1-14-0

# అమృతాంజనము




వామనావతారము

# భారతి

సచిత్రమాసపత్రిక

సంపాదకుఁడు

కా. నాగేశ్వరరావు





సంపుటము ౨. భాగము ౨.

ఆంధ్రపత్రికాముద్రాలయము - మద్రాసు

౧౯౨౫

# భారతి—పంచమ సంపుటము—భా. ౨.

## వ్యాసకర్తల అకారాది సూచి

## శ

## స



---

# భారతి—పంచమ సంపుటము భా. ౨.

## వ్యాసముల అకారాది సూచి

# న

# విషయానుక్రమణిక

# చిత్రములు



---



గోపీమోహనుడు

చిత్రకారుడు: వరదా వెంకటరత్నంగారు, రాజమండ్రి.




చెన్నపట్టణము, జూలై ౧౯౨౮

సంపుటము ౫ | విభవ సంవత్సరము ఆషాఢమాసము | సంఖ్య ౭



# మేలుకొలుపు

గుజ్జప్పడియ ఆంజనేయులు గారు

పరువపు మల్లెతీవియల పజ్జను డాఁగురుమూఁతలాడు తె
మ్మెరకసుగందు లూడిగపుమేలము లాడుచునుండ, మంజుల
స్వరమునఁ బక్కిఱాగములు పాడఁదొడంగెఁ బ్రబోధగీతు లీ
తరుణము భావికార్యశుభదం బగు మేల్కను మింక భారతా!

అలమిన కారుచీఁకటుల నల్లనఁ బాపుచుఁ దూర్పుదిక్కునన్
బొలిచెను వేఁగుఁజుక్క, కనుమోడ్పుల విప్పి సమస్తజీవముల్
దెలివిని బొందె నిండె జగతీవలయంబున నవ్యరోచికల్
దెలతెలవారనయ్యె నిఁక లెమ్ము ప్రభాతము మీఱకుండఁగన్.

తెఱచిన కన్ను మూసి చనుదేరవు నిద్దురమబ్బు వీడి, యి
త్తఱిని బరుండి లేచుచును దద్దయుఁ గాల మతిక్రమించె, సో

దరజనులెల్ల మేల్కనిరి, తల్పముఁ బాసి బిరాన రమ్మ నీ
యజమరవీడి భారతసుతా! భవతారకమాతృసేవకున్.

సద్యస్సుఫుల్ల పుష్పసుగంధబంధురా యతవాతధూపధూపిత మొనర్చి
శాద్వలోపరిభాగ సంచలన్నీహార కణమౌక్తికశ్రేణిఁ గలయఁదీర్చి
ధవళేందుబింబసంభవరుచిస్ఫూర్తి నల్గడల మేలగు పాలగచ్చు దిద్ది
కలకలారావ సంకులనీడజావళీ వందిమాగధకోటిఁ బొందుపరచి
ధరణిఁగై సేసి ప్రకృతికాంతామతల్లి-కాచియున్నది నీకు స్వాగతము నీయ
తరలిరావయ్య, మాతృపాదముల నతుల-మతిని సేవింపవయ్య! భారతకుమార.

చనుచున్నారు స్వకీయకార్యకరణోత్సాహంబునన్ బుణ్యభా
గ్జనులై సోదరసోదరీతతులు, స్వేచ్ఛామందమందానిలం
బున నెమ్మేనులు సేదఁదేర, వినరావో తజ్జమోదంచిత
స్వనముల్, వారలఁగూడ నేఁగఁదగవో! జాడ్యంబు నీకేటికిన్!

చోరులేచిన సాహుకారుకైవడిఁ గుందు జాతీయలక్ష్మిశోకాతిశయము
వలఁ జిక్కువడిన గువ్వనుబోలి విలపించు నీకన్నతల్లి కన్నీటిధార
పులిఁగన్న జింక యట్టులు డయ్యు వాణిజ్య బిసరుహేక్షుణగుండె బెదరుపాటు
కానఁబూచిన తీవెకరణి నిర్వేదించు కవివరేణ్యుని చేతి కలము వణఁకు
తుడిచివేయుము వేగ నీజడిమ నుడిగి-స్వీయనిర్మలసామ్రాజ్య సిద్ధికొఱకు
కార్యకారణవేదిపై కదల కిట్లు-సెజ్జవీడవు నవ్వరే పజ్జవారు!

వినిపించుచున్నది వివిధద్విజానీక సుప్రబోధవిశుద్ధ సూక్తిచయము
కనిపించుచున్నది గాఢాంధపటలవిధ్వంసక ప్రాగ్దిశాధవళిమంబు
వీతెంచుచున్నది విశ్వజన్య నవీనమానితోత్సాహమందానిలంబు
చనుదెంచుచున్నది జననీపదాంభోజ సంసేవనార్థమై సర్వజనము
కరము డగ్గఱె శుభలగ్నకాలమిపుడు-లలితపావనవిశ్వకల్యాణమునకు
వేగిరమ లేచి సముచితవిధులఁదీర్చి-పెండ్లిపెద్దవుగ మ్మావు పృథులతేజ!

వలిగాడ్పుల్ భరమా సహింప నని లేవంజాలవో దట్టపుం
దెలిక్రొందుప్పటి మేల్ముసుంగు విడి సందేహింపనేలా? యదే

తిలకింపంగదవయ్యా, శీతహారిమై ద్యుక్పర్వశోభఁ జగ
ద్వలయం బల్లనఁ దేరి కన్గొనిమె భాస్వంతుండు తేజోనిధీ!

మేటిగుణరాశివని లోకమిత్రుఁడగుట-గురుకరంబుల నిను మేలుకొలుపఁ బనిచి
మెఱుఁగుబంగరు వన్నియ మించురుచులఁ-గాన్కలంపుచునున్నాఁడు కమలసఖుఁడు.

అరయవో జననికై హరినోర్చి యమృతంబుఁ గొనిచన్న వైనతేయుని తెఱంగు!
తలఁపవో దివిజమందాకినీదేవి నీ పృథివినిల్పిన భగీరథునిశక్తి!
కొలియవో నిఖిలదిక్కులఁ గీర్తినింపిన భరతభూపాలుని బాహుపటిమ!
చింతింపవో తండ్రి చెండాడినను దైవభక్తివీడని దైత్యుపట్టి నిష్ఠ
వీరలెల్లరు నీదు పూర్వికులు సుమ్మి-నీమనఃపంజరంబున నేఁటిదనుక
నణఁగియున్నది తత్తేజ మఃనువుగాలె-వెలికిఁదార్చెదుగాని వేవేగ లెమ్ము.

కనుఁగొనలఁ గవోష్ణజలకంకణముల్ వడి రాల్చకయ్య ఘుం
కను గొనవయ్య ధైర్యమును గాఁగలకార్యవిధాన మెట్టిదో
కనుఁగొనవయ్య సోదరనికాయము లద్భుతసంప్రమోదులై
కనుఁగొన మాతృభక్తి సిరిఁ గాంచఁగదయ్య! కులప్రదీపకా!

---

# ఇష్టదేవతా స్తవము

పుల్లెల శ్రీరామశాస్త్రిగారు

బోడ్డుఁదమ్మిని బ్రహ్మఁ బుట్టింపకున్నచో ధర్మమాతృకలు వేదంబు లగునె
బోయచేఁ గ్రౌంచంబు నేయింపకున్నచో వితతరామాయణస్మృతియు నగునె
నికృతి జూదము శకునికి నేర్పకున్నచోఁ బృథివి భారత కల్పవృక్ష మగునె
చిలువచే మృతిఁ బరీక్షితున కీకున్నచో ఘనతత్త్వకలిత భాగవత మగునె
లోకకల్యాణకృతులను మాకొసంగ-నీవు కల్పించు వ్యూహంబు లెన్నఁదరమె
యిందుఫలిపాల, యిందిరాహృదయలోల,-భక్తనుతశీల, కేశవప్రకటలీల!

---

# కర్ణాటకభాషయందలి సంస్కృతవృత్తములు

తేకుమళ్ల రాజగోపాలరావు గారు

ఆంధ్రమునందు వలెనే కన్నడమునందును సంస్కృతమునుండి తీసికొనఁబడినవృత్తములనేకములు కలవు. ఆంధ్రమునందలి యనేక వృత్తములు సరియైననడక లేనివి. కన్నడమునందలి విస్తారసంఖ్యగలవృత్తములకు సరియైన రాగవరుస కలదు. ఈక్రిందివృత్తములకు లక్ష్యములు కర్ణాటచ్ఛందస్సుల కాదిమాచార్యుఁడగు నాంధ్రుఁడైన నాగవర్మ కన్నడమున రచించిన ఛందోంబుధియను ప్రమాణగ్రంథమునుండి తీసికొనఁబడినవి. ఈ ఛందోంబుధి జైనుఁడైన యాతనిచే నాతనిభార్య కంకితము చేయఁబడినది. ఈవృత్తములకు ప్రాసకలదుగాని తెలుఁగునుబోలినయతి లేదు. గణములు తెలుఁగులోని యగణ తగణ మగణ రగణాదులే. ఇం దీకవి తనభార్యను "శాతకుంభఘటోపమవృత్తోత్తుంగపయోధరరాజితే" మన్నగు పదసముదాయముచే సంబోధించుట చూడఁగా నాకాలపు సామాన్య సంఘజీవన మిప్పటికంటె భిన్నమై యిట్టిరీతిపదవాక్యము లశ్లీలములుకాని చరిత్రమును సూచించునట్లు కానఁబడును. ఈక్రింది కన్నడపువృత్తములలో నేకనామముగల కొన్నివృత్తములకు భిన్నలక్షణములు కానవచ్చుచున్నవి. ఈక్రింది వృత్తములకు కర్ణాటాంధ్రములలో నేకలక్షణములును, భిన్ననామములును గానవచ్చుచున్నవి.

| సంఖ్య | ఛందస్సు | లక్షణము | వృత్తసంఖ్య | వృత్తనామము | |
|---|---|---|---|---|---|
| | | | | తెనుఁగు | కన్నడము |
| 1 | 3 | మ | 1 | నారీ | వామాంగ |
| 2 | 8 | య | 2 | కేస | రతాంతము |
| 3 | 3 | ర | 3 | మృగి | పావనము |
| 4 | 3 | స | 4 | వినయము | ప్రవరము |
| 5 | 4 | రగ | 3 | సమృద్ధి | దేవరమ్య |
| 6 | 4 | సర | 4 | సుమ_ర్త | మృగనేత్ర |
| 7 | 4 | జగ | 6 | సుకాంతి | జనోదయ |
| 8 | 4 | భగురు | 7 | బింబ | సౌందర |
| 9 | 5 | రగగ | 3 | ప్రీతి | నందకము |
| 10 | 5 | సగగ | 4 | ప్రగుణము | సన్మృగనేత్రము |

| సంఖ్య | ఛందస్సు | లక్షణము | వృత్తసంఖ్య | వృత్తనామము తెనుఁగు | కన్నడము |
|---|---|---|---|---|---|
| 11 | 5 | జగగ | 6 | సతి | అనంగము |
| 12 | 5 | భగురుగురు | 7 | పంక్తి | కాంచనమాల |
| 13 | 5 | తలగ | 13 | నంద | తిలక |
| 14 | 5 | భలగ | 15 | అంబుజ | ప్రేమ |
| 15 | 6 | భయ | 15 | చంద్రవదన | శశికాంతము |
| 16 | 6 | నయ | 16 | శశివదన | ఉదాత్తము |
| 17 | 6 | మస | 25 | ముకుళము | కమళము |
| 18 | 6 | సస | 28 | వసుధ | కుముదము |
| 19 | 7 | సరగ | 20 | హంసమాల | సరలము |
| 20 | 7 | మసగ | 25 | మదలేఖ | కమళము |
| 21 | 7 | ననగ | 64 | మదనవిలసితము | సులభము |
| 22 | 9 | రసర | 187 | భద్రకము | హలాయుధము |
| 23 | 10 | మనయగ | 121 | పణవము | పణవకము |
| 24 | 10 | భమసగ | 199 | రుక్మవతి | మందానిలము |
| 25 | 10 | భభభగురు | 4[illegible]9 | పంక్తి | చిత్రపదము |
| 26 | 11 | తతతగగ | 293 | మందారదామము | లయగ్రాహి |
| 27 | 11 | భతనగగ | 487 | మౌక్తికమాల | సాంద్రము |
| 28 | 11 | రజరవ | 683 | శ్యేని | సైనికము |
| 29 | 11 | ననరలగ | 704 | భద్రకము | చంద్రిక |
| 30 | 12 | ననమయ | 576 | ప్రహేయము | ఘటము |
| 31 | 12 | నజజయ | 880 | తోదకము | లలితపదము |
| 32 | 12 | నభజర | 1400 | ప్రియంవద | నిరుపమము లేకమ త్త |
| 33 | 12 | సజసన | 1772 | ప్రమితాక్షరము | ప్రమితాక్షర [కోకిల |
| 34 | 12 | జసజస | 1886 | జలోద్ధతగతి | జలోద్ధతరతము |
| 35 | 13 | నజజగగ | 1392 | ప్రభాతము | ప్రభాతమిశ్రము |
| 36 | 14 | భభరసలగ | 5815 | సుందరి | సుందర |
| 37 | 14 | ననరసలగ | 584 | అపరాజిత పరాజిత | కుసుమాంఘ్రిపము |
| 38 | 15 | నజజభర | 11632 | మనోజము | నవనలినము |
| 39 | 16 | యమనసరగ | 10178 | చంద్రశ్రీ | విజయానందము |
| 40 | 16 | నభజజజగ | 23416 | పద్మకము | మంగళము |
| 41 | 17 | నజభజజలగ | 56240 | నర్కుటము | కనకాబ్జిని |
| 42 | 17 | నసమరసలగ | 46112 | హరిణి | హరిణీప్లుత |
| 43 | 18 | మతనయయయ | 37857 | కుసుమితలతావేల్లిత | కందకందర్పజాతము |

| సంఖ్య | ఛందస్సు | లక్షణము | వృత్తసంఖ్య | వృత్తనామము తెనుఁగు | వృత్తనామము కన్నడము |
|---|---|---|---|---|---|
| 44 | 18 | రసజజభర | 93019 | మత్తకోకిల | మల్లికామాల |
| 45 | 19 | రసరసజజగ | 186587 | చంద్రకళ | ఖచరప్లుత |
| 46 | 20 | భభభభరసలగ | 372151 | అంబురుహము | నగరంజితము |
| 47 | 20 | నభభమసలగ | 373176 | ఖచరప్లుతము | అనవద్యము |
| 48 | 22 | భభభభభభభగురు | 1797559 | మానిని | వనమంజరి |
| 49 | 23 | నజజజజజజలగ | 3595120 | కవిరాజవిరాజితము | హంసగతి |
| 50 | 23 | మమతననలగ | 4194081 | మత్తాక్రీడ | క్రీడ |
| 51 | 24 | భతనసభభనయ | 4155367 | తన్వి | సుందరము |
| 52 | 25 | నననసభభభగురు | 14368768 | బంధురము | హంసపదము |
| 53 | 25 | నననననననగ | 16777216 | ధరణీధరగతి | వికలిత సరసిజము |

ఈ నామభేదములకుఁ గారణము ఈ కవులదే కాదు. ఒక్కొకప్పుడు అనేకభాషలలో నేకలక్షణమునకు సమాననామమును, భిన్ననామములుగల యొక్కొక్కలక్షణమునకు ఈ భిన్ననామములందును నితరభాషలసాక్ష్యమును గానవచ్చుచున్నది. ఒక్కొక్కయెడ కవియే నూతనలక్షణమును గల్పించి యొకవృత్తమును సృష్టించినప్పుడు మాత్రము తనకుఁ దోఁచిన పేరిడుచున్నాఁడు. సంస్కృతమున ననేకలక్షణగ్రంథములు కలవనియు, కర్ణాటకరాజ్యమున విశేష వ్యాప్తిగల గ్రంథములును, నట్లే యాంధ్రదేశమున విశేషవ్యాప్తిగల ఛందోగ్రంథములును వేఱువేఱనియు నందువలననే యీనామభేదము కలిగినదనియు నా మతము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలోఁ గానరాని యీక్రిందివృత్తములు కన్నడముననుండుట గూడ ఈ యూహను గొంత బలపఱుచును.

| సంఖ్య | ఛందస్సు | లక్షణము | వృత్తసంఖ్య | వృత్తనామము |
|---|---|---|---|---|
| 1 | 1 | ల | 2 | పేరు తెలుపఁబడలేదు |
| 2 | 2 | లగ | 2 | దిగంతగము |
| 3 | 2 | లల | 4 | గిరిధరము |
| 4 | 3 | న | 8 | పరమము |
| 5 | 4 | తగ | 5 | కామాంగము |
| 6 | 4 | నల | 16 | సురతరువు |
| 7 | 5 | రలగ | 11 | నందకము |
| 8 | 5 | సలగ | 16 | సరసిరుహము |
| 9 | 6 | నమ | 8 | సులలితము |
| 10 | 6 | గణు | 11 | శాలిసీవితానము |

| సంఖ్య | ఛందస్సు | లక్షణము | వృత్తసంఖ్య | వృత్తనామము |
|---|---|---|---|---|
| 11 | 6 | సస | 27 | కుముదము |
| 12 | 7 | మతగ | 9 | చిత్రము |
| 13 | 7 | రలగ | 19 | విభూతి |
| 14 | 7 | భరగ | 23 | వినిమ్నము |
| 15 | 7 | నరగ | 24 | నరగము లేక శశాంకవక్త్రము |
| 16 | 7 | ససగ | 32 | విశాలము |
| 17 | 7 | సతగ | 40 | కోమలము |
| 18 | 7 | భభగురు | 55 | కమళము |
| 19 | 8 | రరగగ | 19 | శ్రుతానందము |
| 20 | 8 | సరలగ | 88 | సుమాలతి |
| 21 | 9 | ననమ | 64 | భుజంగశిశుసృతము |
| 22 | 9 | యయయ | 74 | బృహతి |
| 23 | 9 | ననర | 96 | మయూరము |
| 24 | 9 | రసస | 219 | వనజము |
| 25 | 9 | భజస | 239 | ఉదయము |
| 26 | 10 | రసజగ | 347 | కల్యాణము |
| 27 | 11 | మసజగగ | 345 | మాణిక్యము |
| 28 | 12 | నభజయ | 888 | ద్రుతపదము |
| 29 | 12 | భభరస | 1719 | హంసవృత్తము |
| 30 | 13 | భజనసగ | 1775 | అంబుజము |
| 31 | 13 | నతజభగురు | 3432 | సౌందరము |
| 32 | 13 | భభభభగురు | 3511 | అంగరుచము |
| 33 | 13 | నభభభగురు | 3512 | అభ్యుదయము |
| 34 | 15 | ననసభయ | ·7608 | విచిత్రలలితము |
| 35 | 16 | భభభభభగురు | 28087 | పద్మముఖి |
| 36 | 16 | నననజసగ | 7168 | లలితపదము |
| 37 | 21 | నననయయతమ | 136192 | లలితగతి |
| 38 | 22 | రనరకరనర | 76567 | తరంగము |
| 39 | 22 | సమరనభరరగ | 618116 | చూతకుజము |
| 40 | 24 | ననభనజననయ | 4186048 | లలితము |
| 41 | 24 | నజభభభభజర | 5729712 | అర్కమరీచి |
| 42 | 24 | నజభజజజరస | 7003056 | వంశజము |
| 43 | 26 | నననననననగగ | 16777216 | వనలత |
| 44 | 26 | నజనసననజలగ | 29358064 | మునిమతము |

కొన్ని యెడల ఒక్క నామమునకే యొక్కొక్క ఛందోగ్రంథమున నొక్కొక్క లక్షణము కలదు.

ఉదా. భుజగశిశుసృతము.

దీనికి వృత్తరత్నాకరమున — ననమ

ఆంధ్రఛ్ఛందస్సుల — ననయ

కన్నడమున వృత్తరత్నాకరము నట్లే.

# కర్ణాటకవృత్తములు

## మొదటి ఛందస్సు

ప్రస్తారమున

వృత్తసంఖ్య—

1. వృత్తలక్షణము—పాదమున కొక్కొక్క గురువు.

లక్ష్యము—శ్రీ|శం|శాం|తే.

2. పాదమున కొక్కొక్క లఘువు—

ల|ల|ల|ల.

## రెండవ ఛందస్సు

2. దిగంతగవృత్తము - ప్రతిపాదమునకు లగ—

లగో|పగం|దిగం|తగం.

4. గిరిధర—ప్రతిపాదమునకు లల—

మర|హర|గిరి|ధర.

## మూఁడవ ఛందస్సు

1. వామాంగవృత్తము—పాదమున కొకమగణము.

భూమిప్రోద్దామంకేళ్|వామాంగీ|వామాంగం.

2. రతాంతవృత్తము—య—

యతాంతం|నితాంతం|రతాంతం|లతాంతే.

3. పావనవృత్తము—ర—

పావకో|ద్భావదిం|శీఘ్రుం|పావనం.

4. ప్రవరవృత్తము—స—

పవనో|ద్భవదిం|ప్రవరం|ప్రవరే.

8. పరమవృత్తము—న—

సురర|సెరవి సెరెయొ|పరమె.

## నాలవ ఛందస్సు

3. దేవరమ్య—రగ—

పావకాగ్రం|భావనీయం|దేవదేవం|దేవరమ్యం.

4. మృగనేత్ర—సగ—

లగయుగ్మం.

5. కామాంగము—తగ—

వ్యోమంహారం|తామాగిరలె.

6. జనోదయ—జగ—

జనోదయం.

7. సౌందర—భగురువు—

ఇందుహరర్|బందిరకేళ్|సౌందరసం|సుందరిసే.

16. సురతరువృత్తము—నల—

సురహరి|సెరెదిరె.

## అయిదవ ఛందస్సు

4. సన్మృగనేత్రము—సగగ—

సగ యుగ్మంగళ్.

6. అనంగ—జగగ—

దినేశనింద|త్త.

7. కాంచనమాల—భ 2 గురువులు—

మించునచంద్రం.

11. నందకము—రలగ—

ఒందునప్పియొళ్.

13. తిలకము—తలగ—

వ్యోమం హారిముం.

15. ప్రేమ—భలగ—
సోఽ హరియుం.

16. సరసిరుహము—నలగ—
హరిహరరుం.

## ఆఱవ ఛందస్సు

8. సులలిత—నమ—
జలజపత్రాక్షీ.

10. విచిత్రము—యయ—
పయోయుగ్మదిందం

11. శాలినీవితానము—రయ—

12. తనుమధ్య—తయ—
వ్యోమాది జలాంతం.

15. శశికాంతము—భయ—
శీతకరతోయం.

16. ఉదాత్తము—నయ—
నయగణదింసం.

25. ముకుళము లేక కమళము } —మస—
నిర్వ్యాజం కమళం.

27. కుముదము—సస—
అనిల ద్వితయం.

## ఏడవ ఛందస్సు

9. చిత్రము—మతగ—
ధాత్రీచంద్రేందుధరం.

19. విభూతి—రతగ—
భోజనేత్రే తేక్కళనీ.

20. సరలము—సరగ—
సరలం వృత్తనామం.

23. వినిమ్నము—భరగ—
శీతళరాగ్ని చేతో.

24. శశాంకవక్త్రము లేక నరగము—నరగ—
సరసిజాయతాక్షీ.

32. విశాలము—నసగ—
త్రివళిపవనేళర్.

40. కోమళము—సతగ—
ఆయతనేత్రే తేకోమళం.

55. కమళము—భ భ గురువు—
సౌందరి కేళ్ కమళం.

64. సులభము—ననగ—
జననుత సులభం.

## ఎనిమిదవ ఛందస్సు

1. విద్యున్మాల—మమగగ—
శాంతం విద్యున్మాలావృత్తం.

19. సుతానందము—రరగగ—
భావనీయం శ్రుతానందం.

55. చిత్రపద—భభగగ—
బందుహర ద్వితయంగళ్.

88. సుమాలతి—నరలగ—
గురుకుచే సుమాలతీ.

103. మాణవకము—భతలగ—
శాంతశశి వ్యోమలగం.

## తొమ్మిదవ ఛందస్సు

64. భుజగశిశుసృతము—ననమ—
భుజగశిశుసృతం నామం.

74. బృహతి—యయయ—
విలోలాక్షీ కేళింతిదక్కుం.

96. వనమయూరము—నసయ—
అమరగణవాతతోయం.

183. ఉత్సుకము—భభర—
సుందరి నాకిగ నిష్టదిం.

187. హాలాయుధము—రసర—
దావగం సరసిజాననే.

187. భద్రకము—రనర—
ఇది పై వృత్తమె-స్వదసంలయపక్రమం.

192. వినుతము—ననర—
వినుతమిదువనామదిం.

219. వనజము—రసస—
నాగవర్మని నీవనజం.

239. ఉదయము—భజస—
నాకిగనినాదు దుదయం.

## పదియవ ఛందస్సు

121. పణవకము—మనజగ—
మీనాక్షీయతిగిరి యొప్పెల్కుల.

199. మందానిలము—భభసగ—
నీతియుతే మందానిలవృత్తమ్.

219. మణిరంగము—గసనగ—
పాదపాళిన మారుతయుగ్మం.

241. మత్తము, పూజ్యము, లేక నవ్యము—
మున్నంభా త్రీశశిపవనేశో.

347. కల్యాణము—రసజగ—
క్షోణివాయు దినేశనీశ్వరం.

439. చిత్రపదము—భభభ గురువు—
చంద్రగణంగ లెమూడె డియొల్.

## పదునొకొండవ ఛందస్సు

289. శాలిని—మతతగగ—
భూమిఖ్యాతం శాలినీనామవృత్తం.

293. లయగ్రాహి—తతతగగ—
నామం లయగ్రాహియందాద్యు వృత్తం.

345. మాణిక్యము—మసజగగ—
జారే నీనదనోడు భేగదిందు.

358. ఉపేంద్రవజ్రము—జతజగగ—
దినాధిపం వోన్యరవీశయుగ్మం.

357. ఇంద్రవజ్రము—తతజగగ—
వ్యోమస్వయం భానుకపర్ది యుగ్మం.

439. దోదకము—భభభగగ—
ఇంపుగ ంగళె మూఁఅవడింప.

443. స్వాగతము—నభగగ—
స్వాగతంవెగద్దునాకిగ నిందం:

487. సాంద్రము—భతనగగ—
చంద్రని నభ్రంసురపురమిాళ.

ద్వంద్వం—
(ప్రాసము చూడనలెను.)

683. సైనికము—జరలగ—
పాదపాళనార్క పారకంలగం.

699. రథోద్ధతము—రనరలగ—
మారు లేష్టదివిజాగ్నియుం లగం.

704. చంద్రిక—ననరలగ—
కమలవదన చంద్రికాహ్వయం.

1009. భ్రమరవిలసితము—మభనలగ—
నామం శ్రీమద్భ్రమరవిలసితం.

## పండ్రెండవ ఛందస్సు

576. ఘటము—ననమయ—
మినిబగెఘ పెమెంచం నాగవర్మం.

586. భుజంగప్రయాతము—యయయయ—
విశేషంకవీంద్రస్తుతం పింగళంబోల్

880. లలితపదము—నజజయ—
కులిశధరార్క యుగం గళముందా.

888. ద్రుతపదము—నభజయ—
ద్రుతపదంద్రుతపదోక్తిగళింనం.

1071. స్రగ్విణీ—రరరర—
ఖ్యాతమంభోజపత్రోపమానేక్షణే.

1381. ఇంద్రవంశము—తతజర—
తామొందిదిగ్దంతియొళాగవిశ్రమం.

1382. వంశస్థము—జతజర—
సువిశ్రమం బందిరె సప్తసంఖ్యయొళ్.

1400. నిరుపమము లేక మత్తకోకిల—నభజర—
నిరుపమంకళదిమత్తకోకిలం.

1464. ద్రుతవిలంబితము—నభభర—
నభభరంగళుమెుందిరె పాదదొళ్.

1719. హంసమత్తము—భభరస—
సుందరినాకిగ నిష్టదింవవృత్తం.

1756. తోటకము—ససనస—
పవమానచతుష్క యుతం యతియుం.

1772. ప్రవితాక్షరము—సజసస—
పవమానమర్క మదు తద్వయసం.

1886. జలోద్ధతరతము—జసజస—
గుణాగ్రణిదినేశవాయుయాగళం.

1979. చంద్రవర్త్మము—రనభస—
చంద్రబింబముఖికేళిసఖిలభూ.

## పదుమూఁడవ ఛందస్సు

1392. ప్రభాతమిశ్రము—నజజరగ—
బలరిపుభానుయుగం హుతాశనపిం.

1633. మత్తమయూరము—మతయసగ—
ఎత్తంధాత్రీవ్యోమపయోవాయుహరర్కేళ్.

1775. అంబుజము—భజససగ—
శంబరవిరోధి శరజందెవిరామం.

2806. రుచిరము—జభసజగ—
సునిశ్చితం రుచిర మిదాగమోక్తియిం.

3432. సౌందరం—నతజభగురు—
ఇందుగరంబందిరె నిందువిశ్రమమం.

3511. అంగరుచము—భభభభ గురువు—
కోమళమాదుదిదంగరు చంకళదీ.

31512. అభ్యుదయము—నభభభ గురువు—
మృగనిభేక్షణ నామదొళభ్యుదయం.

## పదునాలుగవ ఛందస్సు

2368. వసంతము—ననతతగగ—
క్రమదొళిరలిదుం నామదిందం వసంతం.

2933. వసంతతిలకము—తభజజగగ—
నామం వసంతతిలకం కమలాయతాక్షీ.

3823. వనమయూరము—భజసనగగ—
ఇందువదనే యతిపదార్థదొళెనిందం.

5815. సుందరవృత్తము—భభరసలగ—
ఖ్యాతమిదాకవిరాజ హంసవినిర్మితం.

5824. కుసుమాంఘ్రిపము—ననరసలగ—
త్రిదశచంద్రహుతాశనానిలరుంలగం.

6919. కుట్మలమయూరము—భజసనలగ—
అంబుజరిపుద్యుమణిమారుతబలారిఖ్య.

8128. ప్రహరణకలిత—ననభనలగ—
వనరుహవదనే ప్రహరణకలితం.

## పదునైదవ ఛందస్సు

4672. మాలిని—ననమయయ—
సముదగజగతీ కేళ్—మాలినీనామవృత్తం.

7608 విచిత్రలలితము—ససనభయ—
సదమల విచిత్రలలతం లలితగాత్రే.

11184. సుకేసరము—నజభజర
అమరగణార్క శీతకర భానుపావకో.

11632. నవనలినము—నజజభర—
నవనలినం కవిరాజహం సవినిర్మితం.

11707. మణివిభూషణము లేక భూషణము—భసభనగ—
పీవర స్తగభరాస ... కవీంద్రసం.

16384. మణిగణనికరము—నననస—
విరచితవిసనవు మణిగణనికరం.

## పదునాఱవ ఛందస్సు

7168. లలితపదము—నననజసగ—
లలితపద ముచితపదయుక్తమతికాంతం.

10178. విజయానందము—యమనసరగ—
జనానందంఛందం నెగద్దిలిజయానందమక్కుం.

23416. మంగళము—నభజనజగ—
క్షితిగెసంమదివనోదరవిందదలేక్షణే.

28087. పద్మముఖి, జగద్వందితము, లేక
పద్మము—భభభభభ గురువు—
ఇంద్రుగణం శరసంఖ్యయొళుందిర చంద్రధగం.

## పదునేడవ ఛందస్సు

18928. మందాక్రాంతం—మభనతతగగ—
క్రాంతంవృత్తం నెగద్దిదెళయో
శ్కందకందర్పనిందం.

38750. పృథ్వి—జసజసయలగ—
ఇనానిలదనేశమారుతపయోలగం గళ్పిడం.

46114. హరిణీప్లుతము—నసమరసలగ—
నిలె ... దుళిళి త్తంవృత్తస్త నద్వయరాజితే.

56240. కనకాబ్జిని—నభభజజలగ—
నెఁసిరెనాగవర్మకవి నిర్మితమాయతమం.
59530. శిఖరిణి—యమనసభలగ—
జనానంసంఛందం శిఖరిణిమదే ఛేంద్రగమనే.

పదునెనిమిదవ ఛందస్సు

37857. కందకందర్పజాతము లేక నందకందర్పజాతము—
మతనయయయ—
క్షేమారోగ్యంకేళీ నినగిదుచితం కందకందర్ప
జాతం.
50944. అరవిందము—ననసనతయ—
సురుచిరమనిసిద లక్షణదిందం సందరవిందం.
93019. మల్లికామాల—రసజజజభర—
మాలెయెంబుదునిశ్చయం కవిరాజహంసవినిర్మితం.

పందొమ్మిదవ ఛందస్సు

75714. మేఘవిస్ఫూర్జము—యమనసరరగ—
జనఖ్యాతంనూత్నం బుధజనహితం మేఘవిస్ఫూ
ర్జితాఖ్యం.
149337. శార్దూలవిక్రీడితము—మసజసతతగ—
నిర్వ్యాజంభువనత్రయం గళొళగీ
వృత్తం ప్రసిద్ధంకరం.
186040. తరళము—నభరసజజగ—
కరియొళాగిరెసందు దింతిదునాగవర్మవినిర్మితం.
186587. ఖచరప్లుతము—రససతజజగ—
శాతకుంభఘటోపమ వృత్తోత్తుంగ
పయోధర రాజితే.

ఇరువదవ ఛందము

298676. మత్తేభవిక్రీడితము—సభరనమయలగ—
పెసరాయ్తింతిసు నాగవర్మకవియిం
వ్యాలోలనీళాలకే.
356799. ఉత్పలమాల—భరనభభరలగ—
సాతిశయో క్తియింతిదువిరాజిసుగుం
కవిరాజహంసనిం.

372151. నగరంజితము—భభభభరసలగ—
ఇంతీజగదొళ్నగరంజితమెంబుదు
రంజితాధరపల్లవే.
373176. అనవద్యము—నభభమసలగ—
కనకకుండలమండితగండేనీనఅదోదనవద్యమం.

ఇరువదియొకటవ ఛందము

136192. లలితగతి—నననయయయతమ—
గురుజఘనలలిత గతియిందంజనానం
దంకేళ్వ దెన్నిందం.
302993. స్రగ్ధర—మరభనయయయ—
ధామప్రోద్దామకేశాన్వితబగెపెసరిం
స్రగ్ధరానామవృత్తం.
711600. చంపకమాల—నజభజజజర—
త్రిదశరవీందుభాస్కరగణత్రితయాగ్ర
దొళగ్నిచెల్వవాత్తు.
765627. తరంగము—రనరనరనర—
పావకంద్రిదశపావకం దివిజపావ
కం సురపపావకం.

ఇరువదిరెండవ ఛందస్సు

605988. మహాస్రగ్ధర—సతనసరరగ—
స్ఫురితప్రోద్దామకాంచీఖచితమణి
నితంబస్థలాభోగభారే
618116. చూతకుజము—సమరనభరరగ—
జనతానందం శ్రీకామినీప్రతిమె
చూతకుజాహ్వయం నామవృత్తం.
1797559. భభభభభభభ గురువు—
—శీతకరప్రకరం గళవేటిడెయొళిరియె
శైదఃనుక్రమదిం.
1930711. భద్రకము—భరనరనరనగ—
అదమదోజియింనిలసి బంధదొప్ప
కవిరాజహంసనుతదిం.

### ఇరువదిమూడవ ఛందస్సు

3595120. హంసగతి—నజజజజజజలగ—
అవిచలితం రసనృత్తియనాల్దిసేయు
త్తిరికేళ్కశహంసగతీ.
4194081. క్రీడ—మమతననననలగ—
ఉత్పన్నంవృత్తం భిన్నాబ్జాక్షీసురుజన
మతదినిదతిశయనుతిమిం.
3985400. సౌందరం—నభభభమసనలగ—
విదితమాగిరెసౌందరమాదుదు
భిన్నాంభోజదళాయతలోచనే.

### ఇరువదినాలుగవ ఛందస్సు

4155367. సుందరము—భతనసభభనయ—
ఇందునిభాస్యే ధరెగిదు పెసరాయ్తిల్లి
యముద్భవకరమెనె తన్నిం.
4186048. లలితము—ననభనజననయ—
పరెదుదులలితం ధరగిదు పెసరాగిర
సరసిరుహదళాక్షీ.
5729712. అర్కమరీచి—నజభభభభజర—
క్రమవతెదోదుసీని దనర్కమరీచియ
నంబురుహపత్రలోచనే.
7003056. వంశజము—నజభజజజరస—
అనురగణార్కశీతకరభానుగణ
త్రితయాంత్యపావకం పవనం.

### ఇరువదియైదవ ఛందస్సు

14368768. హంసపదము—నననసభభభసురువు—
కవిజనహితకరమిదనతెకెళదీహంస
వినిర్మితహంసపదం.
16776647. క్రౌంచపదము—భమసభననననగ—
నీతియుతేక్శళ్ సాతిశయోక్తి క్రమదో
శినగట్టుది దతిశయరచనో.
16777216. విదళితసరసిజము—ననననన ననగ—
విదళితసరసిజవనమెనలెసె దుదువిదళితవనజముఖీ.

### ఇరువదియాఱవ ఛందము

16777216. వనలత—నననననననగగ—
విదితమిదవనిగెవుదిదుదురసదొళె
వద మిదనతీముదదిందం.
23854849. భుజంగవిజృంభితము—మమతననగరసర—
ఆదిక్ష్మాయుగ్మాకాశాగ్రంపురమితసుర
పురసహితం కృశానుమరుల్లగం.
29358064. మునిమతము—నజనసననజలగ—
జనహితమింతిదుమునిమతమం
బుదునినగతెపిదెకళదీనిరుతం.

---

## చిన్నిగీతములు

సోమంచి సూర్యనారాయణశర్మగారు

చిన్ని చిన్ని నీటి చినుకులె పెల్లయి - ఘోరసాగరముగ మాఱుమ్రోగు
నిసుకరేణువులె యవెన్నియో కూడివి - శైలక్రమమయిన నేలయగును
చిన్నిచిన్నిత్రుటులె యెన్నియో కలిసి మహాయుగంబు లగు ననంతఘనీతి
అల్పదోషములును నధికమై యట్టులే - ఘోరపాతకమున గూల్చద్రోయు
చిన్ని చిన్ని జాలిచేతలఁ జల్లని - ప్రేమవాక్యముల ధరిత్రియెల్ల
భూరి రమ్య శుభకరారామమై నిత్య - సౌఖ్యధామమగును స్వర్గమటులు.

---

# క్షేమేంద్రమహాకవి - ఔచిత్యవిచారచర్చ

కిళాంబి రాఘవాచార్యులు గారు, యం. ఏ., బి. యల్.

కాశ్మీరదేశకవులలోఁ బ్రసిద్ధుఁడై పెక్కు గ్రంథముల రచియించిన క్షేమేంద్రమహాకవి క్రీ. శ. పదునొకండవ శతాబ్దమువాఁడని స్థిరపఱుపఁబడినది. ఈతఁడు కథాసరిత్సాగరకర్తయగు సోమదేవునికిఁ గొంచెమించుమించుగ సమకాలికుఁడని తోఁచుచున్నది. ఇరువురును గుణాఢ్యవిరచితమగు బృహత్కథను సంగ్రహముగఁ గైకొని బృహత్కథామంజరి, కథాసరిత్సాగర మను గ్రంథముల రచియించిరి. క్షేమేంద్రుఁడు సోమదేవునిగ్రంథమును గాని, సోమదేవుఁడు క్షేమేంద్రునిగ్రంథమును గాని చూచినటులు గన్పట్టుట లేదని వాఙ్మయపరిశోధకులు దెలుపుచున్నారు. కాశ్మీరమునందు విజయరాజ్యాధీశుఁడును, రత్నసింహుని కుమారుఁడును నగు ఉదయసింహుని కాలమునఁ గవి జీవించియుండినట్లును, కాశ్మీరాధిపతియగు అనంతభూపాలుని కాలమున గ్రంథము పరిసమాప్తినొందినటులును ఔచిత్యవిచారచర్చయందలి గ్రంథాంతశ్లోకముల వలనఁ దెలియఁగలదు.

ఈక్రిందిగ్రంథములు క్షేమేంద్రునిచే రచియింపఁబడినటులు దెలియవచ్చుచున్నది.

1. భారతమంజరి; 2. రామాయణమంజరి; 3. బృహత్కథామంజరి; 4. దశావతారచరితము; 5. సమయమాతృక; 6. చారుచర్య; 7. సేవ్యసేవకోపదేశము; 8. కళావిలాసము; 9. చతుర్వర్గసంగ్రహము; 10. దర్పదలనము; 11. కవికంఠాభరణము; 12. ఔచిత్యవిచారచర్చ; 13. సువృత్తతిలకము. 14. అవసరసారము; 15. నీతిలత; 16. బోధిసత్త్వావదానకల్పలత; 17. ముక్తావళి; 18. చిత్రభారతనాటకము; 19. మునిమతమీమాంస; 20. లలితరత్నమాల; 21. లావణ్యవతి; 22. వినయవల్లి; 23. వాత్స్యాయనసూత్రసారము; 24. అమృతరంగకావ్యము; 25. కనకజానకి; 26. దేశోపదేశము; 27. నీతికల్పతరువు; 28. పద్యకాదంబరి; 29. పవనపంచాశిక; 30. రాజావళి; 31. వ్యాసాష్టకము; 32. శశివంశమహాకావ్యము.

ఇన్నిగ్రంథముల రచియించుటచేతనే కవి తన యౌచిత్యవిచారచర్చయను గ్రంథమునందన్ను 'అక్షయకావ్యకీర్తిః' అని వర్ణించుకొని యున్నాఁడు.

'క్షేమేంద్ర ఇత్యక్షయకావ్యకీర్తిశ్చక్రే న వౌచిత్యవిచారచర్చామ్' (Kavyamala Series P-92) అందున నేపాశ్చాత్యులు Polymath, Kshemendra మొదలగుపదముల నీతని విషయమున వాడియున్నారు. పై నుదహరింప

బడిన గ్రంథములలో 1 మొదలు 13 వఱకును బొంబాయి నిర్ణయసాగరముద్రణాలయమున ముద్రింపఁబడినవి. 14 మొదలు 32 వఱకు నెచ్చటను ముద్రింపఁబడినటులు గానరావు. అయినను వానిలో 14 మొదలు 23 వఱకు గల గ్రంథములలోనివని కొన్నిశ్లోకముల నీ కవి తన యౌచిత్యవిచారచర్చయం దుదాహరించి యున్నాఁడు. పై ముప్పదిరెండు గ్రంథముల రచించినటులు బొంబాయి ముద్రితకథాసరిత్సాగర పీఠికయందుఁ దెలుపఁబడియున్నది.

### ఔచిత్యవిచారచర్చ

క్షేమేంద్రమహాకవి కవికంఠాభరణము, ఔచిత్యవిచారచర్చ, సువృత్తతిలకము అను మూఁడలంకారగ్రంథముల రచియించినటులు దెలియుచున్నది. ఔచిత్యవిచారచర్చయందుఁ దాను "కవికర్ణిక" యను నలంకారగ్రంథమును రచియించినటులు దెలిపికొనుటచే నదియే కవికంఠాభరణమని తోఁచుచున్నది. కవికర్ణికను ముందు విరచించి తరువాత నౌచిత్యవిచారచర్చను రచించినటు లీ క్రింది శ్లోకయుగ్మము వలన స్పష్టపడఁగలదు.

శ్లో. కృత్వాపి కావ్యాలంకారాం
క్షేమేంద్రః కవికర్ణికామ్;
తత్కాలజ్క్యం వివేకంచ
విధాయ విబుధప్రియామ్.
ఔచిత్యస్య చమత్కార
కారిణ శ్చారుచర్వణే;
రసజీవిత భూతస్య
*విచారం కురుతేఽధునా.

కావ్యమున కాత్మ ధ్వని యని యానందవర్ధనాచార్యుఁడు దెలిపియున్నాఁడు. కావ్యమునకు రసమే ప్రధానమని కొందఱును, 'వక్రోక్తియే ప్రధాన మని మఱికొందఱును జర్చించి యున్నారు. రీతియే కావ్యమున 'కాత్మయని కావ్యాలంకార సూత్రవృత్తికారుఁడగు వామనుని మతము (రీతిరాత్మా కావ్యస్య, 1-2-6).

కావ్యమున కౌచిత్యమే జీవిత మని క్షేమేంద్రుని మతము. గుణాలంకారముల వలనఁ బ్రయోజన మేమియు లేదు. అలంకారము లలంకారములే; గుణములు గుణములే (శ్రుతసత్యశీలాదివద్గుణాయేవ) కాని శృంగారాది రసప్రసిద్ధ మగు కావ్యమునకు జీవిత మౌచిత్యమే. విచారించినను ఔచిత్యమే కావ్యమునఁ గనరాదో యట్టికావ్యమునకు గుణాలంకారాదులవలనఁ బ్రయోజనము లేదు. ఉచితస్థానవిన్యాసముచే నలంకారము లలంకారము లనఁదగును. ఔచిత్యప్రచ్యుతి నొందని గుణములే గుణములు.

కావ్య స్యాల మలంకారైః
కిం మిథ్యా గణితై ర్గుణైః;
యస్య జీవిత మౌచిత్యం
విచిన్త్యాపి నదృశ్యతే.
అలంకారా స్త్వలంకారా
గుణాయేవ గుణా స్సదా;

* కటక కుండల కేయూర హారాదివ దలంకారాయేవ.

ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్యస్య జీవితమ్.
ఉచితస్థానవిన్యాసా
దలంకృతి రలంకృతిః;
ఔచిత్యా దచ్యుతా నిత్యం
భవన్త్యేవ గుణా గుణాః.

కవి యీవిషయమునే యీక్రింది చమత్కారమగు శ్లోకముచేఁ దెలియఁబఱచియున్నాఁడు.

శ్లో. కంఠే మేఖలయా నితంబఫలకే
తారేణ హారేణవా,
పాణౌ నూపురబంధనేన చరణే
కేయూరపాశేనవా;
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా
నాయాంతి కే హాస్యతామ్
ఔచిత్యేనవినా రుచిం ప్రతనుతే
నాలంకృతి ర్నో గుణాః.

ఔచిత్యమన నేమి?

ఈ విధముగాఁ గవి యౌచిత్యప్రాముఖ్యమును వర్ణించి ఔచిత్యమన నేమియో వివరించియున్నాఁడు.

శ్లో. ఉచితం ప్రాహు రాచార్యాః
సదృశం కిల యస్యయత్;
ఉచితస్యచ యో భావః
త దౌచిత్యం ప్రచక్షతే.

"యత్కిల యస్యానురూపం తదుచిత ముచ్యతే- తస్యభావ మౌచిత్యం కథయంతి-"అని పై శ్లోకమునకుఁ గవియే వ్యాఖ్యాన మొనర్చియున్నాఁడు. యేది దేనియొక్క యనురూపమో యదియే యుచితమనఁబడు. దానిభావమే యౌచిత్యము. ఎట్టివర్ణన విశేషములవలనఁ గావ్యమునకుఁ బదవాక్య ప్రబంధార్థాదులయందు నైసర్గిక హృదయంగమత్వము సిద్ధించుచున్నదో యచ్చటనే యౌచిత్యము గలదని తెలియనగును. ఇట్టి యౌచిత్యము కావ్యాదులయం దెచటఁ బాటింపవలయునని యాశంకించి క్షేమేంద్ర మహాకవి యౌచిత్యవిచారము నిరువదియేడు భాగములుగ విభజించి చర్చించియున్నాఁడు. అవి యేవన 1. పదము, 2. వాక్యము,3,ప్రబంధార్థము (మహాకావ్యార్థము), 4. గుణములు (ఓజఃప్రసాదమాధుర్యాదులు), 5. అలంకారములు (ఉపమాదులు), 6. రసము (శృంగారాదికము), 7. క్రియాపదము, 8. కారకము (కర్త, కర్మ కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణంబులు), 9. లింగము (స్త్రీపుం నపుంసకములు), 10. వచనము, 11. విశేషణము, 12. ఉపసర్గ, 13 నిపాతములు (చ. మొదలగునవి), 14. కాలము (భూతభవిష్యద్వర్తమానములు), 15. దేశవిషయకము, 16. కులము, 17. వ్రతము, 18. తత్త్వము (శాస్త్ర యాథార్థ్యసూచకము), 19. సత్త్వము (అవికృతచిత్తత్వము),20.అభిప్రాయము, 21.స్వభావము, 22. సారసంగ్రహము, 23. ప్రతిభ, 24. అవస్థ (బాల్యాదులు), 25. విచారము (చర్చ), 26.నామధేయము, 27.ఆశీర్వచనము.

వీనియందలి యౌచిత్యమును చాటింప వలయునని చర్చించి, కవి తనవిభజనము సంపూర్ణముగాదనియు మిగిలినవాని నతిప్రసంగ భయంబుచే వివరించి యుండలేదనియుఁ దెలిపియున్నాఁడు.

'అన్యేషు కావ్యాంగేషు అనయైవ దిశా స్వయమౌచిత్య ముత్ప్రేక్షణీయమ్.త దుదాహరణా న్యానంత్యాన్న ప్రదర్శితాని ఇత్యల మతిప్రసంగేన.'

గ్రంథోదాహృత కవిప్రశంస :

క్షేమేంద్రకవి పైవిషయముల జర్చించు నపుడు ప్రతివిషయమునకును, ఔచిత్యమును చాటించిన యొకశ్లోకమును, ఔచిత్యరహిత మగు మఱియొక శ్లోకమును నుదాహరణ పూర్వకముగ నిచ్చి చర్చించియున్నాఁడు. ఆయాశ్లోకములు ప్రసిద్ధకవుల గ్రంథముల నుండియుఁ దనగ్రంథములనుండియు గైకొనిన టులు దెలియుచున్నవి.

ఈతఁ డుదాహరించిన కవులలో సుప్రసిద్ధులగు కాళిదాస శ్రీహర్ష, రాజశేఖర, భవభూతి, భట్టబాణ, భట్టనారాయణ, వ్యాస, అమరుక, మాఘ, వరాహమిహిర, కుమారదాసాదులే కాక, 1. పరిమళుఁడు, 2. ధర్మకీర్తి, 3. మాలవరుద్రుఁడు, 4. రాజపుత్రముక్తాపీడుఁడు, 5. ఉత్పలుఁడు, 6. భట్టప్రభాకరుఁడు, 7. భట్టేందురాజు, 8. గౌడకుంభకారుఁడు, 9. ఉపాధ్యాయగంగకుఁడు, 10.మాలవకువలయుఁడు, 11. శ్రీచక్రుఁడు, 12.భట్టలట్టణుఁడు, 13. యశోవర్మదేవుఁడు, 14. చందకుఁడు, 15. పరివ్రాజకుఁడు, 16. కార్పటికుఁడు, 17. శ్యామలుఁడు, 18. ప్రవరసేనుఁడు, 19. మాతృగుప్తుఁడు, 20. దీపకుఁడు మొదలగు కవీశ్వరులు గానవచ్చుచున్నారు. వారు రచియించిన గ్రంథము లెవ్వియో, వారేకాలమునం దుండిరో వాఙ్మయచరిత్రవిమర్శకులు విమర్శింపవలసియున్నది. ఈగ్రంథముననేకాక అలంకారగ్రంథము లన్నిటిలోఁగూడ నిట్టియుదాహరణపద్ధతియే కానవచ్చుచున్నది. అలంకారగ్రంథముల నన్నిటిని బరిశీలించి ఆయాకవులు రచియించినశ్లోకముల నన్నిటి నొకచోట గూర్చి ప్రకటించినచో వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడునని నాయాశయము. కాని యాశ్లోకము లాకవులురచియించినవా కావా యనువిషయముకూడవిమర్శింపవలసియున్నది. ఆలంకారిక శాస్త్రములయం దొక కవి రచియించినట్లు దెలుపఁబడిన శ్లోకము లితరకవుల గ్రంథములలోఁ గానవచ్చుచున్నవి. ఇట్టిసమస్యయే తెలుఁగుభాషయందుఁ గూడఁ గలదు.

ఔచిత్యవిచార చర్చయందు బీభత్సాద్భుతరసంబుల కుదాహరణముల నిచ్చుచోఁ జందకునివని రెండుశ్లోకము లుదాహరింపఁబడినవి. అందు మొదటిదగు

శ్లో. కృశః కాణః ఖంజః శ్రవణరహితః
　　పుచ్ఛవికలః
　క్షుధాక్షామో జీర్ణః పిఠరకకపా
　　లార్దితగళః;

ప్రవిష్టః పూతిక్లిన్నైః క్రిమిపరివృతై
రావృతతనుః,
శునీ మన్వేతిశ్వా తమపి మదయ
త్యేవ మదనః.

అను శ్లోకము భర్తృహరిశతకమున దుర్విరక్త పద్ధతియందుఁ గొలఁదిమార్పుతోఁ గానవచ్చుచున్నది. రెండవదియగు

"కృష్ణేనాం బగతేనరంతు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా, సత్యం కృష్ణ?కఏవమాహ? ముసలీ. మిథ్యాంబ, పశ్యాననమ్; వ్యాదేహీతి వికాసితే ఽథ వదనే దృష్ట్వా సమస్తం జగన్మాతాయస్య జగామ విస్మయపదం పాయాత్సనః కేశవః"

అను శ్లోకము కొలఁదిమార్పులతో లీలాశుకవిరచిత కృష్ణకర్ణామృతమునందు ద్వితీయాశ్వాసమునఁ గననగును. (2-65) గనుక నేయేకవు లట్టిశ్లోకములు రచించిరో, యవి యేగ్రంథములలోనివో తెలిసికొనుట యత్యావశ్యకము.

'యత్కించిదపి నోపేక్ష్యం కావ్యేదుష్టం కథంచన' యను శాస్త్రానుసార మాలంకారిక గ్రంథములలోఁ గవులు నిష్పక్షపాతముగ విమర్శయొనర్పవలెను. క్షేమేంద్రమహాకవి ఔచిత్యవిచారచర్చయం దట్టియాదర్శము నేకైకొని కాళిదాసాది మహాకవులను మాత్రముగాక తన గ్రంథములనుగూడ విమర్శించుకొనియున్నాడు. కాళిదాసవిరచిత కుమారసంభవమునందలి 'ఊరుమూల నఖమార్గసంక్తిభిః తత్క్షణం హృతవిలోచనోహరః' అనుశ్లోకమును, ప్రబంధార్థమునం దనౌచిత్యమును సూచించుచున్నదని కవి విమర్శించియున్నాఁడు. 'వర్ణప్రకర్షేసతి' అను శ్లోకమునఁ గర్ణికారకుసుమ వర్ణన మొనర్చి విధాతృనింద యొనర్చుటఁజేసి ప్రస్తుతశృంగార వర్ణనమునకుఁ దగిన యుద్దీపన భావ మేదియుఁ గలుగుటలేదనియు,నాశ్లోకము.

బాలేందువక్త్రాణ్యవికాసభావాత్
బుభుః పలాశా న్యతిలోహితాని;
సద్యో వసంతేన సమాగతానాం
నఖక్షతానీవ వనస్థలీనామ్.

అను శ్లోకమువలె రసౌచిత్యమును సూచింపటలేదనియుఁ దెలుపఁబడినది.

---

## వేలంవెఱ్ఱి

చింతా శంకరదీక్షితులు గారు

క్రిందుమీఁదెఱుంగని వెఱ్ఱికెరలిపాటు-నందు రచియించినాఁడ బద్యముల గొన్ని
హాయి హాయ్, అని విను జను లనెద రంచు-భావకవిరీతి నెంచితి స్వాంతమందు.

సర్వసాధారణముగ హాస్యములపట్ల - మోమువిప్పక మెలఁగెడు మూర్తినైన
ఇపుడు నాపద్యముల బఠియించి నేను - వికవికా నవ్వితిని బొట్ట విచ్చునట్లు.

సేవకుని బిల్వ నతఁడు విచ్చేసెనంత-పూఁచికనుబోలు నావంటి పురుషునట్టి
దీర్ఘకాయుడు బలశాలి తెలిసితెలిసి - అనుసరించుటకే విస్మయంబు గంటి.

“ముద్రణార్థ మియ్యది,కొనిపొమ్ము” అంటి-పిదప సహజధోరణి హాస్యవృత్తి, నేను
“అచట నిద్దాన నేకొంప లంటికొనునో - అరయవలయును పోయిరమ్మం”టి నతని

సేవకుఁడు క కితంబును జేతబట్టి - లోన గమనించుటను జూచినాను కొంత
మొదటిపంక్తిని చదివెగాబోలు నతఁడు - మొగము నేవంకలను నవ్వు మొదలుపెట్టె.

రెండు మూఁడు పంక్తుల జూచియుండెనేమొ-పెద్దయికిలింతతో మోమువిప్పె నతఁడు
మొదటిపద్యము బూర్తిగాఁజదివెనేమొ-హాహ్హా హాహ యనుధ్వని విననయ్యె నాకు.

ఇంక రెండుపంక్తులు పఠియించెబోలు-ఝుర్రు ఝుర్రని నవ్వె బోరున నతండు
ఆఖరాయనో లేదొ పద్యద్వయంబు-ఒక్కపెట్టున పటికా ‘ఘటుక్కు’మనియె.

మూఁడునాల్గు పద్యమ్ములు పూర్తియయ్యె-ప్రక్కలదుముచు శ్వాసకై బాధజెంది
నిలుపుకోలేక వెఱ్ఱినవ్వులకు దొడఁగి-మూర్ఛ నతఁడు గుభాలున భూమిబడియె.

రాత్రి బవ లనకుండ నిర్భాగ్యు నతని-గాచికొనియుంటి పదినాళ్లు గడచువరకు
ఆదినములగాయతు నేను హాస్యకవన-రచన మానితి నేటిప్రారబ్ధమనుచు.

---

# * మేఘసందేశము

యన్. రామదాసయ్యం గారు, యమ్.ఏ., యల్.టి.

ఇంద్రధనూరాజహంస ప్రక్షిప్తములం గూర్చి ఆ 'పిచ్చయ్య'గారికి 'ప్రష్టవ్యము ఇంతయే' యగునేని దానికిం బ్రతివక్తవ్యముః ఇంతయే.

## 1. ఇంద్రధనువు

ఇంద్రధనువుంగూర్చి "పిచ్చయ్య"గారికి తోలుతంబుట్టిన సందేహము "అది యుత్తర దిక్కున నెట్లు సంభవించును; తూర్పునంగదా?" అనియు, "ఆంధ్రవ్యాఖ్యాతలు శ్రీశాస్త్రులవారు 'ఉత్తరమున' అనుట పొసఁగదు గదా" అనియు. దీనికి నాపూర్వరచన తొలిపుటలోని

"ఈ ధనువునకు తూర్పుననో పడమటనో అఖండాకారము కుదిరినపుడు........తురాయిగా రాణించును."

అను నుపన్యాసము సమాధానమనియు, అది ఇంద్ర ధనువును 'తూర్పునుండి' ఇష్టదిక్కునకు 'ఉత్తరమునకుం' గొనివచ్చుననియు నిజాభిప్రాయము. కవి భావించిన యీ యుత్తరఖండమును గాక 'పిచ్చయ్య'గారు భావించిన తూర్పుస్థితిని (కాదా, అట్టిదేయగు పడమటిస్థితిని) అంగీకరించిన ఉత్తరాశాప్రస్థితుఁడగు మేఘునికి అది తగులక పోవుటచే కాళిదాసభారతి యసంబద్ధప్రలపిత మగు ననియు, అట్లు కాకుండుటకై "వక్రఃపన్థా యదపి" అన్నట్లు తూర్పునకు ఆ ధనువును తలపైకి తెచ్చుకొనుటకై మేఘుఁడు ఇంచుక పోయిన అప్పుడు అది తలపైకి వచ్చినను బర్హ సామ్యముం గోలుపోయి వేఱు భంగిం జెందుననియు ఎచ్చరించుట నాకుం దలంపు. ఆ వేఱు భంగిం గూర్చిన నామాటలో చంద్రరేఖా విపరీతాకార మగు బొమ్మకొరఁడునకు చంద్రరేఖా సమాకారముం జెప్పుట "శిశుపాఠపుస్తకము"నేని చదువనట్టి నా యవివేకమని 'పిచ్చయ్య'గారు నేర్పుమీఱ నుద్ఘాటించినారు. అయినను నావాక్యమునందు.—

"......మేఘునికి తూర్పుపయనము సెప్పి, దానిని నెలవంక, చందురువంక యను పేరుల వెలయు నాభరణమును ఈశ్వరుని తలనుండుదానిం గాని, సరస్వతి తలనుండుదానిం గాని మించినదానింగా నుత్ప్రేక్షింపఁదగును."

అనుదానియందు "ఆభరణముగా" అనుట "ఆభరణమును" అను మదుద్దిష్టమునకు అచ్చులో వచ్చిన పొరయనియు; "మించిన" అనుటచే 'ఉత్కోటి యగునది అథఃకోటియగు దీనికి సాటియా సౌభాగ్యమునకు?' అన్నట్లు ఈ వైపరీత్యమే నేను భావించితిననియు, "ఆభరణమును,...దానిఁ...దానిఁ..."అని విశేషణవిశేష్యములకు సమాన విభక్తిం జేర్చి విధేయప్రధానముగా వ్రాయుట నాకు తఱచు అలవడిన మార్గమనియు లోకమునకుం దెలుపుకొందును. అట్లుగాక నెలవంక రూపమునేని ఇంద్రధనూరూపమునేని యథాస్థితముగా నెఱుంగనేరనివాఁడనే యగుదునేని, ఇప్పుడు వెలుఁగఁజొచ్చిన యీ క్రొత్త 'దీపాల'వెలుతురున దానిం దెలిసికొనుటకు కరము సంతోషింతును. కాని, ఈ 'నెలవంక' ప్రస్తావము కేవలము ఆనుషంగికము; దాననేమి? ఇప్పటికేని కాళిదాసుని యింద్రధనుఃఖండము శ్రీమద్వేంకటరాయ శాస్త్రులవారు కల్పించిన దిక్కునకుం జేరి మేఘుని తలపై నవమాడముగా నిగవుకొనునేనియు, శ్రీ వేంకటాచార్య పిచ్చయ్యగారలచే మేఘమునకు చేతికి తలకు అందకుండ తూర్పునకుం ద్రోపుడుపడకుండునేనియు నాకు చాలును.

వ్రాఁత యసమగ్రమనుట ఇంద్రధనువుంగూర్చి కాదు

* దీనినిగూర్చిన విమర్శనముల నిక ప్రకటింపజాలము. —సంపాదకుడు, భారతి.

## 2. మేఘహంసలు

"రాజహంసాః సహాయాః సంపత్స్యన్తే" అనుట యందు శ్రీశాస్త్రిలవారు ప్రకటించిన స్వారస్యమంతయు నట్లే యుండకున్న కాళిదాసు ఈ శ్లోకమును మానుకొనియుండవచ్చును; హంసలను తప్పకుండ ప్రస్తావింపనే వలయునన్న నియమము లేదుగదా ? 'కవిలోకసిద్ధమైన' శాత్రవమందు తాత్పర్యమున్నను, "సహాయాః" అను మూలమందును 'సయాత్రాః' అను టీకయందును మేఘహంసల స్నేహమునం దాత్పర్యము లేకున్నను, అందులకుం దగిన సంవిధానముం గల్పించి వర్ణింపనేరఁడా మహాకవి? వైరప్రయుక్తమైన సయాత్రతయందే తాత్పర్యమున్న-భయముచే వణకుచు, దిగులుచే నోటఁగఱచుకొన్న తూటిబత్తెమును జార్చుకొనుచు, వెక్కుచు, ఏడ్చుచు, మఱి నీబండిలోనే నీతోడనే నీవు పోవునూరికే రావలసినవారు, వేఱుగతిలేనివారై, ఎట్లెట్లో చచ్చుచుం బ్రదుకుచు, పులితోడం దగులుకొన్న జింకలవలె, నీతోడ వత్తురు ఆహంసరాజులు. ఆ యేడ్పుతమాషాను దారి పొడుగునను చూచుచుం బొమ్మ—అని స్వారస్యస్ఫూర్తి యగునట్లు కవనము సేయఁజాలఁడామహానుభావుఁడు! మఱియు నీ స్నేహమునకు వెలితిగాని యితర పరామర్శలును, వైరానైకాంతికతను సూచించునవి ఈ మేఘకావ్యమందుఁ గలవనియు వానికి మల్లినాథసూరుల యభ్యుపగతి కలదనియు నాపూర్వరచనోదాహరణమున,ప్రభవ పుష్యభారతిలో, ౨౩-వ పుటలో, అ, ఆ,ఇ,ఈ,ఉ,ఊ లుగా ప్రకటింపఁబడినది. కవి సమయములు ఏవేని కొన్ని ఆలంకారికాచార్యుల పరిగణనమునందు "ఇత్యాది"అనుటచే ఊహ్యములుగా విడువఁబడినవి ఉండునేమో కాని ఈ మేఘహంసలం గూర్చినది మాత్రము అట్లు త్యక్తముగాక, ప్రతిపదముగా ఉక్తమే. అదే అది— "జలధరసమయేమానసం యాన్తి హంసాః"—అనునది. మేఘాగమ హంసాపగమ యోగ పద్యముం గూర్చిన కవనమున సులువుగా అనఁగా ప్రతిభా వ్యాపారము అంత ఎక్కువగా లేకయే—హృదయంగమము గానేలే—తోఁచు కల్పన:"అవి వీనిం దఱుమఁగొట్టుట""గర్జించిజడిపించుట, వడగండ్లరాలుఱువ్వుట" మొదలగునదెల్ల శాత్రవ సమర్థకమైనది, కోటానకోట్లు కవులు కోటానకోట్ల తెఱంగులం, జేయఁదగును. ఆ యుదాహరణములకుం గఱవా? వానికైనేఁ డీక్రొత్త దీపాల వెలుతురేల? మునుపున్న వెలుతురుతోడనే, అయిదుపుటలు మాత్రమే కాదు, అయిదు పదుల పుటలును నింపవచ్చును. కాని దానిచే ఆశాత్రవమును కవిసమయ మనఁ జెల్లదు; మానసగమన కవి సమయమును నిర్వాహముచేసిన భంగీవిశేషమాత్రమని యనఁజెల్లును. మఱి యీ మైత్రిభంగిని ఇతరకవు లొక్కరేనియుఁ జెప్పరే యనిన దానిచే కాళిదాసునందు సర్వాతిశాయి ప్రతిభను ఊహింపఁదగునుగాని, తప్పుచెప్పుటగాని 'సహాయాః' అన్నమాటను సారహీనము చేసి ఆయన గౌరవమును మాపుటగాని నీతియా? అరయుఁడు: విరహి. అగ్నిమిత్రుఁడు వసంతుని యాభిజాత్యమును, అందులకు మలయానిలము సోకుటను ఆ వసంతుఁడు కోయిల కూఁతలచే "ఎట్లున్నది బాబూ, నీనొప్పి" అని యడుగుచు తన కుడిచేత తన్ను నిమురుటంగాను ఉగ్గడింపఁ దగునా? దుష్యంతుడు, మాలినీ తరంగ వాతమును తన యనంగతప్తాంగములతో నెమ్మికై గ్రుమ్మి కౌఁగిలించుకొనుటను ఉగ్గడింపఁదగునా? శ్రీరాముఁడు విరహి, వర్షర్తువును వచ్చియుండఁగా మేఘవాతమును—కలువ వాసనచే చల్లనైనదానిని—మొగలిపరిమళము గుబాళించుదానిని—ఊరటకై దోసిళ్లతో త్రాఁగుటం జెప్పఁదగునా? విరహుల యీ యాప్యాయనమునకును ఈ మెచ్చుకోలునకును ఇంకను ఉదాహరణములు నలయుదేని దొరకవు, కాదా అతి విరళవిరళముగా దొరకఁబోలును. మఱి యుపాలంభోదాహరణములు ఈ దీపాలను వెలిఁగింపకయే మేఘహంస శాత్రవోదాహరణముల కన్న పదింతలుగా గొప్ప గ్రంథముగాఁ గుప్పవచ్చును. వాని బాహుళ్యముం బట్టి ఉపాలఁభించుటయే కవిసమయ మనఁజెల్లునా? వీని వైరళ్యముంబట్టి ఇవి వాల్మీకి కాళిదాసుల పొరపాటులే అనఁజెల్లునా? ఈ యిరువురే, ఇట్లుగ్గడించినవారే ఇంత కన్న నెక్కువగా వేఱెడల నుపాలంభింపరా? ఆశాత్రవముపాటి యీ మైత్రియు, ఆ యుపాలంభముపాటి ఈ యాశ్వాసోక్తియు, అట్లే తుల్యయోగక్షేమమని మున్నే నుదాహరించిన వాయుమేఘ మైత్రియు తచ్ఛాత్రవ

ముపాటి సహృదయహృదయంగమములు కావా? మఱియు “జలధరసమయే మానసం యాన్తి హంసాః” అన్నయెడ శాత్రవముచే మానసయాత్ర కల్పనయా, యాత్రచే శాత్రవకల్పనయా? యాత్రంబట్టి శాత్రవ (కాదా?) మైత్రీ కల్పన యనియు, యాత్రకు నిబంధన “కాలాన్తరే హిమ దుష్టత్వాత్ మానసస్య” ఇత్యాది మల్లినాథవాక్యముల వలన తెలుంగఁదగు ప్రకృతిరహస్య మనియు మునుపు నాకుం దోఁచినట్లు స్పష్టముగా దెలుపుకొన్నాఁడను. మరల ఇందును . దానిం గూర్చి రవంత: జలధరసమయ హంసమానసగమన కవిసమయము ఎట్లు ఉత్పన్నమైయుండునన్న విచారమును కొంత నా పూర్వగ్రంథమందు కావించినాఁడను. నీటి తేటదనము, బంగరుతామరల కలిమింబట్టి హంసకు ఎల్లప్పుడును మానస వాసము అతిప్రియము. అయినను అచట తనకు రోగ కారి మంచు విశేషముగా నుండుటచే ఆ యుపద్రవముం దప్పించుకొనుటకు వేఱుచోట్లం గ్రుమ్మరుచుండును. వర్షలో కలుగు జల కాలుష్యముచే సకలజలాశయము లును దానికి వాసానర్హములగును. అప్పుడు అది తన సొంతయింటికే అతిరమణీయమగు మానసమునకుం బోవును. వర్షర్తువున మానసమందు హిమదోషము లేదా యనిన, లేదు అనఁదగును; దానికి పూర్వములగు గ్రీష్మ వసంతములందును అది యటు మృగ్యమే. మఱి శరదాదిగా అట నాదోషము ప్రతిదినము హెచ్చగుటచే హంస మానసమును తనకు వదలఁ గాఁబ్లాడకున్నను ఎట్లో వదలి “మనయింట మనము కుదురుగా నుండుటకు వెరవు లేకున్నదిగదా” యని దుఃఖించుచు ప్రసన్న జలాశయములకై దేశములం గ్రుమ్మరుచుండును. మఱి శిశిరర్తు విరామముననే, వసంతావతారముననే మానసమునకు మరల రాదా యన్న, తాను వలసవచ్చిన జలాశయముల రామణీయకము అప్పటికిని తఱుగకుండుట చేత, అది వానిని వీడి ఎన్నఁడు మరలినదికాదు; తాత్కాలికమైన మానస వృత్తాంతమును ముగ్ధ మది యెఱుఁగదు; మఱల వర్షావతారమున ఈ జలాశయములకు కాలుష్యము కలుగునపుడు దానికి జడిసినదై మానసమునకై యుబ్బిఱిబారి పయనించును. అప్పుడు మానసము హిమహీనమై హంసకు వాసయోగ్యముగా నుండును. మానసము వర్షలో మాత్రమే హిమహీనమై సుఖముగా నుండునని దానిభ్రాంతి అనియేని; కాదా, మానసమున హిమసంతతము నడుమ నున్న దానియందు హిమదోషము నిత్యమేయనుకొన్నను హంసకు హిమోపద్రవమునకన్న జలకాలుష్యోపద్రవము ఎక్కువ పీడాకరమనియు, కావున వర్షలో మానస వాసము దానికి లోభనీయమగునని యుఁ దలంపనగును. ఏ పక్షమునను మానసయాత్ర ఇతర జలాశయవాసమున కన్న హంసకుం బ్రియతరము. కాఁగా “ఉత్తములయిన యా మహానుభావులకు నీలోకోపకారశీలతచేత నీయందు స్నేహము కలుగును;...వారికి అతిప్రియమైన మానస సరస్సు...తమకు నివాసయోగ్యమని నీవు ఉజేమిసూచింతువు, గాన వారికిని నీవు ఉపకారివి....” ఇత్యాది స్వారస్యము మిక్కిలి యొప్పియుండును. ఇఁక నిట కలిగింపఁబోవు జలకలుషీకరణాపకారమునకన్న “మానసము, మీకు అత్యంతప్రియమైనది, మీకు వాసయోగ్యమగు కాలము వచ్చినది. మఱి కదలండి” అని సూచించు నుపకారమును కవి భావించుట ప్రౌఢి పరాకాష్ఠ. ముంగిస పామునకుం బోలెను, పిల్లి చిలుకకుం బోలెను అచేతనమగు మేఘము తాత్త్వికముగా మనోనిశ్చయముతో హంసలకుం జేయు కీడు లేదుగదా! అట్లు జాతివైరము లేమి చేతనే,

“యస్యాస్తోయే కృతవసతయో
మానసం సన్నికృష్టం,
నాధ్యాస్యన్తి వ్యపగతశుచ
స్త్వామపి ప్రేక్ష్యహంసాః.”

అనుట. ఇట మానసమునకైన హంసల యాధ్యానమును (అనఁగా ఉత్కంఠాపూర్వకస్మరణమును) సామాన్యముగాఁ జెప్పుటను అరయఁదగును. మఱియు కమలార్క మైత్రి కవిసమయములం దుదాహృతముగాదా? కాదు; మేఘహంసవైరమువలెనే; మఱి తామరలు రాత్రి వికసింపమియు,కలువలు పగలు వికసింపమియుం జెప్పవలసినది “జలధరసమయే...” వంటి సమయము గలదు. వికాసమును నవ్వుటగాను మేల్కొనుటగాను, సంకోచమును దుఃఖచేష్టగాను నిద్రాకార్యముగాను, చెప్పుటయు;

దానిచే మైత్రిని దీనిచే శాత్రవమును కవులు కవనము చేసినారు. ఒక్కెడ తామరపువ్వును సూర్యునికి మిత్రము అన్నారు; ఒక్కెడ తామరతీఁగను సూర్యునికి కాంత యనియు, ఆ తామరపువ్వు నేత్రస్థానీయమనియు, తద్వికాస సంకోచములు నేత్రోన్మీలన నిమీలనము లనియు అన్నారు. అట తన్మిత్రమైన పువ్వు ఇట తత్కాంతకు కన్ను అయినది. తామరకు దివామాత్ర వికాసము 'సమయము' కాఁగా, ఇవెల్ల కవుల ప్రతిభ వని కల్పనలు, సమయ నిర్వాహప్రకార విశేషములు. దివా వికాస సమయము దాటకుండ ఇట్టి కల్పనలు ఇతరములుం గూడ ప్రతిభ గలఁడేని కవి చేయుటకు అధికారి; దాన సమయోల్లంఘనదోషమునకు గుఱికాఁడు. చూఁడుఁడు. తామరతీఁగపై సూర్యకరప్రసారము పెక్కురవాకున కాంతను గిలిగింతగొల్పు ప్రణయచేష్టయగునేనియు ఈ యుద్ధారమున—అళులమాట యుండనిండు—బాలభాస్కరుఁడు తామరలం బరామర్శించుటలో చెలిమి ప్రస్తావము లేదు గదా, ఒకకొంత తద్విపరీతమును సయితము ఆకర్షింపనగును.

"చ. కరకరి గూటఁ గట్టుబడఁ
గా నొఱవెట్టెడు లీల బాల భా
స్కర కరకాండ కందళి వి
ఘట్టన నించుకవాయివడ్డ తా
మర మొఱవెట్టిపెట్టి పలు
మాఱును వాకిలిదాఁటి యాఁగుచు
న్నొమ్మరయ విపంచి మీటు గతి
మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్."

భాస్కరుఁడు, బాలుఁడు, కొంటె, కరకరి; కరముకట్టు; తామర గూడు; విఘట్టన గ్రుచ్చుట. ఇదేమి మైత్రి? మఱి పెద్దనగారు ప్రాతర్వికాస సమయమును మాత్రము నిర్వాహము చేసినారు. అళులకును, తామరల విప్పి మకరందము పోసి గొప్ప యాపానమహోత్సవముం జరిపినాఁడు, "గిడ్డంగినాయఁడు" కమలాప్తుఁడు అని యనకుండ మొఱవెట్టించినాఁ డనుట కమలసూర్యమైత్రి నిర్వాహమునకు ఒకకొంత ఎడము గాదా? మఱి మైత్రిని చెప్పిన కవన బాహుళ్యముచే తన్మిత్రమనియు, శాత్రవముం జెప్పిన కవన బాహుళ్యముచే తచ్ఛత్రువనియు నిఘంటువులందును కావ్యపరిశ్రమ సాహాయ్యమునకై సంకలితము లగువాని యందు 'తొలకరిసూఁడు', 'కమలాపుఁడు', 'కలువలచెలి' అని తన్నామము లుదాహృతములు కాఁదగును. దానిచే కవిసమయ తత్పరిపాలన ప్రకారములం గూర్చిన నిజ సిద్ధాంతము వైకల్యము చెందదని నా విన్నపము.

"మలి" మేఘము నేకాక "తొలి" మేఘమునుం గూడ హంసలకు భయావహముగా ఎందరేని కవులు వర్ణించి యుండవచ్చును. కాని, కాళిదాసు ఇట సర్వేశ్వరకవి విలక్షణముగా కల్పించిన మైత్రింబట్టి ఆ తొలిమలి భేద జ్ఞానముచే విశేషము అరసికొనఁదగునని జ్ఞాపకము సేయుట నిజాభిమతము. ఆంధ్రవ్యాఖ్యాతలును శ్రవణ సుభగముగా నుఱిమి హెచ్చరిక సేయుట మొదలగు స్నేహకార్యమును తలంపించినారు. ఇతర కవులకుఁ దోఁపని ప్రకృతి రహస్యములను కాళిదాసు ఒక్కఁడేగదా (భాసుఁడొండె) చెప్పుట; "ఇదిగో వసంతలక్ష్మి నడి జవ్వనమందున్నది" అనియు; "ఇదిగో వసంతునికి ఇంచుక యౌవనము ముదిరియున్నది" అనియు; "ఇదిగో వసంతలక్ష్మి బాల్యయౌవన మధ్యదశయం దున్నది" అనియు; ఇట్టిట్లు అశోకచూత కురవక తిలక చంపకాదులపూఁవని, పూచిన, పూచుచున్న, పూవనున్నట్టియు, పిందెలు పుట్టినట్టియు, వీని పిందెలు వాని పిందెలకన్న పెద్దవైనట్టియు, దశావిశేషములను సూక్ష్మతర భేదములుం దెలియునట్లుగా కాళిదాసుగాక ఇతరులు వర్ణించిరా? వసంతవృక్షము లెల్ల ఒక్కుమ్మడిగా ననిచినవి, అంతట చిగిర్చినవి, అంతట పూచినవి, అంతట ఫలించినవి—అని యీ సామాన్యమే గదా ఎల్ల కవులచే ప్రాయికముగా వసంతవర్ణనలం జెప్పఁబడుట? మఱియు "శరత్తున" "కోయిల" కూఁతను (కారణ విశేషము చేతనేలే) శకుంతలావనవాస బంధు తరుప్రతి వచనముగాఁ గల్పింప కాళిదాసుని కంటె అన్యునికిఁ దరమా? కావున కాళిదాసభారతియందు ఇట్టి రహస్యములు మఱెందును లేనివి అరయుట ఆవశ్యకము, సహృదయులకు నిర్వృత్త్యాధాయకము.

## 3. ప్రక్షిప్తములు

శ్రీమద్వేంకటరాయశాస్త్రులవారు తమ సవ్యాఖ్యానగ్రంథమునకుం బీఠికలోనే ఉత్తరమేఘు మందలి 47, 56, 57 శ్లోకములం బ్రక్షిప్తములని నందర్గికార పండితులు చెప్పినమాటను ఉదాహరించిరి. "అయినను వానిని విడువ నిచ్చగింపక నేను ముద్రించితిని" అనిరి. "అయినను" అనఁగా "అవి ప్రక్షిప్తములైనను" "నందర్గికార పండితులు విడిచినను" అని శ్రీశాస్త్రులవారి యాశయము. కావున ప్రక్షిప్తత అంగీకృతమే. మఱి అవి ప్రక్షిప్తము లేలకో యను విచారము నందర్గికార ముద్రణము నాఁటినుండియు, మనీషుల హృదయమునను, విద్యార్థుల హృదయమునను ఉండునదే కాని ఈ ప్రభవ విభవ దీపావళిదినములలో క్రొత్తగా లేపఁబడినదికాదు. 1912 సంవత్సరమున బి. ఎ. పరీక్షకుం బఠనీయములలో ఉత్తరమేఘము కలదు. [అంతకుంబూర్వము ఎన్నితూర్లు ఉండినదో] నాఁటి విద్యార్థులమాత్రమే నాకు, సతీర్థులును, ఇతరులును ఈ విచారమును చేసి యెఱింగినవారు శతాధిక సంఖ్యలు. అంతకుం బూర్వులెందఱో. ప్రక్షిప్తములనుటకుం జర్చను—ఇట్లు మిక్కిలి సామాన్యముగా ఎల్లరచేతను చేయఁబడియుండుదానిని—శ్రీశాస్త్రులవారు—అంతయుం గ్రొత్తగా పూర్వులకు అందని విశేషముగానే చెప్పుచున్నవారు—ఆపీఠికలో చేర్పకుండుట అల్పసారము పునరుక్తము అనావశ్యకము అనియే. ప్రక్షిప్తములన్న యామాఁటినిం గూడ గ్రహింపఁ దక్కిన ప్రక్షిప్తములను మల్లినాథసూరి స్పష్టముగా చెప్పినవానిని గ్రహించినట్లే. ఆ చర్చ వారును చేయలేదు; వీరును చేయలేదు. కవితాశిల్పమునకు ఒకదానం గలుగు దోసఁగు వంటిదే వేఱొక్కదానం గలుగునది. ఇంచుక ఎక్కువతక్కువలు గణనీయములుగావు. మల్లినాథానుగ్రహముగల ప్రక్షిప్తములను గ్రహించుటకుం గారణము లుండునేని అవే, కాదా, అట్టివే ఏతద్గ్రహణమునకును ఊహించుకొనవచ్చును. [వీనికిని మల్లినాథానుగ్రహము గలదనియే నిజాభిప్రాయము.] పీఠికయందే ప్రక్షిప్తతంగూర్చి జ్ఞాపకముచేసిన శ్రీశాస్త్రులవారు పఠితలను సందేహముపాలు చేసినారనియేని కథావిరుద్ధార్థప్రతిపాదక గ్రంథమును చేర్చినారనియేని అనఁజెల్లదు.

మఱియు, ఆక్స్‌ఫర్డు కేమ్బ్రిడ్జ్ మొదలగు మహావిద్యాపీఠములం బ్రకటితము లగు షేక్స్పియరు మొదలగు మహాకవికృతులందు ప్రక్షిప్తతాశంక కలిగిన గ్రంథమును తప్పింపక ముద్రించుటయు, పీఠికలో మాత్రము దానిని సూచించుటయు శైలి.

పూర్వ ముద్రణ పీఠికయందు 47, 56, 57 అని శ్లోకసంఖ్య సరిగాపడినను, ఆయాసంఖ్యకుం బ్రక్కనున్న శ్లోకప్రతీకములలో అచ్చుతప్పు పడినది. రెండవ ముద్రణమందు క్రొత్తదానియందును ఆ తప్పు ప్రామాదికముగా అట్లే వచ్చినది. ఇందు 47 "ధారాసిక్త;" 56 "తత్సందేశం," 57 "శ్రుత్వావార్తామ్." మఱి అచ్చులోని తప్పు స్పష్టమే. "56-ఇత్యాఖ్యాతే" అని అచ్చైనున్నది. "ఇత్యాఖ్యాతే"-56-వ శ్లోకముగాదు, 39 వది. దానింగూర్చి ప్రక్షిప్తమన్న ప్రస్తావము ఎందును లేదు. అది "తత్సందేశం" అనుటకుం బొరపాటు. గురుభక్తిచేతనే అచ్చుతప్పును తొలంచితిని.

ఇఁక ముగింపు.—దొంగ కన్నము వేయవచ్చి తన సాధనములకు అల్పసారములకు శక్యముగాని గోడకడం బని సేయుచుండి, ఇంతలో కొత్వాలునకు కర్మయందు పట్టుబడి తప్పించుకొను వెరవు లేక మిణుకరించి "లేదయ్యా, కాదయ్యా, పామొకటి ఇటు ప్రాఁకినట్లుండఁగా వెదకుచుంటిని" అనుచు తప్పించుకొనఁజూచిన తెఱంగున నున్నది, "నా యీ విమర్శమువలన శ్రీశాస్త్రులవారి యశోధనమునఁ బాలుగొందమన్న తలఁపునఁగాదు." అని వ్రాయుట. "ఏతత్", "పురస్తాత్", "ఖణ్డమ్" అనువానింగూర్చి నాలుగుబంతులును, "రాజహంసాః సహాయాః సంపత్స్యన్తే, బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః" అనుదానింగూర్చి సలువదిబంతులునునిండ, "కళాప్రపూర్ణులు" ఉపక్రమపూర్వముగా ననుగ్రహించిన పదప్రయోజనాచితీ వివరణము పొరబాటనుటయు భ్రమప్రమాదజమనుటయు, 'ఈశ్వరవంతపొరబాటువలననేమి, శ్రీశాస్త్రులవారు చాల గొప్పవారు, ఘనకార్యధురంధరులు' అనుటయు ఇత్యా

దికమంతయు పాపీ ఋమును, మన్నింపరానిదియు, నయవంచన. శ్రీశాస్త్రులవారి యా వ్రాఁత, అట్టి వ్రాఁత, ఘోరపాపే యగునేని అదియొకపాటి కళంకాపాదక మే ఏల కాకపోవును? మఱి ఇప్పటికిని ప్రకృతమున మేఘుహం సకాత్రవమన్న జ్వరము పిచ్చయ్యగారికి అంతర్గతముగా కాయుచునే యున్నది గదా. కనుక గురుసేవగాను, సత్యవిచారముగాను, భారతీపరిపస్యగాను నేను మరల ఈ వ్రాఁతఁ బ్రకటించితిని.

సత్యాసత్యములు, అర్థాపార్థములు మొదలగునవి నిర్మత్సరులగు విద్వాంసులు నిర్ణయము సేయుదురుగాక!

---

# ఠాకూర్ వీర కేసరి

కవిసోదరులు: పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్యగార్లు

౧

నిండుపేరోలగమునఁ గొల్వుండియుండు-'నజిత' ధరణీశు కనకసింహాసనమ్ము
చెంతఁ గుడివంక నాసనాసీనుఁడై,మ-దేభవిదళిత కేసరిఁ దెగడినెగడి.

అరనోరగైన మోమున ననంతముతా ముదుల్గుఱు వికాసమ్గుఱు
బరపుచునున్న కన్నుగవఁ బండిన కెంపుల లేఁతచాయల్గుఱు
జెఱిగి మొగంబునంబడిన నిక్కు-పు నీలపుటుంగరాలజాల్
కురులును, గడ్డమ్గుఱు గల యఁకుంఠిత తేజుఁ డతం డెవండొకో.

ఎదను జెయిచేర్చి నిద్రించు నదనునందుఁ-జెక్కిటను జెయిఁ జేర్చి యాసీన తేల?
నిన్న మొన్న యుద్ధాలమన్నీ లఁదోలు-కేసరి మొగాన నిప్పు డీఖిన్న తేల.

౨

"ఔర! నాయాన నూన కీవాయరంగు-మనుమరాలి మత్ప్రాణసమానురాలి
నాలుకానున్న నాజవరాలి నాయరంగు-నొద్దను డించి తౌరా, యమాత్య!

ఎవనికొలువుంటి; కుడుతు వీ వెవనికూడు-ఇన్ని యేడుల బ్రతుకు నీ కెవరిభిక్ష
ఇట్టినీమేలిక మనమ్ము నేది పీని-శాసనమునకుఁ బ్రతిగ శాసనము సేతొ!

వలదింక నీయమాత్యత—సభాభవనమ్మున రెప్పపాటు నేన్
వలవదు నిల్వ—కంటఁ బడవల్వదు నాకిఁక—కాన కేఁగఁగా

పతె—నుగుడంగ వల్వాదు—భవన్మరణంబటు, బ్రాప్తమౌత-పో
వలయును; పొమ్ము పొ;మ్మిదియు వమ్మొనరించిన సైపనెమ్మొయిన్.

అనుచు శాసించి యజితమహావనీంద్రుఁ-డనుడు నా కేసరి మొగంబునలముకొనిన
సిగ్గుపొరలకు మిది లేదు—జీవకళలు-మృగ్యమాయెను పొరలచే మృతునికట్లు.

కేసరి లేచినిల్చె; వలకే లజితాఖ్యుని యాన నాబ్జమున్
డాసె—"స్పృశింపఁబో కసురుఁడా! సయిరింప"నటంచు రాజనెన్
డాసె మఱొక్కచేయి "ఎవఁడా స్పృశియించు పిశాచ"మంచనన్
డాసెను కేసరంబులఁ గడల్కొనుమో మజితాఖ్యు చెక్కిలిన్.

అజితమహీంద్రుఁ డంతట నిజానన మావలఁ ద్రిప్పఁజూచె, వే
ఱుజరిగె—నాయమాత్యుఁడు పిఱుందనఁ జెక్కిలిముగ్గులాడి, మె
ల్లజరిగిపోయి—"నాయనుఁగ—కాదు—మహావనిపా! యిదే త్వదా
జ్ఞ జరుపఁ జాలువాఁడ నొకసంశయ మయ్యది చిత్తగింపవే'

వీడెడి వీఁడమాత్యశను—వీడెడి మీసభ రెప్పపాటునన్
వీడెడి వీడునున్—వనుల నిల్చెడి—గాని భవద్వచఃస్థితిన్
వీడెను ప్రాణ మిప్పడ—వనీస్థలిఁ బ్రాణము వీడు టెట్లునా
తేఁడు విధించు శాసనము రిత్తపొనర్చితిఁ!—దప్పసైఁతువో!

అనుడు సభనుండి 'సిగ్గ'ను నఱపువెడలె-తజ్ఞ్ఞులగు పెద్దవారి డెందాలు పగిలి
కనులఁ గన్నీరు 'జొటజొట' మనుచు వెడలె-వీర కేసరి కొలువును వీడివెడలె.

3

కనులఁదెఱవని పసికూనఁ జెనిచిపాదు-పాహ యత్నాల కందీక, సాఁకి, దాఁచి,
రాజ్య మరచేత నిడిన వీరవ్రతుండు-కనినప్రతిఫలమిది:—యజితుని కతాన.

'కవిత' నుండి.

---

# అ జం తా చి త్ర ము లు

## ౧. మాతృపోషకజాతకము




పైన—గజవిమోచనము        క్రింద—గజాఖేటము

౨. మాతృపోషకజాతకము



మాతృపునస్సమాగమము

# ప్రాచీన జ్యోతిష గ్రంథములు

నిడుమోలు కనకసుందరం గారు, బి.ఏ.(ఆనర్సు)

ప్రాచీనకాలమున హిందూదేశవాసులగు నార్యులు వివిధ శాస్త్రవిజ్ఞానసంపన్నులై యుండిరి. వారు రచించియుండిన గ్రంథములలో జ్యోతిష శాస్త్రమునకు సంబంధించినవి పెక్కులు మనకు చిక్కియున్నవి. ఆకాలమున శాస్త్రవేత్త లొకరితో నొకరు సంప్రతించుకొనుటకు విశేషములగు నవకాశములు లేకుండుటవలన వారిస్వతంత్రరచనములయందు కొన్ని పరస్పర విరుద్ధములగు సూత్రము లగుపడుచున్నవి. కాని యీ వాఙ్మయమున ప్రత్యక్షమగు సమన్వయసిద్ధాంతము లేకపోలేదు. ప్రాచీనహైందవులు విధించిన భగవత్పూజా విధానములందు జ్యోతిషశాస్త్ర సాంప్రదాయములు విరివిగ నగుపడుచున్నవి. ప్రాతర్మధ్యాహ్న సాయంసమయములయందలి వివిధ ప్రార్థనాదికములకును, ఋతువులతో సంబంధించిన పూజలకును, సాంవత్సరికోత్సవాదులకును, జ్యోతిషాంగముల పరిజ్ఞానము వారి కావశ్యకమైయుండెను. "వేదములు యజ్ఞకర్మలను నేర్పుచుండుటచేతను, అట్టికర్మలు కాలమానముపై నాధారపడియుండుటచేతను, జ్యోతిషశాస్త్రమును, అనగా, కాలమానముయొక్క జ్ఞానమును తెలుసుకొనువాడు యజ్ఞకర్మల నెరిగినవాడగుచున్నాడు" అని ప్రథమజ్యోతిషగ్రంథమగు 'జ్యోతిషవేదాంగము' చూపుచున్నది. ప్రాచీన పవిత్రగ్రంథములగు వేదములందు ప్రసిద్ధములైన జ్యోతిషశాస్త్రసాంప్రదాయములు విరివిగ నుదహరింపబడియున్నవి. ఈవేదములు ప్రాచీన నాగరికతయొక్క ఔన్నత్యమును ప్రదర్శించుచుండుట వలన అందలి జ్యోతిషసాంప్రదాయములకుగూడ ప్రాముఖ్యము హెచ్చుచున్నది. వేదములు నాల్గింటిలో చరిత్రకారులకు ఋగ్వేదము చాల ముఖ్యమైనది. మత సాంప్రదాయములను నిర్ణయించు 'బ్రాహ్మణములు'ను, సూత్రములను విధించు 'సూత్రములు'ను, వేదముల కనుబంధములుగా రచింపబడియున్నవి. అందు 'బ్రాహ్మణము'లలో మూడువిభాగములు కలవు. వేదాంతభాగమును విమర్శించునది 'ఉపనిషత్తు.' ఈ అనుబంధగ్రంథములందును విజ్ఞానవంతములగు జ్యోతిషసూత్రములు వెదజల్లబడియున్నవి.

వేదములలోని జ్యోతిషభావములు కొన్నితావుల క్లిష్టములుగను, కొన్నితావుల నస్పష్టముగను నున్నవి. జ్యోతిర్గోళములు దేవతాస్వరూపములుగ నెంచబడియున్నవి. కాని అట్టిగోళముల దైవతలక్షణములకును, వాని జ్యోతిషసాంప్రదాయములకును సంబంధము ప్రాముఖ్యముగ నగపడుటలేదు. కొన్నిపదములు జ్యోతిషపరమగు నర్థమును కాలక్రమమున కోల్పోయి యుండవచ్చును. ఋగ్వేదములోని కొన్నిభాగములు భావాంతర్ముఖత్వమువలన దురవగాహములై చిత్రములగు నపోహములకు తావులైనవి.

జ్యోతిషవిషయవిచారమే పరమావధిగాగల గ్రంథములు. అతిప్రాచీనకాలమునం దుండినట్లులు మనకు దెలియదు. వేదాదులయందు జ్యోతిషశాస్త్రమును గూర్చి ముచ్చటించిన తావులందు ఆయాభావములు అస్పష్టములుగను, గూఢములుగను నున్నవని పైన వివరించియుంటిని. సంహితలును, బ్రాహ్మణములును కూడ జ్యోతిషవిషయములను చర్చించియుండలేదు. నక్షత్రదర్శకుడగు నరుని (జ్యోతిష్కుని) బలిగానిచ్చిన యెడల జ్ఞానము లభించుననియు, గణకుని బలిగానిచ్చినయెడల శక్తిలభించుననియు యజుర్వేదము (XXX—10 & 20)నందున్నది. నక్షత్రవిద్యయు, రాశిజ్ఞానమును నారదునకు దెలిసియుండిన విషయములుగా ఛాందోగ్యోపనిషత్తు [VII 1 (2), (4), 2 (1), 7 (1)] పేర్కొనుచున్నది. ఆపస్తంబుడు "ధర్మసూత్రము"లందు [IV, II, 8 (10)] వేదములయొక్క షడంగములలో జ్యోతిషమొకటి యని వ్రాసియుండెను. జైనసూత్రములందు విచిత్రమగు నీకథ

యున్నది. "మహావీరుడను మహాముని, గలంధరాయణ గోత్రికురాలగు బ్రాహ్మణి దేవానందయొక్క గర్భమున పిండరూపమును దాల్చెను. ఆసమయమున నాబ్రాహ్మణి ఏనుగు, ఎద్దు మొదలగు పదునాలుగు సుశకునములను స్వప్నములందు గాంచెను. ఆపెగర్భమున చక్కనిబాలుడు జనించునని బుషభదత్తుడు చెప్పుచు, ఆబాలునకు గణితము, జ్యోతిషము, వ్యాకరణము, ఛందస్సు మొదలగు శాస్త్రములయందు ప్రావీణ్యము లభించుననియెను." [మాక్సుముల్లరుగారి Sacred Books of the East, XXII, 221 చూడుడు.] కావున జైనమతప్రచారకునకు జ్యోతిషగణితముల జ్ఞానము ముఖ్యముగ నెంచబడిన ట్లగపడుచున్నది.

జ్యోతిషశాస్త్రము ప్రాచీనులయభిమానవిద్యయై యుండెననుటకు తార్కాణములున్నవి కాని యీశాస్త్రమనిన నిరసించెడి వారనుటకును నిదర్శనములు లేకపోలేదు. "జ్యోతిషమువలన జీవనోపాధిని సంపాదించుట మొదలగునవి మానవుల నపవిత్రులజేయు దోషము"లని బౌధాయనుడు శాసించెను. (Sacred Books of the East, XIV 2[illegible]0 చూ.) "జ్యోతిషమువలన జీవించెడి వానిని జాగరూకతతో తప్పించుకొనవలె"నని మనుధర్మశాస్త్రము బోధించుచున్నది. జ్యోతిషమునందును, తదితరవేదాంగ ములందును గలప్రావీణ్యమును ప్రదర్శించుచు సన్న్యాసి భిక్షాటనముచేయరాదని శాసింపబడియున్నాడు. నక్షత్రములవలన జీవించువారిని మహాభారతముకూడ నిరసించుచున్నది. కౌటిల్యుడు 'అర్థశాస్త్రమున' జ్యోతిషమును తీవ్రముగ ఖండించెను. 'చాంద్రమానము యొక్కయు, నక్షత్రములయొక్కయు మంచిచెడుగుల యందు నమ్మకము కలిగియుండుట లాభకారి కాదనియు, 'నక్షత్రవిషయములను తరచుగ విచారించుచుండెడి అమాయకునియొద్ద ధనము నిలువదనియు నర్థశాస్త్రము బోధించుచున్నది. బుద్ధదేవుడు, తనయంత్యశిష్యుడగు సుభద్రుడు నిర్వాణము చెందినపిదప భిక్షువులకు బోధ నేయుచు "నక్షత్రపరీక్ష, జ్యోతిషము, భావిశుభాశుభములను తెలుపుట......యివియన్నియు చేయకూడని పనులు సుడీ" అని చెప్పియుండెను. [ఫోహో-పింగ్-సాంకుంగ్-26 వర్గ-2022 మహాపరినిర్వాణము. చూ.] "చంద్రగ్రహణము రాగలదు...సూర్యచంద్రులు యేకరాశియందు కలిసికొనగలరు. సూర్యగ్రహణము ఫలాని ఫలము నిచ్చును; చంద్రగ్రహణము ఫలాని ఫలము నిచ్చును. సూర్యచంద్రులు యేకరాశియందు కలిసికొన్నపుడు ఫలాని ఫలము నిత్తురు....అని అబద్ధములు చెప్పుచు, హేయకార్యముల కొడిగట్టుకొని సామన్యబ్రాహ్మణులు కొందరింకను తమజీవనోపాధినిసంపాదించుకొనుచున్నా" రని బౌద్ధమతగ్రంథమగు తేవిజ్జసూత్తమునందుండుటచే, బౌద్ధులకు జ్యోతిషశాస్త్రము పైనగల నిరసనభావము తెలియనచ్చుచున్నది. బౌద్ధులకు మేగియనుల పైగల అసహ్యభావమే, మేగియనులచే పోషింపబడిన జ్యోతిషశాస్త్రముపై వారి కేర్పడిన నిరసనభావమునకు కారణమై యుండవచ్చును. బౌద్ధగ్రంథములు దాదాపుగ నన్నియు, జ్యోతిషశాస్త్రమును కడునీచముగ చూచియుండినవి. బౌద్ధజాతకములందు జ్యోతిషవిషయములనేకములు కానవచ్చుచున్నవి. ముఖ్యముగ సూర్యచంద్రగ్రహణకారకులగు రాహుకేతువులు 25, 481, 490, 537 మొదలగు జాతకములందు పేర్కొనబడియున్నారు.

## ఋ గ్వే ద ము

ప్రాచీనకాలమున నార్యులకు కరతలామలకమై యుండిన విజ్ఞానమంతయు ఋగ్వేదమున క్రోడీకరింపబడియున్నది. ప్రాచీనకాలమున హైందవసంఘమున ప్రచారములో నుండిన ఆచారసంపత్తియు, జీవితసమస్యల పరిష్కరించుట కేర్పరుపబడిన పద్ధతులును, ఆర్యులు విజ్ఞానమును వికసింపజేసిన మార్గములును, చిత్రగతులనీఋగ్వేదమున వర్ణింపబడియుండుటచేత నీగ్రంథ మాధునికులకు అమూల్యమై యొప్పుచున్నది. ప్రాచీనార్యులు భగవంతుని సృష్టిలీలలయందలి అంతరార్థమును గ్రహించుటకు ప్రయత్నించియుండిరి. అట్టిప్రయత్నముల ఫలితములన్నియు ఋగ్వేదమున మనము చూడగలుగుచున్నాము. ఆకలములను దినుచు, ఎండవానలకు జడియక తరుచ్ఛా

యలనే దినములు గడపుచు, భూమియందవతరించిన ప్రకృతివిలాసముల ననుభవించు నార్యుడు, సూర్యుడస్తంగతుడైనంతనే ఆకసమున నుదయించెడి జ్యోతిర్గోళములను దర్శించి వాని పరిణామక్రమమును తెలిసికొనుచు భగవంతుని సృష్టిప్రపంచమున యథేచ్ఛముగ విహరించియుండెను. నేటికి కనీసము 8000 సంవత్సరములకు పూర్వము వేదములను రచించిన మహర్షులు జ్యోతిర్గోళముల ఉత్పత్తి, స్థితి, కారణములనుగూర్చి యేమేమితలచియుండిరో—అది యంతయు ముద్దులొలుకు ఋక్కుల రూపమున మన యదృష్టవశమున లభించుచున్నది. ఆకసమున నగుపడు జ్యోతిర్గోళము లీ 8,000 సంవత్సరములలో నెట్టిమార్పునైన చెందియుండకపోవచ్చును. కాని వానిని సుత్తించుట కేర్పడిన పదజాలముమాత్రము విశేషముగ మార్పుచెందినది. ప్రాచీనార్యులు ప్రకృతియందలి ప్రతిరూపమును భగవంతుని యంశముగనెంచి వానిని దేవతలుగ పేర్కొనుచు పూజించుచుండెడివారు. కావున నేడు మనము వ్యవహరించుకొను పదజాలమునకు, వేదములందు ప్రయోగింపబడినవానికిని సమన్వయము కుదురుట లేదు. వేదములందలి విచిత్రవర్ణనములనుబట్టి జ్యోతిర్గోళముల దేవతావ్యక్తిత్వమును వాని భౌతికలక్షణముల నుండి వేరుచేయుట సాధ్యము కాకున్నది. జ్యోతిర్గోళముల భౌతికలక్షణములను వివరించుటయే ఋక్కుల యొక్క పరమావధియై యుండలేదు. సూర్యుడు, సావిత్రి, మైత్రేయుడు, ఆదిత్యులు మొదలగు జ్యోతిర్దేవతలస్వరూపములను, స్వభావములను పేర్కొని, పొగడి, ఆరాధించుటయే వాని ముఖ్యోద్దేశమై యుండుటచేత, ఆధునిక శాస్త్రగ్రంథములందువలె విషయక్రమము (Syllabus) ను పాటింపనందులకు మనము ఋగ్వేదరచయితలను నిరసింపతగదు! ఆ ఋక్కులయొక్క భావగాంభీర్యమును, వాని సౌకుమార్యమును గ్రహించినకొలదియు, మానవుని విజ్ఞానము వికసించుట నిస్సంశయము. వానియందు సూచింపబడిన కొన్ని నూతనాంశముల నిట వ్రాయుదును.

## సూర్యుడు

జ్యోతిర్మూర్తుడును, గమనవేగమున నెల్లర నతిక్రమించువాడును [i–50(4)], రాత్రిందివముల నిర్ణయించువాడును [i–50 (7)], దొంగలనువలె నక్షత్రములను చీకటిని తరిమివేయువాడును [i–50(2)], అయినటులు ఋగ్వేదము వర్ణించుచున్నది. సూర్యరథమునకు సప్తాశ్వములున్నటుల చాలచోటుల [i–50(8); i–164(2); vi–44 (24) &......] సూచనలున్నవి కాని, కొన్ని సందర్భములలో ఐదులేక ఆరుగుఱ్ఱము లున్నటులును, v–62 (1) యందు సహస్రాశ్వము లున్నటులును వర్ణనములు కానవచ్చుచున్నవి. స్వర్భానుడను రాక్షసుడు సూర్యునపుడపుడు కబళించి అంధకారమున గప్పుచుండును. అత్రిమహాముని ప్రభావమువలనను, భక్తులయొక్క ప్రార్థనములవలనను, సూర్యుడాయంధకారమునుండి విముక్తిగాంచును. ఆధునికకాలమున సూర్యచంద్రగ్రహణకారకులుగ నెంచబడు రాహుకేతువులే వేదకాలమున స్వర్భానుడను పేర నొప్పియుండవచ్చును.

## చంద్రుడు

ఋతుభ్రమణమునకు కారకుడు. నెలకొకసారి పుట్టుకగనుచుండువాడు. సూర్యచంద్రులొకరి వెనుక నొకరు సమీపముననే కదలుచుందురు. [x–85(18)]. ఋగ్వేదమున 'సోము'డే ముఖ్యదైవతముగ నారాధింపబడియున్నాడు. కాని సోముడనిన చంద్రున కన్వయించుననుట కాధారములు బలముగ లేవు. తరువాత గ్రంథములందు, ముఖ్యముగా అథర్వవేదమునందు 'సోము' డను పదమును చంద్రునకు పర్యాయపదముగ నుపయోగించియుండిరి. తదుపరి గ్రంథములందు చంద్రుని ప్రాముఖ్యము క్రమక్రమముగా తగ్గుచువచ్చి ఆధునికకాలమున నవగ్రహములలో నొక్కడై, తన వృద్ధిక్షీణములకు సూర్యునిపై నాధారపడువాడుగ నెంచబడుచున్నాడు.

సంవత్సరమున 12 మాసములు, 360 దినములు కలవు. అందు నాలుగు సమభాగములున్నవి. ఒక్కొక్క భాగమున 90 దినములుండెను. ఋగ్వేదమున పంచవర్షచక్రమునుగూర్చిగాని, అధికలుప్తమాసములను గూర్చిగాని యెట్టి ప్రస్తావనములు నగపడవు.

ఆకాలమున కర్కాటక సంక్రాంతితో నూతన సంవత్సరారంభమయ్యెనని 'మండూకస్తుతి' యొనర్చిన

ఋక్కునుబట్టి యూహింపవచ్చునని జాకోబి తలచియుం డెను. సూర్యుడు ఫల్గునీనక్షత్రరాశియం దుండగా సంవత్సరము ప్రారంభించెనని వేఱొక ఋక్కునందు [x 85 (13)] సూచన కలదు. క్రీస్తునకు 4000 సంవత్సరములకు పూర్వము సూర్యుడు ఫల్గునరాశియందున్నప్పుడే దినము లతిదీర్ఘ ములును, రాత్రు లతిహ్రస్వములును నై యుండి యీకాలమున కర్కటక సంక్రాంతి సమయమున నగుపడుకాలమానపరిస్థితు లేర్పడియుండెనని తెలియుచున్నది. అనగా నేడు, సూర్యుడు ఖగోళమున సంచరించుచు, కర్కటకరాశియందు ప్రవేశించునపుడు ఉత్తర ధ్రువమున కత్యంత సామీప్యమున నుండి తదుపరి క్రమక్రమముగ నుత్తరధ్రువమునకు దూరస్థుడగునటు లే, క్రీస్తునకు పూర్వము 4000 సంవత్సరములక్రిందట సూర్యుడు ఫల్గునీనక్షత్రమునం దున్నప్పుడే యుత్తరధ్రువమున కత్యంతసమీపస్థుడైయుండి తదుపరి క్రమక్రమముగ నుత్తరధ్రువమునకు దూరస్థుడగుచుండినటుల తెలియవచ్చుచున్నది.

6000 సంవత్సరములక్రిందట ఫల్గునీనక్షత్రమున సూర్యుడున్నపు డేర్పడిన కాలమానపరిస్థితులు నేడు సూర్యుని కర్కటక సంక్రమణ సమయమున, అనగా సూర్యుడు పునర్వసు నక్షత్రమున చతుర్థపాదమున ప్రవేశించునపుడు దేర్పడుచున్నవి. ఇందులకు గారణ మేమి? విషువద్బిందువుల భ్రమణమే (Precession of the equinoxes).

వసంతకాలమున వచ్చు విషువద్దినమున మృగవ్యాధ నక్షత్రము (sirius) సూర్యునితోపాటు ఉదయించుచుండెనని యొకఋక్కు [i-105(11)] స్ఫురింపజేయుచున్నదని తిలకు వ్యాఖ్యానము చేసియుండెను. ఆ కాలమునందే అగస్త్యనక్షత్రము(& Argus or canopus) సూర్యునితోపాటు ఉదయించుచుండెనని కొన్ని ఋక్కులు [i-170&180] స్ఫురింపజేయుచున్న వని కెరన్ (Kern) అభిప్రాయ పడియుండెను.

వేదరచయితలు గ్రహగోళములను గురుతించియుండలేదని వాదించుట మూర్ఖతే యగును. స్థిరనక్షత్రములన్నియు క్రమము తప్పక దినమున కొకసారి ఖగోళమును చుట్టివచ్చుచుండునటులు భూభ్రమణమువలన నగుపడుచుండుటయు, సూర్యుడును గ్రహగోళములు నీ ఖగోళభ్రమణ మార్గమున కెదురుగ శీఘ్ర మందగమనములగదలిపోవుచుండుటయు వేదకాలమునందలి జనులు గమనించియే యుందురు. ఖగోళమునందలి పంద్రెండు రాసులను సూర్యుడు సంవత్సరమున కొకసారి చుట్టివచ్చుచుండునని తెలిసికొన్నవారు గ్రహగోళములును అంతకు తక్కువయో, యెక్కువయో కాలములో ఖగోళమును చుట్టివచ్చుచుండు నని గమనించియే యుందురు. కాని వేదకాలమున రచియింపబడిన గ్రంథములం దెచ్చటను గ్రహములనుగూర్చిన ప్రస్తావనములే యగుపడుట లేదు. ఋగ్వేదమున iii వ అధ్యాయము 7 (7) ఋక్కునందు కానవచ్చు "అధర్వాయు పంచక సహితులగు సప్తర్షులు" i-105(10) యందలి "ఉక్షాణపంచకము"; ix-114 (3) నందలి "సప్తాదిత్యులు" మొదలగు ప్రమాణములు గ్రహములనే సూచించుచున్నవని కొందరుపండితులు తర్కించుచున్నారుగాని యీవాదము సార్థకమైనదిగ నగుపడుట లేదు. వేదకాలానంతరమే గురుగ్రహము (Jupiter)నకు 'బృహస్పతి'యను పేరు వచ్చెననుటకు నిదర్శనములు కలవుగాని ఋగ్వేదమునందలి 'బృహస్పతి' యను పదమువలన నీగురుగ్రహగోళమే యుద్దేశింపబడియుండవచ్చును. ఇది యైన నొక యూహయేకాని తార్కాణములు కానరావు. ఋగ్వేదమున [x-123(2)] చెప్పబడిన "మేఘాత్మజ యగు వేణా"ను శుక్రగ్రహము (Venus)తో ముడిపెట్ట జూచిరి గాని యందులకు శాస్త్రజ్ఞులనేకు లంగీకరించుట లేదు ఋగ్వేదమున కానవచ్చు 'శుక్రుడు' 'మంథి' మొదలగు పేరులవలన నాకాలముననే గ్రహముల విషయము ఋగ్వేదరచయితలెరిగియుండిరని తిలకు మహాశయుడు 'ఒరయాన్' (Orion) అను గ్రంథమున (162 పే.) వ్రాసియుండెను. x అధ్యాయము 55 (3)నందు ఉదహరింపబడిన "కాంతివంతము లగు ముప్పదినాల్గింటిలో" ఇరువదియేడు నక్షత్రములును, యేడుగ్రహములును చేరియుండెనని 'ప్రొఫెసరు లూడ్విగ్' యెంచుచున్నారు.

గ్రహములుకాకున్న నక్షత్రరాసులైనను ఋగ్వేదమున తరచుగా పేర్కొనబడలేదు. x అధ్యాయము 85 (13) నందలి 'అఘాస్', 'అర్జుని' యనుపదములు 'మఘ' 'ఫల్గుని' నక్షత్రరాసులను తెలుపుచున్నవని యెంచవచ్చును. v అధ్యాయము 54(13) నందలి 'తిష్య' నక్షత్ర మొకప్రత్యేకరాశియై యుండవచ్చునుగాని శాయనాచార్యుడు తిష్యనక్షత్రమనగా సూర్యుడేనని యర్థము చెప్పియుండెను. x అధ్యాయము 82 (2)నందు పేర్కొనబడిన సప్తర్షులు నేడు ఉత్తరధ్రువప్రాంతముల నగుపడు సప్తర్షి మండలము (Great bear) నందలి నక్షత్రములై యుండినటులు ప్రత్యక్షముగ నగుపడుచునే యున్నది. i-105(1); i-161(13); x-14(11) మొదలగు ఋక్కులయందు మృగవ్యాధుడు (Sirius), మృగశీర్షము (Orion) మొదలగు నక్షత్రములకు అన్వయార్థము కలదని తిలకు ఒరయాన్ అను గ్రంథమున (96 వ పేజి......) వ్రాసి యుండెను.

## అథర్వవేదము

అథర్వవేదమున [v-6(4); xii-3(8)] 30 దినములు ప్రమాణముగల పదమూడవ మాసము ఉదాహరింపబడియున్నది. సంవత్సరమున 365½దినము లున్నవి. మాసమునకు 30 దినముల చొప్పున నెంచినయెడల సుమారైదు సంవత్సరములలో నొకసారి పదమూడవ మాసము వచ్చుచున్నది. కావున నాకాలమున పంచవర్ష చక్రము వాడుకలో నుండియుండవచ్చును. జ్యోతిష వేదాంగమునందుకూడ నీపంచవర్ష చక్రము ఉదహరింపబడి యుండుటచే నీయూహ కొంతవరకు సమంజసమైనదిగనే కన్పడుచున్నది. గ్రహములనుసరించిన ప్రస్తావనములు అథర్వవేదమునందు తరచుగ [iii-2(2); ii-10(8)] కానవచ్చుచున్నవి. గ్రహణకారకుడును, రాక్షసుడునునయిన రాహువుకూడ నిందు [ix-9(10)] పేర్కొనబడియున్నాడు. సోముడును, రుద్రుడును అసురుడగు రాహువును పారద్రోలి గ్రహణములను తొలగించుచున్నటుల iii-2(2) నందున్నది. vi - 80 (12) నందు మృగవ్యాధ నక్షత్రము (Sirius)నకును మృగశీర్ష రాశియందలి 'ఒరయాన్ రాక్షసుని నడుముఘట్టి' (Orion's belt) యని పిలువబడు నక్షత్రత్రయమునకును సూచన యుండినటులు తోచుచున్నవి. vi-128(1) యందలి శకధూమము, 'రాశీసంచయములకు ప్రభువు', ఆకాశగంగ (Milky way) యని పిలువబడెడు నక్షత్రసమూహమున కన్వయించుచున్నటు లగుపడుచున్నది.

## తదితరసంహితలు

సంవత్సరములనామములు కొన్నిసంహితలయందు కానవచ్చుచున్నవి. [తై. సం. v-5(7) చూడుడు.] ఈ పేర్లు వేర్వేరు సంహితలయందు వేర్వేరు విధములుగనున్నవి. ఈనామములకు జ్యోతిషపరమగు నర్థమేదియు గోచరించుటలేదు కావున మనకవి యుపయోగకారులు కావు. వేదకాలజ్యోతిషశాస్త్రము నందలి ముఖ్యాంశములు రెండు తైత్తిరీయసంహితయం దగుపడుచున్నవి. "ఫల్గుణియందు పూర్ణచంద్రుడున్నపుడు నూతన సంవత్సరారంభ మగుచున్న"దని యందు స్పష్టముగ కలదు. నూతన వత్సరారంభమున పూర్ణచంద్రుడు ఫల్గునియందుంటయు వసంతకాల విషువత్తునందు సూర్యుడున్నపుడు సంవత్సరారంభమగుటయు నొకటే యని తలచి తైత్తిరీయ సంహిత క్రీస్తునకు బూర్వము 3000 సంవత్సరముల క్రిందట వ్రాయబడియెనని 'జాకొబి' నిర్ణయించెను కాని అతనియూహ యెంతవరకు క్రమమైనదో యనునంశము నిర్వివాదముగ లేదు.

అథర్వవేదము [xix-7(2-5)] నందు నక్షత్రములిరువదియెనిమిది పేర్కొనబడి యున్నవి. నక్షత్రములు మానవుని యోగములపై నధిష్ఠించియుండెనను నమ్మకమప్పుడే యుండినటు లగపడుచున్నది. తైత్తిరీయ సంహిత iv అధ్యాయము 4(10) యందు కృత్తికాదిగ నిరువదియేడు నక్షత్రములు పేర్కొనబడియున్నవి. ఈ సందర్భమునందే నక్షత్రసంఖ్యను గూర్చి విచారింతము.

(సశేషము.)

రాధ

వేపకొమ్మ ఆదిశేషయ్యగారు

జలజమరందతృప్త మదషట్పదగానము, కీరశారికా
కలమృదునాదముల్, నికటకందరనిర్గత తత్ప్రతిధ్వనుల్
చెలువుగవిందుగాని యతసీకుసుమోపమగాత్ర! నీవని
ర్మలమురళీస్వనంబు వినరా దెటకేగితో నందనందనా!

చలిదికి వేళయయ్యె యదుచంద్ర, భజించెదురార, యీవని
ర్మలయమునానదీ ఘనతరంగవికీర్ణపయఃప్రవర్ధమా
నలలితవల్లి కుంజసదనంబుల, మత్తనటన్మయూరశా
ద్వలములఁ గేళిసల్పెదు భవత్సుహృదావళితోడ మాధవా!

ఆలు భవద్వియోగ జనితాతిశయవ్యథ నేమొ మేయఁగాఁ
జాలవుపూరి, యంబువుల చక్కకినైననుబోవు, ప్రీతివ
త్సాళిని మూర్కొనన్దివుర వయ్యెయొ దైన్యముదోఁప మోములన్
జాలిగఁ జూచువారికి దెసల్ పరికించెడు నశ్రులొల్కఁగన్ ,

కోయిలయొక్కచూతకుజకోమలశాఖను జేరి నిన్నుఁ గృ
ష్ణా యనిపిల్వ రాక సరసంబుగఁ బల్కుఁ గుహూకుహూఁ యటం
చాయతరీతిఁ, బల్లవము నంటదు, తేంట్లనదల్చునౌర, ప
ద్మాయతనేత్ర, రమ్ము ప్రియమారఁగ దానినినైనఁ జూడఁగన్.

ఇటునటుఁద్రుళ్లు చెట్టయెదుటేటికొ వాయసమొండుచేరి యు
త్కటముగఁగూయఁ, దొండ "యిదె తప్పకవచ్చు మురారి రాధికా
కుటిలశిరోజ కుబ్బ నోడఁగూర్పఁగ నీదుడు కాఁప" నంచు మి
క్కుటముగ దానికిన్ భయముగొల్పెడురీతిని మస్తమార్చెదున్.

అల్లదె పుష్పవల్లి సదనాంతరమందు మృగంబు వేడ్క సం
ధిల్లఁ దృణంబు బొసంగుచుఁ దదీయమృగిన్ మెయి నాకుచుండఁగా
నల్లనఁ బారవశ్యమున నమ్మృగి కన్నరమోడ్చెఁ జూమ్, గనన్
ఫుల్లసరోజనేత్ర! కడుముచ్చటయయ్యెడు వానికూరుముల్.

నీకు నొసంగుమంచు నవనీతముఁ బ్రీతిగ నిచ్చె లే యరం
టాకునఁ జుట్టి కట్టి భవదంబ, మనోహర, దివ్యరత్నశో
భాకమనీయ భర్మమయవంశము, నూతనరమ్యబర్హముల్
జేకొనివచ్చితిన్ గొనఁగ శీఘ్రమె వచ్చి యనుగ్రహింపుమా.

వనమునఁ దేనెకై కుసుమవల్లికలారయఁ బోవువేళ నా
ధుని నెటనైనఁ గాంచిన, మధుప్రియభామిని, తద్వియోగసం
జనితమహావ్యథన్ బొగులు నాస్థితి నించుక దెల్పి యాతనిన్
గొని చనుదేరవమ్మ, ప్రియుఁగూడనికష్టము నీ వెఱుంగవే.

ఏమరఁజేసి నిన్ను భవదీశుఁడు వేఱొకతేటిఁ గూడినన్
నీమన సెట్టులుండు మదినిన్ దలపోయుము, ప్రేమమొక్కటే
భామిని నెల్లవారలకుఁ బుణ్యము నెంచి పరోపకారితన్
ఓమధుపాంగనా, చని ప్రియుంగొని తెమ్మతివేగిరంబుగన్.

తనదు సుఖంబె నాసుఖము, తద్వ్యథ నావ్యథగాఁ దలంచు చా
తనికయి కాచియుంటినిగదా తనపిన్నటనాఁటనుండియున్
గనికరమేది నన్నబలఁగారియఁ బెట్టుటలిప్డు పాడిగా
దని తెలియంగఁ జెప్పి వినయమ్మున నాథునిఁదెమ్ము తుమ్మెదా!

ఎఱుఁగుదువో యెఱుంగవొ మదీశునిఁ, జెప్పెద నానవాలు, కం
ధర సమనీలదేహుఁడు సుధామధురోక్తులవాఁడు, మోమునన్
జిఱునగ వొప్పువాఁడు తులసీవనమాలికవాఁడు, పించెమున్
శిరమునఁ బూనువాఁడు, సరసీరుహలోచనుఁడమ్మ, తుమ్మెదా!

కంబుగళుండు, కస్తురితిలకంబున వెల్గెడువాఁడు, హేమపీ
తాంబర మొప్పువాఁడు, హృదయంబున మచ్చఁ దనర్చువాఁడు, ర
మ్యంబగు వేణుధ్వని యుపలావళి నీరుగఁ బాడువాఁడు, రో
లంబసతీమణీ, యితరులన్ సరిపోల్పఁగలేము వానికిన్.

మారుశరంబులైన కుసుమంబులసంగతిఁ జేసి, వింటికిన్
నారివియాటఁజేసి, రతినాథు నెఱుంగుదుగాదె లెస్స, శృం
గారరసాబ్ధి నాదుప్రియకాంతుని ముందట గర్వసేయఁ డా
మారుఁడు గీరుఁడున్ భ్రమరమానిని, యింతలు సెప్పనేటికిన్.

క్షితితలిఁ బైత్యరోగికి రుచించునె శర్కర, నీదుగానమే
గతిని వియోగరోగపరికల్పితదుస్సహతాపవేదనన్
స్మృతి చెడియుండునాకు రుచియించును బాధకమౌనుగాక నా
పతిఁ గొనితెచ్చి నావెతలఁబాపుము, గీతము మాను షట్పదీ!

---

## అన్వేషణము

మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రిగారు

ప్రకృతి సౌందర్య లక్ష్మీనివాస మహిమ,-దనరుచుండెడు కాననాంతరములందు
మంద మలయ సమీరణ స్పందమాన-విమలతమవాహినీ తరంగములలోన
శీతలామలకోమల స్నిగ్ధమధుర-రమ్య శారద కౌముదీ ప్రభలనడుమ
మలయగిరిసానుకానన లలితకుసుమ-సౌరభోన్మేష బాలసమీరణముల
తరళమోహన విద్యుల్లతాసమేత-ఘనఘనాఘనమండిత గగమునను
అరసితిం గాని నాథ, తదంతరస్థ-భవ్యభవదీయ మూర్తి గన్పట్టదయ్యె.

---




శ్రీ. శ్రీ. (కవితాసమితి)

ఆ యుదయమున మధుసూదనుఁ డాలోచనాయత్తచిత్తుఁడై యుండెను. అట్టిసమయమున నే నట కేఁగితిని.

"వానిని గాంచితివా?" యని నన్నతఁ డడిగెను.

గుమ్మము దాఁటిపోవుచు నొక మధ్యవయస్కుఁడు నా కగపడియెను. అతఁ డేకదా యని "చూచితి" నని ప్రత్యుత్తర మిచ్చితిని.

"ఆతనిఁ గూర్చి యేమి గ్రహించితివి?"

"నాకంటికి మిక్కిలి దీనునివలెఁ జూపట్టెను. అతనిని జూచిన నే హృదయము కరఁగిపోవును. వ్యర్థజీవి యనవచ్చును."

"సత్యమే! కాని; యనంతా! జీవితమే వ్యర్థముకాదా? ఇతఁడు దీనుఁడనుటకు సందేహమేమి? వీనిచరితము వింటివేని, ఇంతటి దౌర్భాగ్యుఁ డుండఁబోఁడని నీవే పల్కెదవు. ఐనను వీనికి నేనేమి సహాయము చేయఁగలను? సంగతులేవియు విశదము కావయ్యెను. ఇతఁడు చెప్పిన దానిలో నేడుపుతక్క నెక్కుడు లేకుండెను!"

నాకుఁ గుతూహలమయ్యెను "ఈతఁడు నీ సహాయార్థియా?" యంటిని.

"అట్లే యనవచ్చును. తనకథ చెప్పి పోలీసువారి సహాయ మపేక్షింప వారితనిని నాయొద్ద కంపిరి. ఇంతవఱ కాతఁ డేదో మొత్తుకొనుచు నిప్పుడే, నేను వానివిషయమై మనఃపూర్తిగఁ బనిచేయఁదలఁచితినని పల్కినపిమ్మట, వెడలిపోయినాఁడు."

"సరియే! వానికథ యేమి?"

"వినుము. ఈతనిపేరు సుబ్రహ్మణ్యము. ధనికుఁడనుట నిర్వివాదాంశము. వయ సేఁబది యాఱేండ్లు. రెండుసంవత్సరముల వెనుక భార్య పోవుటచే పునర్వివాహము చేసికొనెను. ఇతని కాపురస్థల మనకాపల్లి.

వర్తక వ్యాపారమున నతఁ డింతటిధనము గడించెను. కాని యిటీవల నారోగ్యము చెడి

పోవుటచే సుప్రశాంతిఁగోరి యనకాపల్లికివచ్చి యక్కడనే సుఖజీవన మొనర్పఁ జొచ్చెను. అపారమగుధనము, అభినవ యౌవనవతియగు భార్య, అవసరమున్నంత విశ్రాంతియుఁగలిగి యత్యంత ధన్యజన్ముఁడనని యానంద మొందు చుండెను. కాని యచిరకాలములో నీవిపుడు చూచుచున్నటులు దీనులలో దీనుఁడై, హతాశులలో హతాశుఁడై, నిర్భాగ్యులలో నిర్భాగ్యుఁడయిపోయినాఁడు. పాపము! వ్యర్థజీవియై పోయినాఁడు."

"అందులకుఁ గారణమేమి?"

"ఏమి చెప్పవలెను! విశ్వాసహీనుఁడగు మిత్రుఁడు! కుటిలవర్తనియగు భార్య! సుబ్రహ్మణ్యమున కితరదుర్గుణములు లేవు కాని చతురంగమన్న మాత్రము చెవి కోసికొనుచుండును. అనకాపల్లిలో నానందరా వొకఁడు కలఁడు. వీ రిరువురకును జతురంగమునఁ బరిచయముకల్గి క్రమక్రమముగ దృఢమైత్రియై పరిణమించినది. ఆనందరా వనవరతము వారియింటికి వచ్చి పోవుచుండును. ఇఁక నితనిభార్యతోడ నానందునికి సంపర్కము కల్గెనన్న వింతయేమి? ఇర్వురునుగూడి వారమురోజుల వెనుక నొకరాత్రి పలాయితులైరి. ఎక్కడికేఁగిరో యెఱుకపడకుండెను. అతనిభార్య తనతోఁగూడ ధనమును తీసికొనిపోయినది. మనమిఁక చేయునదేమి? ఆకాంత పట్టువడునా? ధనము మరలదొరకునా? ఇదియే సమస్య. చూపులకు సాధారణముగ నేకన్పట్టుచున్నది."

"నీవేమి చేయఁదలఁతువు?"

"నేనేమియుఁ జేయఁ దలఁచుకొనలేదు, నా కింకొక యవసరకార్యమున్నది. ఈ రహస్యమును భేదింపఁ గుతూహలమగుచుండెను. కాని నేనటకేగవలయును. కావున మిత్రమా, నీకిది కష్టముకాకున్న నొక్కసారి యనకాపల్లికి వెళ్లఁగోరెదను. సుబ్రహ్మణ్యము నన్నే రమ్మనెను కాని యితరకార్యావసరమున నేఁగఁజాలక నిన్నంపుదునని చెప్పఁగా సమ్మతించినాఁడు. ఇఁక నీవు వెళ్లకతీరదు. చని దొరకినన్ని సూత్రములసేకరింపవలెను."

"అభ్యంతరమేమి? నా సర్వశక్తులను విని యోగింపఁ దలఁచుకొన్నాను."

ఇట్లు పలికి బయలుదేరితిని. బయలుదేరితినేకాని నే నేఁగెడుకార్యమునుగూర్చి వారము దినములలోపున మండలమంతయు మాఱు మ్రోఁగనున్నదని కలనైనఁ దలఁపలేదు.

మఱునాఁడే తిరిగివచ్చితిని. మధుసూదనరావు వాలుకుర్చీమీఁదఁ గూర్చుండి యుండెను. నేను నొక యాసనముమీఁద నాసీనుఁడనైతిని. నేను వెళ్లినపని నెఱవేర్చుకొంటినని పలికి యతని కోరికమీఁద సంగతి నిట్లని తెలియఁ జెప్పితిని:

"పొగబండిమీఁద పోయి సాయంకాలమగునప్పటి కనకాపల్లి చేరితిని. సుబ్రహ్మణ్యమొకతోఁటను, అందలి యింటిని కొని కాపురమున్నాఁడు. అది తోఁటయన్న మాటయేకాని

అంతయు చీదరగనే యుండెను. ఏవో వృక్షము లున్నను అవి కాఁపరిలేని కారణమున దైవిక ముగఁ బెరుఁగుచుండెను. ఎన్నియో తీఁగలు దట్ట ముగ నల్లుకొనియున్నవి. ఒకచిన్న యటవివలె నున్న యాతోఁట నరసి సుబ్రహ్మణ్యమునకు శ్రద్ధలేదని యనుకొంటిని.

"తోఁటకుఁజుట్టు నొకగోడ కలదు. అది మిక్కిలి యెత్తైనది. అదియుఁగూడ శిథిలావస్థ లోనే యుండెను. పెంకుతోఁగట్టఁబడి యక్క డక్కడ నాచుతోడనిండి మిక్కిలి జుగుప్సా కరముగ నుండెను. చాలచోట్ల సున్నమూడి నిజస్వరూప మగపడుచుండెను. ప్రదేశమం తయు నిర్జనమై భయంకరముగ నుండెను. మఱియు నందందు——"

"ఆవర్ణనముల కేమిలే! ప్రస్తుతాంశముఁ దెల్పుము. అతని యావాస మొక నిర్జనప్రదే శమునఁ దోఁటలోఁ గలదు. మఱి?"

"అతని యిల్లిదియని నాకుఁ దెలియకపో యియుండును; కాని, దారిలోని యొక పురుషు నడిగి తెలిసికొంటిని. అతనిని దెల్పుటకుఁ గార ణ మున్నదిలే! కోరమీసములు కల్గి యతఁడు సన్నగా పొడవుగా నుండెను. చామనచాయ మేను. కొంచెము విసువుతో నింటిదెస వ్రేలు చూపెను.

"ఆవైపున తోఁటనుండి యొకసన్నని బాట కలదు. దానిమీఁదుగ నిల్లుసేరితిని. అది యింటికి వెనుకదారి. అల్లేఁగినను నాకక్కడనే సుబ్రహ్మణ్య మగపడియెను.

"అక్కడ నెన్నియో చిన్నగదు లుండెను. ఒకగదిముందు నా కతఁడు కనఁబడెను. అతని కన్నులెఱ్ఱబారి యుండెను. చేతులు కంపించు చుండెను. అట్టి యా దీనస్థితిని జూడ నాకు జాలి యయ్యెను. అది యేమోకాని యతనిచూపుల లోఁ గ్రౌర్యము తాండవించుచుండెను."

"బాగుబాగు, అతఁ డేమనును?"

"అదేవిధముగఁ దనదుఃఖచరిత్రము నేక రువు పెట్టెను. నేను వినఁజాలకుంటిని. అతఁడు పరిపరివిధముల భార్యను,మిత్రునిదూషించుచు, 'మనుష్యస్వభావ మెట్టిది! దానికి నేనేమి తక్కువచేసితిని? కోరిన దేమి లేదంటిని?అయి నను నన్ను కూల్చివేసినదే! ఆమిత్రుఁడో! ఎంతయోగ్యముగఁజూపట్టెను? ఎంతనీచుఁడుగఁ బ్రవర్తించెను! ఛీ! ఇఁక లోకమున నెవ్వరిని నమ్మనగును' అని చింతించుచుండెను.

"ఈలోపున నేనాయింటిని బరీక్షింపఁ జాలితిని. తోఁటమాటఁ జెప్పితినికదా! ఇల్లు కూడ నదే వైఖరి. ఆ ప్రదేశమెల్లను ధూళి ధూసరితమై యుండెను. ఎల్లయెడల పట్లుపట్టి యుండెను. గోడలుకూడ నేనాఁటినుండియో సున్నములులేక పాడుపడియుండెను. పాపము సుబ్రహ్మణ్యము చేయున దేమి? ఇంటిదుఃస్థితినర సియే కాఁబోలు నాతఁడు నేనేఁగుసరికి తలు పులకు రంగువేయుచుండెను. ఆవాసన భరింప శక్యము కాకుండెను. కాని రంగులుమాత్రము ప్రశస్తమైనవి.

"యథాప్రకారముగ నాతఁడు తనపాట సాగించెను. నేనాతని నోదార్చుచు ముఖ్యాంశములను గ్రహింపఁజొచ్చితిని. ఆరాత్రి తానును, ఆనందుఁడును నాటకమునకుఁ బోఁదలంచిరఁట. ముందే టిక్కట్లు కొని యుంచుకొనిరఁట. కాని యాకస్మికముగ నానందరావేదో సాకుచెప్పి వెళ్లుట మానెను. కావున తానొక్కఁడే వెళ్లవలసి వచ్చెను. నాటకమునుండి తిరిగివచ్చునంతట నతనికిఁ బంజరకీరము పలాయితమయ్యెనని బోధపడియెను. అతఁ డిట్లని నాకు వాడని టిక్కట్టుకూడ చూపినాఁడు."

"ఆఁ! అట్లుచేసెనా? చెప్పుము. చెప్పుము. దైవికముగ నాటిక్కట్టు సంఖ్యనుకూడ గుర్తింపలేదుకద!"

కొంచెము గర్వముతో "చూచితి"నంటిని. "అది నాచిన్నప్పటి బడియంకె యగుటచే జ్ఞాపక ముండిపోయెను. అది యిరువదియైదు."

"అట్లయిన ననంతా! సుబ్రహ్మణ్యము కూరుచున్నది యిరువదినాల్గవదో, ఇరువది యాఱవదో కావలయును."

"అవునవును, పైకథ వినుము. సంభాషణము ముగిసిన పిమ్మట నాతఁడు బల్లమీఁది కాగితములలో నగపడుచున్న ఛాయాపటము నొకదానినితీసి కోపముతో చింపివేయుచు, 'ఛీ! ఛీ! ఇఁక నాదుష్టురాలి ముఖము చూడ' నని యఱచెను. నేనాతనిస్థితికిఁ జింతించితిని. పిదప పోవుదునని పల్కి మరలి వచ్చితిని."

"ఉండు ముందుము. అతఁడు రంగువేయుచున్నాఁడని కాదా పల్కితివి? ఎక్కడ?"

"ఆగదితలుపులకు, కిటికీలకు వేయుచుండెను. నేనేఁగుసరి కొకటి రెండు పూర్తియైనవి."

"కాని యిది నీ కాశ్చర్యదాయకము కాలేదా? రాత్రి యేడుగంటలకు రంగులు వేయుచుండు టేమి? ఏమందువు!"

"అది చిత్రమే! కాని యతఁ డింకను చిత్రపు మనిషి. భార్యాచిత్రమును జింపుటమాత్రము చిత్రము కాదా! అదియుఁగాక వానికి వేఱొకపని యేదియుఁ దోఁచుఁట లేదు. మనసు త్రిప్పుకొనుట కేదైన చేయవలదా?"

"సరే! మఱేమయిన చెప్పవలసినది కలదా?"

"కలదు: ముఖ్యమైన దదియే! నేనురైలెక్కునంతట సరిగా నాకు దారిచూపిన మనుజుఁడే తానుకూడ ప్రక్కబండిలోని కెక్కినాఁడు. ఆముఖము, ఆమీసములు, ఆకోరచూపులు——

"ఆ బంగారు సులోచనములు, ఆకుక్కమూతిచేతికఱ్ఱ——"

"ఓహో! అనూన ప్రజ్ఞానిధి వగుచున్నావే! అది నీ వెట్లు గ్రహించితివి?"

"దానికేమి కాని ప్రస్తుతమునకు రమ్ము. అనంతా! ప్రప్రథమమున నీరహస్యము సులభభేద్య మనుకొంటిని కాని రానురాను మిక్కిలి యగాథ మగుచున్నది. నిజముగా నీవు పని నెఱి

వేర్చితివి. కాని కొన్ని ముఖ్యవిషయముల గమనింపవైతివి సుమా?"

"నే నేమైన మరచితినా?"

"అనంతా! చిన్న పుచ్చుకొనకుము. నీవొనర్చినపని యమోఘమైనదియే! అట్లయ్యుఁ గొన్ని ముఖ్యాంశములను వదలివేసితివి. ఇటు చూడుము. ఆదంపతులఁ గూర్చి జనులయభిప్రాయ మేమి? ఇది ముఖ్యమందువా? ఆనందునిగూర్చి వా రేమనుకొందురు? అతని వర్తన మెట్టిది? ఇవి యవసరములుకదా! ఎవ్వరిని కనుఁగొన్నను తెలిసిపోవునే! వీనిని నీవరయక పోతివి."

"కాని యింకను చేయిమించుటలేదుకదా! వానిని గనుఁగొనవచ్చును."

"కనుఁగొనఁబడినవి. తంతిమూలముననను, పోలీసువారి సహాయముననను నా కన్ని సంగతులు నిల్లుకదలకుండ చేతి కందుచుండును. వాస్తవముగ నే గ్రహించినదానివలన సంగతులు స్థిరపడినవి. ఈ సుబ్రహ్మణ్యము లోభియని ప్రతీతి కలదు. భార్యను కష్టపెట్టుచుండుననియు ననుకొనుచుందురు. ఆనందుని సంగతియు నవగతమైనది. ఇక నేటి కీపని చాలును. తరువాత చూచుకొంద" మని మధుసూదనుఁడు వేళ యతిక్రమించుటచే భుజింప నేఁగెను. నేనును గృహోన్ముఖుఁడ నైతిని.

## 3

ఆమఱుదినమున నేనొంటరిగ నింటఁ గూర్చుండియుంటిని. అంతలో నొకపిల్లవాఁడు మధుసూదనుని యొద్దనుండి యొకలేఖ తెచ్చి నా కొసఁగెను. అం దిట్లుండెను:

"మిత్రుఁడగు ననంతరావునకు—

"రహస్యము పూర్తికావచ్చినది. తెలిసికొనవలసిన యంశము లిఁక నొకటి రెండుకంటె నధికము లేవు. ఆపెమ్మట నిది భేదింపఁబడినట్లే! ఈలోపున నీవు నేటిమధ్యాహ్నము మూఁడు గంటలకు మాయింటికి రాఁగోరెదను.

—మధుసూదనరావు."

సరిగా మూఁడుగంటల కాతని యింటికిఁ బోయితిని. మధుసూదనుఁడు మేడమీఁద నుండెను. అట కేఁగితిని. ఏవో ప్రశ్నలు వేయుచుంటిని. కాని జవాబులు రాలేదు.

అంతలో సుబ్రహ్మణ్యము వచ్చియున్నట్లు తెలిసెను. మధుసూదనుఁ డాతనిని మీఁదికి రావించెను. రొజుకొనుచువచ్చి యతఁడు "మధుసూదనరావుగారూ! నా కీ తంతి వచ్చినది. నమ్ముటో నమ్మకుండుటో తెలియకున్నది." యని పల్కుచుఁ దంతి నిచ్చెను.

"వెంటనే వచ్చితివేని నీవు కోల్పోయినవానిని బడయఁగలవు. జాగుచేయరాదు.

—కరణము రామలింగము, కశింకోట"

దానినిచదివి మధుసూదనరావు "సరే! మీ రిప్పుడు కశింకోటకుఁ బోవుఁడు. నాల్గు గంటలకు రైలున్నది." యనియెను.

కాని సుబ్రహ్మణ్యా మేఁగుట కిష్టపడినట్లు లేదు. అతని కాతొందరయే లేకపోయెను. "ఎందుకండీ! ఇదియంతయు తంత్రము! మీఁదు

మిక్కిలి డబ్బుదండుగ! వృథాకాలయాపనము! నాభార్యంగూర్చి యీ రామలింగని కేమి తెలియును?" అని యతఁడు పల్కుచుండెను.

"ఏమిది? అతని కేమియుఁ దెలియకున్న తంతివార్త నెందుల కంపును? మీ రేఁగవలయును."

"నే నేఁగవలసిన యగత్య మున్నట్లు తోఁపదు."

మధుసూదనునకుఁ బట్టరాని కోపము వచ్చెను. "అయ్యా! ఇదిగో వినుఁడు. ఇట్టి బలవత్తర మగు సూత్రము దొరకుచుండ మీరు దానిని సంగ్రహింపక పోయినచో వ్యర్థముగ చిక్కులు కల్గును. మీ కిందు పట్టుదలయే లేనట్లు తోఁచును. కావున నిదియే నాశాసనము. మీరు వెళ్లక తీరదు!"



ఈ మాటలను విని యాతఁడు కొంచెము జంకెను. "మీ రిట్లనినచో నే నడ్డు చెప్పఁగలనా? కాని వృథాశ్రమ!" యనుచుండ "ఆసంగతి నాకుఁ దెలియును. మీరు తత్క్షణమే బయలు దేరుఁడు!" అనియు మధుసూదనుఁ డడ్డుగఁ బల్కెను. ఎట్టకేల కతఁ డిష్టము లేకున్నను నిందుల కంగీకరించెను.

మధుసూదనరావు నన్ను రహస్యముగఁ బిల్చి, "ఓయీ! మీరిరువురును గలిసి కళింకోటకు పొండు. ఈ పని యెంతయు ముఖ్యమైనది. ఒక్కక్షణమైన నీతని నెడఁబాయకుము. వింతలున్న వెంటనే తంతినంపుము. ఇక్కడ నెక్కడనున్నను నాకది యందు నట్లు కట్టుబాట్లు చేసికొనియెదను." అని యాతనికి సాయముగ నన్నంపెను.

సాయంకాలపు బండిమీఁదఁ గళింకోటకుఁ బోయితిమి. కష్టపడి కరణముగారియిల్లు కనుఁగొంటిమి. మారాక నెఱింగింప నతఁడు గౌరవ పురస్సరముగ మమ్ము లోనికిఁ దోడ్కొనిపోయెను. పిమ్మట మేము వచ్చిన కార్య మేమని ప్రశ్నించెను.

"తా మంపిన తంతిని జూచుకొని వచ్చితి" మని నే నంటిని.

"నాతంతియా? నే నేదియు నెవ్వరికి నంపలేదే!"

"లేదా? ఈసుబ్రహ్మణ్యముగారికి నేఁడంపిన తంతిమాటయేమి?" యని దానిని జూపితిని.

"ఇది హాస్యమేమైన నాలోచింపఁదగినదే! ఎంత ధూర్తకృత్యము!"

నేనును సుబ్రహ్మణ్యము నొకరి మొగ మొకరము చూచుకొంటిమి.

"మీపేరుకలవా రిం కెవరైనఁ గలరా? కరణము లిర్వు రుందురేమో! మేము పొరఁబడి యుండవచ్చును." అని నే నంటిని.

"పొరపాటు లేదు-గిరపాటు లేదు. పొండు పొండు. ఇది యబద్ధపుఁదంతియైనఁ బోలీసువారే కలరు! మీరికఁబోవచ్చును." అని మ మ్మతఁడు సాగనంపెను.

జరిగినదంతయుఁ దంతిమూలమున మధుసూదనునికిఁ దెలియఁజేసితిని. అంతయు నతి విచిత్రముగ నున్న దనుకొంటిని.

సుబ్రహ్మణ్యము లుబ్ధుఁడనుటకుఁ దగినవాఁడని నేఁడు గ్రహించితిని. మొదట రైలు ఖర్చులకు మూలిగి మూఁడవతరగతిలోఁ బోవ నిశ్చయించెను. ఇప్పుడు పూఁటకూటి ఖర్చులకు గొణుగుకొనఁజొచ్చెను. ఎట్లో నాఁటి రాత్రి గడచినది. మధుసూదనుఁడు మమ్ముల ననకాపల్లికి రమ్మని తంతి నంపెను.

౪

ఆమఱునాఁ డనకాపల్లి చేరితిమి. వృథాప్రయాస మయ్యెనుకదా యని సుబ్రహ్మణ్య మాడినమాట లిన్నియన్ని కావు. ఎట్లో మే మాతని యింటి కేఁగితిమి.

ఇంటిలో నున్న వారినిజూడ నాకాశ్చర్యమయ్యెను. అక్కడ మధుసూదనుఁ డొక్కఁడే కాక వెనుక నేఁ జూచిన కోరమీసముల వాఁడు కూడ నుండెను.

మధుసూదనరావు లేచి "సుబ్రహ్మణ్యముగారూ! ఇతఁడు నామిత్రుఁడగు శ్యామసుందరరావు. ఇతఁడుకూడ మీవిషయమై పని చేయుచుండెను. అయిననేమి! మాయిరువురి యూహ లేకీభవించియేయున్నవి. ఇద్దఱముకూడ నొక్కప్రశ్నమునే యడుగనుంటిమి" అనెను.

వ్యస్తహృదయుఁడై సుబ్రహ్మణ్యము కూర్చుండెను. కాని యతని ముఖమున ననుమానచిహ్నములు ద్యోతకములగుచునేయుండెను. ఏదో చేయుమించిన పని జరుగనున్నదని యతఁడు పసిపట్టెను. తడఁబడుచునే యతఁడు "మీ రడిగెడునది యే" మనియెను.

"ఇది! ఆకళేబరముల నేమిచేసితిరి?"



సుబ్రహ్మణ్యము దిగ్గున నెగిరిపడియెను. అతనిచేతులు గాలిలో నెగయుచుండెను. ముఖలక్షణములు వర్షాకాల మేఘములట్లు క్షణక్షణము మార్పు చెందుచుండెను. నోరు వెళ్లఁ

బెట్టి కఠోరముగ నఱచుచున్న యతఁడు మూ ర్తీభవించిన బీభత్సరస మేమోయన నొప్పెను. అతని నిజస్వరూప మప్పు డవగతమైనది. వక్ర దేహుఁడే కాక వక్రమానసుఁడనికూడ బోధ పడినది. ఒక ఘోరరాక్షసునివలె నతఁడు ముం దున కుఱికెను.

అతఁడు బలవంతుఁడే కాని పేరెక్కిన నిరూపకు లిర్వురిముం దాతని యాటలు సాగ వయ్యెను. కొంతవఱకు పెనఁగులాడిన పిమ్మట నతఁడు స్వాధీనుఁ డయ్యెను. శ్యామసుందరుఁ డాతనిని ఠాణాకుఁ దీసికొనిపోయెను.

కొంత సేపటికి రక్షకభటాధికారి యా ప్ర దేశమునఁ గాలిడెను. "హత్యలు జరిగినవా?" యని యాతఁ డాశ్చర్యమును సూచించెను. మేమందఱ మింటిమధ్యగదిలో నాసీనులమై యుంటిమి. మధుసూదనుఁడు నన్నుఁగాంచి, "అనంతా! శ్యామసుందరుఁడుకూడ సుప్రసిద్ధ నిరూపకుఁడే! మొదట నీ వతనిని గొంతవఱకు వర్ణించిన పిమ్మట తెలిసిన నేను మిగిలిన దానిని పూర్తిచేసిన వింతయేమి?" అనెను.

రక్షక భటాధికారియగు రామచంద్ర రావు "అయ్యా! మీ రనంత ప్రజ్ఞాధురీణులు. కాని మీ రీరహస్యమును భేదించుటచే నాకు రావలసిన బహుమతి పోవుచున్నది. ఇందులకుఁ జింతయు, హంతకుఁడు దొరకుటచే సంతస మును గల్గుచున్న" వనెను.

"మీరు బహుమతివిషయమై భయపడ నక్కఱలేదు. ఈరహస్యమును మీరు భేదిం చినట్లే ప్రచురించుకొనుఁడు. పత్రికలలో నాపే రుపడుట కిష్టములేదు. శ్యామసుందరునకుఁ గూడ నావిధాన మెఱుఁగఁజేయువఱకుఁ జింతయు నగాధముగనే యుండెను. కావున మీరే దీనిని భేదించినట్లు తలఁపుఁడు."

"ఆహా! ఎంతటియౌదార్యము! కాని జనులకు నేనేమి చెప్పఁగలను? ఈరహస్య మెట్లు బయలుపడియెనో నాకుఁ దెలియదు. నే నెందుల కనుమానించితినో, ఎట్లు నాయను మానములు దృఢపడియెనో, హంతకు నెట్లు బంధింపఁగల్గితినో—ఇట్టివిషయము లెవ్వరైన నడిగిన నేమిచెప్పఁగలను? మీప్రతిభవలన హంతకుఁడుమాత్రము దొరకినాఁడు. ముప్పు రుసాక్షులయెదుట నేరముకూడ నొప్పుకొ న్నాఁడు."

"అట్లయిన మీకుఁ గావలసినది రహస్య భేదనవిధానమన్న మాట. సరే! మీకును, తొలినుండి నాకుఁ దోడ్పడుచున్న యీయనం తునికి సంగతులెల్ల విశదముచేసెద! వినుఁడు.

"ఈ సుబ్రహ్మణ్యము మిక్కిలి తెలివ యినవాఁడు. లుబ్ధులందఱకువలె నీతనికి నను మానము మెండు. భార్య నెప్పుడును బాధించు చునే యుండును. కాన నామె వీనిపోరు పడలే కుండుట వింతకాదు. ఇంతలో వీరికానందుని పరిచయము కల్గెను. తనభార్యకును వానికిని సంపర్కము కలదని సుబ్రహ్మణ్యమునకు మి క్కిలి యనుమానము కలదు. కావున వారిపై కసితీర్చుకొనవలయునని యాతఁ డెంచి యుం

## 3. మాతృపోషకజాతకము



నిరశనవ్రతము

డెను. ఆయూహతోడ నతఁడెట్టిపైశాచిక కృత్యమైనను జేయుటకు సిద్ధుఁడై యుండెను. మిక్కిలి తెలివితోఁ బ్రవర్తించి కార్యము నెఱవేర్చుకొనియెను; చూడుఁడు; నాతో నిటు రండు."

ఆయింటి నెఱిఁగి యున్నవానివలెనే మధుసూదనుఁడు మమ్ములను దోడ్కొని పోయెను. ఇంటికివెనుకఁగల వరుసగదులలో నొక గూఢమగు కొట్టుచెంతకు దీసికొని వచ్చెను.

"అబ్బ! ఎంతఘాటయిన వాసన! రంగులు కాఁబోలును?" అనుచు రామచంద్రరావు వెనుకకుఁ దగ్గెను.

"అదియే నాప్రథమసూత్రము. అనంతరావు రంగులపూఁతఁ గనిపెట్టెను గాని దాని యగత్యము నరయఁజాలఁడయ్యెను. ఇందులకే పరిశీలనమునకుఁ దోడు పరిశోధనము కూడ నుండవలె నందును. అతఁడెట్టిరంగుల నేలపూయుచుండవలెను?కొంచె మూహింపుఁడు. మఱి యేదోవాసనను దాఁచియుంచుట కీపనిచేసినట్లు బోధపడుటలేదా? ఏదియుకానివేళ నిట్టి నిగూఢప్రదేశమున నతఁ డొనర్చు కృత్యముల కర్థమేమి? వీని నన్వయించిచూడ నేదో ఘోరము జరిగినట్లు నాకుఁ దట్టినది. పలాయితుల యుదంత మెవ్వరికిని దెలియదే! వారిసంగతి యేమయ్యెను? ఒక్కొక్కదానిని ముడిపెట్టుచుండ ననుమానము స్థిరపడుచునే యుండెను. ఇంతియేకాక నేనా నాటకశాలకుపోయి కనుఁగొంటిని. ఆరాత్రి ఇరువదినాల్గు, ఇరువదియైదు, ఇరువదియాఱు సంఖ్యల కుర్చీ లుత్తవిగనే యున్నట్లు తెలిసినది. ఇంతటితో రహస్య మిట్టిది యని బోధపడినది.

"ఇఁక మిగిలిన దేమి? ఇంటిని వెదకి మృత కళేబరములఁ గనుఁగొను టెట్లన్న ప్రశ్నము. ఇందుల కొక యబద్ధపుతంతిని సృష్టించి సుబ్రహ్మణ్యమును కళింకోట కంపితిని. తప్పించుకొని పోకుండ ననంతునిఁ బుత్తెంచితిని. ఇఁక నన్నడ్డువారు లేరని యిల్లుచొచ్చి వెదకుచుంటిని.

"ఈగదిలోనే వారిదేహములు కనఁబడినవి. అవి యొకపేటికయందు భద్రపరుపఁబడి యున్నవి. నేను పరిశీలించుచుండు సమయమున నెవ్వరో వచ్చి నన్నుపట్టుకొనిరి. ఇట్లగునని నే ననుకొనలేదు. కావున నిది యాశ్చర్యముఁ గొల్పెను. అట్లువచ్చిన దీ శ్యామసుందరుఁడే! ఇతఁ డానందుని బందుగులవలన నియుక్తుఁడై నిరూపణ మొనర్చుచు నింటిని వెదకవచ్చెను.నన్నుఁ జూచి దొంగయనుకొని పట్టుకొనెను. పిమ్మట పోల్చుకొని నవ్వుకొంటిమి. అప్పుడు సంగతి నెల్ల నతనికి విశదపఱిచి సుబ్రహ్మణ్య మిటకు వచ్చునని పల్కితిని. అంతవఱకు వేచియుండి రాఁగానే బంధించితిమి."

రామచంద్రరా వాశ్చర్యమొందెను. నేను మధుసూదనునిఁ గాంచి,"నాకింకనుఒకటిరెండు సందేహములు తీరుట లేదు. నాఁడు నాటకమునకుఁ బోవలసినయగత్య మాతని కేమికలదు?" అని ప్రశ్నించితిని.

"బోధపడలేదా? మొదట నానందరావు నీమిసమీఁద నింటికి రావింపఁ గల్గుట—ఇది

మిక్కిలి రహస్యముగా జరిగియుండవచ్చును. రెండవది, హత్యారహస్యము బయలుపడినను తానా సమయమున నింటలేనని చెప్పకొన వచ్చును. కాని నీకు టిక్కట్టు చూపి యతఁడు చేయరాని పొరపాటు చేసెను."

"భార్య ధనమెత్తుకొనిపోయెనని యేడ్చి నాఁడు. దాని కేమనుకొనును?"

"మఱి దొరకలేదనియైనను లేక తిరుగ పంపివేసినదనియైనను చెప్పఁగలఁడు, ఈవిష యమంత బాధించెడునది కాదుగదా!"

రామచంద్రరా వంతట, "అయ్యా!పోలీ సువారమగు మా కీరహస్యము శోధింపనిచ్చుట సమంజసమే కాని తమయొద్ద కితఁ డెందుల కేతెంచెనో బోధపడదు!" అనియెను.

"మఱేమియు లేదు, సంగతులు ప్రాఁత వడినపిమ్మట 'చూచితిరా! నేనొక్క-పోలీసువా రినేకాక మధుసూదనునిసైతము వేఁడికొంటిని. లాభము లేకపోయినది' యని యాతఁడు చెప్పకొనును."

"మీ మాటలు స్వోత్కర్షములైనను క్షమార్హములే! ఓహో! మీప్రతిభ వర్ణనాతీ తముకదా! మధుసూదనరావుగారూ! సెలవు. మీరు మాకు మహోపకార మొనర్చితిరి. మా కాజన్మాంతము కృతజ్ఞతాబద్ధులముకదా!"

---

## శత్రునిరాసము

బులుసు పాపయ్యశాస్త్రిగారు

కామునిఁ జిచ్చుఁటికంటఁ జూచినవాని, సంతతయోగప్రశాంతమూర్తి
సకలంకభక్తితో నడిగినవానికి, నెనిమిదైశ్వర్యము లిచ్చువాని
జ్ఞానమే యాకారమై నివ్వటిలువాని, హస్తిదైత్యునిఁ ద్రుంచినట్టివానిఁ
దల యగల్చినపార్థు దయఁదలంచినవాని, సేవించుచున్న నన్ జేనకరాక
కామమా,నీవు దూరముగాఁదొలంగు;-క్రోధమా,విడు;లోభమా,త్రోవఁబట్టు;
మోహమా,చేరకు;మదమ్మ,ముట్టఁబోకు;మత్సరమ,యిటుసూచుటమానిమరలు.

---

# మంగమ్మ

ఆంధ్ర శేషగిరిరావు గారు, బి. ఏ. [సారస్వతసమాజము]

స్వభాష, స్వజనము, స్వదేశము అయినప్పుడే అబలయొకతె రాజ్యలాంఛనములు వహించి భూమిని శాసించుట బహుకష్టము. అట్టిచో పరభాష, పరజనము, పరదేశము అయినప్పు డట్టిపని దుర్ఘటమని వేఱె వచింప నవసరము లేదు. దుర్ఘటమైనను అట్టిచోట రాజ్యమును ఆలించి పాలించి తాము పుట్టినజాతికి పేరు పెంపులు వెలయించిన రమణీమణు లొకరిద్దఱు ఆంధ్ర జాతియందు జనించిరి. అట్టివారిలో మంగమ్మ యొకతె.

మంగమ్మ దళవాయి లింగమనాయకుని కూతురు. లింగమనాయకుడు చంద్రగిరి నివాసుడు. ఇతడు తన కొమార్తెను మధురనాయకరాజైన చొక్కనాథ నాయని కిచ్చి క్రీస్తుశకము 1665–వ సంవత్సరమున వివాహము చేసెను. మధురనాయకరాజులు ఆంధ్రులు. ఆంధ్ర భోజుడగు కృష్ణదేవరాయల కాలమునుండియు మధుర నాయకరాజ్యమును ఆంధ్రులే పాలించుచు వచ్చిరి.

మంగమ్మ పెనిమిటియైన చొక్కనాథనాయడు క్రీస్తుశకము 1659–వ సంవత్సరమున మధురనాయక రాజ్యసింహాసన మధిరోహించెను. ఇరువదిమూడువర్షములు రాజ్యపాలనముచేసి ఆతడు 1682–వ సంవత్సరమున పరమపదించెను.

ఆదినములలో సహగమనదురాచారము చాల ప్రబలియుండెను. అయినను మంగమ్మ పతిమరణానంతరము సహగమనము చేయుట కొడబడలేదు. ఆచార ఛాందసులగు ప్రజ లేమైన ననుకొందురుగాక—ఆమె చచ్చినవారితో చచ్చుట కొప్పుకొనలేదు. ఆదినములలో సహగమన మొక సదాచారముగ పాటింపబడుచుండెను. దానిని ప్రతిఘటించువారే లేకుండిరి. మనోద్రఢిమగల రమణీమణియగుటచేత మంగమ్మ అట్టిదినములలో ప్రజాభిప్రాయమును తృణీకరించినది. ఏఘోరదురాచారమును ప్రజాహితవాదులైన బ్రిటీషు గవర్నమెంటువారు 1830–వ సంవత్సరమువఱకు ప్రతిఘటింప తలపెట్టకుండిరో అట్టి ఘోరదురాచారమును 1682–వ సంవత్సరముననే మంగమ్మ ప్రతిఘటించి నిలిచినది. ఇది ఆంధ్రరమణుల సంఘదురాచారతిరస్కారప్రియత్వమును లోకమునకు వెల్లడించు మహద్విషయము.

చొక్కనాథనాయని అనంతరము ఆతని కుమారుడు రంగకృష్ణముత్తువీరప్పనాయడు రాజ్యభారము వహించెను. కాని ఇతడు చిరకాలము రాజ్యపాలన మొనర్చుటకు నోచుకొనలేదు. పూర్తిగ ఏడేండ్లైన ప్రజాపాలన మొనర్చెనో లేదో, 1689–వ సంవత్సరమున వీరప్ప నాయడు స్ఫోటకమువలన చనిపోయెను. ఇతడు మరణించుసరికి ఇతనిభార్య ముత్తమ్మ నెలలునిండిన చూలాలు. పతిమరణమున ముత్తమ్మకు కలిగిన విచారమునకు మేర లేదు. ఓపలేనిదాననియైన ఆలోచింపక ఆమె పతితో సహగమనము చేయ సంసిద్ధపడెను. సహగమనము దురాచారమని దానిని ప్రతిఘటించి నిలిచిన మంగమ్మ తన కోడలిని—అందును నెలలునిండినచూలాలిని—సహగమనము చేయనిచ్చునా ?

సహగమన మొనర్ప ముత్తమ్మకు ఎంతటి దృఢకాంక్షయైనను న్నది. కాని అట్టి దృఢకాంక్షకు ఆమె నిండు చూలాలితనము తీరని ప్రతిబంధకమైనది. ఏమైననేమి, తుదకు ముత్తమ్మ అత్తమాటలకు చెవియొగ్గి అప్పటికి తన ప్రయత్నమును మానుకొనక తప్పినదికాదు.

కొన్ని దినములకు ముత్తమ్మ మగశిశువును గనినది. పిమ్మట ఆమె తన అత్తయగు మంగమ్మ చెప్పిన హితవచనముల నైన పాటింపక సహగమనము చేసినది. రంగకృష్ణముత్తువీరప్పనాయని కుమారుడు నాయనమ్మ చేతులలో పెరుగుచుండెను. ఆతనికి విజయరంగ చొక్కనాథుడని నామకరణము చేసిరి. అతడు మూడుమాసముల శిశువై ఉండగా సింహాసన మెక్కించి సమస్త

రాజ్య కార్యములను మనుమని పేర మంగమ్మయే నిర్వహించుచుండెను.

మంగమ్మ రాజ్య కార్యముల నన్నిటిని గుర్తెఱిగిన ప్రాజ్ఞురాలు. కావుననే మధురనాయకరాజ్యము ఆమె ఏలుబడిలో జయప్రదముగ సాగినది. రాజ్య ఖలీనమును ఆమె బహుజాగ్రత్తతో పట్టినది. బహు పర్యాయములు ఆమె యుద్ధయాత్రలు సాగింపవలసి వచ్చినను మొత్తము మీద ఆమె రాజ్యకాలము శాంతి యుతముగ,జయప్రదముగ జరిగిపోయినది. మంగమ్మ రాజ్య కార్య నిర్వహణ భారము పూనుసరికి మొగలు చక్రవర్తి ఔరంగజేబు దక్షిణ భారత దేశమున తన నిరంకుశాధికారమును చలాయించి ద్రవిడ దేశముపై ఎత్తి వెళ్లు యోచనలలో నుండెను. ఈ సంగతి సందర్భములను దీర్ఘదర్శినియగు మంగమ్మ బాగుగ యోజించినది. మొగలాయి మహాసామ్రాజ్యమునకు నియంతయైన ఔరంగజేబు అపార సేనాబలముతో మధురనాయక రాజ్యమువంటి చిన్న రాజ్యమునకు అధికారిణియైన తాను ఎదిరించి పోరుట రాజనీతి కాదని ఆమె నిజ మెఱసినది.

ఇప్పుడు మంగమ్మను ఏ పరిస్థితులైతే ఎదుర్కొనెనో ఒక శతాబ్దమునకు పూర్వము గోండు సంస్థానాధీశురాలైన దుర్గావతినిగూడ ఇట్టి పరిస్థితులే ఎదుర్కొనెను. అపారబల సమేతుడైన ఔరంగజేబు మంగమ్మపై ఇప్పుడెట్లు కత్తిదూసెనో అపారబలసమేతుడైన అక్బరు దుర్గావతిపై అప్పుడట్లు కత్తిదూసెను. కాని అప్పుడు దుర్గావతి ఒకవిధముగా ప్రవర్తించెను; ఇప్పుడు మంగమ్మ మఱియొక విధముగా ప్రవర్తించెను.దుర్గావతికిని మంగమ్మకును ఎంతేని తేడా గలదు. ప్రవృత్తియందు దుర్గావతి రాజనీతి ఒల్లని వీరాంగన; సమయజ్ఞతలేని సాహసికురాలు. మంగమ్మ అట్లుకాదు: ఆమె రాజనీతియందుండు తికమకల నెఱిగినప్రౌఢాంగన;కాలానుగుణ్యతపాటించు ప్రాజ్ఞురాలు. ఒకచోట వెనుక ముందులరయని వెఱ్ఱిపౌరుష; రాష్ట్రరక్ష ఏమరిన వీరావేశము; తలము తప్పిన దేశాభిమానము. మఱియొకచోట పౌర్వాపర్యముల పరామర్శించు ప్రాజ్ఞత; లాభనష్టముల తులదూచి లెక్కించు కార్యజ్ఞత; ఏకతానమైన రాష్ట్రరక్షాహిత బుద్ధి. అగుటచే దుర్గావతి తన అల్పసైన్యమును అక్బరుని అపార సేనాబలముతో ఎదుర్కొడ్డి పోరి ప్రాణములను సంస్థానమును గోల్పోయెను. మంగమ్మ అట్లుగాక ఔరంగజేబునకు లోబడి మధుర ఆంధ్రనాయక రాజ్యమును నిలబెట్టినది. సమయజ్ఞత పాటించి మంగమ్మ అట్లు చేయకుండినచో మధుర ఆంధ్రనాయక రాజ్యము చారిత్రక ప్రపంచమునుండి నాడే తుడిచి వేయబడి యుండును. లేదా తోడి తంజావూరి ఆంధ్రనాయక రాజ్యమునకు వలెనే ఇదికూడ తెనుగు వారిచేతులనుండి జారిపోయినదై యుండును. మంగమ్మ రాజనీతివలన, ప్రజ్ఞాదక్షత వలన మధురనాయకరాజ్యము మఱియొక అర్ధశతాబ్దము అవిచ్ఛిన్నముగ తెనుగువారి అధికారముక్రింద కొనలుసాగినది.

ఔరంగజేబు సేనానియైన జులిఫికారుఖాను 1693-వ సంవత్సరమున జింజికోట ముట్టడించుచు కొంత సైన్యమును దక్షిణమునకు పంపెను. అప్పుడు తంజావూరి మహారాష్ట్రప్రభువు షహజీ దోసిలియొగ్గి మొగలులకు కప్పము కట్టుటకు అచ్చుకొనెను. మైసూరురాజగు చిక్కదేవరాయలు మొగలులతో సంధిచేసికొని వారిసాహాయ్య సంరక్షణముల క్రింద తనరాజ్యమును విస్తరింప నుద్యమించెను. తోడిరాజు లిట్లు చేసినతోడనే మధురనాయక రాజ్యమును ఏలుచుండిన మంగమ్మకూడ ఇష్టమున్నను లేకున్నను మొగలులకు లోబడక తప్పినదికాదు. పొరుగుననున్న మైసూరు తంజావూరు రాజులు తలయొగ్గుచుండ ఆమె యొక్కతెయు మొగలులను ప్రతిఘటించి సముద్ర మధుబిందువగుట రాజనీతియగునా?

మొగలుసామ్రాజ్యముతో తనకిట్లు కల్గినసంబంధము మంగమ్మ తన రాజ్యోపయోగమునకై వినియోగించెను. 1697-వ సంవత్సరమున జులిఫికారుఖాను తిరిగి దక్షిణమునకు వచ్చినప్పుడు ఆమె ఆతనికి విలువయైన కానుకల నిచ్చి ఆతని తోడ్పాటున తంజావూరురాజు ఇదివఱకు తనరాజ్యమునుండి చీలదీసికొనిపోయిన కొన్ని ప్రదేశములను మరల తనరాజ్యమున కలుపుకొనెను.

1702-వ సంవత్సరమున మంగమ్మ దాదుఖాను అను మఱియొక మొగలు సేనానికి ప్రార్థనాపూర్వకమగు నొకలేఖ వ్రుత్తెంచెను. మొగలులకు సామంతుడై ఉదయారుపాళెయమును పాలించుచున్నవాడు విక్రమించి మంగమ్మ రాజ్యములోని కొన్ని పట్టణములను ఆక్రమించుకొనెను. ఉదయారుపాళెయమురాజు చేసిన అక్రమము తొలగించి తనరాష్ట్రమునకు సదుపాయము చేయుమని మంగమ్మ దాదుఖానుని లేఖాముఖమున వేడెను. ఆ లేఖతో మంగమ్మ ఔరంగజేబునకు పంపుటకు కొన్ని, దాదుఖానునకు కొన్ని, దివానునకు కొన్ని కానుకలను బంపెను. అందు ఔరంగజేబునకు పంపినవానిలో వెలగలనగలు, మణులు ఉండెను. దాదుఖానునకు ఇరువది వేలును, దివానునకు పదివేలును వెండిరూకలు అందు కలవు. దాదుఖాను వానిని అందుకొని తాను స్వయముగా సహాయార్థము రాజాలనంపుటకు చింతించుచు కొంత మంది సైనికులను పంపెను. ఈవిషయమును గమనించితిమేని మంగమ్మ మొగలుసామ్రాజ్య బాంధవ్యమును మధురనాయక రాజ్యాభివృద్ధికి ఎట్లుపయోగించినదో సువ్యక్తమగును.

మొదట ధనమును, పిమ్మట భూమిని, తుదకు జీవితమును హరించి దక్షిణాపథరాజ్యములను రూపుమాపవలయునని ఔరంగజేబు ఉద్దేశించినట్లు మనూసి చెప్పుచున్నాడు. ఔరంగజేబుని ఇట్టి ఉద్దేశ్యమునకు మంగమ్మ అవలంబించినపద్ధతి అడ్డుతగిలినది. మంగమ్మ ఏ ఎండకు ఆగొడుగు ఎత్తినది. మొగలు సేనానులకు లంచములు గ్రుమ్మరించినది. తనరాజ్యమును నిర్మూలింపవలసిన మొగలుసైనికులను ఆమె యుక్తిచాతుర్యముచే మధుర రాజ్యక్షేమాభివృద్ధికి వినియోగింపగల్గినది.

మొగలుసామ్రాజ్యముతో మంగమ్మ ఇట్లు రాచకార్యములు చక్కబెట్టుకొనుచుండగా మైసూరుప్రభువు చిక్కదేవరాయలు పరభూములను ఆక్రమించుటలో పర్యాప్తుడై యుండెను. 1690 వ సంవత్సరము నాటికే ఆతడు కావేరినదివఱకుగల బారమహాలు, సేలముభాగములను జయించెను. అటుపిమ్మట ఛెడనూరులో విశేషభాగములోగొనెను. 1694 వ సంవత్సరమున జరిగినసంధిలో చిక్కదేవరాయ లంతవఱకు జయించిన భూభాగములన్నియు మైసూరురాజ్యమున చేర్చుటకు నిర్ధారణ అయ్యెను. పిమ్మట చిక్కదేవరాయలు తన సేనలను మధురపై మరలించెను. ఔరంగజేబు ఈసమయమున మహారాష్ట్రులతో దండాగొండి పడుచుండెను. అగుటచే మధురరాజ్యమునకు సాహాయ్యముచేయుటకుగాని, చిక్కదేవరాయని శిక్షించుటకుగాని ఆతనికి సావకాశము లేకపోయినది. సమయము కనిపెట్టి చిక్కదేవరాయలు సేలము, కోయంబుత్తూరులపై ఎత్తివెళ్లి అప్పటి స్థానిక ప్రభువుల జయించి వారిని తనకు సామంతులుగా చేసికొనెను. మైసూరుదళవాయి కుమారయ్య మధురరాజ్యములోని తిరుచునాపల్లిని ముట్టడించుటకు పంపబడెను. తిరుచునాపల్లి పట్టుకొనిగాని తిరిగి మైసూరునకు పోనని కుమారయ్య ఒట్టుపెట్టుకొనెను. కాని అథాత్తుగ మహారాష్ట్రులు మైసూరుపైబడుటచే కుమారయ్య ఒట్టుతీసి గట్టునపెట్టి తిరుచునాపల్లి వీడి స్వరాష్ట్రరక్షణార్థము తిరుగుమొగము పట్టవలసివచ్చెను. తిరిగిపోయినవారు పోగా మిగిలిన మైసూరుసైనికులను మంగమ్మ అతిసులభముగ ఓడించెను.

మైసూరి సైనికుల పీడ వదలించుకొనిన వెంటనే ఆమె తిరువాన్కూరుపై ఎత్తివెళ్లవలసి వచ్చెను. 1623 వ సంవత్సరముమొదలు 1659 వ సంవత్సరమువఱకు మధుర పాలించిన తిరుమలనాయకుడు విక్రమించి తిరువాన్కూరుపై దండయాత్రసాగించెను. అప్పటి తిరువాన్కూరు ప్రభువు భయపడి తిరుమలశౌరికి కప్పముకట్టుటకు అచ్చుకొనెను. తిరుమలశౌరికి కొంతకాలముతరువాత మధురపాలించిన చొక్కనాధనాయని కాలమున రాజ్యమునందు కల్గిన అశాంతి అవకాశముగ తీసికొని తనరాజధానియందు సేనల వృద్ధిపఱుచుకొని తిరువాన్కూరురాజు మధురపై తిరుగబడుటకు వేచియుండెను. అయినను చొక్కనాధనాయనిపుత్రుడు రంగముత్తువీరప్పనాయకుడు మధుర యేలుచుండగా అప్పుడు తిరువాన్కూరు పాలించుచుండిన ఉమ్మాయమ్మరాణి [1677-1684] తిరునల్వేణిపురమునకు స్వయముగ వచ్చి వీరప్పనాయకు

నకు వెలలేని కానుకల నిచ్చి దాసోహ మన్నది. 1684 వ సంవత్సరమున రవివర్మ యనువాడు తిరువాన్కూరునకు ఏలిక అయ్యెను. 1689 వ సంవత్సరమునుండి మంగమ్మ మధుర రాజ్యవ్యవహారములను చక్కబెట్ట మొదలిడెను. తోడనే రవివర్మ కప్పముకట్టుటమానెను. అగుటచే మంగమ్మ రవివర్మపై కత్తి దూయవలసి వచ్చెను. తిరువాన్కూరురాజ్యమునుండి కప్పము వసూలు చేయుటకు ప్రతిసంవత్సరము మంగమ్మ సేనలను బంపుచుండెను. తనపై నిట్లు ఏటేట ఎత్తి వచ్చుచున్న మధుర సేనలకు రవివర్మ ఎదురొడ్డలేకపోవుచుండెను. ఇట్టి పరరాజపీడయేకాక రవివర్మను నిజమంత్రులపీడకూడ వేధించుచుండెను. రాజకీయ వ్యవహారముల నన్నిటిని తమ పిడికిళ్ల యందు చిక్కబట్టి మంత్రులు ఆతడు పెదవి మెదపెనేని తిరుగబడుటకు సిద్ధముగ నుండిరి. ప్రతిఘటించువారులేక మధుర సైనికులు తిరువాన్కూరుదేశమును తమ ఇష్టము వచ్చినట్లు దోచుకొని యింటికివచ్చుచుండిరి. ఏటేట ఇదియొక మామూలైపోయెను. తమరాజ్యముఖద్వారముననున్న ఆరంబోలి కనుమను పరిరక్షించుకొనగల్గియుండిరేని తిరువాన్కూరున కిట్టి దోపిడులు ప్రతివత్సరము లేకుండియుండును. కాని ఆరాజ్యమున మెండుకొనియున్న అంతఃకలహములు అరంబోలి కనుమను పరిరక్షించుటకు వీలులేకుండ చేసినవి. చేయునదిలేక తిరువాన్కూరు ప్రజ లిట్లే బాధపడుచుండిరి.

ఇట్లుండగా 1696 వ సంవత్సరమున రవివర్మ ఒక యుక్తి పన్నెను. ఆతనికి ఇంటియందు మంత్రుల పీడ, బయట మధుర సైనికుల పీడ. ఉపాయశాలియగు రవివర్మ ఈరెండుపీడలను ఒక్కదెబ్బతో వదల్చుకొనుటకు ఊహలు చేసెను.

కప్పము రాబట్టుటకై మామూలు ప్రకారము మధుర సైనికులు 1696 వ సంవత్సరమున తిరువాన్కూరుపై ఎత్తి వెళ్లిరి. వారిని ఎదిరించువారే లేకపోయిరి. నేరుగా వారు రాజధానీనగరమగు కోర్కులము వఱకు పోయిరి. అప్పుడు రవివర్మ బహుప్రమాదకరమైన ఒక పద్ధతి నవలంబించెను. మధుర సైనికులతో ఆతడు సంధి చేసికొనెను. మంత్రులను నిర్మూలించుటలో తోడువచ్చిరేని వారికి తనరాజ్యమున కొంత భాగమును, కోర్కులము నగరమును ఇచ్చుటకు రవివర్మ ఒడంబడిక నడపెను. ఆప్రకారమే ఆతడు దుర్గమును మధుర సైనికుల చేతులలో పెట్టెను. వారిసాయమున మంత్రులలో కొందఱిని తుదముట్టించెను. కొందఱు సచివులు పలాయనము చిత్తగించిరి. మఱికొందఱు విశేషధనము అపరాధముగ నిచ్చి ప్రాణములు దక్కించుకొనిరి.

మంత్రులపీడ ఇట్లు వదలినది. కాని రవివర్మకు సంతోషమేమియు లేదు. ఆతని రాజ్యమందలి ప్రధాన దుర్గము మధురవారిచేతులలో నుండెను. అతని ప్రాణములు, అతనిరాజ్యము, అతని సర్వస్వమును వారి చేతులలో నుండెను. అయినను రవివర్మ చలింపలేదు. తెగువ తెచ్చుకొని మధుర సైనికులున్న దుర్గమును హఠాత్తుగ ముట్టడించెను. అదరిపాటున పైబడిన రవివర్మ ధాటికి మధుర సైనికులు అలజడి నొందిరి. ప్రాణములపై ఆశ పుట్టి వారు పలాయనము చిత్తగించిరి. వెన్నంటి తరిమి వారిని రవివర్మ చిత్రవధ కావించెను. మధురసేన పూర్తిగ నశించెను. ఈవిషాదవృత్తాంతమును ఇంటికి జేరవేయుటకు మాత్రము కొద్దిమంది ప్రాణములతో బయటపడిరి.

మంగమ్మ ఇది వినెను. రవివర్మను తగిన విధమున శిక్షించినగాని నిద్రింపరాదని ఆమె శపథము పట్టెను. 1697 వ సంవత్సరమున తన దళవాయి నరసప్పయ్యకు విశేషసైన్యము తోడిచ్చి తిరువాన్కూరు పైకి పంపెను. నరసప్పయ్య గొప్పయుద్ధము చేసి రవివర్మను ఓడించెను. మధుర దళవాయి చెప్పిన సంధిషరతులకు ఆతడు అంగీకరించెను. బాకీయున్న కప్పము అణాపైసలతో ఇచ్చివేసెను; అమూల్యములగు ఆభరణముల నెన్నిటినో అపరాధముగ సమర్పించుకొనెను. దళవాయి నరసప్పయ్య తిరువాన్కూరునందు పట్టుకొనిన ఫిరంగులు మధుర తిరుచునాపల్లి కోటబురుజులపై విలసిల్లి మంగమ్మ జయమునకు సాక్ష్య మిచ్చుచుండెను.

తిరువాన్కూరు రాజుతో యుద్ధము ముగిసినదో లేదో, ఇంతలో మంగమ్మ తంజావూరుప్రభువుతో తల

పడవలసి వచ్చెను. తంజావూరి మహారాష్ట్రప్రభువు షహాజీ మొదటినుండియు మంగమ్మతో వైర మూని కలహమునకు కాలు ద్రవ్వుచుండెను. మొగలు సైనికుల సాహాయ్యమున ఆతనిని శిక్షింపవలయునని ఆమె ఊహ. కాని అట్టి సాహాయ్యము సమయమునకు అందకుండెను. షహాజీ ఇది కనిపెట్టి మధురరాజ్యములోని కొన్నిపట్టణములను పట్టుకొని సరిహద్దుప్రదేశములను దోచుకొనుచుండెను. మొక్కవోని రాష్ట్రరక్షాహితబుద్ధి గల మంగమ్మ యిది చూచి సహింపలేకపోయినది. 1700-వ సంవత్సరమున ఆమె తన దళవాయి నరసప్పయ్యను తంజావూరుపై పంపెను. తంజావూరు సేనలు మధురరాజ్యమును దోపిడిచేయకుండ ఆపుటకు కాలిరూను (కొల్లడము)నది ఉత్తరభాగమున మధురదళవాయి దండుడిసెను. కాని ఆతడు తంజావూరు అశ్వసైనికుల చాకచక్యమును, ధాటిని అరికట్టలేకపోయెను. దండువిడిసి ఒకచోటనుండుటకంటె తంజావూరుసేనల వెనుదగిలి యుద్ధకథనము నడుపుటయే మధురరక్షణమునకిక మంచిపద్ధతి అని నరసప్పయ్య నిజ మూరసెను. అగుటచే ఆతడు రెండవకంటివానికి తెలియకుండ నదినిదాటి తంజావూరు రాజ్యముపైబడి కొల్లపెట్ట ప్రారంభించెను. తంజావూరి సైనికులకు దిగులు పుట్టెను. వారికి కాలు, చేయి ఆడని కంగారు కల్గెను. అట్టి కంగారులో వారు రాజధానీ నగరరక్షణమును ఏమరి నదిని దాటి ఒక్కపెట్టున మధురదళవాయిపై బడుటకు ఊహ చేసిరి. అప్పుడు నది నిండువరదకు పొంగి గట్లొరసి శరవేగమును మించి పారుచుండెను. తంజాపురివారి పక్షమున పెక్కుమంది సైనికులును, పెక్కుగుఱ్ఱములును నదిని దాటుచుండగనే ప్రవాహవేగమునకు కొట్టుకొనిపోయిరి. తంజాపురిసేన అల్లకల్లోలమై మధుర సైనికుల చేతులలో పూర్తిగ నాశనము నొందెను. నరసప్పయ్య తంజాపురిరాజ్యమును నాశనదేవతకు విహారమందిరముగ చేసెను. మధురవారి విజయవృత్తాంతము దేశదేశములకు ప్రాకిపోయెను. షహాజీ ధైర్యము పూర్తిగ చిటిలి పోయెను. తనముఖ్యమంత్రియైన వాగోజీపండితుని కాపట్యమే ఈ అపజయమునకు కారణమని ఆతనికి కోపము పెచ్చెత్తినది. వాగోజీపండితునియెడ ప్రజ లిదివఱకే ద్వేషము వహించి యుండిరి. సమయము కనిపెట్టి ఇప్పు డాతనిని పదభ్రష్టుని చేయుటకు ప్రజలు ప్రయత్నించిరి. కాని పండితు డిసుమంతయైన చలింపలేదు. షహాజీని దర్శించి ఇట్లు విన్నవించెను: "విక్రమించిన శత్రువుతో గౌరవప్రదముగ సంధి కూర్తును. ఒకవారము దినములు గడువు చాలును. నే నిట్లు చేయలేకపోదునేని నాపీకి నుత్తరింపుడు."

నిస్సహాయస్థితియందున్న షహాజీపండితున కాతడు కోరినగడువు ఇచ్చెను. వెంటనే వాగోజీ తనకార్యదర్శులను స్థానికవర్తకశిఖామణుల వద్దకు పంపి విశేషధనమును ఋణము చేసెను. వీలుచిక్కిన విధములనెల్ల ధనమును పోగుచేసెను. మూడునాలుగు రోజులలో ఆతడు అయిదులక్షల రూకలను సమకూర్చెను. వానితో మధురవారి మంత్రులకు లంచములు పోసెను. దళవాయి నరసప్పయ్య తండ్రికి ధనతృష్ణ హెచ్చు. వాగోజీ ఆతనికి యెంచరానిలంచము ఇచ్చెను. దానితో మధుర తంజాపురి రాజ్యములకు సంధిపొసగెను. పండితుని మంత్రాంగము ఫలించినది. ఆతని సంతోషము మిన్నుముట్టినది. ఆతనిశత్రువులు తలవంచుకొనిరి. తంజావూరు రాజ్యమున ఆతనిపలుకుబడి ఇనుమడించెను.

ఈ సంధికార్యముల నిర్వహించుటలో మధుర తంజావూరువారు పర్యాప్తులై యుండగా మైసూరురాజు కావేరీజలమునంతను తనరాజ్యములోని భూములకు మరలించుకొనుటకై ఆ నదిపై పెద్ద ఆనకట్ట కట్టెను. అందువలన కావేరీజలము ఒక చుక్కయయినా క్రిందికి రాకుండెను. మధుర తంజావూరు రాజ్యములకు నీటియెద్దడి కలిగి కఱవు సంభవించునను భీతిపొడమెను. క్రొత్తగాపొసగిన సంధివలన స్నేహము నెఱపుకొనుచున్న తంజావూరు మధుర ప్రభువులు ఉభయులును ఏకమై మైసూరుపై ఎత్తివెళ్లుటకు ప్రయత్నపడిరి. కాని ఇంతలో వర్షములు తూలగాకురియుటచే చిక్కదేవరాయలు కట్టిన ఆనకట్ట విచ్చిపోయి కావేరి యథాప్రకారముగ ప్రవహించి మధుర తంజావూరురాజ్యములకు జలసమృద్ధి నొడగూర్చెను. చిక్కదేవరాయల ప్రయత్నమిట్లు తొలుతనే

విఫలమునొందినను, మధుర తంజావూరు రాజ్యములకు కల్గిన నూతనస్నేహమును దృఢపఱచుటకుమాత్రము సాధనమయ్యెను.

ఇంతవఱకు మంగమ్మ ఆమె తలపెట్టినకార్యములం దన్నిటియందును జయముగొనుచువచ్చెను. మారవరాష్ట్రమనబడు రామ్నాదునకు అధిపతియైన రఘునాధ సేతుపతి మధురసామంతరాజులలో నొకడు. మంగమ్మ మైసూరు, తిరువాన్కూరు, తంజావూరు ప్రభువులతో యుద్ధములందు తగుల్కొని యున్నప్పుడు రఘునాధ సేతుపతి మధురకు కప్పముకట్టుట మానివేసెను. అంతతో ఊరుకొనక సాహసించి అతడు 1698 వ సంవత్సరమున మధురానగరమునే ముట్టడించి పట్టుకొనెను. కాని మధురదళవాయి నరసప్పయ్య అతని ఆటలు సాగనీయక మధురరాజ్యమునుండి తఱిమికొట్టెను. 1700 వ సంవత్సరమున మంగమ్మ తంజాపురి ప్రభువుతో పోరుచుండెను. అప్పుడు రఘునాధసేతుపతి మంగమ్మకు ప్రత్యర్థియై తంజాపురివారితో చేతులు కలపెను. ఆకోపము మనసునం దుంచుకొని మంగమ్మ తంజావూరి యుద్ధము సమాప్తినొందినవెంటనే 1702 వ సంవత్సరమున తన దళవాయి నరసప్పయ్యను సేతుపతి పైకి పంపెను. సంధి కుదురుటచే తంజావూరిసేనలు మధురసేనలకు తోడువచ్చెను. అయినను జయము సేతుపతినే వరించెను. అనేక యుద్ధములందు మధురకు జయమొసగూర్చిన దళవాయి నరసప్పయ్య ఈమారు అపజయము నొందుటయేకాక ప్రాణములను గూడ గోల్పోయెను. బహువారములు యుద్ధయాత్రలు సల్పి యుండుటచే మధురసేనలు పూర్తిగ నలసియుండెను. మధురసేనకంటె మారవబలము శక్తిమంతమై యుండెను. మధురపక్షమున నున్న బలము మధుర తంజావూరిసేనల కూటమి. మారవపక్షమున ఏకరాష్ట్రమునకు చెందిన బలము మాత్రమే యుండెను. కావుననే మారవసైనికులు ఐక్యతకలిగి ఏకతానమైన శక్తిని చూపిరి. 1702 వ సంవత్సరమున సేతుపతి మధుర రాజ్యమునుండి చీలిపోయి రామ్నాదును స్వతంత్రముగ పరిపాలించెను. మంగమ్మ సేతుపతిని జయింపలేకపోయెనని ఒప్పుకొనకతప్పదు.

అయితే అంతమాత్రమున ఆమె ప్రతిభకునేమియు లోపమురాదు. ఆమెరాజ్యాధీనము పట్టుసరికి మధుర నాయకరాజ్యము విషమపరిస్థితులలో నుండెను. తన శక్తిసామర్థ్యములను, రాజనీతిని ఉపయోగించి రాజ్యవిచ్ఛిత్తిని అరికట్టినది. ఒకవంక మొగలులు; మఱియొక దిక్కున తంజావూరు ప్రభువు; వేఱొకప్రక్క మైసూరు రాజు; మఱియొండుదెస తిరువాన్కూరు ఏలిక; వేఱొండువంక మారవదేశాధిపతి చుట్టుముట్టి పంచాగ్నుల వలె ఆమెను బాధవిరి. తెలివిగలిగి ఆమె మొగలులతో చెలిమి కలిపి మిగిలినవారిని ఒక్కొక్కరినే వదలించుకొని వచ్చినది. ఇం దామెకు దళవాయి నరసప్పయ్య కుడిభుజము వలె సాయపడెను. అతని చావుతో ఆమెకు కుడిభుజము కూలిపోయిన ట్లయ్యెను. అనుటనేసేతుపతి తలయెత్తకల్గినాడు. బహువారములు జైత్రయాత్రలు సల్పివిసిగివేసారి నాయకుని గోల్పోయి నిస్సహాయస్థితియందున్న మధుర సేనలను 'బ్రహ్మిణ్ణో బ్రహ్మ'మీద ఓడించినాడు.

మంగమ్మ మతసహనముగలది. ఆమెరాజ్యమున హిందువులు క్రైస్తవులు, మహమ్మదీయులును ఉండిరి. ఆమె సమకాలికులగు తంజావూరుప్రభువును, మారవదేశాధిపతియు క్రైస్తవమతబోధకులను, ఆమతము స్వీకరించినవారిని విద్వేషించి పీడించుచుండువారు. కాని మంగమ్మ అట్లుగాక విశాలహృదయముతో క్రైస్తవుల యెడ సమరసభావము చూపెను. మహమ్మదీయమతము నెడకూడ ఆమె సహనభావము వహించెను. 1692 1701వ సంవత్సరములం దామె మసీదులకు భూదానములు చేసినట్లు ఆమె వేయించినశాసనములు చెప్పుచున్నవి. ఆమె హిందువులకుచేసిన దానధర్మములకు అంతుపంతు లేదు.

ఆమె దానగుణము మెచ్చతగినది. దేవాలయములకు ఆమె చేసినదానములను శాసనములు ఘోషించుచున్నవి. ఆమె రోడ్లువేయించినది; సత్రములు కట్టించినది; చావడులు నిర్మించినది; రోడ్లప్రక్క చెట్లునాటించినది; మార్గస్థుల ఉపయోగార్థము ఆమె అక్కడక్కడ విశ్రామశాలలు ఏర్పఱచినది; చలివేంద్రలు పెట్టించినది.

అన్నదానసమాజమున కామె 1701-వ సంవత్సరమున భూమిదానము చేసినట్లు శాసన మొకటి చెప్పుచున్నది. ఆమె పెక్కు అగ్రహారము లిచ్చినది. ఉయ్యాంకొండ కాలువగట్టున 1687, 1704-వ సంవత్సరములందు ఆమెవేయించిన శాసనములు వ్యవసాయాభివృద్ధియందును, నీటిపాఱుదలయందును ఆమెకుగల శ్రద్ధను వెల్లడిచేయుచున్నవి. నాటి మైసూరురాజగు చిక్కదేవరాయల పిసినారితనమును, మంగమ్మ దానశీలమును ప్రజలు కథారూపముగ నేటికిని స్మరించుచుందురు.

క్రీస్తుశకము 1260 నుండి ముప్పదిఅయిదు సంవత్సరములు 1295 వఱకు కాకతీయాంధ్రసామ్రాజ్యమునకు నియంత్రియై రాజ్యకల్లోలముల కలకదేర్చి రాజకీయ విషమపరిస్థితుల చక్కబఱచి సుస్థిరమైన రాజ్యమును దౌహిత్రుడు ప్రతాపరుద్రునకు అప్పగించి దివంగతురాలైన ఆంధ్రరమణీమణి రుద్రమ్మకువలెనే క్రీస్తుశకము 1689 నుండి 1706 వఱకు పదునెనిమిది సంవత్సరములు మధురఆంధ్రనాయకరాజ్యమునకు ప్రభ్వియై రాజ్యకల్లోలముల కలకదేర్చి రాజకీయవిషమపరిస్థితుల చక్కబఱచి సుస్థిరమైన రాజ్యమును పౌత్రుడు విజయరంగ చొక్కనాథునకుఅప్పగించి మంగమ్మదివంగతురాలైనది.

తమిళము ప్రధానభాషగాగల దేశమునకు పాలకురాలయ్యు మంగమ్మ తాను వేయించిన శాసనములలో విశేషభాగము తెనుగుననే వెలయించెను. మంగమ్మ ఆత్మభాషాభిమానమువలన ఆనాడా తమిళభూభాగమున ఆంధ్రము రాజభాషగా విలసిల్లినది. విదేశమునందుండినిగదాయని ఆమె స్వభాషను మఱువలేదు. ఉచితజ్ఞురాలు మంగమ్మ చూపిన స్వభాషాభిమానమును జ్ఞప్తియందుంచుకొని ఆంధ్రులు సీమలుకాని సీమలయందు వలసనెలకొనినను స్వభాషను విస్మరింపకుందురుగాక!

ఆంధ్రజాతికి పేరుపెంపులు వెలయించిన రమణీమణులలో నొకతెయైన మంగమ్మ జీవితచరిత్ర*నుండి మనము నేర్చుకొనవలసిన ఉత్కృష్టమగు నీతిపాఠమిదియే.

—'ఆంధ్రరమణీమణుల' నుండి.

---

*'మంగమ్మ' చరిత్ర రచియించుటలో ఈ క్రింది గ్రంథములు చాలవఱకు తోడ్పడినవి.—

I. Gazetteer of the Tanjore District.
II. Do Madura Do
III. Kuppuswami Sastri, T. S.—A Short History of Tanjore Nayak Princes.
IV. History of the Nayaks of Madura, R. Satyanatha Aiyar.





7 - 7 - ౫౦

## *గ్రుడ్డిపిల్లవాఁడు

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

వెలుఁగు వెలుఁగని మీరెల్లఁ బిలుచునట్టి
వస్తు వెయ్యది? దాని రూపం బదేమి?
దృష్టిలాభంబుచే ఫలం బేమి మీకుఁ?
బలుకుము సఖుండ! యీ యంధ బాలకునకు.

వేయివెలుఁగులతో రవి వెలుఁగు ననియు
వింతవింత పదార్థముల్ కాంతు మనియు
ననెద; వాతండు వేఁడి యంచును గ్రహింతుఁ
గానియెట్టుల రేయిబగల్లు సేయు?

రే బవలునాకు నేనయి సృష్టి సేతు;
నతనిసృష్టితో నాకుఁ గార్యంబు లేదు;

నాదు జాగరణావస్థ నాకుఁ బగలు
నాదుగాఢసుషుప్తియు నాకు రాత్రి;

అప్రతివిధేయదుఃస్థితి యంచునుంటి
ననుచు ననుఁగూర్చి మీరెల్ల వగరుచుంద్రు
కాని నాకయి తెలియంగరాని యెల్ల
దుస్థితి సుఖంబుగా సహింతును సఖుండ!

నామనంబున నున్న యానందమునకు
నష్టమును గూర్ప వలవదో నాప్రియుండ!
అనుదినము హాయిగాఁ బాడుకొనుచునుండ
గ్రుడ్డినైన మహారాజు బిడ్డనేను.

---

* ఆంగ్లమున కిబ్బర్ (Cibber) కవివ్రాసిన The Blind Boy యనుదాని యనువాదము.

---

## ఉత్కంఠ

అల్లంరాజు రంగనాయకులు

ప్రవిమలానంద పీయూషరసపయోధి
గర్భజనితోర్మికా డోలికాళి కేళి
సలుపు హృదయాధినాథు డీసరసిపేద
కరడులం దూగ్ధదలషగ గలడో లేడో?

తరుణశారద పూర్ణిమాంబురుహారమణి
బాహులతిలోన బంధింపబడు కృపావి

శాలమూర్తి యెట్లీ విరజాజికన్నె
చిన్నికనుమోడ్పు కౌగిట జిక్కగలడు?

సాధుమునిమానసాంభోజ సౌధరాజ
రాజితాంతఃపురమ్ములో రత్నఖచిత
మృదులతరతల్పమున నిదురించు సుప్ర
శాంత గంభీర భావోదయాంతరంగు
డేటులు కలుషతమోవృత హృదయశిథిల
పటకుటీరమ్ములో దివ్యపాద మిడునో?

# ఫలజ్ఞ

## వేలూరి శివరామశాస్త్రిగారు

వ్యాసమూర్తి మేజస్ట్రేటు. ఆయన ఇప్పుడు కులనాడు అప్పర్ సెకండరీ ప్యాసు అవడమే కాకుండా రెవిన్యూ టెక్స్టులు మొదలయిన వన్నీ ప్యాసు అయినాడు.

వ్యాసమూర్తి తాబేలు నడకతో ఈ వుద్యోగములోకి వచ్చాడు. ఆయనరక్తమాంసాలు ఉద్యోగంలో నేడుడిగినవి. ఆయన మొదటి నుంచీ నిరంకుశాధికారులనీడలలో పెరిగాడు.

వ్యాసమూర్తి ప్రాతః స్నానము చేసి మూడు రేఖలా విభూతి పూసుకొని కాళీపూజ చేసి సుందరకాండ పారాయణం చేశాక కన్నులు మూసుకొని కొంతసేపు ధ్యానం చేశాడు.

కోర్టులు వచ్చాక వ్యాజ్యాలు గెలవడానికి, పెద్దపెద్ద ఉద్యోగాలు రావడానికీ సుందరకాండ పారాయణం పరాయణం అయింది. ఇహానుంచీ కావ్యంయొక్క ఉపయోగాలలో వ్యాజ్యాలు గెలవడం, ఉద్యోగాలు పొందటం— ఈ రెండూకూడా పరిశిష్టాలకింద పరిగణించాలి.

కోర్టులో బెంచిమీద తాను కూచున్నట్టూ, తనకింద నుంచోని ప్లీడర్లు తమతమ వాదాలు చెప్పకుంటూ, 'తమ ఘనము' 'తమ దివ్యచిత్తము' అని మనవులు చేస్తున్నట్టూ, కటకటాలలో ముద్దాయిలు చేతులు కట్టుకోని నుంచున్నట్లూ, తాను బహుపరాకుగా వింటున్నట్లూ వ్యాసమూర్తి భావించుకుంటు



"వ్యాసమూర్తి......కొంతసేపు ధ్యానంచేశాడు."

న్నాఁడు. ఒకఁడికి అయిదు నెల్ల యిరవైతొమ్మిదిరోజుల శిక్షా, ఇంకొకఁడికి నలభైతొమ్మిది రూపాయిల జరిమానా విధిస్తున్నట్లు తలుస్తున్నాఁడు.

ఆయనభార్య అపాల కాఫీతెచ్చి ఎదురుగా పెట్టింది. ఆయన కనులు తెఱచిచూచి 'ఛీ ఛీ ఛీ అంతా పాడుచేశా'వన్నాఁడు. అపాల పెంబేలు పడ్డది. అటుతరువాత ఆయనా తెల్లఁబోయాఁడు. మఱి మాటాడక కాఫీ నైవేద్యం పెట్టి పుచ్చుకోడం మొదలు పెట్టాఁడు.

అపాల 'ఒరే రామాయ్'అని నవుకరును కసురుకుంటూ పిలిచి 'కూరాగాయా నీవు కూచుంటేనే వస్తాయా?' అన్నది. రామాయి కిక్కుఱుమనకుండా నిలుచున్నాఁడు. అపాల బుట్టాడబ్బులు వాని కిచ్చి 'ఆలుగడ్డలు మంచివి ఏఱిపట్రా' అనఁగానే తల ఊఁపి రామాయి వెళ్లాఁడు.

'వ్యాసమూర్తి పిలు పిలు వాణ్ణి పిలు'మన్నాఁడు. అపాల పిలిచిందిగాని జబాబు రాలేదు. ఆయన కళ్లెఱ్ఱచేసి 'ఈవెధవల కెంత పొగరో? మళ్లీ పిలుస్తా రనైనా వెనకచూపు లేదు.' అని వాపోతూ ఉండఁగా రామాయి వచ్చి నిలఁబడ్డాఁడు. వ్యాసమూర్తి కెక్కడ లేని సంతోషమూ వచ్చింది. 'అయితే నాక మేటట్టేవుంది,'అని తల ఊఁపుకుంటూ 'టపాకెళ్లి ఉత్తరాలు పట్రావాలి; కూరగాయల బజారునుంచి తొందరగా రా' అన్నాఁడు. రామాయి ఊఁకొట్టి వెళ్లాఁడు.

అపాల కాఫీగిన్నెలు లోపలఁబెట్టి గబగబా వాకిట్లోకివచ్చి 'ఒరే రామాయ్, రాముఁడూ, రామిగా,' అని పిలిచి 'చెవిటిగోడ! వినిపించుకుంటాఁడూ!' అని విసుగుకుంటూవుండఁగా మెల్లగా రామాయి వచ్చాఁడు. రాంగానే అపాల 'ఒరే ఫూల్! బజారునుంచి వెంటనే వచ్చి మళ్లీవెళ్లి ఉత్తరాలు తెమ్మంటే విని ఊరుకుంటావా? 'వచ్చేటప్పుడే తెస్తా' ననలేకపోయావు? బుద్ధేదీ? మధ్యదారిలోంచే పట్రావచ్చుఁగా!' అని అన్నది.



రామాయి ఊఁకొట్టి వెళ్లాఁడు.

'ఎదురుమాట చెప్పినా ఫ్యూన్ నరసింహమే మేలు; వీఁడు మాటలు వచ్చిన మూగ.' అని అపాల లోలోపల గొణుగుకుంది.

అధికారముముందు 'ఆ'అన్నా మరమేకే, 'ఊ' అన్నా మరమేకే.

వ్యాసమూర్తి 'నాకూ అదే తోఁచింది. అన్నీకలిసి వస్తున్నవి.' అని అనుకుంటూ 'యేమ్,ఎంత ఏ్రబాసిపని? ముందే ఉత్తరాలిచ్చి బజాఉ వెళ్ళమంటే బావుండేది. ఐనా చూదాం; వీఁడు గనుక బజాఉ వెళ్లకుండా మధ్య తోవలోంచే ఉత్తరాలు పట్టుకొస్తే తాసిల్ దారవుతా'నని నిశ్చయం చేసుకున్నాఁడు.

అపాల రాముఁడుతో ఇంకా ఏమన్నా చెపుదామా అని ఆలోచిస్తూ బజాఉ చివర కంటూచూస్తూ నిలఁబడ్డది. వీథిచివర కృష్ణాచార్లుగారింటి దగ్గిఱ బండి నిలచివుంది.

బండీవాఁడు సామానులు లోపల పడేస్తున్నాఁడు. ఆయనకొడుకు కృష్ణద్వైపాయనాచార్లు బండీవెనుక నిలుచున్నాఁడు. ఆమె గడపమెట్లు దిగి ఆచిఆచి చూచి తల ఆడించి లోపలికి వెళ్లింది.

వ్యాసమూర్తి ఆఫీసుగదిలోకి వెళ్లి జేన జేనా పరీక్షించాఁడు. వెంటనే 'ఫ్యూన్' అని ముమ్మాఱు పిలిచాఁడు. రెండోపిలుపుకి ముందరే ఫ్యూన్ నరసింహం ఎదుట నిలఁబడ్డాఁడు.

ఫ్యూన్ నరసింహం సొంతనౌకరు కాదు. అతఁడు కోర్టునౌకరు. ఐనప్పటికీ ఇంటికీ కోర్టు జీతమిస్తుంది. ఇల్లు ఇతరత్ర ఇప్పిస్తుంది.

వ్యాసమూర్తి—'కళ్లేమయినా పోయినాయూ?' అని అన్నాఁడు. 'మీకు ఇన్ని ఉద్యోగాలు వచ్చిందాఁకా పోలేదు. ఇహ తాసిల్‌దారు ఐతే యేమో' అని అంటూ వ్యాసమూర్తి నిలఁబడ్డచోట వంగిచూస్తూ తమలపాకు యీనె తీసి ఫ్యూన్ నరసింహం వాకిట్లోకి వెళ్లాఁడు. వ్యాసమూర్తి 'వీఁడు గూడా అంటున్నాఁడూ, సుందరాకాండలో పారాయణ పట్టూ సరిగా వచ్చింది. నాభార్యామాటా నా మాటా కలిసింది. ఇహ రామాయి నడితోవలోంచే వస్తే యోగం పట్టిం దన్నమాటే. ఒకవేళ ఇవన్నీ అబద్ధమైనా సిద్ధాంతిమాట అబద్ధమవుతుందా?' అని ఆలోచిస్తూ కురిచీలో కూచున్నాఁడు. పక్కకిటికీలోంచి సూర్యకాంతి ప్రసరించినది.

ఆలోచనకూ చీఁకటికీ సావాసం వుంది కాని వెలుఁగుకు ఎక్కడిది?

అతఁడు 'ఫ్యూన్' అని మళ్లీపిలిచి సంజ్ఞ చేయఁగా 'ఫ్యూన్' నరసింహం కిటికీతలుపు ఓరగా మూశాఁడు.

కోరికకు కుదురులేదు. ప్రతీక్షకు ప్రశాంతి లేదు.

వ్యాసమూర్తి వాకిటిలోకి వెళ్లి చూశాఁడు. ఫ్యూన్ నరసింహంకూడా చూశాఁడు. ఆవిధం వ్యాసమూర్తి చూచివుంటే ఇదికూడా కలిసిం దనుకొనే వాఁడే.

రామాయి కూరలకు పోకుండానే వట్టి బుట్ట ఊఁపుకుంటూ టపానుంచి ఉత్తరాలు పట్టుకొవస్తున్నాఁడు. వ్యాసమూర్తి ముఖమింతచేసుకోని గబగబా లోపలికివెళ్లి కవర్లు

చింపే చాకు బల్లమీఁద పెట్టుకొని కూచు న్నాఁడు. కిటికీతలుపు తానే తెరచుకున్నాఁడు. బయటినుంచి నరసింహాం ఇదంతా చూస్తూనే ఉన్నాఁడు.

రామాయి కాలిచప్పుడయింది. వ్యాస మూర్తి కుర్చీలో కుదిరి కూర్చున్నాఁడు. ప్యూన్ నరసింహాం ఉత్తరాలకట్ట తెచ్చి బల్ల మీఁదపెట్టి పక్కగా నిలుచున్నాఁడు.

వ్యాసమూర్తి 'నీవు వాకిట్లోకి వెళ్లు!' అని విదిలించాఁడు. అతఁడు వెళ్లింతర్వాత ఒక్కొ క్కఉత్తరమే తీసిచూసి నిట్టూర్చి ఆఉత్తరా లన్నీ అక్కడే పాఱేసి, కాసేపు కూచోని, 'ప్యూన్! ఎంతసేపల్లా వాకిట్లో కూర్చోవడం?' అని అనఁగానే నరసింహాంవచ్చి ఉత్తరాలకట్ట చేత్తోపుచ్చుకొని ఒక్కొక్క ఉత్తరమే చేతి కిచ్చి చదువుకోంగానే అందుకుంటూఉన్నాఁడు.

అపాల వచ్చి గుమ్మము దగ్గిఱనా నిలఁ బడ్డది. ప్యూన్ నరసింహాం 'ఎవరది అవతలి కిపో, పో అవతలికిపో! ఇది అయ్యగారి ఆఫీసు అని రాసి ఉండలేదూ?' అని తలయెత్తి తెల్లఁ బోవడం అభినయించాఁడు.

మేస్ట్రీటు దర్జాకు అపాల సంతోషిం చింది. .

వ్యాసమూర్తి ఒకసారి తలమెత్తి చూ చాఁడు. అపాల నవ్వుకుంటూ లోపలికి వెళ్లింది.

వ్యాసమూర్తి ఉత్తరాలు చూచుకొ న్నాక, 'ఏమోయ్ కొత్తతాశీల్ దారు వచ్చిం దాఁకా మందేభారం. నేను రేపు పెళ్లికి వెళ్లాలి. కొత్తాయన వచ్చేనాఁటికే నేనూ రావాలి. నీవు జాగ్రతగావుండు. నేనిహా భోజనానికి లేస్తాను. నీవువెళ్లు' అన్నాఁడు. ప్యూన్ నరసింహాం 'తమరేకాకుండా కొత్తతాసిల్ దారేవచ్చి,గుం డెలతో బతుకఁగలఁడా?' అంటూ వెళ్లాఁడు. వ్యాసమూర్తి మళ్లీ పూజామందిరములోకి వెళ్లి పూజ ఆరంభించాఁడు.

రెండు జాములయింది.

అపాల మడిగట్టుకోమన్నది.

౨

అపాల పడుకొని లేచేసరికి నాలుగు అయి నది. సబ్బుతో మొహం కడుక్కొని అలంక రించుకుంది.

చాకలి పరదేశిగాఁడు ముందు నడవందే అపాల అడుగుపెట్టి ఎఱుఁగదు. మందయాన ముతో గుమస్తాల యిండ్లు కటాక్షిస్తూ బయ లుదేరింది. హెడుగుమస్తాగారిభార్య అన్నమ్మ గారు అపాలను ఆహ్వానించింది.

అపాల లోపలికివెళ్లి కూచోనేసరికి అన్న మ్మగారి కూఁతురు ఆదిలక్ష్మి అపాలను చుట్టే సుకుని—'అత్తా, పేరమ్మగారింటికి పెత్తనానికి వెడదాం లే; ఉబుసుపోవడం లేదు!' అన్నది.

'పొద్దుపోని ముద్దరాలు పిలవకుండానే పేరంటం పోతుంది; ఉబుసుపోని ఒయ్యారికి ఊరంతా ఉబుసే. పెత్తనాలు పోకూడదమ్మా;' అని అపాల అంది.

'అయితే నివ్వెందుకొచ్చావ్?' అని ఆది లక్ష్మి అన్నది. అన్నమ్మగారు ఆదిలక్ష్మిని

చేలితో తట్టి—'తప్పు; అల్లా పెద్దలను అన రాదు;' అన్నది. అపాల—'నాకూ పనిఉన్న దమ్మా, పోవాలి' అనిలేచింది. అన్నమ్మగారు





"అపాలలోపలికివెళ్లి కూచో'నేసరికి. . .ఆదిలక్ష్మిఅపాలను చుట్టేసుకుని ...అన్నది."

చిన్నఁబోయి వెంటనే గదిలోనుంచి తాంబూలం తెచ్చి యిచ్చింది.

ఆదిలక్ష్మి గదిలోనుంచి—'పేను, పెత్త నాలమారి; ఆబోతు పెత్తనాలమారి, ఉద్యోగ స్తులపెళ్లాం పెత్తనాలమారి' అంటూ పాడు కోటం మొదలుపెట్టింది.

అన్నమ్మగారు, 'ఆదిలక్ష్మి ఇంకాఏమేమి పాడిపోతుందేమో' నని తానే ముందర దారి తీసి రోడ్డుమీఁదికి తీసుకోవెళ్లి దిగవిడిచింది.

అపాల ఆనాఁడు మామూలుగా చేసే పెత్తనాలు మాని గుమస్తాల భార్యలమీఁద కటాక్షములు మాత్రమే పారేస్తూ కృష్ణాచా ర్లుగారి యింటికి వెళ్లింది. తలుపుతీసే వుంది, గాని ఇంట్లో ఎవ్వరూలేరు. మేడమీఁద మాట లువినిపించి 'కృష్ణద్వైపాయ నాచార్లూ' అని పిలవఁగానే అతను దిగివచ్చాఁడు.

'ఇంట్లో ఎవరూ లేరేమిటి?'

'సర్కీటు వెళ్లారు.'

'ఇవ్వేళ పొద్దున్న ఎవరో క్రొత్త లు వచ్చినట్లున్నారే; వారితో ఆఁ డంగులెవరూ లేరే.'

'ఆయనే ఆఁడంగి.'

'ఎవత్తేమిటి ఆ ఆఁడంగి?'

'మనవాళ్లే-సత్తెనపల్లి, సురభి బిందుమాధవరావుగారి మనమఁడు. నాకు స్నేహితుఁడు. నన్ను చూ డ్డానికి వచ్చాఁడు.'

'అయితే మనకు దగ్గిఱ చుట్ట ఱికమే?'

'ఔను.'

'ఈపూట మీరిద్దఱూ మాఇంటికి భోజ నానికి రావాలి.'

'మానుగారికి తాసిల్‌దారు అయిందా యేమిటి?'

'ఇదివఱకు మేస్త్రీటయితేనే విందుకు వచ్చావా నేమిటి? మీయింట్లో మీఅమ్మ గారు లేరు కాఁబట్టి విందు. అన్నవస్త్రాలం తగా లేనివాళ్లకూ, బంధువులకూ, స్నేహితు లకూ విందులుచెయ్యడం నాకు అతిఅభిలాష. కాఁబట్టి పిలిచాను.'

'విందు విలాసానికే అయితే కుందు.విందు భక్తినేర్పమందు. విందు విజ్ఞానాన్ని ఇస్తుంద్,

తెస్తుంది. విందంటే విశ్వేశ్వరుఁడైన వచ్చి కూచుంటాఁడు; రాజాధి రాజైనా సరిగా చేయడానికి భయపడుతాఁడు. విందు బదరే చేసింది; భగవంతుఁడే ఆరగించింది.' అంటూ అపాల 'ఏమోయ్' నీవు మళ్లీ ఉద్యోగానికి ఊరూరూ తిరుగుతావు. రేపు మేము పెళ్లికి పోతూవున్నాము. మాయింట్లోనూ ఎవళ్లూ లేరు. కొత్త ఆయనకూడా వచ్చాఁడు. ఈ పూఁట భోజనానికి మీరిద్దఱూ తప్పక రావాలి' అన్నది.

'వట్టిభోజన మయితే యెందుకూ?'

'మాయింట్లో ఏపూఁట పిండివంట లేకుం డావుంది?'

'పిండివంట మీకు మామూలే నాయెను, ఇఁక విశేషం?'

'ఏం చెయ్య మంటావు?'

'మామిడిపళ్లు, పనసతొనలున్నూ.'

'ఇంతేకదా! ఇంకేమి కావాలి?'

'ఏడు గంటలకే కావాలి.'

'మీరింకా ఉండఁగలరుగాని మావా రస లేఉండలేరు. ఏడుకొట్టేసరికి విస్తళ్లు వేయిస్తా.'

'మంచిది.'

'ఏమండోయ్! ఎమ్మేగారూ! మావారు మళ్లీ రాలేదనుకోక ఏడుకొట్టేసరికే రండేం.'

'అదికొంచెం వ్యాసఘట్టమే. ఏనాచూదాం. అయితే అతన్ని వదిలేసి నన్నే రమ్మంటారా యేమిటి?'

'మామంచివాఁడ' వంటూ అపాల మేడ మీఁదికి వెళ్లి బిందు మాధవరావును చూచి 'మీ రెఱుఁగక పోయినా మనం ఒకకుటుంబ లోనివాళ్లం. మాపుట్టింటివారు సురభివారే. ఈపూఁట మాయింటికి భోజనానికి రావాలి. ద్వైపాయ నాచార్లతో చెప్పాను కాని మూలి గాఁడు. 'మీరు రావాలి. ఏమంటారు? మఱో మాట చెప్పకండేం' అన్నది.

బిందు మాధవరావు మేడ మెట్లకేసి చూస్తూవున్నాఁడు. కృష్ణద్వైపాయనాచార్లు కిందే ఉన్నాఁడు కాని మేడమీఁదికి రాలేదు.

ఆపాల-'అతనికోసం చూడకండి. అతఁడు మిమ్మల్ని వెళ్లమంటాఁడా?' అన్నది.

ఏమంటాఁడు అటువంటప్పుడు కొత్త వాఁడు? ఇంకోఁడైతే ఏమంటాఁడోకాని అతఁ డేమీ అనలేదు.

'మాఁయింట మీ కేం కొత్త? మేమూ సురభివారమే. మాది నరసారావుపేట. ఉద్యోగ ధర్మాన దూరంగావున్నాం. మీదీ మాదీ ఒకటే వంశం.'

బిందు మాధవరావు మాటాడలేదు. మాటలాడక పోవడాన్నే అంగీకారంగా తీసి కొని అపాల మేడదిగిపోయి ఇంట్లో ఏదో పని అభినయిస్తూ వున్న కృష్ణద్వైపాయ నాచార్లతో—'మొత్తంమీఁద ఆయనను ఒప్పించాను. ఏడుకొట్టేసరికే రండేం. మావారు మళ్లీ ఉండలేరు.' అని అపాల వెళ్లిపోయింది.

కృష్ణద్వైపాయనాచార్లు మేడమీఁదికి వెళ్లి—'ఏమిటోయ్! భోజనానికి ఒప్పుకున్నావా?' అన్నాఁడు.

'నేనా నీవా ఒప్పుకుంది?'

'నాకేం తెలుసు; ఆమె నీవొప్పుకున్నావన్నది.'

'నీవెంత సేపటికీ మేడపైకి రాకుండా వుండడమూ, ఆమె మేమూ సురభివారమేనని బలవంతపెట్టడమూ! నాపనిచాలాచిత్రంగానేవుంది.'

'నిజమే, వారిపుట్టింటివారు సురభివారే. మనకు దగ్గిరచుట్టాలే. ఆవిడె చాలామంచిది. ఆయన మేస్ట్రీటు సుమా! ఆయన ఆర్థడాక్సులకు ఆర్థడాక్సు. రిఫార్మర్సుకి రిఫార్మరు. ఆయన కాళికి కాఫి నైవేద్యం పెడతాఁడు. అది కెతాలిసిటీ.'

'బాగానేవుంది. అయితే ఆయనను ఒకసారి చూడవలసిందే.'

'ఒకసారికాదు, ఎప్పుడూ చూస్తూనే వుంటావులే. సరేకాని షికారు వెడదామా?'

బిందు మాధవరావు బట్టలు వేసుకుంటున్నాఁడు. కృష్ణద్వైపాయ నాచార్లు తోఁటవైపునకు దారితీశాఁడు.

చైత్ర వసంతులవలె వారిరువురూ ఒకరి ప్రక్కన ఒకరు షికారు వెళ్లారు.

### 3

అపాల యింటికి వెళ్లేసరికీ వ్యాసమూర్తి నౌకర్లమీఁద ధూంధాం చేస్తున్నాఁడు.

వ్యవసాయదారుకు విత్తే అదను తెలిసినట్లు అపాలకు భర్తలో తన అభీష్టబీజం నాటే తరుణం బాగా తెలుసును.

'కృష్ణాచార్లుగారు సర్కీటు వెళ్లారు. ఇంట్లో కృష్ణద్వైపాయనాచార్లు ఒక్కఁడే వున్నాఁడు. ఆయన స్నేహితుఁడు ఎవరో మనవాఁడేనుట వచ్చాఁడు. చేతులు కాల్చుకుంటారేమో అని విందుకు పిలిచాను. తామలపాకులూ, అవీ తెప్పించాలి. తాళపుచెవిట్లా తెండి.' అని అన్నది అపాల.

వ్యాసమూర్తి మఱి మాటాడకుండా తాళపుచెవు లిచ్చాఁడు.

అపాల 'రామాయిని పిలిచి వంటలక్కకు కబురంపించింది.

ఉద్యోగుల యిండ్లలో ఒక్కణ్ణి పిలిచినా సరే వంటలక్కలేందే విందుకాదు.

అపాల విందుహడావిడిలో, వుండఁగా వ్యాసమూర్తి స్వయముగా పెల్లిగ్రాం ఆఫీసుకువెళ్లి 'వైరురావాలి వచ్చిందా?' అని అడిగాఁడు.

'తమరే స్వయముగా దయచేశారు? తమకు శాంతి యీవాలేనందుకు చింతగా వుం'దని మాష్టరన్నాఁడు.

వ్యాసమూర్తి వెంటనే యింటికి తిరిగి వచ్చి పూజకు ప్రత్యేకముగా గులాబిపూలు, నైవేద్యమునకు సోడాలు తెప్పించాఁడు.

స్నానముచేసి పూజకు కూచున్నాడు. సహస్రనామాలు అష్టోత్తరశతాలు మొదల యినవన్నీ అయినవి.

ఆయన ధ్యానంలో కాళీ తాసిల్ దారుగా మాఱింది.

అపాల ఎదటికి వచ్చింది. వ్యాసులు కన్నెత్తి చూచాడు. 'ఆయన జమీందారీ కుటుంబంలో వాడు కూడాట! మనిషిని పంపిస్తే బావుండదు. మీరేవెళ్లి పిలుచుకోవస్తే బావుంటుం దనుకుంటాను!' అనిఅపాలఅన్నది.



'పరదేశిగాణ్ణి పంపు' అని వ్యాసమూర్తి ఉఱిమాడు.

'ఔను, పరదేశిగాడు చాకలిగా! పనికి వస్తా' డని అపాల పరదేశిగాణ్ణి పిలిచి భోజనానికి పిలవనంపింది.

భోజనశాలలో అపాల, వ్యాసమూర్తి కానుపీటా, కూర్చొనేపీటా, మిగతా యిద్దఱికీ చెఱో కూర్చొనేపీటా స్వయముగా పఱిచింది. ఒకపెద్ద అరటాకున్నూ, రెండు చిన్న అరటాకులున్నూ వేసింది. భర్తకు వెండి చెంబూ, వెండిగిన్నా, వెండికంచం విస్తరిచుట్టూ పెట్టింది.

బిందు మాధవరావును భోజనానికి తీసుకోరావడం కృష్ణద్వైపాయ నాచార్లకు కృత్యాద్యవస్థే అయింది.

బిందు మాధవరావు, కృష్ణద్వైపాయ నాచార్లూ పట్టుఱ పితాలు కట్టుకోనివచ్చారు. గడియారం ఏడుకొట్టింది. కృష్ణద్వైపాయ నాచార్లు 'మీయింట్లో గడియారానికి కూడా ఎటికెట్ సరిగా తెలుసే' అన్నాడు.

అపాల లోపలనుంచే ఆహ్వానించింది. ఇద్దఱూ భోజనశాలలోకి వెళ్లి చెఱోపీట మీఁదా కూచున్నారు.

'వడ్డన అయిం'దని అపాల అన్నాక వ్యాసమూర్తి పూజామందిరమునుంచి భోజనశాలలోకి వచ్చిచూచి, 'అంగడి పఱచావాయేమిటి? ఈ ఆనుపీట లేమిటి? ఈ వెండిచెంబు లేమిటి? ఈ వెండికంచా లేమిటి? నేనేం పెళ్లికొడుకు ననుకొన్నావా' అని అపాలతో అన్నాడు.

'పెళ్లికి వెడుతున్నాంగదా అని బయటికి తీశాను. బయటికి తీశానుగదా అని వేశాను. మీరు వేయించుకున్నా రనుకోరు లేండి.' అన్నది అపాల.

'నేను అనుకున్నా మాబిందు మాధవ రావు అనుకో' డని కృష్ణద్వైపాయనాచార్లన్నాడు.

వ్యాసమూర్తి కూచోని, పీట కాను కోని, బిందు మాధవరావును కన్నెత్తి చూచాడు. 'ఈయన ఇప్పుడే సీమనుంచి దిగినట్టు న్నాడే' అని అనుకున్నాడు. 'వడ్డన దబ్బున కానీ' అని గదమాయించాడు.

'వడ్డన అయి యెంత సేపయింది?' అని అపాల ప్రశ్నార్థకమును పకడుగా ప్రయోగించింది. ప్రత్యుత్తరముగా పరిషేచించారు. అపాల నేయి వేసింది.

'కృష్ణద్వైపాయనాచార్లూ! నీ వుద్యోగ మేమయింది? అదిన రేకాని వీరిదేవూరు?' అని వ్యాసమూర్తి అన్నాడు.

'ఇహ మావుద్యోగాలే అడగాలీ? ట్యూటర్‌గా ప్రవేశిద్దామన్నా ముప్పైకన్న ఎక్కువ లేదు. ఎమ్మే యెందుకు పాసయినానురా అని అనుకుంటున్నా.'

'నిజమేనోయ్, మా అప్పర్ సెకండ్రీలు, ఆ టెక్‌స్ట్లూ, ఈ టెక్‌స్ట్లే బాగావున్నవి. అట్టే పట్టుకోని పైకి పాకవచ్చు.'

'ఔను, మీకు తాసిల్దారు అయిందని విన్నాను. అందుకే ఈవిందనుకుంటున్నాను.'

'ఆఁ, అంతా అసత్యం; ఎక్కడ విన్నావు?'

'ఊరంతా మోగి పోతూంటే.'

'నాకసలు తాసిల్‌దారు కావాలని లేదోయ్. అందులో అన్నీ పాతకాలే. ఇట్లాగే వుంటే ఏ ఈతిబాధాలేదు.'

' అలా అనక్కండి. మా బంధువుల్లో కూడా ఓ తాసిల్దారూ, ఓడిప్టీకలెక్టరూ ఉన్నాడని మేమనుకుంటాం. మాకు అయే యోగ్యత లేకపోయినా మిమ్మన్నైనాచూసి సంతోషించుకుంటూ వుంటాము.'

'మనవాళ్లలో ఈజిల్లాలో డిప్టీకలెక్టరా?'

'పైసంవత్సరం మీకేకాకపోతేచూడనూ?'

అపాల—'కామాక్షమ్మా! నీకే తాసిల్దారవుతుం దనుకున్న ట్లున్నావే!' అని అనఁగానే కామాక్షమ్మ వడ్డనకు వచ్చింది.

వ్యాసమూర్తి—'మనవాళ్లుమలపలోయ్.'

కృష్ణ—'మీమాట నిజం.'

వ్యాస—'మనవాళ్లు నౌకర్లనే తిన్నగా వుంచరోయ్. అదుపాజ్ఞలు చెయ్యరు. వాళ్లు నదురూ బెదురూ లేకుండా వుంటారు. ఇట్లా ఉపేక్షిస్తూ మనవాళ్లు పెద్ద ఉద్యోగాలకి ఉబలాట పడుతారు.'

కృష్ణ—'మీమాట నిజమేనని నే నిందాకే చెప్పానుగా?'

బిందు మాధవరావు. అపాలా వ్యాసమూర్తుల ముఖాలుచూచి విశేషం ఏమీ లేకపోవుటవల్ల ఎత్తిన కళ్లు దింపాడు.

అపాల—'కృష్ణద్వైపాయనాచార్లూ! భోజనసందట్లో మఱచావేమో! మీమామ గారు ఈయన్ను గుఱించి అడిగారు.'

వ్యాస—'ఔనౌను, అడిగాను.'

కృష్ణ—'ఇందాఁక మీరన్నమాట చూశారూ? మాయింట్లో ఒక్కనౌకరూ పని చెయ్యఁడు.'

వ్యాస—'ఉద్యోగాన్ని పట్టి వుంటుంది లేవోయ్. ఉద్యోగాల్లో ఆఁడ ఉద్యోగాలు మగఉద్యోగాలూ ఉంటయ్.'

కృష్ణ—'ఇంకొకటి మఱచారేం?'

వ్యాస—'ఏమిటి చెపుమా?'

కృష్ణ—'నపుంసక–ఉద్యోగాలు.'

అపాల—'కామాక్షమ్మా! ఏమిటమ్మా భక్ష్యాలు?'

వ్యాస—'టీకాలుపొడవడం అంతనపుంసక - ఉద్యోగం కాదుగాని ఆఁడ ఉద్యోగమే. అందులో మీనాయనగారికి రెండువందలు ముట్టినా ఏమీ దర్జాలేదు. నౌకర్ని ఇంటికే రావద్దంటాఁడాయె. అసలు దర్జా అనేది పౌరుషంలాగా జన్మతో పుట్టుక రావాలి లెద్దూ.'

అపాల—'ఆఁ, అల్లా అనుకున్నారో? ఆయన రమ్మండమూ అయింది, వాళ్లు రాకపోవడమూ అయింది.'

వ్యాసమూర్తి పకలఁబడి నవ్వాఁడు.

కృష్ణ—'వెనకాల వెలమదొర సామెతలా వుంది మాపని. మేమేదొరలం, మేమే నౌకర్లం.'

అపాల 'గారెలు పట్రావేమమ్మా!' అనఁగానే కామాక్షమ్మ 'అవేనమ్మా వడ్డించేవి. వేయించుకోటం లేందే' అని చెప్పఁగా బలవంత పెట్టి బిందు మాధవరావుగారికి రెండువేయించింది. అవి అతనివలెనే ఉదాసీనంగా విస్తట్లో ఉన్నవి.

'మీరేమో మీధోరణే గాని వీరిని కనుక్కోవడం లేదు. వీరేమీ పుచ్చుకోడమే లేదు. వీరివంతు కృష్ణద్వైపాయ నాచార్లకే వెయ్యి' అని అపాల అన్నది.

వ్యాస—'ఆచార్లూ వీరి దేవూరు?'

'సత్తెనపల్లి.'

'ఇంటిపేరు?'

'సురభివారు.'

'బిందుమాధవరావుగారి కేమవుతారేమిటి?'

'మనమఁడు.'

'ఏం పాసయారేమిటి?'

'నాలుగేళ్లక్రింద నాతోపాటే ఇక్కడ బి. యే. పాసయినాఁడు.'

'ఏముద్యోగం?'

'ఇప్పటి వఱకూ ఏమీ లేదు.'

'ఔనోయ్, బి. యే. పాసయి నాలుగేళ్లు నడిచినా ఉద్యోగం లేకపోతే పాడు పరీక్షలు ఎందుకు?'

'ఔనండీ, ఈ కాలములో పరీక్షలిచ్చిన వాళ్లూ, గొడ్డుమోతులూ సమానం.'

'చూశావా? ఇతను చిన్నవాడేననుకో. ముప్పైఏళ్లున్న వేమో! నాలుగేళ్లనుంచీ ఉద్యోగమే లేకపోతే ఇహ లిమిటేషనన్నమాటే.'

అపాల—'మీకచ్చేరిలో ఖాళీ లున్నాయన్నారే?'

వ్యాస—'సరిగా గుర్తుచేశావు, ఉన్నాయి. అయితే బి. యే. లు మాకింద?'

కృష్ణ—'అదేమిటండీ అలా అనకండి, నేను పనిచేయడానికి సిద్ధం.'

వ్యాస—"నీమాటకేమిలే ఇతనిమాటే ఆలోచిస్తున్నాను. నాకిందే ఒకటిఖాళీఅయింది.'

'అయితే నాకింద బి. యే. పనిచెయ్యడం—'అపాల సొంతంగా మామిడిపండ్లూ, పనసతొనలూ వడ్డించింది.

కృష్ణ—'అయినా రేపు మీరు తాసిల్దారు కాబోతూవుంటే మీకింద పనిచెయ్యడం దర్జా.'

ఇట్లా మాట్లాడుకుంటూ వుండంగా వాకట్లోంచి 'నాకు ఈనాం, నాకు ఈనాం' అని వినిపించింది.

వ్యాసమూర్తి—'వెధవలు! అల్లరి! అందులో ఆఫీసు రూముదగ్గిఱ! వెధవ రామాయి ఏంచేస్తున్నాడు? నరసింహాన్ని వాళ్లని ఆవలికి వెళ్లగొట్టమను!' అనిఅపాలతోఅన్నాడు. అపాల వాకిటిలోకి వెళ్లింది. వ్యాసమూర్తి చెవులు నిక్కపొడుచుకొని వింటున్నాడు.

పోస్టు బంట్రోతు—'అమ్మా! అయ్యగారికి అర్జంటు టెల్గ్రాం వచ్చింది. తాసిల్దారైందట. నాకు ఈనాం వస్తుంది' అన్నాడు.

అపాల—'అది ఇల్లా పడెయ్యి.'

పోస్టు—'ఈనాం ఇవ్వందే ఇయ్యను. అయ్యగారి చేతుల్లో నేనే పెట్టాలి.'

అపాల నవ్వుకుంటూ లోపలికి వచ్చి, 'మీకు తాసిల్దారైందని అర్జంటువైరువచ్చిందట. అతగాడే తమచేతులలో పెట్టాలనుకుంటున్నాడు.'

బిందుమాధవరావు వ్యాసమూర్తి వాలకం చూచి విచిత్రపడుతూ కూచున్నాడు.

కృష్ణద్వైపాయ నాచార్లు నవ్వుతూ, 'అయితే మాయింట్లో విందు తాసిల్దారుగారూ!' అన్నాడు.

వ్యాస—'అబ్బా! నాకు భోజనానికి రావడం అలవాటులో లేదు. కచేరిగుమస్తాలకు కూడా అదే చెపుతూ వుంటా.'

అపాల—'మీకున్న జబ్బుఅదే! ఈసారయినా వెళ్లుదురూ.'

వ్యాసమూర్తి భోజనం మూడో కాలంలో పడ్డది. కృష్ణద్వైపాయనాచార్లు మందకొడిగిత్తలాగా వెనకపడ్డాఁడు. వ్యాసమూర్తి 'మీరు మెల్లగా భోంచెయ్యం'డని లేచి గబగబా గదిలోకివెళ్లి పదిరూపాయిలు బంట్రోతుకిచ్చి టెల్లిగ్రాము ఆఫీసు గదిలోకి తెచ్చి కవరు చింపి, 'ఆచార్లూ, ఆయన్నుగూడా తీసుకోరా! ఇక్కడే తమలపాకులు వేసుకుందురుగాని' అని అనఁగా వారిద్దఱూ లోనికి వెళ్లి కుర్చీలమీఁద కూచున్నారు. బంట్రోతు దస్కతుచేయించుకొని మాయమై పోయినాఁడు. 'ఆచార్లూ! ఈ ఆర్డరు చదువు.' అని వ్యాసమూర్తి టెల్లిగ్రాము ఇచ్చాఁడు.

అప్పాల తమలపాకుల పళ్లెం తెచ్చి మేజాబల్లమీఁద ఉంచి 'పరదేశిగా' అని పిలిచింది. పరదేశిగాఁడు వచ్చి వ్యాసమూర్తికి విసురుతూ నిలుచున్నాఁడు. ప్యూన్ నరసింహం వచ్చి ఎదురుగుండా నుంచున్నాఁడు. కామాక్షమ్మ మంచినీళ్ల చెంబు అక్కడ పెట్టడానికి వచ్చింది. ఇంట్లో వున్న యావత్తు సిబ్బందీ అక్కడ ఉంది.

అప్పుడు కృష్ణద్వైపాయనాచార్లు ఇల్లా అన్నాఁడు—'బిందుమాధవరావుకు తాసిల్దారైంది.'

ఇల్లా అని ఆ టెల్లిగ్రాము బిందుమాధవరావు చేతికి ఇచ్చాఁడు.

---

## పొరపాటు

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

నీకు సమధికమోహమ్ము నెగడఁజేయఁ - జారు శృంగార వేషభూషలను దాల్చి
బయలుదేఱితి సుపరిథవమ్ముతోడ - రాజమార్గమ్ము జనగణాక్రాంత మగుట!
నిలిచియుంటిని జనులు నిర్నిమిషులగుచుఁ - బొఁగడుచుండిరి నాదు నపూర్వశోభ,
బళిర! యాత్మప్రశంస కెవ్వార లోడలు - మఱవకుందురు? లక్ష్యమ్ము మఱచి నేను
చూపుచుంటిని నావింత సోయగమ్ము - హృదయ మానందమున మున్కలెత్తుచుండె
అక్కటా! ఎంతపొరపాటు మిక్కుటంపు - దురభిమానమ్ము నన్ను నంధునిఁ బొనర్చె
నీవు నాగుంపునందునె నిలిచి నన్నుఁ - జూచుచుంటివిగాని నిన్ జూడనైతి
దీనవేషమ్ము దాల్చి యేతెంచె సంధ్య, - జారె గుంపును, నీదాన భారగరిమఁ
గరముఁ గ్రుంగిన భిక్షుకు లరుగుచుండి - రేను గన్నులు తెఱచితి నేమిలాభ
మదిర! యాడంబరమున నిన్నరయనైతి.

## చదువుజీవనము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఒక్కచదువున నొక్కని కక్కజమగు-ప్రౌఢి యలరారు నాతని ప్రజ్ఞ లాతి
చదువునం దించుకంతయు సాగకుండు-మఱియొకం డాచదువున నేర్పరిగ నుండు.

వాని కింకొక విద్య స్వాభావికముగ-నలవడకయుండు నొక్కని కిలఁ జదువుల
లోనఁ జొరవ శూన్యంబగుఁ గాని చేతి - పనులలో నాతఁ డెంతయుఁ బ్రౌఢుఁడగును.

అది యసాధ్యంబుగా నెంచునట్టివాఁ డొ-కండు వ్యవహారశూరుఁడై దండిమంత్ర
బలమునన్ రాజులకు రాయబారములను - దిద్దఁగలవాఁడుగా నుండుఁ దద్దయునిపు

ణత్వ మొకనికిఁ గలుగు వక్తృత్వమందు - మఱియు నొకఁడు కవితలో సమర్థుఁడగును.
వైవచిత్రమ్ముకతన సీధాత్రిమీఁద - నిట్టులే యీశ్వరకళలై యెసకమెసఁగు

శక్తులన్నియు నొక్కొక్క స్థలమునందు - నొక్కొకవిధంబుగాఁ బొల్చుచుండు నిట్టి
శక్తిసంస్కారరూపమై జన్మమాది - గా మనుష్యులలోన సూక్ష్మముగ నుండు.

అట్టి సహజశక్తికి వన్నెపెట్టి పెంపు-సేయఁ గలిగిన వ్యాసంగమే యలవడి
యున్నచో నాతఁ డద్దాన నున్నతుఁ డగు-నట్లు కానినాఁ డాతనియాత్మశక్తి

పైకి వెలువడకయె లోననే కృశించు - నితరవిషయంబులందతం డెంతగఁ గృషి
సల్పియుండిన నద్దానశక్తిమంతుఁ - డనుచుఁ బేరుమోయఁగనేరఁ డపనిమీఁద.

సృష్టికి స్వభావ మిటు లుండఁ జిన్నమొదలుఁ - పెద్దదాఁక జాతిమతవివేచనంబు
లెంచక కులధర్మములఁ బాటించకుండ - తాతతండ్రులయాచారధర్మములను

దలఁపఁబోక సర్వజనసాధారణముగఁ - జదువుచదువని యన్యభాషయను పెద్ద
చాకిమూట బాలకుల బుజములమీఁద - వేసి మోసితీరవలెనం చానఁగొల్పి

సార మెఱుఁగఁగలేక సంసారములను - గుల్లలుగఁ జేసికొని ధనమెల్ల స్కూళ్ల
పాలు గావించి బాలుని ప్రౌఢి మెట్టి-విషయమునఁ బ్రసరించునో విపులశక్తి

వాని కెద్దానఁ బాల్పునో ప్రబలుఁడై య-తండు నెద్దాన మిగులఁ బెద్దతనమందఁ
గలఁడో యంచు విచారించక సకలవిధ-ములగు వృత్తులకంటెను బూజ్యమైన

వృత్తి నౌకరియే యని వెఱ్ఱియొకటి - మనములం దుంచుకొని సర్వజనులును దమ
బాలురను బాఠశాలల పాలుసేయ - వారు నైసర్గికముగ విద్యారసికులు

గాకయుండిన నప్పుడు గల్గఁబోవు-నట్టి పర్యవసానంబు వారికి యెఱుక
పాఠశాలలకును దమపాఠములకుఁ-బాఠబోధకులకుఁగూడ పఱువుఁబోవ

చిత్రచిత్రచరిత్రలఁ జెన్నుమిగిలి - వారు వర్తింతు రతిరసాభాసముగను
చదువుకై పుట్టి శ్రద్ధతోఁ జదువునట్టి - బాలురును దమప్రతిభకు వల్లఁగాని

చదువుఁ జదువంగవలసిన శక్తిహీను-లై స్వకీయ సమర్థత యడవిలోని
వెన్నెల యగుచునుండంగ వెఱ్ఱియెత్తి - యెడఁదలందు నాశాభంగ మేర్పడఁ జెడు

చుందు రిఁకఁ గొంద ఱేవిద్యయందు నేని-దాము వెనుకంజయిడని విద్యారసికత
బాలురు కుశాగ్రబుద్ధులు ప్రాణ మొక్క-యెత్తుగాఁ జదివెడు వారలేని వెఱ్ఱి

వానిచేతిరాయివలె దైవవశమైన-జయము నపజయమ్ముం గల వయిన బెద్ద
లెంతయును గాసిపెట్టఁ దదేకపరత-తోడఁ జదివి చదివి శక్తి తొలఁగి దేహ

బలము బుద్ధిబలమ్మును నమ్మగాఁగఁ-దుదకుఁ దేజోవిహీనులై త్రోసినఁ బడి
పోవునట్లుగ బాఠశాలావరణము-నుండి వెలువడుచుందురు కొందఱో పర

తంత్రభావజుగుప్స స్వాతంత్ర్యవాంఛ-తోడఁగూడ మనంబునఁ దోఁచుచుండ
భావికాలశ్వవృత్తి సంబంధములకుఁ-జిత్తములలోన మిక్కిలి సిగ్గుపడుచు

బాల్యమాదిగ మఱియొకపనికి నెప్పు-డైన నలవాటుపడనివాఁ డౌటఁ జేసి
యుదరపోషణమునకుఁ గాలోచితమగు-నట్టిత్రోవ యింకొకటిలే కప్పటి కది

తప్పక శ్వవృత్తులగు వారు దగులు కొనుదు-రాత్మగౌరవ వాంఛల నవల నిలిపి
అది మొదలు నోరు దెఱచి మాటాడుటకును-నలయుస్వాతంత్ర్యములు లేక వారుచదువు

## పటమంజరీ రాగిణి



సీయ బీనాన సుహాతక ఘతెం న ఫులకే హార అగారసే లాగత ।
జ్యామిల వేకో సిగార కీయో జియ తాసు బియోగజ రావత జాగత ।
తాహీ విథా సురహీ ద్రగ ముది సహేలీకే బాతన్హి అనురాగత ।
భేరవరవకే పటమంజరీరాగనీ జా కహు జాని గునీజన గావత ॥

[జయపుర చిత్రము : దివాన్ బహద్దూర్ చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

కొానెడుదినములలో లోకమునఁ గలపలు-దేశముల చరిత్రములు తద్దేశవాసి
జనులస్వాతంత్ర్యములును సాక్షాత్తుగాఁ బ-ఠించుచున్నప్పు డాత్మల నంచితముగఁ

బాడమెడియుదారసంకల్పములకు సముచి-తంబుగాఁ బెద్దలై చేయఁ దలఁచియున్న
దేశసేవ మున్నగుపను లాశయముల-యం దజీర్ణములగుచుండ నందఱకును

దారపుత్రాదిపోషణ తప్పనిపని-యగుచు నుండుటచేఁ బెఱయార్జనముల
చేత జీవించ గలశక్తి చిన్ననాఁడె-తొలగియుండుటచేఁ బోషకులనుఁ గొలిచి

ఘనముగా వారిమెప్పులుగాంచఁ బ్రజల-విత్త మధిపతులకు గట్టిపెట్టునట్టి
వలను లెఱిఁగి జీవింపంగవలసినట్టి-వారలౌదురు తమకున్న పేరు దమకుఁ

గలప్రతిష్ఠమర్యాద సుఖంబు డంబు-నఖిల మాశ్వవృత్తిపయి నాయ తమగుచు
నిలుచుటయును దేశద్రోహములని పెద్ద-నిష్ఠఁబూనిన జరుగక నీతిసడల

స్వార్థపరతతోఁ బయి పయియధికృతులను-నాస సేయుచుఁ దమజీవయాత్ర లెల్ల
నిట్టులే ధర్మపథమున కెంత యేని-దూరములుగాఁగఁ బొరుగుశృంగారమున కె

పుట్టినారమన్నట్లుగాఁ బుడమికి భర-మౌచు వారలు జీవింతు రతికృపణత
కొంద ఱిట్టి పరీక్షలయందు దెబ్బ-దిని మరలఁ గోలుకోకయే తెరువు మదికిఁ

దోఁచ కిహపరముల కతిదూరులగుచుఁ - గాలముఁ గడుపవలసి యిక్కట్టుపడుదు
రక్కటా! యిదియెల్ల విద్యావివేక-శాలురాత్మలలోన నెంచంగ వలదె?

———

5. 7- 9 ౬౭

దిగవల్లి వేంకటశివరావు గారు

# ఖండాంతర భారతీయులు.

వలసపోయిన భారతీయుల చరిత్ర ప్రాచీన హైందవౌన్నత్యమును, నేటి భారతీయ దారిద్ర్యమును దెలుపు కథ. "విశాలభారత" మనదగు సుమత్రా, జావా, బోర్నియో, మలయా, త్రివిష్టప దేశములందు భారతీయుల జాతీయ జీవనము, మత సంఘ రాజకీయసంస్థలు నేటికిని గాన వచ్చుచున్నవి. చాలకాలముక్రిందటనే మనవా రచ్చటికి వలసపోయియుండిరి. ఆఫ్రికా కుశద్వీపమనియు, నందు సంస్కృతధ్వనికల నామములతోడి ప్రదేశము లార్యుల వాసస్థానము లనియు, నచ్చటికి సింధునదీతీరమునుండి భారతీయు లేడెనిమిదివేల సంవత్సరముల క్రిందటనే పోయి నెలకొనిరనియు, ఆర్యావర్తమున వర్ధిల్లిన నాగరకత యొక్క ప్రతిబింబమే ఆఫ్రికాలో నైలునదీ తీరమునను, మెసపొటేమియా లోను బేబిలోన్‌లోను కనబడుచున్నదనియు పాశ్చాత్యచరిత్రకారులే సిద్ధాంతీకరించుచున్నారు. ఆఫ్రికాకు దక్షిణముననున్న మెడగాస్కర్ ద్వీపము లోనివారు మలయజాతి "హోవా"లు. వీరిభాష, నాగరకత మనమలయులదే. అమెరికా దేశములో ఆదిమవాసులగు రెడ్ ఇండియనుజాతివారిలో మన సీతారామ కల్యాణకథ కనబడుచున్నది. అమెరికా ఐరోపా దేశములకు మనవారు వలసకేగినట్లు నిదర్శనము లున్నవని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అమెరికాను మొదట కనుగొనినది "కొలంబసు" కాడనియు, మన బౌద్ధసన్న్యాసియనియు నిటీవల మెక్సికోలో జరిగిన పరిశోధనలవలన తేలినది. గ్రీసు, రోము, పారశీక సామ్రాజ్యములు వర్ధిల్లిననాడు మన భారతీయశాస్త్రజ్ఞులు, యోధులు నచ్చటి కేగినట్లు చరిత్రలలో చదువుచున్నాము.

క్రీస్తుశకము పదునైదవశతాబ్ది పాశ్చాత్యుల యదృష్టమునకును, భారతీయుల దురదృష్టమునకును గారణమైనది. అప్పటికికూడ భారతీయ నౌకాజీవన ముండినట్లును, గుజరాతువర్తకులు ఆఫ్రికాతీరమున జాంజిబారులో జిలుగువలువల నమ్ముచుండినట్లును కెప్టెన్ లంకాస్టర్ వ్రాసియున్నాడు. భరతఖండముయొక్క సంపదను గూర్చిన కథలు పదునైదవశతాబ్దిలో పాశ్చాత్యుల నాకర్షించెను. తురుష్క రాజ్యములవారికి సుంకము లీయజాలకయు, వారితో విరోధించియు భరతఖండమునకు వచ్చుటకు సముద్రమార్గములను కనిపెట్టుటకు ప్రయత్నించిరి. వారి కష్టము ఫలించెను. వర్తకము, మతప్రచారము పేరున రేవుల నాక్రమించియు, దేశమున నెలకొనియు భరతఖండమున రాజకీయరంగమున చదరంగపు యెత్తులు వేయదొడగిరి. భరతఖండమును కనుగొనుసందర్భమున ఇతర ద్వీపములను కనుగొని నల్లవారిని ద్రోసి రాజని వలస రాజ్యములు స్థాపించిరి. తెల్లవా రాక్రమించిన భూములు దున్నుటకు, తోటలలో పనిచేయుటకు, రైళ్లు వేయుటకు, గనులు త్రవ్వుటకు కూలివారు కావలసియుండిరి. అంతట అసహాయులును, అనాగరకులునునగు నీగ్రోలను వంచించి బానిసలుగచేసి వారిచేత పనులు చేయించుకొనసాగిరి. ఈఘోరమైన బానిసతనము వృద్ధియయ్యెను. నీగ్రోల దురవస్థలు వర్ణనాతీతములు. క్రీ. శ. 1800 సంవత్సరము నాటికి ఆచిత్రవధలు, హింసలు, పాతకములు దుర్భరములు గాసాగెను. భరతఖండమున మెల్లగ సామ్రాజ్యమును సంపాదించుటవలన బ్రిటీషు వలసప్రజలు తమ ఏజంట్ల నచ్చటికంపి అచ్చట వసతులు కల్పించి లాభము నొనగూర్తుమని నమ్మించి ఇచ్చటి కూలివారిచేత ఒడంబడికలను వ్రాయించి తీసికొని పోవసాగిరి. వీరు మంచికర్షకులును, సద్గుణములు, ఓర్పుకలవారునునగుటవలన నీగ్రోలకన్న నుపయోగకరముగ నుండిరి ఈవీలు చూచుకొని బ్రిటీషువారు బానిసతనమును బాపెదమని 1833 లో బానిసతనమును నిషేధించి ఈక్రొత్తబానిసతనమును మొదలిడిరి. బ్రిటీషువలసరాజ్యములగు మారిషస్, జమెయికా, ఫీజి, ట్రినిడాడ్, బ్రిటీషుగయానా, కెన్యా, దక్షిణాఫ్రికా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు మున్నగు దేశములలోని కర్షకులు, తోటల యజమానులు భారతీయ

లగు కూలివారిచేత ఒడంబడికలు వ్రాయించుకొని పని చేయించుకొనసాగిరి. 1837 లో మారిషస్, బ్రిటీషు గయానా, ఆస్ట్రేలియా దేశములకు మాత్రమే కూలివారు వలసపోవచ్చు నని శాసింపబడెను గాని తరువాత నేటాలు, ఫీజీ, జమెయికా, ట్రీనిడాడ్ మున్నగు దేశములకు పంపవచ్చునని శాసింపబడెను.

1921 నాటికి బ్రిటీషువలసరాజ్యములందు భారతీయులు చాలమంది యుండిరి. కెన్యాలో 22,822, ఫీజీలో 45,000, ట్రినిడాడ్‌లో 1,17,000, జమెయికాలో 20,000, మారిషస్‌లో 2,60,000, బ్రిటీషుగయానాలో 1,30,000 దక్షిణాఫ్రికాలో 1,6[illegible],339, ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండ్ లలో 5,000 లోపుగను భారతీయు లున్నారు. వీరిలో చాలమంది వలసకూలిప్రజలే. వీరుగాక వర్తకులు, ఉద్యోగులు గలరు. అమెరికాలో, రష్యాలో, జర్మనీలో, జపానులో, భారతీయ రాజకీయ నాయకులలో ప్రవాసము ననుభవించువారును, భారతీయ విద్యార్థులును, వర్తకులును గలరు. అందువలన ఖండాంతర భారతీయులు ప్రవాసము లనుభవించు భారతీయులు, భారతీయ విద్యార్థులు, వర్తకులు, వలస కూలిప్రజలు అను నాల్గుతెరగతులవా రనవచ్చును.

పూర్వము డచ్చివారు మన దేశమునుండి రాజకీయ నిర్బంధితులను దేశాంతరముల కంపుచుండిరి. బ్రిటీషుపరిపాలనమున లాలాలజపత్ రాయిగారు చాలకాలము అమెరికాలో ప్రవాస మనుభవించిరి. ఇంకె ననేకులు ప్రవాస మనుభవించిరి. సుధీంద్రబోసుగారి నమెరికానుండి మన దేశమునకు మొన్నటివరకు రానివ్వలేదు. శ్యాంజీ కృష్ణవర్మ, భాయిపరమానంద్, హరదయాళు మున్నగువారు రాజద్రోహులుగ నెంచబడి దేశాంతరముల ప్రవాసము లనుభవించిరి. విప్లవోద్యమ తత్పరులు కొందరు అమెరికాలో చేరిరి. మరికొందరు జర్మనీ, రష్యా దేశములలో చేరిరి. వీరిలో యం. యన్. రాయిగారు, ఆచారి, అబ్దుల్ రాబ్, అవనీముఖర్జీ, మహమ్మదాలీగారలు, మరికొందరును రష్యా, తురుష్కస్థానములలోని పట్టణములు టాష్కెంట్‌లో చేరినట్లు షౌకత్ ఉస్మానీగారు "పెషావర్ టు మాస్కో" అను గ్రంథమున వ్రాసియున్నారు. వీరిలో అంతఃకలహములు కలిగినందున "మాస్కో"లో వీరికి కొంత పరపతి తగ్గినట్లుకూడ ఆయన వ్రాసిరి.

ఖండాంతర భారతీయ విద్యార్థులు అనేకులు అమెరికాలోను, ఇంగ్లాండులోను కలరు; ఇతరపాశ్చాత్య దేశములందును గలరు. వీరికి అమెరికాలో హోటళ్లలో, ఇతరచోట్ల సౌకర్యములు లేకపోవుటయు, పరిచయస్థులెవరైన చెప్పినగాని నీగ్రోలవలెనే అవమానము పొందుటయు మ. రా. శ్రీ అవటపల్లి నారాయణరావు గారే చెప్పియున్నారు. ఇంగ్లాండులోకూడా మన విద్యార్థులు నల్లవారుగ నెంచబడుటయు, వీరి కవమానము కలుగుచుండుటయు వినుచున్నాము. వర్ణభేదతత్వము మహమ్మారివలె వ్యాపించుచున్నది. జర్మనీ, రష్యా దేశములందుమాత్రము మనకు కొంత గౌరవము కలదు. ఆ దేశములకు పోయివచ్చిన భారతీయనాయకు లిది గమనించియున్నారు.

భారతీయ వణిజులు వలస కూలివారితో వలస దేశములకు పోవుటయేకాక అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా మున్నగు పెద్దదేశములకును పోయి వ్యాపారము చేయుచున్నారు. గాని వీరికి గౌరవము లేదు. ఆఫ్ఘనిస్థానములో హయిబాక్‌లోను, ఆఫ్ఘనిస్థానమున కుత్తరమున 'బొఖారా' ప్రజాస్వామ్యమందును హిందూముసల్మాను సిక్కువర్తకులు సుఖముగ నున్నారు. వీరికి పౌరహక్కులు, గౌరవము కలదు. ఈ సంగతి షౌకత్ ఉస్మానీగారు స్వయముగ చూచియున్నారు. దక్షిణ అమెరికాలో పెనామాప్రజాస్వామ్యమందు కూడ 38 సింధు వర్తకు లున్నారు. కాని క్రొత్తవారు రాకుండ తెల్ల ప్రభుత్వములు ప్రయత్నించుచున్నవి.

మారిషస్, ఫీజీ, దక్షిణాఫ్రికా మున్నగు వలస దేశములందు 1911 సం. వరకును వర్ధిల్లిన వలస కూలి పద్ధతి శాశ్వతబానిసదనపు విధానమే యని నిష్పక్షపాతులగు రాజనీతిజ్ఞు లంగీకరించియున్నారు. వలసకూలి ఒడంబడికను వలసరాజ్యములవారి ఏజెంట్లు భారతీయ నిరక్షరాస్యులచేత వ్రాయించుకొందురు. వ్రాయునప్పుడు కూలివా డావరతుకాలములో నేయజమానికడ కంపబడు

నో ఎరుగడు. నెలకు ఏడున్నర రూపాయిల కాసపడి పోవును. ఆదేశములు భూతలస్వర్గము వలె నుండునన్న మాటలు నమ్మును. అచ్చటికి పోవ నంగీకరించును. పోయినపిదప దుఃఖించును. అచ్చట తోటలయజమానులు వీరిని పశువులట్లు చూతురు. వీరికి శ్రమ యధికము-తిండి తక్కువ. త్రాగుటకు మంచినీరుగాని, ఉండుటకు మంచి యిండ్లుగాని లేవు. అనారోగ్యకరములగు గూడెములందు వీరు నివసింపవలెను. వీరితోపాటు 100 కి 40 వంతున స్త్రీలనుకూడ కూలిచేయుట కచ్చటికి తీసికొనిపోవ సాగిరి. కాని కూలివారి పెండ్లిండ్లు న్యాయశాస్త్ర ప్రకారము చెల్లవనిరి. హిందువులు, మహమ్మదీయులు బహుభార్యాత్వము కలవారగుట వలన వీరి పెండ్లిండ్లు చెల్లవనిరి. ఇందువలన వ్యభిచార మధికమగును అచ్చటికి పోయిన భార్యాభర్తలను వేరుచేయుచుండిరి. వీరు పని విడిచి పోరాదు. గ్రామాంతరము పోరాదు. పురుషుడు జబ్బుగానున్నను, స్త్రీ ప్రసూతి సమయమునను వారిని హింసించిన యజమానులు కలరు. పాలను హెచ్చుధరల కమ్మనిచో, గుర్రమునకు దాణాపెట్టుట కాలస్యముచేసినచో, చిన్నతప్పిదము చేసినచో వీరిని ఖడ్గమృగ చర్మపు కొరడాలతో కొట్టుచుండిరి. వీరికి వైద్యసాహాయ్యము లేదు; విద్యయు లేదు. వలసకూలి మరితుకాలమైన పిదప వీరుస్వేచ్ఛముగ కూలిచేసికొని జీవింపకుండగ వీరిపైన తలపన్ను విధించియు, వీరుచేసికొను వ్యాపారములు లైసెన్సులు లేకుండ చేయరాదని నిషేధించియు బాధించి మరల ఒడంబడిక వ్రాయునట్లు ఒత్తిడి చేయుచుండిరి. వ్రాయని వారిని దేశమునుండి పోవునట్లు చేయుటకు మునిసిపలు హక్కు లీయకయు, నీచముగ చూచియు, అవమానపరచియు, హింసింపసాగిరి. కూలివారినిగూర్చినశాసనములు అన్యాయముగ నుండెను.

తెల్లవారు కూలివారినిమాత్రమెకాక ఇతర భారతీయవర్తకులను,ఉద్యోగులనుకూడఅవమానపరచిబాధింపసాగిరి. నల్లవారని ఏవగించుకొనిరి. మర్యాదగా జీవించు ధనికులనుసైతము కూలివాడని నిందార్థకముగ ననసాగిరి. ఏభారతీయుడైనను తెల్లవారితోసమానముగ రైళ్లలో, ట్రాముబండ్లలో, గుఱ్ఱపుబండ్లలో ప్రయాణము చేయరాదు; కాలిదారులలో నడువరాదు. హోటళ్లలో భారతీయుల కెడము లేదు. వీరికి విద్యాసౌకర్యములు గాని, వైద్యసౌకర్యములుగాని లేవు. మునిసిపలుహక్కులుకూడ లేవు. భారతీయులెల్లరు రిజిష్టరుచేయించుకోవలెననియు, గురుతుపత్రము లుంచుకోవలెననియు,తలపన్ను నిచ్చుకోవలయుననియు శాసించిరి. హిందూమహమ్మదీయజనులు చేసికొనువివాహములు చెల్లవనిరి. అప్పటివారు తమ భార్యలను బిడ్డలను భరతఖండమునుండి తెచ్చుకొనుటకు వీలులేదనిరి. న్యాయస్థానములందుకూడ భారతీయులకు న్యాయము జరుగదయ్యెను. దక్షిణాఫ్రికా చరిత్ర మీ రెఱిగినదే! దక్షిణాఫ్రికాలో గాంధిమహాత్ముడు ప్రారంభించిన సత్యాగ్రహ మహోద్యమమువలన స్మట్సుమంత్రిగారు కొంత రాజీకివచ్చిరి. కాని, మరల వాగ్దాన భంగము గావించిరి. ఈదురవస్థలను సి. యఫ్. ఆండ్రూసు గారు స్వయముగ జూచిరి. దక్షిణాఫ్రికాలోను, ఫిజీలోను, ఒకేరీతిగా నున్నట్లు వ్రాసిరి.ఫిజీలోను,మారిషస్‌లోను, ఇతర వలసరాజ్యములందును భారతీయుల బాధలను పలువురు వర్ణించియున్నారు. పై యన్యాయములు గాక ఇంక ననేకములగునవి కలవు. తెల్లవారు స్థాపించిన రాజ్యములందు నల్లవారి కెడము లేదనిరి. మారిషస్‌లో మనలను నీగ్రోలకన్న నధములుగ చూచుచున్నారు. భారతీయులు చాలమంది కూలీలుగ వచ్చిరి గాన భారతీయ జాతియే కూలీ జాతి యనిరి. చిన్న వలసరాజ్యములకన్న సంపూర్ణ స్వపరిపాలనముగల కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌లలో నే కొంత నయము. అక్కడ న్యాయస్థానములందైనను కొంత సమభావము కనబడుచున్నది. భారతీయులు తమభార్యాబిడ్డలను మాత్రము తెచ్చుకోరాదు. వీరును తమదేశమున నల్లవారి కెడములేదని ఉన్న భారతీయులను వెడలగొట్టుటకును, క్రొత్తవారిని రాకుండ చేయుటకును ప్రయత్నించుచున్నారు. వర్ణభేదతత్త్వము విజృంభించినది. చదువుకొన్నవారే గాని రాకూడదని శాసించిరి.

సామ్రాజ్యసభలలో బ్రిటీషుసామ్రాజ్యము స్వతంత్రరాజ్యముల సమ్మేళనమని రాజనీతిజ్ఞులు ప్రగల్భములు పలికిరి. భరతఖండమునుండిగూడ ప్రభుత్వ ప్రతినిధులు

సభలకేగిరి. 1918 లో బ్రిటీషుసామ్రాజ్యమునగల భాగములెల్ల తమతమ ప్రజల పుష్టోవృద్ధికొఱకు వలసను గూర్చి నిషేధము మున్నగు నియమములు చేసికోవచ్చు ననియు, విద్యకొరకును, వర్తకముకొరకు, చూచుటకును ఒక దేశము వా రింకొక దేశమునకు స్వేచ్ఛగ పోవచ్చుననియు, ఇదివరకు ఇతర దేశములలో కాపురమున్న వారు తమ భార్యలను, బిడ్డలను వారు తమవారే యని రుజువుపరచుకొని తెచ్చుకోవచ్చుననియు తీర్మానింపబడినది. ఇచ్చట తీయని పలుకుల నాడిన మంత్రులే తమతమ దేశములకు పోయి భారతీయులను దేశమునుండి వెడలగొట్టునుపాయ మాలోచించి గూడెములందుండునట్లును, వీరికి సౌకర్యము లెవ్వియు లేకుండునట్లును చేసి దేశమునుండి వెడలగొట్టసాగిరి. దక్షిణాఫ్రికాలో వర్ణభేదచట్టములను చేసిరి. పైనచెప్పబడిన బాధలు పోలేదు. దక్షిణాఫ్రికాతో ఎట్టకేలకు మరల రాజీకుదిరినది గాని దక్షిణాఫ్రికా హృదయము మారలేదు. పౌరహక్కులుగాని, విద్యా సౌకర్యములు గాని మనకు లేవు. మనము మంచిచోట్ల భూములు సంపాదింపరాదు. ఆరోగ్యవంతము లగు ప్రదేశములు తెల్లవారికి ప్రత్యేకింపబడుచున్నవి. పాశ్చాత్యజీవిత పద్ధతికి వలసిన కట్టుబాట్లను దక్షిణాఫ్రికావారు చేసికొందురట. మనకును గూడ నాగరకత కల్గించి కొంతసౌకర్యముల నిచ్చెదరట. వారు నిర్ణయించిన ప్రకార ముండలేనివారు భరతఖండమునకుగాని, ఇతర దేశములకుగానిపోవచ్చునట. పోవుటకు వారే కొంత సాహాయ్యము చేయుదురట. ఏమి ఔదార్యము! అప్పుడే నయముననో, భయముననో చాలమందిని వెడలగొట్టుచున్నారు. వారి నిజాభిప్రాయము తెల్లవారి దేశములందు నల్లవారి కెడము లేకుండ చేయవలెననియే; దక్షిణాఫ్రికాలోవలెనే తూర్పు ఆఫ్రికాలోను భారతీయులు బాధలొందుచున్నారు. అచ్చటి భారతీయుల నాదిమవాసులకన్న నీచముగ జూచుచున్నారు. దక్షిణాఫ్రికాను, తూర్పు ఆఫ్రికాను బాగుచేసినది భారతీయులేయైనను వీరిని తెల్లవా రేవగించుకొనుచున్నారు. తూర్పుఆఫ్రికా గవర్నరుగారును వర్ణభేదమును పురస్కరించుకొని శాసనములు చేసిరి. అచ్చటిచిత్రహింసలు వర్ణనాతీతములు. తూర్పుఆఫ్రికాలోని భాగములనెల్ల తెల్లవారి రాజ్యసమ్మేళనముగ చేయుప్రయత్నమున ప్రభుత్వములవా రున్నారు.

1927 సంవత్సరము డిసంబరులో నైరోబీలో భారతీయజాతీయమహాసభవా రచ్చటి కష్టములను వెల్లడించియున్నారు. భారతీయుల కన్నీటిని తుడుచుటకు బ్రిటీషువారు మనదేశీయులను కొందరిని ఉద్యోగరీత్యా గౌరవించి ఖండాంతరములందు త్రిప్పిరిగాని ఉపకారము చేయలేదు. శాస్త్రిగారును, రంగాచార్యులుగారును ఇంకను ఆశతో నున్నారుగాని సామ్రాజ్యసభలకేగిన సప్రూగారుగూడ ఆశాభంగము నొందిరి. వీరివంటి మితవాదికే ఆశాభంగము కల్గిన పరిస్థితు లెట్లుండునో యూహింపుడు.

నానాజాతులసభ (League of Nations)లో భరతఖండమునకు ప్రాతినిధ్య మిచ్చిరిగాని ఈ సభవారే యుద్ధానంతరము జర్మనీవారి వలసరాజ్యములను బ్రిటీషు వలసరాజ్యములదక్షత (Mandate) క్రిందనుంచి పరిపాలింపుడనిరి. ఈరాజ్యములందు నైరము భారతీయుల కెడము లేదు. భారతీయులకు స్వరాజ్యము చేకూరిన గాని ఖండాంతరములందు గౌరవము కలుగదు.

# ఆరాధనము

మద్దిపట్ల వెంకటరమణయ్య గారు

సింగపుదువారమును దాఁటి చిటికలోన - రెండుగాఁ గుడి కెడమ కాదండు చీలె;
ఒక్కదానికి రఘునాథుఁ డొడయఁ డయ్యె - రెండవదళంబు చంద్రభానుండు నడిపె.

ప్రాణములమీఁది ప్రేమకు స్వస్తి చెప్పి - ప్రళయకాలరుద్రాకృతిం బాటిసేసి
బారుటీటెలు పట్టి నెవ్వాడిని దూఁకు - నామగలథాక కరుల మోహరము విచ్చె.

కలఁగి కలగుండుగొనియుఁ జీకాకుపడియు - వెనుక వెనుకకు నొదిగెడు విమతభటుల
గుదులు గుదులుగ నీఁటెల గ్రుచ్చిగ్రుచ్చి - కసిమసంగిరి మనవారు గండుమిగిలి.

నఱకి వైచిన చెఱకువనంబుకరణిఁ - గోయఁబడినట్టి వరిచేనుచాయ డింపె
యవనసైన్యంబు 'హరహరా'యనుచుఁ బేర్చి-చంద్రభానుఁడున్ భట్టివంశమణి తాఁక.

ఆ తెఱపి చూచి దుర్గదా సాత్మఁ బొంగి - జక్కిమిన్నలపైని మ మ్మెక్కఁ బంచి
తక్కుగల రావుతులతోడ దాడుతీసె - భవనమును వీడి యీశుపై భార ముంచి.

పాయ యిచ్చిన మొగలాయిబలమునడుమ - నస్రసిక్తమై చితచితలాడుబాట
నిరుమెయిని రేఁగుచుండ భీకరతఁ బోరు - బాణవేగంబున గుఱాలఁ బఱపినాము.

కాంద్రు కాంద్రనువ్యాఘ్రముఖంబువంటి - ఘాలికలను దాఁటినా మనుమోద మెట్లు
కీల లుమిసెడు పలుజజాయీలవాత - దిట్ట లందఱ విడిచి యేతెంచుమాకు?

తడవు వినవయ్యె ఢాంఢమీధ్వాన మొకఁడె - తక్కుసందడి యెల్లను దఱిగ నోలి
సంగరవిధంబు జవనికచాటు దయ్యె - ఢిల్లిపురి వెన్కఁబడఁ జేసి మళ్లుమాకు.

దూరనికటంబులు నికటదూరములుగ - జంగమములట్లు పరుగిడ స్థావరములు
స్థూలసూక్ష్మముల్ రెండు విజ్జోడుపడఁగ - సాగె నశ్వాళి మానసజవముతోడ.

పెడతలకు వచ్చె నడినెత్తి విడిచి ప్రొద్దు - విశిచి తరుమూలములు నీడ లెడగఁ బ్రాఁకె
జనపదంబులు నిర్జనస్థలులు కడచి - వచ్చుచుంటిమి మనభూమివైపు మేము.

అత్తఱిఁ బిఱిఁది నేల గొంతెత్తి యఱచె - శత్రువులు శత్రువు లటంచు సంభ్రమమున;
ఆపలుకు వింటి గుండె నీరయ్యె నాకుఁ - బురుషవేష మూనినను మైమఱువు తొడిన.

నాదు ప్రాణములకొఱకుఁ గాదు తనయ! యట్లు భయవిహ్వలత్వ మే నందుటెల్లఁ
జిన్న సనతులకై వడిఁ జితిని జొరక - మొండినయి నీకొఱకుఁ గాదె యుండినాను?

పెద్దసుడిగాలిలోఁ బలె విన్నుముట్టి - ధూళిపటలంబు కనిపించె దూరమందు;
గునపములు వేయిటను నేల గ్రొచ్చినట్లు - చప్పుడే తేరసాగె నాచక్కినుండి.

అంతకంతకు నెడమును నాహరించి - కలిసికొనఁ జూచునాపరాగమునఁ దోఁచె
జంద్రకేతన మాకాశసరణి నెగురఁ - దొరగఁ బఱతెంచు మొగలాయి దొరలపిండు.

సారిది రణచోరుఁ డాదియౌ పిఱిఁదిమగలు - గిఱ్ఱున మరల్చి తమజిరా గుఱ్ఱములను
గలహమునకు సన్నద్ధులై నిలువఁబడిరి - అహితసాదిసమూహంబు నడ్డగింప.

ఆచమూనాథుకడ సెల వంది మంత్రి - క్రమ్మఱెను మమ్ముఁ గొని నిమేషమ్ము నిలక;
అసలు తఱుముచో వెనుకదం డడ్డునట్లు - ప్రథమమునఁ జేసికొనిరొ నిర్ణయము వారు.

ధర్మచోదితు లైన యాధైర్యగిరులు - సనయశాసన ప్రవిధేయు లైనయరులుఁ
దారసిల్లినకొలఁదిని దూరమైతి - మాదృతపలాయనారంభు లైన మేము.

పశ్చిమోత్తరహిమ శైలవాటియందు - వింధ్యగిరిసమీపక్షేత్రవితతియందుఁ
ద్వజ్జనకు కీర్తిపంట కాధారు లైన - పోటరుల వీడి రాలేకపోమె మనసు.

అట్లు మానసహీన దేహమ్ముతోడ - నెంత లెక్క వచ్చితినో యే నెఱుఁగఁజాల
స్మృతిగలిగి చూచుసరి కజమీరుకోట - రేకయయి చుక్కయయి యడంగె నాకసమున.

ఆది వేర్పాటులేక మహాద్రివోలె - మ్రోలఁ బొడసూపె మనయోధపురపుఁగోట
కనుల కప్పుడు విడిచినకల్వ లగుచు - రాను రా సుంత బురుజు లేర్పడఁ దొడంగె.

ఆహరుస మంత యాక్షణంబందె యజిత! ఆవలిక్షణంబు సాంద్రభయావిలంబ
మరల ధారుణీతలనభోంతరమునందు - ధూళివిసర నేపథ్యంబు వ్రేలుకతన.

కడిఁది శోకాంధతమసంబు గ్రమ్ముకొన్న-యుల్లమునఁ బాఱె మెఱపట్టు లొక్కయాశ
పగతుఱను దోలి జయలక్ష్మిపాణి పట్టు - వచ్చుచున్నారొ మనవీరవరులె యనుచు.

వెట్టియేకాని యెంతటివీరు లైన - నూర్వురెకదా యసంఖ్యుల నోర్వఁగలరె
అడరెదరెకాని మందరాహార్యమట్లు - కొంతవడి వైరిసేన సంక్షోభ మొంద.

మందలను మ్రింగి యంగద డింద కునికిఁ - బసికొనినక్రూరమృగములపగిది నంత
మగుడవెన్నాడఁదొడఁగిరిమలకదొరలు-నురుఁగులనుగ్రక్కుతురగాలఁ దఱుముకొనుచు.

అపు డమాత్యుండు ననుఁ జూచి యనియె నిట్లు-'అమ్మ! మావంతువచ్చినదడ్డుకొనఁగ;
పాఱిపోవలె మీరు కుమారుతోడ - నిముసమేనియు నిచ్చోట నిల్వకుండ.

అదిగొ నాకనంబడుచున్న యద్రిమీఁదఁ - గ్రాలునదె జగన్నాథుని యాలయంబు;
ఎట్టిచిక్కును మీకు రానీక వీర-లంగరక్షకులై మిమ్ము ననుగమింత్రు.'

అనుచు నేఁబదిమందితో నాఁగి తాను-దక్కనేఁబండ్ర మావెంటఁ దరలఁబనుచ
నానచివుఁ గాంచి దుఃఖంబు నాఁపలేక - యెలుఁగు రాలుపడంగ నే నిట్టు లంటి.

'స్వామి! యింక నెందఱ నిట్లు బలియొసంగి - పాపపుశరీర మేను గాపాడుకొందు?
చాలు నీచిత్రవధ వేయిజన్మములకు - వెళ్లఁ డనకుఁడు మిము వీడి వెళ్ల నేర.

ఎదురుకొందము శత్రుల నెల్లరమును; - చీలి చను టెంతమాత్రంబుఁ బోల దిపుడు;
సమరమున నంద ఱొకమాటె చత్త; మిద్ది - రాజకాంతల కున్నమర్యాదచొప్పె.'

అని వచింపనే, 'నౌర! యిట్లాడనగునె - సకలమార్వారురాజ్యానుశాసకుండు
ప్రబలమొగలాయి గర్వవిధ్వంసకుఁడు - నగుకుమారుని మీ రొడియందుఁ దాల్చి;

సేవ్యులరు మీరు మేము మీసేవకులము - నెఱపుచున్నాము మావిధి నెగులువిడుఁడు
రక్తమునఁ దేలకుండ గాత్రములు మావి-గాయమును మీమెయినిజూడఁగలమె మేము?

ఇంతకును యోధపురరాణి కేల చెప్ప? ఆలసించిన సర్వంబు వ్యర్థమగును;
సుతునిహిత మెంచి దేశంబు హితము నెంచి - యాచరింపుఁ డనియె నామహాత్ముఁ డజిత!

అంత నేమియు నేను మాటాడలేక - శైవనిర్ణయ మెట్టులుఁ దప్పదనుచు
వన్నెలను బ్రక్కలదిమి వార్వమ్ముఁ గొల్పి - సత్వరమ వారి వీడ్కొని సాగినాను.

గండశిలలచే నిండినకటికినేల - హయఖురమ్ములు మ్రోఁగించినప్పుడెల్లఁ
దరిసి రరు లంచుఁ గడు నుల్కి తిరిగి చూచు-చరుగుచెంచితి గుడిని లక్ష్యముగ నుంచి.

గమనవేగంబునఁ దురంగకాయమందుఁ - గాత్రరత పెల్లున మదీయగాత్రమందు
జాలువాఱెడు ప్రస్వేదజలము నార్చె - నప్పు డెదురైనమలయానిలార్భకుండు.

అసుగసు రటంచు నయ్యద్రియంఘ్రితలము - మేము చేరుసరికి నబ్జకాముకుండు
పశ్చిమనగేంద్రమూర్ధంబుఁ బాసి చనియె - నంబరముఁ జిత్రవర్ణాంకితంబుఁ జేసి.

నింగితెరమీఁదఁ దులకించురంగు లన్ని - క్రమముగా మాసిపోయెను గాంచుచుండ;
సహజనైల్యాంధకారంబె సాంద్రమగుచు - మిట్టపల్లంబు లొకటిగా మెండుకొనియె.

నాదుజీవచరిత్రలో నాఁటిపుటయె - తిరుగవేయుచుఁ గూర్చుంటి దీర్ఘచింతఁ
ద్రెడ్డు తెరచాఁప చుక్కాను లేనినావ - నబ్ధి దాఁటంగ వలసినయతనిమాడ్కి.

ఏనిముస మెట్టిదో యని యేమఱిలక - చీమ చిటుకన్నయలికిడేఁ జెదరనీక
పట్టుకొను చున్న చెవిలోనఁ బడియెఁ దిరుగఁ - గదము నడచెడు గుఱ్ఱాలకాలిసద్దు.

వెంబడినె వినంబడెఁ గర్ణపేయముగను - బహుళశంఖస్వనంబులు గుహలు సెలఁగ;
అవ్వి విజయసూచకములే యైన మాకు - శత్రుకల్పితంబు లనిసంశయము పొడమె.

తోన మనవారు కవచాలు తొడిగి మగుడ - నిలఁబడిరి బారుదీరి కోవెలకు నవల;
వారు చాఁచిన నిడువాఁడి బల్లెకోల - లేదు పెరిఁగినచందాన నెసఁగె నజిత!

తమ్ము మార్కొనఁ జేయుకోల్తలను జూచి-పక్కుమని రొక్కపెట్ట నావచ్చువారు;
'అరులు పఱచిరి హితులమే యాఁగుఁ'డంచు-గుఱ్ఱములనుండి దిగిరి 'నేడ్గురు కుమార!

తొలుత దిగినాతఁడె యమాత్యదుర్గదాసు - కళ్లెముల నూని యట్లు దగ్గఱకు వచ్చు
జేతలను గన్నులార వీక్షించినపుడు .. మేము పొందినయానంద మేమి చెప్ప?

ఇట్టులం బగుతమి వారిచుట్టు మూఁగి-గాఢముగఁ గౌఁగిలించిన కారణమునఁ
గట్టు టుడిగి గంటులవెంటఁ గాఱునెత్తు - రించుకించుక యొల్లరియెదల నంటె.

తుత్తునియ లయి వ్రేలాడుకత్తళాలు-కత్తళాల నెత్తురు చిమ్ము గాయములును
పిడులు మాత్రంబె మిగిలిన యడిదములును-అడుగులూడిన దిస్సయీఁటెలును జూచి,

స్వల్పతర మైనహతశేషసంఖ్యఁ జూచి - ప్రక్కలను రక్త మోడువార్వములఁ జూచి
సులభముగ జయం బబ్బుని తెలియుచుండఁ-బగఱందోలినక్రమ మేల వారి నడుగ?

ప్రెగడ యానాఁడు చూపినవిక్రమంబు - సమరపాండిత్యమును భుజాచండిమంబు
సన్నుతింపఁగ వేనోళ్లఁ జాల వనుచుఁ-జెప్పుదురు వారు నేఁడు నచ్చెరువుతోఁప.

'ఎవరి వీపటాల'ని నన్నుఁ బృచ్ఛచేసి-తెవరివో తెల్లమయ్యెనే యిప్పుడు తండ్రి!
'వేల్పులా తెల్పు'మంటివి వీరిఁ జూపి-నరులెమైనను మనపాలిసురలె వీరు.

క్రూరుఁ డౌరంగజీబుని కుటిలవృత్తి - నసువులను నొడ్డి వీరప్ప డడ్డకున్న
మనమతము మనరాజ్యమ్ము మనముకూడ-నేమి యయియుండుమో దైవమే యెఱుంగు.

పూతరహతూను వంశంపు మొలక వీవు - నవయుచుండ నేతురకజనానలోనొ
స్వర్గమున నున్నమీతండ్రిసరస నిల్చి - యశ్రువుల నించుచుందు నే ననుదినంబు.

వీరికతమునఁ జుమ్మి మార్వారులక్ష్మి-బీబి కాకుండ నున్న దీవేళవఱకు;
బలవదహితలక్షిత మయ్యుఁ బ్రభలు గురియు-నీగఃకూఁకటి మకుటంబు నేఁడు కుఱ్ఱీ!

ఆత్మదేశంబుకొఱకు నేత్యాగమూర్తు-లసుధనంబుల నర్పింతు రలఘుబుద్ధి
వారి మనసారఁ గొల్వని వ్యర్థజీవి - పుట్టినను గిట్టిన నొకండె పుడమిమీఁద.

---

# పల్లవచరిత్రమునందు కొన్ని సంశయములు

డాక్టరు యన్. వెంకటరమణయ్య గారు, యం. ఏ., పి హెచ్. డీ.

వేంగీ దేశము పల్లవసామ్రాజ్యములోనిదనియు, పల్లవులు ప్రథమమున వేంగినుండియే దక్షిణదేశమును సాధించిరనియు కొందఱు పరిశోధకు లభిప్రాయ పడుచున్నారు. వీరభద్రరావుగారు, "శివస్కంద వర్మగాక మఱికొందఱు పల్లవరాజుల పేరులు శాసనములందు గానవచ్చుచున్నవి"1 అని చెప్పుచు వేంగిదేశమునందు రాజ్యము చేసిన జయవర్మ, విజయదేవవర్మలను పేర్కొని యున్నారు. మఱియు, "సాలంకాయన గోత్రులయిన పల్లవ రాజులలో నొకరు నూతనముగా ననుకూల మగు నగరము నొకదాని నిర్మించి వేంగియనగా పులియని యర్థ ముండుటచేతను, శత్రువులకు బెబ్బులివలె సమీపింప సాధ్యము కానిదని సూచించుచుండుటచేతను వేంగీపుర మని పేరు పెట్టి యుండును....ఈవేగిదేశము పల్లవులకాలమునను, చాళుక్యుల కాలమునను దక్షిణమున గాంచీపురము వఱకును, నుత్తరమున మహానదివఱకును వ్యాపించినది."2

ఇందువల్ల మూడువిషయములు తెలియుచున్నవి: (౧) పల్లవులు వేంగిదేశముపై రాజ్యముజేసిరి. (౨) సాలంకాయనులు పల్లవులు. వంశము పల్లవవంశము. గోత్రము సాలంకాయన గోత్రము. (౩) పల్లవులకాలమున వేంగిదేశము కంచినుండి మహానదివఱకును వ్యాపించి యుండెను. ఈమూడు అభిప్రాయములను చరిత్రకారు లంగీకరింప దగినవి కావు. ఏలన అవి ఆధారరహితములు. వీనియం దొక్కొక్క దానిని ఈ క్రింద సూక్ష్మముగ జర్చించి వానియందలి నిజమును వెల్లడించుచున్నాను.

(౧) పల్లవులు వేంగిదేశము నేలిరా? యనుప్రశ్న కు లేదనియే సమాధానము చెప్పవలయును. ఈవిషయము పల్లవశాసనములను పరిశోధించుటచే తేలగలదు. వేంగిదేశము క్రీ. శ. ౬౧౮ సంవత్సరమున రెండవ పులకేశిచే జయింపఁబడి తదనంతరము చాళుక్యుల యధీనముననుండి యుండుటచేత క్రీ. శ. ౬౧౮ నకు పిమ్మటి పల్లవ శాసనములను మనము శోధింపఁబనిలేదు. తత్పూర్వపు పల్లవ శాసనములు అవి వ్రాయబడియుండు భాషచే రెండు తరగతులకు జేరియున్నవి: ప్రాకృత సంస్కృత శాసనములు. వీని నెంతసూక్ష్మదృష్టితో వెదకి చూచినను పల్లవ రాజ్యముయొక్క ఉత్తరపు సరిహద్దు కృష్ణను దాటినట్లగపడదు. అయితే పల్లవరాజ్యము వేంగిదేశముపై వ్యాపించి యుండవచ్చు నని శంకించుటకు కొంత యాధారము కలదు. క్రీ. శ. ౫ వ శతాబ్దాంతమున నెల్లూరు గుంటూరు మండలములపై రాజ్యము సేయుచున్న (యు. మ. విష్ణుగోపుని కుమారుఁడు) సింహవర్మ వెంగోరాష్ట్రముపై ప్రభుత్వము సేయుచుండినట్లగపడుచున్నది. ఇతని మంగడూరుశాసనమున తాను సదరుగ్రామమును బ్రాహ్మణులకు దానము చేసినట్లు చెప్పుకొని యున్నాఁడు.

["పల్లవానాన్ధర్మ్మమహారాజ (జః) శ్రీ సింహవర్మ్మా వేఙ్గోరాష్ట్రే మాఙ్గడూ(దూ) గ్రామే గ్రామేయకాన్స ర్వ్వాధ్యక్ష వల్లభ శాసనసఞ్చారిణశ్చాజ్ఞాపయతి."3]

పైజెప్పబడిన వేఙ్గోరాష్ట్రము వేంగిరాష్ట్రమా లేక వేరొకదేశమా? పల్లవవేంగిరాష్ట్రములకు గృష్ణయే హద్దగుటచేత, వెంగి రాజ్యమును పల్లవు లేకాలమున జయించియుందురేమో యను సందేహము కలుగుచున్నది.

1. ఆం. క. సం. పూర్వ యు. పుట 218.
2. Ibid, p. 222.
3. ఇం. ఆం. v, పు. 155.

ఈకాలమున పల్లవులు మిక్కిలి యున్నతపదవియందుండిరి. కంచిరాజగు రెండవ సింహవర్మ - మంగడూరు శాసనపు దాతయగు సింహవర్మయొక్క పెద్దతండ్రి - కృష్ణాకావేరులకును, తూర్పు పశ్చిమ సముద్రములకును మధ్యదేశముల నేలెను. అతనికి గంగరాజులు భృత్యులు. కదంబుల నాతడనేక సమరములయందు జిదుగగొట్టి పాదాక్రాంతులను జేసికొనెను. ఈరాజునకు గుడిచేయినంటి వాడాతని తమ్ముడు యువమహారాజు విష్ణుగోపవర్మ. ఈ విష్ణుగోపుని కుమారుడే మంగదూరు శాసనపుదాతయగు సింహవర్మ. కావున, పల్లవు లీకాలమున గృష్ణను దాటి వేంగిని స్వాధీనముచేసికొనియుండినను ఉండవచ్చును.

ఇందు కొకయాక్షేపణకలదు. వేఙ్గోరాష్ట్రము వేంగీరాష్ట్రము కాదు అన్యము. అని నామిత్రులు సోమశేఖరశర్మగారు చెప్పుచున్నారు. అట్లనుటకు కారణములు రెండు. మొదటిది: ఒక మంగదూరు శాసనమునందు దప్ప పల్లవులకు వేంగిదేశముతో నేలాటి సంబంధమున్న ట్లేశాసనమునను గాన్పించదు. కావున పల్లవులు వేంగి నేలిరని దృఢముగా చెప్పుటకు ఈ యాధారము చాలదు. ఇది యందఱిచే నంగీకరింపదగినదే. రెండవది: ప్రాచీన శాసనములనుబట్టి చూడగా కృష్ణకావలియొడ్డ ననున్న దేశవిభాగములకు "విషయములని" పేర్లుండెనే కాని "రాష్ట్రము"లని పేర్లున్న ట్లగపడవు. పల్లవ రాజ్య విభాగములకు రాష్ట్రము లను పేర్లుండెననుట యందఱెఱిగినదే.—సాతాహనిరాట్టము, కమ్మరాష్ట్రము, ముండకరాష్ట్రము ఇత్యాదులు. కావున వెఙ్గోరాష్ట్రమనునది కృష్ణకు దక్షిణమున నెచ్చటనో యుండిన పల్లవ రాజ్యభాగమున నొకదానికి పేరేగాని, కృష్ణాగోదావరుల మధ్యనున్న సుప్రసిద్ధమగు వేంగిదేశమున కన్వయింపదు.

ప్రథమమున శర్మగారివాదము చాల సమంజసముగ నుండిన ట్లగపడుటచే దాని నంగీకరించితిని. అయినను శాసనములను మరల చదువగా నాపూర్వపు సందేహము తిరుగ పొడకట్టినది. వేంగి వేఙ్గో శబ్దములకు విశేషమగు పోలిక గలదు. రెండవ సింహవర్మకాలమున పల్లవులు వేంగిరాజ్యమును జయించియుందురనునూహయు. కేవలమచింత్యముగాదు. ఇక 'రాష్ట్ర' శబ్దము కృష్ణకావలియొడ్డ ననున్న దేశభాగములకు జెల్లదనుమాట నించుక విచారింతము. సాలంకాయన విష్ణుకుండి, చళుక్యవంశజులగు రాజుల శాసనములు దేశ విభాగములను జెప్పునప్పుడు "రాష్ట్ర" శబ్దమును దలపెట్టక "విషయ" శబ్దమునే ప్రయోగించియున్నను పల్లవులు తాము జయించిన దేశమును రాష్ట్రమని పేర్కొనుటయందు వింత యేమియును గాన్పించదు. తమ రాజ్యములోని యితర భాగముల కన్నిటికిని రాష్ట్రములని పేర్లుండ, క్రొత్తగా జయించిన వేంగి దేశమునకు వేఙ్గోరాష్ట్రమని పేరిడుట సహజమే. ఒకరాజు పరరాష్ట్రమును జయించినప్పుడు, సాధ్యమైనంతవఱకును, స్వరాష్ట్రములందలి యాచార వ్యవహారములను జయించిన రాజ్యములో వాడుకలోనికి దెచ్చుట యసంభవమగు విషయము గాదు. ఇందుకొక యుదాహరణమును జూపెదను. చోళరాజ్యవిభాగములకు 'నాడు' లని పేరు. అయినప్పటికిన్ని, బాదామి చళుక్యరాజగు మొదటి విక్రమాదిత్యుడు చోళరాజ్యమును జయించి యచ్చట కొన్ని దానముల నిచ్చియున్నాడు. గద్వాలు తామ్రపట్టిక[1]యందు "చోళికావిషయంప్రవిశ్య" యని చెప్పియున్నాడు. అరవదేశమున రాజ్యభాగములకు రాష్ట్ర విషయ శబ్దములు అరవరాజులచే ప్రయోగింపబడియుండలేదు. అంతమాత్రముననే విక్రమాదిత్యుడు జయించినది కావేరీతీరమందలి చోళదేశముగాదు, మఱియొక చోళదేశమని చెప్పుటకు వీలగునా? విక్రమాదిత్యుడు చోళరాజ్యమును జయించినప్పుడు దానిని దేశాచారప్రకారము "నా"డని పిలువక స్వదేశాచారప్రకారము "విషయ"మని పిలిచెను. ఇట్లే పల్లవరాజులు చేసియుండినను ఉండవచ్చును. కావున సింహవర్మ కాలమున వేంగి పల్లవులకు లోబడియుండెననుట కవకాశము లేకపోలేదు. అయినను వేంగి తరువాత అల్పకాలముననే తిరిగి పారతంత్ర్యవిముక్తిని బడసిన ట్లున్నది. పల్లవసామ్రాజ్యపు టుత్తరపుటెల్ల యెప్పుడో యొకప్పుడు చిరకాలమువఱకు గృష్ణ నొకవేళ దాటియుండినను,

1. ఎపి. ఇండి. x, పు. 100.

కాల మట్లుండెనని చెప్పుటకుగాని, వేంగి పల్లవసామ్రాజ్యములోని యంతర్భాగమని చెప్పుటకుగాని జొత్తగ నాధారములు లేవు.

(౨) పల్లవ వంశపు రాజులలో సాలంకాయన గోత్రజులు కొందఱు కలరా? పల్లవుల శాసనములన్నిటియందును "భారదాయసగొత్తో పలవానాం,"1 "భారద్వాజసగోత్రస్య...పల్లవానాం ధర్మ్మయువ మహారాజస్య"2 అని చెప్పబడియున్నది. శాలంకాయనుల శాసనముల బరిశోధించిన "శాలంకాయనో మహారాజ"3 యని కానవచ్చుచున్నది. భారద్వాజుడుకానిపల్లవుడుగాని, శాలంకాయనుడైనపల్లవుడుగాని శాసనములయం దెచ్చటను గానరాడు. "శాలంకాయన" శబ్దము గోత్రసూచకమో లేక అన్వయసూచకమో నిర్ణయించి చెప్పుటకు ఆధారములు లేవు. ఇట్టి స్థితియందు సాలంకాయన శబ్దము గోత్రసూచకమనియు, సాలంకాయనులు పల్లవాన్వయులనియు వచించు వాక్యములు సత్యమునకు దూరములు. ఇక్ష్వాకు బృహత్ఫలాయన వంశముల వలె శాలంకాయన వంశమును స్వతంత్రవంశముగ బరిగణింపబడవలసినదే కాని, పల్లవంశమునకు దాని నదికింప బ్రయత్నించుట సత్యమును గప్పిపుచ్చ నుద్యమించుటయే.

(౩) పల్లవుల కాలమున వేంగి మహానది మొదలు కంచిపర్యంతము వ్యాపించియుండెనా? వేంగి స్వతంత్రరాజ్యమనియు, పల్లవుల యేలుబడికి—ఎప్పుడో యొకప్పుడు స్వల్పకాలపర్యంతము దప్ప—లోబడియుండలేదనియు ఇంతకుపూర్వమే చెప్పబడియున్నది. చాళుక్యులు స్వాధీనము చేసికొనుటకు పూర్వము వేంగిదక్షిణపుహద్దు కృష్ణను దాటలేదు. చాళుక్యులు వేంగిని జయించిన పిమ్మట దానియెల్లలను విస్తరింపజేసినది వాస్తవమే కాని యప్పుడు గూడ వేంగిదక్షిణపుటెల్ల మన్నేటిని దాటినట్లగపడదు. ఇక కంచిమాటను వేరుగ జెప్పవలయునా?

ఈచర్చవల్ల (౧) పల్లవులు వేంగియందు రాజ్యము సేయలేదనియు, (౨) సాలంకాయనులు పల్లవ వంశజులు కారనియు, (౩) వేంగిరాజ్యపు దక్షిణపుటెల్ల కంచివఱకెన్నడును వ్యాపించలేదనియు తెలియుచున్నది. అయితే వీరభద్రరావుగారు సుప్రసిద్ధ పరిశోధకులు. వారిట్లు పొరవడుటకు గారణమేమి? ఇందు కొక్కకారణ మగపడుచున్నది. పల్లవసాలంకాయనబృహత్ఫలాయన వంశీయులశాసనము లన్నియు నొక్క లిపియందు వ్రాయబడియున్నవి.పరిశోధకపండితులు దీనికి వెంగిలిపియని పేరిడిరి.ఇంతేకాక,యీ లిపియందు వ్రాయబడియుండు శాసనములం దనేకములు పల్లవుల వగుటచే, తక్కినవి గూడ పల్లవ వంశజుల శాసనములుగనే నమ్మి బృహత్ఫలాయనులను, సాలంకాయనులను, కందారపురవరాధీశ్వరులను పల్లవ వంశజులని ప్లీటుగారు వ్రాసిరి. వారు పరిశోధకులలో ప్రథములగుటచే వారియం దిట్టిప్రమాదజనితములగు లోపములు గన్పించుట సహజము. తరువాతివా రీవిషయమును జర్చింపక దానిని వేదవాక్యముగ నంగీకరించుటయే వింత. ఇట్లు పూర్వపరిశోధకపండితుల వాక్యములను సంపూర్ణముగ విశ్వసించుటచేతనే వీరభద్రరావుగారిట్టి ప్రమాదమునకు లోనైయుండుగని నా నమ్మకము.

౨

ఈ సందర్భమున జర్చించ దగిన విషయము వేరొకటి కలదు. ఇటీవల బుట్టా శేషగిరిరావుగా రొక నవీన విషయమును గనుగొనిరి. అది నిజ మగునేని దక్షిణదేశ చరిత్రనుగూర్చి మనకున్న యభిప్రాయములను మార్చుకొనవలసి వచ్చును. "సముద్రగుప్త శాసనము-కళింగ దేశచరిత్ర" అను శీర్షిక క్రింద వ్యాసము వ్రాయుచు, అందలి "కౌరాలకమంతరాజ","కాంచేయక విష్ణుగోప" అను పదములకు నూతనార్థములను జెప్పుచు సముద్రగుప్తుడు కళింగమును దాటి దక్షిణమునకు నెళ్లలేదని సిద్ధాంతీకరించి యున్నారు. ఇంతేకాక, "ఇట్లే

1. ఎపి. ఇం. vi, 84.
2. ఇం. ఆం. v, 50-52.
3. భారతి, సం. ౧, సంచి. ౮, పు. 120.

కాంచేయక మనునదియు కళింగమందలి గ్రామములచే సమన్వయ మగుచున్నది...అను గ్రామములు అన్నియు పల్లవునాటిలో, కనబడుచుండుటచేత నీ కాంచీపుర రాజ్యము పల్లవరాజ్యమే యనదగియున్నది. ఇట్లు కళింగమందు కౌరాలక కాంచేయక రాజ్యము లంతర్భాగములుగా క్రీ. శ. 4వ శతాబ్దమధ్యమున సముద్రగుప్తుని దాడికిలోనై యుండును."[1]

శేషగిరిరావుగారి వాదములో నెంత సత్యము కలదో కనుగొన వలయును. అలహాబాదు శాసనమున బేర్కొనబడిన "కౌరాళ" మెచ్చటనుండెను? రెండవ పులకేశి అయ్యవొళె శాసనమును బరిశీలించు సందర్భమున అందలి,

"కౌనాళమంబరమివోదిత సాంధ్యరాగం"[2]

అను వాక్యములోని "కౌనాళ" శబ్దమును, అలహాబాదు శాసనములోని 'కౌరాళ' శబ్దము నొక్కటియేయనియు, అదియే యిప్పటి కొల్లేరనియు కీలుహారన్‌గారు వచించిరి. వీరి వాక్యములను నిరసించుచు దూబ్రేగారు తమప్రాచీన దక్కను చరిత్రమునం దిట్లు వ్రాసియున్నారు:

"అయ్యవొళెశాసనమును బరిశోధించుచు కునాళమను సరస్సును, అలహాబాదు శాసనమందు జెప్పబడిన కౌరాళరాజ్యమును నొక్కటియే యని కీలుహారన్‌గారు నుడివిరి. వీరు చెప్పిన యర్థమును వితర్కించక యందఱును గ్రహించిరి. 'కొల్లేరు సరస్సుగట్టున రాజ్యము సేయుచుండిన' రాజును సముద్రగుప్తు డోడించె నని యందఱు నొప్పుకొనుచున్నారు. అయినప్పటికిని కౌరాళమనదు కునాళముతో నైక్యము గల్పించుట కాధారమేమియును నాకు గన్పించదు. ఈ పేర్ల కొండొంటితో పోలిక లేదు. 'కౌరాళ' అనుదానిని 'కొరాళ' యని చదువవలయుననియు, కొరాళరాజ్యమని తర్జుమా సేయవలయుననియు అలహాబాదు శాసనములో కొల్లేరు సరస్సు ప్రశంసయే లేదనియు నాతలంపు."[3]

దూబ్రేగారి వాదమును తత్‌క్షణము గ్రహించి కొందఱు పరిశోధకులు సముద్రగుప్తుని దండయాత్ర కంచివఱకు వ్యాపించలేదని వాదించుచున్నారు. శేషగిరిరావుగారన్ననో సముద్రగుప్తుడు కళింగమును దాటలేదనుచున్నారుగదా. అలహాబాదుశాసనములోని 'కౌరాళ' మనకును, అయ్యవొళెశాసనములోని 'కౌనాళ' మనకును సంబంధములేదని గదా వీరి వాదము. చూతము. అయ్యవొళెశాసనమున 'కౌనాళ' మను మాట లేదందురేమో. దాని ౨౨ వ శ్లోకమున నిట్లున్నది:

సన్నద్ధవారణ ఘటాస్థగితాన్తరాళం
నానాయుధక్షతనరక్షతజాఙ్గరాగం;
ఆసీ జ్జలం యదవమర్ద్దిత మభ్రగర్భం
కౌనాళమంబరమివోదితసాంధ్య రాగం.[4]

ఈ పైశ్లోకమున పులకేశిసైన్యములు, కౌనాళజలాశయమునందలి ద్వీపము నాక్రమించుకొనినట్లు వర్ణింపబడియున్నది. ఇందువల్ల రెండు విషయములు తెలియుచున్నవి: (౧) అయ్యవొళెశాసనమున కౌనాళ ప్రశంసయున్నది. (౨) కౌనాళము సరస్సు; దాని యంతర్భాగమున ద్వీపము లున్నవి.

కాబట్టి, కీల్హారన్‌గారు కౌనాళమును జూచుటతోడనే కౌరాళమును దలచుట సహజము. రకారము నకారముగ మారుట యొక గొప్పమార్పుగాదు. అందుచేత అలహాబాదు శాసనములోని "కౌరాళ" యు, అయ్యవొళెశాసనములోని "కౌనాళ"యును ఒక్కస్థలమునే సూచించునట్టు కవకాశము లేకపోలేదు. ఇక కౌరాళ, కౌనాళములు కొల్లేరుతో సమన్వయించుట కస

1. భారతి సం. ౫, భా. ౧, పు. 780.
2. ఎపి. ఇండి. vi, 6.
3. ప్రా. ద. చ. 59.
4. ఎపి. ఇం. vi, 6.

కాళము గలదేమో చూతము. పులకేశి జయించిన స్థలములను ఉత్తరమునుండి దక్షిణమునకు క్రమముగా వరుస తప్పక వర్ణించుచు, రవికీర్తి పిష్ఠపురమును జెప్పి తరువాత కౌనాళమును, అటుపిమ్మట కాంచీపురీశ్వరుడగు పల్లవ రాజురాష్ట్రమును జెప్పియున్నాడు. కంచిపల్లవుల రాజ్యపుటుత్తరపు సరిహద్దు కృష్ణానది. కావున కౌనాళము పిష్ఠపురమునకు దక్షిణమునను, గృష్ణకు ఉత్తరమునను ఉండియుండవలయును. ఈ రెండు ప్రదేశములకును మధ్య నుండు జలాశయ మొక్కటియే. అదియే ఇప్పటి కొల్లేరు సరస్సు. ఈ సరస్సుమధ్య ద్వీపములుకలవు; అందిప్పటికిని శిథిలమైన దుర్గములు కలవు. ఇవి చోళులకాలమునఅకును ప్రాముఖ్యము వహించినట్లు శాసనములు తెల్పుచున్నవి. కావున కౌరాళ, కౌనాళములను కొల్లేరుతో సమన్వయించుట సమంజసమే.

"కాంచేయక విష్ణుగోప" యనువాక్యమునకు ఆందఱు చెప్పుకొన్నట్లే దక్షిణదేశమందలి సుప్రసిద్ధపట్టణమగు కంచికిరాజగు విష్ణుగోపుడనియే దూబ్రే యర్థమును జెప్పుకొనిరి. వారు కుస్థలగ్రామ నామములను డిస్ట్రిక్టుమాన్యూయల్సు సహాయమున దడవసాహసింపకైరి. అయితే సముద్రగుప్తుడు కృష్ణను దాటి దక్షిణమునకు పోలేదను తమ వాదము నిల్పుకొనుటకై యొకయుక్తిని బన్నిరి. అది యేదనగా,

"కృష్ణాగోదావరుల మధ్య ప్రదేశములయందు రాజ్యము సేయుచుండిన రాజులందఱు—వారి యందు మిక్కిలిశూరుడు కంచిపల్లవరాజగు విష్ణుగోపుడు—కూడి సముద్రగుప్తుని నెదుర్కొనిరి...వీరిచే పరాజితుడై సముద్రగుప్తుడు ఒరిస్సాలో జయించిన స్థలములను విడిచి, స్వదేశమునకు బోయెను. సముద్రగుప్తుడు మొదట రాజులను బందులుగ జేసి పిమ్మట విముక్తులను జేసినట్లు చెప్పబడియున్నది. గుప్తుల స్వాధీనమున దక్కను రాజ్యములయం దేదియు లేకపోవుటయే దీనికి దార్కాణము. సముద్రగుప్తుడు మొదట కొందఱు రాజులను జయించి, పిమ్మట బలవత్తరమగు శత్రుసైన్యమెదుర్కొనుటచే, జయించిన స్థలములను త్యజించి, సత్వరమ నిజరాష్ట్రమును జేరవలసియుండెను."[1]

ఇట్లు దూబ్రేగారు సముద్రగుప్తుడు కృష్ణను దాటలేదనగా వారికంటె ప్రతిభాశాలు లగు పండితసత్తములు అతనిని కళింగమునుండియే వెనుకకు మరల్చిరి. శేషగిరి రావుగారు పల్లవరాజ్యమునకు బదులు పల్లపురాజ్యమును సృజించి దానిని కళింగాంతర్గతమును జేసిరిగదా. ఇందలి సత్యాసత్యములను గనుగొనుట యవసరము.

"కాంచేయక విష్ణుగోప" యను వాక్యమున కర్థము జెప్పుకొనునప్పుడు మనమొక విషయమును జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. అలహాబాదు శాసనమున వర్ణింపబడిన స్థలములు కుగ్రామములు గావు. కుగ్రామములను సముద్రగుప్తుడు జయించెనని హరిసేనుడు చెప్పెనని తలంచుట న్యాయము కాదు. సముద్రగుప్తుడు లోకోత్తరుడైన వీరుడని లోకమునందు బ్రకటించుటయే యాతని ముఖ్యోద్దేశము. గొప్ప రాజ్యములును, దుస్సాధ్యములగు దుర్గములను సాధించెనని వర్ణించినగాని యట్టి వీరుని శౌర్యము లోకమున గణనకెక్కదు. కావున అలహాబాదు శాసనములోని కాంచీరాజ్యము ఆ కాలమున సుప్రసిద్ధముగ నుండవలయును. సముద్రగుప్తుని కాలమున ద్రావిడదేశమందలి కాంచీపురమును రాజధానిగ జేసుకొని పల్లవవంశజు లగు నృపాలురు కృష్ణాకావేరులకును, పూర్వ పశ్చిమసముద్రములకును మధ్యనున్న దేశము నేలుచుండిరి. ఈ విషయ మనేకములగు శాసనముల వల్ల దెలియుచున్నది. ఇట్టి సుప్రసిద్ధమగు కంచిరాజ్యమును వదలి కళింగములోని కుగ్రామమును సముద్రగుప్తుడు గెలిచెనని హరిసేనుడు చెప్పియుండునా యనుట విచారింప దగిన సంగతి. కళింగమున సముద్రగుప్తునికాలమునగాని, తత్పూర్వముగాని, తదనంతరముగాని కంచిరాజ్య ముండెనని శాసన ప్రమాణమూలమున నిరూపించుటకెవ్వరికైన సాధ్యమగునా? శేషగిరిరావు గారు చూపిన ప్రమాణమునకు వారు దాని నెత్తిపై మోపిన భారము మోయగల శక్తిలేదు.

ఇంకొక విషయము: 'విష్ణుగోప' అను పేరు ద్రావిడదేశములోని కంచిని రాజధానిగా జేసుకొని ప్రభుత్వము సల్పిన పల్లవరాజుల వంశావళి యందే పలుమాఱు

1. ద. పూ. చ. 58.

కాన్పించుచున్నది. మఱి యెచ్చటను గానవచ్చుట లేదు. శేషగిరిరావుగారు కళింగనృపాల వంశావళులయం దట్టి పేరును గుర్తుపట్టగలిగినగాని అలహాబాదుశాసనములోని విష్ణుగోపుడు కళింగమున రాజ్యముచేసె నను వాదము నిలువదు. కాబట్టి "కాంచేయక విష్ణుగోప" యనుదానికి 'కంచినేలు పల్లవరాజగు విష్ణుగోపు'డని కీల్హారన్ గారర్థమును జెప్పుట తెలివిమాలినందుచేతగాదు. తరువాతి పరిశోధకులు స్వప్రతిభాతిశయము ననుసరించి క్రొత్తమార్గములను ద్రొక్కియున్నారు. ఇందేదియు సత్యాన్వేషణమున కనుకూలించినదిగ దోచదు.

ఇక దూబ్రేగారు సముద్రగుప్తుడు కృష్ణనుదాటలేదనుటను గూర్చి ఇంచుక చర్చించవలసియున్నది. తమ వాదమును నిలుపుకొనుటకై వారు రెండుప్రమాణముల నాశ్రయించియున్నారు: ౧. సముద్రగుప్తుడు మొదటరాజులను బందులనుగ జేసి పిమ్మట వదలిపుచ్చుట, ౨. దక్కనులోనెచ్చటను గుప్తులకు లోబడిన దేశము లేకపోవుటచేతను దక్షిణరాజు లేకీభవించి సముద్రగుప్తుని దారసిల్లి యోడింపగా నతడు గెల్చినరాజ్యములను విడిచి నిజరాజ్యమునకు బరుగిడెనని చెప్పుచున్నారు. పైరెండు విషయములును నిజములేకాని వీనినాధారపఱచుకొని దూబ్రేగారు చేసిన సిద్ధాంతము తప్పు. హిందూరాజులు దిగ్విజయయాత్రలు బయలువెడలినప్పుడు పరరాజుల నోడించి కప్పములను గొనువారేకాని, పరరాజుల రాష్ట్రములను స్వరాష్ట్రముతో గలుపుకొనెడివారు కారు. అది యాచారవిరుద్ధము; శాస్త్రవిరుద్ధము గూడ. హిందూ దండనీతిశాస్త్రమునకు జనకుడగు కౌటిల్యుడిట్లు చెప్పుచున్నాడు:

"హతశత్రుని భూమి ద్రవ్య పుత్ర దారలను గొనరాదు. వాని వంశస్థులను వారివారి యుద్యోగములందు నిలుపవలెను. ఇట్లు గావించినచో దండోపనతులు వీని పుత్రపౌత్రుల ననువర్తింతురు.

"ఉపనతుల జంపియు, బంధించియు వారి భూమి ద్రవ్యపుత్రదారలను కోరునట్టివాని నాశముకొఱకు దక్కిన రాజమండల మంతయు ప్రయత్నించును...స్వభూమ్యయుక్తులగువాని మంత్రులు సహితము వానిపై విరోధించి శత్రుమండలము నాశ్రయించి వాని రాజ్యమును ప్రాణమును హరింపఁగోరుదురు.

"కావున దండోపనతులగు రాజులు సామముచే వారివారి భూములందు నిలుపబడినవారైనచో రాజును, వాని పుత్రపౌత్రులను ననుసరించి వర్తించెదరు."1

సముద్రగుప్తుడు నీతిశాస్త్రవిధి ననుసరించి, బందులజేసిన రాజులను విముక్తులను గావించి వారివారి రాజ్యములను వారి కొసగనే కాని ఎదిరించిన శత్రుసమ్మేళనప్రధాటి కోర్వక జయించిన రాజ్యములను విడిచి నిజరాష్ట్రమునకు పరుగిడలేదు. సముద్రగుప్తుని నెదుర్కొనుటకు కృష్ణాగోదావరీ మధ్యదేశప్రభువు లందఱు కంచిరాజగు విష్ణుగోపుని యాధిపత్యము క్రింద సమ్మేకట్టిరని దూబ్రేగారు వ్రాసియున్నారుగదా. ఈ వ్రాతకాధార మేమి? దూబ్రేగారివాక్యమే. ఈవాక్యమున కెక్కువవిలువగలదో, అలహాబాదు శాసనమున కెక్కువ విలువగలదో పాఠకులే గ్రహింపగలరు. ఈ శాసనమున పలక్కడనేలు ఉగ్రసేనుని సముద్రగుప్తుడు జయించినట్లు చెప్పబడియున్నది. పలక్కడ కృష్ణకు దక్షిణమున నుండినదని శాసనపరిశోధకులందరొప్పుకొన్న విషయమే. కృష్ణ దాటనిది పలక్కడరాజుతో సముద్రగుప్తునికి సమరమెట్లు సాగినది? నాకు జూడ సముద్రగుప్తుని దండయాత్ర ద్రవిడదేశమందలి కాంచీపురమునఱకువ్యాపించినదనుటయే నిజముగనున్నది.

పై చర్చలోని సారాంశమేమనగా: (౧) కోరాళమే కొనాళము. దీనిని ఇప్పటి కొల్లేరుతో సమన్వయించుట సమంజసము. (౨) సముద్రగుప్తుని శాసనములోని కాంచీపురము ద్రవిడదేశములోని సుప్రసిద్ధ కాంచీ నగరమే కాని, శేషగిరిరావుగారు తలచినట్లు కళింగదేశములోని కుగ్రామము గాదు. (3) దూబ్రేప్రభృతులు తలచినట్లు సముద్రగుప్తుడు కృష్ణయుత్తరపుటొడ్డున నుండికాని, కళింగమునుండియే కాని వెనుకకు మరల్పబడెననుటకాధారము లేదు. అతఁడు కంచివరకు దండయాత్ర సాగించెననుటకే కొన్ని యాధారములు గలవు.

1. కౌటి. ౭ అధి౧౬. అధ్యా. వెంకటరంగయ్య వేంకటశాస్త్రిగార్ల తర్జుమా, పుట 324.

మనకు తోకలున్నచో?



## వేసవి - విదేశ వేషము


పంట్లాము
ఎంతగాలి వేసినా
ఏమివేడి!
ఏమి దాహం! ఎండ ఎప్పుడు
తగ్గుతాదో కనుక్కోవాలి.
పంచాంగమ్మైనా చూడాలి
చెమట ఊరి
పోతూ ఉంది
అమ్మ!
ఉః!!
హా!!!
నాకొక్కడికే యింత
ఆయాసంగా ఉండ
డం ఎందుచేత చెప్మా?
ఆహా! తెలిసింది!
ఇదీ దీని రహస్యం!!
వెధవ
కోటు!
వెధవ
పంట్లాం!
అమ్మయ్య! ఇప్పుడు
హాయిగా ఉంది. ఇందుకే
మన పూర్వులు ఈ వేషా
లు ఆమోదించ లేదు
రామారావు

# కవి, కవిత, విమర్శకుఁడు

పూడిపెద్ది వెంకటరమణయ్యా గారు

కోరి కడుపారఁ గని పచ్చిగ్రుడ్డులోన
నున్న తఱిఁ గాకిగూటిలోఁ దన్నుఁ ద్రోసి
తల్లి దేశాల కడకు నిర్దయత నేఁగ,
కాకి పొదిగిటఁ బెరిఁగిన కారణమునఁ
బక్షిసౌందర్య మెల్లను బసఁ దొరంగ,
పరభృతంబౌటఁ గల గౌరవమ్ము దఱుఁగ,
చివురు దిని చెట్టునీడను సేదఁ దేఱి
బ్రతుకు కోకిల సమయంబు వచ్చు నేని
పాడదే! మోడు మ్రాఁకులు పల్లవింప!
విరహిణీకాంత లొక్కొక వేళఁ దన్నుఁ
దిట్టినను పాటలోఁ గల తీయఁదనము
తగ్గునే! మెచ్చ లోకమంతయును లేదె?

* * * *

మానసమునకు భావమే ప్రాణముగద!
లలితభావప్రపూర్ణమై చెలఁగు బుద్ధి
కావ్యమూలమ్ము, తద్వచఃక్రమము కవిత
శబ్దమున రూపసంపద స్పర్శయందు
రసములో గంధమునఁగూడఁ బ్రకృతితత్త్వ
మరసి తద్విధానంబుతో నైక్యమగుచు
దాన నవ్యక్తభావ సంధాన మెఱిఁగి
లలిత పదనూపురములు ఘల్లుఘల్లు రనఁగ
నాడి చక్కని భావాలఁ బాడు నతఁడు
కవి యనందగుఁ బెక్కువాక్యంబు లేల?

* * * *

గుండె జల్లని దడదడఁ గొట్టుకొనఁగ
కలఁగి మేనెల్లఁ బులకలు గ్రమ్ముకొనఁగ
ఫాలతలమునఁ జెమ్మట జాలుకొనఁగ
రావిచిగురట్లు చెక్కుల కావి దనరఁ
బాడము భావంబు దక్క యీపుడమి నెల్ల
లిప్తమాత్రమ్ము మఱచి తల్లీన మగుచు
వేఁడినిట్టూర్పుఁ బుచ్చిన వింత సుఖము
కవి యెఱుంగునుగా కొరు ల్గాంచఁ గలరె!
సృష్టితోఁ బుట్టి సృష్టితోఁ జెలఁగునట్టి
కవిమనోవీథి వన్నె కెక్కకయ నెగడు
క్రొత్తభావంబు లెట దొరకొనెడు వెదక?
ఇపుడు వికసించి తావుల నీనుమల్లె
విసువుచే వచ్చు నేఁటేఁట విరియకున్నె?
ప్రకృతి మాఱునె నూత్నభావములకొఱకు?
రాగ మన్నిటిలోఁ గడుఁ బ్రాఁతదయ్యు
గాయకుని కంఠచాకచక్యమును బట్టి
క్రొత్తకళ లొల్కదే పాడుకొలఁది నూఁది?

* * *

కుసుమధామంబులో ముద్దుగులుకు నొకటి
యతివతలమీఁదఁ దాండవమాడు నొకటి
చెలఁగి సరసునిచేతిలో నలుగు నొకటి
పుట్టుతావుననే వాడిపోవు నొకటి
పూవెకా? యిన్ని పోకలఁ బోయియున్న!

5. 7- 11 ౮3

తరుణమునుబట్టి వస్తుతత్త్వమునుబట్టి
కావ్యకుసుమమ్ము కీరితిఁ గాంచఁగలదు
స్రష్టభారమ్ము రచనతోఁ జక్కఁబడదె?

*   *   *

సృష్టితో వచ్చు నిజపరిస్థితులవలనఁ
బత్రముల కూర్పునందున వన్నెలోనఁ
దళ్కులోఁగూడ నొక్కింత తగ్గియున్న
పూవులోఁ దేనెఁ దుమ్మెద ద్రావకున్నె!
ప్రవిమలానిల మాసౌరభమ్ముఁ గొనదె?
సరసు లొకవేళ నట్టి పుష్పమ్ము విడిచి
యన్యమును గౌరవించిన నగునుగాక
తత్ ప్రసూనమ్ము తనదుసత్వమ్ముకొలఁది
బీజమై మొల్కమై మహావృక్షమగుచు
సరసులకు మేనఁ బుల్కలు జాలుకొనఁగ
కొమ్మకొమ్మకు ముద్దులుగురియుపూలఁ
బూయకుండునె? కాలమ్ము పోవకున్నె?

*   *   *

ద్వంద్వభూయిష్ఠమై వస్తుబహుళ మగుచు
మొదలుఁ దుదియును వేర్వేఱఁ బోల్పరాని
ప్రకృతిచిత్రములను జిన్నిపత్రములను
పటములోఁ దోఁచునట్టి రూపమ్ముతోడఁ
గంఠమునఁ దూఁగు సంగీతకళలతోడ
మనము నలమెడు భావసంపదలతోడఁ
జూపుకావ్యమ్ము, ముకురమ్ము రూపుఁ బోలె
కావ్య మవని శ్రేయోదాయకంబుగాదె!

*   *   *   *

క్రొందళుకులీను రేకుల కూర్పుతోడఁ
బొందలుపూవట్లు పదముల పొందుపుతోడ
రమ్యతరమైన హృదయస్థరసముతోడఁ
జెలఁగుకవితను భావవిశేషములను
బోల్చి గ్రహియించి యొక్కచోఁ బొందుపఱచి
జగతి కీఁగలనయవిమర్శకులు లేక
కలదె కవితారసమ్ము లోకమ్మునందు?
తేఁటి లేకున్నఁ బూవులోఁ దేనె గలదె?

---

# కళింగదేశములోని శాసనములు–తేదీలు

గో. రామదాసు గారు

## శ్రీకూర్మ దేవాలయములోనివి

South Indian Inscriptions, vol. V లో పేజీ 419 మొదలు శ్రీకూర్మనాథస్వామి దేవాలయము నందున్న శాసనముల మూల మివ్వబడియున్నది. అందు ప్రతి శాసనమం దిచ్చియున్న శాలివాహనశక సంవత్స రంబుల తిథులను క్రీస్తుశకసంవత్సరపు తేదీలకు మార్చితిని.

శాసనము: నెం. 1150.

పంక్తి 8...స్వస్తిశ్రీ [శా] కవర్షేర—
9 విరవిగణితే మేష. శౌక్ల్యాం
చతుర్థ్యాం సోయం శుక్రవారే
...14 ......శకవర్షంబులు ౧౨౧౨ గు నేంటి
15 వీరశ్రీ నరసింహదేవర విజయరాజ్యసంవ త్సరంబులు ౧౪ శ్రాహి మేష. శుక్ల ౪ శుక్రవారము...

క్రీ. వె. 1290 లో మేషప్రవేశము మార్చి ది 25 న గలిగినది. వైశాఖ శుక్లపక్షము ఏప్రిల్ ది ౧౧ వి నుండి ప్రారంభము. మేష. శు. ౪ అంటే వైశాఖ శు. ౪ యే యగును. గాన

ఈశాసనపుతారీఖు

=క్రీ. వె. 1290 ఏప్రిల్ ది. 14 శుక్రవారము.

ఈరోజున చవితితిథి 30 ఘ. 24 వి. ఘ (లంకా కాలము) వర కున్నది.

నెం. 1151

1 శకవర్షంబులు ౧౨౨౭ గు నేండు శ్రీమదన వర్మ్మగా.

2 ప్రతాపవీర శ్రీనరనారసింహ్వదేవరు ప్రవ ర్ధమాన విజయరాజ్య

3 సంవత్సరంబులు ౩౩ గు శ్రా ఇ విషు సం క్రాంత్తి నాడు...

క్రీ. వె. 1305 సం॥లో మేషప్రవేశము మార్చి ది 25 న 39 ఘ. 36 విఘడియలకు సూర్యాస్తమయమైన తరువాత సంక్రమణ ప్రవేశముగాన దానధర్మము లన్ని యు మరునా డనగా ది 26 న జరుగును. గాన శాస నము తేది

=క్రీ. వె. 1305 మార్చి ది. 26 కు సమానము.

నెం. 1152

1 వీరశ్రీ గజపతి గఉడేశ్వర ప్రతాప—
2 శ్రీపురుసోత్మతే ఉ మహారాజాజ్ఞో గ స—
3 విజే రాఇజే సమస్త ౩౫ అంకో శ్రా—
4 హి బిచ్ఛా సంకరాన్తి సు ౧ గురువారే
... ... ... ...

దీని తర్వాతి నెం. 1153 లో ఈరాజుగారి విజ యరాజ్యసంవత్సరములు ౭ శకవర్షంబులు ౧౩౯౩ కు సమానమని యున్నది. గాన ౩౫ వ సంవత్సరము శక వత్సరంబులు 1417 కు సమానము. అది యెట్లో ఇచ్చట చెప్పవలెను. పూర్వపు కళింగరాజులనుండియు ఒక్కొ క్కరాజు పరిపాలన సంవత్సరములను లెక్కించుటకొక సాంప్రదాయము నేర్పరచుకొనిరి. ఈగణనను 'అంక' 'సమస్త' యను పదములచే తెలియజేయుదురు. ఇందు 1, 6 న్ను, పది తప్ప సున్నతో చేరియున్న అంకెలను, 6 తో చేరియున్న అంకెలను వదలి లెక్కిం చెదరు. ఉ. 15 తర్వాతి వత్సరము 17 అని, 19 తర్వాత 21 అని ఇట్లున్ను, మొదటిసంవత్సరము రెండని గణనచే యుదురు. అందుచే 35 సం.లు పాలించెనని చెప్పిన రాజు నిజముగా 29 సంవత్సరములే పాలించియుండును. గాన పురుషోత్తమదేవుగారి పాలనసంవత్సరములు ౭ ను నిజముగా ౫ సంవత్సరములే. శకవర్షంబులు 1393 కు వారు 5 సంవత్సరములు పాలించియున్న టైతే వారు సింహాసనమెక్కిన సంవత్సరము 1388 వ శాకాబ్దము. దీనికి 29 వ సంవత్సరము శా. శ. 1417.

పైన ఉదాహరించినశాసనము శా. శ.1417 సం॥ వృశ్చికసంక్రాన్తి సు ౧ గురువారమునా డివ్వబడెను.

=క్రీ. వె. 1495 నవంబరు ది. 18 బుధవారము.

(లక్ష్మీవారముగాను.) శు. ౧ దిని ఉదయాది 6 ఘ. వర కున్నది.

నెం. 1153

1 ...శకవర్షంబులు ౧౩౯౩ అగు

2 (౦) నేంటి వీరశ్రీగజపతిగవుడేశ్వరప్రతాపవీర

3 శ్రీపురుషోత్తమదేవ విజయరాజ్యసంవ[త్స]రంబులు

4 ౭శ్రాహి ఆషాఢ శు ౨ గురువారాన...

=క్రీ. వె. 1471 జూను ది. 20 గురువారము.

ఆషాఢ శు ౨ తిథి ఆరోజున సూర్యోదయాది 24 ఘ. 36 విఘ. వర కున్నది.

నెం. 1154-1155

1 శాకాబ్దే రవిసింధుసనిధియుతే హేమా [ధి]ధే వత్సరే మార్గే మా స్యసితే ద్వితీయదివసే వారే శుభే.

2—పండితే| ... ... ...

6 ... శాకవరుషంబులు ౧౨౮౯ నేంటి మార్గశిర భౌళ ద్వితీ—

7—యాను పండితవారాన ... ...

=క్రీ. వె. 1357 నవంబరు 29 బుధవారము.

మార్గశిర బ ౨ తిథి ఆరోజు సూర్యోదయాది 36 ఘ. వరకున్నది.

నెం. 1156

1 శ్రీవీరభాను దేవంకర విజయరాజ్య సంవత్సర ౨౭ స...... మేస—

2 సక్ల ౧౧ గురువారే......

నెం. 1218 వ శాసనమువల్ల ఈవీరభాను దేవు గారి 3 వ అంకసంవత్సరము శా. శ. 1275 గా తెలియుచున్నది. గాన వీరి 12 వ అంకసంవత్సరము శా.శ. 1283 గావున ఈశాసన తారీఖు

=క్రీ. వె. 1361 ఏప్రిల్ 16 శుక్రవారము.

నెం. 1157

1 శకవరుసంబులు ౧౨౮౧ అగు నేంటి మాఘ శు

2 క్ల పంచ్చమి గురువారానను......

=క్రీ. వె. 1359 జనవరి 23 గురువారము.

మాఘ శు. ౫ తిథి ఆరోజు సూర్యోదయాది 42 ఘ. వర కున్నది.

నెం. 1158

1 శాకాబ్దే షడ్గ్రాగ్ని ద్విజపరిగణితే చైత్రసుక్ల దశేమ్యా—

4 ౦గురువ్వా హే... ... ... ...

=క్రీ. వె. 1394 మార్చి 13 గురువారము.

చైత్ర శు. ౧౦ ఆరోజు సూర్యోదయాది 25 ఘ. 12 విఘ. వర కున్నది.

నెం. 1159

1 ...శాలివాహన

2 శకే గతాబ్దాః ౭౫౦

3 కాగాను వర్తమాన సర్వ—

4 ధారి సం|| చైత్రమాస వసంతనవ

5 రాత్రములు......

=క్రీ. వె. 1828 మార్చి 16 ఆదివారం మొదలు 26 బుధవారము

వరకు వసంతనవరాత్రములు.

నెం. 1160

1 ...శకవర్షంబులు ౧౩౧౮ గుంస్నే[ంటి]

వైశాఖశుక్ల ౧౩ రవి వారము.........

=క్రీ. వె. 1392 మార్చి 5 ఆదివారము.

ఈరోజున వైశాఖ శు. ౧౩ తిథి సూర్యోదయాది 29 ఘ. 24 విఘ. వరకుండెను.

నెం. 1161

1 వీరశ్రీగజపతి గఉడేస్వర నవకో—

2 టికర్ణాట కలబరగేస్వర వీరాధి—

3 వీరప్రతాపరుద్రదేఉ మహారాజ్య—

4 సుభరాజ్జేసమస్త ౪౧ అజ్యకౢశాహి

5 మేస ది ౧. సు ౫ సనివారే|......

=క్రీ. వె. 1601 మార్చి 28 శనివారము.

సూర్యోదయాది 15 ఘ.కు మేషప్రవేశ మాయె ను. గాన ఈరోజే మేషమాసములో మొదటిది. ఈ రోజున సూర్యోదయాది ౯0 ఘ. 24 విఘ. లకు చైత్ర శు. ౫ పోయినది.

ఈరాజుగారి 41 వ సంవత్సరము క్రీ. వె. 1601 గాన వీరి ప్రథమ సం. క్రీ. వె. 1568.

నెం. 1162

1 శాకాబ్దే నిధిసింధురామశశభృత్సంఖ్యా సమే తేసుచావాపాత్యాంసుజవా—

2 (స)రకే సురగణాధీశాయ షుమ్మార్త్మనే|...

5 ... ... స్వస్తిశ్రీ[||]శకవర్షంబు

6 లు ౧౩౪౮ అసన్నేటి ప్లవంగ సంవత్సర ఆసాఢపౌర్ణమాసి మంగళవా—

7 రమందు [శ్రీ] లావంశ సంభవ......

=క్రీ. వె. 1427 జూలై 8 మంగళవారము.

పౌర్ణమితిథి సూర్యోదయాది 36 ఘ. 12 విఘ. వరకుండెను.

నెం. 1163

1 స్వస్తిశ్రీ శకవత్సరే రసనియత్ బాహుక మాసం—

2 మ్మితే దీపార్కం ... ...

4 ... ... శకవరుషంబు

5 లు ౧౨౭౬ నేంటిరివిభసంక్రాంతినాండు...

=క్రీ. వె. 1284 ఏప్రిల్ 25 మంగళవారము.

సూర్యోదయాది 10 ఘ. 12 విఘ.లకు బుషభ సంక్రాన్తి ప్రవేశము. ఆరోజున వైశాఖ శు. ౯ తిథి సూర్యోదయాది 41 ఘ. 24 విఘ. వరకున్నది.

నెం. 1164

1 స్వస్తిశ్రీ [||] జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౬౯

2 అగునేటి సర్వజిత్తునామ సంవత్సర చైత్ర శు ౧౩ గురు—

3 వారనాండు ... ... ...

=క్రీ. వె. 1647 ఏప్రిల్ 7 గురువారము.

చైత్ర శు. ౧౩ తిథి సూర్యోదయాది 22 ఘ. 12 విఘ. వరకున్నది.

నెం. 1165

1 ... శకవర్షంబులు ౧౩౮౨ అగు—

2 నేంటి వీరశ్రీగజపతిప్రతాపగాడేశ్వరప్రతాపకపి[లే]శ్వ

3 రదేవవిజయరాజ్య సంవత్సరంబులు ౩౨ గుశ్రాహి

4 విక్రమ సంవత్సర జేష్ట బ ౫ సో ...

=క్రీ. వె. 1460 జూన్ 9 సోమవారము.

జ్యేష్ఠ బ. ౫ తిథి సూర్యోదయాది 28 ఘ. 12 విఘ. వరకున్నది.

నెం. 1166

1 స్వస్తిశ్రీ శకవత్సరే వసనిధిక్షోణీందుభిన్న మ్మితే...

... ... ... ...

4 ... ... శకవరుషంబులు ౧౧౯౮ గు నేంట్టి సింహాపుక్ల ఏ

5 కాదశియందు ... ... ...

=క్రీ. వె. 1276 ఆగష్టు 21 శుక్రవారము.

జూలై 28 న సింహప్రవేశము. అప్పుడు శ్రావణబహుళం గాన సింహశుద్ధము భాద్రపదశుద్ధము.

ఏకాదశి తిథి ఆరోజున సూర్యోదయాది 38 ఘ. 24 వి. వరకున్నది. వారము శుక్రవారముగాని సోమవారము గాదు.

నెం. 1167

1 శుభమస్తు శకవర్షంబులు ౧౩౩౬ అగున్నేంటి వయిశా–

2 ఖ శుద్ధత్రయోదశి గురువా[రా]న ...

=క్రీ. వె. 1414 మే 2 గురువారము.

౧౩ తిథి సూర్యోదయాది 53 ఘ. 24 విఘ. వరకున్నది.

నెం. 1168

1 స్వస్తి [॥] శకవర్షంబులు ౧౧౯౭ నేటి ఉత్తరాయణ సంక్రాంతినాండు...

=క్రీ. వె. 1276 డిసెంబరు 26 శనివారము.

డిసెంబరు 25 న సూర్యోదయాది 48 ఘ. కు మకరప్రవేశము. ఈసమయమునకు సూర్యాస్తమయమై పోవును గనుక మరునాడు సంక్రాంతికర్మలు చేయుదురు.

నెం. 1170

1 శ్రీశాకే మునిబాణవిశ్వగణితే సంవత్సరేరాక్ష–

2 సే మాఘే మాసికు[జే]హ్ని మన్మదతిథావ క్షే

సితే [క్షే౯]–

3 ధితేః

=క్రీ. వె. 1436 జనవరి 23 మంగళవారము, రేవతీనక్షత్రము.

నెం. 1172

1 స్వస్తిశ్రీ శకవత్సరే శరధరాతిగ్మాంశు శం

ఖ్యాన్వితే...

4 ... ... స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨

౧౫ గు నేంట్టి మా

5 ఘ శుక్లపంచమియు రవివారమునందు,..

=క్రీ. వె. 1294 జనవరి 3 రవివారము.

శు. ౫ తిథి సూర్యోదయాది 49 ఘ. 48 విఘ. వరకుండెను.

నెం. 1173

1 వీరశ్రీ నారసింహ్యదేవర విజయరాజ్యసం

త్సరం

2 బులు ౨౨౮ అగున్నేంటి కార్తిక కృష్ణ ౧౩

గురువారా—

3 న... ... ... ...

=క్రీ. వె. 1306 అక్టోబరు 6 లక్ష్మీవారము.

(పూర్ణిమాంతము) కృ. ౧౩ తిథి సూర్యోదయాది 29 ఘ. 24 విఘ. వరకున్నది.

నెం. 1174

1 స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౪౪ అగునేటి

జష్ట

2 బహుళ దసమి గురునరన ... ...

క్రీ. వె. 1422 మేలో పూర్ణిమాంత జ్యేష్ఠమా తా. కృష్ణపక్షము గలిగెను. మే 14 తారీఖున ౯ తి 31 ఘ. 40 విఘడియలకు పోయి ౧౧ తిథి వచ్చెను. ఇది 16 తారీఖున సూర్యోదయాది 3 ఘ. 36 విఘ. కు పోయినది. కాన 15 తారీఖంతయూ ౧౧ తిథియే. అందు చే శాసనముతారీఖు

=క్రీ. వె. 1422 మే 15 లక్ష్మీవారము.

నెం. 1175

1 స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౪౧ అగు నేంటి

జేష్ట బ–

2 హుళ బుధవారాన త్రయోదసి...

=క్రీ. వె. 1419 మే 11 బుధవారము.

(పూర్ణిమాంతము) బ ౧౩ తిథి సూర్యోదయాది 34 ఘ. 48 విఘ. వరకుండెను.

నెం. 1176

1...సంవత్ ౧౪౫౯॥ సా

2 కే॥ ౧౩౭౫॥ సమయే॥ సర్వధారీనామస
3 వత్సరే॥ ... ...

=క్రీ. వె. 1403

నెం. 1177

1 శకవర్షంబులు ౧౨౦౫ నేంటి వైశాఖ ఏకా
దశియందు...

=క్రీ. వె. 1283 ఏప్రిల్ 9 శుక్రవారము.

శు. ౧౧ తిథి సూర్యోదయాది 28 ఘ. 48 విఘ.
లవరకున్నది. వైశాఖ శు. ౧౧ కి మోహినీయేకాదశి యని
పేరు.

నెం. 1178

1 శకవరుషంబులు ౧౨౧౧ గు నేణ్టివీరనరసింహ్వా
దేవరు

2 విజయరాజ్యసంవత్స[ర]ంబులు ౧౪ గు శ్రీహి
మిగున శుక్ల ౧౧

3 యు మంగళవారమున

ఇందులో వీరనరసింహదేవుగారి 14 వ పాలన
వత్సరము శా. శ. 1211 అని యున్నది. నెం. 1150 గల
శాసనములో 14 వ పాలన వత్సరము శా. శ. 1212అని
యున్నది. శా. శ. 1211 సం. మిథున శుక్ల ౧౧ తిథి
లక్ష్మివారమునాడైనది. అందుచే ఇది పనికిరాదు. శాసన
ములో శకవరుషంబులు 1212 అని యుండవలెను.

=క్రీ. వె. 1290 జూన్ 20 మంగళవారము.

ఆషాఢ శు ౧౧ తిథి ఈరోజున సూర్యోదయాది
9 ఘ. 36 విఘ.వర కుండెను.

నెం. 1179

6 ... ...శాకాబ్దే శరబిన్దు—
7 సూర్యగణితే వైశాఖమాసే సితేపక్షే

=క్రీ. వె. 1283 మార్చి 29 సోమవారం మొదలు
ఏప్రిల్ 13 మంగళవారం వరకు

వైశాఖశుద్ధము.

నెం. 1180

1 వీరశ్రీనరసింహ్వాదేవంకరవిజయరాజ్య సంవత్స—
2 రంబులు ౧౩౨౪ అగున్నేంటి పుష్య శుక్ల
పౌర్ణమిా చ-
3 ంద్రవారాన.

=క్రీ. వె. 1403 జనవరి 8 సోమవారము.

పౌర్ణమిసూర్యోదయాది 47 ఘ. 24 విఘ. వర
కుండెను.

నెం. 1181

1 ... శాకాబ్దే రామతర్క ద్విమణి పరి
మితే కుంభకృష్ణే
2 దశమ్యాం వారే కావ్యేచ లగ్నే భిజితిసముచితే.
... ... ... ...
5 ... ...శకవర్షంబులు ౧౨౬౩ గుంన్నేట్టి
6 ప్రతాపవీరనరసింహ్వాదేవ విజయరాజ్యసం
7 వత్సరంబులు ౧౭ శ్రాహిని కుంభకృష్ణ దశమి
శుక్రవారా
8 న .......

=క్రీ. వె. 1342 ఫిబ్రవరి 1 శుక్రవారము

పూర్ణిమాంత ఫాల్గుణకృష్ణ ౧౧ ఆరోజు సూర్యో
దయాది 40 ఘ. 12 విఘ. వరకుండెను.

నెం. 1182

1 శక వరుషంభులు ౧౩౬౭ అగునేటి
2 రక్తాచి సంవచరవఇశాఖ సుక్ల త్రా[యో]
3 దసి గురువరునను

=క్రీ. వె. 1445 ఏప్రిల్ 20 మంగళవారము

వారము గురువారముగాదు. సూర్యోదయాది 7
ఘ. 48 విఘ. వరకు శు. ౧౩ తిథి యుండెను.

నెం. 1183

1 ...శకవరుశంభులు ౧౪౯౩ గు నేంటికర్కా
టక శుక్ల త్ర

2 యొాదశియు గురువారమునాండు ... ...

=క్రీ. వె. 1321 జూలై 8 బుధవారము.

గురువారముగాదు. ఆషాఢ శు ౧౩ తిథి సూర్యో దయాది 12 ఘ. వరకే యుండెను.

నెం. 1184

1 ... శకవరుషంబులు ౧౩౨౫ అగుం—

2 న్నేంటి స్వభానుసంవ్వత్సర వైశాఖ క్రిష్ణ ౫ శుక్రవారా

3 నను

=క్రీ. వె. 1403 మే 11 శుక్రవారము.

కృష్ణ ౫ తిథి సూర్యోదయాది 31 ఘ. 48 విఘ. వరకుండెను.

నెం. 1185

1 స్వస్తిశాకవర్షే మనురవిగణితేశాంగ౯కృష్ణే దశమ్యాం

2 [శౌరే] వ్వా౯రే సులగ్నే......

... ... ... ...

5 శకవరుషంబులు ౧౨౧౪ అగునేంటిప్రతా

6 [ప] వీరశ్రీనరసింహదేవరు ప్ర [వ] ర్ద౯మాన విజయరాజ్య

7 సంవత్సరంబులు ౧౭ అగు శ్రాహి మాగ౯శిర కృ[ష్ణ]౧౦ యు

8 శుక్రవారమున............

=క్రీ. వె. 1292 డిసంబరు 5 శుక్రవారము.

కృ. ౧౦ తిథిసూర్యోదయాది 11 ఘ. 24 విఘ. వరకున్నది.

నెం. 1186

1. స్వస్తిశ్రీ [।] శకవరుషంబులు ౧౨౦౭ గు నేంట్టి మకరశుక్ల

2 ౫ యు గురువారమున

=క్రీ. వె. 1286 జనవరి 1 మంగళవారము.

గురువారముగాదు. మకర శు. ౫ అనగా మాఘ శు. ౫. ఇది ఆగోజున 43 ఘ. 48 విఘ. లున్నది.

నెం. 1187

1 స్వస్తిశ్రీ శాకవర్షే శశికరనయనే భూమిశే మీన—

2 మాసే పక్షేశ్క— [ల] వారేవసుతిథిసహితే సౌమ్య—

3 ధిష్ణేసులగ్నే॥ ... ...

... ... ... ...

5 ... స్వస్తిశ్రీ [।।] శుభశాసన శక

6 వరుషంబులు ౧౨౨౧ అగునేంటి మీనశుక్ల ష్టమియు రవివా—

7 రమున మృగశిరనక్షత్రము నాండు శుభము హూర్తమునను ...

=క్రీ. వె. 1300 ఫిబ్రవరి 28 ఆదివారము.

సూర్యోదయాది 35 ఘ. 24 విఘ. లకు తిథిన్ని 53 ఘ. 24 విఘ. లకు మృగశిరానక్షత్రమున్ను పోయినవి.

నెం. 1188

11 ... శకవష[ల]ంబులు ౧౧౭౨ నే [టి] మకరశుక్ల ౧౩ యు సోమవా

12 రమున... ... ...

=క్రీ. వె. 1251 జనవరి 7 శనివారము.

సోమవారము తప్పు. సూర్యోదయాది 13 ఘ. 12 వి. లకు ఈ ౧౩ తిథి అంత మయ్యెను.

నెం. 1189

1 శాకాబ్దే బాణతర్క్య౯క్షితిశశిసంఖ్యాగణాన్వి—

2 తే॥ శ్రేష్ఠే మాసి ద్వితీయాయాం శుక్లపక్షే కర్క౯వారకే॥

... ... ... ...

10 ... ... శకవర్షంబులు

11 ౧౨౬౫ గు న్నేంటి జ్యేష్ఠశుక్ల ద్వితీయాయు రవివారమునాండు.

... ... ... ...

=క్రీ. వె. 1343 ఏప్రిల్ 27 రవివారము.

ఈతిథి సూర్యోదయాది 4 ఘ. 48 విఘ. లకు పోయినది. ఈసంవత్సరమందు అమాంతమైన వైశాఖము అధికము. పూర్ణిమాంతగణనప్రకారము నిజవైశాఖమే జ్యేష్ఠమాస మగును.

నెం. 1190

1 స్వస్తిశ్రీ [॥] శాకాబ్దే శ్రుతిసింధునేత్రధరణీసంఖ్యాన్వి—

2 తేమార్గకే మాసే మంగ్గళశుక్లపక్షతివనే ఏకాదశీసం—

3 యుతే॥ వారేకావ్యదినే... ...

=క్రీ. వె. 1322 నవంబరు 20 శనివారము.

ది 19 న దశమి తిథి 18 ఘ. ౧ విఘ.కు పోయినది. గాన ది 20 అల్లా ఉండి ది 21 న సూర్యోదయాది 1 ఘ. 12 విఘ. కు పోయినది. కాన ది. 20 పూర్తిగా ఏకాదశి. అదే శుక్రవారము.

నెం. 1191

1 స్వస్తిశ్రీ [॥] శకవ—

2 రుసంబులు ౧౨౭౧ నేటి శ్రీరాదవీర నరనారసింహ్యదేవ విజ

3 యరాజ్యసంవత్సరంబులు ౨౫ గు శ్రావణను శుక్ల ఏకాదసి

4 మంగళవారమునాండు।

=క్రీ. వె. 1349 డిసంబరు 21 సోమవారము.

మంగళవారము కాదు. ఏకాదశి తిథి సూర్యోదయాది 8 ఘ. 24 విఘ. వర కున్నది.

నెం. 1192

1 శాలివాహన శకేగతాబ్దే ౧౭౭౨ అగు

2 నేటి క్రోధననామ సంవత్సర ఆ

3 శ్వీజ శుద్ధ ౧౫ మి సౌమ్యవాసర—

4 మందు ... ... ...

=క్రీ. వె. 1866 అక్టోబరు 23 బుధవారము.

పౌర్ణమి తిథి 57 ఘ. 36 విఘ లవర కుండెను.

నెం. 1193

1 శకవరుషంబులు ౧౨౫౩ అగునేంటి మేష క్రిష్ణగురు—

2 వారమున ... ... ...

=క్రీ. వె. 1331 ఏప్రిల్ 25 గురువారము.

మేషకృ.౩ సూర్యోదయాది 45ఘ.వర కుండెను.

నెం. 1194

1 శ్రీసకవరుసంబులు ౧౩౭౭ అగు నేటి

2 భాద్రపద సుధ్రతీఆ సనివరన వీరశ్రీ

3 గజపతి గఉడేస్వర ప్రతపకపిళేశ్వర—

4 దేవంకర విజయరజ్య సమస్త ౨౫ స్రాహి...

=క్రీ. వె. 1455 ఆగస్టు 16 శనివారము.

సూర్యోదయాది 15 ఘ. 36 విఘ. శు. 3 తిథి ముగించెను.

నెం. 1195

1 ప్రతాపవీరశ్రీ నరశింహ్యదేవస్యప్రవర్ధ (మా) మాన విజ

2 యరాజ్యసంవత్స ౨ శ్రావ రివభశుక్లపౌర్ణమి సోమ

3 వారమున

=క్రీ. వె. 1335 మే 8 సోమవారము.

సూర్యోదయాది 33 ఘ. 36 విఘ. వరకు పౌర్ణమితిథి యుండెను.

ఈనరసింహదేవు మహారాజుకు ఇదియే మునటి సంవత్సరము.

నెం. 1196

1 స్వస్తిశ్రీ [॥] శకవరుషంబులు ౧౨౬౭ ను నేంటి ప్రతాపవీర

2 బాణుదేవర ప్రవర్ధమాన విజయరాజ్యసం[వ]త్సరంబులు 3

శ్రాఈః భాద్రపద శుక్ల ప్రతిపదాపండితవారము న

=క్రీ. వె. 1354 ఆగస్టు 19 బుధవారము.

శుక్ల ప్రతిప త్తిథి సూర్యోదయాది 52 ఘ. 48 విఘ. వర కుండెను.

నెం. 1197

1 శాకాబ్దేరసపాణినేత్ర ధరణీ సంఖ్యాన్వితే చైత్రకేమాసే

2 శుక్లయుతే దినే ప్రతిపది సూర్యవారాన్వితే

=క్రీ. వె. 1226 చైత్ర శు 1 ఆదివారము.

శుక్ల ప్రతిప త్తిథి సూర్యోదయాది 1 ఘ. 48 విఘ. వర కుండెను.

నెం. 1198

1 శాకాబ్దే గుణశైలవహ్నివసుధా

2 శంఖ్యాయుతే వత్సరే।మాఘే మా

3 సి చ పంచమీగురుయుతేనుంభేస్థితే భా

4 స్కరే।... ... ... ...

దీని తెనుగుతర్జుమాయే ఈక్రిందిశాసనము.

నెం. 1199

1 స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧3౭3 అగు నేంట్టి ప్రజాప

2 తి సంవ్వచరమగ శుక్ల పంచమీ గురువారమను

=క్రీ. వె. 1452 జనవరి 27 లక్ష్మీవారము.

శుక్ల పంచమితిథి సూర్యోదయాది 12 ఘ. వు కున్నది. ది 26 న సూర్యోదయాది 31 ఘ. 48 విఘ. కుంభప్రవేశమాయెను. గాన ది 27 కుంభ మాసములో ప్రథమదినము.

నెం. 1200

1 స్వస్తి[॥]శక వరుషంబులు ౧౨౬౭గు నేంటి ప్రతాప

2 వీరనరనారసింహ్యదేవస్య ప్రవర్ధమానవిజయరా

3 జ్య సంవ్వత్సరంబులు ౨3 శ్రాహికుంభ శుక్ల ప్రతిపద

4 బుదవారాన...

=క్రీ. వె. 1346 ఫిబ్రవరి 23 బుధవారము.

ది 23 న మీనప్రవేశము సూర్యోదయాది 54 ఘ. 36 విఘ. అనగా ది 24 నుండే మీనమాస ప్రారంభము. గాన ది 23 న సూర్యోదయాది 11 ఘ. 24 విఘ. వరకు ఫాల్గుణ శు. ప్రతిపత్తున్నదిగాన ఇదియే కుంభ శుక్ల ప్రతిప త్తని చెప్పియున్నది.

(స శేష ము)

---

## సంప్రార్థనము

సాహిత్యవర్ధనుడు

బలవంతుల్ బలహీనులన్ గడిమిమై బాధించుచో, వారి చే
ష్టల వారింప, నవశ్యమైనం దనుశ్వే జక్కన్ సమర్పింపఁగాఁ
గల సత్త్వంబును ధ్యానమార్గ గొలిపి లక్షల్ కోట్లు జన్మంబు ల
ర్మిలిఁ జేకూర్పఁగదయ్య; లేదుకొద; తండ్రీ! సర్వలోకేశ్వరా!

---

# కవిప్రబోధము

మంగిపూడి వేంకటశర్మ గారు

(వెనుకటిసంచిక తరువాయి)

భాషకు విభూషణము లౌ ప్రబంధమణులె - సభ్యములు గావనుచు ప్రజ చదువకుండ
చట్టములు చేయుప్రభువు లీ చెట్టపొత్త - కాలజోలికి పో రేమి కాలమహిమ?

రాజ్యంబు పరులు చేయగ - పూజ్యంబగు దేశభాష పోషణ లేకే
త్యాజ్యంబగు గవితాసా-మ్రాజ్యంబు నశింపకున్నె మన దేశమునన్.

పాలకులు బాసయాలన - పాలనకనుగోరు ప్రజలు బహుమూఢులు భా
షాలలన కాలవాలము - లాలము మేలగునె మీ కహో, కవులారా!

ఏహో వ్రాయుచునుంటిమి - యేహో ప్రజ చదువుచుండి రిక నేమనుచున్
భావింపక బాగోగులు - దైవముఖము చూచి తలపదగు కవులారా!

ఎన్నెన్ని గ్రంథమండలు - లున్నవి ధన మెంత లాగుచున్నవి జాతీ
యోన్నతిని గూర్చు గ్రంథము - లెన్నున్నవి వీనిలోన నెన్నగవలదే.

ఎచ్చటను నచ్చుకూటము - లెచ్చుగగలవనుచు విత్తమిచ్చుటకెవడో
యచ్చుకొనుననుచు కూటికి - చచ్చుంగృతు లల్లు సాహసము తగ వగునే.

క్రొత్త దిదె గ్రంథ మనగా - నెత్తు ఖరీ దెంత యనుచు నెవరే నడుగన్
బొత్తిగను సిగ్గువాడమదె - పొత్తకముల చెత్తగూర్ప బోలునె మీకున్.

కవులు లేరె పూర్వకాలమం దీలాటి - కల్లపుస్తకముల నల్లినారె
వారిప్రజ్ఞయేమి వారిలోకజ్ఞాన - భాగ్యమేమి వారియోగ్యతేమి?

కవితవారు ప్రౌఢకవివారు శృంగార - కవితవారు చిత్రకవితవారు
మధురకవితవారు మరి బంధకవివారు - దిట్టకవులు మునుపు తెనుగు భువిని.

ఎంత సమర్థత గలిగిన - నంతగ మతసాంప్రదాయకాదుల దీక్షా
స్వాంతు లగుచు సారస్వత - కాంతను పెంచిరి స్వదేశకల్యాణ రతిన్.

ఏవ రేగ్రంథము వ్రాసిన - నవునని బుధులెల్ల మెచ్చి యాదల దాల్పర్
కవిధర్మ మెరిగి శ్రమపడి - వివిధార్థా దర్శములుగ విరచించి రహో!

ఏనాటి కవులో వారల - కీనాటికి నిల్చియున్న కీర్తి యదేమో
లోనెరిగి కీర్తిపరులై - మానక మన పూర్వకవుల మార్గము గొనుడీ.

తిక్కన గంటము నుంచిన - చక్కనియొర కిపుడు గలుగు సామ్రాజ్యతర్కా
అక్కవి కవితయె మూలమొ - చొక్కపు గంటంబొ యొరయొ చూడగ వలదే.

అద్దిర యెవరికివారే - పెద్దలనెడు భావమందు పెరుగుటకతనన్
బుద్ధులెవరు చెప్పినపెగ - సుద్దుల నీకవులు చెవుల జొర నీ రెపుడున్.

రెండు రకంబుల కవు లీ - మండలమున గలరు పూర్వమతమాన్యమతుల్
చండతరనాగరకరతు - లొండొరు భావములు దక్షిణోత్తర ధ్రువముల్.

యతులును ప్రాసములును వ్యా-కృతులు ప్రధానములు కొందరికి, కొందరి కీ
యతులును ప్రాసములును వ్యా-కృతులు ప్రధానములుగావు కృతికర్తలలోన్

తొలి యష్టాదశవర్ణన - ములు నేటి ప్రబంధములకు ముఖ్యంబులుగా
తలపరు మననవ నాగర - కులత్రోవలు వేరు క్రొత్త క్రొత్తరకంబుల్

రెండురకంబులలో నొ-క్కండును తన తోడివాని కవియనగా నొ
ప్పండు గదా తన కంతనె - కొండిక తన మగునొ ఘనతకును కొరతగునో.

రసమును నౌచితియుగల స-రసకావ్యము నరసిరేని రచయితమతి కీ
రసపడి మతిచెడి యతినీ - రస మీకృతి యంద్రుగాని శ్లాఘింప రినీ!

రకముగ నెవరో యొక పు-స్తకమును రచియించి చూప సంతసపడి యా
సుకవికి ప్రోత్సాహకముగ - నొకమాటాడగ సహింతు రొకొ తెనుగు కవుల్.

ఛందోలోపము లెంచియొ - యెందో వ్యాకరణదోష మెంచియొ గ్రామ్యం
బం దున్న దనియొ రేఫల - చందములకొ వాదులాట సలుపుదు రకటా.

కవులనిపించుకొనగమ - క్కువ లుండిన మాత్ర గవు లగుదురే తగు స
త్కవులకు గల విధివిహితము - లెవియో తెలియంగ వలవదే కవులారా.

కవి యన్నన్ వివిధార్థము - లవనిన్ గలవందు సార్థకాఖ్యం గను నా
కవియే కవియగు నితరుడు - భవి యగు నిజమాతృగర్భపవి యగుజుండీ!

ఊరూరను నింటింటను - నూరారులు కవులు గలరు నుడుగులచెలి నూ
రారిచికలర్కఁ దేరిచి - తీరుచు వా రెవరు లే రిదేమి తెలివియో!

తెనుగుకవుల బిరుదుల నె - న్నిన సురకవికైన గర్భనిర్భేద మగుఁ
బని బూని పరీక్షించిన - ఘనప్రతిభ మందుకైన గనరా దెందుఁ.

తిక్కనకు తిక్క విడిపింప దివురువారు - అభిన వోభయ కవిమిత్రు లైనవారు
సహజపాండిత్య సంజ్ఞాప్రశస్తివారు - తెలుగునాడుకవులు నేడు వెలసినారు.

ఆశుకవిచక్రవర్తు లష్టావధాన - శతవధాన విధానులు సత్ప్రబంధ
కరణదక్షు లనేకులు గలరు గాని - తెనుగునకు గల్గులోపముల్ దీర్ప రెవరు.

ఎందరో కావ్యతీర్థులు నెందరో పు - రాణతీర్థులు నాంధ్రసరస్వతులును
నాంధ్రవాచస్పతులు గల రందరున్న - తెలుగుబాసకు దైన్యంబు తొలగదేమొ.

కవులంట బాలకవులట - నవకవులట యువకవు లభినవకవులటహో
కవకవులట తెలుగుభువిఁ - కవితకుగల భాగ్య మెన్నగా దరమగునే.

కవివయసుతో పనేమీ - కవిపాండిత్యంబుతోడ గలపని యేమీ
కవిరచనలు దేశాభ్యుద - యవిశేష విభూషితంబు లవు నవియైనఁ.

బాలకవులె కాదు పాలబుగ్గలనిగ్గు - ధారలైన వగ్గు వారలైన
దేశజనులతృష్ణ దీర్చెడునట్టి సం - దేశ మిచ్చువారె దేవసములు.

భావకవులెయైన భావజ్ఞకవులైన - దేశనష్టి పుష్టి తేటపరచు
కావ్యరత్నములనె కల్పించి దేశక - ల్యాణదాతలై చెలంగవలయు.

---

# అహదనకరతామ్రశాసనము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

## అవతరణిక

ఆంధ్రవాఙ్మయాభ్యుదయమునకై యాయువ్యము ధారవోసి కీర్తిశేషులయిన కె. వి. లక్ష్మణరావు పంతులుగారు, నేఁటి కాఱేండ్లకుమునుపు ఆంధ్రపరిశోధకమండలీ పంచమవార్షికోత్సవాధ్యక్షోపన్యాసమున ఈయహదనకరతామ్రశాసనమును గూర్చి కొంతసంభాషించిరి ఫ్లీటుదొరగారు ఇండియన్ ఆన్టిక్వెరి XIII వాల్యూంలో ప్రకటించిన పయిశాసనము తెలుఁగుభాగము దురవబోధముగ నున్నదనియు, దాని కర్థమును గనుఁగొనుటకయి నీచునుండి దానిప్రతిబింబముల మరలఁ దెప్పించి చూచితిమనియు, ఫ్లీటుదొరగారు ప్రకటించిన ప్రతిబింబములకును వానికిని భేదము లేదనియు, నందుఁ గొంతభాగమున కర్థము చేసికొంటి మనియు, నింక నెవ్వరికైన నేమైన దానియర్థము దెలియవచ్చెనేని దానిఁ దమకుఁ దెలుపఁగోరుచుంటి మనియు వా రప్పుడు వ్రాసిరి. ఆశాసనపుఁ దెలుఁగుభాగముపాఠమును గూడ నపుడు వారు ప్రకటించిరి. కాని దానిని కడముట్ట నర్థము చేసికొని ప్రకటించుట జరగకమునుపే యాంధ్రదేశభాగ్యలోపమున వారు పుణ్యలోకమునకుఁ బోవుటయ్యెను. వారియుపన్యాసమునకు సమకాలముననే శ్రీ సోమశేఖరశర్మగారును నాశాసనమున తెలుఁగుభాగముమాత్రము రాజనరేంద్రపట్టాభిషేక నవతితమపట్టాభిషేకవర్షోత్సవోపన్యాససంపుటమునఁ బ్రకటించిరి. వారిర్వురును నట్లు ప్రకటించుటచేతనే నే నాశాసనము నెఱిఁగితిని. అర్థావబోధమునకై యటతటంపడితిని గాని నా కప్పు డందుఁ గొన్నికొన్ని పదములకే తెలిసెనుగాని తుదదాఁక నర్థము తోఁపదయ్యెను.

అప్పుడు నాకుఁ బ్రాచీనచాళుక్యలిపిపరిచయము మిక్కిలి తక్కువ. పయిమిత్రులిర్వురును తెనుఁగక్షరముల తోఁ బ్రకటించినపాఠములను బట్టుకొనియే పరిశీలించితిని గాని మూలమును జదువఁజాలమిచేఁ జూడనయితిని. ఇటీవల నే నాలిపి నేర్చుకొంటిని. దాని నేర్చుకొనుటలో రెండుమూఁడుతడవ లక్కడక్కడ సోమశేఖరశర్మగారు నా కుపదేశకు లయిరి. పిదప పదింబదిగాఁ బ్రాచీనశాసనములఁ జదువుటలో ఫ్లీటుదొరగారు,కృష్ణశాస్త్రిగారు మొదలగువారు పఠించిన యక్షరసంకేతములందు నాకు గొన్ని సందేహములు పొడమెను. ఆ సందేహము ప్రాచీనశాసనములఁ జదువను జదువను నాకు బలపడసాగెను. ఇట్టిపట్టున ఫ్లీటుదొరగారు ప్రతిబింబములతోఁ బ్రకటించిన 'అహదనకర'శాసనమును జదువఁ గుదిరెను. అక్షరసంకేతములనుగూర్చి నేను చెందుచున్న సందేహములకు స్థానము లిందును గలవు. ఫ్లీటుదొరగారు చదివినతీరునఁ జూడఁగా దురవబోధములుగా నున్న పదములకు నేనంతకుఁ గొంతకాలముననుండియు సందేహించుచున్నట్లు క్రొత్తతీరునఁ జదువఁగా నర్థము గుదిరెను. మఱియు నే నంతకుఁబూర్వముననుండియు సందేహించుచున్న విధమునఁ జదువుటే సరి యనుటకుఁగూడ దీనిసాధన మందు దొరకెను. ఎట్టకేల కిట్టిట్లో తుదముట్ట శాసనమున కర్థమును గుదుర్చుకొంటిని.అది యిందుఁ దెలుపుకొందును. ప్రాజ్ఞు లింకను బరిశోధింపఁగలరు.

## శాసన స్థితి

ఫ్లీటుదొరగారు ఇండియన్ ఆంటిక్వెరీ ౧౩ వ వాల్యూంలో దీనిని బ్రకటించుచు నిట్లు వ్రాసిరి: "మద్రాసు ప్రెసిడెన్సీలోని అహదనకరముననుండి సంపాదితమై సర్ వాల్టర్ ఇలియట్ కె. సి. యస్. ఐ. గారి యొద్ద నుండిన మూలపురేకులఁబట్టి యీశాసనము ప్రకటింపఁబడినది. వారు దానిని బ్రిటిష్‌మ్యూజియమున కొసఁగిరి. అవి యైదురేకులు. పొడుగు 8¾; వెడల్పు 2⅞ అంగుళములు. వీనిలో కడపటిరేకు వట్టిది. దానికి రెండువైపులఁగూడ వ్రాఁతలేదు. అది బహుశః క్రమ్మఱ

చేర్పఁబడియుండును. మొదటిరేకు, నాల్గవరేకు, వెలుపటి ప్రక్కలందు వ్రాఁతలేకయే యున్నవి. కావున నీయైదవ రేకునందుకై చేర్ప నక్కఱలేదు. రేకులయంచులు ప్రక్క ప్రక్కలకుఁ గొంచెము సాగఁగొట్టఁబడినవి. శాసన మే మాత్రమును జెడక మంచిస్థితిలో నున్నది. దాని వలయము రాగిది. చిక్కఁదనము 1/3, అంగుళము. మధ్య కొలత 3¾ అంగుళములు. ఈ వలయము శాసనము నాకుఁ జిక్కు నాఁటికే తెగఁగొట్టఁబడి యున్నది. తొలుత దీనికి ముద్ర అదికింపఁబడి యుండును. 17 బంతివఱకు శాసనభాష సంస్కృతము. అటుపైఁ దుదిదాఁకఁ దెలుఁగు. శాసనలేఖనమున వర్ణక్రమము సరిగా లేదు. ఇది సత్యమైనన దామని నే ననుకొనఁ జాలను. శాసనము అసంపూర్తిగా నున్నట్టున్నది. వ్రాయనలసినవిషయ మింకను నుండఁబోలును. ఇది చాళుక్య విష్ణువర్ధనులలో నాల్గవవానిదో, అయిదవవానిదో అగును. ఆయిద్దఱిలో నెవ్వనికిఁ జెందినదో స్పష్టముగా జెప్పఁజాలను.1 శాసనమునఁ గాలనిర్దేశము లేదు. తెలుఁగుభాగమును నేను బరివర్తింపఁజాలనయితిని. మఱియేవిధముననుగూడఁ దాని పరివర్తనమును బడయఁజాలకపోయితిని. ఇది పృథివీపల్లవపట్టణమందలి విష్ణువర్ధనుని దానమునుగూర్చియైనను అక్కడివారగు నితరులదానమును గూర్చియైనను, జెప్పునదిగానుండును."

ఫ్లీటుదొరగారిచేతికి వచ్చునాఁటికే దీనివలయము తెగఁగొట్టఁబడి యున్నదనుటచే నంతకుఁ బూర్వమే బర్గెస్‌దొరగారు దీనిఁ దెగఁగొట్టి ప్రతిబింబములఁగైకొనిరని తలఁపఁదగును. ఇందు వ్రాఁతగల యాఱువైపుల లోను తొల్తటి మూఁడువైపులు, వైపు కై దేసిబంతులును, ఇంచుమించుగా బంతికి28 అక్షరములును గలవైయుండఁగాఁ దర్వాతి మూఁడువైపులు వైపుకు ఏడేసిబంతులును, 32 అక్షరములును గలిగియున్నవి. మొదటి మూఁడువైపులలో సంస్కృతభాగము గలదు. అది పెద్ద యక్షరములతోఁ దూరదూరముగా విస్పష్టముగా నున్నది. తర్వాతి మూఁడువైపులలోఁ దెలుఁగుభాగము గలదు. అది చిన్నచిన్న యక్షరములతో జిలుగై వ్రాఁతతప్పులు హెచ్చుగా గలదై యున్నది. అర్థక్లేశము గల తెలుఁగుపట్టు ముడివ్రాఁతతో అజాగ్రత్తగాఁ జెక్కఁబడినది. అక్షరలోపములు గలవు. ఇలియట్ దొరగారు శాసనమును సంపాదించిన గ్రామ మగు 'అహదనకరము' ఎక్కడకలదో తెలియకున్నది.

ఫ్లీటుదొరగారీశాసనమును అయిదవ విష్ణువర్ధనుని నాఁడు వెలసినదానిఁగాఁ దలఁపఁగా సోమశేఖరశర్మగారు మూఁడవవిష్ణువర్ధనునినాఁట వెలసినదానిఁగాఁ దలఁచిరి. అట్టితలఁపునకు పెక్కుకారణములను శర్మగారు పేర్కొనిరి.2 వారు తెలిపినకారణములాశాసనము మూఁడవ విష్ణువర్ధనునిది గాఁదగు ననుటకు సాధకములే కాని అయిదవ విష్ణువర్ధనునిదిగూడఁ గావచ్చు ననుటకు బాధకములు గావు. అయినను శర్మగారు తెలిపినకారణములను బట్టియు శాసనమందలి తెలుఁగుబాస తీరునుబట్టియు నేనుగూడ మూఁడవ విష్ణువర్ధనునినాఁటిదే కాఁదగు నని తలఁతును. కాని యయిదవ విష్ణువర్ధనునినాఁటిదనుట కీశాసనమున నొక క్రొత్తసాధనము నాకు గోచరించినది. సాతలూరి తామ్రశాసనమున 3 అయిదవ విష్ణువర్ధనునికి 'కరిగల్ల' బిరుదమున్న ట్లొకశ్లోకము తెల్పుచున్నది. "గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః, వరకరిగల్ల భూమిపభుజాసిరిపోజిభుజప్రభాసతే" అని. ప్రస్తుతశాసనమునఁ గూడ 'కరిగల్ల పృథివీమహాసత్త్వ' నామము గలదు. దీనినిబట్టి యీశాసనము అయిదవ విష్ణువర్ధనునినాఁటి దని తలఁచుట సంగతమగును. మూఁడవ విష్ణువర్ధనునికిఁ గూడ నీబిరుదుండుట వ్యక్తమయ్యెనేని యిది మూఁడవ విష్ణువర్ధనునినాఁటిదే యని నమ్మవచ్చును.

---

1. ఇక్కడనట్లు వ్రాసినను అన్యత్ర ఈశాసనము అయిదవ విష్ణువర్ధనునిదేయని వ్రాసిరట.

2. భారతి 1-వ సంపు. 12-వ సంచిక.

3. శ్రీలక్ష్మణరావుగారు దీనిని భారతి మొదటిసంపుటము మొదటి సంచికలోఁ బ్రకటించిరి.

ఈశాసనము సమగ్రముగా 'ద్రవిడసంస్కృత శాసనములు' అను గ్రంథమున బర్గెస్‌దొరగారుగూడ ప్రకటించిరట కాని దాని నేఁ జూడలేదు. శ్రీ సోమశేఖరశర్మగారు బర్గెస్ దొరగారు పఠించిన పాఠమునే పట్టాభిషేకపు సంచికలోఁ బ్రకటించినట్లు తెలిపిరి. శ్రీ లక్ష్మణరావుగారు స్వయము ప్రతిబింబములను జదివి వ్రాసిన పాఠమును ఫ్లీటుదొరగారిపాఠముతో సరిచూచి ప్రకటించినట్లు తెలిపిరి. కాని ముద్రణ ప్రమాదముచేతఁ గాఁబోలును. లక్ష్మణరావు గారు ప్రకటించిన పాఠమున శాసనమందలి రెండుబంతుల యక్షరములే లేకున్నవి. తక్కినదానిలో ఫ్లీటుదొరగారు చదివిన పాఠముతో భేద మంతగాలేదు. బర్గెస్‌దొరగారి పాఠమునకు, ఫ్లీటుదొరగారిపాఠమునకుఁ గూడ భేద మంతగాలేదు.

ఇందు ఫ్లీటుదొరగారు ప్రకటించిన ప్రతిబింబము బట్టి నేను జదివిన పాఠమునే ప్రధానముగాఁ జూ చున్నాను. ఆపై ఫ్లీటుదొరగారి, లక్ష్మణరావుగా శర్మగారి పాఠభేదములను దెలుపుదును. సంస్కృతభా మున నంతగాఁ జిక్కులు లేవు. తెలుఁగుభాగమే ము మయినది. అందే నేను వేఱువిధముగాఁ జదువుటకుఁ గ యానశ్యకతను ఆధారములను ముఖ్యముగాఁ జే దును.

ఇందు నేను సంస్కృతభాగమునకుమాత్రము స స్కారముల నధోజ్ఞాపికలో సూచించితిని. తెలుఁగుభా గమెల్ల సందేహసంకులమై యున్నదిగాన దానిలో నాసంస్కారములుగూడ సందేహగ్రస్తములే యగు వానిని అర్థవివరణప్రసక్తిలోఁ జెప్పుదును.

## మూ ల ము

### మొదటిరేకు: రెండవప్రక్క

౧ స్వస్తిశ్రీమతాం సకలభువన సతూ[1]యమాన[2] వ్యసగోత్రాణం[3] హారి

౨ తిపుత్రాణాం కోశికి[4]వరప్రసాదలబ్ధరాజ్యానా[5] మాతృగణ ప్రారిపలి[6]

౩ తానాం [[7]స్వా]మి మహాసేన. పాదానా[8] [9] [10]...నాం భగవన్నారాయణప్ర

౪ సాదసద[11]సమాసాదిత వరా[12]వరాహలాఞ్ఛనా[13] క్షణక్షణవశీకృ

౫ త[14]రాతి [[15]మ]ణ్డలానాం అశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత వపుషం[16]చా

### రెండవరేకు: మొదటిప్రక్క

౬ ళుక్యానాం క[17]లమలంకరిష్ణో స్వా[18]సిధారా ప్రభావావర్జితా శే[19]ష మహీమణ్డల

౭ స్యశ్రీవిష్ణువర్ద్ధన మహారాజన్య[20] భ్రూభాం[21]గమాత్రవిఘాత స[22]మాస్తారాతిమణ్డలస్య

౮ [23]కారిణ [24]అనేకతులాధృత శాతకుమ్భవిశ్రాణనవదాతశరీరస్య శ్రీవిజ

౯ యాదిత్య మహారాజస్య ప్రియతనయః చక్రవర్తి[25] లక్షణోపేతః చక్ర

౧౦ ధరఇవ లక్షీ[26]వల్లభః భాస్వా ని[27]త్యోపజాయమానోదయః చన్ద్రఇవ జ

1. సంస్తూ, 2. 'మాన(మాన)వ్యస', 3. ణాం, 4. కౌశికీ, 5. నాం, 6. పరిపాలి, 7. అస్పష్టము, 8. నా 9 'దా'కు దీర్ఘ మును కొమ్మను గలవు. 10.'న' క్రింద వింతతీరుబత్తు కలదు. దీనిచర్చ ముందురాఁగలదు. 8,9,10.అక్షర ములు 'నుధ్యాతా' అని యుండవలెను. 11. 'సద' ఈ రెండక్షరములను దొలఁగింపవలెను. 12. ర, 13. 'నానాం' లేక, 'నే' 14. తా, 15. 'మ' ఉండఁదగినది. ఏదో వికారపులిపి గలదు. 16. షాం. 17. కు, 18. 'ఃస్వా' 19. శే, 20. 'ప్రౌ' ఉండవలెను. 21. భం, 22. మ, 23. దీనికిఁబూర్వ మేదోపదముండవలెను. 24. ణః, 25. ర్తి, 26. క్ష్మీ, 27.

రెండవ రేకు: రెండవ ప్రక్క

౧౧ గదాహ్లాదనకరః సురగజఇవ దానవషి[1] జలనిధిరివ గమ్భీరసత్వః[2] యుధిష్ఠిరఇవ
౧౨ భీమసేనాన్వితః కా[3]ర్థికేయఇవా ప్రతిహతశక్తిః శక్తిత్రయోపేతః చతస్నృషున్నృ
౧౩ షవిద్యాసు విచక్షణః యుద్ధేషువిషమసిద్ధిః అర్థి[4]జనే కామధేనుః స్త్రీషు మ
౧౪ కరధ్వజః రిపుతిమిర విధ్వంసనే ప్రలయాదిత్యః జ్వలత్ప్రితాపానలజ్వాలావలీ
౧౫ ఢరిపున్నృపాః ప్రుషపవనః[5] విజిగిషు[6]ర్ధర్మ్మవిజయీ పరమబ్రహ్మణ్యః పరమా[7]హే

మూడవ రేకు: మొదటి ప్రక్క

౧౬ శ్వరఃసర్వలోకాశ్రయశ్రీవిష్ణువర్ధనమహారాజఃరాష్ట్రికూటప్రముఖాన్ కుటు[8]మ్బినః స
౧౭ ర్వ్వానిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వోస్మాభిః స్వస్త[9] ప్రిధివీపల్లవపట్టనబున ఊరి
౧౮ వారు కరిగళ్ళ వడవరికి ఊరిస్వాముళ్ ఇచ్చిన స్తితి రెణ్డువాడలపట్టనాపురకు
౧౯ అరియు డగు తెఱెయు సిద్ధాయంబు దణ్డదసపరాధంబును సర్వ్వబాద ప
౨౦ రియారువు ఊరుదాయసేసి ఇచ్చి దీనికి వక్రంబు లేదు వచ్చినవారు గళరేని ఉరి స్తితి
౨౧ దప్పినవారు దీనికి వక్రంబువచ్చిన గచ్చురు రెణ్డువడల ఏలే మువరు లేములచే
౨౨ సినదియు చన్ను వీరిపయినాడువరు గళ్గిన ఏళేముళ చేసిన సేయుడు సను

మూడవ రేకు: రెండవ ప్రక్క

౨౩ మహానబియుళ్ నరాళోక మహాసత్థవుళ్ విరాపవ మహానబియుళ్ గజ్జంబు సె
౨౪ డ్లనడుపుళ్ శమస్తభువనశ్రియ కనడిరజు బద్రపెరెయ ఊరిపనిన ప్రసివర
౨౫ వయ్యేటి మాహానభిళ్ వయ్యేటి మహాభిళ్ పనికొళు చేనేరక పఞ్చినప్రసి
౨౬ వయ్యేటి మహానభియుళ్ మరల కొన్డుకళ్ సవ్వలోకశ్రయ మహాసత్థవళ్
౨౭ పెర్దాళ్ నెరవద్యమహాసర్థవళ్ పసిణ్డిముడ్లు వెటన్దలచరువయ్య విష్ణువర్ధన మ
౨౮ హాసత్థవళ్ పసుత్మేవుల కొన్డుకళ్ అచ్చకుఱ్ఱవనియు కొన్డుకళ్ గజ్జ సెడ్లల
౨౯ నడుపుళ్ ప్రిథిమిమహాసర్థవళ్ వెటన్దళ్ పొనికన్డిఅము కొళనడుపు విష్ణువర్ధన

1. షీః; 2. త్త్వః; 3. ర్తి; 4. ర్థి; 5. 'నృపాభ్రపవనః' అనియుండునేమో! 6. గీషు; 7. మహా; 8. టు; 9. స్తి.

నాల్గవ రేకు: మొదటి ప్రక్క

౩౦ మహాసత్థవల కొన్డుకలు నిరవద్యప్రిథివి కనడిరజుళ్ గునవన మహానభియుళ్
౩౧ ముద్దకఞ్చికొళ్ రమిస్వరా ప్రిథివీమహాసర్థ౯వళ్ అపయజనువకొల కొన్డుకళ్ కొరిన్దికొ
౩౨ కరిగల ప్రిథివీమహాసత్థవల కొన్డుకళ్ నన్దిమహానవిలనడుపు శ్రీమహా
౩౩ సత్థవళ సకలోకశ్రయ్య ప్రిథివీమహాసర్థ౯వల దివకరయ్య పఞ్చ
౩౪ కొళ్ శ్రీ జప్టి పెన్దటట్ల గడ్డాన్డు.

## సమన్వయము

ఇందు నాలవబంతిలో "లాఞ్ఛనాతుణతుణ" అనుదానిని 'లాఞ్ఛనేక్షణక్షుణ' అని ఫ్లీటుదొరగారు సంస్కరించిరి. మఱికొన్ని చాళుక్యశాసనములందు నిట్లు గానవచ్చుచున్నది. కాని నేను "లాఞ్ఛనానాం క్షుణక్షుణ" అని యుండఁదగు ననుకొందును. మఱియు ౭ బంతి మొదట 'కారిణః' అనుదానికిఁ బూర్వ మేదో యుండవలెనని నేననుమానించితిని. ౯ బంతిలో 'చక్రవర్థిలక్షణో' అని ఫ్లీటుదొరగారు చదివి యందు 'వర్తి౯' అని సంస్కారముచేసిరి. ఈశాసనమున ౧౮ బంతిలోని 'ఇత్థ' అనుచోటి లిపి చిహ్నమును బట్టి యిది తకారముక్రింద థకారముగాఁ జదువఁదగినదే యున్నది. నేను నట్లే పఠించితిని. కాని యిందు లిపికారుఁడు పెక్కుచోట్ల సంయుక్తాక్షరములందు ద్వితీయహల్లగు 'త'కారమున కిట్టి లిపి సంకేతమునుగూడ నుంచెను. మఱియు సంయుక్తాక్షరములందు ద్వితీయ హల్లగు 'థ'కారము నింకొకవిధమున నుంచెను. కాన ఈసంయుక్తాక్షరమందలి ద్వితీయహల్లును 'త'కారమునుగాఁ గూడఁ జదువఁదగును. ౮వ బంతిలో 'విష్ణువర్ధ౯న', ౧౩వ బంతిలో 'యుద్ధేషు', 'సిద్ధిః', ౧౫వ బంతిలో 'గీషుద్ధ౯ర్మ', ౧౬వ బంతిలో 'సిద్ధా' అనువానిలో 'ధ'కారలిపి వేఱుతీరుగా నున్నది. మఱియు ౧౨వ బంతిలో 'కార్తికేయ', ౧౩వ బంతిలో 'అర్తిజన', ౨౫,౨౬,౨౮ బంతులలో 'సత్తవళ్' అని కూడఁ జదువవచ్చును. కాని సంయుక్తహల్లులలో ద్వితీయహల్లుకారమునకు నేటి 'ఒత్తుతకారము(ౖ)'వంటి లిపి చిహ్నముగూడ నిందుఁ గలదు. ౧వ బంతిలో 'స్వస్తి', ౧౨వ బంతిలో 'శక్తి' ఇత్యాదులు చూడఁదగును.

౧౦వ బంతిలో 'భాస్వానిత్యోపజాయమానోదయః'అనుచో ఫ్లీటుదొరగారు 'భాస్వానివోప' అని సంస్కారముచేసిరి. నేను 'భాస్వానివనిత్యోప' అని చెప్పి సంస్కరించితిని. ౧౫వ బంతిలో 'రిపునృపాశ్రుపవనః' అనుచో 'రిపునృపః', 'శీఘ్రపవనః' అని దొరగారు సంస్కారముచేసిరి. నేను 'రిపునృపాశ్రుపవనః' అగునేమో అనుకొంటిని. ఇంతవఱకు సంస్కృతభాగమున సంస్కారవిశేషములఁ దెల్పుకొంటిని. ౧౭వ బంతి సగమువఱకు నిట్లు సంస్కృతభాష గలదు. దానికి నేను క్రొత్తగా నర్థము వివరింప నక్కఱ యుండదు.

తరువాతి తెలుఁగుభాగమే కొఱుకఁబడదు. దానికిఁ దాత్పర్యార్థము నీక్రిందివిధముగా నేను గ్రహించితిని.—

"పృథివీపల్లవపట్టణమనే గ్రామమున వెలసి యున్న 'కరిగల్ల వడవరు'అనేదేవరకు ఆగ్రామాధిపతులు ఆయూరిలోని రెండువాడలపట్టునకు లేక రెండువాడల పట్టణమనే పేరుగల వేఱొకయూరికి, అరి, తగ్గు, తెలె, సిద్ధాయము, దండు, దశాపరాధము అనే పన్నులను సర్వబాధలను పరిహరించి, ఆయూరిని దానముచేసి ఇచ్చినారు. దీనికి అడ్డులేదు. అడ్డు వచ్చినవారు ఉంటిరా వారు ఊరిలో ఉనికిని (ఊరిలో జీవికను) దప్పినవారగుదురు. దీనికి అడ్డువచ్చినయెడల (వాంఛదవిషయమున) ఆ రెండువాడలను (పృథివీపల్లవపట్టణమందలి భాగమునో,

లేక రెండువాడలనే వేఱొక (గ్రామమునో) పాలించునట్టి ముగ్గురు అధికారులు ఏమిచేసినను చెల్లును. అంతేకాక ఆయధికారులమీఁద తప్పునాడువా రెవరైనకల్గిరేని (వారివిషయమునఁగూడ) ఆ యధికారులు చేసినచేఁత చెల్లును." (ఇంతటితో మూఁడవరేకు మొదటిప్రక్క ముగిసినది. మూఁడవరేకు రెండవవైపునను, నాల్గవ రేకు మొదటివైపునను దానముచేసిన యాయూరి స్వాముల పేళ్లున్నవి.)

సాధారణముగాఁ జాళుక్యరాజుల సంస్కృతశాసనములందుండు మకుటమే యీశాసనమునను గలదు. కాని కొంతభాగ మయినతర్వాత భాష తెలుఁగుగా మాఱుటచేత, మతలబుకూడ కొంతమాఱినది. 'విదిత మస్తువోఽస్మాభిః—' అన్నంతవఱకు సంస్కృతమున నున్నది. 'అస్మాభిః' అన్న తృతీయాంతమునకు సాధారణముగా చాళుక్యశాసనములందు (ఫలానివాని కింతభూమి) దత్తమ్ (ఇయ్యఁబడెను) అనుపదముతో నన్వయ ముండును. ఇందు 'అస్మాభిః' తర్వాత తెలుఁగుగలదుగాన దానికట్టియన్వయము పొసఁగదు. కాన యిందు 'మాచేత మీకు విదితమగుఁగాక' అని యర్థముచెప్పి యన్వయము పొసఁగించుకొనవలెను.

మీఁదఁజెప్పిన తాత్పర్యార్థమున కించుక వివరణము:—మూఁడనవాఁడో నాల్గవవాఁడో అయిదవవాఁడో 'కరిగళ్ల' బిరుదాంకుఁడు చాళుక్యవిష్ణువర్ధనుఁడు (బెజవాడరాజధానిగా) రాజ్య మేలుచుండఁగా నాతని రాజ్యములోని పృథివీపల్లవపట్టణమున (పల్లవపట్టనమే నేఁడు 'పల్లపట్టు, పల్లపట్లు' అని పేర్కొనఁబడుచున్న గ్రామమని నేఁ దలఁచుచున్నాను.) కరిగళ్లవడవ అను పేర దేవప్రతిష్ఠ జరగెను. దక్షిణభారతదేశమున నీవిధమున ననేకదేవప్రతిష్ఠ లానాఁడు జరగినవి; నేఁటికిని జరగుచున్నవి. చాళుక్యభీమరాజు తనపేర భీమేశ్వరలింగములను, నాలయములను నిర్మించెను. చాళుక్యనరేంద్రమృగరాజు తనపేర నరేంద్రేశ్వరలింగములను, ఆలయములను నిర్మించెను. కాకతీయ గణపతిదేవుని పేర గణపేశ్వరలింగములును, ఆలయములును నిర్మితము లయ్యెను. వెలనాటి చోడభూపాలుని పేర చోడేశ్వరలింగములును, ఆలయములును నిర్మితము లయ్యెను. హైహయాన్వయుఁడగు ననుఁగుఁగామరాజు పేర నిష్టకామేశ్వరలింగములును, నాలయములును నిర్మితము లయ్యెను. ఇట్లెన్నింటినేని పేర్కొనవచ్చును. 'కరిగళ్ల' బిరుదాంకుఁ డయిన చాళుక్యరాజు (ఈ బిరుదు ఐదవ విష్ణువర్ధనునికిఁ గలదని మన కిప్పటికిఁ దెలియును.) తన పేరఁ దనరాజ్యములోనిదగు పల్లవపట్టణ (పల్లపట్ల)మున ఆయూరియజమానులట్లు దేవప్రతిష్ఠ చేసి, ఆయూరిలోని కొంతభాగమునో, లేక, రెండువాడలను పేరుగల గ్రామాంతరమునో ఆదేవరకు సర్వకరపరిహారముగా ఇచ్చిరి. దేశాధీశ్వరుఁడగు నావిష్ణువర్ధన మహారాజు దానికి సమ్మతించి, తనయంగీకారము నీశాసనము మూలమున వెల్లడించెను. ఆయూరియజమానులే దీనిని సాగించినవారగుటచే నీశాసనమున వేఱుగా "ఆజ్ఞప్తి" ప్రసక్తి యక్కఱలేకపోయెను. ఈ పుణ్యకార్యము సాగించిన 'యూరిస్వాముల' పేళ్లు పెక్కు లీశాసనమునఁ జెప్పఁబడినవి. మహారాజు పేరనే దేవప్రతిష్ఠ జరగెనుగాన యీ ధర్మనిర్వాహకులలో మహారాజుగాక యాతని (కరిగళ్లపృథివీమహాసత్త్వుల) కొమారుఁడును, తద్బంధూద్యోగిసంఘమును నీశాసనమునఁ బేర్కొనఁబడిరి. దానప్రశంసాపరములయిన శ్లోకములు—సర్వశాసనసాధారణములు—దీనఁ గానరాకుండుటచేతను, శాసనసమాప్తిసూచకమైన వ్రాఁత లేకపోవుటచేతను, తుదను వ్రాఁత లేకుండ మూఁడువైపులకు మించి రాగిరేకులుండుటచేతను, శాసనమున నింకను వ్రాయవలసినవిషయ ముండెనేమో, ఏకారణముచేతనేని అది వ్రాయకుండ విడువఁబడెనేమో అనికూడ తలఁపఁదగును. ఫ్లీటుదొరగా రీశాసనమునే నమ్మరానిదానిఁగాఁ దలఁచిరి. అట్లు తలఁపఁదగ దనుకొందును.

## పద, పదార్థ నిర్ణయము

ప్రిథివీపల్లవపట్టనబున—'పృథివీ'పదము ప్రాచీన చాళుక్యశాసనములందు బిరుదప్రాయముగాఁ గానవచ్చును. చాళుక్యశాసనములందే 'దువరాజు'కు 'పృథివీదువరాజు', 'పృథివీపోథి' (మంగియువరాజు కూఁతురు) ఇత్యాదులందు చూడఁదగును. బిరుదప్రాయమయిన 'పృథివీ'పదమును విడువఁగా 'పల్లవపట్టనబు' అయినది. అది 'పల్లపట్లు' అని, నేఁడు పేర్కొనఁబడు గ్రామమంటిని. ఇది

రేపల్లె తాలూకాలో నున్నది. 'పట్టనంబు'కు 'పట్టనబు' అని రూపాంతరమగుటను కడచిన భారతిలో 'నాగబు' పరిశీలనమునఁ దెలిపితిని. నేఁటి కిట్టిరూపములు మాసిపోయినవి. కాని 'గారాబు' మాత్రము మిగిలినది. పట్టనము, పట్టణము, పత్తనము అని రూపములు గలవు. కొందఱు 'పట్టణ' రూపము తప్పందురు. దీనిఁగూర్చి నే నింతకుముందు ప్రభావతీప్రద్యుమ్న వ్యాఖ్యా విమర్శనమునఁ గొంతచర్చించితిని. తిక్కనసోమయాజులవారు దానిఁ బ్రయోగించిరి. "క. రణవిజయముగైకొని పట్టణముద్భట సుభటసంకటంబుగ-" నిర్వ-ఉత్తరశా. ప్రాకృత భాషలలో 'పట్టణ' రూపమే కలదు. "నాభిరేవతు యద్గమ్యం పట్టణం తన్నిగద్యతే"—అర్థశాస్త్రము. ఈ పట్టణము పల్లవులచే నిర్మితమై యుండును.

ఊరివారు కరిగళ్ల వడవరికి—ఊరివారైన కరిగళ్ల స్వామికి-అని యర్థము. విశేష్యము షష్ఠ్యంతముగా నుండఁగా విశేషణము 'అగు' ధాతుసంబంధము లేకే ప్రథమాంతముగాఁగూడ నుండుట ప్రాచీనభాషా సంప్రదాయము. "విద్యారాజీశుభవుంశు మారయకుఁ బుణ్యాచార భీమాంబకున్"—శృంగారనైషధము. 'కరిగళ్ల' పదమున కర్థమేమో సరిగాఁ దెలియదు. ఈపదము సాతలూరి తామ్రశాసనమున 'కరిగల్ల' అనికలదు. మనయీశాసనముననే 3 అవ బంతిలో 'కరిగల' అనికలదు. 'కరిగల్ల' పదమునకు 'ఏనుఁగుచెంప' అని యర్థ మగును. 'ఏనుఁగులచెంపలు గొట్టువాఁడు' అనునర్థమున 'కరిగల్ల తాడన' ఇత్యాది విధమున నుండవలసిన బిరుదమున కిది నామైకదేశగ్రహణము వలని రూపమేమో! 'వడవరు' అనుపదము 'ఉడయవర్' అను ద్రవిడపదముననుండి పుట్టినది. దానికి 'వేల్పు' 'స్వామి' అని యర్థము. అది ప్రాయికముగా నీశ్వరునికిఁ జెల్లుచున్నది. ఇది యొక మనుష్యుని పేరని తలఁచుట యంత సంగతముగా నాకుఁ దోఁపకున్నది.

ఊరిస్వాముళ్—ఊరియజమానులు, వీరి పేళ్లె మూఁడవరేకు రెండవప్రైపున, నాల్గవరేకు మొదటిప్రైపున కలవు.

ఇచ్చిన స్తితి— ఇచ్చినవృత్తి: స్థితియనుట కు స్తితి. ఈపద మీయర్థమున నింకను గొన్ని శాసనములం దుండుటను శ్రీ సోమశేఖరశర్మగారు పేర్కొనిరి.[1] ఇక్కడి కొక్క వాక్యము ముగిసినది.

రెణ్డువాడల పట్టనావురకు—రెండువాడలపట్టన వూరకు— అని సంస్కరింపఁగా— పైగ్రామములోని రెండు వాడలపట్టునకు—అని యర్థమేర్పడును. లేదా —రెండువాడల పట్టనవూరకు—అని సంస్కరింపఁగా రెండువాడల పట్టనమనే గ్రామమునకు అనియర్థమేర్పడును. తలవరి, ఊరు, చెఱువు మొదలగుపదములు దేశిభాషలో ఇకారోకారాంతములుగా నున్నను ఇక్ష్వాకు సాతవాహన సాలంకాయన బృహత్ఫలాయన పల్లవరాజుల ప్రాకృత సంస్కృతశాసనములందు తలవర, ఊర, చెఱువ ఇత్యాదివిధముల అకారాంతములుగాఁ బ్రయుక్తములయ్యెను. తలారి[2] తలవరి యని తెలుఁగున నుండఁగా నిక్ష్వాకు పురుషదత్త శాసనములందు 'తలవర' అని అకారాంతముగాఁ గలదు. ఈ పదము తల + అవర్ అను పదముల కూడికచే నేర్పడినది దీని పరిణామములచర్చ కిది చోటు గాదు. మఱియు బృహత్ఫలాయన జయవర్మ కొండముది శాసనమందు కుడూర, పాటూర అనియు, సాలంకాయన నందివర్మ పెదవేంగిశాసనమున[3] 'ప్రాలూర, మండూర, కంబురాఞ్చెఱువ' అనియుఁ గలవు.

అరియు=అరి యనఁగా భూమిపన్ను. 'యు' సముచ్చయము. పైరుపండిన తర్వాత చెల్లింపవలసిన సిస్తుపేరు అరి. ఇది ధాన్యరూపముగా నుండునను కొందును. దానిని రాజునకొసగుటకై తెచ్చి కాచుకొని యున్న కాపునకు 'అరిగాపు' అని పేరు. "క్ష్మాతలనాథు

1. రాజనరేంద్ర పట్టాభిషేకసంచిక.

2. చూ. 1122 నెం. శాసనము, 'దక్షిణహిందూదేశ శాసనసంచయము', 4 వాల్యూం. 'తలాఱి' అని కొన్ని శాసనములందుఁ గలదు.

3. ఈ తామ్రశాసనమును సోమశేఖరశర్మగారు భారతి 1, సంపు. 8 సంచికలో ప్రకటించిరి.

ల్లె నరిగాపుల మాడ్కిన తీఱువెట్టు"—శక 1087 నాంటి శాసనము.1

డగు—దగు అనికాని,డసు అనికాని,దీనిని జదువ వచ్చును. ఇదియు పన్నులలోని భేదమే. తగ్గు=తరుగు దలకై యిచ్చెడు పన్ను గావచ్చును.

తెఱెయు—'యు'సముచ్చయార్థకము.'తెఱె' యను పదము కర్ణాటభాషలో 'పన్ను' అనునర్థమునం గలదు. 'సబళిగద్యాణతెఱె'యని యుండుటచే నది ధన రూపమని తెలియఁదగును. 'తెఱె'పదము తెలుఁగులోఁ గానరాదు. కాని అమ్మేవానికి,కొనేవానికి నడుమనుండి ధాన్యాదికము బేరము నడపువాఁడు కైకొను ద్రవ్యమునకు 'తఱుగు' అని తెనుఁగునఁ బేరు గలదు. అట్టి వ్యాపారము చేయువాఁడు 'తఱుగరి' యనఁబడును. 'దళారీ' 'కమి షన్' అని దానికి నేఁ డితరభాషాపదముల వాడు చున్నాము. 'తెఱెగళ్' అను బహువచనాంతపదమున నుండి (కెఱెగళ్ పదముననుండి చెఱువులు, తర్వాత చెఱువు పుట్టినట్టు) తఱుగులు, తర్వాత తఱుగు పుట్టినవి. 'తఱుగు' పదము నేఁడేయర్థమున నున్నదో ఆయర్థమున నే యీ శాసనమునఁగూడఁ బ్రయుక్తమై యుండవచ్చును. 'అరి' టీకలో నుదాహరించిన శాసనపద్యమునఁ గల 'తీఱు'తోఁగూడ నిది సంబంధముగలదై యుండవచ్చును.

సిద్ధాయంబు—ఇదియు నొకతీరు పన్ను. నేల పండినను పండకపోయినను, ఇచ్చి తీఱవలసినట్టు నిర్ణీత మైన పన్ను. ఇది 'సిద్దాయ' మనియుఁ బేర్కొనఁ బడును. 'వెచ్చపు సొమ్మునందుఁ గూడఁ బెట్టిన ధన'మని శబ్దరత్నాకరకారులు. ఈయర్థ మిక్కడ సరిపడదు. సిస్తుల భేదములు 'ఆయము' లని పేళ్లుగలవి మఱికొన్ని గలవు. 'అర్థాయము, అంతరాయము, వెణ్డయకాఱ యము లోనైన సమస్తాయములు;'2 'యీయారివల యచుట్టు ఆలమూబన్న సయు నంతరాయముం గీడెఱయు లోనైన సర్వకరపరిహారము,'3 '[అ]ణ్డమూరి యలము సిద్ధయ సమ[స్తా]య అంతరాయ అభినవాయములు'4; 'చెఱువుక్రింద పండివచ్చినవడ్లకు సకలాయం పుట్టి ౧ కి కుంచడు '5

దన్డు—ఇదియు నొకపన్ను. యుద్ధాదులు ప్రస క్తించినప్పుడు సైన్యపుష్యయమునకై యియ్యవలసిన దగును.

దనపరాధంబును—దీనికర్థము నాకుఁ దెలియ లేదు. ఇదియు నొకపన్నే యగును. 'దశాపరాధము' అని యగునేమో! దశాపరాధము లేవో యెఱుఁగను. ఆయపరాధములు సంభవించినప్పు డియ్యవలసిన పన్ను గు నేమో! లేక 'దేశాపరాధంబు' అగునో! శత్రురాజులకు దోడ్పడుట మొదలగు విధమున దేశమునకు అపరాధము చేసినపుడుగాని, దేశమునకు ఎవరివల్లనైన అపాయము వచ్చినపుడుగాని యియ్యవలసిన సిస్తుగావచ్చును. దీనియర్థ మింకను బరిశోధింపవలసి యున్నది.

సర్వబాదపరియారువు—(మీఁదఁ జెప్పిన) సర్వబాధలు లేకుండునట్లుగా.పరిహారశబ్దము ప్రాకృతమున 'పరియారో' అయ్యెను. అది తెలుఁగున 'పరియారువు' అయినది. 'పరిహారము' అనురూపము సంస్కృత తత్స మము. 'పరియారువు' ప్రాకృత తత్సమము. ధర్మువు, కర్మువు ఇత్యాదు లిట్టివే. 'సర్వబాధ పరిహార' శబ్దము మొత్తమునఁ బ్రాకృతవ్యవహారమున 'సర్వబాద పరియా రో' అని రూఢమై తెలుఁగున కిట్లు వచ్చినది.'పరియారు వు'కు 'పరిహారువు' అని కూడ రూపము గలదు. ఇట్టివి సంస్కృతసమాసములందుఁ దుదినుండఁగాఁ గూడ నిట్టి రూపములతోఁ గలవు.

ఊరుదాయ నేసి—(మీఁదఁ బేర్కొన్న)గ్రామ మును దానముచేసి. దాయ = దానము. పాళీ భాషలో 'దాయో' అని పదముగలదు. దానికి దాన మర్థము. లేక, మీఁద బేర్కొన్నగ్రామమును విభాగముచేసి యనియర్థ

1. నెం. 787 శాసనము, 2. నెం. 1040 శాసనము, 3. నెం. 1228 శాసనము, 4. నెం. 1268 శాసనము—చూ. దక్షిణహిందూదేశశాసనసంచయము. 4-సంపుటము. 5. నెల్లూరు శాసనములు, నెం. 571 చూ.

ము చెప్పవచ్చును. 'దాయ' యనఁగా కర్ణాటభాషలో 'భాగము, వంతు' అనియర్థము గలదు.

ఇచ్చి—'ఇచ్చిరి' ఉండఁబోలును. ఇక్కడికింతొక వాక్యము ముగిసినది.

దీనికి వక్రంబు లేదు—ఈయూరికి, అభ్యంతరము (అడ్డంకి, అంకిలి, తిరుగు) లేదు. 'వక్ర' పదము ఈయర్థమున నేఁడును సమాసగతముగా వాడఁబడుచున్నది: 'ఆపని నిర్వక్రముగా సాగినది; అతఁడు అవక్ర పరాక్రముఁడు' ఇత్యాదులు. శాసనములందిది 'వక్రంబువచ్చు', 'వక్రంబు వచ్చువారు' అను పలుకుబడితో నుండును. అదియిందుఁ గూడ నిఁకముందు చూడఁదగును. 'లేదు': ఇల్లై + అదు, (తద్ సంస్కృతము) ఇల్లదు='లేనియది' అయి, దాననుండి 'లేదు' పుట్టినది. 'ఉరల్' 'రోలు' గా మాఱినట్లు 'ఇల్లదు' 'లేదు'గా మాఱినది.

వచ్చినవారు గళరేని ఉరి స్తితి దప్పినవారు—వక్రంబు వచ్చినవారు—అభ్యంతరము గలిగించినవారు ఉండిరా, వారు ఊరిలో జీవిక-బ్రదుకు-గోల్పోయినవారు.

దీనికి వక్రంబు వచ్చిన గచ్చురు—'గచ్చురకు' అని యుండఁబోలును. మఱియు దీనికి అడ్డుగలిగించిన పోగరుఁబోతులకు. లేక 'గచ్చురు' గ్రామాధికారులకు విశేషణము గావచ్చును. 'రక్షకులు' అని యప్పు డర్థము.

రెణ్డువడలఏలే—'రెండువాడల' గ్రామమును పాలించునటువంటి—ఇక్కడ 'ఏలే' కలదు. దీనితర్వాతి బంతిలో మరల నీపదమే 'ఏళే' అని కలదు. ఈ ధాతువే అఱవమున 'ఆళ్' అనురూపముతోఁ గలదు. అఱవమున అకారాదు లయిన శబ్దములు పెక్కులు తెలుఁగుఁ దనమును బడయునప్పుడు ఏకారాదు లయినవి. ఆఱు-ఏఱు, యానై-ఏనిక, నాన్-నేను ఇత్యాదులు. 'ఏలే' యనుటను కావ్యవ్యాకరణము లొప్పకున్నవి. 'ఏలెడు', 'ఏలెడి'యని వాని సంస్కారము. కాని నాఁటికి నేఁటికిఁ గూడ వాడుకభాషలో 'ఏలే' కలదు.

మువరులేముల చేసినదియు చన్ను—'మూవరు'— లేక, ముమ్వరు, ఉండవలెను. మూ + అవరు మూవరు = ముగ్గురు. 'లేముల' అనుచోట 'ళ' తప్పుగాఁ బడినది; తొలఁగింపవలసినది. ఏలనఁగా, ఈపదమే తర్వాతిబంతిలో మరల వచ్చుచున్నది. అందు 'ముళ' అనియే కలదు. 'ముల', 'ముళ' అనునవి షష్ఠీసమాసగతములు. ప్రాతిపదికము 'ముళ్'గా నుండును. ౨౭వ బంతిలోనున్న 'పసిణ్డిముడ్లు'లోని 'ముడ్లును', ఈపదమును ఒకటేయని నానమ్మకము. కడచిన భారతిలో నేను ప్రకటించిన లక్ష్మీపురపుశాసనమునఁ గూడ 'ముడ్లు' కలదు. మఱియు శాలంకాయన నందివర్మకంతేరు తామ్రశాసనమున[1] 'మునుదసహితాన్ గ్రామేయకానాజ్ఞాపయతి' అని కలదు. "ఈశబ్దమునకుఅర్థమగుటలేదు. ఇది దేశ్యశబ్దముగఁ గానవచ్చుచున్నది. ఇది కొల్లేరు ఏలూరు శాసనములందును గలదు. దీనిని గొందఱు 'మున్యుడ' అనియుఁ, గొందఱు 'ములుడ' అనియుఁ జదివిరి. దీని స్వరూపమును, అర్థమును సంశయాస్పదముగ నేయున్నవి" అని లక్ష్మణరావుగారు వ్రాసిరి. శాలంకాయనుల సంస్కృత శాసనములలోని 'మునుడ'యే చాళుక్యులనాఁటి తెలుఁగుశాసనములలో బహువచనమున 'ముణ్డ్లు' 'ముడ్లు' 'ముళ్'గా నుండెనని నేను దలఁచుచున్నాను. శాలంకాయన శాసనములం దాపదమునకు గ్రామాధికారి యని యర్థము సంగతమగును. ఇక్కడను నాయర్థమే పొసఁగును. చేసినదియు=చేసినశిక్షు, చన్ను=చనును-చెల్లును. ఈయర్థమున 'చన్ను' అనురూపము నన్నయాదుల భాషలో లేదుగాని యిదే ప్రశ్నార్థకమయిన 'ఏ'తోఁ గలసి కలదు. "చిఱుత వానికింత తఱుచంటి పలుకులు సన్నె వృద్ధజనము లున్నచోట" - నన్నయభారతము. ఇట్లే 'ఉన్నె' 'కొన్నె' రూపములును గలవు. ఎల్లరు నిక్కడ "వేసినదియు చన్ను" అని చదివిరి.

వీరిపయి నాడ్డువరుగళ్గిన—ఈయధికారుల మీఁద ఆక్షేపించువా రుందురేని.

1. దీనిని శ్రీ. వి. లక్ష్మణరావుగారు ఆం. సా. ప. పత్రిక ౧౧ సంపుటలో ప్రకటించిరి. అందు "మునుష" అనియుఁ జదువవచ్చును.

ఏ శేముళ చేసిన సేయుడుసను—గ్రామాధికారు లయిన పైవారేమిచేసినను నా చేత చెల్లును. ఇందు 'చేసిన సేయుడు' అనుచో 'చే'కు 'సే' ఆదేశము కావ్యభాషలో లేదు. 'చేయుడు'లో అరసున్న గలదనువాదము నీరూప మపాకరించుచున్నది. 'చేయుణ్డు' అని లేదు! 'సను' 'చన్ను' రూపాంతరము.

మహానభియుళ్ నరాలోక—ఈపద మిందు ఈ బంతిలోనే మరలవచ్చెను. మఱియు 25వ బంతిలో 'మాహానభిళ్' అనియు, 'మహాభిళ్' అనియు, 26 వబంతిలో 'మహానభియుళ్'అనియు, 30 వ బంతిలో 'మహానభియుళ్'అనియు, 28 వ బంతిలో 'మహానవిల' అనియు వచ్చెను. మహత్,అభిజ్ఞుల్, లేక అభియుక్తుల్, అను పదములకుఁ డికపై వాడుకలో నేర్పడిన రూపవికార ములే యివి యెల్లను.'అయ్యంగారు','శాస్త్రిగారు','పంతులుగారు', 'రావుగారు', 'ప్రెగ్గడగారు' ఇత్యాది విధములఁ బూజార్థక బిరుదములు పేళ్లకుఁ, జేర్పఁబడుచున్నట్టు ఆకాలమున 'మహాన్,అభిజ్ఞ' పదములు చేర్పఁబడు చుండనలెను.

నరాళోకమహాసత్త్వుళ్—నరలోక మహాసత్త్వులు అనుట కిది వ్యవహారవికారరూపము. మహాన్ అభిజ్ఞులయిన నరలోకమహాసత్త్వులు. ఇట్టి పేరుగలవాడొకఁడు.

విరాపవమహానబియుళ్—వీరపర్వమహత్ అభిజ్ఞుల్ అను పేరివాఁ డొకఁడు.

గజ్ఞంబుసెడ్లనడుపుళ్—'గజ్ఞము' 'గంజము' అని నేఁడు చేర్కొనఁబడుగ్రామము గావచ్చును. ఈ గ్రామము పల్లపట్లకు మిక్కిలి దగ్గఱగాఁ గలదు. సెడ్లు = (అక్కడి) రాజోద్యోగులు. నడుపుళ్ =(వారి)నడిమివారు, 'గంజముగ్రామపు రాజోద్యోగులలోనివారు' అని యర్థము. వారుకూడ నీధర్మ నిర్వహణమునఁ దోడ్పడి యుండనచ్చును. 'ముడ్లు' వలెనే 'సెడ్లు'కూడ రాజోద్యోగులు. ఈపదములు నేఁడుకన్న ము లయినవి. "స్థానపతులు నారుద్రదేవర ముదిసెలి సుప్పనాయకుణ్డు భీమేశ్వరమహాదేవరకు నిచ్చిన అఖండ వర్తి"-ఇదిశక 986 నాఁటి శాసనము.[1] "రాజేంద్రచోడ యముదిసెలి నారాయణపెగ్గడ."[2] 'ముదిసెడ్లు' అని బహువచనరూపముగూడ శాసనములందుఁ గలదు. పై పదములందు 'ముది' వృద్ధవాచకము గావచ్చును. 'సెలి' 'సెలవు' పదములకు సంబంధ ముండవచ్చును. 'సెలవు= ఆజ్ఞప్తి' కావచ్చును. ఫ్లీటుదొరగా రిక్కడ "సెథునడుపుళ్" అనిచదివి 'సెళ్లనడుపుల్' అని సంస్కారము జరపిరి. బర్గెసు గారు "గజ్నబుసెటనదుపుళ్" అని చదివిరి గాఁబోలును. శర్మగారు రాజనరేంద్ర సంచికలో 'ప్రాచీనాంధ్రభాషాస్వరూప' మను పేర వ్రాసిన వ్యాసమున నిట్టిపాఠము గలదు. లక్ష్మణరావుగారు "గిజ్ఞపు సెథ్లనడుపుళ్" అని చదివిరి.

'సెడ్లు' అని చదువుట సంగతమని నాతలఁపు. దీనిని గూర్చి యింకను ముందు చర్చింతును. 'గజ్ఞంబు సెడ్లనడుపుళ్' అను పదములే 28, 29 బంతులలోఁగూడ 'గజ్ఞ సెడ్లలనడుపుళ్' అని వచ్చినవి. ఈరెండుచోట్ల అక్షరవ్యత్యయము గలదు. శాసనము ముగియఁజెక్కను చెక్కను లేఖకున కజాగ్రత్త యెక్కువగుట యిందు స్పష్టముగాఁ గానవచ్చును. శాసనోపక్రమ లేఖనముననున్న యక్షరసౌందర్యము పోనుపోను మిక్కిలి చెడుచువచ్చినది. కావున నిందు 23, 24 బంతులలోని లేఖనమే 28, 29 బంతులలోని లేఖనమునకంటెఁ బ్రామాణికముగాఁ గొనఁదగు ననుకొందును.

శమస్తభువనశ్రియ కనడిరజుబద్రపెరెయః సమస్తభువనాశ్రయ కన్నడిరాజు బద్రపెరెయ—యను వాఁడొకఁడు. 'గజ్ఞంబుసెడ్లనడుపుళ్' ఏతద్విశేషణము గావచ్చును. 'పెరెయ' పేరే 'పేరయ్య' యని నేఁడు మాఱినది. లేక కనడిరాజువేఱు, బద్రపెరెయవేఱు నయినను గావచ్చును.

1. నెం. 1018 శాసనము, 2. నెం. 1228 శాసనము—చూ. ద. హిం. శా. సంపుటము 4.

ఊరిపనిన ప్రసివర వయ్యేటిమాహానభిళ్ — ఇందు 'వయ్యేటి' అనునది ముమ్మాఱు వచ్చినది. లక్ష్మణరావుగారు "వయ్యేటి"అని చదివిరి. ఫ్లీటుదొరగారిపాఠము సోమశేఖరశర్మగారి పాఠమును 'వయ్యేతి' అని కలదు. శాసనమున ఆయక్షరము 'తి' యనికాని, 'టి' యనికాని స్పష్టపఱుప శక్యముగాకున్నది. 18, 20 బంతులలోఁగల 'తి'కిని, దీనికిని సంబంధము లేకున్నది. 'టి' ఈశాసనము దితరత్ర రాలేదు. అది 'తి' అనుట కంటె 'టి' అనుటయే సంగతము. ఊరిపనిన=(ఈ)ఊరి పనియందే, ప్రసివర=డస్సినచ్చుచున్నట్టి (అనఁగా శ్రమ పడిపనిచేయుచున్నట్టి), వయ్యేటిమాహానభిళ్ - య్యేటి= వయ్యేఱుఅని యింటిపేరుగల, మహత్ అభిజ్ఞులు.

వయ్యేటిమహాభిళ్ పనికొళు చేనేరకపఞ్చి న్ప్రసివయ్యేటి మహానభియుళ్ — పూర్వోక్తలయినవయ్యేటిమహత్ అభిజ్ఞులుఊరిపనులనుచేయఁ లక తమకుబదులుగాఁ బంపఁగాఁ బనులుచేయుచుండువారు వేఱొకవయ్యేటిమహత్ అభిజ్ఞులును, (అనఁగాఏతద్గ్రామ కార్యనిర్వాహకులు (కరణముగావచ్చును) వయ్యేటిమహానభియులు ఉద్యోగమునుండి విశ్రాంతి సెలవు పుచ్చుకొన్నప్పుడు వారికి బదులుగా ఊరిపనులను నిర్వర్తించువారు(Acting man).పనికొళు=పనికళుకురూపాంతరము. 'కొళు' రూపమే తర్వాత, 'కులు'గా మాఱినది. అడుగులు, నడుగులు, వలకులు, ములుకులు ఇత్యాదులలోని 'గులు' 'కులు'లు ఇట్టి 'కొళు' నుండి మాఱినవే. 'ప్రసివయ్యేటి' అనుచో 'ప్రసివరవయ్యేటి' అని యుండవలెను.. 24 వ.బంతిలో అట్లే కలదు. 'ప్రస్సి'అనియుండ వలసినదానికి పెక్కుశాసనములందు 'ప్రసి' కలదు.

మరలకొన్డుకళ్ — ఫ్లీటుదొరగారును, లక్ష్మణరావుగారును 'సకలకొన్డుకళ్' అని చదివిరి. బర్గెస్ పాఠముగూడ నిట్లేయుండును. సోమశేఖర శర్మగారు గూడ నిట్లే యుదాహరించిరి. కాని యిందలి తొలి యక్షరము 'మ' కాని 'స' కాదు. ఈశాసనము నందలి తక్కిన 'స''మ'లను బరిశీలించిన నిది స్పష్టపడును. రెండవ యక్షరముగూడ 'క' కాదు. తలకట్టుక్రిందియక్షరముతో సంధించుటకు నిలువుగీత 'ర' కారమున నుండును, 'క' యక్షరమున కట్లులేదు. ఆక్షరముతో నొట్టియుండునని తలకట్టుకు స్థలముచాలక లేఖకుండింకయొడముగాఁ జెక్కెను. 'వారల కొన్డుకళ్' అని చెక్కవలసిన దాన్ని శాసనము చెక్కినవాఁడు ప్రమాదముగా 'మరల కొన్డుకళ్' అని చెక్కెను. శాసనము చెక్కుటకై వ్రాసియిచ్చిన మాతృకలో 'వా' ఉండఁగా నాతఁడు ప్రమాదికముగా దానిని 'మ' అని చెక్కెను. 'వా'|వ్రాత ప్రవ్రాతగాఁ బొరపడదగియుండును. మీఁదఁజెప్పిన యూరిపనిచేయు (Permanent and acting) ఉద్యోగుల కుమాళ్లను—అనియర్థమగును. లేక, 'మరల కొన్డుకళ్' అనుపాఠమే సరియగునేని యీ యర్థము దానికిఁ గూడఁ జెప్పనచ్చును.

ఫ్లీటుదొరగారు మొదలగువారెల్లరును, 'కొన్డుకళ్' అని చదువఁగా నేను 'కొన్డుకళ్' అనిచదువుటకుఁ గారణముల నిక్కడ పేర్కొనుచున్నాను.

మిక్కిలి ప్రాచీనములగు తెలుఁగు శాసనములందు 'బండిఱ'తోఁ గొంతపోలికయున్న వింతవింత లిపిసంకేతములు నాకుఁ గొన్ని గానవచ్చినవి. వానిని ఫ్లీటుదొరగారు, కృష్ణశాస్త్రులుగారు మొదలగువారు కొన్నిచోట్ల 'థ'గాను, కొన్నిచోట్ల 'ఱ'గాను జదివిరి. ఆయక్షరముల స్వరూపముల నాయాశాసనములఁ జూచినఁగాని స్పష్టముగా గ్రహింపఁ గుదురదు. ఇప్పటికిఁ బ్రకటితములయిన శాసనములలోఁ గానవచ్చునట్టి యట్టి వింతలిపి సంకేతములఁ గొన్నింటి నిక్కడఁ బేర్కొనుచున్నాను.

ఎపిగ్రాఫియా ఇండికా XI వాల్యూం 316 రావుబహదూర్ హెచ్. కృష్ణశాస్త్రులుగారు సత్యాదిత్యచోళమహారాజు తెలుఁగుశాసనమును బ్రకటించిరి. అందు 10, 17, 18, 21 బంతులలో'పాఱ','మఱుతు', 'సెట్టుఱ' అనుచో శకటరేఫము నేటిశకటరేఫవు లిపితోనే స్పష్టముగా నున్నది. కాని 7, 9, 21, 25, 30 బంతులలో 'శత్యాదిత్యున్ఱ' 'ఎఱుచున్ఱ' 'వేవాన్ఱుఱు' 'వచ్చున్ఱ', 'న్యాన్ఱ' అని చదివినచోట్ల బండిఱగాఁ దలఁపఁబడిన యక్షరములు 10, 17, 18, 21 బంతులలోని బండిఱలో

స్పష్టమైన భేదము గల్గి వేఱుపడియున్నవిగాని దానివలె లేవు. ఈ శాసనమును నేను జాగ్రత్తగాఁ బరిశీలించి చూచితిని. మద్రాసు మ్యూజియమునకుఁ జేర్పఁబడిన యీ శాసనశిలను ప్రత్యక్షముగాఁ జూచికూడ నీ భేద మును స్పష్టపఱుచుకొంటిని.1 7, 9, 21, 25, 30 బంతులలోని యీ యక్షరసంకేతము బండిఱతో వేఱుపడియున్నది గావున నది వేఱొక యక్షర మని యేల తలఁపఁగూడ దని నాకుఁ దోలుత నా క్షేపముతోఁచెను. మఱియు 'ఆదిత్యుఱు' 'ఉఱ్ఱి' 'వా ఱూఱ్ఱు' 'వచ్చుపఱ్ఱు' 'వాఱ్ఱు' అనుశబ్దములు, ఆదిత్యుడ్డు 'ఉడ్డి' 'వాడ్డూడ్డు' 'వచ్చుపడ్డు' 'వాడ్డు' అనువిధమున నించుమించుగా నీశాసనము పుట్టినకాలమునను, దర్వాతి కాలమునను వ్యవహృతములగుట స్పష్టమగుటచేత నాయ క్షరసంకేతము 'డ'గానో, లేక తర్వాత 'ఱ' గా మాఱి నట్టియు, డకుఁ బ్రకృతియయినట్టియు వేఱొకయక్షర ముగానో యయియుండునని కూడఁ దోఁచెను. శబ్దనిష్ప త్తి శాస్త్రరీతినిబట్టి పరిశీలింపఁగా ద్రవిడభాషలోఁగాని, కర్ణాటభాషలోఁగాని, 'ఆదిత్యుఱు' 'ఉఱ్ఱి' 'పాఱ్ఱు' 'వా ఱ్ఱు' అనురూపముల యునికిఁ దెలియదయ్యెను. ప్రసిద్ధు లయిన ద్రవిడకర్ణాట పండితులవలన నీవిషయము నెఱిఁగి తిని. కాని దాని 'డ'గాఁ దలఁచుటకు బాధకముగా స్పష్టముగా 'డ' లిపి వేఱువిధముగా నీశాసనమందే యుండెను. ఒకవేళ నీక్రొత్తలిపి శ్రీకాశీభట్ట బ్రహ్మ యశాస్త్రిగారికిని, శ్రీజయంతి రామయ్యపంతులుగారి కిని ఇప్పటికింకను జర్చలోనున్నట్టిదియు, 'డ' కు బూర్వ రూపముగాఁ దలఁపఁబడుచున్నట్టిదియు నగు 'ఱ' అగు నేమో అని యోజించితినిగాని ఈశాసనముననే ఆ 'ఱ' రెండుచోట్లఁ గానవచ్చెను. పై సత్యాదిత్యశాసనము తొలిబంతిలోనే 'స్వస్తిశ్రీ చోఱ' గలదు. 13 వ బంతిలో "చిఱుంబూరి" కలదు. ఇవి స్పష్ట ముగా బండిఱకంటె వేఱై అడ్డుగీత లేక 'ఙ' వంటి యుచ్చారముతో నున్న యక్షరములుగానే యున్నవి. ఇట్లున్నను కృష్ణశాస్త్రిలుగారు, 'చిఱుం బూరు' అనుదానిని 'చిఱుంబూరు' అని చదివిరి. అది చిఱుంబూరు, అని చదువుటే సరియని నా నమ్మకము. ఏలనఁగా నాగ్రామమిప్పుడు 'చిలుమ్కూరు' అనుపేర నున్నది. 'ఱ, డ, ళ; ల'లు సంబంధముగల యక్షరము లగుటచే చిఱు, చిడు, చిళులుగా మాఱుటసంగతము.

ఇట్లీలిపిసంకేత విషయమున నేను ఇదమిత్థ మని నిశ్చయింపఁజాలక చిక్కుపడుచు నింకను జెక్కు శాసన ములఁ బరిశీలించుచుంటిని. ఎపిగ్రాఫియా ఇండికా II వాల్యుంలోనే శ్రీకృష్ణ శాస్త్రిలుగారే చిలుముకూరి దగ్గఱిదేయగు కడపమండలపు పుణ్యకుమార తామ్ర శాసనమును బ్రకటించిరి. అందు సీమాచిహ్నములలోని యొకగ్రామనామమును కృష్ణశాస్త్రిలుగారు 'బీరపాఱు' అని చదివిరిగాని యందలి కడపటి యక్షరము నేనింతకు ముందు సత్యాదిత్యచోళుని శాసనమునఁ గ్రొత్తగాఁగాన వచ్చినదన్న యక్షరమువంటిదిగా నుండెను. దానిని బండి'ఱ'గాఁ జదువుట సరిగాదేమో. ఆగ్రామ నామము 'బీరపాడు' అనికాని, 'బీరపఱ్ఱు', 'బీరపఱు' అని కాని యుండును గాని 'బీరపాఱు' అని యుండునాయనియు, నది'బీరపాడు' అని చదువవలెనేమో అనియుఁ దోఁచెను. ముద్రిత మయిన ప్రతిబింబమును బట్టిచూడఁగా 'బిరిపాడు' అని చదువఁదగి యున్నది. మఱియు కె. వి. లక్ష్మణరావుగారు రెండవ పులికేశి కొప్పర శాసనమున[2] సీమాచిహ్నములలో "కొండవేఱు పూ పథా"అని చదివినచోట; 'ఱు' లిపికూడ మీఁద నేను బేర్కొన్న లిపుల పోలిక కొంతగలది. లక్ష్మణరావుగారు దానిని నేఁటి 'కొండవీడు'గా నిర్ణయించిరి. కానదానిఁ గూడ 'కొండవేడు'అని చదువుట సంగతము గావచ్చును. మఱియు నెల్లూరిజిల్లా శాసనములలో ప్రాచీన చాళుక్య లిపిలోనున్న శాసనములు కొన్నింట నిట్టి లిపి గానవచ్చెను. 676 పేజి. కనిగిరి తాలూకా నలజనం

1. శ్రీ సోమశేఖరశర్మగారు నుఱల దీని ప్రతిబింబమునెత్తిరి. వారు దానిని ప్రకటించినచో పాఠకుల కా యక్షరముల భేదము స్పష్టముగా గుర్తింప ననువుపడును.

2. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. ౧౧ సంపుటమున ప్రకటితము.

పాటి శాసనమున నొకపట్టు "పళెయరి కొడుక బాదిరాజెన్వ్యాన్టురాజుబుమూన్టువుట్టు ఆల్లుపట్టు" అని చదువఁబడెను. ఇందు "న్వ్యాన్టు" "మూన్టు" "ఆల్లు" అనువానిలో 'ఱ' గాఁ జదువఁబడిన లిపికూడ మీఁద నేను దెలిపిన లిపివంటిదే. ఇక్కడకూడ 'న్వ్యాన్డు' 'మూన్డు' ఆడ్లపట్టు' అని చదివిన సరిపడును. మఱియు 606 పేజిలో కందుకూరు తాలూకాలోని పెట్లూరి వీరభద్రస్వామిగుడిశాసనమున మగన్టు' ర్చ్చుయిట్టికి' ఆల్లుపట్టు' అని చదువబడిన వానిలోని 'ఱ' లిపికూడ నిట్టిదే. బండిఱకును దానికిని స్పష్టముగా భేదముగలదు. మఱియు నాశాసనమందే "ప్రభురామున్టు క్టొచేరాజుమగ" అని యున్నపట్టునఁగూడ 'న్టు' 'న్డు' గాఁ జదువఁదగినదే. ఇట్టివింకను పెక్కులుగలవు. మిక్కిలి ప్రాచీనము లయిన శాసనములందు 'ఆడ్లపట్టు' అనియే కలదు. ఇక్కడకూడ నట్లే కాఁదగును. ప్రాచీన కర్ణాటక శాసనములందుఁగూడ నీవింతలిపిగలదు. అవి 6, 7, శతాబ్దములనాఁటి శాసనములు వానిలో ఫ్లీటుదొరగారు లిపులను బండిఱగానే పఠించిరి. అట్లు పఠించుటలో ననేకాసందర్భము లుప్పతిల్లెను. వాని నెల్ల వారు సంస్కారమునూచించియు, నర్థము వివరింపకయు, అర్థమే వ్రాయకయు బహువిధములదాఁటిరి. అట్టివానిలో నేను బరిశోధించినవి గొన్ని 'డ'గాఁ జదువుటచే సమన్వితములయినవి. గ్రంథవిస్తరభీతిచే వానినెల్ల నిక్కడఁ జేర్కొన నయితిని. అందుకై ప్రత్యేకవ్యాసము వ్రాయుదును. ఇట్లు పెక్కుశాసనములఁ బరిశోధింపఁగాఁ బరిశోధింపఁగా నాకీ క్రొత్తయక్షరపు లిపి 'డ' గాఁ జదువఁదగినదన్న యనుమానము ప్రబలమయ్యెను. ఇట్టి దశలో నేను క్రొత్తగాఁ గొన్ని శిలాశాసనములను గనుఁగొని వాని ప్రతిబింబముఁ దెచ్చి పరిశీలించుట యేర్పడెను. వానిలో కడచిన భారతిలో నేను ప్రకటించిన లక్ష్మీపురశిలాశాసనమొకటి. అందుఁగూడ నిందు నేను జేర్కొన్న లిపిసంకేతము గలదు. దాని నే నిటీవల 'కడుపండ్లు'గా నిర్ణయించుకొంటిని. (మూఁడవబంతి కడపటియక్షరము 'డ్లు' చూచునది.) మఱియుఁ గపిలేశ్వరపురపు శిలాశాసనమునఁ[1] గూడ "తంబున్డు" (ఇట్లు చదువవలసినట్లు నే నిటీవల నిశ్చయించుకొన్నాను.) అనుచోటఁగూడ 'న్డు'లో నిట్టి లిపిసంకేతము గలదు. మఱియు మద్రాసుమ్యూజియమునకుఁ జేర్పబడిన శిలాశాసనములలోఁ గొన్నింటఁగూడ నిట్టి లిపిసంకేతములే కొన్ని నాకుఁ గానవచ్చెను.

అందు చిలుముకూరిదేయగు నొక శిలాశాసనమున 'చిఱుబూరు' అని యితరులు చదివిన తీరుతో పదము గలదు. అందలి 'ఱు' లిపి + చిహ్నము చుట్టును సున్న చుట్టి కొమ్మిచ్చినట్టున్నది ఇదికూడ 'డు'గా చదివిననే 'చిలుముకూ'రను శబ్దనిష్పత్తికి సరిపడును. కాని యీపదమే కృష్ణశాస్త్రిగారు ఎపిగ్రాఫియా ఇండికా II వాల్యుంలో ప్రకటించిన శాసనమున 'చిఱుంబూరి' అని యుండెను. దీనినిబట్టి 'ఱ'కును దీనికిని గూడ సంబంధముండినట్టు తోఁచెను.

ఇఁకఁ బ్రస్తుతశాసనము:— మీఁద నేను జేర్కొన్నలిపులను బోలిన లిపి యీప్రస్తుతశాసనమునఁ బెక్కుచోట్లఁ గలదు. 24 బంతిలో, 'సెడ్లనడుపుళ్' 26 బంతిలో 'కొనుకళ్', 27 బంతిలో 'ముడ్లు', 28 బంతిలో 'కొన్డుకళ్', మరలనందే 'కొన్డుకళ్', 30 బంతిలో 'కొన్డుకలు', 32 బంతిలో 'కొన్డుకళ్', 34 బంతిలో 'గన్డాన్డు' అనుచోట్లఁ జూడఁదగును.



ఈస్థలములలో నీ వింత లిపి యిట్టివిధముల నున్నది.

ఇంతకుఁ బూర్వము నేను పెక్కు శాసనములలో నున్నట్టు తెలిపిన లిపులుగూడ నిట్టి తెఱఁగుల నున్నవే. మఱియు నీప్రస్తుతశాసనమున బండిఱ 28, 29, 34, బంతులలో స్పష్టముగా నేఁటి బండి'ఱ' యాకృతితోనే వేఱుగా నున్నది. ఇఁతకుఁబూర్వము నేను జేర్కొన్న శాసనములం దితరులు చదివిన విధముగా నిక్కడఁగూడ నీ లిపి బండిఱగాఁ జదువవలసి యుండెను. కాని యీశాసనమునుజదివినవా రెల్లరు వీని నెల్ల 'ధ'కారములఁగాఁ జదివిరి. బండిఱగాఁ జదివినను, 'ధ'గాఁ జదివినను నిక్కడ నర్థసంగతి దుర్ఘటమే అగును. అట్లు చదువుటచేతనే యీ శాసన మెల్లరకును దురవబోధమయ్యెను.

1. ఇది యప్రకటితము. దీని ప్రతిబింబము నాదగ్గఱనున్నది. వచ్చే నెలభారతిలో దీనిని బ్రకటింపనున్నాఁడను.

నే నీ శా స న మూ ల ము ను జ దు వు ట లో నంతకుఁ బూర్వమే నాలోఁ బొడమియున్న యనుమానమునుబట్టి 'ముడ్డు' 'కొన్డుకళ్' 'గడ్నాన్డు'ఇత్యాదివిధమునే యనుసరించితిని. అర్థము గుదిరెను. కాని నేను జదివినదే సరియనుటకుఁ బ్రబలప్రమాణము కావలెఁగదా యని చింతించుచుండఁగా నది యిందే దొరకెను. ఇందు 'కొన్డుకళ్' అను పదము 26, 28, 30, 32 బంతులలో అయిదుపర్యాయములువచ్చెను. ఈఅయిదుచోట్లను ఇతరులు 'థ' గా చదివినలిపితోనే పయిపదములున్నవి. కాని 31వ బంతిలో మరల నీ'కొన్డుకళ్' అనుపద మాఱవతూరి వచ్చెను. ఇక్కడ మాత్రము ఇతరులు ఇతరశాసనములందు 'ఱ' గాను, నీశాసనమందు'థ'గాను జదివిన వింతలిపిలేక స్పష్టముగా 'న' క్రింద 'డ' ఒత్తును, దానికి కొమ్మును గలదై 'కొన్డుకళ్' అని నిస్సంశయమయిన లిపి కలదు. దీనినిబట్టి యేమని తలఁపవలెను? 'డ'కు లిపిలో రెండురూపము లుండెడివనికాని 'కొన్డుకళ్' అని తర్వాతను ఉచ్చరింపఁబడుచుండిన శబ్దమునకు వేఱొకవిధమయిన యుచ్చారమేదో యంతకుఁ బూర్వకాలముననుండి దానికొక లిపి సంకేతముండి, ప్రస్తుత శాసనకాలమాయుచ్చారముల మాఱుపాటు, జరగుకాలమైయుండి, కొన్నిచోట్లనాప్రాఁతయుచ్చారపు వింతలిపి, కొన్నిచోట్ల క్రొత్త 'యుచ్చారపు' డకార లిపి చేర్పఁబడుచుండెనని కాని తలఁపవలెను. కాని దానిబండి'ఱ'గాఁగాని 'థ' గాఁగాని చదువరాదు. ఇంతకుఁబూర్వము నేను బేర్కొన్న స్థలముల కెల్ల నిట్లే సమన్వయము గుదురును. ఇట్టి యుచ్చారణ లిపి సంబంధ మీ వింత లిపికిని డకారమునకు మాత్రమే కాక నేఁడు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రి గారును, శ్రీరామయ్యపంతులుగారును'డ'కు లిపి రూపాంతర మగును, గాదు అని చర్చించుచున్న 'ట' అక్షరమునకుఁ గూడఁ గలదు. ఏలనఁగా చిలుముఱూరి శాసనములలో నొకట 'చిటుంబూ' రనియు, (వేఱొకట. నీశాసనమం దున్నట్టుగా 'ఛి(+చిహ్నమునకు సున్నచుట్టి కొమ్మిచ్చినట్టు)ంబూ' రనియు లిపి గలదు, ఇంతేకాక 'శ'తోఁ గూడ నీలిపులకు సంబంధము గలదనుటకుఁ గొన్నియాధారము లున్నవి. ఇప్పటికి నానమ్మక మేమనఁగా, శ,డ ట ప్రస్తుతపు వింతలిపి పరస్పరము సంబంధముగల పగుట 67 వ శతాబ్దుల శాసనములందుఁ గానవచ్చును. వాని యుచ్చారణములు వేఱుగానున్నను తార్మాఱుగానుండెడివి. ఉచ్చారణముల వలెనేవాని లిపులును వేఱుగానున్నను వ్రాఁతలో నవియు తార్మాఱుగానే యుండెడివి.

ఇఁక 'కొణ్డుకళ్' అనుపదమునకు'కొడుకులు'అనునర్థ మెట్లువచ్చెనో తెలుపుదును. అందు 'కొణ్డు'ప్రాతిపదికము 'కళ్' ప్రత్యయము. కొణ్డు=అనుపదమునకు యువ, చిన్న, చిఱుత అని యర్థము. అఱవమున 'కుఱందై', కన్నడమున'కోడ', తెలుఁగున'కోడె' 'కొండె' 'కొంటె' పదములును దీననుండియే పుట్టినవి. కొణ్డు+కళ్ కలసి కొణ్డుకళు అయ్యెను. 'ఈంగళు' నుండి, ఏకవచనము 'ఈంగ' పుట్టినట్టు, 'కొణ్డుకళు'నుండి ఏకవచనము 'కొండుక' పుట్టెను. 'కొండుక' యనఁగా చిన్నది, కొంచెపుది. 'కొండుక'యే పెద్దనాదులనాళ్ల నుండి'కొండిక'గామాఱినది. అది నేఁటికి 'కొండొక'గాగూడ మాఱినది. 'కొణ్డుకళ్'మహదర్థమున యువ (పుత్రి)వాచకముగా నీశాసనమందుఁగలదు. ఇదియే శిథిలద్విత్వముచే 'కొడుకళ్' 'కొడుక' 'కొడుకు' రూపములఁ బడసినది. కోడ+ఆళ్ కలసి స్నుషావాచకమయిన 'కోడళ్-కోడలు' పదము పుట్టినది. ప్రాచీనకాలమునఁ దండ్రియుండఁగాఁ బుత్రులకు 'యువ'యని వ్యవహారము. యువమహారాజు, యువ్వాపత్యము ఇట్టివే. కుమారపదముగూడ నిట్లేకలదు. 'కుమారసింగభూపతి' 'కుమారవిష్ణు' ఇత్యాదులు చూడఁదగును. మీఁదఁ బేర్కొన్న రూపములకన్నింటికినిశాసనములందును గ్రంథములందును బ్రయోగము లున్నవి. నెల్లూరిశాసనములు 1201 పేజి సన్నమూరు రామలింగేశ్వరస్వామిగుడిలోని శాసనము (శక 890?) 'పెద్దరాజ్యాన' 'కొండుకరాజ్యాన' అని రెండుచోట్లఁ గలదు. ఆ గ్రంథమందే 676 పుటలో నలజనంపాటిశాసనమున "పశెయరికొడుక బాదిరాజన్వా"... శ్రీ సోమశేఖర శర్మగారు రాజనరేంద్రపట్టాభిషేక సంచికలో 'కొడుకళ్' అనుపదమును 'Ep. col. Nos. 359, 364 of 1920' జూచినట్లు వ్రాసిరి.

"కామాంధల్ వెలనాటికొడెవిధవల్ "అనిక్రీడాభిరామ్మమునకోడె= లేఁతవయసుఅనునర్థమునఁబ్రయోగము.

సవ్వలోకశ్రయమహాసత్థవళ్ — సర్వలోకా శ్రయమహాసత్త్వులు అను పేరివారు

పెద్దఃళ్ నెరవద్య మహాసత్థఃవళ్ — పెద్ద లయిన నిరవద్య మహాసత్త్వులు

పసిణ్డిముడ్లు వెటన్దల చరువయ్య — స్వర్ణాధి కారి (ట్రజరర్) (వెటన్దల యొకయారు) అది యింటి పేరుగల చరువయ్య యనువాఁడు.

విష్ణువర్ధఃనమహాసత్థవళ్ — విష్ణువర్ధన మహా సత్త్వులని పేరుగలవాఁడు.

పసుక్షేవులకొన్డుకళ్ — పసుక్షేత్రపుల కొన్డుక ళ్ అని యుండఁబోలును. పశుక్షేత్రాధిపులకొమాళ్లయిన

అచ్చకుట్టువనియు కొన్డుకళ్ — అచ్చకుట్టి వని యనువాఁడును వాని పుత్రులును, లేక అచ్చకుట్టి యను వాఁడును, వనియయు, వానికుమాళ్లును

గఙ్జసెడ్లలనడుపుళ్ — దీనిని గూర్చి యింతకు ముందే కొంత వ్రాసితిని. గంజము సెడ్లలోని వారగు — గంజము పల్లవపట్టణ (పల్లపట్ల) మునకుఁ జేరువనేకలదు.

ప్రిథిమిమహాసత్థఃవళ్ — పృథివీ మహాసత్త్వ లనువారు

వెటన్దళ్ పొనికన్డిఅముకొళనడుపు — వెటన్దల యనుగ్రామపు పొనికన్డిఅముకొళ్? అనువారిలోనివాఁ డగు. ఇందు 'పొనికన్డిఅముకొళ్' కు అర్థము తోఁపలేదు. అదేదో పేరు.

విష్ణువర్ధనమహాసత్థవలకొన్డుకలు నిరవద్య ప్రిథివికనడిరజుళ్ — విష్ణువర్ధనమహాసత్త్వులకొమాళ్లు నిరవద్య పృథివీకన్నడరాజులు అనువారు

గునవనమహానభియుళ్ — గుణవన మహత్ అభిజ్ఞుల్ అనువారు

ముద్దకఞ్చికొళ్ — ముద్దకంచి యనువారు. ఇట్టి పేరు 12, 13 శతాబ్దుల గ్రంథములలోఁగూడఁ గలదు.

ఉ. కోయెల పంచమశ్రుతిని గ్రోల్చినభంగినివిద్దకంచి రా మాయణ మాలుకొండములనచ్యుతుజాగరవేళఁబాడు — క్రీడాభిరామము

ఈపద్యమునగూడ 'ముద్దకంచి' యని కవిప్రయో గ మయి యుండవచ్చును.

రమిస్వరాప్రిథివీమహాసత్థఃవళ్ — రామేశ్వ పృథివీమహాసత్త్వులను పేరుగలవారు

అపయజనువకొలకొన్డుకళ్ కొరిన్ది (న్ధి?) కొళ్ — అపయ=అప్పయ్య, జనువ=జనువ్వ అనువా కొమాళ్లు కొరిన్ది (న్ధి?) కులను వారు

కరిగల్లప్రథివీ మహాసత్థవలకొన్డుకళ్ — కరిగల్ల పృథివీమహాసత్త్వుల కొమాళ్లు

నన్దిమహానవిలనడుపు శ్రీ మహాసత్థవళ్ — (వళ్) అని కాఁబోలును! నందిమహానభిజ్ఞులలోనివారు శ్రీమహాసత్త్వులు,

సకలలోకశ్రయ్య ప్రిథివీమహాసత్థఃవల దివాక రయ్య పఞ్చకొళ్ — సకలలోకాశ్రయ పృథివీమహా సత్త్వులయొక్క (వారిపురోహితుఁడేమో!) దివాకరయ్య పంచాఙ్గులు.

శ్రీజప్పిపెన్దటట్టుగన్డాన్డు — శ్రీ జప్పిపె (న్ద)ట్టు గండన్డు కాఁబోలును. వేత్రధారియైన, పెద్దయైన రట్టు గండఁడు. రట్టులను జయించినవాఁడు.

ఆ కేంద్లకుమునుపు లక్ష్మణరావు పంతులుగారీ శాసనమున కొంతభాగమున కర్థమును గుర్తించినట్లు వ్రాసిరి. కుటియు వారప్పుకు సీమనుండి శాసనప్రతిబింబము దెప్పించినట్లు తెలిపిరి. వారు గుర్తించిన యర్థమును ఆ ప్రతిబింబములు నిప్పుడు దొరుకునేమో. అని దీని ముద్రి దళలో శ్రీ సోమశేఖరశర్మగారినడుగఁగా, వారు లక్ష్మణ రావుగారీశాసనమునకు టీక వ్రాసియుంచినట్లు గా రాలేదని వారు సీమనుండి తెప్పించిన శాసనప్రతిబింబ ములను నా కొసఁగిరి.

# అనంతవర్మ కుమారుడు ఇంద్రవర్మ యొక్క తామ్రశాసనము



మొదటి రేకు- రెండవ ప్రక్క



రెండవ రేకు- మొదటి ప్రక్క

అనంతవర్మ కుమారుడు ఇంద్రవర్మయొక్క తామ్రశాసనము



రెండవ రేకు - రెండవ ప్రక్క



మూడవ రేకు - మొదటి ప్రక్క

# అనంతవర్మకుమారుడు ఇంద్రవర్మయొక్క తామ్రశాసనము

శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనారాయణ హరి చందనజగద్దేవు రాజాబహద్దూర్,
పురాతత్వవిశారద్, M. R. A. S.

ఇంద్రవర్మయొక్క తామ్రశాసనమును గురించి మనము తెలుసుకొనుటకుముందు ఆతని పూర్వచరిత్ర కను గొనుట ఆవశ్యకము గనుక యా చరిత్రము క్లుప్తముగా ఈక్రింద వివరింపబడినది:—

పూర్వమొకానొకప్పుడు దక్షిణభారతమునందు వీరసింహుడను రాజు కోలాహల పురంబును పాలించుచుండెను. అతడు స్వర్గస్థుడైన పిమ్మట అతని తమ్ముడు. ఈవీరసింహుని కుమాళ్ల నేవురను పారదోలి తాను రాజయ్యెను. ఈతరుమబడిన 1. కామార్ణవుడు, 2. దానార్ణవుడు, 3. గుణార్ణవుడు, 4. మారసింహుడు, 5. వజ్రహస్తుడు అను ఈ అయిదుగురుసోదరులు తమతల్లితో బయల్వెడలి రాజ్యకాంక్ష గలవారై ఉత్తరమున కువచ్చి అప్పటి కళింగదేశాధీశుడగు శబరాదిత్యునితో పోరాడి కళింగనగరమును జయించి సమీపముననున్న మహేంద్రాచలమునకుం బోయి తచ్ఛిఖరమున నున్న గోకర్ణేశ్వరుని యిష్టదైవముగా నారాధించుచు కళింగ రాజ్యపాలనము చేయుచుండిరి. ఈసోదరపంచకమును,వీరి తల్లిని గనిన అప్పటి అసభ్యప్రజలు వీరిని పంచపాండవు లనియు, వీరితల్లిని కుంతీదేవియనియు చెప్పుకొనసాగిరి. ఆమహేంద్రాచల శిఖరంబున కొన్ని దేవాలయములు గలవు. వాటిలో గోకర్ణేశ్వరాలయము ప్రధానాలయము గా నుండెడికారణమున ఇప్పటికిని ప్రాముఖ్యము జెంది యున్నది. ఈదేవాలయము వీరికిముందుండెడివారి వలన నిర్మించబడినట్లూహింపవచ్చును. ఈమహేంద్రాచల శిఖ రంబున గల దేవాలయములలో యుధిష్ఠిర, భీమ, కుంతీ నామంబుల మందిరములు గలవు. అప్పటిలో అర్జును డచ్చట లేకుండుటంజేసి యతని నామంబున శివాలయము లేదని వదంతికలదు. అర్జునసమానుడగు దానార్ణవునకు, యుధిష్ఠిరసమానుడగు కామార్ణవునకు ఈమందిర నిర్మాణ సమయంబున ఐకమత్యము లేనందున అర్జునుని పేరిటమందిరంబు లేకుండవచ్చునని ఊహింపందగు. ఇందువలన కామార్ణవుని జీవితకాలమునుంచి దానార్ణవునకు,నాతనికి ఐకమత్యము లేదని స్పష్టమగుచున్నది. ఈమందిరములీయైదుగురుసోదరులు వేరైనపిమ్మటయెవరికివారు నిర్మించియుండవచ్చును. వీరందరు నైకమత్యముగలిగియున్నప్పుడు గోకర్ణేశ్వరుడు వీరి యిష్టదైవతముగా నుండెను. వీరు వేరైన పిదప తన్నగ్రమున ఎవరికీర్తి కొరకు వారు యిష్టదేవతాసాన్నిధ్యంబున దేవాలయనిర్మాణంబులు చేసియుండవచ్చును. కాలక్రమమున ఈదేవాలయములు పంచపాండవ కుంతీనామంబుల విఖ్యాతమైనవి, ఈ పంచసోదరులలో పెద్దవాడగు కామార్ణవుడు దంతపురమును రాజధానిగా ఏర్పరుచుకొని కళింగరాజ్యపాలనము చేయుచుండెను ఈరాజధానికి దంతపురంబను నామ మెట్లు లభించెననగా బుద్ధునితదనంతర మతని తాలూకుదంతమొకటి ఆ కాలపు కళింగరాజులచే ఒకస్తూపమున దంతపురములో నుంచబడినట్లు బుద్ధచరిత్రవలన తెలియవచ్చుచున్నది. ఆ దంతము ఉంచబడినస్తూపము అనగా మంజూష–తెనుగున పెట్టె (మందసము) ఈరీతినిఉండుటవలన–'మందస' అయి ఉండవచ్చును. గనుక ఈదంతపురము మందస అయి ఉండవచ్చును. ఈమందస ఇప్పటిలో చిన్నగ్రామమైనను, ఆకాలములో ప్రస్తుతము మందసకు తూర్పునైపున సమీపములో ఉన్న 'మహేంద్రతనయ' అను నదిమొదలు ప్రస్తుతమందసవరకు వ్యాప్తమై ఉండవచ్చును. ఈ మహేంద్రతనయ తీరంబుననున్న (పాటేశ్వర) పాటేశ్వర మందిరములోనున్న శిలాలిపివలన ఈప్రదేశము అప్పటి దంతపురముగా దృఢమగుచున్నది. ఈకామార్ణవుడాకళింగమును పాలించుచున్న సమయం

బున తన నల్వురుసోదరులకు నాలుగురాజ్యముల నిచ్చెను. 1. దానార్ణవునకు 'కందికాబాధారకంఠ'మను రాజ్యము నిచ్చెను. ఈరాజ్యము ప్రస్తుతపు ముఖలింగమునుంచి విశాఖపట్నంజిల్లాలో కొంతవరకు ఉండవచ్చును. దీనికి రాజధాని ముఖలింగము. 2. గుణార్ణవునకు బొబ్బిడిరాజ్యమునిచ్చెను. ఇది ప్రస్తుతపు బీహారు ఒరిస్సా డివిజను లోనున్న 'బామూదా' అయివుండవచ్చును. దీనికి రాజధాని 'దేవదుర్గము.' 3. మారసింహునకు 'సోదామందలము' నిచ్చెను. ఇది గంజాం జిల్లాలోని ప్రస్తుతపు 'సురదా' ఆయి ఉండవచ్చును. దీనికి 'సురదా' రాజధాని. 4. వజ్రహస్తునకు 'కంటకవర్తని' యను రాజ్యము నిచ్చెను. ఇది బీహారు ఒరిస్సాలో నున్న కలహండి రాజ్యమై ఉండవచ్చును. దీనికి రాజధాని 'కలహండి' కామార్ణవుడు 36 సంవత్సరములు కళింగరాజ్యపరిపాలన చేసి గతించినపిదప వానికుమాళ్లు అల్పప్రాయులగుటనో, లేక దుర్బలులగుటనో దానార్ణవుడాకళింగరాజ్యము నాక్రమించుకొనినట్లు చోడగంగుని కొర్నితామ్రశాసనమువల్ల తెలియుచున్నది. అప్పటికి దానార్ణవుడుకూడా తన అన్నయగు కామార్ణవుడొసంగిన రాజ్యమును 36 సంవత్సరము లేలియుండవచ్చును. ఈదానార్ణవుడు తన అన్నయొక్క కళింగరాజ్యమును ఆక్రమించుకొని 4సంవత్సరములు పాలించెను. అనగా తాను మొత్తముమీద 40 సంవత్సరములు పాలనచేసినట్లు తెలియుచున్నది. ఇతను కాలముచేసినపిదప యీదానార్ణవుని సంతతివారే వంశపారంపర్యముగా కళింగరాజ్యపరిపాలనము క్రమముగా చేయుచుండిరి. అయినను దానార్ణవుని సోదరుడగు కామార్ణవుని వంశీయులకు మహేంద్రాచల ఉత్తరభాగమునుండి కళింగనగర దక్షిణమువరకు సముద్రతీరమువైపున కొంతరాజ్యముండెను. ఈరాజ్యమునకు దంతపురము రాజధానిగా ఉండెను. అందుకు నిదర్శనముగా ఈరాజ్యములోనున్న కొన్నిగ్రామము లొసంగినట్లు దానశాసనములయొక్క తామ్రశాసనములు దొరకుచున్నవి. ఈకామార్ణవవంశీయులు వంశపారంపర్యముగా 'వర్మన్' అనే ఉపాధి ధారణ చేసియున్నారు. కామార్ణవుడు కళింగరాజ్యపాలనచేయుచున్న నాటినుండి విజయరాజ్య సంవత్సర నామములో ఈఉపాధి ధారావాహికముగా వచ్చుచున్నది. ఈవంశీయులకు కళింగసామ్రాజ్యపాలనలే పోయినను వీరి ఆదిపురుషుడగు కామార్ణవుడు కళింగము పాలించుటచే వీ రొసంగిన తామ్రశాసనములో కళింగాధీశులు మొదలగు బిరుదులున్నవి. ఈ'వర్మన్' ఉపాధి ధారకులు దంతపురము, కళింగనగరము, తుంగాం,ఇత్యాదిస్థలములలో దానము లొసంగియుండుట చేతనను, వీరియిష్టదైవము మహేంద్రాచల ప్రతిష్ఠిత గోకర్ణేశ్వరుడగుట చేతనున్న గంగవంశీయులనియు, కళింగాధీశులనియు, తామ్రశాసనములలో ఖోదితముగు చేతను వీరు కామార్ణవవంశీయు లని దృఢీకరింపవచ్చును.

మేము సంగ్రహించిన'వర్మన్'ధారకుల తామ్రశాసనముయొక్క రేకులుకడియమునుండి విడదీయబడలేదు. ప్రస్తుతము మేము అనంతవర్మపుత్రుడగు ఇంద్రవర్మయొక్క తామ్రశాసనమును పెక్కలికాపురస్థుడగు స్వామి నారాయణపట్నాయకునివద్దనుండి తెచ్చినాము. ఈ మూడు రాగిరేకులలో ఉన్నది. ఇవి ఒకరాగికడియమును దమర్చబడినవి. సదరుకడియమునకుఒకరాజముద్రఉన్నది. ఆ ముద్రపై వృషభమును, చంద్రుడును చెక్కబడి ఉన్నారు. ఈమూడురేకులు ఒకదానికొకటి తగులకుండ నటులు వీటిఅంచులు కొంచెము కొట్టబడినవి. ఇట్లు కొట్టుటచేతఅంచులు వెడల్పుఅయినవి. రేకుయొక్కపొడవు 6 అంగుళములు; వెడల్పు 3 అంగుళములు;కడియముయొక్క వ్యాసము $3\frac{3}{4}$ అంగుళములు. కంకణసహితముగా శాసనముయొక్క తూనిక 122 తులములు. రాజముద్రయొక్క వ్యాసము $1\frac{1}{2}$ అంగుళము. మొదటిరేకుయొక్క మొదటివైపునను, మూడవరేకుయొక్క రెండవవైపునను ఖోదితమై ఉండకపోవుటచేత అవి అట్టలవలె ఉండి శాసనమును సంరక్షించుచున్నవి. మొదటి రేకుయొక్క రెండవవైపునను, రెండవరేకుయొక్క మొదటిప్రక్కను 8 పంక్తులు చొప్పునను, రెండవరేకుయొక్క రెండవప్రక్క 7 పంక్తులును, మూడవరేకు మొదటి ప్రక్క 9 పంక్తులును ఖోదితమై ఉన్నవి. ఈ దానశాసనములో ఇది యెవరిచే వ్రాయబడినదో, యెవరిచే చెక్కబడినదో వ్రాయబడలేదు. ఈ శాసనము ప్రాచీన శాసనము.కళింగవంశీయుడగు ఇంద్రవర్మది. ఈ శాసన లిపి ప్రాచీననాగరము. భాష సంస్కృతము.

# మూలము

## మొదటిరేకు: రెండవప్రక్క

1 ఓం స్వస్త్యమరపురానుకారిణ సర్వర్తుసుఖరమణీయా
2 ద్విజయవతశ్రీ కళింగనగరాద్వాసకాన్మహేంద్రాచలా
3 మలశిఖర ప్రతిష్ఠతస్య చరాచరగురోత్సకల
4 భువననిర్మాణైకసూత్రధారస్య శశాంకచూడా
5 మణేర్భగవతో గోకర్ణస్వామినశ్చరణకమ
6 లయుగళప్రణామాదపాస్తసకలకలికళంకో
7 గంగామలకులోద్భవనినిస్త్రాంశధారోపార్జితసక
8 లకళింగాధిరాజ్యప్రవితతచతురుదధితరంగమేఖ

## రెండవరేకు: మొదటిప్రక్క

1 లావనితలామళయశోఅనేకసంక్షోభజని
2 తజయశబ్దఃప్రతాపావనతసమస్తసామంతచక్ర
3 చూడామణి ప్రభామంజరీపుంజరంజితచరణ
4 పరమమాహేశ్వరోమాతాపితృపాదానుధ్యాతోనయవి
5 నయదయాదాక్షిణ్యశౌర్యోదార్యసత్యత్యాగా
6 దిగుణసంపదామాధారశ్రీ అనంతవర్మసూనుమహారా
7 జశ్రీమానింద్రవర్మఫరేయభక్తిః పానివిఖలేక్యాగ్రా
8 మవాసినోభోగి కవారికప్రముఖ సర్వాంసమ(ల) వేతో

## రెండవ రేకు: రెండవప్రక్క

1 క్టుంబిన సమాజ్ఞాపయతివిదితమస్తువోయదాస్మిన్గ్రా
2 మేస్మాభిశ్రీమా (న)ంద్రవర్మా సూర్యోపరాగె పుణ్యావిబ్భ
3 ద్ధయేరాజపుత్రఖాలినామాభూపతకః నివేశ
4 నసహితకపిలమండపయమలేపోల్లక్షిత
5 కౌ(న)ండిల్యసగోత్రాయ బ్రాంహ్మణత్య శర్మణే మాతృ

6 శర్మణే దుగ్గశర్మణేచ సర్వాకరభరైః పరిహృత్య
7 చంద్రార్కప్రతిష్ఠ ప్రతిపాదిత యితి పూర్వేణడోల్లంగినామ

మూడవ రేకు: మొదటి ప్రక్క

1 గర్తాశీమా సేతుదక్షిణేన ప్రవహతి దక్షిణేనసీమా
2 సేతుపశ్చిమదక్షిణకోణేపషాణపశ్చిమేణ వాపీ
3 ఉత్తరపశ్చిమకోణేపాషాణవుత్తరేణ కాణగర్తాపూ
4 ర్వేణప్రవహతి రాజ్ఞః ప్రజ్ఞాపయతి। మాభూద
5 ఫలశంకావః పరదత్తేతి పార్థివాస్వదానాఫల
6 మానంత్యపగదానానుపాలనం। బహుభిర్వసుధా దత్తారాజ
7 భిసగరాదిభియశ్యయశ్యయధాభూమితస్యతస్య
8 తదాఫలమితి, ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరశతే ౨౨౧
9 ఆషాఢదినపంచమీవుత్కీర్ణశాసనం*

---

*మూలమునకు తర్జుమా:—

ఓం స్వస్తి అమరావతి సదృశ సర్వర్తుసంచార సుఖహేతువున అత్యంతరమణీయ విజయ కళింగ నగరము నుండి మహేంద్రాచలశిఖరప్రతిష్ఠిత గోకర్ణ దేవునియెడల గల భక్తివలన సకలకలికళంకరహిత మగు, స్వీయ ఖడ్గ ధారాస్వాధీనమగు కళింగమండలమునగల సామంతరాజుల మకుటమణిప్రభావమున శోభిల్లు పాదపద్మములు గల వాడును, మాతృపితృభక్తుడును, పరమ మాహేశ్వరుడును, శౌర్యాది సకలసద్గుణ మండితుడును అగు మహారాజ అనంతశర్మగారి కుమారుడు మహారాజు ఇంద్రవర్మ పాన్విఖలేక గ్రామవాసులకు ఇచ్చిన ఆజ్ఞ.—

"సూర్యగ్రహణసమయంబున పుణ్యావృద్ధికొరకు ఖాళీనామమడనే రాజపుత్రుడు సామంతరాజుల యెదుట మేము ఈగ్రామము కౌండిన్యసగోత్ర సంభూతుడగు ఆదిత్యశర్మ, మాతృశర్మ, దుగ్గశర్మ, వీరికి ఆచంద్రార్కము అర్పించినాము. దీనికి ఏవిధమగు పన్ను లేదు ఇది యితరులవల్ల యివ్వబడినట్లూహింపగూడదు. ఒకరు దానమిచ్చి నది అనుభవింపనిచ్చుట తాను దానమిచ్చినదానికంటె ఉత్కృష్టమైనది. సగరచక్రవర్తి మొదలగువారీవసుధను దాన మొసంగియున్నారు. ఏసమయమున ఆరాజ్యము ఎవరిది అగునో ఆఫలమును అతను అనుభవించును."

ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరములు ౨౨౧ ఆషాఢపంచమిరోజున ఈశాసనము ఉత్కీర్ణము చేయ బడినది.

ఈగ్రామమునకు సరిహద్దులు, రాళ్లు ప్రవాహములు, దిబ్బలు వగైరాలె కాని గ్రామములు ఉన్నట్లు కానరాదు.

'వర్మ' ఉపాధిగలవారియొక్క ప్రస్తుతము దొరకిన శాసనముల పట్టి యీక్రింద వ్రాయడమైనది.

| | | | |
|---|---|---|---|
| 1. హస్తివర్మ | గాంగేయప్రవర్ధమాన విజయసంవత్సరం | 80 | ఉర్లాం తామ్రశాసనము. |
| 2. ఇంద్రవర్మ | ,, | 87 | మేముసంగ్రహించినది. |
| | ,, | 91 | అచ్యుతాపురం తామ్రశాసనము. |
| 3. రాజేంద్రవర్మకుమారుడు దేవేంద్రవర్మ | ,, | 110 | మాతమ్ముడుగారు సంగ్రహించినది. |
| 4. ఇంద్రవర్మ | ,, | 128 | శ్రీకాకుళం |
| | ,, | 136 | డిటో |
| 5. దానార్ణవునికుమారుడు యింద్రవర్మ | ,, | 149 | పుర్లిపేట |
| | ,, | 154 | మేము సంగ్రహించినది. |
| 6. గుణార్ణవునికుమారుడు దేవేంద్రవర్మ | ,, | 183 | శ్రీకాకుళం (చదివినది. |
| | ,, | 184 | అడవ తామ్రశాసనము మేము సంగ్రహించి |
| | ,, | 195 | సిద్ధాంతం |
| 7. దేవేంద్రవర్మకుమారుడు అనంతవర్మ | ,, | 204 | ఇతని తమ్ముడు జయవర్మ అనుమతిని 'తాలతేరు' అనేగ్రామము ఒక వేదాంత విద్యార్థికి ఇచ్చినాడు. |
| | ,, | 204 | అడవ తామ్రశాసనము మేము సంగ్రహించి |
| 8. అనంతవర్మకుమారుడు ఇంద్రవర్మ | ,, | 221 | మేముసంగ్రహించినది. (చదివినది. |
| 9. అనంతవర్మకుమారుడు దేవేంద్రవర్మ | ,, | 251 | కళింగశాసనము. |
| | ,, | 254 | విశాఖపట్నంశాసనము |
| 10. రాజేంద్రవర్మ కుమారుడు దేవేంద్రవర్మ | ,, | 308 | సౌత్ ఇండియన్ ఎపిగ్రాఫీ: 1918సంవత్సరం అన్యూయలు రిపోర్టులో ఉన్నది. |
| 11. దేవేంద్రవర్మకుమారుడు రాజేంద్రవర్మ | ,, | 342 | బీహారుఒరిస్సా రీసెర్చిజర్నలువాల్యూము 12, 101 పేజీలోఉన్నది. |
| 12. దేవేంద్రవర్మకుమారుడు సత్యవర్మ | ,, | 352 | శ్రీకాకుళం |

(11, 12 వీరిద్దరు సహోదరులై ఉండవచ్చును.)

| | | |
|---|---|---|
| 13. ఇంద్రవర్మ (వజ్రి); వజ్రికుమారుడుమారసింహ; అతని కొడుకు భూపేంద్రవర్మ; అతనికొడుకు దేవేంద్రవర్మ | 397 | 'చేదిముప' తామ్రశాసనము. |

14. దేవేంద్రవర్మ—1081 శకాబ్దము కంబకాయశాసనము.*

* ఇది భారతి 4 సంపుటము 11 సంఖ్యలో ప్రకటితమైన దేవేంద్రవర్మకంబకాయశాసనము. "విజయరాజ్య శకాబ్దసహస్రే ఏకశతత్ర్యధికే" అని ఉన్నది. ఇది "సహస్రమేకోనశతత్రయాధిక" అనిఉండవచ్చును. ఈప్రకారం అయినయెడల 1031(?) శకాబ్దము అయిఉండవలెను. అట్లయినయెడల ఈశకము దానార్ణవవంశీయుడగు ననంతవర్మ చోడగంగదేవుని పాలనలో ఉండవలెను.

అప్పటిలో ఈయనంతవర్మ ఈవంశీయులనందరిని ఓడించి యుండుటచేత పూర్వపు ధారావాహిక ప్రవర్ధమాన విజయసంవత్సరములు వేయక శాలివాహనశకాబ్దము నారంభించెనని ఊహింపవచ్చును.

## రాజ్యపరిపాలనకాలక్రమము

వీరసింహుడు

1 కామార్ణవుడు　2 దానార్ణవుడు　3 గుణార్ణవుడు　4 మారసింహుడు　5 వజ్రహస్తుడు

హస్తివర్మ ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్సరములు 80
ఇంద్రవర్మ " " 87-91
రాజేంద్రవర్మ
దేవేంద్రవర్మ " " 110
ఇంద్రవర్మ " " 128-136
దానార్ణవుడు
ఇంద్రవర్మ " " 128-149-154
గుణార్ణవుడు
దేవేంద్రవర్మ " " 183-195

జయవర్మ　అనంతవర్మ " 204
అనంతవర్మ
ఇంద్రవర్మ " 221
అనంతవర్మ
దేవేంద్రవర్మ " 251-254
రాజేంద్రవర్మ
దేవేంద్రవర్మ " 308

రాజేంద్రవర్మ　సత్యవర్మ 352
ఇంద్రవర్మ (వజ్రి)
మారసింహ
భూపేంద్రవర్మ
దేవేంద్రవర్మ 397
దేవేంద్రవర్మ 1031 శా. శ.

# రసాయన చిత్రములు

కల్లూరి చంద్రమౌళి గారు, బి.యస్.సి., (ఎగ్రి)ఎబర్డీన్

మనమొక మ్యూజియమున కేగినపుడు వివిధ వర్ణాకారములు గల యనేకవస్తువులను గాంచెదము. వేరు వేరు మృగములను, వివిధజాతుల పక్షులను, అనేకజాతుల చెట్లను వివిధ వర్ణాకారములుగల రాళ్లను చూడగలము. ఈవివిధ వర్ణాకారములు కొద్దిపదార్థముల సంయోగము వలననే కలిగినవనియును, వివిధ జంతువృక్షజాతుల భేదములు బాహ్యములే యనియును బాగుగా పరిశీలించిన మనకు విశద మగును.

గానపాండిత్యమంతయు, స,రి,గ,మ,ప,ద,ని యను నేడక్షరములపై నాధారపడియున్నది. ఆ యేడక్షరముల యాధారముతో వేరువేరుకృతులను వేరువేరురాగములతో సంగీతవిద్వాంసులు పాడగలరు గదా! అటులే యాంగ్ల భాషలో 26 అక్షరములు గలవు. ఎన్ని వేల మాటలు, ఎన్ని కోట్ల వాక్యములు-ఇది యది యననేల-నాంగ్ల భాషా పాండిత్యమంతయు నీ యిరువదియారక్కరములపై నాధారపడి యున్నదిగదా!

పైన బేర్కొనబడిన మ్యూజియమున కేగినపుడొకయరలో నొక కొయ్యముక్క, కొంతగోదు, బెండు, రబ్బరుముక్క, సీసపుపెన్సిల్, బ్లాటింగుకాగితము, పంచదార, వరిపిండి, వజ్రము ఉన్నవనుకొనుడు. ఆసొరుగుపై నతికించిన కాగితముపై "ఈ సొరుగులోని వస్తువులన్నియు కర్బనము (Corbon), ఉదజని (Hydrogen), అమ్లజని (oxygen)యను మూడు మూలద్రవ్యముల(Elements) సంయోగముచే కలిగిన"వని వ్రాసియున్న జాలును. రసాయనశాస్త్రము తెలియనివారికి వివిధ రూపగుణ వికారములుగ గన్పించి పైసిద్ధాంత మాశ్చర్యమును గలిగించును. ప్రపంచములోనున్న వస్తువులన్నియు సుమారు 80 మూల ద్రవ్యములచే నేర్పడినవని రసాయనశాస్త్రజ్ఞులు సిద్ధాంతించిరి. అయితే యీ 80 లో చాల కొద్దిమాత్రమే యెక్కువ వస్తువులలో మిళితమై యున్నవి. తక్కినవి చాల యరుదుగ గన్పించును. ప్రపంచములో నున్న వస్తువులన్నియు నీ మూలద్రవ్యముల సంయోగముచే నేర్పడినవని చెప్పియుంటిమిగదా. చిత్రకారు డేడు మూలవర్ణములతో ననేకవిధములైన రంగులను తయారుచేసి యనేకచిత్రములను రచించునట్లు రసాయనశాస్త్రజ్ఞుడు గూడ నీ మూల ద్రవ్యములనుంచి యనేకకోట్ల వస్తువులను, వివిధ ధర్మములు గలవిగను వేరు వేరు నామరూపములు గలవిగను సృష్టించును. ఈ ద్రవ్యములలో కొన్నిటికి కొన్నిటితోమాత్రమే ఎక్కువ రసాయనానురాగము (Chemical affinity) గలదు. ఈ రసాయనానురాగము గల ద్రవ్యముల గొన్నిటిని ఒసగిన, రసాయనశాస్త్రవేత్త యొక క్రొత్త ప్రపంచమును సృష్టించగలడు. కొంతమంది శాస్త్రజ్ఞులు యీ మూలద్రవ్యములన్నియు నొక యాది మూల ద్రవ్యము నుండియేవచ్చినవనియును, ద్రవ్యమంతయు(All matter) నేకత్వములో నున్నదనియును చెప్పుచున్నారు. అనగా యీ ప్రపంచములోనున్న పదార్థము (Matter) నుంచిగాని, శక్తి (Force) నుంచిగాని కొంత తీసివేయుటగాని, కలుపుటగాని జరుగనేరదు. ఎప్పుడును ద్రవ్యశక్తులు, సమానముగానే యుండును. ఒక రూపమునుంచి మరొక రూపమునకు మార్చగలుగుదుమే గాని హెచ్చు తగ్గులు మాత్రము జరుగనేరవు.

పరమాణువులు (Atoms) ఋణ (Negative) ధన (Positive) విద్యుత్‌ను గలిగియుండును. ఉదజని పరమాణువు ఋణవిద్యుత్‌ను గలిగి ధనవిద్యుత్ చుట్టును తిరుగుచుండును. ఏ పరమాణువునుంచి వచ్చినను విద్యుత్ అణువు (Electron) లన్నియు సమానముగానే యుండును. ఉదజని పరమాణువులో నొక విద్యుత్ అణువును స్వారము (Helium) పరమాణువులో రెండును ఉన్నవి. కాబట్టి ద్రవ్యమంతయు విద్యుత్ స్వభావమును గలిగియున్నదని తేలుచున్నది. పరమాణు

వులు వేరువేరుగనున్నను ఒకే పదార్థమునుండి వచ్చిన వని ప్రస్తుత శాస్త్రవేత్తలు నమ్ముచున్నారు.

## ద్రవ్యరూపములు

ఒకేవిధమైన పదార్థము మూడు విధములైన స్థితు లలో నుండును. వాయుపదార్థము, ద్రవపదార్థము, ఘనపదార్థము. ఒకస్థితిలోనుంచి మరియొక స్థితిలోనికి మారునపుడు వేరువేరు ఆకారములను భౌతికధర్మముల (Physical properties) మార్పులను జెందును. ఈమార్పులు పరమాణువుల సంయోగదూరమును బట్టియు చలన వేగమును బట్టియు సంభవించును. అనగా వాయురూప మున నున్నప్పుడు పరమాణువులు చాల దూరముగనుండి తక్కువ యాకర్షణశక్తి గలిగియుండును. తదుపరి యుష్ణ మును తగ్గించిన పరమాణువుల చలనవేగము తగ్గి కొంత వఱకు దగ్గరకు కనబడి ద్రవరూపముగ మారును. ఇంకా ఉష్ణమును తగ్గించిన పరమాణువులు దగ్గరకు చేరి యొకదానినొకటి యాకర్షించుకొని ఘనరూపముగ మారును. వీటినే భౌతికములైన మార్పులందురు.

నీటియావిరి వాయురూపమున నుండి ద్రవరూప మైన నీరుగా మారును. కొంత యుష్ణత తగ్గింపువలన ఘన రూపమైన మంచుగ మారును.

ఒకమూల ద్రవ్యముయొక్క పరమాణువు మఱి యొకమూల ద్రవ్యపరమాణువుతో కలసినయెడల రసాయనమిశ్రమద్రవ్య మేర్పడును. దీనినే రాసాయనిక మయిన మార్పని యందురు. రెండుపరమాణువుల ఉదజని యొకఆమ్లజని పరమాణువుతో రసాయనమిళితమైన నీరు యేర్పడును. $H_2 + O = H_2O$

ఒక నత్రజని పరమాణువు మూడు ఉదజని పరమాణువులతో రసాయనమిళితమైన అమ్మోనియా యేర్పడును. $2N + 3H_2 = 2NH_3$.

ఇట్లు రాసాయనికమయిన మార్పువల్ల వచ్చిన రసాయన మిశ్రమద్రవ్యము (Chemical Compound) మొదట కలసిన పరమాణువుల సగటు ధర్మములను గలిగి యుండదు క్రొత్తధర్మములను, క్రొత్తయాకారములను గలిగియుండును. దీనినే రాసాయనికమయిన మార్పనెదరు.

## సామాన్య మిశ్రమములు, రసాయన మిశ్రమములు

సామాన్యమిశ్రమమునకును, రసాయనమిశ్రమమున కును చాల భేదమున్నది. ఇసుక పంచదార కలసిన సామాన్యమిశ్రమ మేర్పడును. సీసుసున్నము, పంచదార మొదలైనవి రసాయన మిశ్రమములు. సామాన్యముగా రసాయనమిశ్రమ మెసుడునుదిసుడుగా నుండక సమానత్వమును గలిగియుండును. సామాన్యమిశ్రమమును సులభముగ విడదీయవచ్చును. పంచదార యిసుక కలసియున్న వనుకొనుడు. నీళ్లలో వేసిన పంచదార నీళ్లలో కరగిపోవును. ఇసుకను వడపోత వలన విడదీయవచ్చును. పంచదార కలసిన నీరును కాచిన పంచదార తిరిగి లభించును. సీసుసున్నపుపొడి, యినుపపొడి కలసియున్న అయస్కాంతముతో యినుపపొడి నాకర్షింపజేసి విడదీయవచ్చును. వీనిని భౌతికములయిన మార్పులందురు. రసాయనమిశ్రమము నిట్లువిడదీయ వీలు లేదు. రసాయనప్రయోగములవలనే విడదీయవలెను. వేడినో, శక్తినో యుపయోగించి దాని మూలద్రవ్యముల నులోనికి విడదీయవచ్చును.

నీరు, ఉదజని అమ్లజనుల రసాయన మిళితమైనప్పటికిని పరిశుభ్రమైన స్థితిలో దొరకుట దుర్లభము. ఏ పదార్థములోనైనను, ఎంత కొద్ది యితరపదార్థము కలిసినను యాపదార్థము మలినపదార్థమగును.

1/1000 వంతు) అంజనము (Antimony) మంచి రాగిని చెడగొట్టును. 1000వ వంతు బిస్మత్, రాగి యొక్క విద్యుత్ ప్రవాహశక్తిని తగ్గించును. 1/500 వ వంతు బిస్మత్ బంగారమును నాణెములకు పనికిరాకుండ జేయును. సామాన్యమిశ్రమమును సులభముగను, రసాయన మిశ్రమమును రసాయనపద్ధతుల వలనను విడదీయవచ్చునని యిదివరకే నుడివియుంటిమి గదా! ఉప్పును యెంతచిన్న పలుకుగ నూరినను అది రసాయనమిశ్రమముగనే యుండును. దానిని పరమాణువులలోనికి విడదీసిన సోడియము

## అప్పుడు-ఇప్పుడు ౧



సనాతన  సంక్రమ  నవీనములు  పూర్వ వర్తమాన వందనములు



వైదిక  కర్ణాటక  మాధ్యమిక  మిశ్రిత  పాశ్చాత్యములు



బాల బాలికల సనాతన నవీన వైఖరులు

అప్పుడు-ఇప్పుడు ౨



పురాతన విద్యార్థి



నవీనవిద్యార్థి

ప్రస్తుతసాంసారిక జీవనము







సనాతన సాంసారిక జీవనము



(సనాతనము) భోజనమున భేదము (నవీనము)



పాశ్చాత్యరీతుల గరపుట

(Sodium), హరిదము (Chlorine), పరమాణువులు వచ్చును. అనగా ఒక చిన్నయణువును (Molecule) గృహముయొక్క గోడకుపోల్చిన దాని పరమాణువుల నొక్కొక్క రాతికి పోల్చవచ్చును. మూలద్రవ్య మనగా దాని అణువు యొకేవిధమైన పరమాణువులను గలిగియుండును. కాని థురము (Thorium), వరుణము(Uranium) మొదలైన మూలద్రవ్యములు యితర మూలద్రవ్యములను గలిగియున్నవి. మొత్తముమీద అణువు ఒకేవిధమైన పరమాణువులను గలిగియుండునని చెప్పవచ్చును.

రసాయనశాస్త్రజ్ఞుడు స్థూలదృష్టితో కనబడనటువంటి చాల వస్తువులతో మెలగవలెను. గాలి తడిలేక, శుభ్రముగ నున్నంతకాలము కనబడని వస్తువులలో లెక్కయే. సామాన్యముగా మనము ఉదజని, అమ్లజని మొదలైన వాయువులను రాగి, వెండి మొదలైన ధాతువుల వలె చూడలేము. చాల వాయువులకు రంగు, రుచి, వాసనలు లేవు. అయితే రసాయనశాస్త్రజ్ఞుడు యెందువలన ఈ కనపడనటువంటియు, రంగు, రుచి, వాసనలు లేనటువంటియు వస్తువులను నమ్మి లోకసామాన్యమగు "చూచుటయే నమ్మట" యను వాక్యమును త్రోసిపుచ్చవలెనని యడుగవచ్చును. అవి చేయు పనులనుబట్టి వాటి గుణములను కనిపెట్టుటయేకాక యావస్తువు లున్నవని మనము నమ్మవలెను. ఎట్లన యినుము తుప్పు పట్టుట అమ్లజని యినుముతో రసాయన సంయోగమున నుండుటవలననే కర్బన ఏకామ్లజని (Carbon monoxide) ని లోనికి పీల్చిన చనిపోయెదము. ఓజోన్ (Ozone) వాయువు చుట్టుప్రక్కల దుర్వాయువులను శుభ్రపరచి సువాసన నొసగును. హరిదము (Chlorine) వాయువులో రంగు గుడ్డనుంచిన రంగును తీసివేయును. నీళ్లలో నొకగ్లాసును బోర్లించి చేయిపెట్టి వత్తినను నీళ్లు లోనికిపోవు. గ్లాసులో నున్న గాలి నీటిని రానీయక తన శక్తితో వెలుపలకు నెట్టును. మరియును, ప్రతి వాయువునకును బరువు ఉన్నది. వాయువిమానములలో నెంతో తేలికయని యుపయోగించు ఉదజనిగూడ బరువుగలిగి యున్నది. ఇది గాలి కన్న సుమారు 14½ రెట్లు బరువు తక్కువ. ప్రతి వాయువునకును బరువున్నదనియును, దానిని త్రాసుతో తూచిన కనుగొనగలమనియును ఫ్రెంచి రసాయనవేత్తయగు లెవాయిజీర్ కనిపెట్టెను. కాని యీ వాయువులను ద్రవరూపముగను, ఘనరూపముగను మార్చు కొన్ని పద్ధతులను కొంతమంది ప్రస్తుతము కనిపెట్టిరి.

అణువులుగాని, ఒక్క అణువులోని పరమాణువులుగాని వాయుస్థితిలో నున్నంతకాలము చలనవేగ మెక్కువగనుండి యొక అణువును మరియొక అణువు నెట్టుచుండును. ఒక అణువులోని పరమాణువు లొక నిమిషములో నొకదాని నొకటి కొన్నిలక్షలసార్లు నెట్టుచుండును. అనగా అమ్మోనియా వాయువు ఒకబుడ్డిలో నున్నదనుకొనుడు. ఆ బుడ్డిమూత దీసిన నది యాగదిలోనికి విస్తరింప జూచును. దాని వాసనను పీల్చుటకు మనకు కొంతకాలము పట్టును. వెంటనే పీల్చజాలము. ఎందువలననగా గాలియొక్క అణువులచే అమ్మోనియా అణువులు నెట్టబడి వెంటనే వాసనను విస్తరింపకుండ జేసి కొంత యాలస్యమును గలిగించును. అయితే క్రమేణ అమ్మోనియాగాలి గదిలో విస్తరించి వాసనను గది నిండ నింపును. ద్రవపదార్థములో నీచలనవేగము చాల తక్కువగ నుండుటవలన త్వరగ విస్తరింపజాలదు. నార్తుమోరు (North more) గంధకామ్లము వాయువును (Sulphurous-acid gas) ద్రవరూపముగ 19 వ శతాబ్దారంభమున ఒత్తిడివలన మార్చగలిగెను. 1823 సం న డేవి (Sir Humphry Devy), ఫారడే (Faraday) యనువారలు హరిదము, కర్బనద్వ్యమ్లజనిదము, అమ్మోనియా మొదలైన వాయువులను ఎక్కు ఒత్తిడివలన ద్రవరూపముగ మార్చి సులభసిద్ధాంతముల నేర్పరచిరి. తదుపరి థిలోరియర్ (Thilorier) కర్బనద్వ్యమ్ల జనిదమును ద్రవరూపము నుంచి తెల్లగ మంచువలెనుండు ఘనపదార్థముగ మార్చెను. ఇది చాల జల్లగ నుండుటచే చల్లదనమున కుపయోగించెదరు. 1889 సం॥ లో డేవార్ (Sir James Dewar) ఉదజని వాయువును ద్రవరూపముగ మార్చెను. ఇట్లు వాయువుల నన్నిటిని ద్రవఘనరూపములుగ మార్చి వాటి ధర్మములను సులభముగ తెలిసికొనునట్టి యేర్పాటు చేయగలిగిరి.

మొదట మన పూర్వులు ఒక లోహమును మరియొక లోహముగా మార్చుటకు వీలున్నదనియును, పాదరసము నుండి బంగారమును తయారు చేయవచ్చుననియును నమ్మిరి. ఇనుపముక్కను మైలతుత్తము (Copper Sulphate) తో కాచిన రాగిగ మారునని గూడ నమ్మిరి. కాని తదుపరి రసాయనశాస్త్రవేత్త లిట్లు చేయ వీలు లేదనియును, నొక మూలద్రవ్య మెప్పుడును మారక యట్లే యుండుననియును చెప్పదొడగిరి. అయితే యిప్పుడు కొంతవరకు కాయుద్దేశ్యమును మార్చుకొని పూర్వుల యుద్దేశ్యముతో నేకీభవించుచుండిరి. ఎట్లన వరుణము (Uranium) నుంచి రదము (Radium) వచ్చుననియును, థురము (Thorium) నుంచి రదము వచ్చుననియును చెప్పుచున్నారు. ప్రొఫెసర్ సాడి (Soddy) యను నాంగ రసాయనశాస్త్రజ్ఞు డీ విషయములో చాల ప్రయోగముల జేసి పై విషయములను బాగుగ విశదపరచెను.

## జీవులరసాయనచరిత్ర

ఎనుబది మూల ద్రవ్యములలోను, జీవులలో 29 కంటె నెక్కువ యెప్పుడును గాన్పింపవు. వానిలో 12 అరుదుగ నుండును. ముఖ్యముగ ఎల్లప్పుడును గన్పించు మూలద్రవ్యములు ఉదజని, అమ్లజని, కర్బనము, నత్రజని, స్ఫురము, గంధకము, పొటాసియము, మగ్నము, ఖటికము, ఇనుము. కొన్నిటిలో సోడియము హరిదము శైలము కొద్దిగా కన్పించును. జీవులలోనుండు మూల ద్రవ్యములు సామాన్యముగ ప్రకృతినుండి సులభముగ లభించును. జీవి కత్యావశ్యకములైన మూలద్రవ్యములు— ఉదజని, అమ్లజని, కర్బనము, నత్రజని యను నాల్గును, కొన్ని జీవులలో గంధకమును—సామాన్యముగ ప్రకృతిలో సులభముగ లభించును. ఉదజని గాలిని పీల్చుటకును, జీర్ణతకును ముఖ్యావశ్యకము. అమ్లజని ఉష్ణజ్వాలలోని కాహారమును మార్చి దేహమునకు శక్తినొసగుట కుపకరించును. మరియు నితరోపయోగములగు వస్తువుల నాకర్షించును. ఉదజని అమ్లజనుల రసాయన సంయోగము వలన నీరు ఏర్పడును. ఇది ప్రతిప్రాణికిని ముఖ్యావశ్యకమని మనకెల్లరకు విశదమేగదా! నత్రజని ఉదజని అమ్లజనులతో గలసి ప్రాణమునకు ముఖ్యా మగునని నుడివెదరు. కర్బనము యితర మూలద్రవ్య తో కలసి సులభముగ రసాయన మిళితమగును. ఉద జనితో సులభముగ గలసి గాలిలోని విడి స్థితిలో యొక్కవ అమ్లజనిని చెట్లయాకులు విడదీయుట ములకును, మనుష్యులకును లభించునట్లు చేయును. నము అమ్లజని ఉదజనులతో గలసి యనేకకోట్ల యనమిశ్రమములను జీవుల కొసగుచున్నది. ఈ కర్బ సాయనమిశ్రమము లదియొక గొప్ప రసాయనశా శాఖగ నేర్పడినది.

కాబట్టి మనకు తెలిసినంతవరకు జీవిత మం రెండు సిద్ధాంతములపై నాధారపడి యున్నదని చున్నది. (1) వెయ్యి భాగముల గాలిలో సుమారు మూ పాళ్లు గలిగి యెంతో కొద్దిగానుండి అమ్లజని తీ తగ్గించు కర్బన ద్వ్యమ్లజనిపైనను; (2) కర్బనద్వ్య లోనున్న కర్బన పరమాణువు యొసగు శక్తిపైనను, ఈ చెట్లయాకులలోనున్న యాకుపచ్చని రంగువలన, సూ రశ్మివలన లభించుచున్నది. కర్బనము ప్రకృతిలో 3 లలో లభించుచున్నది. 1. కర్బనము 2. సీసముగను ద్రాఫాయితము (Graphite), 3. వజ్రము. వజ్రము గనులనుండి స్వభావసిద్ధముగ తీయక రసాయన లపై వర్తకసరళిని కర్బనమునుండితయారు చేయ నను ప్రయత్నము లింతవరకును జయప్రదములు కాలే కాని కొద్దిగ మాదిరికి మాత్రము చేయ వీలుపడెను.

స్ఫురము ఎముకలలోను మెదడులోను వగ నున్నది. గంధకము మాంసకృత్తులలో (Protein ఎక్కువగ లభించును. పొటాషియము జీవులలో మును గలిగించును. ఇట్లు వేరు వేరు మూలద్రవ్య వేరువేరు విధములుగ జీవితములో పని చేయుచున్న

ఇట్లు రాసాయనికములైన మార్పులు జీవితమ చిత్రవిచిత్ర వికారములను గలిగించుచుండును. రసా శాస్త్రము ప్రతివస్తువుతో సంబంధముగలదై య చిత్రములను సృష్టించుచుండును.

# విద్వద్గోష్ఠి

చిలుకూరి నారాయణరావు గారు, యం. ఏ., యల్. టీ.

జ్యేష్ఠమాస 'భారతి'లో బ్రహ్మశ్రీ ప్రభాకర శాస్త్రిలుగారు వ్రాసిన "ప్రాచీనాంధ్రశాసనములు" అనేవ్యాసము చాలా ముఖ్యమయినదిన్ని, ఆంధ్రభాషా చరిత్రనిర్మాణమునకు అమూల్యమయినదిన్నీ అయిఉన్నది. వారి వ్యాసము చదివినతరువాత నాకుగలిగిన సంతోషమునకు మితిలేదు. వారింకను నిట్టి శాసనములను ప్రకటించిఆంధ్రవిద్వాంసులకృతజ్ఞతకు పాత్రులగుదురు గాక.

వారి వ్యాసమును చదివినపిమ్మట నాకు గలిగిన కొన్ని ఊహలను ఇచట పొందుపరుస్తున్నాను.

## (1) నాగబు

ఇచట 'బు'ను (1) నాగబు వెనుక సున్నగాని చుక్కగాని లేకపోయినా దానిని 'ంబు'గనే చదువవలసినదిగా నాకు తోస్తున్నది. బిందువిరహితమైన 'బు'ను 'ంబు'గా చదువవలసినట్లు పూర్వశాసనములనుబట్టియే కాక, అర్వాచీన శాసనములను బట్టి కూడ ఊహించడమునకవకాశమున్నది. గంజాముజిల్లాలోని శ్రీకాకుళము దగ్గరనున్న అర్సవెల్లి సూర్యనారాయణస్వామి ఆలయములోని అనంతవర్మ చోడగంగదేవుని నాటి ఒక శిలాశాసనములో బిందువిరహితమయిన ఒక 'బు' ఉన్నది. దానిని 'ంబు'గ చదివినగాని అర్థము కుదురదు ఈ విషయమును కీ. శే. రావుబహద్దర్ హెచ్. కృష్ణశాస్త్రిగారితో ముచ్చటింపగా వారు నా యూహ సరియైనదని చెప్పినారు. ఎట్లయినను పై 'నాగబు' శబ్దములోని'బు'కు సానునాసికోచ్చారణ ముండెననుట నిశ్చయము. అది అనునాసికోచ్చారణము కలదని తెలుపుటకే తరువాతి శాసనములను వ్రాసినవారు దాని తలపై చుక్కను నిలిపి యుందురని నా ఊహ. 'బు' తలపై చుక్క ఉండడము వల్ల దానిని 'ంబు' అని సున్నను వెనుకచేర్చిగాని 'బుం' అని తరువాతచేర్చిగాని చదువకూడదని నా అభిప్రాయము.

పాలీభాషలో సంస్కృత ప్రథమైకవచన ప్రత్యయమైన 'స్' అనునది 'ఉ'గా మారినది. శబ్దముయొక్క అంత్యాక్షరమును బట్టికాక, వస్తువుయొక్క సహజ లింగమునుబట్టి శబ్దముయొక్క లింగము ఏర్పాటగుట ఆ భాషలో ఆరంభమయినది. అందుచేత 'నాగ' శబ్దము 'నాగమ్'అయి దానిమీద ప్రథమైకవచన ప్రత్యయమైన 'ఉ'కారము చేరి 'నాగము' అని ఏర్పడవలసి ఉండేది. కాని ఆ భాషలో కొన్ని శబ్దముల మకారములోని అనునాసికత్వము శైథిల్యమునొంది కేవలము 'బు'గానో, అనునాసిక ధ్వనియుక్తమైన'బు'గానో ఉచ్చరింపబడుతూ ఉండేదని నాఊహ. శాస్త్రిలుగారు వ్రాసినట్లు 'నాగబు' అనునది సమస్తపదము కాదనే అభిప్రాయముతో నే నేకీభవిస్తానుకాని, 'బు'నుమాత్రము సానునాసికముగా ఉచ్చరింపవలెనని నా తలంపు.

'నాగబు' అనునది పాలిభాషాపదమయినను కావచ్చును. అది ఆంధ్రపదమయి ఆనాడు ఆంధ్రభాష ప్రత్యేకస్వరూపమును పొంది ఉండడమును తెలియజేస్తే, నాకున్ను పరమసంతోషమే. కాని, అట్లు ప్రతిపాదించడమునకు ఈ ఒక్క పదముకంటె ఎక్కువ ప్రమాణము కావలసి ఉంటుంది. ఒక వాక్యమయినా, వాక్యములోని ఒకముక్క అయినా దొరకి ఉంటే బాగుండేది.

## (2) లక్ష్మీపురశాసనము

### (1) మంగిదొగరాజు

'మంగి' అనేది 'మహీ' శబ్దమునకు ప్రాకృతరూపమయి ఉంటుందేమో! 'సింహ' శబ్దము ప్రాకృతములో సిహ, సీహ అనే రూపములనే. కాకుండా 'సింఘ, సిఘ' అనికూడా అవుతుంది. దీని సామ్యమునుబట్టి 'మహీ' శబ్దము ప్రాకృతములో 'మహ్మి' అయి 'మంఘి'గా మారి తుదకు 'మంగి' అయినదేమో.

..దొగ, ధొవ, దుగ, దువ అనేరూపములు సంస్కృత 'ద్వా' శబ్దమునకు ప్రాకృతరూపములయి ఉండవచ్చును. 'దొగరాజు' అంటే రెండోరోజు, రాజు తరువాతరాజు కావలసినవాడు, అంటే యువరాజు అని చెప్పుకోవచ్చును.

### (2) ముడ్లు

'ముడి' అంటే ఒకఅధికారి అనే అర్థము సరియైనదే అయినట్లు తోస్తుంది. అప్పుడు 'ముడియము'అంటే ముడియొక్క ధర్మము, అధికారము అని అర్థమవుతుంది. 'ముద్దరాజు, ముత్తరాజు ముత్తరసు, మొదలయినవాటిలోని'ముద్ద'ముత్త'శబ్దములున్న'ముడి'తో సంబంధించి ఉండవచ్చును. దక్షిణ హిందూదేశశాసనావళి నాలుగో సంపుటములో (S. I. I. Vol. IV) 'పంచనదముడి' అని ఒక్కశాసనములో ఉన్నది.

### (3) విట్టజుల

ఇచట రేఫము మూర్ధన్యముయిన 'ట'తో చేరి ఉండడముచేత అలఘుత్వమును పొంది ఉండవచ్చును. ఇట్లే "కొట్టంబుల్వట్టెణ్డు" అన్న చోటచూడాను. 'రాజు' శబ్దములోని మొదటి రేఫమునకు తెనుగులో ఒకానొకప్పుడు అలఘూచ్చారణముండి తీరవలెను. లేకపోతే దానినుంచి 'ఱేడు' అను వికృతి ఏర్పడదు. ఇట్లే ఆయాశబ్దములలో శకటరేఫము ప్రాచీన శాసనములలో కనబడడమునకు వాటికి ప్రకృతులైన శబ్దములలో శకటరేఫముండడమే కారణమని నాఊహ. క్రావిడి గల శబ్దములకు ప్రకృతులయిన కొన్నిశబ్దము లితర ద్రావిడ భాషలలో అలఘురేఫయుతములయిఉండవచ్చునని తలుస్తాను. శకటరేఫ విచారమును ప్రత్యేకముగా చేయవలసి ఉన్నది.

### (4) ప్రతమరాజ్యంబున

ఇచట 'త'వర్ణము 'థ'కు మారుగా ఉన్నదనడమునకు 20 వ పంక్తిలో 'యతాభూమి' అనేచోట'థా'కు 'తా'వ్రాయడమే నిదర్శనము. 'ప్రథమరాజ్యంబున' అంటే రాజ్యముయొక్క ప్రథమసంవత్సరమున అనే అర్థమే సరియైనదికాని, ప్రథమ అనేది 'ప్రవర్థమా' అనేదానికి సంక్షేపరూపమై ఉండదు.

### (5) కడువండ్లుల

ఇది యీ రూపముతో గ్రామనామమై ఉం దనుకొంటాను. ఇది సప్తమీవిభక్తి బహువచనరూప దీనికి ప్రథమ బహువచనరూపము 'కడువండ్లు' అని ప్రథమైకవచనరూపము 'కడువలి'అనిన్నీ అయిఉండ 'కడువలి' నుంచియే 'కొడాలి'అనే నేటి గ్రామనా పుట్టి ఉండును.అయితే, బహువచనప్రయోగముసంస్కృత మర్యాదననుసరించినదయిన అయి ఉండవలెను. 'కడువలి' గ్రామములు కొన్నిచేరి ఒకే గ్రామమ నయినా వ్యవహారమండవచ్చును. కడువలి అంటే పల్లె అనే అర్థమయి ఉండవచ్చును.

### (6) రెన్డువటి, రెన్డువట్టి, రెన్డుట్టి

'వట్టి'యొక్క శిథిలరూపము 'వటి'. 'వుట్టి'లో ఆది హల్లోపమువల్ల 'ఉట్టి' అనేరూపమేర్పడినది. వట్టి, ఉ(వు)ట్టి అనేవి 'వృత్తి'శబ్దమునకు ప్రాకృతభా రూపములు. వీటిలోని ఆదివకారము పర్యా సంధిలో ఆదేశముగా వచ్చినది కాదు. బ్రాహ్మ హారము కొన్నివృత్తులుగా విభజింపబడి ఉండ ప్రసిద్ధి. ఈ వృత్తులవ్యవహారము విశాఖపట్టణముజిల్లా ఇప్పటికిన్ని ఉన్నది చూ. వేశెలువులు.

### (7) మిరియమ్పుబోళజ

ఇచ్చట 'ంపు' ఆదేశముగా వచ్చుటనుశ్రీ లుగారు చూపడము భాషా చరిత్రమున కమూల్యమైనది. నన్నయ కర్వాచీన కవులందరూ పు, ంపులనా ములుగావాడి ఉన్నారు. నన్నయగ్రంథములో మ్మా వక్షితత్పురుషమునం దీయాగమము నాకు కనబడ దీనిని నేనే మొదట కనిపెట్టిన వాడిననుకొంటున్నా ఆర. i 34 తపంబుగౌరవంబు; ఆర. ii 68 పు చెఱంగు; ఆర. ii 209 తపముబలమునన్; ఆర. iii ఆశ్రమంబు దెసకు; అని నన్నయ ప్రయోగములు సమాసమందే కాక కర్మధారయమునందును 'పు,ంపు'

నన్నయ గ్రంథములో ఉండవేమో అని నా కనుమానము. ఆది. vi 221 బలితంపురక్కసు; ఆది. vii 260 విరుద్ధంపువరము; ఆర. i 49 వీని పుట్టినపాపంపు వేళ; ఆర. iii 300 పరుసంపు రాలపై ;— అనువాటిలోని 'బలితంపు రక్కసు'అనేదానికి'బలియుండౌ రక్కసు'అనిన్నీ, 'పాపంపువేళ' అనేదానికి 'పాపంబువేళ'అనిన్నీ, గౌతమీ గ్రంథాలయస్థ తాళపత్రప్రతులలో నాకు కనబడినవి. తక్కిన రెండింటికిన్ని పాఠాంతరములు నాకు కనబడలేదు. ఇంకా చూడవలసిఉన్నది. నేను చెప్పినది ఒక్క నన్నయ గ్రంథస్థభాషకే చెల్లుతుందిగాని, భాషకంతటికిన్ని చెల్లదు. అంతమాత్రముచేత చిన్నయసూరికి ఎరుంగమి నాపాదించడము తప్పేఅయినా, శాస్త్రిలవారన్నట్లు కొందరు ఆ వైయాకరణశిరోమణిని అధిక్షేపిస్తున్నారు. నన్నయకు పూర్వపుదయిన యీ శాసనములో 'ంపు' ఆగమమును చూపి శాస్త్రిలవారు భాషాచరిత్రమునకు పరమోపకారమును చేసినారు.

## (8) పెడశిన

ఇచ్చట 'పె'లోని ఎత్వము 'అ' కుమారుగా తప్పుగా వ్రాయబడినదికాదని నాతలంపు. ధాతువు'పెడయు' అని ఉండును. 'ఇచ్చు, సమర్పించు, వదలిపెట్టు అని దీని అర్థమయి ఉంటుంది. 'పెడ(బాయు)-అనే దానిలో నీ'పెడ(యు) ధాతువు కనబడుతున్నది. అందుచేత, 'మిరియమ్ము బోళజకు తెంగరి పెడశిన అంటే మిరియమ్ము బోళజకు తెంగరి ఇచ్చిన, దానము చేసిన అని అర్థము చెప్పుకొంటాను. తెంగరిదాత; మిరియమ్ము బోళజప్రతిగ్రహీత అని నాఅభిప్రాయము.

## (9) 'ఆడ్లుపట్టు... నేల

దీనిని 'ఆడ్లపట్టు' అని సవరించుకో వలెననుకొంటాను. ప్రాచీన శాసనములలోను, గ్రంథములలోను కూడ ఇట్టి ప్రయోగములే బహుళముగా కనిపిస్తున్నవి.

## (10) నేల

నేల, నిలవు, నెలవు- ఈ మూడున్ను 'నిల్' ధాతువు నుండి వచ్చినవే. యుద్ధమల్లుని బెజవాడశాసనములో 'తివిరియిన్నిలవ' అని కనబడుతున్నది. దానిని చదివినవారు 'యిన్నెలవ' అని చదివినారు. ఈలక్ష్మీపురశాసనము యుద్ధమల్లునికి పూర్వపుది కాబట్టి అంతకు పూర్వమే 'నేల' అనేరూపము భాషలోనున్నదని చెప్పవలెను.

## (11) తూఱ్పు

ఇది 'తూఱ్' అనే హలంతధాతువు నుంచి పుట్టినది. దీనికి కృదంతరూపము తూఱ్పు. ఇది శిథిలమయి తూఱుపు అనేరూప మేర్పడ్డది. ఇట్లేమాఱ్, మాఱ్పు, మాఱుపు మొదలయినవి. తూఱ్పు ప్రాచీనరూపము, తూఱుపు అర్వాచీన రూపము అని నా ఊహ.

## (12) వేడ్లుము

'వే'కున్ను 'డ్లు'కున్ను మధ్యను 'స'ను చేర్చుకోవలెనని శాస్త్రిలుగారు వ్రాసినారు. 'వే + ఇడ్లు' అని చెప్పిన సరిపోదా? "వేయిగృహములను నాశనము చేసిన" అని అర్థముచెప్పుకో వచ్చునేమో.

## (13) వే శెఱువుళు

ఇచ్చటను 'పెడశిన'లోను శవర్ణ ముచ్చారణమునను సరించి ఉన్నది. 'పెడసిన' 'వేసెఱువులు' అని వ్రాయడము సంస్కర్తల సంప్రదాయము. ఇచట'శె(సె)ఱు'అనేది 'సరస్' శబ్దభవమై ఉండును. అదిమొదట 'సఱు' అయి తరువాత ఆదిమ అకారము ఎకారముగా మారడమువల్ల 'సెఱు' అనిన్ని వ్రాతలలో 'శెఱు' అనిన్ని ఉండవచ్చును. దీనినుంచే కన్నడములో 'కెఱె' అనేరూప మేర్పడి ఉంటుందని నా ఊహ. 'రెండువ(వు)ట్టి'లోని వకారమెట్లు ఆగమవర్ణము కాదో 'వేశెఱువుళు'లోకూడా శ (స) వర్ణము ఆగమవర్ణము కాదనిఅనుకొంటాను.

## (14) వేవురు

ఇది వే + ఉవర్ అయి ఉంటుంది. వే + అవర్ అని విడదీస్తే వేవరుఅనే రూపము మొదట కనిపించవలెను. నాథ, నాథుఁడు, నాథుఁడు; దేవ, దేవఁడు, దేవుఁడు మొదలయినవి కనిపిస్తూ ఉన్నవి. ఆ సామ్యమునుబట్టి వే + అవర్ అనిసాధించవచ్చును గాని, వేవరు అనేరూపము ఇప్పటికికనబడలేదని చెప్పవలసిఉంటుంది

పైని నాకు తోచినరెండుముక్కలనువ్రాసినాను. ప్రభాకరశాస్త్రిగారుభాషాతత్త్వజిజ్ఞాసువులయి చేస్తూ ఉన్న పరిశ్రమ స్తవనీయమయినది. వీరింకా ఇట్టి నూతన విషయములను బయటపెట్టిభాషాపాండిత్యమునకు వన్నె పెట్టుదురు గాక!

---

# భారతదేశపు స్త్రీలు

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

ఏదేశము ప్రఖ్యాతమై, సీత, దమయంతి, చంద్రమతి, మున్నగు పతివ్రతల చేతను, రాణీ ఝాన్సి, లక్ష్మీబాయి, ఖడ్గతిక్కనభార్య, రాణీ దుర్గావతి మొదలగు వీరనారీమణులచేతను. మొల్ల, తరిగొండ వెంకమాంబ, భండారు అచ్చమాంబ మొదలగు కవయిత్రులచేతను పేరెన్నిక గాంచినదో, అట్టి భారతదేశమున నేడు స్త్రీలు పేక్షాదృష్టితో పరిగణింపబడుచున్నందున భారతమాత కడుంగడు దుఃఖించుచున్నదనుట కొంతమాత్రము సంశయము లేదు. సంసారమనుబండికి నొకచక్రముపురుషుడు, నొకచక్రము స్త్రీ, మొదలగు సమస్త పరికరములు కదా; అట్టి స్త్రీలయొక్క దుస్థితి కనుగొనిన వారలు ఇపుడిపుడు పురుషపుంగవులలో నూటి కేపదిమందియో స్త్రీవిద్యాభిమానులు కలరనుట నిస్సంశయము. నేను చూచినంతవరకు ఈ కాలములో సంపూర్ణ విద్యావతులైన స్త్రీలు నూటికొకరో ఇద్దరో కలరు. పురుషుడు జన్మింపగానే తలిదండ్రులు వానికొరకై ప్రత్యేకముగా కొంతసొత్తు నార్జించెదరు. స్త్రీ జన్మింపగానే జననీజనకులకు విసుగుపుట్టి వివాహమున కేయేబది ఏడుల పెండ్లికొడుకునో ఆర్జించియుంచెదరు. ఇదిఇటులుండగావరశుల్కమను మహాపిశాచ మొకటి దేశము నావరించి పీల్చి పిప్పి చేయుచున్నది. భారతమహిళాసభలనియు, సమాజములనియు, సమావేశములనియు, తీర్మానములనియు, యార్భాటములు చేసినగాని సంఘమునకు శ్రేయము చేకూరదు.

ఆచరణమునకుయోగ్యములైనతీర్మానముల గావించి పట్టుదలతో పని చేసిననేకాని ఈమహిళాసంఘమును పునరుద్ధరింపజాలము. సంఘమునుపీల్చి పిప్పిచేయుచున్న వరశుల్కములు, కన్యాశుల్కములు, అతిబాల్యవివాహములు లోనగు ఘోరదురాచారములను సున్నంపు పారద్రోలవలయును. ప్రతితాలూకాకు బాలికాపాఠశాలలు స్థాపించి తగుశ్రద్ధ వహించి స్త్రీవిద్య నభివృద్ధికి దేవలయును. స్త్రీ సంఘమునకు ఐకమత్యమనునది నానాటికి క్షీణించిపోవుచున్నది. విద్యావ్యాప్తిచే గాని సంఘ మభివృద్ధి పొందనేరదు. విద్య చేకూరిన సువర్ణమునకు వాసన కలిగినట్లు మనబాలిక లున్నతవిద్య సంపాదించిననాడే సంఘము కీర్తివంతమగును. తలిదండ్రులు తమ బాలికలకు విద్యగరపుటకై తగుశ్రద్ధను పూనవలయును. విద్యాలోపముచే స్త్రీలు బాల్యమున ఆటపాటలయందును, యౌవనమున గవ్వలాట, పచ్చీసు మొదలగువానియందును, వృద్ధాప్యమున కోడండ్రతోను, ఇరుగుపొరుగులవారితోను పోరాడుటయందును కాలము వృథాపుచ్చుచున్నారు. భావిభాగ్యమున కాధారభూతమైన స్త్రీల విద్యాభివృద్ధికై పురుషులును, స్త్రీలునుగూడ గట్టి ప్రయత్నము చేయవలయును. పురుషులయభ్యుదయము, జాతియొక్కయున్నతి, బాలుర వికాసము, ఇవి యన్నియు స్త్రీజాతిపై నాధారపడియున్నవి గాన విజ్ఞానవంతులు స్త్రీవిద్యకు తోడ్పడుట యవసరమని విన్నవించుచున్నాను.

---



## జపాను 'మాసపత్రికల మానవాధీశుడు'

'ది యంగ్ ఈస్టు' అను పత్రికలో జపానుదేశమున 'మాసపత్రికల మానవాధీశుఁడు' (Magazine King)అని ప్రఖ్యాతిగాంచిన 'సెయిజీ నోమా'గారి జీవితగాథ ప్రకటితమైనది. అది తన కట్టి గొప్పపేరు వచ్చుటకయి యాతడు కావించిన యద్భుతకార్యములనేకాక జపాను దేశము పత్రికాప్రచురణపఠనముల విషయమున సైతము నెంతయు ముందునకు సాగుచుండుటను చాటుచున్నది. మన దేశమునందలి పత్రికాధిపతులు, సంపాదకులు నీతని చరిత్రమునుండి యించుక దెలిసికొనదగిన యంశములుగలవు.

ఇరువదేండ్లకు పూర్వము 'సెయిజీనోమా' ఒక యనామధేయుడు. అపు డాతడొక రాష్ట్రీయపాఠశాలయందు తక్కువజీతముగల యొకచిన్న యుపాధ్యాయుడుగ నుండెను. ఇపు డాతడు కోటీశ్వరుడు. ఇంతేకాదు. "సూయజు"కాలువకు తూర్పునగల భూమండలమున నాతడిపుడు గొప్ప గ్రంథపత్రికా ప్రకాశకుడయినాడు. ఉదాహృతములయిన యీతనివివిధప్రచురణముల సంఖ్యలు కల్పితములుగ దోచును. ఇతడు బహుగ్రంథప్రకాశకుడే కాక తొమ్మిది పెద్దమాసపత్రికలకును అధిపతి. వీనిలో నొకటియైన 'కింగ్' అను పత్రికకు గట్టిగా పదునైదులక్షలు చందాదారు లున్నారు. తక్కినవానిలో లక్షచందాదారులకు తగ్గిన పత్రిక ఒకటియైనలేదు. మొత్తమున నతని పత్రికలను చదువువారు కోటికి తక్కువగ నుండరు. అనగా జపానీయులలో నైదింట నొక్కడీతని పత్రికలను జదువుచుండుననుట. మంచూరియాలోని 'హెక్కయిడు' మొదలు 'క్యూషు'పఱకును, కోరీలోను, ఫార్మోసాలోను, సాఘేలియనులోను, జపానీయులు నివసించుచున్న సంయుక్తరాష్ట్రములలోను ఈపత్రికలే యెక్కువగా కానవచ్చుచుండును.

అద్భుతావహమయిన యాతని యీవిజయమునకు గల కారణములేవి? మూలధన మత్యధికముగనుండెనా? లేదు. ఆతని మూలధన మత్యల్పము; లేదనియే యనవచ్చును. అయిన ప్రజల అభిరుచుల ననుసరించి వారిని సంతోషపెట్టుటకు తగిన అవకాశములను కనిపెట్టి వినియోగించుకొనుటయందతనికిగల చాకచక్యమా? కాదు. అతడట్టి నేర్పు కలవాడును కాడు. అతడు గ్రంథప్రచురణ వ్యాపారమును ప్రారంభించినది మొదలు పట్టుదలతోను,విశ్వాసముతోను,కష్టించి పనిచేయుటయే యిందుకు కారణము. ఈతని యింతగొప్పవ్యాపారమునకిదియే పునాది. ఇంకనేదియుకాదు.

అతడిపుడు తొమ్మిది చక్కని మాసపత్రికల కధిపతియై అన్యులు స్పర్థించు గొప్పపదవియందున్నాడు.కాని యాతడొక్కనాడయినను సోమరియై యుండువాడుకాడు. 'సాటర్ డేఈవినింగ్' (Saturday Evenig) పత్రికాధిపతి 'కర్టిస్'గారివలె వేకువజామునొదలు రాత్రి చాలప్రొద్దుపోవువరకు నీత డమానుషశక్తితో బనిచేయును. ఆతని యనుదినకార్యక్రమమున విశ్రాంతివిహారములకు తావులేదు. కడచినసంచికకన్న రానున్న

సంచిక మిన్నగానుండ నుపాయముల నాతఁ డనునిమిషము నారయుచుండును. ఒక్కతఁటి నాతఁడు సమర్థుఁడగు సంపాదకుఁడు; ఇంకొక్కతఁటి చక్కని వ్యాసరచయిత; కొండొక్కతఁటి తెలివితేటలుగల వర్తకుఁడు; వేఱొకతఁటి చేయి తిరిగిన ప్రకటనకారుఁడు (Advertiser). అతఁడనుదినమును నైదుగురు చేయుపనిని తానొకఁడే చేయును. అతనిని గాంచి అతనిక్రిందపనిచేయుచున్నవా రుత్సాహవంతులై సంతోషముతో పనిచేయుదురు.

అతని తొమ్మిదిపత్రికలలో ప్రతిపత్రమును అతని ప్రత్యేక వ్యక్తిత్వమును, ఆశయములను, ఆలోచనలను వెల్లడి చేయుచుండును. అతఁడు బోధకుఁడుగా తన జీవితమును ప్రారంభించుటను మఱవక తనజీవితము నంతయును నట్లే-బోధకుఁడుగనే-కడపుట కాతఁడభిలషించెను. జపాను దేశమునందుగల ప్రజానురంజకు లగు నీనాటి బోధకులలో, మతనాయకులలో నీతఁడొకఁడన్న నతిశయోక్తికాదు.

అతనిపత్రికలలో, స్త్రీలకొఱకొకటి, బాలకులకొఱకొకటి, శిశువులకొఱకొకటి కేవలము వినోదములతో నిండినదొకటి ఉన్నవి. కాని ఇన్నిటిని మించిన దింకొకటి గలదు. దానినతఁడు తన అభిమానపత్రికగా దలచుచుండును. అది "యూబెన్" (వక్తృత్వము) అను పేరుగలది. వక్తృత్వమును గూర్చి పెక్కు గ్రంథములున్నవి; కాని ప్రత్యేకము వక్తృత్వమునుగూర్చిచర్చించు నిట్టిపత్రికజపానులో దప్ప నింక నేదేశమునను గానరాదు. ఈపత్రిక నిరుపమానస్వభావము గలదగుటయే కాక పత్రికాప్రచురణవ్యాపారమున నాతనికి గట్టి యాధారమయినదియు నగుటచే దాని నతఁడు మిగుల ప్రేమించుచుండును.

———

## శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు, యం. ఏ.,

౧౯౨౮ సం.జూన్ నెల మాడరన్ రివ్యూ మాసపత్రికలో శ్రీ. కే. పి. జయస్వాలుగారు శ్రీ యదుగిరి యతిరాజస్వామి సంపాదితమై, శ్రీ ఏ. రంగస్వామి సరస్వతి (రాజకీయశాసన పరిశోధనశాఖ, చెన్నపురి) గారిచే ప్రకటితమైన భోజరాజకృతశృంగారప్రకాశైక[...] మును విమర్శించి యది భోజరాజకర్తృక[...] యగునని నిరూపించుచు నొకవ్యాసమును ప్ర[...]టించినారు. అందు వారు నామమాత్రా[...]ష్టమైయుండిన యీశృంగారప్రకాశమాతృక[...] సంపాదించి సంస్కృతసారస్వతమున కమూల్యసంపదను సమకూర్చిన శ్రీ రామకృష్ణ[...] గారినిగూర్చి కొంతముచ్చటించినారు. [...] సంహితలు మొదలుకొని యముద్రితమ[...] సంస్కృత వాఙ్మయము నీనాఁడు పరిశోధిం[...] సంస్కరించి,ముద్రించి వ్యాప్తికిం దెచ్చుచు[...] మైసూరు, తిరువాంకూరు బరోడాసంస్థానము[...]లతోపాటిమహాకార్యమునకు కొంద[...] ప్రత్యేకవ్యక్తులగు ప్రముఖులుగూడ పూను[...] నిరని చెప్పవచ్చు,

అట్టివారిలో తనకాంతులను నలుదిక్కులను[...] చున్న ఉన్నతమగు దీపగృహము (Light house) [...] విరాజిలుచున్న యాతఁ డొక్కఁడుగలఁడు. ఆతఁడు రా[...] మహేంద్రనగరనివాసి యగు శ్రీమానవల్లి రామకృష్ణ[...] (యం.ఎ.) గారే. ఆయనకు ప్రభువులసాహాయ్యము[...] హృదయమే సహాయము. దారిద్ర్య మాయన రాజ్య[...] ఒకమాధ్యమిక పాఠశాలలో నాయన యొక యుపా[...]యుఁడు.

మానముతో, వినయముతో నాయన మలబా[...] నందును, తత్సమీపప్రదేశములయందును గల భారతీ[...] గృహములకు సారస్వత తీర్థయాత్రలు సల్పిరి. అ[...] దక్షిణభారతమునందలిసమకాలీనపరిశోధకులకొఱకు[...] లెత్తించునదియు, నిఖిలభారత సంస్కృత విద్వాం[...] కానందమును, అభిమానమును గలిగించునదియు[...] నమూల్యసారస్వతనిధానమును కనుగొనిరి. విస్మృతమ[...]

యుండిన కుందమాల, నాలుగు భాణములు, ఇప్పటికి దెలియరాని అద్భుతకళా చరిత్రమును సమకూర్చుచున్న అభినవ గుప్తపాదుల భరతనాట్యశాస్త్ర సుప్రసిద్ధ వ్యాఖ్యానము, దండిభారవుల చరిత్రములను బయలుపఱుచుచున్న అవంతిసుందరీకథ, అవంతి సుందరీ కథాసారము



శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు

అను గ్రంథములను సేకరించి, పరిష్కరించి, ప్రకటించినారు. ఇంతేకాక విశాఖదత్తుని దేవీచరిత్ర గుప్త యను చారిత్రక నాటకమును, తాపసవత్సరాజము, విక్రాంత శూద్రకము నను నీమొదలయిన చారిత్రక నాటకములను లెక్కింటిని కనుగొన్న ప్రతిష్ఠను సైతము బడసిరి. మఱియుకవిగారు సుప్రసిద్ధభారతీయ సంగీతశాస్త్ర గ్రంథమయిన మిథిలాపురాధిపతి 'నాన్యదేవుని భరత భాష్యము'ను, సంస్కృత ప్రాకృత పద్యవాఙ్మయముపై నుత్కృష్టకళావిమర్శనమును, ధారానగరాధీశ భోజరాజ కృతమును నగు శృంగారప్రకాశమును సేకరించిరి.

శ్రీరామకృష్ణకవియే స్వయ మొక నూతనోపలబ్ధ వస్తువు. ఆయన సంస్కృతసాహిత్యజ్ఞాన మతి మానుషము; అనగా అపారము; సవిమర్శకము. ఆ భాషయందాయనకు గల యభిమాన మద్వితీయము.

నష్టప్రాయమైన భారతీయుల సారస్వత కులధనమును మరల సేకరించుటతో వీరివ్యక్తిగతపరిశ్రమమంత రించలేదు. అయ్యది తత్ప్రచురణమునందును ఉత్సాహము గలిగియున్నది. 'దక్షిణభారతి' అనుపేరున నొకగ్రంథమాలను వీరు ప్రారంభించినారు. కాని చాలినంత ధనసహాయము లభింపమిచే నందు గ్రంథములు తఱచు వెలువడకున్నవి.

అని నుడివి పదపడి శృంగారకావ్యమును గూర్చి యింతవిమర్శించి మరల నిట్లుచెప్పినారు:

శ్రీ రామకృష్ణకవిగారు తాము శృంగారప్రకాశమునందలి నాటకభాగమును పరిష్కరించినట్లు నాకు లేఖను వ్రాసియున్నారు. నష్టములైపోయిన నాటకములనుండి యుద్ధృతములైన భాగము లందుండుటచే దానిని గాంచనెంతయు కుతూహలముతో వేచియున్నాము. అందు భాసకవికృతమగు 'స్వప్నవాసవదత్త'నుండి కొంత భాగ మున్నట్లు తెలియవచ్చినది.

అన్యరాష్ట్రీయు లగు శ్రీ జయస్వాలుగారు గుర్తించిన యీ కవిగారి భాషాభిమానమును, పాండిత్యమును, పరిశోధనశక్తిని, పరిశ్రమమును ఆంధ్రసహృదయులు గుర్తింపజాలకుండుట కడు విచారకరము. ఇంతటనైనను సర్వథా సమర్థులగు శ్రీకవిగారి కుచితరీతిని సాహాయ్యమొనరించి తమకును, కవిగారికిని కీర్తినిపెంపొందజేయజూచుట పరమావశ్యకము.

---

## భారతీయ గ్రామముల వినాశము

"ది మైసూర్ ఇకనామిక్ జర్నల్" ఏప్రిలు సంచికయందు శ్రీ హుసాన్ అల్ కాట్ గారు భారతదేశమునందలి గ్రామముల పరిస్థితులను గూర్చి వివరించుచు నొక చక్కని వ్యాసమును వ్రాసిరి. రెండుమూడు శతాబ్దముల క్రిందటివరకు నీశ్వరుని సుందరధరణికి చేరువగా ప్రశాంతముగ జీవితమును కొనసాగించి యుండిన గ్రామస్థులకు నేడు దారిద్ర్యము, అజ్ఞానము, వ్యాధి, మృత్యువును కలుగజేయుచున్న సంక్షోభము నత డందు వర్ణించియున్నాడు :—

గ్రామస్థునకు వ్యాధియు, మృత్యువును ఘోరమైన నష్టకారులు. అతడు స్వయముగా శుభ్రముగా నుండ గోరును. తఱచుగా స్నానమును చేయుచుండును గాని, యశుభ్రమైన, మురికియైన పరిసరములలో జీవించును. అతడు తన కుటుంబమునెడల శ్రద్ధాళువుగా నుండినను తమకు రోగమును దెచ్చునట్టితుక్కు, పెంటకుప్పలు తన యింటికి దగ్గఱగా నుండుట సహించును. మేఘములచే నాటంకపరుపబడి, సూర్యుని కిరణములు బాగుగా తగులని యితర దేశములకంటె మనభారతదేశము చాల నయమే. సూర్యుని వేడిమివలన వ్యాధిమూలము లగు సూక్ష్మజీవులు నశించుట గ్రామస్థుని భాగ్యమే. సూర్యుని యుపకారమే లేనియెడల నిప్పటి మరణసంఖ్య సుమారు 1000 కి 80 కంటె నెక్కువయై యుండును. మొత్తముమీద, పట్టణములకంటె గ్రామములు కొంచెము ఎక్కువ ఆరోగ్యవంతములే. గ్రామములలో వాంతిభేదియు, మహామ్మారియు (కలరాప్లేగులు) ఘోరమైన నాశనమును కలుగజేయునుగాని, అనారోగ్యకరమైన యిండ్లలో క్రిక్కిరిసియుండు మనుష్యులతో నిండియుండు పట్టణములలో నవి యింకను ఎక్కువమరణములకు కారణమగును. ఎట్లయినను, 1918 లోను, 1919 లోను లక్షల ప్రాణులను వినాశమొనర్చిన విషపడిసెము(ఇన్ఫ్లుయెంజా) ఉపద్రవము పట్టణములలో కంటె పల్లెలలోనే యెక్కువ భయంకరముగ విధ్వంసమొనర్చెను. ఒక్కటైనను బ్రదికి మిగులని గ్రామములనేకములు గలవు. ఏదైన భయంకరరోగము వచ్చుసూచనలుకనబడినప్పుడు గ్రామస్థుడు గ్రామదేవతకు కోడిపుంజునో, మేకనో వెఱ్ఱిమై బలియిచ్చును. భయంకరములగు నిట్టి రోగములకు తోడు అలవాటుమేరకు తనసర్వనమునకు టక్కైవచ్చి గ్రామస్థుల ద్వారములయొద్ద క్షామదేవతయొక్క భయంకరాకారముతో సిద్ధముగా వేచియున్న భారతదేశపు కృషీవలుల జవసత్త్వములను దినదినము క్షీణింపజేయుచు, దేహమును,బుద్ధిని క్షీణింపజేసి యెందుకును కొఱగానివారినిగా చేయుచున్నది. యీనమ్మరానిరోగములకైన ప్రజ లంతగా భయపడరు. చలిజ్వరము (మలేరియా), కాలాజారు జ్వరము, కొంకిపురుగు జాడ్యము నిట్టిమితి లేనినష్టమునుకలిగించునవి. కలరా మైన యంటురోగమువలె నివి త్వరగా గుర్తింపబడనివి కాకుండుటచే వీని నివారణము కష్టతరము. అవి బహు ఎక్కువకీడును కూడచేయునవి యగును. ఒక్క జ్వరము వలననే సంవత్సరమునకు 40 లక్షల మరణములు కలుగుచున్నవి.

దారిద్ర్యమును, అజ్ఞానమును చాలినంత యాహారము లేకుండుటకును, అపరిశుద్ధ జలమునకును, అనారోగ్యకరమగు నివాసస్థితులకును కారణములగుచున్నవి. వానితోపాటు మోటుమతాచారమును, బాల్యవివాహములును గలిసి యనారోగ్యమును, మరణములను దెచ్చిపెట్టుచున్నవి. ఈ మరణములు చాలవరకు నివారింపదగినవే. కాని గ్రామములలో తగిన వైద్యసహాయము కరవైయున్నది. వైద్యసహాయమునకు తోడు గ్రామపునర్నిర్మాణ కార్యక్రమములను చాలినంతగా నాచరణలో పెట్టవలెను. అంతవఱకు గ్రామస్థులు తఱచు దమ్ము భీతిలచేయువ్యాధులనుండి విముక్తిని బడసి సమృద్ధముగ బ్రతుకజాలరు.

---

## మానవశరీరము-యంత్రశాల

బెర్లినులో నిపుడుజరుగుచున్న ఆహార వైద్యశాస్త్రవస్తుప్రదర్శనమున ప్రదర్శింపబడిన యొక మానవరూపచిత్ర వివరములు: ఈచిత్రము మానవశరీరమున గలుగుచలనములను కొన్ని సుప్రసిద్ధయంత్రముల చలనముతో పోల్చిచూపుటకై కావించిన ప్రయత్నము.




అమ్లజని పరమాణువులు ముక్కుల లోనికి ప్రవేశించుచున్నవి. అవి శ్వాసకోశములలోనికి జేరి యక్కడ రక్తాణువులలోనున్న రక్తముతో కలిసిపోవుచున్నవి. అమ్లజనితో మిశ్రమైన యీ రక్తము హృదయములోనికి బోవును. హృదయ మారక్తము శరీరమునందంతట ప్రవహించునట్లు జలయంత్రమువలె ఒత్తిడి గలిగించును. ఈచిత్రమున జలయంత్ర స్వరూపమును హృదయస్థానమున గానవగును. శరీరమునందలి వివిధామ్లజనీకరణముల (Oxidations) వలన పుట్టిన కర్బనద్వ్యమ్లజనిదము (Carbon dioxide) శ్వాసకోశములలోనికి ధారాళముగా ప్రవేశించి యిటనుండి ముక్కులద్వారమున బయటికి వచ్చును.

నోటినుండి ప్రవేశించునాహారము మెత్తగా పండ్లతో నమలబడినపిదప ఉమ్మితో గలిసి కంఠనాళముద్వారా కడుపులోనికి పోవుచున్నది. అచ్చట నుత్పన్నము లగు కొన్ని జీర్ణకరస్రావములవలన నది జీర్ణ మగుచున్నది. తర్వాత అప్పుడప్పుడు కడుపుక్రింద వైపుననున్న 'పైలోరస్' (Pylorus) అను ఆంత్రముఖమున బడుచున్నది. ఇట్లు పడుచోట నొక ద్వారపాలకుని చిత్రము నిందు కాంచనగును. అంత నాంత్రములలో ప్రవేశించి యాహారము కారిజము (Liver) నుండి పుట్టు పిత్తరసముతోను, మధురరసముతోను, ఆంత్రరసముతోను గలిసి చక్కగా జీర్ణమయి మూడు ఆహార మూలద్రవ్యము — కర్బనోదజనితము (Carbon hydrate), మాంస కృత్తులు (Protein) క్రొవ్వు—ల రూపమును జెందును. కర్బనోద జనితము చక్కెరబిళ్లలవలెను, మాంసకృత్తులు గుండ్రనిబిళ్లలవలెను రక్తప్రవాహమున గలియుట నీచిత్రమున గాంచనగును. ఈరక్తము కారిజములోనికిబోవును. అక్కడ రక్తముననున్న రెండురకముల బిళ్లలును మార్పును జెందును. చక్కెర

గంజీనలేనక్కడనిలిచియుండును. ప్రోటీను ఇంకను పలుచబడి తుదకు కొంచెము చక్కెరను గలుపుకొని మరల నొకమారు రక్తములో జేరును. ఈ సందర్భమననే కారిజమునలన వ్యర్థవిషపదార్థమును మూత్రిక (Urea), రక్తము, వీనివలన కొన్ని వ్యర్థపదార్థములును పుట్టుచుండుట చిత్రమున చూడనగును. అందు మూత్రికను రక్తము మూత్రపిండములలోనికి కొనిపోవుచున్నది. అచ్చట మూత్రములోని వ్యర్థపదార్థము వేరయి, చిత్రము క్రింది భాగముననున్న మూత్రాశయములోనికి పోవుచున్నది. మూత్రపిండమున పరిశుభ్రమయినరక్తము మరల ప్రధాన రక్తప్రవాహమున గలిసి తుదకు శ్వాసకోశములోనికి మరల పోయి కర్బన ద్వ్యమ్లజనిదమును గోలుపోయి హృదయమున బ్రవేశించి యక్కడనుండి శరీరమునందంతటను ప్రవహించును.

చిత్రముయొక్క కుడివైపున రక్తసంచలనక్రమమును గాంచనగును. రక్తప్రవాహమున నొకభాగము నరములలోనికిని, కంఠమునందలి మాంసగ్రంధిలోనికి మఱియొకభాగమును, ఇంకొకభాగము ప్లీహము (Spleen) లోనికిని, వేఱొకభాగము వృక్కములు (Pancreas) లోనికిని పోవుచున్నది.

ఎడమవైపున అస్థిసారము (Bone marrow) కొంతభాగము పైకిపోవుచున్న రక్తవాహినిలోనున్న రక్తకణములలోజేరి వాని నెడతెగక చక్కపరుచుచుండుటను చిత్రమున గననగును. బాహ్యవిషయములన్నియు నేత్రముల ద్వారమున లోనికి ప్రవేశించుచున్నవి. ఇందిది ఛాయాగ్రహణయంత్రవ్యాపారరూపమున జూపబడినది.

శ్రవణేంద్రియవ్యాపారము వాయువార్తాయంత్రవ్యాపారమున జూపబడినది. శరీరముపై మెదడునకుగల యధికారము వెన్నెముక ననుసరించి క్రిందికి మీదికి వ్యాపించియున్న నరముల మూలమున గాంచనగును. వానిలో నొక కేంద్రమునుండి కొన్ని కార్యములలోనికిని, ఇంకొకదానినుండి కొన్ని జీర్ణశక్తికి తోడ్పడుటకై ఉదరములోనికిని వ్యాపించియున్నవి. నరముల కేంద్రమునకు గ్రహణప్రేషణశక్తులు రెండును గలవు. శ్వాసమునకు సంబంధించిన దొకటి. స్వీయకార్యక్రమమును నిర్వ... చుట కొకటి; ఇట్లు కొన్ని కేంద్రములు నరములకు... శరీరరాజ్యమున మెదడు ప్రధాన రాజధానీనగర... జూపబడినది. వివేకమునకు, బుద్ధికి, మనశ్శక్తి వినియో... మునకును ప్రత్యేకస్థానము లిందు గలవు.

[స్ఫియరు...

---

## డాక్టరు సండర్లాండు-భారతబంధువు

డాక్టరు సండర్లాండు భారతదేశమునకు గా... సేవలు, నిస్స్వార్థములగుట, నమూల్యములు. ... ధర్మము, స్వాతంత్ర్యము, సర్వసహోదరత్వము ... మహదాశయములకే యతడు తొలినుండియు ... తము వినియోగపఱుచుచున్నాడు.



డాక్టరు సండర్లాండు

డాక్టరు సండర్ లాండు 1842 సం. ఫిబ్రవరి ... తేదిని జన్మించెను. ఇప్పు డెనుబదియేడవ వత్సరము ...

చున్నది. ఇంతవయసు గడచియు నత డిప్పుడుగూడ తరుచుగ భారతీయులసభల కధ్యక్షత వహించుచు, మిక్కిలి యుత్సాహముతో నుపన్యసించుచుండును.

చిన్నతనముననే యతనిహృదయమున భారతదేశముపెడ ప్రేమయు, నభిరతియు నెలకొనెను. నాటనుండియు నతడు భారతదేశమును గూర్చిన యనేక విషయముల జదువుచు వినుచుండెను. భారతదేశమునుండి మగుడి వచ్చిన యిరువురు మిషనరీలతో నతడు పరిచయము గావించుకొని యిచ్చటి విశేషముల దెలిసికొనెను. తానే యొక మిషనరీయయి భారతదేశమున వసింపవలె నను నిచ్ఛ శీఘ్రముగనే యతని హృదయమున మొలకెత్తెను. కళాశాలయందును, ధార్మికశిక్షామందిరమునను (Theological Seminary) గూడ ఈకోర్కె, యీస్వప్నము ఆతని వీడలేదు. అతడు తన విద్యాక్రమమంతయు భారతవాసమున కనుకూలించురీతి నడపుకొనెను. అతని సోదరియు, కొందఱు మిత్రులును మిషనరీలయి భారతదేశమునకు వచ్చుట సంభవించెనుగాని యాతడుమాత్రము సంకల్పముమాఱి మార్గాంతరము చేకొనెను. ఐన నాతని యగాధమగు భారతప్రేమ సుంతయు కృశింపదాయె. భారతదేశపు గొప్పగొప్పమతములు, విశాలవాఙ్మయము, అమూల్యశాస్త్రములు, సుదీర్ఘమగు నితిహాసము, అన్నిటిని మించి హృదయస్పర్శులగు నేటి సాంఘిక రాజకీయ సమస్యలు—వీనినిగూర్చి యతడు నలుబదియేండ్ల కెక్కువగ శ్రద్ధతో నధ్యయనము నేయుచున్నాడు. భారతీయ విషయములందు చిరపరిచయము గలవాడగుటచే నతనిని బ్రిటిషు జాతీయాద్వైతవాది మహాసంఘము (British National Unitarian Association) వారు 1895–96 సం.న మత, సంఘ, విద్యాదిసంబంధములగు విషయముల నరసి రా స్పెషలుకమిషనరుగా నంపిరి. మరలిన వెనుక నాత డావిషయముల గూర్చి లండను నగరమున విస్తృతమగు వివరణమును ప్రకటించెను. 1913–14 లో బ్రిటిషుఅద్వైతవాది మహాసంఘమువారును, అమెరికను అద్వైతవాది మహాసంఘమువారును గలిసి అట్టి కమిషనుమీదనే యతనిని తిరిగి భారతదేశమునకంపిరి. మిషనరీలను, ప్రభుత్వోద్యోగులను, ఆంగ్ల వాణిజ్య నిర్వాహకులను, భారతీయప్రముఖులను సందర్శించుచు, ప్రధాన నగరముల నుపన్యసించుచు, అన్ని మతములకును, రాజకీయపక్షములకును జెందిన భారతీయ నాయకు లెల్లరితో సంభాషించుచు నప్పు డత డీదేశమున 13,000 మైళ్లకు పైగా ప్రయాణము చేసెను. పెద్దనగరములందే కాక చిన్నపట్టణము లందును, అమెరికనులు మున్నెవ్వరును త్రొక్కియెఱుగని మాఱుమూలల పల్లెలందు సయితము, కొన్నివారములు గుఱ్ఱముపైపయనముచేసి, శ్రమపడుచు, నతడు తనపరిశోధనాదికము సాగించెను. నాటి కిచట నడచుచుండిన వివిధపత్రికారాజముల కాతడు ముచ్చటపడి, అనేకములకు చందాలుగట్టి, తద్ద్వారమున పెక్కు విషయముల గ్రహింపదొడగెను. ఇట్టు లతడు భారతదేశమందలి వాస్తవపరిస్థితుల సాంగోపాంగముగ నరసి, యనేక ముఖ్యవిషయముల బ్రిటిషుజనుల కెఱిగింపగలైను.

అఖిలభారత జాతీయమహాసభయొక్క రెండు వార్షికాధివేశనములయందును, భారత జాతీయసాంఘిక సమాజమునందును నత డుపన్యసించెను; అఖిలభారతాస్తిక మహాసభ కధ్యక్షతకూడ వహించెను. ముఖ్యముగ సభలయందు వివిధప్రాంతముల రాజకీయ సాంఘికోద్యమ నాయకులతోడను, ఆర్యబ్రహ్మసమాజాద్యాస్తికనాయకులతోడను అతడు పరిచయము గావించుకొనెను.

భారతదేశస్వాతంత్ర్యము అతనికి పరమ ప్రియమగు వాంఛ; అగుటనే యత డీవయసున సైతము, పెక్కురివలె విశ్రాంతితో గూరుచుండక, భారతదేశమునుగూర్చి యెల్లపుడు వ్రాయుచుండును.

భారతదేశము నెడతెగని దాస్యమున బంధించి, నాగరకలోకమున దాని నధోగతిపాల్సేయవలె నను ప్రతికూలభావములు బ్రిటిషు ప్రోద్బలమున నమెరికా మున్నగుదేశముల మిక్కుటముగ వ్యాపించుచుట గని, యాతని ధార్మికశక్తి వెచ్చగిలెను. ఆ ప్రతికూలప్రచారమును ప్రతిఘటించుటకై అమెరికాయందును, ఇతర దేశములందును భారతీయప్రాతినిధ్యము నెలకొల్పుట యావశ్యకమని యాతడు తలంచెను. లాలా లజపతిరాయి అమెరికాయం దున్నసమయమున (1914–1919) డాక్టరు

అతని కెల్ల విధముల సాయమొనర్చెను. అది యొక మహా భాగ్యమని యాత డెంచెను. అట్లొనర్చుట హిందూ దేశముపక్షమున, అనగా మానవకోటిలో నైదవభాగము పక్షమున, లోకముయెదుట ధర్మబద్ధమగు న్యాయవాదము సల్పుట యని యతడు తలంచెను. 'ఇండియా హోమ్ రూల్ లీగ్'ను సంస్థాపించుటయం దతడు లాలాజీతో పాల్గొనెను. 'యంగ్ ఇండియా' మాసపత్రిక సంపాదకీయకార్యమున తోడ్పడెను; లాలాజీ అమెరికాలో వ్రాసి ప్రకటించిన మూడు గ్రంథములకును ప్రూఫులు దిద్దెను; అం దొకదానికి పీఠిక వ్రాసెను. ఇంక ననేకవిధముల తోడ్పడెను. లాలాజీ భారతదేశమునకు మరలి వచ్చినపు డతడు 'యంగ్ ఇండియా'కు సంపాదకు డయ్యెను; 'ఇండియా హోమ్‌రూల్ లీగు' నకును, 'ఇండియా ఇన్ఫర్మేషన్ బ్యూరో' కును అధ్యక్షు డయ్యెను.

అతనివ్రాతలు ధార్మికభారతపక్షమును లోకమున నమోఘముగ వ్యాపింపజేసెను. 1908 లో డాక్టరు భారతదేశపు టశాంతికిగల కారణములనుగూర్చి 'అట్లాంటిక్ మన్త్లీ' అను పత్రికయందు వ్యాసము వ్రాయ బ్రిటిషు పరిపాలనమునుగూర్చి హిందూదేశమున నది కల్గించిన విపరీతాభిప్రాయము కారణముగ, ఇట్టివ్యాసములు ప్రకటించుట బ్రిటిషు పురోవృద్ధికి భంగకరమని కర్జనుప్రభువు స్వయముగ ఆపత్రికకు వ్రాసెను.

అమెరికా సంయుక్తరాష్ట్రములందును, కనడాయందును హిందూదేశమునుగూర్చియు, అందలి మతములు, కళలు, వాఙ్మయము, సాంఘికసమస్యలు, స్వాతంత్ర్యము మున్నగు విషయములనుగూర్చియు నతడు విపులముగ నుపన్యసించెను. అతడు రచించినవి రెండుగ్రంథములు భారతదేశమున ప్రకటితములయ్యెను.

అవి. 'భారతీయదుర్భిక్షములకుగల కారణములు', 'భారతదేశము, అమెరికా, విశ్వమానవసోదరత్వము', 'భారతస్వాతంత్ర్యపుహక్కు' (ఇదిఅముద్రితము) అనునవి ప్రతి భారతీయ విద్యాసంపన్నుడును చదివితీరవలసిన యమూల్యగ్రంథములు. ఇందలి తుదిగ్రంథ మిక ముద్రితము కానున్నది. భారతదేశమున రమారమి నాల్గుమాసములుమాత్రము పర్యటనముచేసి సేకరించుకొన్నజ్ఞాన[illegible] సాయమున, ఒక గొప్పదేశమునకు తీరనియపకార మొన[illegible]రించు దురుద్దేశముతో, స్వార్థపరతను తృప్తిపఱుచుకొ[illegible] నీచసంకల్పముతో, కేవలము పైశాచికభావములతో[illegible] కల్లలువ్రాసిన మేయోకన్య దుర్గ్రంథమును గొండ[illegible] ప్రమాణముగ గైకొను నీయదనున డాక్టరుగారి [illegible] గ్రంథరాజము భారతదేశమునకు గావించు నుపకార [illegible]ల్పము. ఈగ్రంథము ననుబంధమున మేయోకన్య కా[illegible] సంక్షిప్తసమాధాన ముండునట. ఇట్టిగ్రంథము రచించు[illegible] కాత డెంతయు నర్హుడు. ఎల్లపుడు నతడు డజను భా[illegible]తీయపత్రికలజదువుచు దేశపరిస్థితుల గమనించుచుండు[illegible] అంతియ కాక, భారతదేశవిషయమై ఆంగ్లభాషయందు గల ముఖ్యగ్రంథములలో నొక్కటియు నాతడు చదు[illegible]వని లేదు. ఇంతటిపరిచయమునకు నాతని భారతదేశ చైతన్యము పోయుచున్నది; రక్షామంత్రములనెల్ల గొలు[illegible] చున్నది.

మేయోకన్యయు అమెరికనే; డాక్టరు సం[illegible]గ్లాండును అమెరికనే. ఇరువురును భారతదేశముతో రాజకీయసంబంధము లేనివారే. కాని, వారు బుద్ధిపూర్వకముగ గల్పించుకొనిన సంబంధములం దెంత వ్యత్యాస మున్నది! ఈసంబంధములకుగల ప్రోద్బలముల దిలకించి నచో, శ్రీతారకనాథదాస ప్రభృతులు సంపూర్ణాం[illegible] పురాతన మహర్షులతో బోల్పదగిన మహనీయు డనుటలో యాథార్థ్యము పొడగట్టును.

అతడు చిన్నతనముననే అమెరికాయందలి బానిసతనమును నిర్మూలింప సన్నద్ధుడై, నాటి విఖ్యాత నాయకులతో గలసి పనిచేసెను. సత్యప్రియుడై, ఆస్తికశిరోమణియై, వివిధమతధర్మములసామరస్యమును గుర్తించి నతడు తనజీవితమును వినియోగింపజొచ్చెను. ఈమహోన్నతాశయము నెఱవేర్చుకొనుటకే యతడు తూర్పుదేశముల సంచరించి, యిచటిజనులయెడ మక్కువ గని, విశ్వమానవసోదరత్వమును బెంపొందింప నేటికిని నల[illegible] వెలుగక పాటుపడుచున్నాడు.

ఏనాటి ఋణానుబంధనముననో మనతల్లి దేశము[illegible] కాత డీపరమసేవనము లొనరించుచున్నాడు! ఆ[illegible]సేమ

మయుని యాశయముల దీపికలుగ చేబూని భారతసంతానము కాలపథమున తన దీర్ఘయాత్ర జయశాలియై కొనసాగించుకొనుగాక! ఇదియే యామహాత్మునెడ కృతజ్ఞత వెల్లడింప యోగ్య మగుమార్గము!

తమ గాఢమగు భక్తికి చిహ్నముగ అమెరికాలోని భారతీయులును, భారతాభిమానులును న్యూయార్కునగరమున ఇండియా సొసైటీ యాజమాన్యమున డాక్టరుగారి కొకవిందు నొసంగియున్నారు. రవీంద్రు డొక ప్రశంసావార్తను, స్వలిఖితమగు నొక చిత్రమును డాక్టరుగారికి కానుకగా నంపెను. ఇంక ననేకులు ప్రశంసాపత్రముల నంపిరి

ఆతడు సజీవుడై యుండగనే భారతదేశము స్వాతంత్ర్యమును బడసి, ప్రసన్నుడగు ఆతని ఆశీర్వచనముల గొని వర్ధిల్లుగాక!

[కొం. జ.]

---

## పాటలీపుష్పము

పాటలిని తెలుగులో 'పాదిరి' అని 'కలిగొట్టు' అని పేరు. ఇదినిడుపు హెచ్చుగా గొప్పవృక్షముగా బెరుగును. దీని యాకులు గుబుర్లుగుబుర్లుగా బాదమాకుల కంటెం జిన్నవిగానుండును. ఇది పుష్పించునే కాని ఫలింపదు.

పనసామ్రపాటల సమా
స్స్వైరిహోత్తమ మధ్యమాధమాః పురుషాః,
ఫల, సుమఫల, సుమనిచయైః
కర్మ, వచఃకర్మ, వాఙ్మిచయైః–(నీతిద్విషష్టిక)

తెలుగుదేశమున నీ వృక్షము నాకుం గానరాలేదు. కృష్ణాతీరమున 'నడుకుదురు' అను గ్రామమునమాత్రమొక్కచెట్టునుజూచితిని గానిరెండేండ్లక్రిందటితుపానుతాకిడి కది పడిపోయినది. చెన్నపురమున కొన్నిచోట్లను,దక్షిణదేశమున పెక్కుచోట్లను నీచెట్లుగలవు. వేసగిలో నీచెట్లు ఒక్కతూరిగా వేపలు, మావులు పుష్పించినట్లు పుష్పించును. వసంతఋతువు కడచినతర్వాతగ్రీష్మముననే యివి పుష్పించును. కాళిదాసమహాకవి యీపుష్పపుసౌభాగ్యమును బాగుగా గుర్తించినాడు:—శాకుంతలమున

సులభసలిలావగాహాః
పాటలసంసర్గసురభివనవాతాః;
ప్రచ్ఛాయ సులభనిద్రాః
దివసాః పరిణామ రమణీయాః;

అని గ్రీష్మవర్ణనమునం బాటలమును జేర్కొనెను. ఇంకను పెక్కుచోట్ల దీని వర్ణనములు గలవు.

దీనిపుష్పము సరిగా నువ్వుంబువ్వును బోలియుండును. పుష్పమంతగాసుందరమైనది గాదు. కాని దాని రంగు హృద్యమైయున్నది. ఎఱుపు మీఱిన తెలుపురంగు. సూర్యుం డస్తమించునపుడు ఆకాశము పడమటిదిక్కున తెల్లమబ్బుల మీంద సూర్యకిరణములు పడంగా సరిగా నీ పూవులరంగు చూపట్టును ఒక్కచెట్టు పుష్పించెనేని పరిసరములెల్లం బరిమళించుచుండును. గ్రీష్మకాలమున నీ పుష్పములు విరివిగా నౌరకుటిలో గొప్ప ప్రయోజనమున్నది.

ఒక్క బిందెడు చల్లనిమంచినీటిలో నాలుగు పాటలీపుష్పములను వేసినచో నా బిందెడు మంచినీరును హితమితసుగంధము గలదై హృద్యమైన పానీయమై యొప్పును. పాటలివృక్షము చేరువగలవారు గ్రీష్మకాలమున నిట్లు చేయుదురు. మఱియు ఒక్కసారి మొత్తముగా బుష్పించి యుడిగిపోవునుగాన యీచెట్లు బాగుగా పుష్పించినతఱినే రాలిన పుష్పములను శుద్ధమయిన బంకమట్టిని (ఎఱ్ఱమన్నుగాని, రేవడమన్నుగాని) ముద్దపదనుగా దడిపి అందీపుష్పములనుగూడం జేర్చి పిసికి కుంకుడుగింజ లంతలేసి మాత్రలుగాం జేసి నీడ నారంబెట్టుదురు. ఆ మాత్రలనుసంవత్సరము దాంక, మరల నాచెట్లుపుష్పించుదాంక గోరిక గల్గినపుడు ఒకటిరెండు మంచినీళ్ల బిందెలలో వేయుచుందురు. పుష్పగంధము మాత్రము నీటికిం బట్టుకొని మన్ను అడుగునకుం జేరును. నీరు సుగంధము గలదై హృద్యమై యుండును. చల్లనీటిలో వట్టివేళ్ళను వేయుటచే గల్గినసుగంధముకంటె నీపుష్పములనువేయుటచేం గల్గు సుగంధము హృద్యము. పాటలీపుష్పముగుణమును వైద్యశాస్త్ర మిట్లు వాకొనుచున్నది.

పాటల్యాఃకుసుమంమనోహరతరంపానీయదోషాపహం
తృష్ణాదాహవినాశనంసుఖకరం శ్రేయస్కరంకాంతిదమ్;
శ్లేష్మాణం తనుతే విశిష్ట మతిభి స్సంసేవ్యతే సర్వదా
పైత్యస్యోన్నతినాశనం సురభిళం శ్రీసేవ్యమేతత్సదా!

శ్లో. ఘునరసఘునదోష హరం
తృష్ణాదాహశ్రమ పిత్తరోగ హరమ్;
స్నిగ్ధం, శీతం, హృద్యం
సతత సముద్గంధి పాటలీపుష్పమ్.

పానీయ పంచకమున:—

స్వచ్ఛం సజ్జన చిత్తవల్లఘుతరం దీనార్థిన చ్ఛీతలం
పుత్రాలింగనవత్త థైవమధురం తద్బాల్యసంజల్పవత్;
ఏలోశీరలవంగపాటల లసత్కర్పూరకస్తూరికా
జాజీచంపక కేత కైస్సురభిళంపానీయమానీయతామ్.

[వేటూరి ప్రభాకరశాస్త్రి]

---

## అగ్ని

'భ'చక్రములో గల వింత లనేకములు. అందు 'అగ్ని'కిని దానికిని గల సంబంధమొకటి. హెచ్. హెచ్. విల్సనుగారు ఋగ్వేదసంహితలోని మొదటి శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు 'అగ్ని' యను శబ్దమునకు అర్థములు పెక్కు చెప్పబడినవనియు, అగ్నియొక్క గుణశీలాదులగురించి ప్రాచీనహైందవులకు గలయభిప్రాయములనవి వెల్లడి చేయుచున్నను బయటికిమాత్రమవి అత్యాహ్లాదకరముగ నుండుననియు నుడివిరి.

మాక్సు ముల్లరుగారు వారి భాషాశాస్త్రము (Science of language)లో ఆకాశమునకు దేవుడగు ఇంద్రుని, నిప్పునకు దేవుడగు అగ్నిని, కొన్నిసమయములలో ఐక్యముచేసి "ఇంద్రాగ్ని"యని మన పూర్వులు వాడుచున్నారనిచెప్పియున్నారు. ఇద్దరిని ఒక్కసారిగా ప్రార్థించునపుడు ఇంద్రాగ్నుల నొక్కదేవునిగానే భావింతురు. ఋగ్వేదములోని యొక శ్లోకములో (i. 109. 4) వారిని 'అశ్వినా' (Acvina) అనియు, వారు అశ్వినుల యొక్క గుణముల ననేకములు గలిగి యున్నారనియు, వారిర్వురును సాక్షాత్ పరబ్రహ్మస్వరూపులనియు చెప్పబడియున్నది. ఈ భావములో ఇంద్రాగ్నులు సోదరులని నమ్మవచ్చును.

ఈవిధముగానే ఇంద్రుని, వరుణుని కలిపి ఇర్వురు ఇంద్రులుగాను, మైత్రవరుణులను గలిపి ఇర్వురు వరుణులుగాను సంబోధించుట యాచారమై యున్నది.

సాధారణముగా 'అగ్ని' యనగా ప్రకృతిలో మనకు గోచరమగుచున్న నిప్పు, మంట, మొదలగు మూర్తీభవించినట్లును, దృశ్యముగను అదృశ్యముగను నున్నట్లును (మాక్సుముల్లరిగారి ననుసరించి) మన పూర్వులు గూడ దలచుచు వచ్చిరి.

To Quote Max Muller :—

"Agni (is) one of their principal gods means clearly fire: it is the same word as the Latin 'ignis'. Hence we have a right to explain his other names and all that is told of him, as originally meant for fire".

(Ibid P. 552).

మాక్సుముల్లరుగారి స్వంతమాటల లోనే:—

"అగ్ని వారియొక్క ముఖ్యమగు దేవులలో నొకడు స్పష్టముగా నిప్పు, లేక మంట యనియే అర్థము. లాటిన్ భాషలోని 'ఇగ్నిసు' దీనికి పర్యాయపదమై యున్నది. అందుచేత వాని (అగ్ని)యొక్క ఇతర నామములను, ఇంకను అగ్నియను అర్థము నిచ్చి వానిని గురించి చెప్పబడిన ప్రతి పదమును వ్యాఖ్యానము జేయుటకు మనకు హక్కు గలదు."

ఈవ్యాసమున కాదిని జెప్పబడిన హెచ్. హెచ్. విల్సనుగారు వ్రాసిన వ్యాఖ్యానమునుండి మనకు ఇంకొన్ని క్రొత్తయంశములు తెలియవచ్చుచున్నవి. ఈభూప్రపంచములో 'అగ్ని'ని దేవులందరిలోను అగ్రజునిగా ప్రార్థించుచున్నారట. దేవలోకమున ఈ అగ్నియే దేవులకు అగ్రణి (తోవజూపువాని)గా జూతురట. దేవులందరి కాదిని అగ్నియే జన్మమొందినాడట.

"In these derivations Agni is compounded irregularly out of Agra first, and in to lead. It is also derived from Anga body because he offers his own substance in the lighting of the sacrificial fire".

ఈ పైని జెప్పిన వివిధార్థములలో 'ఆది'యని అర్థమిచ్చు 'అగ్ర',అనుమాటను త్రోవ జూపు అని అర్థమిచ్చు 'ని' యనుమాటను విషమముగా కలుపుటచే అగ్ని యను మాట కలిగి యుండవచ్చును. మరియు యజ్ఞహోమములలో తన దేహమునే సమర్పించుచున్నాడు గాన 'అంగి' యను మాటనుండి కూడ అగ్ని యనుమాట యుత్పత్తి జెంది యుండవచ్చును.

ద్వితీయవర్గు ఆరవ శ్లోకములో ఆంగీరసు డను నొకానొకఋషి నామము పేర్కొనబడియున్నది. ఇయ్యది 'అగ్ని'యనుమాటను వ్యతిరేకముగా నేర్పరుచుట చేతనే వచ్చియుండ నగును.

కాని ఒకడే దేవుడగు యీ అగ్ని, అంగీరసులు అను ఒకకుటుంబముగా రానురాను ఎట్లు మారెనో మార్కండేయులు యుధిష్ఠిరునకు జెప్పినట్లుగా ఒకానొక గాథ చెప్పుచున్నది.

మరియొక కథ ప్రకారము అధర్వణ అను వేరొక కుటుంబమును అగ్నికి బదులుగా వాడుచుండెడి వారని తెలియవచ్చుచున్నది. ఈ కుటుంబమునే అప్పుడప్పుడు ఆంగీరస్ అని యనుచుండువారట. అధ్రవణ యనగా యజ్ఞము చేయించువాడు. అగ్ని 'అగ్నిరసు' అనుమాట నుండి 'ఆంగీరసు' అనునది ఎట్లు వచ్చెనో 'అధ్రవణ' యనుదానినుండి 'అధర్వణ' అట్లే వచ్చెను.

లోకమాన్య బాలగంగాధరతిలకుగారు వారి 'ఓరియన్' అను గ్రంథమునందు 'అగ్రహాయన' అనుపదమును గురించి యొకఅధ్యాయము వ్రాసియున్నారు. క్రీ. పూ. రమారమి 4000లో మకరసంక్రాంతి Winter Solistice ఫాల్గుణమాసములో వచ్చుచుండెడిదనియు,అప్పుడు అగ్రహాయనమని మృగశిరనక్షత్రమునే పిలుచుచుండి రనియు వారు చెప్పియున్నారు.

"We find that Mrigashiras has been designated by a name, which, if possibly understood denotes that it was the first of the cycle of the Nakshatras, thus showing that the vernal equinox was once near it."

"మృగశిర అనుపదమున కర్థము మనము సరిగా గుర్తించినచో, అది నక్షత్రము లన్నిటిలోను మొదటి దనియు ఒకానొకప్పుడు సంవత్సరారంభము దానితో నగుచుండెడిదనియు స్పష్టమగుచున్నది."

నిఘంటువులోని యీ క్రిందినిర్వచనము జూడుడు: "సౌమ్యా, మృగశిర, శ్చాంద్ర, అగ్రహాయని కశ్చసత్"

ఇవన్నియు జూడ అగ్నియొక్క దైవాంశయనియు, పురాతనమున మృగశిరానక్షత్ర మున్న వృషభరాశితో గలిపి జెప్పబడెడిదనియు, సంవత్సర మప్పుడు మృగశిర నక్షత్రముతో మొదలగుచుండెడి దనియు తేలుచున్నది. మరియు ఆంగీరసు, అధర్వణ మొదలుగాగలవి సుమారు 4000 ఏండ్ల క్రిందట మృగశిరా నక్షత్రముతో సంవత్సరాది యగునప్పుడు, చేయబడుచుండెడి పవిత్ర కార్యములే యనియుగూడ తెలియవచ్చుచున్నది. ఇట్లు చేయబడెడు పవిత్రకార్యములలో (అగ్రహాయన అను మాటనుండి వచ్చిన) అగ్రహాయనుడు అను పేరిట దేవుని పూజించుచుండెడివారు. తుదకు ఈతడే అగ్ని అను నామమున ప్రస్తుతము దేవతగా బూజింపబడుచున్నాడు.

నాటినుండియే అతనిని పూజచేయువారలను అగ్నిరసులు లేక ఆంగీరసులనియు, అధర్వణులు (యజ్ఞము చేయించువారు)అనియు ఋగ్వేద ఋక్కులలో చెప్పబడుచు వచ్చెను. తక్కటి యంశములు ప్రస్తుతము ప్రచురింపబడిన వ్యాఖ్యానములనుండి ఎత్తుకొనవచ్చును.

నవీన విద్యాధికులు కొందరీ ప్రాచీనపరిజ్ఞానమును విని లేనిపోని ఆధిక్యము తెచ్చిపెట్టికొని చిరునవ్వు నవ్వుదురే కాని ప్రాచీనగ్రంథములను విమర్శించి వ్రాయబడిన కలకత్తా విశ్వవిద్యాలయము వారి Journal of the department of Letters, vol. iii లో: మన్న ... 

వ్యాసముజదివినంతనే నాకంటికి గానవచ్చిన యంశముల నిందుపొందుపరచినాడ.

[చేబోలు లక్ష్మణరావు.]

---

## శ్రీ అల్లూరి రామరాజు గారు

ఈ యాంధ్ర వీరాగ్రణి ముప్పది రెండవ జన్మదివస మహోత్సవము జూన్ ౨౧-వ తేది నాడు ఆంధ్రదేశమున పెక్కుచోటుల జరిగినది. భారత దేశ స్వాతంత్ర్యమునకు, స్వరాజ్య లాభమునకునయి ౧౯౨౨-౧౯౨౪ సం॥లో ఏజన్సీలలో స్వాతంత్ర్యయుద్ధమును నెఱపి ప్రభుత్వమువారిని పలుపాటులబెట్టిన యీతని నామ మాంధ్రదేశ చరిత్రయందు సువర్ణాక్షరములతో వెలయ దగినది. ఈతనిని గుఱించి ఆంధ్రభారతియందు రెండువ్యాసములు గలవు. అందొకటి శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతా రామయ్యగారు వ్రాసినది. దానినుండి యీ క్రిందిభాగము:

శ్రీరామరాజుగారు దోపిడి చేయలేదు. పితూరీ గావింపలేదు. స్వార్థముకొఱకు ఘోరకృత్యములు నలుప లేదు. తన దేశ విముక్తి కొఱకు బ్రిటిషువారిపై యుద్ధము చేసెను. ఆనాడు నానాఫర్నవీసు, రాణీ లక్ష్మీబాయి మున్నగు వారు భారత స్వాతంత్ర్య యుద్ధముకొఱకు యెటుల పోరాడిరో అటులనే, 3 సం॥ లకాలము, బ్రిటిషు ప్రభుత్వోద్యోగులకు పూర్వసూచనలు గావించి బహిరంగ యుద్ధములకై స్థల కాల నిర్ణయములతో నాహ్వానముల నంపుచు యుద్ధమును జరిపెను. ఇట్టితెరి రైలుస్టేషనుకు 2 మైళ్ళలోపుగనున్న అన్నవరం పోలీసు స్టేషనుకు ముందుగా తెలిపి ఆయన స్వయముగ రాగ, స్టేషను నిర్జనమై యుండుటచూచి, ప్రేక్షకుల పుస్తకమునందు తగు వ్రాసంతకములు గావించి వెడలిపోయెను. ఇట్టి రాజును బ్రిటిషువారు సంహరించుటకు బలమును యుద్ధ శాసనమును అమలులో ... అపౌరుషేయమని యెంచి సివిల్ శాసనము ... పోలీసు సిబ్బందులతోను పరాజితునిగ జేయుటకు ... ప్రయత్నములను సలిపిరి. చివరకు రాజు పట్టుబడె...



శ్రీ అల్లూరి రామరాజు (బాల్యమున)

రాజే పట్టుబడెనని నమ్మెదము. రాజే చంప... అంగీకరింతము. రాజు పట్టుబడు సమయమునకు ... పట్నంజిల్లాలో అమలులోనున్నది సివిల్ శాసనమా? ... శాసనమా? యుద్ధశాసనమగుచో అప్పటి కలెక్టరు ... రూథర్ ఫర్డుగారికిగాని, దళాధిపతి మేజరు గూడా... గాని ఈయన హత్యనుగూర్చి యెట్టి బాధ్యతయు ... జాలదు. కాని ప్రబలియున్నది సివిల్ శాసనము. ... పట్టుబడిన పిమ్మట పారిపోవ యత్నించు చుండెను ... అందుచే టుపాకితో కాల్చి చంపితిమనియు విశాఖ... లోని యధికారులు మద్రాసు గవర్నమెంటు ... మే. 16 వ తెదీని తెలిపిరి. అయితే హత్యజరిగిన ...

మే. 7వ తేదీన. దహనమెప్పుడు? మే. 8 వ తేదీన. కాబట్టి 11 రోజుల యవకాశమేల జరిగియుండవలెను? ఈ లోపుగనే ప్రజలలో నాందోళన గలుగకుండ 9, 10 తేదీలయందు ఒక సబ్ యినస్పెక్టరు, యినస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసుకు, ఫలానివారు ఫలాని విధమున పట్టుబడి మృతిచెందెనని ఒకతంతివార్త యిచ్చినట్లు పత్రికాముఖమున తెలుపబడెను. కైజరునంటి శత్రువు పట్టుబడినపుడు, ఆతనిని పారిపోవునట్లు యెట్లు బంధించిరి? ఆతను మృతిజెందిన వార్తను రు 60 లు జీతము గల యుద్యోగి ప్రైవేటు తంతిమూలమున యేల ప్రకటింపవలసివచ్చెను? ఇది సరే—రాజును టుపాకితో కొట్టి చంపిరిగదా. ఆతని శవమును గూర్చి విచారణ (inquest) జరుపబడెనా? సివిల్ లా-ప్రకారము ఇట్టి విచారణ అనివార్యముగదా? పోస్టుమార్టమ్ పరీక్ష జరుపబడెనా? సివిల్ లా-ప్రకారం యిట్టిపరీక్ష అనివార్యము కాదా? పారిపోవువానిని టుపాకితో కొట్టినచో, గాయములు కాలిమీద తగులవలసి యుండెను గదా? ప్రాణమెట్లు పోయెను? ఎన్ని గాయములు తగులువరకు ఈయోధుడు మేజరు గుడాల్ యొక్క పాశములనుండి తప్పించుకొని పారిపోవుచుండెను? తప్పించుకొని పారిపోవువానిని ఒకటి రెండు గుండ్లతో అశక్తునుగ జేయలేని దశమా రాజుతో యుద్ధము సలుపుచున్నది? ఇది అంత అయినపిమ్మట తను సమాధానములు దొరకకుండుటకా గుడాల్ మున్నగు అధికారులు శెలవుమీద వెళ్లిపోయిరి?

పోనీ మన నాయకులేమైన నిట్టి విపరీతచర్యలను గూర్చి శాసనసభలలో జర్చించిరా? ఇంతవరకు ఒక్క ప్రశ్న అయినను శాసనసభలలో వేయకపోవుట ఆశ్చర్యకరముగ నున్నది. రాజు సహజమరణము నొందెనని వీరి తలంపా? లేక సర్ ఆర్థర్ నాప్‌గారి పరిపాలన లోటు లేదని వీరి యూహయా? రాజే విచారింపబడి, లోతుపాతులను ఆతని ముఖతః ఆతను వెల్లడిచేసినచో బ్రిటిషు ప్రభుత్వమువారి పటుత్వము వెల్లడి అయ్యెడిది.

అందే శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు వ్రాసినది: శ్రీ రామరాజుగారి జీవితము దిఙ్మాత్రము గలదు. అది చదువదగినది. దాని నుండి యించుక:

### రాజుగారు దచ్చిరి!

౧౯౨౪ సం. మేనెల 8 తేదీని రాజుగారికిని గవర్నమెంటుకున్ను సంఘర్షణము జరిగినట్లున్ను అందు రాజుగారు పట్టుపడినట్లున్ను, ఖయిదీగా పట్టుబడిన పిమ్మట పారిపోయినట్లున్ను, పారిపోతుండగా కాల్చి చంపినట్లున్ను, గూడెంలో ఉద్యోగులు శవమును చూచి ఆనవాలుపట్టిన తరువాత దహనంచేసినట్లున్ను, గవర్నమెంటువారు తెల్పిరి. దానిపై వేసిన ప్రశ్నలకు సమాధానమివ్వరు. ఎట్లు పారిపోవుట తటస్థించెను? ఎవరుకాల్చిరి? పారిపోతూంటే కాలిపై నేల కాల్చలేదు? పంచాయతీ యెవరుచేసిరి? తీర్పుయేమి? వైద్యపరీక్ష యెవరుచేసిరి? వారేయభిప్రాయ మిచ్చిరి? ఈప్రశ్నల కింకను సమాధానమే లేదు.

ఈ సమాధానముల నొసగవలసిన బాధ్యత ప్రభుత్వమువారిపై గలదు. అట్టి సమాధానములను బడయవలసిన బాధ్యత నాయకులపై గలదు.

---

### శ్రీయుత యర్. సి. సేనుగారు, ఓ. బి ఇ.

ఇంగ్లాండుదేశమున 1600 భారతీయవిద్యార్థులు గలరు. వారిలో సగమునకు పైగా లండనుపట్టణమున నున్నారు. ఈ భారతీయవిద్యార్థుల కందరికిని విద్యాభ్యాస విషయమున హితమును బోధించుటకు శ్రీ సేనుగారు నియమింపబడియున్నారు. వీరి తండ్రి బ్రహ్మానంద కేశవచంద్రసేనుగారు సుప్రసిద్ధ మత, సంఘ సంస్కర్త; ప్రాచ్యపాశ్చాత్యనాగరకతా సమ్మేళనమునకై చాల పాటుబడినవారు; 1870-వ సంవత్సరమున వీరు లండను నగరమున కేగినప్పుడు విక్టోరియా మహారాజ్ఞిచే సన్మానింపబడి అచటి ప్రముఖులయొక్క పొగడ్తను గాంచిరి.

యస్. సి. నేనుగారు కలకత్తాయందు జన్మించి ఆల్బర్టు కళాశాలయందు విద్య నభ్యసించి పదపడి ఇంగ్లాండుకు బోయి అచట ఎడింబరో విద్యాలయమున జదివిరి. అటనుండి భారత దేశమున కేతెంచి బీహారు సంస్థానమున



యస్. సి. నేనుగారు, ఓ. బి. ఇ.



నుద్యోగములో ప్రవేశించిరి. 18 ఏండ్లు అందుండి తరువాత బీహారు ప్రభుత్వముక్రింద రెవిన్యూశాఖలో నాలుగేండ్లుండిరి. పదెన్నైదేండ్లకు పూర్వము ఇండియా అండర్ సెక్రటరియగు మాంటేగుగారు లండనులో నున్న భారతీయవిద్యార్థులకు సదయబుద్ధితో హితము నుపదేశించుటకును, వారికిగల కొరతలను దీర్చుటకును ఒక భారతీయప్రముఖుడే యుండుట సమంజస మని తలచి యీ నేనుగారి నాహ్వానించిరి. అప్పుడు వీరు లండనుకు పోయి ఇండియా అఫీసులోనుండి ముఖ్యముగ నానాడు లండనులోనున్న 800 భారతీయవిద్యార్థుల క్షేమలాభములకు జెందిన కార్యములను నిర్వర్తించుచుండిరి. ఏడేండ్లకుపూర్వము హైకమిషనరు కార్యాలయము స్థాపించినతరువాత నేనుగారచ్చటికి మార్పబడిరి. శాస్త్ర పాండిత్యముతోపాటు, సాంకేతికవిద్యా (Technical-learning) పాండిత్యమును సమార్జించుటకు దినదినాభివృద్ధిగ నేతెంచుచున్న స్త్రీపురుషు లిచ్చట వీరి సలహాలను పొందుచుందురు.

ఇటీవల సార్వభౌమ దంపతుల పరిచయము గాంచిన సుందరులలో పేరుగన్న అంజలి, అరతి, శ్రీలత అను నీమువ్వురు యువతులును వీరి పుత్రికలు.

[స్ఫియరునుండి]

---

## బ్రిటనులోని కోటీశ్వరులు

యునైటెడ్ కింగ్‌డమ్ నందు 562 మంది కోటీశ్వరులు గలరు. అందులో 138 మందికి సంవత్సరమునకు 100,000 పౌనులు, నంత కెక్కువయు రాబడి గలదు. మార్చి 31 వ తేదీతో నంత్యమైన సంవత్సరపు యునైటెడ్ కింగ్‌డమ్ గూర్చిన సంఖ్యావివరణపర్యాలోకనము లోని యాకర్షక విషయములలో నిది యొకటి.

['ఇండియన్ రివ్యూ'-జూన్]

---

## వయోవంతులు - విద్య

టి. వి. అప్పర్ సుందరంగారు 'ది ఇండియన్ ఎడ్యుకేటరు'నం దీవిధముగ వ్రాసిరి:—

భారతదేశ జీవనమున నిపుడు కలుగుచున్న క్రొత్త మార్పులనుబట్టి చూచిన వయోవంతుల విద్యావశ్యకత యెడల ప్రత్యేకశ్రద్ధ వహింపవలసియున్నది. భారతదేశమున నీరోజులలో కలుగుచున్న రాజకీయ విస్తరణపు నవయుగమునుబట్టి దాని కెక్కువశ్రద్ధ నందుట కధికారము గలదు. సామాన్యప్రజలలో అవిద్య (అక్షరజ్ఞానము లేమి) ఎడలేక ప్రబలుట రాజకీయాభివృద్ధికి నష్టకారి యనుట తెల్లము. వయోవంతులలో ననేకులు నేడు వోటర్లు. వారికి వోటుయొక్క విలువ (వోటునం దిమిడియున్న సత్త్వము), బోధపఱుచుకొనుటకును, జాతీయాభివృద్ధికి తోడ్పడు విధమున దానిని వినియోగించుటకును విద్య యవసరము. అంతేకాక, వయోవంతులే జీవనమును శాసించువారు. విద్య యంతకంత కభివృద్ధిచెందవలెననిన, నీవయోవంతులు తమబిడ్డలు బడులలో నేర్చుకొను విషయములందు సానుభూతి గలిగియుండవలెను. నిరక్షరుడగు తండ్రి సామాన్యప్రజోద్యమము నెడల సానుభూతి జూపునని మన మాశింపగలమా? లేము. అంతేకాదుగదా, తమ బిడ్డలను బడికి పంపుటకు వ్యతిరేకిగా నుండు నిరక్షరుడగు తండ్రియొక్క ప్రతిక్రియ భారతదేశమున జనరంజకమగు విద్యాభివృద్ధికి శాశ్వతాపకారిగా కూడ నున్నది. వయస్సు ముదిరినవారు అవిద్యలో పెరిగినయెడల బిడ్డలకు బడులలో చదువు చెప్పించుటకు ఎట్టి ప్రేరణమును, ప్రోత్సాహమును కలుగుట కష్టము. తల్లిదండ్రులలో సామాన్యవిద్యా వ్యాప్తి యుండినయెడల నది బిడ్డలను బడులకు పంపి విద్యాభ్యాసము చేయించుట నామోదించు వాతావరణమును కలుగజేయుటకు మిక్కిలి తోడ్పడును.

---

## భారతదేశము - స్త్రీల యభివృద్ధి

'ది ఇంటర్ నేషనల్ రివ్యూ ఆఫ్ మిషన్సు' పత్రిక (లండను) ఏప్రిలుమాస సంచికయందు ఆలిస్ బి. వాన్ డోరెన్ అనునామె పై విషయమునుగూర్చి వ్రాసిన చక్కనివ్యాస మొకటి గలదు. దాని సారాంశ మిది:

అన్నివర్గముల స్త్రీలును ప్రజాహిత జీవనమున నెట్లు నెమ్మదిగా స్థానము పొందుచున్నారో యీమె సుస్పష్టముగా తెలియజేసినది.

అభివృద్ధికావలెనని యే మాత్రము తలచినను విద్యావిషయమునకే ప్రథమస్థాన మియ్యవలెను. ఏలయన స్త్రీల నవీనోద్యమము లన్నిటియందును అదియే మూలమును, ఫలము నైయున్నది. విద్యావతులగు స్త్రీలు గృహమునందును, విద్యాలయమునందును, వైద్యశాలయందును, తుదకు భారతదేశ ప్రభుత్వ సంస్థలయందును కూడ మాతృదేశమునకు సేవ జేసి, అభ్యున్నతికి దెచ్చు నాశయములతో యోగ్యమగు స్థానముల బడయగలరు.

మదరాసు, కలకత్తా, లక్నో, లాహోరు నగరములయందు బి. యే. వరకు స్త్రీలకు ప్రత్యేక క్రైస్తవ కళాశాలలు గలవు. బొంబాయి, పూనా నగరములలో మాత్ర మొక ప్రత్యేక విద్యావిధానము గలదు. సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ యధ్యక్షుని యధికారమున నడుపబడుచున్న సేవాసదనము స్త్రీల యభివృద్ధికొఱకై పాటుబడుట యందు తమ జీవితముల నర్పించివేయుచున్న పురుషులచే నిర్వహింపబడుచు గొప్పకార్యములను చేయుచున్నది. పంజాబునందు ఆర్యసమాజమువారు అనేక బాలికాపాఠశాలల నడుపుచున్నారు. ఏటేట భారత నారీమణు లున్నతవిద్యకై బయటిదేశములగు యూరపు అమెరికాలకు తెగువతో నేగుచున్నారు.

అవివాహిత కాంతలు క్రమశః భారతదేశ సంఘనిర్మాణమున స్థానమును పొందుచున్నారు. మతవిషయికములు లేక సాంఘికములు అగు నాదర్శములచే ప్రేరితులై సేవాజీవనము కొఱకిచ్ఛాపూర్వకముగా వివాహమును వదలుకొనిన భారత నారీమణులును కొందఱు గలరు. విద్యావతులైన అనేకమంది స్త్రీలగృహములు పరిశుభ్రతయందును, అలంకారము నందును మిక్కిలి యభివృద్ధికరములగు మార్పులను కనబరచుచున్నవి. విద్యకు స్త్రీలపై గల ధ్యానార్హమగు ప్రభావ మొక్కటి యేమన, తాను

కొంచెమే విద్యాభ్యాస మొనర్చిన స్త్రీయును తన బిడ్డలకు ఎక్కువ విద్యాభ్యాసమున కవకాశములను వాంఛించి, సాధింపజూచును.

వితంతువులగూర్చి వ్రాయుచు నీ వ్యాసకర్త్రి వితంతువుల విద్యావశ్యకతను వారు బాగుగా గుర్తింప మొదలిడిరనియు, దానియెడ గల ప్రతికూలాభిప్రాయము సన్నగిలుచున్నదనియు నుడివెను.

పండిత రామాబాయిగారిచే నారంభింపబడిన కార్యము భారతదేశమంతటను వ్యాపించెను. పూనా సేవాసదనమునను, చెన్నపురి యందును, భారతదేశపు ఇతర భాగములయందును గల ప్రభుత్వపు సదనములందును విద్యార్థినులగు వితంతువులు బహుసంఖ్యాకలుగ నున్నారు. బోధనాభ్యసన విధానము (Licentiate of Teaching Course) నందు మదరాసు విశ్వవిద్యాలయమువారు కుటుంబనిర్వహణశాస్త్రమును ఐచ్ఛికవిషయముగా పాటించియున్నారు.

1926-27 సం. తుదిభాగమున భారతదేశమందన్నిప్రాంతములందు స్త్రీల మహాసభలు జరుపబడినవి. వానియందు హిందూ, పార్సీ, దివ్యజ్ఞాన, మహమ్మదీయ, క్రైస్తవ మతములకు చెందిన యువతీమణులు హాజరగుటయేకాక బాల్యవివాహములు, పునస్సంధాన వయోనిర్ణయము, ఘోషాపద్ధతి నిర్బంధోచిత విద్యావశ్యకత మొదలగు విషయముల చర్చలయందును పాల్గొనిరి. అంతేకాదు. స్త్రీల యవసరములకు తగు విద్యావిధాన మేర్పరచుటకును, ఆరోగ్యకరమగు శరీరాభివృద్ధిమార్గముల తెలుపుటకును, గృహకార్యములకును, ప్రజాహిత జీవనమునకును వలసిన జ్ఞానము, శ్రద్ధ, నిపుణత నొడగూర్చుటకును తగు కార్యములజేయుటకు పండ్రెండుగురు భారతీయులను, ఇద్దరు యూరోపియనులును గల యొకస్థాయిసంఘ మేర్పరుపబడెను.

భారతీయ మహిళామణులు ప్రజోపయోగకార్యములలోని కత్యంతాశ్చర్యకరమగు వేగముతో ప్రవేశించుచున్నారు. మదరాసు సిండికేటునందొక స్త్రీసభ్యురాలు గలదు; సెనెటునందు భారతీయులును, యూరోపీయులునగు స్త్రీలు పెక్కురు గలరు. బొంబాయి విశ్వవిద్యాలయము సెనెటువారును కొన్నియేండ్లనుండి స్త్రీ సభ్యురాండ్రను చేర్చుకొనుచున్నారు. శాసనసభలయందును, జిల్లాబోర్డులు, జిల్లావిద్యాసంఘములు, పురపాలకసంఘములు మొదలగు స్థానికసంస్థలయందును స్త్రీసభ్యురాండ్రు గలరు. శిశ్వారోగ్యకేంద్రముల నిర్వహణమునందును, 'శిశ్వారోగ్యవారా' కార్యక్రమము నడుపుటయందును భారతీయ నారీమణులు మిక్కిలి పాటుపడుచున్నారు. బాలికాభటోద్యమము మిక్కిలి చురుకుగా వ్యాపించినది.

ఇట్లింతయు వివరించి తుద కీవ్యాసకర్త్రి యిట్లనుచున్నది:—

నేటి భారతదేశమందు—భారతీయస్త్రీ యైననేమి, ఐరోపీయస్త్రీ యైన నేమి—విద్యావతిగా నుండుటకంటె భాగ్యము నే నెఱుగను.

---

## రామమంత్రము

(జ్యేష్ఠమాసపు భారతి సంచికయందు రామాయణ కాలమును గూర్చి కవికొండల సత్యనారాయణ గారు వ్రాసిన విమర్శనము చరిత్రశోధనా నైపుణ్యమునకు మార్గదర్శియయి యున్నది. 'రామ' శబ్దము చారిత్రక నామవాచకము కాదనియు కేవలము మంత్రాక్షరమునై యుండుననియు సూచించుటకు మరియొక యాధారము ఈక్రింద వ్రాసిన చాటుశ్లోకమై యుండనోపు.)

నాయనాయ యద్భుతే ఽక్షరాష్టకమ్
పంచకంచ న శివాయ యద్వినా;
యద్ద్వయం భవతి ముక్తిహేతవే
తద్ద్వయం వయ ముపాస్మహే ఽద్వయమ్.

పద విభాగము

న-అయనాయ-యత్-భుతే-అక్షరాష్టకమ్-
పంచకం-చ-న-శివాయ-యత్-వినా
యత్-ద్వయం-భవతి-ముక్తి హేతవే
తత్-ద్వయం-ఉపాస్మహే-అద్వయం.

## ప్రతిపదార్థము

న=కాదు, అయనాయ=మోక్షమునకు, యత్=ఏది, బుతే=లోపించితే, అక్షరఅష్టకం=ఎనిమిది అక్షరముల మంత్రము—అనగ శ్రీనమోనారాయణాయ, పంచకం=పంచాక్షరీమంత్రము 'నమశ్శివాయ', చ (పాదపూర్ణార్థము), న=కాదు, శివాయ=మంగళమునకు, యత్=ఏ అక్షరము, వినా=లోపించితే, యత్=ఏ, ద్వయం=రెండక్షరములు, ముక్తి=మోక్షమునకు, హేతవే=కారణములో, తత్=ఆ, ద్వయం=రెండక్షరములు, ఉపాస్మహే=ఉపాసింతము, అద్వయం=రెండైనను ఒకటియే.

## తాత్పర్యము

'నారాయణాయ'—అను అష్టాక్షరీమంత్రము ఏ అక్షరము లేకపోతే 'నారాయణాయ'అనుటకు మారుగా, 'నాయనాయ' అగునో, అనగా 'అయనమునకు=(మోక్షమునకు)కాదో';

'నమశ్శివాయ'—అను పంచాక్షరమంత్రము ఏ అక్షరము లేకపోతే 'నమశ్శివాయ' అనుటకు మారుగా 'నశివాయ' అగునో అనగా మంగళమునకు కాదో,

ఆ ఏ రెండక్షరములు (రామ) ముక్తికి కారణములో, రెండైనను ఒకటిగా నుండు ఆ యక్షరద్వయ ప్రతిపాద్యపదార్థమును ఉపాసింతము.

[టి. శివశంకరం]

---

## ప్రాచీన భారతదేశ ప్రావీణ్యము

ఖాలీలూర్ రహమాన్‌గారు 'పాట్నా కాలేజి మేగజీన్' నందిట్లు వ్రాసిరి:—

తత్త్వశాస్త్రమునకు, ప్రకృతిశాస్త్రమునకు,శిల్పాది కళలకు, మఱి యితరవిజ్ఞాన జగత్తంతకును గ్రీసు పుట్టినిల్లని ఐరోపీయుల తలంపు అగుటకు మంచికారణములు గలవు. ఐనను విజ్ఞానమునకును, ఆధ్యాత్మిక సాహాయ్యమునకును మూలములగు ఆసియాఖండపు దేశములును గలవు. అవి విజ్ఞానచరిత్రమందు గ్రీసుతో సమముగా పేర్కొనదగినవి. ఇవి ఇండియా, చైనా దేశములు. ఈ మూడు దేశములును, దేనికదే స్వతంత్రముగ ఇంచుమించుగ నొకే సమయమున విజ్ఞానమునందును, బుద్ధిబలమునందును క్రమానుసారమైన వృద్ధిని గాంచుట కనుగొనవచ్చును.

అతిప్రాచీనకాలము నుండియు భారతదేశమున సంగీతము అభ్యసింపబడి, కృషి చేయబడుచుండెను.

భారతీయులకు శబ్దశాస్త్రపుతి ప్రాచీన కాలము నుండియు తెలిసియుండెను.

శబ్దశాస్త్రవిషయమున భారతదేశమున కుత్తమ స్థాన మున్నది.

గ్రీసు, ఇండియా, చైనా యీ మూడు దేశములను దేనికదే స్వతంత్రముగా నాణెములను కల్పించుకొనినందున వీనిని మూటినిజేర్చి యాలోచించు టెంతయు ఒప్పియున్నది. చైనాదేశము క్రీ.పూ. 1000 సం.ప్రాంతములను, గ్రీసుదేశము క్రీ. పూ. 700 సం. ప్రాంతములను, ఇండియాదేశము క్రీ. పూ. 400 సం. ప్రాంతములను నాణెముల కల్పించుకొనినవి. ఈ మూడు ప్రారంభములనుండియే, నేటికాలపు ఇతర నాణెముల ముద్రణ మేర్పడినది.

బలమైనరాజ్యము, మంచిప్రభుత్వము, ఐశ్వర్యము ఈ విషయములయందును భారతదేశము నిస్సందేహముగా నుత్కృష్టస్థితి యందుండెను.

క్రీస్తుపూర్వము 5, 6 శతాబ్దములలో, ఉత్తర హిందూస్థానమందనేక ప్రజాప్రభుత్వము లుండియుండెను. అవి దృష్టియందును, ప్రభుత్వ విధానమందును గూడ ప్రభుతంత్రముగల్గి యుండెనుగాని, ప్రజాతంత్రము గలవి కావు. ఈ విషయమునందు వీనికిని, ప్రాచీన రోమను ప్రజాప్రభుత్వమునకును పోలిక లేకపోలేదు. మహాత్ముడగు గౌతమబుద్ధుని యౌవనమున నతనితండ్రి శుద్ధోదనుడు శాక్యవంశమునకు ప్రజాప్రభుత్వాధికారిగా నుండెను.

అన్యోన్య దూరస్థములైన గ్రీసు, ఇండియా, చైనాదేశముల మూటను తత్త్వశాస్త్రము, స్వతంత్రముగ నప్రయత్నముగ నుద్భవించెను.

గ్రీసు, ఇండియా, చైనాలను కలుపు నింకొక సంబంధము విశ్వసనీయమైన తర్కశాస్త్రము, హేతు వాదశాస్త్రమును గూర్చిన యన్వేషణము.

మధ్యయుగములందు బౌద్ధమతముగాని, హిందూ మతముగాని ప్రవేశించిన ప్రతి ప్రాచ్య దేశమునందును, తెలిసిన యాత్రికులు తాము చూచు శిల్పమునందును విగ్రహముల చెక్కడమునందును భారతీయ మతముయొక్కయు కళయొక్కయు లక్షణములను నేడు గుర్తింపగలరు. చైనా, జపాను, కంబోడియా, జావా మొదలగు ప్రాచ్య దేశముల శిల్పశైలులు భారతీయాదర్శములచే లక్షితము లగుచున్నవి.

ఆ దినములలో విద్యార్థులను న్యాయ శాస్త్రము నందును, పరిపాలనమునందును, యుద్ధనీతి యందును, వైద్యమునందును, సాహిత్యాలంకార శాస్త్రములందును, కవిత్వాదులయందును, గణితమునందును తరిఫీదు చేయుటకు ప్రత్యేకవిద్యాశాలలు నిర్మింపబడెను. క్రీ.పూ.4-వ శతాబ్దమున తక్షశిలయం దొక గొప్ప విశ్వవిద్యాలయము వర్ధిల్లెను. భారతదేశపు నాల్గుమూలలనుండియు ఉన్నత కుటుంబములకు జెందిన యనేకమంది యువకులు విద్య కొఱ కచటికి పోవుచుండిరి. పిదప క్రీస్తుశకమున దూర దక్షిణమున బీహారములో నలంద యందును, గంగాతీరమున విక్రమశిల యందును రెండు బౌద్ధవిశ్వవిద్యాలయములేర్పడెను. మధ్యయుగములలో యైరోపా ఖండమునకు బొలోన్నా, ప్యారిస్, ఆక్స్‌ఫర్డ్ ఎట్లో అట్లే యీ విశ్వవిద్యాలయములును ఆశియాఖండమునకు క్రీ. శ. 1200 సం.వరకు నుండెను.

ఇతర జాతీయశైలులనుండి సుస్పష్ట మగు భేదములు గలిగి, గ్రీసుదేశమువలెనే భారతదేశమును విఖ్యాత మగు తన ప్రత్యేక నాటకకళను గల్గియుండెను.

క్రీ. పూ. మొదటిశతాబ్దమున ఉత్తర హిందూస్థానమున నాటక ముద్భవించెను. క్రీ. శ. 4 వ శతాబ్దమున కాళిదాసుని నాటకముల మూలమున నత్యుత్తమ దశయందు మిన్నుముట్టిన నాటకకళ యొక్క వేయివత్సరముల చరిత్ర గలిగియుండెను. కాళిదాసుని శాకుంతలము నాటకముగను, కావ్యముగను పరిపూర్ణ సామర్థ్యముతో రచింపబడిన గ్రంథమని వ్రాసి కెక్కెనది. భారతదేశము పడసిన యీ యభివృద్ధులు గ్రీసు, చైనాలవానికంటె నే విధమునను తీసిపోవునవి కావు.

---

## గురుకులాదర్శములు

ఏప్రిలు మాసపు 'వేదిక్ మేగజీన్' లో ప్రచురింపబడిన శ్రీ టి. యల్. వాస్వానీగారి గురుకుల విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవోపన్యాసము గురుకులాదర్శముల నిర్దోషత్వమును చక్కగ నిరూపించుచునది. ప్రస్తుత విద్యావిధానమును వారు 'నపుంసకత్వము'నకు కారణమగు నీరసపు 'అనుకరణ'మని వర్ణించిరి:—

ఈదేశపు ప్రస్తుతవిద్యావిధానము,ఒకచోటనుండి యూడదీసి యింకొకచోట నాటబడిన చెట్టువంటిది. అదియొక అనుకరణము. బొత్తుగా పనికిరాని యనుకరణము. అనుకరణము మగతనమును నాశము చేయునది. భారతదేశపు జీవనసత్త్వము దుర్బలముగానున్న సమయమందీ ప్రస్తుతవిధానము దానిపై బలవంతముగ విధింపబడినది. నెపోలియను జీవితకాలములో నది ఫ్రాంసుదేశమున నుత్పత్తినొందినది; భారతదేశముపై నది యింగ్లాండుచే విధింపబడినది. అది ముఖ్యముగా నిరంకుశమైనది; ప్రజలశక్తులను స్వేచ్ఛలేకుండునట్లు నిర్బంధపరిచి, విదేశ ప్రభుత్వపు 'సామర్థ్యము' నాదర్శముగా పెట్టుకొనినది. బ్రిటీషువారి రాజ్యనిర్వహణమునకు సహాయపడుటకు చవుకగుమాస్తాలను, చిన్నయుద్యోగులను 'తరిఫీదు'చేయుటయే వారి యుద్దేశ్యమయి యుండెను. ప్రస్తుత విధానముయొక్క దురవస్థ యేమన, అది యంగపరిపుష్టి గలది కాదు. ప్రజాత్మనుండి యది దూరము చేయబడినది. అది ప్రత్యేకస్వభావము గలది; వంశమర్యాదలస్మృతి నుండి యది మనస్సును దూరపరచును. "స్మృతిశక్తి పోవుటచే వివేచనాశక్తినాశన మగును; వివేచనాశక్తిని గోల్పోయిన

మనుష్యుడు 'స్వర్థజీవను డగును" అని గీతయందు శ్రీకృష్ణుడు పలికిన వాక్యములు కడు సత్యములు.

ఈసుగుణములమీ ప్రాచీన పుణ్యభూమియొక్క కొన్ని వంశమర్యాదల దివ్యస్మృతులకు ప్రకాశమానముగు నభిజ్ఞానముగా వెలసియున్నది. కావున, నొక క్రొత్త భారత జాతిపునర్నిర్మాణమునకై యత్యంతావశ్యకమగు నొక క్రొత్త భారతపునరుద్ధరణ పరిణామమున ముఖ్యభాగమును నెరవేర్చుటకీసుగుణములము విహితమైయున్నదని నా విశ్వాసము. ఒకజాతి యనునది యాధ్యాత్మికముగు సత్త్వమనియు, అది వంశస్మృతినుండియు, పరిసరముల నుండియు గలుగు ఆశయములవలనను, ఆదర్శములవలనను నేర్పడుననియు నెన్నడును మరవకుందురుగాక. అవియే నిజముగా నొకజాతిని నిర్మించునవి.

---

## అంటును తొలగించు టెట్లు?

మే నెల 'ఓరియంటల్ వాచ్ మార్క్ అండ్ హెరాల్డు అఫ్ హెల్త్' పత్రికలో నిట్లున్నది:

సలసల కాచని నీళ్లను త్రాగకుండుట, బాగుగా నుడుకని యేయాహారమునుగాని తినకుండుట, శుభ్రముగా కడుగుకొనని చేతులతో తినకుండుట-వీనివలన ఆహారపానీయములవలన వచ్చురోగములనుండి తప్పుకొనవచ్చును. పళ్లెరములు మొదలగువానిని చన్నీళ్లతో కడుగరాదు. అందు రోగకారణములగు సూక్ష్మజీవు లుండవచ్చును. మరుగుచున్న వేడినీళ్లు పోసి కడుగవలెను.

చర్మసంబంధముగు అంటు వ్యాధులను రాకుండ జేసికొనుటకు, చాకలి గుడ్డలను బాగుగా నుడుకపెట్టునట్లు పట్టుపట్టుడు. ఏలన, తామర, తీట మొదలగు చర్మవ్యాధులు చాకలిగుడ్డల మూలముననే వచ్చుచున్నవందురు. స్నానమునకు పరిశుద్ధముగు వాననీరు నుపయోగింపుడు. చెరువులో నుండి వచ్చు నీటియందు రోగకారణములగు సూక్ష్మజీవు లుండవచ్చును.

అపాయములకుగల వివిధమూలకారణములను తెలిసికొనియు, అంటుతగులకుండ తొలగించుకొని యారోగ్యము కాపాడుకొనుటకెల్లప్పుడు నన్నియు నతిజాగ్రత్తతో చేయునలవాటు కలిగియు, నావిషయముల నప్పటికప్పుడే మనస్సునుండి తొలగించుకొనవలెను. నిరంతరమేదో యొక ఆపద వచ్చునని భయపడుచుండుట కంటె నేదియు మనుష్యునకు హానికరమైనది యింకొకటి లేదు. సంపూర్ణారోగ్యముతో నుండుటకు మనము సరియైన యారోగ్యకరమగు నభ్యాసముల తోలుతనే, చిన్నతనముననే యలవాటు చేసికొనవలెను. ఆరోగ్యశాస్త్రానుసారముగ నడచుట యలవాటైపోయినంతనే దానిని మరచిపోవలెను.

---

## ప్రపంచములో అన్నింటికంటెను పెద్దపుస్తకాలయము

(జూన్ నెల 'మాధురీ' నుండి)

ప్రపంచములో పెద్దపెద్ద పుస్తకాలయములెన్నో ఉన్నవి. కాని వీనిలో అన్నింటికంటెను పెద్దవినాలుగు. ఒకటి రష్యాదేశమునకు రాజధానియగు సెంటు పీటర్సుబర్గులో ఉన్నది. రెండవ పెద్దగ్రంథాలయము లండను నగరమున ప్రసిద్ధమయిన బ్రిటిషు మ్యూజియములో ఉన్నది. మూడవది ఫ్రాన్సుదేశమునందలి ప్రధాన గ్రంథాలయము, ప్యారిసులో ఉన్నది. కాని, ప్రకృతము వీనియన్నింటికంటెను కొన్ని విషయములలో సర్వోన్నతమయిన ప్రసిద్ధ పుస్తకాలయము అమెరికా యందలి న్యూయార్కులో ఉన్నది. ఈ పుస్తకాలయము తాలూకు విశాలమందిరముసంగతి చూచితీరవలయునే కాని వర్ణించి చెప్పుటకు వీలు లేదు. ఇది పాలరాళ్లలతో కట్టబడియున్నది. ఇందులో ఏడుఖండములు గలవు.

మందిరము తాలూకు పొడవు 390 అడుగులు; వెడల్పు 270 అడుగులు. దీనినికట్టుట కించుమించుగా మూడుకోట్ల రూపాయలు పట్టినవి. ఈ పుస్తకాలయములో మూడు లక్షల పుస్తకము లుంచుటకు చోటున్నది. తక్కువలో తక్కువ 1700 మనుజులు విశాలమైన యీ సరస్వతీ మందిరములో కూర్చుండి పుస్తకావలోకనము చేయజాలుదురు. దీనితాలూకు అన్నింటికంటెను పెద్ద

పఠనమందిరము సర్వోపరిఖండమున నున్నది. దీనిలో గాలి,వెలుతురు వచ్చుటకు మంచి యేర్పాటు గలదు. దాని చుట్టుప్రక్కలనే కొన్ని గదులున్నవి. వీనిలో విశేష ప్రకారములయిన పుస్తకము లుంపఁబడియున్నవి. పఠనాలయము కూడ వీని సరియే. ఎవరి కేశాస్త్ర విషయమున గాని, లేక యే కలావిషయమునఁగాని పుస్తకములు చూడవలసి యుండునో వారి కవి యన్నియు నక్కడనే లభించుట కేర్పాటుగలదు. ఎట్లనఁగా, కళా సంబంధమున నేమేని చూచుకొనవలసి యుండినచో ఒక గదిలోనే ప్రపంచములో దొరకెడి కళా సంబంధమయిన పుస్తకములు లభించును. ఏ విద్వాంసుఁ డయినను ఏదేని శాస్త్ర విశేషము నధ్యయనము చేయుటకుఁగాని, నాలుగయిదు నెలలవఱకును ఏకాంతస్థలములో కూర్చుండి పుస్తకావలోకనము చేయుటకుఁగాని కోరిక గలవాఁ డయిన పక్షమున అతనికిని తగిన యేర్పాటున్నది. అందులకు వేఱు వేఱు గదు లున్నవి.

ఇటువంటి గదులలో ప్రతివానికిని అవశ్యకములయిన పుస్తకములన్నియు నొక్కచోటనే ఉంపఁబడుచుండును. ఎంతవఱ కతఁడు కోరునో అంతవఱకును అవి యచ్చటనే ఉండును. ఆ గదిలోనికి మఱొకరు వెళ్లుటకు వీలులేదు. ఈ పుస్తకాలయము పగలంతయు తెఱచి యుంచఁబడును. రాత్రికూడ కొంతవఱకు జనులు చదువుచుందురు. ఏ పఠనాలయము జనసామాన్యము కొఱకు తెఱచియుంచఁబడునో దానిలో తెఱచి యుంచఁబడిన అల్మారీలలో నించుమించుగా అందఱును చూచుట కావశ్యకములయినవి ముప్పదివేల పుస్తకములుండును. సామయిక పుస్తకాలయము, సమాచార పత్త్రాలయము,ఆశ్చర్య జనకమయిన పదార్థాన్వయమును ఈ పఠనాలయముతో కలిసియే యుండునుగాని వేఱుగానుండును. ఇందులోని కందఱును వెళ్లి పుస్తకములుగాని, వార్తాపత్త్రికలుగాని చదువుకొనుట కభ్యంతరము లేదు.

విశాలమైన యీ పుస్తకాలయములో ఒక గది మిగుల గొప్పది. అది యచ్చటి పుస్తకముల జాబితాలకొఱ కేర్పడినది. ఈ పెద్దసూచీపత్త్రము లేక జాబితా 6000 సంపుటములుగా నున్నది. పెద్దపెద్దవి యగు 13 మేజాలపై నవి యుంపఁబడి యుండును. జనులు పోయి వాని నక్కడనే చూచుచుందురు. ఎవని కేపుస్తక మావశ్యకమో వాఁడు దాని పేరు ముద్రితమయిన కాగితముపైని వ్రాయును. తర్వాతను దానిని లయిబ్రరీ కర్మచారి కిచ్చును. వాఁడాకాగితముపైని నంబరువేసి పుస్తకమును కోరినవానికి ప్యాసిచ్చి "ప్రధాన పఠనాలయములో ఫలానాడిస్కున ఫలానా మేజాపయిని నీ కాపుస్తకము లభించును. అక్కడికి వెళ్లి కూర్చుండి పుస్తకమునకై యెదురుచూచుచుండు"మని చెప్పును. వెంటనే కావలసిన వాఁడు కర్మచారి చెప్పిన చోటికి వెళ్లి కూర్చుండును. ఈ కర్మచారి ఆ కాగితము నొక గొట్టములో వేసి మరత్రిప్పును. వెంటనే అది యెక్కడ నాపుస్తక ముండునో ఆ ఖండములోనుండు కర్మచారి యొద్దకుఁ జేరును. అధికారులయు, కర్మచారులయు నాఫీసులుకూడ నీ లైబ్రరీలోనే యున్నవి. ఈ పుస్తకాలయమునుండి నగరవాసులయొద్దకును, అన్యనగరవాసుల యొద్దకును పుస్తకములు చదువుటకై పంపబడుచుండును. ఇండ్లకుఁగూడ పుస్తకములు పంపుట కేర్పాటున్నది. దీని పద్ధతియే వేఱు దీని కట్టడము తాలూకు భాగము వేఱుగా కట్టఁబడియున్నది. ప్రపంచమంతటికిని గొప్ప పుస్తకాలయ మయిన దీనిలో బాలురనిమిత్తము లైబ్రరీయు, పఠనాలయమును వేఱుగా కట్టఁబడియున్నవి. బాలబాలికలకును, యువతీ యువకులకును, వృద్ధులకును చదువఁదగిన పుస్తకములు వార్తాపత్త్రికలును గలవు. చిన్నచిన్న అల్మారీలును, చిన్నచిన్న మేజాలు, కుర్చీలును, పిల్లలు కూర్చుండి చదువుకొనుటకై యేర్పడి యున్నవి. ఈ కట్టడములోచాల పెద్ద సభాభవనముకూడఁ గలదు. అందులో అమెరికాలో పేర్పడిన ప్రొఫెసర్ల ఉపన్యాసములు కూడ జరుగుచుండును. పుస్తకాలయములో పనిచేయువారి నిమిత్తము స్కూలు, లేక ట్రెయినింగుక్లాసుకూడ నున్నది. అచ్చట లైబ్రరీ కార్యకర్తలకు శిక్షణ కూడ లభించుచుండును.

ఇచ్చటి వస్తుప్రదర్శనశాలలో విద్యాసంబంధములై విచిత్రములును, ఆశ్చర్యకరములును నగు గొప్ప గొప్ప వస్తువులు సిద్ధముగా నున్నవి. వార్తాపత్త్రికలు చదువుస్థలము వేఱుగాను, సామయికపుస్తకములు చదువు

స్థలము వేఱుగాను ఉండును. ప్రతిసంవత్సరము సుమారు 7000 సామయికపుస్తకములు వచ్చుచుండును. ఇదే మాదిరిగా వార్తాపత్రికలును వచ్చుచుండును. కలాకౌశలముతోను, విజ్ఞానవ్యవసాయముతోను సంబంధించిన పఠనాలయము వేఱువేఱుగా నున్నది. ఏఁబది యేఁబది వేలు పుస్తకములకంటె తక్కువ ప్రతిదానిలోను ఉండవు ఇతిహాసగ్రంథముల పఠనాలయములో ఒక్క అమెరికాతోనే సంబంధించినవి 20000 సంపుటము లున్నవి. గ్రుడ్డివాండ్ర వఱకును చదువుట కిచట పెద్ద లయిబ్రరీ ఉన్నది. వాండ్రు చదువుట కేర్పాటును ఉన్నది. వాడు వెంటనే ఆ పుస్తకము నెత్తి యంత్రముద్వారమున పఠించువాని గదిలోనికి పంపించును. ఇంతలో పాఠకుఁడు తనకుఁ జెప్పిన గదిలోనికి ప్రవేశించునో అంతలోనే ఆ మేజాయెదుట వెనుకటి కర్మచారికి ఇచ్చిన ఆ మొదటికాగితము ఒకయంత్రములో నగపడును. 'అపేక్షితమయినపుస్తకము వచ్చినది, తీసికొనుఁడు' అని దాని దర్శనమే సూచించును. పాఠకుఁడు తన యొద్దనున్న ప్యాసు నప్పుడు తిరుగ నిచ్చి పుస్తకమును గ్రహించును. ఈ పుస్తకాలయములో ఇంకొక విచిత్రమయిన సంగతి యున్నది. ఇచ్చట యంత్రముల ద్వారా నడిచెడి తొట్టె లెన్నేని గలవు. ఒకఖండమునుండి రెండవ ఖండములోనికిఁగాని, ఒకగదిలోనుండి రెండవ గదిలోనికిఁగాని తఱచుగా పుస్తకము లాతొట్టెల ద్వారా పంపఁబడుచుండును. పంపవలసిన పుస్తకము లన్నియు దీనిలో నుంచెదరు. ఒకమర నొక్కఁగానే అది పరుగెత్తును. మీఁదికిని క్రిందికిని పోవుచుండును. మాటాడునంతలోనే వేలకువేలు పుస్తకములను కావలసినచోటఁ జేర్చుచుండును. ఈ యంత్రాలతొట్టెలను వలసిన చోట నిలుపను వచ్చును, పంపను వచ్చును.

ప్రతియొక తొట్టెలోను నాలుగుమణుగుల బరువు గల పుస్తకములు పంపుటకు వీలుగలదు. వీటి నడక కూడ కొంచెపుదికాదు. మినిటునకు 150 అడుగులదూరము వఱకును పరుగెత్తఁగలవు. ఆ తొట్టె తాను చేరవలసిన స్థలమునకు చేరఁగానే చేరినట్టు సూచించుటకై గంట కొట్టును. వెంటనే అందలిసామగ్రి తీయఁబడును. ఒకవేళ దానిలో నేమేని బరు వెక్కించవలసియున్నచో వెంటనే యెక్కించి యెచ్చటికేని పంపఁబడుచుండును. పంపించ నక్కఱలేని పక్షమున తాను నిలువవలసిన స్థలమునకు వాపసు చేయఁబడుచుండును.

ఈ పుస్తకాలయము తాలూకువి సందలకొలందిగ శాఖలుకూడ వ్యాపించియున్నవి. వాటిలో లక్షలకొలఁదిగ పుస్తకము లున్నవి. ఈ పుస్తకాలయము తాలూకు కర్మచారులే యీ శాఖలతాలూకుపనులను కూడఁ జేయుచుందురు. ప్రాచీనవిద్యలు, ప్రాచీనకళాకౌశలములు, ప్రాచీననిర్మాణములు, ప్రాచీనపదార్థములు ఉంచఁబడెడి గదులు, పుస్తకములు అన్నియు వేఱువేఱుగా నున్నవి.

ఎవరయినను ఏదేని విషయవిశేషమును గుఱించి క్రొత్తక్రొత్తతత్త్వమునో వెదకి బయటికిఁ దీయు నిచ్ఛచే అధ్యయనము చేయఁగోరినచో వారి కిచ్చట అన్నివిధము లయిన యేర్పాటులును గలవు. ఇవన్నియు ఊరకయే కాని ధనవ్యయ మావంతయు నక్కఱలేదు. ఇట్లుండఁగా అమెరికా క్రియా-కలా-కౌశలములలోను, విజ్ఞానములోను ప్రపంచమంతటికంటెను సర్వోన్నతమై యున్నదనఁగా నేమి వింత? ప్రకృత మచ్చట ఈ విశాల మందిరములో వేలకొలఁది పూజారులు (చదువరులు) నిత్యము సరస్వతిని ఉపాసించుచుందురు. కనుకనే లక్ష్మి వారికి దాసియై యున్నది. గొప్పగొప్పరాష్ట్రము లమెరికా తాలూకు కోశగృహము (ట్రెజరీ) నుండి ఋణము పుచ్చుకొనుచున్నవి. సభ్యప్రపంచ మంతయు దాని పైఁగల పైని నాట్య మాడుచున్నది.

బాపురే! అమెరికా! సంస్కృత భాషలో దీని "కమరికా" యనిపేరేమో? 'ధనమస్తిధనికః'-అన్నట్టుగానే 'అమరాః=దేవాః' అస్యాం సన్తీతి="అమరికా"అగును. అమరికా-అమెరికా అయినది గాఁబోలు! అమరులు గలది స్వర్గము. స్వర్గ మందఱకును పోఁగూడనట్లే అమెరికాకూడ నందఱకును పోఁగూడదు. స్వర్గమున కధిక పుణ్యాత్ములే పోఁగలుగుదురు. అమెరికా కధిక ధనముగలవారే పోఁగలుగుదురు. ధర్మప్రాప్యము స్వర్గము; అర్థప్రాప్య మమెరికా.

[పురాణం సూర్యనారాయణ తీర్థులు]

# అనంత ప్రయాణము

సిరుగూరి జయరావుగారు

౧

తరఁగ లన్నియుఁ జేరి విఱిగిపడుచుండంగ,
నురుఁగు లన్నియుఁ గూడి పరుగు లిడుచుండంగ,
ధూళి ధుమధుమలతోఁ దుఱఁగలించెడు వేళ,
గాలి జవనాశ్వమ్ము కదము త్రొక్కెడి వేళ,
రాకాసిమోహముతో నాకాశ మెదిరించి
వడఁకు కడలికి నడలు దొడరఁ జేయఁగ నుఱుక-
'ఔర! ఔరా!' యంచు నది కూడ బెదరించి,
పొంగి, పైకుబికి యా నింగితోఁ గదియంగ-
పిచ్చి కేకలు లక్ష్యపెట్టఁ దలఁపను నేను,
చచ్చిపోయిన వారి సరకుసేయను నేను;
నా యాత్మశక్తి విన్నాణమ్ముతో జగ
జ్జేగీయమానమై రాగిల్లుచుండంగ
జీవనాంభోరాశి నావలకుఁ దఱియంగ
నావనై పయనమై పోవ నుంకించితిని.

వెలుఁగుకలికలు నన్నుఁ బిలచుచున్న వియవిగో!
కవగూడి నాయాత్మఁ గళఁ దేర్చునో లేదా?
జ్వాలికా మాలికోజ్జ్వలతఁ దేర్చునో లేదా?
కడలిరాజునకుఁ బై
నడరు రాజునకు నడు
కడ నున్న సరిహద్దు
కదలిపోయెడుఁ గాని,
రెట్టించు సంతసము రిక్కించ నయనమ్ము,
రివ్వుమని మరల సాగింతు నా పయనమ్ము.

౨

మురళి! మురళీ! రమ్ము సరళగీతికలతో,
దివ్యఫలపరిపాక నవ్య విభవములతో!
ప్రణయకలశములోనఁ బాలు నిండినజాడ,
ప్రాణతంతువులలో రవళి తీఱినజాడ,
తేటతెల్లముగాఁగఁ జాటు రాగములతో
మురళి! మురళీ! రమ్ము సరళగీతికలతో!
ఇంతసంద్రముపైన
వింతగాఁ బయనమై
పంతమ్ముతోఁ బోవు
పడవ హాయిని జెందఁ
బాడుమా! నవనీత పరిపాటి పేశల
స్వనము లొక్కట రసస్యందమ్ములై వెలయ
మురళి! మురళీ! రమ్ము
సరళ గీతికలతో!

3

మొదలుతుదలనుమాట మొఱఁగి యొక పేరీతిఁ
జదలు సంద్రము మోయ సవదరించిన గీతి
తన నిత్యకైశోరతకు నుగ్గుపాలుగా—
తన పెంకెతనపు టూఁతలకును య్యాలగా—
లోతుసంద్రపు నీటిలో మొగ్గలిడు గాలి,
ఆతతాంబరముతో నాటలాడెడుగాలి,
సైదోడుగా, నాకు సంద్రంబు లేగొప్ప?
సకలావకాశ విశ్వంబైన నేగొప్ప?
(సశేషము.)

# భారతీయ మహిళా మండలి

ఒ. మత్తయికన్య గారు,
యం.బి., బి.యస్., యం.ఆర్.సి.యస్.



ఈమె వియన్నా నగరమున శిశురోగ నివారణ మునుగూర్చి ప్రత్యేకశిక్షణము బడసివచ్చినది. డాక్టరు వీరశింగి చిన్నప్పగారి స్థానమున మదరాసు వైద్యకళాశాలయందు ఉపాధ్యాయగ నియమింపబడెను.

శ్రీమతి పవిత్రగారు



ఈమె తియ్యాకులస్థురాలు. కొచ్చిను విద్యాశాఖయందు ఉద్యోగమున నున్నది. కొచ్చిను ప్రభుత్వము వారిచే నచటి శాసనసభయందు సభ్యురాలుగా నియమింపబడిన ప్రథమస్త్రీ.

కన్య శ్యామకుమారి నెహ్రూ,
యం.ఏ., యల్. యల్. బి.



ఈమె మోతీలాలు నెహ్రూగారి బంధువగు శ్యామలాలు నెహ్రూగారి కుమార్తె. ఉత్తరహిందూస్థానమం దీమెయే మొదట న్యాయవాదపరీక్షయం దుత్తీర్ణురాలయ్యెను. ఈమె ప్రస్తుతము సర్ తేజ్ బహాదూరుసప్రూగారియొద్ద అప్రెంటిసుగనున్నది. పిదప హైకోర్టునందు న్యాయవాదివృత్తి నవలంబించును.

శ్రీమతి అన్నాచాండి, బి. ఏ.



ఈమె యీసంవత్సరము యఫ్.యల్. పరీక్ష యందుత్తీర్ణురాలైన ప్రథమ క్రైస్తవయువతి. తిరువాంకూరు నివాసి.

## ఆంధ్రాభ్యుదయము

శ్రీ చెరుకుపల్లి వెంకటప్పయ్య గారు



వీరు యం. ఏ. యందుత్తీర్ణులై, గత సంవత్సరము యఫ్. యల్. పరీక్షయందువలెనే, ఈ సంవత్సరము బి.యల్. పరీక్షయందును రాజధానియందంతటను ప్రథములుగ నుత్తీర్ణులైన ఆంధ్రయువకులు.

---

## యమునాసాంత్వనము

బసవరాజు అప్పారావుగారు

(భైరవి-త్రిపుట)

ఏలాపాడేనింక
యమునాకళ్యాణి[1] నే,
లీలామానవుడు గోపాలుడు లేడాయె,
నేలాపాడేనింక ?

బంగారుసీమ[2]లో
చెంగలించేవేళ
పిడుగులాటిమాట వినిపించినా దయ్యో,
ఏలాపాడేనింక ?

చెడువార్త వినగానె
చెవులు గింగురుబోయె,
నెంత చించుకున్న గొంతుపెగలదాయె,
నేలాపాడేనింక ?

వెన్నెలకు తోడు మా
వేణుగోపాలుడు
కన్నులపండువుగ కనిపించకుంటేనే,
నేలాపాడేనింక ?

యమునాకళ్యాణి, మా
లీలామానవుడు గోపాలుడు లేడాయె!

---

1 యమునాకళ్యాణి మాగోపాలకృష్ణునికి ప్రాణప్రియమౌ స్థాయీరాగము ప్రేమపాత్రుడనగు నేను బాడగా విన్న మరింత ప్రాణప్రియము. 2 కోలారుబంగారుగనులు. (Kolar Gold-Fields)

# శ్రీ. శే. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు

[ఆంధ్ర రత్న]

శ్రీగోపాలకృష్ణయ్యగారి పవిత్రనామము కడచిన జూన్ ౧౦ వ తేదిరాత్రి స్వర్గవాసుల పట్టికలో చేరుటెంతయు శోచనీయము. ప్రౌఢ వయస్కుఁడు, దేశభక్తి పరాయణుఁడు, వీరాగ్రేసరుఁడు నగు తన యనుంగుఁగొడుకు నొకని నాంధ్రమాత కోలుపోయి డీలుపోయినది. ౧౮౮౯ సం॥ జూన్ ౧౦ వ తేదినాఁడు పుట్టి పుగన్న యీయభిమానధనుని పూర్ణాయుష్యము ౩౯ వ యేటనే క్రుంగి యాంధ్రలోకము నంధకారబంధురము కావించినది. వీరి యకాలమరణ మాంధ్రలోకమునకు దీరని కొఱంత.

శ్రీగోపాలకృష్ణయ్యగారు గుంటూరు నివాసులు. వీరు పిన్ననాట నాంగ్లవిద్యాభ్యాసము చేసిరి. పదపడి ఉన్నతవిద్యోపార్జనము కొఱకు ఇంగ్లాండునకు బోయిఅచ్చట యం. ఏ.



ఆంగ్లమానస పుత్రుఁడు

పరీక్షయందు కృతార్థులయిరి. వీరికి సంస్కృతాంధ్రములయందు చక్కని పాండిత్యము



అసహాయోద్యమ ప్రచారకుఁడు

గలదు. కర్ణపేయముగ గానముచేయు సామర్థ్యముగలదు. వీరు ధైర్యసాహసములకు బుట్టినిల్లయిన స్ఫురద్రూపముగలవారు; రసగ్రహణపారీణులు; హాస్యోక్తి చతురులు; సమయస్ఫూర్తి గలవారు; రామభక్తాగ్రేసరులు; స్వాతంత్ర్యప్రియత్వము వీరి కుగ్గుతోఁబోసినది. వీరి జీవితము, వీరి వేషభాషలు, సామాన్యులకదొక్కవిచిత్రముగ గాన్పించుచుండును.

వీరు తొలుత రాజమహేంద్రవరమున ట్రెయినింగు కళాశాలలో చరిత్రాధ్యాపకులు

గా ప్రవేశించిరి. తరువాత స్వాతంత్ర్యప్రియత్వముచేత నాయుద్యోగమును వదలుకొని బందరు జాతీయ కళాశాలలో నల్పవేతనముపై నొక యుపాధ్యాయ పదము నంగీకరించిరి. అసహాయోద్యమారంభదశయందు దేశ మల్లోలకల్లోలమై యున్న కాలమున నత్యుత్సాహముతో వీరు మాతృదేశారాధనమునకు బద్ధకంకణులయి యా యుద్యోగమును సైతము వదలుకొనిరి. ఆ కాలమున వీ రాంధ్రదేశమున గావించిన దేశభక్తిపరిపూరితములగు నుపన్యాసము లాంధ్రయువకుల నసంఖ్యాకుల నుత్సాహవంతులను, స్వార్థత్యాగులను, దేశసేవాపరాయణులను గావించి మించినవి. వీరి యుపన్యాసధోరణి అద్భుతావహమయినది. వీరు శ్రోతలమనస్సులయందు జక్కగ నాటుకొనునట్లు రాజకీయవిషయములను హరికథారూపమున నుపన్యసించు సామర్థ్యము గలవారు.

గుంటూరుమండలమునందలి చీరాలలో ప్రజలు పన్నులను నిరాకరించు విషయమునైన మహత్సరంభమునకు వీరు నాయకులయి ప్రదర్శించిన ధైర్యసాహసములు వీరి మనస్సంకల్పబలమును ఘంటాఘోషముగ జాటినవి. ఈ కారణముననే వీరు 'చీరాలవీరు' డన్న పేరును గాంచినారు; అప్పుడే చీరాలకుసమీపమున 'శ్రీరామనగరము' అను నొకగ్రామమును నెలకొల్పినారు; అచ్చట నొక శ్రీరామాలయమును నిర్మింప సంకల్పించినారు. తర్వాత 'రామదండు' అనుపేర స్వచ్ఛందసేవాదళమును సేకరించి దానిని వెంటగొని యాంధ్రదేశమున నసహాయోద్యమప్రచారమును గావించుచు గంజాముమండలమును జేరిరి. దేశభక్తి నుద్బోధించు వీరి యుపన్యాసములకు సహింపక ప్రభుత్వమువారు వీరిని ౧౯౨౧వ సం. అక్టోబరునెల ౧వ తేదిని కారాగారమున నుంచిరి. వీరు కారాగారమునకుబోవుసమయమున చీరాలపేరాల నివాసులకొసంగిన సందేశము రక్తనాళములయందలి రక్తము నుడికింపకమానదు. తన సర్వస్వమును(ఉన్న దానినే యనుడు) భారతమాత సేవకై యర్పించి దారాపుత్రులను వీడి చెఱసాలకుబోయిన యీ ఆంధ్రయోధవతంసము నెడ 'ఆంధ్రరత్న'యను బిరుద మన్వర్థమయినది.

ఈ యసహాయశూరుడు కారాగారవిముక్తుడై యేతెంచునాటికి దేశస్థితులు మారినవి. అసహాయప్రచారప్రయత్నములు సన్నగిల్లజొచ్చినవి. ఇది ఇట్లుండ, నిఖిలభారతజాతీయ మహాసభ కాకినాడలో జరిగినసంవత్సరమున వీరుజాతీయమహాసభకు కార్యదర్శులై యత్యుత్సాహముతో సామర్థ్యముతో నామహాసభ కార్యము 'లౌరా'యన నిర్వర్తించి కీర్తిగాంచిరి.

ఇంతలో ఆంధ్రదేశదౌర్భాగ్యవశమున వీరిని క్షయరోగక్రూరపిశాచ మావేశించి రక్తమాంసములను పీల్చి యస్థిపంజరావశిష్టుని

గా జేసివైచినది. దీనికితోడు నిత్యకృత్యములు జరుగుటకూడ వీరికి గడు కష్టముగ బరిణమించినది. చివరకు వీరు సహింపరాని పెక్కు చిక్కులకు లోనై స్వార్థపరమైన యిహలోకమును వీడి స్వర్గము నలంకరించిరి. 'జాతస్య మరణం ధ్రువమ్.' జీవికి చావుతప్పనిదే. కాని, ఇట్టి స్వార్థత్యాగి, వీరుడు, దేశసేవాధురంధరుడు దైవోపహతుడై, క్రూరరోగము వాతబడి, అంత్యకాలమున నన్నవస్త్రాదులకుసైతము చాలినంత యాధారములేక కుందుచుండ నూరక చూచుచుండిన యాంధ్రలోకముయొక్క వింత చెయిదము వంతను గొలుపక మానదు. ఇపుడు—మరణించినతర్వాత—ప్రతిపట్టణమునను, పల్లెటూరను సానుభూతిసభలు, స్మారకచిహ్నములకొఱకుతీర్మానములు, స్మృతికావ్యములు లెక్కకుమిక్కిలిగ పత్రికలయందు క్రిక్కిరియుచున్నవి. 'చచ్చినవాని కన్నులు చేరెడేసి' కదా! రూపుమాసినగాని పేరుమ్రోగదు కాబోలు! ఇపుడయినను దిక్కులేక చిక్కియున్న వీరిభార్యాపుత్రుల సంరక్షణార్థ ముచితరీతిని బ్రయత్నించి సాహాయ్యమును సమకూర్చి, వెనుక తాను వారియెడ జూపిన యలసతచే నయినదోషమును తొలగించుకొనవలసిన , భార మాంధ్రలోకముపై గలదు.

మఱియు వీరిస్మారకచిహ్నవిషయమును పలువురు పలురకములుగ సూచించుచున్నారు. వీరందఱును ఈక్రింది గోపాలకృష్ణయ్యగారి వాక్యములనే పర్యాలోచింపవలెను.—

శ్రీరామనగరు-దేవాలయ నిర్మాణమే

"నాకు తిండిలేనిచో, అంత విచారములేదు. కాని నాజీవితాంతములోగా ఈదేవాలయమును పూర్తికాగా చూడవలయునని యున్నది... నా శరీరస్థితి ప్రస్తుత మవసానము ననుకరించుచున్నది. మరణించులోగా శ్రీకోదండ రామస్వామివారికి ఈ యావత్తు భూమిని అర్పించి, ప్రాణమువదలెదను. ఒకవేళ నా మరణమునకు ముందు ఇది జరుగక పోయిన ఇదియే నావిల్లుగా భావించి, ఆంధ్రమహాశయులు దీనిని చెల్లింతురు గాక."

(ఆంధ్రపత్రిక, ప్రభవ - ఆషాఢ శుద్ధ ౭ లు)

కుటుంబ సుఖజీవనము, శ్రీరామదేవాలయనిర్మాణము నెఱవేఱిననే కాని శ్రీగోపాలకృష్ణయ్యగారి ఆత్మకు శాంతి గలుగజాలదు. ఈ రెండిటిని జరుపుట కాంధ్రలోకము గట్టిగా పూనుకొని యచిరకాలమున వానిని నిర్వర్తింపవలెను.

సర్వేశ్వరు డీయోధవతంసము నాత్మకు శాంతి నొసగుగాక !

―――

5. 7- 19 ౧౫౮

# రత్నచ్యుతి

జి. జాషువగారు

ఒకరత్నంబును చేతఁ బట్టుకొని యూరూరం బ్రదర్శించి, చా
లక ఖండాంతర సీమ లెక్కి నిజవాల్లభ్యంబు లూరించు సా
ర్థకతాదివ్యకుటుంబినీమణి మదాంధ్రక్ష్మాలతాతన్వి యా
యొక రత్నంబును జారవేసుకొనె నయ్యో! యెట్లు శాంతించునో.

రతనము జారిపోయినదిరా! సుకుమారకుమారులార! మీ
యతనము లింక సాధ్యపడ వాంధ్రధరాతలమెల్లఁ జిక్కటం
ధతమసవార్ధిలో మునిఁగెనా? మనగాంధికిఁ జెప్పినారొ లే
దొ? తెలుపుఁ డంచుఁ గేక లిడుచున్నది చూచితిరే ధరాసతిన్.

మహితస్వరాజ్యోద్యమము పోరు కెదురెక్కి, మడమదిప్పని వీర మండనుండు
గాంధిభక్తుని జిహ్వాకాఖనిం గదలించి, రత్నంబుఁ గొన్న సార్థకపురుషుఁడు
వాసి. కెక్కిన నేర్పు మూసలో గుండెరాల్గరఁగింపఁ జాలు నఖండవక్త
పరుల వంచించు టక్కరిభక్తులకు నల్గి, కొరడాలు సృష్టించు గుణవిధుండు
దినము గడచుట కింట బత్తెంబు లేక, నిత్యసంతర్పణంబులు నెఱపుభక్తుఁ
డాంధ్రవైభవధ్వజ మూడి యవనిఁగూలఁ, గూలిపోయెనె మారత్నగోపమూర్తి?

కృష్ణవేణీ తరంగిత తరంగములందు, దేశీయగానంబు దిద్దినావు
జాతీయ పౌరుష స్వచ్ఛందరక్తంబు, చీరాల రణసీమఁ జిందినావు
పులిని గ్రుద్దుకు చంపఁగల దేహదార్ఢ్యంబు, మును బందిలో ధారవోసినావు
శతకోటిమన్మథ స్వర్ణసౌందర్యంబు, పీడరోగమున కర్పించినావు [గు
పలుకుపలుకున హాస్యసంపదలు గురియు, సహజవైదుష్యమునకు పిచ్చలును బొం
నాంధ్రసోదరలోక మల్లాడ నపుడ, స్వర్గ మెక్కితి వేల, గోపాల, నీవు?

ముప్పది యెన్మిదేండ్లు నిను మోసిన యాంధ్రధరాసవిత్రికిం
గొప్పన దిద్దిపోయితివి కోమలకాంచనదామకంబు నీ
యొప్పను సత్కళాప్రతిభయుం గల కొండొక యాంధ్రవీరుఁ డిం
కెప్పటికిం జనింపఁగలఁడే? జనియించినయేని దక్కునే?

నినుఁ గామించినకీర్తి గోపికలు నీ నిర్యాణవార్తా హతా
ఘ్నబాణంబున రొమ్ము గ్రుద్దుకొని నీగంభీరగాథావిమో
హన బృందావన వీథులం బరుగు లేయం జొచ్చె నీశోకవా
హిని నేరీతిఁ దరించునో తెలియ దోయీ! రత్నగోపాలకా!

ధనవంతమైన లండను పట్టణమునందు, తెలుఁగునేలకు వన్నె దెచ్చినావు
స్వాభిమానముఁ జాటు వంగరాష్ట్రమునందు, గౌరవాభ్యుదయంబు గాంచినావు
రాజమహేంద్రపురాన యల్. టీ. దాక, సిరి మీరఁ బాఠంబుఁ జెప్పినావు
ఒక యుపన్యాసంబునకు నూఱుఁబదునార్లు,గా కట్నములు మూటఁగట్టినావు
పెదవిఁ గదలించి నీవు నవ్వింపనట్టి, భారతీయుఁడు నొకతెల్లవాఁడు లేఁడు
ఇట్టి చాతుర్యజలనిధి వింతలోన, రూపు మాసితివే, రత్న రూప కృష్ణ!

బహువిధంబుల గుక్కఁబట్టి యేడువఁజొచ్చె, సగమైన నీదు దీక్షాకుమారి
పాడెకట్టెలమీఁదఁ బడి మొత్తుకొనసాగె, దిక్కులేని భవత్సతీలలామ
హృదయంబు బ్రద్దలై పొదల దిక్కులు సూచె, మితిలేని నీబంధుమిత్రకోటి
ప్రకృతి సుందర వైభవం బేది కళదప్పె, క్షేమాంకమైన నీరామనగరు
దాసు వోయిన యల కల్కతాపురంబు, పగిది గుంటూరిపురి శోకభరిత మయ్యె
నయ్యయో! యాంధ్రరత్న నీయాగమమున, స్వర్గపట్టణ మానందభరిత మయ్యె.

భౌతికశారీర పంజరం బేకదా, చితిమీఁద దగ్ధంబుఁ జేసినావు
క్షణభంగురంబైన సౌందర్యమేకదా, మృత్యుదేవతకు నర్పించినావు
కంటికిం గనరాని కంఠస్వరమెకదా, కాలవాహినిలోనఁ గలిపినావు
ఊటాడి జారు నాయుర్ధనమేకదా, వెట్టిబ్రహ్మమొగాన వేసినావు
మరణధాటికి, జరకు తత్తరముపడని, తతయశఃకాయ మిప్పుడు తాల్చినావు
ఇపుడు జీవించియున్నాఁడ వింద్రసభకు, రత్నదీపంబు లేని కొఱంత దీర్చి.




## ఆంధ్ర ప్రశస్తి

ఆంధ్రప్రశస్తి విశ్వనాథ వెంకటేశ్వర్లు గారిచే ప్రకటింపబడు "రసతరంగిణి" గ్రంథమాలసత్కమున వెలువడిన మొదటిపుస్తకము గ్రంథకర్త: విశ్వనాథ సత్యనారాయణగారు. రాయల్ 16 సైజున ఫెదర్ వేట్ కాగితముపై ముద్రింపబడినది. 73 పుటలు. చందాదారులకు పోస్టేజీతో సహా వెల రు 1. ఇతరులకు పోస్టేజీ కాకుండ రు 1. వలయువారు ప్రకాశకుల పేర కృష్ణాపత్రికఆఫీసు, మచిలీపట్టణము (కృష్ణా) అని వ్రాసిన బడయ గలరు.

ఆంధ్రవిష్ణువు, శాతవాహనుడు, గోతమి పుత్ర శాతకర్ణి, మాధవవర్మ, వేగిక్షేత్రము, ముఖలింగము, నన్నయభట్టు, ప్రోలరాజు, ప్రోలరాజువధ, చంద్రవంక యుద్ధము, యమదంష్ట్రిక అను శీర్షికల క్రింద జగద్విఖ్యాతి గన్న యాంధ్రమహావీరులయు, నాంధ్రమహాపురుషులయు చరిత్రముల యందలి విశేషాంశములు ప్రౌఢములై, గంభీరములై యొప్పుపద్యములలో వర్ణింపబడినవి.

గ్రంథకర్త గారిని ఆంధ్రపాఠక లోకమునకు గ్రొత్తగ నిప్పుడు పరిచితుల గావింపనక్కరలేదు. ఆంధ్రదేశమందలి యువకవులలో నగ్రస్థానమున నుంపదగిన వారిలో సత్యనారాయణగారొకరు. వారిపద్యముల శైలి, వర్ణనములు, ఉపమానములు నిండు క్రొత్తదనముతో ప్రత్యేకవ్యక్తిత్వము గలిగియొప్పుచుండును. ప్రతిపద్యమునను ఏదియోయొకవిధమగు ప్రత్యేకత్వము కన్పించుచునే యుండును. వారి కవితాధారయొక్క ప్రౌఢత ప్రతిపద్యమునను విజృంభించుచునేయుండును. ఆంధ్రప్రశస్తి వారి రచనాస్వాతంత్ర్యమును, కవితాప్రౌఢిని, భావౌన్నత్యమును స్పష్టముగ జాటుచున్నది. ఉదాహరణముగ నీ క్రిందిపద్యముల జూడుడు:

కాషాయ రమ్యవల్కల హలతాళన శిఖా
    సంపిహితాశ్వత్థ సామిధేని
భువనమోహన హేతునవవయః ప్రత్యూష
    స్సముదగ్రోచిః పూర్ణచంద్రరేఖ
కుపిత శంకర నేత్ర కుహరాగ్ని దగ్ధ మ
    న్మథదేవునకును ప్రాణప్రతిష్ఠ
అమిత లావణ్యనీలాకాశ పశ్చిమా
    శాపరత్నిక నూత్న జలద శకల
మొక్కఋషి కన్య, జలకలశోజ్జ్వలాంస
లలిత, కృష్ణానదీముక్తపులినసీమ
గలసికొనె నొక్కయక్షునిఁ, గలసె వారి
యమృతలజ్జాతిమధుర నేత్రాంచలములు.

అర్ధేశ్వర తాండవభ్రమణ పా
    దాంభోరుహ స్రస్త మం
జీరంబో గగనేందిరాకరపత
    చ్ఛ్రీకందుకంబో పునః
స్వారాజ్యచ్యుత భుక్తపుణ్యమగు న
    క్షత్రంబొ నాఁ బశ్చిమా
శారత్నాకరమందుఁ గ్రుంకెను వివ
    స్వద్బింబ మల్లంతలో.

తెలిలేవెన్నెల చాలులో తళతళై
    దీపించు వజ్రాలవ

చ్చల నీలాల హారంగు వన్నెలసరుల్
చాయల్ తలారింపులై.
తొలిక్రొక్కారు మెరుంగులట్టులయి యెం
తో నైన తేయాహ్నతో
జ్జ్వలదివ్యాహివలెం జెలంగ నసి రా
జద్భూమకేత్వాకృతిన్. —ప్ర. రం.

## కాంతంకథలు

ఇది మునిమాణిక్యం నరసింహారావు, బి. ఏ., యల్. టి. (సాహితీసమితి)గారిచే రచియింపబడి రాజమహేంద్రవర సరస్వతీగ్రంథమండలి యనుబంధ మాలిక 11 వ గ్రంథముగా వెలువడినది. క్రౌను 16 సైజున 145 పుటలు గలది. వెల రూ 1.

ఇందు_కోటు, తేనీరు, పూదాచీర, మా కాంతం, నేనూ మాకాంతం, తేనీటిగిన్నెలో తుపాను, సప్తాహం, ఒకరోజు, మరియొకరోజు, కొత్తఎత్తు, ప్రయాణం, ఎందుకు?_అను 12 కథలు గలవు. సంపుటము యొక్క ఆరంభమున కవికి గల భావనాస్వేచ్ఛను సూచించు వాక్యములు కొన్ని గలవు.

ఈకథలు చాలవర కిదివరకు ఆంధ్రదేశపు పత్రికలలో ప్రచురింపబడినవే. వీనిలో నుత్కృష్టభావములు గాని, ఉన్నతభాషాశైలిగాని లేకపోయినను చదువుట కింపుగ చమత్కారముగ సంసారపక్షముగ నుండును. 'కోటు' అనుకథలో గంగాధరంగారి కోటుఅని వ్రాయుచు; మధ్య 'నల్లకోటుచీకట్లో కలిసిపోయి కనబడనప్పుడు వెంకయ్యగారికి భయంవేసింది' అనిరి. గంగాధరంగారి పేరు గ్రంథకర్తగారుమరచిపోయి యుందురు. తొడుగుకొన్న కల్లకోటు అంధకారంలో కలిసిపోయి కనబడుట లేదట. దానిలోనుండిన వాచీగొలుసు మాత్రం మెరుస్తున్నదట. కనబడకున్నందున కోటుందాలేదాయని సందేహం, భయంవేసిందట. జేబులోనున్న అగ్గిపెట్టె తీసి వెలిగించి చూచుకొనేసరికి కోటు కనిపించిందట. ఇందున్న చమత్కృతి యేమో రచయితకే తెలియును!

"'ప్రకృతిలో సౌందర్యము గల ఏవస్తువు నైనా సౌందర్యముకొఱకే ప్రేమింపవచ్చును. స్వేచ్ఛగా స్త్రీపురుషులు విచక్షణలేక యొకరి నొకరు ప్రేమించుకొనవచ్చు'నన్న యసందర్భపు భావమును తెగనేయునట్లు 'పూదాచీర' అనుకథ యున్నది.

'ఎందుకు' అను కథలో హేమచంద్రుడు, గోపాలంభార్య సౌందర్యమును చూచి తనివితీరక మైమరచి యామెను రెప్పవాల్పక చూచుచున్నప్పుడు గోపాలం తన భార్యతో 'ఈయన నిన్ను ఎంతసేపుచూస్తూఉంటాడో అంతవరకు నీవక్కడేఉండు' అనిచెప్పడం సాధారణంగా ప్రపంచములో అసంభవమైనను హేమచంద్రునికి మంచి బుద్ధి చెప్పుమాట లగును! జ. బ్ర.

## భావప్రపంచము (ప్రథమఖండము)

క్రౌనుసైజు ౪౧ పుటలు. వెల ౫ అణాలు. కర్త: వరహాగిరి వెంకటభగీరథిగారు.

గ్రంథకర్తగారికి 'ఉద్దండుడను నొకమహావక్త స్వప్నములో ననేకపర్యాయములు అనివార్యముగా సాక్షాత్కరించి, తనకు నచ్చిన శైలిలో హాస్యరసప్రధానముగను, భావపూరితముగను, రసగ్రహణ భావప్రధాన నవీన మహనీయ రంజకముగను ఉపన్యసించి యుండెనట. అందు కొన్ని యుపన్యాసముల వీరాతని శైలినే శక్తివంచనలేకుండగా ననుకరించి విరమించిరట. ఇందు ధ్వనిగత నిందలు లేకపోలేదు. అటనట నవ్వురాకపోదు. కాని రచనావిధాన మున్నతపద్ధతిని లేదు. నలుగురి మిత్రులను ఈ రచయిత తనహాస్యముచే రంజింపవచ్చును గాని, నలుగురి విద్యార్థికులనడుమ నీపుస్తకము రాణింపదు. అతిభాషణమున మాటలచే నవ్వుపుట్టింపగల్గునుగాని మితభాషణమున భావగాంభీర్యముచే ధ్వనిగతనిందయూ, హాస్యపటిమయు వెదజల్లజాలదు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ యభిప్రాయ మిచ్చుచు, 'భాషాభిమానులెల్లరును దీనిని చదివి తీరవలెను. చదివితీరవలెనననేల, ఒక్కసారి చవిచూచిన చదివి తీరుదురనవలె!' అని నుడివిరి. ఇది తగని పొగడ్తగా గాన్పించుచున్నది.

ఇది వలయువా రీక్రింది చిరునామాకు వ్రాయదగును.—వరహాగిరి బాలాత్రిపురసుందరరావు, జగ్గంపేట, పెద్దాపురంతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

## భజనకీర్తనలు

౬౩ పుటలు. అందు భజనకీర్తనలు ౪౨ పుటలు. భక్తాంజలి పద్యమాలిక. శ్రీమతి ఆచంట సత్యవతీదేవి గారు రచించినది. ప్రకాశకులు: యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్టణము. వెల ౪ అణాలు.

దీనికి మున్నుడి వ్రాసిన శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు ఈ గ్రంథమునుగూర్చి యిట్లు నుడివిరి:

"దైవభక్తి, ఈశ్వరధ్యానము, సచ్చింతన, పుణ్య పరాయణత్వము ఇవి ప్రతి కీర్తనయందును తొలుకాడుచున్నవి. కీర్తన లన్నియును మారుమూల ఘణితీలను గాక ఆంధ్రలోకమున కెల్ల సుపరిచితములైయున్న నాటకపు మట్టులు, త్యాగయ్యకీర్తనలు, వెంకటేశ్వర స్తుతులు మొదలగు వరసలలో నున్నవి. ఈ పాటలను ఉత్సాహముతో పాడువారికి, మన హిందూ పురాణములలో వర్ణింపఁబడిన లక్షణములతో, ప్రభావములతో, పేరులతో ఈశ్వరుడు సగుణుఁడై వెలసియున్న ట్లగుపించును. శనివారముల భజనలలోను, ఆఁడుపిల్లల నోములలోను, ముసలివాళ్ల ధ్యానములలోను ఇవి సత్వరముగా వ్యాపించగలవని నమ్ముచున్నాను."

## కావ్యసంగ్రహము (మొదటిభాగము)

క్రౌను ౪౯ పుటలు. వెల ౬ అణాలు.

## కావ్యసంగ్రహము (రెండవ భాగము)

౧౧౧ పుటలు. వెల ౮ అణాలు.

ఈ రెండిటికిని కర్త: అడిదము రామారావు పంతులుగారు, తెలుగు లెక్చరరు, మహారాజావారి కాలేజీ, విజయనగరం. ఇందు జక్కన, పోతన, శ్రీనాథుడు, ధూర్జటి, చిన్నయసూరి మున్నగు రచయితల గ్రంథముల నుండి పద్యగద్యభాగముల నేర్చి రెండుసంపుటములుగా ప్రకటించిరి. ఇందు మంచిమంచి పట్లున్నవి. ఆయా కవుల జీవిత సంగ్రహముల గూడ శ్రీ పంతులుగారు తొలుతను జేర్చినారు.

## రాటము - మగ్గము

## Hand Spinning & Hand Weaving

క్రౌను సైజు ౨౬౦ పుటలు. వెల రు ౧.

గ్రంథకర్తలు: యస్. వి. పంతాంబేకరు, యస్. యస్. వరదాచారిగార్లు (ఆంగ్లమున); తెనుగు అనువాదకులు: ఉన్నవ లక్ష్మీనారాయణగారు; ప్రకాశకులు: కాశీనాధుని నాగేశ్వరరావుగారు, ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

శ్రీయుత రేవా శంకరజగ్జీవను మెహతాగారు "రాటము-మగ్గము" వ్యాసమున కేర్పాటుచేసిన ౧౧౦౦ రూపాయల బహుమానమును ఈ గ్రంథకర్తలు వడసిరి. ఆయుత్తమ వ్యాసమే ఇట్లు గ్రంథరూపముదాల్చినది. ప్రకాశకులు పీఠికలోనుడివినట్లు 'గాంధిమహాత్ముఁడు నిరంతరము బోధించుచున్న ఖద్దరు-రాటము సందేశము నీ గ్రంథము ప్రత్యక్షప్రమాణములతో ఋజువుచేయుచున్నది.' ఈవిషయమై సమగ్రమగు జ్ఞానమును గలుఁగజేయు గ్రంథము వేఱొకటి యింతవఱకు లేదని చెప్పవచ్చును. అనువాదము తేటమాటలతో నెల్లరకు బోధపడురీతి నున్నది. ప్రత్తి విడఁదీయుట, ఏకుట, సన్ననూలు వడుకుట మున్నగు పనులు తెలియజేయు కొన్ని ఛాయాచిత్రములు ఇందున్నవి.

## మాతృస్తవతారావళి

జీవన్ముక్త విచారణమను సూక్ష్మసూచీ వివరణ సహితము. క్రౌను సైజు ౫౪ పుటలు. వెల రు. ౨-౨-౧. సంపాదకులు, ప్రకాశకులు: కొరళ్ల బసవలింగము గారు, డి. పి. సి., ఎమ్. యన్. యమ్. ఆర్., పరశువాకం, చెన్నపట్టణము. గ్రంథకర్త పేరు తెలియదు. పైగ, 'ఈ గ్రంథమున కెవ్వరుకర్తలు మున్నగువిషయములతో నిమిత్తము లేకుండ నిందలివిషయంబు లెంతవఱకు నాదరణీయంబు లనునవి తెలిసికొని వానిఁబట్టి యిందలి రసంబులు చూఱలాడవలయు'నని సంపాదకులు విన్నవించుచున్నారు. పద్యములు సులభముగ బోధపడుచునే యున్నవి; ఐనను, విస్తృతమగు వివరణమెంతయో యున్నది. ఈ చిన్నిపొత్తమునకు రు ౩-౨-౦ వెలయుంచుటకు ఇందేమంత యలౌకికజ్ఞానము వెలయుచున్నదో తెలియకున్నది

## కృతజ్ఞత

క్రౌనుసైజు ౮౭ పుటలు. వెల రు ౧-౨-౦.

సంపాదకులు, ప్రకాశకులు: వి. వి. సుబ్బారావు గారు, టీచర్, గోరస, పిఠాపురంపోస్టు, గోదావరి.

వెనుకటిగ్రంథము రచించినవారే దీనిని రచించి రనిమాత్రము తెలిసినది. ఇదియొక గద్యవ్యాసము. విషయము విపులముగ చర్చింపబడినది. శైలి సమాసభూయిష్ఠమైనను రంజకముగ నంతట నొక్కరీతినున్నది. ఇట్టి వ్యాసరచన ఆంధ్రభాష కుండదగును. కాని చిన్న పుస్తకములకే వెలయింత యధిక ముంచినచో ప్రయోజనము భంగపడగలదు.

## Aravidu Dynasty of Vijayanagara, vol. I.

గ్రంథకర్త: బొంబాయిలోని సెంటు క్జేవియర్ కాలేజి భారతీయ చారిత్రకపండితులు రెవరెండు హెన్రీ హీరాసుగారు, యస్. జే. యం. ఏ. డిమ్మీసైజు 725 పుటలు; ఫెదర్ వేటు కాగితము. వెల ౧౧-౦-౦.

ప్రకాశకులు: బి. జి. పాల్ అండుకో,మదరాసు.

క్రీ. శ. ౧౫౪౨-౧౬౪౧ వఱకు విజయనగరమును పరిపాలించిన సంగమ, సాళువ, తుళువ, ఆరవీడు వంశములలో నాలవదగు ఆరవీడు వంశముయొక్క సంపూర్ణచరిత్రముతో పాటు ఆకాలమున నొకమలబారు చరిత్రము తప్ప తక్కిన దక్షిణభారతదేశ చరిత్రము నీ గ్రంథము చక్కగా వర్ణించుచున్నది. ఇంత విరివిగా నీవంశ చరిత్రమును వర్ణించుగ్రంథ మింతవరకు చారిత్రక ప్రపంచమున జన్మింపలేదు. ఇందలి చారిత్రక విషయములన్నియు సరియైన ప్రమాణములను గైకొని సమకూర్పబడినవి. కాన, ఇది చరిత్ర పరిశోధకులకు నత్యంతోపకారక మయినది. రాబోవు సంచికయందుదీనినిగూర్చినవిపుల విమర్శనమును గాంచనగును.

## భక్తలోల శతకము

౧౧౦ గీతపద్యములు. వెలతెలియదు.

కర్త:బొడ్డు బాపిరాజుగారు, ఆదివారపు పేట, ఏలూరు.

## గీతాతరంగిణి

క్రౌనుసైజు ౧౬ పుటలు. వెల ౨ అణాలు. వడ్డాది తిమ్మరాజకవి ప్రణీతము. ప్రకాశకులు: వడ్డాది భీమశంకరదాసుగారు, ఖాశింకోట, విశాఖపట్నము.

ఇందు భక్తిప్రధానములగు కొన్నిపాటలును,పద్యములును గలవు.

## శ్రీరామావతారము

డెమ్మీ ౩౦పుటలు. వడ్డాది తిమ్మరాజకవి కృతము. బ్ర. పండిత బులుసు పాపయ్యశాస్త్రిగారిచే పరిశోధితము.

ప్రకాశకులు: లంక సంజీవరావు గారు, ఖాశింకోట, విశాఖపట్టణంజిల్లా.

ఇది రామచరిత్రము; ఏకాశ్వాసప్రబంధము,శైలి సులభము.

## అతిరహస్యము

అను నాడీవిధానము—క్రౌను ౨౫ పుటలు. వెల ౪ అణాలు. గ్రంథకర్త: బలభద్రకోటయ్యగారు,పక్కలగడ్డ. హిందూప్రెస్, మచిలీపట్టణమున ముద్రితము.

## జన్మశాసనము (సంతాన నిరోధము)

గ్రంథకర్త: డాక్టరు నృపేంద్రకుమారవసు; అనువాదకులు: యలమంచి శ్రీరాములుగారు, అంగలూరు, కృష్ణాజిల్లా. పీఠికాకారులు: గౌ. జస్టిస్ వేపా రామేశం పంతులుగారు,మద్రాసు హైకోర్టుజడ్జి. క్రౌనుసైజు ౩౫౨ పుట లున్నవి. వెల రు ౨.

---

## భజనకీ ర్తనలు

౬౩ పుటలు. అందు భజనకీ ర్తనలు ౪౭ పుటలు. భక్తాంజలి పద్యమాలిక. శ్రీమతి ఆచంట సత్యవతీదేవి గారు రచించినది. ప్రకాశకులు: యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్టణము. వెల ౪ అణాలు.

దీనికి మున్నుడి వ్రాసిన శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు ఈ గ్రంథమునుగూర్చి యిట్లు నుడివిరి:

"దైవభ క్తి, ఈశ్వరధ్యానము, సచ్చింతన, పుణ్య పరాయణత్వము ఇవి ప్రతి కీ ర్తనయందును తొలుకాడు చున్నవి. కీ ర్తన లన్నియును మారుమూల ఫణితీలను గాక ఆంధ్రలోకమున కెల్ల సుపరిచితములై యున్న నాటకపు మట్టులు, త్యాగయ్యకీ ర్తనలు, వెంకటేశ్వర స్తుతులు మొదలగు వరసలలో నున్నవి. ఈ పాటలను ఉత్సాహముతో పాడువారికి, మన హిందూ పురాణములలో వర్ణింపఁబడిన లక్షణములతో, ప్రభావములతో, పేరులతో ఈశ్వరుడు సగుణుడై వెలసియున్న ట్లగుపించును. శనివారముల భజనలలోను, ఆడుపిల్లల నోములలోను, ముసలివాళ్ల ధ్యానములలోను ఇవి సత్వరముగా వ్యాపించగలవని నమ్ముచున్నాను."

## కావ్యసంగ్రహము (మొదటిభాగము)

క్రౌను ౪౯ పుటలు. వెల ౬ అణాలు.

## కావ్యసంగ్రహము (రెండవ భాగము)

౧౧౧ పుటలు. వెల ౭ అణాలు.

ఈరెండిటికిని క ర్త: అడిదము రామారావు పంతులుగారు, తెలుగు లెక్చరరు, మహారాజావారి కాలేజి, విజయనగరం. ఇందు జక్కన, పోతన, శ్రీనాధుడు, ధూర్జటి, చిన్నయసూరి మున్నగు రచయితల గ్రంథముల నుండి పద్యగద్యభాగముల నేర్చి రెండుసంపుటములుగా ప్రకటించిరి. ఇందు మంచిమంచి పట్లున్నవి. ఆయా కవుల జీవిత సంగ్రహముల గూడ శ్రీ పంతులుగారు తొలుతను జేర్చినారు.

## రాటము - మగ్గము

## Hand Spinning & Hand Weaving

క్రౌనుసైజు ౨౬౦ పుటలు. వెల రు ౧.

గ్రంథక ర్తలు: యస్. వి. పంతాంబేకరు, యస్. యస్. వరదాచారిగార్లు (ఆంగ్లమున); తెనుగు అనువాదకులు: ఉన్నవలక్ష్మీనారాయణగారు; ప్రకాశకులు: కాశీనాధుని నాగేశ్వరరావుగారు, ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

శ్రీయుత రేవా శంకరజగ్జీవను మెహతాగారు "రాటము-మగ్గము" వ్యాసమున కేర్పాటుచేసిన ౧౧౦౦ రూపాయల బహుమానమును ఈ గ్రంథక ర్తలు వడసిరి. ఆయుత్తమ వ్యాసమే ఇట్లు గ్రంథరూపముదాల్చినది. ప్రకాశకులు పీఠికలోనుడివినట్లు 'గాంధిమహాత్ముడు నిరంతరము బోధించుచున్న ఖద్దరు-రాటము సందేశము నీ గ్రంథము ప్రత్యక్షప్రమాణములతో ఋజువుచేయుచున్నది.' ఈవిషయమై సమగ్రమగు జ్ఞానమును గలుగజేయు గ్రంథము వేఱొకటి యింతవఱకు లేదని చెప్పవచ్చును. అనువాదము తేటమాటలతో నెల్లరకు బోధపడురీతి నున్నది. ప్రత్తి విడదీయుట, ఏకుట, సన్ననూలు వడుకుట మున్నగు పనులు తెలియజేయు కొన్ని ఛాయాచిత్రములు ఇందున్నవి.

## మాతృస్తవతారావళి

జీవన్ముక్త విచారణమను సూక్ష్మసూచీ వివరణ సహితము. క్రౌనుసైజు ౯౪ పుటలు. వెల రు. ౨-౨-౧. సంపాదకులు, ప్రకాశకులు: కొరళ్ల బసవలింగము గారు, డి. పి. సి., ఎమ్. యన్. యమ్. ఆర్., పరశువాకం, చెన్నపట్టణము. గ్రంథక ర్త పేరు తెలియదు. పైగ, 'ఈ గ్రంథమున కెవ్వరుక ర్తలు మున్నగువిషయములతో నిమిత్తము లేకుండ నిందలివిషయంబు లెంతవఱకు నాదరణీయంబు లనునవి తెలిసికొని వానిఁబట్టి యిందలి రసంబులు చూఱలాడవలయు'నని సంపాదకులు విన్నవించుచున్నారు. పద్యములు సులభముగ బోధపడుచునే యున్నవి; ఐనను, విస్తృతమగు వివరణమెంతయో యున్నది. ఈ చిన్నిపొత్తమునకు రు ౨-౨-౦ వెలయుంచుటకు ఇంతేమంత యలౌకికజ్ఞానము వెలయుచున్నదో తెలియకున్నది.

## కృతజ్ఞత

క్రౌను సైజు ౪౮ పుటలు. వెల రు ౧-౨-౦.

సంపాదకులు, ప్రకాశకులు: వి. వి. సుబ్బారావు గారు, టీచర్, గోరస, పిఠాపురంపోస్టు, గోదావరి.

వెనుకటిగ్రంథము రచించినవారే దీనిని రచించి రనిమాత్రము తెలిసినది. ఇదియొక గద్యవ్యాసము. విష యము విపులముగ చర్చింపబడినది. శైలి సమాసభూయి ష్ఠమైనను రంజకముగ నంతట నొక్కరీతినున్నది. ఇట్టి వ్యాసరచన ఆంధ్రభాష కుండదగును. కాని చిన్న పుస్త కములకే వెలయింత యధికముంచినచో ప్రయోజనము భంగపడగలదు.

## Aravidu Dynasty of Vijayanagara, vol. I.

గ్రంథకర్త: బొంబాయిలోని సెంటు గ్జేవియర్ కాలేజి భారతీయ చారిత్రకపండితులు రెవరెండు హెన్రీ హీరాసుగారు, యస్. జే. యం. ఏ. డిమ్మీసైజు 725 పుటలు; ఫెదర్ వేటు కాగితము. వెల ౧౧-౦-౦.

ప్రకాశకులు: బి. జి. పాల్ అండుకో, మదరాసు.

క్రీ. శ. ౧౫౪౨-౧౬౬౧ వఱకు విజయనగర మును పరిపాలించిన సంకమ, సాళువ, తుళువ, ఆరవీడు వంశములలో నాలవదగు ఆరవీడు వంశముయొక్క సంపూ ర్ణచరిత్రముతో పాటా కాలమున నొకమలబారు చరిత్రము తప్ప తక్కిన దక్షిణభారతదేశ చరిత్రము నీ గ్రంథము చక్కగా వర్ణించుచున్నది. ఇంత విరివిగా నీవంశ చరిత్ర మును వర్ణించుగ్రంథ మింతవరకు చారిత్రక ప్రపంచమున జన్మింపలేదు. ఇందలి చారిత్రక విషయములన్నియు సరి యైన ప్రమాణములను గైకొని సమకూర్పబడినవి. కాన, ఇది చరిత్ర పరిశోధకులకు నత్యంతోపకారక మయినది. రాబోవు సంచికయందుదీనినిగూర్చినవిపుల విమర్శనమును గాంచనగును.

## భక్తలోల శతకము

౧౦౮ గీతపద్యములు. వెలతెలియదు.

కర్త: బొడ్డు బాపిరాజుగారు, ఆదివారపు పేట, ఏలూరు.

## గీతాతరంగిణి

క్రౌను సైజు ౧౬ పుటలు. వెల ౨ అణాలు. వడ్డాది తిమ్మరాజకవి ప్రణీతము. ప్రకాశకులు: వడ్డాది భీమశంకరదాసుగారు, ఖాశింకోట, విశాఖపట్నము.

ఇందు భక్తిప్రధానములగు కొన్నిపాటలును, పద్య ములును గలవు.

## శ్రీరామావతారము

డెమ్మీ ౩౦పుటలు. వడ్డాది తిమ్మరాజకవి కృత ము. బ్ర. పండిత బులుసు పాపయ్యశాస్త్రిగారిచే పరి శోధితము.

ప్రకాశకులు: లంక సంజీవరావు గారు, ఖాశిం కోట, విశాఖపట్టణంజిల్లా.

ఇది రామచరిత్రము, ఏకాశ్వాసప్రబంధము, శైలి సులభము.

## అతిరహస్యము

అను నాడీవిధానము—క్రౌను ౨౫ పుటలు. వెల ౪ అణాలు. గ్రంథకర్త: బలభద్రకోటయ్యగారు, వక్కల గడ్డ. హిందూప్రెస్, మచిలీపట్టణమున ముద్రితము.

## జన్మశాసనము (సంతాన నిరోధము)

గ్రంథకర్త: డాక్టరు నృపేంద్రకుమారవసు; అను వాదకులు: యలమంచి శ్రీరాములుగారు, అంగలూరు, కృష్ణాజిల్లా. పీఠికాకారులు: గౌ. జస్టిస్ వేపా రామేశం పంతులుగారు, మద్రాసు హైకోర్టుజడ్జి. క్రౌను సైజు ౩౫౨ పుట లున్నవి. వెల రు ౨.

# సాభిప్రాయవిశేషములు

వర్తమానప్రపంచపరిస్థితులు సుందోపసుందోపాఖ్యానమును సంస్మరింప జేయుచున్నవి. ప్రపంచమునం దన్నిజాతులును నా కాయుష్యము, నాకారోగ్యము, నాకు భాగ్య మని పాటు పడుచున్నవి. యూరపు రాజ్యములకు పరశ్రేయస్సహనము లేదు; పరపీడనమె ప్రధానమైనది. నల్లపచ్చజాతులను పీడించి బలిసిన తెల్లజాతులకు విషమావస్థ సంప్రాప్తమైనది. ఐరోపా మహాసంగ్రామము యూరపురాజ్యముల పశుబలమును శిథిలము చేసినది. మైరావణయజ్ఞములకు యజ్ఞపశువు లగుటకు ప్రజలు ప్రతిఘటించుచున్నారు. గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, జర్మని, రుష్యా, ఇటలి రాజ్యములు మహాదుఃఖవేదన ననుభవించుచున్నను, ఎప్పటి యెత్తులనె వేయుచున్నవి. సకలాంగములును బంధింపబడిన జర్మను రాజ్యము సంగ్రామసంకల్పము చేసినను సాధనసంపత్తి లేని సంకల్పము నిరర్థకము. జర్మనురాజ్యతంత్రజ్ఞు లీవిషయమును గ్రహించి వైరాగ్యమార్గము నవలంబించుచున్నారు. ప్రతియేటను పదికోట్లరూప్యములను యుద్ధ నష్టములకు పరిహారార్థము చెల్లింపవలసిన జర్మని చేయగల దేదియును లేదు. జర్మను దేశము సంగ్రామమునకు పూర్వ మాదాయములో విశేషభాగము మారణయంత్ర నిర్మాణములకై వినియోగించుచుండెను; యుద్ధ నావలు, మరఫిరంగులు, విమానములు, బాంబులు, మరతుపాకులు జర్మనురాజ్యాదాయమును దిగమ్రింగుచుండెడివి. అర్థముతో ధర్మమును పోవుచుండెను. యోధులు మద్యమాంసాదులను తిని క్రొవ్విన మృగములవలె పోరాడుటకు సంసిద్ధులై యుండిరి. ఏమూలను జూచినను సాయుధపాణులైన జర్మనులు సంగ్రామదావానలమును పురికొలుపుటకు సంసిద్ధులై యుండిరి. కౌటిల్యనీతికి జర్మను చక్రవర్తి పట్టభద్రుడై యూరపురాజ్యములను గడగడలాడించెను; కృష్ణపింగళజాతుల నాచంద్రార్కము పరాధీనులను జేయుటకు విశ్వప్రయత్నములను జేసెను; చీనాయందు బాక్సరు ఉద్యమమును నాశనము చేయుటకు నాయకుడై, చీనావిమోచనమునకును, ఆసియా విమోచనమునకును, ప్రపంచశాంతికిని మహాపకారమును జేసెను. ప్రపంచమును గడగడలాడించిన విలియము సింహ మిపుడు బోనునందు జిక్కుకొని తోక నాడించుచున్నది. ఆయన పుత్రుడు బర్లినువీథులందు బస్సులయందెక్కి తిరుగుచున్నాడు. ప్రజలు నిరాయుధులై, నిస్సహాయులై, వైరాగ్యోపహతచేతస్కులై, కాలయాపనమును జేయుచున్నారు. పదునైదేండ్లయందు జర్మను హృదయమునందు గలిగిన పరివర్తనము పరమహింసాభావపరాయణు

లకును జ్ఞానోదయమును గలుగజేయుటకు దగియున్నది. ప్రవృత్తియందు విషబీజము విషఫలమును గలుగజేయునుగాని స్వాదుఫలమును గలుగజేయదు. పాపఫలము తప్పక పండవలసియున్నది. కాలము పరిపక్వమైనపుడప్రయత్నముగ కర్మఫలము గలుగుచున్నది. జర్మను హృదయమునందు చిత్తశుద్ధిగల వైరాగ్యము గలుగకపోయినను బలవంతముగ నైనను వైరాగ్యము గలుగుట ప్రపంచశాంతికి సాధనముగ నున్నది. జర్మను ప్రజల శక్తిసామర్థ్యములు మారణసాధనములకు గాక ప్రజాపోషణమునకు వినియోగపడుచున్నవి. ఇది దైవసంకల్పము. పరపీడనమున కలవాటుపడిన జర్మనుహృదయమున కీపరివర్తనము దుఃఖమును గలుగచేయుచున్నదిగాని సుఖమును గలుగజేయుటలేదు. వర్తమానకాలమునందు జర్మనుహృదయమునకు విషతుల్యముగ నున్న నిర్బంధ వైరాగ్యము కాలాంతరమున సహజ వైరాగ్యమై అమృతము కాగలదు. పుణ్యము పుణ్యము వలన పండును గాని పాపమువలన పండదు. జర్మనులు వారి ప్రారబ్ధకర్మఫలము ననుభవించిరి. భావికాలమునందును వర్తమానకర్మఫలము ననుభవింపగలరు. బాక్సరు ఉద్యమకాలమునందు జర్మనుచక్రవర్తి బోధించిన దుస్తంత్రమునె నేడు బాల్డువిను మొదలగు రాజనీతిజ్ఞులు బోధించుచున్నారు. కాని వారు జర్మనుల గుణపాఠమును మాత్రము మరచిపోవుచున్నారు. ఈపదునైదేండ్లయందును చీనాప్రబోధము, ఆసియాప్రబోధము, మానవప్రబోధము స్థిరపడినవి. ప్రాతవాసనలకై యూరపురాజ్యతంత్రజ్ఞులు పరితపించుట సహజమైనను నిరర్థకము. ఆకాలమును పోయినది. యూరపురాజ్యతంత్రజ్ఞులు స్వాత్మనాశనకరమైన పరపీడనతంత్రమును వీడి, స్వాత్మవికాససాధనమైన పరార్థ హితధర్మము నవలంబించుట వివేకము.

* * * *

మానవప్రబోధము కార్మికసంఘటనమునందును, కార్మికనిరోధమునందును ప్రత్యక్షమగుచున్నది. ప్రపంచమునం దంతటను కార్మికులయం దపారమైన యశాంతి జనించినది. కార్మికులు సంయోగమువలన వారిదుర్భరస్థితిని బాగుచేసికొనుటకు ప్రయత్నించుచున్నారు. ఈ ప్రయత్నములకు సకలదేశములందును ప్రబలమైన ప్రతిఘటన మేర్పడుచున్నది. కులీనులకు కులహీనులకు, శ్రీమంతులకు దరిద్రులకు, పండితులకు పామరులకు, స్త్రీలకు పురుషులకు, పూర్వాచారప్రియులకు సంస్కారప్రియులకు, నిరంకుశత్వప్రియులకు స్వాతంత్ర్యప్రియులకు, భోగులకు త్యాగులకు తీవ్రమైన సంరంభము జరుగుచున్నది. పదివైదేండ్లకు బూర్వము మూర్తీభవించిన నిరంకుశత్వదేవతగ నున్న రుష్యా నేడు మూర్తీభవించిన స్వాతంత్ర్యదేవతగ నున్నది. ఆదేవతాసాన్నిధ్యమునం దన్ని భేదములును నంతరించుచున్నవి. చక్రవర్తులు, మతాచార్యులు, నిరంకుశాధికారులు, కోటీశ్వరులు, భూస్వాములు మాయ

వలె మాయమైరి. రుష్యారాజ్య తంత్రజ్ఞులు ప్రపంచమునందు మహాపరివర్తనమును చేయుటకు నాయకత్వమును బూనుకొనుచున్నారు. ప్రపంచమునం దంతటను సర్వసమత్వ సిద్ధాంతమును స్థాపించుటకు రుష్యానాయకులు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. రుష్యా నాయకుల ప్రయత్నములు చల్లగా వ్యాపించుచున్నవి. ప్రపంచమునం దంతటను సోవీటు ధర్మములకు స్వాగతములో, ప్రతిఘటనములో కనుపడుచున్నవి. సామాన్యులు దీనికి సహస్రముఖములను స్వాగతంబు నొసంగుచున్నారు. శ్రీమంతులు సర్వత్ర సంపూర్ణముగను ప్రతిఘటించుచున్నారు. సోవీటు ద్రవ్యము, సోవీటుబలము, సోవీటుతంత్రము సర్వవ్యాపకత్వమును గాంచుచున్నవి. జర్మను, చీనా, జపాను, తుర్కి, హిందూదేశములందు సోవీటు భావములు వ్యాపించుచున్నవి. జవాహరిలాలు నెహ్రూగారు వ్రాసిన వ్యాసములు, కేరళ రాష్ట్రీయసభయందు జేసిన ప్రసంగములు సోవీటు భావముల వ్యాపనమును తెలుపుచున్నవి. సామ్రాజ్యాభిమానమునకును, ధనాభిమానమునకును, స్వాభిమానమునకును మూలపీఠమైన బ్రిటిషు ప్రభుత్వమునకును, రుష్యా ప్రభుత్వమునకును సర్వత్ర ప్రతిఘటనము తారసిల్లుచున్నది. సర్వత్ర రుష్యాకు జయము గలుగుచున్నది. రుష్యా లక్ష్యము సర్వసమత్వమును స్థాపించుటయందు భౌతికముగాని ఆధ్యాత్మికము గాదు. లోకము నిరసించుచున్న పశుబలమును రుష్యా పశుబలమూలముననే నిరసించుచున్నది. రుష్యా సిద్ధాంతములందు నిరసించుచున్న పశుబలమును నాచరణమునందు వ్యాపింపజేయుచున్నది. ధర్మాధారములేని సిద్ధాంతములందు ప్రళయబీజములు నంతర్గర్భితమై యుండును. రుష్యా సహజముగ ననుభవించుచున్న దుఃఖవేదన ప్రపంచమున కంతకును సుజ్ఞానోపదేశమును చేయుటకు దగియున్నను ప్రపంచమునకు చిత్తశుద్ధి గలుగలేదు. ప్రపంచమం దంతటను మాటలయందు శాంతియును, చేతలయందు సంగ్రామ ప్రయత్నములును సాగుచున్నవి.

* * *

శాంతికాములైన రోమేను రోలెండుగారు వ్యక్తముచేసిన ప్రపంచపరిస్థితులు యథార్థస్థితిని దెలుపుచున్నవి. యూరపురాజ్యములన్నియును మారణాస్త్రములను బడయుటకు పాతాళహోమములను జేయుచున్నవి. ఇంగ్లాండు కోట్లరూప్యములను వ్యయముచేసి సింగపూరు నావాశ్రయమును నిర్మించినది. అనంతమైన ద్రవ్యమును వ్యయముచేసి మూడువేల యుద్ధ విమానములను నిర్మించినది; యుద్ధనావలను నిర్మించుచున్నది. విష వాయువును, జలాంతర్గాములను నిర్మించుచున్నది. నిరపరాధు లెందరో మృత్యుదేవతకు బలియగుటకీమారణయంత్రములు పరమసాధనంబులు గాగలవు. ఇతరుల మారణమున కేర్పడిన శక్తులు తమ మారణమున కేర్పడుటయును సహజము. ఇదియె సుందోపసుందోపాఖ్యానము. ప్రపంచమునకు నాశనమును గోరువారు తమ నాశనమునుగూడ గోరుచున్నారు. మనుమాట

మరచిపోదురు. ప్రపంచరాజ్యాధికారమును వహించుట కవసరమైన శక్తియును, సంపదయును, ధనమును గ్రేట్బ్రిటనునుండి శిథిలములగుచున్నవి. సంపదలయందును, బలమునందును అమెరికా సంయుక్తరాష్ట్రములు ప్రపంచమునందు నాయకత్వమును వహించుచున్నవి. పారిశ్రామిక ప్రపంచమునందు జర్మని, అమెరికా సంయుక్త రాష్ట్రములు ముందంజ వేయుచున్నవి. ప్రజల యభివృద్ధి వెనుకంజ వేయుచున్నది. గ్రేట్బ్రిటనునందు ప్రజల పన్నులభారము విశేషముగ పెరిగినది. తల ఒకటికి రూ 217 పన్నును బ్రిటీషుప్రజలు చెల్లించుచున్నారు. వ్యయమధికమైన రీతిని నాదాయ మభివృద్ధిని బొందలేదు. లక్షలమంది పనివాండ్రు పనిపాటులు లేక పరితపించుచున్నారు. గ్రేట్బ్రిటనునందు ప్రముఖమైన బట్టలపరిశ్రమ మాంద్యముగ నున్నది. కార్మికులం దశాంతి పెరుగుచున్నది. సర్వపాపములను పరిహారము చేయుటకు బ్రిటిషురాజ్య తంత్రజ్ఞులు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. బాల్డ్విను గారు శ్వేతజాతుల బలమును గోరినను, చాంబర్లేనుగారు చీనాను బంధింపగోరినను, బర్కెను హెడ్డుప్రభువు హిందూదేశము బంధింపగోరినను, ఫలము సమానము: గ్రేట్బ్రిటనుకు సుఖసంపదలు, పరాధీన రాజ్యములకు దుఃఖ దారిద్ర్యములు. నాకాయుష్యము నాకారోగ్యముసిద్ధాంతమును బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులు గోరుచున్నారు గాని ప్రపంచ శాంతిని గాని, పరమార్థమును గాని కోరుట లేదు. ఎన్ని తంత్రములను పన్నినను, ఎన్ని యెత్తులు వేసినను, ఎన్ని ప్రయత్నములను జేసినను పడిపోవుచున్న బ్రిటిషు ప్రాబల్యము నిలువజాలదు. ఈజిప్టు, పారసీకము, చీనా, హిందూదేశము వ్యవహారములు బ్రిటిషురాజ్య తంత్రజ్ఞులకు పరమసంతాపమును గలుగజేయుచున్న విధమును వారిమాటలు, చేతలు తెలుపుచున్నవి. చీనావిషయమై బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులవలంబించిన రాజనీతి దుర్భరమై పరాజయమును పొందినది.

* * *

చీనావిజయ మాసియాఖండ విజయము, ధర్మ విజయము, శాంతి విజయము. బ్రిటీషు రాజ్యాధికారుల తంత్రము లన్నియును నిష్ఫలములైనవి. చీనాయం దన్నిపక్షములు వారికిని సంయోగము గలుగుచున్నది. ఉత్తర భాగనాయకులు చీనాను విడిచి దుందుభినాదములతో మంచూరియాకు వెడలిపోయిరి. చీనాప్రభుత్వము పెకింగునువిడిచి టీన్‌స్టినును రాజధానిని జేసి మహాధైర్యమును జూపినది. కమెల్‌పాషా గారు కాన్‌స్టాంటినోపిలును విడిచి అంగోరాయందు రాజ్యమును స్థాపించి తురుష్కజాతీయప్రతాపమును సంరక్షించినట్టులు చీనారాజ్యాధికారులును టీన్‌స్టినునందు రాజ్యమును స్థాపించి చీనాజాతీయపతాకమును నిరాటంకముగ వ్యాపింప జేయగలరు. చీనాయును తుర్కీవలెనే ప్రాతవాసనలను విసర్జించి జాతీయధ్వజమును నూతనవికాసముతో స్వదేశమునందును, పరదేశములందును వ్యాపింప

జేయవలసియున్నది. ధర్మపరాయణులైన నలువదికోట్ల ప్రజల ప్రబోధముతో ప్రపంచము నూతనచైతన్యము వహింపవలసి యున్నది.

* * * *

ఇతర స్థలములందు పడిపోవుచున్న ప్రయోజనములను పరాధీన రాజ్యములందు బడయుటకు బ్రిటీషు ప్రభుత్వము విశ్వప్రయత్నములను జేయుచున్నది. భారతవర్షము బ్రిటీషు సామ్రాజ్యమునకు మకుటమనుట యసంగతమైనను పరాధీన రాజ్యములకు మకుటమనుట మాత్రము సంగతముగ నున్నది. ప్రపంచరాజ్యములందు భారత రాజ్యమునకు గల దైన్యస్థితి వేరొక రాజ్యమునకు లేదు. సకలమును పరాయత్తముగ నున్నది. భారతీయుల కాత్మవిస్మరణము గలిగినది. పరసందర్శన మాత్మసందర్శనమునకు ప్రమాణముగ నున్నది. భారతీయులకు దేహబలము, జ్ఞానబలము, ద్రవ్యబలము కార్యసాధనమునకు లేకున్నవి. వాదోపవాదములతోను, పరస్పరకలహములతోను, నిందలతోను కాలము గడచుచున్నది. ఒకరిమాట వేరొకనికి సరిపడకున్నది. ఒకరికి తూర్పు, రెండవవానికి పడమర మార్గములుగ నున్నవి. బ్రిటీషు రాజ్యతంత్రజ్ఞులు భేదోపాయమునందు మహాదక్షులు. కొంతకాలము హిందూ మహమ్మదీయ భేదములు, కొంతకాలము బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదములు, కొంతకాలము పట్టణ గ్రామభేదములు, కొంతకాలము సంస్థానములు బ్రిటీషు ఇండియాభేదములు భారతీయుల దుర్దశను, బ్రిటీషు అధికారుల దక్షత్వమును విశదము చేయుచున్నవి. సైమనుకమిషను దుర్దశను ప్రత్యక్షము చేయుచున్నది. సైమనుకమిషనుకు నాయకుల తోడ్పాటును బడయుటకు ప్రభుత్వాధికారు లవలంబించుచున్న రాజ్యనీతి యసహ్యముగ నున్నది. ఇర్విను ప్రభువు మొదలు రక్షకభటుని వరకును తెల్లకమిషనుతో సహకారమును ప్రదర్శించుటకు జేయుచున్న ప్రయత్నములు వారి రాజ్యతంత్ర సామర్థ్యమును విశదము చేయుచున్నవి.

సర్ జాను సైమను గారు పలికిన సానుభూతివాక్యములు ప్రజలను వంచింపజాలవు. ఈవిషయమునందు నాయకులందరును నేకీభవించుచున్నారు. శ్రీనివాసయ్యంగారును, జిన్నాగారును నేకాభిప్రాయమును దెలుపుచున్నారు. ఆంగ్లేయపత్రికలయందు ప్రముఖమైన పయోనీరు పత్రికయును నాంగ్లాధికారుల ప్రవర్తనమును నిరసించుచున్నది. సైమనుకమిషను నాయకులను కొంతవరకు చేరదీసినను ప్రజాసంయోగమునకు సాధనము గాజాలకున్నది. సైమనుకమిషనులో భారతీయులకు తెల్లవారికిగల ప్రతిపత్తి లేనంతవరకును, వారు పాల్గొనజాలరని నాయకు లందరును నేకగ్రీవముగ విస్పష్టము చేయుచున్నారు. అయినను సామ్రాజ్యశాసనసభ నియమించిన కమిటీప్రశంసలు కొందరకు భ్రమను గలుగజేయుచున్నవి. శాసనసభలు బహిష్కారము విషయ

మై చేసిన తీర్మానములను అన్నిపక్షములవారును గౌరవించుట దేశక్షేమమునకు ప్రయోజనకరము. జస్టిసుపక్షమువారి ప్రవర్తన విషయమై ఊహాపోహాలు గలుగుచున్నవి. కాని వారు స్వయముగ పోషించిన తీర్మానమునకు వ్యతిరేకముగ వారు ప్రవర్తించుదురని నమ్ముట యసంగతము. ప్రజాపక్షమును పోషించుటకేర్పడిన జస్టిసుపక్షము ప్రజాభిప్రాయమును ధిక్కరించుట యసంభవము. సైమనుకమిషను తిరిగివచ్చి పోగలదు. దేశమోక్షముమాత్రమిట్టి కమిషనుల మూలముననురాజాలదు. దేశమోక్షము ప్రజాప్రబోధము మూలముననే రాగల విధమును చీనాదేశ ముపదేశించుచున్నది. చీనాస్వాతంత్ర్యసంరంభ మంతఃకలహములతో నారంభమైనను, నంతఃకలహము లంతరించి చీనాజాతీయధ్వజము స్థాపితమైనది. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులు ప్రజాబలము సువ్యక్తముగానంతవరకును మామూలు ఎత్తులనే వేయుచుందురు. ఆయెత్తులను వేయుటయందు తెల్లదొర లందరకును సమానప్రజ్ఞ గలదు. గ్వైన్ను గారైనను, మార్షు బాంకుగారైనను, గోషెనుప్రభువైనను, వింటరుటను ప్రభువైనను సమానప్రజ్ఞనే కలిగియుందురు. నల్లదొరలు కూడ వారి మాయోపాయములందు జిక్కుకొనుట సంతాపకరముగనున్నది. భారతీయులకు స్వధర్మ నిర్వాహణమునకు మార్గమును జపాను చీనా రాజ్యములు వేయినోళ్ల జాటుచున్నవి. స్వప్రయోజనమును, కులప్రయోజనమును, సంఘప్రయోజనమును, మతప్రయోజనమును నుత్తమమైన దేశప్రయోజనమునకు సాటిరావు. జపాను, చీనా నేర్పిన గుణపాఠమును భారతీయులును గ్రహించి స్వధర్మ నిర్వాహణమును బూనుకొని భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాత!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T. Madras.

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—గజేంద్రమోక్షణము; లలితారాగిణి.

సాధారణ చిత్రములు:—ప్రాచీన భారతీయచిత్రములు ౧౦; కోయలు, చెంచులు ౫; మంత్రిత్వవైఖరి (పు. ౨౭౦); గోవా వీరగల్లు; దుర్గావిలాసము-బెజవాడ; క్షురకర్మ' (పు. ౩౨౩); కీలుబొమ్మలు (పు. ౩౨౫); ఆంధ్రకవులభావనలు, వారి స్వస్థితి (పు. ౩౪౯); ఇతర చిత్రములును.




చెన్నపట్టణము, ఆగష్టు ౧౯౨౮

సంపుటము ౫ విభవ సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮

# వేసవి

వడ్డాది సుబ్బారాయుఁడు గారు

ఆమని మామిడి యెక్కఁడు, రాముఁడు కళ్యాణపుష్ప రథ మెక్క, వనా
రామంబులఁ గలకంఠులు, గ్రామంబులను గలకంఠకంఠులుఁ బాడన్.

కువకువ వేకువం జెవులకుం జవు లీను రసాయనంబుగా
సవిధరసాలసౌధమున సారెకుఁ బాడెదు మేలుకొల్పు; నీ
వెవరవొ? యేమి? మాధవ మహీధవు మంగళపాఠకుండవా?
కవులును గాయకుల్ వొగడు కంఠము నీకిడినాఁ డతండె కా.

కోకిలమా! ధన్యమ వీ - వేక ప్రభుసేవయందె యొనయించెదు నీ
లోకోత్తర కలగాన క-ళాకౌశలి, మాధవోపలబ్ధస్వరమా!

వేఁడి వెలుఁగు కతన వేసంగి పవళుల - నంటరాని వయ్యె నఖిలవస్తు
వెవని పాలనమున నెల్ల భూప్రజ వాని - యట్ల యాట సాజమంద్రు గాదె?

వలసలుపోయె స్వర్ధునికి వాపులుఁ గూప నదీతటాకముల్
నిలువఁగ లేక వెట్ట, కవనీసతి దప్పిక నావులించె; నాఁ
కలి గడుహెచ్చి చిచ్చుకనఘాతకర్తన్ గబళించె గ్రామముల్;
బలితపువేసవిన్ విభవ భానువిభన్ వెగడొందె భూతముల్.

వేసవి వేవెలుంగుబలువెట్టకు మూర్ఛిలినట్లు, భూతసం
త్రాసము గాఁగ నొక్కొకదినమ్మున నేమిఁ జలింప కుండు వి
శ్వాసువు గాలికిన్, జను లహర్నిశ మొక్కటఁ నేద దేఱఁగా
వేసర కల్లనల్లనను వీతు రుశీరపు వీజనమ్ములన్.

తీవ్రరోహిణిని దృతీయపూ దినమున - దప్పి విభవ నతిగఁ ద్రావునీళ్లు
కడవ గిడవగాదు లొడితెఁడుపొట్ట, యం - దెట్టువట్టె? నవ్వి యెట్టువట్టె?

మబ్బులో చందమామ యీమాపు జగతి - పగటినై దాఘతాపంబు పాయునట్లు
సన్నచినుకులు రాలు; యుష్మత్కరముల-హిమతుషారమొ వారిదామృతకణములో!

కోయిల జోలవాడఁగను గోమకంఠకుహూస్వనంబునన్
గాయము ఘర్మవాఃకణనికాయము తెమ్మెరకూన లానఁగన్
రేయిట తెప్పవాలని శరీరులు వేసఁగి నెట్టకేలకున్
హాయిగ వేగుజాము సమయంబునఁ గున్కుదు రారుబై లులన్.

కటితటి భర్మచేల మెదఁ గౌస్తుభసోదరి భాసిలన్, మహో
త్కటముగఁ బాంచజన్య నినదం బడరన్, మధువైరి, ప్రాణులం
బెటపెటఁ బేల్చు వేసవిరవిం గబళించి ప్రపంచ మోమఁగాఁ
జటుకునఁ దోఁచె నాఁదగె సచంచలమై జలదంబు గర్జన్.

విభవను మృగశిరబిందువు - లభవుజటాజూట బిందులట్టివి యయ్యెన్
నభము పెనుచిల్లి వడిన ట్లిభతుండసమోగు ధారవృష్టి ఘటిల్లెన్.

---

# గద్యకథానకములు

డి. ఏ. నరసింహము గారు, యం. ఏ., యల్. టి.

దేశకాలపరిస్థితుల ననుసరించి సారస్వతములోని జాతులును, రీతులును మారుచుండును. ఆంగ్లసారస్వతప్రోద్బలమువలన మనయాంధ్రవాఙ్మయమున జనించిన సారస్వతజాతములలో గద్యకథానకములు ఇప్పుడు ప్రాముఖ్యము నొందుచున్నవి. ఇవి వినోదము నొనగూర్చుటయే కాక సాంఘికములగు ఆచారవ్యవహారములను, వ్యక్తులవింతపోకడలను, జీవితమును చీకాకుచేయు క్లిష్టసమస్యలను, మనస్సును దిగ్భ్రమ నొందించు దైవవిపాకములను నేర్పుతో ప్రదర్శించి చదువరులను వివేకవంతులనుగా జేయుటకు తోడ్పడుచున్నవి. సాహిత్యముయొక్క ముఖ్యాశయములగు రంజనము, వివేకదీపనము ఈసారస్వతజాతమునగూడ ప్రబలముగా నెరవేరుచున్నవి. మనపత్రికలలో నివి మెండుగా దిగుచున్నవి గావున వీనితత్త్వమును, ఉపయోగమును పరిశీలించుచు వీనివిలువను చదువరులు తెలుసుకొనుటకు తోడ్పడు వ్యాస మొకటి వ్రాయవలసిన దని భారతీపత్రికా కార్యాలయమువారు కొన్నినెలలక్రిందట నన్ను కోరిరి. పలుకారణములవల్ల నట్టిది వ్రాయుటకు జాగైనది. ఇదివఱకు వ్రాయబడినవి, ఇపుడు వ్రాయబడుచున్నవి అన్నియు డెలిసికొనుటకు వీలులేనందున ఆంగ్లసారస్వతపరిచితివలనను, ఆంధ్రపత్రికా భారతీపత్రికలలో ప్రచురింపబడు చిన్నకథలను చదువుచుండుట వలనను నాకు బోధపడినంతవరకు ఈ గద్యకథానకము లనుసారస్వతజాతమును గురించి యీ వ్యాసమున చర్చించుచున్నాను. ఇం దుదాహరింపబడు కథలను ముఖ్యముగా ఆంధ్రపత్రికసంవత్సరాదిసంచికలలోను, భారతీపత్రికలోను, "అభ్యుదయ" అనుపత్రికలోను చదువనగును.

౧

వీనికి "కథానకము" లను పేర్లు తగియుండు నని శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారివలన వింటిని. "కథిక" లను నామము నేను మున్నొక వ్యాసమున "భారతి"లో సూచించియుంటిని. కథానకము లనుపేరే బాగున్నదని తోచి యీవ్యాసమున దానినే అవలంబించితిని. పద్యకవితయందును చిన్నకథ లుండును. కాని గద్యకథానకములను గురించి మాత్రమే యీవ్యాసమున చర్చించుచున్నాను. ఇంగ్లీషులో వీనివి 'షార్ట్ స్టోరీజ్' (Short Stories) అందురు. చిన్నకథలు అనుమాట. ఈమాటయును మనము ఉపయోగించుకొనవచ్చును. కాదంబరి, వాసవదత్త మొదలగు ప్రబంధములు పెద్దకథలు. ఆంగ్లమునను, ఆంధ్రమునను మిక్కుటముగా వెలువడు నవలలును పెద్దకథలే. అయితే పెద్దకథలను సంగ్రహపరచినంతమాత్రమున అవి చిన్నకథలు గానేరవు. ఇవి రెండును ప్రత్యేకజాతులు. వీనికి వలయు నేర్పును వేరువేరుగా నుండును. ఆంగ్లమున కొన్ని చిన్నకథలు నలువది యేబదిపుటల ప్రమాణమునకు మించియుండును. కథావస్తువు విరివి యగుటవలనను, ఏకాంశమున కేంద్రీకరింప వలనుపడనందునను రాజస్థానకథావళి, వ్యక్తులజీవితచరిత్రలు, అరేబియను నైట్సు వినోదకథలును ఈ కథానకజాతిలో నిముడవు. ఏకనాయకాశ్రయత్వము కథానకముయొక్క రచనకు చాలదు.

నవలయొక్క ఆశయము సాంఘికజీవితమును బ్రతిబింబింపజేయుట. వ్యక్తుల నడవడికలు, జాతుల మర్యాదలు, స్త్రీపురుషుల సంభావణములు, యోచన లేని నడతలవల్లను, మాటలవల్లను మన యిరుగుపొరుగువారికి, బంధువులకు, హితులకు మనము కలిగించు మనస్తాపములు, మన దుఃఖములు, మనసుఖములు, మన ఆశయములు, మనేమరుపులు, మన దౌర్బల్యములు, మన ఉత్సాహములు—ఇవియన్నియు చక్కగాను, సప్రమాణము గాను, భావబోధకముగాను ప్రతిబింబింపజేయబడును. నాయికానాయకులే కాక పలురకముల వ్యక్తులును, వారివారి వ్యవహారములును

గూడ నవలయందు కూర్పబడును. జీవితపటము నవలయందు విశాలముగ నుండును. కథానకమం దట్లుండ నేరదు. నిరూపింపబడునంశ మొక్కటిగా నుండవలెను చదువరి యొక్క శ్రద్ధ దానియందే లగ్నమయి యుండవలెను. "రాజశేఖరచరిత్ర" యందు నాయకుడు రాజశేఖరుడా, రామరాజా యనుసందియమునకు తావున్నది. అట్టి సందేహము "శివరామా" యనుకథానకమందు లేదు. ఇందొక హంతకుడు దారుణవేషము వేసుకొని, యొక ముదుసలి సంపన్నుని జంపుటకు కరము చాచియు చంపకుండనట్లు నిలిచిపోవును. కారణ మేమి యని చదువరి యుత్కంఠతో చదువును. తాను ఇల్లువిడుచునప్పుడు తన చిన్నికుమారుడు వెళ్లవద్దని చేయిచాచెనట; వంశనాశన మగునని భార్య వారించెనట. వంశనాశనమే దీనిఫలమని యా ముదుసలి బ్రాహ్మణుడును శపించెనట. ఇన్నిటిని సరకు గొనక తననిశ్చయప్రకారము హంతకుడు కత్తి నెత్తెను... కాని చంపలేకపోయెను. అట్లే ప్రతిమవలె నిలువబడిపోయెను. 'ఏమి యూరకున్నావు'అని ముదుసలి బ్రాహ్మణు డడుగ, "శివరామా" యని కత్తిని క్రింద పడవేసి, "నే నిక నెవరిని జంపను. నీవు బ్రదుకుము, నాయనా" యని యరచి క్రింద కూలబడెను. ఒక్కొక్కటిగా తాను నిర్లక్ష్యము చేసిన యంశము లన్నియు పుత్రప్రేమ యను లోనదాగియున్న శక్తిని బయటకు లాగి బలపరచి, దురాశాసర్పముపై నొక్కుమ్మడి దాడివెడలి, దానిని నిర్వీర్య మొనరించెను. దీనినుండి మంచినీతిని తరువాత తీయవచ్చును. "మానవస్వభావ మెంత యగాధము!" అని ఆశ్చర్యపడవచ్చును. ముదుసలి బ్రాహ్మణుని నిశ్చలత్వమునకు సంతోషింపవచ్చును. ఎన్నియేని యూహింపవచ్చును. కథ ముగియువరకు మనస్సు ఆనీలవస్త్రసంఛాదితమగు హంతకుని విగ్రహముపైని, మీది కెత్తబడిన కృపాణముపైని, కృపాణమును హస్తమును నిర్వీర్యముచేసిన అవ్యక్తభావవిజృంభణముపైని నిలిచియుండును. తక్కినప్రశ్నలకు, ఊహలకు ఆసమయమున తావుండదు. ఇట్టి ఏకాగ్రత నవలలో నుండదు. రాజశేఖరుడుగారి జీవితమందు, వారికుమార్తెల దుఃఖములయందు, సాంఘికములగు చెడుగులయందు మనస్సు పలుత్రోవలుగా పోవును. "అహల్యాబాయి" యను నవలయందు చదువరిమనస్సు శ్యామసుందరుడు, భిల్లుల జీవితము మొదలగు నంశములయందు రాణిజీవితమునందు కంటె ఎక్కువ అభిరుచిగలిగియుండును. "నీబుణముతీర్చుకున్నా" అను చిన్నకథయందుగల స్త్రీపురుషులయందు కన్నవారికంటె పెంచినవారికి గలిగిన అపూర్వానుభవము నందే మనస్సు లగ్నమగును. తాము ముద్దుచేసి పెంచిన పొరుగువారి పిల్లవాడు తమయింట తల్లిదండ్రులుదగ్గర లేని సమయమున జచ్చుటయు, ఆపిల్లవానితండ్రి "నాపిల్లవానిని నా కిమ్మని" చేసిన ఆర్తనాదము, "నీబుణము తీర్చుకుంటా" నని స్నేహితుడు బదులు చెప్పుటయు, తిరుగ నా స్నేహితునికి ఒకపిల్లవాడు కలుగుటయు, ఆపిల్లవానిని మొదటిదంపతులు ముద్దుగా చేరదీసి పెంచుటయు, వాడు వారిచేతిలో జచ్చుటయు, "నీ బుణము తీర్చుకున్నా" నని యా స్నేహితుడు మాటనొప్ప జెప్పుటయు — ఇది ఆ యపూర్వానుభవము. నమ్మండి, నమ్మకపోండి. చదువునంతసేపు మనస్సునకు ఈ ఒక్క అంశమే ఉత్కంఠను గలుగజేసి నింపును. అది చిన్నకథలోని ముఖ్యసూత్రము. చిన్నకథ మిక్కిలి చిన్నదిగా నుండ నక్కరలేదు. కాని దీనిలోని కథావస్తువు విరివిగా నుండినయెడల దీనిపస చెడును. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి "సువర్ణగుప్తుని కథ" పెద్దదే; కాని రాజగు విక్రమార్కుడు "కుక్కను గౌరవించి నీ యన్నల నేల యిట్లు అమానుషముగా అవమానపరుచుచున్నావు?" అని యడుగుటయు, ఆప్రశ్నకు జవాబుగా తనజీవితచరిత్రను వివరించుటయు, అందులో తనయెడల కుక్క గనుపరిచిన విశ్వాసమును, అన్నలు చేసిన ద్రోహమును స్పష్టమగునట్లుగా కథయంతయు విసరింపబడుటయు చూడ నిది యొకకథానక మని తోచుచున్నది. కథావస్తువు విపులమైనను ఏకాంశమున కేంద్రీకరింపబడినది. ఇట్లే "భిక్షువు" అనే కథానకము సన్న్యసించి పలుబాములకు లోనైన యొక పోలీసు ఉద్యోగియొక్క దుర్నీతివర్తనమును ఆతనిచేతనే చెప్పించును. అరణ్యప్రాంతపు స్టేషనుకు బదిలీయగుట, అక్కడ నొకబోయకన్యను మోసగించుట, రోగములపాలయి,

ఉద్యోగమును విడిచి, బంధుగులచేతను, భార్యచేతను విడువబడి భిక్షువగుట యింతలి కథావస్తువు. అరణ్యమున ప్రకృతిసౌందర్యమును, ఆటవికుల నిర్మలస్వభావమును ఈసందర్భమున తేటపడును. అవి మిక్కిలి నేర్పుతో కథలో ఉపాంగముగా నమర్చబడినవి. "కుటీర లక్ష్మి" యను కథానకము రాట్నముయొక్క ఉపయోగమును హృదయంగమముగా ప్రదర్శించుచున్నది. బ్రదికి చెడిన యొకస్త్రీ రాట్నమువల్ల తనను, తనపిల్లలను ఎట్లు తిరిగి ఉద్ధరించుకొనగలిగినదియు తెలుపుచున్నది. ఆమెయొక్క పూర్వపు ఉన్నతస్థితి, ప్రస్తుతపు దీనస్థితి, ఎప్పుడును విడువనిసౌశీల్యము,మార్దవము,మానము అన్నియును ఈముఖ్యాంశమును బలపరచి మనోరంజకముగా నొనరించుచున్నవి. కథానకముయొక్క వస్తువు ఏకాంశమున కేంద్రీకరింపబడవలెను. అంశములు ఎక్కువైనయెడల పస చెడును. చదువరిమనస్సున కథాంశము దృఢముగా నాటుకొనదు. ఈకథలో నాయికయొక్క పెనిమిటి చేసినవ్యాపారములు, లాభములు సంగ్రహముగా దెలుపబడినవి. వ్యాపారముల ప్రశంసకుగాని, రాటపువ్యాప్తికి చేయబడు యత్నముల ప్రశంసకుగాని ప్రాముఖ్య మీయబడలేదు. అవి ముఖ్యాంశమగు కుటీరసముద్ధరణప్రశంసకు సాధనమాత్రములుగానే ఉంచబడియున్నవి.

౨

ఇంతేకాక కథాంశము సులభగ్రాహ్యముగాను, స్పష్టముగాను ఉండుటవలన కథానకముయొక్క ప్రాశస్త్యము హెచ్చును. "జన్మాంతరసంబంధము" అను కథలోని ముఖ్యాంశ మంత సులభముగా గ్రాహ్యము కాదు. తెలిసిన తరువాతనైనను మనస్సున కంత దృఢముగా పట్టదు. మంచన్న అనే మరగుజ్జు బ్రాహ్మణచిన్నవాడు తనయన్నచే మోసగింపబడి దేశాంతరము పోయి ఒకధర్మాత్ముని యింటిలో కుదురుకొనెను. ఆయింటియజమాని కేలాగో యీచిన్నవానియందు మిక్కిలిప్రేమ జనించెను. ఆచిన్నవాడును ఆయనయందు విశ్వాసముగా నుండెను. ఆయన చనిపోవునప్పుడు ఆలుబిడ్డలను మరచి మంచన్నను పిలిచి కౌగిలించుకొని ప్రాణము వదలెను. 'జన్మాంతరసంబంధము మాత్రమే యిట్టిప్రేమను కలుగజేయగలదు' అని చదువరి నమ్మజాలడు. మంచన్నయొక్క నిర్మలసాత్త్వికస్వభావము, అమాయకత్వము, ముగ్ధత్వము, రూపవైకృత్యము జాలిగొలిపి ప్రేమపుట్టింపజాలును. ఇట్టిసందేహము మనస్సున పొడమినచో కథానకము బలహీనమగును. "దయ్యాలకొంప" అను కథానకమునగూడ నిట్టినీరసత కనుపడును. దయ్యములున్నవను నమ్మకము లేక, అట్టినమ్మకములను తిరస్కరించుచున్నదా యీకథ? లేక అట్టినమ్మకము తప్పుగాదని ఋజువుచేయుచున్నదా? యను సందేహము చదువరికి చదువుచుండగనే కలుగును. అందులో మనదయ్యములరీతులను, పాశ్చాత్యులు కనిపెట్టిన దయ్యములచే వ్రాయించు ప్లాంచెట్ (Planchet) విధానమును ఈకథకుడు కలుపుచున్నాడు. ఇదియు చదువరి మనమున సందేహము కలుగజేయును. ఇది కథానకమునకు లోపము.

3

కథానకములయొక్క రచన పలువిధములగు చమత్కారములను గలిగియుండవచ్చును. పూసగ్రుచ్చినట్లు సంగతులను వివరించవచ్చును. ఇట్టిరచన "జన్మాంతర సంబంధము","నీఋణం తీర్చుకున్నా" అను కథలలో కనుపడును. లేదా, ఎవరో ఒకరు సంభాషణలో మిత్రులకు చెప్పుచున్నట్లును, నడుమ నడుమ ప్రశ్నలవల్ల కథాభాగములు తేటపడునట్లును రచింపవచ్చును. భమిడిపాటి రామసోమయాజులుగారు వ్రాసిన "జానకి" యను విచారకథను గోదావరీతీరమున పడవమీదకూర్చుండి గాలి సేవించుచున్న యిరువురుమిత్రుల సంభాషణ సాధనము. గోదావరీకల్లోలములు సదృశమైన రంగాలంకారము. నడుమనడుమ పొర్లివచ్చు భావవీచికలు శ్రుతి. జానకి పెనిమిటి అన్యాక్రాంతహృదయుడై ఆమెను తిరస్కరించి పెట్టినబాధలు, పతిని విడిచియుండ నను దృఢసంకల్పముచే నామె పతిని వెంటాడి తుదకు నూతద్రోయబడి చంపబడుటయు కథావస్తువు. తుదవరకును చదువరికి ఉత్కంఠ పెరుగుచునే యుండును. "నామిత్రుని జీవితచరిత్ర"లో నెల్లిమర్ల అనుగ్రామమునుండి సంపదను గోలు

పోయిన యొకకాపుయువకుడు ఖరగపురము ప్రాంతమునకు పోయి జీవితమును సుఖముగా గడుపుచు, త్రాగుడు పిశాచమునకు లోనై, క్రమముగ తనసుఖమును, పిల్లలను, భార్యను చంపుకొని, ఏకాకియై, ఆస్పత్రిలో పడి యుండగా, పూర్వపున్నేహితు డొకడు వచ్చి చూచి, చరిత్రనంతయు తెలుసుకొని, వాని కోరికప్రకారము వానిని జన్మస్థానమునకు తీసుకవెళ్ళి విడిచెను. ఆస్నేహితుడే యీకథను చెప్పును. "భిక్షువు" అనుకథలో రోడ్డుమీద పోవుచుండు నొక తగుమనిషి యీకథానాయకుడగు భిక్షువునకు ఒక అణా ధర్మముగా నొసగి, యంతట నాతడు ఇంగ్లీషున నాశీర్వదించుటను విని ఆశ్చర్యపడి, యాతనివృత్తాంతమును తెలిసికొనగోరెను. అప్పుడాభిక్షువు తాను పోలీసు ఉద్యోగిగానుండి చేసిన దుర్నీతిపనులకు శిక్షగా కుష్ఠరోగియై, బంధువులచే నిరసింపబడి,యీవృత్తి నవలంబించి కూటికి గుడ్డకు కష్టపడుచున్న సంగతి వివరించెను. ఇట్లు కథానకములలోనికథ కథానాయకునిచేత చెప్పింపబడవచ్చును; లేదా, అతనికి సంబంధించిన వారిచేత చెప్పింపబడవచ్చును; మిత్రులసంభాషణ పూర్వకముగా తగినభావసంచాలనముతో చెప్పింపబడవచ్చును. కథకునిచేతనే పూసగ్రుచ్చినట్టు మొదటినుండి చివరవరకుకథాంశమునకు సంబంధించినసంగతు లన్నియు వివరింపబడవచ్చును. కథకునినేర్పుప్రకారము కథాంశమునకుతగిన ఉత్కంఠ భావపోషణరచనకు వన్నెదెచ్చి కథాంశమును చదువరిమనమున దృఢముగా నిజముగా నడిచినసంగతివలె నాటజేయును. అయినను కథకుడు మరుగుపడియుండి కథాపురుషులచేతనే చెప్పించుట యొక నేర్పు. అట్టికథనమునకు అనుకూలమగు ప్రకృతిసన్నివేశములను చిత్తరువు వెనుకభాగమునందు (background) వలెను, గానంపుశ్రుతివలెను మేళవించుట దీనికి మించిననేర్పు. కథకునినేర్పు ఇంకననేకరీతులను కనిపెట్టవచ్చును. ఇవన్నియు నిర్ణయించుట కలవి గాదు.

"యుగములనుండి నీకొరకు కనిపెట్టుకొనియుంటిని గదా" యను కథానక మొకటి వింతత్రోవను త్రొక్కుచున్నది. ఒకరాజకుమారుడు యుద్ధరంగమున శత్రురాజుకుమార్తెతో పోరి, మెప్పు వడసి యామెను కౌగిలించుకొనుటయు, నిద్దరును హర్ష మందుచుండ అందరు నచ్చెరువంది మెచ్చుచుండ వారిద్దరు జచ్చుటయు పూర్వభాగము. నూతనవిషయములగు నాటలలో మెప్పునందిన బలశాలియగు వైకుంఠరావు అనుయువకుడు అట్లే ప్రవీణతను గడించిన యొకపార్శీయువతిని గలుసుకొని, పూర్వస్మృతి కలిగి "యుగములనుండి నీకొరకు కనిపెట్టుకొనియుంటినిగదా" యనుటయు, నామెకును నట్లే పూర్వస్మృతి కలుగుటయు నిదంతయు ఉత్తరభాగము. అయితే యిందులో వధూవరులు సుఖింతురు. ఉత్తరభాగము చివరవరకు పూర్వభాగమునకును దీనికిని గలసంబంధము కనుపడదు. అయిన నిదియొకలోపముగాదు. జన్మపరంపరయందు నమ్మకము గల మనకు ఇట్టికథ వింతగొలుపదు. ఉత్తమవీరజన్మమునుండి బంతియాటల ప్రసిద్ధిగలజన్మమునకు కొంచెము హీనక్రమము (anti-climax) తోపకమానదు. అయినను ఇది కాలపరివర్తనముగదా. కథకుడు పూర్వచరిత్ర యీనూతనవధూవరులలో నెవరిచేతనైన చెప్పించినయెడల ఈహీనక్రమ మంతగా దోపకయుండెడిది; కథాంశరచనయు బింకముగను, భిన్నత్వసూచన లేకుండగను ఉండెడిది. ఇట్టిరచనాలోపము "అత్తవారిల్లు" అను చిన్నకథలో నగన్పట్టును. ఇందలికథాంశము స్వల్పము. అత్తవారింటిలో మగనియాదరణమున మురియుచుండిన పిల్ల పండుగకు పుట్టినింటికి పోవలెనని కుతూహలపడుటయు, వెళ్లి కొన్నాళ్లుండి మగనియుత్తరువుప్రకారము మతిసంతోషముతో తిరిగి యత్తవారింటికి వచ్చుటయు నిందలికథ. క్రొత్తదాంపత్య మందలి అనురాగోత్సుక్యోత్సాహముల నుదాహరించుటయే ముఖ్యాంశము. రచనావిధానము ఈ ముఖ్యాంశమును అంత తేటగా వ్యక్తపరచలేదని నాకు తోచుచున్నది.

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు వ్రాసిన కథానకములలో గల అనేక ఉత్తమగుణములలో రచనాపటిమ యొకటి. వీరు వ్రాసిన "పద్మాక్షి", "ప్రౌఢాపరివ్రాజకవివాహము" అను కథానకములను చూడుడు. మొదటిది విషాదాంతము, రెండవది హర్షాంతము. రెండిటియందును ప్రథమ

వీక్షణసంజనితప్రేమయే ముఖ్యాంశము. ఎట్టియాటంకములు వచ్చినను ఈపవిత్రమగు ప్రేమభావము మారదు; నశింపదు. పద్మాక్షి రూపవతి యైనను పుట్టుగ్రుడ్డిది. అయినను, స్వరమాత్రమున తనకు విధిప్రేరితుడై వచ్చిన యువకునియందు బద్ధానురాగ యై, వ్యతిరేకప్రశంస చెవిని బడగనే బావిలో బడి యాత్మహత్య చేసుకొనెను. ఆయువకుడును తలిదండ్రులను విడిచి, శ్మశానమునకు బోయి తనప్రేయసియందు లీనమాయెను. ఇచ్చోట కథ అంత స్పష్టముగా లేదు. "ఆశ" యనుకన్య చిన్ననాటి సహపాఠియగు ఉపకలాపునికొరకు ప్రతీక్షించుచు జనకుని ఒడబరచి సాంఘికావమానమును లెక్కగొనక కన్యగానే యొంటరికాపురము జేయుచు తనహృదయచోరుడు పండితవరుడై యూరికివచ్చియు, తనసంగతి తెలిసికొనిన పిమ్మట దైవికాంతరాయమువలన మనసు కలగి ఊరు విడిచిపోగా, ఆశ యతనిని వెదకికొనుచు పోయి తనవిగ్రహమును నిర్మించుకొని దేవతగానుపాసించుచున్న ప్రియుని గనుంగొని సుఖించుట యీ కథానకములోని వస్తువు. ఆమెనిర్మలప్రేమదీక్షవల్ల వివాహనిర్బంధముల తగ్గించుటకై సాంఘికోద్బోధనము చేయుట ముఖ్యాంశము. కథకుని ఆశయము ఇది యని నాకు తోచినది. మొదటినుండి చివరవరకు ఆశయొక్క నిర్మలప్రేమమూర్తి చదువరియెదుట ప్రకాశించుచునే యుండి, మధ్యమధ్య తెలియజేయబడు చిన్ననాటిచరితలు, వివాహయత్నము, దానినిరసనము, సాంఘికావమానము, శత్రువులని హింస మొదలగు సంశములవల్ల ఆప్రేమమూర్తి మరింత మనోహరము, మరింత గౌరవాస్పదమునై మెరుగువారుచుండును. ఇందువలన కథ పాత్రపోషణమందును భావపరిశీలనమందును నే కాక రచనైకాగ్రతయందును కూడ మిన్నయగుచున్నది. పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారి సంఘసంస్కారాశయముగల కథలయందును ఇట్టిరచనైకాగ్రత, ఏకాంశ కేంద్రీకరణము బాగుగా కనబడుచున్నవి.

౪

కథానకముల వస్తు వనేకరీతులనున్నది. మానవ వ్యాపారములలో నీసాహిత్యజాతమున కనువు గానివి లేవని తోచుచున్నది. పూర్వచరిత్రల నాశ్రయించి "వసుభాలుడు" అను వేగువానికథ వ్రాయబడియున్నది. ఆశ్చర్య మగురీతిగ నిందులో యువకులప్రేమ వేగు వ్యాపారముతో మెలికవేయబడినది. కృష్ణదేవరాయల తొలునాటి సరదారుల పిల్లలు ఆయిద్దరు వేగువారగు యువతీయువకులు. ఇందులో చారిత్రము, అద్భుతము, ప్రేమ యీమూడును కలిసియున్నవి. విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించిన "రంగరాజు" అను కథలోను ఇట్టిరసములు కలవు. దురాశచే రంగరాజు హంతకుడై తనబంధువులను, అన్నను, అన్నపిల్లలను జంపి, తానును హతుడగును. తుదకు ప్రయోజనము లేని సంతాపముపాలగును. నెల్లూరుజిల్లాలో క్రిందటియేడు జరిగిన తుపాను విపరీతములలో నొకయూరగల విద్యావంతుడగు రెడ్డియువకుని సాహసౌదార్యకృత్యములు "ముద్దుకృష్ణ" యను కథానకమునకు వస్తువు. ఇందులోనుగూడ చారిత్ర అద్భుత ప్రేమరసములు కలిసి యున్నవి. ఈ అద్భుతరసము "దయ్యాలకొంప"లో నింకొకరీతిని పోషింపబడి యున్నది. అపరాధపరిశోధకములగు కథానకములు కొంతవర కీయద్భుతరసపోషణ చేయుచున్నవి. ఆంధ్ర పత్రికలో క్రిందటి ఏడు "వీరవనిత" యనుకథ చదివితిని. కొన్నిరచనాలోపము లున్నను, అద్భుతరసము నుదాహరించుచున్న దీకథ. ఒకదొమ్మరి ఆటగాడు కరణముగారి భార్య యింటిలో నొంటరిగ నున్నదని గ్రహించి, దొడ్డిద్వారమున బ్రవేశించి, యామెను బలవంతము చేయ జూచుటయు, నామె సమయస్ఫూర్తి గలిగి యాతనికి భోజన మిడునెపమున వంటయింట దాకొని లోన తలుపు బిగించుకొనుటయు, వాడు గోడ త్రవ్వి లోనికి బ్రవేశించుచుండ వానిశిరముపై నొక కొయ్యపారను వైచి అణచిపెట్టుటయు, ఇది యంతయు తాను చచ్చినవెనుక తలుపులు గొట్టి లోన ప్రవేశించిన తన పతికి స్వప్నమున తాను తెలుపుటయు, ఆత డీదుఃఖమును భరించలేక చచ్చుటయు—ఇట్టి సాహసాద్భుతములు ఈకథకు వస్తువు. విమర్శనకు దీనిరచనగాని, అంశములు గాని తాళవు. కాని చదువరికి ఉత్కంఠ కలుగజేసి యాతనిమనమును బలవద్గ్రాహముగా పట్టియుంచును.

"యుగములనుండి నీకొరకు కనిపెట్టుకొని యుంటిని గదా" యనుదానిలో ప్రేమాద్భుతరససమ్మేళన బాగుగా నున్నది. ప్రేమ యనునది తాత్కాలికభావము గాదు. "జన్మజన్మాంతరములయందును జీవుని వదలదు" అను ప్రేమతత్త్వమును, ప్రేమప్రాశస్త్యమును సూచించు కథ యిది. అనేకజన్మము లైనను ఒకరి నొకరు పూర్వ దంపతులు తెలిసికొనగలుగుట యనే అద్భుతము దీనికి సాధనము. కొంతవరకు విమర్శవాక్యములతో గూడుకొని యున్నను రాయసం వెంకటశివుడుగారి "పులికూన" యను చారిత్రకకథయును, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి "నందచరిత్ర"యును ఇట్టికథానకరీతిని వ్రాయబడి యున్నవి. రచనావిపరణములు ముఖ్యరసమును పోషించుచున్నవి. అద్భుతకథానకములలో తదనుకూల ప్రకృతి వర్ణన లుండవచ్చును. అయితే ప్రకృతివర్ణన యెట్టి కథలలో నైనను జొనుపబడవచ్చును. ఇదియొక ముఖ్యాంశము గాదు. "భిక్షువు" అనేకథలో మాత్రము బోయలు, అడవులు కథావస్తువుతో సరిసమానముగా చదువరిమనమును ఆకర్షించును. అయితే యిందులో అద్భుతరసము చాలాతక్కువ. ఆబోయయువతియొక్క హఠాద్దర్శనములు, మంత్రశక్తులు మాత్రము కొంచెమద్భుతజనకములు.

సాధారణముగా ఈ కథానకములు ప్రేమభావమును ఆధారముగా గలిగి యున్నవి. చిన్నవయస్సుగల యువతీయువకులే వీటిలో నాయికా నాయకు లగుచున్నారు. ప్రేమస్వభావము, దానిలోపమువలన గలుగు కీడులు, దానియుద్రేకమువలన గలుగు కీడులు, ఆలుమగలకుండవలసిన సైరణ, సమానప్రేమ లేకున్నచో గలుగు అనుమాననిర్వేదములు, ఇవి సామాన్యముగా కథానకములలో వస్తువుగా గ్రహింపబడుచున్నవి. "రోహిణీసుధారకము", "బంగళాలో కాపురము," "లక్ష్మి" (యిది చిన్న నాటిక యైనను కథానకముగా నెంచుచున్నాను) "జానకి" యను రెండువిచారకథలు ఇట్టికథలు చాలావరకు నీతిదీపకములుగానే ఉన్నవి. యువజనులు ఇట్టి అన్యోన్యభావపరిశీలన కలవాటుపడుటవలన సహనబుద్ధి, ఔదార్యము కలుగవచ్చును. సుఖజీవనమునకు అన్యోన్య ప్రేమ, ఉదారభావము, సైరణ యివన్నియు అవసరమే కదా. యువకులమనస్సులను తెలుసుకొనలేక పెద్దలు వారిని హింసించుచుందురు. వారి ప్రేమప్రవాహమునకు అడ్డువచ్చుచుందురు. అట్టివారికి గూడా ఈ కథానకములు వివేకజనకములని తలచెదను.

ఇందులో సాంఘికసంస్కారాశయములను అనేక కథకులు మేళవించుచున్నారు. ఇందులో పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ప్రవీణులని నాకు తోచుచున్నది. ఇట్టికథ లల్లుటలో వారికి సహజమగు నేర్పు మిక్కిలిగా నున్నది. దీనికి సంఘసంస్కారమందు వారి కున్న ప్రేమయేకాక సాహిత్యాభిరుచి కూడ ముఖ్యకారణ మనవచ్చును. వీరికథనచాతురి, సంభాషణలాలిత్యము, మానవాభివృద్ధియందు గల నమ్మకము గమనింపదగును. వీరు సృజించు స్త్రీపురుషపాత్రలయందు వీరి సహజమగు ఉత్సాహము గననగును. బ్రాహ్మణయువకుడు వేశ్యాకన్యను పెండ్లాడుటయో, వితంతుబాలికను పెండ్లాడుటయో, బ్రాహ్మణుడు వ్యాపారము జేసి మార్గదర్శి యగుటయో యిట్టి వెన్నియేని వీరి కథలనుండి ఉదాహరించవచ్చును. ఇవి "అభ్యుదయ" అను మాసపత్రికలోను, ఇతరచోట్లను చదివితిని. కథలలోని సంభవములను, సందర్భములను పొందుపరచుటలో వీరి చాతుర్యము, లోకానుభవము, జీవితపరిశీలనము బాగుగా కనుపడును. ఇట్టి సంఘశుద్ధి ఆశయములు గల కథానకముల వ్రాయుటలో ఆ. భాస్కరమ్మగారుగూడ నేర్పు గనుపర్చుచున్నారు. వీరు వ్రాసిన "ప్రభావతి" యనేకథ బాల్యవివాహములయొక్క కీడును వ్యక్తపరచుచున్నది. రాయసం వెంకటశివుడుగారు వ్రాసిన "స్త్రీరత్నము" అనుకథానకము ఇంగ్లాండు వెళ్లి ఇంగ్లీషు కన్యను పరిణయమై వచ్చిన కోమటియువకుని గురించి వ్రాయబడినది. మగని తంటాలు పెట్టక, సౌశీల్యముగలిగి, ఆయాంగ్లయువతి పెనిమిటికిని అత్తవారికిని అనుకూలవతి యై తానును సుఖించినది. ఇట్లైనచో విదేశీయులతో సంబంధములు మంచివే యని చూపుటకు వ్రాయబడిన దీకథ. కాని మామూలుగా మనము విన్నసంగతులు

లను బట్టి విదేశీయులతో వివాహములు సుఖము నిచ్చుట లేదని తెలుసుకొనుచున్నాము. "వరశుల్కము" లోని కథను వేరే తెలియజేయుచున్నది "అనాథబాలిక" లో ఖిమనరీల దుండగములు వ్యక్తీకరింపబడుచున్నవి. ఇప్పటి కల్తీనాగరికతను నిరసించుచు పూర్వపురీతిని అతిథిసత్కారమును నడుపుచున్న ధుంఢీశ్వరు డను తపోనిధియొక్క మూర్తి "అతిథిదేవుడు" అనేకథలో వేలూరి శివరామశాస్త్రిగారిచే చిత్రించబడినది. వీరే "వావి" యనుకథానకములో వేశ్యలైనంతమాత్రమున మానవభావములు, పావిత్ర్యనములు, మానమర్యాదలు లేవని యనుకొనరాదని చూపుచున్నారు.

ఒక్క యువతీయువకుల ప్రేమయే కాక మాతృప్రేమ, పుత్రలాలస, స్నేహము మొదలగునవి కూడా కథానకవస్తువు లంగీకరించవచ్చును. "పిన్ని" యను రవీంద్రనాథటాగూరుగారు వ్రాసిన కథను తెలుగున చదివితిని. ప్రేమ లేని భార్యపై ప్రేమ పెట్టుకొని వ్యాధి తెచ్చుకొన్న యువకునికి నిజము తెలుపకుండ ఆతని పినతల్లి పరిచర్య చేసెను. భార్య తనయందు ప్రేమతోనే అన్ని పనులును చేయించుచున్నదని ఆతని నమ్మించి ధైర్యముతో నుంచెను. తుదకు ఆతడు మరణసమయమున నిజము గ్రహించి పినతల్లియొక్క ప్రేమకు అచ్చెరువంది, ఆమెను శ్లాఘించుచు, దేవుని స్తుతించుచు ప్రాణము వదలెను. "మాతృనిర్వేదము"న దిక్కులేని యొకస్త్రీ తనపిల్లవాడే సర్వస్వమని యెట్లో పెంచుచు, వాడు మృత్యువాతను బడినప్పుడు పడినదుఃఖము వ్యక్తము చేయబడినది.

ఈకథలలో సాంఘికమర్యాదలను మెచ్చుట గలుగునట్లుగా ప్రదర్శించునవి కొన్ని అత్యంతమనోహరముగానున్నవి. "అత్తవారిల్లు", "రాజేశ్వరి", "గూడుమారిన కొత్తరికం" అనుకథ లిందుకు ఉదాహరణములు. వీనిలో మొదటిది, మూడవది క్రొత్తగా కాపురమునకు వెళ్లుట, పుట్టింటికి వచ్చుట, మళ్లీ అత్తింటికి వెళ్లుట వీనిలోగల వేడుకలను, మనోభావముల మార్పులను జీవితమునకు సరిగా నుండునట్లు ప్రదర్శించుచున్నవి. రెండవది "రాజేశ్వరి" ముద్దులు మూటగట్టుచున్నది. బాల్యము నుంచియు ఒకపిల్లను తనపిల్లవానికి చేసుకొనవలెనని కుతూహలముగల యొకవృద్ధబ్రాహ్మణుడు ఆపిల్ల తలిదండ్రులతోను, ఆమెతోను "కోనేటితాత" యను నామముతో పరిచయము గలిగించుకొనును. తరువాత ఆపిల్లవివాహసమయమందు నిజము తెలియగానే వారందరికి గలిగిన ఆనందాశ్చర్యముల నూహింపవలసినదే.

కొన్ని హాస్యరసప్రధానము కథానకములు చదువరికి సహజానందమును గూర్చుటయేకాక సంఘములోను, వ్యక్తులలోను గల అనేక చిల్లరబుద్ధిహీనతలను బైటికి వచ్చుచున్నవి. ఇందువలన వివేకము గలిగి జనులువర్తించవచ్చును. నాటకములో "కామెడీ" (ప్రహసనము)వలె నవ్వుపుట్టించును. గోరంతలను కొండంతలను, కొండంతలను గోరంతలుగాను జేయుచు నవ్వుపుట్టించును. ఈకథలలోను గూడా రచన కట్టుదిట్టముగా నుండవలెను. హాస్యమునకైనను తుది, మొదలు ఉండవలెను. వెట్టిపేలాపనకైనను ఏదోయొక మూలముండును. "చింతలపూడి వారిసంభావన", "తమ్ముని పెండ్లికి తల్లీవెళ్లుట", "నాబావమరిది పెండ్లి" యనుకథలు మన పెండ్లిగడబిడలను, ప్రయాణపుగలభాలను, అల్లుండ్ర పెంకెతనములను, భోగముమేళముల నడతలను, వైదికబ్రాహ్మణుల మొరటుతనమును ప్రదర్శించుచున్నవి.

"నేనూ-జొన్నరొట్టె" యను హాస్యరసపుకథ, పెండ్లామును ధిక్కరించి తానువంటచేసుకొను మగడుపడేపాట్లను బహువినోదముగా ప్రదర్శించుచున్నది. ఇది మూడేండ్లక్రిందట భారతిలో చదివినట్లుజ్ఞాపకము. "మాటీలు" అను శ్రీ వాసుదేవరావుగారు వ్రాసిన కథ లలితముగానున్నది. హాస్యరసమును ప్రయోగించుచున్నది. వితంతువైన యువతి తనయక్కబావల రక్షణలో కాలము గడుపుచు కృతజ్ఞతతో తనయక్కకు మాటీలు చేయించుటకు ఏర్పాటుచేయుటలో అనుమానమునకు గురియైనది. కథ నిజము తెలిసినవెంటనే ఆనందజనకముగా పరిణమించెను. పురాణం సూర్యనారాయణ తీర్థులుగారి మోసగాండ్ర కథలు బహువినోదకరములును, పురాణపఠనమందు వివే

కజనకములును అయియున్నవి. "నావా-వీ" యను సెట్టి లక్ష్మీనరసింహముగారి కథ హాస్యరసోద్రేకమున జనించినది గాని యందులో సత్యమూలమున్నదని వారే తెలియజేయుచున్నారు. గౌతమి స్వీయచరిత్ర యను నొకకథ రాయసం వెంకటశివుడుగారిచే రచింపబడినది. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో నాలుగేండ్లక్రిందట చదివితిని. "గౌతమి" యొకకుక్క పేరు; కాని యిది హాస్యరసపుకథగాదు. జంతువులకును ఆత్మయుండును; భావములుండును. మననడతలు జంతువులబుద్ధి కెట్లు కనుపడునో యనుకుతూహలము మనస్సుకు అప్పుడప్పుడు కలుగవచ్చును. అట్లు తెలుసుకొను ప్రయత్నములలో నిదియొకటి. ఒక బ్రాహ్మణుల ఇంటి కుక్క వారిపిల్లతో కూడా పెరిగి ఆపిల్లకల్యాణమైనతరువాత అత్తింటికి వెళ్లుట,మళ్లీవచ్చుట అనుసందర్భములలో నెట్లు భ్రమపడి విచారపడినదియు తెలుపుకొనుట యిందలివస్తువు-ఇది యొక కథయా అని ఒకరు నన్నడిగిరని జ్ఞాపకము. ఇట్టివి యింగ్లీషు పార్టుస్టోరీజులో చాలా గలవు. "బ్రౌను" అను పేరుగల కుక్కయొక్క పౌరుషమునుగురించి యొకకథ గలదు. ఆకుక్క ప్రబంధనాయకునివలె వర్ణించబడినది. కొంచెము వినోదము కలిగించును. గనుక హాస్యరసముకలదనుకొనవచ్చును. కాని యిట్టికథలు భావపరిశోధనకు తోడ్పడు నుద్దేశము గలిగియున్నవి. చారిత్రకములు, అద్భుతజనకములు, సాంఘికాచారప్రతిబింబకములు, సంఘశుద్ధిబోధకములు, వినోదకరములు అను కథానకజాతములను పరిశీలించితిని. ఈ పై జాతులలో చేరక కొన్ని వ్యంగ్యార్థయుతములై పరగుచున్నది. అందుచే వీటిని వ్యంగ్యార్థయుతములు (Allegorical Stories) అనియే పేరిడుచున్నాను. "నాగరాజు" అను అడివిబాపిరాజుగారు వ్రాసినకథ యిట్టిది. అందులోని వ్యక్తులు గాయకుడు, పూర్వాచారపరాయణు డగుపండితుడు, నాగరాజు, సరస్వతి—వీరు దేవతలు గారు, మనుజులు గారు. కథకుని కలమున రూపొందిన కొన్ని ఆశయములు. గాయకుడు క్రొత్త రీతులను పాడెనట. "నాగరాజు"ను పిలిచి బాగోగులు దెల్పుమనెనట. పూర్వాచారపరాయణుడు తప్పు లెంచె జేయును.

నట. నాగరాజు గాయకుని శిక్షింప నుద్యమించెనట, సరస్వతి ప్రత్యక్షమై వానిని వారించి యీనూతన సంగీతరీతులనుగూడా తాను స్వీకరించితి ననెనట. స్పష్టముగా ఇందలి యర్థము క్రొత్తపాట ఫక్కీని సమర్థించుట. దేని యందము దానిది యని కథకుడు తెల్పుచున్నాడు. "కైక" యనుకథలో ఆ. భాస్కరమ్మగారు భరతుని తల్లి యొక్క నడవడికి క్రొత్తయర్థమును సూచించుచున్నారు. రామునికి గల దేశసంచారకాంక్షను గ్రహించి, ఆతనికోరిక ప్రకారము కాఠిన్యము వహించినదని కల్పించినారు. మంచివివేకము గలది, ఉత్సాహవంతురాలు అని ప్రదర్శించినారు. వాల్మీకములోని కైక మంధర యను దాసిచేతి కీలుబొమ్మగా ప్రదర్శింపబడినది. ఇది యిప్పటి కాలపు విమర్శకులు పురాణప్రసిద్ధులగు వ్యక్తులను నూతనరీతులను విమర్శింపబోవుట కొక నిదర్శనము. కర్ణుడే భారతనాయకుడనియు, రావణుడే రామాయణ నాయకుడనియు, కవి వీరి కన్యాయము జేసె ననియు కొందరభిప్రాయపడుచున్నారు. నిజము దేవు డెరుగును. కవి తాను విన్నకథను ప్రతిభచే జీవితసాక్షాత్కారము చేసుకొని ప్రబంధ మల్లును. కవికి పక్షపాత ముండదు. అతిశయోక్తు లుండును. అయినను కైకను ఈరీతిని ఒక నూతనవిద్యావతి సమర్థించుట నాకు బాగుగనే తోచుచున్నది. ఇది సంభాషణరూపముగా రచింపబడినను, కథానకముగా గణింపబడవలెనని తోచినది. వేలూరి శివరామశాస్త్రిగారు రచించిన "సాంపరోహ్యపాసకుడు", "కామకవి" అను కథానకములు గూడా ఈజాతిలోనివే. కవిత పాండిత్యమునకన్న ధారయొక్క ఆధిక్యమును తెలుపుచున్నది; కాని, రెండును సమముగా గలిసి యుండినచో కవిత వన్నెకెక్కును అనుమాట చదువరికి ఆకథ చదువుచున్నంతసేపు తోచదు. "లక్ష్మీరామేశ్వరము" అనుకథలో భార్యాభర్తల ప్రేమ వారిలో నెవరైన ఒకరు చనిపోయినచో నిలుచునా యనుప్రశ్నకు "నిలువదు. అది ముక్తికి అడ్డుదగులును" అనుజవాబు గలదు. ఇందలివస్తువు అతిస్వల్పము. ఇందలిసంభవములు చదువుచుండగనే మనస్సుకు సందియముల గలుగ

౫

ఇట్లు కథానకములు పలురీతుల నవలంబించి విజృంభించుచున్నవి. ఇవి నవలలవలె గాక చిన్న వగుట చేత పత్రికల అవలంబనము లేక నిలువజాలవు. కాని కొన్నికథానకముల జేర్చి "పూలదండ" మొదలగు పేర్లతోగూర్చి సంపుటములుగా ప్రచురించుచున్నారు. ఇందులో ఎక్కువ కళాప్రాశస్త్యము గలవానిని ఏర్చి స్కూలువిద్యార్థుల ఉపయోగము కొరకును, వాఙ్మయాసర్వముకొరకును ప్రచురించుట మంచిది. ఆంధ్రగ్రంథమాలాధికారు లిట్టి ఏర్పాటు గావించగలుగుదు రని నమ్మెదును.

సాహిత్యకళయందు చిత్రకళయందువలె సౌందర్యమే పరమావధి యని కళావిమర్శకు లందరు ఒప్పుకొననగును. కాని కళయును మానవోపయోగముకొరకే జనించును గనుక ఏదోయొకరీతిని, స్పష్టముగానో, వ్యంగ్యముగానో, నీతినో, ఔదార్యమునో, అభిరుచినో బోధించుచుండును. యోచించి కవిభావమును గ్రహించువారు గ్రహింతురు; లేనివారు శైలి, రచన, నైజప్రతిబింబనము వీటితో తృప్తినొందవచ్చును. కథానకములు ప్రస్తుతము మనదేశమునకు సంఘమునకు సాహిత్యకళానందము నిచ్చుటయేకాక వివేకదీపనము జేయుచు అభివృద్ధినొంది బాగుపడుపలుమార్గములను సూచించుచున్నవని నేనుతలంచుచున్నాను. రెండుఉదాహరణములతో ఈ వ్యాసమును ముగించుచున్నాను. "అనర్థం" అనే కథ హాస్యరసము గలిగియున్నది. అందులో మగడు స్నేహితునితో ఇంగ్లీషున మాట్లాడుచుండ పొంచుండి విని మాటలకు అర్థము తెలియక అపార్థములను కల్పించుకొన్నయువతి నిజము తెలిసి తనతప్పును ఒప్పుకొన్నది. పొంచుండి సంభాషణలను వినకూడదని తీర్మానించుకొన్నది. మగడు ఇంగ్లీషు తెలిసినచో నీకు అపార్థములు తోచకుండును గనుక ఇంగ్లీషు చదువుకొను మన్నాడు. చదువరికి ఇందులో ఏయభిప్రాయము రుచించునో! కథకుడు సగముసగము జ్ఞానమువలననో, పొంచుండి వినుటవలననో సంభవించిన యనర్థమునుమాత్రము సంఘమునకు నేర్పుతో చూపించినాడు.

"కృష్ణవేణి" యనుకథానకమొకటి భారతిలో చదివితిని. కథారచన బాగున్నది. భావపోషణము బాగున్నది. కాని యిందులో రెండులోపములు గనుపడుచున్నవి. కథావస్తువు కల్పితమా, లేక ప్రస్తుతపు ఆధునికజీవితము నుండి కొలదిమార్పుతో గ్రహించబడినదా యనుసందేహము కలిగించుట ఒకలోపము. కల్పననైజ జీవితప్రతిబింబముగానుండవలెనుగాని నైజజీవితకథన మేయగుచో వెగటు బుట్టించును; కళయొక్క ఆశయమే చెడిపోవును. ప్రకృతి ననుసరించి నైజజీవితమును ప్రతిబింబింపజేయు కల్పనజీవితమునందును, మనుజులభావముల యందును గలమంచిచెడ్డలను సుస్థిరంగ నూత యొసగుచు మనస్సుకు ఆనందము కలిగించును. దిక్కుమాలిన కృష్ణవేణి వెంకట్రావు అను విద్యార్థిచే మోసమున చెరుపబడి గుంటూరు చేరుటయు, సాంఘిక సంస్కారోద్యమములయందు కృషిచేయుచున్న దంపతులవల్ల రక్షింపబడి తుదకు తనజీవితమును అనాథబాలికల నుద్ధరించు విద్యాసంస్థకు నివేదించుటయు, తరువాత వెంకటరావు పత్రికలలో నిది చదువుకొని తనచెయిదమునకు పశ్చాత్తాపమునొంది కృష్ణవేణివలన తిరస్కరింపబడి తనజీవితమునుగూడ నొకదీనోద్ధారక విద్యాసంస్థకు నివేదించుటయు నిందలివస్తువు. కథాంతమున చదువరులు ఇందువలన నేర్చుకొనతగిన పదినీతులపట్టిక చేర్పబడినది. ఇది కళకు పెద్దలోపము. ఈపట్టిక లేకున్న కథ బాగుండెడిది. ఆ. భాస్కరమ్మగారు వ్రాసిన "శాంత" యను కథానకమునకు కాకినాడకాలేజీతో అంతవివరముగా సంబంధము కలిగింపకపోయినయెడల ఆకథ ఏలోపములేక యుండునని నాకు తోచుచున్నది. శాంత ఆకాలేజీలో నుంచి యఫ్.ఏ. పరీక్షలో రాజధానికి ఫస్టుగా ప్యాసయినది. అనగానే చదువరికి రిజిస్టర్లు వెదుకవలెనని బుద్ధిపుట్టును. అంతేకాక, కథముగింపు సాంఘికసంస్కారోద్యమమునకు అనుకూలమైనను మానవప్రకృతికి అనువుగాదు; కథలో వివరింపబడిన అద్భుతసంభవములకును అనురూపముగా లేదు. కేవలము సంస్కారపరమైన నీతిని బోధించుటకు వ్రాయబడినదని చదువరికి తోచును.

ఇట్లు గద్యకథానకములు అనేకవిధముల చదువరులకు వివేకానందములను గలుగజేయుచు సాహిత్యాభి

వృద్ధికి దోడ్పడుచున్నవని తలచెదను. నాశక్తికొలది విమర్శించి గ్రన్థకథానకముల రీతులను, ఆశయములను నిరూపించితిని. ఈవిమర్శన కథకులకును, చదువరులకును గూడ కొంత సహాయముగా నుండు ననుకొందును. నేను చదువనివి, యింకను జేర్చనవసరములేనివి ఎన్నియో కథానక రత్నము లుండును. ఆంధ్రసాహిత్యమున విమర్శభాగమును పెంపొందించు నుద్దేశముతో వ్రాయబడిన యీ వ్యాసమును సహృదయులగు చదువరులు సాదరముగ చదివి యిందలిలోపములను క్రొత్తవ్యాసములలో పూర్తిజేసి విమర్శకసాహిత్యాభివృద్ధికి తోడ్పడుదురుగాక.

---

## విస్మయము

పురిపండా అప్పలస్వామి గారు (కవితాసమితి)

నీయనంత వినిర్మాణ నియతిఁ గాంచి
విస్మయోన్మత్త మతి నౌచు విహ్వలతను
నన్ను నేనె మఱచిపోదు: నాహృదంత
రాళమం దెద్దియో నూత్న రాగగరిమ
దివ్యవిద్యుత్ప్రభాతీక్ష్ణ దీప్తితోడ
ప్రాఁకిపోవును తనువెల్ల, బాపురే! యి
దెట్టి యింద్రజాలమొ కాని యెఱుఁగలేను—

దినమె జీవించు నొకసూనమునను గూడఁ
గాంచ బరికింపఁ దెల్ప శక్యమ్ము కాని
జీవకళ వెట్టి మాధుర్య భావము నిడి
అనుపమానూన సౌందర్య మమరఁ జేసి
సౌరభచ్ఛవిఁ గూర్చి భాస్వరతఁ జేర్చి
నీవు చూపిన ఘననైపుణీవిభవము
హృదయము హరించు; త్వన్మృదుపదతలమున
దాసి నైపోవఁ గోర్కి యుద్భాసిత మగు.

*   *   *   *

ఎట్టివారికిఁ గూడ నూహింపరాని
ఈవిచిత్ర వినిర్మాణ మేవిధాన
నేరికడ నేర్వఁ గలిగితి వీవు నాథ!

'గోపిక.'

---

# ఆంధ్ర భాషావతారము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

అఖండస్ఫోటమై వెలయు శబ్ద బ్రహ్మము ధ్వని తాదాత్మ్యాధ్యాసచే నానా దేశము లందు, నానాజాతిజనులందు బహుభాషలుగా బహ్వర్థములతోఁ బరిస్ఫురించుచున్నది. ఆకసముననుండి మేఘ మతినిర్మలమయిన యంబువును వర్షింపఁగా నది యుప్పఁబఱ్ఱలందు, రేవడి చెలికలందు, మహౌషధీమయములగు నరణ్యములందు, రసధాతుభరితములగు పర్వతములందును బడి తత్తాదాత్మ్యముతో భిన్నరూపములను, భిన్న రుచులను బొందుచు జాలువాఱి కోళ్లై, సెలయేళ్లై, వంకలై, వాఁగులై, నదులై, మహానదులై, ప్రబలములైన భేదములఁ బడయుచున్నది. భాషల పుట్టుపూర్వోత్తరములు గూడ నిట్టివే.

సహ్యపర్వతమునఁ దొలుత జాలువాఱుటలో సమానలక్షణములు గలవై యున్నను కృష్ణా కావేరీ నదులు ఆంధ్ర దేశమునకును, అఱవ దేశమునకును సాగను సాగను విభిన్న లక్షణముల వెలసి వెలసి వేఱువేఱు తీరులను, పేరులను బడసినట్లుగా ఆంధ్రద్రవిడ కర్ణాట భాషలు తొలుత (ఆంధ్రద్రవిడ కర్ణాటు లని నేఁడు విభిన్నులుగా నున్న వారొకప్పుడొక్క చోట నొక్క సంఘముగా నుండి వెడలి వేఱు పడిన వారే యని నా నమ్మకము.) నొక్కటిగానే యుండి కాలక్రమమున భిన్నభిన్న దేశములఁ జెంది భిన్నభిన్నత్వములఁ బడసినవి. ఆంధ్రద్రవిడకర్ణాటభాషల నేటి స్వరూపము లెంత భిన్నములుగా నున్నను, పూర్వాపూర్వమును బరిశోధించుచుఁ బోవనుబోవను వాని భేదములును దక్కువతక్కువ లగుచుండుట తెలియనగును. ఇట్లు చూడఁగా రెండువేల యేండ్లకుఁ బూర్వ మీభాషల పృథగ్భావము విస్పష్ట లక్షణములతో వెలసియుండక పోవుట గోచరించును.

వర్షోదకము నేలపైఁబడినప్పుడు మట్టితోఁ గలసి వండువాఱి తేటదనము, తేలిక దనము లేక కలుషమై, యస్వారసమై యుండునట్లు భాషకూడఁ దొలుత శబ్దరూపోచ్చారణాదులందుఁ దేటదనము, తేలికదనము, హృద్యత లేక, క్లిష్టమై యుండును. కాలక్రమమున నా నీరు ఏళ్లలోఁ గోళ్లలోఁబడి నదులై ప్రవహించుచుఁ దేటవాఱి నడుమనడుమ గుంటలలోఁ గోనేళ్లలో నిలువరమంది ప్రసన్నమై రుచ్యమై యొప్పును. అట్లే భాషకూడఁ గాలక్రమమునసాధూచ్చారసంస్కారమంది, అందందు గ్రంథములందు నిబద్ధమై నిలువరమంది, స్వచ్ఛమై, యాస్వాద్యమై వెలయుచుండును. వ్యవహారప్రవాహమున భాష వడివడిగాఁ బరిణామ మందుచుండును గాని యది గ్రంథనిబంధము నందిన పిదపఁ గొంత కట్టుదిట్టమును బడసి నిలుకడఁ

జెందును. ఆవలఁ దత్పరిణామము పూర్వమంత త్వరగా సాగదు. ఆంధ్రద్రవిడ కర్ణాటభాషల యారంభ మొక్కటియేమైనను, సంస్కృత ప్రాకృతసంబంధ మల్పముగాఁ బడసి గ్రంథములందు నిబద్ధమై నిలువరమంది లక్షణపరిష్కారములను బడయుటలో నఱవము మొదటిదయినది. ఆనిలువరముమీఁదను, ఆలక్షణ పరిష్కారములమీఁదను నాఁగక ఇంకను గొంత యుచ్చారవ్యవహారమునఁ బరిణామమును బొందిపొంది సంస్కృత ప్రాకృతముల సాహాయ్యము నధికముగాఁ జెందిచెంది పెంపొంది గ్రంథములందు నిబద్ధమైనది కన్నడము. ఈ రెండింటి కింకను దర్వాత నీ రెండింటిలక్షణపరిష్కారములతో నిల్వక యింకను నుచ్చార సంస్కారములఁ బడసి, సవరనయి యందచందముల నంది సంస్కృతప్రాకృతముల సరససాహాయ్యమున నభ్యుచ్ఛ్రితముఁగాంచి గ్రంథములందు నిబద్ధమైనది తెలుఁగు. దక్షిణ హిందూదేశ సమష్టి దేశభాషావధూటి పసిప్రాయపుఁబలుకులఱవము; ఎలప్రాయపుఁబలుకులు కన్నడము; నెఱతనపుఁ బలుకులు తెలుఁగు. ద్రవిడ కన్నడములు తెలుఁగుకంటెఁ బెద్దవేకాని చిన్నదయినను తెలుఁగుభాషా కన్య కందచందములు, పలుకుపొంకములు హెచ్చు. అఱవపదములకును, దత్ ప్రత్యయములకును, కర్ణాట పదములకును, దత్ ప్రత్యయములకును నుచ్చారణమునఁ దోఁచు కార్కశ్యము నాఁటనాఁటఁ దొలఁగి తొలఁగి సవరనయిన యుచ్చారణమును బడసిపడసి తెలుఁగు పదములును, ప్రత్యయములును వెలసినవి. ఉచ్చారణసుందరములయిన తెలుఁగుపలుకుల పూర్వ పూర్వ పరిణామ క్రమదశలలో ద్రవిడకర్ణాటపదరూపములు రెండునుగాని, రెండింట నేదే నొక్కటిగాని పొందియుండుట పెక్కుచోట్లఁ గానఁగును.

పై యుభయభాషా సంబంధము లేనివి యచ్చపుఁ దెలుఁగుఁబలుకులు, ప్రత్యయములు గొన్నియున్నవి. ఇవియేకాక, సంస్కృత ప్రాకృతోభయ భాషోచ్చారణ క్రమపరిణామములఁ బొందినవియు, సంస్కృత మాత్రోచ్చారణ క్రమపరిణామములఁ బొందినవియు, ప్రాకృత మాత్రోచ్చారణ క్రమపరిణామములఁ బొందినవియుఁగూడఁ బెక్కుపలుకులు, ప్రత్యయములు తెలుఁగునఁగలవు. ఇట్టివెల్లను గూడి సుకుమారోచ్చార సంస్కారములను బడసిపడసి వానికంటె వైలక్షణ్యమును బొంది మన తెలుఁగు వెలుఁగొందుచున్నది. మీఁదఁ బేర్కొన్న విషయమున కుదాహరణముగా నొక్క పదమును బరిశోధించి చూపుదును.

'నూనె'—ఈపదము 'నూవు' 'నెయి' అను పదములసమాసము. 'నూవులనెయి'=అనఁగా 'నూవులసారము' అని అర్థము. ఇందు 'నూవు' అనుపదము ద్రవిడ కర్ణాట భాషల సంబంధమేమాత్రమును లేని యచ్చపుఁ దెలుఁగుఁబలుకు. నూవులకుఅఱవమునను, గన్నడమునను, 'ఎళ్'అనిపేరు. 'నెయ్' అనుపదము ద్రవిడమునను, గర్ణాటకమునను గూడఁ గలదు. కాని

యది కర్ణాటకమున 'నే' 'నేయ్' ఇత్యాదిరూపములఁ గూడఁ బొందియున్నది. తెలుఁగున ఉచ్చారణ పరిణామములలో నసుందరమయిన హలంతత్వము దొలఁగిపోయి 'నెయి', 'నెయ్యి', 'నేయి' 'నేయు' 'నై', 'నే' అనురూపములు వెలసినవి. 'నెయ్'అనురూపమునకంటె నీ రూపము లుచ్చారణ సుందరములు. తెలుఁగుభాష హలంతత్వము నేవగించునుగాన 'నెయ్' ని అజంతముగాఁ జేసికొనుటలో 'ఇ' ని జేర్చుకొనఁగా 'నెయి' అయ్యెను. 'నెయ్' పదము అజాదిపదములు పరమయినపుడు 'నెయది' అనురూపము ఉచ్చారణ సహముగాదు గాన, 'నన్ + అది = నన్నది', 'అన్ + అతఁడు =అన్నతఁడు' అనురూపములందినట్లు, 'నెయ్యది' ఇత్యాదిరూపముల నంది, అట్టి సంధినుండి పదచ్ఛేదముఁ బడయుటలో 'నెయ్యి' అను రూపమును బొందెను. ఏకలఘుపూర్వక హల్మాత్రముగల శబ్దములు ఉచ్చారణపుష్టిగలిగి యుండవు గావున హలుచ్చారణ బలము పూర్వహ్రస్వమునకుఁ దన్ని దానిని గురువునుగాఁ జేసి యంతలోఁ దాను గరఁగిపోవఁగా 'నే' అనురూపమేర్పడెను. ఆకరఁగిన హల్మాత్రయకారము అజాదిపదములు పరమగునపుడు వాని తోఁగలసి యకారముగాఁ నిలువఁగల్గుచున్నది గాన దానిపై నజంతత్వపుఁ జికిలి జరగఁగా కొంత దుర్బలమయిన యుచ్చారముగల యకారముతో 'నేయు', 'నేయి' అను రూపములేర్పడెను. హల్మాత్రమగు యకారము దుర్బలమగుటచేత నే 'నెయ్యి' అనురూప మేర్పడినట్లు 'నేయ్యి' అనురూపము పుట్టఁజాలకపోయెను. 'నెయ్'లోని 'య్' 'ఐ' గా మాఱఁగా 'నై' అను రూపము పుట్టెను. పై రూపములందు 'నేయి', 'నై' రూపము లర్వాచీనములు. ఇట్లు 'నేయ్' శబ్దముపై నేర్పడిన బహుసుందర పరిణామములెల్ల మన తెలుఁగునఁ గలవు. 'చెయ్, వెయ్' మొదలగు శబ్దములు గూడ నిట్టి పరిణామములఁ బొందెను. శబ్దముల ప్రాచీనరూపములకుఁ దాతలనాఁటివన్న గౌరవముండఁగా నర్వాచీనరూపములకు హృద్యసంస్కారముల ననేకములఁబడసి వెలసినవన్న వేఱొక గౌరవవిశేషము గలదు. ఆంధ్రుల కాచారవ్యవహార స్వరూప స్వభావాహారదేశలక్షణాది బహుకారణములచేఁ గల్గిన భిన్నభిన్నలక్షణముల కనుగుణముగా నేర్పడిన శబ్దరూపములను మీఁదఁ జూపితిని. 'నెయ్'శబ్దము తెలుఁగులో నిన్నిహృద్యరూపముల నందినది గాని యిది 'నూవు' శబ్దముతో సమాసమందినప్పుడు కొన్ని ప్రాకృతభాషాసంబంధ సంభవములైన వికారములకుఁ గూడఁ బాల్పడెను. 'నూవు'శబ్దము తొలుత 'నూవ్' అనురూపము తెలుఁగు హలంతత్వము నేవగించు కొనును గాన యది 'నూవు' అనురూపమును బడసెను: ఆహల్మాత్రము కరఁగిపోవుటచే 'నూ' అను రూప మేర్పడెను కరఁగిపోయిన యాహల్మాత్రమయిన 'వ్ 'అచ్చుపరమయి నప్పుడు మరలఁ గానవచ్చును. 'నూ + నెయ్' పదములు రెండును సమసింపగా, 'నెయ్'పద మెన్నిరూపములతో నున్నదో, అన్నిరూపములతో నుఆసమాస

ముండుట న్యాయ్యము—అనఁగా 'నూనెయి', 'నూనెయ్యి', 'నూనే', 'నూనేయి' 'నూనేయు', 'నూనై'అనురూపములు గూడనుండవలెననుట. కాని యట్టిరూపములు తెలుఁగున పుట్టలేదు. దానికిఁ గారణమేమనఁగా: 'నూనె'యనుసమాసపదము, 'నెయ్'పదము మీఁదఁ బేర్కొన్న పరిణామములనెల్లఁ బడయుటకుఁబూర్వమేపుట్టి రూఢమైనది. అప్పుడు'నూ + నెయ్'అనియుండి తెలుఁగునకుఁ బ్రియముకాని కడపటి హల్మాత్రము లోపింపఁగా సమాసదశలో నాపదము గురులఘు ఘటితమగుటచే 'నెయ్' 'నే' రూపమును బడయనక్కఱలేకపోఁగా'నూనె'అయ్యెను. కరఁగిపోయిన కడపటిహల్మాత్రపు 'య్'అచ్చుపరమయినపుడు మరలఁగానవచ్చును గాన 'నూనె' + 'అది' కలసినపుడు 'నూనెయది' అయ్యెను. ఇట్టి యకారమునే తెలుఁగువైయాకరణులు 'యడాగమ' మని పేర్కొనిరి. ఇట్టు 'యడాగమ'మని పేర్కొనఁబడుచున్న స్థలములనేకము లట్టి పదాంత యకారహల్మాత్రము ద్రవించిపోఁగా నచ్చు పరమయినపుడు మరలఁ గానవచ్చుటను బట్టి యేర్పడినవే. అట్టి దేశిశబ్దముల రూపసాజాత్యమునుబట్టి యకారపుచ్ఛము లేనివయినను తెలుఁగునఁ జేరిన సంస్కృతప్రాకృత శబ్దములకును నట్టి యడాగమము పుట్టెను: 'రమ + అది=రమ యది' ఇత్యాదులు.

పైనిఁ బేర్కొన్నవిధమున నూనెపదము తెలుఁగు సంప్రదాయపరిణామమునుబట్టి పుట్టియుండఁగా దానిమీఁద 'నూనియ' అను రూపము ప్రాకృతభాషా సంప్రదాయమును బట్టి పుట్టెను. 'కన్నియ' 'వన్నియ' 'దీవియ' మొదలయినశబ్దములు కన్యకా, వర్ణక, దీపికా శబ్దాదులనుండి ప్రాకృత సంప్రదాయమును బట్టి పుట్టి తెలుఁగునఁ జేరినవి. వీనికి 'కన్నె' 'వన్నె' 'దీవె' రూపములును గలవు. వీనిపోలికనుబట్టి 'నూనె' శబ్దమునకుఁగూడ 'నూనియ' అనురూపము వచ్చెను. 'నూనె' నూనియ శబ్దములు పుట్టినతర్వాత వాని సాదృశ్యముచే 'తేన్' అని యఱవమున రూపముగల 'మధు' వాచకశబ్దము తెలుఁగున 'తేనె' 'తేనియ' అను రూపములఁ జెందెను.

ద్రవిడ కర్ణాట ప్రాకృతభాషల పలుకుబడి నూనె శబ్దముమీఁద నెంతచెల్లెనో పై పరిశీలనమువలనఁ దెలియవచ్చెను. కాని యిం దు సంస్కృతపు పలుకుబడికూడ హెచ్చుగాఁ గలదు. ఎట్లనఁగా 'నెయ్' అను పదము దేశి పదమని కొందఱన్నను 'స్నేహ' మను సంస్కృతపదమునకు వికృతియని కొందఱందురు.

ద్రవిడభాషలో 'నెయ్' పదము 'సారము' అని యర్థముగలది. క్షీరములనుండి యేర్పడు సార మగు ఘృతమునకే తర్వాత నదిరూఢ మయినది. 'నూనె'యను సమాసమునఁ జేరుటచే నెయ్, 'స్నేహ'వాచకమైనది కాని యది స్నేహాశబ్ద వికృతికాక దేశిపదమే యగునని కొందఱు.

మఱియు,నూనె యనునర్థముననే సంస్కృతమున 'తైల'పదము గలదు. తైలపదము శబ్ద

నిష్పత్తినిబట్టి నూవుల సారమునకే వాచకమయినను స్నేహసామాన్యమునకును చెల్లుచున్నది. తిలతైల, ఏరండతైల, భల్లాతకతైలాదులు చూడఁదగును. నూనెపదము గూడ నిట్లే తిలస్నేహవాచకమే యయినను, స్నేహసామాన్యమునకును జెల్లుచున్నది.

నూవులనూనె, కొబ్బరినూనె, వలిసెలనూనె, ఇత్యాదులు చూడఁదగును. అఱవమునఁగూడ నూనెకు 'ఎళ్ నెయ్' 'ఎణ్ణెయ్' అని పేరు. అదికూడ స్నేహసామాన్యవాచకమే. 'తేఙ్గాయెణ్ణెయ్' ఇత్యాదులు చూడఁదగును.

నూనెపదము తైలపదమువలె తిలస్నేహవాచకముగానే పుట్టుట, అది స్నేహసామాన్యమునకు వాచకమగుట సంస్కృతభాషా వ్యవహారసంప్రదాయ సంస్కారమును దెలుపుచున్నది.

---

## ప్రతిబింబము

మద్దిపట్ల వేంకటరమణయ్యగారు

వయిందు తా విన్నయందంబుఁ గ్రిందుపఱుచు - పద్మినీరూప విభ్రమ వైభవంబు
మానికపు నిల్వుటద్దంబులోనఁ దోఁప - మ్రానుపడి నిల్చె అల్లయుద్దీను మ్రోల.

చిత్రకారుని తూలిక సృష్టి యనుచు - నమ్మఁ డయ్యె నా ప్రతిఫలనమ్ముఁ ద్రొత్త
సంచలతదీయతుంగవక్షంబు నరసి - చాల నాశ్చర్య మందెను సాహి బవల.

తా నిలుచునెలకట్టు రేఁజేని రాలు - పద్మరాగంబులో యనుభ్రాంతిఁ గొల్పు
మంజుమంజీర విభ్రాజమానమైన - తద్వరారోహామృదుపదద్వంద్వ మాది-

కనకపట్టాంశుకావగుంఠనములోన - గునిసియాడు నీలంపు ముంగురులదాఁక
సుదతి సౌందర్యమాధురి జుఱ్ఱుకొనుచు - నంతిపురి వీడ లేకాతఁ డాఁకవడియె.

భూరిరోషవిషాదధిక్కారకలనఁ - గలుషితం బయ్యు మానినీతిలకముఖము
కాంచుటకె యిచ్చ గొల్పె నక్కాముకునకు - భృంగసంగతవికచారవిందమట్లు.

పడఁతి కుచ్చెళ్లు జీరాడునడుగుదోయిఁ - గలికివాల్గంటిచూపు లగ్నంబు గాఁగ
వంచినమొగంబు ముక్కున్నవ్రేళ్ళఁ బైకి నెత్తి - ముద్దుగొన నాసపడియె నా మొఱకుతురక.

పిడికిట నడంగు చిన్ని నెన్నడుము నొడిసి - గురుకుచను గౌఁగిటికిఁ దార్పఁ గోర్కి-పడియె
"కటకటా! యిది కలలోని కనక" మనుచు-ధైర్యమును నిస్పృహాగ్ని కింధనముఁ జేసె

ఆణిముత్యాలచాలును గ్రేణిసేయు - పల్వరుస దోఁప నించుక పడఁతి నగినఁ
గాయువెన్నెలలోఁ దోఁగఁ గాంక్షసేసె - నతఁడు దేహతాపంబు చల్లాఱునట్లు—

మగువతొగరువా తెరనుండి నిగుడునుడులఁ-దియ్యఁదన మెంత నెగడునో తెలియఁ గోరె
గనులతో సమానమ్ముగాఁ గర్ణములకుఁ - బ్రమదమును బంచ నెంచి యాపాదుసాహి.

ప్రొద్దొకవిధంబు కైసేసి ముద్దుగుమ్మ-యొద్ద నొయ్యార మొలుకంగ నొయ్యనొయ్య
నడచునొప్పిద మీక్షింపఁ బడయనైతి - నక్షిసాఫల్యముగ నంచు నతఁడు కుందె—

ధనికు పేటికలోని కాంచనశలాక - దోఁచుకోఁ దలంచెడు గజదొంగయట్లు
తహతహను జెందె ముసలిమాన్ ధరణిభర్త - ముకురమందలి బంగారుబొమ్మఁ జూచి.

తపనునకుఁ గానిపద్మినీదర్శనంబు - పడయుటను మెచ్చుకొనె నిజప్రాభవంబు;
నీడయే కాని నిజమును జూడలేమిఁ - దనయదృష్టంబు నిందించుకొనె నతండు—

రాజపుత్ర తేజో బల రక్షితమ్ము - నసమసౌందర్యరాశిఁ గన్నారఁ గంటి
మంటి నని సంతసిలె వారి మానుషాన - కాత్మవిక్రాంతి కుంఠిత మౌట కడలె—

భావనాబలమ్మునఁ బ్రతిద్వారమందుఁ - బద్మినీరూపమే కాంచి భ్రాంతిఁ జెందె
మహితచిత్తూరు దుర్గంపుఁ బ్రహరివరుస - మెల్లగా దాఁటి వెళ్లెడుమ్లేచ్ఛవిరహి—

వినుకలిని కల్లువలవంత విడువ నేఁగి - మగిడెఁ గనుకలిఁ రెట్టిగా నగరునుండి
జానుపున బాడి కడుగుకో సరసుఁ జొచ్చి-తొడవఱకు నూబిలో దిగఁబడినయట్లు—

---

# శ్రీమద్భగవద్గీతాభాష్యార్థప్రబోధిని

హరి నాగభూషణము గారు, బి.ఎ.,

౨ అ. ౧౬ శ్లో.—

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః;
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శి
[భిః.

శ్లోకార్థము:—

అసత్తునకు భావము గలుగదు; సత్తునకు అభావము గలుగదు. ఈ రెంటియొక్క నిర్ణయము తత్త్వదర్శులచేత దృష్ట మగుచున్నదియ.

సామాన్యవివరణము:—

ఓయర్జునా! ఈముందు చెప్పఁబోవు కారణములనుబట్టికూడ శీతోష్ణాదిద్వంద్వములు నీవు సహింపఁదగును. నీవు సాంఖ్యాది దర్శనములును, తర్కవ్యాకరణాది శాస్త్రంబులును, ఆగమంబులును జదివి పూర్ణంబుగ శాస్త్రార్థముల నెఱుంగువాఁడవు. దృశ్య మగు ప్రపంచము అసత్ అను శబ్దముచేతను, 'దృక్' అగునాత్మ 'సత్' అనుశబ్దముచేతను ఎఱుంగఁబడు శాస్త్రసంప్రదాయము నీవెఱుంగనిది కాదు. శబ్దమునకును దదర్థమునకును అవినాభావసంబంధ ముండుననికూడ నీకుఁ దెలిసినవిషయమే. సత్ అనినను, భావ మనినను ఉండునది యనియును, అసత్ అనినను, అభావ మనినను ఉండనిది యనియును శబ్దశాస్త్రవేత్త వగు నీకు స్ఫురింపక మానదు. ప్రపంచ మనిన శబ్దాదివిషయజాత మనియును, శీతోష్ణాదులు ప్రపంచకార్యకోటిలోనివే యనియును నీవు గమనించియే యుందువు. ఈ పైవిషయములు మనమం దవధరించి శీతోష్ణాదు లెట్టివియో చూడుము. ప్రపంచము అసచ్ఛబ్దవాచ్య మగుటచే శీతోష్ణంబులును, వానికిఁ గారణంబులగు జలాగ్న్యాది సర్వప్రపంచమును అవిద్యమానము, అనఁగా అభావ మగుచున్నది. వానికి భావము గలుగనేరదు. శబ్దప్రమాణముచేతను, తదనుగృహీత తర్కముచేతను దరిచి చూచిన యెడల శీతోష్ణాదులును, సర్వప్రపంచమును[1] భావములు గానేరవు. భావవికారములుమాత్రమే యగుచున్నవి. వికార మనఁగా వ్యభిచరించునది—అనఁగా మార్పుఁ జెందునది, నాశము బొందునది, లేక నియతరూపము లేనిది యనియు, భావ మనిన వ్యభిచరింపనిది, అనఁగా మార్పుఁ జెంపనిది, నాశముఁ బొందనిది, లేక నియతరూపము గలది యనియు నెఱుంగుము ఇట్లని వేదాంతములు నిర్ణయించి యున్నవి. అట్టివేదాంతములు నావాక్కులగుటంజేసి తిరిగి ఆసిద్ధాంతమునే వక్కాణించుచున్నాఁడను. శీతోష్ణాది సర్వప్రపంచకార్యములును ఇట్టిభావవికారములే. వికారము లగుటంజేసి అసచ్ఛబ్దవాచ్యము లగుచున్నవి. ఏమార్పును లేక నిత్యమును,[2] సత్యమును[3], అయి, భాసించునది ఆత్మ యొక్కటియే. అట్టి దగుటంజేసి ఆత్మయే భావము. అదియే సచ్ఛబ్దవాచ్యము. ఇటులనుటచే ఆత్మయే దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్య మగు భావమనియు, ప్రపంచకార్యము లన్నియు దేశకాలవస్తుపరిచ్ఛిన్నము లగు అభావము లనియు, భావ మగు ఆత్మయొక్క వికారములనియుఁ దెలిసికొని, తితిక్ష వహించి ఏకంబగునాత్మను అనుసంధానముచేసి మోక్షముపొందుము.

1. తార్కికులు అభావము కూడ పదార్థమని చెప్పుచు, పదార్థములు ఏడు అని యొక తెగవారు నిర్ణయించి యున్నారు. అభావము పదార్థము అని యొప్పికొనకుండుటయే కాక తక్కిన యాఱుకూడ భావములు కానేరవని భగవంతుఁడు వేదాంతసిద్ధాంతము నీశ్లోకమునఁ బల్కుచున్నాఁడు.

2. నిత్యము అనఁగా నాశరహితము. మనము చూచుచుండఁగనే షడ్భావవికారములను బొందనిది.

3. సత్యమనఁగాఁ త్రికాలాఽబాధ్యము. జాగ్రత్స్వప్నసుషుప్తులందును, భూతభవిష్యద్వర్తమానములందును, సృష్టికిఁబూర్వమును, సృష్టికాలమందును, సృష్టికిఅనంతరమందును ఏమార్పును లేక ఏకమై, అద్వితీయమై యుండునది.

5 8- 3 ౧౮3

ఈవివేచనమును నేను గ్రహింపఁజేయునట్టి వారెవరైన గలరు... ఈనివేనమును నేను గ్రక మజేయెవరైన గుఱు తించినవా రున్నారా యనిన, బ్రహ్మవేత్తలుమాత్రము ఈసదసత్తుల యాథార్థ్యమును గుర్తించి, నేను నుడివిన చొప్పున 'సదేవ సత్, అసదేవ అసత్' అని దర్శించి తరించియున్న వారు. అట్టి బ్రహ్మవేత్తల దృష్టి నాశ్రయించి, అనఁగా వారి యనుభవమును బురస్కరించికొని వారివలె శీతోష్ణంబుల సహించి తరించుమ ని తాత్పర్యము. విశేషవివరణము:—

తితిక్ష యున్నఁగాని మోక్షార్హత లేదని వెనుకటిశ్లోకమున నిశ్చయింపఁబడి, అట్టితితిక్ష సంపాదింపవలసినదిగా నాశ్లోకమందును, పూర్వోత్తర ప్రకరణంబులందును, గ్రంథమందంతటను బ్రతిపాదింపఁబడినది. ముముక్షువునకు అత్యవసరమగునట్టిశీతోష్ణసహనము ఎట్టివివేకము దృఢమైనసాధ్యమో యీశ్లోకము వివరించుచున్నది. తితిక్షయు, వివేకమును సాధనచతుష్టయము లోనివి యగుటంజేసియు, నీశాస్త్రము ఉపనిషద్భూత మగుటంజేసియు బ్రహ్మజిజ్ఞాసకు వలయు సాధనచతుష్టయంబును భగవంతుఁ డీప్రకరణంబున ముముక్షువగు నర్జుననకును, వానిద్వారా ప్రపంచమునకును బోధించుచున్నాఁడని కూడఁ దెలిసికోనగును.

'సదేవ సో మ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ;' 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవసత్యం;' 'ఏవం స దేవసత్యం—'

ఇత్యాది అభేదప్రతిపాదక శ్రుత్యర్థముల భగవంతుఁ డీశ్లోకమున ననువదించుచు, అద్వైతము సిద్ధాంతమునేయుచున్నాఁ డని తెలిసికో నగును.

"సదితి అస్తితామాత్రం వస్తు సూక్ష్మం నిర్విశేషం సర్వగతమేకం నిరంజనం నిరవయవం విజ్ఞానం యదవగమ్యతే సర్వవేదాంతేభ్యః.........ఇదం జగత్ నామరూపక్రియావత్ వికృతం ఉపలభ్యతే యత్, తత్ సదేవ ఆసీత్."

(సత్తు అనగా అస్తితామాత్రమై, సూక్ష్మమును, నిర్విశేషమును, సర్వగతమును, ఏకమును, నిరంజనమును, నిరవయవమును, విజ్ఞానమును అని సర్వవేదాంతములచేతను నిశ్చయింపఁబడిన వస్తు వనియును,...... ఇద మితి పరిదృశ్యమానమై, నామరూపక్రియావంతమై వికృతముగాఁ దెలిసికొనఁబడుచున్నది జగత్తు అనియు, అట్టి జగత్తు సృష్టికిఁ బూర్వము సత్తే అయియుండెను అనియును) అనెడు ఛాందోగ్యభాష్యార్థ మీశ్లోకమున నిమిడియున్నది. ఎట్టులో తెరుననగును:—

లోకములోనిజను లందఱు రెండువస్తువుల ను ఆదిఇంద్రియములచేఁ బ్రత్యక్షమున గుఱుతించుచున్నారు: ఒకటి సర్వమును గ్రహించు చేతనవస్తువు; రెం నది గ్రహింపఁబడు విషయజాతము. గ్రహించు చేతనవస్తువు ఆత్మ యనియు, గ్రహింపఁబడు విషయజాతము ప్రపంచమనియు ఆస్తికులు వాడుచున్నారు. ఈరెంటిని ఈశ్లోకమున సత్ అసత్ అనుశబ్దములచేఁ బ్రతిపాదింపఁబడినవి. ఎందుకనినఁ, బ్రకరణ మదియే కనుక సదసత్తులు రెండును నిత్యములు, సత్యములునా? లేక యొకటే నిత్యమును, సత్యమునా? యని విచారించి అనునాత్మయే నిత్యమును, సత్యమును అనియును, అసత్తు అను ప్రపంచము అనిత్యమును, అసత్యమును అనియును, ఇటులనుటచే అనిత్యమును, అసత్యమును అను ప్రపంచము నిత్యమును, సత్యమును అనునాత్మయందు అధ్యస్తమై వ్యవహారకాలమందుమాత్రము సత్యముగఁ దోఁచుచున్నదనియును, దానంజేసి ఆత్మ సత్యమనియుఁ బ్రపంచము మిథ్యయనియు, ఆత్మజ్ఞానము గలిగినవెంటనే ప్రపంచమిథ్యాత్వము దనంతఁ దాన బయలుపడి ప్రపంచము లయమైపోవు ననియు అట్టిజ్ఞాననిష్ఠయే ముక్తి యనియు, అట్టి ఆత్మజ్ఞాననిష్ఠులే తత్త్వదర్శులు, బ్రహ్మవేత్తలు, జీవన్ముక్తులు మున్నగు నామములచే వ్యవహరింపఁబడుదురనియుఁ, గాన నట్టియాత్మజ్ఞానముఁ బొందుటయే మానవజన్మపరమావధియనియు శ్రుత్యుక్తరీతిని భగవంతుఁడు నిశ్చయించి, అందునిమిత్తము మిథ్యాప్రపంచకార్యములగు శీతోష్ణంబుల సహింపవలెననియు, నిరంతరము సన్మాత్రమగు బ్రహ్మను అనుసంధానము చేయవలెనని యీశ్లోకమున భగవంతుఁడు బోధించుచున్నాఁడని యెఱుంగనగును. ఈపైని భగవత్సిద్ధాంతముగ వివరించినది యెట్టు లుపపన్నమో తర్కింతుముగాక!

ఆత్మవస్తువు వర్తమానదేహముకంటె పూర్వమందును, పరమందునుగూడ నుండుననియుఁ, బూర్వకర్మానుసారము జన్మాంతరములు పొందుచుండుననియు ఆస్తికులు నమ్ముచున్నారు. వర్తమానదేహముకంటె పూర్వపరంబుల నాత్మవస్తు వనునది లేదని చెప్పు నాస్తికులైనను దేహముకంటె విలక్షణమగు నొక గ్రాహకశక్తి జీవించుకాలమందు వ్యక్తమగుచున్న దనియు, నాశక్తి దేహమువలె క్షణక్షణము మారునది కాదనియు, అట్టి శక్తి అనిత్యమయ్యు దేహమునుబట్టి యాలోచించిన నిత్యమనియు ఒప్పుకొనక వీలులేదు.[1] ఆస్తికుల ఆత్మ యనునది, నాస్తికులు గ్రాహకశక్తి యని చెప్పవలసినది, గ్రాహ్యమగు దేహాదివిషయజాతమునుబట్టి నిత్యమగుటచే ఉండునది యనియును, అనఁగా మారునది కాదనియు, అట్టి గ్రాహకవస్తువునుబట్టి గ్రాహ్యవస్తుజాలము ఉండనిది యనియును, అనఁగా మారుచుండునది యనియును నిశ్చయింపఁదగునుగదా! 'సత్తు' అనినను, 'భావము' అనినను 'అసభువి, భూసత్తాయాం' అనెడు వ్యుత్పత్తినిబట్టి 'ఉండునది' యని యర్థము. 'అసత్తు' అనిన 'ఉండనిది' అని అర్థము. ఈ వివేచనముంబట్టి భగవంతుఁడు సచ్ఛబ్దముచే గ్రాహకమగు ఆత్మవస్తువును (లేక గ్రాహకశక్తిని), అసచ్ఛబ్దముచే గ్రాహ్యమగు దేహాదివిషయజాతంబును, అనఁగా సర్వప్రపంచమును, నిర్దేశించుచు వానియాథార్థ్యమును, బరస్పరసంబంధమును నివేదించుచు ఒకవైపున నాస్తికమతములను ఖండించి మఱియొకవైపున ఆస్తికవాదమును బలపఱిచి, ఆత్మైకత్వమును సిద్ధాంతము సేయుచున్నాఁడని యెఱుంగఁదగును. ఆస్తికమత మెటులు సిద్ధాంతపఱుపఁబడెనో ముందు విమర్శింపఁబడును. తరువాత నాస్తికమతము లెటులు నిరస్తములో నిర్దేశింపఁబడును.

అసత్తు అగు ప్రపంచమును, తత్కార్యములగు దేహాదులు, శీతోష్ణములు, సుఖదుఃఖములును సర్వజంతువులకును అనుభూతము లగుచుండ, మాత్రాస్పర్శములు, ఆగమాపాయులు గనుక అనిత్యములనియు, దానంజేసి శీతోష్ణసహనము వలయు ననియుఁ జెప్పుట యుక్తమా యనెడు ప్రశ్నను శంకించి, శ్రీకృష్ణపరమాత్మ యీశ్లోకార్థము బోధింప నందీయర్థమంతయు నిముడుచున్నది.

శీతోష్ణాదిసర్వప్రపంచము ఆగమాపాయములు గలదని నిర్ణయించినందునఁ ద్రికాలములందును మారకుండ నుండునది కాదని గోచరించుచున్నది. త్రికాలములందును మారకుండ నుండనికారణమున భావ మనఁబడు పారమార్థికసత్త దానికిం గలుగనేరదనియు, వ్యవహారకాలమందు గోచరించు వ్యావహారికసత్తమాత్రము గలదనియుఁ, బారమార్థికసత్త లేకుంటచే నయ్యది 'అసత్తు' అనియు, ఇటు లనుటచే ఆత్మవస్తువు ఆగమాపాయములు లేక త్రికాలములందును మారకుండ ఉండునది యగుటచే దానికి భావ మనఁబడు పారమార్థికసత్త గలదనియు, నందువలన నయ్యది 'సత్తు' అనియుఁ దాత్పర్యము.

"మాత్రాస్పర్శాస్తు కౌంతేయ" అనుశ్లోకమునందు ప్రపంచమునకుఁ బారమార్థికసత్త లేదనియు; "దేహినో ఽస్మిన్ యథా దేహే" అను శ్లోకమునందు ఆత్మకుఁ బారమార్థికసత్త గలదనియు నుపన్యసింపఁబడినది.

అసచ్ఛబ్దమునకుఁ 'గేవలశూన్యము' అనెడు నర్థము స్ఫురించుచున్నది. అందువలన అసచ్ఛబ్దవాచ్యమగు ప్రపంచము 'అసలే లేనిది' (కేవలశూన్యము) అని చెప్పఁగూడదా యనిన నవఁజెల్లదు. శశశృంగము, ఆకాశపుష్పము, వంధ్యాపుత్రుఁడు మున్నగునవి కేవలశూన్య

1. నాస్తికులు పలువురు క్షణికజ్ఞానవాదు లనెడుమాట నే నెఱుంగక యీమాట సెప్పుటలేదు. కాని ఆవాదమున కంతర్భూతముగ నుండిన సంస్కారనిత్యత్వమును బురస్కరించికొని యిదమిత్థమని చెప్పుచున్నాఁడను. ఏకవస్తుజ్ఞానంబునఁ గలుగు సంస్కారములు నిత్యములనియే చెప్పవలెను. లేనిచో స్మృతివలన తద్వస్తుజ్ఞానము తిరిగి సిద్ధింపనేరదు. అహ మిత్యాది ఆత్మవిషయకప్రతీతులును, ఘటపటాది ఆత్మేతరవిషయకప్రతీతులును నిత్యములగు సంస్కారపరంపరలచేతనే కలుగుచున్నవి. అట్టిపరంపరలే నిత్యములు గానిచో నట్టిప్రతీతులచేఁ గలుగు ప్రమితులు ఏకవస్తుభాసకములుగానేరవు. కాన సంస్కారపరంపరలు దేహమువలె క్షణక్షణము మారునవి కానేరవు, ఈసంస్కారపరంపరలే గ్రాహకశక్తియని యిచ్చట నిర్దేశింపఁబడినది.

మునకు ఉదాహరణములు. శశశృంగాదికము కేవలశబ్దములుమాత్రమే కాని శబ్దముచేఁగాని, ఇంద్రియములచేఁగాని గ్రహింపఁబడు నర్థములు (విషయములు లేక వస్తువులు) గావు. అందుచే నియ్యవి 'తుచ్ఛములు' అని శాస్త్రమునందు వ్యవహరింపఁబడుచున్నవి ప్రపంచమన్ననో శబ్దప్రతీయమానమును, ఇంద్రియగ్రాహ్యమును అగువస్తువు కాన ప్రపంచము శశవిషాణమువలె అసలే శూన్యము కాదు.1

అటులయినచో, దానిస్వభావ మెట్టిదో విచారింతుముగాక! ఘటకుడ్యాదికార్యములు తత్కారణమగు మృత్తుయొక్క వికారములు, లేక సంస్థానములు, లేక అవస్థానములు అయినచో నప్పన అసత్ప్రపంచకార్యజాతము తత్కారణమగు సత్తుయొక్క వికార మనికాని, సంస్థాన మనికాని, అవస్థాన మనికాని చెప్పవలెను. ఘటకుడ్యాది కార్యములు మారునవి అయినందునను, తత్కారణమగు మృత్తు అటువలె మారక తత్కార్యములందు అనుగత మైనందునను ఘటకుడ్యాదులు 'వికారము' లని 'వాచారంభణ' శ్రుతి పేర్కొనుచున్నది. దీనినిబట్టి మారునది వికారమనియు, నొకకారణముయొక్క కార్యమనియు, అటు మారక కార్యములందు అనుస్యూత మగునది కారణమనియు నెఱుంగఁదగును. ఇటు లనుటచే నేమిఫలము? అనిన:—సర్వకార్యములును సూక్ష్మపరిశీలనము గావించినచోఁ దత్తత్కారణములకంటె భిన్నసత్తాకములు గానేరవని తెలిసికోనగును. కాన కారణము కార్యముద్వారా మూఁడుకాలములందును ఉండునది యనియుఁ, గార్యము కారణముద్వారా కాలపరిచ్ఛేదము గలదిగ నుండునదనియుఁ దేలుచున్నది. ఈ సూత్రమునుబట్టి ఘటపటాదికార్యప్రపంచము తత్తత్కారణములగు పృథివ్యాదులకంటె భిన్నసత్తాకములు గావనియు, అట్టికారణములఁబట్టి ఏకకాలావచ్ఛిన్నములనియు ధ్రువపడుచున్నది.

ఇట్టిచోఁ బృథివ్యాదికారణములు త్రికాల బాధ్యములనియు, ఘటపటాది ప్రపంచము తద్వికా మనియుఁ జెప్పనగునా యనిన, నటులు గానేరదు. పృ వ్యాదులు జగత్కారణ మయినట్లు అచ్చటచ్చట శ్రు ప్రమాణసిద్ధంబును, సాంఖ్యాది శాస్త్రసమ్మతంబు అయియుండియు, చేతన పదార్థములు కాకపో చేతను, ప్రపంచమునందు చేతనవస్తువుకూడ అభ్యు మగుచున్నందునను, "తస్మా ద్వేతస్మా దాత్మన ఆకా స్సంభూతః" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మవస్తువే జగత్కా రణ మైనట్లు నిర్వచించుటచేతను అట్టి ప్రపంచకారణ చేతనముకూడ కావలసివచ్చును. అటులయినచో, చేత చేతనములు రెండువస్తువులు జగత్కారణములు కా వచ్చుటయు, రెండును నిత్యములును, సత్యములును గా లసివచ్చుటయు సంభవించునుగదా! యనెడు ప్రశ్న డమచున్నది. రెండువస్తువులు నిత్యములును, సత్య లును అగునవి యుండుటయు, అట్టివస్తువులు జగత్కా రణ మగుటయు ననిన అట్టిరెండువస్తువులు మేళ ప్రపంచమును బుట్టించుచున్నవని తాత్పర్యము కావలె మేళగించువస్తువులు సావయవంబులుగా నుండవలె సావయవము లగుటఁజేసి పరిచ్ఛిన్నములును, అనిత్య లును గావలసివచ్చును కాన రెండువస్తువులు నిత్యము సత్యములును అగునవి యుండఁజాలవు. కాన సత్య వస్తువు ఒక్కటియే యుండితీరవలెను. అట్టివస్తువే జ త్కారణమై యుండవలెను. అది చేతనముకూడ యుండవలెను. అటులగుచోఁ బ్రపంచకారణముగఁ దో అచేతనవస్తువుగతి యేమనిన, అదియే అసత్ప్రపంచ మగునదనియు, చేతనవస్తువికారమనియు భగవంతుఁ డీ కమున 'సదేవసోమ్యేద మగ్ర ఆసీత్'; 'సత్యం జ్ఞా మనంతం బ్రహ్మ' ఇత్యాదిశ్రుతి ప్రమాణముల ననుస రించి సిద్ధాంతీకరించుచున్నాఁడు.

చేతనమగు సద్వస్తువు అచేతనమగు అసత్ప్రపంచ కారణ మెట్లు గానగును అనిన, రజ్జువు సర్పము

1. కలియుగవేదాంతులు శాస్త్రమర్యాదలు తెలియకయుఁ దెలిసియు అపార్థములు కల్పించి, లోకము వంచించి అర్థకామములఁ జూరగొను తలంపుతోడను, గొందఱు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనువాక్యమున అపార్థమును గల్పించి, 'ప్రపంచము అసలే లేనిది, ఆత్మమే సత్యము' అని శిష్యులకు బోధించుచున్నా వీరు మోసగాండ్రు; ఆత్మహత్యాపరాయణులు; శిష్యవిత్తాపహారకులు. ఇట్టివారి బారినుండి విముఖు లగుదురు

గారణమగు చందమున నగుచున్నదని తెలుసుకోవలెను. రజ్జువు సర్పబుద్ధికి అధిష్ఠానమగువిధమున సద్వస్తువు అసద్బుద్ధికిని, అసత్కార్యమగు ప్రపంచభావనమునకును అధిష్ఠానమగుచున్న దని తాత్పర్యము.

అయితే, రజ్జుసర్పములు రెండును పరిచ్ఛిన్నములు, అందుచే సావయవములు అనుటంజేసి సర్పముయొక్క అవయవములు రజ్జువుయొక్క అవయవములందు అధ్యాస్యమానములు కావచ్చును. అందుచే సర్పబుద్ధికి రజ్జువు అధిష్ఠానసత్తాకము గావచ్చును. కాని, "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" ఇత్యాది శ్రుతులు సద్వస్తువు అపరిచ్ఛిన్నమును, నిరవయవమును అని నిర్వచించుటచే పరిచ్ఛిన్నమును, సావయవమును అగు అసత్ప్రపంచమునకు అధిష్ఠానసత్తాక మెటులు గానగునని ప్రశ్నింపఁదగును. ఈవిషయమందు శ్రీశంకర భగవత్పాదులువారు ఛాందోగ్య భాష్యమునందుఁ జెప్పినసమాధానము వినుఁడు:—

"రజ్జ్వాద్యవయవేభ్యః సర్పాదిసంస్థానవత్ బుద్ధిపరికల్పితేభ్యః సదవయవేభ్యః వికారసంస్థానోపపత్తేః నిరవయవస్య సతః వికారసంస్థాన ముపపద్యతే."

ఈ వాక్యమునకు ఆనందగిరి యిటు లర్థము వ్రాసినాఁడు—

"యథాఖలు అజ్ఞాతేభ్యః రజ్జ్వాద్యవయవేభ్యః సర్పాదిసంస్థాన మనిర్వాచ్య మిష్టం తథా శ్రుతిజనిత జగత్కారణత్వ బుద్ధ్యనుపపత్త్యా కల్పితేభ్యః సతః మాయోపాధికస్య అవయవేభ్యః వికారసంస్థాన ముపపద్యతే; తస్మాత్ అయం ద్వైతప్రపంచః బ్రహ్మవివర్త స్సంభవతి."

ఈవాక్యముల తాత్పర్యము గమనింపుఁడు :—

రజ్జ్వాదులఅవయవములు బుద్ధికి గోచరింపకపోవుటవలన రజ్జ్వాదులయందు సర్పాదివికారములు దోఁచుచున్నవి. అట్లు తోఁచినంతపర్యంతము సర్పాదివికారములు యథార్థములని, యెంచఁబడుటయు, రజ్జ్వాద్యవయవములలోనే కొన్ని భాసించినను వెంటనే సర్పాదులు అయథార్థములని తెలిసికొనఁబడుటయు సంభవించుచున్నది. దృశ్యమగు జగత్తునకును,దృక్కగునాత్మనును(సత్తునకు)యథార్థతః కార్యకారణభావము అనుపపన్నము అయినను,కులాలమృద్ఘటాదులయెడల లోకము గ్రహించు కార్యకారణభావమునుబట్టి శ్రుతులుగూడ "యతో వా ఇమాని భూతాని జాయంతే"ఇత్యాదులయందు సద్వాచ్యుఁడగు నీశ్వరునికిని, అసద్వాచ్యమగు జగత్తునకును కార్యకారణభావము కల్పించి, అట్టి యీశ్వరుఁడు "మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరం" ఇత్యాది శ్రుతులవలన మాయోపాధికుఁడని నిర్ణయించుచున్నవి. మాయోపాధికుఁడగు ఈశ్వరుఁడు పరమార్థతః నిరవయవుఁడయ్యు, సావయవుఁడుగ నెంచఁబడుచున్నాఁడు. అట్టి యీశ్వరుఁడు భాసింపకపోవుటయే ప్రపంచభాసమునకుఁ గారణము. కాన ప్రంచము సద్వాచ్యుఁ డగునట్టి యీశ్వరుని వికారసంస్థాన మనియు, నీశ్వరుఁడు భాసించుటతోడన ప్రపంచబుద్ధి లయించుననియు, దానంజేసి దృశ్యమగు ద్వైతప్రపంచము బ్రహ్మవివర్తమనియుఁ దాత్పర్యము.

ఈపైని వివరించిన సమాధానమునుబట్టి మాయోపాధికుఁడగు నీశ్వరునియందు జగత్తు కల్పింపఁబడినది అని తేలినది. అయితే అట్టియీశ్వరుఁడు సోపాధికుఁడనుటచే నిరవయవంబగు శుద్ధసన్మాత్రము గానేరఁడు గదా! నిర్విశేషసన్మాత్రమే పరమార్థసత్యస్వరూపమని "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు ఘోషించుచున్నవి. అటులయినయెడల సోపాధికుఁడగు నీశ్వరుఁడుగూడ అసత్కోటిలోఁ బడవలెను. అట్టిచో నట్టియీశ్వరునకుఁ దిరిగి నిరయవయంబగు శుద్ధసన్మాత్రమే అధిష్ఠానము గావలసివచ్చును. కాన నిరవయవంబగు సత్తు సావయవంబగు అసత్తున కెటు లధిష్ఠానసత్తాకము గాఁగలదు అనెడు పూర్వపక్షము మిగిలియేయున్నది అని చెప్పఁగిట్టదు. ఇట్టిపూర్వపక్షము రాకుండుఁగాక యనెడుతలంపుతోడనే ఆనందగిరి "సతః మాయోపాధికస్య" అని తనవ్యాఖ్యానములో వ్రాసియున్నాఁడు. ఆపదములయొక్కభావ మేమో గమనించిన ఈపూర్వపక్షము నిరస్తము గాఁగలదు. జగత్కర్తగ శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడిన ఈశ్వరుఁడు సోపాధికుఁడయ్యు అసత్ప్రపంచము

వలెఁ గల్పితుఁడని చెప్పఁగిట్టదు. అసత్ప్రపంచమునందు నామరూపక్రియాకలాపమే తోఁచుచుండును. దాని యందు అనుస్యూతమగు అధిష్ఠానేశ్వరసత్త భాసించుట లేదు. అట్టియీశ్వరసత్త భాసించుటతోడనె ప్రపంచ బుద్ధి లయించునని దృష్టాంతరీతిచే నిర్వచింపఁబడినది. అట్టియీశ్వరసత్త భాసించి, ప్రపంచబుద్ధి లయించుటకే కర్మోపాసనా జ్ఞానంబులు శాస్త్రములు విధించుచు న్నవి. ఈశ్వరుఁడు భాసించుట యనిన తత్సాధనలచే సోపాధికసమాధినిష్ఠుఁ డగుట యని యర్థము. అట్టిసమా ధియందు భాసించునది సోపాధికమగు నీశ్వరసత్త యని చెప్పవలసియున్నను, యథార్థతః భాసించునది సన్మా త్రమగు శుద్ధచిద్వస్తువే కాని మఱియొకటి కానేరదు. విద్యుత్ప్రకాశము (electric light) కాచపాత్రోప హితమయ్యు తత్ప్రకాశమే భాసించునట్లుండినను, కాచపాత్రకును, అట్టిప్రకాశమునకును ఎట్టివిధేయవిధా యకసంబంధము లేనిచొప్పునను, అట్టిసోపాధికసమాధి యందు శుద్ధచిన్మాత్రమే ప్రకాశించును గాని ఉపాధి యగుమాయకును, తదుపహితంబగు నీశ్వరసత్తకును ఎట్టి విధేయవిధాయకాది సంబంధ ముండనేరదు. గాజుబుడ్డి విద్యుత్ప్రకాశమును లక్షించుటకు మొదట సాధనమయ్యు తత్ప్రకాశము గోచరించినవెంటనే. వ్యావృత్తమైనట్లుండ మున, సమాధినిష్ఠఁ బ్రాపించుటకు ఈశ్వరుని మాయో పాధి ఉపాసనాదులయందు సాధనమయ్యు సమాధినిష్ఠ లభించినవెంటనే లయించి, సన్మాత్రమగు శుద్ధచిత్స్వరూ పమే భాసించును. మాయోపాధి యనిన ఈశ్వరునికి నామరూపక్రియలు కల్పించుట యని తాత్పర్యము. 'నేను' అనెడు నామరూపక్రియాస్పదుఁడగు జీవుఁడు గాఢసుషుప్తిఁ బొందినవెంటనే ద్వైతప్రపంచమునుండి నివృత్తుఁడై, స్వస్వరూపానందరసావేశుఁడౌ తెఱఁగున సోపాధిక సమాధినిష్ఠయందుఁ గూడ సన్మాత్రమగు శుద్ధచిదానందసాక్షాత్కృతిఁ బొంది త్రిపుటిభావనాని వృత్తుఁడై భాసింపఁగలఁడు. అట్టిసోపాధికసమాధియందుఁ బరిపక్వస్థితిఁ బొందినకొలందిని నిరుపాధికసమాధినిష్ఠుఁ డగుచు, వాసనాత్రయరహితుఁడై, గుణాతీతుఁడు, స్థిత ప్రజ్ఞుఁడు మన్నగునామములచే వ్యవహరింపఁబడు బ్రహ్మ విద్వరిష్ఠుఁ డయ్యెడిని. ఈపైని చెప్పిన సారాంశమునకుఁ బ్రమాణవాక్యములుగ నీక్రింది మహావాక్యములు ఉదాహ రింతును: వానియర్థముఁ దిలకింతురుగాక!_

1. "ప్రతిబోధవిదితం మతం అమృతత్వం హి విందతే."
—కేనోపనిషత్

2. "ద్విరూపం హి బ్రహ్మ అవగమ్యతే,-నామరూప వికారభేదోపాధి విశిష్టం, తద్విపరీతం చ సర్వో పాధివివర్జితమ్........, తత్ర అవిద్యావస్థాయాం బ్రహ్మణ ఉపాస్య ఉపాసకాదిలక్షణః సర్వో వ్యవ హారః..." — శ్రీశంకరసూత్రభాష్యమ్.

3. "శాస్త్రాచార్యోపదేశశమదమాదిసంస్కృతం మనః ఆత్మదర్శనే కరణమ్." —శ్రీశంకరగీతాభాష్యమ్.

4. "అవిద్యయాత్రయైవ విద్యయా ఽనుపరక్తచిత్ స్ఫురణం బ్రహ్మానుభవః."
—శ్రీఆనందగిరి కేనోపనిషద్భాష్య వ్యాఖ్యానమ్.

5. "ఓమిత్యాత్మానం యుంజీత." —శ్రుతి.

6. "సమాధినిష్ఠః యదా ఓమిత్యుచ్చార్య ఆత్మానమను సంధత్తే తదా స్థూల మకార ముకారే సూక్ష్మే తం చ కార్యకారణాతీతే ప్రత్యగాత్మని ఉపసంహృత్య తన్నిష్ఠో భవతి."
—పైశ్రుతికి శ్రీఆనందగిరి వ్యాఖ్యానము.

7. "నిరుద్ధే చేతసి పురా సవికల్పసమాధినా,
నిర్వికల్పసమాధిస్తు భవేదత్ర త్రిభూమికః."
—శ్రీమధుసూదనసరస్వతీ గీతావ్యాఖ్యానమ్.

ఈశ్వరుఁడు మాయోపాధికుఁ డన, మాయకును, ఈశ్వరునకును ఎట్టిసంబంధమో తెలిసికొనుఁడు. ఘటా కాశ మనునప్పుడు ఘటమునకును, తదుపహితమగు నా కాశమునకును, ప్రతిబింబితసూర్యుఁ డనునప్పుడు ఉద కాద్యుపాధులకును, తదుపహితుఁడగు సూర్యునకును ఎట్టిసంబంధమో, అంతియసంబంధము మాయకును, మాయో పహితుఁడగు నీశ్వరునకును గలదని చెప్పవలెను. ఘటా కాశస్థలమందు ఘటమును, ప్రతిబింబితసూర్యస్థలమందు ఉదకాదులును తదుపహితులగు ఆకాశసూర్యులను ఉప

లక్షింపఁజేయునవి, లేక వ్యక్తీకరించునవి యనిమాత్రమే చెప్పవలెను గాని తన్నియామకములుగాని, తద్బంధకములుగాని కానేరవు. ఘటాద్యుపాధులు లేక ఆకాశమును, ఉదకాద్యుపాధులు లేక సూర్యుఁడును సర్వత్ర గోచరించుచున్నను, సామాన్య బుద్ధులకు ఆయుపాధులద్వారా వ్యక్తము లగునట్లు అన్యథా కాఁజాలవు. అటువలెనే ఈశ్వరునిమాయోపాధి ఈశ్వరచైతన్యలక్షితమే కాని తన్నియామకము గాని, తద్బంధకముగాని; తదావరకము గాని కానేరదు. అట్టియుపాధి లేకయే శుద్ధబ్రహ్మ పండితులకు సర్వానుగతముగ సర్వదా భాసించుచు, తన్నిష్ఠు లగుచున్నను సామాన్య బుద్ధులకు గోచరింపమి తదుపలబ్ధికై ఉపాసనాదికము గల్పింపఁబడినది. అట్టియుపాసనాదులు పరిపక్వస్థితిని బొందినట్టుగానే సన్మాత్రమగు ఉపాస్యస్వరూపము భాసించును.

జీవుఁడు అవిద్యోపాధి యనియు, ఈశ్వరుఁడు మాయోపాధియనియు వ్యవహరింపఁబడుచున్నారు.

మాయకును, శుద్ధచిత్తునకును గల సంబంధము అవిద్యకును జీవునకును గలసంబంధమువంటిది కాదు. అవిద్యాజీవులకుఁగల సంబంధము సులభముగ విడఁదీయరానిది. 1. మాయేశ్వరులకుఁ గలసంబంధ మట్టిదికాదు ఈవివేచనముచే ఈశ్వరశబ్దముచే మాయోపాధికమగు శుద్ధచిన్మాత్రము బాహ్యార్థతః గ్రహింపఁబడియు యథార్థతః తచ్ఛబ్దశ్రవణముచేత శుద్ధచిన్మాత్రమే స్ఫురింపఁగలదు. కాన ఈ పైవివరణమునుబట్టి ఈశ్వరునకు నిరవయవంబగు శుద్ధచిత్తు ఎటులధిష్ఠానము కాఁగలదు అనెడుశంక పుట్టుటకు వీలులేదు.

ప్రపంచము బ్రహ్మవివర్తమని వెనుకఁ జెప్పఁబడినది. ఈవాక్యముయొక్క అర్థమేమో విచారింపఁదగును. బ్రహ్మవివర్తమనిన బ్రహ్మపరిణామము కాదని యర్థము. పరిణామవివర్తములకు లక్షణములు రెండు మూఁడు రీతులుగ నిర్వచింపఁబడినవి. ఒకరీతి చెప్పెదను: "వస్తునః తత్సమసత్తాకః అన్యథాభావః పరిణామః, తదసమసత్తాకో వివర్త ఇతి." ఉపాదానకారణమగు వస్తువే పూర్వరూపమునుబట్టి మఱియొకరూపముతోడ నుండుట పరిణామము. ఉ. ఉపాదానమగుమృత్తు మృద్రూపముకంటె మఱియొకరూపమగు ఘటాకారమును బొందుట పరిణామము. అన్యథాభావమనిన అన్యథాభవనము అనితాత్పర్యము. ఉపాదానకారణమగు వస్తుసత్తకంటె విషమసత్త భాసించెడు కారణవస్తువుయొక్క అన్యథాభావము వివర్తము. ఉ. ఉపాదానమగు శుక్తిసత్తకంటె విషమసత్త యగు రజతత్వము భాసించెడు శుక్తియొక్క రజతత్వరూప అవస్థావిశేషము వివర్తము. ఇటులనుటచేఁ ప్రపంచసత్త బ్రహ్మసత్తకంటె విషమసత్త యగుచున్నదనియు, అటులయ్యు అట్టి ప్రపంచభావము బ్రహ్మయొక్క అవస్థానవిశేషమనియు, శుక్తి భాసించుటతోడన రజతబుద్ధి పోవునటులు బ్రహ్మజ్ఞానము గలిగినవెంటనే ప్రపంచబుద్ధి లయమైపోవు ననియు నెంచఁదగును. ప్రపంచము బ్రహ్మవివర్తమని చెప్పుటకు బదులు బ్రహ్మపరిణామమని చెప్పినయెడల మృత్పరిణామమగు ఘటమునందు మృద్ఘటరూపంబులు రెండును దోఁచుచుండంబునఁ ప్రపంచమునందు బ్రహ్మప్రపంచరూపములు రెండును జ్ఞానకాలంబునఁ దోఁచవలసియుండును. ఇది యనుపపన్నము. ఇటులే మఱికొన్ని చిక్కులుకూడఁ దటస్థించును. కానఁ ప్రపంచము బ్రహ్మవివర్త మనియే సిద్ధాంతము.

మృదాది ఉపాదాన కారణములుకూడ ఆకాశాది కారణములచేఁ గలిగిన కార్యము లయినందున నవికూడ అసత్తు లనఁబడు వికారములే కావలసివచ్చుచున్నందునను, కారణము లేకయే కార్యము పుట్టనేరదు అనెడు నియమ ముండుటంజేసియు, కార్యకారణవిభాగవిహీనమగువస్తువు (ఒకకారణముయొక్క కార్యముగానివస్తువు)

1 అవిద్యోపాధివలన జీవుఁడు స్వస్వరూపజ్ఞానము లేనివాఁడై మిథ్యాజ్ఞానము గలవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. మాయోపాధి గలయట్లు లెంచఁబడు ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడని శ్రుతులు చెప్పుచున్నవి. కాన మాయేశ్వరులకుఁ గలసంబంధము అవిద్యాజీవులకుఁ గలసంబంధమువంటిది కాదని తాత్పర్యము.

ఎన్నటను గోచరింపఁజాలదని చెప్పనొప్పును. ఇటు లగు టచేఁ బ్రపంచమునకు ఉపాదానకారణమని చెప్పఁబడు బ్రహ్మముకూడ మఱియొకకారణముయొక్క కార్యమే కావలసివచ్చును గాన బ్రహ్మముకూడ వికారమనఁబడు అసత్తే కావలెను గాని త్రికాలాబాధ్య మనియెడు సద్వస్తువు కానేరదు. ఇటు లగుటచే సర్వము అభావమే (అసత్తే) కావలెను అనెడుపూర్వపక్షము సమాధానముఁ గోరుచున్నది. ఇందుకు సమాధానము వినుఁడు:—

త్రికాలాబాధ్యమగు సద్వస్తువు గలదని విచారించిన సంతతముఁ బ్రతీయమాన మగుచున్నది. వ్యాపకవస్తువు వ్యాప్యముకంటె అపరిచ్ఛిన్నమని, అందుచే నిత్యమని గ్రహింపఁదగునుగదా! ఆకాశము సర్వవ్యాపకము. అందుచే నయ్యది సమస్తప్రపంచకార్యములకంటె అపరిచ్ఛిన్నమును నిత్యమును అగుచున్నది. అందువలననే ఆకాశము సర్వోపాదానముగా శ్రుతులు చెప్పుచుంటయు, విచారించిన ననుభవగోచర మగుటయు సంభవించుచున్నది. అట్టిఆకాశము ఆత్మనుండి కలిగినదని "తస్మాద్వేతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" అనెడుశ్రుతి చెప్పుటచే ఆత్మవస్తువు ఆకాశాదిసమస్తకార్యములందు అనుగతమగు వ్యాపకవస్తువనియు, నట్టివస్తువు "సత్యం, జ్ఞానం, అనంతం" అగు ననియు, అనఁగాఁ ద్రికాలాబాధ్యము, జ్ఞానస్వరూపము, అపరిచ్ఛిన్నము అనియు శ్రుత్యుక్తరీతిని దేలుచున్నది. సరియకాని, యీఆత్మవస్తు విట్టికార్యకారణవిభాగవిహీన మగునది అయ్యుఁ ద్రికాలాబాధ్య మగునది యని శ్రుతి చెప్పు-యేనా, అనుభవమునకుఁగూడ గోచరించునా యనిన, గోచరించును అని చెప్పవలెను. అనుభవము రెండువిధములు: శాస్త్రతః సిద్ధించు తర్కప్రమాణాదులచేఁ గలుగునది మొదటిది; సాక్షాదనుభవముచే సిద్ధించునది రెండవది. రెండవది యగు సాక్షాదనుభవము గలిగినపిదప శాస్త్రప్రమాణ విమర్శనము అనవసరమని మనబుద్ధికే గోచరింపఁగలదు. భగవంతుఁడును 'తదా గంతాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ' అని యీయర్థమునే యీశాస్త్రమందు ముందు చెప్పనున్నాఁడు. సాక్షాదనుభవము లేని మనబోంట్లు శాస్త్రతః సిద్ధించు తర్కప్రమాణాదులచేతనే యిదమిత్థమని తెలుసుకొనఁదగియున్నది. ఏట్టులో చూడుఁడు:—

ఒకటి యిదియూ అదియూ యని నిశ్చయించుటకు బుద్ధికంటె బలవత్తరమగు ప్రమాణము లేదు. బుద్ధియనగ నిశ్చయించు వృత్తిజ్ఞానము. ఇట్టిబుద్ధివృత్తికి నొకవస్తువు సర్వానుగతముగ నెల్లప్పుడును స్ఫురించుచున్నది (ఇది ఘటము; ఇది పటము; ఇది హస్తి; వీఁడు మనుష్యుఁడు) అనెడు సమస్తకార్యప్రతీతులందు ఇదంశబ్దార్థబుద్ధి వ్యభిచరించుట లేదు. ఘటపటాదిబుద్ధిమాత్రము వ్యభిచరించుచున్నది. అనఁగా ఇదంశబ్దార్థము ఘటపటాది సమస్తప్రపంచకార్యములందు అనుగతమగుచున్నదని తాత్పర్యము.

అట్టి ఇదంశబ్దము లేకయే వ్యవహారమందు ఘటపటాదివస్తుజ్ఞానము గలుగనేరదుగదా! కాన ఇదంశబ్ద ప్రతీయమానమగు వస్తువు సర్వత్ర అనువృత్తము అగుటచే అయ్యది దేశతః, కాలతః, వస్తుతః పరిచ్ఛేదరహితం బగుచున్నదని తెలుసుకొనఁదగియున్నది. అట్టి పరిచ్ఛేదరాహిత్యమే సద్భావము కాన ఇదంశబ్దప్రతీయమాన మగునది యొకటి సత్తు ఉన్నది; సర్వము అసత్తు కానేరదు అని తెలియనగునుగదా! ఇఁక ఘటపటాదులు పైన నుదాహరించినచొప్పున ప్రతీతులనుబట్టి వ్యభిచరించునవి యైనందున, అనఁగా దేశకాలవస్తుపరిచ్ఛిన్నములైనందున, అసత్పదార్థములు గావలసి వచ్చుచున్నవి. మఱియు నట్టిప్రతీతులందు ఇదంశబ్దవాచ్య మగునది ఘటపటాదులతో నభిన్నముగ నెంచఁబడుచున్నందున సత్పదార్థమందు ఘటపటాదిప్రపంచము గల్పింపఁబడుచున్నదని ధ్రువపడుచున్నది. అటు లగుటచేతనే ప్రపంచమనిన బ్రహ్మవివర్త మని పైన వివేచింపఁబడినది.

మఱియు నట్టి ఇదంశబ్దార్థము పైతర్కముచేతనే సద్వస్తువని చెప్పుటయే కాక మనబుద్ధిప్రతీతులను బట్టి కూడ సద్వస్తువుగ స్ఫురించుచున్నది చూడుఁడు:— సన్ ఘటః (ఉండునదియగుఘటము); సన్ పటః (ఉండునది యగు పటము); సన్ హస్తీ (ఉండునది యగు హస్తి); సన్ మనుష్యః (ఉండువాఁడగు మనుష్యుఁడు)

# *ప్రాచీన భారతీయ చిత్రములు



౧. పులి.



౨. ఒంటె.

* ఇందు మొదటి నాలుగుచిత్రములను మృగములయు, మనుష్యులయు చిత్రములతో రచియింపబడినవి. తరువాతి యైదును రాజంనామాలోని చిత్రముల నమూనాలు. అన్నిచిత్రములు 'ఇండియన్ ఆర్టు అండ్ ఇండస్ట్రి జర్నలు' నుండి కైకొనబడినవి.



౪. దుప్పి.



౩. గుఱ్ఱపు రౌతు.

అనెడుప్రతీతులు సమానాధికరణమందు మనకుఁ గలుగుచున్నవి. ఈ ప్రతీతులందు సద్విషయికబుద్ధి (అనఁగా ఉనికిని గుర్తించిన బుద్ధి) యొకటియు, ఘటపటాదివిషయికబుద్ధి మతియొకటియు రెండుబుద్ధులు గోచరించుచున్నవి. అట్టిప్రతీతులందు సద్బుద్ధి వ్యభిచరింపనిదియు, ఘటపటాదిబుద్ధి వ్యభిచరించునదియు నగుచున్నది. సద్బుద్ధికి విషయము 'సత్తు' అని వాక్యములందే కనఁబడుచున్నది. కాన ఘటపటాదులు 'అసత్తులు' అని ధ్వనించుచున్నవి. సమానాధికరణ మేమనిన, విశేషణవిశేష్యములు రెండును సమానాశ్రయములుగ, లేక అభేదసంబంధములుగ నుండుట అని తాత్పర్యము. ఉ. నీలోత్పలము- నీలాభిన్నమగు ఉత్పలమని యీసమాసపదమునకు శాబ్దబోధ. అటువలెనే 'సన్ ఘటః' అనుచో సదభిన్నమగు ఘటము అని శాబ్దబోధ చేసికోవలెను. అటువలెనే సమస్తప్రపంచకార్యములును సదభిన్నమగునవి యని తేలుచున్నవి. కాన సద్వస్తువునందుఁ గల్పింపఁబడుచున్నవి.

ఈపైవివేచనమునుబట్టి కేవలసద్వస్తు వొకటి కార్యకారణవిభాగవిహీన మగునది మనబుద్ధులకు మనము గుఱుతింపకుండియుఁ దగులుచున్నదనియు, అందువలననే అట్టిసచ్ఛబ్దసమానాధికరణవాక్యప్రయోగములు మనము వాడుచున్నామనియు సిద్ధాంతము నేయఁదగియున్నది.

అయితే, నీలోత్పలము అనుచో నీలపదము గుణవాచి, ఉత్పలపదము గుణివాచి అగుటచేతను, గుణము గుణికంటె భిన్నమగు వస్తు వగుటచేతను, నీలోత్పలపదము ఏకవస్తునిర్దేశక మైనప్పటికిని, దానిలోనిపదములు భిన్నవస్తుగ్రాహకము లగుచున్నవి. అటువలెనే 'సన్ ఘటః, సన్ పటః' అనుపట్టులఁ గాంచనగు సమానాధికరణవృత్తిత్వము భిన్నవస్తుగ్రాహకము కాఁగూడదా యని శంక వొడమనగును గాని సరి కాదు. "సో ఽయం రామః" (ఈ కనుపించెడువాఁడు ఆరాముఁడే) అనెడు ప్రతీతియందుఁ గాంచనగుసామానాధికరణ్యముభిన్నవస్తుగ్రాహకముకాక ఏకవస్తునిష్ఠంబగుటంబట్టి ముఖ్యార్థమందు సామానాధికరణ్యము(?)నకు నిదియేయుదాహరణము. నీలోత్పలము అనుప్రతీతియందుఁ గాంచనగు సామానాధికరణ్యము గుణిగుణుల కగునది. ఇయ్యది గౌణమని (అముఖ్యమని) యొప్పుకోవలెను. 'మృద్ఘటః, మృత్పటః మృద్హస్తీ' అనెడు ప్రతీతులందుఁ గలసామానాధికరణ్యము సామాన్యవిశేష్యములకు (జాతివ్యక్తులకు) అగునది కాని గుణిగుణులకు అగునది కాదు. కాన ఆప్రతీతులందుఁ గలుగు సామానాధికరణ్యము "సో ఽయంరామః" అనుస్థలమందువలె ముఖ్యార్థమందు ప్రసక్తము గాని 'నీలోత్పల'స్థలమందువలె గౌణార్థమందుఁ గా నేరదు. సామాన్యవిశేష్యముల కగు సామానాధికరణ్యముకూడ గుణిగుణులకువలె గౌణమే యనిన, మృత్తునకు, దానికార్యములగు ఘటపటాదులకును భేదము, అభేదముకూడ చెప్పవలసియుండును. నీలోత్పలప్రతీతియందువలె ఇట్లు చెప్పుట యసంగతము. ఇటు లనుటంబట్టి 'సన్ ఘటః, సన్ పటః' ఇత్యాదిప్రతీతులందుఁ గలుగు సామానాధికరణ్యము ముఖ్యార్థమందే చెప్పుకోవలెనని స్పష్టమగుచున్నది.

సరియేకాని, 'సన్ ఘటః' అనెడుప్రతీతి ఘటకాలమందు ప్రవర్తించునుగాని ఘటము నష్టము అగుచోఁ బ్రవర్తింప నేరదుకదా! అట్టియెడల నష్టఘటమునందు ఘటబుద్ధితోపాటు సద్విషయికబుద్ధికూడ నశించునని చెప్పవలసియుండును. అట్టిచో ఘటబుద్ధి వ్యభిచరించుచుండ సద్బుద్ధి వ్యభిచరించుట లేదనియు, సర్వత్ర అనుగత మగుచున్నదనియు నెట్లు చెప్పఁదగును అనిన:___ ఘటము నశించినను పటాదులు నశింపనికారణముచేతను, పటాదులయందు 'సన్ పటః, సన్ హస్తీ' ఇత్యాది ప్రతీతులు అనుగతములే యగుచున్నందునను సద్బుద్ధి వ్యభిచరించుట లేదని చెప్పవలెను. 'నీలోత్పలమ్, నీలాంబరమ్, నీలాగః' అనెడు ప్రతీతులందు విశేష్యములగు ఉత్పలాదులు నశించినయెడల ఉత్పలాదిబుద్ధి వ్యభిచరించియు, విశేషణమగు నీలశబ్దార్థబుద్ధి వ్యభిచరింపక, ఇతర విశేష్యార్థంబుల గోచరించుచున్నవిధమున 'సన్ ఘటః' అనుప్రతీతియందుఁగల విశేషణీభూత సచ్ఛబ్దార్థబుద్ధి విశేష్యమగు ఘటశబ్దముచే గ్రాహ్యమగు ఘటము నశించినప్పుడు 'సన్ పటః' 'సన్ హస్తీ' ఇత్యాదిప్రతీతులందుఁ గల విశేష్యార్థంబులు గోచరించుచుంటచే వ్యభిచరించుట

లేదనియు, అనువృత్తమే యగుచున్నదనియు సెంచు కోవలెను.

ఘటము నశించినప్పుడు సద్బుద్ధి పటాదులయందు గోచరించుటంజేసి వ్యభిచరించుట లేదని చెప్పినచో నప్పున ఘటబుద్ధికూడ ఘటాంతరములందుఁ గాంచనగును గాన, వ్యభిచరించుట లేదని యేల చెప్పనొల్ల దనిన, ఘటము నశించినప్పుడు పటాది సమస్తకార్యజాతమునందును అనువృత్తమగుచుండుటంబున, ఘటబుద్ధి ఘటాంతరములందు అనుగతమైనను, పటాది సమస్తకార్యజాతమందును అనువృత్తము కాకపోవుటచే వ్యభిచరించుచున్న దనియే చెప్పవలెను. ఘటము నశించినప్పుడు 'సన్ ఘటః'అనెడు ప్రతీతి పుట్టకపోయినను, 'సన్ పటః, సన్ హస్తీ' ఇత్యాది ప్రతీతులు గలుగుచునే యున్నవి. కాని 'ఘటః, పటః, ఘటో హస్తీ' ఇత్యాది ప్రతీతులు గలుగనేరవు. కాన ఘటబుద్ధి వ్యభిచరించుచున్నదనియే తాత్పర్యము.

ఘటము నష్టము అగునప్పుడు 1 నష్టఘటమునందు సద్బుద్ధి అనుస్యూతము గానేరదు కాన నష్టఘటమునందు సద్బుద్ధి వ్యభిచరించుచున్నదని యేల చెప్పఁగూడదు అనెడుశంక పరిహర్తవ్యము. 'సన్ ఘటః, సన్ పటః' ఇత్యాదిప్రతీతులందు సద్బుద్ధికి విషయము విశేషణీభూత సచ్ఛబ్దార్థము. విశేషణ శబ్దము విశేష్యశబ్ద ముండినఁ బ్రవర్తించును గాని విశేష్యము లేనిచోఁ బ్రవర్తింపదు అని శబ్దశాస్త్ర మేమాత్రము దెలిసినను గోచరింపఁగలదు. ఘటము నశించినప్పుడు విశేష్యమగు ఘటశబ్దముతో పాటు విశేషణమగు సచ్ఛబ్దముకూడ తొలఁగిపోవు చున్నది. సచ్ఛబ్దము తొలఁగిపోయినంతమాత్రమున సచ్ఛబ్దార్థము పోనేర దని వేఱె చెప్పనక్కఱలేదు. కాని అట్టి విశేషణార్థము (సచ్ఛబ్దార్థము) ఘటశబ్దార్థ వ్యంజకముమాత్ర మగుట లేదని చెప్పనగును. కాన, విశేషణార్థము(సచ్ఛబ్దార్థము)నువిషయముగాఁగలయట్టిసద్బుద్ధి, విశేష్యమగు ఘటశబ్దమునకు విషయమగు ఘటము నశించుటచే ఆఘటమును అభివ్యక్తపఱచుట లేదు అని చెప్పవలెను గాని అసలే నశించిన దనికాని, అందుచే వ్యభిచరించుచున్న దనికాని చెప్పఁదగదు. అట్టి సద్బుద్ధికి విషయము ఘటోపహితమగు సత్తునకు బదులు కేవల సచ్ఛబ్ద వాచ్యమగు బ్రహ్మమే యగుచున్నది కాన వ్యభిచరించుట లేదు అని తాత్పర్యము.

వ్యక్తి యగుఘటము నశించినప్పుడు సర్వవ్యక్తిగతమగు తజ్జాతి నశింపకయు గోచరింపని చందంబున సదితివిశేషణాభివ్యక్తమగు సత్తను బ్రకాశింపఁజేయు ఘటవిశేషము నశించినప్పుడు తద్గతమగు సత్త నశింప లేదనియు, ఘటోపహితమై మాత్రము బుద్ధికి గోచరించుట లేదనియుఁ జెప్పనగును ఘట మున్నప్పుడు తద్ఘటమందు ఘటోపహితంబుగ నుండు తజ్జాతి ఘటోపలక్షితమై ఘటాంతరకార్యముల గోచరించు చందంబున ఘటకాలమందు తద్ఘటోపహితమై గోచరించు సద్బుద్ధివిషయిక సత్త ఘటోపలక్షితమై సర్వప్రపంచకార్యములందును గోచరించుచుండును. ఇట్లనుటచే ఘటనాశమైనను, ఘటోపలక్షిత సత్త వ్యభిచరించుట లేదనియు సర్వగతముగఁ బ్రకాశించుచున్నదనియును, దానంజేసి సద్బుద్ధి ఘటనాశమందును వ్యభిచరించుట లేదనియుఁ దాత్పర్యము.

'నీలోత్పలం' అనుసామానాధికరణ్యమందు నీలత్వ ఉత్పలత్వము లను రెండుపదార్థములు సిద్ధించుటం జేసి 'సన్ ఘటః' ఇత్యాదిసామానాధికరణ్య స్థలము లందుఁగూడ విశేషణ విశేష్య పదవాచ్యంబులగు సత్తయు, ఘటత్వాదులును అను రెండుపదార్థము లుండవలెను గాన రెండును భావములే కావలెను గాని ఒకటియే భావము (సత్తు) అనియు, ఘటత్వాదులు అభావములు (అసత్తులు) అనియు నెటులు చెప్పనగును అనియును, ఒకటి భావమును, మఱియొకటి అభావమును అగునెడల సమానాధికరణత్వ మెటులు సిద్ధించును అని

1. ఈపూర్వపక్షి తార్కికుఁడు. తార్కికులు అభావముకూడ ఒకపదార్థమనియు, అట్టిఅభావము ప్రాగభావము, ప్రధ్వంసాభావము అని రెండుతరగతులుగ నుండుననియుఁ జెప్పుదురు. నష్టఘటము ప్రధ్వంసాభావము గాన ఈనియమముబట్టి యీపూర్వపక్షము పుట్టుచున్నదని యెఱుంగనగును.

యును శంకింపఁజనదు. సమానాధికరణప్రయోగమందు విశేషణవిశేష్యము లను రెండుపదము లుండవలెను అనెడునియమము ఉన్నది. కాని రెండును భావములే అయియుండవలె ననెడు నియమము లేదు. మరీచిని (ఎండమావులఁ) జూచి 'ఇదమ్ ఉదకమ్' అనునప్పుడును, శుక్తిని జూచి 'ఇదం రజతమ్' అనునప్పుడును, రజ్జువును జూచి 'అయం సర్పః' అనునప్పుడును విశేష్యపద వాచ్యంబులగు ఉదక రజత సర్పములు అభావము లయ్యు (మిథ్యాభూతము లయ్యు) ఆప్రతీతులందు సమానాధికరణబుద్ధి యోగ్యమగు చందంబున "సన్ ఘటః, సన్ పటః" ఇత్యాదులయందుఁగూడ విశేష్యార్థములు అభావము లయ్యు, సామానాధికరణ్యము సిద్ధింపఁగలదు అని యెఱుంగవలెను. మరీచ్యాదులందు ఉదకాదులు గల్పింపఁబడుచున్న చందంబున సమస్తజగత్కార్యము లును సత్పదార్థమందుఁ గల్పింపఁబడుచున్నవి అని కూడ సిద్ధించుచున్నది.

ఘటాదులయందు మృదాదికారణధర్మంబులగు కాఠిన్యనైల్యాదు లెటులు సూక్ష్మదృష్టికి అనువృత్తములై భాసించుచుండునో, అటులే జగత్కార్యజాతమందుఁ తత్కారణమగు బ్రహ్మయొక్క తదభిన్నధర్మములగు సత్తా చైతన్యానందంబులు అనువృత్తములై వివేకశాలికి భాసించుచుండును. అనఁగా వివేకి యగువాఁడు సర్వత్ర సిద్ధించు సత్తాచైతన్యానందంబులు బ్రహ్మస్వరూపమని తెలిసికొని, జగత్కార్యములందు ఆధర్మము లెచ్చ పెచ్చట మిక్కిలి అభివ్యక్తములో వానియందు బ్రహ్మ నుపాసించుచు, ఉపాసన పక్వమైనకొలఁదినిసమస్తమునందుసత్తాచైతన్యానందంబులే అనుభవించుచు జీవన్ముక్తుఁ డగును అని యెంచవలెను. మఱియు జగజ్జాతమందుఁ గాంచనగు సత్తాచైతన్యానందంబులు సదాత్మస్వరూపమనియు, నామరూపక్రియా కలాపము అసన్మాయాస్వరూపమనియు, మాయా స్వరూపనిష్ఠులు పామరులనియు, సత్స్వరూపనిష్ఠులు పండితులనియు భావింపవలెను.

ఈశ్లోకమందు బ్రహ్మస్వరూపమగు సత్తయొకటే ప్రతిపాదింపఁబడినను, ఇతరత్ర 'సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ' 'విజ్ఞానమానందంబ్రహ్మ' ఇత్యాదిశ్రుతుల ననుసరించి సత్తామాత్రముచేతనే చైతన్యానందంబులు గూడ బ్రహ్మస్వరూపంబుగా నెఱుంగనగును. అయితే బ్రహ్మకు మూఁడు స్వరూపంబులు అనిన, కాదు. సత్యజ్ఞానానందంబులు బ్రహ్మను లక్షింపఁజేయు బ్రహ్మాభిన్న(బ్రహ్మ+అభిన్న) ధర్మంబులని యెంచవలెను గాని బ్రహ్మకు మూఁడు స్వరూపముల నొసఁగునవి యని యెంచరాదు.

ఇంతకును గార్యకారణవిభాగసక్తమగు పరిచ్ఛిన్నవస్తువు శబ్దవృత్తులకు గోచరించును, గాని, కార్యకారణవిభాగవిహీనమని పరిష్కరింపఁబడిన సత్పదార్థము శబ్దవృత్తులకు అతీతమనియే చెప్పవలెను. అటులయ్యు శబ్దసహాయము లేకయే మనము వస్తువుల గ్రహింపలేని కారణమున అట్టి యపరిచ్ఛిన్నవస్తువును గ్రహించుటకై యేవేనిశబ్దములను మనము వాడుకొనవలసి వచ్చుచున్నది. అట్టి శబ్దములు ఎవరియిష్టము వచ్చినచొప్పున వారు వాడుకొనిన వస్తుస్ఫురణమే కాకపోవునేమోఅనియెంచి, 'సత్, చిత్, ఆనందము, ఆత్మ, బ్రహ్మ, ఈశ్వరుఁడు' మున్నగు పదములు గ్రహించి శ్రుతులు అట్టి అపరిచ్ఛిన్న వస్తువును నిర్దేశించియున్నవి. శ్రుతులు వాడిన పదములగుటచే నవి మిగుల నర్థోపపత్తి గలవనియు ఆపదములు బ్రహ్మాఽభిన్నధర్మ ప్రతిపాదకము లనియు నెఱుంగఁదగును. అటులయ్యు నయ్యవి బ్రహ్మవాచకములు గానేరవనియు, బ్రహ్మలక్షకంబులనియు, గ్రాహ్యము. ఈయర్థమునే "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అనెడుశ్రుతి ప్రతిపాదించుచున్నది. బ్రహ్మవస్తుస్ఫోరకశక్తి లేనియిట్టి పదముల ద్వారా బ్రహ్మను గ్రహింపవలసి వచ్చుచున్నందున శబ్దప్రతీతులవలనఁ గలిగెడు శంకలు మన కనేకములు వొడముచుండును గాన నవి యీపైన వివరించినచొప్పునఁ బరిహర్తవ్యములు.

కాన దేహాదివిషయప్రపంచమును, శీతోష్ణాదులును, వీనికిఁ గారణమగు మూలప్రకృతియుఁ త్రికాలములందును ఉండునవి కావు. అనఁగా నియ్యవి అసత్పదార్థములు: వీనికి భావ మనఁబడు పారమార్థికసత్త లేదు; వ్యవహారసత్తమాత్రమే యున్నది. ఇక విషయి యగు నాత్మ యన్నచో, సర్వానుగతమును, సర్వాధిష్ఠానమును

అనుటచేఁ ద్రికాలాబాధ్యము- అనఁగా నియ్యదియే సత్పదార్థము; దీనికి అభావము లేదు-అనఁగా నెప్పుడును, దేనిచేతను బాధింపఁబడదు; కానఁ బరమార్థసత్త గలది అని యీశ్లోకముయొక్క ప్రథమపాదము ఆస్తికమతము ననుసరించి అద్వైతసిద్ధాంతము నేయుచున్నదని తాత్పర్యము.

ఇది యిటు లుంచి, యీశ్లోకపాదము నాస్తికవాదము నెటులు ఖండించుచున్నదో తరుతుముగాక! దేహోత్పత్తికిఁ బూర్వమును, దేహనాశానంతరమును దేహముకంటె విలక్షణమై, నిత్యమై, సత్యమై, సుఖదుఃఖభోక్తయై, పరఁగు నాత్మయే లేదని విశ్వసించి, వేదోక్తవిధినిషేధ వాక్యములు తమకుఁ బ్రవర్తకములు గావని ప్రవర్తించువారు నాస్తికులు. వీరు చార్వాక సౌత్రాంతిక వైభాషిక యోగాచార మాధ్యమి కార్హత భేదముచే నాఱుతెగలుగ విభజింపఁబడి యుండిరి. ఇప్పుడు మనసంఘములో మనము గనెడు నాస్తికులు కూడ నీ యాఱుతెగలలో నే యొకతెగకో కాని, ఆయాటింటి సంకరముచేఁ గలుగు భిన్నశాఖలకుఁగాని చెందినవారుగ నెంచఁదగి యుందురు. వీరిలో వీరికి మతసిద్ధాంత భేదము లనేకము లుండవచ్చును. అవి మన కిచ్చట ప్రపంచయితవ్యములు గావు. దేహ మున్నంతకాల మైనను గ్రాహకవస్తు వొకటి గోచరించుచున్నదని వీ రందఱును ఒప్పుకొనక తప్పనది కావని వెనుకఁ జెప్పఁబడినది. అట్టిగ్రాహకశక్తి క్షణిక మనుఁడు, దేహముతోఁ బుట్టి దేహముతోఁ బోవునది యనుఁడు, మఱేమైన ననుఁడు, కాని అట్టి గ్రాహకశక్తి మాత్రము ప్రత్యక్షప్రమాణసిద్ధ మని యొప్పుకొనక తప్పదు.

ఇట్టిగ్రాహకశక్తి మహాభూతాది వస్తుసంయోగముచేఁ బుట్టినను, మఱియొకలాగునఁ బుట్టినను, అయ్యది దేహమునుబట్టి విలక్షణమును, నిత్యమును అని చెప్పక తప్పదని వెనుక చెప్పియుంటిని. జ్ఞానము క్షణిక మైనను, గ్రాహకశక్తి యనంబడు సంస్కారపరంపరలు నిత్యములు అని చెప్పకతప్పదు అని యిదివఱలోఁ జెప్పియుంటిని. ఇట్టి గ్రాహకశక్తి దేహోత్పత్తికిఁ బూర్వము లేదనియు, దేహోత్పత్తితోడఁ బుట్టునదనియు, దేహముతో నశించునదనియుఁ జెప్పుటకు వీలు లేదని భగవంతుఁ డీశ్లోకమున సిద్ధాంతము చేయుచున్నాఁడు. ఎటులన:—అసత్తునకు భావము గలుగనేరదు అనుటచే జీవించుకాలము నందు సత్తుగఁ బ్రకాశించు గ్రాహకశక్తి దేహమునకుఁ బూర్వము అసత్తు గాదు, అనఁగా అసలే లేనిది కాదు అనియు, సత్తునకు అభావము గలుగనేరదు అనుటచే సత్తు అగునట్టి గ్రాహకశక్తి దేహము మృతి నొందిన పిదప అసత్తు గానేరదు, అనఁగా నశింపనేరదు అనియు నీశ్లోక ప్రథమపాదార్థముగా నీప్రకరణమున గ్రహింపనగును. ఈసిద్ధాంతమునకు ఉపపత్తి యెటులో సంగ్రహముగాఁ దెలిపెదను.

భూతాది వస్తుసంయోగముచే అప్పటికప్పుడు గ్రాహకశక్తి గలుగుచుండుట ప్రత్యక్షానుమాన ప్రమాణసిద్ధంబు కాదు. విద్యుచ్ఛక్తి (electricity), ఉష్ణశక్తి (heat) మున్నగుశక్తులు వస్తుసంయోగముచేఁ గలుగుచున్నవి కాని యిట్టి వేవియు మనకుఁ గల గ్రాహకశక్తి వంటివి కావు. ఇది గాక, శక్తికూడ నొకపదార్థమే యగుటచే నది పుట్టుటకుఁ గారణ ముండియే తీరవలెను అనియుఁ, గారణము నందు లేనిధర్మము కార్యమునందు వ్యక్తము గానేర దనియు భౌతికశాస్త్రజ్ఞులును ఒప్పుకొనుచున్నారు. అటు లగునేని, గ్రాహకశక్తికిఁ గారణ మెయ్యది? అట్టికారణ మేధర్మముగలది? యని వితర్కింపనాకారణము చైతన్య మని చెప్పక తప్పదు. అటు లగునేని, అట్టిగ్రాహకశక్తి అచేతనమగు దేహమువలనఁ బుట్టునది గాని; దేహముతో నశించునది గాని యనుటకు వీలు లేదు. కార్యము కారణముయొక్క అన్యథాభావ మని వెనుక చెప్పఁబడియున్నది గదా! కాన గ్రాహకశక్తి చైతన్యముయొక్క అన్యథాభావ మనియు, దేహముతోఁ బుట్టి దేహముతో నశించునది కాదనియు, ఇటు లనుటచేఁ ద్రికాలాబాధ్య మనియుఁ దేలుచున్నది.

ఇది యిటు లుండ, సమష్టిప్రపంచమును, వ్యష్టిదేహంబును దానిదానియుత్పత్తికిఁ బూర్వము లేవు అనెడువాదము కూడ దురుద్ధరము. అటు లగునేని,

శూన్యమునుండి ప్రపంచమును, దేహమును బుట్టుచున్న వని చెప్పవలెను. ఇటు లనుటయుఁ బ్రత్యక్షప్రమాణ విరుద్ధమును, గారణము లేకయే కార్యము పుట్టనేరదు అనెడు తర్కశాస్త్రనియమమునకు దూరమును అగుచున్నది. కాన నీరెంటికిని గారణము లుండియే తీరవలెను. అటు లగుచో వీనికిఁ గారణ మెద్ది యని విచారించిన, సచ్ఛబ్దవాచ్యమగు పరమాత్మయే యని వెనుక చర్చించనదానినిబట్టి సిద్ధాంతము గాఁగలదు. కాన నీశ్లోకపాదము ఈవిధంబున నాస్తికవాదమును ఖండించుచున్నదని యెఱుంగనగును.

ఈసందర్భమున మఱియొకమాట సెప్పవలసియున్నది. కారణము అని పైన ననేకపర్యాయములు వాడఁబడినది. అట్టి కారణము ఒకపక్షమున రెండువిధములని యెఱుంగఁదగును—నిమిత్తకారణము, ఉపాదానకారణము అని. ఘటోత్పత్తికిఁ గులాలుఁడు నిమిత్తకారణ మనియు, మృత్తు ఉపాదాన మనియు మీ రెఱుంగనిది కాదు. అట్టి యుపాదానము తిరిగి రెండువిధములు—పరిణామోపాదానము, వివర్తోపాదానము అని. ఈవిషయ మిదివఱలోఁ జెప్పఁబడినది. కారణము లేకయే కార్యము పుట్టనేరదు అనిన నిమిత్తోపాదానకారణములు లేనిది కార్యము ఉత్పత్తి కానేరదు అని అవధరింపఁదగును. ప్రపంచకార్యమునకు మాయోపాధి యగు నీశ్వరుఁడు వివర్తోపాదాన మనియు నిదివఱలో స్థిరీకరింపఁబడినది. ఇఁక నిమిత్తకారణ మెవరు అని ప్రశ్నింపవగును. అదియును ఈశ్వరుఁడేయని తెలుసుకోఁదగును. అటులుగానిచో నీశ్వరుఁడు పరిచ్ఛిన్నుఁడును, అనిత్యుఁడును గావలసివచ్చును. కాన నిమిత్తోపాదనములు రెండును ఈశ్వరుఁడేయని "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిశ్రుతులు చాటుచున్నవి. ఈయర్థముకూడ పైనవివరించిన వాక్యార్థమునుబట్టి యీశ్లోకతాత్పర్యముగ నెఱుంగఁదగును.

ఈసదసద్వివేచనము భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు గాక మఱియెవరైన గుఱుతించిరా యనిన, తత్వదర్శులున్నారని భగవంతుఁడే యీశ్లోక ద్వితీయపాదమునఁ జెప్పుచున్నాఁడు. తచ్ఛబ్దముయొక్క భావార్థకము తత్త్వము లేక తత్వము. తచ్ఛబ్దము సర్వనామము, అనఁగా సమస్తపదార్థములను నిర్దేశింపఁగల నామవాచకము. ఇయ్యది త్వత్, మత్ మున్నగు సర్వనామములవంటిది కాదు. ఈపదములు 'నీవు, నేను' అనువ్యక్తుల నే సూచించును. ఇఁక 'తత్' అనుపదము అన్నివస్తువులను నిర్దేశింపఁగలదు. కాన దానికే సర్వనామ మనుపదము అన్వర్థము. 'సర్వంఖల్విదం బ్రహ్మ' అనెడు శ్రుతినిబట్టియు, పైన వివరించిన దానిని బట్టియు సర్వము బ్రహ్మము అని తెలిసికోఁబడుచున్నది కాన తచ్ఛబ్దము సర్వమగు బ్రహ్మను నిర్దేశించునది యని రూఢమగుచున్నది. ఇటులనుటచే తత్వమనిన బ్రహ్మభావము, అనఁగా బ్రహ్మయొక్క యాథార్థ్యము అని తాత్పర్యము. అట్టి బ్రహ్మయాథార్థ్యము సత్యజ్ఞానానంతస్వరూపమే. ఇఁకఁ దత్వదర్శులు అనిన బ్రహ్మ సత్యజ్ఞానానంతస్వరూప మని సాక్షాదనుభవంబున దర్శించినవారు; బ్రహ్మవేత్తలు అని యర్థము. ఇట్టి బ్రహ్మవేత్తలు జగన్మిథ్యాత్వమును బూర్వమే తిలకించి యుందురుకాన వీరు సదసత్తులయథాస్వరూపమును నిర్ణయించినవారనియీశ్లోకమునివేదించుచున్నది.

మనుజుని సూక్ష్మపరిశీలనము హెచ్చినకొలంది వానిప్రాముఖ్యము హెచ్చుచుంట మన కనుభవసిద్ధమే. చదువుకొననివారు చదువుకొనినవారిని, చదువుకొనినవారు తమకంటె నెక్కువ చదువుకొనినవారిని, సమానముగఁ జదువుకొనినవారు తమలో తీక్ష్ణమేధావులను బ్రమాణముగ నెంచుకొని ప్రవర్తించుచుందురు. కారణ మేమనిన దమకంటె వారు సూక్ష్మవస్తుదృష్టి గలవారని విశ్వసించుటయే. సర్వగతమగు బ్రహ్మము సూక్ష్మాత్ సూక్ష్మతమము. అట్టిబ్రహ్మమును దిలకించు బ్రహ్మవేత్తలు సూక్ష్మజ్ఞతములు. 'సర్వజ్ఞం బ్రహ్మ' అనుశ్రుతినిబట్టి బ్రహ్మము సర్వజ్ఞము అగుటచేతను, సర్వము బ్రహ్మమే అగుటచేతను బ్రహ్మవేత్తలు సర్వజ్ఞులు అనెడు అన్వర్థాభిధానము గలవారు. కాన నట్టిసూక్ష్మజ్ఞతములు అగు సర్వజ్ఞులదృష్టి పరమప్రమాణము గాన వారియనుభవమును అనుసరించి 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనిగ్రహించి, శోకమోహములవీడి, శీతోష్ణాదుల సహించి, మోక్షార్థత సంపాదించుటకై యథోక్త కర్మ భక్తి జ్ఞానవిధుల నాచరింపఁదగునని యీశ్లోకముయొక్క ఉత్తరార్థ తాత్పర్యము.

# ఆంధ్రక్షేత్రములు

పం. వెంకటసుబ్బయ్యశాస్త్రిగా

## అమరావతి

ఓయమరావతీ, సవినయుండను; నేఁ డిటు చేలవోలె నే
దో యొక నామమాత్రమున నుండిన నిన్ గని మ్రొక్కువెట్టి పో
నై యరుదెంచితిన్; వడి బయల్పఱుపంగదె తావకీన పూ
ర్వాయత వైభవమ్ముఁ గనులారఁ గనుంగొను వేడ్క పుట్టెడున్.

ఎల్లరకు ముక్తి గలదని వెల్లడించు - బౌద్ధమతమునఁ గల సూత్రపఙ్క్తి నీ వి
శాలవీథులు; గొందిలో జగము లిన్ని-పోసఁగరానివి గద ముక్తిఁ బొందు టెట్లు?

బుద్ధహృదయమ్మువలె స్వచ్ఛములును విపుల-స్నిగ్ధములు నైన శశికాంత శిలలు ప్రాచ్య
శిల్పవిద్యా సరస్వతీ స్మృతు లివెల్ల - వ్యక్తపఱచెడు నీపూర్వవైభవమ్ము.

ఇది బుద్ధాకృతి యట్టె శాంతరస మెందేఁ గల్గినన్ దాని కి
య్యది గా నొప్పు జనుః స్థల మ్మిచట నాయంతస్సు రంజిల్లుచు
న్నది, యద్దంబునఁ దన్నుఁ దాను గని యానందంబునన్ మున్గు నె
మ్మదితోఁ జేతులుఁ గాళ్లు దుర్బలము లై మానున్ స్వకీయక్రియల్.

## అమరేశ్వరస్వామి

ఓహో స్వామి, యుమాసతీవ్యతికరం బూహించి నేత్రాగ్ని చే
దేహంబున్ జెడఁగాల్చి మన్మథుని శాంతిం బొంద కేతెంచి ప్ర
త్యూహంబున్ గలిగించికొంటి విటు రుద్రున్ నిన్నుఁ జాముండికా
బాహాబంధములందు నామె నయనప్రాగల్భ్యముల్ ద్రోసెనే?

ఆకాశంబులఁ దాఁక నీ వయితి లోకాధీశుఁ డన్యుండు లేఁ
డా కల్యాణమయస్వరూప, వృథయేనా విష్ణు వంచున్ సరో

జాకీర్ణాసనుఁ డంచు భిన్నగతులన్ బ్రార్థించుటల్? సర్వమున్
నీకుం జెందున? లోకముల్ సతతమున్ నీలోననే నిల్చునా?

క్లేశంబుల్ దిగమ్రింగి న న్వివిధకేళీలోలుఁ గావించి దీ
ర్ఘాశాంతంబులఁ బట్టి పోవు హృదయ వ్యాపారముల్ మాన్చి శి
క్షాశక్తిం గని నే నిటుల్ నిలిచినన్ జ్ఞాన మ్మసంపూర్ణ వి
ద్యాశంకన్ ననుఁ ద్రోయుచున్నది జగద్భద్రంకరా, శంకరా!

చేతుల్ మోడ్చి నమస్కరించితిని నాచిత్తంబు నిండింపవే
శీతాంశూజ్జ్వల దుత్తమాంగ, బుధులన్ సేవించెదన్ నీమత
ఖ్యాతిన్ మెచ్చక దుష్టతంత్రములపా లై బూడిదన్ బ్రుంగు నా
జాతిన్ నేను సముద్ధరించెదను భిక్షాభోగి నై, భోగి నై.

చాముండికా దేవి

'ప్రాతశ్శోభిదిశాముఖి' యనుచు సంభావింపనా? 'సాగర
స్రోతః పూరసుతామణీ' యనుచుఁ గే ల్జోడింపనా? 'సౌమ్యతా
స్ఫీత ఖ్యాతకళావతీ' యనుచు సంశ్లేషింపనా? లేక, చ
ట్టాతింబోలి యిటన్ నిలంబడి నినున్ రంజిల్లఁ గీర్తింపనా?

సౌందర్యం బిట రూపుగొన్న దని యెంచన్ బోలుఁ గాదేని నే
యందూ బంధమునం దగుల్కొనిన వాఁడై నిల్చు నీరీతిఁ దా
నెందుం బోవుట మాని శంకరుఁడు తల్లీ, దానసే కల్గెనో
మందప్రజ్ఞత సర్వభూతములకున్ మత్తిల్లెనో లోకముల్.

తా నానేత్ర హుతాశనాంచల శిఖాదగ్ధోద్ధతానంగుఁ డీ
శానుం డెచ్చటి నుండి వచ్చెఁ దనకున్ శ్యామాతను శ్రీ దివ్య
క్షోనై సర్గిక వాంఛ లా నవు నయస్కాంతంబు చెంతన్ క్షణం
బేనిన్ నిల్వఁగ నేర్చునే యినుము స్వోద్వృత్తిన్ విడంబించుచున్.

అమ్మా, నిన్నును నాకసంబునకుఁ దానై యెప్వ నీయయ్యనున్
సమ్మోదంబునఁ దెచ్చి శిల్పి యెవఁడో సంధించె నాంధ్రావనీ

ధమ్మిల్ల ప్రసవాభిరామమగు నీస్థానమ్మునన్ నిర్ఝరా
ఘుమ్మున్ చుట్టును జేరియుండఁగ ముదాకారమ్ములై చండికా!

నీకర్ణాంత విలోచనమ్ములు కృపాస్నిగ్ధమ్ము లానంద మా
ధ్వీకందమ్ములు ప్రాకృపించినవి నన్ వేసారు లీ-దోటికిన్
నాకున్ బుద్ధివికాసముం గొలుపు చైనన్ సర్వధాత్రీ, నమో
వాకంబుల్ పచరింతు నీవలని తాత్పర్యం బసంపూర్ణమే.

ఈ సంపూర్ణము గాని జ్ఞానము నన్నున్ హేరాళ దుఃఖమ్ము పా
లే సేయున్ సుఖదాయి గాదు, ప్రజ 'హీహీ' యంచు నన్నుం బరీ
హాసంబుల్ వలుకంగఁ జొచ్చు నటు లేలా? తల్లి, బాధాకరం
బౌ సింహాసనమైనఁ గోరను మదీయాకాంక్ష. గుర్తింపవే!

రాజా వెంకటాద్రినాయఁడు

అధిగతజ్ఞాని యాచరిత్రానభిజ్ఞు-నంసభాగములందు వ్రేలాడుఁ బూర్వ
శిల్ప విద్యా సరస్వతీ స్మృతులు పాడు-చేసినట్టి వినింద కైశికము నట్లు.

ఇతని వితరణధార లహీనవాహి-నులు గడిగి వేయుచున్నవి నలుపులెల్ల
సురలు గొనియాడ మాటలు దొరకవేమొ?-మెదలకున్నారు మూలల నొదిఁగి యొదిఁగి.

ఓయి నృప, మర్మమునఁ జెంచునాయకులను-సంహరించిన చంద్రహాసంబు నీది
మూల్గుచున్నది యొఱ నిద్ర పూర్ణతప్త-చిత్తమట్లు నీ కెందును క్షేమ మగునె?

కృష్ణా నది

కృష్ణవేణీ, జగము లెన్నిరీతు లయి న-శించినను నీవుమాత్రము చెక్కు-చెదర
వూళ్లపై నూళ్లుపడిన నే ములికిపడని-కరణములమీఁద నొకరాగి కాసు పడునే?

నీ వెడపాట నీవు గమనింతువు లోకము లాలకించునో
యావల నాలకింపవో? రయంబునఁ బోవుచు నుండు నీకుఁ జిం
తావహమైనఁ గా దది మహానది, ధర్మ వినిశ్చితాత్మ దీ
క్షా వృతబుద్ధి నిన్ నిలుపఁ జాలునె స్తోత్రములున్ వినిందలున్.

అయినను గొంచె మాఁగుము దయారసరూపిణి, నిన్ను నాశ్రయిం
చి యొకట సర్వలోకముల శ్రీలఁ దనర్చిన యాంధ్రజాతి నేఁ
డయనయహీన మై బ్రదుకు నక్కట, పూర్వకథాస్మృతుల్ భరం
బయి హృదయావగుంఠనము లావలఁ ద్రోసి హితంబు సెప్పవో?

కొనియాడవే మహాక్రూరమౌ భూతహింసనము నింద్యం బన్న జ్ఞానమహిమ
ప్రకటింపవే రామరాజ్యంబునం బలెఁ బ్రజలు సుఖించినప్పటి విధంబు
కీర్తింపవే రణక్రీడ శత్రుశిరంబు లాటబంతులు చేసినట్టి నేర్పు
తెలియింపవే దేవతలకు నైతేము శరణ్యములైన యీపట్టణముల సొబగు
పొనుఁగు వడిన నిప్పుపోలిక నుండిన-యుగయుగములనాఁటి మగతనమ్ము
గలిగినంతవట్టు వెలిఁగింపవే తల్లి-కెరటములను విసరి కృష్ణవేణి!



## దారిద్ర్యమా

రాయసం శేషగిరిరావు గారు

"మమ్ము చూచిన జగము ద్వారమ్ముమూయు
మాటలాడిన వినరు మాపాటు కనరు
ఏడ్చినను మమ్ము నోదార్ప కేగుదెందు
సోకగూడని నీచూపు సోకినంత
సంతసం బేదొ మాకుగా నంతరించె
సౌఖ్యమన్ననొ మము చూచి సాగిపోయె
భాగ్యదేవత భయపడి పారిపోయె
అసలు ప్రాణమె నిర్గంధకుసుమమయ్యె
అరయ క్షుద్బాధ మాయింట నతిథియయ్యె
కష్టదేవత మా గృహకాంతయయ్యె
ఆపలేనట్టి పెనుదుఃఖ మాప్తు డయ్యె
అశ్రుధారలె మాకయ్యె నార్జనములు
సేవ్యమగునట్టి మానవజీవయాత్ర
కుటిల దుర్గంధసంయుక్త కూపమయ్యె
సర్వఫలసస్య యుక్తమౌ జగతి యంత
శూన్యగృహమయ్యె—
ఇం కేటిసుఖము మాకు."

# గుడిపాటి వెంకటచలంగారి 'శశిరేఖ'

ఆరికపల్లి లక్ష్మీనరసింహారావు గారు, బి. ఏ., బి. యల్.

ఇప్పుడు అమలులోవున్న కొత్త తెలుగుభాషను ప్రస్తుతపు ఉన్నతస్థితికి తెచ్చుటకు ప్రయత్నించిన యువకులలో శ్రీ వెంకటచలంగారు ముఖ్యులు. పూర్వంనుంచీ వున్న భాషను, భావాలను కూడా వీరు మార్చి తమయథాశక్తిని మన ఆంధ్రభాషను ఉద్ధరించుచున్నారు. అందుకు వీరు వందనీయులు. వీరు అప్పుడప్పుడు వ్రాసేకథలను నేనతిశ్రద్ధగా చదివేవాణ్ని. అందు కనే నాకు వీరియందు కొంత అభిమానము. వీరు వ్రాసిన 'శశిరేఖ' అను నవలను ఈమధ్య నామిత్రు డొకడు నాకు యివ్వగా చదువుట తటస్థించినది మార్కెటులో వున్న యితరనవలలవలె దీనినికూడా ఒకమారు చూచి పారేయడానికి వీలు లేదు. ఇట్టిభాషాభిమానులు ఒక 'సెట్టుపర్పసు'తో వ్రాసినగ్రంథములను పరిశీలించి అందలి మంచిచెడ్డలను విమర్శిస్తూ వుంటే భాషకూడా వృద్ధిఅవుతుంది. ఆంధ్రభాషకు చిరపరిచితులగు శ్రీ శివశంకరశాస్త్రిగారు యీగ్రంథమునకు ఒక చిన్న ఉపోద్ఘాతమును వ్రాసినారు. మామూలు ఉపోద్ఘాతాలవలె గాక యిందు సాహిత్యానికి సంబంధించిన సమస్యలు కొన్ని చర్చించబడినవి. శ్రీ శాస్త్రిగారి అభిప్రాయములకు ఎంతేని విలువ గలదు. అందువలన వాటిని మనము తృణీకరించ రాదు. అయినను ఆఅభిప్రాయములు ఎంతవరకు సమంజసములో మనము పరిశీలించవచ్చును. ఆపీఠికలో వారు నిరూపించినహంశము లేమనగా—

(1) "సాహిత్యానికి నీతితో పనిలే" దంటారు వీరు. మొత్తంమీద యిది కొంచెము పంచదారపూయని కొయినామాత్రే మింగడానికి. "రమణీయార్థము ప్రతిపాదించడమే కావ్యోద్దేశ్య" మంటారు. ఎవరిరమణీయార్థము? నారమణీయార్థమని నాయిష్టము వచ్చిన అశ్లీలములు వ్రాస్తే చదువరులు సహిస్తారా? అయితే, "కథావ్యపదేశంతో కావ్యము నీతినే బోధించవలె" నని వీరే ఒప్పుకుంటూ, "అనీతిని కూడా వర్ణించవ" చ్చంటారు. బోధించడానికి, వర్ణించడానికి ఏదో భేదము తీస్తున్నారు. బాగా విచారిస్తే యీ రెంటికి యెక్కువ తేడా కనుపించదు—అంటే విడదీయుటకు వీలు లేదని నాతాత్పర్యము. గ్రంథములోని పాత్రల నోటిలోనుంచి వచ్చినభావాలు ఒక్కొక్కప్పుడు వర్ణించడ మవుతుంది; మరొక్కప్పుడవ్వే బోధించడ మవుతుంది. 'చింతామణి' అందరిని బుట్టలో వేసుకోడం చూస్తే వర్ణించడములాగ కనుపడుతుంది; వైరాగ్య మబ్బినతరువాత తాను చేసినపనులు చాల

తప్పని సాటిస్తే బోధించడ మైనది. 'వరవిక్రయం'లో. మొదట పాత్ర లందరూ మనసంఘంలోని దురాచారాలను వర్ణిస్తారు. పెళ్లికూతురు నూతిలో పడేటప్పుడు చెప్పే సాలిలోక్వీ చూస్తే బోధించడ మైనది. కాబట్టి వర్ణ నే బోధ నవుతుంది. బోధనకూడా వర్ణ నవుతుంది పరిస్థితులను బట్టి. యీగ్రంథములో మాత్రము ముఖ్యముగా వర్ణనబోధనలకు పరస్పరభేదము లేకుండా గ్రంథకర్తగారు వర్ణనరూపేణా బోధన చేస్తున్నారు. ఇట్టిది తగునో తగదో చదువరులే ఊహించుకుందురుగాక.

(2) "దేశకాల పాత్రలనుబట్టి నీతులు మారుత" నంటారు. ఇట్లనుకోటం కేవలము పొరబాటని మనవిచేస్తున్నాను. ముఖ్యనీతులు యెల్లప్పుడూ ఒక్కటే. బైబిలులో చెప్పిన Ten Commandments కు ఎప్పుడైనా చలన ముంటుందా?

(3) ప్రేమ శాశ్వతమా చంచలమా అనే ప్రశ్నకు "చంచలమే" నని శ్రీశాస్త్రి గారు జబాబిచ్చినారు. "ఒకరిమీద అనురాగము నడలినతరువాత యింకొకరిమీద ప్రసరించవచ్చు"నట-అంటే ప్రేమ అనేది ఒకరు తప్పితే మరియొకరు, వారు పోతే వేరొకరు-యీవిధంగా యెంతమంది మీదపడితే అంత మందిమీదికి ప్రవహిస్తుం దన్నమాట, తుమ్మెదగనుక ఒకపువ్వులోని రసమును తాగి వేరొక పువ్వుమీదికి పోయినట్లు. అప్పుడు దీనికి 'ప్రేమ' అనే గొప్పపేరు తగుతుందా? అటువంటిది Fancy అవుతుంది. ఇంకా ముదిరితే Lust అంటారు. ప్రేమ అంటే "ఆత్మను ఆత్మను కలిపి కుట్టే దార" మని ఒకకవి వర్ణించాడు. అంతకంటే ఏనుగులుకూడా తెంపలేని గట్టి యినుపగొలుసంటే బాగుంటుందేమో, కొంచెము మోటుగా వున్నప్పటికీ.

మిగతాహాంశములు సందర్భానుసారంగా చర్చిస్తూ అసలుకథకు వద్దాము. ఈనవలకు కథానాయకు డెవ్వడో చెప్ప వీలు లేకపోయి నప్పటికి కథానాయికమాత్రము శశిరేఖ. మన కథాప్రారంభమునాటికి యీమెకు పదునారేండ్ల వయస్సు. నిండుజవ్వని. చక్కనిచుక్క. యీమెకు వివాహమైన పదియవ ఏటికిపూర్వమే రామారావనే ఆయనను ప్రేమించినదట. ఆయన సీమకు వెళ్లుటచేత యీమె ప్రేమ కృష్ణారావు అనే "బాలుని" వైపునకు తిరిగినది. కాని అతనియొక్క అవస్థ చూస్తే బాలునికంటె పెద్దవాడని తోస్తుంది. ఒక నాటి సాయంకాలము ఆయిద్దరు పరస్పరాలింగనమువలన కలిగిన ఆనందమును అనుభవించి ముందు కర్తవ్య మాలోచించి, ఎవరిదారిని వారు వెడతారు. ఇంటికి వెళ్లినతోడనే శశి తన అమ్మతో తనకు రామారావునే భర్తగా చేయమంటే చేయక, వేరొకని కిచ్చి వివాహము చేసినందున తన అయిష్టమును చూపుతూ, తనకు ప్రస్తుతపు భర్తతో కార్యం చెయ్యకూడదని పట్టుబట్టి, నాలుగుచివాట్లు తిని చివరకు కార్యంరోజున చేసినముస్తా

బుతో అర్ధరాత్రివేళ కృష్ణారావువద్దకు పరుగెత్తుకుని రాగా, యిద్దరూ కలిసి ఆరాత్రే యెక్కడకో లేచిపోతారు.

కృష్ణారావుయొక్క స్నేహితుడైన సుందరరావుతో కొంతకాల ముంటారు వీరిద్దరు. సుందరరావు ఆప్రాన్తో డాక్టరు; డబ్బు బాగా సంపాదిస్తున్నాడు. అప్పుడే కథానాయకురాలికి అతని సుగుణములు, సంపాదన చూస్తే కొంచెము ఆమెయొక్క దృష్టి అతనివైపు తిరుగుంది. మరి మూడు సంవత్సరములకు కృష్ణుడు, శశిరేఖ తమస్వగ్రామము చేరుతారు. సూదిలో దారమల్లే సుందరరావు కూడా యిక్కడకు డాక్టరుగా తయారు. ఒకనాడు యీముగ్గురు కలిసి పడవషికారు వెళ్లగా డాక్టరుగారు ఫిడేలు వాయిస్తారు. దానితో శశి ఒళ్లు మరచిపోతుంది. ఈఆనందములో కృష్ణుడు నిద్రపోతాడు. ఇదే సమయమని డాక్టరుగారు తమ కాంపైను మొదలుపెడతారు. డబ్బు, సంగీతము, ప్రేమ మున్నగుకబుర్లమధ్య డాక్టరుగారు ఆమెకు సంగీతము నేర్పుతా నని ఆమె చెయ్యి పట్టుకుంటే ఆకంగారులో పడవ ఒరుగుతుంది. శశి నీళ్ళలోపడుతుంది. మొగవాళ్లిద్దరు ఆమెకు శుశ్రూష చేస్తారు కాని ఆమెకు జ్వరము వస్తుంది. ఉదారపురుషులగు డాక్టరుగారు ఆమెను తనఆసుపత్రిలో ఇన్ పేషంటుగా తీసుకుంటారు. ఇంతలో అదృష్టవశాత్తుకృష్ణునితల్లికి విషజ్వరము తగిలినందున శశి యింటికి వెళ్లుటకు వీలుకాక మరికొన్నిరోజులు ఆసుపత్రిలోనే గడపడం తటస్థిస్తుంది. ఏవో మాటలసందర్భములో డాక్టరుగారు ఆమె చేతులను ముద్దు పెట్టుకుంటారు. శశికి లోపల యిష్టము; పైకి కష్టము. ఆమెయొక్క ఆందోళనను గ్రంథకర్తగారు నాలుగుపేజీలలో వర్ణిస్తారు. పర్యవసానమేమంటే, ముట్టుకుంటే మూర్ఛపోతుదేమో అని ప్రేమించేకృష్ణుడు గాక ఆమెను "నలిపి" "జీవనరసమును పిండి" "తీవ్రమగు ఉద్రేకముతో బలముగల భయంకర మోహముచే" తన్ను తృప్తిచేయ గలుగు డాక్టరుగారే కావలసివస్తారామెకు. ఏట్లాగైతే నేమి! ఒకనాటిరాత్రి తన యిష్టమువచ్చినట్లు డాక్టరుగారితో గడిపి ఆమరునాడే కృష్ణుని మొఖాన్ని ఒకవుత్తరము పారేసి కథానాయకురాలు డాక్టరుగారితో లేచిపోతుంది.

కొంతకాలానికి ఆసుపత్రిలో అనాటిరాత్రి చూపిన ప్రేమంతా మరచిపోతారు డాక్టరుగారు. మున్నాళ్ల ముచ్చట తీరగానే డాక్టరుగారికి శశిరేఖంటే విసుగు పుడుతుంది. యీమెకుకూడా ఆయనయందు ప్రేమ నశించింది. యథాప్రకారం డాక్టరుగారిని వదిలేసి లేచిపోదామని (యీసారి ఆమెకు తోడుమొన్వరూ దొరకలేదు, పాపము!)రయిలుకు బయలుదేరగా దారిలో కాంభోట్టను నాతడు సైంధవుడులాగ అడ్డపడతాడు. తిరిగి యింటికి వస్తుంది డాక్టరుగారిబండి బోర్లపడి ఆయనకు గాయ

ములు తగులతవి. ఆయనకు మందివ్వడానికి పెద్దడాక్టరు.గారు ఇంకొకరు దాపరిస్తారు. ఇంక దాచడమెందుకు? పెళ్లికాకపూర్వము తాను ప్రేమించిన రామారావే యీపెద్ద డాక్టరు. మొదట దూరపుతళుకు చూపులు; తరువాత సరససల్లాపములు; క్రమంగా అనురాగం ఏర్ప డుతుంది వీరిద్దరకు. రామారావు చెయ్యి సుంద రరావు చేతికంటె ఎక్కువలావుగా వుంటుంది; ఎక్కువబలముకూడా ఉంది. ఇవన్నీ చూచి సుందరరావుకు కొక్కుపెట్టి రామారావుతో లేచిపోయి ఆయన కుదిర్చిన ఒక యింటిలో వుంటుంది.

ప్రతిరోజు సాయంత్రమూ రామారావూ శశీ షికారువెళ్లేవారు ఎంతో ఆనందంగా కాలము గడుపుతారు. ఒకనాటిసాయంత్రము రామారావు వస్తానన్నసమయానికి మళ్లీ సుం దరరావు ప్రత్యక్షమయి తనతో తిరిగి రమ్మని బతిమాలి నయానా భయానా చెప్పగా తన మామూలుప్రకారం రామారావు కీ క్రింది వుత్తరమును వ్రాసి వెడుతుంది. "రామా! నన్ను క్షమించు సుందరరావును వదలలేను. ......నన్ను మరచిపో."

సుందరరావు, శశిరేఖ మద్రాసులోకొంత కాలము గడుపుతారు. యథాప్రకారం ఎడ చూపులు, వెడచూపులు. ఇది సహించలేక శశిరేఖ ఒకరాత్రి యింటిలోనుంచి పారిపోతుం డగా నవజీవనదాసు అనే ఆయన ఈమెను సోదరభావముతో ఆదరిస్తాడు;ఎంతోమర్యాద చేస్తాడు. చిత్రమేమిటంటే ఆమెనడతచూడగా ఈయనకు కూడా చివరకు మోహము కలుగు తుంది, అంతా అయిపోయినాక శశిరేఖమీద. ఇక్కడ పాత రామారావును తిరిగి కలుసు కుంటుంది. ఆయన తన్ను పెళ్లి చేసుకోమం టాడు. పెళ్లిమీద ఒకపెద్దలెక్చరిచ్చిపెళ్లిచేసు కో నంటుంది. కారణమేమిటంటే(ఇది మనము జాగ్రత్తగా గమనించవలెను.) రామారావు మీద ఇప్పుడు ఉండేప్రేమ ఎల్లకాలంవుంటుం దని గారంటి లేకపోవడమేట. ఇదీ ఈమెకు తెలి సినప్రేమ. మామూలుగా మనము చూసే ఫ్లర్టింగుకు దీనికీ ఏమైన తేడాఉందేమో చూ డండి. పెళ్లిచేసుకోకపోతే తనకు అక్కర్లేదని రామారావు వెళ్లగా శశిరేఖ బహుశా (ఈ లాగు మనము ఆలోచించుకోవలెను) ఆత్మ హత్య చేసుకుని రంగములోనుండి విరమిస్తుంది.

శ్రీశివశంకరశాస్త్రిగారు ఈకథానాయిక "సామాన్యస్త్రీ" కాక "ప్రేమైకజీవిని" కాబట్టి "తనకు యోగ్యుడైన ప్రియునికోసము ఎట్టి త్యాగమైనా చేసిం" దంటారు. ఇట్లు వ్రాయ డము కొంచెము నగుబాటుగా వుంటుం దని మనవి చేస్తున్నాను. ఈ విపరీతాభి ప్రాయంతో ఎంతమంది ఏకీభవిస్తారో శ్రీశాస్త్రిగారికి తెలియకపోలే దనుకుంటాను. గ్రంథకర్తగారియందు తమకున్న అభిమా నముచొప్పున ఇట్టివిమర్శన చేసినారు గాని, నిష్పక్షపాతంగా ఇచ్చిన అభిప్రాయంమాత్రం కాదని తోస్తుంది. సామాన్యస్త్రీకంటె అధ

మము అనేఅర్థములో ఈమె సామాన్యస్త్రీ కాదంటే నేనుకూడా ఒప్పుకుంటాను. ఈమె యొక్క జీవితములో నిశ్చలము, అకళంకము ఐనట్టి దివ్యస్వరూపముగల ప్రేమ ఎక్కడైనా కనుపడుతుందేమో ఆలోచించండి. కృష్ణారావుతో వుంటూ డాక్టరు సుందరరావుమీదికి యిష్టము పోనిచ్చుట ప్రేమలక్షణమేనా? ఈసుందరరావుగారిని వదిలి అంతకంటె బలాఢ్యుడైన రామారావుతో వెళ్లడానికికూడా "ప్రేమ" అనే పవిత్రనామము పెట్టవచ్చునా? పవిత్రమైన ప్రేమ ఈమెకు తెలియనే తెలియదు. గ్రంథకర్తగారి ఉద్దేశము అట్టి ఆదర్శకమైన ప్రేమమూర్తిని నిరూపించుటయే అయియుండవచ్చును; కాని అయ్యవార్లంగారిని చేయబోతే ఏదో అయినట్లుంది. కృష్ణారావును ప్రేమించకపూర్వము రామారావును ప్రేమించెను. కృష్ణారావును ప్రేమిస్తూ సుందరరావువైపు దృష్టి మరల్చెను. రామారావుపైని వలపు చూపుతూ రెండవపర్యాయము సుందరరావుతో కాలము గడిపెను. దీన్నిబట్టి చూస్తే ఈమెయొక్క ప్రేమకు అర్థ మేమనగా, తనకు ఎవరు ఏసమయానికి కంటికింపుగా వుంటే అప్పుడు వానితో కాలము గడపడమే తప్ప స్వార్థమును మరచి శాశ్వతమైన పవిత్రప్రేమను ఈమె ఎరుగనే ఎరుగదు. ఈమెకున్నది 'మియర్ ఆనిమల్ పాషన్'-చదువరులు మన్నింతురుగాక.

ఇంక, ఈమె చేసిన స్వార్థత్యాగ మేమి? ఆత్మహత్య చేసుకోడంట్ కాబోలు! తననడతను, తన ఆదర్శములను, తన అభిప్రాయములను మెచ్చుకొని తన్ను దగ్గరకు చేరదీయు 'నా' అనేపురుషు డొక్కడైనను లేనప్పుడు చేయు కర్తవ్యమేమి? తాను ఆత్మహత్య చేసుకొని శశిరేఖ తనకే కాక సంఘమున కంతకును ఉపకారము చేసిందంటే అతిశయోక్తి కాదు. ఇది కొంచెము కఠినాభిప్రాయమైనప్పటికి నొప్పుచ్చక తప్పదు. ప్రేమ యనుపేరుతో ఈమె చూపిన దంతయు విలాసచేష్టలు కాని వేరు కాదు. సోదరివలె ఆదరించిన నవజీవనదాసు గారికికూడా ఈమెనడత అసహ్యము కలిగించినది.

అన్నిటికంటె విపరీత మేమనగా, శ్రీశాస్త్రిగారు ఈమెను "స్వధర్మప్రకారము నిస్సంశయముగా పతివ్రత" అనుట. దీనినిబట్టి చూడగా పీఠిక వ్రాయుటలో శ్రీశాస్త్రిగారి ఉద్దేశము ఈగ్రంథమును, తద్ద్వారా గ్రంథకర్తను తమ అభిమానముచొప్పున పొగడుటయే కాని, సరిఅయిన విమర్శనచేయుట కాదని తేలుతుంది. పతే లేనప్పుడు పతివ్రత ఎట్లగును? ఏపతిని ఈమె పూజించి గౌరవించినది? ఈమె పతివ్రత అవునో కాదో ఒక్క మాటవల్ల తెలుస్తుంది. ఈమెను ప్రథమములో పెళ్ళిచేసుకొన్న నిర్భాగ్యుడు చనిపోయినట్లు తెలియగానే ఈమె అంటుంది: "పోయినాడా ఆఖరికి పాపం!...ఈజుట్టూ గిట్టూ గొరిగేవాళ్లుగావును. అప్పుడు నువ్వు వచ్చి పెళ్లి చేసుకొంటానని జుట్టు పెంచితే ఈపాటికి నీతల

మల్లె వుండేది నాతలకూడా." (అంటే బెంగాల్యు[కాసింగులాగన్నమాట). ఏ మాత్రము Sentiment ఉన్న ఆడదైనా ఇట్లాంటిమాటలు అనగలదేమో ఆలోచించండి. నలుగురి విటకాండ్రతో తిరిగి ఏవరిడప్పు తిన్నప్పుడు వారి కనుకూలముగా ఉండడము పతివ్రతాత్వమా? "స్వధర్మప్రకార" మంటే ఏమిటి? స్వధర్మమునకు లోకముయొక్క మంచిచెడ్డలతో నిమిత్తము లేదు. సంఘముయొక్క ఉద్దేశాలు అసలే పాటించ నక్కరలేదు. ఎవరికి తోచేపనులు వారు చేస్తే వారు స్వధర్మమును నిర్వహించుకొనినట్లే. వాడిధర్మ మది కాబట్టి దినదినము వేనవేలు మేకలగొంతుకలు పరపర కోయు కటికవాడు, తమధర్మంప్రకారం కూనీలు, దొంగతనాలు చేసేవారు, అదే ప్రకారం యువకుల కొంపలు తీయు వారకాంతలు, అందరుకూడా ఈసూత్రముప్రకారము వందనీయు లవుతా రన్నమాట. సర్వము తెలిసిన శ్రీశాస్త్రిగారు ఇట్టిఅభిప్రాయములను వెలిపుచ్చుట శోచనీయము.

ప్రేమతత్వాన్ని నిరూపించడానికి సాహసికుడైన ఈగ్రంథకర్త ప్రయత్నించినా డంటారు శ్రీశాస్త్రిగారు. వాస్తవముగా ఈగ్రంథకర్త కడుసాహసికుడు; నిర్భయుడు. ఇంచుమించుగా "లోకముతోటి మన కేటి" కనే బాపతు. అయితే అట్టిప్రేమతత్వాన్ని నిరూపించడానికి ఈగ్రంథకర్తగారు చేసిన ప్రయత్నములు ఫలించినవా? ముమ్మాటికిని లేదని నామనవి. అసలు అక్కడ ప్రేమ ఉంటేగా, దానితత్వము బయలుపడడానికి?

ఈగ్రంథముయొక్క శైలి చాలామందికి కష్టము కలిగిస్తుందని శ్రీశాస్త్రిగారు అభిప్రాయపడుతున్నారు. నేనుమాత్రము మీఅభిప్రాయమును ఆమోదించలేను. మీదుమిక్కిలి ఈగ్రంథమునకు వన్నె తెచ్చేది దీనిశైలి అని నానిశ్చితాభిప్రాయము. ఈగ్రంథకర్తగారు స్వచ్ఛమైన వాడుకభాషలో ధారాళంగా వ్రాస్తారు. ఇప్పుడు పండితులు, పామరులు కూడా మెచ్చుకునేది వాడుకభాషే నని చెప్పవచ్చును. అర్థములేని పదగుంభన తక్కువ. భావాలు గొప్పవి—నూతనోద్దేశాలు. ఒక్కొక్కప్పుడు భావోద్రేకంలో భావముకొరకు భాషను బలియిచ్చినా, మొత్తంమీద గ్రంథకర్తగారి శైలి సజీవముగా ఉంటూ, సర్వజనాదరణీయముగా వుంటుం దనుటలో సందేహము లేదు.

ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము అనాదినుంచి అన్నిదేశాలలోను వున్న వివాహములను నిరసించడములాగ కనపడుతుంది. పెళ్లి అనేపద్ధతి ఒప్పుకోరు గ్రంథకర్తగారు, కథానాయిక కూడాను. పెళ్లిచేసిన పాప మేమిటనగా భార్యాభర్తలను శాశ్వతముగా బంధించుతుందట. మనధర్మశాస్త్రప్రకారము పెళ్లి అనేది ఒకమతవిధి. ఇతరదేశాలలోనికిమల్లే కేవలము కంట్రాక్టుకాదు. అయితే ఇతరదేశాలలో భార్యాభర్తలకు అనుకూలము లేకపోతే ఒకరి నొకరు త్యజించవచ్చును. కాని

మన దేశంలో అట్టి అవకాశాలు తక్కువ. మతం మాట అటుంచినా, పరస్పరారోగ్యానికైనా పెళ్లి అనేది ముఖ్యావసరము. సంసారపక్షంగా ఆలోచిస్తే అటువంటి Sacred కట్టుబాటు ఒకటి ఉంటేనే కాని వీలులేదని తేలుతుంది. ఏది ఎట్లున్నను మన దేశంలో మాత్రము అటువంటిది ఒక్కటి ఉండితీరవలెను. పెళ్లి లేకపోతే న్యాయశాస్త్రమునకు సంబంధించిన ఇబ్బంది ఒకటి కలుగుతుంది. ఇతర దేశాలలో ఉన్న "Your children, my children and our children" అనేవారి హక్కులు స్థిరపరచుట కష్టము. అప్పుడు న్యాయశాస్త్రము కూడా మారవలసి వస్తుంది. మన హిందూధర్మశాస్త్రము పూర్వపురుషులు వ్రాసిన గ్రంథములపైన ఆధారపడి యుండగా, దానిని ఇప్పుడు మార్చుట కష్టతరము. ప్రస్తుతపు వివాహములలో అనేక దురాచారాలున్నా యన్నమాట నిజము. అటువంటివి పోగొట్టుటకు ప్రయత్నించాలిగాని కేవలము వివాహములనే Institution ఉండుటకు వీలులేదంటే మాత్రము సంఘము ఒప్పుకోదు.

ఈ గ్రంథము నీతిబాహ్యము కాదని శ్రీ శాస్త్రిగారు వాదిస్తారు. 'నీతి' విషయమై వీరికున్న అభిప్రాయములు మొదటనే తెలియజేసినాను. ఇట్టి సందర్భములలో ఈ గ్రంథము నీతిబాహ్యము అవునో కాదో చదువరులే ఊహించుకుందురు గాక. ఇట్టి గ్రంథములు ఆంగ్లభాషలో రైనాల్డ్సుకవి వ్రాసినాడు కాని సదరు గ్రంథములలో సంఘములలో ప్రబలి యున్న అవినీతులను చూపిస్తూ, వాటిని ఆక్షేపి నిరసిస్తాడు. కాని ఈ గ్రంథములో అట్టిది కన్పడదు. మీదుమిక్కిలి అవి ఆమోదించబడి నవి. పైన ఉదాహరించిన ఆంగ్లగ్రంథములలో కనపడే పాత్రలు Victims of circumstances అవుతారు. అందువల్ల మనకు వారలయందు సానుభూతి ఉంటుంది. ఈ గ్రంథములోని కథానాయకురాలు అట్లుగాక తాను చేసిన పనులన్నియు కళ్లు తెరచి స్వబుద్ధితో కావాలని చేస్తున్నందువల్ల ఈమెయందు చదువరులకు సానుభూతిగాని సదభిప్రాయముగాని కలుగుట కష్టము.

ఇంకొక్కమాటతో ముగిస్తాను. శ్రీ వెంకటచలంగారు ఇట్టి గ్రంథమును వ్రాసి చదువరులు గట్టిగా ఆలోచించుటకు కొన్ని సమస్యలను చూపించినారు. ఆసమస్యలు సాహిత్యమునకు, సంఘమునకు చెందినవై యున్నందువల్ల ఆయావిషయములలో అభిమానము గలవారాయాసమస్యలను నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించి, అవి ఎంతవరకు ఆచరణీయమో, ఎంతవరకు ఆదర్శప్రాయమో ఆలోచించి, ఆ ప్రకారము నడుచుకొనుట కర్తవ్యము. ఈ గ్రంథము సామాన్య నవలలవలె చదివి పారవేయతగినది కాదు. చదివినకొలది సమస్యలు హెచ్చవుతవి. ఆలోచనకు తగు ఆహారము ఇచ్చిన ఈ గ్రంథకర్తగారు ఎంతయు వందనీయులు.

# రేరాణి

కలువలపల్లి రంగనాథశాస్త్రి గా॥రు

పెక్కు రకాల తావులను బెక్కు రకంబుల వన్నెలం గడున్
ముక్కును గన్నులం దనుపు పూవులు పెక్కు రకంబు లుండినన్
చక్కని వన్నెఁ గాంచు నెఱజాణవు నీవెకదా! గుణజ్ఞులం
జొక్కఁగఁ జేయు నీవలపు సొంపు వహావ్వరె! రేయిరాణిరో!

మాలతియు మల్లికయు నవమాలికయును-వలపు పెంపును వన్నెచిన్నెలు గడించి
పుడమి సరసులఁ దనియించు ప్రోడవైన-నిన్ను బోలంగ నేర్తురే యెన్నఁడైన.

లలితాకారము కల్మి బల్వలపునన్ లాలించు నైపుణ్యమున్,
విలసన్మంజుల మూర్తియుం గలిగి యుద్వేల ప్రమోదంబు తజ్
జ్ఞులకుం బాయక కూర్తు సర్వసుమన శ్చూడామణీ, త్వద్గుణ
జ్ఞులు శ్లాఘింతురు వేయునోళ్ల భళి యంచున్ రాత్రిరాణీ, నినున్.

పురు డే పూవులుఁ గావు నీకు సుమనఃపుంజావతంసంబ, నీ
పరు వే పువ్వుల కబ్బ దింత నిజ మవ్యాజస్థితిన్ మించి రా
తిరి రాణించెడి రాణివై వెలయు నీతీ రెన్న మాబోంట్లకుం
దరమా? నీపరువంబు నీవలపు సంస్తవ్యంబు లింకేటికిన్.

ధీరోత్తంసులు నిన్ను డాసి మది నెంతేఁ గాంతు రామోద మ
య్యారే, మేదిని సారెసారెకును నీ యామోదమున్ మెచ్చుచున్
రేరాణీ, నినువంటి మంజులగుణ శ్రీకం గనుంగొంటిమే
ధీరశ్లాఘ్యవు, నీకు నీవె జగతిన్ దీటొండు లే దెయ్యెడన్.

పవ లెప్పట్టునఁ గానరావు నిజసౌభాగ్యంబు దైవార, గౌ
రవ శీలంబుల పెంపుఁ గాచుచు నసూర్యంపశ్య వౌటన్ నిస
ర్గవికాసంబున మంచితావులను రేరాణీ, మహాధీరులన్
భవదుత్కృష్ట గుణంబులం దనుపు దెన్నన్ మాపులన్ బాపురే.

దవ్వులకున్ బుగుల్కొనెడు తావిని మూర్కొని యబ్బ మొంది యే
పువ్వుల తావియో యనుచు ముగ్ధులు సైతముఁ గౌతుకంబునం
జివ్వున నీదు చెంగటికిఁ జేరి నినుం గన నెంతు రింక నీ
మవ్వపురూపు నీవలచుమాదిరిఁ గాంచిన నెన్నకుందురే.

మూఁత దీసిన యత్తరుబుడ్డి మాడ్కి-గమ్ముగమ్మున వలచు నీకమ్మతావి
నెల్లకడల బుగుల్ కొల్పి యెల్లరకును-హాయి గల్గించుచున్నావు రేయిరాణి!

నీమేలితావుల నెమకుచు నిను డాయ వచ్చు నెంతటి చక్రవర్తియైన
నేమారుమూలనో యీవున్న నినుఁ జూడ రాఁ గోరు నెంతటి రాణియైన
నపరిమితామోద మంద నీచెంతకుఁ జనుదెంచు నెంతటి ధనికుఁడైనఁ
బ్రచురసువాసనావశ్యుఁడై నీదండఁ జేరఁ బో యెంతటి ధీరుఁడైనఁ
దమిని దటి వేచి నీదుపాదముల దరికి - నింక సామాన్యుఁ డేతెంచు టేమి వింత
నోము లెన్నెనిఁ దొలిమేన నోఁచి యింత-ప్రాభవంబును గంటి! రేరాణి, భళిర.

టాటోటుంబువు లెన్నిపాట్లు పడినన్ డంబంబు లెంతేనియున్
నీటుం గోటును జూపినన్ మఱియు నెన్నే వన్నెలన్ మించినన్
నీటన్ మున్గియుఁ గానలం దపము లెన్నే సల్పినన్ రాణి, నీ
సాటిం గాంచఁగ లేవు నిక్కమముగన్ జన్మాంతరం బొందినన్

పలుతెగల పూలు పుడమిన్ - వెలసిన 'నైట్ క్వీ' ననియెడు పేరొక నీకే
చెలువారుఁ బుష్పరత్నమ, - కలుగునె సుకృతులకుఁ బోలె ఖ్యాతి పెరలకున్?

కమ్మతావులకుం బట్టుఁ గొమ్మ లనుచుఁ - బలుమరున్ నిక్కువిరుల దర్పంబు నణఁచి
జగతిఁ దనరు రాతిరిరాణి సకలపుష్ప - దర్పదమని యన్ బిరు దొందఁ దగుదు వీవు

అసదురూపుఁ దాల్చి యాడంబరము లేక - వింత తావి వెల్లివిరియఁ జేసి
మంచి పువ్వనంగ మహి మింతు రేరాణి - మేలుమేలు సుమతి మెలఁగు నిటులు.

సవతు లేనట్టి సౌభాగ్య సౌరభముల - మంచిపేరును గడియించి మనుచు నున్న
నీదు ప్రఖ్యాతి లాఁతికి రాదురాదు - తనరు రేరాణి, యాచంద్రతారకముగ.

---

# కాలభైరవుడు

సోమయాజుల వేంకటరామమూర్తి గారు



౧

పాచిపెంట ఫిర్కా రివిన్యూ ఇన్స్పెక్టరు వెంకటసుబ్బయ్య వెల్నాటి బ్రాహ్మణుడు. నలభై యేళ్లు వయస్సు కలిగి పింఛనీకి సగందూరంలో వున్నాడు. తేరగా ధర్మపిండాలు బజాయించి దమ్మిడీ ఖర్చులేకుండా జీతం రాళ్లన్నీ మూటకట్టి పెట్లోపారేశే వుద్యోగాల్లో రివిన్యూ ఇన్స్పెక్టరీ చాలా ఉన్నతస్థానం వహించిందని వాడుక అయినప్పటికీ మన వెంకటసుబ్బయ్య న్యాయంగా దేవుడిమొగం చూసి కాలక్షేపం చెయ్యవలసినవాడే కాని, ఒక శేరు నెయ్యి అయినా యితర్లని నోరు విడిచి అడగవలసిన మనిషికాడు. ఇంతకూ—ఏం పదిమంది మందున్నారు గనుకనా అతని కుటుంబంలో? ఒక్కగానొక్క పున్నమ్మ అనే ఆడపిల్ల. ఆపిల్లని పన్నెండేండ్ల క్రిందట కని వెంకటసుబ్బయ్యగారి భార్య గతించింది. పంచప్రాణాలూ ఈ పన్నెండేండ్ల పిల్లమీద పెట్టుకుని వుంటాడు మన వెంకటసుబ్బయ్య. స్థూలకాయుడు. అందుకు తోడు పరమకోపం, దూర్వాస మహాముని సెత్తి మొత్తి పుట్టాడేమో అనిపిస్తుంది. ప్రపంచంలో అతని కంటబడిన ప్రతిమనుష్యుడూ, జంతువూకూడా అతని కెప్పుడో ఒకప్పుడు కోపం కలిగించే వుంటారు. ఆ గ్రామంలో అన్నింటికంటే ముఖ్యంగా అతగాడికి ఎక్కువకోపం (భయం కూడాను) కలిగించినది ఒక నల్లకుక్క. ఒకమాటానల్లకుక్క మన రివిన్యూ ఇన్స్పెక్టరుగారు చెరువుగట్టుక్రింద బాహ్యానికి వెళ్లివస్తూంటే వెంటబడి ఆ డబుల్ పన్నా బ్రాహ్మడ్ని చెరువుచుట్టూ మూడు మార్లు తిప్పి, యింటినద్ద మూడు చెంబుల మంచినీళ్లు తాగించింది. అప్పట్నుంచీ నలుగురు తలార్లు కర్రలు పట్టుకొని అగల్ బగల్ నడుస్తేనేకాని ఆయన సాయింత్రం గుమ్మం కదలడు. ఆ దెబ్బతోటి ఇప్పటికీ ఎక్కడైనా గట్టిగా కుక్క మొరిగిందంటే ఉక్కచచ్చిపోతాడు పాపం!

ఆవూరు కరణంపేరు శేషయ్య. వెల్నాటిబ్రాహ్మణుడే. వయస్సు పందొమ్మిది సంవత్సరాలుంటుంది. బక్కపలచగా, ఎఱ్ఱగా తొగరుదారంలాగుంటాడు. అతడు సాధారణంగా వెంకటసుబ్బయ్యగారింటే వుంటూ తల్లిలేని పున్నమ్మకూ, కాలంమళ్లిన వెంకటసుబ్బయ్యకూ పనుల్లో తోడ్పాటూవుంటాడు. శేషయ్యకి వెనకా ముందూ ఎవళ్లూలేరు. "ఏక్ నిరంజన్" అని ఏకాకి; అయితే యేకాకి అని సుతలామూ కొట్టి పారేయడానికి వీల్లేదు. ఎందుచేతనంటరా? అతగాడికి పున్నమ్మమీద చెప్ప వీల్లేనంత స్నేహం, అభిమానం, ప్రేమాన్నూ. సాయంకాలం తనకీ తండ్రికీ బియ్యంపడేశి పున్నమ్మ తీరుబాటుగా పెరట్లో జామిచెట్టుదగ్గర కూర్చొని శేషయ్య చెప్పే కథలన్నీ సరదాగా వింటుంది. "అనగనగా ఒక రాజకుమారుడు; వేటకళ్లాడు; అడవిలో ఒక పెద్దమేడ; ఆ మేడలో ఒకచక్కని పన్నెండేండ్ల బాల"—అని యేమో కథలు చెప్తూవుంటే పున్నమ్మ మనస్సులో అమితమైన సిగ్గు ఉదయించి, ఆసిగ్గు పున్నమ్మయొక్క నీలం ముక్కల్లాంటి కళ్లలోంచి పైకి బలవంతంగా పొంగి వచ్చేటప్పుడు, ఆ వేగానికి కనురెప్పలూరికే అల్లాడిపోవడం; చెక్కులెఱ్ఱబారడం; మొగం క్రిందికి వంగడం; పెదవుల మీద చిరునవ్వు; గుండెలు దడదడ— ఇన్నిలక్షణాలు ఒక్కమాటు కనిపించేవి. ఇవన్నీ చూసి మన శేషయ్య చిన్నప్పట్నుంచీ పున్నమ్మని చేరదీసి హాస్యంమాటలు చెప్తూ, ఆమె నవ్వినప్పుడు ముద్దెట్టుకుంటూ వుండిన అలవాటు చొప్పున, ఇప్పుడుకూడా (అంటే 'ఇప్పుడుకూడా'

అని మనం అనుకుంటున్నాము కాని, అసలు వాళ్లు పెద్ద వాళ్లయిన సంగతి వాళ్లకి తెలియదు) ముద్దులూ మురి పాలున్నూ.

౨

ఆ వేళ కార్తిక సోమవారం. రివిన్యూఇన్స్పెక్టరు వెంకటసుబ్బయ్య పగలల్లా ఉపవాసంచేసి సాయంత్రం ఈశ్వరాలయంలోకి పూజకి బయల్దేరాడు. నల్లకుక్క భయంచేత దండపాణులైన యిద్దరు తలారులు వెంట నడిచారు. వెంకట సుబ్బయ్య ఆవేళసాయింత్రం కరణం శేషయ్యని భోజనానికి పిలిచాడు. నక్షత్రదర్శనం అయినవరకూ వెంకటసుబ్బయ్య శివాలయంలోంచి రాడని తెలిసివుండి పున్నమ్మతో నిరాటంకంగా యిష్ట గోష్ఠి కోసమని శేషయ్య పెరటివేపునుంచి వెంచేశాడు. తనతండ్రి తిరిగిరావడానికింకా అరగంట వ్యవధి వుందని పున్నమ్మ మడితోనే తీరుబాటుగా కూర్చుంది. శేషయ్య కూడా మడికట్టుకునే వచ్చాడు. ఇన్స్పెక్టరుగారు యింట్లో లేరు. ఇక నేముంది? శేషయ్య పున్నమ్మలిద్దరూ ఒకరి



నొకరు చేరుకున్నారు. స్నేహబంధాలు వాళ్లని దగ్గరగా యీడుస్తూంటే వాళ్ల తరమా మరి! అయస్కాంతం, యినుమూ రెండు చేరుకోవడం స్వభావమే కాదండీ? ఏదైనా ఒక కథ చెప్పమని మామూలుగా పున్నమ్మ శేషయ్యని అడిగింది కాని, కథ పూర్తికావడానికి అవకాశం లేదని చెప్పి, శేషయ్య సంభాషణని స్వవిషయంలోకి దింపాడు.

* * * *

పున్నమ్మ—"సరేకాని, నువ్వు కథల్లో 'ప్రేమ ప్రేమించడం' అంటావుకదా, అదేమిటో సరిగా చెప్పవూ?"

శేషయ్య—"మహా గట్టిప్రశ్న వేశావు. 'ప్రేమ' అంటే నాకూ సరిగ్గా బోధపడడంలేదు కాని, అయినా నావుద్దేశం మనవిచేస్తాను, వినుమరి. ఇప్పుడు మనమిద్దరం వున్నాం కదా; నువ్వు దూరంగావుండి నాకంటికి కనపించకుండా వున్నప్పుడు నిన్ను చూడాల్ని నామనస్సులో వుంటుంది; తరువాత మీయింటికి వచ్చి నీదర్శనం చేసుకున్నాననుకో—అప్పుడు నువ్వు మాటలాడుతే వినాలని వుంటుంది; ఏదైనా సందర్భంలో నువ్వు నీకోకిలకంఠంతో నాతో ఒక్కమాటాడి, నీకడకంట చూపొక్కటి నామీద పారేశే సరికి నావొళ్లు పులకరిస్తుంటుంది; పట్టరాని సంతోషము కలుగుతుంది; పరుగెత్తి వెళ్లి నీబుగ్గలు ముద్దెట్టుకుందామా అని కోరిక కలుగుతుంది; అయితే మీనాయన వున్నారని మళ్లీ మనస్సు వెనక్కి లాగుతుంది; అప్పుడు మళ్లీ యిదంతా తలుచుకుంటే సిగ్గు కలుగుతుంది.

పూర్వకవుల గ్రంథాల్లో చెప్పిన 'ప్రేమ' అంటే ఇదే అని నే ననుకుంటున్నాను. ఈ మానంప్రకారం చూస్తే నేను నిన్ను ప్రేమించానన్నమాట. నామాట చెప్పానుకదా! నువ్వుకూడ నీసంగతి నేనిప్పుడు చెప్పిన సూత్రంప్రకారం తైపారువేసి చెప్పుమరి."

పున్నమ్మ—"నాకూ నీముఖం చూద్దామని; నీమాటలు విందామని వుంటుంది. కాని ఒక్కొక్కప్పుడు సిగ్గు వేస్తూంటుంది భయముమాత్రం లేదు. స్నేహంపట్ల భయమెందుకూ? అయితే సిగ్గుమాత్రం ఎందుకుండాల్నా అని సందేహం."

శేషయ్య—"సిగ్గు—సిగ్గు ప్రేమయొక్క లక్షణమే. మనప్రేమలో సిగ్గు తప్పకుండా కలిసివుంటుంది. ప్రేమా, సిగ్గూ నువ్వు వేరువేరుగా భావిస్తున్నావు—అది పొరబాటు. అవిరెండూ వేరుకావు. ఒకదాన్నొకటి అనుసరించుకునే వుంటాయి.........సరే, ఈమాటకేంగాని, మీనాన్న నీకోసం ఎన్నో సంబంధాలు చూస్తున్నారు. దేవుడిదయవల్లనూ, నా అదృష్టంవల్లనూ యింతవరకూ అవన్నీ తేలిపోతూవచ్చాయి. నువ్వు పెద్దదా

ని వయావు. ఇలాగు ముసుగులో గుద్దులాట వ్యవహారం ఎన్నాళ్లు? అంచేత, రేపు ఎలాగైనా తెగించి మీనాయన్ని మనవివాహం విషయమై కదప దలుచుకున్నాను."

పున్నమ్మ—"అమ్మయ్యో! అతగాడికి చాలా కోపం. ఒకవేళ కోపంవచ్చి ఆయన నిన్నేమైనా అంటే నాప్రాణానికి బాధిస్తుంది. అది కాకుండా, మాతండ్రి ఇవాళపొద్దున్నుంచీ చాలాకోపంగా వున్నాడు. రేపేమో తాసిల్దారుగారు వస్తున్నారుట. చిన్నప్పుడు ఆయనా, మాతండ్రీ కలిసి చదువుకొన్నారుట, అలాంటితాసిల్దారు మొన్న నేనో ఉద్యోగరీత్యామాతండ్రిని ఆక్షేపించాడుట. అప్పట్నుంచీ మాతండ్రి అతగాడిమీద కారాలూ మిరియాలు నూరుతున్నాడు. అతడూ కోపిష్టేనుట. వీళ్లిద్దరూ రేపు కలుస్తే ఏం కొంప ములుగుతుందోఅని హడలుగా వుంది. అలాంటిసమయంలో అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు నువ్వుగానీ పెళ్లిమాట ఎత్తావంటే చెప్పేదేముంది?"

శేషయ్య—"తాసిల్దారుగారు రేపు వస్తున్నారా?..."

పున్నమ్మ—"ఔను. ఆయన భార్యతోకూడా వస్తున్నారుట. భార్యాభర్తల వ్యవహారాల విషయంలో మన కథ మొదటిపాఠం." (ఇద్దరు నవ్వుదురు)

వాళ్ల సంభాషణ అంతమైంది. అందుకుకారణం వీధి వైపునుంచి వెంకటసుబ్బయ్య రావడమే. భోజనాల దగ్గిర వెంకటసుబ్బయ్య ప్రస్తుతాంశము లేమీ మాట్లాడకుండా, మొగం ధుమధుమలాడుతూ పెట్టి, ఎవరినోవుద్దేశించి "పెంచనుకి సిద్ధమైన ముండాకొడుకని నాకు తప్పు లెంచుతాడేం? ముసలాడయినాడు వాడికిమాత్రం తెలియవూ, కష్టసుఖాలు? చిన్నప్పుడు తోటలో రేగుపళ్లు ఎత్తుకొచ్చి పారిపోతుంటే తోటవాడు వెంటబెట్టి చావగొట్టాడు—చలపతి రావు—'చల్లన్న—మజ్జిగన్న—పెరుగన్న' అని వుడికించేవాళ్లం; నేటికాలానికి 'అస్, పీస్' అని నాలు గింగిలీషుముక్కలు రావడంచేత తాసిల్దారీ అయిందని వీడి కిప్పుడు కళ్లు నెత్తికెక్కాయి. ఎందుకూ? రేపుంది కథ; నాలుగూ మొగం ఎదుట ఝాడిస్తాను" అని మరునాడు రావలసివున్న తహస్సీల్దారు చలపతిరావుపంతుల్ని వుద్దేశించి మాట్లాడుతూ తొందరగా నాలుగు మెతుకులు వేసుకొని దిగ్గున లేచాడు. శేషయ్య ఆలోచనలో మునిగివున్నాడు. పున్నమ్మ తండ్రివాలకం అంతా చూసి, రేపు గావలసివున్న ప్రళయాని కిదంతా ఉపోద్ఘాతం అనుకుని, రే పేమౌతుందో భగవంతుడా అనుకుంటూ, భయపడడం తప్ప మరేమీ చెయ్యలేక పూరుకుంది.

## 3

మంగళవారంనాడు ప్రొద్దున్న యేడుగంటలు కావచ్చింది. పాచిపెంట వూరి పొలిమేర తూర్పువైపునుంచి ఒక రెండెడ్లబండీ గ్రామాన్ని సమీపిస్తూంది. బండీ ముందువెనకల యిద్దరు బిళ్లజవానులు నడుస్తున్నారు. బండి తహసిల్దారు చలపతిరావు పంతులుగారిదే. చెరువు గట్టు దగ్గిరి కొచ్చాక బండీ నిలబడింది. అందులోంచి చలపతిరావుపంతులు దిగాడు. స్థూలకాయుడు కాబట్టి 'దిగాడు' అనీకంటె ఊడిపడ్డాడంటే సరిపోతుంది. చెరువుదగ్గిర కాలకృత్యాలు తీర్చుకుని వూర్లోకి వెళ్లదామని అతని ఉద్దేశం కాబోలును— కప్పుకొన్న ఎర్రశాలువ బండిలోకి విసిరి, బండిని రివిన్యూఇన్స్పెక్టరు వెంకటసుబ్బయ్య యింటికి తోలమన్నాడు. బండి సాగుతూంది. అదివరకు అప్పుడే అరగంటనుంచి చెరువు గట్టున కూర్చొని దంతధావనం చేసుకుంటూవున్న కరణం శేషయ్య ఇదంతా కనిపెడుతున్నాడు. ఆతాలూకాకి క్రొత్తగా వచ్చిన తహసిల్దారు చలపతిరావుపంతులుగారి దర్శనం అతడింకా చేసుకోలేదు. బాహ్యానికని బండిదిగిన తహసిల్దారు కెదురుగావెళ్లి దండంపెట్టి నిలబడడాని కతని కిష్టంలేక, మించిపోయిన దేముందని, ఊర్లోనే సావకాశంగా చూద్దామనుకున్నాడు.

చలపతిరావు పంతులు ప్రాతఃకృత్యాలు తీర్చుకుని ఊరుమొగిమై బయల్దేరాడు. చెరువుగట్టుమీద వేపచెట్టుదగ్గిరకొచ్చేసరికి—ఏం చెప్పను? - పాపం! - నల్లకుక్క—అతనివెంటపడింది. బ్రాహ్మడు అసలే స్థూలకాయుడు; పరుగెత్తలేడు పోనీ,ఒకవేళపరుగెత్తుదామా అనుకుందుకి అంతా యేమనుకుంటారో అని భయం. పోనీ, కుక్కని

కొంచెం భయపెడుదామని వెనక్కి తిరిగేసరికి నల్లనిశరీరం, నిప్పులురాల్తూన్నకళ్లు, నోట్లోంచి వ్రేల్లాడుతూ ఎర్రని నాలుకతో, కోరలుచూపుతూ మొరుగుతూ పెనుభూతం లాగు, నాలుగుకాళ్ల మీదవున్న కాళికాదేవి అపరావ తారమేమో అన్నట్టుగా ఆ బ్రాహ్మడిదృష్టిలో పడేసరికి



"పాపం !-నల్ల కుక్క అతనివెంటపడింది."

కుక్కని అదమాయించడం సంగతి అలావుండగా, అత గాడికే ప్రాణా లెగిరి పోయాయి. నల్ల కుక్క కోపానికి తానే గురిఅయిన సంగతి తెలుసుకున్నాడు; అందులో యేమీసందేహం లేదు. అకారణంగా ఆ శునకానికి తన మీద అంత ఆగ్రహం యెందుకు రావాలో ఆలోచించడా నికి అతనికి కాలం లేదు. ఆలోచించినా ఏంలాభం? చేపలు ఈదడానికీ, పక్షులు ఎగరడానికీ ఏమికారణమో, ఆనల్ల కుక్క స్థూలకాయుల్ని వెంబడించడానికీ అదేకారణం. దాని స్వభావమది. కుక్కబుద్ధికి సబబేమిటి? స్థూలకాయు లైతేచాలు: పాచిపెంట నల్లకుక్క వెంటపడిం దన్న మాటే. అంచేతేకదూ మన రివిన్యూ ఇన్స్పెక్టరు వెంకట సుబ్బయ్య ఇవాళవరకూ తనశరీరాన్ని లావుగా సృష్టించి నందుకు బ్రహ్మజీదేవుడ్ని మనస్సులో తిట్టుకుంటూ వుండడం!

ఏమైతే నేమి—చలపతిరావు పంతులు కుక్క స్వరూపాన్ని చూడడం, చటాల్న వేపచెట్టు యెక్కడం ఒక్కమారు జరిగించి. 'ఎక్కడం' అన్న ముక్క చలపతి రావు పంతులు అప్పుడు చేసిన క్రియకి సరిపోదు; ఇక వేరేపదం ఎక్కడా భాషలో లేదు. ఏమంటారా?—

అతడు మొదటికొమ్మ పట్టుకుని ఒక్కమాటు "ఉష్" అని విశ్వప్రయత్నంచేసి శరీరాన్ని మీదికి ఒక్క ఊపు ఊపి తనకాళ్ల మధ్యని మీదికొమ్మను గట్టిగా అదిమిపట్టు కున్నాడు. [ఈ ఫీటు స్థూలకాయులకి సాధ్యం అవు తుందా అన్న సందేహం మొదట నాకూ కలిగింది. అయితే "ప్రాణంమీదికి వొచ్చినప్పుడు సాధ్యాసా ధ్యాల్తో సంబంధం లేదనిన్నీ, మిన్నొచ్చి మీదపడి నప్పుడు అసాధ్యాలే సాధ్యాలౌతా" యని ఊహిం చాను.] చేతులతో కిందికొమ్మ, కాళ్ల మధ్యని మీది కొమ్మ, మనిషంతా తల్లక్రిందులా, మొహం కుక్కవైపూ- నిజంగా చూడవలసిన దృశ్యమే. సృష్టికర్త భూమికి (gravity) ఆకర్షణశక్తి ఎం దుకు కల్పించాలా అని చలపతిరావుపంతులు ఆ సమ యంలో చాలా విసుగుకున్నాడనుటలో సందే హం లేదు. ఏమంటారా? తలక్రిందులావున్న అత గాడి శరీరంలో వున్న రక్తమంతా మొగానికి దిగింది. అంచేత మొగం బరువెక్కి యెర్రబారింది. శరీరం బరు వంతా చేతులమీదా కాళ్ల మీదా వుంది. పొరపాటు గాని కాళ్ల పట్టు జారిపోయెనా, క్రిందనున్న నల్లకుక్క పాదాలు కొరికేయడంలో సందేహం లేదు; చేతుల పట్టుగానీ వదుల్తే ముఖం కుక్క కందుతుంది, అప్పు డింక ప్రాణం పోయినట్టే. ఈప్రకారంగా ముచ్చెమ టలూ పోసి, బరువుకి వూగులాడుతున్న కొమ్మలు విరిగి పోకుండా వుండడానికిన్ని, చెట్టుమీదవున్న కండచీమలు తన కాళ్లనీ చేతుల్నీ కుట్టకుండా వుండడానికిన్నీ కుక్కకి విసుగుపుట్టి వెళ్లి పోయేటట్టు చెయ్యడానికిన్నీ సర్వేశ్వరుని ప్రార్థిస్తూ అల్లా వున్నాడు. అయితే కుక్క మాత్రం మొండికత్తి "ఎంతసేపుంటావో చెట్టుమీద చూస్తాను కాదూ మరి" అన్నట్టు దృష్టి నిసుప్పి అక్క డనే స్థిరంగా భైఠాయించింది.

ఈవ్యవహారం అంతా గట్టునివున్న శేషయ్య చూస్తూనే వున్నాడు. సద్బ్రాహ్మడికి గట్టిఆపద వచ్చిం దని అనుకుని చలపతిరావుపంతులు కష్టం తొలగిద్దామనీ, కొంతవరకూ అతని మెప్పు పొందుదామని వుద్దేశాలతో, స్వభావతః పరోపకారియైన శేషయ్య వేపచెట్టుకేసి పరుగెత్తాడు. సన్నపాటి మనుష్యులికి నల్లకుక్క భయం

ఎంతమాత్రం లేదని అతనికి బాగా తెలుసును. గట్టుకింద నున్న మంచి నునుపైనది, బరువైనదీ రాయి నొకదాన్ని కుడిచేతులో సంధించాడు. తన కోపదృష్టులన్నీ చెట్టు లోంచి వ్రేల్లాడుతున్న చలపతిరావుపంతులుమీద నిలిపి వున్న నల్లకుక్క మన శేషయ్యని చూడలేదు. కుక్కకీ శేషయ్యకీ మధ్య నైదారుగజాలు ఎడం వుంటుంది. బాగా గురిచూసి శేషయ్య పాషాణం ప్రయోగించాడు. అస్త్రపరీక్ష నాడు అర్జునుని బాణం మాయపక్షిని తెగేసి నట్టు, ఆ రాయి సరిగా వెళ్లి నల్లకుక్క మూతిమీద తగిలేసరికి, 'కుయ్యో' మని దీర్ఘమైన ఒక్కకేక వేసి ఒక్కక్షణమాత్రం వెనక్కి తిరిగి ఆ గ్రామసింహం తోక ముడుచుకుని గ్రామంవైపు దౌడాయించింది

హృదయపూర్వకంగా దైవాన్ని ప్రార్థిస్తూ వుండిన చలపతిరావుపంతులు క్రిందివైపు చూస్తూనే వున్నాడు కాని ఏమిజరిగిందీ కొంచెమైనా అతనికి తెలియదు. మనస్సంతా అన్యథా (అనగా భగవంతుని వైపు) వుండడంచేత అతని యింద్రియాలన్నీ స్తంభించి పోయా యి. గజేంద్రమోక్షంలో "లావొక్కింతయు లేదు" అన్న పద్యంలో చెప్పినట్టుగా వున్నాడు మన చలపతిరావు పంతులు. అలాంటప్పుడు కర్ణకఠోరమైన శునకస్వనం చెవిని పడేసరికి అతనియింద్రియాలన్నీ ఒక్కమారు మేలుకున్నా యి. త్రుళ్లిపడి భయంలో కాళ్లపట్టు వదిలేశాడు. వొదిలేశాడేమిటి! వదిలిపోయింది. తరువాత చేతులొది లేశాడు. ప్రమాదవశాత్తు మొదట చేతులూ, తరవాత కాళ్లూ వొదిలివుంటే చాలా ప్రమాదం సంభవించేదే. భూమిమీద పాదాలపైని పడ్డాడు. పూర్తిగా తెలివివచ్చి చూశాడు. కుక్క అంతర్ధానం అయింది. ఎదురుగా చిరు నవ్వుతో వున్న శేషయ్య అతనిదృష్టిలో పడ్డాడు. చక్ర ప్రయోగంచేత మకరాన్ని సంహరించి గజరాజుని రక్షిం చిన నాటి విష్ణుమూర్తి తన పాలిటకూడా ఆవేళ ఆ 19 ఏండ్ల కుర్రాడిరూపంగా సాక్షాత్కరించాడేమో అని అనుకున్నాడు చలపతిరావుపంతులు: చెట్టులోనుంచి తానుచేసిన ప్రార్థన వూరికే పోలేదన్న సంతోషముతో చల్లపొంగరంలాగు గుండ్రముగా స్ఫోటకపుచుచ్చులతో నున్న అతని ముఖం వికసించింది. నవ్వుతూ ప్రశంసా పూర్వకంగా శేషయ్యని కౌగిలించుకొని, "నాయనా! నాపాలిట దేవుడిలా గొచ్చావు; ఎవరిచిన్నవాడవోయి తండ్రీ? నీపేరేమిటి నాయనా?" అని ప్రశ్నించాడు చల పతిరావుపంతులు. "నాపేరు శేషయ్యంటారండి; నేనీ వూరి కరణాన్నండి" అని శేషయ్య అనేసరికి తాసిల్దా రుగారు మొదట కొంచెం సిగ్గుపడినప్పటికీ (ఒక తహసిల్దారు ఒక కుక్కకారణంచేత కరణంయెదుట లాచారీ అవడ మనేది సిగ్గుకి కారణం కాదూమరి) వెంటనే నవ్వేసి, "చూశావూ. వెధవముండాకుక్క! నన్నుకూడా చెట్టె క్కించింది" అని గట్టిగా దిశలు బ్రద్దలయ్యేటట్టు నవ్వాడు! తరువాత యిద్దరూకలిసి వూర్లోకి లోకాభి రామాయణం మాట్లాడుకుంటూ నడిచారు

౪

శేషయ్య తాహసిల్దారుకి వెంకటసుబ్బయ్యగా రిల్లు దూరంనుంచే చూపించి, మలుపుతిరిగి పెరటిదారిని ఆయింట్లోకే ప్రవేశించాడు. పున్నమ్మ పెరట్లో ఒక్క



త్తే కూర్చొని నాల్గోవాచక పుస్తకంలో సింహంపాఠం చదువుకుంటోంది. శేషయ్య రాగానే ఆమె పుస్తకం మూసేసి, మందహాసంతో, "శేషూ! తహసిల్దారుగారి

భార్య వచ్చింది. మనయింటిపొరుగునున్న సావడిలో బస చేశారు. ఇంకా ఆయన వొచ్చినట్టులేదు. వారు వచ్చాక మానాన్న, ఆయన ఏమి కలబడుతారో అని భయంవేస్తూంది" అన్నది. ఆమాటలు విని, "చలపతిరావు పంతులు గారూ నేనూకలిసి యిప్పుడే వస్తున్నాం; అతడు చాలా మంచివాడులాగు కనిపిస్తున్నాడు. మీ నాయనకీ అతనికీమధ్య మరేంప్రమాదం సంభవించినా నేనున్నానుగా అన్నీ సరిచెయ్యడానికి"అని గర్వంగా శేషయ్యపలికిన పలుకులు పున్నమ్మకి అర్థంకాకపోవడమే కాకుండా, రాబోయే గాలివానలో తన శేషయ్యకు ఏమి ఆపద వస్తుందో అని విచారించింది. ఈ వ్యవహారంలో శేషయ్యని ఏమీజోక్యం కలుగజేసుకోవద్దని చెప్పేదేకాని ఇంతలో ఎక్కడో 'అమ్మయ్యో' అన్నట్టుగా ఒకఆర్తధ్వని వినిపించింది. స్త్రీకంఠస్వరం. సంగతేమిటో కనుక్కుందామని శేషయ్య వీథిలోకి ఒక్కఅడుగు వేశాడు. అక్కడేం కానరాలేదు. పొరుగున చావడిలోకి తొంగిచూశాడు. తహసీల్దారుగారి వంటమనిషి (అన్వఒకర్తె) ఒకమూలని తడకలగదిలో వంటచేసుకుంటూంది. తహసీల్దారు యింట్లో లేడు. రివిన్యూఇన్స్పెక్టరూ, అతనూ కలిసి కొన్ని యెండిన పొలాలు పరీక్షించి, వ్యవసాయదారుల రెమిషన్ అర్జీలు విచారించడానికి వెళ్లిపోయారు. 'అమ్మయ్యో' అన్నధ్వని ఆయింట్లోంచే వచ్చియుండాల్ని వూహించి శేషయ్య లోపల ప్రవేశించాడు. పెరటిద్వారంలో అతనికి కనుపించిన దృశ్యం అత్యద్భుతము! ఆశ్చర్యమైనసంగతి! నూతి దగ్గర అప్పుడే స్నానంచేసి తడిచీరతో, కాలం మళ్లినది, స్థూలశరీరంగలది అగు ఒకానొక ముత్తైదువు ద్వారానికి ఎదురుగుండా ముఖంతిప్పి నిలబడివుంది. ఆమె ముఖంవల్ల ఆవిడ భయభీతయైనదని స్పష్టమవుతుంది. గుమ్మంలో శేషయ్యవైపు వీపుతిప్పి అనగా అవిడవైపు ముఖముంచి నల్లకుక్క! ఆ ముత్తైదువే తాసిల్దారుగారి భార్య. పేరు లక్ష్మిబాయమ్మ. పురుషసింహం చలపతిరావు పంతుల్నే ముప్పతిప్పలా పెట్టిన నల్లకుక్క యాకృతి స్త్రీ యగు లక్ష్మిబాయమ్మను భయపెట్టిం దనుటలో ఆశ్చర్యమేముంది? అయితే దైవాత్తు లక్ష్మిబాయమ్మ చేతులో చెంబు వుండడంచేత కుక్క దూరంగా కూర్చునే, తనకు స్థూలకాయులగు మానవులమీదనున్న కోపం అంతా ... నయరూపంగానే చూపుతూంది కాని, ఆ యిల్లాల్ని సమీపించి నోటితో క్రియారూపంగా ప్రకటించడానికి ధైర్యం చాలింది కాదు. ఇలాంటి సందర్భంలో ... శేషయ్య వచ్చిన సడి కాగానే కుక్క వెనక్కి తలతిప్పి చూచింది. చూడడమే తడవుగా — మోరయెత్తి "కుయ్యో!" మని చెరువుగట్టుమీద తిన్న దెబ్బలన్నీ అంతా ఒక్కమారు దానికి అనుభవంలోకి వొచ్చినట్టుగా అరచి, చెరువుగట్టుమీద ప్రొద్దున్న ప్రారంభించిన పరుగు యిక్కడ పూర్తిచేసింది; పిమ్మట గోడమీది కొక్క లఘువేసి అదే పరుగు, వాయువేగ మనోవేగాలతో. "ఎవ్వరు నాయనా నువ్వు- మాదొడ్డ కుర్రాడిలా వున్నావు? నీదృష్టి కాగలేక వెధనకుక్క పరుగుచ్చుకుంది. నువ్వు రాకపోతే నా పనేమైయుండేదో నోయి బాబూ! స్నానం చేస్తుంటే గోడదిగి ద్వారంలోవొచ్చి చక్కా కూర్చుంది. పాపం రివిన్యూ ఇన్స్పెక్టరుగారి అమ్మాయి వాళ్లింట్లో స్నానం చెయ్యమంటూనే వుంటే బుద్ధిలేక యిక్కడ స్నానం చెయ్యడానికని వచ్చాను వొచ్చి నందు కనుభవించాను. పాపం! ఆపిల్ల మాదొడ్డపిల్ల, మణిపూస! పనిపాట్లు ఎంతశ్రద్ధగా చేసుకుంటుంది! తల్లి లేని పిల్లట పాపం! ఏదో ఒక లోపం!...నాయనా! నీపేరేమిటో చెప్పావుకావు?" అని తుదకి ప్రశ్నించింది. పేరు చెప్పడానికి అసలు సావకాశం కలుగతే కాదూ మన శేషయ్యకి! కొందరిస్త్రీలకు సహజమైన గుణం ఏమిటి అంటే, ఒక్క అంశంగురించి మాట్లాడుతూ వున్నప్పుడు వాళ్లకి జ్ఞాపకంవచ్చిన కబుర్లన్నీ యాకరు పెట్టడమే — అవిసందర్భమైనా సరే, అసందర్భమైనా సరే; ప్రస్తుతమైనా సరే, అప్రస్తుతమైనా సరే; లక్ష్మిబాయమ్మగారి అప్రస్తుత ప్రశంసమధ్యని శేషయ్య జవాబుచెప్పక వూరుకోవలసి వచ్చింది. ఆవిడ ధోరణి సన్నగిల్లిన తర్వాత శేషయ్య "నా పేరు శేషయ్యంటారండి, నే నీవూరికరణాన్నండి" అంటూ తొందరగా వీధులోకి నడిచాడు. కొలది కాలంలోనే తాసిల్దారంతవాడి చేతనే కాకుండా తాసిల్దారుకి తాసిల్దారయిన (చలపతిరావుపంతులు భార్యచే భయపడి నడుచుకుంటూంటాడని బిళ్లజవాన్ల గుసగుస



౫. పంచతీర్థములలోని సౌభద్రతీర్థమున స్నానమాడబోయిన అర్జునునివలన నందు మొసలియైయున్న యప్సరసకు శాపవిమోచన మగుట,



౬. బలరాముని నిర్యాణము. శేషావతారమగుటచే నోటినుండి సర్పము వెలికురుకుచున్నట్లు చిత్రింపబడినది.

ద్వారా వెల్లడి) లక్ష్మీబాయమ్మచేత కూడా మెప్పు పొంది, పొగడ్త లందినందుకు మన శేషయ్య గర్వానికి మేర లేకపోయిందంటే ఆశ్చర్యం లేదు. అందులో లక్ష్మీ బాయమ్మ పున్నమ్మయెడల చూపిన మాటల సానుభూతి చూస్తే, ఈ వ్యవహారం అంతా సమయం వచ్చినప్పుడు, శేషయ్య పున్నమ్మల వివాహానికి సహాయం చేసితీరు తుందని అతనికి నమ్మకం కలిగింది.

ఇలాంటి ఆలోచనలతో అతడు వీధులోకి వచ్చే సరికి ఎదురుగా వున్న సుబ్బయ్యగారి యింట్లోంచి ఏవో కేకలు వినుపించాయి. మాటలస్వరంబట్టి రివిన్యూ ఇన్స్పెక్టరు వెంకట సుబ్బయ్యకీ, తాసిల్దారుగారకు చలపతిరావు పంతులుకీ ఏదో వాగ్వాదం జరుగుతూం దని మన శేషయ్య గ్రహించాడు. వాలకం అంతా చూస్తే, పున్నమ్మచెప్పినట్టు వారిద్దరూ కలబడ్డారని అతనికి స్పష్టమైంది. ఇదే సమయ మనుకుని మెల్లిగా



సుబ్బయ్యగారింట్లోకి ప్రవేశించాడు శేషయ్య. గది గుమ్మందగ్గర నిలబడ్డాడు. లోపలనున్న ఆఫీసర్లిద్దరికీ వ్యవహారం సుతిమించి రాగంలోకి దిగింది.—"నువ్వు చిన్నప్పుడు తోటలో రేగుపళ్లు దొంగిలించి తోట వాడి చేత చావదెబ్బలు తిన్నావు, నువ్వా నాకు చెప్పడమే నట్రా, చల్లన్నా!" అని వొకరు; "నువ్వు మాత్రం ఏం బుద్ధిమంతుడ వని? మా డోక్లాసు చదువుతూ వున్నప్పుడు నువ్వు మేష్టరు కాంతారావుగారి డస్కులో సిరా పారబోసి, మేస్టరు, 'ఎవరు పోశార్రా?' అని అడిగేసరికి గుప్చుప్‌గా ముంగి పోతులాగు వూరుకొని, తరువాత మేస్టరుకి తెలిశాక బెత్తంతో దెబ్బలు తినలేదుట్రా, సుబ్బన్నా?" అని యిం కొకరు. ఇలాగు మాటలు మహా జోరై పోతూవుండడం విని, శేషయ్య, ఇకనూరుకుంటే సిగ్గుకి చేటేమో అని వూహించి, తలుపు మెల్లిగా తోసుకొని గదిలో ప్రవేశించి చూసేసరికి "చల్లన్న సుబ్బన" లిద్దరికీమధ్యని జానెడే డమైనా లేదు. జామెట్రీలో రెండువర్తులములొకచోట



కలిసిన రీతిచెప్పినట్టుగా వాళ్ల యిద్దరి పొట్టలూ అప్పుడే ఒకదాన్నొకటి అంటుతూ వున్నాయి; మొగాలు బాగా కాలిన మినపరొట్టెలాగు ఎర్రబారాయి; కోపం యిద్దరి ముఖాలమీద తాండవిస్తూంది; ఇద్దరు పళ్లు పటపటకొరు కుతున్నారు; పిడికిళ్లు గట్టిగా మూసి, ఆపిడికిళ్ల లో ఒకరి నొకరు నలిపి ముద్దచేసేస్తున్నారేమో అన్నట్టుగా వున్నారు. ఇలాంటి సమయంలో వాళ్లిద్దరూ తలుపుసది

విన్నారు. ద్వారంలోవున్న శేషయ్యాని చూశారు. ఉపన్యాసానికిదేకాలమని వెంటనే మన శేషయ్యా, "ఇదిగో, మీరిద్దరూ ఒకడిపార్టుమెంటు వుద్యోగస్థులు. చిన్నప్పుడు చదువుకున్నవాళ్లు. స్నేహంగా వుండకుండా పందెముకోళ్లలాగు ఒకరితో ఒకరు కాట్లాడుతూవుంటే బాగుండదు. నేను మీ తాబేదారుని; వీథిలో జవాన్లున్నారు; మాఅందరికీ ఈ అసందర్భం తెలిస్తే ఏంబాగుంటుందో ఆలోచించండి" అని, నల్లకుక్క కారణంచేత ఇదివరకే తాసిల్దారుని జేబులోవేసిన ధైర్యంతో, లెక్చరు వొదిలాడు. ఆ ఉపన్యాసం తను అనుకున్నట్టుగా వాళ్ల కోపాన్ని తొలగించి, లజ్జను ఆవేశింపజెయ్యాటం చూచి, మనస్సులో సంతోషించి, శేషయ్య వ్యవహారం చక్కపడుతుందని యెంచి,ఆనాటకంలో సూత్రధారము వహించుతే తనమాటలు వారిద్దరూ వినే అవస్థలో వున్నారని ఆలోచించి, మరింత ధైర్యం తెచ్చుకొని, తన రెండుచేతులతో వారిరెండు కుడిచేతులు కలిపి, "ఇక మీరు స్నేహంగా వుండాలి" అంటూ మళ్లీ యేదో కొద్దిగా లెక్చరు సాగిద్దామనుకుంటూవుంటే, రెండువేపులావున్న సుబ్బయ్య చలపతులిద్దరూ ఒకరినొకరు కౌగిలించుకొనే ప్రయత్నంలో వున్నారని తెలిసికొని, వాళ్లిద్దరి మధ్యనూ ఆలాంటప్పుడు నిలబడివుంటే ఆపొట్టలమధ్యని అడకత్తెరలో పోకచెక్కలాగు నలిగిపోతాడేమో అన్న భయంచేత, మెల్లగా ప్రక్కనుంచి జారి, ఆ ముసలి ఆఫీసర్ల పశ్చాత్తాపాన్ని సూచించే గాఢాలింగనాన్ని, కొంచెం దూరంగా నిలబడి, కన్నుల పండువుగా చూశాడు. "నన్ను నువ్వే మొదట చల్లన్నా అన్నా"నని ఒకరు; "నన్ను సుబ్బన్నా అన్నా"నని మరొకరు. "నీతో ఎప్పుడూ పోట్లాడనని చెంపలు వేసుకుంటున్నా"నని ఒకరు; "నీతో ఎప్పుడూ కోపంగా మాట్లాడనని చెవులు నులుపుకుంటున్నా"నని మరొకరు. "తెలివి తక్కువచేత నిన్ను అనిన మాటలు క్షమించు" అని సుబ్బయ్య; "బుద్ధిలేక నీమీద కోపంగా కేకలేసినందుకు క్షమించు" అని చలపతిరావుపంతులు. పిమ్మట, వచ్చిన పశ్చాత్తాపం బాష్పరూపంగా పొంగి వాళ్ల బొజ్జల మీంచి పారేదేకాని, ఇంతలో ఒక విశేషం జరిగింది.

వెంకటసుబ్బయ్యకోపం చల్లారుతూవున్నప్పుడు అతగాడిదృష్టి ద్వారంలో నిలబడివున్న శేషయ్యామీద పడింది. జరిగిన ముచ్చటంతా అతని ఊహలోకి వచ్చి "ఒక్కముక్క పచ్చలారని కుర్రాడు, ఇంతనాటకం చేస్తాడా!" అని పోతూవున్న కోపం మరలివచ్చింది. "శేషయ్యా! నువ్వెలాగొచ్చావు, ఈ వ్యవహారంలోకి? ఏదో సాటిశాఖ వాడివని వూరుకుంటూవుంటే, నీ అధిక ప్రసంగం ఎక్కువవుతూంది! నీ కక్కరలేని ప్రసంగం లేదు, మా పెద్దమనిషిలాగు! కుర్రముండాకొడుకులు కుర్రముండాకొడుకుల్లాగుండాలి!" అని అసంతృప్తి, ఆగ్రహం కనబర్చాడు సుబ్బయ్య. ఈమాటలు విని, చలపతిరావు పంతులు, "ఇదిగో ఈ కుర్రాడ్ని ఏమన్నా అంటే నే నొప్పుకోను, జాగ్రత్త; కుర్రాడు చాలా బుద్ధిమంతుడు. ఇప్పు డితడు లేకుంటే మనమిద్దరమూ గాడిదకంటే నీచంగా ప్రవర్తించి వుందుము. కృతజ్ఞత చూపడానికి మారుగా కోపపడుతున్నావూ!—రావోయి శేషయ్యా! ప్రొద్దున్న నువ్వు చూపినధైర్యం ప్రశంసనీయము" అని చలపతిరావుపంతులు ఆయువకుని చెయ్యి పట్టుకున్నాడు. సుబ్బయ్యకిదేమీ అర్థం కావటం లేదు. తహసిల్దారు కరణంగాడిని చెయ్యిపట్టి 'రావోయి బాబూ!' అని లాగడం అతగాడి సర్వీసులో ఎక్కడా అనుభవానికి రాకపోవడంచేత తెల్లమొగంవేసి, "వీడు కరణం శేషయ్య, ఎవరనుకున్నావోకాని!" అన్నాడు. ఆమాట విని చలపతిరావుపంతులు, "తెలుసును; కరణమైతేనేం, మనిషే. ఈ కుర్రాడివాళ ప్రొద్దున్న చెరువుగట్టుమీద లేకపోతే నల్లకుక్క నన్నేంజేసి వుండేదో?"—"చెరువుగట్టు, నల్లకుక్క" ఈ రెండుముక్కలూ చెవినిపడేసరికి వెంకటసుబ్బయ్య తేలుకుట్టినట్టు గెంతాడు. ఆరునెలలక్రిందట చెరువుగట్టుమీద తనకూ నల్లకుక్కకూ జరిగిన ముచ్చటంతా అతనికి జ్ఞాపకం వచ్చింది. దాంతో బిక్కమొగంవేసి వెంకటసుబ్బయ్య "ఏమిటీ? నల్లకుక్కా?" అని ప్రశ్నించేసరికి చలపతిరావు పంతులు కొంచెంసేపు క్రితం జరిగినసంగతి యావత్తూ పూసగుచ్చినట్టు చెప్పి, శేషయ్య ధైర్యాన్ని మరల ప్రశంసించి ముగించాడు. సాంతముగా విని, వెంకట

సుబ్బయ్య, "అబ్బ శేషూ! మనవూరి నల్లకుక్కని సాధించావన్రా నాయనా! ఎంతగట్టివాడవు!" అని వీపుమీద తట్టాడు.

ఇంతలో తాసిల్దారుగారి భార్య లక్ష్మీబాయమ్మ రంగంలోకి ప్రవేశించింది. ఆ యిల్లాలిని చూడడంతోటే చలపతిరావుపంతులు, ఒక్కసారి తాంబేలు తన శత్రువుని చూసేసరికి తన అవయవాలన్నీ బురిక్రిందికి ముడుచుకున్నట్టుగా, చిన్నవాడైపోయాడు. అతని సంతోషం అంతా మాయమైపోయింది. అయితే భార్యమొగం నవ్వుతూవుండడం చూచి అతనికి కొంచెం ధైర్యం కలిగింది. లక్ష్మీబాయమ్మగారు తహసిల్దారు గార్ని, రివిన్యూఇన్స్పెక్టరుగారిని చూచి, "ఓహో! బాల్యస్నేహితులుకామా మరి! వంటయింది స్నానానికి లెండి" అని ముసిముసినవ్వుతో అన్నది. "శేషయ్య లేకపోతే మా బాల్యస్నేహం బండలయ్యే"దని మన స్సులో వాళ్లిద్దరూ అనుకున్న సంగతి ఆమెకేం తెలుస్తుంది? ఇంతలో లక్ష్మీబాయమ్మ శేషయ్యవైపు తిరిగి, "ఇదిగో, ఈఅబ్బాయికూడా ఇక్కడే వున్నాడూ? నాయనా! ఇందాక చెప్పకుండానే వొచ్చేశావు! నిన్ను భోజనానికి పిలుద్దామని అనుకుంటూంటేనే వొచ్చేశావూ?" అనేసరికి, సుబ్బయ్య తనలో— "పిల్లందరకీ వెర్రా యేమిటి? ఈమాటలు నాకేమీ అర్థం కాకుండా వున్నాయి. ఈభాగ్యంతా నిజంగా శేషుగాడికే!" అనుకుంటూండేసరికి, లక్ష్మీబాయమ్మ సుబ్బయ్యవైపు తిరిగి, "సుబ్బయ్యగారూ! మీరుకూడా మా బసకి భోజనానికి రావాలి. మరేం అడ్డుచెప్పకూడదు" అని మరల శేషయ్యవైపు తిరిగి, "నాయనా! నువ్వంటే నల్లకుక్కకి సింహస్వప్నమోయి!" అనేసరికి చలపతిరావుపంతులు, సుబ్బయ్య యిద్దరూ గతుక్కుమన్నారు. "మళ్లా నల్లకుక్కేమిటి?" అని యిద్దరూ ఏకకంఠంతో పలికారు. అప్పుడు, లక్ష్మీబాయమ్మ ఒక పావుగంటక్రిందట స్నానంచేసినప్పుడు జరిగిన సమాచారం అంతా తెలిపింది.

ఇంతలో ఈగోలంతావిని పున్నమ్మకూడా లోపలినుంచి గదిలోకి వచ్చి ఒకమూలని ముసిముసినవ్వు నవ్వుతూ నిలబడ్డది. శేషయ్య దృష్టి వెంటనే చెదరిపోయింది. పున్నమ్మ చిరునవ్వు శేషయ్య పెదవులమీదకూడా మందహాసచంద్రికని ఉదయింప జేసింది. శేషయ్య మందహాసం గర్వసూచకంగా కూడా వున్నది. లక్ష్మీబాయమ్మగారుచెప్పిన నల్లకుక్క కథననుసరించి తదేకధ్యానముతో ఆలోచిస్తూ వుండిన వెంకటసుబ్బయ్య శేషుమీద కలిగిన సంతోషాన్ని పట్టలేక అతన్ని కౌగిలించుకుని, "బాబూ శేషూ! 'కాలభైరవు'ణ్ణి (ఆగ్రామంలో స్థూలకాయులంతా కలిసి ఆనల్లకుక్కకి 'కాలభైరవు'డని నామకరణం చేయించారు)లొంగదీశావుట్రా!" అంటూ వుంటే శేషయ్య బుర్రలో అనేక ఊహలు బయల్దేరాయి. వెంకటసుబ్బయ్యవంటి కోపిష్టికి కూడా తనమీద అనుగ్రహం కలిగిందని చూచి, 'పర్వాలేదు,జయించానుకొని, శుభముహూర్తం మించిపోకుండానే,అనగా వెంకటసుబ్బయ్య బాహుచక్రంలో వుండినప్పుడే, మన శేషయ్య ఈవిధంగా లెక్చరు ఆరంభించాడు: "సుబ్బయ్య మామా! నామనస్సులో నాలుగు ముక్కలూ చెప్తున్నాను విను. ఇన్నాళ్లనుంచి నీతో చెప్పడానికి సాహసించలేదు, నువ్వేమంటావో అన్న భయంచేత" అనేసరికి వెంకటసుబ్బయ్య ముఖకమలం దళితమైంది. ఇది చూచి శేషయ్యకి మరింత ధైర్యం కలిగి, "మామా! మరేం లేదు: ఇదుగో మీపున్నమ్మ! మాయిద్దరి వివాహానికి నువ్వు అనుమతిచ్చావంటే, మాయిద్దరికీ తృప్తికలిగించినవాడి వౌతావు"అని నాలుగుముక్కలూ తణుకూ బెణుకూ లేకుండా ఒక్కవూపిరిలో బజాయించాడు. ఈమాటలు వినీసరికి వెంకటసుబ్బయ్య ముఖంలో గొప్పమార్పు కలిగింది. స్వచ్ఛమైన సూర్యరశ్మితోనిండి కలకలనవ్వుతూ వున్న భూప్రదేశముమీద ఒకమాటు మబ్బువేసి నట్లయింది. కోపం వచ్చింది. ఆకోపంలో శేషయ్య అతనిచేతుల మధ్య ఏమైపోయివుండునో కాని, యింతలో చలపతిరావుపంతులు మాటల కుచ్చుకున్నాడు: "అభ్యంతరం ఏముంటుంది? ఈడుజోడు సరిగ్గా సరిపోయింది; నాకు ఆడపిల్ల లేక పోయిందికాని—" ఇంతవరకూ చెప్పి చలపతిరావుపంతులు భార్యవైపు ఒకపిరికిదృష్టి వేసి గప్చుమని మౌనం ధరించి బిక్కమొగం వేశాడు. తనభార్యవుద్దే

శం తెలియకుండా, తనమనస్సులోమాట బాహాటంగా వెలిపుచ్చినందుకు అతడు పశ్చాత్తాప పడుతూ, ఏంకోం పమునుసకుందో అని భయపడ్తావుంటే లక్ష్మీబాయమ్మ నవ్వుతూ, "సందేహమేమిటి? నాకుగానీ ఆడపిల్లవుంటే క్షణంలో నేను దానిని శేషయ్యకిచ్చి పెళ్లి చెయ్యనూ!" అన్నది. చలపతిరావుపంతులు 'బ్రతుకుజీవుడా' అనుకుని బాగా వూపిరి తీశాడు. చలపతిరావు పంతులు, ఆతని భార్య—వీరిద్దరివాక్యాలు సమయానికి టంకంపొడివేసి నట్టు పడేసరికి మన శేషయ్య సంతోషానికి మేరయెక్కడిది? కార్యమంతా సానుకూలంగా నడుస్తూవున్నందుకు అతడు తనలోనే ఈశ్వరునికి ధన్యవాదాలు సమర్పించాడు.

ఇంతమంది, యిన్నివైపులనుంచీ తనమీదకి దండెత్తేసరికి వెంకటసుబ్బయ్యమాత్రం ఏంజెయ్యగలడు? అతడు ముఖముతిప్పి మూలనున్న కూతురువైపు చూశాడు. అప్పుడు పున్నమ్మముఖం కొంచెంప్రక్కకితిప్పి,మందహాసంతో గోడమీద చూపుడువ్రేలితో ఏదోగీస్తోంది. పున్నమ్మ భావంకూడా సుబ్బయ్యగారికి వ్యక్తమైంది. విచారణ ముగిశాక సెషన్సుకోర్టులో జడ్జీగారు జడ్జిమెంటుయిచ్చి నట్టు గంభీరంగా వెంకటసుబ్బయ్య, "ఇంతమంది చెప్పాక తప్పుతుందామరి? 'జనవాక్యంతు కర్తవ్యం' అన్నారు; మీయిష్టమే నాయిష్టమూను" అన్నాడు. అప్పుడు లక్ష్మీబాయమ్మగారు మూలను ముసిముసి నవ్వులతోవున్న పున్నమ్మని చెయిపట్టి తీసుకొచ్చి, ఆమెచెయ్యిని శేష



య్యచేతిలో కలిపి, "ముందు బాజాలతోను,మంత్రాలతోను కాబోయే పాణిగ్రహణ మహోత్సవానికి కిది రిహార్సు" అని తనయింగ్లీషు పదప్రయోగానికి పక్కున నవ్వింది.

* * * *

మాఘ మాసంలో శేషయ్య పున్నమ్మల వివాహం జరిగింది. పెళ్లిలో తాసిల్దారు చలపతిరావుపంతులుగారు పెళ్లికొడుకు శేషయ్యపేర వెయ్యిరూపాయల కట్నం చదివించారు (అనగా భార్యఅనుమతి తీసికొని). పున్నమ్మ శేషయ్యల ఆయురారోగ్యములకు, సంతాభివృద్ధికి వారిని ఆశీర్వదించి మనంకూడా విరమిద్దాము.

---

## లీలాబాలుఁడు

కోటమర్తి నాగేశ్వర శర్మ గారు

ఒకటి కింకను బదుమూఁడు నొనరఁ గూర్చి
బొంగరములను, మిగుల నుప్పొంగి నీవు
స్వేచ్ఛయను రజ్జువునఁ జుట్టి చిత్రగతిని
ద్రిప్పుచున్నావు, మంచిదే; తెలియఁ బలుకు
విసుగు పుట్టదో? క్షణమైన విడువలేవు
బాలకా! నీవు సామాన్యబాలకుఁడవె?
కనులు మూయవు మెతుకైనఁ దినవు నీవు
కష్టసుఖములు నీకు సిక్కంబులేవో
పట్టుదల యొండె నాకుఁ గన్పట్టుచుండె
నెంతకాల, మిఁ కీయాట కంతు లేదె.

---




౧

పరశురామయ్యపంతుల పైసా సాయము లేనిది క్షీరపురిలో కాదుగదా, ఆయూరికి చుట్టుపట్టులలో నుండు గ్రామములలోగూడ పెండ్లిండ్లు కావు; చదువులు సాగవు; నాట్లు పడవు; కోతలు నెఱవేరవు; శిస్తులు చెల్లవు. వేయేల, ధనావసరము గలిగిన ప్రతిపనియు పరశురామయ్యవద్ద ప్రామిసరీనోటు వ్రాసిననే కాని కాదు. ఇప్పటి జనసామాన్యపుస్థితి యట్లున్నది. ఈ విధముగా చూచిన పరశురామయ్య ఆపద్బాంధవు డనియే చెప్పవచ్చును. కాని ఆయన పుచ్చుకొనెడి అధికపు వడ్డీలు చూచినను, నూటికి పదినూరులు పుచ్చుకొనునా డైనను పైసా త్రోసివేయుట కిచ్చగింపని కాఠిన్యమును చూచినను ఆయనను నక్షత్రకు డనువారేకాని ఆపద్బాంధవు డనువారు మాత్రము కానరారు. అయిన నేమి? అయన యివ్వవలెను, వారు పుచ్చుకొనవలెను. కాలము కలివుకాలము. పంటలు తక్కువ. ఖర్చు లెక్కువ. పిల్లలుజాస్తి. ధనికుడైనవాని నాశ్రయింపక జనసామాన్యము బ్రతుకు టెట్లు? కాబట్టియే ఆగ్రామజనులే కాక ఆచుట్టుపట్టుల నుండు గ్రామముల జనులుగూడ పరశురామయ్య పిడికిలిలోని పిచ్చుకలు. పరశురామయ్య మంచి నైష్ఠికుడు కాని అందులో మతాభిమానముకంటె సాంఘికపీడయు, నిరంకుశత్వము నే యెక్కువగా ద్యోతకమగుచుండును. దానికి తగినట్లుగా పరశురామయ్య మంచి ఒడ్డుపొడుగుగల మనిషి. దానికి తగినట్లుగా మొగము విశాలము. కన్నులు కాషాయపురంగు. అందువలన భయంకరుడుగా నుండును. ఉదయమే లేచి ప్రాతఃకృత్యములు తీర్చుకొని, స్నానసంధ్యా ద్యనుష్ఠానములు తీర్చుకొని, మొగము నిండిన విభూతిరేఖలతో, మెడనిండిన రుద్రాక్షమాలికలతో పంతులు వీథియరుగు పై గూర్చుండెనా, పిన్న పెద్దల కావీథిని నడువ వెఱపు. ఎవరు నడచినను పక్క పక్కలనే.

బుద్ధిశాలియగు విష్ణుశర్మ రాజకుమారులకు హితోపదేశము నేయుటకు కరటకదమనకుల నేనాడు సృష్టించెనోకాని, తత్సంతతివారు ఇప్పటికిని ఉన్నారు. సాధారణముగా పెద్దపెద్ద లందఱి కీమనుష్యరూప గోమాయువులే కన్ను, కాలు, చెవి, చిత్తము. సామాన్యముగా కులపెద్దలుగా నున్నవారి కేమి, గ్రామపెద్దలుగా నున్నవారి కేమి, మఱి యే యితర స్థానికాధికారముల లో నున్నవారి కేమి, ఈకరటకదమనక సంతతివారగు మనుష్య లోకరో, యిద్దరో పార్శ్వవర్తులై యుందురు. ఆపెద్దలకు వారు పెట్టినదే భిక్ష. ప్రత్యక్ష పరిశీలన తక్కువ. న్యాయాన్యాయవిచక్షణ శూన్యము. వారు తిమ్మయనిన తిమ్మ, బెమ్మ యనిన బెమ్మ. అంతకంటె దూరదృష్టి లేదు. పరశురామయ్య పంతులుకు శివయ్య

శాస్త్రి నమ్మిన బంటు. కోపించినప్పుడు ?తులు మెచ్చియు, శాంతుడై యున్నప్పుడు చెవులుకొఱికియు సమయానుకూలముగా పంతులువద్ద మెలగెడి నేర్పు శాస్త్రి కున్నట్లు మఱియొకరికి లేదు. పంతులుకు ఒకరిపై నిగ్రహముగాని, అనుగ్రహముగాని గలుగునట్లు ప్రసంగించుటలో శాస్త్రి కడు చతురుడు. పంతులుతో నేరైన నేవ్యవహారము నైనను జరుపుకొనదలచిరేని వారు శాస్త్రిద్వారా వెళ్లిననే వారికార్యము సఫలము; లేకపోయిన శాస్త్రి పుల్లవిఱుపు మాటలకు వారికార్యము పొల్లుగావలసినదే: కాన పంతులవలని భయముకంటె శాస్త్రివలని భయమే ప్రజల కెక్కువ.

౨

ఆయూరికి నడుమ నొకవేపచెట్టు; దానికిచుట్టు నొకగచ్చుటరుగు: దాని కమ్మవారి తిన్నె యని పేరు. దానిపై సాయంత్ర మైదుగంట లగునప్పటికే, పంతులు, శాస్త్రి, వారియనుచరులు కొందఱు సమావేశ మగుచుందురు. ఇక నక్కడ జరుగుచర్చలలో శాస్త్రదృష్టి తక్కువ; ఆచారపు పట్టుదల లెక్కువ. ధర్మనిర్ణయము తక్కువ; అధర్మపు తీర్మానము లెక్కువ. క్షేమవిచారణ తక్కువ; కష్టపెట్టు యత్నము లెక్కువ. సఖ్యపఱచు యోచన లల్పము; బహిష్కార బాంబుల ప్రయోగ మత్యధికము. ఎవరియింట నాలుఘగలు జగడమాడినను, ఎవరియింట నత్తకోడళ్లు వాదులాడినను, వీరికే. అందులో బలవంతులపక్షము చేరుట, బలహీనుల పీడించుట వారిపని. పంతులు శాస్త్రిని చూచి, 'శివయ్యా! ఏమిటి విశేషాలు?' అని తిన్నెపై గూర్చుండగనే యడుగును. అడుగగనే, 'బాబూ! వింటివో లేదో: రామయ్యకొడుకు పట్నంలో చదువుకు చేరగానే క్రాపింగుపెట్టినాడు. మొఖాన బొట్టు పెట్టుకోడు. ఇటువంటివాడు మాలకూడు తిని వచ్చాడంటే సందేహ మేమిటి? మఱియొకసంగతి: సుబ్బయ్య శాస్త్రికూతురు నిత్యము సాయంత్ర మయ్యేటప్పటికి తల్లో పూలు ముడుచుకోకమానదు. పెనిమి టెక్కడనో బొంబాయిలో చదు వేసుస్తుంటే యిదీ పూలుపెట్టుకొని కులకటం యేమిటో అర్థంకాదు. అది సరే. మొన్న వెంకటపలం వ్యాజ్యానికని గుంటూరు పోయి వితంతు వివాహం చేసుకున్నవాడి స్నేహితుడి యింట్లో తాంబూలం సేవించి వచ్చాడట. ఇక గోపయ్య, యీ గ్గండు వెళ్లివచ్చిన మాధవరావు తల్లి పినతల్లి ఆడబిడ్డల ఇంట్లో గప్పళ్ళ మే కొట్టి వచ్చినాడట. వెంకయ్యకొమార్తె గుజ్జుములా గున్నది, ఇంతవఱకు పెండ్లియన్న మేలేదు. ఒకటో రెండో అయ్యేవుంటుంది. అడిగేవా రెవరు? కులకట్టుబాట్లు కూలిపోతున్నవి. వర్ణాశ్రమధర్మాలు శాస్త్రచోదితకర్మలు వల్లకాడై పోతున్నవి. పెద్దవాళ్లము మన మింకా పూర్వాచారాలు విడువలేక చేస్తుంటే ఈకులభ్రష్టుల మూలంగా మనకుగూడా వర్ణసంకరం ప్రాప్తిస్తున్నది. ఇంకా మీవంటి కర్మిష్ఠులు వేదమ తాన్ని రక్షిస్తూఉండబట్టి ప్రపంచం యింకా ఏభూకంపపు ఉపద్రవంచేతనో నాశనంకాకుండా నిలిచియున్నది.' అని శివయ్య ప్రసంగముసాగించును. ఆస్తోత్రపాఠములో పంతులుకు శివము వెరుగును. అతడు నిజముగా తనవల్లనే లోకమంతయు నిలిచియున్న దనుకొనును. వేదమతము నుద్ధరించుటకు తా నొక శంకరావతార మనుకొనును. వెంటనే, 'పంపండోయి ఆంక్షాపత్రికలు, వర్ణసంకరం మా డాకొడుకుల కందరికీ' అనును. రాత్రి యెనిమిది తొమ్మిది గంటలవేళ ఈతీర్మానము. తెల్లవాఱేయు తెల్లవారక మునుపే యింటింటి కొక ఆంక్షాపత్రిక. అదిచూచి యా గృహస్థు లాలగోడు, బాలగోడు. ఇక వారి కేవ్యరును వారు పనిచేయరు. సరిగదా, ఏ బావినీళ్లను వారిని తోడ నీయరు. పురోహితులు ఆబ్దికాదికర్మలకు రారు. ఏ వారు భోజనపేరంటములకు బిలువరు. ఈవిధముగా వారెన్నిదినము లగచాట్లుపడుదురు? పాప మాగృహస్థు బాధలు పడలేక అమ్మవారితిన్నెమీద వేంచేసియుండు అమాత్యసమేతుడగు బహిష్కారచక్రవర్తిని, అనగా పరశురామయ్యపంతులును, క్షమాపణ కోరియో, అపరాధరుసుము చెల్లించియో, ప్రాయశ్చిత్తము గావించుకొనియో, బహిష్కారమును బాపుకొని, సంఘములో చేరుదురు. క్షీరపురిగ్రామస్థులకు పరశురామయ్య పంతులచే నివి నిత్యపాట్లు.

### 3

పరశురామయ్య పంతులుకు కొమారులు ముగ్గురు కొమార్తె లైదుగురు. పెద్దకొమారుడు కరిణీకము చేయుచున్నాడు. రెండవవాడు కొంత చదివి మానివేసి, పంటపైరులను, ఇచ్చి పుచ్చుకొను వ్యవహారములను జూచుచు, తండ్రికి సాయముగా నున్నాడు. మూడవవాడగు శంకరుడు బాపట్లలో మెట్రిక్యులేషన్ పరీక్ష నిచ్చి గుంటూరులో ఎఫ్. ఏ. చదువుచున్నాడు. కాని దురదృష్టవశమునన్నో, అదృష్టవశమునన్నో శంకరునకు ఎఫ్. ఏ. పరీక్ష రెండుమాఱులు పోయినది. మొదటిమాఱేమో ప్రమాదమనుకొనెనుగాని రెండవమాఱుగూడ పరీక్ష పోయిన దన




గనే పరశురామయ్యపంతులు కొడలు మండిపోయినది. "తెలివిమాలిన వెధవా, యీమాటుగూడా తప్పిపోయినావా? నీ వేమో చదివి తాసిల్దా రేడుస్తానని మీ అమ్మ యేడిస్తే వెయ్యి రెండువేలు నీబొందమీద పోశాను. చదివిందీలేదు యేడ్చిందీలేదు. యేటేటా తప్పటమే. నీచదువుకు పెట్టినడబ్బు కట్నంగా లాగవచ్చునంటే నష్టంలేదని ఒప్పుకున్నాను. ఇట్లా తప్పే వెధవకు కట్నమెవ రిస్తారు? ఇక చాలు, యింట్లో కూర్చో: చదువూవద్దు గిదువూవద్దు". అని యేమేమో తిట్టినాడు. పరీక్ష పోయినందులకే లోలోన క్రుళ్లి యేడ్చుచున్న శంకరునకు తండ్రిమాటలు గోరుచుట్టుపై రోకటిపోటువోలె మహావేదనను గలిగించినవి. అదినమెల్ల అన్నము నీళ్లు గానకుండ గదిలో ముసుగుబెట్టుకొని పడుకొని, యేడ్చి యేడ్చి వేసారిపోయినాడు. కడగొట్టుకొడుకని కాబోలు, సుభద్రమ్మకు శంకరునిపై మహాప్రేమ. కాన కొమారుని కడకు బోయి, 'నాయనా! వెధవపరీక్ష పోతేపోయింది. దానికోసం యింతదుఃఖపడట మెందుకు? ఏమో చదివితే మంచి దనుకున్నాము. మనగ్రహచారం చాలక కలిసి రాలేదు. పోనీ,నీవు చదివి సంపాదిస్తేనేగాని పొట్టగడవని సంసారం కామగదా? నీవు అన్నము నీళ్లూ కానకుండా యింతగా దుఃఖపడట మెందుకురా బాబూ! మీ తండ్రిమాటలకా, ఆయనమాట లెప్పుడూ అంతే. నీవు తప్పిపోయినావని ఆయనకు దుఃఖం లేదు; డబ్బు నష్టమైందని ఆయన విచారం: అందుకోసం అట్లా వేష్టపడ్డారు. ఆయనమాటలు మనకు క్రొత్తా. ఇవ్వాళ అట్లాగే అంటారు; రేపు ఆయనే మళ్లీ చదువుకోమని పంపుతారు నాయనా! ఏడవ్వద్దు బాబూ ఏడవ్వద్దు' అని తల్లి కడుపు గడ్డం పట్టుకొని బతిమలాడినది. శంకరుని మనస్సు తేరలేదు. ఏవిధముగానైనను పెద్ద పరీక్ష లిచ్చినగాని తనకు ఖ్యాతి లేదని భావించినాడు. కాన యేదేశం పోదాము, ఏమి చదువుదాము; ఎక్కడ చదివినస్తే గొప్పఉద్యోగం దొరుకుతుంది-అని దీర్ఘముగా యోచించినాడు. ఈవిధముగా యోచింప యోచింప; శంకరున కొకయుపాయము తోచినది. దానితో నాతని చింత నివృత్తియైనది. అంత చివాలున లేచి వంటయింటిలోనికి వెళ్లినాడు. తల్లి వంటచేయుచున్నది. ఆమెతో ఏమేమో గుసగుసలాడినాడు. తల్లి మొదట యొప్పుకొనని యట్లు మాట్లాడినది. తరువాత దీర్ఘచర్చమీద అంగీకరించినట్లు తల యూపినది. అప్పటికి ఎనిమిది

గంటల రాత్రి యైనది. శంకరుడు వేగముగా భోజనము చేసి తనము ల్లెమూటలు సరదుకొని చల్లగా తొమ్మిది గంటలకు వచ్చు పట్నంప్యాసిం జెరుకు వెళ్లి పోయినాడు. మద్రాసు ప్యాసింజెరుమాత వినినగాని అమ్మవారి తిన్నె దిగుపద్ధతి లేదు పంతులుకు. ఆవిధముగానే రైలుమాత వినగానే యింటికి వచ్చి భోజనము చేసి పడుకొనినాడు పంతులు. శంకరునిమీద కోపము వచ్చియుండుటచే నతని సమాచారము పరశురామయ్య అడుగలేదు, సుభద్రమ్మ చెప్పలేదు. ఆరాత్రి గడచిపోయినది.

ఉదయము స్నానసంధ్యాద్యనుష్ఠానము లన్నియు తీరినవెనుక రాత్రి చేపెట్టెలోని యెనిమిదివందల రూపాయలును ఇనుపపెట్టెలో పెట్టనిమాట పంతులుకు చప్పున జ్ఞాపకము వచ్చినది. తటాలున వెళ్లి చేపెట్టె తెఱచినాడు. ఇక నేమున్నది? రూపాయలసంచి లేదు. పంతులుగుండె గుభేలుమనినది. మొగము వెల్లనైనది. చేతులు వణకినవి. సంభ్రమస్వరముతో భార్యను కేకలెట్టిపిలిచి, 'రూపాయలసంచి లేదేమే' అనినాడు. 'ఏమో నాకేమి తెలుసు? ఎక్కడ పెట్టుకున్నారో బాగా చూచుకోండి' అన్నది సుభద్రమ్మ. 'ఇంకెక్కడ పెట్తాను? నిన్నసాయంత్రమే గదా, రామిరెడ్డి యెనిమిదివందలు యిచ్చిపోయినాడు! రాత్రికి యినుపపెట్టెలో పెట్టనచ్చును, ఇంతలో ఏమైపోతుందని ఈచందమూకాలోనే పెట్టిపోయినాను. రాత్రి జ్ఞాపకం లేకపోయింది. యిప్పుడు చూస్తే లేదు. వేసిన తాళం వేసినట్లే ఉంది. పెట్టినకాగితాలు పెట్టినట్లే ఉన్నాయి. ఎవరు తీశారు? పెద్దవాడు జమాబందీకి వెళ్లినాడు. చిన్నవాడు అత్తవారింటికి పోయినాడు. ఇక ఎవరు నాపెట్టె తీశారు? శంకిగాడేమైనా తీసి ఉంటాడా? ఏడీ శంకిగాడు?' అని సంభ్రమముతో ప్రశ్నించినాడు పంతులు. 'ఏమో' అనినది సుభద్రమ్మ.

'బహిర్భూమికి పోయినాడా?'

'ఏమో నే చూడలేదు.'

'అన్నిటికి యేమో యేమో అంటావు, నీదుంపతెగ, ఎక్కడికి పంపించావు చెప్పవే' అని పంతులు పట్టరానికోపముతో పండ్లు పటపటకొఱుకుచు పలికినాడు.

'రాత్రినుండి వాడిమొగమే చూడలేదు. నన్నడిగితే నాకేమి తెలుస్తుంది?' అని సుభద్రమ్మ అక్కడనుండి వెళ్లి పోయినది.

'ఏమో మాయగా వుంది' అని పంతులు పది మందిమనుష్యులను పిలిపించి నలువైపులకు పంపినాడు. రైలువద్దకు పంపినాడు. వాళ్లు నలువైపుల వెదకివచ్చి కనపడలేదని పంతులతో చెప్పినారు. అంతటితో రూపాయలచౌర్యము శంకరునిపనియే యని పంతులుకు రూఢిగా తోచినది. 'ఏమే, ఎక్కడికైనా పోతానన్నాడా, శంకరుడు?' అని భార్యను పిలిచి అడిగినాడు. 'నాతో చెప్ప లే'దన్నది సుభద్రమ్మ. శంకరునిమీద కోపమెక్కువైనది పంతులుకు. 'వెధవ, ఎనిమిదివందలు యెత్తుకొనిపోతే ఏమవుతుం దనుకొన్నాడు? ఒకవేళ యీయెనిమిది వందలతో ఈ ఎఫ్ఫే ప్యాసయినా బియ్యే ఎట్లా చదువుతాడు కుంక! పస్తులుపడి చస్తున్నాడన్నా పైసా పంపను. ఏమన్నా కానీ, వాడు నాకు కొడుకు గాడు; నేను వాడికి తండ్రిని కాను. నేటితోసరి. వాడికి నాగడప త్రొక్కేప్రాప్తి పోయిం' దని చిత్తము వచ్చినట్లెల్ల శంకరుని చెవులిట్టి యంతటితో కసిదీరక భార్యను తిట్టి, అంతకును ఉమ్మలికము దీరక నౌకరులను దిట్టి, తన కీసొద తెచ్చిపెట్టిన యింగ్లీషుచదువును తిట్టి, తాను డబ్బు ఇనుపపెట్టెలో పెట్టుకొనకపోయినందులకు తన్ను దిట్టుకొని, నోరు నొచ్చి వూరుకొనినాడు పరశురామయ్య.

౪

శంకరుడు ఇల్లు వదలి వెళ్లి వారము దినములైనది. మధ్యాహ్నభోజనానంతరము నిద్రపోయి లేచి విసనకఱ్ఱతో చెమట నార్చుకొనుచు సావడిలో కూర్చున్నాడు పరశురామయ్య. సుభద్రమ్మ పెనిమిటి కెదురుగా కత్తిపీట ముందువైచుకొని కూర్చుండి మామిడిపండు ముక్కలు కోసి పెనిమిటి కందించుచున్నది. ఇంతలో తపాలబంట్రౌతు ఒకజాబును తెచ్చి పంతులు కిచ్చి వెళ్లినాడు. తినుచున్న మామిడిపండు ముక్కల నావల పెట్టి పరశురామయ్య సులోచనముల దెచ్చుమని భార్యతో

చెప్పినాడు. వెంటనే గదిలోనికి వెళ్లి ముక్కద్దములను తెచ్చి యామె పెనిమిటి కిచ్చినది. భుజము పైనున్న కొల్లాయితో కంటియద్దములు తుడిచి కన్నులకు బెట్టుకొని, తత్తరపాటుతో నుత్తర మొక్కమాఱు చదివి, "అయ్యో!"అని పెద్దకేక పెట్టి, నిశ్చేతనుని వోలె




గోడకు చేరగిల బడిపోయినాడు. "అయ్యో!ఏమి! ఏమి!" అని మొఱపెట్టుచు కొయ్యయైపోయిన పెనిమిటిని సుభద్రమ్మ తియ్యబోయినది. మొదట పంతులు పెట్టిన గావుకేకను, తరువాత సుభద్రమ్మ యేడ్చిన యేడ్పును విని యింటిలోనివారును, నిరుగుపొరుగువారును పోగైనారు. బహుశైత్యోపచారములు చేసినమీదటగాని పంతులుకు ప్రాణము చేరుకొనలేదు. తెలివి రాగనే,"నాకొంప మునిగింది: నే నెట్లా బ్రతికేది?" అని పంతులు మరల దుఃఖింపసాగినాడు. పెనిమిటి యేడ్చుచుండెనని భార్య యేడువసాగినది. వారిని చూచి బిడ్డ లేడువసాగినారు. వా రందఱను జూచి యితరులు కంట తడిపెట్ట మొదలిడినారు. ఈవిధముగా నొకయఱగంట గడచిపోయినది. సమాచార మెఱిగి యేడ్చుచున్న దొక్క పంతులే: తక్కినవా రందఱాతని యేడ్పుజూచి యేడ్చుచున్నవారే. సంగతి తెలియకుండ యేడ్చుట బాగుగ లేదని పంతులు పెద్దకొమారుడైన లక్ష్మీపతికిదోచినది. కాన నతడు దుఃఖమును కొంత యుపశమింపజేసికొని ఉత్తరమును విప్పి చూచినాడు. అం దిట్లు వ్రాయబడియున్నది:

"రాజమాన్య రాజపూజితులైన శ్రీ కోటంరాజు పరశురామయ్య పంతులు నాన్నగారికి తమకొమారుడు శంకరు డనేక సాష్టాంగనమస్కారములు. తర్వాత నేను మూడుదినముల క్రిందట యీ బొంబాయికి వచ్చితిని. ఇచ్చటనుండి కే పుదయపు స్టీమరులో సీమకు వెళ్లుచున్నాను. మీ చేపెట్టెలోని యెనిమిదివందల రూప్యములను నేనే తీసికొనివచ్చితిని. నేను బారిష్టరుపరీక్ష యై వచ్చుట కగువ్యయ మంతయు గుంటూరులోని యొక న్యాయవాది యొసంగునట్లు ఆయనకు నాభాగపు ఆస్తిని తాకట్టువెట్టి యేర్పఱచుకొని వచ్చితిని. పరీక్షయందోడిన యవమానమును తీర్చుకొని, తన ఉద్యోగమున కర్హుడ నైన వెనుకనే తమ దర్శనము చేయగలను. క్షమించవలెను. మహాలక్ష్మి సమాన యగు మా తల్లిగారికి నా నమస్కారములు.

బొంబాయి, } ఇట్లు: విధేయపుత్రుడు,
౨-౬-౨౮. } శంకరుడు.

లక్ష్మీపతి యుత్తరము చూచుట ముగియుటతోడనే, 'ఏమిటి, ఏమి'టని అంద ఱడిగిరి. 'ఏమీ లేదు. మావాడు సీమకు వెళ్లుతున్నా నని ఉత్తరము వ్రాశా' డని అతడనెను. ఆమాట వినుటతోడనే, 'పంతులుకు బలేశాస్తి అయింది. ఊరందఱిని ఉత్తుత్త నెపములు కల్పించి వెలిపెట్టినట్టు గాదు' అని లోలోన సంతసింపుచు [సమి

కూడినజను లెక్కడివా రక్కడకు వెళ్లిపోయిరి. ఏమి ప్రమాదమో అని భయముతో నేడ్చుచున్న సుభద్రమ్మ ఆసమాచారము వినుటతోడనే యాసమాచారము తాను కొంతకొంత యెఱిగినదే యగుటచే ఏడ్పు మానివేసినది. కాని శిష్టాచారసంపన్నుడనని డాబులుకొట్టుచు, కారణము లేని నెపములు కల్పించి యూరిజనుల బహిష్కారములతో బాధింపుచు, నిరంకుశుడై వర్తింపుచున్న పంతు లాయవమానము నెట్లు భరింపగలడు? పాపము. పంతు లా యవమానదుఃఖమును సైరింపలేక, నలువురలో తల యెత్తుకొని తిరుగజాలక, యింట్లోనుండి బయటికి రాలేదు. తననిష్ఠ నీళ్లగలిసెనే, తనకే బహిష్కారకర్మము పట్టెనే యని లోలోన కుములుచు, అన్నము నీళ్లు గానక, చిక్కి శల్యమై, మంచము పట్టిపోయినాడు. పాప మాతడు వచ్చి కూర్చుండకపోవుటచే నమ్మవారి తిన్నె చిన్నపోయినది. తమ బహిష్కారవ్యాపారమునకు విఘాతము గల్గుటచే శివయ్య ప్రభృతులకు వెఱ్ఱెత్తినట్లయినది.

౫

శివయ్యశాస్త్రికి ఒకతే ఒక్కకూతురు: పార్వతి చక్కనిచుక్క; పరువమందిన బంగరు బొమ్మ. ఆ బిడ్డకు విద్యాబుద్ధులు గఱపుటలో పూర్వాచారపరాయణుడగు శివయ్య నూత్నపంథా త్రొక్కినాడు. అతని యనూనకృషిచే పార్వతి గీర్వాణాంధ్రముల యందు మంచిప్రజ్ఞావతి యైనది. "ఊరివారి నందటిని ఊరకనే ఆక్షేపిస్తావు. సీమదొరసానిలాగ నీకూతురుకు ఆచదువేమి"టని ఎవరైన నడిగినచో,"అయ్యా' ఏమి చెయ్యను? నాకు కొడుకైనా అదే, కూతురైనా అదే-నా ముచ్చటెట్లా తీరాలి?" అని దీనముగా జెప్పి తప్పించుకొనువాడు. "అవును పాపము" అని లోకులుగూడ మనస్సమాధానము చేసికొనువారు.

శివయ్య శ్రమపడి రెండువేలు పోసి పార్వతివిద్యాబుద్ధులకు దగినవరుని బి. ఏ. పరీక్షకు జదువుచున్నవానిని తెచ్చి పెండ్లిచేసినాడు. కాని విధివిధానమును దప్పింప నెవరితరము? శంకరుడు సీమకు వెళ్లిన యాఱుమాసములకు రాజమండ్రిలో చదువుచున్న పార్వతి పెనిమిటి గోదావరిలో నీతగొట్టపోయి యందుపడి మరణించినాడు. ఎవతెను తమ ప్రాణపదముగా నెంచుచుండిరో అట్టి తమ ప్రియకొమార్తెకు శారాని దురవస్థ ప్రాప్తించినప్పుడు తల్లిదండ్రు లెట్లు సైపగలరు? అందు శివయ్య దుఃఖము తల్లిదుఃఖముకంటె మిన్నయై పోయినది. పాప మాతడు నేల నంటిపోయినాడు. 'వాని వైధవ... నగలు పెట్టుకుంటున్నది. వీని వితంతుకొమార్తె ... తొడుక్కొంటున్నది. వానికూతురు సకేశి; వానియిం... బ్రాహ్మణార్థము చేయరా'దని నిరంతరము ఊరిజను... నాక్షేపించుచు పంతులుతో కొండెములు చెప్పి ఆం... పత్రిక లంపుచు బాధించెడిశివయ్య కిట్టికష్టము ప్రాప్తి... నందులకు 'పాపకర్మునకు దగినశాస్తి అయిం'దని ఆ... నగచాట్లు పడినవారు కొందఱు సంతోషించినను, పెక్కు మంది లావణ్యవతియైన పార్వతి దురవస్థకు మిక్కి... దుఃఖపడిరి. ఈదుఃస్థితిలోనే అభాగ్యురాలగు పార్వ... రజస్వలయైనది. ఏకకోరనియమములు వితంతువు ల... బింపవలెనని శాస్త్రి రూక్షముగా బలుకుచుండెనో, ఆకకోరనియమములను తనప్రేమైకనిలయయైన పా... తిపై ప్రయోగించుట యనిన శివయ్యహృదయము విదారి... చికొనిపోయినది. 'అయ్యో,ఆసాడురూపము నేను చూ... లే'నని తల గొట్టుకొని యేడువసాగినాడు. 'అయ్యో! ప... నాలుగేండ్ల పిల్లేగదా, ఇంకా రెండేళ్లు చీర రవికల... కట్టుకొంటేనేమి? చెవి కమ్మలైనా పెట్టుకుంటేనేమి! ... చేతి బంగారుగాజులైనా ఉంచుకుంటేనేమి!' ఆ... యోచన సాగించినాడు.తలనొప్పియు, దారిద్ర్యమును ... దాక వచ్చినగాని తెలియదని లోకసామ్యము గదా.

౬

మూడేండ్లు గిఱ్ఱున తిరిగిపోయినవి. శంకరరా... బారిష్టరు శంకరరావై స్వదేశమునకు తిరిగి వచ్చినా... తనరాక ముందుగా తల్లిదండ్రులకును, బంధుమిత్రులకును దెలియబఱచినాడు శంకరునిఆగమనవార్త దెలియబడగానే యింట్లో పెద్దవివాదము బయలువెడలినది. 'వస్తే రా... నాగడప తొక్కనియ్య'నని పరశురామయ్య వా...

'మూడేండ్లక్రిందట ఇల్లు వదలి పోయినబిడ్డ నేటికి మరల దేశంలోకి వస్తుంటే నేను చూడకుండా ఉండలే'నని సుభద్రమ్మ యేడుపు. వాడికి మనయింట్లో అన్నము పెట్ట వద్దు;నీళ్లు పొయ్యావద్దు. ఇంటికి వచ్చి చూచిపోనీ, దానిలో తప్పేము'ందని కొడుకులసమాధానము. 'శంకరుడు యింటికే రావాలె-పంతులుకు బహిష్కారపత్రిక పంపించేదే. అందఱిని వెలిపెట్టినట్టుగాదా, తనకు యింకోధర్మమా?' అని యూరిలోనివారి ఆలోచన. పంతులుకు ఎటు చేయుటకును తోచలేదు. శంకరు నింటికి రానిచ్చినచో గ్రామస్థులు తన్ను బహిష్కారావమానమునకు పాల్పరచెదరని భయము. రానీయకున్న భార్యాపుత్రులతో తీవ్రమైన పోరాటము. ఏది చేయును,ఏదిమానును? ఎటు చూచినను గళబద్ధకముగనే యున్నది. ఆలోచింప నాలోచింప, గ్రామస్థుల బహిష్కారమునకైన నొప్పుకొననగును గాని భార్యాపుత్రులతో పోరాడుటకు పరశు రామయ్యకు సాహసము కలుగలేదు. ఏల యందురా: "శంకరునితో నిర్దాక్షిణ్యముగా పోరాడినందుననే నాతడిట్లు విదేశ మేగుట ప్రాప్తించినది. అట్లు గాక 'నాయనా! పరీక్ష పోతే పోయింది, మళ్లీ చదువరా' అంటే శంకరుడింత సాహసం చేసేవాడు కానేకాదు గదా! కాబట్టి ఒక అవివేకము వల్ల కుటుంబమున కిట్టి యాపద తెచ్చి నాను. ఇప్పుడు ఈ భార్యాపుత్రులతో గూడ వివాదము పెట్టుకొనినచో వీ శ్లేమి చేస్తారో! యిందువల్ల మరల యెట్టికుటుంబ చిక్కులు వస్తాయో!" అని పంతులుకు మనస్సులో పెద్దభయము పుట్టినది. కాన ఎటను సమాధాన మీయకుండ ఊరకొనినాడు. తండ్రి మౌనము చూచి తమ్ము నింటికి పిలుచుకొని వచ్చుటకు అన్న లిరువురు పూనుకొనినారు.

మఱునాడుదయము రైలువద్దకు వెళ్లి అన్న లిరువురు శంకరు నింటికి తీసికొని వచ్చినారు. సుభద్రమ్మ కొమారుని కౌగిలించుకొని తన యనుపమాన వాత్సల్యమును నయననిర్గతబాష్పబిందువులచే వెల్లడించినది.




ముక్కవోయిన కత్తివలె, కోఱలు పెఱికిన సర్పమువలె, వాడిచెడిన వాడై, ఖేదమోదశూన్యమైన నిర్వికార నిరాలాప నిశ్చల దృష్టితో కొమారునకు స్వాగత మిచ్చినాడు పంతులు.

శంకరు డింటికి వచ్చిన సమాచారము ఒక్క నిమసములో గ్రామమంతటను వ్యాపించినది. సంబంధము లేని వారికిగూడ నూహాపోహాలతో సంబంధములు గల్పించి పంతులుచేసిన బహిష్కారములచే బాధింపబడియున్న గ్రామస్థులకు పంతులుపై కసిదీర్చుకొనుటకు మంచియవకాశము లభించినది. అనామకులందఱు నామకులైనారు. మూలనున్నవారెల్ల ముందుకువచ్చినారు. 'వాకిట్లోకివచ్చిన వాడు వంటయింట్లోకి వచ్చియుండడా? పంతులుపై బహిష్కారపుసందు ప్రయోగించవలసినదే.' అని నిశ్చయించి

నారు. ఆసాయంత్రము అమ్మవారితిన్నె గ్రామజనులతో బిలబిలలాడినది. బహుదినములనుండి బహిష్కార నాయకులలో నొకడుగా నుండుటచే నొప్పుదల లేకున్నను శివయ్య సభాధిపతిగా నుండుట తప్పనిసరి యైనది. సరే యని సభాధిపతిగా కూర్చున్నాడు. 'ఈ గ్రామపెద్దయు, శిష్టాచారసంపన్నుడును నైన శ్రీ కోటంరాజు పరశు రామయ్య పంతులుగారు, ఇంగ్లండు వెళ్లి మూడువత్సరములు దొరలతో మద్యమాంసాదులు సేవించి వచ్చిన కొమారుని యింటికి రప్పించి, యెట్టి ప్రాయశ్చిత్తము లేకుండ పంక్తిభోజనము పెట్టినారు గావున, వారిని బహిష్కరించడమైనది. నేటినుండి యీ గ్రామస్థు లెవ్వరును శుభాశుభకర్మలకు వారిని తమయింటికి పిలువరాదు; వారింటి కెవ్వరును పోరాదు. అన్ని కులముల వారు ఈకట్టడికి లోబడి యుండవలెను. అట్లు లోబడని వారు తమకులస్థులచే వెలివేయబడుదురు.' అని తీర్మానించినారు.

౭

పార్వతి శంకరునకు చిన్ననాటి నేస్తకత్తె. వారిద్దఱి కాఱేడువత్సరములు వ్యత్యాస మున్నను వారిద్దఱు చాల స్నేహముగా నుండువారు. బుద్ధిమతి యగు పార్వతికి శంకరుడు తనచెల్లెలితో పాటు చదువు చెప్పుచుండువాడు. ఆసమయములో తనసౌందర్యవివేకములచే శంకరునిమనస్సు కొల్లగొనినది పార్వతి. ఆమెబుద్ధి నైశిత్యమే శంకరున కామెపై నకారణప్రేమను గలుగజేసినది. అతడు పెద్దవాడై ఉన్నతతరగతులలో జదువుచుండెడి దినములలో గూడ సెలవుదినములలో తాను వచ్చినప్పుడు దినమున కొకటి రెండు మాఱులు శివయ్య యింటికి వెళ్లి పార్వతిని చూడకుండ నుండువాడు కాడు. బాలికలు చదువుకొనుట యనిన శంకరునకు మహా అపేక్ష. "పార్వతి శ్రద్ధగా చదువుకొంటుందని, చూడు, ఎంతప్రేమగా విచారించిపోతాడో! పట్నవాసాల్లో చదివే పిల్లలకు మహాగర్వం ఉంటుంది: పాపం, శంకరుడికి అటువంటివేషాలు లేవు. చిన్ననాడు ఆడుకొన్న సావాసంగూడా మఱచిపోకుండా పార్వతిని చూచిపోతాడు!" అని పార్వతి తల్లిదండ్రులు వాత్సల్యపూర్వకముగా శంకరుని శ్లాఘించుచుండెడివారు.

ప్రస్తావవశమున తల్లి పార్వతి వైధవ్య మంజీ సమాచారము శంకరునకు చెప్పినది. శంకరుని దయాపూర్ణహృదయమున నావార్త పిడుగుబోలె దా యాతని హృదయమును విదారించినది. 'అంత మంచి పార్వతికి, అంతవిద్యావతియైన పార్వతికి, అంత సౌందర్యవతియైన పార్వతికి, వైధవ్యమా! అయ్యో, విధి యెంత నిష్కరుణుడు!' అని నివ్వెఱబోయినాడు శంకరుడు. అప్రయత్నముగా నతని నేత్రములనుండి యశ్రువులు జలజల రాలినవి. ఆ దుఃఖ మాపు కొనుటకే అతని కెంతయో కష్టమైనది. పరస్పర ప్రేమ ప్రకటనము గావించుకొనుచు, స్త్రీ పురుషులు యథేచ్ఛముగా సంచారముచేసెడి దేశములో శంకరుడు మూడేండ్లు గడపివచ్చినాడు; పెక్కుమంది స్త్రీల గలసి వసించినాడు; చదువుకొనినాడు; విహారము సల్పినాడు: కాని యతని వినిర్మలచిత్త మెప్పుడును కళంకితము గాలేదు. విద్యావిహారముల స్వేచ్ఛావర్తినులైన పాశ్చాత్యనాగరక యువతీమణులయెడ నాతని హృదయ మెప్పుడును నాకర్షింపబడలేదు. అమాయకమును, సౌమ్యమునగు హైందవసాధ్వీముగ్ధస్వరూపము పార్వతీరూపమున నాతని చిత్తఫలకమున నంకితమై యుండుటయే యందులకు కారణము. పార్వతి వివాహిత యయ్యెనని యాతనికి తెలియును. ఆమెపై తనప్రణయదృక్కుల ప్రసరింప రాదనికూడ ఆతడు తలంచెను. కాని తనకు పత్నిగా నుండెడియువతి యిట్టి ముగ్ధమోహనసుందరి యై యుండవలె ననెడి తలంపునుమాత్ర మాతడు తనహృత్సీమనుండి తొలగింపజాలకపోయెను. ఈవిధముగా తనహృదయోద్యానమున గోప్యముగా పెంపబడుచుండెడి ప్రేమలతయైన పార్వతి దుర్భరవైధవ్యదుఃఖమునకు పాల్పడినదని వినుటతోడనే శంకరు డామెను చూడకుండ నుండలేకపోయినాడు. కాన తనరాకకు గ్రామస్థులు చేయుచున్న సందడియు, శివయ్య పూర్వాచార పరాయణత్వమును బాగుగా నెఱిగియుండియు, శంకరుడు చివాలున లేచి పార్వతిని చూచుటకు వెళ్లిపోయినాడు.

## ౨

శంకరుడు శివయ్యయింటికి వెళ్లినప్పటికి పార్వతి తలిదండ్రు లిరువురును నింట లేరు. చింతకు కాణాచియై యున్న మొగముతో, నశ్రువుల కునికిపట్టైయున్న కన్నులతో పార్వతి యాతనికి సావడిలోనే కన్పడినది. ఆమెను చూచుటతోడనే శంకరునకు మహాదుఃఖము వచ్చినది: అచేతనునివోలె యట్టె నిలువబడిపోయినాడు. అతనిని చూడగనే పార్వతికిగూడ పట్టరాని యేడుపు వచ్చినది. ఆతనియెదుట నిలువబడుటకుగూడ నశక్తురాలైనది. కాని విధివశమున నాసమయమున నామె తలిదండ్రు లిరువురుగూడ నింట లేకుండుటచే దుర్భరవైధవ్య దుఃఖోపహతచేతస్కయగు పార్వతియే యాతనిని కూర్చుండుడని మర్యాద చేయక తప్పినదికాదు. కాన పొంగి పొరలివచ్చుచున్న దుఃఖము నెట్లెట్లో కంఠగతము గావించుకొని, కుర్చీవైపు చేయిచూపి, 'కూర్చొండి' యనినది. దుఃఖభారముచే నిలువ నశక్తుడై యున్న శంకరుడు తత్క్షణమే కుర్చీలో కూలబడినాడు.

పార్వతికి పదునారువర్షములు వచ్చియున్నవి. కాన నామె యవయవముల పొందికయు, మేనిచాయయు నినుమడించి యుండెను. ఆమె యింకను చీరె రవికెలను ధరించియుండెను. మఱియు నలంకారములను గూడ పూర్తిగ పరిహరించియుండలేదు. అయినను నవి యెల్ల నిర్జీవశరీరమున కలంకరింపబడిన ట్లున్నవే కాని యామె కెట్టిశోభ నొసంగుటలేదు. ఆ అరుణాధరముపై చిఱునవ్వు కఱవై యున్నది. ఆ విశాలలోచనములలో నౌత్సుక్యోల్లాసముల భావమై యున్నవి. ఆచంద్రార్ధసదృశ లలాటభాగమున కుంకుమరేఖ కొఱయై యున్నది. ఆనిద్దంపు చెక్కుటద్దము లశ్రుధారాకళంకితమై యున్నవి. ఇరులు గ్రమ్మినట్లు ఎటు చూచిన విషాదచ్ఛాయలే మొగమున నుట్టిపడుచున్నవి. అట్టిస్థితిలో రూపవతియయ్యును పార్వతి విరూపవలెనే కన్పట్టుచున్నది. పార్వతి దైన్యాకృతి చూడంజూడ శంకరునిదుఃఖము దుర్భర మయ్యెను. అతడామెను బలుకరించుటకు గూడ నశక్తుడయ్యెను. లజ్జావనతయు, దుఃఖవిహ్వలయు నైన పార్వతిగూడ నాతని నెట్టికుశలప్రశ్నయు నేయలేదు. గోడ నానుకొని నిలువబడినది నిలువబడినట్లే యుండిపోయినది పదినిముసములపాటట్టె కడచిపోయినది. ఆపన్నురాలైయున్న పార్వతిని పలుకరింపవలసిన భారము తనదే యని శంకరునకు తోచినది. కాని, 'యేమని పలుకరింతును? నాయౌదార్య్ప మామెదుఃఖమును దూరీకృతము చేయునదిగా నుండవలదా? ఇట్టి విద్యాసరస్వతికి, ఇట్టి భూలోకసుందరికి, ఇట్టి అనాఘ్రాతకుసుమమునకు మాంగల్యశోభ నొసంగని వట్టి యౌదార్య్పలవలన ప్రయోజన మేమి?' అనుకొనినాడు శంకరుడు. కాని, 'యట్టిసూచన లేమైన చేసిన పార్వతియంగీకరించునా? శుద్ధవైదికుని కడుపునబుట్టిన బిడ్డగదా!' అని మరల యోచించినాడు. 'వేదమతమే యంగీకరించునో వైదికు లాచరించుటలో నాక్షేపణ మేమి? కాన గీర్వాణపండితురాలగు పార్వతిని పునస్సౌభాగ్యమును బడయుటకు గీర్వాణభాషనే శోధించి తరింపవలసినదని హెచ్చరించుట యుక్త'మని శంకరునకు తోచినది. 'అదియామె కష్టమును తొలగించుటకు యథార్థమైన యూరడింపు.'అని శంకరు డూహించినాడు. ఇందువ్రాయుటకు కొన్ని నిముసములు పట్టెనేకాని శంకరుని మనస్సీమ నిట్టిభావములు మెఱుపులు మెఱసినట్లు క్షణములో మెఱసిపోయినవి. శంకరుడు లేచినాడు; పార్వతివంక చూచినాడు. అవిరళాశ్రుధారలచే నామె లలితకపోలము లార్ద్రిము లై యుండుట శంకరునకు కన్పట్టెను. శంకరు డిక మనస్సు నిలుపలేకపోయెను. తనమాట లెవరైన విందు రను శంకనో, ఏమో,పార్వతినొకింత సమీపించి, "పార్వతీ! ఏడువకుము. ఆర్షమతము నీ సౌభాగ్యమును పునరుద్ధరించగలదు." అని చెప్పి వెడలిపోయెను. ఆపలుకులును, ఆయెడ నాతడు చూచిన చూపులును పార్వతి హృదయమున నాశాంకురముల మొలక లెత్తించినవి.

## ౩

గ్రామస్థులు గావించిన బహిష్కారతీర్మానము ఆరాత్రియే పరశురామయ్యపంతులు కందజేయ బడినది. అది చూచి పంతులు నిశ్చేష్టుడైపోయినాడు. 'అయ్యో! పూలమ్మినయూర కట్టె లమ్మవలసివచ్చె'నని, దుఃఖము

పడినాడు. తెల్లవాఱిన తరువాత గ్రామస్థుల మొగము చూచుట కాతనికి మొగము చెల్ల లేదు. కాన ఆరాత్రియే



"పార్వతీ! ఏడువకుము. ఆర్ష మతము......పునరుద్ధరింపగలదు"

మూట ముల్లెలు గట్టుకొని కాశీకి వెళ్లి పోయినాడు. సుభద్రమ్మ యాతనిని వెంబడించినది. ఊరిలోని కోలాహలము చూచి శంకరుడు గూడ నా రాత్రియే గుంటూరు వెళ్లి నాడు. తెల్లవాఱగనే బహిష్కార ప్రభావము పంతులింటివారికి బాగుగా కన్పట్టినది. పనిమనిషి రాలేదు, చాకలి రాలేదు. పంచాంగపు బ్రాహ్మణుడు, నీళ్లు పోయు సుబ్బమ్మ రాలేదు. ఎన్నడు నెఱుగని యీ దురవస్థకు పంతులు కొడుకులు, కోడళ్లు అడలిపోయి నారు. అలవాటు లేని పనులన్నియు చేసుకొని ఆదినము వారు భోజనము చేయునప్పటికి మూడుఝాములు గిఱ్ఱున దిరిగిపోయినవి.

పల్లెటూరి బహిష్కారములలో మతనిష్ఠకంటె పగసాధింపులే యెక్కువగా నుండును. ఆపట్టింపుల కర్థ ముండదు. ఆ ఆంక్షలలో న్యాయ ముండదు. దొరలకు గూడ సున్గ్ద లుతుకు చాకలులు దొరల దేశమునకు వెళ్లి వచ్చినవాడు వచ్చిన యింటి వారికిసున్గ్ద లుతుకకునుటలో నర్థ మేమున్నది!

## ౧౦

మానవులు తలచిన తలపులెల్ల, దలపెట్టిన కార్యములెల్ల నిర్విఘ్నముగాను, నిరంతరముగాను జరుగుచున్నచో, బలవత్ప్రభువులు 'భగవంతుడను వాడు లేడు: మేమే భగవంతుల'మని డప్పు బజా యించువారే; కాని అపారశక్తి సంపన్న పరమేశ్వరుడు వారి నొకకంట కనిపెట్టి వారి యత్నములకు విఘ్నములనో, వంచనలనో, పరాభవములనో కల్పించి తన జగన్నాథత్వమును నిలుపుకొనుటవలననే ప్రజాప్రపంచ మాయనను మఱ జాల కున్నది. దీనశరణ్యుడగు భగవంతు డట్లు తనమహామహిమను బ్రకటింపకున్నచో మతసంఘ రాజకీయాధికారుల కబంధ హస్తములలో పేదల రాయిడికి దీనజనులు అడిందవలసిన దేకదా!

ఇంకను బాగుగా తెల్లవాఱనైన లేదు— శివయ్యశాస్త్రి కొమార్తె యెక్కడకో పోయినదటనెఱుకుచున్నారు, అనువార్త యూరిలో బయలు దేఱినది. ఒకరి నుండి యొకరికి ఊరంతట నొక్క క్షణములో వ్యాపించినది. వైధవ్య దుఃఖము భరింపలేక ఎందులో బడినదో, ఏమైనదో అని ఊరంత వెదకిరి. కాని పార్వతిజాడ కన్పడలేదు. అందుమీద, "పెండ్లి చేసుకో పోయిందేమో" అని కొందఱు; "పెండ్లి పెటాకులు దీన్నెవడు చేసుకోవచ్చాడు! ఎవడో మోసగించి తీసుకుపోయినా"డని కొందఱు; "ఛా, అటువంటిది కాదు; మంచియోగ్యురాలు. యింట్లో కాలు బయట పెట్టియెఱుగదు. మూడేండ్లయినదిగదా మగడు చచ్చి ఒక్క చెడ్డమాట విని యెఱుగము. తలవని తలంపుగా యింత సాహసం చేస్తుందా?" అనికొందఱు; "ఏమి ఎఱుగనట్లుండే వాళ్లే యెంతపనైనా చేసేది" అని కొందఱు; "అదికాదు. మొన్న పంతులుకొడుకు శివయ్య యింటికి వెళ్లి నట్టు

విన్నాముకాదా; వాడే దాన్ని లేవదీసి ఉంటాడు" అని కొందఱు—ఎవరికి దోచినట్లువారు వ్యాఖ్యానము సేయ సాగించినారు. ఊరిలో ప్రజలగోల యిట్లుండ, తలిదండ్రుల గోడు చూడ శక్యము గాకున్నది. అల్లుడు పోయినందుకే యల్లాడుచున్నవారికి ఆకూతురుగూడ కంటికి కఱవై పోయినప్పుడు వారేవిధముగా భరింపగలరు? ఆదినమున వారు పాచిమొగములు కడుగుకొనలేదు; పాచివాకిలి యూడ్చుకొనలేదు; పండినపక్కలపైనుండి లేవలేదు: కన్నీటితో పక్కలు తడుపుచు అట్లే పడియున్నారు. ఎవ రెన్నివిధముల నోదార్చినను వారు దుఃఖవిముక్తులు కాలేదు.

ఆదిన మావిధముగా గడచిపోయినది. మఱునాడుగూడ వారట్లే దురపిల్లుచుండ నెక్కడనుండియో శివయ్యకొక యుత్తరమువచ్చినది. దాని నాత డాతురతతో విచ్చి చూడ, అం దిట్లు వ్రాయబడి యున్నది:

"పూజ్యులైన శ్రీతండ్రిగారిపాదపద్మములకు తమ ప్రియ కొమార్తె పార్వతి నమస్కార శతములు.

నాన్నా—

నీవు ప్రేమపూర్వకముగా నేర్పిన గీర్వాణభాష నాకు మాంగల్యభిక్ష పెట్టినది. చూడుము:—

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ,
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే."
—పరాశరుడు.

"పాణిగ్రహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా,
సాచే దక్షతయోని స్స్యాత్ పునస్సంస్కార మర్హతి."
—వసిష్ఠుడు.

మతకర్తలగు మహర్షులవాక్యము లట్లుండ, సర్వమంగళ విశేషదూషితమగు వైధవ్యావస్థతో నేనవయనేల? శాస్త్రనిషిద్ధము కాదని యెఱిగినపిదప నేనే పునర్వివాహమున కంగీకరించితిని. నీప్రియ కొమార్తెనైన నేను నీసహజవాత్సల్యమునకు దూరము గానని నమ్ముచున్నాను.

ఇట్లు: నీప్రేమంపుతనయ,
పార్వతి."

ఆయుత్తరమును చూడగనే శివయ్య గుండెబాదుకొని కొమార్తె పెండ్లాడుచున్నందుకు గాక ప్రతిష్ఠ పోయినందులకే కొంత యేడ్చి, 'సాధ్యమైతే చప్పుడు గాకుండా తీసుకవస్తాము' అనిచెప్పి, సమాచార మెవ్వరికి చెప్పకుండ, భార్యాసహితుడై గుంటూరు వెళ్లినాడు.

౧౧

సుప్రసిద్ధులగు లక్ష్మీనారాయణ పంతులుగారి యుదారకృషిచే పార్వతీ శంకరుల వివాహము మహావైభవముగా జరిగినది. కొమార్తెయత్నము నేవిధముగానైన మాన్పి యింటికి తీసికొనిరావలె ననునూహతో వెడలిన శివయ్యశాస్త్రి గుంటూరుజేరి, లక్ష్మీనారాయణ పంతులుగారి యింటి కేగి చూడ,నప్పుడే పెండ్లిపీటలపైనుండి లేచి పెద్దపెద్ద లందఱకు నమస్కరింపుచున్న పార్వతీ శంకరులు ప్రత్యక్షమైనారు. తండ్రిని చూచుటతోడనే తటాలున వచ్చి పాదములపై బడినది పార్వతి. తెల్లబోయి, తెలివి దెచ్చుకొని, "దీర్ఘ సుమంగలీ భవ" అన్నాడు శివయ్య!

---

# కవిప్రబోధము

మంగిపూడి వేంకటశర్మ గారు

(వెనుకటిసంచిక తరువాయి)

కవిమండలి సమకూరిచి - సవినయ మతు లగుచు దేశసౌభాగ్యము జే
రువ జేర్చునట్టి ఫక్కిక - లవలంబింపంగ దివురు డతి ధృతి మెరయన్.

ఎవ రేపొత్తము వ్రాసిన - జవమున స్వాతంత్ర్యపదవి సంపాదింపన్
వివిధోపాయము లిచ్చెడు - కవనమె యల్లంగ బద్ధకంకణు లగుడీ.

పెద్దదొ చిన్నదొ గీతమొ -. గద్దెమొ పద్దెంబొ యనక గ్రంథంబుల నే
పెద్దలు పిన్నలు వ్రాసిన - తద్దయు మన్నింపుడీ యుదారత నెరయన్.

దేశాభ్యుదయము జూపెడు - కోశంబులు గూర్పవలయు కోట్లకొలందిన్
కోశాభ్యుదయములోనే - దేశాభ్యుదయంబు గలదు తెలియుదు రె కదా.

ఏవీ దేశ చరిత్రము - లేవీ జీవితచరిత్ర లెన్నున్నవి యే
వేవీ దేశాభ్యుదయమె - పావన మని బోధసేయు పలుకబ్బంబుల్.

శీలమును బెంచునవియున్ - శ్రీలం గూర్పంగ నుపమ జెప్పెడు నవియున్
తాలిమిని దెలుపు నవియున్ - ధీలలితుల జేయు కృతులు దెలుగున గలవే.

నీతిని నిల్పెడు నవియును - చాతుర్యము నేర్పునవియు జాతీయకళా
భూతి మతసాంప్రదాయక - రీతుల బోధించు నెన్నికృతు లున్నవియో.

నిరుపమమగు నృపరీతిని - గరపు నవియు ధైర్యశౌర్య గాంభీర్యగుణో
త్కరుల గలిగించు నవియగు - వరకావ్యము లెన్ని తెనుగుబాసను గలవో.
బానిసతనమున మ్రగ్గెడు - మానిసులను దేశభక్తి మహితాత్ములు గా

మానసనిధులుగా మార్చెడు - మానితకావ్యంబు లెన్ని మన కున్నవియో.

కడుపున్ గక్కుర్తికినై - చెడు గ్రంథంబులను చెడుగుచిత్రముల రచిం
చెడు వారిని వారించెడు - నుడుగులుగల గ్రంథములు తెనుంగున గలవే.

దేశాభిమాన నిరతిని - దేశమె సర్వస్వ మనుచు ద్రికరణశుద్ధిన్
దేశమునకు బలి కాగల - ధీశాలుల జేయుకృతులు తెనుగున గలవే.

ఆత్మగౌరవంబె యైశ్వర్య మని సర్వ - సంపదలను రోసి శాంతి మదిని
కష్టములె సుఖాలుగా నెంచు నభిమాన - మతుల బుట్ట జేయు కృతులు గలవె.

బాలికలకు బాలురకున్ - స్త్రీలకు ప్రత్యేకవిధులు దెలిపెడు సద్గ్రం
థాలును నట్టివె పత్రిక - లాలోకింపంగ ముచ్చ టైనను గలవే.

ఆరోగ్యబలంబుల కా - ధారం బై సకలసౌఖ్యదం బగు వ్యాయా
మారాధన సాధనలం - గూరిచి వివరించు కృతులు కోరిన గలవే.

కల్ల బొల్లి పొత్తకము లెల్ల చదివి యే - త్రోవ తెన్ను లేక జీవితములు
వ్యర్థపరచుకొనుచు బ్రతుకుచున్నా రహో - పామరులు ద్విపాదపశువు లగుచు.

ఇట్టి పరిస్థితులం దిట - బుట్టిన సుకవులు స్వజన్మభూమికి గలయి
క్కట్టు లణప కంకణమును - గట్టుకొనన్ వలదె సార్థకత గనవలదే.

ధనమే ప్రధానముగ మీ-మనముల దలపోయ దగునె మాన్యులు గద జీ
వనములు బుద్బుదములుగద-ఘనకీర్తి గడింపవలదె కవిజనులారా!

కలమును బట్టినదానికి-ఫలమును దిలకింప నుదర భరణమె యైనన్
హలమును బట్టగ దగదే- కలితనమున మెరసి కీర్తి గాంచగవలదే.

కలమే కనకము గావలె-కలమే ఘనజాతిరత్నఖని గావలయున్
కలమే కోరందగినన-కలమున్ సమకూర్చు కల్పకము గావలయున్.

కలమే వజ్రము గావలె-కలమే విపదబ్ధికలము కావలె తొలియే
కలమే యన నెత్తగవలె-కలమే యవనతిని గన్న కవిజన్మ భువిన్.

కడు మూఢ్యంబున జిక్కిన-జడులగు దేశీయు లెల్ల జ్ఞాను లగునటుల్
వడివడి సద్గ్రంథము లెక్కుడుగా రచియించి ప్రజలకును నిడదగదే.

ఆశావాగురలన్ బడి-దేశంబును మరచి స్వార్థదృష్టిని మోహా
వేశు లగువారి బహుగతి-దేశము పహి ద్రిప్ప నీతు దిపురగవలదే.

దేశాభిమాని వేషము- దేశీయులు మెచ్చుపద్ధతిని వేయుచు ను
ద్దేశముల పనుల నేరగు- దేశద్రోహులను కవులు తెగడగవలదే.

మనసంఘమందు జొచ్చిన-మనమతమున జేరియున్న మూఢాచారా
లను మాన్పి సంస్కరింపగ-ఘనతర మగు దీక్ష బూన గవికిక దగదే.

తాటోటు మాట లాడుచు - కోటీశ్వరులట్లు నీటు గోటు గలిగి కై
లాటము చేసెడు తులువల - బూటకములు మానిపింప బోలదె కవికిన్.

మింగ మెతుకు లేదు మీసాల సంపెంగ - నూనె యన్నయట్లు కూల లింట
కూడు గుడ్డ లేక గోడు జెందుచు నుండ - షోకు చేయు నరుల నేక దగదె.

పూర్వతపఃఫలలబ్ధ మ పూర్వంబగు కవిత మారు' పుంతల నిముచు
దుర్వినియోగము చేసి య-ఖర్వాఘము గట్టుకొనగ గవులకు తగునే.

శృంగారరసం బన్న చె-విం గోసికొనంగ వేనవే లున్నారం
చుం గల పాత్తకములకే - శృంగారపు సంజ్ఞ జేర్ప జెల్లునె యకటా.

శృంగార నీతిశాస్త్రము - శృంగార బ్రహచర్య చింతామణియున్
శృంగార తర్కశాస్త్రం - బుం గల్పనచేయు కవులు పుట్టిరి బళిరా.

శృంగార శుకచరిత్రము - శృంగారపు బుద్ధదేవు శ్రీచరితంబున్
శృంగారపు సావిత్రిక-థం గల్పన జేయు కవు లుదయమై రహహా'

తిలకింప దేశమున కిది - ప్రళయసమయ మనుచు మదిని భావింపకయో
అలరుచు ప్రణయోదంతం-బులనే లిఖియించు చుండ బోలునె చెపుడా.

బంగారువంటి దేశము - దొంగలు పా లైసినట్టి దోసంబునకై
క్రుంగిన కవులకు మనకా - శృంగారరసంబు ప్రణయచేష్టలు చెపుడీ!

పచ్చియవినీతికథలను - స్వేచ్ఛాప్రేమంబులని రచించెద రకటా
రెచ్చి మృగంబుల వరుసను - స్వచ్ఛందవిహారు లగుటె పరమార్థమొకో?

వేదాంత మన్న ప్రజ కా-మోదం బగు నంచు విషయముగ్ధులె ద్రవ్యా
శాదోషప్రేరితు లై - వేదాంతగ్రంథగణము విరచింతు రహో!

ఏమొడలే దింతటి య-న్యాయం బిది ప్రజ కసాయ మని తలప కయో!
వ్రాయుదురు వైద్యగ్రంథము-లాయుర్వేదంబు తెలియనట్టి ఖలు లయో!

హాస్య మనియొ వినోదంబు లనియొ బండ - బూతు లన్నియు బుస్తకంబులను వ్రాసి
పరువు గలవారు తల వంచి పరితపింప - డబ్బు లాగుచు కైసరు లుబ్బ దగునె.

కవులు వ్రాసిన యేపుస్తకంబులైన - స్త్రీలు బాలురు చదివి చర్చించు నెడల
కొంకు సిగ్గుల కెడ మీయకుంటె కాక - యుపకరింపంగవలె వారి కొజ్జలట్లు.

తనకలమును దేశారా - ధనకై వినియోగపరచి ధన్యు డగుదు నే
నని దీక్ష బూని నెరవే - ర్చిన కవిరత్నంబు తెనుగుసీమను గలడే.

కవివరుల చేతిలో ను - న్నవి పత్రిక లెల్ల పత్రికావళివశ మై
భువనము లున్నవి నిజముగ - కవి తలచిన చేయలేని కార్యము గలదే.

గిలుకకుము కల్లకృతులను - పలుకుడు సత్కృతులు బుధులు బళిబళి యనగా
తళుకుంగరవాలము లన - కలముల ఝళిపింపు డాంధ్రకవివరులారా.

కవులకలములముఖముల గలవు మతము - సంఘమును దేశమును సమస్తమును గూడ
నెంతబాధ్యత తా నిర్వహింపవలెనో - యెరుగుకవి తన విధి నుపేక్షింప గలడె.

లోక మిపు డెట్టు లున్నదో - లోకము గనకున్నచో గలుగు ఫల మేమో
సాకల్యంబుగ దెల్పి వి-వేకము గలిగింప గవికి విధి కాదొక్కో!

ఉండ నిల్లు లేక పండ మంచము లేక - కడుపు నిండ త్రాగ గంజి లేక
కట్ట గుడ్డ లేక కష్టించు పేదల - కతలు వెల్లడింప కవికి తగదె.

ఆరుకోట్లమంది యస్పృశ్యులై సంఘ - దూరు లగుచు దేశభార మగుచు
దైన్యదశను మునిగి తల్లడిల్లుచు నుండ - వారి నుద్ధరింపవలదె కవులు.

ఏయంగళ్లను గన్న వి - లాయితి వస్తువులె వృత్తులకు భయ మయ్యెన్,
పోయెను ధనము ప్రవాహం - బై యీదురవస్థ కవుల కక్కరలేదే.

వెలతక్కువకె బజారున - సులభముగా చిక్కు ననుచు చూతురు కానీ
నెల తక్కువబిడ్డ లనుచు - తలపరు పరదేశముల పదార్థము లయ్యో!

దాపురించు నవణీతల్లి నెరుంగక - తండ్రిపెండ్లి తలచి తలచి పొంగు
చందమున విలాతి చౌక వస్తువులకు - మురియుచుందు రయ్యొ ముగ్ధనరులు.

అలజీవితంపు టవసర - ములకును గా కెల్ల భోగములకు విలాస
మ్ములకే కలధన మంతయు - సెలవయ్యెడు ప్రజ కిదేమి చేటుం బాటో.

కరి తిన్న వెలగపం డై - సిరి యెల్ల హరించి చేవ చెడి యున్నది బం
గరు భరతఖండ మయయో - మురిసెద రిది యేమి మోసమో కవులారా.

రత్నగర్భ యగుచు రహి నన్న పూర్ణ యై - పుణ్యభూమి యన్న పొగడు గన్న
ఆర్యమాత నేటి కన్నార్తురా లయి - శోక మొందదగునె సుకవులార!

మన దేశంబున నిర్మిం-చినవస్తువు మోటుదైన చిత్తము లలరన్
గొని వాడుకొనెడు నట్టుల-జనులను ప్రోత్సాహపరుప సత్కవికి తగున్.

ఏయంగళ్లకు బోయిన-నేగ్రే పొత్తములు చేత నెత్తిన దేశ
శ్రేయము బోధించెడు న - ధ్యాయములే చదువరికి సదా తోపవలెన్.

మన రాజనీతి చతురత-మనవిజ్ఞానాతిశయత మనయౌదార్య
మ్మును మనపరాక్రమంబును-గనువిందుగ నెల్లయెడల గన్పడ వలయున్.

మనరాజుల యౌన్నత్య-మ్మును మనపూనుల మహత్త్వమును మనసాధ్వీ
మణుల ప్రభావము శూరుల-ఘన సాహసశౌర్యములును గన్పడవలయున్.

మనస్త్రీల కలాకుశలత-ఘనశౌర్యము సాహసంబు గాంభీర్యంబున్
వినయము వివేక మీలువు-తనమును వర్ణించు సత్కథలె వెలయవలెన్.

మానము కొరకై నమసిన-మానవతుల చరిత లొప్ప మంగళకృతులన్
ధీనిధులు బాలశూరుల-గానము గావించు కృతులు గన్పింపవలెన్.

ఆలముల బెదరి వచ్చిన-బేలపతుల ప్రోత్సహించి పెంపు దలిర్పన్
దోలిపరువు నిల్పిన యా-బాలల శీలములె తోచ వలె గబ్బములన్.

నాటకంబుల యందును నవలలందు-సకలకథలందు సరసహాస్యములయందు
నాటపాటల యందును మాటలందు-నెల్లెడల దేశభక్తి రంజిల్లవలయు.

వ్యాసంబులలోన నుప-న్యాసంబులలోన బాంధవాశ్రిత తతితో
వ్యాసంగంబుల లోపల-దేశాభ్యుదయ ప్రసక్తి దీపింపవలెన్.

ఏలలను మేలుకొలుపుల-జోలల కోలాటములను సుద్దులలో వి
య్యాల వినోదపదంబుల-బోలగ స్వాతంత్ర్యభావములె వెలయవలెన్.

కవి యన్న వానితలపై-దవులుకొనసభార మెంతో తలపోసితిరే
కవిధర్మచ్యుతు డైనను-గవియరు వేలుపులు గతులు గలుగవు సుండీ.

ధర్మము నడిపింపంగల-కర్మఠు డై వెలయువాడు కవి యాకవినే
ధర్మమును విడిచి నడిచిన-నిర్మలుడని లోక మనునె నిష్కృతి గనునే.

దేవుం డిచ్చిన కవితను-దేవునకును ధర్మమునకు దేశంబునకున్
వావిరి వినియోగించిన-పావనుడే సుకవిపట్టభద్రుడు గాడే.

దేశంబు పరులపాలై-కోశంబులు పట్టిపోవ కూటికి పేదై,
క్లేశంబు లనుభవింపుచు-నాశం బగుచుండ జూడ న్యాయమె కవికిన్.

దేశాభి మాన మెద లవ-లేశంబులు లేక స్వార్థలీలావశులై
దేశీయు లుండ వారి స-దాశయులను జేయ గవులధర్మము గాదే.

జన్మభూమిగూర్చి జాతీయతనుగూర్చి-స్థితినిగూర్చి లోకగతిని గూర్చి
సంఘశక్తిగూర్చి స్వాతంత్ర్యమును గూర్చి-గిలికినారె నోట బలికినారె.

మూడుజగంబుల గడగడ-లాడించిన భారత స్వరాజ్యోద్యమమున్
వీడక బలపరుచుచు వెం-టాడెడు కవు లెంద రాంధ్రులం దున్నారో.

ఖద్దరయిన గట్టితిరో - వద్దికతో రాట్నమైన వడికితిరో యే
కొద్దియు ధన మిచ్చితిరో - యెద్ది యొనర్చితిరి చెప్పుడీ కవులారా!

కలకంఠము గలిగినకో - కిలలవలెన్ కొసరి కొసరి కీర్తింపుడు మి
మ్మలరించు జన్మభూమిని - నెలమిగ సోదరులు మదుల నెచ్చరిలంగన్.     (సశేషము)

# ప్రాచీన రాజధర్మము

మాకేమండ రామారావు గారు, బి. ఏ. (ఆనర్సు)

క్రీస్తుశకమునకు పూర్వము భారతీయ రాజ్యాంగ రంగమున రెండు విధములగు పరిపాలనాపద్ధతు లుండెడివి. వానిలో రాజాధీన రాష్ట్రము లెక్కుడుగనుండి, నేటికిని వర్ధిల్లుచున్నవి. రెండవది గణాధీన రాష్ట్రము.[1] వన ప్రజాచోదితుడగు నాయకునియాధిపత్యము క్రింద పరిపాలనము సాగింపబడు చుండెను. క్రీ. శ. 5 వ శతాబ్దానంతర మా గణములు క్షైణ్యము నందినవి.

రాజ్యమునం దైనను, గణమునం దైనను రాష్ట్రనాయకుడు ప్రజానియమితుడై యుండెను. వేదయుగమున రాజులు సభలచేతను, సమితులచేతను నెన్నుకొనబడుచుండెడివారు. దీనికి దశరథుని మరణానంతరము నూతన రాజ నియమార్థము రాజకార్యకర్తలు సమావేశమయిరను శ్రీమద్రామాయణాయోధ్యాకాండ స్థమగు నిదర్శనమే ప్రమాణము మఱియు నుజ్జయినీపరిపాలకుడును, ఛత్రపతిబిరుదాంకితుడు నగు రుద్రదమనుని ప్రజలెల్లరును తమ రక్షకునిగ నెన్నుకొనిరను జునగడ శాసనము ద్వితీయ నిదర్శనము.[2]

రాజకీయధర్మము లనేకములు మహా భారతమున పేర్కొనబడియున్నవి.

"ప్రజాదాయమున 1/6 సుంకముగ ప... గ్రహించియు ప్రజలను రక్షింపనియెడ రాజ నకు ప్రజాపాప ఫల మంతయు సమకూరు నని యున్నది.[3] కర పరిగ్రహణ విషయమున మిక్కిలి స్పష్టముగ నున్నది. బలిషడ్భాగము రాజునకు ప్రజారక్షణ వేతనముగను, సామ్రాజ్యానుభవము ప్రజారక్షణ బాధ్యత గలదిగను పేర్కొన బడినవి.

మనుధర్మశాస్త్రము రాజపదవి కెక్కుడు గౌరవము జూపుచు, రాజు నరరూపి యగు దేవత యనియు[4], నీలోకమున శాంతి నెలకొల్పుటకై రాజపదవి సృష్టింపబడియున్న దనియు[5] నధికారమదముచే ప్రజాపీడన మొనర్చునాతడు రాజ్యభ్రష్టుడై కుటుంబనాశము, నాత్మనాశము

1. "కేచి ద్దేశగణాధీనాః కేచి ద్రాజాధీనా ఇతి" —అవధాన శతకము.

2. "సర్వవర్ణై రభిగమ్య రక్షణార్థం పతిత్వే వృతేన"—Dr. Bhandarkar's Early History of the Dekkan, p. 28.

3. "అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణమ్; త మాహు స్సర్వలోకస్య సమగ్రం పాపచారిణమ్." —భా. ఆ. అ 213, శ్లో. ...

4. "మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి." —మ. ధ. శా. అ 7, శ్లో. 8.

5. "రక్షార్థ మస్య సర్వస్య రాజాన మసృజ త్ప్రభుః." —మ. ధ. శా. అ. 7, శ్లో. 3.

గూడ నందు ననియు చెప్పుచున్నది. శరీర బాధచే వీర్యమువలెనే, రాష్ట్రకర్షణచే రాజ జీవితము క్షీణించును.[6]

కరపరిగ్రహణాభిప్రాయమును, దానిచే రాజున కగు బాధ్యతయును మహాకవియగు కాళిదాసుచే నిట్లు ప్రశంసింపబడినవి: "సూర్యుడు వివిధజలాశయములనుండి జలము నాకర్షించి, తిరిగి శతాధికముగ దానిని విడుచునటులు, రాజు ప్రజలనుండి బలిని పరిగ్రహించెను."[7]

కరపరిగ్రహణవిధానము మహాభారత శాంతిపర్వమునందును, మనుసంహితయందును, గరుడపురాణమునందును గూడ చక్కగ నిర్ణయింపబడినది. "మధుపములు పుష్పములనుండి మధువును గ్రహించురీతిని, ధేనుపీడన స్తనవిదారణాదికము లేక గోదోహ మొనర్పబడునటులును, జలూక రక్తము పీల్చు చందముునను, రాజు శ్రీమంతులగు ప్రజలనుండి క్రమాభివృద్ధి నందురీతిని సుంకమును గ్రహింపవలెను."[8]

మహాభారతసభాపర్వస్థమగు యుధిష్ఠిర నారదసంవాదమునుండి యీ క్రిందిసంగతులు విశదము లగుచున్నవి. "రాష్ట్రమున చోరుల వలన, నత్యాశాపరులవలన, స్త్రీబాలక్రౌర్యమువలన నేమియు బాధ కలుగకుండవలెను. రాజ్యమున పెక్కులు సరస్సులు నిర్మింపబడి తత్రస్థమగు జలము భూములకు సమముగ నిర్దేశింపబడవలెను. కృషి, వాణిజ్య, గోరక్షణ కోశాదిరాజ్యాంగములు యోగ్యాధికారిపాలితములై యుండవలెను."

"రాజా ప్రకృతిరంజనాత్" అను నార్యోక్తి ననుసరించి ప్రజాసంరక్షణానురంజనములే రాజునకు ప్రథమకర్తవ్యములు. రాజశబ్దము తోషణార్థకమగు ధాతువునుండియే వచ్చును.[9] తా నామె పరిశుద్ధ యనియు, నక్లిష్టచరిత్ర యనియును విశ్వసించియు, కేవలప్రజానురంజనార్థమే శ్రీరాముడు సీత నరణ్యమున కంపుట యీ విషయమున ప్రమాణము.

మత్స్యపురాణస్థమగు నీయంశ మత్యాదరణీయము. "రాజు లెల్లపుడు నేకార్య

---

6. "మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్షయత్యనవేక్షయా। సో ఒచిరాద్భ్రశ్యతే రాజ్యాత్ జీవితాచ్చ సబాంధవః. శరీరకర్షణా త్ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా, తథా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్షణాత్."
—మ. ధ. శా. అ. 3, శ్లో. 112.

7. "ప్రజానా మేవ భూత్యర్థం స తాభ్యో బలి మగ్రహీత్, సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః."
—రఘు. 1. స. 4, శ్లో. 18.

8. "మధుదోహం దుహే ద్రాష్ట్రం భ్రమరా ఇవ పాదపమ్, జలౌకావ త్పిబే ద్రాష్ట్రం మృదునైవ నరాధిపః. అల్పే నాల్పేన దేయేన వర్ధమానాం ప్రదాపయేత్, తతో భూయ స్తతో భూయః క్రమవృద్ధి సమాచరేత్."
—భా. శాం. ప. అ. 88, శ్లో. 4,7.

9. "రంజితాశ్చ ప్రజాః సర్వా స్తేన రాజా." —భా. శాం. ప. అ. 59, శ్లో. 125.

ములు ప్రజాతోషకము, లెయ్యవి వారికి హేయము లని విచారించి, ప్రజల కసంతృప్తి నొనగూర్చు కార్యముల నాచరింపకుండవలెను."10

అధికార దుర్ణయములనుండి ప్రజలను రక్షించుటకొరకు, ప్రాచీనరాజ్యాంగతత్త్వవేత్తలనేకము లగురక్షల నుపపాదించి యున్నారు.

"స్థానికరాజకీయోద్యోగులు ప్రాయశః అధికార గర్వితులు, క్రూరులు నయియుండుటచే రాజు సర్వదా ప్రజల నుద్యోగులబారి నుండి రక్షింపవలెను" అని మనువును, శుక్రుడును గూడ విధించుచున్నారు.

సుప్రసిద్ధబౌద్ధయాత్రికుడగు హ్యుయన్ త్సాంగ్ చే నుదాహృతమగు హర్షవర్ధనుని కాలపు మతసమావేశమునుగూర్చి వివరించుచు హేవెల్ గా రిట్లు వ్రాయుచున్నారు—

"ప్రాచీనాదర్శ ప్రతిపాదకు లగు పండిత వర్యులకు ప్రజానాయకు లెక్కుడుగౌరవము జూపుటభారతరాజకీయజీవితలక్షణము. తత్త్వవేత్తల నిర్దేశములే కాక పట్టాభిషేకసమయమున రాజులు చేయు ప్రమాణముగూడ వారిని ధర్మనైతిక శాస్త్రముల కవిరుద్ధమై యుండు ప్రతివిషయమును దైవతుల్యముగ భావించి తదనుగుణ్యముగ ప్రవర్తించునటులు శాసించుచున్నది. ఆధ్యాత్మికస్వచ్ఛందతయును, వ్యక్తికరాజకీయములగు హక్కులును జాతీయ ధర్మమునను, రాజ్యాభిషేకప్రమాణమునను నణగియుండుటచేతను వానికైయీదేశమున వివాద మనవసరమై యుండెను. తృణబాహుళ్యనిర్మితమగు రజ్జువు మృగరాజైనబంధింపగలుగునటులు, పౌరాభిప్రాయము రాజశాసనమును నిర్దేశింప సామర్థ్యముగలి యుండును. నిరంకుశత్వముపై నియతుల న వదించుపట్ల హైందవ ధర్మశాస్త్రకారులు మిక్కిలి విస్పష్టముగ నుండిరి. ఈవిషయ నుగూర్చి చర్చించుచు హేవెల్ గారు ఇ యిట్లనుచున్నారు.—

"ఈ(శుక్రనీతిసార) గ్రంథకర్త మెప్పుడై యుండిన నాతడు సర్వరాజన్యమాన్యము ప్రాచీనధర్మము ననువదించు ననుట నిర్వివాదాంశము. ఈనీతిశాస్త్రములే రాజవిద్యాభ్యాసమునన గ్రగణ్యములు. ప్రాయికముగనే కరాజులు తమవిద్యావ్యాసంగముల మ చియు, పెడదారిని నేర్చియు నుండినను, హైందవయుగమున నాధునికసమ్మతమగు రాజ్యాగనిర్మాణ మేమియు నుండియుండ లేదనుట గొప్పతప్పు."

ఆధునికేతిహాస పరిశోధనా సూచితము లగు పూర్వీక స్థానికపాలనాపద్ధతులు, సమి సభాదినిర్మాణములు మున్నగు 12 వ శతా పునాగరికతనుగూర్చివ్రాయుచు హేవెల్ గా మరల నిటు లభిప్రాయపడుచున్నారు—

"హైందవరాజత్వ మెల్లపుడును ని మితమును, నిరంకుశమునే యను సామా పాశ్చాత్యాభిప్రాయము భారతచరిత్రము గూర్చి యైరోపీయులకు గల విమర్శనము

10, "తస్మాత్ ప్రయత్నేన నరేంద్రముఖ్యైః కార్యోఽనురాగో భువి మానవేషు." —మత్స్యపురాణము



ఉగత భాన చలే జబ కంథ తబ త్రియ దేఖ బియోగమే భీనీ
సోచ భరీ ముఖ సాస లియే తిహీ ఖేదహీ సో అఖియా భర లీనీ
దేఖి దసా ఫిరకే పియ చాహత ఆలి రహీ చకికే ఛబి ఛీనీ
భేరవరాగకీ రాగనీ సో లలిత యహీ నామ గునీ కహి దీనీ.

[జయపుర చిత్రము: దివాన్ బహదూర్ చతుర్భుజదాస గోవిందదాసుగారి యనుమతిని]

లలో నొక్కటి. సచ్ఛాస్త్రాదేశవినిర్మితమును, అధికారదుర్ణయ ప్రతీకార రక్షాసహితమునై యార్యమతమునకు సాంఘిక రాజకీయమూలకముగ నార్యులచే నిర్మింపబడిన హైందవస్థానిక ప్రభుత్వముకన్న నుత్కృష్టమగు పరిపాలనాపద్ధతి పూర్వముగాని, ప్రకృతమునగాని ఐరోపాఖండమున నెచ్చటను గానరాదు. ఆంగ్లస్వాతంత్ర్యము బహుళ వివాదానంతరమును, నంఘర్యుద్ధాదిమూలముగను సంపాదింపబడెను. హిందూరాజ్యాంగనిర్మాణములు మహాత్ములచే ప్రజాసౌకర్యార్థము నిర్మింపబడినవి. అయ్యవి ప్రత్యేకజాతులకు గాక జనులెల్లరకును వారి యోగ్యత ననుసరించియు, జాతీయాభివృద్ధి కనుగుణముగను, స్వాతంత్ర్యము, నైహికాముష్మిక ద్రవ్యముల నిచ్చునవియునై యుండెను."

క్రీస్తుశకమునకు పూర్వపు దక్షిణ దేశపరిస్థితులనుగూర్చి కృష్ణస్వామి అయ్యంగా రిట్లు వ్రాయుచున్నారు:

"ఆకాలపు రాజులు రాజకీయ విషయముల నుత్కృష్టములగు నాదర్శముల ననుసరించుచుండిరి. మంత్రి, పురోహిత, సైనిక, గూఢచారి, దూత్య విసిర్మిత సభాజనితమగు పౌరాభిప్రాయమునకు రాజశాసనము లోనయి యుండెను. బ్రాహ్మణులును, పండితులును రాజాస్థానముల నెక్కుడు గౌరవమంది ప్రజాస్థితినిగూర్చి తమయభిప్రాయముల నిరాఘాటముగ వ్యక్తీకరించుచుండిరి."

భారత దేశము ప్రజాపాలనానర్హ మను వాదమును సాగించుటకు రచింపబడిన యొక చిన్న పుస్తకమున భారత సానుభూతి గల చరిత్రకారులలో నగ్రగణ్యుడు స్మిత్ దొరగారు సహిత మిట్లు వ్రాయుచున్నారు:

"హిందూ మహమ్మదీయ యుగములలో రాజుల కెక్కుడుగ నధికార ముండిన యెడ వారలకు తత్తోధికమగు బాధ్యతగూడ నుండెను. ఒకరీతిని వారు ప్రభువులైనచో నింకొక విధమున వారు ప్రజాసేవకులుగ భావింపబడుచుండిరి. రాజులకు ప్రజాసేవకత్వము సారస్వతమునందును, విశేషించి యశోకశాసనములందును ప్రతిపాదింపబడు చున్నది."

ఏడవశతాబ్దమున భర్తృహరి తన నీతిశతకమున నిటుల నుచున్నాడు:

"ఓ రాజా! నీవు భూమినుండి గోవువలె క్షీరగ్రహణ మొనర్చునెడ నీ ప్రజలను ధేనువులవలె రక్షింపుము."

"ప్రభుప్రకృతులన్యోన్యానురక్తులై యుండు దేశము చక్కగ నభివృద్ధినందు"నని శుక్రనీతి యుపపాదింప, "రాజక్షేమమే ప్రజాక్షేమము, ప్రజాక్షేమమే రాజక్షేమము. అయినను పాలకుడు కేవలాత్మతోషణములందే యనురక్తుడు గాక, ప్రజాక్షేమకరములగు నంశముల నెల్ల నాత్మశ్రేయస్కరములుగ భావింపవలె" నని యర్థశాస్త్ర ముద్ఘోషింపుచున్నది.

---

# ఆధిపత్యము

మిన్నికంటి గురునాథ శర్మగారు

త్రస కధికార మున్నపుడె ధర్మము చేసినఁ బాప మాచరిం
చిన; సుయశంబుఁ బొందినను జెడ్డయసంబును గాంచినన్; మహా
జనుఁ డనుపేరుఁ జెందినను జాల్మ్యుఁ డటం చనునాఖ్యఁ గొన్న; నా
వెనుక మఱేమి యబ్బును? లభించును నాకమొ, కాలులోకమో.

ఎప్పటి కెట్టివీలు లభియించిన వేసరపోవ నీక తా
నప్పటి కప్పడే సుకృత మార్జన సేయుట లెస్స "దీప ము
న్నప్పుడె దేవులాడుకొన నొ"నని చెప్పరె పెద్ద లావలం
జొప్పడు నయ్య, నీకుఁ దటి, చూచునె నీమొగ మొక్కఁడేనియున్.

గతి యిఁక మీరె యంచు, నపకారము చేసిన మేలు చేసినన్
మతి యిఁక మిమ్ము వీడ దని, మాబ్రదు కంతయు మీదె యంచు, సం
స్తుతు లొనరించు మానవులు దూరమున న్నగుచుండ్రు నిన్ బద
చ్యుతుఁ గని యప్డు నీకు సుకృతోదయ మొక్కఁడె సుమ్ము దిక్కగున్.

"అదిరా కన్నును మిన్ను, గన్పడక యుగ్రానేక దుష్కార్యముల్
పొదలం జేసితిఁ బిన్నపెద్ద లనుచున్ బుద్ధిం దలంపన్, గనుల్
చదల న్నిల్పితి, గర్వి నైతి" నని పశ్చాత్తాపముం బొందఁ బో
వెదుసుమ్మా! యధికారపీఠ మెడ యా నేనాఁడొ ఆనాఁడునన్(?).

"అవురా దైవము లేదు పూర్వజనిపుణ్యం బుంటయుం బొంకు వే
దవిధుల్ కేవలకల్పితంబులు నిరాధారవ్యవస్థాక్రమం
బవు స్వర్గానుభవంబు సర్వజనసౌభ్రాత్రం బశక్యప్రియం
బవు"నం చెంచితి నంచు నేడ్చెదవుసుమ్మా, ఆధిపత్యచ్యుతిన్.

పరిణామంబు చరాచరప్రకృతికిన్ స్వాభావ్యమం చాత్మ నీ
వెఱుఁగం జాలవె? ఊసరక్షితియుఁ గాదే సర్వసస్యాఢ్య? ని
ర్ఝరిణీస్ఫూర్తియు నింక దే? జనుఁడ, నీస్వాంతంబున న్నిత్యతా
స్ఫురణం బాయుము వీడు గర్వమును జూపు న్నిల్పు భావిస్థితిన్.

"ఉపకారం బొనరింపఁ డాయె నని యెంతో యేడ్తువో మూఢుఁడా!
అపకారం బొనరింప కుండుటయె సుమ్మా నీకు మేల్సేఁత"యం
చపనోదించెడు లాఁతి నెవ్వగను, ని న్నాభంగిఁ బైవార ల
న్నపుడే "నత్తయు నొక్కయింటి స్నుష"యం చాత్మన్ విచారింపవో?

మాలోఁ బుట్టితి, వెట్టిటో పెరిగి తౌ మాలోన, మాలోన వి
ద్యాలేశంబును గంటి, మిత్రులదయన్ ప్రాప్తిం దదుద్యోగముం
బాలింపం దొరకొంటి, విప్పుడు మము న్వంచింప యత్నింతు; వే
మో లక్షించెడు క్రొత్తవారిపగిదిన్ భూతాభివిష్టుండవో?

వాడుకరీతిన్ దరియ వచ్చినవారలఁ గోపగించి మా
టాడఁగఁ బూన నెప్పటిక్రియం దగు బందుల నాదరింపఁగాఁ
జూడకయున్న, మిత్రుల నసూయను గాంచిన, నప్డు నీమదిం
గాఁడుసుమీ పరాభవవికారశరం బధికారశూన్యతన్.

నిను నీదౌష్ట్యము నీచరిత్రమును నీ నిస్సారవాచాలతన్
గనులం జూచి సహింప లేక సత మేకాంతంబునన్ సేవకున్
గినుకం దిట్టఁ గడంగు చుండెదరు దుష్కీర్తిప్రవాహంబు డా
యును మే ల్గల్గ దటం చెఱుంగ వింక నీయుద్యోగముం గాల్పనా?

నిత్యము లౌనె దేహములు నిల్చునె సంపద లెల్లకాలమున్
మృత్యువు వెంట నంటుకొని మేని కషాయము సేయ కుండునే?
సత్యపథం బొకండె నిను స్వర్గముఁ జేర్పఁగఁ జాలు నేల నీ
భృత్యుల నేడిపించుటలు కృత్రిమపుంబను లాచరించుటల్.

చేతికిఁ జిక్కి వీఁడు కృప సేసినచో నిఁక నన్నుఁ గాంచి ని
ర్భీతి మెలంగు నంచు నొనరించెద వీ వపకార మయ్యయో! నీ
చేఁతకు నవ్వ వచ్చుఁ గృప సేసినచో నిను గౌరవింపఁడే?
ఆ తెరు వేల ద్రొక్క, ఫణియట్లు? దురాశయపూరితాత్మకా!

మనవుల్ శ్రోత్రములం జొరంబడవు, ప్రేమారావముల్ నోటఁ రా
వు, నమస్కారములం గనుల్ గనవు; చూపుల్ క్రోధముం గ్రక్కు చుం
డు; నవిశ్వాసము నెమ్మదిం గలఁచు చుండున్, సుస్థిరానంద మెం
దు నిమేషం బయినన్ లభింపదు దురుద్యోగప్రభావంబునన్.

మిత్రులతోనైన మెలఁగడు మన సిచ్చి తనగౌరవంబు తగ్గునో యటంచు
ఆంతరంగిక సేవకాళితోనైన నవ్వుచుఁ బల్కఁ డేదియో పోవు నంచు
ఎఱిఁగినవారలే నెఱిఁగినఁ దల వంచుకొనిపోవుఁ దన కేమొ కొదవ యంచు
చూడ వచ్చినవారితోడనే సభిముఖుం డై పల్కఁ డభిమాన మూరు నంచు
అమ్మనైనను "నాయనా" యంచుఁ బల్కనోడు నెప్పుడు ధుమధుమలాడు నంచు
బిడ్డలైన దగ్గఱకు రా బీతు సెందు-నాధిపత్యదౌర్జన్య మేమంతసుఖమొ?

తొలి నీచేసిన పున్నె మీపగిది నుద్యోగంబుగా మారు నం
దుల కానందము సెంది యెడ్డ నిపు డంతో యింతో పున్నెంబు నె
ట్టులనేనిం గడియించుకొమ్మదియ యుండు న్నీకుఁ దో డయ్యు నె
చ్చెలి చందంబున భావిజన్మమునకున్ సిద్ధంబుగా మూర్ఖుఁడా!

*　*　*　*　*

తా నొనరించుకార్యము సదా సఫలం బగు చున్నచో భళీ!
యేనె సమర్థుఁడన్ భగవదిచ్ఛ యటంట యసత్యమం చనున్
గాని యొకండు చేటు పొడగట్టినచోఁ దన కప్పు డీశ్వరా
ధీనము సర్వ మంచుఁ బ్రణుతింపఁ దొడంగు మనుష్యుఁ డద్దిరా!

---

## ప్రార్థనాద్వయము

కప్పగల్లు సంజీవమూర్తి గారు
(అనువాదము)

నిన్న రాతిరివేళ నాచిన్నిసుతుఁడు
తనదుపిన్నాఁట తప్పొప్పికొనుచు నాదు
మ్రోల జానువులూది కూర్చుండి యశ్రు
వితతి గ్రమ్మఁగ, "దేవ! వివేకయుతుఁడు
బలయుతుఁడు నైనమాయయ్యపగిది నన్ను
బెద్దవానిని గావింపవే" యటంచుఁ

బ్రార్థనము చేసె; నంత నే వాఁడు నిద్ర
పోవుపడకచెంత యొకింత మోఁకరించి
శిరమువాంచి నాయఘము లేకరువుపెట్టి,
"దేవ! నిష్కల్మషాత్మతఁ దేజరిల్లు
వీనిగతి బాలు ననుఁ జేయవే" యటంచు
భావ మొప్పంగఁ జేసితిఁ బ్రార్థనంబు.

---

# చెంచులు, కోయలు

ఆర్. సుబ్బారావు గారు, బి. ఏ., యల్. టి.

౧

## 1. చెంచులు

### ఆకారాది విశేషములు

చెంచులు నల్లని శరీరమును, ఎత్తైన బుగ్గ ఎముకలున్ను, నల్లని లోతైన కండ్లును గల్గిన అడవిజాతివారు. వీరు పొట్టిగ నుందురు. వీరుకోయలవలెనే సోమరితనము, త్రాగుడు మొదలగు దురాచారములకులోనై, దొంగతనములు, నరహత్యలు మొదలగు పాపపుపనులు చేయుటయందు కడుసమర్థులు.

### నివాసములు

వీరు గోదావరిజిల్లాలోని చోడవరము, పోలవరము ఏజన్సీలయందున్ను, కర్నూలు జిల్లాలోని నల్లమలెకొండలయందున్ను, అడవుల యందున్ను ముఖ్యముగా నివసించుచున్నారు. మరియు తూర్పుతీరమునం దంతటను ఇప్పుడిప్పుడు తెనుగుమీరి నాగరికులై, స్వల్ప వ్యాపారములపైని తిరుగుచున్నారు. అడవి చెంచులు వీరివలె గాక, శ్రీశైలప్రాంతమందలి అడవులయందు అనాగరికులై గుహలలోను, చెట్లక్రిందను అడవిజంతువులవలెనే బట్టబయళ్లలో నివసించుచున్నారు. వీరు వెదుళ్లతోను, చొప్పతోను తమగుడిసెలను నేసుకొని నివసింతురు. వీరు కాపురముండుపల్లెలకు 'చెంచుగూడెము' లని పేరు. ఈ గూడెములయందు 10 మొదలు 50 వరకు గుడిసె లుండును. అడవిచెంచులు గుడ్డపీలికలను, ఆకులను ధరించి, వారిమానములను కాపాడుకొందురు. వీరు కాపురముండు గూడెములు ఒకదానికొకటి చేరువగనే యుండును. చెంచుగూడెములలోని గుడిసెలు తేనెపట్టువలె దగ్గరదగ్గరగా కట్టబడియుండును. తరుచు ఒకే కులమునకు చెందిన చెంచు లందరు కలిసి నివసింతురు.

### చెంచుకులములు

వీరు తమ యిష్టదైవమైన శ్రీకృష్ణుడే చెంచుకులమును ఏడుజాతులుగ పుట్టించెనని నమ్ముదురు. ఆజాతులపేర్లు ఈక్రింద వ్రాయబడినవి.—

1. అడవిచెంచులు

వీరు బొత్తిగ అనాగరికులై, అడవిజంతువులను బోలి సంచరింతురు. అడవిపంటలను దినుచు, అడవులయందు సంచరించుచున్నారు.

2. గైతచెంచులు లేక గడపలు

వీరు వ్యవసాయము, ముఖ్యవృత్తిగా గల్గి, అడవిచెంచులవలె సోమరులై తిరుగక, నివాసము లేర్పరుచుకొని కాపురము చేయుచుందురు.

3. దాసరచెంచులు

వీరు అడవులయందు తిరుగాడు పులులను, దుప్పులను, నెమళ్లను వేటాడి, వాటి చర్మములను, గోళ్లను, వెండ్రుకలను సంపా

దించి, సమప్రదేశమునందలి ప్రజలకు అమ్ముకొనుచు జీవించుచున్నారు. వీరు ముఖ్యముగ సవరములను, నెమిలికన్నులను, పులిగోళ్లను పెద్దపట్టణములయందు అమ్ముకొను విషయము మనకు తెలిసినదే.

**4. పుట్టచెంచులు**

వీరు తేనె, మైనము, కొమ్ములు మొదలగు అడవిపంటలను సంపాదించి సమప్రదేశములందలి ప్రజలకు అమ్ముచుందురు.

**5. ఆటచెంచులు**

వీరు చెంచుకులము లన్నిటిలోకి తెలివిగలవారు, నాగరికులు. వీరు చెంచునాటకములను ఆడుచు, చెంచులక్ష్మి కృష్ణునిచే వరింపబడినదనియు, గనుక కృష్ణుడు వారి ఇష్టదైవమయ్యెననియు చెప్పుచుందురు.

**6. వేటచెంచులు**

వీరు అడవిజంతువులను వేటాడుట, పక్షులను గొట్టుట, చేపలను బట్టుట మొదలగు వృత్తులవలన జీవించుచున్నారు.

**7. ముత్తరాసుచెంచులు**

వీరు గింజలు, పూసలు, సూదులు మొదలగు వస్తువుల నమ్ముకొనుచు జీవించుచుందురు. వీరు సోది చెప్పుటలో కడుసమర్థులు.

పై ఏడుకులములవారు ఒకరితోనొకరు భోజనములను చెయ్యరు. సంబంధబాంధవ్యములను జరుపరు. వివాహాదికృత్యములు కులమువారిలోనే జరుగుచుండును. పై కులముల యుత్పత్తికి ఆయాకులములు చేయు పనులే ముఖ్యకారణములుగా కనబడును.

**చెంచుమతము**

వీరు చెంచుదేవతలకు తేనె పళ్లు మొదలగునవి పండుగసమయములందును, కరువు, వ్యాధులు మొదలగు కష్టములు సంభవించినప్పుడును సమర్పించి పూజింతురు. మరియు వీరు అహోబల నరసింహస్వామిని "ఓబలేశప్ప" యనుపేర నారాధింతురు. ఈదేవుడు "చెంచీత"ను వివాహమాడిన కృష్ణుని యవతారమని నమ్మెదరు. ఈవివాహమునకై కృష్ణుడు కన్యాశుల్కముగా చెంచుకులమునకును వెదురుపిడియము ఇచ్చెననియు, అందుచేతనే చెంచులు వెదురువల్ల జీవనము చేయవలసి వచ్చెననియు చెప్పుదురు. గోదావరీ జిల్లాలోని రంపచోడవరము, పోలవరము మొదలగు తాలుకాలలోని చెంచులు ఇప్పుడును ముఖ్యముగా వెదురువర్తకమువల్లనే వేలకొలది జీవనము చేయుచున్నారు. (ఈ జాతివారి ఛాయాపటములను నిందు చూడనగును.) మరియు పండుగ సమయములయందు చెంచులు రామలక్ష్మణుల విగ్రహములను పూజింతురు. దీనినిబట్టి వీరు వైష్ణవమతావలంబకులనితోచుచున్నది. మరియు వీరు తమబొట్టును నిలువుగీతగా ధరింతురు. ఈచెంచులు పోతరాజు, గుఱప్ప, శుంకాలమ్మ మొదలుగాగల కొండదేవతలను పూజింతురు.

**వేషభాషలు**

అడవి చెంచులు గోచీలను మాత్రమే ధరింతురనియు, సమప్రదేశమునందలి చెంచులు నాగరికులై అడుగుభాగమున గోచీ

లను, పైభాగమున పంచెలను లేక నెత్తి గుడ్డయును ధరింతు రనియు తెలుసు కొంటిమి. వీరు చూచుటకే అసహ్యాకరముగ నుండి, బద్ధకస్తులును, త్రాగుబోతులు నై, వ్యవసాయము చేయుటయం దిష్టము లేనివారై, దోపిడిగాండ్రవలె కన్పట్టుచున్నారు. కనుకనే, సమప్రదేశములందు చెంచుగుంపులు సంచరించునపుడెల్లను పోలీసువారు వారికి అభ్యంతరము కలిగించుచు, వారిశాకపోకలను కనిపట్టుచునే యున్నారు. కర్నూలుజిల్లాలోని అడవిచెంచులు తమకు అడవిపంటలు దొరకనప్పుడెల్లను బందిపోటుతనమువల్ల జీవించుచున్నారు. బాటసారులను బాధించి దోపిడిచేయుచు, పంటలను తగులబెట్టి వ్యవసాయదారులను బాధపెట్టుచున్నారు. సర్కారువారు వీరికి అభ్యంతరములు పెట్టినయెడల అడవులను తగులబెట్టి, సెలయేళ్లలో విషము కల్పి, సర్కారు ఉద్యోగస్థులను కొట్టుచు తిట్టుచు నున్నారు. ఇట్టి అనాగరికులగు మోటుపశువులను లొంగదీయుటకై సర్కారువారు వారికి తమ ఇంటి యుపయోగము నిమిత్తము కావలసిన అడవిపంటలను (వంటచెఱుకు, వెదుళ్లు, చౌప్పగడ్డి, నేళ్లు, పళ్లు, తేనె, మైనము మొదలగువస్తువులు) కొంపోవ సెలవిచ్చిరి. మరియు వీరు స్వేచ్ఛగ వేటాడుటకును, వీరి పశువులు అడవియందు మేయుటకును అంగీకరించిరి. ఇట్టి సామోపాయములచేత అనాగరికులగు చెంచులను లోబరుచుకొను చున్నారు. మరియు చెంచుగూడెములయందు సర్కారు బడులను స్థాపించి విద్య నేర్పుచున్నారు. విద్య నేర్చిన చెంచులను వారి ప్రదేశములయందు తలయారులుగను, బడిపంతుళ్లుగను, అడవిని సంరక్షించుటకు నౌకర్లుగను నియోగించు చున్నారు. అయినను విశేషఫలము గానవచ్చుట దుర్లభము. సహజముగ మోటులై, త్రాగుడు అభ్యాసమైన చెంచులు తరుచు వారి గూడెములలో అల్లరులు, కొట్లాటలు గల్పించుకొనుచు ప్రాణములను గూడ గోల్పోవుచున్నారు. గోదావరి, విశాఖపట్టణం జిల్లాలకు సంబంధించిన ఏజన్సీలోని చెంచులు తెలుగు ఓఢ్రభాషలను రెండింటిని మాట్లాడుదురు. కాని వీరు మాట్లాడుభాష గ్రామ్యము. వీరు ఈభాషలను వ్రాయలేరు. నల్లమలె కొండలలోని చెంచులున్ను, కర్నూలుప్రాంతపు చెంచులును తెలుగుభాషను మాత్రమే మాట్లాడుట, చదువుట, వ్రాయుట నేర్చుచున్నారు.

జాతకవివాహాది కర్మలు

వీరి జాతకకర్మలు కోయలజాతకకర్మలను బోలియుండును. శిశువును దినమువిడిచిదినము కడుగుటయును, పదొకొండవ రోజున కులము నంతయు నామకరణోత్సవమునకై పిల్చుటయు, విందుచేయుటయు జరుగును. శిశువునకు పూర్వికునియొక్క పేరుగాని, కొండదేవతలపేర్లుగాని ఉంచుట సహజము. పోలుగాడు, నాగలేటిగాడు, అచ్చిగాడు మొదలగునవి చెంచుపేర్లు. కోయలలోవలెనే వీరియందును వివాహములు రెండువిధములు: వధూవరులతలిదండ్రులసమ్మ

త్తిపైని జరుగువివాహములు వరునియింట జరుగును. పేడతో గుండ్రముగా అలికిన భూమిమీద విల్లుఅంబులు ఉంచి వధూవరులను వాటికి చుట్టును మూడుసార్లు ప్రదక్షిణము చేయింతురు. వధూవరులనెత్తిపైన బియ్యము చల్లుట, వధువునకు "తాళి"కట్టుట జరుగును. విందు, నాట్యము ప్రతివివాహమునకు తప్పవు. ఒక్కొక్కప్పుడు వధూవరులు ఒకరి నొకరు ప్రేమించి గూడెమునుండి రాత్రి పరారై, గాంధర్వవివాహము జరుపుకొనిమరునాడుదయము గూడెముచేరుట కలదు. ఒక్కొక్కప్పుడు వరుడు పిల్ల నెత్తుకొనిపోయి బలవంతముగా రాక్షసవివాహము చేసుకొనును. అట్టి సమయములందు కులముపెద్దలు సమావేశమైతప్పు చేసినవానికి జుల్మానా విధింతురు. ఆ సొమ్ము ఇవ్వనిమెడలగాని, ఇచ్చినను కోపము తీరనియెడలగాని కుటుంబకలహములు పెరిగికొట్లాటలు, మరణములు సంభవించును. చెంచులయందు తదితరము లడవిజాతులయందు వలె, విడాకులిచ్చుటగలదు. అట్టిసమయములందు నేరస్తులు పంచాయతిదారుల ఇష్టానుసారముగా కొంతముదరా నియ్యవలసియుండును. వీరిలో వితంతువివాహములు గలవు. చెంచులు తదితరజాతులవలెనే పిచ్చినమ్మకము గలవారగుటచేత వారికి కల్గునష్టములు, కరువులు అన్నియు గ్రహములవల్లను, పిశాచములవల్లను, కొండదేవతలవల్లను, కలుగుననినమ్మి, వారికిజాతరలు జరిపింతురు. చనిపోయినవారిని తగుల బెట్టక పూడిచెదరు. పూడ్చిన స్థలముమీద కొంచెము పాలు, బియ్యము వేయుదురు. హిందువులలోవలెనే వీరు పదకొండురోజులు మయిల పట్టి, ఆఖరున పెద్దదినమని ఒకవిందును చేయుదురు. అట్టివిందునకు కులమువా రందరును చేరుదురు.

## 2. కోయలు

కోయలు, గోదావరివిశాఖపట్టణజిల్లాలకు చేరిన ఏజన్సీడివిజనులయందున్ను, బస్తరు నైజాము రాష్ట్రములలోని అడవులయందున్ను, గుట్టలయందున్ను నివసించుచున్నారు. వీరు అరణ్యప్రాంతములయందుండు సెలయేరులను ఆధారముగా చేసికొని జీవించుటచేత వీరికి అడవివాగులే ముఖ్యములగు కాపురస్థలములని చెప్పవచ్చును.

### నివాసములు

ఈకోయలు కాపురముండు గూడెములు పది మొదలు ఏబదివరకు ఇండ్లుండును. ఆ యిండ్లు తాటాకులతో గాని, పూరితో గాని నేయబడిన గుడిసెలు. వీరు కాపురముండు గూడెముల లేక పల్లెలచెంతను తాటిచెట్లు, ఇప్పచెట్లు విశేషముగా ఉండును. వీరు తమగూడెములను కట్టుకొనుటకు ముందుగా తమ "పెద్ద" చేత కొన్ని నిదర్శనములు కాంచుతురు. అప్పుడు ఆటంకములు లేవని తెలుసుకొన్న యెడల, గూడెము కట్టుటకు నిశ్చయింతురు. కాని కట్టుటకు పూర్వము వారికొలచు దేవతలను, గ్రామదేవతలను ఆరాధించి మేకనుగాని, ఎద్దునుగాని బలియిచ్చి, విందు జరిపి మరిన్ని గూడెము కట్ట ప్రారంభింతురు.

# కోయలు, చెంచులు



౧. అచ్చపు కోయజాతిపురుషు లిద్దఱు



౨. కోయవాండ్రు



3. సుగాలివారు



౮. కోయవాడు కల్లు తీయుటకయి తాటిచెట్టెక్కుచున్నాడు



౯. కోయజాతి ఆటకాండ్రు

కొన్ని గ్రామములగుంపునకు "సమతు" అని పేరు. ప్రతిగ్రామమునకున్న గ్రామపెద్దయుండి నట్లేప్రతిసమతునకున్న సమతుదొరయుండును. వీరు తమ ఇళ్లచుట్టును కొంత ఖాళీస్థలమును వదలి, దానియందు తమపశువులను కట్టుదురు. వీరికి పశువులే ముఖ్యధనము. వీరిపశువులకు వింతయగు పేరు లుండును. వీరు ఒకపూట మాత్రమే పాలను పితుకుదురు. పశువులు పగటిభాగమున అడవిగడ్డిని, ఏటినీరును త్రాగి బ్రతుకును. సవరలవలెనే వీరును పశువులను దొంగిలించుటలో కడుసమర్థులు. మరియు వీరు పోయిన పశువులను జాడదీసి కనుగొనుటలో మిక్కిలి నేర్పరులు. వీరు మేకలనుగూడ పెంచుచున్నారు. పులులవాత బడకుండ తమపశువులను వెదురుతడకల క్రింద నుంచి రాత్రులందు కాపాడుదురు.

వీరు ఆవులయొక్కయు, మేకల యొక్కయు పాలను అనుభవించుటయేకాక, వాటిని చంపి పచ్చిమాంసమును భుజింతురు. వారు దేవతలకు బలియిచ్చునప్పుడును, వివాహములు, లేక ఉత్సవములు చేయునప్పుడున్ను పశువులను విశేషముగా వధింతురు. వీరి పశువులు అడవులయందు మేసినను, వీరికి పన్నులుగాని, ఇతర అభ్యంతరములుగాని లేవు. పశువులను దొంగిలించినప్పుడు పట్టుపడిన దొంగలు తమ నేరమును వెంటనే ఒప్పుకొని, దానికి పదిఝుంతలు ముదరా నిత్తురు.

ఈకోయలలో గుట్టకోయ లనబడువారు మన్యప్రాంతములందుండి, పోడువ్యవసాయము, వేట, అడవిపంటలతో వర్తకము ముఖ్యవృత్తులుగా గల్గియున్నారు. పళ్లు, కాయలు, వేళ్లు, ఇప్పపువ్వు, తేనె, చింతపండు, పొగాకు, కల్లు మొదలగువాటిని అడవులయందు సంగ్రహించి తమకు కావలసినది తిని, మిగిలినదానిని అమ్మివేయుదురు. వెదురుబియ్యము పిండి చేసుకొని తిందురు. వెదురు, వంటచెరుకు, అడవి పంటలు వీటిని విశేషముగా ఎగుమతిచేసి ధనము నార్జించుచున్నారు. కాని వీరు బద్ధకస్తులగుట చేతను, త్రాగుడునందు ఎక్కువప్రీతి గలవారగుటచేతను, తమవస్తువులకు తగినసొమ్మును సంగ్రహించలేనివా రగుటచేతను కడు బీదలుగా నగపడుచున్నారు. గుట్టకోయలు సోమరులగుటచేత దుక్కిదున్నక, పోడువ్యవసాయము చేయుచున్నారు. కావలసినచోట అడవిని నఱికి, తవ్వుగాలితోకాని, దుక్కి చాలుతో కాని భూమినికదిపి, చెట్లనుకాల్చివేసి, నీటితో తడిపి విత్తులను నాటుదురు. వారి ఇండ్లకు చేరిన దొడ్లయందు కూడ వ్యవసాయము చేయుదురు. చామ, గంటె, జొన్న, దుంపలు, పొగాకు మొదలగువాటిని పండింతురు. పల్లపుప్రాంతములందుండు కోయలు వారి గూడెములకు చేరిన కొంత భూమిని సాగుచేయుచున్నారు. వీరి దరఖాస్తులపైని భూమి వ్యవసాయమునకై ఎకరము 1 కి 0-4-0 రేటుపైనిఇవ్వబడును. వీరు భూమిని చిన్నదియు, సన్నదియునగు నాగలితో పైపైని దున్ని, మెరకపైరులనేకాక వరి మొదలగువాటిని గూడ పండించుచున్నారు. తమపంటలను అడవిమృగములనుండి కాపా...

టమకై పొలములకు చుట్టును "అలవను" కట్టుదురు. మరియు, పొలములయందు మంచెలను కట్టుకొని పిట్టలను, అడవిమృగములను తోలుచుందురు. పైరులు, పంటలు తయారుకాగానే వాటిని షాహుకార్లకు గుత్త కిచ్చివేసెదరు. తఱుచు వీరు పచ్చిపైరులనే భుజింతురు.

కోయలు అడవిపోడులను, కొండపోడులను వ్యవసాయము చేయుటయే కాక, లంకలయందుగూడ వ్యవసాయము చేయుదురు. ఈలంకలు దుబ్బుగడ్డి, చెట్లు, చేమలు, ఇసుకతిప్పలు మొదలగువాటి ఆటంకముల చేత నదులమధ్యను ఏర్పడును. ఈలంకలయందు తమపసులను మేపుటయేకాక, ఆముదము, జొన్న, కూరగాయలు, పొగాకు, మిరపకాయలు మొదలగు పైరులు పండింతురు.

**జాతి మత విషయములు**

సవరలలోవలెను, కోదులలోవలెను వీరిలోగూడ కులభేదములు గలవు. పల్లపుప్రాంతములందు వ్యవసాయము చేయు కోయలకు గుమ్మకోయ లనియు, అడవు లందు వేటాడు కోయలకు గుట్టకోయ లనియు పేర్లు. వీరిలో లింగధారణము చేయువారు కొందరు కలరు.

వీరిలో వృత్తి భేదములను బట్టికూడ వేర్వేరు పేర్లు గలవు. బాసకోయలు, వడ్డికోయలు (వ్యవసాయము చేయువారు), డోలుకోయలు (అపరకర్మలు చేయువారు), కాకకోయలు (కూలిపని చేయువారు), కమ్మరకోయలు (కమ్మరపని చేయువారు) మొదలుగాగల కులము లున్నవి.

చేతనాచేతనవస్తుపూజయే వీరిమతము. వీరు చెట్లయందును, కొండలయందును, నదుల యందును, ప్రకృతియందును దేవు డున్నా డని నమ్ముదురు. వారికి కల్గు రోగములు, కష్టములు, మంచిచెడ్డలు వీటివల్లనే కలుగుచున్న వని వీరి దృఢనిశ్చయము. ఇంతేకాక, ముత్తాలమ్మ, గంగరమ్మ, కొండ దేవతలు, వేల్పులు, మొదలుగాగల వారిని ఆరాధించి, పూజింతురు. కష్టకాలము లందు జాతరలు జరిపించి, మేకలను, పోతులను బలియిత్తురు. కోయలయందును, కొండరెడ్ల యందున్న భీమునిమతము వారు చాలమంది కలరు.

వీరు భూపండుగ, కొత్తపండుగ లే సామకొత్తలు, సంక్రాంతిపండుగ, మొదలగు పండుగలు జరుపుకొందురు. ప్రతిపండుగసమయమునందును పచ్చిమాంసము తినుట, ఇప్ప సారాయిని త్రాగుట, నాట్యమాడుట మొదలగువాటితో గొప్పవిందులను జరిపెదరు.

**జాతక వివాహాది కర్మలు**

వీరిలో స్త్రీలు పురిటిసమయమువరకు తిరుగులాడుచుందురు. పురుడు వచ్చిన తర్వాత వీరు మందులను తీసుకొనక, కొన్ని చెట్లబెరడులు, వేళ్లు కషాయముగా మరగబెట్టి పుచ్చుకొందురు. శిశువు పుట్టిన ౫వ లేక 7-వ దినమున ఆశిశువును కడిగి నామకరణము చేయుదురు. బంధువులలో పెద్ద ఏపేరు తలపెట్టిన, దానినే పెట్టి పిల్చెదరు. త్రాగుట, నాట్యమాడుట విందారగించుట జరుగును. వీరిలో రజస్వలానంతరమే వివాహములు జరుగును. మేనరికము

గలదు. వివాహము స్వయంవరము, రాక్షసము అని రెండువిధములుగాను జరుగును. సవరలలో వలెనే, వరుడు సాధ్యమైనంతవరకు తనఇష్టమువచ్చిన కన్యను బలవంతముగా నైనను తీసుకొనిపోయి వివాహము చేసుకొనును. కన్యాశుల్కము గలదు. "తాళి"కట్టుట ఉన్నది. విందు, త్రాగుడు, నాట్యము మొదలగు వాటితో వివాహము ముగియును.

వీరిలో వితంతువివాహము గలదు. వితంతువు తనమరదిని సహజముగా వివాహమాడవలెను. అట్లు చేయనియెడల ఆమెగాని, ఆమెను వివాహము చేసుకొనిన వరుడు గాని కొంతమదరా నియ్యవలెను. వీరిలో వ్యభిచారము చాల మెండు. కనుకనే జబ్బులచేత పీడింపబడి, వీరు క్రమక్రమముగా క్షీణదశకు వచ్చుచున్నారు. ఒక పురుషుడు పెక్కుస్త్రీలతో నుండవచ్చును గాని, స్త్రీకి అట్టిఅధికారము లేదు. బిడ్డలులేని వితంతువు తప్పక పెండ్లియాడవలెను.

వీరిలో చనిపోయినపిల్లలను పూడ్చెదరు. కాని వివాహమైన పెద్దవారిని తగులబెట్టి, ఆస్థలమందున్న బూడిదను ఒక కుండయందుంచి, అక్కడనే దానినిపూడ్చి ఆస్థలముపైని ఒకరాతిని పాతెదరు. దానిదగ్గర కొన్ని పాలు బియ్యము అప్పుడప్పుడు ఉంచుదురు. చనిపోయిన 10 దినములలో చిన్న దిన మనియు, పెద్దదినమనియు రెండువిందులను గావింతురు. బంధువు లందరు వచ్చుటయు, వారివారికి తోచిన పారితోషికములనిచ్చుటయుజరుగును. విందారగించిన పిదప ఇప్పసారాయి త్రాగుట, నాట్యమాడుట జరుగును. చనిపోయినవాడు దయ్యము, లేక భూతముకాకుండ వానికి ప్రేత కర్మలన్నియు నాచరింతురు.

**వేషభాషలు**

వీరు సవరలవలెనే మొలవరకుమాత్రము బట్టలను ధరింతురు. కొందరు గోచీలను,లంగోటాలను ధరింతురు. వీరిలో కొందరికి లంగోటాకు తోకలుండుటచేత వారికి "లంజ" కోయలని పేరు. స్త్రీలు తమ పాలిండ్లను బట్టలతో కప్పరు. కాని, మెడకున్ను చేతులకున్ను విశేషముగా పూసల దండలు వేసికొందురు. వీరిలో పచ్చాకు బొట్లు పొడిపించుకొనుట గలదు. అందమునకున్ను, దయ్యములు పట్టుకొనకుండ సురక్షితముగా నుండుటకున్ను, వాతపునొప్పులు పోగొట్టుకొనుటకున్ను వీరిట్లు పచ్చాకుబొట్లు పొడుపించుకొందురు.

వీరు కూయి, తెలుగుభాషలను రెండిటిని మాట్లాడుదురు. కూయిభాష గోండు భాషలో చేరినదిగాకన్పట్టును. బస్తరు నైజాము రాష్ట్రములలోని గుట్టకోయలు శుద్ధ కోయ భాషనే మాట్లాడుదురు. వీరిభాషకు వ్రాత లిపిలేదు. ఈదిగువకొన్ని కోయమాటలున్ను, వాటికి సరియగు తెలుగుమాటలున్ను వ్రాయ బడినవి—

| కోయపదములు | తెలుగుపదములు |
|---|---|
| అయ్యా | అయ్యా, తండ్రి |
| యవ్వ | తల్లి |
| అన్న | అన్న |

| | |
|---|---|
| అబ్బ | తమ్ముడు |
| పేక | కొడుకు |
| పేకి | కూతురు |
| అక్క | అప్ప |
| పోయి | అత్త |

శేషము

కోయలు కడు అమాయకులు. నీతిమార్గము తప్పనివారు. వారికి అపకారము చేయని వారికి ఎన్నడును హాని చేయరు. కాని వారికి కీడు చేసినయెడల దానికి తప్పక కీడు చేయనిదే వదలరు. త్రాగుడు, బద్ధకము, అజ్ఞానము వీటిచే పీడింపబడుచున్నారు. ... యందు ఇటీవల విద్య నభ్యసించు సలవా... కల్గినది. కోయగూడెములయందు సర్కా... బడులు, జిల్లాబోర్డుబడులు ఉంచబడినవి. ... ఫీజులయిన ఉపాధ్యాయులు విద్యను చక్క... నేర్పుచున్నారు. ఈభాగములందు రో... అభివృద్ధి చేసి, ఆసుపత్రులను ఉంచి, విద్య... అభివృద్ధిపరచి, కోయవారికే ఆయా ప్రా... ములయందు వీలయినంతవరకు ఉద్యోగము... నిచ్చినయెడల కోయల జనసంఖ్య అచిరకా... ములోనే వృద్ధి పొందగలదు.

---

## దేవదాసి

పెనుమర్తి వెంకటరత్నము గారు

కవి

ఎడనెడ నీవసంతనటుఁ డేఁగెడుఁ దేనెల వాఁకలోనఁ దే
లెడు రతనాలనౌక, మధులిట్కులకాహళ మల్లదే! ధ్వనిం
చెడు, జగదేకసుందరి! సుశీతలదృఙ్మధుధార లోడికర్
దడుపు! జను శ్శతోగ్రపరితాపపు వేఁడిమి గొంత యారునో?

భయపడ నేల, అంబరసభాభవనమ్మున నీకుముద్వతీ
ప్రియున కసూయ పుట్టునని? పెన్నెఱిగుంపు మొగిళ్ల నుండి నీ
నయన సుధార్ద్రరోచిషమునర్ దరితీపుల పాలవెల్లిలో
లయమయి యాయగాథపు విలాసమునం బడి క్రుంగిపోవుదః.

తీవెలమేడలోఁ గలరుతి స్నదియించు విహంగవీణలోఁ
దావులు ముమ్మరింప మధుతాండవ కేళిని దాఁగి యున్న యోఁ

పూవులరాణి! నీదువలపుల్ పులకించిన కంటకాగ్రవ
న్యావలి నేనుగూడఁ బులుఁగై పడిపోతిని ఱెక్క లార్చుచున్.

దే వ దా సి

ఓకవిరాజ, నీవు వినవో! రసలుబ్ధజగత్ప్రవృత్తి మా
యాకృతి; విశ్వవీథికలయం దవగుంఠన మీఁగఁ జాల నో
యీ! కెరటాలుఁ బొర్లు జలధీశ్వరుఁడేని నతీతలోక ది
వ్యాకృతి నన్నుఁ జూచి జడతాత్మకుఁడై కడు మోసపోయెడిన్.

నాయనగుంఠన మ్మొడలినా నను మాతృకమంద, దైవపా
దాయతనాన మోకరిలినట్టి మహాత్ముఁడు, పూలరాణితోఁ
డీయములాడు బంభరుఁడు తేఁకువ దప్పి ప్రగాఢ మోహబా
ధాయుతు లై త్రపావిరహార్తిన్ బడిపోదురు వెఱ్ఱివార లై.

నాసౌందర్య మహాప్రవాహములు గంధర్వాళి వర్ణింతు రో
హో! సిద్ధంబ యమర్త్య మంచు, దివిషద్వ్యూహంబు మోహంబునన్
శోషిల్లం బడిపోవు నాత్మభవనిష్ఠ్యూతోగ్రకోపాగ్ని, పే
రాసన్ మానుము మానవుండవు, దవీయశ్శోభిరోచిష్మతిన్.

అపరసీమంతినీ చరణార్ద్రలాక్ష - శోణఘుసృణసంధ్యా నవాంశులు తొలంక
నాగళోద్గారి మధురగాంధర్వవాణి - దేవతలకుఁ గన్పడెద మాధ్వీపిపాసి!

* * * * * * *

నా జననవృత్తములు పండునాఁడు, నాదు-వాకిళులు విచ్చి నాథుఁడే వచ్చిపోవు!
నాఁటి కనగుంఠనము దీసి, నాయతీత - జననసౌందర్యముల నుపాయనము లిత్తు!

---

# మా గోపాలకృష్ణుడు

బసవరాజు అప్పారావు గా

చచ్చినదాకా బతికుంటే పెళ్లిజేస్తా నన్నాడట గడుసుబుజ్జి యెవడో, వెనుకటి కొక వెర్రివాణ్ణి జూచి! అంతకన్నా తెలివిగలవాడు మరొకడు వెర్రిబాగుల వాడొకడికి చచ్చినతర్వాత పెళ్లి జేస్తా నన్నాడట! కాని మా గోపాలకృష్ణుడు చురుకైన తెలివిగలవాడు గనుక వాళ్లూ వీళ్లూ ఆశాళీ పెడుతూవుంటే పొంగి బోర్లపడక ఈ కల్లలమారి కపటాంధ్రప్రపంచాన్ని నమ్మివుండక గాంధర్వ వివాహపద్ధతిని మృత్యుకన్యను పరిణయమైనాడు. బతికినన్నాళ్లు ఉప్పుతిడిసి ముప్పందు మూతున్న ఆంధ్ర వీరుడిగతి కనుక్కొని కృతఘ్నాంధ్రు లందరికి నేటికి గణం పూని వీరావేశ మెక్కుతున్నది. విగ్రహాలు, ప్రతిమలు, స్మారకచిహ్నాలు, కుటుంబనిధులు మొదలైన స్కీములు నిలవలు పలవలుగా వేసి, ఏమీ చెయ్యటానికి తోచక, గవర్నమెంటు వారిలాగ సెలక్టుకమిటీవారికి వదలివేశారు, మన కెందు కీగొడవంతా నని. ఏమి? సుభాష బోసుపాటి చెయ్యడా ఆంధ్రులకు ఆంధ్రవీరావతంసమైన గోపాలకృష్ణుడు? ఈస్మారకచిహ్నాలకి పెట్టదలచిన ఖర్చులంతా బతికున్నపుడే గోపాలకృష్ణునికి పెట్టి వున్నట్లయితే బతికేవాడేమో? బంగాళీలు పంతముబట్టి సుభాషబోసుని జయిలునుండి తప్పించి బతికించుకున్నారా లేదా? చీరాలయెడారిలో ఏకాకిగా ఆంధ్ర వీరుడు పడినయిబ్బందులు ఆంధ్రులకు తెలియక పోలేదని నేను నమ్ముతాను. తెలిసి ఉపేక్షించారు. ఉపేక్ష వల్లనూ, కాలకర్మ దోషమువల్లనూ ఆంధ్రరత్న గోపాల కృష్ణుడు దాటిపోయినాడు. మళ్లీ ఎన్నటికీ ఆంధ్రదేశానికి రాడనే నానిశ్చయము.

బతకనిబిడ్డ బారెడా పదిబారలా? గోపాలకృష్ణునికి seriousness లేదని ఆక్షేపించినవారు, కార్యదీక్ష లేదని ఎగతాళిజేసినవారు, అతగాడు వొట్టి అస్తవిస్తపు హాస్యగాడని వెక్కిరించినవారు, యావన్మందీ నేడతని గుణగణాలు పద్యరూపంగా, గద్యరూపంగా, మీదు మిక్కిలి ఉపన్యా[సరూపంగా] ఘోషింపడం చూస్తే నాలో నాకే నవ్వు[...]స్తుం దొకపట్టున! కాని చచ్చినతరువాత కూడా [బతికే] వున్నాడన్నట్లు భ్రమ కల్గించే ఆంధ్రరత్న గోపాలకృష్ణుని శక్తి ఎటువంటిది? ఆయనజీవితానికి సూత్ర మే[...] అతని జీవితమార్గ మితరుల కెంతవరకు అనుసరణీయ[...]

గోపాలకృష్ణుడు మంచిరసికుడు. రసికతే అ[తని] జీవితానికంతా సూత్రము. రసికత అంటే మనశాస్త్రకారులకు భయమేకాని కవీశ్వరులకుమాత్రం ప్రాణ[...] రసికుడైనవాడికి అరసికుడితో పొత్తు దుర్భరము. [...] లేదా కాళిదాసు, "ఎన్ని పాపఫలాలైనా నాన[...]గొట్టుకాని అరసికులకు రసము నివేదించ మనిమాత్రం [...]డూ నానెత్తిన రాయన"న్నది? గోపాలకృష్ణుడికి ఆ[...] కూడా లేదు, అరసికులనుకూడా రసికులను చేయగ[ల] రసికచక్రవర్తి గనుక.

గోపాలుడికీ నాకూ యిరవైయేళ్ల పరిచయం. చిన్ననాటినుండీ అతడు రసికుడే! చక్కనిరూపము, దివ్యమైన ముఖవర్చస్సు, శ్రావ్యమైన గానధోరణి, మా[...]కారితనము, అన్నిటికన్న ఎక్కువైన నాట్యకౌశలము. ఇంకేమిటి లోటు రసికతకు? ప్రప్రథమము అతని పరి[చ]యము నాకు ఆంధ్రవీరుల రంగభూమి అయిన కొండవీటిదుర్గముమీద కలిగింది. ఆంధ్రవిద్యార్థి మహాసభ బందరులో 1909 సం॥లో జరిగింది. సభానంతరము కొండవీడు దుర్గము దర్శించవలెనని అందరము సంకల్పించుకొన్నాము. ఆసందర్భములో గోపాలుడు కూడా అక్కడికి విచ్చేశాడు. రెండురోజు లున్నాము. రెండు రోజులూ గోపాలుడి కబుర్లతోను, సంగీతములోను రెండుగంటల్లాగు ఎగిరిపోయినవి.

గోపాలుడు తరవాత పెద్దచదువులు చదవటానికి సీమకు పోయినాడట. పండితుల ప్రాపూ పరిచయమూ

కూడా పొందినాడట. మిత్రుల ప్రేమ జూరగొన్నాడట. రసికశిఖామణి ఆనందకుమారస్వామి పండితుడూ, ఆయన సతీమణీ గోపాలుడి గానసై పుణ్యానికి అబ్బురపడి సాక్షాత్తూ గోపాలకృష్ణుణ్ణి పూజించినట్లుగా పూజించారనీ, సీమలో భారతవిద్యార్థి సంఘానికి కార్యదర్శిగా వుండి చాణక్యప్రజ్ఞ ప్రదర్శించాడనీ, భారతదేశానికి తిరిగి పండితుల మహదాశీర్వచనముతో వచ్చాడనీ విని యెప్పటి కప్పుడు మహదానందము పొందుతూ వుండే వాడిని. చెన్నపట్టణంలో విక్టోరియా హాస్టలులో ఒక సారినీ, బెజవాడలో గవర్నరుపేటలో ప్లీడరు గంగరాజు కృష్ణరావుగారింట మరొకసారినీ అతని పరిచయము కలిగింది. సీమకు వెళ్లి వచ్చేటప్పటికల్లా వేషంలో వైదికప్రకత్తు పోయి చిరుగడ్డపు ప్యారిస్‌కత్తూ, సంగీతములో కంపెనీకత్తు పోయి గీతగోవిందపుకత్తూ ద్యోతకమైనవి. అప్పటికి ముఖపరిచయమల్లా చనువులోకి దిగింది కాస్తకాస్త. అంతకు మునుపు గుంటూరు ఎమెచూర్స్ అనే నాటకసంఘములో మే ముభయులమూ మెంబర్లమే. అతను ప్రజ్ఞ వుండటంవల్ల పెద్దపెద్ద రాజువేషాలు కూడా వేస్తుండేవాడు. నేను కుర్రవాణ్ణి గనక చూచి ఆనందించేవాణ్ణి.

కొంతకాలానికి చెన్నపట్నంలో ఆంధ్ర సారస్వత సభ, ఆంధ్రసాహిత్య పరిషత్తుకు సాటేగానో పోటీగానో, 1919 సంవత్సరము శీతకాలములో జరిగింది. ఆసభకు గోపాలుడూ, మిత్రుడు అబ్బూరు రామకృష్ణరాయడూ విచ్చేశారు. గోక్లేహాలు ఎదుటవున్న హాస్టలు మేడ గుమ్మమువసారాలో నేనూ, గోపాలుడూ, రామకృష్ణరాయడూ, మరిద్దరు స్నేహితులూ చేరి కూర్చునివుండగా ఎవరో నన్ను శాస్త్ర సంగీతం పాడమన్నారు. అప్పటికే శాస్త్ర పద్యాలు గిలుకుతూ వుండేవాణ్ణి. ‘దంపుడుపాటకు దరిద్రమా’ అని పాడ మనగానే సాగదీయించుకోకుండా పాడేస్వభావం కలవాణ్ణి గనక వెంటనే రామప్రియ రాగములో “ఆడవె, ఆడవె, అన్నులమిన్నా” అని నేను రచించినపాట పాడినాను. పాడగానే బ్రహ్మానందభరితుడై ఎంతో పొంగి, “చ్యుతిసమయంలో పాడే రాగం ఇది, భావం ఎంతో సరసంగా వుంది.” అని మెచ్చుకున్నాడు గోపాలుడు. మిత్రులు ఔనని తల లూచారు. నాకూ heart ఆరడుగులు expand అయింది. శేషు, ఇంకొక్కటి కానియ్యమన్నాడు గోపాలుడు; మిత్రులుకూడా గుస్తరించారు. జంకుకూడా తీరిపోయింది. వెంటనే, “పానకమ్ములో పుడక నేటికిటు పడవేసితివో దేవా? ముద్దుగులాబీ ముట్టబోవగా ముల్లు విరిగెనో దేవా!” అనే సొంతసొదను యమునాకళ్యాణిలో పాడి వినిపించాను. వినే వినగానే గోపాలుడు అలౌకికావేశ పూరితుడైనాడు. “తత్ చేతసా స్మరతి నూనమబోధపూర్వం భావస్థిరాని జననాంతర సౌహృదాని” అని కాళిదాసు చెప్పినరీతిగా యేమి జ్ఞప్తికి వచ్చిందో కాని, కొంచెము సేపు నిదానించి ఆలోచించి, సోత్సాహంగా “ఈ రాగం ఎక్కడనుంచి పట్టినావోయ్? ఇది నాస్థాయీరాగం. నాలో ఎక్కడో నిద్రపోతున్న యీరాగాన్ని మళ్లీ మేలుకొలిపావోయ్! పద్యభావ మెంతో బాగున్నదోయ్! ఠాగూరు ఎందుకు నీముందర? ధూపానికి కూడా చాలడు!” అని పొగడ్త ప్రారంభించాడు గోపాలుడు. వెట్టిబాగులా ణ్ణైతే వెంటనే పాట నింగ్లీషులోకి ఏకజిన్స్‌గారిచేతనో తర్జుమా చేయించి Nobel Prize కోసం ultimatum పంపించేవాడినే! ఎల్లాగో దైవం ఆబెడద తప్పించాడు, నాపుణ్యమా అని, ఆంధ్రుల పుణ్యమా అనీ! గోపాలుడికీ నాకూ మనసు మనసు అతకడానికీ యమునాకళ్యాణిరాగమూ, నాముద్దు గులాబీ పాటా ముఖ్యకారణా లయినవి. యేమిచిత్రమో కాని, అప్పటినుండి గోపాలుడు నన్ను మిత్రకోటిలో, అంతరంగగోష్ఠిలో చేర్చుకొని ఆ మరణాంతము ఆదరించాడు.

గిరీశం “ఈవేళ పూటకూళ్లమ్మకీ నాకూ యుద్ధమైపోయింది” అని కన్యాశుల్కములో కంప్లెంటు చేసినట్లుగా గోపాలుడికీ అరసికు లైనవాళ్లకీ ఎప్పుడూ యుద్ధ మాతూనే వుండేది. ఏల పాటలు, జంగమకథలు మొదలైన పునాదులమీద దేశచరిత్రసౌధము నిర్మించాలనే గోపాలుడి భావము Rajahmundry Training College వారి కెల్లా బోధపడుతుంది? జాతీయవిద్యకూ విజాతీయ యంత్రవిద్యకూ పొత్తుకుదర దనేవాదము బందరు జాతీయకళాశాలవారి కెల్లా నచ్చుతుంది? అది రసి

కతకు సంబంధించిన విషయము, గోపాలు డన్నట్లుగా, 'all a question of taste.' పూటకూళ్లమ్మ తిండిలో ఎంత taste వుంటుందో ఛాంధసపద్ధతులమీద నడిపిం చబడే ఈ పూటకూళ్ల చదువులబడుల (educational hotels) చదువులో అంత taste (రసికత) వుంటుంది. అందుకనే గోపాలుడు పై రెండుకళాశాలలలో ఉద్యోగ ముకు తిలోదకా లిచ్చాడు. ఇచ్చినందుకు విచారించక చీరాలసమీపములో వాడరేవు కనతిదూరంలో ఆంధ్ర విద్యాపీఠగోష్ఠిని నెలకొల్పినాడు. "Proximity with the Infinite" లభించిందని పొంగిపోతూ వుండేవాడు గోపాల రసిక చక్రవర్తి.

కాని అరసికులైన ఆంగ్లప్రభుత్వమువారు ఆరామములాంటి చీరాలలో అసహ్యమైన మ్యునిసిపాలిటీని బలవంతముగా యేర్పాటుచేశారు, ప్రజలంతా వద్దని మొత్తుకున్నాను. రసికుడైన గోపాలుడికి ప్రభుత్వంవారి అరసికచర్య చూచేసరికి అసహ్యం అయింది. వెంటనే ఆబాలగోపాలం ఊళ్లోజనాన్ని లేవదీసుకొనిపోయి వన వాసం చేయించాడు చీరాల జీడిమామిడితోటల్లో. దేశము అట్టుడికిపోయింది. ప్రభుత్వమువారు గడగడా వణకిపోయారు. గాంధీమహాత్ముడిదాకా దేకిం దీవార్త. వచ్చిచూచాడు మహాత్ముడు. చూచి ఆశీర్వదించి హుషారిచ్చాడు. ఆంధ్రమహాజనులు ధనసాహాయ్యము చేశారు పుష్కలంగా, కొందరు గుణకారులు వద్దంటున్నప్పటికీ.

ఇంతటిలో బరంపురం ఆంధ్రసభలు వచ్చినవి. చీరాలగ్రంథపారాయణానికి గోపాలుని సభ కాహ్వానించారు. ప్రభుత్వమువారు శంగార్తై గోపాలుని వాగ్బంధము చెయ్యవలెనని చూచారు. గోపాలుడు ప్రభుత్వము వారిని ధిక్కరించాడు. సర్కారువారు గోపాలుని పట్టుకొని ఖైదు చేశారు. అదంతా ఒక పెద్దభారతకథ. ఆభారతం అన్ని పర్వాలూ వ్రాసిపెట్టివుంచాను. ఆంధ్రలోకానికి అడిగినప్పుడు అదునుకు సమర్పించాలని కసితీరక ప్రభుత్వమువారు రెండోకేసు పెట్టినారు, Prince of Sections అని గాంధీమహాత్ముడి ప్రస్తుతిగన్న 124 A, I. P. C. క్రింద గోపాలుడిని అణచటానికి! కాని గోపాలుడు తన రసికప్రసంగముతో న్యాయాధికారిని డిల్లపోజేసి తొమ్మిదినెలల విడిశిక్షై దుతోశ్చే బైటపడ్డా సర్కారువారు చిన్నబోయారు.

తిరుచినాపల్లి జైలులో యేడాది వుంటి గోపాలుడు గాంధీమహాత్ముని అసహాయోద్యమము సికపద్ధతిని నడుస్తున్నదని గ్రహించి దాసు, నెహ్రూ మొదలైన రసికులకు చేయూతఇచ్చి స్వరాజ్యపక్ష బాసటగా నిలిచి, కాంగ్రెస్ మహాసభకు కార్యదర్శి ఎన్నుకోబడి చాణక్యప్రజ్ఞ ప్రదర్శించి దేశసేవచేశా కాంగ్రెసు బొక్కసం ఖాళీ యిందని గ్రహించి రూర ఉపన్యాసాలిచ్చి నూరార్లు చొప్పున పోగ కాంగ్రెసుసంఘాలకి దానంజేశాడు గోపాలుడు. మాత ఆనందభరితురాలైంది. కాని అంతలో ఎవరిదృ గొట్టిందో యేమో కాని గోపాలుడికి రోగబాధ కములాగు యేర్పడ్డది.

మొట్టమొదట బొంబయి మలేరియా జ్వరము జోరబడి, క్షయగా మారి, మారిదై రోగము మాగోపా లుని తనపొట్ట బెట్టుకొన్నది. ఆలుబిడ్డలు గోలున స్తున్నారు. ఆంధ్రలోకము అల్లాడుతున్నది. మిత్రులం నిరుత్సాహులై విచారముతో కుమిలిపోతున్నారు. లేడుగా మాగోపాలుడు? రాడుగా తిరిగీ?

గోపాలుడు రసికచక్రవర్తి. ఆనందకుమారస్వా పండితునితోగూడ "అభినయదర్పణ"మును ఆంగ్లమున "The Mirror of Gesture" అనే పేరుతో రసి లోకానికి దానము జేశాడు. చిత్రకళ భారతీయ మైన భావస్ఫురణతో ప్రకాశించవలెనని ఘోషించే వాడు. సంగీతములో కూడా రాగచ్ఛాయ, రాగ ప్రధానలక్ష్యాలుగాని సంగతులసంఖ్యగాదని పాడి సిద్ధాంతము జేసేవాడు. అతను ఏరాగము పాడి జీవకళ ఉట్టిపడుతూ వుండేది. నాదము సింహనాద కాని అతి శ్రావ్యమైనది. ఆదిభట్ల నారాయణదాసు మహమ్మదు హుసేనుగార్ల గాత్రాలు గోపాలుడి గాత్ర నికి సరిపోలుతవి. సంగతివేశాడంటే రసమూ, జీవ ఉట్టిపడవలసిందే! శ్లోకంగాని, పద్యంగాని చదివాడంటే ప్రత్యక్షర రసస్ఫురణ కావలసిందే! ఎంత సమానమైన

గంభీరముగా నోటబట్టవలసిందే! తోస్సు అనేదిలేదే ఆనోటికి, ఆపాటకు?

ఇక అతనివి ఉపన్యాసాలా? కావు, హరికథలు! ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికల సంపాదకవ్యాసాల ఫోటోగ్రాఫులా? కావు, సద్యఃకల్పితములైనటువంటి కావ్యరత్నాలు! ఆభావ? ఆంగ్లవాసనావాసితమా? కాదు, స్వచ్ఛాంధ్రసుగంధగంధితము! ఆంధ్రులకు హరికథా కాలక్షేపమే నిజమైన ఉపన్యాసధోరణి అని గ్రహించి వేలాది వేల ఉపన్యాస వేదికలమీద ఆ హరికథా ధోరణితో నారాయణస్వరూపమైన మహాజనుల నారాధించి సేవించినాడు. సద్యస్స్ఫురణ అతనిదేసొమ్ము. ఏదైనా పద్యముగాని, శ్లోకముగాని ఉదాహరించాడంటే లక్కలాగు అతుక్కుని పోవలసిందన్నమాటే! స్వరాజ్యపక్షమువారిదీక్ష "త్రాయై, మానై, దృఢదారువై,... పూవై, తన్మకరందమై పెలుచ పోబోనీళ్లకుం బల్చనై" పోయిందని గోపాలుడు ఆక్షేపించేసరికి శూలంలాగు గుచ్చుకొని పోయిందిగదా? వందలు వేలు ఉదాహరించవచ్చును. అచిరకాలములో ఆంధ్రులకు పంచభక్ష్యపరమాన్నములతో గోపాలుని వాగమృతము విందొసగ సంకల్పించుకొన్న మాప్రయత్నము ఆంధ్రుల ఆదరణవల్లనూ నెరవేరగలదని మాఆశ.

ఇంక అతని వాదధోరణి? ఏమాత్రమూ కటువుగాక, పిట్టకథలతోను, పురాణగాథలతోను, హాస్యప్రసంగాలతోను, లోకోక్తులతోను, చాటుపద్యాలతోను చతురోక్తులతోడు నిండి నిబిడీకృతమై ప్రియుడి నఖక్షతాలలాగు, పెళ్లాము సాధింపులలాగు బాధపెట్టకుండా, ద్వేషము పురికొల్పకుండా కార్యసానుకూలానికి తోడ్పడేది. "Excess of Sorrow laughs" అని డాక్టర్ పట్టాభిగారికి ప్రత్యుత్తరమిచ్చి గోపాలుడు చీరాలవాసుల విషయమై ఆంధ్రుల హృదయాలలో ఒక్కమారుగా చిచ్చులేపాడు. ఆనాడు సభలో వున్నవారంతా ఒక్కపెట్టున హర్షించారు. ఎవ్వరికీ మనసు నొవ్వలేదు. డాక్టర్‌గారికిహూడా మనస్సు నొవ్వలేదనే నా నిశ్చితాభిప్రాయము.

మరి స్నేహపక్షపాతమో? అగణితము. "నీవాళ్ల"మన్నవాళ్లని చేపట్టి బ్రహ్మాండనాయకులను చేయటానికి ప్రయత్నించాడు. స్నేహితులను అన్నదమ్ములవలె చూచాడు. అడిగినవాళ్లకు అన్నదానము తనకున్నా లేకపోయినా మరురోజు సంగతి విచారించుకోకుండా చేసేవాడు. డబ్బులేకుండా ఇబ్బందిపడ్డాడంటారా? గడిచి బ్రదికినవా శ్లెందరో లేరే? మహానుభావు లెందరో కష్టపడ్డారే? ఉద్యోగంలో వుంటే గోపాలుడూ వేలకువేలు సంపాదించి లోకానికి శ్రీరంగనీతు లుపదేశించేవాడే! Life is a gamble (జీవితము జూదములాంటిది) అని భావించి సంచరించాడు గోపాలుడు. జూదములో ఓడిపోయాడో గెలిచాడో నిర్ణయించదగినకాలం ముందున్నది. కాని బ్రతికున్నంతకాలము "మత్తేభేంద్ర విభిన్నకుంభ పిశితగ్రాసైకబద్ధ స్పృహః, కిం జీర్ణం తృణమత్తి మానమహతా మగ్రేసరః కేసరీ" అన్న భర్తృహరి వాక్యముకు లక్ష్యప్రాయుడై బ్రతికి, తుదకు ముఖాముఖిని మృత్యువును సందర్శించి, వరించి, చేపట్టి మృత్యువశుడైపోయినాడు.

కత్తులూ, కలహాలూ కలకాలముండవు. కాలము పసుపుజల్లెడలాంటిది, మనుష్యుల గుణాగుణాలన్నీ ఆజల్లెడ చిల్లులలోగుండా జారి దిగిపోతవి. వాటినన్నీ మూటగట్టి దాచుకొన్నవాళ్లకే శోభనమూ ధనమూను. లేనివాళ్ల కెన్నడూ లేమే!

కాలచక్రము గతిగడచి తెనుంగు
భావిభాగ్యమ్మెల్ల పండినవెనుక
ఆనాటి కవరైన నడుగకపోరు
గోపాలకృష్ణు డేగోష్ఠివాడంచు?
భాగ్యవశమ్మున భావికాలాన
అమృతతుల్యమ్ములు నతిభావభరిత
ములునైన నాగీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్పదీపించు!

---

# లక్క-గేదె

నాళము కృష్ణారావు గా

విప్రుఁ డొక్కఁడు లేమిచే వెతలఁ బడుచు - తనకుటుంబముఁ బోషించుకొనఁగ లేక
ధనము నార్జింప మానసంబునఁ దలంచి - జలనిధిని దాఁటి దూరదేశముల కేఁగె.

కొంతకాలము గడచినయంత, నతఁడు - ధనము గడించి తనపురంబునకు వచ్చె
పౌరు లెల్లరు నత్యంతగౌరవమున - వానిఁ దోడ్కొని వచ్చిరి స్వగృహమునకు.

భర్తరాకకు ముద మంది వానిభార్య - కమ్మనెయ్యియు, కూరలు, గట్టిపెరుఁగు,
పిండివంటలు వడ్డించి ప్రీతితోడఁ - దనివి దీఱఁగఁ బతికి భోజనము వెట్టె.

ఆతఁ డవి యెల్లఁ గడుపార నారగించి - ఇట్లు వచియించె "సాధ్వి! నే నింటనుండి
అరుగునప్పుడు చిల్లిగవ్వైన లేదు - ఇన్నికూరలు భక్ష్యంబు లెట్లు వచ్చె?

ఇందుఁ దక్కిన వన్నిటి కేమి గాని - ఇట్టిపెరుఁగును జవిచూచి యెన్నఁ డెఱుఁగ,
ఎట్టు లభియించె నీ కిట్టిగట్టిపెరుఁగు? - గేదెపెయ్యయు మనయింట లేదు కాదె?"

అనుడు నవ్వుచు నాయింతి యనియె నిట్లు:-"గట్టిపెరుఁ గన్న మీ కెంతొ కాంక్ష యనుచుఁ
గొంటి నొకగేదె మనపొరుగింట నున్న - కంసలికి గుల్లగుట్ర తాకట్టు వెట్టి."

"ఎచట కొంటివి? మనయింటి కెదుట నున్న - యట్టికంసాలిచెంత నా? అమ్మచెల్ల!
నిక్క మగుగేదె కా దది లక్కగేదె - సుమ్ము, కంసాలి యకట! మోసమ్ము చేసె"

అనుచు నాతఁడు వచియింప, ననియె నింతి: -"నీదువచనంబు చోద్యంబు గాదె నాథ!
లక్కగేదెలు కలుగునే యెక్కడైన? - ఎవ్వరేనియు విన్నచో నవ్వ రొక్కొ?"

"ఎవ్వ రెన్నివిధంబుల నవ్వ నిమ్ము - 'నిక్క మగుగేదె కా దది లక్కగేదె'
అంచు ముమ్మాటికిని వచియించుచుంటి" - అనుచు సతితోడ గట్టిగ ననియె నతఁడు.

'గడ్డి మేయుచునున్నది:' 'గడ్డి మేయు;' - 'పాల నిచ్చుచునున్నది:' 'పాల నిచ్చు;'
'పేడ వేయుచునున్నది;' 'పేడ వేయు;' - 'దూడ లీనుచునున్నది:' 'దూడ లీను;'

ఆలుమగలకు నీరీతిఁ జాలసేపు - జరగె వాదము; సతిమాట సరకు గొనక
తాను పట్టినమాటయే తథ్య మనుచు - పెనఁగులాడె 'ననేమిరా' యనుచు భర్త.

అంత నీరీతి భర్తతో ననియె భార్య: - "వాద మేటికి? అది లక్క గేదె యనుచు
మీరు దృఢముగ మదిని నమ్మితిరయేని - ఋజువు చేయుఁడు హేతు వేదేని చెప్పి."

"అట్టు లైన, వచించెద నతివ! వినుము: - మున్ను నే నీపురంబున నున్నయపుడు
కుండలంబులు చేయించుకొనఁ దలంచి - మూఁడుబంగారుకాసులఁ గూడఁబెట్టి-

ఎదుట నున్నట్టి బత్తునియింటి కేఁగి - 'కంసలీ! నీదు నేర్పెల్లఁ గానిపింప
గట్టికుండలములజత కట్టవలయు' - అనుచుఁ బలికితి, నీరీతి ననియె నతఁడు.-

'ఇరుగు పొరుగున నుంటిమి యిన్నినాళ్లు - లాఁతివాఁడనె పలుక నీరీతి?' ననుచు
మంచిమాటల నన్ను నమ్మంగఁ బలికి - శీఘ్రముగఁ గుండలంబులు చేసి యిచ్చె.

తూనిక తూఁచితి, సరియైన తూనిక తూఁగె; - గీటు పెట్టితి, మేలిమిగీటు వచ్చె;
నాణె మరసితి, చక్కనినాణె మమరె; - సంతసించితి, పనిజిగిసంతనకును.

కొంతకాలము గడచినయంత, నపుడు - పెద్దకోమటియింటను పెండ్లి యొకటి
జరుగ, సంభావనంబున కరిగియుంటి; - త్రోపులాడిరి దొడ్డిలో బాపనయలు.

చెవులు పట్టుక నను లాగె సెట్టికొడుకు - ఇంతి! యాతనఁబోతర మేమి చెప్ప?-
వెంటనే కుండలంబులు పెళుకు మనుచు - లొట్టవడి యీవలికి వచ్చె లోనిలక్క.

చెవులు చేతులఁ దడవుచు నివలఁ బడితి - మనమునం దిట్లు తలపోసికొనుచు నంత:
మాయురే! బత్తుఁ డెంతటిమాయ చేసె - మంచిమాటల నన్ను నమ్మంగఁ బలికి?

లక్కపోఁగులఁ జేయఁగలట్టివాని - కొక్క లెక్కయె చేయంగ లక్క గేదె?
కాన, చెప్పుచునుంటి నోకాంత! వినుము - గేదె కాదిది మఱి లక్క గేదె కాని."

---

# జన్మపరంపర

చింతా దీక్షితులు గారు
[సాహితీసమితి]

౧

అతడు ఫ్రాంసులో బీదకుటుంబములో జన్మించినాడు. శ్రీమంతులు దరిద్రులను పెట్టే బాధలన్నీ అతడూ అనుభవించాడు. రెండుమూడుసార్లు అకారణముగా చెరసాలలో వాసము చేయడము కూడా అతనికి సంభవించినది.

ప్రజలందరూ భాగ్యవంతులమీదికి తిరుగుబడ్డారు. భాగ్యవంతుల వశములో ఉన్న రాజ్యమును విధ్వంసము చేయుటకు పూనుకొన్నారు. ఆ స్వాతంత్ర్య యుద్ధములో అతడూ పాల్గొన్నాడు. చెరసాలను గోడ ను పడగొట్టుతుండగా ఒకరాయి అతని మీద పడుటచేత అతడు మరణించినాడు.

౨

అతనికిపునర్జన్మవచ్చినది. అమెరికాదేశములో పుట్టాడు. నీగ్రోజాతిలోజన్మించినాడు. అతనికి స్వజాత్యభిమానముఎక్కువగా ఉన్నది. తెల్లవాళ్లు నీగ్రోలవిషములో చేస్తూఉన్న దౌర్జన్యములను అతడుచూచి సహించలేక పోయాడు. వారితో కలహాము పెట్టుకొన్నాడు. వాళ్లను దూషించినాడు. తత్ఫలముగా ఒక తెల్లదొర తుపాకిదెబ్బతినిఅతడుమరణించాడు.

౩

అతనికి పునర్జన్మ వచ్చినది. ఆఫ్రికాదేశములో 'జూలూ' జాతిలో అతడుపుట్టాడు. "జూలూ" జాతివారికి జాత్యభిమాన మెక్కువ. తన జాతి నాయకుడు ప్రక్కజాతి నాయకుడికి లొంగియున్నాడు అది స్వాతంత్రముకు భంగమని అతడు తనజాతి నాయకుణ్ణి పురిగొల్పాడు. అందరూ యుద్ధసన్నద్ధులయ్యారు. ఉభయ జాతులకూ మారణయుద్ధమైనది. జాతు లంతరించినవి. ఆయుద్ధములో మిగిలిన వారితోపాటు అతడూ మరణించినాడు.

౪

అతనికి పునర్జన్మ వచ్చినది. అతడు హిందూ దేశములో పుట్టాడు. ఇంగ్లీషు వారి అధికారం దేశములో అభివృద్ధిచెందుచున్న రోజులు. అత డొక సిపాయి. స్వాతంత్రేచ్ఛ ఒకకారణముగా అతడుకూడా ఇతర సిపాయీల తోపాటు ఇంగ్లీషువారిపై తిరగబడ్డాడు. వీరుడనిపించుకొన్నాడు కాని ఫిరంగి వాతబడి మరణించినాడు.

౫

అతనికి పునర్జన్మ వచ్చినది. అతడు ఇంగ్లాండులో ఉన్నత కుటుంబమున జన్మించినాడు. మంచిచదువులు చదువుకొన్నాడు. మంచి రాజకార్యధురంధరుడని పేరు పొందాడు. స్వదేశమునకు ఆపత్కాలమున మంచిమంచి సలహాలిస్తూ ఉంటాడు. "భారతీయులకు స్వాతంత్ర్య మియ్యవచ్చునా" అంటే "ఇయ్యకూడదం"టున్నా డతడు.

---

# శ్రీగద్వాలసంస్థానపు రెడ్డిరాజుల గురుభక్తి

ఆదిపూడి ప్రభాకరకవి గారు

శ్రీ రామభూపసుత, సీ-తారామక్షోణిధవ, సుధాధామమహో
దారయశస్సారతర-క్షీరాబ్ధివిహారహారి, కేశవ, శౌరీ!

చలదుత్తుంగతరంగశోభితము కృష్ణాతీరమం దాయహో
బలలక్ష్మీనరసింహ దివ్య పదసేవాధుర్య శ్రీరంగ నా
థలసచ్ఛోభన నామదేశికుని సీతారామ భూపాలుఁ డ
త్యలఘుం డాదటఁ గొల్చెఁ దచ్చరణ భక్త్యారూఢచిత్తాబ్జుఁడై.

కనకాంబరంబులు గణన కెక్కుడు గాఁగ నర్పించె గురునిపాదాబ్జములకు
రజతస్వరూపముల్ రాసులు వోసి యర్పించెఁ దచ్చరణ రాజీవములను
నవరత్నమయ భూషణముల సంఖ్య లొసంగి మెఱఁగెఁ దదంఘ్రిపంకరుహయుగళి
షాడబోపేత భోజనతుష్టి మెసఁగ సేవించెఁ దత్పదపద్మ వినతుఁ డగుచు
హస్తి తురగశతాంగ పల్యంకికాది-దివ్యవాహనములు నివేదించి భక్తిఁ
బూజ లొసఁగె సీతారామ భూధవుండు-నతులు నుతు లొప్ప శ్రీరంగనాథయతికి.

కాల్బలంబులచేతఁ గత్తుల చకచకల్ దినమణిద్యుతులకుఁ దేజు లీన
రాహుత్తులబుజాల రహి వహించు తుపాకు లమరారులకు మతిభ్రమణ మొసఁగఁ
బటుభటోద్భటహస్త పర్యటత్ కేతన పటలంబు సురల కభయము సూప
నాశావకాశ మాద్యత్తూర్య ఘోషమ్ము లరుదెంచు శుభసమయమ్ముఁ జాట
స్వారి వెడలిన సంయమిస్వామితోడ-నరిగె నరసింహు కెలనఁ బ్రహ్లాదుపగిది
మోడ్పు కేల్దమ్మియును నరమోడ్పుచూడ్కి-కొమరు మిగులంగ నరపాలకుంజరంబు.

అఖిలజీవవ్రాత మాత్మతుల్యంబుగా నరసి యీషణముల నడఁచువాని
నైహికభోగమ్ము లన్నియు నమ్మహా మాయావి కప్పనఁ జేయువాని
నవ్యాజ కరుణామృతార్ద్రమై శోభిల్లు హృదయంబుతోడ వర్తించువాని
నరసఁ జేరిన యెట్టి చండాలునేనియు సచ్చరిత్రునిఁ జేయఁ జాలువాని

సర్వశోభనవితతి కాస్పదము విష్ణు - దేవుపదసేవ యనుచు బోధించువాని
నెఱిఁగి సేవించె సేవించి యెఱుకఁ గాంచె - మాన్నృపుఁడు మావిభుప్రేరితానురక్తి.

పంద్రెండుజాపు లొప్పంగఁ గ్రాలెడు చండభానుండు వెస శీతభానుఁ డయ్యె
మిన్నుమన్నును నాక్రమించి వచ్చెడు కృష్ణవేణమ్మ రుచిరాళివేణి యయ్యె
గాలిడ్డఁ జుఱచుఱఁ గాల్చు చుండెడు శిలాతలములు మిహిర శీతలము లయ్యె
నెఱగలిమంటలఁ గురిసెడు ఖగకర కరములు గాంగశీకరము లయ్యె
చిట్టిదొరసాని ముద్దులపట్టిఁ గూడి - భక్తిపరవశుఁ డగు గురుస్వామి సాగ
నంప సోపానములు డిగి యల్లనల్లఁ - బల్లకీతోడ నడచు మాపార్థివునకు.

ఆందోళికావరోహణవేళఁ గైదండ యొసఁగి పావలు మ్రోల నుంచునపుడు,
సోపానములు డిగ్గువో నడుగడుగున కెచ్చరించుచుఁ బరాకిచ్చునపుడు,
పడవపై నెక్కునప్పుడు పార్శ్వములు కాచి పాయక శ్రమ లేక పట్టునపుడు,
పాయఁ ద్రోసెడుతఱిఁ బాదపద్మములపై శిర ముంచి ప్రణతులు సేయునపుడు,
ఎంతవినయంబు, నయ మెంత, యెంతభయము-భక్తి యెంత యీభూపాలపరివృఢునకు
నంచు జలజల రాల్చె బాష్పాంబువులను - నయనములనుండి శ్రీరంగనాథదండి.

ప్రాచీన పుణ్యంబువశమున వచ్చెఁగా కిట కేల తా వచ్చు నీఘనుండు
వచ్చిన వచ్చెఁగా కిచ్చమూఁడేండ్లు సేవించు భాగ్యంబు లభించు నెట్టు
లదియు లభించెఁగా కల మహాత్ముని కేల కలుగు నాపయి నింత కనికరంబు
కనికరంబును గల్గెఁ గా కేల యింతటఁ బైనంబు తానెట్లు ప్రాప్త మాయె
ఇంక నెక్కడిగురుసేవ, యేడ తీర్థ - సంస్మరణ మేడ, యేడప్రసాదభోగ
మనుచుఁ దల వంచుఁ బలవించు మనుజనాథుఁ-డంచుఁ గన్నీరు గురువియోగార్థిఁ జింతె.

అన్యాంగనాసక్తుఁ డైన నాథుని నేఁడు భంగాలఁ బెట్టఁగా వలయు ననుచు,
రత్నమ్ము లెల్ల నేరమణి కిచ్చునో నేఁడు, పని బూని పట్టుకో వలయు ననుచుఁ,
గూడికూడని యట్టి కూటంబునకు మదిఁ గలలోఁతు దెలిసికో వలయు ననుచుఁ
దనపొం దతనికి నచ్చునో నచ్చదో యొక్కబాస సేసికొనంగవలయు ననుచు,
వార్ధిఁ జేరంగఁబోవు సంభ్రాంతి యెసఁగఁ - బఱచు శ్రీకృష్ణవేణమ్మ భాగ్యమహిమ
నొదవె నాయమ్మ కపుడు శుభోదయముగఁ - బరమగురునాథుచరణసేవావిభూతి.

ముడిచిన కెందమ్మి పూవు లివే లంచుఁ జయ్యనఁ దీసి విజ్జల్లుకరణి
నల్లిన జడ సూచి యలరువా రెవ రంచుఁ బాడవు వేసలి విరఁబోయుకరణిఁ
గట్టిన వెలికోక గౌరవం బేమని విప్పి యయ్యది పాఱవేయుకరణిఁ
దాల్చిన ముత్యాల దామమ్ము లే నొల్లనే యని వెసఁ ద్రెంచివేయుకరణి
వీచువీచీకరమ్ములు వినతి మోడ్చి - సిగ్గు విరిమొగ్గలుగ నర్చచేసి గురుని
కేఁగఁగాఁ బాయ యిచ్చె మాకృష్ణవేణి - పతియు యతియును నివ్వెరపడి భజింప.

మాయాకురంగంబు మహిఁ గూల్పఁ జనుచున్న రఘుకులస్వామి నారాచ మనఁగ
నంతరిక్షంబున అమృతకుంభము పూని పఱచుచున్న విహంగపతి యనంగ
నుదయార్కబింబంబు నుమియఁ బోగయి యేఁగు చండదీధితుల పుంజం బనంగ
బాణాసురప్రాణ పానాశఁ జనుచున్న శార్ఙ్గనిర్గతసుదర్శన మనంగ
భ్రాంతి యొసఁగొల్పు చాయానపాత్ర పూజ్య - తీర్థపుంగవు నరసింహదేవుఁ డున్న
హొన్నుపల్లకితోఁ బాయ నుఱికి కృష్ణ - వేణి కద్దరిఁ జేరెఁ బృథ్వీపతి యలర.

ప్రాభాతసూర్యబింబము ప్రాచిఁ బ్రాఁకుచోఁ బరిఘవిల్లెడు నొప్పుఁ బరిహసించి
వనవిహారార్థంబు చనుచు మేరువు నెక్కు నైరావతముసొంపు బేర ముడిచి
భూభార మటు డించి పుట్టపై కేతెంచు భోగీంద్రు సొగ సెల్ల బుట్టఁ బెట్టి
దైత్యలోకకుకూలదహనుఁ జూడఁగ నేఁగు నాకకర్మంది విన్నాణ మడఁచి
అల్లనల్లన నవలిగ ట్టాయతీంద్రుఁ - డెక్క గమ్యస్థలంబు నిం పెసఁగఁ జేరెఁ
బలియు నాదిక్కునకు నమస్కృతి యొనర్చి - సౌధరంగంబుఁ జేరె విశ్రాంతి యొసఁగ.

---

## రవీంద్రుఁడు*

గరిగిపాటి రామమూర్తిగారు, బి. ఏ.

జలనిధిపూరముల్ తరణి సంతతమున్ గ్రహియించు చుండు, న
బ్బలరిపు డంబుదావళుల బంపి సువృష్టి నొసంగు, సృష్టిలో
గలుగు రహస్యసారమును గ్రాహ్య మొనర్చి కవిత్వవర్ష మున్
గలుగగ జేయు దీవు రవికంటెను, నింద్రునికంటె మిన్న వై.

---

* శ్రీయుత కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారి సంస్కృత శ్లోకమునకు భాషాంతరీకరణము.

# బోధనాపద్ధతులు

[19-3-1927 వ తేదీని రాజమండ్రీ బోధనకాలేజీలో ఉపాధ్యాయసంఘు వార్షికోత్సవసందర్భంలో, ఒకపాతవిద్యార్థి చదివిన వ్యాసం.]

"బోధించడం" అంటే ఒక తెలిసినవాడు ఒక తెలియనివాణ్ణి దగ్గిర కూచోబెట్టుగుని, ఒక కొత్తవిషయం పట్టుగొచ్చి అది అరిటిపండు ఒలిచినట్టు చెప్పి, "చెప్పాను, నా పని అయింది" అని ఊరుకోడం కాదు; వాడిచేత "హం" అనిపించి "అదా! తెలిసిందండి" అనిపించడం. అనగా బోధనలో ఉపాధ్యాయుడూ, విషయం, విద్యార్థీ ముగ్గురుండాలి; కాని ఈముగ్గురూకాక మరొకపదార్థం ఉంటేనేగాని బోధనక్రియ నెరవేరదని జ్ఞానుల ఊహ. అదేమిటంటే, విద్యార్థి అయినవాడికి చెప్పేవాడియందుండవలసిన ఒకభావం. విద్యార్థికి మేష్టరంటే 'హడల్' ఉన్నా సరే— యముడ్రా వీడు, తప్పట్టుగుని చంపేస్తాడ్రా—అని. 'భయం' ఉన్నా సరే—యమకింకరుడురా వీడు, అదే తన్నడం తన్ని బాధిస్తాడేమో—అని. 'భక్తి' ఉన్నా సరే — సృష్టించిన దేవుడ్రా, నేను మొక్కాలీ — అని. 'విశ్వాసం'ఉన్నా సరే—యజమానుడురా, నేను సేవించాలి—. అని. 'నమ్మకం' ఉన్నా సరే — జ్ఞానిరా, నేను ఆశ్రయించాలి — అని. 'గౌరవం' ఉన్నా సరే — అనుభవ శాలిరా నేను వినాలీ—అని. పోనీ 'స్నేహం'ఉన్నా సరే— సహవాసిరా, నేను తిరస్కరించనా — అని. ఆఖరికి 'సిగ్గుభిడియాలు' ఉన్నా సరే — ఆ తల మేష్టరికి రాకపోడం అనుమానం అయినా, నాకు రాకపోడం రూఢిగదా—అని. ఆలాంటి భావం ఉన్నన్నినాళ్లు మేష్టరులో ఉండేది చదువు; మేష్టరుయందు గురుత్వం ఉండేది. ఆ తర్వాతనించి కుర్రాడిలోనే గురుత్వం ప్రవేశించింది. అనగా, అప్పటిదాకా విద్యార్థి విద్య అర్థించేవాడు, అక్కణ్ణించి ఆ అర్థించడు మానుకున్నాడు. మానుకుని "విద్యకోసం మ నేను బయలుదేర్ను. అంత అవసరంగా ఉంటే విద్యనే నాదగ్గిరికి రమ్మనండి. నాకేం పట్టింది! కావలిస్తే ఏమన్నా మధ్యవర్తులకి నాలుగు రాళ్లు గిరవపెడతాను." అని బిగిసి కూర్చున్నాడు. అయితేం గాక, అతడు అర్థించక పోయినా సరే "మేం మాత్రం మా కొచ్చింది బోధించక మానం" అని అనేక కారణాల వల్ల ఉపాధ్యాయులు విద్యార్థిని పట్టుగున్నారు. ఆలోచించారు. "ఆఁ. ఏమిరా ఇది. కుర్రాడు ఇల్లా వినిపించుగోకుండా వచ్చాడు; వీడికి కష్టం లేదే! వీడు దేవుడు. వీడి మనస్సు కష్టపెట్టాలి. ఇన్నాళ్లనించీ ద్రోహంచేసి వీణ్ణి కష్టం లం కుర్రాడి కిందగట్టి చదువు తెగచెప్పి సుఖపోతున్నారు కొందరు. అల్లాంటి అన్యాయం జరగకుండా కట్టుదిట్టం చెయ్యాలి" అని

పరిచారు. "కుర్రాడికి తెలియకపోవడానికి కారణం కుర్రాడు కాదు, మేష్టరుగారి తెలివి తక్కువ" అన్నారు. అంతటితో మరి మెదడు వెనక్కి పట్టి మెథడ్ తియ్యమన్నారు.

ఆఫలంగా బోధనాపద్ధతులు వెలిశాయి. ఉపాధ్యాయుడు తనకి ఊహూ మహావచ్చును గదా అని విశేషాలు గబగబా అదే వాగుడు కింద ఊరికే చెప్పిపారెయ్యకూడదన్నారు. సంగతులకి కొత్తేంటూ ఏముంది? ప్రతీసంగతీ కూడా నున్నూ కుర్రాడి బుర్రకాయలోనే ఇదివరకే ఏమూలో దాగుడు ముచ్చీలు ఆడుతూ వుంటుంది. అది ఎక్కడుంటుందో వెతికి బయటికి లాగడంపూచీ మాష్టరిది అన్నారు—ఇదే ఎలిసిటింగ్ మెథడ్ అంటారు. కొందరు 'కుర్రాడికి ఏదో కాస్త లంచమిచ్చి బెల్లించాలి; లేకపోతే చదవడు' అన్నారు. కొందరు వాడు ఏం కావాలంటే అది చెప్ప మన్నారు. వాడేమీ వద్దంటే ఊరుకోడమే విద్య అన్నారు. వాడు 'ఎప్పుడు, ఏది, ఎంతవరకు' కోరితే 'అప్పుడే, అదే, అంతవరకే కానీ' మన్నారు. వాడి బుర్ర గుంజుని అంటిపెట్టుగుని కొన్ని గొప్ప లక్షణాలు ఉంటాయి; వాటికి ఓ పట్టకారు పట్టించి ఇవతలికి పెల్లగించడమే 'ఎడ్యుకేషను' అంటే అని, ప్రతీమనిషీ లెక్చెరివ్వగలడు. ఇల్లాగ్గా ఒక్కొక్క కొత్త ఊహతో, వెనకటి పద్ధతుల్లో లోట్లు తమరు పూడిచాం అని ఎవరి మట్టుకు వారు చెబుతూ, ఒక్కొక్కటి చొప్పున, అనేకమైన నవీనబోధనా పద్ధతులు బయలుదేరదీశారు! దాంతోటి ఏం జరిగింది? జీవంఉన్న మాష్టర్ని వదిలేసి లేచిపోయిన గురుత్వం జీవండున్న కుర్రాణ్ణీ ఆశ్రయించలేదు, కుర్రాడు మైనరుగదా అనిగా వున్నా- ఆగురుత్వం ఇప్పుడు జీవంలేని మెథడ్ని నమ్ముకుని ఉంది. ఆమెథడ్ మహాదేవతనే అందరూ కొలుస్తున్నారు.

ఎల్లానో అల్లా అంతా మెథడ్స్మరణే. మతాల్లో ఉండే కక్షలు, వృత్తుల్లో ఉండే అభిమానం, భాషల్లో ఉండే అసహ్యాలు మెథడ్లలో ఉన్నాయి. ఏమనిషి మంచివాడో నిర్ణయించచ్చు; చివరికి ఏగడియారం రైటో తేల్చచ్చు గాని ఏమెథడ్ మంచిదో చెప్పలేం. ఈమెథడ్ మంచిదా ఆమెథడ్ మంచిదా అనే చర్చ అసలు కూడదు. వెనక ఓకవి వైదీకా, నియోగా అని మీమాంస వచ్చింది. సరి, ఓ వైదీకిగారు కవి వైదీకే అని వాదించి పదిపదిహేను దృష్టాంతరాలు చూపించాడు. తక్షణం, ఒక నియోగిగారు బయలుదేరి కవి నియోగే అని ఇరవైచోట్ల ఋజువులున్నాయి; గ్రంథవిస్తరభీతిచే ఆగుతున్నానన్నాడు. ఆంధ్రసాహిత్య విమర్శనలో గొప్ప వాదనవిషయాలు ఏవంటే ఇవీ, కాలనిర్ణయమూను. చివరికి ఓ ఆసామీ చక్కావచ్చి, ఆకవి నియోగీకాడు వైదీకీకాడు, అసలు బ్రాహ్మడే కాడు వల్లకాడు, అబ్రహ్మణ్యుడని చెప్పి పూర్తిగా సిద్ధాంతం చేశాడు. అందుకని మంచి మెథడ్మాట అటుంచి ఎవరేనా వచ్చి ఇవి మెథడ్లే కావంటే! చావాలి. కాని, కొందరు మెథడ్లు అంటే తమరికి ఇష్టం లేదం

టూ మెథడ్లు ఉపయోగిస్తారు; ఏమీ బా గుండలేదు, కాస్త వంకాయకూర ఇల్లా వడ్డిం చండి అన్నట్టు. మరికొందరు, మెథడ్‌ని ద్వేషించినా అది నిరర్థకం అని శాసన చెయ్యడానికట ఉపయోగిస్తూన్నది; చుట్ట కాల్చడం ఎందుకయ్యా అంటే, పొగాకంటే నాకు ద్వేషం కనపడ్డ చోటల్లా దానిమొహం తగలేస్తున్నాను అన్నట్టు. చాలామంది మెథడ్ అవలంబించి ఫలితం శూన్యం అయితే మెథడ్ తప్పంటారు; టెన్నిసులో పాయింటు పాడుచేసి బ్యాట్ కేసి చూసి మొహం చిట్లించినట్టు. చేసేటట్టు చేస్తే ప్రతీమెథడూ మంచిదే అని కొందరు. తమరి మెథడే మెథడని కొందరు.

పూర్వం బోధనకి పద్ధతులంటూ వినం. ఆచరణలో కొన్నిరీతు లున్నా, అవి పేరు మోసిన పేర్లతో లేవు. కాబట్టి మనమే వాటికి కొన్నిపే ర్లెట్టాలి. మొదట 'దెబ్బ దేవేంద్ర లోకం' మెథడ్, అనగా "తెలిసిందా, తెలిసిం దా లేదా; తెలిసిందను, అను" అని తెలిసే వరకు కొట్టడం. తరవాత, 'పొడుంపట్టు' మెథడ్, అనగా బొటనవేలూ చూపుడు వేలూ కలిపి పట్టుగుని— "ఆయొక్క— శ్రీరామచంద్రుల వారు ఏమన్నారూ?" అంటూ నభ క్తికంగా చెప్పడం. ఆపైని 'వాయినం' మెథడ్: మేష్టరు 'గివ్' చేస్తూం టే విద్యార్థి 'టేక్' చేస్తూండడం, "ఇస్తినమ్మా వాయినం" అంటే, "పుచ్చుగుంటినమ్మా వాయినం" అన్నట్టు. ఒకవేళ విద్యార్థికి ఇష్టం లేకపోయినా 'గివ్'చేస్తే, కూరడం లక్షణం ఉంది గనక 'కాయావకాయ్'అనేష్వంటి 'గన్ పౌడర్' మెథడ్ అవుతుంది. అక్కణ్ణించి "ఫెయిర్" మెథడ్ ఉండేది— అనగా నంత కింద పాఠం చెప్పడం. ఆతరవాత,'వడ్డీమంగలి' మెథడ్, అంటే శిష్యుడు కాళ్లు పిసుగుతూంటే గురువు పాఠం చెప్పడం. వీటిల్లో "ఊఁ మెథడ్" అని ఒకటుంది. ఓ తాసిల్దారుగారు తమరి అబ్బాయిని 'నాలుగుమూ ళ్లెంత?' అని అడిగితే అతడు కాయితం ఉంటేనేకాని తేలదని అది పుచ్చుగుని దానిమీద "2" అని వేశాట్ట. తాసిల్దారుగారికి కోపం వచ్చి తమరింటో ప్రైవేటు ట్యూషన్ మనిషికి కబురంపించి, "ఏమిటయ్యా నీచెప్పు? నాలుగు మూళ్లైనా రాదే మావాడికి!" అన్నాట్ట. అంటే మేష్టరు-"ఇది వరకు పదిసార్లు చెప్పానండి, రెండు మూడు సార్లుగాదు, పదికాని; దానికి మెథడ్ వుంది లెండి మీ రెరగరు. చూడండి నే తీస్తాను సమాధానం. నాలుగుమూ ళ్లెంతోయ్!"

అ—పది! (అని మూలుగుతాడు).

మే—ఊఁ-

అ—పదకొండు!

మే—(మరీఘట్టిగా) ఊఁ-

అ—పన్నెండు!

మే—(బహుదీర్ఘంగా తాపీగా) ఊఁ...

తా—మరి, మీరైతే ఇప్పుడు ఇల్లా చెప్పించారుగాని, ఇందాకా వాడేసిన 'రెండు' తప్పు కాదూ?

మే—కాదండి. ఈ ప్రశ్నకి రెండాన్స ర్లున్నాయి. మీఅబ్బాయి'2' ఎందు కేశాడో

తెలిసిందా? నాలుగు మూళ్లు రెండు గజాలు గదా అని. కాదుటోయ్?

అ—మ రేనండి!

మే—ఊం.

ఇదికూడా ఒకజాతి "ఎలిసిటింగ్ మెథడ్." ఇంకా "ఫింగర్ అండ్ స్ట్రెయిట్ ట్రెడ్ మెథడ్" (వ్రేళ్లతో దంధ్యం మెలెయ్యడం—వ్రరా:—దంధ్యం ఉంటేమాటే), "వాల్ ఛైర్ మెథడ్" (అనగా గోడకుర్చీ మెథడ్) లాంటివి ఉన్నాయి కాని మనం ఇక ఇటీవలి పద్ధతులలో పడదాం.

మొదట సోక్రటిక్ మెథడ్; అనగా ఊడూ బసవన్నా మెథడ్. మేష్టరు "కాదు ట్రా" అంటే విద్యార్థి "అవునండి, ఒట్టు, అంతే నండి" అంటాడు. అప్పడే వెంటనే మేష్టరు "అవునా?" అంటే "కాదండి, ఒట్టు" అంటాడు. కుర్రాడు 'యెస్' 'నో' లే ప్రయోగించేది. వెనకటికి 'యెస్, నో, ఆల్ రైట్' వచ్చిన ఒకాయన దొరగారితో మాట్లాడ్డానికి వెడితే దొరగారు మొదటి ప్రశ్న "మీ వూరికి మెడ్రాస్ ఎంత" అని వేశాట్ట. వేస్తే ఆయన 'నో' ప్రయోగించాట్ట. దొరకి తెలిసి, "నీకు జాతిభాష రాదుగావున్ను" అన్నాట్ట. మనవాడు "యెస్" అన్నాట్ట. అక్కడితో దొరకి విసుగెత్తి "నీవు ఫూల్‌లా వున్నావే" అన్నాట్ట. 'ఆల్ రైట్' విసిరి మనవాడు చక్కాపోయాట్ట. అల్లాంటిదే కొశ్చెన్ మెథడ్. వీటిల్లో మాష్టరుకి బాగా వస్తుంది పాఠం. తరవాత కొన్నాళ్లకి ఒక డైరెక్టరు అనే దొర ఒక మెథడ్ కనిపెట్టాడు. అదే డైరెక్టు మెథడ్. తెలియని భాష నేర్చుగోవాలంటే తెలియకుండా మాట్లాడుతూంటేగాని బాగా తెలియ దన్నారు వీరు. ఈయనికి ఏజెంటు ఫొనెటిక్స్ అనేదొర. ఈదొర ఊరు కోపేరు, ఒక్కొక్క మనిషి దగ్గిర ఓవేషం వేసేసరికి ఈన అసలు నామరూపాలు పోయాయి. విన్నప్పడు ఈన బాగానే ఉంటాడు గాని, చూపులకి మాఅసహ్యం. ఎవరిష్టం వారిది ఈయన్ని పిలవడంలో. ఒక యజమాని మేష్టర్ని ఇల్లా ఆశ్రయించాట్ట—"మా కుర్రాడిమీద ఆ ల్యూనటికస్ దొరగారికి కోపంట. తమరు చెప్పి కొంచెం కూడ తీద్దురూ!" అని. అక్కణ్ణించి 'రియలిస్టు' అనే మరొకదొర—దొరేమిటంటే, ఇంగ్లీషు ఊరుపేరు, దేశంపేరు, పర్వతం పేరు, జంతువు, పక్షి, మనిషి ఇవన్నీ దొరగార్లే మనికి—ఒక మెథడ్ స్థాపించాడు. ఇదీ కొంత ప్రబలింది. ఓమేష్టరు పిల్లిమీద రియలిస్టిక్ మెథడ్ ప్రకారం 'ఐడియల్' గా పాఠం చెబుదామని, ఒక పిల్లిని క్లాసులోకి పట్టిగెళ్లాడు. వెడితే అది బరిమీద పడి కొందర్ని రక్కి, కడంవాళ్లని గుడ్లుపీకి చేతిలో పెట్టడానికి సిద్ధమైందిట. పదపడి ఒకాయన 'కాంక్రీట్' మెథడ్ కనిపెట్టాడు. రోడ్డు కాంక్రీట్‌కీ ఈయనకీ సంబంధం తేలేటట్టుగా ముందుముందు శాసనం దొరకచ్చు. ఓపంతులు దీని ప్రకారం పాఠం చెబుతున్నాడు. 'ఐ టాక్'

అన్నాడు. అని, అన్నదల్లా చెయ్యాలిగా, సరి, మాట్లాడాడు. ఇదివరకునుంచీ మాట్లాడుతూండడంవల్ల కొత్తగా అప్పుడేం చేశాడో కుర్రాళ్లకి బోధపడలేదు. 'ఐ సింగ్' అన్నాడు, అని పాడాడు. 'ఐ లాఫ్' అన్నాడు, అని నవ్వాడు. 'ఐ క్రై' అన్నాడు, అని పాపం, ఏడిచాడు. 'ఐ డై' అన్నాడు, అని పాఠం ఆగిపోయిందని తరవాత హెడ్‌మాస్టరుగారు కోప్పడతారని గావును అంతటితో ఊరుకున్నాడు. పోనుపోను ఒకతను 'రీజినల్' మెథడ్ చేశాడు. కొండలమీద పాఠం అయితే అంతా కొండెక్కాలి. గోదావరిమీద అయితే అంతా కట్టకట్టుగుని గోదావరిలో దిగాలి. గాలిమీద పాఠం అయితే అంతా గాలిలోకి ఎగరాలి. ఇది రమారమీ 'ఎయిరీ' మెథడ్. ఈలోపున 'సైన్సు' దొరగారు ఒక మెథడ్ సృష్టించాడు. ఇందులో ఒక్కటే వచ్చింది చిక్కు. ప్రతీవాడూ తన ఆయుర్దాయం సాగగొట్టించుగుని, తెలివితేటలు చెక్కించుగుని రావలసివచ్చింది. ఈస్థితిలో ఒక'లేబర్'పక్షం మనిషీ, ఒక 'టోరీ'పక్షం వాడూ జాయింటు కమతంచేసి 'లేబరేటరీ' మెథడ్ కనిపెట్టారు. బాగా కృషి చెయ్యాలి, డబ్బు విపరీతంగా ఉండాలి, అదెట్టి కర్రా కంపా సామగ్రీ కొని తయారుచేసి ఉంచితే, ప్రతీవాడూ అందులో పడి కొట్టుగుని కొన్నాళ్లకి ఏదో కనిపెట్టలేకపోడన్నారు. కాని ఇంకో ఇద్దరు తలెత్తారు: 'డిడక్షన్' దొర 'ఇండక్షన్' దొర అనేకమల పిల్లలు. ఎవరెవరో పోల్చడం మా కష్టం. లోపల కూర్చుని వచ్చానంటాడు మొదటాయన. వచ్చాను, లోపల చిక్కడ్డాను అంటాడు రెండోఆయన. వీరు చెరోవేపూ నడిచి, చివరికి రాజీపడి 'ప్రొడక్టివ్'మెథడ్ ఒక్కటి మాత్రం స్థాపించారట. ఇల్లా ఉండగా 'హ్యూరీ' అనే మరొక దొరగారు బయలుదేరారు. ఆయన చరిత్ర వ్రాసిన 'బ్యూరీ'అనే దొరకి మేనమామ అయినట్లు మా స్వకీయ విలేఖరి వ్రాస్తున్నాడు. ఈయన, తక్కువా మిటి- "నేనే కనిపెట్టా, నేనే కనిపెట్టా," నంటూ ఒక మెథడ్ నెలకొల్పాడు. అదే 'హ్యూరిస్టిక్' మెథడ్ అయింది. ఈపద్ధతి ప్రకారం విద్య స్వకపోలకల్పితం. పదపడి 'కిండర్‌గార్టెన్' బయలుదేరింది. అనగా మేష్టర్ని 'తోటమాలి'పని చెయ్యమన్నారు. మొక్కల తిండి మొక్కలకి తెలుసులెండి, అన్నారు. ఆ మట్టున ఒకదొరసాని వ్యక్తిత్వం సంపాదించడానికి ప్రతిబాలుడికీ స్వేచ్ఛ యింకా కావాలి, చాలదు అని విచారించి, ఒక 'సారీ' మెథడ్ పెట్టింది. అదే 'మోంటిసారీ' మెథడ్. ఇందులో కుర్రాడు ఏమంటే అదే వేదం: వాడు మేష్టర్ని నోరుమూసుగోమంటే మేష్టరు అంతే చెయ్యాలి. లేకపోతే వాడిమనస్సు పాడై చదువు రాదన్నారు. కాని ప్రతీమెథడ్‌లోకిమళ్లీనే అందులోనూ, చెప్పినవాటిల్లో చాలావరకులు పాటించక్కర్లేదుట. కాలక్రమాన్ని డాల్టన్ దొరగారి మెథడ్ వచ్చింది: ఇందులో మేష్టరు చెప్పకుండా చెప్పాలి. విద్యార్థికి భాధ్యతా, పట్టుదలా, ఓర్పూ ఉండి, చేతినిండా డబ్బూ

బీరువాలనిండా కొత్తపుస్తకాలూ ఉంటే ఇహ నేమీ అక్కర్లేదు పొమ్మన్నారు. ఒకచోట ఈ మెథడ్ నడుపుతూ, ఒక కుర్రవాడికి ఒకకూడిక లెక్క ఎసైన్మెంటు ఇచ్చారు. ఆ అబ్బాయి లెక్కతప్పాడు. మేష్టరు "రూపాయల్లో తప్పావు, మళ్లీ చెయ్యి" అని మళ్లీ అదే ఇచ్చాడు. ఆ అబ్బాయి మళ్లీ తప్పాడు. మేష్టరు "అణాలలోత ప్పావు, మళ్లీ చెయ్యి" అని మళ్లీ అదే ఇచ్చాడు. ఆ అబ్బాయి మూడోమాటు మళ్లీ తప్పాడు. మేష్టరు "పైసలు తప్పా, మళ్లీ చెయ్యి" అన్నాడు. కుర్రాడు "ఎంత తప్పండి" అని అడిగాడు. ఆయన 6 పైసలు తక్కువొచ్చిందని చెప్పాడు. చెపితే "ఆ ఆరుపైసలూ నేను తమకి దాఖలు చేస్తాను, ఈ లెక్క మాత్రం నావల్ల కాదండి" అన్నాట్ట ఆ అబ్బాయి. ఇందులో కుర్రాణ్ణి పెద్దలు నమ్మాలి. అతడు నమ్మించి ఎగెయ్యొచ్చు. మేష్టరూ తనకి పనిలేదని బైటాయించవచ్చు. దాని తరవాత 'ప్రోజెక్టు' దొర బయలుదేరాడు. ఆ పేరుకే సవాలక్షగ్రంథం ఉంది. కుర్రాణ్ణి మారుమూల లోంచి సంఘంలోకీ, జీవితంలోకీ ఈడవమంటారు వీరు. జీవితంలో సమస్య ఓటి కుర్రాడు తలపెట్టుగుని, దాని మూలస్థానమైన అశంగు కెళ్లిపోయి, ఆసమస్య నిర్వహించెయ్యడానికి కావలసిన శాస్త్రభాగాలు నేర్చేసుగుని సొంతంగా పనిచెయ్య మంటాడు. అనగా ఇది 'తత్సంబంధం' మెథడ్, లేక 'సాండుఫోర్డు అండ్ మర్టన్' మెథడ్. వీరూ గొప్పవాళ్లని పెట్టి కుర్రాడికి మళ్లీ చెప్పించమంటారు డాల్టన్కిమల్లేనే. ఇది పెద్దవాళ్లకయితే పర్వా లేదు గాని, కుర్రాళ్లు దారీ తెన్నూ లేకుండా మహారణ్యంలో పడిపోతారేమో అని కొందరిబెంగ. ఇందులో స్త్రీవిద్య అంటే గృహకృత్యం నేర్చుకోడమేట. అందుకని ఈదేశపు స్త్రీలకి ప్రస్తుతం ఇది రుచించదు. ఆపైని, 'గేరీ' దొరగారు తమ యథాశక్తి చందా పారేశారు—అదే గేరీ కంట్రిబ్యూషన్. పిల్లల్ని వదలద్దు. పని—ఆట—చదువు అన్నీ స్కూల్లోనే కావాలి. మంచి పౌరుల్ని తయారుచెయ్యాలి. తల్లి తండ్రుల్ని వచ్చి పిల్లలతో కలిసి అప్పుడప్పుడు ఆ స్కూల్లోనే బన చెయ్య మన్నాడు. కాని మనదేశంలో తండ్రి తమరి అబ్బాయి ఫేలయినప్పుడు గాని స్కూలు కాంపౌండు తొక్కడు. తల్లి తన పిల్లాడికి బూతులు రావని వాదిస్తుంది గాని, అవి తమవాడు ఎంతపరిశుభ్రంగా వాడతాడో ఎరగదు, వినదు. వీరికి 'గేరీ' చెప్పింది నచ్చకపోవచ్చు. తరవాత 'ఆటా, పాటా, తమాషా' మెథడ్, అనగా 'ప్లే, వే' మెథడ్. అందులో భాగమే 'స్కౌటింగ్' అన్నారు. నాటకాలుకూడా ఆడమంటారు వీరు. మనదేశంలో అన్నిందాలా పాడైపోయినవాడుగాని నాటకంలో వేషం కూడదని అభిప్రాయమాయిరి! అందుకని, ఇదీ మనకి నచ్చకపోవచ్చు!

ఇందాకణ్ణించీ అనుకున్నవి, ఐశ్వర్యంలో తులతూగుతూ, చల్లగా ఉండి, స్వంత రాజరికం ఉండి, మావాళ్లు విద్యావంతులై ప్రపం

చం ఏలాలి అనే దేశాల్లో మెథడ్లమాటలు కాని, మన దేశం !—మన దేశంలో విద్యా పోషణ అనేటప్పటికి,—చెయ్యి, కాలు, నాలిక అన్నీ వెనక్కి లాగేస్తాయి (ఒక్కనాడి తప్ప). అల్లా దరిద్రం వెళ్లబోసుకుంటూండి, వేడిప్రదేశమై ఉండి, విద్యానాథులెవరో తేలకుండా, నానాజాతులూ, నానావర్ణాలూ, నానా భేదాలూగల నానా సాహేబులు నలభై యేసి (పైవారి ఒప్పుదలమీద యాభై యేసి) మంది అజ్ఞానులు ఉన్న తరగతులు—ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ సంవత్సరం ఆ తరగతే ఎందుకురా ఇదీ అని ఉసూరున ఈడుస్తూండే పిల్లలుగల తరగతులు—మార్కులపెంట, పరీక్షలగొడవ, ప్యాసుల ఆదుర్దా, గుమాస్తాగిరీ పరమావధిగల తరగతులు—చొక్కాలు విప్పితే ఎముకలపోగులుగా ఉండి, ఆత్మికవిద్య లేక, సౌశీల్యం ఏర్పడడానికి నోచుగోక, గంట కిద్దరు మేష్టర్లని చూసేపిల్లలుగల తరగతులు—స్వభాషకి దూరాన్నిపడి అన్యభాష అందుకోడానికి అర్హత లేనిపిల్లలు గల తరగతులు— ఉంటూన్న ఈదేశంలో ఏ మెథడ్ పెట్టి చబితే బోధన జరుగుతుందో తెలుసుగోడం మాటలు కాదు. డబ్బు చిమ్మి, తెలివిగలవాణ్ణి పెట్టి, తెలివిగలవాడికి చెప్పమంటే "ఆదర్శం ఎక్కడ కుదురుతుంది? ఉన్నదాల్లోనే ఏదో కాస్త నెత్తిమీద చమురెట్టి అయింది అనిపించాలి, ఏం జేస్తాం?" అంటారు కొందరు. ఈ దేశం మేష్టర్లు అందుచేత, అన్నీ కలిపేసి మహాథప్పళం మెథడ్ అవలంబించాలి. నవీనమైన మెథడ్లు ఎరుగుండం మంచిది. అవి 'బియిడి' పరీక్షలో ప్రశ్న కొస్తాయి. ఇంత సైకాలజీ, ఇన్ని మెథడ్లూ ఉంటేనేగాని అర్థం తెలియని ఆన్సర్లు పరీక్షలో రాయడానికి వీలుండదు. అది ఒకటి. రెండోది, మీరు ముందుముందు ఇన్స్పెక్టరుగా వెడితే ఆచెప్పేవిషయం మీకు తెలియకపోయినా మెథడ్ నీ, మేష్టర్నీ విమర్శించి పారెయ్యచ్చు. ప్రతీమెథడ్ లోనూ మంచి ఉంటుంది. అది ప్రతీవాడూ పుచ్చుగుని, డబ్బు ఖర్చు లేనంతమట్టుకి ఆచరిస్తేసరి మన దేశంలో, ఏ మెథడైతేం? క్రియ ముక్క కుర్రాడికి తెలియడం ప్రధానంట. అల్లాయితే మొట్టమొదటికొచ్చాం. ఏముక్కతో చాలా పుస్తకాలు బయలుదేరారో ఆముక్కదగ్గిరికే మనం తిరిగి తిరిగి వస్తున్నాం. సెలవ్.

---

## మాధవా!

శ్రీ. తి. వ. నారాయణస్వామిగారు

తలపయి బర్హి బర్హ మఱుతన్ వనమాలయుఁ గన్నుదోయిఁ గ
జ్జల మలికంబునం బస లెసంగెడు కస్తురి యొప్పఁ జిన్నిఁ జే
తుల నవనీతముం గొనుచుఁ దోడియనుంగులఁ గూడి గొల్లగీ
ములఁ దిరుగాడు నీచెలువమున్ గృపఁ జూపఁగ రమ్మ మాధవా !

లలితవిశాలశాద్వలతలంబులఁ బచ్చిక మేయ నాల వి
చ్చలవిడిఁ దోలి ప్రాంతవిలసచ్ఛిలపై వసియించి యంగుళీ
వలయిత వేణుదండమున వర్ణ్యసుగానలతాప్రపంచమున్
వెలయఁగఁ జేయు నీరుచిరవేషముఁ జూపఁగ రమ్మ మాధవా!

చెలువగు పొన్నగున్నపయిఁ జిక్కఁగఁ బ్రాకిన మల్లెతీవ ను
య్యెలగ నమర్చి దానిపయి హేల వసించుచు మోమునందు న
వ్వొలయఁగ నూఁగు నిన్నుఁ దనివోని ముదంబునఁ గాంచువ్రేత లో
జలజదళాక్ష! యేతపము సల్పిరొ తొల్లి యెఱుంగ మాధవా!

తరుణులు వేడ్కఁ దావక కథాసుధ నానుచు మించు వేడ్కతో
నరమర వీడి యుండఁగ గుణాఢ్యుఁడ! నవ్వుచు వెన్కనుండియే
కరమున నొక్కసుందరికిఁ గన్నులు మూసి యొకర్తు ముద్దు గొం
చరిగి హసించునీదు వికచాననపద్మముఁ జూపు మాధవా.

శయవిలసత్కశాచలనచాతురి క్రొమ్మెఱుఁగై వెలుంగఁగా
హయఖురపాతనిర్గతమహాధ్వనిగర్జల నీనుచుండఁగా
లయజలదభ్రమంబున నలందుర నిన్, గని కౌరవుల్ ధనం
జయరథచోదకత్వమున సాఁకవె! పాండవులన్ రమాధవా!

---



ప్రపంచమునందలి వింతలలో నొకటి

ఇది ఇటలీలోని ఏటవాలుగ నున్న 'పిసా' గోపురము. దీని నిపుడు నిక్కగా చేయ [illegible] చు [illegible].

మంత్రిత్వ వైఖరి

భార్య:—అయితే తామిపు డెక్కడనున్నారు? హౌస్ ఆఫ్ కామన్సులోనా?



౭. కర్ణ ఘటోత్కచ యుద్ధము





౮. అర్జున విభీషణుల యుద్ధమున విభీషణుని పరాజయము

# పల్లవులు

డాక్టరు యన్. వెంకటరమణయ్య గారు, యం.ఏ., పి. హెచ్.డి.

## ౧

క్రీ. శ. 3వ శతాబ్ది మొదలు ౯వ శతాబ్దము వఱకు కృష్ణాకావేరుల మధ్యదేశమున పల్లవ వంశపురాజులు రాజ్యము జేసిరి. పల్లవులయుత్పత్తిని గురించి పరిశోధక పండితులు అనేకులు అనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. కొందఱు భరతఖండమునకు వలసలు వచ్చిన పాశ్చాత్త్యు లనిరి; కొందఱు అరవ లనిరి; మఱికొందఱు సింహళదేశవాస్తవ్యు లనిరి. ఇట్లు పలువురు పలువిధములుగ బలికిరి. ఈయభిప్రాయముల నన్నిటిని చక్కగ జర్చించి, వారు పారశీకమునుండి వచ్చినవారైనను చిరకాలము ఆంధ్రదేశమున నివసించి ఆంధ్రులవేషభాషలను, మతాచారములను అవలంబించి, వారితో సంబంధబాంధవ్యములను గల్పించుకొని యాంధ్రులైన యొక తెగవారని ఇంతకుపూర్వము 'జయంతి'యందు వ్రాసియున్నాను. వీరు మొదట ఆంధ్రరాజులభృత్యులై యుండి, ఆంధ్రసామ్రాజ్య మస్తంగత మైనపిమ్మట, నాసామ్రాజ్యములోని దక్షిణభాగమున కంతటికిని ప్రభువు లైరి. ఇక పల్లవులకు రాజ్య మెట్లు వచ్చినదో విచారించవలసియున్నది.

పల్లవవంశమున చారిత్రపురుషుడుగ బ్రథమమున బరిగణింపదగినవాడు వీరకూర్చమహారాజు. ఇట్టిరాజుండె ననుటకు సాక్ష్యము దర్శి-శాసనము.1 ఇతనిపూర్వికులు రాజులు గారు: సామంతులు, సేనాపతులునయి యుండిన నుండవచ్చును. వారితో మనకు పని లేదు. ఈవీరకూర్చునికి రాజ్యమువచ్చిన తెఱగు వేలూర్పాళెయపుతామ్రశాసన2 మున నిట్లు వర్ణింపబడియున్నది:

"తత్సుతా దజని చూతపల్లవా
ద్వీరకూర్చ ఇతి విశ్రుతాహ్వయః;
యః ఫణీన్ద్రసుతయా సహో గ్రహీ
ద్రాజచిహ్న మఖిలం యశోధనః".

వీరకూర్చమహారాజు ఫణీన్ద్రసుతతోగూడ రాజచిహ్నముల నన్నిటిని గ్రహించెనని శ్లోకార్థము. ఫణీన్ద్రకన్య యన్న నేమని యర్థముచేసుకొనవలయును? నాగుబాముపిల్ల యనియా? కాదు. పూర్వ మీదక్షిణదేశమున నాగవంశజులగు రాజులు రాజ్యమేలిరి. నాగవంశపు రాజులలో నొక్కనికూతు నుద్వాహము జేసికొని తన్మూలమున రాజ్యమును వీరకూర్చరాజు వడసెను.

ఈనాగరా జెవ్వరు? నాగులకు దక్షిణాపథమునం దధికార మెట్లు వచ్చెను? అనుప్రశ్నలకు సమాధానము జెప్పవలసి యున్నది. నాలుగవ పులమావియను నతడు ఆంధ్రరాజులలో కడపటివాడు. ఇతనియనంతర మాంధ్రసామ్రాజ్య మంతరించిపోయెను. తదనంతరము నాగవంశజులగు రాజులు ప్రబలి యాంధ్రరాజ్యమును స్వాధీనపఱచుకొని రాజ్యము నేయదొడగిరి. నాగరాజు లాంధ్రదేశమునకు క్రొత్తగా వచ్చినవారు గారు. చిరకాలమునుండి యాంధ్రదేశమున నివసించుచు నాంధ్రరాజకుటుంబముతో సంబంధబాంధవ్యములను నెరపుచుండిన సామన్తరాజులే యని యెఱుగవలయును.

ఇట్టిసామన్తరాజకుటుంబములలో ముఖ్యముగ గమనింపదగినవి రెండు: (౧) చూటుకులము; (౨) మహారథివంశము.

(౧) చూటుకులమువారు నాగు లనుటకు మొదటి నిదర్శనము వారికులము పేరు. చూడ మన్న అరవమునందు పడిగెయని డా. కృష్ణస్వామి అయ్యంగారు తమ 'పల్లవులు' అనుగ్రంథమున వ్రాసియున్నారు. రెండవది యీవంశమువారు సర్పములను బూజించుటయు.

---

1. ఎ. ఇం. సం. ౧.

2. సౌ. ఇం. ఇ. సం ౮.

శాతవాహనవంశే మంతరించినపిమ్మట వారిరాజ్యమందు చాలభాగము చూటుకులనాగులకు వైవసమాయెను. ఇట్లని శాసనములవల్ల దెలిసికొనుచున్నాము.

మైసూరుసంస్థానమునకు జేరిన షికారపురతాలూకాలోని మాళవల్లి గ్రామమున నొకశిలాస్తంభము గలదు. దానిపై పురాతనములగు శాసనములు రెండు చెక్కబడియున్నవి. అందొక్కటి "హారీతిపుత-విణ్హుకడ్డ-చుటుసాతకంణి"యనురాజుయొక్క ద్వితీయరాజ్యవర్షమునందు జెక్కింపబడినది. ఈతడు 'వైజయంతీ (బనవాసీ) పురరాజు'యని వర్ణింపబడియున్నాడు. ఇతనిదే మఱొకశాసనము బనవాసియందు గాన్పించుచున్నది. ఇందు రాజుపేరు 'హారీతిపుత-విణ్హకడ - చుటుకులానంద' యని చెప్పబడియున్నది. ఈదానశాసనమును చెక్కించినది మహారాజునకును, మహాభోజికిని కుమార్తె యగు 'నాగములనిక' యను నామె. ఆమె తనకుమారుడను సివఖందనాగసిరి యనునాతనితోగూడి యీశాసనమును వేయించినది. ఈసివఖందనాగసిరియు కాన్హేరిశాసనమున జెప్పబడిన ఖందనాగశాతకుడును నొక్కరే. ఈతనితండ్రి యొకమహారథి. ఈశాసనములను మథింపగా దేలినవిషయ మేమనగా, నాంధ్రరాజ్యము క్షీణించినపిమ్మట కుంతలమును, అపరాన్తమును చూటుకులనాగులకు స్వాధీన మాయెను.

హారీతీపుత్ర-విష్ణుకడ-చుటు శాతకర్ణి
భార్య మహాభోజి-వీరి కిరువురకును కూతురు
|
నాగమూలనిక
మహారథుని వివాహము జేసుకొనెను
|
స్కందనాగ శాతక లేక
శివస్కందనాగశ్రీ

శివస్కందనాగశ్రీయొక్క తండ్రి మహారథియని పై జెప్పబడియున్నది. అతనిపేరు మనకు దెలియదు. అయినను, నాత డెచ్చటివాడు? చిత్రదుర్గము (Chitaldroog in Mysore) నకు సమీపమున నున్న చంద్రావళీపురమును రాజధానిగ జేసుకొని, తత్సమీపభూముల నేలుచుండిన నాగవంశజుడు. విష్ణుకడ-చుటు-శాతకర్ణి తనకుమార్తెను నాగనికను మహారథున కిచ్చి యుద్వాహము చేసెను. కాబట్టి చంద్రావళీపురాధీశునకును, వైజయంతీశునికూతురగు నాగమూలనికకును బుట్టినవాడు శివస్కందనాగుడు. ఇతనితండ్రి తుంగభద్రకు దక్షిణమున నున్న రాజ్యమున కంతటికిని నధిపతి. మాతామహుడగు విష్ణుకడ-చుటు-శాతకర్ణునకు పురుషసంతతి లేకపోవుటచేత నేమో, యాతనిరాజ్యమునకు దౌహిత్రుడగు శివస్కందనాగుడే ప్రభు వాయెను. కావున స్వరాజ్యారంభకాలమున నాతడు కృష్ణాకావేరులమధ్యరాష్ట్రములకును, కుంతలాపరాంతములకును ప్రభు వాయెను. ఈశివస్కందనాగుడే ఆంధ్రరాజులలోని కడపటివాడగు పులుమావికి మహాసేనానిగా నుండెనని మ్యాకదోనిశాసనము చెప్పుచున్నది. పులుమావియనంతరము శివస్కందనాగుడు స్వతంత్రుడై పైదేశముల కన్నిటికి నధిపతి యాయెను. ఈతడే పల్లవవంశస్థాపకుడగు వీరకూర్చునికి గూతు నిచ్చి వివాహము చేసిన నాగరాజు. ఈతని పేరే పల్లవాన్వయమునకు బుఱోభాగము నలంకరించిన శివస్కందవర్మకును బెట్టబడెను. ఇట్లాంధ్రరాజ్యలక్ష్మి సాతవాహనవంశమును విడి, చుటు, మహారథులకడ గొంతకాలము వసించి, తుదకు పల్లవాన్వయము నాశ్రయించెను.

## ౨

ఈప్రకరణమున పల్లవవంశక్రమమును రచింపవలయును. ఇందుకు సాధనము లెవ్వి? పల్లవరాజుల శాసనములు.

(౧) వీనియందు వర్ణితమగు వంశచరిత మొక్కతీఱుగున లేదు. పురాతనములగు శాసనములయం దొక్కొక్కదానియందును రెండుమూడుతరముల రాజుల పేర్లే కానవచ్చుచున్నవి. అర్వాచీనములగు శాసనములవలె వంశసంబంధమగు పురాణగాథ లేవియు గానరావు. ఉదా. పల్లవరాజులు భారద్వాజులనియు, పరమబ్రాహ్మణ్యులనియు ప్రాతశాసనములయం దున్నది. తరువాతి శాసనములందువలె బ్రహ్మ, అంగిరస, భరద్వాజ, ద్రోణ, అశ్వత్థామలగుండ వంశావతరణము వర్ణింపబడియుండ లేదు.

కాలముగడచుకొలది పల్లవరాజులు స్వవంశచరిత్రను మఱచిరి. తమపూర్వికులపేళ్లుసైతము వారికి జ్ఞప్తి లేక పోయెను. కావున వారు తమశాసనములలో వంశచరిత్ర మను వర్ణించునపుడు ఎట్లు తోచిన నట్లు వ్రాయిం చిరి. అందుచే, ఈశాసనములలోని పురాతనపల్లవవంశ వర్ణన లన్నియు విశ్వసనీయములు గావు. కావున చక్కగ పరిశీలించికాని వానిలోని విషయములను గ్రహింపరాదు. ఇక వంశవృత్తరచన కనుకూలములగు శాసనములపట్టిక నొకదానిని బొందుపఱచెదను.—

౧. మయిదవోలు తామ్రపట్టిక:— (ఎపి. ఇండి కా. వా. ౬ పు. ౮౪) ఇది యువమహారాజు శివస్కన్ద వర్మ వ్రాయించి యిచ్చిన దానశాసనము.)

౨. హీరహడగల్లి తామ్రపట్టిక:—(ఎ. ఇం. ౧, పుటలు ౨—౧౦. ఇది అగ్నిష్టోమవాజపే యాశ్వమేథ యాజియు, భారద్వాజుడును, పల్లవధర్మ మహారా జును నగు శివస్కన్దవర్మ వ్రాయించి యిచ్చిన దాన శాసనము.)

౩. చారుదేవియొక్క గుంటూరుమణ్డల తామ్ర పట్టిక:—దీనినే బ్రిటీషు మ్యూజియము తామ్రపట్టిక యందురు. (ఎ. ఇం. సం. ౮, పు. ౧౪౩. ఇది శివస్కన్ద మహారాజు కోడలును,యువమహారాజు విజయబుద్ధవర్మ ధర్మపత్నియును, బుద్ధ్యఙ్కురుడను రాజకుమారుని తల్లియును నగు చారుదేవి వ్రాయించి యిచ్చిన తామ్ర పట్టిక.)

ఈ పైమూడు పట్టికలును ప్రాకృతమునందు వ్రాయబడియున్నవి. సంస్కృత శాసనములకంటె ప్రా కృతశాసనములు పురాతనములై నవని పరిశోధక విద్వాం సుల సిద్ధాంతము. కావున పల్లవశాసనము దీపైమూడును బహుప్రాచీనములని నిర్ధారణ సేయబడియున్నవి.

౪. దర్శి తామ్రపట్టిక:— (ఎ. ఇం. సం. ౧, పు. ౩౯౭. ఇది వీరకూర్చవర్మ మహారాజుయొక్క ప్రపౌత్రునిచే వ్రాయించి యివ్వబడినది. తామ్రపట్టిక లోని మొదటిరేకు మాత్రమే లభ్య మగుటచేత, వీరకూ ర్చవర్మకు వెనుక వచ్చువారలనామములు దెలియవు.)

౫. ఓంగోడు తామ్రపట్టిక:—౧. (ఎ. ఇం. సం. ౧౫, పు. ౨౪౬. ఇది కుమారవిష్ణుని ప్రపౌత్రు డును, స్కన్దవర్మపౌత్రుడును, వీరవర్మ పుత్రుడును నగు విజయస్కన్దవర్మ వ్రాయించి యిచ్చిన తామ్ర పట్టిక.)

౬. ఓంగోడు తామ్రపట్టిక:— ౨. (ఎ. ఇం. సం. ౧౫. ఇది వీరవర్మ ప్రపౌత్రుడును, స్కన్దవర్మ పౌత్రుడును, విష్ణుగోపుని పుత్రుడును నగుసింహవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౭. ఉరువపల్లి తామ్రపట్టిక:— (ఇం. ఆంటి క్వేరీ, సం. ౫, పుటలు. ౫౦—౫౨. ఇది స్కన్దవర్మ ప్రపౌత్రుడును, వీరవర్మ పౌత్రుడును, స్కన్దవర్మ పుత్రుడును నగు యువమహారాజు విష్ణుగోపవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౮. పీకిర తామ్రపట్టిక:— (ఎ. ఇం. సం. ౮, పుట. ౧౫౯. ఇది వీరవర్మ ప్రపౌత్రుడును, స్కన్ద వర్మ పౌత్రుడును, యువమహారాజు విష్ణుగోపవర్మ పుత్రుడును నగు మహారాజు సింహవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౯. మంగళూరుపట్టిక:— (ఇం. ఆం. సం. ౫, పు. ౧౫౫. ఇది వీరవర్మ ప్రపౌత్రుడును, స్కన్ద వర్మ పౌత్రుడును, యువరాజ విష్ణుగోపుని పుత్రు డును నగు మహారాజ సింహవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౧౦. చూరతామ్రపట్టిక:— (మదరాసు శాసన పరిశోధకసంఘపు వార్షిక కార్యనివేదన పత్రిక. ౧౯౧౩—౧౪, భా. ౨, నెం ౧, రు. ఇది స్కన్దవర్మ ప్రపౌత్రుడును, మహారాజు విష్ణుగోపవర్మ పౌత్రు డును, సింహవర్మ పుత్రుడును నగు విష్ణుగోపవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౧౧. చెన్దలూరుతామ్రపట్టిక:—(ఎ. ఇం. సం. ౮, పు. ౨౩౩. ఇది స్కన్దవర్మ ప్రపౌత్రుడును, కుమారవిష్ణుని పౌత్రుడును, బుద్ధవర్మపుత్రుడును నగు కుమారవిష్ణువు వ్రాయించి యిచ్చినపట్టిక.)

౧౨. ఉదయేన్దిరముపట్టిక:—(ఎ. ఇం. సం. ౩, పు. ౧౪౨. ఇది స్కన్దవర్మ్మ ప్రపౌత్రుడును, సింహవర్మపౌత్రుడును, స్కన్దవర్మ్మకుమారుడును నగునంది వర్మ్మ వ్రాయించియిచ్చిన పట్టిక.)

౧౩. అమరావతిశిలా స్తంభ శాసనము:— (సౌ. ఇం. ఇ. సం. ౧. ఇందు పల్లవరాజులవంశవృక్షమొక్కటి వర్ణింపబడియున్నది. అందలిరాజులకును కంచిపల్లవులకును గలసంబంధ మిట్టిది యని నిర్ధారణ సేయుటకు వీలు లేకున్నది.)

౧౪. వాయలూరుశిలా స్తంభశాసనము:—(దు బ్రాయిలుగారి 'పల్లవులు'- ఇందు పల్లవరాజులజాపితా యొక్కటి కలదు. అయిన నొకరాజునకును మఱియొక్క రాజునకును సంబంధ మెట్టిది యైనదియు వర్ణింపబడలేదు. శాసన నిదర్శనములు లేనిపేళ్ళనేక మున్నవి.) ఇది మొదటి పరమేశ్వరవర్మ్మ నాటిది.

౧౫. వేలూర్పాళెపు తామ్రపట్టిక: — (సౌ. ఇం. ఇ. సం. ౨, భా. ౫. ఇది మూడవనన్దివర్మ్మ వ్రాయించి యిచ్చిన తామ్రపట్టిక. ఇందుగూడ పల్లవవంశవృక్షమభివర్ణితము. ఇది వాయలూరుశాసనమునకంటె విశ్వసనీయమని పండితులయభిప్రాయము.)

ప్రాచీన పల్లవరాజ చరితరచనమున కాధారభూతములైన శాసనములివియే. వీనియందన్నిటియందును నీరాజులవంశావళి కొంచెముగనో గొప్పగనో వర్ణింపబడియున్నది. ౧౩, ౧౪, ౧౫ లలోదప్ప తక్కినవానియందు దాతయొక్క ముత్తాత, తాత, తండ్రులుమాత్రమే పేర్కొనబడియున్నారు. అనగా వీటిలో బ్రతిదానియందును ఏనాలుగుతరముల రాజులైనను. పేర్కొనబడియున్నారు. ఈదానశాసనముల నిచ్చినదాతలకు వారి తాతముత్తాతలపేర్లు తప్పక తెలిసియుండును. అందుచే వీనియందు వర్ణింపబడినవంశావళి విశ్వసనీయమని యంగీకరింపబడినది. ౧౩, ౧౪, ౧౫ అట్టివి కావు. అమరావతిశాసనములోని పేర్లకును, ౧—౧౨ లోని పేర్లకును ఏలాటిసంబంధమును గాన్పింపదు. వాయలూరుశాసనమున ౩౬ తరములరాజులపేర్లు కలవు. ఒకరికొకరి కున్న సంబంధము తెలియరాదు. వచ్చినపేరు మరల వచ్చుటయేకాక, మూడునాల్గుపేర్లు కలసి గుచ్ఛములుగ మరలిమరలి వచ్చుచుండును. శాసనమును వ్రాసినవారికి రాజులపేర్లును, వారు రాజ్యము చేసిన కాలక్రమమును నెఱుక లేకపోవుటచేత వారి యిచ్చవచ్చినట్లెల్ల వ్రాసి పేర్లను గల్పించిరి. కావున, చరిత్రరచనయందీశాసనముపై నాధారపడవలసినపుడు, జాగ్రత్తగ పరిశీలించి చూడవలయును; లేకున్న ప్రమాదము సంభవించును. వేలూర్పాళెపుశాసనమున ౧౯ రాజులపేర్లు గలవు. అందు కొంతమట్టుకును వారి కున్న సంబంధము చెప్పబడి యున్నది. ౧—౧౨ శాసనములలోని పేర్ల వరుస కది వ్యతిరేకింపదు. కావున నది విశ్వసనీయమని నాయభిప్రాయము. ఇక వంశవృక్షరచన కారంభించెదను.

ప్రాకృతశాసనములు సంస్కృతశాసనములకంటె ప్రాచీనమైనవని శాసనపరిశోధక పండితులసిద్ధాంతమని యింతకు ముందె చెప్పియున్నాముగదా; అందుచేత, ప్రాకృతశాసనములలో పేర్కొనబడిన రాజులు సంస్కృతశాసనములలో పేర్కొనబడిన వారికంటె పూర్వము రాజ్యమేలినారనుట నిస్సంశయము. ప్రాకృతపల్లవశాసనములు మూడు: మయిదవోలు, హీరహడగల్లి, గుంటూరు మండలశాసనములు. ఇందు మిక్కిలి పురాతనమైనది మయిదవోలుశాసనము. దీనియందు పేర్కొనబడినవాడు పల్లవవంశజుడు, భారద్వాజస గోత్రుడును యువమహారాజు, శివస్కందవర్మ. హీరహడగల్లి శాసనమున పేర్కొనబడినవాడు కాఞ్చీపురాధిపుడు, ధర్మ్మమహారాజాధిరాజు, పల్లవకులోద్భవుడు, భారద్వాజసగోత్రజుడు, శివస్కన్దవర్మ్మ. ఈశాసనమునందు మహారాజు బప్పస్వామి పూర్వము చేసిన దానమును తాను పునరుద్ధరణము సేయుచున్నానని శివస్కన్దవర్మ్మ చెప్పుకొనుటచేత, తత్పూర్వము పల్లవరాజ్యము నేలినరాజులలో బప్పమహారాజొకడని తేలుచున్నది. ఈబప్పమహారాజు శివస్కన్దవర్మ్మ తండ్రియని చరిత్రకారులయభిప్రాయము. అట్లైన హీరహడగల్లి శాసనమున పల్లవరాజులు రెండుతరములవారు పేర్కొనబడియున్నారు.

బప్పమహారాజు
|
శివస్కన్దవర్మ

చారుదేవి గుంటూరుశాసనమున జెప్పబడినవారు ముగ్గురు: మహారాజు విజయస్కన్దవర్మ, భారద్వాజుడు, పల్లవులయువమహారాజు విజయబుద్ధవర్మ. ఇతనికుమారుని పేరు 'కుర'యనుపదముతో ముగియును. దీనిని హూల్ట్షుదొరగారు 'బుద్ధ్యాఙ్కుర' యని పూరించిరి. కావున ఈశాసనములలోని పల్లవులు—

విజయస్కన్దవర్మ
|
యు. మ. విజయ బుద్ధవర్మ
[బుద్ధ్యాఙ్] కుర

ప్రాకృతశాసనములలోని రాజులకు గలసంబంధ మెట్టిది? ఈశాసనముల కన్నిటికిని ఒక పేరు సామాన్యము. అన్నిటియందును స్కన్దవర్మ పేర్కొనబడియున్నాడు. ఈతనిపేరు మయిదవోలుశాసనములలో శివస్కన్దవర్మయని యున్నను, చారుమహాదేవిశాసనమున విజయస్కన్దవర్మ యని యున్నది. 'శివ' 'విజయ'శబ్దములు శుభసూచకములగు నుపసర్గలుగ నుపయోగింపబడినవి. అర్థభేదము విశేషము లేదు. కావున శివస్కన్దవర్మయు, విజయస్కన్ద వర్మయు, నొక్కని పేర్లే. ఇట్లే కదంబరాజులు 'శివ' 'విజయ' శబ్దములను ఉపసర్గలుగ తమనామములకు ముందు జేర్చుకొనియున్నారు. ఉ. శివమాంధాతృవర్మ శివమృగేశవర్మ, శివకృష్ణవర్మ ఇత్యాదులు. ఒకకదంబరాజు తనపేరునకుముందు 'శివవిజయ'పదములను రెంటిని జేర్చుకొని యున్నాడు.(ఎపి.కర్ణా.సం. ౭, పు. ౭.) కావున విజయస్కందవర్మయు, శివస్కందవర్మయు నొక్కరే యనుటకు శంకింప బనిలేదు. అట్లు పైరెండుపేర్లొక్కరివే యను సిద్ధాంత మేర్పడినపిమ్మట నీక్రింది ప్రాచీన పల్లవవంశవృక్షమును చెంపవచ్చును.—

బప్పమహారాజు
|
శివస్కన్దవర్మ
|
బుద్ధవర్మ
|
[బుద్ధ్యాఙ్] కుర

అయిన నీబప్పమహారా జెవ్వరు? 'బప్ప'యనుమాట నామధేయము కాదు. 'అప్ప'యనుమాటయే ప్రాకృతమున బప్ప యైనదేమో! ఇతర నామధేయ మేమి? వేలూర్పాళెపుశాసన మీసందర్భమున కొంచెము దోడ్పడుచున్నది.

"తత్సుతా దజని చూతపల్లవా
ద్వీరకూర్చ ఇతి విశ్రుతాహ్వయః,
యః ఫణీన్ద్రసుతయా సహాగ్రహీ
ద్రాజచిహ్న మఖిలంయశోధనః."

పైశ్లోకములోని చూతపల్లవుడు చుటు, పల్లవ వంశములసంయోగమును సూచించు కల్పితపురుషుడుగాని యన్యుడుగాడు. ఆరెండువంశముల సంయోగానంతరము బుట్టినవాడు వీరకూర్చుడు. ఇతడు నాగకన్యాకరము యొక్కయు, అఖిలరాజచిహ్నములయొక్కయు గ్రహణమును నేకకాలమందు జేసెను. ఈదంపతులకు బుట్టిన పుత్రుడే స్కన్దవర్మ. ఇతనికి స్కాన్దశిష్య డనుపేరు సైతము గలదు.

"అన్వవాయనభశ్చన్ద్రః
స్కాన్దశిష్య స్తతో భవ."

ఈస్కాన్దశిష్యునిగూర్చి రాయకోటశాసనమున నిట్లు చెప్పబడియున్నది:—

"అశ్వత్థామాశ్యతస్తు భర్గవతు ఖలు పురా
విక్రమన్యక్కృతారి
ర్జాతో ద్విజిహ్వాంగినిపుత్రాహ్వా హ్వాతి
జగతాం స్కన్దశిష్యాధిరాజ."[1] యత

1. ఇ. ఎ. ఇం. సం. ౫, పుట ౪౯.

ఈపైశ్లోక మెట్టిదుస్థితియందున్నను తాత్పర్యము విశదముగ దెలియుచున్నది. అశ్వత్థామకు ద్విజిహ్వాంగనవల్ల యనగా నాగకన్యకవలన స్కందశిష్యుడు పుట్టెను. ఇచ్చట నాగకన్యతోడి తగులాట మశ్వత్థామకే యంటగట్టబడినది. రాయకోటశాసనకర్త క్రీ. శ. ౯, ౧౧ శతాబ్దముల యందున్నవాడు. కాన నతడు నాగకన్యామూలమున తన పూర్వీకులకు రాజ్యము లభించెనన్న గాథనుమాత్ర మెఱుగును. ఏరాజు నానాగకన్య వరించుటచే రాజ్యలబ్ధియైనదియు నెఱుగడు. ఏతత్కారణమున నాతడు నాగకన్యను పల్లవవంశమునకెల్ల మూలపురుషుడను ప్రథగలిగిన యశ్వత్థామకే యిచ్చి పెండ్లిచేసెను. ఏది యెట్లున్నను పల్లవులు నాగకన్యా మూలమున రాజ్యలాభమును బొందుట నిజము. అశ్వత్థామ పురాణములలోనివ్యక్తి. అతని యునికికి కవిప్రతిభయే కారణము. అట్టివానివల్ల దక్షిణదేశమున ౧౦ శతాబ్దములవఱకును రాజ్యమొనర్చిన పల్లవవంశ ముత్పన్నమైనదనుట యసంభవము. వీరకూర్చుడను రాజుండెననుటకు శాసననిదర్శనము గలదు. వాయలూరుశాసనమున1 నీపేరు గలరాజుల నిర్వరను పేర్కొనుచున్నది. ఈశాసన మంత విశ్వసనీయము గాదని యింతకు పూర్వమే వచించియున్నాను. దర్శిశాసనదాత తన ముత్తాత వీరకూర్చవర్మయని చెప్పుకొనియున్నాడు కావున వీరకూర్చుడు చరిత్రపురుషుడు. ప్రాచీనపల్లవరాజులు కొంద రాతనిని తమవంశమునకు మూలపురుషుడుగ వర్ణించియున్నారు. నాగకన్యకాపతి యితడనుటయే సమంజసము. పైపరిశోధనవల్ల దేలినవిషయ మేమన:—

బప్పమహారాజు లేక వీరకూర్చుడు
(నాగరాజుకుమార్తె నుద్వాహము చేసుకొని
తన్మూలమున రాజ్యమును బడసినవాడు)
|
శివ లేక విజయస్కందవర్మ
(ఇతనికే స్కందశిష్య డనుపేరు గలదు)
|
విజయబుద్ధవర్మ (చారుమహాదేవిభర్త)
|
[బుద్ధ్యా] కురుడు.

ఇక సంస్కృతశాసనములలోని వంశములనుగూర్చి చర్చ సల్పుదము. ప్రథమమున పైపట్టియందలి ... శాసనములను గూర్చి విచారింతము. ఇవి యేవియన, ఒం గోడుశాసనములు ౧,౨, ఉరువపల్లి, పీకిర, మంగళూరు, చూరశాసనములు. వీనియందలి రాజుల

## వంశ క్రమము:—

ఒంగోడు (౧)

కుమారవిష్ణు
|
స్కందవర్మ
|
వీరవర్మ
|
విజయస్కందవర్మ

ఒంగోడు (౨)

వీరవర్మ
|
స్కందవర్మ
|
విష్ణుగోప
|
సింహవర్మ

ఈపై రెండుశాసనములలోని రాజు లొక్కరే ... మువా రనుట పై వంశవృక్షములవల్ల విదితమగుచున్నది. ఇందు ఆరుతరముల రాజులు పేర్కొనబడియున్నారు.

ఉరువపల్లి

స్కందవర్మ
|
వీరవర్మ
|
స్కందవర్మ
|
యు. మ. విష్ణుగోప

మంగళూరు

వీరవర్మ
|
స్కందవర్మ
|
యు. మ. విష్ణుగోప
|
సింహవర్మ

పికీర

వీరవర్మ
|
స్కందవర్మ
|
యువమహారాజు విష్ణుగోపవర్మ
|
సింహవర్మ

చూర

స్కందవర్మ
|
మహారాజవిష్ణుగోప
|
సింహవర్మ
|
విష్ణుగోప

1. దుబ్రాయిలు : పల్లవులు.

ఈ పై నాలుగు శాసనములలోని రాజవంశము ఒంగోడు శాసనములలోని రాజవంశము నొక్కటియే యనుట స్పష్టము. కావున నీవంశవృక్షపుతునుకలను సంకలితము జేసిన, నీక్రిందివంశ మేర్పడును.—




ఇట్లు పైయారుశాసనములవల్లను ౭ పురుషాంతరములుగల వంశవృక్ష మేర్పడినది. ఇంకను నిం దొకటి రెండువిషయములు గమనింపదగినవి గలవు. ఉరువపల్లి, మంగళూరు, పీకిరశాసనములలోని విష్ణుగోపుడు యువమహారాజనియే పిలువబడియున్నాడు. ఏతత్కారణమున కొందరీతడు తనతండ్రికాలముననే మృతిజెందెనని తలచిరి. ఇది పొరబాటు. ఉరువపల్లి శాసనదాత యగు యు. మ. విష్ణుగోపుడు ఆ దానశాసనమును (సింహవర్మ్మయను రాజుయొక్క యేకాదశవర్షమున: సింహవర్మ్మ మహారాజస్య విజయసంవత్సరే ఏకాదశే) ఇచ్చినట్లు చెప్పియున్నాడు. కావున హూల్ట్షుగారన్నట్లు ఈసింహవర్మ్మ విష్ణుగోపుని జ్యేష్ఠభ్రాతగ నుండవలయును. వీరితండ్రియగు స్కన్దవర్మ్మకు పిమ్మట నాతని పెద్దకుమారుడు సింహవర్మ్మ రాజాయెను. అతడు తనతమ్ముని యౌవరాజ్యాభిషిక్తునిగ జేసి రాజ్యములోని యుత్తరార్ధమున కధిపతిగ జేసెను. అతనిసంతతివారు మహారాజులమని చెప్పుకొన్నను సింహవర్మ్మకు, కంచిరాజ్యము నేలిన యాతనివంశస్థులకులోబడి యేరాజ్యము సేయుచుండిరి. కావున విష్ణుగోపుడు తనతండ్రికి పూర్వమే మృతినందె నని కాని, తత్కారణమున నాతడు శాసనములయందు యువమహారాజని పిలువబడె నని కాని యనుకొనవలసినయవసరము లేదు. కావున నీవంశవృక్ష మిట్లుండవలెను:—




పైపట్టికలోని (౧౨) ఉదయేన్దిరపుశాసనమున నీక్రిందివంశము వర్ణింపబడియున్నది.—




ఈరాజులు పైవంశవృక్షములోని స్కన్దవర్మ్మయొక్క జ్యేష్ఠపుత్రుడగు సింహవర్మ్మవంశజులుగ నుండవలయును. కావున నీవంశవృక్ష మిట్లుండవలయును:—




ఇక (౧౧) చెన్దలూరుశాసనమునందు వర్ణింపబడిన రాజులవిషయము విచారింతము. వీరు—




చెన్దలూరు(౧౧)శాసనమందు బేర్కొనబడినరాజు లెప్పుడు రాజ్యముచేసిరి? అనువిషయము ప్రథమమున విచారణీయము. హూల్ట్షుగా రిట్లనుచున్నారు:—"చెన్దలూరుశాసనపులిపి...పీకిర, మంగళూరు, ఉరువపల్లి దానపత్రములలోని లిపిని పోలియున్నది. అక్షరముల తలకట్లపై యడ్డగీట్లు చెన్దలూరుశాసనమున లేకపోవుటయే దానికిని ఇతరశాసనములకు గల భేదము. మఱియు దీనియందు 'ర', 'క', 'య' (కొమ్ము)ను సమమైనరెండు నిలువుగీళ్లై యున్నవి; ఈయక్షరములను తెలియజేయు నిలువుగీట్లు పీకిర, మంగళూరు, ఉరువపల్లి శాసనములలో మిక్కిలి కురుచలుగ నున్నవి. ఈవిషయము చెన్దలూరుశాసనముపై యర్వాచీనముద్ర నిడుచున్నది. కాచెక్కు—వపు బనివాండ్రనుబట్టి శాసనాక్షరములు ... వున చెన్దలూరుశాసనమున బేర్కొనబడిన పల్లవరాజు సింహవర్మ, సింహవిష్ణువులమధ్యకాలమున ప్రభుత్వ సల్పియుండవలయును."[1]

కేవల మక్షరములస్వరూపమునుబట్టి దానశాసనములను, నందు బేర్కొనబడినవారికాలమును నిర్ణయించుటకు గొంతవఱకును సాధ్యమే. స్థూలముగ నక్షరముల స్వరూపమునుబట్టి శాసనముల ప్రాచీనార్వాచీనత్వములను నిర్ణయింపవచ్చును. అట్లుగాక అక్షరస్వరూపమును బట్టి యీశాసన మిప్పటిదని నిశ్చయించి చెప్ప వీలుగాదు. హూల్ట్షుగారు పై జేసిన సిద్ధాంతముపై దుబ్రాయిలిట్లు వ్యాఖ్యానమును జేసియున్నాడు:—

"పీకిర, మంగళూరు, ఉరువపల్లి శాసనములలో 'ర' 'క'ల కంటె చెన్దలూరుశాసనములలోని యాయక్షరములు స్వరూపము చక్కగ నేర్పడినవనియు, కారణమున నది యర్వాచీన మైనదనియు లిపిశాస్త్రజ్ఞుతో నీశాసనములలోని యక్షరములను బరిశీలించిచూచి హూల్ట్షుగా రనియున్నారుగదా. నేను స్వయముగ నీనాలుగుశాసనములలోని యక్షరములను బరీక్షించినప్పుడు, (చెన్దలూరుశాసనమున) 'ర' 'క'ల స్వరూపము గొంచెము జక్కగ నేర్పడియున్నను, వానికి బదులు 'య'ల స్వరూపము చక్కగ నేర్పడక యున్నది. అక్షరముల నొక్కొకదానితో బోల్చి చెప్పగలిగిన దంతయు చెన్దలూరుశాసనము దక్కినమూటితోడను సమకాలీనమనియే.

"అయితే, అక్షరముల నొండొంటితో బోల్చుటకు బదులు, లిపులయొక్క సామాన్యస్వరూపమును బోల్చి చూచితిమేని, చెన్దలూరుశాసనపులిపి, ప్రాచీన శాసనములంగువలె, వంకరటింకరగ నున్నది. ఉరువపల్లి, మంగళూరు, పీకిరశాసనములం దన్నో, అర్వాచీన శాసనములందువలె, లిపి చక్కగ కుదిరియున్నది. అయినప్పటికిని సామాన్యముగ నక్షరములపోలిక యథార్థస్థితిని తెలుపగలదని నేను నమ్మను. శాసనములను వ్రాసినవారి భేదము...

1. ఎ. ఇం. స. ౮ పు. ౨౩౩.

విషయము పల్లవశాసనములవల్ల నేకాక, గాంగ, కాదంబ శాసనములవల్లను ఋజువగుచున్నది. ఒక్కొకపు డొక రాజు కాలమునందలి శాసనములే యొకదాని నొకటి పోలియుండవు. కడపటిమాట: కాఞ్చీపురమున నొసగ బడిన చెన్దలూరుశాసనమును పలక్కడయం దిచ్చిన యురువపల్లి శాసనముతోడను, దశనపుర, మేన్మాతురల నుండి యిచ్చిన మంగళూరు, పీకిరశాసనములతోడను బోల్చవలసినయవసరము లేదని నాయభిప్రాయము. పలక్కడ, దశనపుర, మేన్మాతుర లనుపట్టణములు గుంటూరు సీమలోనివై యుండవచ్చును. అనగా నవి కాఞ్చీపురమునకు బహుదూరమున నుండినవి. కావున, దేశభేదమే (పైశాసనములందలి) యక్షరభేదమునకు గారణమని విశద మగుచున్నది."[1]

ఇట్లు, చెన్దలూరుశాసనము ఉరువపల్లి, పీకిర, మంగళూరుశాసనములకాలమప్పటిదో, లేక తత్పూర్వపు కాలముదో యనునభిప్రాయము దుబ్రాయలుగా రిచ్చియున్నారు. ఇదియే సరియైన యభిప్రాయమని నాతలపు.

చెన్దలూరు శాసనములోని రాజులు సింహవర్మ్మ సింహవిష్ణువుల మధ్యకాలమున రాజ్యము చేసియుందురని హూల్ట్జు అభిప్రాయపడియున్నాడు. ఇది సాధ్యము కాదు. ఏలనగా, ఉదయేన్దిర శాసనమున చేర్కొనబడిన రాజులు సింహవర్మ్మ వెనుక కంచియందు రాజ్యము చేసినట్లు తెలియవచ్చుచున్నది. "లిపిస్వభావమునుబట్టి చూడగా నీ (ఉదయేన్దిరపు) శాసనము ఉరువపల్లి శాసనముకంటె దరువాతిదని యభిప్రాయపడుచున్నాను"[2] అని కీల్హారను చెప్పుచున్నాడు. కావున చెన్దలూరుశాసనములో చేర్కొన్న, రాజులు సింహవర్మ్మకు వెనుక గంచియందు రాజ్యము జేసిరనుట కవకాశము లేదు. వారు సింహవర్మ్మకు బూర్వమే చే.యుండవలయును.

ఇట్లు చెన్దలూరు శాసనపురాజులకాలమును స్థూలముగ నిర్ణయించితిమి. ఈశాసనమున నిద్దరు కుమారవిష్ణువులు చేర్కొనబడియున్నారు. వీరిద్దరిలో ఒంగోడు (౧) పట్టికయందు వర్ణింపబడిన కుమారవిష్ణు వెవ్వడు? ప్రథముడా, ద్వితీయుడా? ఒంగోడు (౧) శాసనమందలి వంశావళి యిది:—




ఈశాసనము విజయస్కన్దవర్మ్మ నాటిది. ఇతడు ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపుని యొక్క తండ్రి. ఒంగోడు(౧) శాసనములోని "యక్షరములు ఉరువపల్లి, మంగళూరు, పీకిరశాసనాక్షరముల వంటివి" అని కృష్ణశాస్త్రిగారనుచున్నారు పితాపుత్రుల శాసనముల కంతటి బంధుత్వ ముండుట వింత గాదుగదా! చెన్దలూరుశాసనపు టక్షరములు సైతము ఉరువపల్ల్యాది శాసనముల యక్షరములవంటివని పండితుల యభిప్రాయముగదా! కావున చెన్దలూరు శాసనములోని రెండవకుమారవిష్ణువు ఒంగోడు (౧) శాసనపు విజయస్కన్దవర్మ్మతో నించుమించుగ సమకాలీనుడుగ నుండవలయును. అట్లయిన చెన్దలూరుశాసనపు ౨వ కుమారవిష్ణువును, ఒంగోడు శాసనపు కుమారవిష్ణువును భిన్నపురుషులు. ఒంగోడు (౧) శాసనపు విజయస్కన్దవర్మ్మయు, చెన్దలూరుశాసనపు ౨వ కుమారవిష్ణువును ఇంచుమించు సమకాలికులైన, ఒంగోడు (౧) శాసనపు కుమారవిష్ణువు చెన్దలూరుశాసనపు కుమారవిష్ణునకు మూడు నాలుగుతరముల ముందటివాడగును. చెన్దలూరుశాసనము ప్రకారము ౨వ కుమారవిష్ణుని తాతపేరుకూడ కుమారవిష్ణువే కదా! వేలూర్పాళెయపు శాసనమున రాజులవరుస యిట్లు గలదు:—




1. ప్రా. ద. చ. పుట ౬౬—౭.

2. ఎ. ఇం. సం. ౩, పు. ౧౪౩.

కావున పల్లవ వంశవృక్షస్వరూప మిట్టిదిగ నుండ వలయును.




ఇక ప్రాకృతశాసనపురాజులను, వీరికిని ఎట్టిసంబంధము గలదో విచారింతము. వీరు:




వీరకూర్చ మహారాజొకడుండెననుటకు ప్రబలనిదర్శనము దర్శితామ్రపట్టిక. దీనిభాష సంస్కృతము ఇది వీరకూర్చుని మనిమనుమనికాలమునాటిది. అక్షరములు గడుప్రాచీనములు. దర్శితామ్రపట్టికను ఉరువపల్లి హిరహడగల్లి శాసనములతో బోల్చిచూచితిని. అక్షరములు ఉరువపల్లి శాసనాక్షరములకంటె ప్రాచీనములుగను, హిరహడగల్లి శాసనాక్షరములకు దరువాతివిగను గన్పట్టుచున్నవి. దర్శిశాసనదాత ఉరువపల్లి, హీరహడగల్లి శాసనముల మధ్యకాలమున నుండెననుటకు సంశయము లేదు. ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపునితాత స్కన్దవర్మయని యొకరాజున్నాడు. అతడే యీవీరకూర్చరాజని కృష్ణశాస్త్రిగారివాదము. శాసనపరిశోధకులయ్యు వీర లిట్టిపొరబాటునకు లోనగుట చిత్రము. దర్శిశాసనము ఉరువపల్లికంటె ముందటిదని లిపియే సాక్ష్యమిచ్చుచున్నది. కృష్ణశాస్త్రిగారు 'వాయలూరుశాసనమున వీరవర్మపే రొక్కమారు గాన్పించుచున్నది. కావున వీరకూర్చుడే వీరవర్మ'[1] యని తమవాదము సమర్థింపజూచిరి. శాస్త్రిగారు లేదృష్టితో జూచిరోకాని, వాయలూరుశాసనమున వీరవర్మనామమునకు పైన రెండుపర్యాయములు వచ్చు వీరకూర్చనామము వారికంట బడదాయెను. వాయలూరుశాసనమున (౫,౧౧) రెండుపర్యాయములును వీరకూర్చనామము స్కందవర్మ, కుమారవిష్ణునామములకు ముందే వచ్చియున్నది. వేలూర్పాళెయపుశాసనమునను నట్లే యున్నది. దర్శిశాసనప్రతిచెన్దలూరుశాసనపులిపికంటె ప్రాచీనముగ గన్పడుచుండుటచే తచ్ఛాసనదాత రెండవకుమారవిష్ణువునకు పూర్వుడై యున్నవాడనుట స్పష్టము. కావున నాతనిముత్తాతయగు వీరకూర్చవర్మ హీరహడగల్లి శాసనదాతయగు మొదటిస్కందవర్మయొక్క జనకుడేకాని యన్యుడు గాడు. దుర్భాయలుగారే కారణముచేతనో వీరకూర్చునిపే రెత్తరైరి. పల్లవవంశవృక్షమున లేనిపేళ్లను గల్పించిరి. బప్పస్కన్దవర్మ, యు. మ. బుద్ధవర్మ, బుద్ధ్యాంకురుల నెబిమ్మట విష్ణుగోపు నొక్కని సృజించి, తదనంతర మొక స్కన్దవర్మను వానికంటగట్టి, వానికి పల్లవవంశవృక్షము నతికించిరి. ఇట్లు దుర్భాయలు పల్లవవంశమును బహుకరించుట కొక కారణముగన్పడుచున్నది. క్రీ. శ. నాల్గవశతాబ్దిమధ్యకాలమున దక్షిణదేశముపై దండెత్తివచ్చిన గుప్తరాజు సముద్రగుప్తుడు కాఞ్చీశ్వరుడగు విష్ణుగోపు నోడించెనని హరిసేనుడు అలహాబాదుశిలాస్తంభశాసనమున జెప్పియున్నాడు. ప్రాచీనశాసనముల నన్నిటిని గాలించి చూచినను విష్ణుగోపనామపల్లవరాజైదవశతాబ్దమున

* కంచిరాజులు.

1. ఎ. ఇం. సం. ౧౫ పు. ౨౪౬.

మునఱి కెక్కుడను గాన్పింపదు. కావున విశ్వాసానర్హమగు వాయలూరుశాసనము నాధారపఱుచుకొని ప్రాకృతశాసనరాజులకు వెనుక నొకవిష్ణుగోపునికి రాజ్యాభిషేక మొనర్చెను.

సముద్రగుప్తుని దక్షిణదండయాత్ర క్రీ. శ. 350–60 లమధ్య జరిగియుండునని స్మిత్తుగారనిరి.[1] హరిసేనుడు సముద్రగుప్తునియుత్తరదిగ్విజయమునకుముందు దక్షిణదిగ్విజయమును వర్ణించియుండుటనుకారణముగా గొని దక్షిణ దిగ్విజయము క్రీ.శ. 335ననో, 340ననో నడచియుండునని దుబ్రాయలుగా రనుచున్నారు.[2] తనయిరుగుపొరుగుదేశముల నుండు శత్రువుల నట్టె యుంచి ముందు దూరదేశములపై నేరాజునకు దండయాత్రవెడలుట సంభవింపదు. ఉత్తరాపథమునందలి శత్రువులను లోబఱచుకొనక దక్షిణ దిగ్విజయమునకై సముద్రగుప్తుడు బయలుదేరె ననుట నాకు నమ్మకము కలిగింప లేదు. కావున స్మిత్తుగారియభిప్రాయమే సరియైనదని నాకు దట్టుచున్నది. సముద్రగుప్తునిదండయాత్ర యెప్పుడు నడచియుండినను ఆకాలమున విష్ణుగోపు డనుపల్లవరాజొక డుండియుండవలయును. అట్టిరా జెవ్వడైన నున్నాడేమో కనుగొందము. ఉరువపల్లి శాసనదాతయగు విష్ణుగోపుని యన్నయగు సింహవర్మ క్రీ. శ. 436 మొదలు 460 వఱకును రాజ్యము చేసినట్లు ఫ్లీటుగారు నిర్ధారణచేసియున్నారు.[3] విష్ణుగోపుడుగూడ నప్పటివా డనుట నిస్సంశయము. ప్రాకృతశాసనములందుగాని, సంస్కృతపుశాసనములయందుగాని బేర్కొనబడిన విష్ణుగోపనామముగలవారలలో ప్రథము డితడే. ఇంతకుముం దా పేరుగలరా జెవ్వడును లేడు. ఉరువపల్లి శాసనపు విష్ణుగోపుడే సముద్రగుప్తుని ప్రతిపక్షి కాజాలడు. ఏలనగా, వారి కించుమించుగ నొకశతాబ్దమెడ మున్నది. కావున నురువపల్లి విష్ణుగోపున కొకశతాబ్దముపూర్వ మొకవిష్ణుగోపు డుండియుండవలయును. అనగా నాతడు క్రీ. శ. 350 ప్రాంతమున రాజ్యము సేయుచుండి యుండవలయును. సింహవర్మకు ముందు కంచియం దైదుగురు పల్లవరాజులు రాజ్యముచేసిరి. తరమునకు ౨౫ సంవత్సరములు విడిచిన, ౧౧౧ సంవత్సరములలో నాలుగుతరము లగును. సింహవర్మకు నాలుగుతరములముందున్న వాడు మొదటిస్కందవర్మ. ఈతనికాలమున సముద్రగుప్తునిదండయాత్ర నడచియుండవలయును. లేక యీతని మరణానంతరమేని నడచియుండవలయును. అలహాబాదుశాసనపు విష్ణుగోపుడు స్కందవర్మ జ్యేష్ఠపుత్రుడై యాతని తరువాత రాజ్యమునకు వచ్చియుండవలయును. సంతానహీనుడుగనో, కయ్యముననో పసితనముననే మడియుటచేత నాతని పేరు సంస్కృతప్రాకృతశాసనములయందు గానరాకపోయెను.

టి. జి. శంకరయ్యరు మొదటిస్కందవర్మపుత్రుడగు యు. మ. విజయబుద్ధవర్మయు, చెన్దలూరుశాసనములోని బుద్ధవర్మయు నొక్కడే యనిరి.[4] చెన్దలూరి శాసనపు బుద్ధవర్మ తండ్రిపేరు కుమారవిష్ణు డనుటచేత వీ రేకపురుషు లనువాదము సాగదు; కావున మొదటిస్కందవర్మకు ముగ్వురుపుత్రు లుండిరని యొప్పుకొని తీరవలయును. ఇంతటితో పల్లవంశావళింగూర్చిన తర్కమును చాలింతము.

ఈ క్రింది వంశవృక్షమునందలి రాజులకాలము స్థూలముగ నిర్ధారణసేయబడినది. సింహవర్మకాల మొక్కటియే నిశ్చయముగ దెలిసినది. తక్కినరాజులకాలములు పురుషాంతరమునకు ౨౫ సంవత్సరములు తగ్గించుటవల్లను, హెచ్చించుటవల్లను తేలినవి. కావున భావిపరిశోధన వలన వాస్తవస్థితి బయల్పడవలయును.

1. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా.
2. ప్రా. ద. చ. పుట ౬౯.
3. జ. రా. ఏ. సొ. ౧౯౧౫, పు. ౪౮౬.
4. ఇం. హి. క్వా సం. ౬.

## వంశవృక్షము


వీరకూర్చవర్మ
లేక బప్పమహారాజు (౨౭౫–౩౧౦)
శివస్కన్దవర్మ ౧.
(స్కన్దశిష్యుడు) (౩౧౦–౩౩౫)
విష్ణుగోపుడు
(సముద్రగుప్తుని శత్రువు) (౩౩౫–౩౬౦)
కుమారవిష్ణువు ౧. (౩౬౦–౩౭౫)
యు. మ. విజయబుద్ధవర్మ
(చారుదేవిభర్త)
[బుద్ధ్యాం]కుర
బుద్ధవర్మ (౩౭౫–౪౧౦)
కుమారవిష్ణువు ౨. (౪౧౧–౪౩౫)
స్కన్దవర్మ
వీరవర్మ
స్కన్దవర్మ
సింహవర్మ (౪౩౫–౪౬౧)
స్కన్దవర్మ ౨. (౪౬౧–౪౭౫)
నన్దివర్మ (౪౭౫–౫౧౦)
యు. మ. విష్ణుగోప
సింహవర్మ
విజయవిష్ణుగోపవర్మ

# కుమారుఁడు

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

శ్రీమాత మణిద్వీప
స్వామినియు ననంతకోటిబ్రహ్మాండములన్
ప్రాముఖ్యముఁ గన్నది మా
కామేశ్వరి నిన్నుఁ బ్రోవఁ గలదు కుమారా.

జ్ఞానప్రదుఁ డగు గురువును
ధ్యానింపుము ముందు భక్తితాత్పర్యములన్
పై నొకపరి చదువులదొర
సానికి వందనము చేసి చదువు కుమారా.

గురుఁడే విధి గురుఁడే విష్ణువు
గురుఁడే శంకరుఁడు మఱియు గురుఁడే చెప్పన్
పరఁగుఁ బరబ్రహ్మముగా
గురునిన్ నిందించువాఁడు కూళ కుమారా.

గురువున కెదిరింపకు నీ
దొరనున్ నిందింపఁబోకు దుష్టులతోడం
బరిచయము చేయఁ బోకుము
దురితముఁ బ్రాప్తించి చెడెదు తుదకుఁ గుమారా.

చదివించినగురువునకున్
పదిరెట్లధికుండు కన్నవాఁ డాయనకుం
బదిరెట్లు తల్లి హెచ్చని
మది నెంచుచు భక్తి గలిగి మనుము కుమారా.

జననిని జన్మస్థాన
మ్మును గొప్పగఁ జూడనట్టి మూర్ఖుల కెందున్
ఘనత కలుగఁబోదారెం
టిని దప్పక కొల్చుచుండు నీవు కుమారా.

తలిదండ్రులు నీకోసము
పలుబాములు పడిర యింతవానిఁగఁ జేయన్
తలపోయు మన్న ! నీ వే
వలనన్ తదృణమును దీర్పవలెనొ కుమారా.

చెప్పినచొప్పున నడువని
తప్పక తద్దినమునాఁడు తనుపని గయలో
నొప్పుగఁ బిండము వేయని
యప్పాపిని బుధులు పుత్త్రుఁ డనరు కుమారా.

తమ కిహపరముల కయ్యెడు
తమకొమరుఁడు వ్యర్థుఁ డయినఁ దలిదండ్రులచి
త్తములకుఁ గలిగెడునా ఖే
ద మిట్టి దని తెలుప నెవరితరము కుమారా.

తలిదండ్రులు సన్మిత్రుం
డిల నరులకు సహజమయినహితు లనియును అ
న్యులు వారి కార్యకారణ
ములచే హితు లనియుఁ దెలియుము మదిఁ గుమారా.

సోమరితనమును మించిన
ఆమయ మిం కొకటి లేద యందురు దానిన్
నీమదిని జేర నిచ్చిన
సేమమునకు నదియ హాని చేయుఁ గుమారా.

నాలుగు గంటలు కొట్టిన
కాలమ్మున లెమ్ము మొగము కడిగికొనుము నీ
వాలోఁ జదివినపాఠము
లాలోడన చేయు బుద్ధి నంటుఁ గుమారా.

ప్రాతఃకాలమ్మున నే
శీతలజలమందుఁ గొంత సేపు మునిఁగిన
చేతమునకు దేహమునకుఁ
బ్రీతియు నారోగ్యమును లభించుఁ గుమారా.

తల పండినంత వృద్ధని
తలఁపరు మెవ్వాఁడు బాల్యదశనుండియు వి
ద్యలు నేర్చుచుండు నతనిన
తలఁతురు వృద్ధునిఁగ దేవతలును కుమారా.

కలలు గలవాని నందఱుఁ
దలపఁగ నిడుకొందు రన్న దానిని ధరలో
వెలయించెను సర్వజ్ఞుఁడ
కలానిధిఁ దల ధరించి కనుమ కుమారా.

చదివింపనిపిత సుతునకుఁ
జదువుకొననిమోఱకుండు జనకునకు ముదం
బొదవింప రంద్రు కావునఁ
జదువుకొనుమ బుద్ధి గలిగి చాలఁ గుమారా.

దీపము లేని గృహముతో
సాపత్యము సేతు రన్న చదువుకొనని యా
పాపాత్మునిజీవితమును
కోపపడక లెన్స చదువుకొనుము కుమారా.

తన తల్లి బాసఁ గుడిచే
తినిగా సంస్కృతము నెడమదిగ నేలికబా
సను తలగాఁ జెప్పదు రిం
దునిచినభావంబుఁ దెలియుటొప్పుఁ గుమారా.

క్షణమయిన వ్యర్థపుచ్చక
కణముల చొప్పుననుసకలకలలు ధనమ్ముగ
గణియింప నేర్చినట్టి ని
పుణుండ పో! ఎందుసుఖముఁ బొందుఁ గుమారా!

సంగీతము సాహిత్య మె
ఱుంగనినరు విబుధు లందఱును స్పష్టముగా
శృంగములుఁ దోఁక లేని ప
సింగాఁ జెప్పుదురు వినుమ చెవులఁ గుమారా.

పుడమిపయిని కన్నులు కను
పడనికతనఁ గాఁడు గ్రుడ్డివాఁడు నిజముగా
బుడుతతనమునుండియు నె [రా.
వ్వఁడు చదువఁడో వాఁడ గ్రుడ్డివాఁడు కుమా

పండితుఁడు తగుధనము లే
కుండియు నాదరముఁ జూప యోగ్యుఁడ విత్త
మ్ముండియుఁ గృపణుఁడు పరిభూ [రా.
తుండ యగుచునుండుఁ జుమ్మ తుదకుఁ గుమా

బలవంతుఁ డనఁగ బాహా
బలము గల యతండె నాఁగ వలవ దెవఁడుబు
బలము గలవాఁడో వానిన
బలవంతుం డంద్రు పెద్దవారు కుమారా.

విద్యాహీనుఁడు పశు వను
విద్యానిధి భర్తృహారిని వేదనవలన
తద్యుక్తుఁడ పురుషుం డని
వేద్యం బగుచుండు వినుము వినుము కుమారా.

సిరియును విద్యయు నెవ్వని
వరియించునో వార లెట్టివా రయినను సం
సరణమునఁ బూజ్యు లిది సద్
గురువచనము దీనిఁ దెలిసికొనుము కుమారా.

పుస్తకములు పయివారల
హస్తంబులఁ బడినయేని యట్టే పోవుర్
వాస్తవ మిది కావున నీ
పుస్తకముల నెర వొసంగఁబోకు కుమారా.

కొండెములు చెప్పుటకు నీ-
యండకు నరుదెంచుహితుని కగునను చెవి యీ
కుండుటయ కాక వానిని
చండాలునిఁగాఁ దలంపఁ జనును కుమారా.

పెద్దలయొద్దను వినయము
బుద్ధి గలిగి సరిగ నడువఁ బూనినచో నిర్
ముద్దుగఁ జూతురు దానను
పెద్దతనము గలుగు నీకుఁ బిదపఁ గుమారా.

తనతోడివారికంటెను
తనుఁ బెద్దగ నెల్లవారుఁ దలఁచెడునట్టుల్
ఘనతను సంపాదింపఁగ
మనమున నెంచుటయె మంచిమాట కుమారా.

పదుగురిలో నే. కార్యము
బెదరక చేయంగ నీకు వీ లగునో అ
ట్టిద చేయఁ బూను దానను [శా.
మది సంతస మందుఁ గుందు మానుఁ గుమా

---

## ధర్మసందేశము

వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు

నీవు నీధర్మంబు నెఱవేర్చుకొనుర
ఏవేళ నూడునో యీశరీరంబు
ఇది సదాకాలంబు నెద నుంచుకొనుర
తుదిదాఁక సత్త్వంబు దొలఁగక మనుర
చేవతో ధర్మ మ్మార్జితము సేయంగ
పావకుండును జల్లఁ బడును డాయంగ
సర్వేశ్వరునకైన జడువఁగాఁ బోఁడు
ఉర్వి ధర్మముఁ దప్ప కుండెడువాఁడు.
గటికిపోఁచకు గడగడలాడుఁ జూడు
తటికి సద్ధర్మంబు దప్పెడువాఁడు.
కలదు ధర్మము దానిఁ గావ నీశ్వరుఁడు
కలఁ డేలరా చింత, కలవర మేల?
ధర్మంబు ధర్మంబు ధర్మంబు రన్న!
ధర్మానుగతి జీవితము పుచ్చ రన్న!
ధర్మానుగతి నీకు ధైర్యం బొసంగు
ధర్మానుగతి పవిత్రత నీ కొసంగు.

---

# 'అహదనకర' శాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

చాల కాలముక్రితమే కీ. శే. శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావుపంతులుగారు ఈశాసనములోని తెలుగుభాగమునకు అర్థము తీయుటకై చాలకృషిచేసి యున్నారు. శాసనలేఖకుడు శాసనమును చాల నశ్రద్ధగ వ్రాసియుండుటవలన, మరల ఈశాసనపురేకులను సంపాదించి, వాటినుండియే మూలమును జదివినచో ఫ్లీటుదొరగారిచ్చిన పాఠముకంటె మంచిపాఠ మేర్పడుట కవకాశ ముండునేమో యని వారు లండను బ్రిటిషు మ్యూజియమువారికి రేకుల నిమిత్తము వ్రాసిరి; కాని వారు అసలురేకులను బంపుటకు వీలు లేదనిచెప్పి, ఒకప్రతి ప్రతిబింబములను ఒకప్రతి శాసనపు ఫోటోలను బంపిరి. నేనును లక్ష్మణరావుగారును ఈప్రతులను ముందుంచుకొని శాసనమునందలి యక్షరస్వరూపమును గురించియు, పదములను గురించియు చర్చించుచుండిననాటిసంగతులు నేడీసందర్భమున దలపునకు వచ్చుచున్నవి. అటుతరువాత నేను రాజమహేంద్రవరమునకు వెళ్లుటతో ఇందునుగురించిన నాకృషి నిలిచిపోయినది. లక్ష్మణరావుగారింకను దమకృషిని సాగించుచునే యుండిరి. వారీశాసనమున వచ్చు పదములన్నిటిని తీసి, పట్టికలు తయారుచేసి, తెలిసినచో ఆ పదములకే కాని, లేకతత్త్వాంతిక ప ములకు గాని యర్థము తెలుపవలెనని కోరుచు వాటిని కొందఱు ద్రవిడ, కర్ణాట పండితులకు బంపిరి; కాని అందువలన దమకు ఏవిధమైన ప్రయోజనమును కలుగలేదని తరువాత వారి నొకపరి కలిసికొనినప్పుడు నాతో చెప్పినట్లు జ్ఞాపకము. ఏదో యొకవిధమున ఈ తెలుగుభాగమున కర్థము తీసి, దానిని గురించి ఒక 'నోటు' 'ఎపిగ్రాఫియా ఇండికా' లోను, ఒక 'నోటు' 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' లోను ప్రకటింపవలెనని ప్రయత్నించుచుండగనే వారు అకాల మరణము వాతబడుట తటస్థించెను.

తిరిగి నేడు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు దీనిని కదిపియున్నారు. కడచిన భారతిసంచికలో వారీశాసనమునందలి తెలుగుభాగమునకు పద, పదార్థ వివరణములను గావించి, ఆంధ్రభాషకు మహోపకారము చేసినందుకు అభినందింప దగియున్నారు. వారు కొన్ని యక్షరములను మార్చియు, మరికొన్ని యక్షరములను దీసివేసియు, వేరొక కొన్నిచోట్ల లేని యక్షరములను జేర్చియు ఈశాసనపు తెలుగుభాగమున కర్థవివరణము గావించియున్నారు. ఇట్లు దానిని సంస్కరించి కావించిన యాయర్థవివరణము ఎంతవరకు సరియైనదని చాల సందేహింప వలసియున్నను కొన్నికొన్నిపట్టుల వారు కావించిన శబ్దనిష్పత్తులు భాషావేత్తల సాదరాలోచనమునకు పాత్రములు.

ఈ శాసనమునుగురించి వ్రాయుటలో శ్రీశాస్త్రి గారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో నే నిచ్చిన ఈ శాసనమునందలి తెలుగుభాగపు పాఠమును గూర్చి కూడ తలపెట్టియున్నారు. ఆసంచికలో నేనిచ్చినది బర్జెన్‌దొరగారి పాఠము. అప్పటికి నేను రాజమహేంద్రవరమున నుండుటచేతను, నాయొద్ద శాసనప్రతిబింబములు లేకపోవుటచేతను నామతముప్రకారము ఆ శాసనపాఠము ఎట్లుండదగునో తెలుపుకొనుటకు నాకు అవకాశము లేకపోయినది. అందువలన ఈ శాసనమునందలి తెలుగుభాగమున కిప్పుడు నాపాఠము నిచ్చుచున్నాను.

౧౭. స్వస్తి ప్రిథివి పల్లవపట్టనబున ఊరి

౧౮. వారు కరిగల్ల వడవరికి ఊరిస్వామిళ్ ఇచ్చిన స్తితి రెణ్డువాడల పట్టనావురకు

౧౯. అరియుడగు తెతెయు సిద్ధాయంబు దణ్డు[1]దసపరాధబును సర్వ్వ బాదప

౨౦. రిహారువు ఊరు దాయసెసి[2] ఇచ్చి దినికి వక్రంబు శెదు వచ్చినవారు గళరెని ఊరి స్తితి

౨౧. దప్పినవారు దినికి వక్రంబు వచ్చిన గచ్చురు రెణ్డువడల ఎలెవు[3] వరు లెముల[4]

౨౨. సినదియు చన్ను విరిపయినాడు[5] వరు గల్గిన ఎళెముళ చెసిన సెయుడుసను



౨౩. మహానబియుళ్ నరాళొక[6] మహాసత్థవుళ్ విరాపవ మహానబియుళ్ గజ్జ బు[సె]

౨౪. ల్ల[7] నడుపుళ్ శమస్తభువనశ్రియకనడిరజు బద్రపెరెయ ఊరిపనిన వ్రసివర

౨౫. వయ్యెటి[8] మాహానభిళ్ వయ్యెటి మహాభిళ్ పని కొళుచెనెరక పఞ్చిన వ్రసి

౨౬. వయ్యెటి మహానభియుళ్ స[9]క[10]ల కొన్టుకళ్ సవ్వలొకశ్రయ మహాసత్థవళ్

౨౭. పెర్దాళ్ నెరవద్యమహాసర్థవళ్ పసిణ్డిముద్గు[11] వెటన్దల చరువయ్య[12] విష్ణువర్ధన మ

౨౮. హాసత్థవళ్ పసుశెవుల కొన్టుకళ్ అచ్చరుజ్జవనియు కొన్టుకళ్ గజంబు[13]సెల్ల[14]ల

౨౯. నడుపుళ్ ప్రిథిమి మహాసర్థవళ్ వెటన్దళ్ పొనికన్టిఅము కొళనడుపు విష్ణువర్ధన

౩౦. మహాసత్థవల కొన్టుకలు నిరవద్యప్రిథివి కనడిరజుళ్ గునవన మహానవియుళ్

౩౧. ముద్దకళ్చికొళ్ రమిస్వరాప్రిథివి మహాసర్థవళ అపయజ[15]నువకాల కొణ్డుకళ్ కొరిన్ధి[14]

౩౨. కరిగల ప్రిథివి మహాసత్థవల కొన్టుకళ్ నన్దిమహానవిల నడుపు శ్రీమహా [కొళ్

౩౩. సత్థవళ సకలొకశ్రయ్య ప్రిథివి మహాసర్థవల టి[16]వకరయ్యపఞ్చ

౩౪. కొళ్ శ్రీజష్టి పెన్దటట్టు గన్టాన్టు

నే నిచ్చిన యీపై పాఠమునకును శ్రీశాస్త్రిగారు కడచిన భారతిసంచికలో నిచ్చిన పాఠమునకును గొంత భేదముకలదని చదివినవెంటనే బోధపడగలదు. నే నట్టి పాఠము నిచ్చుటకుగల కారణములను సవిశేషముగ ఇచట పేర్కొనుచున్నాను.

1. దణ్డు: ఇచట 'ణ' కలదుకాని 'న' లేదు: 'రెణ్డు'లోని 'ణ'యు, 'దణ్డు'లోని 'ణ'యు ఒక్కరీతి నున్నవి చూడుడు.

2. గుణింతమున ఎ, ఏ హ్రస్వదీర్ఘములకు ఈ శాసనమున భేదముపాటింపబడలేదు. చేసి, లేదు అను పదములలోని ఎత్వమునకు దీర్ఘముకలదనుట నిశ్చయమే యైనను నాకు తెలియనిక్రొత్తమాటలలో ఎత్వమునకు దీర్ఘ ముండవలెనో లేదో తెలియరాకుండుటచేత భాషా జిజ్ఞాసువులు ఎత్వ, ఏత్వములను నిర్ణయించుకొనగల రను తలపున శాసనమునం దెల్లెడల హ్రస్వరూపమునే వాడితిని.

3. ప్రతిబింబమున గాన్పించురీతినిబట్టి చూచిన చో ఈయక్షరము 'వు' కాదగునుకాని 'ము' కాదని నాయభిప్రాయము. 'ము' అను అక్షరము ౧౬, ౨౫ పంక్తులనడుమ 'ప్రముఖాణ్'అన్నచోటను,'స్వాముళ్' అన్నచోటను, ఈ 'రెణ్డువాడల' అన్న పంక్తిలోనే 'లెముల' అన్నచోటను, 'ఎళెముళ' అన్నచోటను నాలుగుపర్యాయములు వచ్చినది. ఇన్నిటిలోను మకారపు కొమ్ము స్పష్టముగ గాంచనగును; కాని యిచ్చట ఆకొమ్ము కనబడుటలేదు. 'భూతద్దము' నుపయోగించి చూచినను అది 'వు'గనే కనబడెనుగాని 'ము'గ కనబడలేదు. 'ఎలెవు' క్రొత్తపదమగుటచేత దీనిస్వరూపమును అక్షరముల వైఖరినిబట్టియే నిరూపింపవలసి యుండును గనుక ఇంత సూక్ష్మముగ వాటిని పరిశీలింపవలసిన యవసరము కలుగుచున్నది.

4. ఈ యక్షరమును ఉన్నరీతి ననుసరించి చదువవలసి వచ్చినచో 'ల'కారముగ చదువుదునుకాని 'చె'గ చదువను. ఇది 'ల'కారమునకే చేరికగనున్నది. ౧౬,౨౨ పంక్తులనడుమ 'ఇచ్చిన', 'వచ్చిన', 'గచ్చురు', 'చను', 'చెసిన' అను పదములలోని 'చ' వర్ణమును జూచిన ఇది 'ల'కావచ్చు ననుకొందును.

5. శాసనము చివరికిపోయినకొలది 'వ' 'ప'లకు భేద మంతగ కానరాదు. ఏది 'వ' యైనదియు, ఏది 'ప' యైనదియు తెలియరాదు.

6. గుణింతమున ఒ, ఓలకు కూడ ఇందు భేదము పాటింపబడలేదు. ఇందువలన శాసనమునం దంతటను హ్రస్వ 'ఒ' కారమునే వ్రాసితిని.

7. ఇది 'ఘ' వలెనున్నది. ఇదేవిధమైన యక్షరము సంస్కృతభాగమున 'అశ్వమేధావభృథ' అన్నదానిలో వచ్చినది; కాని సాధారణముగ ప్రాచీన శాసనములన్నిటిలోను 'థ' కు పొట్టలో చుక్కయే కాని అడ్డుగీటు ఉండదు. అడ్డుగీటున్న యిట్టియక్షరములును ప్రాచీనాంధ్ర శాసనములలో చాలచోట్ల వచ్చినవి. అట్టియక్షరము శకటరేఫమని నానమ్మకము. దానికి కారణము ముందు వర్ణించెదను. ఈయక్షర మీరూపమునను, ఇదుకు గొంచెము విలక్షణమైన రూపమునను 'కొఱ్ఱు', 'కఱ్ఱిఱము', 'గఱ్ఱాఱు' అనుపదములలో గూడ వచ్చును. 'అశ్వమేధావభృథ' లోని 'థ' ఇట్లే యుండుటచేత ఈ తెలుగుభాగమున వచ్చిన యిట్టియక్షరముల నొక్కొకచోట ఫ్లీటు మొదలైవారు 'థ' గనే చదివియున్నారు.

8. ఈయక్షరము ఱి (ఱ్జి) యని నాయభిప్రాయము. 'చోఱు','ఏఱు' మొదలైన పదములలోని 'ఱ'రూపమిట్టిదే. ఇది 'టి' యునుకాదు, 'తి' యునుకాదు.

9. నేను 'సకల' గ చదివినదానిలోని మొదటి యక్షరమును శ్రీ శాస్త్రిగారు 'మ' గ చదివిరి. ఈశాసనమునవచ్చిన 'మ' ఎట్లున్నదనగా: 'మ' యొక్క అడుగున 'సున్న' భాగము పెద్దదిగ నుండవలెను. సున్నకును తలకట్టునకును మధ్యనుండు నిలువుగీటు చిన్నదిగ నుండవలెను. సున్ననుండి కుడివైపునకు వచ్చినకొమ్ము కొంచెమెగువగ, సాగారినట్టుగాక చేరికగ కుదించినట్టు ఉండవలెను. ఇందువచ్చిన 'మ' వర్ణమునకు సాధారణముగ ఇదియే లక్షణము. శాసనమున వచ్చిన 'మ' వర్ణములన్నియు సాధారణముగ ఇట్లే యున్నవి. ఈలక్షణమున క్రియకు

రము విరుద్ధముగ నున్నది. కాని ౨౮-వ పంక్తిలోని కట్ట కడపటి 'మ' కారమును ఇదియు కొంచె మించుమించుగ ఒక్కరీతి నున్నట్లగపడుచుండుటవలన దీనిని 'మ' వర్ణ ముగ జదువవగదా యనవచ్చును; అయితే శాసనమునందలి మరి యేయితర 'మ' వర్ణము నిట్లు లేకపోవుటవలనను, ఈయక్షరమునకు 'స' వర్ణమునకు ఎక్కువపోలిక యుం డుటవలనను దీనిని 'స' వర్ణముగనే చదువుట యుక్తమని నాతలంపు. 'పసుక్షెవుల' లోని 'స' కారముయొక్క ఎడమవైపు దిగువపొక్కిలిని తలకట్టుదిగువనున్న నిలువు గీటుతో కలిపిన అది 'సకల' అని నేనుచదివినదానిలోని 'స' వర్ణమునే పోలియుండును.

10. నేను 'క'కారముగ చదివిన యక్షరమును శ్రీశాస్త్రిగారు 'ర' వర్ణముగ జదివిరి. అది 'క' వర్ణమ గనుకాని 'ర' వర్ణముకాదని నాతలంపు. ఇందుకు కారణమిది: అక్షరమును నొట్టియున్నతలకట్టుతో మాత్ర మేకాక వేరే మరియొకతలకట్టుతో కూడనున్న 'ర'వర్ణ ము శాసనమున ఒక్కటియైన గానరాదు. "అక్షరము తో నొట్టియుండవలసిన తలకట్టుకు స్థలముచాలక లేఖకు డించుక యెడముగ జెక్కె"నని శ్రీశాస్త్రిగారు వ్రాసి యున్నారు. కాని యిచ్చట తలకట్టు శ్రీశాస్త్రిగారు చెప్పినరీతిగాక అక్షరముతోనే నొట్టియున్నది. పాఠ కులు బాగుగ పరిశీలింపదగును. 'ర' వర్ణముతో నొట్టి యున్నతలకట్టుపై ఒకచిన్న నిలువుగీటువ్రాసి దానికి తల కట్టిచ్చిన 'క' వర్ణమగును. ఈ యక్షరమున 'ర' అక్షర మును నొట్టియుండు తలకట్టును, ఎగువ మరియొకతల కట్టునుగూడ కనబడుచున్నవి. ఇది 'క' వర్ణమనుకొన్న చో ఒక్కనిలువుగీటే లోపము. 'శక్తిత్రయో పేతః' అను పదములోని 'క' వర్ణమునకును, ౨౧-వ పంక్తిలోని 'దినికి వక్రంబులేదు' అన్నచోటనున్న మొ దటి 'క' వర్ణమునకును, ౩౧-వ పంక్తిలోని 'కొరిన్ధి కొళ్'లోని రెండవ 'క' వర్ణమునకును నిలువుగీటు కాన రాకపోయినను వాటిని 'క' వర్ణములుగనే చదువుచున్న పుడు నేను 'క' వర్ణముగ చదివినదిమాత్రము ఎందుకు'క' కారాదు?

11. ఈపదమును శ్రీశాస్త్రిగారు 'ముద్లు' అని చదివిరి. 'ధ' వర్ణము ౧౫-వ పంక్తిలో 'వడవరికి' అన్నచోటను, అదేపంక్తిలో 'వాధల' అన్న చోటను, ౧౯-వ పంక్తిలో 'ధగు' అన్నచోటను, ౨౧-వ పంక్తిలో 'రెణ్డువడల' అన్నచోటను వచ్చినది; కాని యిందేదియు శాస్త్రిగారు చదివిన 'ముద్లు' అను పదములోని రెండవ యక్షరమును బోలియుండలేదు. వలసినచో పరిశీలింపదగును. 'ధ' వర్ణరూపమును ౫, ౬, ౮, ౯, ౧౦, ౧౧, ౧౩, ౧౪, ౧౮, ౧౯ మొదలైన పంక్తులలో గాంచనగును. నేనీపదమును 'ముధ్లు' అని యే చదువవలెనందును.

12. 'వయ్య'లో 'య్య'కు ఎగువ వలపలిగిలక కలదుచూడుడు. ఇట్టిదే 'విష్ణువర్ధన'పదమునను గాంచ నగును.

13. శ్రీ శాస్త్రిగారు దీనిని 'గజ్ఝ' గ చదివిరి. కాని నేనుచూచినంతవరకు 'జ' వర్ణముక్రింద 'ఝ' లేదు. ఇచట 'జ' తో కలిసి దానిపిదప నొకయక్షరమున్నది. దానికి ఉత్వమున్నది. ఆయుత్వమునే 'జ' తరువాతి య క్షరముయొక్క ఎడమవైపు నిలువుగీటుగ పోనిచ్చిన ట్లు న్నది. అట్లే యగునేని దానిని 'బు'గ చదువదగుననుకొం టిని. ఈయక్షరము కుడికొనను చుక్క కనబడుటంజేసి దానిని 'గజంబు' అని చదివితిని.

14. ఇక్కడి 'ధ' వర్ణముకూడ 'ముధ్లు' లోని 'ధ' వర్ణమువంటిదే.

15. ఇది 'జ' వర్ణమగునాయని సందేహము. ఈశాసనమున ఇతరస్థలముల వచ్చిన 'జ' వర్ణము దీనికి కొంచెము భిన్నముగ నున్నది. ఈయక్షరము కుడివైపున నున్న ఎగువగీటును దిగువగీటును కలవనందువలన గాని, లేనిచో దీనిని 'థ' గగాని 'ఙ' గగాని చదివియుందును.

16. ఇది 'డ','ద'లకు భిన్నమైనవర్ణముగ నున్నది. 'ద', 'డ'లకు అక్షరముతోగలిసి తలకట్టును సంధించు చిన్న నిలువుగీటుండును. 'ట'కు అట్టిగీటు కాని, తలకట్టు గాని యుండదు. అందువలన నేను దీనిని 'ట' గా చదివి

తిని. ఒకటిరెండు ప్రాచీనశాసనములలో ఇట్టిపోలిక గల యక్షరను 'డ' వర్ణముగగూడ జదువబడెను.

'సెట్లి' 'కొన్టుక', 'కన్టిఱము', 'గన్టాన్టు' అనువాటికితప్ప మిగిలిన నాపాఠభేదముల కన్నిటికి కారణములను వివరించియున్నాను. ఈ పదములను శ్రీ శాస్త్రిగారు 'సెడ్లు', 'కొన్డుక', 'కన్డిఱము', 'గన్డాన్డు' గచదివియున్నారు. మాయిరువురి పాఠమును గమనించినచో నేను బండి 'ఱ' చదివిన లిపిసంకేతమును వారు 'డ' గ చదివిరని విదితమగును. ఈలిపిసంకేతము సెట్లు చదువవలెనను విషయము ననే వారికిని, నాకును గొంచెము భేదాభిప్రాయముకలదు.

ఈపైని పేర్కొన్న పదములలోనే కాక ఈయక్షరము క్రీ. శ. పదవ, తొమ్మిదవశతాబ్దులకు పూర్వపు తెలుగుశాసనములలో 'శత్యాదితుట్టు', 'వేవాట్టు', 'వక్రంబువచ్చువాట్టు', 'ఏలుచుట్టి', 'అల్లిపట్టు', విట్టినాయకట్టు', 'మగట్టు'-ఈ మొదలైన పదములలోగూడ వచ్చును. రక్తప్రాణములను ధారవోసి, శాసనపరిశోధనలోనే యాయుష్కాలమంతయు గడపి, ప్రాచీనశాసనములను బ్రకటించిన ఫ్లీటుదొరగారు, బర్జెస్‌దొరగారు, హుల్షుదొరగారు, కృష్ణశాస్త్రిగారు, లక్ష్మణరావుగారు, నరసింహాచారిగారు-వీరందరునుగూడఆయక్షరసంకేతమెచ్చుట వచ్చినను దానిని బండి 'ఱ'గనే చదివియున్నారు. వారిమార్గమునే యవలంబించి నేనును ఇంతవఱకు దానిని బండి 'ఱ'గనే భావించి చదువుచున్నాను. శ్రీశాస్త్రిగారు సత్యాదిత్యచోళమహారాజుశాసనములోవచ్చినదని తెలుపు బండి 'ఱ' స్వరూపమునకు ఈలిపిసంకేతము భిన్నముగనున్నను దీనిని ఫ్లీటు మొదలైనవా రెందువలన బండి 'ఱ' గ చదివిరో, వారికట్లు చదువుటకుగల యాధారములేవో నేనెన్నడును విచారించి యుండలేదు; శ్రీ ప్రభాకరశాస్త్రిగారు లక్ష్మిపుర శిలాశాసనమును, ఈ 'యపాదనకర' శాసనమును బ్రకటించి, యా లిపిసంకేతమును 'డ' గ చదువవలెననువాదమును బైలుదేరదీసిన పిదపనే ఇది 'ఱ' గ చదువవలెనా? 'డ' గ చదువవలెనా యన్నయాలోచనము కలిగి, ప్రత్యేక మీ యక్షరమును గూర్చిన పరిశోధనకు బూనుకొంటిని. ఇంతవఱకు తేలిన తత్ఫలితముల నిట వివరించుచున్నాను.

శ్రీశాస్త్రిగారు

i ఈయక్షరము ఏయే పదములలో వచ్చునో అవియన్నియు ఇప్పుడు 'డ'కారయుతములుగ నున్నవి గనుకను,

ii 'డ'కారముతో చదివిననే కొంచెమించుమించుగ అన్నిటికిని అర్థము సరిపోవును గనుకను,

iii "శబ్దనిష్పత్తి శాస్త్రరీతినిబట్టి పరిశీలింపగా ద్రవిడభాషలోగాని- కర్ణాటభాషలోగాని 'ఆదిత్యుట్టు, ఉట్టి, వాట్టు' మొదలైన రూపములయునికి తెలియుట లేదు" గనుకను

ఆలిపి సంకేతమును బండి 'ఱ'గ గాక 'డ' కారముగనే చదువవలె ననుచున్నారు; కాని యిది సరియైనదికాదని నాయభిప్రాయము. ఏలయన పూర్వమునకు ఇప్పటికి భాషలో చాలమార్పులు కలిగినవి. పూర్వపు పదములు కొన్నిటికి స్వరూపము మారినది. కొన్ని పూర్వపుపదము లిపుడు భాషలో లేకుండనే అంతరించినవి. ఇంతయేల తుదకు పదముల వర్ణక్రమమునుంచియు మార్పు కలదు. ఇన్నిటిలో మార్పున్నయపుడు కొన్ని ప్రాచీనపదముల యుచ్చారణమునగూడ మార్పుండిన నుండవచ్చును. ఇది సిద్ధమని చెప్పనుకాని సాధ్యమందును. ఇట్లు తెలుగు పదములలో పరిణామమున మార్పులనేకము సంభవించినవి. అందువలన ఇప్పటి శబ్దస్వరూపమును, అర్థమును బట్టుకొని ప్రాచీనాంధ్రపదముల స్వరూపోచ్చారణములను నిర్ణయించుట సరికాదని నాతలంపు. ఉన్న యక్షరసంకేతములనుబట్టి యేర్పడు పదముల కర్థము నిర్ణయించుట యుక్తముకాని అర్థముకుదురుట కనువగునట్లు లిపిసంకేతమును చదువబూనుట యుక్తముకాదని నాయభిప్రాయము.

"ఈశాసనమును జదివినవారెల్లరు వీని (ఈయక్షర సంకేతముల) నెల్ల 'థ'కారములగా జదివిరి. బండి 'ఱ' గా జదివినను, 'థ'గా జదివినను నిక్కడ అర్థసంగతి దుర్ఘటమే అగును. అట్లు చదువుటచేతనే యీశాసన మెల్లరకును దురవబోధమయ్యె" ననియు, "నే నీశాసనమును జదువుటలో...'ముడ్లు', కొన్డుకళ్', 'గన్డాన్డు'

ఇత్యాదివిధమునే యనుసరించితిని. అర్థము కుదిరెను" అనియు శ్రీశాస్త్రిగారు వ్రాయుచున్నారు. దీనిననుసరించిమాచిన ఆసంకేతమును 'డ'గ చదువుటచేతనే వారికి ఈశాసనము సుబోధమైనట్లు తేలుచున్నది. ఇట్లుచదివినను 'కన్డిఱము' అనుపదమునకు అర్థము కాలేదని వారే తెలుపుచున్నారు. అది యటుండ, వారి యీశాసనవ్యాసమును జదివినచో, కేవలము ఈయక్షరసంకేతమును 'డ'గ చదివినందువలనగాక ఇతరసంస్కారములుకూడ జరిపినందువలననే ఈశాసనమునకు వా రర్థము కుదుర్పగలిగిరనుట స్పష్టమగును. తాముచేసిన యీ 'సంస్కారములు సందేహాగ్రస్తములు' అని వారే యనుచున్నారు. కావున తత్సందేహాగ్రస్త సంస్కారఫలితముగ కుదిరిన లిపినిర్ణయమును, అర్థమును సందేహాగ్రస్తమే యని తేలుచున్నది.

ఈ యక్షరసంకేతముతో వచ్చు ప్రాచీనపదములుకొన్ని శ్రీశాస్త్రిగారు చెప్పినట్లు 'అడ్లపట్టు', 'వేవాన్డు', సత్యాదిత్యున్డు', మొదలగు రూపములతో నేను 'డ' కారయుతములుగనే ఉన్నవని నేనును అంగీకరించెదను; అనగా 'వాన్టు' మొదలగుపదములు కాలక్రమమున 'వాన్డు' మొదలగు పదములుగ మారినవని నావిశ్వాసము. ఆంధ్రభాషా పరిణామమునకును, శబ్దశాస్త్రమునకు నీయక్షరనిర్ణయమును, తన్మూలమున కొన్ని ప్రాచీనపదముల యుచ్చారణనిర్ణయమును అత్యంతోపయుక్తమును, అత్యంతావశ్యకమును గనుక ఈ యక్షరస్వరూపమును గురించి యింతగ చర్చింపవలసివచ్చెను.

ఈయక్షరమును బండి'ఱ'గ చదివినచో ఈపదమున కేమియర్థము చెప్పెదవని నన్నడిగినచో, 'లిపిసంకేత మట్లున్నది గనుక నట్లుచదివితిని. దానినిగురించి చర్చించి పరిణామము నరసి యాపదమున కర్థము తీయు బాధ్యత భాషాశాస్త్రజ్ఞులపై గల' దనియే నాజవాబు. భాషలోనుండి జారిపోయిన ప్రాచీనపదములకు పూర్వమర్థమేదో ఎవ్వరికెఱుక? అర్థమును దెలియదు: పదస్వరూపమును దెలియదు. అందువలన తత్పదార్థ నిర్ణయమునకు మనకాధారము లేకపోయినను, తత్పదాక్షర నిర్ణయమునకు మనకు శాసనములందలి లిపిస్వరూపము ఆధారముకాకపోదు. అందువలన ఈ చర్చలో ప్రధానముగ నావాదమంతయు శాసనలిపిస్వరూపము మీదనే యాధారపడియున్నది కాని అర్థముమీద నాధారపడియుండునదికాదు.

ఇంకవఱకు నేను ఈలిపిసంకేతమును బండి'ఱ'గ చదువదగుననుటకుగల కారణముల నిటవివరించుచున్నాను.

౧. నేను చూచినంతవఱకు ఈయక్షరము చాలప్రాచీనశాసనములలో గాన్పించును. ఈయక్షరముగల ప్రాచీనశాసనములలో శకవర్ష సంఖ్యగాని,ఆశాసనములు పుట్టినకాలము తెలిసికొనుటకు మరియే యితరపరిగణన సాధనముకాని లేకపోవుటవలన అవి యెప్పటివో తెలియరాదు.అందుగల లిపిస్వరూపము ననుసరించి చూచినచో అవి క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దికి చాల పూర్వపువై యుండవలెనని యూహింపవచ్చును. ఇట్టి ప్రాచీనశాసనములలో ఈ యక్షరము కర్ణాటాంధ్రాది ద్రావిడభాషాపదములలోనే కాని సంస్కృతపదములలో గానరాదు. అందువలన నేను దీనిని ద్రవిడభాషలకు సంబంధించిన ప్రత్యేకాక్షరముగనే పరిగణించుచున్నాను. సంస్కృతోత్తరామ్నాయమున లేనివియు, కేవల మొక్క ద్రావిడభాషలకు సంబంధించిన వర్ణమాలికలలోమాత్రమే యున్నవియౌనగు అక్షరములు ముఖ్యముగ రెండుకలవు: ఱ (ఴ) యొకటి; 'ఱ' (బండిఱ)యొకటి. ఈరెండును సున్నలనుండి యేర్పడిన యక్షరములే. ఱ (ఴ) స్వరూపమును మనమెఱుగుదుము. క్రీ. శ. తొమ్మిదవ, పదవ శతాబ్దులనాటి కది యిప్పటి బండి'ఱ'లోనున్న అడ్డుగీటు తీసివేసిన నెట్లుండునో యట్లుండెను. అయితే దీని ప్రాచీనరూప మది కాదు. వందలకొలది సంవత్సరములు గడచి, పరిణామము పొందినపిదప గలిగిన రూప మది. సున్నచుట్టి దానిమధ్య నొక నిలువుగీటుగీసిన నదియే దాని తొలిరూపము. ఈ రూపమును మనము కడుప్రాచీనశాసనములలో గాంచగలము. ఈయక్షరము నిలువుగీటుమూలమున, కాలక్రమమున, జములుచేసి నిలువుగ నిలబెట్టిన రెండు కోడిగ్రుడ్లమాదిరి నుండు అక్షరముగమారెను: అనగా నిలువుగీటు మధ్యగాగల ఆయక్షరమే కలిసియుండు రెండు సున్నలుగల యక్షరముగ కాలక్రమమున మారిపోయెను.

చర్చలోనున్న మనయక్షరము 'ఱ' (ఙ్జ)కు తొలిరూప మని మనమనుకొను అక్షరమునకు భిన్నముగ నుండుట వలనను, అది కేవలము ద్రావిడభాషాపదములలోనే వచ్చు చుండుటవలనను, సంస్కృతాక్షరామ్నాయమున లేని ద్రావిడ వర్ణమాలికలోని యక్షరముగనే నిర్ణయించుకొంటిమి గనుకను అది బండి'ఱ' అయియుండవలెనని నానమ్మకము. ఈ ⼗-చిహ్నముచుట్టును సున్నచుట్టినట్లున్న ఈయక్షరము ఇప్పటికి బాగుగ పరిణతిని పొందిన బండి'ఱ' యొక్క తొలిరూపమని నాతలంపు.

౨. ఈ ┼ చిహ్నము చుట్టును సున్నచుట్టిన నేప్పడునట్టి యాలిపిసంకేతమనే క్రీ.శ. నాలుగైదు శతాబ్దుల నుండియు ప్రాచీనసంస్కృత భాషాశాసనములలో ఉపధ్మానీయమునకు గుర్తుగ వాడుచుండినట్లు ప్రాచీనశాసనములను బరిశీలించిన దెలియగలదు [చూడుడు, భారతి, రక్తాక్షి సం॥ శ్రావణమాస సంచికలోని శాలంకాయన నందివర్మ పెదవేగిశాసనము: ౧౩ వ పంక్తి]. ఈ గుర్తే విష్ణుకుండి, పల్లవ, కదంబ, గాంగ, చాళుక్య, రాష్ట్రకూట వంశములవారి ప్రాచీనసంస్కృత భాషాశాసనములలో గూడ గాంచనగును. బాదామి చాళుక్యవంశజుడును, క్రీ.శ. ఏడవశతాబ్ది ప్రథమభాగమున నున్నవాడునగు శ్రీ సత్యాశ్రయపులికేశి మహారాజుయొక్క ఒకానొకశాసనమును ప్రకటించుచు, ఫ్లీటుదొరగారు అందువచ్చిన యీ యుపధ్మానీయపు గుర్తును(ఈ ⼗-చిహ్నము: దానిచుట్టు సున్న) గురించి యిట్లువ్రాసియున్నారు:

"We have here and in several places further on, the old form of the Visarga, called in this case Upadhmaniya, before 'p' and 'ph'. The sign is identical with the letter 'ṟ' (ఱ) and is called by Vopadeva 'Gaja Kumbhakriti' (గజకుంభాకృతి) 'that which has the shape of the two projections on the fore-head of an elephant which swell in the rutting season'. It is used sometimes where in classical sanskrit 'sh' is written; e. g., 'puṟpa' (పుఱ్ప) for 'pushpa' (పుష్ప)."

వారుకూడ ఈ యుపధ్మానీయపు గుర్తును, బండి 'ఱ' యును ఒక్కతీరున నుండుననియు, 'వోపదేవుడు' దీనిని 'గజకుంభాకృతి' యని పేర్కొనెననియు వ్రాయు న్నారు. అయితేవారు దీనిని 'ఱ' గ చదివినారు. మనముకూడ అట్లే చదివితీరవలెనని శాస్త్రములేదు. కాని యంతటి పూర్వకాలమున, క్రీ. శ. అయిదు ఆరు శతాబ్దులలో ఈగుర్తు నెట్లుచ్చరించుచుండెడి వారో కూడ మనకు దెలియదు: అనగా అప్పటి కాయక్షరము యొక్క పేరును దెలియదు; ఉచ్చారణమును దెలియదు. అయితే శాసనములం దీయుపధ్మానీయపుగుర్తు నుంచు పద్ధతి క్రీ. శ. ఆరేడు శతాబ్దులతో ఆగిపోలేదు. క్రీ. శ. తొమ్మిదవ, పదవ శతాబ్దులనాటి సంస్కృతభాషా శాసనములలో గూడ నది కలదు. లిపిపరిణామమున అక్షరములును మార్పులను బొందినట్లే క్రీ. శ. అయిదు శతాబ్దినాటి యుపధ్మానీయపు గుర్తును పరిణామమును బొంది మార్పును గాంచినది. మార్పునొందిన యీయుపధ్మానీయపు గుర్తుయొక్క స్వరూపమును వేంగీ చాళుక్య వంశజుడగు, రెండవచాళుక్యభీముని(క్రీ.శ. ౯౩౩-౯౪౫) యొక్క దిగుమర్రుశాసనము నందును, అతని కుమారుడు అమ్మరాజ విజయాదిత్యుని 'మలియంపూండి' శాసనమునందును గాంచనగును. ఉదాహరణమునకు ఈరెండు శాసనములను మాత్రమే పేర్కొంటిని కాని తొమ్మిదవ, పదవ శతాబ్దులలోని సంస్కృతభాషా శాసనములు నేదైన జూచినను ఉపధ్మానీయపు గుర్తే యుండునెడల దాని అయిదవ శతాబ్దినాటి స్వరూపముగాక మార్పునొందిన రూపమే గోచరించును. ఆ మార్పునొందిన రూపము సరిగా బండి 'ఱ' ను బోలియుండుటను గాంచగలము. దీని ననుసరించిచూడ, క్రీ.శ. పదవశతాబ్ది సంస్కృతశాసనములలో ఉపధ్మానీయపు గురుగ గనబడుదానికిని బండి 'ఱ' కును సారూప్య సాజాత్యము లున్నయపుడు క్రీ. శ. అయిదవశతాబ్దినాటిసంస్కృతభాషాశాసనములలో ఉపధ్మానీయపు గుర్తుగ గనబడుదానికిని బండి, 'ఱ' కును గూడ సారూప్య సాజాత్యము లుండవగునని నానమ్మకము. అందువలననే చర్చలోనున్న యక్షరమును బండి 'ఱ' గనే చదువవలెనని నాయభిప్రాయము.

3. ఈ + గుర్తుచుట్టు సున్నచుట్టిన నేర్పడు లిపిసంకేతము కేవలము మన తెలుగుననే కాక ప్రాచీన కర్ణాటశాసనములగూడ గలదు. ఈసందర్భమున మనము కడుప్రాచీనకాలమునుండియు, తెలుగు కన్నడలిపులకు భేదమేమియు లేక రెండు నొక్కరీతినే యుండెనని జ్ఞాపక ముంచుకొనవలెను. అందువలన మన పూర్వపు తెలుగుశాసనములలో వచ్చు ఈ లిపిసంకేతము ప్రాచీన కర్ణాటభాషాశాసనములలో ఎట్లుచ్చరింపబడు చుండెనో అట్లే యుచ్చరించుట యుక్తము.

ఆళుపులనబడువారి శాసనములు కొన్ని కన్నడ భాషను గలవు. ఏడవశతాబ్దికి పూర్వముండినను లేక పోయినను వారు ఏడవశతాబ్దినుండి యుండిరనుటకు నిశ్చయమైన శాసనాధారములు కలవు. వారు బాదామి చాళుక్యులకు సామంతులుగను, సైన్యాధిపతులుగను నుండిరి. ధార్వాడ జిల్లాలో దొరకిన వీరిశాసనములను గొన్నిటిని హుల్ట్జుదొరగారు ప్రకటించియున్నారు. వీటిలో గొన్ని 'వీరకల్లు'లనబడు 'వీరశిలల'మీద జెక్కబడియున్నవి. ఆశాసనములు క్రీ. శ. ఏడవ ఎనిమిదవ తొమ్మిదవ శతాబ్దులనాటివి. ఈయక్షరముగల మన తెలుగు దేశశాసనము లెప్పటివో అవియు నప్పటివే. అందువలన వాటిని సమకాలీనప్రమాణముగ గ్రహింపదగును. ఆవీరశిలలమీద జెక్కబడిన శాసనములు అందు పేర్కొనబడిన వీరులు శత్రువులను గొట్టి స్వర్గాలయమున కెక్కి (పోయి)రను విషయమును దెలుపుచున్నవి. 'స్వర్గాలయ క్కేఱిదర్' అనుపదము లట్టిసందర్భమున నుపయోగింపబడినవి. 'ఏఱ్'యన 'ఎక్కు'యని యర్థము. ఇందలి 'ఱ'వర్ణమును ప్రాయసంపర్కమున ఆశాసనములలో ఈ -|- గుర్తుచుట్టు సున్నచుట్టగా నేర్పడులిపి సంకేతమే చూపబడెను. కర్ణాటమున నీ 'ఏఱ'పద మింకను అంతరించిపోలేదు. ఇప్పటికి దాని కదియే యర్థము. దానిలోనిది బండి'ఱ'యే యని తజ్జ్ఞులు చెప్పుదురు. అందువలన సమకాలమునబుట్టిన కర్ణాటభాషా శాసనములలో గూడ ఈ లిపిసంకేతము వచ్చుచున్నపుడును, దాని నచట బండి'ఱ'గనే గ్రహింపవలసియున్నపుడును, తెలుగుకన్నడ లిపులకు భేదమేమియు లేనపుడును ఆకాలముననే పుట్టిన తెలుగుదేశశాసనములలో వచ్చు నీలిపిసంకేతమునుగూడ బండి'ఱ'గనే చదువవలసి యుండునని నానమ్మకము. ఆళుపులయొక్క యొక శాసనములోని కొంతభాగము నిట పొందుపఱుచుచున్నాను.

౬. ......................ఉరు
౭. భటర ఏఱిదు ప్రియచె
౮. ల్వాచెల్వ శెన్వన్న క(ఖ)ల
౯. [జ*]నవజ్జితర్ ధరెగి(గీ)
౧౦. [శ*]జ్ఞె ఓవదొరపత
౧౧. [తి]య అఱెదు సురలో
౧౨. కక్కె ఏ ఱి దర్ [1 *] కెళెయ
౧౩. వాళెఱెయ న్నిఱిసిద.

ఈ పై శాసనపంక్తులలో ఎత్తుగీటిచ్చిన బండి'ఱ' లన్నియు చర్చలోని యక్షరమునే పోలియున్నవి (అనగా ఈ -|- చిహ్నము: దానిచుట్టు సున్న).

ఆళుపుల శాసనములనేకాక బాదామిచాళుక్యుల శాసనములను బరిశీలించినను ఈయక్షరసంకేతము బండి 'ఱ' అనియే విదితమగును. బాదామిచాళుక్య వంశజుడైన వినయాదిత్యసత్యాశ్రయుని శకవర్షము ౬౧౬ నాటి తామ్రశాసనమున అతడు 'కిఱుకాగామాసి' యను గ్రామమును దానముచేసెనని కలదు. ఈగ్రామనామమున నేను బండి'ఱ'గ వ్రాసినచోట చర్చలోనున్న యక్షర సంకేతమే కలదు. ఆగ్రామ మిప్పుడు స్పష్టముగ నిదియని గుర్తింపరానందున దానిని 'ఱ'గ చదువదగునో, 'డ'గ చదువదగునో తెలియదు. కాని ఆగ్రామమునకు సరిహద్దులను దెలుపుపట్ల వచ్చు కొన్నిపదములలో ఈయక్షర సంకేతము వచ్చును. ఆశాసనమును ప్రకటించినవారు ఈయక్షరసంకేతమును బండి'ఱ'గ చదివియున్నారు. 'కుఱుపకెఱె' ఈ మొదలగు పదములలోని బండి'ఱ' ఆ యక్షరసంకేతమున నున్నదే. 'కెఱె' యనుపదమిప్పటికి కన్నడమున శకటరేఫముతోనె కలదు. 'కెఱె' యనగా చెఱువు. 'కెఱె' యను పదమే మన తెలుగున చెఱువుగా

మాఱినది. చెఱువుపదమున నిప్పటికి మనభాషను బండి 'ఱ' గలదు. గ్రామమునకు సరిహద్దులుగ నిచ్చినవి సాధారణముగ గ్రామనామములుకాని, చెఱువులపేళ్లుకాని, చెట్లు, గట్లపేళ్లుకాని యగుట సహజము: అందువలన 'కెఱె' యనుపద మిప్పటికి కన్నడమున బండి'ఱ' తోనుండుటవలనను, గ్రామమునకు సరిహద్దులుగ నిచ్చిన పదములలో నది వచ్చుచుండుటవలనను, ఆపదమునకు వ్యుత్పత్తి రూపమగు 'చెఱువు' పదమునగూడ బండి'ఱ' యుండుటవలనను ఆయక్షరసంకేతము బండి'ఱ' యగుననియే నానమ్మకము. ఇట్టి యుదాహరణము లనేకములు చూపవచ్చును.

౪. బర్నెల్ దొరగారు క్రీ.శ.౯౮౦ నాటి పశ్చిమచాళుక్యశాసనాక్షరస్వరూపములను దెలుపుపట్టిక నిచ్చియున్నారు. దానిలో బండి'ఱ' యొక్క సంకేతము మన యక్షరమువలెనే కలియజేర్చి నిలువుగ నిలిపిన రెండు సున్నలమధ్య అడ్డుగ నొకగీతగీసిన నేర్పడు లిపిసంకేతమువలెనున్నది. శాసనములను బరిశీలింపగా క్రీ. శ. ౯౮౦ నాటికి బండి 'ఱ' ఆస్వరూపమున నుండెనని వారికి తోచినది. ఆళుపులశాసనములు మొదలైనవాటిలోవచ్చు బండి 'ఱ'స్వరూపమునకు దీనికి నంతగ భేదము లేదు. ఈ + గుర్తు చుట్టు సున్నగల సంకేతమే కాలక్రమమున నించుక మార్పుచెంది ఈరీతికి వచ్చినదని నాయభిప్రాయము. ఇట్టి యక్షరమునుగూడ మన తెలుగుదేశ శాసనములలో జూడవచ్చును. శ్రీయుత సి. కృష్ణమాచార్యులుగారిచే భారతిలో ప్రకటింపబడిన రెండవ జయసింహవల్లభుని పెణుకపఱుదానశాసనమును జూడుడు. అందు పెణుకపఱులోని కడపటియక్షరము రెండుసున్నలను దగ్గరగ జేర్చి మధ్యనొక యడ్డుగీటు నిచ్చిన నెట్లుండునో యట్లున్నది. ప్రిథివీమూలుని గోదావరితామ్రశాసనమున ౨౩ వ పంక్తిలో 'రేజ్గుటకమ్పా ఱాతుకురాణామ్' అన్న దానిలో నేను బండి'ఱ' వ్రాసినచోటకూడ అట్టి సంకేతమే కలదు. వేంగీచాళుక్యవంశజుడైన రెండవ మం[గి] యువరాజు మంజేఱుశాసనమున దానముచేయబడిన గ్రామము సరిహద్దులను దెలుపు సందర్భమున 'పశ్చిమస్యాందిశి విలజ్గమిఱు' అనికలదు. ఇచ్చట నేను బండి'ఱ' వ్రాసినచోట పైని తెలిపిన సంకేతమేకలదు. 'విలజ్గ' 'వెలగ' యనియు, 'మిఱు' 'మిట్టు'అనియు నాయభిప్రాయము. 'మిఱు' 'అఱు' పదములు 'మిట్టు', 'అట్టు'[1] పదములకు రూపాంతరములు. శాసనభాషలో 'మిఱు' పదమును చాలచోట్ల చూడనగును. 'మిఱు' పదము మనభాషలో లేనిచో దానిని 'విలజ్గమిడు'గ చదువవలెనా లేక 'విలజ్గమిఱు'గ చదువవలెనాయని సంశయింపదగునేమో కాని అదియున్నపుడు దానిని 'మిడు'గ గాక 'మిఱు'గ చదువుటయే యుక్తము అని నాతలంపు. అందువలన ఆ సంకేతమును బండి'ఱ'గ చదువవలెననియే నానమ్మకము.

౫. బండి 'ఱ' లేక 'శకటరేఫము' అనుపేరే ఆ యక్షరస్వరూపమును దెలుపుటలో కొంత తోడ్పడును. ఈలిపి సంకేతమునకు బండికివలె చక్రములవంటి రెండు సున్నలును, ఇరుసువలె మధ్య అడ్డముగ నొకయడ్డుగీటును ఉండి, రేఫోచ్చారణ ముండుటవలననే దీనికి బండి 'ఱ' యనియు, శకటరేఫమనియు పేర్లుగలిగెనని నా యభిప్రాయము. ఈ నామమున కాలిపిస్వరూపమే లక్షణము: ఆలక్షణమున కీపేరు లక్ష్యము. ఈ స్వరూపముతో అతిప్రాచీనశాసనములలో గానవచ్చు లిపిసంకేతము కొంతకాలమగుసరికి శ్రీశాస్త్రిగారు సత్యాదిత్యచోళమహారాజు శాసనములో కలదను స్పష్టమైన బండి 'ఱ' రూపముగా మాఱి పరిణామమున ఇప్పటి బండి'ఱ' రూపముగ పరిణతిం జెందెను. బండియిరుసు వలె మధ్య అడ్డముగ నుండు అడ్డుగీటే ఈయక్షరమునకు ప్రాణము. మొత్తముమీద ఈలిపిసంకేత మెట్టిమార్పులను బొందినను అన్నిమార్పులలోను ఈయడ్డుగీటును గాంచుచునే యుండగలము. ఈయొక్క యక్షరమే

1. అట్టు, మిట్టుల వలెనే ప్రాచీనశాసనములలో 'కట్టు' అను పదమును గలదు. 'కట్టు' అనగా గట్టు అని యర్థము: ఏటికట్టు, కోటికట్టు ఇత్యాదులు. 'కఱుత' అనునది ఈ పదముయొక్క సప్తమ్యేకవచనరూపము. రా... రాజనరేంద్ర పట్టాభిషేకసంచికలో పొరపాటున 'కఱుత' అనుదానినినే ప్రథమావిభక్తిరూపముగ గ్రహించి దానికి 'గట్టు' అని యర్థము చెప్పియున్నాను. ఇది తప్పు. 'కట్టు' ప్రథమావిభక్తిరూపము: 'కఱుత' సప్తమీవిభక్తిరూపము.



౯. బకాసురునిపుత్రుడగు విభీషణుని నాతనిమంత్రి ధర్మరాజుయొక్క అశ్వమేధాశ్వమును బట్టుకొన బురికొల్పుట.





౧౦. అజంతాగుహాలయములోని యొక మండోదకచిత్రము (Fresco) యొక్క నమూనా.

కాలక్రమమున తెలుగు-కన్నడ అక్షరములన్నియు ఇట్లు మార్పులుచెంది పరిణామమును బొందినవే. ఇతర లిపుల మాట యెటులున్నను తెలుగు-కన్నడ అక్షరములలో కాలక్రమమున కొద్దిగనో గొప్పగనో ఇట్లు పరిణామము ను బొందని యక్షరము ఒక్కటియైన లేదు. చర్చలోని యాలిపిసంకేత మే యిట్లు ఇప్పటి బండి'ఱ'గ మార లేదన్న సత్యాదిత్యచోళమహారాజు శాసనములో కలదను స్పష్టమై విష్ణుకుండి, చాళుక్య, గాంగ, కదంబ, రాష్ట్రకూట, శాలంకాయన, ఆనందవంశజుల శాసనములు పరిశీలింపదగును. అడ్డగీటుతోనున్న ౧౪-వ రూపమును మంగియువరాజు నూతులపఱ్ఱు శాసనమునను గలదు. చూడుడు: రెండవరేకు, రెండవప్రక్క: ౨, ౪, ౬ పంక్తులు.



మైన బండి'ఱ' రూపము అంతకుపూర్వపు ప్రాచీనశాసనములలో గనబడవలసియుండును. కాని నేను చూచినంత వర కది అయినవ, ఆఱవశతాబ్దులలోని శాసనములలో గానరాలేదు. అక్షరములు అన్నియు కాలక్రమమున మార్పులుచెంది పరిణామమును బొందినయపుడు ఈ బండి'ఱ' యొక్కటియు నేమార్పును లేక మొదటి నుండియు నిట్లే యుండెననుట సంగతము కాదు.

ఈ బండి'ఱ' యక్షరము పరిణామము నొందుటలో గాంచిన మార్పులను ఇట చూపుచున్నాను:



ఇన్నివిధములైన రూపాంతరములను మనము ప్రాచీన శాసనములలో గాంచగలుగుదుము. ఇందునిమిత్తమై ...

"(౧)*...దోణశర్మ్మ (౨)ణపుత్రాయ కుణ్డి దోణశర్మ్మణే కర్మరాష్ట్రే నుతుల పఱునామగ్రామే దొ[క్షి](3)ణదిశాయం పద న్తక్షేత్రదత్తమ్ శేవదిస్తనే బ్రహ్మణక్షేత్ర దక్షిణత తటా(౪)క పశ్చిమత పెఱుకపఱంబు బ్రహ్మణక్షేత్ర ఉత్తరత నిడుంబఱుప (౫) స్త పుర్వత దోణవాది పస్త బ్రహ్మణక్షేత్ర దక్షిణత ఏతకణ్డనామ బ్రహ్మ (౬) ణక్షేత్ర పశ్చిమత వెపెఱుకణ్డి నామ బ్రహ్మణక్షేత్ర....."

ఈ పైపాఠమున ఎత్తుగీత లిచ్చి బండి 'ఱ' గ వ్రాయబడిన వన్నియు, ఇట్టిసంకేతము కలవే. 'నుతుల పఱు'లోని చివరియక్షరమునకు ద్విత్వము లేనందున దానిని నూతులపాడుగా చదువవలెను కాని 'నుతులపఱు'గా చదువరాదని యొక వేళ ఆక్షేపము వచ్చిన రావచ్చును. కాని ప్రాచీనశాసనములలో ఇప్పుడు ద్విత్వముతో నున్నని

* ఈ ( ) కుండలీకరణమున నున్న సంఖ్యలు శాసనపు రేకుమీది పంక్తులను దెలుపును.

పూర్వము ద్విత్వము లేకుండ గనబడుటయు కలదు: కొంబ ఱు (ద్విత్వము లేదు); నిడుంబఱు (నిడుమ్బఱు; దానికి పూర్వము ద్విత్వము లేదు). ఇట్లే, కొణ్ణపఱు (నరేంద్రమృగరాజ విజయాదిత్యుని శాసనము), ట్రండపఱు (మూడవ విజయాదిత్యుని శాసనము), వంగిపఱు (రెండవ విజయాదిత్యుని శాసనము), మిఱు (మంగియువరాజు శాసనము) మొదలైన ద్విత్వము లేని పదములను జూపవచ్చును. అందువలన దానికి ద్విత్వము లేకపోయినను అది 'నుతులపఱు' కాకపోదు. ఇప్పుడు 'నూతులపాడను గ్రామము కలదని ఒకవేళ 'నుతులపఱు' అని యున్నదానిని సంపూర్తిగా సంస్కరించి 'నూతులపాడు'గ చదివిన 'నిడుంబఱు'ను 'నిడుంబడు'గను, 'కొంబఱు'ను, 'కొంబడు'గను, 'మిఱు'ను 'మిడు'గను చదువవలసివచ్చును. ఈ పేర్లుగల గ్రామము లున్నట్లు వినము. తరువాతి చాళుక్యశాసనములలో 'గణ్డేఱు'గ వ్రాయబడినపదము మొదటి జయసింహవల్లభుని శాసనమున చర్చలోనున్న లిపిసంకేతముతో 'కణ్డేఱ' అని కలదు. రెండవ యక్షరములోని 'ఱ' బండి'ఱ' కాదు 'డ' అనుకొన్నను చివరియక్షరము పరిణామమున సూచించిన ౧౪-వ రూపమును బోలియున్నది.

౬. శ్రీశాస్త్రిగారు క్రిందటి భారతిసంచిక ౧౧౪-వ పుటలో "సత్యాదిత్యచోళమహారాజు తెలుగు శాసనమును ప్రకటించిన హెచ్. కృష్ణశాస్త్రిగారు దానిలోని 'చిటుంబూరు' అను దానిని 'చిఱుంబూరు' అని చదివిరి. అది 'చిటుంబూరు' అని చదువుటే సరియని నానమ్మకము" అనియు, ౧౧౭-వ పుటలో 'చిఱుంబూరు' అని యితరులు చదివినతీరుతో పదముకలదు. అందలి 'ఱు' లిపి ┼-చిహ్నము చుట్టును సున్నచుట్టిన ట్లున్నది. ఇదికూడ 'డు'గా చదివిననే 'చిడుముకూరు' అను శబ్దనిష్పత్తికి సరిపడును. కాని యీపదమే కృష్ణశాస్త్రిగారు ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించినశాసనమున 'చిఱు(ష్టు)ంబూరి' అని యుండెను. దీనినిబట్టి 'ట' కును దీనికిని గూడ సంబంధ ముండినట్టు తోచెను." అనియు వ్రాసియున్నారు: అనగా చిఱుంబూరు అను పేరులోని రెండవయక్షరము సత్యాదిత్యచోళశాసనమున 'టు'గ నుండెనుకాని అది కృష్ణశాస్త్రిగారు చదివినట్లు 'ఱు' కాదనియు, ఆయక్షరమే ఆపేరులోనే వేరొకశాసనమున ┼ గుర్తువేసి దానిచుట్టు సున్నచుట్టినట్లుండెననియు, 'ట', 'డ'లకు ఎక్కువ సంబంధ మున్నదిగనుక ఈ ┼ గుర్తుచుట్టు సున్నగల యక్షరమునకును 'డ'కును గూడ సంబంధముండెనె ననియు, దానిని 'డ'గ చదివిననే 'చిడుముకూరను శబ్ద నిష్పత్తికి సరిపోవుననియు వారియభిప్రాయము. నేనిట్లు



చి ఱుం బూ రి ఉ త్త

ఆ పేర్ల ప్రతిబింబములను శాసనములనుండి విడిగా దీసి యిచ్చుచున్నాను. వాటిని చూచినచో సత్యాదిత్య చోళరాజు శాసనమునందలి 'చిఱుంబూరి' అనుదానిలో బండి'ఱ'యే కలదనియు, కృష్ణశాస్త్రిగారి పాఠము సరియైనదే యనియు తేటపడును.

అదియునుంగాక 'చిఱుంబూరు'లో బండి'ఱ'గాక శాస్త్రిగారు చెప్పినట్లు 'డ'కారమే యుండవలసియున్నను శబ్దనిష్పత్తి శాస్త్రమననుసరించి యది 'చిలుంబూరు', 'చిలువూరు'గా మారునుగాని 'చిలుమకూరు'గా మారదు. అదియటుండ విక్రమాదిత్యచోళమహారాజు శాసనమునగూడ అది బండి 'ఱ'తో 'చిఱుంబూ'రనియే

రెండవయక్షరము ఈ + గుర్తుచుట్టు ఇంచుమించు సున్నచుట్టిన సంకేతమున గలదు. ఈయక్షరము రెండు వేరువేరు శాసనములలో ఒకే పేరులో రెండురీతులగనబడునప్పుడును, అందొకరీతి యక్షరము మనకు బండి'ఱ'యని స్పష్టముగ దెలియుచున్నపుడును రెండవరీతి నున్న యక్షరముగూడ పేరొకటే కనుక అదేవిధమైన యుచ్చారణముగల యక్షరమే యని నిశ్చయించుట యుక్తము. అందువలన ఈ + గుర్తుచుట్టు సున్నచుట్టగా నేర్పడు సంకేతముకూడ బండి 'ఱ' అనియే నేను నమ్ముచున్నాను. ఈసంకేతముతో నున్న 'చిఱుంబూరు' పేరుగలశాసనము సత్యాదిత్యచోళ శాసనముకంటె ప్రాచీనముకాదగునని నాతలంపు.



చి ఱు బు రు

కలదు. దీనిలోని బండి'ఱ' క్రీ. శ. పదవ శతాబ్దిపరకే కాక విజయనగరాధీశుడైన బుక్కరాయల కుమారుడగు హరిహరరాయలకాలమున క్రీ. శ. ౧౩౮౨ నాటివఱకు గూడ కలదు. క్రీ.శ. ౧౩౮౨ నాటి యాతని చిలుమకూరి శాసనమున ఆపేరు బండి'ఱ'తో 'చిఱుమకూరు'గ నున్నది. అందువలననే అది ఇటీవల 'చిలుమకూరు'గ మారుట సంభవించినది. శబ్దనిష్పత్తిశాస్త్రమునుబట్టి 'చిఱుమకూరు' 'చిలుమకూ'రగుట సంగతమే.

మరియొక శాసనమున వచ్చిన ఈ పేరులోనే

౩. ఈవిధమైన యక్షరము నెల్లూరుమండలము నుండి ఇటీవల నేను తెచ్చిన ప్రాచీనాంధ్రభాషాశాసనములలో చాలచోట్ల కనబడుచున్నది. ఈశాసనములు కొన్నిటిలో వచ్చు 'ఆచాఱ్లు', 'ఈఱ్లు' అను పదములలో కడపటి సంయుక్తాక్షరములలోని ఎగువయక్షరము ఈసంకేతముననే కలదు. ఒకటి రెండు ప్రతిబింబముల నిచట నిచ్చుచున్నాను. అందు దీనిని చూడవగును.



శ్రీవెళ్ఙగుణ్ణ ఆచాల్లు
పణికేసిరి.



శ్రీకలువాది ఆచల్లుకే
సినపణియు

కేసిరి, కేసిన అను పదములు మనయిప్పటి చేసిరి, చేసిన పదములే. కన్నడమున 'క' కారముతో నున్నవి తెలుగున చకారముగ మారిన యుదాహరణములనేకము లీయవచ్చును (కెయ్యి-చెయ్యి; కిఱు-చిఱు; కిలుమ్బు-చిలుము-ఇత్యాదులు).

మఱియొక శాసనమున 'ఈల్లు' అను పదము ఈ సందర్భమున వచ్చును:

...శ్రీప్పరాజు ల్వాలత్రేగారికి పన్నాస ఇ చ్చినవారు దానికి సక్కి కొణ్డకావ్వల్లె కొ.

యరు నడ్ళబోళ నడపయ గోరణ్డాళ పేరయ
దేనమ్బఱితి ము(?)దుట్ల కొణ్డయరు పట్రి (?)
ముదుఱదు ఈఱ్లునలువురాయుతోటఱ ఏవుదు
ఊరెల్ల సక్కి వ్రసినవాన్రు...

ఎత్తుగీటు లిచ్చినచోట నేను బండి'ఱ'గ చదివిన అక్షరసంకేతము చర్చలోనున్న దానిని బోలియున్నది. (ఒకసున్న, దానికిమధ్య అడ్డుగీటు).

ఈపై పదములలో ఆసంకేతమును 'డ' గ చదివిన 'ఆచాఱ్లు'[1] అను దానిని 'ఆచాడ్లు' గ చదువవలసి వచ్చును. అట్టి రూప మున్నట్లు నే నెరుగను. అదియును గాక 'ఈఱ్లు నలువురాయు' అన్నచోట 'ఈఱ్లు'[2] అను దానిని 'మీరలు'గా అర్థముచేసుకోవలెనేమో. మీరు, నేను, నీవు మొదలగుపదములకు ఈరు, ఏను, ఈవు మొదలగునవి ప్రాచీనరూపములు. అందువలన 'ఈఱ్లు నలువురాయు' అనుదానిని 'మీరలు నలువురయు' అని గ్రహింపవలసియుండు ననుకొందును. ఇట్టి సందర్భమున ఆపదమును 'ఈడ్లు'గ గాక 'ఈఱ్లు' గనే చదువవలసియుండునని నాయభిప్రాయము. 'ఊరు' 'మడి' పదములకువలె బహువచనమున, 'ఈడ్లు' రూపముమాత్ర మేలయుండరాదను ప్రశ్న కలిగిన కలుగవచ్చును. కాని, ఏవియోకొన్ని పదముల బహువచనరూపము 'డ్లు'గ కనబడుచున్నది గనుక అన్నిటికి బహువచనమున నట్లే 'డ్లు' రూప ముండునని భావించుట సమంజసముకాదు. పురి, తేరు, మేడ, పాడు, అరి, గోడ, ఈమొదలైన పదములకు బహువచనమున 'డ్లు' రూపమురా నవకాశము లేదనుకొందును. ఈకారణముల ననుసరించి ఆపదములను 'ఆచాఱ్లు', 'ఈఱ్లు' గనే చదువవలసి యుండుననియు, ఆయక్షరమును బండి'ఱ'గనే చదువవలెననియు నానమ్మకము.

౮. 'ఆదిత్యఱ్రు', 'ఉన్రి', 'పొన్రు', 'వాన్రు' అను రూపములు కర్ణాటభాషలోగాని, ద్రవిడభాషలో గాని లేవనియు, అందువలన ఆలిపిసంకేతమును 'డ' గనే చదువవలెననియు శ్రీ శాస్త్రిగారనుచున్నారు; కాని ఒన్రు, మూన్రు ఇత్యాది రేఫోచ్చారణము కలిగిన పదములు అరవమున గొన్ని యిప్పటికినికలవు; కన్నడము నను గలవని విందును. ఇప్పటివఱకు నిట్టి యుచ్చారణముగల పదములు కర్ణాట, ద్రవిడ భాషలలో నుండినచో ప్రాచీన కాలమున నిట్టి వనేకము లుండియుండునని విశ్వసింపదగును. అది యటుండ 'మూన్రు' 'ఒన్రు' మొదలైన పదములనుండియే 'మూణ్డు': మూఱు; ఒణ్డు: ఒరు మొదలగు రూపములు కలిగినవని నాయభిప్రాయము. అట్లే కానిచో మూఱు, ఒరు మొదలగుపదముల కారూపములెట్లు సిద్ధించినవో అరయవలసి యుండును. ఈకారణము ననుసరించి కూడ ఆసంకేతమును బండి 'ఱ' గనే చదువవలసియుండునని నాతలంపు.

౯. మఱియొక విషయము: కడు ప్రాచీనకాలము నుండియు తెలుగు రచనమున సంస్కృతవర్ణక్రమమే యనుసరింపబడుచుండెనను విషయము ప్రాచీనశాసనములను దిలకించిన బోధపడగలదు. అందువలన కడు ప్రాచీనకాలపు తెలుగు రచనలో అనునాసికములనే కాని పూర్ణానుస్వారములను గాని, అర్ధానుస్వారములను

---

1. ఈ లిపిసంకేతము ఈ పదమున గనబడుట వింతగ నున్నది. ఇది ఆర్యభాషాపదమే యైనచో ఈ సంకేత మిచట ప్రామాదికమయి యుండవలెను.

2. ఇచ్చటి సందర్భము ననుసరించి దీనిని 'వీరలు' గ అర్థముచేసుకొనుట యుచితమగునేమో కాని 'మీరు' అను దానికేకాని 'వీరు' అనుదానికికూడ 'ఈరు' అను ప్రాచీనరూపము వ్యాకరణముల గానరాదు. ఒకవేళ 'ఈరు'అను రూపము ప్రాచీనకాలమున 'మీరు', 'వీరు' పదములు రెంటికిగూడ నుండెనేమో. అయినను దీని విషయమై ఇంకను యోజింపవలసి యున్నది. ఈపదమే మొదటి జయసింహవల్లభుని విప్పర్ల శాసనమున హ్రస్వ 'ఇ' కారముతో 'ఇఱ్లు' అని యున్నది. ఒకచోట 'ఇ' కారమును, వేరొకచోట 'ఈ' కారము నుండుటకు గతమేమో, ఇం దేది ప్రామాదికమో ఏది సరియైనరూపమో. దీనియర్థమును గురించియు, పదస్వరూపమును గురించియు ఇంకను ఆలోచింపవలసి యున్నది.

గాని గాంచము. కాలక్రమమున పదవర్ణక్రమముకూడ మార్పునంది యాయనునాసికములే పూర్ణానుస్వారములుగను, అర్ధానుస్వారములుగను మారెనని యెల్లరంగీకరింతురు. మన 'అహవనకర' శాసనము తెలుగు భాగమున పదవర్ణక్రమముననుగూడ పూర్ణానుస్వారము లున్నను చాలచోట్ల అనునాసికములు లేకపోలేదు. చర్చలోనున్న లిపిసంకేతముగల పదములలోగూడ అనునాసికము కలదు. శ్రీ శాస్త్రిగారు చెప్పునట్లు ఆసంకేతమును 'డ' గ చదువవలసియున్నచో పూర్వము పాటింపబడుచుండిన సంస్కృత వర్ణక్రమపద్ధతి ననుసరించి తదక్షరమునకు బూర్వము తద్వర్గానునాసికమైన 'ణ' యుండవలెను గాని 'న' యుండరాదు. ఒకవేళ అట్లుండుట లేఖక ప్రమాద మనుకొందమన్న శాసనమున నీలిపిసంకేత మెన్నిచోట్లవచ్చినదో అన్నిచోట్లనుగూడ తత్సంయుక్తాక్షరమున 'న' వర్ణమేకాని 'ణ' వర్ణము వ్రాయబడక పోవుటవలన దానిని లేఖక ప్రమాదముగ బరిగణింప వీలు లేదు. చూడుడు :

| | | | |
|---|---|---|---|
| ౧౮-వ పంక్తి | —రెణ్డు | ౨౭-వ ,, | —పసిణ్డి |
| ౧౯-వ ,, | —వణ్డు | ౨౭-వ ,, | —నెటన్ద |
| ౨౧-వ ,, | —రెణ్డు | ౨౯-వ ,, | —నెటన్ద |
| ౨౪-వ ,, | —పఞ్చిన | ౩౧-వ ,, | —కఞ్చి |

౩౨-వ పంక్తి—నన్ది

ఈ పదములన్నిటిలో వచ్చిన సంయుక్తాక్షరములలో రెండవయక్షరము ఏవర్గమునకు చెందినదో ఆవర్గము యొక్క అనునాసికమే మొదటి యక్షరముగ నున్నది. ౩౧-వ పంక్తిలోని 'కొణ్డుక' పదముతక్క నేను బాడి 'ఱ'తో చదువవలెననుచున్న 'కొన్టుక', 'కన్టిఅము', 'గన్టాన్టు' పదములే పైవర్ణక్రమమునకు విరుద్ధముగ నున్నవి. ఈలిపిసంకేతము వచ్చినచోటనెల్ల 'న' కారమే వచ్చుటచేత 'కొణ్డుక' అనునది లేఖక ప్రమాదమైన గావలసి యుండును లేదా అది 'కొన్టుక' వంటి 'ఱ' కారయుతములైన పదములు 'కొణ్డుక' వలె 'డ'కార యుతములుగ మారుచుండిన మార్పుకాలమైన నైయుండవలెనని నా యభిప్రాయము. అదియునుగాక ఈలిపిసంకేతముగల సంయుక్తాక్షరమున అనునాసికమే వచ్చినచో అది 'న' వర్ణముగనే యున్నది కాని ఏశాసనమునను 'ణ' వర్ణముగ లేదు. కొన్ని శాసనములలో ఈసంకేతముతోను, 'న' అనునాసికముతోను వచ్చిన పదములను గొన్నిటి నిచ్చుచున్నాను చూడుడు :

| | | |
|---|---|---|
| శత్యదితున్టు<br>ఏళుచున్టి<br>వేవాన్టు<br>వచ్చువాన్టు | — | సత్యాదిత్య చోళ మహారాజు శాసనము. |
| కన్టేఱవాటివిషయ | — | మొదటి జయసింహవల్లభుని శాసనము. |
| ఇచ్చినవాన్టు | — | వైదుంబ శాసనము. |
| తారుమున్టి | — | పృథివీ వల్లభచోళుని శాసనము. |
| ఇచ్చువాన్టు | — | విక్రమాదిత్య శాసనము. |
| మగన్టు | — | ముడివేడు శాసనము. |
| ఏళువాన్టు<br>విన్టి నాయకున్టు | — | వైదుంబ శాసనము. |
| చేయి? న్చినవాన్టు<br>ఇచ్చిన వాన్టు | — | బుడమనరాయలపాటి శాసనము. |
| మగన్టు<br>మున్టు | — | పెట్లూరి శాసనము. |
| ముదిగొన్ట | — | విష్ణువర్ధనుని శాసనము. |

ఈవిధమున ఈసంకేతము ఎచ్చటవచ్చినను ఆయక్షరము 'న' వర్ణమేకాని 'ణ'వర్ణముకాదు. పైనిచ్చియీపదముల పట్టికలో అన్ని శాసనములలోను ఈసంకేతము వచ్చినచోట ఒకేరీతిని 'న'వర్ణమే కనబడుచున్నది డు ఈవ్రాతను ప్రామాదికముగ నేను గ్రహింపజాలను నిశ్చయమైన యేదో యొకపద్ధతికి కట్టుబడియే నాటిశాసలేఖకులు అట్లు వ్రాయుచువచ్చిరి కాని ప్రమాదవశమునట్లు వ్రాసియుండలేదనియే నానమ్మకము. ఈకారణమువలనగూడ ఆలిపిసంకేతము 'డ' కాదనియు బండి 'ఱ'యే అనియు నానమ్మకము.

౧౦. శ్రీశాస్త్రిగారు వారివ్యాసమున నొక చోట 'డ'కు రెండురూపములు ఉండెడివని తలంపజే

నని వ్రాసియున్నారు. ఒకే యక్షరమునకు రెండురూపము లుండెడివనియే అంగీకరించుచో శకటరేఫమునకే రెండురూపము లుండెడిననియు, ఈలిపిసంకేతము ఈ విడిగవచ్చిన బండి'ఱ'యొక్క రూపాంతరమనియు నేల తలంపరాదు?

ఈ పైకారణము లన్నిటివలన నే నింతవఱకు ఆలిపి సంకేతమును బండి'ఱ' అనియే నమ్ముచున్నాను. నాయభిప్రాయము ప్రకారము బండి'ఱ' వర్ణము పరిణామమున పెక్కురూపములను బొందినది. కాని యీవర్ణము పరిణామమున ఈదశలో ఈరూపమును బొందినదని యితరవర్ణములవిషయమునవలె దశలు నిర్ణయించి మార్పులను నిశ్చయింపలేము కాని యది పొందిన రూపాంతరములను మాత్రము జూపవచ్చును. ఒకేశాసనమున ఆయక్షరము పొందుచుండిన మార్పురూపములనే కాక అంతకుపూర్వపు రూపములను గూడ జూడగల్గుటయు తటస్థించును: అనగా పరిణతిపొందుచుండిన రూపములు క్రమముగా వాడుకలోనికి వచ్చుచుండినను, ప్రాచీనరూపములపైగూడ లేఖకుల కభిమానము పోలేదనియే దానినిబట్టి మనము గ్రహింపవలసి యుండును. అందువలననే 'అహదనకర'శాసనమున కొంచెము బాగుగ పరిణతిపొందుచుండిన 'ఱ' వర్ణముతోపాటు, తత్ప్రాచీనరూపముకూడ అందు కుదురుకొనియుండుట తటస్థించెనని నాతలంపు.

నే నాలిపిసంకేతమును బండి'ఱ'గ చదువుటకు నాకు ఇంతవఱకుగల కారణముల నెఱింగించితిని. ఈ పై కారణములను కాదనుటకు దగుహేతువులుండి ఆలిపి సంకేతమును 'డ'గనే చదివితీరవలెననుటకు ప్రబలాధారము లున్నచో ఇంతవరకు చాలమంది శాసన పరిశోధకులు ఆలోచితముగనో, అనాలోచితముగనో చేయుచున్న తప్పు సవరణకాగలదు.

నాయభిప్రాయప్రకారము ఈశాసనము మూడవ విష్ణువర్ధనుని (క్రీ. శ. ౬౧౪-౬౩౧) నాటిది; శ్రీశాస్త్రిగారి యభిప్రాయము ప్రకారము ఇది అయిదవవిష్ణువర్ధనుని (క్రీ.శ. ౭౪౬). నాటిది. ఇందు ఎవ్వరిదయినను-మూడవ విష్ణువర్ధనునికికూడ పూర్వమున్న ఆంధ్రభాషాశాసనములు కొన్నికలవు. వాటిలో ఎక్కడనో కొన్నికొన్ని పదములుతక్క దీనివలె ఇంతబొత్తుగా అర్థముకాకుండనున్న శాసనమేదియు లేదు. ఆశాసనములలోని భాష యింతకంటె కొంచెము బాగుగ అర్థమగుచుండినపుడు ఈశాసన భాష ఇంత దురవబోధముగ నుండుటకుగూడ కారణ మరయవలసియున్నది. ఏమాత్రము నీభాష యర్థముకాని కారణముననో యేమో-బాగుగ జ్ఞాపకము లేదు-ఫ్లీటుదొరగారు ఈశాసనమును నమ్మరానిదానిగ దలంచియున్నారు. సంస్కృతమునకే యఖండగౌరవముండినట్టియు, దానలేఖ్యములను వ్రాయింపవలసి వచ్చిన సందర్భమున స్మృతిప్రమాణములను బట్టి రాజులు సీమానధులతోగూడ తామ్రశాసనములనెల్ల సంస్కృతముననే వ్రాయించుచుండినట్టియు నాకాలమున నీశాసనమున మూడు పెడల తెలుగు రచన ముండుట విడ్డూరమే. పదునొకండవ శతాబ్దినుండియే సీమావధులను వ్రాయుసందర్భమున తెలుగు విపులముగ వాడబడుచు వచ్చెను. ఇంతవరకు దొరకిన తామ్రశాసనములను బరిశీలించినచో క్రీస్తుశకము పదవశతాబ్దికి పూర్వము అసలు శాసనభాగముననే తెలుగున్న శాసన మిది యొక్కటే. ఈకారణములవలననో యేమో ఫ్లీటుదొరగారు దీనిని నమ్మరానిదానిగా దలచుట. ఒకవేళ చరిత్రవిషయకముగ నిది సరియైనశాసనము కాదని త్రోసివేసినను ఇందలి పదజాలమునకు సరియైన స్వరూపమేర్పడి అర్థవివరణమే కుదిరినచో నిది యాంధ్రభాషా కమూల్యాలంకారమనుటకు సందియము లేదు.

---

## సెలపాట

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు (కవితా సమితి)

౧

సందెపసపులనిగ్గు తేఁటప
సందు మొయిలు ముసుంగుసందున
సందడిలు బాలెంత కొండల
చలువఁ గీర్తింతుర్.

౨

చరులపాదిగిట మోము సుమమం
జరులు విరియఁగ నీటిముత్తెపు
సరులఁ బుడికిళ్లాడు పసిసెల
చనవు దీవింతుర్.

౩

పొదలమాటున రొదలపాటలు
పొదల దాఁగిలి మూఁతలను శశి
గదిమి నయ్యాటించు చిఱుసెల
కన్నె భావింతుర్.

౪

రంగదమృత తరంగయుత హృ
ద్రంగమున నవభావమాలా
రంగవల్లులఁ బెట్టు సెలజవ
రాలి వర్ణింతుర్.

౫

చల్ల చల్లని తలపు తెమ్మెరఁ
జల్లుమేసి విలాస సంపద
జల్లు గాఁగ నటించి చనుసెల
చాను వర్ణింతుర్.

౬

అమల నూతనరాగ చిహ్నము
లమర మంజిమ యౌవనప్రభా
రమన నడుగిడు సెలపొలంతుక
రకము వర్ణింతుర్.

౭

సానునయన ర్తనము రాగర
సానుభూతియుఁ జాటు చరితము
సానువుల లిఖియించికొను సెల
చాన నుతియింతుర్.

౮

మానమున నొదుదుడుకులకు నను
మాన మందక, ప్రియునికై పవ
మాన వేగముతోడఁ జను సెల
మగువ నుతియింతుర్.

౯

బిరబిరం జని ప్రియుని కౌఁగిట
విరిసి కరఁగి తదీయవీచుల
విరతిఁ జెందెడు సెలపడంతుక
ప్రేమ దీవింతుర్.

---

# ఆంధ్ర నాటకరంగము

శ్రీయుత దేవులపల్లి
వెంకట లక్ష్మీనరసింహారావు గారు

ఆంధ్రమున రసాత్మకము లయిన నాటకములు నిజముగా కడు కొద్దిగా నున్నవి. చక్కని, మంచినాటకములు—ప్రదర్శనయోగ్యములయిన నాటకము లింకను వ్రాయబడవల



శ్రీయుత దేవులపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు

యును. నాటకములును, నాటక ప్రయోగములును గూడ నాంధ్రమునందు ఒకకొంతవరకు పెరిగి పిమ్మట అభివృద్ధి గాంచలేక 'గిడస' బారినరీతి, మడగుజ్జువాని శరీరమువలె నయిపోయినవి. అయినను ఇపుడున్న నాటకములలో కథానైజముచేతనే రసపూరితములయిన రంగములుగలవి కొన్ని కలవు. అట్టి వుండుట బట్టియే ఆనాటకప్రదర్శనము లెంతపాడువారుచున్నను భావనచేత ప్రేక్షకులు నటులు తెచ్చిపెట్టిన కొరంతలేకుండ జేసికొనగలుగుచున్నారు. అందువలన కొన్ని నాటకము లెన్ని సారులు ప్రయోగించినను, ఎట్టినటులాడినను రసవిహీనములయి పాడువారుటలేదు. చిత్రనళీయమున బాహుకుని వియోగ సంతాపమును, సారంగధరనాటకమునందు చిత్రాంగి మనోవేదనయు, హరిశ్చంద్రుని కథయందు ఆపదచ్యుత సార్వభౌముని దుఃఖార్తులును, రామదాసునందు గోపన్నగారి భక్తిపారవశ్యమును, అమాయకపు విశ్వాసమును ఆంధ్రుల రక్తనాళములందు రక్తముతోపాటు జీర్ణించిపోయి ప్రవహించుచున్నవి. ఇంకను ఇట్టియుదాహరణము లెన్నియేని యీయావచ్చును.

తాను ధరించుపాత్రను అనుభవముచే తెలుసుకొని యందు లీనమైపోయి తన్మయత్వమునటించు భావనామూర్తియు, అనుభవజ్ఞుడ నగువాడే నిజమయిన నటు డనిపించుకొనును. అనుభవ, భావనలలో నేది లోపించినను నటుని అభినయము, నటన పరిపూర్ణత్వమును పొందనేరవు. నటుడు తన జీవితమునం దనుభవించిన కష్టసుఖముల యనుభవసారమైన రసములను మాత్రమే భావనాప్రజ్ఞచేత నినుమడింపజేసి ప్రదర్శింపగలడు. కావున ప్రతినాట్యజీవియు అన్ని రసములను ప్రకటింపజాలడు. అన్ని రసములను సమముగా ప్రక

టింపజాలిన నటు లెవ్వరయిన రసమూర్తులు ఒక రిద్ద రెక్కడయిన నుండవచ్చును. అట్టి వారు మహాప్రతిభాశాలురు. వారి జీవితము కేవలము రసాత్మక మైనదిగా నుండును. సాధారణముగా ప్రతినటుడును తనప్రకృతికి సహజము లయిన రసములనే బాగుగా నటింపగలడు.



బాహుకుడు
"ఆహా! దమయంతీ! నీ నలు నిట్లు పరిభవింతువే!"

ఈ కాలపు నటులలో మనము సాధారణముగా జూచు నాటకములలో చిత్రనళీయము నందు నలునిపాత్రమును కడునేర్పుతో నించుమించుగా సమానముగా నిర్వహించిన నటులనేకులను గాంచితిని. కాని, బాహుకపాత్రముతో సంపూర్ణముగా నైక్యమయిపోయి ప్రదర్శించిన నటులలో శ్రీయుత దేవులపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారివంటి నటులను ఇంకొకరిని గాంచియుండలేదు. బాహుకుడు వీరియందు మూర్తీభవించినట్లుండును. వీ రా పాత్రకు ఒప్పినట్లు ఒరు లొప్పి యుండలేదు. కేవలము అనుభవైకవేద్యము లయిన రసభావములను, ప్రియభార్యావియోగము వలనను, ఆమె కపట ద్వితీయస్వయంవరవార్త వినుట వలనను, అసలే క్రుంగిపోయిన జీవితము సంతాపవహ్నిచే రగులుకొనిపోవుచున్న హృదయభారమువల్లను జనించు దురంత దుఃఖ భావ తరంగములను భావనామూర్తు లయిన నరసింహారావుగారు అత్యద్భుతముగా నటింతురు. బాహుకవేషము వీరిసొమ్ము. వీరి ప్రకృతిలో బాహుకుని నిర్వేదము, దైన్యము, బహుత్తరవిధి యిమిడియున్నవి కాబోలు!

నరసింహారావుగారియందు రామదాసు పాత్రము గూడ రసస్ఫూర్తి జెందియుండును. నామిత్రులు సూరిశాస్త్రిగారు రామదాసుని గూర్చి వ్యాఖ్యానము చేయుచు వ్రాసిన యంశములు వీరి నటనయందు మూర్తీభవించి యుండును. నరసింహారావుగారి రామదాసునకు రాముడు కంటె కగపడును. వారి భక్తిస్వభావములో బాలకచేష్ట లగుపడును. రాముని తనతో ఆడుకొను సైదోడువలె, తమ్మునివలె, ముద్దులమఱదివలె, గొప్ప గుణరాశివలె, సకల సద్గుణసంపన్నుడగు స్నేహితునివలె భావించి, భక్తిపారవశ్యముతో ధ్యానము

చేయుచు రామదాసునడకల నడతురు. వీరు



రామదాసు

"ఆ! రామా! వచ్చితివా! కరుణకల్గెనా!......"

మొదటినుండియు రాముని వశపరచుకొను చిత్తవృత్తి నగుపరుచుచు నడుమ నడుమ భక్తిభావపరంపరలతేలి యాడుచు, అపుడపుడు దుర్భరదుఃఖాతిశయముచే కలిగిన నాస్తికపుట విశ్వాసమును గనబఱచుచు తుదకు మనోవీథియందు రామసాక్షాత్కారము కలిగినపుడు జనించు ఆనందమును మహాద్భుతముగ జూపగలరు. భక్తిపరవశులయి అడుగడుగునకు రామనామసంకీర్తనముజేయుచు నటించునపుడు వీరిని జూచినవారు రామదాసుయొక్క అపరావతారమా యని భ్రమింతురు.

నరసింహారావుగారు ప్రతిబింబింపజేయు పాత్రలలో నూతనమైనది నందసామ్రాజ్య వినాశకుడైన చాణక్యునిది. ఈపాత్ర నిదివరకెవ్వరును ప్రదర్శించియుండలేదు.(?) చాణక్యుడుమహాప్రతిభాశాలి; ప్రతిహింసాపరాయణుడు; బ్రాహ్మణాభిమాని; బ్రాహ్మణోత్తముడు; చంద్రగుప్తునిచేత మౌర్యసామ్రాజ్యము స్థాపింపజేసి యేలించిన ఆచార్యుడు; ఒకసారి బ్రాహ్మణప్రభావము సకల భారతవర్షమునకును కన్నులకు మిరుమిట్లు గొలుపునట్లుచేసిన



చాణక్యుడు

"ఒక నాఁడీ భిక్షుకునిపాదములపై బడి ప్రాణభిక్ష పెట్టుమని ప్రార్థించెదవు! నేను నీ కాభిక్ష పెట్టను......"

అసాధారణప్రజ్ఞాన్వితుడు. కపిలుని తేజమును, భార్గవుని క్షాత్రమును, అగస్త్యుని మహాసామర్థ్యమును చాణక్య మంత్రియందు మూర్తీభవించియున్నవి. అట్టిచాణక్యుని నరసింహారావుగారు ప్రదర్శించునపుడు చూపఱులకు భయవిషాదసంభ్రమములు ఒక్కసారిగా కలుగుచుండును. వీరి చాణక్యపాత్రను ఆంధ్రలోకము ఇంకను బాగుగా నెఱుఁగదు. సహజముగ వీరు డాంబికవేషధారులు గాకపోవుటచేత పెక్కుమంది వీరి నెఱుఁగరు. మారుమూలల దాగియున్నను నరసింహారావుగారి నటనాసామర్థ్యము ఎప్పటికైనను వెల్లడి కాకపోదు. వీరి బాహుకుని వేదనయందు గల నిస్పృహతకును, రామదాసునందు గన్పట్టు అమాయకపు భక్తివిశ్వాసములకును, చాణక్యుని జీవితమునం దంతర్వాహినియై ప్రవహించు తీవ్ర మనఃక్షోభమునకును ఏదోయొక అపూర్వసంబంధ ముండవలయును. లేకున్న ఈమూడు ప్రవృత్తులును నరసింహారావుగారియందు మూర్తీభవించియుండుట పొసగియుండదు. ఆప్రకృతి యేదో—గ్రహింప వీలులేనిది—నరసింహారావుగారి పాత్రధారణకు వన్నె దెచ్చుచున్నది.

[భావరాజు వెంకటకృష్ణరావు]

---

# సౌందర్యలహరి

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

అరయఁగ నిన్నుఁ గూడిన నజాండముఁ గల్పన సేయఁ జాలు నీ
శ్వరుఁ డటు గానిచోఁ గదలఁ జాలఁడుగా నడుగైనఁ దల్లిరో!
హరిహరపద్మసంభవముఖామరసేవిత మా భవత్పదాం
బురుహము లంటఁగా నకృతపుణ్యుఁడ నేగతి నేర్చువాఁడనో!

ఎంచఁగ నీదుపాదరజ మించుక దాగ్రహియించి మించి ని
ర్మించుచు నున్నవాఁ డల విరించి జగంబుల నెల్ల విష్ణుఁ డ
భ్యంచితలీల మస్తకసహస్రముపై ధరియించుదాని న
ప్పంచశరారి దేహమున భస్మము లీల నలందు దానినే!

పోషితభక్తులై యభయముద్రలు దేవత లెల్లఁ దాల్తు రే
వేషముఁ దాల్ప పీవు సరివిన్ జగదండము లెల్లవేళలన్
బోషణ సేయుచుండు, వరముల్ దగఁ గోర్కెకు మీర నిచ్చి సం
తోషముఁ గొల్పు నీదు పదతోయజముల్ నతులైనవారికిన్.

నతజనభాగ్యదాయిని, మనంబున నిన్నుఁ దలంచి స్త్రీత్వ మం
చితగతిఁ దాల్చి మోహితునిఁ జేసె పురారినిగూడ కేశవుం
డతివ, నినున్ స్మరించియె సమంచితరూపముఁ గల్గి సన్మని
ప్రతతిమనంబులన్ గలఁచి వైచుచు నుండె మరుం డవార్యుఁ డై.

విరు లవి విల్లు, నారి యళిబృందము, బాణము లైదు, మంత్రి శే
ఖరుఁడు వసంతుఁ, డా మృదులగంధసమీరణుఁడే రథంబు, తా
నరుదుగ వీనిఁ దాల్చి యొకఁ డయ్యు జగంబుల గెల్చుచుండె శం
బరరిపుఁ డద్రిజా, భవదపాంగకృపాఘటితప్రతాపుఁ డై.

కరికలభోరుకుంభకుచ గాఢభరానత, పూర్ణచంద్రసుం
దరముఖి, క్షీణమధ్య, క్వణదంచితకాంచనకాంచి యాచుఁ దాఁ
గరధృతచాపపాశసృణికాండవితానయు నై దయార్ద్రి యై
పురహరురాణి నాకనులముందటఁ దానటియించుఁగావుతన్.

అల్లసుధాబ్ధిమధ్యమున నాసురసాలవనాంతసీమ రం
జిల్లెడు రత్నద్వీపమున (?) నీపవనావృత రత్నసౌధమం
దల్లశివాఖ్యఖట్వమున నాపరమేశు శుభాంకమందు భా
సిల్లెడు నీచిదాకృతి భజింతురు కొందఱు ధన్యు లిద్ధరన్.

---

# జన్మశాసనము - పీఠిక

[న్యాయమూర్తులు శ్రీ వేపా రామేశంపంతులుగారు 'జన్మశాసనము' అను గ్రంథమునకు వ్రాసిన పీఠిక.]

సంతాన నిరోధమునుగూర్చి డాక్టరు యన్. కె. వసు వంగభాషలో రచించిన గ్రంథమున కిది ఆంధ్రానువాదము. దీని పేరు 'జన్మశాసనము'. 'జన్మ' అనగా జననము. శాసనము అను పదము వివిధార్థములు గల యొక సంస్కృతపదము. అది సందర్భమును బట్టి 'ఆజ్ఞ', 'సంయమము', 'లోహశిలాదికములపై చెక్కబడు శాసనములు' అను అర్థముల నిచ్చును. ఇచ్చట ఈశబ్దము 'జననసంయమము' అను అర్థమున వాడబడెను. మన యనువాదకర్త యీపదమునకు తుల్యమగు నర్థము నిచ్చు 'సంతాన నిరోధము' అను శీర్షికగూడ వాడియున్నారు. ఇది సంతాననిరోధమును గూర్చి వ్రాయబడిన తొమ్మిది ప్రకరణములు గల సంపూర్ణ శాస్త్రీయగ్రంథము. ప్రథమాధ్యాయము సంతాననిరోధావసరములను దెలియఁజేయును. ఇందు ఆదాయము ననుసరించి మధ్యతరగతి కుటుంబములో నుండవగిన బిడ్డల సంఖ్యను దెల్పుపట్టీ చూపఁబడెను. సామాన్యజీవనాధారములు గలిగిన మధ్యతరగతివారు ఋణగ్రస్తులై దాని బారినుండి యెన్నటికిని తప్పించుకొననేరక యెట్లు అగచాట్లు పడుచున్నదియుఁ జూపుటకు విపులముగ నుదాహరణము లీయఁబడినవి. హిందూకుటుంబమునకు వచ్చు ఆదాయము —అవసరములు నిరూపింపఁబడినవి. మఱియొక భాగము తల్లి యారోగ్యమునుగూర్చి తెలుపుచున్నది. ద్వితీయాధ్యాయము సంతానోత్పత్తి ధర్మముల వివరించుచున్నది. మూఁడు మొదలు ఏడవఱకుఁగల అధ్యాయములు సంతాననిరోధమునకు అనేక పద్ధతులనుబోధించుచున్నవి. వీనిలో యంత్రపద్ధతులు, ఔషధపద్ధతులు, అన్యపద్ధతులు గలవు. అష్టమాధ్యాయము సంతాన నిరోధమునకు ప్రతికూలురచేఁ గల్పింపఁబడిన అవరోధములఁ జర్చించుచున్నది. నవమాధ్యాయము సంతాన నిరోధోద్యమ చరిత్రమును దెలుపుచున్నది. పుస్తకములోని ముఖ్యభాగము సంతాన నిరోధపద్ధతులను దెలుపునదియే. శస్త్రవిధానమేకాక పూర్వపుహిందూ తాంత్రిక ఆయుర్వేద విధానములు కూడ వ్రాయఁబడియున్నవి. వానిగుఱించి గ్రంథకర్త సందేహముతో తన యభిప్రాయము వెల్లడించుచు నవీనశాస్త్ర గ్రంథములలోని పద్ధతులను బాగుగా తర్కించియున్నాఁడు. అవి సర్వజనులకు ఆచరణసాధ్యములై ప్రతివారికి అత్యంతోపయోగముగ నెంచఁబడుచున్నవి. మన అనువాదకర్త అతి జాగరూకతతో తనవిధిని నిర్వహించి యున్నాఁడు. అనువాదకర్త భాషాంతరీకరింప వలసిన బాధ్యతను గలిగియుండుటలో సందియము లేదు. ఈపుస్తకము చదువునప్పుడు కొన్నివిషయములు అనువాదకుఁడు స్వతంత్రముగ నొక గ్రంథమును రచించిన బాగుగా నుండెడి దనితోఁచినది. కాని అనువాదకర్తకు ఈవిషయమున సమగ్రమగు గ్రంథపరిశోధన లేదు. ఈయనకు సమగ్రమగు ఆంగ్లభాషా పరిచయము లేదు. వంగభాషాపరిచయము ఎక్కువగా నుండుటచే ఈపుస్తకము వెలువడుటకుఁ గారణమైనది. వీరత్యుత్సాహముతో ఈభారమును వహించి యీకార్యము నెఱవేర్చినందులకెంతయు నభినందన పాత్రులు. పుస్తకములోని విషయములఁగూర్చి యెక్కువగా వ్రాయవలసిన యగత్యము లేదు. గాని యిట్టిపుస్తకమునకు పీఠిక వ్రాయుటలో ఈయుద్యమమును గూర్చి కొన్ని యభిప్రాయముల నిచ్చుట నాకర్తవ్యమని మీరు తలంపవచ్చును.

'డాసన్ ప్రభువు' చెప్పినట్లుగ ఈయుద్యమ ప్రతికూలురు ఏమి చెప్పినను, చేసినను, ఈయుద్యమము నశించునది కాదు. 'బక్‌మాష్టరు ప్రభువు' 28-4-1926 వ తేదీని ప్రభువులసభలో నిట్లుపన్యసించెను: "మానవుఁడు కాంతి

కొఱకల్లెడల నన్వేషించుటయు, నన్నియెడల నాశాభంగము నొందుటయు జీవితములోని బాధలలో నొక్కటైయున్నది. ఒకస్థానము నాక్రమించిన వెంటనే మఱియొకస్థానము నన్వేషింపవలసిన యవసరము గలుగుచున్నది. నిరంతరము తారుమారగుచుండెడి పరిస్థితులను జీవితమును అనుసరించి పోవుచుండుటయే అభివృద్ధికి సాధనము." ఆయన నివేదికను సంతాననిరోధ సమస్య బలపఱచుచున్నదని చెప్పెను. "ఏబదేండ్లకు పూర్వమది క్రొత్త. దాని ననుసరించినప్రజలు నేరస్థులుగ భావింపఁబడి శిక్షార్హులగుచుండెడివారు. అందుచే ప్రజలు భీతిలిరి. భాగ్యవంతులచేఁ బొందఁబడి యనుభవింపఁబడు విజ్ఞానమును బీదలకు లేకుండఁ జేయుటకు చర్య తీసికొనుటయూ యనువిషయము వివాదాంశము."

భారతదేశదురదృష్టవశమున ప్రభువరుని అంత్యవాక్యములు ఐరోపా ఆఫ్రికా ఖండముల విషయమై నిజమైనను భారతదేశ విషయమున కాదు. ఇచ్చట విజ్ఞానము భాగ్యవంతులకును, బీదలకును సున్నయే. బీదల విషయమై ఆలోచించినచో ఇతర దేశములవలెనే యిచటను పెక్కు ఇడుములఁ గుడుచుచున్నారు. వీరిలో సంఖ్యాభివృద్ధియేకాని గుణాభివృద్ధి లేకపోవుటచే బాధలపాల్పడుచున్నారు. "అన్నాతురులై కాయకష్టముచేసి జీవించువారి సంఖ్యను ధనాధిపుడు మిత్రవర్గముగఁ జేసికొను" నని స్యాంగరు సతి యొకానొక గ్రంథమున వ్రాసెను. సంతాననిరోధోద్యమమునకు వ్యతిరేకముగ నుండుట 'కారల్ మార్క్' యొక్కయు, అతని ప్రప్రథమపు అనుయాయులయొక్కయు గొప్పపొరఁబాటని యిప్పు డనుభవపూర్వకముగ గుర్తింపఁబడెను. సాంఘికతత్త్వము సంతాననిరోధోద్యమముతో సమ్మేళనము చేయఁబడిననేకాని మానవజీవితసమస్యలు పరిష్కరింపఁ బడనేరవు. నా మిత్రుఁడు దివానుబహద్దరు రంగాచారి యరుగారు ఆస్ట్రేలియానుండి తిరిగి వచ్చినపుడు ఆ దేశములోని ఆర్థికౌన్నత్యమును గూర్చి ఆసక్తితో విపులముగ నుపన్యసించుచుండెడివారు. కాని శ్రోతల కచటి ఆర్థికౌన్నత్యమునకు నిజకారణమును విశదీకరింపలేదు. ఆకారణ మెద్దియన, చదరపు మైలున కొక్కఁ డున్నను అచట సంతాన నిరోధము ప్రజలచే అవలంబింపఁ బడుచుండుటయే.

భారతదేశమున మనము పరిష్కరింపవలసిన సమస్యలు రెండు గలవు: అందొకటి జనసామాన్యమును పైకిఁ దీసికొనివచ్చుట, మఱియొకటి కొన్నితరగతుల వారికి సంతాననిరోధ విషయమున శిక్ష గఱపుట. బహువిస్తీర్ణమై 32 కోట్ల జనసంఖ్యను గలిగిన భారతదేశమున బొంబాయి కలకత్తాలయం దున్న రెండు మాల్తూజియను సంఘములు సరియగు పని చేయుటకుఁజాలవు. జనసంఖ్యలో ప్రపంచమున చీనాతర్వాత భారతదేశ మున్నతస్థాన మాక్రమించుకొను చున్నది. యుద్ధానంతరమున నిరుద్యోగ సమస్య భారతదేశమున విపరీతముగఁ బెరిఁగి పోయెను. నిష్పక్షపాత బుద్ధితో విచారించిన ప్రతివారికి నిర్లక్ష్యముగ సంతానాభివృద్ధి చేయుటయే ప్రస్తుత కలకత్తలకుఁ గారణమని తోఁపకపోదు. జీవితాందోళనము నేఁడు తీవ్రమైనది. రాజకీయ నాయకులును, తదితరమగు నుద్యమ నాయకులును దీనికి ముఖ్యకారణము మితిమించిన జనాభివృద్ధి యని గమనింపక అన్యమగు సాకులను జెప్పి భ్రమించుచున్నారు. 'కార్సు ఆండర్సు' అను నాయన 'జనసంఖ్య' అను పుస్తకమున వ్రాసినటులు, ప్రతి దేశమందును నాగరికత యేదో యొకస్థితియం దున్నపుడు తదనుసరణముగ జనసంఖ్య పరిమితమై యుండవలెను సర్వకాల సర్వావస్థల యందును ప్రతిదేశము ఒకేపరిమితి సంఖ్యను పోషింపఁగలుగునని దీనియర్థము కాదు. అట్లనుకొనుట తప్పు. కార్సు ఆండర్సు అట్టి నేరమునకు గురియగుట లేదు. ప్రతి దేశముకూడ నభివృద్ధినొందుచున్నపుడు ప్రతి యవస్థయందును పరిమితిగల సంఖ్య మాత్రమే సౌఖ్యము నిచ్చుచు పోషింపఁగల్గును. పరిమిత జనసంఖ్యకును, నాగరికతకును అత్యంత సంబంధము గలదు. ఆదృష్టితోఁ జూచినయెడల ప్రస్తుతము చెన్నరాజధాని చ. మై. 298 గురును పోషింపఁ జాలదని తోఁచుచున్నది. ఈరాష్ట్రములో గంజాము, విశాఖపట్టణము గోదావరిమండలములలోని నిస్సారమగు భూములుగల యేజన్సీ ప్రదేశములును, నెల్లూరు దత్తమండలములలోని కొండప్రదేశములును చేరియున్న వని తెలిసికొనినప్పుడు కొన్ని భాగములందు పూర్తిగా మితిమించిన జనసంఖ్య యున్నదని కనుఁగొందుము. తంజావూరు చ. మై. 625;

దక్షిణార్కాటు చ. మై. 550; మలబారు చ. మై. 525; మద్రాసు, చెంగల్పట్టు, వేలూరు, దక్షిణార్కాటు, తంజావూరు, రామనాథపురము, మధుర, తిరునెల్వేలి, మలబారు మండలములను విచారించిన గ్రేటుబ్రిటనువలె చ. మై. సగటున 482 జనసంఖ్య తేలినది. ప్రస్తుత రాజకీయ ఆర్థిక పారిశ్రామిక పరిస్థితులలో జనసంఖ్యలో గ్రేటుబ్రిటనునకు సమానముగ నుండుటకు మద్రాసు రాజధానికి అర్హతకలదా? అనుప్రశ్న ముదయించును. కాని, గ్రేటుబ్రిటనువిషయము వేరని మనము గుర్తెఱుంగ నగును. ఇంగ్లండునందును, వేల్సునందును చ. మై. 649 జనసంఖ్య. ఇంత జనసంఖ్యగల ప్రదేశము మఱియొకటి లేదు. బెల్జియము, శాక్జని యెక్కువ జనసంఖ్య కలిగియున్న ప్పటికిని విస్తీర్ణమునందు మిక్కిలి చిన్నవి. అంత జనసంఖ్య గూ యితర నాగరిక దేశములలోను లేదు. అమెరికా సంయుక్తరాష్ట్రములు చ. మై. 35 మాత్రమే. అది నూతనముగా కనిపెట్టఁ బడినదియు పూర్తిగా అభివృద్ధి నొందనట్టిదియు నగు దేశము అగుటవలన ఇంకను ఎక్కుడు జనసంఖ్యను గలిగియుండుటకు వసతులు గలవు. కాని డెన్మార్కులో చ. మై. 204, ఫ్రాన్సులో చ. మై. 184 అయినప్పుడు దక్షిణ హిందూదేశమునందు చ. మై. 482 జనసంఖ్య యేల యుండవలెను? విశ్వవిద్యాలయముల నుండి వచ్చి యుద్యోగములకై వెనఁగులాడు పట్టభద్రుల సంఖ్యను, దానివలనఁ గల్గుచున్న సహింపరాని కులకత్తులను మనము గమనించినచోఁ గనీసము మధ్యతరగతుల యందైనను ఈసంఖ్యను ఎట్లు తగ్గింపవలయు నను నదియే యవసర సమస్య. పక్షపాతముతోఁ గాక న్యాయముగ నాలోచించిన సంతాన నిరోధోద్యమమును శాస్త్రీయముగ నెవ్వరు నెదిరింపఁజాలరు. ఈయుద్యమము ప్రపంచమునునున్న ప్రతిభాశాలు లగుశాస్త్రజ్ఞుల యామోదముఁ బడసినది. దీనియందుఁ గలిగిన పక్షపాతము రెండువిధములు. ఒకటి సామ్రాజ్యతత్వము లేక సైనికము. మఱియొక మతము రాఁబోవుయుద్ధమునకు సైనికులను సిద్ధము చేయుటకై కుతూహలపడు రాజకీయ ధురంధరులు, సంతాన నిరోధోద్యమము నరికట్టిన ఫ్రెంచిగవర్నమెంటు చర్యయు, ప్రభువులసభలో 'మార్క్వెస్ ఆఫ్ సాలిస్బరి' యిచ్చిన యుపన్యాసము దీనికి తార్కాణములు. కాని హిందూదేశమునందలి క్షాత్రజాతులు కొన్నిమాత్రమే యీవిషయ మాలోచింపఁదగును. హిందూదేశరక్షణ విషయమై తదన్యుల కెట్టి సంబంధమును లేదు. మిక్కిలి ఐరోపాసంగ్రామము జరుగనున్న వారికైతే హిందూదేశమునకు ప్రస్తుత మంత యవసరము లేదు. ఈవిషయమున మతసంబంధమగు పక్షపాతము గలవారు రోమనుకాథలిక్కులు. ఈపక్షపాతమువలన మూఢవిశ్వాసము ఎక్కువగ వృద్ధి యగు ననుటకు ప్రభువులసభలో నైకౌంటు ఫిట్జు ఆలెన్ ప్రభువు ఇచ్చినయుపన్యాసమే తార్కాణము. దీనితోఁపాటు తదితర ప్రభువుల యుపన్యాసములు చదివిన నెంతయో విచారకరమగు దృశ్యము కాననగును. ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్బరిగారి యుపన్యాసమును తిలకించినచో ఈమతసంబంధమగు పక్షపాతము కొంచెము తక్కువగను, సహేతుకముగను ఉన్నట్లును గనఁబడును. కాని వారి నిస్సారమగు వాదములు వారికిముం దుపన్యసించిన బక్మాస్టరు ప్రభువుగారును వారికి తర్వాత నుపన్యసించిన బాల్ఫరు ప్రభువుగారును ఖండించిరి. ఎచట నీ రెండువిధములగు పక్షపాతములు లేవో అచట సంతాన నిరోధమున కభ్యంతరము నుండకూడదు; ఉండఁదగదు. నూతన సమస్యలకు అభ్యంతరపెట్టు సాధారణప్రజలయొక్క పక్షపాతమును, మంచిబుద్ధితో గలిగిన పాక్షికాభిప్రాయమును నేను లక్ష్యపెట్టనవసరము లేదు. ఈపక్షపాతము జ్ఞానముచేతను, తర్కముచేతను పటాపంచ లగును. ఈచిన్న శాస్త్రీయ జ్ఞానము లక్షలకొలది వెసఁజల్లు ననునాశతోను, మానవాభివృద్ధికై లోకప్రసిద్ధమైన ఈనవీనోద్యమమును ఆంధ్రులు ఆదరించుటలో ముందంజ వేయుదు రను నుద్దేశ్యముతోను నాయాంధ్రసోదరులు ఈపుస్తకమును చదువవలెనని హెచ్చరించుచున్నాను.

---

# పునర్విమర్శనములు

## కొన్ని సందేహములు

ప్రాచీనాంధ్ర శాసనములయందు పూర్వపండితులకు దురవగాహమైన వానిని శోధించి, నూతనాంశములను బయలుపఱచుచు, వ్యాఖ్యానసహితములుగ బ్రచురించుచు పరిశోధకపండితబృందమునే కాక ఆంధ్రలోకమునంతటిని శ్రీప్రభాకరశాస్త్రిగారు తుష్టినంద జేయుచున్నారు. అయినను వారు వ్రాసినవిషయములలో సంశయాస్పదములు పెక్కులు గలవు. అందు ముఖ్యమైన వానిని ఇచ్చట బొందుపఱచుచున్నాను. వాని విషయమై శాస్త్రులుగారికిని నాకును కొంతచర్చ జరిగినది. నా సందేహములు నివృత్తి కాకపోటచేతను, ఇట్టి సందేహములే కలిగినవారితరులు గలరేని, వారి యుపయోగముకొఱకును, నాసందేహములను భారతికి నివేదించుకొనుచున్నాను.

౧. నాగబు:—దీనినిగురించి ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు: "ఈ యక్షరము లించుమించు క్రీ. త. ౨ వ శతాబ్దినాటి బ్రాహ్మిలిపి యక్షరములు. పైశాసనమును బ్రకటించిన రమాప్రసాదచందా గారు దీని నింగ్లీషులో 'Naga-bu' అని ప్రకటించిరి. వారు 'నాగ' వేఱుపదముగాను, 'బు' వేఱుపదముగాను, 'నాగబు' సమస్తపదముగాను దలచి యట్లు వ్రాసిరి. దానిని వారు శిల్పకారునిపేరు గావచ్చు ననిరి. అది పాళీభాషాపద మనియే వారు తలచియుందురు. నేను చూచినంతలో పాళిభాషలో నిట్టిపదము కానరాలేదు. ఇది తెలుగు ప్రత్యయాంతమైన తత్సమపదమని నాతలంపు. నాగబు అనగా నాగంబు, పాము అని యర్థము. విరుగగొట్టబడిన మీదిశిల్పచిత్రము గొప్పసర్పమై యుండును."*

ఇందు గమనింపదగిన విషయములు కొన్నిగలవు. చందాగారు తలచినట్లు శిల్పిపేరును దెల్పునామపదమే యైన పక్షమున, అది యీభాషకు సంబంధించిన పదమని చెప్పుటకు వీలుకాదు. అట్లుగాక శాస్త్రిగారి మతము ప్రకారము నాగంబు ఆయెనా అది తప్పక తెలుగే కావలయును. "ఇంచుమించు రెండువేలేండ్ల క్రింద తెలుగు" ఉండెనా? ఈవిషయమును నిర్ధారణ సేయుటకు "నాగబు" సాధకము కానేరదు. ఏలన, "నాగబు" తెనుగా యని శంకించిరేకదా ః ప్పుడు తెను గుండెనా యని ప్రశ్న వేసికొంటిమి. కావున వేరు ఉదాహరణములవల్ల రెండువేలేండ్లక్రింద తెను గుండెనని నిర్ధారణ చేసినగాని, నాగబు తెలు గను వాదమునకు పుష్టి కలుగదు.

పోనీ, పాముబొమ్మ యైన నుండి దానిక్రింద ఈ "నాగబు" వ్రాయబడియున్న, శాస్త్రిగారి వాదము నంగీకరింపవచ్చును. సర్పచిత్రము మృగ్యము. అట్టిచిత్రమొకప్పు డుండెనని యనుమానించుటకుగూడ వీలు లేదు. మనదేశమున సర్పప్రతిమలక్రింద "నాగ"మనికాని, "పా"మనికాని వ్రాయునాచారముండిన ఈ "నాగబు" పైన సర్పప్రతిమ యుండెనని యూహించుట కవకాశ ముండెడిది. వేనవేలు సర్పప్రతిమలను జూచియున్నాము గాని ఇంకను క్రింద పాముని వ్రాయబడియుండు శిల్పమును చూడలేదు. అట్టి యుదాహరణములను కొన్నింటిని చూపించినగాని ఈ "నాగబు"పై సర్పచిత్ర ముండెనని నమ్ముటకు వీలు లేదు. అయితే శాస్త్రులవా రొకసామ్యమును జూపిరి. అమరావతీస్తూపములలో ననేకములగు చిత్రములక్రింద పేర్లు కలవు. ఇదియును అట్టిదేకదా? కాదు: అవి జాతకకథలయొక్కయు, బుద్ధలీలలయొక్కయు చిత్రములు. కావున వానిక్రింద పేరు వ్రాయుట యవసరము. అమరావతీస్తూపమున సర్పచిత్రము లెన్నియేని ము కలవు. ఎచ్చటను 'నాగబు' అనుమాట కానరాదు. ఏమియు లేని "నాగబు" అనుమాటపై సర్పప్రతిమ యుండెనని యూహించుట వింతగదా!

౨. అహదనకరశాసనమున శ్రీశాస్త్రిగారు అనేక నూతనాంశములను వ్యక్తపఱచియున్నారు. ఇచ్చట మొ

* భారతి, సంపు. ౫, పుట ౯౩౮.

దట చెప్పనలచిన దేమనగా, శ్రీశాస్త్రిగారు శాసన భాషను తమ యిచ్చవచ్చినట్లు సంస్కరించియున్నారు. శాసనపాఠమునకును, వీరిపాఠమునకును పెక్కుస్థలముల యందు సంబంధ మున్నట్లగపడదు. ఈశాసనము ౨౧-వ పంక్తి కడపటిభాగమును శాస్త్రులవా రిట్లు చదివియున్నారు: "రెణ్డువషల ఏలేమువరు లేములు" అని. శాసనమున నెట్లున్న దనగా, "రెణ్డువషలఎ లేవునరు లేములు"అని. ఇందు ముఖ్యముగ గమనింపవలసినది శాసనములోని "వు" అను నక్షరమును "ము" అని చదువుట. "లేములచే" అనుదానిలో "ము" ను పైయక్షరముతో బోల్చిన ఇవి రెండును ఒకేయక్షరము కాదనుట స్పష్టము కాగలదు. ఈతామ్రశాసనమున పెక్కు "ము" లు కలవు. అం దొక్కటియు దీనిని పోలకుండుటయు, అన్ని "ము" లొక్కతీరుననుండుటయు చిత్రముగదా! శాస్త్రిగా రట్లు చదువుటకు గత మేమో? "ము" అని చదువకున్న అర్థము కుదుర దనియా? అట్లగుచో, మనకు అర్థముకాని యపూర్వపదములను మనచిత్తానుసారము మార్చి చదువుకొని చేత నయిన ట్లర్థము జెప్పవలసినదేనా? ఈమార్గము నవలంబించిన ఏపదమున కేయర్థమును జెప్పుకొనరాదు?

"లేముల" అనుచో "లే" తప్పుగా బడినది; తొలగింపవలసినది. ఏలనగా, ఈపదమే తర్వాతిబంతిలో మరల వచ్చుచున్నది. అందు "ముళ" యనియే కలదు. తర్వాతి బంతి శాసనమున నిట్లున్నది:

"సినదియు చన్నువిరిపయి నాడు వరగళిన ఎళె ముళచేసిన నేయుడు." ౨౧ వ బంతిలోని "లేముల" అనునదియు, ౨౨ వ బంతిలోని "ముళ" అనునదియును ఒక్కటేపదమని మొదట నిర్ధారణచేసినగాని "లే తప్పుగా పడినది; తొలగింప వలసినది" అని చెప్పుటకు వీలులేదు. ఇవి రెండును వేర్వేరు పదము లేల కారాదు. కావనుటకు నిదర్శనము లెవ్వియేనియు కలవా? అట్టి నిదర్శనములు లేకున్నచో, ఆరెండుపదము లొక్కటియే యని తలచి సంస్కరింప బూనుకొనుట సాహసము. మఱియు ౨౨ వ బంతిలోని "ముళ" కు ముందొక "శే" కలదు. ఈ "శే" ప్రభాకరశాస్త్రిగారిచే పూర్వాక్షరముతో జేర్పబడుటచే "ముళ" యనుపద ముత్పత్తి యైనది. ఒకవేళ ౨౨ వ బంతిలోని పదము "శేముళ" అగునేమో, అట్లగునేని ౨౧ వ బంతిలోని "లేముల" లోని "లే" తప్పని తొలగింపవలసిన యవసర ముండదు గదా. ఇంతటికిని భాష పురాతనమైనది. మాటలకర్థము మనకాలపువారికి దెలియదు. మనపురాతన గ్రంథములు పండితులచే మరలమరల సంస్కరింపబడి "అప్టుడేటు"గా జేయబడినవి. అవి ప్రథమమున వ్రాయబడినట్లే యిప్పు డున్నవని చెప్ప శక్యముగాదు. శాసనభాష పూర్వకాలమున వాడుకలో నుండిన భాష. పదముల స్వరూపము నిర్ధారణచేసి యర్థము చెప్పునప్పుడు, తరచుగా శాసన భాషనే ప్రమాణముగ నంగీకరించుట యుక్తము.

"మరల కొన్డుకళ్" – "ప్లీటుగారును, లక్ష్మణ రావు గారును 'సకలకొన్ధుకళ్' అని చదివిరి. బర్గెసు పాఠముగూడ నిట్లే యుండును. సోమశేఖరశర్మ గారు కూడ నిట్లే యుదాహరించిరి. కాని యింవలి తొలి యక్షరమున 'మ' కాని 'స' కాదు. ఈ శాసనమున దలి తక్కిన 'స' 'మ'లను పరిశీలించిన నిది స్పష్టము కాగలదు." అని శాస్త్రిగారు నుడివిరి. వారు వచించినట్లే పరిశీలించిచూచితిని గాని వారితో నేకీభవింపజాలకుండుటకు చింతించుచున్నాను. ఆ యక్షరము 'మ' కాదు. 'స' అనుటయే నిశ్చయము. శ్రీశాస్త్రిగారు ౬వ పంక్తిలోని 'సకలలోకశ్రయ్య' అని చదివినపదము లోని మొదటియక్షరమును 'మరలకొన్డుకళ్', లోని మొదటియక్షరముతో పోల్చిచూచిరేని అవిరెండును ఒకే అక్షరమగుట బోధపడగలదు. 'సకలలోకశ్రయ్య' లోని 'స' ను 'మ' గ జదువవలయు నందురేమో! 'మరల కొన్డుకళ్' లోని రెంవయక్షరమును 'ర' గ చదివిరి. ఇటువంటి 'ర' ఇక నెచ్చటనైన కలదా? "తలకట్టు క్రింది యక్షరముతో సంధించుటకు నిలువుగీత 'క' కారమున కుండును. ఈయక్షరమున కట్టు లేదు. అక్షరముపై నొట్టియుండవలసిన తలకట్టుకు స్థలము చాలక లేఖకుడు చుక ఎడముగా వ్రాసెను" అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. దీనిని 'ర' గ చదువుట తప్పు; 'క' గనే చదువవలయును. సంధిగీటు వ్రాయబడి మాసిపో యియుండును. లేక 'క' రెండు విధములుగ వ్రాయ

నాచారమైన నుండియుండవలయును. 'ర' తలకట్టు అక్షరమునకు నొట్టియే యుండవలయును. తలకట్టుతో నేర్పఱుపబడిన 'ర' శాసనములయందెచ్చటను గాన్పింపదు. స్థలము లేకపోవుట యెట్లు? ముందు 'ర' వ్రాసి కదా వెనుకటి యక్షరమగు 'ల' ను వ్రాసి యుండవలయును? అట్టి సందర్భమున స్థలము లేకపోట యెట్లు సంభవించినది? బంతినంతయు వ్రాసిన పిమ్మట 'ర' ను ఇప్పట్ల వ్రాయక విడుచుటను గుర్తించి యచ్చట ఇరికించెనందురేమో? శాసనములను వ్రాయువారిట్టి సందర్భమున హంసపాదిని పంక్తిక్రింద పెట్టి పైన విడిచిన యక్షరములను వ్రాయుచుండెడివారు. కావున నది 'క' అయినను కాకపోయినను, 'ర' మాత్రము గాదు. ఈమాటతో ఇంతసేపు కుస్తీపట్టియు తుదకు తామే ఓటయినారు. 'మరల కొన్డుకళ్' తనగూఢార్థమును శ్రీశాస్త్రిగారి కెఱుకపఱుపక తిరుగబడినది. కావున 'వారల కొన్డుకళ్' అని చెక్కవలసిన దానికి శాసనము చెక్కినవాడు ప్రమాదముగా 'మరలకొన్డుకళ్' అనిచెక్కెను అనుటపూర్వము యుగంధరుడు "పోవుభూతమిా చెట్టుకొమ్మను విరుచుకొని పోవునుగాక" యన్నట్లు "పాడుచెక్కడపుపనివాడీనిందను మోయునుగాక" యని తలచినట్లున్నది. శాసనములోని మాటకును, వారిపాఠమునకును సమన్వయమునకు ఒండొంటి కెంతదూరము! శాస్త్రిగారు తమయూహను శాసనములోనికి చొప్పింప ప్రయత్నించిరే కాని శాసనపుమాట కర్థము చెప్పబూనరైరి. 'మరల కొన్డుకళ్'లో 'న్డు' అనునక్షరమును 'న్థు' అని పూర్వపరిశోధకులు చదివిరి. ఈ సందర్భమున ప్రభాకరశాస్త్రిగారు కేవలము పొరపడినట్లు తలచెదను. "కొన్డుకళ్" అని శాస్త్రిగారును, "కొన్థుకల్"అని ఇతరులును చదివినపదములో 'న' క్రింద ఈ



సంకేతములున్నవి. దీనిని లిపిశాస్త్రజ్ఞులు సామాన్యముగ 'ఱ'గ చదువుట వాడుక. కదాచిత్తుగా 'థ' యని చదువుటయు కలదు. దీనిని శాస్త్రిగారు "డ" అని చదువవలయు ననుచున్నారు. శాస్త్రిగారి వ్యాసమును చదివిన పిమ్మట పైసంకేతములుగల పెక్కుశాసనములను పరిశీలించి చూచితిని. నాపరిశోధనయొక్క ఫలితమును విపులముగ మఱియొకసమయమున వ్రాసెదను. మొత్తముమిాద దీనిని 'ఱ' యని చదువవలయుననియే నాయభిప్రాయము. ఈసందర్భమున శాస్త్రిగారు చెప్పిన రెండు మూడువిషయములను గూర్చి యింకను విచారింపవలసి యున్నది.

౧. "కొన్థుకళ్" అని యితరులు చదివినదానిని "కొన్డుకళ్" అని చదివి " 'డ'కు లిపిలో రెండురూపములుండెడి"వని చెప్పినారు. ఇది వింతగాదు. 'బ'కు రెండు సంకేతములుండుట నే నిదివఱకే నిరూపించియున్నాను. అటులే 'డ'కు రెండుసంకేతములుండినను ఉండవచ్చును. అయితే శకటరేఫమున కేల రెండుసంకేతములుండి యుండరాదు? అందొకటి 'ఱ,' రెండవది ప్లస్‌మార్కు పైని గుండ్రగీటు ఉండునది. ఇందసాధ్యమేమున్నది? ఇది 'డ'కారమే కాని 'ఱ'కారము కాదని నిశ్చయించి చెప్పుట యెట్లు?

౨. కృష్ణశాస్త్రిగారిచే ప్రకటితమగు సత్యాదిత్యచోళమహారాజు శాసనములోని "శత్యాదిత్యన్ఱు, ఎఱుచున్ఱి, పచ్చువన్ఱు, వ్యాన్ఱు" ఇత్యాదులలోని 'ఱ'ను 'డ'గ చదివి, "శబ్దనిష్పత్తి శాస్త్రరీతినిబట్టి పరిశీలింపగా ద్రవిడభాషలోగాని, కర్ణాటభాషలోగాని 'ఆదిత్యన్డు, ఉన్డి, పాన్డు, వాన్డు' అనురూపముల యునికి దెలియదయ్యెను. ప్రసిద్ధులైన ద్రవిడకర్ణాటపండితులవలన నీవిషయము నెఱిగితిని" అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. పైశబ్దములోని 'ఱ' కారము బహువచనమును సూచించు ప్రత్యయమని నాతలపు. మనము 'వాడు' యొక్క బహువచనము 'వాళ్లు' అనుచున్నాము. మన పూర్వికులు 'వాన్ఱు' అనెడివారు. రేఫము బహువచనమును సూచించుట కన్నడభాషయందు గాననగును: 'ఏఱ్ని, కూతుకొఱ్ళి, కుఱ్డి, బఱ్ని' ఇత్యాదులు. కావున కృష్ణశాస్త్రిగారు 'ఱ' యని చదువుటయె సమంజసముగ నున్నది.

౩. చిఱుంబూరు:—"పై సత్యాదిత్య శాసనము ౧౩ వ బంతిలో 'చిఱుంబూఱి' కలదు. ఇది స్పష్టముగా బండి 'ఱ' కంటె వేఱై అడ్డుగీత లేక 'ఙ' వంటి

యుచ్చారముతో నున్న యక్షరముగానే యున్నది. ఇట్లున్నను కృష్ణశాస్త్రిలుగారు 'చిలుంబూరు' అనుదాని 'చిలుంబూరు' అని చదివిరి. అది 'చిలుంబూరు' అని చదువుటే సరియని నానమ్మకము. ఏలనగా నా గ్రామ మిప్పుడు 'చిలుమూరు' అనుపేర నున్నది." అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు.

పై శాసనపు ప్రతిబింబమును సోమశేఖరశర్మ గారికడ నుండి కైకొని జాగ్రత్తగ జదివితిని. శాస్త్రిగారు భ్రమ నందిరని యప్పుడు తెలిసికొంటిని. ఏలన, 'చిలుం బూరు' అను మాటలోని రెండవయక్షరము 'ట' కాదు. శాస్త్రిగారు తలచినట్లు అడ్డుగీత లేకపోలేదు. స్పష్ట ముగ నగపడుచున్నది. కావున ఆయక్షరము 'ఱ' అగునే కాని 'ట' కాజాలదు. కృష్ణశాస్త్రిగారు 'చిలుంబూరు' అని శాసనము నున్న తీరుగనే చదివిరి.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తలచినట్లు, 'చిలుం బూరే' నిజమైన పాఠము అని వాదమునకై యొప్పు కొన్నను, 'చిలుంబూరు' 'చిలుంబూరు' 'చిలుమూరు' 'చిల్మూరు' అగునే కాని 'చిలుంమూరు' కాజాలదు. కావున శాస్త్రిగారిపాఠము తప్పని నేను తలచుచున్నాను.

మఱియు 'నాగబు' విషయమై ప్రభాకరశాస్త్రి గా రిట్లనుచున్నారు. 'నాగమ్బు' అనుపదమునకు ద్విత్వ శైథిల్యమును, పూర్వహల్లోపమును గలుగుటవల్ల 'నా గబు' అనురూప మేర్పడినది. దీనికి ఉదాహరణములు నన్నెచోడుని కుమారసంభవమునుండియు, అద్దంకిశాసన మునుండియు కొనియున్నారు. 'నాగబు' క్రీ. శ. ౬-౭ శతాబ్దినాటిది. ఉదాహరణములు క్రీ. శ. ౯-౧౦ శతా బ్దమునాటివి. కావున,'నాగమ్బు'నకు ద్విత్వశైథిల్యపూర్వ హల్లోపములు గలుగుటచే నది 'నాగబు' ఆయెనని రుజు వుచేయుట కీయుదాహరములు పనికిరావు. క్రీ. శ. ౨, 3 శతాబ్దములనాటి శాసనములనుండి యుదాహరణ ముల నెత్తిచూపిన మిక్కిలి యుపయుక్తముగ నుండును.

యన్. వెంకటరమణయ్య

---

## తెలుఁగుచేసిన సిలు గేమో!

కవిసార్వభౌముఁ డగు కూచిమంచి తిమ్మకవీం ద్రుని సర్వలక్షణసారసంగ్రహములోని కొన్ని లక్ష ణములనుగూర్చి 'వజ్రాయుధ పత్రికావ్యాసవిశేషము' గలిగిన సందేహములలో ముఖ్యము లైనవానికి సమాధా నముగా భారతీపత్రికారత్న శ్రావణమాససంచికయందు (సంపు. ౪, సంచి. ౮) నేనొకవ్యాసమును బ్రకటించితిని. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, నావ్యాసమును గొంతవఱకుఁ బోషించుచు, గొంతవఱకుఁ దమకుఁ గలయభి ప్రాయభేదమును కార్తికమాససంచికయందు (సంపు. ౪, సంచి. ౧౧) ప్రకటించినారు.

ఆనావ్యాసమునకు వజ్రాయుధపత్రికయం దేకే వియో ప్రత్యుత్తరము లీయఁబడియెను గాని యవిగణిం పఁబడఁదగినవిగా నుండలేదు. ఏమన, గసడదవాదేశము నుగూర్చిన "న వికృతిశబ్దా త్పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః" అనుసూత్రము దెగిపోకుండవలయు నని కాఁబోలు, ఆవిలేఖకుఁడు దానిని నన్నియట్టో కుని మెడకుఁ దగిలించినాఁడు! మఱియు నేను జూపిన శిలాశాసనప్రయోగము లాయనకు జాలు అప్పట నయ్యెను; వేలువేలుకవుల భిన్నప్రయోగములును తమ లేఖకప్రమానములే యయ్యెను! ఇఁక నాయన చిత్తమే ప్రమాణము!

విన్నకోట పెద్దనకవీంద్రుఁడు 'ప్రథమపాంతం బడు కచటతపలకు గసడదవ లగు' నని వ్రాసినలక్షణ మున, "తెలుఁగులమీఁది సాంస్కృతికంబుల కని చెప్పఁ బడియుండ లే" దని తత్పత్రికాధిపతిగారు వ్రాసినారు. ఆతఁ డిచ్చినలక్ష్యమును జూచియుండియు వారట్లు వ్రాయుట సిత్రమే! ఎల్లప్రథమలకు (సంస్కృతాంధ్ర శబ్దప్రథమావిభక్తుల కన్నిటికి) నియ్యాదేశము గలుగు చుండుటచే నాతఁడు వేఱుగఁ దెలుఁగులమీఁది సాం స్కృతికంబుల కని వక్కాణింపలేదు. లక్ష్యము సరి యఁదగును.

ఇప్పట్టున నంధ్రభాషాగతి యించుకంతే విచా రింపవలసినదే.

"నాల్గుం జెల్లెడి బ్రహ్మచారిగృహివా
నప్రస్థయత్యాశ్రమం
బు గైవల్య ... ... ... ... వీ
ర ల్గోపించిన ... ... ... "

ఉత్తర హరివంశము, ౮ ఆశ్వా.

ఇందు, (1) ఆశ్రమంబుల్ + కైవల్య—అనున ప్పుడు కకారము గకారముగ మాఱనవచ్చునట! ఏల? రెండును సంస్కృతశబ్దములుగాన.

(2) వీరల్ + కోపించిన—అనునప్పుడు కకారము గకారముగ మాఱరాదట! ఏల? మొదటిది తెలుఁగుపదము, రెండవది గీర్వాణపదము నగుటచేత.

చూడుఁడు! పైరెంటను జివర నున్నది తెలుఁగు ప్రత్యయ మగు లకారమే (ల్)! పరుషమును సరళముగఁ జేయునది లకారపుఁబొల్లా? దానివెనుకనున్న శబ్దమా? పొల్లు తెలుఁగుదైనను గీర్వాణశబ్దమును జేరుటచే గట్టిదైన దేమో! తెలుఁగుదాని యాపొల్లు పొల్లేకాఁబోలు! ఆహా! ఏమి యీసూత్రధర్మము! తెలుఁగు నేసిన సిలుగేమో!

ప్రథమలపైవచ్చు కచటతపలకు గసడదవ లాదేశ మగుటనుగూర్చి ప్రభాకరశాస్త్రిగారికిని నాకును గల యభిప్రాయభేదము కొంచెమే. అయ్యాదేశము నిత్యమని నేను వ్రాసితిని. బహుళముగాఁ గానవచ్చుచున్నదని వారు వ్రాసిరి. బహుళమనుటకుఁ బ్రమాణములుగా బసవపురాణ పీఠికయందు వారు చూపిన బద్దెన భాస్కరుల ప్రయోగములు రెండును బలువ్రాఁతప్రతులలోఁ బరిశీలింపఁదగినవై యున్నవి. ఒకవేళ వ్రాఁతప్రతుల నన్నిట నట్లేయున్న, నవి ప్రయోగస్వాతంత్ర్యమును దెలుపునే కాని సూత్రవిచ్ఛేదమును జేయఁజాల వని తలంచెదను.

గసడదవాదేశమును గూర్చి నేను చూపెన ప్రయోగములకుఁ దోడుగ, ముద్రితకేయూరబాహుచరిత్రమున లేని నూతనప్రయోగమును వ్రాఁతప్రతినుండి తెచ్చి లోకమునకుఁ బ్రకటించిన శ్రీ శాస్త్రిగా రెంతయు నభివంద్యులని వేఱుగ వ్రాయనక్కఱ యుండదు.

## స్థానశబ్దవిచారములు

శ్రీనాథాదిమహాకవులచేఁ బ్రయోగింపఁబడి యతిస్థానముచే సమర్థింపఁబడుచున్న స్థానశబ్దస్థకారమును గూర్చి ప్రభాకరశాస్త్రిగారికిని నాకును నించుకంత యభిప్రాయభేదము గలదు. ఈశబ్దముతోడి యతిస్థానము గలపూర్వకవీంద్రప్రయోగముల నన్నిటిని మార్చ సాహసించిన "వజ్రాయుధ పత్రికావ్యాసవిలేఖరి" వలెఁగాక శ్రీశాస్త్రిగారు దానికివేఱుగతి గల్పించి యాప్రయోగములను నిలిపినారు. ఏమైన నేమి? మా 'తా' మా కున్నది!

తకారమునకు యతి సెల్లునట్లు స్థానశబ్దమును పూర్వమహాకవులు ప్రయోగించినదాని కాధారముగాఁ గానవచ్చిన ప్రాతిశాఖ్యసూత్రమును నేను చూపితిని. ప్రాతిశాఖ్యము ఛందస్సునకుఁ జెందినది గాని భాషకుఁ గాదనియు, మునిత్రయమువారు, 'ఛందసి—భాషాయామ్' అని వేఱుపఱిచి లక్షణములను జెప్పిరనియు వారు వ్రాసిరి. న్యాయమే. కాని యెల్లచోటుల నియ్యనుశాసనము చెల్లలేదు. ఒక్కయుదాహరణము:—

* "ఛన్దసి—పరిపన్థిపరిపరిణాపర్యవస్థాతరి."

* శాత్రవార్థమున పరిపంథి పరిపరిశబ్దములు వేదమునమాత్రమే ప్రయోగింపఁబడును.

ఇయ్యనుశాసనమును గవీంద్రు లతిక్రమించి పరిపంథిశబ్దమును విపక్షార్థమున స్వేచ్ఛగాఁ బ్రయోగించినారు. తుద కది నిఘంటువులకునయిత మెక్కినది! కావుననే,

"లోకేతు పరిపన్థిశబ్దప్రయోగో న న్యాయ్యః"

అనువాక్యము పుట్టినది! పరిపంథిశబ్దమునేకాక పరిపరిశబ్దమునుగూడ వైర్యర్థమున మన తెలుఁగుకవులు ప్రయోగించియున్నారు.

"పరిపరిపీలుకర్బురపురక్షణనుఁడు..." —రసికజన.

"ఛన్దసి—భాషాయామ్" అను మునిత్రయము వారి నియమి మిచ్చటఁ బరిగణింపఁబడలేదు. అట్లే (మునిత్రయమువారు తెల్పక కున్నను) స్థానశబ్దమును మన కవులు వేదమునుండియే గ్రహించియుండవచ్చును.

మఱియు శ్రీశాస్త్రిగారు "ఋషులు, ఋషికల్పులు, నిరంకుశులు, వశ్యవాక్కులు నగు వ్యాసవాల్మీకి కాళిదాసాదికవులుగూడ నీస్త్రానరూపమును బరిత్యజించిరి! వేలకొలఁది యేండ్లనుండి వెలయుచున్నట్టియు, నతివిపులమైనట్టియు సంస్కృతభాషా వాఙ్మయమున నెక్కడను స్త్రానరూపము గానరాకుండఁగా, నిప్పటికేనూఱేడులకు ముందున్న శ్రీనాథుఁడు సంస్కృతభాషామర్యాదా విరుద్ధముగాఁ దెలుఁగుకవిత్వములో వైదికవర్ణక్రమోచ్చారము గల స్త్రానపదమును బ్రయోగించె ననుట భావ్యమా?" అని వ్రాసిరి.

సంస్కృతిభాషామర్యాదా (కేవల) విరుద్ధముగ 'త్రియమ్బకమ్' అని కాళిదాసుఁడు ప్రయోగించిన ఛందశ్శబ్దమునుమాత్రము వాల్మీకివ్యాసాదులు (తత్పూర్వులు) ప్రయోగించిరా? సంస్కృతకవి యగు కాళిదాసునకుఁ గల యాస్వాతంత్ర్యము తెలుఁగుకవి యగు శ్రీనాథున కేల లేకపోవలయును? ఆతఁడు మాత్రము నిరంకుశుఁడు గాఁడా? వశ్యవాక్కు గాఁడా?

తెలుఁగుకవిత్వమును సంస్కృతకవిత్వమువంటిదే. సంస్కృతమువలెనే యదియు వైదికవర్ణక్రమోచ్చారము గలపదములకుఁ జోటీయ నర్హమైనదియే. మఱియు సంస్కృతకవులంబోలె నాంధ్రకవులును ఋషులు, ఋషికల్పులు ననఁదగినవారే.

"ఏషా త్రిలిఙ్గభాషా సంస్కృతభాషాతుల్యా"

—మహాభాష్యకారులు.

"ఆన్ధ్రసంస్కృతభాషాభ్యాం కవిత్వంఋషితాప్రదమ్"

—కణ్వస్మృతి.

ఇట్టి పేరెన్నికగన్న పవిత్రమైన యాంధ్రకవిత్వమునందు శ్రీనాథునివంటి మహాకవి 'స్త్రానము' అను వైదికశబ్దమును బ్రయోగించుటయం దాక్షేపమా?

ఆహా! తెలుఁగు నేసిన సిలుగేమో!

పిమ్మట, ప్రభాకరశాస్త్రిగారు, వేదోచ్చారణము గలకొన్నిశబ్దాదుల నిచ్చి "వానివర్ణక్రమశబ్దోచ్చారరీతులనుగూడ నిఁక భాషలోనికిఁ జొప్పింపవలసినదే!" యని యాశ్చర్యపడినారు. అట్టివానిని జొప్పింపవలసినదని నేనను గాని చొప్పింపఁబడినవానినిమాత్ర స్వీకరించుట సమంజస మని యనియెదను.

తెనాలి రామకృష్ణుని యుద్భటారాధ్యచరిత్రమునుండి నే నిచ్చిన 'త్రియంబకం యజామహే' అను వేదవాక్య మనుకరణసహితము గావున నిరుపయోగమని శాస్త్రిగా రనిరి. 'త్ర్యమ్బకమ్' అనియే కాని 'త్రియమ్బకమ్' అని విసంహితగా వేదమునందును లేదనియు కాళిదాసునిప్రయోగము 'త్రిలోచనమ్' అనునర్థమునందు యుండు ననియు నాతో వాదించిన కొందఱుపండితులు కొఱ కది వ్రాయఁబడినదే కాని యనుకరణము మనుట యెఱుఁగక వ్రాయఁబడినది గాదు. అది యక్షరసహితమై యుండుటచే గణబద్ధమైన యాప్రయోగము వారికిఁగా నీయఁబడినది. మఱియు బృహస్పతయము, పిశంగిల, పిలిప్పిల—ఇత్యాది వేదస్థపదములు శాస్త్రసాధితములు గాకున్నను మనవారిచేఁ బ్రయోగింపఁబడిన వనియు, అట్టివానిని శాస్త్రము నిషేధింపఁజాల దనియు, నట్లే స్త్రానశబ్దముఁగూడ మనవారు వేదమునుండి తెచ్చియే ప్రయోగించినా రనియు, 'శానము'నువికృతిపదమునకు 'స్త్రాన' శబ్దమే ప్రకృతిగా యుండు ననియు భావించియే నే నాయుదాహరణము లిచ్చితిని. "ఇట్టిప్రయోగములు పంతులుగారి వాదమునకుఁ బ్రయోజకము లగునా?" అని శాస్త్రిగారు వ్రాయుట వింతగానే యున్నది.

అనంతర ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని ప్రయోగములను సమర్థించుపొంటె 'తద్భవవ్యాజమ'గతిని వానికిఁగూడఁ జూపి, స్నానశబ్దమున మొదటి యక్షరమునకు తథదధలకు యతి సెల్లవచ్చునని లక్షణగ్రంథముల కొకక్రొత్తలక్ష్యమును సమకూర్చిరి.

విన్నాణము, విన్నపము మొదలగు వికృతిపదములకు మూలము లైన విజ్ఞానము, విజ్ఞాపనము మొదలగు ప్రకృతిపదములలోని 'జ్ఞ'కు తద్భవత్వము వ్యాజముగా గల 'న'తో యతి సెల్లినట్లే 'తాన' మను వికృతిపదమునకు మూలమై స్నానశబ్దమునకు తకారముతో యతి సెల్లింపవచ్చు నని వారు వ్రాసిరి. జ్ఞ న—ఈరెంటి యందును అనునాసికాధ్వని వినవచ్చును. అచ్చట జీవ

నకు తత్సమత్వము తోడు గాఁగా, వాని కట్టి యతి సెల్లు ననుట యొకవింతగా గానరాదు. స్నానతానశబ్ద ముల కట్టిచుట్టఱికమును దెలుపుధ్వని యేదియు వినఁబ డదే! ఇది యెట్లు చెల్లును ?

దీనికి శాస్త్రిగారు, "ఆయా దేశకాలములయందటు వంటి యటువంటి (స్నానము, స్నాతకము, స్నేహము మొదలగువానివంటి) యుచ్చారణరీతులు సామాన్యవ్యవ హారమున నుండెడివి. అట్టివానిని బట్టికూడ వికృతులు వెలయుచుండును...'తాన' మను వికృతి యిట్టివిధము నను బట్టియుండవచ్చును." అని యొకదారిని జూపిరి. దీనింబట్టి స్నానశబ్దము 'స్తాన' మని వ్యవహారమున నున్నకాలమున 'తాన' మనువికృతి పుట్టియుండు నని వీరియాశయ మైనట్లు స్పష్ట మగుచున్నది అవ్యవహార మున నుండినస్తానశబ్ద మాకాలమునందు మాత్ర మెక్కడ నుండి వచ్చినది? వేదమునుండియే వచ్చియుండవలయును. ఆశబ్ద మట్లు తకారము గలిగియుండుట కాధార మేది? ప్రాతిశాఖ్యసూత్రమే! కావున, తానమను వికృతిపద మునకు స్తానమే ప్రకృతి; స్నానమమాత్రము గాఁజా లదు.

కాళిదాసునిచే త్రియంబకమంబోలె శ్రీనాథా దులచే స్తానముగూడ వేదమునుండియే కైకొనఁబడి నిరంకుశముగాఁ బ్రయోగింపఁ బడియెను. అక్షరసామ్య మేమియు లేని తెలుఁగుశబ్దమును బట్టుకొని ఏదో ప్రకృతి నుండి పుట్టిన వికృతిపద మని శాస్త్రిగారు మాత్ర మనఁ గలరా?

స్నేహము—నెయ్యము; స్నిగ్ధము—నిద్దము:— ఇట్టివి వికృతు లనఁజెల్లునుగాని, స్తానముగాని స్నానము నుండి తానము పుట్టినదని పలుకుట సమంజసమా?

కావున శ్రీనాథాదులు ప్రయోగించినది (తకార ముతో యతిచెల్లునది) స్తానశబ్దమే కాని స్నానశబ్దము గానేరదు.

నడకుదుటి వీరరాజు.

---

## శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటురచనము

ఈ మహాకార్యముయొక్క విధానమును గుఱించి భారతిలో నిటీవల విమర్శసమాధానములు మెండుగఁ గనఁబడుచున్నవి. ఇవి యీకార్యమునకు సహాయపడక చాలవఱకు వ్యర్థముగ నున్నవి. నిఘంటువునం దెట్టిపద ములు చేరవలయును? ఎట్టిప్రయోగములు కూర్చవల యును? వ్యుత్పత్తి వ్యాకరణాంశములు సంస్కృత ద్రావిడాది సంబంధములు ఎంతవఱకు నిరూపింపఁబడ వలయును? ఇట్టి ముఖ్యవిషయములను ప్రసంగములోనికి తీసికొనిరాక భారతీలేఖకులు స్వల్పవిషయములను విపుల ముగ చర్చించుచు కర్తవ్యమును ఉపేక్షించుచుండిరి.

ఈ మహోద్యమమునకు ఒకదశ కడచెను. రెండవ దశ మధ్యకు వచ్చినది. ఫలితము కంటఁబడ లేదు. జనులలో ఆతురతకలుగుట వింతకాదు. శ్రీ మహారాజాగారి యౌ దార్యమును, అభిలాషయును సార్థకములగుట వారికిని, లోకులకును మహానందకరమగును.

నిఘంటుకార్యస్థానమునఁ గార్యక్రమము చతుర ముగ జరుగుచున్నది. అర్థము, ప్రయోగము, వ్యుత్పత్తి ఇతర భాషాసంబంధములును జాగ్రత్తగ విమర్శింపఁబడు చున్నవి. మసాయిదాపని ముగిసినది. ఇది యక్షర రూపముఁ దాల్చుటకు ఒకటిరెండేండ్లు పట్టును. కార్య విధానమున మాంద్యము కనఁబడదు. ఆంగ్లద్రావిడాది నిఘంటులు రచించుటకును ఇరువదేండ్లు పట్టెను. ముద్ర ణకుముందుగ నిప్పన్నగ్రంథమును నలుగురయిదుగురు ఆంధ్రపండితులు-రచయితలేకాక-పైవారును బరికించుట యవసరము. ఇట్టి యేర్పాటుచే అపార్థప్రమాదాదులకుఁ దా వుండదు.

విమర్శనములో స్వల్పవిషయములకుఁ బ్రాధాన్యము కల్పింపఁబడెను. అభిప్రాయభేదములు ప్రకటించుట ఈసందర్భమున నిరుపయోగము. ప్రణాళిక చర్చింప వలసియుండఁగా లేశములనుబట్టి వాదములల్లుట సమంజ సముగాదు.

ప్రయోగములనుజూపు గ్రంథపట్టికలోని గ్రంథ ములన్నిటినుండియు ప్రయోగములు మాదిరిపదములలో

కనఁబడలేదనెడి యాక్షేపము నిరాధారము. కొన్ని చోట్ల గ్రంథములలోని పద్యసంఖ్యలు మాత్రముండి పద్య పాదములు లేకపోయినంతమాత్రాన హానియేమి? సంఖ్య నుదాహరించుట దోషముకానేరదు. ఇప్పటివ్యవహారము సమగ్రము కాదుఁగదా!

అంగపడి, అంగలార్చు, అంగవించు, అగుడెంచు మున్నగుమాటలనుగుఱించిన ఆక్షేపములు బలముగునవి కావు. ఇందు అభిప్రాయభేదము లుండనోపును. చేయక, చేయమి-లలో క, మి, వ్యతిరేకార్థబోధకములని పైయాకరణులందురు. కాల్డ్వెలును ప్రమాణముగ గొనమి తప్పుగాదు.

అంచుక, యించుక, అంగదట్టము, లిల్వర యేని మున్నగుపదములపై చర్చలు నిష్ఫలములు. అర్థచ్ఛాయలు కడపటి నిర్ణయములో తేలవలయును.

ఉపకారకముకాని ప్రసంగములు బాధించును. ఆర్జవము, గుణపక్షపాతము వ్రాఁతలకుఁ బెంపుఁ దెచ్చును.

జరుగుచున్న మహాకార్యమునకు విజ్ఞులు సాయపడుట యుక్తము. విత్తమును మహారాజుగారు విపులముగ ధారాళముగ నొసంగుచున్నారు. పెక్కండ్రు పండితులుచేరి చర్చించి నిర్ణయించుచున్న యీగ్రంథము గుణవంతముగ నుండుట న్యాయముగాదా!

ముద్రణమునకు ముందుగ విఖ్యాతపండితులను —నిఘంటునిర్మాణమున పాల్గొనని వారినిగూడ— చేర్చి సందేహములను నిర్ధారణచేయుట యుక్తము. ఈమహానిఘంటువులో ఆంధ్రవ్యవహారమున మాత్రముండుమాటలకుఁ దావు లేకుండుట ఒకగొప్పలోపము. ఇది తీరునది కాదుగదా! విమర్శించువారు విశాలహృదయములతో విమర్శించుట న్యాయము. దోషారోపణమునకయి విమర్శించుట శోచనీయము.

గరిమెళ్ల సోమన్న.

---

## సారంగధర వ్యాఖ్యానము

చేమకూరవాని 'సారంగధరచరిత్ర' యను శీర్షిక క్రిందనే వ్రాసిన 'ఉప్పనైనట్టి చక్కెర లప్పలీడ' యనుపద్యమునకు వ్యాఖ్యానమును గుఱించి శ్రీ వేటూ[రి] ప్రభాకర శాస్త్రిగారు వైశాఖమాస భారతీ సంచి[క] యందు గొంత విమర్శనమును వ్రాసిరి. అట్లు నా య[భి]... శమును జర్చించినందులకే నెంతయు గృతజ్ఞుడను. కా[ని] యాపద్యమునందుగల 'చక్కెరలప్పలు' నాకిప్పటి[కి] గటువుగనే యున్నవనిన మన్నింపదగును. లప్పయన[గా] శబ్దరత్నాకరమున 'రాశి' యనియు, బ్రౌణ్యమున '[ముద్ద]' యనియు నర్థములుంట నే నెఱుఁగకపోలేదు. శ్రీ శాస్త్రి గారిచ్చిన పరిమాణార్థ మప్పుడు నిప్పుడు నాకనువ[గు]... గానరాకున్నది. శ్రీ శాస్త్రిగారీయర్థమును వి[శద]... జక్కఁగ సాధించిరనుట కించుకయు సందేహములే[దు]. వారు సూచించినయట్లు లప్ప పరిమాణము లనుట[చే]... చక్కెరలప్పలని వాడుకకు రాజెల్లును. కాని పద్య... నందలి చక్కెరలప్ప లుప్పి చేయుదగియుండి, య... పదార్థసమ్మేళనము నపేక్షించుచున్నవి. ఈకష్టము నా... బోలె శ్రీ శాస్త్రిగారికిని గలిగెననుట నిశ్చయ... కావుననే, యెత్తికొనుటలో 'ధర్మారావుగారు స్వ... ముగ వ్రాసిన టీకగూడ దప్పుగానున్నదని చెప్ప... వచ్చినందుకుఁ జింతిల్లుచున్నాను' అని యాశంకించి... మాణార్థకమగు 'నెడు' ను మిగుల సంభావించి, తు... తుదకు 'చక్కెరలప్ప లనగా చక్కెరప్రధాన ద్ర[వ్య]ముగానుంచి (ఉప్పిచేయునదిగాన చక్కెరమాత్రమే య... నేని ద్రవించిపోవును.) ముద్దపదనుగా జేసిన మ... భోజ్యపు లప్పపరిమాణములని యర్థమగు' నని శ్రీ శాస్త్రి గారే వ్రాయక తప్పినదికాదు. వారొసగిన యీయ... మునకును, నేజెప్పిన 'భక్ష్యవిశేషము'లను న్యర్థ... కును భేదము, తొలుత తామునెప్పినట్లు జింతిల్ల... నంత యెక్కువగాక యీపరిణామ్రమయి యుండుట... వారే గుర్తించిరి. అందువలననే 'ప్రకరణసాహచర్య... లనుబట్టి యింతయర్థమిక్కడ పుట్టుచున్న'దని వ్రా... తాము తొలుత నుగ్గడించిన నాతప్పును సాధించి... పరిమాణార్థమునకు ప్రాధాన్యము నొసగనెంచి, ... కల్ప మెంతవఱకు సిద్ధించెనో యారయుదము.

భక్ష్యమనిన నన్ను గాదని తాము భోజ్యమని... ఇట భేదపాఠములను గూర్చి పెనగులాడుట యేల!

సాహచర్యమువలన చోష్యమో, పానీయమో యయిన మఱియు సంతసింతును. భోజ్యమేయందము—అట్లను టకు నాకభ్యంతరమేమియు లేదు; ఉప్పుట కనువుగ నుండుటకే భక్ష్యమంటిని—కాని, చక్కెరలప్పనెప్పుడు మనము భోజ్యముగ నంగీకరించితిమో యప్పుడే తన పరిమాణార్థమునకు ప్రాధాన్యము నశించునుగదా! ప్రక్రమమునుబట్టి చూచినను బరిమాణార్థమున నేమి స్వారస్యమున్నది? ఇంక శాస్త్రిగారిచ్చిన యర్థముతో నాపాదమునకు దండాన్వయము చూడు డెట్టులుండునో: ఉప్పునైనట్టి చక్కెరలప్పలీడెయానిన 'ఉప్పిచేయుటచేసనగు చక్కెర ప్రధానద్రవ్యముగా నుంచి ముద్దపదనుగా జేసిన మధురభోజ్యపు లప్పపరిమాణములు (తీయనగు నా తెఱకు) సరియగునా' యని యగునుగదా! ఇదిలెస్సయో, 'ఉప్పిచేయనయినభక్ష్యములో, లేక భోజ్యములో సరియగునా' యనుట లెస్సయో చదునరు తెలుంగకపోరు. ఇట మాధుర్యమే ప్రధానముగాని పరిమాణ మావంతయు గానేగదు. పద్యభావమును బోషించుటయే వ్యాఖ్యాతకు గర్తవ్యముగాని పాండిత్యముతో బాడుచేయుట కానేరదు. కర్ణాభరణమగు బుగడయాకారముచే గలిగిన 'చక్కెరబుగడ' లను భక్ష్యవిశేషములం దాకారప్రాధాన్య మంతరించిపోవును. ఆకార మాబుగడయట్లు లేకున్న నాభక్ష్యములనారగింప మానుదుమా? అట్టులనే పరిమాణమువలననే యా పేరు వచ్చినను రాగిడబ్బంత చక్కెరలప్పయు బాగుగ నున్నదనుచు భుజింపగలము.

ఇట్లు ప్రక్రమ సాహచర్యాదులచే బట్టుచున్నట్టియు, నుప్ప ననువగునట్టియు, స్వారస్యమును బోషించునట్టియు, వేయేల తప్పని చెప్పదలంచినను దప్పించుకొనజాలనట్టియు, నా'టీకగూడ దప్పుగానున్న'దని శ్రీ శాస్త్రిగారు వ్రాయనెంచుట, తప్పనిచెప్పుట తగదుగాన నొప్పదనియైన వ్రాయవలసి వచ్చినందుకు నే నెంతయు జింతిల్లుచున్నాడను.

లప్పలవిమర్శను లంకించుకొని, విమర్శవిషయమునకప్రస్తుతమైనను శ్రీ ప్రభాకరశాస్త్రిగారు దమకులభించిన నైషధాముక్తమాల్యదాదుల యందలి చక్కని పాఠభేదములలో గొన్నింటిని గూర్చి ముచ్చటించి నాకును, నన్నుబోలిన యాంధ్రపాఠకులకును వందనీయులైరి. అప్రస్తుతమనుటకేల సాహసించితినన, నున్నపాఠమున కర్థముసెప్పుట ప్రస్తుత విమర్శనవిషయము: పాఠభేదములు చిక్కకపోవుటచే భావముపాడగుట వారు ముచ్చటించిన విషయములు. ఏదెట్టులయినను, దమకందుబడిలోనుండు నిట్టి యమూల్యపాఠముల నాంధ్రజనంబున కనతికాలంబున నంగజేయుతలంపు శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి గలుగుగాత! భాషాసేవ కావించుటకభిమాన మభ్యంతరము గాకుండుగాక! బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగా రింతకుముందే యిట్టి వానిని ఛెక్కింటి నాకళించియు నింతకాలము నూరకుండుట యాంధ్రుల దురదృష్టమునక తప్పదు. ఇప్పుడయినను వానిని ముద్రింపించి వెల్లడింపనున్నారనుటకు మిగుల సంతసము.

ధీమంతులకైనను బ్రమాదంబు లటనట దప్పవను నార్యోక్తి సర్వజనసమాదరణీయంబుగ నుండ, శ్రీ ప్రభాకరశాస్త్రిగా రేటికో మఱియొక్క యనవసరవిషయమును దమవ్యాసమున జొప్పించిరి. విజయవిలాస సారంగధరచరిత్రల వ్యాఖ్యానంబుల గాననగు లోపంబులకు సమాధానరూపంబుగ దమతో శ్రీ వేంకటరాయశాస్త్రిగారుచెప్పిన వాక్యములని "శ్రీ (వేంకటరాయ) శాస్త్రులవారు విజయవిలాస సారంగధరచరిత్రలకు టిప్పణులను దమయొద్ద బనిచేయుచున్న యొకగ్రంథకర్త, అప్పయపంతులగారి ప్రాతటీక ననుసరించి వ్రాసికొనివచ్చి యిచ్చిన లఘుటీకను సరిపఱిచి, రచించిరట. అట్లు సరిపఱుచుటలో నాలఘుటీకలోని ప్రమాదములు గొన్ని యపరిశీలితములుగా నట్టె విడువఁబడియుండునని శాస్త్రులవారు నాతో ననిరి" అని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. ఈసమాధానము నేడు కేవల మనవసరమగుటయేకాక, "స్వవిరచితవ్యాఖ్య" యనియు, "మద్విరచితవిపులవ్యాఖ్య" యనియు శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు వ్రాసిన యనేకవాక్యములతో సమన్వయము నేసికొన నలవికానిదియు నైయున్నది. అంతియకాక, యావాక్యంబు లనర్థదాయకంబులగు ననేకాపోహలకు దావునొసంగుచు శ్రీ శాస్త్రులవారి వ్యాఖ్యానముల కట్టి

కళంకమునైన గూర్ప సమర్థంబు లగుచున్నవి. కావుననే యీవాక్యంబు నాకత్యంతవిషాదమును గలిగించుచున్నవనిన నన్ను శ్రీ వేంకటరాయ శాస్త్రిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును మన్నింతు రని తలచెదను. ఇట్టి సమాధానముల నడుపుచు గాలయాపనము సేయుట కన్న, నవకాశముగల యాంధ్రపండితులు శ్రీ వేంకటరాయశాస్త్రిగారియెడ నముద్రితములై యున్నవని చెప్పుచున్న యనేకామోఘువిషయంబుల నాంధ్రజనుల కనతి కాలంబున నందజేయ నుద్యమించిన జాలమేలగునని విన్నవింతును.

అవకాశము గలిగినంత నాకడనున్న నాలుగాశ్వాసముల సారంగధరసంపుటమును శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి జూపగలుగుదునని నమ్ముచు, వారు దీని సాధించి సాయమొనర్ప నెంచినందుల కభివందనము లర్పించుచున్నాడను.

తాపీ ధర్మారావు

---

# ఆత్మస్తుతి

మండా సూర్యప్రకాశ రావుగారు

ఆశాబద్ధకమై, దురాగ్రహమదవ్యాళోరు సంచారమై,
క్లేశానీకతమంబు కార్కొనఁగ, నక్షీణోగ్రసంసార యా
త్రాశుంభద్గహనాంతరస్థలిని సంక్రాంతుండనై, ఖిన్నతన్
గాసిం జెందని యంతరాత్మకు నమస్కారంబుఁ గావించెదన్.

తూలన్ లేదు ప్రపంచకార్యఘనవాతూలౌఘ లోలన్మహో
భీలోద్వృత్తికి నేను; నాశిరము దీపించున్ సగర్వంబుగా
నాలోకోగ్రదురంత దుర్ఘటనరూక్షాస్త్రప్రఘాతంబులన్
గీలాలంబు స్రవించు చుండియు నధోక్షిప్తంబు గా కెన్నఁడున్.

అతికోపాకులితంబు, తీవ్రవనయనాంభోనీక గంభీర మీ
క్షితి; అద్దానిని దాఁటినన్ బలలమ స్తిష్కాస్థిదుర్గంధదూ
షితకాలానల తీవ్రతప్తనరకక్షేత్రంబు; రెండింటికిన్
మతి భీతిల్లక ధిక్కరించెద మదాత్మస్థైర్య శౌర్యోద్ధతిన్.

నాకద్వారపథంబు తిన్నన యగున్! వక్రంబె యా!! దాని నా
లోకింపం బని యేమి? ఈవసుధ నాలోపంబు లెనైననో!
నాకర్మంబున కేన కర్తను గదా! నాయాత్మ శాసింపఁగా
నాకన్నన్ బరుఁ డెవ్వఁడున్ గలఁడె విజ్ఞానంబుమైఁ జూచినన్.

---



## భారతీయ మహిళామణులు

### ప్రముఖములగు ప్రజోపయోగోద్యోగములలో నున్నవారు

స్త్రీలు రాజకీయ, పౌరస్వత్వపు హక్కులను సంపాదించుకొనుటకు మిక్కిలి తోడ్పడినది 'విమెన్స్ ఇండియన్ ఎసోసియేషన్' (భారతీయ మహిళాసమాజము). ఆ సంఘముయొక్క రెండు ముఖ్యోద్దేశములు:—స్త్రీలకు పురుషులతో సమానముగా పురపాలక సంఘములలోను, శాసనసభలలోను వోటుచేయు అధికారముకలుగునట్లు చేయుటయు; అన్ని పురపాలక సంస్థలలోను, శాసనసభలయందును స్త్రీలు సభ్యురాండ్రుగా నెన్నుకొనబడు హక్కునుసంపాదించుటయును.

ఈ దిగువ పట్టికలో కొలదిమాత్రపు వినాయింపుతో నందరును భారతమహిళాసమాజపు సభ్యురాండ్రే.

వారు వారు నియమింపబడిన తేదీలవరుసను వారి పేరులు వ్రాయబడినవి. ఇందు కొందరు మాత్రము సొంచిత్రములను పెక్కు కారణములపైని రాజీనామాల నిచ్చియున్నారు.

### శాసనసభాసభ్యురాండ్రు

డాక్టరు పూనెన్‌లూథాన్ (తిరువాంకూరు) రెండు సంవత్సరములు ఆరోగ్యశాఖామంత్రి; శ్రీమతి మాధవీఅమ్మ (కొచ్చిను); డాక్టరు ముద్దులక్ష్మిరెడ్డి (చెన్నపురి) శాసనసభోపాధ్యక్షురాలు; రాజకోట సంస్థానమున నిద్దరు స్త్రీలు.

### పురపాలక సభ్యురాండ్రు

దేవదాసుసతి (చెన్నపురి); హాడ్కిన్‌సన్‌సతి (బొంబాయి); శ్రీమతి సరోజినినాయుడు; గోఖలే సతి; లోటవాలాకన్య; మెకంజీసతి; హాచెన్ ఏంజిలోసతి (చెన్నపురి); యస్. బి. దాసుకన్య (పాట్నా); లక్ష్మణఅయ్యరుసతి (సైదాపేట); కాశియాబాయిదేవధర్‌కన్య (పూనా); శ్రీమతి అచ్చమ్మగారు (గుంటూరు) మేక్లియాడ్‌కన్య (బేలూరు, కలకత్తా) శ్రీమతి క్రిష్ణవేణమ్మ (కాకినాడ); శ్రీమతి రమణాబాయి నీలకంఠ (అహమ్మదాబాదు); శ్రీమతి పి. సుశీలాబాయి (బళ్లారి); శ్రీమతి బాపాయమ్మ (రాజమండ్రి); అన్నా థామస్‌సతి (తిరునెల్వేలి); జానకీకన్య (కాలికట్); లక్ష్మీఅమ్మాళ్ కన్య (వేలూరు); ఆదిశేషయ్యసతి(వేలూరు); లైనియరుసతి (రంగూను); బార్ట్లోసతి (తంజావూరు); రజక్‌సతి (తంజావూరు); అబ్రహామ్‌సతి (ఉదకమండలము); అచ్యుత మీనన్‌సతి (మధుర); దొరైకన్ను ముదలియార్‌సతి(మధుర); జ్ఞానదురైసతి(తిరుచినాపల్లి); జేసుదొరైసతి (తిరుచినాపల్లి); శ్రీమతి బుడ్డి సుబ్బమ్మ (నెల్లూరు); శ్రీమతి సుగుణార్ (కడలూరు); డాక్టరు కింగ్‌స్లీసతి (రంగూను); యన్. సుబ్బారావుసతి (మంగుళూరు.)

### జిల్లాబోర్డు సభ్యురాండ్రు

శ్రీమతి యన్. కన్నమ్మాళ్ (ఉత్తరఆర్కాటు); శ్రీమతి జయలక్ష్మీకుమార్ (చిత్తూరు); డాక్టర్ హార్టిసతి (చిత్తూరు); ఆస్టిన్ భాన్‌సతి (తెలిచ్చేరి); ఇ.రాబర్ట్సన్‌కన్య (దిండిగల్); స్పారిన్‌సతి (తిరుచూరు); శ్రీమతి

ద్రౌపది అమ్మాళ్ (గరుచూరు) ; డి. కె. మిస్త్రీసతి (కన్ననూరు); శ్రీమతి ఆచంట రుక్మిణిఅమ్మ (చెంగల్పట్టు); శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ (గుంటూరు.) శ్రీమతి భాగీరథి శ్రీరామ్(చెంగల్పట్); శ్రీమతి ఆర్. శాంభవీబాయి, బి.యే., (మంగళూరు మహిళాసభనుండి దక్షిణకనరాజిల్లా విద్యాసంఘమునకు)

## తాలూకాబోర్డు సభ్యురాండ్రు

శ్రీమతి పద్మాసని (మదనపల్లి); శ్రీమతి జయలక్ష్మి(మదనపల్లి); జూలియా నేథనీల్ సతి(వేలూరు);ఫిలిప్స్ సతి (శివగంగ.)

## ఆనరరీ స్త్రీమేజిస్ట్రేటులు

కజిన్సుసతి (చెన్నపురి), సదాశివయ్యరుసతి (చెన్నపురి; స్టాండ్ ఫర్డుసతి (చెన్నపురి), వి. పాండురంగారావుసతి (చెన్నపురి); బీస్లిసతి (చెన్నపురి); హాడ్కిన్సన్ సతి (బొంబాయి); కాఆస్జిజహాంగీర్ సతి (బొంబాయి); డి. తాతాసతి (బొంబాయి); త్యాబ్జీసతి (బొంబాయి); యస్. బి. దాసుకన్య (పాట్నా); బర్డ్సువికన్య (చెన్నపురి); శ్రీమతి జయలక్ష్మి (మదనపల్లి); గురుమూర్తిసతి (మదనపల్లి); లలితాక్రిష్ణస్వామిసతి (చెంగల్పట్టు); దేవసహాయంసతి (మధుర); మద్గాకరుసతి (బొంబాయి); ఇంజనీరుకంట్రాక్టరుగారికుమార్తె (బొంబాయి); పువ్వనాథంసతి (కడలూరు) ఉపాధ్యాయురాలు; బొంబాయిరాజధానినుండి మఱి 10 మందిస్త్రీలు (పేర్లు తెలియరాలేదు);శ్రీమతి అలమేలు మంగతాయారమ్మాళ్ (చెన్నపురి); శ్రీమతి మాలతీపట్వర్ధనుసతి(చెన్నపురి.) శ్రీమతి కేథరిన్ సుబ్బారాయమ్మ (బెజవాడ)

## విశ్వవిద్యాలయ సెనెటుభ్యురాండ్రు

సుబ్బరాయనుసతి (చెన్నపురి); హజ్రాకన్య (పాట్నా); జెకరైకన్య (చెన్నపురి); యస్. బి. దాసుకన్య (చెన్నపురి) ; ప్రభుత్వనియోజితులును, ఉద్యోగరీత్యా నిచ్చిన సభ్యత్వము గలవారు నగు పెక్కుమంది సభ్యురాండ్రును.

## స్త్రీబ్యారిష్టరులు, లాయరులు

కార్నీలియా సొరాబ్జీకన్య (కలకత్తా); మిస్ తాతాకన్య (బొంబాయి) ; హజ్రాకన్య (పాట్నా); ద్వామే మే ఖిన్ కన్య(రంగూను); పాంక్షాకన్య(పూనా); బి. ఆనందబాయికన్య (చెన్నపురి) ; దేవదాసుకన్య (చెన్నపురి) శ్యామకుమారి నెహ్రూకన్య (అలహాబాదు.)

---

## మన పొగాకు వ్యయము

గాంధీమహాత్ముడు 'యంగ్ ఇండియా' పత్రికలో నిట్లు వ్రాసెను:—

బహువిధ సంస్కారములయందు ప్రియము కల యొక విలేఖరి మన భరతదేశము పొగాకునకై ఎంత వ్యయము చేయుచున్నది తెలియగోరుచున్నాడు. సంవత్సరమునకు పట్టిపొగాకునకును, సిగరెట్లకును కలిపి 213 లక్షల రూపాయలగుచున్నవని నాకు తెలియుచున్నది. ప్రతియేడాదికిని మొత్తము ఎక్కువగుచున్నది. 1923 వ సంవత్సరములో 1½ మిలియను పౌను లయియుండిన దిగుమతి 1927 వ సం॥లో 5 మిలియనులకు హెచ్చెను. సిగరెట్ల దిగుమతియందును దీనికి తగు హెచ్చుదల యుండెను. నేను చూచిన సంఖ్యావివరణము నమ్మకమైన దైనయెడల మనదేశమునుండి యేమాత్రము పొగాకును ఎగుమతి యగుచుండుటలేదు. అందుచేత మనదేశపు పొగాకుపంట యొక్క విలువయు పై సంఖ్యలకు చేర్పబడవలయును. పొగాకుచుట్టలు, బీడీలు, సిగరెట్లు కాల్చు ప్రతివాడు నీ యసహ్యపు దురభ్యాసమును మానివేసి, తన నోటిని చెడువాసనకు నిలయముచేయక, తనపండ్లను పాడుచేసికొనక,రుచులను వేడిని గ్రహించు జిహ్వేంద్రియమును నష్టమొనర్పక, ఈ దురభ్యాసమును మానుటవలన మిగులు సొమ్మునేదైన నొక జాతీయోద్యమమునకు దానముగ నిచ్చునెడల, నతడు తనను తన దేశమునకు హితమేలొనగూర్చిన వాడగును.

---

## క్షురకర్మ



## అమరావతికోటరాజులు

శ్రీయుతులు భావరాజు వెంకటకృష్ణరావు పంతులు (బి. ఏ., బి. యల్.) గారు ఆంధ్ర హిస్టారికల్ రీసర్చి సొసయిటీ త్రైమాసికపత్రిక (రెండవ సంపుటము 3-4 సంచికల సంపుటి) యందు వెనుక తాము అమరావతికోటరాజులనుగూర్చి వ్రాసినపుడు రెండుమూడుముఖ్యములైన విషయములను పొరపాటువలన నందు చేర్పక విడిచితిమనియు, ఆవిషయముల నిపుడు వివరించుచుంటిమనియు నొకచిన్ని వ్యాసమును ప్రకటించిరి. అందు మొదటిది:కోటరాజులయింటిపేరు పొలెవారనియు కోట వంశమునకు మూలపురుషుడయిన ధనంజయుని యొక్క జాతి,పేరు, ఇంటిపేరు తెలుపుపద్య మొకటి పెదమక్కెన భూతమహాదేవి శాసనమున గలదనియు చెప్పి యాపద్యము నుదాహరించినారు. ఆపద్యమిది:

చ. అమలపయోధిఁ జంద్రుఁ డుద
యం బగునట్లనెపోలె వారిజా
తమున విరించి పుట్టిన వి
ధంబునఁ గాంచనధారుణీధరేం
ద్రమున సురావనీజ ముది
తంబయి యొప్పుగతిం జతుర్థసం
శమున జనించె నుగ్రరిపు
సైన్యజయుండు ధనంజయుం డిలన్.

ఈపద్యము మొదటిపాదమున 'పోలె' అనుపదము 'వారి' అను 'వారిజాత' పదైకదేశమును నొక్కచో నుండగాంచి వెనుక నీకోటవారు కర్ణాటకులని సూచించిన శ్రీకృష్ణరావుగారు ఈపద్యముయొక్క అర్థమునుగాని, సమన్వయమునుగాని పరిశీలింపకయే 'పొలె వా'రనువాని నేకపదమని విశ్వసించి కోటవారు 'పోలెవా'రను నింటిపేరు గలవారని నిశ్చయించినారు. కోటవా రాంధ్రులేయను సిద్ధాంతమును నెలకొలుపబూనిన వీరి యుత్సాహాపరవశతయే యీప్రమాదమునకు గారణమని తలపదగును. పైపద్యమునకు సమన్వయము:

అమలపయోధిని (నిర్మలమైన (పాల) సముద్రమునందు) చంద్రుడు ఉదయము అగునట్లనె పోలె (అట్లవలెనే), వారిజాతమున (తామరపూవున) విరించి (బ్రహ్మ) పుట్టినవిధమున, కాంచనధారుణీ ధరేంద్రమున (బంగారుకొండ_అనగా మేరుపర్వతము_అందు) సురావనీజ (దేవతలమ్రాను_అనగా కల్పవృక్షము) ఉదితమయి ఒప్పుగతిని, చతుర్థవంశమునందు ఉగ్రరిపుసైన్యజయుడు (భయంకరులయిన శత్రుసేనలను జయించినవాడు) ధనంజయుడు ఇలను జనించెను.

పైపద్యము నొక్కసారి స్థూలదృష్టితో జదివినంతనే స్ఫురింపదగు నీయర్థమును పూర్తిగ నిట వ్రాసినందుకు పాఠకులు మన్నింపవలెను.

ఇయ్యది కేవల మాంధ్రభాషయందే ప్రకటితమై యుండినచో నీయల్పప్రమాదము ...తలపెట్టవలసిన యావశ్యకత లేకుండెడిది. ...గాక ఆంగ్లపత్రికయందు ప్రకటింపబడినది. ...ధ్రభాషానభిజ్ఞులందరు నీప్రమాదమునే ...ణముగాగొని తప్పుదారులు ...ఇట్టివి మనకు క్రొత్తకాదు. ...కారులు కావించిన పొరపాటుల నెన్ని... తరువాతివారు నవరించుచుండుట ...

భవములో నున్నవిషయము. కావున శ్రీ కృష్ణరావుగారే ఈవిషయమును గుర్తించి యీత్రైమాసిక పత్రికయొక్క రాగలసంచిక యందు తమప్రమాదమును సవరించి ప్రకటించుట సముచితము; చరిత్రకు మహోపకారమును.

---

## ఆంధ్రమహాజనులకు విన్నపము

కీర్తిశేషులగు శ్రీ ఆంధ్రరత్న రామదాసు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిచే స్థాపింపబడిన శ్రీమదాంధ్ర విద్యాపీఠ గోష్ఠివారు శ్రీగోపాలకృష్ణయ్యగారి జీవితచరిత్ర, రచనలు, ఉపన్యాసములు, ఇష్టాగోష్ఠి, హాస్యసల్లాపములు, చాటుపద్యములు, లేఖలు మొదలగువానిని గ్రంథరూపమున ఆంధ్రమునందును, ఆంగ్లమునందును, వేఱువేఱుగ నచ్చొత్తించి ఆంధ్రమహాజనులకు సమర్పించుకొనను సంకల్పించియున్నారు. శ్రీగోపాలకృష్ణయ్యగారి జీవితమునందలి మహదాశయములను ఆంధ్రలోకము మఱువకుండుట కీయత్నమెంతయవసరమో మేము వేరుగ తెలుప నక్కరలేదు. కాని యీ యుద్యమము నెరవేరుట శ్రీ గోపాలకృష్ణయ్యగారితో నేదోవిధముగా పరిచయముగల ఆంధ్రమహాజనులు బహుమంది యొక్క తోడ్పాటుపై నాధారపడియున్నకతమున, ఆంధ్రమహాజనులెల్లరును పై నుదహరించిన విషయములనుర్చి, వారివారికి తెలిసిన యావద్వృత్తాంతమును, శ్రీవారి స్వహస్తలిఖిత లేఖలు (లేక అందుకు సరియగు నకళ్లు), రచనలు, ఛాయాపటములు మొదలగునవి యీ దిగువ చిరునామాకు పంపించి మాకు తోడ్పడగలందులకు ప్రార్థించుచున్నాము. అట్లు పంపించిన లేఖలు, ఛాయాపటములు తిరిగి కావలయునని కోరినచో త్వరలో వారికి వాపసు చేయబడును.

ఉత్తరప్రత్యుత్తరము లన్నియు యీ దిగువ చిరునామాకు పంపదగును.

గుమ్మిడిదల వెంకట సుబ్బారావు, ఇండియన్ బ్యాంకు, బెజవాడ.     ఇట్లు విన్నవించు,

౧. నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు,
౨. అబ్బూరి రామకృష్ణారావు,
3. గుమ్మిడిదల వెంకటసుబ్బారావు.
ఆంధ్రవిద్యాపీఠగోష్ఠి, బెజవాడ, ౨౮-౪.౨౭.

---




---

## గోవా వీరగల్లు
## విజయనగరాధీశుడగు
## రెండవ హరిహరరాయల కాలమునాటిది

మిథిక్ సొసయిటీ త్రైమాసిక పత్రికలో రెవరెండ్ హెచ్. హీరాసు, (యస్. జే., యం.ఏ.,) గారు ఈ వీరగల్లును గూర్చిన విమర్శముగా నొక పెద్దవ్యాసమును వ్రాసినారు. అందలి ముఖ్యాంశములు కొన్ని యీక్రింద నుద్ధరింపబడినవి.

ఈ వీరగల్లు ప్రాతగోవా [Old Gao (Velha Gao] మ్యూజియమున నున్నది. ఇది ఒకటే నల్లరాతిపై చెక్కబడినది. దీనిపొడవు అ. ౫ అం. ౧౧; వెడలుపు అం. ౨౧. ఈ రాతిపై ఆరు వరుసలు చిత్రములు, పంద్రెండుపంక్తులు శాసనమును చెక్కబడియున్నవి. చిత్రములవరుసలు పైనుండి క్రమముగా నొకదానికన్న నింకొకటి పెద్దదిగా నున్నవి. మొదటి రెండువరుసలయందును నాయకుని కుటుంబములోని స్త్రీలుకాబోలును చెక్కబడియున్నారు. మూడవవరుసయందు పాలకిపై నొకడు పోవుచున్నట్లున్నది. అతడు నాయకుడు కానోపును. నాల్గయిదు వరుసలయందు గుఱ్ఱపురౌతులు చెక్కబడియున్నారు. ఆరవ వరుసయందు శిరస్త్రాణములు, డాళ్లు, కటారులు, ధరించినయోధులు బాహాబాహిని పోరాడుచున్నారు. బొమ్మలన్నియు మోటుగా చెక్కబడియున్నవి.

శాసనము ప్రాతకన్నడభాషనున్నది. పంక్తులలోని కొన్ని యక్షరములు మాసిపోయినవి. మొదటి నాలుగుపంక్తులు ఒకటిరెండు బొమ్మలవరుసలకు నడుమనున్నవి. తరువాతి అయిదుపంక్తులు మూడునాలుగు వరుసలకు నడుమనున్నవి. చివర మూడుపంక్తులు, నాలుగ అయిదు వరుసలకు నడుమ నున్నది. అక్షరములు క్రీ.పదునాల్గవ శతాబ్దమునకు చెందినవి. శాసనవిషయము యొక్క సారాంశము:

"మహారాజాధిరాజ, రాజపరమేశ్వర ... రాయలు రాజ్యమేలుచుండగా 'హైవె' రాజ్య... నధికారము నెరపుచుండిన మహాప్రధాని మల్లప్పొడ... రౌద్రిసంవత్సర భాద్రపద బహుళ చతుర్దశినాడు ... మునకు వెడలినాడు. మడియగొంబు వద్ద యుద్ధము ... నది. రాణువచెంతనున్న ముద్దకళ్ల తిమ్మనాయక... మల్లప్పొడయరు కుటుంబమునకు చెందినవాడు ... మున మృతుడయ్యెను. అతని కొడుకులు ముద్దనాయ... బీరనాయక, కుమణ్ణనాయకులు ముగ్గురు నీ వీర... జెక్కించి ప్రతిష్ఠించినారు. అనమందాచార్య ... చెక్కినాడు."

ఈశాసనమున శకసంవత్సరము లేదు. ఇందు ... బడిన రౌద్రిసంవత్సరము శా. శ. ౧౩౦౨ సం.కు ... పోవుచున్నది. దీనికి క్రీ. శ. ౧౩౮౦ సం. ... రెండవ హరిహరరాయలు క్రీ. శ. ౧౩౭౭ ... ౧౪౦౪ వఱకు రాజ్యమును పాలించెను. కావున ... గల్లు ఆతని కాలమునాటిది.

హీరాసుగారు ఇతరచారిత్రక ... ప్రమాణములను బెక్కింటిని పురస్క... కొని పై కాలనిర్ణయము సరియైనదని ... పించినారు. తరువాత—శాసనమున నుదా... తుడయిన మల్లప్పొడయరును గురించి ... చర్చించినారు:

రెండవ హరిహరరాయల మంత్రులు, మూ... లుగ విభజింపబడినారు. (౧) రాజకుటుంబ... జేరనివారు తొమ్మండుగురు; (౨) తనకుమారులు ... (3) ఒకటవబుక్కరాయల కొడుకులు ఎనమం... మూడవ తెగకు జేరినవాడీమల్లప్పొడ... ఇతడు రెండవ హరిహరరాయలకు తమ్ముడు. ... శాసన మీతడు 'హైవె' రాజ్యమును పరిపాలించు... డెనని తెలుపుచున్నది. ఇతడు ౧౩౮౦ వ సం. గో... దండెత్తియుండును. కాన నాచేరువ నీవీరగల్లు ... ష్ఠింపబడి యుండును. రెండవబుక్కరాయల ...



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి భవనము

రొకతె భార్యయయ్యెను. మొట్టమొదట నీతనిపేరు ౧౩౫౫ వ సంవత్సరపు బెంగుళూరిజిల్లాలోని యొకశాసనమున గలదు. ఇతడపుడు రాజకార్యములందు ప్రసక్తి గలిగియుండెనట. ౧౩౬౧ వ సం. వఱకు నీతనిశాసనములున్నవి. తరువాత కాన్పింపవు. చివరశాసనమున నితడు 'ఆరగ' రాజ్యమునకు గవర్నరుగా నున్నట్టున్నది. అటు పిమ్మట నతడు మహాప్రధానియై రాజధానియందే యుండెనుకాబోలు. ౧౩౬౪ వ సంవత్సరపు నింకొక శాసనమున నీతనిపే రున్నది. రాజకార్యముల నాతడు నెరపినట్లు అందున్నది.

మఱియు, రెవరెండుగారు మూడవ విభాగములోనివాడే యగు నింకొకప్రధాని మాధవమంత్రియు, నీ మల్లప్పొడయరు నొకరే యనుచున్నారు. ఈవిషయమున వీరుచూపిన కారణములు,కానించిన సమన్వయమును నంత తృప్తికరముగా లేదు. వీరగల్లునం దుదాహృతమైన దండయాత్ర గోవాముసలుమానులపై నెత్తిన దనుచున్నారు. ఈవీరగల్లు ఎక్కడ ప్రతిష్ఠింపబడెనో, మఱియగొంబు ఎచ్చటనున్నదో తెలియరాదనుచున్నారు. మఱియగొంబు యుద్ధమున మృతుడయిన తిమ్మనాయకు డెవ్వరో కాని మల్లప్పొడయరుకు బంధువును, ఆతని సేనానులలో నొకడును అగు ననుచున్నారు. హీరాసుగారి యీ వ్యాసమంతయు చక్కని శాసనాదిప్రమాణములతో గూడియున్నది. దక్షిణదేశచరిత్రపట్ల-అందును విశేషించి విజయనగరచరిత్రముపట్ల- ఇంతపరిశ్రమను చేసికొనుచున్న వీరియెడ భాషాభిమానులు, చరిత్రాభిమానులు కృతజ్ఞతచూపుట సముచితము. వీరు 'అరవీటువంశము' అనునొక గొప్పగ్రంథమును రచించియుండుట నిదివఱకే భారతీపాఠకు లెఱిగియున్నారు. ఆగ్రంథముయొక్క-ప్రాశస్త్యమును గూర్చిన వివరములు ముందు సంచికయందు గానన గును.

---

## నిర్వాణ బుద్ధ విగ్రహము

మాడర్న్ రివ్యూ జూలై సంచికయందు శ్రీ. శే. సత్యేంద్రమోహనకుందగారు (Research scholar, National Council of Education, Jadabpur) వ్రాసిన వ్యాసమునుండి యిది యుద్ధృతమయినది. ఈ గొప్ప విగ్రహముయొక్క- ఛాయాచిత్రమునకు ప్రథమప్రకటనమట యిది.

ఈ విగ్రహము 'కాసియా' లోనున్న నిర్వాణ దేవాలయమున నున్నది. తొలుదొలుత ౧౮౬౧ వ సం. ప్రాంతముల కార్లేలు అనువాతడు దీనిని కనుగొన్నాడు. దేవాలయము, విగ్రహము నప్పుడు శిథిలస్థితియందుండినవి. కార్లేలు వానిని చక్క-చేయించినాడు. బౌద్ధగ్రంథములు చెప్పుచున్న రీతిని ఈ విగ్రహము కుడివైపునకు ఒత్తిగిలి పండుకొని యున్నట్లున్నది. కాళ్లొకదానిపై నొకటి చాపబడి యున్నవి. తల ఉత్తరపుదిక్కు-న నున్నది. ముఖము పడమరవైపునకున్నది. కుడిచేయి కుడిచెంపక్రింద నున్నది. ఎడమచేయి శరీరముపొడవున పైన జాపబడి యున్నది. కురులు సుళ్లుతిరిగి యున్నవి. తల 'నుష్ణీష' మున్నది. శరీరమువస్త్రాచ్ఛాదితమైయున్నట్లుమడతలునడుమ తెలుగ చెక్క-బడిన రేఖలు సూచించుచున్నవి. పీఠమునకు ముందుభాగమున మూడువిగ్రహములు దుఃఖచిహ్నములతో నున్నవి. అందొకటి సుభద్రుని విగ్రహము. బుద్ధభగవానునివలన సన్మతమును స్వీకరించినవారిలో నీతడు చివరవాడు. విగ్రహము ఎఱ్ఱనిసానరాయి (sand stone) తో చేయబడినది. పొడవు ౨౦ అ.; ఎత్తు ౩ అం; పీఠముపొడవు ౨౩ అ. ౯ అం.; వెడల్పు ౫ అ. ౬ అం;

ఎత్తు ౧ అ. ౩ అం. మొదలు ౨ అ. ౬ అం. వరకు గలదు. ఇపుడు దేవాలయమున పూజ సలుపు బౌద్ధులు



విగ్రహమునకు స్వర్ణరజమును బూసి పట్టుబట్టలను గట్టి యున్నారు.

పీఠముపైనున్న విగ్రహములలో నడిమిదానిక్రింద నొక లేఖనము కలదు. దానిని ఫ్లీటుదొరగారిట్లు చదివినారు.

పం. ౧. దేయధర్మో=యనిమహావిహారస్వామినో హరిబలస్య

పం. ౨. ప్రతిమా చ=ఎయని ఘటితారనె... మ(?) స్వరేణ.

డాక్టరు ఓజెల్‌గారు 'మ (?) స్వరేణ' అనుటకు మారుగ 'మధురేణ' అని చదివినారు. ఈ లేఖనమునకు అర్థమిది:

'ఇది మహావిహారాధిపతియగు హరిబలుడొనరించిన దానము. విగ్రహమును మధురా నివాసియగు 'దిన' అను నాతడు నిర్మించెను.'

లేఖనమునందలి లిపి విన్యాసమును బట్టి చూచిన నీ విగ్రహ నిర్మాణకాలము క్రీ. ౫ వ శతాబ్దము—గుప్తయుగము—అని నిర్ణయింపవచ్చును. ఓజెలుగారి పాఠము

ననుసరించి విగ్రహనిర్మాతయగు శిల్పి మధురా నివా[సి] యగును. ఎట్లయిననువిగ్రహముయొక్క శిల్పవిధానము[...] స్థూలము లయిన అ[...] యవములు, లావు [...] వులు, బలిసిన గ[...] నిండారిన గండభాగ[...] సుళ్లుతిరిగిన వెండ్రుక[...] వస్త్రవిధాన చిహ్న[...] లు, అరకాలనున్న [...] చిహ్నమగుచక్రము [...] టియందును—మధురన[...] రాజుల కాలమునాటి[...] విన్యాసముయొక్క [...] క ఎక్కువగా కాన్పి[...] చున్నది.

---

## స్త్రీ వైమానికురాలు



ఎమీలియా ఇయరుహార్టుకన్య. ఈమె అమెరి[...] నుండి ఇంగ్లాండునకు వాయువిమానముపై సా[...] ప్రయాణమొనర్చిన ప్రథమస్త్రైర్యవతి.

## ఆంధ్రకవులభావనలు–వారి స్వస్థితి



## ఏల్మర్ మాడ్ గారు

### టాల్‌స్టాయిగారి ముఖ్యస్నేహితుడు



రష్యాదేశపు ప్రముఖ రాజకీయవేత్తయు, వేదాంతియు, గ్రంథకర్త యునగు కౌంటు లియో టాల్‌స్టాయి మహాశయుని నూఱవ జన్మదిన మహోత్సవము సెప్టెంబరు నెలలో రానున్నది. దానికి సంబంధించిన ఉత్సవకార్యకలాపము లప్పుడే యింగ్లండులో నారంభమైనవి. టాల్‌స్టాయిగారి నితరాంగ్లేయు లందరికంటెను నెక్కువగ నెఱిగియుండిన ఏల్మర్ మాడ్ గారు, వారినిగూర్చియు, వారొనరించిన కార్యములగూర్చియు నింగ్లండులో నుపన్యాసములు గావింపుచున్నారు. రషియాలో మాస్కోనగరమందు ఆరాష్ట్రీమునకు విద్యాంగ మంత్రియగు ప్రిన్స్ మెస్చెర్‌స్కీగారిబిడ్డలకీమాడ్ గారిసోదరి యధ్యాపకురాలుగానుండెను. ప్రిన్సు మెస్చెర్‌స్కీగారుఉచితవిద్యావేతనమిచ్చుటచే నంతవరకు నింగ్లాండులో క్రైస్ట్స్ హాస్పిటలునందు విద్యనభ్యసించిన మాడ్ గారు తమ పదునారవయేట మాస్కోకేగి యచటి 'లీసియమ్'నందు చేరిరి. రెండుసంవత్సరముల తరువాత నతడు మాస్కోయందు ట్యూషనులు చెప్పుట నారంభించియుండియు, వయసు వచ్చినవెనుక వ్యాపారమున ప్రవేశించి తుదకు రషియన్ రత్నకంబళముల కంపెనీయందు చేరి, కొన్నాళ్ల కందు వ్యవహారకర్తయు, నధికారులలో నొకరును నైరి. వ్యాపారములోనున్నప్పుడే వారు టాల్‌స్టాయివ్రాసిన 'ఇక మన కర్తవ్యమేమి?' (what then must we do?) అను గ్రంథమును చదివిరి. ఆ గ్రంథములోని కొన్నివిషయములతో నాత డేకీభవింపజాలక, ఒకస్నేహితునితో గ్రంథకర్తయింటికేగి మాడ్ గారు టాల్‌స్టాయిగారితో నాగ్రంథమునుగూర్చి మొగమోటమిలేక విపులముగ విమర్శించిరి. టాల్‌స్టాయిగారు మనస్సువిప్పి మాటలాడుటను మిక్కిలి యిష్టపడువారు కావునను, తనకు సద్భావముగలవాడని తోచిన యెవరియెడలనైన సహనము చూపువారు కావ నను, మాడ్ గారిని ఇట్టివిమర్శనలు చర్చలు నింకను గావించుచుండుటకు వారి నాహ్వానించుచుండిరి. ఇట్లా రంభమైన వారి పరిచయము, స్నేహముగా మారి టాల్‌స్టాయిగారు 1910 సం. లో మరణించువఱకు కొనసాగె నది. 1897 సం. లో మాడ్ గారు వ్యాపారము వదలి యింగ్లండున కేగుచుండినప్పుడు టాల్‌స్టాయిగారు వారిని 'కళ యననేమి? (what is art?) అను తమ గ్రంథము ననువదింపగోరిరి.

రషియను ప్రభుత్వముచే హింసింపబడిన డూఖోబార్స్ అను రష్యను తెగవారు వలసపోవుటను గూర్చిన యేర్పాట్లను గావించుటకు టాల్‌స్టాయిగారి కోరికపైని మాడ్ గారు కనడాకు వెళ్లియుండిరి. అప్పటినుండియు ఏల్మరు మాడ్ గారును, వారి సతీమణియు కలసి టాల్‌స్టాయిగారి గ్రంథములలో చాలవరకు ననువదించిరి. వీరిప్పుడు టాల్‌స్టాయిగారి నూఱవజన్మదిన మహోత్సవ సందర్భమున ముద్రింప బడనున్న వారి గ్రంథ సంపూర్ణ రణమునకు సంపాదకత్వము వహించియున్నారు.

(16 జూన్ 1928 'స్ఫియరు' నుండి)

---

## ఛాల్డియా దేశపురాజు మరణముతోపాటు చేయుబడిన నరబలులు

ఛాల్డియాయొక్క మిక్కిలి పూర్వపు రాజు మెస్‌కలాండగ్ మరణించినపైని 'అర్' అను పట్టణమున నతని యనుచరులలో నరువదిమందిని బలియిచ్చి మృతుడయిన రాజుతో పాతిన సమాధియొక్క ఊహా కల్పిత పునర్నిర్మాణము.

ఛాల్డియా బేబిలోనియా కింకొక పేరు.

చిత్రవివరణము:— 1. నైణికుడు, 2. ఇరువురుబట్టలు, 3. నలువురు యువతులు, 4. బట్టలగది కావలిదారు, 5. గుఱ్ఱపువారిరువురు, 6. వస్త్రములుండు బొషాణము, 7. ఏటవాలుగనుండు సున్నపు రాతిదిమ్మలు;

బలివేదిక యైయుండును, 8. ఆరుగురు స్త్రీలు, 9. బండివాడు, 10. రెండు బండిగుఱ్ఱములు, 11. శకటము, 12. ఆరుగురు నపుంసకులు, 13. రెండు సామానుబండ్లు, 14. బండి నడుపువాండ్రు, 15. ఆరుఎడ్లు, 16. గుఱ్ఱపువారు, 17. ఆరుగురు కావలిభటులు, 18. ఏటవాలుగానున్న ప్రహరీ, 19. ఇచ్చటి నేల; దిగువనున్న నేలమాళిగపైననే



యాధారపడినిలిచియున్నది, 20. బంగారు వెండి రాగితో చేయబడిన పాత్రలు, 21. దోపిడిగాండ్ర కన్నము, 22. బోదెకట్టెలపై విలువంపుగా ఇటుకలతో కట్టబడిన యింటి పై కప్పు, 23. తోలుపట్టాచక్రములు, 24. భృత్య వర్గములో ముప్పదిమంది, 25. సన్నపురాతి బోదె కట్టెలపై విలువంపు కట్టడము, 26. గోపురాంతములు, 27. ముప్వురు కావలివాండ్రు, 28. శవపేటికలున్న కందకము, 29. ముఖమునకు పూసుకొను రంగులు, ఆలి చిప్పలు, గుల్లలు, తైలకలశములును, 30. గోరీ (సమాధి) చుట్టును వరుసగా నిరువదిమంది యంతఃపురకాంతలు. 31. ఇటుకలతో కప్పివేయబడిన ద్వారము, 32. రెండు వృషభవిగ్రహములు, 33. కాల్చిన యిటుకలతో కట్టబడిన సరియైన విలువంపు సరంబి, 34. మెస్కలాండగ్ రాజుయొక్క సమాధి, 35. వెండితో చేయబడిన మాదిరి పడవ, 36. బంగారపు పూవులు, ఆకులు, పూసలు, ఉంగరములు, జలతారు పట్టీలు, 37. రాతిగోడలు, 38. షూబ్ఆన్ రాణీయొక్క సమాధి, 39. బలి యొసగబడిన పరిచారకులు, 40. బంగారు, వెండి, రాగితో చేయబడిన నూటయేబది వస్తువులు, 41. బంగారు పూసలతోడను, అమూల్యములగు రత్నములతోడను పూర్తిగా నిండిపోయియున్న పైవస్త్రము, 42. కట్టతో చేయబడిన శవవాహనము.

బ్రిటిషు మ్యూజియమువారును, పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయ మ్యూజియమువారును కలసి చేసిన పరిశోధనలు అబ్రహాం జన్మస్థలమని ప్రతీతిగల, ఖాల్డీనుల దేశపు 'అర్' నగరమున నత్యాశ్చర్యకరమగు చరిత్రవిషయములను బయలుపెట్టినవి. ప్రాచీన సుమేరియనుల అంత్యక్రియలరీతికి నిరాక్షేపప్రమాణముగనున్న మూడు రాచసమాధుల కూడిక యిది. పూర్వము గ్రీకులు, ఒక సరదారు మరణించినయెడల నతని యశ్వము నొకదానిని కూడ చంపివేసి యతనితోపాటు దాని యంత్యక్రియలును జరిపెడి యాచారము కలిగియుండెడివారు. అట్లే భారతదేశమునను మరణించిన పతితోపాటు జీవించియున్న యతని భార్యనుకూడ చితినెక్కించునాచార (సతి) ముండెను. ఈరెంటినికూడ నత్యంతాల్పమనిపించి మించిన దీ ఛాల్డీయావారి దురాచారము. ఘన భూగర్భమున 40 అడుగుల లోతున పాడుపడి కట్టపని యంత్రశాలకువలెనైన లేనట్లు నశించి యమూల్యములగు లోహములతో చేయబడినట్టియు, రత్నములతో కూర్చబడినట్టియు ననేక వస్తువులచట కనుగొనబడెను. మృతుడైన రాజుతో నాతని కుటుంబము పరివారముతో పాటు వారి బండ్లను లాగు జంతువులు కూడ ప్రాణములు తీయబడి పూడ్చిపెట్టబడినట్లు వాని యెముకలన్నియు కనుబడుటవలన స్పష్టమగుచున్నది. భూతలమునకు 25 అడుగుల లోతున మెస్కలాండగ్ రాజు (సుమారు క్రీ. పూ. 3300) యొక్క సమాధి కనుగొనబడెను. ఈ సమాధి రాతిగోడలతోను, యిటుకతో కట్టబడిన కప్పుతోను నుండి చెక్కుడురాళ్లతో కట్టిన విలువంపు ద్వారోర్ధ్వభాగపు టతిప్రాచీన వైఖరిని తెలుపుచున్నది. ఆయిరుకుస్థలములో యరువదికి తక్కువకాని స్త్రీపురుష శరీరములయొక్క యెముకలు పడియున్నవి. ఆరు ఎద్దుల యస్థిపంజరములుకూడ నచట నున్నవి. ఈగోరీ పూర్వమెన్నడో కొల్లగొట్టి దోచుకొనబడినది; కాని యారాజు భార్య షూబ్ఆన్ యొక్క గోరీ యామె పతి సమాధికి 5 అడుగులపైని కనుగొనబడినది కాని పాడుచేయబడక భద్రముగ నుండెను. రాణి శరీరమంతయు నాభరణములతో మిక్కిలి యలంకరింపబడియుండెను. ఆమె తల టోపా (wig)పై యెత్తుగా కిరీటమువంటి భూషణము లదు. దానిం జుట్టియున్న బంగరు జలతారుపట్టీలు నొకటివెనుకనొకటిగ పరిభ్రమము చేసి విప్పగా నేడు యేండ్లక్రింద నది యెట్లు తళతళ మెఱసియుండునో అట్లే మెఱయుచుండెను. పరిశోధకులు దానినంతయు

ఈ పై చిత్రము అసలు (మూల)సర్వావయవ ముయొక్క ఊహాకల్పితము, యుక్తిసిద్ధమునైన స్థితిని చూపించుచున్నది.

('స్ఫియరు' 16-6-28 నుండి)

---

## 18-వ శతాబ్ద ఒక అప్పు పత్రము

కాకినాడ వాస్తవ్యులయిన కీర్తిశేషులు మల్లాది సత్యలింగం నాయకరుగారి విద్యార్థి వేతనముమీద నేను లండను విశ్వవిద్యాలయమున పి. హెచ్. డి. (P.H.D.) పరీక్షకు, ఆంధ్రదేశమునందలి కంపెనీవారి పరిపాలనము ప్రథమదశ (Early Revènue Administration of the Northein Circars, 1 60-1830) మీద కృషిసలుపుచున్న సందర్భములో, యీదిగువను విశద పరచిన అప్పుపత్రమును నేను చూచుట తటస్థించినది. ఇయ్యది బ్రిటిషు మ్యూజియములో పొందుపరుపబడి నది. దీనియొక్క ముఖ్యాంశములు యీవిధముగ వర్ణింప బడియున్నవి. (British Museum, Sloane MSS. No. 2,762. An East India Bond for Payment of a summe of mony in the Gentue Character and Language on the Leaf of a Palymerow Tree.) 'స్లోనుదొరగారి లిఖితపత్ర సమితియందలి 2,672 వ పత్రము. హిందువులభాషలో తాటియాకుపత్రముమీద వారిలిపిలో వ్రాయబడిన తూర్పు హిందూదేశపు అప్పుపత్రము.' దీనియొక్క నిజమైనకాలపరిమితిని నియమించుటకు తగినఆధారములు యేమియు లేవు. కాని, పత్రమునందలి భాషానియతి పలనేమి, అందలి అంశములను బట్టియేమి, ఆంగ్లభాషతో వర్ణింపబడిన పదములనుబట్టియేమి, తుదకు తాళపత్రముయొక్కయు, ఆంగ్లకరపత్రముయొక్కయు శిథిల దశనుబట్టి యేమి, యీఅప్పుపత్రము తూర్పు హిందూదేశపువర్తకసంఘము (East India Company) యొక్క ప్రథమదశయందలి వాణిజ్యవిధానములకు జెంది యుండవచ్చునని నేను నిర్ణయించితిని. యియ్యది యెనిమిదిన్నరఅంగుళములకు పైగా పొడవును, అర్థఅంగుళమునకుపైగా వెడల్పును కల, రెండాకులుకలిసిన తాళపత్రము. ప్రతిపత్రమునను ఒకవైపుననే మూడుపంక్తులు లిఖింపబడియున్నవి. ఈపత్రముయొక్క నకలును ఇందు పొందుపరచుచుంటిని.

మొదటిప్రక్క:—

పంక్తి (1) యువనామసంవత్సరం జ్యేష్ట బహుళ ౨ శ్రీమతు మేస్తరుగేముసన్ పెండ్లాం మాజిమగార్కి కొళంబ్కా.

పంక్తి(2) కం కేసువయకుమారుండు చినవెంక్కటపతి యిచ్చిన అప్పుపత్రం యీవిదాన మా అవసరనిమిత్తమై

పంక్తి (3) మీచాత అప్పుపుచ్చుకంన్న చెల్లుబడి చెన్నపట్ణం కొత్త [?] ౫౫౬ (New Madras Pagodas) అక్షరాలా చెంన్నపట్ణం కొత్తవరహా.

రెండవప్రక్క:—

పంక్తి(1) లు ఆరు యిందుక్కు వడ్డి నెల ౧ కి [కి] వరహాలు ౧౦౧ కి [కి] [?] ౫౫ ౧ లెన్డు వడ్డింన్ని మొదలుంన్ను మీరు అ

పంక్తి(2) డ్గినప్పుడె యీయ్యగలవారం. యీపత్రానకుసాక్షులు శ్రీరంగశెష్టింన్ని, దుబాశిమూర్తికాంన్ని

పంక్తి(3) విరుల [వీరల?] సంమ్మతిని వెంక్కటపతి వ్రాశిన అప్పు పత్రం. "కేసువయచేవ్రాలు."

యీపత్రం అతిసులభంగా అర్థము చేసికొనదగినది. కొళంబాకం కేశవయ్యగారి కుమారుడు మాష్టరు జేమిసన్‌గారిభార్యకు (Mr. Jameson's wife, otherwise commonly addressed as Madam) స్వనిమిత్తంగా అప్పుతీసుకొనిన ఆరు వరహాలకు, నూటికి నెలకు ఒకవరహాచొప్పున అసలుఫాయిదాలతో అడిగినప్పుడు ఇవ్వగలవారలు అని. యిందుకుసాక్షులు శ్రీరంగిసెట్టిగారు, దుబాసిమూర్తిగారు.

ఇట్టి సులభమైన పత్రమునుంచి మనముకొన్ని విషయములను స్పష్టపరుపగలము. మొదటిది పదునెనిమిదవ శతాబ్దమునందలి ఆంధ్రభాషయొక్క పొందిక మనకు కొంచము ఆనందము కలుగజేయగలుగుట. రెండవది అప్పటి వ్యవహారములన్నియు, కావ్యములరీతిని, తాళపత్రములమీద లిఖించుచుండిరనుట. అప్పటి వడ్డి విధానము నూటికి నెలకు ఒకటిచొప్పున సామాన్యముగ వ్యవహరింపబడుచుండుట మూడవది. యిక నాలుగవది, ఆంధ్రదేశములో వృద్ధులయనుభవములో నున్న పూలవరహా, కరుకువరహా అను నాణెముల విధానములో ఈకాలమున ముఖ్యముగా కరకువరహా అయియున్నదని. నేను చేయుచున్న పరిశోధనలలో కూడ యీసిద్ధాంతమును బలపరచుమహాంశములు పెక్కులు బయలుపడినవి. పైగా, మనపత్రమునందలి "౫౫" అనుఅక్షరములు యీకరుకు

వరహాను సూచించునను నూహ నొకదానిని ప్రతిపాదించుచున్నాను. ఈకరుకువరహానే, తూర్పుహిందూదేశ వర్తకసంఘపువారి చిఠాలలో మదరాసుపగోడా అని వ్యవహరించుచుండిరి. దీనివిలువ యిప్పటిమూడు రూపాయలకంటె కొంచెము హెచ్చు. అయిదవది, యీ జేమిసనుదొరగారు వర్తకసంఘమువారియొక్క స్థానముల (అనగా బందరు, విశాఖపట్నము, మాధవాయిపాలెము, యింజరము, గంజాము మున్నగునవి) యందలి ఉద్యోగిగా మనమూహింపవచ్చును. దీనికి కారణములు రెండు. క్రింద సాక్షులలో యిద్దరి పేరులు తెలుపబడినవి. వారలలో మొదటివాడు శ్రీరంగశ్రేష్టి. ఈకాలపు వర్తకపుసంఘవ్యవహారములలో, ఆంధ్రదేశము (అనగా ఉత్తరసర్కారులు) వారిపరిపాలనములో ఉండినప్పటికిని, ఇప్పటిమాదిరి రాజ్యాంగవిధానములు లేవు. దేశము యిజారాపాటలమీద కొట్టివేయబడుచుండెడిది. అట్టిసందర్భములలో జమీందారులే కాకుండా సామాన్యపుధనికులుకూడ పాటపాడుచుండెడివారు. పాటకొట్టివేయబడినవెంటనే, కొంతధనము చెల్లించి, మిగతదానికి హామీలను నిరూపించు అలవాటుగలదు. ఈహామి వ్యవహారపుచిఠాలలో వర్తకులు, సాహుకారులు, వర్తకసంఘ పరిపాలనాదక్షులకు హుండీలను ఇచ్చుచు వచ్చిరి. ఈవిధంగా యీసంఘమును అనుసరించి యెక్కువపలుకుబడిగల్గినవర్తకులు అనేకులు గలరు. మన శ్రీరంగశ్రేష్టి అట్టివర్తకుడు అయియుండవలెను. రెండవది, ద్విభాషి మూర్తిపంతులు. ఈ కాలములో ప్రభుత్వపు వ్యవహారములన్నియు దుబాసులు (dubash) అనబడువారిచేత నడుపబడుచుండెడివి. దుబాసియొక్క మూలము సంస్కృతమందలి ద్విభాషి; అనగా రెండుభాషలు నేర్చినవారని అర్థము. వీరు ప్రభుత్వోద్యోగులవద్ద వేతనములు పుచ్చుకొని, ఆంధ్రప్రజాబాహుళ్యమునకు ఆంగ్ల భాషరామింజేసి, వారి నివేదికలు ఆంగ్లమునకు తర్జుమా జేయుచుండెడివారు అనగా ప్రజలయొక్క వా(క్)స్థానమునందుండి ప్రభుత్వమువారియొక్క వ్యవహారములు నడుపుచుండెడివారు. ఇట్టివారిలో రాజమహేంద్రవరం మజుందారు అయిన రాజాకాంద్రేగుల జోగిపంతులు, వెంకటరాయ మున్నగువారలు. మనము వ్యవహరించుకాలములో ప్ర గాంచినవారలు. ఇట్టివారే మనమూర్తిపంతులుగా యిక కొళంబాకం కేశవాయి, వారిపుత్రులు వెంక యీ జేమిసనుదొరగారి నౌకరులుగ ఉండినట్లు ఊహ వచ్చును. ఇందుకు తార్కాణమువారియొక్క యింటి కొంచము క్రొత్తగా ఉండుట, చేవ్రాలు "కేశవ చెరలు" (కేశవాయి చేవ్రాలు) అని వికృత వ్రాయుట. దొరగారిభార్యను వారి యలవాటు ప్ర మేడమ్ అనగా యజమానురాలు) అని వ్రాయు

యిట్టి పత్రమును బ్రిటిషుమ్యూజియ జాగ్రత్తగా భద్రపఱచుట అతిసంతోషకరము.

లంక సుందరం (యం. ఎ)*

---

## బ్రిటిషువారికై భారతీయులు కావించిన యుద్ధములు

'బ్రిటను భారతదేశమునకు ప్రసాదిం శాంతిని'గూర్చి జులై 'మాడర రివ్యూ' ప యందు వ్రాయుచు డాక్టరు సండర్లాండుగా నేడు భారతదేశమున బ్రిటిషువారివలన ప్ర ష్ఠించి వెలయుచున్న శాంతి యని చెప్పబ చున్నది యుద్ధముకంటె నికృష్టతరమనియ అట్టిదానికైనను భారతీయులరక్తము నదు గట్టి ప్రవహించెననియు నిరూపించుచు బ్రిటి వారు భారతీయులచే చేయించిన యుద్ధము గొన్నిటి బేర్కొన్నారు.

పార్లమెంటునివేదిక ప్రకారము 19 శతాబ్దమున బ్రిటిషుదేశము భారతదేశ

---

* వీరు రాయలు ఆర్థికసంఘపు గౌరవసభ్యులు; లండను విశ్వవిద్యాలయమున సత్యలింగంగారి వద్ద విద్యార్థిగ నున్నారు. వీరి ఛాయాచిత్రము భారతి సంపు. ౮. సం. ౧౧. నందు గలదు.

నిమిత్తమై, చాలవఱకు భారత దేశపు సరిహద్దులయందు, 111 కు తక్కువ కాకుండ యుద్ధములు, ముట్టళ్లులు, దండయాత్రలు సలిపి యుండెను. ఇంచుమించ చన్నియును, నూర్లేగారు వివరించినట్లు, హింసా ప్రయుక్తములు. బ్రిటిషువారుఅంతకునుపసాకులు పన్నినను— పొరుగురాజు పేచీకోరనియో, అల్లరిపెట్టువాడనియో, హిందూ దేశమున అక్రమప్రవేశము చేయుటచేదండార్హుడనియో,హిందూ దేశమున కింకను మంచిసరిహద్దు లేర్పఱుపవలెననియో, ఏదోయొకమిష కనబఱిచి సమర్థించుకొనచూతురుకాని—వారి ఆశయముమాత్రము క్రొత్త రాజ్యభాగము సంగ్రహించుకొనుటకే. ఆంగ్లేయరక్తముకంటె భారతీయరక్తము చౌకయని భావించి బ్రిటను దేశము భారతీయులకే యీ యుద్ధాదికములయందు రక్తము దారవోయుభార మప్పగించెను. ఆంగ్లేయాగమనమునకుపూర్వము భారత దేశమంత వైరములతో నిండియుండినను, భారతీయరాజ్యములలోను, భారతీయరాజన్యులలోను గల విద్వేషములు తప్పి బయల్పడినప్రజలు తత్థానమున బ్రిటిషువారి నిమిత్తమై యిరుగుపొరుగుజాతులపై ఎడతెగని దండయాత్రలు, కయ్యములు సాగించుచు, కోట్లకొలది ప్రాణము లాహుతి చేయుటకు—అదియువిదేశీయ విజేతలరాజ్యము విస్తరించి బలము పెంపొందించుటకుగాను— బలాత్కృతు లగుట భారత దేశమున కొక గొప్పమేలా యని ప్రశ్నించి, డాక్టరుగారు 1859 మొదలు 1900 ప్రాంతమువఱకు, చాల భాగము భారత దేశపు ఎల్లలకడను, కొన్ని సుదూర దేశములందును, బ్రిటిషువారు భారతీయులచే మెడలు విరిచి చేయించిన యుద్ధములును, దాడులును ఈ క్రిందివిధమున పేర్కొన్నారు—ఇదియు పూర్తియగుజాబితా కాదట:

చైనాలో 1860, 1900 సం.ల రెండుయుద్ధములు; 1864–65 న భూటానుయుద్ధము; 1868 న అబిసీనియనుయుద్ధము;1878–79 సం.పుఆఫ్ఘనుయుద్ధము; కాబూలుమిషనుసంహారానంతరము,1879–80న రెండవఆఫ్ఘను యుద్ధము;1882 సం. ఈజిప్టుయుద్ధము; 1885 న బర్మాయుద్ధము;1886 లో ఉత్తరబర్మా ఆక్రమణముతో అంతమైనది;సితానాపై 1858న చిన్న దాడి,1863 న పెద్దదండయాత్ర 'సితానా దండయాత్ర'; 1859 న నేపాల–సిక్కిము దండయాత్ర; 1864 న సిక్కిము దండయాత్ర; 1858 న పశ్చిమోత్తరప్రాంతమున గొప్పకలహము; 1871–72 న 'లూషాయీల'మీదికి దాడులు; 1875 న 'నాగుల' మీదికి; 1877 న 'ఆఫ్రిడీల'మీదికి; 1879 న 'రంపు'లను కొండజాతివారిపైకి; 1881 న 'వూజీరిజుల'పైకిని, 'నాగుల'పైకిని; 1884 న 'ఆఖుల'మీదికి; 1884 న ఝూబ్ లోయమీదికి; 1884 న అచ్చటికేమఱియొకసారి;సిక్కిమునందు 'ఆకజాయిల' మీదికిని ('నల్లకొండదాడి'), పూర్వోత్తరపర్వతజాతులమీదికిని' 1888–89 న దాడులు; 1890 న ఇంకొక 'నల్లకొండదాడి'; 1892 న మఱొక్కటి; 1890 న మణిపురముమీదికి దండయాత్ర; 1891 న 'లూషాయీల'పయి నింకొకదాడి; 1891 'మిరాజ్జలు' లోయలోనికొకటి;1897–98 న 40,000మంది తో గొప్ప దగు'టిరా దండయాత్ర'; 1901 న 'ముష్టూదుల'పై కొకదాడి; 1902 న కాబట్లామీదికొక దండయాత్ర; 1904 న టిబెటుదండయాత్ర. ఇవిగాక సుదూరములగు మాల్టా, సైప్రస్ దీవులకు భారతీయదళముల బంపుటయు, ప్రసిద్ధమైన 'రష్యన్ మెనేస్' (రష్యాభీతి)నెపు రొక్కనుటకై సైన్యవ్యాపారముల నిమిత్తము 10,000,000 డాలర్ల వ్యయపఱుచుటయు పేర్కొనదగును.

ఈజాబితా నమ్మ వీలు లేనంత పెద్దదయ్యు, 1859 సం.కు పూర్వమును, 20-వ

శతాబ్దముననే జరిగిన యుద్ధములును, దండ యాత్రలును ఇందు లేనే లేవు: ఈయన్నిటను, (1914-18) ఐరోపామహాసంగ్రామముననే భారతీయులు ఘోరముగ, సార్థకముగ పోరియుండిరి. బ్రిటను దేశము తన భారతీయేతిహాసము పొడుగునను ఎడతెగని స్వార్థపరములగు యుద్ధములు సాగించిన విధమును తెలియజేయుటకీజాబితా చాలి యున్నది.

## మృత్యుకాల మహత్త్వము

శాస్త్రదృష్టి లేనిపక్షమున మనుజుండంధుండనియే చెప్పవచ్చును. మనయింద్రియములు మిగుల ప్రబలములు. శాస్త్రదృష్టివలన మనకర్తవ్యాకర్తవ్యముల విచారణ చేసికొనకపోవుటవలన నెంతేని హాని కలదు. ప్రకృతి యీశ్వరసంబంధమయినమాయ. మనశరీరముల కదియే ఉపాదానము. ఆమాయకూడ మిక్కిలి ప్రబలయే. కాబట్టి, మనశరీరమునుగూడ మనయధీనమునం దుంచుకొనుటకై శాస్త్రదృష్టివలన మనవిచారములను సర్వదా నిర్మలములుగాను, శుద్ధములుగాను ఉంచుకొనుటకు ప్రయత్నించవలయును. అట్లు చేయనిపక్షమున, ఇంద్రియములు, ప్రకృతి యేకమయి, బండిని పెంకెగుఱ్ఱము లేప్రకారముగా ఇచ్చకువచ్చినమచ్చున లాగి గోతం బడద్రోయునో అదేప్రకారముగా మనుజుని అధోగతి మార్గమునకుం దీసికొని పోవుచుండును. సాధారణ మనుజునియందును, శాస్త్రదృష్టిగల మనుజునియందును గుర్తింపందగినభేద మొకటి గలదు. సాధారణ మనుజుండు ప్రియాప్రియరూపమయిన వలలోం బడియుండిపోవును. కాని, శాస్త్రదృష్టిగల మనుజుండో సిద్ధాంతశాస్త్రముల-పరిశీలనవలన బుద్ధిని పవిత్రముగం జేసికొని విచారణపూర్వకముగా ఆత్మకల్యాణము విషయమున ప్రవర్తించువాండగుచుండును. "ఇది నాకు బాగుగానున్నది, ఇది నాకు చెడ్డదిగా నున్నది" అను నిట్టి విచారణయు, "దీనివలన నాకు మేలు గలుగును, శ్రేయస్సాధనమగును, లేక, అశ్రేయస్సాధన మగును" అను నిట్టి... రణయు నొకటి కాదు. రెండింటియందును భూమికిని ఆ... శమునకును ఉన్నంత అంతరము గలదు. కేవలము ... ద్రియతృప్తిపరాయణులయిన మూర్ఖులింద్రియ... లను సార్థకముగా చేసికొనుటకై ప్రియాప్రియముల... రించుచుందురు. కాని, పరమార్థమును కోరుకొను... ప్రియాప్రియరూప మయినవలలోం జిక్కుపడక ... కల్యాణమునిమిత్తము శ్రేయస్సంగ్రహతత్పరులగుచుం...

ఏమనుజుండు మరణావస్థయందుండునో ... గూర్చి ప్రస్తుతకాలములో చేయంబడుచుండెడి... మిక్కిలి చెడ్డవి యనియును; శాస్త్రదృష్టినిబట్టి కా... జ్ఞానదృష్టినిబట్టి కాని, ఆలోచించినపక్షమున మరణి... చున్నవాని కమంగళకరము లగుటవలన సర్వవి... చేతను హేయములు-అనంగా, విడిచిపెట్టందగినవని... చెప్పకతప్పదు. సిద్ధాంతశాస్త్రజ్ఞానాభావము ... బుద్ధిభ్రష్టతవలనను మన మట్టిచేంతలు చేయుచుం... మరణించుచున్నవానికి జీవము శరీరముతో విచ్ఛేద... పొందుసమయ మెంతేని మహత్త్వము గల దనువిషయ... మున నెంత చెప్పినను హెచ్చు కాంజాలదు. వి... లుండు, జ్ఞాని యగువానికి బ్రదికినబ్రదు కంతయు ... విధముగా తపము లేక యజ్ఞము. మృత్యుసమయ ... పస్సు లేక యజ్ఞమునకు ఫలప్రాప్తిసమయము. ... వంటిసమయము దురుపయోగ మగుటవలన వానియ... వపుతపముతాలూకు లభింపవలసినఫలప్రాప్తిలో విఘ్న... ప్రాప్తించుటయు, చేసినతపస్సంతయు నష్టప్రా... మగుటయు సంభవించెడిని. మనసిద్ధాంతశాస్త్రము... ఈవిషయమునం జేయంబడినయుపదేశ మేదేని ధర్మ... షముకొఱకుం గాదు. ఆఉపదేశము వ్యాపక ... సార్వజనీన మనవచ్చును. ఇది యేప్రకారముగా ... వాదులు, శైవులు, శాక్తేయులు, వైష్ణవులు ... వారివిషయమున నిర్విశేషరూపముగ సంబంధపడి... న్నదో మతాంతరాను యాయులవిషయమునను ... ప్రకారముగానే సమానరూపమున సంబంధపడియున్న... వారు ముసల్మాను లగుదురు గాక, క్రైస్తవు లగుదురు గాక, లేక, యితరమతముల నంగీకరించువారే ...

దురుగాక. ఈయుపదేశము మనప్రాచీనధర్మశాస్త్రముల ప్రాశస్త్యముతోఁబాటును, మనపూర్వాచార్యుల తత్త్వదృష్టితోఁబాటును గాంభీర్యముయొక్కయు, విచారముయొక్కయు అసంకీర్ణతకు పరిచాయకమగుచున్నది. ఇటువంటి ఉచ్చకోటిని చెందినవిచారము లున్నప్పటికిని మనలోనుండి వేలకొలఁది, లక్షలకొలఁదిసంఖ్యలో అన్యధర్మమును గ్రహించియున్నారు. ఇప్పుడును కొంచెము కొంచెము గ్రహించుచునే యున్నారు. దీనిని గుఱించినదోష మీప్రకారముగా అన్యధర్మమును గ్రహించినవారి యందుఁగాని, వీరిని తమలోఁ గలుపుకొన్నవారియందుఁ గాని లేదు. ఏమా? ధర్మాంతరగ్రహణము చేయువారు శాస్త్రజ్ఞాన రహితులయిన అంధవిశేషులు. దీనిదోష మంతయు దేశమును, సమాజమును సంరక్షించువారిపయిననే యున్నది. బిడ్డలు అశిక్షితులును, మూర్ఖులును అయినపక్షమున, వారి తలిదండ్రులేకదా పూర్తిగా దోషులగుదురు. ఆప్రకారముగానే ఒకధర్మమును విడిచి యెవరేని ధర్మాంతరమును గ్రహించినపక్షమున, అందునుగురించి, ఆధర్మమును సంరక్షించువారు బదులుచెప్పవలసినవా రగుచున్నారు. ఏమా? వారు స్వమతానుయాయులలో స్వధర్మతత్త్వముల జ్ఞానప్రచారమునకు తగిన యేర్పాటు చేయనివారును, వారిలోనుండి జాఱిపోయినవారి శారీరిక మానసికాత్మక క్షుధానివృత్తికి ప్రయత్నమేనియు చేయనివారును అగుచున్నారు. కనుక సత్యము నపలపింపకున్నపక్షమున, ఎవరైతే ఆహారము లేక చనిపోవుచున్నవారి కాహారమిచ్చియు, అనాశ్రయుల కాశ్రయ మిచ్చియు తమవారినిగాఁ జేసికొనుచున్నారో వారు ధన్యవాదములకు పాత్రు లనకతప్పదు. కాని, మనము—ఇటువంటిదుఃఖితులనిమిత్త మేమియుఁ జేయనిమనము, ఈప్రకారముగా మన-అంగములనే కోసివేసి యితరుల-అంగములతోఁ గలుపుట కవకాశ మిచ్చినమనము—మనయీకర్తవ్యభ్రష్టతను విచారించి యాత్మగ్లానివలన తలలు వంచుకొనవలసియున్నది. మనదోషముల నితరులశిరములపై నుంచుప్రయత్నమును విడువవలయును.

ఈశరీర మాత్మ సుఖదుఃఖముల ననుభవించుటకైనయంత్రము. వ్యాధివలన నైననేమి, మఱియేయితరకారణములచేత నైననేమి యేసమయమున ఈశరీరము దుర్బలము, శక్తిహీనము నగుచున్నదో, ఏసమయమున నీదుర్బలతయు, శక్తిహీనతయు చరమదశను పొందునో ఆసమయమున జీవుఁడీశరీరమును వ్యర్థము అనఁగా నెందులకును ఉపయోగింపని దని యాలోచించి విడిచిపెట్టుచున్నాఁడు. వెంటనే భోగయోగ్యమయిన యితరశరీరమును గ్రహించుచున్నాఁడు. ఈభావమునే గీతలో— "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి, తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ" (గీ. ౨—౨౨) అనఁగా, మనుజుఁ డేప్రకారముగా ప్రాఁతవస్త్రములను విడిచిపెట్టి క్రొత్తవస్త్రములను ధరించుచుండునో, జీవుఁడును అదేప్రకారముగా ఒకశరీరము జీర్ణ మయిపోయినపిమ్మట దానిని విడిచిపెట్టి క్రొత్తశరీరమును ధరించుచుండును. ఆసమయమున బహిర్ముఖమయిన జీవునిప్రసారమంతయు నంతర్ముఖ మగుట కుపక్రమించుచుండును. ఇంద్రియములు తమవిషయములను విడిచిపెట్టి తమసూక్ష్మరూపములవలన ప్రాణవాయువులోనికి ప్రవిష్టము లగుచుండును. ప్రాణ మింద్రియముల సూక్ష్మతత్త్వమును స్వీకరించుచునే హృదయమునందు ప్రవేశించును. హృదయమునందే పురుషుఁ డనఁగా, జీవుఁడు నివసించుచుండును. అపుడు హృదయముతోఁబాటు ముందుభాగము ప్రదీప్తమగుచుండును. ఆవెలుఁగుసాయముననే జీవుఁడుతనముందుమార్గమును చూచుకొనుచు శరీరమునుండి ముఖాదులలో నేదేని యంగముగుండా బయలుదేఱును. వానివెంబడినే ప్రాణము బయలుదేఱును దానితోఁగూడ నింద్రియములు, శుభాశుభములగు కర్మములు, ఆర్జితమయిన విద్య, జ్ఞానములు మొదలయినవన్నియు 'సూక్ష్మరూపమున బయలుదేఱును. ఈవిషయమునే గీతలో సంక్షేపముగా నిట్లు చెప్పినాఁడు కృష్ణభగవానుఁడు"శ్లో. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః, గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్" (గీ. ౧౫-౮) అనఁగా, జీవుఁడు మనసును, ఇంద్రియములను గ్రహిం

చుకొనుచునే జన్మమును పొందుచుండును. దేహమును త్యజించిపోవునపుడు వీని నట్లే వాయువు పుష్పాదిస్థానములనుండి గంధమును తీసికొనిపోవునట్లు తీసికొనిపోవుచుండును. "పూర్వజన్మార్జితా విద్యా పూర్వజన్మార్జితం ధనమ్, పూర్వజన్మార్జితా భార్యా చాగ్రే ధావతి ధావతి" అనఁగా, ఇవన్నియు జీవుని వెంబడించుచుండుననుట. పై నుదాహరించిన గీతాశ్లోకముతో నీశ్లోకమును కలిపి సమన్వయించుటవలన నీవిషయమున బృహదారణ్యకములోని వాక్యముల—అర్థము స్పష్టము కాఁగలదు. ఏసమయమున జీవుఁ డీశరీరమునుండి బయలుదేటి పైని చెప్పఁబడినప్రకారము పోవుచుండునో, ఆసమయమున వానివిచార మెట్లుండునో దాని ననుసరించియేఆజీవునిగతి ముందుజన్మములోనగును. కనుకనే "యాంతే మతిస్సాగతిః" అని పెద్ద లన్నారు. జీవుని భావిజన్మకల్యాణమును ధ్యానమం దుంచుకొనియే మనమంత్రద్రష్టలు మాటిమాటికిని మృత్యుకాలమునందలి మాహాత్మ్యమును వర్ణించినారు. "అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్" (గీ. ౮-౫.) "యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్" (గీ. ౮-30) "స్థిత్వాస్యామన్తకాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి" (గీ. ౨-౭౨) "యథాచ మరణం ప్రాప్య ఆత్మా భవతి." (కఠ. ౫-౬) "ఏతద్వై పరమం తపః. యద్వాహితః తప్తప్యతే" (బృ అ ౫-౫౦ ౧౧. ప ౧) "జన్మజన్మ ముని యతన కరాహీం, అంత రామ కహి ఆవత నాహీం. (తులసీరామాయణము.) ఇత్యాదులు

ఇఁక నీవిషయమున ఆలోచింపవలసిన సంగతి యేమనఁగా? మరణావస్థలోనున్న వాని నలువయిపులను గుంపుగూడి బంధుగులు నెత్తి నోరు మొత్తుకొనుచు నెన్నో విధముల నేడిచి యల్లరిచేయుచుందురు గదా! అట్లు చేయుట వానివిషయమున తగునా తగదా? ఈరోదనాదుల ప్రభావము వాని కేమిటి కలిగించును? అనునదియే. జీవుఁడు బ్రహ్మమునంశే మని "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" (. ౧౫-౭) అను గీతావచనమువలనను, "జీవో బ్రహ్మైవ నాపరః" అను శ్రీశంకరభగవత్పాదుల వాక్యమువలనను, "ఈశ్వర జీవహి నహీ కఛు భేదా" యను తులసీరామాయణవాక్య వలనను పరమసిద్ధాంత మగుచున్నది. ఆజీవుఁడు స్వభావ ముచలననే శుద్ధబుద్ధస్వరూపుఁడు. అతఁడు స్ఫటికము లేక నిర్మలమయిన జలమువలె స్వచ్ఛుఁడు. శుద్ధమయిన స్ఫటికము నెదుట నేవస్తు వుంచఁబడునో దాని ప్రతి బము దానియందు ప్రతిఫలించును. శుద్ధమయిన జలము నేపాత్రమునందుఁ బోయుదుమో అది తదాకారము పొందును. జీవునివిషయమునను సరిగా నట్లే యని చెప్ప యఁదగును. జీవునియెదుట నాసమయమున నేవస్తు యుంచఁబడునో అతఁ డద్దానియాకారమునే గ్రహించు చుండును. దీనినే పాతంజలయోగశాస్త్రములో వృత్తి సారూప్య మన్నారు. ఈపరమార్థతత్త్వమునే సిద్ధాంతులు క్రిందివిధమున వర్ణించినారు. "శ్రద్ధా యోఽయం పురుషః" (గీ. ౧౭-3.) "కామమయో యంపురుషః (బృ౪-౪-౫)" "క్రతుమయోఽయంపురుషః (ఛా. 3-౧౪-౧.)" మనోమయోఽయం పురుషః (బృ. ౫-౬.) ఇద్యాదులు.

జీవుఁడు మనస్సుతోలూఁడ అధ్యక్షశక్తిచే ఇంద్రియములద్వారా విషయముల ననుభవించుచుం "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (కఠ 3-౪.) అనఁగా, ఇంద్రియములతోను, మనస్సు తోను కూడిన ఆత్మయే భోక్త యని పండితు లన్నా ఈయింద్రియములే బయటివిషయములను జీవుని త్తము మనస్సునొద్దకు పంపుచుండును. ఏవిషయ యింద్రియగోచర మగునేని, అది మనస్సుద్వారా యొద్దకు చేరును. ఎంతవఱకు శరీరమునందు శక్తి డునో అంతవఱకును మనస్సు, ఇంద్రియములవిషయ లనుండి మంచిచెడ్డలను గమనించుచుండును. శక్తి చున్న కొలఁదిని మనస్సుతోలూఁడ వివిచారశక్తియు చుండును. తుదకు ఫలిత మే మగుచున్న దనఁగా, చివిగానీ, చెడ్డవికానీ యెట్టివయినను ఇంద్రియము తమవిషయములను మనస్సుద్వారా ఆత్మ కందించు డును. ఇపు డేమనుజుఁడు తన బ్రదుకంతయు వరి రముతోలూఁడ మేలుకొఱకును దానిభరణపోషణ ముల కొఱకును దారపోయుచున్నాఁడో అట్టి

కిట్టి శక్తిహీనమయిన దశలో వానిపరివారమంతయు చుట్టును గుంపుగూడి నెత్తి-నోరు మొత్తుకొనుచు ఏడిచి అల్లరిచేయుచున్నపుడు ఇఁక నాఁడీనునిదుఃఖమున కేమయినను హద్దుండునా? అట్టిస్థితిలో వాఁడు తనపరివారము నోదార్చువిషయమున నేమియుఁ జేయఁజాలఁడు సరిగదా! తుదకు మాటలయినను ఆడఁజాలఁడు. పరివారమునకు సానుభూతిచూపుటకు ఏవిధమైన ఉపాయమును వానియొద్ద సిద్ధముగా నుండదుగదా! అటువంటి యసహ్యావేదనను సహింపలేనికారణమున వాఁడు కేవలము కన్నుల నీరు పెట్టుకొనుచు పరివారము నోదార్చును. కాని, ఈఘటనతాలూకు ప్రభావము వానివిషయమున నేమగునో ఆసంగతియు నందఱికిని విచారింప వలసియుండును. తనయావజ్జీవము ప్రాణములకు సయితము తెగించి పరివారమునకు చేసినసేవకు బదులుగా పరివారము వానిభావిజీవనమంతను దుఃఖమయమగునట్లు చేసివేయుచున్నది. ఏమా? శరీరమునుండి బయలుదేఱునపుడు జీవుఁడు దుఃఖమయమయిన దృశ్యమునే తోడఁ దీసికొనిపోవుచున్నాఁడు. దీనినే నిష్ఠురదయ యందురు. జడభరతుఁడు ఆత్మచింతనలో నేవిధమయినవిఘ్నము నుకలుగకుండఁ గాక యనియే తనయావజ్జీవము వనవాసము చేసినాఁడు. ఏజడభరతుని స్త్రీపుత్రాదుల ప్రేమమయ బంధనము సంసారములో బంధించి యుంచుటకు సమర్థము కాఁజాలకపోయినదో ఆయనకే అసహాయమయిన ఒక్క లేడిపిల్లయందలి స్నేహము లేడిజన్మము నెత్తించుటలో సమర్థమయినది. ఇది యెట్టివిచిత్రమయిన సంగతియో కదా! ఏమా? అతఁడు మరణించుసమయమున—ఈలేడిపిల్లను నేనసహాయావస్థలో విడిచిపెట్టి పోవుచున్నానే, ఈనిర్జనారణ్యములో నింకొకమనుష్యుఁడయినను ఉండిన పక్షమున దీనిభరణపోషణముల భారమును వానికప్పగించి పోదును గదా—అనియే యాలోచించుచుఁ జనిపోయినాఁడు. ఈప్రకారముగ లేడిపిల్లభరణపోషణములనుగుఱించి చింతించుచుండఁగానే యతనికి దేహత్యాగము తటస్థించినందున యావజ్జీవము తానుచేసిన ఆత్మచింతనమునకు కలుగవలసిన ఫలమునకు బాధయేర్పడినది. తుద కాతనికి హరిణజన్మమెత్తక తీఱినదికాదు.

ఇంతే కాదు. తానెంత నిష్కామకర్మమును చేసినవాఁడయినను, ఎంతటి యోగాభ్యాసము చేసినవాఁడయినను, ఎటువంటి జపతపములు చేసినవాఁడయినను దేహికి దేహముతో వియోగము కలుగునప్పుడు వాని ధ్యానము తనదృశ్యవస్తువుపయి నుండనిపక్షమున, మనస్సు సచ్చిదానందచింతన చేయుచుచేయుచు బయలుదేఱని పక్షమున, ఇతరవిషయములతో సంబంధము గలిగియుండినకారణమున మరల జన్మమును పొందకతీఱదు. వాని నిష్కామ కర్మమంతయు సకామకర్మముక్రిందను పరిణమించకయు మానదు, దానిని వాఁడనుభవింపకయుఁ దప్పదు.

మఱొకవయిపు దృష్టిని ప్రసరింపఁజేసి చూచెదముగాక. ఎటువంటిదుష్కర్మములు చేసినవాఁడయినను దేహదేహివియోగము కలుగునప్పుడు వానిబుద్ధిలో సాత్త్వికభావము కలిగి వానివిచారములు పవిత్రములయినపక్షమున వాని కుత్తమగతి లభించితీఱును. ఏమా? అజామిళునకు లభించినది గాదా? యావజ్జీవము పాపకర్మములు చేసినవానికి మరణసమయమునఁ బరమార్థభావము కలుగఁజాలునా చాలదా యనువిషయము సందేహించవలసినదే. కాని, పూర్వజన్మసంస్కారమువలన, ఒకవేళ నేవిధముగా నయినను పరమార్థభావము కలిగిన పక్షమున వానిసద్గతివిషయమున సందేహింప నక్కఱలేదు ఏమా? ఇది ముమ్మాటికిని సత్యము. ఇందులకుఁ గారణము లేకపోలేదు. జీవుఁడు స్వభావమువలననే శుద్ధబుద్ధముక్తస్వరూపుఁడుగదా! వానికి తనశుద్ధస్వరూపము ధ్యానములోనికి వచ్చినతోడనే సుకృత దుష్కృతరూపమయిన వాని యావరణము తనంతనే తొలఁగిపోవును. పుణ్యపాపములన్నియు అగ్నికణముపడిన దూదిరాశిమాదిరిగా నష్టమయిపోవును. ఈవిషయమును మనస్సునందుంచుకొనియే—"యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్, తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే" (గీ. ౧౪..౧౪.) అనఁగా, సత్త్వగుణము వృద్ధియయిన సమయమున జీవుఁడీశరీరమును విడిచిపెట్టిన పక్షమున ఉత్తమతత్త్వమును తెలిసికొన్నవారినిర్మలలోకములు వానికి లభించును—అని కృష్ణపరమాత్మ వచించియున్నాఁడు.

కాఁబట్టి, మనము చేయఁదగినది యేమనఁగా, ఏ మనుజుఁడయినను మరణశయ్యయందు పడియున్న పక్షమున సాంసారికభావములు పూర్తిగా వానిస్థానమునుండి తొలఁగింపబడవలయును. వానిలోపలను ఉత్తమోత్తమములయిన భావములు కలుగుటకుఁ దగినప్రయత్నములు చేయవలయును. వానియొద్దను మంచిమంచి విషయములనే చర్చించుచుండవలయును. వానిస్థానమును పవిత్రముగ నుంచవలయును. వానికి భగవద్గుణములు వినిపించుచుండవలయును. ధార్మికమయిన దృశ్యమును చూపించుచుండవలయును. అట్లు చేసినపక్షమున వానిలోపలనుండి దుర్భావనలు వీలయినంతలో వెంటనే దూరమగును. వాఁడీశ్వరచింతన చేయుచునే ఉత్క్రమించును. ఒకవేళను, పరివారము తనకుఁ జేసిన సేవకు బదులుగా వానికేమయినను చేయఁగలిగినపక్షమున నిదియే. అంతేకాని, పరివారము, వాఁడు తనకుఁజేసిన సేవారూపమయిన పురస్కారమునకు బదులుగా ప్రకృతకాలములో జరుగుచున్నట్లు తిరస్కారము చేసి వానియధోగతికి మార్గము చక్కఁజేయుటయా? జీవుఁడు శరీరమునుండి బయటికి వెడలిపోయినతర్వాతను తల పగులఁగొట్టుకొనుఁడు, గుండెలుపగుల బాదుకొనుఁడు కాని, వానికిటువంటి దృశ్యములు చూపించుట మాత్ర మాలోచించి చూడఁగా, వాని మంచిమార్గములో కంచెలు కొట్టుటయే యగును. కాఁబట్టి జీవకారుణ్యముగల ప్రాజ్ఞులీసంగతులను జ్ఞప్తియం దుంచుకొని మూర్ఖులక్షేమమునకై యథాశక్తి పాటుపడుదురుగాక. "యా న్తే మతి స్సా గతిః" అన్న పెద్దల యథార్థవాక్యమును మఱవకుందురుగాక. (మాధురి)

[పు. సూ. నా.]

---

## ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, చెన్నపురి

**(Government Oriental Manuscripts Library)**

ఈ భాండాగారమున తెలుగుభాష నున్న వ్రాతపుస్తకముల నన్నిటిని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు చెన్నపురప్రభుత్వమువారిని తమవశము చేయ కోరిరనియు, ప్రభుత్వమువా రందుల కంగీకరించిరనియు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు గ్రంథములను త్వరలో గొనిపోవ నున్నారనియు పత్రికలు ప్రకటించినవి. ఇది ఎంతవఱకు విశ్వసింపదగినదని యూహింపవలసియుండగా అట్లు 'చేయరా'దని కరపత్ర *మొకటి పుట్టినది. ఇది తగనిమాట. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు గ్రంథములను గొనిపోవుట సత్యమే యగునేని యది ప్రత్యాంధ్రహృదయమును పల్లవింపజేయు శుభవార్త.

ఈభాండాగారమున ఎక్కువగా సంస్కృతాంధ్రద్రావిడభాషలను, తక్కువగా కర్నాటమలయాళాదిభాషలను వెలయుచున్న గ్రంథములును, స్థానికచరిత్రములును, ప్రాచీన శాసనముల నకళ్లును — తాళపత్రములయందును, కాగితములయందును వ్రాయబడినవి — లెక్కకుమిక్కిలిగ నున్నవి. అన్నియును దేశభాషావాఙ్మయములకును, చరిత్రకును నత్యంతోపకారకము లయినవి. ప్రభుత్వమువారు తమకు దేశీయులపట్లను, దేశభాషలపట్లను గల సహజానాదరభావముచే నా వ్రాత సంపుటముల సమ్యక్పరిపోషణమునకు చాలినంత సొమ్మును వ్యయించి సముచిత సౌకర్యములను గలిగింపకుండుటచే నవి నానాటికి జీర్ణించి చీకిపోవుచున్నవి. ఇట్లే కొంతకాల ముండునేని యవి నామమాత్రావశిష్టములు కావచ్చును. పదపడి దేశీయులు తమ యమూల్యభాషా చారిత్రక వాఙ్మయములను గోలుపోయి వాపోవ

* విద్వాన్ మంకాల శ్రీపతిగారు వ్రాసినది.

నలసినవా రగుదురు. అట్టిగతి పట్టకమునుపే ప్రజలు మేలుకొంచి ఎవరెవరి మాతృభాష లకు జెందిన సంపుటములను వారువారు తమ వశము కావించుకొని జీర్ణము లగుచున్న వానికి ప్రతికలు వ్రాయించి అన్నిటిని సరియైనస్థితిలో నుంచుకొనుట లెస్సయే యగును. కాబట్టి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి ప్రయత్నము ఆంధ్రవాణికిని, ఆంధ్రదేశమునకును శ్రేయ స్కరము. బొత్తిగా లేకపోవుటకంటె నెక్కడ నేని చక్కగా నుండు టెల్లరకును సంతోషా వహముగదా!

తెలుగుపుస్తకముల మాట యటుండు గాక! తక్కినభాషలయందలిపుస్తకములమాట యేమికావలెను? దేశభాషలు పరస్పరసంబం ధము గలవి. కావున అన్నిభాషలలోగ్రంథ ములు నందఱకు భాషావాఙ్మయచారిత్రపరి శోధనమున కేమి, దేశచారిత్రపరిశోధనమున కేమి మిగుల నుపకరించునవి. వీనియెడ ప్రభు త్వమువారి కనాదరము తగనిది. ఈభాండాగార పోషణనిర్వహణములు సంతృప్తికరములుగ లే వని కొంతకాలము క్రింద పత్రికలయందు కొం దరు భాషాభిమానులు వ్రాసిప్రకటించియున్నా రు. ఈపోషణనిర్వహణవిషయమై భాండాగార మున నటీవల కొన్ని చిన్నిమార్పులు, కూర్పు లు జరిగినను అవి యంత సంతృప్తికరములుగ జూపట్టవు. పాలకజాతికి జెందినవారే యగు శ్రీ బ్రౌనుదొరగారొక్కరే దేశభాషావాఙ్మయ ములయందలి స్వారస్యమును లెస్సగ్రహించి, అపారమగు వ్యయమును, ప్రయాసమును బరి గణింపక, ఆయాభాషలగ్రంథములను బెక్కిం టిని సేకరించి, వానికి ప్రతికలు, వ్యాఖ్యాన ములు, టీకలు, శబ్దసూచికలు మొదలయినవి వ్రాయించి కావించినమహోపకార మేనాటి కిని దేశీయులకు మరవదగనిది. విదేశీయుడగు నా యుదారాశయునికి కడుంగడుప్రేమపాత్రము లై వెలసిన యాసంపుటములు నానాటికి శిథిలములై నేలపాలగుచుండుటఁగాంచి భాషాభి మాను లంగలార్చకుండుట దుర్ఘటము. ఇంత యేల? ఈనాడు భాండాగారమునగల యెల్ల పుస్తకములకు సరియైనయొకపట్టికయైన లేకు న్నది. ఇట్టిపట్టున భాండాగారపర్యవేక్షకు లగు వారు భాండాగారముయొక్క యీ దుస్థితిని తొలగింప బూనకుండుట వింతగా నున్నది. ప్రభుత్వమువారికి భాండాగారముయొక్క సత్య స్వరూపమును దెలుపుట వారి పని; ప్రభు త్వమువారివలన చాలినంత ధనసహాయమును జేకూర్చుట వారిపని; ఆసొమ్మును వెచ్చించి భాండాగారము నభివృద్ధికి దెచ్చుట వారిపని. కావున వా రీపనులను నెరవేర్చుటకు వెంటనే గట్టిప్రయత్నములను చేయవలెను; అచిరకాల మున భాండాగారము నుద్ధరింపవలెను.

ఈభాండాగారమునందు తెలుగున ముద్రి తములు, నముద్రితములు నగు గ్రంథముల యొక్క వ్రాతప్రతులు—తాటాకులపైనను, కాగితములపైనను వ్రాసినవి—కలవు. దక్షిణ భారతదేశప్రాచీనచరిత్ర నిర్మాణమున కుపక రింపగల శాసనలేఖనములయొక్కయు, స్థానిక చరిత్రములయొక్కయు వ్రాతప్రతులును పెక్కు లున్నవి. చరిత్రసంపుటములందు ఆంధ్రద్రావిడ కర్ణాటమహారాష్ట్రదేశములకు సంబంధించిన విషయములు గలవు. ఇదికాక తెలుగులిపిని వ్రా సిన సంస్కృతభాషాగ్రంథములు చాల గలవు. ఇన్నింటిలోను జాలవాటికి శిథిలప్రాయములగు చున్న యొండు, రెండు, మూడు, నాల్గు ప్రతు

లును ఉన్నవి. కొన్ని ఏకైకములుగ నున్నవి. మెకంజీదొరగారు తొలుత వ్రాయించినస్థానిక చరిత్రసంపుటములు శిథిలము లగుచుండ శ్రీ బ్రౌనుదొరగారు వానికి ప్రతికలను వ్రాయించిరి. అవియు నిపుడు జీర్ణదశకు వచ్చుచున్నవి. కావున వానికి మరల ప్రతికలు పుట్టవలసిన యావశ్యకత కల్గినది. వెనుకటి కొన్ని సంపుటములలోని కాగితములేమి, తాటాకులేమి తాకినంతనే తునాతునక లగుచున్నవి. మరి కొన్ని సంపుటములలోనివి కీటదష్టము లయి భ్రష్టము లయినవి. కాన జీర్ణము లగుచున్న వానికి త్వరలో ప్రతికలు పుట్టవలెను. అవి సురక్షితముగ నుండు నేర్పాట్లు జరుగవలెను. ఇట్టివిధముననే యెల్ల భాషల సంపుటములకును ఉద్ధారణ సంరక్షణములు జరుగవలెను. 'భారత దేశ సంరక్షణము కొఱ' కను నెపమున కోట్లకొలదిగ భారత దేశ ధనమును విదేశములందలి సైనికులకు ఏటేట ధారాళముగా వ్యయించుచున్న ప్రభుత్వమువారికి భారతీయుల దేశభాషా వాఙ్మయ పోషణము కొఱకు ఇంచుకంత సొమ్మును వ్యయించుట వ్యయముక్రింద లెక్కపెట్టవలసినది కాదు.

ఇక ఆంధ్రవిశ్వవిద్యాలయము వారికి తెలుగుపుస్తకముల నిచ్చువిషయము: చెన్నపురి చెన్నరాష్ట్రమునకు రాజధానీ నగరము. ఇటభాషాపరిశోధకులకు, చరిత్రపరిశోధకులకు, ఇతరపరిశోధకులకు పెక్కుసౌకర్యములు, నవకాశములు గలవు. కళాశాలలు, పరిశోధనాలయములు, ముద్రితగ్రంథభాండాగారములు నెక్కువగా గలవు. ఎల్ల దేశములనుండియు, ఎల్లరాష్ట్రములనుండియు, ఎల్లమండలముల నుండియు పెక్కు రిచ్చటకు పరిశోధనములు సలుప నిరంతరము వచ్చుచుందురు. వారి యితరకార్యములతోపాటు పరిశోధనలును తిన్నగా నిక్కడ జరుగుచుండును. మఱియు నీ నగరముననే భాషా, చరిత్రపరిశోధకులు పలువు రున్నారు. ఇందఱకును ప్రత్యేక మిః కొకచోటికి బరిశోధనలు సలుపబోవుట దుష్కరముగ నుండును. కాక, ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రత్యేకింపబడినమాత్రమున, చెన్నపుర విశ్వవిద్యాలయమునకును చెన్నపురము వారికిని, తత్ప్రాంతమండలములవారికిని తెలుగుతో పని తీరిపోయెనని తలపజనదు. తెలుగుపై నభిమానము గలిగి, తెలుగుతెన్నుల నరసి తెలుగు వెలుగున మెలగగోరువారీపురమున నిప్పుడును లెక్కకుమిక్కిలిగనే యున్నారు. ఇది యట్లుండ, నిట్లు తెలుగు తొలగ నున్నట్లె ఇతరభాషలును తొలగగలవేని ప్రభుత్వమువారు కొంతదండుగ వ్యయముయొక్కబరువుతగ్గెనని యూపిరాడ్చుకొనవచ్చును. కాని అట్టి సూచన లేవియు కానరాకుండుటచే నీభాండాగారభారమును ప్రభుత్వము దించుకొనజాలదు. కాబట్టి తెలుగుసంపుటములనన్నింటిని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారికిచ్చి వేయక—ఇచ్చుట వాస్తవమైననే—ప్రతిసంపుటమునకును నొక్కొకప్రతినిమాత్రము—ఒక్కప్రతియే యున్నచో ప్రతికను వ్రాయించియైన—యొసగదగును. ఇది యుచితమయినకార్యము; ఉభయసమ్మతమును. అన్నిటి నిచ్చివేయుడని వారడుగుటయు, వీ రిచ్చివేయుటయు నెంతమాత్రమును సహింపదగినది కాదు. ఈవిషయములను ప్రభుత్వమువారుచక్కగాపర్యాలోచించి అందఱకు ననుకూల మగుమార్గము నవలంబించి భాండాగారమునభివృద్ధికి దెచ్చుట సమంజసము.



సీమలోనుండు ఆంధ్రులు

విభవ సంవత్సరాదిపండుగ దినమున లండనునగరమున తీయబడిన ఛాయాచిత్రము

పైనుండి మొదటి వరుస:—(1) యస్. సుందరం గారు, బి. ఏ., యల్. యల్. బి., బారట్లా. వీరి నివాసము చిత్తూరుజిల్లా. ప్రస్తుతం రంగూను సెక్రటరి యటునం దున్నారు. (2) చలసాని వెంకటరత్నంగారు, కృష్ణాజిల్లా చేరికల్వపూడి గ్రామనివాసులు; లండను నగరమున ఇంజనీరింగు చదువుచున్నారు. (3) తేకుమళ్ల వెంకాజీగారు, బి.ఎ., యఫ్.సి.యస్.; రాజమహేంద్ర వర నివాసులు. కాగితపుపరిశ్రమనుగూర్చి ప్రత్యేకముగా నేర్చుకొనుటకు మదరాసు గవర్నమెంటువారు విద్యార్థి వేతనమునిచ్చి వీరిని ఇంగ్లాండుకు పంపియున్నారు. వీరు ప్రస్తుతము బ్రిటనులోని పేపరుమిల్లులలో పనిచేయుచున్నారు. (4) చదలవాడ నాగయ్యచౌదరిగారు; వీరిది గుంటూరుజిల్లా పెదపూడి. యం. బి. అండ్ సి. హెచ్. బి. పరీక్షలయందుత్తీర్ణులై న్యూకేసిల్ వైద్యాలయమందు పనిచేయుచున్నారు. (5) ఉపద్రష్ట వెంకటకృష్ణయ్యగారు, బి. ఏ., యల్. యల్. బి., తెనాలి నివాసులు అక్కౌంటెన్సీపరీక్ష(యఫ్. యస్. ఎ. ఏ)కు లండనులో చదువుచున్నారు. (6) కన్నేపల్లి లక్ష్మీనరసింహంగారు, గంజాంజిల్లా ప్రియాగ్రహారము వీరి నివాసస్థలము. ఫస్టుగ్రేడు ప్లీడరుగారైన వెంకటప్పయ్యగారికుమారులు; ఐ. సి. యస్. కు చదువుచున్నారు. (7) సి. దామోదర రెడ్డిగారు, బి. ఎ., హైద్రబాదు వాస్తవ్యులు, యం. ఆర్. సి. యస్. అందు యల్. ఆర్. సి. పి. పరీక్షలకు లండనులో చదువుచున్నారు.

రెండవ వరుస:—(1) నాయని గోపాలకృష్ణరెడ్డి గారు, (బి. ఎ) మునగాల; లండనులో రసాయనశాస్త్ర మందు యం. యస్. సి. పరీక్షకు చదువుచున్నారు. (2) కాకర్లపూడి కృష్ణమూర్తిగారు. యం. యస్. సి. (కలకత్తా) రసాయన శాస్త్రమందు డి. యస్. సి. పట్టము నొందుటకు మద్రాసు గవర్నమెంటు వారు పంపియున్నారు. (3) హనుమంతరి శ్రీరామకృష్ణశాయాజీరావుగారు, కృష్ణాజిల్లా పెయ్యేరు వాస్తవ్యులు. ఇంజనీరింగు బి. యస్. సి. పరీక్షకు చదువుచున్నారు. (4) గోగినేని వెంకటప్పయ్యచౌదరిగారు; నిడుబ్రోలు; బారిష్టరు పరీక్షకును, ఆర్థికశాస్త్రమందు బి. యస్. సి. పట్టమును పొందుటకును లండనులో చదువుచున్నారు. (5) ఐ. జె. పీటర్సుగారు; యం.ఏ., యల్. టి., మద్రాసు, లండనులో పి. హెచ్.డి. (సాహిత్య) పట్టమునకు చదువుచున్నారు. (6) వల్లభజోస్యుల నాగభూషణంగారు; గుంటూరు. లండనులో వర్తకము చేయుచున్నారు. (7) కన్నేపల్లి బలరామమూర్తిగారు; ప్రస్తుతం లండనులో ప్రాక్టీసుచేయుచున్న బారిష్టరు వెంకటలక్ష్మీనరసింహంగారి; కుమారులు. లండనులో ఇంజనీరింగు చదువుచున్నారు. క్రికెట్ ఆటయందు మిగుల ప్రవీణులు. (8) కన్నేపల్లి లక్ష్మీనరసింహంగారు, వీరును బారిష్టర్ నరసింహంగారి కుమారులు ఐ. సి. యస్. కు చదువుచున్నారు. క్రికెటునందు ప్రవీణులు. (9) బి. పుల్లారెడ్డిగారు, హైదరాబాదు. లండనులో యం. ఆర్. సి. యస్.,యల్. ఆర్. సి. పి. పరీక్షలకు చదువుచున్నారు. (10) చావలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, బి. ఏ.. తెనాలి. లండనులో అక్కౌంటెన్సీ డిగ్రీకొరకు చదువుచున్నారు. ఆర్టిస్టు నాగేశ్వరరావు (బొంబాయి)గారి సోదరులు.

మూడవవరుస (కుర్చీలపై కూర్చున్నవారు):— (1) కన్నేపల్లి గోపాలకృష్ణమూర్తిగారు, బారిష్టరు నరసింహంగారి కుమారులు. లండనులో సాలిసిటరుగా పని చేయుచున్నారు. (2) ఆదిపూడి సోమనాథరావుగారి కుమార్తె. శ్రీమతి వసుంధరాదేవి(కన్య)గారు; లండను విశ్వవిద్యాలయమునందు రసాయనశాస్త్రమున బి. యస్. సి. పరీక్షకు చదువుచున్నారు. మద్రాసు యూనివర్సిటీయందీమె యం. ఏ. పరీక్షలో ఉత్తీర్ణురాలైనది. మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఈమెకు విద్యార్థివేతనము నిచ్చుచున్నారు. (3) బారిష్టరు కన్నేపల్లి లక్ష్మీనరసింహంగారి భార్య సుభద్రమ్మగారు, గా. వేపారామేశం పంతులుగారి సోదరి. (4) కన్నేపల్లి లక్ష్మీనరసింహంగారు, యం. ఏ., యల్. యల్. బి., గంజాంజిల్లా ప్రియాగ్రహారము వీరిది; కొంతకాలం మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు చేసిరి. ప్రస్తుతం ప్రివీకౌన్సిలునందు ప్రాక్టీసు చేయుచున్నారు. (5) బారిష్టరు కన్నేపల్లి వెంకటలక్ష్మీనరసింహంగారి కుమార్తె కేసరీదేవిగారు; బారిష్టరు పరీక్షకు చదువుచున్నారు. ఈతయందు ప్రవీణరాలు. (6) గుంటూరు వాస్తవ్యులు పులుగూరు వెంకటసుబ్బారావుగారు, బారిష్టరు. ప్రివీకౌన్సిలునందు ప్రాక్టీసు చేయుచున్నారు.

నాల్గవవరుస—క్రిందకూర్చున్న వారు:—(1) పల్లెంపాటి గోపాలకృష్ణయ్యగారు, సికింద్రబాదు వాస్తవ్యులు. వ్యవసాయ విద్యయందు ప్రత్యేకవిద్యను నేర్చి హిందూదేశమునకు మరలివచ్చిరి. (2) వ్యాసరగామ శేషగిరిరావుగారు, బి ఏ., యం. బి. బి. యస్; లండనులో యఫ్. ఆర్. సి. యస్. కు చదువుచున్నారు. (3) లంకా సుందరంగారు, బందరు వాస్తవ్యులు; ఐ. సి. యస్. కును, ఆర్థికశాస్త్రమునందు పి. హెచ్. డి. పట్టమునకును చదువుచున్నారు వీరు మల్లాది సత్యలింగంనాయకరుగారి విద్యార్థివేతనమును పొందుచున్నారు. (4) యర్రమిల్లి దీక్షితులుగారు; బి. ఏ., యల్. యం. అండ్ యస్., తణుకు వాస్తవ్యులు. నేత్రరోగముల చికిత్సనుగూర్చి ప్రత్యేకముగా నేర్చుకొనుటకు లండనులో నున్నారు. (5) టి. జె. పీటర్సుగారు, బి. ఏ., యల్. టి., మద్రాసు; సాహిత్యమందు పట్టము పొందుటకై లండనులో నున్నారు

క్రిందివరుసలో (కుడివైపు) తుదిని కూర్చున్న వారిని గూర్చిన వివరణము తెలియరాలేదు.



### శ్రీ దాసు త్రివిక్రమరావు గారు

శ్రీ దాసు త్రివిక్రమరావు గారు, యల్. యల్. బి., బారిష్టరు, బెజవాడ. హాలెండునందు జరుగనున్న అంతర్జాతీయ యువజనమహాసభకు వెడలిన ఆంధ్రప్రతినిధి. వీరు జర్మనీ, రషియా తదితర దేశములందలి గ్రంథాలయోద్యమమునుగూడ పరిశీలించివత్తురు.

---

# కృష్ణావతారము

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

లోకాపవాదంబుఁ బోకార్పఁ డని తెల్పఁ దివిరి రత్నంబును దెచ్చినావు
మిత్రవాత్సల్యంబు మేలటం చని తెల్ప మించి కుచేలుఁ బోషించినావు
కడఁగి గోసంరక్ష కర్తవ్య మని తెల్పఁ గాపవై మందల మేపినావు
ఆపన్నులను బోచు టే పాడి యని తెల్ప నింపారఁ బెనుఁగొండ నెత్తినావు
చెప్ప నేటికి స్వామి నీచెయువు లెల్ల - జగతి కాదర్శములు గావె? చర్చ సేయ
నీరహస్యంబుల నెఱుంగ నేర్తు మయ్య - పావనాచార! బృందావనీ విహార.

పీల్చినాఁడవు దానవీప్రాణవాయువుల్ త్రుటిలోనఁ జనుఁబాలతోడఁ జేర్చి
చూపినాఁడవు యశోదాపురంధ్రీమణి కఖిలప్రపంచంబు నాస్యసీమ
ఎత్తినాఁడవు భువనైక విక్రమశక్తి దివిజు లౌ నన ధరిత్రీధరంబు
త్రొక్కినాఁడవు జగద్ద్రోహిఁ గాళీయుని పడగలపై నిల్చి పాటవమున
వెలసినాఁడ వహో! పదార్వేల యిండ్ల-వివిధ రూపాలతో నేకవేళ యందు
నీమహత్త్వంబు లెల్ల వర్ణింపఁ దరమె! - పతితపావనరూప, గోపకులదీప!

అచార్యపీఠంబునందు నధిష్ఠించి ధర్మోపదేష్టవై తనరినావు
అర్జునాదులచేత నఖిలధర్మంబులఁ జేయించినావు సాక్షిత్వ మూని
స్వయముగా మానవాచారంబు లివి యంచు నోపికతోఁ జేసి చూపినావు
ధర్మేతర ప్రవర్తనుల నెల్లరఁ గూల్చి బలితంపు ధర్మంబు నిలిపినావు
గురుతర సుషుప్తినుండి మేల్కొలిపినావు - సలిపినాఁడ వమానుషచర్య లెన్నొ
సర్వశక్తిస్వరూప, విశ్వప్రదీప,- దళితసంతాప, సద్గుణోద్యత్కలాప!

# భారతీయ మహిళామండలి

శ్రీమతి పద్మావతి కనకరత్నంగారు,
బి. యే., యల్. టి., బి. యస్ సి.



ఈమె కాశీ హిందూవిశ్వవిద్యాలయమునందు చరిత్రోపాధ్యాయగను, స్త్రీల కళాశాలకు సూపరిం టెండెంటుగను నియమింపబడిరి.

మిస్. రంగారావు (రంగారావుగారి కుమార్తె)



ఈమె చెన్నపురి మేరీకళాశాలయందు ఉపాధ్యాయ. ఇంగ్లాండులో ఉన్నతవిద్యను బడసి కడచిన నెలలో తిరిగి మదరాసు చేరిరి.

శ్రీ సి. రామసుబ్బనుగారి సతీమణి



ఈమె కడపజిల్లా విద్యాసంఘమున సభ్యురాలుగ నియమింపబడెను.

అలి కురియను కన్య



ఈమె బి. యే. పట్టమును పొంది అమెరికాలో ఉన్నతవిద్య బడయుటకు వెడలుచున్నది.

డాఫ్నీ మ్యేకిన్ బి.ఎ., బి.యల్.



ఈమె రంగూను హైకోర్టునందు అసిస్టెంటు రిజిష్ట్రారుగ పనిచేయుచుండెను. ఇపుడీమె రంగూనుకోర్టు జడ్జిగ నియమింపబడినది. న్యాయాధిపత్యము వహించిన స్త్రీలలో నీమెయే మొదటిది.

శ్రీమతి కె. కె. కురువేల, బి.యే.



కొట్టాయం నివాసినియగు నీమె తిరువాంకూరు శాసనసభాసభ్యురాలుగ నియమింపబడెను. ఈమె కొంతకాలము కలకత్తాయందును, మదరాసునందును క్రైస్తవ యువతీసంఘములకు కార్యదర్శినిగనుండెను. కొన్ని యేండ్లక్రిందట చీనాలో జరిగియుండిన ప్రపంచమహిళాసభకు ప్రతినిధిగ బోయియుండెను.

చంద్రబాయి పాంటికన్యగారు



పూనాలోని స్త్రీన్యాయవాదిని; మహారాష్ట్రము. నీన్యాతియం దీమెయే ప్రథమురాలు. కీ. శే. గోపాలకృష్ణ గోఖలేగారి మేనకోడలు.

పి. చెల్లమ్మాళ్ కన్య, బి. యే., (ఆనర్సు)



నాంగినాడు వెల్లాలతెగకు చెందిన యీయామె చెన్నపురి విశ్వవిద్యాలయమున పట్టభద్రయైనది. ఈమె యిపుడు సిలోను ద్వీపమునందలి జాఫ్నాలోని రామనాథం కళాశాలయందు అధ్యాపికగ నియమింపబడి యున్నది.

ఇక్కావు అమ్మ, బి. యే. (ఆనర్సు)



ఈమె తిరువాంకూరు రాజవంశములోని యువతి. తిరుప్పంమ్హరైయందు రాజకుమార్తెల ఉన్నతపాఠశాలయందు ఉపాధ్యాయనిగ నియమింపబడెను. రాజవంశమువారు ఉద్యోగము చేయుట కిదియే ప్రథమము.

---

# దిద్దుబాట్లు

విభవ జ్యేష్ఠాషాఢ భారతులలో నేను ప్రకటించిన 'లక్ష్మీపురాహాదనకరశాసనము'లందు దీ క్రింది సంస్కారములు చేర్చుకొనవలెను.

## లక్ష్మీపురశాసనము

4, 7, 11, 12 బంతులలో 'న్డ' గా జదివిన యక్కరమును 'ణ్డ' గా దిద్దుకొనవలెను.

## అహాదనకరశాసనము

19, 31 బంతులలో, దన్డు, కొన్డులను దణ్డు, కొణ్డు, లనుగా దిద్దుకొనవలెను. పదపదార్థ వివరణమును కూడ నిట్లే దిద్దుకొనవలెను.

వే. ప్ర.

## భావస్ఫురణ

పిశిపాటి వెంకటరమణయ్య గారు

ఏదియేనిన్ రచియింపఁగాఁ దలఁచి నే నెంతేఁ బ్రయత్నించినన్
హృదయమ్ము బెండి ఘనీభవించి శిలయై యేపారి సద్భావ మె
య్యదియుం బుట్టఁగఁ దావు నీక రసబాహ్యంబై విలంబింపఁగా
మదిఁ జింతించుచుఁ జిత్తశాంతికయి హర్మ్యం బెక్కి కూర్చుండినన్.

ననుఁ గని మందహాసమున నల్లని యంబరసీమ వజ్రపుం
దునుకలువోలె జీవకళ తొట్రిలఁ బూచిన మల్లెలుం బలెన్
మినమినలాడు తారకలు మింట మధూక్తులఁ గేలిసేయ యా
మినియుఁ జలింప కట్టెకను మీటక చూచుచు నుండె నత్తఱిన్.

తఱిఁ గొని నిద్రవోవు వనితాతతి సంభ్రమవిభ్రమభ్రమల్
చెలువుగునటంచు నంబరవశీకృతముం దగఁ దాము సేయ నె
వ్వారి యవి వారి కీవలసి వచ్చు నటంచు సమర్చినట్లుగా
మెఱయఁ దొడంగెఁ దారకలు మింట మనోజ్ఞవిలాసవైఖరిన్.

నీలపు టంబరంబును వినిర్గత పుష్పవిలాస తారకా
జాలముఁ గేళికాగృహపు శయ్య నమర్పఁగఁ బశ్చిమాద్రిపై
బాలశశాంక దీపిక విభాసిల సర్వదిగంతరాళముల్
జోలలు పాడఁ గన్మొగుచు శూరుఁ డొకండు నిశాసమేతుఁ డై.

అతఁడు రచియించినట్టి కావ్యంబునందు-నిగ్గు దేరిన సరసార్థ నిహిత పదవి
తానముంబలె తారకా తతి వెలింగె - మినుకుమినుకున భావగంభీర మగుచు.

దారుణాతపనిష్ఠా నిధానగరిమఁ - బ్రకృతిసౌందర్యమునకునై ప్రాఁకులాడు
వనలతాజాలముల సౌరు వాడఁ జేయు - వెలుఁగు కన్నను నిసియె సంప్రీతికరము.

---




# గ్రంథములు

## దాంపత్యరహస్యములు

ఇది 'సారథి' చే వ్రాయబడి, యన్.వి. గోపాల్ అండుకో, మదరాసు వారిచే ప్రకటింపబడినది. క్రౌను సైజు; 258 పుటలు. వెల తెలుపబడలేదు.

గ్రంథముయొక్క పేరును, ప్రకరణముల శీర్షికలును ఆకర్షకములుగ నున్నవేకాని లోపలివిషయముల విశేషమేమియు కానరాదు. ఉపయోగకరమగు సలహాలుగాని, క్రొత్తగా తెలియదగు విశేషాంశములుగాని యట్టె లేవు. లెక్కకు మిక్కిలిగనున్న యచ్చుతప్పులు, భాషావిషయికమగు నసందర్భములు పెక్కుచోట్ల నపార్థములకు దావొసగుచున్నవి. కొన్నివిషయములను వివరించుటలో క్షంతవ్యములుకాని తప్పులు జరిగి యున్నవి. ఉదాహరణమునకు:'ప్రతివారును సురాపానము చేయవచ్చునని హిందూదేశమందలి కొన్నిశాస్త్రములయందుండియున్నది' అని వ్రాసిరి. ఈ విషయ మెట్లునిర్ధారింపబడినది? ఈవిషయమునకు 'దాంపత్యరహస్యముల'కును ఏమిసంబంధముకలదు! ఋతుదినములయందుస్త్రీలు వేరుగానుండి యింటిపనులయందు పాల్గొనకుండుట మన సంఘమం దాచారమై యున్నది. దానికి తగు కారణము లుండకపోలేదు. ఈవిషయమును 'స్వార్థపరులు శాసించిరి' అనియు, తగుకారణములు చెప్పక యిట్లు వేరుగా నుంచుట 'స్వార్థము నాశించి కపట తంత్రమును సాగించుటగాక వేరేమి?' యనియు వ్రాసిరి. ఈవాక్యము లెంత యసందర్భముగను, అర్థము లేనివిగను నున్నవి! ఇందు పురుషుల స్వార్థము, కపటతంత్రమేమి యున్నది?'స్త్రీల కథమము ప్రాథమిక విద్యావిధానమును నిర్బంధము గావింపవలయును' అని యొకచో వ్రాసి, ఆ ప్రకరణమందే యింకొకచో 'లాభము లేకయున్న అట్టి విద్యల నేర్పి అనవసరముగ బాలికలకులేని శ్రమ నేల గల్పింపవలయును?' అని వ్రాసిరి. ఈ రెండు వాక్యముల సమన్వయ మేమో? హిందూదేశమందలి వితంతువుల సంబంధమున వ్రాయుచు నొకే ప్రకరణమున మూడు పేరాలయందు వేరువేరుగా నిట్లున్నది 'ప్రస్తుతము హిందూదేశమున రెండు కోట్ల వితంతువులు గలరు', 'హిందూసంఘమునందు రమారమి 20 కోట్ల వితంతువులున్నారు', 'హిందూసంఘమునందు 24 కోట్ల వితంతువులున్నారు', 'దీనియందు అధికసంఖ్యాకులు లేమ శిశుప్రాయముననే భర్తలను గోల్పోయిరి'... ఇంత యసంగతపు వ్రాతలున్నప్పుడు ఈగ్రంథముయొక్క విలువ నేమనవచ్చును! 'వివాహముయొక్క ప్రధానాశయము వివాహమని ... జెర్కొనియుంటిమి' ఈ వాక్యములో నేమి యర్థమున్నది? 'శిశుసంరక్షణ' యను ప్రకరణమున పవుడరు, బొరాక్సు, మెత్తనిట్వల్లు కాలికొట్టుక్కుపులవెలు, ఫ్లానలు రుమాళ్లు, బైండరు, వియల్లాగాముల్, హుక్ మున్నగునవన్నియు నవసర సామగ్రిగా పేర్కొనిరి. ఇవన్నియు భారతదేశసాంప్రదాయములను నష్టపులేనా? ఇంతవరకును ఆరోగ్యమును బలమును గలిగి హిందూసంఘమున పుట్టిపెరిగిన బిడ్డలు వీటి నుపయోగింపనిదే పెద్దవారు కాలేదా? పాశ్చాత్యనాగరిక

యనుకొనబడుదానిలో నివియే మనకు పట్టుబడుచున్నవి. 'ప్రపంచమందలి జనులసంఖ్య విపరీతముగ పెరిగిపోవుట యే పాపముపండుట' యట. అందుకొఱకు కృత్రిమసంతాన నిరోధోపాయము లవలంబింపవలయుననట. సంతాననిరోధక నీచమార్గములు రవీంద్రుని యనుమతిని బడసి యున్నవట. రవీంద్రుడీవిషయమున నేసందర్భమున నే వాక్యములు వ్రాసియున్నాడో వ్రాసియుండిన భాగం జెడిది. ఆసుధీమణి వాక్యముల కజ్ఞానముచే నపార్థకల్పనము కావించిరేమో యని యనుమానింప వలసియున్నది.

అనుకూలదాంపత్యము గూర్చి టాల్‌స్టాయి, ఆరిస్టోటల్, సోక్రటీస్, గాంధీమహాత్ముల యభిప్రాయములిందు పొందుపరుచుచున్నామని యొక ప్రకరణమున వ్రాసి తుది యిరువురి యభిప్రాయముల నుదాహరింప మరచి కాబోలు ముద్రింపలేదు. ఇట్టి గ్రంథములు సారస్వత మానవాభ్యుదయముల కుపకరింపక పోవుటయే కాక మీదుమిక్కిలి యపకరింపక పోవునవి కావనిచెప్ప సాహసించినందుకు విచారమగుచున్నది. 'రావు'

## ఆంధ్రవచన భారతము: సభాపర్వము

కలువె వీరరాజప్రణీతము: ౧౭-వ శతాబ్దపు వచనగ్రంథము. ప్రకాశకులు: యన్. కే. వెంకటేశం పంతులుగారు, ఆంగ్లవాఙ్మయ ప్రధానబోధకులు, గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి, రాజమండ్రి. డెమ్మీసైజు ౩౬౯ పుటలు. వెల రు ౨-౮-౦.

ఇందెడనెడ తుపాకుల అనంతభూపాలుడు రచించిన భాగములు గలవు. ఇందలి శైలి అతిస్నిగ్ధముగను, మనోజ్ఞముగను వెలయుచున్నది. పునరుక్త్యాదులు లేవండ శబ్దప్రయోగమున సౌష్ఠవము కడు నిండియున్నది. శ్రీ వెంకటేశం పంతులుగారు, ఆకాలపు భాషాస్వరూపము వెల్లడించు నభిలాషతో, తాళపత్రగ్రంథమున నున్నరీతినే దీనిని బ్రకటించిరి. వారు దీని కొక విస్తృతమగు మంచిపీఠిక నాంగ్లమున వ్రాసిరి. అందు వారు 'ఈ అద్భుతమగురచన ౧౭-వ శతాబ్ది చివరను, ౧౮-వ శతాబ్ది మొదటను కర్ణాటదేశమున విలసిల్లిన ఆంధ్రప్రతిభ కొక శాశ్వతమగుచిహ్న'మని నుడివినది సత్యము.

ఇందలి శైలికి మచ్చు:—

అంత నా రామకృష్ణులు బాల్యంబు నతిక్రమించి యేడేండ్లప్రాయంబు వార లగుచు నీలపీతాంబరంబులు ధరియించి,యరుణ ధవళవర్ణంబులగు దివ్యగంధంబు లలంది, చలిది చిక్కంబును, నలాబుపాత్రయును బూని, వనంబునం గ్రేపులన్ మేపుచు గ్రుమ్మరు సమయంబున నెమలి పింఛంబులు కర్ణావతంసంబుగ ధరియింపుచుం గెంజిగురాకుగుత్తులును, బన్నమాలికలును, చిప్పకూంకటులం జుట్టుకొనుచు, వనమాలికలు ధరింపుచు, వత్సబంధ సూత్రంబుల యజ్ఞోపవీతంబులుగ వైచికొనుచుం, బర్ణ వాద్యంబులు గావింపుచుం, బిల్లంగ్రోవు లూదుచు, మఱియు నొక్కొక్కయెడ నవ్వుచు, గ్రీడింపుచు, నొక్కొక్కయెడం జిగురుంబాన్పులం బవ్వళించుచు, వేఱొక్కయెడ నిద్రించుచు, ఫలంబుల నుపయోగించుచుం బూదే నియలు గ్రోలుచు, నెం దెందులం దిరుగుచు, మహాభుజంగ యుగ్మంబు చందంబున వనంబునం ద్రిమ్మరుచునుండి యంత నొక్కనాండు బృందావనంబునకుం జని గోగణంబుల మేపుచు నిజశరీరఛాయలవలన వనంబు బ్రకాశింపం జేయుచు విహరింపుచుండిరి.

## ఆర్యమత తత్త్వబోధిని (వచనము)

క్రౌను. ౭౮పు. వెల రు ౧-౮-౦.

గ్రంథకర్త: వేదం సుందరరాజ శర్మగారు, హిందూ థియాలజికల్ స్కూల్ తెలుగుపండితులు; విలాసము, నెం. ౨౭౬-౧౭౭ టంకశాలవీథి, మద్రాసు.

ఈగ్రంథము పేరే దీనియందు వర్ణింపబడిన విషయముల స్వరూపమును సూచించుచున్నది. గ్రంథము ప్రశ్నోత్తరరూపమున నున్నది. ఆర్యమత వాఙ్మయ తత్త్వములను జిజ్ఞాసుత్తముగ దెలిసికొనుట కిది యుపయోగించును. వచనరచనము. శైలి సరళముగానే యున్నది. వేదములను పఠివర్తింపరాదు, విష్ణువే ఉత్కృష్ట దైవము అను నిట్టి కొన్ని పరంపరాగత మూఢవిశ్వాస జనితములగు నభిప్రాయము లిందు కాన్పించుచున్నవి. ఇట్టియూహలు తొలగినచో భారతీయులకు మేలు గలుగును.



5. 8- 24 ౩౯౧

## శృంగార భల్లాణచరిత్ర

గ్రంథకర్త: చితారు గంగాధరకవి. ప్రకాశకులు జి. యస్. శాస్త్రీ అండుకో. తపాలుపెట్టె నెం. 110, మద్రాసు. క్రౌను ౮౧ పుటలు. ఫైదర్ వేటు కాగితము. సుందరమైన అచ్చుకూర్పు, బైండు. వెల ౨-౧-౧.

ఈపుస్తకము శృంగార గ్రంథమాలలో నాల్గవ సంఖ్యగలది. శివభక్తాగ్రేసరుడగు భల్లాణరాజు విటజంగముడై వచ్చిన పరమేశ్వరునకు భార్యను వేశ్యగా నర్పించి శివసాయుజ్యమును బొందినకథ ఆశ్వాసత్రయగ్రథితమగు నీద్విపద ప్రబంధమున వర్ణితమైనది. శివభక్తి పారమ్యమును చాటుచున్న యీగ్రంథమున వేశ్యాశృంగారము సరసముగా సంతరింపబడినది. దోషభూయిష్ఠమయినను కవిత్వము దేశితెనుగునుడి కారపు సొంపుగలిగి పామరజన సుబోధముగ నున్నది. గ్రంథకర్త పదునేడవ శతాబ్దమునకు జెందినవాడు కావచ్చును. అచ్చుతప్పులు హెచ్చుగనున్నవి.

## ప్రభవ

గ్రంథకర్త: శ్రీ. శ్రీనివాసరావుగారు, కవితాసమితి, విశాఖపట్టణము. క్రౌనుసైజున ౫౮ పుటలు గలవు. వెల రు ౦-౮-౦.

ఇది కవితాసమితి గ్రంథావళిలో మొదటిది. ఇందు ప్రకృతిగీతములు, ప్రణయగీతములు, ప్రకీర్ణగీతములు అను వేర్వేఱువిభాగముల పదునాఱు ఖండకావ్యము లున్నవి. శైలియందు సార్థకతకంటె సమాసత్వరత యెక్కువగ గోచరించుచున్నది. ఇంకను విషయానుగుణ్యముగ శైలియందు మార్పులు కన్పడవలెను. తెనుగు వాడకము చాల తక్కువగనున్నది. ఒక్కొకచో బడలించు సమాసభూయిష్ఠత యున్నను మొత్తముమీద శైలి బాగుగ నున్నది. భావములందును గాంభీర్యమున్నది. భావములకును, భాషకును సామరస్యము సంధించుట కీకవి యింకను ప్రయత్నింపదగును. ఇది చదివిన వారికి కాలక్రమమున ఈకవి కవిత యింకను సంపన్నము కాగల దను ఆశపొడమును. భావస్వాతంత్ర్యమును, భాషాసౌష్ఠవమును మెచ్చదగియున్నవి. ప్రకృతిపథముల తత్త్వాన్వేషణము సలుప సమకట్టిన యీకవి కిశోరమానసము ఉత్సాహరంజితమై యొప్పుచున్నది.

## The Torch of Learning by Mr. Benaiah Cole, Master, Christian Line, Cuddapah.

'వాచకపుస్తక'మట. చిన్నచిన్న ఆంగ్లపదములకును, వాక్యములకును ఉచ్చారణములు, అర్థములు ఉన్నవి. క్రౌనుసైజు ౮౬ పుటలు. వెల ౫ అ.

## ఆంధ్రాక్షరములు

రాజా పానగంటి పార్థసారథిరాయణింగారు రచియించిన వ్యాసము; డెమ్మీసైజు ౨౮ పుటలుగలవు.

## శృంగారసావిత్రి

తంజావూరి రఘునాథరాయలు రచించినది. క్రౌనుసైజు ౧౩౬ పుటలు. వెల రు ౨. ఇది శృంగార గ్రంథమాల ౫ వ కుసుమము. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రీ అండుకో., మద్రాసు.

## పశువైద్యచింతామణి

గ్రంథకర్త: యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు, అంగలూరు (పోస్టు), కృష్ణాజిల్లా. క్రౌనుసైజు ౧౯౮ పుటలు. వెల రు. ౧-౮-౦.

## కాంతాపహరణము (సాంఘికనాటకము)

గ్రంథకర్త: పుల్లేటికుర్తి కృష్ణమాచారిగారు, డెమ్మీసైజు ౧౬౮ పుటలు. వెల రు ౧-౮-౦.

ప్రకాశకులు: వేగుజుక్క గ్రంథమాల, పూడిపెద్దివారివీథి, బరంపురము (గంజాము).

## శ్రీమద్రామానుజీయము (నాటకము)

గ్రంథకర్త: ముడుంబై రామానుజాచార్యులుగారు; డెమ్మీసైజు ౧౮౬ పుటలు. రాజమండ్రి శ్రీరంజన్ ముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల రు ౧-౦-౦.

## తెనుగు అభ్యాసబోధిని ౧ భాగము

సంపాదకుడు: రా. వెంకటసుబ్బయ్యగారు. క్రౌనుసైజు ౨౧ పుటలు. వెల ౦-౧-౬.

## శ్రీరామశతకము

గ్రంథకర్త: సత్యవోలు రాధామాధవరావుగారు, కాకినాడ. వెల ౨ అణాలు.

## విషనివారిణి

ప్రకాశకులు: యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు అంగలూరు. వెల ౪ అణాలు.

# సాభిప్రాయవిశేషములు

## యూరపురాజ్యముల విషమస్థితి

ప్రాగ్దేశములందు ప్రవర్ధమానం బగుచున్న ప్రబోధము పాశ్చాత్యరాజ్యతంత్రజ్ఞుల కసహ్యమై వారిప్రవృత్తియందు విచిత్రమైన పరివర్తనమును గలుగజేయు చున్నది. పాశ్చాత్యరాజ్యాధికారులు రాజ్యనీతిని, రాజ్యధర్మమును, మానవధర్మమును విసర్జించి రాజ్యతంత్రమును మాత్రము పరిగ్రహించుచు మహాప్రళయము నారాధించుచున్నారు. ప్రపంచ మంతయును తెల్లవారికి సేవను జేయుటకే ఏర్పడినది. మృగములు వారి మృగయావినోదమున కేర్పడినవి. నల్లజాతులు తెల్లజాతులకు బానిసతనమును జేయుటకై ఏర్పడినవి. సృష్టిలోని మంచివస్తువు లన్నియును తెల్లవారి విలాసమున కేర్పడినవి. వారితృష్ణకు మితిమేరలు లేవు. దానిని పూరించుకొనుట యసాధ్యమని వారు గ్రహింపజాల కున్నారు.

ఐరోపామహాసంగ్రామము గలుగజేసిన మహాదుఃఖ మైనను పాశ్చాత్యరాజ్యములకు జ్ఞానోదయమును గలుగజేయలేదు. సకలరాజ్యములును వారితృష్ణాపూరణమునకై సంగ్రామసన్నాహములను జేయుచు మహాప్రళయము నాశ్రయించు చున్నవి. సంగ్రామ సన్నాహముల కపారమైన వ్యయమును జేయుచున్నవి. ఫ్రాన్సు రాజ్యమును పట్టి పీడించిన వైరసాధనపిశాచము నిశ్చేష్టతను బొందినను ఫ్రాన్సుకలవరము మాత్రము తగ్గలేదు. ఫ్రాన్సుకు జర్మనిని సాధించుట సాధ్యమైనను ఆత్మవికాసము సాధ్యము గాలేదు. దురాశాపిశాచము శాంతిని బొందలేదు. యూరపుఖండమునందు రాజ్యాధిపత్యముగాని, ఆర్థికాధిపత్యముగాని ఫ్రాన్సునకు లభించలేదు. ఫ్రాన్సును సంగ్రామము కృశింపజేసినది గాని బలియజేయలేదు. ధనసంపద, జనసంపద లేని రాజ్యాధిపత్యము నిరర్థకమని ఫ్రాన్సు గ్రహించినది. జర్మని పరాజితమైనను జనసంపదను గలిగి వికసించుచు ఫ్రాన్సునకు హృదయశల్యముగ నున్నది. ఈ దురవస్థనుండి తప్పించుకొనుటకు ఫ్రాన్సుకు మార్గాంతరము గనుపడకున్నది. బ్రిటీషురాజ్యనీతిజ్ఞు లెప్పటివలెనే రాజ్యతంత్రమును లోకమునం దంతటను వ్యాపింపజేయు చున్నను నది నిష్ఫలముగ నున్నది. బ్రిటీషురాజ్యాధికారము విశ్వవ్యాప్తమైనను శిథిలమై సారహీన మగుచున్నది. లోకమునం దంతటను శిథిలమగుచున్న బ్రిటీషు ప్రాబల్యమును పునరుద్ధరణము చేయుటకు బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు పన్నుచున్న మహోపాయములు నిరర్థకము లగుచున్నవి.

బ్రిటీషురాజ్యము వాణిజ్యవ్యాపనమును జేసి, రాజ్యలాభమును, రాజ్యవ్యాపనమును జేసి

ఆర్థికాధిపత్యమును బడసినది. బ్రిటీషుసామ్రాజ్యమునకు దేశాధిపత్యము నిలిచియున్నను వాణిజ్యప్రాబల్యమును, ఆర్థిక ప్రాబల్యమును తగ్గిపోయినవి. తగ్గుచున్న వాణిజ్యార్థిక ప్రాబల్యములను బలపరచుటకు బ్రిటీషు రాజ్య నిర్వాహకు లవలంబించుచున్న వామ మార్గము నింద్యమై ప్రపంచశాంతికిని, మానవకల్యాణమునకును ప్రతిబంధకముగ నున్నది. చీనాయందును,నితరప్రాంతములందును వా రవలంబించుచున్న రాజ్యతంత్ర మసహ్యముగ నున్నది. అమెరికా చీనా కార్థిక రాజకీయస్వాతంత్ర్యము నంగీకరించినది. సర్ ఆస్టిను చేంబర్లిను చీనా స్వాతంత్ర్యము నంగీకరించుట కభ్యంతరములను జెప్పుచున్నారు. గ్రేటుబ్రిటను ఎన్ని యభ్యంతరములను కల్పించినను చీనా స్వాతంత్ర్యము స్థిరపడినది. అమెరికా, రుష్యా రాజ్యములు చీనాస్వాతంత్ర్యమునకు జూపుచున్న సానుభూతి బ్రిటీషు రాజ్యనీతిని నిరర్థకము చేసినది. చీనాస్వాతంత్ర్య మాసియాదాస్యవిమోచనమునకును, భారతీయదాస్యవిమోచనమునకును సహజముగ వినియోగ పడగలదు. చీనాపరిస్థితులైనను బ్రిటీషు రాజ్యతంత్రజ్ఞులకు గుణపాఠమును నేర్పజాలకుండుట విచిత్రముగ నున్నది. అమెరికారాజ్యము కెల్లోగుగారి ద్వారా నిర్ణయించిన నానాజాతీయ సంధి నిర్ణయములపట్ల గ్రేటుబ్రిటను చూపిన సంశయహృదయమును బ్రిటీషు రాజ్యనీతిజ్ఞుల సంకుచితలక్ష్యమును వ్యక్తము చేయుచున్నది.

* * * *

## ఆర్థిక రాజ్యయుగము

మానవచరిత్రయందు చిరకాలమునుండియును దేశాధిపత్య మార్థికాధిపత్యమునకు సాధనముగ నేర్పడినది. పరదేశములను పశుబలసాధనమున నాక్రమించుకొని దేశవాసుల సంపదలను హరించుట లోకమునకు పరిపాటియైనది. ప్రజలనుండి నయముననో, భయముననో ద్రవ్యమును గైకొనుచు ప్రభువులును, వారి యనుచరులును సుఖపడుట యాచారమైనది. రాజ్యసంపాదనమునందును, రాజ్యపాలనమునందును ప్రభుత్వములకు స్వార్థముమూలబీజముగాని ప్రజాహితము మూలబీజముగాదు. నిరంకుశరాజ్యములందు రాజులు రాజ్యాదాయమును దుర్వినియోగము చేసినపుడు ప్రతిఘటనములేకపోయినను నియమితరాజ్యములందు ప్రతిఘటనము ప్రబలుచున్నది. నియమితరాజ్యములందు రాజ్యాదాయమును ప్రజల యనుమతి లేక వ్యయము చేయుట దుర్లభమైనది. నియమితరాజ్యములం దైనను స్వదేశమునందు గల నియమితవ్యయము పరాధీనదేశములం దవలంబింపబడకున్నది. పరాధీనరాజ్యములందు రాజ్యాదాయమును యథేచ్ఛముగ నిర్ణయించుటయును, ఖర్చుపెట్టుటయును సామాన్యవిషయముగ నున్నది. కాని రాజ్యాదాయము స్వాధీనదేశములందును, పరాధీనదేశములందును సహజమైన స్వయంపోషణమునకును, అపారమైన సైన్యవ్యయమునకును చాలకున్నది. ఇట్టి విషమావస్థయందు స్వాధీనరాజ్యములకును, పరాధీనరాజ్యములకును లోకవ్యవహార

ములందు ప్రాబల్యము గలిగి భాగ్యభోగముల ననుభవించుటకు ఆర్థికప్రాబల్యము ప్రధానసాధనముగ నున్నది.

ఆర్థికసామ్రాజ్యము, రాజ్య సామ్రాజ్యము నతిక్రమించి ప్రపంచవ్యాపకత్వమును గలిగియున్నది. రాజ్యాధికారము లేకపోయినను పరదేశముల సంపదలు శ్రమలేకుండా స్వాధీనమగుచున్నపుడు ప్రపంచమునందు రాజ్యభ్రాంతి నశించుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యము పూర్వమువలెనే రాజ్యాధిపత్యమును గలిగియున్నను, ఆర్థికాధిపత్యమును గోల్పోవుచున్నది. గ్రేట్బ్రిటనునందు పరిశ్రమల సముద్ధరణము దుస్తరముగ నున్నది. ప్రధానములైన బట్టలపరిశ్రమయును, ఇనుముపరిశ్రమయును దుర్దశయం దున్నవి. గ్రేట్బ్రిటను వ్యాపార మమెరికా, జపాను, జర్మని, ఇటలి, ఫ్రాన్సు మొదలగు దేశముల పోటీకి నిలువజాలక సన్నగిలుచున్నది. సకల రాజ్యములును ఆర్థికవికాసమును గోరుచున్నవి. ఆర్థికవికాసమునకు సకలజాతులును మహాసంరంభమునకు ప్రయత్నములను జేయుచున్నవి. బ్రతుకు తెఱువున్నగాని శుభములు సాధ్యములుగావు. బ్రిటీషుప్రజలకు వారిజీవయాత్రను సౌఖ్యప్రదముగ నడుపుకొనుటకు పరదేశాక్రమణము, పరదేశవాణిజ్యము, పరదేశపీడనము సహజధర్మములైనవి. వారి నిర్మాణపదార్థములతో ప్రపంచమును నింపి బ్రతుకుట బ్రిటీషుప్రజలకు సహజమైనది. చిరకాలాభ్యస్తమైన సహజావస్థ కిపుడు ప్రబలమైన ప్రతిఘటన మేర్పడినది.

ఆర్థిక సామ్రాజ్యాధిపత్యము అమెరికాకు సంక్రమించినది. అమెరికా, జపాను, జర్మని మొదలగు దేశములు పారిశ్రామిక వాణిజ్యాధిపత్యమును సంగ్రహించుచున్నవి. రుష్యారాజ్యము బ్రిటీషు రాజ్యప్రాబల్యమునకు ప్రబలమైన ప్రతిఘటనమును వహించుచున్నది. రుష్యా ప్రతిఘటనమును నిర్మూలము చేయుటకు బ్రిటీషు ప్రభుత్వము సంగ్రామ సన్నాహములను జేయుచున్నది. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములు స్వయం పోషణమును స్వయం వికాసమును గోరుచు ప్రాతికూల్యమును వహించుచున్నవి. ఆస్ట్రేలియా, కనడా, ఆఫ్రికాదేశము లార్థిక స్వాతంత్ర్యమును గోరుచున్నవి. భరతవర్షమునందును చల్లగా ప్రతిఘటన మేర్పడుచున్నది. దూది యంత్రాలయములు, రాటములు బ్రిటీషు దూదిపరిశ్రమను స్తంభింపజేయుచున్నవి. కాంగ్రెసునిర్ణయించిన బ్రిటీషువస్తుబహిష్కారము చల్లగా బ్రిటీషు వ్యాపారమును స్తంభింపజేయుట సహజము. భారతీయుల హృదయమునందు ప్రవర్ధమానం బగుచున్న బ్రిటీషువస్తుబహిష్కారాభిలాషను సభలు, సంభాషణలు, సంకల్పములు విశదము చేయుచున్నవి. లోకమునందంతటను సంకుచితమగుచున్న బ్రిటీషు ప్రతిష్ఠను, ఆర్థికాధిపత్యమును భరతవర్షమునందు వ్యాపింపజేసి బ్రిటీషు పాశబంధములను స్థిరతరముచేయుటకు బ్రిటీషు ప్రజలు పరిత

పించుచున్న విధమును వారి భావములు విశదము చేయుచున్నవి. బ్రిటీషు ప్రజలకును, బ్రిటీషువ్యాపారమునకును, బ్రిటీషు వస్తువులకును హిందూదేశమును రంగభూమిగ నుంచుటయే బ్రిటీషుప్రజల సంకల్పమని వారి సంభాషణలువిశదముచేయుచున్నవి. బ్రిటీషుప్రజలేమి చేసినను వారిప్రాబల్యమితరభాగములందువలె భరతఖండమునందును క్షీణించుట సహజము. ఇది కాలప్రభావము. ప్రజాప్రబోధమును నిరోధించుటకు బ్రిటీషురాజ్యాధికారులు చేసెడి ప్రయత్నము లన్నియును నిరర్థకములని సకల దేశముల పరిస్థితులును విశదము చేయుచున్నవి. భారతీయుల వికాసమువలన బ్రిటీషు సామ్రాజ్యమునకు ప్రయోజనము గలదుగాని భారతీయుల శోషణమువలనను బ్రిటీషు సామ్రాజ్యమునకు కొంచెమైనను ప్రయోజనము గలుగదు. బలసంపదలుగల భరతవర్షము బ్రిటీషుప్రజలను పోషించగలదుగాని శుష్కించిన భరతఖండము బ్రిటీషుప్రయోజనములకు వినియోగపడజాలదు. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులును, బ్రిటీషుప్రజలును నీధర్మమును గ్రహింపకుండుట సంతాపకరముగ నున్నది.

* * * *

భారతీయ పారతంత్ర్యము

ముప్పదిమూడుకోట్ల భారతీయుల పారతంత్ర్యస్థితి వారికేని, బ్రిటీషుసామ్రాజ్యమునకును, లోకమునకును పరమానర్థములకు మూలముగ నున్నది. సకలాంగములు కృశించిన మానవు లెవరికిని మేలుచేయజాలరు. మానవులకు శక్తివికాసములు స్వేచ్ఛాస్వాతంత్ర్యములవలన గలుగుచున్నవి గాని నిర్బంధ పారతంత్ర్యముల వలనను గలుగుట లేదు. బ్రిటీషురాజ్యాధికారులును బ్రిటీషు ప్రజలును కోరెడి స్వీయప్రతిష్ఠకును, స్వలాభమునకును, స్వప్రయోజనమునకును నైనను చైతన్యము గల భారతీయులు వినియోగపడగలరుగాని చైతన్యములేని భారతీయులు వినియోగపడజాలరు. ఆంగ్లేయు లెవరు వేసినను నొకతాళమునే వేయుచున్నారు; ఎవరు పాడినను నొకపాటనే పాడుచున్నారు. అన్ని సందర్భములందును ఆతాళగీతములే ప్రత్యక్షము లగుచున్నవి.

పౌరసేవోద్యోగులను హెచ్చరించుటకు భారతీయుల యసమర్థత, బ్రిటీషు ప్రజల సమర్థత గోచరం బగుచున్నది. రాయలు కమిషనును నియమించుట యందు భారతీయుల యంతర్విభేదములు, బ్రిటీషుప్రజల ఏకత్వము గోచరం బగుచున్నవి. దేశసంరక్షణమునందు భారతీయుల నిస్సహాయత్వము బ్రిటీషుప్రభుత్వ ప్రాబల్యము ప్రత్యక్ష మగుచున్నవి. ఆర్థికస్థితియందు భారతీయుల పారతంత్ర్యము, బ్రిటీషుప్రజల స్వాతంత్ర్యము గనుపడుచున్నది. ఇర్విను బర్కెను హెడు వింటరుటను ప్రభువులును, రామ్సె, మెక్డొనాల్డు ఫిలిపుస్నోడను గారులును సర్ మైకేలు ఓడ్వాయరు పాడిన పాటనే శ్రుతినిమార్చి పాడుచున్నారు.

ఈ పాటలందు భేదము శ్రుతియందు గనుపడుచున్నది గాని భావరాగ తాళము లందించుకైనను గనుబడదు. భారతీయుల నిస్సహాయస్థితి శ్రీనివాసయ్యంగారు, జిన్నా, సప్రూ, బెజంటమ్మ, చమనులాలు మొదలగువారలకు గ్రేటుబ్రిటనునసం దనుభవవేద్యమైనది. భారతీయులస్థితి సర్కసులలోని జంతువుల వలె నున్నది. నిర్బంధింపబడిన గజసింహ శార్దూలాదులాయుధపాణియైనయజమానికిగడగడలాడు నటులున్నది. ఈదైన్యస్థితి భారతీయులస్వయం సహాయమువలన పోగలదు గాని బ్రిటీషు ప్రజల దయాదాక్షిణ్యము వలనను పోజాలదు. సైమనుకమిషను లెన్నియైనను వచ్చిపోవచ్చును; స్వరాజ్యవిధానము లెన్నియైనను సిద్ధము గావచ్చును. సాధనములనెన్నిటినైనను ప్రచురింపవచ్చును; ప్రత్యక్షాచరణమున కవసరమైన శక్తిసామర్థ్యములు లేనంతవరకును భారతీయుల మనోరథము లన్నియును రిక్తమనోరథములైయుండెడి విధమును స్వదేశ విదేశ వ్యవహారములు విశదము చేయు చున్నవి.

* * * *

సైమనుకమిషను

సైమనుకమిషను విషయమై బ్రిటీషు రాజ్యాధికారు లవలంబించుచున్న వామమార్గము లసహ్యమైనను భారతీయుల నిస్సహాయ స్థితికి నిదర్శనములుగ నున్నవి. సైమను కమిషనును బహిష్కరించుటయందు నాయకులకును, ప్రజలకునుగల దృఢసంకల్పము సర్ జాన్ సైమనుకును, కమిషను సభ్యులకును, భారత బ్రిటీషు ప్రభుత్వములకును విశదమై యున్నది. గతాగమనమునందు సైమను కమిషనుకు గుంటూరు పురమునందు గలిగిన పరాభవము ప్రజాహృదయమునకు ప్రమాణముగ నున్నది. అయినను సైమను కమిషను పట్ల ప్రజల కాదరణము గలదని చాటుటయును, దానిని సార్థకము చేయుటకు మాయోపాయములను పన్నుటయును పారతంత్ర్యము గలుగజేసెడి దైన్యమును చాటుచున్నది. సైమను కమిషను స్వార్థారాధకులకును, దేశారాధకులకును నవకాశములను గలుగజేసినది. స్వార్థారాధకులు సహకార ఫలమును, దేశారాధకులు సహకార నిరాకరణ ఫలమును ననుభవించుచున్నారు. కులభేదములు, మతభేదములు, జాతిభేదములు ప్రభుత్వమున కెప్పటివలెనే భేదతంత్రము నారాధించుటకవకాశములను గలుగజేసినవి. ఉత్తరమున హిందూమహమ్మదీయ విభేదములును, దక్షిణమున బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములును ప్రభుత్వతంత్రమున కవకాశములను గలుగజేసినవి. పంజాబు, బెంగాలు, బొంబయి, సంయుక్తరాష్ట్రములందలి శాసనసభలయందు సహకారభావ మామోదమును బడసినది. 'చెన్నరాష్ట్రమునందును సహకారమార్గ మామోదింపబడునని పరిస్థితులు విశదము చేయుచున్నవి. వెనుకను సైమను బహిష్కారము నామోదించిన చెన్నరాష్ట్ర శాసనసభ తిరిగి సహకారము నామోదించుట తలవంపులుగ నుండుట సహజము. కాని సహ

కారవాదులును నచిరకాలములోనే వారి కన్నులను తెరువవలసియుందురు. స్వార్థపరత్వము చిరకాలము మనజాలదు. స్వార్థపరత్వమునందు గల విషబీజములె దాని వినాశనమునకు సాధనం బగుచున్నవి. సకలధర్మములను నతిక్రమించిన సైమనుకమిషనుకు దోడ్పడుట మహాపరాధముగ నుండగలదు. ఆ యపరాధమును జేసెడివారేపక్షమువారైనను దానిఫలము ననుభవింపవలసి యుందురు. మహమ్మదీయులందును, బ్రాహ్మణేతరు లందును నీవిషయముపట్ల భేదాభిప్రాయము లేర్పడుటయే దాని యధర్మస్వరూపమును చాటుచున్నది.

సర్ కె. వి. రెడ్డి, సర్ ఎ. పి.పాత్రో, ఎ. రామస్వామి మొదల్యారు, పానుగల్లు రాజా, మునిస్వామి నాయుడు గారులు మొదలగువారు భిన్నాభిప్రాయములను గలిగి స్వపక్షమునకు విఘాతమును గలుగజేయుచున్నారు. స్వల్పప్రయోజనముల కాశపడి దేశప్రయోజనములను చెడగొట్టుట యనుచితము. గ్రామసీమలందును, పట్టణములందును సామాన్యజనులు పడుచున్న కష్టములు వర్ణనాతీతములు. వారికష్టము లుద్యోగములవలన తీరునవి కావు. నలుగురు మంత్రులైనను, పదుగురు జడ్జీలైనను, కలెక్టరులైనను ప్రజల కష్టములు గట్టెక్కజాలవు. ప్రజలను వారి కష్టములనుండి గట్టెక్కించుటకు స్వరాజ్యమే శరణ్యముగ నున్నది. సాంఘికవిభేదము లున్నపుడు వాని నెదుర్కొనుట భావ్యముగాని విడనాడుట భావ్యము గాదు. వెనుకపడియున్న సంఘములకు ప్రత్యేకమైన సౌకర్యముల నొసగుటయే సాంఘికసమస్యలను నిర్ణయించుటకు సాధనముగ నుండగలదు. ఏసంఘమునకును ప్రత్యేకలాభములు చిరకాలము నిలువజాలవు.

వివిధపక్షముల నాయకులునులక్నోయందు సమావేశము గానున్న సభయందు సాంఘీక సమస్యను సమదృష్టితో నిర్ణయించి స్వరాజ్య సౌధమును దృఢమైన పునాదులమీదను నిర్మించుటకు భగవదనుగ్రహము గలుగునని నమ్ముచున్నాము. చెన్నరాష్ట్రము నందలి బ్రాహ్మణేతర నాయకులును దూరదృష్టిని గలిగి పూర్వమువలెనే సైమను బహిష్కరణమునకు వారిపక్షబలమును సమర్పించుట శ్రేయస్కరము. ప్రజాస్వామ్యమునందు స్వరాజ్యము బ్రాహ్మణేతర స్వరాజ్యము గాగలదు గాని బ్రాహ్మణ స్వరాజ్యము గాజాలదు. బ్రాహ్మణబ్రాహ్మణేతర నాయకులీరహస్యమును గ్రహించి స్వల్పప్రయోజనములను విసర్జించి స్వరాజ్యసిద్ధికై పాటుపడుదురుగాక! స్వరాజ్యసంపాదనమునకు ప్రత్యక్షాచరణ మవసరమైన విధమును బార్డోలి ప్రస్థానము విశదము చేయుచున్నది.

* * * *

## బార్డోలి సత్యాగ్రహము

బార్డోలిసత్యాగ్రహ మొక సామాన్య విషయమని ప్రాజ్ఞులు గ్రహించవలసియుందురు

సత్యప్రియుడైన గాంధిమహాత్ముడు బార్డోలి సమస్య రైతులకు సంబంధించిన సమస్య యని యును, పన్నులనిరాకరణ ప్రస్థానము గాదని యును గట్టిగ జెప్పుచున్నను ప్రభుత్వాధికారులు విపరీతార్థమును జేయుట యనుచితము. బొంబయిగవర్నరు శాసనసభయందు జేసిన యవ్యక్తప్రసంగమును బ్రిటీషు నిరంకుశత్వమునకు నిదర్శనము గాని వారి ధర్మనిరీక్షణమునకు నిదర్శనము గాదు. ప్రభుత్వనిర్ణయములను నిరభ్యంతరముగ ప్రజలు శిరసావహింపవలయు ననుట కేవల మన్యాయము. నిరంకుశాధికారమయమైన దేశమునం దిది మిగుల నన్యాయము. నొంటుఫర్డుసంస్కరణ ప్రణాళిక యందు భూమిపన్నును శాసనసభల యామోదమును బడసి నిర్ణయింపవలయు నని సూచింపబడినను నిరంకుశవర్గము, దీనిని నిరాకరించినది. వింటరుటను ప్రభువు సూరత్తుప్రతినిధులు శాసనసభ యం దీవిషయమును నిర్ణయించుటకు వీలు గలదని పార్లమెంటునందు దెలుపుట కేవల మసత్యముగ నున్నది. బార్డోలిసమస్య సిస్తు సమస్య యనిమాలవ్య, మోతిలాలు నెహ్రూ, తేజబహాద్దరు సప్రు, మహాత్మా గాంధిగారులు మొదలగు వారలు చాటుచున్నను నిరంకుశవర్గము విపరీతార్థమును కల్పించుట యన్యాయము.

గాంధిమహాత్ముని సత్యాగ్రహముయొక్క శక్తిసామర్థ్యములను బార్డొలిసత్యాగ్రహము విశదముచేసినది. బార్డోలియందు ప్రభుత్వాధికారులవలంబించిన బీభత్సవిధానమును, బార్డోలిప్రజల శాంతిప్రస్థానమును, సత్యాగ్రహ ప్రభావమును విశదము చేసినవి. బార్డోలిసమస్య దేశమంతను నాకర్షించినది. ఈ సమస్యయందు బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదములు, హిందూ మహమ్మదీయ భేదములును నంతరించినవి. వివిధ రాజకీయ పక్షములును, వివిధసంఘములును బార్డోలిసమస్యను సమదృష్టితో సందర్శించి బార్డోలిప్రస్థానమును జయప్రదము చేసినవి. సర్దారు వల్లభభాయి పటేలుగారును, ప్రజలును కోరినది స్వతంత్ర విచారణగాని పన్నులను తొలగించుట గాదు. ఈసమస్య ప్రజాభీష్టమున కనుకూలముగ నిర్ణయింపబడుట ప్రశంసనీయమై స్వరాజ్య ప్రస్థానమునకు మార్గదర్శకముగ నున్నది. బార్డోలిప్రజలును, వారినాయకులును, ముఖ్యముగ సర్దారు వల్లభభాయి పటేలుగారును భారతీయుల కృతజ్ఞతకే కాక నిరంకుశాధికారుల కృతజ్ఞతకును పాత్రులు. ఈ స్వల్పారంభము ఘోరాకారమును దాల్పక పూర్వమె ప్రభుత్వము మేలుకొనుట సమంజసముగ నున్నది. బార్డోలి సత్యాగ్రహపాఠమును ప్రజలును, ప్రభుత్వమును నిరంతరమును మననముచేసి కృతార్థులగుదురు గాత! వెనుకను పన్నుల నిరాకరణప్రస్థానము నుపక్రమించిన యాంధ్రప్రజానాయకులకు, ముఖ్యముగ గుంటూరు మండలవాసులకు, బార్డోలివిజయము పరమానందమును గలుగజేయ గలదు.

* * * *

ఆంధ్రమహాసభలు

జులై మాసాంతమునందు గుంటూరునందు గూడిన ఆంధ్రమహాసభ లాంధ్రహృదయమునందు గలిగిన సంచలనమునకు నిదర్శనములుగ నున్నవి. ఇన్ని సభలను జయప్రదముగ నడిపిన శ్రీయుతులు నడింపల్లి నరసింహారావుగారును, గూడూరు రామచంద్రరావుగారును, వారి యనుచరులును ప్రజాభినందనములకు పాత్రులు. అసహాయోద్యమము నారంభించిన తరువాత నిన్ని సభలు గుంటూరునందేకకాలమునందు మొదటిసారి గూడినవి. సభలు జయప్రదముగ ముగిసినను ప్రయోజనము మాత్రము విచారయోగ్యముగ నున్నది. సభలయందు తీర్మానములను జేసి సంతృప్తిని బొందవలసిన కాలము సహాయనిరాకరణోద్యమముతో నంతము నొందినది. ఆడంబరమువలన కాలహరణమును, ధనవ్యయమును గలుగుచున్నది. దేశమున కించుకైనను ప్రయోజనము గలుగుట లేదు. దేశము సకల రంగములందును వికాసమును గోరుచున్నది. దేశవికాసమున కన్ని రంగములందును పని జేయగల కార్యదక్షులు గావలసియున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. దృష్టి నేరంగమునకు మరల్చినను కార్యదీక్షాపరాయణులు లేరను నార్తనాదము బయలుదేరుచున్నది. అన్ని రంగములందును కార్యదక్షులను సిద్ధముచేయుటకు ఆంధ్రసేవాసంఘమును స్థాపించుట సముచితముగ నున్నది. ఈ సేవాసంఘము భారతీయ సౌభాగ్యమునకు మూలాధారమైన రాజకీయార్థికసాంఘికాది సమస్యల సమదృష్టితో నవలోకించి నిర్ణయించి, కార్యరూపమున వ్యాపింపజేయుటకు సార్థక మగునని నమ్ముచున్నాము. పరావలంబనమునకును, పారతంత్ర్యమునకును నలవాటుపడిన భారతీయుల లక్ష్యమును స్వయం సహాయమునందును సహాయ నిరాకరణమునందును సత్యాగ్రహమునందును లగ్నము చేయుటకు సేవాపరాయణులు పాటుపడి వారిసేవను సార్థకముచేయుదురు గాత!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, G.T. Madras

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—శ్రీ గాంధిమహాత్ముడు; ఆరాధనము, మాలకోస్‌రాగము.

ఏకవర్ణచిత్రములు:—గాంధివిజయము; "హరిలో రంగాహరి;" గౌతమీపుత్రయజ్ఞశ్రీశాతకర్ణి ౨ (యౌవనదశ; వృద్ధదశ); నెల్లూరుమండల చిత్రములు ౫; శ్రీభ్రమావృతి (౪౭౯ పుట); బ్రహ్మకు కొన్నిసూచనలు (౪౮౮ పుట); శ్రీ ముకుళదేవుగారి చిత్రములు ౨; వేలంవెట్టి (౫౧౨ పుట); సంభాషణయం దధికాభిలాష; (౫౩౪ పుట); ఏసుక్రీస్తు; ఆకస్మిక ఛాయాచిత్రములు ౩; ఇతర చిత్రములు.



శ్రీ గాంధిమహాత్ముడు



చిత్రకారుడు : శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావుగారు, ఛత్రపురము




చెన్నపట్టణము, సెప్టంబరు ౧౯౨౮

సంపుటము ౫ | విభవ సంవత్సరము భాద్రపదమాసము | సంఖ్య ౯

# భావకవిత్వము

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

ఉ. అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ! శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి! ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ! శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావ! భా
వాంబరవీథివిశ్రుతవిహార! ననుం గృపఁజూడు భారతీ!

—శార. అర. ౪-౨౧౬.

సహృదయులారా,

భావకవిత్వము భావకవిత్వమని సుమారు పది పండ్రెండేండ్ల నుండియు తెలుఁగునాఁట ఒకధ్వని బయలుదేరినది. దీని ప్రతిధ్వనులతోడను, ప్రతిస్పందములతోడను, దూషణభూషణములతోడను దిక్కులు బధిరితములగుచున్నవి.

భావము లేనిచో కవిత్వమే కాదు కావున *పునరుక్తమనియు, దానఁజేసి భావకవిత్వమనియు, మామకవిత్వమనియు పండితులు అనుచున్నారు.

* Lyr c poetry అను వ్యవహారమునందును (Tautology) పునరుక్తి కలదు.

నవీనులు ఆంగ్లభాషాకోవిదులు కొంద ఱును, తదనుయాయులు కొందఱును భావ కవిత్వ మనియు, భావగీతము లనియు మాటి మాటికి వ్రాతకోఁతలలో ఉప్పువలె వాడి వేయుచున్నారు. ఏల వాడఁగూడదని కొందఱు మొరాయించుచున్నారు. అసలులో నేతగాదా.

భావకవిత్వ మను నామకరణము ఏనాఁడు ఏ బారసాలలో చేసిరో కాని ఇది వివాదగ్రస్త మై పోయినది.

లేనిదానికి పేరు పెట్టముకదా! ఆలు లేదు చూలు లేదు అల్లుని పేరు సోమలింగము!

అయితే నవీనవస్తువులను నిర్మించి దానికి పేరుపెట్టుట చూచుచున్నాము — గ్రామో ఫోను మొదలగు యంత్రముల పేరులు యోగ రూఢములు, రూఢములు కావా? నానతీర్థ్యుఁడు మహా-ఉపజ్ఞ కలవాఁడు పెద్దinventorఒకా యన వేదములను, శ్లోకములను అనుకరించి అవ్యక్తముగా గబగబా ఉదాత్తానుదాత్త స్వరితప్రచయములతో ఒకగ్రంథము సాంత త్యముగా చెప్పికొనుచుఁ బోవుచుండెడివాఁడు. యజుర్వేదము వచ్చినవా రెవరేని ఇది యేమి అని అడుగుచో ఋగ్వేదమనియు, ఋగ్వేదు లడిగిన యజుర్వేద మనియు ప్రత్యుత్త రించువాఁడు. చలానా అయ్యెడిది. ఒకా నొకప్పుడు ధనుర్వేదముతోఁ గూడ పని పట్టుచుండెడిది. కొన్నాళ్ల కతఁడు దానికి అర్య మణ వేదమని సంకేతము సృష్టించి పాఱవై చెను. దానివలె ఈభావకవిత్వము అర్యమణ వేదమా? నిస్సందేహముగా కాదు. సిద్ధమైన వస్తువు ఉన్నది. పేరులోనే పోరు.

పేరు

నం దింద్రజాల మున్నది. దంపతులు తమకుఁ గూర్చు బిడ్డనికి పేరుపెట్టుటలో వివ దింతురు. భర్తకు నచ్చిన పేరు భార్యకు, భార్యకు నచ్చిన పేరు భర్తకు నచ్చదు. కొన్నా ళ్లనుండి మఱచిన ప్రణయకలహము బారసాల నాఁడు మఱల మొలకెత్తి కలహ మగును. పర్యవసానము బిడ్డనికి పేరు ఉండదు. లోక వ్యవహారమునకు చిన్నవాఁడు, పెద్దవాఁడు అను పేరులు కాయపడును.

ఈసందర్భమున ఒకటి గుర్తు వచ్చు చున్నది — ఇరువురు ధనికు లొక కొన్ని వేల యెకరముల భూమి కొనిరి. అందు నూతులు, చెఱువులు త్రవ్వించిరి. కొంతమంది రైతులను ప్రవేశపెట్టి ఇండ్లు వేయించిరి. మంచి ముహూ ర్తమున పీటలపై కూర్చుండి గ్రామమునకు నామకరణము చేయ నారంభించిరి. ఒకరి పే రొకరికి ఇష్టము కాలేదు. నూతు లొకరు పూడ్వఁగా చెఱువు లొకరు పూఁడ్చిరి. ఒకరు కొంపలు కూల్పఁగా ఒకరు రైతులను తఱిమిరి.

అయితే పెద్దలు What is a name? అనియు, 'నామమాత్రే వివాదః' అనియు అందురు.

ఈశ్వరుఁ డనువాఁ డొకఁ డున్నాఁడని తెలుచో ఆయనకు మనము శివుఁడనియో, విష్ణువనియో పేరు పెట్టుకొందుము.

ఇంగ్లీషులో లిరిక్ అనునది కలదు. దానికి భావకవిత్వ మని తెలుఁగు.

లిరిక్* అను ఈ భావకవిత్వము మన సాహిత్యశాస్త్రమున ధ్వని, భావధ్వని, రస ధ్వని ఈ మొదలుగా పరిభాషింపఁబడును.

అయితే లిరిక్కుయొక్క రాజ్యమున భావకవిత్వమునకు పట్టాభిషేకము చేసి దానిని కొలుతము. 'స్థితస్య గతి శ్చింతనీయా.'

కవిత్వము

అన నేమియో తెలియనిది భావకవిత్వము తెలియదు. మృగమన నేమియో తెలియనిది కస్తూరీమృగము తెలియదు కదా!

కవిత్వమును తజ్ఞులు అనేక-మంది అనేక విధములుగా నిర్వచించిరి. కేవలము ఆనిర్వచ నములను ఒకచోఁ జేర్చుచో ఒకకోశ మగును. అందులో పరస్పరభేదములు పరస్పరహాస్యము. వాని వివాదతో వాణీవీణాతంత్రులు తెగు టయేకాక వీణబుర్రయు, వినువారి బుర్రయు పగిలిపోవును. అయినను విభిన్నములగు ఆ ధ్వనులలో కవిత్వమును గూర్చి తెలిసికొన వచ్చును.

చంద్రుఁ డేఁడి అని యడుగుచో మనము చూపఁగలము. చంద్రుఁ డనఁగా ఏమిటి? అనుచో ఆలోచింతుము. ఒకఁడు మంచుముద్ద యనియు, ఒకఁడు ఒకానొక దేవుఁడనియు, ఒకఁడు గ్రహవిశేషమనియు కల్పనలచే, మత విశ్వాసములచే, శాస్త్రములచే మెలమెల్లగా పరిష్కరింతురు. అన్నిటిలో సత్యము లేకపోదు గాని ఏదియు సంపూర్ణసత్యము కాదు. అను భూతియే సత్యము.

ఆరీతిగనే కవిత్వమును శృంగ గ్రాహిక గా చూపఁగలము. కాని అవ్యాప్త్యతివ్యాప్తులు లేకుండ నిర్వచించుట సులభము కాదు. ఎంత నిర్వచించినను చక్రవాళమువలె ఆవలనే యుం డును. తెలిసినవారికే ఆనిర్వచనము లుపయో గించును. తెలియనివారికి ప్రత్యుత భ్రాంతి జన కముకూడ నగును.

కుర్రఁడొకఁడు బడిలో ఏనుఁగుపాఠము చదివికొనెను. చదివిన కొలఁదినాళ్లకే బందరు వెళ్లెను. అచట విచ్చలవిడిగా విహరించుపందు లను చూచి, 'నాయనా! ఈయూర ఇన్ని యే నుఁగు లున్న వేమి?' అని అడిగెను.

కవిత్వమనఁగా నేమియో తెలియుటకు కవిత్వమునకు విషయ మేమో, దానిప్రయోజన మేమో ఈ మొదలగునవి విచారించుట లగ్గు. మన మీబాటను నడిచి కవిత్వమన నేమియో తెలిసికొందము. మనకు దారిబత్తెముమాత్రము సాహిత్యశాస్త్రము పెట్టిన బిచ్చమే.

మంత్రములు, ఉపనిషత్తులు, పురాణ ములు, కావ్యములు, నాటకములు, లహరులు,

* లైర్ అనునది చితారువంటి జంత్రము. ఒంటితీఁగ తంబురాశ్రుతితో బొబ్బిలికథ మొ. పాడినటులు లైర్ శ్రుతితో పాడు పాటలకు లిరిక్ అని తొల్లిటివ్యవహారము. తరువాతఁ దరువాత లాక్షణికముగా వ్యవహ రింపఁబడుచున్నది. గ్రీసులో క్రీస్తుపూర్వము ౬౦౦ నాఁట సాఫో అను నామె గొప్ప లిరిక్కులు చెప్పెనట.

భావశతకములు, చాటువులు, అన్యోక్తులు, శిశుక్రందీయములు—ఈ మొదలుగా లెక్కిడుటకు వీలులేనన్ని భేదములతో నిండిన గ్రంథ రాశిలో కవిత్వ మున్నది. ఋషులు, దేవమనుష్యులు, మనుష్యులు వీనికి కర్తలు.

వీని యన్నిటియందును 'ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ దమలోన దొరయు శబ్దములు'ను, చక్కని అర్థములును కలవు. 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అని జగన్నాథపండితులు. The best words in the best order అని కోలిడ్జి.

వీనిలో మనస్సు అందుకొనఁగలిగినపదార్థమునుండి అంచఁజాలని పదార్థము వఱకు, కుటీరసృష్టినుండి చిన్మయసృష్టివఱకు, ఉన్మాదమునుండి ఆనందమువఱకు, ఉత్తేజనమునుండి తన్మయతవఱకు మనము చూచుచున్నాము.

ఇటులు కవిత్వము ఆబ్రహ్మస్తంబ పర్యంతము వ్యాపించియున్నది. కవితకు విషయము కానిది లేదు; శక్తిమాత్రము ఉండవలయును గాని. కవి కాంచనిచో రవి కాంచ నేర్చునే?

కవి, కవియొక్కజీవితము, విశ్వము, విశ్వముయొక్క జీవితము, ఈశ్వరుఁడును కవితాదర్పణమునందు ప్రతిబింబించుచున్నారు. కాఁగా కవిత్వమును ఒకవిధముగా లోకవృత్త మనఁజెల్లును. 'నాటకం లోకవృత్తంస్యాత్.' ఇది యే Interpretation of life. 'సారం విశ్వస్య' అని గోవర్ధనుఁడు.

కవిత్వము యశస్కరము. కాళిదాసునెవ రెఱుఁగరు? తెలుఁగునాఁటిలో తిరుపతివేంకటేశ్వరులకు తిరుపతి వేంకటేశ్వరులకు భేదము లేదు. టాగోరు జగ మెఱిఁగిన బ్రాహ్మణుఁడు. 'కావ్యం యశసే.' అన్నిటికంటె కవిత అప్పటికపుడు అతిసంతోష జనకము. 'సద్యః పరనిర్వృతయే.'

కవియొక్క సంకల్పము భావనచే సత్యముగా, సుందరముగా ఉద్దీపిత మగుచున్నది. మఱియు ధ్వనిచే ఆత్మవంతమయి తన్మయత కలిగించి ఆనందమున ముంచియెత్తుచున్నది.

* భావన-సృష్టి-అలంకారము

కవి కొక దివ్యదృష్టిగలదు. అతఁడు దానితో విశ్వమునందలి సత్యసుందరరూపము కనును. దానిని సహృదయులకుఁ గూడ గోచరింపఁ జేయును.

ఒక్కొకచో యథార్థమునే రమణీయముగా సృజించును.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలల
సత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ
దాల్చి సుధాంశువికీర్యమాణ క

* భావనకు సాధర్మ్యములు బీజము. భావనామహిమచే సత్యము స్ఫుటించును. దానిచే కవి విశదముగా, సుందరముగా సృష్టి చేయుచున్నాఁడు.

ర్పూరపరాగపాంసురుచి
పూరములం బరిపూరితంబు లై.
—భార. అర. ౪-౧౪౭.

చ. అరు దగు లేత్పవోదసను
యంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ
బల్వలభూముల భూరిదర్దురో
త్కరరవముల్ మహీరుహాశి
ఖండములందు శిఖండితాండవాం
తరమృదుమంజులస్వన ము
దారతరం బసుచుఁ వనంబునన్.
—భార. అర. ౪-౧౩౭.

కొన్నిచోటుల కొంచెము దవ్వుగ:

సీ. కులిశధారాహతిశైలువునఁ బైనుండి
యంచు మోవఁగ జేసు రైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరమువాఱఁ
జలువ యానయ్యేటి కొలఁకులందు
ఇసుక వెట్టిననేల నేచి యర్కాంశులఁ
జొర నీక దట్ట మై యిరులు గవియు
క్రముకపున్నాగనారంగరంభానాళి
కేరాదివిటపికాంతారవీథిఁ
గెరలుపికశారికాకీరకేకిభృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్ష
గానఘూర్ణితమగు నొక్కకోన గనియె.
—మను. ౨-౧౭.

ఇది ప్రకృతి కనుకృతి, లేక ప్రతిసృష్టి.

సీ. అఖిలలోకానందుఁ డగుచంద్రుఁ డెందేని
గలిగె నుజ్జ్వలఫేనకంబుమాడ్కి
*ఐరావతాదిమహాకరు లెందేనిఁ
బ్రభవించె మకరశాబములపగిది
కమనీయసురతరుసముదయం బెందేనిఁ
జనియించె శైవాలచయము భంగి
భువనైకమాత మాధవుపత్ని యెందేనిఁ
బొడమె మాణిక్యంపు బొమ్మపోల్కి
ఆదిమత్స్యకూర్మములు విహారలీలఁ
దనరు నెందేనిఁ బ్రకృతిసత్త్వములకరణి
అట్టి యంభోధి యొప్పారు నద్భుతైక
సారమహనీయమహిమ కాధార మగుచు.
—నృసింహపురాణము.

ఈసముద్రము వట్టి నల్లనీరు కాదు.

కవికి సుందరమైన యిల్లు, సుందరమైన తోఁట, సుందరి యగు సుదతి, సుందరమగు ప్రపంచము—ప్రతిది సుందరమైనదే కావల యును. అతని సృష్టిలోని ప్రతిపరమాణువు నందును ఎత్తుకెత్తుగా సౌందర్య మిమిడి యున్నది.

అందుచేతను లత లతగానే కానవచ్చును. కవి కది ఉద్యానలలన.

చ. అతిరుచిరాగతుం డయిన
యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున ల
తాలలనల్ మృదులానిలాపవ
ర్జితకుసుమాక్షతాంజలులు
సేసలు వెట్టినయట్లు లైరి—
—ఆది. ౪-౧౭.

చంద్రుఁడు రాఁగనే కలువ వికసించును. కవి అందలి సాధర్మ్యము గొని ప్రణయము లోనికి వడియఁగట్టెను—

* ఈయుపమ దోషజుష్టము.

సీ. కటికిచీకటితిండికరములగిలిగింత
సెవ్వాఁడు తోఁగకన్నె నవ్వఁజేయు.
—మను. ౧-౧౮.

ఇచట చంద్రుఁడు నాయకుఁ డాయెను; కిరణములు చేతులు. కలువ కన్నె. గిలిగింత వెట్టఁగా కన్నె నవ్వుచు నీకు ఆనంద మిచ్చు చున్నది.

ఇటులే నదులు, పర్వతములు మొ. నాయికానాయకులుగా సృజింపఁబడు చున్నారు. వసుచరిత్రము మొ. అట్టివే. సాంఖ్యుల ప్రకృతిపురుషు లట్టివారే. ప్రకృతి గుడ్డి; పురుషుఁడు కుంటియట. స్వర్గము కవిసృష్టియే. అచటివారు నిత్యయౌవనులు. ప్రాయమున సంఖ్యలో వారికి ముప్పదికి పైని లేదు. నిత్యసుందరులు! గంధర్వులు, అచ్చరలు వీ రంద ఱెవరు?

కవి కడు వత్సలుఁడు. ఎంతవాత్సల్యము లేనిదే జగతిని సుందరముగా చూడఁగలఁడు? అతఁడు విశ్వచేష్టితమందు తనచేష్టితమును చూచును.

సీ. వేడుకఁ జేతులు విచ్చియాడెడునట్లు
లోలోర్మిపంక్తులఁ గ్రాలిక్రాలి.
—అరణ్య. ౮-౩౨౯.

చ. దళితనవీనకందళక
దంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధుర స
మీరణుఁడర్క సఖుఁ గూఁచుచుండఁగా
నులియుచుఁ బువ్వుగుత్తులను
నుయ్యెల లొప్పఁగ నెక్కి యాఁగె ను
ల్లలదళినీకులంబు మృదు
లధ్వనిగీతము విస్తరించుచున్.
—అరణ్య. ౮-౧౩౨.

ఇచట కవి తరంగకల్లోలమును చేతు లెత్తుకొని యాఁటలోఁ జూచెను. తుమ్మెదలు పూగుత్తుల నెక్కి మ్రోయఁగా ఉయ్యెల లెక్కి పాడుట అను మనుష్యచేష్టితములుగా తీసికొనెను. మనుష్యునకు తనయందు, తన చేష్టయందు ఎంతప్రీతియో! అవ్యక్తశబ్దము లకుఁగూడ తనయర్థము ముడిపెట్టుట చూచుచో కవి విశ్వవిశ్వమును తనలోనికి తెచ్చుకొనుట విశద మగును.

*సీ. ఇవి రాజసుతులు చేయవలసినపనులు
కావు కా వంచుఁ గాకంబు లఱచె.
—బుద్ధచరిత్ర.

కాకులు కావుకావని కూసినవి. ఇవి రాజసుతులు చేయవలసిన పనులు కావుకావని కూసినవఁట.

యేషాం శ్రీసుదయశోదాసుతపదకమలే
నాస్తి భక్తిర్నరాణాం,
యేషా మాభీరకన్యా ప్రియగుణకథనే
నానురక్తా రసజ్ఞా;
యేషాం శ్రీకృష్ణలీలా లలిత గుణరసే
సాదరౌ నైవకర్ణౌ,
ధిక్తాన్ ధిక్తాన్ ధిగేతాన్ కథయతి సతతం
కీర్తనస్థో మృదంగః.

ధిక్ అనఁగా ఛీ. ధిక్ తాన్ అనఁగా వారిఁ గూర్చి నింద లగుఁగాక. మద్దెల కృష్ణ

* ఈశ్రీవమ భట్టుమూర్త్యాదులు, శ్రీహర్షాదులు ప్రాచీనాచార్యులు.

భక్తి లేనివారిని ధిక్తాత్ ధిక్తాత్ అనుచున్న దట.

ప్రబంధ మిటులు అపూర్వముగ సృజిం పఁబడును. ప్రవరవరూథినీసృష్టి అపూర్వము. షెల్లీ- ఎపిసైకిడియను.

భావన ఇంకొక మెట్టెక్కినది. మంత్ర ద్రష్టలు ఇటులు చెప్పిరి——

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే;
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి.

మంచి రెక్కలుగల రెండుపిట్టలు చెలిమితో ఒక చెట్టుననే ఉన్నవి. దాని తీయని పండు ఒకపిట్ట ఆరగించుచున్నది. రెండవది తినక చూచుచున్నది.*

ఈరెండు పిట్టలమాటున జీవేశ్వరులు దాఁగియున్నారు. లేక జీవేశ్వరులే యిట పిట్టలుగా సృజింపఁబడినారు.

ఈరీతిగా భావన భూమికిని స్వర్గమునకును నిచ్చెన వైచుచున్నది.

కవికి భావన యోగశక్తి. దీనిచే దూరశ్రవణము, పరకాయప్రవేశము మొదలగు మహిమలు పొందియు కవి ద్రష్టయే. అతని నాగబెత్తము తాఁకుచో శూన్యమునందు నగరములు పుట్టును; భరద్వాజవిందులు జరుగును. అతఁడు దేనిని సంకల్పించునో అది సిద్ధమగును. 'సత్యకామః సత్యసంకల్పః, స తత్ర పర్యేతి జక్షత్ క్రీడత్ రమమాణః. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి:' అని ‡ సగుణముక్తునివిషయమై ఛాందోగ్యము చెప్పినటులు మహాకవియు మానసజగత్తునందు సత్యకాముఁడు; సత్యసంకల్పుఁడు; అతఁడు తినుచు తిరుగుచు నిత్యసంతోషి; అన్ని లోకములందును అతనికి కామచారము.

ధ్వని, లేక వ్యంగ్యము

ఒక గృహస్థు సభాగృహమున విద్వాంసులతో మాటలాడుచున్నాఁడు. తెరలోనుండి మోమువెట్టి కాంత మృదుమధురముగా పిలిచెను. మాటలసందడిలో ఈధ్వని యేమి? అని అటు చూచి ఆలకించెను.

ధ్వని ఒకానొక లోపలి పిలుపు. దాని యాకర్షణము మెండు. ధ్వనియొక్క గాఢంతయు,గాంభీర్యమును అక్షరాలా ఎంత మొత్తుకొనినను రాదు.

ఆవశ్యకములగు పనులలో మునిఁగి తేలుచున్న తల్లితో అమ్మా నాకు అన్నము పెట్టుమని అడిగినచో, ఆమె పనులు ముగించుకొని అన్నము పెట్టును. అమ్మా! ఆఁకలియగుచున్నది, లేక కడుపుమండుకొని పోవుచున్నది

* ఆలంకారికులు దీనిని రూపకాతిశయోక్తి అని అందురు. Mystic poetry అని కొందరు. Allegory కి రూపకాతిశయోక్తియే బీజము.

‡ చూ. బ్రహ్మసూత్ర. సంకల్పాధికరణము.

అని యనుచో, పనుల నన్నిటిని పాఱవైచి మునిముందు అన్న మిడును.

సంభాషణమునందును ఇట్టిధ్వనులు ఉపయోగించువారు కలరు. వారిమాటలు మంత్రములు. వారిని వినుటకు సభ్యులు చెవులు కోసికొందురు. పెద్దిభట్టుగారు, బులుసు పాపయ్యశాస్త్రి గారు, మంగళంపల్లి సర్వేశ్వర శాస్త్రిగారు-వీరి ప్రసంగములు ధ్వనిపూరితము లయి ఉండెడివఁట. లోకులు వీరిమాటలు నేఁటికిని చెప్పుకొందురు.

సోక్రటిస్, జార్జి షా అట్టివారు; రామకృష్ణపరమహంస ధ్వనిసరస్వతి. నేఁటి తెలుఁగు వారిలో వేంకటరాయశాస్త్రిగారు, సాంఖ్యాయనశర్మగారు, లక్ష్మీనృసింహము గారు; వెంకటశాస్త్రిగారి సంభాషణములన్నియు ఎవరును వ్రాయలేదు గాని అది ఒక గ్రంథము. ఇట్టివా రరిది.

వ్యంగ్య మనఁగా తోఁపఁజేయఁ దగినది మొ. అర్థము. అదియు పదముచేఁ గాని, అర్థముచేఁ గాని.

మూగవారు చేతులతో కనులతో సంజ్ఞ చేసి ఒక యర్థమును తోఁపఁజేయుదురు. అటులే పదముగాని అర్థముగాని మూగలై ఒకఅర్థమును తోఁపఁజేయును. గంగలో గొల్లగూడెము కలదు అనువాక్యము వినఁగనే గంగలో గొల్లగూడె ముండుచో,'నదీనాం సాగరో గతిః' అని కొట్టుకొనిపోయెడిదే కాన గంగలో గొల్లగూడె ముండఁజాలదు అని తోఁచును. అయినను ఇట్టివాక్యము ఉన్నది. గంగలో గొల్లగూడెము ఉండుటకు వీలులేదు కాన గంగాపదము మూగ. ఇది యేమి అర్థము తోఁపఁజేయును? ఆమూగది గొల్లగూడెము కడు చల్లనిది, పవిత్రమైనది అని తోఁపఁజేయును.

లేక గంగాపదము ఊఁగ. అది నాలో గొల్లగూడెము 'ఉండదో, ఉండదో' అని కెరటములచే ఘోషించును. కాఁగా గంగయొద్దున గొల్లగూడె మున్నది. అనిచెప్పుటకు గంగలో గొల్లగూడె మున్నది అనుకొందుము. గంగయొద్దున గొల్లగూడె మున్నది. అనుట యేల? అను నాలోచనము కలుగును. అపుడు గంభీరమైన గంగలోనుండి ఈధ్వనిబయలు దేరును— 'నాలోని చల్లదనము, పవిత్రత గొల్లగూడెమున ఉన్నవి'అని.

ఇటులే సూర్యుఁడు అస్తమించెను అనఁగనే ఒకఁడు సంధ్యావందనము చేయలేచెను; ఒకఁడు పసులను కట్టఁబోయెను; మరియొకఁడు సంకేతస్థలపుదారిఁ బట్టెను. ఇట్టి వ్యంగ్యములు రమణీయములు.

ఒకొక్కప్పుడు వాచ్యార్థమే రమణీయమై వ్యంగ్యార్థమే లొచ్చుగ నుండును.

* క. సిరి గలవానికిఁ జెల్లును
దరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్ద ఱేలా?
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.

* దీపాల పిచ్చయ్య శాస్త్రిగారిచే సంపాదితమగు చాటుపద్య రత్నాకరమునుండి తీసికొనఁబడినది.

విష్ణు వసలే సిరి కలవాఁడు కావున అతనికి పదాఱువేలభార్య లున్నను చెల్లును. ఆదిభిక్షువు ఉన్నభార్యనే అమ్ముకొనవలసి యుండఁగా ఇద్దఱేల? అను వాచ్యార్థము చమత్కారముగా నున్నది.

శ్రీనాథుఁడు పల్నాఁటిసీమలోఁ దిరుగాడుచు నడిదారిలో నీరు దొరకక తంటాలుపడి దవ్వుల ఒక చెఱువు చూచి శ్రమించి అటకు పోవఁగా అందును నీరు లేకపోయెను. అపు డీ పద్యము చెప్పెనఁట! ఇందు జలముయొక్క అత్యంతాభావము గూఢ వ్యంగ్యము. ప్రకరణము తెలియనిచో తెలియదు. మిగిలిన ధ్వనులన్నిఁటికంటె వెంటనే స్ఫురించును గాన రసధ్వని మొ.వానినే సాహిత్యశాస్త్రము మేలుతరముగా నెన్నెను.

మహాకవు లందఱు వ్యంగ్యవైభవముతోడనే పుట్టిరి. ధనికుఁడు బంగారు పిచ్చుకయగుచో కవి వ్యంగ్యకలహంసము. ధనికుఁడు golden spoon తో పుట్టుచో కవిని 'జిహ్వాతే మధుమత్తమా' అని యందుము.

సీ. ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడఁగు.
—విరాట. ౨-౧౯౧

ఎన్ని యేనుఁగు లుండుచో వాని మదధారలు బురదకావలయు? లోని కేఁగుటకు ఎంత ఒఱపిడియుండి వారినగలు రాచుకొని రజము రాలవలయు? ఎంతరజము రాలి ఆ బురద గట్టిపడవలయు? అన్ని యేనుఁగులు, అందఱు సామంతులు ధర్మరాజు హజారమున ఉన్నారు అని వ్యక్తమగుచున్నది.

ఈరీతిగా *కథా కథా, ప్రబంధమూ ప్రబంధమూ, నాటకమూ నాటకమూ వ్యంగ్యముగా చూచుచున్నాము. వేదములందలి స్తావకము లట్టివే. పురాణములందు, ఇతిహాసములందు కథ లట్టివే. నేఁటి ఉపకథ (Short-story) లట్టివే. అందును విశేషించి టాగూరువి.

కవిత్వమునందు కూర్పఁబడు రతి, క్రోధము, కరుణ మొదలగు చిత్తవృత్తి విశేషము లన్నియు వ్యంగ్యము మొగముమీఁద వ్రాసికొనియే పుట్టినవి.

నాయికానాయకులకు ప్రీతి కలిగినది అని కాని, ఇందు శృంగారరస మున్నది అని కాని చెప్పుచో, రసోత్పత్తి కలుగదు. రసాదులు వాచ్యము లగుచో వమన మను దోషము లాక్షణికులు చెప్పుదురు.

దప్పి తీఱుటకు నీరునీరని పలుమాఱు లనుకొనినచో దప్పి తీఱకపోవుట యటుండ మఱి కొంచెము దగయెత్తును.

ప్రియుల పరస్పర విలోకనములు, సుందరమగు ఏకాంతము, శృంగారలజ్జ, వెళ్లిపోవుచు, చేతిలోని తారహారము ఏపొదరింటినో చిక్కుపడినట్లుచేసి వెనుదిరిగి ప్రియుని చూచుట—ఈ మొదలగునవి చక్కగా చెప్పుచో పాఠకుల

* గృధ్రజంబుకోపాఖ్యానము. —చూ. భార. శాం. ౩-౩౬౫.
సుగాత్రీశాలీనోపాఖ్యానము.—చూ. కళాపూర్ణోదయము.

హృదయమున ప్రణయము వ్యక్తమగును. కావుననే రసము వ్యంగ్యము. 'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అని భరతుఁడు.

చ. నిలయము శూన్య మాట గని
నెమ్మదిఁ శాన్పున లేచి కల్లని
ద్రలుగను నాథుమోమును ని
దానముగాఁ గని నమ్మకంబుతో
జిలిబిలి ముద్దు వెట్టి నును
జెక్కులు చెమ్మగిలంగఁ గాంచి మో
మలఁతిగ వంచు బాల నగి
యాతఁడు ముద్దుల ముంచి తేలిచెన్.

—అమరుకము.

ఇందు ప్రేయసి, ప్రియతముఁడు, ఏకాంతము, నిదానపు చూపు, సిగ్గు ఈ మొ. అన్నియుఁ గలిసి ప్రణయము వ్యక్త మగుచున్నది.

* ప్రణయము మొదలగు ఈచిత్తవృత్తులు కార్యకారణ భావములచే చక్కఁగా వ్యక్తమగుచో రసధ్వని అని సాహిత్యశాస్త్ర సంకేతము. దీనినే §ఉత్తమోత్తమ కవిత్వ మందురు. కావుననే మనుష్యభిన్నములగు జడాజడములకుఁగూడ చేతనధర్మములును, అందును విశేషించి ప్రణయము, కరుణ మొ. చిత్తవృత్తులను, ఆరోపించి కవులురసింపఁజేయుచున్నారు.

ఆనందజనకమయిన ధ్వని సత్యసుందరమగు భావనను వేయిరెట్లు సత్యముగను, సుందరముగను జేయును. ఇట్టి ధ్వనికావ్యము సృజింపఁగలుగుట మహాభాగ్యము. కవితాకుటుంబమున వ్యాసవాల్మీకి కాళిదాసప్రభృతులే మైదాఱుగురో వ్యంగ్యవైభవపట్టభద్రులని ధ్వన్యాలోకమున †ఆనంద వర్ధనాచార్యులుగారు.

ఈరీతిగా ముత్తెములవంటి పదములు, తేనెలవంటి అర్థములు, నిత్యనైభవము పచ్చతోరణ మగు సృష్టి, బ్రహ్మానందసబ్రహ్మచారి యగు రసానందము మొదలగునవి కావ్యములందు కానిపించుచున్నవి. అటువంటి కావ్యములందు ‖ఉత్తమకవిత్వము కల దనుచున్నాము.

ఇప్పటికి కవిత్వమన నేమియో తూచాలు తప్పకుండ తార్కికముగా నిర్ధారింపకపోయినను అందుగల విశేషములను చూచాయగా తెలిసికొన్నాము.

ఇఁక—

భావకవిత్వము

కూడ ఇపు డనుకొన్న ఉత్తమకవిత్వమే.

* రతి, హాస్యము, క్రోధము, ఉత్సాహము, శోకము, జుగుప్స, భయము, విస్మయము, నిర్వేదము.

§ అనుబంధము చూచునది.

† ఈ పేరు అసలు పేరు కాదనుకొందును. అయినచో యోగరూఢ మేమో!

‖ కేవల-ధ్వని దృష్టితో ధ్వనికారుఁడు ధ్వనియుండిననే కావ్య మగు ననెను. దాన అలంకారప్రధానములైన రచనలకు కావ్యత్వము లేకపోయెను. లేకపోవలె ననియే అతని మతము. ఇటులే రసాత్మకమే కావ్యమని సాహిత్యదర్పణమున విశ్వనాథకవిరాజు. 'మిగిలిన రచనలకు కావ్యత్వము లేకపోయినా మా భాగే' అని ఆతఁడనెను. ఇటులే రీతివాదులు, ఔచిత్యవాదులు, వక్రోక్తివాదులు మొ. వారు కలరు.

గ్రంథము లన్నియు కవితాగ్రథితము లయ్యును ఒకదానికి పురాణమని, ఒకదానికి ప్రబంధమని, ఒకదానికి నాటకమని, ఒకదానికి శతకమని- యిటులు వ్యవహారము వివిధముగా నున్నది.

పురాణము

ఇది కొన్ని యేండ్లు, కొన్ని మాసములు చదువఁదగిన మహాగ్రంథము: కొన్ని జగత్తుల కూడలి; శాస్త్రములకు ఏకసభ; కథలకు కాణాచి; నీతులకు నిధి. అందు కవి తన కవితాస్పర్శమణి సోకించి ప్రతివిషయమును కవితగా మార్చివైచినాఁడు. ఇఁక-

ప్రబంధము

ఒకనాఁడుగాని, కొన్నాళ్లుగాని చదువఁదగినది. నాటకము కొన్ని గంటలు చూడఁదగినది. ప్రబంధమునందును, నాటకమునందును పురాణమునందువలెఁ గాక ఒకకథయే యుండును. ఆంతరాళికముగా మఱొకకథ యున్నను అదియు ప్రధానకథకు అంగముగనే యుండును.

వానియందు కొన్ని నియతపాత్రములను సృజించి మనోవృత్తులను స్ఫుటముచేసి రసప్రాదమున ప్రవేశించు సహృదయుల మనస్సను నావకు కవి కర్ణధారుఁడై యుండును.

ఈగ్రంథములం దన్నిటియందును కవి కథకుఁడైనను కానఁబడక నిలీనుఁడై యుండును.

శతకము

నందు విడిగా నాయికానాయకుల కల్పన లేదు; శృంగారశతకములందు ఉన్నను కవియే నాయకుఁడు, కథకుఁడును. భక్తిశతకములందు తన భక్తికి తానే కథకుఁడు.

అన్యోక్తి

ఉ. ఈఁకలు నల్లనైనవని
యెంచి విశాల రసాలశాఖ యం
దేకమతోడ నెక్కి- వికసించి ఫలంబులు నీవు మేయుచుఁ
గోకిలరీతి నుందు నను
కొన్నను నంటివి కాక పాపపుం
గాకమ! నీకు నమ్మధుర
గానము గల్గునె యెన్ని వల్కినన్.

ఇత్యాదులందు కవియే నిందకుఁడు గాని, భూషకుఁడు గాని; కవియే కథకుఁడును.

అన్నియు బంగారుతోడనే చేయబడినను హారమని, కంటెయని, నాగరమని, జిగినియని, గొలుసని భిన్న వ్యవహారము కలదు. అయితే ఇది యెల్లను బంగారమే. 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్.'

భావకవిత్వ (లిరిక్) చిహ్నములు

సామాన్యము 1-2 పద్యములతో ముగియును. అమరుకము, గాథాసప్తశతి, ఆర్యాసప్తశతి మొదలగువానియందు ఒకొక్క పద్యమే. కొన్నికొన్నిచోట్ల ఏఁబదివఱకును కలవు. ఇది సంఖ్యావిషయము.

దీనిని కొన్ని నిమిషములలో చదివికొనవచ్చును. కొన్ని సంవత్సరములు మఱవకుండ నుండవచ్చును.

ప్రబంధమునందుఁగాని, నాటకమునఁ గాని ఒకకథయే యైనటులు దీనియందు ఒకటియే

విషయము. కోకిల, నాయిక, నాయకుఁడు, చూపు, ప్రపంచము; ఈశ్వరుఁడు-ఏదైన నగుఁగాక—ఒకటి.

కవికి తన్మయజ్యోతి మెఱుపు వలె చరాలున ఒక్కసారి మెఱయును. దానికి ప్రతిఫలమే ఉత్తమకవిత, లేక భావకవిత.

అట్టి తన్మయత మెఱుపువలె ఎంతో కాలము ఉండఁజాలదు.

ప్రబంధములు, నాటకములు అన్నియు ఈ మెఱుపు తునియలచేత నే కూర్పఁబడినవి.

భావకవిత్వమున ఇంకొక విశేషము: ఇందు కవి సాక్షాత్తు తన సొంత విషయమునుగాని, అనుభవమునుగాని చెప్పుకొనును. శతకాదులందువలె రంగమున తానే నిలువఁబడును.

పురాణములందుఁగూడ కవి తన్మయుఁడై, ఒకానొకట శ్రీకృష్ణునివలె—'ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష న చ కశ్చి చ్ఛృణోతి మామ్. ధర్మా దర్థశ్చ కామశ్చ-'

'చేతు లెత్తుకొని బిగ్గఱగా అఱుచుచున్నాను. ఎవ్వఁడును నన్ను వినఁడు. ధర్మము వలన అర్థము, కామము కలుగును. ఆధర్మమును మీఁరనుష్ఠింపరు' అని వ్యాసులు రంగమున కుఱికెను.

సీ. కవిరాజు కంఠంబు కౌఁగలించెనుగదా
  పురవీథి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
  నగరివాకిట నుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రి యుగ్మంబునఁ
  దగిలి యుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేయి
  వియ్యమందెనుగదా వెసురుగొడియ
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
సెట్టి చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు.

సీ. కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
  రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు?
కైలాసగిరిపైని మైలారువిభుఁ డుండె
  దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
  కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సన మంత్రి మఱి హేమ
  పాత్రాన్న మెవ్వాని పంక్తిఁ గుడుతు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగె
కలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

ఇది మేలిభావకవిత్వము లేక లిరిక్కు. సాహిత్యశాస్త్రమున ఇది రస ధ్వని. ఇందు వీరారెడ్డి మొదలగు మహారాజులు చనిపోవుటయు, ఏనూఱుటంకములు చెల్లింపలేకపోవుట చేతనను ఎండలో నిలువఁబెట్టుట, బండ యెత్తుటలోనగు దైన్యమును, 'దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ'అనునెడ పాండిత్యవీరత అంగముగాఁగల కవ్యాలంబనమగు మృతియు- ఇవి యన్నియుఁ గలిసి కరుణరసము వ్యంగ్యమగుచున్నది.

సంబోధ్యుఁ డైనరాజు నెదుటను, ఈశ్వరాదుల యెదుటను కవి తానయి నిలువఁబడుచున్నాఁడు.

సీ. నిఖిలభూధరదరీ నిమ్నోన్నతస్థలీ
　　విహరణాగతమైన వెనుక కొంకు
యమిరత్నణార్థమై యమహృత్కవాటంబు
　　పగులఁ దన్నిననాఁటి ప్రాఁతనొప్పి
బ్రహ్మాదిసకల నిర్జర కృతార్చనకాల
　　మున నిల్వఁబట్టిన మొనయఁ గదులు
ఏకాంఘ్రిపై నిల్చి నృత్య మత్యంతంబు
　　విరచించునాఁటి తిమ్మిరియుఁ దీఱ
తోమి గ్రుద్దెదఁ బిసికెద ధూళి దుడిచి
వ్రేళ్లు విఱిచెదఁ జాఁపవే కాళ్లు తండ్రి!
నిగమసుకీర్తి యెలకుర్తి నగరవర్తి
యాళె మల్లేశలింగ ఉమాళితాంగ!

ఇవి యన్నియు మంచి లిరిక్కులు. సాహిత్యశాస్త్రము దీనిని భావధ్వని అని అనును. కవిగత భగవదాలంబనమగు భక్తి ఇచట వ్యంగ్యము.

కవి తాను సాక్షాత్తు ప్రవేశము కలిగించుకొనుట, తనసొంత తన్మయత, అనుభవము మొదలగునవి ఉల్లేఖించుట అనునవి భావకవిత్వమునకు భేదక మని అందురు. అటులు కవి తాను పొడుచుకొని వచ్చినను, తన సొంత అనుభవాదులే వర్ణించినను అవియన్నియు సాధారణీకృతములై public property వలెనే అనుభవింపఁబడును. రసము ననుభవించు దశలో కవి కానఁబడఁడు.

ఒకసారి సింహావలోకనము సేయుదము. కవి సాక్షాత్తు ఉండుట, తన అనుభవము చెప్పికొనుట, ఏదో ఒకానొక విషయమును గుఱించి కొలఁది పద్యములలో ఉత్తమోత్తమ కవిత్వము ఉండుట - ఇవి భావకవిత్వము(లిరిక్)న చూపట్టును.

భావకవిత్వ మను పేరు బాగుగా నున్నదా?

పురాణములందును, ప్రబంధములందును, నాటకములందును, శతకములందును, చాటువులందును అవిశేషముగా ఈ ఉత్తమకవిత్వమున్నది. ఈ పైఁ జూపిన శ్రీనాథునిపద్యములకు భావకవిత్వ మనుపేరు తొడుగుదమా? నాలుక వెనుకాడుచున్నది.

భావకవిత్వము అనునది ఒక పుస్తకమునకు పేరు కాఁజాలదు. మంచికవిత్వము అను నర్థముగల ఈపదము ఒకజాతి గ్రంథమునకు పే రెటు లగును? ఆజాతిగ్రంథమునకు లాక్షణికముగనో, వ్యంజకముగనో ఒక పేరు కావలయును.

అమరుకము, గాథాసప్తశతి, ఆర్యాసప్తశతి ఇవి మంచి లిరిక్కుల సంపుటము. ఏపద్యమున కాపద్యమే ఒకగ్రంథము. 'అమరుక కవేః ఏకః శ్లోకః ప్రబంధశతాయతే.' అందులకే అమరుకుఁ డనుకవి తనభావకవిత్వములకు (లిరిక్కులకు) అమరుకమని తనపేరే పెట్టుకొన్నాఁడు. శాతవాహనుఁడు తాను సేకరించిన 'ఏడువందల గాథలసంపుటి' అను నర్థ మిచ్చు గాథాసప్తశతి యనుపే రిడెను. గోవర్ధనుఁడు ఏడువందల *ఆర్యలు అనునర్థ మిచ్చు ఆర్యాసప్తశతి అని పేరుపెట్టుకొన్నాఁడు.

* సంస్కృతమున ఆర్య అనునది జాతి అనుశ్లోకము. తెనుఁగు కందమునకు దీనికి కొంచెము చుట్టఱిక ముకలదు. బహుశా అప్పా సెల్లెండ్రు కావచ్చును.

అటులే ఇప్పటి తెలుఁగుకవులు గూడ ఊహాగానము, హృదయేశ్వరి, జడకుచ్చు లని, సంధ్యారాగమని, ముని మాపని, కృష్ణపక్షమని ఈ మొదలుగా వ్యంగ్యముగనే తమ పుస్తకములకు నామకరణము చేయుచున్నారు.

కావున భావకవిత్వ మనఁగా ఉత్తమ కవిత్వమనియు అట్టి ఉత్తమ కవిత్వములు గలిగి పైని చెప్పిన కొన్ని చిహ్నములు కల గ్రంథజాతికి పేరు లుప్తమై యున్నదనియు గ్రహింపఁ గలిగితిమి.

ఆ పేరునకు మనకు అంతగా తొందర లేదు. ఆగ్రంథజాతి బహుళముగా ఎపుడు పెరుఁగునో అపుడే తన పేరు తాను సంపాదించుకొనఁ గలదు. సౌందర్యము పరిమళము కలపూలుపూచు ఒకజాతితీఁగలు మన ఉద్యానమున మొలిచిన వనుకొందము. దేవతార్చన దైనందినము ఆపూలతోడనే. అట్టి తీఁగలు గేస్తులచే వెంటనే మధురమైన పేరు పెట్టించుకొనును.

ఇఁక నీచర్చ విరమించి భావకవిత్వము (లిరిక్కు)నుగూర్చి తుదిమాటలు ఒకటి రెండు చెప్పెదను.

భావకవిత్వము (లిరిక్కు) వేదాంతమువలె కవితాంతము. గ్రంథము కొలఁది, ఆనందము హెచ్చు. పిట్ట కొంచెము, కూఁత ఘనము. కవిత్వమున కిది శిరస్సు. తెలుఁగు భాషలో లోఁగడ నున్న లిరిక్కులను ఉద్ధరించుట ఆవశ్యకము. తెలుఁగుకవులును దీని ప్రాశస్త్యమును గుర్తించిరి. అమితముగానే వ్రాయుచున్నారు. ఇంకను వ్రాయుటకు పండితులు ప్రోత్సాహ మిత్తురు గాక. ప్రకృతమున లిరిక్కులు వ్రాయువారి—ఒకటి రెండు:—

విరహము *

గీ. హేమపాత్రలఁ జందన మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి హారములను
పానలం దింకె స్నానకషాయ గంధ
మబల! యెవనికోసము సగ మయి కృశింతు!

గీ. చెక్కుచెదరని పాపట చిక్కువడియె
వేణిబంధము శిథిలమై పిఱుఁదు లందె
కరఁగి చెరగిన తిలకరేఖలను దుడువ
వతివ! యెవఁ డాహరించె నీయార్ద్రహృదిని!

గీ. పాలు పొంగిన గతిఁ బొంగు ప్రణయరక్తి
నాఁపుకొనలేని పడుచు ప్రాయంబుతోడ
నమ్మి యెవనికి నీమన మ్మమ్ముకొంటి
వుబిద? యీ మేఘమాస నవోదయముల.

ఇది భావకవిత్వము (లిరిక్కు). సాహిత్యశాస్త్రమున ఇది రసధ్వని. విప్రలంభము వ్యంగ్యము.

చిత్రకుబ్జ §

ఎన్ని మార్గములన్ నిరంతర
మెంతసాధన చేయుచున్నను
పోవకున్నది వక్రగమనము
బుద్ధియందుండి.
కుబ్జ నీ వొకమారు ప్రీతిని
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చినంతనె

—చూ. ౩౬ పుట.

* రాయప్రోలు సుబ్బారావుగారి జడకుచ్చులు.

§ ఇది తల్లావఝుల శివశంకరశాస్త్రిగారిది. ఆంధ్రభారతిలో రెండవసంపుటము ౧౧-వ సంచికనుండి.

వదలిపోయిన దంట ఆయమ
వక్రిమము కృష్ణా!
ఎల్ల వేళలయందు నీకై
యెదురుచూచుచు నున్న దెవ్వడీ
చిత్తకుబ్జను నీదు కౌఁగిటఁ
జేర్తువో కృష్ణా!

ఇదియు భావకవిత్వము(లిరిక్కు). వక్రతా సాధర్మ్యమున చిత్తము కుబ్జగా రూపింపఁ బడినది. ఆరూపకము శృంగార భక్తికి తాళము వేసినది. అవాఙ్మానస గోచరమైన భగవంతుని మహిమచే, దయచే అను భావితమై, కలిగత భగవదాలంబనమగు శృంగారభక్తి, అందును విప్రలంభము ధ్వనించుచున్నది. సాహిత్య శాస్త్రమున దీనికి భావధ్వని అని పేరు.

తెలుఁగుకవులారా ! నూతనసృష్టి ఒక అక్షరమే యగుఁగాక, అది యొక ప్రపంచము. శిక్షాజన్యమై ప్రతిభ లేని ప్రాచీన సృష్టి యొక్కనకలు స్కాందముకంటె ఎక్కువ అగుఁగాక, అది యంతయు ఒక యక్షరమేని గాదు.

ఈజాతి (లిరిక్) కవిత్వము నిక్కముగా కవియొక్క సర్ఫకాస్ (సొంత ఆస్తి) (private-property). ఇందు కవి దానవీరుఁడై, (జీమూతవాహనుఁడు మొ. వారికన్న నెక్కువగా—వారు శరీరము మాత్రమే కోసియిచ్చిరి. కవి మనస్సును ద్రాక్షవలె పిండి యిచ్చును) 'న మమ' అని సంకల్పించి తన సర్వస్వమును లోకులకు ధారపోయును. ఇది హృదయముయొక్క విల్లు (will).

---

## ఏల ?

"విద్యార్థి"

నీలవసనావృతసుషుప్తి నీలవేణి
యంకతలిఁ దన్మయతఁ గన్న యట్టి నన్ను
జాలువాఱఁగఁ బ్రేమ; మే జలదరింప
మేలుకొల్పంగనేల చామీకరాంగి ?

మేలుకొని నిద్రమంపునఁ గేలునఁ గను
దోయి నులుముచు దిక్కులు తోఁపకున్న
నుజ్జ్వలచ్చంచలాలతికోపమాన
కాంతి వెలయించి కన్నీటగానదేల ?

ఆశముందున కలసతాపాశ మూఁచి
వెన్క లాగ గాధేయ దివిం జరింపఁ
గాను జవ్వాడఁ బయ్యెద గదలియాడఁ
గేలు మెల్లన నూఁపి నన్నేల పిలువ ?

డెంద మస్ఫుటభావాల నందడింప
ననుకరించుచునున్న నన్నతుల ప్రేమఁ
గేలుగీలించి సుమధుర లీల వింత
వింత దోహదముల మఱపింతువేల ?

భవదమల ప్రేమఁ గ్రోలి నిన్నెడయఁ గోరి
వేగ వెన్నాడి పిలుచు నన్వీనక గగన
హర్మ్యతలముల మేఘవాహనముమీఁదఁ
జెలఁగియాడుచు నన్ను వంచింతువేల ?

---

# నందిమల్లయ్య–ఘంటసింగయ్య—ప్రబోధచంద్రోదయము

తేకుమళ్ల అచ్యుతరావుగారు, యం. ఏ., యల్. టి.

దగ్గుబల్లి నారాయణకవిని గుఱించి వ్రాయునప్పు డుదయగిరి రాజ్యప్రభువగు బసవరాజును గుఱించియు, మఱి దగ్గుబల్లి దుగ్గనామాత్యునిగుఱించి వ్రాయునప్పుడు బసవరాజుమంత్రియైన చెందలూరి గంగయామాత్యుని గుఱించియు వ్రాయుట తటస్థించినది. ఆకాలముననే మఱియొకగ్రంథ మాసచివాగ్రణియగు *గంగయామాత్యునకే కృతియీయఁబడినది.

నందిమల్లయ్య, ఘంటసింగయ్య యను నిద్దఱు కవులు తాము కలిసి రచించిన "ప్రబోధచంద్రోదయ" మనుప్రబంధము నీగంగయామాత్యుని కంకితముచేసిరి. ఈ గ్రంథమువలన బసవరాజునుగుఱించియు, గంగయామాత్యుని గుఱించియు మఱికొన్నిసంగతులు విశదమగుచున్నవి.

మాధవవర్మ వంశోద్ధురుఁడైన యీబసవరాజు ఉదయగిరిరాజ్యము నేలుచుఁ గళింగాధీశ్వరులైన గజపతులకు సామంతుఁడై వారిపక్షమునఁ దనయావచ్ఛక్తిని వినియోగించుచుండెను. బసవరాజో లేక యతనితండ్రి యగు తమ్మరాజో యుదయగిరి రాజ్యమును గజపతులకొఱకు జయించి దానిని వారిస్వాధీనములో నుంచిరి. సాళువ నృసింహరాయలు విజయనగర రాజులపక్షమున నాప్రాంతదేశమంతయు లోఁబఱచుకొనినను ఉదయగిరిదుర్గముమాత్ర మాతనికిఁ గైవసము కాలేదు. కాఁబట్టి బసవరాజు గజపతుల కొకగొప్పప్రాంత రక్షకుఁడుగా నుండెను. ఈవిషయము ప్రబోధచంద్రోదయమున నిట్లు చెప్పఁబడినది :

సీ. మాధవవర్మ భూమండలేశ్వర వంశ
జలధికి నేరాజు చందమామ

* గంగమంత్రి వంశవృక్షము

[ప్రబోధచంద్రోదయము ననుసరించి]




[నాచికేతూపాఖ్యానము ననుసరించి]



యేరాజు దయశైల మెలమి విభేదించెఁ
గపటాహితమదాంధకార మడఁగ
గజపతి సురధాణి గడిదుర్గముల కెల్ల
నేరాజు వజ్రంపు బోరుతల్పు
మహిమచే నేరాజు మఱపించె నలభగీ
రథ పృథు...రామ రఘురమణుల
నట్టిగుణశాలి తిమ్మరాజాన్వయకుమార
వీరబసవక్షమాచక్రవిభ నిచేత
మన్ననలు గాంచి మించిన మహితుఁ డితఁడు,
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు.

ఈ బసవరాజునొద్ద ప్రధానసచివుఁడుగా నుండిన చెందలూరి గంగయామాత్యుఁడు పెసరువాయవంశేస్థుఁడు. ఈయన యదియటులో నాసికేతూపాఖ్యానము కృతి పొందిన విషయ మీ ప్రబోధచంద్రోదయమునఁ గూడ సూచింపఁబడినది.

"ప్రఖ్యాతనాచికేతూ
పాఖ్యానమహాకవిత్వపరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత
సౌఖ్యా సంఘటితచిత్త శంకరసఖ్యా."

ఈ మంత్రీశ్వరుఁడు రాజనీతియందు దసమానప్రజ్ఞ గలిగి యుదయగిరి రాజ్యమును దమకుఁ బ్రబలశత్రువు లైన విజయనగర రాజులకు లోఁబడకుండఁ గాపాడుటయే కాక యారాజుల దండనాయకుఁడైన సాళువ నృసింహ రాయలను దనకు వశునిఁగాఁ జేసికొనెనఁట. "నృసింహ నృపతి వశీకరనయవిద్యాకరణ" అని ప్రబోధచంద్రోదయ మునఁ జెప్పఁబడినది. ఈ వశీకరణవిధాన మేదో యిద మిత్థమని గ్రంథమున లేదుకాని సాళువనృసింహరాయ లొకానొకసమయమున యుద్ధములో జీవగ్రాహముగా పురుషోత్తమ గజపతికిఁ జిక్కినట్లు గ్రంథాధార ముండుటచేతను, రాజనీతికోవిదుఁ డగు గంగయ్య తన నయ నైపుణ్యమున నిట్లు నృసింహరాయలను పట్టించె నేమో యని యూహింపఁదగియున్నది. ప్రతాపరుద్రగజపతి రచించిన "సరస్వతీవిలాసము" అను ధర్మశాస్త్రగ్రంథ ములో,

మిత్రం శేషధరస్య దాతృపరిష
ద్యస్యైవ సూనో స్స్వయం
సౌందర్యాతిశయాళుకీర్తిసమతా
న్నత్యేతు నైవాపరః;
జీవగ్రాహ మరిం ప్రగృహ్య సమరే
కర్ణాటభూమీధవం
దీనో క్షిప్రవణం నృసింహమనుజా
ధీశం పున స్త్యక్తవాన్.

ఈశ్లోకమందలి విషయము ప్రతాపరుద్రుని తండ్రియగు పురుషోత్తమ గజపతినిగుఱించియై యున్నది. దీనినిబట్టి నృసింహరాయలు పురుషోత్తమగజపతిచే జీవగ్రాహము గాఁ బట్టుబడెననియు, దరువాత విడువఁబడెననియు స్పష్టపడుచున్నది.

మ. ౦. రా. కం. వీరేశలింగంగారు యీవిష యమునుగుఱించి వేఱభిప్రాయమును గనుపఱచినారు. ఆయన తనయాంధ్రకవుల చరిత్రములో నందిమల్లయ్య, ఘంటసింగయ్యలను గుఱించి వ్రాయుచు, "నృసింహనృప తివశీకరనయవిద్యాకరణ" అను విశేషణమును గుఱించి యీక్రిందివిధముగా నూహించినారు: "గంగయామా త్యుఁడు ముందు జైమినిభారత కృతిపతియైన సాళువ నృసింహరాయలయొద్ద సచివుఁడై యుండినట్లు నెఱుఁగ వచ్చును." ఈయూహ సరికాదని నాకుఁ దోఁచుచున్నది. ఏలయన, గజపతులయొద్ద మంత్రిగా నున్న కాలములోఁ గృతినందిన గ్రంథములో శత్రురాజునొద్దఁ దాను మంత్రి గా నుండినట్లు వ్రాయించుకొనునని యూహించుట యసంగతమని తోఁచుచున్నది. కనుక నృసింహరాయ లను జీవగ్రాహముగాఁ బట్టించుటయే గంగమంత్రియొక్క నయవిద్యాకరణమహత్త్వమని నిర్ణయింపవచ్చును.*

*పురుషోత్తమగజపతి సాళువనరసింహరాయలను యుద్ధములోఁ బట్టుకొనఁగా అతఁడు అభయయాచనాంజలితో నుదయగిరిరాజ్యము నిచ్చివేయఁగా నతనిని విడిచిపెట్టినట్లు కొడుకగు ప్రతాపరుద్ర గజపతి తనయనంత వరము శాసనములోఁ బ్రకటించినట్లు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారీసంవత్సరాంధ్రపత్రిక ఉగాది

గంగమంత్రి మహాశివభక్తుఁడును, నిత్యవైదికసంప్రదాయాచరణుఁడును నని యిదివఱకే మనకుఁ దెలిసినది. ఆయనచిత్తవృత్తి తాను గృతినందిన రెండుగ్రంథములఁ బట్టియుఁ గొంతవఱకు గ్రహింపవచ్చును. నాసికేతూపాఖ్యానము శాంతరసప్రధానమై, యాధ్యాత్మికవిషయప్రపూర్ణమై, పుణ్యాపాపలక్షణవిచక్షణమై, స్వర్గనరకవివరణద్యోతకమై జ్ఞానోపదేశకగ్రంథములలో నగ్రస్థాన మలంకరించుచున్నది. ప్రబోధచంద్రోదయము గూడ నటువలెనే యాధ్యాత్మికతత్త్వప్రభావకలాపమును గథారూపముగాఁ బ్రవర్తించుచున్నది. ఈ రెండుగ్రంథములు కేవల మాముష్మికదృష్టితో జీవయాత్ర గడపుచు ముముక్షుమార్గము నవలంబించెడువారికే యభిరుచియు, నభినివేశమును గలిగించుచుండును. వానిఁ బ్రత్యేకముగాఁ గృతినొందుటఁ బట్టి గంగయ్యమంత్రి కాధ్యాత్మికవస్తువిచారము మెండుగా నుండియుండవలెను.

ఈ బుద్ధివిశేషము నుద్దేశించియే కాఁబోలు, ప్రబోధచంద్రోదయమున నీమంత్రిపుంగవుగుఱించి తదాశ్రితకవిపండితలోక మిట్లు పల్కెనఁట:

సీ. "సరిలేని నీతిచాతురిచేత రాజ్యతం
త్రంబును నడపిన నడపుఁ గాని
యనిశంబు పువ్వనందనవనితాదిసౌ
ఖ్యంబుల నంగనందుఁ గాని
సంగీతసాహిత్యసరసవిద్యావినో
దంబులఁ దగిలినఁ దగులుఁ గాని
స్వామిహితాసక్తి సవనాసదనుశా
సనలీల జరపిన జరపుఁ గాని
నీళ్ల లోపలి సరసిజినీదళంబు
సరవి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియము లేదు ప్రత్యక్షశంభుమూర్తి,
యీయనంతయ గంగమంత్రీశ్వరుండు."

కాఁబట్టి యీ యనంతయ గంగమంత్రీశ్వరుఁ డపారరాజకార్యనిర్వహణలౌకికప్రవాహములో మునిఁగి తేలుచుండినవాఁడైనను, నీటిలోని తామరాకువలెఁ బ్రాపంచికవిషయానురక్తి యంటకుండ నిర్లేపుఁడై సంసారయోగివలె మనుచుండెనఁట. ఇట్టినియతాత్ముఁడు నిజాత్మతేజఃపుంజంబున నజ్ఞానతిమిరంబును విచ్ఛేదంబు చేసి ప్రబుద్ధుఁడైనకతన "ప్రబోధచంద్రోదయ"మనుగ్రంథ మీతని కెక్కుడు సులభముగా బోధపడఁగలదు, కాన నాగ్రంథమును సత్కవులచే నాంధ్రీకరింపించి కృతినందఁదగినవాఁడని యాశ్రితాశేషశేముషీభూషణబృంద మాశీర్వదించినఁట:—

ఉ. ఈదృశవర్తనంబునకు
నెక్కుడు బోధముగున్ ప్రబోధచం
ద్రోదయ మాంధ్రభావ నతి
యోగ్యకవీంద్రులచేత నంకితం
బై దిశలం బ్రసిద్ధముగ
నందిన గస్తురితావి నైడికిన్
మేదుర హేమకాంతి ధర
ణిన్ మృగనాభికిఁ గల్గులాగునన్.

అట్లు బుధాశీర్వాదపురస్కృతుఁడై యీయనాగ్రంథమును గృతినంద నుద్యోగించి దరినున్న పండితావళి నిట్టిమహనీయగ్రంథము నాంధ్రీకరింప సమర్థులెవ్వరైన నున్నారా యని ప్రశ్నింప వారీకవిస్వయమును బేర్కొనిరఁట—

సీ. కలరు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీతవంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజగో
త్రారామ చైత్రోదయంబు ఘంట

సంచికలో వ్రాసినారు. శాసనములో నీశ్లోక మిట్లున్నది:
"యస్మై నిత్యతరప్రతాపదహన జ్వాలాయమానధ్వజ, స్తంభాబద్ధకుసుంభరక్తవసన ప్రేక్షావిభగ్నద్విషే;
సంధాయాభయయాచనాంజలిమహోగ్రతోద్వదయాద్రింభయా, దాత్మానంముముచే నృసింహనృపతిః కర్ణాటదేశాధిపః."

నాగధీమణికిఁ బుణ్యాచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్సు-
ధీశ్వరారాధకులు ఖ్యాతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థ లీకృతిరాజ నిర్మాణమునకు.

ఆమాటలు విని సంతోషవికసితవదనారవిందుండై మిత్ర లంపు నాతలంపు నేకంబయ్యె నిదియ సరిలేని శుభనిమిత్తం బని వెంటనే యాకవిపుంగవుల నిరువుర రావించి, చిత్రవర్ణాసనంబున నాసీనులం జేసి, శివపూజావిధాన విలిప్తసుగంధపరిమళితంబైన హస్తంబున కర్పూరతాంబూలంబు లిచ్చి,

క. నేరుపరి పోషణించిన
హారము వెల యెక్కుడీల నతిశయముగ నా
పేరఁ దెలిఁగింపవలయును
సారపుఫణితులఁ బ్రబోధచంద్రోదయమున్.

అని యాకవిద్వితయమును సవినయగాఁ గోరెనఁట. అందులకు వారంగీకరించి కృష్ణమిశ్రునిచే రచింపఁబడిన ప్రబోధచంద్రోదయమను గీర్వాణనాటకరాజమును బ్రబంధరూపముగాఁ దెనిఁగింపఁ బూనిరి.

## నందిమల్లయ్య, ఘంటసింగయ్య

ఈ జంటకవుల వంశాదివిషయముల గూర్చి వారు రచించిన రెండుగ్రంథములే మనకు ముఖ్యాధారములు. మొదటఁ బ్రబోధచంద్రోదయమును వ్రాసి గంగయామాత్యునికిని, దరువాత వరాహపురాణమును రచియించి తుళువనరసనాయకునకును నంకితముచేసిరి. ఆగ్రంథముల యవతారికలలోఁ తమకులగోత్రముల గుఱించి యిట్లు చెప్పికొనిరి.

ప్రబోధచంద్రోదయమున వీరినిగుఱించి చెప్పిన పద్యము పైన నుదాహరించితిని. వరాహపురాణమున వీరిని గుఱించి యిట్లు చెప్పఁబడినది:

సీ. అపుడు సభావేదికాగ్రస్థితులమైన
మమ్ము వాగీశ్వరీమంత్రరాజ
సిద్ధిపారగులఁ గౌశికభరద్వాజగో
త్రుల మహాదేవాంఘ్రిజలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబసూత్రుల
గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల నతిశాంతచిత్తులఁ దనకునా
శ్రితులభాషాద్వయ కృతినిరూఢ
శేముషీభూషణుల నందిసింగనార్య
తనయు మల్లయకవిపులోత్తముని ఘంట
నాగధీమణి కూర్మినందనుని మలయ
మారుతాంకితు సింగయమంత్రిఁ జూచి.

క. మీరిరువురు నెప్పుడును శి
రీరప్రాణములక్రియఁ జరింతురు మిగులం
గూరిమిఁ గృతిఁ బ్రతిపద్యముఁ
జారుఫణితిఁ జెప్పఁగలరు చాటువుగాఁగన్.

పైపద్యములఁబట్టి వీరినిగుఱించి తెలిసినసారాంశములు:—

నందిమల్లయ్య కౌశికగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; తండ్రి సింగన్న; తల్లి పోచమ్మ; శివభక్తుఁడు; వాగీశ్వరమంత్రోపాసకుఁడు, దక్షిణామూర్తిశిష్యుఁడు. ఘంటసింగన్న భారద్వాజగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; తండ్రి నాగన్న; తల్లి అమ్మలమ్మ; శివభక్తుఁడు; వాగీశ్వరీ మంత్రోపాసకుఁడు; అఘోరశివశిష్యుఁడు.

ఈఘంటసింగయ్యకు మలయమారుతకవి * యని ప్రత్యేకబిరుదాంకము గలదు. ఈతఁడు నందిమల్లయ్యకు

* మలయమారుతకవి యని బిరుదు బహుశః ఈతనికవిత్వమందలి గుణవిశేషములవలన వచ్చియుండును. మలయమారుతమందు శైత్యము, సౌరభ్యము, మృదుత్వమునున్నట్లు తెలిసిన విషయమే. ఈతని కవిత్వమునందు నీగుణవిశేషములే యుండుటచేత ఈ బిరుద మీయఁబడినది. మొత్తముమీద ప్రబోధచంద్రోదయ వరాహపురాణములలోని కవిత్వము చాలమృదువుగాను, సమరసభావయుతముగాను నుండుటచే హృద్యమై, యీబిరుద నామమునకీతఁడు తగినవాఁడని చెప్పవచ్చును.

మేనల్లుఁడు కాఁబట్టి యీయిద్దఱు కవులు నొక్కకుటుంబములోనివారు.

*వీరిద్దఱును ఎల్లప్పుడును శరీరప్రాణములవలె అభేదాధ్యవసాయమున నుండిరి. వీరు రచించిన గ్రంథముల యాశ్వాసాంతగద్యములలో సైత మిద్దఱి పేళ్లను చెప్పికొనిరి: "ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్రమల్లయమనీషితల్లజ మలయమారుతాభిధాన ఘంటనాగయప్రధానతనయ సింగయ కవిపుంగవ ప్రణీతంబైన..."

కృష్ణదేవరాయలకాలములోనివాఁడైన నందితిమ్మన్న లేక ముక్కుతిమ్మన్న అనుకవీశ్వరుఁడు తాను రచించిన "పారిజాతాపహరణము" అను కావ్యమును కృష్ణదేవరాయల కంకితముఁజేసి తన కులగోత్రములఁ జెప్పికొనుచు 'మలయమారుతకవి' యని బిరుదనామముకల యీఘంటసింగయ్యకుఁ దాను మేనల్లుఁడనని చెప్పికొనెను:

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
  సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
  దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
  నల్లుఁడు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
  నమహాగ్రహారసన్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
  ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నాంధ్రభాష
  నాదివాకర తారాసుధాకరముగ.

కాఁబట్టి యాకవులవంశము పండితవంశమై పెక్కండ్రు కవిపుంగవులచే శోభితమైయుండెను. నంది సింగయ్య, ఘంటమల్లయ్యయను కవులుకూడ నుండినట్లు తెలియవచ్చుచున్నది.

## ప్రబోధచంద్రోదయము

ప్రబోధచంద్రోదయ మను గీర్వాణనాటక మొక ప్రత్యేకమైన విచిత్రగ్రంథము, సామాన్యముగః గావ్యనాటకములయందు మానవజాతులలోని స్త్రీపురుషులో, లేక నిలింపవర్గములలోని స్త్రీ పురుషులో పాత్రములుగా నుండి కథాక్రమమును జరిపింతురు ఈగ్రంథమం దట్లుగాక మానవస్వభావమందుండెడు సుగుణదుర్గుణములే పాత్రములుగా నుండి, మనుష్యుని యాధ్యాత్మికజీవితనాటకము ప్రదర్శింపఁబడుచున్నది. కావున నీగ్రంథమందలి పాత్రములు ప్రతిపురుషుని యందును, ప్రతిస్త్రీయందును స్వాభావికముగా గోచరించుచున్నవియే. ఈనాటకము గ్రహించుటకు మనుష్యస్వభావము తప్ప మఱే గ్రంథములను బరిశీలింప నక్కఱలేదు. మహాభారతమందుఁ గౌరవులకును భాండవులకును, శ్రీమద్రామాయణమందు రామరావణులకును ఘోర యుద్ధము జరిగినట్లుగ నీప్రబోధచంద్రోదయమందు మానవప్రకృతియందలి సుగుణదుర్గుణములకు నిత్యము జరుగుచున్న సంకులసమరము నిరూపింపఁబడినది. ఇట్టియాధ్యాత్మికయుద్ధమును సమస్తదేశములవారును దమతమ మతగ్రంథములయందు వ్రాయుచుండుట తఱచు కానంబడునుగాని రసప్రధానములగు కావ్యనాటకములయం దిట్టి విలక్షణపాత్రములచేఁ బరస్పరవిజిగీషాసంఘట్టనము నిరూపించుట చాలనరుదు.

ఆంగ్లేయభాషలో 'బనియను' అను మహామేధావి యొకఁడు "యాత్రికుని పర్యటనము" (Pilgrim's Progress) అను వచనగ్రంథమును వ్రాసెను. ఆయాత్రికుఁడు క్రైస్తవుఁడు. అతనియాత్ర భూలోకమునుండి స్వర్గలోకమునకు. ఆదారిలో నతనికి సంభవించిన యానుకూల్యాంతరాయములును, సుఖదుఃఖములును బహుచమ

* కవులు కవలుగానుండుట యొక ప్రతిభాగౌరవవిశేషమని తలంపఁబడుచుండిన యీకాలమున జంటకవుల కృతినిర్మాణపద్ధతులు సులభగ్రాహ్యములు. ఈకాలమున విడికవులకంటె జంటకవుల పేళ్లే లెక్కకుమిక్కిలి యున్నవి. తిరుపతి వెంకటేశ్వరకవులు సుప్రసిద్ధులు. వారిఁబడి నెన్నియేని జంటలు పెరిఁగినవి. రామకృష్ణకవులు శేషాద్రిరమణకవులు, వెంకటపార్వతీశ్వరులు, కొప్పరపుసోదరకవులు ఇత్యాదులు.

రతతో వర్ణింపఁబడినది. జర్మనీభాషలో "గీటే" అను సుప్రసిద్ధ కవిపుంగవుఁడు 'ఫౌస్టు' అనెడు లోకోత్తరమైన నాటకరాజమును తనయవసాన దశయందుఁ బూర్తిచేసి మానవజీవిత మంతయు నుత్తరోత్తరాభివృద్ధి సూచకముగాను, మహాదాదర్శలక్షితముగాను నన్యాపదేశగర్భితముగాను జిత్రించెను.

సంస్కృతభాషయందే యీ ప్రబోధచంద్రోదయమునకు, బోటీగా "సంకల్పసూర్యోదయ"మను పేర శ్రీవైష్ణవమత పరివ్రాజకవర్గములో నొకరగు వెంకటనాథవేదాంతదేశికులవారు రచించినారు. ప్రబోధచంద్రోదయమం దద్వైతమతము నిర్ధారింపఁ బడినట్లు సంకల్పసూర్యోదయమున విశిష్టాద్వైతమతము స్థాపింపఁ బడినది.

పైఁ జేర్కొనఁబడిన ప్రసిద్ధగ్రంథములతో సమానముగాఁ జెప్పఁదగిన మఱియొక గ్రంథ మాంధ్రవాఙ్మయమందే యున్నది. అది పింగళి సూరనార్యుఁడను కవిశిఖామణి రచించిన "కళాపూర్ణోదయము" ఇందు మనుష్యుని ఆధ్యాత్మిక జీవితచరిత్రము సామాన్యశృంగారరసప్రధానముగు కథలో నంతర్లీనము చేయఁబడి యతిచతురముగాఁ గూర్పఁబడినది. దీనిలో సైతము మనుష్యుని ఆధ్యాత్మికతత్త్వమందలి సుగుణదుర్గుణము పోరాటము ఛాయారూపముగాఁ జిత్రింపఁబడినది.

కాని పైఁ జేర్కొనఁబడిన అంతరర్థకథాగ్రంథము (allegories) లన్నిటిలో కథా విస్పష్టతలోను, పాత్రరసపోషణములోను, క్రమనిర్వక్రతలోను అపారజ్ఞానవిజ్ఞానసంపత్తిలోను ప్రబోధచంద్రోదయము మిన్నయని చెప్పక తప్పదు. ఈనాటకమందుఁ జరిత్రాత్మకమైనవిగాని, సాంఘికమైనవి గాని అన్యోపదిష్టభావము లంతర్నిబద్ధము లగుట లేదు. కావున కథానిర్మాణము చాలవిశదముగాను, నిరాడంబరముగాను గల్పింపఁబడినది.

## కృష్ణమిశ్రుఁడు

అసమానమైనదియు, నద్వితీయమైనదియు నగు నిట్టి నాటకరాజమును కల్పించిన మహామహుఁడు కృష్ణమిశ్రుఁడను కవివర్యుఁడు. ఈకవిపుంగవుఁడు క్రీ.శ. పదనొకండవ శతాబ్ద్యంతమున నుండినట్లు కానఁబడుచున్నది. ఈతనిగుఱించిన కాలనిర్ణయాదుల కాధారము లీగ్రంథమందే కొంతవఱకుఁ గాన్పించుచున్నవి. ఈనాటకమందలి ప్రస్తావనభాగములో నటీసూత్రధారు లీనాటక రచనమును గుఱించియు, నాటకప్రయోగమును గుఱించియు సవిస్తరముగా, సవిశేషముగాఁ బ్రస్తావించియున్నారు. వారి పరస్పరసంభాషణాదికముచేఁ దెలియవచ్చిన చరిత్రాంశము లేవన:—

చంద్రవంశపురాజైన కీర్తివర్మయను నృపాలుఁడు చేదిదేశప్రభువైన కర్ణునిచే పరాజితుఁడై రాజ్యమును గోల్పోయెను. పదంపడి కీర్తివర్మ మహీపాలుని సేనానియైన గోపాలుఁ డనుభూసురోత్తముఁడు కర్ణుని నోడించి కీర్తివర్మను మరల రాజ్యస్థాపితునిఁ జేసెను. ఈగోపాలుఁడు బ్రాహ్మణుఁ డగుటచే యుద్ధానంతరమునఁ దన సహజమైన శాంతరసమును బొందినవాఁడై, క్షత్రియకులహంతయైన పరశురామునివలెఁ దనయుజ్జ్వలకోపాగ్నినిఁ జల్లార్చుకొని శాంతజీవితమును స్వీకరించెను. ఆయన యాజ్ఞానుసారముగా నతని గురువగు కృష్ణమిశ్రునిచే నీనాటకము రచింపఁబడి కీర్తివర్మ భూపాలుని సమక్షమునఁ బ్రదర్శింపఁబడవలసివచ్చినది.

ఈకీర్తివర్మ చాండిల్యవంశస్థుఁడైనట్లును, క్రీ.శ. 1098 సం. ప్రాంతములో రాజ్యము చేయుచుండినట్లును కొన్నిశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. అంతియకాక ఈతని శత్రువైన కర్ణుఁడు పడమటిచాళుక్యరాజులలో నొకఁడగు త్రిభువనమల్లుఁడు, లేక విక్రమాంకదేవుఁ డనుపేరుగల నృపాలునకు సమకాలికుఁడైనట్లు బిల్హణ చరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది:

కాలః కాలంజరగిరిపతే ర్యః ప్రయాణే ధరిత్రీం
తుక్కారాణాం ఖురపుటరవైః క్ష్మాపనాన్యాంచకార,
శ్రీదాహాలక్షితిపరివృఢః సోఽపి యం ప్రాప్య వృత్తమ్
కర్ణః కర్ణామృతరసభరాస్వాద మంత స్తతాన.
(బిల్హణ—విక్రమాంకదేవచరిత్ర)

అనఁగా బిల్హణుఁడు దాహళదేశపురాజైన కర్ణునికడకు వెళ్ళి సన్మానమును బొందెను. ఈబిల్హణుఁడు

విక్రమాంకదేవుని యాస్థానకవియై తనవిక్రమాంకదేవచరిత్రమును ఆరాజున కంకితముచేసెను. విక్రమాంకదేవుఁడు క్రీ. వె. 1076 మొదలు 1126 వఱకు రాజ్యము చేసినట్లుగాఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి కర్ణుఁడు, విక్రమాంకదేవుఁడు, కీర్తివర్మ వీరుముగ్గురు సమకాలికులగు ప్రభువు లని యేర్పడుచున్నది.

ఇట్లుండఁగా కీర్తివర్మ నరపాలుని యాస్థానకవి యగు కృష్ణమిశ్రుఁడు బహుశః విక్రమాంకదేవుని యాస్థానమునకును బోయి యాతనివలన రాజపోషణాది సత్క్రియలను బొందెనాయని సంశయము గలుగుటకొక యాధారము కానఁబడుచున్నది.

శ్రీవిక్రమాంకో జగతీతలేఽస్మిన్
జీయాన్ మనుప్రఖ్యయశా నరేంద్రః,
ప్రపోష యం కోటిసువర్ణతో వా
సబాంధవం సప్తతివత్సరాణి.

(కృష్ణమిశ్రః-ఫలరత్నమాల)

అని యొకానొక కృష్ణమిశ్రుఁడు తన ఫలరత్నమాల యనుజ్యోతిషగ్రంథమున వ్రాసికొనెను. ఆకృష్ణమిశ్రుఁడును, మననాటకకర్తయగు కృష్ణమిశ్రుఁడును ఒకఁడా, కాదా యని నిర్ణయింపఁదగినది.

ప్రబోధచంద్రోదయ నాటకనిర్మాతయగు కృష్ణమిశ్రుఁ డొకమహాపండితుఁడైన సన్న్యాసియనియు, ఆతని కనేకులు శిష్యులుండిరనియు, వారిలో నొకశిష్యుఁడు వేదాంతవిషయములను చదువనొల్లక, కావ్యనాటకాది గ్రంథముల మాత్రమే చదువుచుండెననియు, అతనికి వేదాంతమార్గ ముపదేశించుటకుఁ గృష్ణమిశ్రుఁడు వేదాంతసారము నీప్రబోధ చంద్రోదయ నాటకరూపముగా రచించినాఁ డనియు, నొకవిద్వత్సంప్రదాయక్రమాగత గాథ కలదు. మొత్తముమీఁదఁ గృష్ణమిశ్రుఁడు శ్రోత్రాహుఁడును, గౌడదేశస్థుఁడును నగు కవివర్యుఁడు క్రీ. వె. పదునొకండవ శతాబ్దాంతమున నుండినవాఁడు; అతఁడు విష్ణుభక్తుఁడు, వేదవేదాంతాభ్యాసకుఁడు; నిర్మలయశస్కుఁడు, వైదికాచారతత్త్వకోవిదుఁడు, మృదుమధురకావ్యరచనానిపుణుఁడు, వాణీవిశారదుఁడు, అప్రతిమభావభావనావిచక్షణుఁడునై గీర్వాణవాఙ్మయమునఁ బ్రక్షీణకీర్తి సంపదల గడించెను.

## కథాసారము

జ్యోతిర్మయంపుఁ గోటలును, అమృతంపుఁ బరిఖలును, నైర్మల్యంపుమేడలును గల చిదానందనగరియందు ఈశ్వరుఁ డనురాజు రాజ్యపాలనము చేయుచుండెను. అతనికి మాయయనెడు పట్టమహిషివలన మనస్సు అనెడు తనయుఁడు కలిగెను. ఆరాజకుమారునకుఁ బ్రవృత్తి యనియు, నివృత్తియనియు నిద్దఱుభార్యలు గలరు. ప్రవృత్తిదేవివలన మహామోహుఁడు మున్నగు సుతులును, నివృత్తిదేవివలన వివేకుఁడు మొదలగు పుత్రులును జనించిరి.

ఈ యిరువురు సపత్నులపుత్రులయందును సమానమగు రాజ్యకాంక్ష యుద్భవించినకతనఁ గౌరవపాండవులకు రాజ్యవిషయమునఁ బోరు కలిగిన ట్లీయుభయపక్షములవారికిని భువనైకాధిపత్యముకొఱకు నిరంతరమును తగవు గలుగుచుండెను. జ్యేష్ఠవర్గమగు మహామోహాదులయందు జనకునకుఁ బక్షపాత ముండుటచే వివేకాదులు సమరమున నిలువలేక చెల్లాచెదరై పాఱిపోవలసివచ్చెను.

మహామోహుఁడు రాజ్యమును స్వీకరించి సాపత్న్యేయులగు వివేకాదులను నిర్మూలముచేయ నుద్దేశించి వా రెక్కడెక్కడ దాఁగియుండిరో వెతకించుటకుఁ జారులను బంపెను. వారు విశ్వంబునంగల పురంబుల నన్నిట నెమకి, యచ్చటచ్చట వివేకాదులు పొడసూపుట వినినవారై తమయేలికకు విన్నవించిరి. మహామోహుఁ డుగ్రుఁడై పేరోలగంబునఁ దనతమ్ముల విలోకించి వివేకాదుల నెట్లు భంజింపవలయునో తగు నుపాయంబులఁ దెల్పుఁడని, సోదరామాత్యవర్గంబుల కాజ్ఞాపించెను. అందుఁ గాముఁడు తన యద్భుతప్రాభవంబునుఁ బ్రకటించుకొనుచు వాసంతికా నవమల్లికావికసితవల్లీమతల్లులవలె నుల్లసిల్లెడు పల్లవాధరలు దన బలానీకంబులో నుండ వివేకాదు లెట్లాహవంబున నిలువనోపుదురని యుత్కటగర్వంబునఁ బ్రగల్భించెను.

మహామోహమహారాజు సభాంతరమున రహస్యాలోచనము చేయుచున్న సమయంబున దుర్గుణుం డను వేగులవాఁడు వచ్చి వివేకమహారా జుపనిషద్దేవిని పునఃపరిగ్రహించుటకును, ఆ యిరువురిసంయోగమువలన విద్యాప్రబోధచంద్రు లుదయించుటకును వలయు ప్రయత్నములు జరుగుచున్నవనియు, నవి నిర్విఘ్నముగా నెఱవేఱుటకు శమదమాదులు సకల పుణ్యతీర్థంబులకుఁ బోయి దేవతాప్రార్థనంబులు చేయ సమకట్టియున్నారనియు పిడుగువంటివార్త వినిపించెను. మహామోహుఁడు భయవిహ్వలుఁడై తన ముఖ్యసచివుఁడగు దంభుని జూచి, "మిత్రమా, పుణ్యతీర్థంబులలోఁ బ్రశస్తమగు కాశీనగరంబునకుఁ బోయి వివేకుని ప్రయత్నంబులకు భంగము గావింప వలయు" నని చెప్పిపంపెను.

మహామోహుఁ డొనరించిన యాలోచనంబును, దంభాదులకు నియోగించిన యాజ్ఞావిశేషంబులును రహస్యముగాఁ గనిపెట్టి సదాచారుఁ డనెడు చారుఁడు తద్వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు వివేకమహారాజునకు నివేదించెను. ఆమహీవల్లభుఁడు చింతాకులుండై తన యగ్రమహిషియగు మతిని రావించి యీయుదంతమును సర్వంబు నామెకు విన్నవించెను. విద్యాప్రబోధచంద్రు లెట్లుద్భవింతురని యామె ప్రశ్నింపఁ దనతోఁ గలహించి చిరవియోగానలమునఁ గృశించుచున్న యుపనిషద్భామినికిఁ దనతోఁ బునఃసమాగమము గలిగనేని విద్యాప్రబోధచంద్రులు ప్రభవింతురని చెప్ప నాసాధ్వీలలామ సపత్నీపునరాగమమున కియ్యకొనెను

మహామోహునిచే నాజ్ఞాపితుఁడై దంభుఁడు వారణాసీపురవరంబున కేఁగి, యచ్చట నివాస మేర్పఱచుకొని రాజకార్యనిర్వహణదీక్షితుఁడై యుండెను. కొండొక దివసమున నొకానొకపురుషుఁడు వానియింటికి యాదృచ్ఛికముగా నేతెంచి, యాతిథ్యమును గ్రహింపనొల్లక దురహంకృతి, గనుపఱుప, వారి కిరువురకు జరిగిన సంభాషణక్రమమున నానూతనపురుషుఁ డహంకారుఁడని తెలియవచ్చినది. అప్పుడు దంభుఁ డహంకారునకు మ్రొక్కి-నను లోభునికుమారుఁ డనియుఁ, గావున నహంకారునకు మనుమఁ డనియు బాంధవ్యమును జెప్పికొనెను. పిమ్మట నిరువురును దమతమ యాచరణీయవిషయములను దెల్పుకొని మహామోహుని యాజ్ఞానుసారముగ నుభయులును కాశీక్షేత్రమునకు వచ్చిన ట్లెఱింగికొనిరి.

ఇట్లుండ మహామోహమహారా జాసమయమున కాశీపురంబున సపరివారంబుగఁ బ్రవేశించెను. దంభాది బంధువర్గమును, క్షపణకబౌద్ధకాపాలికాది పరివారనికరమును నామహారాజును జుట్టికొని సంతోషసంభ్రమకోలాహలంబునఁ జెలరేఁగిరి. మహామోహమహారాజు బంధుమిత్రానుచరులకుఁ దననాస్తికమతప్రకారమును సర్వంబు నుద్బోధించి శరీరము వేఱనియు, నాత్మ వేఱనియుఁ జెప్పు వేదవాక్యము లబద్ధములనియుఁ, బంచభూతపరిపాకప్రాప్తచైతన్యమగు నీయొడలే యాత్మయనెడు సిద్ధాంతము సత్యమనియు వాక్రుచ్చి, వేదచోదితకర్మాచరణచణులను నిర్మూలము గావింపవలసినదని మేఘనిస్వనితగాంభీర్యమునఁ జెప్పుచుండఁ, దన మతాచార్యవర్యుఁడగు చార్వాకుఁడు శిష్యసహితుఁడై విచ్చేసి, మహారాజును దీవించి, సమస్తము దేవరపంపున సాధింపఁబడెనని నివేదింప, మహామోహాదిసమస్తరాజన్యలోకము గడుంగడు సంతసించె. విష్ణుభక్తి యను కల్లరిపిల్లమాత్ర మింకను లొంగకుండ సిలుగులు పెట్టుచున్నదని కొంతసంకోచముగాఁ జెప్పిన చార్వాకునిమాటలు విని మహామోహుఁ డించుక నిట్టూర్పు నిగిడించి, యామూర్ఖురాలు పట్టినపట్టు విడువదుగాని కామక్రోధాదులముండట నామె త్రుళ్లగింతలు సాగవని యాడిల్లి, అయినను శత్రువర్గములోనిదైన నిసువునైనను నుపేక్షింపఁగూడదని తనభృత్యవర్గమును హెచ్చరించెను.

ఆలోన నొకప్రతీహారి వచ్చి పురుషోత్తమ దేవాలయమున నున్న మదమానులు దేవరవారి కొకవిజ్ఞాపనపత్రికఁ బంపిరని చెప్ప, మహామోహమహారాజాపత్రికఁ గైకొని శ్రద్ధయును, ఆమెదుహితయగు శాంతియును గలసి వివేకమహీవల్లభునకును, ఉపనిషద్భామినికిని బొత్తు గలుగునట్లు దౌత్యము నడుపుచున్నారనియు, ధర్మము, వైరాగ్యము మున్నగు పెద్దలీకార్యసంఘటననిమిత్తము సహకారులుగా నున్నారనియును వ్రాసినసంగతులను జదివికొనెను. పిమ్మటఁ గామక్రోధలోభులను బిలిచి ధర్మ

మును గట్టిపెట్టుమని కాముసికిని, శాంతిని బంధింపుమని క్రోధలోభులకును నానతు లిచ్చి శ్రద్ధను వశీకరించుటకు నాస్తికత తప్ప వేఱొకరు సమర్థులు గారని యూహించి, మిథ్యాదృష్టి పేరం బరఁగు నాస్తికతను తోడితెమ్మని విభ్రమావతి యను దాసిం బంపెను. ఆమె శీఘ్రము పోయి మిథ్యాదృష్టిని దోడ్కొనివచ్చెను. అంత మహామోహ భూకాంతుఁడు తన కత్యంతప్రియ విలాసినియయిన మిథ్యాదృష్టిని జూచి పరమానందభరితుఁడై యామెను గాఁగిట గ్రుచ్చిగ్రుచ్చి యాలింగనస్పర్శసుఖమునఁ జొక్కి-చొక్కి కొంతవనుక నామెతో శృంగారలీలల నోలలాడి తుద కామెతోఁ దాను పనివడి రప్పించిన కార్యమును జెప్పి శ్రద్ధ నేదో మాయోపాయంబున బద్ధురాలిం జేయవలసిన దని నియమించి పంపెను.

అట్లు మహామోహుని యాజ్ఞానువర్తినియై మిథ్యాదృష్టి శ్రద్ధాలలనయొద్దకుం జని తనకపటోపాయంబులఁ నెఱపి యామెను వేదమార్గంబునం దప్పించి పాషండమత వశంవదం జేసి మఱుఁగువెట్టిన, శాంతికన్య తనతల్లిని గానలేక విభ్రాంతినొంది తిరుగులాడుచు, విలపించుచు నామె పాషండసదనంబులనైన నున్నదేమో యని వెదకికొనె నుద్దేశించి తనచెల్లెలియగు కరుణతోఁ గూడ బోవుచున్న సమయంబున నొకవికృతాకారుఁడైన పురుషుఁ డాదారినే యెదురేఁగుచుండఁ జూచెను. వా రాతని వీక్షించి రాక్షసుఁడో పిశాచమో యని సంశయించి భయభ్రాంతులై కొంతసేపటికిఁ దెప్పిఱిల్లి యానూతనపురుషుఁ డొకదిగంబర సన్న్యాసియని తెలిసికొనిరి. అప్పుడు శాంతి తనతల్లి యామనుష్యునియొద్ద నుండునేమోయని కనుఁగొనుట కచ్చటనే నిలువఁబడెను. ఇంతలో నాదిగంబరుఁడు "అర్హంత, అర్హంత" యని తనశ్రావకవర్గమును బిలిచి స్వమతోపదేశమును జేయుచు శ్రద్ధను రావించి వారికి నూడిగములు చేయుమని నియోగించెను. ఆవచ్చిన స్త్రీని శాంతి చూచి తనతల్లి యనుకొని భ్రమించెను కాని మఱికొంతసేపటికి తనతల్లి కాదనియు, తామసియనియు నిశ్చయించుకొనెను.

తరువాత బౌద్ధమందిరములనైన తనతల్లి యుండునేమో యని వెదకుటకుఁ దిరుగులాడుచుండ నంతలో బౌద్ధభిక్షు వొకఁడు చేతఁ బుస్తకములకట్ట పట్టుకొని యెదురుపడెను. ఆతనియొద్దనైనను దామసియే యున్నది గాని తనతల్లి యగు నిజమైన శ్రద్ధ లేదని నిశ్చయముగా దెలిసికొనెను.

ఇట్లుండ నాదిగంబరుండైన జైనక్షపణకుఁడు బౌద్ధభిక్షువుతో మతవిషయమున వాదములాడ మొదలిడి తుదకు వాని దూషింపసాగెను. వీరిద్దఱు కలహమాడుచుండఁగా సోమసిద్ధాంతుఁ డొకఁడు చేతఁ గరవాలముఁ బూని యటఁ జేరెను. వీరు మువ్వురు మతాభినివేశముఁ దమతమమతములఁ గూర్చి చర్చింపసాగిరి. కొంతకాలమునకుఁ గాపాలికుఁడు రోషరూషితనేత్రకోణుఁడై కరవాలముం ద్రిప్పుచు జైనక్షపణకునిఁ బొడుచుటకుఁ జేయి సాచెను. అంత బౌద్ధుఁడును, క్షపణకుఁడును చెగిపడి యాభైరవాకారు డగు సోమసిద్ధాంతిని క్షమింప వేఁడికొనిరి. అంతట సోమసిద్ధాంతుఁడు తాను గ్రోలుచున్న మదిరారసమును గొంత వారి కిచ్చి తనమతమునకు వారిని మార్చికొనెను. వారు మువ్వు రిట్లు సఖ్యపడి, "అద్దిరా. మనచక్రవర్తియగు మహామోహుని యాజ్ఞను మఱచి యిచ్చోటఁ గాలవిలంబము చేయుచున్నాము. శ్రద్ధాదేవిని బట్టితెమ్మని మన కేనియానతికదా. ఆమె విష్ణుభక్తిచెంతను దాఁగియున్నది; కాఁబట్టి యామెను వెంటనే కొని తేవలయు" నని కాపాలికుఁడు తన భైరవీశక్తి నాకర్షించి పంపెను. ఇంతలో శాంతియుఁ, గరుణయు శ్రద్ధయొద్దకుఁ బోయిరి. వీ రిట్లుండఁగా రౌద్రరసావిష్టయగు భైరవీశక్తి భీకరాకారముతో గగనమున కెగసి పావురమును డేగపట్టుకొనినట్లు, శ్రద్ధాలలనను బట్టికొని యెగిరి వచ్చుచుండఁగా విష్ణుభక్తి యడ్డుపడి భైరవిని బాఱఁద్రోలి శ్రద్ధను విడిపించెను.

విష్ణుభక్తిమహాదేవి శ్రద్ధను విడిపించి యామెతో నిట్లు నుడివెను: "శ్రద్ధా, నీవు వేవేగ మేపోయి, వివేక మహారాజుతో నిట్లు చెప్పవలెను. మోహాదివిరోధివర్గమును నిర్జించుటకు సైన్యముల నన్నిటిని జేరఁ గూర్చుకొని యాయత్తపడియుండవలెను. విష్ణుభక్తిమహాదేవి కావలసినసాయ మొనర్చుటకు సిద్ధముగానున్నది" అమ.

టలు విని శ్రద్ధాదేవి యవిలంబితముగా వివేకమహారాజును జేరి విష్ణుభక్తిదేవి నుడివినపలుకులు యథావిధిగా నివేదించెను. అంత వివేకనృపాలుఁ డెదిరిబలములన్నిటిలోఁ గ్రోడయగు కాముని జయింప సమర్థుఁ డెవ్వఁడని యోచించి వస్తువిచారునకు వర్తమానముఁ బంపెను. అంత వస్తువిచారుఁడు వచ్చి కాము ననాయాసముగా జయింపఁగలనని ప్రతిజ్ఞ చేసెను. క్రోధుని భంజించుటకు క్షమను, లోభుని నిరోధించుటకు సంతుష్టిని నియోగించి, తదితరబలానీకంబుల నెల్లఁ గలయఁజూచి యందఱును త్వరితముగఁ గాశికానగరంబునకు సమరోత్సాహంబునఁ బ్రయాణ మగుఁడని యాజ్ఞాపించి జయభేరిని మ్రోఁగింప శాసించెను.

వివేకపృథ్వీశుఁడు మహానీకసమేతుఁడై కాశీనగరంబుఁ జొచ్చి యాదికేశవుం దర్శించి స్తుతించి ధర్మయుద్ధమునకు సిద్ధముగా నుండెను.

మహామోహాదివీరులును సంగ్రామమునకుఁ దమతమసేనలను గూర్చుకొని చేర్చి కాశీనగరంబునను విడిసియుండిరి. ఇట్లుభయసైన్యంబులును జయధ్వానంబులతో దిక్కులు పిక్కటిల్ల నార్చుచు సమరకోలాహలమున సంభ్రమించుచుండిరి. రుధిరధారాసిక్తమగు నాహవభూమిని జూడనొల్లక విష్ణుభక్తిమహాదేవి "శ్రద్ధా! యుద్ధానంతరమున జయాపజయముల పర్యవసానము సత్యముగా నాకుఁ జెప్పు"మని యాజ్ఞాపించి, శాంతితోఁ గూడ సాలగ్రామశిఖరసమీపమున నున్న చక్రతీర్థంబునకుఁ బోయెను.

యుద్ధము ప్రారంభించెను. వివేకాదియోధులయెదుర మహామోహాదివీరులు నిలువలేక పరాజితులై పికాపికలై చెదరి పాఱిపోయిరి.

మహామోహుఁ డెక్కడ నణఁగెనో యెఱుకపడలేదు. వివేకమహారాజు జయధ్వానములతోఁ గాశీనగరంబుఁ బ్రవేశించెను. ఈవృత్తాంతమునంతను శ్రద్ధాదేవి చెచ్చెరఁ బోయి విష్ణుభక్తిమహాదేవికి నివేదించెను.

మహామోహాదులపరిభవమువిని తండ్రియగు మనస్సు పలువిధముల శోకించి పలువరించుచున్న సమయమున విష్ణుభక్తిమహాదేవి వ్యాససరస్వతిని బంపి మనస్సునకు వైరాగ్యము గలుగునట్లుగా నుపదేశముచేయుమని నియమించెను. వ్యాససరస్వతియు నట్లే మనస్సునకు ననేకవిధముల బోధించి భావంబు లనిత్యములనియు, పాంచభౌతికములగు శరీరములు నశ్వరములనియు, బ్రహ్మమే నిత్యమనియుఁ, దక్కినవన్నియు వికల్పితవికృతులనియు నిత్యాదివేదాంతవిషయములను జక్కఁగాఁ దెలియఁజెప్పి విచారము మానుమని యుపదేశించెను. కాని యామె యెంతచెప్పినను మనస్సునకు దుఃఖ ముపశమింపలేదు. వేదాంతసరస్వతిమాత్రము విసువు చెందక సకలలోకరక్షణదక్షుఁడగు నిందిరాధవునిఁ గాని, యిందుధరునిఁ గాని పొందుగ సదా తలంచియుండుమనియు, మోహపాశబంధంబులు తనంతట తామే సడలి విడిపోవుననియుఁ జెప్పిన, మనస్సు అడిల్లి కృతార్థుఁడ నైతినని వ్యాససరస్వతీదేవి పాదంబుల కెఱఁగిన, నామె మనస్సును జూచి, "వత్సా! నీహృదయం బుపదేశక్షమం బయ్యెను గాన మఱియొకరహస్యము జెప్పెద" నని "జడునకసార సంసారవిభ్రాంతి కలుగును గాని వివేకవంతునకుఁ గలుగదు. వివేకున కిదియంతయు విరక్తికారణం బే"యని వేదాంత పరమరహస్యము దెల్పెను. ఇంతలో వైరాగ్యుఁడు రాఁగా భారతీదేవి మనస్సుతో "వత్సా, నీ తనయుఁడు వైరాగ్యుఁడు వచ్చినాఁడు. అతనిసంభావింపు" మని కోరెను. అప్పుడు మనస్సు వైరాగ్యునిఁ గౌఁగిలించుకొనెను. అంత సరస్వతీదేవి మనస్సుతో నిట్లనియె—

ప్రథమభార్యయగు ప్రవృత్తిదేవి పుత్రశోకానలమున మరణించినది కాన విచారింపక రెండవపత్నియగు నివృత్తిదేవిని రావించి కూడియుండ వలసినదనియుఁ, దత్సంజనితులగు వివేకాదులను యౌవరాజ్య స్థాపితులఁ జేసి సామ్రాజ్యము వహింపుమనియు నుపదేశించి దీవించి, శ్రద్ధను జీవమహారాజునొద్దకుఁ బోయి చేయవలసిన కార్యంబుల ననుసంధింపుమనియు శాంతిని వివేకమహారాజునకడ కేగియాడిగంబులు సలుపుమనియుఁ జెప్పి మిగిలిన కార్యములను సంఘటించుటకుఁ దా వెడలి పోయెను.

వివేకమహారాజు శాంతితోఁ దనప్రేయసియగు నుపనిషద్దేవిని వెనుకకుఁ దోడి తెమ్మని చెప్పి పంపెను. ఆమె యట్లు పోవుచుండఁగాఁ దల్లియగు శ్రద్ధను దారిలోఁ జూచి యానందభరితురాలై యామె యెచ్చటికి ససంభ్రమముగాఁ బోవుచున్నదని ప్రశ్నించెను. జీవేశ్వరుఁడు నిష్కంటకముగ సామ్రాజ్యమేలుచుండఁగ విచారమునకు హేతువేది యని మాఱుపల్కి మహామోహుఁ డట్లు యుద్ధమున నిర్జితుఁడైనను జీవపురుషుని వశీకరించుటకు మధుమతియను మోహినీ స్త్రీని బంప నామె తనయింద్రజాల విద్యను జూపి జీవేశ్వరుని మోహపాశబద్ధునిఁ జేయుటకు నానావిధంబులగు నింద్రియ సుఖభోగంబులఁ గల్పించి, యాతనిఁ బరిభ్రమింపఁజేసి, తనవలలో వేసికొనినదని చెప్ప, శాంతి విషణ్ణహృదయయై, యింత శ్రమపడినను దుదకు ఫలము గలుగలేదని దుఃఖించి, యీపరిణామమునకుఁ బ్రతీకారవిధాన మెద్దియేని కలదో యని యడిగెను. అంత శ్రద్ధాదేవి శోకించుచున్న పుత్రికను సమాశ్వసించి, "తనయా, ఊరడిలుము, ఊరడిలుము. తర్కము నీశ్వరుఁడు జీవేశ్వరునియొద్దకుఁ బోయి, 'ఈశ్వరా, యిట్లేల సంసారవిభ్రాంతిజ్వాలలఁ జిక్కుకొనియున్నావని' యడుగ జీవేశ్వరుఁ డదరిపడి, 'తర్కా, మేలు మేలు. నే నెంతమూఢుఁడ నైతిని. నన్ను మేలుకొల్పితివి; మేలు చేసితివి' యని మెచ్చుకొనుచు, మధుమతిని చాల ధిక్కరించెను. కావున మనకు నిశ్శంకముగ నానందదాయకంబులగు వైభవోత్సవంబులే కలుగుచున్న"వని శ్రద్ధ చెప్పి తాను వివేకుని జీవేశ్వరునికడకుఁ దెచ్చుటకుఁగాను బోవుచున్నానని నుడివెను. అంత శాంతి తానుగూడ నుపనిషద్దేవిని వివేకునికడకుఁ దోడితెచ్చుటకుఁ బోవుచున్నానని తల్లితో నుగ్గడించి తనదారిని బోయెను. అంత జీవేశ్వరుఁడు విష్ణుభక్తిదేవి మహిమకుఁ గడుసంతసించి తాను గష్టముల నన్నిటి నతిక్రమించి నిత్యనిర్మలసుఖమును బొందఁగలుగుట యాదేవికృపాకటాక్షమున నే యని వాక్రుచ్చి సంతోషించు సమయమున వివేకమహారాజు శ్రద్ధాంగనాసమేతుఁడై జీవేశ్వరుని సన్నిధి కేతెంచెను.

వివేకమహారాజు జీవేశ్వరునకు మ్రొక్కి దీవనలు పొంది ప్రస్తుతించుసమయంబున నుపనిషద్దేవి శాంతిచేతను దోడ్కొని వివేకమహారాజుసమక్షమునకు నొయ్యనొయ్యనఁ జనెను. అంత జీవేశ్వరుఁ డుపనిషత్తరుణిని సంభావింప నామె వివేకున కభివందనము లొనరించి యుపాంతస్థలమున నధిష్ఠించెను. జీవేశ్వరుఁ డుపనిషదంగనతో, "లలనా! నీవు భర్తవలన నెడఁబాటునొంది, పెక్కుకడగండ్లు పడి, కాలము గడుపుచుంటివని మే మెఱుఁగుదుము. ఎచ్చటెచ్చట నేవిధములైన బాధల నొందితివో మాకుఁ దెలియఁ జెప్పు"మనిన నామె యిట్లు పల్కెను. "కృష్ణాజినాజ్యసమిదాదిగృహీతహస్తయై యజ్ఞవిద్యాదేవి నన్ను నొల్లక నాతోఁ బరుషించి వేఱుపోటీ నన్నరుగుమని వెళ్లఁగొట్టెను. అంతటఁ గర్మమీమాంసాతరుణియొద్దకు నేఁ బోవ నామెయు యజ్ఞవిద్యావలెనే నన్నోర్వలేక పొమ్మని నాకు దారిఁజూపెను. తరువాతఁ దర్కవిద్యలచెంత నేఁ జేరగ వారు నానావిధకర్కశభాషణంబుల రెచ్చఁగొట్టి చెలరేఁగి నన్ను బంధించుట కనుసంధించుచుండ నే భయభ్రాంతనై పాఱుచున్నఁ జూచి, విష్ణుభటులు వెఱవకు వెఱవకు మని నాకభయమిచ్చి యాకఠినహృదయలగు తర్కవిద్యలను మోఁది చెదరఁగొట్టిరి. అంత నాపుత్రియగు శ్రీగీత మచ్చికంబునఁ జేరవచ్చి కౌఁగిలించి నన్నూరడించెను. ఇట్లనన్యసామాన్యవిపదవస్థలను బొంది తిరిగి యేలినవారి ప్రాపుఁ జేరఁగలిగితి" నని యుపనిషద్దేవి పల్కి, జీవేశ్వరునితో "నీవు పరమాత్మవు. నీకును బరమేశ్వరునకును భేదములే"దని చెప్పిన జీవేశ్వరుఁ డామాటలయాథార్థ్యమును గ్రహింపలేక వివేకుని వంకఁ జూచెను. ఆమహానుభావుఁ డుపనిషద్దేవిమాటల యర్థము వివరముగా వినిపింప జీవేశ్వరుఁడు గ్రహించి సంతసించుచున్న సమయమున నిదిధ్యాసనము నొకశాలో దరి వారిని సమీపించి యుపనిషద్దేవికి సంజ్ఞచేసి యిట్లు చెప్పె: "విష్ణుభక్తిమహాదేవివలన ఈసందేశమును నీకుఁ గొనివచ్చితిని. వివేకమహారాజు సన్నిధానంబున నీ వుండిన మాత్రంబున సంకల్పజననివై విద్యాప్రబోధచంద్రుల నీగర్భంబున దాల్చితివి. నీవు నీతనూజయగు విద్యాకన్యను మనస్సునందుఁ బ్రవేశపెట్టి, ప్రబోధచంద్రునిఁ బురు

## “హరిలో రంగా హరి”




చిత్రకారుడు : చామకూర సత్యనారాయణగారు, రాజమండ్రి.

షునియందు నిల్పి నీవు వివేకునిఁ దోడ్కొని యామె కడకుఁ జేరుమని యాయమ యాజ్ఞాపించినది" అని యిట్లు చెప్పి నిదిధ్యాసము జీవేశ్వరునియం దంతర్ధాన మయ్యెను.

తరువాత విద్యుల్లతాప్రభాసియగు విద్యాకన్య యు,నిర్మలసహజప్రకాశమానుఁడగు ప్రబోధచంద్రుఁడును నావిర్భవించిరి. జీవేశ్వరుఁ డపారమగు సంతోషమును బొంది వారిని గౌరవించి కౌఁగిలించి,యతిశయించుచున్న సమయంబున విష్ణుభక్తిమహాదేవి చనుదెంచెను. జీవేశ్వరుఁ డామెకు వినమితోత్తమాంగుండై ప్రణమిల్లి దీవనలు పొంది, యామె యానతిచొప్పున వివేకుని మంత్రిగాఁ జేసికొని, శ్రద్ధ, మతి, శాంతి మున్నగునారీమణుల గౌర వవినతుల కాస్పదుండై, నిరుపమానవైభవంబున సదానంద సామ్రాజ్యంబు చేయుచుండెను. [సశేషము.]

---

# ఋతుసంహారము

మోచర్ల రామకృష్ణయ్య గారు, బి. ఏ.

ప్రియురాలా పటుచండభానుకిరణోద్వేలంబు, చంద్రాంశు సం
చయ శోభా స్పృహణీయశర్వరి, సదా స్నానార్హశీతోదకో
చ్చయ సంయుక్తము, వాసరాంత సుమనోజ్ఞం, బస్తసూనాస్త్ర దు
ర్జయ సంరంభము—గ్రీష్మకాల మిదిగో! ప్రారంభమై యొప్పెడిన్.

హరిణాంక క్షతసాంద్రమేచకతమః ప్రాంచన్నిశావేళలున్,
స్ఫురదుద్య జ్జలయంత్ర మందిరచయంబుల్, దివ్యరత్నంబులున్,
సరసంబౌ హరిచందనంబును, మహానందంబుగోల్పన్, జనో
త్కరసంసేవ్యములై చెలంగెడిఁగదా, కాంతా, నిదాఘంబునన్.

రమణీయంబు, సువాసితంబు నగు హర్మ్యంబందు గ్రీష్మంబునన్
శ్రమవాయంగ నిశీథవేళలఁ బ్రియోచ్ఛ్వాసప్రలోలంబు, మ
ద్యము నాస్వాదమొనర్చి, పుష్పవిశిఖ వ్యాపార లీలా సము
ద్యమవర్ధిష్ణు సుతంత్రి గీతముల సౌఖ్యంబందరే కాముకుల్?

స్నానసురభిళ కేశపాశములచేత-సమణి రశనా వసన నితంబములచేతఁ
జందనోదార హార కుచములచేతఁ-గాముకుల వెట్ట దీర్తురు కాంత లిపుడు.

అందియలమ్రోఁత ప్రతిపద మంచరవళి-ననుకరింపఁగ లాక్షారసారుణమ్ము
లైన చరణంబుల నితంబినీనికరము-సంస్మర మొనర్చు జనతతిస్వాంతములను.

---

# టెంకణాదిత్యుని కుమారసంభవము

పి. సర్వోత్తమాచారి (యువకవిమండలి)

౧

ఆంధ్రవాఙ్మయ సామ్రాజ్యమున కాదికవిరాజ శిఖామణి యని యీ రాజేంద్రుని కుమారసంభవ కావ్యమును, ౧౯౧౭ వ సంవత్సరమున మానవల్లి రామకృష్ణయ్య, (యం.ఏ.) గారు ప్రకటించిరి. వేయియేండ్లకు పైగా విస్మృతికుహరమున బడిపోయిన యీ కవిరాజ శిఖామణి కావ్యమధువు నాంధ్రులకు పంచిపెట్టిన కీర్తి కవిగారిది.

వారీకవికాలనిర్ణయము నేయుచు కొన్ని హేతువులు చూపి, యితడు క్రీ. శ. ౯౪౦ నాటివాడనియు, తత్కారణమున నాంధ్రకవితా పిత యని పిలువబడు నన్నయకు నూరేండ్లు పూర్వుడనియు సిద్ధాంతీకరించిరి. నాటినుండియు నేటిదాక ఈ కవిరాజ శిఖామణి కాలమును గురించి యాంధ్రలోకమున పెక్కు వాదోపవాదములు జరిగెనవి. ఆంధ్రవాఙ్మయస్రష్ట యని తాము చెప్పుచున్న నన్నయ కిత డిటీవలివాడనియు, పూర్వుడగుట సంభవింపదనియు వీరేశలింగ ప్రభృతులు వాదించిరి. కాని యీవాదించిన బుర్రా శేషగిరిరావు, వీరేశలింగం, వీరభద్రరావు ప్రభృతు లెవ్వరును రామకృష్ణకవి గారు కాలనిర్ణయమునకు జూపిన యాధారముల సరిగా ఖండింపజాలరైరి. కొందరు తెలుగుమాటలు సంస్కృతీకరించియు, వాచ్యమునకు గౌణార్థము లుపన్యసించియు నన్నయ్యయొక్క యాంధ్రకవితా పితృత్వమునకు నష్టము రాకుండ వాదించిరే కాని సత్యమునకు మాత్రము తొలగి తొలగియే పోయిరి. కొందరిది యింద్రజాలమనియు, మాయాశక్తియనియు తమ వక్తృత్వనైశిత్యపుటంచు తళ్తళ్ లాడించిరి.

ఇది యిట్లుండ, జయంతి రామయ్య పంతులుగారు రామకృష్ణకవిగారు ద్వితీయ భాగమున ప్రశంసించిన పెదచెఱుకూరి మల్లిదేవుని శాసనము నాధారముగా గొని యితడు నన్నయ్యకు ౧౦౦ సంవత్సరములు పిమ్మటివాడని సిద్ధాంతీకరించిరి. ఉపరినిర్దిష్టులగు వారివాద సామంజస్యమును నడకుదిటి వీరరాజు పంతులుగారు కొంతవరకు ఖండించిరి. మనమును వీరివాదముల ఫణితి కొంత మీమాంసింతము.

౨

బుర్రా శేషగిరిరావుగారు సంవత్సరాది సంచికలో (౧౯౧౩) చేసిన కాలనిర్ణయము వీరరాజుగారిచే ఛిద్రుపలైనది. వీరు సత్యాశ్రయకుల దీపకుడగు రాజనరేంద్రునే సత్యాశ్రయునిగా భ్రమించి, 'మునుమార్గ కవిత' యను పద్యమునకు పెడయర్థము దీసినవారిలో ప్రథములు. వీరివాదమున మన మంత జోక్యము కలుగజేసికొన నవసరము లేదు.

ఇక వీరభద్రరావుగారు: వీరు తమయాంధ్రుల చరిత్రలో సామ్రాజ్య పరిపాలకుడు గాని సామాన్యుడగు బేట విజయాదిత్యుని కుమారుడగు సత్యాశ్రయుడే 'మునుమార్గకవిత' యను పద్యములోని సత్యాశ్రయుడనియు, కాన నన్నయ్యకు ౧౦౦ సంవత్సరములు పూర్వమునుండి తెలుగున గవిత్వ మున్నదనియు సెలవిచ్చిరి. వీరేశలింగం పంతులుగారీదుర్బలవాదమును నమ్మి సత్యాశ్రయుడు కుబ్జవిష్ణువర్ధనుని యన్న గాకపోవుటచే కవిగారి కాలనిర్ణయము (౯౪౦) తప్పనిచెప్పుచు నేమేమియో వ్రాసిరి. వీరేశలింగం పంతులుగారు వార్ధక్యమున వ్రాయుటచేత గాబోలు, స్వవచన వ్యాఘాతాంశములు క్రొత్తకూర్పు కవిచరిత్రలో బహుళముగ గనబడుచున్నవి. నన్నయ్య చరిత్రమున నీసత్యాశ్రయుని గురించి వ్రాయుచు నీతడు కుబ్జవిష్ణువర్ధనుని యన్న గాన తెలుగుకవిత నన్నయ కాలమునూరేండ్లనుండి వర్ధిల్లు చున్నదని వ్రాసిరి.

వీరేశలింగం పంతులుగారు చూపిన 'మాబల', దీని వ్యాఖ్యానములును చాల దుర్బలములు. రామకృష్ణకవిగారు చూపిన కొన్నికొన్ని శబ్దములనే గ్రహించి, చోళు డీశబ్దముల గన్నడమునుండి దొంగిలించెనని వ్రాసినారు. ద్రావిడభాషలలో సమానపదములని కవిగారు చెప్పిన ముక్కకు దుర్బలసమాధాన మొసంగినారు. శంభుదాస తిక్కనాదులనుండి ప్రయోగసహస్రములు చూపింతునన్న వాక్యమునకు సంజాయిషీయే లేదు. క్రౌంచచ్ఛందము విషయమున గూడ వీరువ్రాసినది నిరాధారము. చోళుడు కర్నాటకసంప్రదాయము ననుసరించి వ్రాసెనట! ఆధారమేమి? నన్నెచోళున కొక్క యీ క్రౌంచపదవృత్తమున మాత్రమే కర్ణాటకభాషాభిమాన మేల కలుగవలెను? ఇది దురూహ్యము. అతనిభాష తేనె తేటవంటి జానుదెనుంగు. అందములు పొదిగిన రతనపుమొలక లాతనిపలుకులు. చోళునికి కర్ణాటమున బాండిత్య మున్న దనుట కేమిప్రమాణము?

నన్నెచోళుని సర్వాత్మనా అనుకరించిన పాల్కురికి సోమన కన్నడమునగూడ గొప్పకవి. అతడు వ్రాసిన క్రౌంచపదము నన్నెచోళుని దానివలె లేదే. అది యర్వాచీన సంప్రదాయము గలది కన్నడమున మహాకవియని పేరొందిన సోమనకులేని తద్భాషాభిమానము కన్నడము వచ్చునో రాదో యన్న చోళునికేల యుండవలయునో తెలియదు! నిష్కారణముగ చోళునికి కర్ణాటభాషా పక్షపాతిత్వము గట్టుట తొందరగలచేత.

రుద్రభట్టువ్రాసినజగన్నాధవిజయమునుండి నన్నెచోళుడే భావము దొంగలించెనని వీరేశలింగము వారి వాదము. దీని కాధారము శూన్యము. ఈ పద్యముకంటె వేయిరెట్లు మనోహరములైన పద్యములు వ్రాసినమహాకవి చోళుడు. రుద్రభట్టు జగన్నాథవిజయమును, చోళుని కుమారసంభవమును బోల్చి చదివినచో, రుద్రభట్టు చోడునిపాదములవద్ద కొంత శుశ్రూష చేయవలసియుండునని గోచరించుచున్నది

అన్నిటికంటె విచిత్రమైన విషయ మొకటి గలదు. త్రైలోక్యమల్లుని(౧౧౨౪) కాలమునాటి జైనమతమున గల తెలుపురంగు వస్తువుల జాబితా గల శ్లోకముచూచి, నన్నెచోళుడు కుమారసంభవమున 'హరహాసాకాశగంగా' యనుమహాస్రగ్ధరను వ్రాసినాడట! జైనులు శబ్దార్థచౌర్యమునకు వెనుదీయరని రామకృష్ణకవిగారు వ్రాసిన దానికి గప్‌చిప్! ఇంత చక్కని ప్రౌఢకావ్యము వ్రాసిన చోళునికి శ్వేతపదార్థముల జాబితాపద్యమున చౌర్య మొడిగట్టుట ద్రోహము!

వీరేశలింగముగా రెట్లయిన రామకృష్ణకవిగారి కారణము లన్నిటిని నెదురుగ నన్వయింపజూచిరే కాని, తదన్వయములు దుర్బలాధార గగనసౌధము లని గుర్తెఱుగక పోవుట శోచనీయము.

3.

జయంతి రామయ్యపంతులు గారు పెదచెఱుకూరి శాసనమును జూపించిరి. ఆశాసనము నన్నెచోళునిది గాదుగాని, యిందు చోళుడు తనతండ్రియని చెప్పుకొన్న చోడబల్లి కనబడుచున్నాడు.

చోళశాసనములలో చోడబల్లులు, నన్నెచోళులు పెక్కురున్నారు. వీరెవరో!—ఇది ఘుణాక్షరన్యాయముక్రిందకు వచ్చునేమో యని మాసంశయము!

వీరు నన్నెచోళుడు తనగురువని చెప్పుకొన్న కాలాముఖమల్లికార్జునుని గురించినదని చెప్పుచు శాసనము జూపించుచున్నారు. నన్నెచోళుడు తన కావ్యమున 'పూని మహాగ్రహార' యను పద్యమున జంగమమల్లయ పేర 'సప్తసంతానముల నొప్ప సల్పుదు'నని వ్రాసికొన్నాడు. అట్టి శాసనము లేవియు మనకు గన్పట్టుటలేదు. ఏవియో శాసనములు దెచ్చి అందొక మల్లికార్జునుని పట్టుకొని, యింకొకశాసనమున ఘుణాక్షరము గన్న చోడబల్లి కుమారుని నన్నెచోళుని లాగుకొనివచ్చి, అతడే మనకవి, ఆ బైరాగియే మనకవి గురువు—అని వాదించుట దుర్బలవాదము! నన్నెచోళుడు తన కావ్యమున స్పష్టముగ నొరయూరి కధిపతినని చెప్పుకొన్నాడు! అట్లు చెప్పుకొనుట చోళుల కాచారమను సిద్ధాంతము ఎప్పటినుండి యాచారమను పూర్వపక్షము నెదుర్కొన

వలసియున్నది. నన్నెచోళుడు తన నివాస మొరయూరని యబద్ధమేల చెప్పుకొనవలసి వచ్చినదో తెలియదు. మిత్రాన్వయకుల శేఖరుడను, వివిధయజ్ఞముల పవిత్రీకృత దేహుడనని చెప్పుకొన్న మహానుభావున కసత్యదోషము గట్టుట యవిమృశ్యకారిత్వము. చోళుని కాత్మస్తుతియం దిష్టమని కవిచరిత్రకారుడు తన మనోదౌర్బల్యమును బయలువెట్టుకొనినాడు.

౪

ఓంకణాదిత్యుని తొల్దొల్త పరామర్శించిన అథర్వణుని కాలమునుగూర్చి యేమియు దేలలేదు. త్రిలింగ శబ్దానుశాసన కర్తయగు నథర్వణుడును, కారికావళీ కర్తయగు నాతడును భిన్నులు వలె కన్పట్టుదురు. ఒకడే రెండు వ్యాకరణములు వ్రాయుట, అందొకదాని కింకొకటి సంబంధహీనమైయుంట, ఇవియన్నియు చూడ కారికావళీకర్తకు శబ్దానుశాసనకర్త పూర్వుడని తోచుచున్నది. అథర్వణునికి ద్వితీయాచార్యుడని తొల్త నామకరణము చేసిన అహోబలపండితు డాతని కారికావళిని బట్టియే చేసెను. కాని ఐతిహ్యము నన్నయాథర్వణులు సమకాలీనులని చెప్పుచున్నది. బలవంతమైన శాసనాది సాక్ష్యము లేనప్పు డీదృశైతిహ్యములే (tradition) ప్రమాణముగా చరిత్రజ్ఞు లంగీకరింతురు.

అథర్వణాచారి తొల్త ఓంకణాదిత్యుని తన ఛందస్సులో పరామృశించెను. కాని మనకవి నన్నయాత్పూర్వుడే యగుననుట కిదియొండు చాలదు. అథర్వణుని కాలనిర్ణయము మనకవికాలనిర్ణయమునకు సహకారి యగును గాన, అథర్వణచ్ఛందమును రామకృష్ణకవిగారు ప్రకటించి, తత్కాలనిర్ణయమునకు తోడ్పడుదురు గాక యని కోరుచున్నాము.

౫

నన్నెచోళునికి ఓంకణాదిత్యు డనునది మరియొక నామమనియు, ఆతడు పరాంతకుని కుమారు డగు రాజాదిత్యునికి పూర్వమున నున్న ఆదిత్యుడే యనియు, అతడు క్రీ. శ. 880-900 లో నొరయూరు పాలించుచుండెననియు నెంపరాల సుబ్రహ్మణ్యంగారు 'Andhra Historical Research Journal' లో వ్రాసియున్నారు.

చోళచరిత్ర పరిశోధింపగా నందు నాదిత్యనామధారు లిర్వురు గన్పట్టుదురు. ఆయిర్వురిలో మొదటియాతడే మన ఓంకణాదిత్యుడని సుబ్రహ్మణ్యంగారి వాదము.

ఇది మాకును సమంజసముగనే కన్పట్టుచున్నది. ప్రాచీనుండగు మనచోళుని లక్షణగ్రంథములును, జనశ్రుతియుగూడ ఓంకణాదిత్యు డని పేర్కొనుచున్నవి. కన్నడమున 1105 లో మల్లినాథపురాణము వ్రాసిన నాగచంద్రుడు చోళుని భావములు గ్రహించినాడు. తత్సమీపకాలీనుడైన రుద్రభట్టుగూడ ఓంకణాదిత్యుని పెక్కుచోట్ల ననుకరించినాడు. ౧౧౯౭ లోని శైవ్య మల్లుని మతమువీది శ్లోక మీకవిరాజశిఖామణి పద్యమునకు బుత్రియై తీరవలెను! కన్నడ విక్రమార్జున విజయము వ్రాసిన ఆదిపంపడు వేంగీవాస్తవ్యుడు. ఆతడు తన విక్రమార్జున విజయమునకు కృతిపతియైన అరికేసరికి, యర్జునునకు నభేదముగ నాశ్వాసాంతపద్యముల వ్రాసినాడు. ఆదిత్యుని కుమారసంభవమునగూడ నాశ్వాసాంత పద్యముల కృతిభర్తయగు జంగమమల్లికార్జునునకును, పరమునకును నభేదత్వము గల్పితమైనది. ఈసంప్రదాయము ప్రాచీనాంధ్ర కావ్యముల సంప్రదాయమని మన మనుమానింపవచ్చును. తెలుగువాడైన ఆదిపంప డీపద్ధతిని కన్నడమున దొల్దొల్త వ్యాపింప జేసినవాడు. కావున నీకవి కాలము చెఱువూరిశాసనము ప్రకారము ౧౩ శతాబ్దము కాజాలదు. ఇంకను, ఒరయూరు నేలిన ప్రాచీన చోళరాజుల తమిళశాసనములు పరిశోధించినచో మన కవి చరిత్ర చిక్కక పోదని మాయుద్దేశ్యము. కాన బహుభాషావేత్తలగు పరిశోధకు లీభారము బూని యాంధ్రభాషాసేవ జేతురుగాత!

ఈకన్నడకవులకు (రుద్రభట్టు, నాగచంద్రుడు మొ.) తెలుగు వచ్చునాయని ప్రశ్నించినచో రాని

చెప్పుట కాధారము లేదు. తెలుగు వచ్చిన కన్నడ కవులు పెక్కురున్నారు; కన్నడము రాని తెలుగు కవులును పెక్కురున్నారు; ఆకాలమున నాబాసల కంతయన్యోన్య ముండెడిది. నవీన విమర్శనలప్రకారము, ప్రాచీన తమిళకావ్యముల సాక్ష్యమునను, కన్నడభాష తెలుగు తమిళముల మిశ్రణమని తెలియుచున్నది. 12 శతాబ్దములో ప్రసిద్ధ తమిళకవియగు జయకొండన్ కన్నడమును గుఱించి యిట్లు చెప్పెనని ప్రసిద్ధవిమర్శకులు వ్రాయుచున్నారు.—

'Jayamkondan the prince of the poets of the early years of the twelfth century speaks of Kanarese being of jumble of some Telugu and much Tamil.'
'Tamils & Andhras' by Pandit Raghava Iyengar, *vide* Triveni, vol I, no. 2.

౬

నన్నెచోళుని గుఱించి వ్రాయునప్పు డింకొక విషయ మున్నది. అది చోళు డాంధ్రకవిత యెప్పుడు పుట్టినదో తెల్పియజేసిన పద్యమును గుఱించి. ఆపద్యమునగల 'సత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్' అను పాఠ మసత్పాఠమనియు, 'చాళుక్యరాజు మొదలుగ బూర్వుల్' అనునది సత్పాఠమనియు మన విమర్శకుల సిద్ధాంతము.

వారివ్యాఖ్యప్రకారము—లోకములో సంస్కృతకవిత ప్రచలితమై యుండ దేశికవిత (అనగా, కర్ణాటాంధ్రాదిదేశభాషల కవిత) పుట్టించి—ఆంధ్రవిషయమున దెలుగు నిలిపిరి—అనగా, తెలుగునగూడ కావ్యములు పుట్టించిరనుట.—ఎవరు?—రాజరాజనరేంద్రుడు మొదలుగాగల చాళుక్యరాజులు—అని యర్థమట!—

దేశికవితలో కర్ణాటకవితగూడ జేరునుగదా! లేక దేశికవిత బుట్టించి యనగా తెలుగుకవిత బుట్టించి యనియే యైన, నాంధ్రవిషయమున తెలుగు నిలిపిరని మరల చెప్ప ననవసరము!—కాన దేశికవిత యన కర్ణాటకవితగూడ నంతర్భూతమగును! రాజరాజనరేంద్రుడు తెలుగుమాట యేమైనను కర్ణాటకవిత పుట్టించినాడనుట వట్టికల్ల. రాజరాజు తాతలనాటికే కన్నడమున అమోఘవర్ష నృపతుంగుని కవిరాజమార్గము(క్రీ. శ. 850) తత్పూర్వకవుల ననేకుల పేర్కొనుచున్నది. జైనవాఙ్మయ మాకాలమునాటి దాభాషలో కావలసినంత యున్నది. దేశికవిత యన నింకేమి యర్థ మిచ్చెదరు?

ఇక తెలుగునుగుఱించి: తెలుగుకవితను రాజరాజనరేంద్రుడు పుట్టించి యంధ్రవిషయమున నిలిపెనా?— అని నన్నయ్య భారతములోగలదా! రెండవ రాజరాజు శ్రీకూర్మశాసనములో 'అంధ్రీచకార వర భారతసంశేవృత్తం' అనినాడేకాని యాదికావ్యమును రచియింపించెననినాడా? నన్నయ నాఱక భారతసంహితను తెనుగున రచియింపు మధికధీయుక్తిమెయి ననెనేకాని, యాంధ్రకవిత పుట్టించి యాదికావ్యము వ్రాయు మనినాడా? నన్నయ్యయు తా నోపినకొలది భారతభారతీ సముద్రము నీదుదు నన్నాడు: కాని యాంధ్రకావ్యము తొల్దొల్త పుట్టించుచున్నానని చెప్పుచున్నాడా? లేదే!

తత్సమకాలీనుడైన నారాయణభట్టు సంస్కృతకర్ణాటప్రాకృత పైశాచికాంధ్రభాషలలో గవిరాజశేఖరుడని నన్నయ్యయే దాను స్వయముగ వ్రాసినాడే. వీరిర్వు రేగురువువద్ద ప్రాచీనాంధ్రవాఙ్మయము నభ్యసించిరోకదా!—సత్యమురాధిపాచార్యుడ నని తన్నుగుఱించి వ్రాసుకొన్నవాడు కావ్యవిధాతయేయైన కావ్యముఖమున నేల ప్రశంసించుకొనడు?

నన్నయ్యకు రెండువందల యేండ్లనుండి పద్యములు గలిగిన శాసనములు గన్పట్టుచున్నవి. కాని అవి దేశీయచ్ఛందోబద్ధములనియు, సంస్కృతవృత్త కవిత నన్నయయే ప్రారంభించినా డనియు నింకొక పుల్ల వేసినారు. అసలు, శాసనముల యుద్దేశ్యము దానధర్మముల ప్రశంస. అది యందఱ కెఱుకయగు నట్లుండవలెను కాన సుపరిచితచ్ఛందములలో మన ప్రాచీనకవులు వానిని వ్రాసినారు. నన్నయ్యభారతము పిమ్మట పుట్టిన సోమలదేవి శాసనము సీసపద్యములో నుండుటయేమి? సంస్కృతచ్ఛందోబద్ధమగు రచన లేకయా? దీర్ఘాసి శాసనము మాట యేమి? కాన నిట్లు వాదించువారితో మనకు పనిలేదు.

కాన 'సత్యాశ్రయునితోట్టి చాళుక్యనృపుల్' అనునదియే సత్ప్రాతమువలె గన్పట్టుచున్నది. దీనివలన నన్నయ్య కాలమునకు వందలేండ్లనుండి తెలుగుకవిత యుండె నని తెలియుచున్నది. ఇది కవి చరిత్రకారుడును నొప్పుకొనియున్నాడు. కన్నడ కవితయు నీకాలముననే పుట్టి యుండును. నృపతుంగుడు పూర్వులగు వారి నెందఱినో పేర్కొనియున్నాడు.

మన వేంకణాదిత్యుడు నృపతుంగునికి సమకాలీనుడును గానగును. ఈకాలముననే పండరంగని యద్దంకిశాసనము పుట్టినది. అందు తరువోజ గలదు. వేంకణాదిత్యుడును దన కావ్యమున దరువోజలు వ్రాసియున్నాడు. మధ్యాక్కర లటుపిమ్మట ప్రచారమునకు వచ్చినవై యుండనగును. పండరంగని శాసనములో శిథిలద్విత్వ మున్నట్లే కుమారసంభవమున గూడ నున్నది.

నాటి పెక్కుశబ్దములు నన్నయనాటికి లుప్తము లై పోయినవి.

ఇతని గురువు జంగమ మల్లికార్జునుడుగూడ గొప్పకవి. ఇతని కృతులను కాలము తన పొట్టను బెట్టుకొన్నది. ఆమహాసాగరమునుండి యేతరంగము వానిని ఒడ్డున కీడ్చునో తెలియదు.

*     *     *     *     *

మన యాంధ్రకవిత నన్నయ్యయే పుట్టించినాడని పొరబడెనిందు! నన్నయ్యకు బూర్వము గావ్యము లున్నవన్న వారిమాట లింద్రజాలములనే మోయని వేటూరివారు జోస్యము చెప్పుచున్నారు. కాని కాలమే యెవరివి ఇంద్రజాలములో వెలిబెట్టగలదుగదా! "ఎక్కడిదొంగలక్కడే!" సంగములనాటి తొలకాప్పియరను తమిళచ్ఛంధోవేత్త కాలమున తెలుగు తమిళముతో సరిసమానముగా నున్నదని, ప్రఖ్యాతతమిళ విమర్శకులు చెప్పుచున్నారు.

"Kakkaipadiniyar,also an ancient Tamil poet, mentions distinctly that Vadugu, the land where the Telugu language is current, formed the northern limits of Tamil; it will thus be patent that long before Tolakapiyar's times, Tamil and Telugu had been current side by side as two independent languages. To judge by the Tamil literature now available, Telugu would seem to be entitled to an antiquity equal to that of Tamil.

Pandit Raghavaiyangar, 'Tamils & Andhras'—*Vide* Triveni, vol. I, no. 2.

మఱియు వీరు నన్నయ్యయే యాంధ్రకవితాద్యతయను వారి కిట్లు సమాధాన మిచ్చుచున్నారు:

'The Yapparungala Vritti' a renowned commentary which must be attributed to the 10th or 11th century, A. D., cites an old prosodical work in the Andhra language said to have been written by one Vanchi. Though the reading in the printed books is 'Vanji' some manuscripts may be taken to yield the reading 'Avaranji'—(Aparanji).

The existence of so early a prosodical Treatise show that the Andhra literature must have been rich. Here, we have proof positive that the absence in the present day of Telugu works earlier than those of Nannayya Bhatta (11th century A. D.) cannot support the view that there was no Telugu literature prior to his days. —*Ibid.*

తమిళములో 'యాప్పరుంగళవృత్తి' అను ప్రాచీనచ్ఛందోవ్యాఖ్యలో ఒక ప్రాచీనాంధ్ర ఛందస్సు పరామృశింపబడినది. ఆవ్యాఖ్య ౧౦, లేక ౧౧వ శతాబ్దమునది. ఆఛందస్సు వ్రాసినయాత డపరంజి యను వాడు. మన పండితులెవ్వరు నీతని స్మరింప లేక పోయిరి.

ఈ ఛందస్సొక్కటియే 'మును మార్గకవిత' యను పద్యమున గల చాళుక్యరాజు రాజనరేంద్రుడు గానము క్తకంఠముగ ఘోషించుచున్నది.

# కుచేల

సి. కామేశ్వరరావు గారు

ముఖ్యపాత్రలు:—

పురుషులు

1. శ్రీకృష్ణుఁడు-ద్వారకానాథుఁడు
2. కుచేలుఁడు—అవంతీ నగరవాసి; శ్రీకృష్ణభక్తుఁడు
3. నారదుఁడు—దేవర్షి
4. నావికబాలుఁడు, కావడివాఁడు } ఛద్మవేషధారి శ్రీకృష్ణుఁడు
5. బిచ్చగాఁడు—కుచేలుని సంగడీఁడు
6. సాత్యకి-శ్రీకృష్ణానుజుఁడు
7. రాముఁడు, భీముఁడు-దొంగలు
8. రోగి

స్త్రీలు

1. రుక్మిణీదేవి-ద్వారకరాణి
2. వామాక్షి-కుచేలునిభార్య
3. సన్న్యాసిని-ఛద్మవేషధారిణి రుక్మిణీదేవి
4. సుశీల

ప్రథమాంకము

దృశ్యము ౧.

రాజమార్గము

[కుచేలుఁడు పాటపాడుచుఁ బ్రవేశించును]

కురంజీ(భైరవి)రాగము — ఆదితాళము

ప. జయజయ గోకులబాల — జయసకలాగమ మూల
దయయా మాం గోపాల — దీనం పాలయ బాల!

1. దేవ మయా చరిత మిదం — దీనధియా అపరాధం
శ్రీవసుధాధవ కృపయా — కేవల మిహ ధునీహి.

2. ఈక్షే తావక దేహే — ఈశ జగంతి నిరీహే
వీక్షాశిక్షితమోహే — వేదాంతాగమ గేహే.

3. జగనండకోటితనో — జగదుదరాంతరసుతనో
అగణిత సంజాతతనో — అపరిమితాశ్రిత ధేనో!

4. వితర మ యీశ్వర కరుణాం—వినుటయ మోహావరణం
సతతం మే భవ శరణం — సాధయ సంసృతితరణం.

5. ఇతివిధినా పరిగీతం — శ్రుతివచసా హరిచరితం
యతినారాయణకథితం—యదుకులభూషణ ముదితం.

గీ. నీకృపారసమధురాబ్ధినిండుఁదనము
తలుఁగునా యొక్క బిందువు కొలఁతపడిన,
నిన్ను వేఁడెదఁ జేదోయి నిటలతలముఁ
జేర్చి, నందనందన, దరిఁ జేర్పు నన్ను.

[పాటపాడుచు బిచ్చగాఁడు ప్రవేశించును.]

ఎన్ని జన్మము లాయెనో
నేటి కిందెందు జన్మించినానో,
నన్ను దరిఁ జేర్పఁగదవే
యిఁకనైన నాతండ్రి నారాయణా!

బిచ్చగాఁడు

కుచేలా, హరిప్రేమామృత పానమున నున్మత్తుఁడవైతివి. నీముఖమున దివ్యతేజము స్ఫురించుచున్నది. నిక్షిప్తధనము దొరికినదా ఏమి? నీవంటిభక్తునికి హస్తగతము కాకుండిన మఱి యెవ్వరికి లభించును!

కుచేలుఁడు

తమ్ముఁడా, అది నిక్షిప్తధనము కాదు; అది యొక యమూల్యరత్నము.ఆరత్నమూల్యము బ్రహ్మరుద్రేంద్రాదులకైన గణింప నలవికాదనిన నావంటి యధమునకు గణింపఁదరమా?

నిజముగా శ్రీహరి నాయెడ దయాప్రసన్నుఁడై యాయనితర సులభసాధ్య ధనమును బ్రసాదించునా?——

(భావావేశమున) ఓబృందావనచంద్రా!

గీ. విశ్వవేదాంత వీథుల విహరణంబు
సలుపు నపుగుఁదమ్మిలకుఁ, బ్రశాంతి(?)
భరిత, త్రిభువనాధార, శుభప్రసార
లోచనములకుఁ గృష్ణ! శ్లేద్దోయి మోడ్తు.

గీ. మునులు కన్నులు మోడ్చి కాంచినయమోఘ
కాంతి, గోపకామినులు నిరంతరంబు
హృదయముల నింపుకొను కమనీయకాంతి,
కనులు చల్లఁగ నెన్నఁడు గాంచఁగలనో.

బిచ్చగాఁడు

(స్వ) హరీ, హరీ! యని రాత్రింబగళ్లు నఱచు వీనివెఱ్ఱికి మేరయున్నదా? వీథిలో హరి, సంతలో హరి, ఎల్లప్పుడు నెల్లచోటుల హరిశబ్దమే! ఇట్టివెంగలితో నాకెట్లు సరిపడును? వీనికి హరిచింత; కడుపుచింత నాకు. ఆలుబిడ్డల నెట్లు పోషింతును, ఇల్లు వాకిలి నెట్లుపరిపాలింతును, అనుచింత నాది; వీనికో రాత్రింబగళ్లు హరిచింత. ఇట్టివానితో మాటలాడుచుండిన మూట నిండునా? ఈరోజులలో మాటతోఁ బనియేమియును లేదు; మూటయే సర్వస్వము. మూట నిండుసదుపాయము వెదుకనివాఁడు నిరర్థకజీవి. నేనింక మసలరాదు. ప్రొద్దెక్కినది. (రెండడుగులు నడచి) ఈకుచేలుఁడు నితాంత దరిద్రుఁడయ్యు మహనీయ త్యాగమూర్తి. పెక్కుసారు లీవిశాలనగరమున రిక్తహస్తములతో గృహోన్ముఖుఁడనై పోవునపుడు, మహోదారమూర్తి యీకుచేలుఁడు తన ముష్టి గింజలను నాచెంగున ముడివేసి శ్రీహరీ! యనియానందతాండవ మొనరించి యుండెను. తనకడుపునిండకుండినను, పరులయాఁకలి చూచి సహింపలేని దయాశీలుఁడు ; పరోపకారపరాయణుఁడు.

(ప్రకాశముగా) కుచేలా! హరినామరసాస్వాదనమున నాఁకలి మఱచితివా?

కుచేలుఁడు

తమ్ముఁడా, జన్మజన్మాంతరములనైన నాకీయాఁకలి తీరునా? ఓ పురుషోత్తమా! అనంతకల్యాణ గుణాభిరామా!

బిచ్చగాఁడు

(స్వ) వీనితో నిట్లు మాటాడుచుండిన ముష్టిగింజలు మునుఁగుటయేకాని మఱిమెట్టి లాభము లేదు.

(ప్రకాశముగా) కుచేలా! నీవు హరినామస్మరణముఁ జేయుచుండుము. దాత బిచ్చగానికై యెదురుచూచుచుండు ననుకొంటివా? మన పొట్టనిండకుండిన వానికిఁ గొఱంతవాటిల్లునా? నేఁబోయి వచ్చెదను.

కోఁతికి జలతారు కుళ్లాయి యేటికి,
విరజాజిపూదండ విధవకేల?

(నిష్క్రమించును)

కుచేలుఁడు

నన్ను సుస్థిరనిర్వాణపదవీచ్యుతు నొనరింప నెంద ఱెందఱు నిష్ప్రయోజనప్రయత్నములలో నరించుచున్నవారలు! ఈనడివీథిలో నాగోకుల

చూడామణిని స్మరించుటకు నా కధికారము లేదా? నానయన చకోరచంద్రుని, నాముద్దుల గోపబాలుని, నాచిన్ననాఁటి చెలిమికానిని, నాహృదయమున నారాధించు భాగ్యమునాకు జన్మజన్మాంతరములఁగూడ లభించుఁగాక! ఓ యదువంశరత్నమా, గోపాలచూడామణీ!

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

ప. శరణం భవ కరుణాం మయి కురు దీనదయాళో,
కరుణారస వరుణాలయ కరిరాజకృపాళో!

అ. అధునా ఖలు విధినా మయి సుధియా సురభరితం,
మధుసూదన మధుసూదన హర మామక దురితం.

1. వరనూపురధర సుందరకరశోభితవలయం
సురభూసురభయవారక ధరణీధర కృపయా,
త్వరయా హర భర మీశ్వర సురవర్య మదీయం
మధుసూదన మధుసూదన హర మామకదురితం.

[నిష్క్రమించును.]

దృశ్యము. ౨

[నిజకుటీరాంతరమున కుచేలుఁడు]

2. ఘృణిమండలమణికుండల ఫణికుండలశయన
అణిమాది సుగుణభూషణ మణిమంటపసదన,
వినతాసుత ఘనవాహన మునిమానసభవన
మధుసూదన మధుసూదన హర మామకదురితం.

3. అరిభీకర హలిసోదర పరిపూర్ణ సుఖాబ్దే
నరకాంతక నరపాలక పరిపాలిత జలధే,
హరిసేవక శివనారాయణతీర్థ పరాత్మన్
మధుసూదన మధుసూదన హర మామకదురితం.

గీ. ఎవని యున్నరూపెఱుఁగక ఋషులు సురలు
సర్వవిదుఁ డని యెలుఁగెత్తి చాటినారొ,
యెవఁడు దుఃఖౌషధంబని యెఱుఁగఁజేయు
శ్రుతులు, నతని సద్గతిని సన్మతినిఁ దలఁతు.

గీ. యదుకుల మణిదీప మగుచు నవతరించి,
పార్థసారథియై ధరాభర మణంచి,
యే ప్రవీణుఁడు ధర్మసంస్థాపనంబు
నెఱపె; నాచిరంజీవి నేమఱక తలఁతు.

(వామాక్షి ప్రవేశించును)

వామాక్షి

(స్వ) ఆహా! పేదఱికంబుకంటెఁ గరంబు భరంబైన దురితంబు గలుగునే?

గీ. రూపమును మాపు; నెడలేని పాపచింతఁ
గలుగఁజేయు; నుద్యోగముఁ దలఁపనీదు;
మానముఁ గృశింపఁగా బ్రతిమాలిపించు;
లేమికంటెను దుర్గతి లేదు జగతి.

అనంతదారిద్ర్య పీడాగ్రస్తులమై యెన్నాళ్లిట్లు దురపిల్లువారము! విపులసంసారమున సుఖాభావయోగమునకు మా పేదకుటుంబమే నిర్దేశింపఁ బడినదా? జీవనసుఖానుభవము మాకు గగనకుసుమప్రాప్తియేనా? సాందీపఋష్యాశ్రమంబున మేము గడపిన దినములు మఱచిపోవుదమన్నను మఱపునకు రావు. ఆహా! ఆదివ్యాశ్రమనివాస మెంత శాంతిదాయకము! ఇప్పు డీబిడ్డలతో నియ్యాశ్రమవాస మెంత విపరీతముగా నున్నది! (భర్తనుజూచి) రాత్రింబగళ్లు శ్రీహరీ! శ్రీహరీ! యని యీ మహాత్ముఁడు బాహ్యజగంబు మఱచియుండును. ఈతఁడు యనూనపదవీ ప్రాప్తికై సంతోషింతునా? చిఱుతప్రాయంపు బిడ్డల పేదఱికంబునకై దుఃఖింతునా? సాందీపమునిచంద్రుని యాశ్రమోపాంతమున నేశ్రీపదములసందర్శనమయ్యెనో, యాశ్రీపదముల నాశ్రయించిన దుఃఖాంధకారము దూరముకాకుండునే? ఆబ్రం

దావనవనధిపూర్ణచంద్రుని సందర్శించి సిరులు వేఁడినఁ గరుణింపఁడా? లక్ష్మీనిలయుని యను కంపాతిశయమున సకలకళ్యాణములు చేకూరఁ గలవు. ఆతఁడు భక్తవరదుఁడు; మేమాశ్రితులము. విశేషించి నాప్రియభర్త కాతఁడు కడుం గడుఁగూర్చు నెచ్చెలికాఁడు. అవశ్యము మా మొఱాలించును.

(ప్రకాశముగా) నాథా! ఇదియేమి? నిరంతరధ్యాన మగ్నులరైయుండిన సంసారచక్ర మెట్లు దిరుగును? ఆలుబిడ్డలు లేనివారు తపోనియమంబుఁ బాటించినఁ జెల్లుఁగాని, గృహస్థుల కీ యప్రతిమానప్రతిభ చెల్లునే? తల్లిదండ్రులఁ గలిగియు లేనివారైరి మన యీ చిఱుతప్రాయంపు బిడ్డలు! వీరి దుర్దశ కణుమాత్రమైనఁ జలింపరేమి! మనము బ్రతికియుండఁగనే మనబిడ్డలు దిక్కుమాలిన వారలగుదురా? కడుపుతీపి యెఱుంగని మిమ్మె మనంగనేర్తు? శిశువులగోడు గమనింపని పితృహృదయము దోషభూయిష్ఠమని యార్యులు వచింపరే? నాథా, పిల్లలముద్దు చెల్లింపలేకపోయితిని కదా యని నాగుండె నీరయి చలించుచున్నది. ఆఁడుదానను; అబలను; పవిత్రవిప్రకులమున జనించినదానను; పరమపవిత్రులరగు మీచేయిఁ బట్టినదానను; పుత్త్రివతిని. నే నెట్లు దేహియని నడివీథిలోఁ దలచూపఁ గలను? పురుషుఁ డుద్యోగనిపుణుఁడు; స్త్రీయాతని యాశ్రితప్రాణి. మిమ్మాశ్రయించి మీ పౌరుషభంగమెట్లు కావింప నేర్తును?

మహాత్మా, నా యలజడి దైవమెఱుంగు! (కన్నీరుదుడుచుకొనుచు)

సీ. నారగోచు లెకాని నాణెంపుఁగోకలు
 బుడుత లేనాఁడైనఁ దొడుగుకొనిరె?
పాలపూస లెకాని బంగారు నగలు నా
 బిడ్డ లేనాఁడైనఁ బెట్టుకొనిరె?
పేదగంజియె కాని పితికినపాలు నా
 తనయు లేనాఁడైనఁ ద్రాగినారె?
ఆఁకులందు నెకాని యపరంజిగిన్నెల
 నిసువు లేనాఁడైన మెసవినారె?
పేదవారలు లేరె? ఇవ్విధమ యధమ
గతులు గాంచినారె? మఱి సుఖంబు మనకు
విధి లిఖింపలేదె?—సిరుల విఱ్ఱవీఁగు
పోరుగు వారలు చేసిన పుణ్యమేమి?

కుచేలుఁడు

అబలా, నీ వెడఁగుమాటలు మానవుకదా? అజ్ఞానజనితదుఃఖము నుపసంహరింపుము. జగములు నిర్మింప, రక్షింప నిర్వాణదాయకుం డగు శౌరియే కర్త. మృగములకు మేఁత బెట్టినవాఁడు, నట్టడవుల వృక్షములకు నీళ్లుపోసినవాఁడు, ఱాతిలోఁ గప్ప కాహారమిడినవాఁడు మర్త్యులకుఁ బెట్టఁ డన్నమిడఁడా?

వామాక్షి

నాథా, ఈ రిత్తవేదాంతములవలనఁ గడుపు నిండునా? దైవమానుషములు సమములని యెఱుంగరే! పంచభక్ష్యాన్నములు పళ్లెరమున నిడి భుజింపకున్నఁ గడుపు నిండునా? మీరు శ్రీహరిని నమ్మిన నిష్కాములు; మేము మిమ్ములు నమ్మితిమి. మమ్ము రక్షించుట మీకుఁ బరమధర్మము. మా 'కన్యథా శరణం నాస్తి!'

శ్రీకృష్ణుఁడు మీా చిన్ననాఁటి నెచ్చెలి. ఆతని నర్థించిన బహుళైశ్వర్యములు బ్రసాదించును.

కుచేలుఁడు

(సవితర్కముగా) వామా, నీ మృదువచనములు నాహృదయమును సంతోషతరంగములఁ దేల్చివేయుచున్నవి. నీ యీా యుపదేశమునఁ దీర్ఘమును స్వార్థమును ఘటిల్లును.—— కాని, (మౌనమూనును.)

వామాక్షి

నాథా, ఊరకుంటి రేల ?

కుచేలుఁడు

వామా, సర్వనదీనదాంబువులకుఁ బట్టయిన వారాశికి మంచు బిందువులు బరితోషమును గూర్చునా? సర్వసంపన్నుఁడగు హరికిఁ గానుక లీయ మనమెంతటి వారము! ఇచ్చినను, అది లాభమే యతనికి ? కాని చంద్రునకు నూలు పోఁగన్న సామెతవినలేదా ?

వామాక్షి

(స్వ) సాందీపఋష్యాశ్రమంబున మేము వసించిన దినములందు నందానందుఁడు నన్నుఁ జేరంజీరి, "అమ్మా, నీవిచ్చిన యడుకులు దినుటకు నా కెంతయో యభిలాష" అని యడిగి పుచ్చుకొనెడువాఁడు. మా పేదకుటుంబమున నాతనికిఁ బ్రియమైన వస్తు వేమికలదు. నేఁడు నే నుపవసించి, ధాన్యములు మిగిల్చి యడుకులు దంచి, ప్రేమోపహారముగా శ్రీకృష్ణదేవున కంపెదను. ఆతఁడేల నిరాకరించును ? మా పేదటికము జగద్విఖ్యాత మేకదా ?

(ప్రకాశముగా) నాథా! నిజము, మన మాతనికేమైన నీయకున్న మన కాతఁడేల సంపదలిచ్చును ? ముంజేయి యాడినఁ గదా మోచేయి యాడును. ఆ జగదానందమూర్తి కొఱకు నివ్వరియడుకులు సేకరించెదను. మీా చేలమునముడిచికొని పొండు.

కుచేలుఁడు

మగువా, నీవొసంగ నెంచిన కానుక కేమిగాని, నీ యుదారహృదయమునకు ధన్యవాదము ! నీవు లోనికరుగుము. నేను పూజావిధానము ముగించి భోజనమునకు లేచెదను.

[నిష్క్రమింతురు.]

దృశ్యము. 3

ద్వారకారాజసౌధము

[చింతానిమగ్నుఁడై శ్రీకృష్ణుఁడు ప్రవేశించును]

కృష్ణుఁడు

కుచేలా, నీపేదఱికము నా యేకాంతహృదయమును గలంచివేయుచున్నది. ఈ రాజ్యభోగము విషతుల్యమై పొడకట్టుచున్నది. నీవంటి బ్రాహ్మణుఁడేకదా నా యిష్టదైవము; నా యిలువేల్పు. నీదారిద్ర్యదుఃఖభంజనమునఁ గదా నా సుఖసర్వస్వము. భక్తుని సామాన్య దుఃఖమున నాదుఃఖ మసామాన్య మగును. సఖా, నీ యాశీర్వాదమున నీ దుఃఖమోచనముఁ గావించెదను.

(రుక్మిణీదేవి ప్రవేశము)

రుక్మిణి

నాథా, మీసరసవదన మేటికి విరసంబై చూ పట్టుచున్నది? ఎవ్వని యార్తస్వరము హృదయకుహారమునఁ బ్రతిధ్వనించు చున్నది? ఆర్తత్రాణపరాయణా! ఎవ్వని కెట్టి యాపద సంభవించెను?

కృష్ణుఁడు

ప్రేయసీ, ఆపదకాదు; సంపద!

రుక్మిణి

ధన్యుఁడాభాగ్యవంతుఁడు! సంపత్సమయమునఁగూడ మిమ్ము స్మరించుచుండెనా?

కృష్ణుఁడు

ఆమహాపురుషుఁ డొకదరిద్రబ్రాహ్మణుఁడు; నా చిన్ననాఁటి నెచ్చెలి.

రుక్మిణి

దరిద్రుఁడు సంపన్నుఁడయ్యె నెట్లు?

కృష్ణుఁడు

ఎవ్వాఁడు నిష్కామఁడై నాధ్యానమున నీరవ నిశ్చలుఁ డగునో, యాతఁడు దరిద్రుఁడయ్యు సంపత్సముపేతుఁడు.

రుక్మిణి

ఆమహనీయుఁ డెవఁడు?

కృష్ణుఁడు

మగువా, నీవాతనిఁ జూచియుండలేదు. కొలఁది దినములలో మన కాతని దర్శనభాగ్యము లభింపఁగలదు.

(పాటపాడుచు నారదుఁడు ప్రవేశించును)

ముఖారిరాగము - ఆదితాళము

గోవర్ధనగిరిధర గోవింద,
గోకులపాలక పరమానంద.
శ్రీవత్సాంకిత శ్రీకౌస్తుభధర,
భావుకభయహర పాహిముకుంద. గో.

కృష్ణుఁడు

దేవర్షీ, త్రిభువనముల నెట్టి యలజడియును లేదుకదా?

నారదుఁడు

ప్రభూ, నీకరుణాతిరేకమున జగంబుల నిత్యకళ్యాణ మగును.

కృష్ణుఁడు

మీరాకకుఁ గారణమేమి?

నారదుఁడు

దేవా, ఉద్దేశపూర్వకముగా నీ సమక్షమున కరుదెంచుటలేదు. చాలకాలమునుండి మర్త్యభువనమునకు వచ్చియుండలేదు. ఆకారణమున మనంబు నిలకడలేనిదయ్యె. జగత్పిత వగు నిన్నును, లోకమాతయగు రుక్మిణిదేవినిఁజూచి పోదమని వచ్చితిని. (రుక్మిణి నుద్దేశించి)అమ్మా ఎన్నాళ్లిట్లు ద్వారద్వారములఁ దిరుగ నాకు విధించితివి?

రుక్మిణి

శూన్యహృదయుండవై తిరిగిన బాధలేదు. నీ వడుగిడినచోటఁ గలహబీజములు వెదచల్లు చుందువు. నారదా, నిన్నుఁజూచిన నా కెంతయో భయమగుచుండును.

కృష్ణుఁడు

అవును. ఆనాఁడు పారిజాతకుసుమము నర్పించి మాయింట శాంతిభంగముఁ గలిగించితివి. చక్కఁదనములసీమ యగు సత్యభామయు, సాధుశీల రుక్మిణీదేవియు నా లతాంతము కారణమున నెట్టి యలజడి వడిరో, నే నెన్నఁటికిని మఱవఁజాలను. నారదా, నిజముగా నిన్నుఁ జూచిన నాకుఁగూడ భయమగుచుండును.

నారదుఁడు

ఆహా! నేధన్యుండ నైతిని! ఎవ్వాని నామస్మరణ మాత్రమున సమస్తభయములు దూరమగునో యాతఁడు నన్నుఁజూచి భయపడునేని, నా యౌన్నత్యము వర్ణనాతీతముగదా? తల్లీ, భయకారణ మేమియునులేదు. నే నూరక యే యిట కరుదెంచితిని. దాసునిపై నీలాపనిందలు మోపఁదగునా?

కృష్ణుఁడు

(నవ్వుచు) మునికులనాయకమణీ, చాలదినములకు మఱల మాద్వారకకు వచ్చితివి. కొన్నిదినము లీసౌధమున విశ్రాంతి వడయుము. నేనిప్పు డొక మహత్తరకార్య నిర్వాహణమునకై పోవుచున్నాను. జాగు సేయరాదు

నారదుఁడు

నీముఖమున నావేగము స్ఫురించుచున్నది. నీవు సంకల్పించిన కార్యము నిశ్చయముగా గురుతరమై యుండును.

కృష్ణుఁడు

కార్యము నిశ్చయముగా గురుతరము. నీవు స్వర్గ మర్త్య పాతాళముల నిరంకుశభ్రమణ మొనరింతువు. నీకు గోచరింపని దుర్లభపదార్థ మేదియును లేదు; గాని నీవెన్నఁడును గని విని యెఱుంగని యపూర్వవస్తుప్రదర్శనము గావించెదను. ఆకారణమున నేఁ డింతయస్థిర మనస్కుఁడ నైతిని.

నారదుఁడు

దేవా, స్వర్ణముహూర్తమున నేను బయలు దేరితిని!

ఆనందామృత వారిధిఖేల,
అలఘుపరాక్రమ అనుపమలీల,
శ్రీనందాత్మజ శ్రితజనపాల,
శ్రీకరకిసలయ లాలనలోల. గో.

(నిష్క్రమించును.)

కృష్ణుఁడు

ప్రేయసీ, రమ్ము పోదము.

[నిష్క్రమింతురు.]

---

ద్వితీయాంకము

దృశ్యము. ౧

నదీతీరము

(పథికవేషధారి కుచేలుఁడు ప్రవేశము)

కుచేలుఁడు

ప్రళయ సమయ సముద్రగర్భమువలెఁ దరంగములు విశ్వమును గబళింప నెగయుచున్నవి. వినీలమేఘమాలిక లాకసమును గప్పివేయుచున్నవి. ఆహా! ఎట్టి భయంకరదృశ్యము! నే నెట్టి విపదంధకారమునఁ బడిపోయితిని. స్త్రీ బుద్ధి ప్రళయకారణము గాకుండునే?

ఈ వృక్షమూలమున క్షణకాలముఁ గూర్చుం డెదను; నావికుఁ డెవ్వఁడేని కానవచ్చునేమో. (కూర్చుండి) ఆహా! ఈ సెలయేఱు దాఁటుటే యింతకష్టముగదా! సుదీర్ఘమును, గభీరమును నగు భవనది నెట్లు దాఁటనగును! ఆ చెలిమి కానికే గోచరము. కృష్ణా, వసుదేవనందనా! (జపతత్పరుఁడగును.)

(నావికబాలునివేషము ధరించి కృష్ణుఁడు ప్రవేశించును)

నావికబాలుఁడు

ఆలుబిడ్డలును అన్నదమ్ములును
అప్పటి కప్పుడె సుమ్మీ,
కాలకర్మమున గాటికిబోయిన
కలిసిరారు నీ వెంట!

కుచేలుఁడు

ఆహా! ఈ లోకోత్తర మధురగాన శ్రవణమున నాప్రాణము శాంతిసంతోషములలో మునిఁగి పోవుచున్నది.

నావికబాలుఁడు

సారహీన మీసంసారాంబుధి
సారెకు మునిగెద వేలా?
తీరము నేరెదు కోరిక లుడిగిన,
తెలివి తప్పితివె చేలా?

కుచేలుఁడు

ఆహా! ఇట్టి మనోమోహనగీతము నే నెన్నఁడు నాలించియుండ లేదు.

నావికబాలుఁడు

బాబయ్యా, దణ్ణాలు! దణ్ణాలు! నది దాటా ల్ని ఉంటే బేగిరా.

కుచేలుఁడు

ఈ దుర్దినమున, నీజడివానలో, నీవఱదలో నీ వెట్లు సాహసించి పడవ నడుపుచున్నావు! నీచిఱుతప్రాణమునకు భయములేదా! మహా నందమూర్తివై పాటలుకూడ పాడుచున్నావు!

నావికబాలుఁడు

బాబయ్యా, బయపడితే మాపని నేసేవా ళ్లోరు? ఎండావానా, గాలీముసురూ, అని ఇంటికాడ కూకుంటే పొట్ట నిండుతాదా? తాతలనాటి మాటుంటే హాయిగా తిని కూకోమా?

కుచేలుఁడు

నీయిల్లెక్కడ? నీపేరేమి?

నావికబాలుఁడు

నాపేరు "అనాది;" నా యిల్లా?—

కుచేలుఁడు

ఇల్లా? యని యూరకుంటివేమి? నీ కిల్లులేదా?

నావికబాలుఁడు

నే నెక్కడుంటే అక్కడే నాయిల్లు.

కుచేలుఁడు

ఇదేటిమాట! నీతలిదండ్రు లున్నారా?

నావికబాలుఁడు

నాకామాట తెల్దు. నాకోరు నేను.

కుచేలుఁడు

ఇది మఱియు నాశ్చర్యముగా నున్నది. స్వర్గమునుండి జారిపడితివా? నీవు

నావికబాలుఁడు

ఏమో, పుట్టినప్పుడు గ్యానం ఉంటాదా బాబయ్యా!

కుచేలుఁడు

(స్వ) బాలకుఁడు వెఱ్ఱివాఁడా ? లేక నా యీ జరాజీర్ణ కళేబరమునుగాంచి హాస్యము లాడు చుండెనా?

(ప్రకాశముగా) నీవు నన్ను నదిదాటింపఁ గలవా?

నావికబాలుఁడు

రా బాబయ్యా, కన్నుమూసి తెరిసినంతలో ఆవలి ఒడ్డు సూపిత్తాను. పెద్దపెద్ద జాలారోళ్లు నాతో పందెమోసి ఓడిపోయారు ఓడనడప డంలో. వరదొత్తే బయమేటి-జగమంతా సంద్ర మైనా బయంలేదు.

కుచేలుఁడు

బాలకా, ధన్యము నీసాహసము!—కృష్ణా, నీ భక్తుఁడను; నిన్నే నమ్మితిని. నిన్ను నమ్మి యెవఁడు తరింపలేదు!

నావికబాలుఁడు

ఏటాలోసిత్తున్నావు? బేగిరా బాబయ్యా!

కుచేలుఁడు

(నావయెక్కి) చావో, బ్రతుకో! నుదుట నెట్టి వ్రాఁత కలదో!—కృష్ణా, కృష్ణా!

నావికబాలుఁడు

(నావనడుపుచు) బాబయ్యా! వణుకుతావేటి?—నాకు నాలుగుడబ్బులు దొరుకుతాయా?

కుచేలుఁడు

ఏమిరా, డబ్బనుచుంటివి? దరిద్రబ్రాహ్మణుఁడను. నాదగ్గర డబ్బెక్కడ?

నావికబాలుఁడు

(నవ్వుచు)

దగ్గర నేదు డబ్బు
నావెక్క తాని సుబ్బు!

కుచేలుఁడు

కాసుకు బదులుగా నిన్నాశీర్వదించెదను. నేను గర్భదరిద్రుఁడను; బ్రాహ్మణుఁడను; నీకు దయ కలుగదా ?

నావికబాలుఁడు

చరే! మంచి ఆచీర్వాదం చెయ్యి, జాలారి పిన్నోడు మంచి మేడకట్టాలని.

కుచేలుఁడు

(సహర్షముగా) బాలకా, భగవానుఁడు నీ మనోవాంఛను పూర్ణ మొనరించును గాక! నీకశేష మంగళప్రాప్తి యగునుగాక! (నావ మునుఁగనుండుటఁ గాంచి) బాలకా, బాలకా, నావ కదలుచున్నదేమి? అయ్యో! అయ్యో! మునిఁగిపోవుచున్నది!—

నావికబాలుఁడు

బాబయ్యా, మఱి నా సేతకాదు. తెడ్డు నడిపి నడిపి నాసెయ్యి ఇరిగిపోయింది. నువ్వే చనంలో నా వెక్కావో! నాపుట్టిమునిగింది.

కుచేలుఁడు

నిజమా! నిజమా! నీ పుట్టిమునుఁగుటే కాదు; నాపుట్టికూడ మునిఁగినది. ఇంట సురక్షిత

ముగ నున్న మా వామాక్షి పుట్టికూడ మునిఁగినది! — బాలకా, మఱి యెట్టి యుపాయమును లేదా?

నావికబాలుఁడు

మఱి నేదు బాపనయ్యా, మఱిదారి నేదు. నీ దేవుణ్ణి తలుసుకో, బాపనయ్యావు కదా. ఏమో పిలుత్తే దేముఁ డినఁడా?

కుచేలుఁడు

నా దైవము శ్రీకృష్ణభగవానుఁడే! ఆతని దయతప్ప విముక్తిమార్గ మింకేమియును లేదు. ఓ కృష్ణా, ఆపద్బాంధవా! మమ్ము రక్షింపుము. (నావ సమముగా నడచిపోవును.)

నావికబాలుఁడు

బాబయ్యా, మఱి బయం నేదు. అదిగో, ఒడ్డు కనపడుతోంది.

నమ్మిన వోళ్లూ నమ్మని వోళ్లూ
నన్ను నేరగలరు,
నమ్మి నమ్మనినాయ నమ్మలు
నన్నెఱుంగలేరు.

[నిష్క్రమింతురు.]

దృశ్యము. ౨

అడవిదారి

(ప్రవేశము-కుచేలుఁడు)

కుచేలుఁడు

ఆఁడుదానిమాటవిని నే నీ విపదంధకారమునఁ బడిపోయితిని. ఆగోపాలబాలుని యవ్యాజ కారుణ్యమునను, ఆనావికబాలుని యద్భుత సాహసప్రదర్శనమునను నాకు జలగండము తప్పినది. (నలువైపులు పరికించి) ఒత్తుగా బెరిఁగినవృక్షలతాగుల్మముల దట్టంపునీడ లీవనప్రదేశమున సూర్యకిరణములకుఁ దావొసంగుట లేదు. అంతయు నంధకారమయము. ముం దడుగిడుదమన్న దారికనబడదు. ఇప్పుడేమి సేయుదును?—హా! శ్రీహరీ! (కూర్చుండి) కృష్ణా, రుక్మిణీవల్లభా,

సీ. శరదిందుచంద్రికా సమమైనమృదుహాస
కాంతితో మధురవీక్షణముతోడ
శ్రుతిసౌఖ్యసంభాన సుకుమారవేణుని
స్వనముతో కరుణారసంబుతోడ
నునుకెంపు జిగిపెంపు నినుమడించెడుముద్దు
మోవితో చందురుమోముతోడ
భువనమోహనవేష భూషణరూపవి
భ్రమముతో నీలగాత్రంబుతోడ
దేవకీవసుదేవుల జీవరత్న
మమలమతిరుక్మిణీహృదయాబ్జమిత్రుఁ
డఖిలలోకాధినేత, నాయాత్మసఖుఁడు
కృష్ణదేవుఁడు సాక్షాత్కరించుఁగాత!

(కన్నులుమూసి ధ్యాననిమగ్నుఁ డగును)

(రాముఁడు భీముఁడు-ప్రవేశింతురు)

రాముఁడు

భీమా, బెబ్బులి యుబ్బునడంచిన నాదెబ్బ చూచితివికదా?

భీముఁడు

(ఆశ్చర్యానందముల నభినయించి) రామా, చూడు, ఆచెట్టుక్రింద దట్టంపునీడలో నెవ్వడో ముక్కుమూసికొని కూర్చున్నవాడు. వానిపెడతెక్కలు విఱిచికట్టి—

రాముఁడు

(పరికించిచూచి) సెభాస్; భీమా, పిల్లివలె, గుడ్లగూబవలె చీకటిలో నీచూపు లానఁగలవు!

(కుచేలుని సమీపింతురు.)

కుచేలుఁడు

(కన్నులువిప్పి, తస్కరులఁజూచి స్వ.) కృష్ణా! నీమధుమయరూపమును జూపుమని ప్రార్థించి నందుకు నాపైఁగోపమా! ఆహా! ఎట్టిభయంకర హృత్కంపమాన ప్రళయాభీలదృశ్యము! సంపత్కుబేరులగు బేహారులు ధనరాసులు సంగుప్తముఁ గావించుకొని ప్రయాణము సేయుదురు. వారివలెనే నేనుగూడ నవరత్నములు మూటగట్టుకొని పోవుచున్నానని వీరుభావించి నానిలువెల్లఁ బరికించుచున్నవారలు. ఆహా! వీరి విశ్వాసమునకును, అవిశ్వాసమునకును దారతమ్యము లేదుకదా?

(ప్రకాశముగా) అయ్యలారా, నావద్ద హరినామముతప్ప, శ్రీహరిపై నచలవిశ్వాసముతప్ప-నొండుధనం బేమియును లేదు. మీ రేటికి వ్యర్థసందేహమున నూఁగులాడెదరు?

రాముఁడు

(మొలనుండి చూఱకత్తిదూసి) ఇచ్చెదవా, చచ్చెదవా?

భీముఁడు

సగము చచ్చితివి; ఇచ్చెదవా, లేదా! విచ్చుకత్తితో నీపీక నుత్తరించెదము.

కుచేలుఁడు

పౌరుష మింకేమికలదు? హా! శ్రీహరీ! కృష్ణా! ఆపదుద్ధారకా!

(రాముఁడు కుచేలు నాక్రమించి, యటుకుల మూట దీసికొని)

రాముఁడు

భీమా, ఈరూకలమూట విప్పి లెక్కపెట్టుము.

భీముఁడు

కాసైన లేదని బాసచేసిన వేసగాఁడు.

(మూటతో నడచిపోవును.)

(రాముఁడు కుచేలుని నిరీక్షించి చూచుచుండును.)

భీముఁడు

రామా, రామా, మోసము, మోసము!

రాముఁడు

(పరుగెత్తిపోయి, భీమునిఁ గలిసికొని) ఏమిరా రూకలు లెక్కిడుమన్న మోసము మోసమని కేకవేసెదవు?

భీముఁడు

ఇవి రూకలుకావు, నూకలు!

రాముఁడు

అబ్బా! దొంగల మొకిమీఁద నైన నాయెదుట కపటనాటకమా? రూక లీయకున్నఁ బీక నులిమివేసెదను!

భీముఁడు

(భయముతో) అఁ! అఁ! నేను రూకలు చూడలేదు!

రాముఁడు

ఇచ్చెదవా, చచ్చెదవా! ముచ్చెమటలుగ్రమ్మిన నీయొడలుచీల్చి వెచ్చని పచ్చినెత్తురు దొరలించెదను—జాగ్రత్త!

(భీముఁడు భయభ్రాంతుఁడై పారిపోవును. రాముఁడు వాని వెన్నంటి పరుగెత్తును.)

కుచేలుఁడు

(అడుకులు మూటగట్టి) ఈ మూర్ఖులు వృథా కలహకారణమున దూరమైరి.—ఆహా! నికృష్టులగు నీ దొంగలకుఁ బనికిమాలిన యీ యడుకులు లోకోత్తర మహారాజగు శ్రీ కృష్ణున కెట్లుపహారయోగ్యంబు లగును! వామా, నీవు నాపాలిటి విధివై నన్ను నడపుచున్నావు!

[నిష్క్రమించును.]

దృశ్యము. ౩

ద్వారకా నగరమున నొకవీథి

(ప్రవేశము కుచేలుఁడు)

కుచేలుఁడు

ఆహా! ఈ సౌధముల యౌన్నత్యము, నీ పూఁదోఁటల పచ్చందనము, నీ మాణిక్యవేదులు, నీ తిన్ననివీథులు, ఎంత మనోహరముగా నున్నవి! అదె, శ్రీకృష్ణభగవానుని సౌధ రాజము. నటీనటుల కాటపట్టగు రంగస్థలంబులు, మృగమద కాశ్మీర సిక్త శృంగాటకములు, మరకత ముక్తామణిమండితతోరణములు గలిగి యీ సౌధరాజము కన్నుల పండువుగా నున్నయది. ఓ సౌధాగ్రకేతనమా!

గీ. రాత్రియుఁ బగలు పులకిత గాత్రవగుచు,
స్తోత్రమొనరింతు నీరదగాత్రు జయము;
అందుసంజేసి కాద సౌధాగ్రసీమ
నిలిపినాఁడు, భక్తులయాత్మ నిలుచువాఁడు.

(ఉపక్రమించి)
ఓ ద్వారపాలకులారా! బ్రాహ్మణుఁడను; శ్రీ కృష్ణభగవానుని సందర్శింపవచ్చితిని. ఆ దీన బాంధవుని సమక్షమునకు దారిచూప వేఁడెద.

ద్వారపాలకులు

(కుచేలునకు నమస్కరించి) మహాత్మా! "బ్రాహ్మణో మమ దేవతా", యని మా చక్రవర్తి నిరంతరము నిండుమనంబునఁ బల్కుచుండును. బ్రాహ్మణులు శపింపఁ గలరు; శాపంబులు గ్రమ్మఱింపఁ గలరు. మహీపతుల రాజ్యభోగ వైభవములు బ్రాహ్మణాధీనములు! మారాజ్యమున బ్రాహ్మణుఁడే గురువు; బ్రాహ్మణుఁడే దేవర; బ్రాహ్మణుఁడే యఖిలధర్మార్థ నిర్ణయ దక్షుండు. ఓ ధన్యాత్మా! మీ యధీనుఁడగు భగవానుని సందర్శింప వచ్చితిరా? మీ స్వర్గీయ మహోదారబుద్ధి కంజలిఘటించి మ్రొక్కుచున్నాము.

కుచేలుఁడు

ఓ పుణ్యాత్ములారా!

గీ. శౌరిసామీప్యవాసము, శౌరిభజన
శౌరిసందర్శనార్చనల్, శౌరికొలువు
ఎంతపుణ్యముచేసి సాధించినారొ
మీకు మీరలేసాటి ముల్లోకములను.

౧ ద్వారపాలకుఁడు

భూసురోత్తమా, మీజన్మస్థానమేది?

కుచేలుఁడు

అవంతీనగరము.

౨ ద్వారపాలకుఁడు

మహాత్మా! సకలదీవులరాజులు పరివేష్టింప శ్రీకృష్ణచక్రవర్తి నిండుకొలువునఁ బేరోలగం బున్నవాఁడు. ఈ స్వర్ణసమయమున మీ రాతనిం జూడవచ్చును. వీరభటపాలితం బైన యీమహాద్వారముఁ గ్రమించి నడువుఁడు.

కుచేలుఁడు

(నడచుచు) ఆహా! ఏకన్నులతో నాఁడు సాందీప గురుదేవుని పవిత్రాశ్రమమున నా పచ్చని కోకవానిం జూచితినో, ఆకన్నులతో మఱల నీద్వారకారాజసౌధమున, రాజన్యవర్గ పరివేష్టితుని, నామహారాజుఁ జూచు భాగ్యము లభింప నున్నది. ఒక్క యాశ్రమవాసమున నధ్యయనముఁ గావించితిమి; ఒక్క గురుదేవుని పాదారవిందము లాశ్రయించితిమి. నేఁ డాతఁడు రాజచూడామణి; నేనన్ననో పేదబాపఁడను. ఆకాంచనచేలుఁ డీకుచేలు నానవాలు పట్టఁగలఁడా?— నే నిం దరుదెంచుట దుస్సాహసముగాదే? వామా, నీమాటలు నేనేల పెడచెవిని బెట్టనైతిని?— దుర్గమ మార్గాయాసమున కోర్చివచ్చితినిగదా; నాచిరంతన తపః ఫలమును, నానయనచకోరచంద్రుని, నాకృష్ణ భగవానునిఁ గన్నులారఁజూచి, యమృతము కన్న మధురములైన యాతనిపలుకులు చెవులార నాలించి, మృతకళేబరమునఁ బ్రాణ ప్రతిష్ఠఁ గావింపఁజాలు నాతనికరుణారసమును మనసారఁ గ్రోలి, నాపర్ణకుటీరమునకు మఱలి పోయెదను గాక!

[నిష్క్రమించును.]

(సశేషము)

---

# సంప్రార్థనము

పురిపండా అప్పలస్వామిగారు, కవితాసమితి

ఏమహోన్నత పర్వత శృంగవీథి
జన్మమెత్తిన నేమి! విశాలవనుల
మృగకులము ఖగతతి గళమెత్తిపాడ
నెన్నిగీతాలఁ బాడిన నేమి! తుదకు
ఈ చిఱుతసెల యెపుడైన ఈ నికృష్ట
వాలుకాభూమి మధురజీవనము విడిచి
సర్వనాశమ్ము గనుట నాజమ్మెకాదె!
ప్రభువ! ఆఘోరదుస్థితి రాకమున్నె
దీనఁ బొరలు శీతలకణమేని యుపక
రింప నిమ్మోయి! పావనప్రేమ మొదవ
యుష్మదంచితపూజామహోపకృతికి.

---

# కచ్చితమైన జబాబు

పండిత శ్రీపాద
సుబ్రహ్మణ్యశాస్త్రిగారు





౧

“ఎక్కణ్ణుంచిరా సీతారామయ్యబావా” అంటే “ఎందాకానురా జానకిరామయ్యబావా” అని చామర్లకోట రైల్వే ప్లాటుఫారమ్మీద మేనత్త మేనమామ బిడ్డలిద్దరూ వొక్కమాటే పలకరించుకున్నారు. ఇద్దరూ కూడా బెజవాడ నుంచి వచ్చిన బండే దిగినా, దిగీదాకా మాత్రం వొకర్ని వొకరు చూసుకోలేదు. ఆచూసుకోవడంలో కూడా యిద్దరూ వొక్క మాటే చూసుకున్నారు. తరవాత లైసెన్సుకూలీచేత సామాను పట్టించుకొని వెళ్లి కాకినాడ సూప్లికేటులో యిద్దరూ వొక్క గదిలోనే కూచున్నారు. కూచునీ లోపల కుశలప్రశ్నాదికం అంతా అయిపోయింది.

సీతారామయ్యది క్రాపింగూ, కుచ్చు మీసాలూనూ. జానకిరామయ్యది యిసలా. అతను మీసాలువుంచుకోడానికి పితామహుడు వొప్పుకోలేదు. తక్కిన వేషం అంతా—అంటే బిళ్ళగోచీలూ, నెక్టయిలూ, వేస్టకోట్లూ, రిస్టువాచీలూ, బూటులూ, కళ్లకద్దాలూ—అంతా సమానమే. కానైతే సీతారామయ్య కొంచెం పొడుగూ, చామనచాయానూ. జానకిరామయ్య కొంచెం పొట్టీ, దబ్బపండు లాంటి పచ్చనానూ.

సీతారామయ్య సిగరుట్టి తియ్యగా జానకిరామయ్య కారాకిల్లీ తీశాడు. ఇద్దరూ కూడా మంచి అడావుడిలో వున్న సమయంలో అనాఘ్రాతపుష్పం లాంటి వొక బాలవితంతువు దగ్గిరనుంచి చకచకా నడిచి పోయి పక్క గదిలో కూచుంది. సీతారామయ్య చూపులు మెరసిపోతూ అలా తిరగ్గా జానకిరామయ్య “యిలా చూడూ” అన్నాడు.

“వోరేయి! మహా చెడ్డ పని తలపెట్టావని తెలిసిందిరా, నిజమో అబద్ధమో గానీ. చిన్నప్పణ్ణుంచీ మాయింట్లో పెరగడంచేత నీ తత్వం తెలుసును కనక నీకిలాంటి బుద్ధులు పుడతాయని మేమెవళ్లమూ యెప్పుడూ అనుకోలేదు. వెధవముండని పెళ్లాడాలని ప్రయత్నిస్తున్నావుట యేమిటిరా నువ్వు? ఇటు నాటకాంతం సంస్కృతమూ, అటు బి. యే. దాకా యింగ్లీషూ చదవడంచేత వచ్చిన తెలివితేటలా యేమిటివి? నువ్వాపని చేశావంటే నీ పూర్వులు స్వర్గభ్రష్టులు కావడం అలా వుండగా, యిక మీ యమ్మ గోల చెప్పతరమౌతుందా? పోనీ మంచీ, చెడ్డా యేర్పరిచుకో తగ్గ ప్రతిభ లేనివాడవేమో అంటే, ముప్ప యేళ్లు ఖరాగా నిండడమే కాకుండా, మంచి విమర్శకుడవని పేరు కూడా పొందావు. కొంచెం నిదానించావంటే నువ్వు ప్రయోజకుడవు కూడా అయినావు కనక, యే పిల్ల జమీందారైనా పది పన్నెండు వేల కట్నంతో బతిమాలి పిల్లనిస్తాడు; కాని నీకు మళ్లీ పెళ్లి కాదని భయమా? కృష్ణుడు తరవాత మన బ్రహ్మగాళ్లలో అంత చక్కనివాడవు; నీ కందమైన కన్యలు దొరకరా? నీకీ దుర్బుద్ధి యెలా పుట్టిందో కాని యీ పాటికి మళ్లించుకో. తాతయ్య వింటే గోలపెడతాడు. నాయనమ్మకి తెలిసిందంటే యిక చెప్పనా? చివరికి

పెద్ద గందరగోళం పుడుతుంది. నా మాట విని యీపా ట్టికి మంచి దారికి రా"అని జానకిరామయ్య చెప్పగా సీతారామయ్య చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

ఈ మందహాసం జానకిరామయ్యకి వుద్రేకం కలిగించింది. "నువ్వే మహా తెలివైన వాడ వనుకోకు; నీ తల మీద యెగిరిపోయీ నాళ్లు లోకంలో లక్ష లున్నారు. విధురుడు వితంతువుని పెళ్లాడ్డంలో కొంచెం చమత్కారం వున్నా, కాస్త పస్తాయించి చూసుకుంటే అందులోవున్న అవకతవకలు నీకే తెలుస్తాయి. అనేకాలు చూశా నాభాసదాంపత్యాలు నేను. అందులో నువ్వు కూడా చేరిపోవడం నా కిష్టం లేదు. ఆడదానికి వైధవ్యం వస్తే ఐహిక వాంఛల్ని తెగ తెంచుకోవడంలోనే వుంది ప్రశంస. అలా తెంచుకో లేనిదాన్ని పెళ్లాడ్డం–యేమి చెప్పనూ? ఇంతకీ మంచి వంశంలో పుట్టి, మంచి సాంప్రదాయాల్లో పెరిగిన పణ మైన వితంతువు మా చెల్లెల్లాగ వైరాగ్యంతో కాలం గడిపేస్తుంది; కాని పునర్వివాహానికి సిద్ధపడుతుందా?" అని అతను కొంచెం దురుసుగా అడిగాడు.

సరిగా ఆసమయానికే బండి కదిలింది. ధ్వని అంత కంతకి హెచ్చింది. "మాటలు బాగా వినపడడం లే"దంటూ సీతారామయ్య వూరుకో మన్నాడు; కాని "వినిపించుకోవా లంటే వినపడక యేం చేస్తుం"దంటూ జానకిరామయ్య ధోరణి తగ్గించ లేదు. దాని మీద అతను మందహాసం చేస్తూ మొగం పక్కకి తిప్పుకున్నాడు.

మరి పది నిమిషాలికి బండి కాకినాడ పోర్ట్ స్టేషన్లో ఆగింది. ఆగీ ఆగడంతోనే సీతారామయ్య దిగి కూలీచేత సామాను తీయిస్తూ వుండగా పక్క పెట్టిలో వున్న వితంతుయువతి దిగింది. అతని చూ పంతా అక్కే వుంది. వొక యువకుడు వచ్చి ఆమె కింగ్లీషులో స్వాగతం యిచ్చాడు. ఇద్దరూ హ స్తచాలనం చేసుకుని యింగ్లీషులో మాట్లాడుకుంటూ విలాసంగా నడిచిపోయి మోటా రెక్కారు. చూస్తూ వుండగానే మోటారు భోంయి మంటూ వెళ్లిపోయింది.

ఇదంతా చూశాటప్పటికి సీతారామయ్య మొగమ్మీద అసంతృప్తిలక్షణాలు పొటచురించాయి. కళ్లల్లో నుంచి నిశితదృష్టులు పుంఖానుపుంఖాలుగా దూసుకుపోయాయి. ఇదంతా చూసి జానకిరామయ్య "ఆవి డేనా యేమిటి పెళ్లికూతురు?" అన్నాడు. దానితో సీతారామయ్యకి మెరుపుదెబ్బ తగిలినట్లయింది. "వోరేయి! నువ్వు మంచీ, చెడ్డా చూడవురా. లేనిపోని వన్నీ కల్పించి, చూస్తూ వుండగా పెంచెయ్యడంలో నీయంతవాడు లేడు. వితంతువివాహానికి సిద్ధపడితే మాత్రం ఆదొరసాని యెవరి క్కావాలీ?" అని అతను కొంచెం చురుగ్గా జవా బిచ్చాడు.

జానకిరామయ్య మొగం పక్కకి తిప్పుకుని నవ్వుకోగా సీతారామయ్యధోరణి మాశ్చెయ్యాలని వూహించి, "యింతకీ ను వ్వెందుకు వస్తున్నా వోయి?" అన్నాడు.

"పూర్ణ యిక్కడే వుంది."

"ఎందుకు వచ్చిందీ?"

"వదినగారిని చూడడానికి."

"ఏం కథా? పిల్లల తండ్రి వౌతావా యేమిటిరా నువ్వూ?" ఇందుకు జవాబు చెప్పక జానకిరామయ్య మందహాసం చెయ్యగా, "అయితే నేనూ అక్కడికే వస్తాను పద" అని సీతారామయ్య చెప్పాడు. ఇద్దరూ జట్కా యెక్కి వేళాకోళాలు చేసుకుంటూ వెళ్లిపోయారు.

౨

వర్ధనమ్మా, పూర్ణా జానకిరామయ్య యివాళో రేపో వస్తాడని నాలుగు రోజులనుంచి యెదురు తెన్నులు చూస్తూవున్నారు. వర్ధనమ్మకి మూడో నెల దాటింది. ఆమె తల్లి యీ సంగతి చూచాయగా రాయగా పూర్ణ "చూడకుండా వుండలే" నంటూ తిరుగుటపాలో జవాబు వచ్చినట్లు ఉత్తరక్షణంలో కాకినాడ వచ్చి వాలింది. వర్ధనమ్మా, పూర్ణావదినా ఆడపడుచులైనా లోకంలో వాళ్లలా కాకుండా ఎంతో ప్రేమతోటీ, ఎంతో ఐకమత్యంగానూ, వొక్క కడుపున పుట్టిన అక్కచెల్లెళ్ల

కంటేనూ అన్యోన్యంగా మసులుకుంటూ వుంటారు. ఆడపడుచుని చూసి వర్ధనమ్మ యెంతో సంతోషించింది. "నీకు నామీద దయవుంది కనక వచ్చావు. మరొకళ్లైతే 'గాజులు పెట్టించాక మన యింటికే వస్తుం'దని చడీ చప్పుడూ లేకుండా వూరుకుంటూ"రని వర్ధనమ్మ చెప్పగా, "దిక్కుమాలిన కర్మం యేలా వుంటారమ్మా, తెలవగానే చూడకుండానూ ? మాయింటికి దీపంలాగ నువ్వెంతో వెలుగు తెస్తున్నావు. మీ యమ్మరాసిన వుత్తరం చూశా టప్పటికి నాకు బ్రహ్మానందమయింది. 'అమ్మయ్యా! నట్టింట చంటిపిల్లలు తిరిగీ అదృష్టం మళ్లీ యిప్పటికి పట్టిం'దంటూ. నాయనమ్మ పొంగిపోయింది. తాతయ్య నేను బయలుదేరేదాకా తొందలు విడిపించా "డని పూర్ణ చెప్పింది. ఈ అడావడిలో ఆ పూట కాఫీ పుచ్చుకోవడం యిద్దరూ కూడా మరిచిపోయారు. వర్ధనమ్మ గర్భవతి కావడం నిజమని తేలగానే "వెంటనే రావలసిం"దని పూర్ణ అన్నగారికి రాసింది. అంచేతనే అత నిప్పుడు కాకినాడ వచ్చాడు.

జట్కాబండి గుమ్మంలో ఆగే టప్పటికి ఎప్పటి కప్పుడే "ఈబండికి తప్పకుండా వస్తా" డంటూ మాటి మాటికీ వీధిగుమ్మంలోకి వచ్చి చూసి వెడుతూ వుండే పూర్ణకి ముందు సీతారామయ్య కనిపించాడు. ఇంటికి వెళ్లా టప్పుడు తప్పకుండా రాజమండ్రీలో దిగి చూడా లనుకుంటూ వున్న మేనత్త కొడుకు అయాచితంగా కనపడడం చేత బ్రహ్మానందపడుతూ ఆమె "ఎక్కణ్ణుంచిరా బావా ?" అంటూ బండి దగ్గిరికి వచ్చా టప్పటికి జానకిరామయ్య దిగాడు. అతన్ని చూడడంతోటే ఆమె కెంతో ఆనందం కలిగింది. వెంటనే ఆమె "ఇన్నాళ్లు చేశావేమి టన్నయ్యా ?" అంటూ ముందు దారి తీసింది. ఆ వెనకాల తన కాదరం తక్కువయిం దన్నట్లుగా సందేహిస్తూ సీతారామయ్య వెళ్లాడు. బండివాడు సామానింటో పెట్టి సీతారామయ్య దగ్గిర కిరాయి పుచ్చుకుని వెళ్లిపోయాడు.

జానకిరామయ్య నింటోకి తీసుకువెళ్లి వర్ధనమ్మని చూపించడం తొందరలో పూర్ణ సీతారామయ్యకి ఉపచారాలు చెప్పడం మరిచిపోయింది. వర్ధనమ్మ కాళ్లు కడుక్కోడానికి నీళ్లిచ్చి కుశలప్రశ్న చేసింది గాని అతని కెలాగో వుంది. పూర్ణ కంగా రంతా అర్థం అవుతూనే వున్నా—అయినంతా నేదో తప్పు చేసి నట్లూ, దాని కామె శిక్ష చేస్తూ వున్నట్లూ,—ఇలాగ ఏమి టేమిటో నిరుత్సాహాలు పెరిగిపోయి అతని మనస్సుని గజిబిజి పెట్టాయి.

"సిగ్గుపడతా వెందుకూ? నువ్వంటే నువ్వంటూ రోజూ నువ్వు చదరంగం ఆడేవాడే కాదూ మా అన్నయ్యా? ఇవాళ నీకు కొత్త అయినాడా?" అంటూ పూర్ణ ఆగడం చెయ్యగా "వుండవో. చెయ్యి విడిచి పెట్టవో" అంటూ వెనక్కి తీస్తూనే గదిలోకి వెళ్లి వర్ధనమ్మ జానకిరామయ్య మందహాసానికి నూతన తేజస్సు కలిగించింది.

వెంటనే పూర్ణ యివతలికి వచ్చి సీతారామయ్య యోగక్షేమాలు కనుక్కుంది. "మేనల్లుడు పుడతా డన్న సంతోషంలో నీకు నేను కనపడతానా?" అని మందామెమీద నెపం వేసే అతను జవాబులు చెప్పాడు. వొక్క క్షణం సంభాషణ జరిగా టప్పటికి పూర్ణ అమాయికత్వమూ, ప్రేమా, స్నేహమూ, ఆదరమూ యథాపూర్వంగానే వున్నా యనీ, ఆమె తనని వాకిట్లో విడిచిపెట్టి అన్నతో కూడా యింట్లోకి వెళ్లడమూ అదీ అస్వాభావికం కా దనీ, పైగా అప్పుడలా చెయ్యడమే గొప్ప చాతుర్యానికీ, బంధుప్రీతికీ నిదర్శనం అనీ అతను గ్రహించాడు. తోడనే ఆమెమీద ఆదరభావం ప్రబలింది. అందుకు తగ్గ స్వరంతో అతను "ఈ సంగతి మా అమ్మపేరకూడా కాస్త రాయకూడదు టే?" అనగా, "నే నిక్కడికి వచ్చేదాకా స్థిర మైన సంగతి తెలవనే లేదూ. రేపో యెల్లుండో యేలూరు వెడుతూ మీవూరేలాగా వచ్చాటప్పు డిక వుత్తరం రాయడం యెందుకని మానేశానురా" అని ఆమె చెప్పింది. "ఈసంగతి తెలిస్తే నేను వొట్టి చేతులతో రాకపోదును గామా!" అని అతను మళ్లీ అనగా, ఆమె "ఇప్పుడైతే మాత్రం మించిపోయిం దేమిటే? బజారులో దుకాణా లిప్పుడే

తెరుస్తూ వుంటారు. తాజా సరుకు మధ్యాహ్నం తేవచ్చునులే" అని బదులు చెప్పింది.

ఇలాగ పది నిమిషాలు గడిచాటప్పటికి జానకిరామయ్య యివతలికి వచ్చాడు. అప్పటికి "మామీద నీకు దయే వుంటే—నే నింకా యేలూరులో బతికే వున్నా నని నీకు జ్ఞాపకమే వుంటే—మొన్న చెన్నాపట్నంనుంచి యింటికి వెళ్లా టప్పుడు మా వూళ్లో దిగకపోదువా యేమిటి? రెండు మాసాలు దాటింది నువ్వు కనపడీ" అంటోంది పూర్ణ. దాని మీద జానకిరామయ్య అందుకుని, "ఇక వీడికి మన మసలే కనిపించవూ. అంటే వీడికీ మనకీ మధ్య పెద్ద గోడ వొకటి లేచిపోతోంది. పరువూ, ప్రతిష్ఠా, సిగ్గూ, బిడియమూ విడిచిపెట్టేశాడులే వీడు వెధవముండని పెళ్లాడతాట్ట వీడు. అంతా సిద్ధమైంది. ముహూర్తం నిశ్చయం చేసుకోవడం కోసమే యీవూరు వచ్చా డిప్పుడు" అన్నాడు. ఇది విని పూర్ణ వులిక్కిపడింది. "అవున్రటా?" అన్నమాట



నామె సరిగా వుచ్చరించలేకపోయింది. వొక మెరుపు నవనాడులూ సంగతియ్యగా వెంటనే యింకోమెరుపు ఆమె క్షాత్తరక్తాన్ని వుడుకెత్తించింది. "నీ దగ్గిర దాచడం యెందుకూ? నే నలాగే నిశ్చయించుకున్నా" నన్నా డతను. "ఎవర్రా పెళ్లికూతురూ?" అని ఆమె మళ్లీ అడగ్గా, "చూస్తావు కాదూ? మీరు వచ్చినా రాకపోయినా మిమ్మల్ని పిలవకుండా పెళ్లి చేసుకుంటానా నేనూ?" అని సీతారామయ్య బదులు చెప్పాడు. ఇంతట్లో గదిలో నుంచి వర్ధనమ్మా, వంటింటో నుంచి అత్తగారూ వస్తూ వుండడం కనిపెట్టి, జానకిరామయ్య "మంచి పనే. ఈపాటికి వూరుకో. ఎవరేనా వింటే నవ్విపోతారు. చెమట ఆరేదాకా వొక్కక్షణం వీధిగదిలో కూచుందాం రా" అంటూ సీతారామయ్యని చెయ్యిపట్టుకుని తీసుకు పోయాడు.

తొమ్మిదింటి దాకా ఏలూరులో ప్లీడరీ గొడవలూ, రాజమండ్రీలో షాపు సంగతులూ చెప్పుకుని భావమరుదు లిద్దరూ యివతలికి వొచ్చి స్నానాలూ, భోజనాలూ చేశారు. భోజనసమయంలో జానకిరామయ్య అత్తగారూ, మామగారూ సీతారామయ్యని చాలా ఆదరించి మాట్లాడేరు. భోజనానంతరం పురుషులు హాలులో పడక కుర్చీల మీద కూచునే టప్పటికి వర్ధనమ్మ తాంబూలాలు తెచ్చి యిచ్చింది. ఆమెతండ్రి కలెక్టరు కచేరీకి వెళ్లిపోయాడు.

స్త్రీలు భోజనాలు చేసేదాకా భావమరుదు లిద్దరూ మళ్లీ లోకాభిరామాయణం విడేశారు. భోజనం దగ్గిర పూర్ణ మందకొడిగా వుండడం చూసి వర్ధనమ్మా, తల్లీగూడా "ఏం చెప్మా" అనుకున్నారు; గాని కారణం బోధపడలేదు. చివరి కెలాగో వొకలాగ భోజనా లయినాయి. దక్షిణపు వసారాలో వున్న వుయ్యాలలో కూచుని తాంబూలం వేసుకుంటూ వర్ధనమ్మ "రాత్రి నిద్ర చాలదేమోనో" అంది. దాని మీద పూర్ణ "అవునో. నా కేనా తోచింది కాదేమిటే?" అంటూ యివతలికి వచ్చి, "రాత్రి నిద్రచాలదేమో పడుకుంటావా యేమిటన్నయ్యా?" అని జానకిరామయ్య నడిగింది. దాని కతను "ఇంతా అంతా కాదు నిద్ర. వొంటిగంటకి మెళుకువ వచ్చింది. వెంటనే స్టేషనుకు వచ్చాను. అయితే యింటివా రేమేనా కాస్త—సడల

మంచమేనా చూపిస్తారేమో కనుక్కో చెల్లీ" అన్నాడు. ఈమాట చెవిని పడగా యింటియజమానురాలు కూతురు కోసం వెదికి, ఆమె మేడమీద కనబడగా, "సరే" అని పూరుకుంది. ఇక్కడ పూర్ణా, సీతారామయ్యా ఆమాట మీద సరాగాల కందుకోగా, జానకిరామయ్య యాదా లాభంగా పైకి చూసి, అక్కణ్ణుంచి వర్దనమ్మ కనుసన్న చేయగా, "చెల్లీ! సెలవౌతోంది. వారే బావా! కాస్త సేపు పడుకుంటానురా. ఇప్పుడుండే పనితొందరలో నీకు నిద్ర రాదు; గాని వస్తే రా" అంటూ మెల్లిగా పైకి చక్కాపోయాడు. "పెట్టి పుట్టావు కనక సుఖంగా నిద్రపోతావు నువ్వు. నేను నుంచున్నపళంగా జగన్నాథపురం వెళ్లా" లంటూ సీతారామయ్య లేచాడు. "నువ్వు గూడా పడుకుంటే బాగుండును. అంతపని వుంటే యేలాగా మరీ? తొరగా రారా" అంటూ పూర్ణ అతన్ని వీథిగుమ్మందాకా సాగనంపి యజమానురాలి దగ్గిరికి వెళ్లి కూచుంది.

అతను వెళ్లేటప్పటి కక్కడ గుమ్మంలో వొక మోటారు సిద్ధంగా వుంది. "ఎవరేనా వచ్చారా, వెడతారా?" అంటూ అతను గుమ్మం యెక్కే టప్పటికి, రైలులో కలిసి వచ్చిన తరుణి చకచకా యెదురువచ్చి "మీరు వచ్చారా? నేను కొంచం తొందర పనిమీద వొకచోటికి వెడుతున్నాను. నాలుగయితే గాని యింటికి రాను. మళ్లీ అయిదింటకి బీచికి షికారు వెడతాం' కనక మీరు రేపుపొద్దున్న తొమ్మిది దాటాక వస్తే మాట్లాడుకోడానికి వీలు కావచ్చును." అని చెబుతూనే మోటా రెక్కి "రామారావుపేట" అని డ్రైవరుతో చెప్పింది. సీతారామయ్య మొగం చిట్లించుకుంటూ గుమ్మం దిగేటప్పటికి కారు వెళ్లిపోయింది. "వాలకం చూస్తే మొగాడికంటేనూ స్వేచ్ఛగా వుండీలా వుంది. మద్రాసులో తొందరపడడం చూసి అదంతా చదువు కోసం అనుకున్నాను. చాలు చాలు" అనుకుంటూ అతను జట్కా యెక్కి "బయలుదేరిన చోటికే" అని బండివాడితో చెప్పాడు.

వచ్చేటప్పు డతనికి "బావ చెప్పిన మాటల్లో యథార్థం వుందా" అని సందేహం తోచింది. "కాని అందరూ వొకలాగే వుంటారా?" అని ఎవరో ప్రశ్నించినట్లు కాగా, "మంచి చెడ్డలన్నింటిలోనూ వుంటాయి. ఇంత మాత్రానికే సిద్ధాంతాన్ని కొట్టెయ్యడానికీ, సంస్కర్తల్ని నిందించడానికీ వల్లకా"దని నిశ్చయం చేసుకున్నాడు. "పోనీ, వరణసామర్థ్యం లేకపోయినా, కాపరానికి రావడం ఆలస్యమైనా కన్యనే పెళ్లాడితేనో" అని యింకోమాటు తోచింది; కాని "మంచికో చెడ్డకో వితంతువుని పెళ్లాడా లని బుద్ధి పుట్టింది. అదేదో చివరిదాకా చూడవలసిందే" అని దృఢనిశ్చయం చేసుకున్నాడు. అప్పటికి బండి గమ్యస్థానం చేరింది. వెంటనే బండివాణ్ణి పంపేసి అతను గుమ్మం యెక్కాడు. వదినగారితో మాట్లాడుతూ వాకట్లో నుంచుని వున్న పూర్ణ చల్లపడిందాకా రాకుండా కున్న మేనత్తకొడుకు అప్పుడే రావడం చూసి, "రారా, బావా" అంటూ యెదురు వచ్చి లోపలికి తీసుకు వెళ్లింది. కొంతసేపు ఆమాటా ఈమాటా అయినాక, అతను నిద్రవొస్తోందనగా, మేడమీదకి తీసుకు వెళ్లింది.

## 3

పొద్దున్న యేడు న్నర అయింది మొదలుకొని యెదురు చూస్తూ వున్న యేకాంతం యిప్పటికి దొరికింది పూర్ణకి. దక్షిణపు గది వసారాలో జానకిరామయ్య గాఢనిద్రలో వున్నాడు. ఉత్తరపు వసారాలో సీతారామయ్య మడత మంచంమీదా, పూర్ణ పడకకుర్చీలోనూ కూచున్నారు. అతను నడుం వాలుద్దా మనుకుంటూ వుండగా ఆమె అందుకుంది:

"ఏమిరా బావా! నిజం చెప్పవూ?"

"నే నెప్పుడేనా అబద్ధం చెప్పడం యెరుగుదువా?"

"అంచేతే నమ్మలేకుండా వున్నాను. భమిడిపాటివారి యింటో పుట్టి నోరివారి యింటో పెరిగావు. ఇలాంటి సాహసం కలగడం—"

"ఆశ్చర్యం యెందుకూ? చదివింది యింగ్లీషు. దేశం అంతా చూశాను. అనేకసంఘాల ఆచారాలు పరిశీలించాను. బ్రాహ్మణ్యం వొకటే ముక్తిసాధనమనీ మన ఆచారాలు మాత్రమే మంచివనీ చెప్పడానికి వల్లె

## గౌతమీపుత్ర యజ్ఞ శ్రీ శాతకర్ణి (యౌవనదశ)

29 సంవత్సరములు ఆంధ్రరాజ్యము నేలిన ఆంధ్రరాజు. క్రీ. శ. 173




ఈతని నాణెములపై నున్న చిత్రమునుండి పెంపొందింపబడినది

చిత్రకారుడు : కె. నరసింహాచారిగారు, చెన్నపురి

## గౌతమీపుత్ర యజ్ఞ శ్రీ శాతకర్ణి (వృద్ధదశ)

29 సంవత్సరములు ఆంధ్రరాజ్యము నేలిన ఆంధ్రరాజు. క్రీ. శ. 173




ఈతని నాణెములపై నున్న చిత్రమునుండి పెంపొందింపబడినది

చిత్రకారుడు : క. నరసింహాచారిగారు, చెన్నపురి

కాదు. పైగా అన్ని దేశాల్లోనూ కాలాన్ని పట్టి ఆచారాలు మారుతూ వచ్చాయి. మారుతున్నాయి. ఇంకా మారతాయి."

"అదంతా యిప్పు డెందుకు?"

"నా నిశ్చయాన్ని గురించి సమాధానాలు వినాలంటే కొంచెం వోపిక పట్టాలి. వార్ధకంచేత నడవలేకా, రైలెక్కితే బ్రాహ్మణ్యం చెడిపోతుం దనీ, పుర్లాం ప్రయాణం మానుకున్న తాతయ్య నన్నూ, బావనీ విసర్గాన్ని బోధించే యింగ్లీషు చదువులో ప్రవేశపెట్టాడు."

"అదే కొంపముంచీలా వుంది చివరకి."

"ముంచదు ముంచదు; తేలుస్తుంది. ఇంగ్లీషు విద్యకి మనం చాలా ఋణపడి వున్నాం. నిజంగా యింగ్లీషు మన కళ్లు తెరిచింది. ఒక సంగతడుగుతాను: శాంతంగా విని, జాగ్రత్తగా ఆలోచించి, సరిగా సమాధానం చెబుతావా?"

"అడుగు."

"ఎనిమిదో యేట నీకు పెళ్లయింది; పదకొండో యేట మోడు వైపోయావు; ఇప్పుడిరవై రెండో యేడు నడుస్తోంది. ఈడు వచ్చినప్పణ్నుంచీ—అంటే యే డెనిమి దేళ్లనుంచి నువ్వు నిజంగా యమయాతన అనుభవిస్తున్నావు."

"పూర్వజన్మంలో చేసిన పాపం—"

"నువ్వా, తాతయ్యా? అడిగేవాడు లేక కాని కళ్లు తెరవని వయస్సులో నీకు పెళ్లి చెయ్యడానికీ, మొగుడంటే యేమిటో తెలవందే ముండామోశావనడానికీ, నీజీవితాన్ని యిలా బగ్గంపాడు చెయ్యడానికీ, యెవడి కధికారం వుందీ? పోనీ నువ్వు పూర్వజన్మంలో యేదో పాపం చేశా వనీ, అది యిప్పుడిలా అనుభవిస్తూ వున్నా వనీ, అనుకుంటూ వూరుకున్నవాళ్లంతా నువ్వు మళ్లీ—"

"అయ్యో!"

"ఏమీ?"

"మొగుడు చచ్చిపోతే ఆడాళ్లు మళ్లీ పెళ్లాడ్డం బ్రాహ్మల్లో యెప్పు డేనా వుందా?"

"ఎప్పు డేనా వుందా అంటే దానికి సమాధానాలు చరిత్రలో కావలసినన్ని వున్నాయి. మళ్లీ పెళ్లాడితే నిజంగా కొంప మునిగిపోతుందా? సంసారంలో పురుషుని కెంత విలవ వుందో స్త్రీకీ అంతే వుంది. ఈశ్వరసృష్టిలో పురుషు డెలాంటివాడో స్త్రీ కూడా అలాంటిదే! సౌఖ్యమూ, ఆనందమూ అనుభవించడానికి పురుషుని కెలాంటి హక్కు వుందో స్త్రీకీ అలాంటిదే వుంది. పెళ్లిఅనేది యిద్దరికీ సమానమే. స్త్రీ అంటే రాయికాదు; బొమ్మ కాదు. నా శరీరం యెలాంటిదో నీ శరీరమూ అలాంటిదే. ఎన్నిమాట్లేనా పెళ్లాడే మొగాడికి పుణ్యమే వస్తే మళ్లీ పెళ్ళాడీ ఆడదానికీ వస్తుంది. గార్హస్థ్యం అంటే పురుషుడు వొక్కనితో టే లేదు."

"మన శాస్త్రాల్లో అలా యెందు కుందీ?"

"అలా రాశారు కనకా. అలా యెందుకు రాశారంటే అప్పు డలాంటి అవసరం యేం వచ్చిందో. ఆరాతరాసిన తరవాత యెన్ని సంవత్సరాలు గడిచాయో. ఎన్ని ఆచారాలు మారిపోయాయో. ప్రపంచకంలో వున్న తక్కిన జాతు లన్నీ కాలానుగుణ్యంగా నడుచుకుంటూ—"

"వాళ్లంతా బ్రాహ్మలంత గొప్పవాళ్లా?"

"వాళ్లదగ్గిర యీమాట అంటే బ్రాహ్మల కంటే అధము లెవళ్లంటారు. బ్రాహ్మల దారి వొకవిధమైనది; తురకలదారి వొకమోస్తరూ; కిరస్తానీల దింకో మాదిరి; పార్శీలది మరోరకం, అక్కడిదాకా యెందుకూ? మేనరికం. అంటే మనం చెవి కోసుకుంటాం, ద్రావిళ్లదగ్గిర ఆమాట యెత్తితే ఛీ ఛీ అంటారు."

"ఎంచేతా?"

"వాళ్ల కలా తోచింది కనక."

"ఇవన్నీ మనవా ళ్లేర్పరుచుకున్న వంటావా?"

"ఇంకా నింపాదిగా అడుసుతావా? దేశప్రకృతిని పట్టి ఒక్కొక్క తెగవా ళ్లొక్కొక్క విధంగా ఆచారా లేర్పరచుకున్నారు. తరవాత కాలాన్ని పట్టి

మంచి చెడ్డలు గమనిస్తూ అవసరమైన ఆచారాలలో మార్పులు చేసుకుంటూ ఆమార్పులు ధర్మశాస్త్రాల్లోకి ఎక్కించుకుంటూ వచ్చారు. అలాగే మనవాళ్లలో కూడా వితంతువివాహాలు—"

"లోకం హర్షిస్తుందా?"

"లోకం అంటే యెక్కడికి? మనవాళ్ల సంగతి యిప్పుడెలా వుందంటే, ఎవడిమట్టుకు వాడు శాస్త్రాన్ని దూరంగా తన్నేసి, తన అనుకూల్యాన్ని పట్టి నడుచుకుంటూ, ఎదటివాడికి పంగనామాలు పెడుతున్నాడు. కనకనే మనసంగతి యిలా వుంది. ఇక లోకం హర్షిస్తుందా అంటే హర్షించక యేం చేస్తుందీ? ఏం చెయ్యగలమూ? ఏం చెయ్యగలుగుతోందీ? మా పెత్తండ్రి మనమరాలి మొగుడు లండను వెళ్లి వచ్చాడు. మా పెత్తాత మనమరాలి కొడుకు అందరితోటీ బాహాటంగా భోజనం చేస్తాడు. మా మేనత్త కొడుక్కి మొన్న మొన్న—పదహారో యేట అయింది వొడుగు. వాడి మేనత్త కూతురికి రజస్వల అయిన తరవాతే పెళ్లి కావడం అంతా యెరుగుదురు. వాళ్లని వెళ్లేం చేశారూ?"

"అలాగే నువ్వు వెనవని పెళ్లాడతానంటావా?"

"ఇంకా సందేహమా?"

"అయితే యెవర్తిని పెళ్లాడతావురా?"

ఈ ప్రశ్న అడిగేటప్పుడు పూర్ణ హృదయం గుబగుబ లాడింది. పాదాదిశిరఃపర్యంతమూ రక్తమంతా వొక్కమాటు వుడుకెత్తి ఏదో మెరుపుదెబ్బ తగిలినట్లయింది. అచ్చంగా తనలాంటి తరుణి వొకతె పుణ్యస్త్రీ వేషంతో పిల్లలతోటీ, మొగుడుతోటీ, జన్మ కల్లా నిగ్గయిన తృప్తితోటీ, ఆనందంతోటీ ముఖమ్మీద హృదయాకృతి అంతా అచ్చుపడుతూ వుండగా, సుఖమయసంసార సరస్సులో నౌకావిహారం చేస్తూ వున్న ట్లొక దృశ్యం ఆమెకి కొన్నాళ్ల కిందట సినీమాలో చూసినట్లు తోచింది. ఇలాంటి భావనల వల్ల తమ కృత్రిమ నిబంధనల నెక్కడ జవదాటి పోతుందో అని భస్మధారులూ, కుండలధారులూ అయిన బోసినోటి శాస్త్రులవార్లు కొందరు, సుఖావేశనతో మెల్లి మెల్లిగా—హృదయం బలవంతం చేస్తూ వుండగా, జడుస్తూ జడుస్తూ ముందుకడుగు వేస్తూ వున్న తనని చెక్కలుపట్టుకుని వెనక్కి లాగుతూ "రా వెనక్కి. బుర్ర గొరిగించుకో. చేతుల వున్న మురుగులూ, మెడలో వున్న గొలుసూ మా కిచ్చెయ్యి. మల్లుపంచె విప్పేసి నైను సడ్డ కట్టుకో. ఆవుపేడా అలుగ్గడ్డా పుచ్చుకొని పసంటింటోకి" అని బలవంతం చేస్తూ వున్నట్లు తోచింది. ఇంకా సుఖమయాలూ, దుఃఖపూరితాలూ అయిన యిలాంటి ఆశలూ, కష్టానుభవాలూ హృదయాన్ని కలత పెడుతూ వుండడంచేత "ఇంకా నిశ్చయం కాలే" దని సీతారామయ్య చెప్పిన సమాధానం ఆమెకి వినపడలేదు. ఆమె శిరస్సు వంచుకుని మాట్లాడకుండా వుండడం చూశా డతను. వొక్క క్షణం వూరుకుని "మాట్లాడవేమే?" అన్నాడు. చివరకి "నే నన్న మాటలికి కోపం వచ్చిందా?" అని అడుగుతూ లేచి నుంచున్నాడు.

అప్పుడు పూర్ణ జొటజొట కన్నీరు కారుస్తూ, "నువ్వన్న ట్లేడెనిమి దేళ్ళనుంచి నేను యమబాధ అనుభవిస్తున్నాను. నాలాగ కుళ్లి పోతూ వున్నవాళ్లు వేలూ, లక్షలూ వున్నారు. ఆడాళ్ల బతుకింత తేలిక యెందుకయిపోయిందీ? దేవుడు మొగాళ్లని కుడిచేత్తోటీ, ఆడాళ్ళని యెడంచేత్తోటీ చేశాడా?" అంది.

"ఇప్పటి దాకా హిందూస్త్రీకి ఇలాంటి ఆవేశం కలగలేదు. ఆమె పురుషు డంటే దేవు డనుకుంది. అతను రాజనీ, తాను నౌకరనీ నమ్మింది. మొగాడు ఏం చేసినా వొప్పుకుంది. అన్నం తినమంటే తింది. నిద్ర పొమ్మంటే పోయింది నువ్వు మనిషివి కా దంటే వొప్పుకుంది. ఈకారణాలచేత మొగాడికి కళ్లు మూసుకుపోయాయి."

"బావోయి! నిన్నుకూడా తిడుతున్నాననుకోకు. మొగాళ్లకంటే రాక్షసులు నయం. అందులోనూ వేదాలూ, శాస్త్రాలూ చదువుకున్నవాళ్లు నల్లరాళ్ల కంటేనూ కఠినులు. కన్న కూతుళ్ల గొంతుకులు కూడా వాళ్లు నదురూ, బెదురూ లేకుండా పరపరా

కోసేస్తారు. రామరామా! నా జుట్టు తీయించేయ్య మని తాతయ్య చేసే రభసం చెప్ప తరమా? నా మూలా లాన్ని సాటి వాళ్లలో తనకి తలవంపులుగా వుందిట. ఏమీ యెరగందే నేను ముండామోశా ననడం నాసాటి వాళ్లలో నాకు తలవంపులుగా లేదూ? నాపెళ్లి నే నె రగను; నా మొగుణ్ణెరగను; ముండామొయ్యడం వొక్కటే నాకు కనబడుతోంది. నా పెళ్లి నాకోసమా? ఇతర్ల కోసమా? నే నెరగని—నా కోసం కాని—పెళ్లివల్ల నాకు వెధవరికం యేమి టోయి?"

"నీలాగ కుళ్లిపోతూ వున్న పడుచులు లక్షలున్నా రన్నావు. వాళ్లందరూ యెందుకు సాహసించ కూడదూ? శాస్త్రాల విలవ నాడే గంగలో కలిసింది."

"బతకడానికి వీల్లేని ధర్మాలు చెప్పి అలా నడవ మంటే శాస్త్రాల నెవళ్లు గౌరవిస్తారూ?—"

"ఇక సంఘం వుంది. సంఘంలో యిప్పు డెవళ్ల దారి వాళ్లదీ. విధినిషేధాలు పోయాయి."

"అయినా తరతరాల నుంచి వస్తూవున్న విశ్వాసం వొకటి వుంది కదూ? ఈయమభాధని కూడా నిర్లక్ష్యం చెయ్యడానికి కారణం అదీ. శాస్త్రాలు దేవుని వుపదేశాలు అనే నమ్మకం వున్నంత కాలమే వాట్లకి విలవ. తరవాత మనశాస్త్రాలన్నీ కొల్లేటిపాలే. మనుష్యుల నిన్ని విధాల విడతీసిన శాస్త్రాలు యింకా లోకంలో యెక్కడేనావున్నాయా?"

"ఈ కర్మభూమిలో—ఈ పుణ్యభూమిలో—సారంవిరిగి పోయిన యీ చాటిపఠ్రలో తప్ప మరెక్కడా లేవు."

"బావా! ఇం కెందుకూ? వెధవలు మళ్లీ పెళ్లాడితే పనికిరాని మతం వెధవ లంటే పనికివస్తుందా?" వొకదారీ, వొకతెన్నూ లేని మతాన్ని లక్ష్యపెట్టడం యెందుకూ? ఎవళ్లేం చేసినా యెవళ్లూ యేమీ చెయ్యలే నప్పుడు నువ్వు "ఇక గతిలే"దని నిరాశ చేసుకొని వున్న వొకవితంతువుని ఉద్ధరించడం తప్పు కాదు. ఆడదానివుసురు మహాచెడ్డది. బావా! నావంటివాళ్లంతా యీ దుర్గతి దేవుడు కలిగించిందే అనుకుంటున్నారు; గాని మనుష్యులు—అందులోనూ మొగాళ్లు—వేద శాస్త్రాలు చదువుకున్న బ్రాహ్మలు కలిగించిం దని తెలుసుకున్నారంటే వాళ్లవుసురు తగిలి యీదేశం అంతా వొక్క క్షణంలో బుగ్గయిపోతుంది. కనక వొక్క ఆడదాన్ని రక్షించినా రక్షించడమే. బావోయి! మానకు; ఇక సందేహించకు; ఆలస్యం చెయ్యకు. ఎవర్తి పుణ్యం పుచ్చిందో, యెవర్తి అదృష్టం పండిందో, నీ కిలాంటిబుద్ధి పుట్టింది. వితంతువునే పెళ్లాడు బావా! పెళ్లాం చచ్చిపోతే మొగాడు దుఃఖించడం నిజమే కావచ్చును; కాని ఆదుఃఖాని కంతం వుంది. మాబతు కేం చెప్పను బావా? అయ్యో! ఈబ్రాహ్మణజాతిలో పుట్టడం కంటే పురుగై పుట్టడం మంచి దేమోనోయి!"

పూర్ణ యిలా చెప్పడం మాని సీతారామయ్య నిర్విణ్ణు డైపోయాడు. ఆమె విశాలనేత్రాలలో నుంచి



చెక్కుల మీదుగా ప్రవహిస్తూ వున్న కన్నీరు యావద్భారతమహిళామండలియొక్క కరిగిపోయినహృదయాల లాగ తోచిం దతనికి. రావిరేకల లాగ కదలిపోతూ వున్న ఆమె పెదవులు చూసి అతను యీభరతవర్షం అంతా గడగడ వొణికిపోడాని కిం కెంతో సేపు పట్ట దని భయపడ్డాడు. పొద్దున్న తాను బండి దిగే టప్పటికి కలకల లాడుతూ వున్న ముఖంమీద యిప్పు డింత విచారం అంకితం కావడం చూడగా అతనికి ప్రపంచకం అంతా మహాంధకారంలో మునిగిపోతూ వున్నట్లు తోచింది. ఈకారణాలచేత అతని హృదయం కంపించిపోసాగింది. చూస్తూ వుండగా ఆవొణుకు కాళ్లల్లోనూ, పెదవుల్లోనూ, మాటల్లోనూ కూడా కనపడింది. ఇక కూచో లేకపోయాడు. తూలుతూ తూలుతూ లేచి నుంచుని, అతను "వదినా! నీ కిలాంటి సాహసం కలుగుతుం దని నే నెప్పుడూ అనుకోలేదు. నీ హృదయం యింత దయాపూరిత మనీ, నీ మన స్సింత నవనీతకోమలమైన దనీ నే నెప్పుడూ అనుకోలేదు. నా సంగ తంతా ఆమూలాగ్రంగా తెలిసిన నువ్వు ఇప్పు డిలా చెబుతూ వుండగా నా కింక సందేహం యెందుకూ ? నువ్వుచెప్పిన ప్రకారం నేను తప్పకుండా వితంతువునే పెళ్ళాడి హిందూపురుషులు స్త్రీజాతికి చేసిన ద్రోహంలో అణుమాత్రమైనా తగ్గిస్తా" నన్నాడు; కాని పూర్ణ కింకా శోకావేగం తగ్గలేదు. ఆమె యింకా వెక్కి-వెక్కి యేడుస్తూనే వుంది.

జానకిరామయ్య సరిగా యిలాంటప్పుడు కళ్లు నులుముకుంటూ వచ్చాడు. అతను పూర్ణను చూసి అదిరిపడి, "ఎందుకే చెల్లీ?" అంటూ ఆమె దగ్గిర నుంచుని సీతారామయ్య కేసి ఫులుకూ ఫులుకూ చూశాడు. దానితో యిద్దరూ కూడా వులికిపడ్డారు. సీతారామయ్య యింకా తేరికోక ముందే పూర్ణ అందుకుని మరింత వెక్కి-వెక్కి యేడుస్తూ, "నిక్షేపంలాంటి బావ యెక్కడో యెవ త్తినో వితంతువును పెళ్ళాడి మనకి దూర మైపోతాడుట. అదే నిజ మైతే వీ డిక మనకళ్లకి కనపడతాడా ?" అంటూ మరింత దుఃఖించింది. అంతట జానకిరామయ్య చెయ్యి పట్టుకుని ఆమెను లేవతీసి, "ఇం తేక దా ? బుద్ధిపూర్వకంగా కులం చెడతా నంటే యెవ శ్లేం చెయ్యగలరూ ! ఇంతకీ మనకి దూర మైనా ఆకొత్తపెళ్ళామూ వాడూ సుఖంగావుంటేఅం తేచాలు" అని వోదార్చి, సీతారామయ్య కేసి తీవ్రంగా చూస్తూ, "చూశావా, అప్పుడే యెంత గోల మొద లయిందో! ఇప్పు డేనా బుద్ధి తెచ్చుకో" అన్నాడు. వొక్క క్షణం దాకా యెవరూ యేమీ మాట్లాడ లేదు. తరవాత పూర్ణ చెయ్యివిడిపించుకొని "నువ్వు పద వస్తా" ననగా జానకిరామయ్య కళ్ళు బాగాతుడుచుకుని, "మరి గా కిందకి" అంటూ వెళ్లి పోయాడు. మెట్లమీద వర్ధనమ్మ యెదురుపడింది. అతను "కిందకి రా" అనగా ఆమె "మీకు చొక్కా తెస్తా"నంది; కాని అతను "ఇప్పు డక్కర లేదు లే" అంటూ చెయ్యి పట్టుకుని కిందకి తీసుకుపోయాడు.

అక్కడ పూర్ణ అప్రతిభుడై వున్న సీతారామయ్యతో "బజారుకి వెళ్లి రా" అంది. దానితో అతను ప్రకృతిలో పడి మేడ దిగి, బజారుకి వెడుతూ, "వదిన కథ అంతా అలామార్చేసిం దేం" అని చర్చించుకోవడం మొదలు పెట్టాడు.

౪

"మీ బావ యెక్కడికి వెళ్ళారో ?"

"ఎందుకూ ?"

"కాస్త కాఫీ—"

"వొట్టి కాఫీ యిస్తావుటో మా బావకి ?"

"మా అమ్మ యేం చేస్తోందో చూశావా ?"

"వుయ్యాలామంచంమీద పడుకుని—"

"చాల్లే నేర్చుకుపోయావు. దుడుకూ దుడుకూ మాట లనెయ్యడమే కాదూ యెప్పుడూను!"

"మ రేం చేస్తోందో చెప్పావా యేమిటి నువ్వు?"

"నువ్వడిగావా?"

"ఏ పోకుండలో, యే వుండ్రాళ్లో—"

"సిగ్గుసిగ్గు. ఊరుకో యీపాటికి."

పూర్ణా, వర్ధనమ్మా యిలా సరాగా లాడుకుంటూ వున్న సమయంలో సీతారామయ్య వొక అర్ధమణుగు మిఠాయీ, మైసూరుపాకూ, జహాంగీర్లూ, కోవాబిళ్లలూ, మొదలైన మధురపదార్థాలున్నూ, మరో యెత్తెడు కారపు సరుకున్నూ తెచ్చి వాకట్లో బల్లమీద పెట్టాడు. వెంటనే పూర్ణ అవన్నీ యింట్లోకి పట్టుకు వెళ్లి, "ఏమండోయి అత్తగారూ, మీరూ, మీ అమ్మాయీ వొక మాటు మడి కట్టుకు రండీ. మీ తాహతెక్కడ, మా తాహ తెక్కడ ? మీతో సమానంగా మేము పెట్టగలమా పొయ్యగలమా ! అయినా యేదో కాస్త—తొరగా లేవా"లంటూ వాట్లని వర్ధనమ్మ తల్లి యెదట పెట్టింది. పాపం ఆవిడ హఠాత్తుగా చూసి, యెవరు తెచ్చారో గ్రహించలేక "ఇవన్నీ యెందుకు తెచ్చారమ్మా, నేను చేస్తూ వుండగానూ?" అంది. "మీరు చేస్తున్నా రని మాకు కల వచ్చిందా యేమిటే ? కాకపోయినా మీ రెప్పుడో చేసీ దాకా మేం వుండ లేము సుమండీ. మీరు చెయ్యడమే నిజమైతే దాచుకోండి; మేంవెళ్లాక తలుపులు బిడాయించుకుని మీరూ, మీఅమ్మాయీ తిందురుగాని" అని పూర్ణ మళ్లీ అనగా, వర్ధనమ్మ అందుకుని, "వదినె తెప్పించిం దనుకున్నావా యేమిటే, సొంతడబ్బు ఖర్చుపెట్టి? అన్నయ్యగారు తేగా యీవిడ మనకి బంతివేస్తా నంటోంది. పోనీ వోపని చెయ్యవో వదినా. మాఅమ్మ చేసినవీ, మాఅన్నయ్యగారు తెచ్చినవీ నువ్వన్నట్లే దాచుకుని తలుపులు బిగించుకుని మేం తింటాం నువ్వూ, మీఅన్నయ్యా వుండలేరు కనక తొంగా కాఫీహోటలుకి వెళ్లిరండి" అంది.

మళ్లీ పదినిమిషాలు వేళాకోళాలు జరిగాయి. తరవాత యజమానురాలు పడమటింట్లో వొక గోడ దగ్గిర రెండుపీటలూ, వొకగోడ దగ్గిర రెండుపీటలూ వేసి, జానకిరామయ్యకీ, సీతారామయ్యకీ, వర్ధనమ్మకీ, పూర్ణకీ ఫలహారాలు పెట్టింది. వారు వొక్కరొక్కరే వచ్చి కూచుని మిఠాయివుండలు వొకరూ, జహాంగీర్లు వొకరూ, చిదుపుతున్నారు. సరిగా పూర్ణ పూరీ విరిచీ సమయంలో ఇంటి యజమానుడు చక్కావచ్చాడు. అతన్ని చూసి అంతా తెల్లపోయారు. వెంటనే సీతారామయ్య "రండి బాబుగారూ; పిన్నిగారూ, బాబుగారికికూడా వడ్డించండి తొరగాను" అన్నాడు. అతనలా అంటూ వుండగానే వర్ధనమ్మ పీట తెచ్చి సీతారామయ్యదగ్గిర వేసింది. "మీరు కానిస్తూ వుండండి" అని వెళ్లి యజమానుడు చేతులూ కాళ్లూ కడుక్కొని వచ్చాటప్పటికి యజమానురాలు అతనికూడా వడ్డించింది. అతను పెద్దవాడు కనక యెదట కూచుని ఫలహారం చెయ్యడానికి పూర్ణ కొంచెం సందేహించింది; గాని వర్ధనమ్మా, యజమానురాలూ తప్పులేదని బలవంతం చేసి కూచో పెట్టారు. "మావర్ధని యెలాంటిదో నువ్వూ అలాంటిదానవే. బిడియం యెందు కమ్మా? కూచో కూచో. నలుగురమూ కూచుని ముచ్చటగా ఫలహారం చెయ్యవచ్చు ననే ఇవాళ అడావుడిగా యింటికి వచ్చా" నని యజమానుడు కూడా చెప్పీదాకా పూర్ణ పూరీ ముట్టుకో లేదు. తరవాత అంతా ఫలహారం ప్రారంభించారు; గాని వొకళ్లూ మాట్లాడలేదు. దానిమీద యజమానుడు "ఏం వూరుకున్నా రేం? మీ వేళాకోళాలికీ, సరాగాలికీ నే నడ్డు వచ్చానా యేమి?" టనగా వర్ధనమ్మా, జానకిరామయ్యా వోరకంటితో చూసుకుని లోపల లోపల నవ్వుకున్నారు. పూర్ణ మొగం వంచుకొనే నవ్వుకోగా, సీతారామయ్య "బాబుగారు బాగా కనిపెట్టారు. వేళాకోళాలు లేకపోయినా మీరు వుండడంచేత బంతి చాలా నిండుగా వుంది. అన్నీ దగ్గిర పెట్టేసి పిన్నిగారు కూడా కూచుంటే బాగుండు" నన్నాడు. "మనం అవతలికి వెళ్లాక వదినా, అత్తగారూ చాటుగా కూచుని యెలాగా మళ్లీ తింటారు" అని పూర్ణ అనే టప్పటికి వర్ధనమ్మ అందుకుంది. దానిమీద జానకిరామయ్య అందుకున్నాడు. మొత్తంమీద వారంతా యిలాగ వొకరి తరవాత వొక గందుకోబట్టి కాని లేకపోతే యజమానురాలు కాళీ అయిన పళ్లేలు వెంట వెంటనే భర్తీ చెయ్యలేకే పోవును.

ఎలాగైతే యేమి? ఫలహారా లయినాయి. వర్ధనమ్మ తండ్రికీ, సీతారామయ్యకీ, జానకిరామయ్యకీ మళ్లీ తాంబూలా లిచ్చింది. యజమానుడు మళ్లీ కచేరీకి వెళ్లిపోయిన తరవాత వీధిగదిలో కూచుని ఆయువకులూ,

వుయ్యాలామంచంమీద మూచుని ఆయనతులూ జాతే పాలు మొదలు పెట్టారు. యజమానురాలు "రాత్రికి మువ్వంకాయ వండనా, బంగాళాదుంపలు వేయించనా?" అని ఆలోచనలో పడింది.

౫

అయి దయిన తరవాత జానకిరామయ్య "బీచికి వెడదాం లె"మ్మనగా, సీతారామయ్య "సినీమాకి వెడదాం ర"మ్మన్నాడు. బీచిలో వుండే ఆధిక్యాన్నతను అర్ధ్యం చెయ్యగా సినీమాలో వుండే విశేషాలతను జాబితా వేశాడు. తీర్పుకోసం జానకిరామయ్య వర్ధనమ్మనీ, సీతారామయ్య పూర్ణనీ అడగ్గా, వారిద్దరూ యజమానురాలితో ఆలోచించి "సినీమాకే వెడదాం" అన్నారు.

టిక్కట్లు పుచ్చుకునేటప్పుడు సీతారామయ్య "వొరేయి బావా! మన వాళ్ళని కూడా మన దగ్గరే కూచోపెట్టుకుందాం" అనగా "సరే" అని జానకిరామయ్య నాలుగూ పెద్ద టిక్కట్లు తెచ్చాడు. వర్ధనమ్మా, పూర్ణా వరసగా కూచోగా, వర్ధనమ్మవైపున జానకిరామయ్యా,పూర్ణవైపున సీతారామయ్యా కూచున్నారు. ఆవరసలో వారు నలుగురే వున్నారు.

ఫిలిము మొద లయింది. మొదట వొక ఇంగ్లీషు ప్రహసనం చూపించారు. తరవాత "చెల్లతగ్గ పెళ్లి" అనే కథ వచ్చింది.

మొదట నలభై యేళ్ల బ్రాహ్మడు తెర యెక్కాడు. అప్పటి కతనికి మూడు పెళ్లి ళ్లయినాయి. తరవాత మూడో పెళ్లి తాలూకు పదహారేళ్ల పెళ్లాం కొన్నాళ్లు కాపరం చేసి చచ్చిపోయింది. అతని దగ్గిర చాలా డబ్బు వుండడంచేత రోజులు వెళ్లకుండానే మళ్లీ పెళ్లి కుదిరింది. మూడో పెళ్లాం చచ్చిపోయిన పద మూడో నాడు నాలుగో పెళ్లి చేసుకొని అతను మనుగుడుపులికి వెళ్లాడు. దానిమీద సీతారామయ్య "పెళ్లాం చచ్చిపోతే రవ్వంతేనా దుఃఖంయెరగడే. వాడు నల్లరాయా, వుక్కుతునకా?" అనగా జానకిరామయ్య "మళ్లీ పెళ్లాడకపోతే వాడి బతుకెలా గడుస్తుందీ?" అన్నాడు. "ఆసూత్రం స్త్రీలకిమాత్రం చెల్లదూ?"అని సీతారామయ్య టోకాయించిఅడిగాడు; గాని జానకిరామయ్య జవాబు చెప్పలేదు.

ఆపిల్ల కాపరానికి వచ్చింది. అంటే పిల్ల బొద్దుగా వుండడం చూసి రజస్వల కాకుండానే ఆబ్రాహ్మడు పోరి నిషేకం చేసుకుని ఆమెని తన యింటికి తెచ్చుకున్నాడు. చిన్నతనంచేత ఆపిల్ల కాపరం చెయ్యడానికి భయపడగా, అతను యినపపెట్టిలో వున్న డబ్బు చూపించి, "నన్ను సుఖపెడితే యీడబ్బుతో నువ్వు కోరిన నగలు చేయిస్తా" నన్నాడు. నగల కాశపడి ఆపిల్ల చెప్పినట్లే నడుస్తూ "మరి నగలు చేయించండి" అనగా, "నువ్వింకా చిన్నపిల్లవు. రెండేళ్లకి బాగా యెదుగుతావు. ఇప్పుడు నీకు నగలు చేయిస్తే అప్పుడు సరిపోవు. కనక రెండేళ్లు వోపిక పట్ట" మన్నాడు. తరవాత నాలుగైదుమాట్లామె "నేను యెదగవలసినంతా యెదిగాను. కనక నగలు చేయించ" మంది గాని "ఇదిగో" "అదిగో" అని అతను మాయ మాటలు చెప్పి కాలం గడిపేశాడు. చివరి కతను పెట్టిన రెండేళ్ల గడువూ దాటేటప్పటి కాపిల్ల పురుడు వచ్చి నెలపురుట్లో చచ్చిపోయింది. నెల తిరక్కుండానే అతను మళ్లీ పెళ్లాడాడు. ఆసందర్భంలోకూడా భావమరుదు లిద్దరూ కొంచెం వాదం చేసుకున్నారు; గాని వర్ధనమ్మా, పూర్ణా కూడా పైకి యేమీ మాట్లాడలేదు.

ఇలాగ మొత్తాని కతనికి యాభై యేళ్లు వచ్చేటప్పటికి యేడు పెళ్లిళ్లయినాయి. ఏడో పెళ్లి పెళ్లాం యీకాలపు మనిషి. హార్మోనియం వాయించడమూ, గూడకట్టు కట్టడమూ, పక్కపాపిడి తియ్యడమూ, కాఫీ తాగడమూ, సినీమాలకీ నాటకాలకీ వెళ్లడమూ— ఇలాంటి వతని కేమీ సరిపడలేదూ. అయ్యాకి కంగారెత్తింది. అది చూసి వర్ధనమ్మ "రాక్షసుడికి ఇప్పటికి తగినపెళ్లాం వచ్చింది" అనగా, పూర్ణ "మొదణ్ణుంచీ వొక్క విధంగానే రాలిపోయాడు. చివరి కయింది వెధవ పని. దేవుడు లేడూ?" అంది.

సీతారామయ్య మధ్యమధ్య వుద్రేకంతో వాడి బతుకు విమర్శిస్తూ, "వోరే బావా! హిందూకుటుంబంలో పురుషుని నిరంకుశత్వం యెంత దుస్సహంగా వుందో చూశావా ? కర్మకోసం పురుషుడు మళ్లీమళ్లీ పెళ్లాడవచ్చు నన్న ఋషుల వాక్యాలెలా వికటిస్తున్నాయో చూశావా? స్త్రీల విషయంలో యిలాంటి దుష్పరిణామాలకి కారణాలైన నికృష్టసిద్ధాంతాలు ప్రకటించిన మన భారతదేశం పుణ్యభూమా ? పాపభూమా ?" అని యిలాగ తీవ్రంగా ప్రశ్నిస్తూ వచ్చాడు గాని జానకిరామయ్య "తరవాత మాట్లాడుకుందాం" అని జవాబు చెప్పి, "ఈకథలో అతిశయోక్తి వుందా? మన ధర్మాలు చివరి కిలాగ పర్యవసించీ వేనా ?" అని తర్కంలో పడ్డాడు.

తరవాత ఆబ్రాహ్మడు తలదువ్వ మంటే ఆపిల్ల అతని బట్టతలకి ఆముదం రాయడమూ, తమలపాకులు మెత్తగా నూరి పెట్టమంటే పెండలపాకులు నూరి నోట్లో పెట్టడమూ, అన్నం మెత్తగా వండమంటే బిరుసుగా వార్చడమూ, ముద్దపప్పు వండమంటే అప్పడాలూ, వొడియాలూ వేయించి వూరుకోవడమూ, చలిమిడీ, చిమ్మిలీ చెయ్యమంటే సెనగలు వేయించి పొయ్యడమూ, చద్దన్నం తినవద్దంటే వుల్లిపాయల పులుసు వండడమూ, పొత్తుపంచె కూడా తడిపి ఆరవేస్తేగాని పనికి రాదంటే వంటిల్లు దాసీదానిచేత బాగుచేయించడమూ, అమావాస్యనాడు వుప్పుపిండి చెయ్యడం బుద్ధిపూర్వకంగా మానేసి, "అయ్యో! మరిచిపోయా నండీ, ఇంట్లో పిండికూడా లేదూ. దాసీపీనుగు చెప్పినమాట వినడం బొత్తిగా మానేసింది. పున్నం మొదలుకొని పోరుతున్నాను గాని గిద్దెడు బియ్యమేనా విసిరిందికాదు. మళ్లీ అమావాస్యకి తప్పకుండా చేస్తాను. ఈవేళకి—కూడక పోతే మజ్జిగతో మాత్రమే తినండి అన్నం" అనీ—ఈ విధంగా అతన్ని నానాతిప్పలూ పెట్టింది. అది చూసి వర్ధనమ్మా, పూర్ణా కడుపులు ఉబ్బిపోయేలాగ నవ్వేరు. సీతారామయ్య "తగిన పెళ్లాం" అని మెచ్చుకున్నాడు గాని జానకిరామయ్య కిక్కురుమన లేదు.

ఇలాగ వొక్కసంవత్సరం గడిచే టప్పటికి ఆ బ్రాహ్మడే చచ్చిపోయాడు. నెలరోజు లేనా తిరక్కుండా ఆపిల్ల వీరేశలింగంపంతులుగారి ఆనందాశ్రమంలో చేరి రెండో నెలలో చక్కని యువకుణ్ణి పెళ్లాడి తనడబ్బూ, జీవితమూ అతనికి ధారపోసింది.

ఆట అయిపోయింది. ఎవళ్ల యింటికి వాళ్లు వెళ్లిపోయారు. వర్ధనమ్మ మేలుకున్నంతసేపూ ఆమొగుడూ పెళ్లాల గొడవలే చెప్పి జానకిరామయ్యని నవ్వించింది. పూర్ణ వర్ధనమ్మ తల్లిని నవ్వించింది. సీతారామయ్య "వదినకి యీకథ కొంచెం ధైర్యం కలిగించవచ్చు" ననుకున్నాడు.

మర్నాడు జానకిరామయ్య పూర్ణతో "వెళ్లిపోదాం" అనగా వర్ధనమ్మ ప్రయాణం సాగనిచ్చింది కాదు. సీతారామయ్య "వెళ్లిపోతా"ననగా రహస్యంగాపూర్ణా, బహిరంగంగా జానకిరామయ్యా, వర్ధనమ్మా, యజమానురాలూ "వల్లకా" దని ఆపేశారు.

మరి రెండుదినాలైన తరవాత ముగ్గురూ బయలుదేరారు. స్టేషనులో టిక్కెట్లు కొనేటప్పుడు సీతారామయ్య బలవంతం చెయ్యగా, "ఇప్పటికి పూర్ణని తీసుకవెళ్లు. నేను వారంరోజులలో దాన్ని తీసుకవెళ్లడానికి వచ్చి రెండురోజులు తప్పకుండా వుంటా" నని చెబుతూ, జానకిరామయ్య తనకి యేలూరికే టిక్కట్టు పుచ్చుకున్నాడు. అతను పూర్ణనీ, సీతారామయ్యనీ రాజమండ్రీ స్టేషనులో గేటుదాకా సాగనంపి, "మళ్ళీ శని వారం మధ్యాహ్నం బండిమీద తప్పకుండా వస్తా" నన్నాడు. పూర్ణని కొంచెం యెడంగా పిలిచి, "అత్తతో చెప్పి బావని చీవాట్లు పెట్టించు" అని కూడా చెప్పి వెళ్లి బండిలో కూచున్నాడు.

౬

"బావ పిల్లల తండ్రి అవుతాట్ట" అని సీతారామయ్య చెబుతూ వుండగా పూర్ణ వచ్చి చిట్టెమ్మని కౌగిలించుకుంది. మేనత్తా మేనగోడలూ చూసుకుని అప్పటికి రమారమీ ఆరు మాసా లయింది. ఇద్దరికీ కూడా కళ్లు కాయలు కాసిపోయాయి. "ఎన్నాళ్లకి చూ

శానే పూర్ణా" అంటే "ఎన్నాళ్లకి కనపడ్డా వమ్మ అత్తా" అని యిద్దరూ పలకరించుకుని అలా కౌగిలించుకునే వుండి, వెనక్కి వెళ్లి, అక్కడ వొక సోఫా వుంటే దానిమీద కూచున్నారు. తరువాత యిద్దరూ ప్రశ్నల తోటీ, జవాబులతోటీ వొక్కగడియ వుక్కిరిబిక్కిరై పోయారు. "సుందరమ్మతల్లి బతికివుంటే యీపాటికి మా అబ్బాయిగూడా పిల్లలతండ్రి అయివుండు"నని చిట్టెమ్మ చెప్పగా, పూర్ణ తాను విన్న సంగతి చెప్పి, "నీకు తెలుసునా? నిజమే?" అని అడిగింది.



"తాతయ్య మండిపడతాడు. నాయనమ్మ గోల పెడుతుంది. బావా నువ్వూ కూడా, యిక మాట్లాడరు. కన్నెత్తిచూడనైనా చూడరు. అయినా నా నాయన మాటకి నే నడ్డుచెప్పను. లోకంలో జరుగుతూ వున్న సంగతులన్నీ చెప్పి వాడు నన్నువొప్పించాడు. సమర్తాడిన పిల్లనేనా సరే, వితంతువు నేనా సరే, బావ యేపిల్లని పెళ్లాడినా నాకు సంతోషమే. నా కొడుకూ, నా కోడలూ సిరిసంపదలతో పది కాలాలు బతికి నలుగురు బిడ్డల్ని కని పెంచి హాయిగా వుంటే బంధువులు నా యింటికి రాకపోయినా నాకు చింత లేదు" అని చిట్టెమ్మ చెప్పగా పూర్ణ ఆశ్చర్యపడింది.

కొంత సేపటికి అత్తా కోడ ళ్లిద్దరూ గోదావరికి వెళ్లి వచ్చారు. పూర్ణ పైపనులు చేస్తూ వుండగా, "ఏం కూర వండ మంటావే? పులుసు చెయ్యనా, చారు కాచనా? లేకపోతే పుల్లని పెరుగు పొగన మంటావా?" అని

అడుగుతూనే చిట్టెమ్మ క్షణంలో వంట చేసేసింది. సీతారామయ్య షాపునుంచి పదకొండింటి కింటికి వచ్చి పూర్ణ అందివ్వగా వేన్నీళ్లతో స్నానం చేశాడు. తరవాత చిట్టెమ్మ పూర్ణకీ, సీతారామయ్యకీ యొక బంతిని వడ్డించింది. వా రిద్దరూ వేళాకోళా లాడుకుంటూ భోజనాలు మొదలు పెట్టాక చిట్టెమ్మ నట్టివాకట్లోకి వచ్చి "సూర్యనారాయణమూర్తీ, తండ్రీ! నా మేనకోడలి బుద్ధి మళ్లించు. నాకొడుక్కి దాన్ని చేసుకునే అదృష్టం నాకు కలిగించు" అని మొక్కుకుంది.

ఈసమయంలో "బావకి నెయ్యి కావాలిట అత్తా" అని పూర్ణ పిలవగా, "పచ్చడి కూర కావాలిటే అమ్మా" అంటూ సీతారామయ్య పిలిచాడు. చిట్టెమ్మవచ్చిచూడగా కూరకావలసి సీతారామయ్యా, నెయ్యికావలసి పూర్ణా యెదురుచూస్తున్నారు. ఆమె వారిద్దరికీ అవ్వే కాకుండా పులుసులోవున్న వంకాయముక్కలూ, గుమ్మడికాయబద్దలూ, మునక్కాడలూ కూడా వేసి, యెదట కూచుని కబుర్లు మొదలుపెట్టింది.

సీతారామయ్య పెళ్లిగొడవలు వచ్చాయి. "వొసే బావా! మాఅన్నయ్య చెప్పేనట్లు నువ్వు పెద్ద ఆస్తిపరుడవు కదా? అందమైనవాడవుకదా! వితంతువుకాకపోతే మంచిపిల్ల దొరకదుట్రా నీకూ?" అని పూర్ణ అడగ్గా సీతారామయ్య అందుకున్నాడు: "బడాయి చెబుతున్నా ననుకోకు. కన్యకలు కావా లంటే లక్షమంది నాకాళ్లమీద పడేసేవా ళ్లున్నారు. ఇదివరకీ ఈయేణ్ణర్ధంలోనూ పద్ధానుగు సంబంధాలువచ్చాయి. సుందరి పోయిన యేడాది దాకా నాకు పెళ్లిమీద దృష్టి లేకపోయింది. తరవాత వితంతువుని పెళ్లాడాలని తోచింది. వొకనాడు వీరేశలింగంపంతులుగారి దగ్గిరికి వెళ్లగా ఆసంకల్పాన్ని ఆయన దృఢపరిచారు. ఆ కోరిక మనస్సులో పెట్టుకుని ఎన్ని సంబంధాలు వచ్చినా తిప్పేశాను. తిప్పెయ్యడం నువ్వు యెరుగుదువు. నా కిప్పుడు ముప్ఫయే ళ్లున్నాయి. లోకంలో యెంత వెదికినా పన్నిండేళ్ల పిల్లకంటే పెద్దది దొరకదు. పోనీ, సమర్తాడిన పిల్లని పెళ్లాడ

కూడదా అంటే బ్రాహ్మల్లో అలాంటి పిల్లలు దొరకరు. ఎక్కడేనా వొక ళ్లిద్ద రుంటే నచ్చకపోవచ్చును. పన్నెండేళ్ల కన్య దొరకినా నాకూ ఆపిల్లకీ పద్దెనిమిదేళ్ల తేడా వుంటుంది. మొగుడూ పెళ్లాల మధ్య పదేళ్లకంటే హెచ్చుతక్కు లుండకూడదు. అంటే నా కిప్పుడిరవై యేళ్లేనా వుండే పిల్ల దొరకితే గాని మాయిద్దరకీ కూడా సుఖం వుండదు. మనస్సులు కలవవు. రుచులే వేరుగా వుంటాయి. ఇప్పుడు బ్రాహ్మణాళ్లలో యిరవై యేళ్ళ పిల్ల కావా లంటే వితంతువులే దిక్కు. మనలో వితంతువుల సంఖ్య అనంతంగా వుంది. వారిలో చాలామంది నిజంగా రత్నాలకంటే గూడా మంచివాళ్లున్నారు. కొందరు వైరాగ్యంతో కాలం గడుపుతూ వున్నా, కొందరు అక్రమమార్గాల్లో ప్రవర్తిస్తూ వున్నా, అగ్నిహోత్రం లాంటివాళ్లు అనేకమంది వున్నారు. వాళ్ళందరూ ప్రేమ అంటే యేమిటో, సంసారసుఖం యెలాంటిదో, జీవితానందం యెంత విలవైనదో, దాంపత్యంలో యెంత పావిత్ర్యం వుందో, ఈజీవితం యెంత గొప్ప దుర్లభపదార్థమో బాగా తెలిసి, తమ కా అదృష్టం లేనందుకూ, తమకు అట్టి నికృష్టదశ సంభవించినందుకూ విచారిస్తూ, ఉత్తరజన్మలోనైనా చాలాకాలం అనుకూలభర్తలతో సుఖపడా లని తపస్సు చేస్తూ కాలం గడిపేవాళ్ళు వేలూ, లక్షలూ వుంటారు. అలాంటివాళ్ళలో సాహసం వున్న రత్నాన్ని యేరి పెళ్లాడితే ఎంత సుఖమో, ఎంత పరమార్థమో, ఎంత పుణ్యమో ఆలోచించూ. ఇదీగాక, మన బ్రాహ్మల్లో ప్రేమించడం యెలాగో తెలుసుకోడానికి వితంతువులకు మాత్రమే అవకాశా లున్నాయి. కన్యకలకు ప్రేమ యిలాంటి దని తెలవని స్థితిలోనే పెళ్లి అయిపోతుంది. తరవాత ఆపిల్లకీ ఆపిల్లవాడికీ కలిస్తే కలుస్తుంది, లేకపోతే లేదు. వితంతువివాహంవల్ల ఈచిక్కులు కలగవు. వయస్సు సంబంధించిన హెచ్చుతక్కువల బాధ వుండదు. నేను వితంతువునే పెళ్లాడాలని నిశ్చయించుకోడానికి కారణా లివి. నాపుణ్యంవల్ల చాలా కష్టంమీద నైనా మాఅమ్మ యిందు కంగీకరించింది. నలుగు రైదుగురు వితంతువులు నాదృష్టిలో వున్నారు. వొకామె యింకొకణ్ణి వరించింది, వొకతె అంగీకరించేలాగ కనపడింది కాని వాకబు చెయ్యగా చాలా పెంకిమనిషి అని తెలిసింది. వొకామెని మద్రాసులో చూశాను; ఆమె తల్లిదండ్రులతో మాట్లాడాలనే మొన్న కాకినాడ వచ్చాను; గాని పిల్ల సంగతి చూడగా ఆమె మొగుడులాగా, నేను పెళ్లాంలాగా మసులుకోవలసి వుంటుందని తోచింది. ఇక బందరులో వొకామె వుంది. అన్నీ బాగానే వున్నాయి; గాని తల్లిదండ్రులకేకసంతానం. అల్లుణ్ణి యిల్లరికం తెచ్చుకోవాలని వారి సంకల్పమట. అది నాకు సరిపడదు. అవరతు వారు వొదులుకుంటే ఆమెను పెళ్లాడవచ్చును. మొన్న మా అమ్మకూడా చూసిం దామెని" అని సీతారామయ్య చెప్పగా, "పిల్ల అన్నివిధాలా బాగుందే. ఇల్లరికం చిక్కు లేకపోతే మాఅబ్బాయికి చేసుకుంటూ నని నే ననగా 'యింటికి వెళ్లి ఆలోచించి రాస్తా' నని పిల్ల తండ్రి చెప్పాడు" అని చిట్టెమ్మ చెప్పింది. తరవాత మాట్లాడవలసిన వంతు పూర్ణకి వచ్చింది; గాని ఆమె మాట్లాడలేకపోయింది. అది వుత్సాహమో, ఆందోళనమో, తహతహో, బెంగో, బిడియమో, ఉద్రేకమో, మ్రాన్పాటో యేదో ఆమెని స్తబ్ధురాలుగా చేసేసింది. సీతారామయ్యా, చిట్టెమ్మాకూడా అది కనిపెట్టి కళ్లతో యేమిటో చెప్పుకున్నారు; గాని ఆసంగతి పూర్ణ యెరగదు.

౭

భోజనా లయినాయి. తాపితాపంచె విడిచి, గ్లాస్గోమల్లు కట్టి, సిల్కుషర్టు తొడుక్కొని, తాంబూలం వేసుకోడానికి సీతారామయ్య పాందాను తీసికొని రాగా, పూర్ణ "నేను చిలకలు చుట్టి యిస్తాను. తేరా బావా" అంటూ ఆపాందాను పుచ్చుకుంది. తరవాత యిద్దరూ పడమటింటోకి వెళ్లి చిట్టెమ్మ భోజనం చేస్తూవుండగా ఆమె యెదురుగా కూచున్నారు. పూర్ణ పాందాను తెరిచి తమలపాకులు తియ్యగా చిట్టెమ్మ కబుర్లందుకుంది—

"ఇక మాయిల్లు తొక్కి చూడవు కాదూ కోడలా?"

"చూశావుటే బావా, మీయమ్మ యిక రావద్దం టోందీ?"

"ఉన్నమాటంటే వులుకెక్కువట."

"ఇప్పుడేం వచ్చిందీ?"

"అంతానూ—"

"ఏం?"

"నేను వితంతువివాహం చేసుకుంటే నిజంగా నువ్వు మాయింటికి వస్తావా?"

"రానని నిశ్చయం యేమిటీ?"

"బావ చెప్పిన మాటలు జ్ఞాపకం వున్నాయా?"

"చివరికి మా వాళ్లుగూడా అంగీకరిస్తారేమో!"

"లేకపోతే రావు కదూ?"

"ఆమాట అనకు"

"ఏమన మంటావు కోడలా, మరీ?"

"మేంవచ్చినా రాకపోయినా పిలవడం మీవంతు."

"మేము పిలిస్తే? తరవాతా?—"

"రావడం మా వంతు."

"అంటే యిందులో వొకటి జరిగితే రెండోది కూడా జరుగుతుం దన్నమాట."

"మూడు వంతులు—"

"రాకపోడాని కా కాస్త సందూ చాలు."

"ఇంతెందుకూ? నేనిక్కడ యింకా వారంరోజు లుంటానుకదా! ఈలోపుగా నువ్వు పెళ్లాడు: నేను వుంటానో వుండనో చూద్దువుగానీ."

"నిజంగా?"

"తరవాత యేం జరిగినా ఆ మహోత్సవంలో నా వంతు అనుభవించే—"

"సెబాస్. అదీ మాట. కోడలా! కోట్లు వెలగలమాట చెప్పావు. నువ్వు ఆమాత్రం ధైర్యం చెబితే మా కింక లేని దేమిటే? ఇక నీదే లోటురా నాయనా."

"అవునా వొదినా?"

"ముమ్మాటికీనీ."

"ఆమాటమీద వుండు. తాంబూలం యేదీ?"

సీతారామయ్య చెయ్యి చాపగా మందహాసం చేస్తూ పూర్ణ వక్కలూ, చిలకలూ అతని కందించింది. సీతారామయ్య తల్లి కేసి చూసి చిరునవ్వు నవ్వుతూ తాంబూలం వేసుకున్నాడు.

"నువ్వుకూడా వేసుకోవే అమ్మ. ఇక్కడెవ్వరూ చూడరు లే."

"ఔనే వదినా! మా డాకులు వేసుకో."

"అదివఅకు లేదు గాని వదిన కాపరానికి వచ్చాక చాలా మాట్లు బలవంతం చేసింది. తాతయ్య పూళ్లోలే నప్పుడెప్పుడేనా మా డాకులు—అదేనా నాయనమ్మకి తెలవకుండానూ—మా అమ్మ వేసుకోమనే అంటూ వుంటుంది. నాకే సందేహం. వొకమాటు అన్నయ్య చూశాడు. ఏ మంటాడో బాబూ అని భయపడ్డాను గాని చూసీచూడ నట్లు మాట్లాడకుండా చక్కాపోయాడు. పాపం, వాళ్ల నాన్న నెల్లూరులో వుద్యోగం చేసి నప్పుడు వదిన చూసిందిట. అక్కడ వితంతువులు కూడా మంచికుటుంబాల్లో తరుచు తాంబూలం వేసుకోవడం వుందిటే అత్తా!"

"ఔనుట నువ్వుకూడా వేసుకో అమ్మా!"

"నాకు నువ్విచ్చావు కనక నీకు నే నిస్తాను తాంబూలం. ఏం వదినా?

"ఇవ్వరా నాయనా!"

వెంటనే సీతారామయ్య తమలపాకులు తుడిచి, సున్నం రాసి, చిలకలు చుట్టి అందించాడు. పూర్ణ అవి పుచ్చుకుంది; గాని "చూశావుటే అత్తా, బావ చుట్టిన



చిలకలు యెంత వంకరటింకరగా వున్నాయోనూ!" అని శోకాలశం చేసింది.

"చిలకలు చుట్టి యివ్వడం ఆడది చెయ్యవలసిన పని కాదుటే వెర్రిదానా? నీమీద వుండే ఆదరంచేత చుట్టి యిచ్చాడు; గాని బావ కేం చేత నౌనమ్మా!" అని చిట్టెమ్మ చెప్పింది.

ఇలాగ అరగంట అయేటప్పటికి చిట్టెమ్మ లేచింది. "ఇక పావుకి వెడతానే వదినా" అంటూ సీతారామయ్య లేచాడు. "ఎనిమిదైతే గాని రావు కామోసు" అని పూర్ణ అనగా, చిట్టెమ్మ "ఇవాళ తొరగా రారా నాయనా" అంది. "మామూలుగా యెనిమిదింటికే వస్తాను. నువ్వు ఇక్కడ వున్నన్ని రోజులూ ఆరింటికే వస్తానులే" అని బసులు చెప్పి సీతారామయ్య వాకట్లోకి వెళ్లాడు. చిట్టెమ్మ "రాత్రి శేమీ కూరలు లే"వంటూ అతని దగ్గిరికి వెళ్లి, "అయిదుగంటలికి మల్లి మొగ్గలు పొట్లం కట్టి పంపు" అని రహస్యంగా చెప్పింది. సీతారామయ్య కళ్లతో జవాబు చెప్పి వెళ్లి పోయాడు.

౭

వొంటిగంటకి చిట్టెమ్మకి పని ముగిసింది. మేనత్తా, మేనకోడలూ వీధితలుపులు బిగించి వచ్చి వాకట్లో వున్న సోఫామీద కూచున్నారు. విశాలమైన మండువాలో నుంచి తీక్ష్ణమైన చైత్రమాసపు యెండ కడపరాళ్లతో చప్టా చేసిన వాకట్లో పడుతోంది. అది చూసి జ్ఞాపకం రాగా చిట్టెమ్మ "విజయదశమికి వోమాటు యెండవేశాను సుందరమ్మ చీరలు. మళ్లీ వోమాటు యివాళ యెండవేద్దామా?" అనగా పూర్ణ "అలా చేస్తేనే మంచిదీ" అంది. తరవాత యిద్దరూ లేచి చప్టామీద జపాను తుంగచాపలు పరిచి, బీరువాలో వున్న చీర లన్నీ తెచ్చి, దులిపి, చాపలమీద పెట్టారు. తరవాత చిట్టెమ్మ బీరువా దులుపుతూ వుండగా రైక లన్నీ పూర్ణ వొక్కర్తే పరిచింది. చీరలు రమారమీ యిరవైదాకా వున్నాయి, వుప్పాడ వైతే నేమి, బనారసు వైతే నేమి, బెంగుళూరు వైతే నేమి, మధుర వైతే నేమి, పునహా వైతే నేమి, పుల్లంపేట వైతే నేమి, జపాను వైతే నేమి—అన్నీ జరీ ముద్దలు. వొక్క—చీర కూడా నలిగిపోకుండా అప్పుడు షాపులో నుంచి తెచ్చిన ట్లున్నాయి. రైకలు కూడా అన్ని రకాలూ, వాట్లకి తగిన విలవగలవి, ఉన్నాయి. "అన్నట్లు మరిచిపోయా" నంటూ లేచి మళ్లీ యింట్లోకి వెళ్లి చిట్టెమ్మ రెండు డజన్ల పట్టు చేతిరుమాళ్ళు తెచ్చి, "ఇవి దానికోసం యిక ఆరు మాసాలికి పోతుం దనగా కొన్నాడు మా నాయన. ఇందులో యే నాలుగైదో తప్ప తతిమ్మావి మడతే విప్పలేదు సుందరమ్మ" అని చాపమీద వేసింది.

మళ్లీ యిద్దరూ సోఫామీద కూచున్నారు. చిట్టెమ్మ సుందరమ్మకి పుట్టింటివారు పెట్టిన వేవో, తాము కొన్న వేవో వివరించి చెప్పగా, పూర్ణ "అన్నీ మూడువేల ఖరీదు వుంటాయి. ఏమే అత్తా?" అని అడిగింది. "వీట్లలో పాతికరూపాయలకి తక్కువ విలవ అయినదీ, రెండువందల యాభైయింటికి ఎక్కు—వైనదీ లేదు. పాతికవందలకి తక్కువ ధర వుండదు" అని చిట్టెమ్మ చెప్పగా, పూర్ణ గుండెలమీద చెయ్యి వేసుకుని, "అమ్మబాబోయి! చీరలే యింతైతే నగ లెంత వుంటాయో? కాని పాపం సుందరక్కయ్యకి యోగం లేకపోయింది" అని విచారించింది. దానిమీద "నగలు కూడా వోమాటు చూద్దాం రావే అమ్మా" అని చిట్టెమ్మ ముందు దారి తియ్యగా, "పద" అంటూ పూర్ణ వెనక్కాలే వెళ్లింది.

"ఆయినపెట్టె బావది. ఇది సుందరమ్మది. దాని నగలకోసమూ, వెండిసామానుకోసమూ ఇది పుట్టింటివారే యిచ్చారు. అది పోయాక వారు పెట్టిననగలూ, చీరలూ, ఈపెట్టే, ఆబీరువా, ఆమంచమూ, తతిమ్మా సామానూ పట్టించుకుని వెళ్ళవలసిం దని యెంతమంది చేత యెన్నిమాట్లు ఎన్నివిధాల కబు రంపినా 'మాఅమ్మా యితో పాటు ఆవస్తువులు మీ కిచ్చేశాం. అవి మావి కావు; మేం చేసుకున్న పాపంవల్ల మా అమ్మాయి మమ్మల్ని విడిచి వెళ్లి పోయింది; గాని మా అల్లు డున్నాడు. ఆవస్తువు లన్నీ అతనికి చెందవలసినవే.

అతను మళ్లీ యింకో పిల్లని పెళ్లాడి ఆపిల్ల ఆవస్తువులు వాడుకుంటే ఆమెని మాసుందరమ్మ అనే భావించుకుంటాం' అని మళ్లీ కబురంపారు" అని చెప్పి పెట్టి తెరిచి, వొక్కొక్క వస్తువే పైకితీసి చాపలో పెట్టింది. అందుకు "చాపమీదవద్దు. వుండవే అత్తా" అని చెబుతూ పూర్ణ లేచి సీతారామయ్య తువ్వాలు తెచ్చి పరిచింది.

వస్తువు లన్నీ చూశాటప్పటికి యిద్దరికీ కూడా కళ్లు చెదిరిపోయాయి. పచ్చని బంగారంమీద యెర్రనివీ, తెల్లనివీ రాళ్లూ, ఆణిముత్యాలూ ధగధగ మెరిసిపోతున్నాయి. "ఇవి దుద్దులు. పద్ధానుగు రాళ్లూ పద్ధానుగు వందలకి కొన్నాడు నాయన. ఈవొడ్డాణానికి మజూరీ ప్రత్యేకం రెండువంద లయింది. ఈవంకీల రాళ్లు యెనిమిదివందలకి కొన్నాడు. జడ చూశావా, యెంత బాగాచేశాడో పనివాడూ! కాసుకి అయిదుకాసుల రకం కూడా మోటని సుందరమ్మ పదికాసుల రకం చేయించుకుంది పోరీ కట్టకాసుల పేరు. పాము మీసంలాగ యెంత నాజూకుగా వుందో చూశావా?" అంటూ యిలాగ చిట్టెమ్మ వాట్లని వివరించి చెప్పింది. పూర్ణ "ఎంత బాగుందో", "ఎంత మెరసిపోతోందో", "ఎంత చక్కగా వుందో", "ఔను", "మరే", "దేవుడు చూడలేకపోయాడు", "అంతే", "బతికి వున్నంతకాలమూ దివ్యభోగం అనుభవించింది" అని యిలాగ సమాధానాలు చెబుతూ, వొక్కొక్క వస్తువే తీసి కళ్ల కద్దుకుని, "నన్నిలా మోడుగా చేసెయ్యకపోతే నా ఆయు వంతా సుందరక్కయ్యకి పొయ్యగూడదూ ఈశ్వరుడూ" అంది. చిట్టెమ్మ తరవాత కంచమూ, గిన్నెలూ, సాసర్లూ, కోపాలూ, స్పూనులూ, పన్నీరుచెంబూ, గంధపుగిన్నీ, పళ్లెమూ వగైరా వెండిసామాను కూడా చూపించి, "యివి రెండుమళ్లు వుంటాయి" అంది. వాట్లని చూసి కూడా పూర్ణ చాలా ఆనందించి, "అక్కయ్యకి యోగం లేకపోయింది" అని మళ్లీ అంది. తరవాత వొక్కొక్క వస్తువే పూర్ణ అందించగా చిట్టెమ్మ పెట్టిలో పెట్టి, ఒక్క గడియమాత్రం వేసింది. "తాళం వెయ్యవా" అంటే "ఆనక వేస్తానులే" అంది.

తరవాత యిద్దరూ ఫోనోగ్రాఫుదగ్గిరికి వెళ్లారు. చిట్టెమ్మ ప్లేట్లు పైకి తియ్యగా పూర్ణ తన కిష్టమైనవి యేరి పాడించింది. ఇలా వొకఅరగంట గడిచాక ఫోటోల దగ్గిరికి వెళ్లారు. చిట్టెమ్మ తానూ భర్తా వున్న పటమూ, తన ఆడపడుచుపటమూ, తాను ఒక్కర్తీ ఉన్న పటమూ, తను లక్షవర్తివ్రతం చేసుకునే టప్పుడు తీయించిన పటమూ—ఇలాంటివన్నీ ముందు చూపించి తరవాత కొడుకూకోడళ్ల పటాల దగ్గిరికి తీసుకువెళ్లింది. వొక పటంలో సీతారామయ్య కుర్చీమీద కూచోగా సుందరమ్మ కుర్చీపట్టుకుని నుంచునివుంది. ఇంకోదాన్లో సుందరమ్మ కూచునీ, సీతారామయ్య నుంచునీ వున్నారు. వొకదాన్లో సుందరమ్మ యీజీచెయిరుమీద కూచుని వుండగా సీతారామయ్య కింద కూచుని వున్నాడు. వొకదాన్లో ఇద్దరూ నుంచుని వున్నారు. ఇంకోదాన్లో ఇద్దరూ చదరంగం ఆడుతున్నారు. మరోదాన్లో గప్పాలాడుతున్నారు. ఇంకోదాన్లో సీతారామయ్యకి సుందరమ్మ తాంబూలం యిస్తోంది. ఇలాగ వాళ్ల ఫోటోలు అనేకరకాలు వున్నాయి. వాట్ల నన్నింటినీ చూపించిన తరవాత చిట్టెమ్మ "హాల్లో వున్న సుందరమ్మ పెద్దపటం చూశావు కాదా?" అంటే పూర్ణ "చూశా" నంది.

౬

అప్పటికి నాలు గయింది. చీరలమీద యెండ పోయింది. ఆసంగతి చెప్పి పూర్ణ "చీర లిక దాచేద్దాం" అనగా చిట్టెమ్మ ఆమెని దగ్గిరిగా తీసుకుని, "నాబిడ్డా! వొక్క మాట చెబుతాను వినవూ?" అంది.

"వినకేం?"

"వినకే మంటే చెవులతో మాత్రమే కాదు వినడం; అలా చెయ్యాలి."

"ఏమిటో చెప్పు."

"చేస్తా నను."

"నీమాట తీసేస్తానా? అదేమిటో చెప్పు."

"నీకు వీలులేనిమాట చెబుతానా? వింటా నను."

"సరే."

"ఏమీ లేదే నాకూనా! నావి పాడుకళ్లు కాక పోతే నా కిలాంటి యోగం పట్టదు. దిక్కుమాలింది, ఏమీ లేనిదే మానాయన తండ్రికీ, మీనాయనకీ మాట పట్టింపులు వచ్చాయి. ఆపట్టింపులు రెండేళ్లు వుండి పోయాయి. ఆరెండేళ్లూ రాజమహేంద్రవరంకాకి యే లూగులోనూ, యేలూరుకాకి రాజమంహేంద్రవరం లోనూ వాలలేదు. ఆసమయంలోనే నీకు మీ నాన్న పైసమ్మంధం కుదిర్చాడు. ఆముహూర్తానికే మానాయన పెళ్లి చెయ్యాలని మావారు సుందరమ్మని కుదిర్చారు. ఏలూరులోనూ, బెజవాడలోనూ వొకటే లగ్నంలో మీపెళ్లిళ్లు అయిపోయాయి. తరవాత సుందరమ్మ అర్ధాయుష్యపు చావైనా మొన్నటిదాకా అనుభవించింది. కాని, కసలే లేకపోయిందే నాతల్లీ. ఎనిమిదో యేట పెళ్లి, పదకొండో యేట గంగాప్రవేశమానూ. రామ రామా, గుండెలు చెరువై పోతున్నాయి. పరికిణీలమీదే గాని కోకలమీద నిన్ను చూడడానికి యోగం లేక పోయింది. సుందరి చక్కదనం నీచక్కదనంలో యేమూలకమ్మా? కాని అంతా అడివిలో కాచిన వెన్నెలలాగ అయిపోయింది. అయినా ముసలిదాన్నయిపోతున్నాను. ఇంకెన్నాళ్లో బతకను. బతకాలని కూడా లేదు. నా తండ్రికి పెళ్లయి వొక్క బిడ్డ పుడితే చాలు. తరవాత సంతోషంతో వెళ్లిపోతాను. వైధవరికం వచ్చినా నా కన్ని ముచ్చటలూ తీరాయి. రెండుమాత్రం తరవాయి. మొదటిది వొక్క కూతు రేనా లేకపోవడం. రెండోది నువ్విలా అయిపోవడం......అమ్మా! చెప్పవచ్చిం దేమీ లేదూ. వీధి తలుపులు వేసే వున్నాయి. ఇక యీవేళకి తియ్యను. బ్రహ్మాభేద్యం. వొక్కమాటు—వొక్క క్షణం వాట్లలో యిష్టం వచ్చిన చీరా, రైకా ధరించి, నగలు పెట్టుకుని, యీపాడుకళ్ళకి— యీ దరిద్రపు కళ్ళకి—దించుకుపోవలసిన యీకళ్ళకి వెలుగు చూపించవూ తల్లీ? మా అమ్మవు కావూ? లే అమ్మా వొక్క క్షణం అలా వుంటే చాలు. తరవాత—తరవాతా— నా చిట్టి తల్లివి కాదూ? నాబంగారు కొండవు కాదూ?" అంటూ కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుంటూ అడిగింది. దాని మీద పూర్ణకి యేడుపు వచ్చింది. ఆదుఃఖం వుచ్ఛ్వొత్తుకొని రావడంచేత మాట వచ్చింది కాదు. అది గ్రహించి చిట్టెమ్మ ఆమెని పొదివి పట్టుకుని, "మాఅమ్మా! ఏడవకు నేను కటికికేసుకుని. కానైతే యిది మంచి కోరిక కాదు; కాని నిన్ను దుఃఖపెట్టాలని కోరలేదు. నువ్వు పుణ్యస్త్రీవేషంలో వుండగా వొక్కమాటు చూస్తే యిక నాకు కూతుళ్ళు లేని బెంగ వుండదు. నువ్వు నా కోడలివే అని ఆనందిస్తాను. లే తల్లీ! లే మా అమ్మ నువ్వు ఆగదిలోనే వుందువు గాని, యివతలికి రానే వద్దూ. మాఅమ్మవు కావూ?" అని వోదార్చింది.

తరవాత పూర్ణ దుఃఖం కొంచెం తగ్గిందని గ్రహించి చిట్టెమ్మ సందిట పట్టుకుని లేవతియ్యగా, ఆమె అడ్డు చెప్పకుండా లేచి నుంచుంది. గదిలోకి తీసుకు వెళ్లగా మాట్లాడకుండా వెళ్ళింది. దానిమీద, "నాతల్లే! నాఅమ్మే! మేనత్తనైనందుకు మాట తీసెయ్యకుండా—ఇక్కడ కూచో తల్లీ నువ్వు" అంటూ ఆమెని నిలువుటద్దం యెదట కూచోపెట్టి, అగరునూనీ, దువ్వెన్నా తెచ్చింది. వాట్లని చూసి పూర్ణ "తల గూడా దువ్వుతావా అత్తా?" అనగా చిట్టెమ్మ "నాత ల్లివి కాదూ? ఇక దేనికీ అడ్డు చెప్పకమ్మా నువ్వు" అంది. అప్పుడు పూర్ణ మళ్లీ కళ్ళమ్మట నీళ్ళు తెచ్చుకుని చిట్టెమ్మ వొడిలో చేరబడి, "అత్తా! నువ్వేం చేసినా సరే. నన్ను బావకిమాత్రం చూపించకు" అంది. "నీకిష్టం లేకపోతే ఆలాగే లే అమ్మా" అంటూ చిట్టెమ్మ ఆమె తలకి నూని రాసింది.

వొక్క క్షణంలో నాగరం పెట్టి వాలుజడ వెయ్యడం అయిపోయింది. తరవాత నీళ్లు తెచ్చిపూర్ణని సబ్బుతో మొగం కడుక్కోమని సీతారామయ్య కండువాతో తుడిచింది.

"వాట్లలో నీయిష్టం వచ్చిన చీరా, రవికా తీసుకో తల్లీ!"

"నీయిష్టం"

"నాయిష్టం కాదు నీయిష్టం. వాట్లలో అన్ని రంగులూ, అన్నిరకాలూ వున్నాయి. తీసుకో అమ్మా!"

"నీముచ్చటకోసం నేను ఈవేషానికి వొప్పుకున్నాను. నీకళ్ళకి ఏవి బాగుంటే అవి తే."

"అలా అయితే నాకళ్ల కివి నచ్చాయి."

ఇలా చెబుతూ చిట్టెమ్మ జరీ పువ్వులు గల వూదా బనారసు చీరా, జరీచార లున్న ఆకుపచ్చని దక్షిణాది రవికా తీసి చేతి కివ్వగా, పూర్ణ అందుకుని, "సరిగా నాకు మనసైనవి తీశావు. నాకు కట్టుకునే యోగం లేకపోయినా వూదాచీర అంటే యిష్టం. అంచేత పోరి మాఅన్నయ్యచేత మావదినికి ఇలాంటిచీరే కొనిపించాను. నాముద్దు తీర్చడం కోసం మావదిన మాయింటో వున్న ప్రతీ పండుక్కీ 'ఏచీర కట్టుకోమంటా' వని నన్నడగడమూ, నేను 'వూదాచీర' అని చెప్పగానే, పాపం,మారుచెప్పకుండా—సంతోషిస్తూనే ఆచీర కట్టుకోవడమూ జరుగుతూ వుంటుంది. నువ్వు సరిగా నా రుచి కనిపెట్టావు" అని చెబుతూ వాట్లని ధరించింది.

తరవాత చిట్టెమ్మ పూర్ణని సుందరమ్మ యినపపెట్టిదగ్గిరికి తీసుకు వెళ్ళి వొక్కొక్కటే పుదుచ్చేరి నానూ, గజ్జెల పట్టెడా, పుస్తెల నానూ, కట్టకాసుల పేరూ, చంద్రహారమూ మెడలో వేసింది. చేతులికి రెండుమూడు జతలబంగారుగాజులూ, నాగపురివంకీలూ తొడిగి యెడమచేతి అనామికకు సుందరమ్మ రవ్వల వుంగరం పెట్టింది. అది పూర్ణకి సరిగా సరిపోగా, "మా అమ్మే, మాతల్లే, ఇది నీకోసం చేయించినట్లే సరిపోయిం" దని చిట్టెమ్మ చెప్పగా పూర్ణ ఆవుంగరాన్ని చూసి మందహాసం చేసింది. తరవాత ఆవిడ చెవులికి కమలాలూ, ముక్కులికి ముక్కుపుడకలూ పెట్టి, చంపసరాలు తగిలించింది. కాలివేళ్ల కి మట్టెలూ, కాళ్ళకి పాంజేబు గొలుసులూ పెట్టింది. నడుముకి గజ్జెల వొడ్డాణం పెట్టి, జడకి బంగారపు జడ కట్టింది. కళ్ళకి సన్నంగా కాటుకా, నుదుట సెనగబద్దంత చుక్కాకూడా పెట్టి, "ఇది చేత్తో పుచ్చుకో" అని పట్టుచేతిరుమాలిచ్చింది.

చిట్టెమ్మ యిలా అలంకరిస్తూ వుండగా పూర్ణ "యెవ రేనా వస్తా రేమో" అని పదిమాట్లంది. దానికి చిట్టెమ్మ "వీధి తలుపులు వేసే వున్నాయి కదూ? వొక్క వేళ తలుపులు తియ్యవలిసివచ్చినా వచ్చిన పనేమిట్లో హాల్లోనే అడిగి అక్కణ్ణించే పంపేసి మళ్లీ తలుపులు బిగించేస్తాను" అని పదిమాట్లూ జవాబు చెప్పింది.

అలంకారం పూర్తి అయిన తరవాత చిట్టెమ్మ పూర్ణని నసారాల్లోకి తీసుకు వెళ్ళి చూడగా పూర్ణ అప్సరసలా వుంది. "నాతల్లి నాకోరిక తీర్చింది. నా



మేనగోడలు కనక నామాట తీసెయ్యకుండా—నా కూనా! లక్ష్మీ, సరస్వతీ, పార్వతీ కూడా అందానికి నీకు సాటిరారు. తల్లీ, ఇంత సౌందర్యం యిచ్చిన దేవుడు నిన్ను వితంతువుగా చేస్తాడా? నీకు అలాంటి గతి మనుష్యులు కల్పించింది కాని దేవు డేర్పరిచినది కాదు. ఇప్పుడు నిన్ను చూస్తే నీకు మొగుడు లేడని యెవ రైనా గలరూ? నిండుచంద్రుడులాంటి నీముఖంమీద అలాంటి అయిదువుతనం మెరిసిపోతూ వుండగా నీకు వైధవ్యం అంటే యేమిటి నామాటా! ఈ చీరా,ఈరవికా, ఈనగలూ సుందరమ్మకి కంటే నీకు బాగున్నాయి. ఏదీ? వొక్క

మాటు యిలా చూడు కోడలా? నా కళ్లకి నే డెంత వెలుగు ఐచ్చిందే? అమ్మా! వొక్క-త్తుణం యిలాగే వుండు. నువ్వెవ్వరికీ కనపడవు. దేవతలు కూడా నిన్నిప్పుడు చూడలేరు. ఇంకొక్క- లో టుంది. ఎవరి నేనా బజారుకి పంపి మల్లి—"

చిట్టెమ్మ యిలా చెబుతూ వుండే సమయంలో "అమ్మా" అని సీతారామయ్య తలుపు తట్టాడు. దాని మీద "బాబోయి బావ ఐచ్చాడు. తలుపు తియ్యకే అత్తా" అంటూ పూర్ణ కౌగిలించుకోగా, చిట్టెమ్మ "బావకి తలుపులు తియ్యకపోతే యెలాగ తల్లీ? నీ కిష్టం లేకపోతేయీగదిలోకి రానివ్వను లే.భయపడకు"అని వోదార్చింది కాని పూర్ణకి నమ్మకం కలగలేదు. "వొద్దే అత్తా తలుపు తియ్యకే.బావ యీగదిలోకి తప్పకుండా వస్తాడే. నే నిలా వుండగా చూస్తే వెక్కిరిస్తాడే. నామాట వినవూ?" అని ఆమె మళ్లీ చెప్పగా, చిట్టెమ్మ "భయం లే దమ్మా! నామాట నమ్మ. బావకి నిన్ను కనపడనివ్వను లే. వొకవేళ బావ నిన్ను చూస్తే మాత్రం నీ అందాన్ని చూసీ, ఆపాడువేషం తీసేసి నువ్వు ఈముంగళవేషం వేసుకున్నందుకూ బ్రహ్మానందపడతాడు; గాని వొక వితంతువుని పెళ్లాడి ఆమె కిలాంటి వేషం వేయించాలని ముచ్చటపడుతూ వున్నవాడు నిన్నెక్కిరిపిస్తాడా? భయపడకమ్మా! నీకేమీ ఫరవా లేదు" అంటూ ధైర్యం చెప్పి, తలుపులు తీసి, సీతారామయ్య యింట్లోకి వచ్చాక మళ్లీ వేసేసింది.

"వదిన యేదే?"

"ఇంట్లో వుంది నాయనా!"

"ఏం చేస్తోందీ?"

"ఏమీ లేదూ."

"ఈచీర లన్నీ యిక్కడ వున్నా యేం?"

"ఆరవేశానురా"

"ఇంకా తీశావుకాదేం?"

"చెయ్యి వూరుకుంది కాదు."

"ఏం చేస్తున్నా వేమిటి?"

"వొక పనేమిటే? ఆపొట్లం యేమిటోయి?"

"మల్లెపువ్వులూ, దండలూనూ."

"ఇలా తే. ఎందుకు తెచ్చావూ?"

"వేసుకోడానికి; అలా అడిగా వేమే అమ్మా?"

"నా కిప్పుడు మల్లిపువ్వుల పని వచ్చింది. నువ్వు చెప్పినట్లు తెచ్చావు."

"ఆ పనేమిటే అమ్మా?"

"రేపు చెబుతాను లే."

తరవాత తల్లి, కొడుకూ వొక్క- క్షణం కళ్లతో మాట్లాడుకున్నారు. అప్పుడు చిట్టెమ్మ "ఇంట్లోకి రాకు 'రా నాయనా" అంటూ గదిలోకి వెళ్లి లోపల గడియ వేసింది.

"అమ్మయ్యా; బావ లోపలికి వస్తా డేమో నని నాగుండె బేజారై పోయింది."

"నేను వద్దంటూంటే వస్తాడా అమ్మా అలాగా? నాకొడుకు అంత మోటవా డనుకున్నావా? నాకొడుకని నేను మెచ్చుకోవడం కాదు. నా కొడుకులాంటివాడు పృథివిమీద వున్నాడా? మీ నాన్నకి పనికి వచ్చాడు కాదు గాని అలాంటి పెళ్లికొడుకు కోట్లు కట్నం యిచ్చినా దొరుకుతాడా? వాడు మొన్నటి దాకా మీతోపాటు ఏలూరులో మీయింట్లోనే పెరిగాడు కనక వాడిమనస్సు యెంత మంచిదో నీకు తెలిసే వుంటుంది."

చిట్టెమ్మ యిలా చెప్పి పొట్లం విప్పి నాలుగైదు మొగ్గలు పూర్ణ తలలో పెట్టి సోఫామీద కూచుని ఆమెని దగ్గిరగా కూచోపెట్టుకుంది.

"బావ వొక్క-డూ వున్నాడే పాపం వాకట్లోనూ!"

"నూతిదగ్గిరికి వెళ్లాడు కాళ్లు కడుక్కోడానికి. పోనీ వోమాటు—"

"బాబోయి!"

"ఏం తల్లీ?"

"వొద్దు బాబూ!"

"నాకళ్లు చల్లబడ్డట్టే నాకొడుకు కళ్లుగూడా చల్లపడవొద్దూ? నేను దగ్గిరదాన్నీ, బావ దూరపువాడూనా నీకూ? నిన్ను చూస్తే బావ కెంత ఆనందం?

అందులో యిప్పుడు చూశాడంటే యిక పొంగిపోడూ? వొక్కమాటు చూడని య్యమ్మా!"

"బావకళ్ల పడి నేను నుంచోలేను బాబూ."

"పోనీ కూచో అమ్మా! నామాట విను. వొక్కమాటు బావ ముచ్చటకూడా తీర్చు నాతల్లీ! ఏ మమ్మా!"

"నువ్వింటాకా బావకి చూపించ నన్నావూ మరీ?"

"నీ కిష్టం లేకపోతే యిప్పుడూ చూపించనూ. వొక్కమాటు చూడని య్యమ్మా. చూస్తాడు, వెళ్లిపోతాడు. అంతే. నుంచోనివ్వనులే నేను. నీ కిష్టం లేకపోతే పలకరించనివ్వను కూడాను."

"............"

"ఏం తల్లీ? నామాట వినవూ?"

"..............."

"మాట్లాడవటే నాకూనా?"

"..............."

"తీసుకు రానా?"

"వొద్దంటే నీకు కోపంవొస్తుంది."

"తప్పా అమ్మా? బావ చెడిపోయాడా?"

"మరి-అయితే చూడాలి, వెళ్లిపోవాలి. అంతే."

"అలాగే లే, నీదగ్గిరికి రాడు; ముట్టుకోడు; ఏం?"

"..............."

"మా అమ్మే. మా తల్లే. నామాట తీసెయ్యమమ్మా నువ్వు! నిన్ను నాకొడుకంటే యెక్కువగా చూచుకుందును. మీ నాన్న నా కిలా తెచ్చిపెట్టాడు ముప్పు."

ఇలా చెబుతూ చిట్టెమ్మ వాకట్లోకి వచ్చాటప్పటికి సీతారామయ్య అప్పుడే నూతిదగ్గర నుంచి వచ్చి కాళ్లు తుడుచుకుంటూ సోఫామీద కూచుని వున్నాడు. అతన్ని చూడగానే నవ్వు రాగా, చిట్టెమ్మ దానిని చాలా ప్రయత్నం చేసి ఆపుకుని, "వోమాటు యింటోకి రా నాయనా నువ్వూ" అని చెబుతూ గది తలుపులు బారుగా తెరిచేసింది. సీతారామయ్య మంద హాసంతో గుమ్మం యెక్కేడు.

"ఆపిల్ల యెవర్రా నాయనా?"

"మొగం కనపడ్డం లేదు."

"వోమాటు యిలా తిరుగమ్మా."

"అక్కర్లేదక్కర్లేదు. అద్దంలో—ఆహా! పూర్ణ! ఎంత మంచి రోజూ నేడూ! అమ్మా! కళ్లున్నందుకు నేడు ఫలం కలిగింది. నాజన్మలో యిలాంటి ఆనందం యెప్పుడూ కలగలేదు."

"కళ్లు చల్లపడ్డాయిరా యివాళా."

"సందేహమా? అమ్మా! మన పాడు శాస్త్రాలవల్ల యిలాంటి తరుణీమణు లెందరు జీవచ్ఛవాలైపోతున్నారో చూశావా?"

"..............."

"మాట్లాడ వేనమ్మా? అంచేతే మన దేశం యింత పాడైపోయింది. నిరపరాధలగు ఇలాంటి బాలికల ఉసురువల్లనే మన జాతి యింత దుర్బలమైపోయింది."

"ఈదండ వదినికి వెయ్యరా నాయనా."

చిట్టెమ్మ వొక దండ ఇవ్వగా పుచ్చుకుని సీతా



రామయ్య పూర్ణదగ్గిరికి వెళ్లాడు. సిగ్గుచేత పూర్ణ మొగం పక్కకి తిప్పుకోగా, "సిగ్గుపడకమ్మా! రోజూ చూసే బావే కాదూ? బావ ఆదండ నీ మెడలో వేశాక నీ

వీ్వదండ బావ మెడలో వెయ్యి. తప్పు లేదమ్మా! బిడియపడకు నా కూనా!" అని చిట్టెమ్మ ధైర్యం చెప్పి, పూర్ణని సరిగా నుంచోపెట్టింది. వెంటనే సీతారామయ్య బ్రహ్మానందంతో పూర్ణమెడలో పూలదండ వేశాడు. చిట్టెమ్మ ప్రోత్సాహంచేత పూర్ణకూడా చాలా సిగ్గుపడుతూనే రెండో దండ సీతారామయ్య మెడలో వేసింది. ఆవేశా టప్పుడామె చిటికెన వేలు ఫాలతలమ్మీద తగలగా సీతారామయ్య పరవశుడైపోయాడు.

తరవాత "యికను వ్వవతలికి వెళ్ళరా నాయనా" అని తల్లి చెప్పగా, కొడుకు "తలుపులు వేసెయ్యి నువ్వు" అంటూ పూలదండ బల్లమీద వుంచి, కోటు తీసేసి, ఛత్తం పుచ్చుకుని షికారు వెళ్ళిపోయాడు. "నేనిప్పుడే వస్తా నుండవే అమ్మా" అంటూ చిట్టెమ్మ దొడ్డోకి వెళ్ళింది.

## ౧౦

జరిగిపోయినదాన్ని తలుచుకోగా పూర్ణకి వల్లమాలిన సిగ్గు వచ్చింది. వెంటనే ఆవేషం తీసేసుకోవాలని ఎడంచేతి గాజుల మీద కుడిచెయ్యి వేసుకుంది. కాని పైనుంచి యెవరో "యేం తప్పా?" అని అడిగినట్లయింది. వెంటనే నిలువుటద్దం దగ్గిరికి వెళ్ళి చూసుకుని తన స్థానంలో మరెవర్తో వొక అందకత్తె నుంచుని వుండని బెదిరింది. నిదానించగా తానే; కలగాదు. ఆకళ్లు మునపటివే; గాని వాట్ల కిప్పు డపార మైన నూత్న తేజస్సు కలిగింది. ఆకపోలాలూ, ఆనుదురూకూడా మునపటివే; అయితే వాట్లమీద యిప్పు డంతం లేని నవలావణ్యం తొణికిపోయీలాగ ప్రవహిస్తోంది. పెదవులు కూడా మునపటివే; అయినా ముఖ్యంగా అధరోష్ఠం మీద యేదోనవీనతం కనబడింది. మునుపు వాడిపోయిన ట్లుండే చేతు లిప్పుడు నవనవలాడే తామరతూడుల్లాగ కనపడ్డాయి. ఆశరీరంకూడా మునపటిదే; గాని యిప్పుడది తవతవలాడే మాధవీలతలాగ ముద్దొస్తోంది. మునుపు దుఃఖభారంచేత కుంగిపోయి వుండే హృదయం యిప్పుడానందపారవశ్యంచేతా, వుత్సాహాతిశయంచేతా, భవిష్యజ్జీవితములో నూత్నపథాన్వేషణం ప్రారంభించింది.

పరికిణీలు కట్టుకునే సమయంలో మల్లుపంచెలామెమీద అమాంతంగా విరుచుకు పడిపోయాయి. శరీరం బాగా యెదగడమూ, బుద్ధి బాగా వికసించడమూ, మనస్సు ప్రాపంచికవృత్త పరిశీలనంలో మంచి చాతుర్యం సంపాదించడమూ ఆమెకి తరవాతనే జరిగాయి; కాని ఆతరవాత జరగవలసిన ముచ్చటలూ, వేడుకలూ, లాంఛనాలూ, మర్యాదలూ, గౌరవాలూ, సుఖానుభవాలూ-ఇలాంటి వన్నీ మాత్రం ఆమెకి మచ్చుకేనా దొరక్కుండానే పోయాయి. స్త్రీలకీ పురుషులకీ గూడా సంసారంలో వున్నంతసేపూ యేవేనా దుఃఖాలు వచ్చినా, అవి హద్దుకలవి కావడమూ, తరవాత మంచిమంచి సుఖాలు కలగడమూ, ఆ సుఖానుభవాలవల్ల పూర్వపు దుఃఖాలు పూర్తిగా మరుపు రావడమూ జరుగుతూనే వుంటాయి; కాని పూర్ణ సంగతి అలా కాలేదు. మల్లెతీగకి ఆకులు దూసెయ్యడమూ, మొగ్గలు తుంపెయ్యడమూ కాక మూలచ్ఛేదం యెలాంటిదో పూర్ణకి వైధవ్యం అలాంటి దయింది. ఆమెకి యేమీ యెరగని వయస్సులోనే యేమీ లేకుండా పోయింది. ఐహికవాంఛలమీద సహజమైన నిర్లిప్తత కలక్కుండానే ఆమె కవి సాంఘికదౌర్జన్యంవల్ల అంటరానివీ, కోరరానివీ, తెలపరానివీ, చివరకి చూడరానివీ కూడా అయిపోయాయి. ఈవిధంగా ఆమె జీవితలతకి సహజపరిణతి కాక నిర్బంధప్రతిబంధకం యేర్పడిపోయింది.

ఇంతకీ చెప్పవచ్చిం దేమిటంటే: ఆమె వేషం లాగులూ, పరికిణీలూ, పైటపరికిణీలూ, పల్లెవాటులూ, చీరలూ, తరవాత—వయస్సు మళ్లేక—అంతానికీ—అప్పుడేనా క్వాచిత్కంగానూ, యేదో దురదృష్టంవల్లనూ మాత్రమే సైనుపంచెలూ—ఇలాంటి పరిణామాన్ని పొందక, పరికిణీలలోనుంచే సైను—మల్లుపంచెలలోకి దిగిపోయింది. అందుచేత పైటపరికిణీలూ, పల్లెవాటులూ, చీరలూ ధరించినపుడు తన రూపం యెలా వుండునో వూహ కేనా అందని విషయం అయిపోయి వుండగా, తరవాత తటస్థించిన దౌర్భాగ్యవేషం చాలా కాలాన్నుంచి అనుభూతమై, జీర్ణమై పోయి వుండగా,

యిక లేనే లేదనుకున్న యీమంగళవేషం ఆయాచితంగానూ, తలవని తలంపుగానూ, ఆకస్మికంగానూ, ఆశ్చర్యంగానూ, తటస్థించడంచేత నిలువుటద్దంలో మనోహర-దివ్య-సుఖమయ-హృదయోత్తేజక రూపం కనపడగా పూర్ణకి తాను తానేనా అనే సందేహం కలిగింది. అయితే యీసందేహం చివరి కామెకి మంచి ఫలాన్నే కలిగించింది. దేశానికీ, కాలానికీ, పాత్రకీ తగిన యీశోభనవేషం తీసేసుకొని తలచుకోడాని కూడా—రామరామా! మళ్లీ ఆబురదగుంటలో — ఆ అగ్నిగుండంలో వురకడం యేమిటీ?

ఆమె అద్దం యెదుట నిలువునా నుంచుని కళ్లు



చేరడేసి చేసుకుని తన వేషాన్నీ, రూపాన్నీ బాగా చూసుకుంది. ఓహో! ఎంత సుఖమూ! ఆమె వేషం ఆమెకే మోహజనకంగా వుంది. ఇందాకా చిట్టెమ్మా, సీతారామయ్యాచేసిన స్తుతిలో ఎంతయాథార్థ్యం వుందో ఆమె కిప్పుడు బోధపడింది. ఆమె తనకిట్టి ఆనందపారవశ్యాన్ని కలిగించిన మేనత్తయొక్క శుభచింతనాన్ని మెచ్చుకుని జన్మజన్మాలు పాదసేవ చేసినా ఆమెఋణం తీర్చుకోలే నన్నీ, కనక అందుకు కృతజ్ఞతగా ఆమె చెప్పినట్లు నడుచుకోవాలనీ నిశ్చయించుకుంది.

సరిగా యీసమయంలో మళ్లీ చిట్టెమ్మ వచ్చింది. "ఏం చేస్తున్నావు కోడలా" అని ఆమె పిలవగా, "ఎందుకే అత్తా?" అని పూర్ణ గుమ్మంలోకి వచ్చి యెదురుగా నుంచుని అంతట్లో కొంచెం వెనక్కి తగ్గి, "వీధితలుపులు వేసే వున్నాయా?" అంది. చిట్టెమ్మకి కోడలు రూపం చూశా టప్పటికి బ్రహ్మానందమూ, ఆమె మాటలు వినగా నవ్వూ వచ్చాయి. "నేనే కాదుటే బావ షికారు వేళ్లాక తలుపులు బిడాయించి వచ్చానూ?" అని ఆమె అడిగింది.

"ఏమో బాబూ! ఎవ రేనా చూస్తే యింకేమేనా వుందా?"

"ఎవళ్ల సొమ్మేనా పట్టుకువచ్చామా యేమిటి మనం? ఎవ ళ్లేనా చూడడం మాత్రం యెందుకు వస్తుందీ?"

"నిజమే అత్తా. అదుటు అలా వుంది."

"కాదమ్మా మరీ? అయితేలే. పొద్దు పోయింది కదూ? మడి కట్టుకున్నాను. వంటింట్లో కూచుందువు గాని రా, పిచ్చాపాటీ చెప్పుకోవచ్చు."

"పద."

ఇలా చెప్పి పూర్ణ ఎడమచేతితో కుచ్చెళ్లు పట్టుకొని, వీధిగుమ్మంకేసి తిరిగితిరిగి చూస్తూ భీతహరిణం లాగ జడుస్తూ జడుస్తూనే చిట్టెమ్మతోకూడా వంటింట్లోకి వెళ్లి ఆమె ముక్కాలిపీట వెయ్యగా దానిమీద కూచుండి చిట్టెమ్మ వొక పొయ్యిమీద అన్నానికి యెసరు పెట్టి, దొండకాయలు తరగడానికి కత్తిపీటమీద కూచుంది.

కూర తరగడం అయిపోయే టప్పటికి సంధ్యారాగం బలిసింది. అది చూసి దీపాలు వెలిగించడానికి చిట్టెమ్మ లేవగా "నేను వెలిగిస్తాను, అగ్గిపెట్టి యివ్వవేఅత్తా" అని పూర్ణ లేచింది. "నువ్వు కాదమ్మా! హాల్లోకి వీధి కిటికీలు తెరిచి వుంటాయి. దీపాలు నేను వెలిగిస్తాను

గాని చీరలూ అవీ వాకట్లో మరిచే పోయాం. గదిలో పెద్దలాంపు వెలిగించి వాట్లని బీరువాలో సద్దుతావా? చూడూ; రాత్రి పడుకునే టప్పుడు నువ్వు కట్టుకోడానికి ఉప్పాడ చీరా, ఇమిటేషను సిల్కురవికా తీసుకుని మరీ సద్దుసుమా తలిమ్మానీ'' అని చిట్టెమ్మ మళ్లీ అనగా, ''అలాగే'' అని పూర్ణ అగ్గిపెట్టి పుచ్చుకొని గదిలోకి వెళ్లింది. తలిమ్మా దీపాలు చిట్టెమ్మ వెలిగించేసి మళ్లీ వంటింటోకి రాగా పూర్ణ కూనిరాగం తీసుకుంటూ చీరలు సద్దడం మొదలుపెట్టింది.

## ౧౧

వంట అయిపోయింది. చిట్టెమ్మ చెప్పకుండానే లేచి వెళ్లి పూర్ణ వేషం మార్చేసి—అంటే వుప్పాడ చీరా, ఇమిటేషన్‌సిల్కు రవికా తొడుక్కుని, నగలలో కాసులపేరూ, చంద్రహారమూ, పుస్తెలనానూ మట్టుకు తీసి మంచంమీద పెట్టి వచ్చి, చిట్టెమ్మ సీతారామయ్యకోసం గంగాళంలోకి నీళ్ళు తోడేటప్పటికి పసమటిల్లు తుడిచి పీటలు పరిచింది.

''ఇనపపెట్టి తీసి వెండి గిన్ని తెచ్చుకోవే కోడలా!''

''ఈపూట బావ లేచి వెళ్లాక నువ్వూ నేనూ వొక్కమాటు కూచుందామే.''

''ఇంకా నువ్వు వారంరోజు లుంటావు కదూ? తరవాత నాదగ్గిరే కూచుందువుగానిలే. ఈపూటకికూడా బావదగ్గిరేకూచో తల్లీ!''

''నేను కూచోలేను బాబూ బావదగ్గిరా. పోనీ నాకు వంటింటో వడ్డించు.''

''తన అందం నీ అందానికి చాలింది కానప్పుడు నీదగ్గిర కూచోడానికి బావే సిగ్గుపడాలి; గాని నీ కేమి? అయినా మధ్యాహ్నం వాడిబంతిని కూచుని యిప్పుడు కూచోకపోతే నాతండ్రి మనస్సు యెలాగో. అయి పోదూ?''

''ఏమో నమ్మా, నాకు భయం వేస్తోంది.''

''పోనీ నిన్నిందాకా యేమేనా వెక్కిరించాడా బావా?''

''లేదు పాపం. అబద్ధా లెందుకూ?''

''ఇక నేమీ? ఇక భయం యెందుకూ?''

''..................''

''లేనిపోని మొగమాటాలు తెచ్చుకోకమ్మా. గిన్ని పట్టుకురా. చారు పుచ్చుకోడానికి దొన్నికూడా తెచ్చుకో. బావ వెండికంచం అలమరులో వుంది పీట దగ్గిర—అదేమే? నీకూ బావకీ మధ్యాహ్నంలాగే రెండు పీటలూ వరుసగా వేస్తే సిగ్గుపడతా వెందుకే నాతల్లీ?''

''..................''

''ముసలిదాన్ని చేసి నన్ను బుట్టలో పెట్టేద్దామని చూస్తున్నావా గడుసుపిల్లా? నన్నప్పుడే లోకువ చేసేశావుటే?''

''..................''

''తొరగా రావమ్మా! వెర్రిపిల్ల, వుబలాటమే గాని పెంకితనం యెరగదమ్మా చిన్నప్పణ్ణుంచీ గూడానూ.''

నవ్వుకుంటూ వెళ్ళి పూర్ణ గిన్నీ, కంచమూ పీటల దగ్గిర పెట్టేటప్పటికి సీతారామయ్య వచ్చాడు. చిట్టెమ్మ కలుపు తియ్యడానికి వెళ్ళగా పూర్ణ వంటింటోకి చక్కాపోయి తలుపుచాటున నక్కింది. తరవాత సీతారామయ్య చొక్కాలు తీసేసి రంగుపంచె కట్టుకుని నూతిదగ్గిరికి వెళ్లి, ''ఈపూట ఏం చేశావమ్మా?'' అని అడుగుతూ పెరటిగుమ్మంలోనుంచి యాదాలాభంగా వంటింటోకి రాగా, పూర్ణ వొక్క అంగలో పడకటింటోకీ, యింకో అంగలో మండువాలోకీ వురికింది. అది చూసి చిట్టెమ్మ ''అదేమిటిరా నాయనా, దాన్నలా బెదరకొడతావూ?'' అనగా, సీతారామయ్య ''నేను చూడలే దమ్మా'' అంటూ నూతిదగ్గిరికి వెళ్లిపోయి స్నానం మొదలుపెట్టాడు.

అతను తాపితా కట్టుకుని వచ్చి పీటమీద కూచునేటప్పటికి వడ్డన పూర్తి అయింది. ఇంకా పూర్ణ రాకపోవడంచేత పరిషేచన చెయ్యడాని కతను సందేహిం

చగా, చిట్టెమ్మ "వెళ్లి నువ్వు కూడా కూచోవే అమ్మా! బావ నీకోసం కనిపెట్టుకున్నాడు చూడూ" అంది. ఇలా మేనత్త రెండుమూడుమాట్లు చెప్పాక పూర్ణ యిక బాగుండదని వచ్చి కూచుంది. ఇద్దరూ వొక్కమాటే ప్రారంభించారు భోజనం. చిట్టెమ్మ వారికి నెయ్యి వడ్డించి వంటింటి గుమ్మంలో కూచుంది.

"నీ కేం కావాలే పూర్ణ?"

"............"

"నిన్నే ఓహూయ్! వదినా!"

"............"

మాట్లాడ వేమే బంగారబ్బొమ్మా?"

"............"

"అయితే నీకూ నాకూ మాటలు పోయాయా యేమిటే?"

"............"

"అయితే నాకు సయించడం లేదే అమ్మా అన్నం. నేను లేచిపోతానే."

"చూశావా? బావని అన్నం తిననివ్వవుటే పూర్ణా?"

"నే నేం చేశానే?"

"నువ్వు మాట్లాడ్డం మానేస్తే బావ ప్రాణం కొట్టుకోదు తల్లీ?"

"............"

"ఈమాటు పిలవరా నాయనా"

"ఏమే వదినా?"

"ఎందుకూ?"

"ఏం కావాలే నీకూ?"

"కాస్త కూరా, కాస్త ఆవపిండీ వెయ్యవే అత్తా!"

"దొంగా! కడుపు కట్టిపెట్టుకుంటున్నావా?"

"నాకు పాపం తెచ్చిపెడతావుటే కోడలా?"

"కొంచెం కొంచెం వెయ్యాలి సుమా."

ఇలాగ వేళాకోళాలతో భోజనా లయినాక ఎవరో స్నేహితులు రాగా సీతారామయ్య హాలులోకి వెళ్లిపోయాడు. పూర్ణ మండువాలోకి వున్న హాలు తలుపులు మెల్లిగా బిగించి వచ్చి పొందాను తీసికొని వచ్చి పడమటింటో మేనత్త ఫలహారం చేస్తూ వుండగా యెదట కూచుని చిలుకలు చుట్టింది.

చిట్టెమ్మ యిల్లు సద్దడం తొమ్మిదింటికి పూర్తయింది. చిలుకలు చుట్టడం అయిపోయిన తరవాత పూర్ణ ఆమెకి కొంచెం సాయం చేసింది. అప్పటికి సీతారామయ్య తన పని కూడా పూర్తిచేసుకుని, వీథితలుపులు పూర్తిగా బిగించి చూడగా హాలు తలుపులు వేసివున్నాయి. తను మొదట వొకటి రెండు మాట్లు తల్లిని పిలిచాడు; గాని జవాబు రాకపోగా తలుపు గుంజాడు. అది విని పూర్ణ మెల్లిగా పిల్లిలాగ వెళ్లి మునివేళ్లతో గొళ్లెం తీసి మెరుపులాగ పడమటింటోకి చక్కాపోయింది. సీతారామయ్య పూర్ణ సిగ్గు చూసి ఆనందిస్తూ గదిలోకి వెళ్లి గ్లాస్గో మల్లుపంచె కట్టుకుని, వాకట్లో మడతకుర్చీ మీదకూచుని ఏదో ఆలోచనలో పడ్డాడు. తరవాత మేనత్తతోకూడా పూర్ణ గదిలోకి వెళ్లింది.

లోపల యేవో గుసగుసలలాగ ధ్వని వినిపించింది. అది వుండివుండి వొకటిరెండుసార్లు వినిపించే టప్పటికి సీతారామయ్య మొగం వెనక్కి తిప్పుకుని చూడగా, వెండిపళ్లెంతో తాంబూలం పట్టుకు వచ్చి పూర్ణ సిగ్గుపడుతూ కుర్చీవెనక్కాల నుంచుని వుంది. వెంటనే ఆతను లేచి నుంచుని, "మాట్లాడకుండా అలా యెంతసేపు నుంచుంటావే పూర్ణా" అన్నాడు. అప్పుడు కూడా ఆమె మాట్లాడలేదు. "మాట్లాడవుటే పూర్ణా" అని ఆతను మళ్లీ అడిగినా మాట్లాడలేదు. అందు కతను "మాట్లాడ్డానికి పనికిరాని వాణ్ణి తాంబూలం యివ్వడానికి మాత్రం పనికివస్తానా యేమిటి? నా కక్కరే లేదు" అంటూ కొంచెం వెనక్కి తగ్గాడు.

పూర్ణ కేమో మాట్లాడకుండా వుండా లనే వుంది గాని యిక మేనత్త అందుకుంటుంది. యింకా అలాగే వుంటే సీతారామయ్యాకి కష్టం తోస్తుం దని వకమూల భయంకూడా పుట్టింది. "వోశే బావా" అంటూ అస్తమానూ పాకులాడే తా నంతసిగ్గుపడడం

కూడా యేమి టని తోచింది. మాట్లాడడానికే సిగ్గయితే అతని యెదట అంతసేపు నుంచోడంమాత్రం సిగ్గ కాదూ? ఇదంతా ఆలోచించుకుని ఆమె "ఇదిగో తాంబూలం" అంది. కానయితే ఆమాట చాలాదూరాన్నుంచి వినపడ్డం వీణాధ్వనిలాగే వుంది. అయినా సీతారామయ్య దానికే పొంగిపోయాడు. ఇంకా ఆలస్యం చేస్తే తను మోటతనం చేసిన ట్లవుతుం దని కూడా జంకా డతను. ఆభయముతో పూర్ణా, యీజంకుతో సీతారామయ్యా రాజీపడ్డారు. పళ్లెం జారిపోయిందా, పూర్ణ యిచ్చిందా అని సందేహం. కాని ఆమె చేతిలో వున్న పళ్లెం అతనిచేతిలో వుంది. చూడగా పూర్ణ గదిలో వుంది.

ఇదంతా చూసి బ్రహ్మానందపరవశురా లవుతూ వున్న చిట్టెమ్మ వొక్క నిమిషం గడిచాక ముందుకు వచ్చి, "నువ్వెక్కడ పడుకుంటావురా నాయనా?" అని అడిగింది.

"పూర్ణో?"

"అదీ, నేనూ గదిలో పడుకుంటాం."

"అయితే నా కాంపుకాట్టు తెచ్చి యిక్కడ వెయ్యి."

"గాలి చాలుతుందా?"

"ఎలాగో బాధపడతా నివాళికి."

పూర్ణకి "మరి రేపో?" అని అని యెవరో అడిగిన ట్లయింది. దానిమీద యేదో మెరుపు తగిలినట్లు కూడా అయింది. వొళ్లు ఝుల్లు మంది. వొక్కనిమిషం యిలా గడిచింది. అప్పుడు చిట్టెమ్మ యింటోకి రాగా పూర్ణ యెంతో మెల్లిగా "పోనీ మనం పడమటింటో పడుకుందామే" అంది. కాని చిట్టెమ్మ అంగీకరించ లేదు. తరవాత కాంపుకాట్టిద్దరూ విప్పి సాగతీసి సీతారామయ్య చెప్పిన చోట వేశారు. చిట్టెమ్మ పరుపు వేయగా పూర్ణ దుప్పట్టీ పరిచి,తలగడ పెట్టి, చిక్కగా మల్లిపువ్వులు చల్లి వెళ్లిపోయింది. తరవాత చిట్టెమ్మ గుమ్మంలోనూ, పూర్ణ కొంచెం తలుపు చాటునా చూడగా, సీతారామయ్య కుర్చీ వారి కభిముఖంగా తిప్పుకున్నాడు.

## ౧౨

చిట్టెమ్మ గ్రామోఫోనుకేసి యాదాలాభంగా చూశాటప్పటికి దానిమీద అరవిచ్చిన పూలదండ కనపడింది. దానిమీద "అయ్యో! బావ దండ మరిచేపోయాడే. వేసిరా తల్లి" అని యామె చెప్పగా పూర్ణ వొకటి రెండు క్షణాలు సునిసిసునిసి వేసి చక్కా వచ్చింది. తరవాత వారు కొంత సేపు ఆమాటా యీమాటా చెప్పుకున్నారు. గడియారం పదకొండు కొట్టింది. అప్పుడు పూర్ణకి ఆవలింతలమీద ఆవలింతలు రావడం చూసి చిట్టెమ్మ "నాయనా! పూర్ణకి నిద్ర వొస్తోందిరా. ఇక పడుకుందాం లే" అంటూ లేచింది. "అవునవును. పొద్దుపోయింది. పూర్ణని యివాళ చాలా కష్టపెట్టాం మనము. పడుకోండి" అని తన పక్కమీదకి వెళ్ళిపోయాడు. చిట్టెమ్మ "మిగిలిన పువ్వులు నీపక్కమీద—ఏమే? వొక్క పువ్వుకూడా లేకుండా చేసుకున్నావూ?" అనగా "నేను తెస్తున్నానుండవే అమ్మా" అంటూ తన పక్కమీది పువ్వులు సగంకంటె పైగా తెచ్చి సీతారామయ్య పందిరిమంచం మీద చల్లి చక్కాపోయాడు. అప్పుడు చిట్టెమ్మ "నాతండ్రి కన్నీ తెలుసును. నీపక్కమీద పువ్వులు లేకపోతే వాడు సహించగలడా? నాకొండా! నువ్వు చేసిన పనీ, నాతండ్రి చేసిన పనీగూడా బాగానే వున్నాయి. వెళ్లి పడుకోవే తల్లీ" అంటూ తన మామూలుచోప్పున జపానుచాప పరుచుకుని పడుకుంది. పూర్ణ ఆమెకి సమాధానం చెప్పకుండానే లోపల్లోపల నవ్వుకుంటూ లేచి గుక్కెడు మంచినీళ్లు తాగి, వసారాలోకి వున్న కిటికీరెక్కలు నాలుగూ బారుగా తెరిచేసి పడుకుంది.

వొంటిగంటకు హఠాత్తుగా మెళుకువ వచ్చి చిట్టెమ్మ లేచి చూడగా మంచుతెర వంటి వుప్పాడ చీర కట్టుకొని వున్న పూర్ణ వెన్నెలవంటి పాన్పుమీద బంగారుసలాకలాగ కదలకుండా పడుకుని వుంది. మూడు గంటలకి మళ్లీ మెళుకువ వచ్చి చూడగా పూర్ణ గోడ వేపుకి తిరిగి పడుకునే వుండి వెక్కివెక్కి దుఃఖిస్తోంది.

అది చూడగా చిట్టెమ్మ గుండె బేజారైపోయింది. ఆమె మనస్సు పరిపరి విధాలపోయింది. వాకట్లోకి తొంగి చూడగా సీతారామయ్య గాఢనిద్రలో వున్నాడు. ఆమె కారణాన్ని పోల్చుకో లేకా, యిక వుండలేకా, తటాలున లేచి వెళ్లి ఆమె పక్కలో కూచుని, "ఏం తల్లీ? ఏం మామ్మా?" అంటూ కంగారుపడుతూ అడిగింది. ఆమె యిలాగ రెండు మూడుమాట్లడిగే టప్పటికి పూర్ణ దుఃఖం కొంచెం సమాళించుకొని, లేచి కూచుంది. చిట్టెమ్మ మళ్లీ అడగ్గా అప్పుడు పూర్ణ "ఏమీ లేదూ. పూర్వపు సంగతు లన్నీ—ఇవాళ మధ్యాహ్నం దాకా నేను వేసిన పాడు వేషమూ, నే ననుభవించిన యమయాతనా జ్ఞాపకం వచ్చి, హృదయాన్ని గొడ్డలిపెట్టుగా బద్దలుకొట్టేశాయి. దుఃఖాంధకారంలో సుఖానికల్లా నిగ్గయిన రోజులు—పదకొండేళ్లు వ్యర్థంగా గడిచిపోయాయి. పరాపాదిత మైన అలాంటి దారుణశిక్ష ననుభవిస్తూ నేను బతికి యెలా వుండగలిగానూ? అనే ఆవేదన కలిగి దుఃఖం వుబ్బెత్తుగా పొంగిపోయింది. ఎన్ని విధాల ప్రయత్నించినా అది తగ్గలేదు" అని చెప్పింది.

ఇది విని చిట్టెమ్మపెద్ద నిట్టూర్పు విడిచింది. సన్నసన్నంగా భాగ్యదేవత చెవిలో యేదో చెప్పినట్లయింది. ఆరాటపెడుతూ వున్న హృదయభారం తగ్గిపోయింది. అది విజయమో, భ్రాంతో-గర్వం మాత్రం కలిగింది. చిట్టెమ్మకి కంఠస్వరమే మారిపోయింది.

"తల్లీ! యింకెందుకూ? ఆపత్సముద్రం దాటి వొడ్డెక్కేక కూడా దుఃఖించడం యెందుకూ? నీకళ్లమ్మట నీళ్లు రావడం—దుఃఖోద్రేకంచేత నీపెదవులలా రావిఆకల్లాగ వొణికిపోవడం నేను చూడలేను. ఇక్కడ కాదు. వసారాలో కూచుందాం రా మాట్లాడుకోవచ్చు" నంటూ చిట్టెమ్మ ఆమెని రేవతీసుకుని బయలుదేరింది. ఇద్దరూ సోఫామీద కూచున్నారు. పూర్ణని తన వొడిలోకి తీసుకుని చిట్టెమ్మ లాలిస్తూ మాట్లాడింది—

"అమ్మా! నావుద్దేశమూ, బావ వుద్దేశమూ నువ్విదివరకే యెరుగుదువు. నీ వుద్దేశం కూడా స్పష్టంగానే వుంది. అయినా అవి వ్యాగ్రూపంగా పైకి వచ్చి యేకం కాలేదు. నా కూనా! ఇం కెందుకూ దాపరికాలూ! నిన్ను నాకొడుక్కి—"

"బావకి నామీద దయ వుందా? నిజం చెప్పవె అత్తా! మోసం చెయ్యకు."

"మోసమా? బావ యిప్పుడు చక్రవర్తికూతురు—"

"ఎలా నమ్మనే? నిన్న భోజనం చేశాటప్పుడు—నువ్వు గూడా బందరుపిల్లమీద ఆశగా—"

"రామరామా! అప్పు డలా అనకపోతే యేమనమంటావు చెప్పూ? నీఅభిప్రాయం కొంచెమేనా—"

"నాలుగు రోజుల నాడు బావతో కాకినాడలో నేను స్పష్టంగానే—"

"అయితే బావ నిన్ను—"

"అలా చెప్పడానికి వల్లకాదూ. కొంచెం ఆశా వుంది. కానయితే అది నామనస్సుయొక్క దౌర్బల్యం—"

"నిజంగా అంతే. పోనీ బావచేత క్షమాపణ కోరిస్తా నుండూ."

"వొద్దువొద్దు. బావని నేను క్షమించడమా! అత్తా! ఇక నే నాపాడువేషం వెయ్యలేను. ఆనికృష్ట జీవనం గడపలేను. నా చూపు సంసారసుఖంమీదకి పోయింది. దాన్నిక తిప్పుకోలేను. నన్ను నీ కడుపులో పెట్టుకోవూ?"

"నువ్విలా అంటే నా కేడుపు వస్తోంది. మీ నాన్న నాకొడుకుని తోసేసి నిన్ను పైవాళ్ల కిచ్చినప్పుడు నే నెన్ని విధాల యెంతగా యేడ్చానో దేవుడికెరుక. తరవాత యింకేం లాభమూ?—"

"వారం రోజుల కిందటే నాకూ యేలూరులో రుణం చెల్లి పోయింది. మా అమ్మా, మావడినా నామీద చూపిస్తూవచ్చిన ప్రేమ జ్ఞాపకం వస్తే కొంచెం ఆశకనపడుతూనే వుంది. కాని నమ్మలేను. ఇక నాబతుకు కావాడవు నీ చేతిలోనూ, నీచేతిలోనూ వుంది. నన్ను కాపాడవూ అత్తా?"

"వెఱ్ఱిదానా! కాళ్లు పట్టుకుంటున్నావా? కాస్త ఓపికి పట్టావంటే ఇవాళ భావ నీకాళ్లే— తీసుకు వస్తా నుండు."

"వొద్దు వొద్దు. రేపు— తెల్లవారేక—"

"నే నుండలే నమ్మా! నాయింటికి సాక్షాత్తూ లక్ష్మి వస్తూ వున్నప్పుడు—నాయనా!"

"నిద్ర చెరపకే, లేపకే పాపం!"

"తండ్రీ!—తీసుకు వస్తా నుండు."

"నువ్వు లేచావంటే—మళ్ళీ పిలిచావంటే నన్ను చంపుక తిన్నట్లే. ఇదిగో...కూచో. మాట్లాడకు. ఒొక్కమాట చెప్పు. నే నింక బతుకుమీద నిరాశచేసుకో నక్కరలేదూ? నువ్వు రక్షిస్తావా?"

"అయ్యో! ఇంకా సందేహం యెందుకే తల్లీ! నిన్నమధ్యాహ్నం భోజనాలవేళ దగ్గిర్నుంచి నీకోసం అటమటించి పోతున్నాను నేను. నాతండ్రికి మనస్సు మనస్సులోనే లేదూ. ఇప్పటి కేనా నువ్వు నాకోడలివైనందుకు—ఇంతకీ యిప్పటి కీవిధంగా వుంది యోగం.

ఇక వారు పడుకో లేదు. ఇలాగే మాటలతోటే మిగిలివున్న ఆకాస్త రాత్రీ కడిచిపోయింది. ఉషఃకాంతిలో అరవిచ్చివున్న గులాబీమొగ్గలూ, వెన్నముద్దల్లాగ విప్పారివున్న నందివర్ధనం పువ్వులూ, విరజిమ్మినట్లు నేలమీద రాలివున్న పారిజాతపుష్పాలూ పూర్ణకి స్వాగతం యివ్వగా వాట్లమీద మూగుతూ వున్న కొదమతుమ్మెదలు భవిష్యజ్జీవితం యొక్క ఆనందమయవిలాసాలిని గానం చేశాయి.

మందువాలోనుంచి దూసుకు వచ్చి ప్రభాతవాయువు మేలుకొలపగా సీతారామయ్య అప్పుడే లేచి కూచున్నాడు. చిట్టెమ్మ గాలిలో దూదిపింజలాగ యెగిరి వచ్చి, "నాయనా! నీదే తరవాయి. నిమిషాలమీద అయిపోవాలి పెళ్ళి" అంది.

---

# హృదయార్పణము

తన్నీరు కృష్ణమూర్తిగారు

ఘాండులోకంబుపైన నిష్ఫలముగాను
రిక్తహస్తుండ నౌచు వ్రాలితిని దేవ!
దేని నర్పించి మిమ్ము ప్రార్థింతు నిపుడు
అన్నవస్త్రంబులే కఱవయ్యె నాకు!

యేడుపులతోడ వత్సరా లెగిరిపోయె
చూతుమన్నను నెత్తురుచుక్క లేక
జీవములతోడ శల్యావశిష్టుడనయి
నిలచియున్నాడ; నన్ను గాంచితివో? లేదో?

కటికకఱవులలోన ముక్కలయిపోయి
అహరహంబులు క్షుత్ బాధ కాగలేక
అవయవంబులు రక్తంబు నపహరింప;
రంధ్రములతోడ నిదిగో డొల్లయయిపోయు;

ఈక్షణమొ; ఆక్షణంబునో; యెగిరిపోవు
హృదయమున్నది; దాని నందించుచుంటి
స్వామి! గైకొమ్ము నా మనశ్శాంతికొఱకు.

౧

మేమిద్దరమున్నూ సహాయ నిరాకరణోద్యమములో ప్రవేశించి చాలా పనిచేసిన వాళ్లమే. ఈమధ్యను దేశం చప్పచప్పగా ఉండడంవల్ల మేమున్నూ వెనకకు తగ్గాము కాని మాదుస్తులలోనూ, వేషభాషలలోనూ, మనస్సులోనూ ఏమీ మార్పులుమాత్రం కలగలేదు. ఆనాటినుండి నేటివరకూ ఖాదీబట్టలు కట్టుకొని గాంధీటోపీ పెట్టుకుంటూనే ఉన్నాము. దేశముకు స్వరాజ్యము వచ్చే పసందైన ఉద్యమం మళ్లీ వచ్చిందంటే మేము ఆశాంతి యుద్ధములో ప్రవేశించి దేశముకోసము ప్రాణత్యాగమైనా చెయ్యడానికి సిద్ధముగా ఉన్నవాళ్లమే. మా దేహములు, మాఆత్మలూ దేశభక్తితో నిండి ఉన్నవి. మా మాతృభూమి అన్నప్పుడు మా దేహములో రక్తము వేగముగా ప్రవహిస్తుంది. దేహము గగుర్పాడుస్తుంది. మా ఆత్మ తాండవిస్తుంది.

౨

ఒకయేటి శివరాత్రికి మేము శ్రీశైలపర్వతము వెళ్లినాము. తెలుగు దివ్యక్షేత్రమును కళ్లారా చూడగానే మాకు మా మాతృభూమిదుర్దశ కళ్లకు కట్టినట్లయినది. అక్కడ మల్లిఖార్జునుడికి మ్రొక్కుకున్నాము. భ్రమరాంబముందు సాగిలబడ్డాము. కృష్ణవేణికి అంజలులు ఘటించినాము. మాకు దాస్యవిమోచన చెయ్యరా అని ప్రార్థించినాము. మా ప్రార్థనలకు బదులు వచ్చినట్లు మాఆత్మలు గ్రహించ లేదు.

శ్రీశైలప్రాకారములోపల పశ్చిమగోపురములో అరుగుమీద ఒక ముని కూర్చుని తపస్సు చేసుకొంటున్నాడు. ఆతని సమీపించాము. అతడు కళ్లు మూసికొని సమాధిలో ఉన్నాడు. చుట్టుపట్టుల అనేకమంది చేరి ఆయనమహత్తు ఉగ్గడిస్తున్నారు. మనస్సును చిక్కబట్టి, ఇంద్రియముల జయించి, పరమాత్మ సాన్నిధ్యమును కల్పించుకొని ఎప్పుడూ మననము చేస్తూ ఉంటాడట ఆమహానుభావుడు.

ఆయనతో ప్రసంగిస్తేనే కాని తిరిగి రాకూడదని మేము నిశ్చయించుకొన్నాము.

రాత్రి అయినది. చీకటులు బాగా ఆవరించుకొన్నవి. అక్కడి వాళ్లందరూ ఒకరితరువాత ఒకరు వెళ్లిపోయారు. అర్ధరాత్రి అయినది. తైర్థికు లందరూ నిద్రపోయేవారూ, ప్రసంగించుకొనేవారూ, భజనచేసేవారున్నూ. వారందరూ దూరముగా ఉన్నారు. ముని ఇంకా తపస్సులోనే ఉన్నాడు. రాత్రి మూడుజాములు గడచి నాల్గవజాము ప్రవేశించినది. తీర్థయాత్రాపరులు చాలామంది నిద్రపోతున్నారు. జాగరణమున్నవారు మాత్రము తడిబట్టలతో కళ్లు తడుపుకొంటున్నారు.

న్నాగ్గనజాము సగము గడిచింది. అప్పుడు ముని కళ్లు తెరిచాడు. లేచాడు. అది కనిపెట్టి మే మాయనకు నమస్కరించాము. ఆయన కను రెప్పపాటుతో మానమస్కార మందుకొన్న ట్లు తోచినది. నక్షత్రకాంతిలో అయన మా ముఖములు పరిశీలించి చూచాడు. ఒక్కనవ్వు నవ్వాడు. నవ్వి స్నానార్థమై బయలుదేరాడు. మే మాయన వెంట బడ్డాము.

3

ఒకతాళముల నూతిలో ఆయన ప్రవేశించి స్నానము చేస్తున్నాడు. మేము నూతి గుమ్మము దగ్గర నిలబడ్డాము. ఆయన స్నానము చేస్తూ స్నానము చేస్తూ బయటికి వచ్చి నాస్నేహితుణ్ణి ముట్టుకొన్నాడు. ముట్టుకొని వింటున్నావా అన్నాడు నాతో.

"చిత్తం, వింటున్నాను" అన్నాను.

అతడు మావాడిని ఈవిధముగా ప్రశ్నించాడు:

"మీది ఏ దేశం ?"

"ఇంగ్లాండు."

"నీకు ఉద్యోగ మేమిటి?"

"మంత్రివర్గములో ఉన్నాను."

"హిందూదేశపు విషయాలు నీకు బాగా తెలుసునా?"

"ఆవిషయమై నేను కృషిచేసి బాగా చదువు కొన్నాను."

"వాళ్లు స్వరాజ్యానికి అర్హులేనా?"

"ఆసంగతి నేను చర్చించను."

"పోనీ, వాళ్లకు స్వరాజ్యం ఇవ్వడానికి నీకేమైనా అభ్యంతరం ఉందా?"

"ఉంది."

"ఏమిటది?"

"మా దేశక్షేమము ముందు చూచుకోవడం మావిధి. మా దేశక్షేమానికి భంగకరం కాబట్టి స్వరాజ్యం వాళ్లకు ఈయ వీలులేదు."

ముని నావైపు తిరిగి చూశాడు. ఆమాట్లాడు తున్నది మావాడేనా అని సందేహం తోచింది నాకు.

"అమాట్లాడుతున్నది మీవాడే. మీ వాడిప్పుడు భారతీయుడు గాడు. ఆంగ్లేయుడు" అన్నాడు ముని.

"అయితే మీమహత్తువల్ల ఆలాగున మాట్లాడించా రన్నమాట."

"ఇందులో నామహత్తు ఏమీ లేదు. అతని మనస్సు నేను మార్చలేదు. దేశము మాత్రము మార్చాను" అన్నా డాముని.

నాస్నేహితు డిట్లా మారుతాడని నే నెప్పుడూ అనుకోలేదు.

ఇంతట్లోకే ముని వచ్చి మావాడిని మళ్లీ ముట్టుకొన్నాడు. ముట్టుకొని ఈరీతిగా ప్రశ్నించాడు:

"ఏ ఊరు నీది?"

"అమెరికా."

"ఏమిటి నీ ఉద్యోగం?"

"ప్రజాసభలో సభ్యుడను."

"హిందువులకు పౌరసత్వము ఇచ్చుటకు నీ కే మైనా అభ్యంతర మున్నదా?"

"ఆ."

"ఏమి టది?"

"అది మా దేశముకు క్షేమకరము కాదు."

ఏరంగు చిమ్నీ పెట్టితే ఆరంగు దీపకాంతి వచ్చినట్లు నా స్నేహితుడు మారిపోవడం చూచి నే నాశ్చర్య పడ్డాను.

"చాలునా?" అన్నాడు ముని నావంక తిరిగి.

"చాలును" అన్నాను.

"అయితే వెళ్లండి. నీవూ నీస్నేహితుని వంటి వాడవే. ఈవిషయములో నిజమైన హిందూత్వమే మీలో ఉంటే ఎక్కడ నున్నా ఒక్కటే పలుకు పలికేవారు. వెళ్లండి. దిగులుపడకండి. ఈ దేశంలో మీవంటి వా ళ్లనేకు లున్నారు. మానవభ్రాతృత్వం అంటే ఏమిటో తెలిసిన మీగురువును బాగా అర్థముచేసుకోండి." అని ఆయన నాస్నేహితుణ్ణివచ్చి ముట్టుకొన్నాడు. నా స్నేహితుడు నిద్రలోనుండి మేల్కొన్నాడు. మే మిద్దరమూ ఆయన్ని మళ్లీ పలకరించాలని ప్రయత్నము చేశాము గాని ఆయన పలకలేదు. మేము తిరిగివచ్చాము.

౪

నే నడిగాను నాస్నేహితుణ్ణి—"ఏమి జరిగిందో నీకేమైనా జ్ఞాపక మున్నదా" అని.

"నాకేమీ జ్ఞాపకము లేదు. అంతా స్వప్న ప్రాయముగా ఉన్న" దన్నాడు. "స్వప్న మేమై నా జ్ఞాపక మున్నదా" అన్నాను.

"ఏమీ లేదు కాని, ఈ నాబానిసత్వము పోయి నట్లూ, స్వాంతత్ర్య మదముతో నే నున్నట్లూ అనుకొన్నాను. ఆ ఉత్సాహవాసన ఇప్పు డిప్పుడే క్రమంగా నామనస్సును విడిచిపోతూ ఉన్నది."

"సరే కాని, నేను నిన్ను రెండుప్రశ్న లడుగు తాను, సమాధానం చెప్పు."

"అలాగే."

"నీవే ఇంగ్లీషువాడ వై, వాళ్ల మంత్రివర్గంలో నీ వే ఉన్నట్లయితే మన దేశానికి స్వరాజ్యా ఇప్పించడానికి ప్రయత్నిస్తావా?"

"ప్రయత్నించడమా! రేపటికి వచ్చేలాగ చే య్యనూ?"

"సరే, ఆగు. నీవే ఆమెరికాదేశస్థుడ వై ప్రజా సంఘములో సభ్యుడ వైనట్లయితే హిందువు లకు పౌరసత్వము ఇప్పిస్తావా?"

"తప్పకుండా."

---

# డాక్టర్ సన్‌యట్‌సేనుగారి జాతీయపునర్నిర్మాణవిధానము

## ప్రతివాది భయంకరం రంగాచార్యులుగారు

ఈ క్రింది యిరువదియైదు కార్యక్రమములును చీనాదేశమున జాతీయపునర్నిర్మాణము గావించుటకై డాక్టరు సన్‌యట్‌సేనుగారు కాంటను ప్రభుత్వమున కధ్యక్షుడుగ నుండినప్పుడు, వారిచే నిర్ణయింపబడినవి.

డాక్టరు సన్‌యట్‌సేను తన జీవితసర్వస్వమును భక్తిపూర్వకముగ దేశమాత పాదములకడ నర్పించుకొనగల్గిన ధన్యులలో నొకడు. ఇరువదియేండ్లయిన నిండక మునుపే యతనికోమల హృదయమున స్వదేశపారతంత్ర్యము ప్రళయతాండవ మొనర్చెను.

ఇంక నాహృదయమునకు విశ్రాంతి యెక్కడిది!

చీనాదేశమున నింగ్లీషువారు, అమెరికనులు మున్నగు విదేశీయుల ప్రాబల్య మధిక మయిపోయినది. చీనాదేశపు రాజవంశములోనివారే, యెవరో యొకరు సింహాసనమున గూర్చుండుట సాంప్రదాయికముగ వచ్చుచునేయున్నను, నిజముగ బరిపాలనాధికారమంతయు విదేశీయుల యనుభవముననే యున్నది. క్రమముగ చీనాదేశపు సౌభాగ్యమంతయు నంతరించుచున్నది. సన్‌యట్‌సేను కీయవస్థ దుర్భర మయ్యెను

ఈదురవస్థ నంతరింపజేయు టెట్లు? ఎల్లవిధముల జాతీయాభివృద్ధియే పరమాశయముగ గల ప్రజాప్రభుత్వమును నెలకొల్పి, తన్మూలమున స్వార్థపరులగు విదేశీయులయధికారమునకు లోబడియున్న ప్రభుత్వము నడుగంటజేయవలయునని సన్‌యట్‌సేను ఉద్దేశించెను అటుపైదన 19 వ యేడు మొదలుకొని నిరంతరముగ నతడు తన యాశయమును సఫలము గావించుకొనుటకై ప్రయత్నముల గావించుచునే యుండెను. తుదకు 1922 సం. న నెడతెగక నిర్దయముగ దన్నెదుర్కొనుచున్న పరాజయ పరంపరలే మార్గదర్శకములుగ గలిగిన యాధీరుడు తనయాశయమునకు చీనాదేశమున నిలువ నీడ గల్పింపగలిగెను.

సన్‌యట్‌సేను కాంటననగరమును ముట్టడించి యందు తన ప్రజాప్రభుత్వమును నెలకొల్పెను. తత్ప్రాంతములనున్న తిరుగుబాటుదారుల నణచివైచెను. తన ప్రయత్నముల ప్రారంభదశలో నొకసారి యతడు యూరపు ఖండమున సంచార మొనర్చుచున్న కాలమున సాన్‌మిన్‌సిద్ధాంత మనునొక ప్రజాప్రభుత్వ సిద్ధాంతమును గనిపెట్టెను. దీని ననుసరించియే యతడు చీనాదేశమున ప్రజాప్రభుత్వవిధానము నేర్పరచెను.

సన్‌యట్‌సేను తనయాశయము పూర్ణముగ ఫలింపకుండగనే యిరువదియవయేట—1926 సం. న— నీలోకమును విడిచిపోయెను. ఐన మహాత్ము లమోఘసంకల్పులుగదా! డాక్టరు సన్‌యట్‌సేను స్థాపించినయాప్రజాప్రభుత్వమే నేడు చీనాదేశమున విజృంభించి సంపూర్ణసాఫల్యము నందుచున్నది. చీనాదేశపు దానిసత్వము శీఘ్రముగ నంతరించి పోవుచున్నది.

### కార్యక్రమములు

#### ౧

సాన్‌మిన్‌సిద్ధాంతము ననుసరించియు, ప్రభుత్వములో ఐదుప్రత్యేకములైన స్వతంత్రములైన శాఖ లుండవలయునన్న పద్ధతిని బట్టియు ప్రజాప్రభుత్వమువారు చీనాదేశములో జాతీయ పునర్నిర్మాణము గావించెదరు.

[సాన్‌మిన్ సిద్ధాంతము, ప్రజాప్రభుత్వము అను పదములనుగూర్చి పైయుపోద్ఘాతమున తెలుపబడియున్నది. జాతీయ పునర్నిర్మాణము అనగా ధనము లేకపోవుటచేతను, ప్రజలలో వ్యాపించిన యితరదురాచారములచేతను, చదువు లేకపోవుట చేతను, ప్రజలజీవనమునకు

తగిన వసతులు, ఆరోగ్యముమున్నగు సౌకర్యములు నశించుటవలనను, ఒకజాతి ప్రజలు హీనదశలో నున్నప్పుడు పైలోపముల నన్నిటిని సవరించి వారిని సరియగుస్థితిలోనికి దెచ్చుట. 'ఐదు ప్రత్యేకములైన, స్వతంత్రములైన శాఖలు' అను దానినిగుఱించి 19 వ పేరాలో వివరముగ జెప్పబడినది.]

## ౨

ఈపునర్నిర్మాణకార్యక్రమములో మొదటిమెట్టు అన్నవస్త్రములకు, వసతులకు, రాకపోకలకు దగిన సౌకర్యములను ప్రజలకు సమకూర్చుటలో శ్రద్ధ వహించుట. అందుచే ప్రభుత్వమువారు ఆహారసౌకర్యము పుష్కలముగ నుండునట్లు వ్యవసాయమును వృద్ధిచేసెదరు. వస్త్రసౌకర్యమునకై ప్రత్తి పరిశ్రమలను నెలకొల్పెదరు. పరిశుభ్రముగా నుండి ప్రజలు సుఖముగా నివసించుటకు దగియుండునట్లు ఎక్కువగా వసతులను నిర్మించెదరు. రాకపోకల సౌకర్యమునకై నీటిదారులను, ఇనుపదారులను నిర్మించెదరు.

## 3

తరువాతి సిద్ధాంతము ప్రజల హక్కులకు సంబంధించినది. వోటునిచ్చుట (Suffrage), ప్రభుత్వమునకు పరిపాలనపద్ధతులను సూచించుట (Initiative), ప్రభుత్వమువారు సూచించు పద్ధతులను ఆమోదించుట లేక త్రోసివేయుట (Referendum), ప్రభుత్వోద్యోగులను తొలగించుట(Recall) అను నీనాల్గు హక్కులును ప్రజలకు ఉండవలయును. ప్రజలు ఈహక్కులను అనుభవములోనికి దెచ్చుకొనుటకు దగినట్లు ప్రభుత్వమువారు వారికి రాజకీయప్రబోధము నొసంగెదరు.

[Suffrage, Initiative, Referendum, Recall అను నీనాలుగు (ప్రజల) హక్కులకును ప్రభుత్వము సంపూర్ణముగ లొంగియున్నప్పుడే యది బాధ్యతాయుత ప్రభుత్వ మగునని రాజ్యాంగవేత్తల యభిప్రాయము. బాధ్యతాయుతప్రభుత్వము అనగా సంపూర్ణముగా ప్రజలయిష్టమునకు లొంగియుండు ప్రభుత్వమని యభిప్రాయము. ఈనాలుగు హక్కులలోను వోటునిచ్చుట యనగా మనకు దెలియును. రెండవది ప్రజలలో కొందరు (ఎంతమంది. యనువిషయము మొదట పరిపాలనపద్ధతులలోనే నిర్ణయింపబడియుండును) ప్రభుత్వమువారు ఫలానాపద్ధతి నవలంబింపవలయునని యభిప్రాయపడుదురనుకొనుడు. అట్టి సందర్భములో, ఆపద్ధతి ప్రవేశపెట్టవలయునా, అక్కరలేదా యను సంశము నిర్ణయించుటకు, దానిని ప్రభుత్వమువారు దేశము మొత్తముపైనున్న ప్రజలయభిప్రాయమునకు వదలివేయుదురు. మొత్తముపై ప్రజలలో నెక్కువమంది యెట్లు నిర్ణయించిన ప్రభుత్వమువారావిషయమున నట్లు చేయవలెను. ఇంక మూడవది ప్రభుత్వమును నడుపునుద్యోగులు ఏదైన ప్రధానమగు నొకపద్ధతిని అమలులో బెట్టవలయునని సూచింతురనుకొనుడు. అట్టి సమయమున దాని నమలుజరుపవలయునా, అక్కరలేదా యను సంశము ప్రజలకు వదలివైచి, ప్రజలలో నెక్కువమంది యభిప్రాయము ననుసరించి వర్తింపవలయునేకాని ప్రభుత్వమువారు స్వతంత్రించి దాని నమలుజరుపరాదు. (ఈ సందర్భమున, ఈ విధముగా ప్రజలనిర్ణయమునకు వదలివేయదగిన యంశము లేవి యనువిషయము మొదట పరిపాలనపద్ధతిలోనే వివరింపబడియుండును.) నాల్గవది: ఇప్పుడు మనదేశములో మనము శాసనసభలు మున్నగు వానికి వోటునిచ్చి కొందర నెన్నుకొనుచున్నాము. అట్లెన్నుకొనబడువారు ఒకసంవత్సరమో, మూడుసంవత్సరములో, ఐదు సంవత్సరములో ఏదో కొంతకాలమువరకు -శాసనసభలు మున్నగువానిలో మనతరఫున సభ్యులుగా వ్యవహరించుచున్నారు. ఇట్లు వ్యవహరించునప్పుడు అనేకులు మొదట తాము ప్రజల కొనర్చిన వాగ్దానములకు వ్యతిరేకముగా వర్తించుటను గూడ మనము చూచుచున్నాము. అయితే యిట్లు ప్రజలయిష్టమునకు విరుద్ధముగా, తమ మొదటి వాగ్దానములకు భంగకరముగా వారు ప్రవర్తించినను, ఇన్నాళ్లని మొదట యేర్పాటైయున్నవారి సభ్యత్వపు యధికారము కాలము ఆఖరగువరకు వారిని తొలగించు నధికారము మనకు లేదు. అందుచే సదరుసభ్యులు మున్నగువారు ఒక్కొక్కప్పుడు స్వలాభమునే చూచుకొని, ప్రజలక్షేమమునకు భంగకరములగు కార్యములను జేయుదురు

శించుచున్నది. ఇట్టిలోపమున కవకాశము లేకుండునట్లు చేసి, ప్రజలయిష్టము ననుసరించి ప్రభుత్వపుటుద్యోగులు నడచుకొనియే తీరవలయును, లేకున్న నధికసంఖ్యాకు లగు ప్రజలు కోరినప్పుడు వారు తప్పక రాజీనామా నొసగవలయును అనుటయే పైన జెప్పిన నాల్గవహక్కున కర్థము.]

౪

మూడవది ప్రజలలోనిసంఘములకు సంబంధించిన సమస్య. దేశములో వెనుకబడియున్న సంఘములవారికి ప్రభుత్వము సాయపడి వారిని తమ్ము దాము పరిపాలించుకొనుటకు-తమవ్యవహారములను దామ సవరించుకొనుటకు-దగినవారినిగా జేయును. చీనాదేశముపై విరోధము గలిగియుండు దేశములకు చీనాదేశమున నెట్టి సౌకర్యములను గలుగనీయకుండ ప్రభుత్వమువారు చేయుదురు. చీనాదేశము ఇతరజాతులతో సమానముగ నుండునట్లు చేయుటకై యింతకుమున్న విదేశములతో గావింపబడిన రాజీనామాలలో తగువిధమున సవరణ కావింపబడును.

౫

జాతీయపునర్నిర్మాణ కార్యక్రమమునకు మూడు మెట్లు: (1) సైనికప్రభుత్వకాలము (The Period of Military Government); (2) ప్రబోధక ప్రభుత్వకాలము (The Period of Educative Government); (3) శాసనమూలక ప్రభుత్వకాలము (The Period of Constitutional Government.)

[వీనిలో మొదటిదాని కర్థము: ప్రజల నందరను ఒక్కప్రభుత్వముక్రిందికి దీసికొనివచ్చుటలో అవసరము వచ్చినప్పుడు సైనికబలము నుపయోగించుట. రెండవదాని యభిప్రాయము: ప్రజలకు ప్రభుత్వమునకు నుండవలసిన పరస్పరసంబంధములను గురించియు, హక్కు-ధర్మములను గురించియు బోధనము మూలమునను, క్రమముగ ప్రజలకు ప్రభుత్వములో భాగస్వామ్యమొసంగుటచేతను ప్రజలనుభవములోనికి దెచ్చుకొనునట్లు చేసి, వారిని స్వపరిపాలనమునకు సంసిద్ధపరచుట. మూడవదానిభావము: ఇట్లు ప్రజలనందరను క్రమముగ నొక్కప్రభుత్వము క్రిందికి దీసికొనివచ్చి, ఆప్రభుత్వము నడుచుటకు దగినశాసనములను, పద్ధతులను ఏర్పాటుచేసి, ప్రజలయిష్టము ననుసరించి పరిపాలనము నడుపుట. ఈవిధానమంతయు గ్రమక్రమముగ నెట్లమలులో నుంచవలయునో యీక్రింద విశదముగ వర్ణింపబడినది.]

౬.

సైనికప్రభుత్వ కాలములో సాధనములన్నియు సైనికప్రభుత్వముయొక్క ప్రత్యక్షాధికారముక్రింద నుంపబడును. దేశములోని తిరుగుబాటులను అణగద్రొక్కుటకై ప్రభుత్వము తనసైనికశక్తి నుపయోగించును. దీనితోపాటుగ ప్రజలందరును తుదకు ఒకేయధికారముక్రిందికి వచ్చుటకు తగుమార్పును సంఘములో గలుగజేయుటకు ప్రజలలో ప్రబోధము కలుగజేయబడును.

[అనగా, ప్రజలు తమకు స్వాధీనము కానప్పుడు ప్రభుత్వమువారు తమసైనికబలమును ప్రయోగించి నిర్బంధమున బ్రజలను లోబరచుకొందురు. ప్రజలకు తమయభిప్రాయములను, ఆదర్శములను బోధించి, స్వాధీనపరచుకొనుటకుముందు ప్రయత్నించెదరు. ఇట్లు తమబోధనలకు లొంగనప్పుడు సైనికబలమును ప్రయోగించుటకు ప్రభుత్వమువారు వెనుదీయరని దీనియభిప్రాయము.]

౭

ఇట్టిరాష్ట్రమయినను సంపూర్ణముగ సైనికాధికారముక్రిందికి వచ్చినపుడు సైనికప్రభుత్వకాల మయిపోయిన దన్నమాట. అటుపై ప్రబోధకప్రభుత్వకాలమారంభించును.

[దేశము కొన్నిరాష్ట్రములుగాను, ఒక్కొక్కరాష్ట్రము కొన్నిజిల్లాలుగను విభజింపబడును. పైనియమమునుబట్టి, ౬ వ పేరాలో సూచింపబడినపద్ధతి మొట్టమొదటనే దేశమందంతటను ప్రవేశపెట్టబడదని యెరుంగవలయును. ముం దేదియో యొకరాష్ట్రమును దీసికొని ప్రజాప్రభుత్వము దానిలోనిజిల్లాల నన్నిటిని సంపూర్ణముగ వశపరచుకొనును.]

## ౮

ప్రబోధక ప్రభుత్వకాలములో ప్రభుత్వమువారు ప్రజలను స్వపరిపాలనకు సంసిద్ధులనుగా జేయుటకై వారిలో ప్రబోధము గలిగించుటకు అర్హులైన యుద్యోగులను ప్రతిజిల్లాలోనికిని బంపుదురు.

[ఈప్రచారకులు ప్రతిజిల్లాలోనికిని బోయి, స్వపరిపాలనముయొక్క ఫలములను గురించియు, పద్ధతులను గురించియు ప్రజలకు బోధింతురు.]

ఒకజిల్లా యీక్రిందిలక్షణములను గలిగియున్నప్పుడే సంపూర్ణముగ స్వపరిపాలనమును బొందినదని చెప్పనచ్చును. ఆలక్షణము లివి: జిల్లామొత్తముపై జనాభాలెక్క తీసికొన బడవలయును. భూముల కొలతలు నిర్ణయింపబడవలయును. ప్రజలలో శాంతిని కాపాడుటకై పోలీసుపద్ధతి యేర్పడవలయును. రహదారీలు జిల్లాయందంతటను నిర్మింపబడవలయును. ప్రజలలో తమ నాలుగుహక్కులను అనుభవములోనికి దెచ్చుకొనుటకు దగుజ్ఞాన ముండవలయును. జిల్లాను పరిపాలించు నొకయధికారి నెన్నుకొనుటకును, జిల్లాలో ప్రభుత్వపద్ధతులను నిర్ణయించు ప్రతినిధుల నెన్నుకొనుటకును ప్రజలు తగినవారై యుండవలయును.

[ప్రతినిధు లనగా ప్రజలపక్షమున వారియిష్టము ననుసరించి పరిపాలనము నడుపునట్లు ప్రభుత్వమునకు సలహాలొసంగు వారు ప్రజలచే నెన్నుకొనబడినవారే ప్రజాభిప్రాయమును సరిగ ప్రభుత్వమునకు దెలుపగలరు. ప్రజలచే నెన్నుకొనబడినవారు కాక ప్రభుత్వముచే నియమింపబడినవారుగూడ నేడు మన దేశమున కొన్నిసంఘముల ప్రతినిధులుగ నుండుట మనము చూచుచున్నాము. వారు నిజమగు ప్రజాభిప్రాయమును దెలుపజాలరు. ఇదియే యెన్నికలయొక్క యభిప్రాయము. అందులకే ప్రభుత్వమువారి నామినేషనులపద్ధతి- అనగా వారు ప్రత్యేకముగా కొందరిని నియమించుపద్ధతి - యంతరింపవలయునని మన దేశములో రాజకీయనాయకు లనుచుందురు.]

## ౯

సంపూర్ణ స్వపరిపాలనము గలిగినజిల్లాలోని ప్రజలు పైన 3 వ పేరాలో దెలుపబడిన నాల్గుహక్కులను గలిగియుండవలయును.

## ౧౦

స్వపరిపాలనమునకు తయారగుచున్న జిల్లాలలోని భూము లన్నిటికిని విలువ ముందుగ నిర్ణయింపబడవలయును. ఈ విషయమును భూమిఖామందులు ప్రభుత్వమువారికి దెలుపవలయును. అప్పుడు ప్రభుత్వమువారు పన్నులను విధించుటకాని, యవసరమైన చో పైన నిర్ణయింపబడిన విధమున విలువ నిచ్చి ఖామందులవద్దనుండి భూములను కొనుటకాని చేయుదురు. రెజిష్ట్రేషను అయిపోయిన తరువాత రాజకీయ స్థిరత్వముచే (Political Stability)గాని, సంఘముయొక్క అభివృద్ధిచేత (Social Progress) గాని భూముల విలువ పెరుగవచ్చును. ఇట్లు పెరిగినవిలువయంతయు జిల్లామొత్తముపై గల ప్రజలకందరకును జెందునే కాని యేభూమిఖామందు యొక్కయు ప్రత్యేకమగు నాస్తిగ నుండకూడదు.

[రాజకీయస్థిరత్వముఅనగా, పరిపాలనపద్ధతులలో గాని, దేశమున ప్రబలియున్న శాంతిలోగాని యెట్టిమార్పును కలుగకుండుట. సంఘముయొక్క అభివృద్ధి యనగా జనసంఖ్య హెచ్చుట; ఐశ్వర్యము, విద్య మున్నగునవి వృద్ధి బొందుట. పైకారణములను బట్టి భూములవిలువ పెరిగినప్పుడు భూమిఖామందులు వారివారికిగల ప్రత్యేకములైన ఆస్తులతో క్రొత్తగభూములనుగొనియు, ఎక్కువఖరీదునకు భూముల నమ్మియు, ప్రత్యేకముగ నెవరికివారు ఎక్కువ ధనవంతులు కావలయునన్న యాశలతో దేశమున నలజడి గలిగింపవచ్చును. ఇట్టి స్వార్థపరత్వమునకు అవకాశము లేకుండ పైవిధమున పెరిగిన విలువలను ప్రభుత్వమువారు వశపరచుకొని జిల్లామొత్తముపై ప్రజలందరకును ఉపయోగపడుకార్యములలో వినియోగింతురు. ఇందుచే జిల్లా మొత్తముపై పేదవాండ్రకు గూడ లాభము గలుగ జేయుటయే యీనియమముయొక్క యుద్దేశము.]

౧౧

ఈ క్రింది యాదాయములన్నియు స్థానికప్రభుత్వమునకు_అనగా జిల్లాప్రభుత్వమునకు_జెందును: (స్థానిక, ప్రధానప్రభుత్వములను గురించి ౧౨వ పేరాలో వివరింపబడును.) భూములపై ఏటేట వచ్చు పన్ను, పెరిగిన భూములవిలువ, సార్వజనికములగు భూముల (public lands గనులు, కొండలు, అడవులు, నదులు) ఆదాయము. ఇట్టియాదాయము బాలవృద్ధులను, నిరుపేదలను, కరవుచే బాధపడువారిని రక్షించుటకొరకును, ప్రజలక్షేమమునకై యాసుపత్రులు మున్నగుసార్వజనిక సంస్థల (public institutions) నేర్పాటుచేయుట కొరకును వినియోగింపబడును.

[సార్వజనికములగు భూములు: అనగా ప్రత్యేకముగా ఏవ్యక్తియొక్క_పోషణపైనను ఆధారపడక ప్రకృతివల్లనే వృద్ధిబొందుచుండు స్థలములు కొన్ని యుండును. అవి కొండలు, అడవులు, గనులు, నదులు మున్నగునవి. వాని నుపయోగించుకొను నధికారము జిల్లామొత్తముపై గలప్రజల కందరకు నుండును. అందుచే నివి సార్వజనికములగు భూములు అనబడును. ఇట్టిభూములవిషయమున ప్రభుత్వమువా రేమియు జోక్యము కలుగజేసికొనకున్నచో, ప్రజలలో బలవంతులైనవ్యక్తులు వానిని తమ సొంతముగ నాస్తిగ జేసికొని, యితరులకు వానిపైగల యధికారము దొలగించుటకు, వానిపై వచ్చునాదాయము దాము స్వయముగ ననుభవించుటకు బ్రయత్నింపవచ్చును. కావున నట్టిదాని కవకాశము లేకుండ ప్రభుత్వమువారే వానిని వశపరచుకొందురు. జిల్లామొత్తముపై గల ప్రజలందరిపక్షమునను జిల్లాయొక్క_ పరిపాలనము నడుపువారు ప్రభుత్వమువారగుటచే జిల్లామొత్తముపై గల ప్రజలందరకును జెందునాస్తిని స్వాధీనపరచుకొనుటకు ప్రభుత్వమువారి కధికారము కలదు. సార్వజనిక సంస్థలు అనగా మొత్తముపై ప్రజలకందరకును ఉపయోగపడు ఏర్పాటులు: విద్యాలయములు, ఆసుపత్రులు, సత్రములు మొదలయినవి. ఇట్లు మొత్తముగ బ్రజలకందరకును జెందు ఆస్తిపైవచ్చు ఆదాయము మొత్తముగా ప్రజలకందరకును ఉపయోగపడు కార్యములయందే వినియోగింప బడవలయును కాని ప్రత్యేకముగా నెవ్వరికిని చెందగూడదు. ప్రభుత్వమువారైనను దమసొంతఖర్చుల నిమిత్తము అట్టియాదాయము వినియోగించుకొనరాదు. ఇదియే పైనియమములయొక్క_యర్థము.]

౧౨

ప్రకృతిసంపదలను ఉపయోగములోనికి దెచ్చుటయు, మరియితరములగు గొప్పగొప్ప యేర్పాటులను జేయుటయు ప్రత్యేకవ్యక్తుల సామర్థ్యమునకు అసాధ్యమైపోయి పైసాయము కావలసివచ్చినప్పుడు అట్టిపనులకు ప్రధానప్రభుత్వమువారు సాయ మొసంగెదరు. ఇట్టి ప్రయత్నములవలన వచ్చుఆదాయమును స్థానికప్రభుత్వమువారును (Local Government), ప్రధానప్రభుత్వమువారును (Central Government) సమానముగ బంచుకొందురు.

[ప్రకృతిసంపద లనగా గనులు, నదులు మున్నగునవి. స్థానికప్రభుత్వము అనగా నొకప్రత్యేకస్థానమునకు జెందినప్రభుత్వమని అర్థము. అందుచే నీసందర్భమున స్థానికప్రభుత్వము అనుమాటకు జిల్లాప్రభుత్వము అని యర్థము. అట్లే దేశమునంతను బరిపాలించు ప్రభుత్వము ప్రధానప్రభుత్వము. ప్రధానప్రభుత్వము దేశము మొత్తముపై అన్నిజిల్లాలకును సమానముగ సంబంధించియుండు వ్యవహారములను జక్క_బెట్టుచుండును. స్థానికప్రభుత్వము ప్రత్యేకముగ దనక్రిందనుండు వ్యవహారములను_ అనగా బ్రత్యేకముగ దనపరిపాలనలోగల ప్రదేశమునకు సంబంధించిన వ్యవహారములను_సరిచూచుచుండును. ఉదాహరణార్థముగ మనదేశములోగల స్థానికస్వపరిపాలనసంస్థలు అను నేర్పాటులను దీసికొనవచ్చును: ఇవి గ్రామపంచాయతీలు, మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు. గ్రామపంచాయతీ ఆగ్రామమునకు సంబంధించినంతమట్టుకు విద్య, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, రాకపోకల యేర్పాట్లు మొదలైన వ్యవహారములను నిర్వహించుచుండును., అట్లేమునిసిపాలిటీ తనపట్టణమునకు ప్రత్యేకముగా సంబంధించిన వ్యవహారమును నడుపుకొను చుండును. తాలూకాబోర్డు తన తాలూకావ్యవహారములను జిల్లాబోర్డు

తన జిల్లావ్యవహారములను నిర్వహించుచుండును. ఊరక ఉదాహరణమునకై మన దేశములోని స్థానికస్వపరిపాలన సంస్థలను చూపితిని. అంతేకాని మనయీసంస్థలు నిజమైన యధికారము గలిగియున్నవని కాదు. మన దేశములోని యీసంస్థలు నేతిబీరకాయ సంస్థలని యెల్లరకు దెలిసినయంశమే.]

## ౧౩

ప్రతిజిల్లాయును తనయాదాయమునుండి నూటికి పదికి తక్కువకాకుండగను, ఏబదికెక్కువ కాకుండను గల సొమ్ముతో ప్రధానప్రభుత్వమునకు తప్పక సాయపడవలయును. సరియైన లెక్క యేటేట ప్రజలయొక్క ప్రతినిధులచే నిర్ణయింపబడును.

[ప్రతినిధు లన నేమో 8-వ పేరాలో వివరింపబడినది.]

## ౧౪

స్థానికప్రభుత్వము స్థాపింపబడిన తరువాత ప్రతి జిల్లాయును ప్రతినిధిసభలో బాల్గొని ప్రధానప్రభుత్వమునకు సాయపడుటకై యొకప్రతినిధి నెన్నుకొనవలయును.

## ౧౫

ప్రభుత్వములో పదవులను గోరి వచ్చువారు ప్రభుత్వముచే నియమింపబడు పదవులకైననుసరే, ప్రజలచే ఎన్నుకొనబడు పదవులకైనను సరే, స్థానికప్రభుత్వమునకైనను సరే, ప్రధానప్రభుత్వమునకైననుసరే ప్రధానప్రభుత్వమువారు నిర్ణయించిన యర్హతలను (qualifications) గలిగి యుండవలయును.

## ౧౬

ఒకరాష్ట్రము (Province)లోని జిల్లాలన్నియు స్వపరిపాలనమును బొందినప్పుడు ఆరాష్ట్రము శాసన మూలకప్రభుత్వకాలమున ప్రవేశించుచున్నది. ప్రతినిధిసభ రాష్ట్రముయొక్క స్వపరిపాలనము నడిపించుటకై యొక యధికారి నెన్నుకొనును. ప్రభుత్వములోని జాతీయసమస్యలకు సంబంధించినంతవరకు రాష్ట్రప్రభుత్వము ప్రధానప్రభుత్వముయొక్క యాజ్ఞల ననుసరించును.

[రాష్ట్రము, స్వపరిపాలనము బొందుట, శాసన మూలకప్రభుత్వము, అను మాటలు వరుసగా 7, 8, 9 పేరాలలో వివరింపబడినవి. రాష్ట్రప్రభుత్వము అనగా, ప్రత్యేకముగా నొకరాష్ట్రముయొక్క పరిపాలనమును నడుపుప్రభుత్వము. జాతీయసమస్యలు అనగా, జాతిమొత్తమున దేశమునందంతటను గలప్రజలకు సంబంధించిన సమస్యలని యర్థము. ఇట్లు జాతిమొత్తమునకు సంబంధించిన సమస్యలను నిర్వహించుటలో రాష్ట్రప్రభుత్వము తనరాష్ట్రమునకుమాత్రమే లాభము గలుగునట్లు చూచుకొనక ఇతరరాష్ట్రములకు వేనికిని దనమూలమున నష్టము రాకుండ, ప్రధానప్రభుత్వము చెప్పినవిధమున వ్యవహారము నడుపవలయునని యభిప్రాయము. రాష్ట్రీయప్రధానప్రభుత్వములకు గలసంబంధము మరువచ్చు పేరాలో వివరింపబడును.]

## ౧౭

ఈ కాలములో పరిపాలనాధికారములు రాష్ట్ర ప్రధానప్రభుత్వములకు రెంటికిని సమానముగ విభజించి యొసంగబడును. జాతిమొత్తమునకు సంబంధించిన పరిపాలనసమస్య లన్నియు (administrative problems) ప్రధానప్రభుత్వమునకు వశపరుపబడును. ఆయారాష్ట్రములకు ప్రత్యేకముగ సంబంధించిన వ్యవహారము లన్నియు రాష్ట్రప్రభుత్వముక్రింద నుండును. ప్రత్యేకముగ సంయోజనపద్ధతి (Centralisation) కాని, ప్రత్యేకముగ విభజనపద్ధతి (De-centralisation) కాని యవలంబింపబడదు.

[సంయోజనము అనగా దేశముయొక్క పరిపాలన పద్ధతుల నన్నిటిని గూడబెట్టి ప్రధానప్రభుత్వముచేతిలోనే యుంచుట. ఇట్లుచేయుటవలన ప్రధానప్రభుత్వమునకు భారము మెక్కుడగును. అంతే కాక, ఒకరాష్ట్రముయొక్క ప్రత్యేకస్థితిగతుల ననుసరించి యారాష్ట్రమునకే ప్రత్యేకముగ జక్కబెట్టవలసిన వ్యవహారముల నేమా

లుండును. అట్టివానిని నిర్వహించుటకు, ఎప్పుడును విడువకుండ రాష్ట్రములోని పరిస్థితులను గనిపెట్టుచుండుట దగుటవలన, రాష్ట్రప్రభుత్వమే తగియుండును. ప్రధానప్రభుత్వ మాపనిని జేయజాలదు. ఒకరాష్ట్రముయొక్క ప్రత్యేకపరిస్థితులను గనిపెట్టుచుండుటకు దానికి తీరుబడియుండదు. అందుచే సంయోజనపద్ధతిగూడదు. ఇంక, ఇదియది యను భేదములేకుండ నన్ని సమస్యలను రాష్ట్రప్రభుత్వములకప్పగించివేయుట విభజనపద్ధతి. అప్పటికి ప్రధానప్రభుత్వముయొక్క అక్కరయే లేదు. ఒక్కొక్క రాష్ట్రము తనలాభమునే చూచుకొని ఇతరరాష్ట్రములకన్యాయము గలుగచేయుట కవకాశ మున్నది. అందుచే సంపూర్ణమగు విభజనపద్ధతియు బనికిరాదు. కావున పైనవివరింపబడినరీతిని, రాష్ట్రప్రధాన ప్రభుత్వములకు రెంటికిని పరిపాలనసమస్యలను సమానముగ బంచిపెట్టుటయే యుత్తమమని నిర్ణయింపబడినది. ఉదాహరణమునకై మనదేశములోని ప్రధాన రాష్ట్ర ప్రభుత్వములను దీసికొనవచ్చును. పోస్టుఆఫీసులు మున్నగుదేశమున కంతకును సంబంధించిన వ్యవహారములు ప్రధానప్రభుత్వము (ఢిల్లీవైస్రాయ్‌గారి ప్రభుత్వము) క్రింద నున్నవి. విద్య మొదలగునవి, ప్రత్యేకముగ నాయారాష్ట్రములకు సంబంధించినసమస్యలు, రాష్ట్రప్రభుత్వములచేతులలో నున్నవి.]

## ౧౮

జిల్లా స్వపరిపాలనమునకు పరిమాణము (unit)గా నుండవలయును. రాష్ట్రప్రభుత్వము జిల్లా ప్రధానప్రభుత్వములకు రెంటికిని మధ్యస్థముగ నుండి రెంటికిని బలీయమగు పరస్పరసహాయమును సమకూర్చుచుండును.

[పరిమాణము అనగా కొలత. స్వపరిపాలనమునకు పరిమాణము అనగా స్వపరిపాలనము ఎచ్చటనుండి యారంభింపబడుచున్నదో ఆమొదటిమెట్టు. మనదేశములో గ్రామము పరిమాణము. గ్రామపంచాయతీయొక్క యేర్పాటులో నర్థ మిదియే. ఇచ్చట జిల్లా పరిమాణము. జిల్లా ప్రభుత్వము మొదటిమెట్టు; ప్రధానప్రభుత్వము పైమెట్టు; రాష్ట్రప్రభుత్వ మీరెంటికిని మధ్యస్థముగ నుండి, ప్రధానప్రభుత్వము పరిపాలించెడి దేశము మొత్తమున కంతకును సంబంధించిన సమస్యలలో, తనజిల్లాల కన్నిటికిని ఇతర రాష్ట్రములలోని జిల్లాలతోపాటు సమానమగు న్యాయమును గలుగజేయుచు, ప్రధానప్రభుత్వమునకు తనజిల్లాలు సాయపడవలసినరీతిని దప్పకుండ జూచుచు, రెండు ప్రభుత్వములతోడను సమానమగు సంబంధమును గలిగియుండి, ఇటు వ్యక్తులసౌకర్యములను, అటు జాతీయతాభావమును వృద్ధిపొందించునదిగ నుండవలయునని పైనియమముయొక్క యుద్దేశము.]

## ౧౯

శాసనమూలక ప్రభుత్వకాలమున ప్రధానప్రభుత్వము తాను చక్కబెట్టవలసిన యైదుకార్యముల కొరకును ఐదుప్రత్యేకములైన శాఖలను గలిగియుండవలయును. (1) పరిపాలన పద్ధతులను అమలులో బెట్టునది (కార్యనిర్వాహకశాఖ); (2) పరిపాలనపద్ధతులను నిర్ణయించునది; (3) ప్రజల నేరములను విచారించి న్యాయము గలుగజేయునది; (4) సివిల్ పరీక్షలను జరుపునది; (5) ప్రజల యాదాయమునుబట్టి పన్నులను విధించునది.

## ౨౦

పైశాఖలలో మొదటిశాఖయందు ఈ క్రింద సూచింపబడిన మంత్రివర్గము లుండవలయును: (1) దేశములోని ఆంతరంగిక వ్యవహారములను చక్కబెట్టునది; (2) విదేశములతో సంబంధించిన వ్యవహారము నిర్వహించునది; (3) యుద్ధకార్యములను చక్కబెట్టునది; (4) ప్రభుత్వముయొక్క ఆదాయవ్యయములను సరిచూచునది; (5) వ్యవసాయముయొక్కయు గనులయొక్కయు వ్యవహారమును నెరవేర్చునది; (6) కూలివాండ్రయొక్కయు, వర్తకముయొక్కయు వ్యవహారమును నిర్వర్తించునది; (7) విద్యావిషయములను నిర్వహించునది; (8) రాకపోకలకు సంబంధించిన వ్యవహారము నడుపునది.

## ౨౧

ప్రభుత్వవిధానము నమలులో బెట్టుటకు ముందొకయధ్యక్షుడు ఆయాశాఖల యధికారులను నియమించి,

తనయధికారమున నుంచికొని తొలగింపవలయును.

[అనగా ప్రధానప్రభుత్వము ప్రజలచే నెన్నుకొనబడక పూర్వము ప్రధానప్రభుత్వములోని యుద్యోగులను నియమించుపద్ధతి యీవిధమున నుండవలయునని యర్థము. ప్రధానప్రభుత్వముయొక్క యెన్నికనుగూర్చి ముందుపేరాలలో వివరింపబడును.]

౨౨

పరిపాలనపద్ధతులయొక్క నిర్ణయము జాతీయ పునర్నిర్మాణముయొక్క పద్ధతులపైనను, ప్రబోధకశాసనమూలక ప్రభుత్వకాలములలో జరిగినపనిమీదను ఆధారపడియుండును. ఈపరిపాలనపద్ధతులను శాసననిర్మాణ శాఖవారు (19 వ పేరాలో సూచింపబడిన రెండవ శాఖవారు) తయారుచేయుదురు. ఇట్లు తయారుచేయబడిన ప్రభుత్వవిధానము క్రమక్రమముగ - తుదియంగీకారము బడయువరకు- ప్రజలయెదుట నుంచబడుచుండును.

[శాసననిర్మాణ శాఖవారు ప్రధానప్రభుత్వముయొక్క పద్ధతులను నిర్ణయించునప్పుడు, రెండుసంగతులను దృష్టియం దుంచుకొందురు:(1)జాతీయపునర్నిర్మాణమునకు మనము తయారుచేయు ప్రభుత్వపద్ధతి యెంతవరకనుకూలముగ నున్నది? (2) దేశముమొత్తముపై ప్రజలుస్వపరిపాలనమున కెంతవరకు తగియున్నారు? అని. ఇట్లు తాము నిర్ణయించెడి ప్రభుత్వపద్ధతిని ఆయాసమయములందు ప్రజలకు దెలియజేయుచు, వారియభిప్రాయములను దెలిసికొనుచు, ఆవశ్యకములయిన మార్పులను జేయుచు, తుదకు తమపద్ధతులను ప్రజ లంగీకరించువరకిట్లే చేయుచుందురు. ప్రజలయనుమతి లేక తాము తయారుచేసిన పద్ధతుల నమలులో నుంచరు.]

౨౩

దేశములోని రాష్ట్రములలో నధికసంఖ్యాకములు శాసనమూలక ప్రభుత్వకాలమును జేరినప్పుడు, అనగా ఆయారాష్ట్రములలో బలీయములైన రాష్ట్రప్రభుత్వము లేర్పడినప్పుడు, పరిపాలనపద్ధతిని నిర్ణయించి యమలుజరుపుటకుగాను ఒకమహాజనసభ సమావేశము చేయబడును.

[ఒకరాష్ట్రము శాసనమూలక ప్రభుత్వకాలమును జేరుట యనగా నేమో 11 వ పేరాలో వివరింపబడినది. దేశములోని ప్రజలలో నధికసంఖ్యాకులు స్వపరిపాలనమునకు సంసిద్ధులైనప్పుడు ప్రధానప్రభుత్వము ప్రజలయెన్నికకు వదలివేయబడును. అంతవరకును ఒక్కొక్కజిల్లానే, యొక్కొక్కరాష్ట్రమునే పైపేరాలలో వివరింపబడినపద్ధతిని స్వపరిపాలనమునకు సంసిద్ధముగ నొనర్చుటకు ప్రజాప్రభుత్వమువారు పాటుపడుచుందురని యభిప్రాయము.]

౨౪

ప్రధాన ప్రభుత్వముయొక్క పరిపాలనవిధానము మమలులో నుంచబడినతరువాత ప్రధానప్రభుత్వముయొక్క అధికారము మహాజనసభకు స్వాధీనపరుపబడును. ఈమహాజనసభకు ప్రధానప్రభుత్వములోని కార్యనిర్వాహకుల నెన్నుకొనుటకును, తొలగించుటకును (Suffrage & Recall), పరిపాలనపద్ధతులను నిర్మించుటలో ప్రజలపక్షమున పద్ధతులను సూచించి నిర్ణయించుటకును (Initiative), ప్రభుత్వమువారిచే సూచింపబడు పద్ధతుల మంచిచెడ్డలు నిర్ణయించి యమలులో పెట్టుటకును (Referendum) అధికారము లుండును.

[కార్యనిర్వాహకు లనగా పరిపాలనపద్ధతుల నమలు జరుపునుద్యోగులు.

ఈనాలుగధికారములును 8 వ పేరాలో వివరింపబడినవి.]

౨౫

పరిపాలనపద్ధతి నమలులో పెట్టినదినముననే శాసనమూలకప్రభుత్వ మారంభమగును. జాతిమొత్తముపై నెన్నికలు జరుగును. ఎన్నికలు జరిగిన మూడునెలలకు ప్రజాప్రభుత్వము తనపరిపాలన బాధ్యతలను పరిత్య

జించును. అటుపై నాబాధ్యత ప్రజలచే నెన్నుకొనబడిన ప్రభుత్వమున కప్పగింపబడును. ఇంతటితో జాతీయపునర్నిర్మాణ కార్యక్రమము సంపూర్ణమగును.

[మొదట నొకజిల్లాలోని ప్రజలను నయభయములచే ప్రజాప్రభుత్వము వశపరచుకొని తనస్వపరిపాలన సిద్ధాంతములను దానిలో నమలుజరుపును. అటుపై నా స్వపరిపాలనపద్ధతి క్రమముగ రాష్ట్రమందంతట వ్యాపింపజేయబడును. అనంతరమున దేశము మొత్తముపై రాష్ట్రము లించుమించుగ నన్నియు స్వపరిపాలనమునకు సంసిద్ధములయినప్పుడు, దేశమందంతటను ప్రజలయనుమతితో ప్రధానమగు నొకప్రభుత్వము నిర్మింపబడును- అనునదియే ప్రజాప్రభుత్వముయొక్క కార్యక్రమము. ఈకార్యక్రమము నడుపుటలో (1) జాతీయపునర్నిర్మాణము, (2)ప్రజలను తమ్ము దాము పరిపాలించుకొనుటకు దగినవారినిగా జేయుట, (3) దేశములోని ప్రజలందరలోను జాతీయత దృఢముగ నాటుకొనునట్లు చేయుట. అను నీమూడుఆదర్శములను ప్రజాప్రభుత్వమువారు ఏమరకుండ పాటించుట గమనింపదగిన యంశము.]

---

# కవిప్రబోధము

మంగిపూడి వేంకటశర్మగారు

(వెనుకటిసంచిక తరువాయి)

ఈదివ్య భరతఖండము - నాదిసుమీ దీని కేను నాథుడను జుమీ
నాదేశముపై నొరులకు - లేదుసుమీ హక్కనుచు చలింపక నిలుడీ.

నీరిచ్చును గాలిచ్చును - కోరినభోగముల నెల్ల గూర్చును సౌఖ్యా
గార మగుజన్మదేశము - కూరిమి విడనాడు నరుడు క్రూరుడు గాడే.

భారత దేశమునకు తగు - తీరున గల్పించె గాంధిధీరు డశాంతో
దార సమరంబు దానిని - నేరుపుతో నెరపి జయము నెరయగ రండీ !

ప్రేతాన్నము దిను కాకుల - రీతిని వేయేళ్లుబ్రతికి రిత్తగ జావన్
ఖ్యాతియగునో నీతియగునో - బాతిగ మనవలయు ప్రజలు బలియనవలయున్.

అదిగో నిద్రాణంబై - నది దేశము వారె దొంగ లాయాసిరులన్
గదిసి హరించుచునుండిరి - పదిలంబుగ మేలుకొలుపవలదే ప్రజలన్.

లెండయ్యా దీక్షితులై - రండయ్యా దేశభక్తి రతులు ప్రజకి
య్యండయ్యా శూరు లగుచు - పొండయ్యా స్వేచ్ఛ వేగముగ తెండయ్యా!

---

# వెండ్లూరుశాసనము

వంగోలు వెంకటరంగయ్యగారు

నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాలో వండ్లూరను అగ్రహారము గలదు. ఇది కండ్లేరు నాబరగు కణ్వాన దీతటమున నున్నది. విజయనగరవంశములోని విజయదేవరాయలు మల్లినాథుడను విద్వాంసుని కీయగ్రహారమును "శాకాబ్దే వసురామవహ్ని శశిభృత్ సంజ్ఞే గతే మన్మథే, వర్షే కార్తికశుక్లవిష్ణుదివసే సోమస్య వారే శుభే" దాన మిచ్చినటు లున్నది. దీనివలన ఈ దానము శాలివాహనశకవర్షంబులు ౧౩౩౮ది యందు జరిగినది. ఇది క్రీస్తుశకము 1416 నకు సరియగుచున్నది. దానము జరిగి 511 సంవత్సరము లయినది. విష్ణుదివస మనగ ద్వాదశి: కాలామృతమున ప్రథమబింబ ద్వితీయశ్లోకము వలన దెలియుచున్నది. కార్తికశుక్లద్వాదశీ పుణ్యదినమున జేసినదానము లనేకములు గలవు. బట్టరువర్తు వేణుగోపాలశెట్టిగార్లు ప్రకటించిన నెల్లూరుజిల్లాశాసనములలో పోలెపల్లి, యరసపల్లి, మామిడిపూడి లోనగు గ్రామదానశాసనములు ద్వాదశీతిథియందే జరిగినవి.

ఈ దానశాసనము మూడురాగిరేకులపై నున్నది. ఒక్కొకరేకును $7\frac{1}{2}$ అంగుళముల పొడవును, $5\frac{1}{2}$ అంగుళముల వెడల్పును గలిగి యున్నది. ఈ మూడురేకులును దిట్టమగు నొకరాగికడియమున గూర్పబడియున్నవి. ఈ కడియముమీద రాగిరువ్వ యంతటి దిమ్మ యున్నది. ఈ దిమ్మమీద వరాహాకృతి చెక్కబడియున్నది. ఈ శాసనమున కది రాజముద్ర.

ఈ శాసనము నందినాగరాక్షరములలో జెక్కబడియున్నది. ఈ మూడురేకులలో మొదటిరేకు రెండవప్రక్కన పదునెనిమిదిబంతులు, రెండవరేకు ఇరుప్రక్కల ప్రక్కకు పదునెనిమిదిబంతులు, మూడవరేకు మొదటిప్రక్కన పదమూడుబంతులు గలవు. మూడవరేకు కడను "శ్రీవిరూపాక్ష" యను నక్షరములు కన్నడమోడిగల తెలుగున నున్నవి.

ఈ శాసనము సామాన్యముగ జదువ నలవియగుచున్నది. కాలగతివలనను, శిల్పిలోపమువలనను కొన్ని యక్షరములు స్ఫుటములుగ గన్పడవు. చెక్కడమునకై శిల్పి కీబడిన వ్రాతప్రతియందు లేఖక ప్రమాదము లెండుగ నుండినట్లు తోచుచున్నది. అవి శిల్పితప్పులు కాజాలవు. వానిలో కొన్నిటి నీక్రింద జూపుచున్నాను: ఈస్ఖాలిత్యములలో 2, 3, 4, 5, 6, 9, 10, 11, 12, 13 ల వలన ఛందోభంగము గలుగుచున్నది:

| రేకు | ప్రక్క | పంక్తి | చెక్కబడియుండు అక్షరము | ఉండవలసిన యక్షరములు |
|---|---|---|---|---|
| ౧ | ౨ | ౧ | సైవ్య | సేవ్య |
| ... | ... | ... | వక్ర | వక్త్రీ |
| ... | ... | ౨ | జన | జన్మ |
| ... | ... | ... | నిత్య | నిత్యం |
| ... | ... | ౩ | కలప | కలాప |
| ... | ... | ౭ | నృపేశే | "శే"అధికాక్షరము |
| ... | ... | ౬ | సిద్దః | సిద్ధః |
| ౨ | ౧ | ౫ | అఘండ | అఖండ |
| ... | ... | ౧౧ | ముఖ | ముఖ్య |
| ... | ... | ౧౭ | రాజాధిరాజు | "ధి"అధికాక్షరము |
| ౨ | ౨ | ౭ | గుండలూత్తర | గుండలూరుత్తర |
| ... | ... | ౧౩ | సయుంతో | సంయుతో |
| ... | ... | ౧౮ | కండ్లరు | కండ్లేరు |
| ౩ | ౧ | ౮ | సగ్రదిభిః | సగరాదిభిః |
| ... | ... | ౬ | త్రిబువన | త్రిభువన |

ఈ శాసనమున "థ"కార "ధ"కారములు విచ్చలవిడిగ నొండొరు స్థలముల నాక్రమించుకొని యున్నవి. ఈస్ఖాలిత్యమున కుదాహరణములు వేరుగ నీయ నక్కరలేదు. శాసనము చదువుచుండ నెన్నియైన గోచరింపగలవు. ఇట్లు వర్ణక్రమలోపములు ఇంకను కొన్ని గలవు: "య" "అమర్త్య" అనుటకు "అమర్త్యః" యనుట;

స్మిన్" అనుటకుగాను "యస్మింన్" అని అనుస్వార మును జేర్చుట; "గుండ" ను "గుండ్డ" యనుట; "ధర్మ" మును "దమ్మన్" యనుట ఇత్యాదు లున్నవి. రేఫసంయోగము వచ్చుచోట్ల ప్రాయికముగ వలపలిగిలక కు సరియగు నాగరచిహ్నము (అనగ నక్షరముపైన రేఫముయొక్క పొర్లు) చూపబడియున్నది. అక్షరదుష్టములగు కొన్నిశ్లోకములు చక్కగ నన్వయమగుట లేదు. మొట్టమొదటిశ్లోక మిందు పదాహాగణము కాగలదు.

ఈ శాసనమునందో అన్యగతముల ముప్పదియొక్క శ్లోకము లున్నను పదునెనిమిదివరకే శ్లోకసంఖ్య వేయబడి యున్నది. శాసనలిపి నాగరమయినను శ్లోకసంఖ్య తెలుగుఅంకెలలో నున్నది. ఏపొరపాటున నాల్గవసంఖ్య నాల్గవశ్లోకాంతమున బడక శ్లోకమధ్యమున బడినది.

శాసనమున దాతృవంశావళి యిటు లున్నది:—

చంద్రుడు
⁂
యదువు
⁂
సంగమమహీపతి
|
బుక్కనృపతి = మైలాంబా
|
హరిహరరాయలు = మెలాంబిక
|
దేవరాయలు = దేమాంబిక
|
విజయదేవరాయలు = నారాయణాంబ

ఈ వంశావళి సూయల్ గారు నిర్ణయించిన వంశవృక్షమునకును, Sources of Vijaynagar History అను విద్యానగరచరిత్రాకర గ్రంథములోని వంశవృక్షమునకును సరిపోవుచున్నది. బట్టరువర్తి వేణుగోపాల శెట్టిగార్లు ప్రచురించిన నెల్లూరుజిల్లా శాసనగ్రంథమున లింగంపాడుశాసనములో బుక్కని మహిషి గౌరాంబిక యనియు, వీరికి హరిహరుడు కలిగెననియు, దేవరాయని భార్య హేమాంబికయనియు నున్నది. హేమాంబికయే ఈ వండ్లూరుశాసనమున "దేమాంబిక"గ వ్రాయబడినది కాబోలు. ఈవంశవృక్షములోని బుక్కడు ప్రథమబుక్కడుగను, హరిహరుడు ద్వితీయహరిహరుడుగను, దేవరాయడు ప్రథమదేవరాయడుగను నుండవలెను. విజయదేవరాయలు తనతల్లియగు "దేమాంబ" పేర ఈ అగ్రహారదానము చేసినటులు "దేమాంబాపుర మగ్రహారమపిద గ్రామం విధాయాఖ్యయా" యను పదునేడవ శ్లోకములోని వాక్యమువలన స్ఫురించుచున్నది. ఈ గ్రామమునకు వాడుకపేరు "వెండ్లూరు" అని శాసనమువలన తెలియుచున్నది. ఇప్పటి వాడుకపేరు "వండ్లూరు" అయినది. దేమాంబాపురాగ్రహార మను పేరు వాడుక తప్పినది.

ఈదానము మల్లినాథుడను విద్వాంసునికి జేయబడినది. ఈతడు వసిష్ఠమునిగోత్రజుడు. ఈతనివంశాను క్రమణిక ఇందు లేదు. "తుర్మిశ్లాలయ మల్లినాథవిదుషే" యని పదునెనిమిదవ శ్లోకమున నున్నది. దీనివలన ఈతడు తుర్మెళ్లగ్రామ వాస్తవ్యు డగునో, లేక వీరియింటి పేరు తుర్మెళ్లవారో తెలియ వలనులేదు. రాపూరు తాలూకాలో తురిమెర్ల అను గ్రామ మిప్పటికిని కలదు. ఈ యగ్రజన్ముడు వేదార్థవిచ్ఛ్రేష్ఠుడని శాసనమున గలదు.

దానమీబడిన గ్రామము ఉదయశైలరాజ్యతిలకమగు రాంపూరిసీమాస్థలములోనిది. దానప్రశంస గల పదునేడవశ్లోకమున "కృత్వా దాన మనుత్తమం తిలగిరే వెండ్లూరు నామాంకితం" అని యున్నది. "తిలగిరే" యనుటలో నేమిభావమో తెలియలేదు. తిలదానాంగముగ ఈగ్రామము దానము చేయబడిన దనియా? లేక ఆగ్రామప్రాంతముల తిలగిరి యనునది యున్నదియా?

గ్రామసీమానిర్ణయము ఆకాలపు దేశ్యనామములతో నున్నది. శ్రీగుండెలూరు (గుండవోలు?)న కుత్తర ప్రాచ్యదిక్కున కణ్వనదీ తటమున నుండు నీగ్రామము భోగాష్టకముతోడ దానమియ్యబడినది. గ్రామమునకు తూర్పుఎల్ల "బొల్లిరాళ్లు" అని యున్నది. బొల్లి యనగ తెలుపుబట్టలు గలది యని యర్థము. సంస్కృతాక్షరమాలికయందు హ్రస్వఒకారము లేనందున ఈస్వరము వచ్చు

టకు "బొల్లి రాళ్లు" అనుటకు మారుగ ముందొకఅకారమును బెట్టి "అంబొల్లి" అనియు, "అబొల్లి" యనియు శాసనమున వ్రాయబడియున్నది. ఈఎల్లలలో ననేకములు ఇప్పటికిని శాసనములోని పేళ్లనే కలిగియున్నవని తెలియుచున్నది. సీమానిర్ణయము బొల్లి రాళ్లకడ బయలువెడలి నలుదిక్కులు తిరిగి తుదకు తిరుగ అబొల్లి రాళ్లకడనే సమాప్తమైనది. ఎల్లలవిషయమున రెండవ రేకు రెండవప్రక్క 12 వ బంతిలోని యక్షరములు బాగుగ తెలియలేదు.

రెండవరేకు రెండవముఖమునందలి పదియారవ బంతిమొదలు శాసనాంతమువరకు దానఫలమును, దానభంగమువలని దోషములను దెలుపు వాడుకశ్లోకములు గలవు. మాంధాతాచేత్యాది చాటుశ్లోకమును దీనిలోని కెక్కినది.

శాసనాంతమున నుండు మంగళవాక్యము "మంగళమహా శ్రీ శ్రీ శ్రీం జేయును" అని తెలుగుమాటలతో విలసిల్లుచున్నది.

అగ్రహారికులలో నొకరగు బ్రహ్మశ్రీ సెనగవరపు వెంకటసుబ్రహ్మణ్యముగారీ తామ్రశాసనమును దెచ్చి నాకు జూపిరి. వారిసమ్మతిపడసి దీని సైక్లోయచ్చొత్తి తెలుగున వ్రాసితిని. దీనియందు అశ్రుతపూర్వములగు చరిత్రాంశము లేమియు లేవు. అయినను శ్రుతపూర్వమగు శ్రీవిద్యానగర రాజవంశావళి నిది రూఢి చేయుచున్నది.

మరియు ఆకాలపురాజులు మూల మూలలలో నుండు విద్వాంసుల కనుగొని సన్మానించి విద్యాపోషణము జేయుచుండుటయు తెలియగలదు. ఇంతియ కాక యేమహాపురుషుని ప్రాపున మాధవసాయణులు వేదభాష్యముల రచించి ప్రకటించిరో, అట్టివాని పవిత్రవంశము నలంకరించిన విజయదేవరాయలును వేదాభిమానియై వేదార్థవిచ్ఛేత్తృల పోషణకై ఆచంద్రార్కమగు నీభూదానము జేసెను. భరతఖండము మహోన్నతదశకు రావలయునన నైదికమార్గాలంబన మే పరమసాధనమని శ్రీవిద్యారణ్యులు విద్యానగర రాజ్యస్థాపనామూల స్తంభముగ నెలకొల్పిరి.

నాగరాక్షర విన్యాసభేదముల నభ్యసించుట కీ శాసనము మిక్కిలి ప్రయోజనకారిగ నుండగలదు. శాసనము చిన్నదైనను అక్షరస్వరూపభేదములు మెండుగ గలవు.

ఈశాసన మిడెవర కెచటను ప్రచురము కాలేదని యగ్రహారికు లొకరు చెప్పినందున దీని బ్రకటింప సాహసించితిని. దీని జదువుటయందును, తెలుగక్షరముల పరివర్తనము చేయుటయందును నే నొక్కరుడ స్వతంత్రప్రవర్తనము బూననొల్లక హితపరులును, ఇచటి సంస్కృతశాస్త్రపాఠశాల (Sanskrit College) లో శిరోమణితరగత్యుపాధ్యాయులును, తర్కసాహిత్యమీమాంసావిచక్షణులును నగు శ్రీమాన్ కవితార్కికసింహ గోవిందాచార్యులవారియొక్క సహాయమునువిశేషముగ బొందితిని.

మొదటిరేకు : రెండవప్రక్క

౧ అవిఘ్నమస్తు। అగజోద్ధమప్రిప్రసైవ్యమానంగజవక్త్రిహారిణా
౨ ప్యజననిత్య శివజంశివజన్మహేతుభూతంవలయేపారిష
౩ ద్యాగ్రగణ్యమీడ్యం। ౧। సదాపగాచంద్రజటాకలపంసదానవంవి
౪ త్రిదివారిమారం। సదారదేహార్ధమనంతహారంసదావిరూపాక్షమమంభ
౫ జేహం। ౨। అస్తిప్రశస్తచరితోయదురిందువంశేవంశేస్యసంగమమహీప
౬ తిరావిరాసీత్। తస్మాదశేషధరణీభరణాహబాహుశ్రీవీ
౭ రబుక్కనృపతిర్నృపతీందురాసీత్। ౩। యస్మిం న్దదత్యవనిపే శేబహుహేమరా
౮ శిదానానిభూసురగణాయదినేదినేపి। ౪। రాధ్యాశ్వకర్ణఇవ

యత్కుప తేః ప్రసిద్ధస్సర్వోర్జగతస్సధనదః కిమితిస్తువేతం। మహిషీ తస్యామెలాంబాతస్యాముత్పాదితస్సుతః। రామోహరిహరశ్శత్రుమయ శోహారాపహారకః। ౫। యత్ పాణిదత్తబహుదానజలప్రవంతీ సంయుక్తదీర్ఘతరభంగకరో మహాబ్ధిః। లావణ్యమామృగయత హరిదశ్వభావాద్యన్నామభీతఇవతీక్ష్ణకరోస్తమేతి। ౬। మేలాంబికాయామంతనయోస్యజాతస్సంక్రందనాభోభువి దేవ రాయః। యస్మిన్ ధరాంశాసతినాకలోకాదప్యాభిమింవిశంతివసుదే వరాయః। ౭। యస్మిన్ క్షితీశే పృథివీభుజంగరాజాస్యదంష్ట్రా గ్రవిషోత్థదుఃఖం। విస్మృత్యఖేలత్యతులేభుజాంసేనద్భుత్యాలాబా ద్ద్రుఢమస్యహృష్టా। ౮। యద్విద్విషన్మణిమందిరాంగణగతప్రో

## రెండవ రేకు : మొదటి ప్రక్క

న్మత్తదంతిక్షురద్దానాంభఃపరిపూర్ణక్కృత్రిమనదీస్తత్తురంతదా బంధనం। సేవాయాతమృగీదృశస్తనతటేవిన్యస్తకస్తూ రికాలేఖైరేవహితన్వతేసబలవాన్ రాయఃకథంవర్ణ్యతే। ౯। యస్యాగ్రగణ్యమహిషీకులశీలయుక్తాదేమాంబికాభవ దమర్త్యవరాంగనాభా। తస్యామఖండమహిమావిజయోజయశ్రీక న్యావరఃకమలనాభఇవావిరాసీత్। ౧౦। జితాన్యనగరే భద్రే తుంగభద్రాసమన్వితే। విద్యాఖ్యనగరే ప్రాపత్ పితృసింహాసనంశు భం। ౧౧। యస్యాస్థాననికేతనాంగణభువి ప్రాతర్యథాశర్వరీ మధ్యాదిస్సమయోవిభాతిసతతంప్రావృడ్యథావిక్రమా। సేవా యాతనృపేంద్రహైమమకుటబద్ధప్రభాజాలకైస్తన్మత్తద్విపముఖదా నసుమహాసారాతిపాదైర్ఘనైః। ౧౨। నారాయణాంబామహిషీ సురూపాయస్యాభవచ్ఛ్రీరివచక్రపాణేః। తత్త్రైవసోయంరమ తేసుశీలశ్చైతోభిలాషంజగదేకవీరః। ౧౩। రాజాధిరా జపరమేశ్వరవీరరాయో। భాషాతిలంఘ్యనృపవారవధూ భుజంగః। విఖ్యాతమువ్వరపదాన్వితరాయగండఃప్రఖ్యాత శౌర్యపరరాయభయంకరోసౌ। ౧౪। ఇందురాయసురత్రాణః సోష్టదిగ్రాయభీకరః। రాజాధిరాజోవితరణేమాగధైః పరికీర్త్యతే। ౧౫। కదాచిత్పంపాసరసస్తీరేవిక్రమ

## రెండవ రేకు : రెండవ ప్రక్క

భూషణః। విరూపాక్షస్యపురతస్సుగతోదానవాంఛయా। ౧౬।

శాకాబ్దేవసురామవహ్నిశశభృత్సంజ్ఞేగతేమన్మథేవర్షేకార్తి-
కశుక్లవిష్ణుదివసేసోమస్యవారేశుభేకృత్వాదానమనుత్త
మంతిలగిరేవేంణ్డూరునామాంకితం దేమాంబాపురమగ్రహారమపిచగ్రా
మంవిథాయాఖ్యయా। ౧౭। ఆచంద్రార్కమదాద్విశిష్టమనః నిగోత్రాయా
గ్వేదార్థవిచ్ఛే(శ్రే)ష్ఠాయోదయశైలరాజ్యతిలకేరాంపూరిసీమాస్థలే।
తుమ్మిర్లల్లలయమల్లినాథవిదుషే। శ్రీగుండ్లజలూత్తరాప్రాచ్యాంక
ణ్వానదీతటేసుకుచిరేభోగాష్టకేనాన్వితం। ౧౮। అథగ్రామ
స్యసీమాయాలిఖ్యంతేవథినిర్ణయాః। ప్రాచ్యాంత్ప్రయంబోలి
రాలుస్తతస్తమ్మనకుంటికా। తతోపిపలుంగురాయశ్చరాలగు
ట్టస్తథైవచ। అతిప్పగ్రాద్రాళ్లగుట్టాస్తతః ప్రభృతి కేవనం। త
ద్గ్రాంవహ్నిదిగ్భాగేతతః పశ్చాదదుగ్నతుః। ఉడ్డదిప్పాశ్చయామ్యేతువాంగుః
కుంటశ్చసయుంతౌ। నామ్నా కాల్లతిభక్తస్యప్రసిద్ధౌతావుభా
వపి। సవీవవాంగుర్నైరుత్యాంయత్రకాణ్వసరిద్గతః। కండ్లరుః
పశ్చిమేభాగేదితుశేషాసుసానదీ। అబోల్లరాల్లపర్యాం
తంనద్యాదక్షిణతస్తటాత్॥మత్కృతస్యాస్యధర్మస్యవి
రోధంయోనరాధమః। కరోతిబ్రహ్మహత్యాదిపాతకైఃఫలమ
శ్నుతే॥సామాన్యోయంధర్మసేతుర్నృపాణాంకాలేకాలేపాలనియో

మూడవరేకు : మొదటిప్రక్క

భవద్భిః।సర్వానేతాన్భావినఃపార్థివేంద్రాన్ భూయోభూయోయాచతేరామభద్ర॥
దానపాలనయోర్మధ్యదానాచ్ఛ్రేయోనుపాలనం। దానాత్స్వర్గమవాప్నోతిపాలనా
స్వదత్తాద్ద్విగుణంపుణ్యంపరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ [దచ్యుతంపదం
స్వదత్తంనిష్ఫలంభవేత్॥బహుభిర్వసుధాదత్తారాజభిస్సగరాదిభిః
యస్యయస్యయదాభూమిస్తస్యతస్యతదాఫలం॥స్వద
త్తాంపరదత్తాంవాయోహరేతవసుంధరాం। షష్టిర్వర్షసహస్రాణి
విష్టాయాంజాయతేక్రిమిః॥ఏకైవభగినీలోకేసర్వేషా
మేవభూభుజాం। నభోగ్యానకరగ్రాహ్యావిప్రదత్తావసుం
ధరా॥మాంధాతాసమహీపతిస్త్రిభువనాలంకారభూతోగ
తస్సేతుర్యేనమహోదధావిరచితఃక్వాసౌదశాస్యాంతకః
అన్యేచాపియుధిష్ఠిరప్రభృతయోయాతాదివంభూపతేనైకేనా
పిసమంగతావసుమతీనూనంత్వయాయాస్యతి॥
లక్ష్మీనారాయణాభ్యాంనమః। మంగలమహాశ్రీశ్రీశ్రీం జేయును
శ్రీవిరూపాక్ష



౧. మొదటి రేకు- రెండవప్రక్క

## వెండ్లూరుశాసనము-మూలము



౨. రెండవ రేకు-మొదటిప్రక్క



3. రెండవ రేకు-రెండవప్రక్క

# కళింగదేశములోని శాసనములు—తేదీలు

గో. రామదాసుగారు

(౫ వ సంపుటము ౩ వ సంచిక తరువాయి)

## శ్రీకూర్మదేవాలయములోని శాసనములు

నెం. 1200

పంక్తి 1 స్వస్తి శకవరుషంబులు ౧౨౬౮ గు నేంటిప్రతాప

2 వీరనరనారసింహ్యదేవస్య ప్రవర్ధమానవిజయరా

3 జ్యసంవత్సరంబులు ౨3 శ్రాహికుంభశుక్ల ప్రతిపద

4 బుధవారము...

క్రీ. వె. 1346 లో జనవరు ది 25 నుండి ఫిబ్రేవరు ది 23 వరకు కుంభమాసము. జనవరు ది 24 మాఘ శు. ౧ మి. ఫిబ్రేవరు 21 మాఘాంతము. ఫిబ్రేవరు ది 22 నుండి ఫాల్గుణమాసారంభము. కాన కుంభ శుద్ధ ప్రతిపత్తు అంటే మాఘ శు. ౧ యైనా గావచ్చు, ఫాల్గుణ శు. ౧ యైనా గావచ్చు. కాని మాఘ శు. ౧ మంగళవార మైనది. ఫాల్గుణ శు. ౧ బుధవార మైనది. ఈ పైశాసనములో జెప్పినది ఫాల్గుణ శు. ౧ యే. కాన శాసనపు తేదీ

=క్రీ. వె. 1346 ఫిబ్రేవరు ది 22 బుధవారము.

నెం. 1201

1 శ్రీశకే వేదశైలేత్రిశతిపరిమతే [మా]ఘ-

2 వీమః శతిథ్యాం పంచమ్యాం భానువారే।

=క్రీ. వె. 1453 జనవరు ది 23 ఆదివారము.

నెం. 1202

1 శ్రీశాలివాహనశక సంవత్సరములు

2 వెయ్యేడు నూటముప్పదారు వెళ్ళగను ప్రమోదూ

3 తహాయన వైశాఖ శుద్ధ తృతీయార్క శుభది

4 నమున మృగశీర్ష నక్షత్ర మేషలగ్నమందు-

వెయ్యేడు నూటముప[దా]రు సరి కాదు. వెయ్యేడునూటముప[ది]రు అని యుండవలెను. ప్రమోదూత సంవత్సరమునకు సరియైన శాలివాహన శక వత్సరము 1732 గాని 1736 గాదు. కాన ఈశాసనపు తారీఖు

=క్రీ. వె. 1810 మేయి ది 6 భానువారము.

రోహిణి వెళ్లగా మృగశిర. సూర్యోదయమైన ౧౨ విఘ. మీనలగ్నము; తదుపరి మేషలగ్నము.

నెం. 1203

1 స్వస్తిశ్రీ [॥] శాలివాహనశకే గతాబ్దాః ౧౬౮౫ కాంగ్గా

... ... ... ...

7 ... ... శ్రీమత్స్వభాన్వా(ం) హ్వయే [।]

8 వర్షే మాసి చ జేష్ఠ సంజ్ఞని నిజే చిత్తాఖ్య ఋక్షే శుభే

9 శ్రీమత్సద్దశమీ దినే శుభకరే వారే చ సోమస్య వై ॥౨॥

= క్రీ. వె. 1763 జూన్ ది 20 సోమవారము.

ఆరోజున చిత్రా నక్షత్రము 35 ఘ. 24 విఘ. లవర కుండె.

నెం. 1204

1. స్వస్తిశ్రీ శాకవర్షే మణిశశిరవిగే శ్రావణే శుక్లపక్షే ప-

2. ంచ్చమ్యాం జీవవారే ... ... ... ...

... ... ... ...

12. ... ... ॥స్వస్తిశ్రీ [॥]

13. శకవరుషంబులు ౧౨౮౯ గు నేండు వీరశ్రీ నరసింహ్యదే-

14. [ప్ర] స్య ప్రవర్ధమానవిజయరాజ్య సంవత్స రంబులు ౨౩ గు

15. శ్రావిక కర్కాటక శుక్ల ౫ గురువారమున

... ... ... ...

= క్రీ. వె. 1297 జూలై ది 25 లక్ష్మీవారము.

కర్కాటక ప్రవేశము జూన్ ది 28 న. కర్కాటకాంతము జూలై ది 28. శ్రావణశుద్ధము జూలై 21 నుండి ప్రారంభము. అందుచే కర్కాటక శు. ౫ =శ్రావణ శు. ౫.

ఈశాసనము గంగవంశపురాజైన వీరశ్రీ నరసింహ్మ దేవుగారి రాజ్యకాలములో 23 వ సంవత్సరమది. ఈ 23వ సంవత్సరము శాలివాహన శక సం. 1219 కి సమానము.

నెం. 1205

1. స్వస్తిశ్రీ [||] శాకాబ్దేరవి బాణసాగరయుతే పౌషాదిశుక్లే దినే వీరశ్రీ-

2. వరభానుదేవ నృపతి[:] శ్రీ కూర్మనాథ యహి[|] వీరశ్రీ నరసింహ్యదేవ

3. నృపతేశ్చాయాంచ గంగాంబికా [|] చ్ఛాయాందీపకళా ధరార్పితకరాం ప్రాదా-

4. త్ప్రితాపోన్నతః|| వీరశ్రీ భానుదేవస్య ప్రవర్ధమాన విజయరాజ్యతృతీ

5. యాంక్కే మకరస్థే రవౌ పౌషే శుక్లప్రతిపది భృగువారే ...

... ... ... ...

శాలివాహన శక 1275 పుష్య శు. ౧ శుక్రవారము. మకరమాసము. క్రీ.వె. 1353 సం. లో మకరప్రవేశము డిశంబరు ది 26 న సూర్యాస్తమయమైన తర్వాత గావున ది 27 న సంక్రాంతి దానధర్మములు. ఆదినము ప్రతిపత్తు సూర్యోదయాది 7 ఘు. 48 విఘ. లున్నది. కాన ఈశాసనకాలము

= క్రీ. వె. 1353 డిశంబరు ది 26 శుక్రవారము.

ఈశాసనమువల్ల వీరశ్రీ నరసింహదేవ నృపతియొక్కయు, ఆయన భార్య గంగాంబికగారియొక్కయు రూపములుగల రెండుప్రతిమలు దీపాలు పట్టుకొన్నట్లు ఉంచిన చేతులు గలవి (దీపకళాధరార్పితకరాం) స్వామికి సమర్పించినట్లు తెలియుచున్నది. ఆవిగ్రహములిప్పుడు ఆలయములోనే యుండియున్నయెడల ఆలయాధికారులతో జెప్పి వానిని జాగ్రత్తపరచుట దేశాభిమానులకెల్లరకును ముఖ్యమైనపని. లేని యెడల అవి యేమైపోయినవో చర్చజేసి వాటిని తిరుగ సంపాదించుట గూడ నట్టిదే.

నెం. 1206

ఇందు తేదీ యివ్వలేదు.

నెం. 1207

1. స్వస్తిశ్రీ [||] శకవర్షంబులు ౧౩౦౧ అగునేంటి కార్తిక కృష్ణదశమి

2. ని గురువారమున ... ...

=క్రీ. వె. 1379 అక్టోబరు 6 గురువారము.

నెం. 1208

1 స్వస్తిశ్రీ[||]శాకవర్షంబులు౧౩౦౧ అగునే...

2 నరసింహ్యదేవ నృపతేస్తార్తీయ్యకేంకే ఘటమానే బ్రహ్మదినే ... ... ...

... ... ... ...

4 ... |వీర... ...

5 సిహ్యదేవస్య ప్రవర్ధమాన విజయరజ్య సంవత్సర......

6 ంకే చిహన్యమానే కుంభ శుక్ల త్రితీయాయాం గురువారే......

శాలివాహన శకవర్షములు 1301 లో కుంభప్రవేశము జనవరు ది 25 న 54 ఘుడియలకు. అనగా కుంభమాసప్రారంభము ది 26 నుండి. ఫిబ్రేవరు ది 7 నుండి

ఫాల్గుణ శుక్లపక్షము ప్రారంభము. కాన కుంభ శుక్ల 3 అంటే ఫాల్గుణ శు 3 అనియే.

=క్రీ. వె. 1380 ఫిబ్రేవరు ది 9 గురువారము.

ఈరోజున తదియతిథి 28 ఘ. 48 విఘ. లవర కున్నది.

నెం. 1209

1 స్వస్తిశ్రీ సాకవర్షే మునినయన కరత్మామితే జ్యేష్ఠపక్షే శుక్లే ప్రా-

2 దా తృతీయాయుత గురుదివసే

=క్రీ. వె. 1305 మేయి ది 27 గురువారము.

ఈరోజున తృతీయాతిథి 28 ఘ. 48 విఘ. లవర కుండె.

నెం. 1210

1 స్వస్తిశ్రీ [||] సకాబ్దే శశిసింధునేత్రధరణీ సంఖ్యాన్వితే ద్వంద్వకేమ-

2 సే శుక్లదినే దశే శుభమయే పక్షే గవాం భార్గవే|

=క్రీ. వె. 1319 నవంబరు ది 23 శుక్రవారము.

నెం. 1211

1 శ్రీమత్తుర్య్యనృసింహ్య బూతాళపతే చాతుర్థ కేం కే ఘటామా

2 నేచ సితపంచమీ గురుదినే... ...

... ... ... ...

6 ... | స్వస్తిశ్రీ [||] శకవర్షంబులు ౧౩౦౨ అగునేంటి (|) వీర శ్రీ నరసింహ్య

7 దేవరా ప్రవర్ద్ధమాన విజయరాజ్య సంవ్వాత్సరంబులు ౮౦ కుంభాపాహినం

8 భకృష్ణ ౫ గురువారాన

= క్రీ. వె. 1381 ఫిబ్రేవరు ది 14 గురువారము.

నెం. 1212

1 శాలివాహన శకశరదంబులును వెయిణ్నూట త్రిదశకంబెలు

2 రెండు వర్త్రమోదూత సంవ్వత్సర వైశాఖ మాస శు-

3 క్లతదియ మరియు భానువారము మృగశిర

4 నక్షత్రంబు రాశి మేషంబున ... ...

ఈ శాసనము నెం. 1202 శాసనమును విపులముగా జేసినది.

నెం. 1213

1 శాకాబ్దే శశినేత్ర బాణనాయనేత్వాషాఢక్రి

2 ష్ణే తిథౌ సప్తమ్యాం ...

... ... ... ...

7 ... | ప్రతప శ్రీవీరనరనారసింగ్గ-

8 దేవంక్కర విజయరాజ్య సంవత్సర శ్రా-

9 —యిని కక్కాటక క్రిష్ణ ౭ రవివారే.

శాలివాహన శకవత్సరంబులు 12౮2 లో కర్కాటకప్రవేశము జూన్ ది 28 న; సింహప్రవేశము జూలై ది 29 న. జూన్ ది 28 మొ|| జూలై ది 29 వరకు కర్కాటక మాసము. జూన్ ది 16 మొ|| జూలై ది 16 వరకు ఆషాఢము. అందుచే కర్కాటక కృష్ణపక్షము ఆషాఢ కృష్ణపక్షమునకు సరిపోవును. ఈశాసనము తేదీ

= క్రీ. వె. 1330 జూలై ది 8 ఆదివారము.

నె. 1214

1 స్వస్తిశ్రీ శాకవర్షే శశిగుణరవిసే చాశ్వాయు-

2 క్శుక్లపక్షే మాసేకాంతేయతిథ్యాం సుర

3 గురుదివసే ... ... ...

... ... ... ...

10 ... ... | స్వస్తిశ్రీ [||] శకవర్షం

11 భులు 1231 గునేం [ట్రి] శ్రీజగన్నాథదేవర విజయరాజ్య సంవ్వత్సరంబు

12 లు 3 గు క్రాపికన్య శుక్ల ౫యు గురువారమున ...

శాలివాహన శకవత్సరంబు ౧౨౩౧ లో కన్యామాసము ఆగష్టు ది 29 మొ|| సెప్టెంబరు ది 28 వరకు.

ఆశ్వయుజ శుద్ధము సెప్టెంబరు ది ౯. నుండి ది 20 వరకును. ఇదియే కన్యామాసములో వచ్చిన శుద్ధపక్షము. కాన ఈ శాసనము లేదీ

=క్రీ. వె. 1309 సెప్టెంబరు ది 10 బుధవారము.

కాని గురువారము గాదు. పంచమీతిథి ఆరోజున సూర్యోదయాది 18 ఘడియలకే పోయినది.

నెం. 1215

1 స్వస్తిశ్రీ॥ ॥శాకే గ్రహేంద్వేషు తనూయు

2 జి హేమళంఘా(।) వర్షే విజృంభతి మఘావధ

3 మాసిరాఘే। రాకాతిథౌ గురుదినే నిలభేచ...

... ... ... ...

23 శకవర్షంబులు ౧౫౧౯ అగునేటి హేమళంబి-

24 సంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ గు।

=క్రీ. వె. 1597 ఏప్రెల్ ది 21 గురువారము.

ఈ ది 21 న ౧౪ తిథి సూర్యోదయముతో పోయెను. అప్పటినుండి పౌర్ణమి తిథియే. ఇది ది 22 న సూర్యోదయాది ౦ ఘ 22 విఘ. వర కుండెను. రాత్రిగల పౌర్ణమి ది 21 నే కాన ఈశాసనములో జెప్పిన వ్రతములు ది 21 నే జరిగియుండవలెనని భావము.

నెం. 1216

1 రసాగ్ని సూర్యాన్విత శాకవర్షే ఆషాఢ మాసేక్కర్ణ దినేద-

2 శేమ్యాం। ... ... ...

=క్రీ. వె. 1314 జూన్ ది 23 ఆదివారము.

నెం. 1217

స్వస్తిశ్రీ [॥] శకవరుషంబులు ౧౨౧౨ గు నేంట్టి ప్రతాపవీ-

2 ర శ్రీనరసింహ్యదేవరు ప్రవర్ధమాన విజయ రాజ్య-

3 సంవత్సరంబులు ౧౫ గు శ్రాహిమకర శుద్ధ ౧౦

4 యు గురువారము ... ...

=క్రీ. వె. 1291 జనవరు ది 11 గురువారము.

మాఘ శు. ౧౦ ఆరోజున సూర్యోదయాది 41 ఘ. 24 విఘ. లకు పోయెను.

నెం. 1218

1 స్వస్తిశ్రీ [॥] శాకాబ్దే శరసింధునేత్ర ధరణీ సంఖ్యాన్వితే

2 ఫాల్గునే మాసే మీనసితే తిథౌప్రతిపది శ్రీ చంద్రవారే

3 శుభే॥ ... ... ...

... ... ... ...

5 ... ॥ శకవర్షంబులు ౧౨౭౫ గునేంటి మీనశుక్ల ప్ర-

6 తిపదా సోమవారాన శ్రీవీరభానుదేవర విజయరాజ్య-

7 సంవత్సర 3 అంకశ్రాహిని......

నెం. 1205 వలెనె యిదియు శ్రీవీరభానుదేవు రాజ్యకాలములో 3 వ సంవత్సరమందు వ్రాయబడినదే.

= క్రీ. వె. 1354 ఫిబ్రేవరు ది 24 సోమవారము.

ఈసంవత్సరములో మీనప్రవేశము ఫిబ్రేవరు ది 23 న సూర్యోదయాది 59 ఘ. 24 విఘ. కాగా-అందుచే మీనమాసములో ప్రథమదినము ఫిబ్రేవరు ది 24. ఫాల్గుణ శు. ౧ కూడా యీరోజునే సూర్యోదయాది 46 ఘ. 24 విఘ. వర కున్నది.

నెం. 1219

1 శ్రీప్రతాప వీరారి వీరనరనారసింహదేవరు

2 ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు

3 ౭ శ్రాహిసింహ్య శుక్ల ౭ గురువారమున ...

... ... ... ...

ఇందులో శకవర్షంబు లివ్వలేదు. రాజుగారి రాజ్యకాలపు సంవత్సర మిచ్చినారు. కావున ఈ రాజుగారి కాలపు ఇతరశాసనములను బట్టి యీశాసనపు సంవత్సరము శకవర్షములలో తీయవలెను.

ఈశాసనపు తేది

= క్రీ. వె. 1332 జూలై 30 గురువారము.

ఈ సంవత్సరములో సింహప్రవేశము జూలై ది 29 నను; కన్యాప్రవేశము ఆగష్టు ది 29 నను; శ్రావణశుద్ధము జూలై ది 23 నుండియు; భాద్రపదశుద్ధము ఆగష్టు ది 23 నుండియు; గాన శ్రావణ శు. ౭, భాద్రపద శు. ౭ గూడ సింహశుద్ధములోనే వచ్చినవి. జూలై ది 30 శ్రావణ శు. ౭ అయినది; భాద్రపద శు. ౭ ఆగష్టు ది 28 అయినది. కాని జూలై ది 30 గురువార మైనది. ఆగష్టు ది 28 శుక్రవార మైనది. కావున శ్రావణ శు. ౭ గురువారమునకు సరియైన క్రీ. శ. తారీఖు తీసుకొంటిమి. క్రీ. వె. 1332 శాలివాహన శకవర్ష ము 1254కు సమానము. ఇది రాజుగారు రాజ్యమునకు వచ్చిన 7 వ వత్సరము. అందుచే ఈశాసనములో జెప్పిన రాజుగారి శాసనము లే నెం. లు 1181, 1191, 11౯5, 1200, 1213 లో నిచ్చినవి కూడ. ఈశాసనములలో నిచ్చినరాజ్య సం. లును, శాలివాహన శక సం.లును పరిశీలించి చూచిన రాజ్యకాలవర్ష గణనము విపరీతముగా గన్పించును. ఇట్లే ఈగంగవంశపు రాజులయొక్కయు, వారితర్వాత పాలించిన సూర్యవంశపు రాజులయొక్కయు గణన యుండును. దీనివిషయమై ప్రత్యేకముగా నొకవ్యాసము వ్రాయుదును.

నెం. 1220

1 శకవర్షంబులు ౧౨౮౩ నేంట్టి మాఘ శుద్ధ ద్వితీయా-

2 ను గురువారన... ... ...

= క్రీ. వె. 1361 డిశంబరు 30 గురువారము.

ద్వితీయా తిథి సూర్యోదయాది 6 ఘ. 36 విఘ. వర కుండెను.

నెం. 1221

1 శాలివాహన శకవర్షంబులు ౧౭౩౧

2 కాగాను శుక్లసంహ్వత్సర వైశాఖ శు ౧౫ స్థిర

3 వారం ... ... ...



= క్రీ. వె. 1809 ఏప్రేల్ 29 స్థిరవారము.

పౌర్ణమి తిథి ఈ రోజున సూర్యోదయాది 59 ఘ. 24 విఘ. ల వర కున్నది.

నెం. 1222

1 స్వస్తిశ్రీ [॥] శాకాబ్దే రవిలోకసాగరయుతే సంఖ్యాన్వితే వత్సరే

2 మాఘె మాస్యసితే భృగోః సుదివసే శ్రీపంచమీసంయుతే॥

మాఘ శు. ౫ శ్రీపంచమి. 'మాఘే మా స్యసితే' యని యుండుటచేతను శ్రీపంచమీయన్న ప్రయోగమున కేమీ యర్థ మున్నట్లు దోచదు. ఈ శాసనపు తేదీ

= క్రీ. వె. 1322 జనవరు 8 భృగువారము.

నెం 1223

1 స్వస్తిశ్రీ [॥] శాకాబ్దే సింధురకు భిన్నోఽత్ర వ్యోమ గణాన్వితే [।] వృష.భేమాసి

2 శుక్లేస్మిన్ పక్షే వారే విధో ర్శుభే॥

శాలివాహనశకాబ్దము 1267లో వృష.భమాసము ఏప్రెల్ ది 25 మొదలు మే ది 27 వర కుండె. వైశాఖ బహుళము ఏప్రెల్ 18 మొ॥ మే ది 2 వరకు. జ్యేష్ఠ శుద్ధము మేయి ది 3 మొ॥ 17 వరకు. 'శుక్లేస్మిన్ పక్షే వారే విధో ర్శుభే' యని చెప్పుటచే తిథివారములు 'పౌర్ణమి సోమవార'మని-చతుర్దశి మే ది 16 న సూర్యోదయాది 9 ఘ. 36 విఘ. లవర కుండె. తదుపరి పౌర్ణమి ప్రవేశించి ది 17 న 8 ఘ. 24 విఘ. లవర కుండె. రాత్రిగల పౌర్ణమి ది 16 ననే- ఆరోజే సోమవారము గాన-

= క్రీ. వె. 1345 మే 16 సోమవారము.

నెం. 1224

1 స్వస్తి [॥] శకవర్షంబులు ౧౨౭౮ నేటి అధిక శ్రావణ బహుళ చతుర్థి శని-

2 వారము నాడు.

= క్రీ. వె. 1356 జూలై ది 17 శనివారము.

నెం. 1225

1 స్వస్తిశ్రీ [॥] సఖవరు శంబ్బులు ౧౨౭౧ కం డ్డగుసేంట్టి శ్రీవీరా-

2 ధివీరనరనారసింహ్యదేవ ప్రవర్ద్ధమాన విజయ రాజ్య సంవత్స

3 ౹ా శ్రాఇమీన శుక్ల ౧౧ సౌరివారము ...

శకవర్షంబులు ౧౨౭౧ లో మీనమాసము క్రీ. వె. 1350 ఫిబ్రేవరు ది 23 మొ॥ మార్చి 25 వర కున్నది. ఫాల్గుణ బహుళము ఫిబ్రేవరు ది 22 నుండి మార్చి ది 10 వరకు. తదుపరి చైత్రశుద్ధము. కావున శాసనపు తేదీ

= క్రీ. వె. 1350 ఫిబ్రేవరు ది 20 శనివారము.

ఈ తిథి యారోజున సూర్యోదయాది 2 ఘ. 24 విఘ. ల వర కున్నది.

నెం. 1226

1 స్వస్తిశ్రీ శకవత్సరే మునిరతుస్నేత్రేందు సంఖ్యాన్వితే మాసే

2 శాతురశబ్దితే ప్రతిపది శుభ్రాం శువారే శుభే॥

అనగా శకవత్సరములు 1267 శ్రావణమాస శుద్ధ ప్రతిపత్ సోమవారము-

= క్రీ. వె. 1345 ఆగష్టు ది 22 సోమవారము.

ఇది నిజభాద్రపద శుద్ధపాడ్యమీ సోమవారము. శ్రావణ శు. పాడ్యమి శనివార మగుచున్నది.

నెం. 1227

1 ... శాకాబ్దే రామతర్క్ర శ్రవణశశియుతే జ్యేష్ఠ శుక్లేచ

2 పక్షే పంచమ్యాం జీవవారే అభిజితి శుభదినే...

... ... ... ...

13 శకవరు[ష]ంబులు ౧౨౬౩ గున్నేంటి జ్యేష్ఠ శుక్లపంచమీ గురువారమునా

14 ండు ... ... ...

= క్రీ. వె. 1341 మే 21 సోమవారము.

శాసనములో జెప్పినట్లు గురువారము గాదు.

నెం. 1228

1 ... శకవర్షంబులు ౧౪౨౫ అగు

2 స్నేటి వీరశ్రీ గజపతి శ్రీప్రతాపరుద్ర

3 -న మహారాజ్యనను రుధిరోద్గారి సంవత్స కార్తిఁ

4 క శుద్ధ పౌర్ణమీ శుక్రవారానను .....

= క్రీ. వె. 1503 నవంబరు 4 శుక్రవారము.

ఈరోజున సూర్యోదయాది 36 విఘ. లే పౌర్ణమి యుండె. ఈరుద్రదేవుగారు, శాసనము నెం. 1161 లో చెప్పిన రుద్రదేవుగారు ఒక్కరు గారు. ప్రస్తుత పూరీరాజులు పూర్వపు ఒరిస్సారాజుల సంతతివారే. కాన పూర్వపురాజ్యము పోయినా ఈబిరుదులు పోలేదు. ఈశాసనములో జెప్పిన రుద్రదేవుగారు విజయనగరరాజైన కృష్ణదేవరాయలతో పోరాడినవారు.

నెం. 1229

1 ...శకవర్షంబులు ౧౪౧౭ అగు

2 స్నేటి వీరశ్రీ గజపతి ప్రతాపపురుషో

3 త్తమ దేవరాజ్య విజయ శుభ సంవత్సరంబు

4 లు 3౭ అగు ప్రసిహి రాక్షస సంవత్సర కార్తిక

5 శుద్ధ ౧3 మందవారానను...

= క్రీ. వె. 1495 అక్టోబరు 31 శనివారము.

ఇది వీర శ్రీ గజపతి ప్రతాపపురుషోత్తమదేవ అనే రాజుయొక్క 37వ రాజ్య సం. లో వ్రాయబడినది. నెం. 1152 క్రింద నిచ్చిన శాసనము ఈశాసనమునకు ఒక్క సంవత్సరమే పూర్వము. అది రాజుగారి రాజ్యకాలములో 35వ వత్సరమని యున్నది.

నెం. 1230

1 ...శాకవర్షే జలధిగిరిసుధాధామధాత్రీసమే

2 తే క్షోణీంద్రా సంగభీమ క్షితిపతి తిలకాత్.

మాసము, తిథి వారములు మరేమీ యివ్వలేదు. సంవత్సరము క్రీ. వె. 1252.

నెం. 1232

1 శాకాబ్దే గోత్రనాదక్షితి శశిగణితే...

... ... ... ...

ఇందులోనూ మాస తిథి వారము లివ్వలేదు. ఈ సంవత్సరము క్రీ. వె. 1255.

నెం. 1233

1 ...శాకాబ్దే లోకరత్నావని శశిగణితే

2 వృశ్చికం యాతిభానౌ శుక్లే కందర్పతిథ్యాం

= క్రీ. వె. 1271 నవంబరు 8 ఆదివారము.

వృశ్చికమాసము అక్టోబరు ది 28 నుండి నవంబరు ది 26 వరకు. అందులో అక్టోబరు 28 మొదలు నవంబరు ది 4 వరకు కార్తిక కృష్ణపక్షము. తరువాత మార్గశిర శుద్ధము నవంబరు ది 19 వరకు. కావున వృశ్చిక శు. ౧౩ అంటే మార్గశిర శు. ౧౩.

నెం. 1234.

ఎపిగ్రాఫియా ఇండికా vol. V, pp. 31 ff లో ప్రకటించియున్నది.

నెం. 1235

... ... ... ...

6 ......। శాకాబ్దే శైలరత్నక్షితి శశిగణి-

7 తే కార్తికే శుక్లపక్షే సౌమ్యే వారే దశ మ్యాం...

= క్రీ. వె. 1275 అక్టోబరు 30 బుధవారము.

నెం. 1236

1 ... శకవర్షంబులు ౧౧౯౯ నేటికన్యా శుక్ల పౌర్ణమావాస్యయు

2 సౌరివా [ర] మున శ్రీకూర్మనాథుని కుమార పున్నమ ఉత్సవము ......

శాలివాహన శకవత్సరము 1199 లో కన్యా మాసము ఆగష్టు ది 29 నుండి సెప్టెంబరు ది 28 వరకు. అందులో ఆగష్టు ది 31 నుండి సెప్టెంబరు 14 వరకు ఆశ్వయుజశుద్ధము. ఆశ్వయుజ శుద్ధ ౧౫ కుమారపౌర్ణమి. ఈ శాసనపు తేది

= క్రీ. వె. 1277 సెప్టెంబరు 14 మంగళవారము.

నెం. 1237

1 శాకాబ్దే రవిసాగరా(అ) క్షి (౦)సహితే పౌషే చ మాసే తిథౌ స-

2 ప్తమ్యాం శుక్ల [పక్షే] సితిసుతసహితే ...

... ... ... ...

4 ... ...। శకవరుషంబులు ౧౨౪౭ గు సే-

5 ంటి శ్రీవీరాధివీర నరనారసింహ్యదేవ ప్రవ ర్ధమాన విజయరా-

6 జ్య సంవత్సరంబు ౨౯ గు నేటి ఇ పుష్య సు[క్ల] సప్తమిని భానువా-

7 రన ... ... ...

= క్రీ. వె. 1350 డిశంబరు 6 ఆదివారము.

సప్తమితిథి ఆరోజున సూర్యోదయాది 48 ఘ. 36 విఘ. వరకున్నది. ఇది వీర నరనారసింహదేవుగారి రాజ్యకాలములో 29 వ సంవత్సరములోనిది.

నెం. 1238

1 ... శకవరుషంబులు ౧౨౦౧ గు నేంట్టి ప్రతా పవీ-

2 ర నరసింహ్యదేవరు ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్స

3 రంబులు 3 గు శ్రాహి చైత్ర క్రిష్ణ ౧౩ యు గురువారము

... ... ... ...

= క్రీ. వె. 1280 ఫిబ్రేవరు 29 గురువారము.

(పూర్ణిమాంత చైత్రము.) ఈ ప్రతాపవీర నరసిం హ్యదేవుగారు నెం. 1150, 1151, 1173, 1178, 1185, ...

1204, 1217 లలో చెప్పినవారే. వీరి రాజ్యకాలములో 3 వ వత్సరములో ఈశాసనము చేయబడినది.

నెం. 1239

1 ... సకవరూసంభూలు ౧౩౨౧ అ_

2 గు నేంటి పల్గుణ శుక్ల 3 సోమవారాన

... ... .. ...

= క్రీ. వె. 1419 ఫిబ్రేవరు 27 సోమవారము.

నెం. 1240

1 ......శకవర్షంబులు ౧౨౬౭ గున్నేంట్టి ప్రతాప-

2 శ్రీ వీరనరనార సింహ్యదేవరు ప్రవర్ధమాన విజ_

3 యరాజ్య సంవత్సరంబులు ౨౨ గు శ్రాహిని జ్యేష్ఠకృ-

4 ష్ణ ద్వితీయయు మంగళవారము నాండు...

= క్రీ. వె. 1345 ఏప్రేల్ 19 మంగళవారము.

(పూర్ణిమాంత జ్యేష్ఠము.) ఈ రాజుగారు పైన నెం. 1237 శాసనములో జెప్పినవారే. ఇది యీయన రాజ్య కాలములో 22వ వత్సరమున పుట్టినది.

నెం. 1241

ఎపిగ్రాఫియా ఇండికా vol. V, p. 34 f. లో ప్రకటితమైనది.

నెం. 1242

1 ...శకవర్షంబులు ౧౩౨౭ అగు (౦) నే

2 వైశాఖ శుద్ధ ఏకాదశి భృగువారాన

... ... ... ...

= క్రీ. వె. 1405 ఏప్రెల్ 10 భృగువారము.

నెం. 1243

1 శాకాబ్దే శశిరత్న భానుగణుతే చైత్రే సితే చాష్టమీ

2 పుణ్యాహే......

= క్రీ. వె. 1369 మార్చి 16 శుక్రవారము.

శాసనములో వార మివ్వలేదు.

నెం. 1244

1 వీర శ్రీ నరసింహ్య దేవర విజయరాజ్యసం

2 వ (౦) త్సర 33 అంక శ్రాహి చైత్ర శుద్ధ పౌర్ణమీ

3 రవివరే......

= క్రీ. వె. 1405 మార్చి 15 ఆదివారము.

నెం. 1245

1 ...శకవరుషంబులు ౧౨౧౫ గు సేండు శ్రీ

2 ర నరనార సింహ్యరావుతు దేవరు ప్రవర్ధమానవిజ_

3 యరాజ్య సంవత్సరంబులు ౧౭ గు శ్రాహి వృషభ

4 శుక్ల ౧౩ యు శుక్ర వారమున...

= క్రీ. వె. 1293 మే 19 మంగళవారము.

ద్వాదశి_మరునాడు త్రయోదశి వ్యయము: చతుర్దశితిథి; ది 21 న పౌర్ణమియు_ లక్ష్మీవారము. అందుచే ౧౩ శుక్రవార మన్నమాట తప్పు. ముందు నెం. 1249 చూడుడు.

నెం. 1246

1 శాకాబ్దే శశిరత్న భానుగణితే వైశాఖమాసే

2 సితే పంచామాం గురువార పుణ్యదినే

... ... ... ...

= క్రీ. వె. 1369 ఏప్రేల్ 12 గురువారము.

నెం. 1247

1 ... శకవరుషంబులు ౧౩౯౨ అగు

2 నేంటి పతాప విజయపురుషోత్తమ దేవరా

3 జ్య సంవత్సరంబులు ౭ శ్రాహి ఆశ్వీజ

4 శుద్ధ ప్రతిపదా మంగళవరానను ... ...



బైఠ జరావు సింగార సజై ఇక ఆసన జో పియరావ కహావే।
రూప అపార రహ్యో రంగరాగసా ఏసీ దుహునకీ జోరీ సుహావే।
సుందరనారి రసీలో పియా తిన చ్యారు సఖీజనచోర దురావే।
యా బిధి సో మాలకోస హై రాగ గునీ జనతాహి బనాయకే గావే॥

[జయపురచిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

= క్రీ. వె. 1470 సెప్టెంబరు 25 మంగళవారము.

ఆరోజు సూర్యోదయాది 57 ఘ. ల వరకు ప్రతి పత్తిథి.

నెం. 1248

1 ...... శకవర్షంబులు ౧౩౯౩ అ-

2 గు నేంటి ఖరసంవత్స చైత్ర బ ౧౧ ఆదివా-

3 రన ... ... ...

= క్రీ. వె. 1471 మార్చి 16 ఆదివారము.

(పూర్ణిమాంత చైత్రము.)

నెం. 1249

1 ... శకవరుషంబులు ౧౨౧౫ గు నేండు వీర శ్రీన-

2 రనారసింహ్యదేవరు విజయరాజ్యస[ం]వత్స రంబు (ల)

3 లు ౧౫ గు శ్రాహి ౧౫భ- శుక్ల పౌర్ణమియు గురువా

4 రమున

పైన నెం. 1245 వ శాసనము జూడుడు. ఈరెండింటి శాసనకాలపు ప్రభువు ఒక్కరే. ఇదియే నిజమైన శాసనమువలె నున్నది.

= క్రీ. వె. 1293 మే 21 గురువారము.

నెం. 1250

1 ... శకవర్షంబులు ౧౩౭౩ అ[గు]నేంటి ఖర

2 సంవత్సర శ్రావణ బ ౧౦.

= క్రీ. వె. 1451 ఆగష్టు 22.

(వార మివ్వలేదు.)

---

# కుమారుఁడు

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

దొంగతనము చేయుట యె
ష్టుం గల్లలు వల్కుటయుఁ గడు న్నీచులతో
సంగాతము నేఁత యొక
ష్టుం గూడ దటంచుఁ దలఁపు బుద్ధిఁ గుమారా.

కోపమునకంటె నెక్కువ
తాపముఁ బాపమును గూర్పఁ దగినది యిలలో
మాపింప లేదు కావునఁ
గోప ఘణఁచుకొంటమంచిగుణముకుమారా.

తనకంటె హెచ్చువారిని
కనుఁగొని దుఃఖించుకంటెఁ గనువారలలోఁ
దనకంటె లొచ్చువారిని
గని సంతోషించుచుంట ఘనత కుమారా.

పేదల నాక్షేపింపకు
సాదులతో నెందులకును జగడింపకుమా
వాదింపకు పెద్దలతో
నాది యనకు మన్న! పరధనమ్ముఁ గుమారా.

పరధనమున కాసింపకు
పరుషమ్ములు పలుకఁబోకు పాపపుఁబనులన్
జరపింపఁ బోకు నిన్నం
దఱు మెత్తురు మేలు గలుగు దానఁ గుమారా.

పొగచుట్ట కాల్చునోటను
సిగరెట్టులు పీల్చునోటఁ జెడుమాటలు ప
ల్కఁగఁ బూనునోటఁ జదువుల
మగువ నిలువ దనుచు నమ్ము మదిని కుమారా.

నరజన్మ మెత్తినందుకుఁ
బురుషార్థ మొక్కఁడేనిఁ బూర్ణముగాఁ దా
నెఱవేర్పఁ జాల కుండిన
నరుఁ డనఁగాఁ దగఁడుపశువునమ్ముకుమారా.

చలిచీమ మొదలయిన ప్రా
ణులయెడ దయ గలిగి వాని నొప్పింపకయే
మెలఁగునతఁడు నరుఁడా? భూ
తల దేవుం డనుచు నమ్మఁ దగును కుమారా.

హెచ్చు గలవారిఁ గనుఁగొని
మచ్చరము వహించునట్టి మానిసి నెవరున్
మెచ్చరు కావున నెపుడును
మచ్చరపడఁబోక తెలిసి మసలు కుమారా.

ఆయువు కర్మము ధన వి
ద్యాయోగమ్ములును చావు ననువీని నజుం
డీయాత్ముఁడు గర్భగతుం
డై యుండినయపుడ వ్రాయునంట కుమారా.

భయ తంద్రలు కోపము ని
ద్రయు సోమరితనము మఱి చిరక్రియతయు దు
ర్ణయ మాదిగఁ జెడుగుణముల
నయమునకై విడుచు టొప్పునండ్రు కుమారా.

హితమును గోరెడిమిత్రుల
హితవచనమ్ములను వినని హీనునకు విపద్
గతి చేరువ యగు నని పం
డితు లందురు తెలిసి మెలఁగు నీవు కుమారా.

దీనజనుల బాధింపకు
హీనుల నెన్నఁటికి నాశ్రయింపకు మెపుడున్
జ్ఞానులసంగతి మానకు
మానకు మహదాశ్రయము కుమార! కుమా [రా!

ఒక్కఁడవు దారి నడువకు
పెక్కండ్రు పరుండియున్న వేళను నట నీ
వొక్కఁడవును మేల్కొనకుము
చిక్కు తటస్థించు నని వచింత్రు కుమారా.

మాసిన బట్టలు కట్టకు
భూసురులను నింద సేయఁ బూనకు చెడు సా
వాసములు చేయకుము పలు
దోసములు తటస్థమగును తుదకుఁ గుమారా.

నలుగురు గుమిగాఁ గూడిన
స్థలమునకుం బోయి యందుఁ దగులుకొనకు చి
క్కులు గలుగవచ్చు వానిని
దులుపుకొనుట కష్ట మగును తుదకుఁ గుమా [రా.

కొండెములు చెప్పఁ బోకుము
దుండగులను జేరఁబోక దూరముగానే
యుండుము ధనము వృథాగా
దండుగులకు వెచ్చఁబెట్టఁ దగదు కుమారా.

నినుఁ జూచి తోడిబాలురు
వినయాదిగుణములు నేర్చువిధమున నీవ
ర్తన మలవఱుచుకొనినచో
నిను మెత్తురు సకలజనులు నిజము కుమారా.

చిన్నతనమ్మున నుండియు
నెన్నఁడసత్యమ్ము పలికి యెఱుఁగని వానిన్
మన్నింతు రన్ని యెడలను
కన్నారం గనుము సత్యగరిమ కుమారా.

చీకటిలో నొంటిగఁ బోఁ
బోకుము రిపునింటఁ గుడువఁబోకుము నీ వే
కాకిగ నాలోచింపం
బోకుము వడినీట నుఱుకఁ బోకు కుమారా.

ముందుగ నాలోచింపక
తొందరపడి పనులు సేయఁ దొడరితివేనిన్
పొందెది వాపద లందునఁ
గుందవలసివచ్చుఁ జుమ్ము కొనకుఁ గుమారా.

ఉదయించునపుడు నస్తముఁ
గదియునపుడు గగనమధ్యగతుఁ డయినపు డ
భ్యుదయాకాంక్షులు సూర్యుని
కెదురుగఁ దమదృష్టిఁ బఱుప రెప్డుఁ గుమారా.

పలుపలుకులు పలుకుము గా
ని లిఖింపకు మన్న! యొకటి నీ చేవ్రాలున్
పలుకులు పొల్లు లనియు వ్రాఁ
తలు ప్రాణము గలవి యనియుఁ దలఁచి కు.

గురులను దేవుని వృద్ధుల
ధరణిపతిని గర్భవతిని తగ బాలకులన్
దరిసింపఁ బోవునప్పుడు
కరమున నేమయినఁ గొనుము కాన్క కు.

వర్ణాశ్రమధర్మమ్ముల
నిర్ణయము లెఱింగి వానిని నిత్యమ్మున్
పూర్ణమ్ముగ నెఱవేర్పని
దుర్ణయులకుఁ గలదె సుఖము తుదకుఁ గు.

ఏ దేశపుమానవులకు
నా దేశపుమందె తప్ప నన్యము హిత మిం
కేదియుఁ గా దనునాయు
ర్వేదపువచనమున మనసు పెట్టు కుమారా.

హిత మయినవస్తు వయినను [యినన్
మితముగ భుజియింప వలయు మిక్కుట మ
మతి చెడు కాక దేహ [మారా.
స్థితియుఁ జెడును తుదకుఁ దానుఁ జెడును గు

ఏ బానఁ దొలుత నీక
మ్మా! బాయే' అనెడిపలుకు లలవడెనో నీ
వా బాసను ప్రేమింపని
చోఁ బసు వనిపించుకొందు సుమ్మ కు.

"తింటే గారెలె తినవలె
వింటే భారతమె యెపుడు వినవలె" ననుచున్
ఘంటారవముగ బుధు లను
చుంట గలదు దీనిఁ జిత్తమునుంచు కుమారా.

తమ ప్రాణము తమ కెంత ప్రి
యమొ తక్కినభూతములకు నట్లె యనుచుఁ జి
త్తమునఁ దలంపని యాదు [రా.
ష్టమనుష్యుఁడు గాఁడు రాక్షసుండె కుమా

సర్వంసహ లగువారును
సర్వ మయినహింస విడుచుసాధులు మఱియున్
సర్వాశ్రయభూతులుఁ దుది
స్వర్వాసము చేయుచుండువారు కుమారా.

ఏపడినపండొ ఆకో
సాపడినన్ కడుపుమంట చల్లాఱుఁ గదా!
ఈపాడుపొట్టకొఱ కే
లా పాపము చేయవలయు నయ్య కుమారా.

మొనగాఁ డయి పోఁగూడఁదు
పని యగునే నందఱకును ఫలము సమం బౌఁ
బని చెడినను పరు లడ్డిన		[రా.
మొనగాఁడే చంపఁబడును మొదటఁ గుమా

తమ కోరిక లే కుండఁగఁ
దమకు సుఖము వచ్చునట్టి తన యంతన దుః
ఖమునయితము వచ్చును దై
న్యము దీనను తాలుఁగు టొప్పునయ్యకుమారా.

సేవించి ధనముఁ గొనియెడి
సేవకు లొనరించుకొన్న చెడుగి బె తమకుఁ
దైవ మొసంగిన హక్కు ల,
కోవిదు లై యొరుల కమ్ముకొనుట కుమారా.

ఎద్దాన వృత్తి జరగు నీఁ
కెద్దానను మెచ్చుదురు మనీషులు తనుఁ దా
నద్దానిన చూ ప్రాజ్ఞుఁడు
పెద్దగ నొనరించుకొనును బెంచి కుమారా.

మనసున నాలోచించిన
పని ప్రకటన చేయఁబోకు పరు లెఱిఁగిన నా
పని నెఱవేఱుట కష్టము
విను మిదినాయనుభవమున వేల సెఁగుమారా.

రోగులు వైద్యుల కుపసతి
త్రాగుడు మొదలయ్యిన వున్న ధరణీపతి త్రిదు
ద్యోగులకుఁ బామరులు వి
ద్యాగురులకుఁ జేతిపెట్టె లంట కుమారా!

తనయెడ ద్రోహము చేసెడి
మనుజులవిషయమున నెపఁ డమాయికమగువ
ర్తనమును జూపునొ వాఁ డెం
దును పరిభవ మందుచుండును జుమ కుమా.

తొలిగుణము గొడుగుగా నా
వలి రెండును పాదుకలుగ వర్తించునతం
డిల లోకాతీతుం డని
తెలిసికొనుము ముదము వానిది సుమ కుమా.

నో రొకటి మంచి దగునే
నూరంతయు మంచి దగుచు నుండును వినుమీ
కాఱులు పలికినచో నీ
నోరే పీఁపునకుఁ దెచ్చునుజుమ కుమారా.

నరునకు నరుఁ డెప్పుడు నౌ
కరు గాఁడు ధనమ్మునకున కాని ధనముచే
గురులఘుతలు గలుగుట సం
సరణముధర్మమ్ము యనఁగఁ జనును గుమారా.

శ్రీకిం బాసిరి పుణ్య
శ్లోకులు నల ధర్మసుతులు జూదమువలనన్
పేకయు జూదమ కావునఁ
బేకాడకు మదియ యగును పిడుగు కుమారా.

చదువుకొనువయసునను సం
పద లార్జన సేయఁ దగినవయసున నెపుడున్
చదరంగ మాడఁబోకుమ
అది మరగిన మరలనీయ దయ్యా కుమారా.

యుద్ధమునఁ జచ్చునట్టిసు
బుద్ధిని స్వర్గమ్ముఁ బాఱిపోయి బ్రదుకు దు
ర్బుద్ధిని నరక మెదుర్కొన
సిద్ధముగా నుండు నని వచింత్రు కుమారా.

# అర్ధనారీశ్వరుడు

లింగం వీరభద్రయ్య చౌదరిగారు, బి. ఏ. (ఆక్సుఫర్డు); బారిష్టర్-ఎట్-లా

కొలదిదినములక్రితము నామిత్రు డొకరి యింట నొకబ్రాహ్మణుడు స్త్రీధర్మమును గుఱించియు, పాతివ్రత్యమాహాత్మ్యమును గుఱించియు నితిహాసపూర్వకముగా నింటిస్త్రీల కుపన్యసించుచుండెను. నేనందుకొని, "స్త్రీలకు మాత్రమే మీరు ధర్మములను శాసించుచున్నారు. మీరు చెప్పుచున్న గాథనుబట్టి భార్య భర్తను గుష్ఠయినను, పాపియైనను దేవునివలె బూజించవలెను. అతని కితర స్త్రీలను దార్చుటగూడ తప్పుకాదు. మఱి మీరు భర్తల విధ్యుక్తధర్మములనుగుఱించి మాట్లాడరు. స్త్రీలజేరి పురుషులకంటె దేవుళ్లు వేరులేరని చెప్పుటకంటె, బురుషులనుజేరి వారికి భార్యల నెట్లాదరించి ప్రేమించవలసినది బుద్ధులుగరపిన, వివాహమున నెక్కుడు సౌమనస్యము, సౌఖ్యము కలుగు"నంటిని. అందుల కాయన స్త్రీలు పురుషుల నెట్లు చూడవలెనో, యట్లే పురుషులును స్త్రీలను జూడవలెనని శాస్త్రములు చెప్పుచున్నవనియు, వివాహకాలమందు బురుషుడు 'నాతిచరామి' మొదలైన ప్రమాణములు చేయుచున్నాడనియు జెప్పెను. ఇంగితజ్ఞుడైన యాబ్రాహ్మణునిమాటల కానందించి,యికనట్లయిన,మీరు వెంటనే మీసదుపదేశములను బురుషులకిప్పటినుండియైన గరపుడని కోరితిని.

సదభిప్రాయయుతుడైన యాబ్రాహ్మణునివలె మన మప్రయత్నముగ, సలవాటు చొప్పున, స్త్రీల కొకధర్మము, బురుషుల కొక ధర్మము నున్నట్లు వ్యవహరింతుము. పురుషునకు జెడునడవడియందుగూడ గొంత స్వేచ్ఛ యిత్తుము. స్త్రీకిమాత్రము, మంచివర్తనయందైనను స్వాతంత్ర్యమీయము. మనము చెప్పుమాట లెట్లున్నను, నడవడియందు మనము స్త్రీని పురుషున కుపయోగపడు భోగవస్తువువలె, అతని సంతోషవిలాసముల కక్కఱకు వచ్చు ఆటవస్తువువలె చూచుచున్నాము. ఆమె మనబంగారుబొమ్మ; మనమోహంపు బరిణె; మనముద్దులగుమ్మ; మనమురిపాలపేటి; అలంకారవస్తువు; ప్రియమైనధనము; మోహకామములదీర్చుయంత్రము. అంతియే. ఆమెకు వ్యక్తిత్వము లేదు; కష్టసుఖంబులు లేవు; కోర్కెలు, ఆశలు, ఆశయములు లేవు; మనకు బూర్తిగ లోబడి మన కష్టనష్టములకు లోనై, మన మెట్లాడించిన నట్లాడవలెను. మనము రమ్మనిన రావలెను; పొమ్మనిన పోవలెను. మనము చిరునవ్వునవ్విన నుప్పొంగవలెను; మనము కండ్లెఱ్ఱజేసిన భయపడి యొకమూల నొదిగియుండవలెను. మన కిష్టమువచ్చిన దగ్గరకు దీసికొని లాలింతుము; ముచ్చటైన మల్లెపూవునువలె నాఘ్రాణిం

తుము, గులాబిపూవునువలె పెదవులతో స్పృశింతుము; కష్టమైన లాగి చెంపపెట్టు బెట్టుదుము. దగ్గరకు దీసికొని కౌగిలించుకొందుము; లేదా తన్నిత్రోసి వేయుదుము. మనము నిరంకుశరోమకసమ్రాట్టులము; వారు దిక్కు మొక్కులేని బానిసలు: మనదయా దాక్షిణ్యములమీద, మనయిష్టా నిష్టముల మీద నాధారపడి యుండుదురు. మానవుని హృదయమున నున్న స్త్రీసంబంధమైన తృష్ణ, మదము, ఆవేశము-కసిదీరునట్లు,పగదీర్చుకొను విధముగ-దీయ మామిడి పండును రసవిహీనముగజీకి, నిస్సారమైన టెంక నవతలికి బారవేయునట్లు- లేత మొక్కజొన్న కండెను పండ్లతో గీరి గింజలను నమిలి బూండును దూరముగ విసరివేయునట్లు, మనము మనస్త్రీలయెడ వర్తింతుము. మఱియు, మానవ హృదయమున డాంబికము, అధికార తృష్ణ యున్నవి. తనకంటె నితరవ్యక్తిని దక్కువగా జూచుటకు, నావ్యక్తిని దనయాట వస్తువుగా జేసికొనుటకు, దనదయాదాక్షిణ్యములమీద నాధారపడి, తనయధికారమునకు లోబడి యావ్యక్తి యుండుటకు మానవ స్వభావము గోరును. పురుషున కాకోర్కెల దీర్చుకొనుటకు స్త్రీ సాధనమైయున్నది. మెత్తని మల్లెపూవువలె నామె యతనిక్రూరహస్తముల నిమిడియుండును. మల్లెపూవును వలె నామె నతడు నలిపివేయగలడు. అన్నెము పున్నెము నెరుగక, సహజభీరువైన లేడికూనను శార్దూలమువలె నతడు భయపెట్టగలడు; నిర్దయుడగు కృషీవలు డెద్దులనువలె నిరంతర మామెచే సేవజేయించుకొనగలడు. ఈవిధముగ నామెనుజూచి, ఆమెయెడ వర్తించి, పురుషుడు స్త్రీ వ్యక్తిత్వమును జంపివేసినాడు. ఆమె భార తీయవైభవమునకు, ప్రపంచనాగరికతకు జేయ వలసిన సేవ, సాయము, అర్పించవలసిన అర్ప ణమును అణచివేసినాడు వ్యక్తిత్వమును జ పుట ప్రాణఘాతకంటె ఘోరమైనది. స్త్రీ వ్యక్తిత్వమును జంపి, పురుషుడు మహాపాత కము నొడిగట్టుకొనినాడు. ఈ హేయప్రవర్త వలన మనకు గలిగినప్రతిఫల మేమన, మనము ప్రపంచమున మిక్కిలి యనాగరికులముగ నెంచబడుచున్నాము. ఆధునికసంఘములు మనలను జీవరహితమైన యస్థిపంజరములుగ జూచుచున్నవి. మనలోని యున్నతగుణములు నశించిపోయినవి. మనజాతి నిస్సారమై పరా ధీనమై పోయినది. మన మవివేకముచేత, నహంకారముచేత, మాతృద్రోహము చేసినాము. ప్రాచీనకాలమునుండియు బలువుర చేత గౌరవమును, మెప్పను బొందిన మన దేశజనని యిక్కాలమునకు దిక్కులేనిదై యపకీర్తిపాలై పోయినది.

మానవజీవితమున భార్యస్థాన మెట్టిదను ప్రశ్న వచ్చినప్పుడు, మనపండితమ్మన్యులు విప రీతవాదములు చేయుదురు. "ప్రజాయై గృహ మేధినాం" పూర్వకాలమున ప్రమాణవాక్యమై యుండవచ్చును. "అపుత్రస్య గతి ర్నాస్తి" యను సిద్ధాంత మేకారణమున వాడుకలోనికి

వచ్చినదో యాకారణముచేతనే, బిడ్డలను గనుటకొఱకే వివాహముచేసికొనుట యను భావము పూర్వకాలమున బ్రబలియుండును. అనగా, గొప్పవైశాల్యముగలిగి, మిక్కిలిసార వంతమై, యనార్యజాతులతో నిండియుండిన యక్కాలపుహిందూదేశమున దగినంతజన మార్యసంఘమున లేకపోవుటయే. మహాభక్తు లగు నారదాంజనేయులు "అపుత్రస్య గతి ర్నాస్తి" సిద్ధాంతమును తునాతునకలు జేసి నారు. ప్రపంచచరిత్ర, మానవస్వభావము "ప్రజామైగృహమేధినాం" సూత్రమును కటికి బొంకును జేసివైచినవి. స్త్రీలు బిడ్డలను పొదుగు పెట్టలుమాత్రమే యని తలంచుబుద్ధి మంతులు, పెట్టలు పొదుగకుండ బిల్లనుజేయు యంత్రములతో దృప్తినొందుదురేమో తెలిసి కొనవలసియున్నది. పిల్లలకొఱకేపెండ్లము లయిననో, బిడ్డలనుసంపాదించువెరవున్న, పెం డ్లములపోరు తప్పించుకొనుట కెంతమంది ప్రయత్నించెదరో చూడవలసి యుండును. 'బిడ్డలు, బిడ్డలో' యని ఘోషించెడు వేదాం తార్థముల, గీతారహస్యముల నుపదేశించు మనయార్యశ్రేష్ఠుల కేపాశ్చాత్యపండితుడో యుపకరించకపోడు. (?)పైవాదముఖ్యంబె ననం బద్ధమైనవాద మింకొకటున్నది. దాన్ని ప్రకా రము స్త్రీ క్షేత్రము; పురుషుడుబీజము. క్షేత్ర ము నిష్కల్మషముగా నుండనిది బీజము ఫలిం చదు. కాన నల్ల రేవటిపొలమువలె స్త్రీ కద లక మెదలక; ముక్కక, మూల్గక; అతి యనక, పతియనక; మంచియనక, చెడనక; కష్టమనక, సుఖమనక; 'నీవు చేయవలసిన దుర్మార్గమంతయు జేయు' మనునట్లు మత్తుగా పడియుండవలెను. పురుషుడు బీజముగదా. బీజ మునకు చలన మున్నది. ఒక్కచోట నుండ వలసినయవసరము లేదు. ఈరోజున రాసిలో నుండును; రేపు బస్తాలోని కేగును; ఎల్లుండి పాతరల గాపురము చేయును; ఆవలెల్లుండి పురిలో నివసించును; ఒంటెద్దులబండిమీద షికారువెళ్లును; రెండెడ్లబండిమీద బరుగు లిడును; దర్జాగా రైలుబండిమీద దేశ యాత్రజేయును; వీలుగానున్న విదేశములకు గూడ స్టీమరులో నేగును. అట్టిచో బీజమున కు హద్దుపద్దుల గట్టుబడి యుండవలసిన యవసర మేమియున్నది? క్షేత్రమున కుండ వలసిననైర్మల్యము బీజమున కక్కరలేదు. క్షేత్ర మస్వతంత్రము; బీజము స్వతంత్రము. పండితు లిక్కడ పొరపడిన ట్లున్నారు. పురుషుడు బీజమని చెప్పుటకూడ, వారి యుద్దేశ్యముప్రకారము సాదృశ్యము సరిగా లేదని తోచుచున్నది. సాదృశ్యము సరిగా నుండవలె ననిన, స్త్రీయను క్షేత్రమును నిష్టము వచ్చినట్లు దున్ని, సంస్కరించి, బీజము నాటు కృషీవలుడు పురుషు డని చెప్పవలెను. నేను పైన వ్రాసిన గుణములు బీజమున కున్నవియాయని కించిజ్జ్ఞులు శంకిం పవచ్చును. అట్టి శంకకు పురుషుడు పురు షుడే; స్త్రీమాత్రము జడస్వరూపమైన మా గాణిభూమియని చెప్పుట సరియైన సమాధా నము. స్త్రీని క్షేత్రముగా జెప్పి సృష్టిజెందు

నుపమాన కాళిదాసులు చక్కఁగా దున్ని, మంచి మెరువు వేసి, శ్రేష్ఠమైన విత్తనములు నాటిన, నేకృషీవలుడైన సరిపోవునని చెప్పక, ఒకటి కుంటిది, రెండవది గ్రుడ్డిది యగు రెండు బక్కఁ యెద్దులను గట్టి, సగ మరిగిపోయిన కఱ్ఱుతో నెక్కఁడి కలుపు మొక్కఁల నక్కఁడనే యుంచి, దున్ని యుదున్న నట్లు దున్నినను, రెండు తట్టల చెత్త చెదారమైన నెరువు వేయుటకు శక్తి లేకపోయినను, సగము ముక్కిఁపోయి మిక్కిఁలి నీరసములైన గింజలను చల్లినను సరియే, 'యాక్షేత్రము నాది' యని చెప్ప వ్యర్థ, క్షుద్రకృషీవలుడే యాక్షేత్రమున పైరును బెంచ నర్హు డని చెప్పుదురు. వారికి గావలసిన దారోగ్యవంతము, దార్ఢ్య యుతము, తేజోవంతము శౌర్యోపేతమునయి జాతిగౌరవమును నిలువబెట్టగల సుసంతానము కాదు. చచ్చో, పుచ్చో నాలుగుపిందెలు పడిన జాలును. ఈతత్త్వమును బరిశీలించి చూడగా నిజమున కీమహానుభావులు గోరునది సుసంతానముకొఱకు వివాహముగాక, క్రొత్తగా సాగునకువచ్చు సారవంతమైన భూమివంటి, చక్కఁని యారోగ్యవతులైన కన్యలును, తామిష్టము వచ్చినట్లు వ్యభిచరించుటయును, భార్యలుమాత్రము నియమము గలవారై యుండి, తమ దుర్బలము, రోగభూయిష్ఠ మునయిన శరీరములకు నర్పితలయి బలిగా నుండుటయు నని తేలుచున్నది.

ప్రతిస్త్రీకిని బ్రతిపురుషు డర్హుడు కాడు. "శ్రీయును, కులమును, రూపును, బ్రాయుము, శుభలక్షణంబు, బాంధవ విద్యాశ్రేయము గలవరునకు" గన్య నీయవలెను. స్త్రీ సహజముగ శిరీషకుసుమ పేశల; మిక్కిఁలి సున్నితమైన స్వభావము గలది; అతి మృదులహృదయ; వికసించుచున్న మల్లెపువ్వు వంటిది; సౌందర్యోపాసకురాలు. అట్టి యామెకు గట్టికె మొరకుని, మూర్ఖుని, అవినీతిపరుని, దుర్మార్గుని, కుత్సితుని, ముదుసలిని గట్టిపెట్టుట మాతృగర్భచ్ఛేదనముకంటె మహాఘోరము. ఆమె ప్రేమింపదగినది; గౌరవింపదగినది; పూజింపదగినది; తలలో నాలుకవలె పోషించవలసినది; హృదయమున నత్తుకొనవలసినది; తలపై నెక్కిఁంచుకొనవలసినది. ఆమె ప్రణయిని, మనము ప్రేమించవలెను; ఆమె గృహలక్ష్మి, మనము గౌరవించవలెను; ఆమె మన బిడ్డలతల్లి, మన మాదరించవలెను; ఆమె మన సహవాసిని, మనము మైత్రిని జూపించవలెను; ఆమె మనక్రీనీడ, మన మాతర్య మీయవలెను; ఆమెమన కేడుగడ, మనము పూజించవలెను.

విష్ణువు హృదయమున బెట్టుకొనినాడు; బ్రహ్మ సదా స్మరించుచున్నాడు; ఇక శివుడో, యర్ధశరీర మిచ్చి యర్ధనారీశ్వరుడైనాడు; నెత్తిమీద బెట్టుకొని పూజించినాడు. దక్షయజ్ఞమున నామె నశింపగా, నామెకొఱకు సన్న్యాసి యైనాడు. మనోవేదనచే బూడిద బూసుకొని దిగంబరుడైనాడు. ఆమెను కీర్తించుటకు దనయొక నాలుక చాలక ఫణీ

సమూహాముయొక్క నాలుకల నెరువుదెచ్చుకొనినాడు. ఆమెను కన్నులారజూచి యానందించుటకు రెండుకండ్లుచాలక మూడవకన్ను ధరించినాడు. ఆమెయందు వలపుచే దెల్లబారిపోయినాడు. ఆమెయందుండు ప్రణయముచే, మోహాముచే నామె వేషము సగము వేసినాడు ఆమెప్రేమభిక్ష నపేక్షించుటకై భిక్షుకుడైనాడు. అర్ధనారీశ్వరుడగు మహేశ్వరుడు మనము, మనభార్యలయెడ నడుచు నడవడి కాదర్శముగ నుండవలెను. అప్పుడే మనము తేజశ్శాలురు, వీర్యవంతులు నగు సంతతిని గందుము. జాతికి, దేశమునకు గీర్తి తేగల కవులు, గాయకులు, నటకులు, చిత్రలేఖకులు, శిల్పులు, కళాప్రపూర్ణులు, విద్వాంసులు, శాస్త్రజ్ఞులు, రాజకీయజ్ఞులు, యోధులు, విజ్ఞానధనులు, భక్తులు, భాగవతులు నుద్భవించుదురు. ఆరోగ్యము, దీర్ఘకాలజీవితము, ఐశ్వర్యము, దయ, దాక్షిణ్యము, సుహృదయత్వము, ఔదార్యము, త్యాగము, ప్రేమ దేశమున తాండవించును.

స్త్రీ కేమాత్రము మనస్సునకుఁ గష్టము కలిగినను మనకు జయము కలుగదు. "కల కంఠికంట గన్నీ, రొలికిన సిరి యింట నుండ నొల్లదు." ఆమె చిరునగవులు మనకు సిరులిచ్చును. ఆమెయానందము, మనకు నందనోద్యానసౌఖ్యము నిచ్చును. ఆమెతృప్తి మనకు ముక్తి నిచ్చును.

---

# ప్రేమ

వఝ్ఝుల వేంకటేశ్వర కవిగారు

బాలరో, యుంచు మొకముద్దుఁ బల్లెరమున,
నింక నాహారమనునది యిచ్చగింప;
హృదయసంభూతమగు దాహ మిపుడుమివులఁ
గూర్మిఁ బ్రణయామృతముఁ గ్రోలఁగోరుచుండె;
యుష్మదధరామృతమునకు యువతి, యింద్రుఁ
డమృతము నొసంగెనేని వద్దనెడువాఁడ.

*  *  *  *

ము నొక్కగులాబి నీ కంపియున్న వాఁడ;
సరగ నొకసారి దాని వాసన గ్రహించి
ప్రీతి వెండియు నాకుఁ బంపితివిగాదె ?
అంత నొక దివ్యవాసన యంకురించె,
నొక్క భవ్య నవ్య విలాస ముద్భవించె;
నా విలాసవాసనలు నీవగును బాల !

---

# నా నెల్లూరుమండల యాత్ర

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

౧

రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో 'ప్రాచీనాంధ్రభాషా స్వరూప' మనువ్యాసం వ్రాసి నప్పటినుంచీ ఆవిషయమును గురించి యింకా ఎక్కువ కృషి చేయవలెననే అభిలాష బలమైంది. అందువల్ల ప్రాచీనాంధ్ర భాషాశాసనాలు పరిశీలిస్తూ ఉండడమూ వాటిలోని విశేషాలు గమనిస్తూ ఉండడమూ జరుగు తున్నది. ఇట్లాఉండగా ఒకమారు నామిత్రులైన శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మగారిని కలుసుకోవడం సంభవించినప్పుడు ఆయాశాసనాలలో నాకు పొడగట్టిన భాషావిశేషాలూ, శబ్దవైచిత్ర్యాలూ మొదలైనవాటిని గురించి ప్రసంగవశమున వారితో కొంత ముచ్చటించాను. దానిమీదట వారు, ఇటువంటి పరిశోధన చేయడానికి ముందు అటువంటి ప్రాచీనాంధ్రభాషా శాసనాలను సంగ్రహించి సరియైన పాఠాలు నిర్ణయించుకోవడం అవ సరమని చెప్పినారు. ఇందులోఉండే యధార్థం కొంత కాలముక్రిందట భారతిలో నేను అద్దంకి, ధర్మవరం శాసనములను ప్రకటించినప్పుడు నాకు గోచరించింది. అందుమీదట నెల్లూరుమండల శాసన సంపుటాలలోని ప్రాచీనాంధ్రభాషా శాసన పాఠాలు సరియైనవి అవునా కాదా అని సందేహం కలిగి, వాటికి సరియైన ప్రతి బింబాలు సంపాదించి సరియైన శాసనపాఠాలు నిర్ణయిం చడం యుక్తమని తోచింది. ఈవిషయమును గురించి దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారితో ప్రసంగింపగా వారు సహజౌదార్యంతో నాకు తోడ్పడి నన్ను నెల్లూరిమండల పర్యటనానికి పంపినారు. నాపర్యటన విశేషాలు తెలపడమే ఈవ్యాసంయొక్క ఉద్దేశము.

నేను ముందు కోవూరుతాలూకాకు వెళ్లినాను. కోవూరుతాలూకా విడవలూరులో నాస్నేహితులు డా క్టరు కే. యస్. ప్రసాదరావుగా రున్నారు. ఆచుట్టు పట్ల గ్రామాలలో శాసనాలు ఉన్నట్లు తాను విన్నాననీ నేను అక్కడికి వచ్చేటట్టయితే ఆచుట్టుపట్ల గ్రామాలకు తానుకూడా వస్తాననీ ఆయన నాకు ఉత్తరం వ్రాశారు. అందుచేత కొడవలూరిస్టేషనులో రైలుదిగి విడవలూరికి వెళ్లాను.

నెల్లూరుజిల్లాలోని చాలాగ్రామాలలో ఉన్నట్లే ఈ గ్రామంలోకూడా ప్రాచీన విగ్రహాలూ మొదలైనవి చాలాఉన్నవి. విడవలూరు గ్రామంనుంచి రెండుమైళ్ల దూరంలో ఊటుకూరికి పోయేరోడ్డుకి ఎడమపక్క మూశేల్లమ్మా, కుడిపక్క వెలగలమ్మా అని రెండు శిలా విగ్రహాలు ఉన్నవి. వెలగలమ్మా, మూశేల్లమ్మ అనేపేర్లు ప్రజలు ఇటీవల పెట్టినవిగా కనబడుతవి. ఎందుచేతనంటే ఆవిగ్రహాలను చూచినట్లయితే అవి పౌరాణిక సంబంధమైన శక్తులుగానో తాంత్రికసంబంధమైన శక్తులుగానో కనిపిస్తవి కాని నట్టి గ్రామదేవతలవలె కన బడవు.

వెలగలమ్మ విగ్రహం చిన్నది. రాయి పొరలు లేచి పోయి శిథిలావస్థలో ఉంది. మూశేల్లమ్మ విగ్రహం పెద్దది. అయితే యిది సగంవరకు భూమిలో పూడిపోయింది. పైకి చేతులూ, తలా మొదలైనవి మాత్రమే కనబడుతున్నవి. వెలగలమ్మ విగ్రహం అంతగా చెడిపోలేదు. ఇప్పుడు లేదుకాని మూశేల్లమ్మకు పూర్వం కొంతప్రభావమూ, మహత్తూ ఉండేదంటారు. అందుకు తార్కాణంగా ఒకకథ చెప్పుతారు. అది ఏమనంటే:

వెనుక ఎప్పుడో ఒకమాటు లంబాడీలు తండాలుగా వచ్చి ఆశక్తిఉన్నస్థలంలో దిగుతుండేవారట. ఎవరైనా వాళ్లను అమ్మకానికి ఏం సరకు తెచ్చారని అడిగితే తెచ్చిన అసలుసరకు చెప్పక మరొకసరకు పేరు చెప్పుతుండేవారట. ఇట్లా చెప్పుతుంటే ఆమరునాటి ఉదయానికి ఆ లంబాడీవాళ్లు తమసంచులూ విప్పిచూచుకొనేసరికి తాము తెచ్చిన సరకుకాక చెప్పినసరకే వాటిలో ఉండే

దట. అందుమీదట వారు భయపడి అదంతా తామదిగిన స్థలప్రభావం: అమ్మవారి ప్రభావం అని ఆయమ్మకు మ్రొక్కుకొని దీపారాధనలూ మొదలైనవి చేస్తూఉంటే తిరిగి తామతెచ్చినసరకే సంచులలో ఉండేదట. ఇట్టి కథలు చాలాచెప్తూతారు అక్కడివారు. మారెళ్లమ్మప్రభావం పూర్వం అటువంటిదట.

ఇంకా కొంచెంమారం ముందుకుపోతే వడివైపు పోయేపుంతలో రోడ్డుకి కొంచెం సమీపంగానే 'మొండిరాయి' అనే శిలాఫలకం ఉంది. దానిని అక్కడివారు 'సుంకుమాలక్ష్మి' అంటారు. ఈరాతిఫలకమీద విగ్రహం ఏమీలేదు కాని అదికూడా ఒక శక్తే అనీ, దానికికూడా పూర్వం కొంతప్రభావం ఉండేదనీ అంటారు. 'సుంకుమాలక్ష్మి'క్రింద ధనం పూడ్చిపెట్టి ఉన్నదని కొంతకాలంక్రితం మాలవాడొకడు దానిని తవ్వినాడనీ, కొంత లెక్క తవ్వగా వాడు రక్తం కక్కుకొని చచ్చిపోయినాడనీ చెప్తూతారు. 'సుంకుమాలక్ష్మి'రాయి భూమిలో చాలావరకు పూడిపోయి ఉంది. ఆరాతిమీద తూర్పువైపు వ్రాతఏమీ కనిపించలేదు కాని పడమటితట్టు దిగువభాగంలో అక్షరాలు కనిపిస్తే నామిత్రులు ప్రసాదరావుగారినీ, ఉత్సాహంగల అడపాల లక్ష్మినరసారెడ్డిగారు మొదలైన మరికొందరు యువకులనూ తీసుకువెళ్లి ఆరాతిని తవ్వించినాను. తవ్వించి రాతినికడిగి చూడగా అక్షరాలు స్పష్టంగా ఉన్నవి. అదొకపెద్దశాసనమే అంతా అరిగిపోయింది. ఇక్కడ ఒక అక్షరమూ అక్కడ ఒక అక్షరమూ కనిపిస్తున్నది. ఇవి చాళుక్యలిపిలో ఉండడముచేత శాసనం నన్నయభట్టారకునికి పూర్వపుదన్నమాట వాస్తవమే. కాని ఏం ప్రయోజనం? నన్నయభట్టారకునికి పూర్వపు తెలుగుశాసనం ఒకటి కొత్తది కనిపించిందన్న సంతోషం తాత్కాలికమే అయింది.

ఈ రాతికి దక్షిణంవైపు ఒకపాటి దిబ్బఉంది. ఆ దిబ్బ నెవరో యిదివరకే తవ్వినట్లు కనిపిస్తుంది. అక్కడ ఇటికలపేర్పులూ, గుట్టలూ ఉన్నవి. అవికాకుండా అక్కడ పూడిపోయిఉన్న లింగంతాలూకు ఊర్ధ్వభాగం ఇంచుమించుగా ఒక అడుగువరకు పైకి కనిపిస్తున్నది. అక్కడ తవ్వితే ఏదైనా ప్రాచీన శివాలయంతాలూకు శిథిలాలేవైనా కనబడుతవేమో.

విడవలూరు ఊళ్లో 'పోలేరమ్మ మిట్ట' అని వుంది చిన్నదిబ్బఒకటి. అక్కడ ఒకరాయిఉన్నది. దానికి పసుపురాసి కుంకంపట్టీలుపెట్టి 'పోలేరమ్మ' అని పేరుపెట్టి అక్కడివాళ్లు పూజలుచేస్తున్నారు. దానికొక చిన్నతాటాకుల గుడిసె వేశారు. ఆరాతిదగ్గర రామపటాలు కాబోలు పెట్టినారు. దానిమీద ఏవో అక్షరాలు ఉన్నవని చెప్పితే,అది పరిశీలించాను. తీరాచూస్తే అది పోలేరమ్మాకాదు ఏమీకాదు; పెనుగొండ రాజధానిచేసుకొని కర్ణాటకరాజ్యం పరిపాలించిన రంగరాయదేవ మహారాయలవారి శాసనం క్రీ. శ. ౧౫౫౭ నాటిది. కర్ణాటరాజులు కట్టించిన చెరువొకటి ఉంది విడవలూరికి. అది చాలా పెద్దది. దానిక్రింద ఇప్పటికీ చాలాభూమి సేద్యమవుతున్నది. అది రంగరాయదేవ మహారాయలవారి నాటికి ఖిలపడివుంటే విడవలూరు ప్రాంతానికి అప్పుడు ప్రభువులుగాఉన్న కోనేటి చినతిమ్మానాయనింగారు ఆచెరువు తిరిగి బాగుపడేటందుకు తగు కట్టుబాటులు చేసి ఒకధర్మశాసనం వేయించారు. ఆశాసనం యిదే: ఇప్పుడు పోలేరమ్మగా మారి గ్రామస్థులవల్ల చలివైవేద్యాలు మొదలైనవి పుచ్చుకొంటున్నది. ఆయన చేసిన కట్టుబాటులుగల శాసనభాగ మిది:

"గ్రామాననుపండిన నానాధాన్యానకు నగరికమతాలను మలువులను భటవృత్తి మాన్యాలనుసహా విత్తిన పుటికల పుట్టికి కుంచెడుమేర సాగింస్తిమి మాన్యంచెరువుకిందను బాడవలోని దక్షిణం నూరుకుంటలు ఇస్తిమి మాన్యం వల్లను పుట్టి కుంచాలవల్లను యాట వచ్చినవి యాంట చెరువుమీంద పనిశేయుటకు ఇట్లని యిచ్చినధర్మశాసనం"

ఈ శాసనంవల్ల విజయనగరాధీశులనాడు వ్యవసాయానుకూల్యములైన చెరువులూ మొదలైన నీటివసతులు ఎట్లా కాపాడేవారో తెలుస్తుంది. అప్పుడు 'డి.పి. డబ్ల్యు. డిపార్టుమెంటు' ఉండేదికాదు. ఒక్కొక్క గ్రామంలో ఉండే చెరువులూ, బావులూ మొదలైన

వాటిని సంరక్షించడమూ, ఆ నీటిని సరాసరి రైతులకు వ్యవసాయానికి ఇబ్బంది లేకుండా వంతులుకట్టి యిస్తూ ఉండడమూ ఈ మొదలైన అధికారాలన్నీ గ్రామస్థులకే ఉండేవి. ఏగ్రామంలో ఉండే యిబ్బందులు ఆ గ్రామంవారికే బాగా తెలుస్తవి. అందువల్ల అటువంటి అధికారాలు వారికిందే ఉంటే తమకనుకూలమైన రీతిని నీటిని ఎట్లా సర్దుకోవాలో వారే చూచుకొంటారు. చెరువు కింద బాడవలో ఇచ్చిన మాన్యంవల్లనూ, గ్రామంలోవనూ లయిన పుట్టికుంచాలవల్లనూ తిమ్మనంగారు వేయించిన ధర్మశాసనప్రకారం చెరువు మరమ్మతుచేసుకొని విడవలూరు గ్రామస్థులు సేద్యం చేసుకొంటూ సుఖాన ఉండేవారు. ఇటువంటి స్థానికవిషయాలలో పై అధికారులకు గ్రామస్థులమహజర్లు లేవు, అధికారుల నిగ్రహానుగ్రహాలు లేవు

కొత్తగా బయలుపడ్డ శిలాశాసనాలు ఉన్నవని ఎవరో కబురుచెప్పితే విడవలూరినుంచి ఆర్లపాడు వెళ్లినాను. అవూళ్లో కొంతకాలంక్రితం పాటిదిబ్బలు తవ్వుతుండగా లింగం, పానవట్టం, ఇంకా ఏవో కొన్ని విగ్రహాలూ, రాళ్లూ మొదలైనవి బయలుపడ్డవట. అక్కడ శిలాశాసనాలు ఏవైనా కనబడుతవేమో అని చాలా వెదకినానుకాని కార్యం లేకపోయింది. ఒక పాటిదిబ్బకు కొంచెందూరాన్ని ఒక పెద్దరాతి పలక కనబడింది. అది నేలమీద పడివుంది. దాని పైభాగమున వ్రాత ఏదీలేదు. రెండోవైపు వ్రాత ఏదైనాఉన్నదా అని గ్రామస్థుల నడిగితే 'ఏమో ఎవరికీ తెలియదు. అనాదికాలంనుంచీ అది అట్లేఉన్నద'ని జవాబు చెప్పినారు. రెండోవైపు ఏమున్నదో తిరగదీసి చూదామని ప్రయత్నం చేస్తే గ్రామస్థులు బ్రాహ్మణులూ మొదలైనవారు 'అది మంచిపనికాదు. రక్తం కక్కుకొని చస్తారు. ఇటువంటి పూర్వపురాళ్లు తవ్వడమూ తిరగవేయడమూ చాలా ప్రమాదకర'మని వారంతా దూరదూరంగా తొలగినుంచున్నారు. నాతో ప్రసాదరావుగారూ మరికొందరూకూడా విడవలూరినుంచి వచ్చారు. గ్రామస్థులేమన్నాసరే అని నాతో వచ్చినవారి సాయంతో ఆరాతిని తిరగదీయించాను. మేము తిరగదీస్తూ ఉండగా అవూళ్లో సంసారులు—నెల్లూరుమండలంలో చతుర్థవర్ణం వాళ్ళ సంసారులంటారు—కొందరు 'తెగించి' మాకు తోడ్పడ్డారు.

రాతిని తిరగదీసి చూస్తే దానిమీద శాసనము ఏదీ కనిపించలేదుకాని చక్కగా చెక్కిన ఏడు శక్తి విగ్రహాలుమాత్రం కనబడ్డవి. (చిత్రాలు ౧, ౨) ఆచెక్కడపుపని బాగున్నదికాని ముఖాలు కొన్ని అరిగీ, కొన్ని—శిల్పులవల్లనో ఏమో—దెబ్బలు తినీ ఉన్నవి. ఆవిగ్రహాలుచూస్తే వాటిని చాలాకాలంక్రితమే చెక్కి ఉండాలని తోచింది. (బహుశా ఒకటితక్క) అవి అన్నీకూడా పీఠాలమీద ఎడమకాలు ముడుచుకొని, కుడికాలు కిందికి వేలాడవేసి సుఖాసనమున కూర్చున్నవి. ప్రతీశక్తికీ నాలుగేసి చేతులు: రెండు కుడిచేతులూ, రెండు ఎడమచేతులూను. ప్రతీశక్తికీ ఒక కుడిచెయ్యి అభయమిస్తున్నట్టూ (అభయహస్తం), ఒక ఎడమచెయ్యి ముడుచుకొన్న ఎడమకాలి తొడమీద పెట్టుకొన్నట్టూ చెక్కినారు. మిగిలిన చేతులలో ఆయాశక్తులకుండే ఆయుధాలూ మొదలైనవి ఉన్నవి. ఈయేడు శక్తులకూ 'సప్తమాతృక'లని పేరు. హిరణ్యాక్షుని కొడుకైన ప్రహ్లాదుడు పరమభాగవతోత్తముడై సర్వసంగపరిత్యాగం చేసినమీదట అంధకాసురుడనేవాడు రాక్షసులకు రాజై చాలాకాలం హిరణ్యాక్షాదులవలెనే ఘోరతపస్సుచేసి బ్రహ్మవల్ల అనేక వరాలుపొంది దేవతలను హింసించడం మొదలుపెట్టితే వారంతా కైలాసానికిపోయి శివునితో తమబాధలన్నీ విన్నవించుకొన్నారట. అందుమీదట దేవహితం కోసం శివుడు అంధకాసురునిపైకి వెళ్లి ఘోరయుద్ధంచేసి అతనిని సంహరించాడు. ఆయుద్ధంలో శివుని బాణాలు తగిలి అంధకాసురుని వొంటినుండి రాలి నేలమీదపడ్డ ప్రతీరక్తపుచినుకులోనుంచీ మళ్లీ ఒక్కొక్క అంధకాసురుడు పుట్టేవాడట. ఇట్లా పందలూ వేలూ కొత్తగా అంధకాసురులు తయారయ్యేవారట. ఇదంతా చూసి శివుడు అంధకాసురరక్తం నేలమీద పడకుండా ఆపడానికి తననోటి మంటలోనుంచి 'యోగేశ్వరి' అనే శక్తిని పుట్టించాడట. బ్రహ్మాది ఇతరదేవతలున్నూ ఇందునిమిత్తమై

తమతమ శక్తులనుకూడా పంపినారట:—(౧) బ్రాహ్మి (బ్రహ్మశక్తి), (౨) మాహేశ్వరి (మహేశ్వరశక్తి), (౩) కౌమారి (కుమారస్వామిశక్తి), (౪) వైష్ణవి (విష్ణుశక్తి),(౫) వారాహి(వరాహస్వామిశక్తి), (౬) మాహేంద్రి (ఇంద్రునిశక్తి), (౭) చాముండి (యమశక్తి), అని వాటిపేర్లు. ఇవే సప్తమాతృకలు. కొందరు యోగేశ్వరినీ, కొందరు మహాలక్ష్మినీ కలిపి వీటిని అష్టమాతృక లంటారు. ఎవ రెవరి శక్తులు వారు వారు ధరించే ఆయుధాలూ, ఆభరణాలూ ధరించి, వారువారు ఎక్కే వాహనాలే ఎక్కుతవి. బ్రాహ్మికి హంసా, మాహేశ్వరికి వృషభమూ, కౌమారికి నెమలీ, వైష్ణవికి గరుత్మంతుడూ, వారాహికి దున్నపోతూ, మాహేంద్రికి ఏనుగూ, చాముండికి శవమూ వాహనములట. సాధారణముగ ఈ సప్తమాతృకా విగ్రహాలు అన్నీ ఒకే శిలాఫలకంమీద చెక్కుతుంటారు. కొన్ని కొన్ని చోట్ల ఈ సప్తమాతృకా విగ్రహాలతోపాటు ఆఫలకంమీదనే భైరవవిగ్రహమున్నూ చెక్కడము కలదు. ఈసప్తమాతృకా విగ్రహాలు సాధారణంగా శివాలయాలలోనూ, కొన్ని కొన్నిచోట్ల గ్రామ దేవతల గుళ్ల లోనూ కూడా కనబడుతవి. చెక్కడములో ఈవిగ్రహాలవరుస ఒక్కొక్కచోట ఒక్కొక్కమోస్తరుగా ఉంటుంది. బ్రాహ్మిశక్తి మధ్యగాఉంటే గ్రామానికి క్షేమమనీ,శత్రునాశనమనీఅంటారు. చాముండి మధ్య ఉంటే గ్రామంలో ప్రజాభివృద్ధి ఉంటుందంటారు. ఆర్లపాటిలో కనబడ్డ సప్తమాతృకా విగ్రహాలలోవారాహి మధ్య ఉన్నది. సప్తమాతృకలచేత, అభివృద్ధిపొందినవారమని తమశాసనాలలో చాళుక్యవంశపు రాజులు చెప్పుకొంటూ వచ్చారు. సప్తమాతృకాదులకు సంబంధించిన గాథలు వారికాలంనుంచే బాగావాడుకలోనికి వచ్చినవేమో.

ఆర్లపాటి కయ్య (చేను)లో ఒకచోట ఒకశాసనశిల కయ్యగట్టున జేర్ల బెట్టి ఉంది. దానిమీద 'నెల్లూరి మనుమకేశవనాథదేవర నిధి, పెదపార్లపల్లి' అని ఉంది. ఈ తెలుగుఅక్షరాలు విజయనగరంరాజుల కాలంనాటివి: పదునారవ శతాబ్దిలోవి కావచ్చు.

ఆర్లపాటినుంచి విడవలూరు పోతూఉంటే ముదివర్తిగ్రామం పెట్టివాడు ఒకడు కసబడి అన్నవరప్పాడు, అలగనంపాడు 'సంధు'లో ఒకశిలాశాసనం ఉందని చెప్పినాడు. ఆమరునాటిఉదయం వెంకనపాళెం, చౌకచర్ల మొదలైన గ్రామాలకు వెళ్లాలని ఉండడంచేత ప్రసాదరావుగారినీ వారిమిత్రులనూ తీసుకొని ఆరాత్రే భోజనంచేసి అన్నవరప్పాటికి వెళ్లినాను. అన్నవరప్పాటి కాపులుకూడా మాకు కొందరు తోడుగా వచ్చారు. ఇంతమందిమీ పోయి అక్కడ చూస్తిమికదా అది 'సర్వేరాయి' కాని 'శాసనశిల' కాదని తేలింది. ఆశోపహతులమై మేమంతా వచ్చినదారినిబట్టి పోయినాము.

ఆమరునా డుదయం మిత్రులైన ప్రసాదరావుగారిని తీసుకొని వడ్డిపాలెం, ముసలారెడ్డిగుంట మీదుగా వెంకన్నపాలెం వెళ్లినాను. ఆవూళ్లో మహాలక్ష్మమ్మగుడి అని ఉన్నది. ఆగుళ్లోనే శాసనశిల ఉంది. ఆశిలకు పసుపురాసి కుంకంపెట్టి దేవతగా భావించి దాన్ని పూజ చేస్తున్నారు. ఆశాసనశిలతోపాటు ఆగుళ్లో అమ్మవారి ఉత్సవవిగ్రహమున్ను, ఒకయంత్రమున్ను ఉన్నవి. ఈ శాసనశిల ఊరికి తూర్పువైపు ఎక్కడో ఒకకయ్య(చేను) లో ఉండగా దానిని వెంకనపాలెం కాపులుఊళ్లోకి తీసుకువచ్చి ఇప్పుడు మహాలక్ష్మమ్మ దేవళానికి సమీపాన్ని ఉన్న బావిదగ్గర పడవేసి కపిలకు ఉపయోగిస్తుండేవారట. ఇట్లా చేసేటప్పటికి కపిలకుకట్టేయెద్దు లెండూ చనిపోయినవట.ఆశిలను కపిలకు వాడినందువల్ల నే ఈయాపద తటస్థించిందని అప్పటినుంచీ దానిని బావిదగ్గిర నుంచి తీసి నడివీధిలోకి తీసుకొనివచ్చి అమ్మవారుగ భావించి పూజిస్తున్నారు. ఆటుతరువాత మహాలక్ష్మమ్మగుడి కట్టడమూ, ఈశిల అందులో చేరడమూ తటస్థించింది. ఇప్పటికీ ఆ'మహాలక్ష్మమ్మ' విగ్రహానికీ ఈశాసనశిలకూ పూజాపురస్కారాలు చేస్తూ వడపప్పు పానకాలు నివేదిస్తూ ఆరాధిస్తున్నారు. శాసనశిలే ముందువచ్చిందనీ, పిదపనే 'మహాలక్ష్మమ్మ' ఉత్సవవిగ్రహమూ, యంత్రమూ వచ్చినవనీ తెలిసింది. ఆశాసనశిలమీది అక్షరాలు చదువవలసియున్నదని నేను చెప్పగా అర్చకులు స్నానంచేసి మడి

కట్టుకొని మంత్రపూతంగా ఆశాసనశిలను కడిగి నన్ను దానిమీది అక్షరాలు చదువుకోవచ్చునని చెప్పినారు. ఆశాసనశిలకు ప్రతిబింబములు కూడా తీసుకొంటానని వారితో చెప్పినాను. అప్పుడు అర్చకులు నూరం సుబ్బరామయ్యగారు—చాలా సాధువులు, దైవభక్తి పాపభీతీ కలవారు: ఆచారపరులు, మంచివారు—ఈయమ్మవారు మహత్తువల్లనే ఆగడ్డకు విషూచీ, మశూచీ యేవిన్నీ రావడము లేదనిన్నీ, ఆశిలమీదవి బీజాక్షరాలని నమ్మతున్నామనిన్నీ, ప్రతిబింబం తీసుకోకతప్పనిసరి అయితే మైలబట్టతో కాకుండా స్నానంచేసి మడికట్టుకొని తీయవలసిందనిన్నీ చెప్పినారు. వారిమనస్సు నొచ్చకూడదని వారు కోరినప్రకారమే దగ్గరఉన్న బావిదగ్గరకుపోయి స్నానంచేసి వారిచ్చిన మడిబట్టలుకట్టుకొని ఆశాసనాలకు ప్రతిబింబాలుతీశాను. కపిలలో వాడుక చేసినందువల్ల రాయి చాలా చెడిపోయింది. దానికొక వైపున అరవశాసనం ఉన్నది. క్రీ. శ. పదమూడోశతాబ్దిలో కూడా నెల్లూరుమండలం తంజావూరు చోళరాజుల పరిపాలనలో ఉండడంచేత నెల్లూరుమండలంలో అరవశాసనాలు కనబడుతుంటవి. ఈ శాసనం కొంచెమించు ఆ నా టి దే; కాని బాగా అ రి గి పో యి ం ది. శాసనానికి ఎగువభాగాన శంఖచంక్రాలు— అనుకొంటాను—చెక్కబడిఉన్నవి. రెండోవైపున విజయనగరం రాజులనాటి తెలుగుశాసనం ఉంది. అదికూడా చాలా అరిగిపోయింది. అంతేకాకుండా శాసనశిల ఆ వైపున గంట్లూ గుంటలూపడి చాలా ఎగుడుదిగుడులుగా ఉంది. అందువల్ల తెలుగుశాసనానికి ప్రతిబింబం తీసుకోవడానికి వీలూ, తీసుకొన్నందువల్ల ప్రయోజనమూకూడా లేకపోయింది. ఊరికి తూర్పువైపు ఎక్కడనో దేవాలయం ఉండేదనీ, ఈశాసనశిల ఆస్థలంలోనుంచే ఊళ్లోకివచ్చిందనీ పెద్దలు చెప్పేవారని సుబ్బరామయ్యగారు చెప్పినారు.

ఆవూళ్లో భోజనంచేసి చాకచర్లలో శాసనమున్నదంటే అక్కడికి వెళ్లినాము. చాకచర్ల తలమంచినుంచి గుండ్లపాలెంవైపు పోయేరోడ్డుమీద ఉన్నది. చాకచర్ల గ్రామందగ్గర రోడ్డుకు దక్షిణంవైపు ఒకచెట్టుక్రింద ఒక విగ్రహం ఉంది (చిత్రం 3). అది సగంవరకూ పూడిపోయి ఉంది. అక్కడివాళ్లు దానిని 'చాకచర్ల అయ్యపనాయడు' అంటారట. ఆశిలమీద యోధుడైన అయ్యపనాయని విగ్రహము చెక్కబడి ఉన్నది. అయ్యపనాయడు ఎవరినో పొడవడానికి ఈటె ఎత్తినట్లున్నది. అతని మొలలో కుడివైపుకైజారు ఉంది. ఎడమవైపు ఏదో (?) ఆయుధం ఉంది. అతనికి కుడి, ఎడమవైపుల స్త్రీవిగ్రహాలుఉన్నవి. ఎడమవైపున్న విగ్రహం కొంచెం స్పష్టముగా ఉన్నది. కుడివైపున్నది చాలా అరిగిపోయినది. అయ్యపనాయడియొక్క శిరోవేష్టనమూ, దుస్తులూ మొదలైనవి చూస్తే అది మూడు నాలుగువందలేళ్ల కిందట ఉన్న అమరనాయకుడియొక్కకాని, పాళెగాని యొక్కకాని విగ్రహమై ఉంటుందని తోచింది.

నేను పట్నం వచ్చిన తరవాత ఆవిగ్రహం ఫోటో తీసి పంపవలసిందని మిత్రులు ప్రసాదరావుగారికి వ్రాశాను. ఆయన అక్కడికి వెళ్లి ఫోటో తీయడానికి ఆవిగ్రహాన్ని బైటికి తీస్తూఉంటే ఆచాకచర్ల గ్రామస్థులు ఆవిగ్రహం క్రింద ఏవో నిధినిక్షేపాలు ఉన్నవనీ, అవి తీసుకుపోవడానికి ఆయన వచ్చినాడనీ చాలా గందరగోళంచేసి ఆయనను తిట్టి తుదకు ఆవిగ్రహాన్ని కదిలించినందుకు మేజస్ట్రీటుగారికి ఆయనమీద కంప్లెయింటుదాఖలుచేసినారట! పూజాపురస్కారాలు లేకుండా, ఆలనాపాలనా లేకుండా ఉన్న ఈవిగ్రహముపట్ల వారికీసందర్భమున కలిగిన ఆదరాభిమానములకు ఎంతో మెచ్చుకోవలసిందే, కాని అట్టి అభిమానం వారికి ఎప్పుడూ ఉంటేనే అది నిజమైనదని అనుకోవడం తటస్థిస్తుంది. పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు ప్రసాదరావుగారిని కలుసుకొని సంగతి సందర్భములు విచారించిన పిదప కేసు కొట్టివేశారు. చరిత్ర తెలుసుకోవాలనే సదభిప్రాయంతోనే పరిశోధన సాగించినప్పటికీ కొన్నికొన్నిచోట్ల ఇటువంటి చిక్కులు తటస్థిస్తూ ఉంటవి.

చాకచర్ల అయ్యపనాయని విగ్రహం క్రీ. శ. పదిహేను, పదహారు శతాబ్దాలలో ఉండే తెలుగు యోధుని వేషమూ మొదలైనవి తెలియజేస్తూ ఉండడముచేత అది జాగ్రత పెట్టవలసిందగును. అభిమానం

తులైన చాకచర్ల గ్రామవాసులు ఇప్పటికైనా దాని మీద అభిమానముంచి దాని రక్షణకు తగిన ఏర్పాటులుచేస్తే మేము చేసిన కృషి వ్యర్థం కాలేదని సంతోషిస్తాము.

అటుతరువాత ఊళ్ళోకి వెళ్లి శాసనం చూచినాము. అది శాసనంకాదు. బీజాక్షరాలు చెక్కిన కలరాయంత్రము. నెల్లూరు మండలంలో కొంచెమించుగ ఏగ్రామానికి వెళ్లినా ఈయంత్రాలు కనబడుతుంటవి. వీటిని సాధారణంగా కర్రపలకలమీదగాని, రాళ్ల మీదగాని చెక్కుతారు. ఇవి ఊరిగవిడి (మొగదల)లో పాతివేసి ఉంటవి. ఈయంత్రాలున్న ఊరికి విషూచి, మశూచికాదులు రావని వాడుకకాని ఇవి ఉన్నప్పటికీ అటువంటి జాడ్యాలు రావడం మామూలే అవుతున్నది. కొన్నికొన్ని చోట్ల వీటిని 'శీతలయంత్రా'లని కూడా అంటారు. చాకచర్లలో ఇంతకు తప్ప వేరే శాసనం లేదు.

అక్కడనుంచి తుమ్మగుంట వెళ్లాము. ద్రావిడులలో కొందరికది కాణాచి. అందువల్లనే వారికి తుమ్మగుంట ద్రావిడులనిపేరు. ఇప్పటికీ ఆవూరినిండా ఉన్నవారు ద్రావిడులే. ఆవూళ్లో కాశీవిశ్వనాథస్వామి ఆలయంలో గర్భగుడిగుమ్మం తనాబీరాళ్ల మీద రెండుశాసనాలున్నవి. కాని అవి చెక్కిఉన్న రాయి పొట్లిపోతున్నది. రాతికి ఏమాత్రము అదుముడుతగిలినా అది పొడిపొడి అయి పొసిరాలిపోతున్నది. అందువల్ల శాసనాలుండీకూడా ప్రతిబింబాలు తీయడానికి వీలులేకపోయింది. రాయి చాలా అరిగిపోవడంచేత శాసనాన్ని రాతినుంచి చదవడానికైనా వీలులేకపోయినది. వెనక ఎప్పుడో కొంతకాలం క్రితం కొన్ని రాగిశాసనాలు దొరికినవనీ, అవి దొరికిన తరువాత, దొరకినవారికి ఏవో అరిష్టాలు సంభవించినవనీ, అందుమీదట వారు వాటిని ఒకనూతిలోనో ఎక్కడో పారవేశారనీ చెప్పుతారొక కథ అక్కడివారు. అదికథో: నిజమో! దాని నిజంసంగతి ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నిస్తే నిజం తెలిసిందికాదు కాని పాఠాంతరాలు కొన్ని దొరికినవి. ఆశోపహతులమై మళ్లీ విడవలూరు చేరుకొన్నాము.

ఈపర్యటనంలోనే చరిత్రప్రసిద్ధమైన ఉదయగిరి దుర్గమునూ, ప్రాచీనప్రసిద్ధికలిగిన 'దుగ్గిభై రవుడికోన' గుహాలయములనూ చూడవలెననుకొన్నాను. ఈవిషయం ప్రసాదరావుగారికి చెప్పేటప్పటికి ఒకటిరెండు రోజులు ఆయనకూడా నాతోవస్తానన్నారు.

మేమిద్దరమూ విడవలూరిలో బైలుదేరి కొడవలూరికి వచ్చి అక్కడ రైలెక్కి సాయంత్రం నాలుగు నాలుగున్నర గంటలకు కావలి చేరుకొన్నాము. రైలు దిగేసరికి ఉదయగిరి వెళ్లే 'బస్సు' సిద్ధంగాఉన్నది. వెంటనే 'బ'స్సెక్కి ఉదయగిరికి బైలుదేరినాము.

కావలికి ఉదయగిరి ఆరవైమైళ్ల దూరమున ఉన్నది. దారిలో జమ్మలపాలెం, జలదంకి, చిన్నక్రాక, కొండూరు, పోలంపాడు, కలిగిరి, వింజమూరు, దుత్తలూరు మొదలైన ఊళ్లు చాలా తగులుతవి. వీటిలో జలదంకి, వింజమూరు, కలిగిరి మొదలైనకొన్ని ఊళ్లలో మంచి చెరువులుఉన్నవి. నెల్లూరుమండలములో ఉండే చెరువులలో కందుకూరు తాలూకాలోని మాచవరం, పొన్నలూరుచెరువులూ, కావలితాలూకాలోని జూటూరు, మోపాడు ప్రాజెక్టు చెరువులూ, కోవూరుతాలూకాలోని కనిగిరి జలాశయమూ, నెల్లూరు తాలూకాలోని సర్వేపల్లి నెల్లూరు, మనుబోలు చెరువులూ, ఆత్మకూరుతాలూకాలోని అనంతసాగరం, కలువాయి చెరువులూ, గూడూరు తాలూకాలోని కోటపెణక గూడూరు యేరూరు చెరువులూ చాలా గొప్పవి. మొత్తము మీద నెల్లూరు మండలంలో చెరువులు చాలా ఎక్కువ. చిన్నవైతే నేమి, పెద్దవైతే నేమి మొత్తంమీద ఈమండలంలో ౭౩౪ చెరువులు ఉన్నవి. వీటిలో కొన్నిటికి నీరు నదులలోనుంచి వచ్చినప్పటికీ వర్షాధారపు చెరువులే అనేకములుగా ఉన్నవి. ఇటువంటివి ప్రతీ తాలూకాలోనూ కనబడతవి. కాని నీటి సప్లైకాలువలు చాలా చెడిపోవడంచేత కొన్నికొన్ని చెరువులు మంచిస్థితిలో లేవు.

నెల్లూరుమండలంలో చెరువులను కట్టుతారు కాని గోదావరి, కృష్ణాజిల్లాలలోవలె తవ్వరు. చెరువు లెట్లా

కట్టవలెనో, ఎట్టిప్రదేశాల కట్టవలెనో, మంచిచెరువుకు వుండవలసిన లక్షణాలేమిటో, ఉండగూడని దోషాలేమిటో—ఇవిఅన్నీ ఒకశాసనంలో వ్రాయబడి ఉన్నవి (చూడుడు: నా 'ఆంధ్రదేశము: తటాకములు' అను వ్యాసము—చిత్రాడ, ఆంధ్రపరిశోధక మహామండలి పంచమవార్షికోత్సవ సంచిక). సాధారణంగా ఇటువంటి చెరువులన్నీ కొండలకు పరిసరమున ఉంటవి. కొన్నికొన్ని చోట్ల కొండలే చెరువుయొక్క పోతగట్టులుగా కూడా ఏర్పడుతవి. ఒకవేళ కొండలు ఒకదానికొకటి ఎడమెడముగా ఉన్నప్పటికీ వాటిని పోతగట్టుపోసి కలిపివేస్తారు. ఇట్లా రెండుమూడు వైపుల కొండలుంటే నాలుగోవైపు పోతగట్టుఉండి అదొక పెద్దచెరువుగా ఏర్పడుతుంది. కొండలమీదకురిసిన వర్షమంతా చెరువుగా ఏర్పాటయిన పల్లంలోకి చేరుకొంటుంది. కొండలమీద కురిసినవర్షపు నీరు ప్రవహించేమార్గాలే చెరువులకు నీటివనరులుగాను సప్లైకాలువలుగాను ఉంటవి. ఇటువంటి వర్షాధారపు చెరువులవల్ల నెల్లూరుమండలంలోని కొన్నికొన్ని తాలూకాలు కృష్ణా, గోదావరిడెల్టా ప్రదేశాలవలె పచ్చని వరి పైరుతో కలకల లాడుతుంటవి. కావలినుంచి ఉదయగిరి పోయే మార్గమంతా—అది అసలు రాతిప్రదేశమైనా—చక్కని వరిపంటతో చూడ ముచ్చటగా ఉంటుంది. ఈచెరువుల ఆధారమున రైతులు రెండవపంట(దాళవా) కూడా పండిస్తారు.

ఈచెరువులలో చాలాభాగం విజయనగరంరాజులనాడు కట్టించినవే. నెల్లూరు మండలంలోని విజయనగరం రాజులనాటి శాసనాలు తిరగవేస్తే వాటిలో చెరువు ధర్మశాసనాలే ఎక్కువగా కనబడుతవి. కొత్తగానిర్మించిన చెరువులకు సంబంధించినవో, లేక ఖిలపడివున్న చెరువులను 'పూర్జితం' చేయించడమునకు సంబంధించినవో. తటాకనిర్మాణం సప్తసంతానాలలో ఒకటి గనుక పుణ్యం కలుగడానికి పూర్వులు ధర్మచింతతో చెరువులు కట్టించేవారు. కట్టించిన చెరువులన్నీ సురక్షితంగా ఉంటవనీ, పూడిపోకుండా ఉంటవనీ ఎవరు చెప్పగలరు? ఇటువంటి నీటివసతులు కాపాడడానికి ఇప్పటివలె డి. పి. డబ్ల్యు డిపార్టుమెంటు ఉండేది కాదు. అందువల్ల వాటిరక్షణ ప్రజలమీదను అది కట్టించిన వారిమీదను పడేది. ఏవిధమైన ప్రతిఫలమూ లేకుండా వాటిని సంరక్షిస్తూ ఉండవలసినదని ప్రజ నడిగితే ఎవ రంగీకరిస్తారు? అందువలననే ఇట్టి సందర్భాలలోనే 'దశబంధంమాన్యం' అనే మాన్యంపుట్టింది. ఇది ఈనాము. చెరువులు పూడిపోకుండా జాగ్రత్త పెట్టుతుండే కొరకును, వాటిని అవసరమయినట్టయితే మరమ్మతులు చేసేటందుకును ఆచెరువునీటి ఆధారమున సాగయ్యే ఆయకట్టు పరిమితంలో సాధారణంగా పదవ వంతుభూమిని ఈనాముగా ఇచ్చేవారు. దీనికే 'దశబంధంఈనాం', 'దశబంధంమాన్యం' అనిపేరు. తరువాత తరువాత ఈనాంగా ఇవ్వబడే భూమిపరిమితం కొన్ని కొన్నిచోట్ల ఆయకట్టుపరిమితంలో నాలుగవవంతు వరకూ, అయిదవ వంతువరకూ కూడా పెరిగినది. చెరువు మరమ్మతు సరిగా జరుగుతున్నదీ లేనిదీ తణిఖీచేసే అధికారము గ్రామస్థుల కుండేది. దశబంధం ఈనాందారు తనపనిని తాను చక్కగా నిర్వహిస్తూ ఉండకపోయినట్టయితే గ్రామస్థులు ఆ యీనాందారును తప్పించి ఆ మాన్యమును మరొకరి కిచ్చి పనిచక్కగా నిర్వర్తింప జేసుకొనేవారు. ఈవిధంగా చెరువులను పూర్వం సంరక్షించేవారు. ఇట్లే నూతులు (బావులు) కూడా కాపాడేవారు. ఇట్టివాటికి దశబంధం చెరువులనీ, దశబంధం నూతులనీ కూడా పేరు. ఇటువంటియేర్పాటు చాలాపూర్వకాలం నుంచి ఉన్నది. పూర్వం చెరువులనూ, నూతులనూ సంరక్షించే పద్ధతులలో ఇదొకటి. కొండప్రదేశాలలోనూ, రాతినేలనూ ఎంతెంతడబ్బు ఖర్చుపెట్టి ఇటువంటి చెరువులుకట్టించేవారో. ఇటువంటి ధర్మకార్యాలవల్లనే రాతిప్రదేశములనుకూడా ఇట్లా సుక్షేత్రములుగ మార్చినందువల్లనే 'రాయలవారి' పరిపాలనమీద ప్రజలకు భక్తిగౌరవాలు కుదురుకొని ఉండడానికి కారణము. విజయనగరం రాజులకు నరపతులని పేరు. సైన్యంలో జనమే ఎక్కువగా ఉండేవారు కనుక వారికి నరపతులు (నరబలం ఎక్కువగాగలవారు) అని పేరు కలిగిందంటారు. కృష్ణదేవరాయలవద్ద ఎల్లప్పుడూ పదిలక్షలసైన్యం సిద్ధంగా వుండేదనీ, అవసరమైతే ఆతడు ఇరవైలక్షలజనా

# * నా నెల్లూరుమండల యాత్ర





చిత్రము ౧,(అ)వ స్థూపశిలలు(గౌతమబుద్ధు) చిత్రము ౧,(ఆ)వ స్థూపశిలలు(కొండబుద్ధు)



చిత్రము ౨, వ.స్థూపశిలలు

* ఈ ఛాయాచిత్రములు డాక్టరు కె. యస్. ప్రసాదరావుగారు తీసినవి.



చిత్రము ౩, చాకచెర్ల అయ్యపనాయడి విగ్రహము



చిత్రము ౪, భైరవునికోన



చిత్రము ౫, ఉదయగిరిదుర్గము

సైన్నా యుద్ధానికి సిద్ధంచేయగలడనీ పేయస్ చెప్పుచున్నాడు. ఆశ్చర్యమేమున్నది దేశం సుభిక్షంగా ఉండేటట్టు ఇటువంటి ధర్మకార్యాలుచేసిన విజయనగరం రాజులకు నరపతులని పేరు రావడానికి? ఇటువంటి ధర్మకార్యాలు చేసి ప్రజల హృదయం చూరగొన్న కర్ణాటరాజుల సైన్యాలలో పదాతిసైన్యం ఎక్కువగా ఉండేదంటేమాత్రం ఆశ్చర్య మేమున్నది? తిన్నగా చూస్తే పూర్వపు కర్ణాటరాజ్య వైభవాన్ని గుండె రాయిచేసుకొని దేశమే వర్ణిస్తుంది.

వింజమూరు కావలికీ ఉదయగిరికీ సగందూరంలో ఉన్నది. ఈవూరు తమలపాకులకు చాలా ప్రసిద్ధట. ఇక్కడ తమలపాకుల తోటలు చాలా ఉన్నవి. ఇక్కడినుంచి ప్రతిదినమూ బండ్లకొద్ది తమలపాకులు నిజాంరాష్ట్రానికి ఎగుమతి అవుతుందంటారు. ఈతమలపాకులతోటల కన్నిటికీ వింజమూరు చెరువే ఆధారము.

వింజమూరికి సమీపముననే ఈనడుమనే క్రొత్తగా రాగిగనులు దొరకినవట. అందు ఇక్కడ దొరకే రాగి చాలా ప్రశస్తమైనదనీ, గనిలో రాగిపాలే చాలా ఎక్కువగా ఉన్నదనీ చెప్పుతారు. అప్పుడే విదేశీయులు దొరలువచ్చి భూమి పరిశోధన చేయడమూ, ఆప్రదేశము కౌలుకు పుచ్చుకొని యంత్రాలు తెప్పించి పనిచేయడమూకూడా జరుగుతున్నది. కావలినుంచి మాబస్సులోనే మైనింగ్ ఇంజినీరుకూడా వచ్చాడు. సాంకేతికవిద్యలపట్ల ఆంధ్రులకుగల నిరాదరణకు ఫలిత మిది. ఆదరణ ఉన్నప్పటికీ కార్యంలేని ఈరోజులలో అసలే ఆదరణ లేకపోవడం ఇతరులకు మరింత మేలుకాదా? ఎప్పటికీ కూలిమాత్రం మనదీ లాభం ఇతగులదీని. మన మొకరి క్రింద పనిచేసి కూలి సంపాదించుకోవడానికి మాత్రం దండుగ ఉండదనుకొంటాను.

మేము ఉదయగిరికి వెళ్లేటప్పటికి— దారిలో అయిన ఆలస్యాలవల్ల రాత్రి పదిన్నరగంటలో పధకొండుగంటలో అయినది. దారిలోనే 'దుగ్గిభైరవునికోన'ను గురించి వాకబులు చేశాము. చివరకు అది మేమనుకొన్నట్లు ఉదయగిరికి పది పన్నెండు మైళ్ళలోగాక రమారమి ఇరవై మైళ్లో, ఇరవై అయిదుమైళ్ళో దూరాన్ని ఉన్నట్లు తేలింది. ఎట్లయినా ముందు దానినే చూచిరావలెననీ, పిదపనే ఉదయగిరిని చూడవలెననీ నిశ్చయించుకొన్నాము. కావలినుంచి ఉదయగిరికి మోటారువేసినవారే సీతారాంపురంనుంచి బద్వేలు (కడపజిల్లా)కూ, బద్వేలునుంచి సీతారాంపురానికీకూడా మోటారు వేశారు. కడప, నెల్లూరుజిల్లాలను 'వెలిగొండలు' వేరు చేస్తున్నా మోటారు'బస్సులు' వాటిని కలిపి ప్రయాణీకులకు సౌకర్యం కలుగజేస్తున్నవి. ఈమోటారులు కనుమల (కొండత్రోవల)గుండా 'వెలిగొండ'లలోనుంచి పోతవి.

వెలిగొండలు ఉత్తరమునుంచి దక్షిణానికి వ్యాపించి నెల్లూరుమండలానికి పడమటిసరిహద్దుగా ఉన్నవి. ఇవే కడప, కర్నూలు మండలాలనుండి నెల్లూరుమండలమును విడదీస్తున్నవి. ఈపర్వతపంక్తి వెంకటగిరి దక్షిణమునుంచి బైలుదేరి కొంచె మించుమించుగ వాయవ్యదిశగా కంభం (కర్నూలుజిల్లా)వరకు పోతవి. సాధారణంగా ఇవి సముద్రపుమట్టమునకంటె రెండువేలు మొదలు మూడువేల అడుగులవరకు ఎత్తు ఉంటవి. కడపమండలంవైపు ఈకొండలమీద గొప్ప అడవులు ఉన్నవి. నెల్లూరు మండలంవైపు అట్టి గొప్ప అడవులులేవు. ఈకొండలను బ్రద్దలుకొట్టుకొనే పెన్ననది సముద్రంలోకి వస్తుంది. ఈ 'వెలిగొండల' చీలికలలోనే 'దుగ్గిభైరవుని కోన' ఉన్నది.

మేము ఉదయగిరి చేరేటప్పటికి బద్వేలునుంచి సీతారాంపుర్గం పోయే మోటారు అదివరకే వచ్చి, పోనడానికి సిద్ధంగా ఉన్నది. సీతారాంపురం, బద్వేలు మోటారులు ఉదయుగిరిమీదుగానే పోతవి. మాసామానుకొంత మోటారు యజమానుల స్వాధీనంలో ఉంచి వెంటనే సీతారాంపురం మోటారెక్కి 'దుగ్గిభైరవుని కోన'కు బైలుదేరినాము. ఆకోన సీతారాంపురమునకు దగ్గరగా ఉన్నదట. అర్ధరాత్రివేళ ఆకరకురాతి ఎగుడు దిగుడు నేలను చిన్నవాగులలోనుంచీ చిట్టడవులలోనుంచీ వెడుతుంటే మోటారుపెద్దలైట్ల వెలుతురున దేశం

చాలాచిత్రంగా కనిపించినది. మేము క్రమంగా ఉదయగిరీ, గుర్రప్పల్లీ, బసినేనిపల్లీ మొదలైన ఊళ్లు దాటి అయ్యావారిపల్లికి వచ్చాము. ఉదయగిరికీ అయ్యావారి పల్లికీ పన్నెండుమైళ్ల ప్రయాణము. 'భైరవకోనకు' పోదలచినట్టయితే సీతారాంపురం పోవనవసరం లేదనీ, అయ్యావారిపల్లినుంచే వెళ్లవచ్చుననీ, ఒకవేళ సీతారాంపురం వెళ్లినా దిగువకు మళ్లీ రావలనే ఉంటుందనీ బస్సులోని ప్రయాణీకులు చెప్పినంగువల్ల అయ్యావారి పల్లిదగ్గరే మేము దిగినాము. అయ్యావారిపల్లికీ మోటారు 'రోడ్డు'కూ అరమైలులోపు. బహుశా అప్పటికి ఒంటిగంట అయివుంటుంది. ఆరాత్రి అయ్యావారిపల్లెలో ఎవరోఒకరి అరుగుమీద పరుండి ఉదయమననే లేచి దారి చూపడానికి ఒకమనిషిని కుదుర్చుకొని'దుగ్గిభైరవునికోన', కు బైలుదేరినాము. దారిలో సింగారెడ్డిపల్లి, దేవిసెట్టిపల్లి, పోకలింగాయపల్లి మొదలైన గ్రామాలు గడచినాము. నాగరికత కింకా ఈవూళ్లున్నట్టు తెలియ లేదు. ఊళ్లన్నీచాలా 'పూర్వో త్తరం'గా ఉంటవి. ఈ వూళ్లలో మంచినీటికేమిటి, సేద్యానికేమిటి దిగుడుబావులే ఆధారం. వాటివల్ల ఆరికలూ,వరిగెలూ,కొర్రలూ మొదలైనవి పైరవుతవి. ఆప్రాంతాల 'స్కూళ్లు' చాలాఅరుదు. ఉంటే ఎక్కడో అయిదారేసి గ్రామాల కొక్కొక్కటి. పోకలింగాయపల్లి దాటిన దగ్గరనుంచి అంతా అడవే. అయ్యావారి పల్లికి 'భైరవునికోన' బరువుగా రెండు పరుగు లుందనీ, తేలికగా మూడు పరుగు లుందనీ అక్కడివా రన్నారు. ఆప్రాంతమంతా 'పరుగుల లెఖ్ఖ' వాడుకలో ఉన్నది. పరుగంటే రెండున్నర మైలు. కాని మాకు మాత్రం నడచిచూస్తే కోన రమారమి పదమూడు పదునాలుగు మైళ్ళదాకా ఉన్నట్టుతోచింది. వాళ్లు ఎప్పుడూ తిరుగుతూ ఉండడముమూలాన్నీ, ప్రదేశాలు పరిచయమైనవి అవడంమూలాన్నీ ఎక్కువదూరం ఉన్నా కొంచెం ఉన్నట్టు కనబడడం సహజం. వాళ్లు చెప్పిన మాటలనూ, దూరాన్నీ నమ్మి మేము మధ్యాహ్న భోజనానికి ఏవిధమైన ప్రయత్నాలూచేసుకోకుండా తిరిగి రావచ్చుననే ఉద్దేశంతో వెళ్ళినాము. అదిన్నీగాక కోనకు చేరువనే రెండుపరుగుల లోపున కృష్ణంపల్లె, రాచవారిపల్లె అనే ఊళ్లున్నవనికూడా అన్నారు. ఈకారణాలవల్ల భోజనానికి ఏమీ ఏర్పాటులు చేసుకోకుండా వెళ్లినాము. అందుకు శాస్తి అనుభవించినాము. ముందుముందు అక్కడికి పోయేవారికి మా అనుభవమే ఒక హెచ్చరిక. ఆ యడవులలో ప్రక్కపక్కల ఉన్నకొండ లెక్కి వెళ్లితే కోనకు దగ్గరదోవ ఉన్నది దప్పున చేరుకొంటామని మాకూడా వచ్చిన మనిషి చెప్పినాడు. కాని కొండ లెక్కడమూ దిగడమూ వచ్చినదంటే అలిసిపోయి కోనలో తీసుకోదలచిన స్నానాలూ, ఫోటోలూ తీయడానికైనా ఓపిక ఉంటుందో లేదో అని కొంచెం చుట్టయినా నాటుతోవనే పోయినాము. అడవి ఎంత నడచినా తరగనట్టు కనిపించింది. 'ఎర్రచెలకల' తరువాతనుంచి సరాసరికోనలోకి అడవి గుండా అడ్డము పడిపోవచ్చు నన్నారు. దారిలో కనబడ్డ పొరుగూళ్ల గొల్లబోయలు. తుప కట్లయితేనేమి కొండవాగులుదాటి కోనవంకలు దాటి, కారడవులుగడచి చిలపరాళ్ళతో గువ్వరాళ్ళతో చాపరాళ్ళతో కత్తెరరాళ్ళతో బొమ్మరాళ్ళతో పెద్ద నల్లబండలలో నిండిఉన్న దారిని నడచినడచి కోనకు ఉదయం పదిన్నరకో పదకొండు గంటలకో చేరుకొన్నాము. దర్శనీయమైనది 'దుగ్గిభైరవుడికోన'. (చిత్రం ర) ముండ్లపొదలతోను నల్లరాతి నిలువుబండలతోను కప్పబడిఉన్న ఆ దారికానిదారిలో నడవవలసివచ్చినందుకు నిట్టనిలువుగ పెరిగిన ఆచెట్లు ఒకదానినొకటి పెనవేసుకొని నీడే ఇవ్వక పోయినట్లయితే ఆ ఎండ దెబ్బకు మా ప్రాణాలు గిలగిలలాడేవే.

ఇటువైపునుంచి ఒకకొండ, అటువైపునుంచి ఒక కొండ—అయిమూల వాటంలోవచ్చి ఒకదాని నొకటి కలుసుకొంటవి. ఈఅంతః ప్రదేశానికే కోనఅని పేరు. ఈకోనలోనే కొండకొమ్ములు కలుసుకొన్నప్రదేశములో కొండనే మనపూర్వశిల్పులు ఆలయాలూ, విగ్రహాలూ, స్తంభాలూ మొదలైనవాటికింద చెక్కివేశారు. ఇది దుగ్గిభైరవులస్థానము: అందువల్లనే దీనికి 'దుగ్గిభైరవుని కోన' అని పేరువచ్చినది. 'దుగ్గి' రూపమే యిక్కడి వాడుక. ఈఆలయాల ముందునుంచి ఆకోన నడిమిగా

ఒక్క సెలయేరు ప్రవహిస్తుంది. మేము వెళ్లినది వేసవికాల మవడంచేత అంతవిశేషం నీరులేదు. పైనుంచివచ్చే సెలయేటినీరంతా ఆలయాలముందుండే దొన (గుండమువంటి పల్లము)లో చేరుకుంటుంది. ఆప్రదేశం కుడివైపు ఆలయాలతోనూ, ఎడమవైపు ఆలయాలతోనూ, వీటిమధ్య సెలయేటి నీటిపసిడియతోనూ చూడడానికి చాలా ముచ్చటగా ఉంటుంది.

ఎంతకష్టపడ్డా రమణీయమైన కోన చేరుకొన్నాము. దాని దర్శనము చేసుకొన్నాము. పడ్డ కష్టమంతా ఉప్పున ఊదేసి మేము ధన్యుల మనుకొన్నాము. పడిన దెంత కష్టమో మేము పొందిన దంతటిసంతోషము. అంతటి ఆనంద మిచ్చింది కోన. అందమంతా అక్కడ పోసువేసుకొని కూర్చున్నట్టున్నది కోన. ఓహో! ఆవిగ్రహ శిల్పకళానైపుణ్య మేమిటి? కొండనే నక్కని ఆలయాలుగా మలిచివేసిన మనపూర్వశిల్పుల ఆప్రజ్ఞావైభవమేమిటి? చూచాము చూచాము; ఆవైభవమును అనిమిషులమై చూచాము; తన్మయుల మైనాము; కొంతసేపటికి తేరుకొన్నాము.

ఆసిద్ధహస్తుల సంతతివారమే మనము. మనకే వారీయమూల్యనిధి– ఈశిల్పసంపదను విడిచిపెట్టి పోయినారు. కాపాడుకో గలుగుతున్నామా మనం దీనిని? వారి సంతతివారమైన మనము ఆశిల్పకళాతంతువు తెగిపోకుండ సాగింపగలుగుతున్నామా? పోనీ తుదకు గుర్తింపనైనా గుర్తించి ఆరాధింప గలుగుతున్నామా ఆకళావైభవమును? తమప్రాచీన సంపద్విశేషాన్ని తెలుసుకొని ఆరాధింపలేని జాతికి అభ్యుదయ మెక్కడ? నాగార్జునకొండ, గుమ్మడిదొర్రు మొదలైనచోట్ల ఉన్న తమ అమూల్య నిక్షేపము—శిల్పసంపద—రాష్ట్రాంతరములకు తర్లిపోతుంటే వేదనాఘోషము పొంగులుదేరి ఇంకా పైకి వినబడనిజాతికి అభ్యుదయ మెక్కడ? సర్వతోముఖమైన అభివృద్ధి యెక్కడ? ఎట్టిస్థితి! అని కన్నీరోడ్చి వనలక్ష్మి సింగారించుకొనే అట్టిస్థలాలలో మనకు కళాసంపద నిక్షేపించి కీర్తిశేషులైన ఆశిల్పాచార్యులకు నమస్కరించి, ఆసెలయేటి లేటనీరింత దాహము పుచ్చుకొని అక్కడ రాతిబండలమీద సంకులములైన తలపులతో దిక్కులు కలియజూస్తూ అట్లే కూర్చుండి పోయినాము.

ప్రతిశివరాత్రికీ గొప్ప ఉత్సవం జరుగుతుందట అక్కడ. తిరునాళ్లు సాగుతుందట. యాత్రికులు తండోపతండాలుగా వస్తారట. ఆ శివరాత్రిదాటితే మళ్లీ అక్కడి కెవ్వరూ రాడు.

ఆలయాలు దాటి ఇంకా ఎగువ మిట్టప్రదేశానికి కొండమీదుగా సెలయేటిజాలు ననుసరించి పోతే పెద్ద రాతిగోడవలె నిట్టనిలువుగా లేచిన కొండదరికి పోతాము. ఆ కొండమీద బుగ్గలున్నవి. అక్కడనుంచి ఆకాశధారలు పడుతూ ఉంటవి. వేసవిలోనైనా ఈధారలకు కొదవలేదు. ఆధారలనీరు ఆకొండ మొదలనున్న దొనలో చేరుకొని అక్కడనుండే సెలయేరు ప్రారంభమవుతుంది. నేలమట్టమునుంచి పాతికముప్పై అడుగుల యెత్తుమీద నిట్టనిలువుగా ఉన్నకొండలో సొరంగముగా దొలిచిన ప్రదేశమున్నది. ఆప్రదేశంలో లింగమూ పానవట్టమూ కొన్ని విగ్రహాలూ ఉన్నవి. కొండమీదనుండి పడే నీటిధారలు అభిషేకము చేస్తున్నమాదిరి బొట్లు బొట్లుగ ఆ లింగముమీదా ఆవిగ్రహాలమీదా పడుతూ ఉంటవి. ఎక్కడానికి సాధ్యముకాని ఆనిట్టనిలువు కొండగోడను అంతయెత్తున ఎట్లా దొలిచారో, అక్కడికి విగ్రహాలూ మొదలైనవి ఎట్లా చేర్చారో? ఆకాశధారలు వాటిమీద పడేటట్టు వాటి నక్కడ అమర్చడం ఆశ్చర్యంకదా!

ఈ దుగ్గి భైరవునికోన ఆలయాలను గురించి వేరొకపర్యాయము వ్రాస్తాను. అక్కడ శాసనాలకు ప్రతిబింబాలున్నూ, కొన్నికొన్ని దృశ్యాలకు ఫోటోలున్నూ తీసుకొనేసరికే మధ్యాహ్నము రెండో రెండున్నర గంటలో అయినది. కడచినరాత్రి వింజమూరిలో చేసిన భోజనము. రాత్రి నిద్రలేదు. మధ్యాహ్నము మళ్లీ భోజనం లేదు. ఇంకా అక్కడ చేయవలసినపని ఎంతైనా ఉంది. కాని ఏమిచేయము? అక్కడ ఒక్కరోజు కాదు కదా ఒక్కపూటయినా ఆగడానికి తయారై వెళ్లలేదు. ఆప్రదేశముయొక్క స్వభావమెట్టిదో, అక్కడ చేయవలసిన పని ఎంతఉండునో కూడా అంతకుపూర్వము తెలియదు.

మాతో దారిచూపడానికి వచ్చినవానికికూడా భోజనము లేదు. అరణ్యప్రాంతము: నిర్జనప్రదేశము. ఇట్టి సందర్భాలలో పని సంపూర్తిగా కాకపోతేమాత్రము ఎట్లా ఆగగలము? మరునాడు వద్దామనుకొన్నా చేరువా చెంతా కాదు. ఇంతదూరము నడచి మళ్లీ రావలెను. సీతారాంపురంనుంచి అయితే ఒంటెద్దుబండో రెండెడ్లబండో కోనకు కడతారట. కాని కిరాయి చాలాజాస్తి. ఇంక చేసేది లేక మిగిలిన పనికి మళ్లీ ఎప్పుడో ఇంకొక మారు వద్దామని పని దిగడిపోయిందే అన్న విచారంతోను, ప్రశాంతమైన ఆసౌందర్యావాసం విడిచిపెట్టి వెళ్ళిపోతున్నామే అన్న మనస్సుకలకతోను కోనకు అధిదేవత అయిన భైరవునికి నమస్కారం చేసి ఆలయాలవంక చూస్తూనే 'తిరుగుముఖం' పట్టినాము.

అక్కడికి చేరువలో కృష్ణంపల్లీ, రాచవారిపల్లీ కలవట; కాని మరునాడింక అచ్చటికి మళ్లీ రాదలచుకోలేదు. అట్టిస్థితిలో ఆపల్లెలకు వెళ్ళడమెందుకు? తిన్నగా అయ్యవారిపల్లెకే వెళ్లినట్టయితే ఉదయగిరిపోయే 'బస్సు' దొరుకుతుందని అక్కడికే ప్రయాణమైనాము. పొద్దున్న పదునాలుగు మైళ్లు నడక: మళ్ళీ పదునాలుగు మైళ్లు నడక: దారి చూపడానికి మాతో వచ్చిన అతనుకూడా మాతో సమానంగా తిండిలేక మాడినాడు.

ఆలయాలకు చేరికగానే ఉన్న ఒకగుహనుకూడా చూచి మళ్ళీ మాదారి మేమందుకొన్నాము. నడచాము: నడచాము చాలాదూరం నడచాము. మంచివేసవి ఎండ: తీక్ష్ణమైన గాడుపు:ఉసూరుమనే ఘటాలు:కోనలోతాగిన నీళ్లేకాని ఎక్కడా మరి నీళ్ళచుక్క లేదు: వాగులూ,వంకలూఅన్నీ ఎండిపోయినవి. ఆస్థితిలో ఎంత నడచినా తరగని దూరం. విపరీతమైన దాహం. కూర్చుంటూ లేస్తూ మా మాటా మళ్లతో . ఉస్సు రస్సురంటూ ఒక్క అడుగు పెట్టినా పెట్టడమే అని నడిచాము. పోకలింగాయపల్లికి పోతేకాని-నడుమ గ్రామమేమీ లేదు- నీళ్లు లేవు. ఆవురుపంటున్నవి ప్రాణాలు: తడి యార్చుకపోతున్నది గొంతుక. ఏమిటి సాధనము? ఏమిటి చేయడము? పరుగులలెక్క మాప్రాణాలు తీసింది. మిత్రులైన ప్రసాదరావుగారు—కాసైతే డాక్టరుగారే—చెట్టుక్రింద కూలబడ్డారు—నేనూ చతికిలబడ్డాను.ఆయన పరకాయించి చూశాడు: దాహానికి మంచిమందు కని పెట్టినాడు: నాగజెముడుపళ్లు మాకాసమయంలో అమృతఘుటికలైనవి. అవే మమ్మల్ని పోకలింగాయపల్లి వరకూ నెట్టినవి. అక్కడ కడుపునిండా పట్టినన్ని మంచినీళ్లు తాగినాము. ప్రయాణం మంచిపాఠం నేర్పిందనుకున్నాము—అంతేకదా: అనుభవంతో మనిషి బుద్ధిమంతుడూ అవుతాడు:ప్రాజ్ఞతా వస్తుం దతనికి. ఇక ఇటువంటి ప్రయాణాలెట్లా చేయవలెనో తెలిసింది. రాత్రికి అయ్యవారిపల్లి చేరుకొన్నాం. అక్కడ భోజనంచేసి రాత్రి కక్కడనే శయనించి ఉదయాన్నే ఉదయగిరి మోటారెక్కినాము.

అవిద్య ప్రబలమున్న,విద్యతక్కువా అవడముచేత ఊళ్లుకొంచెం మోటుగా ఉంటవి. జనసంఖ్య కూడా చాలా పలుచన. ఈఉదయగిరి తాలూకాలో చదరపు మైలుకు నూరు—నూట యాభైమంది జనం ఉంటారు. ఇది ఎంతవిపరీతమో గోదావరిడెల్టా ప్రదేశాలతో పోల్చి చూస్తే తెలుస్తుంది. గోదావరిడెల్టా తాలూకాలలో చదరపుమైలుకు ఆరువందల యేభై మొదలు వేయివంది వరకూ ఉంటారు. తెనాలితాలూకాలోనూ ఇదే లెఖ్ఖ. గుంటూరు, గుడివాడతాలూకాలు ఇంకాకొంచెం వెనక పడుతవి. అక్కడ చదరపుమైలుకు అయిదు వందలు మొదలు ఆరువందలయాభైవరకూ ఉంటారు. వీటితో పోల్చిచూస్తే ఉదయగిరితాలూకా ఏమూల? చదువుకొన్నవారి సంఖ్య చూస్తే గవర్నమెంటువారి లెక్క ప్రకారం మొత్తంమీద ఈమండలంలో నూటికి ఎనిమిమందో పదిమందో-ఇంతే. అది అటుండగా ఈతాలూకాఅంతా వర్షాధారంమీద ఆధారపడిఉండే దేశం: ఒకయేడు పండితే రెండవయేడు ఎండుతుంది. దారిద్ర్యం అధికం. ఇట్టిస్థితిలో కొన్నికొన్నిచోట్ల దొంగతనాలు ఎక్కువ! కూనీలే జరుగుతుంటవి అంటే ఆశ్చర్య మేమున్నది? మేము అయ్యవారిపల్లె చేరినరాత్రో ఆమరునాటిరాత్రో బర్రెలను కొనుక్కునేటందుకు పోయేటొక్కణ్ని సీతారాంపురం ఉదయగిరిబాటమీద డబ్బున్నదనిఅనుమా

నించి—అట్లని చెప్పుకొన్నారు: నిజమోఅబద్ధమో—చిత్రవధచేసి చెట్టుకు పడదీసి కట్టినారట.

అయ్యవారి పల్లెలో మోటారెక్కి ఉదయం తొమ్మిదిన్నర పదిగంటలకు ఉదయగిరి చేరుకొన్నాము. భోజనానికి అక్కడ పూటకూటిల్లున్నది. బసకు ప్రసాదరావుగారి మిత్రులు— ఏ. వెంకటసుబ్బారావుగారు- దొరకినారు. వారింట్లో బసచేసి వంటపూటింట భోజనం చేసి మధ్యాహ్నం ఉదయగిరి చూచినాము.

ఉదయగిరి చాలా చరిత్రప్రసిద్ధమైన స్థలము. ఇప్పటికీ దానికి ప్రాచీనతాకళ పోలేదు. అడుగడుగుకీ వూరు 'నేను పూర్వపు పట్టనా'న్నని తెలుపుతూనే ఉంటుంది. ఇప్పటికీ అది శత్రువులు కొద్దికాలం కిందటే వచ్చి పాడుపరిచినట్లుంటుంది. ఇప్పటికీ ఆవూళ్లో కనబడే శిథిలావశేషాలు మణిగిపోయి కాంతివిహీనమై మూలమూలల మినుకు మినుకుమంటూ ఉన్న ప్రాచీన హిందూ రాజకళాభిరుచినిగురించి రహస్యంగా మనకు ముగ్ధవచోవిన్యాసంతో వర్ణిస్తూనే ఉంటవి. సమరాధ్వరదీక్షితులైన పూర్వపు హిందూమహమ్మదీయ రాజుల నెత్తుటివెల్లువలతో తడిసి ఆగడ్డఅంతా చిట్లంకట్టుకొని పోయింది అటువంటిది ఉదయగిరి. ఈవుదయగిరిని గురించీ అందలి దుర్గాన్నిగురించీ వేరొకప్పుడు వ్రాస్తాను.

ఆమరునాడు ఉదయం ఉదయగిరి దుర్గాన్ని చూడడానికి బైలుదేరినాము.(చిత్రం ౫)అవశాత్తుగమాకు దుర్గాన్ని చూడడానికి బైలుదేరిన ఉద్యోగస్థులు కొందరు తటస్థపడ్డారు. వారూ మేమూ కలిసి దుర్గానికి పోయినాము: అదంతాచూసి సాయంత్రం ఆరున్నర ఏడుగంటలకు ఇంటికి వచ్చాము. ఆమరునాడుదయాన్ని బైలుదేరి బస్సుమీద తిరిగీ కావలి చేరుకొన్నాము. నాతో సమానంగా నాకష్టసుఖాలు అంతవరకూ పంచుకొన్న మిత్రులు ప్రసాదరావుగారు కావలినుంచి మళ్లీ విడవలూరు వెళ్లిపోయినారు. నేను ప్రాచీనాంధ్రశాసనసంపాదన నిమిత్తం ఆసాయంత్రం కావలిలో 'బస్సు'మీద బైలుదేరి కందుకూరికి వెళ్లినాను.




శీఘ్రావృతి
(చిత్రకారుడే బ్రహ్మయైనచో)

# బాఘ్ విహారములు,

## వాటియందలి చిత్తరువులు, , , ,

### తవిశెట్టి రామారావు గారు

౧

పురాణములందు చిత్రశాలల వర్ణన లుండుటచే భూపాలకుల నివాసములందు కొన్ని గదులైనను చిత్తరువులచే నలంకరింపబడి యుండెననుట నిర్వివాదాంశము. ఈ నివేశము లన్నియు మన్నుతోను, శిథిలమగు సామగ్రితోను నిర్మింప బడుటచే ఎండకు, వర్షముల తాకుడుకు ఆగజాలక నశించుటవలన వాటియందలి చిత్తరువు లెవ్వియు మనకు లభింపకపోయెను. పరాధీనస్థితి యందైనను తలయెత్తి నలుగురిలో మనము తిరుగుటకు మతదీక్ష యన్నివిధముల మనకు దోడ్పడెను. సన్న్యాసులు విహారముల నేర్పరచుకొని వాటియందు చిత్రరచనను జేయించుటచే సనాతన చిత్రకారు లెట్టినిరుపమాన కౌశల్యమును జూపిరో తెలిసికొనుట కవకాశము కలుగుచున్నది. ఈ విహారములు కొండశిలలందు దొలువబడుటచే వర్షమునకు జెడక యిప్పటికిని నిలిచియున్నవి. ఇట్టివి మన కిప్పుడు అజంత, బాఘ్, రాయఘుడ్ మొదలగు కొన్ని స్థలములందు కానవచ్చుచున్నవి. కాని బాఘ్ చిత్తరువుల గూర్చి విన్నవారిసంఖ్య యల్పము. ఇప్పుడీ చిత్తరువు లన్నియు ననేకములగు కారణములవలన మలినములైయున్నను చిత్రకళాప్రపంచమున వాటివిలువకు మితి లేదని చూపరులకు తోపకమానదు.

౨

గ్వాలియరు సంస్థానమున అఝేరాజిల్లాయందు 'బాఘ్' ఒక గ్రామము. ఇది వింధ్యపర్వతశ్రేణికి దక్షిణమున గలదు. ఈగ్రామమునకు సమీపమున నుండుటచే నీ విహారములు బాఘ్ విహారము లని పిలువబడుచున్నవి. మొదట నీస్థల మెట్టి ప్రాముఖ్యము వహించియుండెనో తెలియదు కాని యిప్పటిస్థితినిబట్టి చూచినను సన్న్యాసుల కెంతయు ననుకూలమైనదని తోపకమానదు.

నర్మద కుపనదియగు 'వాఘ్' లేక 'బాఘ్' నది వింధ్యకు దక్షిణమున బ్రవహించుచున్నది. దీనికంటె 150 అడుగుల యెత్తుగనున్న యొకకొండయం దీబాఘ్ విహారము లత్యంతనిపుణతతో దొలువబడినవి. నదికంటె ఈవిహారములు సుమారు 50 అడుగులయెత్తున నుండుటచే ఎట్టి వర్షాకాలమునందైనను ఇందు నివసించువారి కపాయము లేకపోవుటయే కాక స్నానమునకు, పానమునకు జలము సులభముగ లభింపగలదు. చుట్టును చిన్న యడవి; జలసమూహమునకు దూగములగు గుహలు; ఎండకు, వర్షమునకు లక్ష్యపెట్టని నివేశము; భక్ష్యములు, పానీయము సులభముగ లభించెడి యవకాశము; సృష్టికర్తయొక్క గొప్పతనమును జాటజాలు ప్రకృతిదృశ్యము: ఇంతకు మించిన యవకాశము లింకెవ్వి సన్న్యాసులకు కావలెను? ఈకారణములవలననే అజంతవిహారములు కూడ ఇట్టి వసతులుగల స్థలముననే నిర్మింపబడినవి. ముందుభాగమున నుండిన 220 అడుగుల పొడవుగల వరండా ఇప్పుడు నశించుటచే విహారద్వారములు బిల ద్వారములవలె కానబడును. ఈ వరండా (చిత్రము ౩) లేకపోవుటకూడ ఈగుహల శిథిలావస్థకు తోడ్పడెను.

విహారములపైని బరువగుశిల లుండుటచే వాని బరువువలనను, మీదినుండి ప్రవహించు వర్షపునీటివలనను విహారములు త్వరగా నశించుచున్నవి. కొన్ని భాగములు, స్తంభములు పడిపోయినవి. తక్కినవి త్వరలో పడునను భయము కలదు.



చిత్రము ౨

## ౩

బాఘ్ విహారములందలి చిత్తరువుల కాలమును నిర్ణయించుట కచ్చటగాని, మరెచ్చటగాని శాసనములు కానరాలేదు. భారతదేశమున నిట్టి శిలానిర్మాణములు క్రీ. పూ. 3 వ శతాబ్దము మొదలు క్రీ. 15 వ శతాబ్దము వరకు నిర్మింపబడెనని పండితులు నిర్ణయించిరి. ఇచ్చట గల రాళ్లు మెత్తని వగుటచే తొలుత శాసనము లుండినను త్వరలో నివి నశించెనని యనుమానపడవచ్చును. 4, 5 వ గుహలయందు గల చిత్తరువుల దిగువ నొకరచన యుండి నటులు నిదర్శనము కలదు. ఇదియు నశించెను కాని "క" యను అక్షరముమాత్రము ఎరుపువర్ణమున గానవచ్చుచున్నది. ఈ యక్షరము 6 లేక 7 వ శతాబ్దములకు జెందినదని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

బాఘ్‌గ్రామమునకు రెండుమైళ్లదూరమున కొన్ని యిటుకపునాదులు కానవచ్చుచున్నవి. ఇవి మయూరధ్వజు డను పౌరాణికనృపతివని యచ్చటి ప్రజలు చెప్పుకొందురు. ఈ ప్రాంతములందే కల సప్తమాతృకల శిలావిగ్రహము 5 లేక 6 వ శతాబ్దమునాటిదని చెప్పవచ్చును. మహాకాళేశ్వరుని దేవాలయము, బ్రహ్మయొక్క విగ్రహము, బాఘేశ్వరుని దేవాలయము మొదలగునవి 11 వ శతాబ్దమునకు తరువాతి వగుటచే చిత్తరువుల కాలమును నిర్ణయించుటకు సహాయపడవు.

కాలమును నిర్ణయించుటకు విహారములే చాల తోడ్పడుచున్నవి. బౌద్ధులచే నిర్మింపబడిన ఇట్టిగుహలన్నియు తొలుత స్తూపములుగ నుద్దేశింపబడెను. నాసికయందుగల ఇట్టి స్తూపములు నహపానునికాలము, అనగా సుమారు క్రీ. శ. 100 సంవత్సరములనాటివని తెలియుచున్నది. రానురా నీచైత్యములు బౌద్ధభిక్షుకుల యాశ్రమములుగ బరిణమించెను. వీటిని విహారము లందురు. బాఘ్ "గుహ" లీతరగతికి జెందును.

అజంతా విహారములతో వీటిని పోల్చిచూచిన కాలనిర్ణయము సులభ మగును. నెం. 1 రు గుహ అన్నిటికంటె సనాతనమనియు, నెం. 2, 3 రు గుహలు అజంతా నెం. 12 రు గుహను పోలుననియు, నెం. 4 రు గుహ యందలి చిత్తరువులు అజంతా నెం. 16, 17 రు గుహలకు సమకాలికములనియు గార్డేగారి యభిప్రాయము.

చిత్రరచనను బరిశీలించినను ఇవి 5 లేక 6 వ శతాబ్దములనాటి అజంతాచిత్తరువులను బోలియున్నవి.

ఈ నిదర్శనములను బట్టి బాఘ్‌చిత్తరువులు మహాయాన బౌద్ధులకాలము-అనగా 5, 6 లేక 7 వ శతాబ్దములనాటి వని నిర్ణయింపవచ్చును.

## ౪

క్రీ. శ. 1818 సం.కు పూర్వము సన్న్యాసులకు, పల్లెటూరిప్రజలకు, చరిత్రమునందును, చిత్రరచనయందును అభిలాష లేని వారికి దప్ప తక్కినవారి కీవిహారములు తెలియలేదు; తెలిసినను వారు వీటియాధిక్యమునుగూర్చి ప్రపంచమునకు దెలియజేయలేదు. ప్రయాణయోగ్యమగు మార్గములచెంత నివి లేకపోవుటవలనను, కాలవశమున జెడి ప్రాముఖ్యము లేని శిథిలనిర్మాణమువలె పైకి కనబడుచుండుట వలనను, చిత్తరువులు విశేషము మలినమై చూపరుల నాకర్షింపక పోవుటవలనను

ఈ విహారములు దూరప్రదేశములనుండి పండితుల నాకర్షింపలేదు.

బొంబాయియందు సైనికోద్యోగిగ నుండిన జేంజరుఫీల్డుగారు 1818 సంవత్సరమున వీటినిగూర్చి వ్రాసిరి. ఈతనికి సనాతన హిందూదేశపుచరిత్రయం దభిలాష లేకపోవుటచేతను, ఆకాలమున ఛాయాచిత్రగ్రహణ యంత్రము (camera) లేకపోవుటచేతను, ఒకదినముమాత్ర మచ్చటనుండి తొందరగ కొన్నివిషయములను మాత్రము కనిపెట్టుటవలనను ఈతని వర్ణన ముపయోగకరము కాలేదు. ఎర్స్కియినుగారును వీటినిగూర్చి వ్రాసిరి కాని ఇందు చరిత్రాంశ మల్పము. డాక్టరు ఇంపేగారు విహారములందలి శిల్పమును, చిత్రరచనను విపులముగ వర్ణించిరి. ఈతడు వర్ణించిన పిమ్మట కొన్నిచిత్తరువులు నశించుటచే నీతనివ్రాతలే యాచిత్తరువుల గొప్పతనమును దెలుపుటకాధారములయినవి. ఆనాడీతడు బాఘ్ కు పోనియెడల మనకు కొన్నిచిత్తరువుల వర్ణన లభింపక పోయియుండెడిది. ఈ విషయమై కర్నల్ లుఆర్డుగారు చేసిన పరిశ్రమ వర్ణనాతీతము. 1907 లేక 1908 వ సంవత్సరమునం దీతడు విహారములను జూచి డాక్టరు ఇంపేగారివ్రాతను విమర్శించి వీటిగొప్పతనమును ప్రపంచమునకు చాటుటచే మిగిలిన చిత్తరువులైనను మనకు లభించెను. వీరి ప్రోత్సాహమువలననే ఆస్గారు ఆలీఖానుగారు శిల్పముల చిత్రములను గొన్నింటిని వ్రాసిరి. వీరు ప్రచురించిన ఛాయాచిత్రములవలన వీటియాధిక్యము వెల్లడియయ్యెను. పిమ్మట హల్దారుగారు బర్లింగ్టను పత్రికయందు వీటినిగూర్చి యొకవ్యాసమును 1923 వ సంవత్సరమున ప్రచురించిరి. తదనంతరము ముకుళదేవుగారు 1925 వ సంవత్సరమున "అజంత బాఘ్లకు నాయాత్ర" అను గ్రంథమును వ్రాసిరి.

వీరందరు ప్రచురించినవాటియందు పొందిక లేకపోవుటవలన మనకు సంపూర్ణమగు వర్ణన లభింపలేదు. ఈపనిని గ్వాలియరు సంస్థానపు పురాతనవస్తు పరిశోధనశాఖ (Archælogical Department) వారిసహాయమున భారతదేశపు సంఘము (India Society) వారు పూర్తిచేసి చక్కనిగ్రంథమును బ్రచురించిరి.

ఇచ్చటిరాళ్లు పిండిరాళ్లగుటవలనను, విహారము మీద బరువగు శిల లుండుటవలనను చాలభాగము పడి పోయెను. ద్వారములన్నియు గప్పబడియుండుటచే లోపల నేమున్నదో బాగుగ జూచుటకు గూడ వీ లేకుండెను. పడిపోయినరాళ్ల కుప్పలను, మన్నును పై తీయించి, చెడినకుడ్యములను బాగుచేయించి, విరిగిన స్తం ములను మరల నిర్మించి, పడిపోవుచున్న కప్పున కాధార నిర్మించి, గ్వాలియరు సంస్థానోద్యోగియగు గార్డెగా విహారముల నిప్పుడు చూడ యోగ్యముగ జేసిరి. ఇం కాదు: ఈమధ్యను కలకత్తానుండి నందలాలుబోసు, అ తకుమారహల్దారు, సురేంద్రనాధకార్ గార్లను; బొంబా యినుండి భాంస్లే, ఆప్తేగార్లను; గ్వాలియరునుండి ఖాండ్, జగ్తప్ గార్లను రప్పించి యీ చిత్తరువుల నమూనాల రంగులతో బాగుగ వ్రాయించి, ప్రచురించి, అసలుచిత్త వులు నశించు నన్న భయమును దీర్చిరి. ఇట్టి యమూల్య మగు పనిని జేయించినందులకు గ్వాలియరుమహారాజుగా యెడల చిత్రకళాకోవిదులు, చరిత్రకారులు కృతజ్ఞతా బద్ధులు.

౫

బాఘ్విహారములు తొమ్మిది. ఇవి యన్నియు కలసి లేకపోవుటచే సుమారు 7:0 గజముల పర్వత భాగము నాక్రమించియున్నవి.

1 వ విహారము: ఇది చాల చిన్నది. విహారవి స్తీర్ణ మునందుకాని, శిల్పమునందుకాని, చిత్రరచనయందుకాని దీనికి ప్రాముఖ్యము లేదు.

2 వ విహారము: దీనిని పాండవొంకిగుహ, లేక పాండవులవిహారము అని పిలిచెదరు. ఇది విశాలమైనది కప్పు కొంత పడిపోయినను దీనిని శుభ్రముచేయు సమ యమున పద్మము, వ్యాఘ్రము మొదలగు చక్కని శిల్ప ములతో నలంకరింపబడి యుండెనని చెప్ప జాలుటకు తగిన నిదర్శనములు లభించెను. ద్వారముచెంత పరివార ముతో నున్న బుద్ధుని విగ్రహ మొకటి కలదు.

3 వ విహారము: దీనిని హత్తిఖానా (ఏనుగు చావడి) యందురు. రెండవ విహారమువలె నిదియు భిక్షు

ఘల నివాసముకొరకు నిర్మింపబడెను. చాలభాగము శిథిల మయ్యెను. తక్కినభాగమున బుద్ధునివిగ్రహములు కలవు.



చిత్రము 3

4 వ విహారము: (చిత్రము 3) దీనియం దిప్పుడు చిత్తరువులు కానవచ్చుటచే రంగ్ మహల్ అని పిలిచెదరు. స్తంభములు,వరండా పడిపోయినను దీనివైశాల్యము,సౌంద ర్యము జూపరులకు గోచరము కాకమానదు. ఇందు గ్రీసు సిరియను దేశముల శిల్పవిధానములు కానవచ్చుచున్నవి.

5 వ విహారము: ఇది నాల్గవ విహారమున కను బద్ధముగ నుండినటులు గోచరించుచున్నది. పూర్వము కప్పునందు, స్తంభములందు, గోడలయందు చిత్తరువు లుండెను. ఇప్పుడు మిగలినవి చాల నల్పము.

6 వ విహారము: ఇది 4, 5 వ గుహలతో గలసి యున్నది. మనచర్చ కెవ్విధమునను పనికిరాదు.

7, 8, 9 వ విహారములు శిథిలములైనవి.

౬

మిగలియున్న చిత్తరువులు 4, 5 వ గుహలమం దుభాగమున గలవు. దీనిని వర్ష మునుండియు, ఎండనుండి యు గాపాడజాలు రాతికప్పు పడిపోవుటవలన నీయ మూల్య రత్నములం దనేకములు మంట గలసెను. 220 అడుగుల గోడయందు పూర్వము చిత్తరువు లుండె నను టకు నిదర్శనములు కలవు. ఇప్పుడు 45 అడుగుల కుడ్యభాగమున మాత్రము మలినమైనవి కాన వచ్చును. ఎన్నియోవందలసంవత్సరములకు పూర్వ ము ఈకప్పు పడిపోయెను. భారతదేశపు జలా పాతము, తీవ్ర మగు సూర్యరశ్మి వీటినాశనము నకు కారణములు. పైనుండి జారిన మంటిక్రింద పూడిపోయియుండిన భాగమునందలి చిత్తరువు లన్నియు నాశనమైనవి. ఉన్నచిత్తరువులందును మధ్యమధ్య నేమియు కానరావు. బాటసారులు రగిల్చిన నిప్పుసెగవలన కొంతభాగము నల్ల నయ్యెను. వీటిని జూచుటకు వచ్చినవారు వారిపేర్లను చిత్తరువులమీద జెక్కి వినాశము నకు దోడ్పడిరి.

ఇచ్చటను గరకుగనున్న గోడపైని పీచు గలపిన మన్ను నలమి, దానిపైని సున్నమును బూసి చిత్రరచనను గావించిరి. అజంతయందలి పూతకంటె నిది దుర్బల మగుటవలన చిత్తరువు లింతగా చెడుటకవకాశము కలిగెను.

మొదట గోడలపై నిట్టి యద్భుతములైన చిత్తరువు లున్నటులు గానరాదు. వీటిని జల్లినయెడల చిత్తరువు లందున్న వ్యక్తులు సనాతనకాలమునుండి వెలువడుచు న్నవో యనునట్లు గోచరమై జూపరులకు దిగ్భ్రమ కలుగజేయును.

అజంతయందు చిత్తరువులు విడిగ నున్నవి. ఇందు 220 అడుగుల గోడయం దధికభాగ మొకేయంశము చిత్రింపబడుటచే వీటి కొకవిధమగు ఘనత, వైశాల్యము, స్వేచ్ఛ కలదు. ఈ పటములు దేనినిగూర్చిన వని నిర్ణ యించుట సాధ్యము కాదు. ఏదో జాతకమును లేక అవ దానమును గూర్చి యుండునని డాక్టరు వోజల్ గారి యభిప్రాయము. ఇది యొకయుత్సవమనియు తరుచుగ రాజపుత్రస్థానమునం దిట్టివి జూడనగుననియు హేవెలు గారు వ్రాసిరి. ఇదియే సరియని తోచుచున్నది. ముఖ్య మగు జమీందారీస్థలములం దీయుత్సవము లిప్పటికిని జూడనగును.



చిత్రము ౪

ఇరువురు స్త్రీ లొకచోట గూర్చొని యున్న యామె నోదార్చుచున్నటులు గలదు. (చిత్రము ౪) వీరి విచార మెట్టిదోకాని చూపరుల మనస్సున కీవిచారము కొంత యంటకమానదు. వీరి యలంకారములు చాల చక్కగ నున్నవి.

మరియొకచోట నిరువు రలంకారశోభితులగు మ



చిత్రము ౫

కుటధారులు సామాన్యముగ మరి ఇరువురితో మాటలాడుచున్నటులు గలదు. (చిత్రము ౫) వెనకభాగమున గానవచ్చు చెట్లచిహ్నములవలనను, ఆపుష్పవర్ణములవలనను వీ రేయడవియందునో, లేక యుద్యానవనమునందునో కూర్చునియున్నట్లు స్పష్టమగుచున్నది. దేహవర్ణము నలుపు. వీరి సమాలోచన మెట్టిదరో యెట్టి మహత్తరమగు కార్యమును జేయుట కాలోచన గావించుచున్నారో తెలియరాదు.

తరువాతి కొన్ని పురుషవిగ్రహములు కలవు. మీదనున్న ఆరుగురును ఆకాశయానమును జేయుచున్న ఋషులో, లేక స్వర్గనివాసులో కావచ్చును. దిగువ నున్నవారు స్త్రీగాయకులవలె గానవచ్చుచున్నారు. వీరి దిగువభాగము కానరానందున వీరి విషయమై విశేషముగ చెప్పుట కవకాశము చాలదు. అజంతయందువలెనే వీరి శిరోజము లలంకృతములై యున్నవి.

తరువాతిచిత్తరువులన్నియు నొక యుత్సవమును ప్రదర్శించుచున్నవి. వీటిని విడిగ వర్ణించుటవలనను, చిత్తరువులను వ్రాయుటవలనను చిత్రకారుని భావవైశాల్యము చదువరులకు గోచరము కాజాలదు. మరియొకమార్గము లేకపోవుటచే నిదియే శరణ్యము.

తొలుత నటకులు, గాయకులు కలిసిన సమూహములు రెండు కలవు. మొదటిదానియందు (చిత్రము ౬) పెద్దగు



చిత్రము ౬

స్త్రీలమధ్య నొకపురుషుడు విచిత్రవస్త్రములను దాల్చి నాట్యముచేయుచున్నటులుగలదు. వీనిశిరమునగల జడలు కొంతవింతగనున్నవి. నాట్యముచేయువారందరు నిట్టివి పూర్వము ధరించుచుండిరనియు, ఇందుకు దక్షిణమునగల నటరాజవిగ్రహము నిదర్శనమనియు, హేవెల్‌గారభి ప్రాయపడుచున్నారు. మరికొన్ని నిదర్శనము లున్నగాని యిట్టియూహను బలపరచుట సాధ్యము కాదు. ఒకతె మృదంగమును వాయించునట్లు గలదు. ముగ్గురు చిరుతలను వేయుచున్నారు. తక్కినముగ్గురు తాళమును వేయుచున్నారు.

రెండవసమూహము మొదటి దానివలె నున్నది కాని ఇందొద్దరుస్త్రీలుమాత్రము కలరు. ఇవి సంగీతముతో గూడుకొన్న హల్లీసకమను నాట్యములని విన్సెంటుస్మిత్తుగారి యభిప్రాయము.

తరువాత పదునేడ్గు రశ్వారూఢులై పోవుచున్నటులు గలదు. ఇందు ఛత్రచామరములతో గలనృపతి వానియుద్యోగులు గలరు. చామరమురంగు నీలముగ నున్నది. కాలవశమున తెలుపువర్ణ మిటులు మారియుండ వచ్చునని పండితుల యభిప్రాయము.

సనాతన హైందవ చిత్రకారులును, శిల్పులును ఏనుగును చక్కగ తమనిర్మాణములందు జూపగలిగిరి. ఈ విషయమున అజంతా, సాంచిమొదలగు కళానిర్మాణములకు బాఘ్‌చిత్తరువు లెవ్విధమునను వెనుకబడవు గుఱ్ఱపు రౌతులతరువాత ఆరు ఏనుగులును, మూడుగుఱ్ఱములును కలవు. ఒకయేనుగుపై పురుషశ్రేష్ఠు డొకడు కలడు (చిత్రము ౭) ఈతడు పుష్పాలంకృతమైన తెల్లనిటోపీని ధరించియున్నాడు. చేత నొకపద్మము కలదు. ఏనుగును నలంకృతమైయున్నది. చెంత నొకసేవకుడు చామరమును విసరునట్లుగలదు. మరియొకడు ఛత్రమును బట్టినట్లూహింపవచ్చును కాని ఛత్రము పైభాగమిప్పుడు కానరాలేదు.

ఈ చిత్తరువులకు దక్షిణమున కొన్ని యేనుగులు గుఱ్ఱములుగల చిత్తరువులున్నటులు ఇంపేగారువర్ణించిరి; కాని యవి ఇప్పుడు కానవచ్చుట లేదు. అరటిచెట్టుక్రింద బుద్ధుడున్నటు లొకచిత్తరువునందు వీరుచూచిరట.

నాల్గవవిహారమునందలి ముఖ్యద్వారమున కుత్తరమున కొన్నిచిత్తరువుల చిహ్నములు కలవు. ఇంపేగారు చూచినప్పటికే యివి మలినమై యుండెను. ఒకరోగికి మరియొకవ్యక్తి పరిచర్య సలుపుచున్నటు లిందూహింపవచ్చును.

తరువాత నిరువురు దుఃఖనిమగ్నలగు స్త్రీలను, ఆనందముతో నున్నశిశువును కానవచ్చినటులు ఇంపేగారు వర్ణించిరి.

మరికొన్ని చిత్తరువులు కొంచెముగ గనబడుచున్నవి; కాని వీటినిగూర్చి విశేషము గ్రహింప నలవికాకున్నది. ఇం దొకడు యక్షుడై యుండవచ్చును.

ఈ వ్యాసమునందు ప్రచురించిన చిత్తరువులు విడివిడిగ నుండుటవలన బాఘ్‌చిత్రకారుల విశాలభావముల ఘనత పాఠకులు బాగుగ గ్రహించుట కష్టము. హల్దారు, నందలాలుబోసు, ఆప్తేమొదలగు సుప్రసిద్ధ చిత్రకారులు వ్రాసినప్రతులుకూడ చాలవని హేవెల్ గారి యభిప్రాయము. ఛాయాచిత్రము లెక్కువనమ్మ దగ్గవని వీరు తలంచుచున్నారు. అసలుచిత్తరువులు మలినమై తడిపినగాని కనబడకుండుటచే వీటిప్రతులను తయారుచేయుట సులభమైనకార్యము కానేరదు.



చిత్రము ౭

చిత్తరువులం దెరుపు విశేషముగ గలదు. కొన్ని చోట్ల గాఢమగు నీలి, పసుపు, ఆకుపచ్చ, తెలుపు వర్ణములుండుటచే మనోహరమగు భిన్నరుచులను జూపుచున్నవి. ఎరుపునందు చిత్రకారులు తొలుత జూపిన సౌందర్య మిప్పుడు నశించియుండవచ్చును. కొన్నివర్ణములు మారెననుటకు నిదర్శనములుకలవు. విశేషమేల? అన్నివర్ణములును మాసినవి. ఈ కారణములవలన వర్ణనిరూపణమునుగూర్చి విమర్శచేయుట భావ్యముకాదు.

మనుష్యవిగ్రహములందే కాక అలంకారములందును బాఘ్‌చిత్రకారు లత్యంతాధికమైన కౌశలమును



చిత్రము ౮

జూపిరి. (చిత్రము ౮) ఇట్టి యలంకారలు స్తంభములపైనను, లోకప్పునకును గలవు. లతలయందు హంసలు, పద్మములు, జంతువులు మొదలగువాటిని విచిత్రరీతిని బొందుపరచిరి.

అజంతయందుగల భిన్నరుచు లిందు కానరావు. కాని యచ్చట మతమునకు సంబంధించినవి విశేషముగనుండ ఇచ్చట ప్రపంచ వ్యవహారములకు సంబంధించినవి విశేషముగ గలవు. హల్లీసక నృత్యము, ఉత్సవము మొదలగునవి దీనికి నిదర్శనములు. మతమునకుగాను సృజింపబడిన విహారములం దిట్టిచిత్తరువులను వ్రాయుట కవకాశమెట్లుగలిగెనో తెలియదు. మహాయాన బౌద్ధమతము దీనికి కారణమై యుండవలెను. బౌద్ధమతపతనమునకు దోడ్పడిన కారణములలో గొన్నిటి నివి సూచించుచున్నవేమో? ప్రపంచమును విశేషము మరచుట భావ్యము కాదని అజంతచిత్రకారులకు నేర్పిన నీతియేమో! ఏది యెటులున్నను ఈ చిత్రకారు లాకాలపు తదితరచిత్రకారుల కెవ్విధమునను వెనుకబడరు. ఒకచోట బుద్ధపాదములుమాత్రము మిగిలియున్నవి. వాటిసౌందర్యమును జూడ తక్కినచిత్తరువులేల లేకపోయెనా యను విచారము కలుగునని కజిన్సుగారు వ్రాసిరి. భారతభాగ్యమంతరించినటు లివియు మాయమయ్యెను.

అజంత చిత్తరువులందువలె నిచ్చటను రేఖావిన్యాస మత్యద్భుతముగ గలదు. చిత్రవైశాల్యమునందు బాఘ్ అజంతనుమించెను.

హల్లీసకమునందు నాట్యము, సంగీతము, చిత్రరచన అన్నియు గలసియుండుటచే నీ రెండు చిత్తరువులును సుందరస్త్రీ విగ్రహములతోగూడిన కళాసన్నములా యనిపించును.

ఈ చిత్తరువులను జూచిన సనాతనహిందూదేశప్రజలతో మనమొకపర్యాయము కలసిమెలగినటు లుండును. వారియానందము, వారివిచారము, వారియాలోచన, వారిఘనత, వారిసాంఘిక మతదీక్షలు మనల నాకర్షించి ప్రస్తుత ప్రపంచమును మరచునట్లు చేయును. చిత్రకారుల "అహం" ఎచ్చటను కానరాకపోవుటచే నీచిత్తరువులు మనకమూల్యములు. నూతనముగ ప్రపంచమున కీ చిత్తరువులను లభింపజేసిన వారికి మనము కృతజ్ఞులము.

---

# హెచ్చరిక

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

(౫ వ సంపుటము, ౩ వ సంచిక తరువాయి)

నీసత్తి లాఁతివాని నొకనిం బొరపాటునఁ గాంచెనేని బల్
రోసముఁ బూని "నీ శిరముఁ ద్రుంచెదనో చెడిపా" యటందు వీ
దోసమె భారమైనఁ బెరత్రోయ్యలులన్ వలపించి కొంపలన్
దీసెడు నీ ప్రవర్తన మదిం దలపోయ వదేమి సోదరా?

ఉ. కూడును గుడ్డ లేక మదిఁ గుందుచు "బాబయ! దండ"మంచు నీ
తోడినరుండు వెంటఁబడి దోసిలినొగ్గి నుతింప వానిపై
గోడు నొకింత చూడ కెదఁ గొంకక జంకక పట్టణాలలో
మాడలఁ బాడుసేసె దిది మానవధర్మ మటయ్య సోదరా!

ఉ. నీతి విహీన మైన తరుణిం గుల దేవతఁగా భజించి య
ప్పాతకి కూఁతలన్ నిగమపాఠము లంచు భ్రమించి కాటికిన్
జేతులుఁ గాళ్లుఁ జాఁచిన విశుద్ధచరిత్రులఁ దల్లిదండ్రులన్
ద్రోతువు కూడు వెట్ట కిది దుర్గతి హేతువు గాదె సోదరా?

ఉ. ఆడినమాటఁ దప్పిన మహా దురితం బని నీదుపూర్వు ల
ల్లాడిరి దాని నిల్పుకొన నాపద లే పదివేలు వచ్చినన్
నేఁ డది యేమి పాపమొ? మనీషు లిసీ యనఁ గూటసాక్షి వై
బేడకు మూఁడణాలకు లభించుచు నుంటివి నీవు సోదరా!

ఉ. పగలు విరాగివేషమునఁ బ్రాకృతలోకముచెంతఁ జేరి "యీ
జగమున నెద్ది శాశ్వతము? సంసరణం బతి హేయ"మంచుఁ బె
క్కు గతుల సూక్తు లాడి రవి గ్రుంకుడుఁ గన్నముఁ ద్రవ్వి విత్తమున్
నగలను దస్కరింతు విది నారకమూలము గాదె సోదరా?

ఉ. నీ యసమర్థతం దెలియనేరక ధీనిధు లైన వార ల
య్యా! యిది కూడ దన్నఁ గడు నాగ్రహ మందుచుఁ బెత్తనంబులం
జేయుదు నంచు వచ్చెదవు చెల్లరె! సంతకమైనఁ బూర్తిగాఁ
జేయఁగలేవు నీ వతి విచిత్రము నీ చరితంబు సోదరా!

---

## బ్రహ్మకు కొన్ని సూచనలు

“నాగరికత” వ్యాపించుటవలన సృష్టియందు కొన్ని మార్పులు చేయవలసిన యావశ్యకత కలదు



కాళ్లకు డెక్కలున్నచో యిరుకు జోళ్ల బాధ యుండదు. జోళ్లదొంగలు యాటలు సాగవు.



పొడుగు చేతులున్న బీదలకు లాభము



మూడు కాళ్లున్నయెడల ముక్కాలిపీట పని సులభముగ నిలుపబడవచ్చును.



తోకలన్యోన్యానురాగమును పెంపుచేయును.



నాలుగుచేతు లున్నయెడల కేటలాగులోయున్న అన్నిరకముల గాజులను ధరింపవచ్చును



వెనుకను కన్నొకట యున్నచో మోటారు ప్రమాదములు తగ్గును.



ముక్కుపొడుగైన చుట్ట కాల్చుట సులభము.

వతిశెట్టి రామారావు.



## విశ్వేశ్వరభూపతి—విన్నకోట పెద్దన

(ధర్మలింగేశ్వరాలయశాసనము)

విశ్వేశ్వరభూపతి యొక్కయు, ఆతని యాస్థాన కవియు, కావ్యాలంకార చూడామణి కర్తయు నగు విన్నకోటపెద్దన యొక్కయు కాలమును నిర్ణయించుటకు పూనుకొనువారి క్కల్లరకు పంచధారలలో ధర్మలింగేశ్వరస్వామి ఆలయములోని విశ్వేశ్వర భూపతియొక్క శాసనమే కొంచె మించుమించుగ ప్రధానాధార మగుచున్నది. ఆశాసనమురొక్క శుద్ధప్రతి ఇంతవర కెచ్చటను ప్రకటింపబడక పోవుటవలన అందలి విషయములు సరిగా తెలియక పెద్దనాదుల కాలనిర్ణయాదికములు చేయుటలో తబ్బిబ్బులు కలుగుచున్నవి.

ఇప్పు డాశాసనమును మొట్టమొదటిమారు ఎపిగ్రాఫియా ఇండికా ౧౯-వ సంపుటము ౧౬౫-వ పుటలో జర్మనీ విశ్వవిద్యాలయపు జే. నోబెల్ (పిహెచ్. డి) దొరగారు ప్రకటించియున్నారు. ఇది విశ్వేశ్వర భూపతియొక్కయు,తద్ద్వారమున విన్నకోటపెద్దన కవియొక్కయు సరియైన కాలమును తెలుపుటయే కాక అందలి చాళుక్యవంశావతార పరిక్రమమును గురించిన యపోహములనుగూడ దొలగింపగలదని అందలి విషయములను పైపత్రికలో ప్రకటితమైన శాసనమునుండి గ్రహించి తెలుపుచున్నాను.

అందు తెలుపబడిన చాళుక్యవంశావతార క్రమ మిది: ఎట్లనిన—




జనమేజయుని వంశములో చాళుక్యపర్వతము మీద తపోజీవితమును గడపిన విష్ణువర్ధనుడు: ఈ విష్ణువర్ధనుని చాళుక్యాన్వయములో చాళుక్య భీమేశ్వరు డుదయించెను. ఈతడీశాసనమున నిట్లు వర్ణింపబడినాడు:

ఆసీదిన్దుకులాగ్రణీర్జనపతిః చాళుక్యభీమేశ్వర
స్తస్యాత్ర పవిత్రశైవపదవీ వృత్తం విచిత్రం భువి;
తేనైవాప్పితవైభవాత్ ఖలుసదాచాళుక్యభీమేశ ఇ
త్యాఖ్యా మాపద పూర్వికా మిహ కుమారా
[రామభీమేశ్వరః.

ఈ చాళుక్యభీమేశ్వరుని వంశములో





೧. ಶ್ರೀ ವೀಣೆ ಶೇಷಣ್ಣ

యలంకారము నెపమున విశ్వేశ్వరభూపతి విజయవత్స రము నిట తెలిపియున్నాడు. ఈశ్లోకపు తెలుగు నేతయే కావ్యాలంకార చూడామణిలో గాన్పించుటవలన అది విశ్వేశ్వరభూపతి విజయలక్ష్మీపరిగ్రహణానంతరమే రచియింపబడినదని సిద్ధాంతమగుచున్నది. అయితే దొర గారు గతికి అయిదు లెక్కవేసినారు. దానము,భోగము, నాశము అని ధనగతులు మూడేయని శబ్దరత్నాకరము తెల్పుచున్నది. దీని ప్రకారమైనచో గతికి మూడు లెక్కవేయవలెను. అప్పుడు విజయసంవత్సరము శకము ౧౩౨౩ అగును. కాని కావ్యాలంకార చూడామణిలోని పద్యము ప్రకారము అది [చతురుపాయ (౪). బాహు (౨) శక్తి (౩) తను (౧)] శకము ౧౩౨౪ అని స్పష్ట మగుచున్నది. 'చతురుపాయ' అన్న పదము నుపయోగిం చినందువలన ఆసంఖ్య నాలుగనుటలో సందేహింప నవసర ము లేదు. అందువలన శాసనములోని 'గతి'కి చతుర్విధ గతులని నాలుగులెక్కనె తీసికొనవలెను కాని మూడు కాని, అయిదుకాని తీసికొనవీలులేదు. దేవగతి, మను ష్యగతి, జంతుగతి, నరగతి యని గతులు నాలుగని కూడ ప్రసిద్ధమే (చూడుడు, సంఖ్యార్థనామ ప్రకాశిక శ్రీసత్కవుప ర్తి వేంకటరామ శ్రీవిద్యానంద నాథ విరచితము). కొన్నిప్రాచీనశాసనములలో గూడ 'గతి'ని 'నాలుగు' లెక్కనే వాడియున్నారు. ఈ కారణములవలన విశ్వేశ్వరభూపతి శత్రువులను శకము ౧౩౨౪ లోనే అనగా క్రీ. శ. ౧౪౦౨ లోనే జయించె ననియు, కావ్యాలంకార చూడామణి క్రీ. శ. ౧౪౧౨ తరువాతనే రచియింపబడియె ననియు నిర్ణయమగుచున్నది. శాసనము నందలి సంస్కృత శ్లోకమునకు తెలుగునేతయే కావ్యాలంకార చూడామణిలో నుండుటవలన ఆ శాసనరచయితకూడ విన్నకోట పెద్దనయే అగునేమోయని సంశయింపవలసి వచ్చుచున్నది.

ఈవిశ్వేశ్వరభూపతికి 'రాయగండగోపాల' బిరుద మున్నట్లును,—తండ్రి పేరిట కాదగును—ఇతడు ఉపేంద్ర వరాగ్రహార ప్రతిష్ఠ గావించినట్లును ఈక్రింది శాసన శ్లోకమువలన దెలియుచున్నది.

కించ్చ తదుత్తర దిక్సముదంచితసాలం విశాలముత్తాలం
ప్రాకల్పయదాకల్పం విశ్వేనృపోరాయగండగోపాలః.

విష్ణుప్రతిష్ఠా మకరోత్సహోధాం
విశ్వేశభూపో ధరణీవరాహః
స్వాపాదితో పేంద్ర వరాగ్రహారే
వట్కూర్మభి స్తృప్త మరుద్విహారే.

[మల్లంపల్లి సోమశేఖరశర్మ]

---

## శ్రీ ముకుళ దేవుగారు

సుప్రసిద్ధకళావిమర్శకులగు గంగోలీగారు మేమాసపు "త్రివేణి" ద్వైమాసపత్రికయందు ముకుళ దేవుయొక్క చిత్రరచనావిధానమును బాగడుచు చక్కని వ్యాసమును వ్రాసిరి. అందు విద్య నభ్యసించుటకు పాశ్చాత్యదేశ ములకు బోయిన హైందవ యువకులు తమ జాతీయమానసమును గోల్పోయి పాశ్చాత్య మార్గములను ద్రొక్కుచున్నారు. ఇందుచే వీరుగావించు మార్పులకు హైందవ చిత్రకా రులును బలియయిరనిరి; కాని

సాధారణముగ విదేశములకుబోయిన చిత్రకా రులవలెగాక ముకుళ దేవుగా రెన్నదగినటులు గౌరవప్రద ముగ బ్రవర్తించి మున్ముందు గొప్పదియు, భావపూరిత మును గాజాలెడు విలువగల మార్గమును జూపజాలిరి. ఏలయన పాశ్చాత్యదేశమునకు పోకపూర్వమే ఆవేళజన కమగు అవనీంద్రనాథ్ ఠాకూరుగారి బోధనవలన వీరు బాగుగ జాతీయభావములతో నిండిన చిత్రరచనమున ప్రవీణులై యుండిరి. వీరి సుప్రసిద్ధరూపచిత్రమాలయం దును, ప్రారంభదశయందే వ్రాయబడినవానిలో నొకటగు "గ్రహణము" (ఈ సంచికయందు గలదు) అను నీటి రంగుల చిత్రమునందును బాగుగ వీరి స్వీయచిత్రలేఖన సామర్థ్యము కానవచ్చుచున్నది.

అని తరువాత పాశ్చాత్యవిధానము నను సరించి లోహఫలకములపై చక్కని చిత్తరువు లను చెక్కుటయందు ముకుళ దేవుగారు ప్రవీ ణులనిరి.

ఇదివరకు సంకుచితముగ నీటిరంగులనే యాశ్రయించియున్న నవీనభారతచిత్రరచనకు, ఇతరులయొక్క సాహసకరమైన నూతనభావప్రదర్శనమునకు వీరి విజయము క్రొత్తమార్గమును జూపుచున్నది.

ఇంతేకాదు. వీరి రూపచిత్రములు సుప్రసిద్ధములు. వీనినిగూర్చి గంగోలీగారిట్లు చెప్పిరి.

వీరిచే రచియింపబడిన ఈస్ట్మన్, ఆర్. బి. కన్నింగ్‌హాము, గ్రాహమ్, డబుల్‌యూ. డబుల్‌యూ. పియర్సను, డాక్టరు రవీంద్రనాథ ఠాకూరుగార్ల రూపచిత్రములందు కానవచ్చు రూపశీల పరిపోషణము, ముఖ్యాంశగ్రహణము వీరు చాలసంవత్సరముల క్రిందట లావణ్యముగ, లలితముగ పెన్సిలుతో చిత్రించిన దక్షిణ హిందూదేశపు సుప్రసిద్ధ సంగీతవిద్వాంసులగు శ్రీ శేషన్న గారి చిత్తరువునంగు (ఈ సంచికయందు గలదు) చూడ నగును.

ఈ కాలమున భారతీయ చిత్రరచనకు పోషణ లేదనిగంగోలీగారువిచారించుచున్నారు. అందరి దృష్టియు స్వరాజ్య సంపాదనముపై నిలిచియున్నది గాని భారతీయ నాగరకతాభివృద్ధికావశ్యకములైన యితరముఖ్యవిషయము లవంకకు మరలలేదనుచున్నారు. వారన్నారు:

ఒక నందలాలుబోసు, ఒక రామరావు, ఒక క్షితిన్ ముజుందారు,ఆదరించువారులేక,ఏకాకులై ప్రయాసముకోర్చి, ప్రపంచపుటాధ్యాత్మిక సంపదకు హిందూదేశముయొక్క యుత్కృష్టమగు కానుకగా, తమజాతీయకళయొక్క సాంప్రదాయములను, భావౌన్నత్యమును నిలిపియున్నారు. ఆడంబరరహితులై భారతదేశముయొక్క ఆధ్యాత్మికభవిష్యత్తుకొరకు వీరు ప్రత్యేకపు తమజీవితములను ధారపోసి కావించుచున్న కార్యములందు మహత్తరమైన సందేశము కలదు.

సుప్రసిద్ధభారతీయ చిత్రకారులతో నాగ్రభులగు కీ. శే. దామెర్ల రామారావుగారిని గణించినందులకు గంగోలీగారి నభినందింపదగును. భారతపుత్రులిపుడిపుడు మేల్కొని నూతనముగ తమ జాతీయకళయొక్క యాథార్థ్యమును గ్రహించుచున్నారు. వారిలో నీ గంగోలీగారొకరు. వీరు వ్రాసినటులు ముకుళదేవునంటి నూతనచిత్రకారులు భారతీయచిత్రకళయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమును ప్రదర్శించి, ఆకళకు నూత్నభావములను చేకూర్చి దానియభివృద్ధి కెంతయు దోడ్పడగలరని నమ్మవచ్చును. ఆంధ్రదేశపు చిత్రకారులును ఎల్లవిధముల పరిశ్రమించి యీకళయందు ప్రత్యేకసామర్థ్యమును గడించి పేరుగాంతురు గాక!

---

## క్రొత్త గుప్తరాజు

బీహారు ఒరిస్సా రీసర్చిసొసయిటిజర్నలు (జూన్ ౧౯౨౮ సంచిక)యందు కాశీవిశ్వవిద్యాలయమున ప్రాచీనభారతేతిహాస పండితులగు శ్రీ ఏ. యస్. ఆల్టెకర్ (యం. ఏ., యల్. యల్. బి)గారు గుప్తవంశమునుగూర్చి నూత్న చారిత్రకాంశమును వెల్లడించు నొక పెద్దవ్యాసమును ప్రకటించినారు. ఆవ్యాసముయొక్క సారము నీక్రింద గాంచనగును:

యం. సిల్వెయిను లెవి అనువారు ౧౯౨౩ సంవత్సరమున జర్నల్ ఏషియాటిక్ అను పత్రికలో

కమను నూత్నముగ నుపలబ్ధమయిన నాట్యదర్పణమును సూర్చి వ్రాయుచు నందు ముద్రారాక్షసనాటకకర్త యగు విశాఖదత్తుడు రచియించిన దేవీచంద్రగుప్తమను నాటకమునుండి లక్ష్యములుగా గైకొన్న ఆరుదాహరణ ములను బ్రకటించి వానినిబట్టి యీనాటక నాయకుడగు చంద్రగుప్తుడు రెండవచంద్రగుప్తుడే యని వ్రాసినారు. ౧౯౨౪వ సంవత్సరమున శ్రీ ఆర్. డి. బెనర్జిగారు కాశీ విశ్వవిద్యాలయమున నొసగిన యుపన్యాసములలో గుప్తరాజుల చరిత్రమునకు ఉదాహృతనాటక భాగ ములను పురస్కరించుకొని కొన్ని నూత్న విషయములను సమకూర్చి చెప్పినారు. 'లెవి'గారి ప్రకటనము భారత దేశమున కంతగా దెలిసియుండదు. బెనర్జిగారి యుప న్యాసము లింకను నముద్రితములు. కావున పైయాధా రములను, ఇంకను ఇటీవల నుపలబ్ధములైన ఇతరాధార ములను బురస్కరించుకొని ప్రాచీనగుప్తరాజుల చరిత్ర మును ఇట్లు వివరించుచున్నాను. ఈగుప్తరాజుల పరిపాల నకాల మింతవఱకు సరిగా నిశ్చయింపరాకున్నది. మొదటి చంద్రగుప్తుని రాజ్యప్రారంభము— గుప్తశక మీతని రాజ్యపరిపాలన ప్రారంభ సం. తోనే ప్రారంభమయి నచో— క్రీ.శ. ౩౧౯-౩౨౦ కంటె పూర్వమునకుబోజా లదు. రెండవ చంద్రగుప్తుని పరిపాలనకాలము క్రీ. శ. ౪౧౨-౪౧౩ వఱకు గలదని చెప్పుట కాధారము గలదు. ఇట్లయినచో మొదటి ముగ్గురి (మొదటి చంద్రగుప్తుడు, సముద్రగుప్తుడు, రెండవచంద్రగుప్తుడు) కాలము ౯౩ సంవత్సరము లగును. దీనితో తరువాతివాడగు కుమార గుప్తుని కాలమును జేర్చుకొన్నచో నీనలుగురికా లము ౧౩౦ సంవత్సరములకు ఇంచుమించుగా నేర్ప డును. క్రొత్తగా దొరకిన ఆధారములనుబట్టి సముద్ర గుప్తునికి తరువాత రామగుప్తు డొక డున్నట్లు తేలుచు న్నది. ఆయాధారము లివి.

రామచంద్ర, గుణచంద్రులు విరచించిన నాట్య దర్పణమున 'దేవీచంద్రగుప్తము'లోనివిగా నుదాహృత ములయినవని యీక్రిందియా ఉదాహరణములను యం. లెవి గా రిచ్చినారు.

౧. భిన్నస్య ప్రస్తుతాదన్యస్య త్రిగత మనేకార్థగతం త్రిశబ్ద స్యానేకార్థత్వా త్తేన ద్వ్యర్థమపి. యథా "దేవీ చంద్రగుప్తే" ద్వితీయేంకే ప్రకృతీనా మాశ్వాస నాయ శకస్య ధ్రువదేవీసంప్రదానే అభ్యుపగతే రాజ్ఞా రామగుప్తేన ఆరివధనార్థం ఇయాసుః ప్రతిపన్నధ్రువ దేవీ నేపథ్యః కుమారచంద్రగుప్తో విజ్ఞాపయ న్నుచ్యతే: యథా:

ప్రతి ష్ఠోత్తిష్ఠ, నఖ ల్వహం త్వాం పరిత్యక్తు ము త్సహే.

ప్రత్యగ్రయౌవనవిభూషణ మంగ మేతత్
రూపశ్రియంచ తవ యౌవనయోగ్యరూపామ్;
స్నిగ్ధం చ మ య్యనుపమా మనురుధ్యమానో
దేవీం త్యజామి బలవాం స్త్వయి మేఽనురాగః.

అన్యస్త్రీశంకయా ధ్రువదేవీ—

యది భర్తృం అవేక్షసి తదో మ మందభాఇణి పరిచ్చయసి.

రాజా:—అపిచ,

త్యజామి దేవీం తృణవ త్త్వదన్తరే,

ధ్రువదేవీ:—అహంపి జీవిదం పరిచ్చయంతీ అజ్జఉత్తం పఢమపరంయ్యేవ పరిచ్చయిస్సం.

రాజా:—త్వయా వినా రాజ్య మిదం హినిష్ఫలమ్;

ధ్రువదేవీ:—మమవి సంపదంనిష్ఫలో జీవలోఅ సు హాపరిచ్చయణీఅ భవిస్సది.

రాజా:— ఊఢేతి దేవింప్రతి మే దయాలుతా,

ధ్రువదేవీ:—ఇయం అజ్జఉత్తస్స ఈదిసీ దయాలుదా జం అణవరద్ధోజణో అణుగాదో ఏవం పరి చ్చఇయది

రాజా:—త్వయి స్థితం భావనిబంధనం మనః.

ధ్రువదేవీ:—అదోయ్యేవ మందభాగా పరిచ్చఇయామి.

రాజా:— త్వయ్యుపారోపిత ప్రేమ్ణాత్వదర్థేయశసాసహా,
పరిత్యక్తా మాయాదేవీ జనోఽయం జనవీపమే.

ధ్రువదేవీ:—ణాంజే, ఇయంసా అజ్జఉత్తకరుణాదా,

సూత్రధారీ:—దేవీ పడంతి చందమండ లా చూడలీ? కిమేత్థ కరియ్యది

రాజా:—దేవీవియోగదుఃఖార్తాం త్వ మస్మాన్ రమయిష్యసి.

ధ్రువదేవీ:—వియోగదుంఖంపి దే అకరుణాస్స అత్థి జ్జేవ.

రాజా:—త్వద్దుఃఖస్యాపనేతుం శతాంశేనాపినక్షమా. ఇతి.

ఏతత్ స్త్రీవేషధారీ చంద్రగుప్తబోధనార్థ మభిహితమపి విశేషణసామ్యేన ధ్రువదేవ్యా స్త్రీవిషయం ప్రతిపన్నం ఇతి భిన్నార్థాభియోజకమ్.

౨. ఆర్తిః ఖేదో వ్యసన మిష్టా ద్విరోధః. యథా "దేవీచంద్రగుప్తే" రాజా చంద్రగుప్తమాహ:

త్వద్దుఃఖ స్యాపనేతుం సా శతాంశేనాపి నక్షమా, ధ్రువదేవీ సూత్రధారీ మాహ:

హంజే, ఇయం సా ఈదిసీ అజ్జఉత్తస్స కరుణాపరాహీణదా

సూత్రధారీ:—దేవి, పడంతి చందమండలాఉ వి చుడ ఆలిఉ కిం ఏనుకరిహ్మా.

రాజా:—త్వ య్యుపారోపిత ప్రేమ్ణా త్వదర్థే యశసాసహ

పరిత్యక్తా మయా దేవీ జనోఽయం జనఏవమే.

ధ్రువదేవీ:—"అహంపి జీవిదం పరిచ్చయం తీ పఢమ పరం య్యేవ తుమం పరిచ్చయిస్సం.

అత్ర "స్త్రీవేషనిహ్నుతే చంద్రగుప్తే" ప్రియవచనై స్త్రీప్రత్యయా ద్ధ్రువదేవ్యా గురు మనుసంతాపరూప వ్యసనస్య సంప్రాప్తిః.

౩. భావానాం సాధ్యఫలోచితానాం రతిహర్షోత్సవాదీనాం యాచనం ప్రార్థనా. తథా "దేవీచంద్రగుప్తే చతుర్థేఽకే:"

చంద్రగుప్తః—ప్రియే, మాధవసేనే, త్వ మిదానీం మే బన్ధ మాజ్ఞాపయ,

కంఠే కిన్నరకంఠి బాహులతికా పాశః సమాసజ్యతాం

హారస్తే స్తనబాన్ధవో మమ బలాత్ బధ్నాతు పాణిద్వయమ్

పాదౌ త్వజ్జఘనస్థలప్రణయినీ సందానయో న్మేఖలాం

పూర్వం త్వద్గుణబద్ధమేవ హృదయం బంధం పున ర్నార్హతి.

అత్ర రతేః ప్రార్థనా.

౪. తథాచ వేశ్యాయాం నాయికాయాం వినయరహితమపి చేష్టితం నిబద్ధ్యతే, యథా "విశాఖదత్తకృతే" దేవీచంద్రగుప్తే మాధవసేనాం సముద్దిశ్య కుమారచంద్రగుప్తస్యోక్తిః:

ఆనందాశ్రుజలం సితోత్పలరుచో రాబధ్నతా నేత్రయోః,

ప్రత్యంగేషు వరాననే పులకిషు స్వేదం సమాతన్వతా,

కుర్వాణేన నితంబయో రుపచయం సంపూర్ణయో ర ప్యసౌ

కేనా ప్యస్పృశతా ప్యధో నివసనగ్రంథి స్తవోచ్ఛ్వాసితః—ఇతి.

౫. యథా "దేవీచంద్రగుప్తే" పంచమేంకే

ఏసో సియకరవిత్థగపణాసియా సేసవేరితిమిరోహో,

నియవిహావరేణచందో గయణంగహాలంధియోవిస ఇ.

ఇయం స్వాపాయశంకినః కృతకోన్మత్తస్య కుమారచంద్రగుప్తస్య చంద్రోదయవర్ణనేన ప్రవేశప్రతిపాదికేతి.

అంకాంతే అంకమధ్యేవా సనిమిత్తం రంగాత్పాత్రస్య బహిర్నిస్సరణం నిష్క్రమః. తత్ప్రయోజనానుశక్తికాదే రాకృతిగణత్వాది కన్యభయపదవృద్ధౌ నై ష్క్రామికీ; యథా 'దేవీచంద్రగుప్తే పంచమాంకాంతే:'

బహువిహాకజ్జణి నేసం అఇగూఢ నిణవావే ఇమయిణాదో నిక్ఖలయి ఖుద్దుచిత్తా ఉరస్సా......త్తంమనోరిఉణో.

ఇయ మన్మత్తస్య చ ద్రగుప్తస్య మదనవికార గోపనపరస్య మనాక్ శత్రుభీతస్య రాజకులాగమనార్థం నిష్క్రమసూచికేతి.

౬. భావస్య పరాభిప్రాయ స్యాథవా భావ్యమాన స్యార్థస్యోహ ప్రతిమాదివశా న్నిర్ణయో యథావస్థితిరూ పనిశ్చయః క్రమః బుద్ధి స్తత్రక్రమ తే న ప్రతిహన్యత ఇత్య ర్థః యథా"దేవీచంద్రగుప్తే"ధ్రువదేవీం దృష్ట్వా స్వగత మాహ, ఇయమపి సా దేవీ తిష్ఠతి, యైషా

రమ్యాం చారతికారిణీంచ కరుణా
శోకేన నీతాదశాం
తత్కాలోపగతేన రాహుశిరసా
గుప్తేవ చాంద్రీకలా;
పత్యుః క్లీబజనోచితేన చరితే
నానేన పుంస స్సతః
లజ్జాకోపవిషాదభీత్యరతిభిః
క్షేత్రీకృతాతామ్యతే.

అత్ర ధ్రువదేవ్యభిప్రాయస్య చంద్రగుప్తేననిశ్చయః.

---

ధారానగరాధీశ భోజకృత మనబడుచున్న శృంగార రూపకమునం దుదాహృతములయినవని శ్రీ ఆర్. సర స్వతిగారు (ఇండియన్ ఆంటిక్వెరి 1923 p 181.)లో ఈదేవీచంద్రగుప్తనాటక భాగములను మూటిని ప్రక టించినారు. అవి ఈక్రిందివి:

౭. "శ్రీవేమనిహ్నూత శ్చంద్రగుప్త శ్శత్రోస్స్కం ధావార మరిపురం శకపతివధా యాగమత్.

౮. దేవీచంద్రగుప్తే విమాతకంప్రతి చంద్రగుప్తః:

సద్వంశా న్పృథువంశే విక్రమబలా
న్దృష్ట్వాద్భుతా న్దన్తినః,
హీనస్యేవ గుహాముఖా దభిముఖం
నిష్క్రామతః పర్వతాత్;
ఏకస్యాపి విధూతకేసర జటా
భారస్య భీతా మృగాః,
గంధాదేవ హరే ర్ద్రవ న్తి బహవో
వీరస్య కింసంఖ్యయా.

౯. దేవీచంద్రగుప్తే వసంతసేనా ముద్దిశ్యమాధవోక్తిః:

ఆనందాశ్రుజలం సితోత్పలరుచో
రాబధ్నతా నేత్రయోః
ప్రత్యంగేషు వరాననే పులకిషు
స్వేదం సమాతన్వతా,
కుర్వాణేన నితంబయో రుపచయం
సంపూర్ణయో రప్యసౌ,
కేనా ప్యస్పృశతా ప్యథోనివసన
గ్రంథి స్తవోచ్ఛ్వాసితః.

---

రాజశేఖరుడు తన 'కావ్యమీమాంస' యందు 'ముక్తకకథోత్థ' మను 'వస్తుస్వరూప' భేదమున కుదా హరణముగా నీక్రిందిశ్లోకము నిచ్చినాడు.

౧౦. దత్వా రుద్ధగతిః ఖసా( )ధిపతయే
దేవీం ధ్రువస్వామినీం,
యస్మా త్ఖండితసాహసో నివవృతే శ్రీ
శర్మ (v. l.సేన) గుప్తో నృపః;
తస్మిన్నేవ హిమాలయే గురుగుహా
కోణ క్వణత్కిన్నరే
గీయంతే తవ కార్తికేయ నగర
స్త్రీణాంగణైః కీర్తయః.

---

795 వ శకవత్సరమునాటి ఒకటవ అమోఘ వర్షుని 'సంజన్' తామ్రశాసనమున (E. I. Vol.XVIII P. 248) ఒకగుప్తరాజు వితరణమున అమోఘవర్షుని మిగిలినవాడు కలడని వర్ణించుశ్లోక మున్నది. అదియీ క్రిందిది:

౧౧. హత్వా భ్రాతరమేవ రాజ్య మహరే
ద్దేవీంచ దీన స్తథా
లక్షం కోటి మలేఖయన్ కిల కలౌ
దాతా సగుప్తాన్వయః;
యే నాత్యాజి తను స్స్వ రాజ్య
మసకృద్బాహ్యార్థకైః కా కథా

స్త్రీ స్త్వోన్నతి రాష్ట్రకూట
తిలకో దాతేతి కీర్త్యా మపి.

---

ఈ శకధ్రువదేవుల విషయమునుగూర్చిన పైపదు నొకం డుదాహరణములు. కాక బాణుని హర్ష చరితమున నొక యుల్లేఖనము గలదు. ఇది చిరకాలమునుండి ఎటి గినదైయెనను చరిత్రకారులదృష్టి నాకర్షింపకుండెను. అది యిట్లుకలదు:

౧౨. అరిపురేచ పరకళత్రకాముకం కామినీవేషగుప్త శ్చంద్రగుప్తః శకపతి మశాతయత్.

---

ఈ హర్ష చరితవ్యాఖ్యాకారుడగు శంకరార్యు డీ విషయమునే యింకను వివరించి యిట్లు వ్రాసెను:

౧౩. శాకానామాచార్యః శకాధిపతిః చంద్రగుప్తభ్రాతృజాయాం ధ్రువదేవీం ప్రార్థయమానః చంద్రగుప్తేన ధ్రువదేవీవేషధారిణా స్త్రీవేషజనపరివృతేన వ్యాపాదితః.

ఈ యుదాహృతభాగముల * నన్నిటిని యతికి సమన్వయింపగా నిట్లు తేలుచున్నది:

రామగుప్తుడను భీరువు, అసమర్థుడు నయిన రాజొకడుండెను. తత్కాలీనుడును, బలవంతుడును నగు శకరాజొక డాతనిరాజ్యముపై దండెత్తెను. తన్ను, తన రాజ్యమును, ప్రజలను కాపాడుకొనుట కాతడు తనపట్ట మహిషియగు ధ్రువదేవిని శత్రురాజు కామతృష్ణ కెర చేయ నంగీకరించెను. ధీరుడు సాహసి యగు నాతని తమ్ముడు చంద్రగుప్తుడు తనకుటుంబగౌరవమును కాపాడుకొనగోరి ధ్రువదేవి వేషమున శత్రుశిబిరమున ప్రవేశించి కామాతురుడయిన యాశకుని జంపనెంచెను. స్త్రీవేషధారులయిన కొందఱు భటుల నాతడు తనవెంట గొనిపోయెను. తాను కావించుకొన్న సంధి ననుసరించి అనుక్షణమును ధ్రువదేవిరాకకై నిరీక్షించుచున్న శకరాజు పరీక్షింపకయే వారిని శిబిరములోనికి రానిచ్చెను. అంత శకరాజు చంద్రగుప్తుని చేరరాగా నాతడు వానిపైబడిచంపెను. చంద్రగుప్తుడు రాజ్యమునకు తిరిగివచ్చిన కొలదికాలముననే—ఏకారణముననో కాని—యాతని రామగుప్తునితో విరోధము కలిగెను. చంద్రగుప్తుడు తన ప్రాణములకు భీతిల్లుచుండెను. తన్ను కాపాడుకొనుటకు తనకామోన్మాదమును కప్పిపుచ్చి(?)అన్నను జంపుటకు తగు కాశమునకయి వేచియుండెను. తుదకు రామగుప్తుడు హతుడయ్యెను. తరువాత చంద్రగుప్తుడు రాజయి అన్నభార్యయగు ధ్రువదేవిని పెండ్లాడెను.

ఇట్లేర్పడిన కథాభాగమున కాధారములయిన పైయుదాహృతభాగము లెంతవఱకు విశ్వాస్యములగు? పదుమూ డుదాహరణములలో మొదటిఆరును నాట్యదర్పణములోనివి. నాట్యదర్పణకర్తలగు రామచంద్ర గుణచంద్రులు C 1143-1173 లలో నుండిన 'అణహిలపాటక' చాళుక్య వంశీయుడగు కుమారపాలునికి సమకాలికుడును, సుప్రసిద్ధుడును నగు హేమచంద్రుని శిష్యులు. ఈదేవీచంద్రగుప్తకర్త విశాఖదత్తుడని తెలియవచ్చుచున్నది. ఈతడు ముద్రారాక్షసకర్తయగు విశాఖదత్తుడే యగును. చాణక్యునిచే తల్లక్రిందు కావింపబడిన రాజ్యముయొక్క చరిత్రమును నాటకముగా రచియించిన విశాఖదత్తు డంతకన్నను భావోద్రేజనకమగు నీచంద్రగుప్తగాథను వినియో, స్వయముగనియో యిట్లు నాటకముగ రచియించియుండును. కాని విశాఖదత్తునికాలము సైతము నిశ్చయము కాలేదు. ఇతడు క్రీ ౫ వ శతాబ్దమునగాక, ౬, లేక ౮ వ శతాబ్దములయం దున్నవాడయినను దేవీచంద్రగుప్తముయొక్క ప్రధానేతివృత్తము చారిత్రకమనుట కాధారములు గలవు. విశాఖదత్తుడు రెండవచంద్రగుప్తునికి సమకాలికుడని పలువురు చరిత్రజ్ఞు లంగీకరించియున్నారు. అట్లయిన నీనాటకమందలిగాథ నాతడు కనియేయుండును. లేక ౬, ౮ శతాబ్దులలోవాడయినను చంద్రగుప్తుని కాలమునకు చాలా కాలము తరువాతివాడు కామిచే చరిత్రాంశముల సత్య

---

* ఈ సంస్కృత ప్రాకృత భాగములందు తప్పు లున్నవి.

ధాకరించియుండు నన జనదు. బాణ, శంకరార్యుల గ్రంథభాగములు, సంజన్ శాసనము నీయభిప్రాయమునకే తోడ్పడుచున్నవి. శ్రీరంగస్వామిసరస్వతి, కృష్ణస్వామి అయ్యంగార్, స్మిత్తుగార్లన్నట్లుగాక బాణ శంకరార్యులయొక్క గ్రంథస్థోదాహరణములు విశ్వసింపదగినవే.

తరువాతివగు శృంగారరూపకమునందలి మూడుదాహరణములలో నొకటి నాట్యదర్పణమునందలి యుదాహృతభాగమునకు సరిగా సరిపోవుచున్నది. మీదుమిక్కిలి తద్గ్రంథ కర్తయగు భోజుడు కేవలమాలంకారికుడే కాక స్వయము మహారాజు; గొప్పరాజనీతిజ్ఞుడును. ఇట్టియాతడు అప్రమాణములగు చరిత్రాంశములుగల గ్రంథములనుండి లక్ష్యములను స్వవిరచితలక్షణ గ్రంథములోనికి గైకొనియుండడు. సంజన్ శాసనము పేర్కొన్నగుప్తరాజు స్కందగుప్త విక్రమాదిత్యుడని డాక్టరు భండార్కరుగారు చెప్పియున్నారు. కాని ఆతడు రెండవ చంద్రగుప్తుడేయగును. (ఇందుకు పెక్కుకారణములను నీ వ్యాసకర్త పేర్కొన్నాడు.)

పదవ ఉదాహరణము రాజశేఖరుని కావ్యమీమాంసలోనిది. ఇందు శర్మగుప్తుడని కలదు. చంద్రగుప్తునకు దేవగుప్తుడను నామాంతర మున్నట్లే రామగుప్తునకును శర్మగుప్తుడను నామాంతర ముండియుండవలెను. లేక మాతృకలోని 'రామ' అను పదమును పొరపడి 'శర్మ' అని చదువుటవలన నిట్లు పొసగియుండవలెను. ఇందీగుప్తునిభార్యపేరు 'ధ్రువస్వామిని' అని యుండుటచేత అక్షరములను పొరవడిచదువుటయే నిశ్చయముగా తలపవచ్చును. మఱియు నిందు 'ఖస'రాజు అని కలదు. కవి తాను వర్ణింపదలచిన యంశమున కనుకూలముగ నుండునట్లు స్వతంత్రించి చరిత్రవిషయము నించుకమార్చి యుండవచ్చును; లేక 'శక' అనుటకు మారుగ 'ఖస' అని పొరపాటు చదువుటచేత నీపాఠముపుట్టియుండవచ్చును. రెండవదియే ఉపపన్నముగదోచుచున్నది.

## దీనిపై నాక్షేపణలు-సమాధానములు.

౧. ఉపలబ్ధములయిన గుప్తరాజుల శాసనములన్నిట నెందును ఈరామగుప్తునిపేరే కానరాదు. సమాధానము. ఆంధ్రరాజులశాసనములలో కృష్ణరాజుపేరునే శాసనమును పేర్కొననంతమాత్రమున నాతనియునికిని కాదందుమా? ఇందు పౌరాణికాదులగు నితరగాథలను ప్రమాణములుగా నంగీకరింపలేమా! ఇట్లే ఈరామగుప్తుని యునికియు విశ్వసింపదగినది. మరియు సముద్రగుప్తుని 'ఈరాను' శాసనమునను ముద్రగుప్తునికి కొందఱు పుత్రులున్నట్లు కలదు. ఈరామగుప్తుడు వారలలో నొక్కడో లేక సర్వజ్యేష్ఠుడో కాదగును.

౨. అన్న పెండ్లామును రెండవ చంద్రగుప్తుడు పెండ్లాడెననుట నమ్మదగినదికాదు. సమాధానము. ధ్రువదేవి చంద్రగుప్తుని పట్టమహిషియనుట కాధారములు గలవు. వైశాలిలో నీధ్రువదేవిముద్రికలు లభించినవి. వానియం దీమె మహారాజాధిరాజ చంద్రగుప్తునికి పట్టమహిషియనియు, మహారాజశ్రీ గోవిందగుప్తునికి తల్లి యనియు నున్నది. దేవీచంద్రగుప్తమువలన నీమె చంద్రగుప్తుని అన్నయగు రామగుప్తునకును భార్యగా నుండెనని తెలియవచ్చుచున్నది. ఈవిషయమునే శంకరార్యుని వ్యాఖ్యానమును, సంజన్ శాసనమును రూఢిపరుచుచున్నవి. వీనివలన చంద్రగుప్తుడు అన్నను చంపుటయేకాక ఆతని భార్యను పెండ్లాడెననికూడ తేలుచున్నది.

## శకరాజెవ్వరు?

భారతదేశచరిత్రమునకెక్కిన శకక్షాత్రపరాజులు రెండుశాఖలకు చెందియున్నారు: ౧. మథురశకులు; ౨. ఉజ్జయినిశకులు. వీరిలో ధ్రువదేవిని అప్పగింపకోరినయాతడు పశ్చిమక్షాత్రపుల (మథురశకుల)లోని రెండవ రుద్రసేనుడు కాదగునని నేను తలతును. ఈతని నాణెములు క్రీ. 348 మొదలు 378 వఱకు ముద్రితములయినవి కలవు. ఆకాలమున నీతడే గుప్తులకు ప్రబలశత్రువుగా నుండియుండును. చంద్రగుప్తుడీతనిని సపుత్రకునిగా జంపుటచేతనే యితని తోబుట్టువుకొడుకు సింహసేను డీతనితరువాత రాజ్యమునకు వచ్చియుండును.

ఇట్లు సువిపులముగను, సోపపత్తికముగను జర్చించి తుదకు వ్యాసకర్త యీక్రిందిసిద్ధాంతములను తేల్చినారు:

(౧) సముద్రగుప్తునికి తర్వాత రాజ్యమునకువచ్చినవాఁడు రామగుప్తుఁడుకాని రెండవ చంద్రగుప్తుఁడుకాఁడు

(౨) రామగుప్తుడు దుర్బలుడు; పిఱికి; అసమర్థుఁడు; కావున నీతని కాలమున నుండిన శకరాజు (పశ్చిమశకక్షాత్రపుఁడు) గుప్తసామ్రాజ్యముపై నెత్తివచ్చి తనకతని పట్టపుమహిషియగు ధ్రువదేవి నప్పగింప నిర్బంధించెను.

(౩) రామగుప్తుని తమ్ముఁడు చంద్రగుప్తుఁడు ధ్రువదేవి వేషమును వేసుకొని శకరాజునొద్దకుబోయి యాతనిజంపి యాయుపద్రవమును తొలగించెను.

(౪) చంద్రగుప్తుడు మరలివచ్చినపిదప నాతఁడో, నాతనిచే ప్రేరితులయినవారో రామగుప్తుని చంపిరి.

(౫) మృతుఁడయిన అన్నయొక్క పెండ్లామును చంద్రగుప్తుడు వివాహమయి యామెను పట్టపుదేవిని జేసికొనెను.

ఈవ్యాసకర్తయొక్క పరిశోధన సిద్ధాంతములు సంశయగ్రస్తముగనున్న గుప్తవంశ చరిత్రమున కెంతవఱకు తోడ్పడగలవను విషయమును చారిత్రజ్ఞులు పరిశీలింతురుగాక !

[గ. సు.]

---

## డాక్టరు సుధీంద్రబోసుగారు

డాక్టరు సుధీంద్రబోసుగారు ఒకపాతిక శతాబ్దము విడిచియుండినపిదప తమ మాతృదేశమును సందర్శింపవచ్చి కొలదికాలముమాత్రమే యిచట నుండగల్గిరి. వారిచట నెవ్వరికి నెగ్గు నేయలేదు. అమెరికానుండి అభ్యాగతుడుగా నేతెంచి భారతదేశమున నున్నంతకాలము వీరపాయకరముగ వర్తించినట్లు 'నిరంకుశ'వాదులలో పెద్ద మొదలు చిన్నవఱకు నొక్కడును తలంపలేదు. అయినను వీరు తమ్మికముం దీదేశమునకు యాత్రికుడుగగాని, నిత్యనివాసిగగాని రానిత్తురను నిశ్చయత యేమియు సిమ్లా 'దేవతల'నుండి పడయలేదు.

వీరిని బ్రిటిషు, ఇండో బ్రిటిషు నిరంకుశప్రభుత్వము విసిగించుట యే మహాపరాధములు, దుష్కృత్యములు గావించిరనియో తెలియదు. యుద్ధసమయమున వీరు అమెరికాయందు పౌరస్వత్వము బడయుటయే వీరిమహాపచారమని యొకప్పుడు వదంతి ప్రబలెను. కాని అట్లనేక లైరోపీయులును, అందెందఱో బ్రిటనులు నైనను అచట పౌరస్వత్వము బడసియుండిరి. అట్టివారెవ్వరు నిచ్చవచ్చినపుడు తమ జన్మదేశముల సందర్శించుటనుండి కాని, అచట నివసించుటనుండికాని నిషిద్ధులైనట్టు తెలియరాలేదు. కావున డాక్టరుబోసుగారు గౌరవర్ణముగాక బూడిదరంగు దేహమువారగుట చేతనే యిట్లు శిక్షాపాత్రులైరనుట తెల్లము; అదికాక వారు బ్రిటిషు ప్రజగా జనించు దుర్భాగ్యమునకు పాల్పడుటచే, అమెరికను లయి విముక్తులగుటకు సంకల్పించియుండురు. కాని బ్రిటిషు ప్రభుత్వమునకును, బ్రిటిషువారికిని కులవిశ్వాసమున్నది—ఒక్కసారి (బ్రిటిషు)ప్రజ యైనవారు ఎప్పటికిని (బ్రిటిషు) ప్రజయే. భారతదేశపు బ్రాహ్మణోత్త



ములు శూద్రకులజాతుడు బ్రాహ్మణుడు కాజాలడని విశ్వసించినట్లే. బ్రిటను దేశపు గౌరబ్రాహ్మణులు భారత దేశపు రాజకీయశూద్రుడు ఐరోపా అమెరికాల రాజకీయబ్రాహ్మణజాతికి చెందరాదని విశ్వసించుచున్నారు.

[మాడరన్ రివ్యూ ఆగస్టుసంచికనుండి]

---

## మట్టుననుండి పైమెట్టునకు

డాక్టరు ఆనీ బెసంటమ్మగారి కుమారుడును, సుప్రసిద్ధ గ్రంథకర్త యగు సర్ వాల్టరు బెసంటుగారి భ్రాతృవ్యుడు నగు ఆర్థర్ డిగ్బీ బెసంటుగారు రెండువత్సరములకాలము ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆక్చుఅరీస్ (జనన మరణముల సంఖ్యలు మొదలగువాని గూర్చిన లెక్కల తయారుచేయు కార్యాలయము)న కధ్యక్షులుగనుండి మానుకొనినవారు. వా రింకను



క్లెరికల్, మెడికల్ అండ్ జనరల్ లైఫ్ అష్యూరెన్సు సొసైటీకి జనరల్ మేనేజరును, ఆక్చుఅరీయునై, ఆసంఘముయొక్క చరిత్రమును గ్రంథముగ వ్రాసినవారు. ముందుకు మంచి యవకాశము లుండు ఫస్టుక్లాసు సివిల్ సర్వీసులో చేరుతలంపుతో వీరు పోర్ట్సుమత్ లోని యొకస్కూలునుండి లండనులోని యూనివర్సిటీ కళాశాలకు వచ్చిరి. వారు లండను విశ్వవిద్యాలయమున బి. ఏ. పట్టము నందుకొనునప్పటికి సివిల్ సర్వీసునం దొకవిరామము కలిగినందున వీరిని భీమాకంపెనీలయందు వృత్తి నారంభింపు డని పెద్దలు సలహాల నొసగిరి. వీరి ప్రస్తుత కార్యాలయముయొక్క అప్పటి నిర్వాహకునితో పరిచయముకలిగినపైని, వారమున కొక పౌండు వేతనముచొప్పున తాత్కాలికోద్యోగము వీరికి లభించెను. మఱికొన్నాళ్లకే చిన్నగుమాస్తాయొకడు జబ్బుపడిపోయి యతనిస్థానము ఖాలీగా నుండుటచే బెసంటుగారు ఆయుద్యోగమునకు సంబంధించిన చిల్లరపనుల న్నియు తాను చేయుదునని నొక్కిచెప్పుటచే ఆయుద్యోగము వీరి కీయబడెను. మఱికొన్ని నెలలకే వీరు యాక్చుఏరియల్ శాఖకు మార్పబడి, కొలదికాలములో దాని ముఖ్యోద్యోగియైరి. తొమ్మిదేండ్లవెనుక వీరు అసిస్టెంట్ యాక్చుఅరీగా నియమింపబడి 1906 సంవత్సరములో, నప్పటి యాక్చుఅరీ తనయుద్యోగముచాలించుకొనిన పిదప, నతని పదవికి వీరిని హెచ్చించిరి. ఆరోగ్యభీమాకు సంబంధించిన యన్నిసమస్యలను పరిశీలించుటకై ప్రభుత్వము వారు హెల్తుకమిషనును నియమించినప్పుడు, ఈ బెసెంటుగారి నాసంఘమునం దుద్యోగము స్వీకరింప నాహ్వానించియుండిరి.

['స్ఫియరు'-14-7-28]

---

## దేశభాషలు—విశ్వవిద్యాలయము

శ్రీయుత గోపాల హల్దారుగారు 'వెల్ఫేర్' అను వారపత్రికయందు బోధనమున దేశభాషను ద్వారభాషగ త్వరలో నేర్పఱుపవలెనను విషయము చర్చించుచు చివరను సమంజసమగు ఈక్రిందిసూచనను గావించిరి: మన విశ్వవిద్యాలయ సదస్యు లిది గమనింపదగుదురు:

మనము మన విద్యాశాలలనుండి యాంగ్లమును పూర్తిగ తొలగింపగోరుట లేదు. ఉన్న పరిస్థితులయందు సర్వకాలమునకు గాకున్న గొంతకాలము వఱకైన అది సెకండరీ విద్యాభ్యాసకులు చాలినంత జ్ఞానము గల్గియుండదగిన ముఖ్యవిషయముగ నుండవలెను. కాని నిర్విశేషముగ దేశభాషల సత్వరోజ్జీవనమును మనము వాంఛింతుము; దానికై తప మొనరింతుము. దానినే మనము ముఖ్యముగ నుపాసింపవలెను; వెలుపటియాశియ ప్రపంచమునకు మనల ననుబంధించుకొనుటకు ఆంగ్లము నొకయుపకరణముగ మనము గావించుకొనవలెను. ప్రతిభారతీయ విశ్వవిద్యాలయమునను, తద్రాష్ట్రమున నిత్యనివాసులును, చిరనివాసులునగు ప్రతివిద్యార్థియు దిగవిడుపులేకుండ,

తద్రాష్ట్రభాషయందు తగినంత పరిజ్ఞానము గల్గియుండవలెనను నియమ ముండవలెను. ఇట్లు కలకత్తా విశ్వవిద్యాలయము వంగీయులను, వంగేతరభారతీయులను, ఆంగ్లో ఇండియనులను, ఐరోపీయులను—అందఱను వంగభాషా పరీక్షకు కూర్చుండ జేయవలెను. పరిశోధనమునకై బయటనుండి యేతెంచిన విదేశీయ విద్యార్థుల విషయమునమాత్రమే యీనియమము సడలింప జెల్లును.

---

## డెన్మార్కునందు కోఆపరేటివు ఉద్యమము

'సరస్వతీ' (హిందీ) పత్రిక జూలై సంచికయందు శ్రీయుత రమేశప్రసాదు, బి. యస్. సి. గారు వ్రాసిన వ్యాసమునుండి:

డెన్మార్కు దేశమున కోఆపరేటివు సంస్థలు మిక్కిలి వ్యాప్తిలోనికి వచ్చినవి. క్రీ. ౧౮౮౨ సం.న డెన్మార్కునందు ౧౮౮౧ కోఆపరేటివు సంస్థలుండెను. క్రీ. ౧౮౯౬ నం దచట నొక్క సహయోగ (కోఆపరేటివు) సంస్థ నెలకొనెను. ఈసమితి సంయుక్తసమితుల కావశ్యకములగు వస్తుజాలమును కొనుటయేకాక, అనుదినము నుపయోగపడు వస్తువుల గొన్నిటి దయారు చేయుటకై యొక కర్మాగారమునుగూడ తెఱచెను. దీని యొక్కవ పేరులు గ్రామములందు గలవు; ఎక్కువ మెంబర్లు రయితులు. డెన్మార్కు తన యభ్యున్నతి నిట్లు సహయోగమువలన నెక్కువగ గావించుకొన్నది.

డెన్మార్కునందు అప్పిచ్చు సహయోగసమితుల ప్రచారము జరుగలేదు. ఇందులకు గారణ మచ్చట రైతులకు ధన మావశ్యకము గాకుంటయు గాదు, అప్పిచ్చు సంఘముల సంస్థాపనమున వారు కృతకృత్యులు కాకుంటయు గాదు. డేనిషుప్రభుత్వము రైతులకు వేరొండు రీతిని ధనసహాయత గావించుటయే యిందులకు ప్రధాన హేతువు. భూమిని దున్నువాడే భూమికి ఖామందు గావలెనను నుద్దేశముతో డేనిషుప్రభుత్వము చిన్నచిన్న భూమండములను గొనుటకుగాను రైతులకు సాయ్మిచ్చుచుండును. క్రీ. ౧౯౧౧ సం.న డెన్మార్కునందు ఒక కోఆపరేటివుబ్యాంకు స్థాపిత మయ్యెను. దీనిషేరులు కోఆపరేటివు సంఘములు మాత్రమే కొనవలెను. ౧౫వ సం.న ౧౪౧౦ కోఆపరేటివు సంఘములు ఈబ్యాంకుతో సంబంధ మేర్పరచుకొనెను.

...ఇంక ననేకవిధములగు సంఘములు డెన్మార్కునందు గలవు. ఇంచుమించు వ్యవసాయ విభాగములన్నిటను, రైతుల సర్వకార్యము లందును సహయోగ సిద్ధాంతమున ననుకరించి డేనిషు రయితులు తమ యార్థికౌన్నత్యము గావించుకొనిరి. తొలుదొల్త సహయోగోద్యమప్రచారము గావించిన వారి యాశయ మేమన, ప్రతివ్యక్తియు పూర్ణ వికాసమునందు విధమున సహయోగముద్వారా సాంఘికవ్యవస్థను గావించుటయే ఈయాశయముయొక్క సాఫల్య మింకను చాలదూరముననున్నను, ఈసహయోగప్రచారము వలననే డెన్మార్కు రయితులయం దాత్మశక్తి యుద్భవించినది. దేశసంబంధములైన కార్యములన్నిటియందును డేనిషురయితులు పాల్గొనుచున్నారు. వారిమూలముననే డెన్మార్కుదేశము నేటి యీపదమున నారూఢమైనది. ఈదేశపురయితులును డెన్మార్కు రయితులనుండి శిక్ష గఱచి తమకును, తమదేశమునకును ఔన్నత్యము ఘటియించుకొందురు గాక!

---

## శిక్ష—జీవనసమన్వ

'సరస్వతీ' (హిందీ) పత్రిక జూలై సంచికయందు శ్రీ హరిశంకరద్వివేదిగారు వ్రాసిన వ్యాసమునుండి:

శిక్షాప్రణాలిని సరసమును, హృదయంగమము నొనర్చుటకు పెక్కుపాయములు గావింపబడినవి. హెచ్. క్రిన్లే జాన్సనుకన్య చెప్పిన నాటకపద్ధతిని శిక్షగఱపుట యన్నిపద్ధతులను మించినది. 'The Dramatic Method of Teaching' అను తనగ్రంథమున నామె నాటకమూలమున నెల్లవిషయములను బోధింపవలెనని

నడిచినది. నాటకముద్వారా సాహిత్యమును, ఇతిహాసమును చక్కగ బోధింపవచ్చునుగాని తక్కినవిషయముల బోధించుట యెట్లో యాలోచనీయము. 'పార్సునూలు' ఉపాధ్యాయులగు కాల్డ్వెల్ కుక్కుగారు విద్యార్థులకు బోధనతోపాటు మనోరంజనము గూర్చుటకు నాటకమే కాక యింక ననేక పద్ధతుల నేర్పఱచిరి. తమకళాశాలయందు తమసామర్థ్యము సంపూర్ణముగ ప్రదర్శించుటకు విద్యార్థు లెంతయు నుత్సాహులగుచుందురు. వారొక్కొకపుడు తమలో దాము వాదవివాదములు గావించుకొందురు; ఒక్కొకప్పుడు చిన్నచిన్న యుపన్యాసములిచ్చుచుందురు; ఒక్కొకపుడు కవిత్వము చెప్పుచుందురు; వేరొకప్పుడు తోచినచిత్రములు గీయుచుందురు.

ఇట్టిబోధనపద్ధతు లనేకములు కనిపట్టి పాశ్చాత్యలోకము శిక్షావిషయమున నొక నూతనయుగము సిద్ధపఱిచినది. ఇందధికశ్రేయ మమెరికా గడించినది. అచటి యధ్యాపకులు ప్రజాతంత్ర పక్షపాతులు; స్వాతంత్ర్య ప్రేములు. కనుకనే వారు శిక్షణయందును స్వాతంత్ర్య ప్రచారమునకే కడంగుదురు. ఆ యాశయధార అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రముల విశాలవక్షముల భేదించుకొని యింగ్లండునందును, ఆసియాలోనికొన్ని భాగములందు సైతమును అలజడిగూర్చినది. కాని యింకను నది భారతదేశమును చేరినదో లేదో సందేహాస్పదము. చేరినను ఇచ్చటి నివాసులు తమసహజమాంద్యమువలనను, ఔదాసీన్యము వలనను తగినంతగ దానికి స్వాగత మొసంగజాలకున్నారు. నేటివఱకు వారు తమప్రాచీన గౌరవస్వప్నముల గాంచుచున్నారు. ప్రపంచమున నింతవేగముగ జరుగుచున్న పరివర్తనమునకు తా మెంతదూరమున నున్నారో అదికూడ వారికి దెలియదు. నిజమునకు మనప్రాచీనగౌరవమునెడ శ్రద్ధవహించుట మంచిమాటయే; కాని మనవర్ణాశ్రమములను, జ్ఞానపిపాసను, సంఘీభావమును, ధార్మికభావములను తిరిగి యుజ్జీవింపజేయు నాలోచన యేమైన జరుగుచున్నదా? వైజ్ఞానిక సిద్ధాంతముల ననుసరించి ప్రతివారును పూర్వజన్మ సంస్కారములతో జనింతు రనునది సత్యమని యంగీకృతమైనది. ప్రతిమనుజునికిని సంస్కారానుసార మెట్లొకవ్యక్తిత్వ మున్నదో యట్లే ప్రతిజాతికిని సంస్కారగతమగు నొక ధర్మమున్నది. ఒకబాలకుని స్వతంత్రప్రకృతి నుపేక్షించుటచే నెట్లతని వ్యక్తిగత జీవనమునకు సంగ్రథనము లేకపోవునో యట్లే జాతీయ విశేషత నుపేక్షించుటచే సాంఘికజీవనమునకును సంగ్రథనము సాధ్యపడదు. ఈజాతీయసత్త్వ మనునది జాతీయాచార విచారములకంటె పూర్తిగ వేరైనది. ఆచారాదులు జాతికి బహిరంగరూపములు; జాతీయసత్త్వము జాతికి అంతరాత్మ. జాతిఅంతరాత్మ అక్షయము, అమరము, సనాతనము. ఆచారాదికమందన్ననో, దేశకాలపాత్రిభేదముల ననుసరించి మార్పులు గలుగుచుండును. దేశాచారము, లోకాచారము, యుగధర్మము మున్నగు శబ్దములే యిందులకు ప్రమాణములు. కాని యాజాతీయసత్త్వము నేడును స్థాయియే. భారతదేశపు మతము, దర్శనము, సాహిత్యము, కళ మున్నగువానియందు జాతీయసత్తయే ప్రతిఫలించుచున్నది.

మనదేశమున శిక్షాపద్ధతి సఫలము కాకుండుటకు ముఖ్యకారణ మేమన, జాతీయసత్తకు తగిన సమ్మానమును, శ్రద్ధయు లభింపకుంటయే. మనశిక్షానౌక కెవ్వరు కర్ణధారులో, ఎవరు మనదేశమున నేటిశిక్షాపద్ధతిని ప్రచారము చేసి శిక్షానీతిని నియంత్రణము నేయుచున్నారో, వారిజాతీయ సంస్కారములు మనజాతీయ సంస్కారములకంటె నెల్లవిధముల భిన్నములు. కనుకనే వారు శుభచింతన గల్గియు మనజాతీయ శిక్షయందలి విశేషతను గుఱుతింపజాలకున్నారు. మనజాతీయసంగ్రథనమున కేశిక్ష యుపయోగకర మనునదియు వారు నిర్ణయింపజాలకున్నారు. ఈవిషయమున శిక్షితసమాజము ఉదాసీనత వహింపక, అమెరికా, ఐరోపాలయందలి యుద్యోగ శీలురైన యధ్యాపకులవలె జాతీయశిక్షనున్నతమొనర్చు ప్రయత్నముల గావించినచో, జాతీయ శిక్షాప్రవాహము నేడు వేరుమార్గమున నుండెడిది. సంఘసంస్కర్తలును, దేశనాయకులును ఇక శిక్షమూలమున సంఘసమస్యలను, దేశసమస్యలను సాధింప నడుముకట్టవలెను. అప్పుడే వాస్తవౌన్నత్యము లభించును.

---


తన్నామన్నా
బయ్యారన్నా


తన్నామన్నా
బయ్యరన్నా


తన్నామన్నా
న్నానా నా


తన్నామన్నా
హొటలు


తన్నామన్నా సిగరెట్లు
అగాకురెండుపొట్లు


తలనొప్పిగా ఉంది కొంచెం
తన్నామన్నాంజనము
రుద్దమన్నారా?
వలిశెట్టి రామారావు

## భారతనారీమణులు-శాసనములందు వారికి గల స్థానము

'డక్కా' విశ్వవిద్యాలయమున న్యాయ శాస్త్రపండితులగు శ్రీ నిర్మలచంద్రపాల(యం. ఏ., బి. యల్.)గారు ఆగస్టు మాడర్న్ రివ్యూ పత్రికయందు భారతదేశమున స్త్రీలకు ప్రతికూలములగు శాసనములవలన కలుగుచున్న ఇబ్బందులనుగూర్చి చర్చించుచు నొకవ్యాసమును ప్రకటించినారు. అందాయన ప్రాచీనకాలమునుండియు ప్రపంచమున స్త్రీలు కేవలము దాసీజనముకన్న నికృష్టముగ పరిగణింపబడుచున్నారనియు, వారికి పురుషులపై నెట్టి యధికారమును లేకపోవుట యటుండ తమ శరీరములయెడను, తమస్వత్వమునెడను సైతముఇంతయైన నధికారము లేకున్నదనియు, తరువాత క్రమముగా నేర్పడిన శాసనములు కూడ వారి కేయనుకూలమును కలిగించియుండలేదనియు నుడివిరి. ఇటీవల నితరదేశములయందు కొన్ని శాసనములు పుట్టి స్త్రీల నిర్బంధములను సడలించుచున్నను భారతదేశముమాత్ర మున్నచోటనే కదలక యున్నదనిరి. మనదేశమున నెల్లజాతుల స్త్రీలకును పట్టినగతి యిట్టిదే యగుననిరి. మొదటినుంచి దిఙ్మాత్రముగ నీచరిత్రనంతయు చెప్పి చివర కిట్లు చెప్పిరి:

భారతదేశమున...భార్యయైనను, తల్లియైనను, కూతురయినను,సోదరియైనను—స్త్రీకి కుటుంబమున నెప్పుడు, నెట్టియధికారమును లేదు. ఇందువలన మనకు స్త్రీలయెడగల గౌరవప్రతిపత్తులు ఏయితర జాతికంటెను ఇంతయేని కొఱతపడినదని నేననుటకాదు. ప్రత్యుత, ప్రాచీనకాలమునుండియు స్త్రీలు గృహములకు అధికారిణులుగనున్నారు. స్త్రీలయెడ గౌరవభావము గలిగియుండుట ఆర్యావర్తనివాసులకుగల గొప్పగుణములలో నొక్కటియై యున్నది.

మనువు ఇట్లు చెప్పినాడు:

శ్లో. యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః;
యత్రైతాస్తు నపూజ్యన్తే సర్వా స్తత్రాఫలాః క్రియాః.

[ఏయింట స్త్రీలు పూజింపబడుదురో ఆయింట దేవతలు తృప్తిగాందురు. ఎచ్చట వారు పూజింపబడరో అచ్చట (దేవతా ప్రసాదాభావముచే యాగాది) సర్వక్రియలు నిష్ఫలము లగును.]

'శతాపరాధములు గలదయినను స్త్రీని పూవుచేనయితము కొట్టరాదని' మఱియొక మహనీయుడు నుడివెను. మనకు స్త్రీలయెడ గల గౌరవము గాఢమేయగుగాక! ప్రతికూలశాసన నిర్బంధములచే వారిని మనకన్న నికృష్టమయిన స్థితియందుంచుట అనుచితము. స్త్రీని గాని, పురుషునిగాని, కేవలసాంఘిక శక్తులుపేక్షించినపుడు వారిని రక్షింపబూనుట శాసనముల ముఖ్యకృత్యము. మనుజుడు పిచ్చివాడు, మూఢుడు, బాలుడు అయినపుడు—అనగా సామాన్యమానవునికంటె బుద్ధియందుకాని, ఈడునందుకాని కొఱవడినపుడు—శాసనప్రతిబంధము వలన బాధచెందును. ఈనాటి పురుషుడెవ్వడు నాడుది తెలివితేటలయందు గాని, ఏయితర గుణములయందుగాని పురుషునికంటె తక్కువయని వివదింపడు. ఒక్క స్త్రీని,పురుషుని ప్రత్యేకము పరిశీలింతము. పెక్కురు మగవారికంటె నసంఖ్యాకులగు నాడువాండ్రే యెల్లవిషయముల చాల నుత్తములుగానున్నారు. ఇక భారతదేశమున స్త్రీలకు ప్రతికూలశాసనవిధానమేల? ప్రపంచమునందలి యెల్లనాగరకజాతులును స్త్రీలకు పురుషులతో సమానాధికారము నంగీకరించినవి. భారతీయులుమాత్ర మాలసించి వెనుకబడియున్నారు. ప్రపంచమున మనముమాత్రమే యింకను మధ్యయుగము

వారి కనుకూలములయియుండిన శాసనములతో తృప్తి చెందియున్నాము.

మనకుటుంబమునందలి స్త్రీలకు మనతో సమానమగు హక్కులను, బాధ్యతలను మన మొసగనంతవఱకు విదేశీయులు మనలను తిరస్కారదృష్టితో జూచుచుందురు. మఱియు ప్రపంచమునందలి యితర నాగరక జాతులతో సమాన పదభాజనులనుగ మనల నామోదింపగోరుట యన్యాయము. మన మీవిషయమున దేశకాలముల ననుసరించి చాలదూరము ముందుకు పోవలసియున్నాము. ఇపుడు భారతదేశమున స్త్రీలకు కొంత స్వాతంత్ర్యము లభించినది. కాన తమశక్తిని వినియోగించి తమకు పురుషులతో సమానముగ హక్కుబాధ్యతల నొసగుటకయి శాసనములను నిర్మింప శాసననిర్మాణసంస్థలను కోరవలసిన బాధ్యత వారిపైననే కలదు.

పురుషులు స్త్రీలయెడ న్యాయైకదృష్టితో ప్రవర్తింపనపుడు స్త్రీలు తమ యభ్యుదయము కొఱకు తాము ప్రయత్నించుట యావశ్యకమే యగును.

---

## జీవిత దశాషట్కము

భావప్రకటనముల యొక్కయు, వేషధారణాదులయొక్కయు చోద్యమైన అనుశీలము.

భారతదేశ వ్యవసాయమును గూర్చిన రాయల్ కమిషనునం దొక సభ్యుడుగనుండిన డాక్టరు నగేంద్రనాథ గంగోలీగారి సోదరుడు శ్రీ సురేంద్రనాథ గంగోపాధ్యాయగారు మానవుని జీవిత దశాషట్కమును ప్రకటించుటకై తాల్చిన రూపముల చిత్రముల నిందులో ప్రచురించుచున్నాము.

జీవితకాలపు వివిధవయస్సులందలి మనోవృద్ధిని నిరూపించుటయు, ముఖవైఖరుల పరివర్తనములను ప్రవర్తించుటయు, సామాన్యప్రతిభ కతీతమైన కార్యములు. భావప్రకటనరీతుల మార్పులను చేయుటయందు శ్రీ గంగోపాధ్యాయగారసామాన్యప్రజ్ఞ గలవారు.



25 వ సంవత్సరమున



35 వ సంవత్సరమున



౫౫ వ సంవత్సరమున



65 వ సంవత్సరమున



75 వ సంవత్సరమున



95 వ సంవత్సరమున

బంగాళీనాటకరంగమునందు ప్రత్యేకగుణయుత మగు భారతీయహర్షాంతనాటకములను ప్రవేశపెట్టి తమప్రయత్నములందు విజయవంతులైనవారిలో నీతడే ప్రథము డనదగును.

1919 వ సంవత్సరమున నితడు ఇండోబ్రిటిషు ఫిల్ము కంపెనీని స్థాపింపజేసెను. జయప్రదము లగు పెక్కు ఫిల్ములను తయారుచేసిన లోటస్‌ఫిల్ము కంపెనీ కితడు సర్వాధిపతి.

నాటకరంగమున శ్రీగంగోపాధ్యాయగారు భారతీయ హర్ష నాటకనటులలో కెల్ల గొప్పవాడని పేరుపడిరి. యద్భుతనటనాకౌశలమును, గుణానుభవప్రదర్శనములును, అతనియత్యున్నత కళావాసనలను బహిరంగ పరచుచున్నవి. అతనిసర్వతోముఖ కౌశలమును నిరూపించు ననేకచిత్రముల సంపుటములు నేడు అమ్మడు పోవుచున్నవి.

సినిమావిచారణ సంఘమునెదుట నతనిసాక్ష్యము బంగాళములోని ఫిల్ముపరిశ్రమకు గొప్పచురుకుదనమును కలుగజేసినది. అతనిసూచనలును, సలహాలును ప్రభుత్వోద్యోగవర్గమునందును మంచియామోదమును, పొగడ్తను గాంచినవి.

అతడు బంగాళమున ఫిల్ములుతయారుచేయు కంపెనీ నొకదానిని పెద్దయెత్తుమీద ప్రారంభింప ప్రయత్నములు సాగించుచున్నాడని తెలియవచ్చుచున్నది.

(ఇండియన్ డెయిలీ మెయిల్, ఆగష్టు, 2.)

---

## బరోడా సంస్థానము—అనువత్సరవిద్యాభివృద్ధి

"బరోడాసంస్థానమున కడచిన సంవత్సరమునందు సమకూడిన విద్యాభివృద్ధిని వివరించు నుపదేశప్రాయమయిన యీక్రిందివాక్యములను బ్రిటిషు భారతదేశ ప్రభుత్వము గుర్తించి తాను భారతీయులకు సమకూర్చిన విద్యాభివృద్ధి మార్గములతో పోల్చి చూచుకొనదగును.

'సంస్థానమందలి పట్టణములయు, పల్లెలయు సంఖ్యనుబట్టి చూతుమేని సరాసరి ప్రతిపట్టణమునకును, ప్రతి పల్లెకును ఒక్కొక్క పాఠశాల గల దనవచ్చును.

పురుషుల జనసంఖ్యలో సరాసరినూటికి పదునేడుగురు బాలురు చదువుకొనవలసినవయసులోనివారున్నారని నిశ్చయింతుమేని పాఠశాలలలో గతసంవత్సరమున నూటికి ౧౧.౮ బాలు రుండగా నీసంవత్సరమున ౧౯.౫ గలరనియు, అట్లే స్త్రీల జనసంఖ్యలో నూటికి పండ్రెండుగురు బాలికలు చదువుకొనవలసినవయసులోనివా రున్నారని నిశ్చయింతుమేని గతసంవత్సరమున నూటికి ౫౫.౧ బాలికలుండగా నీసంవత్సరమున ౫౬.౬ గలరనియు లెక్కలు తేల్చుచున్నవి.

పంచమబాలురకు ౨౨౯ విద్యాశాలలుగలవు. వానిలో నాలుగుబాలికలవి. వానియందు ౯,౫౭౧విద్యార్థులు చదువుచున్నారు. ఇదిగాక సాధారణ గుజరాతి పాఠశాలలలో ౮,౭౬౩ పంచమ విద్యార్థులు చదువుచున్నారు. అచ్చట అస్పృశ్యతాపిశాచముయొక్క పట్టు సడలుచున్నది. ఉన్నతజాతులవార మనుకొను హిందువులీపాఠశాలలయం దుపాధ్యాయులుగను, పరీక్షాధికారులుగను ప్రవేశించుచున్నారు. బరోడా, అమ్రేలి, పటాను, నవసారులలో నాలుగు అంత్యజనసతిగృహము లున్నవి. వాని యాశ్రయపోషణములనుబడసి ౧౩౭ పంచమబాలురు చదువుకొనుచున్నారు.

పట్టణ, మండల పుస్తకభాండాగారము లచ్చట ౮౫ గలవు. గ్రామపుస్తకభాండాగారములు ౧౮౮౮ గలవు. పుస్తకభాండాగారశాఖకు జెందిన భిన్నభిన్న విభాగములు—స్త్రీ, శిశుపుస్తక భాండాగారములు మొదలయినవి—తమవిధులను తృప్తికరముగ నిర్వహించుచున్నట్లు చూపట్టుచున్నది.'

[మాడరన్‌రివ్యూ, ఆగస్టు]

---

## యువకుల కొకసందేశము

శ్రీయుత టి. యల్. వాస్వానిగారు 'స్కాలరు' అను పత్రికయందు ప్రకటించిన 'యువకుల కొక సందేశ' మను వ్యాసము

మానవుడు లోకమహాత్ప్రయోజనము నుద్దేశించి ఆత్మసమర్పణము కావించువిధానమును తారస్వరమున గానము చేయుచున్నది.

ఉత్పాదనశీలురు కండు. అనుకరణశీలురు కాకుడు.

సులభములయిన అనుకరణమార్గములు సాధనమార్గములు గావు.

భారతదేశమును క్రొత్తగావించుటకయి వలసిన సామగ్రికొఱకు రషియావంకకు జూడకుడు; ఇటలీవంకకు జూడకుడు; ఇంగ్లాండువంకకు జూడకుడు.

ప్రతిజాతియొక్క అనుభవములను దెలిసికొనుడు. దేనిని ఆచరింపకుడు.

అనుకారులు కాకుండుడు; మీరు మీరుగ నుండుడు.

ప్రతిజాతియు తన యాదర్శములందును, ధీశక్తియందును నడగియున్న పరిణామసిద్ధాంతమునకు తలయొగ్గవలెను.

అనుకరణము ఆత్మహననము; స్వాతంత్ర్యము ఆత్మవ్యక్తీకరణము. (Self Realization)

భారతదేశము తానుగ నుండవలెను; కేవలము తనదిగనే యుండవలెను.

గాఢక్షోభను జెందియున్న భారతదేశ మాకాంక్షించుచున్నదానిని రషియనుల సాంఘికవాద మొసగజాలదు; బ్రిటిషువారి పారిశ్రామికవాద మొసగజాలదు; దుస్సాహసమునకు, కలహములకు మూలమయిన పాశ్చాత్యనాగరకత యొసగజాలదు.

భారతదేశము విశ్వోపదేశక మయినది.

కాబట్టి మీరు మహర్షులయు, మహాసిద్ధులయు పవిత్రసందేశముల నాలకింపుడు. సనాతనజ్ఞానముయొక్కయు అధునాతనవిజ్ఞానముయొక్కయు శక్తులను మేళగించి భారతదేశమును బలవంతుల దేశముగను, స్వతంత్రుల దేశముగను క్రొత్త నిర్మింపుడు.

---

కీ: శే. జేము ఎల్లెను టెర్రీ



ఆంగ్లనాటకరంగమున పెద్దపేరు కన్న నటకురాలు. ఈమె 8 యేండ్ల వయసుననుండి పెక్కురకముల స్త్రీపాత్రలనుధరించి కీర్తినిగాంచినది. షేక్స్పియరు మహాకవినాటకములయందలి నాయికల పాత్రములను ఈమె అద్వితీయముగా ప్రదర్శించెడిది.

---

## వ్యాయామము

శ్రీయుతులు స్వామి సత్యదేవపరివ్రాజకులు జర్మనీయందలి వ్యాయామమునుగూర్చి

యొక మంచి సచిత్రవ్యాసమును 'సరస్వతీ' (హిందీ) పత్రిక జూలై సంచికయందు ప్రకటించిరి. అందు వారు పాశ్చాత్యదేశము లెన్నియో దుర్వర్తనములకు లోనయ్యు పతనము నొందకుండుటకు బాలబాలికలును, యువతీయువకులును నిత్యము వ్యాయామము సల్పుచుంటయే కారణమని ప్రసంగించుచు నిల్లు నచించిరి;



సరస్సుచెంత జర్మనుయువకులు మాతృభూమిధ్యానము చేయుచు వ్యాయామము చేయుచున్నారు.

'వ్యాయామము! వ్యాయామము!' నిజముగ నిది జాతియొక్క జీవన రసప్రవాహము. ఆరోగ్యమున కిది భీమా. అరుగ్ణభావముల కిది మిత్రము. నిర్భయత కిది ఖజానా. జీవనానందమున కిది మంత్రము. గ్రీకులు వ్యాయామప్రియులై యుండినకాలముననే కళావిజ్ఞానదర్శనాదులకు పునాది వైచికొనిరి. వారి ఆనాటి లక్ష్యమే నేడు ఐరోపాకు స్ఫూర్తి నిడుచు నాటి ప్రాచీననామముల నమరముల గావించుచున్నది. గ్రీసుదేశపు చెక్కడపు నమూనాలును, మల్లులయు, వీరులయు మూర్తులును నేడును వారి యానిర్మలకీర్తిని దలపించుచున్నవి. ఏజాతి తనపిల్లలను వ్యాయామశాలలకు పంపుచుండునో, ఏజాతి చాలినంతయుత్సాహము, నుత్తేజనయు నొసంగి తనవీరుల వర్ధిల్ల జేయునో, ఏజాతి తనస్త్రీలను పురుషులవలె నారోగ్యవతులు, వికాసవతులు, చుఱుకుదనముగలవారు నగుటకై వారిచే వ్యాయామము చేయించుచుండునో, అది సర్వదా స్వతంత్రమును, బలయుతమునై విలసిల్లును. జర్మనీ ఆతత్త్వము నధిగమించినది. బాలురు నాట్యశాలలకు పోవుదురు; బాలికలు నాటకాదిప్రదర్శనములందు తమ ప్రియులతో గలియుచుందురు; మద్యమాంసములు మస్తుగ జెల్లుచుండును: స్త్రీపురుషులు దండిగ సిగరెట్లు త్రాగుచుందురు: ఇన్నియు చేయుచున్నను వారు తమ దేహమును, వ్యాయామశాలను మఱవరు. జీవనరసము నుత్పన్నము చేసికొనుటకు వారు నిరంతరము యత్నించుచుందురు.

సత్యమై సుఖదమై యొప్పు సాత్వికాదర్శమును బడసి, అఖండజీవనదీప్తి జాడలు గనిపట్టి, జీవనరసామృతాస్వాదనము గావించి, విశుద్ధమార్గము ననుగమించి, తా నాదివ్యస్రవంతి వంకకు ఐరోపాఖండపు పరమపురుషార్థమునుగూడ వెంట గొంపోవు దేశ మేదేని నున్నచో మహాభాగ్యమే. పవిత్రాశయసంకలితులగు బాలబాలికలు, ఆధ్యాత్మిక భావము లుగ్గుగా పెరిగిన నాగరికులు వేలకొలదిగ ప్రాతస్స్నానములు వ్యాయామశాలలనుండి వెలువడునపుడు, దేశౌన్నత్యపు జయనాదములతో ఆవీరులును, వీరాంగనలును నలుదెసల మార్మ్రోగించునపుడు, లోకమున నొక నూతనమగు— అభయదాయకమగు—

యుగము ప్రాదుర్భవించిపోవును. ఫ్రాన్సు విప్లవముత్ప న్న మొనర్చిన జాతీయతాయుగము భీకర భూకంపగ



బాలికలు వ్యాయామక్రీడ గావించుచున్నారు.

తికి పరిణామము. అందు సామ్రాజ్యలోలుపత, ఇంద్రియసుఖలాలస, ప్రకృతివాదము నిండియున్నవి. ప్రపంచము సాత్త్వికస్వరూపము గల జాతీయత కెదురుచూచుచున్నది. సభ్యదేశములందలి లక్షలకొలది స్త్రీపురుషులు ఆ నూతనయుగపు ఆధ్యాత్మిక జాతీయవాదమునకై కొట్టుమిట్టాడుచున్నారు.

జాతీయశక్తియొక్క జీవనరసస్థాయి స్రోతపు దివ్యదర్శనమును భావిభారతజాతి యొక్కటియే చేయింపగలదు. మనకు ఐరోపాఖండపు పరమపురుషార్థము కావలెను. ఐరోపాలో జర్మనీ ఆపరమపురుషార్థమున శిరోమణి యైయున్నది. ఐరోపామహాసంగ్రామము జర్మనీఅహంకారమును భగ్నపరిచినది: మంచిపని యైనది. జర్మనులు తమ్ముగాక యింకెవరిని గణించెడివారే కారు. ఇప్పటికిని కొంతటియందా స్వార్థాధిక్య సంస్కారము మిగిలిపోయియున్నది. మహాసంగ్రామానంతరము జర్మనులయం దడకువ జనింపసాగినది. పరమపురుషార్థమున వారు యూరపున కంతకును ముందంజ యిడుచున్నారు. కావున నే జర్మను బాలబాలికల చిత్రములు నాదేశవాసులకై యిందు ప్రకటించుచున్నాను. నేడీభారతీయ సంగ్రహణ యుగమున మనము జర్మనీదేశపు పరమపురుషార్థమున మనోగత మొనర్చుకొనదగును. ప్రతిగ్రామమునను, ప్రతి జనపదమునను, ప్రతినగరమునను వ్యాయామశాలల సంస్థాపించి బాలబాలికల నెల్లర నటకు పంపుచుండవలెను. భూమిలో పాతుకొన్న ధనముల వెలుపకిచి నేడు జాతీయశక్తి జీవనరసము నుప్పతిల్ల జేసికొనుట యుచితము. బాలికారత్నములను నగలతో నడపక వికాసవతులు, నిర్భయురాండ్రు నగుచుఱుకైన వీరాంగనల గావింపుడు. లంపటుల బానిసపటుపగలు గుసట్టియు, విదిగ్ర ప వేశము



బెర్లినునందలి సుప్రసిద్ధవ్యాయామశాలయందు బాలికలు 36 అడుగులఎత్తునుండి నీటియం దురుకుట

ల నిర్భయవిహారమునలు పగలట్టియు బాలికల దయారుచేయుడు. మనయధ్యాత్మ వాచములును, వనయుపనిషత్తులును వ్యాయామశాల లనునాలయములు లేకున్న వట్టి శబ్దాడంబరములు మాత్రమే యగును.

---

## ప్రథమ భారతీయ వైమానికుడు
## యస్. ఎ. అణ్ణామలై శెట్టిగారు



ఇతడు నాటుకోటశెట్టి తెగవారిలో గొప్ప ధనవంతుడు. జర్మనీ, ఇంగ్లాండులందు విమానమును నడపించుటకు అభ్యసించెను. జర్మనీనుండి 'జంకర్స్' అను 110 గుఱ్ఱముల వడిగల విమానమును 30 వేల రూపాయలకు కొని తెప్పించినాడు. ఈ విమానమున ముగ్గురు కూర్చుండవచ్చును. అణ్ణామలెశెట్టిగారీ చిత్రమున నున్నవారే.

---

## మిస్ మేయోగారి దేశపు వివాహనీతి

న్యాయాధిపతి బెన్. బి. లిండ్సేగారును, వెయిన్ రెయిట్ ఇవాన్సుగారును "రివోల్టుఆఫ్ మాడరన్ యూత్"అని యొక గ్రంథమును రచించిరి. ఆ గ్రంథమునుండి కల్పద్రుమ పత్రిక గైకొనినభాగమునకు అనువాదము:—

"1920, 1921 సంవత్సరములలో డినీవరు జువెనల్ (పిల్లలుచేసిన నేరములను విచారించుట కేర్పడిన) కోర్టువారు ఉన్నతపాఠశాలల (హైస్కూల్సు)లో చదువుటకు తగినవయస్సులో ఉన్నదోషులయిన 769 మంది ఆడపిల్లలను విచారించినారు. ఈపిల్లలందఱును 14 మొదలు 17 సంవత్సరముల వయసుగలవారలు. వీరిలో 465 గురు ఇప్పుడు పాఠశాలలో లేరు. 304 రు యింకా చదువుచున్నవారే. ఈ 769 మంది ఆడపిల్లలమీద వచ్చిన నేరములలో అధమము 2000 మంది మగపిల్లలకైనా ప్రత్యక్షసంబంధ మున్నది. ఇంతమంది ఆడపిల్లలలోను 365 గురిని గురించి ప్రత్యేకము వారిసంగతి సంద

ర్భములను విచారించి తెలుసుకొన్నారు. వీరిలో 313 గురు 11, 12 సంవత్సరము లప్పుడు-అందు చాలమంది ముఖ్యముగా 11వ యేటనే-రజస్వలలయినారు. ఈ 313 రిలో 285 గురు 11, 12, 13 సంవత్సరముల వయస్సులో రజస్వ లయిరి. 28 గురు మాత్రము 14, 15, 16 సంవత్సరముల వయస్సులో రజస్వలలయిరి. ఆలస్యముగ రజస్వలయగువారికంటె శీఘ్రముగ రజస్వలయగువారే సంపర్కదోషములో తగులుకొనునట్టి అపాయస్థితిలో నున్నారు. ఇట్టి బాలికలగాంచిన మగపిల్లలు వారిని బాగా ప్రేమించెదరు. అట్టి యాడపిల్లలకు సంభోగమునుగురించిన జ్ఞానమేర్పడును. పరిణతమయిన బుద్ధినికూడ అతిక్రమించి కోర్కెలు పరుగులెత్తుచుండును. అవయవవికాసమును గురించిన తర్కము మున్నగునవి వారి కప్పుడేమియు తోచదు. 11, 12 సంవత్సరములప్పుడే అట్టి పిల్లలకు 18 సంవత్సరములు అంతకెక్కువ వయస్సుగల ఆడపిల్లలకుండే కోర్కెలు, అక్కరలు ఉండును. పెద్దవారికి ఉండే యుక్తాయుక్త పరిజ్ఞానము సహజముగా ఉండని ఆవయస్సులో నిగ్రహము లేకపోవుటవలన రజస్వలయగుట వినాశకరముగా పరిణమించుచున్నది. మగపిల్లలతో రహస్యసంబంధముగలదని ఒప్పుకొన్న 495 గురు ఆడపిల్లలలో 20 మంది కొక్కొక్కరు చొప్పున గర్భిణులయినారు. ఈరీతిని చూచినయెడల నూరుమంది గర్భిణులు కలరన్నచో 1900 లమంది అయినా గర్భిణీస్థితి దాటినవారు కలరన్నమాట. అనగా 3 లక్షల జనసంఖ్య గల నగరములో 200 మంది అక్రమగర్భిణులు ఉన్నారన్నచో 3800 మంది అయినను గర్భము గలుగకుండా దాటినవారు కలరనియు అందు వీరందఱు పాఠశాలలో ఇంకా చదువుచున్న వారుగానో, చదువు మానినవారుగానో, ఉన్నతపాఠశాలలో చదువదగిన వయస్సు గల వారుగానో ఉన్నారనియు తెలియుచున్నది. ఇంతకు ఈ సమస్య అంతయు ఇంటినిబట్టి యున్నది. ఒకానొక రకము యిండ్లలో నుండివచ్చే మంచి సంప్రదాయము కలిగి, సంపన్నములయిన మంచి కుటుంబములకు చెందిన పిల్లలు తమతోడివారిలో ఉన్నప్పుడు సాధారణముగా ప్రలోభములలోను, స్వేచ్ఛలలోను అంతగా చిక్కకొనరు; కాని దురదృష్టవశమున మంచివంశములనుంచి వచ్చే వారిలోకూడా అటువంటివారు చాలతక్కువగ నున్నారు. ఇది విచారకరమయిన విషయము. అమెరికా నగరము లెట్లున్నవో తెలుసుకొనుట కుదాహరణముగా షైకొన దగిన డినేవరువంటి నగరములోనే ఎన్నెన్ని వివాహము లగుచుండునో కొంచె మించు మించుగా అన్నన్ని వివాహవిచ్ఛేదములును, వేఱుపాటులును ఉన్నప్పటికి మనము దేశాభిమానముతో అమెరికా కుటుంబముయొక్క ఘనతనుగుఱించి ఊరక పొగడుకొను చుందుమని నాకు తెలియును. కాని పిల్లలకు తగిన ఆధ్యాత్మిక వైజ్ఞానిక వాతావరణముగల కుటుంబములు మాత్రము-న్యాయము చెప్పవలయునన్న-తప్పిదారియుండు నేమోకాని సాధారణముగా లేవనియే చెప్పక తప్పదు. ఇటువంటి చిక్కులలోపడని పిల్ల లెవరైన ఉన్నయెడల వారికి సరియయిన కుటుంబశిక్షణ కలదన్నమాటే. సరియైనపాఠశాలాశిక్షణమునుగూర్చి నేనిప్పుడు చెప్పుట లేదు. ఎందుచేతననగా ఎక్కడనో కొద్దిప్రైవేటు స్కూళ్ళలోను, పబ్లికుస్కూళ్ళలోను తప్పిదారి కొన్నిటిలోను తప్ప ఇతరవిధములు పాఠశాలశిక్షణము యెంత అద్భుతమయిన దున్నప్పటికిన్నీ స్త్రీపురుషజాతి సంబంధమయిన విషయమున మాత్రము సరియయిన శిక్షణమున్నట్టు కనబడదు...1922 సంవత్సరములో డినేవరులో జరిగిన ఒక్కొక్క వివాహమునకున్నూ ఒక్కొక్క వివాహపు వేర్పాటుకలదు. ఇచ్చిన ప్రతిరెండు వివాహపు పట్టాలకు (License) ఒక్కొక్కవివాహ విచ్ఛేదపు (Divorce) కేసువచ్చినది. ఈయంకెలు ఒక డినేవరునగరమునకు మాత్రమే చెందినవి కావు. అమెరికా సంయుక్త రాష్ట్రములలోని చాలనగరములకివి కొంచె మించుమించుగ సరిపోవును. పైనుడివిన సంవత్సరమున వివాహవిచ్ఛేదములు (Divorces) ను, వేర్పాటులు (Separations) ను మొత్తము 2992... డినేవరులో 1922 లో 1842 వివాహవిచ్ఛేదములును; 3008 వివాహములును జరుగగా 1921 సంవత్సరములో 1497 వివాహవిచ్ఛేదములును 3626 వివాహములును జరిగినవి. అనగా 1922 సం. లో వివాహవిచ్ఛేదములు 45 వంతున వృద్ధి

అయినవనియు వివాహములు 613 తగ్గినవనియు తేలు చున్నది. 1920 వ సంవత్సరమున డినీవరులో ఇవ్వబడిన వివాహపుపట్టాలు 4002. 1922 సంవత్సరములో చికాగోలో 39000 వివాహపు పట్టాలు (License) ఇవ్వగా వివాహవిచ్ఛేదములు 13000 బహిరంగముగా లెక్కకు వచ్చినవి. ఈవివాహముల సంఖ్యయు, విచ్ఛేదముల సంఖ్యయు యునైటెడు ప్రెస్సు వార్తలనుబట్టి:

1924 సంవత్సరమునందు:

| నగరము | వివాహము | విచ్ఛేదము |
|---|---|---|
| అట్లాంటగ | 3350 | 1845 |
| లాస్ ఆంజిలీసు | 16605 | 7882 |
| కన్సస్‌నగరము | 4821 | 2400 |
| ఓహియోరాజ్యము | 53300 | 11885 |
| డినీవరు | 3000 | 1500 |
| క్లీవుల్యాండు | 10132 | 5256 |

కలవని తెలియుచున్నది. బాధ్యతలేకుండా పిల్లలను స్వేచ్ఛగా డబ్బు ఖర్చుపెట్టనిచ్చుటయే ఇట్టిపరిస్థితులు కలుగుటకు కొంతవఱకు కారణము. అట్టి స్వేచ్ఛ ఉండుటవలన తమతమ ఉద్దేశములు నెరవేర్చుకొనుటకు వారికి కొంతబలము అవకాశము కలుగుచున్నవి. అట్టి స్వేచ్ఛలేనియెడల ఇట్టివిసాగుట కవకాశము లేదు.

[స్వధర్మ]

---

## గోవా వీరగల్లు

హరిహరాసుపండితుని మాధవ మంత్రియు, మల్లప్ప యొడయరు నొక్కరే అను నభిప్రాయము సరియైనదికాదు. అస్మత్కృత విజయనగరసామ్రాజ్యచరిత్ర*మునుండి యీ క్రింది యాధారముల నిచ్చుచున్నాను.

"ఈమాధవమంత్రి పండితకుంజరుడు. పెక్కుగ్రంథములను రచించెను. అంగీరసగోత్రుడు. తండ్రిపేరు చౌండప్ప. ఉపనిషన్మార్గప్రతిష్ఠాగురుః డని ప్రఖ్యాతిగాంచిన పురుషవరేణ్యుడు; కాశీవిలాసుని ప్రియశిష్యుడు; వీరశైవుడు; త్ర్యంబకనాథ సేవాపరాయణుడు. పైవిషయములన్నియు కర్ణాటికాశాసనసంపుటములందలి షికార్‌పూర్ శాసనములలో నొక్కదానియందు వివరింపబడెను. (Epigraphia Carnatica, Vol. VII, Shikarpur-)281 ఈశాసనమునకలు నాదగ్గఱనున్నది. అదియంతయు నుదాహరించుట అనవసరమని మానితిని. ఈమాధవమంత్రియే గోవానగరమును మహమ్మదీయులకడనుండి పట్టుకొని విజయనగర సామ్రాజ్యములోఁ గలిపివైచెను. ఇతఁడు క్రీ. శ. 1391 సంవత్సరమునఁ బరమపదము నొందెను. (J. B. Br. R. A.S. Vol. IV, 107-115) ఈమాధవమంత్రియే హరిహరరాయల సోదరుఁడగు మారపరాయలకు మంత్రిగనుండెను;బుక్కరాయలకుసామంతుఁడుగవనవాసినేలెను.

మల్లినాథ యొడయరు రెండవ హరిహరరాయల సోదరుఁడు. బుక్కరాయలకు జొమ్మాదేవియందు జనించిన కనిష్ఠపుత్రుఁడు. ఇతఁడు అరగరాజ్యమును రాజప్రతినిధిగఁ బాలించెను. రెండవబుక్కరాయలకూఁతు రొకతె యితనికి భార్యయైన విషయము హాస్యాస్పదముగనున్నది. రెండవ బుక్కరాయలకు మల్లపయొడయరు పినతండ్రియగును. తనకూఁతును బినతండ్రి కిచ్చిన నేటివరుస యగును ? రెండవ బుక్కరాయల కూతురిమగఁడు మఱియొక మల్లపయొడయరు కావలెను.

మల్లపయొడయరు తండ్రికాలములో; బొమ్మటనకల్లు ప్రాంతమును రాజప్రతినిధిగఁ బాలించెను. (Epi. Colls. for 1901, Nos. 132, 139, 141) సోదరుఁడగు హరిహరరాయల కాలములో అరగరాజ్యమును శా. శ. 1312 ప్రాంతములందు బరుకూరు రాజధానిగ రాజ్యమేలుచుండెను. (Epigraphical Colls. for 1901, Nos. 154, 156 and 164)

కావున మల్లపయొడయరు, మాధవమంత్రి యొక్కఁడేయని చెప్పుట సాహసము.

[కుందూరి ఈశ్వరదత్తు]

---

—సంపాదకుడు.

* ఇది యముద్రితము కానోపును.

మిస్. యం. గన్‌గారు



ఈమె ఆంగ్ల యువతి. లండనులో జరిగిన నిఖిల ప్రపంచ స్త్రీ వ్యాయామసంఘపు పోటీపందెములందు 18 అ. 7¾ అం. మేర దుమికి మొదటి బహుమతిని గాంచినది.

---

మిస్ కె. హిటోమి



ఈమె జపాను యువతి. పై పందెములందు 18 అ. 4 అం. మేర దుమికి రెండవ బహుమతిని పొందినది.

---

## బార్డోలీ విజయము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ఉరుముచు నున్నవల్లవె, మహోత్సుకతన్ జయదుందుభుల్ దిగం
తరములు దద్దరిల్ల, ముదితాజనముల్ జయగీతికా పుర
స్సరముగ హారతుల్ దగనొసంగిరి; కౌతుకపూర్ణచంద్రికా
భరితమనోజ్ఞమూచు నల బార్డొలి భూతలస్వర్గమయ్యెఁబో!

కేరటాల్ గొట్టుచు రింగురింగురని పక్షిస్వామియో నాఁగ నం
బరమధ్యంబునఁ దేలియాడెడు నదే వర్ణత్రయోత్ఫుల్ల సుం
దరమై యొప్పుపతాక పూర్ణవిజయోత్సాహ ప్రభూతోచ్చ సు
స్వరులై గాంధికి జే పటేలునకు జైజై యంచు ఘోషింపఁగన్.

రణ మొనరింపలే దటు ఫిరంగులు ఢామ్మని ప్రేల్చలేదు, దా
రుణముగ బాంబుగుండ్లు పయిరువ్వఁగలేదు, విమానముల్ దిశాం
గణములఁ దేలుచున్ విసపుగాలులు పైపయిఁ బంపలేదు, సై
రణయొకఁడే మహాస్త్రమయి రాజిలె నవ్యజయోపలబ్ధికిన్.

రవి యస్తమయమునొందని - యవనీరాజ్యంబునకు నియంతలు రణమ
ర్మవిదులు నృపనీతినిపుణు - లవురవురా, లొంగిపోయిరా యాంగ్లేయుల్!

చిట్టపురాయియే బ్రిటిషు సింహము పట్టినపట్టు, నట్టిమే
ల్పట్టు ప్రతిష్ఠనై పుణిబలంబును జేవయు, నంగవస్త్రమున్
గట్టెడు గాంధియున్, *బిరుసుగడ్డముఁ బెంచెడు నాపటేలు న
ట్టేట్టుగఁ జేసి, రద్దిర! కడిందితపోబల సంప్రయుక్తిమై.

కనుఁగొన గాలిమేడలను గట్టెడు వట్టికబుర్లపో, గహిం
సనె పలుమారుఁ జెప్ప నొకఛాందసుఁ డెప్డురణంబు నేఁతకున్
గొనకొనునట్టి యా పిఱికికోమటియా, నల గోఁచిపాతరా
యని వెడమాటలే పిడుగులయ్యెను, మేకులు మేకులయ్యెనన్.

కోపములేని యాపిరికికోమటి, గడ్డము బూచివాని సే
నాపతిగా నొనర్చుచు, ననాగరికుల్ రణభీరులు న్నవ

* ఈ పటేలుగారు గడ్డమును బెంచుకొనియున్నట్లు గాన్పింపదు. (సంపాదకుడు)

జ్ఞాపరులన్న పామరులఁగైకొని, శ్వేతమహీశు సంగరా
టోపము నాఁగఁజాలుట కడుంగడుఁ జిత్ర మహో విచిత్రమా.

అభినవప్రహ్లాదులనఁగఁ - ద్రిభువన దుర్లభము నాతితీక్షమెయి మహా
రభసమున కోర్చి నవజయ - విభవాస్పదులగుట మిగుల వింత గొలిపెడిన్.

చేసినదానికిన్ బదులుచేయఁగ నొల్లము, మృత్యువైన సం
త్రాసము గొల్వఁజాల దిఁక ధర్మమునందును, దైవమందు వి
శ్వాసమెుకండె చాలును, దిశల్ వడికింపఁగఁ జాలుమేటి స
న్న్యాసమె సంప్రదాయముగ నందితినంచును జాటినా రహో!

నొచ్చియు నొవ్వఁజేయని మనోజయమే జయమిచ్చుమాకు, మా
నచ్చిన మార్గమద్ది, నవనాగరికుల్ విరసోక్తులాడినన్
వచ్చినలోటులేదు, దిగివచ్చిరివారును గొండనుండి, యీ
పిచ్చియె యచ్చివచ్చినది పిచ్చి యుగంధరజాతివారికిన్.

చంగునపైకి దూకు రభసంబుమెయిన్ ఝుళిపించు నాంగ్లపుర్
సింగముజూలు, మాతపముఁజేసిన గడ్డము, బోరియున్న యీ
రంగమె రక్తికట్టెను; స్వరాజ్యముమాట యటుండనిండు, పై
సంగతిఁజూచుకొంద మదిచాలును దత్త్వము బోధసేయఁగన్.

జడనిధి గర్భములోపల - బడబానల మున్నయట్లు బార్డోలియందున్
బడుగులును బక్కలును గడు - జడులగు జనులందు సత్వసారము వెలిఁగెన్.

అంతర్వాహినియై యత - లాంతరమున నడఁగియున్న యార్యత్వం బా
క్రాంతమహీతల గగన ది - గంతరమై వెలయు స్వప్రకాశముఁ దాల్చెన్.

శరములఁ దాల్చి రక్కసులచందమునన్ నరరక్తతృష్ణమై
దురమున ద్రావు టత్యధికదోషము, మృత్యువె మేలు, మేలునా
గరికత గోరువారల కఖండ యశోధనమబ్బు దాన నీ
వరవడిఁ బెట్టియిచ్చి రల బార్డొలివా రిది దిద్దుఁడందఱున్.

ధాత్రి మహాత్ముఁడౌచు నవతారముఁ దాల్చెను కృష్ణుఁ డాఁ పృథా
పుత్రుఁడు వల్లభాయి యనపుట్టెను, బార్డొలిభూమియే, కురు
క్షేత్రముగాఁగఁదోఁచె, నవగీతలు వెల్వడె; ప్రేమధర్మస
త్సూత్రమరంద మింత చవిచూడుఁ డిహంబుఁ బరంబుఁగోరినన్.

---

# ఆంధ్ర నాటకరంగము


శ్రీ దేవులపల్లి

వెంకట లక్ష్మీనరసింహారావు గారు


శ్రీ నరసింహారావు గారి చాణక్యుని, రామదాసును * మొనమొన్ననే క్రొత్తగా చూచుభాగ్యము గల్గినది. వీరియందుత్తమనట లక్షణములు మొలకలెత్తియున్నవి. క్రమముగ నవి ప్రోదిగాంచి యాంధ్రనాటక రంగమున కాశ్రయము నొసంగగలవు. చాణక్యరామదాసుల స్వభావములు పరస్పర విరుద్ధములయి నవి. శ్రీరావుగారియందవి ప్రత్యేకము సరిపోవగల్గినవి.

శ్రీరావుగారి గోపన్న రంగాలంకారమయినాడు; రామదాసుభక్తి యింకను నిశ్చలము, పరిపక్వము కాదగును. మఱియు వీరి చాణక్యపండితుడు రాజనీతికుశలుడు; నిష్ఠురుడు; కుటిలుడు; అభిమానఘనుడు. కాని, రావుగారి హృదయ మతిమాత్రావేశపూరితమయినది. దీనికిదోడు తోడిపాత్రముల యొనరుపాటు వీటి

బోయినది. మనచాణక్యుని యుత్సాహము సన్నగిల్లినది. కర్తవ్యము ఇంచుక పేదవడినది.

చంద్రగుప్తుడు మహాచక్రవర్తి; కాత్యాయనుడు మహామంత్రి. చాణక్యమహాశయుడు భారతమహాసామ్రాజ్యరథమును నిర్మించి దానిని నడపుటకు దగుదురని వీరి నిద్దఱి నేర్చి కూర్చినాడు. వీరు, నిక్కము మహాపురుషులు. కాని, ప్రదర్శనము వీరి నన్యథాకరించినది. చంద్రగుప్తుడనుచితపాత్రమయినాడు; కాత్యాయనుడు పరిహాసపాత్రమయినాడు. చాణక్యునియుత్సాహ మడుగంటుట కిది చాలదా!

నటుడు విద్యావంతుడు, సంస్కారి, నాట్యకళాకోవిదుడు కావలెను; చక్కని ప్రపంచజ్ఞానము నార్జింపవలెను. ఇందేది కొఱవడినను తాను ధరించుపాత్రముకొఱవడి పరిభవముపాలగును. ఇట మఱికొన్ని యుపయుక్తవిషయములనుపదేశించు శ్రీభావరాజు వెంకటకృష్ణరావుగారి § యీ క్రిందివాక్యములు పరికింపదగినవి.

---

* మొన్న ఆగస్టుమాసమున ఏలూరు సీతారామాంజనేయ నాటకసమాజమువారు చెన్నపురమున నాటకములను ప్రదర్శించుచుండిరట. వారు చిట్టచివరవిగా చంద్రగుప్త, రామదాసు నాటకములను ప్రదర్శించిరి. శ్రీలక్ష్మీనరసింహారావుగారి కోరికపై నేనా నాటకములను జూచితిని. అందు చంద్రగుప్తనాటకము సుప్రసిద్ధవంగనాటక కర్తయగు ద్విజేంద్రలాలు రాయిగారి రచనమునకు శ్రీయుత నండూరిశివరావుగారు కావించిన యాంధ్రానువాదము. రాయిగారి చంద్రగుప్తుని పాత్రముయొక్క యౌచిత్యమునుగూర్చి కొన్ని సంశయములు గలవు. వానిని గూర్చి యించుక విన్నవింప గోరిక గలదు. ఇంకొకమారు దానిని దీర్చుకొందును.

§ కడచిన (శ్రావణమాస) భారతియందు శ్రీభావరాజు వెంకటకృష్ణరావుగారు శ్రీనరసింహారావుగారి నటన కౌశలమును గూర్చి సచిత్రముగా నొకచక్కనివ్యాసమును వ్రాసియున్నారు. దానిని గాంచనగును.

తాను ధరించుపాత్రను అనుభవముచే తెలుసుకొని యందు లీనమైపోయి తన్మయత్వమునటించు భావనామూర్తియు, అనుభవజ్ఞుడు నగువాడే నిజమయిన నటు డనిపించుకొనును. అనుభవ, భావనలలో నేదిలోపించినను నటుని అభినయము, నటన పరిపూర్ణత్వమును పొందనేరవు. నటుడు తన జీవితమునం దనుభవించిన కష్టసుఖముల యనుభవసారమైన రసములనుమాత్రమే భావనాప్రజ్ఞచేత నినుమడింపజేసి ప్రదర్శింపగలడు. కావున ప్రతినాట్యజీవియు అన్ని రసములను బ్రకటింప జాలడు. అన్నిరసములను సమముగా ప్రకటింపజాలిన నటు లెవ్వరయిన రసమూర్తులు ఒక రిద్ద రెక్కడయిన నుండవచ్చును. అట్టివారు మహాప్రతిభాశాలురు. వారి జీవితము కేవలము రసాత్మకమైనదిగా నుండును. సాధారణముగా ప్రతినటుడును తనప్రకృతికి సహజములయిన రసములనే బాగుగా నటింపగలడు.

ఆంధ్రనటకులు పై విషయములను బాటింప దగుదురు. ఆంధ్రనాటకరంగమునకు దామును, తమకు నాటకరంగమును సర్వథా సరిపోవునట్లు సంస్కరించుకొన దగుదురు.

శ్రీనరసింహారావుగారి చాణక్యరామదాసు పాత్రములనుబోలె బాహుకపాత్రమును గూడ జూడ కుతూహలము గలదు.

గ. సు.

(భారతీకార్యాలయము)

---

## స్థానం నరసింహారావుగారు-'సత్యభామ'

శ్రీ స్థానం నరసింహారావుగారు పేరెన్నికగన నటకావతంసులు.

వీరు తమ ధరించుపాత్రమున తమ్ము తాము చతుగ్రసముగ దిగగొట్టుకొందురని శ్రీయుత వేలూరి శివరామశాస్త్రిగారు నుడివినది. వీరి నటనమును విమర్శించుతటి పెక్కుతావుల జ్ఞప్తికి వచ్చుచుండును. కాని వీరి సత్యభామాపాత్రము*మాత్ర మీపరిచయముతో సంతృప్తి నిడక యించుక యెక్కువ విమర్శనము నపేక్షించుచున్నది.

వీరి నటనమున నొక యమోఘమగు సమ్మోహనశక్తి యున్నది. ఎట్టిపాత్రనైనను వీరు సజీవముగ, నుజ్జ్వలముగ ప్రదర్శింతురు. సత్యభామాపాత్రయు వీరు తాము భావించినతీరున సమగ్రసౌష్ఠవముతో ప్రదర్శింతురు.

వీరిభావన ననుసరించిన సత్యభామ యెట్టిదో పరామర్శించుటకు ముందు శ్రీకృష్ణ తులాభారమున సత్యభామ యెట్టిదో గుఱుతింపదగును.

సత్యభామ శ్రీకృష్ణుని సంపూర్ణముగ ప్రేమించినది: అతని సుందరమూర్తిని కామించినదియు. ఎల్లపుడు నతని సాన్నిధ్య మామెకు గావలెను. ఈఓరిమిలేని కూరిమిచే నామె తనహక్కునుగూడ నతిక్రమించి, తోడి దేవేరులకు భర్తను పాలువెట్ట నొల్లదు. కనుకనే రుక్మిణికి గల అతిలోకప్రేమ కిది లొక్కైనది. భక్తి యను పేరునకు యోగ్యత యీప్రేమకు చాలినదికాదు. ఐనను సత్య గొప్ప ప్రేమికురాలు. రాజస ప్రేమచే నామె మత్తిల్లిపోయినది. ఆప్రేమ సామ్రాజ్యమునకు శ్రీకృష్ణుడు సార్వభౌముడు; తాను మహారాజ్ఞి. ఈశ్రీకృష్ణుడు భౌతికమూర్తి. తన్నాభౌతికమూర్తి వీడినచో నామెహృదయ మాక్రోశించును. ఆత్మదమనము చేసికొను ధీరత యామెకు లేకపోలేదు: కాని, అతనిసాన్నిధ్యమున తా నుపలాలిత యగుచు అతని నాశించుకొనుచున్న సమయమున తనసవతి తనపతి నెడబాప—తోడగొంపోవ—వచ్చినచో నామె యోగ్వజాలదు. ఇందడచుకొను ధీరత యామెకు లేదాయనిన, సవతిమూలమున రెచ్చిన యభిమానము నడచుకొనుటకే యిచ్చగింపని రాజస ప్రకృతి యామెది. రుక్మిణి తన జన్మదినోత్సవ

* ఆగస్టు ౯ వ తే. శ్రీదుర్గా ఎమెచూర్సువారు మదరాసునందు ప్రదర్శించిన శ్రీకృష్ణతులాభారమున వీరి 'సత్యభామ'ను నేను జూచితిని.

మునకై పతి నాహ్వానించినది—తగినంత హేతువున్న దియే: ఐనను సత్యభామ క్లిష్టముకాని సందర్భమునకు సవతి కారణభూతయైనది: ఆమె ఆత్మదమనము కావిం చుకొనదు.

ఇట్టియెడ శ్రీకృష్ణుడు తా నెవరియింటి కేగ వలె నని అన్యుడగు నారదుని నాలోచన మడుగుట ఆమె కింకను వెగటగును. ఇక చివరకు తన యింటికి రాక యాతడు సవతి రుక్మిణి యింటికే యేగినచో ఆమెకు గల్గు మనఃక్షోభమునకు మేర యేముండును?

ఆసమయమున నారదు డామెకు వ్రత ముపదేశించి దాన నామె తనభర్తను తనకు వశవర్తిని జేసికొనగల్గు నని వచింప, నామె తన తప్తమానసము నా పేరాస యందు పోసికొన్నది. సరితూగు ధనాదికము నిచ్చి దానము పోయిన భర్తను బడయుటకై ఆమె తన సర్వ స్వమును తూనిక యిడెను. 'రెండు నిమిషములు కళ్లు మూసికొన్నచో, నాభర్త యెప్పటికిని నావాడే' యని యామె కొనవ్రేళ్లపై నిలిచియుండెను. ఎన్నివైచినను ఆతడు తూగడాయె!—ఏమి పోయినను సరే, ఆతడు దక్కిన చాలును!—కాని, యేదీ సాఫల్యము? ఎంతటి ఆశ!—ఉపహత మైపోయినది. ఎంతటిమూల్యము!— అపర్యాప్త మైపోయినది. ఏబరువున కాతడు తూగునో యామెకు తెలియదాయె! భౌతికమూర్తినే యామె తలచుకొనెను. శ్రీకృష్ణు డంతబరు వుండునని యామె యెఱుగదు; నారదుడు చెప్పనైన లేదట, ఏలయని యామె ప్రశ్నించినది. ఆమెకు తన యోచనయందు మూర్ఖత యేమియు కన్పడదు. మానవబుద్ధిబల మంతయు వినియోగించి చూచినను నది యర్థము కానిది. ఆమె అది కలహప్రియుని వంచనయని భావింప కేమిచేయును? (కృష్ణుడు తన్ను వంచింపడని యామెకు నమ్మకమే కాబోలు.)

ఇక కృష్ణుడు నారదునికి దాసుడైపోయినాడు. సత్యభామకు భర్త తనకడ లేకుంటయేకాక, యొకరికి దాస్యము సేయుచున్నాడు: దుర్భరము! అటుపై తన మూలమున తోడిదేవేరులు భర్తను గోల్పడిరి. తాను గర్హావస్థ నున్నది. అంతయు తనవల్ల నైనదే.

కడచినదాని కనుతాపము; కృష్ణుడు తనతో మాటాడుటనుగూడ వంచకుడు నారదుడు నిర్దయముగ నిషేధించినందులకు కినుక; తన నిస్సహాయతకు పరితా పము—ఇంతయు భరించుచు, నెట్లయిన కృష్ణుని బడ యుట కుపాయము నారయవలయును. ఇంతవ్యాకులత యామెహృదయమును కలచివైచుచున్నది. పాపము, అంతయు ప్రతికూలము. కానా?

ఈసత్యభామకంటె మానవహృదయమును సమీ పించు పాత్రలు నాటకలోకమున నెన్నియో లేవు. మాన వప్రకృతి యామెయందు పూర్తిగ మూర్తీభవించినది. ఆమెది లౌకికత్వమున నికృష్టస్థానముగాదు; అతిలోకత్వ మునకు దగ్గరమెట్టే. ఆమె ప్రేమకొఱ కెంత త్యాగమొ నర్చినది!

ఇక నామెకు విశ్రాంతి లేదు. ఎట్లయిన పతిని బడయ నారదుని వెంటాడినది. చివరకు దేవేరులుగూడ వచ్చినారు. ఎట్లు మాట దక్కుట?

భక్తులవలన నామెకు భర్త తిరిగి లభించునని నారదుడు పల్కెను. అట్టి భక్తు లెచ్చటనైన గలరా యని యామె తహతహతో నడిగినది. తత్పురముననే యున్నారని యాత డమ్ముతోపమానమగుమాట తెల్పెను. భక్తపద మామె హృదయమును మీటలేదు. 'నాకంటె భక్తు లెవ్వ'రని యామె యహంకృతి చూపలేదు. అట్టి భక్తు లెవ్వరో తెల్పినచో పాదములంటి తెచ్చుకొందు నని చెప్పినది. ఆహా! ప్రేక్షకుల సానుభూతి బడయుట కీపాత్ర కెంతపాత్రత యున్నదో!

తన పల్కులకు నారదు డొసగిన యుత్తర మామె కొక పెద్దపరీక్ష: ఆభక్తురాలు రుక్మిణియేయట!

భర్తను దాస్యమునుండి విడిపించి, తాను బడయ వలయును. శుద్ధాంతజనముకడ తనమానము గాపాడుకో వలయును. దేవేరులహక్కు నిపు డామె తిరస్కరింపదు: తానిపుడు మానవతి; కర్తవ్య జ్ఞానిని: ప్రేమ పీడిత యయ్యు ప్రేమ ప్రమత్తురాలు గాదు.

ఏరుక్మిణియెడ కక్షగట్టి యామె కృష్ణునిస్వవశము గావించుకొనుటకై విలక్షణచర్యల జేయబూనెనో, ఆరు

క్మిణియే తన కిపుడాశ్రయణీయయైనది—ఆచర్యల దుష్పరిణతి సంస్కరించుటకే! భర్తను బడయుట కెట్టిదియైన జేయవలయును: అతడు పూర్తిగ తనకే కావలె ననిపించు పొంగు ప్రేమ ఆమెది. తనయపరాధమును సవరించుకొనుట తనవిధి. తాను ప్రార్థింపకయే రుక్మిణి వచ్చి యాతని విడిపించుట తన కవమానము. ఆమె యహంకారిణి కాదు: ఉత్కృష్టయగు నభిమానిని. సవతిని వేడుకొనుటకంటె వేడుకొనకుండుటయే యామె యభిమానమున కెక్కువ యాఘాతము. రుక్మిణిని వేడుకొన్నది; భర్తను—తన ప్రయత్నమువలననే—విముక్తు జేసి, పడసి, తన కర్తవ్యము నిర్వహించుకొన్నది; రుక్మిణిహృదయము తనహృదయముకంటె మహత్తరమగుట గ్రహించినది: ఏలయన—రుక్మిణి శ్రీకృష్ణుని మనసార భజించినది. అత డెక్కడ నున్నను సరియే, భావబద్ధుడగు ప్రేమమయుడు తనతోడనే యున్నాడు. తృప్తిమయమైన భక్తితో నామె తన పతిని భగవంతునిగ నుపాసించుకొన్నది.

సత్య శ్రీకృష్ణునకువలెనే యెల్లరకును సానుభూతికి పాత్రురాలు. ఆమె యేమొనర్చినను కృష్ణునెడగల ప్రేమాతిశయమువలననే. పవిత్రమైనది కారణము: కార్యములమాత్రము హృదయదౌర్బల్యపు రక్కలున్నవి.

ఇది యీనాటకమునందలి సత్యభామ.

శ్రీనరసింహారావుగారి భావనమాత్ర మించుక భిన్నరూపముగల పాత్రను ప్రదర్శించెను.

నటకుడు కవిరచించిన పాత్రకు సంస్కారములు చేసికొనవచ్చునే కాక చేసికొనవలసిన సందర్భములు గూడ నుండును. ఐన నాసంస్కారములు నాటకమున కుపకరింపవలెను; నాటకముయొక్క నాటకత్వమునకువన్నె తేవలయును. నాయికా నాయకపాత్రములను నటకుడు గాని, కవిగాని ప్రేక్షకుల సానుభూతి కేంద్రమునకైనను సాధ్యమగునంత సమీపమునకు గొంపోవలయును.

ఈనాటకమున సత్యభామయే కేంద్రవర్తిని—నాయిక. ఈపాత్రము నరసింహారావుగారియందు నాటకప్రయోజనమున కెట్లు లుపకరించెనో గమనింపదగును.

నారదునకు శ్రీకృష్ణుని భార్యలు తక్కినవారు ప్రణమిల్ల. శ్రీరావుగారి సత్యభామమాత్రము వంగిదే నమస్కరించును. కృష్ణుడు రుక్మిణి యింటి కేగినపిదప తనభవనమున నారదుడు విచ్చేసినపుడు అతి విముఖతతో అడకువ లేక వర్తించును. అత డామెకు భర్తను బడయునుపాయముగ వ్రత ముపదేశించినపిదప నామె యతనికి మోకరిల్లి నమస్కరించి, దాసిచే గూడ ప్రణమిల్ల జేయును.

తక్కిన దేవేరులకుకంటె సత్యభామకు నారదుని యెడగల భక్తి తక్కువయా? వారితో సమముగ దేవర్షి యెదుట మోకరిల్లుట తన కవమానమని యెంచునంతటి దురభిమానినిగాని, మూర్ఖురాలుగాని కాదు. సత్య తన యింట నతనియెడ నంత వైముఖ్యమును, అవినయమును జూపుటకు ఆతనియెడ నామె కెంతచన వున్నను జాలదు; ఎచ్చట జూచినను ఆమె కానన వున్నట్లు కన్పడుటలేదు. తనభర్త తనకడకు రాకుండ జేసినది నారదుడే యనుకోపమున నట్లు వర్తించెనన్న, ఎట్లయిన నతని సత్కరించుటేకాని గౌరవాచారములు తప్పదు: కళావతి రాజపుత్రి, శ్రీకృష్ణునిదేవి: ఆమె కాతనియెడ గౌరవము లేకపోను లేదు. చివరకు తన కాతనివలన నొక ప్రయోజనమున్నదని భావించి ప్రణమిల్లుట దుఃస్వార్థపరతను, సంకుచిత మనస్కతను సూచించును. దేవర్షియెడ సత్యభామ కంతగౌరవము గల్గుట కిదియే మొదటిసారియా, ప్రయోజన మున్నపుడెల్ల నట్లు ప్రణమిల్లునా యనిపించును. పాత్రకు లేని నలుపులు గూర్పరాదు: అట్టి కళంకితపాత్ర కిట నావశ్యకత లేదు.

శ్రీకృష్ణుని తూచునపుడు వీరి సత్యభామ తన యింటగల సర్వస్వమును త్రాసున వైచునుగాని తనయొడలియాభూషణాదు లొక్కపూసయైనతొలగించివైచదు. చిట్టచివరి యత్నముగూడ చేయక యామె వీడునా! అంత పరితపించిన ప్రేమ కృష్ణునినిమిత్తమై యాభూషణముల తొలగించివేయుటకు వెనుదీయనిచ్చునా? ఇట సమంజసత తక్కువ. కృష్ణుడు సంస్కరింపనెంచిన సత్య

భామ హృదయము ప్రాపంచికతయం దింతక్రింద లేదు. సత్యభామ యిట్టిదన్నచో నాటకము సహింపజాలదు.

కృష్ణుడు నారదునకు దాసుడైపోయినపుడు వీ ర తిచతురతతో నటించిరి. పిదప గన్పఱుపదగిన దైన్యపరి మాణముమాత్రము వీరియం దహంకారాతి శయమున మట్టునడ్డది. పాత్రకు దైన్యము తనతో ప్రేక్షకులసాను భూతిని కోలుపుచ్చినచో, అహంకార మాస్థానమున ప్రేక్షకుల ప్రశంస నాకర్షింప లేదు.

మొత్తముమీద వీ రభిమానముకంటె నహంకా రము నెక్కువ యుపాసించిరి: రాజసముకంటె తామ సము నెక్కువ యవలంబించిరి. వీరిసత్య కడుంగడు సాధా రణవనిత. ఈనాటకమునకు నాయికయగుట కనర్హ గ నున్నది.

చివర సత్యభామకు సంస్కారము గల్గినది. లేనిచో పాత్రకు సరియగు పరిణతి యుండదు. రుక్మిణిని వేడుకొను టనుండి వీరిసత్యభామ సంస్కారమునొందు యోగ్యత తోనే యున్నది. ఆస్థితికిని, పూర్వపు ప్రవృత్తులకును సామరస్యము కుదురుకొనవలెను. అప్పుడు వీరిసత్య సత్య యను సత్య యగును.

సత్యభామకంటె నెక్కువ యాకర్షక మగుపాత్ర మీయితివృత్తమున లేదు.

ఇట్టిసంస్కారములు కొలదిగ నిర్వహించుకొన్నచో, శ్రీ నరసింహారావుగారి యంతటి యాకర్షక ముగ నీపాత్రను ప్రదర్శింపగలవా రరుదుగ నుందురు.

శ్రీరావుగారు రంగమున ప్రవేశించినది మొదలు నిష్క్రమించువఱకును పాత్రగనే స్ఫురింతురు కాని యొక్కత్రుటియు తమవలె గన్పట్టరు. అటుపై వారి నట నమున నొకవిధమగు నగిషీసొంపు లున్నవి. పాత్ర నుజ్జ్వల ముగ చూపుటయందు వా రసాధారణమగు నేర్పుగన్పఱు తురు. అట్టియెడ వా రిటనిట బాగుగ నటింతురని యెత్తి చెప్పుట యథార్థమగు ప్రశంస గాదు.

నటనా కౌశలమునకు తీసిపోవని గాన ప్రావీణ్య మును వీరి కున్నది. రసానుగుణమగు సంగీతము వీరియం దొక పెద్దగుణము. పద్యముగాని, పాటగాని పాడు చున్నపుడు వచనమునవలె భావమే వ్యక్తమగుచుండును. రస ముబ్బుగ చిందుచుండును. వారు గానప్రవీణు లను మాట దూరమున గన్పడును. వీరి సంగీతము రసమును మఱింత పరిస్ఫుటము చేయునే కాని పాత్రను విడిచి రం గమును కళంకిత మొనర్పదు. రంగమున సంగీత మావశ్య కమా యనుసమస్యను వీరియభినయము అనుకూలముగ సమర్థించును. ప్రతికూలవాదుల కది యొక గొప్పప్రతి వాదము—ఇట్టివా రరుదుగ నుండుటచే ఆసమస్య మాత్రము తలచూపుచునే యుండును గాని—

వీరి యనల్పనటనా కౌశలము నిదివఱకు శ్రీయు తులు శివరామశాస్త్రిగారు తమసుధామధుర ఫణితుల నుగ్గడించియే యున్నారు. కాక వీ రాంధ్రసామాన్యము నకు ప్రత్యక్ష పరిచితులగు నటకావతంసులు. తమభావన ననుసరించి యేపాత్రనైనను వీ రతికుశలముగ ప్రదర్శిం తురు. ఈపాత్రవిషయమున తమభావన తిరుగవేసికొను నపుడు శ్రీరావుగారు సహృదయముతో ఈసూచనల గమనింతురు గాక. పాత్రశీలన కౌశలమును, భావనా బలమును వీరియం దింకను పెంపైనచో, తన నిగ్గైన నటులలో నొకరని వీరినిజూచి మనదేశము గర్వింపగలదు.

కొంపెల్ల జనార్దనరావు

# పునర్విమర్శనము

## అహదనకరశాసనము

హేమా హేమీ లుండఁగా నిన్నే యొకశాసనముఁ బ్రకటించినవాఁడను నేను శాసన పరిశోధనకై రక్తమాంసములు ధారవోసిన వారికి గూడ నర్థముకాని యహదనకరశాసనమును అర్థముచెప్పుటమాట యవ్వల నుండఁగాఁ బఠించుటయును బ్రబలానర్థమే యయ్యెను. నేను శాసనమును బ్రకటించిన తోడ్తోడనే, బహువర్షములనుండి బహుశ్రమముతో శాసనపరిశోధనము కావించుచున్న మన్మిత్రులు బ్రహ్మశ్రీ సోమశేఖరశర్మగారు, పి. హెచ్. డి. బిరుదాంకులు శ్రీవెంకట రమణయ్యపంతులుగారు జోడించి నాపాఠ ప్రమాదములఁ గడచిన భారతిలో నుద్ఘాటించిరి. కాని అందు శ్రీవేంకట రమణయ్యపంతులుగారి దోష ప్రతిపాదనములు ప్రధానముగా శ్రీశర్మగారి ప్రతిపాదనములకుఁ బ్రతిధ్వనులును, అవహేళన బహుళములును గానవాని నెక్కువగా లెక్కపెట్ట నక్కఱలేదు. ప్రాజ్ఞులు, నాకు బహుకాల మిత్రులు నగు శర్మగారి ప్రతిపాదనములనే నేను పరిగణింతును.

అహదనకరశాసనమును నేను 'కదపితి' నని శ్రీశర్మగా రనిరి. ఎంతమంచియోగ్యతగలమాట! శర్మగారు నాయర్థ వివరణాదులు కొన్ని యక్షరముల మార్చి, చేర్చి, తీసివేసి చేసిన వగుటచేఁ జాల సందేహింపవలసి యున్న వనిరి. అయినను గొన్నిపట్టుల భాషావేత్తలు ఆదరముతో ఆలోచించుట కర్హమైన శబ్దనిష్పత్తులుగల వన్నారు గాన యిఁక ధన్యుఁడను.

శ్రీశర్మగారుగాక బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు, శాసనపరిశోధక శాఖోన్నతోద్యోగులగు శ్రీమాన్ ఆర్. కృష్ణమాచార్యులుగారు నింతవఱకుఁ బ్రాచీన చాళుక్యలిపిశాసనములను బ్రకటించుచుండుట నెఱుఁగుదును. ఆంధ్రచరిత్ర పరిశోధకమండలి వారుగూడ నిప్పుడు కొన్ని చాళుక్యశాసనములఁ బ్రకటించుచున్నారు. ఇంకను బ్రహ్మశ్రీ గిడుగురామమూర్తిపంతులుగారు, మానవల్లి రామకృష్ణకవిగారు, గొ. రామదాసు పంతులుఁగారు మొదలగువారుకూడ నీ లిపిని జదువుదురని విశ్వసించుచున్నాను. వీరుగూడఁ బ్రాచీనలిపి శాసనములను బ్రకటించియుండవచ్చును.

ప్రాచీనచాళుక్యలిపి పరిచయముగల పయివిద్వాంసుల నెల్లరను నీపత్రికా ముఖముననే బాహాటముగా నిట్లు వేఁడుచున్నాను. "ఈచర్చావిషయము సర్వసామాన్య సాధారణముగా గుర్తింపఁదగినది కాదు. ఇండియన్ ఆంటిక్వెరి ౧౩వ వాల్యుం అందఱికిని సులభముగాదు. ఆసంపుటము మీయొద్దనుండును. శ్రీశర్మగారికిని నాకును నభిప్రాయ భేదముగల స్థలములను మీరు సరిగా నందుఁ జూచిచదివి సాధుపాఠనిర్ణయము చేయఁగోరుచున్నాను."

నేనీ యహదనకరశాసనమును ఫ్లీటు దొరగారు ఇండియన్ ఆంటిక్వెరి ౧౩ వ వాల్యుంలో ప్రకటించిన ప్రశస్త ప్రతిబింబములను జూచి పఠించితిని. ఈవిషయమును స్పష్టముగా నాశాసనవివరణోపోద్ఘాతమునఁ జెప్పితిని. నేను పూర్వతర భారతిలో ప్రకటించిన శాసన ప్రతిబింబములు ఇండియన్ ఆంటిక్వెరిలోనివి కావు. అయుదంత మించుకంత విన్నవించుకొనవలసియున్నాను.

అహదనకరశాసనము నీఁక నెలనాళ్లకుఁ బ్రకటింతుననఁగా నేను శ్రీశర్మగారి నడిగితిని. 'అయ్యా, లక్ష్మణరావు పంతులుగారు సీమనుండి తెప్పించిన యహదనకరశాసన ప్రతిబింబము లెక్కడనున్నవి? వాని మీరు సూచితిరా? ఆశాసనమునుగూర్చి వారేమేని నోట్సు వ్రాసియుంచిరా?' అని. వారు 'ఆప్రతిబింబము లేమయ్యెనో నాకుఁ గానరాలేదు. లక్ష్మణరావుగారేమియు వ్రాసియుంచలేదు." అని బదులుచెప్పిరి. నేను నాపరిశీలనము నెల్ల ఇండియన్ ఆంటిక్వెరీ ౧౩-వ వాల్యుంలో

ఫ్లీటు దొరగారు ప్రకటించిన ప్రతిబింబములఁబట్టియే జరపికొంటిని. నాపాఠముల వానిఁబట్టియే గ్రహించితిని. శాసన విమర్శాంతమున నేను శ్రీశర్మగారిని సీమనుండి వచ్చిన ప్రతిబింబములఁగూర్చి యడుగుట మొదలగు విషయములనెల్ల వ్రాసితిని. భారతీకార్యాలయమున నాశాసనవిమర్శము కొంత ముద్రితమయ్యెను. ఇఁక బ్లాకులు చేయింపవలసి యుండెను. అందుకై ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని యిండియన్ ఆంటిక్వెరీ ౧౩-వ వాల్యూమును ఎరవుగాఁ దీసికొని నేను భారతీ కార్యాలయమునకుఁబోయి అక్కడ ప్రధానోద్యోగులగు బ్రహ్మశ్రీ సుబ్బరామయ్యగారి కా పుస్తకమందలి ప్రతిబింబములఁ జూపి బ్లాకులు చేయింపఁగోరితిని. వారు తోడనే డ్రాయరు తెఱచి రెండు జెఱఁగుల శాసనప్రతిబింబములనెత్తి "ఇవేకావా మీరు తెచ్చిన పుస్తకములోనున్నవీని" అనిరి. అవి రెండును అహదనకర శాసనప్రతిబింబములే. ఒకటి ఫోటో; రెండవది రాగిరేకు లకచ్చొత్తి యెత్తినది. వానిఁజూచుట నాకు వింతయ్యెను. ఇవి యెక్కడివంటిని. వారు శ్రీశర్మగారొకటిన్నర వత్సరమునకు ముందు నాకొసఁగిరనిరి. 'నేను ఇదేమో తెలియఁజాలకున్నాను. శర్మగారి నడుగఁగా వానిఁ దామెఱుఁగమనిరి. ఎందుకివి? ఫ్లీటుదొరగారి పుస్తకములోని ప్రతిబింబములఁబట్టియే బ్లాకులఁజేయింపుఁడు. కాని యాపుస్తకము దొరతనమువారిది. కాగితములు చెడకుండ ఫోటోలు తీయవలెను. జాగ్రత్తసుమండి' అంటిని. వారు 'ఈవిషయము శర్మగారు మఱచియుందురు. మీపుస్తకమును గొనిపొండు. నే నీప్రతిబింబములఁబట్టియే బ్లాకులఁ జేయింతును." అనిరి. వారు చూపిన రెండు సెట్ల ప్రతిబింబములఁ జూచితిని. అచ్చుతీసిన ప్రతిబింబములు గొంత స్పష్టముగా నున్నవిగాని అవి సిరా ఒలికి చెడిపోయినవి. బ్లాకులు చేయింపఁ బనికిరావు. ఫోటో ప్రతిబింబములు అస్పష్టముగా నుండెను. ప్రాచ్యలిఖితపుస్తకశాలాపుస్తకమున కపాయము కలుగునన్న భీతిచే అస్పష్టముగా నున్నను ఆఫోటో ప్రతిబింబములనే మరల ఫోటోతీసి బ్లాకులు చేయింప నంగీకరించితిని. ఇదియెల్ల మేమక్కడ చర్చించుకొంటిమి. మఱి కొన్నాళ్లకు శ్రీసుబ్బరామయ్యగారు మాయింటికివచ్చి శాసనాంతమున నేను వ్రాసిన వాక్యముల మార్చియామార్పు నంగీకరింపఁగోరిరి. అప్పటికే నేను తొలుత వ్రాసిన వ్రాఁతను తొలియచ్చుచిత్తులోఁ గొంత మార్చి ప్రతిబింబముల సుబ్బరామయ్యగారిచ్చినట్లు వ్రాసియుంటిని. శర్మగారి నడుగుటను దీసివేసితిని. సుబ్బరామయ్యగారు ప్రతిబింబములను ముద్రణసమయమున శర్మగారే యొసఁగినట్లు మార్చిరి. నిజముగా నే నీప్రతిబింబములు బయల్పడ్డపిదప వానిఁగూర్చి మరల శర్మగారితో నేమియు ముచ్చటింపను లేదు; వారు వానిని నాకొసఁగను లేదు. అయినను నాకందు అభినివేశము లేదుగాన మీయిష్టము-చొప్పున మార్పునంగీకరింతును అంటిని. శ్రీసుబ్బరామయ్యగారు మార్చిన వాక్యము పూర్వోత్తరములఁ జూచుకొని రచనలో నించుక మార్పేదో చేసితిని. అంతేకాని భారతిలో ప్రకటితములయిన శాసనప్రతిబింబములను గాని, వానిమూలములగు సీమనుండివచ్చిన ప్రతిబింబములనుగాని, నేను శాసనవిమర్శము వ్రాయుకాలమునఁ జూడనే లేదు; ఉపయోగించుకొననే లేదు. భారతిలోని ప్రతిబింబములను నలుగురుంబోలె నేనును భారతి ముద్రితమై వచ్చినతర్వాతఁ జూచితిని. అవి మిక్కిలి అస్పష్టములు. మూలపురేకులను బట్టి తీసిన ఫోటోలఁబట్టి మరలఫోటోతీసి, వాని సైజుకంటె మిక్కిలి తగ్గించిన సైజుతో చేయఁబడిన బ్లాకులఁబట్టి ముద్రితములయినవి. అవి సరియయిన పాఠనిర్ణయమునకుఁ బనికిరావు. ఫ్లీటు దొరగారి ప్రతిబింబములే పనికివచ్చును. అవి మిక్కిలి స్పష్టముగా సరిగానున్నవి. వానినే నేను జూచితినని మరల విన్నవించుకొనుచున్నాను. నేను ప్రకటించిన పాఠములను స్పష్టముగాఁ బరిశీలించుట కీవిషయమెల్లను చెప్పుకొనవలసెను. భారతిలోఁ బ్రకటితములయిన ప్రతిబింబము లెంత యస్పష్టమయినను నవిగూడఁ గొంతవఱకు లిపిభేదనిర్ణయమున కుపకరింపవచ్చును.

ఇఁక పాఠభేదములఁ జెప్పుకొందును. 19 బంతిలో 'దన్డు' అని నేను ప్రామాదికముగా వ్రాసితిని. భారతి ప్రకటితముకాఁగానే నాపొరబాటును శ్రీ శర్మగారికిని విన్నవించుకొంటిని. కడచిన భారతిలో ఈతప్పును దిద్దుకొంటిని. శర్మగారు 'దణ్డు' అని చదువుట యుక్తమే.

21, 22 బంతులలో "రెణ్డువడల ఏలేమువరులే మల చేసినది" అని నాపాఠము. "రెణ్డువడల ఎలెవు వరులెము లలసినది" శర్మగారిపాఠము.

ఇక్కడ శర్మగారు 'ఎలె' తర్వాతి యక్షరము 'వు' కాదగునుగాని 'ము' కాదనిరి. భూతద్దము నుప యోగించినను వారికది 'వు' గనే కనుపడెనట! 'ఎలెవు' క్రొత్తపదమట!

దీనికిఁదోడు వెంకటరమణయ్యగారు శాసనభావమును నే నిచ్చవచ్చినట్లు సంస్కరించితి ననిరి. అది 'ము' కాక పోవుట స్పష్టమనిరి. అర్థము కుదురదని యిట్లు మార్చి నైచుటా యనిరి. అర్థముకాని యపూర్వపదములను చిత్తానుసారము మార్చి చదువుకొని చేతనయిన ట్లర్థము

'పరియారువు' అనుచోటను, 23 బంతిలో 'సత్తవుళ్' అను చోటను, 28 బంతిలో 'పసుత్క్షేవుల' అనుచోటను 'వు' లు గలవు. వానికిని ప్రస్తుతాక్షరమునకును సంబంధ మేమయినఁ గలదేమో ప్రాజ్ఞులు పరిశీలించి చూడఁగ గుదురు! మఱియు శర్మగారును, వెంకటరమణయ్యగారును గోరినట్లు 15,16 బంతులనడుమ 'ప్రమఃఖాన్', 18 బంతి లో 'స్వాముళ్', 21 బంతిలో 'లెముల', 22 బంతిలో 'ముళ', 27 బంతిలో 'పసిణ్డిముడ్లు', 32 బంతిలో 'ముద్దకఇచ్చి' యను చోట్లఁగల 'ము' లతో ప్రస్తుతాక్ష రమునకు సంబంధము లేదేమోకూడ పరిశీలించిచూడఁ దగు దురు. అది 'వు' అని చదువువారి హృదయ మిట్టిదని నే నూహింపఁజాలకున్నాను.

ఇది ఇండి. ఆర్. 13 వాల్యుంలోనిదానిఁబట్టి చేసిన ప్రతిబింబపు తునుక. ఇందలి మూడవబంతి "రురెణ్డువడల ఏలేమువరులేమలచ్చే" అని నేను జదివినది. క్రింద గీతగలవి తగాయిదాగల యక్షరములు.

చెప్పవలసినదేనా యనిరి. ఈవిధమున ఏపదమునకైన నేయర్థమైన చెప్పవచ్చుననిరి.

వీరుభయులు దానిని 'వు'గా చదువుట నాకు అచ్చెరువు గొల్పుచున్నది. స్పష్టమయిన యాయక్షర మును గుర్తించుటకు భూతద్దమేల? నిర్వికారమైన తిన్నని చూపున్నఁ జాలును. పైయిద్దరును ఆయక్షరమును శాస నమునఁగల తక్కిన 'ము'లతోఁ బోల్చి చూడుఁడనిరే కాని,తక్కిన 'వు'లతోఁ బోల్చిచూడుఁ డనరైరేలొకదా! 18 వ బంతిలో 'నావురవు' అనుచోటను, 20 వబంతిలో

మఱియు శర్మగారు 21 బంతిలోనిదేయగు కడపటి యక్షరము 'ల' యనుచున్నారు. వెంకటరమణయ్య గారును పైపలుకునే ప్రతిధ్వనించుచున్నారు. విస్పష్ట ముగా ఫ్లీటుదొరగారి ప్రతిబింబములో నది 'చే'గాఁ గలదు. ఇంక నెవ్వరేని దానిని 'వె' గాఁ జదివినను జదువవచ్చునుగాని 'ల' గాఁ జదువుట యాశ్చర్యము గొల్పును. భారతిలోఁ బ్రకటితమయిన ప్రతిబింబములో నాయక్షరము సగపాలు ఫోటోలోనికి ఎక్కలేదు— శర్మగారు అనేకపర్యాయములు ఇండియన్ ఆంటిక్వారీ

పరిశోధించుచుఁగూడ నేను 'ఇండియన్ ఆంటిక్వరీలోని ప్రతిబింబములనుబట్టి పాఠమును ప్రకటించితినని స్పష్టముగాఁ జెప్పిననుగూడ, "చేసినదియు చన్ను" అనుటలో నర్థసంగతి గమనింపవలసియున్ననుగూడ "దానిని 'ల'గాఁ జదువుదునుగాని 'చె'గాఁ జదువను" అన్నచో నే నేమి యనఁగలను! ప్రాజ్ఞు లున్నారని యూరకుందును. శ్రీశర్మగారికూడ నిట్లు పాఠమును మాత్ర మాక్షేపించిరి. శ్రీవెంకటరమణయ్యగారు నేఁ జెప్పిన యర్థనిర్వచనమును గూడఁ జిందఱవందఱచేసిరి ! నే నీపట్టున నర్థము చెప్పుటలో నొక్క యక్షరమును 'లే' అనుదానిని దొలఁగించు టావశ్యకమయ్యెను. అట్లు దానిని దొలఁగించుటకు సరియయిన కారణము తెలిపితిని. 'దీనికి వక్రంబు వచ్చిన గచ్చురు రెణ్ణువడల ఎలే మువరు లెముల చేసినదియు చన్ను,' 'వీరిపయి నాడువరు గల్గిన ఏళే ముళ చేసిన సేయుడు'సను.' అని రెండువాక్యము లొకదాని తర్వాత నొకటిగాఁ గలవు. 'ఎలే–మువరు–లేముల–చేసినది–చన్ను–'తో సరివచ్చు పదసంవిధానమే తర్వాతి వాక్యమునఁ గూడ 'ఏళే–ముళ–చేసిన–సేయుడు–సను.' అని కలదు. 'రెండువాడల గ్రామమును ఏలునటువంటి ముగ్గురుగ్రామాధికారులు చేసిన చేఁత చెల్లును.' అని తొలివాక్యమున కర్థము చెప్పితిని. 'ఆమువ్వురిమీఁదఁగూడ నడ్డదిడ్డము లాడువా రుందురేని వారియెడఁగూడ నాగ్రామాధికారులు చేసినచేఁత చెల్లును' అని రెండవవాక్యమున కర్థము చెప్పితిని. ఇందు గ్రామాధికారులని యర్థమిచ్చుపదము 'ముళ'. ఆశబ్దపు నిష్పత్తినిగూర్చి కొంత చర్చించితిని. తొలివాక్యమున "ఏలే లేముల చేసినది" సరియయినచో రెండవవాక్యమున "ఏళే ముళ చేసిన చేయుడు" అనుచోట, 'ఏళే' తర్వాత నొక 'లే' చేర్చవలసియుండును. 'ఏళేముళచేసిన చేయుడు' సరియగుచో మొదటి వాక్యమున 'ఏలేలేముల చేసినది' యనుచో 'ఏలే' తర్వాతి 'లే' తొలగింపవలసి యుండును. మొదటివాక్యములో 'లే' తొలగించుట యుక్తమా, రెండవవాక్యములో 'లే' చేర్చుట యుక్తమా యని విచారించితిని. 'లేముల'కు అర్థము నాకుఁ గుదురలేదు; 'ముళ'కు అర్థము గుదిరినది. రెండవ వాక్యమున "లే" చేర్చుట సరిగాదని మొదటివాక్యమున 'లే' తొలఁగించితిని. రెండు వాక్యములందును పదసామ్యము స్పష్టముగాఁ గానవచ్చుచున్నదన్న నమ్మకము నాకుఁగలదు. సామ్యమును బట్టి తొలివాక్యమున 'లే'ను దీసివేయకున్నచో రెండవవాక్యమున 'లే'ను జేర్పవలసియేవచ్చునుగదా! రెండువాక్యములకును బదసామ్యము లేదని నిరూపించి నేఁ జెప్పిన యర్థముకంటె సరిగా సరిపోయిన యర్థమును సంస్కారనిరపేక్షముగా నెవ్వరేని సాధింతురేని జోహారులు! అట్టిదేదియుఁ జేయకుండఁ బదసామ్యము గలదని మొదట (సామ్యము స్పష్టముగాఁ గానవచ్చుచుండఁగా) నిరూపింపవలసినదని, రెండును వేర్వేఱుపదములేల కారాదని, కావనుటకు నిదర్శనము లేవీ యని సంస్కరించుట సాహసమని చేయు నాక్షేపములకు నే నేమని బదులు చెప్పవలెను ? ఈ 'ళే' ప్రభాకరశాస్త్రిగారిచే పూర్వాక్షరముతో జేర్పబడుటచే, ముళపదముత్పత్తియైనది. ఒకవేళ 22 వ బంతిలోని పదము 'ళెముళ' అను నేమో' ఇత్యాదిగా వెంకటరమణయ్యగారు వ్రాసిన పదొకొండు బంతుల వ్రాఁతకునుం బదులా? దశరా–మళరా–కథ స్మృతికి వచ్చుచున్నది.

20వ బంతిలో నేను 'నాయసేసి' అని చదివిన దానిని శ్రీ శర్మగారు 'దాయసెసి' యనియు, 23వ బంతిలో నేను 'నరాళోక' అని చదివిన దానిని 'నరాళోక' యనియు, 22 వ బంతిలో నేను 'వీరిపయి' అని చదివినదానిని 'విరిపయి' అనియు నిట్లే 'ఇ–ఈ, ఎ, ఏ, ఒ ఓ, స్వరములలో సర్వత్ర హ్రస్వరూపములనే పఠించిరి. కాని వారు ఈశాసనమునఁ బై స్వరములలో హ్రస్వదీర్ఘ భేదము పాటింపఁబడలేదని యంగీకరించిరి. అట్టిచో హ్రస్వముఁబోలె దీర్ఘముగూడఁ బాఠార్హమేయగునుగదా! నేను శాసనమున కర్థము చెప్పఁ బూనితిని గాన హ్రస్వదీర్ఘములు రెండును బాఠార్హములే కాన హ్రస్వముగాఁ బఠించినచో నర్థము పొసఁగనేని హ్రస్వముగాను,దీర్ఘముగాఁ బఠించినచో నర్థము గుదిరెనేని,దీర్ఘముగాను బఠించితిని. నాయర్థము నింకెవ్వరేని దుష్టముగా నిరూపించి హ్రస్వముగానే చదివి యర్థము చెప్పినప్పుడే

నాపాత మాక్షేపార్హ మగును. హ్రస్వదీర్ఘ ములకు లిపిలో భేదము లేనప్పుడు శబ్దరూపమును, అర్థమును తన్నిర్ణయమునకు సాధకము లగును. ఈవిధమున నేను శాసనమున హ్రస్వముగనున్న కొన్ని 'హ' లను దీర్ఘ ములుఁగా బఠించితిని. హ్రస్వదీర్ఘ స్వర సంస్కారమును జేయక విడిచితివి.

24 వ బంతిలో నేను 'సెడ్ల' అని చదివినదానిని శ్రీశర్మగారు 'సెల్లి' అని చదివిరి. ఇది మహత్తరమయిన చర్చగల లిపి. దీని చర్చ నికమీఁద విపులముగాఁ గావింప నున్నాఁడఁగాన యిక్కడ ను పేక్షించుచున్నాను.

25, 26 బంతులలో నేను 'వర్యేటి' యని చదివిన పదములను శ్రీశర్మగారు 'వర్యే టి (ష్జి) యని చదివిరి. "ఇది 'టి' యుఁగాదు. 'తి' యుఁగాదు." అని వారు వ్రాసిరి. నాకుఁ బూర్వ మీశాసనమును జదివినవారు ఫ్లీటుదొర గారు, బర్గెస్‌దొరగారు 'వర్యేతి' అని చదివిరి. లక్ష్మణరావుగారు 'వర్యేటి' అని చదివిరి. దీనినిగూర్చి నేను శాసనవిమర్శనమున నిట్లు వ్రాసితిని. "ఈయక్షరము 'తి' యనికాని, 'టి' యని కాని స్పష్టపఱుప శక్యము కాకున్నది. 18, 20 బంతులలో గల 'తి'కిని దీనికిని సంబంధము లేకున్నది. 'టి' ఈశాసనమం దితరత్ర రాలేదు. అది "తి' అనుటకంటె 'టి, అనుట సంగతము" అని. ఇతరశాసనములందుఁ గొన్నిట నిట్టి యక్షరము 'తి' గాఁ జదువఁబడెను. కాని యిందు 'తి' వేఱువిధముగాఁ గలదు గాన యట్లు చదువుట సంగతముగాఁ దోఁపలేదు. 'టి' లిపితో దీనికిఁ గొంతపోలిక గలదుగాని, 'టి' యేయని సరిగాఁ జెప్పఁదగియుండలేదు. ఈశాసనమున 'టి' లిపికి పోలిక యితరత్ర గానరాలేదు. 'టి'గాఁ జదివిన నర్థము గుదురుచున్నది. ఆపదము మువ్మాఱు వచ్చినది. అది గ్రామనామమని నేనర్థము చెప్పితిని. శర్మగారు చదివినట్లు 'వర్యేష్జి' కూడ తృప్తికరముగాదు. టి యక్షరము అడ్డుగీతలేని బండిఱాకు గుడియే. దాని యడుగుతట్టున 'ద' 'ట' 'ఱ' ల కున్నట్టు లోనికిఁ జొచ్చిన పృష్ఠముండును. ఇందది లేదు. ఇది సరిగా నేఁటి మనవ్రాఁతలిపిలోని 'తి' వలెనున్నది. నేను 'టి' గాఁ జదివినను, దాన నాకు అతృప్తియే కలదని స్పష్టముగాఁ జెప్పితిని. 'తి', 'టి', 'ష్జి' పఠనములు మూఁడును, అతృప్తిని గొల్పుచున్నపుడు 'టి' యని చదివిన నర్థసంగతి గానవచ్చెను గాన నేను దాని గ్రహింపవలసెను.

26 వ బంతిలో నేను 'సరల' అని చదివినదానిని శ్రీశర్మగారు 'సకల'అని చదివిరి. ఇట్టి యాక్షేపమునకు నే నెట్లు సమాధానము చెప్పవలెనో యెఱుఁగఁజాలకున్నాను. ఇందు మొదటియక్షరము 'మ, యగుట నిరాక్షేపమై నెగడవలసినది. చిరకాలముననుండి శాసనపఠన ప్రకటనాది కార్యములందు నిష్ణాతులయిన శ్రీ శర్మగారు దీనిని 'స' గాఁ జదువవలెననుట, దానికి నేను బదులుచెప్పుకొనవలసి వచ్చుట దైవదోషమే. ఈశాసనమందలి 'స' లిపికి నేఁటిమనవ్రాఁతలోను, అచ్చులోను నున్న 'స' లిపికి భేదమత్యల్పము ఈశాసనమందు 'స' ఇట్లు గలదు. 'మ' ఇట్లు గలదు. సకారము నడ్డిమీఁదనుండి తలకట్టున కొక నిలువుగీటు గలదు. ఇదియే మననేఁటి 'స' కును, ఈశాసనమందలి 'స' కును భేదము. మకారము తలకట్టు నుండి నిలువుగీఁత కొంత క్రిందికి సాగి డాఁపలితట్టుగా మీఁదికి మెలికతిరిగి తలకట్టుననుండి క్రిందికి వచ్చిన తన మీఁదుగా వలపలితట్టునకు సాగి కొంత యూర్ధ్వముఖముగాఁ బోయి నిలుచును. మన తెలుఁగునాలుగంకె డాఁపలికొనకుఁదలకట్టిచ్చి యించుక వలపలితట్టుకు వ్రాల్చినచోఁ గొంచె మించుమించుగా నిట్టియక్షర మేర్పడును. ఇందుఁ దలకట్టునుండి క్రిందికి సాగినగీఁత మెలికతిరుగుటలో నొకసున్న యాకృతియు, నాగీఁత వలపలికి సాగి యూర్ధ్వముఖముగాఁ బోవుటలో కొమ్ము నాకృతియు నేర్పడినవి. నేఁటి మనలిపిలోని 'మ' కుఁ గల మొదటి సున్నయాకృతియు కొమ్మునాకృతియు వీని పరిణామము లే. 'స' కు అట్టిసున్న యాకృతి లేదు. నాఁడును లేదు; నేఁడును లేదు. నాఁడు తలకట్టునుండి క్రిందికిసాఁగినగీఁత 'స' కారపు 'నడ్డి'మీఁదికి మాత్రమే వచ్చి నిలిచినదిగాని క్రిందికి సాఁగి మెలికతిరిగి సున్నయా

కృతిని గల్పించుట గానరాదు. ఈలిపిరీతు లింతవిస్పష్ట భేదము గలవై యుండఁగా, నీశాసనమందలి యిక్కడిలిపి నిస్సంశయముగా 'మ' కారమై తెలియవచ్చుచుండఁగా, నిందలి యన్నిమకారములు నిట్లేయుండఁగా, సకారములతో దీనికి సంబంధము లేమి స్పష్టముగాఁ గానవచ్చుచుండఁగా—ఇఁక దీనిఁగూర్చి నేనేమివ్రాయుదును—మకారము నడుగుసున్న పెద్దదిగా నుండవలెనని, తలకట్టుకు సున్నకు నడుమ నిలువుగీటు చిన్నదిగా నుండవలెనని, కొమ్ము, సాగారినట్టుగాక, కుదించిన ట్టుండవలెనని, ఇవి మకారలక్షణములని, ఏకం విధముగా శ్రీశర్మగారు వ్రాసినవ్రాఁతలోని యాచితిని ప్రాజ్ఞులు పరిశీలించి నిశ్చయింపవలెను. ఈపట్టున వెంకట రమణయ్యగారి వాగ్ధోరణిని గూడ యారయవలసినది. ఆయక్షరము 'మ' కాఁజాలదట; 'స' యగునేే నిశ్చయమట!

ఇఁక మఱియు 'మ' తర్వాతియక్షరమును నేను 'ర' గాఁ జదివితిని. అది 'క' కాదని నాతలఁపు. దానిగూర్చి నాశాసనవిమర్శమున నిట్లు వ్రాసితిని. "తలకట్టు క్రిందియక్షరముతో సంధించుటకు నిలువుగీఁత కకారమున కుండును. ఈయక్షరమున నట్టులేదు. అక్షరముతో నొట్టియుండవలసిన తలకట్టుకు స్థలముచాలక లేఖకుఁ డించుక యెడముగాఁ జెక్కెను" అని. ఈశాసనమున రకార కకారములకు భేద మెట్టిదనఁగా:— చింతాకు నాకారముననే రెండక్షరములును గలవు. రకారమునకు రెండువైపులకుఁ గొంచెము హెచ్చుగాసాగి తలకట్టు ఆయక్షరముతో నొట్టియున్నది. కకారమున కాయక్షరము వలపలితలయంచునుండి, పయికొక గీఁత సాగి దానిమీఁద వలపలితట్టునకు మ్రొగ్గువలగల తలకట్టున్నది. ప్రస్తుతాక్షరమును రకారముగాఁ జదువుటలోను నాక్షేపము గలదు. రకారముగాఁ జదువుటలోను నాక్షేపముగలదు; కకారముగాఁ జదువుటకుఁ దలకట్టు దూరముగానుండు టాక్షేపవిషయము. కకారముగాఁ జదువుటకుఁ దలకట్టుతో నొట్టియుండవలసిన నిలువుగీటు లేకుండు టాక్షేపవిషయము. దీనిఁగూర్చి నేను జాలఁగాయోజించితిని. 'ర'గాఁ జదువగా 'మరల' అని యర్థముగల పదమగును. వాక్యార్థము పొసఁగును. 'మకల' నాకర్థముగాలేదు. అనర్థకపక్షముకంటె అర్థవత్పక్షము గ్రాహ్యముగాన 'మరల' యని పఠించుటే సముచితమయ్యెను. అయినను 'క' కారముగాఁ జదివికూడ నెంతెంతో యోజించి చూచితిని. ఇక్కడ నొక క్రొత్త గానవచ్చెను. శాసనమం దింక నెక్కడను లేని యిఱుకుగల యీయక్షరస్థానమునఁ గలదు. ఈశాసనమునఁ దక్కిన యక్షరములన్నిఁ దగినంత యెడముండునట్లు చెక్కఁబడినవి. ఈయొక్క యక్షరమే మిక్కిలి యిఱుకుగాఁ జెక్కఁబడినది. శాసన లేఖకుఁడు దానినిఁ దొలుతఁ జెక్కమఱచి తర్వాత 'మ', 'ల'లకు తక్కిన యక్షరముల కన్నింటికిఁబోలె నడుమనున్న యెడమున నిఱికించి చెక్కియుండునని తోఁచెను. అట్లుచెక్కుటలో రకారపుఁ దలకట్టుకూడఁ జెక్కినను రెండుప్రక్కలను అక్షరము తలకట్టు కుండవలసిన చిమ్ములకుఁ జోటు లేదుగాన దానికై తలకట్టును మరల నెడముగాఁ జిమ్ములువచ్చునట్లు చెక్కియుండునని గోచరించెను. ఆవిషయమునే శాసనవిమర్శమున వ్రాసితిని. రకారముగాఁ జదువుటలో నున్నట్లే కకారముగాఁ జదువుటలోఁ గూడ స్పష్టముగా నతృప్తియుండఁగా నాయక్షరము రకారము కానేకాదు. నిశ్చయముగా కకారమేయని శ్రుద్ధిచెప్పుట యొప్పునా? ఈపట్టున వెంకటరమణయ్యగారు చేసిన ప్రసంగమును పరికింపుడు: దానిని 'ర' గ చదువుట తప్పట! 'క' గనే చదువవలెనట. మరల—నది 'క' అయినను కాకపోయినను 'ర' మాత్రము కాదట!" నేను కుస్తీపట్టితినట! ఓటయిపోయితి నట! ఏ భీతియు లేనప్పు డేమన్న ననవచ్చును!

మఱియు 27 వ బంతిలో 'వరువయ్య' అని నేను జదివినదానిని శ్రీశర్మగారు 'వరువయ్య' అని చదివిరి. అక్కడ యకారపుఁ దలకట్టు సూఁదిమొనయంతే నిలువుమొగమైనది. అది రేఫవ్యంజకముగాఁ దలఁచి దలఁపవచ్చును. 33 వ బంతిలో 'దిచక తీరవలసియున్నరయ్య' యనియే కలదు గావునను; నిక్కడ యకారమునకు సూఁదిమొన యంతగానున్న యాయూర్ధ్వముఖత యస్పష్టమగుటచేతను నేను 'వయ్య' యని చదివితిని! శర్మగారు చదివినట్టుకూడఁ జదువవచ్చును. కాని యది నిర్విశేషము.

మఱియు 28 వ బంతిలో 'గజ్ఞ సెడ్లల' అని నేను జదివినదానిని శ్రీ శర్మగారు 'గజంబు సెథ్లల' అని చదివిరి. తాము చూచినంతవఱకు 'జ' క్రింద 'ఞ' లేదనిరి. 'జ' తోఁగలసి దానిపిదప నొక యక్షరమును దానికి కొమ్మను గలవనిరి. ఆయుత్వమునే 'జ' తరువాతి యక్షరముయొక్క యెడమవైపు నిలువు గీటుగఁ బోనిచ్చినట్లున్నదనిరి. అట్లేయగునేని దాని 'బు' గ చదువదగు ననుకొంటి మనిరి. ఈపట్టున నేను శాసన విమర్శమున నీక్రింది యర్థముగల వాక్యముల వ్రాసితిని. '23, 24 బంతులలో "గజ్ఞంబు సెడ్ల నడుపుళ్" అన్న పదము లున్నవి. అవియే మరల 28, 29 బంతులలోఁ గూడ "గజ్ఞ సెడ్లలనడుపుళ్" అని వచ్చినవి. ఈరెండు చోట్లను అక్షరవ్యత్యయముగలదు. శాసనము ముగియఁ జెక్కనుజెక్కను లేఖకున కజాగ్రత్త యెక్కువగుట యిందు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. శాసనము మొదటఁగల యక్షరముల సౌందర్యము పోనుపోను మిక్కిలి చెడుచువచ్చినది. ఇందు 23, 24 బంతులలోని లేఖనము 28, 29 బంతుల లేఖనముకంటెఁ బ్రామాణికముగాఁ గొందును." ఇట్లు నేను వ్రాయుటకుఁ గారణముల నిక్కడ వివరించుచున్నాఁడను. 23, 29 బంతులలోని "గజ్ఞంబు సెడ్లనడుపుళ్"కు నే నర్థముచెప్పితిని. 28, 29 బంతులలోని పదములుగూడఁ గొంచెపు భేదముతో నట్లే చదువను, అర్థము చెప్పను దగియుండెను. ఆకొంచెపు భేదము లేవనఁగా:—23 బంతిలో 'గజ్ఞ' అని 'జ' కారముక్రింద ఞకారము స్పష్టముగాఁ గలదు. 28 వబంతిలో 'జ'కారముక్రింద నుండక 'ఞ' కారము దాని నంటికొనియే దానిప్రక్క నున్నది. శాసనప్రతిబింబమును బరిశోధింపఁదగును. శాసనవిలేఖకుఁడు దానినట్లు ప్రక్క.గా వ్రాయుటకుఁగూడఁ గారణముగలదు. సరిగా నీయక్షరమునకుఁదలమీఁద మీఁదిబంతిలోని 'ష్ణ' అను ద్విత్వాక్షరములోని ణకారము క్రిందిబంతి కుండఁదగినచోటును గొంతయాక్రమించుకొనెను. అట్లు క్రింది బంతిస్థలమాక్రమించుకొన్న యా 'ష్ణ'కు సరిగా నీక్రిందిబంతిలో మరల ద్విత్వాక్షరముగు నీ 'జ్ఞ'చెక్కవలసివచ్చెను. ఈబంతికిఁ గ్రింద నింక నొకబంతి చెక్కవలసియున్నది. ఇక్కడ జకారముక్రింద ఞకారము చెక్కుచోఁ గ్రిందిబంతిచెక్కడమున కడ్డంకి కలుగును. ఈకారణముచే శాసనము చెక్కినవాఁడు 'ఞ'ను జతో నంటించి ప్రక్కగాఁ జెక్కియుండుననని నాయనుమానము. 17 వ బంతిలో 'ఆజ్ఞాపయతి'లోని 'జ' క్రింది 'ఞ'కును, 28 బంతిలో 'జ' క్రిందనున్న 'ఞ'కును, నిక్కడ 'జ' నంటి ప్రక్కగానున్న యక్షరమునకును సారూప్యము చక్కఁగాఁగానవచ్చుచున్నది. కాని 17, 28 బంతులలో నాయక్షరము నిలువుగీటుకు నడుమ కుడితట్టునకు మాత్రమేయున్న యడ్డుగీటు ఇక్కడఁ గుడితట్టునకును నెడమతట్టునకును గలదు. ఇది కొంచెము భేదము. దీనిని జదువుటలో నేను మిక్కిలి చిక్కుపడి యిట్లు గుర్తించితిని. జకారముతర్వాతి యాయక్షరమును 'ఞ'కారముగాఁ జదువుటే చాల సంగతముగా నుండునుగాని యింకే యక్షరముగా జదువుటయు సరిగాదు. అక్షరస్వరూపముచేతనే యిది యిట్లు చదువఁదగియుండఁగా నింక 23 బంతిలో 'గజ్ఞంబు' ఇత్యాది పదములతో నిక్కడిపదములకు సంగతిగూడ నున్నప్పు డట్లు చదువుట కాక్షేప ముండరాదనియే నేనందును. శ్రీశర్మగారిక్కడ కుడికొన నొకచుక్క గలదనిరి. అంగీకరించుచున్నాను. 'గజ్ఞం'అని చదువుదును. శ్రీశర్మగారు 'సెథ్ల' అని చదువగా నేను 'సెడ్ల'అని చదువుటకుఁ గారణమిది. 28,29బంతులలో శర్మగారు'సెళ్ల'గాను నేను'సెడ్ల'గాను జదివినపదమే యిదియని నావిశ్వాసము. 29 వ బంతిలో నాద్విత్వాక్షరమునకుఁ బొట్టలో నడ్డుగీఁత గలదు;ఇక్కడ లేదు. లేఖకుఁ డజాగ్రత్తచే దానినిక్కడ విడిచినాఁడని నేను దలఁచితిని. 23, 24 బంతులలోని లిపికంటె, ఈ 28, 29 బంతులలోని లిపిలో శాసనవిలేఖకుఁడు చేసిన లిపి వ్యత్యాసములివి:—'జ' క్రింద 'ఞ' చెక్కకుండుట, 'ఞ'కు అడ్డుగీటు ఎడమతట్టునకుగూడఁ బోనిచ్చుట 'ళ్లి' 'డ్లి' అక్షరములో నడ్డుగీటు చెక్కకుండుట,—ఈవిషయమునే నేను శాసనవిమర్శమున సంగ్రహముగాఁ జెప్పితిని.

మఱియు 31 వ బంతిలో నేను 'జనువ' అని చదివినదానిలో శ్రీ శర్మగారు తొలియక్షరము 'జ'

యసనాయని సందేహించిరి. ఈశాసనమున నితరస్థల
ములవచ్చిన 'జ'లకును దీనికిని గొంచెము భేదము గలదనిరి.
దీనికిఁ గుడితట్టున (గుడితట్టునకు అగ్రములుగల మూఁడు
అడ్డగీఁతలున్నవి.) ఎగువగీటును, దిగువగీటును కలవనందు
వలనఁగాని, లేనిచో 'ఛ'గగాని, 'ఱ' గగాని దానిఁజదివి
వలనఁగాని, లేనిచో 'ఛ'గగాని, 'ఱ' గగాని దానిఁజదివి
యుందుమనిరి. శాసనము చెక్కుటనఁగా అచ్చుపోఁత
యక్షరములఁగూర్చుట గాదు. చేతివ్రాఁతలోఁ గూడ అ
క్షరములను సర్వత్రసమానాకారముతో వ్రాయుట గుదు
రదు. అక్షరముల నిర్మాణరీతిలోని భేదములను జూచు
కొనవలెనుగాని పొంకములోని భేదములను లెక్కింపఁ
బూనినఁ గుదురదు. ఇక్కడ నీయక్షరమును 'జ' కార
మునుగాఁ జదువ నగునుగాని యింకొకదానిఁగాఁ జదువఁ
గాదు.

మఱియు 33 వ బంతిలో నేను 'దివకరయ్య'
యని చదివినదానిని శ్రీ శర్మగారు 'టివకరయ్య' యని
చదివిరి. ఆయక్షరమునకుఁ దలకట్టుతోఁగూడిన గుడి లేద
నిరి. ఇట్లున్నను గొన్ని శాసనములం దది 'డ' గాఁ జదువఁ
బడెననిరి. దీనిగుడి తలకట్టుతోఁ గూడియున్నట్టుఁ
గూడ గుర్తింపఁదగియే యున్నది. ఇట్టి లేశాతిలేశ
మయిన లిపిభేదమును నిశ్చయించుటకు శబ్దార్థసంగతి
సాధకము. 'దివకరయ్య' యనఁగా నర్థము చక్కఁగా
సరిపోవును. 'టివకరయ్య' యట్టిదిగాదు. ఇంతకు నిక్కడ
తొలియక్షరము నాదృష్టికి 'ది' గాఁ జక్కఁగాఁ జదు
వఁదగియే యున్నది.

శ్రీ శర్మగారు పేర్కొనిన శాసనపాఠభేదము
లను చెక్కింటినిగూర్చి నాకు న్యాయ్యమని తోఁచిన
సమాధానముఁ జెప్పికొంటిని. శ్రీ శర్మగారికిని నాకును
ముఖ్యముగాఁ జర్చావిషయము గానున్నది:— సెథ్లు,
కొస్థుక, గథ్థను, అని ఫ్లీటుదొరగారు, బర్గెస్‌దొరగారు,
లక్ష్మణరావుగారు చదివినట్టి శబ్దములలోని థకారమే.
నేను దానిని డకారముగాఁ గాని, డకారముగాఁ
దర్వాతఁ బరిణామమందు యుత్పన్నమైపోయిన యొక
వింతపూర్వలిపిగాని యగునంటిని. శ్రీ శర్మగారది బండి
'ఱ' యనిరి. ఇక్కడమాత్రము 'ఢ' గాఁ జదివిరిగాని
యితరత్ర దీనిని ప్రాచీనులు బండి ఱ గా నే చదివిరి. శ్రీ
శర్మగారును పెక్కుసాధనములతో నాతలఁపును దప్పఁ
జెప్పి ప్రాచీనులు ఇతరత్ర చదివినట్లే చదువవలెననిరి.
ఈ యక్షరమునుగూర్చి చర్చ పత్రికలలోఁ బడక
పూర్వము నేను శ్రీశర్మగారితో నీవాదపు సాధక బాధ
కములఁ జర్చింపఁ గోరితిని. నాయుద్దేశములనెల్లఁ జెప్పి
కొంటిని. నాశాసన విమర్శము ముద్రితము గాకపూర్వ
మును, ముద్రితమగుచున్నప్పుడును దానిఁజూచి మంచి
చెడ్డలఁ జెప్పఁగోరితిని. నాకోరిక నెఱవేఱలేదు. వారు
నావాదమునకు సాధకములుగా నే నుదాహరించు శాస
నాదులకు స్పష్టముగా ఆకరములను దెలుపవలసినద
నియుఁ దర్వాత వానిని దాము పరిశోధించుకొనవలసి
యుండుననియు నాతోఁ జెప్పిరి. మే మిర్వురము ఆప్త
మిత్రుల మేకాన పత్రికకెక్కి ప్రతివాదము జరిగినను నది
సరసముగా నే సాగునని నే విశ్వసించితిని నావిమర్శమున
నే నుదాహరించిన శాసనాదులకు స్పష్టముగా నాకర
ములఁ దెలుపుకొంటిని. న న్నట్లు కోరినవారయ్యు శ్రీ
శర్మగారు తమ ప్రతివిమర్శమునఁ దాముదాహరించిన
శాసనములలో దేనికిఁగాని ఆకరము దెలుపరైరి! వారిం
తవఱకు అనేకశాసన విమర్శములఁ బ్రకటించినవారు.
వానిలో ననేకప్రాచీనశాసనముల నుదాహరించినవారు.
ఎన్నఁడుగాని, ఎక్కడగాని వారు తాముదాహరించిన
శాసనములకు ఆకరములఁ దెలుపకుండుట గానరాదు.
ఈప్రతివిమర్శమున నే వీరిట్టి యపూర్వపద్ధతి నవలంబిం
చిరి. వా రుదాహరించిన శాసనములు పెక్కులు అప్రసి
ద్ధములు, అముద్రితములు. అవి యెక్కడెక్కడ నున్నవో
వెదకి పట్టుకొనవలసి వచ్చెను. శ్రీ శర్మగారివలె నే
నేనును నింతకుఁబూర్వమే కొన్ని ప్రాచీనశాసనములను
ఎపిగ్రఫీఆఫీసువారి శాసనసంచయమునఁ బ్రతిబింబ
ములఁజూచి ప్రతులు వ్రాసికొనియుంటిని గాన వానిలోఁ
గొన్నింటిని వెదకి గుర్తించితిని. ఇంకఁ గొన్నిటికై తం
టాలు పడవలెను. ఆయాఫీసులోని ప్రాఁతతెలుఁగు శాస
నముల ప్రతిబింబములను చెక్కింటి నీనడుమ శ్రీ జయం
తిరామయ్య పంతులుగారు తెప్పించికొనిరట. శర్మగా
రుదాహరించినవి కొన్ని యందుండును. వానిపాఠములను,
లిపులను జూచుకోవలసి యున్నది. మఱియు నావాదము

నకు సాధకములయిన శిలాశాసనములకుఁ గొన్నింటికిఁ బ్రతిబింబములను దీసి యచ్చుదిమ్మలు చేయింపవలసియున్నది. ఇదియెల్ల నెఱవేర్చుకొనుటకుఁ గొన్నాళ్లగును. వలయు పరికరములనెల్ల సమకూర్చుకొని శ్రీ శర్మగారివాదమును జక్కఁజూచుకొని నావాదమునకుఁ గూడఁ బునరాలోచనము చేసికొని న్యాయ్యమని నేను నమ్మినదానిని రాఁబోవు భారతిలోఁగాని దాని తర్వాతి భారతిలోఁ గాని వెల్లడించుకొందును. నావాదము సరిగాదని తోఁచెనేని దానిఁదప్పక వెల్లడింతును. ఈచర్చ కొంతప్రాచీనాంధ్ర భాషాస్వరూపమును, ప్రాచీనలిపి స్వరూపమును బ్రవ్యక్తపఱుపఁగల్గుటతోఁ బర్యవసన్నమగునేని శ్రీ శర్మగారును, నేనును ధన్యుల మగుదుము.

శ్రీ శర్మగారు పయియక్షరమునుగూర్చి పత్రికలలో జర్చింపఁ దలపెట్టుట నాకు సమ్మతమే. ఆచర్చ వలన నపూర్వశాసన భాషాపరికరము గొంత బయల్పడఁగలదు. కాని నిక్కముగా నిలువఁజాలని యసందర్భపుటాక్షేపముల నిప్పుడు నేను బదులుచెప్పినవానినిఁ బత్రికలోఁ బ్రకటించినందుకే యావంతనావంత. వారు తమపాఠభేదములగూర్చి నాతో ముచ్చటించియుండఁదగును. నేను సమాధానము చెప్పియుండఁదగును; పరస్పరము మామాపాఠముల గుణదోషములనిర్ణయించుకొని యుండఁదగును. అట్లుజరగియుండెనేని శ్రీశర్మగారికిఁగాని నాకుఁగాని, నడుమ వెంకటరమణయ్యగారికిఁగాని యీ యాయాస మక్కఱ లేకపోయెడిది. శర్మగారును, నేనును బరస్పరము సందిగ్ధవిషయములనుగూడఁ బలుకుకొనుట చాలఁగాలముననుండి సాగుచున్న సంప్రదాయమే కాని క్రొత్తగాదు. అయినను శర్మగారేలో ఆత్రపడి ప్రభాకరశాస్త్రిగారికి ప్రాచీనచాళుక్య లిపి చదువుటే చేతకాదన్న సిద్ధాంతము పుట్టఁదగినన్ని యాక్షేపములఁ బ్రోదిచేసిరి.

మఱియు శ్రీశర్మగారు నాశాసనపదపదార్థవివరణములఁగూర్చి అక్షరముల మార్చి చేర్చి తీసివేసి, శాసనమున కర్థము చెప్పితినని, అది చాలవరకు సందేహింపవలసి యున్నదని సందేహగ్రస్తసంస్కార ఫలితముగఁ గుదిరిన లిపినిర్ణయమును, అర్థమును సందేహగ్రస్తమే యని తేలుచున్నదని సూత్రప్రాయముగాఁ జెనకఁగా వెంకటరమణయ్యగారు దానికి భాష్యప్రాయముగా బహుభాషలాడిరి. పయిశాసనము లిపిదోషబహుళము. విడివిడిగాఁ బెద్దపెద్దగాఁ బ్రక్కకై దేసిబంతులచొప్పున వ్రాసిన మొదటి రెండుప్రక్కలలోను నిర్వదియేడుదోషములు గలవు. అందు సంస్కృతభాష గలదుగాన యాదోషములు స్పష్టములు. నేను వాని నిష్టమువచ్చినట్టు తీర్చి మార్చి చేర్చి నాయభిప్రాయమును జొప్పించి దిద్ది సంస్కరించితినని తెగడ శక్యముగాదు. 'ప్రసాదసదసమాసాదిత' అని కలదు. ఇందు 'సద' తీసివేయవలెను. 'భాస్వానిత్యోప' అనికలదు. 'భాస్వా'తర్వాత 'నివ' చేర్పవలెను. 'రిపునృపాఃభ్రుపవనః' అని కలదు. 'రిపునృపాభ్రపవనః' అనిమార్పవలెను. యిట్టివే యాతప్పు లెల్లను. తెలుఁగుభాగమును బ్రక్కకేడేసి బంతులచొప్పున లేఖకుఁడు చెక్కినాఁడు. అక్షరములు చిన్నవి. బంతులు వంకర. లిపి మిక్కిలి అజాగ్రత్తగాఁ జెక్కినది. ఇట్టిచోఁ దప్పులుండక పోవునా? అయినను నేను సంస్కృతభాగమునఁ జేసిన సంస్కారములకంటెఁ జాలఁదక్కువగా నే తెలుఁగు భాగమున సంస్కారములను జేసితిని. వానిఁగూడ సకారణముగాఁ జేసితిని. వానినెల్ల నిక్కడ మరలఁ జెప్పఁజాలను. చేతఁలోఁ జెడిపోవచ్చునుగాని భావమునఁ బ్రామాణికత కొఱకే బాధపడితిని. ఆదరబీదరగా నేనో యందనిపొందని యర్థముల మనసులో నుంచుకొని 'మసిపూసి నేరేడుపండు' విధముగా మాయఁ జేయలేదు. నేఁ జెప్పినయర్థవివరణాదులు నిర్దుష్టములేయని నేనన లేదు. ప్రాజ్ఞులింకను బరిశోధించి విశేషముల వెల్లడింపవచ్చును. మఱియెవ్వరేని యీసంస్కారములఁగూడఁ జేయకుండ యర్థము గుదిర్చినచోఁ జోహారులు. అట్లేమియుఁ జేయక యాక్షేపించుట యర్హలక్షణముగాదు. శ్రీ శర్మగారును బెక్కుశాసనములఁ బ్రకటించిరిగదా. వానిలో దాము గావించిన సంస్కారములనుగూడ స్మరించిచూచుకొనవలదా!

నా యీశాసనవిమర్శమునందే కీ. శే., కె. వి. లక్ష్మణరావు పంతులుగారు పరిశోధించినట్టియు, వారి యనంతరము శ్రీశర్మగారు సరిచూచి పూర్తిచేసి ప్రకటించినట్టియు సాతలూరి తామ్రశాసనమునుండి యొక్కో

ముదాహరించుకొంటిని. ఆశ్లోకమును శ్రీలక్ష్మణరావు పంతులుగారు ఆంధ్రపరిశోధకమండలి వార్షికోత్సవాధ్యక్షోపన్యాసమునఁగూడఁ జేర్చిరి. ఆయుపన్యాసమునను, భారతి ఒకటవ సంపుటమున ఒకటవసంచికలోను ప్రతిబింబముగాఁ బ్రకటించిన తచ్ఛాసన విమర్శనమునను నాశ్లోకచరణము "నరకరిగల్ల భూపతి భూజాసి రిపూజిభువి ప్రహాసతే" అని కలదు. 'ప్రహాసతే' అని సంస్కృతమునఁ గ్రియారూప ముండదు. 'ప్రహసతి' అని యుండును. 'ప్రభాసతే' అని యుండు నేమోయని యనుమానముతో భారతిలోని ప్రతిబింబమును జూచితిని. అందులిపి 'ప్రభాసతే' యని చదువఁదగియున్నది. బంతిచివర భాయక్షరము గలదు. భస్పష్టముగానున్నది. దాని దీర్ఘమున కక్కడ చోటు చాలక లేఖకుఁ డాయక్షరముక్రిందుగాఁ జెక్కెను. క్రింద నొకదీర్ఘపుగీటు గలదు. 'భ' స్పష్టముగానున్నప్పుడు, 'భాసతే' అర్థవంతమును, నిర్దుష్టమును నగు పద మయినపుడు ఇట్లే చదువఁదగును. 'ప్రహాసతే' అనురూపము సాధువు గాదు; లిపియు నట్లు లేదు; అర్థమును గుదురదు. నేనీవిషయము నెల్లఁ జేరుకొనక 'ప్రభాసతే' అనియే యుదాహరించుకొంటిని. మఱియు నాశాసన ప్రతిబింబములను బాఠములను జూడఁగా నిట్టి వింకను గానవచ్చెను. ప్రతిబింబములనుబట్టి ౭ వ బంతిలో 'మగిదొగరాజః' ౩౧ వ బంతిలో 'చతురాశ శ్చక్ర వరహాలాఞ్ఛన' అని కల వానిని 'మగిదాశ(పుట్ నోటులో శ స్పష్టముగ లేదు 'గ' కావచ్చును' (గ స్పష్టముగనే కలదు.) అని) రాజః' అని; 'చతురాశశ్చ కే(?) వరహాలాఞన' అని చదివరి. ఇట్టివి దాన నింకనుగలవు.

శ్రీశర్మగారిప్పటికిఁ బ్రకటించిన శాసనములలోఁ గడపటిదగు చాళుక్యభీమరాజు సీసపద్యశిలాశాసనమునఁ గూడ సందేహస్థానములు గలవు. "నెడజేన బోయల నడవిసా[న్పె"] ...... కన్నరాభూపతి వెన్నాజిలో జూపె సంకిలా (ల) ద్దాను సేని బింకమడిచె...చోటి నింజేకొని కాచె భూలోకం బెలుంగ..."

ఇత్యాది విధముగానున్న సీసమున వాక్యముల కెల్ల కర్తృపదము 'పండరంగు' అనునది. 'కన్నరాభూపతి వెన్నాజిలోఁ జూపె' అని శర్మగారి పాఠముచొప్పునఁ జూడఁగా వాక్యాన్వయము, అర్థము పొసఁగదు. తక్కిన వాక్యముల కెల్ల విరుద్ధముగా 'కన్నరాభూపతి తనవెన్ను ఆజిలో పండరంగనికిఁజూపె' నని యర్థము చెప్పరాదు. కనుక "కన్నరా భూపతి వెన్నాజిలోఁ జూచె" అని యుండవలెనని నేను నిశ్చయించుకొని శాసనశిలను బరిశీలించితిని. అం దాయక్షర మస్పష్టముగానున్నను 'పె' అని చదువుటకుఁగాక 'చె' అని చదువుటకే యానుకూల్యము గల్గియున్నది. శర్మగారు తమవిమర్శమున లిపిరీతియే తమకుఁ బ్రధానముగాని యర్థసమన్వయముతోఁ దమకుఁ బని లేదని వ్రాసిరి. నేఁడు జిలుగువ్రాఁతగల కాగితములను జదువుటలోఁగూడ లిపిసంకేతములతోపాటు పదపదార్థసంగతికూడఁ బాఠపరిజ్ఞానమున ముఖ్యమగుట సర్వవిదితము. ఇంచుమించుగా శాసనలిపియు నిట్టిదే. అర్థసంగతియు, నారయకున్నచో సర్వత్ర స్పష్టముగాఁ బాఠనిర్ణయము లిపిమాత్రజ్ఞానముచే సాధ్యము గాదు. అర్థయోజనము సాధు లిపిస్ఫురణమునకు సాధకము.

[వేటూరి ప్రభాకరశాస్త్రి]

---

## శ్రీయుతులు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య గారు, యమ్. ఏ., పి హెచ్. డి.



వీరు పుదూరుద్రావిడశాఖీయులు; నేలటూరి సుబ్బయ్యగారి కుమారులు. జననము ౧౮౯౪ ప్రాంతము. స్వకాయకష్టమువలను, స్వయంసహాయమువలనను నెల్లూరు అమెరికన్ బాప్టిస్టుమిషన్ హైస్కూలులో ప్రాథమికవిద్య ముగించుకొని, పిదప మదరాస్ క్రిస్టియన్ కాలేజిలో ఇంటర్మీడియెట్, ఆనర్సు పరీక్షలం దుత్తీర్ణులైరి. ౧౯౨౧ లో బెంగుళూరిలో 'వెస్లియన్‌మిషన్ కాలేజి'లో ఆర్థికశాస్త్రోపన్యాసకులు (Economics Lecturer)గ పనిచేసి, ౧౯౨౨ లో మదరాసు 'క్రిస్టియన్ కాలేజి'లో తెలుగుపండితులుగ ప్రవేశించిరి. ౧౯౨౩ లో వీరి నచట చారిత్రకశాఖలోనికి మార్చిరి. అప్పటినుండి యిప్పటివరకు ఆశాఖయందే ఉపన్యాసకులుగ పనిచేయు చున్నారు. 'డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ' (పి హెచ్. డి.) బిరుదమునకై వీరు ౧౯౨౬ లో దక్షిణహిందూదేశ దేవాలయోత్పత్తి (The origin of the South Indian temple) అను వ్యాసమును మద్రాసువిశ్వవిద్యాలయమువారికి బంపిరి. వారు దీని యోగ్యతను, ప్రాశస్త్యమును బరీక్షించి వెంకటరమణయ్యగారికాబిరుదమును ౧౯౨౪ మార్చిలో నొసంగిరి. కడచిన నెల ౨౩ వ తేదీని జరిగిన పట్టప్రదాన సభలోనే వీరు 'డాక్టరు' పట్టమునందిరి.

## శ్రీయుతులు డాక్టర్ వంగల శ్రీరాముగారు



వీరు లక్నో విశ్వవిద్యాలయ రాజనీతిశాస్త్రశాఖా ప్రధానాధికారులు; సుప్రసిద్ధాంధ్రులు, కృష్ణాపత్రికా సంపాదకులు నగు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి యల్లుండ్రు. వీరు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయము నందు బి.ఏ. (ఫస్టుక్లాసు ఆనర్సు) అందుత్తీర్ణులైనవారు; రాజనీతిశాస్త్రమునందలి నైపుణికి బెన్నెట్ బహుమానము బడసినవారు ; హార్వర్డు విశ్వవిద్యాలయమున యమ్. ఏ., పి హెచ్. డి. పట్టములను పొంది అంతర్జాతీయ న్యాయశాస్త్రమునందు బౌడీన్ బహుమతిని బడసి, 1917–18 సం.ల యందు యూనివర్సిటీ స్కాలరు గను, 1919–19 సం.లలో గూడ్విన్ మెమోరియల్ ఫెల్లో గను, 1919–20 సం.లలో పార్కర్ ట్రావెలింగ్ ఫెల్లో గను నుత్తమవిద్యల నభ్యసించినవారు; కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయమున ఎమ్మాన్యూయల్ కళాశాలయందు అంతర్జాతీయ న్యాయశాస్త్రమున పరిశోధనలగావించినవారు; 1924–25 సం.లయందు పాట్నా విశ్వవిద్యాలయమున రీడర్ షిప్ లెక్చరుల నుపన్యసించినవారు. ఇంతకుపూర్వము వీరు కలకత్తా విశ్వవిద్యాలయమున ప్రధానోపన్యాసకులుగపనిచేసి యుండిరి. అంతర్జాతీయ న్యాయశాస్త్రము నందు కార్నెజీ ఫెల్లోషిప్‌ను పొందిన ప్రథమ భారతీయులు వీరే.

# భారతీయమహిళామండలి

## శ్రీమతి వైదేహీకన్య



ఏడేండ్లు వయస్సుగల ఈబాలిక హైందవ లక్ష్మీ విలాస సభ (తిరువళిక్కేణి)కు అధ్యక్షురాలైన శ్రీమతి యం. లక్ష్మీఅమ్మాళు మనుమరాలు. ఈబాలిక తన మూడవసంవత్సరముననుండి నాట్యమునందు పేరుగాంచి పెక్కురచేత పెక్కు బహుమతులను బడసినది. మఱియు 'బాలనటి' యను బిరుదమును 'టాడ్‌హంటరు సతి'వలన బొందినది. ఈబాలిక లక్ష్మీవిలాససభవారి యాదరణమున నిటీవల రుక్మిణీకల్యాణ హరికథను కాలక్షేపము చేసినది. ఈమె తలిదండ్రులు ఈబిడ్డను విద్యావతినిగాజేయుట పరమావశ్యకము. విద్యావతియగునేని యీమెకీర్తి మున్ముందు బహుధా పెంపొందగలదు.

## శ్రీమతి ఎ. సి. దేవకీకన్య, చెన్నపురి



ఈమె చెన్నపురి మేరీరాణీ కళాశాలయందు చదివి బి. ఏ. పరీక్షయం దీరాజధానిలో ప్రథమస్థానము నలంకరించినది. ప్రొఫెసరు కాండేతుపండితులవారి మేనకోడలు.

## శ్రీమతి ఇ. జార్జికన్య



వేదాంతశాస్త్రమున యం. ఎ. పట్టపరీక్షయందు రాజధానిలో మొట్టమొదటిస్థానము నలంకరించినది. ఈమె చెన్నపురి క్రైస్తవకళాశాలయందు విద్య నభ్యసించినది.

అన్నపూర్ణాదేవి బాలికాపాఠశాల, ఏలూరు.

ఈపాఠశాలను కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి స్మారకసంఘమువారిపుడు నడుపుచున్నారు. ఇందు విద్యతోపాటు చేతిపనులుకూడ నేర్పుచున్నారు. ఇయ్యది పాఠశాలయొక్క వార్షికోత్సవ చిత్రము.

శ్రీమతి అమృతమ్మాళ్



ఈమె చిదంబరం పురపాలక సంఘమునకు సభ్యురాలుగా నియమింపబడిన మొదటి ఆద్రిద్రావిడయువతి; విద్యావతి.

శ్రీమతి కాథరైను సుబ్బరాయుడుగారు, బెజవాడ.



ఈమె బెజవాడయందు గౌరవన్యాయాధిపతిపదమున నియమింపబడిన మొదటి ఆంధ్రయువతి.

శ్రీమతి రుక్మాబాయిగారు




పరశురామరావుగారి సర్కసునందు వ్యాయామప్రదర్శనము గావించుచుండగా తీసిన ఛాయాచిత్రము. ఈమెనుగూర్చి భారతి నాల్గవ సంపుటము మూడవసంచికయందు చూడదగును.

మాధవయ్యగారికుమార్తె, యం.బి.,బి.యస్.



ఇంగ్లండుకు పోయియున్నది. మాధవయ్యగారు సుప్రసిద్ధ గ్రంథకర్త.




## హీరాసుపండితకృత ఆర్వీటివంశకృతి విమర్శనము

## (ARAVIDU DYNASTY)

ఆంధ్రదేశచరిత్రరచన మిదివఱకును, అఱవసోదరు లొక్కరియు, ఆంగ్లపండితులయొక్కయు హస్తగతమై యున్నది. అందు వారుపెట్టినదియే భిక్ష. ఆంధ్రదేశ చరిత్ర నిబంధమునకు ఆంధ్రభాషా పాండిత్య మత్యంతావశ్యకము. అట్టి పాండిత్యములేక ఆంధ్రదేశ చరిత్రను వ్రాయఁబూనుట నేలవిడిచి సాముచేయుటవంటిది. ముఖ్యముగా విజయనగర సామ్రాజ్య చరిత్రమువ్రాయుటకు, కృష్ణదేవరాయల కాలమునాఁటికవులకృతు లెంతయుఁ దోడ్పడఁ గలవు. ఆంధ్రభాష మన అఱవసోదరులెట్లు తెలిసికొనెదరు? ఆంగ్లచరిత్రకారు లెట్టిపరిశ్రమ చేసిరి? ఒకచిన్నఉదాహరణము మిచ్చెదను. కృష్ణస్వామి అయ్యంగారు తాము సవరించి Sources of Vizianagar History అను గ్రంథమునందు 'హుర్మత్తున' అనే పదమున కర్థము తెలియమిచే నీక్రింది యసందర్భపు వ్రాఁతలువ్రాసిరి. "According to this manuscript hurmattu appears to be the name of a fortress near Udayagiri. But in the Krishnarayavijayam, the word occurs in the phrase ఒక్క హుర్మత్తున meaning in one hurmattu and refers to the conquest of Sivasamudram. It therefore appears to be an adverb. The proper meaning of hurmattu is not known and there is no fort of that name near Udayagiri. (Sources of Vijianagar History, P. 114). హుర్మత్తున అనే పదము కృష్ణరాయవిజయమునం దీవిధమున నుపయోగింపఁబడినది. "వ. అనంతరం బొక్కహుర్మత్తున నుమ్మత్తూరు శివసముద్రస్థలంబుల నొసంగు" పుట 62. ఆ 'హుర్మత్తు' అనే పదము నామవాచకమో అవ్యయమో తెలియక గింజుకొనెడు అఱవపండితుని ఆంధ్రదేశ చరిత్ర మట్లుండునో చదువరు లూహించుకొనెదరుగాక.

నేను విజయనగరసామ్రాజ్యము రచించుటకు మొదలిడితిని. నేఁటివఱకు ప్రచురింపఁబడిన ఆధారము లన్నిటిని బురస్కరించుకొని సప్రమాణముగ వ్రాసినాఁడను. తుళువ వంశముగూర్చి వ్రాయుటకుఁ బ్రారంభించితిని.

విజయనగరసామ్రాజ్య చరిత్రకుఁ దోడ్పడు గ్రంథములలో హీరాసు పండితుని 'Aravidu Dynasty of Vizianagar' అను ఆర్వీటి వంశ చరిత్రము చాల ముఖ్యమైనది. వీరు Journal of Mythic Society of Bangalore కు కొన్ని వ్యాసముల నీవిషయమై యిదివఱకు వ్రాసి, వాని నన్నిటిని జేర్చి విపులముగా నిట్లు గ్రంథ నిబద్ధముగావించిరి. వీరి గ్రంథమునందలి విశేష మేమన పోర్చుగీసువారు వ్రాసియుంచిన చరిత్రలనుండియు,అకాలపునాఁటి పోర్చుగీసు ప్రభుత్వమువారిదగ్గఱ నున్న రికార్డులనుబట్టియు, నూతనాంశముల గ్రహించి, చరిత్రమును విపులమొనర్చిరి. కాని ఆర్వీటివంశమునుగూర్చి చక్కటి ఉద్రేక

పూర్వకమగు చరిత్రను వ్రాయుటకు ఆవంశమునందలి రాజులు వ్రాసిన కృతులు, వారు కృతినందిన ఆంధ్ర కావ్యములను ముఖ్యముగా సహకారులుగాఁ గలవు. వసుచరిత్ర, రామరాజీయము, బాలభాగవతము, నరస భూపాలీయము మొదలగు గ్రంథములు సమగ్రముగాఁ బఠించినచో నార్వీటి వంశముయొక్క కథానీకము పూర్తిగా నెఱుంగును. హీరాసు పండితునకు ఈకావ్యములఁ గూర్చి తెలిసికొనుటకు అఱవఅయ్యంగారి గ్రంథమే ఆధారమయినది. గ్రంథముయొక్క Foot Notes లో కృష్ణస్వామి అయ్యంగారి నామమే యెక్కుడుగఁ గన్పించుచున్నది. దానికిఁ గారణము వారు ఆంధ్రసంస్కృత కావ్యములు సవరించి వీని నన్నిటిని జేర్చి 'Sources of Vizianagar History' అని యొక యుద్గ్రంథమును ముద్రించుటయే. హీరాసుపండితుని గ్రంథమునందు మన ఆంధ్రకావ్య కృతికర్తల నామములు మేఘచ్ఛన్నమగు రాకాశారదచంద్రికవలె మఱుఁగుపడియున్నది. దీని కంతకును గారణము మన ఆంధ్రచరిత్ర అన్యుల హస్తగతమగుటయే. 'Literary Activity' అని పేరు పెట్టి ఒక్క అధ్యాయము 20 పుటలలో పూర్తిచేసిరి. ఆర్వీటివంశమునుగూర్చి వ్రాయుచు నందు సారస్వత పరిణామముఁ గూర్చి వ్రాయుదమన్న నే యాంధ్ర పండితునకైన నేవేయిపుటల గ్రంథమైనను వ్రాయనగును. వసుచరిత్రమునుగూర్చి రెండు పేరాలు వ్రాసి వదలివేసిరి. తెనాలి రామలింగకవిఁగూర్చి ఒక్క పేరా వ్రాసి వదలివేసిరి. వ్రాసినదంతయు నసందర్భముగానే యున్నది.

ఆంధ్రకావ్యములందు విజాపురీ నవాబును 'సపాదుఁ'డని వర్ణింపఁబడినది. ఈవిషయము వసుచరిత్రాది గ్రంథములు చదివినవారికిఁ దెలియఁగలదు. కాని హీరాసునకు సపాదుఁ డెవరో తెలియలేదు.

19 వ పుటలో "Bukka's son RamaRaya who expressed Lakkambika, is called a great warrior, and conqueror of Sapada's army. Sapada is understood to be the Sultan of Golkonda." మన తెలుఁగు కావ్యములందు గోలకొండ నవాబు కుతుబుషాహియనియు, కుతుపనమల్కనియు వర్ణింపఁబడెను. ఇది హీరాసుగారి కెట్లు తెలియును? ఆగ్రంథమునందే 78 వ పుటలో "The Vasucharitram states that the Nizam, Kutubshahi, and Sapada (Adil Saha of Bijapur) fled to the forests before his march" అని వ్యాఖ్యానింపఁ బడినది. దీనికాధారము కృష్ణస్వామి అయ్యంగారి వ్రాఁతయే (Scurcts of Vizianagar History).

ఆర్వీటివంశచరిత్రమును గూర్చి వ్రాయుచు ఆర్వీటిపుర మెక్కడిదో, వీరి మొదటి వాసస్థల మెక్కడనో దొరగారు నిర్ణయింపలేదు. దీనికి గారణము వారు దానికిఁ దగినకృషి యొనర్పక పోవుటయే.

ఈ గ్రంథమునందు ముఖ్యముగా మనకుఁ దెలిసిన నూతనవిశేషము తల్లికోట యుద్ధమునుగూర్చి. ఈ నూతనవృత్తాంతము దొరగారు చంద్రవార్కరుగారి 'The Destruction of Vizianagar—Account of the Second Conference of the Bharata Ithihasaka Samsodhaka Mandala, Poona 1914' నుండి గ్రహింపఁ బడినది. మొదటినుండి చివఱకుఁ జదివినచోఁ బ్రతియాంధ్రుఁడును, ఆర్వీటివంశ ప్రాబల్యమును గూర్చి గర్వపడక మానఁడు. ఇందులకు దొరగారి చరిత్ర పరిశోధనయుఁ గృషియుఁ గారణములు. ఆయన కాంధ్రులు కృతజ్ఞులు.

విజయనగర సామ్రాజ్యచరిత్రమును వ్రాయుచుంటినిగాన, తద్రచనయందు ఈగ్రంథము నాకుఁ జాల సహాయకారిగ నున్నది. నాకాంధ్రమునందే రచింపవలెనని యుత్సాహము కల్గి, నామాతృభాషలోనే వ్రాయుచుంటిని. గ్రంథమధ్యమం దాంధ్రకవుల పద్యములు ప్రమాణములుగ వ్రాయుచున్నప్పుడు, చదివినఁ గలుగు ఆహ్లాదము, అన్యభాషలో భాషాంతరీకరించి వ్రాసిన వానినిఁ జదివిన గలుగ లేదు. అందుకనే ఒకచీనా (China) పండితుఁడు 'Translation is transformation. అన్నాఁడు. త్వరలోనే నాగ్రంథమును గూడ ఆంధ్రప్రపంచమునకు సమర్పించెదను.

కుందూరి ఈశ్వరదత్తు

## పశువైద్యచింతామణి

గ్రంథకర్త: యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు, అంగలూరు (క్రిష్ణాజిల్లా). క్రౌను సైజు 194 పుటలు; వెల 1-4-0.

భారతదేశ సౌభాగ్యము పూర్వకాలమునను ప్రస్తుతమునను, భావికాలముననుకూడ పాడిపంటలపైననే యాధారపడియున్నది. మన మాతృదేశము ముఖ్యవ్యవసాయ జీవనముగల ప్రజతో నిండియున్నది. ఈవిశాల దేశమున నేకొద్దియో పట్టణము లున్నవిగాని నూటికి తొంబదిభాగములు పల్లెటూళ్లేయని యందరకును తెలియును. పాశ్చాత్యనాగరికత, పట్టణావాస గౌరవము నెంత హెచ్చుయిపోవుచున్నను దేశక్షేమ మెన్నటికైన గ్రామసౌభాగ్యమునే యాధారము చేసికొని యున్నది. 'గ్రామపునర్నిర్మాణము చేయుడు', 'మరల గ్రామములకు మఱలుడు' అను హెచ్చరిక లెచ్చటజూచినను వినవచ్చు నీదినములలో పాడిపంటలకు రెంటికిని, శిశు ఆరోగ్యమునకును, వస్తువుల రవానాలకును నన్నింటికి నత్యవసరమైన బలమగు, నారోగ్యకరమగు పశువుల సంపదయొక్క తప్పని యవసరమును గూర్చి చెప్ప బనిలేదు. నిత్యకృత్యములకును నప్పుడు మనకు పశువుల యారోగ్యాభివృద్ధులకు తగు మార్గములు తెలియుట, వాని రుగ్మతలను తెవుళ్ళను కుదిర్చి మరలసౌభాగ్యము నొడగూర్చుటయు తెలియుట యత్యావశ్యకము. ఈగ్రంథకర్తగారు మిగుల శ్రమకోర్చి పశువులు, గుఱ్ఱములు, కోళ్ళు మొదలగు వానికివచ్చు జాడ్యలక్షణములను, వానికి ఆయుర్వేద, ఆంగ్లవైద్య పద్ధతుల ననుసరించిన చికిత్సలు మొదలగువానిని ఇందు సమకూర్చి మిగుల నుపకార మొనర్చిరనుటకు సందియములేదు. చిన్నరోగము మొదలు పెద్దజాడ్యములకు సులభచికిత్స మొదలు అతి కఠినచికిత్సలకు నిందు వివరముగ, సరళముగ దెలిపినందుకు వీరికి రైతు లెల్లరు, పశుసంపదగలవారెల్లరు కృతజ్ఞులై యుండవలయును.

ఈపుస్తకమునకు, ప్రొఫెసరు రంగనాయకులు (ఆక్సుఫర్డు) గారు పీఠికనువ్రాసి, దీని విలువనుగూర్చి చక్కగా వివరించిరి. వ్యవసాయమునుగూర్చి విద్యనభ్యసించిన పెద్దలు కొందఱును, పశువైద్య శాఖోద్యోగులు కొందఱుకూడ నీగ్రంథముపై తమ సదభిప్రాయము నొసంగియున్నప్పుడింతకంటె వేఱుగా వ్రాయుట యవసరము లేదు. జ. బ్ర.

## యువకులు—దేశము

ఇది యొక 13 పుటల చిన్ని శాస్త్రము. కాకినాడ శ్రీ సోదరసమితివారిచే ప్రచురింపబడిన మొదటి ప్రచురణము. యువకులపైననే భారతదేశభావిసౌభాగ్యమాధారపడి యున్నదను సాధువాస్వానీగారి యుద్బోధనము నాధారముగాగొని ప్రపంచములోని వివిధఖండములలోను, దేశములలోను యువకులు స్వాతంత్ర్యమును గడించుట కెట్లు పాటుపడి విజయవంతులైరో వివరించుచు భారతీయులను కార్యకరణమునకు పురికొల్పుచున్నది. వ్యాయామము, బ్రహ్మచర్యము, దేశభక్తి, ఖద్దరుదీక్ష, గ్రామపునర్నిర్మాణము మున్నగునవన్నియు యువకుల కార్యక్రమములోనివే యని యుద్ఘోషించుచున్నది. ఇట్టి సమితులును, వాని ప్రచురములును, దేశసౌభాగ్యమున కెంతయు తోడ్పడగలవు. జ. బ్ర.

## మిస్ మేయో గ్రంథ ఖండనము

(తెలుగు వచనము)

ఇందు మేయోగ్రంథసారము, రంగయ్యగారి ఖండనము, దీనబంధు ఆండ్రూసుగారి ఖండన లేఖలును గలవు. క్రౌనుసైజు. ౨౦౦ పుటలు. వెల రు. ౧-౦-౦.

పరిష్కర్త: శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు

ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండు కో, పోస్టుబాక్సు నెం. 110 రు, చెన్నపురి.

## పునర్జన్మ (తెలుగు వచనము)

గ్రంథకర్త: శ్రీ పంచకర్ల వెంకన్నగారు, రాజమహేంద్రవరము.

డెమ్మిసైజు. ౧౧౦ పుటలు. వెల రు ౦-౧౦-౦.

మహాభారతచరిత్రము (వచనము)

గ్రంథకర్త: పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, పిఠాపురము. డిమ్మీసైజు. ౨౩౪ పుటలు. వెల రు ౧-౪-౦

బాష్పాంజలి (వచనము)

గ్రంథకర్త: శ్రీ ఓంకారస్వాములు గారు. విలాసము: శ్రీ శాంతిఆశ్రమము, తోటపల్లికొండలు, శాంతి ఆశ్రమము పోస్టు, తూర్పుగోదావరిజిల్లా. ౬౪ పుటల చిన్నిపుస్తకము. వెల రు ౦-౪-౧.

ఆంధ్ర భగవద్గీతలు, (పద్యములు. మొదటి మూడధ్యాయములు మూడు ప్రత్యేక సంపుటములు)

గ్రంథకర్త: కే. బాబూరావునాయడు గారు, బి. ఏ., బి. యల్., హైకోర్టు వకీలు, బరంపురము. ఈ యొక్కొక్క చిన్ని సంపుటము వెల రు ౦-౧-౦.

రసవాహిని (ఖండగీతములు)

గ్రంథకర్త: తుర్లపాటి గోవర్ధనరావు గారు. క్రౌనుసైజున ౬౨ పుటలు. విలాసము, వెల తెలియదు.

ధర్మసంగ్రహమునందలి

ఆహ్నికకాండము-ద్వితీయభాగము

(సంస్కృతమూలము; తెలుగు తాత్పర్యము)

గ్రంథకర్త: ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు. విలాసము: శైవప్రచారిణి, వరంగల్. డిమ్మిసైజు. ౧౩౧ పుటలు. వెల రు. ౧-౮-౧.

అభినవభారతచరిత్ర (తెలుగు వచనము)

గ్రంథకర్త: తూములూరి శివరామయ్య గారు. విలాసము: వాఙ్మయమండలి, గుంటూరు. ఈమండలిలో రెండవదగు నీ పుస్తకము క్రౌనుసైజున ౧౬౦ పుటలు గలది. వెల చందాదారులకు రు ౧-౧౨-౧; ఇతరులకు రు. ౧-౦-౯.

శ్రీకృష్ణచరిత్రము (వచనము)

గ్రంథకర్త: కొడాలి సత్యనారాయణరావుగారు, విలాసము: కే. శేషగిరిరావు అండ్ బ్రదరు, బుక్ సెల్లర్సు, ఏలూరు (పశ్చిమగోదావరిజిల్లా). క్రౌనుసైజు ౧౦౧ పుటలు. వెల రు. ౧-౧౦-౦.

వివిధకుసుమావళి (ప్రథమగుచ్ఛము)

గ్రంథకర్త: కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి యల్. విలాసము: గ్రంథకర్త, నరసాపురము, పశ్చిమగోదావరి. క్రౌనుసైజు ౧౦౬ పుటలు. వెల విద్యార్థులకు రు ౦-౭-౦; ఇతరులకు రు ౦-౧౨-౦.

ముద్దుకృష్ణ

(అయిదంకముల చిన్ని నాటకము)

గ్రంథకర్త: కొండపల్లి జగన్నాథదాసు గారు విజయనగరము. క్రౌనుసైజు ౪౧ పుటలు. వెల రు ౧-౪-౦.

ఆంధ్రీకృత ప్రసన్నరాఘవనాటకము.

అనువాదకుడు: శ్రీరాజా మంత్రిప్రెగడభుజంగరాయకవి. డిమ్మీసైజు ౧౪౨ పుటలు. వెల రు ౧-౦-౧ విలాసము: రాజా భుజంగరాయ ప్రచురణాలయము, ఏలూరు, వెస్టు గోదావరీజిల్లా.



ఏసుక్రీస్తు

[ఆగస్టునెల మాడర్న్ రివ్యూ పత్రికయందు ప్రకటించిన శ్రీ మణీంద్రభూషణగుప్తగారి త్రివర్ణచిత్రమునుండి.]

# ఆకస్మిక ఛాయాచిత్రములు

**(SNAP SHOTS)**



౧. ద్రాక్షారామ సప్తగోదావరి ప్రాంతము



౨. వరిమళ్లకు గూడలతో నీరు వేయుట



3. వరిమళ్లకు ఏతముతో నీరుతోడుట

ఛాయాచిత్రకారుడు: శ్రీ చక్రవర్తుల వెంకటరావుగారు, దంగేరు, ద్రాక్షారామంపోస్టు, తూ. గో. జిల్లా.

# సాభిప్రాయ విశేషములు

## సకలపక్షసమావేశము

ఆగస్టు మాసాంతమునందు లక్ష్మణపురమునందు గూడిన సకలపక్షసమావేశము భారత స్వరాజ్యసంరంభమునం దొక దివ్య ఘట్టముగ నున్నది. సకలపక్షసమావేశము బొంబయియందు మే నెల 19-వ తేదిని గూడినది. బొంబయి సభయందు స్వరాజ్యాంగ నిర్మాణమును తయారుచేయుట కొక యుపసంఘ మేర్పరుపబడినది. ఆయుపసంఘమునందు శ్రీయుత పండిత మోతిలాలునెహ్రూ, సర్ తేజబహదూరు సప్రు, సర్ ఆలిఇమాము, ప్రధాను షుయేబు క్వరీషు, సుభాసుచంద్రబోసు, మాధవరావు ఆనె, జయకరు, జోషి, సర్దారు మంగళసింగుగార్లు సభ్యులు. ఉపసంఘమునకు పండిత మోతిలాలునెహ్రూ గారధ్యక్షులు. బొంబయి సమావేశమునందు సకలపక్షసమావేశము నాటిన బీజమునకు ఉపసంఘసభ్యులు దోహదంబు నొసంగి స్వల్పకాలములోనే పల్లవకుసుమపరిశోభితము చేసిరి. దానిని ఫలవంతము చేయవలసిన భారము భారతీయులమీదను, బ్రిటీషు రాజ్యాధికారులమీదను గలదు. ఆరంభమునకు బొంబయివలెను సఫలత నొందించుటకు లక్ష్మణపురమును సకలవిధములను తగియున్నది.

బొంబయి. నగరము పాశ్చాత్యనాగరికతకు చిహ్నమై నవయుగ పరిణామమునకు లక్ష్యముగ గోచరంబగుచున్నది. బొంబయి నగరమందలి విశ్రాంతిగృహములు, దుకాణములు, పొగయోడలు, రైలుబండ్లు, నౌకాశ్రయములు, వేషభాషలు, మోటారుబండ్లు, సంపదలు పాశ్చాత్యవిజయమును సహస్రముఖముల వెల్లడిచేయుచున్నవి. బొంబయి నగరమందు ప్రాచ్యసంస్కారము రూపమునందు కొంతవరకు కనబడుచున్నను, భావమునందు కృశించినది. అన్నిజాతులవారును, ధనార్జనమునకై నిరంతరము పాటుపడుచుండెడి విధమును బొంబయినగర పరిస్థితులు సువ్యక్తము చేయుచున్నవి. దేశమునకును, జాతికిని వ్యాపారపరిశ్రమములు గలుగజేసెడి లాభనష్టములను బొంబయి నగరము వేయినోళ్ళను చాటుచున్నది. ఒకప్రదేశమున దివ్యభోగముల ననుభవించెడి కోటీశ్వరులును, ఒకవైపున అష్టకష్టముల ననుభవించెడి దరిద్రులును ప్రత్యక్షమగుచుందురు. బ్రిటిషు రాజ్యప్రభావ మంతయు బొంబయి నగరమందు గోచరంబగుచున్నది. మూడువందల ఏండ్లలో బొంబయినగరమునకు పట్టిన మహద్దశవలన బ్రిటిషురాజ్యస్వభావము, బ్రిటిషురాజ్యబలము గ్రాహ్యములగుచున్నవి. చూపులకు సకల జనులకును సాహచర్య సంయోగములు గన్పట్టుచున్నను, కార్యములందు సంకుచితముగ పరిణమించుచున్నవి. నవయుగ నిర్మాణమైన బొంబయినగ

రమునందు గూడిన సకలపక్ష సమావేశము ప్రాచీనమైన లక్ష్మణపురమునందు సఫలమూట సకలవిధములను ప్రశస్తముగ నున్నది.

లక్ష్మణపురము ఆర్యావర్తమండలి పుణ్య క్షేత్రము. హిందూయుగమునందు వలె మహ మ్మదీయయుగమునందును లక్ష్మణపురము ప్రసి ద్ధిని బడసినది. 1857 సం. నందు సంప్రాప్తమైన సిపాయిల తిరుగుబాటు సందర్భమునను లక్ష్మ ణపురము నాయకత్వమును వహించినవిధ మితి హాసప్రసిద్ధము. ఆపురమందలి దివ్యమందిర ములు భారతీయకళా వైభవములను ప్రత్యక్ష ము నేయుచున్నవి. బ్రిటీషు రాజ్యాధికారము రూపమునందు ప్రత్యక్ష మగుచున్నను, భావ మునందు భారతీయసంస్కార ప్రాబల్యమే గోచరించుచున్నది. లక్ష్మణపురము హిందూ మహమ్మదీయుల విభేదములకు వలె హిందూ మహమ్మదీయ సంయోగములకును నిలయము గ నున్నది. ఉత్తర హిందూదేశమందు హిం దూసంఘటనము ముస్లింసమితిన్వీయసాంఘికు లందు వెలుగజేయుచున్న ఆత్మవిశ్వాసమునకు లక్ష్మణపురమునందు కూడిన సకలపక్షసమావే శము ప్రమాణముగ నున్నది. సకలపక్షసమా వేశము తాలూకుదారులసుందరమందిరమునం దుగూడినది. స్వరాజ్యపతాకము మందిరము మీద విరాజిల్లినది. తాలూకుదారుల నాయకు డు మహమ్మదాబాదు మహారాజు సభ్యులకు స్వాగతము నొసంగిరి. సభను సకలపక్షనా యకు లలంకరించిరి. డాక్టరు బిసెంటమ్మ, ఆలీఇమాం, తేజబహద్దూరు సప్రూ, సి. పి. రామస్వామయ్యరు, మదనమోహన మాల వ్యా, షౌకతాలీ, చాగ్లా, బిపినచంద్రపాలు, చింతామణి, అబ్దులుకలం ఆజాదుగార్లు ముఖ్య లగువారలు చూపిన వ్యగ్రోత్సాహము సకల పక్షములవారలకు గల స్వరాజ్యకాంక్షను విశ దము చేసినది. పంద్రెండు సంవత్సరములకు పూర్వము పట్టిన అదృష్టమె ఇప్పుడును లక్ష్మ ణపురమునకు పట్టినది. నాలుగేండ్లనుండియు దేశమును కీలాభీలము చేయుచున్న హిందూ మహమ్మదీయ విభేదములు లక్ష్మణపురమునం దు సమసిపోయినవి. డెబ్బదేండ్లు నిండిన పాలు గారును, ఎనుబదేండ్లు నిండిన బిసెంటమ్మగా రును పూరించిన స్వరాజ్యనాదము దిగంత ములందును వ్యాపించి బ్రిటీషు రాజ్యనీతిజ్ఞుల కును, భారతీయులకును జ్ఞానోదయమును, స్వరాజ్యదీక్షను గలుగజేయుటకు సాధనముగ నుండగలదు. పాలుగారు దురహంకారపరా యణులైన బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులకును, ప్రాజ్ఞు లైన వివిధపక్షనాయకులకును, స్వాతంత్రసంపా దనయందు కృతనిశ్చయులైన యువజనుల కును, పరమేశ్వరునకును సమర్పించిన వందన ములు భారతీయుల ధర్మపరాయణత్వమును విశదము చేయుచున్నవి. వృద్ధులైన పాలుగారి భావములకును, యువకులైన జవాహరీలాలు నెహ్రూగారి భావములకును గల యంతర మును సకాలముననే బ్రిటీషు రాజ్యాధికారులు గ్రహించుట శ్రేయస్కరము.

* * *

భారతరాజ్యాంగ నిర్మాణము

మాంటుఫర్డు నివేదికయందు బాధ్యతాయుత స్వపరిపాలనమును స్థాపించుట బ్రిటీషు రాజ్యాధికారుల విధ్యుక్తధర్మమని ప్రతిపాదింపబడినది. ఆ ప్రతిపాదనను సార్థకము గావించుటకు బదులు నిరోధించుటకే బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులు వారి శక్తిసామర్థ్యములను గతించిన పదేండ్లయందును వినియోగించిరి. ఆ నిరోధక మార్గమునే సుస్థిరము చేయుటకు బ్రిటీషు రాజ్యాధికారులు సైమను కమిషనును నియమించిరి. బ్రిటీషు రాజ్యాధికారులు నియమించిన ఈ తెల్లకమిషను భారతీయుల కన్నులను తెరచినది. తెల్లప్రభుత్వము భారతీయులకు చూపుచున్న అవమానమును ఈ తెల్లకమిషను వెల్లడిచేసినది. అన్నిపక్షముల వారిని, అన్నిసంఘములవారిని ఈ అవమానము హృదయశల్యమై వేధించి కలుపుటకు దోడ్పడినది. న్యాయాంగమంత్రులై దేశభక్తులను నిర్బంధముల పాలుచేసిన సర్ ఆలీఇమాం, సర్ తేజ బహద్దూరు సప్రూ, సర్ సి. పి. రామస్వామి అయ్యరు మొదలగు ప్రముఖులకు బ్రిటీషు రాజ్యనీతిజ్ఞుల దుస్తంత్రము సుసంగతమైనది. ద్వంద్వప్రభుత్వమందలి అసంగతములు మంత్రుల కనుభవవేద్యములైనవి. మాంటుఫర్డు సంస్కరణములు స్థాపించిన రాజ్యాంగవిధానము దేశబంధనమునకు వినియోగపడినవిధమున దేశమోక్షమునకు వినియోగపడని విధమును గడచిన పదిఏండ్లయనుభవము తెల్లముచేసినది.

దేశమునకు స్వరాజ్యమో పరరాజ్యమో కాని మధ్యమార్గము సాధ్యముగాదని గత కాలానుభవము విశదము చేసినది. రక్షణాధికారము, ధనాధికారము, న్యాయాధికారము లేని రాజ్యాంగసంస్కరణములు మాయాసంస్కరణము లని మంత్రులు గ్రహించిరి. బర్కెను హెడ్డుప్రభువు రాజ్యాంగవిధానమును తయారుచేయవలయునని చేసిన సవాలున కనురూపముగ భారతీయనాయకులు స్వరాజ్యవిధానమును తయారుచేసి బ్రిటిషు రాజ్యాధికారులకు విషాదమును, భారతీయుల కానందమును సమకూర్చిరి. బర్కెను హెడ్డుప్రభువునకు భారతీయుల విభేదములందును, బ్రిటీషు రాజ్యాధికారుల స్వాభిమానమందును గల విశ్వాసము భారతీయుల విజ్ఞానమునందును, మానవకల్యాణమందును లగ్నము కాకుండుట సంతాపకరము. ప్రపంచమునందు ఎన్నియో సామ్రాజ్యములు పుట్టి గిట్టినవి. చాల్డియా, అస్సిరియా, గ్రీకు, రోము, పారసీకము మొదలగు సామ్రాజ్యములు నామమాత్రావశిష్టము లైనవి.

భారతవర్షము పరాధీనమైనను వీర్యవంతమై వెలయుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యమునకును, లోకకళ్యాణమునకును వీర్యవంతమైన భరతవర్షము ప్రయోజనకరముగాని, నిర్వీర్యమైన భరతవర్షము ప్రయోజనకరముగాదని బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులు గ్రహించుట పరమధర్మము. పరాధీనస్థితియందున్న దేశవికాసము దుస్తరమని రాజ్యాంగ

నీతిజ్ఞు లంగీకరించుచున్నారు. రాజ్యాంగ నీతిజ్ఞు లంగీకరించిన సిద్ధాంతమును భారతవర్షము నకు వ్యాపింపజేయుట బ్రిటిషు రాజ్యనీతి జ్ఞుల విధ్యుక్త ధర్మమని వారుచేసిన ప్రతిజ్ఞ లన్నియును మృతాక్షరములగుట వారి సంకు చిత హృదయమును విశదము చేయుచున్నవి.

హిందూదేశ రాజ్యాంగ నిర్మాణము సులభకార్యము కాదని తెలిసిన విషయము. దీనికి బాధ్యత వహించవలసినవారు బ్రిటిషు రాజ్యాధికారులుగాని భారతీయులు గారు. స్వరాజ్యనిర్మాణమునకు ప్రతికూల వాతా వరణము బ్రిటిషు రాజ్యాధికారులు గలుగ జేయుచున్న విధమును దేశపరిస్థితులు విశద ము చేయుచున్నవి.

1. హిందూమహమ్మదీయ విభేదములు,

2. స్వదేశసంస్థానములు,

3. జాతి, కుల, మత భేదములు,

4. యూరపియను వర్తకుల, పౌరసేవో ద్యోగముల ప్రయోజనములు,

5. దేశసంరక్షణభారము-

స్వరాజ్య స్థాపనకు ప్రతిబంధకము లని బ్రిటీషురాజ్య నీతిజ్ఞులును, రాజ్యాభిమాను లును ప్రతిపాదించుట ఆచారమైనది. ఈ ప్రతి బంధకములను తొలగించుటకు బ్రిటిషురాజ్యా ధికారులు గడచిన నూటఏబది ఏండ్లయందును చేసిన ఘనకార్యమును నిరూపించుట ప్రయో జనకరము. బ్రిటిషు రాజ్యాధికారులు శాంతిని స్థాపించినను, వ్యాపారపరిశ్రమలను వృద్ధిచేసి నను, రైలుమార్గములను నిర్మించినను, రాజ్యా గసంస్కరణములను నెలకొల్పినను, విద్యా వ్యాపనమునకు తోడ్పడినను, భారతీయపార తంత్ర్యమునకు తోడ్పడినవిగాని భారతీయ స్వాతంత్ర్యమునకు తోడ్పడలేదు. బ్రిటిషు రాజ్యాధికారులు భరతవర్షమునందు బాధ్య తాయుత పరిపాలనమును స్థాపించుటకు ప్రతి జ్ఞను జేసిరి. కాని వారు బాధ్యతాయుత పరి పాలనమును నిర్వచనము చేయక మాయ మాటలతో కాలహరణము చేయుచున్నారు. ద్వంద్వప్రభుత్వము బాధ్యతాయుత పరిపాల నము గాజాలదు. బాధ్యతాయుత పరిపాలన మును నిర్వచనము చేయవలసిన యవసరము లేదు. రాజ్యాంగవిషయములందు స్వల్పపరి జ్ఞానము గలవారలకుగూడ నీసంగతి తెలిసి యున్నది. బ్రిటిషు రాజ్యాధికారులును, వారి యభిమానానుచరులును తెలియని వారివలె నటించుచు లోకమును వంచింపజాలరు.

**బాధ్యతాయుత పరిపాలనము**

ప్రజాలాభములకై ప్రజలు చేసెడి పరి పాలనము బాధ్యతాయుత పరిపాలనము. శా సనసభలు ప్రజాధికారము నకు లోబడుటయును, కా ర్యనిర్వాహకవర్గము శాసన సభకు లోబడుటయును బాధ్యతాయుత పరి పాలనమునకు లక్ష్యములని రాజ్యాంగములు వెల్లడిచేయుచున్నవి. ఈలక్ష్యములు సంపూర్ణ స్వతంత్రరాజ్యమునందే సాధ్యములుగాని పరా

ధీనరాజ్యములందు సాధ్యముకావని నిత్యాను భవము తెలుపుచున్నది. ఎంతమంచి సుపరిపాలనమైనను, స్వపరిపాలనముతో తులతూగదని రాజ్యాంగవేత్తలు ఘోషించుచున్నారు. స్వరాజ్యము సకలజాతులకును జన్మస్వత్వము. భారత జాతీయమహాసభ స్వరాజ్యము భారతీయుల గమ్యస్థానమని ప్రతిపాదించినది. చెన్నపురి యందు గతసంవత్సరమున గూడిన జాతీయ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యమే స్వరాజ్యసాధనమని నిర్ధారణచేసినది. ఈ సందర్భములందు బాధ్యతాయుత పరిపాలన నిర్వచనవిషయమై ప్రజానాయకులయందు భేదాభిప్రాయముల కవకాశము లేదు. అయినను నెహ్రూకమిటీ వలసరాజ్యముల పరిపాలనము బాధ్యతాయుత పరిపాలనమని నివేదికయందు నిర్వచనము చేసినది. ఈ ఉభయభావములును ఏకాభిప్రాయము తెలుపుచున్నట్లు నివేదిక సూచించుచున్నది. సంపూర్ణ స్వాతంత్ర్యమునకును, వలసరాజ్యముల స్వాతంత్ర్యమునకును గల తారతమ్యము సర్వత్ర తెలిసియున్నది. దానిని విశేషము చర్చించుటయు ననవసరము. పండిత మదనమోహన మాళవ్యాగారు వలస రాజ్యపరిపాలనము బాధ్యతాయుత పరిపాలన మని ఎంత సమర్థించినను వారిసమర్థనమందు పసలేదని జవాహరీలాలుగారి ప్రసంగము విశదము చేసినది. కాని లక్ష్మణపురమునందు కూడిన సకలపక్షసమావేశము సకలపక్షముల యభిమతమును నిర్ణయించుటకు ఏర్పడినదిగాని కేవలము కాంగ్రెసు అభిమతమును మాత్రమే నిర్ణయించుటకు ఏర్పడలేదు. జవాహరిలాలు నెహ్రూగారు భేదాభిప్రాయము తెలిపినను వ్యతిరేకముగ సమ్మతి నొసంగలేదు. బాధ్యతాయుత పరిపాలనము విషయమై భిన్నపక్షములందు భేదాభిప్రాయము లున్నను అన్ని పక్షముల వారును నెహ్రూనివేదిక నంగీకరించి దేశమున కవసరమైన కనిష్ఠ రాజ్యాంగ విధానమును నిర్ణయము చేసిరి. ఈ నిర్ణయము భారతీయ యువజనామోదమును బడయక పోయినను భారతీయులసంయోగమును, దేశావసరమును లోకమునకు వ్యక్తము చేయుచున్నది. సకలపక్షసమావేశము దేశకాల పాత్రముల కనురూపముగ నెహ్రూకమిటి నిర్ణయముల నేకగ్రీవముగ నామోదించినది. నెహ్రూకమిటి నిర్ణయించినది కనిష్ఠసామాన్య ప్రమాణముగాని గరిష్ఠసామాన్యప్రమాణము గాదు. ఈ విషయమును సకలపక్ష సమావేశమునందు తేజబహద్దూరు సప్రూ ఆలిఇమాముగారులుచేసిన ప్రసంగములు విశదముచేసినవి. స్వరాజ్యస్థాపనమునకు ప్రతిపక్షులు తెలిపెడి ప్రతిబంధకములు కల్పితములుగాని యథార్థమైన ప్రతిబంధకములు గావని సర్వత్ర తెలిసియున్నది.

దేశరక్షణసామర్థ్యము స్వరాజ్యమునకు ముఖ్యావసరమని యందరును నంగీకరించు చున్నారు. ముప్పది మూడుకోట్ల ప్రజలకు

దేశరక్షణభారము

దేశరక్షణసామర్థ్యము సహజముగ గలదనుట నిర్వివాదాంశము. సకలాంగములను

బంధించి కదలుటకు సామర్థ్యము లేదని ఆక్షే పించుట యసంబద్ధము. ఇప్పుడైనను సైన్యము నందు విశేషభాగము భారతీయ సైన్యము. ఐరోపా మహాసంగ్రామమునందును, నితరసందర్భములందును భారత యోధులు చూపిన సాహసపరాక్రమములు బ్రిటీషురాజ్యాధికారుల ప్రశంసలను బడసినవి. చీనా, తుర్కి, పారసీకము, ఆఫ్ఘనిస్థానచరిత్రములు సకల జాతులకును సహజముగ గల స్వసంరక్షణ సామర్థ్యమును విశదము చేయుచున్నవి. ఒక వేళను లేదని యంగీకరించినను కనడా, ఆస్ట్రేలియా, ఐర్లాండు, ఆఫ్రికా మొదలగు వలస రాజ్యములకు స్వసంరక్షణసామర్థ్యము బాధ్యతాయుత పరిపాలనము స్థాపించినపుడుగాని, ప్రస్తుతముగాని కలదని ఎవరును చెప్పుటకు సాహసింపజాలరు. ఆ దేశముల కవసరములేని సామర్థ్యము భరతవర్షమునకు మాత్ర మేల కావలయునో ప్రతిపక్షులు తెలుపవలసియుందురు. ప్రపంచమంతయును యుద్ధబహిష్కారణమునకు బూనుకొనుచున్న సమయమునందు స్వసంరక్షణసామర్థ్య మేదేశమునకును నవసరము లేదు. ప్రపంచమునందంతటను ఆయుధనియమమునకును, సంగ్రామ బహిష్కారమునకును ప్రయత్నములు జరుగుచున్న యుగమునందు స్వసంరక్షణ సిద్ధాంతమునందు పస లేదని తెలియుచున్నది. ఆసిద్ధాంతము నంగీకరించినను ముప్పదిమూడుకోట్ల ప్రజలకు లేనిసామర్థ్యము మూడుకోట్ల ప్రజలకు గలుగజాలదు. భరతవర్షమునకు సంప్రాప్తమైన దుర్దశ కపారమైన సైన్యవ్యయమే మూలకారణము.

భారతీయులు కోరునది నిరంకుశత్వమునకు బదులు బాధ్యతయు, పరదేశ ప్రాజాపత్యమునకు బదులు స్వదేశ ప్రాజాపత్యమును గాని అరాచకము గాదు. బ్రిటీషు పరిపాలనమువలన నిదివరకు ప్రయోజనము గలిగినను గలుగకపోయినను, నిపుడును ముందును ప్రయోజనము గలుగజాలదు. పంజరమునందు బంధింపబడిన సింహము శాంతిసౌఖ్యముల ననుభవించుచున్నను వీర్యమును గోల్పోయి కృశించుచున్నది. పరాధీనమైన భరతవర్షము సకల విధములను కృశించుచున్నది. వ్యక్తివికాసమునకును, జాతీయవికాసమునకును, ఆత్మావలంబనమువలె పరావలంబనము ప్రయోజనకరము గాదు. దేశసంరక్షణభారము వహించుటయందు భరతవర్షము దుఃఖము ననుభవించినను దేశావృతమైన నిశ్చేష్టతపోయి వీర్యవంతమై ఆత్మోపలబ్ధిని బడయగలదు. స్వీయ ప్రతిభను గోల్పోవుచున్న గ్రేట్బ్రిటను భరతవర్షరక్షణభారమును పూర్వమువలె వహింపజాలదు. స్వరాజ్యాభిలాషగల దేశమును నిర్బంధమార్గమున పాలించుటయును సాధ్యమును, ప్రయోజనకరమును గాదు. గ్రేట్బ్రిటనుకు స్వాధీన భరతవర్షము సమకూర్చెడి ప్రయోజనములను పరాధీనభరతవర్షము సమకూర్పజాలదు. స్వీయప్రయోజనములకును, బ్రిటీషు ప్రయోజనములకును భరతవర్షము స్వయంరక్షణసామర్థ్యమును గలిగియుండుట

పరమావసరము. ఆసామర్థ్యము స్వరాజ్య మూలమున నే కలుగగలదు.

స్వరాజ్యస్థాపనమునకుస్వదేశసంస్థానములు ప్రబలాటంకములని వాదించుట యాచారమై నది. స్వదేశసంస్థానములు భారతవర్షములో మూడవ వంతుస్థలమును,నాల్గవవంతు ప్రజలను గలిగియున్నవి. గతించిన ఒడంబడి కల ననుసరించి స్వదేశసంస్థానముల సంర క్షణభారమును బ్రిటీషు ఇండియా ప్రభుత్వము వహించుచున్నది. సంస్థానముల కును, బ్రిటీషురాజ్యములకును ఒడంబడిక లేర్పడినను, వ్యవహారమంతయును బ్రిటీషు ఇండియా ప్రభుత్వమూలముననె నడుచుచు న్నది. ఇప్పుడు జరుగుచున్నవిధముననె ముం దును సంస్థానముల వ్యవహారక్రమమును బ్రి టీషుఇండియా ప్రభుత్వము నిరాటంకముగా నిర్వహింపగలదు. బ్రిటీషుఇండియాను విడిచి సంస్థానములు నిలువజాలవు. బ్రిటీషుఇండియా యందు ప్రజాస్వామ్యమును బాధ్యతా యుత ప్రభుత్వమును, సంస్థానములందు నిరం కుశత్వమును స్వేచ్ఛాపరిపాలనములును నసం భవములు. సకలవ్యవహారములకును భరతవర్ష మేకత్వమును, నేకాధికారమును గలిగియుం డుట యుక్తముగాని అనేకత్వమును, భిన్నాధి కారములను గలిగియుండుట ప్రయోజ నకరముగాదు. భారతయుద్ధము, మౌర్యసా మ్రాజ్యము, మొగలుసామ్రాజ్యము భారతీయ సామ్రాజ్యలక్ష్యమును విశదము

స్వదేశ సంస్థానములు

చేయుచున్నవి. ప్రాచీనకాలమునందు సాధ్య మైన సామ్రాజ్యలక్ష్యము వర్తమానకాలమున సులభసాధ్యముగ నుండగలదు. బ్రిటీషు ఇండి యాయును, సంస్థానములును స్వీయపరిస్థితుల కనురూపముగ ప్రాంతీయ స్వాతంత్ర్యమును గలిగియుండుటయును, కేంద్రాధికారమునకు లోబడియుండుటయును భారతసామ్రాజ్యము నకు సహజమైన రాజ్యాంగవిధానము. ఆ రాజ్యాంగవిధానమునె నెహ్రూనివేదిక నిరూ పించుచున్నది. ఇంతవరకును ఇండియా ప్రభు త్వము నిర్వహించుచున్న యధికారమునే స్వరాజ్యప్రభుత్వమును నిర్వహింపగలదు. ఇం దు విపరీత మేమియును లేదు. సంస్థానా ధీశులును, బ్రిటీషు రాజ్యాధికారులును భరత వర్షమునకు సహజమైన సాంఘాతిక రాజ్యాంగ విధానము నామోదించుట ప్రయోజనకరము. సంస్థానాధీశులు వారి నిరంకుశాధికారమును విసర్జించి నియమితాధికారమును వారి సంస్థా నములందు స్థాపించి భారతమాతను సేవిం చుట శ్రేయస్కరము. భారతప్రాచీనసంస్కా రమునకు నిలయములైన సంస్థానములు నవీన సంస్కారమునకు నిలయములై సకలభారత భాగ్యోదయమునకు దోడ్పడుట పరమధర్మము.

సంస్థానాధీశులు బట్లరుకమిషను సంద ర్భమున చేయుచున్న యాందోళనము దుర్గ్రాహ్యముగ నున్నది. లక్షలరూప్యముల నిచ్చి సర్ లీలిస్కాటును వారిపక్షమున వాదిం చుటకు నియమించుట విచిత్రము. కొందరు

స్వతంత్ర సంస్థానములను స్థాపించుటకు గోరుచున్నారు. సంస్థానాధీశులు బ్రిటీషు రాజ్యాధిపతితో సంబంధమును గలిగియుండవలయునని కోరుచున్నారు. స్కాటుగారు చిరకాల మాచరణమునందున్న వ్యవహారక్రమమును మరచి బ్రిటీషు రాజ్యాధికారసంబంధమునే స్థిరపరచుచున్నారు. భారతీయ రాజ్యాధికారమునకును, బ్రిటీషు రాజ్యాధికారమునకును నడుమను సంస్థానములు వ్రేలాడజాలవు. ఈసందర్భములను గ్రహించిన మైసూరు సంస్థానాధీశుల వంటి ప్రాజ్ఞులు వారియాశయములను సకల భారతీయాశములందు మేళగించుటకు సిద్ధముగ నుండుట భావిభాగ్యోదయమునకు శుభసూచకముగ నున్నది. బ్రిటీషు రాజ్యాధికారులును, సంస్థానాధీశులును స్వప్రయోజనములను విసర్జించి భారతీయ ప్రయోజనములను నారాధించుటకు భగవంతుడనుగ్రహించుగాత! నెహ్రూని వేదిక స్వదేశసంస్థానములవిషయమై దృఢాభిప్రాయములను తెలుపకుండుటయనుచితమైనను సహజము. బ్రిటీషుఇండియా రాజ్యాధీశులతోపాటు సంస్థానాధీశులను సైతము ప్రబలశత్రువులను జేయుట దేశప్రయోజనములకు సాధనభూతము గాదు. అయినను భారతీయ నాయకులీభారమును నిర్భయముగ నహింపవలసిన యవసరమును సంస్థానముల పరిస్థితులు తెల్లముచేయుచున్నవి. సంస్థానప్రజల సమావేశమునందు మోచర్ల రామచంద్రరావుగారు తెలిపిన భావములును, సకలపక్ష సమావేశమునందు మనీలాలు కొఠారిగారు తెలిపిన భావములును సంస్థానముల సంస్కరణావసరమును విశదము చేయుచున్నవి. బ్రిటీషు ఇండియా ప్రజలును, సంస్థానముల ప్రజలును చేతులు కలిపి పని చేయుట సత్వరస్వరాజ్యసిద్ధికి సాధనము గాగలదు.

**దేశమత సాంఘిక భాషా భేదములు**

భరతవర్షము విశాలమైనఖండము. 10 లక్షులమైళ్ల వైశాల్యమును, 33 కోట్ల ప్రజలను గలిగియున్నది. హిందువులు, మహమ్మదీయులు, జైనులు, బౌద్ధులు, సిక్కులు, పార్సీలు, క్రైస్తవులు మొదలగు భిన్నమతస్థులు గలరు. హిందీ, ఉర్దూ, బంగాళీ మహారాష్ట్రి తమిళ కర్ణాటాంధ్రాంగ్లాది భాషలు గలవు. వివిధకులములు గలవు. భిన్నసంస్కారములు, జాతులు గలవు. బ్రిటీషు రాష్ట్రిములు, సంస్థానములు గలవు. ఈ విభేదములన్నియును స్వరాజ్యమునకు ప్రతిబంధకములని బ్రిటీషు రాజ్యాధికారులును, వారి ప్రియశిష్యులును చిలుకపలుకుల వలె పలుకుట పరిపాటి మైనది. పరాక్రమణ జాతీయాహంకారమున కలవాటుపడిన పాశ్చాత్యరాజ్యాధికారుల కిట్టి సిద్ధాంతములు స్వప్రయోజనములకు వినియోగపడినను నవి సహజములు గావు. విశ్వప్రవృత్తి యంతయును భిన్నరూపములనె గోచరంబగుచున్నది. అనంత జీవములు, బ్రహ్మాండతారాగణములు ప్రవృత్తియందలి భిన్నవైచిత్ర్యమును విశదము చేయుచున్నవి. ఈ విచిత్రరూపముల నన్నిటిని నొక టంకసాలయం దేకరూపమునకు మార్చుట

దుస్సాధ్యము. ఒకవేళ సాధ్యమైనను ప్రపంచ కల్యాణమునకు ప్రయోజనకరము గాదు. విశ్వకల్యాణమునకు చీమమొదలు బ్రహ్మవర కును గల జీవజాలము లన్నియును భిన్నరూప ములను దోడ్పడుచున్నవి. సకల సంహారమును గోరెడి "నాపార్టీ, నాబట్ట, నాజాతి, నామ తము, నాభాష, నాదేశము" సిద్ధాంతములు శాంతి సౌఖ్యములకును, విశ్వవికాసమునకును సాధనంబులు గావు. బలముగలవారిది రాజ్యమను సిద్ధాంతము మూలబడినది. శ్రీకృష్ణపరమాత్ముడు విజయున కుపదేశించి నటులు విశ్వమునందు భిన్న ప్రవృత్తులకును స్థానము గలదు. విశ్వకల్యాణమునకు ధర్మము సాధనమైనటులు ధనముగాని, బలముగాని సాధనములు గావు. అశోకుడు ౨౨౦౦ పూ ర్వము ప్రతిపాదించిన ధర్మమునే వర్తమాన కాలమునందు పాశ్చాత్యులు మెల్లమెల్లగా గ్రహించుచున్నారు.

యూరపు ఖండమునందు గతించిన రెండు శతాబ్దములందును ప్రబలిన జాతీయ దురహంకారము మహాసంక్షోభమును గలుగ జేసినది. ఐరోపామహాసంగ్రామాను భవమైనను నీ దురహంకారమును పోగొట్ట లేదు. వివిధమతములకును, జాతులకును, భాషలకును నిలయమైన భరతవర్ష రాజ్యాం గవిధాన మీసమస్యను,లోకమునకు నిర్ణయింప వలసియున్నది. భావమునం దేకత్వము, రూప మునం దనేకత్వము సృష్టిరహస్యము. ఆరహ స్యమే భారతరాజ్యాంగనిర్మాణమునందు పరి స్ఫుటము గావలసి యున్నది. సకలపక్షసమా వేశమునందు డాక్టరు బెజంటమ్మగా రీరహస్య మును సభ్యులకు హృద్యముగ విశదముచే సిరి. అమెరికా, ఆఫ్రికా, స్విజర్లాండు మొద లగు దేశముల రాజ్యాంగము లీవిధానమునకు మార్గదర్శకములుగ నున్నవి. భరతవర్ష రా జ్యాంగవిధానము రాజ్యాంగ చరిత్రమునందు నూతనాధ్యాయము నేర్పరుపగలదు. భాషా ప్రయుక్తరాష్ట్రవిభాగ మీ సిద్ధాంతమునే యనుసరించుచున్నది.

భాషాప్రయుక్త రాష్ట్రములు, ఆంధ్రరాష్ట్రము

నెహ్రూనివేదిక భాషాప్రయుక్తరాష్ట్ర విభాగముల నామోదించినది. కాని ఉపసం ఘపుదృష్టి వాదప్రతివా దములకు మూలమైన సిం ధురాష్ట్రము మీదనే ల గ్నమైనది. సింధురాష్ట్ర నిర్మాణము విషయమై హిందువులకును మహ మ్మదీయులకును పట్టుదల యేర్పడినది. ఆన మస్య రాజ్యాంగస్వభావమును గోల్పోయి సాంఘిక స్వరూపమును దాల్చినది. నివేదిక యందు అవసరమైన యితరభాషావిభాగముల ప్రస్తావన లేకపోయినను,సింధురాష్ట్రము ప్రము ఖతను వహించి పట్టుదలలకు గారణంబైనది. కష్టమైన సాంఘికరాజకీయ సమస్యలందు మునిగియున్న ఉపసంఘులక్ష్యము ఆంధ్రోత్క లాదిరాష్ట్రనిర్మాణమునందు లగ్నము గాకుం డుటసహజము. మోతీలాలు నెహ్రూగారి లక్ష్య మీసమస్యయందు లగ్నమైనపుడు వారు సక లపక్షసమావేశమునందు భాషాప్రయుక్తరా

ష్ట్ర ప్రస్తావమును విస్తరింపజేసి రాజ్యాంగవిధానమును సార్థకము చేసిరి. ప్రపంచమునందు గల భిన్నజాతులు, మతములు, భాషలు, దేశములువలెను భరతవర్షమునందును భిన్న జాతులు, మతములు, భాషలు, భాగములు గలవు. ఆ భిన్న భాగముల వికాసమునం దైక్యానందము సాధ్యముగాని భిన్నభాగముల సంహారమునం దైక్యానందము సాధ్యము గాదు.

అనంతములైన ప్రకృతి వైభవములందు వ్యక్తులవలెను జాతులును, భాషలును, సాంప్రదాయాచారములును ప్రత్యేక లక్షణములను గలిగి విశ్వవికాసమునకు వినియోగ పడుచున్నవి. ప్రవృత్తియం దైక్యము భావమునందు సాధ్యముగాని రూపమునందు సాధ్యముగాదు. వివిధ మతములకును, భాషలకును, జాతులకును, సాంప్రదాయాచారములకును నిలయమైన భరతవర్షము లోకమునకు నవయుగ సందేశమును ప్రకటించుటకు సకలవిధములను దగియున్నది. ఆసందేశము సర్వసమత్వ సందేశము. సర్వసమత్వ సందేశమును భౌతిక రూపమునను సార్థకము చేయుటకు ఫ్రెంచి పరివర్తనము పందొమ్మిదవ శతాబ్దారంభమునందు ప్రయత్నము చేసినది. ఇరువదవ శతాబ్దమునందు సోవియటురూపమునను రుష్యారాజ్యము సర్వ సమత్వ సిద్ధాంతమును సార్థకము చేయుటకు విశ్వప్రయత్నము చేయుచున్నది. సమత్వము త్యాగమునందును, ధర్మమునందును సాధ్యముగాని భోగమునందును విజయమునందును సాధ్యముగాదు. భౌతికవిషయములందు జాతీయత్వమును, సర్వసమత్వమును స్థాపించుటకు పాశ్చాత్య రాజ్యములు చేసిన ప్రయత్నములును, వారిసిద్ధాంతములును సంక్షోభమును గలుగజేసిన రీతిని శాంతి వికాసములను గలుగజేయలేవు. భారతస్వరాజ్యసిద్ధికి ప్రతిపక్షులు నిరూపించెడి ప్రతిబంధకములె సహజమైన సాధనములని నవయుగ ధర్మము విశదము చేయగలదు. భారతీయులందరును భేదాభిప్రాయములను విడిచి వారి లక్ష్యమును దేశమునందును, ధర్మమునందును, దైవమునందును లక్ష్యముచేసి దేశమోక్షమును, లోకకల్యాణమును సాధింతురుగాక! సకలపక్షసమావేశమునం దీలక్ష్యము గోచరంబైన విధమును సభ్యులప్రసన్నవదనములు, శాంతప్రవర్తనము, ధర్మస్వభావము విశదము చేసినవి.

వ్యాపార ధనలక్ష్యముగల ప్రభుత్వమునకు ధర్మలక్ష్యము సంకుచితమగుట సహజము.

యూరపియను వర్తకుల ఉద్యోగుల ప్రయోజనము

స్వరాజ్యస్థాపనము బ్రిటీషు వర్తకమునకును, బ్రిటీషుప్రజల యుద్యోగములకును కొంత ప్రతిబంధకములను గల్పించుట సహజము. స్వదేశవ్యాపారమునకును, స్వదేశప్రయోజనములకును ప్రతిబంధకములైన వ్యాపారోద్యోగముల కాటంకములను గల్పించుటయె స్వరాజ్యమునకు ప్రయోజనము. దేశారిష్టమునకు మూలమైన విదేశవ్యాపారమును, పౌరసేవోద్యోగుల ప్రాబల్య

మును నరికట్టుట రాజ్యాంగమునకు సహజ ప్రయోజనము. ఆప్రయోజనములను ధర్మాత్ము లందరును నిరభ్యంతరముగ నంగీకరింపవలసి యుందురు. కాని ధర్మపరాయణులైన భారతీయులు వారి ధర్మబాధ్యతను మాత్రము విస ర్జింపరు. ఆవిషయమును నెహ్రూనివేదిక సువ్య క్తముచేసినది. యూరపువర్తకుల సొమ్మున కును, పనిచేయుచున్న యుద్యోగస్థుల హక్కు లకును నష్టము గలుగజాలదు. ఇట్టి స్వల్పవిష యములను నిర్ణయించుట సులభసాధ్యము. బ్రిటీషు రాజ్యాధికారులు సరళమార్గము నవ లంబించునపుడు సకలజాతులకును స్వాగతంబు నొసంగిన భారతీయులవలనను వారి న్యాయ మైన హక్కులకు భంగము గలుగజాలదు. నెహ్రూనివేదికయం దీవిషయము స్పష్టము చేయబడినది. నానాపక్షసమావేశమును నీవిష యము నంగీకరించినది.

నెహ్రూనివేదిక భారతదేశపరిస్థితుల కను రూపమైన రాజ్యాంగవిధానమును ఏడవ య ధ్యాయమునందు 87 నిబంధన లందు వ్యక్తము చేయుచున్నది. ఈ నిబంధన లితర రాజ్యాంగ విధానములనుండి ఎత్తి వ్రాయబడిన వని యాక్షేపించుట సులభము. మానవనిర్మా ణము లన్నియును గతానుభవమును బట్టి ఏర్పడుచున్నవి. ముఖ్యముగ రాజ్యాంగవి ధానము లనుభవమునుబట్టి నిర్మింపబడుచు న్నవి. ఈనియమములం దసంబద్ధ నియమము లున్న నిరాకరింపవచ్చును; వానిని మార్చవ

రాజ్యాంగ విధానము;

చ్చును. నివేదికను పరిశీలించి విమర్శించుట రాజ్యాధికారులకు ధర్మమైయున్నది. బర్కె_ను హెడ్డుప్రభువు చేసిన సవాలునకు బదులుగ నెహ్రూనివేదిక ప్రచురింపబడినది. ఇతరప్రయ త్నములకువలెను, దీనికిని సంపూర్ణత్వ మసం భవము. ఆంగ్లేయ పత్రికలు నివేదికను నిర సించుటయును, నిందించుటయును సహజము. నిష్పక్షపాత బుద్ధితో నిరంకుశవర్గము నెహ్రూనివేదికను విమర్శించునని భారతీయులు కలలోనైనను తలచియుండరు. కాని నెహ్రూ నివేదికయును, సకలపక్షసమావేశ మామోదిం చిన తీర్మానములును భారతరాజ్యాంగనిర్మా ణమున కఖండమైన ప్రయోజనమును సమ కూర్చగలవు.

భారతరాజ్యాంగము సంయుక్తరాజ్యాం గవిధానమనియును (Federal Type), కేంద్రా ధికార రాజ్యాంగవిధానమనియును (Unitary-Type) భేదాభిప్రాయములు ప్రబలియున్నవి. నెహ్రూనివేదికయందు రెండువిధానములును చేర్పబడినవి. భారతీయ రాజ్యాంగసమస్య లపూర్వములు. అపూర్వమైన సమస్యల కపూర్వమైన రాజ్యాంగవిధానము లేర్పడుట యును సహజము. ప్రయోజనము ప్రధా నముగాని నామరూపములు ప్రధానములు గావు. నెహ్రూ ఉపసంఘము సంకుచిత పరిస్థితులందు సమర్పించిన భారతరా జ్యాంగ విధానము వివేకమును, నిగ్ర హమును, దూరదృష్టిని, సాహసధైర్యములను, వ్యవహారదక్షత్వమును గలిగి ప్రాజ్ఞుల యాశీ

ర్వాదములను బడయుచున్నది. సైమను సప్తక మేమిచేయునో కాలము తెలుపగలదు.

లక్ష్మణపురమునందు గూడిన సకలపక్ష సమావేశమునకు దిగ్విజయము గలిగినది. సకల రాజకీయపక్షములవారును, భిన్న సంఘములవారును, భిన్న మతములవారును, భిన్న ప్రదేశములవారును వారి సంకుచితాభిప్రాయములను, ప్రత్యేకలాభములను విసర్జించి, స్వధర్మనిర్వాహణమును జేసి, ప్రతిపక్షులకు విషాదమును, స్వదేశీయుల కానందమును గలుగజేసిరి. నిరంకుశవర్గము చేయుచున్న కుట్రల మీదను లక్నోతీర్మానములు పిడుగువలె పడి భయభ్రాంతులను గలుగజేయగలవు. ప్రపంచమునందు ధర్మమునకు విజయముగలుగునుగాని యధర్మమునకువిజయముగలుగజాలదు. సైమను కమిషను నిర్ణయములను, వారి సహకారుల నిర్ణయములను సకలపక్ష సమావేశ మామోదించిన తీర్మానములు పరివర్తనము చేయగల విధమును కాలము విశదము చేయగలదు. శాసనసభాసభ్యులు నిరంకుశాధికారుల మాయలలోబడి దేశానర్థమునకు సాధనంబైన సహకారము నంగీకరించుట భారతీయుల పతితస్థితికి నిదర్శనముగ నున్నది. సైమను సప్తకమును బహిష్కరించుటకు నిర్ణయించిన చెన్నరాష్ట్రశాసనసభ తిరిగిసహకారము నామోదించుట పరమవిచారమును గలుగజేయుచు భారతీయుల దుర్దశను విశదము చేయుచున్నది.

ఆరుమాసములు తిరుగకపూర్వమే చెన్నరాష్ట్రశాసనసభ వెనుక చేసిన నిర్ణయమును మార్చుకొని తనయాత్మగౌరవమును నాశనము చేసికొనినది. స్వప్రయోజన పరాయణులైన సభ్యు లనుచితముగ ప్రవర్తించినను సభాగౌరవమును గాపాడవలసిన సభాధ్యక్షులైనను ధర్మసంరక్షణమునకు బూనుకొనకుండుట సంతాపకరము. సభాధ్యక్షులు ప్రతిపాదనమునకును, మోషనునకును గల్పించిన భేదములును, చేసిన నిర్వచనములును వా రి న్యా య వా ది స్వ భా వ మును దెలుపుచున్నవి గాని ధర్మస్వభావమును దెలుపుట లేదు. నిరంకుశవర్గమునకు గల బలసామర్థ్యముల కిది యొక నిదర్శనముగ నున్నది. భారతీయులు స్వధర్మనిర్వాహణపరాయణులై ఆత్మోపలబ్ధిని బడయుటకు స్వారాజ్యావసరమును నిట్టి యనుచితకార్యములు సంబోధించుచున్నవి. సకలపక్షసమావేశము నెహ్రూనివేదిక నేకగ్రీవముగ నామోదించుట యందు చూపిన దూరదృష్టిని, ధర్మైక్యమును, దేశభక్తిని, సాహసధైర్యములను భారతీయులందరును వ్యక్తముచేసి. దేశమును, ధర్మమును, దైవమును భక్తిశ్రద్ధలతో నారాధించి కృతార్థు లగుదురు గాక!

---

... and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras

# విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—రాధ; 'విషయ నిమ్ము'.

సాధారణచిత్రములు:—అబ్రహాముకాలమున అబ్రహామునగరము; చెదపురుగుల గుట్టు; త్యాగరాజమహోత్సవము-సింగరేణికాలియర్సు; లక్కచిత్రములు ౫; శ్రీ గాంధి మహాత్ముఁడు; శ్రీ రాజా రామమోహనరాయిగారు; డాక్టరు అనిబెసంటుగారు; ఇతర చిత్రములును.




రా ధ

చిత్రకారిణి: శ్రీ ది. బుచ్చి కృష్ణమ్మగారు, రాజమండ్రి




చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౨౮

సంపుటము ౫ విభవ సంవత్సరము ఆశ్వయుజమాసము సంఖ్య ౧౦

# ప్రతాపరుద్రచక్రవర్తి

శ్రీ శేషాద్రిరమణకవులు

సలలిత విక్రమక్రమ విశాల మహీవలయైకరక్షణో
  జ్జ్వలులగు కాకతీయులకు సామ్యముగా మహితాంధ్రధారుణీ
తలము భరించి నవ్యకవితావిభవంబులచేత వాఙ్మయం
బలరిచినాఁడ వెంత సుకృతాత్ముఁడవో ధరణీపురందరా!

ప్రత్యర్థి నరపాలపటలివక్షములలో వాసం బొనర్చె నీ వాఁడికత్తి
ఆంధ్రవీరులరక్తమందు విక్రమవహ్ని వెలుఁగొందఁ జేసె నీ తెలుఁగుమాట
సారస్వతమునకు సర్వస్వము నొసంగ నను వయ్యె నీదు భాషానురక్తి
నిజరాజ్య కుశల మన్వేషింప యవనబంధిత మయ్యె నీ భవ్యదేహయష్టి
అస్వతంత్ర పరాధీన మైన యాంధ్ర-సోదర మనోంబుజములలో ఘన్నమైన
తావకీనయశోమూర్తి ధ్యానదృష్టి-నరయుచుంటిఁ బ్రతాపరుద్రావనీశ!

బలిపెట్టించితి వాంధ్రమాతృచరణప్రాంతప్రదేశంబునన్
దెలుఁగుం గత్తులచేతఁ గూలిన విరోధివ్రాతకాయంబు లాం
ధ్రుల విక్రాంతికి యావద్ద్రవిడరాట్ స్తోమంబుచే దాస్య క
ర్మలఁ గావించితి వెంతధన్యుఁడవు రుద్రా, రాజబృందారకా!

అడఁకువ దాల్చి దేవగిరి యాదవరాజులు గాన్క లంపఁ దుం
దుడుకుఁదనంబు మ్లేచ్ఛనృపతుల్ విడనాడి విధేయవర్తులై
కడుఁ బరిచర్య సల్ప, నధికారమహాత్తర మాంధ్రరాజ్య మ
ట్లడరె నొకప్పు డవ్వి కథ లైనవి మాకుఁ గలిప్రచండతన్.

ప్రాఁతవారిన పూర్వప్రభావ మెల్ల-మరల నాంధ్రులఁ జేరె నీతరుణమందుఁ
జివికిపోయిన యాంధ్రుల జీవనంబు-లుద్ధరించితి వీవె యోగ్యుఁడవు భూప!

కమనీయతరమైన కవితాసతికి నాంధ్రదేశంబుఁ బెండ్లిపందిరియొనర్చి
లలితవిక్రాంతిసంకులమైన తెలుఁగుపౌజులకు సామ్రాజ్యంబు నెలవుఁ జేసి
మహిత త్రిలింగసామ్రాజ్యలక్ష్మికి నన్యరాజ్యలక్ష్ములఁ ద్రిప్పి రక్షఁ బెట్టి
కళల నన్నింటిని దెలుఁగువీరుల కరాంచలములఁ జక్కఁగా నిలువరించి
మాసిపోయిన మగధసామ్రాజ్యలక్ష్మి-యతులితవిభూతిఁ గాకతీయాంధ్రవీర
మండలాగ్రంబులందుఁ గ్రమ్మర ఘటించి-తాంధ్రరత్న, ప్రతాపరుద్రావనీశ!

ఏలినయంత కాలమును నేకముఖంబున నాంధ్రవైభవ
శ్రీ లలరించి, ప్రాక్తనవిశేషసముజ్జ్వలభోగభాగ్య ని
ర్వేలమహావిభూతి నలరించి, మహామహితాంధ్రరాజ్యల
క్ష్మీ లలితాత్మఁ డన్న ప్రథఁ జెందితి వయ్యది చాలదే నృపా!

రాజహంసాభిరామముల్ రమ్యశాత-కుంభ కుంభప్రతానైక గుంభితములు
తావకమహాగృహాస్థితిద్వారములను-నరయుకన్నులె కన్నులోయాంధ్రభూప!

అరిరాజన్యభయంకరంబుగ విశాలాంధ్రప్రపంచంబు ని
ర్భరవిక్రాంతి వృతాభిమానమతితోఁ బాలింప సాహసమ్మహా

శ్వరతేజంబునఁ బుట్టినాఁడవఁట భూపా, నీవు, మ్లేచ్ఛావనీ
శ్వరబంధిగ్రహణప్రతప్తుని బొనర్పన్ ధాత యెట్లోర్చెనో.

పరుగుపరుగునఁ బయిఁ బడు తురకభటులు-గ్రుమ్ము బల్లెమ్ములకుఁ బేరుర మ్మొసఁగి
సంతరించిరి పరిఘకు జలసమృద్ధి-నాంధ్రు లానాఁటిశ్రమ మెల్ల నడుగుఁబట్టె.

రావచ్చున్ దరుణం బిదే యని మహారాష్ట్రుల్ స్వరాజ్యంబునన్
ద్రోవల్ చూపక యున్న, నాంధ్రబలముల్ దుర్వ్యాధిపూర్ణంబులై
చావన్ సిద్ధము గాక యున్న వశమే సర్వంసహామండలీ
శ్రీవిభ్రాజితమైన యాంధ్రదళముల్ చెండాడ నెవ్వానికిన్?

శ్రీస్వయంభూనాథసేవాసమారబ్ధ విఖ్యాతవరములు వీటిఁబోయె
రుద్రమదేవీ నిరూఢపరాక్రమసముపార్జితబలంబు సన్నగిల్లె
శివదేవదైవజ్ఞసిద్ధాంతనిర్ణయఫలసముదాయంబు పాడువారె
నవలక్షధానుష్క-నాథమహత్తరోదారవిక్రమదీప మారిపోయె
జలధివలయితధారుణీచక్రభరణ-దక్షదక్షిణభుజుఁడు ప్రతాపరుద్ర
వసుమతీనాథుఁ డరులచేఁ బట్టువడిన-యంతన యదృశ్యమయ్యె మహాంధ్రలక్ష్మి.

కళ లౌన్నత్యము నొందుచుండె, నరిసంఘాతంబు క్షీణించె, ని
శ్చల వీరవ్రతులైన యాంధ్రతనయుల్ సామ్రాజ్యసేవావ్రతో
జ్జ్వలులై యుండిరి ప్రాక్తనప్రతిభ సంపాదింపఁగా వచ్చు నన్
తెలుఁగుం బాజు ప్రతాపరుద్రనృపు బంధింపంగ నెట్లోర్చెనో.

సంస్కృతాంధ్రకవిత్వ సర్వస్వనిలయముల్ గ్రంథభాండారముల్ కాల్చునపుడు
శ్రీ స్వయంభూదేవు చిత్రాలయంబును దుండగంబునఁ గూలఁద్రోయునపుడు
రాజగేహముఁ జొచ్చి రాణివాసమ్మున సాహసకృత్యముల్ సలుపునపుడు
స్వాతంత్ర్యసంరక్షణార్థమై యాంధ్రుల వీరరక్తము వీటఁ బాఱునపుడు
అమలచారిత్ర కాకతీయాంధ్రరాజ్య-లక్ష్మి యన్యుల వలచి మెలంగునపుడు
నీదు నయనాంతరాళముల్ నిండి రాలు-నశ్రులకు వందనంబు రుద్రావనీశ!

పాప మెఱుఁగ, వేరి కపకారము సేయవు, వెన్ను వైరికిన్
జూపవు, శౌర్యధైర్యముల శూలికి బోలికవత్తు, వాంధ్ర ల

5.    10-    1-౨    ౫౫3

క్ష్మాపరిచర్య కర్హ మగుచేవయు లావుఁగలాఁడ వంచుఁ జూ
పోషక నిన్ను దైవ మయయో కసిపట్టె నృపాలభూషణా!

కవులయాశీర్వచనములుగాని, నేఁ-వేలుపు లొసంగుచున్న దీవెనలుగాని
చిరపరాధీనదౌర్భాగ్యజీవు లైన-యాంధ్రులకుఁ దోడుపడ దయ్యెనా నృపాల?

కాల్చిరి కొంప లంగనలఁ గారియపెట్టిరి దేవళంబులన్
గూల్చిరి కోటలం బగులఁగొట్టిరి మండెడి మంటలోపలన్
నేల్చిరి తెల్గుపౌజులను వీరిడిపోయె మహాంధ్రతేజమే
నిల్చిన లాభ మేమి యని నీ వరికిన్ వసమైతివే నృపా!

పరదాస్యంబున కోర్వ కాంధ్రతరుణుల్ వాపోవఁ బ్రత్యర్థిరా
ట్కరఘాతంబుల కాంధ్రరాజ్యరమ యాకంపింప వీక్షించి హృ
త్పరితాపంబున నున్న నీమొగము దీవ్యద్భావనాదృష్టితో
నరయన్ వ్రయ్యఁదొడంగె గుండె యిపు, డష్టాంధ్రాళి నెట్లోర్చునో.

అనితరవీరవిక్రమవిహారమహారథికాగ్రగణ్యులా
తెనుఁగువజీరు లెల్లఁ గడతేరుచునుండ, మహాంధ్రరాజ్యల
క్ష్మిని జెఱఁబట్టఁగాఁ దలఁచి మ్లేచ్ఛనృపుల్ చెలరేఁగుచుండఁగాఁ
గని యెటులన్ సహించితివొ కాకతిరాజ్యరమాధురంధరా!

గౌతమీ కృష్ణవేణీ తరంగిణుల నీ రేకముఖంబుగా నేర్పడంగ
ప్రకృతిదుస్సహ మైన భయద నిర్ఘాతంబు లంబుదంబులనుండి యవతరింప
ధారుణీగర్భస్థ దహనకీలామాల లాంధ్రభూమండల మాక్రమింప
చటులఝంఝూవాతసంఘట్టనంబున దివి భువి యేకమై నివురుగప్ప
ప్రభవ మొందిన దుస్తరప్రళయకాల-మాంధ్రనగరంబుతో సమస్తాంధ్రజాతి
నడఁచివేసిన యెడల భగ్నావశిష్ట-ములకుఁ బరితాప మొందుట తొలఁగకున్నె.

ఆత్మరక్తంబుచేఁ బ్రవాహములు గూర్చి-తురకరాజుల నడ్డగించిరఁట తొల్లి
తెలుఁగుపౌజులు; నాఁడు నీతలఁపుపడవ-యెచటి సుడిగుండములఁ బడియెను నృపాల!

రాజిత సర్వభాగ్యనికరప్రచురం బని వాసి నొంది రా
రాజపురంబొ లేక యమరావతియో యన వన్నెగాంచి వి

భ్రాజితలీల నాంధ్రనగరంబు చెలంగె నొకప్పు డంచు ని
స్తేజుల మేము తచ్ఛిథిలచిహ్నా లెఱింగితి మార్ద్రదృష్టితోన్.

ఆరామవనసీమలందు నల్లుకపోయెఁ గంటకావృతమైన గచ్చచెట్లు
ఆలయాగ్రములపై నవతరించె నితాంత గుల్మాకరము లైన గుబురుపొదలు
కొలువుసావడిచుట్టు మొలచె ముజ్జిడ్డుగా సమధికవై ఖరి జెముడుకంప
అంతిపురంబున కన్ని కెలంకులఁ బడియుండె నిస్తుల ప్రస్తరములు
మాటు మడఁగిన యాంధ్రసామ్రాజ్యశోక-గీతి వినిపించె దుర్గసంఘాతచటుల
భిత్తికాలోలఘూకంబు భీకరముగ-నెటులు సహియింతు రాంధ్రు లీ హేయగతికి.

వీథులు గూలె రాజగృహబృందము భూగత మయ్యె నాంధ్రరా
ట్సాధితభోగభాగ్యములు సర్వ మదృశ్యము నొందె విక్రమా
రాధకు లైన కాకతినరప్రవరుల్ గడియించినట్టి దు
ర్భేదయశం బొకండెఁ గనిపించు నోరంగలులోన నేటికిన్.

అభ్రంకషం బైన యాంధ్రభూవిభుమేడ జంబుకప్రతతికి సదన మయ్యె
కాకతీయుల పూజ గాంచిన శ్రీ స్వయంభూదేవుఁ డెచ్చటనో పూడిపోయె
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మము లైన దిగ్జయ స్తంభంబు లెందెందొ దాఁగికొనియె
పలుకుఁదోడై తెల్గునెల వెల్ల నేలిన యేకవీరాదేవి యెటకొ చనియె
భిన్నపాషాణనిర్మిత భిత్తికలను-గాకతమ్మ చిరంబుగాఁ గన్ను మూసెఁ
గాలపురుషుండు ప్రశిథిలాంకంబు లేని-నిలుపఁ డేమని నెమ్మదిఁ దలఁచినాఁడొ.

శాంతి

"ఆంధ్రసుతులార, మనతల్లి యాంధ్రరాజ-లక్ష్మి విలపించె నేకశిలాపురస్థ
శిథిలములయందుఁ జెక్కుటఁ జేయి నేర్చి-తరలి దర్శించి పేర్మి నోదార్పుఁడయ్య!"

# తిక్కనవిరాటపర్వము

గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య గారు, యమ్. ఏ.

హూణకవుల షేక్సుపియరు, సంస్కృతకవులఁ గాళిదాసు నెట్లో తెలుఁగు కవులఁ దిక్కన యట్లే యగ్యుఁ డనునభిప్రాయముతో నేకీభవింపని యక్షరాస్యుఁడగు నాంధ్రుఁ డుండఁడు. ఆంధ్రవిద్వత్కవికూట మేకగ్రీవముగ నొసఁగిన "కవిబ్రహ్మ" బిరుదమును, ఎఱ్ఱన శ్రీనాథాదులు గావించినఘనస్తుతియును, కళాప్రపూర్ణ నవమల్లినాథపాదు లెత్తిన "విజయ"ధ్వజమును, బ్ర. శ్రీ. దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు, నాగపూడి కుప్పుస్వామయ్యగారు మున్నగు మనీషులెందఱో రచించిన సువిమర్శనలును తిక్కనయప్రతిమాన ప్రతిభను వేనోళ్లఁ జాటుచున్నవి. ఇట్లు పలువురుపెద్దలు తమతియ్యఁబల్కులఁ గొండాడిన తిక్కనకవనమును—అందును,కురుపాండవసంగ్రామమున నుత్తరగోగ్రహణ మప్పటి యర్జునసమర మెట్లో, అట్లే భారతమున సాటిలేనిదగు విరాటపర్వమును, అల్పజ్ఞుఁడనగు నేఁ బ్రశంసింపఁబూనుట

> "మించినవేడ్క వీనులకు
>     మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
> యంచలు గూయఁ గ్రౌంచమును
>     నావలఁ గూయఁ గడంగుభంగి"

యైనను కతిపయాక్షర పరిగ్రహణ జనితంబైన నైసర్గికచాపలంబును, తిక్కనకవిత పాలమున్నీటిం బోనిది కావునఁ దచ్చుకొలఁది నందు భావరత్నములును, రసామృతమును వెల్వడు నను నమ్మికయు నీసాహసమునకు నన్నుఁ బ్రేరేచుటంజేసి విద్వజ్జనమునకు క్షంతవ్యుఁడ నని విన్నవించువాఁడను.

## ౧

### ఆంధ్రీకరణము :

భారతకవిత్రయము మూలమున తూచా తప్పక మక్కికిమక్కి తెలిఁగించు తెరువునఁ బోవక, స్వతంత్రించి యిచ్చవచ్చిన మార్పులను జేర్పులను గావించిరని యెల్లరకుఁ దెల్లము. విరాటపర్వమునఁ దిక్కన తెనిఁగింపును ద్రివిధముల విభజింపనగును:

i. మూలమునందుఁ దిక్కన వదలిన రసవత్తరములగు పట్టులు:

మూలకావ్యమును దిక్కన కొన్నియెడల మార్చె ననుటచేతనే అయ్యది కబ్బంపు గొనములఁ గొండికయని తలపోత అజ్ఞసంప్రదాయము. మూలకృతి "లేఖ్యంబైన యామ్నాయ" మనియు, "నాదరణీయసారవివిధార్థగతి స్ఫురణంబు కల్గె"ననియు, "జనుల కారాధ్యమగు పంచమవేద" మనియు, "నేష్టునఁ బూజ్యమూర్తి" యనియుఁ గొనియాడు తిక్కనపలుకులె పైవాదమునకు నిరాసకములు. ఇంకను సాక్ష్యమువలయునేని, మాతృకయందటనట నేలొకో తిక్కన తెనిఁగింపక వదలె

నను కొంతం బాడమించు శ్లోకరత్నములు మెఱయుచుండుటయే నిదర్శనము. అందొక కొన్నింటి నిచ్చట నుదాహరించెద.—

౧. విరటునికొలు వర్థించి వచ్చిన బృహన్నల వాక్యము:

"ఇదంతు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనమ్;
బృహన్నళాం మాం నరదేవ, విద్ధి
సుతం సుతాం వా పితృమాతృవర్జితామ్."

(రాజా, నారూపముఁగూర్చి నీకేమి? దానిం దలంచినఁ గడుశోక ముప్పతిల్లును. నన్ను బృహన్నలయని చెప్పుదురు. తల్లిదండ్రులు లేని నన్ను నీబిడ్డమాడ్కిఁ దలంపుము.) ఈశ్లోకము కరుణరసనిష్యంది యని వేఱ చెప్పవలయునా?

౨. కీచకుని దుర్భాషణములకు సైరంధ్రి ప్రత్యుత్తరము:

"యథా నిశ్చేతనో బాలః కూలస్థః కూల ముత్తరమ్;
తర్తు మిచ్ఛతి మందాత్మా తథా త్వం కర్తు మిచ్ఛసి...
త్వం కాళరాత్రీమివ కశ్చి దాతురః
కిం మాం దృఢం ప్రార్థయసేఽన్య కీచక!
కిం మాతు రంకే శయితో యథా శిశు
శ్చంద్రం జిఘృక్షురివ మన్యసేహి మామ్."

(తెలివిమాలిన బాలుఁ డీవలిగట్టునఁ గూర్చుండి ప్రవాహము దాఁటి యావలిగట్టుఁ జేరఁ దలంచుచందంబున, నీవును మూఢుఁడవై యట్టికార్యముఁ జేయఁబూనుచున్నావు...... నీవుఁ గాళరాత్రినైన నన్ను ఆతురుండవై కోరుచున్నావు. బాలుండు తల్లితొడపైఁ గూర్చుండి, చంద్రునిఁ బట్టంగోరినట్లు నన్నుఁ గైకొనఁగోరుచున్నావేమో!) ఇందలి యుపమానములు 'రామణీయకంబు రమియించు నిక్కలు' కావె!

3. వలలునికి సైరంధ్రి యొసంగు నూఱట:

"స్థితం పూర్వం జలం యత్ర పున స్తత్రైవ గచ్ఛతి;
ఇతి పర్యాయ మిచ్ఛంతి ప్రతీక్షే హ్యుదయం పునః."

(జల మున్నచోటికే మరల జలము వచ్చి చేరునన్న సామెత ప్రకారము, తిరిగి మనకుఁ గలిమి కలుగునని యెంచి యెదురుచూచుచున్నదానను.) ఇందలి యుపమాసారస్యము సులభగోచరము.

౪. వలలుని ప్రతిన:

"తత్రాస్య దర్శయిష్యామి
పూర్వప్రేతాన్ పితామహాన్."

(అచ్చట [నర్తనాగారమున] వీనికి [కీచకునకు] ఎన్నాళ్లకుముందో చచ్చిన వీనితాతముత్తాతలను జూపెదను. ఇందలి రోషగర్భిత హాస్యము స్వయంవ్యక్తము.

౫. గోపాధ్యక్షుఁడు ఉత్తరుని యుద్ధమునకుఁ బ్రేరేపించు వాక్యము:

"పాశోపధానాం జ్యాతంత్రీం
చాపదండాం మహాస్వనామ్;
శరవర్ణాం ధనుర్వీణాం
శత్రుమధ్యే ప్రవాదయ."

(పాశంబు లనుదిండు గలదియు, అల్లెత్రాడను తంత్రులు కలదియు, బాణము లను వర్ణ

ములు గలదియు నగుధను స్సనువీణెను శత్రు మధ్యంబున వాయింపుము.) ఇయ్యుపమ యెంత యపూర్వమో అంతసుందరము, హృదయంగ మము గదా!

౬. గాండీవి యుద్ధవర్ణనము:

"స్రజోర్జున శరైః శీర్ణం
శువ్యత్సువ్పం హిరణ్మయమ్;
ఛత్రాణిచ పతాకాశ్చ
ఖే దధార సదాగతిః."

(అర్జునుని బాణములచేఁ దొరఁగి మీఁది కెగిరిన బంగరువన్నెగల పూలదండలు, గొడుగులు, టెక్కెములు వాయుదేవుఁడు ధరించిన పూలదండలు, గొడుగులు, టెక్కెములో యనునటు లొప్పుచుండినవి.) అద్భుతరమణీయోత్ప్రేక్ష. మూలమున నిట్టిశ్లోకము లింకను పెక్కు లున్నను గ్రంథవిస్తరభీతిచే బూర్వోదాహృతములతోఁ దనివి నొందుచున్నాఁడను.

ii. మూలముననను, దెలుఁగుననను సారస్యమునఁ దులఁదూఁగు పట్టులు:

ఈ పర్వమునందు తిక్కనార్యుఁడు తన సమర్థతయు, బుద్ధిసూక్ష్మతయుఁ దెల్లమగునట్లు ఇతరుల కందరాని, మించరాని మూలంపు మెఱుఁగు లించుకేని మాయకుండునట్లు మిక్కిలి మెలఁకువతోఁ దెలిఁగించిన తావు లనేకములు కలవనుటచే గీర్వాణకావ్యమహిమ మఱింత ప్రస్ఫుటమగుచున్నది. ఇట్టిపట్టుల దెనుఁగుసేత కత్తిసాముపంటిపని. ఏమాత్రము పొరవడినను, ఒక్కయక్కరము పొల్లయినను మూలసారస్యము చెడును; అనువాదకుని యెఱుఁగమి బయలువడును. ఈభాగమున గవితాగుణరహస్యజ్ఞులగు తిక్కనాద్యుత్తమ కవులు దక్క నితరులు నెఱవేర్పఁజాలరనుట అతిశయోక్తి కానేరదు. అనన్యసదృశమగు వ్యాసమహర్షి ప్రతిభకును, తిక్కననేర్పు మెఱుఁ కువలకును ఇంచుక తెలివిడి:

౧. బొమ్మలకు పొత్తిగుడ్డలు తెమ్మని కోరిన యుత్తరకు, నామె చెలులకు బృహన్నల యుత్తరము:

"యద్యుత్తరోఽయం సంగ్రామే
విజేష్యతి మహారథాన్;
అథాహరిష్యే వాసాంసి
దివ్యాని రుచిరాణిచ."

(ఉత్తరుఁడు మహారథులగు కౌరవుల జయించెనేని, దివ్యమనోజ్ఞవసనముల మీకు దెచ్చియిచ్చెదను.)

క. అనుడు బృహన్నల యిట్లను
జనపాలక నందనుండు జయలక్ష్మిం జే
కొనునటె, చీరలు తెచ్చుట
పనియే! యటు సూడఁ డెల్లభంగులఁ దెత్తున్."

ఉత్తరునెడ గూఢహేళనము ఇట రెంటను సమానము.

౨. యుద్ధమునకుఁ దరలు నుత్తరునకు ద్విజాదు లొసంగు దీవెన:

"యదర్జునస్యర్షభతుల్యగామినః
పురా భవ త్ఖాండవదాహమంగళమ్;
కురూన్ సమాసాద్య రణే బృహన్నళే
సహోత్తరే ణాస్య తదస్తు మంగళమ్."

(తొల్లి నీచే నర్జునునకు ఖాండవదహనమునఁ గలిగినట్టి జయము ఇప్పుడు నీచేతనే ఉత్తరునకుఁ గురువీరుల నడంచుటచేఁ గలుగును గాక.)

"తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున మాంగల్యం బెట్టి పట్టిద భవత్సాహాయ్యంబున నిపుడు భూమింజయున కయ్యెడు."

"భవత్సారథ్యంబున" అని వాచ్యభంగిం జెప్పనియేమూలమందలి చమత్కారము. దీనిని దిక్కన "నీకతంబున", "భవత్సాహాయ్యంబున" అని తెలిఁగించి మూలసారస్యమును నెలకొల్పినాఁడు.

3. అర్జున యుద్ధవర్ణనము:

"పతంత్యరూపేషు యథా చక్షూంషి న కదాచన;
నాలక్ష్యేషు శరాః పేతు స్తథా గాండీవ ధన్వినః."

(అదృశ్యములపై దృష్టి వడనియట్లు గాండీవిబాణంబులు గుఱితప్పినచోట్లఁ బడలేదు.)

క. "నరు లోరులు దృశ్యములపైఁ
బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు వడుఁ దప్పక, య
ప్పురుసున నరుఁ డేయు నిశిత
శరములు లక్ష్యములు తప్పి చన వించుకయున్."

ఇట మాతృకయందలి నఙ్ ద్వయ ప్రయోగసారస్యము దుహితృకయందుఁ దెనుఁగు నుడికారమున కనువుగఁ ద్యజింపఁబడినన్, నిశ్చయద్యోతన ముభయములఁ దుల్యమే.

౪. అర్జునుఁడు కర్ణునితోఁ బల్కిన యెత్తిపొడుపుమాట:

"య స్సభాయాం స పాంచాలీం
క్లిశ్యమానాం దురాత్మభిః;
దృష్టవానసి తస్యాద్య
ఫలమాప్నుహి కేవలం."

(అల్లసభలో దురాత్ములు ద్రోవది నవమానపఱచుచుండఁగ నక్కటతోఁ జూచుచున్న దాని కిప్పుడు ఫలంబు ననుభవింపుము.)

"......అట్లు ద్రుపదపుత్త్రికిఁ బఱుపంగఁ
గాంచినగిన ఫలముఁ గందుగాక!"

"కాంచుట"యె కాక "నగుట" తెలుఁగునఁ గల విశేషము.

౫. అర్జునుని పలుకుములుకులచే దుర్యోధనుఁడు యుద్ధమునకుఁ బునర్ముఖుఁ డగుట:

"ఆహూయమానశ్చ స తేన సంఖ్యే
మహాత్మనా వై ధృతరాష్ట్రపుత్త్రః;
నివర్తిత స్తస్య నిరంకుశేన
మహాగజో మత్త ఇ వాంకుశేన."

(అమ్మహావీరుఁడు దుర్యోధనుని యుద్ధము నిమిత్తము పిలువఁగా స్వచ్ఛందవర్తియగు మదగజేంద్రము అంకుశముచేబలె నాతఁడు మరలి నిల్చెను.)

క. "నీయట్టివాఁడు నిన్నీ!
పోయెడిదే యిట్లు పోకు పోకుమనుడు, భూ
నాయకుఁడు మరలి, పటుకో
పాయత్తతఁ ద్రొక్కఁబడ్డయహిగలిఁ గవిసెన్."

ఉపమానముల రెంటను రోషస్ఫురణ సమానము. తెలుఁగుపోలికయందుఁ దీక్ష్ణత యెక్కుడందుమేని, గీర్వాణసామ్యమున నౌన్నత్య మెక్కుడుగదా! రెండును ప్రకరణమందుపాదేయములే.

౬. కంకభట్టు విరటుని గేలిసేయుట :

“తతో ఽబ్రవీ న్మహాత్మా స ఏనం రాజా యుధిష్ఠిరః;
బృహన్నలా యస్య యంతా కథం స నజయే ద్యుధి.”

(అంత విరటునితో మహాత్ముఁడు ధర్మరాజు పలికెను: “బృహన్నల యచ్చట నుండఁగా యుద్ధమున జయ మేల కలుగదు?” అని.)

చ. “కురుబలమేల, దైత్యసుర
కోటులు వచ్చిన గెల్వరాదె యు
త్తరునకు, నాబృహన్నల ర
థంబుపయిం బరవాహినీభయం
కరభుజసారమున్ మెఱయఁ
గాఁ దఱిఁ గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేలి నిర
తుం డయి దుర్దమలీల నుండఁగాన్.”

ఇటను రథచోదకప్రస్తాపము వాచ్యము గామియె మూలానువాదముల రెంటనుగల లోకోత్తరవిశేషము. తెనుఁగున “రథంబుపయి” ననియు “సారథ్య మొనర్చుచు” ననమిచేఁ దిక్కనార్యుని జాగరూకత మఱెంత గూఢి కెక్కుచున్నది.

౭. అర్జునుఁడు విరటునింగూర్చి పల్కిన కృతజ్ఞతావాక్యము:

“ఉషితాః స్మో మహారాజ సుఖం తవ నివేశనే;
అజ్ఞాతవాస ముషితా గర్భవాసఇవ ప్రజాః.”

(మేము గర్భవాసమున శిశువు లున్నట్లు, మీయింట నీయజ్ఞాతవాసము సుఖముగాఁ గడపితిమి.)

తే. చాల దుస్తరమైన యజ్ఞాతవాస
వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త
వృత్తి నేము నిర్భయులమై విందు లట్ల.”

ఇట మూలమునందలి యపూర్వరమ్య రూపకరాజమును వదలక యనువదించి నందు లకే తిక్కనగుణగ్రహణపారీణతను మిక్కిలి కొనియాడవలయు ననుచో దానివిలువను నేఁ యుత్కర్షింపఁ బని యుండదు.

iii. రసమును పెంచుటకును, ఔచిత్య మును బోషించుటకును తిక్కన మూలము నుండి మార్చిన పట్టులు :

మూలము కావ్యగుణఖని యగుటంజే యందలి సారస్యమును జెఱుపక, యున్నది యున్నటు లనువదించుటకే మహాప్రతిభ వ యు నన్నచో, నౌచిత్యరసపోషణార్థము స్వతం త్రించి కృష్ణద్వైపాయనరచనమును మార్చు టెంతటిఘనకార్యమో వేఱ నుడువం బనిలేదు తిక్కన పెక్కెడల నట్టిమార్పులఁ గావించెనని మూలానువాదముల సరిపోల్చు పాఠకుల కెఱు కవడఁగలదు. “తన కావించినసృష్టి తక్కొరుల చేతం గా”దన్న పొగడ్తకుఁ గారణములగు నీకవిబ్రహ్మ రసికతకును, ఔచితీనిర్వహణమున కును, కవితాశిల్పసౌందర్యమునకును ఉన్న త్యయము కన్న మిన్నయగు తార్కాణము కలుగదు. ఇయ్యవి యీపర్వమున వేనవేలుగ నున్నను గ్రంథవిస్తరభీతిచే నిట దిక్ప్రదర్శన మాత్రముగ వీని నుదాహరించెదను.

౧. మూలమున విరటుఁడు బృహన్న లను తనకొమార్తెకు నట్టు లొజ్జగ నియమిం

చుటకుమునుపు తా నతనిగీతాదికుశలతం బరీక్షించుటయె కాక నిజమంత్రులతో నాలోచించి ("పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై; అపుంస్త్వ మ ప్యస్యనిశమ్యచ స్థిరం.") స్త్రీలచేఁ బరీక్షింపించి యతనిని నపుంసకత్వమును దృఢముగా నెఱింగెనని యున్నది. ఆంధ్రమునఁ బరీక్షాప్రస్తావమే వాచ్యముగాక, "నైపుణంబున నుచితంబుమై నరసి పొచ్చెము లేమి" నని మాత్రము నుడువఁబడినది. ఇటఁ దిక్కనయు మూలమందలి యశ్లీలతను "నైపుణంబున నుచితంబుమై" దూరీకరించుట తెల్లము గదా!

౨. సైరంధ్రి కల్లుఁ గొనిపో వచ్చినప్పుడు కీచకుఁడు ("తాం మృగీమివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం") చేరువకు వచ్చుచుండు భీతహరిణింబోలు ద్రౌపదిని జూచెనని మూలము. "బెబ్బులి యున్న పొదరు లేడి సొచ్చుచందంబున" సైరంధ్రి కీచకుమందిరముఁ బ్రవేశించెనని తిక్కన. "బెబ్బులి యున్న పొదరు" అనుటచే మూలరూపకమునకు జీవము పోయఁబడినది.

3. మూలమున, సైరంధ్రి మహానసశాల కేఁగి, యట నిదురించుచుండు వలలుని

("బాహుభ్యాం పరిరభ్యైనం ప్రాబోధయ దనిందితా;
...భీమసేన ముపాశ్లిష్య ద్ధస్తినీవ మహాగజమ్).

కౌఁగిలించుకొని నిదుర లేపె ననియున్నది. ఆంధ్రమున, వలలుఁడు "పాంచాలి పాణిస్పర్శనంబున మేలుకనియె" నని యున్నది. మూలమునందలి "యాలింగము" పని యిటఁ "బాణిస్పర్శనము" చేతనే నెఱవేఱినది!

౪. ఎవని "మహోగ్రకోపరేఖావిభవంబు వైరులకుఁ గాలము చేరువ" యని వర్ణితమో, ఆ భీమసేనుఁడు ఆఁడుదాని వేసముఁ దాల్చుటకును, కామప్రేరిత కీచకప్రలాపములకు వలపుఁగత్తెవలెనే మఱుమాటాడుటకును ఎట్లు సమ్మతించెను? సమయభంగభీతిచే గోపనార్థ మాతఁ డిట్లొనర్చెనని సమాధానమేని, అంధకారబంధురముగదా నర్తనశాల, యట నిజరూపముననే యున్నను ఏమివిపత్తు మూడును? మోసముచే మాఱువేసముచేఁగాక సింహబలునిఁ జంపఁగలనా యని భీముఁడు సందేహించెనా? మూలమున నిందులకు సమాధానము మృగ్యము. ఆంధ్రమున నేతన్నిమిత్తమే అద్భుతసంవిధానము గల్పింపఁబడినది. భీముఁడు ద్రౌపదితో శపథ మొనర్చునపుడు "ఆసాబగునిం దెగఁజూచి, నీకుం జూపి నీచిత్తంబు వడసెద" నని నుడువును. అందుకొఱకాతఁడు నర్తనాగారమున "విరాటనందన పర్యంకమున కనతిదూరమునఁ బాంచాలి నోసరిల నునుచును" కావుననే కీచకుని కాముకభాషణములకుఁ "గనలియు రోసియు," "మృదురీతి నుచితనిగూఢభంగులగు భాషణములను తనప్రియ వినిపించుటకుఁ"గా బదులు వల్కెను. ఇందుఁ బ్రకటమగు తిక్కనార్యుని ప్రకరణోచితకల్పనసామర్థ్యము నెంతని కొనియాడనగును!

౫. మూలమున, భీముఁడు కీచకునితోఁ బోరుసల్పుటకు మున్ను తనవాస్తవస్వరూప మాతని కెఱింగించుచు నిట్లు పలుకును :

"పాపాత్మా, సింహముచే మత్తగజేంద్రము కైవడి, నాచే బుజమిని ద్రోయఁబడి యీడ్వంబడు కొండనుబోలు నిన్ను నీయప్ప చూడఁగలదు. నీవు హతుఁడవైన సైరంధ్రి నిర్భయముగ సంచరించును. సైరంధ్రిపతులును సుఖపడుదురు."

అని భీముఁ డిట్లు వచించుట కీచకునకు ఎదుర్కొనుటకును, ఎలుఁగెత్తి సేవకాదులం గూయిడుటకును అవకాశ మొసంగుటయె కాక, యేమఱుపాటునఁ గీచకునిఁ బట్టికొని యుక్కడంపఁ గోరు భీమునుద్దేశ్యమునకు విరుద్ధముగ నున్నది. కావునఁ దిక్కన పైభీమ వాక్యములను బూర్తిగా వదలి, యతఁడు "గ్రక్కున లేచి" సూతునిం "దలపట్టివంచి" నట్లువర్ణించినాఁడు.

౬. భీమకీచకులు భూనభోంతరాళములు భేదిల్లునట్లు సింహనాదములు సేయుచుఁ బోరిరని మూలము. ఇందలిప్రకరణవిరోధ మెఱింగి, తిక్కన వారియుద్ధమును వర్ణించుచోటఁ

క. తనయగపాటొరు లెఱుఁగుదు
రని సూతుఁడు, సమయభంగ
మగుటకు భీముండును గొంకుచుఁ, జప్పుడు సే
యని గూఢవిమర్దన ప్రహారములఁ దగఁ."

గడంగిరని వచించినాఁడు. ఇరువురు నిశ్శబ్దముగఁ బోరిరనుటయె కాక, సూతుఁడు నట్లు సేయుట కద్భుతహేతువుం గుదుర్చుట యిందలివిశేషముౘ విశేషము !

౭. మూలమున పాదపయుక్తపాణియై యేతెంచుభీమునిం గని, యుపకీచకులు బెదరి యూరివైపు పరువిడుటకుఁ బూర్వము ద్రోవదిని కట్లనుండి విడిపించిరని యున్నది. ఎవని ప్రాణమువాఁ డక్కఱతో వేగము కాచుకొన వలయు సందర్భమున, నుపకీచకులకు-నీచాత్ములకు ద్రౌపదిని దొలుత విడిపించుతలంపు అంతసహజముగఁ దోఁపదు. కావున నాంధ్రమునఁ దత్క్రమము వ్యతిరిక్తమైనది. ఇట నుపకీచకులు "ద్రుపదసూతిసమేతముగా నగ్ర ప్రేతము వైచి" పాఱందొడఁగ, వాయుసుతుఁడు వారిని సమయించి వచ్చి, పాంచాలీబంధమోక్షణము గావించును. ఈమార్పుచే మానవస్వభావానుగుణత యలవడుటయెకాక, నిజభార్యను విడిపించుగౌరవము భీమునకే అబ్బుట వలన ఔచిత్యమును రూఢివడినది.

౮. కీచకుని వధించుటకు అర్జునుఁ డేల పూనుకొనలేదు ? అను ప్రశ్నమునకు నుత్తరమరయఁగా, మూలమున "నతఁడు తిర్యగ్యోని నొందుటచేత" ననిమాత్ర మున్నది. ఆంధ్రమున నిందు కద్భుతసుకుమార సమాధానము కానవచ్చుచున్నది.

అర్జునవాక్యము:

క. 'నీతోడిపరిచయము లే
దే తలపోయఁగ ననింద్య వెందును నీ వి
ట్లాతుర వగుటకె నామది
నేతాపము లేదు నైజ మెఱుఁగవు కంటే'.

వ. అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరముఁ దాల్చిన యంతియకాక, యూర్వశి యిచ్చిన శాప

బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవు గాకునికి గుప్తసాభిప్రాయంబుగాఁ దెలిపిన......"

౯. కౌరవసభయందు దుర్యోధనుఁడు "పాండవుల వెదకి యెఱుంగు తెఱంగులు మీ మీయెఱిఁగినచందంబున నా కెఱింగింపుఁ"డని సభ్యుల నడుగఁగాఁ, గర్ణుఁడు "తొంటిచారుల కన్న నేర్పరు లగువేగువారిని మరల నంపి వెదకింపవలయు" నని యభిప్రాయ మిచ్చెను. అంత దుశ్శాసనుఁ డిట్లు పల్కెనని మూలము:

"యేషు నః ప్రత్యయో రాజం
శ్చారేషు మనుజాధిప!
తే యాంతు దత్తదేయా వై
భూయ స్తాం పరిమార్గితుమ్."

(మనుజేంద్రా, మనపని యిప్పుడు నెఱవేర్పఁగలరని యేచారులపై గట్టినమ్మకము గలదో, వారికిఁ గావలసినంత ద్రవ్యం బొసంగి మరల వారిని వెదకఁ బంపుఁడు.)

ఆంధ్రమున దుశ్శాసనవాక్యము:

చ. "వలవదు రోయఁ బాండవుల
వా రొకయూఱు లేని త్రిమ్మటన్
బల మతి వన్యసత్త్వముల
పాల్పడి చచ్చినచోటఁ బూరియున్
మొలవదె యింత కింకిట మ
నోముద మస్ఖలితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగు
చందమునన్ గొనియాడు మన్నలిన్."

ఆంధ్రవాక్యము కర్ణునిమాటయే దుశ్శాసనునినోటఁ బునరుక్త మయ్యె నను మూలంపునెరసును దలంగుటయె కాక దుస్ససేనుని స్వాభిమానిత్వమునకును, గాఢగర్వాంధతకును ఎక్కువ యనుగుణముగ నున్నది.

౧౦. మూలమున విరాటుఁడు త్రిగర్తుల పై దండెత్తి తరలునపుడు తనతమ్మునితో "కంక వలల గోపాల దామగ్రంథులు శూరులు బాహుబలాఢ్యులుగఁ జూపట్టుటచే వారును యుద్ధము సేయఁగలరని నానమ్మకము కావున వారికిని గవచాదు లొసంగి రణమునకుఁ దరలింపు" మని చెప్పఁగా, నాతఁడు వారికి రాజాజ్ఞ నెఱింగించి వారిచే నట్ల సేయించును. ఇందుఁ బాండవసాహాయ్య మపేక్షించుట కొసంగఁబడిన కారణము దుర్బల మగుటయే కాక విరాటరాజు తనబలమునందు నమ్మకము సాలక నిజాశ్రితులతోడ్పాటును వేఁడెనా యను సడికి గుఱియగుచున్నాఁడు. కావునఁ దిక్కన పైకథ నిట్లు మార్చినాఁడు. ధర్మరాజే 'అనిలతనయ మాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుండని నిపుణంబుగా నియోగించి తాను మత్స్యవల్లభు నల్లనఁ జేరి', యొకబుపిచేఁ దాను రణవిద్య నభ్యసించితి ననియు, వలల దామగ్రంథి తంత్రీ పాలురును అనికిఁ జేరెన్నఁగన్న వారనియుఁ బల్కె తన్నును, వారిని సమరమునకుఁ దోడ్కొనిపోవుట కాతని నియ్యకొల్పును. మూలానువాదసంవిధానముల కెంతయంతరమో వేఱ వచింపవలయునా!

౧౧. ఖైదియగు సుశర్మను భీముఁడు యుధిష్ఠిరాజ్ఞానుసారము విడిచిపెట్టెనని మూలము. యుద్ధమునఁ బట్టువడ్డ యెదిరిని విడిపించుటకు రాజునకుఁ దక్క నితరుల కేమధికారము

కలదు? కావున, ఆంధ్రమునఁ జైవృత్తాంత మిట్లు మార్చఁబడినది: సమరమునఁ దా మొన ర్చిన యుపకారమునకుఁ ద మ్మగ్గించుచు విర టుఁడు 'ఏద్దియేని కోరుఁ' డని యడుగఁగా, ధర్మజుఁడు

క. "తగ నొక్కటి వేఁడెద నిను
జగతీశ్వర యిచ్చుటొప్పు సరభగజాశ్వం
బుగ విడిచిపుచ్చు మిప్పుడ
త్రిగర్తపతి నిజయ నాకుఁ బ్రియ మెబ్బంగిన్."

అని పలికి యందులకు రాజానుమతి వడయును. ఇందుచే నౌచిత్యపోషణము తెల్లమకదా!

౧౨. ఉత్తరుఁడు తాను కురుబలముపై నెత్తిచనుటకు సారథి లేఁడని వగచుచుండఁగా, సైరంధ్రి యతనితో బృహన్నల యెల్ల విధముల నప్పనికిఁ దగియుండుట నాతనికి నమ్మిక పుట్టఁ బల్కెనని, మూలము. ఆంధ్ర మున, ద్రౌపది యుత్తరునిపలుకులు విని, "యుత్తర యున్న యెడకుం బోయి,బృహన్నల సారథ్యకౌశల మత్తెఱఁగ కెఱింగించి, యమ్ముది తయుఁ దానును జని యతనికి (ఉత్తరునకు) నత్తెఱంగు సముచితముగఁ జెప్పె"నని యున్న ది. పాత్రౌచిత్యనిర్వహణమునం దియ్యెడఁ దిక్కన మూలమునకు మెఱుఁగువెట్టె ననుట అత్యుక్తి యగునా?

౧౩. మూలములో, నుత్తర బృహన్న లను సోదరసారథ్యమునకుం బురికొల్పుచు నిట్లనును:

"అ ష్టై తద్వచనం మేద్య నియుక్తా న కరిష్యసి;
ప్రణయా దుచ్చమా నా త్వం పరిత్యక్ష్యామి జీవితమ్."

(మాయన్న నన్నుఁ బనిచి, నీకుఁ జెప్పి [illegible] నిన్నుఁ దోడ్కొని రమ్మనఁగా నాకు నీయెడ నించుక చనవు కలుగుటఁజేసి యట్లు యని వచ్చితిని. నామాట వినక నన్ను నరకుగొ వేని నేఁ బ్రాణంబులు విడుతును.)

ఆంధ్రమున నుత్తరవాక్యము:

"నీపాల నాకుఁ జనవు కలుగుటంజేసి; యెల్లభంగి విధములం దెత్తునని పూనివచ్చితి. నీవును నాపలుకుఁ గలుగ సేయక, నీపెంపునం బ్రకటంబుగా నయ్యుత్త కుమారునకు రథంబు గడప నియ్యకొని, యియ్యెపఁ దలంగనలయును. అట్లాడంబడక తక్కుట నాపలి వాత్సల్యంబు గొఱంతనఱచుట."

ఇట వచస్సౌకుమార్య మాధుర్యముల మాత్ర కాదుహితృకలకు లోకములో మాతకు దుహితకు నుండుభేదమే కానవచ్చుచున్నది!

౧౪. మూలమున బృహన్నలకు "శుక్ల వసనము;" తెనుఁగున రణోచితముగ "రక్తాం బరము."

౧౫. మూలములో, అర్జునుఁడు నిజ సహోదరులం దన్ను నుత్తరున కెఱింగించు నపుడు తొలుత నే ("అహమ స్మ్యర్జునః") "ఏ నర్జునుఁడను" అని మొదలువెట్టును.

ఆంధ్రమున నర్జునవాక్యము:

క. "కంకుఁడు ధర్మసుతుఁడు వల
లాంకుఁడు భీముండు కవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁదొడఁగితి
నింకఁ గొఱఁతవెట్టనేల యే నర్జునుఁడన్."

ఇం దర్జునుఁడు తన్నుఁ గడపటఁ దెలిపి కొనుటయే కాక, "చెప్పఁదొడఁగితి నింకఁ

గొఱితపెట్టనేల" యని యాత్మనామోచ్చారణము సమాధానము. ఔచిత్యమున నిట మూలానువాద తారతమ్యము సులభగోచరము.

౧౬. ద్రోణుఁడు తన కర్జునుఁడొనర్చు శరప్రయోగరూప సత్కారము నెఱుంగుట.

మూలము:

"ఇమౌహి బాణౌ సహితౌ పాదయోర్మే వ్యవస్థితౌ;
అపరౌచా ప్యతిక్రాంతౌ కర్ణౌ సంస్పృశ్య మే శరా."

(ఇతఁడొక్కపెట్టున రెండుబాణముల నాపాదములఁ దాఁకునట్లుగను, రెండుబాణముల నాచెవులు దాఁకునట్లుగను వేసెను.)

ఆంధ్రము:

"ఇప్పుడు నాకుఁ బ్రణామంబుగాఁ బాదంబుల మొదలంబడ రెండమ్ము లేసి పెద్దకాలంబేని పాసి యున్నవాఁడు కావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం జోకములుగా రెండమ్ము లేసెను."

మూలము ననువదించుటలో "పాదంబుల మొదల", "చెవులు సోఁకియుం జోకములుగా" అనుట యెంత సాభిప్రాయమో, సుకుమారమో రసజ్ఞు లూహించుకొనఁగలరు.

౧౭. అర్జునుఁడు కురువీరులపై సమ్మోహనాస్త్రముం దక్క నన్యముం బ్రయోగింపమికిఁ గారణము మూలమునఁ గన్పట్టదు. తిక్కన యద్దానికిఁ దగిన హేతువు నొసంగక తనివి నొందఁడయ్యెను. "విజయుండు తనతోడంబుట్టువుల ప్రతిన లూహించి యొండు నేయనొల్లక, సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టం దలంచి, సమ్మోహనాస్త్రంబు ప్రయోగించెను." ఇంతకన్న నుచితమగు కారణమేమి కలదు?

౧౮. అర్జునుఁడు సమ్మోహనాస్త్రముఁ బ్రయోగించిన వెంటనే శంఖముఁ బూరించినట్లును, ఆభీమరవముచేఁ గురువీరులు మూర్ఛిల్లినట్లును మూలకథ. శంఖరావప్రస్తావము అప్రస్తుతమును, ప్రకరణప్రతికూలము నగుటచే నాంధ్రమున విడువఁబడినది.

౧౯. మూలమున, అర్జునుఁడే విరటునకుఁ దనసోదరులతోఁగూడఁ దన్నుఁ దానే తెలిపికొన్నట్లున్నది. అన్నదమ్ములందఱచటనే యుండునపుడు కిరీటి తన్నుఁ దా నెఱిఁగించికొనుట అనవసరము, అనుచితము; గావున నిటఁ దిక్కన భీమునిచే నర్జునుని దెలిపించినాఁడు.

మూలకావ్యమునకుఁ గథావ్యాజమున జ్ఞానము నుపదేశించుటయే ప్రధానోద్దేశ్య మగుటను, ఆంధ్రకృతి కథాచమత్కారమును, స్వభావానుసరణమును ముఖ్యముగఁ బాటించుటచేతను, తిక్కన వ్యాసమహర్షి కర్వాచీనుండగుటను పైవ్యత్యయము లుప్పతిల్లె ననియు; వాని నెత్తిచూపుట సంస్కృతాంధ్ర భారత ప్రణేతృగుణతారతమ్య మెన్నుటకొఱకుఁ గాదనియుఁ గొన్నిచోట్లఁ దిక్కన మూలమునకును మెఱుఁగువెట్టెనన్నచో నయ్యది కేవల కావ్యశిల్పదృష్టిచేత నేకాని యన్యమునఁ గాదనియుఁ బాఠకమహాశయులకు విన్నవించుచు నీభాగము నుపసంహరించువాఁడను.

# వాయువిమానాగమనము

వడ్డాది సుబ్బారాయఁడు గారు

విభవన్ శ్రావణ శుద్ధ పంచమి యిదే విచ్చేసెఁ; బుట్టుం దిథిన్
లభియించెం గన నాకు; డెబ్బదిపయిన్ నల్మాఱు లీమాటుతో;
నభవుం డీ శుభవేళ భక్తుపయి నెయ్యానన్ వినోదానకున్
నభమం దేఁగు విమాన మింటికడకున్ రప్పించె దృక్సర్వమున్.

వసునకు వాసవుం డిడె సువర్ణవిమానము రాను బోను నా
కసమున గాఢమైత్రి ననుగాథ మొదల్గఁ బురాణముల్ ప్రశం
న సలుపు పూర్వవృత్తము, లసత్యపుఁగల్పన లంచుఁ దెల్పు మా
నిసి యనుతాప మొందు బుధనింద కిఁకం గని యీ విమానమున్.

బం బన్ నామ విమానయుగ్మము నభోధ్వప్రస్థితిన్ రాజ్మహేం
ద్రంబున్ జేరఁగవచ్చి వ్రాలి యట గోదామధ్యమం దున్న లం
కం బణ్యాంబున దర్శనం బిడుచు నెక్కన్ ముప్పురన్ ముప్పురన్
ఖం బందున్ ద్రుటిఁ బట్టణంబు నలువంకం ద్రిప్పి దీవిం దిగున్.

జమిలి గఱు లిరుఁగెలంకుల-నమరఁగఁ దల దోఁక గలిగి యద్భుతముగ రూ
పము దూనిఁగ బోలఁగ వ్యో-మమునం గడు మొఱయుచున్ విమానము పఱచున్.

ఉడువీథి విమానంబులు-నడువీథిం గార్లు, రైళ్లు నదిఁ బాగనావల్
గడువడిఁ జన రొదతో నె-ప్పుడు సందడి రాజ్మహేంద్రపుర మొప్ప రమన్.

గాలిపడగ మెగురఁగా నా-కసంబునఁ-గంద్రు తెప్పపాటు గనని కనుల;
మానవులకు మేఘమండలం బందించు-నవ విమానదర్శనం బెటుండు?

డాల విహాయసంబునఁ గదల్పక ఱెక్కలు, రాఘులుంగు సు
న్నాలను జుట్టునట్టు, గతినైపుణిఁ జూపుచుఁ గీల్విమాన మీ

ప్రోలను మండలాకృతినిఁ బ్రొద్దుట సాయముఁ జల్లపాటునన్
స్త్రీలును బూరుషుల్ వెలిఁగుఁ జెంద నొనర్చు లఘుప్రచారముల్.

ఉప్పరవీథికిం జనుచు నుట్టిని పిల్చు విమానముం గనం,
గప్పరగందు ల్లాత్రమునఁ గాల్లు తడంబడ, వ్యస్తభూష లొ
చుప్పరిగల్ మెఱుంగుగమి నొప్ప మొగుళ్లను బోల నెక్కి, గన్
తెప్పల నెత్తి వాలుపక నింగికిఁ దావెద రింద్రనీలముల్.

కంటికి తెప్ప, మింటికిని గావిరి, యక్కట! కాలదేశముల్
రెంటికి నడ్డు; వాని కవి లేనిమెడన్ ద్రుటియైన బీఱుపో
కుంటయు, దూరదృష్టి చెడకుంటయుఁ గల్గుఁగదా యటంచు, మి
న్నంటు విమానముం గనెడునప్పుడు లో ననుకొంద్రు చూపఱుల్.

కాకియొ కేకియొ గ్రద్దయొ-నాకసమున నెగఁరుచుండ నదిగో విమానం
బాకడ! నని భ్రమపడుచుఁ ద-దేకధ్యానమునఁ బరువు లిడుదురు బుడుతల్.

ఆలును గేదె లెడ్లుఁ, బసు లన్నియు, మున్నెటు రైలు మోటరుల్
నే లదరం బిఱాన గమనింపఁగ, నూడనిఁ బాడు బీతునం;
బైలున నేఁడు బోరని విమానము పీటఁ జరింప, నట్లు గ
గ్గోలున నుల్కి పాఱుఁ బులుఁగుంబలఁగంబు లెలుంగు లిచ్చుచున్.

వలమై మిక్కిలి చియ్యపట్టిన బలీవర్దంబు పెక్కేండ్లక్రిం
ద లయం బొందెను గ్రోధచోదితము క్రొత్తన్ రైలుతోఁ దాఁకి; నేఁ
డల వృత్తంబు దలంపు వచ్చెడి విహాయఃంబుల్ మహారోషసం
కులముల్ కొన్ని విమానముం దొడర ముక్కుం బోటులన్ అక్కలన్.

మాలల నగ్రవర్ణుల సమానులఁగాఁ జలుపం దలంచు నీ
కాలపు భారతోత్తములఁ గన్గొని, యూరపువారలందు ధీ
శాలులు, నేలవారి దివిషత్తతి నేకము సేయఁ దెచ్చిరో
గాలివిమానమున్, గురియఁ గాంచన మీ విభవన్ నభంబులన్.

చుట్టునకుం దలొక్కటికి సుంకము గొంచుఁ బదేసిరూప్యముల్,
పట్టణముం గనంబఱచుచుఁ బైఁ బ్రదటిఁ ద్రిప్పి విమాన; మందులోఁ
బట్టుదురంట మువ్వు; రొకపారికి ముప్పది; యెన్ని ముప్పదుల్
గట్టునొ మూట గంట ? కిది కాంచనవర్షము దాని కీనెలన్

నీళుల నావ లేఁగుటకు, నేలను సాగుట కట్లు బండ్లు, భూ
పాలక శాసనంబునను బన్నుల నిచ్చుచు నుండ్రుగా ప్రజల్;
పాలకు లింక గాలికిని బైలికి సుంకము గట్టకుందురా,
హేల విమాన మెప్పు డిటు లెక్కి ప్రయాణము సేయ మానవుల్?

అఱచుచు రివ్వునన్ నెగయ నంబరవీథికి వ్యోమయాన, మ
త్తఱి వెఱవేకి, గుండెదడ, దత్తరమై తన కట్టుఁబుట్టమున్
జెఱుచుకొనెన్ విశుం డొకఁ డిసీ యని రోయఁగ లోని మానుసుల్;
పిఱికిమనంబువాఁడు దలపెట్టఁగరాదు విమానయానమున్.

దినము సహస్రపూజ, వెలితిన్ గనకుండఁగ రాణ్మహేంద్ర ప
త్తన మొనరింప, నేత్రకుముదంబులకున్ బ్రమదంబు శ్రావణం
బునఁ దొలితెక్క నక్కజము వొంద ఘటించి విమానరాజ, మా
వెను కెటకేనియున్ జనియె, వెన్నెలఁ జీఁకటిఁ బ్రోల్ దలంచుకోన్.

గరళజ్వాలల పాఁపతేఁడులకు తెక్కల్ సువ్వె, చివ్వం బర
స్పర వైరాన నొక ల్లొకళ్లఁ బరిమార్పన్ విక్కు నిక్కాలపు
ధరణీభర్తల కీ విమానము; లగడ్తల్, దుర్గముల్ వ్యర్థముల్;
పురసైన్యాదులఁ బ్రోచుకో దివికిఁ దల్పుల్ దాపఁగా శక్యమే?

---



డాక్టరు అనిబిసెంటుగారు
౮౧-వ జన్మదినము (౧-౧౦-౧౮౪౭)



శ్రీ రాజా రామమోహనరాయిగారు
౯౫-వ వర్ధంతి (౨౭-౯-౧౮౩౩)

# నందిమల్లయ్య—ఘంటసింగయ్య

ఓటుమళ్ల అచ్యుతరావుగారు,
యం.ఏ., యల్.టి.

(వెనుకటి సంచిక తరువాయి)

## ప్రబోధచంద్రోదయము-భాషాంతరీకరణము

ప్రాచీనాంధ్ర వాఙ్మయమం దిది చాల నరుదైన గ్రంథము. ఆంధ్రకవులు ప్రథమమున సంస్కృత పురాణేతిహాసములనుండి గ్రంథముల నాంధ్రీకరించుచు వచ్చిరి గాని సంస్కృత మహాకవులు రచించిన మహాకావ్యనాటకములను దెనిఁగింపరైరి. కాళిదాసు, భవభూతి, భారవి, మాఘుఁడు, విశాఖదత్తుఁడు మున్నగు మహాకవులు రచించిన గ్రంథములను విడిచిపెట్టి పుక్కిటికథలుగల విక్రమార్క చరిత్రము; భోజరాజీయము, పంచతంత్రము మున్నగు గ్రంథములను బరివర్తించిరి. రఘువంశము, మేఘసందేశము, ఉత్తరరామచరిత్రము, కిరాతార్జునీయము మొదలగు గ్రంథములు ప్రాచీనకవుల యసదృశమగు మృదుమధురధోరణిని రచింపఁబడినయెడల నాంధ్రసరస్వతి నిరుపమానమగు సౌందర్యాతిశయమున మిన్నందియుండెడినని యిదివఱలోఁ బిన వీరభద్రుని విషయమున వ్రాసియుంటిని. శ్రీనాథుఁడు శ్రీహర్షుని నైషధమును దెనిఁగించిన త్రోవను పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు కాళిదాసుని శాకుంతలమును గైకొనెను గాని ప్రత్యేకముగా నాగ్రంథము పరివర్తింపక యందలి పద్యములను గొన్నిటినిమాత్ర మాంధ్రీకరించి తన గ్రంథమం దిడికొనెనని యిదివఱకుఁ జెప్పితిని. గీర్వాణనాటకములలో నుత్తమమైనదాని నీవిధముననైన నొకప్రాచీనాంధ్రకవి చేఁ దెనిఁగింపఁబడిన భాగ్యమాంధ్రులకుఁ గలిగినందులకు సంతోషింపఁదగిన విషయమని యీసందర్భమున వ్రాయఁగలిగితిని. ఈప్రబోధచంద్రోదయ మను ప్రబంధ మట్లుగాక గీర్వాణనాటకరాజములలోఁ జేరొందినదై యుండి ప్రాచీనాంధ్రకవులలో వాసినొందిన యీకవిద్వయముచే సంపూర్ణముగా నాంధ్రీకరింపఁబడినదిగాన నీయాంధ్రగ్రంథమునకు మనము ప్రత్యేకస్థాన మీయఁదగినదని నాయభిప్రాయము.

ఈకవులు తత్కాలాచారమునుబట్టి గీర్వాణనాటకమును సైతము ప్రబంధరూపముగాఁ దెనిఁగించిరి. తెనుఁగున నాటకములు వ్రాయుపద్ధతి యాకాలమున నున్నయెడల వారు దానిని నాటకరూపముగానే తెనిఁగించియుందురు. ప్రబంధముగా మార్చినను, వారు మాతృకలోని కథాప్రణాళికనుగాని, పద్యక్రమమునుగాని, భావస్థితినిగాని సర్వసామాన్యముగా మార్పు లేకుండ స్వీకరించిరి. వీరు రచించిన ప్రబంధమును మాతృకయైన నాటకముతో సరిచూచిన నెవ్వియో కించిద్భేదములు తప్ప రెండు నొకేవిధముగ నున్నవి. ఈవిధముగ సంస్కృతనాటకరాజము నాంధ్రప్రబంధముగ రచించుటయందీకవిద్వితయమే ప్రథమమార్గదర్శకము.

కృష్ణమిశ్రుఁడు దృశ్యప్రబంధమగు నాటకమును వ్రాసియుండెనుగాన దానికి ననువగు మార్గమునఁ దన గ్రంథమును బ్రారంభించెను. నటీసూత్రధారుల ప్రస్తావన పూర్తియయినవెంటనే తెరమాటు తొలఁగి కాముఁడు, రతియు రంగస్థలముఁ బ్రవేశించి, నాటకమందలి కథావిషయమును సంభాషణక్రమమున విశదపఱుతురు. ఈజంటకవులు శ్రవ్యప్రబంధమును వ్రాసియుండిరిగాన నాపద్ధతిని విడనాడి తమప్రబంధమున కనుకూలమగు విధమున గ్రంథమును బ్రారంభించిరి. అనఁగా: నొకచిదానందనగరి యను పట్టణ ముండెను. అం దీశ్వరుఁడను రాజు పరిపాలించుచుండెను. ఆయన కిద్దఱు భార్యలుండిరి. వారిద్దఱకుఁ బుత్రులు గలిగిరి. ఆకొడుకులు రాజ్యముకొఱకుఁ బోట్లాడుకొనుచుండెడివారు. అందుఁ బెద్ద భార్యకొడుకు తండ్రిపేరను రాజ్యముఁ జేయుచు రెం

డనభార్యపిల్లలను దఱుమఁగొట్టుటకుఁ బెద్దయాలోచన సభ గావించెను. అసభయందుఁ గాముఁడును, రతియును దమతమ సామర్థ్యములను బ్రకటించిరి. ఇట్లు గీర్వాణ నాటకమునందుఁ బ్రారంభమున నున్న రతీకాముల ప్రసంగ మీయాంధ్రప్రబంధమునఁ గథ కొంతవఱకుఁ జెప్పఁబడిన తరువాత వచ్చినది. అనఁగా, గీర్వాణనాటకమున గథను జెప్పెడువా రాయాపాత్రములే; మన ప్రబంధమున గథను జెప్పెడివాఁ డొకానొక కథకుఁడు. ఈవక్తృభేదముచే గ్రంథప్రారంభభేదమును గలిగినది. *

ఇట్టి స్వల్పభేదము లింకను మఱికొన్ని కాన్పించుచున్నవి. వానికి ముఖ్యకారణ మీరెండు గ్రంథముల నిర్మాణభేదమే యని చెప్పఁదగును.

ప్రబంధమునందుఁ గొన్నివర్ణన లుండవలయునని యొకశాస్త్రనియమ మున్నదికదా! ఆనియమముకొఱకు నాటకమునందు లేకపోయియినను కొన్నివర్ణనల నీకవులు కల్పింపవలసివచ్చెను.

ప్రథమమునఁ జిదానందనగరవర్ణనము. ఈచిదానందనగరిపేరు నాటకమున లేనేలేదు. ఆనగరిపేరు కల్పించి ప్రబంధనియమములకొఱకు కీకవులు వర్ణించిరి.

ప్రబంధమునందు మహామోహాదులకును, వివేకాదులకును జరిగిన యుద్ధము ప్రారంభింపకపూర్వము సాయంకాలవర్ణనము చేయఁబడినది. నాటకమం దీవర్ణనము లేదు. ఈవిధముగా నచ్చటచ్చట మాతృకలో లేని క్రొత్తవర్ణనలు కల్పింపఁబడినవి.

కాశీనగరమందు మహామోహమహారాజు ప్రవేశించినప్పుడు కొంత పరివార మున్నదనిమాత్రము నాటకమందు సూచింపఁబడినది. కాని కాముఁడు, లోభుఁడు, క్రోధుఁడు మొదలగువారు రాజునొద్ద నుండినట్లు చెప్పఁబడలేదు. వీరికిఁ బనులు నియోగింపవలసివచ్చినపుడు రాజు ప్రత్యేకముగాఁ బ్రతీహారులను బంపి యొకరినొకరిని రప్పించి వానివాని కవసరకార్యములను నిర్ణయించెను. ఈప్రబంధమం దట్లుగాక మహామోహుఁడు కాశీనగరమందుఁ బ్రవేశించునప్పుడే కామక్రోధాదిబంధువులు, మున్నగువా రాతనితో నుండినట్లు వర్ణింపఁబడినది. కాఁబట్టి శత్రువర్గమువారిని గుఱించి తాను జేయవలసిన నిర్మూలనశాసనములను దెలియఁజెప్పుటకుఁ గామక్రోధాదులను వేఱె పిలిపింప నక్కఱలేక వారి సమక్షముననే యాయా యాజ్ఞలను వారివారికి జారీ చేయించెను.

మఱియొక చిన్నభేదము. జీవేశ్వరునికడకు వివేకమహారాజు, నుపనిషద్దేవిని దీసికొని సమ్మని శ్రద్ధాశాంతులను విష్ణుభక్తిమహాదేవి పంపినట్లు గ్రంథమం దున్నది. ఆయిరువురును జీవేశ్వరుని దర్శించుటలోఁ జిన్నభేదము భయగ్రంథములయందును గాన్పించుచున్నది. నాటకమం దుపనిషద్దేవి శాంతిసహితయై ప్రథమమున జీవేశ్వరునికడకుఁ బోయినట్లుగ నున్నది. ప్రబంధమున నట్లుగాక యీక్రమము మారినది. బహుశః భర్తయగు వివేకమహారాజున కీశ్వరుని ప్రథమదర్శనము కల్పించుట యుచితమగు మర్యాద యని కాఁబోలు నీకవులు తలంచి వివేకమహారాజునకు మొదటిప్రవేశము చేయించి, పదంపడి యుపనిషద్దేవిని రావించిరి.

ఇట్టి కించిద్భేదము లచ్చటచ్చట కథాక్రమము నందుఁ గాన్పించుచున్నవి. అయిన నీయల్పమైన మార్పులు దప్ప, మొత్తమమీఁద నుభయగ్రంథములను బరస్పరము సరిపోల్చినచో, నీగ్రంథము సంస్కృతమాతృకకు చక్కని యాంధ్రీకరణమని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

కథాప్రణాళికవిషయ మింతటితో ముగించి భాషాంతరీకరణవిధానమును గుఱించి స్థాలీపులాకముగాఁ గొన్నివిశేషములను జూపించెదను.

---

* శ్రవ్యప్రబంధమునుగూడ దృశ్యప్రబంధమువలెనే తెరచాటుఁ దప్పించి కథాపాత్రలచేఁ బ్రారంభింపఁజేసెడు పద్ధతి పింగళిసూరనార్యుని యపారమేధాశక్తివలనఁ గల్పింపఁబడినది. ఆమహామహునిప్రతిభ వెనుకటివారికిఁగాని, తరువాతివారికిఁగాని లభ్యము కాలేదు. కావున నాంధ్రవాఙ్మయమున నాయననిక్కముగనద్వితీయుఁడు.

## నాటకమందు

౧. అహల్యాయై జారః సురపతి రభూ దాత్మతనయాం
ప్రజానాథో౽యాసీ దభజత గురో రిందు రబలామ్
ఇతి ప్రాయః కోవా న పద మపథే౽కార్యతమయా
శ్రమో మద్బాణానాం క ఇవ భువనోన్మాథ విధిషు.

## ప్రబంధమందు

సీ. తన కన్నకూఁతును దాన పెండ్లాడఁడే
వారిజగర్భుండు వావి తప్పి
బలభేది గౌతము భార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్ల మేఁకతప్పు
కచ లేనిరట్టడి కొడి గట్టుకొని యైనఁ
గమలారి గురుతల్పగతుఁడు కాఁడె
తపనసూనుఁడు తారఁ దా నాక్రమింపఁడె
యన్నప్రాణములకు నట్టు దలఁచి
మఱియు నిట్లు జగంబుల మరులుకొల్పి
యెట్టి నియతాత్మకులనైన గట్టు చెఱిచి
కాని త్రోవల నడిపించు కడిమి నాదు
వాలుఁదూపులగమి కవలీల గాదె.

నాటకమందలి శ్లోకమున మూఁడు దృష్టాంతములతో స్త్రీమోహనత్వము నిరూపింపఁబడినది. ఆశ్లోకము నీకవులు సీసపద్యరూపముగాఁ దెనిఁగించిరి. సీసపద్యమందు నాలుగు పాదములును, పైఁగా నొకయెత్తుగీతమును ఉండునుగదా. నాలుగు పాదములు సమనిర్మితముగా నుండుటకు నాలుగు గాథలు కావలసియున్నవి. మాతృకయందు మూఁడు మాత్రమే యున్నవి. తత్కారణమున నీకవు లొక నూతనగాథను, అనఁగా, తపనసూనుఁడు (సుగ్రీవుఁడు) తారను గుఱించినదానిని చేర్చి యాపద్యమునుఁ బూర్తి చేసిరి.

## నాటకమందు

౨. శ్రీదేవీజనకాత్మజాదశముఖ స్యాసీ ద్గృహే హర్తుసో
సీతాచైవ రసాతలం భగవతీ వేదత్రయీ దానవైః;
గంధర్వస్య మదాలసాంచ తనయాం పాతాలకేతుశ్ఛలా
ద్దైత్యేంద్రో౽పజహార హన్త విషమా వామా విధే
[ర్వృత్తయః.

## ప్రబంధమందు

సీ. చాప చుట్టఁగ జుట్టి చంకఁ బెట్టుక పోఁడె
ధరణి హిరణ్యాక్షు దానవుండు
వేదత్రయీ కాంత వెస ముచ్చిలింపఁడే
చూఱ పట్టినయట్లు సోమకుండు
సాక్షాన్మహాలక్ష్మి జనక భూపాలనం
దనఁ జెఱ పట్టఁడే దశముఖుండు
కొసరక యమ్మదాలసఁ గొనిపోఁడె పా
తాళకేతుఁడను నక్తంచరుండు
గాన నింతేసివారముగా యనంగ
రాదు పో యెట్టి పుణ్యవర్తనునికైన
సహజవక్రంబుగాన సజ్జనుల మేలు
చూడఁజాలక విధి తప్పఁ జూచెనేని.

పై నుదాహరించిన నిదర్శనము మాదిరిగా నే యీ పద్యమందును సీసపద్యమందలి నాలుగు పాదములను సమానముగాఁ బూరించుటకుఁగాను హిరణ్యాక్షుఁడును ధాత్రి దేవిని గుఱించినగాథను నూతనముగాఁ జేర్చి కవు లీశ్లోకము ననువదించిరి.

## నాటకమందు

3. నిత్యం స్మరజ్జలదనీల ముదారహార
కేయూరకుండల కిరీటధరం హరిం వా;
గ్రీష్మే సుశీతమివ వా హ్రద మస్తశోకం
బ్రహ్మ ప్రవిశ్య భజ నిర్వృతి మాత్మనీనాం.

## ప్రబంధమందు

లయగ్రాహి. నందకధరున్ ఘనపురందరమణి ప్రతిము
నిందిరమనోహరు ముకుందు హరిఁ గానీ
చందనమరాళబిసకుందధవళాంగు గిరి
మందిరు సుమారమణు నిందుధరుఁ గానీ

పాండుగ సదా మనసునం దలంచిరైనం జిర
మందమగు తత్పరమునిం దలంచిరైనం
డెందముల పాపము వడిం దలఁగుఘర్మ మునఁ
గుందిమడుగుందఱియడిందుపడులీలన్.

నాటకకర్తయగు కృష్ణమిశ్రుఁడు వైష్ణవమతస్థుఁడగుటచే నందకధరుఁడగు శ్రీమహావిష్ణువును మాత్రమే తనగ్రంథమందుఁ జేర్కొనియెను. ఈకవులు శైవమతాచార్యు లగుటచే మాతృకానుసారముగా శ్రీమహావిష్ణు ప్రశంస చేయుచుఁ బక్షాంతరమున నందివాహనుఁడగు శివునిగుఱించికూడఁ జేర్చిరి.

కాఁబట్టి కృష్ణమిశ్రుని మహానాటకము నాంధ్రమున ననువదించుచున్న నీజంటకవులు కొన్ని స్వకపోలకల్పనల నచ్చటచ్చటఁ బొందుపఱచి కొంత స్వాతంత్ర్యమును గనుపఱచిరి. కాఁబట్టి వీరును దమ సమకాలికులగు శ్రీనాథాదులవలెను, దమకుఁ బ్రాచీనులగు తిక్కనాదులవలెను స్వేచ్ఛగా భాషాంతరీకరణ మొనర్చినట్లు నిశ్చయింపవచ్చును.

భాషాంతరీకరణరీతిని గుఱించి మఱిరెండు నిదర్శనములను జూపి యీభాగమును ముగించెద.

నాటకమందు

౪. సమ్మోహయంతి మదయంతి విడంబయంతి
నిర్భర్త్సయంతి రమయంతి విషాదయంతి;
ఏతాః ప్రవిశ్యసదయం హృదయం నరాణాం
కిం నామ వామనయనా న సమాచరంతి.

ప్రబంధమందు

సీ. వన్నెలు పచరించి కన్ను సన్నలు చేసి
వెడమాటలను ప్రేమ గడలుకొలిపి
తరితీపు నటనలఁ దమకంబుఁ బుట్టించి
వట్టి ప్రియంబుల గుట్టు తెలిసి
కలికితనంబునఁ గాఁకలు గావించి
తోడినీడలువోలెఁ గూడిమాడి
యలుకల నలయించి కలయిక వలపించి
బాసల నడియాసఁ బాదుకొల్పి,

మనసు కరఁగించి భ్రమయించి మస్తరించి
మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులు పఱచి
పాసి యెడఁబాసి తమబంటుఁ జేసికొనరె
వామలోచన లెంతటివారినైన.

నాటకమందు

౫. "క్షేత్రగ్రామవనాద్రిపత్తనపుర ద్వీపక్షమామండల ప్రత్యాశాయతసూత్రబద్ధమనసాంలబ్ధాధికంధ్యాయతాం; తృష్ణే దేవి యది ప్రసీదసి తనో ర్వ్యంగాని తుంగాని చేత్తదోష్ణః ప్రాణభృతాంకుతఃశమకథా బ్రహ్మాండలక్షైరపి.

సీ. పుడమిలో మాన్యంపు మడి కొంత గలవాఁడు
గ్రామమెల్లను నేలగాఁ దలంచు
గ్రామ మేలెడువాఁడు కాంక్షించు గిరివన
స్థలజలదుర్గప్రదాజ్య మేల
రాజ్య మేలెడువాఁడు రాజ్యవైభవమున
హెచ్చి తా నొక ద్వీప మేలఁ గోరు
ద్వీప మేలెడువాఁడు తేజస్వియై మహీ
వలయ మెల్లను నేల వాంఛచేయు

నిట్లు కడలేని యాసాస లీనుచుండ
జనులు బ్రహ్మాండకోటులఁ దనివినొంద
రనిన శాంతికిఁ గా లూఁదనైనఁ గలదె
యెడము మదిఁ గృష్ణ నీ వింత వెడలితేని.

వరాహపురాణము

ఈకవులిద్దఱు ప్రబోధచంద్రోదయము రచించిన తర్వాత వరాహపురాణమును దెనిఁగించిరి. ఈరెండు గ్రంథముల పౌర్వాపర్యము నిర్ణయించుట కాగ్రంథములం దెక్కువైన యాధారములు లేవు. కాని యాగ్రంథముల కృతిసమర్పణము స్వీకరించిన నాయకుల జీవితకాలములఁబట్టి కొంతవఱకు నేతద్విషయము లూహింపఁ గలుగుదుము. ప్రబోధచంద్రోదయము నంకితమునొందిన చెంచులూరి గంగయమంత్రి సాళువనృసింహరాయలకు సమకాలికుఁడై యానృసింహరాయలు దండనాయకుఁడుగా నున్న కాలమునాటివాఁడు. వరాహపురాణమును గృతి

నొందిన తుళువ నరసరాయలు సాళువ నృసింహరాయల యొద్ద దండనాయకుఁడుగా నుండుటయేకాక, యాతని ప్రశంసావాక్యములనుబట్టి చూడఁగా నా నృసింహరాయలు విద్యానగరరాజ్యము నేలుచున్న నాఁటి వాఁడని కాన్పించుచున్నది. కాఁబట్టి వరాహపురాణము రచనకాలమునకు సాళువనృసింహరాయలు సింహాసనస్థుఁడై యుండెను. ఈచారిత్రక విషయములఁబట్టి ప్రబోధచంద్రోదయము వారి మొదటిగ్రంథమనియు, వరాహపురాణము రెండవగ్రంథమనియు చెప్పవలసియున్నది. ఇంతియకాక యాగ్రంథముల శైలి భేదము లీయూహను మఱింత బలపఱచుచున్నవి. ప్రబోధచంద్రోదయము సులభమైనట్టియు, మృదులమైనట్టియు శయ్యారీతుల వ్రాయఁబడినది. వరాహపురాణ మట్లుకాక, ప్రౌఢతరమై, జటిలమైన శైలిని వ్రాయఁబడినది. కావునఁ బ్రబోధచంద్రోదయమును బ్రథమమున విమర్శించి తర్వాత వరాహపురాణమును బరిశీలింప నుద్యమించితిని.

వరాహపురాణ మీకవివరుల లలితములైన వాగ్విలాసములచెన్ను వహించియున్నను కథాసంభృతినిబట్టి చూడ నాంధ్రవాఙ్మయచరిత్రమునం దెక్కువగా నుగ్గడించుటకుఁ దగినదని నాకుఁ దోఁపదు. ఈగ్రంథము యొక్క ప్రాముఖ్యము దీనియందలి కథాస్వారస్యముకంటె నిందుఁ బొందుపఱుపఁబడిన విజయనగరరాజ్య చరిత్ర వృత్తాంతములపై నాధారపడి యున్నదని నాయభిప్రాయము. ఈకవులు తమయధిపతియైన తుళువ నరసరాయలయొక్కయు, నతని ప్రభువైన సాళువనృసింహరాయలయొక్కయు వంశచరిత్రములను సావధానముగ వ్రాసియుఁ, జెక్కు లపూర్వవిషయములు చేర్చియు నాంధ్రచరిత్ర పరిశోధకులకు నిక్కమైన సాయ మొనరించినవారైరి.

## తుళువ నరసరాయలు

విజయనగరరాజ్య చరిత్రమున నరసరాయలనియు, నరసనాయకుఁడనియుఁ బేరొందిన యీమహనీయుఁడు తుళువ వంశమువాఁడు. ఈతనివంశమున కీపేరు తామేలుచుండిన దేశమునుబట్టి వచ్చిన ట్లీక్రిందిపద్యములఁ దెలియవచ్చుచున్నది:

ఉ. మిన్నుల మోచి భాగ్యమున
మీఱినకోటల రమ్యహర్మ్య సం
పన్నత సస్యవాటగరి
మంబులఁ దోఁటల వాహవారణా
ఢ్యున్నతిఁ గేలిదీర్ఘికల
నుగ్రభటావలి వన్నెకెక్క వా
రాన్నిధి కాంచి పైఁ దుళువ
రాజ్యము సంతతవీరభోజ్య మై.

క. ఆతుళువరాజ్యమున వి
ఖ్యాతి వహించిరి దిగంత కరికటతట సం
భూతమదఘోళన వి
ద్యాతత్పరకీర్తిఁ జెండ్లియాడిన రాజుల్.

ఈవంశస్థులు తుళువదేశపరిపాలనచేత తుళువవంశస్థులని పేరు గణించిరి. ఆతుళువదేశ మేదో నిర్ణయింపవలసియున్నది. తుళునాడు అని మైసూరుసంస్థానములోనిదైన యొకభాగమునకుఁ బేరు. కాఁబట్టి నరసరాయలపూర్వులు ప్రాచీనకాలమున నాదేశపువారై యుండిరేమోయని మన మూహింపఁదగినది. నరసరాయల కాలమునను, అతనితండ్రి యీశ్వరరాయల కాలమునను వీరును, వీరికుటుంబమువారును జిత్తూరుజిల్లాలో నున్న చంద్రగిరిలో రాజ్యముచేయుచున్న సాళువ నృసింహరాయలయొద్ద దండనాయకులుగా నుండిన కారణమునఁ గొన్ని తరములనుండియు నీవంశజులు చిత్తూరుజిల్లా యొక్కయు, ఉత్తరార్కాడు జిల్లాయొక్కయు ప్రాంతముల వలస లేర్పరచుకొని రాజ్యములు చేయుచున్నట్లు నిశ్చయింపవచ్చును. ఈయభిప్రాయమునకుఁ బ్రబలమైన యాధార మింకొకటి యీగ్రంథమందు కాన్పించుచున్నది. నరసరాయలగుఱించి వ్రాయుచు నీకవివరులు వరాహపురాణమందలి యేకాదశాశ్వాసాంత పద్యములలో నిట్లు వ్రాసిరి:—

క. ధరణినుత దేవకీపుర
వరనిలయ శ్రీగిరీశ వరసంపన్నే
శ్వర విభుతనయా సాళువ
నరసింహనృపాల దండనాయక తిలకా!

అనఁగా, భూలోకమందుఁ బ్రసిద్ధినొందిన దేవకీపురము నివాసస్థలముగాఁ గలిగినవాఁడా! శ్రీశైలమల్లేశ్వరస్వామివలన నీశ్వరనాయకునకుఁ బుట్టినవాఁడా, సాళువనృసింహరాయ సార్వభౌమునకు ముఖ్యమైన దండనాయకుఁడా, యని నరసరాయలను సంబోధించిరి. కావున తుళువనరసరాయల రాజ్యస్థానము దేవకీపురము.

ఈదేవకీపుర మెచ్చట నున్నది? ప్రస్తుత ముత్తరార్కాడుజిల్లాలో ఆరణితాలూకాలో నొకదేవకాపుర మను ప్రాచీనస్థల మున్నది. అది గవర్నమెంటువారి రివిన్యూగ్రామముల జాబితాలో దేవికాపురమనియు, ప్రాచీనశాసనములలో దేవకాపురమనియు నున్నది. అది నిక్కముగ దేవకీపురమనియే నుడువవచ్చును. ఆపురమందలి బృహదంబదేవాలయములో ననేకమైన శిలాశాసనము లున్నవి.

ఆశాసనములుఁ జాలవఱకు తుళువఈశ్వరరాయల కుటుంబములోనివారు లిఖించినవే. ఈశ్వరరాయలు, నరసరాయలు, వీరనృసింహరాయలు, కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు, సదాశివదేవరాయలు, వెంకటపతిరాయలు, శ్రీరంగరాయలు మున్నగువా రనేకదానములీబృహదంబకు చేసి శాసనములు లిఖించిరి. సాళువనృసింహరాయలయు, ఆయనకుమారుఁడు నృసింహరాయలయుశాసనములు నీదేవళమందుఁ గాన్పించుచున్నవి. కాఁబట్టి తుళువనరసరాయలతండ్రియైన యీశ్వరరాయల ముఖ్యపట్టణ మీదేవకీపురమని నిశ్చయింపవచ్చును. ఈతఁడు తనచిన్నరాజ్యమును బరిపాలనచేయుచుఁ దన దేశమునకు సరిహద్దున నున్న చంద్రగిరిలో రాజ్యము చేయుచుండి, క్రమముగా విజయనగరరాజ్య సింహాసనమెక్కి, సాళువనృసింహరాయలకు సేనానాయకుఁడై యాతనికొలువులో నుండెను. ఆయాశ్రమముఁబట్టి తన కుమారుఁడైన నరసరాయలకును నృసింహరాయలయొద్దసైన్యాధిపత్యము సంపాదింపఁగలిగెను. నరసరాయలు బాహుబలముచేతను, బుద్ధిబలముచేతను, అన్నిటికంటె నెక్కువైన నీతిబలముచేతను దినదినాభివృద్ధినొంది విజయనగరసింహాసనమును సాళువవంశ మంతముగాఁగ దనకుమారుల కొప్పగింపఁ గలిగెను.

కావున సాళువ నృసింహరాయలును, తుళువనరసరాయలును ఆంధ్రులని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. కర్ణాటకులగు సంగమవంశముతోఁ బ్రారంభించిన విజయనగరరాజ్యము పదునేనవశతాబ్ద్యంతమునఁ గేవలము తెలుఁగువారైన సాళువనృసింహరాయలవశమై, యాతనితరువాతఁగూడఁ దెలుఁగువారైన తుళువవంశస్థుల యాధిపత్యములోనికిఁ జేరినది.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినిభారత కృతికర్తయగు సాళువనృసింహరాయలు క్రీ. వె. 1487 సం. విజయనగరరాజ్య సింహాసనాసీనుఁ డయ్యెనని యిదివరలోఁ జెప్పితిని. ఆతఁడు సుమారు ఆరుసంవత్సరములు రాజ్యముచేసి క్రీ. వె. 1493 లోఁ బరలోకగతుఁ డయ్యెను. ఆతని మరణకాలమునాఁటికి నాతని యిద్దఱుకుమారులు పిన్నవారై యుండుటచేత, వారిపోషణమును, సామ్రాజ్యసంరక్షణమును నిర్వహించుటకుఁ దన యొద్ద ముఖ్యదండనాయకుఁడుగాను, బహువిశ్వాసపాత్రుఁడుగాను నున్న తుళువ నరసరాయలఁ నాతఁడు నియోగించెను. నరసరాయలు స్వామికార్యమును కడుభక్తితో నిర్వహించి, రాజ్యభారము నంతయుఁ దానే, వహించుచున్నను, దన ప్రభువు నియోగమును మాత్రము మరచి యుండలేదు. సాళువనృసింహరాయల పెద్దకొడుకు సింహాసనారూఢుఁడై కొలఁదికాలములోనే, అనఁగా క్రీ. వె. 1493 లో, తురుష్కులతోఁ బోరి సమరాంగణమున వీరస్వర్గముఁ జూఱఁగొనెను. ఆకారణమున నరసరాయలు నృసింహరాయల రెండవకుమారుఁడగు ఇమ్మడి నృసింహరాయలను సింహాసనమునం దుంచి తాను సంరక్షకుఁడుగా మెలఁగుచుండెను.

సాళువ నృసింహరాయ లింకను బ్రతికియుండఁగానే, తా నామహీవల్లభుని సైన్యముల సర్వాధిపత్యము

వహించియుండఁగానే యీవరాహపురాణమును గృతి నొందినట్లు తెలియవచ్చుచున్నది.

తుళువవంశమును సాళువవంశమువలెనే చంద్ర వంశము. సాళువవంశజులు మొదట ఓరుగల్లుప్రాంతముల రాజ్యముచేయుచుండినట్లుగానే యీవంశజులును మొట్ట మొదట మైసూరుప్రాంతములలో రాజ్యముచేయుచుఁ, దురుష్కుల యొత్తిడి కారణముననో, మఱేకారణము ననో తూర్పుదేశమునకుఁ బోయి, తెనుఁగుదేశములోఁ జిన్నచిన్న సంస్థానము లేర్పరచుకొని రాజ్యములు చేయుచుండినవారు. బహుశః సరిహద్దుసంస్థానములలో రాజ్యములు చేయుచుండినవా రగుటచే సాళువవంశ మునకు తుళువవంశమునకు సంబంధబాంధవ్యము లేర్పడి యుండెడివి. చంద్రగిరిరాజులగు సాళువవంశపువారియొద్ద నీ తుళువ నరసరాయలును, అతనితండ్రి ఈశ్వరనాయ కుఁడును సైన్యాధిపత్యమును వహించినవారై యుండిరి. ఇన్నితరములనుంచి రాజ్యకార్యవిషయములలో నగ్గల మైన స్నేహసాహచర్యములు గలిగియున్న రాజమం త్రులకు రాజకీయసంబంధమే కాక రక్తసంబంధము కూడను ఉండకపోదు. అది యింకను గ్రంథస్థేతివృత్త ముల నిర్ధారింపఁబడవలసిన విషయము. *

తుళువవంశములోఁ దిమ్మరాజు పుట్టెను. అతనికి భార్య దేవకీదేవి. వారిరువురకు నీశ్వరరాజు, తిమ్మరాజు అని యిద్దఱు కొడుకులు గలిగిరి. వారిలో నీశ్వరరాజు సాళువనృసింహరాయలయొద్ద దండనాయకుఁడై యనేక దుర్గములను దన ప్రభువు కొఱకు జయించెను. §

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోటపురంబుఁ గదలఁ ద్రవ్వె
పెనుకొండ సాధించె బెంగళూరు హరించెఁ
గోవెల నెల్లూరు గుటుపఱచెఁ
గుందాణి విదళించె గొడుగుచింత జయించె
బాగూరుపంచము పాడుచేసె
నరుగొండ వెకలించె నామూరు మర్దించె
సీరంగపట్నము చారిసమరె

రాయచౌహత్త మల్లధరావరాహ
మోహనమురారి బర్బరబాహుసాళ్వ
నారసింహప్రతాప సన్నహనుఁ డనుచు
విశ్వహితకారి తిమ్మయయీశ్వరుండు.




* కీర్తిశేషులైన కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు తమ 'మహమ్మదీయ మహాయుగము' అను గ్రంథమునందు, (పుట 848) సాళువ నరసింహరాజునకును, తుళువనరసరాయలకును గల సంబంధబాంధవ్యము నీక్రిందివిధముగఁ దెల్పిరి:—

"ఈతుళువవంశము సాళువవంశాంతర్గతము. సాళువ నరసింగరాజుతండ్రి గుండరాజు. అతని కిద్దఱు కుమారులు: మొదటివాఁడు తిమ్మరాజు; రెండవవాఁడు సాళువ నరసరాజు. తిమ్మరాజునకు నీశ్వరరాజును, నాయీశ్వరరాజునకు నీతుళువనరసరాజును బుట్టిరి. కావున తుళువ నరసరాజు సాళువనరసరాజునకు అన్నమనుమఁడు." ఇట్లీ రెండువంశములకుఁ బరస్పరబాంధవ్యము నిర్ణయించుటకు వీరికి దొరకినయాధార మెద్దియో నాకుఁ దెలియలేదు.

§ "అట్టు సాళువ నరసింగరాజరత్నముచేత మన్నన వడసి, సైన్యనాయకపట్టభద్రత్వంబున, నిర్నిద్రవిజయలక్ష్మీ మహత్వంబున, మదవదభియాతి భయదసత్త్వంబున, దీర్ఘాయురైశ్వర్యధుర్యుండైన ఈశ్వరనాయకునకుం బ్రియతనూభవుండు నరసవసుధాధ్యక్షుండు." (వరాహపురాణము.)

నెల్లూరిజిల్లాలోని ఉదయగిరి, చిత్తూరుజిల్లాలోని పుత్తూరు, కడపజిల్లాలోని గండికోట, అనంతపురం జిల్లాలోని పెనుగొండ, మైసూరురాజ్యములోని బెంగుళూరు ఇత్యాది కడిందిదుర్గములను జయించి సాళువ నృసింహరాయలకుఁ గుడిభుజముగా నుండెను.

ఇంతియకాక బెడందకోట (బీదరు) యవనసైన్యములతో ఘోరమైనరణము గావించి నెల్లూరుజిల్లాలో నున్న కందుకూరుకడ వారిని విధ్వంసముచేసి గొప్పవిజయముఁ బొందెను.

మ. నరసింగక్షితిపాలుపంపునుడు గా
నాఁ జేసి దండెత్తి యీ
శ్వరభూభర్త బెడందకోట యవనా
శ్వవ్రాతముల్ భీమ సం
గరరంగంబునఁ గొల్లవట్టుకొని వీఁ
కం గందుకూరీపురాం
తరసీమంబునఁ జక్కఁగా నఱికె దు
ర్దాంతారి సంతానమున్. *

ఉ. రాజులనెత్తుటం బరఁగ
రాముఁడు వ్రంతలు సేసె రెండుమూఁ
డీజగతిన్ గణింప నది
యెంతటివిస్మయ మబ్జినీసుహృ
త్తేజుఁడు కందుకూరికడఁ
దిమ్మయయీశ్వరుచే జనించె ఘో
రాజి బెడందకోట యవ
నాశ్వికరక్తనదీసహస్రముల్.

ఈ యీశ్వరరాజునకు నిద్దఱుభార్యలు: గౌరాంబయు, †బుక్కాంబయు. రెండవభార్యయగు బుక్కాంబకు నరసరాయలు, తిమ్మరాజు అను నిద్దఱుపుత్రులు కలిగిరి. ఈనరసరాయలే యేతద్గ్రంథమునకుఁ గృతిపతి.

నరసరాయలు కాలక్రమమున తండ్రిస్థాన మలంకరించి, సాళువనృసింహరాయలయొద్ద దండనాయకపట్టభద్రుఁడై, యాతనికి ముఖ్యసచివుఁడై ప్రాణమిత్రుఁడై యుండెను. § సాళువనృసింహరాయలు విద్యానగరరాజ్యసింహాసనాసీనుఁడుగా నుండినకాలమున నాన్నపాలునికడ బహువిశ్వాసపాత్రుఁడుగా నుండి యామహీవల్లభుని యభ్యుదయమే తనకర్తవ్యముగా నాలోచించుకొని నిర్వ్యాజరాజభక్తిలో మెలఁగుచుండెను. ఒకవంక భామినీసుల్తానులతోను, మఱియొకదిక్కునఁ గళింగభూపతులతోను నిరంతరము సమరములు సలుపుచు వారి నరికట్టి విజయనగరసామ్రాజ్యము చెక్కుచెదరకుండఁ గాపాడుచువచ్చెను.

నరస దండనాయకుని విజయమునుసురించి వరాహపురాణమున నిట్లభివర్ణితమైనది:—

ఉత్సాహ. మందునా బెడందకోట మాహురాదిమేదినీ
మండలేశ్వరస్తుతా సమానమానుషోదయా
భండనాజితప్రచండపటహనిస్వనార్భటీ
హిండితొప్పదిక్కుడుంగ యీశ్వరాత్మసంభవా.

అనఁగా, మందువా, బెడందకోట, మాహురీ(నిజాంరాజ్యములో నున్నది) మొదలగు కోటలను జయించినట్లు చెప్పఁబడినది.

ఇంక పారిజాతాపహరణములో నరసరాయలను గుఱించి వ్రాయుచు నీకవులకు బంధు వయిన ముక్కుతిమ్మన యిట్లు వ్రాసెను:—

సీ. కుంతలేశ్వరుఁడు సిక్కువడంగ విద్యాపు
రంబుఁ గైకొని నిజప్రాభవ మెఱసె
శారసీకునకు దుర్ధర మానవత్త్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధ
రము లిచ్చి మధురాపురంబుఁ గొనియె

* ఈవిషయమునే ముక్కుతిమ్మన్న తనపారిజాతాపహరణములోఁగూడ నుదాహరించెను.

† బుక్కాంబకు లక్కాంబ యని ముక్కుతిమ్మన పారిజాతాపహరణములో నున్నది.

§ నరసింగనృప సామ్రాజ్యరమాభరణా నరసింగస్వామి నిర్నీతసంకల్పాభిజ్ఞ (వరాహపురాణము)

శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటే వి
నోదంబు హైసణేంద్రునకుఁ జూపె
నతఁడు నతి కెక్కె హైమ నేత్వంతరాళి
కలిత షోడశదాన విఖ్యాతయశుఁడు
మండలీకర మేఘ మార్తాండబిరుదుఁ
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

విద్యాపురము (బిజాపురము), మానవదుర్గము (మన్నవ), మధుర, శ్రీరంగపట్నము మున్నగు ముఖ్య పట్టణములను పట్టుకొని ఈనరసరాయలు తన విపులప్ర తాపమును వెలిపుకొనెను. ఇట్లనేకములైన దుర్గములను ముట్టడించుచు యుద్ధములను జేయుచుఁ దన జీవితమం తయుఁ దనప్రభువైన సాళువనృసింహరాయలకు ధార పోసెను. సాళువ నృసింహరాయలు మరణించునప్పుడు తనకుమారు లిద్దఱు బాలవయస్కులుగా నుండుట చే వారిసంరక్షణము, రాజ్యభారము నీమహాపురుషున కొప్ప గించినిర్విచారముగాఁ బ్రాణములు విడిచెనని పైఁ జెప్పి తిని. తనప్రభువు నియోగమే పరమపవిత్రమగు ధర్మ ముగా యోచించుకొని శిరసావహించి, నృసింహరాయల పుత్రులకు సంరక్షకుఁడుగా నుండి, తాను మృతి నొందు వఱకును, ననఁగా క్రీ. శ. 1505 వఱకును, సమస్తరాజ్య మును నిర్వహించు చువచ్చెను. రాజ్యము తనయఱచేతిలో నున్నను స్వీకరింప నొల్లకుండెను. ఈమహామహుఁడు నిక్కముగా భీష్మునియవతారమని చెప్పక తప్పదు. *

సీ. ఎవ్వానివిజయంబు లెలిఁగించు శాసన
స్తంభంబు లాశాంతశైలవితతు
లెవ్వానియరిగాఁపు లేపారు కాళింగ
యవనాదివివిధ దేశాధినాథు
లెవ్వానినిత్యదానైకవిలాసంబు
లారూఢతరతులాపూరుషంబు
లెవ్వానిచిరకీర్తి యింద్రలోకాంగనా
భోగినీగీతికాభోగపదము

వాఁడు వొగడొందు సర్వసర్వంసహాధి
దేవతాముఖదర్పణ ద్విజయనగర
భద్రసింహాసనసుఁడున్నిద్రతేజుఁ
డీశ్వరాధిపు నరసభూమీశ్వరుండు.

ఈశ్వరరాజు శివభక్తుఁడు. శ్రీశైలమల్లికార్జునుని ప్రసాదమున తనకొమరుని నరసరాయలను బొందఁగలి గెను. నరసరాయలు వైష్ణవమతావలంబకుఁడు. శేషగిరి పర్యంకశయనుఁడగు వెంకటేశ్వరభక్తుఁడు. "శ్రీవెంక టాద్రిపతి సంసేవాహేవాకనిపుణా" యనియు, "వైష్ణవకథాపూతాత్మా" యనియు నీకవు లీరాయల నభివర్ణించినను, వారే వేరొకచోట "మధురిపుత్రిపుర హరాభేదసపర్యాచర్యా" యని నుడివినారు. కావున నీమహనీయుఁడు వైష్ణవమతమును స్వీకరించినను శివమ తమునుగుఱించి భేదబుద్ధి గలవాఁడు కాఁడు. కావున నే శైవమతస్థులగు నీకవులు వైష్ణవగ్రంథము నాంధ్రీకరించి తన కంకితముచేయుట తటస్థించెను.

విద్యానగరరాజ్య ధురంధరులగు నితరరాజన్యుల వలెనే యీమహామహుఁడును "వాణీకరవీణానిక్వాణ రతి" నఖిలపించి, యనేక కవులను, బండితులను బోషిం చి, వారికృతులను స్వీకరించి సరస్వతీసేవ యొనర్చెను. "వరలక్ష్మీకల్యాణము", "నరసింహ విజయ పురాణము" అను రెండుగ్రంథములకుఁ దాను కృతిభర్త యయ్యెను. ఈగ్రంథము లిప్పుడు లభ్యములు కావని నాకుఁ దోఁచు చున్నది.

ఇట్టి సకల సామ్రాజ్య భారధారే యుండును, సరససారస్వత సేవాపరుండు నగు నరసరాయల కీవరా హపురాణ ప్రబంధకృతి నీకవులు సమర్పితముఁజేసిరి.

## వరాహపురాణము

వ్యాసభట్టారకకృతరచితములగు నష్టాదశపురాణము లలో నొకటియైన యీవరాహపురాణము నిక్కముగ నేతిబీరకాయవంటిది. నేతిబీరకాయయందు నేయి

* ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణములో ఈనరసరాయలు విద్యానగరసింహాసనము నెక్కినట్లుగా వర్ణించినాఁడు. కాని చరిత్రకారు లీవిషయమును నమ్ముటలేదు.

లేదు; వరాహపురాణమునందు వరాహావతారవిషయము లేదు. ఆదివరాహమూర్తి ధరణీవరారోహకు సృష్ట్యాదివిషయములను గూర్చి చెప్పినపుణ్యకథలు మున్నగునవి యెన్ని యేని దీనియం దున్నవి. కాని

"చాపచుట్టగఁ జుట్టి చంక పెట్టుక పోఁడె
ధరణి హిరణ్యాక్షుఁ డానవుండు."

అని యాకవులు తమప్రభోధచంద్రోదయమునఁ జెప్పినట్లు ధరణీరమణిని హిరణ్యాక్షుఁ డెట్లు గాసిపెట్టెనో, యేలాగున శ్రీమహావిష్ణువు వరాహరూపమున భూదేవి నుద్ధరించెనో యాకథ యేమాత్రము నేతద్వరాహపురాణమునఁ గాన్పింపదు. ఇది బహు విచిత్రముగదా!

బహుళప్రఖ్యాతి గాంచిన గాథ లెవ్వియు దీనియందు లేకపోయినను ననేకములగు చిన్న చిన్న పుణ్యకథలు, ముఖ్యముగా వైష్ణవులలోను, స్మార్తుల లోను సామాన్యముగా నాచరింపఁబడు వ్రతదానముల పుణ్యకథలు దీనియందుఁ బెక్కులు కాన్పించుచున్నవి. ప్రతికథయందును వ్రతవిధానము, ఆవ్రతము నాచరించిన యొకానొక మహాపురుషుని ప్రశంసయు, ఆతఁ డనుభవించిన వ్రతఫలమును నిత్యాదులు లెక్కకు మిక్కిలి వక్కాణింపఁబడినవి. పాడ్యమి మొదలు పూర్ణిమామావాస్యలవఱకు ప్రతిదినము నాచరింపఁదగు వ్రతములును, దానములును, చైత్రమాసము ప్రభృతి ఫాల్గుణమాసాంతమువఱకును ననుష్ఠింపఁదగు వ్రతములును, దానములును సక్రమముగా సచరిత్రముగా నిరూపింపఁబడినవి. ధరణీవ్రతము, రుద్రవ్రతము, ధన్యవ్రతము, పద్మనాభవ్రతము, కాంతివ్రతము, శుభవ్రతము, కామవ్రతము, సార్వభౌమవ్రతము ఇత్యాదులును, తిలాద్రిత్రయోదశదానములు, గోదానము, హేమకుంభదానము ఇత్యాదులును నీగ్రంథమందు సగము భాగము పైఁగా నావరించియున్నవి. మిగిలినభాగములో స్థలమాహాత్మ్యములు అనఁగా సానందూరమాహాత్మ్యము, లోహార్గళమాహాత్మ్యము, మధురామాహాత్మ్యము, గోకర్ణమాహాత్మ్యము మున్నగునవి పెక్కులు గలవు. ప్రాచీనభూగోళవర్ణనము సప్తద్వీపములు, సప్తసముద్రములు, సప్తకులపర్వతములు, మహానదీనదములు, పర్వతాదివిశేషములు, ఇత్యాదివివరణములతో సవిశేషముగఁ జేయఁబడినది.

* నాచికేతోపాఖ్యానమును గాథ యిందు ప్రాసంగికముగాఁ జేర్పఁబడినది. ఉద్దాలకుని పరిణయము, నాచికేతుని జననము వఱకుఁ గలకథాభాగ మిందు లేదు కాని మిగిలినకథ యంతయు — అనఁగా నాచికేతుని శాపము, యమపురీగమనము, తత్ప్రత్యాగమనము, నరకాదివర్ణనము — మొదలగు సంగతులు గలకథ యంతయు సవిస్తరముగ వర్ణింపఁబడినది.

వాఙ్మయదృష్టితో నీమూలగ్రంథమును గాని, తదాంధ్రీకరణమును గాని పరికించెడు విమర్శకులకీవిషయము లెవ్వియు నంతగా రుచింపవు. రసాత్మకమై పాత్రపోషణాన్వితమైన కథాభాగమున కవిపుంగవుల కవితాపుష్టి కానంబడును గాని వ్రతవిధానవర్ణనములు, స్థలమహిమావర్ణనములు, భూవిభాగవర్ణనములు ఇత్యాదులయందు కవిత్వప్రభావ మంతగా ద్యోతకపడదు. ఈయుభయకవుల కవనపటిమను తెలిసికొనుటకనువగు కథాభాగము లీగ్రంథమున క్వాచిత్కముగఁ జూడనగుచున్నవి. వీనినిబట్టి ముఖ్యముగా నీకవుల సారస్వతచాతుర్యవిశేషమును నిర్ణయించుట కవకాశము కొంత గలుగుచున్నది. అట్టికథాభాగములలో మొదటిదగు దుర్జయోపాఖ్యానము గ్రంథాదిని విపులముగ వర్ణింపఁబడినది. దుర్జయుఁ డనురాక్షసరాజు దేవేంద్రుని జయించి ముల్లోకముల నేలుటయు, గౌరముఖుఁడను మహామునియొద్ద నాతిథ్యము నొందుటయు, ఆతపోధనునియొద్ద నున్న చింతామణిని బలాత్కారముగఁ బుచ్చికొనఁ బ్రయత్నించుటయు, మహావిష్ణువు బాసటయై గౌరముఖునికి విజయ మొసంగుటయు, నిత్యాదివిషయములు గల యీయుపాఖ్యానమేతద్గ్రంథమునకుఁ గొంత వన్నె దెచ్చుచున్నది. ఇదిగాక, దానిమఱియొక యుపాఖ్యానముగూడ నించుమించుగ

* దుగ్గుబల్లి దుగ్గయ్య నాచికేతోపాఖ్యానమును జూడుఁడు.

వలెనే యింపుసొంపులు గులుకు కథాప్రణాలికతో నొప్పారుచున్నది. అది గౌతమ్యుపాఖ్యానము. దానియందు గౌతమి లేక గోదావరి యను పేరు గల మనయాంధ్రదేశమందలి పుణ్యనదియొక్క యుత్పత్తికథ విపులముగ వర్ణింపఁబడినది. ఈకథాభాగ మతిమనోహరముగను, శ్రవణోత్సుకముగను నున్నది. ద్వాదశవర్ష క్షామకాలమున గౌతమముని తనసస్యసహాయమున భూసురసంఘంబులఁ బోషించుట, వారీసడించుకొని మాయాధేనువును గల్పించి గౌతముని సస్యకేదారమును మేపించుట, గౌతముఁడు తపోజలముతో దానిని బోఁదోలుట, ఆకితవగో వుసురులు విడుచుట, తత్పాపపరిహారార్థము గౌతముఁడు శివునిజటాజూటమునుండి గంగను దెచ్చి గోవుపైఁ బ్రవహింపఁ జేయుట, తత్కారణమున గోదావరి యనునామము వచ్చుట ఇత్యాదివిషయములు గల యీయుపాఖ్యానము చాల రసవంతముగ విరచితమైనది.

ధర్మవ్యాధ దుహితృ చరిత్రము చాల రసవంతముగను, నీతియుక్తముగను, సర్వవిధముల శ్లాఘాపాత్రముగ నున్నది. ధర్మవ్యాధుని పుత్రికయగు సాధ్వీమణి అర్జునిక శ్వశురగృహమున పడినబాధలు సహింపలేక, తండ్రియొద్దకు వచ్చి తనచరిత్రమును జెప్పి విలపింప, ధర్మవ్యాధుఁడు కోపించి జామాతృగృహమున కేఁగి యత్తమామలను దూఱి ధర్మోపదేశము చేసెను. ఈయుపాఖ్యానమున హిందూకుటుంబములందలి జీవితవ్యవస్థలసదృశముగా నిరూపింపఁబడియున్నవి. హిందూసంఘమందుఁ గుటుంబజీవితము నాఁటికిని, నేఁటికిని కీటురాయివలె నచలితమై యున్నదని యిట్టిగ్రంథాధారములఁ బట్టి యూహింపవచ్చును.

## భాషాంతరీకరణము

సంస్కృత వరాహపురాణమునఁ గొంతభాగమును మాత్రమె యీకవులు దెనిఁగించిరి. వ్రతదానభాగము పూర్తి యయినవెంటనే గ్రంథపఠనశ్రవణఫలముఁ జెప్పి గ్రంథమును బరిసమాప్తి చేసిరి. స్థలమాహాత్మ్యములుగల భాగమంతయు విడిచిపెట్టఁబడినది. కావున వ్రతదానముల జ్ఞానము నాంధ్రులకుఁ దెలుపు నుద్దేశముతో నీగ్రంథమును దెనిఁగింపఁ బ్రారంభించిరేమో యని యూహింపవలసియున్నది. ఈవిపులమగు పురాణము నాంధ్రీకరించు ప్రయత్నముతో నీకవు లున్నారని కర్ణాకర్ణికగా విని నరసరాయ లీకవులను రప్పించి తన కాగ్రంథమును గృతియిమ్మని కోరిన ట్లీగ్రంథమున వీరు చెప్పికొనిరి.

తాము వ్రాసిన పండ్రెండాశ్వాసముల గ్రంథములో మాతృకయందలి సగముభాగముమాత్రమే తెనిఁగింపఁగలిగి యుండుటకు కారణము వీరి భాషాంతరీకరణపద్ధతియందలి విపులీకరణ విధానమే యని చెప్పవలసియున్నది. మాతృకలో నున్న కథాంశములను మాత్రము తీసికొని, వాని ననేకవిధముల రసపుష్టిచేసి, పాత్రోచితస్థలోచితవర్ణనముల నత్యంతిశయముగఁ జేర్చి పెంచి సుమనోమనోజ్ఞముగ రచించిరి. సామాన్యముగఁ బ్రతికథయందు నిట్టిప్రత్యేకరసపోషణ సంధానము కానఁబడుచున్నను, ముఖ్యముగా దుర్జయోపాఖ్యానమునఁ గడుంగడు రమణీయముగ నీప్రక్రమము మెఱయుచున్నది. దుర్జయోపాఖ్యానము సంస్కృతగ్రంథమున సుమారు నాలైదు పుటలుమాత్రముగ నుండును. వీరు దానిని బ్రత్యేకప్రబంధమని చెప్ప నొప్పుదానినిఁ జేసి, యనేకవిధములఁ బోషించి విస్తరించి, తమకవితాప్రాగల్భ్యమును సర్వవిధముల వెల్లడించిరి.

ఆంధ్రప్రబంధములఁ జరిత్రమును వ్రాయువిమర్శకున కీదుర్జయోపాఖ్యాన మొకదృష్టాంతముగా నుపకరించును. ఒకచిన్నకథను దీసికొని వర్ణనసంభృతితోఁ బ్రత్యేకగ్రంథముగా రచించుపద్ధతి పెద్దనాదులతోఁ బ్రారంభించుట లేదనియు, తత్పూర్వమే యాంధ్రవాఙ్మయమున సువ్యక్తముగా నున్నదనియు స్పష్టమగుచున్నది. దుర్జయనృపాలుని జననము, సద్యోయౌవనము, దిగ్విజయము, వనవిహారము, సుకేశీమిశ్రకేశీసమావేశము, దుర్జయవిరహము, నర్మసఖదౌత్యము, సుకేశీమిశ్రకేశీవిరహము, దుర్జయవివాహము, పుత్రజననము అనునీవిషయక్రమమున నీయుపాఖ్యానము వ్రాయఁబడినది. ఇదియే కదా సామాన్యముగఁ బ్రత్యాంధ్రప్రబంధమందలి కథానిర్మాణక్రమము. ఈనిర్మాణక్రమము పెద్దనాదులకు పూర్వమే వాఙ్మయమునం దున్నదని యీకథ

యం దీజంటకవులు చూపిన కల్పనాచాతుర్యమున విశదముగ నున్నది. ఈకథానిర్మాణమంతయు మాతృకయందుఁ గానఁబడదు. నర్మసఖదౌత్యము, విరహాదివర్ణనలు మున్నగునవి యీకవులు స్వయముగాఁ గల్పించిన విషయములే. కావున నాంధ్రప్రబంధనిష్పత్తి పెద్దనాదులకు పూర్వమే మనవాఙ్మయమం దున్నదని దృఢముగాఁ జెప్పవచ్చును.

వర్ణనాదికపోషణముచేసి కథాప్రణాళిక నెట్లుగా విస్తరించి రచించిరో యావిషయమును రెండుదృష్టాంతములఁ జూపి యీభాగమును విరమించెదను.

గ్రంథవిస్తరభీతిచే వెనుదీయవలసివచ్చినది కాని (౧) ధర్మవ్యాధోపాఖ్యానమును, (౨) గౌతమ్యుపాఖ్యానమును సంపూర్ణముగా మాతృకయందును, ఏతదాంధ్రీకరణమందును పరిచూచినయెడల నీకవుల స్వభావశుద్ధమగు వర్ణనప్రాగల్భ్యమును, రసపోషణవిధానమును బ్రత్యక్షముగఁ గోచరమగును. సవిమర్శదృష్టితో స్వయముగాఁ బరిశీలింపఁ గుతూహలము గలపాఠకమహాశయు లెల్లరీభాగములను రెండుగ్రంథములఁ జదువఁ బ్రార్థితులు.

(సశేషము)

---

# భారతవీరుఁడు

జి. జాషువకవి

"ఈ కవచంబుఁ గుండలము లీయకు మల్లదె దొంగబాపఁడై
నాకవిభుండు వచ్చెడిని నా యనుఁగుంగొడుకా" యటంచు మ
ర్త్యాకృతి నుండి పల్కెఁడు సహస్కరునిం గని నవ్వి యవ్వి యే
పోకడఁ బెట్టు నీ సుగుణము న్నుతియింపఁ దరంబె భానుజా!

నరుఁడు బృహన్నలాఖ్య నలనాఁడు విరాటునిఁ గొల్చుచుండి, యు
త్తరునకు సాయమై, కురుశతంబును మూర్ఛలఁ గొట్టునాఁడు, భా
స్కర సుతుఁ డోడె నందు రని కన్నుల నీ రిడకయ్య, శక్తులై
గురుఁడు, నదీసుతుం డెదురుకొన్నది లేదుగదోయి, భానుజా!

గంగాపుత్రుఁడు రాజునానతి శతాంగశ్రేణి యర్పించు నాఁ
డంగీకారము గాక నీ కొక రథం బర్పించెనే కాని, యో
యంగాధీశ్వర, యుగ్రవత్కదనపంచాస్యుండ వౌ నీకు నీ
యంగత్రాణములున్ రథంబులును సాహాయ్యంబు లేమాత్రముల్.

సంగరసీమ నీకుఁ దొలిసాయకమైన భుజంగభర్త, పా
ర్థుం గుఱిచూచుచో నది విరుద్ధగతిం జని టెక్కెముం గిరీ
టాంగదము ల్దహించి, యినజా, ననుఁ గ్రమ్మర నేయుమన్న, భీ
మెంగిలిబాణ మేయ ననవే! రణవీరుఁడ వీవ యర్కజా!

నిక్కపుఁ బేడబుట్టువలె నీ త్రోడ నింద్రుఁడు బొక్కసేయు నాఁ
డక్కట నెత్తురు ల్వరద లై ప్రవహించుచునున్న ధైర్యమున్

దక్కక నిద్రఁ జెందు జమదగ్నికుమారుఁ గదల్పలేదు హా!
యెక్కడి చిత్తదార్ఢ్య; మిది యెక్కడి దీగురుభక్తి భానుజా!

కురురా జొక్కఁడుగాక నీ దగు మహా త్కోదండపాండిత్యము
న్వరదాన ప్రతిభానిసర్గగుణ మెవ్వారేని గుర్తించి రే
యరవిందాప్తకుమార, చింతపడకయ్యా! నేఁటి కింకన్ దిగం
తరదేశంబులఁ బాఱుచున్నవి భవద్దానాంబుధారానదుల్.

నీ నేర్పు న్సహజప్రతాపవదనోన్మేషంబు నీక్షించి, యా
శ్యానైశిత్యముఁ దోఁపనీక, కులగోత్రప్రశ్నలన్ దెచ్చి ల
జ్జానిర్జివునిఁగా నొనర్చెడు కృపాశ్వత్థామలే లేక, క
ర్ణా, నీ నేరికి తీసిపోయెదవు, మార్తాండాత్త తేజస్వివై?

అంబుజనాభు నంతటి మహాత్ముఁడు పార్థుని తేరిమీఁద గు
ఱ్ఱంబులు దోలుచుండ సమరం బొనరింపఁ దెగించునే లలా
టాంబకుఁడైన? నీ తెగువ యబ్బురముం గలిగించు! వీరలో
కంబున నీకుఁ జాలిన మగండు జనింపఁడు సూర్యనందనా?

"నా యరదంబు క్రుంగిన దనంత, కిరీటి, క్షణంబు తాళుఁ డో
యీ! యిది యుద్ధ ధర్మ" మని యీవు వచించుచునున్న నిన్ను న
న్యాయముగా వధించిన ధనంజయుఁడా విజయుండు నీవు కా
వా, అకటా! యి దెక్కడి నిరర్థకధర్మము సూర్యనందనా!

"భారతయుద్ధరంగమున పాండుతనూభవమధ్యముండొ, కా
దా, రవిజుండొ! తీరవలె తథ్యము నా కటు గాక కంటికిం
గూరుకు రాదు, రా" దనుచు ఘోరముగా శపథంబు చేసి నీ
కూరిమి జేనికై తనువుఁ గోల్పడి తెంతటి సాహసుండవో!

"కుడిభుజమైన కర్ణుఁ డనిఁ గూలె, సమస్తముఁ దీఱె" నంచు డీ
ల్పడి, ధృతరాష్ట్రినందనుఁడు పాండుకుమారుల కోహటించి య
మ్మడువునఁ జొచ్చె, శూరజనమండన, నీవు గతింపకున్న, భీ
ముఁడు తొడఁ గొట్టి నీ నృపునిముందర నిల్చి గదం ధరించునే.

ఫల్గునుఁడు దక్కఁ దక్కిన పాండుసుతులు-భండనంబున నీచేతఁ బడిసయపుడు
తల్లి కిచ్చినవరము చిత్తమున మెఱసి-యడిద మెత్తని సత్యసంధుఁడవు కర్ణ!

---

# రామాయణము*

[రవీంద్రుని మాతృకనుండి]

బెజవాడ గోపాలరెడ్డి గారు, బి. లిట్.
(విశ్వభారతి)

సరాసరిని కావ్యములను రెండుభాగములుగ భాగింపవచ్చును. కొన్ని కావ్యములు కేవలము వానిని రచించు కవుల యభిప్రాయములతో ప్రపూర్ణములై యుండును; కొన్ని అటులుగాక యేదో యొక బృహత్ సంప్రదాయమునకు చెందినవై యుండును.

ఒకకవి అభిప్రాయములు ఒక కావ్యమునం దుండుననిన ఆయభిప్రాయములు మరెవ్వరికిని ఉండవని అర్థము కాదు. ఒకవేళ అట్లుండిన అవి పిచ్చి అభిప్రాయములు. తలంపులకన్న వేరుగా నుండజాలవు. నిజసుఖదుఃఖములు, నిజకల్పనః నిజజీవనాభిజ్ఞానముగుండా విశ్వమానవుల చిరంతనహృదయావేగము, జీవనమర్మకథ, తనంతటతానే వెలువడుచుండునట్టి సామర్థ్యము కవియందు కలదని అర్థము చేసికొనవలయును.

వీరు ఏవిధముగ ఒకశ్రేణికి చెందిన కవులయిరో, ఆవిధముననే రెండవశ్రేణికి చెందిన కవులు గలరు. వారి రచనలద్వారా ఒకసమగ్రదేశము, ఒక సమగ్రయుగము, తమ హృదయమును, తమ అభిజ్ఞానమును వ్యక్తపరచి వాటిని మానవుల చిరంతన సామగ్రిగా చేయుచుండును.

ఈద్వితీయశ్రేణికవినే మహాకవియని చెప్పనొప్పును. సమగ్రదేశముయొక్క, సమగ్రజాతియొక్క విజ్ఞానము వీరిని ఆశ్రయించును. వీరు రచించునది యేదో వ్యక్తి విశేషముయొక్క రచనగా తోచదు. అది బృహద్వనస్పతివలె దేశముయొక్క భూతల జఠరమునుండి ఉద్భూతమయి, ఆదేశమునకే ఆశ్రయచ్ఛాయాదానము చేయుచున్నదా యనునట్లుండును. కాళిదాసు శకుంతల, కుమారసంభవము విశేషముగ కాళిదాసు నిపుణహస్తపరిచయమును పొందుచున్నవి. కాని రామాయణమహాభారతములు జాహ్నవీ, హిమాచలములమాదిరినే భారతవర్షమునకే చెందినట్లుగా తోచును. వ్యాసవాల్మీకులు ఉపలక్ష్యముమాత్రమే.

అసలు వ్యాసవాల్మీకులు ఎవరి పేరులు కావు. అవి భావమున నామకరణములుమాత్రమే. సమస్త భారతవర్షమునకు సంబంధించిన యీ గ్రంథములు రెండును, తమ్ము రచించిన కవులనామములు పోగొట్టుకొని యున్నవి. కవులును తమ కావ్యముల యంతరాళముననే మునిగిపోయియున్నారు.

మన దేశమున రామాయణమహాభారతములవలె ప్రాచీనగ్రీసుదేశమునందు 'ఇలియడ్' ఉండినది. అది సమస్త గ్రీసుదేశముయొక్క హృత్పద్మసంభవముగను; హృత్పద్మవాసిగను ఉండినది. కవిహోమరు తనదేశకాలములయొక్క కంఠమునకు భాషను దానముచేసియుండెను. ఆసాహిత్యము తనదేశ నిగూఢాంతఃస్థలము నుండి బయల్వెడలుచు, చిరకాలముగ తన దేశమున దీప్తిమంతముగ నుండగలుగుచున్నది.

ఏయాధునికకావ్యమునకుగూడ నింత వ్యాపకత్వ మున్నటులు కనబడదు. మిల్టన్ పారడైజు లాస్టునందు భాషాగాంభీర్యము, ఛందోమాహాత్మ్యము, రసగంభీరత యెంత విశేషముగ నున్నను, అది దేశధనము కాదు. అది లైబ్రరీయొక్క ఆదరముగు వస్తువు.

అయినను, కొన్ని ప్రాచీనకావ్యములను ఒకరాశిగా చేర్చి వాటి కన్నిటికిని ఒకేనామ మివ్వవలయుననిన మహాకావ్యమని తప్ప మరేనామ మివ్వగలము! ఇవి ప్రాచీనకాలపు దేవచైత్యములవలె మహాకాయులుగా నుండినవి. వీటిజాతి యిప్పుడు లుప్తమైపోయినది.

ప్రాచీనార్యసభ్యతయొక్క ఒకధార యూరోపునందును, ఒకధార భారతవర్షమునందును ప్రవహించినవి. యూరోపుధార రెండుకావ్యములయందును, భాగౌ

* శ్రీయుత దీనేశచంద్రసేన్ గారి 'రామాయణీకథ' అను గ్రంథమునకు భూమికా స్వరూపమున ౧౯౦౩ సం. డిసెంబరులో రచింపబడినది.

వర్ష పుధార రెండుకావ్యములయందును తమ సాహిత్యమును సంగీతమును రక్షించి నిలిపియున్నవి.

మనము విదేశీయులము. గ్రీసు తనసమస్త ప్రకృతిని తన రెండుకావ్యములలో ప్రకాశింపగలిగెనా లేదా యని మనము దృఢముగ చెప్పజాలము. కాని, భారతవర్షముమాత్రము రామాయణ మహాభారతములలో నింకేమియు శేషము లేకుండగ ప్రకాశింపగలిగె ననుట నిశ్చయము.

అందువల్లనే, శతాబ్దములతర్వాత శతాబ్దములు దొర్లిపోవుచున్నను, రామాయణమహాభారతములస్రోత్రము భారతవర్షమున లేశమాత్రమైనను శుష్కించిపోవుట లేదు. అనుదినము గ్రామగ్రామమున, గృహగృహమున అవిపఠింపబడు చున్నవి. కల్లుదుకాణమునుండి రాజప్రాసాదమువరకు వాటికి సమానమైన ఆదరము గలదు. ఆకవియుగళము ధన్యము. కాలమహాప్రాంతరమధ్యమున వారి నామములు పోగొట్టుకొనబడినను, వారివాణి బహుకోటినరనారీ ద్వారద్వారమునకు అజస్రధారగా శక్తిని శాంతిని గైకొని పోవుచున్నది. శతశతప్రాచీనశతాబ్దముల ఒండుమట్టిని తెచ్చి, భారతవర్షముయొక్క చిత్తభూమిని నేడును సత్తువచేయుచున్నది.

అట్టిచో, రామాయణమహాభారతములను కేవలము మహాకావ్యము లనిన చాలదు. అవి యితిహాసములు గూడను. ఘటనావళియొక్క యితిహాసము కాదు. ఏందుకన, అట్టియితిహాసము సమయవిశేషమునై ఆధారపడియుండును.—రామాయణ మహాభారతములు భారతవర్షముయొక్క చిరకాలపు ఇతిహాసములు. అన్యేతిహాసములు కాలకాలమునకు ఎంతపరివర్తనయైనను, ఈ యితిహాసము పరివర్తనయే కాలేదు. భారతవర్షపుసాధన, ఆరాధన, సంకల్పములయితిహాసము ఈ రెండువిపుల కావ్యహర్మ్యములమధ్య చిరకాలపు సింహాసనమున విరాజమానముగుచున్నది.

ఈహేతువుననే, రామాయణ మహాభారతముల సమాలోచన, యితరకావ్యసమాలోచన ఒకటి కాదు. రామునిచరిత్ర ఉచ్చమో, నీచమో, లక్ష్మణునిచరిత్ర మనకు రుచించునా, లేదా యనెడివిచారణ చాలదు. మౌనము దాల్చి, నిఖిలభారతవర్షము అనేకసహస్రవత్సరములనుండి, వీటిని ఏభావముతో గ్రహించియుండినదో యని శ్రద్ధాసహితముగ విచారణ చేయవలసియున్నది.

రామాయణమున భారతవర్షమేల పల్కుచున్నదో, రామాయణమున భారతవర్షమేయాదర్శమును గొప్పదని ఒప్పుకొనినదో, అదియే ప్రస్తుతము మనము శ్రద్ధగ విచారించవలసిన విషయము.

వీరరసప్రధానమగు కావ్యమునే 'ఎపిక్' అనెదరని సామాన్యప్రజలతలంపు. ఏకాలమున, ఏదేశమున వీరరసముయొక్క గౌరవము ప్రాధాన్యమును పొందినదో, ఆదేశమున, ఆకాలమున స్వాభావికముగ ఎపిక్ వీరరసప్రధానమగుట లెటస్థించును. ఇదియే అందులకు కారణము. రామాయణమునందు యుద్ధవ్యాపారము కావలసినంత యున్నది. రామునిబాహుబలము గూడ విరివిగ వర్ణింపబడియున్నది. కాని రామాయణమునందు ప్రధానరసము వీరరసము కాదు. అందువల్ల బాహుబలగౌరవము ప్రాస్వముగుట లేదు. యుద్ధఘటనమే వారిముఖ్యవర్ణనవిషయము కాదు.

దేవుని అవతారలీలనే గైకొని రచింపబడినకావ్యమును కాదు ఇది. కవి వాల్మీకియొద్ద రాముడు అవతారపురుషుడుగా నుండలేదు. సామాన్యమనుష్యుడుగనే యుండెను. కవి రామాయణమున నరచరిత్రనుగాక దేవచరిత్రనే వర్ణించియుండిన, రామాయణముయొక్క గౌరవము తగ్గియుండెడిది; దానికి కావ్యాంశమున లోటు ఆపాదిల్లెడిది: మనుష్యుడనియే రామచరిత్రము మహిమాన్వితమైనది.

ఆదికాండప్రథమసర్గయందు వాల్మీకి తనకావ్యోపయుక్తనాయకుని ఉద్దేశించి బహుగుణముల ఉల్లేఖించి నారదు నిట్లడిగెను:—

"సమగ్రా రూపిణీ లక్ష్మీః క మేకం సంశ్రితా నరమ్."

(ఏదో ఒకనరుని ఆశ్రయించి సమస్తశోభలు రూపగ్రహణము గైకొనినవా?)

అప్పుడు నారదు డిట్లనియెను:—

"దేశేష్వపి నపశ్యామి కశ్చి దేభి ర్గుణైర్యుతమ్;
శ్రూయతాంతు గుణైరేభి ర్యోయుక్తో నరచంద్రమాః"

(ఇట్టి గుణయుక్తపురుషుని దేవతలలో గూడ చూడలేదు. కాని యేనరచంద్రునియందు ఈసకలగుణములు కలవో వానివిషయము వినుము.)

రామాయణము ఆనరశ్రేష్ఠునివిషయము; దేవతావిషయము కాదు. రామాయణమునందు దేవత తన్ను తాను తక్కువపరచుకొని మనుష్యుడగుట లేదు. మానవుడే నిజగుణములద్వారా దేవతయై విరాజిల్లుచున్నాడు.

మానవుని చరమాదర్శమును స్థాపించుటకొరకే భారతవర్షపుకవి యీ మహాకావ్యమును రచించెను. ఆదినమునుండి నేటివరకు మానవుల యీ యాదర్శచరితవర్ణనను మనదేశపు పాఠకమండలి పరమశ్రద్ధావిశ్వాసములతోడ పఠించుచు వచ్చుచున్నారు.

రామాయణ ప్రధానవిశేషత్వ మేమన, అది క్షుద్రమగు గృహవిషయమునుగూడ మిగుల పెద్దదానినిగా చేసి చూపుచున్నది. పితాపుత్రుల, భ్రాతాభ్రాతల, భార్యాభర్తల ధర్మబంధనములను, ప్రీతిభక్తి సంబంధములను ఎంతయు మహత్తరములైనవానినిగా చేయుటచే, అవి సహజముగనే మహాకావ్యములకు ఉపయుక్తములగు విషయములగుచున్నవి. దేశజయము, శత్రువినాశము, రెండు ప్రబలవిరోధిపక్షముల ప్రచండాఘాత సంఘాతములు మున్నగు సమస్తవ్యాపారములే సహజముగా మహాకావ్యమునందు ఆందోళనోద్దీపన కారకములుగ నుండును. కాని రామాయణముయొక్క ఔన్నత్యము రామాయణములోని యుద్ధముపై ఆశ్రితమై యుండలేదు. ఆ యుద్ధఘటన సీతారాముల దాంపత్యప్రేమను ఉజ్జ్వలముగ నొనర్చి చూపుటకు ఉపలక్ష్యముమాత్రమే. తండ్రియెడల కుమారునిభక్తి, సోదరునికై సోదరుని ఆత్మత్యాగము, పతిపత్నులమధ్య పరస్పరప్రీతినిష్ఠ, ప్రజలప్రతి ప్రభునికర్తవ్యము ఎటులుండవలయునో దానినే రామాయణము చూపుచున్నది. ఈరీతిగ వ్యక్తివిశేష ప్రధానత, గృహసంపర్కములు మరి యేదేశముయొక్క మహాకావ్యమునందును ఈతీరుగ వర్ణనీయ విషయ మైనదని చెప్ప వలనుపడదు.

రామాయణమున కవి పరిచయముమాత్రమే యగుటలేదు. సమస్త భారతవర్షముయొక్క పరిచయము ప్రాప్తమగుచున్నది. దీనివలన గృహమనిన, గృహధర్మములనిన, భారతవర్షమునకు ఎంత గౌరవాస్థానములగు విషయములో తెలియుచున్నది. మనదేశమున గార్హస్థ్య ఆశ్రమమునకు ఎట్టి అత్యంత ఉచ్చస్థాన మొసంగబడినదో, దానిని ఈకావ్యము సప్రమాణముగ నిరూపించుచున్నది. గృహస్థాశ్రమము మన నిజసుఖములకు భోగములకు ఏర్పాటు చేయబడి యుండలేదు: అది సమస్తసమాజమునుగూర్చి ఆలోచించెడిది; మనుష్యుని యథార్థభావముగ మనుష్యుని చేసెడిది. గృహస్థాశ్రమము భారతవర్షపు ఆర్యసమాజమునకు ప్రాకారమువంటిది. రామాయణము అట్టి గృహస్థాశ్రమముయొక్క కావ్యము. ఈ గృహస్థాశ్రమధర్మమునే రామాయణము ఒక విషమ అవస్థయందు గెంటి దానినే వనవాసదుఃఖములతో విశేషగౌరవాన్వితముగ నొనరించినది. కైకేయీ మంథరలు కుచక్రకఠి నాఘాతములచే అయోధ్య రాజగృహమును చిందరవందర చేసినట్టి స్థితియందును, గృహధర్మపు దుర్భేద్యదృఢత్వమును రామాయణము చాటుచున్నది బాహుబలవిషయము కాదు; జయించవలెననెడి ఆశయు కాదు; రాష్ట్రగౌరవము కాదు. శాంతరసాస్పదమగు గృహధర్మమును రామాయణము కరుణాశ్రుజలమున అభిషిక్తముచేసి ఆ మహావీరునిపై స్థాపనచేసెను.

శ్రద్ధాహీనులగు పాఠకులు ఈఘట్టమున చరిత్రవర్ణన అతిశయోక్తిగ పరిణమించినదని అనగలరు యథార్థస్థితిని కల్పనల సరిహద్దులను ఉల్లంఘించిన కావ్యకళ అతిశయోక్తిగ మారును. ఒకటి రెండు మాటలలో దాని మీమాంస కానేరదు. రామాయణ చరిత్రవర్ణన స్వాభావికముకాదని చెప్పువిదేశీయ విమర్శకులకు ప్రకృతిభేదముచే నేది ఒకనికి అస్వాభావికముగ తోచునో, అదే మరొకనికి స్వాభావికముగ కన్పట్టునని చెప్పవలసియున్నది. భారతవర్షము రామాయణమున అస్వాభావికమును గాని, అతిశయోక్తిని గాని కాంచుటలేదు.

ఎచ్చోట ఏ ఆదర్శము ప్రచలితమో దానిని అసలే వదలివేసిన, అచ్చటిప్రజలకది గ్రాహ్యమే కానేరదు. మనశ్రుతి యంత్రమున మనము ఎన్నిశబ్ద తరంగముల యాఘాతముల గైకొనగలమో దానికి కొంత పరిమితి గలదు. ఆ సంఖ్యను మించిన మనచెవులు ఆశబ్దతరంగములను గ్రహింపజాలవు. కావ్యమునందు చరిత్రభావ, ఉద్భావన సంబంధములయందును అదేరీతిగ ఉండునని చెప్పవచ్చును.

ఇదే యథార్థమైన రామాయణకథ, భారతవర్షముకడ ఏయంశమునందును అస్వాభావికము కాలేదను మాట సహస్రసవత్సరములనుండి ఋజువై వచ్చుచున్నది. ఈరామాయణకథనుండి భారతవర్షపుబాలురు, వృద్ధులు, వనితలు, పామరులు, పండితులు శిక్షణనుమాత్రమే పొందుట కాదు; ఆనందమును పొందిరి. కేవలము దానిని శిరోధార్యముగ చేసికొనుటయేకాక, హృదయాంతరాళములయందును ఉంచుకొనిరి. అది వారికి ధర్మశాస్త్రముమాత్రమే కాదు; వారిమహాకావ్యమై యొప్పుచున్నది.

ఈమహాగ్రంథపు కవిత్వము భారతవర్షమునకు కేవలము సుదూరకల్పనాలోకసామగ్రియే యైయుండిన, మనసంసారసీమకు దూరస్థమగు విషయమే యైయుండిన, రాముడు ఒకేకాలమున మనకు దేవుడుగను, మనుష్యుడుగను, రామాయణము పయి మనకు ఒకేకాలమున భక్తిప్రేమలు కల్గుటయు, నెప్పుడుగాని సంభవమయ్యెడిది కాదు.

ఇట్టిగ్రంథమును అన్యదేశవిమర్శకులు వారి కావ్యవిచారాదర్శానుసారముగ అస్వాభావికమని యనిన,వారిదేశముతో సరిపోల్చుటలో భారతవర్షపు ఒకవిశేషత్వము ఇంకను అధికముగ పరిస్ఫుటమగుచున్నది. రామాయణమున భారతవర్షము దేనిని అభిలషించినదో దానినే పొందగల్గినది.

రామాయణమహాభారతములను నేను ఈదృష్టితోనే పరికించుచున్నాను. దీని సరళానుష్టుప్ఛందమున భారతవర్షపు సహస్రసవత్సరముల హృత్పిండము స్పందితమగుచున్నది.

సుహృద్వరుడు శ్రీయుత దీనేశ్చంద్రసేన్‌గారు తాను రచించిన ఈరామాయణచరిత్ర సమాలోచనమునకు ఉపోద్ఘాతమును వ్రాసి యిమ్మని నన్ను అనురోధించినపుడు, నాకు అస్వస్థతగ నుండినను, సమయము లేకుండినను, ఆతనిమాట త్రోసివేయజాలకపోతిని. కవిమాటలను భక్తునిభావమందు కూర్చి ఆతడు తనభక్తి చరితార్థమగునటులు సాధనమొనర్చెను. ఇటులు భక్తిపూజావేగమిశ్రితమైన వ్యాఖ్యయే స్వాభావికసమాలోచనయని నాతలంపు. ఈయుపాయమువలననే ఒకహృదయము యొక్క భక్తి మరియొక హృదయములోనికి పోగలుగుచున్నది. ప్రస్తుతకాలమున మనసమాలోచనలు బజారులోని 'దలారుల'మాదిరి నగుచున్నవి. సాహిత్యమే యిప్పుడు బజారువస్తువగుట యిందులకు కారణము. తర్వాత మోసపోకుండుటకై, సమర్థులైన దలారుల సహాయము పొందుటకు అందరును ఆతురత జూపుచున్నారు. ఇటులాశ్రయించుట వ్యాపారవిషయములలో ఉపయోగమేకాని యథార్థ సమాలోచన పూజయని చెప్పుచున్నాను. సమాలోచకుడను పూజారి పురోహితునితో సమానము. ఆతడు తనయొక్కయు, సర్వసాధారణులయొక్కయు భక్తితో మిశ్రితమైన విస్మయమును వ్యక్తపరచుటమాత్రమే.

భక్తుడు దీనేశ్చంద్రుడు ఆపూజామందిర ప్రాంగణమున నిలువబడి ఆరతియిచ్చుటకు ఆరంభించెను. హఠాత్తుగా ఘంటమ్రోగించుభారము నాపై నుంచెను. ఒకపార్శ్వమున నిలువబడి నేనును ఆకార్యమునందు ప్రవృత్తుడనైతిని. అధికాడంబరములతో ఆతని పూజను మరుగుపరచుట నాకు ఇష్టము లేదు. వాల్మీకి రామచరితకథను పాఠకులు కేవలము కవియొక్క కార్యమని చూడక, దానిని భారతవర్షపు రామాయణముగ తెలిసికొనవలయునని మాత్రము తెలుప ఉద్దేశించుచున్నాను. ఆలాగైన రామాయణముద్వారా భారతవర్షమును, భారతవర్షముద్వారా రామాయణమును సరియగురీతిగ అర్థము చేసికొనగలరు. ఇది యేదో ఐతిహాసిక గౌరవవాహిని కాదనియు, పరిపూర్ణమగు మానవుని ఆదర్శచరిత్రమును భారతవర్షము వినగోరెననియు నేటివఱకును అశ్రాన్తా

నంద సహితముగ వినుచున్నదియుగూడ పాఠకులు స్మరణయం దుంచుకొనవలయును. ఇందు గోరంతలు కొండంతలు చేయబడెననికాని, యిది కావ్యకథయే యనికాని మనదేశ మెన్నడు ననలేదు. సీతారామలక్ష్మణు లైనం తనిజము, భారతీయులకు తమతమ కుటుంబములలోని వారును కారు.

పరిపూర్ణతను తెలిసికొనవలయునని భారతవర్షమునకు ఒకేప్రాణాకాంక్ష గలదు. ఇది సత్యాతీతమైనదని అనాదరము చూపుటలేదు; అవిశ్వాసపడుటయు లేదు. దానినిగూడ యథార్థసత్యమని విశ్వసించినది. దీని మూలముననే ఆనందమును పొందుచున్నది. అపరిపూర్ణతాకాంక్షను మేల్కొలిపి, తృప్తియగునటులు చేసి, రామాయణపు కవి భారతవర్షపు భక్తహృదయములను చిరకాలము ఋణగ్రస్తములుగ చేసికొనెను.

ఏజాతి ఖండసత్యమునకు ప్రాధాన్యమునొసంగుచున్నదో, ఎవ్వారు యథార్థసత్యానుసరణమున అలసటను చెందరో, కావ్యమును ప్రకృతిదర్పణము మాత్రమే యని యనుచున్నారో, వారిచే లోకములో అనేక కార్యములు చేయబడినవి. వారు అధికముగ ధన్యులైరి. మానవజాతి వారికడ ఋణగ్రస్తమే. మరియొకవైపున ఎవరు "భూమైవసుఖం, భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" (పూర్ణతయే సుఖము, అదే తెలిసికొనదగినది.) అని చెప్పిరో, ఎవరు పరిపూర్ణపరిణామము మనుష్య సమస్తభాగములకు సౌందర్యము, సకలవిరోధముల ప్రశాంతినొసగూర్చుటకు సాధనసల్పిరో, వారిఋణముగూడ ఎన్నటికిని తీర్పబడదు. వారిపరిచయము విలుప్తమై, వారి ఉపదేశములు మరువబడిన, మానవనాగరిక ధూమధూప సమాకీర్ణ కారాగారములోని జనుల కుంపులమధ్య, నిశ్వాసములచే కలుషితమై, తుదిలేనికష్టములలో తగుల్కొని, కృశించి, తుదకు మరణించియుండెడిది. రామాయణము ఆయఖండామృత పిపాసార్థుల చిరపరిచయము మోసికొని తెచ్చుచున్నది. దీనిలో ఏ భ్రాతృప్రేమ, ఏసత్యనిష్ఠ, ఏపాతివ్రత్యము, ఏ ప్రభుభక్తి వర్ణింపబడినదో, దానిపై సరళశ్రద్ధను, హృదయస్థభక్తిని నిలుపగలిగినచో మనకారాగారపు వాతాయనములనుండ మహాసముద్రపు నిర్మలవాయువు ప్రవేశించుటకు మార్గమును పొందగలదు.

---

## గోవిలాపము

మంగిపూడి వేంకటశర్మ గారు

స్మరియింపరో 'అహింసాపరమో ధర్మ' యనెడు నార్యోక్తి పుణ్యాత్ములార,
భావింపరో 'ఆత్మవత్సర్వభూతాని' యన్న ధర్మోక్తి ధన్యాత్ములార,
తరచరో 'పాపాయ పరపీడన' మటన్న సత్యార్థమును దయాశాలులార,
అనరో 'పరోపకారార్థం శరీర' మన్ దివ్యసూక్తిని బుధధ్యేయులార,
జీవుల నకారణముగ హింసింతు రేల-తోడిజీవుల మీావలె జూడ రేల
జంతుసంతతి బట్టి బాధింతు రేల-దేహముల బెంప మమ్ము వధింతు రేల?

నోరెరుంగని మమ్ము నొవ్వజేయుట మీాకు ధర్మ మేమో మదిన్ దలపరయ్య,
సాధుజీవుల మమ్ము చలపట్టి హింసింప న్యాయమేమో చింత చేయరయ్య,

మీకు మేల్చేయు మమ్మే కోసి భక్షించు టిది కృతజ్ఞతయేమొ యెంచరయ్యా,
శాకభక్షణ మాని జంతుభక్షకు లౌట క్షేమమేమో పరీక్షించరయ్యా,
ఈశ్వరకుటుంబ మగుగదా యెల్ల జగము-మీకు మే మన్నదమ్ముల మేకదయ్యా,
సర్వ ధర్మము లెరిగి మాంసమును మరగ-మన జగత్పిత మెచ్చునే మనుజులార!

చీమ కుట్టిన నెంత చిమచిమలాడునో చిత్తంబులందు యోచింపరయ్యా,
అరకాలిలో ముల్లు విరిగినచో గల్గు వేదనన్ మదిని భావింపరయ్యా,
కంటిలో నలుసుచే గలిగెడు బాధను తలపునం దొక్కింత తలపరయ్యా,
చెప్పులోపల రాయి చేరి యొత్తినమాత్ర బాడముకష్టము నాత్మ దడవరయ్యా,
నల్లికరచిన మన సెంత తల్లడిలునో-దోమకాటున కెద యెట్లు త్రొట్రుపడునో
నెరసు సోకిన మే నెంత చురుకుమనునో-మనసునం దెంచి హింసను మానరయ్యా!

గడ్డి గాదము మేసి కడుపు నింతుము గాని మీనోటి కడ్డమై మెలగబోము
సాధుమార్గములందు సంచరింతుము గాని పరకంటకంబుగా బ్రతుకబోము
పాలు చేపుచు మీకు మేలు చేతుము గాని యపకార మెపుడు చేయంగబోము
మామగసంతతిన్ మీ మేలు గోరి శ్రమించు మంచును సమర్పించినాము
తామె మా తల్లిదండ్రులు దైవ మనుచు-నమ్మియున్నాము మాయమర్మమ్ము లేక
యిట్టి మము బట్టి పగబట్టి హింసచేయ-మనసు లెటు లొప్పె నయ్యయో మనుజులార!

మా పాలు పెరుగులు మజ్జిగల్ లేకున్న గడిమైనగాని వేగంగలేరు
మా వెన్న మీగడల్ మా నెయ్యి చవిచూడ కున్నచో నొక్కనా డుండలేరు
వ్యవసాయమునకు మావారి సాయము లేక యొక క్షణికంబైన నోపలేరు
పయనంబులందు మావారు తోడ్పడకున్న నడు గావ లీవల కిడగలేరు
అదియిది యనంగ నేల మాయవసరంబు-లేనిసమయంబు గలదె గాలించి చూచి
మమ్ము లాలించి పాలించి మాకు మీకు - మైత్రి పొసగంగ జూడరే మనుజులార!

ధేను సమృద్ధియే దివ్యంబులైన సంసారసౌఖ్యముల కాధార మనుచు
ఆముష్మికానంద మందింప సులభ సాధనము గోబృంద సేవన మటంచు
గో దేవత లటంచు గో మాత లనుచును సొమ్ములు జీవ ధనమ్ములనుచు
తమ నందనులతోడ సమముగా మమ్మాదరించి ప్రేమించి పోషించినారు

రోగములను రొచ్చు రాకుండ రోజురోజు - నేమరక సర్వవిధముల నోమినారు
ఉభయ తారక సరణిచే నొప్పినారు - తొల్లి మీపెద్ద లట్లె వర్తిల్లరయ్య!

మాపాలు పెరుగులు మజ్జిగల్ త్రాగిన తనివి తీరగలేదె తండ్రులార,
మావెన్న మీగడల్ మాజున్నులను దిన్న నాశ తీరగలేదె యన్నలార,
మాపాల పాసెముల్ మానెయ్యి జుర్రిన మనసు తీరగలేదె మాన్యులార,
మామలమూత్రముల్ మమత మీరగ గొన్న తుష్టి తీరగలేదె శిష్టులార,
కాచి పెంచిన మమకార కరుణ లెల్ల - గంగపాల్చేసి మా యుపకారములను
మరచి మా మాంసమును మెక్కమరగినారు-ధర్మమగునయ్య మీకు మా త్రాతలార!

ఫలజాతు లెన్నెన్నొ వెలయించి యున్నాడు దేవుండు మీతుష్టి దీర్చుకొరకు
కాయజాతుల నెన్నొ కల్పించి యున్నాడు దేవుండు మీతృప్తి దీర్చుకొరకు
పుష్పజాతుల నెన్నొ పుట్టించియున్నాడు దేవుండు మీతన్వి దీర్చుకొరకు
ఆరుజాతుల నెన్నొ చేకూర్చి యున్నాడు దేవుండు మీయాశ దీర్చుకొరకు
తరువులును ధాన్యములు సదా తరుగకుండ - నీశ్వరుడు మీతనువు బెంప నిచ్చినాడు
చిత్రభక్ష్యాలు మీరు సృష్టింపగలరు - మాంసమును మానరాదె యో మనుజులార!

మాయరణ్యము లక్రమవిచారులై చొచ్చి మించునుద్ధతి నాక్రమించినారు
మాయమర్మము లేని మమ్ము మచ్చికచేసి బంధనంబుల పాలు పరచినారు
తమ దయా ధర్మభిక్షము మీద నాధార పడియుండు గతికి లోబరచినారు
మాలేగ లుస్సురు మని యేడ్చుచుండంగ మాపాలు గొని త్రాగ మరగినారు
ఉన్న గోభూములన్నియు దున్నినారు - ముసలితపమున గడ్డికై మొగమువాచి
కాటిమొగమైన మము బట్టి కటికివారి - కప్పగింతురె కటకటా యార్యులార!

బ్రతికియున్నప్పుడు పాలు మున్నగునట్టి యాహారముల నిచ్చు టంతెకాక
చచ్చియు జాల బాసట చేయుచున్నాము కొమ్ములు గొరిజలు నెమ్ము లిచ్చి
గోరోజనం బిచ్చి కొవ్వును నిచ్చియు చర్మంబు నిచ్చి మాంసంబు నిచ్చి
చచ్చియు బ్రతికియు సాయంబు చేసెడు సాదుల మము బట్టి చంప దగునె
దయయు ధర్మంబు మేలును దలప వలదె - హింసచేసిన మి మ్మింక నీశ్వరుండు
మెచ్చునే మీకు శ్రేయస్సు నిచ్చునయ్య - కినిసి శపియింపడయ్య యో మనుజులార!

---

# కుచేల

సీ. కామేశ్వరరావు గారు

(వెనుకటి సంచిక తరువాయి)

## తృతీయాంకము

### దృశ్యము ౧

### రాజసభ

[ప్రవేశము: కృష్ణుఁడు సింహాసనాసీనుఁడై; సమీపమున నుచితాసనాసీనులై నారదుఁడు, సాత్యకి, సామంత రాజవర్గము]

నారదుఁడు

మహాప్రభూ, అపూర్వవస్తుప్రదర్శనముఁ గావింతునని సెలవిచ్చియుంటిరి. నేఁటిదనుక నా యద్భుతమును జూడఁజాలనైతిని.

కృష్ణుఁడు

నారదా, తొందర యేల? నామాటకుఁ దిరుగు లేదు. తప్పక చూపెదను. నానాదేశాధీశులు వచ్చియున్నవారు. రాజకార్యము ముగిసిన తరువాత నీయభీష్టము నెఱవేర్చెదను.

నారదుఁడు

శ్రీనివాసా, విస్మృత మయ్యెనేమో యని భ్రమపడితిని!

కృష్ణుఁడు

ఋషితిలకా, నేను మఱవలేదు; అది యెన్నఁటికిని విస్మృతగాథలలోఁ గలియనేరదుసుమా!

[కుచేలుఁడు ప్రవేశించును.]

కుచేలుఁడు

ఆహా! భువనాలంకారమగు నీభవనము సుదర్శనసభ ననుకరించుచున్నది. శ్రీకృష్ణదేవుఁడు కార్యాలోచనాధీనుఁడై యున్నవాఁడు. ఈ శృంగారమూర్తిని విలోకించిన మాత్రమున నయనేంద్రియములు ధన్యత్వ మొందె. వనమాలికావాసనల ఘ్రాణేంద్రియము కడుం గడు తృప్తిఁ గాంచె. ఒక్కింత యాఁగి యాతని మధురవాక్యంబు లాలించి శ్రోత్రేంద్రియములను బవిత్రముఁ గావించుకొనియెద.

కృష్ణుఁడు

మగధరాజా, మీరాజ్యము సుభిక్షమేకదా?

కుచేలుఁడు

(స్వ) సముద్రమున వడగండ్లుపడిన కైవడి, శ్రీనివాసునియందు నామనంబు లీనమైపోవుచున్నయది.

మగధరాజు

మహారాజా, మీయనుకంపాతిశయమున సమయోచితముగా నెలకు మూఁడువానలు కురియుచున్నయవి; వసుంధర సస్యశ్యామలమై, సమృద్ధిశాలినియై యొప్పారుచున్నయది; బ్రాహ్మణులు వేదాధ్యయనతత్పరులై, ధర్మనిష్ఠాగరిష్ఠులై, పూజ్యులైయున్నవారలు; ప్రజలు దుర్భిక్షపీడ లెఱుంగక సుఖమున నున్నవారలు. రాజ్యమున నెట్టియలజడియును లేదు.

కుచేలుఁడు

(స్వ) నా కింకేమి కావలయును? పరమనిష్ఠాగరిష్ఠులు, మును లెవ్వానిదర్శన మపేక్షించి

వడయనేరరో, ఆ మహామహునిఁ గన్నులారఁ గాంచితిని; కన్నులున్న ఫలముఁ గాంచితిని. ఇంక నాకుటీరమున కరిగెదను.

కృష్ణుఁడు

కాంచీపతీ, (అర్థోక్తిలో) ఆహా! నేఁ డెట్టి సుదినము! అన్నా, కుచేలా! ప్రాణసఖా, కుచేలా! రమ్ము, రమ్ము! నేఁ డెట్టి స్వర్ణము హూర్తమునఁ దెల్లవాఱినది!

(ఆసనము డిగ్గి) కుచేలా! ఎన్నిదినములకు నాకన్నులపండువుగా మరల దర్శన మిచ్చితివి! (కౌఁగిలించుకొని) అన్నా, దారితప్పి వచ్చితివా, యేమి?

కుచేలుఁడు

(హర్షోత్కంపమున) (స్వ) ఆహా! ఎంతదయ! ఆదర మెంత! ఇట్టివాఁడు కాకున్న లోకబాంధవుఁడని, దయాసాగరుఁడని త్రిజగములఁ బేరు కలుగునా?

(ప్రకాశముగా) కృష్ణా! కాదు; కాదు. మహారాజా, చాలదినములనుండి నిన్ను—కాదు, కాదు, శ్రీవారిని—

కృష్ణుఁడు

ఏ మనుచుంటివి? మహారాజా, శ్రీవారిని, అనియా? కుచేలా, నన్నింత త్వరలో మఱచిపోయితి వెట్లు? చిన్ననాటి ముచ్చటలు నీ కెంతలో విస్మృతమాయెను! సాందీపఋష్యాశ్రమమున మనము చదువుకొనిన పుణ్యాదినములు మఱచిపోవుదమన్నను మఱపునకు రావు. ఆదినములందు నీవు నన్ను మహారాజా యని యెన్నఁడైనఁ బిలిచితివా? ఆ పిలుపులోఁ దీపి లేదు; సుఖము లేదు; ప్రాణము లేదు. అన్నా, నన్నుఁ బెఱవానిఁ జూచినయటులు చూడవలదు. నీరాకఁజేసి నాదేహము పులకరించెను; నాగేహము పవిత్రమయ్యెను. (చేయి పట్టుకొని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టును.)

కుచేలుఁడు

వలదు, వలదు. ఈ సింహాసనమును నావంటి దరిద్రబ్రాహ్మణుఁడు స్పృశింపరాదు. క్రిందనే కూర్చుండెదను.

కృష్ణుఁడు

కుచేలా, నీమాటలు నాహృదయమును వేధించుచున్నవి. నేను నీసఖుఁడను; నీతమ్ముఁడను. ఈ యాసనము నీది కాదా? నీకు దీనిపై సంపూర్ణాధికారము లేదా?

(కుచేలునిశరీరమును స్పృశించి) ఓహో! దూరాగమనప్రయాసమునఁ గాఁబోలు దేహమంతయుఁ జెమటలు గ్రమ్మినది. ఈ పూలవీవనతో విసరుదునా? (విసరును.)

కుచేలుఁడు

వలదు, వలదు. ఆవీవన నా కొసంగుఁడు. నేనే విసరుకొనెదను.

కృష్ణుఁడు

అన్నా, ఎట్టి విపరీతపుమాటలు వినుచుంటిని! సాందీప గురుదేవుని పూజాసమయమునకు వలయు పూవులు, పండ్లు, సమిధలు మున్నగు పదార్థములు సంగ్రహింప మన మెన్నిసారులు

సాంద్రారణ్యభూములఁ గ్రమ్మఱలేదు. అప్పు డప్పుడు నీ వాయాసఖిన్నుఁడవై చెట్లనీడ విశ్ర మించునపుడు చిగురాకువీవనలతో నే విసర లేదా? అప్పు డేమైన నా కడ్డుచెప్పితివా? అప్పటి యాహృదయ మిది కాదా? ఆనాఁటి నెచ్చెలి కాఁడను గానా నేను? కుచేలా, ఇంట నంద ఱును సుఖమున్న వారలా?

(రాజులు తమలోఁదాము గుసగుసలాడుదురు.)

కుచేలుఁడు

(స్వ) వామా! నన్నెట్టిభయంకరకూపమునఁ గూలఁద్రోసితివి! ఎవ్వాఁడు త్రిజగత్పూజ నీయుఁడో, యాతఁడా నన్నుఁ బూజించుట! నాపాపము దుస్సహము! దుర్భరము!

కృష్ణుఁడు

సఖా, నీవు నన్ను మఱచినటులు సాధ్వీమతల్లి, పరమపూజనీయచరిత, మద్భక్తురాలు, మా వామాక్షి నన్ను మఱవలేదుకదా?

కుచేలుఁడు

లేదు, ఆమె మిమ్ము మఱవలేదు. లోక కళ్యాణమూర్తి నెవ్వరు మఱవఁగలరు?

(స్వ) నే నిప్పు డెందున్నవాఁడను! రాజసభా మధ్యముననా? సాందీపఋష్యాశ్రమముననా?

కృష్ణుఁడు

సాత్యకీ, సత్వరము లోని కరిగి పట్టమహిషి రుక్మిణీదేవికి వర్తమాన మంపుము; సువర్ణకలశ మున జలముఁ గొని యామె నిందురమ్మనుము.

[సాత్యకి నిష్క్రమించును]

నారదుఁడు

ప్రభూ, నే నిప్పు డెందున్నవాఁడను?

కృష్ణుఁడు

దేవఋషీ, నీవు రాజసభలో నున్నవాఁడవు.

[బంగారుగిండియలో జలముఁ గొని రుక్మిణి ప్రవేశము]

కృష్ణుఁడు

దేవీ, నీ వీతనిని బోల్చితివా? మున్ను జూచి నఁగదా పోల్చఁగలవు. ఈతఁడే నాచిన్న నాఁటి నెచ్చెలి; నాసహాధ్యాయి; నాగౌరవ కేతనము! చూచితివా, యీతనిచరణములు ధూళిధూసరితములై యున్నవి. ఇప్పటికే చాలనాలస్యమైనది. ఈతనిపాదములు కడిగి నీగౌరవవర్ధనముఁ గావించుకొనుము.

[రాజులు తమలోఁ దాము గుసగుసలు.]

కుచేలుఁడు

(కాళ్లు ముడుచుకొని) (స్వ) ఓహో! ఎట్టిపాప మార్జింప వచ్చితిని! శ్రీకృష్ణభగవానుని పట్ట మహిషి లోకమాత, ఇందిరాదేవి, నాకాళ్లు కడుగుటయా? వినలేను; చూడలేను; సహిం పలేను!

రుక్మిణి

మిత్రుఁడా, కాళ్లు ముడుచుకొనెద వేమి? నీ కాళ్లు కడిగి, యా పవిత్రజలమును శిరమునఁ జల్లుకొని చరితార్థురాల నయ్యెదను.

కుచేలుఁడు

(స్వ) ధనలోభమున నాపిశాచి నన్నిటకుఁ బంపినది! తెలిసినది, లోభమునఁ బాపము;

పాపమున మృత్యువు—వామా, నీకన్నీళ్ల క్రోడి, నేను మహాపాపపారావారమునఁ బడి మునిఁగిపోవుచుంటిని.

కృష్ణుఁడు

సఖా, సిగ్గుపడెద వేల? ఉత్కృష్టకార్యతత్పరులను వంచింపఁ దగునా?

నారదుఁడు

జగత్పితా, నానివేదన మొండు గలదు. అవధరింపుము.

కృష్ణుఁడు

ఆనివేదన మెట్టిది?

నారదుఁడు

రుక్మిణీదేవి లోకమాత; నేను మీపుత్రుఁడను. బ్రాహ్మణునిపాదములు కడుగుటకు నా కానతిండు.

రుక్మిణి

ఈకార్యభారము నిర్వహించు పుణ్యము నాయది. నారదా, చూడలేదా, బ్రాహ్మణుని పవిత్రపాదచిహ్నమున భూషితమై ప్రాణేశ్వరుని వెడఁదయుర మెట్లొప్పారుచున్నదో!

(పాదములు కడిగి, నీరు శిరమునఁ జల్లుకొని, చేలాంచలమునఁ దుడుచును.)

కుచేలుఁడు

పాపినీ, నీవలనఁ గదా నా కీకష్టము!

కృష్ణుఁడు

మిత్రమా, ఏమంటివి? ఎవరివలన? ఎట్టి కష్టము నీకుఁ గలిగెను?

కుచేలుఁడు

ఎవరా? నీభక్తురాలు వామ!

కృష్ణుఁడు

ఆహా! ఆమెను జూచి యెన్నిదినములైనది! ఆమెచేతియన్నము దిని యెన్నాళ్లయినది! మహానందభరితయై యాసాధ్వి నా కెన్నిసారు లెన్నిపదార్థములు దినుట కొసంగుచుండెడిది! ఆమెచేతి యడుకు లెన్నిమాఱులు దినినను, తినవలయుననియే యుండును.

కుచేలుఁడు

(స్వ) ఏమి చేయుదును! జీర్ణచేలమున ముడిచి దాఁచిన యీయడుకులమూట బైటవేయఁడు కదా? ఇందుఁ గూడిన పృథ్వీపతులు నన్నుఁ జూచి నవ్వకుందురే?

కృష్ణుఁడు

సఖా, నిజము చెప్పుము. నీవు వచ్చినప్పుడు వామాక్షికిఁ జెప్పివచ్చితివా? ఆమెచేతి యడుకులకు నే నాసపడుచుందునని యామె యెఱుంగదా? దూర మైనంతమాత్రమున న న్నామె మఱచిపోయినదా?

కుచేలుఁడు

(స్వ) హతభాగ్యుఁడను. నా కిం కేమి దారి?

కృష్ణుఁడు

కుచేలా, క్రొత్తవానివలెఁ జూచెద వేల? చంక క్రింద దాఁచితి వదేమి? ఆ సద్భక్తిశీలిని, వామాక్షి పంపిన యుపహారామృతమును దాఁచెద వేల? తెమ్ము! ఈనిండుసభలో,

సమస్తజనుల సమక్షమున, నాయలౌకికపదార్థమును దిని ధన్యుఁడ నయ్యెదను.

(అడుకులమూట దీసికొనును.)

కుచేలుఁడు

దేవదుర్లభపదార్థ మర్పించియైన నెవ్వనిఁ దృప్తిపఱుపఁజాలమో, యాతని కిట్టి తుచ్ఛపదార్థమె ట్లర్పింపఁగలను? ఎట్టి యకార్య మొనరించితిని? నాపాపమునకుఁ బ్రాయశ్చిత్తమున్నదా?

కృష్ణుఁడు

(మూట విప్పి పిడికెఁ డడుకులు దిని) ఆహా! అమృతముకంటె శతకోటిగుణముల మధురమై నా కవ్యక్తానందము గలిగించుచున్నది! ఇట్టిపదార్థమును వైకుంఠమున, గోలోకమున, దేవలోకమున, మర్త్యలోకమున, నే నెన్నఁడును దినియుండలేదు. నారీశిరోమణి వామాక్షి యెంత శ్రద్ధాధీనయై, యెట్టి భక్త్యావేశమునఁ బంపెనో యీయడుకులు! ఆహా! ఎంతమధురము! ఎంతమధురము!!

(మఱల పిడికెఁడడుకులు దినుట కుద్యమించును. రుక్మిణి యాతని చేయిపట్టి వారించి)

రుక్మిణి

నాథా, ఇది యేమి? భక్తురాలి ప్రేమోపహారమారగించి సర్వమును మఱచితిరా? ఆప్రేమ మయికి వైకుంఠముకూడ ప్రదానముఁ గావించితిరి; త్రిభువనములు దానముచేసితిరి. ఈ యీవికి మేర లేదా? మఱియొకపిడికెఁ డడుకుల కింకేమి యొసంగ నెంచితిరి? చివరకు నన్నుఁ బరాయిదాన నొనరింతురా?

కృష్ణుఁడు

దేవీ, నిజము; ఆయబలాస్నేహదత్త నైవేద్యమారగించి నేను సర్వమును మఱచిపోయితిని.

కుచేలుఁడు

కృష్ణా, విన్నది కన్నులారఁ గాంచితిని; నీవు నిజముగా దీనబంధుఁడవు; అనాథనాథుఁడవు! పేదవాని నెచ్చెలికాఁడవు! నికృష్టపదార్థమని యీయుపహారమును బహిరంగముగా నీకు సమర్పింప లజ్జించితిని. నీవు సమాదరపూర్వకముగా దానిం గైకొని, యమృతము కంటె మధురతరమని యారగించి, నామానవృద్ధి గావించితివి. గోకులచూడామణీ, నీదయామహిమకు ధన్యవాదము! నీకారుణ్యమునకు నమస్కారము! దుఃఖదరిద్రుఁడనని నేఁడు నేను గర్వించుచున్నాను.

నారదుఁడు

బ్రాహ్మణోత్తమా, సార్థకము నీజీవనము! శ్రీకృష్ణా, సార్థకము నీయనురాగము! త్రిలోకముల మీరలే పూజ్యులు!

రాజవర్గము

ధన్యోస్మి! ధన్యోస్మి!!

నారదుఁడు

బ్రాహ్మణప్రవరా, నీపూజ పూచి ఫలించినది.

రుక్మిణి

ప్రాణేశ్వరా, పథక్లేశమునఁ బూజ్యుఁ డగు నార్యబ్రాహ్మణుఁడు చాల కృశించిపోయెను.

ఆతని విశ్రామమనదుపాయ మొనరింపవలయును. లోనికిఁ బోవుదము.

కృష్ణుఁడు

అవును, దేవీ!—కుచేలా, పదలోనికి—రాజశేఖరులారా, నేటికి మనము కొలువు చాలింతము. ఎన్నాళ్లకో మరల చిరమిత్రలాభము. నేటి నా యీ యానందమునకు మేర లేదు.

రాజులు

జయము! ద్వారకాధీశ్వరా, జయము! జయము!!

[నారదుఁడు తప్పఁ దక్కిన యందఱు నిష్క్రమింతురు.]

నారదుఁడు

శ్రీకృష్ణభగవానుని లీలాతత్త్వము దురవగాహము! ఎవ్వని నేముహూర్తమున నెట్లాడించునో, యెవరు గ్రహింపఁగలరు? ఆ లీలానాటకసూత్రధారునకే యెఱుక!

(యదుకులకాంభోజిరాగము - ఆదితాళము)

ఏహిముదం దేహి శ్రీకృష్ణ! కృష్ణ!
పాహి గోపాలబాల కృష్ణ! కృష్ణ!
నందగోపనందన శ్రీకృష్ణ! కృష్ణ!
యదునందన భక్తచందన కృష్ణ! కృష్ణ!

[నిష్క్రమించును.]

దృశ్యము ౨

అంతఃపురము

[ప్రవేశము రుక్మిణీ శ్రీకృష్ణులు]

కృష్ణుఁడు

దేవీ! కుచేలుని యాగమన కారణ మెఱుంగుదువా?

రుక్మిణి

ప్రాఁత నెచ్చెలికాఁడు గదా, చూచిపోవుదమని వచ్చియుండును.

కృష్ణుఁడు

కాదు, సఖీ, ఆతఁడు నిజబుద్ధిబలమున రాలేదు.

రుక్మిణి

అటులైన నెవరిప్రబోధమున వచ్చియున్నాఁడు?

కృష్ణుఁడు

ఆతని యర్ధాంగి వామాక్షి ప్రోద్బలమున.

రుక్మిణి

ఆమె యాతని నిటకుఁ బంపుటకు హేతువేమి?

కృష్ణుఁడు

కుచేలుఁడు నితాంత దరిద్రుఁడు. కట్ట గుడ్డ లేక, తినఁబట్టెఁడన్నము లేక, ఆతని పేదకుటుంబ మెడతెగనికష్టముల పాలై పోయినది. ఆకారణమున ధనభిక్షుకై వామాక్షి స్వీయనాథు నిటకుఁ బుత్తెంచినది. కుచేలునకు బొత్తిగా ధనకాంక్ష లేదు. ఆతఁడు నన్నేమియు నర్థింపఁడు. నిరంతరము నా ధ్యానమున నిమగ్నుఁడై యుండును!

రుక్మిణి

నాథా, ఈ పరిస్థితులలో మీయుద్దేశ మేమి?

కృష్ణుఁడు

దేవీ, స్త్రీవినా పురుషుని సంపూర్ణత దుర్లభము. నీవు నా యభీష్టమును బూర్ణమొనరింపవలయును.

రుక్మిణి

మీ యాదేశమును సమగ్రముగఁ బాలించుట కంటె నాకొండు పుణ్యవ్రతము గలదా? నాథా, నేను మీపాదదాసిని; నే నిప్పు డేమి చేయవలయును?

కృష్ణుఁడు

నీవు తలంచిన నాచెలికాఁడు దారిద్ర్యదుఃఖ విముక్తుఁ డగును. నీవు అన్నపూర్ణవు; జగత్పాలయిత్రివి. కుచేలుని దరిద్రకుటీరమున నీవు పదార్పణముఁ గావింపవలయును. అచిర కాల మాతనియింట నీవు నివాస ముందువేని నే నెంతయో సంతసించెదను.

రుక్మిణి

వామాక్షి పతివ్రతాశిరోమణి. ఆపుణ్యాంగ నాసందర్శనము సామాన్యభాగ్యము కాదు. నాథా, అవశ్యము పోయివచ్చెదను.

కృష్ణుఁడు

దేవీ, అనుకూల దాంపత్యముకంటె సుఖ తరవస్తు వేది కలదు? నీ యనుకూలభావ మున నేను త్రిలోకపూజ్యుఁడ నైతిని. అదిగో, కుచేలుఁ డిం దరుదెంచుచున్నవాఁడు. ఆతని ముఖశ్రీ విలోకనము నా హృదయ మున కమృతవృష్టి యగుచుండును.

[కుచేలుని ప్రవేశము]

కుచేలుఁడు

(ప్రవేశించి—స్వ.) ద్వారకాధీశ్వరుని స్నేహము స్వచ్ఛందము; దయ యపారము; ఆదరము మనోజ్ఞము; నావంటి దీనహీనబ్రాహ్మణునకా యింతపూజ! ఈ యానందమయస్వర్గరాజ్య మునఁ బ్రవేశించి యింటిమాట మఱచితిని. శ్రీకృష్ణుని సహవాస మెంత శాంతిదాయకము! జగజ్జనని రుక్మిణీదేవి శుశ్రూషాపూర్వకముగా నాహృదయమును గొనివేసినది. ఆదిదంప తులు రుక్మిణీ శ్రీకృష్ణుల దర్శించితిని; సకల భాగ్యములు జేకూఱె.—వామాక్షి దుఃఖా శ్రుకలిత నేత్రములతో నాయాగమనము నిరీ క్షించుచుండును. నే నిం దరుదెంచి యెన్నియో దినము లైనట్టు లున్నది. భగవానుని సెలవు గైకొని యింటికిఁ బోయెదను.

(ప్రకాశముగా) యదుకులమణీ! నే నిం దరు దెంచి చాలదినము లైనది. వామాక్షి బిడ్డల యాగడ మోర్వలేక యలజడిపడుచుండును. నేఁ బోయి వచ్చెదను.

కృష్ణుఁడు

కుచేలా, మఱి రెండుమూఁడుదినము లాలసించిన సంతోషించి యుందును. చాలదినములకు మఱల మనము కలిసికొంటిమి. నీవు మారాజ సౌధమునఁ బ్రవేశించినదాది నాయానందమున కు మేరలేదు; గాని గృహస్థులకే యెక్కఁడలేని యలజడి; నిన్ను నిరోధించుటవలన లాభము లేదని యెఱుంగుదును. సరియె, సఖా, పోయి రమ్ము. వామాక్షికిఁ జెప్పుము ఆమె పంపిన యమూల్యోపహారమునఁ గృతార్థీభూతుఁడ నైతినని.

కుచేలుఁడు

తప్పక చెప్పెదను. సఖా, పోయివచ్చెదను.

కృష్ణుఁడు

బయలు దేఱినతరువాత నే నాటంకము చేయఁ గలనా?

రుక్మిణి

ఆర్యా, వామాక్షికి నామాటగా నిట్లు వచింపుఁడు: "పురాణపురుషుఁడగు భగవానుని నిమిత్తము నైవేద్య మర్పించి, నన్ను మఱచి పోయితివి. నేను పరాయిదాననా? నన్ను నీవు మఱచినను, నేను ని న్నెల్లవేళల స్మరించుచునే యుందును."

కుచేలుఁడు

అమ్మా! అటులే చెప్పెదను.

(స్వ) శూన్యహస్తములతోఁ దిరిగిపోవుటయే మంచిది. నోరెత్తి యడుగలేను. మనసులో మాట తెలిసికొని, సర్వవ్యాపి భగవంతుఁడు తృణమో పణమో యొసంగిన మంచిది; లేకున్న వామాక్షి నెట్లో బుజ్జగించెదను. ఇంతకు సిరులతో నాకేమి పని యున్నది?

కృష్ణుఁడు

సఖా, ఆలోచించుచుంటి వేమి? మమ్ము విడుచుటకు మన స్సొప్పకున్నదా? అవును, ఇప్పటిదా యీబాంధవ్యము? కాని, వామాక్షి నీకై యెదురుచూచు చుండును! పోవకున్న సంసారయాత్ర జరుగు టెట్లు?

కుచేలుఁడు

కృష్ణా, పోయివచ్చెదను.

కృష్ణుఁడు

సరియె, సావధానముగాఁ బోయిరమ్ము.

కుచేలుఁడు

(స్వ) అడుగకయే యిచ్చువాఁ డడిగిన నిచ్చునా? నాయదృష్టమున నేమియున్నదో యదియే ఫలించును. దేహియని స్వర్గీయసంబంధమును గళంకిత మొనరింపఁజాలను.

(ప్రకాశముగా) సరియె, పోయివచ్చెదను

కృష్ణుఁడు

మిత్రమా! ఎన్నిమాఱులు చెప్పెదవు?

కుచేలుఁడు

(స్వ) వామా, నీయాశ నిరాశఁ గావించితిని. నీనైరాశ్యవదనముఁ దిలకించు దౌర్భాగ్యము నాలలాటమున విస్పష్టముగా లిఖింపఁబడి యున్నది.

(ప్రకాశముగా రుక్మిణి నుద్దేశించి) లోకమాతా, పోయివచ్చెదను.

రుక్మిణి

పోయిరండు; వామాక్షి యడుగుఁదమ్ములు స్మరించుచుందునని చెప్పుఁడు.

కుచేలుఁడు

(స్వ) దంపతు లిరువురు నేకగ్రీవముగాఁ బోయి రమ్మని సెలవిచ్చిరి.

(ప్రకాశముగా) ఇప్పటికే చాల యాలస్య మైనది. లోకనాథా, లోకమాతా, పోయి వచ్చెదను.

కృష్ణుఁడు

కుచేలా, పోయిరమ్ము.—కాని, నీవిం దరుదెంచినటులు నీదర్శనముఁ జూపకున్న వామాక్షి

విశ్వసించునా? ఈరత్నహారమును గైకొనుము (రత్నహారము కుచేలుని మెడలో వేయును.)

కుచేలుఁడు

మహాభాగ్యము! పోయివచ్చెదను.

రుక్మిణి

ఆర్యా, ఈ రత్నహారము దుర్లభపదార్థము. దీనిని గేలఁ దాల్చి యేది యర్థింతు రది సిద్ధించును; గాని యట్టిసిద్ధి యొక్కమాఱే కలుగును. దీనిగుణ మిట్టిది.

కుచేలుఁడు

(స్వ) దరిద్రుఁడ నగుట శ్రీకృష్ణుని యనురాగమునకుఁ బాత్రుఁడ నైతిని. దారిద్ర్య మొక వరప్రసాదమని వామాక్షి కెఱింగించెదను.

(ప్రకాశముగా) సఖా, పోయివచ్చెదను; తల్లీ, పోయివచ్చెదను.

[నిష్క్రమించును.]

నారదుఁడు

(ప్రవేశించి) మహాప్రభూ, నీ లీలారహస్యము నే నెఱుంగఁజాలకున్నాను. సాంద్రారణ్య భూముల మహామునులు పర్ణాశనులై కొందఱు, వాయుసేవనమునఁ గొందఱు, పంచాగ్నిమధ్యమునఁ గొందఱు, సహస్రసహస్రవర్షములు కఠోరతపం బాచరించి నీయనురాగలేశము నడయనేర కున్నవారలు. ఈసామాన్యదరిద్ర బ్రాహ్మణుఁడు, సంసారతాపత్రయమున జర్జరీభూతమైన హృదయముతో, నీయాదరమునకు యోగ్యుఁ డయ్యె నెట్లు? నీగళము నలంకరించు నమూల్యరత్నహారము నాతనికిఁ బ్రదానముఁ గావించితివి; రుక్మిణీమాత యాతని కాళ్లు కడిగినది. ఇంతకంటె నాశ్చర్య మేమి కలదు?

కృష్ణుఁడు

నారదా, కుచేలునకును నాకును నెట్టిభేదమును లేదు. ఆతనికారణముననే యీమర్త్యభువనమున నాగౌరవము చిరస్థాయి యగును.

నారదుఁడు

దేవా, ఇంతప్రియపాత్రుఁ డగుట కాతని గుణాధిక్య మేమి?

కృష్ణుఁడు

దేవర్షీ, నీ వాతని ననుగమింపుము. ఆతనియెడ నాకుఁగల స్నేహగౌరవముల ప్రమాణము నడయఁగలవు.

నారదుఁడు

సరియె, ప్రభూ, పోయివచ్చెదను.

(స్వ) పరీక్షించి చూచెదనుగాక!

సాధుసాధు కృత మిహ   కృష్ణ కృష్ణ—లోక
సాధక హితాయ శ్రీ   కృష్ణ కృష్ణ!

[నిష్క్రమించును.]

కృష్ణుఁడు

దేవీ, నీ వింక వామాక్షిపజ్జ కరుగుము. నేను కుచేలుని వెనువెంట నడచెదను.

[నిష్క్రమింతురు.]

## చతుర్థాంకము

### దృశ్యము ౧

### కుచేలుని కుటీరము

[ప్రవేశము - వామాక్షి]

వామాక్షి

ఉ. ద్వారక యెంతదవ్వొ? కడు
దారుణమైన వనప్రదేశ మే
తీరున దాఁటెనో విభుఁడు?
తీరనిదుఃఖముఁ దెచ్చుకొంటి ని
స్సారధనంబుఁ గోరి;—ననుఁ
జల్లనిచూపులఁ జూచువాని, ని
ష్కారణప్రేమమూర్తి నిఁకఁ
గాంచెడు భాగ్యము లేద దైవమా!

నే నెంతపని చేసితిని! ద్వారకాయాత్ర కేల నే నాతనిఁ బురికొల్పితిని? పాపపుణ్యము లెఱుంగని నే నేల తొందరపడి యింత కొడిగట్టుకొంటిని? ముష్టిగింజలతో సంతృప్తి నొందక సిరుల కేల పేరాసపడితిని? హా! కృష్ణా, నా విభుఁడు సురక్షితముగా గృహోన్ముఖుఁ డగునట్లు వరముఁ బ్రసాదింపుము. నాప్రాణ మున్నంతవఱకు మఱి నే నాతని నెచ్చటకును బంపను. నాతప్పు సైరింపుము. తండ్రీ, దయామయా, పిట్టలకడుపులో గుట్టు నెఱుంగువాఁడవు; అంతర్యామివి; నా హృదయమును బోల్చుకొనలేవా? ఆతనిపరోక్షమున నాకంతయు నంధకారమయముగాఁ జూపట్టుచున్నది.

[సన్న్యాసిని ప్రవేశించును]

గీ. భువనమోహనకరమైన ముద్దుమోముఁ
జూపి చూపవు, నాయెడఁ గోపమేమొ!
చల్లనికనుల సంజకెంజాయ విరియ,
ప్రణయబాంధవా, పాతాళప్రాప్తి నాకు.

గీ. కరిసెదవు గా లిడినచోట విరులవావ
భావణముల నొల్కెదవు పీయూషధార
అమృతహాసము నిత్యకల్యాణమయము!
ప్రణయబాంధవా, ని న్నెడఁబాయఁగలనె?

వామాక్షి

ఆహా! ఈ నిశీథమునఁ గనికరపు గీతమును బాడుచున్న దీమె యెవరు చెపుమా?

సన్న్యాసిని

అమ్మా, తల దాఁచుకొనుటకు మీయింట నాకుఁ దా వొసంగుదువా?

వామాక్షి

నీ వెవరు? నీ దేయూరు?

సన్న్యాసిని

అమ్మా, మాది చాల దూరదేశము. చేరెడు నేలకై వాడవాడలఁ దిరిగితిని తల్లీ! ఈమేఘాంధకార నిశీథమున నామొ రాలింతు రెవరు? ఈయూరికిఁ గ్రొత్తదానను; న న్నెవరు విశ్వసింతురు?

వామాక్షి

అయ్యో! ఎట్టివిపరీతకాలము! ధనధాన్యములఁ దులఁదూఁగు నీయవంతీనగరమున నీకాశ్రయము లభింపలేదా?

సన్న్యాసిని

అమ్మా, నీవు దయామయివి; పరులదుఃఖము గ్రహింపఁగలవు. నేను నిరాశ్రయురాలను.

వామాక్షి

బాలికా, నీవు చాల చక్కని దానవు. నీకీ దేశాటనము విధించిన విధికాఠిన్య మేమందును! నీభర్త లేఁడా? నిన్నాతఁ డాదరింపఁడా?

సన్న్యాసిని

అమ్మా, ఆతనిమాట నే నేమని చెప్పుదును. ఆతఁడే యిల్లు వాకిలి కనిపెట్టుకొనియుండిన నాకీ యనంత భ్రమణయోగ మేటికి కలుగును?

వామాక్షి

బాలికా, నీమాటలు నాహృదయమును జీల్చివేయుచున్నవి. అయ్యో! నీ కెంతకష్టము కల్గెనే తల్లీ!

సన్న్యాసిని

అమ్మా, నాభర్త కాలు నిలకడలేని దేశద్రిమ్మరి. ఆతనికి జాతిమతభేదములు లేవు. 'తన, పర' యను విభేదము లేదు. బ్రాహ్మణుల నారాధించును; గొల్లలఁ బూజించును; సుందరుల, వికలాంగుల నొకేచూపునఁ జూచును; పిలిచినను, బిలువకయున్నను, నేదియో పని యున్నటు లందఱి నాశ్రయించును. ఇట్టి రీతి, గతి లేనివానితో నేవంపు బ్రతుకు బ్రతుకలేక నే నిల్లు విడిచి వచ్చితిని. అమ్మా, మీయింట నింకెవ రున్నారు?

వామాక్షి

అదిగో, కటికినేల నిద్రించువా రిరువురు నా పుత్రులు. నాభర్త యింట లేరు. నేను హతభాగ్యను. ఆతనిరాక వార్చి నిద్రాహారములు లేక యలజడిపడుచున్నాను.

సన్న్యాసిని

వా రెం దేఁగిరి?

వామాక్షి

ద్వారకానగరమునకు.

సన్న్యాసిని

ఏల?

వామాక్షి

శ్రీకృష్ణభగవానుఁ డాతని చిన్ననాఁటి నెచ్చెలికాఁడు. నే నాఁడుదానను; బిడ్డలగోడు చూడలేక, ధనభిక్షుకై నావిభుని ద్వారకాధీశ్వరుని సమక్షమునకుఁ బుత్తెంచితిని. ఎన్నియో యుగములనుండి నే నాతనిని విడనాడినటులు నా హృదయము బరువుగా నున్నది.

సన్న్యాసిని

అమ్మా, నే వినుచుందును శ్రీకృష్ణుఁడు దీనుల పాలిటి కల్పవృక్షమని; ఆతనిసమక్షమున కరిగినవారికి సకలశుభంబు లగును.

వామాక్షి

నిజమే; కాని, కూఁతురా! నాయంధహృదయ మేటికో భయభ్రాంతిపూర్ణమై పోయినది.

సన్న్యాసిని

అమ్మా, తెల్లవాఱినంతనే నాదారి నే నడచిపోయెదను. అంతదనుక నే నిందుఁ దల దాఁచుకొనుట కనుమతింతువా?

వామాక్షి

తల్లీ, నీవంటి దీనహీనప్రాణులకుఁ దావొసంగలేకున్న నిల్లు కట్టిన ప్రయోజన మేమి? గృహ

స్థాశ్రమధర్మము లోపింపదా? బాలికా! వలసి నన్నాళ్లు నీ వీకుటీరమున నుండవచ్చును.

సన్న్యాసిని

అమ్మా, నీయౌదార్యమునకు నమస్కారము. నీహృదయము నిష్కళంకము; నీవంటి నారీ మణులయునికి కారణముననే సూర్యచంద్రులు దారి తప్పక వర్తించుచున్నవారు.—తల్లీ, నేఁ డాలస్యముగా భోజన మొనరించితిని. పిడికెఁ డడుకు లున్నఁ దిని, గ్రుక్కెఁడు నీళ్లు ద్రాగి నిద్రింతును.

వామాక్షి

(స్వ) హా! కృష్ణా, న న్నెట్టి తీవ్రపరీక్షకు లోను గావించితివి! గంజి కాఁచి పోయుదమన్నఁ బిడికెఁడునూకలైన నింట లేవు. నామాట కేమి? పిల్లలుకూడ నేఁడు కూడు లేకయే పండుకొనిరి. పూర్వజన్మమున నే నెట్టిఘోరపాప మొనరించితినో! యింటి కరుదెంచిన యతిథుల, నభ్యాగతుల సత్కరింపలేని నిష్ఠురజీవనము నిష్ప్రయోజనము. అట్టిబ్రతుకు బ్రతుకుటకంటె బలవన్మరణమే మేలు! ఇప్పుడు నే నీమె కేమని బదులుచెప్పుదును?

సన్న్యాసిని

అమ్మా, ఆలోచించుచుంటివేమి? నాకుఁ దావొసంగ నీ కిష్టము లేకున్నఁ జెప్పుము, నే నింకొకచోటికిఁ బోయెదను.

వామాక్షి

తల్లీ, నీచేతులు పట్టుకొని ప్రార్థించెదను, నీయిష్టము వచ్చినన్నాళ్లు నీవు మాయింట నివసింపుము. నీవు తిరిగిపోయిన నాకు ఘోరనరకప్రాప్తియగును.—నీ వించుక యాఁగుము, నే నిప్పుడే వచ్చెదను.

సన్న్యాసిని

ఈచిట్టచీఁకటిలో నీ వెం దరిగెదవు?

వామాక్షి

అమ్మా, ఇంట నీళ్లు లేవు; బిందెఁడునీళ్లు దీసికొనివచ్చెదను.

(నిష్క్రమించును.)

సన్న్యాసిని

సతీమణీ, వామాక్షీ, నీవే ధన్యురాలవు! నీవంటియిల్లాలు ముల్లోకముల వెదకినను గానరాదు. ఇంట నేమియును లేదు; మానవతివగుట, లేదని చెప్పలేక ప్రాణత్యాగ మొనరింపఁబోవుచున్నావు. నానాథుని యనురాగమునఁ బోషితవగు నీకుఁ గొఱంత యేమి కలదు? పేదదానవైనను, కుబేరసంపద యనుభవించు శ్రీమంతులయందు లేని మహోదారస్వర్గీయగుణము నీయందుఁ గలదు. నీవు తిరిగి వచ్చునంతలో నీ యీ దుఃఖస్మృతి లేశమైన లేకుండఁ జేసెదను.

[లోని కరుగును.]

[స శేషము]

---

# ప్రాక్టికల్ కవిత్వం
## (చాకిరేవునుండి)

కొల్లూరు ధర్మారాయ కవిగారు, బి. ఏ.

(ప్రవేశం. గిరీశం - వీధంటవొస్తూ)

గిరీశం__అవతల social reform లో practical side of the question solve చేసి, ఇక్కడ field of letters లోకి వొచ్చేసరికి, మనకీర్తి చంద్రిక లేవడో కవిగాడు చెప్పినట్టు దిక్కుల్లో డీ కొడుతున్నాయి.... ...... రమారమి ఏడాదైంది మా బాబానికి romantic poetry లో instructions ఇచ్చి; ఇప్పటి కెక్కడా పైటు పల్లేదు. Ruminate చేసి చేసి ఆఖరికి Grey లా యేవో నాలుగు సలైన్లు రాస్తాడు కాబోలు జన్మకల్లా.

(గుమ్మం ఎక్కి వీధితలుపు కొడుతూ) Dearest!-

బుచ్చమ్మ__ (లోపల్నించి) వొచ్చా, వొచ్చా.

గి.__Dearest! తలుపు తియ్.

బు.__(తలుపు తీస్తూ) అబ్బా! వస్తూవుంటే ఒకటే పిలుపా? (అని గిఱ్ఱున వెళ్లును.)

గి.__My goodness! ఏవిటివాళ ప్రణయమూర్తి కాళీమూర్తికింద తయారైంది?

బు.__ (వంటింట్లోంచి ఠెక్కుతూ) అభిమానాల్తప్పితే అన్నీ మార్పుల్లాగే ఔపడతాయి.

గి.__ (స్వగతం) Socrates పెళ్లాం కోపంతో ఉరిమి ఉరిమి చెంబుతన్నీళ్లు వర్షం కురిపించిందట వాడినెత్తిమీద. మా అవుధాన్లు మావగారి మోస్తరు తత్వం దాంది. Mrs. గిరీశం tears వర్షం కాబోలారంభించింది. (దగ్గిరికెళ్లి) ఏవిటిప్పుడొచ్చిన కొత్తవిశేషం? క్రిష్ణుళ్లాగ కాళ్ల మీద పడాలేమిటి?

బు.__ (కోపంగా) చాల్లెండి. ఈ దిక్కుమాలి నకవిత్వాలేవో మొదలెట్టి, ఇల్లా సంసారం, ఇదుందీ, ఇది లేదూ, అన్న వూసే తలపెట్టడం మానేసేరు. ఈమధ్య ని మా తమ్ముడు కనిపించేట్ట, వాణ్ణి ఓమాటు తీసుకొచ్చి నా కళ్లయెదుట పెడితే తప్పా, చెప్పండి? వాడేలా వున్నాడో అనిపిస్తూంది.

గి.__ (స్వగతం) అబ్బా! Wordsworthian reflection! (పైకి) ఎందుకా వగవడం? అవుధాన్లు మావగారి సంతానంలో unhealthy fellows, అంటే అనారోగ్యపు అభాజను లున్నారా? వెంకటేశానికేం, దుక్కలాగున్నాడు. బావ బస్తాలాగున్నా బుద్ధి మనపటిదేన్లే!

వెంకటేశం__ (వీధిలోంచి) బావగారూ!

గి.__Coming. (బుచ్చమ్మతో) అడుగో మాటలోనే వొచ్చాడు; నూరేళ్లాయుష్షు. (వెళ్లి తలుపు తీసి) ఏమోయ్ బావా, welcome. మీ sister నీసురించిప్పుడే curtain lecture ఆరంభిస్తూంది.

బు.__(వంటింట్లో స్వగతం) ఔను, నే మాట్లాడితే చాలు, లెప్చరు. ఆయన మాటాడిందంతా పాఠం చెప్పడం.

వెం.__అక్కయ్య కులాసాగా ఉందా? ఎన్నాళ్లయిందో దాన్ని చూసి!

బు.__(సన్నని కంఠంతో ఏడుపు ప్రారంభించును.)

వెం.__ఊరుకో అక్కయ్యా, మనకు ప్రాప్తం లేందీ నాన్న ఎలా బతికుంటాడు?

బు.__(మరో స్థాయి హెచ్చించింది.)

గి.__ Keep quiet; foolishness! ముసలాళ్లకోసం ఏడుపేవిటి? and for such an old hag? చాల్లే; వేగంలేచి కాఫీపెట్టు, బావ కాఫీ తాగేడో లేదో.

బు.—(కళ్లొత్తుకుంటూ) అక్కర్లేదు. వాడు చల్దిన్నం తింటాడు. మీరు కావలిస్తే మరోమాటు తాగండి, పెడతాను. తమ్ముడూ, కాళ్లు కడుక్కోరా.

వెం.—వొద్దే. ఇప్పుడిప్పుడే కాఫీ తాగేను, దార్లో అరవక్లబ్బులో.

గి.—సరా. మీ తమ్ముడింకా చిన్నగుంటడను కున్నావేవిటి? నాదగ్గిర శిష్యరికంచేసినవాడెవడూ ఉట్టినే పోలేదు.

బు.—(కూరలబుట్ట తెచ్చిపెట్టుకొని) ఐతే, ఒరే తమ్ముడూ, మనసుబ్బిపెళ్లికి నాన్నశుభలేఖ రాయక పోతే నువ్వేనా రాయకూడదా?

గి.—ఏది, మీసుబ్బి రెండోపెళ్లికా?

బు.—చాల్లెద్దురూ, మీరూ మీమాటలూనూ! మొదట పెళ్లయిందా ఏవిటసలు; అంతా మీరు చేసిందే.

గి.—నేనేంచేసేను, మధ్యని?

బు.—మీరో మీలుభ్దావుధాన్లో. అంతా పోకటే కద.

గి.—Nonsense, మీ మావ play చేసినదగ్గా, నానెత్తినివేస్తావేం? మొత్తాన్ని ఆముహూర్తాన్ని పెళ్లిందంటావా, లేదంటావా?

బు.—పెళ్లెక్కడైంది?

గి.—ఏదో వోపెళ్లి? (అని కోరచూపు చూసి నవ్వును.)

బు.—(జవాబుగా నవ్వును.)

వెం.—(బోధపడక) మానాన్న అప్పుడు నాకు చేసినదెబ్బలపెళ్లి మీకలా తెలిసింది?

గి.—Poets eye అంటే సామాన్యం అనుకున్నావేవిటి? ఐతే బావా? నీపెళ్లిమాటలేం అవుతున్నాయా?

వెం.—లేదండీ, మాఅమ్మ వొప్పుకోకుండావుంది. మానాన్న సంవత్సరీకాలు దాటాలంటుంది.

గి.—పోనీ, నీఅభిప్రాయం చెప్పూ. Grown up girl కావాలా, కన్నెని పెళ్లాడతావా?

వెం.—కన్నెపెళ్లి సరదా మానాన్న తీర్చేశాడు పెయ్యాకన్నెతోటి.

గి.—(నవ్వుతూ) అదికాదోయ్... మీ sister ఏదోపన్లలో పడ్డావి. At length మాటాడుదాం; గదిలోకి రా.

(గదిలో Easy ehair లో గిరీశం, ఎదటి కుర్చీ మీద వెంకటేశం.)

గి.—Well! బావా, నువ్వింకా marriage చేసుకోకుండా వుండడం నాకు disgrace లాగుంది.

వెం.—లోగడ మీతో చెప్పేనుకదూ, నాకేదేనా ప్రణయమూర్తిని జతపెట్టించాలని? ఆభారం మీమీదే వేసేను.

గి.—Alright, I am glad for that. ఐతే నువ్వు కొంచెం romantic trend లోకి దిగితేగాని లాభంలేదు. ఇది by proxy నడిపించడానికి వీల్లేని హంశం.

వెం.—నిజంవేకాని, మీరు చెప్పిన romantic వాసన నాకు పట్టు బడ్డాదికాదు. ఏం సాధనం?

గి.—yes. దీనికి మీఅగ్రహారం విడిచిపెట్టి కొంత touring చెయ్యాలి. Regular study of ournajls వల్లకూడా అది కుదురుతుంది.

వెం.—పత్రికలు చదువుతున్నానండీ; దేన్నో చూసినా మీరు లోగడ చదివిన గీతాల్లాటివే కనిపిస్తున్నాయిగాని, ఒహదానికీ సందర్భం, అన్వయశుద్ధి లేవు.

గి.—Foolishness! నీ orthodoxy విడిస్తేనేగాని వాటిస్పిరిట్ catch చెయ్యలేవు. పోనీగాని ఇప్పుడు Journals లో అవితప్ప, పండితులు రాసే దిక్కుమాలిన chronological research discussions ఎవడేనా చదువుతున్నాడూ? ఎవడో నాగమ్మ tenth century లో పుట్టేడని ఒహడూ; కాదు ninth century మధ్యస్తంగా వుంటుందని మరొహడూ ఎందుకీతగవులాటలు? అలాటివాళ్లకి రసవిచారణలో—అంటే soul of poetry గ్రహించడంలో ఒహటో head వెళ్లదు. Real poet అన్నవాడు, ఒహటో

అక్షరం రాస్తే, చెర్లో రాయిపడ్డట్టు reader గుండెల్లో stirring కలుగుతుంది.

వెం.—చదివేసరికి అర్థానికేందారి అని గుండెల్లో రాయిపడా లంటారు?

గి.—Foolish jokes మానుమీ! ఈ subject మాత్రం serious గా think చెయ్యవలిసుంది.

వెం.—నిజంవే, నేను ఖర్మంజాలక మీమాటలు విని ఓగీతం అల్లితే, చాలా serious గా తిరిగింది. ఆకథ తాపీగా చెబుతాలెండి.

గి.—Alright, చెబుదూగాని. Hear me, ఇప్పుడీ భావకవిత్వాలవల్ల ఎన్ని వుపయోగా లున్నాయో చూసేవా?

వెం.—నాకో హపే తోచలేదు.

గి.— మొదటు, press వాళ్లు బతుకుతున్నారు. Articles కోసాని హావురావురుమనీ journals కి ఆకలి తీరుతూంది. ఇవి material benifits. ఇహ literary విషయం ఆలోచిస్తే: ఇదివరకు, Telugu literature అంతా ఒకబీరువాలోకి వచ్చేదికాదు. ఇప్పుడో, కావ్యాలు అపరిమితంగా చైల్ దేరేయి.

వెం.—బాగుంది; కాని ఈ modern పుస్తకాలు తూనికనికూడా రైలుస్టేషన్లలో అమ్ముతున్నారు. ఒహకవితాలూకు సంపుటం వెయ్యికాపీలైనా ఒక వీసెడు తూగకుండా వున్నాయి.

గి.—ఔనోయ్. Iron తూఁగినంత లావుగా gold తూగుతుందా? Quality చూడొద్దూ?

వెం.—ఆగొప్పతనంవే నాకు బోధపళ్లేను.

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ చందాదారుసంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది.

—భారతి.

గి.—Yes. ఆగొప్పతనం నీకు logical గా prove చేస్తాను విను. భావకవిత్వం ఇప్పుడు బాగా చలామణీ అవుతూందికదా?

వెం.—ఔను.

గి.—పెద్దపెద్ద వాళ్లంతా దానిమీద criticisms రాస్తున్నారా లేదా?

వెం.—రాస్తున్నారుకాబోలు.

గి.—కాబోలుకాదు. నిజంగానే రాస్తున్నారు. అంచేత, literary big-wigs తాలూకు attention. draw చేసిన poetry లో ఏదో unique excellence వుండని ఒప్పుకోవాలా?

వెం.— ఏమో! మీ logic కూడా భావకవిత్వంలాగే అయోమయంగా ఉంది.

గి.—Nonsense పోనీగాని నువ్వేదో గీతం రాస్తే కొంప మునిగిందన్నావే, అదేదోచదూ. దానిలో నీ shortcomings, explain చేస్తాను.

వెం.—(మొహమాటిస్తూ) చదూతానుగాని అర్థం నన్నడక్కండి.

గి.—What a man you are? అసంగతి చెప్పాలిటోయ్ నాహ?

వెం.—సరే. (చదువును.)

"నాటిసాయాహ్నమందున పూటకూటి
ఇంటిలోపల ప్రేయసీ, కంటినిన్ను"

గి.—Beautiful! ఆ abrupt opening ఈరోజుల్లో రక్తికట్టిస్తుంది. కాని నా old story,

versify" చేసేవేమిటి కొంపతీసి? లేక similar incidents నీకూ తటస్థపడ్డాయా?

వెం.—నా సంగతే ఇదంతా ఆటో—ఎదో—ఆటోడిల్ బహోర్ గా వుండా లన్నారు poetry మీరేను?

గి.—ఓయ్, నీతస్సాగొయ్యా! Auto-biographical కి వచ్చిన పాళ్లేవి టని?

వెం.—అదిగో మరిచిపోయేను. ఏంటని?... ఏదో...అలాసంటాలన్నారు కారూ మీరూ?

గి.—అచ్చా! నీకూ స్వీయచరిత్ర కొంచకొంచం form చౌతూందన్నమాట? 'Great wits jump' అన్నాడు. నా story, repeat చేసేవే. Go on; interesting గానే వుంది చనూ.

వేం.—(చదువును.)

"ప్రళయఝంఝూప్రభంజనోచ్చలితమామ
కీనహృదయపత్రంబు తోడ్తోన వచ్చి
భవ్యభినదీయమృదుపదద్వయిని వ్రాలె,
నా ప్రణయజీవ సంజీవనప్రదాత్రి!"

గి.—Good. Keats లాంటి idea పారేసేవ కుర్రాడ; Sound echoing sense కూడా romantic type లో లాక్కొచ్చేవు. అయితే ఆ first line లో ప్రళయంవా, ప్రణయంవా?

వెం.—అది మీ యిష్టం. యతికోసాన్ని చూస్తే ప్రళయంవే, లేకుంటే ప్రెస్‌వాళ్ల యిచ్ఛాధీనం.

గి.—బాగుంది. Continue.

వెం.—మరివా continue ఏంటిటి?. ఆమకవిత్వంకింద personal గా address చేసి చెప్పడం నించే కొంపమీది కొచ్చింది.

గి.—Devilish! ప్రణయమూర్తిని oral గా ముఖాముఖీ address చేసేవేంటిటి?

వెం.—మరేం చెయ్యను? అచ్చుపడితే మరీప్రమాదంవేంవోనని దేనికీ పంపలేదు. ఇదిగో తర్వాత ముత్యాలసరం చెప్పేను వినండి:

నీను రాత్రి గం. 8-30 లకు.

"భుక్తశేషోచ్ఛిష్ట పాత్రా
లంకృతార్ద్రికరంబుతో, ద్వా
రమున, సఖి, నీమూర్తి మెరయగ
నిలువు నీకై తిన్."

గి.—Capital. True to nature. ఇంత కన్యానికవిత్వం నువ్వెప్పుడూ చెబుతా వనుకోలేను.

వెం.—Nature ఏంటిటి. Fact జరిగినట్టు రాసేను.

గి.—yes. Continue.

వెం.—అంతేను. మరి సశేషం కాదు. అర్థంతెలిసిన నాగయ్య.. వరసకి మా బావ...ఆకేనీడలో ఉన్నాడు. దాంతో మాయింటి కళ్లీదాకా నాకు ఒంటిమీద తెలిలేదు.

గి.—(నవ్వుతూ) ఏం, ఆకర్ణాంతంగా measure చేసేడేంటిటి వాడు?

వెం.—(కోపములో) ఆ rascal ని చూడండిమాటు......

గి.—శాంతించవోయి బావా; ఏదో హాస్యానికి తగిలేచ్చేడు. కాబోయే బావకదా మరి!

వెం.—హాస్యంవేంటిటి? జిగ్గుమంది మొహాడం తానూ.

గి.— Practical భావకవిత్వంలో strata. gems నీకు తెలిసేయికావు. నేనైతే అలాంటి situation లో ఊరుకుంటానా?

వెం.—ఏంచేస్తా రూరుకోక. దొంగలతల్లి కేడుపు భయం.

గి.—అబ్బే, దాని methods వేరు. కవిత్వంలో అడ్డుతగిలినవాణ్ణి కథలో పట్టుకుని ఏకేస్తాను.

వెం.—ఎలాగేంటిటి? దానివల్ల లాభ వేంటిటి?

గి.—"నేను" కథ లెరగవోయ్. కథలో hero "నేను" heroine "ప్రణయమూర్తి". Happy ending

కి అడ్డుతగిలే character ఎవడో వాణ్ణి fool లాగు depict చేసి, in spite of that fellow "ప్రణయ మూర్తి" "నేను"ని చేపట్టించని రాయాలి. దానివల్ల two birds at one shot అన్నట్టు ఒకవంక reprimand, ఒకవంక ప్రణయలేఖా, telegrams లాగ పడతాయి.

వెం.—మీరు నెయ్యి చెప్పండి; నాకు నురిహా భావ కవిత్వం ఒద్దు; ప్రణయమూర్తి దొరక్కపోతే మాని పోతాను.

(ప్రక్కసావిట్లోంచి బుచ్చమ్మ) ఒరేతమ్ముడూ. ఆగొడవేదో కట్టిపెడుదురూ. ఏందారి పొయ్యిమీద ఎసరెక్కించీనేను. ఓమాటు చెయ్యిచేసుకుంటేగాని ఎలాగ?

గి.—అన్నా! చచ్చాం. ఏంసాధనం బావా! I. C. S. తగిలింది.

వెం.—మీకేం ఫర్వాలేదు. నేను నడుం కడతాను.

గి.—పోనిద్దూ. ఈ troub e ఎవడు పడతాడు? హోటల్లో మనిద్దగం mess చేసేసి carrier తో మీ sister కి తెద్దాం రావోయి.

వెం.— నేనయి ఇహ హోటేలుగుమ్మం ఎక్కను.

గి.—ఓయ్, నీతస్సాగొయ్యా! ప్రణయందెబ్బ నీకు బాగా experience అయిపోయిందే.

వెం.—ప్రణయందెబ్బకాదు. ప్రణయకవిత్వఁనే యిలా ఖడిసికొట్టింది.

(అని నూతికి పోవుచు.)

(తెర)

---

# కుమారుఁడు

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

[వెనుకటి సంచిక తరువాయి]

ఈ రత్నగర్భయే చే
కూరునుగా కన్నృత మాడకుమ విను వినలే
దే రోగికిఁ బథ్యము సం
సారికిఁ దథ్యమ్ము ననువచనము కుమారా.

పథ్యము చేయనిరోగియుఁ
దథ్యము పలుకనినరుండుఁ దగ నతిథుల కా
తిథ్యము చేయనిగృహి సా
రథ్యవిరహి రథియుఁ జెడుదుర ఛుమ కు.

ఏగుణములు లేకున్నను
బాగుగ ధైర్యమును వృద్ధిపఱుచుకొనుమ యు
ద్యోగికి ధైర్యగుణమ్మే
వేగుణములపెట్టు సుమ్మ వినుము కుమారా.

జ్యేష్ఠులు చేసినయదియ క
నిష్ఠులు చేయుదురు గాన నీ వెల్లపుడున్
శ్రేష్ఠముల చేయుచుండి వ
రిష్ఠుఁడ వనిపించుకో ధరిత్రిఁ గుమారా!

లంచములు గొనుట యతరుల
వంచించి ధనమ్ము గొనుట వల దటు సంపా
దించినసంపద లామయ
సంచయమునఁ గలుగుబలుపు సమము కు.

కాంతాకనకమ్ములపైఁ
జింతన లేనట్టినరుఁడ శివుఁ డనుకొనుమా
కాంతాకనకము లనఁ బర
కాంతాకనకమ్ము లనియె కనుమ కుమారా.

క్షమవంటితపసు సంతో
షముతో సరి యయినచిత్తసౌఖ్య మ్మాశా
సమ మగురోగము దయతో
సమ మగుధర్మమ్ము లేదు జగతిఁ గుమారా.

ఒకవేళ నయినఁ బరులకుఁ
బ్రకటింపకు మింటిగుట్టు పా డగుఁ జూ! ఊ
రక యింటిగుట్టు చెడి లం
కకుఁ జేటు తటస్థ మయ్యెఁ గాదె కుమారా.

ప్రాచీనుల యాచారము
లాచరణకుఁ దెమ్ము విడువు మన్యమ్మును శి
ష్టాచారహీను వేదము
లే చక్కఁగ శుద్ధుఁ జేయలేవు కుమారా.

విను వంట మొదలుగాఁగల
పను లన్నియు నేర్చి యుండవలె నెప్పటి కే
పని చేసికొనవలెనొ యె
వ్వని కెఱుక? అదవుకు పనికివచ్చుఁ గుమారా.

ధన మొసఁగినచో సిద్ధిం
పనికార్యము లేద మెట్టిమానిసి కయినన్
కనుకను మతిమంతుఁడవై
ధన మార్జించుటకె పూనఁ దగుదు కుమారా.

అశనముచే నింద్రియములు
వశపడుచందమున నెల్లపనులు ధనముచే
వశపడును గాన దానిని
విశేషముగఁ గూర్పఁ గొనుమ వేడ్కఁ గు.

నీకంటెఁ జిన్నవాండ్రను
లోకువ యని యెంచి వంచి లోలత నెపుడున్
చీకాకుపఱుపఁ బోకుము
నీకే కష్ట మగు దాన నిజము కుమారా.

అవమానపూర్వకముగాఁ
దెవిపోయినప్రేమ మరలఁ దిన్నఁబఱుప నా
శివునకును జెల్ల దఁట! అవుఁ
బవిలినముత్తెమ్ము నదుకఁ వశమె కుమారా.

అడిగిన షహానము కాలము [మల్
గడపుట పయనమ్ము భూమిఁ గనుట కనుబొ
మ్ముడివైచుటయును పెడమొగ
మిడుటయు నివి నాస్తి యనుటయేర కుమారా.

అకులీనుఁడు రా జయినను
అకోవిదునికొఱకు ప్రాజ్ఞుఁ డైనను నిఱుపే
దకు ధన మబ్బినను ప్రపం
చక మగపడు గడ్డిపరకసరణిఁ గుమారా.

వినయ మ్మన నెట్టిదొ యెఱుఁ
గనివాఁ డగువిద్వద్గ్రగణ్యునికంటెన్
వినయము గలమూర్ఖుఁడె మ
న్ననఁ గాంచుచు నుండు ననుచు నమ్ము కు.

రా జనఁగ ముఖ్యసుమన
స్తేజస్సంభవుఁడు భువిని దేవుఁ డతఁడ త
ద్భూజాని నెపుడు భక్తిగఁ
బూజింపనివాఁడు దున్నపోతు కుమారా.

రాజులకంటెను హెచ్చుగ
రాజామాత్యాదులను నిరంతరమును దా
నేజనుఁడు కొల్వఁడో ఆ
వాజమ్మకు నెట్లు పేరు వచ్చుఁ గుమారా.

ధనికుఁడు శ్రోత్రియుఁడును నది      [యూ
యును రాజును వైద్యుఁ డెందు నుండరో ఆ
రను ప్రాజ్ఞుఁ డయినవాఁ డొక
దిన మయినను మసలఁ దగఁడు తెలియు కు.

గుణవంతునిసంగతి ని
ర్గుణుఁ డెఱుఁగఁడు;మచ్చరించుగుణవంతుఁడు స
ద్గుణములు గలవానిని గని
గుణియు గుణగ్రాహి యగుట గొప్ప కు.

విను మెచటినుఁడియొ తమం
తన వచ్చును; ఉండియుండి తమయంతన పో
వును మరల నెచటికో; ఔ
ధనఘనములవిధము తెలియఁ దరమె కు.

ఇల నెవఁడు బ్రదికియుండఁగఁ
బలువురు బ్రదుకుదురొ వాన్ని బ్రదుక బ్రదుకు ప
క్షులు బ్రదుకుచుండవే ము
క్కులతోఁ దమపొట్ట నింపుకొనుచుఁ గు.

ఎది యోగ్యుల కిచ్చెద వె
య్యది తృప్తిగ ననుభవింతు వదిమాత్రమ నీ.

యది యని తక్కినయది యొరు
లది యనియును చిత్తమునఁ దలంచు కు.

'యుగరాజశాసనముల క
నుగుణముగా నడువ' మనుజనుల కిహసంప
త్తి గలుగ దందురు కావున
యుగము ననుసరించి నడుచు టొప్పుఁ గు.

దేశక్షేమార్థులు పలు
క్లేశమ్ములు వచ్చినను చలింపరు తమ యా
వేశము విడువరు స్వార్థము
లేశముఁ గన రూరకుండలేరు కుమారా.

ప్రతిదినము కొలువఁజాలిన
చతురుల కలజాతిబొమ్మసయితము కోర్కుల్
జతపఱుచుచుండ నిఁక భూ
పతిసంగతి వేఱ చెప్పవలెనె కుమారా.

పాలిచ్చునవుడు చేసెడి
లాలన పాలనలు పశువులకుఁ జేయము గా
పాలొట్టిపోయినపు డిది
చాలదె మనస్వార్థపరతఁ జాటఁ గుమారా.

శ్రీకాళయుక్తివర్షము
నాకరునెలలోని మొదటి యర్ధమ్మున యం
దేకాదశదినమున నిది
ప్రాకటముగఁ బూర్తి సేయఁబడియెఁ గుమారా.

పలునీతులు చెప్పిన కవి
నలినభవుం డయిన సూర్యనారాయణతీ
ర్థులపేరు నీమన స్సను
పలకపయిని వ్రాసి యుంచవలయుఁ గుమారా.




నా తలిదండ్రులు నేఁటి యాచారము చొప్పున నా కింగ్లీషు చెప్పించిరి. నేను బి. ఏ. ప్యాసయితిని.

నా ప్రకృతి పూర్వాచారములందే ప్రతిష్ఠితమయి యున్నది. నేను ముమ్మొదట పూర్వాచారపరాయణలలో అచ్చాఁడీని.

నాకథను నేనే చెప్పికొనుచుండుటచే ప్రాచీనాచారముల నతిక్రమింపవలసి వచ్చుచున్నది. నేను క్రమక్రమముగా ప్రాచీనాచారముల నతిక్రమింపనే అతిక్రమించితిని గాన ప్రకృతము నాభర్త నామధేయమును విన్నవింప లజ్జింపను. ఇపు డానామమే నాకు మంత్రము.

నరోత్తమరెడ్డి బి. ఏ. సర్టిఫికెట్ పుచ్చికొని నాలుగేండ్లయినది. నాకు బి. ఏ. సర్టిఫికెట్ పుట్టినతోడనే నన్నతని కిచ్చి పెండ్లి చేయుటకును సర్టిఫికెట్ పుట్టినది. పరీక్షాఫలము తేలినపిదపనే ఏయావయు లేని యానంద మనుభవింప నర్హ మని నాతలంపు. నరోత్తమరెడ్డి సంకల్పముకూడ నదియే.

నవీనాచారప్రకారము పెండ్లి జరుగవలయునని వరుని యిచ్ఛ. ప్రాచీనాచారప్రకారమే జరుగవలయునని నాయిచ్ఛ. తుదకు నాపట్టుదలయే నెఱవేఱెను. కాని కొన్ని ప్రాచీనాచారముల నే నతిక్రమింప కుండలేకపోతిని. అసలు నాది ప్రౌఢావివాహముకదా! నేను బంతులాడలేదు. అతనికంచమున కూడు కుడువలేదు. నామగనిపేరు—పాప మతఁడు చాల కుతూహలపడియుండు ననుకొందును—అపుడు చెప్పలేదు. కాని నాపేరు చెప్పింపవలసినదని నేను చేసిన ప్రేరణ మింతింత కాదు. అతఁడు విధిలేక నాపేరు చెప్పుచుండఁగా పురుషలోకమును దాసలోకముగాఁ జేసినంత యానందించితిని.

పెండ్లి కెక్కువవ్యయము. కాఁగూడదని అతని తలఁపు. కాని నాపట్టుచే షాజమీందారు కుటుంబములలోనగు వ్యయము, ఆడంబరము, లాంఛనములు వృథాయును అయిపోయినవి.

పెండ్లియగు పిదప నేను మగనితో అత్తింటి కేఁగితిని. నేను లోఁగడ వలచియుంటిఁ



౧. షాహ్‌నజాఫ్-పంజాబు

గను. నరోత్తమరెడ్డికి నాపై ప్రేమ కలదని మెఱుఁగుదును గాని నన్నంతగా అతఁడు వలపించిన నమ్మకము లేదు. చాలకాలము దాటినతరువాత తన యనుగ్రహమున నేను సాత్త్వికమగు ప్రేమగంథమున ఓనమాలు చదువ మొదలిడితిని. నే నంతఃపురమున నే యుండఁగోరితిని గాని అది నామగని కిష్టము కాదు. నా కపుడపుడు పురుషులకు వలె స్వేచ్ఛాచారముపై మనసు పుట్టెడిది కాని దాని నడఁచి తెరచాటున బొమ్మవలె తిరుగుదానను. 'పిఱికివారును, అనదలును తెరచాటున దాఁగియుందు'రని నాభర్త యనెను. 'నీవు నామనఃకవాటముపై ఆఘాతము కలుగఁజేసితి' వంటిని. 'మనఃకవాటమునకు బీగము తీయుటమాత్రమే నాపని కాదు. కవాటోత్పాటనమే నాపని' అని అతఁ డనెను.

నాభర్త నాయుడుపువలెను, నాయూర్పువలెను నన్నంటుకొని, నాలో లీనుఁడై యుండనలయునని నాకోరిక. నే నుండఁగా నతనికి శయ్య యేల? అతఁడు నన్నొక చెలివలె చూచుచుండువాఁడు గాని భార్యవలె చూడఁడని నాయపవాదము. రేయుంబవళ్లు నన్నంటుకొనియుండుమని అతనితోఁ జెప్ప సంశయించుచుండుదానను గాని యాతఁడు వెళ్లునపుడతనివస్త్రాంచలము నెఱుఁగనటులు గ్రహించుటయో, ఏదోపని యున్నట్లు వెనుకకుఁ బిలిచి యేమి లేదు లెండని యనుటయో చేసెడిదానను. అతఁడు వెనుదిరిగి చూడక, మాఱుమాటాడక వెళ్లిపోయినపిదప నే నుస్సురని

చిబుకముక్రింద చేయూఁది కూర్చుండుదానను. ప్రేమయనిన వట్టి రాకపోకలా? నే నపుడు చేసిన మంచిపని యేదనఁగా, ఏదాసిచేతను నాభర్తకు ప్రేమబోధ చేయింపలేదు.

నే ననేకగ్రంథములు చదివితిని. ఏకవియు ప్రేమను సంపూర్ణముగా నిరూపించినటులు నాకు తుష్టి కలుగలేదు. ప్రేమయన్న కేవల నాయికానాయకవర్ణనమా? దాని ననుభవింపవలయు, వ్రాయవలయు. నేనే కవయిత్రి నయితినేని శృంగారకవిత్వమునకు జగతిలో లోపముండకుండెడిది. ఈశ్వరుఁడు దాతను ధనికుని కావింపనటులే చేయవలసినవానిని కవులుగాఁ జేయఁడు.

నాభర్తలో మఱియొక మనుష్యుఁడు లేఁడు. ఇది చెప్పవచ్చును, ఇది చెప్పరాదు అనున దతఁ డెఱుఁగఁడు. ఏదాసియేని తనపై భావము చూపించుచో వెంటనే నాకు తెలిపి దానిని పవిత్రపఱుపు మని నొడివెడువాఁడు. నేను దానిని తన్ని తగిలివేయ నెంచుదానను. అతఁ డది ఖండితల పనియనియు, వారి నచటనే యుంచి వస్త్రగాళితము చేయుట నీతిలక్షణ మనియు చెప్పి, వారిని తాను 'అమ్మా' యని సంబోధించువాఁడు. ఇటు లగుటఁజేసి నే నొక మనశ్శుద్ధిసంఘమున కాధిపత్యము వహింపవలసి వచ్చినది.

అతఁడు తెర తీసివేయవలసినదని నాకు మఱొకసారి బోధించెను. ప్రకృతము దానిఁ దొలఁగింపవలసినంత యక్కఱ లేదని నే



5, 10- 8

నంటిని. నాసమాధానమున రెండుప్రయో జనము లున్నవి: .నే నంతఃపురమున నే యుండుచో అతఁడు ప్రేమోపాసకుఁ డగు ననున దొకటి; నేను చెప్పనిది రెండవది.

అతఁడు స్త్రీస్వాతంత్ర్యమును గూర్చిన గ్రంథములు బోలెఁ డిచ్చెను. పాప మిపు డెవరిస్వాతంత్ర్యము హెచ్చో అతఁ డెఱుఁగఁడు. ఆతఁ డాపుస్తకముల నెచట నుంచెనో అవి యచటనే యుండెను. అవి జడములు కావా? ఆసరస్వతి యెచట నలిగిపోవునో యని నేను కడుశ్రద్ధతో ముట్టక మూచూడక శరన్నవ రాత్రపూజ చేసితిని.

నా యుదాసీనతకు నాభర్త కోపింపను లేదు, సంతసింపను లేదు; ఆగ్రంథముల నట నుండి కదిలింపను లేదు. చదివితివా యని యడుగను లేదు.

మాదివాణమున తంబళి యొకఁడు దైనం దినమును రుద్రపాదములు శిరమున నుంచు నాచారము కలదు. నేను వానిభార్యను అందుల కేర్పాటు గావింపుమని నాభర్తకు తెలియఁ బఱచితిని. నాఁటినుండియు రాణివాసమున మగవానిదర్శనము మఱుమాయమైనది. ఆ రేయి నాభర్త ఒక చిఱునవ్వు నవ్వెను. ఆ చిఱునగవున అన్ని యర్థము లున్నవని అపుడు నాకు గోచరము కాలేదు. నా మనఃపరిణామ మతనికిఁ దెలిసినటులు నాకును దెలియ లేదు.

నాకడ కాతఁ డెంత రావలయునని—కాదు: ఒడళ్లు సాగిపోవునటులు కౌఁగిలిఁగొన నాశరీ రమున నతని శరీర మెంత కలిసిపోవలయునని నేను తలంచుచుంటినో, అతఁ డంతవిడివిడిగనే యున్నాఁడని నాభావన. నే నెంత ప్రేమగు హాలోఁ దూఁగుచుంటినో ఆతఁ డంత ప్రేమ శృంగ మెక్కుచున్నాఁడు.

నా కిపు డొక గర్వ ముదయించినది. నేనును అతనితోపాటు బి. ఏ., కడతేఱితిని. సంపత్సమృద్ధులలో తక్కువ లేదు. సౌందర్య మున నేనే హెచ్చు. నాయెడ నీతని కీ యుదా సీనత యేల? అని. నే నిటులు తలపోసికొను చు ఆవసంత చంద్రికలో ఉద్యానమున తిరుగు చుంటిని. నా శిరోఽలంకృతములగు పూవులు పరివేషమువలె నుండెను. మావిపొదలో కోయిల కుహూకుహూకుహూ మనెను. ఆకుహూ ధ్వనికి నాచెవులు గింగురుమని పోయెను. నా శరీరమును నే మఱచితిని.

నే నతిప్రయత్నముచే మల్లెతీవల చాళ్లు దాఁటి అశోకముక్రిందికి వచ్చుచుంటిని. దాపున నున్న శిలావేదికపైఁ గూరుచుండి నాభర్త యెవరినో ధ్యానించుచున్నాఁడు. 'అహో,నన్నే ధ్యానించుచున్నాఁడు. ఎంత యదృష్టవతిని' అని యనుకొంటిని. పరమేశ్వరునికై పరితపించు పార్వతివలె నే నతని యెదుట తల వంచుకొని పుష్పాంజలి తొణుకులాడ నిలిచితిని. నేను వసంతుని కుమారివలె వలచుచుంటిని. మలయ మారుతహృదయమువలె నిట్టూర్చుచుంటిని. అతఁడు కాసంత కన్ను తెఱవకయే మనసిజు ననంగుని గావించెను. ఇసీ! న్యాబడు కనిపించి

నది. అతఁడు నాప్రేమను వెక్కిరించినటులు లేదా?



"పరమేశ్వరునికై పరితపించు పార్వతివలె.........
......పుష్పాంజలి తోఁణుకులాడ నిలిచితిని."

నేను పులుకుపులుకున నతని జూచుచు పరిక్రమించితిని. నిక్కముగా నాకు తలనొప్పి లేదుకాని—నన్నతఁడు పలుకరింపనైన పలుకరింపఁగూడదా?—పలుకరింప నందులకు తలనొప్పి కలిగినమాట నిక్కము. నాకు జ్వరమే వచ్చినది. వట్టిది వట్టి దని విలపించితిని. ఉన్న మాట చెప్పుట కేమి? ఈ దిక్కుమాలిన మగని నాకేల కూర్చితి రని నాతలిదండ్రుల దూఱితిని.

కొంతవడికి నాభర్త వచ్చి మంచముపైఁ గూర్చుండెను. కొంత నా తలనొప్పి జ్వరము శాంతించెను. ఇఁకఁ గొంచెముసేపు కూర్చుండినచో నాబాధ అపుడు తీసివేసినటులు పోయెడిదే! ఆవైద్య మతని కెవరు చెప్పుదురు? అతఁడు నా తలయంపిపై చేయి వైచి 'యేమి యిది?' 'చల్లగను వేడిగను ఉన్న'దే'యనెను. నేను 'ఇది వ్యామిశ్రమగు జబ్బు' అని యంటిని. అతఁడు తల నూఁపి వైద్యురాలిని బిలిచి మెల్లగా సిమ్కమించెను.

రెణ్ణాళ్ల కొకతూరి యీ రోగము నాకు రాఁ దొడఁగెను. క్రమముగా దైనం దినమును రాఁ దొడఁగెను. దానితో నాశరీరము కాంతి దొఱఁగుటకు బదులు కాంతి యినుమడింపఁ జొచ్చెను.

౨

నాభర్తకు దూరజ్ఞాతియు,అదూరమిత్రుఁడు నగు ధర్మారెడ్డి రెడ్లలో బ్రాహ్మణుఁడు. అతఁడు నాభర్తకు సహాధ్యాయుఁడు. ధర్మారెడ్డి విద్యకొఱకే విద్య నభ్యసించెను. అతఁడు నాభర్తను జూడవచ్చెను.

ఒకనాఁడు పదిగంటల సుమారున నాభర్తయు, నతఁడును ప్రసంగించుచుండఁగా తెర చాటున నుండి వింటిని. నాభర్తకు అన్ని శాస్త్రములు వచ్చియుండు నని నే ననుకొనలేదు. చదువులో నే నతనికి తీసిపోను అను నాగర్వము చదికిలఁబడిపోయినది. అతని సంభాషణమున తర్కము, వైశేషికము, 'పూర్వ

మీమాంస, ఉత్తరమీమాంస, తంత్రశాస్త్రము, వైద్యశాస్త్రము, ఆస్టేయాలజీ, ఫైలాలజీ, జియాలజీ, బయాలజీ, థియాలజీ, కెమిస్ట్రీ, ఫిజిక్సు, కొరాను, బైబిలు, జెందవెస్తా, బుక్కు, ఉపనిషత్తులు లోనగునవి సులువుగా ఉపబృంహితము లగు చుండెను. ధర్మారెడ్డియు అతనికి తీసిపోవలేదు.

ధర్మారెడ్డి సంభాషణము మారుత శీతలమయిన కార్తిక చంద్రికాసారమువలె నుండెను. నా కాతని యాకారము చూడవలయునని కోరిక యుబికినది. వెంటనే కొంచెము తెర నెత్తితిని. మఱల తెర వాల్పవలయునని నాకు తోంపలేదు. కొంతవడికి వెదురుపొదల గాలి కా తెర కదలఁగా తెర వైచి లోని కేఁగితిని. కాని నే నెంతయో నే పంతిపురిలో నుండఁజాలక పోయితిని. మఱల తెరవద్దనే యిల్లు కట్టుకొని కూరుచుండి యపాంగశుక్తిచే నతనిని గ్రోలితిని.

ఆ తెర నా కొక యినుపగోడవలె నుండెను. నాసశితనిరీక్షణములు కుశాగ్రములవలె పడుగు పేకలను భేదించుకొని యావలికి దూఁటుచున్నవి. అపటీక్షేపముగా నే నారంగమును బ్రవేశింపఁ దలఁచితిఁగాని నిర్వహింపలేకపోయితిని. నరోత్తమరెడ్డి 'తెర' తొలఁగింపవలసినదని చేసిన యుపకారమును వినియోగించుకొనలేకపోయితిని గదా యని నన్ను నిలువెల్ల నిందించుకొంటిని.

మాటలాడుచు మాటలాడుచు ధర్మారెడ్డి ఎక్కడ అలసిపోవునో యని అనుకొంటిని. అతని చేతులు నా చేతులకంటె మృదువుగా నున్నవి. ఆతనిశరీరములో ఆముఖము రాజు! ఆకన్ను లెవరి నాకర్షింపవు? ఆహాహా! ధర్మారెడ్డి అందుది. అందుదానికిఁగూడ అంత సౌందర్య మెక్కడిది? ఆ సౌందర్యదేవతకు నే నారతి పట్టితిని. వెనుకతలుపు లన్నియు మూసి ఆ తెరచాటునఁ గూరుచుండి అతని సౌందర్య



మును పూర్ణిమాదృగ్యోగముచే ప్రత్యక్షము చేసికొంటిని.

కొంతసేపటి కంతఃప్రవేశసూచకమగు నొకగంటను నాభర్త మొరయించెను. నా యోగము ఆశబ్దముచే భగ్న మయినది. నేను

వెంటనే లోని కేఁగి మఱల గంటను మొరయించితిని. ధర్మారెడ్డి హస్తమును గ్రహించి నరోత్తమరెడ్డి నాకడ కరుదెంచెను. నా సంఘాతమంతయు నొక ప్రేమకుసుమముగా మాఱిపోవ నేను ధర్మారెడ్డి హస్తమును కదిలించుట యను మిషచే ఆకుసుమము నతనికి సమర్పించితిని. నాభర్త యతనిని నివేదించి నా కప్పగించెను. నేను నతనితో పరిచితి కలిగించుకొంటిని. తరువాత నేను నేనేనా అని యనుకొంటిని.

మాపరిచయాధిక్యమే తెరను చించివైచినది. అందులకు ధర్మారెడ్డిని నాభర్త మిగుల నుతించుకొని యుండును. అపుడపుడు నేనును, ధర్మారెడ్డియు స్త్రీస్వాతంత్ర్యమును గుఱించియు, ప్రేమను గుఱించియు, సోక్రటీస్ సౌందర్యమును గుఱించియు మాటలాడుకొనుచుండువారము. అపుడు నేను నాభర్త యొసఁగిన స్త్రీస్వాతంత్ర్యమును తెలుపు గ్రంథములనన్నిటిని జదివితిని. అపుడు నరోత్తమరెడ్డి ఆగ్రంథములఁ దనకిమ్మని నాయాసక్తిని వృద్ధిపొందించెను తన్మూలమున నా హృదయమునుగూడ కనిపట్టి యుండును.

ధర్మారెడ్డి నాతోఁ బ్రసంగింప నెంచినపుడే నే నతనితోఁ బ్రసంగింప దొరకొనుదానను. అతఁడే నాకడ కిపుడు తఱుచుగా వచ్చుచుండువాఁడు. అతఁ డేకాగ్రతతో తిలకించుచు నాతో సంభాషించుచుండునపు డెపుడును నా కిసుమంతయు నర్థము కాలేదు. ఆతఁడు నాపరతంత్రతను కనిపట్టి యుండునని సిగ్గును, ఆనందమును గూడ పొందుచుండుదానను. నే నతని నెటులు చూచుచుంటినో అతఁడును నన్నటులే చూచుచున్నాఁడని నాతలఁపు. స్త్రీస్వభావము పురుషునకును, బురుషస్వభావము స్త్రీకిని దెలియును.

నాభర్త ప్రాచీనాచారము నుండి నవీనాచారమునకు ఇన్ని యేండ్లకు తొలఁగింప లేని నన్ను ధర్మారెడ్డి ఒక్కనాటితో తొలఁగించెను. ఇపుడు డాబామీఁద వరుసగా వైచిన శయ్యలపై మొదట నేనును, నడుమ నాభర్తయు, చివర ధర్మారెడ్డియు నిదురించుట. కొన్నాళ్లరిగిన పిదప నేను నాశయ్యను నడుమకు మార్చికొంటిని.

నాభర్తకు తలఁచుకొనినంత నే నిదురవచ్చును. అతఁడు నిద్రించెనా, మఱి తురీయయామము నకే మేలుకనుట. నా కపుడు ధర్మారెడ్డితో మాటలాడుట కెక్కడలేనిమాటలు పుట్టుకొని వచ్చెడివి. తుదకు నే నతని శయ్యపై మల్లీకు

### మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజుకాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండా తిన్నగా వ్రాసి పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయేకాక తప్పులుకూడ నిలిచి పోవునని మనవి.

—భారతి.

సుమములో, గులాబిపూవులో, జాదులో వెదఁ జల్లుదానను. అటులు చల్లునపు డతనితాఁకుచే నాశరీర మెంత పులకితమయినదో అతనిశరీరము కూడ అటు లాయెనా లేదా యని నేను కనుఁగొనఁ బ్రయత్నించుదానను.

అపుడపుడు ధర్మారెడ్డియే నాకడకు వచ్చి బ్రౌనింగ్, గీతలు ఉన్నవా యనియు, మల్లియలుకాని, గులాబులుకాని ఉన్నవా? యనియు, మీఁగడగాని, ఐస్‌క్రీముగాని ఉన్నదా యనియు అడుగుచుండువాఁడు. అతనికోరికల నన్నిటిని నేను నా హస్తగతము కావించుకొని అతనిచే అడిగించుకొనుచుండుదానను. పాప మాతనికి మోమోటమి లేదు. పిల్లవానివలె కావలసిన ప్రతివిషయమును నన్నే అడుగుచుండెను.

మాగోష్ఠిలో ఒకనాఁడు దివ్యజీవితమును గుఱించి ప్రశ్న వచ్చెను. నరోత్తమరెడ్డి సర్వసంగపరిత్యాగమునకు వోటుచేసెను. ధర్మారెడ్డి కర్మయోగమునకు వోటిచ్చెను. నావంతు వచ్చెను. నా కావిషయమున ఇంకను దృఢ యగు నభిప్రాయ ముదయింపలే దంటని. కాని నాయంతరాత్మకు తెలియకపోదు. నేను తెలుపకున్నను నావోటు దేనికి పడునో మీరు సులభముగ నే గ్రహింపఁగలరు.

కొన్నాళ్లు కడఁచిన పిదప నొకనాఁడు ధర్మారెడ్డి నాకడకు వచ్చి, 'మీ కొక ఆతంకమును, నాకొక మంగళమును ఒక సారియే తొలఁగిపోవుచున్న' వనెను. 'కాదు కాదు, నా జీవరసము పోవుచున్న' దని నే నంటిని. నే నపుడు తెల్లపోయితినో, పాలియే పోయితినో! నాశరీర గృహమునుండి బయటికి వచ్చి నేను ధర్మారెడ్డిని నిరీక్షించితిని. ఆహా! ఎడఁబాటులో ఎంత మనశ్శోషణము కలదు! బదులునకు బదులుగాక కేవలముగా మీరు మాగృహ మలంకరింప వలయునని ధర్మారెడ్డి యనెను. నేను 'తప్పక' అంటిని.

ధర్మారెడ్డి మోటారు ఎక్కెను. అతఁడు నామనస్సుతోపాటు కానిపింపకుండఁబోయెను. అపుడు నా మన స్సంతయు నాటకము చూచి వచ్చిన తరువాత ఉన్నటు లుండెను. మా మేడ యంతయు చిన్నఁబోయినది. పోవుచు ధర్మారెడ్డి నన్నుఁ జూచిన చూపే నాకు పాథేయమైనది.

## 3

నా బయటితెర ఉడ్డాని పోయినది కాని నామనస్సుపై దట్టముగా పడినది. వెన్నెల, సెలయేళ్లు,ఉద్యానములు, తీవలు, పూవులు, మలయవాయువులు, ఋతువులు, హంసలు, నెమళ్లు, కోయిలలు, తుమ్మెదలు, జలయంత్రశాలలు,అంగరాగములు,శయ్యలు పుటము పెట్టఁగా, శరీరపు మూసలో నామానసము తుకతుక ఉడికిపోయెను. అపూర్వమైన కాంతి మండలము నా ప్రత్యయవమును గుడికట్టెను. కపోల

విన్యస్త హస్తనైన సన్నపుడు ధర్మారెడ్డి చూచినఁ జాలును. నరోత్తమరెడ్డి చూడకున్నఁ జాలును.

అంచుమట్టముగా తేనె వోసి రేకులు కుట్టివైచిన పూవువలె నే నపు డుంటిని. ఈశ్వరుఁడు నన్నొక సుఖపిపాస కాలవాలము కావించెను. నాలో నేనే దహించుకొని పోయితిని. నా కీజగతి యంతయు నిస్సారముగాఁ దోఁచెను. ధర్మారెడ్డి చిత్తరువేని లేనిమెడల నామేడ చవుటి దిబ్బగా నుండెడిది. ఒక రేయి యంతయు నే నాచిత్తరువు నెదుట నుంచుకొని కూరుచుంటిని. కొంతసేపు దానితో వినోదించితిని. క్రమక్రమముగా నా కనులవెంట బాష్పములు స్రవించినవి. తెలవారు లటులే కూరుచుంటిని. అపుడు మయూరము లొకటొకటియేలేచి స్తంభ మెక్కి కూయఁ దొడఁగెను.

నే నొకమోసము చేసితిని. ధర్మారెడ్డి శయ్యలోని యుపధానము నాశయ్యలోనికిని, నాశయ్యలోని యుపధానమును ధర్మారెడ్డి శయ్యలోనికిని మార్చితిని. ప్రకృతము నే నా యుపధానమునే ధర్మారెడ్డి భుజముగా భావించి కనులు మూసికొంటిని. తల్లివలె వచ్చి నిదుర నన్నెత్తుకొని పోయెను.

నేను స్వప్నమున ధర్మారెడ్డి కొక ఉత్తరమును వ్రాసితిని. వ్రాఁత కుపకరణము కలము కాదు; వ్రాఁత కుపయోగించినది కాకితమును కాదు. ఇచ్చ నా మానసముమీఁద నన్ను కరఁగించి కరఁగించి కరకకాయ సిరాచేసి అక్షరములుగా పోసినది. అపుడు ధర్మారెడ్డి నాలో ఒకభాగముఁగా ఉండెనుగాన దానిని పఠించెను. నే నతనిలో ఒకభాగముగా నుంటిని. నాలో నున్నవాఁ డెవఁడో నన్ను పట్టుకొని యీసుఖధామమున కెక్కించుచు హాఠాత్తు జాఱవిడువ నేను జాగ్రదవస్థలో పడి పోయితిని.

ఇఁక నీజన్మము సార్థకమని నాకు హాజము కలిగినది. నావలెనే అతఁడును నాదిండుపైఁ బరుండి వినోదించుచుండునని నిశ్చయించితిని. అపుడు నీ వెవరికిని నివేదింపరాని ఒకానొక తన్మయతలో మ్రగ్గుచుండలేదా? అని నేను ధర్మారెడ్డికి లేఖ వ్రాయకుండుట చాలవిచిత్రమే.

ఎవనిపొడయనిన నా కుఁ గిట్ట కున్నదో ఆనరోత్తమరెడ్డి ఆ రేయి నాకడకు వచ్చెను. అతఁడు నన్ను నాపేరుపెట్టి పిలిచెను. అతఁడే పేరున నన్నుఁ బిలిచెనో ఆనాపేరు స్త్రీలలో చాలమంది కుండవచ్చును. నాపేరు తెలుపుచో మీపేరులన్నియు కలుషితమై పోవును. మీరెవరును ఇఁక ఆపేరు పెట్టుకొనఁజాలరు. కావున 'పేరులో ఏమున్నది?' అని అనకుఁడు.

అతఁ డటులు పిలువఁగా నేను పలుకనైనఁబలుకలేదు. పిదప నతడు—'కొన్ని జంతు

వులు తమజీర్ణకోశమును విప్పి నీటిలో కడిగి కొనును. నీవును నీమనస్సు నటులచేసికొనుము' అనెను.



" కొన్ని జంతువులు తమ జీర్ణకోశమును......
నీవును నీ మనస్సు నటుల చేసికొనుము "

నాగుండియలు జలదరించెను. పట్టుపడిన దొంగవలె నేను మాటలాడలేక పోయితిని. అతఁడు నావాలక మాఁచిచూచుచు కూరుచుండెను. నామానస మంతయు అతని నేత్రదర్పణమున ప్రతిబింబించినటులు నాకు భయము పుట్టెను. ఏకవియు ఆయవస్థను వ్రాయవలదు. నవతులేని ఆయవస్థను భరింపవలదు. దానిని భరించినదానను నేనే.

అతఁడు క్రమ్మఱ నిటు లనియెను:— చావఁబోవుముందు చేసికొను జీవప్రాయశ్చిత్త మొక జీవప్రాయశ్చిత్తము కాదు. మానసము మీరినపుడు చేసికొన్న ప్రాయశ్చిత్తియే ప్రాయశ్చిత్తి. మృతి కాలమునఁ జేసి కొన్నది జీవునితోపాటు మరణించును. సజీవుఁడై చేసి కొన్నది సజీవమై యుండును.

నామనస్సుపై శరీరాచ్ఛాదనము లేదా యని ఒకసారి కనులతోఁ జూచి కొంటిని. నా మానసములోని ఒక్కొక్క పెట్టెయు పైకి లాఁగి తెరచుచున్నటు లుండెను. ఇంక నికేఁ డెంతద్రష్టయో యని తెలిసికొనఁ గోరినటుల తల వంచుకొని కూరుచుంటిని.

అతఁడు క్రమ్మఱ "మనస్సు కన్న మంచి గురు వెచటను లేఁడు; మానసమున అజయ్యమైన వృత్తి కలుగుట అనఁగా ఈశ్వరుని దాపునకుఁ జనుట, లేక తనను తాను ప్రేమించుట అపు డెవఁడును దానిని ఇతరులకుఁ దెలుపఁ జాలఁడు. ఇఁక నిన్ను నేను పరిత్యజించుచున్నాను. ఈపరిత్యాగము నీ మేలుకొరకే కావున ఇది పవిత్ర పరిత్యాగము; ప్రేమ గర్భిత పరిత్యాగము. నీవు నిన్నతిగా ప్రేమించుకొని వత్తువేని యీ నీ మిత్రుఁ డెపుడేని నీ పార్శ్వవర్తియే"అని గంభీరముగాఁ బలికి న న్నాఁచి చూచుచు నిలువఁబడెను.

నాకనులవెంట నీరు క్రమ్మ నారంభించెను. నా కంఠము స్తంభింపకముందే 'రాతికి చెవులు లేకుండుట యెంత పుణ్యము? మోడునకు

# బసవపురాణము

వెల రు. ౩-౮-౦

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి    పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవశతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునియు; తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నరాష్ట్రములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పు.) యిందుగలదు. ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

విలాసము:—ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము

## (The Telugu Encyclopaedia)

ఇందు చరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, జీవితములు, నీతి, మత, సాంఘిక, వైద్య, రాజకీయాది విషయములు, భూగోళము, న్యాయము, శిల్పము, జ్యోతిషము మొదలగు సమస్తవిషయములు చర్చింపబడును.

ప్రస్తుతము మేలు (సగము తోలు) బైండు చేసినవి మూడు సంపుటములు సిద్ధముగ నున్నవి

ఒక్కొక సంపుటము వెల రూ. 6-8-0. పుస్తకములను వి. పి. గా పంపగోరువారు

ఒక్కొక్క సంపుటమునకు అడ్వాన్సుగా రెండు రూపాయలు పంపవలెను.

ఒకటవ సంపుటమున-'అ' మొదలు 'అటక్‌పట్టణము' వఱకు, రెండవ సంపుటమున-'అటకమా' మొదలు 'అబుల్‌ఘాజీ బహదర్' వఱకు, మూడవ సంపుటమున - 'అబుల్ ఫజల్' మొదలు 'అహిమర్క' వఱకును—గల పదము లున్నవి.

తరువాతి భాగములు ముందు ప్రకటింపబడును.

అంచెకూలి కొనువారే భరింపవలెను.

దొరకుచోటు—

ఆంధ్రవిజ్ఞానసర్వస్వకార్యాలయము, 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

నిజాంరాష్ట్రప్రతినిధి:—

నాంపల్లి గౌరీశంకరవర్మ అండ్ కో.,

౬౬౬౬, రెసిడెన్సిబజారు, హైదరాబాదు, దక్కన్.




# గొంతు నొప్పి?

గొంతునొప్పిగా నుండిన, దానియందు శ్రద్ధవహించి, ఫార్మమింటు తీసుకొనుడు. రుచ్యమైనట్టి యీ బిళ్లలను గంటకొక్కొక్కటిచొప్పున సేవించిన నేద జేర్చును. గొంతునొప్పిని నయమొనర్చి ఇన్‌ఫ్లూయంజా, అంగుడువాపు, జ్వరము మొదలైనవి రాకుండ నాటంకపరచును.

నేడే
ఒకసీసానుకొనుడు

# FORMAMINT

కెమిస్టు లందరివద్దను దొరకును.
స్టోరు లన్నిటియందును అమ్మబడును.
క్రిములనుసంహరించుగొంతునొప్పిబిళ్ల.

# డ్వార్కిన్ హార్మోనియములు

ప్రపంచమునం దన్నిటిలో శ్రేష్టమైనవని ఖ్యాతి గాంచుచున్నవి.



డ్వార్కిన్ హార్మోనియములను ఎవ్వరు వినియుండరు! అది ఒకటి గలిగియుండిన ఎందుకు గర్వపడరు! సరసమైన ధరలలో కొత్తమాదరీలుగలవు.

కేటలాగుకు వ్రాయుడు.

ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను.

**DWARKIN & SON,**
Original Inventors of the Hand
Harmonium and the oldest
Music Firm in India.
8, Dalhousie Square, CALCUTTA.

---

ఆంధ్రగ్రంథమాల ౮-వ కుసుమము

# ధమ్మపదము (వచనము)

## వెల రు. ౦-౧౦-౦.

అనువాదకులు:

శ్రీ కిళాంబిరంగాచార్యులుగారు, ఎమ్.ఏ.బి.ఎల్

అహింసయే జీవితపరమార్థముగ వెలసిన బుద్ధదేవుని ఉత్తమధర్మోపదేశము లిందు పాళీ మూలమునుండి అనువదింపబడినవి. మానవ జీవితము చరితార్థ మగుటకై మహనీయుని ధర్మోపదేశము లందఱును సర్వదా పఠించి యాచరింపదగినవి.

ఆంధ్రగ్రంథమాల,
నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

వీటియొక్క సుగుణములను గురించి యిదివరకే అందరికిని బాగుగా
ఎల్లచోట్లయందును తెలిసియున్నది

అట్లు తెలియనివారు ఆలసింపక తక్షణమే

# మా లోకామయహర కస్తూరి మాత్రలను

Regd
Trade Mark




తెప్పించి, ఒకదఫా వాడిన మీరు మిక్కిలి తృప్తిచెందెదరని మా నిశ్చితాభిప్రాయము. ప్రతిదినము మాకు వచ్చుచున్న ప్రశంసాపత్రములే ఇందుకు ప్రబల నిదర్శనము.

ఇవి మేలైన కస్తూరి, కుంకుమపువ్వు, అపూర్వమైన ఓషధులు మొదలగునవి చేర్చి, శాస్త్రోక్తముగా తయారుచేయబడినది. తాంబూలముతోగాని, విడిగాగాని ఉపయోగించవచ్చును. పలువిధ జ్వరములు, దగ్గులు, శీతలము, అజీర్ణము, ప్లేగు, అజీర్ణభేది, కడుపుజ్వరము, కడుపునొప్పి, పిల్లల పడిశెము, ప్రక్కలఈడ్పు, అగ్నిమాంద్యము, మలబద్ధము, బలహీనత మొదలగువాటికి వజ్రాయుధమువలె పనిచేయును. స్త్రీలు, పసిపిల్లలు, ముసలివారు మొదలగువారికి అమృతసమానము. 250-300 మాత్రలుగల బుడ్డి 1-కి ధర రూ 0-4-0 పోస్టుకర్చు 0-4-0 6 బు. పోస్టుఖర్చుతో సహా రు 1-8-0 12-కి రూ 2-13-0 25-కి రూ 5-3-0.

భిషగ్రత్న పాళ్యపు వెంకటాచల పండితులు, ప్రొప్రైటరు.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

మద్రాసులో నెం. 6, బందరువీధిలోనున్న ప్యాంకంపెనీవారివద్ద దొరకును.

---

ఆశ్చర్యము! జయవశీకరణి లేక **అద్భుతమైన తాయెత్తు** అత్యాశ్చర్యము!!

ఈ తాయత్తు అద్భుతమైన క్రియతో తయారుచేయబడినది. ఇది ధరించిన ప్రతిమనుజునకును, వారికోరికలు తప్పక యీడేరుచుండును. ఇది ధరించినవెంటనే మనసునకు నుత్సాహమును, అధికారుల యాదరణయును, వాణిజ్యమునందు లాభమును, ఉద్యోగలాభము, పరీక్షలయందు గెలుపొందుటయు, మొదలగు శుభములు జరుగుచుండును. ఇవియేగాక మనల నావహించియుండు పిశాచములను పోగొట్టి యితరకష్టములనుండి తొలగించి పరమేశ్వర కృపా ప్రాప్తులజేయును. పసిపిల్లలనాసించిన బాలగ్రహాది ప్రతిబంధకములుగూడ తప్పించి, వారికి సంతోషమొనగూర్చును. గ్రహచారమువలన కలిగినసర్వరోగములను ఉపశాంతింపజేసి న్యాయధర్మబద్ధములందు జయముకలుగుటకై కావలసినచో ప్రత్యేకపు తాయెత్తులు పంపబడును.

ఒక్కొక్క తాయత్తు రు. 2-0-0; 10 తాయెత్తులు రు. 15-0-0 }
ప్రత్యేక కార్యలాభములకొరకు ప్రత్యేకపు తాయెత్తులు ఒక్కొక్కటి రు. 50-0-0 } పోస్టేజి ప్రత్యేకము.

గాంధిమహాత్ముని కారాగృహ విముక్తి తెల్పిన దైవజ్ఞశిరోమణియొక్క యపూర్వజ్యోతిషము.

హనుమాన్ ఆరూఢము! మీరు మీభవిష్యత్తును తెలియగోరెదరా?

అయినచో తిరుగు టపాలో కావలసిన ప్రశ్నలను పంపుడు. ప్రతిప్రశ్నకును నెంబరు వేయవలెను. మావిలాసము పూర్తిగా తెలియజేయవలెను. జాబువ్రాయు సరియైన కాలముగూడ తెలియజేయవలెను. వెంటనే సరియైన జవాబులను పొందగలరు. 5 ప్రశ్నలకు రు. 1-0-0 వి. పి. చేసినచో రు. 1-4-0. పై ప్రశ్నలకు ఒక్కొక్కదానికి రు. 0-4-0 చొప్పున చార్జి చేయబడును.

## వి. కె. శఠగోపాచార్యులు,

హనుమదుపాసి జ్యోతిష్కుడు, తిరుత్తణి, చిత్తూరుజిల్లా, మద్రాసు రాజధాని.

చేతన లేకుండుట యెంతభాగ్యము?' అని నేను కనులు మూసికొని పఱపుపై నొఱగితిని. ఆతఁడచటినుండి మెల్లగా వెళ్లుట కనులవలె నాచెవులు చూచెను.

అటు లాతఁడు నిష్క్రమించిన కొంతసేపటికి లేచి కూర్చుంటిని. లతికాపర్ణవిచాలనముచే పుట్టి, పర్వతవృక్షశాఖాఘాతముచే పెరిఁగి, ఒకమహావాతము వీవఁదొడఁగెను. ఉపవనమున రాలిన కుసుమములు ఆకాశపతితము లగు తారకాగణములవలె నుండెను. ఆ వాత్యా చంక్రమణములందు ఎగిరిపోయిన జీర్ణలతాజాలములు క్రిందికిని మీఁదికిని దిగు గాలిపడగలవలె చూపట్టెను. అవి మీఁది కేఁగినవో, క్రిందనే పడినవో ఎవ రెఱుఁగుదురు? చాలసేపటి కాయాకాశరంగమున మబ్బుతెరలు విరిసినవి. ఈనాటక మెవ రాడించిరో యెవరు కనుఁగొనినారు? కాని అందఱును కనులు పెట్టుకొని చూచినారు.

నా కపుడు నరోత్తమరెడ్డియం దొకగౌరవము, ఒకనైచ్యము, ఒక ఆస్తిక్యము-ఒకనాస్తిక్యము, ఒకప్రేమ, ఒకత్యాగమును కలిగెను. కడపటి నిమిషమున నేనతనిని సంపూర్ణముగా సన్న్యసించితిని.

'నీపరిత్యాగము నాకొక అర్హత నిచ్చినది. ఆయర్హతతోడనే నేను నీనుండి కత్తితో నఱుకఁబడిన తుండెమువలె వేఱయిపోవుచున్నాను. నీమాటలు నీహృదయమునుండియే ప్రసరించెనేని నన్ను ద్వేషింపఁజాలవు.' అని యొక యుత్తరము నరోత్తమరెడ్డికి వ్రాసి యెవ్వరికిఁ దెలియకుండనే నటనుండి యెగిరిపోయితిని.

ఆహా! ఆ ప్రథమస్వాతంత్ర్యము నేమని చెప్పుదును? అది కాఫీహోటలు విందు; ఆఱవయింద్రియసుఖము; ఉన్మత్తతాండవము; మూఁడవచూపు; గర్భనరకము; విదేహముక్తి.

నాకు ప్రతిపదార్థము భయమయముగాను, ప్రేమమయముగాను కానిపించెను. నాకొఱకే ఋతువులు, కుసుమములు, చంద్రుఁడు, దక్షిణ వాయువులు సృజింపఁబడినవి.

నాకొక క్రొత్తవన్నె వచ్చినది. స్వేచ్ఛ నాసౌందర్యమును పల్లవింపఁజేసినది. నేనా స్వేచ్ఛలో ముక్తునివలె బంధ మనుభవించితిని; బద్ధునివలె ముక్తత చవిచూచితిని. అప్పటి నాకర్మయంతయు ఒకతపస్సు. నేనాతపస్సు నంతయు ధర్మారెడ్డికడనే యుండి అతని కొఱకో, నాకొఱకో చేసితిని.

అతఁడును, నేనును ఏకాంత చంద్రికలలో సంచరించితిమి. పర్వతసానువులపై దీర్ఘాలోచనములతోఁ గూరుచుంటిమి. నదీతీరములందలి కురుమాపులేని పచ్చిక పట్టుతివాచీలపై విశ్రమించితిమి. ప్రాసాదోపరిభాగములందు శరచ్చంద్రికాతూలశయ్యలపై మాటలాడి మాటలాడి నిదురఁగూరితిమి; ఏకపఙ్క్తి నారగించితిమి.

నేనతనికి షెల్లీ—ఎపిప్సైకిడియన్ వినిపించితిని. విజయవిలాసము తల కెక్కించితిని. అభిజ్ఞాన శాకుంతలమును వర్మసచివుని చేసి

తిని. ఓమర్ ఖాయమును పార్శ్వచరుని గావిం చితిని.

ధర్మారెడ్డి దాసికలలో నొకతెయేనియు మఱియొక దాసిచెవిలో ఏరహస్యమేని చెప్ప లేదు. కాని మే మిరువుర మరణ్యమునకు అసి వారు వెళ్లినపుడుమాత్ర మెదురుబడిన పౌరు లు మాగుల్మములు. కొంతదూర మరిగిన పిదప అచట నిలిచి మమ్ము వేలితో చూపించుచు ఏవియో కొన్ని మాటలు చెప్పకొనువారు. ఆమాటలు వినుటకు నాకు మూఁడవ చెవి లేకపోయెనే యని నే ననుకొను దానను.

ధర్మారెడ్డి కనుచాటు చేసి నరోత్తమ రెడ్డి యతనికి వ్రాసిన యుత్తరములు చూచు టకు నాకు తత్తరమయ్యెడిది. వానిలో నామా టయే యుండునదికాదు. నరోత్తమరెడ్డికి చేతనలేదా? లేక దాని నతఁడు జయించెనా? అని నేను సంకోచపడితిని. అది దైవమున కెఱుక!

ఒకటి రెండు మూఁడు నాలుగు నెలలు కడఁచెను. 'నీ వెందులకు వచ్చితి' వనికాని, 'ఇంక నెన్నాళ్లుందు' వని కాని ధర్మారెడ్డి నన్నడుగ లేదు.

అతని పలుకులలో దిండు మాటిన సంగతి అతని కింతవట్టు తెలియలేదు. నేను తడవతడ వకు ఆతలయంపి పై కెత్తి క్రింద వైచి ఆకాశ మున బంతియాట లాడినను అతఁడు దాని విష యమున ఇసుమంతయేని శ్రద్ధ చూపలేదు. నేనుమాత్ర 'మీదిండు నీది కాదా?' అని అడుగ లేదు.

అతఁడు లేనపుడు నే నతని శయ్యపై బరుండుదానను. అతఁడు వచ్చి నాశయనముపై బరుండు వాఁడు. నే నతని వెండి కంచమున నా వ్యంజనమును బడవైచుదానను. అతఁడు స్వీకరించువాఁడు. అతఁడు నాకు Friendship Mysticఅని పేరిడెను. Love and Beauty Mystic అని పేరు పెట్టినచో సరిగానుండెడిది.

నా కాతని చేతలన్నియు ఒక శక్తి చేకూర్చెను. ఎట్టిశక్తి? నా చరిత్రము నొక తూరి సింహావలోకనము చేసికొనునట్టిది. చేసి కొంటినిసరియ. ఏమి ప్రయోజనము? ఆశక్తి నిశ్శక్తమైపోయినది.

వెతలఁ బాగులువారు శాంతికని ఏకా తకులుచేరి లేనిపోని వెతలన్నియు నెత్తిని వైచికొందురు. అటులే నేనును ఉద్యానము నకుఁ బోయితిని. నా కెచటలేనిదుఃఖము పుట్టుకొనివచ్చెను. నే నెవరినికోరిన వారు న న్నెత్తుకొనిపోవరు? అపుడు న న్నెందఱు హృదయేశ్వరిగా భావించి పూజించిరో! న న్నెదుర్కొనిన ఏపురుషుఁడు ఇంద్రియములు లేని చేతనుఁడు కాలేదు? ధర్మారెడ్డి నాసాహ చర్య సహవాస సహభోజన సహశయనములు స్త్రీవలెనే ఆచరించుట యేమివింత? నాసౌంద ర్యము గుడ్డిగవ్వకంటె ఏమి ఎక్కువ? ఈసౌం దర్యముకంటె అంతరసౌందర్య మేమేని కలదా? ఉండుచో అది యెవరిలో లేదు? లోపలినుండి పుట్టుకొనిరావలయునుగాని నన్ను ప్రేమింపు మన్న నెవరు ప్రేమింతురు? ప్రేమ పుట్టుచో గుడ్డిదియేని అర్ధాంగి. ప్రేమ లేదేని రంభ

యేని అమ్మా. ప్రేమ గుడ్డిదా, మనుజులు గుడ్డి వారా?

శేఫాలికాకుసుమములు పైఁబడ తలబరు వెక్కెను. యూథికలు నన్నుఁ జూచి నవ్వెను. ఏడాకుఁల యరఁటిపుప్పొడులు నాతలపై కాలు వెట్టెను. వీనియన్నింటిపై అపరిణతిశరచ్చంద్ర చంద్రిక! నే నాయాటకొలఁకునొడ్డున కూరుచుంటిని. ఊరక నా గండఫలకముల నుండి బాష్పము స్రవించెను.

నా వెనుకనుండి వచ్చు పాదవిన్యాసధ్వనిని నాచెవులు విన లేదు. నేను వెనుదిరిగి చూచు వఱకు ధర్మారెడ్డి నాపైఁ జేయివైచెను.

ఆహా! ఏమి ఆస్పర్శ! అది నాబాష్ప ధారలకు సేతువు. పులకములకు చక్కిలిగిలి. ప్రీతికి విభుఁడు. 'ఇఁక నేను ధన్యను. ఇఁక మృతికి భీతిల్లను. ఇఁక ఇహలోకమున స్వర్గము కట్టెదను.' అని అనుకొంటిని. ఆతత్క్షణము నాశరీరము నాకుఁ దెలియుచో ఒట్టు.

తనపై నొఱగిన నన్ను సరిగా నిలువ రించుచున్న ధర్మారెడ్డిని కొంతవడికి కనుఁ గొంటిని. అతఁడు న 'న్నమ్మా!' యని సంబో ధించెను. నేను పాతాళమున పడిపోయితిని. నే నచటినుండి భూలోకమునకు తిరిగి వచ్చు వఱకు 'అది నీ మంచికేని దుఃఖింపుము. దుఃఖ మునందలి సుఖమే సుఖము! అమ్మా! పల వింపుము.' అని యతఁ డనుట వింటిని. అతని ప్రత్యుత్తరమును న న్నొక అసీమమగు వెలుఁగు లోనికి నెట్టెను.

నే నతని నచట నుండుమని యన లేదు; అతఁ డచట నుండను లేదు. అతఁడు నిష్క్ర మించినంతటనే నాకు వచ్చిన చావయిపోయి నది. నాకు ప్రాణములం దెంత తీపియో! నే నా కంఠదఘ్నమైన కాసారము విడిచి యివలికి వచ్చితిని. నేను రాకున్నచో ధర్మారెడ్డి తన మృదుల హస్తములతో నెత్తుకొనివచ్చి వేల్చువాఁడుగదా! అని యనుకొంటిని.

మేడమీఁదినుండి యిటులు విస్పష్టముగా వినఁబడియెను:—'న వా అరే పత్యుః కామా య పతిః ప్రియో భవ త్యాత్మన స్తు కామాయ పతిః ప్రియో భవతి। న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియాభవ త్యాత్మ



"అది నీమంచికేని......అమ్మా! పలవింపుము."

నస్తు కామాయ జాయా ప్రియాభవతి । నవా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవ న్త్యాత్మన స్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి । న వా అరే విత్తస్య కామా య విత్తం ప్రియం భవ త్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి........... న వా అరే లోకానాం కామాయ లోకాః ప్రియా భవ న్త్యాత్మనస్తు కామాయ లోకాఃప్రియా భవన్తి.'

నే నిటులు విని కొంతవడికి మేడపై కేగి తిని. ధర్మారెడ్డి నిదురించెను. అతఁడచట తెఱచియుంచిన బృహదారణ్యకమున 'మగని కొఱకు మగఁడు ప్రియుఁడు కాఁడు, తనకొఱ కే మగఁడు ప్రియుఁడు. ఆలికొఱ కాలు ప్రియు రాలు కాదు, తన కొఱకే ఆలు ప్రియురాలు. కొమరులకొఱకు కొమరులు ప్రియులు కారు; తనకొఱకే కొమరులు ప్రియులు. రొక్కము కొఱకు రొక్కము ప్రియము కాదు, తనకొ ఱకే రొక్కము ప్రియము... లోకుల కొఱకు లోకులు ప్రియులు కారు, తనకొఱకే లోకులు ప్రియులు' అను నర్థమును ఇంగ్లీషు వ్యాఖ్యచే గ్రహించితిని.

నాకొరకే నేను వచ్చితినని తెలిసినది. నరోత్తమరెడ్డి యిందులకనియే నన్ను పరిత్య జించెను. నాశరీరమంతయు పిండీకృతవస్త్రమా యెను. తెలవారులు ఆభావ మనుభవముచేసి కొంటిని. ఆహా ! అది యెంతసత్యము ! క్రమ క్రమముగా ఆ పిండీకృతవస్త్రముయొక్క ఒకొక్క చుట్ట విప్పారినది. నే నెవరు ? అని నే ప్రశ్నించుకొంటిని.

తెలవారుకడ ధర్మారెడ్డిని తిలకించితిని. ఆహా ! అతఁడు నాజీవితమును పవిత్రపఱిచిన పరమగురువు! నే నతని లేపి 'నాయనా! నే నొక పొరపాటు చేసితిని: నా తలాఁపి నీశయ్య కును, నీ తలాఁపి నాశయ్యకును మార్చితిని. ఇపు డా మార్పు సవరింపవలయు' నంటిని. ధర్మారెడ్డి చిఱునగవుతో తనతలాఁపి తీసికొని నాతలాఁపి నా కిచ్చెను.




ధర్మారెడ్డికడ సెలవు గైకొని పయనమైతిని. ఆపయన మత్తింటికని, పుట్టినింటికని తెగక, నిశ్చితబుద్ధి కలుగువఱకు ఒక యేకాంతస్థల మున నుండ నెంచితిని.

నే నున్న యేకాంతస్థలమున నూతనముగు పదమూఁడవ ఏడవ ఋతువు ప్రవేశించెను.

నెల వొచ్చెను. అఱువదొొకటవ సంవత్సర మారంభించెను. ఎనిమిదవవారము ఉదయించెను. పదునారవ తిథి వచ్చెను. ఆఱవ మహాభూతముతో అచటి సృష్టి. మానసముతో అచటి భోజనము. శూన్యముతో అచటిక్రీడ. బయట నెన్ని నగారాలు మ్రోఁగించినను అచటికి చొొరవు. అచట స్వయముగా శబ్దము మ్రోఁగును. అందు దోషములు మేము మేమని వచ్చి ఆహుతియగును. అందు శాంతి పసిపాపవలె జనించును.

నే నాయేకాంతమున చాలఁగాల ముండుటచే నాతలిదండ్రులు మరణించిరనియు, నన్నుఁ గనుఁగొొన మిగులఁ బ్రయత్నించిరనియు నే నెఱుఁగను. నే నమెరికా వెళ్లినటులు వార్తాపత్రికలు ప్రచురించెను. నా తమ్ముఁడింగ్లాండులో చదువు ముగించుకొొని నాకొఱకమెరికా వెళ్లి విసిగి వచ్చెనని తెలిసినది.

ఇపుడు నాతమ్ముఁడు ననుఁ జూడవచ్చెను. అతఁడు భవిష్యజ్జీవితము ఎటులు కడఁప నెంచి నదివింటిని. మన మెంచినటు లది చనదు దానికితరులకుఁ గానరాని కన్నొకటి కలదు. దాని చూపులోనే అది చనును. ఎపుడో ఆకన్ను మూఁతవడును.నాఁటఁగోలె అది మనము చెప్పినచొొప్పున నడుచును.

అతఁడు గృహాభిముఖుఁ డాయెను. నరోత్తమరెడ్డిని సందర్శించి మఱి యింటికిఁ బొమ్మని అతనికి చెప్పితిని. 'నరోత్తమరెడ్డి నీకు బావయే కాఁడు. అతఁడు నరోత్తముఁడే' యని అంటిని.

నే నిటు లనఁగా అతఁడు రెండు దీర్ఘ నిశ్వాసములు విడిచెను. నేనును రెండు దీర్ఘ నిశ్వాసములు విడిచితిని.

మనస్సు వాక్కుతోనే కాక ఇతరేంద్రియముతోను మాటలాడఁ గలదు. ఆసంభాషణ మాత్మకడకు పాదములతో పరుగిడును.

నాతమ్ముఁడు వెళ్లిన తరువాత నన్నుఁ బెంచిన దాది వచ్చినది. అది ముగ్గిన పండు. సుఖదుఃఖముల పుటపాకము. వాత్సల్యమునకు పుట్టినిల్లు. నేను ముదియలలోను, కసుఁగందులలోను జగన్నాటకమును చూడఁగలను. దాని శీలవాత్సల్యములచే నేను పసుఁబాప నైతిని. దానికి నానగ లొలిచి యిచ్చి యింటికిఁ బనిచితిని.

నేను నాయింటికిఁ బయన మయితిని. నే నే ప్రదేశము శ్మశానమువలె విసర్జించితినో అదియ నాపడకటిల్లు; అచటికే నాపయనము. నే నిపుడు నాకొఱకే నాయింటికి వెళ్లుచుంటిని. కాని బడికి వెళ్లు పిల్లవలెనే వెళ్లితిని.

అంతిపురిలో నాకు సవతి యుండదనియే నాతలంపు కాని నాయందు నాభర్తకుఁగల విశ్వాసమే యచట సవతిగా నుండెను. నరోత్తమరెడ్డి నాకు 'దేవిడీ మన్నా' చెప్ప ననుకొొంటిని. కాని పరిచారిక లందఱు తొొంటివలెనే స్వాగతమిచ్చిరి. 'అమెరికానుండి యేమి తెచ్చితి' రని అమల యడిగెను. 'ఆ దేశము మనయడుగున నున్నది కదా! అట వారందఱు తలలు క్రిందై, పాదములు మీఁదనై

పడిపోవరా?'యని కుముదిని శంకించెను. 'అచట పగలు రాత్రి, రాత్రి పగలును గదా! సూర్యుఁడు చంద్రుఁడుగను, చంద్రుఁడు సూర్యుఁడుగను మాఱుదురా?' యని ప్రసన్న పలికెను. 'అచట చెఱువులలోను,నదులలోను, సముద్రములోను నీరు క్రిందఁ బడి పోవక యెటులు నిలిచియుండు?'నని పద్మిని ప్రశ్నించెను. 'ఇచటి నుండి సూటిగా బెజ్జము వైచికొని పోయినచో అచటికి తేలుదుమా?' యని యరుణ యనియెను. సామానంతయు వెనుక బండ్ల మీఁద వచ్చుచున్నదని వారియూహ. నరోత్తమరెడ్డికి నా వచ్చిన వార్త తెలిసియుండును.

నా యంతఃపురమును నేను స్వాధీన పఱిచికొంటిని. అతఁడు నన్నటులు చేయనిచ్చుననుకొనలేదు. నేను తొంటివలెనే నాపాకశాలలో భుజించితిని; ఆతఁ డతని పాకశాలలో భుజించెను.

ప్రాసాదోపరిభాగమున దాసికలు మాయిరువురికిని రెండు శయ్యలు పఱిచిరి. చందన తాంబూలము లునిచిరి. అగరువత్తులు వెలిఁగించిరి. గాజు పళ్లెరములలో పూవు లుంచిరి.

నన్నుఁ జూచుటకుఁబోలె తారాగణము లాకాశసౌధమున నిలువఁ దొడఁగెను. పతివ్రతాతిలక మగునరుంధతి నన్నుఁ గన్నారఁగనుఁగొని నిష్టము లేనిదానివలె చూచినటులు,చూడనటులు, మినుకు మినుకు మనుచుండెను.

నేను మేడమెట్లెక్కఁ దొడఁగితిని. ఒక్కొక్క మెట్టెక్కుట ఒకొక్కలోక మెక్కినటులుండెను. చివరమెట్టు నెక్కి నాయనమునెక్కితిని. డాబామీఁద నిలువఁబడి తొల్లిటి నామీఁద నేను నిలువఁబడితిని. నరోత్తమరెడ్డి పాదములు చూచి నాగుండియలు చప్పుడు వింటిని. అతని ముఖమును అవలోకించి ప్రేమను పుక్కిలించితిని. క్రమగతియు సరళశైలియు, ఉన్నతభావముకల సద్వృత్తమువలెనే నా నరోత్తమునిదరికి నడచితిని.

దక్షిణాశ శాంతిసందేశమును వలె మలయమారుతము నంపెను. చంద్రుఁడు వెన్నెలచే సత్వాంజనము పూసెను. ఆజ్యోత్స్న పరమేశ్వరుని సగుణస్వరూపమువలె దివ్యవిభూతులతో తేజరిల్లెను.

శయనైకాదశినాఁట పాలవెల్లిలో పురుషోత్తముఁడు పవ్వళించినటులు నరోత్తముఁడు పవ్వళించెను. నేను కాళరాత్రివలె అతనికడకరిగి యతని రెండుపాదములును గ్రహించితిని. నరోత్తమరెడ్డి లేచి నాపేరున నన్ను సంబోధించి, 'నీకు శాంతి కలుగుఁగాక!' అని ఆశీర్వదించెను.

నేను 'ఓగురూ! పరమగురూ'అని మాటలాడఁబోఁగా, అతఁడు 'కాదుకాదు; నీవే నీకు గురువవు; నీకు బంధుగుఁడవు. నీవే నీకు శత్రుఁడవు. నీవే నీ కాత్మవు' అనెను.

నేను 'నిక్కము' అని పిదప నాన్మకృతమంతయు పూస గ్రుచ్చినటులు చెప్పికొంటిని. అతఁడు శాంతతతో సమగ్రముగా ఆనుగుఁడై వినియెను.

పిదప నాహస్తములలో నున్న అతని పాదపంకజములు నలిగిపోవు ననుభీతి లేక యొత్తుచు 'నన్ను క్షమింపుము' అని ముమ్మారు వేడితిని. వేడి కన్నీరుచే నాచెక్కులు లేత మట్టాకు లాయెను.



'నిన్ను నీవే క్షమించుకొంటివి. ఇతరుఁడు క్షమించుటలో మెత్తఁదన మున్నది. తన్ను తాను క్షమించుకొనుటలోఁగల కఱకుఁదనము సూర్యునందేని లేదు. నాచే క్షమింపఁజేసికొని క్రింది కొక మెట్టుల దిగెద వని అతఁ డనెను.

'కాదు కాదు; నన్ను నేను క్షమించుకొనుటలో శాంతి లేదు. ఎంత క్షమించుకొన్నను దాని కెదురుగనే నేను క్షమింపఁబడ ననునది వలె దోషము నిలువఁబడును. నీక్షమాపణయే దాని కుచ్చాటనము. అథవా నేను క్షమింపఁ దగుదానను గాను. నాలోప మెపుడు నా కనులలో కాఁపుర ముండవలయును. నన్ను క్షమింపకుము!' అని యంటిని.

నరోత్తమరెడ్డి బాష్పజల ప్లావితుఁడై. 'నిన్నుఁగాక మఱి యెవరిని నేను క్షమింపఁగలను ? ముమ్మాటికి క్షమించితిని. ముమ్మాటికి క్షమించితి' ననెను.

నే నదివఱకుఁ గాదు, ఆక్షణముననే నరోత్తమరెడ్డిని వివాహమాడినది.

నా ప్రాయశ్చిత్తమున కుపకల్పింపఁబడిన శుద్ధిసభలో సదస్యులవలె నక్షత్రములు, చంద్రుఁడు, సప్తర్షులు అరుంధతి లేచి నన్నాశీర్వదించినటు లుండిరి.

నరోత్తమరెడ్డి నన్ను పుత్త్రివలె, చెలియవలె, భార్యవలె, శిష్యవలె క్షమించెను. అతఁడు వెనుకటి వలెనే సంచరించెను. ఆహా ! ఏమి యా ప్రాసు !

నాచరిత్ర మంతము కాకమునుపు నరోత్తముఁడు నన్ను క్షమించిన ఆపవిత్ర రాత్రిని స్మరించుకొందును.

ఘాతకుని క్షమింపవచ్చును; దొంగను క్షమింపవచ్చును; అందఱను క్షమింపవచ్చును; మతిమాఱిన భార్యను క్షమింపవచ్చునా ? ఆమెను క్షమించుటయే క్షమ. నరోత్తమ రెడ్డియే నేనై, నేనే నరోత్తమరెడ్డినై యున్నచో నేను క్షమింపఁజాలకపోయియుందును. స

న్నిటులు క్షమించి పుచ్చిన నరోత్తముఁడు మనుజుఁడా, దేవుఁడా, క్షమాదేవుఁడా ?

నరోత్తముని క్షమాపణమే నాజీవవాణి. ఆవాణితో నాకథను సమగ్రముగా చెప్పకొనుటకు నేను సిగ్గిల్లను. నాచరిత్ర శరీరమునకు జీవమైన క్షమాపణ తన పూర్వదళములను రాల్చి క్రొత్తాకు తొడిగినది.

నన్నాతఁడిటులు క్షమించి తలమునకలయిన ప్రేమతో నన్ను కౌఁగిలించుకొన్నటు లుండెను. ఆయాలింగమున నేను నాశరీరమును బాసినచో ఎంత ధన్యవతిని! ఏలయన్న, నూతనశరీరమే ఆయాలింగనమునకుఁ దగినది.

---

## అహర్ముఖము

శ్రీ. శ్రీ [కవితాసమితి.]

అహర్ముఖాంచిత హర్షవీచికలు
జాండభాండమున నిండినవి!
రహఃప్రశాంత దినోదయవేళా
రాగఘోషములు మ్రోగినవి!

* * * *

ఆయుదయకాల రమ్యరహస్యగర్భ
సురభిళలతాంత గుచ్ఛమాధురులయందుఁ
దనువుపులకించు నూతనోత్సాహకలిత
మోదభరమున నాకనుల్ మూఁతవడియె!

అపుడుపొడమిన గాఢమాంద్యమున రేఁగి
కాలగర్భనిలీనాంధకారమందుఁ
దరలిపోయితి భావసౌదామనీల
తాంచలసురక్షితస్థలి నధివసించి!

ఆదినోదయవేళాప్రయాణశుభము
హూర్తమున భావనాభావితోత్సవమున
నాకుఁ గననయ్యె విస్మృతానేకచరిత
గతపురాతనసమయభారతధరిత్రి!

అప్పుడసదృశశాంతి మహత్త్వగతుల
వెనుకదినములఁ బ్రజ్వలించినచిరంత
నార్యవైభవవహ్ని సహస్రశిఖలు
కనులుపొడిచిన మెఱుపులై కానుపించె!

అవియె ఋష్యాశ్రమమనోజ్ఞ దివిజసదన
నిభతలమ్ములు వారె హూనిప్రకాండు
లదియె ఘోషిలు దిక్కటాహములు నిండి
మార్మ్రోఁతల ఋగ్వేదమంజురవళి!

ఆసనాతనకాల ప్రభాసమేత
వేదభూసురఘోషా నవీనగతులఁ
బలుకుదెలియని తన్మయత్వమునుగనిన
నాహృదంతరమునకు లీనతఘటిల్లె!

* * * *

ఇంద్రహరిత్సముదంచితదీధితు
లంధకారముల నడచినవి!
సాంద్రవికాసస్ఫీతమద్ధృదయ
సరసిజదళములు విరిసినవి

---




" ఈభవాంభోధి నీ వేరీతి దాటేవు ఏమి తలపోసేవె ఓమనసా!
కన్ను గానగరాని కటికిచీకటిలోన ఎన్నాళ్లె నీ(బదుకు ఓమనసా? "

ఆంధ్రదేశములో ఆబాలగోపాలమూ ఈ కీర్తన పాడుతుంటారు. నే నెన్నో సారులు విన్నాను. ఆకీర్తనంటే నాకు ఇష్టముకూడా. ఈ దూరదేశములో, ఈటంగూనగరములో, ఈ బర్మావాళ్లనడమ, ఈ తెలుగుకీర్తన వినబడడము నాకు కర్ణామృతముగా ఉన్నది. ఆస్వరముకూడా ఎక్కడనో విన్నట్టే ఉన్నది. కొంచెముదూరాన వినబడుతుండడమువల్ల నాకు ఆ పాటమీద మరింత ఆసక్తి కలిగింది. ఏవైపు నుంచి ఆపాట వినబడుతున్నదో ఆవైపే ముందుకు పోయాను.

అది భాద్రపదమాసము. సెటాంగునది ఒడ్లొరసి పారుతున్నది. దాని అవతలిగట్టున చెట్లచేమలతో పచ్చగా ఉన్నపర్వతము; ఆ పర్వతము వెనకనే కుంకుతున్నపొద్దు; ఆపొద్దు పక్కపక్కల మంకెనపూల రాసులలాగున చరమసంధ్యారాగ రంజితములైన మబ్బుతునకలదొంతరలు- చూడడానికి ఎంతోమనోహరముగా ఉన్నవి. సందెకావి తగ్గిపోతున్న కొద్ది ఎఱ్ఱనిమబ్బుతునకలన్నీ క్రమక్రమముగా నల్లబడిపోతున్నవి. సిటాంగునదిమీదినుంచి చల్లగాలి వీస్తున్నది.

" అస్తమించెను సూర్యుడంతరించెను సంధ్య
అయిపోయె నీరోజు ఓమనసా!
గట్టుపై కూర్చుండి కంట నీరిడుచున్న
కానరాదే దారి ఓమనసా!"

నా కెంతో ఆశ్చర్య మయింది. సిటాంగునదిమీద ఒకవంతెన ఉన్నది. టంగూనగరములో ఆవంతెనమీద తిరగడముకన్న నాకు మరొక ఆనందము లేదు. ఆవంతెన మీదనే కూర్చుండి ఒక బౌద్ధసన్యాసి ఏకతారమీద ఆపాట పాడుతున్నాడు. ఉచ్చారణలో ఏమీ

పనలేదు. చక్కని తెలుగుపాట పాడుతున్నాడు. నేను వంతెనమీదికి వెళ్లి నిలబడ్డాను. ఆసన్యాసి నాకేసి కన్నెత్తి చూడనేలేదు.



తదేకదీక్షతో కళ్లు మూసుకొని పాడుకొంటున్నాడు.

"ఇల్లువాకిలిగాని, ఇల్లాలుగాని, నీ
కిపుడు తోడౌనటే ఓమనసా!
కల్లబంధాలెల్ల చల్లగా తెంపుకొని
గతి యేదోచూడవే ఓమనసా!
భవ్యతేజోమూర్తి, భవకర్ణధారి ఆ
పరమేశు డొక్కడే ఓమనసా!
ఆపదలు, గీపదలు అణగునే యికనయిన
అతడె శర ణనుకోవె ఓమనసా!"

ఆసన్యాసికి గడ్డాలు మీసాలు లేవు. బోడితల. కాషాయవస్త్రాలు కట్టుకొన్నాడు. ఈ బర్మాదేశములో, ఈబౌద్ధసన్యాసినోట చక్కని తెలుగుపాట విని నేను నివ్వెరపోయాను. నానోట మాట రాలేదు. కీర్తన అయిపోయింది. కొంచెమునేపటివరకూ కళ్లు మూసుకొని ఏదో యోగసమాధిలో ఉన్నట్లు ఉన్నాడు సన్యాసి. తర్వాత ఏవోమంత్రాలు కాబోలు, నెమ్మదిగా గొణిగాడు. అవి పాలీభాషలో ఉండడమువల్ల నాకేమీ అర్థముకాలేదు. కాని వినడానికి సొంపుగా మాత్రము ఉన్నవి. ఈ తెలుగు పాటా, ఈపాలీమంత్రాలూ, నన్నా సన్యాసికి మరింతదగ్గరగా లాగినవి. అతడు కళ్లు తెరవగానే నేను మరింతదగ్గిరికి వెళ్లి నిలుచున్నాను. నావాలకము చూచి ఆయన నవ్వాడు. నేను నెమ్మదిగా "మీరెప్పుడైనా తెలుగుదేశము వెళ్లారా యేమిటి?" అని అడిగాను.

"అవును, వెళ్లాను. నీ విక్కడికి వచ్చి ఎన్నాళ్లయింది?"

"నేను వచ్చి యిప్పటికప్పుడే ఏడాది వెళ్లింది. ఇక్కడ ప్లీడరీ చేస్తున్నాను. మీ రెక్కడా ఉండడము?"

"ఫలానిచోట నివాస మని లేదు. నేను బౌద్ధ భిక్షువును. ఊరికే తిరుగు తుంటాను. దగ్గర ఏమఠ ముంటే దానిలో పడుకుంటాను. 'సత్రేభోజనం, మఠేనిద్రా.' నేనూ తెలుగు వాడనే."

ఆకాశమంతా దట్టమైన మబ్బు గమ్మి ఉన్నది. హఠాత్తుగా ఒక పెద్ద ఉరుము ఉరిమింది. నేను ఉలికిపడి పైకి చూచాను. తప్పకుండా వాన వస్తుందని తోచింది. రంగూననగరములో వానలకు విధీ విరామమూ ఉండదు.

వాన కురవడము మొదలు పెట్టితే ఇక వెల వడ మంటూ లేదు.

“మబ్బు దట్టముగా పట్టింది. వాన రాక తప్పదు. మీరు మాయింటికి దయచేయండి” అన్నాను నేను.

“గృహస్థులయింట్లో కాలుబెట్టి చాలా రోజు లయింది. అయినా నీవు తెలుగువాడవు. పద. వస్తాను.” అని లేచాడు సన్యాసి. వంతెన దగ్గరనే గుఱ్ఱపు బండిని విడిచిపెట్టి వచ్చాను నేను. వాన ప్రారంభమయింది. కొంచెము తడుస్తూ తడుస్తూనే వంతెన దిగి మేము బండి దగ్గరికి వచ్చి ఎక్కాము. బండి మా యింటి వైపు మళ్లింది.

మాయింట్లో నా ‘డ్రాయింగ్ రూము’ చక్కగా సర్ది ఉన్నది. పరదాలూ, పటాలూ, బొమ్మలూ, కుర్చీలూ, టేబిలూ, అన్నీ ఏది ఎలా ఉండాలో అలా అమర్చింది నాభార్య. ఆమె నేర్పే ఆగది అంత శుభ్రముగా, అంత చక్కగా, ఉండడానికి కారణము. తళుక్కున మెరుపు మెరిసింది. ఆవెలుతురులో ఆగదిలోని చిన్నా పెద్దా వస్తువులన్నీ చక్కగా ఉన్నట్లు కనబడినవి. లోపలినుంచి ఆగదిలోకి రావడానికి ఒక గుమ్మ మున్నది. ఆగుమ్మము లోనే ప్రాణము గల చిత్రపటము లాగున కదలక మెదలక నాభార్య నిలుచున్నది. ఆ మెరుపు మెరిసినప్పుడు నాభార్య ఎంత చక్కగా కనబడిందో నేను చెప్పలేను. కానీ ఏమిటిది? ముందుగా బండి దిగి గడపలో కాలుబెట్టాడో లేదో ఆసన్యాసి నాభార్యను చూచి, “ఇదేమిటి? ఎవరు?” అని ఒక్క కేక వేసి కింద కూలబడ్డాడు. క్రమక్రమంగా అతనికి తెలివి దప్పిపోతున్నట్లు తోచింది. నాభార్య భయపడుతూ నాపక్కకు వచ్చి నిలుచున్నది. నేను గబగబా వెళ్లి ‘స్మెల్లింగుసాల్టు’ సీసా తీసుకొని అతని దగ్గరికి వెళ్లి కూర్చున్నాను. ఆసన్యాసి మెల్లగా “అక్కర లేదు. కొంచెముండు. ఏమీ ఫరవా లేదులే” అని లేచి కూర్చొని ఏదో ధ్యానము మొదలు పెట్టాడు. ఆగదిలో బౌద్ధ సన్యాసుల బొమ్మలు చాలా ఉన్నవి. ధ్యానిస్తూ ఉన్నప్పుడు ఈ సన్యాసి కూడా ఒక బొమ్మలాగే ఉన్నాడు. నాభార్యమనసు కొంచెము కుదుటబడింది. ఈసన్యాసి తెలుగువాడేనని నేనప్పుడు ఆమెకు చెప్పాను. ఆమె మెల్లగా నాపక్కనే కుర్చీమీద కూర్చున్నది.

బయట వాన పెద్దదయింది. ఒక తుపానులాగు ఉన్నది వాన. ఏనుగుతొండములాగు ధార పడుతున్నది. పెద్ద యీదురుగాలి. నడమ నడమ ఉఱుములూ మెఱుపులూను. సన్యాసి కళ్లు తెరిచాడు. అతని కాళ్లకు వంగి నమస్కరించి, “ఏమి స్వామీ! నామీద తమకు కోప మెందుకు? నేనేమి అపరాధము చేశాను?” అని సవినయముగా అన్నది నాభార్య.

“లేదమ్మా లేదు. నీమీద కోప మేమిటి?” అన్నాడు సన్యాసి నవ్వుతూ.

“కొంచెము తేనీరు తెచ్చి ఇయ్యముటారా?”

ఈమాట విని సన్యాసి కొంచెము నవ్వుతూ, "సరే! తీసుకొనిరా!" అన్నాడు. స్వయముగా టీ తయారుచేసి తీసుకొని రావడమునకు నాభార్య వెళ్లింది. సన్యాసి నావైపు చూచి "నీభార్య పేరేమిటి?" అని అడిగాడు.

నాకు కొంచెము సిగ్గూ, ఆశ్చర్యమూ కలిగింది. చెప్పక పోవడమేమి? నాభార్యపేరు నేనుచెప్పనా? అయినా ఈకాలములో తప్పు లేదని "అనితమ్మ" అని సమాధానము చెప్పాను.

ఆపేరు వినడముతోనే సన్యాసికి పిడుగు పడ్డట్టు అయింది. ఏదో విద్యుత్ప్రవాహము అతని శరీరములో ప్రవహించినట్లయింది. గాలికి రావిఆకులాగున అతడు నిలువున చలించి పోయాడు. ఆకంగారూ, ఉద్రేకమూ చూచి నేను బెదరిపోయాను. వెంటనే ఆసన్యాసి కళ్లు మూసుకొని మరల యోగసమాధిలో మునిగి పోయాడు.



కొంచె మేదో చిరుతిండీ, తేనీరూ, తీసుకొని నాభార్య వచ్చింది. సన్యాసి కొంచెము నేపటికి కళ్లు తెరచి చూచాడు. నవ్వుతూ ఒక కుర్చీమీద కూర్చొని అవి పుచ్చుకొన్నాడు. తర్వాత "అబ్బా! ఏమిటీవాన! ఈవేళ ఏదో మూడింది. ఏదో విపరీతానికే భగవంతు డిదంతా కల్పించాడు." అని, కొంచెమాగి, మళ్లా మాకేసి చూచి, "నాసంగతి తెలుసుకోవాలని ఉన్నదా మీకు?" అని అడిగాడు. నేనూ, నాభార్యా ఒకరిమొగము ఒకరు చూచుకొన్నాము. తర్వాత "చిత్తము" అన్నాము.

"అంతా చెప్పడానికి ఇప్పుడు సావకాశము లేదు. టూకీగా చెపుతాను. వినండి. ఇరవ య్యోయేట నేను బి. ఎ. ప్యాసైనాను. ఆయేడే నాభార్య కాపురానికి వచ్చింది. నాభార్య అంటే నాకెంతో ప్రేమ. ఆమెను విడిచిపెట్టి ఒక నిమిషమైనా ఉండలేకపోయేవాణ్ణి. అటువంటప్పుడు పొరుగూళ్లలో చదవడము నాకిష్టము లేకపోయింది. అందుచేత చదువుతున్న 'లా' మానేశాను. ఏదైనా వ్యాపారము చేయాలని బర్మాకు ప్రయాణమైనాను. ఇది చాల రోజుల క్రితముమాట: అయినా ఈవేళ జరుగుతున్నట్లే ఉంది. నేను బయలుదేరి వస్తున్నప్పుడు గుడ్ల నీరు గుక్కుకుంటూ చూస్తూ నిలుచున్న నాభార్య యిప్పుడు కళ్లకు గట్టినట్లు

ఉన్నది. అప్పటి సంగతు లన్నీ ఒక్కటొక్కటే మనసుకు తట్టుతున్నవి.

బర్మా వచ్చాను నేను. కొన్నాళ్లు రంగూనులో వ్యాపారము చేసి కొంతడబ్బు సంపాదించాను. తర్వాత టేకుకఱ్ఱ వ్యాపారము చేయాలని బుద్ధి పుట్టింది. అందుకోసము ఈటంగూనగరము వచ్చాను. అప్పుడు నేను ఈయింట్లోనే కాపురమున్నాను. ఈయింటికి పడమటి వైపున గుఱ్ఱాలసాల ఉన్నది కదూ! అందులోనే నాగుఱ్ఱపుబండీ, రెండు బర్మాగుఱ్ఱాలూ ఉండేవి. ప్రతిరోజూ సాయంకాలము గుఱ్ఱపు బండిమీద సిటాంగునదీతీరానికి షికారువెళ్లడము నాకలవాటు. రోజూ వెళ్లుతుండేవాణ్ణి. నేనెక్కడ గుఱ్ఱపుబండి దిగి నడక సాగించేవాణ్ణో అక్కడనే రోడ్డుపక్కన ఒక ఇల్లున్నది. ఆయింటి వీధివైపు కిటికీలో, నేను బండిదిగే సమయానికి ఏదో అందమైనముఖము నన్ను చూస్తున్నట్లు కనబడేది. నేనుకూడా ఒకరోజు పరకాయించి అటుకేసి చూచాను. ఆముఖము నవ్వుతూ ఉన్నట్లు నాకుతోచింది. సరే రోజూ ఆలాగే షికారు వచ్చేవాణ్ణి, ఆలాగే ముఖము కనబడేది, అలాగే పరకాయించి చూచేవాణ్ణి, ఆలాగే నవ్వుతూ ఉండేది. ఇల్లా కొన్నాళ్లు గడచినవి. రోజుకు రోజుకు ఆనవ్వు ఆదోవిధముగా మారిపోతున్నట్లు నాకు తోచింది. ఏమిబుద్ధి పుట్టిందో ఒకరోజున దిగకుండా బండిమీదే కూర్చొని కొంచెము సేపు ఆవైపు చూస్తున్నాను. నాకేసి చూస్తూ ఆముఖము—ఆ అందమైన ముఖము—నవ్వుతూ ఆ కిటికీలోనే ఉన్నది. తల్లో పూలదండ, చెవులకు వజ్రపుపొళ్ల దుద్దులూ, వంకపాపిడీ, కళ్లలో, ముఖానా చిరునవ్వూ, ఆనవ్వులో ఒక విధమైన శృంగారమూ, ఇవన్నీ చూచేటప్పటికే నా మనసు మనసులో లేదు. ఏమి చేయడానికీ తోచలేదు. ఆలాగే చూస్తూ కూర్చున్నాను. ఇంతలోనే ఆకిటికీలోనుంచి దోసెడు సంపెగపూలు వచ్చి నాబండిలో పడ్డవి. నేను ఆశ్చర్యపోయి ఆపూవులు ఏరుకోనడానికి వంగాను. ఏరుతూ ఏరుతూ కిటికీ వైపు చూచాను. అక్కడ ఎవరూ లేరు. పూవులన్నీ ఏరి చేతులో పట్టుకొన్నాను. ఇంతలోనే ఎవరో చల్లగా నన్ను ముట్టుకొన్నారు. నేను తల ఎత్తి చూచాను. ఆశ్చర్యము! ఆకిటికీలోని చందమామే; ఆ అందమైన పడుచుపిల్లే; నవ్వుతూ నా చెయి పట్టుకున్నది.



ఆవేళ శుక్లచతుర్దశి. లేత లేత వెన్నెల అసిటాంగునదీ జలముమీద 'బుకుమలు' తెర లాగున పడి ఉన్నది. అది సౌందర్య లక్ష్మీ మేలిముసుగులా గున్నది. చల్లని పిల్లగాలులు జోకొట్టు తున్నట్లు మేనికిసోకుతూ వీస్తున్నవి. నేను ఈవేళ కూర్చున్న వంతెన అప్పటి కిం కా కట్టలేదు. రేవులో చిన్న చిన్న పడవ లెన్నో ఉన్నవి. టేకు పలకలను తెప్పకట్టి ఆనది మీా దనే దేశదేశాలకు తీసుకొని వెళ్లుతారు. అటు వంటి తెప్పలు రేవుపొడుగున ఉన్నవి. ఆతె ప్పలమీాదనే చిన్నిచిన్ని గుడిసెలు వేసుకొని తెప్పలవాళ్లు నివసిస్తుంటారు. వాళ్లు ఎంతో చక్కగా పిల్లనగ్రోవి ఊదుతున్నా రావేళ.

ఆయువతి నాచేయి పట్టుకొని ఆనదివైపు తీసుకొని వెళ్లింది. నేను మాట్లాడలేకపోయా ను. మంత్రముగ్ధుడిలాగున ఆమె తీసుకొని వెళ్లి నట్లల్లా వెళ్లాను. నదీతీరాన ఒక తెప్పమీాద కూర్చున్నాము "నీపేరేమిటి?" అని నే నడిగా ను. "సాలోయా! సాలోయానే (సంపెగ) ఇప్పుడు నీపదార్పణ చేశాను."

తర్వాత ఎన్నో మాట్లాడినాము. అవన్నీ యిప్పుడు చెప్పి లాభములేదు. చాలాసేపైన తర్వాత నేను ఇంటికి బయలుదేరాను. నా బండి ఆకిటికీదగ్గరే వున్నది. ఆమే, నేనూ అ క్కడికి వచ్చాము. నేను బండి యెక్కాను. అప్పుడు సాలోయా నాచేయి మెల్లిగా నొక్కు తూ, "నీభార్య యెక్కడున్నది?" అని అడి గింది. నేనొక నిట్టూర్పు విడిచి, తణుకు బెణుకు లేకుండా, "నాకింకా పెండ్లి కాలేదు." అన్నా ను. నాగుండెలు కొంచెము కొట్టుకోకపోలేదు.

మరునాడు నాబండి సాలోయా ఇంటిద గ్గిరకి వచ్చింది. ఆమె ఆకిటికీలోనే ఉన్నది. నన్ను చూచి పరుగెత్తుకొని వచ్చి నవ్వుతూ బండి ఎక్కి నాపక్కనే కూర్చున్నది. నేను నవ్వుతూ ఆమెకేసి చూచాను.

"సరోవరము దగ్గరికి వెళ్లుదాము" అన్న దామె.

బండి వెనుకకు మళ్లింది. రోడ్డుమలుపు తిరిగి సరోవరానికి వెళ్లాలి. బండి మలుపు తిరిగి రోడ్డెక్కింది. అబ్బా! గుఱ్ఱాలు ఎంత గబ గబా నడిచినవి!

ఇంగ్లీషు ప్రభుత్వము రావడానికి చాలా పూర్వము ఆసరోవరము పక్కనే వుండేది రాచనగరు. ఇప్పుడు దానితాలూకు ప్రహరీ గోడమాత్రమే ఉన్నది. ఆగోడమీాదా, పక్క నా, మంచి గంధపుచెట్లూ, కర్పూరపుచెట్లూ, ఇంకా ఏవేవో పలురకాలచెట్లూ దట్టముగా ఉన్నవి. ఆసరోవరానికి తూర్పువైపున 'పెగో డా' ఉన్నది. దాని బంగారుశిఖరమూ, ఆశిఖ రము చుట్టూ ఉన్న బంగారుగంటలూ, ఆచర మసంధ్యాకాంతిలో తళతళ మెరిసిపోతున్నవి. ఆగంటలు గాలికి మెల్లగా కదలుతూ అతిమనో హరముగా, మధురముగా మోగుతున్నవి. ఆ సరోవరములో ఈదుతూ ఉన్న పెంపుడుహం సలను పట్టుకొని చీనావాళ్లు ఇండ్లకు వెళ్లిపో తున్నారు. సంధ్యాచీకటి పడీపడకమునుపే వున్న

మవెన్నెల వచ్చి స్వచ్ఛమైన ఆసరోవర జలము మీద వాలింది. నవ్వుతూ నీటిమీద తేలి ఆడుతున్న ఆవెన్నెల్లో ఆసరోవరము ప్రశాంత ముగా ఉన్నది. పిల్లగాలికి అప్పు డప్పుడు చిన్ని చిన్ని తరంగాలు లేచి కూనిరాగాలు తీస్తూ వెన్నెలను కౌగిలించుకుంటున్నవి.

నేనూ, సాలోయా ఒకచిన్న బోటుమీద ఎక్కి నడిసరోవరానికి వెళ్లాము. తర్వాత బోటును గాలికి వదిలిపెట్టాము. నెత్తిమీద నిండుజాబిల్లి; కింద అద్దములాటి సరోవరము; చుట్టు దడిగట్టినట్లున్న చెట్లూ; సరోవరములో ప్రతిఫలించిన వాటినీడలూ. ఆసౌందర్యము నిజముగా—

ఇక కథ ఏమి చెప్పను? సాలోయా నా యిలవేల్పయింది. నాయింటికి వచ్చి పెత్తనము వహించింది. నాదగ్గర వంట చేయడానికి ఒక తురక ఉన్నాడు. సాలోయా మాటప్రకారము ఆతురకవాడికి సెలవు చెప్పి ఒక బర్మావాడిని వంటకు పెట్టాము. ఈబర్మావాడు సాలోయా చుట్టము.

ఇక ఈవైపునుంచి నాభార్య మాటి మాటికి వస్తున్నా నని జాబులు వ్రాయడము మొదలుపెట్టింది. నాచేత నైనన్నాళ్లు ఏవో లేనిపోని సాకులు చెప్పి ఆమెను రాకుండా ఆపాను. చివరకు నామాట పాటించకుండా ఇక్కడికి రావడానికి ఆమె బయలుదేరింది.

స్టీమరు దిగి రైలుమీద ఆమె టంగూ నగరము వచ్చింది. నేను 'స్టేషను'కు వెళ్లి ఆమెను కలుసుకొన్నాను. బండి ఎక్కిన తర్వాత నే నామెతో నాదురవస్థ అంతా సూచా తప్పకుండా చెప్పాను. ఆమె ఏడ్వ మొదలు పెట్టింది.

"మీరు ఏదోవిధముగా ఇక్కడ సుఖ ముగా ఉన్నారని తెలిస్తే నే నసలిక్కడికి బయలుదేరకనే పోదును. మీరు దేశముకాని దేశములో ఏమి కష్టపడుతున్నారో అని వెర్రి దానిలాగు పడిపోయినట్లు పరుగెత్తుకొని వచ్చాను. సరే! ఏమైనా కానీయండి! ఇప్పుడే తిరిగి నన్ను ఇంటికి పంపించినా సరే. లేకపోతే వేరే ఏదైనా ఇల్లు మాట్లాడి నన్నక్కడ ఉంచినా సరే. నేను ఆమనిషి ఉన్న ఇంటికి రాను."

అన్నది నాభార్య.

నే నేమీ మాట్లాడలేదు. బండివచ్చి ఇంటివాకిట్లో ఆగింది. నేను ఆమెకళ్లు తుడిచాను. ఆమె బండి దిగింది.

ఆరునెలలపాటు ఏదో ఒకమాదిరి గడిచింది. తెరవెనక ఏమిగందరగోళము జరుగుతున్నదో నేను ఎరగనే ఎరగను. క్రమముగా సంగతి సందర్భాలన్నీ నాకు తెలియవచ్చినవి. ఇక నాయాట సాగ దనుకొన్నాను. నేను తెచ్చే డబ్బంతా సాలోయాచేతిలోనే ఉండేది. కొత్త వంటవాడు తనయిష్టము వచ్చినట్లు ఖర్చు చేసేవాడు. నాతో చెప్పేవాడే కాడు. ఇది ఇల్లా ఉండగా, వీళ్లిద్దరూ కలసి నాభార్యమీద ఏమి దౌర్జన్యము చేస్తున్నారో అదికూడా చూచాయగా నాకు తెలిసింది.



3. కైసరిబాగ్ ద్వారము-లక్నో



౭. కైసరిబాగుయొక్క- ౧౮౫౦ సంవత్సరమునందలి దృశ్యము-లక్నో

నే నొకరోజున సాలోయాతో "ఒంట్లో ఆరోగ్యము సరిగా లేదు. మా దేశము తిరిగి వెళ్లుతాను." అన్నాను.

"నన్ను కూడా నీవెంట తీసుకొని వెళ్లు."

"ఎల్లా వీ లవుతుం దది?"

"అయితే నీ పెళ్లాన్ని ఇక్కడ అట్టే పెట్టి వెళ్లు."

"అది వీలు కాదు."

"ఎందుకు వీలుకాదు? ఆమె ఇక్కడ ఉండటానికే సంబరపడుతుం దనుకుంటాను." అని హేళనగా నా కేసి చూసింది సాలోయా.

"ఏమి టామాట?" అని నేను కొంచెము కోపముతో గద్దించాను.

"నీవేమో గట్టికబుర్లు చెప్పతున్నావు! నీభార్య ఇప్పుడు కడుపుతో ఉన్నది. నేను గట్టిగా తలుచుకున్నానంటే నీభార్యను కూనీ చేయగలను. కాకపోతే చేయించగలను. ఇది ఆవిషయములో ఆరితేరినచేయి. తెలిసిందా?"

నాకు మాట్లాడడానికి నోరు రాలేదు. ఇది జరిగి రెండునెల లయింది. ఈ రెణ్ణెల్లు కూడా నేను టంగూనగరము చుట్టుపట్ల గ్రామాదులలోనే తిరుగుతూ ఉన్నాను. నేను టంగూనగరము వచ్చిననాడే నాభార్య నొప్పులుపడి ఒక ఆడపిల్లను కన్నది. ఆవేళ ఒక బౌద్ధసన్యాసి మాయింటికి వచ్చాడు. నేను సంతానము కలిగిందనే సంతోషముతో ఆవచ్చిన సన్యాసిని ఎంతో గౌరవముచేసి ఆతిథ్యమిచ్చాను. ఆబౌద్ధసన్యాసి నాతో "నాయనా, సంతానము గలిగిందని ఆనందము వద్దు. ఈ సంసారము అనిత్యము. ఈ భార్యా పుత్రులు అనిత్యము. మాయ, మోహము-అన్నీ అనిత్యమే" అన్నాడు. అతడు మాట్లాడుతున్నంతసేపూ "అనిత్యము" అనేమాటతప్ప మరొకటి మాట్లాడలేదు. స్ఫుటమైన ఉచ్చారణ లేక ఆమాటనే 'అనితం' అనేవాడు. అతడు వెళ్లిపోయిన తర్వాత నేను నాభార్యతో "మన చిట్టికి 'అనితమ్మ' అని పేరుపెడదాము" అన్నాను. నాభార్యకూడా సరే అన్నది."

సన్యాసి ఈమాట అనగానే నాభార్య అతనికాళ్లమీద పడి, "నాన్నా, నేనే నీ అనితమ్మను" అన్నది.

సన్యాసి "అవును నిజమే నమ్మా! నీవు సరిగా మీ అమ్మపోలికే. కన్నూ ముక్కూ తీరు, మాటా, గొంతూ, సరిగా ఇచ్చి పుచ్చుకొన్నట్లు మీ అమ్మమాదిరే. తర్వాత కథ వినండి. కథంతా సరిగా పూసగుచ్చినట్లు చెప్పలేను. నేను ఒకరోజున టంగూనగరానికి ఇరవైమైళ్లదూరములో ఉన్న ఒక ఊరి 'ట్రావెలర్సు బంగాళా'లో ఉన్నాను. అప్పటికి సాయంకాలము కావచ్చింది. హఠాత్తుగా సాలోయా అక్కడికి ఊడిపడ్డది. కారణ మేమిటో నాకు తెలియలేదు. నే నడిగాను. ఎన్నిసారులడిగినా "నిన్ను చూడకుండా ఉండలేక పోయాను. అందుకే వచ్చాను." అనేమాటనే రకరకాల భావాలతో, ఎన్నో విధాల తెలిపింది. చివరకు ఆమాటా ఈమాటా అయిన

తర్వాత నాతో "నామాట నీవు నమ్మవు. నేను రోజూ కళ్లారా చూస్తున్నాను నీభార్య సంగతి. నా వెంట నీవు వస్తే ఈవేళ నీకు కూడా ప్రత్యక్షముగా చూపిస్తాను" అన్నది.

నే నామెమాట అణుమాత్రమూ నమ్మ లేదు. కాని ఒక మూ రదేమిటో చూడాలని మాత్రము మనసుపుట్టింది. ఆ మరునాడు రెం డుజాముల వేళకు మోటారుమీద టంగూ నగరము వచ్చాము. మాయింటికి వచ్చి చూచే టప్పటికి తలుపు లోపల గొళ్లెము వేసి ఉన్నది. సాలోయా చిత్రముగా ఎల్లాగో బయటినుంచే లోపలిగొళ్లెము తీసింది. ఏమున్నది లోపల? చంటిబిడ్డతో నాభార్య పడుకున్నది. ఆపక్క మీదనే ఒకవైపునవంటవాడు పడుకున్నాడు. నాభార్య గాఢనిద్రలో ఉన్నది. నాతల తిరిగి పోయింది. ప్రపంచము తలక్రిందు లైపోయి నట్లు తోచింది. వెంటనే ఈపన్నాగ మంతా సాలోయా పన్నిం దని మెరుపు మెరిసినట్లు నామనసున తోచింది. వంటవాడు మేలుకొ నే ఉన్నాడు. మే మింట్లోకి రావడము చూసి వాడు మెల్లగా నాభార్యమీద చేయి వేయ బోయాడు. నాకు ఒళ్లు మండింది. 'కబడ్దార్' అని ఒక కేకవేసి నేను ఆగదిలోనే ఒకమూల వేలాడుతూఉన్న కత్తి తీసుకొన్నాను. నావంట వాడు నాముందే నాభార్యను అవమాన పరుస్తు న్నాడని నాకెక్కడలేని కోపము వచ్చింది. చేతికొద్దీ కత్తి విసరివేశాను. ఆదెబ్బ భుజము దూసుకొనిపోయి తలకు తగిలింది. తెలివి దప్పి కింద పడిపోయాడు వాడు. ఇంటినిండా నెత్తురు. మహాభయంకరముగా ఉన్నది. సాలోయా కేకలు వేస్తూ వెళ్లి ఆవంటవాడిని కౌగిలించు కొని ఏడ్పు మొదలు పెట్టింది. ఈగందరగోళ ముతో, నాభార్య లేచి చూచి, గబగబా వచ్చి నాచేతిలో కత్తి లాగి ఒకపెట్టెలో పెట్టి తాళము వేసింది. జరిగిన సంగతి ఆమెకు తెలియదు. ఇంకొక మోస్తరుగా యోచించి ఆమె నాదగ్గ రికి వచ్చి విసనకర్రతో విసరుతూ, "నేను ఇ న్నాళ్లదాకా ఈసాలోయా సంగతి మీకు చెప్పలేదు. ఈవేళ గ్రహచారము చాలక మీ కంట బడ్డది. ఏమిటి ఈ గందరగోళము? ఈ కొంపమునక ఎందుకు వచ్చింది?" అన్నది. అస లుసంగతి ఆమె ఊహించను కూడా ఊహిం చ లేక పోయింది. ఆ అమాయకు రాలిని నే నేమనను?



"'కబడ్దార్' అని ఒక కేకవేసి......కత్తి తీసుకొన్నాను."

నరే; వంటవాడు ఆసుపత్రికి వెళ్లాడు. నేను జయిలుకు వెళ్లాను. అసలుసంగతి బయటబడ్డది. వంటవాడికి సాలోయా ప్రియురాలు. వాళ్లిద్దరి ఖర్చులూ భరించడానికి నేనొక సాధనాన్నిమాత్రమే. ప్రతిరోజూ నాభార్య ఈ సంగతి కళ్లార చూస్తూ వింటూకూడా, నామనసు బాధపడుతుందని నాతో చెప్పలేదు. ప్రతిక్షణము వేయితేళ్లు కుట్టినట్లు ఆమెమనస్సు బాధపడుతూ ఉన్నప్పటికీ ఈవిషాన్ని ఏలాగున సహించిందో ఎవరు చెప్పగలరు?"

నన్న్యాసి మరి మాటాడలేదు. నేలచూపు చూస్తూ, కిందపడిఉన్న ఏకతార తీగ రెండుసారులు వేలితో మీటాడు. నాభార్య వెక్కివెక్కి ఏడుస్తున్నది. అదిచూచి సన్యాసి మళ్లా "చూడు తల్లీ! ఏడవకమ్మా! అనితా! నాకేసు విచారణకు వచ్చింది. నాతరపున పెద్దపెద్ద అడ్వకేటులు పనిచేశారు. చివరకు నాకు ఏడేండ్లు కఠినశిక్ష పడింది. జయిలులో సంగతు లెందుకు చెప్పడము? శిక్షపూర్తికాగానే జయిలులోనుంచి సరాసరి ఈయింటికి వచ్చాను. వంటవాడూ, సాలోయా భార్యాభర్తలులాగున ఇక్కడే కాపురముంటున్నారు. నన్ను చూసి వంటవాడు వెఱ్ఱినవ్వునవ్వుతూ, "మళ్లానన్ను చంపడానికి వచ్చావా? నాతోటలోని ఈసాలోయా సుమాన్ని మళ్లా కొంచెము వాసనచూస్తావా?" అన్నాడు.

'చూడను.' అన్నాను నేను.

సాలోయా నవ్వుతూ "మాకాపరాన్ని గంగలో కలుపుతావా?" అన్నది. నేను అడ్డముగా తలవూపి "నాభార్య ఎక్కడ!" అని అడిగాను.

"ఈ 'బర్మాభర్త' దొరకలేదని ఆత్మహత్య చేసుకొన్నది."

ఆమాట నాకేమీ ఆశ్చర్యము వేయలేదు. "మాఅమ్మాయి యేది?" అని నేను మళ్లా అడిగాను.

"రంగూనులో అమ్మేసి వచ్చాము."

నేను మరిమాటాడ లేదు. అక్కడనుంచి వచ్చేశాను. తర్వాత ఆపిల్లకోసము చాలా వెదికాను. కాని ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయినవి." అని తనకథ ముగించాడు.

అప్పుడు నాభార్య "ఎల్లా కనబడతాము మరి? నన్ను తీసుకొని మాఅమ్మ తాతగారింటికి వెళ్లింది. మామామయ్యను అనంతపురము బదిలీచేశారు. మేము మామయ్యవెంట అక్కడికి వెళ్లిపోయాము" అన్నది.

తర్వాత సన్యాసి "అంతా అయిపోయింది. ఈ ప్రపంచమంతా మిథ్య-అనిత్యము. ఈ మాట నాకు నచ్చింది. దీన్ని అనుభవములో పెట్టడమునకూ, నాకడుపుమంట చల్లారడమునకూ, ముక్తి సంపాదించడమునకూ, బౌద్ధమత మవలంబించాను. కొన్నాళ్లకు సన్న్యాసము పుచ్చుకొన్నాను. తర్వాత ఈనగరములో ఉన్న 'సుఖాతాపెగోడా'లో కొన్నాళ్లు, రంగూనులో ఉన్న 'స్వాడేలాపెగోడా'లో కొన్నాళ్లు కాలము గడిపాను. తర్వాత అక్కడా, అక్కడా, తిరిగి తిరిగి మళ్లీ ఏడేండ్లకు ఈనగరము వచ్చాను." అన్నాడు.

నాభార్య మళ్లీ, "నాన్నా! మాఅమ్మ తాతగా రింట్లో ఉన్నన్నాళ్లు చేతిగాజులు చిట్లించలేదు. రెండుపూటలూ ముఖాన పసుపు రాచుకొని కుంకుమబొట్టు పెట్టుకొనేది. అంతే కాని ఒకపండుగనీ, పబ్బమనీ, ఒకసంతోషమనీ, సంబరమనీ ఏమీ ఉండేదికాదు. ఎప్పుడూ ఉపవాళ్లూ ఉపవాసాలతో ఉండేది. ఎప్పుడూ ఆమె ముఖాన చిరునవ్వు చూడలేదు నేను. పొద్దస్తమానమూ ఏడుస్తూ ఉండేది. ఎవరైనా నీసంగతి తలపెట్టితే 'ఎక్కడున్నారో ఏమీ తెలియదు.' అని చెప్పేది. నామట్టుకు నాకు కూడా ఈసంగతి చెప్పలేదు. అప్పుడప్పుడు మాత్రము 'నీపెళ్లి అయిన తర్వాత నేనొకసారి బర్మా వెళ్లిరావాలి' అనేది. ఇక్కడ వకాల్తీ చేయమని బలవంతపెట్టి ఈయనగారిని ఆమె తీసుకొని వచ్చింది. మీ రెప్పటికైనా తప్పక కనబడతారని, మీ కాళ్ల దగ్గరే తనప్రాణాలు విడవవచ్చునని, ఆమె అనుకొన్నది కాబోలు. పాపము! ఆమె ఉద్దేశము ఇప్పుడు తెలుస్తున్నది. చివరకు ఆమె కోరిక నెరవేరనే లేదు. ఆమె చనిపోయి ఈ వేళకు పదహారు. ఒక్క పదిహేనురోజులు ముందుగా వచ్చి ఉంటే నీవు, ఆయిల్లాలి ఆత్మ ఎంత సంతోషించేదో!" అన్నది.

ఈమాట విని సన్యాసి ఒకవెట్టికేక వేశాడు. ఉఱుమైనా అంత భయంకరముగా ఉండదనుకొంటాను. నాకప్పటికి రెండేండ్ల కొడుకు. అంతవరకు వాడు దాదిదగ్గర నిద్రపోతున్నాడు. ఈసన్యాసి కేకతో నిద్రలేచి వాడు కాళ్లూ చేతులూ విదిలిస్తూ, 'అమ్మా అమ్మా' అని ఏడుపు మొదలుపెట్టాడు. నేనుకూడా వాడివైపే చూస్తూ ఉన్నాను. నాభార్య వాడిని ఎత్తుకొని ఓదార్చి సన్యాసివైపు వేలు చూపిస్తూ, "అడుగో తాతయ్యా, చూడు." అన్నది.

'తాతా తాతా' అంటూ కుఱ్ఱవాడు చప్పట్లు కొట్టుకుంటూ సన్యాసి దగ్గరికి వచ్చాడు. సన్యాసి లేచి నిలుచున్నాడు. నాభార్య ఏడుస్తూ అతని కాళ్లుపట్టుకొని, "లేని అమ్మ లేనేలేదు. ఇన్నాళ్లకు నీవు కనబడ్డావు. నిన్ను నేను పోనియ్యను. నీవు ఇక్కడే ఉండాలి" అన్నది. "నేను సన్యాసిని. మాకు సుఖదుఃఖాలుగాని, బంధాలుగాని లేవు. ఈ ప్రపంచమంతా మిథ్య."

"ఆ మాటలేమీ పనికిరావు."




'హా' అని సన్యాసి మళ్లా కేకవేశాడు. నా చంటికుఱ్ఱవాడు భయపడి కేరుమన్నాడు.

భార్య వాడిని ఎత్తుకొని ముద్దుబెట్టుకొని ఓదార్చడానికి నాలుగడుగులు వేసింది. ఈలోపల సన్యాసి బయటికి వెళ్లాడు. ఫెళఫెళా ఉఱిమింది. 'హాహా' అనే సన్యాసి అఱుపుకూడా ఆ ఉఱుములో కలసిపోయింది. ఆచీకట్లో, ఆకుంభవర్షములో, ఆ ఈదురుగాలిలో 'హాహా' అనే ధ్వనితప్ప మరి సన్యాసి కనబడలేదు. ఎంత పిలిచినా ఈదురుగాలి 'రంయ్యి' తప్ప మరేమీ వినబడలేదు. తర్వాత కూడా అతనికోసము వెదకాను. అయితే లాభ మేమిటి?

---




తండ్రి—వెధవా! ఎప్పుడురా నీ చేతుల కింత మసి అంటుకుంది.

కుమారుడు—మొఖం కడుక్కుంటప్పుడు—

---

# చిన్ననాఁటిచేష్టలు

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పల్లెటూరు మాది పశువులు పైరులు
చెట్లు చెఱువు కృష్ణగట్లు గఱువు
బైళ్లుగుళ్లు పెంకుటిళ్లును గల; వంతె
కాని నగర శోభ కానరాదు.

అందు నుప్పుఁ బప్పులంగడి గల దైన
దొరక దేమితాయి సరకు దాన
పట్టణముననుండి చుట్టాలు వచ్చి మా
కట్టి దెప్పుడైనఁ బెట్టుచుంద్రు.

కుడువఁ బెట్టు గుజ్జుఁగూళ్లను మాయమ్మ
యాలనేయి పెరుఁగుఁ బాలు పోసి
వండు నెడప దడప పండుగుపబ్బముల్
వచ్చినపుడు పిండివంట లింట.

పూర్వకాలమునను బేర్వేలసినది మా
వీడు వేదశాస్త్రవిద్యలకును
దానిమాఱుపేరు దక్షిణకాశిక
కృష్ణ యచట నుత్తరించి సాగె.

గోపురంబు గుడియు గొప్పవి నాగేశ్వ
రుండనంగ నీశ్వరుండు గలఁడు
చెలఁగుచుండు నచట శివరాత్రికిని బ్రతి
వత్సరంబు గొప్ప యుత్సవంబు.

*          *          *

అవు నా కప్పటి కించుమించు వయసై
దాఁటేండ్లు; చేర్వ్యామ్యో ను
త్సవమంచుర్ బురిః బౌరు లెల్లరుఁ బదా
ర్థవ్రాతసంపాదన

వ్యవసాయంబున గేహసంస్కరణ కృ
త్యంబందు వర్తిల్లి రా
శివరాత్ర్యుత్సవవాసరంబు లట వ
చ్చెన్ హెచ్చె మావేడుకల్.

ఎప్పుడు నిండు నంగళులు
నెప్పుడు సాగు ధ్వజాధిరోహణ
బెప్పు డగున్ మహోత్సనము,
నెప్పుడు బందుగు లేఁగుదెంతు; రే
నెప్పుడు నేడ్క నుండుదు నిఁ
కెప్పుడు మాబడి కాటవి ద్పటు
చుప్పతిలం బ్రమోద మెద
నూఱుటలూఁగిన వెల్లఁ జొప్పడన్.

ఇపుడు చూచుచున్న యీ తెన్నుపురిని మా
యూర నపుడె చూచి యుంటి నేను
మేటిమేడ లింక మోటారుకారులు
మాత్ర మిపుడు క్రొత్తచిత్ర మిచట.

ఊరిలోన దూతె నూఱూళ్లు క్రొంగ్రొత్త
వీడువాడ లుద్భవించె మించె
ఆమె నాకు నపుడు మాయూరె తెన్నును
తీరు నెఱుఁగరాని మాఱుటూరు.

సర్క సరుదెంచె నాటకశాల నెలసె
వచ్చె ఱంకులరాటంబు హెచ్చె లాట
రీలు మఱి బొమ్మలాటలు చాలఁ గలిగె
రెండె కనులాట చాలక యుండె నాకు.

పండ్లయంగడులును బలుమిఠాయంగళ్లు
నాటవేడ్కబొమ్మలంగడులును
నిండఁగా బజారు మెండయ్యె మావీటి
చెలువుకట్టయయ్యె నరులపుట్ట.

చుట్టుప్రక్కల నున్నట్టి చుట్టములును
పక్కములు వచ్చి రది యొక్కలెక్క కాదు
దూరదేశమ్మునందుండి దూరబంధు
వారమును వచ్చె నాయుత్సవమ్ముకొఱకు.

వింతవింతలు వెలసెను వేడ్క గొల్పె
స్వామికల్యాణ మెందఱో జాతివారు
వచ్చి రింకేమొ జరగె నావార్త లిపుడు
చిత్తఫలకంబుపై నాకుఁ జెఱిగిపోయె.

* * *

సందడి తగ్గుచుండెను బ
జల్ తమతావుల కేఁగుచుండి రూ
రందము మాఱుచుండె ముగి
యంగల వంగళు లన్నవార్త విం
టిం దొర యెక్కు వయ్యె జన
నిం జనకుం గడు గోఁజులాడితిన్
ముందుగ లెక్కవెట్టితిని
ముచ్చట గొల్పిన వస్తుజాతమున్.

సాయంకాలము కొన్ని రూప్యములు చే
సంధించి మాతండ్రి యే
మోయీ! నాయన! నీవు గోరినవి యే
వో కొండు రమ్మంచు నన్
హాయం బిచ్చె బజారు కేఁగితిమి
వేడ్కల్ క్రేళ్లు వాఱంగ నే
నాయావస్తులఁ జూపి బేరమును జే
యన్ నాయనన్ వేఁడితిన్.

బేర మడుగు నేను గోరినవస్తువు
లంతె; యందు నొక్కటైనఁ గొనఁడు
కోరనట్టి వేవొ కొనుచుండె నా యాస
లుడుగుచుండె మూతిముడుఁగుచుండె.

చిల్లర మార్చిన డబ్బుల్
కొల్లగ నా చేతి కిచ్చెఁ గొండెక్కితిఁ, బైఁ
జల్లించుచుండె నాచేఁ
జల్లఁగఁ దా విలుచువస్తుజాతము విలువన్.

చేతఁ బట్టి కాల్వ భీతి దీపావళి
బాణసంచు నాకు బాల్యమందు
కాల్చువారిచేయి దాల్చి ప్రమోదింతు
నట్టిముదము నాఁడు పుట్టదయ్యె.

చేటభారతములు పాటలపుస్తకా
లాంధ్రనామసంగ్రహములు పెద్ద
యక్షరముల బాలశిక్షలు నింకేవొ
కలవు గొప్పపుస్తకములగములు.

వాని బేరమాడె మానాన్న పెదపెద్ద
పుస్తకమ్ము లేవొ పుచ్చుకొనియె
"ఆంధ్రనామసంగ్రహము బాలశిక్ష నీ"
కనియె వాని బేర మాడి కొనియె.

కీఁచుకాఁగితములు పిడుకలఁ బోలిన
యట్టు లున్నవాని ముట్టనైతి
ప్రక్కఁ గంటి నొక్క బుక్కులషాపు నేఁ
గానికానిపుస్తకములగముల.

చక్కనైనయచ్చు చిక్కనికాగితాల్
ముచ్చటైనసైజు ముద్దుబైండు
నాకు వేడ్క గొల్పె లూకాసువార్త నేఁ
గోరుకొంటిఁ గాని కొనకపోయె.

* * *

లడ్డు లుల్లిపాయలపకోడులు జిలేబి
జీడిపాఁగు దూదుఫేడ బర్ఫి
ఇట్టి వింక నేవొ తట్టలఁ గలవు నో
రూరి వానిఁ గొనఁగఁ గోరుకొనఁగ.

జాతరకు వండినట్టివి గోఁతకూటి
మిఠాయిలు కొనఁగ నే నిష్టపడను
ఆలనేతితో నీకు మాయమ్మ యింట
వండి పెట్టు నిం కివి కోరకుండు మనియె.

కజ్జిబొగ్గువంటి బాణలి
ముఱికిచమురు పోసి భక్ష్యములు వండుట నీ
వెఱుఁగ వని చూపె నను డ
గ్గఱఁ జేరిచి పిండివంటకంపుంగంపుల్.

మొఱ వెళ్లఁబోసికొంటిం
గొఱకొఱతోఁ గంట నీళ్లు గ్రుక్కితి నైనన్
సరకుగొనఁడాయెఁ దా నా
సరకు గొనండాయె నాకు సంకటమాయెన్.

* * *

దుస్తులఁ గొనెఁ బటములఁ గొనె
పుస్తకములఁగొనియె మంచిబొమ్మలఁగొనెనా
కస్తివిశదైన నేను బ్ర
శస్తముగాఁ దలఁచు వస్తుజాతముఁ గొనమిన్.

నాకు నేనె డబ్బుఁ జేకొని నా కిష్ట
వస్తువులను నిచ్చవచ్చినట్లు
కొనుకొనంగవలయు ననుకొందుఁ గాని యేఁ
గాని నాదుచేతఁ గానరాదు.

లాటరీలు ఱంకురాటమ్ము లిఁక నేను
గోరుకొన్న వేమి గూర్పకుండ
నిల్లు చేర్చి మెల్లమెల్లఁగ నమ్మన
మతిమందు నన్ను మందలించె.

అమ్మ యమ్మలించి యనియెను మాతండ్రి
కోరఁబోకు కాసుకోరికలను
ఏది నీకు హితమొ యెఱిఁగి మానాన్నగార్
తెచ్చినారు వానిఁ బుచ్చుకొనుము.

పుస్తకాలు కొనిరి దుస్తులఁ గొని రాట
వస్తువులను గొనిరి పండ్లు గొనిరి
ఇంట నేను బిండివంటలు వండితి
నెందు కింక నీకుఁ గుందు తండ్రి!

* * *

పెత్తనంబు చేత విత్తంబు గల్గిన
వానికే సుఖంబు గాని, హాయి
కూడు నెట్లు చేతిలో డబ్బు లేకుండు
తల్లిదండ్రుచాటుపిల్లలకును.

ఎప్పుడు నాకుఁ జేత లభి
యించునొ విత్తము; నాయభీష్టపు
జొప్పున భోజ్యవస్తువులు
చొక్కపు వేడుకవస్తువుల్ కొనం
జొప్పడు నెప్పుడో ధనము
శూన్యము;నాయన కానియేనియూ
డెప్పు, డొసంగెనేని యిది
యెగుదుకొ ముందు కనుంగొనుంగదా!

* * *

అమ్మమీఁదఁ గోప మయ్యపయింగోప
మింటిలోని పిండివంటమీఁదఁ
గోప మపుడు నేను గోపస్వరూపుడ
రాత్రి నాకు నిద్ర రాకపోయె. (స. శేషము)

## పల్లవులు

డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, యం.ఏ., పి.హెచ్.డి.

(౫-వ సంపుటము ౭-వ సంచిక తరువాయి)

### 3

పై ప్రకరణమునందు పల్లవవంశవృక్షమును రచించితిమి. ఆవంశజులచరిత్ర మింకను వర్ణింపవలసియున్నది. పల్లవులకు నాగకన్యమూలమున రాజ్యలాభము గలుగుట నింతకుపూర్వమే వచించియున్నాము. అటుపిమ్మటివృత్తాంత మింకను జెప్పవలసియున్నది. దీని కాధారములు పల్లవరాజుల ప్రాకృతసంస్కృతశాసనములే. ఇవిగాక ఆకాలములో పరరాష్ట్రములరాజుల శాసనములందును, గొన్ని పురాతనగ్రంథములయందును పల్లవరాజులవిషయము చెప్పబడియున్నది. అందు ముఖ్యమైనవి.—

౧. సముద్రగుప్తుని యలహాబాదు శిలా స్తంభశాసనము: ఇందు సముద్రగుప్తుడు దక్షిణమునజయించిన రాజ్యములును, తదధిపుల నామములును వర్ణింపబడియున్నవి.

౨. కదంబకకుత్స్థవర్మ్మతాళగుండశాసనము:(ఎ. ఇం. సం. ౬) కదంబరాజ్యస్థాపనను వర్ణించుచున్నది.

౩. ,, మృగేశవర్మ్మ రవివర్మ్మలశాసనములు. (ఇం. ఆం. సం ౬, పుట ౨౪, ౨౫.)

౪. కృష్ణవర్మ్మ(౧) నాటి అణజిశాసనము: (ఎ. కర్నా. సం. ౯, దా. గి. నె. ౧౬౧.) కృష్ణవర్మ్మసైన్యము నెట్లు పల్లవులు హతముచేసినదియు వర్ణించుచున్నది.

౫. పెనుగొండశాసనము: (ఎ. ఇం. సం. ౧౫) గాంగపల్లవరాజులమైత్రిని దెల్పును.

౬. లోకవిభాగము: జైనభూగోళ విషయిక గ్రంథము. మొదటి సింహవర్మ్మకాలమును దెలియజేయుచున్నది.

### వీరకూర్చ మహారాజు

ప్రాచీనపల్లవరాజులలో ప్రథముడు వీరకూర్చరాజు. నాగరాజుకొమార్తెను పెండ్లాడుటచే రాజ్యలాభము గలిగెనని వెలూర్పాళెయపు శాసనము పల్కుచున్నది.

"యః ఫణీన్ద్రసుతయా సహాగ్రహీ
ద్రాజచిహ్న మఖిలం యశోధనః".

దర్శిశాసన మీతడు "స్వబాహుబలార్జ్జితోర్జ్జితక్షాత్రు" డని చెప్పుచున్నది. ఇంతకుమించి యీతనివిషయ మేమియు మనకు దెలియదు. ఇతనికుమారుడగు మొదటిస్కన్దవర్మ్మ యీతని 'బప్పమహారాజ'ని పేర్కొని, "అప్రతిహతశాసను" డనియు, "అనేక హిరణ్యకోటి గోహలశత సహస్రప్రదాత" యనియు జెప్పుచున్నాడు. హలశత సహస్రప్రదానమును గూర్చి డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారి ట్లనుచున్నారు:—

"దీనికి (గోహలశతసహస్ర యనుదానికి) నేమైన నర్థ మున్నచో, నరణ్యమును నరికించి భూమిని వ్యవసాయార్హ మగుదానిగ మార్ప నీరాజు ప్రయత్నముజేసెనని నిస్సంశయముగ సూచించుచున్నది. ఈసందర్భమున నొకవిషయమును గమనింపవలయును. తమిళుల కీదేశము (సాతవాహనాహారము: దత్తమండలము) దండారణ్యమను పేర నెరుకపడియుండినది. ఇదియే సంస్కృతపు దండకారణ్యము. ఇచ్చట పశుపాలనము ముఖ్యోద్యోగము; పశుహరణము ముఖ్యక్రీడ. ఈబప్పదేవుడే యరణ్యమును వ్యవసాయార్హ్మముగజేయ (—ప్రయత్న మెంతవఱకు సఫలమో చెప్పజాలము—) ప్రయత్నము జేసెను. కావున నీరాజు జనులకు మహోపకార మొనర్చెను.



5. 10- 12

ఇక్ష్వాకుప్రభువులను దత్తమండలములో నిజను లింకను స్మరిం చుచున్నారని స్థానికచరిత్రలవల్ల దెలియుచున్నది."

ఈతనిరాజ్యకాలమున పల్లవరాజ్యవిస్తీర్ణ మెంతో ఈతనికుమారుడగు శివస్కన్దవర్మ శాసనములవల్ల నీవిషయమును దెలుసుకొనవచ్చును. సాతవాహనరాష్ట్రము (అనగా ప్రస్తుతదత్తమండలములో గొంతభాగమును, మైసూరుసీమలోని గొంతభాగమును), కఞ్చీపురము (అనగా తొండమండలము), ఆంధ్రపథము (అనగా కృష్ణవఱకుగల యాంధ్రరాజ్యము) పల్లవులకు స్వాధీనముగ నుండెను.

మఱియు నీతనిరాష్ట్రమున కుంతలదేశముగూడ జేరియుండెను. పశ్చిమసముద్రమె పల్లవరాష్ట్రమునకు బడమటిసరిహద్దుగ నుండెను. ఈవిషయమున బండితులు భిన్నాభిప్రాయమును గనుపఱచియున్నారు. వారిలో ప్రముఖుడు ప్రొఫెసరు రాప్సన్ అనునతడు. ప్రస్తుతము మైసూరుసీమలోని షికారిపురతాలూకాయందు మలవళ్లియను గ్రామము గలదు. ఆయూర పురాతనప్రాకృతశాసనములు రెండు చెక్కబడ్డశిలాస్తంభ మొకటి కలదు. అందొకటి, "హారీతిపుత విణ్హుకడ్డచుటిసాతకంణి" యనునతనిది. ఇతఁడు నాగవంశజుడగు నాంధ్రభృత్యరాజు. రెండవది, పేరులేని కదంబరాజుది. ఈ రెండుశాసనములను విమర్శించుచు రాప్సన్ ఇట్లు వ్రాయుచున్నాడు:—

"ఈశాసనము (మొదటిది) ఆగ్రామమందలిదానమును తెల్పుచున్నది. ఇది రాజునకు 'వైజయన్తీపురరాజా' యనుబిరుదు నిచ్చుచున్నది. ఇదే స్తంభముపై నీశాసనమునకు క్రింద వేరొకశాసనము గలదు. అక్షరములనుబట్టి చూడ నిది పైశాసనముకంటె విశేషము పిమ్మటిది గాదు. ఇందువల్ల బనవాసిరాజ్యము (కున్తలము) చుటువంశమువారికడనుండి కదంబులహస్తగత మైనట్లు తెల్లమగుచున్నది." ప్రొఫెసరురాప్స నన్నట్లు కున్తలరాజ్యలక్ష్మి చుటుకులమును విడి తత్క్షణమే కదంబవంశము నాశ్రయించలేదు. మొదటికారణ మేమన, చుటువంశ మంతరించినకాలమున కదంబరాజవంశ ముత్పత్తి కాలేదు. మఱియు కదంబులకు కున్తలరాజ్యప్రాప్తి పల్లవసరపాలుర యనుగ్రహమువలన గలిగినది. ఈవిషయము కదంబరాజవంశమునకు మూలపురుషుడగు మయూరవర్మ మునిమనుమడగు కకుత్స్థవర్మయొక్క తాళగుండశిలాశాసనమువల్ల దెలియుచున్నది. మయూరవర్మకు రాజ్యప్రాప్తిగల్గినవిధమునుగూర్చి యిట్లు చెప్పబడియున్నది:—

సంశ్రిత స్తదా మహీపాలా
నారాధ్య యుద్ధేషు విక్రమైః;
ప్రాపపట్టబంధసంపూజాం
కరపల్లవైః పల్లవైర్ధృతాం.
భంగురోర్మ్మివల్లిత్రైన్ఋత్య
దపరార్ణవాంభః కృతావధిం;
ప్రేహారాన్త మనన్యసఞ్చరణ
సమయస్థితాం భూమి మేవచ.

పైశ్లోకములవల్ల మయూరవర్మ పల్లవరాజుల నాశ్రయించి అనేకయుద్ధములయందు విక్రమము బ్రకటించుటచే వారిప్రసాదమునకు బాత్రుడాయెననియు, దత్కారణమున ప్రేహారము మొదలు పశ్చిమసముద్రము వఱకు గలరాష్ట్రమున కధిపతిని జేసి స్వకరపల్లవములచే నాతనికి పట్టబంధము జేసిరనియు దెలియుచున్నది.

కావున కున్తలము కదంబులకు బూర్వము బల్లవులస్వాధీనమం దుండెననుట స్పష్టము. ఆంధ్రభృత్యులయనంతరము పల్లవులును, పిమ్మట కదంబులును కున్తలముపై రాజ్యముచేసిరి. వీరకూర్చనికాలమున కున్తలము పల్లవుల యేలుబడికి లోనై యుండెననుట నిస్సంశయము. ఒకకున్తలమే కాదు; కొంగుదేశముననైత మాతనియధికారము చెల్లియుండవలయును. కావున నాతఁడు భార్యమూలమున లబ్ధమైన ఆంధ్రసామ్రాజ్యపు దక్షిణార్థమున కధిపతియై యుండెను. రాజధాని కంచి.

## (శివ)స్కన్దవర్మ

(క్రీ. శ. ౩౧౦—౩౩౫)

శివస్కన్దవర్మ వీరకూర్చనిపుత్రుడని యింతకు పూర్వమే చెప్పియున్నాము. ఇతనివి రెండు... శాసన

ములు దొరకినవి. అందు మొదటిది మైదవోలుశాసనము. ఇది శివస్కన్దవర్మ యువరాజుగ నున్నకాలమున నిచ్చినది.

"యువమహారాజో భారదాయసగోత్తో
పలవానాం శివఖ[ం]దవమ్మో."

ఇది బప్ప లేక వీరకూర్చ మహారాజు ౧౦వ రాజ్యవర్షమున నొసగబడెను అని మైదవోలు శాసనమున నున్నది.

రెండవది, హీరహడగల్లి శాసనము. ఇదిరాజైన పిమ్మట ౮వ రాజ్యవర్షమున నిచ్చినది. రాజు తన్నుగురించి యిట్లు చెప్పుకొనియున్నాడు:—

"అగ్గిథోమ వాజపేయాస్సమేధయాజీ ధమ్మ
మహారాజాధిరాజో భారద్దాయోపల్లవా
ణ సివఖందవమో."

ఈరెండు శాసనములు గాక యాతనిరాజ్యకాలమున నివ్వబడిన శాసన మొకటి కలదు. దీనిని చారుదేవి యొక్క గుంటూరుమండలశాసన మందురు. ఈమె (విజయ)స్కన్ధవర్మయొక్క పుత్రుడును, యువమహారాజును నగు విజయబుద్ధవర్మయొక్క భార్య. ఈదంపతులకు "కుర" శబ్దాంతనామధేయు డగు పుత్రుడొక డుండెను. వానిపేరు బుద్ధ్యాంకురయని హూల్షుగారనిరి. శాసనదాత్రి యువమహారాజ్ఞి యగుటచే నప్పటికి యువమహారాజు బ్రదికియుండెనా యను సంశయము గలుగుచున్నది. ఇది నిజమైనను కాకపోయినను బుద్ధవర్మ శివస్కన్దవర్మ ప్రథమపుత్రు డనుట నిజము. దీని కితడు యౌవరాజ్యపట్టాభిషిక్తు డగుటయే సాక్ష్యము. ప్రాచీన పల్లవరాజులు దమ ప్రథమపుత్రునిగాని, సోదరునిగాని యౌవరాజ్యమున కభిషిక్తునిగ జేయుచుండినట్లు తోచుచున్నది. శివస్కన్దవర్మ తన తండ్రికాలమున యువరాజుగ నుండెను. అట్లే బుద్ధవర్మయును, సింహవర్మ రాజ్యకాలమున నాతని సోదరుడు విష్ణుగోపుడు రాజుగ నుండెను. ఇంతేకాక మహారాజు రాజధానియగు కాఞ్చీపురినుండి పల్లవరాజ్యములోని దక్షిణభాగము నేలుచుండెను. ఉత్తరార్ధము యువమహారాజు నేలుబడియం దుండెననుట స్పష్టము. శివస్కన్దవర్మ యువరాజుగ నున్నప్పుడు ఆంధ్రపథమునందలి వీరిపరగ్రామమును దానముసేయుచు ధాన్యకటకములోని తనవ్యాపృతుని కడి యొలుకపఱచెను. యువరాజగుబుద్ధవర్మభార్యయగు చారుదేవి దాలూరునందలి విష్ణుదేవాలయమునకు భూదానమునుజేసి తద్వర్తమానమును "కడక", అనగా ధాన్యకటమునందలి యధికారి కెఱుకపఱచెను. తరువాతి కాలమున సింహవర్మ యనుజుడగు విష్ణుగోపవర్మయు, తద్వంశజులును ప్రస్తుతపు నెల్లూరు గుంటూరు మండల సంగమ ప్రాంతములలోని దశనపుర, పలక్కద, తాంబ్రాప యను స్థలములనుండి పల్లవరాజ్యపు టుత్తరార్ధముపై ప్రభుత్వము సేయుచుండిరి. ఈయుదాహరణములవల్ల పల్లవ యువరాజులు పల్లవసామ్రాజ్యములోని యుత్తరవిషయముల కధిపతులై యుండిరని తేలుచున్నది.

శివస్కందవర్మ కాలమున బల్లవరాజ్యవిస్తీర్ణమునుగూర్చి యిదివఱకే చెప్పియున్నాము. ఈతనిశాసనములు ఈతడు అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ యాగములను జేసెనని చెప్పుచున్నవి. కడపటియాగము దిగ్విజేతలును,సామ్రాజ్యపట్టభద్రులును నగు రాజులేచేయదగినది, తదితరుల కసాధ్యము. కావున నీతడు మహాశూరుడై రాజ్యములను గెల్చినట్లు తోచుచున్నది. ఈతడు జయించినరాజ్యము లెవ్వియో, రాజు లెవ్వరో తెలియదు. అయినను వేలూర్పాళెయపు శాసనమున స్కందశిష్యుడు, అనగా స్కన్దవర్మ సత్యసేను డనురాజును జయించి, బ్రాహ్మణఘటికను దీసికొన్నట్లు చెప్పబడియున్నది:

"అన్వవాయనభశ్చన్ద్రః
స్కాన్దశిష్య స్తతో భవ;
ద్విజానాం ఘటికాం రాజ్ఞ
స్సత్యసేనాజ్జహార యః.—"

ఈసత్యసేను డెవ్వడో తెలియరాదు. డాక్టరుకృష్ణస్వామి అయ్యంగా రీతడు శాత్రపుడగు స్వామి

సత్యసింహు(సేను)డే యనుచున్నారు. కాని యది నిజము గాదు.

అప్పటి రాజ్యపరిపాలనవిధానము శివస్కన్దవర్మశాసనములవల్ల కొంత దెలియుచున్నది. సర్వాధికారమును రాజునందే యుండెను. రాజ్యపాలనమున రాజునకు యువరాజు తోడ్పడుచుండెను. రాజు నిరంకుశుడు గాడు. రాజధానియందు మంత్రాంగసభ యొక్కటి యుండెను. ఈసభవారి యిష్టానుసారము వర్తించినను లేకున్నను వారియభిప్రాయములను ముఖ్యవిషయములయందడుగుట రాజున కాచారమని తోచెడిని. ఈమంత్రాంగసభలో సభ్యత్వమున కెవ్వ రర్హులో చెప్పుటకు వీలులేదు. హీరహడగల్లి శాసనముప్రకారము కొలివాల గ్రామభోజకుడు భట్టిసమ్మ యీసభకు జేరిన సభ్యుడు.

"కొలభోజకస రహసాధికత భట్టిసమ్మస"

యని శాసనము. ఇంతమాత్రముననే భోజకు (అనగా యినాందారు)లకు మంత్రాంగసభలో సభ్యత్వము తమభోజకత్వమువల్ల లభించెడివని తలపరాదు. భట్టిశర్మ బ్రాహ్మణుడు. ఈతనిబ్రాహ్మణత్వమువలననే యీతడు రహస్యాధికృతు డయ్యెనని గ్రహించవలయును. పూర్వపుక్షత్రియులసభలయందుబోలె పల్లవరాజులసభలయందు మంత్రిరాజకుమారుల తోపాటు బ్రాహ్మణులు గూడ మంత్రము జెప్పుచుండుట యాచారము.

పాలనసౌకర్యార్థమై పల్లవరాజ్యము రాష్ట్రములుగ విభజింపబడియుండెను: సాతవాహనరాష్ట్రము, ఆంధ్రపథము, ముండకరాష్ట్రము, కర్మరాష్ట్రము ఇత్యాదులు. ఈరాష్ట్రములపై నధిపతులను రాజేర్పఱచుచుండెను. ఇందు కొందఱు రాజకుటుంబమునకు సంబంధించినవారు; తక్కినవారు సామాన్యులు. ప్రతిరాష్ట్రమును మాడంబము లనుపేరుగల భాగములుగ మరల విభజింపబడి యుండెను. మాడంబమున కధిపతి మాడంబికుడు, లేక మాడబికుడను పేరుగల యధికారి. వీరుగాక స్థానికాధికారులును, గ్రామాధికారులును గూడ నుండిరి. హీరహడగల్లి శాసనమున నింకననేకులు రాజభృత్యులు పేర్కొనబడియున్నారు: పల్లవులు, గోవల్లవులు, అమాత్యులు, ఆరక్షకాధికృతులు, తిథూకులు, నైయోగికులు మొదలగువారు. ఈయుద్యోగస్థులనామములను, పరిపాలనావిధానమును జర్చించునపు కౌటిలీయార్థశాస్త్రమునందును, నశోకుని శిలాశాసనములలోను వర్ణింపబడిన మౌర్యసామ్రాజ్యపు కట్టుదిట్టములు జ్ఞప్తికివచ్చును. పినాకినిపర్యంతము వ్యాపించియుండు దక్షిణదేశము అశోకచక్రవర్తికాలమున మౌర్యులయేలుబడికి లోనైయుండుట సుప్రసిద్ధమైనవిషయమే. తదనంతర మాంధ్రరాజుల కాలమున పరిపాలన పద్ధతులు మారక పల్లవులకాలము వఱకట్లే యుండినట్లు తోచెడిని.

శివస్కందవర్మకాలమున జను లెంతసుఖ మనుభవించిరో తెలియదు. అయినను వారిపై విధింపబడిన పన్నులను జూడ వారు విశేషసుఖ మనుభవించిరని తలంచుట కవకాశము లేదు. పన్నులను రాజున కిచ్చుటయేకాక రాజభృత్యు లగు నధికారులకు పాలు మజ్జిగలను సరపరా చేయవలసి యుండెను. ఉప్పు పంచదారలమీదిపన్నును సర్కారునకు చెల్లించవలసి యుండెను. అంజీపను లధికారుల యిష్టప్రకారము చేయవలసి యుండెను. అధికారులు గ్రామస్థులకడనుండి పచ్చిక, కలప, పశువులు, పండ్లు, పుష్పములును గొనుట యాచారమైయుండెను. ఇట్లు జనులు సర్కారువారి కియ్యవలసిన పన్నులకుగాని, చేయవలసిన చాకిరులకుగాని "బాధ" లని పేరు. ఇటువంటిబాధలు పదునెనిమిది. వీనియందొక్కటి ప్రజల నుపద్రవించుచున్నట్లు తోచెడి. సంచరింతల (సిపాయీల) వల్ల బాధ విశేషముగ నుండెడిది. వీ రిచ్చవచ్చినట్లు రాజ్యమునం దంతటను సంచరించుచు జనులను బాధించెడివారు. సంచరింతలవలె గూఢపురుషులు రాజ్యమంతటను సంచరించెడివారు. గూఢపురుషుల స్వభావ మెఱింగిన మనతరమువారికి వారివల్లగల్గు నుపద్రవ మిట్టిదని వర్ణింప నవసరము లేదుగదా.

## కాంచీపురము : ప్రాచీనపల్లవరాజధాని

బప్పదేవుడు లేక వీరకూర్చవర్మ యొక్క రాజ్యకాలమునుండియు పల్లవులకు రాజధాని కాంచీపురము. మైదవోలుశాసనము కాంచీపురమున నివ్వబడినది.

"కాంచీపురాతో యువమహారాజో భార
దాయసగొత్తో పలవానం సివఖందవ
మ్మో ధంఞకడే వాప్తం ఆణపయతి"

యని శాసనము. ఇందువల్ల శివస్కందవర్మ యువ రాజుగ నున్నప్పుడు కంచి పల్లవులరాజధాని యగుట స్పష్టము. అట్లే హిరహడగల్లి శాసనమునను

"కాంచీపురా అగ్గిత్థోమ వాజపేయాస్స
మేధయాజీ ధమ్మ మహారాజాధి రాజో
భారద్దాయో పల్లవాణ శివఖందవమ్మో"

యని చెప్పబడియున్నది. కావున శివస్కన్దవర్మరాజ ధానియు కాంచీపురమేయని స్పష్టము. పల్లవరాజ్య ముత్పన్నమైనదిమొదలు వారికి కాంచీపురమే రాజధాని.

## విష్ణుగోపుడు (335–360)

శివస్కన్దవర్మ యనంతరము పల్లవరాజ్యాధి పత్య మెవ్వరు వహించినదియు నిశ్చయించి చెప్పటకు వీలు గాదు. శాసనములును అనేకసందేహముల కాస్పదము లగుచున్నవి. ఇంతకుపూర్వము నాచే నిర్ణయింపబడిన కాలనిర్ణయపట్టికను బట్టి శివస్కన్దవర్మ గుప్తచక్ర వర్తియగు మొదటిచంద్రగుప్తునకు (310-330) కొంచె మించుమించుగ సమకాలీను డగుచున్నాడు. మొదటిచం ద్రగుప్తునియనంతర మాతనిపుత్రుడు సముద్రగుప్తుడు చక్ర వర్తి యాయెను. ఇతడు దిగ్విజేత. దక్షిణదిక్కుపై దండు వెడలి తూర్పుసముద్రతీరమున బ్రభుత్వము సేయుచున్న రాజుల నదిమి కప్పముగొని, యుత్తరాపథనృపాలు రను నిర్మూలముగావించి, యశ్వమేధయాగము నొనర్చి, మహా రాజాధిరాజపదమును బడసెనని హరిసేనకృతమగు నలహా బాదు శిలాస్తంభశాసనము వల్కుచున్నది. హరిసేనుడు ప్రశస్తియందు సముద్రగుప్తునిచే బరిభవింపబడిన రాజు లను, వారిరాజ్యములను చేర్కొనియున్నాడు. వా రెవ్వరన్న:

| | |
|---|---|
| ౧. కోసలరాజు | మహేంద్రుడు. |
| ౨. మహాకాంతారాధిపుడు | వ్యాఘ్రరాజు. |
| ౩. కౌరాళకనృపాలుడు | మంతరాజు. |
| ౪. పిష్టపురీశ్వరుడు | మహేంద్రుడు. |
| ౫. కొట్టూరునరపతి | స్వామిదత్తుడు. |
| ౬. ఏరండపల్లి రాజు | దమనుడు. |
| ౭. కంచిరాజు | విష్ణుగోపుడు. |
| ౮. అవముక్తాధిపుడు | నీలరాజు. |
| ౯. వేంగీశ్వరుడు | హస్తివర్మ. |
| ౧౦. పాలకరాజు | ఉగ్రసేనుడు. |
| ౧౧. దైవరాష్ట్రనాథుడు | కుబేరుడు. |
| ౧౨. కుస్థలపురరాజు | ధనంజయుడు. |

ఈరాజులను సముద్రగుప్తుడు బద్ధులనుగ జేసి పిమ్మట విడిచెను. ఈరాజ్యము లుండినస్థలములు దెలి యకపోవుటచే సముద్రగుప్తుడు కేరళపర్యంతముగల దక్షిణదేశమును జయించెనన్న భ్రమయొక్కటి కలిగెను. కాని యిటీవల దుబ్రాయలుగారి పరిశ్రమలవల్ల సము ద్రగుప్తుని దండయాత్ర తూర్పుసముద్రతీరదేశములపై గృష్ణానది యుత్తరపుటొడ్డువఱకు వ్యాపించెనని తేలుచు న్నది. గుప్తపల్లవసైన్యములు కృష్ణ కావలియొడ్డున నే తారసిల్లె ననియు, సముద్రగుప్తునకే పరాజయము గలుగు టచే యచ్చటినుండియే వెనుకకు దరలెననియు దుబ్రా య లనుచున్నాడు. దీనికి శాసనస్థమగు నాధార మెద్దియు లేదు. అట్టియాధారమును గల్పింప సమకట్టి ఆర్. సుబ్బారావుగారు సాలంకాయనరాజగు మొదటి నంది వర్మ పెదవేగి శాసనములోని

"విజయవేంగీపురానైక సమరవాప్తవిజయి
నో హస్తివర్మ మహారాజస్య"

యన్నవాక్యము నాధారపఱచుకొని, హస్తివర్మయే సముద్రగుప్తుని గెల్చెనన్న భావమును సూచించిరి. (ఇచ్చట విజయశబ్దము శుభసూచకము.) దీని కంతకంటె విశేషా ర్థ మున్నట్లగపడదు. విజయకాంచీపుర, విజయదశనపుర, విజయపలక్కడలలోని 'విజయ'శబ్దమున కేయర్థముగలదో ఆయర్థమే 'విజయవేంగీపురము'లోని 'విజయ' శబ్దమున కును కలదని నాభావము. అట్లుగాక 'విజయ' శబ్దము జయమును దెల్పునదేయని వాదమునకై యొప్పుకొన్నన్ను

హ స్తివర్మ సముద్రగుప్త నోడించెననుట కది యెట్లాధారము కాగలదు?

వాస్తవము విచారించిన సముద్రగుప్తుడు కృష్ణను దాటినట్లే తోచుచున్నది. కంచిరాజగు విష్ణుగోపుని మాత్రమేకాక పాలకరాజగు నుగ్రసేనునిగూడ జయించిన ట్లున్నది. పాలక (పాలక్కడ) యనునది కృష్ణకు దక్షిణదేశమున నున్న పల్లవముఖ్యపట్టణములలో నొకటి. కావున పాలకరాజు పల్లవుల సామంతుడనుట నిజము. కంచివిష్ణుగోపుని జెప్పి పాలకయుగ్రసేనుని జెప్పుటచే సముద్రగుప్తుడు వారితో వేరువేరుగ యుద్ధము జేసియుండును. పాలకరాజును పాలకపురమననే జయించెనని తోచుచున్నది. భావిపరిశోధనవల్ల గాని నిజము తేలదు.

పైవాదములోని నిజానిజము లెట్లున్నను ఒకవిషయమునుగూర్చి మనము సందేహపడవలసిన యవసరము లేదు. అది యెద్దియన, సముద్రగుప్తుని సమకాలికుడగు పల్లవరాజుపేరు విష్ణుగోపుడనుటయే. అందువల్ల క్రీ. శ. ౪ వ శతాబ్దారంభమున కంచియందు రాజ్యము నేయుచున్న శివస్కన్దవర్మకును, నీతనికిని నేదేసంబంధ ముండవలెననుట నిశ్చయము. ఈబంధుత్వమును నిర్ధారణసేయుట కేశాసనమును దోడ్పడదు. కావున దుబ్రాయ లీతనికొఱకై ౫౧ వర్షము లెడము సంపాదించవలసివచ్చెను. ఒంగోడు (౧) శాసనములోని (మొదటి) కుమారవిష్ణువును చారుదేవి కుమారుడగు బుద్ధ్యాంకురునికి మునిమనుమనిగ జేసి ప్రాకృతసంస్కృతశాసనములమధ్య విష్ణుగోప స్కందవర్మల నిరికించెను. వాయలూరు వెలూర్పాళెయము దశి-శాసనములు వీరకూర్చ డనురాజుండెనని చాటుచున్నను దుబ్రాయ లాతని నామమును స్మరించలేదు. స్మరించియున్న యాతనివాదము డొంకు తప్పియుండెడిది. వాయలూరు శాసనమున వీరకూర్చనామధేయులిద్దరు (౫, ౧౧; గన్పించుచున్నారు. విష్ణుగోపుడు ౭ వ వాడు; అనగా, వానిపేరు పై యిద్దరు వీరకూర్చులమధ్య నున్నది. వెలూర్పాళెయపు శాసనమున పల్లవరాజులలో ప్రథముడు వీరకూర్చుడనియు, తత్పుత్రుడు స్కందశిష్యుడనియు, వాని కొడుకు కుమారవిష్ణువనియు చెప్పబడియున్నది. కా... వీరకూర్చుడు పల్లవరాజులలో గడుప్రాచీనుడని తే... చున్నది. ఈవిషయమును కృష్ణశాస్త్రిగా రొప్పు... న్నారు. పైశాసనములనుబట్టి యాతడు ప్రాకృతశాస... ములకాలమువాడని యొప్పుకొనవలసియున్నది. శివ... మునిమనుమ డిచ్చినదే దశి-శాసనము. దీనిభాష సంస్కృ... తము. వీరకూర్చనికొడుకు శివస్కందవర్మ కాలము... నకు శాసనములభాష ప్రాకృతము. అతనిమనుమనికా... మున సంస్కృతము. ఇట్లు శాసనములభాష రెండుత... ములలో మారిపోయెను. అయితే దశి-శాసన మెప్ప... టిది? ఈప్రశ్నకు సమాధానము చెప్పుట సులభముగాదు. అయినను ప్రయత్నము చేయుదము. పల్లవశాసనములలో బహుపురాతనమైనది హిరహడగల్లి శాసనము. దాని యక్షరములు చక్కగ తీరియుండక యుండుటగాక నానాఘాటు శిలాశాసనాక్షరములను బోలియున్నవి. యువమహారాజు విష్ణుగోపవర్మ యురువపల్లిశాసనము క్రీ. శ. ౪౪౮నం దివ్వబడినది. దీనియక్షరములు చక్కగ తీరియుండుటయేకాక దుబ్రాయలుగా రన్నట్లు ... మైనపెట్టెతలలు గల్గియున్నవి. ఒంగోడు (౧) శాసనములోని లిపి యురువపల్లి లిపికంటె పురాతనమైనదని కృష్ణశాస్త్రిగారు వచించియున్నారు. దశి-శాసనపు టక్షరములను పైశాసనాక్షరములతో బోల్చిచూచి నొక్కవిషయ మందరికిని తప్పక బోధపడగలదు. దశి-శాసనపుటక్షరములు హిరహడగల్లి శాసనాక్షరముల కంటె నవీనముగను, ఒంగోడుకన్న ప్రాచీనముగను ఉరువపల్లి కన్న ప్రాచీనతరముగను గాన్పించుచున్నవి. కావున దశి-శాసనము హిరహడగల్లి ఒంగోడు (౧) శాసనముల మధ్యకాలముదని తెలియుచున్నది. హిరహడగల్లి శాసనదాత వీరకూర్చని కుమారుడగు శివస్కందవర్మ. దశి-శాసనము నిచ్చినవాడీతని మనుమడు. ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపవర్మయొక్క తండ్రియగు వీరవర్మయో, యాతనిసమకాలికుడగు నింకొక పల్లవరాజో దశి-శాసనము నిచ్చియుండవలయును. యు. మ. విష్ణుగోపవర్మయొక్కయు, దత్పుత్రులైన ... లయొక్కయు శాసనములన్నియు దశనపుర పలక్కడ...

శాంగ్రాపలనుండి యివ్వబడియుండుటచేతను, దర్శిశాసనమున 'విజయదశపురాధిష్ఠాన' యని యుండుటచేతను నాశాసనమును యు. మ విష్ణుగోపవర్మయొక్క తాత యగువీరవర్మయే యిచ్చెనని నాతలపు. ఇది నిజమేనిం దర్శిశాసనకాలము నొక తెఱగున గని పెట్టవచ్చును. యు. మ. విష్ణుగోపునియన్నయగు సింహవర్మ ౪౩౬ మొదలు ౪౬౦ వఱకు రాజ్యముచేసెను. అతనితండ్రి స్కందవర్మ ౪౧౦ మొ॥లు ౪౩౬ వఱకును, తాతయగు వీరవర్మ ౩౭౫ మొదలు ౪౧౦ వఱకును రాజ్యముచేసి యుండవలయును. కాబట్టి దర్శిశాసనము ౩౭౫-౪౧౦ మధ్యకాలమున నివ్వబడియుండవలయును. ఈకాలనిర్ణయము సరియైనచో వీరకూర్చుడు క్రీ. శ. ౨౭౫ మొదలు ౩౧౦ వఱకును, శివస్కందవర్మ ౩౧౧ మొ. ౩౫౩ వఱకును రాజ్యపాలనము జేసియుండవలయును. సముద్రగుప్తుని దండయాత్ర దుబ్రాయలు గారు చెప్పినట్లు ౩౪౫-౪౦ ల మధ్య నడచినను శివస్కందవర్మకు దరువాతి కాలముననే నడచియుండవలయును. కావున నేను రచించిన పల్లవవంశావళియందు ప్రయాగశాసనములోని విష్ణుగోపుడు శివస్కందవర్మపుత్రుడై యుండునని శంకించితిని. అయినను చారుదేవిశాసనము శివస్కందవర్మకు బుద్ధవర్మ యనుకుమారుడు యువరాజుండెననియు, నాతనిపుత్రుడు బుద్ధ్యాంకురుడనియు తెల్పుచున్నదిగదా! యువమహారాజగుటచే బుద్ధవర్మ శివస్కన్దవర్మయొక్క జ్యేష్ఠపుత్రు డనుట నిజము. అయినను వాయలూరు శాసనమునందుగాని, వేలూర్పాళెపు శాసనమునగాని స్కన్దవర్మయనంతరము బుద్ధవర్మగాని, బుద్ధ్యాంకురుడుగాని రాజ్యమునకు వచ్చినట్లు చెప్పలేదు. ఒకవేళ ఏకారణముచేతనైనను బుద్ధవర్మ తండ్రికిపూర్వము మృతినందగా నతనికుమారుడు బుద్ధ్యాంకురుడే శివస్కన్దవర్మకు పిమ్మట రాజ్యాభిషిక్తుడై యుండవచ్చును. బుద్ధ్యాంకుర యనునది బిరుదని యంద రొప్పుకొన్న విషయమే. ఇతని పేరు వాస్తవముగ విష్ణుగోపుడై యుండవచ్చును. యుద్ధముననో, మరియొక విధముననో విష్ణుగోపబుద్ధ్యాంకురుడు మరణమంద, నాతనిపినతండ్రి మొదటికుమారవిష్ణువు కంచిరాజ్యమున కధిపతియై యుండవచ్చును. శాసనములలోని రాజులు తమ పితృ పితామహ ప్రపితామహులనే పేర్కొను నాచారమును బాటించువారగుటచే ఈవిష్ణుగోపుని స్మరింపరైరి.

డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపుడే సముద్రగుప్తునితో బోరాడిన విష్ణుగోపు డనుచున్నాడు. ఇది సాధ్యము గాదు. కారణ మేమన 'లోకవిభాగ'మను జైనభూగోళగ్రంథము వలన కంచిరాజగు సింహవర్మ (యు. మ. . విష్ణుగోపునియన్న) శ. ౩౫౮, అనగా క్రీ. శ. ౪౩౬ న రాజ్యాధిపత్యమును వహించినట్లు తెలియవచ్చుచున్నది కావున యు.మ. విష్ణుగోపున కొకశతాబ్దమునకు బూర్వమే సముద్రగుప్తుని దండయాత్ర నడచెను. అందువల్ల యు. మ. విష్ణుగోపుడు సముద్రగుప్తుని సమకాలీనుడనువాదము నిలువజాలదు. మనప్రస్తుత చరిత్రజ్ఞానమును బట్టి చూడ యు. మ. విష్ణుగోపునకు పూర్వ మింకొక విష్ణుగోపుడు రాజ్యము జేసిన ట్లగపడుచున్నది. నిజము భావిపరిశోధనవల్ల గాని బయల్పడదు.

శివస్కందవర్మకు దరువాతి కాలమున బల్లవరాజ్యమున గొంత యల్లకల్లోల ముండినట్లు గాన్పించుచున్నది. శివస్కందవర్మకాలమున కాంచీపురము పల్లవరాజధాని యనుట నిరూపింపబడెనుగదా! వేలూర్పాళెయపు శాసనము నిజముపల్కుచుండు పక్షమున కుమారవిష్ణువు రాజ్యాభిషిక్తుడైనప్పుడు కంచి పల్లవుల స్వాధీనమందు లేదనుట నిజము. వేలూర్పాళెయపుశాసనమందిట్లున్నది:—

"గృహీతకాఞ్చీనగర స్తతో౽భూ
త్కుమారవిష్ణు స్సమరేషు జిష్ణుః."

కావున కుమారవిష్ణునికి పూర్వము కంచి పరహస్తగత మైనదనుట నిజము. అయితే కంచిని పల్లవుల కడనుండి యొడిచికొన్న శత్రువు లెవ్వరు? ఈసంశయమును పైశాసనమే నివారించుచున్నది:

"భర్త్రా భువో౽భూ దథ బుద్ధవర్మా
య శ్చోళసైన్యార్ణవ బాడబాగ్నిః."

అనుటచే నీప్రాంతములయందు బల్లవులతో బోరాడుచుండిన శత్రువులు చోళులనుట తెల్లము. కావున కుమారవిష్ణునికి పూర్వము కంచిని గెల్చినవారు చోళరాజులై యుండవలయును. ఇందువల్ల శివస్కందవర్మయనంతరము పల్లవరాజ్యమున నల్లకల్లోలము గల్గినదనుట నిజము.

సముద్రగుప్తుని దండయాత్రవల్ల పల్లవరాజుల బలమును, యశమును గొంతవఱకును క్షీణించియుండవలయును. ఈకాలముననే కదంబవంశస్థాపకుడగు మయూరశర్మయు పల్లవరాజుల నెదుర్కొని యుండవలయును. ఈతని విషయము తాళగుండశాసనమున చక్కగ వర్ణింపబడియున్నది.

హారీతిపుత్రులును, మానవ్యసఋషి గోత్రజులును, వేదాధ్యయనసంపన్నులును, సద్గుణోపేతులును నగు బ్రాహ్మణులకుటుంబ మొకటి యుండెను. "వివిధయజ్ఞావభృథ పుణ్యజలములయందు పలుమారు తడిసిన సిగలు గలవారును; ప్రవచనావగాహననిష్ణాతులును; విధిప్రకారము సమిగ్గల నగ్నియందు హోమముచేసినవారును; సోమపానము జేసినవారును; ప్రణవపూర్వకముగ నారువిధముల వేదమును పఠించు వారి కంఠస్వరములచే మారుమ్రోగు గృహాంతరాళము గలవారును; చాతుర్మాస్యము, హోమము, ఇష్టి, పశుబంధము, పౌర్ణమాస్యశ్రాద్ధపాష్టిక క్రియలను జేయువారును; అతిథులచే నిరత మాశ్రయింపబడినదియు, సవనత్రయములు సేయని దినము లేనిదియు నగు వసతిగలవారును-నగు నీబ్రాహ్మణుల గృహసమీపప్రదేశమున వికసించినపుష్పములచే నిండినకదంబపాదప మొక్కటి యుండెను. వారీవృక్షమును పెంచుట చేత వారి కాచెట్టుతోడి 'సానామ్య' 'సాధర్మ్యము'లు గలిగి యచ్చటివారిచే కదంబులని పిలువబడిరి.

ఇట్టికదంబులవంశమున శ్రీమంతుడును, శ్రుతశీలశౌచాద్యలంకృతుడును, మయూరశర్మాభిధుడును నగు ద్విజోత్తము డొక్కడు పుట్టెను. అతడు ప్రవచనమును సర్వమును జదువగోరి తనయుపాధ్యాయు డగు వీరవర్మ్మతోగూడ పల్లవేంద్రునిపురికిపోయి తర్కణాసుడై ఘటికను బ్రవేశించెను. అచ్చట పల్లవాశ్వసంస్థయందు గలిగిన తీవ్రమగు కలహముచే రోషితుడై, 'అక్కటా! ఈ కలియుగమందు క్షత్త్రియులకంటె బ్రాహ్మణులెంతసత్వహీనులై యున్నారు! గురుకులమును చక్కగ నారాధించుచు, స్వశాఖను బ్రయత్నముతో బఠించినవానికిసైతము బ్రహ్మసిద్ధియగుట నృపాధీనమైన నంటప మించినదుఃఖ మేమి కలదు?' అని చింతించి, భూమిని జయింపగోరి, కుశసమిద్ద్రుపత్స్రుగాజ్య చరుగ్రహణమునకు దగినహస్తముచేత మండుచున్న ఖడ్గము నొరనుండి పెరికెను. పల్లవేంద్రుని యంతపాలురను సత్వరముగ నోడించి శ్రీపర్వతద్వారమువఱకు వ్యాపించియుండు నరణ్యదేశమును స్వాధీనపఱచుకొనెను. బృహద్బాణప్రముఖబహురాజమండలముల నదిమి కప్పము గొనుటచే పల్లవేంద్రుని కనుబొమలముడికి గారణభూతుడై ముసింపబడిన స్వప్రతిజ్ఞావ్రతమును, సులభముగ ప్రాప్తమైన కృతార్థత్వమును సముత్థాపిత యుద్ధయాత్రతోడ భూషణములై చెలగ నాతడు విరాజిల్లెను. శత్రువులగు కంచిరాజులు బలముతో యుద్ధము సేయుటకు పలుమారాతనిపైకి రాగా, వారిసేనాసాగరముపై రాత్రులయందు విషమదేశములయందు బయనము సల్పునప్పుడుగాని, విశ్రమించినప్పుడుగాని, అవస్కన్ద భూములయందుగాని, డేగవలె మహాతీవ్రముగ దాకి, ప్రహరించుచు, వచ్చినకష్టములను చేత నున్నకత్తినే తోడుగ గొని యోర్చుకొనుచుండెను. పల్లవేంద్రు లాతనిశక్తిప్రతాపములను, వంశమును గనుగొని యట్టివానికి హానిసేయుట శ్రేయము గాదని తలచి సత్వరముగా నాతని మిత్రునిగ జేకొనిరి. అంతట నారాజులకొలువునందు జేరి, యనేకయుద్ధములయందు స్వపరాక్రమమును బ్రకటించి వారిని సంతోషపఱచి, పల్లవులకరపల్లవములచే సంపూజితమైన పట్టబంధమును బొందెను. దానితోగూడ వల్గితరీతి నృత్యము సేయు వంకరయలలుగల పశ్చిమసముద్రతీరము నుండి ప్రేహారము వఱకు గలదేశమును బడసెను."

తాళగుండశాసనములో వర్ణింపబడిన కదంబవంశోత్పత్తిక్రమము విశ్వాసార్హమైనదని యందరు నొప్పు



౫. జలోహ్ఖానా లేక హుసేనాబాద్ ద్వారము-లక్నో



త్యాగరాజమహోత్సవము (12-2-28), సింగరేణి కాలియరు్స

పంపినవారు: శ్రీ వేమగంటి వెంకటకృష్ణారావుగారు, ఖమ్మంమెట్టు, నైజాం.

కొన్ని విషయమే. అయినను ఆశాసనములోని కొన్ని విషయముల నీసందర్భమున జర్చింపవలసియున్నది.

౧. మయూరశర్మ పర్వతసానుభూములను జేరి, బృహద్బాణాది పల్లవసామంతరాజులకడనుండి కప్పము గైకొనెనని శాసనము చెప్పుచున్నది. ఇందువల్ల మయూర శర్మకు లోబడి బృహద్బాణాదిరాజు లాతనికి బ్రాపై నిలిచిరనుట తెల్లము. మయూర శర్మచే సముత్థాపన మైన తిరుగుబాటు బలీయమైనదనుట నిస్సంశయము. కావుననే పల్లవేంద్రు డీతిరుగుబాటు నణగద్రొక్కుటకు పలుమారులు దండెత్తి రావలసివచ్చెను. ఇది

"అభియయుక్తయా గతేషు
భృశం కాంచీనరేంద్రే ష్వబాతిషు"

అన్న శాసనవాక్యమువల్ల నిర్ధారితము. అట్లు వచ్చిన సైన్యములను నిర్జించుచు పల్లవరాష్ట్రముపై దండెత్తిపోవు చుండెనని

"విషమదేశప్రయాణసంవేశ రజనీ ప్రవ స్కందభూమిషు ప్రాప్య సేనాసాగరం తేషాం ప్రాహార్బలీ శ్యేనవత్తదా"

యన్న వాక్యములవల్లను,

"బలవద్యాత్రా సముత్థాపనేనచ"

యన్నమాటలవల్లను విదితమగుచున్నది. ఈవిషయముల నన్నిటిని చక్కగా నాలోచించి చూడ, పల్లవరాజులు మయూరశర్మను లోబరచుకొనుటకై యనేక ప్రయత్నములు చాలకాలమువఱకు జేయుచుండిరని తోచుచున్నది.

౨. ఇట్లు పోరాడుచున్న మయూరశర్మను జయలక్ష్మి నిరంతరము వరించియుండెనని చెప్పుట కవకాశము లేదు. అతడు నిరంతరము జేతయగుటయే వాస్తవమేని పల్లవులతో సంధి కేల నొడంబడవలయును.? ఆసంధిసమయము లెట్టివి? మయూరశర్మ పల్లవులకు లొంగిన, వా రీతనికి సేనాధిపత్యము నిచ్చుట కంగీకరించిరి. మయూరు డందుల కొప్పుకొని పల్లవసేనాధిపత్యము వహించెను. కావున నాతడు పల్లవులచే పరాజితుడై జయముపై నాస విడిచెను. పల్లవరాజుల కట్టి శూరుని కింక నుపద్రవము గలుగజేసిన దమకు ముప్పు వాటిల్లునను సంశయము గలుగుటచేత నాతనితో సంధి చేసుకొనిరి.

౩. అనేకులు చరిత్రకారులు తాళగుండశాసన మందలి కదంబోత్పత్తికథనము నాశ్రయించుకొని, మయూరశర్మ పల్లవులను సంపూర్ణముగ జయించి స్వతంత్రరాజ్యమును స్థాపించినట్లు వ్రాసియున్నారు. కాని యిట్టివ్రాతల కేయాధారమును గానరాదు. శాసనమున నిట్లున్నది:—

"సంశ్రిత స్తదా మహీపాలా
నారాధ్య యుద్ధేషు విక్రమైః;
ప్రాప పట్టబంధసంపూజాం
కరపల్లవైః పల్లవై ర్ధృతామ్."

పల్లవులను సంపూర్ణముగ జయించియే యుండిన యెడల వారి నాశ్రయించుట యేల? వారికొలువున జేరి యుద్ధమున స్వవిక్రమప్రకటనముచే వారి నారాధించుట యేల? ఇట్లు పల్లవుల నారాధించుట వల్లగదా పట్టబంధప్రాప్తియును, సపరార్ణవప్రేహారమధ్యదేశలాభమును గల్గినది? బంటుచేసిన యూడిగమునకు మెచ్చుకొన్న రాజు బంటును సామంతుని జేయుట సహజముగాని స్వతంత్రునిగ జేసి తనరాజ్యమును బంచియిచ్చుట నెచ్చటను వినియుండలేదు.

మఱియు నైశాసనమున కకుత్స్థవర్మ తాను 'కదంబసేనానీ బృహదాన్వయవ్యోమచంద్రము' డనని చెప్పుకొనియున్నాడు. కావున, మయూరశర్మయు, నతని తరువాతి కదంబరాజులును పల్లవసేనానులేకాని స్వతంత్రరాజులు గారు. ఇందువల్లనే తరువాతికాలమున పల్లవరాజులు కదంబరాజ్యవిషయములందు పలుమారు జోక్యము గలిగించుకొనియుండిరి.

కకుత్స్థుని పుత్రుడగు ప్రథమకృష్ణవర్మ పల్లవులచే యుద్ధమున బరాజితు డాయెను. ఈతనికుమారుడు విష్ణువర్మ తన హెబ్బటశాసనమున దాను "శాంతిప

ర్మ మహారాజు పల్లవేంద్రాభిషిక్తుడ" నని చెప్పుకొన్నాడు. విష్ణువర్మయొక్క జ్యేష్ఠపితృపుత్రుడు దాను

తుణ్గగణ్గకులోత్సాసీ పల్లవప్రలయానలః

అని ప్రగల్భములు వల్కియున్నాడు. ఈతని యనుజుడగు రవిపై విష్ణువర్మను నిర్జించి యాతనికి దోడుసనిన చండదండుడను కాంచీశ్వరుని బరిభవించెను.

ఈవిషయముల నన్నిటిని దరచిచూడ గదంబులు పల్లవుల నాశ్రయించియుండిన సామంతరాజులేకాని స్వతంత్రులుగారను విషయము స్థిరపడుచున్నది.

---

# సరస్వతీ శాపఘట్టము

కోమాండూరు కృష్ణమాచార్యులు గారు

(ఆంధ్రహర్ష చరిత్రమునుండి యుద్ధరింపబడినది)

శ్రీనారాయణ నాభిపద్మమధుపశ్రేష్ఠుండు ముల్లోకముల్
వాసం జాలినవేల్పుఁబెద్ద నిగమాభ్యాసైక నిష్ఠుండు గీ
ర్వాణాధీశ వినూత్నరత్నమకుట ప్రాంచత్పదాబ్జుండు ని
త్యానందామృతవార్ధి బ్రహ్మ యొకనాఁ డాత్మీయలోకంబునన్.

భారద్వాజ వసిష్ఠ కాశ్యపముఖ బ్రహ్మర్షి దేవర్షి సం
వారంబుల్ గొలువన్ విశుద్ధధవళాబ్జాతోరుపీఠంబునం
దారోహించి ప్రజాపతుల్ మునులు బ్రహ్మాఖ్యానముల్ సల్ప లో
కారాధ్యుండు తదేకసంశ్రవణ దీక్షాసక్తుఁడై యుండఁగన్.

కొందఱు ఋక్కులన్ మునులు కొందఱు సామములన్ యజుస్సులన్
గొందఱు కల్పసూత్రములఁ గొందఱు యజ్ఞవిధానవిద్యలన్
గొంద ఱశేషనైగమిక గూఢ మహార్థములన్ వచింప వా
రందఱిలోన నత్రిసుతుఁ డాగ్రహచిత్తుఁడు మందపాలుతోన్.

కలహముఁ బెంచి రోషరయ గద్గదకంఠ కఠోరనాద మా
ప్రలయ మహోగ్రభైరవ రవప్రతిమంబుగ సామగానమున్

సలుప నపస్వరంబు మునిసత్తము లెల్ల వినంగఁ దోఁచినన్
బలుకక యూరకుండిరి సభాసదు లందఱు శాపభీతులై.

అపుడు కుమారివాణి కమలాసనుఁ జామర మెత్తి వీచుచున్
జపలకటాక్షమాలికలు చారుసభాంతర సీమ నిండ న
త్తపసిని జూచి పాటల రదచ్ఛద మించుక విప్పి దిక్తట
ద్వీప కమనీయ దంతఘనదీధితి వెల్వెలఁ బార నవ్వినన్.

భాషాదేవి శుచిస్మితంబుఁ గని దుర్వాసుండు దుర్వార వి
ద్వేష ప్రస్ఫురదోష్ఠపల్లవుఁడు సందీప్తోగ్ర నేత్రుండునై
యోషారత్నము పైని శాపజలముల్ ప్రోక్షింప నిల్వంగఁ ద
ద్రోషార్చుల్ ముఖనాసికాపుటములన్ రూక్షంబులై వెల్వడెన్.

విప్రు సంరంభమును జూచి వేదమాత, దేవిసావిత్రి దుర్వాసుఁ దేరి చూచి
చెడుగ! సామంబుఁ జెఱచియు సిగ్గు లేక, వాణి శపియింతురా యని పల్కుచుండ.

అత్రిముని, పుత్ర! యేల నీయతుల తపము, కోపమున నాశ మొనరింతు కుమతి వగుచు
సకలలోకైక జనని భాషావధూటి, తండ్రి! తిట్టకు మనుచు నదల్చుచుండ.

అకట! వాగ్దేవి శాపార్హ యగునటయ్య, తప్పఁ గావు మటంచు బృందారకులును
కోప ముపసంహరింపుఁడు గురువు లనుచు, వటువులనుగూడి వేఁడ నబ్బడుగుతపసి

ఆ సరసీజయోని మగఁ డన్న మదంబున నిండుకొల్వులో
భూసురు లెల్లఁ జూడ ననుఁ బూరికిఁ గైకొన కిట్లు నవ్వితీ
వోసి దురాత్మురాల, మనుజోర్వి వసింపుము పొమ్మటంచుఁ దా
నీసునఁ దిట్టె లోక జనయిత్రిని బద్మభవుండు భగ్గిలన్.

వేదజనయిత్రి సావిత్రి విప్రునకును, మరలఁ బ్రతిశాప మీయఁ గమండలంబు
పాణిపుటమున ధరియింపఁ బరమసాధ్వి, పద్మజునిరాణి వారించి పలికె నిట్లు.

చెలియరో! తాపసోత్తములు చిత్తమునం దొకతెంపు నేసి తా
మలిగిన నల్గ నిమ్ము సకలాగమ తత్త్వరహస్య మాత వీ

వలిగిన లోకముల్ నిలుచు నమ్మ, ద్విజన్ములు జాతి మాత్ర మా
న్యులుగద శాంతిఁ బొందుము మహోదధి వేల నతిక్రమించునే.

ఇట్లు సముచిత భాషణంబుల భాషాయోషకు పితయగు సావిత్రి ననునయించు చున్న సమయంబున.

శాపావసాన సంజాత సభాక్షోభ మబ్జాసనుండు హస్తాంచలమున
వారించి మధురగంభీర స్వరంబునఁ బ్రావృడంభోధరధ్వానగరిమ
నాత్రేయుతోఁ బల్కె నరుణాధరము విప్పి దంతకాంతుల దిశల్ ధవళములుగ
విషవృక్షమునకును విప్ర నీకు సమంబు పటుజటావల్కల భార మంతె
శాంతి లేనితపం బేల శాస్త్ర మేల, స్థలజలాంతర భూతవిదాహమునకు
వత్స, పుట్టితి వత్రి గర్భమున నీవు, కలశవారాశి జనియించె హాలహాలంబు.

కోపమును నిగ్రహింపని కుత్సితాత్ముఁ, డైహికాముష్మిక సుఖంబు లందఁ గలఁడె
అక్షియుగళంబుఁ గల్గిన యంధుఁ డతఁడె, సాధుగర్హిత వర్తన సంయమీంద్ర.

క్రోధ ధర్మంబులకు సమానాధి కరణ, మన్నకిని పాఁకును బోలె నవనిఁ గలదె
రోషమును నిగ్రహింపకు ఋషి కుమార, బాల వాగ్దేవి శపియింపఁ బాడి యగునె.

అని భాషాయోషం జూచి కమలాసనుండు.

బాల కలంతఁ జెందకుము బ్రాహ్మణశాప మవశ్యభోగ్య మా
గాలనియోగ మెవ్వరును గాదనఁ జాలరు ధీర వీవు నీ
లాలక మద్వియోగ విరహార్తిఁ గృశింపకు మర్త్యలోకమం
దీలలితాంగి వేద జనయిత్రి భవత్సఖితోడు నీ కగున్.

మనుజభువి సుతుని ముఖమును, గనుటయె శాపాంత మట్లు గావున మరల్
ననుఁ గొల్వ నేఁగుదెంతువు, చనుమా సావిత్రిఁ గూడి సారసనేత్రా.

అని భారతి నూరడించి విసర్జిత సురాసురముని మనుజమండలుండును ససంభ్రమోపగత నారదస్కంద విన్యస్తహస్తుండును నై చతుర్ముఖుండు సముచితాహ్నిక కరణార్థం బరిగె నంతఁ గమలజురాణి శప్త యయి.

మోముదమ్మినిఁ గన్నీరు ముమ్మరముగఁ, దనకుఁ బ్రామిన్కులమ్మ నైదండ యొసఁగ
వేఁడియూరుపు సెగలఁ గెంబెదవి గంద, పలుకు తొయ్యలి యిలు సేరె వగలఁ బొగిలి.

జనని సరస్వతీ సతి రసాతల మేఁగెడు వార్త సర్వభూ
జనులకుఁ దెల్ప వచ్చె ననఁ జండమయూఖుఁడు దోఁచెఁ దూర్పునన్
మునిఁగె నపార పశ్చిమ సముద్రమునందు సుధాంశుఁ డుగ్ర భా
నుని కరకాండ ఘట్టనఁ దనుద్యుతి సర్వము మాసిపోవఁగన్.

అంతట నంశుమంతుఁ డుదయాచలకూటము లాక్రమించి దు
ర్దాంత మయూఖజాల సముదగ్ర మహాగ్ని శిఖాకలాప మా
శాంతర సీమ నిండ గగనాంగణమధ్యము నాక్రమించి యం
తంతఁ గ్రమంబునం బరిణతారుణ కాంతుల నొప్పె శాంతుఁడై.

సమదైరావణ దంతకుంత దళిత స్వర్వాహినీ కూల ము
త్తమ సప్తర్షి సమర్పితార్ఘ్య జల సంత్రస్తోగ్ర మందేహ మ
స్తమితా దిత్యమయూఖ తాపము గిరీశ ప్రస్ఫురత్తాండవ
స్తిమితం బయ్యెఁ బ్రదోష మంబరచరత్సీమంతినీతోష మై.

అంతటఁ బండువెన్నెల లజాండ కటాహము నిండ యామినీ
కాంత మొగంబునం బొలుచు కప్పురపుం దెలిచుక్క నా నిశా
కాంతుఁడు వచ్చెఁ గల్వలవికాసము హెచ్చె మొగిడ్చెఁ బద్మినీ
కాంత మొగంబుఁ జంద్ర శిల కాయము నిండఁ జెమర్చె నత్తఱిన్.

వ. అట్టి రమణీయయామినీ ప్రథమ యామంబున విరించి విరహదోదూయమానమానస
యు శూన్యహృదయయు నయి కన్నుఁగవఁ దొరఁగు బాష్పకణంబులు నఖాంకురంబుల
మీటుచు బయలుసూచుచున్న నమ్మహాదేవిం జూచి సావిత్రి యిట్లనియె.

---

# పచ్చియెరువువలన వరిచేలను బలపరచుట

గోటేటి జోగిరాజుగారు

ఇటీవల కోయంబత్తూరు వ్యవసాయకళాశాలయొక్క సాంవత్సరికోత్సవ సందర్భమున జరిగిన సభలో గవర్నమెంటు వ్యవసాయ రాసాయనికశాస్త్రజ్ఞులగు బి. విశ్వనాథగారిచే "వరిచేలను బలపరచుటలో గమనింపవలసిన సూత్రముల"ను గురించి చదువబడిన వ్యాసమున, వరిపైరున కాయాకల్పితపు పెరువులను ప్రత్యేకముగ వేయుటకంటె, పచ్చియెరువు (green manure) ప్రత్యేకముగగాని, కల్పితపు పెరువులతో జేర్చికాని, వేయుట ప్రశస్తమని స్పష్టపరచిరి. వారిలెక్కప్రకారము, ఏయెరువును వేయకయే నాటినపైరువలన 100 కుంచములధాన్యము లభించుప్రదేశమునుండి, యీక్రింది యెరువులను, వానిమిశ్రణములను వేయుటవలన నదేప్రదేశమునుండి లభించుధాన్యమును కుంచములుగా చూపబడెను.

| వేసినయెరువు | | పంటయొక్క తారతమ్య పరిమితి కుంచములు[1] |
|---|---|---|
| 1. ఏమియు ఎరువు లేకయే ... ... | | 100 |
| 2. కల్పితపు పెరువులరూపమున స్ఫురితములు మాత్రమే వేయగా | | 152 |
| 3. ,, ,, నత్రజనినిమాత్రమే వేయగా | | 212 |
| 4. ,, ,, నత్రజనియు, స్ఫురితములును | చేర్చి వేయగా | 272 |
| 5. పచ్చియెరువును మాత్రమే వేయగా ... | | 303 |
| 6. పచ్చియెర్వులజేర్చి కల్పితపు పెరువు రూపమున స్ఫురితములుమాత్రము వేయగా | | 364 |
| 7. ,, ,, నత్రజనినిమాత్రమే వేయగా | | 403 |
| 8. ,, ,, నత్రజనియు స్ఫురితములును | చేర్చివేయగా | 485 |

కల్పితపు పెరువులు, సంపాదించుటకును, పొలమునకు గొనిపోయి వేయుటకును ఎంత యనుకూలముగ నున్నను, అవి మొత్తముమీద పచ్చియెరువులతోగాని, స్థూలములగు నితరసేంద్రియపు పెరువులతోగాని (organic manures) సాటిరావనియు, సేంద్రియపు పెరువులు పోషమంతటికిని చాలక కల్పితపు పెరువులను నుపయోగింపవలసి వచ్చినప్పుడు వానిని సేంద్రియపు పెరువులతో కలిపి వాడుట మంచిదనియు శాస్త్రజ్ఞులు దృఢముగా చెప్పుచున్నారు.[2] కావున రైతులు తమ పశువులయెరువును పదిలపరచుటయందును, పచ్చియెరువులను సంపాదించుటయందును హెచ్చుకృషి జరుపవలసియున్నది. ఈవ్యాసమున పచ్చియెరువును సంపాదించి ఉపయోగించు మార్గమునే చర్చించెదను.

వరిచేలకు పచ్చియెరువులను సంపాదించుటకు ఆనేలయందే జనుము, జీలుగు, తీగపెసర మొదలగు సస్యములను పెంచి, దమ్ముచేయుటయే ముఖ్యసాధనము. ఉత్తరసర్కారులలో లేకరి యనుభవమునుబట్టి ఆయా సస్యములను జల్లుతరుణములును, విధానములును ఈక్రింద వివరింపబడినవి—

1. విశాఖపట్టణపు జిల్లాలోవలె వరినాటు ఆలస్యముగ జరుగు అప్లండు గరుపభూములలో తొలకరించినారుపోయు తరుణముననే మరికొన్నిమళ్లలో జనుముగాని, జీలుగుగాని చల్లినచో, నారెదుగునప్పటికివియు 3, 4 అడుగు లెదిగి ఎరువుగా దమ్ముచేయుట కనుకూలించును. ఎకరమునకు 2½—3 కుంచములు[3] విత్తనములను జల్లవలెను.

2. గోదావరి డెల్టాలోవలె దాళువాపంట సాగుచేయు నేలలలో నాపంటను కోయుటకుముందు జనుముగాని, జీలుగుగాని చల్లినయెడల అది గూపడనుకు

1. కుంచముధాన్యము 7 పౌనులు తూగును.
2. చెన్నపురి వ్యవసాయశాఖవారిచే ప్రచురింపబడిన 90 వ బుల్లెటిన్‌ను చూడుడు.
3. కుంచ మనగా సుమారు 9 పౌనులు (పెసలు, మినుములు, జనుములు మొదలగునవి.)

మొలచి, మరల తడిపెట్ట నక్కఱ లేకయే మరుసటి సారు నాపంట పెట్టుకాలమునకు 3—4 అడుగులకు పైగా నెదిగి, ఎరువుగా దమ్ముచేయుట కనుకూలముగా నుండును. కాని, ఇటీవల చాలచోట్ల దాళువాపంట ఫలించుకాలమునకు నీరు చాలక నేల యెండిపోవుచుండుటచే నిట్లు పచ్చియెరువు సస్యములను జల్ల నవకాశము లేకపోవుచున్నది. తరుచు దాళువాపంటయే ఎండి బొందైపోవుటకూడ గలదు.

3. పైని చెప్పినట్లు దాళువాపంటకు తగినంతనీరందనిచోట్ల నాపైరును పెట్టుటయే మాని వెనుకటిసారువాపైరు కోసినప్పటినుండియు, మళ్లలో నీరు కట్టి నిల్వయుంచి, మార్చినెలలో జీలుగ చల్లి నీరు తీసివేసినయెడల మరల తడిపెట్టనవసరము లేకయే యాపైరు మరుసటి సారువాపంట పెట్టుకాలమునకు బాగుగా నెదిగి ఎరువుగా దమ్ముచేయుట కనుకూలించును. ఈసంవత్సరము చామర్లకోటవ్యవసాయస్థానమున ఎ. 2–88 ట్లలో నిట్లు జీలుగ చల్లగా ఎ. 1 కి 12,269 పౌనుల రొట్టచొప్పున ఆయెను. ఒక ఎకరమున పెరిగినరొట్ట సామాన్యపునేలకు 6 ఎకరములకును, బీదనేలకు 3 ఎకరములకును సరిపోవును. క్రిందిపటము జీలుగ చేను కోయునప్పుడు తీయబడిన ఛాయాచిత్రము.



జీలుగుచేను చిత్రము— దమ్ముచేయుటకుముందు కోయబడుచున్నది.

పైని చెప్పినట్లు మళ్లలో నీరు గట్టినప్పుడు ఒక్కొక్కప్పుడు గడ్డి విస్తారముగా పెరుగును. అట్టిస్థితిలో జీలుగును జల్లుటకు ఒకవారము ముందుగా ఒకటిరెండు సారులు మళ్లను దమ్ముచేసి, పట్టె తోలి, నీరు కట్టి యుంచుట మంచిది. కాని గడ్డి అంతగా పట్టనినేలలో దమ్ము చేయ నవసరమే యుండదు. గడ్డి ఒక మోస్తరుగ పట్టిన రెండుమళ్లలో, ఒకదానిలో దమ్ము చేసియు, రెండవదానిలో దమ్ముచేయకయు జీలుగు చల్లగా, దమ్ముచేసినమడిలో ఎకరమునకు 10,686 పౌనుల రొట్ట చొప్పున కాగా, దమ్ముచేయని నేలలో నెకరమునకు 11,974 పౌనుల చొప్పున అయ్యెను.

4. చెఱకుతోట పెంచి ఆకువేసిన నేలలో మొదళ్లను త్రవ్వి కాల్వలను కప్పగనే అప్పటికి నేలయందుండు పదునుతోనేకాని, ఒకతడిపెట్టికాని, జీలుగ, జనుము, తీగపెసర వీనిలో దేనినైననుగాని, మూడవదానితో మొదటి రెంటిలో నొకదానిని కలిపికాని చల్లినయెడల నవి తరువాత సారువాపంట కెరువుగా నుండుటకు సిద్ధమగును. చామర్లకోట వ్యవసాయ క్షేత్రమున సామాన్యముగ ప్రతిసంవత్సరము నీపద్ధతియవలంబింపబడుచున్నది. తరుచు ఎకరమునకు 20,000 ఫౌనుల వరకు (అనగా సుమారు 5, 6 ఎకరముల బీదనేలకు సరిపోవు) రొట్ట అగుచున్నది. ఎకరమునకు సుమారు కుంచెడు జనుములుగాని, జీలుగలుగాని రెండు కుంచముల పెసలతో కలిపి చల్లవలయును.

5. పయర నూవుచేలకు పంటతడి పెట్టుటకు ముందు పైని చెప్పబడిన సస్యములనే చల్లినయెడల తరువాత సారువాపంటకు తగినంతరొట్ట లభించును.

6. పయర నూవుచేలను చల్లునప్పుడే నీలివిత్తులనుగాని, వెంపలి విత్తులనుగాని కలిపి చల్లునెడల, నూవుచేను కోసికొనినవెనుక, నానీలియు, వెంపలియు నెమ్మదిగ నెదిగి, తరువాతి సారువాపైరునకు ఎరువుగా దమ్ముచేయ వీలగును. ఎకరమునకు 4—6 సేర్ల విత్తులు చాలును.

7. నేల అంతగా బీటదీయక పదును నిలుచు చోట్లగాని, పయరచేలకు తడిపెట్టు ఆచారముగల చోట్లగాని, సారువావరిచేను కోయుకాలమున, నీలిగాని, వెంపలిగాని, పయరదినుసులతో (పెసర, మినుము) కలిపి చల్లవచ్చును.

8. సారువాపంటకోతకు ముందు, సామాన్యముగ మేతకు జల్లినట్లే జనుము జల్లి, దాళువాపంటకు ఆసస్యమును ఎరువుగా దున్ని వేయవచ్చును.

9. పైని చెప్పినట్లు జీలుగవిత్తులను జల్లినయెడల నీపైరు జను మెదిగినట్లు బాగుగ నేదుగదు. కాని ఈకాలమున జల్లిన జీలుగమొక్కలు మెల్లగ నెదిగి బాగుగ కాయును. విత్తులకొఱ కాసస్యమును మార్చి, ఏప్రిల్ నెలలో కోసుకొన్నయెడల, కొన్ని పదును నిలుచు నేలలలో నా మొక్కలమొదళ్లు మరల చిగిర్చి, తరువాత సారువాపైరునకు తగినంతరొట్ట నిచ్చును. ఈసంవత్సరము చామర్లకోట వ్యవసాయక్షేత్రమున నిట్లు య. 2.61 సెంట్లభూమిలో చల్లగా నెకరమునకు 419 ఫౌనుల విత్తులును (సుమారు 52 రూపాయల విలువగలవి), తరువాత మొదళ్లు చిగుర్చుటవలన నెకరమునకు సుమారు 2,000 ఫౌనుల రొట్టయు లభించెను. విత్తులకుగాను చేనిని కోసినవెనుక నేదైన వర్షము కురిసినయెడలగాని, ఒకతడి పెట్టుటవలనగాని రొట్ట బాగుగా నగును. ఈసంవత్సరము వేసవివర్షములంతగా లేక ఎండలు మిక్కుటముగా గాసినను చామర్లకోట వ్యవసాయక్షేత్రమున పైని చెప్పినట్లు కోసినమోళ్ళనుండి ఎకరమునకు 2000 ఫౌనుల రొట్టయగుట, జీలుగమొక్కయొక్క మోటుదనమును సూచించుచున్నది.

పైని చెప్పినట్లు జీలుగను ప్రత్యేకముగాగాక పెసర, మినుము మొదలగు పయరదినుసులతో కలిపి కూడ చల్లవచ్చును, చల్లుపెసలలోగాని, మినుములలోగాని మూడవవంతు తగ్గించి జీలుగవిత్తులను వానికిబదులు చేర్చవలయును.

పైనిచెప్పిన తొమ్మిది విధానములలో దేనినైనను అవలంబించి వ్యవసాయదారుడు తననేలకు గావలసిన రొట్టను సంపాదింపవలయును. మరియు వీలగుచోట్ల నిద్రగన్నేరు, కానుగ, వేప మొదలగుచెట్ల రొట్టనుగాని, బంజరు నేలలందును, కాల్వగట్లను, బాటలప్రక్కలను స్వాభావికముగ పెరుగు, కసింద, తంటెప, జిల్లేడు, సీమనేపాళము మొదలగు జాతుల రొట్టనుగాని, తెచ్చి యుపయోగింపవచ్చును. ఈవిషయమై మరియొకవ్యాసమున వ్రాయబడును.

పచ్చిరొఎరువు వేసినప్పుడెల్ల, సామాన్యముగ దానితో నెముకలపొడినికూడ వేయుట చాలచోట్ల లాభకారిగనుండును. ఎకరమునకు మొదటిసంవత్సరమున 4 గుండ్ల యొత్తును (224 ఫౌనులు), తరువాత నవసరమగునెడల ప్రతిసంవత్సరమున 2 గుండ్లయొత్తుగాని, రెండుసంవత్సరముల కొకసారి మూడుగుండ్ల యెత్తుగాని వేయవలెను. ఇప్పు డెముకలపొడి 4 గుండ్లు ఎత్తుగల బస్తా 9—10 రూపాయలకు దొరకును.

# పునర్విమర్శనము

## పరామర్శ విమర్శము

వినోదవిమర్శమను పేరితో నేను ప్రభవఫాల్గున భారతిలోఁ బ్రకటించిన భారతపద్య పాఠార్థ విమర్శమును బ్ర. శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు విభవ వైశాఖ భారతిలోఁ బరామర్శించినారు. వినోదవిమర్శమున నేను "ఇంతకంటె సరసమయిన యర్థమెవ్వరికయిన గోచరించినచో వెల్లడింప వేఁడుచున్నాఁడ"నని విద్వాంసులను వేఁడితిని. శాస్త్రులుగారు తమ పరామర్శోపక్రమమున "ఆ పద్యమున కర్థము నాకు మఱొకవిధముగా గోచరించినది. అది సరసమయిన దగునో కాదో ప్రభాకరశాస్త్రిగారును, పాఠకులును నిర్ణయింపవలయును గాని నేను నిర్ణయింపఁజాలను. నాకుఁ దోఁచిన యర్థమును వారి యనుజ్ఞా ప్రకారము వెల్లడించుచున్నాఁడను." అని వ్రాసిరి. ఉపక్రమ వినయోక్తిగా నూరక యట్లు వ్రాసిరే కాని వారు తమ పరామర్శ నిర్వాహమున నేను జెప్పిన యర్థమున దోషములను, స్వయముచెప్పిన యర్థమున గుణములను ఉపన్యసించినారు. నేను జెప్పిన యర్థము దోషజుష్టమనియు, స్వయము చెప్పిన యర్థము సరసమయినదనియు నభిమానము వారికున్నది. లేదేని వారిపరామర్శారంభమే వ్యర్థమగును. నేను గోరినది నేను జెప్పిన యర్థముకంటె సరసమయిన యర్థమునేకదా! కాని శాస్త్రులుగారు నా వినోదవిమర్శముమీఁదఁ జూపిన దోషములుగాని, స్వయముగ చెప్పిన యర్థముమీఁదఁ జూపుకొన్న గుణములు గాని యుక్తియుక్తములు గావని నేఁ దలఁతును. నా తలఁపుల నిక్కడ తెలుపుకొనుచున్నాను: తత్త్వనిర్ణయమునకు సహృదయులు ప్రమాణము.

నేను పఠించిన పాఠమును, అర్థమును, ఇట్లు:—

చ. పగ యడఁగించు టెంతయు శు
భం బది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మార్కొనక
పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగ
దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినన్ బగకు
మేలిమి లేమి ధ్రువంబు గేశవా!

పగ యడఁగించు టెంతయు శుభంబు—అది లెస్స యడంగునే పగన్— పగ పగగొన్న మార్కొనక పల్కక యుండఁగవచ్చునే—కడుం దెగ మొదలెత్తిపోవ, పగ దీర్పఁగ వచ్చిన, క్రౌర్య మొందు —ఏమిగతిఁ దలంచినన్ పగకు మేలిమి లేమి ధ్రువంబు—కేశవా! ఇది నేఁ జెప్పిన యర్థమున వాక్యవిభాగము. ఉభయపక్షములు పగ వీడి పొంది పొసఁగియుండుట మిక్కిలి శ్రేయము. పగ యనునది రెండుపక్షములలో నెక్కడనేని కలదా, శాంతి చేకూరదు. అది యెట్లనఁగా: స్వయము పగ సాగించుచున్నచో, ఎదిరివానియందు పగపూర్తిగా నడఁగిపోవుట యసంభవము. ఎదిరివాఁడు (పగవాఁడు) పగ సాగించుచున్నచో స్వయమును చేతనో, వాతనో, ప్రతిసల్పక యుండ శక్యము గాదు. స్వయము ఎదిరివాని మీఁదికిని, ఎదిరివాఁడు తనమీఁదికిని పరస్పరము పగ దీర్చుకొనుటకు దండెత్తివచ్చినచో ఉభయపక్షములో, ఒకపక్షమో నశించి పగయడంగిపోయినఁ బోవచ్చునుగాని యందు హింసారూపమగు క్రౌర్యము గలదు. కావున పగయుని కిగల తెఱఁగులలో మేలిమిలేదు. ఉభయపక్షములలోను బగ లేనితెఱఁగే శ్రేయము. ఇది పద్యమునకు నేఁ జెప్పిన తాత్పర్యార్థము:—శాంతికాముఁ డయిన ధర్మరాజు రాయబార మరుగుచున్న శ్రీకృష్ణులవారితోఁ జెప్పువిషయ మిది:— కేశవా! ఎట్లయినను ఉభయపక్షములందును పగ చల్లార్చి శాంతి చేకూర్పుము— అని కోరుటలో ఎదుట వైరము గ్రక్కుచున్న భీమార్జునాదుల స్మరించి ముందు స్వపక్షము పగ వీడినఁగాని శాంతి చేకూర దనెను. కాని, అట్లు స్వపక్షము నెట్లో నిర్బంధించి పగ వీడునట్లు

చేసినను, విరోధులగు దుర్యోధనాదులు పగనే సాధించుచున్నప్పుడు ఆశాంతి నిలువదనెను. ఇంక, భీమార్జునాదులు, దుర్యోధనాదులు ఉత్సాహపడుచున్నట్లు పరస్పరము దండెత్తి యుద్ధము సాగించినచో పగ తీరినం దీరునేమోకాని, అందు జీవహింసాదోషము ప్రాప్తమగునసెను. ఇట్లు పగగల తెఱంగులమూఁటిని మేలిమి లేనివని నిరూపించెను. ఉభయపక్షములందును బగలేని నాల్గవ తెఱంగయిన శాంతిని బ్రశంసించెను. ఇట్టిపద్యమున సాధితమయిన విషయమునే తర్వాతిపద్యమున 'కావున శాంతిఁ బొందుటయ కర్జము' అని ధర్మరాజు పేర్కొనెను. వినోదవిమర్శమున నేను రెండుపక్షములందును (పగలేమి-పగలేమి, పగ-పగలేమి, పగలేమి-పగ, పగ-పగ) పగకలిమి పగలేములచే నేర్పడిన నాల్గు తెఱంగులకును దృష్టాంతముగా-రెండును గురువులు, లఘువు గురువు, గురువు లఘువు, లఘువు లఘువు అని యత్యుక్తాచ్ఛందః ప్రస్తారమున నేర్పడిన రెండక్షరముల గణముల నాల్గింటిని జూపితిని.

దానిని శాస్త్రిలవారీక్రిందివిధమున నవహేళనము చేసిరి—

"......స్వపక్ష పరపక్షములందున్న పగకలిమి పగలేములయందు గురులఘుభావము లారోపించి ఛందస్సులోనికి దింపి తుది కత్యుక్తాపద్యము సంపాదించిరి."

ఇది యప్రౌఢమయిన యవహేళనము. గురులఘుభావము లెఱుంగనేరనివారు, ఛందః ప్రస్తారమున నవగాహింపఁజాలనివారుగారు శాస్త్రిలుగారు. అత్యుక్తా ఛందస్సులో నౌపమ్యము చెప్పుట దప్పు గాదు. నేఁ జెప్పిన యర్థమున నీయౌపమ్యము పొందక యత్యుక్తిదోషము నకుఁ బాల్పడెనేని దాని వారు నిరూపింపవలెను గాని యిట్లు చెనకుట యనుచితము. వర్తులమై, ఆహ్లాదజనకమై యీ మెముఖము చంద్రునిపోల్కి నున్నది అని యొకఁడనఁగా, అంధరాకషాంధరాక ఆకాశమున నున్న చంద్రునితోఁ బోల్కి చెప్పఁబడెనని ముఖపువర్తులత్వాహ్లాదకత్వముల నింకొకరాక్షేపించుట యెట్టిదో, శాస్త్రిలవారి యీయాక్షేప మట్టిది. శాస్త్రిలవారికిది యిష్టముగాదేని ఇంకొకపోల్కి నిదిగో చెప్పుచున్నాఁడను:—

"ఒకరియింట మూల నెక్కడో దాఁచియుంచిన చిఱుఁదాళములలో నొక్కదాని నొకబాలుఁడు గైకొని 'ఆయి! ఇదిగో నాకు తాళం! నీకు లేదు!' అని రెండవపిల్లవానిని కవ్వించుచు వానిమీఁదికి దాని బొంగరమువలెఁ ద్రిప్పి విసరివైచుచు నాడుచుండెను. రెండవ బాలుఁడు నా కట్టిదిగానలెనని యేడ్వఁజాగెను. తండ్రి పెద్దపిల్లవాని చేతనుండి దానిలాగికొని రెండవపిల్లవానికిచ్చెను. వాఁడు దానితో నాడుచుఁ బెద్దపిల్లవానిని జెల్లింపఁజాగెను. వరలఁ జీకాకు గదిరెను. రెండవతాళమును తండ్రి పెద్దపిల్లవాని కిచ్చెను. ఇర్వురును రెండుతాళములఁ గలిపి మ్రోఁగింపఁజాగిరి. పిల్లలనస తీరెనుగాని యిల్లెల్ల గగ్గోలయ్యెను. ఇర్వురచేతులనుండియుఁ దండ్రి తాళముల లాఁగికొనెను. శాంతి యేర్పడెను."

ఈ కథ నిక్కడ పోల్చుకోవచ్చును. ఇందు గురులఘుభావములు లేవు. ఛందస్సులోనికి దిగుటలేదు; అత్యుక్తాపద్యము లేదు.

శాస్త్రిలుగారు నావినోదవిమర్శముపైఁ జూపిన దోషములు మఱియు నివి:—

"వీరియర్థమున 'లెస్స' దేనితో నన్వయించునో, అర్థమేమియో చెప్పలేదు. అది వాక్యాలంకారము గాన ప్రభాకరశాస్త్రిగారు వ్యాఖ్యలో నియ్యదే దనుకొనెన మన్న నది తిక్కనసోమయాజి ఫక్కి కాదు. అడంగునే యనుదానితో నన్వయించినచో సరసార్థము రాదు. మఱియు, స్వపక్షము దండెత్తిపోవఁగా పరపక్షము దండెత్తి రాఁగా అని యన్వయించుటకుఁ బదసామగ్రి లేదు. అది సంస్కృతభారత భావానుసారము గాదు. ప్రభాకరశాస్త్రిగారు రస్వరసముని తలంచిన లక్ష్మీపతి సోమయాజిగారిటీకలో ఇదేయర్థమున్నది. అది తిక్కనసోమయాజిగారి భావమయియుండదని నాయభిప్రాయము."

... 'లెస్స' యన్వయింపు దనుట్లకు:—

నా వినోదవిమర్శము ముద్రణముననో, వ్రాతనో 'లెస్స'యు, దానియర్థమును జారిపోయినవి. అట్టి ప్రమాదములు సర్వసాధారణములు. శాస్త్రిలవారి పరామర్శమునఁగూడ 'అది వేలుచేసినచో అగును' అని కొంత లోపముతో వాక్యముండెను. అట్టివానిని సరిచూచు

కానవలసినదే కాని, చర్చ తగదు. అందు 'లెస్స' అన్వయము శాస్త్రిలవారికిఁ గుదురకపోవుట వింత. అది వాక్యాలంకారమను తలఁపున నే విడువలేదు. అది యక్కడ వాక్యాలంకార మెట్లగును? అడంగునే యనుదానితోనే యది యన్వయించును. అందు సరసార్థము రాదని శాస్త్రిలవారు వ్రాయుట యచ్చెరువు గొల్పుచున్నది. "అది లెస్స యడంగునే పగన్" స్వపక్షముగ సాగించుచున్నప్పుడు పరపక్షము పగయడఁగి యున్నను, ఆయడంగుట లెస్స యడంగుట కాదు. ఏలనఁగా, స్వపక్షము సాగించుపగను పగయడఁగియున్న పరపక్షము ఒకతూరి యోర్చును, రెండుతూర్లోర్చును. కాని అదేపనిగా స్వపక్షముగ పగ సాగించుచునే యున్నప్పుడు పరపక్షము లెస్సగాఁ బగయడఁగియుండ సాధ్యము గాదు–అని యర్థముగదా! ఇక్కడ 'లెస్స'కు సరసార్థము రాదనుట సరసార్థమా? నేఁ జెప్పిన యీయర్థము సరసమయినను, 'లెస్స' పదమును 'అడంగునే' యను క్రియతో నన్వయించి నప్పు డీయర్థనిష్పత్తి యాపలుకు బడినుండి సరసముగా సంఘటిల్లదనియేమో శాస్త్రిలవారియాక్షేపము! అట్లేని ఇట్టి పలుకుబళ్లు ప్రాచీన ప్రబంధములందు తవ్వి తండములు. 'అది లెస్సగా నడంగునే' యనుటకంటె 'అది లెస్స యడంగునే' అనుటే ప్రాచీనకవులకుఁ బ్రియము.

'వీరలు పెద్దద్రవ్య కొకవెంట నొడంబడి తేరి శాంతులై.'

—ఉద్యోగపర్వము ౧ ఆశ్వా.

క. తాను దయఁ బెద్ద మనిచిన
మానిసి పతిఁ దగినయెడల మన్నింపమి య
జ్ఞానము తనమనుపు గజ
స్నానముపలె నంద్రు గీర్తి నారాయణుఁడా!

—బద్దెననీతి.

పాలవెల్లువవోలెఁ బైఁటచేలము లెస్స
ముసుఁగుఁ బెట్టిన దయా ముద్దుగుమ్మ!

—శ్రీనాథుని చాటువు.

లెస్స యొండునె. గృహభర్తలేని బ్రదుకు.

—మనుచరిత్ర.

ఈప్రయోగములు చాలవా?

'పదసామగ్రి లే' దనుటకు:—

కడున్–తెగన్–మొదలు–ఎత్తిపోవన్–పగ–తీర్పఁగన్–వచ్చినన్–ఈపదములు పద్యమున నున్నవి. వీనికి నేఁ జెప్పిన యర్థ మిట్లు:—కడున్=మిక్కిలి, పూర్తిగా, (పగ=విరోధము) మొదలు, తెగన్=మూలనాశమగునట్లు, ఎత్తిపోవన్=దండెత్తిపోయినను, (పగ=విరోధమును,) తీర్పఁగన్–వచ్చినన్ = (మొదలంట) నశింపఁజేయుటకు (దండెత్తి) వచ్చినను, – క్రార్యమొందున్=క్రార్యము ప్రాప్తమగును.

ఇందు "తెగ మొదలెత్తిపోవన్–తీర్పఁగ వచ్చినన్" అను నసమాపకవాక్యములకు రెంటికి నడుమ 'పగ'యను పద ముండి దేహళీదీపన్యాయమున రెండువాక్యావయవములందును నన్వయించుచున్నది. ఒక మహావాక్యములోని వగు నసమాపక వాక్యావయవములు రెంటిలో వేఱువేఱుగా 'పగ' పదమును రెండుసార్లు చెప్పుటయే యసుందరము. రెండువాక్యావయవములకును నడుమ 'పగ' పదము నుంచి రెండింట నన్వితముసేయుటే సుందరము. 'దేహళీదీపన్యాయ' మిట్టివానికే యొట్టును. మొదటి యసమాపక వాక్యమున దం'డెత్తిపోవుట' కలదుగాన రెండవ యసమాపకవాక్యమున 'వచ్చుట' యనుటచేతనే 'దండెత్తివచ్చుట' యనునర్థముసరళముగాలభించును. స్వపక్షము, పరపక్షము అనునవి 'పగ పగగొన్న మార్కొనక పల్కక యుండఁగవచ్చునే' అన్నవాక్యమునఁ గల తొలి 'పగ' పదము శత్రుపక్షవాచకము. మార్కొనక పల్కక యుండఁగవచ్చునే' యనుచో స్వపక్షముఅనునర్థము సిద్ధించుచున్నది. ఆవిధముననే తిక్కన వాక్యములందును సిద్ధించుచున్నది. ఇక్కడ పదసామగ్రి చాలదని శాస్త్రిలవారనిరి. ఇది తిక్కన సోమయాజులవారి రచనమగుటను స్మరింప వేఁడుచున్నాఁడను. సోమయాజులవారి రచనలోఁ బ్రాయికముగాఁ బదములకూర్పింత గట్టి ధట్టింపుతో నుండుట సర్వవిద్వద్విదితము.

అది సంస్కృత భారతభావానుసారము గాదనుటకు:—ఈప్రకరణమున సంస్కృతమునఁగల శ్లోకము.

నీ క్రిందిదానిని స్థలాంతరమున నుదాహరించియు శాస్త్రులుగా రిట్లు వ్రాయుట వింత—

'అథవా మూలఘాతేన ద్విషతాం మధుసూదన,
ఫలనిర్వృత్తి రిద్ధా స్యాత్తన్న ్రశంసతరం భవేత్.'

అను శ్లోకము నేను "కడున్ దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు" నను వాక్యమునకుఁ జెప్పిన యర్థము నొసఁగుటలేదా? ఒకరు దండెత్తిపోవుట, రెండవవారు దండెత్తివచ్చుట యన్న పలుకులు సంస్కృతశ్లోకమున లేవనియు నాక్షేప ముండఁదగునా? రెండవపక్షము ముచ్చుముడిఁగియుండఁగా యుద్ధ మెట్లు సాగును? వీరు వారికి విరోధు లయినప్పుడు వారు వీరికి విరోధులగు అట్లు పరస్పరము విరోధులయినప్పుడే, పరస్పరము దండెత్తి వచ్చినప్పుడే యుద్ధము సాగును. లక్ష్మీపతి సోమయాజిగారి టీకలోని వాక్యమున కీ యర్థ ముండుట యుక్తమే. వారి టీక యస్వరసమని నేను వ్రాయుటకుఁ గారణ మీవాక్యమున కీయర్థము వ్రాయుట కాదు.

వినోద విమర్శమున నేను "పగ యడఁగించు టెంతయు శుభంబు; అది లెస్స. అని వేఱుచేయుట పాడినపాట యగును. అది సోమయాజులఫక్కి కాదు" అని వ్రాసితిని. దానిమీఁద శాస్త్రులుగా రిట్లు వ్రాసిరి:- "'అదిలెస్స' అని చెప్పుట పాడినపాట గాదు. ధర్మరాజునకు శాంతియందుగల యత్యాదరమును, పగయడఁగించుటయందలి కష్టమును సూచించుచున్నది. అదిగాక శుభము అన్న పదముకంటె లెస్స యన్నపదమున విశేషార్థ మున్నదిగదా! ఈవదర్థభేదముతోఁ జెప్పినది మరలఁ జెప్పుట సందర్భానుసారముగా గుణమే— ఇట్టిది తిక్కనసోమయాజి కవిత్వమున లేకపోలేదు. క. ఒడఁబఱచి.....పొంది పొసఁగియుం|డెడినట్టి తెలుఁగు నేయుట|కడు మేలది గౌరవము సుఖంబును జేయున్. అట్టి తెలుఁగు నేయుట కడుమేలు. అది=అట్టి తెలుఁగు నేయుట, గౌరవమును సుఖమును జేయును- ఈరెండువాక్యముల నెంత భావభేద మున్నది? ఇట్టి వింకను గలవు."

చెప్పినదానినే మరలఁ జెప్పుట ఉక్తార్థదార్ఢ్యమున కుపచరించుననుట యుక్తమేకాని, యట్టివానికి స్థానములు వేఱు. అందును ఉక్తపదముసకే యావృత్తి హృద్యము. అదియెంతయు శుభంబు; 'అదిలెస్స' యనుట చవిసారములేక చవ్వగా నుండును. ముందు సామాన్యము, తర్వాత విశేషమును జెప్పుట యుండెనేని హృద్యమే యగునుగాని యిక్కడ మొదల 'శుభము', పిదప 'లెస్స' ఉన్నవి. ఈరెండిటిలో 'లెస్స' సామాన్యమని, 'శుభము' విశేషమని తలఁపఁదగును. అవి వెనుకముందులుగా నుండుటచే నిక్కడ నిట్టికూర్పు నీరసమనియే చెప్పవలెను. దీనికి పోలికగా శాస్త్రులుగారు తిక్కన సోమయాజుల వారి ప్రయోగాంతరమును జూపినారు. కాని సరసతరమయిన దానికిని, నీరసతరమయిన దీనికిని పోలికయెక్కడ!

కడుమే లది గౌరవము సుఖంబును జేయున్— అనుటలో తొలుత "ఆవిధముగా మీరు నడచుకొనుట మిక్కిలి మేలు" అని సామాన్యము నుపన్యసించినాఁడు. గౌరవప్రదమును మేలయినదే, సుఖప్రదమును మేలయినదే. సాధారణముగా గౌరవప్రదము సుఖప్రదముగా నుండదు; సుఖప్రదము గౌరవప్రదముగా నుండదు. కావున నిక్కడ నుపన్యస్తమయిన మేలు గౌరవప్రదత్వరూపమా, సుఖప్రదత్వరూపమా యని సందేహము తోఁచును; దానికి వారకముగా "గౌరవము సుఖంబును (రెండిటిని) జేయున్" అని విశేషము నుపన్యసించినాఁడు. దీనికిని, "ఎంతయు శుభంబు; అది లెస్స" అనుటకును సాజాత్యము చెప్పుటలో సారస్యము లేదు.

మఱియు— నేఁజూచిన తాళపత్రప్రతులలో నెల్ల 'పగ దీర్పఁగ వచ్చిన' అన్నపాఠమే కలదనియు, 'పగ దీర్పఁదలంచిన' పాఠము నాకెక్కడను గానరా లేదనియు; అది తిక్కనగారి తెలుఁగు గాదనియు, ఏలనఁగా 'తీర్పఁదలంచినఁ గ్రౌర్యమొందు' నే మిగతిఃదలంచినక' అని మరల నదేపదము వచ్చుచున్నదనియు, రెండుమార్లొకటే పదము దగ్గఱదగ్గఱగా నీతీరునఁ బ్రయోగించుట సరసరచనగాదనియు నేను వ్రాసితిని. దానిపై శాస్త్రులుగా రిట్లు వ్రాసిరి:— "ఆంధ్రసాహిత్యపరిషత్కా

స్థానమునుండి నేను తెప్పించిన పాఠములలో 'తలంచిన' అను పాఠ మొక తాళపత్రగ్రంథమున నున్నట్లున్నది."

ఇది వింతగా నున్నది! ఆపాఠములుగల కాగిత మును పొఱపడి, యందలివిషయము నఱకొఱగా స్మరించియో, వారు వ్రాసినకాగితమున 'తలంచిన' అన్నలిపి యస్పష్టమగుటచే ననుమానించియో, వ్రాసి పంపినవారి నవిశ్వసించియో, శాస్త్రిలుగా 'రున్నట్లున్నది' అని వ్రాసిరి!

ప్రాచ్యలిఖితపుస్తకశాలలో పదులకొలఁది భారతపు వ్రాఁతప్రతు లున్నవి. ఇటీవల పీఠికాపురాధీశ్వరులు పదులకొలఁది భారతప్రతుల మరలఁ బంపిరి. అన్నింటిని బరిశీలించితిని. అన్నింటను 'తీర్పఁగ వచ్చిన' పాఠమే కలదు. ఎకాడమీ పుస్తకభాండాగారమునఁ గూడఁ బదులకొలఁది భారత ప్రతు లుండియుండును. శాస్త్రిల వారి "తలంచిన" పాఠ మిన్నింటను లేక యొక ప్రతిలో మాత్ర 'మున్నట్లున్న'దట. ఏది ప్రామాణికమో, గ్రాహ్యమో సహృదయులే యెఱుఁగఁగలరు.

మఱియు శాస్త్రిలుగారు "రెండుమార్లొకటే పదము దగ్గఱదగ్గఱగా వచ్చుట విరసమే యైనచో నట్టి దోషము మనము గ్రహించినపాఠమున 'వచ్చిన' అను చోటఁగూడఁ బట్టునేమో" అని వ్రాసిరి!

"పల్కకయుండఁగ వచ్చునే కడుం, దెగ మొదలె త్తిపోవఁ బగఁదీర్పఁగ వచ్చినఁ గార్య మొందు" అనుటలో 'వచ్చు' ధాతువు నావృత్తికిని, "తీర్పఁ దలంచినఁ గార్య మొందు నే, మిగతిఁ దలంచినన్" అనుటలో 'తలంచు' ధాతువు నావృత్తికిని మిక్కిలి భేదము గలదు. మొదటి దెంతో దూరముగానున్నది. మఱియు నందు మొదటి 'వచ్చునే=శక్యమా?' అని యర్థము గలది. రెండవ 'వచ్చిన=చనుదెంచిన' అని యర్థము గలది. దూరస్థితి, అర్థభేదము ఉండుటచే తొలి దాన రచనావైరస్యము లేదు. శాస్త్రిలుగారు దానిని దీనిని బోల్చుట సరిగాదు.

శాస్త్రిలుగారు నేను జెప్పిన యర్థమువిూఁదఁ జూపిన దోషములు నిజముగా దోషములుగావని నిరూపించితిని. ఇఁక వారుచెప్పిన యర్థమునుగూర్చియు, వారు వ్రాసిన మఱికొన్ని విషయముల గూర్చియు, సంస్కృత భారతమును గూర్చియు, దాని తెలిఁగింపును గూర్చియు వ్రాయవలసినది హెచ్చుగా నున్నది. విస్తరభీతిచేతను, నా యర్థసమర్థనమున కవి యనావశ్యకము లగుటచేతను నిక్కడ విడుచుచున్నాను.

వే. ప్రభాకరశాస్త్రి.

---

## అపాదనకర శాసనము

నేను శ్రావణమాససంచికలో అపాదనకరశాసనమును గురించి వ్రాసినవిషయము మన్మిత్రులును, నాకు పూజ్యులు నైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మనస్సునకు కష్టము కలిగించె నన్నవిషయము వారు 'పునర్విమర్శనము' అను శీర్షికక్రింద ఈశాసనమును గురించి భాద్రపదమాస సంచికలో వ్రాసిన వ్యాసమును బట్టి— ఇతరులకు అగునో కాదో కాని, నాకుమాత్రము—స్పష్టమగుచున్నది. నావ్యాసమున వాడిన 'కదిపి' రన్నమాట వారిమనస్సు చాల నొవ్వజేసిన దనికూడ వా రుపయోగించిన 'మంచియోగ్యత గలమాట' వలన నేను గ్రహింపగలిగితిని. మానై పుల 'కదుపుట' విపరీతార్థద్యోతకము కాని, అపార్థస్ఫురణముకాని కాదు. ఇంతవరకు నాకు దానిలోనుండు విపరీతార్థముకాని, విశేషార్థముకాని తోప లేదు. దీనిమాట యటుండనిండు.

నావ్యాసమున నే నెరిగినంతవరకు కేవలము విషయమునే ప్రధానము చేసికొని వ్రాసితినికాని శ్రీశాస్త్రిగారిపై నెట్టి ఆరోపణలను, నిందలను, అవహేళనములను జేసియుండలేదని నానమ్మకము. నా కట్టిఅవసరము కూడ లేదు. ఇంతవరకు మేము మిత్రులమే కాని విరోధులము కాము. అభిప్రాయభేదము కలిగినంత మాత్రమున. అసలు విషయములను వదలి వ్యక్తులనుగురించి

వ్రాయుట చాల తప్పని నే నెరుగుదును. దీని కింతవివరణ మేల? పాఠకులే ప్రమాణము.

శ్రీశాస్త్రిగారి వ్యాసధోరణి మాత్రము ధ్వని ప్రధానమై నాస్వభావమును గురించి పాఠకులకు దురభిప్రాయము కలుగఁజేయునదిగ నున్నది. శ్రీశాస్త్రిగారీ చర్చ 'సరసముగానే సాగునని నే విశ్వసించితి' నని వ్రాసియున్నారు. నేను నట్లే తలచితిని కాని యది యిట్లు పెడత్రోవ త్రొక్కునని నే ననుకోలేదు. అట్లు వ్రాయుట వారికి 'మంచియోగ్యత' అని తోచినది.

వారివ్యాసమున ముఖ్యముగ నిట్టిదురభిప్రాయము నుకలుగఁజేయునవి రెండుపట్టులు కలవు: (౧) ప్రతింబబి ప్రకరణము; (౨) చర్చాప్రకరణము. మూడవపట్టు ఇంకొకటి కలదు: అది నేను చెప్పినసంగతిని సరియైనరీతిని అన్వయింపక పోవుటనుగూర్చి. వారి కడచిన వ్యాసము కేవలము పాఠభేదములను గురించియే కాని అసలువాదమునుగురించి కాదు గనుక, నే నీపై మూడుపట్టులను గురించియే—అవి నామీద పాఠకులకు దురభిప్రాయము కలిగించునవిగ నుండుటచేత—యిట కొంచెము వ్రాయుచున్నాను.

నేను చెప్పవలసిన నాలుగుమాటలు తేటమాటలతో చెప్పెదను. ప్రతిబింబ ప్రకరణమును గురించి: 'నేను ప్రకటించిన పాఠములను స్పష్టముగా పరిశీలించుట కీవిషయమెల్లను చేర్కొనవలసె'నను వ్యాజమున శ్రీశాస్త్రిగారు ఒకటినరపుటలు వ్రాయుటలోని పరమార్థము ఆశాసన ప్రతిబింబములు వారికిచ్చుట నా కిష్టము లేదని పాఠకులకు బోధచేయుటయే యని నాకు తోచుచున్నది. లండను బ్రిటీషు మ్యూజియమునుంచి శ్రీలక్ష్మణరావుగారు తెప్పించిన అహాదనకర శాసనపు ఫోటోలును, ప్రతిబింబములును అసలు నాయొద్దనే యుండినవి. కాని ఒకటినర, రెండుసంవత్సరములకు పూర్వము నేను జ్వరములో నుండగా శ్రీనాగేశ్వరరావు పంతులుగారు వాటి నెందుకొఱకో ఒకమాఱు తెమ్మనిరని శ్రీగన్నవరపు సుబ్బరామయ్యగారు మాయింటికి వచ్చి వాటిని భారతీకార్యస్థానమునకు తీసికొనిపోయిరి. అటుతరువాత వాటిసంగతియే మరచితిని. వాటిని శ్రీగన్నవరపు సుబ్బరామయ్యగారు తీసికొనివెళ్ళిరన్న విషయమును మరచితిని. అటుపిమ్మట నెన్నిమారులో వాటినిగురించి మాయింట వెదకికొన్నాను కాని కానరాలేదు: ఎక్కడ పోయినవో అని చింతించి చింతించి చేయునది లేక యూరకొంటిని. శ్రీశాస్త్రిగారి అహాదనకరశాసన వ్యాసము ముద్రణదశలో నుండగా, ఒకమారు సాయంకాలము భారతీకార్యస్థానమునకు వెళ్ళినప్పుడు శ్రీసుబ్బరామయ్యగారు ఈప్రతిబింబములను అంతకుపూర్వమే అక్కడికి వచ్చియుండిన శ్రీశాస్త్రిగారికి చూపించుచుండగా వాటిని జూచి అపరిమితానందమును పొంది, 'ఇవి ఎక్కడ నున్నవి? మాయిల్లంతయు వీటికొఱకెన్నిసారులో వెదకితి' నని అంటిని. 'ఇక్కడ డ్రాయరులో నున్నవి. వెనుక మీరు జ్వరపీడితులై యున్నప్పుడు మీయింటికి వచ్చి శ్రీనాగేశ్వరరావుపంతులుగారికొఱకై తెచ్చితిని. ఈవిషయము మీరును మఱచితిరి, నేనును మఱచితి'నని శ్రీసుబ్బరామయ్యగారు బదులు చెప్పిరి. ప్రతిబింబోదంత మిది. శ్రీశాస్త్రిగారి 'అహాదనకరవ్యాసము' ముద్రణ మగువరకు మాయిరువురికి కించిత్తయిన పొరపులు కాని, వైమనస్యములు కాని లేవన్నవిషయముకూడ పాఠకు లెఱుంగ దగును. శ్రీశాస్త్రిగారికి ప్రతిబింబములనుగూర్చిన ఈవిషయముల నన్నిటిని ప్రతిబింబములు బయల్పడ్డపిదప శ్రీసుబ్బరామయ్యగారు తెలిపిరి. శ్రీశాస్త్రిగారు 'నిజముగా నే నీప్రతిబింబములు బయల్పడ్డపిదప వానిగూర్చి మరల శర్మగారితో నేమియు ముచ్చటింపను లేదు, వారు వానిని నా కొసగను లేదు.' అని వ్రాసినారు. మే ముభయులము అక్కడ ఉండగా బ్లాకులు చేయుటకై యుపయోగింపబడనున్న ప్రతిబింబములను నేను మరల వారికి ప్రత్యేకముగనియ్యకపోవుట పొరపాటే కావచ్చును. ఇట్టిస్థితిలో శ్రీశాస్త్రిగారు ప్రతిబింబములవిషయమునుగురించి లేశమును విడువకుండ ఒకటినరపుటలు వ్రాయుటలోగల పరమార్థము ఏదో సహృదయులైన పాఠకుల నిర్వికారాంతఃకరణమునకే గోచరింపవలెను. మఱిపునకుగూడ దురుద్దేశము లారోపితములైనచో నది విధివిలసితమే.

ఇక రెండవది చర్చావిషయము. శ్రీశాస్త్రిగారి వ్యాసమునందలి వాక్యము లివి 'ఈయక్షరమునుగూర్చి చర్చ పత్రికలలో బడకపూర్వము నేను శ్రీశర్మగారితో నీవాదపు సాధకబాధకముల జర్చింపగోరితిని. నాయుద్దేశములనెల్ల జెప్పికొంటిని. నాశాసనవిమర్శము ముద్రితము గాకపూర్వమును, ముద్రితమగుచున్నప్పుడును దానిని జూచి మంచిచెడ్డల జెప్పగోరితిని. నాకోరిక నెఱవేఱలేదు.' నేను నానెల్లూరుమండలయాత్ర ముగించి వచ్చిన పిదప శ్రీశాస్త్రిగారు తాము అహదనకర శాసనమునకు పద పదార్థ వివరణములను గొంతవరకు కావింపగలిగితినని మ్యూజియము కాఫీహోటలులో కలిసికొని చెప్పినప్పుడు నేను అపరిమితానందమును పొందితిని. ఈవిషయము వారికిని దెలియు ననుకొందును. తరువాత నేను 'కాన్నిమరా' లైబ్రరీకి వెళ్లినప్పుడు వారిని తరుచు కలిసికొనుచు వచ్చినపుడెల్ల ఈయక్షరప్రశంస నచ్చుచునే యుండెడిది. వారు నన్ను రెండుమారు లడిగిరి—అప్పటికింకను వారి వ్యాసము ప్రకటితము కాలేదు—"మీ రీ యక్షరమును బండి 'ఱ' యందురా? 'డ' యందురా?" అని. "మీరు ఇప్పుడు తలపెట్టుచున్నమీదట కాని నే నీవిషయమునుగురించి యోజించియుండలే దింతవరకు. అయినను అది 'డ' కాకూడదా అన్నదృష్టితో పరిశోధన చేసిన మీదట కాని నే నేమియు చెప్పలేను. ఆవిషయమై ఇక పరిశోధింతును." అని శ్రీ శాస్త్రిగారికి విన్నవించుకొంటిని. ఇంకను వారి వ్యాసము ముద్రణదశలో నున్నప్పుడే మరియొకమారు వారిని మ్యూజియములో కలిసికొనుట సంభవించినప్పుడు వారు నాతో 'మీరు నెల్లూరు మండలమునకు వెళ్లి ప్రాత తెలుగుశాసనములకు ప్రతిబింబములను దీసికొనివచ్చితిరి కదా, వాటినిబట్టి ఈ యక్షర మిదియని నిర్ధారణచేయుట కవకాశ ముండునా?' అనిరి. "భైరవునికోన శాసనములలో 'ఆచాఱ్లు' అనుపదములో కడపటి సంయుక్తాక్షరములోని ఎగువవర్ణము మీ సందేహమున కెడమిచ్చు నక్షరసంకేతముననే యున్నది. ఇంకొక శాసనమున 'ఈఱ్లు' అనుపదము వచ్చును. ఇందు కూడ కడపటి సంయుక్తాక్షరములోని ఎగువ వర్ణము ఈ సంకేతముననే కలదు. ఆపదములను 'ఆచాఱ్లు', 'ఈఱ్లు'గనే చదువవలసియుండు ననుకొందును. అట్లే యైనచో ఇవి ఆ యక్షరసంకేతమును 'డ'గ చదువుటకు ప్రతిబంధకములే యగునేమో. అందువలన ఆసంకేతము బండి 'ఱ' కాదగు"నని నేను జవాబిచ్చితిని. ప్రాచీనశాసనములలో 'ఊడ్లు', 'ఆడ్లు' మొదలైనపదము లున్నపుడు ఆ పదమును 'ఆచాడ్లు' ఎందుకు కాకూడదని శ్రీశాస్త్రిగా రనిరి. "నిజమే; 'ఊడ్లు', 'ఆడ్లు' మొదలైన వున్నవి: కాని 'ఆచాఱ్లు' అన్నది 'ఆచాడ్లు'గ చదువుట అంత సమంజసము కాదేమో. అయినను దీనినిగురించి నా కంత తెలియదు. ఇంకను పరిశోధింపవలసియున్న"దని జవాబిచ్చితిని. ఈవిధమున నీయక్షరమునుగూర్చి మ్యూజియము ఆవరణమున కలిసికొన్నపుడు కొంత కొంత చర్చ జరుగుచునే యుండెను. ఇదియంతయు వారివ్యాసము ప్రకటింపబడక పూర్వమే: ముద్రణదశయం దున్నప్పుడే. అంతవరకు శ్రీశాస్త్రిగారాసంకేతము 'డ' యనియే వాదించుచుండిరి. "మీరంత గట్టి పట్టుదలతో ఆయక్షరము 'డ' అని వాదించుటకు గల కారణము లేవో తెలిపినచో, అవి నాకు నచ్చినయెడల నేను అది 'ఱ' అనుటను మానుదు"నని కూడ రెండు మూడు పర్యాయము లడిగితిని; కాని వారు 'పడిహారి' పదములోని ద్వితీయాక్షర మిట్లే యున్న నది యేమి కావలెనని నన్నడిగిరి. అట్టియుదాహరణ లెక్కడనున్నవో కొంచెము చూపినచో ఆ సంకేతమునుగూర్చిన నా యభిప్రాయము తప్పైన మార్చుకొందు నంటిని కాని మరల వారు నా కాయుదాహరణములను జూపను లేదు; తమ కారణములను తెలుపను లేదు. అటుతరువాత ఇంకను వారి వ్యాసము ముద్రణదశయం దున్నప్పుడే మరియొకమారు మ్యూజియమునుండి ఇండ్లకు వెళ్లిపోవుచున్నప్పుడు మేము మ్యూజియములో శాసనశిలలు భద్రపరిచియుంచిన 'షెడ్డు' ముందర కలిసికొంటిమి. శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారు 'ఎపిగ్రాఫియా ఇండికా'లో ప్రకటించిరని శ్రీ శాస్త్రిగారు నుడివిన 'సత్యాదిత్య చోళమహారాజు శాసన' మున్నశిల ఆషెడ్డులో గలదు. అందు 'గుఱ్లు' అనుపదము వచ్చును. ఈ పదమునందలి సంయుక్తాక్షరములోని ఎగువ యక్ష

రము ఈవింత సంకేతమునే కలదు. శ్రీ శాస్త్రిగారు అప్పుడాపదమును నాకు జూపి దీనిని మీ రెట్లు చదివెదర లని నన్నడిగిరి. ఇక్కడ మరల మా కుభయులకు గొంత చర్చ జరిగినది. మీరు దానిని 'డ' గనే చదివితీరవలె ననుటకు దగిన కారణములను జూపుమనిరి, ఆపద మిప్పుడె ట్లుచ్చరింపబడుచున్నను, ఆ యక్షరసంకేతమును 'ఱ' గనే భావించి, దానిని 'గుఱ్ఱు' గనే చదువుదునని జవాబిచ్చితిని. అందుమీదట వారు కొంచె మవహేళనము చేసిరేమో కూడను. చర్చ తీవ్రరూపముగూడ దాల్చుతరి ఇరువురమును దానికి స్వస్తిచెప్పితిమి. వారివ్యాసము ముద్రణము కాకపూర్వమును, ముద్రణవేళలో నున్నప్పుడునుకూడ మాకుభయులకు నింతటి గ్రంథము జరిగినప్పుడు శ్రీశాస్త్రిగారు కడచిన తమవ్యాసమున నట్లు వ్రాసినందుకు "నే నేమి యనగలను? ప్రాజ్ఞు లున్నారని యూరకుందును."

శ్రీశాస్త్రిగారు తాము ఉదాహరించిన శాసనాదులకు స్పష్టముగా ఆకరముల దెలుపుకొంటినని వ్రాసినారు. నావ్యాసమున నేను ఆకరములను దెలుపనిమాట వాస్తవమే; కాని శ్రీశాస్త్రిగారు తమవ్యాసమున 'శర్మగారు తమ ప్రతివిమర్శనమున దాముదాహరించిన శాసనములలో దేనికిగాని ఆకరము దెలుపరైరి' అని వారు నాపై నొకనింద మోపిరి. "ప్రాచీనకర్ణాటక శాసనములందుగూడ నీవింతలిపి గలదు. అవి 6, 7 శతాబ్దముల నాటి శాసనములు. వానిలో ఫ్లీటుదొరగారు లిపులను బండి ఱ గనే పఠించిరి. అట్లు పఠించుటలో ననేకాసందర్భము లుత్పత్తిల్లెను. వాని నెల్ల వారు సంస్కారము సూచించియు, నర్థము వివరింపకయు, అర్థమే వ్రాయకయు బహువిధముల దాటిరి. అట్టివానిలో నేను బరిశోధించినవి గొన్ని 'డ' గ జదువుటచే సమన్వితములయినవి" అని వ్రాసి, వాటికి ఆకరములను దెలుపక వదలివేసినారు. ఇవి ఆకరములను దెలుపవలసిన సందర్భములు కావా? శ్రీ శాస్త్రిగా రుదాహరించిన పైశాసనములను నేను చూడగలిగియే యుండినయెడల ఇంతచర్చకు అవకాశ ముండెడిది కాదేమో!

ఇక మూడవ విషయము: 'శర్మగారు తమవిమర్శనమున లిపిరీతియే తమకు ప్రధానము కాని యర్థసమన్వయముతో దమకు పని లేదని వ్రాసిరి. నేను జిలుగువ్రాతగల కాగితములను జదువుటలో గూడ లిపి సంకేతములతోపాటు పద పదార్థసంగతి కూడ బాగపరిజ్ఞానమున ముఖ్యమగుట సర్వవిదితము. ఇంచుమించుగా శాసనలిపియు నిట్టిదే. అర్థసంగతియు నారయకున్నచో సర్వత్ర స్పష్టముగా బాఠనిర్ణయము లిపిమాత్ర జ్ఞానమునే సాధ్యముకాదు' అని శ్రీశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇదివరకు నేను ప్రకటించిన తెలుగుశాసనములలో శాసనమున దప్పులు గనబడినప్పుడెల్ల వాటిని 'ఫుట్టునోట్ల'లో సంస్కరించుచునే వచ్చినాను. ఈవిషయమును శ్రీశాస్త్రిగారును ఎఱుగుదు ర నుకొందును. అయితే మనకు సుబోధములైనట్టియు, వాడుకలో నింకను ఉన్నట్టియు, వాడుకలో గాకపోయినను గ్రంథములనుబట్టి మనకు దెలియవచ్చునట్టియు పదములు ప్రాచీన శాసనములలో తప్పులుగా వ్రాయబడినయెడల అట్టివాటినే సంస్కరించితిని. అట్టివే సంస్కార్యములని నాయభిప్రాయము. అంతియకాని అసలుపద మేదో, పదస్వరూప మెట్టిదో, అర్థ మేదో తెలియరానిపదములు ప్రాచీన శాసనములలో నున్నచో, వానిస్వరూపమును నిర్ణయించుపట్టున లిపియే పరమాధారమని ఇప్పటికి నానమ్మకము. ఇటువంటి వాటి సందర్భముననే లిపిరీతి నాకుప్రధానమంటిని కాని తదితరముల విషయమున గాదు. పాండురంగని అద్దంకి, ధర్మవరము శాసనములను, తదితరశాసనములను ప్రకటించినపుడు శాసనమూలపాఠమునందు ప్రామాదికములుగను, తప్పులుగను తోచిన పదములను సంస్కరించుచువచ్చిన నేను అట్లెట్లు చెప్పగలను? నేనితరప్రాచీన శాసనములను ప్రచురించుటలో చేసిన పద సంస్కరణముల నెఱింగియు శ్రీప్రభాకర శాస్త్రిగారు కడు దురవబోధముగ నున్న అహదనకరశాసనము (తెలుగుభాగము) విషయమున మాత్రమే వ్రాసిన 'లిపిరీతియే ప్రధాన' మన్న సంగతిని ఇతరశాసనములకుగూడ ననువర్తింప జేసినారు.


(7) Files of Termites watering Gardens and removing Seeds for Beds below
X.X. FUNGUS GARDENS
Z. Queen's Prison Cell Saturated with Water Vapour
(8) Innumerable small chambers constructed with woody fibre
(9) Termites ascending with Water and Store to replant Garden
(10) termile Shaft 3 inches wide
(11) Worker Termite
(3) North Wall of Well
(12) Cakes of woody sponge-like cellulose carton laid to cultivate Seeds
Y.Y. Fungus Seed Beds near Water to replenish Gardens
(13) Termites descending to Water
(5) Termite Shaft continues down to water
(6) Water Pocket of unknown depth
(14)

౨. చెదపురుగుల గుట్టు

శ్రీశాస్త్రిగారీప్రకరణమున ప్రాచీన శాసనములను ప్రకటించుటలో నేను చేసిన తప్పులను గొన్నిటిని పేర్కొని సవరించిరి. సాతలూరి తామ్రశాసనమును మరల కొంతకాలముక్రిందట చూచుట తటస్థించినపుడు దానిలో తప్పు లున్నవని తెలిసికొంటిని; కాని వాటిని సవరించి ప్రకటించుటకు నా కవకాశము కలుగలేదు. ఈ విధముననైనను శ్రీశాస్త్రిగారు తప్పులు సవరించిపెట్టినందుకు వారి కెంతయు కృతజ్ఞుడను. కాని యంతకుపూర్వము నా కంతో 'ఆప్తమిత్రులు' అయిన శ్రీశాస్త్రిగారు ఒక్కపరియైన వాటిని తాముకూడ గుర్తించినట్లు నాకు తెలిపి యుండకపోవుటకే చింతించెదను. ఇక చాళుక్యభీమరాజు సీసపప్ప్య శిలాశాసనమున 'వెన్నాజిలో జూపె' అన్నది 'వన్నాజిలో జూచె' అని యుండదగుననియు; శాసనశిలను పరీక్షింపగా ఆకడపటి యక్షరము 'పె' గ గాక 'చె' యని స్పష్టముగా గనబడుచున్నదనియు వ్రాసియున్నారు. శాసనశిలను, ప్రతిబింబములను నేనును పరిశీలించితి కాని నాకాయక్షరము వారు చెప్పునంతటి స్పష్టముగా లేదని తోచినది. ఎట్లయినను వారు చేసిన సంస్కారణమును, దిద్దుబాటును నాకు సమ్మతమే. నా తప్పు ఒప్పుకొందును. కాని శ్రీశాస్త్రిగారు ఈ 'అహదనకర శాసనవిమర్శన' సందర్భమున నావెనుకటి వ్యాసములలోని పొరపాటుల నుద్ఘాటించుటలోని సారస్యమును పాఠకులు గ్రహింపకపోరనుకొందును. ఇక మరికొన్ని విషయములు: 'శర్మగారు నాయర్థవివరణాదులు కొన్నియక్షరముల మార్చి, చేర్చి, తీసివేసి చేసిన వగుటచే జాలసందేహింపవలసి యున్నవనిరి. అయినను గొన్నిపట్టుల భాషావేత్తలు ఆదరముతో ఆలోచించుట కర్హమైన శబ్దనిష్పత్తులు గలవన్నారు గాన యిక ధన్యుడ' నని వ్రాసిరి. దీనిని బట్టి ఆ నా వ్రాతను శ్రీశాస్త్రిగారు అవహేళనమని తలచినట్లు నాకు స్ఫురించుచున్నది; కాని అహదనకరశాసనమునుగూర్చిన వారి ప్రథమవ్యాసమును తిలకించినచో నేను వ్రాసినది అవహేళనమో, సత్యమో పాఠకులే గుర్తింపగలరు.

శ్రీశాస్త్రిగారు వారివ్యాసమున వేరొకచో నేను "ప్రభాకరశాస్త్రిగారికి ప్రాచీనచాళుక్యలిపి చదువుటచేత కాదన్న సిద్ధాంతము పుట్టదగినన్ని యాక్షేపములను ప్రోదిచేసితి"నని వ్రాసియున్నారు. శ్రీ శాస్త్రిగారిని గూర్చి నా కట్టి దురభిప్రాయమే యుండినచో వారి శాసనవ్యాసమును విమర్శించియే యుండను. వారి విమర్శనము అమూల్యమైనదని తలచియే దానివిషయమున నాకు గల యభిప్రాయభేదములను దెలుపుకొంటిని. నా వ్యాసమున కట్లు శ్రీ శాస్త్రిగారు విపరీతార్థము చేసికొనుట నాకు చాల వింతగ నున్నది.

ఇంక అహదనకరశాసనమునందలి పాఠభేదములను గురించి: ఇంకను వాదము - శ్రీ శాస్త్రిగారి వ్యాసము ప్రకారము చూచిన - ముగియలేదు గనుక, అది ముగిసిన పిదప పాఠభేదములకు అవసరమైనచో బదులు చెప్పుకొందును: ఒప్పులని ఇంకను నాకు నమ్మకమే యున్నచో అవి యొప్పులే యని వాదింతును. తప్పులని నమ్మకము కుదిరినచో అవి తప్పులని ఒప్పుకొని వాటిని సవరించుకొందును.

వ్యక్తివిషయకముగ నింత వ్రాసికొనవలసి వచ్చినందుకు సిగ్గుపడుచున్నాను; శ్రీ శాస్త్రిగారి వ్రాతలో ప్రత్యేక మీపైవిషయములకు జవాబీయకపోయినచో పాఠకలోకమునకు నన్నుగురించిన దురభిప్రాయముపోదని యింతగ వ్రాసికొనవలసివచ్చినది. కావున అనవసరచర్చతో ఇంత వ్రాసినందుకు పాఠకులు మన్నింతురు గాక! ఇంక ఈవిషయమున వ్యక్తిగతముగ నెంత చర్చ వచ్చినను అది మరియు మితిమీరిననే తప్ప—నే నేమియు వ్రాయదలపెట్టువాడను కానని విన్నవించుకొనుచున్నాడను.

మల్లంపల్లి సోమశేఖరశర్మ.



# బాగడ తలికెలు

'కాళిదాసః కవిశ్రేష్ఠః'

ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగంతుం వ్యవసితా
ముహు స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే;
పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
మయి క్రూరే యత్తత్సవిషమివ శల్యం దహతి మామ్.

ఈశ్లోకమున మహాకవిగారి భావపోషణనైపుణి కన్పట్టెడిని. దుష్యంతునియందు శకుంతలావియోగజన్యమైన శోకమును సాధించుచున్నాఁడు. ఏది స్మృతికి వచ్చుటచేత ఈశ్లోకము అపారమగునో అట్టిదానిని దుష్యంతుని స్మృతిపథమునఁ బెట్టవలెను. తాను త్యజించి వెళ్ళఁగొట్టినప్పుడు శకుంతల కణ్వశిష్యులతోడను, గౌతమితోడను పోఁబోయినది. కణ్వుని తర్వాత కణ్వునంతవాఁ డాశిష్యుఁడు, "నిలు" అని యదల్చినాఁడు. అప్పుడామె మరలఁ గన్నీరు గార్చుచుఁ దన్నుఁ జూచినదఁట. ఈపరిస్థితిలో శకుంతల యీచేష్ట విషముతోఁగూడిన బాణాగ్రమువలె బాధించుటయం దబ్బురము కన్పట్టకపోఁగా, దుష్యంతుని దుఃఖము పరిమితి లేనిదని మనమనస్సులకుఁ దోఁచుచున్నది. ఇట్లు శోకపోషకమైన చేష్ట కవికిఁ దోఁచుటయే మహాకవి లక్షణము.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేన యా పల్లవమ్;
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే
యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం
సర్వై రనుజ్ఞాయతామ్.

ఈశ్లోకములోఁ గణ్వునియందు శోకమును శకుంతలావియోగముచే సాధించుచున్నాఁడు. శకుంతలమీఁది వాత్సల్య మీశోకమునకు హేతువు. ఆవాత్సల్య మెక్కువగుటకు శకుంతల ప్రేమించెడి వస్తువులును, ఆమె ప్రేమాతిశయము సూచించు చెయ్వులును కణ్వుని స్మృతికి రావలెను. అం దిట్టిచేఁతలు ఆఁడుపిల్లలకు సహజములై, సౌశీల్యసూచకములై, తలిదండ్రులకుఁ గూఁతుల నత్తవారింటికిఁ బంపునప్పుడు స్మృతికి వచ్చి శోకమును బెంచునో, ఎవ్వి యాశ్రమవాసుల కుచితములో, అవి కాళిదాసమహాకవిగారికిఁ దోఁచుటయే రసభావపోషణచాతుర్యమును దెల్పుచున్నది.

ఔత్సుక్యమాత్ర మవసాయయతి ప్రతిష్ఠా
క్లిశ్నాతి లబ్ధపరిపాలనవృత్తి రేవమ్;
నాతిశ్రమాపనయనాయ నచ శ్రమాయ
రాజ్యం స్వహస్త ధృతదణ్డమి వాతపత్రమ్.

ఇట్టి శ్లోకములలో మానవప్రకృతి పరిశోధననైపుణ్యము కవియందుఁ గన్పట్టుచున్నది. గొప్పగొప్ప పదవులను నరులు గోరుదురు. అవి లభించిన పిమ్మట వారికి పనిలేనివారి కుండెడి నిశ్చింత యుండదు. అయినను మానవుఁ డాపదవిని వదలలేఁడు. అప్పు డానరుఁ డెద్దానిఁ జూచికొని యానందపడుచున్నాఁడు? గొప్పను. ఆపదవియందున్నఁ దన్ను గౌరవించుజను లుందురు. వారి మెప్పే యీతని పురుషార్థము. అట్టి లోకులలోఁ బేరు ప్రతిష్ఠలు గలిగియుంట కుండే అతని హృదయము రమించుచుండును. ఇట్టి స్వభావమును "ఔత్సుక్యమాత్ర మవసాయయతి ప్రతిష్ఠా" అనుమాటచే మన కద్దమునఁ జూపినట్లు మహాకవి చూపుచున్నాఁడు.

శుశ్రూష స్వ గురూన్ కురు ప్రియసఖీ
వృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాఽపి రోషణతయా
మాస్మ ప్రతీపం గమః;
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
భాగ్యే ష్వనుత్సేకినీ

యాన్త్యేవం గృహిణీపదం యువతయో
వామాః కుల స్యాధయః.

ఇచ్చట భరతఖండములోని చిరకాలసంప్రదాయాగతమైన సాధ్వీమణుల శీలము నచ్చొత్తినాఁడు. లోకాతీతమైన సౌశీల్యమే వనితల కిక్కడ నుపదేశింపఁబడినది. "భర్తుర్విప్రకృతాఽపి రోషణతయా మాస్మ ప్రతీపంగమః" అను కణ్వోపదేశమును కోపము వచ్చి నప్పుడు శకుంతలయే పాటింపలేకపోయినది. "అనార్య! ఆత్మనో హృదయానుమానేన పశ్యసి క ఇదానీ మన్యో ధర్మకంచుక ప్రవేశిన స్తృణచ్ఛన్నకూపోపమ స్యాను కృతిం ప్రతిపత్స్యతే" అని భర్తను నిరాకరించి మాటాడుచున్నది. ఎల్లప్పుడు నెల్ల వనితలు నాచరింపలేకపోయినను లక్ష్యభూతమై యస్ఖలితధర్మస్వరూపము నిరూపింపఁబడి యుండుట ముఖ్యమని కవి యాశయము. చివరకు హేమకూటగిరిమీఁదఁ దన్నుఁ గాంచి పశ్చాత్తాపమందు భర్తతో శకుంతల "నూనం మమ సుచరితప్రతిబంధకం పురాకృతం తేషు దివసేషు పరిణామాభిముఖ మాసీత్. యేన సానుక్రోశోఽప్యార్యపుత్రో మయి తథావిధ స్సంవృత్తః." అనినది.

అస్మాన్ సాధువిచిన్త్య సంయమధనా
నుచ్చైః కులం చాత్మనః
త్వయ్యస్యాః కథ మప్యబాన్ధవకృతాం
స్నేహప్రవృత్తించ తామ్;
సామాన్యప్రతిపత్తిపూర్వక మియం
దారేషు దృశ్యా త్వయా
భాగ్యాయత్త మతఃపరం నఖలు త
ద్వాచ్యం వధూబన్ధుభిః.

ఈశ్లోకమున వస్తుధ్వనుల వెదఁజల్లుచు మహాకవి త్వమును గాళిదాసుఁడు చూపించుచున్నాఁడు. 'సంయమధనులమైన మమ్ముల నాలోచించి' అనినప్పు డెన్ని యైనధ్వనులు రావచ్చును.

౧. మేము డబ్బులేనివారము కాన నీకుఁ దగిన ట్లరణ మీయలేము.

౨. మావంటి ఋషులయాజ్ఞ శిరసావహించుట మీకు వంశాచారము.

౩. మేము శాపాయుధులము కాన మామనస్సు నొప్పించుట నీకు శ్రేయము కాదు.

౪. మేము సంయమధనులము. కావుననే సొమ్ము పారవేసిపోయిన దొంగవానినిబిల్చి దొంగిలించినసొమ్మును సమర్పించినట్లు కోపింపక శకుంతలను నీకడ కంపితిమి.

౫. శాపాయుధులమైన మాయాశ్రమమునందలి కన్యను మాయాజ్ఞ లేక వరించితివి. ఇప్పుడు పిల్లను పంపుచున్నాము. మాసౌశీల్యమును నీ వెట్లు గ్రహింపఁగలవో!

ఇట్లే "అబాంధవకృతాం" అనునప్పుడును అర్థశక్తిమూలధ్వనులై యనేకార్థములును, పెక్కుభావములును దోఁచెడిని. "సామాన్యప్రతిపత్తి" అనునప్పుడు శబ్దశక్తిమూలధ్వని మర్యాదతో సభంగశ్లేషరూపమై రచన యర్థతతిని వ్యక్తపఱచెడిని.

సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి;
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదిత రసమ్;
అఖణ్డం పుణ్యానాం ఫలమివ హి తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః.
ఇదం కిలావ్యాజమనోహరం వపు
స్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి;
ధ్రువం సనీలోత్పలపత్రధారయా
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.

ఇట్టిచోఁ గాళిదాసుని యుపమా కల్పనాచాతుర్యము వెల్లడియగు.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# వృత్రుఁడెవఁడు

ఈ విషయమునుగూర్చి ఋగ్వేద మేమి చెప్పుచున్నదో చూతము. ఋగ్వేద ప్రథమమండల ప్రథమాష్టక ద్వితీయాధ్యాయ సప్తమానువాకములోని రెండవ

సూక్తసంతయు కొంచె మించుమించుగా ఇంద్రవృత్ర వ్యాపారమునే వర్ణించుచున్నది. అందు కొన్ని ఋక్కుల భావ మిట్లున్నది.

౧. ఇంద్రుఁడు అహిని (అనఁగా మేఘుని) బద్దలు చేసెను. వానిలోనుండి వచ్చిన జలమును భూమి మీఁద పడునట్లు కొట్టెను. కొండలమీఁద పడి ప్రవహిం చు స్వభావముగల యానీటిని పర్వతప్రదేశములు భేదిం చుకొని నదులుగా ప్రవహించునట్లు చేసెను.

౨. ఇంద్రుఁడు త్వష్ట యిచ్చిన వజ్రముతో పర్వ తము నాశ్రయించియున్న యహిని (మేఘుని) భేదిం చెను.

౩. గాఢాంధకారము గలిగించిన వృత్రుని (మే ఘుని) ఇంద్రుఁడు వజ్రముతో కొట్టఁగానే, వాఁడు మొదలు నఱికిన చెట్టువలె నేలపై కూలెను.

౪. వర్షము లేకపోవుటచే భిన్నములైన జన ముల మనస్సులు సంతోషించునట్లుగా, జలములు ప్రవాహవేగమున గట్లు తెగిన సింధునదము నతిక్రమించి పోవునట్లుగా భూమిమీఁదపడిన వృత్రుని (మేఘుని) దాఁటిపోవుచున్నవి. ఏవృత్రుఁడు జీవనదశయందు ఏజల ములను నిరోధించెనో, ఆ మేఘరూపుఁడైన వృత్రుఁడు ఆజలముల కాళ్లక్రిందఁ బడినవాఁ డయ్యెను.

౫. ఉదకముల ప్రవాహద్వారమును మూసివేసిన వృత్రునిఁ జంపి యింద్రుఁ డాద్వారము తెఱచెను.

ఇట్లు, అహి వృత్ర శబ్దములు రెండును మేఘపర ములుగా నుపయుక్తము లైనవి. అహిని కొట్టినపుడు జలములు పర్వతములమీఁదను, భూమిమీఁదను పడినవని వర్ణించినట్లే, వృత్రునిఁ గొట్టినపు డావృత్రుఁడు నేలపై కూలెననియు, వానిపతనముచే నదీకూలపాషాణములు భిన్నములైనవనియు వర్ణించుట చూడఁగా, జల ప్రవాహవేగము స్ఫురించుచున్నది. మఱియు వృత్రుని మాయచేతను, మేఘావరణముచేతను అంధకా రము కలుగుచున్నదని సమానముగా వర్ణింపఁబడినది. ఇదియునుగాక, ఆఙ్పూర్వకమైన హనధాతువునుండి పుట్టిన అహిశబ్దమునకు అంతటవ్యాపించునది యనేయర్థ మున్నట్లే, వృతుధాతువునుండి పుట్టినవృత్రశబ్దమునకును ఆవరించునది యనే యర్థమున్నది. కావున, అర్థసా మ్యము, వ్యాపారసామ్యము, ఫలసామ్యము నొందుచున్న అహివృత్ర శబ్దములు రెండును ఏకార్థకములై, మేఘ పరము లగుచున్నవని తెలియుచున్నది. ఈయభిప్రా యము మనస్సున నుంచుకొనియే సాయణాచార్యుల వారు—అహిః = వృత్రః, మేఘః—అని వ్యాఖ్యానము వ్రాసినట్లు కనఁబడుచున్నది. వారు వృత్రశబ్దమునకు మేఘమనే యర్థము స్పష్టముగా వ్రాయలేదుగాని, ప్రకరణార్థమునుబట్టి అది యవగత మగుచున్నది. ఇక నో, వృత్రుఁ డనఁగా మేఘుఁడేయని యుందరమనియు, మేఘత్వమును ప్రచ్ఛన్నము గావించి వృత్రున కసుర త్వము గల్పించుట చమత్కారకారిణియైన ప్రాచీనమ మహర్షుల శైలియనియు గ్రహింపఁదగియున్నది. ఈవి షయమున యాస్కుఁ డుపదేశించిన తత్త్వ మిది—

"తత్కో వృత్రః? మేఘ ఇతి నైరుక్తాః; త్వాష్ట్రో సుర ఇత్యైతిహాసికాః. అపాంచ జ్యోతిషశ్చ మిశ్రీభా వకర్మణః వర్షకర్మ జాయతే. తత్ర ఉపమార్థేన యుద్ధ వర్ణా భవంతి."

"అయితే, వృత్రుఁ డెవఁడు? మేఘుఁడని నైరు క్తు లందురు. త్వష్ట కొడుకైన యసురుఁడని యైతిహాసిక లందురు. నీళ్లును, జ్యోతిస్సును కలియుటచే వర్షము పుట్టుచున్నది. వాటికి రూపకల్పనచేయుటచే యుద్ధవ ర్ణనలు సంభవించినవి."

అనఁగా జలమయుఁడైన మేఘునకు వృత్రాసుర రూపమును, జ్యోతిస్సునకు ఇంద్రరూపమును కల్పించు టచే వారిద్దఱికి యుద్ధము జరిగినట్లు వర్ణింపఁబడుచు న్నది. దీనినిబట్టి ఋజ్వర్థవ్యాఖ్యలో— "మరు త్తావేష్టితమైన యింద్రాఖ్యమైన వైద్యుత జ్యోతిస్సుచే వృత్రాఖ్యుఁడైన మేఘుని యుదరగతము లైన జలములు తాడ్యమానములై వర్షభావమును పొం దుచున్నవి. ఇక్కడ నిజమైనయుద్ధ మనునది లేదు" అని భగవద్దుర్గాచార్యులు వ్రాసిరి. మఱియు యాస్కుఁడు వృత్రశబ్దము నిట్లు నిర్వచించెను: వృ, వృన్, వృత్, ధాతువులనుండి వృత్రశబ్దము నిష్పన్నమగుచున్నది. అందు దానికి క్రమముగా ఆకాశము నావరించునది, పెరుగునది, జలమును ప్రవర్తింపఁజేయునది అని యర్థము. (వృత్రః= మేఘః.) కావున మేఘుఁడే వృత్రుఁడనియు, దానికి రూపకల్పన చేసి ఐతిహాసికులు వృత్రాసురుఁడని పురాణముల వర్ణించిరనియు, జ్యోతీరూపుఁడైన యిం ద్రుని సంఘర్షణచే వాన కలుగుచున్నదనియు తెలియు చున్నది. అందుచే మేఘుఁడే వృత్రుఁడు.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---



## పియరీఇమాన్సుగారు-లక్కప్రతిమలు

పశ్చిమ ఖండవాసులు మనయెడల నసహ్య భావమును గలిగియున్నవారలయినను వారు మన కనేకవిధముల నాదర్శకు లగుచున్నారని యొప్పుకొనక తప్పదు.

భరతఖండమున పాలరాతితోను, లోహముతోను పాశ్చాత్యవిధానము లందు చక్కని విగ్రహములను నిర్మింపజాలు శిల్పులు కలరు. కాని లక్క, మైనమువంటి పదార్థములతో విగ్రహములను నిర్మించువారు మనలో నరుదు; లేరనియే చెప్పవచ్చును.

లక్క విగ్రహములను చేయుటయందు సుప్రసిద్ధులగు పియరీ ఇమాన్సుగారీ వ్యాపారమునకు నూతనమగు ప్రాముఖ్యమును దెచ్చిరి. దీనినిగూర్చి సెప్టెంబరు మాసపు స్ట్రాండు మాగజిను నందు చక్కని వ్యాసము కలదు.



పియరీ ఇమాన్సు

వీరు లక్కపనులయందలి యన్నివిధానములను నేర్చుకొనిరి. తరువాత కళాకోవిదులను సమకూర్చి తమపనిని ప్రారంభించిరి..........తరువాత రంగులను పూయుటను గూర్చి వీ రనేక ప్రయత్నములను జేసి చూచిరి. సంపూర్ణముగ తృప్తికరముగ లేని యొక విగ్రహమునైనను వీరు అమ్ముడు పోనివ్వలేదు. నేడు



1. మిలిసుజేన్ లెంగ్లెన్, 2. మిస్ హెలెన్‌విల్సు, 3. మేయల్ ప్యారిసు సంగీతమందిర గాయకులు.



మరికొన్ని ప్రతిమలు

పియరీ ఇమాన్సగారు మూడువందల మంది కార్మికులను నియమించి లక్కతో మనుష్యవిగ్రహములను చేయించి ప్రపంచమున నన్ని భాగములకును బంపుచున్న కర్మాగారమున కాధిపత్యమును వహించియున్నారు.

వీరు చేయువిధానమును బరిశీలించిన ప్రతికార్మికునకు, చిత్రకారునకు ఉండవలసిన దీక్ష జాగరూకత గోచరమగును.

ముఖభాగ మేదోవిధముగ తయారైన పిమ్మట నునుపుచేయుట, దిద్దుట ప్రారంభమగును. పోతపోయగా నేర్పడిన చిహ్నముల నన్నిటిని తీసివేసెదరు. ... ... తరువాత తలపై నొక కన్నమును చేసి దీనిని మరియొక భాగమున కంపెదరు. ఇచ్చట కనురెప్పల క్రింద పెదవుల క్రిందను గలలక్కనుపలుచపరచి కండ్ల పండ్లను పెట్టెదరు. కొంచెము భేదమున్న ద్రు నను వినాశకరము కాన కండ్లను పెట్టుట సు మైన పని కాదు.

ఇంజక్షనులను ఇచ్చేపిచికారీ సూదివంటి సూదిని వేడిచేసి దా కన్నములను జేసి, తలవెండ్రుకలను రెప్పవెండ్రుకలను తగల్చెదరు. మా వుని వెండ్రుకలనే యుపయోగించు వలన ప్రతిమలకు వింతయగు సొగసు కలుగును.

తరువాత ఇట్టి విగ్రహము కళాకోవిదు వర్ణకారుని వద్దకు బంపబడును. ఈతని ప్రా ణ్యమువలన నది స్వాభావికమైన రంగులతో వి జిల్లును.

ఈరంగులు లక్కలోని కింకుటకు ఏదో రహస్యమైన పద్ధతి కలదట. తరువాత నిజమగు దుస్తులను దొడుగు టచే నీవిగ్రహములు మనుష్యులవలెనే యుండునట. ముతుకకుంచెతో తాకు టవలన మానవ చర్మమునందువలె వీటిపై ముడుతలు మొదలగునవి యేర్పడునుకాన నెంత సూక్ష్మముగ బరిశీలించినను నిర్జీ వమగు ఈవిగ్రహము జీవపూ తమైయున్నటులుగానవచ్చును.



లిండ్ బర్గు

ఇట్లు పాశ్చాత్యులు తమ వాణిజ్యమున లలితకళలను వి విగ నుపయోగపరచి ధనము నార్జించుచున్నారు.

ఈవిగ్రహములం దనేకము సుప్రసిద్ధ పురుషులరూపములు, లిండ్

బర్గ (ఈతడు ప్రసిద్ధిపొందిన ఫ్రెంచి వైమానికుడు) యొక్క ప్రతిమ లెక్కపగ నమ్ముడు పోవుచున్నవి. ఇవి ఫ్రాన్సునందు వేలకొలది కిటికీలనుండి దారిపోవు వారివైపు జూచి నవ్వునటు లుండును. ఈతని లే బ్రాయపు తలపై నుంచిన దొరటోపీలు వేగముగ నమ్ము డుపోవును. ఫ్రాన్సురిపబ్లి కుక్కన కధ్యక్షులగు మాన్సియర్ గేస్టను దూమెర్గుగారి ప్రతిమ మధ్యరకపు స్థూలకాయులకు గావలసిన దుస్తులను బ్రదర్శించుటకు ఉపయోగపడును. సుజేనీ లెంగ్లెన్, హెలెన్‌విల్సు (వీరు టెన్నిసు ఆటయందు పేరుపొందిన యువతీమణులు) గార్ల యొక్క విగ్రహములు నవీనము లగు స్త్రీల టెన్నిసు దుస్తులను బ్రదర్శించును.



గేస్టన్ దూమెర్గు

... ... ... ...

సినీమాకు పోయెడివేలకొలది ప్రజలను కడుపు ఉబ్బునటులు చేయుటయం దద్వితీయుల



చార్లీచాప్లిన్ జాకీకూగన్



ఇమాన్సుగారి కార్యాలయము

గు 'చార్లీ చాప్లిన్', 'జాకీకూగను'గార్ల ప్రతిమ లెంతస్వాభావికముగ నున్నవో కాంచనగును.

---

## మరణదండనము జరుగుచుండ ఛాయాచిత్రము దీయుట

వార్తాపత్రిక లొకదానినొకటి మించి యుండుటకును, చందాదారులసంఖ్య వృద్ధియగుటకును పత్రికాధిపతు లనేకప్రయత్నములను జేయుచుందురు. ఏదైన వింతవిషయము జరుగనున్నదని విన్నప్పుడు, అనుభవశాలులగు వార్తాగ్రాహకులను (Reporters) బంపి, యా వింత విషయముయొక్క సంపూర్ణమగు వర్ణనను సేకరించి యందరికంటె ముందుగా ప్రచురింప యత్నించెదరు. పత్రికాధిపతులు వ్యయమునకు వెనుదీయరు. వార్తాగ్రాహకులు ప్రయాసమునకు వెరవరు. చిత్రప్రచురణము ప్రాముఖ్యము వహించుచున్న యీకాలమున ఛాయాచిత్రగ్రాహకులును అనేక విధముల ప్రయత్నములనుజేసి చక్కని చిత్రములను, సేకరించుచున్నారు. విమానములపైనెక్కియు,

క్రూరమృగములమధ్యకు బోయియు ఛాయా చిత్రములను దీయునప్పుడు సంభవించు ఆప త్తులకును వెఱచువారు కారు.

విద్యుచ్ఛక్తిచే మరణశిక్షను బొందుచు న్నవారి ఛాయాచిత్రములను తీయకూడదని యొక నిబంధన కలదు. అతిజాగ రూకతతో కని పెట్టుచున్న పో లీసు భటులను గూడ మోసపు చ్చి యిట్టిచిత్తరు వొకటి యెట్లు తీయ బ డె నో సిడ్నీ సదర్లేండు గారు సెప్టెంబరు మాసపు స్ట్రాండుపత్రికయందు వర్ణించిరి. ఈ వ్యాసకర్త ఛాయా చిత్రకారునకు ఛాయా చిత్రగ్రహణమునందు సహాయము జేసినారు.



రూత్ స్నైడరు

భర్తనుజంపిన 'రూత్ స్నైడరు'నకును, ఆమెకు సహాయముజేసిన 'జడ్ గ్రే'కును మరణశిక్ష విధింపనున్నా రని విని న్యూయార్కునందు ప్రచురింపబడుచున్న 'డెయిలీన్యూసు' అను వార్తాపత్రికయొక్క అధిపతి ఆదండితుల మరణముయొక్క ఛాయాచిత్రమును తీయు టకు దలపెట్టిరి. ఇట్టికోర్కె యనేకులకు పుట్టియుండ వచ్చును కాని వారికి సాహసము సాధారణముగ నుండుట దుర్లభము. మూడేండ్లక్రితముకొన్న రెండు అంగుళములు వెడల్పు, మూడంగుళములు ఎత్తు, మూడంగుళములు పొడవుకల చిన్న కేమెరా వీరికడ నుండెను. ఇక సాహ సించి చిత్తరువును గ్రహించువా రుండవలెను. ఉన్నత పదవిని స్వీకరించుటకు పోవుచున్న 'థామస్ హోవర్డు' అను ఛాయాచిత్రగ్రాహకు డీపత్రికాధిపతిని జూచు

టకు అకస్మాత్తుగ వచ్చెను. "విద్యు చ్ఛక్తిపూరితమైనకుర్చీపై గూర్చొ నియున్న 'రూత్ స్నైడర్' యొక్క ఛాయాచిత్రమును గ్రహిం పగలవా?" యని యాపత్రికాధి పతి 'హోవర్డును' ప్రశ్నించెను. "ప్రయత్నించెదను." అని హోవర్డు ప్రత్యుత్తర మొసగెను.



థామస్ హోవ

కేమెరాను రహస్యముగ నుంచుటకు అనేక లగు ప్రయత్నములు గావింపబడినవి. వెయిస్టుకోటు ఏదాచిన నూపిరి తీయుటయందు కేమెరాకదలును. ... యొకచోట పెట్టుటకు వీలు లేకపోయెను. తుదకు చర్చించి, చిత్తరువున జూపినటులు గాలికి ... కేర్పాటు జేసిరి. కాలి వరాయిలోనుండి కోటు ... లోనికి వచ్చున ట్లుంచుకొన్న గొట్టముచివరనున్న ... చేతితో నొక్కి చిత్రమును దీయునట్లు నిశ్చయించు...

మరణము విధించునప్పుడు కొందఱుసాక్షు ... వలెను. అందులో హోవర్డుగారి నొకసాక్షిగ నేర్ప... చెఱసాలయొక్క ముఖ్యాధికారి లోపల జరుగనున్న ... ఛాయాచిత్రమును తీయరాదని సాక్షులందరికి తెలియ... సెను. లోపలికిబోయి యందరును కూర్చొనిరి. కేమెరా కదలకయుండుటకు కట్టుగట్టిగ కట్టుటవలన కాలికి నొ... కలిగినను హోవర్డుగారు బాధనోర్చి ధైర్యముతో ... యముకొరకు గనిపెట్టుకొని యుండిరి. సదర్లాండుగా... చాటుగ గూర్చొని వారిబాధను గొంత దీర్చుచు... కుర్చీకి విద్యుచ్ఛక్తిని విడిచిపెట్టిన యుత్తరక్షణము... హోవర్డుగారు జేబులోని గొట్టమునకున్న మరను నొక్కి... కేమెరా మూతము ... గప్పవలెను. వంగియో... డల అనుమానించు... కాన యాలిసామాను... జూచి సామ్మసిల్లి... వానివలె మందునకొ... తన కార్యము వారు... నెరవేర్చి యందరితో... వెలుపలికి ...



కాలికికట్టియుంచిన కేమెరా

మోటారు సిద్ధముగ నుండెను. దానిపై నాతడు రివ్వున బ్రయాణమై మార్గమున మరియొక మోటారు నెక్కి తన యాఫీసును జేరుకొనెను. ఛాయాచిత్రము బాగుగ రాని యెడల నింతప్రయత్నమును వ్యర్థమగును. కాని యిది వరకు కొన్నిసమయములందు మోసపుచ్చిన యాకేమెరా నాడత్యద్భుతమగు చిత్రరువును బ్రపంచమునకీయగల్గెను.

ఎంతయో యాతురతతో వేచియుండిన యాకా ర్యాలయోద్యోగు లీవిజయమున కానందించి తమతమ కార్యములను త్వరగా జేయుటవలన కొలదికాలమునకే డెయిలీ న్యూసునందు ఆ చిత్తరువు ప్రచురమై ప్రపంచ మున కంతటికిని లభించెను.

హోవర్డుగారి ధైర్యసాహసము లితర వార్తాగ్రాహకుల కున్నయెడల మన వార్తా పత్రిక లిప్పటికంటె ఎక్కువగ మానవసేవను జేయగలిగి యుండెడివి.

---

## ప్రాచీనభారతీయ విజ్ఞానముయొక్క విలువ

[కరాచీలో జరిగిన యువకమహాసభాధ్య క్షోపన్యాసమున శ్రీ. టి. యల్. వాస్వాని గారు భారతీయ విజ్ఞానమును మన యువకు లెల్లరు పఠించు టత్యావశ్యకమని యిట్లు ఒకచిన్న ఉదాహరణముతో నొక్కి చెప్పి నారు.]

కొందఱు భారతీయవిజ్ఞానము సర్వాంగసంపూ ర్ణమయిన దందురు. నేను దాని నంగీకరింపను. ఏవిజ్ఞా నమును సంపూర్ణము కాజాలదని నావిశ్వాసము. భార తీయ విజ్ఞానము సంపూర్ణ మయినది కాకున్నను, ఈనాటి విశ్వప్రపంచమున కుత్కృష్ట సందేశము నొసగగలదని మాత్రము విన్నవించుకొనుచున్నాను. భారతీయవిజ్ఞాన ముత్కృష్టమగు నాదర్శముయొక్క శక్తితో నిండియున్న ది.ఆయుత్కృష్టాదర్శశక్తియే భారతదేశముయొక్కయు, అధునాతన ప్రపంచముయొక్కయు జీవనప్రవాహము లోనికి ప్రవహింపవలెనని నేను కోరుచున్నాను.

పెక్కేండ్లక్రిందట నొక గొప్ప భారతీయగూ ఢ మతవాది (Mystic) ఇంగ్లాండులో చెప్పినసంగతి నాకు జ్ఞాపకమునకు వచ్చినది. ప్రతాపచంద్రమజుందా రను గొప్ప బ్రహ్మమతప్రచారకు డగు భారతీయుని పేరునేని మీరందఱు వినియుండరని నేను తలతును. ఆతడు చిరకాలముక్రింద మరణించెను. గొప్పవిజ్ఞానవి శారదుడగు టిండలుగారు తీవ్రవిమర్శనమునకు గురి అయి యుండినకాలమున నాత డింగ్లాండున నుండెను. టిండ లుగారు బెల్ ఫాస్టు (Belfast) లో కావించిన ప్రసం గమున విజ్ఞానమునందు ద్రవ్యములయందు ఆత్మయొక్క ఉనికిని, శక్తినిగాంచగల కాలమువచ్చుచుండెనని చెప్పిరి. ఈయభిప్రాయము పెక్కురకు విరుద్ధముగ తోచి తీవ్ర విమర్శనములతో పత్రికలను నింపివై చిరి. ఒకమారపుడు మజుందారుగారు టిండలుగారిని సందర్శించి మాటాడుచు బెల్ ఫాస్టు ఉపన్యాసముల విషయమునుగూర్చి ముచ్చ టించెను. మజుందారుగారు టిండలుగారియెడ సానుభూ భూతిని జూపుచు ద్రవ్యమునకు, ఆత్మకు గలసంబంధము నుగూర్చి ప్రాచీనోపనిషత్తులు పేర్కొనిన సిద్ధాంత ముల నెత్తి చూపిరి. 'మీవాక్యములు నాకు మిగుల మనశ్శాంతిని గూర్చినవి. జ్ఞానజ్యోతిస్సు ఒకప్పుడు ప్రాగ్దిక్కునుండియే ప్రసరించినది. మరల నది యటనుం డియే ప్రసరించనున్నది' అని టిండలుగారు నుడివిరి. మన భారతదేశము విశ్వప్రపంచమున కొసగవలసిన దిం కను నొక్కవిషయము గలదని నేను సవినయముగ విన్న వించుకొనుచున్నాను.

ఆధిభౌతిక విజ్ఞానములయందు పాశ్చాత్యప్రపంచ ముత్కృష్టమయినది. ఆవిజ్ఞానముల తత్త్వమును పరిశీలించి కనుగొనుటకు మనము పాశ్చాత్యప్రపంచమునకు పాదసే వకావింపదగును. కాని భారతదేశము విశ్వప్రపంచమున కంతటికిని సందేశము నొసగవలసినవిషయ మింతకంటె వేరయినదని నావిశ్వాసము. మనము భారతదేశపు యథార్థహృదయమును గుర్తించుటకు ప్రాచీనభారతీయ విజ్ఞానమును శ్రద్ధతో బఠింపవలెను.

(జూన్ వేదిక్ మేగజినునుండి.)

---

## స్త్రీల వారసత్వపు హక్కులు

హిందూ ధర్మశాస్త్రప్రకారము స్త్రీలకు గల వారసత్వపు హక్కులు బహు స్వల్పము. సోదరిగాని,

కుమా ర్తెగాని వారసులుగ నంగీకరింప బడరు. జ్ఞాతులు లేనప్పుడే సోదరి, కుమారుడు బంధువుగ నంగీకరింప బడును. ఈలోపములను దీర్చు నిమిత్తము సర్ శంకరన్ నాయరుగారు స్టేటు కౌన్సిలులో నొక బిల్లును ప్రవేశ పెట్టిరి. దీని ప్రకారము కుమారుని కుమార్తెయు, కూతురు కూతురును, సోదరియు, సోదరి కుమారుడును, క్రమముగ తండ్రి తండ్రి తరువాత గాని, తండ్రి సోదరుని తరువాత గాని బంధువులుగను, వారసులుగను అంగీకరింప బడవలసియుందురు. స్త్రీల స్వాతంత్ర్యమును గూర్చి ప్రపంచమందంతటను అభిప్రాయములు మారుచున్నవి. సాంఘిక వ్యవస్థలయందే కాక రాజ్యాంగమునందు కూడ స్త్రీలు పురుషులతో సరిసమానముగ భావింపబడి, తదనుగుణ్యములైన సంస్కరణములు గావింపబడుచున్నవి. టర్కీ, పర్షియా మొదలగు మహమ్మదీయ రాజ్యములలో గూడ స్త్రీలకు సర్వవిధములైన స్వాతంత్ర్యపు హక్కు లంగీకరింప బడుచుండ, హిందూదేశమునందు మాత్రము స్త్రీలు పూర్వమువలె దాస్యమున బంధింపబడి యుండజాలరు. దేశమునం దంతటను స్త్రీ సమాజములు వెలయుచున్నవి. స్త్రీలు తాలూకు బోర్డులలోనికి, జిల్లా బోర్డుల లోనికి, మున్సిపాలిటీల లోనికి, శాసన సభలలోనికి ఎక్కుచున్నారు. బాల్య వివాహములను నిషేధించుటకు ఆందోళనము సాగుచున్నది. వారసత్వపు హక్కులుకూడ తక్కిన సంస్కరణములతో పాటు అంగీకరింపక తప్పదు. 1923లో టి. వి. శేషగిరి అయ్యరుగారు ప్రతిపాదించిన బిల్లు లెజిస్లేటివు అసెంబ్లీలో నామోదింపబడి యుండెను. న్యాయకమిటీ వారు కూడ స్త్రీలకు వోటింగు హక్కుల నొసగుట కంగీకరించిరి. వారసత్వపు హక్కులు లేని స్వాతంత్ర్యము నిజమైన స్వాతంత్ర్యము కాదు. శంకరన్ నాయరుగారి బిల్లు స్టేటుకౌన్సిలు వారి యామోదమును గూడ బడయును గాక.

(కృష్ణాపత్రిక, ౨౨-౯-౧౯౨౮.)

---

## క్షయ-నివారణము

శ్రీయుత 'ముకుట్'గారు త్యాగభూమి భాద్రపదసంచికయందు పైశీర్షికక్రింద నొక వ్యాసము వ్రాసిరి. అందు క్షయ యొక్క కొన్ని స్వరూపములను, ప్రాథమిక లక్షణములను వివరించి, అది అసాధ్య వ్యాధి కాదనియు, నివారణ గావించుకొన వచ్చుననియు, వంశపరంపరాగతముకూడ కాదనియు, కాని మిగుల భయంకరమైనదనియు సంతతపుకొని ధనము వ్యక్తపఱచెనని తెలిపి, శిశువులకు క్షయగ్రస్తులనీడకూడ తగులకుండ కాపాడ దగువిధము వక్కాణించి, ఆవ్యాధి భయకరత యించుక నిరూపించి, యిట్లు నుడివియున్నారు:

"నేకు మన భారతవర్షమున క్షయరోగులసంఖ్య కనీసము ౦౧ లక్షలని యంచన: అనగా, మొత్తము జనసంఖ్యలో ప్రతి శతమునకు ౨ రు ఈమహామారి పిడికిట జిక్కియున్నారు. మృతసంఖ్యయు తక్కువ కాదు— ౧౨౫ లక్షలజనులు ప్రతిసంవత్సరము దీనికి కానుక పోవుచున్నారు. పోనీ, కాలము గడచినకొలది తగ్గుచున్నదాయనిన, అదియు లేదు: నానాటికి వృద్ధియగుచున్నది. సర్కారులెక్కలను అనుసరించి, కడచిన ౨౧ సంవత్సరములలోను ౫౧% పెరిగినది. చికిత్సకును తగినయేర్పాటు లేదు. రోగము వ్యాప్తియే అట్లున్నది; ఇక సర్కారులెక్కలప్రకారము, ౦౦ లక్షలక్షయరోగులలోను ౦౧౦ మందికి మాత్రమే చికిత్సాలయములలో నేర్పాటు గలదు. ఇన్ని ఆసుపత్రులు, డిస్పెన్సరీలు కలిసి సాలుమొత్తమున చికిత్సచేసెడిది లక్షనర రోగులకు! ఇంకను తక్కువ మందికేమోకూడ! ఎక్కడ ౦౦ లక్షలు, ఎక్కడ ౧౪ లక్ష! ఏమూలకు? కాని ఎవరితో చెప్పుకొనుట? మనకంటెను మన కెక్కువ హితులా యేమి సర్కారువారు!!

కాని యిటు కొలదినాళ్ళనుండి కొందరు మహాసుభావుల దృష్టి యీ పెడకు మరలినది. క్షయచికిత్సాలయములు, స్వాస్థ్యగృహములు, క్షయచికిత్సాశిక్షణాలయములు-వీనివిషయమై యాలోచన సల్పుటకు ప్రభుత్వమునకు సంబంధించినట్టియు, సంబంధింపనట్టియు సకలభారత ప్రతినిధులతో నొకసంఘము మేర్పరుపవలెననుఁ తీర్మానమొకటి రాజ్యసభయందు కావింపబడెను. సర్ ఇబ్రహీమ్ హారూన్ జాఫరుగారు లెక్కలద్వారా తనుకీలిని దీనిని సమర్థించిరి. వారి అభిప్రాయముప్రకారము 'భిన్నభిన్నరాష్ట్రముల ప్రభుత్వప్రతినిధులతో నొక మధ్యస్థసంఘము నేర్పఱిచి, దానిసాయమున పని నడిపిననే ఈ పెద్ద సమస్యకు తగిన పరిష్కారము జరుగును.' క్షయచికిత్సాశాలలను, స్వాస్థ్యగృహములను వృద్ధిపొందింపవలెనని వారి ప్రోత్సాహము. ఖర్చు పెరుగుగాక; రోగనివారణకై ఖర్చు పెట్టవలెను. దాతలును తమ దాతృత్వమున పాలీయవలెనని వారి ఆశయము. ఇంతేకాదు: ఈచికిత్సకై కార్య కర్తలకు శిక్షగఱుపవలెననియు వారిప్రోత్సాహము; ఇందు నిమిత్తమై శిక్షితసంస్థల సంస్థాపింపవలెనని వారు బోధించియున్నారు. ఇక స్వనామధన్యులు డాక్టరు ముత్తుగారు తమ జీవనమునే యిందుల కర్పించినైచినారు అనేకవత్సరములనుండి వారు ఇంగ్లండునందును; భరతదేశమందును దీని మూలకారణములయొక్కయు, నివారణోపాయముల యొక్కయు నన్వేషణమున నిమగ్నులైయున్నారు. వారు చాలవఱకు సాఫల్యము గూడ బడసి యశస్వులైనారు. వారు చెప్పురీతిని, పర్దాయు, బాల్యవివాహమును భారతీయసంఘమున ఈమహావ్యాధి వ్యాపించుటకు ముఖ్యకారణములు. అన్నపానములయందు మద్యమాంసాదులగు ఉత్తేజక పదార్థములిందులకు ముఖ్యకారణములేకాని, వారియభిప్రాయము ననుసరించి, బియ్యమును, పల్చనిపప్పును మిక్కుటముగ నేవించుటయు కొంతవఱకు దీనికి తోడ్పడును. ఉత్తరమునకన్న దక్షిణమున క్షయ యెక్కువగ నుండుట కిదియే కారణమట.

పిదప వ్యాసకర్త రా. బ. కప్తాను మహారాజకృష్ణ కపూర్ ఎం.డి, డి.పి.హెచ్. గారు (డి. ఏ. వి. కాలేజీ యూనియన్ మేగజినునందు) విద్యార్థిదశయందీరోగ మంకురించుటకుగల కారణములని తెలిపినవి కొన్ని. పేర్కొనిరి ఇంటికడ నప్పటివఱకు నెంతయో స్వేచ్ఛతో సంచరించుచుండిన బాలుడు పాఠశాలయందు ప్రవేశింప, హఠాత్ప్రతిబంధము వలన మనోవృత్తియిరుకుపడి, స్వాస్థ్యము చెడునట. అదికాక, బడియందు భయయుక్తమైన వాతావరణ ముండుటయు, భవనముల నిర్మాణము సరిగా లేకుండుటయు, ఒక్కొకగదికి పెక్కుమంది బాలుర కూర్చుండబెట్టుటయు స్వేచ్ఛానిరోధమునకు తోడై, యీదుస్తరోగము విద్యార్థులయం దవతరింపజేయుననియు, కావున నీవిషయముల తగిన సంస్కారముల గావించి, భయమయముకాక ప్రేమమయమగు వాతావరణము నిల్పి, బాలురస్వాచ్ఛందత హఠాత్తుగ భంగపఱుపక మెల్ల మెల్లగ వానిని దారికి తీసికొనివచ్చుచు మెలకువతో వర్తింపవలెననియు వారి ఆశయమని తెలిపి, వ్యాసకర్త చికాగో (అమెరికా) మ్యునిసిపల్ సానిటోరియమ్‌వారు ఈవిషయమున గావించిన సూచనలు మిక్కిలి యుపయోగకరములని చెప్పుచు నవి యీదిగువరీతిని పొందుపఱిచిరి:

౧. పేటెంటుమందుల నేవింపకుడు.

౨. ప్రకటన ఔషధాలవెట్టిలో పడకుడు.

౩. క్షయను తప్పక కుదుర్చుమందు నేటివఱకును దొరకలే దనువిషయము మఱవకుడు.

౪. చికిత్స పరిచితవైద్యునిచేగాని, గృహవైద్యునిచేగాని చేయించుకొనుడు.

౫. ఆకలికి మించి తినకుడు. సులభముగా నెంత పాటి జీర్ణమగునో అంతే భుజింపుడు.

౬. నియమితసమయమునను, కడుపు చూచుకొనియు భోజనము సేయుడు.

౭. జఠరము నారోగ్యముగా నుంచుకొనుడు.

౮. నమలి నమలి తినుడు.

౯. తక్కిన అవయవములకువలెనే జఠరమునకును నడుమ నడుమ విశ్రాంతి యిండు; అనగా ఉపవాసము చేయుచుండుడు.

౧౦. మాటిమాటికి తినకుడు; దీనివలన జఠరము దుర్బలమగును.

౧౧. రుచింపని, అనగా ఏది తినుటవలన మీకు ప్రసన్నత కలుగదో అట్టి, తిండి తినకుడు.

౧౨. గ్రుడ్లు తినుచున్నచో, రోజునకు ఒకటి రెండుకంటె నెక్కువ తినవలదు.

౧౩. భోజనముతో కొంచెము పాలుకూడ త్రాగుచుండుడు.

౧౪. ఎట్టిక్రొవ్వును భుజింపవలదు.

౧౫. వెన్న తినుడు, అది చాల లాభకారి.

౧౬. ఉమ్మియందు క్షయ కీటకము లుండును గాన ఇంటిసమీపమునగాని, నేలపైగాని, గోడలమీద గాని ఉమియక, కాగితముమీదనో, రుమాలుమీదనో, వస్త్రముమీదనో ఉమియుడు; పిదప వానిని తగుల బెట్టుడు.

౧౭. పీకిదానులో నుమియవలసినచో దానిలో కార్బోలిక్ ఆసిడును, నీరును (౧: ౨౧ భాగములుగా) వేసియుంచి, దినమునకు రెండుసార్లు వేడినీటితో దానిని కడుగుచుండుడు.

౧౮. దగ్గునపుడును, తుమ్మునపుడును క్షయాణువు లిటునటు చెదరి వ్యాపింపకుండ నోటిముందర రుమాలు పట్టి, దానిని మరుగునీటితో నుదుకవలెను.

౧౯. ఎవ్వరిని ముద్దుపెట్టుకొనవలదు. అందువలన క్షయకీటకములు వారియందు ప్రవేశించును.

౨౦. చాల విశ్రాంతి తీసికొనుడు.

౨౧. సాధ్యమగునంతవఱకు, ఇంటివెలుపల ఆరుబయటగాని, వరండాలోగాని మాత్రమే యుండుడు, తిరుగుటకంటెను, కూరుచుండుటకంటెను, పండుకొనుటకాని, నిదురించుటకాని మంచిది. జ్వరము వచ్చినపుడు పూర్తిగా విశ్రమింపుడు.

౨౨. అనుదినము స్నానము చేయుడు; జ్వరము వచ్చినచో వేడినీటియందు వస్త్రము తడిపియైనను సరే, కాని నాగామాత్రము కారాదు.

౨౩. గాలివెలుతురులు లేనియింట నుండక, ఎండయు, గాలియు బాగుగ తగులుచోట నివసింపుడు.

౨౪. ఇతరుల కీవ్యాధి అంటకుండుటకుగాను, ఇటునటు ఇల్లంతట తిరుగుటకంటె మీగదియందే యుండుట మంచిది.

౨౫. మీరు భోజనాదిక మొనరించు పాత్రలు పొరబాటుననైన ఇంటియందలి యితరపాత్రలతో కలయనీకుడు. మీయెంగిలి నెవ్వరిని తిననీయకుడు

౨౬. ఈపై జెప్పిన నియమముల పాటించుట వలనను, పిల్లల తమ సహవాసమునుండి వేరుగ నుంచుట వలనను దీనికి ప్రతిబంధము కలుగుననియు, దీని లక్షణములు తోచినతోడనే చికిత్స చేయించుట, శాంతి, విశ్రాంతి, ఉత్తమభోజనము, పరిశుద్ధవాయువు నేర్పాటు చేయుట—వీనివలననే యారోగము తొలగిపోవుననియు జ్ఞప్తియందుంచుకొనుడు.

---

## అమెరికను గ్రంథాలయములు

గ్రంథాలయ ప్రచారము అమెరికాలో ప్రాముఖ్యము పొందినటుల మరి యేయితరదేశమునందును బొందియుండలేదు. ప్రతిఅమెరికను పట్టణమునందలి ముఖ్య

భవనములలో గ్రంథాలయ భవనము తప్పక ఒకటియై యుండును. గ్రంథాలయ నిర్మాణములలో వివిధ మండలములవారు పోటీపడి, ఒకరికంటె నొకరెక్కువ ధనము వెచ్చించుచుందురు. ప్రతి చిన్న పాఠశాలకు నంటి ఒక చిన్న గ్రంథాలయము నెలకొల్పబడి యుండును. సామాన్యముగ లోకలుబోర్డువారు వీనిని పోషించుచుందురు. లోఆంజిలో యను గ్రామమున పెద్దగ్రంథాలయము నంటి పిల్లలకుగాను వేరు చిన్న గ్రంథాగారము గలదు. బాలబాలికల నీచోటునకు రప్పించి వారియందు విద్యాభిలాష పురికొల్పబడును. బఫెలో యను పట్టణమున నొక కేంద్రగ్రంథాలయము గలదు. ఈగ్రంథాలయాధికారులు ఆపట్టణములోని ఎలిమెంటరీస్కూళ్ల విద్యార్థులనిమిత్తము 1300 లైబ్రరీక్లాసుల నేర్పాటుచేసిరని విని నప్పుడు గ్రంథాలయపద్ధతి ఆమెరికాలో నెంతె ప్రాచుర్యము నొందుచున్నదో తెలియగలదు. సంవత్సరమునకీఎలిమెంటరీ స్కూళ్ల మధ్య సుమారు 7 లక్షల గ్రంథములు తిరుగుచుండునని విన్నప్పు డాశ్చర్యము కలుగక మానదు. సెంటు లూయి యనుపట్టణమున గ్రంథాలయాధికారులు ఎలిమెంటరీస్కూళ్ళకు బోయి, గ్రంథాలయముల యుపయోగములను ప్రత్యక్షముగ ప్రదర్శించి, బాలురలో గ్రంథాలయములకు బోవు అభ్యాసమును బురికొల్పుచుందురు. బోస్టను, చికాగో మొదలగు పెద్దపట్టణములందలి పబ్లిక్కు గ్రంథాలయములవారు స్వయముగ కాలేజీలయందు శాఖలను నెలకొల్పి కాలేజీ లైబ్రరీల కెంతయు దోడ్పడుచుందురు. 500 మంది విద్యార్థులుగల ప్రతి స్కూలుకును లైబ్రేరియను అను ఒక యధికారి నియమింపబడును. ఈతడు స్కూలు గ్రంథాలయమును పాలించుటయే కాక విద్యార్థులకు గ్రంథాలయ పాలనావిధానమును బోధించుచుండును. విద్యాశాఖవారు ప్రత్యేకముగ నీగ్రంథాలయములను తనిఖీచేయుటకు సుశిక్షితులైన లైబ్రేరియనులను నియమించుచున్నారు. అమెరికాలో సుమారు 175000 రూరలుస్కూళ్లు కలవు. వీనికన్నిటికి గ్రంథాలయశాఖ లేర్పాటు చేయబడుచున్నవి. గ్రంథాలయములేని స్కూలు స్కూలు కాదని అమెరికను విద్యాధికారుల మతము. ఇంగ్లాండులో గూడ నిట్టి యేర్పాట్లు లేవు. సంచారగ్రంథాలయములకుగాను ప్రత్యేకముగ బస్సులు కలవు. ఇవి గ్రామగ్రామములకు గ్రంథములను గొనిపోయి గ్రామములలోని మెంబర్లకు పుస్తకములను బంచిపెట్టి వచ్చుచుండును. పెద్దపెద్ద సిటీలైబ్రరీలలో గ్రంథాలయాధికారుల బసనిమిత్తము గదు లేర్పాటు చేయబడినవి. ఈవిధముగ గ్రంథాలయోద్యమము అమెరికాలో నొక ప్రత్యేక విద్యావ్యాపనముగ బయల్వెడలుచున్నది. మన దేశములో గ్రంథాలయములే కొద్ది. అవియైనను తగుపోషణము లేక సన్నగిలుచున్నవి. వీనికి స్వల్పముగ గ్రాంటు నిచ్చుటకే గవర్నమెంటువారు వెనుకాడెదరు. ఏమ్యునిసిపాలిటీ వారైనను గ్రాంటు నొసగుటకు సాహసించినయెడల, గవర్నమెంటువారు దానిని సర్చార్జిక్రింద చేర్చుటకు శంకింపరు. ఈవిధముగ బ్రిటిషు గవర్నమెంటువారు హిందూదేశీయులను స్వపరిపాలనా విధానమునందు శిక్షణము గరపి స్వరాజ్యార్హులనుగ జేయుచున్నారు.

---

## ప్రాంబనన్‌లో రామాయణశిల్పము

డాక్టరు సునీతికుమారచటర్జిగారు జావాలో హిందువులు చూపిన చిత్రకళాకౌశలమును గూర్చి యించుకంత యొక సచిత్రవ్యాసమున నుడివినారు. ప్రాంబనన్‌లోని రామాయణ శిల్పచిత్రములనుగూర్చి యం దిట్లు వ్రాసిరి:-

జావాద్వీపమున ప్రాంబనన్ అనుచోట నున్న దేవాలయము లొక శిలామయమయిన మహాకావ్యము. సగ్గస్థితిలయకారులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నెలకొనియున్న యా యాలయములు ప్రాచీన భారతీయ కళావృక్షమున పండిన ఉత్తమఫలము. జావాలో నాటిన భారతీయ చిత్రకళావృక్షము ప్రసవించిన కవలపూవులు బోరోబుదురు; ప్రాంబననులు; జాతి ఆత్మస్వరూపమును, కళాప్రబోధమును గాంచిన కాలముననే పుట్టి

నకవ లివి. కవ లసటచే వానిలో నొండొంటికి పోలికి గలదు. కాని స్వీయ ప్రత్యేకవ్యక్తిత్వ మాకళకు గలదు. ఇదియే మనమనస్సును తనవంక కాకర్షించుచున్న వాని వ్యత్యాసము పుట్టుట కవకాశము గలిగించినది.

ప్రాంబనన్‌లోని రామాయణశిల్పచిత్రములు కేవలము సుందరముగ నుండుటయే కాదు: అవి భారతీయ వాఙ్మయము యొక్కయు, ఇతిహాసము యొక్కయు నమూల్యము లయిన ప్రమాణపత్రములు. ఆచిత్రములు శిల్పచిత్రకారులు ఇతర కవికృత రామాయణములకంటె వాల్మీకికృతము నెక్కువగా ననుసరించినవారు కారను టను చాటుచున్నవి.

---

## 'అబ్రహాము'కాలమున 'అబ్రహాము'నగరము

[మెసొపొటేమియా దేశమున బాబిలోనియనుల 'ఉర్' అను సమేరియను నగరరాజమున (ఇది ఆజాతి కాదిపురుషుడగు అబ్రహాముగారి జన్మస్థలమని ఐతిహ్యము) సార్వజనిక మందిరముల నడుమగల యొకనివాసగృహము నంతర్భాగమును సమంజసముగ వివరించు నొక చిత్ర మిది.]

### (నాల్గువేలయేండ్లకు పూర్వము జనుల నివాసపద్ధతి)

కొలది మాసముల క్రిందట బయల్పడిన క్రొత్తవిశేషములలో ముఖ్యములై యున్న బ్రిటిషు మ్యూజియమున నిలిపిన ప్రదర్శిత వస్తువుల కాకరమైన రాజసమాధులుకాక, అందు 'ఉర్' నగరమున అబ్రహాముగారికి సమకాలీనమగు పట్టణప్రదేశ మొకటి యుండెను. ఇది అసలుగుడి యావరణమునకు వాయవ్యదిశనుగల 'పెమినాస్' గోడకు వెలుపట నొకదిబ్బపై నున్నది. (Society of Antiquarians) పురాచరిత్ర విచారకసంఘము సాయమున రచించిన యీ బొమ్మయందు 'పెమినాస్' మీదుగా నవ్వల పూర్తిగ బాగుపఱుపబడిన గృహములలో నొకటి యగపడుచున్నది. అవి సరిక్రొత్తయుపలబ్ధుల ననుసరించి, క్రీ. పూ. 1400 న 'కురిగాల్జూ' కాలమున నెట్లుండెడివో అట్లు ప్రదర్శితములైనవి. క్రొత్తగా త్రవ్వితీసిన శిథిలగృహములు భావించినకంటె గొప్పగ నిర్మితములై యుండెను. అవి మంచి యిటుకలతో కట్టబడి, నేటి బాగ్దాదు నగరమందలి గొప్ప గృహస్థుల యిండ్లకు సరివచ్చుచుండెను. అవి నగరనితంబములపై వేరువేరున్నత ప్రదేశముల విహారయోగ్యములగునట్లు క్రీ. పూ. 2100 ప్రాంతమున నిర్మితము లయ్యెను. క్రీ. పూ. 1900 సం.న తిరిగి 'ఉర్' నగరము బాబిలోనియనులచే జక్కి పరచు రాము ప్రీతియగునటుకు నవి యట్లే అచలముగ నిల్చియుండెను. ఆదహనముజాడ లిప్పటికిని గలవు. శీతమధ్యకాలమున మేటవేసిన చెత్తచెదారమువలన నప్పటి యిరుకువీథులు దాదాపు 3 అ. ఎత్తయ్యెను. అసలైన వాసగృహములందు నేలగదులు సార్వజనికములు, పైగదులు స్వకీయములును. యజమానుడు కొంతకాలము గృహము విడిచి యుండవలసినయెడల నతడు సింహద్వారమున నిటుకలు పేర్చెడివాడు. సాధారణముగా వెలుపలిగోడ కది యొక్కటే ద్వారముండెడిది. ధనికుల గృహములయందు (ఒకముఖ్యలక్షణముగా నుండెడు) దేవాయతనముల క్రిందను, అవి లేని బీదగృహములయందేదో యొకచోటను గోరీలు కన్పడెను.

విలువఎంపు గోరీలయందు, తొలుత పాతిన శవముల పరిశిష్టములను గర్హ్యమగు తమ సహజనిర్దయతతో నొకప్రక్కకు త్రోసిపుచ్చి, వేఱుశవముల మఱుమఱి యందే పూడ్చుట సమీరియనుల కాచారమై యుండెడిది. ఒక్కొకగోరీని పదిశవములకు తక్కువకాకుండ నుపయోగించెడివారు. వేఱురకముల సమాధులు ప్రక్క క్రిందియూల ప్రక్షిప్తముగా చూపబడినవి.

1. ఇ-డబ్లల్-మహ్, న్యాయమండపము. 2. ఇ-నన్-మహ్, దేవాలయము. 3. పెమినాస్‌గోడ. 4. పైగోడలు — పచ్చి యిటుకల కూర్పుపై చాపతాపటము.

5. వెలుపటిగోడలు_ద్వారములుదక్క శూన్యముగ నుం డును. 6. వాకిలినడవ. 7. క్రిందిగోడలు___కాల్చిన యిటుక. 8. గడప_వీధిపయినే (గుమ్మములు లేవు.) 9. బోర్లించిన మట్టిపాత్రగోరీ. 10. బల్లవసార. 11. కఱ్ఱ దూలములపై కట్టిన కాల్చిన యిటుకలమెట్లు. 12. పూల కుండ్లు పెట్టుకొను తిన్నెలు. 13. మండువా. 14. మలుగుదొడ్డి. 15. ఇరుకు వీథులు ఎండవేడిమిని,దుమ్మను అంతగా రానీయవు. 16. బరువువేయు అరుగు. 17. శిశు వులసమాధులు. 18. గాలివెలుతురులకై పెరడు. 19. స్వాగతగృహము. 20. దేవతాపీఠము. 21. వేదిక. 22. వంటిల్లు. 23. దేవాయతనము క్రింది విలువంపుగోరీ. 24. కాళ్లు కడుగుకొంటకు కడవయు, మండువాయు. 25. పొరుగిండ్లకు పోవు ద్వారులు. 26. ఇంటిమూలలు___ జంతువులసంపులును, రాతులును బోవ సనువగు దారులు.

(స్ఫియర్)

---

## చెదపురుగుల గుట్టు

[చెదపురుగులు తరుగులేని పాటుచే తమ కుక్క గొడుగుతోటల సాగుచేసుకొను నద్భుతవిధానముల కిది సరియైన శాస్త్రసమ్మతమగు చిత్రము. ఈపురుగుల క్రమ యుక్తమైన పరిశ్రమ వరుస మూడేండ్ల యనావృష్టినిసై తము వృథా పఱచివేయును.]

ఒక్క గడ్డిపోచయైన బ్రదుకజాలనంతగ భూమి నార్చివేయు వరుస మూడేండ్ల యనావృష్టి సంభవించి నను, చెదపురుగులు తమ పుట్టల కెప్పటివలె నీటి సర ఫరా జరుగుచుండునట్లు చేసికొను నద్భుతచర్య చివరకు దైవికముగా విస్మృతమయ్యెను. (ఇది 'లివింగ్‌స్టను' నాడు మొదలు శాస్త్రజ్ఞులనెల్లర కలతపెట్టిన సమస్య. 'లివింగ్‌స్టను'గారు తుద కీపురుగులు వాయుగతమైన ఉద జని ప్రాణవాయువుల కూడికచేసి నీరు తయారుచేయు నని సిద్ధాంతము చేసికొనిరి.)

ఒకకాలమున (క్లీట్ ఫాన్టీన్, నెం. 1368) ప్రిటో రియా దేశీయుడు ఉత్సాహముగల ప్రకృతిశాస్త్రవేత్త యూజీన్ ఎన్. మేరే అనునాయన, 65 అడు గుల లోతునకు జలపరీక్షకయంత్రము చొన్పినను తేమ తగులని యొకతావున నింకను లోతుగ నొకబావియందు చెదపురుగులకు నీరు సరఫరాచేయు బోదె నొకదానిని కనిపట్టెను. చెదపురుగులు భూమ్యాకర్షణశక్తిరేఖలకు (Lines of Terrestrial Magnetism)అనుభవపా త్రములగుట(susceptible)సువిదితమే: ఇది వీని యద్భు తచరిత్రమున నింకొక యద్భుతము. ఇందువలన, తూర్పు పడమరలకు తరుచుగ పాయలు జటిలముగ చీలిపోవుచు న్నను, ఉత్తరదక్షిణప్రస్తారము విడకపోవుటచే బోదె త్రవ్విన బిలము పొడుగునను వెలసెను: అదియే ఎడమ ప్రక్క బొమ్మలో సరియగు సంబంధసామ్యముతో చిత్రితమైనది. అది దిగువ నింకను తెలియనంత లోతునకు బోయెను. వెలుతురు కిట్టని ఆచెదపురుగులు తమబాటను పరీక్షార్థమై విడగొట్టిబడినతావులనెల్ల కప్పుకొనుటకై రాత్రి అఖండముగ పాటుపడెను. కుడిప్రక్క విపుల చిత్రముల గానబడురీతిని, తమ ముఖ్యాహారము (కుక్క గొడుగులు) అవి తమపుట్టలలో ఆనుపూర్వికగా పెంచు కొనును. ఎడతెగని నీటిగొట్టముల దొంతిరలు దానిని రాత్రిందివములు తడుపుచునే యుండును.

1. పుట్ట.

2. చెదపురుగుల నీటిబోదె - వంకరలు తూర్పు పడమరలకేకాని యెన్నడును ఉత్తరదక్షిణముల కుండవు.

3. నూతి ఉత్తరపుగోడ.

4. తడియున్న తగులకయే తొలచుట నిలిపివేసిన తావు.

5. బోదె క్రిందికి నీటికడకు విస్తరించును.

6. జలకోశము-తెలియనిలోతు.

7. చెదపురుగు గుంపులు తోటలకు నీరుపెట్టుచు, దిగువ మళ్లకై విత్తుల దీసికొనిపోవుట.

8. లెక్కలేనన్ని పీచుతో నిర్మించిన చిన్ని గదులు.

9. తోట మరల పెంచుటకై అతిసూక్ష్మము లగు గ్రుడ్లతోను, నీటితోను ఎక్కుచున్న చెదపురుగులు.

10. బోదె—3 అంగుళముల వెడల్పు.

11. పాటుపడు చెదపురుగు.

12. వి త్తనములు వృద్ధిచేయుటకై పెట్టుకొన్న స్పంజుఅవంటి పీచు తెట్లు.

13. నీటికై దిగుచున్న చెదపురుగులు.

14. రెక్కలచెదపురుగు— దండులకుమాత్రమే వినియోగపడును.

X. X. కుక్కగొడుగుల తోటలు.

Y. Y. తిరిగి తోట పెరుగుటకై నీటిదరి కుక్కగొడుగు వి త్తనముల మళ్లు.

Z. రాణికైదుగది—నీటియావిరితో నిండియుండును. (స్మీయర్)

---

## కీ. శే. చింతామణిఘోషు



ఈతడు పదుమూడవయేట అలహాబాదునకు వచ్చి 'పయొనీరు' ఆఫీసులో పదిరూపాయలు జీతముపై నొక గుమస్తాగా ప్రవేశించెను. కొంతకాల మందుండి తర్వాత రైల్వేమెయిలు సర్వీసులో ప్రవేశించెను. దానిని వదలి పదపడి అలహాబాదున ప్రభుత్వవాతావృత్తగ్రంథ కార్యాలయమున ౬౧ రూపాయలజీతమున ప్రవేశించెను. అందు నూరురూపాయలు వేతనము పుచ్చుకొను చున్న కాలమున విశ్రాంతివేతనమును పుచ్చుకొనెను. అప్పటి కతడట్టె వయసుమీరినవాడు కాడు. అంతట నతడు ముద్రాపకుడుగను, ప్రకాశకుడుగను వ్యాపారమును ప్రారంభించెను. ఆతడు పుస్తకముల ముద్రణమునందు అందమునే ఎక్కువగ చూచుకొనుచుండెను. సొమ్ము వ్యయమగుచున్నదని తలచువాడు కాడు. పెక్కురకముల అచ్చుముక్కలను లెక్కకు మిక్కిలిగ వెచ్చించి తెప్పించి యుపయోగించువాడు. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు, బెంగాలి పుస్తకముల నీతడు చాల సుందరముగ ముద్రించువాడు. ఈతని ముద్రణాలయమునకు 'ఇండియన్ ప్రెస్' అని పేరు. ఇందు ముద్రితమగు గ్రంథములవలె ఇతరముద్రాలయములు ముద్రింప లేకయు వెన్నువీగుచుండెడివి. చింతామణిగారికి పుస్తకముల నమ్మి డబ్బు గడించవలెనన్న కోరిక లేదు. కావున నాతడు గొప్ప గ్రంథకర్తలు రచించిన గ్రంథములను, ఇతర విద్యాశాలాపాఠ్యగ్రంథములను మాత్రమే ముద్రించువాడు. ఈతడు హిందీవాఙ్మయాభివృద్ధిపట్ల కావించిన సేవ అపారమయినది. సచిత్రముగ తులసీరామాయణమును, మహాభారతమునకు హిందీ అనువాదమును, ఇంకను పెక్కు ఇతరహిందీగ్రంథములను ఇతడు ప్రకటించినాడు. ఉత్తమమగు 'సరస్వతి' యనుమాసపత్రికనొకదానిని ప్రారంభించి ప్రకటించుచున్నారు. ఇతడు హిందీశబ్దార్థకోశము మొదలయిన నాగరీప్రచారిణీసభ ప్రచురణములను అందముగా ప్రచురించిరి. ఉర్దూవాఙ్మయాభివృద్ధికొఱకును ఇంత పాటుపడిరి. వీరు బెంగాళీ జ్ఞానేంద్ర మోహనదాసుగారి అనుత్తమమయిన బెంగాలీనిఘంటువును ముద్రించి ప్రకటించినందుకు బెంగాలీ వారు వీరియెడ కృతజ్ఞులై యుండవలెను. ఇప్పుడు అంతరించిన 'ఇండియన్ యూనియను', 'ఇండియన్ పీపిల్' అను రెండుపత్రికలను ఇతడే ప్రకటించుచుండెను. వీరి ముద్రాలయమునకు కాశీ, ఆగ్రా, పాట్నా, కలకత్తా, నాగపూరులయందు శాఖలు కలవు.

మాడరన్‌రివ్యూపత్రికా సంపాదకులజియే యగు 'ప్రవాసి' అను బెంగాలీమాసపత్రిక తొలుత ఈము ద్రాలయముననే ముద్రింపబడుచుండెడిది. అచ్చు చాల సుందరముగా నుండెడిది. మాడరన్‌రివ్యూపత్రికనుకూడ చింతామణిగారే ప్రతిమాసమునను మంచికాగితములమీద అందముగా నియమితకాలమున ముద్రించి యిచ్చుచుండెడివాడు. దానికయి రమారమి ఒకసంవత్సరకాలము వరకు సొమ్ము నిమ్మని యడిగినవాడు కాడు. మొదలు సొమ్ములేని మాడరన్‌రివ్యూపత్రిక యీయుదారుని ఇట్టి సహాయమే లేకపోయియుండినచో వెలువడకయే యుండెడిది. కాక వెలువడినను చిన్ననాడే చితికిపోయి యుండెడిది.

ఈవ్యాపారమున నీతడు పెక్కులక్షలు సొమ్మను గడించెను. ఈసొమ్ము నీతడు దీనుల మొఱ్ఱను పెడచెవిని బెట్టి మూటకట్టలేదు. ఈతడు దరిద్రులగు వికలాంగుల కొక వైద్యశాలను స్థాపించెను. దాని ననుసరించియే యొక ప్రత్యేకభవనమున శస్త్రచికిత్సకు తగిన సదుపాయములను గలిగించెను. పెక్కు విద్యాలయములకు, బీద విద్యార్థులకు పుష్కలముగా సొమ్ము నిచ్చి సహాయము చేయుచుండెడివాడు. "భారతీయ వితంతుస్త్రీల దుర్గతిపోవుటకయి ఎంతయు కుంది వానిని తొలగించుటకయి కొల్లలుగా ధనమును వ్యయించె"నని ఈతనినుతించి 'ప్రవాసీ'పత్రిక వ్రాసినది. ఈపారశ్రేష్ఠుడు ఇటీవలనే తన డెబ్బదినాల్గవయేట కీర్తిశేషు డగుటచే అలహాబాదునకు గొప్పలోటు కలిగినది. స్వప్రయత్నముచే నభివృద్ధిగాంచినవా డన్న మాట యీతనికే వాచ్యముగా సరిపోయినది.

ఈ ఘోషుగారి యీచరిత్రలేశ మాంధ్రుల వికాసాభివృద్ధుల కుపకరించు నను నాశ గలదు.

[మాడరన్‌రివ్యూ-సెప్టెంబరు]

---

## రావుసాహెబు సుబ్బయ్యనాయడుగారు



"శ్రీనాయడుగా రిపుడు బ్రిటిషు మలయద్వీపములకు భారతప్రభుత్వప్రతినిధిగా నున్నారు. ఆరాష్ట్రములయందు రబ్బరుతోటలలో పనిచేయు కూలివాండ్రకు కూలి ఒకేనియమముచొప్పున నిచ్చునట్లు చేయుటకు చాలా పాటుపడుచున్నారు. నిక్కముగా భారతీయు లారాష్ట్రములవారి అభివృద్ధికి,సంపదకు. ఎంతయో కష్టించినారు. తమ కష్టమునకు తగినకూలిని పొందుటకు వారికిగల హక్కులను రబ్బరుతోటల యజమానులు కాదని త్రోసిపుచ్చుట కేవల మన్యాయ్యము. నాయడుగారు తను ఉద్యోగమును స్వీకరించినపిదప కూలీలవిషయమున తోటలయజమానులతో చాల పోరాడిరి. త్వరలో వీరి పరిశ్రమకు ఫలము కార్యరూపమును దాల్పనున్నది. ఇంతేకాక, వీరు కూలీలలో పరపతిసంఘములను స్థాపించినారు. అవి చదరముగా నడుచుచున్నవి. మఱియు మలయను కూలీలచట్టమున(Malayan Labour Code) ముఖ్యములయిన మార్పులను గావించిరన్న గౌరవమునకు వీరు పాత్రులయినారు.

సుబ్బయ్యనాయడుగారు చెన్నపురి విశ్వవిద్యాలయమున పట్టభద్రులయి, చెన్నపురరాష్ట్రీయ ప్రభుత్వమున చిరకాలమున నుద్యోగమున నుండిరి. పదపడి

---

మదరాసు సెక్రిటేరియటునందు స్థానిక స్వపరిపాలన శాఖయందు సహాయకార్యదర్శిగ నుండి పిదప మలయ రాష్ట్రముల ప్రతినిధిగా నియమింపబడిరి."

ఇట్లని ఒకయెన్నికగల విలేఖకుడు తెలిపెనని మాడరన్‌రివ్యూపత్రిక వ్రాసినది. విదేశములయందు యిడుమల గుడుచుచున్న సోదర భారతీయులకు సౌకర్యములను గలిగించుటకై భారతీయప్రముఖులలో నింకను పలువురు పలుతెరగుల ప్రయత్నింపవలసియున్నారు.

---

## 'భారతమాత వాస్తవస్థితి'

[అమెరికా సంయుక్తరాష్ట్రములందు ప్రొఫెసర్ ఎర్నెస్ట్‌వుడ్‌గారి ఉపన్యాసములు.]

భారతదేశమునుగూర్చి సంయుక్తరాష్ట్రములందుపన్యసించిన ఆంగ్లేయులలోనిక్కల్ల నెక్కువ భారతదేశసానుభూతియు, భారతదేశ పరిజ్ఞానమును గల ప్రొ. ఎర్నెస్ట్‌వుడ్‌గారీనడుమ నచట సుమారు రెండువందల యుపన్యాసము లొసగిరి. మిస్ మేయో గ్రంథము మిసుల వ్యాప్తి నొందియుండుటచే దానివలన జనులకు గల్గు దురభిప్రాయముల తొలగించి భారతదేశము వాస్తవస్థితి నెఱుగజెప్పుటకుగాను వారు వత్సరములకొలది ఈదేశమున తమకుగల నివాసపర్యటనాధ్యయనాదుల వలని యథార్థపరిజ్ఞానముతోడను, అనుభవముతోడను, ఎంతవీలైన నంతమందికడ తమ భావముల వెలిబుచ్చుట తమవిధి యని భావించిరి. వారి యుపన్యాసములు భారతజీవనమును మతసంఘపరిశ్రమాది సమస్త వైఖరులను వివరించెను. నిష్కపటముగను, మిక్కిలి బుద్ధిశాలితతోను భారతరాజకీయస్థితినిగూర్చి వారు కావించిన నిరూపణమువలన శ్రోతృజనసహస్రములు భారతదేశమన్నను, ఇచటి ప్రజలన్నను ఎక్కువ సానుభూతితోడను, విశాలహృదయముతోడను భావింపదొడగిరి. ఇక్కడిజనుల పద్ధతులను, కార్యములను చూపు వినోదమైన 'స్లైడు' చిత్రములతోడుగ, వీరి యుపన్యాసములు సాంగోపాంగముగ భారతదేశ నిజస్థితిని ప్రకటించుటయందు జయావహము లైనవి.

ఈయుపన్యాసముల యనంతరము కొందరు భారతీయులును, అమెరికనులును విందొసగినపుడు ప్రొఫెసరుగారు భారతప్రదేశమును గూర్చియు, ఇచటివర్తమాన సమస్యలగూర్చియు, భూతభవిష్యములగూర్చియు జాలిగొలుపునట్లు మాటాడిరి. ఇతిహాసము పొడుగునను సమకాలికముగు ఏదేశముతోగాని, ఏనాగరికతతోగాని పోల్చిచూచినను, భారతదేశము గొప్పదిగ నుండినవిషయమును వారు నిరూపించిరి. మానసికనైతిక శాస్త్రములయందును, భౌతికౌన్నత్యమునను మానవపరిజ్ఞానమువిషయమునయెల్ల-నీగొప్పతన మిందుకన్పడునని వారనుడివిరి.



ప్రొ. ఎర్నెస్ట్‌వుడ్ ఎర్నెస్ట్‌వుడ్ సతి

పురాతనగ్రామములందలి కలనియమములయు, దేశీయపరిశ్రమలయు వినాశమును, ఋణదాతలకు భూములు తనఖా పెట్టుటయు భారతదేశపు నేటి ఆర్థికపతనమునకు ముఖ్యకారణములుగ వారు పేర్కొనిరి. వారిట్లు చెప్పిరి—.

"వెనుకటికాలమున తనకు భౌతికజయమును, ఆధ్యాత్మికసర్వము చేకూర్చిన మనోవిన్యాస మింకను భారతదేశమున గలదు. ఆర్థికపరిస్థితు లనుకూలపడుటతోడనే యిది నవోన్మేషముతో విజృంభింప సిద్ధముగనున్నదనుట ధ్రువము."

"కనడా, ఆస్ట్రేలియా మున్నగు బ్రిటిషుసామ్రాజ్యమునందలి ఇతరభాగము లవలంబించిన మార్గమువనే భారతదేశముగూడ ఆధునిక పద్ధతుల నభివృద్ధి గాంచవలెను. ముందో వెనుకనో, ఇంగ్లాండు భారతదేశమునకు ఆంతరిక స్వపరిపాలనము నిచ్చి, దాని నితరస్వపరిపాలకరాష్ట్రములతో సమానమగు స్థానమున నిలుపకతప్పదు. ముప్పునకై వేచియుండుటకంటె నిప్పుడే ఆపని చేయుటమేలు: ఉన్నవి ఉన్నపాళమున నుంచినచో ఆముప్పు రాక తప్పదు. పరిస్థితులు విషమముగ నున్నవి. భారతీయులు జాతిబంధముచే ఐరోపీయుల కభిన్నులయ్యు, తమ సమీపపు దేశముల వారి ఆయుధముల దాల్ప బలాత్కృతు లగుచున్నారు. మనము లక్ష్యపెట్టనిచో యొకోహామా మొదలు కాన్స్టాంటినోపిల్ వఱకును– కైరోవఱకుగూడ గావచ్చును– విశ్వఆసియా సమవాయము నెదుర్కొనవలసినవార మగుదుము. క్రొత్తటర్కీ– ఈజిప్టునకు ప్రశంసాభాజనమగు వస్తువనుటకు సందియము లేదు. జపాను బ్రిటనుతో మైత్రిసూత్రములు తెంపుకొన్నది. సింగపూరు నౌకాశ్రయ నిర్మాణసందర్భమున బ్రిటను కొంత ఆందోళనకరములగు ప్రవర్తనలు సాగించెను. చైనాజాతీయవాదులు పెకినుకడనున్నారు. స్వరాజ్యము నాలసించినకొలది భారతదేశమున నావేశము హెచ్చుచున్నది. ఐర్లాండునందు పెంపొందిన భావావేశమునంటి భావావేశము పెరుగవచ్చును. భారతదేశము తన తూర్పుపడమరల యిరుగువారితో గలసి తుదకు ఇతిహాసముననెల్ల మహత్తమమగు సమవాయమునకు మస్తిష్కముగ నేర్పడవచ్చును. అప్పుడిక ఐరోపీయుడు ఆసియాఖండమునుండి ప్రయాణము కట్టవలసిన దినము దాపురించును. మనము భారతదేశము నింతదూరము పోనీవలదు."

ప్రొ. వుడ్డుగారి కెల్లవిధముల తోడ్పడు వారి సతీమణి భారతీయనారీమణులగూర్చి ముచ్చటగు విషయము లనేకములు ముచ్చటించియుండెను. కొంద ఱమెరికాస్త్రీల కుపన్యసించుచు నామె యిట్లు చెప్పెను—

"భారతీయస్త్రీలనుండి నేనొక సందేశము తే నిచ్చగించితిని. వారివిషయమున నెన్నియో దురభిప్రాయములు ప్రబలియున్నవి; అసత్యవచనము లనేకములు వారినిగూర్చి వ్యాపించినవి. వారు తెరలో నున్నారనియు, వారివ్యాపకములన్నియు గృహసంబంధమైనవే యనియు వాడుక. తక్కినచోట్లవలెనే భారతదేశమందును స్త్రీలు బహిఃప్రపంచ కార్యరంగములోని కధికాధికముగ వచ్చుచున్నారు. ఈనడుమ పూనాయందొక అఖిలభారతమహిళా మహాసభ జరిగినది. అందు దేశమంతటనుండియు స్త్రీ లనేకులు వచ్చి, స్త్రీవిద్యా శిశు వివాహములగూర్చి అతిముఖ్యము లగు తీర్మానము లనేకములు గావించియున్నారు.

"భారతీయ స్త్రీపురుషుల ప్రతినిధి సంఘములు ౧౯౨౪, ౧౯౨౫, ౧౯౨౬ సం. లలో మూడుసారులు వివాహవయస్సును హెచ్చింపవలెనని కోరిరి; ప్రతిపర్యాయమును ప్రభుత్వమువారా దరఖాస్తును త్రోసివైచిరి.

"భారతస్త్రీ కంఠస్వర మెల్లెడల క్లబ్బులయందును, సమాజముల యందును వినవయ్యెను; అనేక సభలలో నామె అసంఖ్యాకముగ నవతరించెను; ఇంట భారతమాత పుత్రులయు, పుత్రికలయు శీలమును పోతబోయుటయం దామె సిద్ధహస్త. తన పిల్లల కామె చెప్పెడు కథల ప్రోద్బలముననే చాలవఱకు భారతదేశపు నైతిక ధార్మికాశయము ఉజ్జీవితమయియున్నది. ప్రాచ్యభూమి కెప్పుడును కథలన్న నిష్టమేకదా! ఈకథలలో గొన్నిటి నైరోపా ప్రాతవేడుకలు తప్పకుండ, నవలంబించుకొనెను.

"దేవుడైనను తన అర్ధాంగి–'శక్తి'–లేక శక్తిహీనుడని పరిగణించు పూర్వకాలమునవలెనే, స్త్రీలు తమ పురుషుల యండ నిలుచుచున్నారు."

ఆవిందుసభ కధ్యక్షత వహించిన డాక్టరు సండర్లాండుగారు వుడ్డు దంపతులను బొగడుచు, ప్రొ. వుడ్డుగారివంటివా రింకను చాలమంది ఆంగ్లేయు లున్నచో భారతదేశపు రాజకీయభవిష్యము రంజితమై వెలయుట తథ్యమని నుడివిరి.

నాల్గుమాసముల పరిచయముతో కల్లవ్రాతల వ్రాసిన మేయోకన్య గ్రంథమునకు తగిన ప్రత్యుత్తరములును, ఖండనములును, పదుమూడు వత్సరముల నివాసాధ్యయనముల పరిపక్వపరిచయముగల ప్రొ. వుడ్డుగారి రాబోవుగ్రంథమున వెలయగలవు. అది యిపు డచ్చగుచున్నది. అచ్చట వసించు రామలాల్ బి. బాజపేయిగారు మున్నగు భారతీయులు తమ ప్రశంసలను ప్రొఫెసరుగారి కందజేసిరి.

---

## పండిత మోతీలాలు నెహ్రూగారు



రాబోవు అఖిలభారత మహాజనసభకు అధ్యక్షులుగా నెన్నుకొనబడిరి.

## రాజకీయ లోకమున ఒక వనితామణి



లిండిస్ ఫాక్స్ హామిల్టనుకన్య - ఇల్ఫర్డు తరఫున పార్లమెంటు కన్సర్వేటివు సభ్యురాలు; సర్ జార్జి హామిల్టనుగారి కూతురు.

---

## దురదృష్టము (అనువాదము)

కర్లపాలెం కుటుంబశాస్త్రి గారు

చెట్టుగా నేల నే నిల పుట్టనైతి
ఎవ్వరికినైన నే నీడ నిచ్చియుందు
అర్పణము చేసియుందు తీయనిఫలాలు
తాను తనపిల్లలును తల దాచుకొనగ

ఏదియో పిట్ట న న్నాశ్రయించియుండు
దాని కాపాడ ననుకూలతయును నాకు
కలిగియుండెడి దట్టి భాగ్యంబె యున్న
సార్థకత జెందెడిది నాదుజన్మ యపుడు.

---

# భారతీయ మహిళామండలి



**శారదాబాయి నాయుడు కన్య**

పూనా సేవాసదనసంఘమున శిక్షణ పూర్తిచేసికొని, లండను బెడ్‌ఫర్డు కళాశాలలో సార్వజనిక స్వాస్థ్యము (Public Health), ధాత్రీ విద్యను (Nursing) వీనియం దున్నతవిద్య గఱచుటకై ఈమె ఇంగ్లాండుదేశ మేగినది.



**కావ్యతీర్థ**
**శ్రీమతి రత్నకుమారి దేవి**

జబ్బల్‌పూరు వాస్తవ్యులగు గా. సేఠ్ గోవిందదాసుగారి కొమార్తె. కలకత్తా సంస్కృత సభవారు నడపు సంస్కృత వాఙ్మయపరీక్షలలో నుత్తమ బిరుదపరీక్షయం దుత్తీర్ణ యైనది ఈ 'కావ్యతీర్థ' బిరుదపరీక్షయందు ఉత్తీర్ణ యగుటకు ఈమెయే మొదటి మార్వాడీ కన్య. ఈమె వయస్సు పదునైదువత్సరములు మాత్రమే.



**బాలకృష్ణమీనను సతి**

కొచిను సంస్థానమున గౌరవ న్యాయాధికారిణి (Honorary Magistrate) గా నియమింపబడిన మొదటి స్త్రీ ఈమెయే.



వి. కమలాబాయి కన్య

దక్షిణ ఇండియాలో సంక్షిప్తలేఖనము (Short-hand) నం దారితేరిన ప్రథమ భారతీయ కుమారీమణి. కాశ్మీరు సంస్థానమునం దీమెకు ఉద్యోగమొసంగబడెను.



ఇ. రామారావుకన్య, బి. ఏ. (ఆనర్సు)

సుప్రసిద్ధ భారతీయ సినీమాప్రదర్శకురాలు. 'షిరాజు' అను ఫిల్మునందు 'మంతాజ్' ముఖ్యపాత్రను ధరించినది. కృష్ణాజిల్లా జడ్జీగా నుండిన బి. రామారావుగారి కుమార్తె. ఈమె మదరాసు విశ్వవిద్యాలయమునందు బి.ఏ (ఆనర్సు)నం దుత్తీర్ణురాలయ్యెను.



శారదాబాయికన్య, బి. ఏ.

మహారాష్ట్రసంఘమున ఈ వత్సరము బి. ఏ. పట్టము పొందిన స్త్రీ యీమె యొక్కర్తయే.




# గ్రంథములు

## అభినవ భారతచరిత్ర

ఈ పుస్తకము హిందీభాషలోని "భారతీయ విద్రోహ్" అను గ్రంథము ననుసరించి వ్రాయబడినది. గుంటూరునందలి వాఙ్మయమండలి పక్షమున నిది వెలువడినది. వాఙ్మయమండలి సంపాదకులగు తూములూరి శివరామయ్యగారే యాంధ్రానువాదకులు. ఇది క్రౌను సైజున 160 పుటలు గలిగియున్నది. వెల చందాదారులకు రు 0-12-0; ఇతరులకు రు 1-0-0.

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు దీనికి పీఠిక వ్రాసినారు.

1885-వ సం॥మున భారతజాతీయ మహాసభ స్థాపింపబడిన నాటినుండియు గొప్ప రాజకీయసంచలనము జనించి పలుదారుల ద్రొక్కి దేశము నలుగడల గ్రమ్మివైచినది. ఒకవిధమగు నసంతృప్తి నాటుకొని పోయినది. ఈసంచలనము, ఈయసంతృప్తి నానాటికి మరింతమరింత తీవ్రముగ విజృంభించుచున్నవే కాని, యణగిపోవుట లేదు. తుదకు నేటికి ఒకవిధముగ నీరాజకీయ మహోద్యమము మిగిలిన యుద్యమముల నన్నిటిని-సంఘసంస్కరణము, విద్యాభివృద్ధి మున్నగు సమస్యలకు సంబంధించిన యుద్యమములను-గబళించివైచి తన యస్తిత్వము మాత్రమే వెలువఱచుకొనుచున్నది. ఇట్లేల కావలయుననునది గొప్ప సమస్య. ఐన రాజకీయాందోళనమున కీ సర్వతోముఖప్రాముఖ్యము లభింపజేసిన త్రోసివేయరాని ప్రబలకారణము లనేకములు.

అందుచే భారతీయులకెల్లరకు,-నందు ముఖ్యముగ రాజకీయోద్యమమున బనిచేయువారలకు-ఈమహాప్రవాహ మేయేకాలముల నేయేదారుల బట్టుచున్నది, ఎట్టి యాఘాతముల నెదుర్కొనుచున్నది, అనునంశముల దెలిసికొని తమ కార్యవిధానము జక్కబరచుకొనుచుండవలసిన యావశ్యకత కలదు.

ఇట్టి యీ పెద్దచెట్టునకు ఈ 'విప్లవోద్యమము' ఒక పెద్దకొమ్మ. హింసామూలకములగు ప్రయత్నములచే నీతెల్లదొరతనము గూలద్రోయవలయునను నాశయ మాధారముగా గల యుద్యమమే యీ విప్లవోద్యమము. పీఠికలో పంతులుగా రన్నట్లు "ఈ భరతఖండమున నీయుద్యమము శాశ్వతముగ స్థిరపడినది." మరియు "ప్రభుత్వమువారి దౌర్జన్యపద్ధతులే దీనికి మూలకారణము."

మనదేశమున గల యీ విప్లవోద్యమమును సంక్షిప్తముగ బాఠకుల కెఱుకపఱచు చరిత్రగ్రంథ మీ "అభినవ భారతచరిత్ర". మొదటినుండి తుదివఱకు నిందు వివరణోద్ఘాటనమే కానవచ్చును. మూలలేఖకులయొక్క కాని, అనువాదకులయొక్క కాని స్వీయాభిప్రాయములు, పాక్షిక విమర్శనములు నెందును గన్పట్టవు. "ఈ గ్రంథమును బ్రకటించుటలో విప్లవోద్యమమును తిట్టుట కాని, దీవించుట కాని మాయుద్దేశ్యము కాదు. జరిగిన చరిత్రను జరిగినటుల పాఠకుల సముఖమున నుం

చితిమి." అని యనువాదకు లుపోద్ఘాతమున వ్రాసి నారు. ఈపద్ధతి గ్రంథముయొక్క యుపయోగమును స్థిరపఱిచినది. అనువాదకు లవలంబించిన సులభశైలి గ్రంథప్రయోజనమును రెట్టించినది. (ప్ర. రం.)

## వివిధకుసుమావళి (ప్రథమ గుచ్ఛము)

క్రౌనుసైజున 106 పుటలు గలిగియున్న దీపుస్తకము. రచయిత కవికొండల వెంకటరావు గారు, బి. ఏ., బి. యల్. దీనివెల విద్యార్థులకు రు 0-8-0; ఇతరులకు రు 0-12-0. కావలసినవారు ప్రకాశకులైన గాడిచర్ల రామమూర్తిగారి పేర రాజమహేంద్రవరమునకు వ్రాయ వలయును.

ఇందు గ్రంథకర్తగారు ఇరువదియైదు శీర్షికల క్రింద తమ మనసు నాకర్షించిన యాయావిషయములను గూర్చిన తమ యభిప్రాయములను పద్యములలో వెలు వఱిచినారు.

ఆదినుండి తుదివరకు నేకధారగ బ్రవహించు చున్న వీరిశైలి చదువరుల మనసు నాకర్షింపజాలదు. పద్యరచన పెక్కుచోటుల చిరపరిచితములై శిథిలములై యున్న ప్రాతదారులనే పట్టినది. పదములకూర్పులోను, భావచిత్రణమునను, పాఠకుల నానందోత్సాహముల బంధించు మధురత,గభీరత యింతంతగ గానరావు.(ప్ర. రం.)

## Jasmines (ఆంగ్లపద్యములు)

గ్రంథకర్త: సోమిన వెంకయ్యగారు, కాకినాడ. (For Private Circulation.) ఇందు అచ్చటచ్చట మెఱపు మెఱసినటు లొక్కొకభావము విలసిల్లినను, కవితాధోరణి ఉన్నతముగ లేదు. భావయందును లాలిత్య గాంభీర్యములుగాని, నుడికారముగాని తక్కువ. ఇంకను అవయవసౌష్ఠవ మేర్పడువఱకు వీరి కవితాకన్య యింట పోషణ గాంచిన, ముందుముం దాకర్షక సౌందర్యము బడయవచ్చును. కవి తనయుత్సాహమును తగిన రీతి శిక్షితముగ నడపుకొన యత్నించుగాక.

## కలికాలపు కథలు (మొదటిభాగము)

గ్రంథకర్త: కలగ సత్యనారాయణ గారు, పీఠ భద్రపురము, రాజమండ్రి. క్రౌనుసైజు ౧౧౭ పుటలు, వెల ౧౨ అణాలు.

## శ్రీ కన్యకాపరమేశ్వరీ శతకము

గ్రంథకర్త: దోమా వేంకటస్వామి గుప్తగారు, పండితుడు, క్రిస్టియన్‌కాలేజి, మద్రాసు. వలయువారు గ్రంథకర్తకు అణాచీటి పంపవలెను.

## శ్రీ సత్యాసత్య పురుషత్వము

శ్రీ వివేకానందస్వామి 'దిరియల్ అండ్ అప్పరెంట్ మ్యాన్' అను ఉపన్యాసమునకు జ. వెంకటేశ్వరరావుగారి ఆంధ్రానువాదము. శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల 3-వ కుసుమము ——గార్ల, నైజాం. వెల తెలియదు.

## ౧. శ్రీ వేణుగోపాల కళామాలికా

## ౨. శ్రీ రామలింగేశ్వర రుద్రస్తుతిః

ఈ రెండు సంస్కృత గ్రంథములకును కర్త: గొ. కృష్ణమాచార్యులు గారు. బెజవాడ, వాణీముద్రాక్షరశాలయందు ముద్రితము.

## వేశ్యాచర్యాదర్శన నక్షత్రమాలిక

కీ. శే. పరవస్తు జియ్యరు సూరిప్రణీతము. కొంగులూరు, విచారదర్పణ ముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల ౦-౧-౬.

## శ్రీ విద్యారత్న స్తోత్రాణి

'శ్రీ శంకరారణ్య శ్రీ వాసుదేవ పరబ్రహ్మ పండితాభ్యాం విరచిత వ్యాఖ్యాద్వయ సంయుతాని' (సంస్కృతము). ప్రకాశకులు: క. మార్కండేయశర్మగారు, స్వధర్మప్రకాశినీ సంపాదకులు, పూనమల్లి హైరోడ్, కీల్‌పాకుపోస్టు, మదరాసు.

## సూర్యోదయము

కలిదిండి నరసింహరాజుగారు

ఉదయ భూధరముపైన
సదయుఁడై భానుమూర్తి
అడుగో ఆసీనుఁడైనాఁడు.
కడుదట్టమైన యంధ
కారము పరియ లగుచు,
వడివడి పడమటికి నదె
పరువెత్తుచున్నది!
నిదుర విదళించి, సుబల
నిర్నిద్రమానసముతో
లేచి, మాభరతమాత
చూచుచున్నది దెసలు.
అమ్మా నాదేశజననీ
కొమ్మా నవహార్తికవిరా
జమ్మైన పూర్వమకుటము
వమ్మై అరిబలము తూలఁగ.
గౌతమాశోక ఋషుల
కాలమునందువలె నిపు
డఖిలభూ మండలికి నీ
వవసర మైతి వమ్మ.
చాటింపు మమ్మ నీవు
సర్వాధిపత్యమునకు
మరల నవయౌవనముతో
అరుదెంచినట్టివార్త.
జననీ నీగాఢనిద్రా
సమయమునందు మేము
ఆకొని వెక్కి వెక్కి
అడలుచుంటిమి తల్లి.
హృదయధీ దేహబలసం
ప్రదమై కడుతియ్యనైన
పాలిచ్చి జోలపాడి
లాలింపవమ్మ మమ్ము.

# సాభిప్రాయ విశేషములు

నెహ్రూనివేదిక స్వార్థపరాయణులకు భయభ్రాంతులను గలుగజేసినది. భరతవర్షమునందును, గ్రేట్బ్రిటనునందును స్వార్థపరులు నిప్పులుతొక్కిన కోతులవలె తందనా లాడుటకు మొదలుపెట్టిరి. ఆంగ్లపత్రికల ప్రలాపములు, స్వదేశసంస్థానాధీశుల పటాటోపములు వారి సహజస్వభావమును విశదము చేసినవి. కోపావేశమునం దొకపత్రిక నొకపత్రిక మించినది. బ్రిటీషు సామ్రాజ్యతత్వాభిమానమునకు కంకణమును గట్టుకొనిన లండను టైమ్సుపత్రిక నెహ్రూనివేదికను నిరసించుటయందు విచిత్రము లేదు. నెహ్రూనివేదిక సకలపక్షముల యభిప్రాయములను తెలుపుట లేదట! ముఖ్యముగను మహమ్మదీయాభిప్రాయమునకు ప్రతికూలమట! సిక్కుల కిది సమ్మతము గాదట! నివేదిక హిందూ జాతీయవాదుల లక్ష్యమును మాత్రమె తెలుపుచున్నదట! స్వదేశసంస్థానములమాట తలపెట్టనే లేదట! బ్రిటానియా యను క్రొత్తపత్రిక మతిపోయిన వాదమును దెలుపుచున్నది. హైందవులను నిరంకుశాధికారులైన సంస్థానాధీశులవశము చేయవలయునట! దేశానర్థదాయకులైన విద్యావంతులు మాయ మగుదురట! ఆంగ్లేయ సైన్యములు కేంద్రస్థానములందు ఖులుకుచు గూర్చుండునట! మార్నింగుపోస్టు, డెయిలిటెలిగ్రాఫు, మాన్చెస్టరు గార్డియను చేయుచున్న యక్రమప్రచారము పరమాసహ్యముగ నున్నది. నెహ్రూనివేదికను పంజాబు వంగదేశముల మహమ్మదీయులు నిరసించిరట! సకలపక్షసమావేశములు ప్రాతవడిన విద్యావంతుల సమావేశము లట! నెహ్రూనివేదిక ప్రజాభిప్రాయమును దెలుపదట! సామ్రాజ్యశాసనసభయందు ప్రజాప్రతినిధులకు పలుకుబడి పోయినదట! సకలపక్షసమావేశము బ్రిటీషుశత్రువుల సమావేశమట! ఇట్టి అసందర్భములైన భావములతో బ్రిటీషుపత్రికలన్నియును చిలుకపలుకులవలెను నింపబడి ద్వేషమును వ్యాపింపజేయుచున్నవి. ఈ యున్మత్తప్రలాపములకు ప్రత్యుత్తరము నిరర్థకము.

నెహ్రూనివేదిక సకలపక్షముల సమాదరణమును పొందుచున్న విధమును దేశసమావేశములు విశదము చేయుచున్నవి. లయాల్పూరునందుగూడిన పంజాబు రాష్ట్రీయ సంఘసమావేశము సకలపక్ష సమావేశము చేసిన తీర్మానముల నామోదించినది. పంజాబు ఖిలాఫతు సంఘాధ్యక్షులు అబ్దులుఖాదరుగారు సకలపక్షసమావేశము చేసిన తీర్మానమును ప్రతిపాదించిరి. సభ ఏకగ్రీవముగ తీర్మానము నామోదించినది. వంగరాష్ట్రమునందలి మహమ్మదీయులును సకలపక్ష సమావేశము చేసిన తీర్మానముల నామోదించిరి. కొందరు

మహమ్మదీయులు ప్రతిఘటించుటయందు విచి త్రము లేదు. ప్రపంచమునం దందరి యామో దమును బడయగల విషయ మేదియును నుండ దు. ఏస్వార్థపరులో ప్రతిఘటించుట సహజము. మహమ్మదీయులందు చాలమంది నెహ్రూనివే దికను, సకలపక్షసమావేశ మామోదించిన తీర్మానములను హర్షించుచున్న విధమును దేశ వ్యవహారములు విశదము చేయుచున్నవి. డాక్టరు అన్సారి, అబులు కలామ్ ఆజాదు, సర్ ఆలి ఇమాము, మొహమ్మదాబాదు మహారాజు గారులు మొదలగు మహమ్మదీయుల యభి ప్రాయము మహమ్మదీయాభిప్రాయములను చెప్పక చెప్పుచున్నవి. సిక్కుల మహాసభ సకలపక్షసమావేశము చేసిన తీర్మానముల నేక గ్రీవముగను నంగీకరించినది. భారత ప్రజాభి ప్రాయములను భారతీయనాయకులు తెలుప గలరు గాని 6,000 మైళ్ల దూరమునందున్న బ్రిటీషు పత్రికలు తెలుపజాలవుగదా! భిన్న పక్షములవారును, భిన్న మతములవారును కలిసి చేసిన తీర్మానములను హిందువుల తీర్మానము లని యాక్షేపించుట దుర్జనత్వమునకు లక్ష ణముగాని వివేకమునకు లక్షణము గాదు. మహమ్మదీయులను రెచ్చగొట్టుటకై ఆంగ్లేయ పత్రికలు పన్నెడి దుస్తంత్రములు మహమ్మ దీయుల నెల్లకాలమును మోసగింపజాలవు. ప్రపంచమునందు మాయోపాయములకును మితిమేరలు గలవు. భారతీయ మహమ్మదీయు లును భరతవర్షమే వారికి శరణ్యమనియును, హిందువుల సహకారమే ప్రయోజనకరమని యును చిరకాలానుభవమువలన గ్రహింప గలిగిరి. మిత్రభేదతంత్ర మెల్లకాలమును ప్ర యోజనకరము గాదు. ఈ సమయము నందు మహమ్మదాబాదు మహారాజు మహమ్మదీయ సోదరులకు జేసిన హితోపదేశమును వారు సావధానచిత్తులై గమనింప వలయును. సకల పక్ష సమావేశము మహమ్మదీయాశయముల కనుకూలముగాని ప్రతికూలముగాదు. సంయు క్తనియోజకవర్గమె సాంఘిక విభేదములకు పరమహంస క్రియ.

నెహ్రూ నివేదికయును, సకలపక్షసమా వేశమును అధినివేశపరిపాలనమును (Dominion Status) అంగీకరించుటయందు విచిత్రము లేదు. ఇది సకలపక్షాభిప్రాయము గాని ఏక పక్షాభిప్రాయము గాదు. ప్రాతవడిన విద్యా వంతులు గావుననే అధినివేశపరిపాలనమును నంగీకరించిరి. యువజనులు సంపూర్ణస్వాతం త్ర్యమును గోరుచున్న విధమును జవహరి లాలు నెహ్రూగారి యొక్కయు, వారి సహ చరులయొక్కయు భావములు విశదము చేయు చున్నవి. జాతీయమహాసభ సంపూర్ణ స్వాతం త్ర్యమునే ప్రతిపాదించినది. చెన్నరాష్ట్రము నందు సంపూర్ణస్వాతంత్ర్యసమితి స్థాపింపబడి నది. చీనా, పారసీకము, ఆఫ్గనిస్థానము మొదలగు రాజ్యములు సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవిం చుచున్నవి. ప్రాతవడిన విద్యావంతుల కింకను బ్రిటీషు ప్రతిజ్ఞలమీదను, బ్రిటీషు సంయోగ ముమీదను విశ్వాసము నిలిచియున్నది. గౌర వనీయులైన శ్రీనివాసశాస్త్రిగారు బ్రిటీషు సం

బంధావసరమును ఆఫ్రికానుండి ప్రకటించుచు న్నారు. పాపము, బ్రిటీషు పత్రికలకు వీరిమీ దనైనను కనికరము లేకపోయినది. సకలపక్ష సమావేశము సాధ్యమైన సహకారరాజ్యాంగ విధానమును నిర్ణయించుట కేర్పడినది గాని సహకారనిరాకరణమును నిర్ణయించుట కేర్ప డలేదుగదా! అధినివేశపరిపాలన నామోదిం చిన సకలపక్షసమావేశము బ్రిటీషుమిత్రుల సమావేశ మగునుగాని బ్రిటీషుశత్రువులసమా వేశము గాజాలదు. బ్రిటీషుఇండియాను స్వదేశ సంస్థానాధీశుల వశము చేయుటకై భారతీయులె వరును అభ్యంతరపెట్టరు. ఇది భరతవర్షమున కు క్షేమకరముగ నుండగలదు. ఇటులు చేసిన బ్రిటీషు సామ్రాజ్యమున కెట్టి దుస్థితిపట్టునో బ్రిటానియాపత్రిక యూహించుకొని యుండదు. భరతవర్షములేని బ్రిటీషు సామ్రాజ్య మెంత బాగుగనుండునో తెలుపనవసరములేదు. స్వార్థ పరాయణు లెన్ని యారోపణల నైనను మతి చెడిచేయుట సహజము. నెహ్రూనివేదికను విమ ర్శించి లోపములను తెలుపుట వివేకము. ఆక్షే పించుట, నిందించుట ప్రయోజనకరము గాదు. కాని వాని యసత్యమును వెల్లడిచేసి యథా ర్థస్థితిని తెలుపుట భారతీయుల ధర్మమై యున్నది.

*   *   *   *

సంస్థానాధీశుల ప్రగల్భములు

స్వదేశ సంస్థానాధీశుల స్వార్థపరత్వము బ్రిటీషు నిరంకుశాధికారుల స్వార్థపరత్వమును మించి పోయినది. భారతమాతకును వారికి ని గల సంబంధమునె వారు మఱచిపోవుచు న్నారు. వీరి సంబంధమంతయును బ్రిటీషు రాజ్యాధికారముతో గలదట గాని భారతప్ర భుత్వముతో లేదట. భారతీయసంపదలను ననుభవించుచు బలియుచున్న సంస్థానాధీశు లకు బ్రిటీషురాజ్యాధికారులతో మాత్రమె సంబంధ ముండుట చోద్యముగ నుండగలదు. సంస్థానాధీశులు వారి ద్రవ్యమునువలెను వారి దేశమునుగూడ నింగ్లాండు పాలుచేయుటకు వీలుండిన బాగుండియుండును. అప్పుడు సంస్థా నాధీశులకోర్కెలు సఫలములై యుండును. సంస్థానములును బ్రిటీషు ఇండియాతోపాటు భారతవర్షమునందే మనవలసియున్నవి. రెండు వంతుల బ్రిటీషుభాగమున కేమిగతి పట్ట నున్నదో శేషించిన సంస్థానముల భాగము లకును నాగతి పట్టనున్నది. సంస్థానముల కును, బ్రిటీషు ఇండియాకును రాజ్యాంగబం ధము దేశమునందున్న భారతప్రభుత్వముగాని దూరమునం దున్న బ్రిటీషుప్రభుత్వము గాదు. ఇది ఇప్పుడు మామూలుగా నున్న మార్గము గాని క్రొత్తమార్గము గాదు. సమాన బా ధ్యతలు, ప్రయోజనములు, ధర్మములు గల భరతమాతను విడిచి బ్రిటీషు రాజ్యాధికార ముమీద నాధారపడుట నేల వదలి సాము చేసినటు లుండును.

సంస్థానాధీశులు వారి హక్కులను బట్లరు కమిషను సమక్షమునను స్థిరపరచుటకు విశ్వ ప్రయత్నములను జేయుచున్నారు. మహా రాజులు, నవాబులు లండనునందు సెప్టెంబరు

30-వ తేదిని సభను జేసి వారి హక్కులను ప్రతిపాదించిరి. సర్ లీలి విల్సనుకు లక్షలకొలా ప్యముల నిచ్చి న్యాయవాదిగ నియమించిరి. రూష్బ్రూకు విలియమ్సుగారు మొదలగు ప్రతినిధుల సంఖ్యకు లెక్కయే లేదు. నూటికి తొంబదివంతున సంస్థానాధీశుల వాదములు సరిగా నున్నటులు న్యాయవాదులు తెలుపుచున్నారట. కాశ్మీరు, బికానీరు, పాటియాలా మహారాజులు, భోపాలునవాబుగారు మొదలగు సంస్థానాధీశులు వెలిపుచ్చిన భావములు వారి సంకుచిత హృదయమును విశదము చేయుచున్నవి. పండితులును, ఆలీలును, లాలాలును, సింగులును స్వదేశసంస్థానము లందు రాజ్యముచేయవలయునని కోరుటలేదు. స్వదేశ సంస్థానములును, బ్రిటీషు ఇండియాయును భారతసౌభాగ్యమునకును, లోకకల్యాణమునకును సమానప్రతిపత్తితో కలిసి పనిచేయవలయుననియే కోరుచున్నారు. బ్రిటీషు ఇండియాకు సంస్థానములమీద బాధ్యత లేనపుడు సంస్థానములకును బ్రిటీషు ఇండియా మీద బాధ్యత యుండజాలదు. భరతవర్షమునందలి సకలభాగములును భారతప్రభుత్వముమీదనాధారపడి యుండగలవు గాని కొంతభాగమైనను విదేశప్రభుత్వముమీద నాధారపడి యుండజాలవు. పరాధీనత్వము సంస్థానములకే కళంకమును గలుగజేయుచున్నది. భారత ప్రభుత్వాధికారము సరిపడని సంస్థానాధీశులకు బ్రిటీషు రాజ్యాధికారము రుచించుట రాజ్యాధికారమునందుగల మహిమగాని, దేశాభిమానము గాని స్వాతంత్ర్యప్రియత్వముగాని కాజాలదు. ప్రజాస్వామ్య యుగము నందు రాజాధికారాభిమానము నిలువజాలదను విషయమును సంస్థానాధీశులు గ్రహించుట ధర్మము.

చీనారుష్యాసామ్రాజ్యముల యుదంత మీ విషయమును విశదముచేయుచున్నది. సంస్థానాధీశులు చేసినధర్మములు వారిదుర్వ్యయములలో సహస్రాంశమైనను నుండవు. ఒకవేళ సంస్థానాధీశులు గొప్ప ధర్మములను చేసినను సంస్థానముల నిరంకుశత్వమున కీ ధర్మములు నైవేద్యము గాజాలవు. భరతవర్ష రాజ్యాంగనిర్మాణము సాంఘాతిక నిర్మాణముగా నుండవలయునని రాజ్యాంగ పరిజ్ఞాత లంగీకరించుచున్నారు. ఆనిర్మాణ మేరీతి నుండవలయునో బ్రిటీషు భాగములును, సంస్థానములును నిర్ణయించుట వివేకముగాని నెహ్రూనివేదికను నిందించుట వివేకము గాదు. సంస్థానములు వాని స్థితిగతులకు దగినటులు సాంఘాతిక నిర్మాణమునందు స్వాతంత్ర్యము ననుభవించుట కభ్యంతరము లెవరికిని నుండజాలవు. బ్రిటీషు ఇండియా రాష్ట్రములకు గల స్వాతంత్ర్య బాధ్యతలే సంస్థానములకును నుండగలవు. కాని సంస్థానముల సంపూర్ణస్వాతంత్ర్యస్థితి యసంభవము. భరతమాత స్థానిక స్వాతంత్ర్యప్రాబల్యమువలన మహాదుఃఖవేదన ననుభవించినది. బలవత్తరమైన కేంద్రాధికారము విశాలమైన దేశమునందు శాంతిరక్షణమున కవసరమై యున్నది. ఆయధికారము బ్రిటీషుఇండియాకును, సంస్థానములకును సమానముగను వర్తింపగలదు.

నైహూ నివేదిక స్థానికస్వాతంత్ర్యమును, ప్రబలమైన కేంద్రాధికారమును నిర్ణయించుచున్నది. భారత సౌభాగ్యమున కీమార్గమె శరణ్యమని చిరకాలానుభవము వ్యక్తముచేసినది. సంస్థానాధీశులు స్వార్థపరత్వమును, అధికారాభిమానమును విడిచి కృశించుచున్న మాతృదేశము నుద్ధరించుటకు భగవదనుగ్రహమును బడయుదురుగాత !

* * * *

సైమను కమిషను

సైమను కమిషను గలుగజేయుచున్న వాద ప్రతివాదములకును, భేదాభిప్రాయములకును, విచిత్ర భావనలకును నాద్యంతములు గనుపడవు. సర్ జాన్ సైమను ప్రజ్ఞావంతుడు, సుప్రసిద్ధన్యాయవాది. అయినను వారిప్రజ్ఞ, న్యాయవాదిత్వము బ్రిటీషుప్రయోజనములను సమకూర్చుటకు వినియోగపడుచున్నటులు స్వధర్మనిర్వాహణమును జేయుటకు వినియోగపడుట లేదు. లండనునగరమునందు వారు చేసిన ప్రసంగములందు భరతవర్షముపట్లను స్వధర్మ నిర్వాహణమును జేయునటులు వెల్లడిచేసిరి. నైహూనివేదికను వారు తెప్పించినటులును, బాగున్నటులును తెలియజేసిరి. రాష్ట్రీయశాసనసభలు సహకారోపపాదనల నంగీకరించినందులకును, 500విజ్ఞాపనపత్రములు వారికి చేరినందులకును సైమనుగారానందభరితులైరి. రీడింగుప్రభువు సైమనుగారినభినందించుచు భారతీయులు సైమనుకమీషనుపట్లను సహకారభావమును జూపుచున్నారని యానందించిరి. కార్మికనాయకులు రామ్సె మాగ్డొనాల్డు, లేన్సుబరిగారులు సైమనుకమిషనుతో సహకారమును బోధించిరి. రామ్సెమాగ్డొనాల్డుగారు కార్మికపక్షము భారతీయులకు స్వారాజ్యమునకు స్వర్ణమార్గమును నిర్మించునని హెచ్చరించి యానందించిరి. సైమనుకమిషను నిర్మాణమును పునర్విమర్శనమును జేయవలయునని ఫెన్నెరు బ్రాక్వేగారు ప్రతిపాదించిన తీర్మానము నెగ్గక పోయినది. ఈ తీర్మానమునకు 15,000 అనుకూలాభిప్రాయములును,30,00,000 ప్రతికూలాభిప్రాయములును వచ్చినవి. బ్రిటీషుప్రజాభిప్రాయ మేపక్షమునకు జెందియున్నను బ్రిటీషు ప్రయోజనములకు వినియోగపడుచున్నదనియును, భారతీయ ప్రయోజనములకు వినియోగపడుట లేదనియును విశదమగుచున్నది.

బ్రిటీషు ప్రజాభిప్రాయము భారతీయ రాజ్యాంగములందు ప్రమేయమును గల్పించుకొనుట లేదను విషయము సర్వత్ర తెలిసియున్నది. రీడింగులు, మాగ్డొనాల్డులు, సైమనులు, వింటరుటన్నులు చెప్పిన మాటలే హిందూదేశ విషయమై బ్రిటీషు ప్రజలకు వేదవాక్యములు. బ్రిటీషు నాయకులు తాము యథార్థమును గ్రహించక, ప్రజలకు యథార్థస్థితిని తెలుపకుండుట శోచనీయము. సైమనుకమిషను విషయమై నడచుచున్న కపటనాటకము బ్రిటీషుప్రజాహృదయమును, నిరంకుశవర్గహృదయమును విశదము చేయుచున్నది.

* * * *

సైమను సహకార బహిష్కారములు

సైమనుకమిషను ఈ నెల 12 వ తేదిని బొంబయియందు దిగుచున్నది. అధికారులు మహాస్వాగతము నొసంగుటకు ప్రయత్నములను జేయుచున్నారు. ప్రజలయందును స్వార్థపరాయణులు కొందరు స్వాగతంబు నొసంగుటకు ప్రయత్నములను జేయుచున్నారు. రాష్ట్రీయ శాసనసభలు చాలవరకు సహకారనిరాకరణమును విసర్జించి సహకారము నవలంబించినవి. స్టేటుకౌన్సిలు సహకారము నామోదించి ప్రతినిధుల నెన్నుకొన్నది. రాజప్రతినిధి భారతసామ్రాజ్యశాసనసభ నుండి సభ్యులను నియమించిరి. ఈ రెండుశాసనసభల యుపసంఘమునకును పార్లమెంటరి కమిటియని నామకరణము చేసి, సర్ శంకరనునాయరుగారి నధ్యక్షులనుగ నియమించిరి. సర్ జాన్ సైమనుగారును, నిరంకుశవర్గమును, బ్రిటీషు ప్రజలును నీవ్యవహారము నంతయును సహకారమని నమ్మి చాటుచున్నారు. దేశాభిప్రాయము నెరిగినవా రెవరును నీకపటనాటకమును సహకారమని నమ్మజాలరు. స్వార్థపరులు సకలదేశములందును పరమార్థధర్మములకు పాలుపడుచుందురు. వారిలక్ష్యము స్వప్రయోజనము లందువలెను దేశప్రయోజనములందు లగ్నము గాదు. ముఖ్యముగా నిది భారతమాతకు పట్టిన దౌర్భాగ్యము.

రాష్ట్రీయశాసనసభలయందును,సామ్రాజ్య శాసనసభలయందును అధికార సభ్యులును, వారియనుచరులును సహకారమును బలవంతముగ నెగ్గింప గలిగినవిధమును దేశవ్యవహారములు తెలుపుచున్నవి. నిరంకుశప్రభుత్వములం దిట్టివిజయములు సహజములు. రాజాశ్రయ మాత్మగౌరవమును, దేశకల్యాణమును నాశనము చేయగల విధమును ప్రపంచేతిహాసములు వేయినోళ్లను చాటుచున్నవి. కార్డినలు వుల్సి ముఖమునను షేక్స్పియరు మహాకవి లోకమునకు జేసిన హితోపదేశమును సహకారపరాయణులు మననము చేయవలసియుందురు. "నేను నాప్రభువునకు జూపిన భక్తియందు సగమునైనా నాదేవునకు జూపిన నాకిట్టిదురవస్థ సంభవించి యుండదు." అని వుల్సి చేసిన విలాపము సకల జనులకును స్వధర్మనిర్వహణమును సంస్మరింప జేయుటకు దగియున్నది. వర్తమాన సందిగ్ధ సమయమునందు భారతీయులకు వుల్సిగారి యనుభవము జ్ఞానోపదేశమును జేయుటకు దగియున్నది. స్వార్థపరత్వము, నిరంకుశాధికారావలంబనము భారతీయులను స్వధర్మ పరాఙ్ముఖులను జేసినవి. భారతీయుల లక్ష్య మాత్మావలంబనమునందు లగ్నమగుట శ్రేయస్కరముగాని పరావలంబనమునందు లగ్నమగుట శ్రేయస్కరము గాదు. భారత ప్రముఖు లీలక్ష్యమును గ్రహించియే సైమను కమిషను బహిష్కరణమును నిర్ణయించిరి. దురహంకార పరాయణులైన బ్రిటీషురాజ్య నీతిజ్ఞులకు బ్రిటీషు ప్రయోజనము లందు గల లక్ష్యము భారతప్రయోజనము లందును, ప్రపంచ ప్రయోజనములందును గలుగకున్నది.

భారతీయులును బ్రిటీషు అధికారుల మాయోపాయములందు బడుట సంతాపకరము. ప్రముఖులు మాత్రము బ్రిటీషు మాయోపాయములందు జిక్కుకొన కుండుట ఆశాజనకముగ నున్నది. సామ్రాజ్యశాసనసభ గత సమావేశమునందు జూపిన సాహస ధైర్యములు సైమనుకమీషనుపట్ల ప్రజలకుగల దృఢసంకల్పమును విశదము చేయుచున్నవి.

* * * *

సామ్రాజ్యశాసనసభ

సామ్రాజ్యశాసనసభయొక్క గతసమావేశము నిరంకుశాధికారవర్గమునకు కొంతవరకు గర్వభంగమును గలుగజేయుటకు దగియున్నది. అధికారవర్గము సహజవిశ్వాసముతో ప్రజాక్షేమరక్షకశాసనమును ప్రవేశపెట్టినది. శాసనప్రవేశమున కవసరమైన పరిమితకాలము లేకపోయినను శాసనము ప్రవేశమును గాంచినది శాసనము విషయమై తీవ్రమైన వాద ప్రతివాదములు బయల్వెడలినవి. నిర్ణీతోపసంఘము శాసనమును సవరించినను శాసనావసరము ప్రజాప్రతినిధులకుదుర్గ్రాహముగనుండెను. శాసనము విదేశీయులమీద ప్రయోగించుట కేర్పడినను మానవ స్వాతంత్ర్యమునకు ప్రతిబంధకమని స్పష్టమగుచున్నది. నిరంకుశ కార్యనిర్వాహకాధికారుల ఆయుధాగారమునందు తీక్ష్ణమైన నవీనాస్త్రమును నిర్మించుట కధికారులు సంకల్పించిరి. భారతదేశమున కీశాసన నిర్మాణ మనవసరము. అవసరమైనను అపఖ్యాతిని గలుగజేయుట సహజము. విప్లవకారులను నిర్బంధించుటకు హైందవ శాసనాగారమునందు పాశుపతాస్త్రములు చాల నున్నవి. వేరొక శాసన మేల కావలయును? ఈశాసనము ప్రభుత్వబలమును నిర్ణయించుట కేర్పడి యుండును. పండిత మోతీలాలు నెహ్రూగా రారంభమునుండియును శాసనమును ప్రతిఘటించి స్వాతంత్ర్యప్రియుల కృతజ్ఞతకు పాత్రులైరి. భారత ప్రముఖుల సంయోగము వలనను, గా. పటేలుగారి నిశ్చితాభిప్రాయమునను నిరంకుశ ప్రభుత్వమునకు తలవని తలంపుగ పరాజయము గలిగినది. ఈరంగముతోనే నిరంకుశవర్గ మాడదలచిన కపటనాటకమును ముగించినది. సైమను సహకారోపసంఘమును నిర్మించుటకుగాని, ఇతర నిరంకుశ శాసనముల నిర్మాణములకుగాని భారత ప్రభుత్వము పూనుకొనక శాసనసభను యథేచ్ఛగను నిలుపుదల చేసినది. సామ్రాజ్య శాసనసభయందు సైమను సహకారరంగమున కవకాశము లేనపుడు ఇర్విను ప్రభువు సహకారోప సంఘము నేర్పాటు చేసి 'పార్లమెంటరికమిటి' యని నామకరణము చేయుట భారత రాజ్యాంగముయొక్క దౌర్బల్యస్థితిని విశదము చేయుచున్నది. పార్లమెంటు నియమించని కమిటి పార్లమెంటరికమిటి యెటు లగును? శ్వేత మందిరము నుండి వెలువడిన యాజ్ఞలను శిరసా వహించుటయె భారత ప్రభుత్వమున కనుల్లంఘనీయ మైన ధర్మమై యున్నది.

ప్రజాసంకల్పమును ప్రతిఘటించుచున్న సైమను కమిటీని బహిష్కరించుట భారతీయులకు పరమ ధర్మమని నిరంకుశప్రభుత్వమవలంబించుచున్న వ్యవహార విధానమే విశదము చేయుచున్నది. నిరంకుశ ప్రభుత్వమును, వారి యాశ్రయులును సహకార మార్గము నవలంబించినను భారతీయాత్మ గౌరవము నవమానపరచిన సైమను కమిషనును బహిష్కరించుట ప్రజాధర్మమై యున్నది. ఆ ధర్మమును నిర్వహించుటకు దేశమునం దన్ని ప్రాంతములందును ప్రయత్నములు జరుగుచున్న విధమును దేశవ్యవహారములు తెలుపుచున్నవి. బొంబయియందు కాంగ్రెసు సభ్యులందు భేదాభిప్రాయములు బయలు దేరినను యువజనసమితి బహిష్కారమును జేయుట కుత్సాహము చూపుట భావిభాగ్యోదయమునకు శుభసూచకము. దేశమునం దంతటను ఒక నిర్ణయమైన దినమునందు బహిష్కార చిహ్నముగను హరతాళమును జేయుట సమంజసముగ నుండును.

* * * *

## ప్రజల కర్తవ్యము

ఘనకార్యములు లోకమునందు తగిన శక్తియును, సాధనసంపత్తియును లేక సిద్ధింపజాలవు. స్వరాజ్యసంపాదనము భారతీయులు చైతన్యమునుగలిగియుండుటకే అవసరమైయున్నది. భాగ్యభోగ్యములమాట యెటులున్నను జీవించుటకు సకల మానవులకును స్వతస్సిద్ధమైన హక్కు గలదు. భారతీయచైతన్యము క్షీణించుచున్నపుడా ప్రళయమునం దందరును క్షీణించుట సహజము. ప్రళయమునందు సంఘాభిమానములను నిరంకుశాభిమానములను, రాజ్యాభిమానములను సంరక్షించుకొనజాలరు. స్వధర్మనిర్వహణము విజయమునకుసాధనముగాని స్వార్థారాధనము విజయమునకు సాధనము గాదు. భారతమాతను చైతన్యవతిగ చేయుటకు భారతీయులందరును యథాశక్తిని నైవేద్యమును సమర్పించుట ధర్మము. వర్తమానసమయమునందు భారతీయు లందరును భేదాభిప్రాయము లేక చేయగల కార్య మొకటి గలదు.

లక్నో నగరమునందు సర్వపక్షసమావేశమామోదించినతీర్మానములను దేశమంతయును నేకగ్రీవముగ నామోదించి భారతాభిప్రాయమును వ్యక్తము చేయుట యవసరము. చెన్నపురియం దఖిలపక్ష సమావేశము గోకలే మందిరమునందు శ్రీమతి డాక్టరు బెజంటమ్మగారి యధ్యక్షతక్రిందను గూడి సకలపక్ష సమావేశమును సమర్థించినది. ఆ సమావేశమునందు చెన్నపురి రాష్ట్రమునందు జరుగవలసిన కార్యవిధానము నిర్ణయింపబడును. ఆనిర్ణయానుసారముగ ప్రజలందరును వారిధర్మమును నిర్వహించుటకు బూనుకొనియెదరుగాత! బెజంటమ్మగారు 9-వ తేదిని బెజవాడ యందు సకలపక్ష సమావేశమున కధ్యక్షతను వహింప నున్నారు. ఆంధ్రమహాజను లీసమావేశములను సఫలము చేయుదురని నమ్ముచున్నాను.

కాంగ్రెసు పక్షాభిమానులు కాంగ్రెసు సమావేశములకును, సకలపక్ష సమావేశముల

కును గల భేదములను గమనించుచు, రెండు సమావేశము లందును పాల్గొనుట కవకాశము లు గలవు. దేశమనవసరమైన కలవరమునందు మునుగ కుండునటులు నాయకులు ప్రవర్తించు ట ధర్మము. గతవారమునందు జరిపిన వర్ధంత్యుత్సవములు మన కీవిషయమున మనధర్మ మును బోధించు చున్నవి.

* * * *

జయంతివర్ధంత్యుత్సవములు

గతవారమునందు దేశమునం దంతటను భారత నవజీవనమునకు జనకుడైన శ్రీ రాజా రామ మోహన రాయల జయంత్యుత్సవములు పరమోత్సాహముతో జరుపబడినవి. భారతీయుల నావరించిన మూఢ విశ్వాసములను మూలచ్ఛేదము చేయుటకు పాటుపడిన మహానుభావుడు రామమోహనరాయలు. ఆయన శాశ్వతకీర్తికి సహగమన నిర్మూల మొకటి చాలియున్నది. రామమోహనునిలక్ష్యము మహర్షుల లక్ష్యమువలెను మూలతత్త్వాన్వేషణము నందు లగ్నమైనది. పవిత్రమైన ఆర్యావర్తము నందు పెరిగిన కంటకావరణములను నిర్మూలము చేసి భారతబృందావనమును లోకానందకరము చేయుటకు రామమోహనరాయలు పడిన పాట్లు వర్తమానకాలమునందుగల జ్ఞానవ్యవస్థలకు సాధనంబులైనవి. భారతీయ విద్యావంతు, లక్ష్యమును క్రైస్తవమతమునుండి మరల్చి ఏకేశ్వరోపాసనయందు లగ్నముచేసి బ్రహ్మసమాజమును స్థాపించిన రామమోహన రాయలు భారతజాతీయోద్ధారకుడు; లోకోద్ధారకుడు. ఆమహనీయుని యారాధనోత్సవము వర్తమానకాలమునందు మననియత ధర్మానుష్ఠానమునకు సాధనముగ నుండగలదు.

శ్రీమతి డాక్టరు బెజంటమ్మగారికి 82-వ జన్మదినోత్సవమును లోకమునం దంతటను బ్రహ్మజ్ఞానసామాజికు లత్యుత్సాహముతో జరిపి వారికృతజ్ఞతను వెల్లడిచేసిరి. వసంతమ్మగారు నిజముగా 82-వ ఏటను చూపుచున్న వసంతచైతన్యము పరమాశ్చర్యమును గలుగజేయుచున్నది. ఆమె యుత్సాహము, పట్టుదల, కార్యపరత్వము నిరుత్సాహులకును నుత్సాహమును గలిగింపగలదు. మానవజీవిత రంగమునందు సకలాంగములును కలిసి పని జేయవలసిన విధమును బెజంటుగారి జీవితము విశదము చేయుచున్నది. బ్రహ్మజ్ఞాన సమాజమునం దాచార్యపీఠము నధిష్ఠించుచున్నను స్వరాజ్యసంపాదనమునకై బెజంటుగారు చేయుచున్న కృషి భారతీయుల కాదర్శప్రాయముగ నుండగలదు. సామాన్యయువతిగను జన్మించిన బెజంటమ్మగారు గడించిన కీర్తి, విజ్ఞానము, ప్రాముఖ్యము మానవులకు సాధ్యములు గాని పనులు లేవని విశదము చేయుచున్నవి. స్థిర సంకల్పము, సంకల్పమున కనురూపమైన ప్రయత్నములు కార్యసిద్ధికి సాధనములు. భారత దేశప్రతిష్ఠను ప్రపంచమునం దంతటను వ్యాపింపజేసిన బెజంటమ్మగారు భారతసేవను, మానవసేవను జేయుటకు చిరకాలము వర్ధిల్లుగాత !

గాంధిమహాత్మునకు 60-వ ఏడు ప్రారంభ మైనది. గాంధిగారికి వారి జీవితమునందు యథార్థముగను మహాత్ముని పదవి లభించిన విధమును వారి పరిచయము గలవారికిని, వారి ఆత్మకథను చదివినవారికిని విశదమగుచున్నది. 'నా చిన్ని పొట్టకు శ్రీరామ రక్ష' యనెడు అల్పజ్ఞులును, అల్పాత్ములును లోకమునం దంతటను గలరు. భోగము, డంబము, గర్వము సకల జీవములకును సత్యారాధనమునకు ప్రతి బంధకముగ నున్నవి. ఈషణత్రయమును జయించిన మహానుభావు లవతారపురుషులు. గాంధిమహాత్ము డీషణాత్రయమును, అరిషడ్వర్గమును జయించిన మహానుభావుడని వారి పరిచయమును, ఆత్మకథయును విశదము చేయుచున్నవి. అహింస, సత్యము, త్యాగమును ధరించి భారతోద్ధరణమును, లోకోద్ధరణమును, మానవోద్ధరణమును జేయుటకు జీవితార్పణమును జేయుచున్న గాంధిమహాత్మునకు భగవంతు డనేక వర్ధంతులను ప్రసాదించుగాత! విశ్వేశ్వరుని విశ్వవిలాసములను, భారతవిజ్ఞానమును సార్థకము చేయుచున్న ఈ మహానుభావుల పవిత్రజీవితములు భారతీయు లాత్మోపలబ్ధిని బడయుటకు వినియోగపడుటకు పరమేశ్వరు డనుగ్రహించుగాత!

---

Printed and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T, Madras

# విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—బాల్యచాపల్యము; జీవేశ్వరైక్యానుసంధానము; దీపావళి

ఏకవర్ణములు:—కృష్ణరాజసాగరచిత్రములు ౬; మైసూరు రాజావారి ఊరేగింపు; తెలుగునాటి విపరీతపు వరదలు ౪; ఉమా పరితాపము; శివుడు; డాక్టరు అవనీంద్రనాథ ఠాకూరుగారు; కీ. శే. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు; కీ. శే. యస్. ఆర్. దాసుగారు; పటేలుగారి కుటుంబము; ఆకస్మికఛాయాచిత్రములు ౫; దసరాచిత్రములు ౪; ఇతరచిత్రములును.

బాల్య చాపల్యము



సమం దేవి, స్కన్దద్విపవదనపీతం స్తనయుగం, త వేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్;
యదాలోక్యాశంకాకులితహృదయో హాసజనకః, స్వకుంభౌ హేరంబః పరిమృశతి హస్తేన ఝడితి.
—సౌందర్యలహరి.

చిత్రకారుఁడు : కంచి శివరామమూర్తిగారు, చెన్నపురి.




చెన్నపట్టణము, నవంబరు ౧౯౨౮

సంపుటము ౫ | విభవ సంవత్సరము కార్తికమాసము | సంఖ్య ౧౧


## సుధాకరా!

వేదుల సత్యనారాయణ శాస్త్రి (సాహితీసమితి)

ఓయి సుధాకరా! నిలువు మొక్కనిమేషము ; నీ మహోదయ
చ్ఛాయలు సోకి నాయెడద సాగరమట్టుల పొంగుచున్న; దే
వో యనుభూతజీవితసుఖోర్మ్ములపూర్వవిముగ్ధనాట్యముం
జేయుచు పాడుచున్నవి వినిర్మల మోహనరాగ గీతికల్.

నా కిపు డీప్రపంచ మొకనందనమట్టుల నీ యనంతలో
కైకపవిత్రకాంతి సుధలందున విచ్చిన మూగసోయగం
బై కనుపట్టె మానవుల యాశలతో విధికిన్ నిరంతరా
నీకము సాగు ఈకటికినేల మనోజ్ఞత యింతనిల్చునే!

ఈయది మోదమో యెడద నేర్చెడు ఖేదమొ యతలంతలై
పోయెడు మోహమో తొలగిపోవని స్వప్నమొ చెప్పలేని దే
దో యనుభూతి దివ్యపవనోర్మిపరీమళ మట్లు ముగ్ధనిం
జేయుచునుండె నన్నిపుడు నీతెలికాంతుల కౌగిలింతలన్.

నీవొక యప్సరఃప్రణయినీ కబరీచ్యుత పారిజాత మా
లావిసరంబవో మరి; ఇలాతలమంట సుధాతుషారవ
ర్షావిమలావగుంఠనము జార్చుచు బోవు శరద్విభావరీ
దేవి లలాటికామణివొ, దీపికవో, సురలోకలక్ష్మికిన్.

అలసట జెందినావొ యుదయాస్తమయమ్ములె జీవనమ్ముగా
తిలచెడు మర్త్యపాళి కమృతప్రభలన్ వెదజల్లి; యింత సొం
పులొలుకు వెన్నెలం గనులు మూయని పేదలకై కృపారసం
బొలసెడు నీసుధామురళి నూదుదువో భువనాలుసోలగన్.

ఓయమృతాశ్రుమూర్తి, యెటకో పరువెత్తెదు వాయులీనమై
పోయెడు రాగరేఖవలె; మోయగరాని ప్రవాసదుఃఖమో,
తీయని ప్రేమవేదనయొ, తీరనికోరికయో, యెదో యెదం
గోయునొ యేమొ రాల్చెద వనూనహిమాశ్రుకణాల నావలెన్.

విరిసినపూలవెన్నెలల వెల్లువ చక్కదనాల హంసవై
యరిగెడు నిన్నుజూచు నిశలందున నాకగు బాష్పశాంతి నీ
వెరుగుదు; దుఃఖతాపముల క్రిల్లగు పాడుప్రపంచమం దెరుం
గను కరుణైకముగ్ధుల యగాధహృదంతర బాష్పమాధురిన్.

చిరవిరహైకవాసనల జిమ్ముసుఖస్మృతులేవొ పైపయిం
బొరలుచు దుఃఖపుంగసటు వోవనియాశల మేలుకొల్ప సుం
దరతరచంద్రికా పులకితమ్మగు నింతటి కమ్మనైన రా
తిరి తెలవారిపోవక యిదేగతి నాకయి నిల్వరాదొకో!

ప్రేమపిపాసచే అమృతవీథుల జేరిన సుందరాంగనా
స్తోమ సితావగుంఠనతతుల్ సుమి యా తెలిమబ్బుదొంతరల్;
నీమృదు శయ్యలై సుధలు నిండిననీస్మితరోచిరూర్మికా
కోమల ఫేనరాసులయి కూర్చెడు నాయెద కింత వేదనన్.

ఆమృదుచంద్రికా యవనికావృత నీలనభోనిశాంత శో
భామయసీమలం దమృతవాటుల స్వప్నపథాల ఒక్క యీ
యామినిమాత్రమే తిరుగులాడెద నే చిరుమబ్బువోలె నీ
తో మనసార; ఒక్కపరి తోడ్కొనిపోవగ రాదటో సఖా!

---

# నందిమల్లయ్య - ఘంటసింగయ్య

ఓరుమల్ల అచ్యుతరావుగారు, యమ్. ఏ., యల్. టి.

(వెనుకటి సంచిక తరువాయి)

ఉదాహరణము: ౧—

## ధర్మవ్యాధోపాఖ్యానము

శ్లో. తస్య కాలేన మహతా చారిత్రేణచ ధీమతః;
బభూవార్జున కానామ కన్యాచ వరవర్ణినీ.
తస్యా యౌవనకాలేతు చింతయామాస ధర్మవిత్;
కస్యేయం దీయతే కన్యా కోవా యోగ్యశ్చవై
పుమాన్.

ఇతి చింతయత స్తస్య మతంగస్య సుతం ప్రతి;
ధర్మవ్యాధస్య సువ్యక్తం ప్రసన్నాఖ్యం ప్రతిబ్రువన్.
(సంస్కృత వరాహపురాణము)

గీ. వ్యాధభర్తకు మఱికొన్ని వర్షములకుఁ
బుట్టె నర్జునకీనామపుత్రి మెఱుఁగుఁ
డీఁగె కైవడి రతిరాజు తియ్యవింటి
చేగపోలిక వెన్నెలసోగపగిది.

క. ఈచందంబున జననం
బై చాంద్రమసకళభంగి ననుదిన వృద్ధి
శ్రీచాతురి గల చెంచుల
రాచూలికి యౌవనంబు రాఁ గడఁగుటయున్.

సీ. నాభికావాలమండలమున మొలచిన
తాపింఛవల్లీమతల్లి యనఁగఁ
దనుమనోభవపుష్ప ధనురంతరంబునఁ
గట్టిన బంగారు కట్టు లనఁగ
సౌందర్యకేళి కాసారంబులోపల
మొనసిన నెత్తమ్మి మొగడ లనఁగ
నిటల స్తనంధయనీహారకరునిపైఁ
గవిసిన గాఢాంధకార మనఁగ

నాఁడు నాఁటికి నారు గానంగఁ బడియె
వళులు దోఁచెఁ గుచంబులు వచ్చెఁ గురులు
వ్రాలె నంతట నాభిల్లవంశవల్లి
భాత్మసంభవ సంపూర్ణయౌవనమున.

గీ. హరిణ కరిహరిచమరంబు లక్షికుంభ
మధ్యవాలాకృతులు దెచ్చి మనుపుకొఱకు
భిల్లపతియింట గిరువులు పెట్టె ననఁగ
దృక్కుచవలగ్నచికురచారిమల నొప్పు.

గీ. పట్టెఁజేసి కుచంబులపై ధరించి
కందుకక్రీడ గావించు ఘర్మవారి
గరఁగి డిగజాఱ నవగైరికద్రవంబు
గిరులఁ బ్రవహించు ధాతునిర్ఝరము లనఁగ.

గీ. చన్నుగుబ్బలపోరాటఁ జక్కఁబెట్టఁ
బోయి మధ్యస్థభావంబు పొంద లేని
కతన లజ్జించె ననఁగ మొగాలు నల్లఁ
బారు గురువింద పూసలపేరు వైచు.

క. క్రిక్కిఱిసినబింకపుఁజను
జక్కవకవ యెక్కు లనఁగ సకియలు దనకున్
మక్కువ నీ నొక్కొకమరి
పెక్కులు మెడఁ దాల్చు మంచి పింఛెపుదండల్.

గీ. గ్రహణభయమున రవిసుధాకరులు హీను
లై చికురబంధరాహుగ్రహంబు కడను
శరణు వేఁడంగ వచ్చినచాడ్పు దోఁపఁ
బెట్టు సిందూరమునఁ జుక్కబొట్టు నొసల.

వ. ఇవ్విధంబున నారూఢయౌవనవిజృంభణమున దృక్కు
రంభంబైన నిజతనూజ నర్జునకిం జూచి దూరీకృత

విరోధుండు ధర్మవ్యాధుండు దీనికిం దగినవరుం డెవ్వండు గలుగునో యని చింతించుచు మతంగముని కుమారుండు ప్రసన్నుం డనువాఁడు సకలవిద్యాప్రసన్నుం డని విని వానికి వివాహంబు సేయునీహ నక్షీణ పుణ్యలక్షణగేహ నవ్వరారోహఁ గొంచు దుష్కృతంబులకుం గొంచు చెంచులు వెంటరా నిరాయాసంబునం జని లవంగ నారంగ పూగ పున్నాగ వకుళ కురవక ప్రియాళు రసాల ప్రముఖ సాలవికాసమాన సూనవాసనాసనాథ గంధపవమాన నిరస్త సమస్త పాంథ శ్రమంబగు నాశ్రమంబు దఱిసి ముంగట సరోవర తీరంబున బహుశిష్యగణంబులతోడ నాహ్నిక క్రియాకలాపంబులుదీర్చి వేదాంతశాస్త్రవ్యాఖ్యాన గోష్ఠి నున్న మతంగునిఁ గనుంగొని యి ట్లనియె.

మ. ఆనఘస్వాంత మతంగసంయమివరే
ణ్యా నాతనూజాత న
ర్జున కీ కన్యకఁ దెచ్చినాఁడ రమణీ
చూడామణిన్ మీ ప్రస
న్ననకున్ జేయుదమా వివాహ మిఁక నెం
దుం జూచినం గల్గ రా
యన దక్కన్మనిరాజనందనులు క
న్యాదానయోగ్యుల్ నరుల్.

చ. అనవుడు నట్ల కాక తగు
నాటవికాన్వయసార్వభౌమ నీ
తనయ మదీయ పుత్రునకు
ధర్మకళత్రముగా నటంచు నా
తనిఁ దనపర్ణశాలకు
మతంగమహామునిపుంగవుండు తో
డ్కొని చని చూపెఁ బెండ్లికొడు
కున్ మితభాషణు వంశభూషణున్.
(తెలుగు వరాహపురాణము, ద్వితీయాశ్వాసము)

ఉదాహరణము: ౨—

శ్లో. అస్త్యేకం భారతే వర్షే వనం దండక సంజ్ఞితమ్;
తత్ర తీవ్రం తపో ఘోరం గౌతమో నమవై ద్విజః.
చకార తస్య బ్రహ్మాతు పరితోషం గతః ప్రభుః;
ఉవాచ తం మునిం బ్రహ్మ వరం బ్రూహి తపోధన!
ఏవ ముక్తస్తు తాతేన బ్రహ్మణా లోకకర్తృణా;
ఉవాచ సస్యపంక్తిం మే ధాన్యానాం దేహిసంగతా,
ఏవ ముక్తో దదౌ తస్య తమే వార్థం పితామహః;
లబ్ధ్వాతు తం వరం విప్రః శతశృంగే మహాశ్రమః.
చకార త స్యోషసిచ పాకాంతే శాలయో ద్విజైః;
లూయంతి తేన మునినా మధ్యాహ్నే పచ్యతే తథా.
సర్వాతిథ్య మసౌ విప్రః బ్రాహ్మణేభ్యో దదాత్యలమ్;
కస్యచి త్త్వథ కాలస్య మహతీ ద్వాదశాబ్దికా.
అనావృష్టి ర్ద్విజవర హ్యభవ ల్లోమహర్షిణీ;
తాం దృష్ట్వా మునయః సర్వే అనావృష్టిం వనేచరాః.
క్షుధయా పీడ్యమానాశ్చ ప్రయయు ర్గౌతమం తదా;
అథ తా నాగతాన్ దృష్ట్వా గౌతమః శిరసా నతః.
ఉవాచ స్థీయతాం మహ్యం గృహే మునివరాత్మజాః;
ఏవ ముక్తా స్తు తే తేన తస్థు ర్వివిధభోజనమ్
భుంజమానా అనావృష్టి ర్యావ త్సా నివృతా౽భవత్;
నివృత్తాయాంచ తే తస్యా మనావృష్ట్యాంతు తేద్విజాః;
తీర్థయాత్రానిమిత్తాంతు ప్రయాతు మనసో౽భవన్.
(సంస్కృత వరాహపురాణము.)

సీ. మున్ను భారతవర్షమున దండకావన
వాటి గౌతమఋషివర్యుఁ డబ్జ
సంభవుఁ గూర్చి నిష్ఠాపరత్వంబున
బహుకాల ముగ్రతపంబు సలిపి
ప్రత్యక్ష మైనతద్బ్రహ్మచే విత్తిన
సస్యంబు లన్నియు జాములోన
పరిపాకమును బొంద వరముఁ గైకొని వచ్చి
శతశృంగగిరిఁ బర్ణశాలఁ గట్టు
కొని సమర్పించుఁ గోటులకొలఁది మీఱి
వచ్చు నతిథుల కెల్ల నవ్వారి గాఁగ
మృష్టాన్నంబు వరలబ్ధసస్యవృద్ధి
కలిమి నంతట నొకకొంతకాలమునకు.

క. రోషముతో నిజమహిమో
న్మేషము చూపంగ వలసి మానంబునకున్

బాషాత్మజుండు వచ్చిన
దోషంబునఁ జేసి కఱవు దోఁడనె రాఁ గన్. [మమ

లయవిభాతి. విసరెఁ జెనుగాడుపులు మసలె జలదాగ
పసిమిచెడె సస్యములు కసవు దినలేమిం
బసరములు వట్టె నదు లిసుకలునుఁ జిప్పలును
మిసమిస మనన్ విగతరసగరిమ నింకెన్
వసుమతి పడన్ దివిసె గుసుమఫలపత్రముల
పస దఱిగె భూరుహము లుసు రుడిగెఁ బ్రాణి
ప్రసరములు నొండొకటి మెసఁగఁ దొడఁగెన్ గఱవు
గసిమసఁగె విశ్వమున వెస లయవిభాతిన్.

సీ. మిగుల భీకరవృత్తి మిన్ను ముట్టినధూమ
కేతువె బిరుదు టెక్కెంబు గాఁగ
నోరంత ప్రొద్దును హోరని విసరుచుఁ
గెరలు కరువలి నకీబు గాఁగ
చెట్టుచేమలు గారుచిచ్చునఁ గమరిన
నున్ననిగిరులె యేనుఁగులు గాఁగ
నిప్పులు గ్రక్కుచు నెప్పుడుఁ గాయు
నిబ్బరపు టెండలె ప్రతాపంబు గాఁగ
అనశనప్రాప్తి మృతమనుష్యప్రతాన
మాంసభక్షణదృప్తగోమాయుకాక
ఘూకబహుజంతువులు బంట్లగుంపు గాఁగ
రాజసంబున దుర్భిక్షరాజు మెఱసె.

క. భూకాంత నీరువట్టుకుఁ
గాక వదన మిలుకరింపఁ గాన్పించిన పం
క్లో కాకన వెలిపుచ్చలు
లోకములోఁ గాచె నీళ్లు లోఁబడె జనముల్.

ఉ. అప్పుడు దేవదారు విపి
నాంతరసీమ వసించుసంయముల్
విప్పగు భూమి నన్నము ఫ
లింపక చెట్టులు నెండిపోయె వా
తప్పినఁ బోవుఁ బ్రాణములు
తప్పదు రం డని మున్ను గౌతముం
జెప్పఁగ విన్నవా రగుటఁ
జేరిరి తచ్ఛతశృంగ శైలమున్.

క. ఈగతి వచ్చిన మునులకు
నాగౌతముఁ డెదురు నడచి సాష్టాంగముగాఁ
జాగిలి మ్రొక్కుచు నేఁడు గ
దా గణనకు నెక్కె మత్ప్రియాసం బనుచున్.

సీ. సంతసించుచు నిజాశ్రమమున విడియించు
కొని వారి కెల్లను దినదినము న
హల్య ప్రాణేశుఁ డహల్య శాల్యన్నంబు
వలసిన వారికి వలసినంత
ఘృతసూపఫలదధిక్షీర యుక్తంబుగాఁ
దలఁచినప్పుడె పెట్టెఁ దార నిత్య
మును భుజాభోజనంబులు చేసి చట్టుల
కరణి నందఱు మ్రుచ్చె మురియ బలిసి
నెమ్మది సుఖింప నెడలెఁ బండ్రెండువత్స
రములు కఱవును దీఱె వర్షములు గురిసెఁ
జల్లఁబడె నేల సకలసస్యములఁ బండెఁ
బుడమి ధాన్యంబు పోఁకకుఁ బుట్టెఁ దమ్మ.

క. అప్పుడు తపసులు తమలో
డెప్పరమా తీరె నేమిటికి నిఁక నిచటన్
గుప్పలు వడి నిలువఁగ రం
డెప్పటి తావులకె పోద మిందఱ మనుచున్.

(తెలుగు వరాహపురాణము, దశమాశ్వాసము)

## కవనశిల్పము, శైలి

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని తరువాతికవులను గుఱించి వెనుకటి రెండధ్యాయములలోను గొంత వ్రాయవలసివచ్చినది. దగ్గుబల్లి దుగ్గకవియు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవియు శ్రీనాథున కతిసమీపకాలములో వెనువెంబడిని వచ్చినవారు. వారికి సన్నిహితసమకాలికులే యీజంటకవులు. కావున వీరును శ్రీనాథుని తేజస్సారము గొంత గ్రహించియుందురని తలంచుట యసంభవము కాదు.

దుగ్గన కృతి నొందిన చెందలూరి గంగయామాత్యునికి వీరును దమ ప్రబోధచంద్రోదయమును గృతియిచ్చిరి. పినవీరభద్రుని కృతి స్వీకరించిన సాళువ నరసింగరాయల క్రిందనున్న దండనాథునకు వీరును తమ వరాహపురాణము

నంకితముచేసిరి. కావున నీజంటకవులు దుగ్గనకును, పిన వీరనకును అత్యంత సమీపస్థులుగ నుండి పరస్పరసన్ని కర్ష సాహచర్యమున మెలఁగుచుండిరని యూహించుట యాథార్థ్యమునకుఁ జాలఁ జేరువయని చెప్పవచ్చును. కాఁబట్టి వీరికవిత పైనఁ జెప్పిన కవుల కవిత్వసంపత్తితో సరిచూచుట సారస్వత జిజ్ఞాసువుల కెంతయుఁ బ్రీతికర ముగా నుండును.

వీరి కవితాశిల్పము శ్రీనాథాదులవలెనే కేవలము మాతృకానుసారి గాకుండ స్వకపోలకల్పనాభూయి ష్ఠమై యొప్పుచున్నది. మూలమందలి కథారేఖాకృతిని దీసికొని దానిని మాంసమస్తిష్కమసృణ మగు సజీవ స్వరూపముగ సృజింపఁగల నిసర్గశక్తి మహాకవులయం దున్నట్లు వీరియందును గానంబడు. మూలగ్రంథమందలి విషయములను సంక్షేపించుటకంటె విస్తరించుటయే వీరి శిల్పమందలి ప్రధానాంశమని తోఁచుచున్నది. శ్రీనా థుఁడు మూలగ్రంథములను సర్వవిధములఁ బెంచుచు వ్రా సెను. కాని యాతని శబ్దభూయిష్ఠమగు శైలివలెనే వర్ణ నావిస్తృత మగు శిల్పమును గ్రంథసంక్షేపమునకంటె గ్రంథవిపులీకరణమందే నిదర్శనముగా నున్నది.

ఈకవులశైలి యట్లు గాక, గ్రంథపరిమాణము పెరుఁగుచున్నను, శైలియందుమాత్రము పదనియమము చాలవఱకుఁ బాటింపఁబడినది. భావములను గొలఁదిమాట లతో విస్పష్టము చేయుటయే కాని శబ్దాడంబరములగు నతిదీర్ఘ సమాసములతో ఘటించుట వీరిమార్గము కాదు. కథావిషయములను సందర్భానుసారముగఁ దదుచితకల్ప నలతోఁ బోషించి మెఱుఁగుపెట్టి వృద్ధిపఱచుటయే తెఱుగు గోచరించును. అట్లు పెంచుటలో వీరికి విసువు కానరాదు. వీరికల్పనలు, వర్ణనలు నైసర్గికములుగను, సర్వజనానుభవ సిద్ధముగను, మనోహరముగను గాన్పిం చుచున్నవి. పినవీరనకల్పనలు స్వాభావికముగ నుండ వనియు, పూర్వగ్రంథములనుండి సామాన్యముగ నెత్తి వ్రాయఁబడినవనియు నిదివఱలోఁ జెప్పితిని. వీరివి యట్టివి కావు. అనంతామాత్యునివలెనే వీరును నిసర్గప్రకృతిని దిలకించి స్వానుభవవిశేషములతో బ్రదర్శించిరి. జక్క నకవి వర్ణనలు నిర్జీవప్రతిమలవలె శృంగారభూషితములై విరాజిల్లుచున్నవి కాని వానియందు వీరు చేయఁగల చైత న్యారోపముగాని, ప్రకృతిసిద్ధభూషణములుగాని కాన రావు. దుగ్గనకవి పరిమితశక్తి గలవాఁడై తనుమాత్ర ముగ రసపోషణ చేసినను, తాను జూపినశిల్పము నిర్దు ష్టమై, నిర్వక్రమై, నిర్మలమై యున్నది. ఈకవుల ప్రతిభ దుగ్గనదానికంటె చాల హెచ్చు. కావున నించుమించు సమకాలికులగు కవులలో వీ రనేకవిధముల మిన్నలని చెప్ప సాహసించుచున్నాను. వీరి భాషాంతరీకరణపద్ధతిని నిరూపించుటకుఁ గాను నేను జూపిన రెండు దృష్టాంతము లలోను వీరి కవితాశిల్పసంబంధమైన పైయంశములను ధ్రువపఱచుటకు వలసిన నిదర్శనములు చాలఁ గలవు. కావున గ్రంథవిస్తరభీతిచే మఱికొన్ని భాగములను మూలమునుండి యుద్ధరించి యిటఁ బొందుపఱుప మాని నాఁడను.

వీరిశైలి ధారాళమై, రసావహమై యున్నది. పినవీరనయందలి యుద్దండమగు నైసర్గికధారాపాతము గాని, యనంతామాత్యుని కించిత్కుంఠిత శబ్దాను సంధానముగాని వీరి కవనశైలియందుఁ గానఁబడదు. ధారాశుద్ధి సహజమై, సమగతి కలదియై విరాజిల్లు చున్నయది. వీరిశైలియు దుగ్గనకవిగారి శైలివలెనే మృదులమై, సుకుమారమై, ప్రతిపద్య రసస్ఫురితమై హృద యంగమముగా నుండును. జక్కనకవియందు ముఖ్య ముగాఁ గవి సమయసిద్ధములగు భావములును, వర్ణనలును, శబ్దచమత్కృతులును గుప్పతిప్పలుగా నుండును. వీరియం దట్లు గాక ప్రకృతిద్యోతకములగు వర్ణనలును, భావము లును, రసవికారములును కవియొక్క హృదయకుహరము నుండి నిర్వక్రగతిని వెలువడి, పాఠకహృదయములఁ బ్రవే శించి రసావేశము నుద్భవింపజేయును.

తమకవిత్వ శయ్యావిషయమున నీకవు లిట్లు వ్రా సికొనిరి: "వచనరచనాచాతుర్యంబున నల్పాక్షరంబుల నధికార్థంబు గుదియించి పద్యపూరణంబులకు నాదికార ణంబులైన సంస్కృతాంధ్రభాషలం గల జల్లులు విస ర్జించి రసపోషణ ప్రధానశబ్దము లుపార్జించి" వీరు గద్య

పద్యరచనాక్రమమునకుఁ గడంగిరి. వీరి గ్రంథములు పరిశీలింపఁగా నీరచనాపద్ధతులు యథావిధిగా వీరిచే నిర్వర్తింపఁబడిన వని మనకు విశదమగును.

ప్రాచీనకవిగ్రామణు లగు తిక్కన, సోమ్మన, మంచన మున్నగువారివలెఁ జిన్నచిన్న పదములను, ముఖ్యముగా నాంధ్రపదములను, జేర్చి, సుస్వనము వీనులకు విందొనరించునట్లు మేళవించి, సరసకవితానిసర్గగానమాధుర్యమున డెందంబున నానందంబు నెలకొల్పుదురు. వారి భాషాప్రయోగమున జాతి వార్తావమత్కృతి తఱచు గానవయ్యెడు. వీరి కవిత్వమందు భావనాసమృద్ధియు, భావనాప్రకాశమును, ప్రాచీనకవి ప్రయోగసంపత్తియు, నిండైన గౌరవమును సమకూర్పఁబడియున్నవి. ఏస్థలమందును వ్యర్థపదములు గానఁబడవు. నీరసభావములు చాల నరుదు. నాచనసోముఁడు, పోతన మొదలగు వారివలె వర్ణనములయందు దృశ్యములను దృగ్గోచరమగునట్లు వర్ణించెడు ప్రయత్నము చేయుదురు కాని యాప్రయత్నము సర్వత్ర సఫలము కాలేదు. చిత్రవర్ణనముకంటె భావసౌష్ఠవమే యెక్కువగ గోచరించుచుండును.

సీ. అర్చన దాన వహోమాదులు ఫలకంబు
　　లింద్రియనిగ్రహం బినుపచీల
యఖిలభూతదయాపరాయణత్వము లిపి
　　కాఁడు వైరాగ్యంబు గాలిచీర
ధైర్యంబు శుద్ధసత్వగుణంబు ద్రోవలు
　　మంచివారలతోడిమైత్రి సరకు
శీలంబు నడిపించుమాలిమి సంచలిం
　　పని మానసం బది బరువు గాఁగఁ
జేసిన మురారిచరణరాజీవభక్తి
గౌరవం బను పేరోడ గలిగెనేని
ఘోరభవసాగరము దాఁటి చేరవచ్చు
మోక్షు మనుదీవి మానవాధ్యక్షుతిలక.
　　　　(వరాహపురాణము, ఆశ్వాసము ౫)

వీరు రచించిన రెండుగ్రంథములలోను ప్రబోధచంద్రోదయమే యెక్కువ గణనీయమైన దని నే నభిప్రాయపడుచున్నాను. దీని శయ్యాపాకరీతులు లేఁబ్రాయపు రచనను బోడసూపుచున్నవి. అయినను రసపుష్టిచే నిగనిగలాడు ద్రాక్షాఫలమంజరులవలె కోమలమై, మృదులమై, సర్వవిధముల మనోహరమైయున్నది. అందలిపద్యరచన యెంత రమణీయముగా నున్నదో గద్యరచనయు నంతసరళముగాను, మనోజ్ఞముగాను నున్నది. వీరిగద్యము పింగళి సూరనార్యుని గద్యమువలె దీర్ఘసంస్కృతసమాసములు లేక, చిన్నచిన్న శబ్దములతోఁ గూర్పఁబడి, యనుప్రాసమాత్రశబ్దాలంకారశోభితమై, ముత్యంపుసరులవలె విరాజిల్లుచున్నది. దిక్ప్రదర్శనముగా నొండు నిదర్శనము మాత్రము చూపెదను.

"అప్పుడు క్షపణకుఁడు భిక్షుసహితం బగు కాపాలికుని వీక్షించి యాక్షణం బగణితమార్గంబున నెఱింగితి మన మిందఱము మహామోహుని పంపుఁబడి సత్వాత్మసంభవ యగు సాత్త్వికశ్రద్ధం జెరపట్టుకొని పోవం జనుదెంచినారము. వచ్చి యిచ్చట నెచ్చరిక దప్పి విచ్చలవిడి నుండుట కాదు గావునఁ గార్యంబు విచారింపవలయు ననినఁ గాపాలికుండు దిగంబరా, యవ్వరాలిం బరామర్శింపుము. ... ... ... ... (ప్రబోధచం. ఆ. ౩.)

ఈగద్యసారళ్యము వరాహపురాణమున నెక్కువగాఁ గాన్పింపదు. ప్రబోధచంద్రోదయము లేఁబ్రాకమున రచింపఁబడినదని కాఁబోలు, వరాహపురాణమున గద్యపద్యరచనాబంధము కొంత క్లిష్టతరమై సమాసబంధురమై సంఘటింపఁబడినది. మఱియు నీకావ్యమున శబ్దచమత్కృతులుమాత్రము గనుపఱచెడు పద్యవైచిత్ర్యములు కథాసరణియందే నిబద్ధములై, పఠనసారస్యమున కంతరాయము గలిగించుచున్నవి.* ఈవిషయమున మాత్ర మీకవివరులు తత్కాలసంప్రదాయముల నను

* రాజసభలయం దుండు పండితకవులు పరస్పరము కావ్యకృతుల నెట్లు పరిశీలించి మెచ్చుఁగు పెట్టుదురో యావిషయము నీకవులు తమ ప్రబోధచంద్రోదయమున నిట్లు తెలుపుచు చేసిరి:—

క. సారిసారి నొప్పు సలాకల, నోరసినకుందనపు బూఁడెయును బోలె సభన్
సరసుల సంఘర్షణమున, వరకవికావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్.

సరించి, పాండిత్యప్రకర్షము ద్యోతపరుప నుద్దేశించినట్లు గాన్పించుచున్నది. అట్లు కానియెడల రసజ్ఞులగు నీకవిశేఖరులు కథాసందర్భమున నేకాక్షరకందములు, ద్వ్యక్షరకందములు మున్నగునవి వ్రాయవలసిన హేతువు కాన్పింపదు. మహిషాసురుఁడు వైష్ణవీమహాశక్తిని జూచి మోహించి విరహాతురుఁడై యావాలుఁగంటి కటాక్షవీక్షణము లపేక్షించి మాయాకోవిదుండగు విద్యుత్ప్రభుం డను వానిని దౌత్యమునఁ బంప నాసందేశహరుఁ డామెసౌందర్యాతిశయంబుల వర్ణించుచు నిట్లు స్తుతించెను:

### ద్వ్యక్షరకందము

క. కాకలికాకల కలకల
కోకిల కుల లీల కలుల కులుకుల కలుకే
కైకోకు కేలికోలఁకుల
కోకాలీకేలి కులికి కొంకకు కలికీ.

(వరాహ. ఆ. ౧౧)

ఈశృంగారస్తవ మెంత రసోత్సేకముఁ బుట్టింపఁగలుగునో వేఱ చెప్పవలయునా? ఇట్టి రసవిచ్ఛేదసందర్భము లింకను గొన్నితావుల కేతకీకంటకములవలె రసామోదమునకు భంగకరములుగా నున్నవి.

ఈకవు లిద్దఱిలో నెవరికవిత్వ మెట్టిదో నిర్ణయించుట కాధారములు లేవు కాని వీరిలో రెండవ వాఁడగు ఘంట సింగయ్య మలయమారుతకవి యను పౌరుషాభిధానము గలవాఁడై, కవితావిషయముల నెప్పుడు గౌరవమున కాస్పద మయ్యెనని యూహింపఁదగును. అట్లయిన నంది మల్లయ్య యను మొదటివాఁడు కవిత్వవిషయములోఁ గణనీయుఁడై యుండును. వెనుకఁ బినవీరనగుఱించి వ్రాయుటలో "కుకవి మల్లకషణ కులిశహస్తపల్లవుఁడ" నని యాకవి యహంకృతిని నాత్మస్తుతి చేసికొనె నని, యాతనిచే నోటఁబడు పొందిన మల్లన కుకవి యెవరై యుండునోయని నేను ప్రశ్నించితిని. ఆప్రశ్నమునకు సమాధాన మీనందిమల్లయ్య యగునేమోయని నాకు గొప్ప సందేహము కలుగుచున్నది. ఏలనఁగాఁ, బినవీరన సాళువ నరసింగరాయలయొద్ద నుండుటయు, నందిమల్లయ్య యతని దండనాయకుఁడైన తుళువ నరసరాయలయొద్ద నుండుటయుఁ జూడ, వీరికి తఱచుగా సారస్వతసమరములు గలుగుచుండెడివేమో యని తోఁచెడిని. ఆసమరములలోఁ బినవీరన వజ్రపాణియై ఘంటసింగయ్యను దాఁకలేక, మెత్తనివానిని మొత్తుటయే మహాపౌరుషలక్షణమని తన చెట్టిదంపు దిట్టతనము నంతయు నీమల్లనమీఁదఁ బ్రయోగించియుండును!

పినవీరభద్రుఁ డెంత గర్వించినను నీ మహాకవు లిద్దఱు వాణీవిశారదులు, పదవాక్యప్రమాణజ్ఞులు, సరసకవితానిష్ణాతులు, నిర్దుష్ట ప్రవర్తనాదర్శప్రబోధకులు, గావున వీరి గ్రంథము లాంధ్రసోదరులు సాదరముగఁ బఠింప వేఁడుచున్నాను.

---

# అజవిలాపము

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు

తరువోజ

ప్రేమైకపాత్రమౌ బ్రియురాలిఁ బాసి
పెంటిఁ బాసిన గువ్వపిట్ట చందమున
వేమాఱును ననంత విరహార్తి నొంటి
విలపించు విరహి పెన్విలపనంబులను
సామోదమధుర భావామృతాసార
మనుపదమ్ము వెలార్చునట్టి సత్కవుల
కోమలామలసూక్తి కుసుమమంజరుల
గుణవిశేషమ్మును గొనియాడఁ దరమె.

మంజరి

సరయూతరంగిణీ జలజషండముల
కమ్మఁ బుప్పొడి దుమారమ్ముఁ జిమ్ముచును
దరఁగయుయ్యాల లెక్క తగ నూఁగి యూఁగి
తెలిముత్తియపుఁ దుంపురులఁ దొప్పఁదోఁగి
యల్లనల్లనవీచు పిల్లగాలులకు
నుల్లమ్ము రంజిల్ల నొకనాఁడు వేడ్కఁ
దనప్రాణపదమైన తరుణితోఁ గూడి
నందనవని శచీనాథుండు వోలె
విరిదోఁటలోఁ బ్రీతి విహరించుచుండె
నిజరూప విజితకాయజుఁడైన యజుఁడు.

దక్షిణార్ణోరాశి తటమందు నలరు
గోకర్ణమున నున్న శ్రీకంఠుఁ గొలువ
నింగిరంగగు వీణెఁ గెంగేలఁ బూని
యవ్వేళ నాత్రోవ నరుగుచు నుండె
గానవిశారదుండైన నారదుఁడు.

వేలుపుజడదారి వీణియకొనను
వ్రేలువేలుపుమ్రాని విరిదండ నొడిసి
కరువలి వేగమై హరియించె నప్పు
డలరుఁ దావులకునై యాసించినట్లు.

మందారతరుపుష్పమాల వెన్కనెడు
తేంట్లతోఁ గూడు నాదేవర్షి వీణె
గనుపట్టె గాలి చేసిన తిరస్కృతికిఁ
గాటుకఁ గన్నీరు గార్చుచున్నట్లు.

అట్లు గాలిం దూలి యవనిపైఁ బడెడు
నవ్వేల్పు విరిదండ యతిభూమియైన
పరిమళమకరంద భరముచే నచటి
తరులతార్తవరమం బరిహసించుచును
దైవంబు గుఱిచూచి తగవైచినట్లు
లాతోఁట విహరించు నజుపట్టమహిషి
యిందుమతీదేవి యెఱిగబ్బిగుబ్బ
పాలిండ్ల మొనలందుఁ బడియె నుగ్రముగ.

పడినంత భయదసర్పముఁ బోలె దానిఁ
దిలకించి కరము విహ్వలయౌచు నామె
స్వర్భానుహృతచంద్ర చంద్రిక వోలె
నిలను రూపటి కూలె నిఁక నేమి చెప్ప.

ఆకస్మికముగ నిట్లతివ దాఁ గూలి
తనపతిం గూడఁ దోడన కూలఁ జేసెఁ
దొఱఁగెడు తైలబిందువుతోడఁ గూడఁ
బుడమి దీపజ్వాల వడియెదుం గాదె.

అట పార్శ్వవర్తి జనార్తరావములఁ
గలగుండు వడి సరిగాఁ గుందునట్లు
కమలాకరమ్మునం గలవిహంగములు
గోలుగోలునను గగ్గోలుగా నఱచె.

ఉపచారములను దెల్పొ్వందె నయ్యాజుఁడ.
పడఁతి లేవక మున్ను పడినట్ల యుండె
నాయువు మిగు లున్నయప్పుడే కాదె
ప్రాణికిని జికిత్స ఫల మీయఁజాలు.

విగతతంత్రీకమా వీణియవోలెఁ
జైతన్యరహిత యా నా తీవఁబోఁడి
నతివత్సలుండైన యా తేఁడు దిగిచి
యిమ్ముగాఁ బరిచి తాంకమ్మునం జేర్చె.

కరణహానిం జేసి కడు గాజువాటి
యున్న యన్నాతి న ట్లొడిఁ జేర్చి యజుఁడు
సూపట్టె వలువాత సాం పేది యున్న
మృగలేఖఁ దాల్చు రాత్రీశుండువోలె.

అపు డట సహజధైర్యముఁగూడ వీడి
బాష్పగద్గదముగాఁ బతి విలపించెః
గ్రాఁగిన నిను మైనఁ గడు మెత్తఁ బాఱు
దేహధారులమాట దెలుపఁగా నేల.

మేఘమ్ములా లేవు మెఱుపులా లేవు
ఉల్లమ్ము నులికించు నుఱుములా లేవు
కడు బెట్టిదములైన గాడ్పులా లేవు
విమలప్రశాంతమా వినువీథినుండి
పడియెఁ జప్పుడు లేక చల్లఁగా జాఱి
పడియె నీ కడిఁదిపూఁబిడు గి దెక్కడిదొ.

అకట పువ్వులును దేహము సోఁకినంత
నుసుఱులం బాపఁగా నోపునే నింకఁ
గడ తేర్చుపనికి సంకల్పించుకొన్న
దైవంబునకును సాధన మేది గాదు.

అదిగాక కాలుండు మృదులవస్తువును
మృదువస్తువునన మాయింపఁగాఁ గడఁగు
నెఱ మంచువాన రూపఱు తమ్మిఁ తీవ
మొదటి నిదర్శనం బిదియ రెండవది.

ఇప్పువ్వు సరి జీవ మెడలించునేని
నెడఁదఁ జేర్పఁగ నన్ను మడియింప దేల?
అవుర! యొక్కెడ విషం బమృతంబ యగును
అమృత మొక్కెడ విషం బగు నీశ్వరేచ్ఛ.

కాక నాదగు నభాగ్యతఁ జేసి నేఁడు
పిడుగుగాఁ జేసె నివ్విరిదండ నజుఁడు
చెట్టుఁ గూల్పక దానిఁ జుట్టుకొన్నట్టి
తీవియం బడఁ గూల్చె నీ వింత పిడుగు.

ఎందుండి యరుదెంచితే పూలసరమ
నా ప్రాణపదమును నాశమ్ము నేయ
దివ్యభావస్ఫూర్తిఁ దేజరిల్లుచును
గ్రూరరాక్షసవృత్తిఁ గొంటి వేమిటికి.

భువనమోహనమైన పొలుపమ్ము గలిగి
మకరందరస పరిమళ పరంపరల
హృదయ రంజన నేయు నిట్టి నీవేడ
నతిఘోరమగు ప్రాణిహననం బిదేడ.

ననలకుం గడుఁ గూర్చు నా ప్రాణదయిత
యెలమిమై వాని నౌ దలఁ దాల్చుచుండు
నట్టి పూఁబోఁడిని గిట్టించినావు
రమణి నీ కే మపరాధంబు నేసె.

నీతావుల హసించు నిట్టూరుపులను
నీ తేనెతీపుల నిరసించు నుడుల
నీచాయఁ దెగడుచుండెడు లే నగవుల
నీకోమలత మీఱు నెమ్మేని తీరు

నారసి లోలోన నీరసం బూని
నాతిపైఁ బగఁ బూనినావు గాఁబోలు

నట్లు గాకున్నఁ దత్ప్రాణాలతోడ
నవి యన్నియు హరింతువా దాయవగుచు.

హా జీవితేశ్వరీ, హా ప్రాణపదమ,
యిదియేమి నను బాసి యెం దేగినావు
నినువీడి నిముసమైనను మనఁజాల
నని యెఱింగియు నింత యదయ వైతేల ?

చిరునవ్వు గెమ్మోవిచివురునం దొలఁక
సరస నాతోడ ముచ్చటలాడుచుండి
మఱి చూడఁ జూడంగ మాయమైపోతి
వైంద్రజాలికుఁ డయ్యె నవుర కాలుండు.

పలుమారు దేవి తప్పులఁ జేసియున్న
నన్ను నొండనఁబోక మన్నించినావు
నేరమేలేని యీ నీ ప్రియుతోడ
నిపుడు మాటాడ విదేటికో చెపుమ.

శఠుఁడ నేఁ గపటవత్సలుఁడనం చీవు
దలపోసినా వింత తథ్యంబు సూవె
కాకున్న నన్ను వీడ్కొక యిందుండి
తిరిగి రానను పూన్కి దివికి నేఁగుదువె.

తోడుతోఁ బ్రియురాలితోఁ గూడఁ జనియు
నానాతి విడిమల్లి తాను రానేల
తనతప్పువలని వేదన సైచుఁ గాక
యతి శోచ్యమైన నా హతజీవితమ్ము.

అతను కేళి జనించినట్టి శ్రాంజెమట
బొట్టులుగ నీమొగంబున నివే కలవు
మదిరాక్షి క్షణములో మఱి నీవు లేవు
ప్రాణికోటుల యస్థిరతఁ గాల్ప నొక్కొ.

ఎదనైన నప్రియం బేఁ జేసి యెఱుఁగఁ
బడఁతి నన్నిట్లేల విడిచి పోయితివె

మహిభర్త నను మాట మాత్రమే కాని
నిక్కవం బగు ప్రేమ నీయంద కలదు.

అళికాంతిఁ దఱిమి లే యలరులం దుఱిమి
నెఱి గల్గి వఱలు నీ నీలంపుఁ గురుల
గాలి గదల్చుచుఁ గరభోరు మరల
బ్రదుకు దీవని నాకు భ్రమ గొల్పుచుండె.

కాన నామదిలోనఁ గలవిషాదంబుఁ
బ్రతి బోధమున వేగఁ బాపవే దయిత
నిశి మంచుమలగవి నెఱయు చీకటిని
స్వరుచిచేఁ బాపు నోషధివల్లివోలె.

చలితాలకములతోఁ బలుకొండు లేని
యీ నీదు నెమ్మొగం బెద నిర్దహించు
రాదలేక లోని తుమ్మెద పిందు మెదల
నిశివేళ ముకుళించు నెత్తమ్మివోలె.

రేచానమగుడఁ దారే తేనిఁ బొందు
మరల జక్కవ వెంటి మగనిఁ దాఁ బొందు
నవి దాననే వియో గావధినోర్చె
మఱి నీవు రావయో మఱుఁగ దే మనసు.

నును లేఁ జిగుళ్ల పాన్పునను జేర్చినను
గందు నీ సుకుమార సుందరాంగమ్ము
ఎటు లోర్చుఁ జెప్పుమా యిపుడు రంభోరు
యతి కర్కశచితా సమారోహణమ్ము.

అతిరహస్యమయాన పాయిని యనుఁగుఁ
జెలియ యీ రతనాల మొలనూలు నీకు
నడలేమి నిదియు సద్దడఁగి నీతోడ
నార్తిమై మరణించి నట్లున్న దకట!

కోయిల లందును దీయఁ బల్కులను
రాయంచలందును రమణీయగతుల

హరిణులందును జంచలాలోకనముల
ననిలలోల లతావళిని విలాసముల
స్వర్లోకజిగమిషా సంసక్తవయ్యు
నాకు నై యిటనిల్పినా వింత నిజము
నినుం బాసి విరహార్తి మునుంగు నామెదకు
నివి మేలిడంగం జాలునే యక్కటకట!

ఫలినిని సహకార ఫలశాఖినొకటం
గలపి రెంటిని జంటగాం జేసినావు
అవ్వాని పెండ్లి సేయకయ యిప్పగిదిం
బాసిపోవుట నీకుం బాడిగా దబల!

అతివ నీచేత దోహదమంది కలయం
బూచు నీ కంకేళి పూగొలల్ నీదు
కురులకుం దొడవుగాం గూర్పకే నెట్టు
లకటా, నివాపమాల్యముం జేయనేర్తు.

కనకనూపురము గల్లనంగ నీ యిడిన
పరదుర్లభంబైన చరణ సత్క్రియను
దలంచినట్టులు సుమాశ్రులు రాలనీయ
శోకమ్ము నీకునై శోకించుం గంటె.

నేం దోడుగా నీదు నిట్టూర్పు నెనయు
పొగడపూవుల నూలు సగము గూర్చితివి
మిగులు నద్దానిం బూర్తిగం గూర్పకుండ
నిదురం జెందితి వహో యిది యేమి చెపుమ.

జలజాక్షి సమదుఃఖ సౌఖ్య లీ చెలులు
విదియ క్రొన్నెలవోలె వెలయు నీ కొడుకు
నీ పాదదాసుండ నే నిట్టు లయ్యు
నింతయుగ్ విడిపోవు టెంత నిష్ఠురము.

ధృతి యస్తమయమందె రతి మాయమయ్యె
గేయమ్ము విరసమై హేయమై పోయె
సకలర్తువులు నిరుత్సవములై తోంచె
భూషాప్రయోజనంబును గతంబయ్యె
నకట, పాన్పతిశూన్య మయ్యె నా కిపుడు.

గృహిణివై వహియింతు గృహభారమెల్లం
బ్రగడవై పచియింతు పరమహితమ్ము
నతిరహస్సఖివై హృదానంద మిడుదు
లలితకోమల సత్కలావిధులందుం
బ్రియశిష్యురాలవై ప్రియము గూరుతువు
కటకటా, యిట్టి నిన్ గనికరం బేది
హరియించి కొంపోయినట్టి యమ్మృత్యు
చెలియ, నా దేది ముచ్చిలం లేదొ చెపుమ.

మదిరాక్షి, యత్యంత మధురమైనట్టి
నాదు పుక్కిటిమధు వాదట నాని
దివి నెట్లవలం ద్రావెదవు నీవు బాష్ప
కలుషితంబైన నా తిల జలాంజలిని.

నెఱవైభవంబున్న నీలేమి సౌఖ్య
మింతతో సరి సుమీ యీ యజునకును
అన్యవిషయదూరుం డగు నాకు సర్వ
విషయముల్ నీతోడివేకదా దయిత!

అని యిట్టు లతికరుణాలాపములను
గులకాంతకై కడున్ విలపించు చజుండు
పూందేనె కన్నీటి బొట్టు లుట్టించి
చెట్టులచేం గూడ బిట్టేడిపించె.

---

# శశిరేఖ

ఏ. వి. రత్నముగారు

భారతిలో తరచు చక్కనిముచ్చటగు పద్యములు వ్రాయువారు, న్యాయవాదివృత్తియం దున్నవారు, నా కాత్మీయమిత్రులు, ఒక రొకనాడు ప్రాసంగికముగ వెంకటాచలముగారి కథామంజరి "కన్నీటికాలవ" అనుదానినిగూర్చి ప్రశంసించుచు నన్నుగూడ దానినొకసారిచూడుమని చెప్పిరి. కాని, నేడు లెక్కకు మిక్కిలిగా వెలువడుచున్న కథలు, కావ్యములు వంటివే యిదియు నని లోదలంచి "కన్నీటికాల్వ" కై నే నెచ్చట ప్రయత్నము చేయలేదు. కాని తలవని తలంపుగ సుమా రొక సంవత్సరముక్రిందట, అది నాకళ్లబడుట తటస్థించినది. అంత నామిత్రులు దీనింగూర్చి చేసిన ప్రశంస జ్ఞాపకమురా, కుతూహలాయత్త చిత్తుండనై ససంభ్రమముతో పుస్తకము తీసి చదువ మొదలిడితిని. ఒక గంటలో ముగింపగల్గుదు ననుకొంటిని; కాని అట్లయినది కాదు; అట్లా చదివి పారవేసేది అయిందికాదు. చాలసేపు పట్టినది; ఏకబిగిని కాకపోయినను, చదివిందే మరల చదువవలసివచ్చేది; కొన్నిపట్ల మధ్యమధ్య ఆగిపోయేది చదవడము; ఆలోచనలోపడేది మనస్సు. అంతట నామిత్రులుచేసిన ప్రశంస అర్హమయినదని యనిపించింది.

'కన్నీటికాలవ'లో 4 కథ లున్నట్లు జ్ఞాపకము. మొదటిది శశిరేఖ; చివరిది నాయుడుపిల్ల. ఆకథలన్నియు ప్రేమకథలే; అనగా ప్రేమతత్త్వమునుగురించి వినిపించే కథలు. మొదటివి మూడున్ను నవీనభావసంచలన వాతావరణమున తేలియాడునవి: చిరకాలమునుండి యవిచ్ఛిన్నముగ వచ్చుచున్న నీతి నియమములకు విరుద్ధమై, వ్యక్తిస్వాతంత్ర్యపరమైన స్వైరవిహారధీరలగు యువతులభావములచే, చేష్టలచే నడచునవి. వారిసంయోగములు, వియోగములు, జీవితచర్యలు హృదయమును స్పృశించునవి గాకున్నను చాలకుతూహలమును గలుగజేయునవి. అట్టి నూత్నభూములందు స్వేచ్ఛాజీవనమును, స్వేచ్ఛానురాగమును ననుభవించుటకై అతిసాహసముగ బయల్వెడలినది శశిరేఖ. ఆమె దొకవిలాసము; అదొక జీవితము; అదొకయాదర్శము. ఇతరుల కది నచ్చకపోవచ్చును; పోనిండు. కాని గ్రంథకర్తగారి కావ్య ప్రతిభయంతయు కన్నీటికాల్వయంతయు 'నాయుడుపిల్ల' యం దసమానముగ ప్రభవించినది. కన్నీటికాల్వ 'నాయుడుపిల్ల'యందు సార్థకమగుచున్నది. అందుకు వీరిభాష, శైలి యెంతయు...నొనగూర్చుచున్నవి. శైలి ధారాళమై జీవకళలతో స్ఫురించుచు ప్రవహించుచుండును. భాష యన్ననో అచ్చముగు ఉచ్చమైన వాడుకభాష; హృదయమునుంఛి పుట్టుకొస్తుంది. నాయుడుపిల్ల చెపుతూ ఉంటే బ్రాహ్మణపిల్లమాటలులాగే వుంటవి. చెపుతుంది, చెపుతుంది కన్నీరుకారేటట్టు; మహచక్కగా చెపుతుంది నాయుడుపిల్ల.

ఆవిధముగ మనోహరముగ చిత్రింపబడిన 'నాయుడుపిల్ల' నామనంబునఁ దద్దయుఁ బెద్దకాలంబు నిలిచిపోయినది. తర్వాత చాలకాలమునకు ఆనామిత్రుని మరల నేను రైలులో కలిసికొనుట కలిగెను. 'కన్నీటి కాలవ'నుగూర్చి చాలప్రసంగించితిమి. ఎవ రెట్లనుకొనేది చెప్పుకొన్నాము. వెంకటచలముగారి మిత్రులు కొందరు శశిరేఖమీద కనపర్చిన చప్పరింపులు పెదవికదల్పడాలు 'నాన్సెన్స్! ఫ్రీలవ్వట...' మొదలుగాగల మాటలు నేనక్కడ కన్నది విన్నది చెప్పితిని. మే మంత తేలికగా త్రోసివేయలేదు. 'నాయుడుపిల్ల'మీదమాత్రము మా యిద్దరిమనస్సులు పడ్డాయి ఒకేవిధముగ. అది గ్రంథకర్తగారికి లభించిన వాస్తవికమయిన ప్రత్యక్షానుభవమో, పరోక్షానుభవమో అయియుంటుంది. అందుచేతనే అట్లు వ్రాయగల్గిరి అని యనుకొంటిమి. 'కన్నీటికాలవ'మీద-ముఖ్యముగా నాయుడుపిల్లమీద-నొకవ్యాసము వ్రాయాలని కుతూహలముగా ఉండేది నాకు కొన్నాళ్లు; కాని యితరవ్యాసంగములమధ్య పడి మునిగియుండుటచే, నే నాతలంపే మఱచియుంటిని. ఆగస్టునెల భారతిలో శశి

రేఖమీద వ్యాసము చూసేసరికి మళ్లీ ఆతలంపు పొడ చూపి యినుమడించింది. ఇది ప్రస్తావన; శశిరేఖమీద గల్గు నభిప్రాయముల నుపకరించునని యిచ్చట చేసితిని.

శశిరేఖనుగూర్చిన సర్వసామాన్యమయిన యభిప్రాయము, అది దుర్నీతిబోధకమని, నీతిబాహ్యమని అందుచే శశిరేఖ చాలామంది కసహ్యముగా నుంటుంది. అది యెట్లో అలక్ష్మీనరసింహారావు. (బి. యె., బి. యల్) గారిచే (ఆగష్టు) భారతిలో విమర్శింపబడినది. దానికి పీఠిక వ్రాసినవారు ఆగ్రంథము నీతిబాహ్యము కాదంటారు. విమర్శకులయితే అందు సాహిత్యమునకును, సంఘమునకును జెందిన సమస్యలు గట్టిగా ఆలోచించుట కున్నవి; కాని యిది యవినీతిబోధకముగ నున్నదని విమర్శించి, "యీగ్రంథము నీతిబాహ్య మవునోకాదో చదువరులే యూహించుకొందురుగాక" యని హెచ్చరించిరి. విమర్శకులు శ్రీ శాస్త్రిగారు—పీఠిక వ్రాసినవారు—ఇచ్చిన యభిప్రాయము లెంతేని విలువగలవందురు గాని, అవి సమంజసములుగావని, ఒప్పుకోబడవని యంటారు. ఈకష్ట మెందుకు గల్గుచున్నదంటే, అసలుకథకంటే పీఠిక పాఠకుల మనస్సు నెక్కువగా కలవరపెట్టుచున్నది. పీఠికయందలి యంశములను చదువరులకు చక్కగ బోధపడునట్లు విపులముగా చరిత్ర క్రమేణ నైతికసంస్థలను, వానిపరిణామావస్థలను శాస్త్రిగారు చర్చించినచో గ్రంథమునందలి నీతి మత్తతనుగురించిగాని, శశిరేఖచరిత్రవిషయమైగాని కల్గే దురభిప్రాయములు పుట్టుట కవకాశ ముండేదికాదు. విమర్శకులకు శ్రమ తగ్గేది. అందలి యభిప్రాయములతో చదువరులేకీభవిస్తారా, శశిరేఖను హర్షిస్తారా అనేది వేరెసంగతి. అటుగాక నవీనభావములతో సంక్షుభితమగుచున్న అపారపారావారమైన సాంఘికనీతిని చిన్న పీఠికలో తరింప జూచిరి. బహుదుర్ఘటమైన కార్యమిది చదువరులు ఆధునిక సాంఘిక తత్త్వవేత్తల వ్రాతలతో చాలా పరిచయము కల్గియుంటేనేతప్ప తదితరులకు శాస్త్రిగారు ఢంకామీద దెబ్బకొట్టినట్లు వచించిన యభిప్రాయములు దురవగాహముగనుండి పైగ దుర్నీతిబోధకముగ గన్పట్టుటయందు వింతలేదు. అటుగాక ఆబాధంతా లేకుండా శశిరేఖపాత్రకు సంబంధించినంతవరకుగలనీతిని పీఠికలో చర్చించి వదిలేస్తే చాలా బాగుండేది.

నీతివిషయమై శాస్త్రిగారిదృష్టిపథము వేరు. అది ప్రాతవాసనలు లేని కేవలము క్రొత్తపుంత; ఉపప్లావికమయినది. నలుగురితో నారాయణా అనేది కాదు. ఇక మనవిమర్శకుల దృష్టి లోకములో పాటిది; 'గతానుగతికో లోక'మను నార్యోక్తి ననుసరించునది; బాధలేనిది; లబ్ధమైనది. ధర్మశాస్త్రప్రకారము, సాంప్రదాయానుసరణి ననుసరించి పోతుంది. శాస్త్రిగారు వీటికన్నిటికి స్వస్తి చెప్పనేసినారు. శాస్త్రిగారిమతమునకు చెందినవారు ప్రస్తుత నైతికసంస్థలను మూలముకంట, పునాదులలోనుంచి పెకల్చివైచి, క్రొత్తపునాదులమీద చక్కనిసంస్థలను కట్టనెంచెడివారు. మనవిమర్శకులవంటివారు repairs చేయనుంటారు; లోపములుంటే దిద్దమంటారు; పన్నెలు, చిన్నెలు, మెరుగులు పెట్టమంటారు ఇట్టిసంస్కారములవలన కార్యము కావని భావిస్తారు శాస్త్రిగారి మతమువారు. వీరిమతము, వారిమతము బాగాపరిశీలిస్తే యిట్లుగా తోస్తుంది యీరెండుమతములకు గల మూలభేదము. అందుచే ఈ రెండు మతములవారికి సమరమేకాని సామరస్యము పొసగదు. మరి యింతవు ఎవరినిగురించి యీసమరము జరుగుచున్నదో వారు చాలకాలమునుండి తెంపుకోలేని బంధములలో చిక్కువడియుండుటయే దీనికంతకు కారణము. వారిగొంతుకలు నొక్కివేయబడియుండుటచే, మనగొంతుకలు లేచుచున్నవి. అటుగాక, "శారీరకమానసికవిషయములలో మీకుగలస్వేచ్ఛ, స్వాతంత్ర్యము, మా కేల ఉండగూడదు. మేము మీసొమ్ములము గాము. మేమునూ మీవలె మనుష్యమాత్రులమే. మీతత్త్వములకు సరిపడునది మాతత్త్వములకు సరిపడుతుంది; వికటించదు. మీవంటిరోగములే మాకును; అందుకు మీకొకవిధమయినచికిత్సాను, మా కింకొకటినా?" అని లేచి గట్టిగ ప్రతిఘటింపగల్గితే, యిట్టి మనవిమర్శనములతో, నీతిబోధతో పనిలేకుండాపోతుంది. అప్పుడు మనము నియమించే నీతిధర్మాలు, చదివే ధర్మపన్నాలు తెలుస్తాయి. వారు యుద్ధరంగములోనికి దిగనంతసేపు మనకోటలలో మనము సురక్షితముగ నుండి

నీతులు చెపుతాము. అట్లాకాదు; స్త్రీలకుకూడ సర్వస్వాతంత్ర్యములు పురుషులకువలె కలగజేసేటట్టయితే, లోకానికి మనకు శుభము చేకూరదు; శాంతి యుండదు, అంటే అది కేవలము స్వార్థపరమును న్యాయేతరము నని అనిపించుకుంటుంది. అందుచే ధర్మశాస్త్రములను, లాకోడ్లను అవతలపెట్టి హృదయమును విశాలముచేసికొని, స్వార్థపరతను దిగనాడి పరికించితే ఇప్పుడు మనకు దుర్నీతిబోధకములుగను, నీతిబాహ్యములుగను కన్పట్టేవి అట్లా కన్పట్టవు. అప్పుడు వెంకటాచలంగారి 'శశిరేఖ', విమర్శకులు తలంచునట్లు నీతిబాహ్యముగ గన్పట్టదు.

దేశకాలపరిస్థితులనుబట్టి నీతులు మారుచుండునని శాస్త్రిగారంటే విమర్శకులు "అట్లనుకోవడం కేవలంపొరపాటు. ముఖ్యనీతులు ఎల్లపుడూ ఒక్కటే. బైబిలులో చెప్పిన 'పదియాజ్ఞల' కిప్పుడైనా చలనముంటుందా?" అని ప్రశ్నించారు. దేశకాలపరిస్థితులనుబట్టి యెన్నినైతిక సంస్థలు మారలేదు మారుటలేదు? వీరు చరిత్ర చదువుకోలేదేమో! పూర్వము బానిసవ్యాపారము నేడున్నదా? పూర్వము దొంగతనానికి శిక్ష కాళ్లుచేతులు నరకడము. ఇప్పుడుందా? పూర్వము మనదేశములో స్వయంవరములుండేవి; స్వైరవిహారములుండేవి; తర్వాత సహగమనాలుండేవి. ఇప్పు డవి పల్లీకులో ఉంటున్నాయా? సంస్థలు మారుతాయంటే, నీతులు మారవాయేమి? నీతిలేనిసంస్థ యేదైనా, యెన్నడైనా ఉంటుందా యేమిటి?

ఇంకా మరేమంటే వివాహసంస్థ ఒక్కొక్కజాతిలో ఒకొక్క విధముగా ఉంటోంది. అందుకు సంబంధించిన నీతులుకూడా వివిధములు. కొన్నిజాతులలో (నాగరికజాతులలోనే) క్రీస్తు పదియాజ్ఞలలో నొకటగు జారత్వము నేరముగాదు. కొన్ని దేశాలలో ఒక ఆడదానిని నలుగురు మగవాళ్లు సమిష్టిగ పంచుకొని కాపురము చేస్తారు. కొన్ని దేశాలలో ఆడవాళ్ళ నీతినియమాలేకాని మగవాళ్ల కేమి అధికారము లేదు. తురకలలో ఒక మగవాడు పదిమంది ఆడవాండ్రను పెండ్లిచేసికోవచ్చును. క్రైస్తవులలో మొదటిపెళ్లాము పోతేగాని రెండవదానిని కట్టుకోడానికి వీల్లేదు. మనలో మగవాళ్లకంతా ఉంది; ఆడదాని కేమిలేదు వివాహస్వాతంత్ర్యము. ఇట్లా నీతికి బహుదేశాలలో బహువిగ్రహణముపట్టియుంటే ముఖ్యనీతియంటే యేమిటో, ఇది నీతిబాహ్యమంటే యేమిటో అర్థముకాదు. బైబిలులోని 10 శాసనములకు చలనముంటుందా అంటే, చెప్పడములో చలనము లేదుగాని చేయడములో చాలావుంది. ఆనీతి ధర్మములే, లోకమనందంతటు; కాని బహుదేశములందు బహువిధములుగ ఆచరణలో ఉంటున్నాయి, ఇట్లుంటుంటే, ముఖ్యనీతులంటే యేమిటో; వానికి చలనముంటుందా అంటే యేమిటో, మనవిమర్శకులకే అర్థమవాలిగాని, మరి యాలోచించువారి కెవరికి అర్థముకావు. నీతిశాస్త్ర మపారమయినది. ఏది నీతో, ఏది మంచో, నిర్ణయించుట బహు దుర్ఘటము, బిట్రాండు రసెల్ వంటి పేరెన్నికగాంచిన మహాతత్త్వవేత్తలు, పిడుక్కి బియ్యానికి ఒకేమంత్ర మన్నట్లు క్రీస్తుచెప్పిన బైబిలులోని 10 నీతిశాసనములను పరిహాసము చేస్తారు. మన విమర్శకులు లాయరుగారైయుండి నీతినిగురించి అంతతేలికగా సందర్భము విడిచిపెట్టి ప్రశ్నించడము చోద్యముగా నున్నది.

శ్రీశాస్త్రిగారు ప్రేమ చంచలము, శాశ్వతము కాదని చెప్పేది లోకానుభవముమీద చెప్పినది. వాస్తవికజీవితములోని నిజముసంగతి చెప్పినారు. ఆయన చెప్పినది సర్వజనసామాన్యమయినది; కావున నదియే సత్యసమ్మతము. విమర్శకు లందుపైన దాడివెడలితే; కవులగీతములను వెంటబెట్టుకొని, కవుల ఆదర్శకభూములందుండి—అనగా స్వప్నభూములు—వాస్తవలోకము వైపు తిరిగిచూడకుండా వాదిస్తే విమర్శకులు గెలుస్తారు. వాస్తవమునకు వస్తే శాస్త్రిగారికే విజయము. ప్రేమ స్త్రీలదృక్కులవలెనే చంచలమయినది. కాబట్టి యేపెండ్లిముడి వేసినా, "లా"కు అప్పచెప్పడము తప్పినది కాదు ప్రేమకు. ప్రేమ శాశ్వతమయేటట్లయితే దాని జుట్టు 'లా'యొక్కచేతిలో పెట్టడ మెందుకు? బాగా ఆలోచించండి; లోకమువైపు తిరిగిచూడండి. మనలో మగవారు విద్యావంతులుకూడ పెళ్లాముపోయిన పెద్దదినమునాడే—యింకా ఆమెబూడిద చల్లారకముందే—పెళ్లిచేసుకొంటూరే! మొదటిప్రేమ శాశ్వతమే అయ్యేట

ట్టయితే రెండవ దెబ్బకాలు పెట్టగలదు ఆస్థానములో? అది కాదు; ప్రేమ శాశ్వతము చేసుకోవాలంటే అది మన చేతిలోనిపని కాదు. కట్టి పడవేయుదుమంటే, అట్లా పడిఉండేది కాదు. ఆదర్శమునకును వాస్తవమునకును స్వర్గమర్త్యములకు గలభేదము గలదు. మన మమరులము కాము, కావున అమృతమువంటిదని దలచే, ఆదర్శ ప్రేమ మన కీమర్త్యలోకమున, కావ్యములందు దక్క, వాస్తవమునం దనుభవించుటకు లభ్యము కాదు. విమర్శకులు తలంచే శాశ్వతప్రేమ బందిఖానాలో చిలుకపిట్ట లాగున దొరుకుతుంది. అదేప్రేమ, అంటే అనుకో వచ్చును; కవులుమాత్రము అట్లాతలంచరు దానిని.

ప్రేమ చంచలస్వరూపము గలది. మొదటుండే ప్రేమ కొన్నాళ్లకు తగ్గిపోతుంది. కలియకపూర్వము కనబడిచేప్రేమ, కలిసిన తర్వాత ఉండదు. అందుచేతనే కాబోలు ప్రేమరసము చిలుకుకావ్యాలు పెళ్లి చేసి ఊరుకుంటాయి. "తుమ్మెదలాగున పువ్వుపువ్వుమీద వ్రాలెడు ప్రేమ,ప్రేమేనా?అప్పుడు దీనికి 'ప్రేమ'అనేగొప్పపేరు తగుతుందా?" అని విమర్శకులు కోప్పడతారు. అందుకు లోకవృత్తమును తెల్పుకథలేసాక్షి; మహాకవి కాళిదాసే సాక్షి; కాళిదాసుకథానాయకులది మీరు lust అంటారాఅనండి; ఏ పేరిడితేనేమి పెరుమాళ్ళకు? అసలు స్వరూపము ఒకటే. వీరు శశిరేఖది ప్రేమకాదు Fancy (=ఈత్కు) అంటారు; ఇంకాపోతే lust (=కామము) అంటారు. ఇంకాపోతే అది mere animal passion (=పశుధర్మము) అంటారు. ఏమిటో! కామశాస్త్రములో ఇవి అర్థములేనిపదాలు. ప్రేమకు ముందుగా దారిచూపేదే ఫ్యాన్సీ; ఫ్యాన్సీ లవ్వు అవుతుంది; love ఫ్యాన్సీగాను ఉంటుంది. అంకెకుమూలము ప్రేమధర్మమే; లవులో లస్టుంది; లస్టులో లవ్వుంది. Love కు, lust కు పరిహద్దు ఎక్కడా గీచేది? Lust లోకంటె love నందే, వీరనుకొనే animal passion ఎక్కువగా ఉంటుంది. Love దగ్గరగల కొన్ని దుర్గుణాలు lust కు లేవు; lust కు గల సుగుణాలు కొన్ని లవ్వుకు లేవు; love లో పశుధర్మము లేదంటే, పడుకోవడాలు ఎందుకు కల్గాలి? ఒక్క శశిరేఖయందే కాబోలు పశుధర్మమంటా? ఒక్కణ్నే కట్టుకొని చచ్చేవరకు పడి ఉండలేదనా? 'పశుధర్మము' ఎంత సుఖముగా తీరితే, అనగా సంతుష్టినొందితే అంత దృఢముగ పాతుకుంటుంది లవ్వు. మనస్సులో అంతబాగా వికసిస్తుంది లవు అనే పువ్వు. అది లేనిచోట నీరసించి, వాడిపోతుంది. "పశుధర్మము" సంతుష్టిచేయడమంటే ప్రేమవృక్షమునకు దోహదము చేయడమన్నమాట. Law లోనరె loveలో వేరువేరు సెక్షనులు లేవు. అంతా ఒకటేగ్రంథము. మనకామవికారాలు, మోహాలు, పశుధర్మాలు అన్నిటిని వివాహము కప్పిపుచ్చుచున్నదిగాన బయల్పడడం లేదు.

ప్రేమతత్త్వము బ్రహ్మాండమువలె పెద్దదయినది; ఆకాశమువలె విశాలమయినది; సాగరమువలె అగాధమయినది. దానితత్త్వము హరిహరబ్రహ్మాదులకైనా తెలియదంటే మన మేమిచెప్పగలము. బ్రహ్మతత్త్వమయినా తెలుస్తుందిగాని, ప్రేమతత్త్వము తెలియదు దానిలోతంతా కనుక్కొన్న ఏమహాకవియు లేడు. దాని తత్త్వము అనుభవమునకే తెలియదంటే తర్కిస్తే తెలుస్తుందా? ధర్మశాస్త్రాలు, లాకోర్టులు, కేసులాలు తిరగేస్తే దొరుకుతుందా? మరి కవులేమిటి అట్లావర్ణిస్తారంటే, వాస్తవికములో నిది చూపిస్తే, అంతరసవంతముగా ఉండదని. దానికి నైతిక సాంఘిక ప్రతిబంధాలు చాలాఅడ్డుపడతవి. అందుచే రసము పోతుందని, ఎంతో సేపు భావసముద్రమునసే తేలుచు, "ఆత్మను, ఆత్మను కలిపి కుట్టేదారమ"ని, ఇట్లు ఆనందించడానికి ఏవో భావగీతాలు పాడుతూవుంటారు. అదిపట్టుకొని మనము వేళ్లాడుతూ ఉంటాము. ఆదార్శాన్ని పట్టుకొని మనము గాలిపటాలులాగున ఎగురుతూ ఉంటాము. అంతే కవులు వర్ణించేదానితత్త్వము, ఆదర్శము ఆదర్శమే. వారు పాడేదంతా అద్దములోని ఆటవంటిదే.

కాబట్టి శశిరేఖను లాదృష్టితోను, ధర్మశాస్త్రాల ప్రకారము, సాంఘికనీతి ననుసరించి చూస్తే, శశిరేఖ నీతిరేఖకు వక్రగతి పట్టినట్లు కన్పట్టకమానదు. అటుగాక మనజ్ఞానచక్షువునకు చిరకాలమునుండి పట్టినపొరమును పోగొట్టుకొని హృదయమును విశాలముచేసుకొని

చూచినట్టయితే మనశశిరేఖయు నొకచల్లని చంద్రకళ లాగే కనబడుతుంది. శశిరేఖది యొక వ్యక్తిస్వాతంత్ర్య మును, మనోధర్మమును నిర్భయముగ వ్యక్తపరచు ఆదర్శకజీవితమే. సాంఘికమర్యాదలకు కట్టువడి ఆత్మవంచనమును, పరవంచనమును చేయుటకంటె, ఆత్మధర్మమును (Law of inner being) అనుసరించుట ధర్మయుతమైనది. కాదా; ఏమిసంభవించినను? నీతిదాయకమయినదికాదా? అట్లనుసరించుటవలన లోకహితమునకు గాని, పరార్థమునకుగాని హాని కలుగుతుందంటే, లోకమనహించి యూరకుంటుందాయేమి? గట్టిగా శాస్తి చేస్తుం దప్పుడు. కాదు, అసహ్యముగా పరిణమిల్లుతుందంటే మనయొద్ద సహనగుణము లోపించిందన్నమాట.

"ప్రస్తుతపు వివాహములలో అనేక దురాచారాలున్నాయన్నమాట నిజము. అటువంటివి పోగొట్టుటకు ప్రయత్నించాలిగాని కేవలము వివాహము అనేసంస్థ ఉండుటకు వీలు లేదంటే మాత్రము సంఘము ఒప్పుకోదు" అని విమర్శకు లంటారు. మున్నొకప్పుడు ఒప్పుకోని సంస్థలను నేడు సంఘ మొప్పుకోవడంలేదా ? అలాగే దాని కాలము వచ్చినపుడు దానిని ఒప్పుకోవలసివస్తుంది. రష్యాలో నేడు రాలేదా ? మనము అనాగరికులని అనుకొనేజాతులలో ఏయిబ్బంది లేకుండా సుఖముగా కాలక్షేపము చేయడము లేదా Legal marriage లేకుండాసంస్థలు సంస్థలులాగనే ఉండనిచ్చి దురాచారాలు పోగొట్టాలంటే మురికిగుంటలలో మందులుచల్లుటవంటిదే. అందుచేతనే సంఘసంస్కరణాభిలాషుల ప్రయత్నములు వ్యర్థములై దురాచారాలు దూరానికి పోకుండావుంటున్నాయి. శస్త్రవైద్యమునకు కుదిరేరోగాలు మందులువేస్తే కుదరవు. నాగరికులమనుకొనే మనయొక్క సాంఘికసంస్థలు, నైతికాదర్శములు స్వార్థమూలములును, శుష్కదాంభికములును, వట్టి యాడంబరములు నై నిర్వీర్యముగ నున్నవి గాని త్యాగయుతములుగను సత్యసంబద్ధములుగను నున్నవని నేటి నాగరికుల నైతికవ్యవహారములను బాగా లోతుగా పరీక్షించేవా రెవరు తలంపరు.

వెంకటచలముగారు మున్నెవ్వరు నాంధ్రవాఙ్మయమునందు త్రొక్కని త్రోవలను నూత్నసమస్యలతో నిర్భయముగ చూపుచున్నారు. అజ్ఞానాంధకారముచే నావరింపబడి యున్న మన సాంఘిక నైతికవిషయముల మీదకు సెర్చిలైటును త్రిప్పినారు. వీరి 'కన్నీటికాలవ' లోని విషయముయొక్క విలువ యెంతేని అక్కడగలదు. అందు 'నాయుడుపిల్ల' ఒకటితప్పితే, తక్కినవి కన్నీటిని కాల్వగా చేయలేకున్నను, చదువుటకు మొదలిడితే కడచూచేవరకు పుస్తకము విడువలేనంత కుతూహలముగను, అంతర్భావోద్రేకముగను నుండును; చివరకు మనయభిప్రాయ మెట్లున్నను, ఒక్కొకపట్టున చదివిందే మరల చదువాలని యనిపించుతుంది. 'నాయుడుపిల్లను' గురించి వేరే చెప్పేదేమున్నది ? అది వెంకటచలముగారి పుష్పవనములోని Night Queen అన నొప్పును దాని సౌరభమే వేరు.

అధునికాంధ్రవాఙ్మయమును భాగ్యవంతముగ చేయు కొలదిపాటి గ్రంథములలో వెంకటచలముగారి "కన్నీటికాలవ" నిరతిశయముగ నున్న దని నిస్సంశయముగ చెప్పవచ్చును.

---

# ఏది శాశ్వతము?

[ఒక ఆధునికతర కవిబాలుడు]

౧

భూమ్యాకాశముల పెండ్లిదినమా,
నీ విలాసము లెంతో ఆనందజనకములు.
చల్లని గాలులతో, వెచ్చని యెండలతో
అందరికీ హాయి కల్పించుచున్నావు.

కాని నీకు రానున్న అంతమును గానలేక
పోవుచుంటివి చూడుము అదిగో ఆ
తూర్పు దిక్కున నీకు సహజవైరి యైన
రాత్రి ని న్నంతరించుటకు వచ్చుచున్నది
నీచావుకు దిక్కులు విలపిస్తూ వదలిన
కన్నీటిమంచుధారలవిగో ఆవరిస్తున్న వంతటను
ఆహా, సరిగదా నీ బ్రతుకు ఇంతటితో.

౨

చక్కని సంపెగ పువ్వా
నీ సొగసూ నీ సొంపూ నీ వాసనా
నీకూ మాకూ కూడా సంతోషకరములే
కాని సమీపిస్తున్న నీఅంతమును కానకున్నావు.

నీ మూడిక మెత్తందనమే నీ ముప్పుకు
కారణమని నీకు తెలియకున్నదా.
కొంచెము నీ శిరస్సు నిటు వంచిచూస్తే
నీ మొదలెట్లు పగుల నారంభించిందో
నీకే స్పష్టము కాగలదు గదా.

౩

వసంతమా నీవెంతో సుఖప్రదాతవని
చల్లదనమని చలిగాకుండా, వెచ్చదనమని వేడి
[గాకుండా
ఇండ్లలోనూ గాక తోటల్లోనూ గాక
ఇక్కడా అక్కడా ఉంచేటి కాలమని
నీవు పొంగిపోతూ నడుస్తున్నావు
పచ్చని చామంతులతోడా ఎర్రమామిళ్లతోడా
పూస్తున్న పనసలతో వికసిస్తున్న గులాబీలతో
ప్రపంచాన్ని స్వర్గసమంగా చేస్తున్నానని
అంత వడిగా పరుగెత్తు తున్నావు
కాని నీకూ తప్పింది కాదుకదా
ఈ నిర్దయ స్వరూపమైన అంతము.

౪

అయితే అన్నీ అట్లే పోతే నిలిచే దేది?
పోయేది వ్యక్తులు, మంచిగుణాలు నిలిచే ఉంటవి
దినమూ, సంపంగీ, వసంతమూ, పోవచ్చును
గాని తేజస్సుకూ, సువాసనకూ, శృంగారానికీ
చావంటూ ఎన్నడూ లేదు గదా
ప్రపంచ మంతా నశించి పోయినా
లోకకళ్యాణము సంపాదించే గుణాలకు
నాశము ఉండనేరదు గదా.

---

# 'దసరా' చిత్రములు



౧. దసరా గిలకలు



౨. దసరా పూజ

# తిక్కన విరాటపర్వము

గుఱ్ఱపు వెంకటసుబ్బరామయ్య గారు

(వెనుకటి సంచికతరువాయి)

## దృశ్యప్రబంధసామ్యము

సంస్కృత భారతమునకును, దిక్కన యనువాదమునకును ప్రాయికముగ శ్రవ్యదృశ్య కావ్యములకుఁ గలభేదము కానవచ్చును. మూలముం బఠించునప్పుడు ఎచటనో జరిగిన కథ నెవరో చెప్పఁగా వినుచుండునట్లు మనకుఁ దోఁచును. తిక్కనకబ్బముం జదువుతఱి నందలి సంగతులెల్ల నొకకతవలెఁ గాక, మనకన్నుల యెదుటనే నడచునట్లు స్ఫురించును. చదువరులమనంబులు తలుచుగఁ దత్కవితావేశమగ్నములై, కల్పితమెల్ల వాస్తవమని భ్రమించి, నిజప్రత్యేకత విస్మరించి, కథాపురుషాదులతో తాదాత్మ్యముం బడయును. వేయేల, తిక్కన భారతము శ్రవ్యప్రబంధరూపముఁ దాల్చియున్నను, కార్లయిలు కవీశ్వరుని "పరాసువిప్లవము" (The French Revolution)వలెఁ జిఱుతుకమార్పులతో నొక మహోత్కృష్టనాటక మగునని మదీయాశయము. ఇట్లు తోఁచుటకుఁ, దిక్కన వశీకరించికొన్న మానవస్వభావ పరిజ్ఞానమును, ప్రకృత్యనుకరణశక్తియు, ఔచితీ నిర్వహణమును ముఖ్యకారణములు.

i. కవిబ్రహ్మ మానవ స్వభావజ్ఞతకు విరాటపర్వమునుండి నిదర్శనములు—

౧. కీచకుఁడు తొలుసారి సైరంధ్రిని గాంచి, తత్సౌందర్యమున కచ్చెరు వొంది, మోహపాశములఁ దగుల్కొనుట యిట్లు వర్ణితము:

చ. "అని యని యుగ్గడించు; ధృతి
యల్లల నాడినఁదల్లడించుఁ; బై
కొనుతలఁ పోరగించు; మదిఁ
గోర్కులు పేర్చిన నప్పళించు; నె
ట్టన తెగ నగ్గలించు; సచ
టక జనులం బరికించు; బుద్ధి దూ
లిన పెస నెంతయుం గళవ
ళించు మనోజవికారమగ్నుఁ డై."

ఇయ్యది నాయికా ప్రథమదర్శనమున కాముకుని 'మనోజవికారమగ్న' చిత్తమున కెత్తిన 'ఛాయాపటము' వలె నున్నదిగదా!

౨. కీచకుని వలపుచూడ్కుల కగ్గమై విపద్దశ పాల్పడిన పాంచాలి యార్తమూర్తియై కీచకుని మోహమునకుఁ బ్రోది పెట్టినట్లు సరసముగఁ జమత్కరింపఁబడినది. ఎట్లన—

సీ. "నెఱవక ననుఁ జూచె వీఁ డని యెదఁ గలుషించిన నొండొండఁ జెమట వొడమ,
ననుచిత కృత్యంబు లాచరించు విధాత బలిమికి నివ్వెఱపాటు దోఁప,
నిచ్చట దిక్కు లే రెవ్వరు నా కను భయమున మేనఁ గంపంబు వుట్టఁ,
జేయంగ నేమియుపాయంబు లేమి, నాననమున నెల్లఁదనంబు గదుర,
నున్నపాంచాలిఁ గనుఁగొని యన్నరాధముఁడు వివేకవిహీనుఁ డై, ముదితుఁ డగుచు,
మదన వికృతియ కాఁ దన మదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె".

ఇటఁ జెమటయు, నివ్వెఱపాటును, మై కంపమును, మోము వెల్లఁదనమును గ్రమము గా నాగ్రహాశ్చర్య భీత్యసహాయతలచే జనించిన వయ్యు, సాత్త్వికభావోద్భవంబులు గూడ నగుటయే కీచకునిభ్రమ కాధారమయినది. ఇయ్యది "యేదస్వార్థమో కామికీ" అను సూత్రప్రాయమగు కాళిదాసోక్తికిఁ దెలివిడి కానోపు!

3. మోహపరవశుఁడగు కీచకుని వలపు తలఁపులు:

సీ. "లీల నాముందట నాలేమ వొలసినఁ,
జూడ్కికిఁ జుబ్బన చూఱ గాదె!
కను విచ్చి నన్ను నాతనుమధ్య సూచినఁ,
దనువున కమృతసేచనము గాదె!
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ
ల్కినఁ, జెవులకు రసాయనము గాదె!
యెలమి నమ్మెలఁత నన్నేలయింపఁ దివిరిన
నెడఁద కానందంబు నిక్క గాదె!
యానితంబిని మక్కువ ననఁగి పెనఁగి
యింపు పొంపిరివోవ నన్నేలికొనఁగఁ
దలఁచి పొందిన, నది జన్మఫలము గాదె!
యనుచు వలరాజుబారికి నగ్గమయ్యె."

తొలుత నాలేమ తన'ముందటఁ బొలయుట,' పిమ్మట కను విచ్చి 'తన్నుఁ జూచుట', అంతఁ 'జిఱునవ్వు బెరయఁ దనతోఁ బల్కుట', అటుపై 'నెలమిఁ 'ద న్నేలయింపఁ దివురుట', ఆమీఁద 'మక్కువ ననఁగి పెనఁగి యింపు పొంపిరివోవఁ 'ద న్నేలికొనుట' ఈక్రమమునఁ గీచకునికోర్కె యెగఁబ్రాఁకుట మానవప్రకృతి కెట్టి యనుకృతియో వేఱ వచింపనక్కఱలేదు.

౪. కీచకునింటికిఁ గల్లుఁ దేరఁబోవు సైరంధ్రి వర్ణనము:

సీ. "దైన్యంబుతలపోఁత దలకొన్నఁ జెలువ కా
ననమున వెల్లఁదనంబు గదిరె;
భయరసవేగంబు పైకొని మట్టినఁ
గాంతకుఁ దనులతఁ గంప మడరె;
జగడంత కంతకు మిగిలిన నింతికిఁ
బదముల నటఁ దొట్రుపాటు వొరసె;
దల్లడం బొందినఁ దన్వికి వదయానం
బుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగె"

ఇందు 'దైన్యము'చే 'నాననమున వెల్లఁదనము','భయము'చేఁ 'దనులతకంపము','బెగడుచేఁ' 'బదముల తొట్రుపాటు', 'తల్లడము' చే 'ఘర్మము'—ఇట్లు వివిధభావనమున్నతె కాయికవికారము లెంత సూటిగ నిర్దేశింపఁ బడినవి!

౫. కీచక విరహోన్మాద చరమదశ యిట్లు వర్ణితము:

సీ. "పొడసూపిన దైన వడిఁ బట్ట సనఁకట్టి
పరికించి కానక బమ్మరించు
మెలఁగినయ దైనఁ బలికింపఁ దలఁచి ని
రూపించి లేమి నశ్రులు వహించుఁ
గదిసినయ దైనఁ గౌఁగిలింపఁ గడంగి
యారసి భొం కైన నలఁత నొందు
నొడఁబడ్డయ దైన నడరి పైకొనఁ జూచి
చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు
లలితవివిధవిహారంబులకు లతాంగి
యెలసి పొలసిన య దైన నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ నప్పళించి
వెదకి రిత్తబయల్ గని విహ్వలించు."

ఇప్పద్యము "మేఘసందేశ"మందలి "మామాకాశప్రణిహితభుజం" ఇత్యాది శ్లోకమును, షేక్స్పియర్ నాటకముల రోమియో, ఆంటోనీ మున్నగు వియోగార్తుల ఆత్మగతములను పఠిశల తలఁపునకుఁ దేవచ్చును. కీచకుఁడు దురాత్ముఁడే యగును గాక, పైపద్దెమునఁ బ్రకటితమగు నతని వలరాచవేఁగుఁబు నెడ జాలిగొనని పాషాణహృదయుఁ డుండునా?

౬. సైరంధ్రీసమాగమమున కువ్విళులూరుకీచకుని వేగిరపాటును కవి యిట్లు వర్ణించినాఁడు:

క. "మాయురవి యేల క్రుంకఁ డొ
కో? యను; నిట్టేల తడసెనే? యనుఁ; గ్రుంకం
బోయెడుఁ జూ యిప్పుడ యను;
దాయపడిచె నను మనోజతాపము పేర్మిన్.

ఆ. దివము కాని యింక భువనంబునం దిట
పట్టిరాత్రి లేనియట్టు గాఁగఁ
జేసె నొక్కొ విధి! విశేషించి నాక కా
నేఁడ దివము సాగి నిలిచె నొక్కొ!

తే. అనుచుఁ గ్రుంకింపరానిప్రొద్దరసి యరసి
శిశిరపర్యంకమున మేను సేర్చి సేర్చి
వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి
మిగుల వందురి వందురి పొగిలి పొగిలి."

"ప్రొద్దుఁ గ్రుంకించు"టకుఁ బ్రొద్దేమి యీతనిచేతియాటబొమ్మా? ఇట్టిచిత్తవృత్తి నెఱింగియే కదా కాళిదాసు "కామార్తాహి ప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు" అను నర్థాంతరన్యాసము రచించినాఁడు!

౭. ఉత్తరుఁడు కురుబలమును జయించి పసుల మరలించినాఁ డను గోపాలురవాక్యములు విని విరటుఁడు ఏమేమో యని గోపస్తోమముఁ బలుమాఱు నడిగెనఁట! సద్వార్తాశ్రవణము సంతోషావహ మగుటచే నాతఁడు దానిని బల్మాఱు వినఁ గోరుట మనుష్యస్వభావమున కత్యంత మనుగుణముగ నున్నది.

అన్నియు నొక్కయెత్తు, కీచక పాత్రనిర్వహణ మొక్కటి యొక్కయెత్తు. షేక్స్పియరు షైలకు, అయాగో మున్నగు నీచాతినీచస్వభావులఁ జిత్రించుటయందును, మిల్టను మహాకవి సేటనుపాత్రమును దీర్చుటయందును, ఆంధ్రకవితాపితామహుఁడు వరూథినీపాత్రమును రచించుటయందును, వ్యక్తమగు నేర్పు, ప్రతిభ మానవస్వభావజ్ఞానమును దిక్కనార్యుని యీకీచకసృష్టియందుఁ గన్పట్టుచున్నవి. మూలమునందుఁ గీచకుఁ డన దౌష్ట్యావతారము; కామోద్రేకమునఁ గేవల మ్మృగప్రాయుఁడు. ఈతనియెడఁ బాఠకునకుఁ గినుకయు, రోఁతయుఁ దక్క వేఱుభావములు కలుగవు. మఱి తిక్కనార్యుని కీచకునియం దన్ననో, మానవస్వభావము చక్కఁగఁ బ్రతిబింబించుచున్నది. కీచకుఁడు కేవలదుష్టుఁ డయ్యు, నీచుఁ డయ్యుఁ, దిక్కనమానసము తాత్కాలికముగ నాతని యాత్మలోఁ బ్రవేశించినట్లు తోఁచును. తిక్కన కీచకుఁడు ఉత్తమ నాగరకుఁడు, సరసుఁడు; కాని, భావోద్రేక పూరితుఁ డై, వలరాచవారి యురులలోఁ జిక్కువడి, తన నేర్పును, రసజ్ఞతయుఁ బెడత్రోవఁ బట్టుడుఁ గడపటికి సమూలనాశనముం గాంచును. ఇట్లు దోసముల దయ్యము

(Monster of vice) ను శోచ్య పాత్రము (Tragic character) గ మార్చిన తిక్కన మానవప్రకృతి పాండితిని, 'హేమవిద్యం' బోని దాని, నెంతని కొనియాడ నగును!

ii. తిక్కనార్యుని ప్రకృత్యనుకరణ మహిమ-

తిక్కన కవనము మానవ స్వభావమున కెల్లో బహిఃప్రకృతికి నట్లె యెత్తిన నిలువుటద్దమో, ఛాయాపటమో యనఁదగును. కవి బ్రహ్మసృష్టి యగుటం గాఁబోలు, నయ్యది బ్రహ్మసృష్టికి నొరవడి యని కూడఁ జెప్ప నొప్పను. స్వరూప వర్ణనలచేతను, అలఁతి యలఁతి స్వభావోక్తులచేతను, వర్ణ్యమును జిత్తరువునం బోలె—కాదా—నాటకరంగమునం బలె, స్ఫుటముగఁ బ్రత్యక్షీకరించు నేర్పునందుఁ దిక్కనకు సాటి తిక్కనయె. ఇందుల కించుక యుపపత్తి:—

౧. సంభాషణలను రచించుచో, మూలమునంబలె "అర్జున ఉవాచ", "కర్ణ ఉవాచ" ఇత్యాదులతోఁ దనివి నొందక, తిక్కన తత్తదనుగుణ ముఖవైఖర్యాదిస్వరూపవికృతిని హావభావ వికసనమును అతినిపుణముగ వర్ణించును. ప్రాయికముగ నీవర్ణనలు "ఛాత్రసాహస్రప్రకారంబుగా నాటకములుఁ దన్నిగమంబు గఱపు" వారు నట్టువుల మెఱుఁగకొఱకు నిజ రూపకముల నిమిడ్చిన సూచనలం బోలి యుండును. ఎట్లన—

వనవాసాంతమున బ్రాహ్మణులకు వీడ్కోలు చెప్పి ధర్మజుఁడు "డగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుఁ" డగును. భీముఁ డర్జును సగ్గింపఁగా ధర్మరాజు "తెలి వొందిన మొగంబుతో శిరఃకంపంబు" చేయును. సవ్యసాచి యుధిష్ఠిరుంగూర్చి ప్రస్తావింపఁ బోవుచు "సవితర్కంబును, సవిషాదంబును, సగౌరవంబునుగా నతని నుపలక్షించును." అట్లె ధర్మతనయుఁడు భీమునింగూర్చి నుడువఁ గడఁగుచు, "అనిలతనయు నిరీక్షించి తత్కాలజనితం బైన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యంబవలంబించును." తాను సైరంధ్రివృత్తిఁ గైకొనుదును ద్రౌపదికి యుధిష్ఠిరుఁడు తన వెజ్జెతనము బయలువడునట్లు

క. "మనవంశంబును వృత్తం
బును శెంపును గావఁ జాలు పుణ్యావలి వీ
ర్జను లగుతులువలశ్రలఁ పులు
కనుఁగొని యేసుఆక మెలఁగఁగా వలయుఁజుమీ."

యని కేవల మనావశ్యక మగు నుపదేశ మొసంగఁగా, నందులకు యాజ్ఞసేని "అనాదర మందస్మిత సుందరవదనారవింద" యగును. విరటుఁడు తన్నుఁ బొగడఁగా వలలుఁడు "మోఱకుచందంబున మో మడ్డము గదల్చును." ఏలికి తన్ను మల్లునితో యుద్ధము నకుఁ బురికొల్పఁగా నతఁడు తొల్త "ధర్మతనయు కనుసన్నఁ గయికొనును." కీచకుఁడు తన్నుఁగూర్చి సుదేష్ణతో నాడుపలుకులు "వినియు వినమి భావించి యప్పాంచాలి నిర్వి

కార మై యూరకుండును." సుదేష్ణ నిజ పాదములకడఁ జాఁగి మ్రొక్కిన తనతమ్ముని "నల్ల నెత్తి దండడి దొరఁగం జనుదెంచు నశ్రుపూరము కనుఁగవలో మ్రింగికొనును." కీచకునిచేఁ బరిభవింపఁబడి పాంచాలి శయ్యపై మేను వైచి "యపాంగంబులఁ దొరఁగు కన్నీరు చెవులకొలఁకులు నిండఁ" జింతిల్లును. పాండవాయుధములఁ గని యుత్తరుఁడు తన మేనమామల "సస్నేహంబును, సగౌరవంబును, సవిషాదంబునుం గా" స్మరించును. అర్జునుఁడు కౌరవసైన్యముం గని, "మెలన వ్రాలయువద సమున గరువంపుఁ జెన్ను దలకొనఁగా" విరాటసుతునకు వేర్పఱిచి చూపును. కిరీటి కృపుని విరథుఁ గావించి, "లోచనముల నవ్వు మెఱయ నాలోకించి" తద్వక్షఃస్థలంబునఁ గ్రూరభల్లంబులు నాటును. తనమెత్తిపొడుపు మాటలచేఁ గనలు విరటుని ధర్మసుతుఁడు "దరహాసం బాననమున ముసుఁగు వడఁగ" గేలిసేయును. పాండవులు తమ్మొఱఁగింపఁగా విని విరటుఁడు "అద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునఁ గలుగు సందేహావేశంబు విన యసంభ్రమముల నిగుడ కునికిం జేసి చిక్కువడును."

౨. కనుకట్టువిద్యచేతంబలె, నవలీలమై మనకుఁ గథావస్తువు నెల్ల స్ఫురింపఁజేయఁగల స్వభావోక్తులకుఁ దిక్కనకవనము పుట్టినిల్లు. కీచకునిచే నవమానిత యై మరల నిలుసేరిన సైరంధ్రితో సుదేష్ణ యి ట్లనును:

సీ."ధరణీపరాగంబు వొరసి ధూసరిత మై
చేడియ నీమేను చెన్ను దఱిఁగెఁ;
జిత్తంబు తలపోతచే వాడు వొదివినఁ
జెలువ నీసెమ్మొము చిన్నవోయెఁ;
బ్రస్వేదమునఁదోఁగి ఫాలంబుతో నంటి
యుగ్మలి నీకురు లొప్పు గందెఁ;
గన్నీరు వఱ్ఱోడి కాంతి యెంతయుఁ గొన్న
వెఁది నీకనుఁగవ విన్న నయ్యె-"

ఇందుచే నప్పటి ద్రౌపదీస్వరూపము విస్ఫుటముగ దృగ్గోచర మగుచున్నదిగదా. పాంచాలీపాణిస్పర్శనంబున భీముఁడు మేల్కని, చీఁకటి యగుటచే గుఱుతింపఁ జాలక "ఇది యెవ్వరు?" అనవుడు "నేను" అని యమ్మానిని బదులు వల్కెను. ఈసంవాదము ఎచటనో ఎప్పుడో జరిగినవృత్తాంతమును మన గృహద్వారముకడకు మనయింటిలోనికే కొని వచ్చినదిగదా! నర్తనాగారమున కేఁగఁ బోవు భీముఁడు "తలచీర యాయితము సేసికొనె" నఁట. ఇట్లనుటచే నతని యాఁడువేసము ప్రత్యక్ష మగుచున్నది. నిజశంఖారావమున హయములు పుడమిపైఁ జాఁపకట్టువడఁగాఁ బార్థుఁడు వాని "వాగెలు వట్టి యెత్తి తత్తనువుల నూల్కొనఁ నివిరె"నఁట. ఈవర్ణనచే గుఱ్ఱములబెదరు వాపుట విస్పష్ట మగుచున్నది.

దుర్యోధనుఁడు తనవారితో "శత్రులం గనుఁగొని యిట్లు లొండొరు మొగంబులు సూచుచు నున్నఁ బోవునే" యనుపల్కులు భయభ్రాంతమగు కౌరవసైన్యమును లోచనగోచరము గావించును.

ధర్మరాజు విరటునితో,

ఉ. "ఆహవకేళి వేడుక బృ
హన్నలచిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని
సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీపసుల
నొక్కఁడు దక్కఁక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గావలయుఁ
దప్పదు నాపలు కట్ల నూడుమీ."

అని యంతట నిలువక, "యమ్మనుజేశ్వరు మొగముఁ జూచి" మఱియుఁ "బురములోనఁ జాటు బంపు బృహన్నలజయంబు భవ్యవిచారా" యని పల్కెను. "అమ్మనుజేశ్వరు మొగముఁ జూచి" యనుటచే విరాటరాజును, అతనియెదుట నాసీనుఁడై పలుకుములుకుల నొప్పించి యతని గేలిసేయు కంకభట్టును ప్రత్యక్షగోచరు లగుచున్నారు.

iii. తిక్కనార్యుని యౌచితీ నిర్వహణ ధౌరంధర్యము.—

ఇతరకావ్యభేదములకన్న మిన్నగ దృశ్యప్రబంధము లౌచితీప్రధానములు. అన్యముల నగణ్యములు క్షంతవ్యములగు నౌచిత్యలోపములు రూపకములఁ గేవలరసభంజకము లగును. ఒండుగొనములు మెండయ్యు నౌచితి కొఱవడెనేని, నాటకము వన్నెఁ గాంచనేరదు. పాత్రోచితభాష, స్వభావోచిత వర్తనము, రసోచితశైలి, ప్రకరణోచిత సంవిధానము— ఇత్యాదులఁ జక్కఁగ నెఱిఁగి, తక్కక పాటించునదే నాటకము. ఈయౌచిత్య పోషణమునఁ దిక్కనకృతి యుత్తమనాటకకల్ప మన నొప్పును. ఇందుల కుదాహరణములు పెక్కులు మూలానువాదముల సరిపోల్చుచోట సూచింపఁబడినవి. ఇట మఱికొన్నిటి నీయందగును.—

౧. విరటుఁడు తనగాదిలికూఁతు నుపలాలించుట:

చ. "తిగిచి కవుంగిలించి జగ
తీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునన్ గదియ
మోపుఁ గరాంగుళులన్ గపోల మిం
పుగఁ బుడుకున్ బొరింబొరి న
పూర్వవిలోకన మాదరించుఁ గ
ప్పురపుఁబలుకుహాళి నుజ్జ్వలన
ఖాంశురచేష్ట యొనర్చు నర్మిలిన్".

ఇప్పద్యము నే, "జగతీవిభుఁ డక్కమలాయతాక్షి" అనుటను "నరదేవ కులోత్తముఁ డక్కుమారు" అని మార్చి, తిక్కన "నిర్వచనోత్తర రామాయణము"న రామదేవుఁ డనుజునిఁ గారవించు పట్టున వాడినాఁడు. ఇట్లు తండ్రి కొమరిత నుపలాలించుటయు, అన్న తమ్ముని సంభావించుటయు నేకముఖముగ నొక్కపద్దెమున నౌచితి కించుకేని వెలితి గాకుండ నర్ణించుట తిక్కనకుఁ దక్క నన్యులకు సాధ్యము గాదని సాహసించి నుడువవచ్చును.

౨. మూలమునఁ గీచకుఁడు సైరంధ్రిని స్వకీయధనకనక వస్తువాహన దాసీజన చిత్రమాల్యాంబర వివిధభక్ష్య భోజ్య పేయాదుల మెడ నాసఁ గొల్పి కైవసము చేసికొనం జూచును. తిక్కన్న యన్ననో, కీచకునినోట నతని

సంపదంగూర్చి యొక్క మాటయైనఁ జెట్టక, ద్రౌపదీ సౌందర్యగాంభీర్యాది గుణములను, కీచకమోహపారవశ్యమును యౌగపద్యముగ సూచించువాక్యముల నిట్లు పలికించినాఁడు:

సీ. "సుదతి, నీమై చక్కఁ జూచుట కోడెదఁ,
గనుఁబాటు వొరయునో యని తలంచి;
మది నిగిర్చినమాట, మగువ, నీపెంపునఁ
గుదిసి, నానాలుక తుదికి రాదు;
పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి, శం
కించి వడంకెడుఁ గేలు నాకు;
సెజ్జ నిట్టి దని, యింతి, నీసొమ్మసం జెన్ని
భంగుల నరసినఁ బట్టువడదు;
చెలువ, యింక నొక్కించుక నేపు నీ న
నాదరంబున నెప్పటియట్ల యున్న,
మన్మథుఁడు సమయించిన మగఁడ నన్నుఁ
బడయ వచ్చునె యెన్నియుపాయములను."

ఇందుచేఁ దిక్కనార్యుని సౌకుమార్యౌచిత్యపరిజ్ఞానము తెల్లముగదా.

3. కీచకప్రలాపములకు బదులు పల్కునపుడు ద్రౌపది యతని "నోయన్న"యని సంబోధించుటయు, "ఆఁడుఁబుట్టువులతోడ నీవు ను బుట్టినాఁడ"వని మర్మము దూఱ నాడుటయు మహాపతివ్రత యగు నమ్మానిని కెంతయుచిత ముగ నున్నవి!

౪. దక్షిణగోగ్రహణసమయమున వలలుఁడు చూపిన పరాక్రమమును విరాటరాజిట్లు వినుతించును:

ఉ. "మంటయుఁబోని శాత్రవస
మాజము నించుకయేని శంక లే
కంటఁగఁ దాఁకి, వెండి తెగ
టార్చె మహాద్భుతశక్తిశాలి, యీ
వంటలవానిచేసిన యు
దార్యపరాక్రమ మెందుఁ జోటులన్
గంటిమె వింటిమే! యితఁడ
కాఁడె వెసన్ గెలిపించె నన్ననిన్."

'వంటలవాని' పరాక్రమము వర్ణించు పట్టున, 'మంటయుఁబోని శాత్రవసమాజము నించుకయేని శంకలే కంటఁగఁ దాఁకి' నట్లుపమించుట యెంతయుచితమో, సాభిప్రాయమో, రసజ్ఞు లూహించుకొనఁగలరు.

౫. భీష్ముఁడు సుయోధనునిదెస నరుగు నర్జునున కడ్డపడుటకుఁ దనబలముం బురికొల్పుచు నిట్లు వచించును:

ఆ. "వాసవాత్మజుండు వసుధేశనందను
ముట్టుకొనిన నొకటి పుట్టెనేని,
మనప్రయోజనంబు మఱియేమి, పను లవి
యేటి కొండుధనము లెల్ల నేల."

"ఒకటి పుట్టెనేని—" ఔచిత్యముంబట్టి విలువ గణింతుమేని, ని "య్యొకటి" యొకకోటి నేయదా?

౬. ఉత్తరునిఁ గొంచెపఱుచుచు బృహన్నలం బొగడు కంకభట్టును విరటుఁడు మందలించుట:

క. "నాకొడుకు పోటుమాటలు
నీ కేటికిఁ? జొనుఁగ నాడ నేరవు, మూర్ఖో శ్రీ.
ద్రేకమునఁ బలుకుచుండుట
మాకు సహింపంగ రాదు మానుము, విప్రా."

"నాకొడుకు" అని మొదలుపెట్టి, రోసము రేఁగుసరికి, "మాకు సహింపంగరా"దనుటయు

"బాపఁడా" యన్నట్లు "విప్రా" యని సంబోధించుటయుఁ గోపోద్రిక్తమానసుండగు మత్స్యమహీపాలున కెంత యొప్పియున్నవో వేఱ నుడువ నక్కఱలేదు. ఇచ్చటి "మా"కై, ఔచిత్యజ్ఞులిక్కవివతంసునకు "మాకై"ని—లక్ష్మహస్తము—నర్పింపఁదగును!

౭. ఇతరస్థలములందుకంటె శృంగారఘట్టముల ననౌచిత్యగంధము సోఁకనీయమి కష్టతరమని యనుభవజ్ఞులకు విదితము. కవులు—ముఖ్యముగ నాంధ్రకవులు—శృంగారరసలోలుపతచే ననౌచిత్యాశ్లీలతాది దోషముల నంతగఁ బరిగణింపమి యెల్లరకుఁ దెల్లమె. అనౌచిత్యముపొంతఁ బోవని ధ్వనిప్రధాన లలిత సాధుశృంగారకవనము తిక్కనయొక్కని సొత్తు. ఇందుల కొక్క మనోహరలక్ష్యము నొసంగి యీభాగమును విరమించెదను: ఉత్తరాభిమన్యు వివాహమహోత్సవ ఘట్టమున వధూవర ప్రథమాన్యోన్యావలోకన మిట్లు వర్ణితము:

సీ. "వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి,
తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు;
సుందరీరత్నంబు చూపు మనోరమ
నడుగుల యొప్పుపై నల్ల నడరుఁ;
బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగు చుండు;
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
సెగసి, మోమునఁ జోఁకి, మగిడి వచ్చు;
నొండొరువుల లేఁజెమటల నూని గ్రేఁగు
పడినచాడ్పున నవయౌవభఁగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱ విశాల
నయనదీప్తులు, సెలుకువ బయలుపడఁగ."

ఇప్పద్యంపుఁ బదప్రయోజన మరసిన నిందలి యౌచితీవిశేషము తేటపడఁగలదు. "ముద్దియ వదనంబుపై—" వదనమే అందమునకుఁ బ్రధానస్థాన మగుటచేత. "వదనంబుపైఁ బాఱి"—ఆత్రముచేఁ బాఱుట. "నునుఁగాంతి తీపుఁ గ్రోలు"—సౌందర్యతత్త్వజ్ఞలు తత్ప్రపంచమున నంగసౌష్ఠవాది గుణములకన్న దేహకాంతిని మిన్నఁగ నెన్నియున్నారు. కావుననే ఉత్తమ కవియగు తిక్కనకును "నునుఁగాంతి తీపుఁ గ్రోలుట" కడుంగడుప్రియము. "అడుగులయొప్పుపై నల్ల నడరు"—ఉత్తర ముగ్ధ కావున సిగ్గుచేతను, వినయసచ్ఛీలాదిసుగుణసంపత్తిచేతను; "పలుమఱు"—ఒక్కసారితోఁ దనివి తీఱనందున. "కటాక్షములు"; వ్రీడాభరమున; కావుననే "మోమునఁ జోఁకి మగిడి వచ్చు" "లేఁజెమటలు—" సాత్త్వికోదయమున. "మఱపునఁ దడయు"—ప్రేమపారవశ్యముచే "మఱపు."—ఇట్లు సారస్యమున నిప్పద్యము, కళాప్రపూర్ణ శ్రీవేంకటరాయశాస్త్రులవారు తిక్కనార్యుని మఱియొకపద్యముఁగూర్చి నుడివినరీతిని, గోదావరిఆవఁగాయం బోలి యున్నది. ఇట్టివీపర్వమున నింకను వేనవేలు గలవు.




౩. ఆయుధపూజ

# కవి కంఠాభరణము

కిళాంబి రాఘవాచార్యులుగారు

మహాకవి క్షేమేంద్రుఁడు కవికంఠాభరణ మను నలంకారగ్రంథమును రచించె నని యు, దానికి 'కవికర్ణిక' యను నామాంత రము గలదనియు 'ఔచిత్యవిచారచర్చ' యనువ్యాసమునఁ దెలిపియుంటిని. శిష్యుల కుపదేశ మొనర్చుకొఱకును, విద్వాంసులకు విశేషాంశముల బోధించుకొఱకును నీగ్రంథము ను రచించితి నని తెలుపుచుఁ, దన గ్రంథ మునుగూర్చి కవి యిట్లు వ్రాసియున్నాఁడు:

సువిభక్తిసమన్వితం బుధై
ర్గుణసంయుక్త మముక్తసౌష్ఠవైః;
రచితం పదకైః సువర్ణవ
త్కవి కంఠాభరణమ్ విచార్యతామ్.

మనకుఁ జిరపరిచితము లగు కావ్యప్రకా శికా, ప్రతాపరుద్రీయా ద్యాలంకారిక గ్రంథ ములవలెఁ గాక, యీగ్రంథ మొకనూతనమా ర్గము ననుసరించుచున్నది. నాయకనాయికాల క్షణములు గాని, కావ్యనాటకాదిలక్షణములు గాని యిందుఁ దెలుపఁ బడ లేదు.

కవికంఠాభరణము కవిత్వప్రాప్తి, కవి శిక్షణము, కవిత్వచమత్కారములు, గుణదో షవిభాగము, పరిచయప్రాప్తి యను నయిదు ప్రకరణములఁ గలిగి యున్నది. అందుఁ బ్రథ మప్రకరణమునఁ గవిత్వప్రాప్తికి దివ్యమానుష ప్రయత్నములు కారణము లని నిర్వచింపఁబడి నవి. సరస్వతీపూజనాదికములు దైవికములు; గురుశిష్యసంబంధము మానుషము. కవి యీ ప్రకరణమును ముగింపుచు సంగ్రహముగ నీ శ్లోకమును రచించియున్నాఁడు:

ఇతి తతసుకృతానాం ప్రాక్తనానాం విపాకే
భవతి శుభమతీనాం మంత్రసిద్ధం కవిత్వమ్;
తదను పురుషయత్నై ర్ధీమతా మభ్యుదేతి
స్ఫురతి జడధియాం శ్రీశారదా సాధనేన.

ద్వితీయప్రకరణమునఁ గవులను ఛాయోపజీవీ, పదకోపజీవీ, పాదోపజీవీ, సకలోపజీవీ, భువ నోపజీవీ అని అయిదుజాతులుగ విభజించి, యనంతరము కవి యెట్టిశిక్షణము నందవల యునో తెలిపి యున్నాఁడు. (ప్రక. 2, శ్లో. 2-22). ఈ ప్రకరణమునందుఁ దెలుపఁబడిన నూఱు విషయములయందును శిక్షణము నంద నిచోఁ, గవి కానేరఁ డని క్షేమేంద్రుని యభి ప్రాయము. అందుననే ప్రాచీనకవులయొక్క సర్వతోముఖవిజ్ఞానము వెల్లడి యగుచున్నది.

తృతీయప్రకరణమునఁ జమత్కారనిరూ పణ మొనర్పఁబడినది. చమత్కారమునకుఁ గవి యీక్రిందిశ్లోకము నుదాహరించియున్నాఁడు:

రక్త స్త్వం నవపల్లవై రహమపి
శ్లాఘ్యైః ప్రియాయా గుణైః
త్వా మాయాంతి శిలీముఖాః స్మరధను
ర్ముక్తాః సఖే మా మపి;
కాంతాపాదతలాహతి స్తవ ముదే
తద్వ న్మమా ప్యావయోః

సర్వం తుల్య మశోక కేవల మహం
...సశోకః కృతః.

కాని యశోవర్మవిరచిత మగు నీశ్లోకము కాళిదాసవిరచిత మని పొరఁబాటునఁ దెలుపఁబడినది.

చమత్కారము పదివిధములు: (౧) అవిచార్యమాణరమణీయత, (౨) విచార్యమాణరమణీయత, (౩) సమస్తసూక్తవ్యాపి, (౪) సూక్తైకదేశదృశ్యము, (౫) శబ్దగతము, (౬) అర్థగతము, (౭) శబ్దార్థగతము, (౮) అలంకారగతము; (౯) రసగతము, (౧౦) ప్రఖ్యాతవృత్తిగతము. ఈదశవిధచమత్కారములకు క్షేమేంద్రమహాకవి తాను రచించిన శశివంశపద్యకాదంబర్యాదిగ్రంథములనుండియే యుదాహరణముల నిచ్చియున్నాఁడు.

చతుర్థప్రకరణము గుణదోషవిభాగమని పేర్కొనఁబడియున్నది. కాని యీ ప్రకరణమునందు అప్రయుక్త, అపుష్టార్థ, నిరర్థ కాది దోషప్రశంస గాని, శ్లేష ప్రసాద మాధుర్యాది గుణప్రశంస గాని కానరాదు. క్షేమేంద్రమతానుసారము కావ్యగుణములును, కావ్యదోషములును శబ్దార్థరసముల వైమల్యకాలుష్యములచేఁ గలుగుచున్నవి. కావ్యములు సగుణ, నిర్గుణ, సదోష, నిర్దోష, సగుణదోషంబు లని అయిదువిధంబులు.

పంచమప్రకరణమునఁ గవికి తర్క వ్యాకరణ భరత చాణక్య వాత్స్యాయన భారత రామాయణ మోక్షోపా యాత్మజ్ఞాన ధాతువాద రత్నపరీక్షా వైద్యక జ్యౌతిష ధనుర్వేద గజతురగపురుషలక్షణ ద్యూ తేంద్రజాలాదుల యందుఁ బరిచయము తప్పక యుండవలయు నని తెలుపఁబడినది. వివిధపరిచయముల కుదాహరణము లీయఁబడినవి.

ఈగ్రంథము నూతనమార్గము ననుసరించుచున్న దని యిదివఱలో తెలుపఁబడినది. కావ్యాలంకారలక్షణ నిర్వచనముకొఱకు వ్రాయఁబడి యుండ లేదు. కవిత్వప్రాప్తి మొదలు శిక్షణాదికములు చర్చింపఁబడి యుండుటచే, కేవలము కవులకొఱకు రచింపఁబడినటులు దోఁచుచున్నది. కాని భాషాప్రపంచమున కుపయోగకరము లగువిషయము లిందుఁ జాలఁ గలవు.

౧. కవి తక్కిన యాలంకారికులవలెఁ గాక యుదాహరణములఁ జాలవఱకుఁ దన గ్రంథములనుండియే కైకొనియున్నాఁడు. క్షేమేంద్రుని గ్రంథములలో సంపూర్ణముగ మనకుఁ గొన్నిగ్రంథములు మాత్రమే లభించిన వని యిదివఱలోఁ దెలిపియుంటిని. ఔచిత్యవిచారచర్చాది గ్రంథములయం దుదాహరించిన శ్లోకములవలన మనకు లభించని గ్రంథముల ఇతివృత్తము స్పష్టపడఁ గలదని నానమ్మకము.

౨. ఔచిత్యవిచారచర్చయం దుదాహరించిన కవులను గాక యింక నీక్రిందఁ దెలుపఁబడిన కవులశ్లోకములను క్షేమేంద్రుఁ డీగ్రంథమున నుదాహరించి యున్నాఁడు: భట్టశ్రీశివస్వామి, భట్టవాచస్పతి, దామోదరగుప్త

డు, విద్యానందుఁడు, భట్టముక్తికలశుఁడు, ముక్తాకణుఁడు, చక్రపాలుఁడు, ఆర్యభట్టు, ఇంద్రభానుఁడు. వీరి కాలమును గూర్చియు, రచించిన గ్రంథములను గూర్చియు విమర్శన మొనర్పవలసి యున్నది.

3. మఱియు ద్వితీయప్రకరణమున ఛాయోపజీవి మొదలగువారి కొసంగినయుదాహరణములవలన భట్టభల్లటుఁ డుత్పలరాజదేవునకును, ఆర్యభట్టు భట్టభానునకునుఁ బూర్వులనియుఁ దోఁచుచున్నది. ఇది విమర్శనీయము.

౪. ముక్తాకణుఁడు, చక్రపాలుఁడు సోదరులని ద్వితీయప్రకరణమునఁ గననగును. ఇంద్రభానుని దని యుదాహరించిన 'స్నాతుం వాంఛసి కిం ముధైవ...' యను శ్లోకమును క్షేమేంద్రుఁడు సువృత్తతిలకమున రిస్సువిరచితమని యుదాహరించి యుండుటచే, రిస్సు వను కవికి ఇంద్రభానుఁ డనునామాంతరము గలదని తోఁచును.

౫. క్షేమేంద్రునకు భట్టోదయసింహుఁడు, రాజపుత్ర లక్ష్మణాదిత్యుఁ డను నిరువురు శిష్యులు గల రనియు, నందు భట్టోదయసింహుఁడు భక్తిభవ, లలితాభిధానము లను కావ్యముల రచించె ననియుఁ బంచమప్రకరణమువలనఁ దెలియుచున్నది.

౬. ఈ గ్రంథమునందు భర్తృహరివైరాగ్యశతకమున కాలమహిమాను వర్ణనమునఁ గానవచ్చు నీక్రిందిశ్లోకము చంద్రకుని దని యుదాహరింపఁబడినది:

యత్రానేకే క్వచిదపి గృహే
తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ
స్తత్ర నైకోఽపి చాంతే;
ఇత్థం నేయే రజనిదివసౌ
లోలయ న్ద్వావి వాక్షౌ
కాలః కాల్యాసహ బహుకలః
క్రీడతి ప్రాణిసారైః.

అందువలన భర్తృహరికిఁ జంద్రకుఁ డని యపరనామధేయము గలదా, లేక భర్తృహరిశతకత్రయము సంగ్రథితమై యుండునా యనుసంశయము కలుగుచున్నది. భర్తృహరిశతకమునఁ గానవచ్చు నొకశ్లోకమును జంద్రకుని దని కవి యుదాహరించినటు లౌచిత్యవిచారచర్చ యనువ్యాసమునఁ జూపియుంటిని.

౭. తాను రచించిన యాలంకారికగ్రంథముల మూఁటియందును దనగ్రంథములనుండి యనేకోదాహరణములఁ గైకొనుటవలనఁ గవికి స్వాభిమానము విశేషముగఁ గల దని యూహింప నగును.

౮. ఈ గ్రంథమును కాశ్మీరనృపతి యగు అనంతరాజుకాలమున రచించితి నని కవి యీ గ్రంథాంతశ్లోకమునఁ దెలిపియున్నాఁడు—

కాశ్మీరేషు పృథుప్రతాపసవితుః
కీర్త్యంశుతారాపతేః
ప్రౌఢారాతివనానలస్య ధనద
స్యేంద్రస్య భూమండలే;
విశ్వాకారవతః పునః కలియుగే
విష్ణో రివోత్సాహినో
రాజ్యే శ్రీమదనంతరాజనృపతేః
కావ్యోదయో ఽయం కృతః.

# ఉదయభానుఁడు

కొంపెల్ల జనార్దనరావు గారు

సరసుల మానసాబ్జములు జల్లన, దిక్కులు ఱెప్ప లెత్తి యా
దరమున మ్రొక్క, 'విశ్వవిభు, తామసహారి, త్రిమూర్తిరూప' యం
చెలుఁగెసు భక్తసంఘముల కిమ్ము ఘటించుచు పద్మలోక సం
భరణచణాంశుఁడై యుదయభానుఁడు తొంగుచుఁ దోఁచెఁ దూర్పునన్.

ప్రాంతవిపంచి కూర్చికొని రాతిరి పాడు వియోగగీతికల్
సీతున పేరి రాలు హిమశీకరసంతతి జాలువాఱ, వే
దాతిశయార్థ మేమి కల దంచునొ యేఱుకొనంగ వచ్చె ని
ర్యాతతమఃప్రభాకరుఁ డహర్పతి పాటలకాంతి పర్వఁగన్.

నీడలు సోగలై నిగిడె; నిద్దుర నిద్దుర కేఁగె; బిట్టు కో
రాడెను తూర్పుటేన్గు లుదయాద్రిని జేగుఱుగుట్ట లెల్ల; మో
మోడెఁ దొగల్; పయోజముల కుబ్బులువాఱెను మోద మాత్మ స
మ్రా డభిదర్శనం బొదవ; మంతనమాడెను భూమి స్వామితోన్.

---

# నిట్టూర్పు

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

ఎడము లేక తగులు నీ సుత్తిదెబ్బల
కెట్టు లోర్చి తనువు నెట్టువాఁడ?
మృదు సుమమ్మె కాని హృదయమ్ము పరమాత్మ
కాదు కమ్మటీని గట్టిదాయి—

కలరు కష్టసుఖా లోలిఁ గాంచుచుంట
బ్రదుకుఁ జదరంగమున బంట్లపగిది వారు;
దైవమా! యేమికర్మమో కేవలమ్ము
నల్లగడిసెకటును బోలినాఁడ నేను—

ఎంతకాల మిట్టు లెదురుగాలుల కోడ
నడిసముద్రమందు నడపుచుందు?
అకట! విసరదయ్యొ ననుకూలముగ నొక్క
పిల్లగాలి మేని మెల్లగాను—

మొలకనగ వొప్పు నడకంటి తళుకుకొఱకుఁ
బెద్దయాసతోడను నేను వేచియుండఁ
జిమ్ముచున్నాఁడ వౌర! క్రోధమ్ముతోడఁ
గరముఁ గనకనలాడు నింగలము నీవ!

కఠినశిలలఁ జీల్చుకొనుచుఁ గాఱుటడవి
సన్నముగ బాఱుటయె, కాని యెన్నఁటికిని
లేదె మజ్జీవితాపగ కోదయాబ్ధి!
స్వేచ్ఛమై వెల్లడిని బ్రవహించు కలిమి?

అడుగకుండ నిచ్చి యడియాసలను గొల్పి
తిరుగ లాగికొంటి వెరవుపోల్క;
ఆది నేమికతన నరయవైతివి స్వామి!
నా యపాత్రతయును నీ యశక్తి?

---

సీ. కామేశ్వరరావు గారు

# కుచేల

(వెనుకటి సంచిక తరవాయి)

## దృశ్యము ౨

[ప్రవేశము - నారదుఁడు]

నారదుఁడు

సకల లోకాధార సచ్చిదాకార
ప్రకటితాగమజాల పద్మానిలోల,
అగణిత గుణగ్రామ ఆత్మాభిరామ
నిగమశీర్షారామ నిత్యాప్త కామ.

చాల దినములకు మరల మర్త్యభువనమున శ్రీకాంతుని యపూర్వలీలాప్రదర్శనముఁ గాంచి ముగ్ధుండ నైతిని. ఆహా! దయామయుఁ డా శ్రీకృష్ణభగవానుని యుదారహృదయపరివర్తన మెవ్వఁడు గ్రహింపఁగలఁడు? నవ్వించునొక వేళ; తేలించు బాష్పస్రవంతిలో నింకొక వేళ. ఓ యదుకుల సార్వభౌమా, నీ యద్భుతమహిమ వాచామరగోచరము; నీ శైశవక్రీడారంగస్థలం బాగోకులము, నీ యమృతప్రణయరసాస్వాదనమున సాయుజ్యపదవి సాధించిన యా గోపకామినులు, నీ మధురవేణుగీతముల మైమఱచిన యానందవాహిని, యా యమునా తరంగిణి, భక్త్యావేశమున నీ హృదయప్రవేశముఁ గావించినలోకమాత యా రుక్మిణీదేవి ధన్యులని భావించితిని. సర్వసామాన్యుఁ డీ బ్రాహ్మణుఁ డింతమహిమాఢ్యుఁ డని నేఁ గలనైనఁ దలంపలేదు. ఎట్టిగుణాధిక్యమున ని న్నాతఁడు వశీభూతు నొనరించెనో పరీక్షించి చూచెదనుగాక! అదె, కుచేలుఁడు వచ్చుచున్నవాఁడు. ఇచ్చటనే పొంచియుండి యాతని వర్తనముఁ బరిశీలించెదను.

[నిష్క్రమించును]

[ప్రవేశము - కుచేలుఁడు]

కుచేలుఁడు

కృష్ణా, లోకనాయకా, నాహృదయతృష్ణ తీరినది. కన్నులార నిన్నుఁ జూచితిని. నా కింకేమికోరికలు గలవు? నిరంతరము నీ సాన్నిధ్యమే యభిలషింతును. భక్తచింతారత్నమా, మనోముగ్ధకరంబగు నీ మహోదార స్వర్గీయ స్నేహభావమునకుఁ బ్రణామము!—వామా, నీకారణమున నే ధన్యుండ నైతిని; నీభక్తి మాన్యం బయ్యె; మనజీవనము సార్థకమయ్యె. (ముందుఁ జూచి) ఓహో! ఎట్టి బీభత్సదృశ్యము!—ఓ యబలా, నీ వెవరు? ఈ దుర్గతికిఁ గారణ మేమి?

[కుష్ఠరోగపీడితుఁడగు భర్తను గంపలో నిడి శిరమునఁ దాల్చి సుశీల ప్రవేశించును]

సుశీల

బ్రాహ్మణోత్తమా, ప్రణామము. ఈగంపలోఁ గల రోగార్తుఁడు నా మనోనాథుఁడు. మేము చాల పేదవారము. వాడవాడల బిచ్చమెత్తి పొట్ట పోసుకొనుచుందుము.

కుష్ఠరోగి

అబ్బా! అబ్బా! ఈబాధ భరించలేనురా దేవుఁడా! మృత్యువు న న్నేల కటాక్షింపదు!

పాతాళము నా కేల చో టొసంగదు! పూర్వ జన్మమునఁ జేసిన ఘోరపాపము! అనుభవింపక తీరునా? అబ్బా! అబ్బా! నా కేమిదారి? ప్రాణ మేల పోదు?

సుశీల

(గంప క్రిందఁ బెట్టి, పైఁటతో వ్రణములనుండి స్రవించురక్తము నొత్తుచు) కృష్ణా, విపద్బంధూ, పాపభంజనా, మమ్ముఁ గరుణింపుము! నాథా, పుణ్యాంగన యొకతె యన్నప్రదానముఁ గావించినది. పట్టెడన్నముఁ దిని యా చెట్టుక్రింద విశ్రమింపుఁడు.

కుష్ఠరోగి

అబ్బబ్బా! నానిలువెల్ల విషజ్వాలలు ప్రసరించి పోవుచున్నవి. నా కిం కేమిదారి! హా! పరమేశ్వరా!—

కుచేలుఁడు

సాధ్వీశిరోమణీ, నీ యునికివలననే చరాచర ప్రపంచము నిలిచియున్నది. నీస్వామి భయంకరరోగప్రపీడితుఁడు. ఆతని సర్వాంగము వ్రణప్రపూర్ణము. ఈ శిథిలబీభత్సకళేబరమును బూదండవోలె శిరమునఁ దాలిచి, వాడవాడల బిచ్చమెత్తి, దుర్భరజీవనయాత్ర నెఱపుచున్నావు. తల్లీ, నీవే పతివ్రతవు! నీ దుఃఖవిమోచనమున సర్వజగత్కల్యాణ మగును. (రత్నహారమును స్పృశించును.)

నారదుఁడు

(ఆవేగమునఁ బ్రవేశించి) ఓ బ్రాహ్మణోత్తమా, ఈవెట్టి నీ కెవరు గఱపిరి? శ్రీకృష్ణదేవుఁడు దయాతిరేకమున నీ కర్పించిన రత్నహారప్రభావమును మఱచితివా? జగజ్జనని రుక్మిణీదేవి యా యలంకారమూల్యమును విశదీకరింపలేదా? త్రిభువనైశ్వర్యము, బ్రహ్మలోకము, దేవేంద్రపదవి, యమరత్వము, వేయేల, అనంతకోటిసంభీష్టము లీ రత్నహారమున నిమిడియున్నవి. దేని వాంఛింతు వది నీహస్తగత మగును. అట్టి యమూల్య పదార్థతత్త్వమును విస్మరించి యిప్పు డే మొనరింప నూహించుచుంటివి?

కుచేలుఁడు

తపోధనా, నమస్కారము. ఏ మంటిరి? ఈ రత్నహారతత్త్వమును మఱచితి ననియా? త్రిభువనైశ్వర్యము, త్రిలోకాధిపత్యము, త్రికాలస్థాయిత్వము—భూతదయలేని హృదయమునకీ మొనలేని విభూతి యేల? ఈ రోగార్తుని యాతన నేఁ జూడఁ జాలను. ఈ పతివ్రత దుఃఖము నే సహింపలేను. నన్ను నిరోధింపకుఁడు. (రత్నహారమును దీసి పట్టుకొని) ఓ కృష్ణా, ప్రాణసఖా, ఈ శీర్ణగాత్రుఁడు వజ్రగాత్రుఁ డగునుగాక!

కుష్ఠరోగి

(ఆరోగ్యలాభము వడసి, కుచేలునిపాదములపైఁ బడి) మహాత్మా, మీ యవ్యాజకారుణ్యమున నేఁ బునర్జీవితుఁడ నైతిని. నా హృదయపూర్వకప్రణామము స్వీకరింపుఁడు.

సుశీల

ఓ పుణ్యపురుషా, నీ యాశీర్వాదమున నేను చిరసౌభాగ్యవతి నైతిని. నాకృతజ్ఞత నే నెట్లు

నివేదింపఁ గలను. నీయాలుబిడ్డ లపారశ్రీవిలసితు లగుదురుగాక!

[నిష్క్రమింతురు.]

నారదుఁడు

కుచేలా, ధన్యాత్ముఁడవు! శ్రీనివాసుని హృదయరాజ్యమున నీ వేటి కభిషిక్తుఁడ వైతివో గ్రహించితిని. మర్త్యలోకము నీవలనఁ బరమ పూజ్యం బయ్యె. మహాత్మా, నీపాదధూళిఁ బ్రసాదింపుము. నాశిరమునఁ దాల్చి ధన్యాత్ముఁడ నయ్యెద.

కుచేలుఁడు

ఋషీశ్వరా, మీ రిట్లనఁ దగునా? ఈ యవాచ్యములు నే వినఁజాలను. ఈకార్యమున నా యాధిక్యమేమి కలదు? శ్రీకృష్ణుని కృపాతిరేకమున నీరోగార్తుఁ డారోగ్యలాభము వడసెను.

నారదుఁడు

కుచేలా, నీస్వార్థరాహిత్యము, నీపరోపకారపరాయణత, నీ శ్రీకృష్ణభక్తి, యాచంద్రతారార్కము మానవచరిత్రమున స్వర్ణాక్షరముల విరాజిల్లుఁగాక!

సౌరాష్ట్రి (మోహన) రాగము - ఆదితాళము

నందనందన గోపాల జయ నవనీతచోర గోపాల
కందర్పశతకోటిసుందర సుఖకరమందహాస శ్రీగోపాల
బృందావనగోబృందఘనానంద చంద్రానన శ్రీగోపాల
లీలామానుష బాలకవేష బలానుజవిగ్రహ గోపాల
మురళీధర మునిబృందవిచింతిత ముక్తజనాశ్రయ [గోపాల.

[నిష్క్రమించును]

కుచేలుఁడు

చాల వేళ యైనది. వామాక్షి నాకై యెదురు చూచుచుండును. శీఘ్రగతిఁ బోయెదనుగాక.

[నిష్క్రమించును]

దృశ్యము 3౮

[సరోవరతీరము-కుండ చంకఁ బెట్టుకొని చింతాకులభావమున వామాక్షి ప్రవేశించును]

వామాక్షి

ఈ దగ్ధజీవనమున నిం కేమిప్రయోజన మున్నది? దారిద్ర్యదుఃఖము దుర్భరము. ఈ దుఃఖయోగమున నాస్వామిని దూరభూముల కంపితిని. నట్టింట కరుదెంచిన దీనురాలికిఁ బట్టెఁడన్నముఁ బెట్టలేనైతిని. కడుపుతీపి చంపుకొని బిడ్డలగోడు సహించితిని. నిర్లజ్జజీవనమునకు నోచుకొనిన నా కింకేమి సుఖ మున్నది? ఓ సరోవరలక్ష్మి, నీగర్భక్రోడమున నా కాశ్రయ మిమ్ము. (కుండ గట్టుపైఁ బెట్టి, సరోవరసోపానములు దిగుచు,) ఆహా! హృదయేశ్వరుని పాదపద్మములు కడసారి చూచుభాగ్యము లేకపోయె! ఓకృష్ణా, దీనురాలను! నాతప్పు సైరింపుము. మఱియొక జన్మమున నావిభుని పాదదాసి నై జన్మించెదను గాక! సురక్షితముగా నాతని నిల్లుఁ జేర్పుము తండ్రీ!— నాథా, నా యవివేకమును మన్నింపుఁడు. తల్లి లేనిబిడ్డల నాదరింపుడు! (సోపానములు డిగ్గి) ఆహా! చావ నెంచిన వానికి సముద్రము మోకాలు బంటి యని పెద్దలు వచింతురు. ఆ యార్యోక్తి నాయందు సార్థకం బయ్యె.

ఇంతదనుక ప్రళయపయోదమువలె సజల మైన పుష్కరిణి, శుష్కీభూత మయ్యె నెట్లు? ఇదియును నా యభాగ్యమే. నా మనోభీష్ట మొక్కటియుఁ జేకూరదయ్యె; కడకు మర ణింతమన్నను, నదియు ఘటింపదయ్యె. (చం ద్రోదయమగుటఁ గాంచి) అయ్యో! ఆత్మ హత్య కననుకూలముగా నంధకారము విరిసి యుండెను. ఈ వెన్నెలవెల్లువలో మునిఁగి ధరణి శోభారాణివలెఁ బ్రసన్నతవహించినది. ఇది చంద్రాతపమా; లేక నా కర్మదశయా?

[కావడితో బాలకవేషధారి శ్రీకృష్ణుఁడు ప్రవేశించును]

కృష్ణుఁడు

ఈచిట్టచీఁకటిలో—ఒంటరిగా—చెఱువుగట్టు మీఁద—చాల బాగున్నది! నీ వెవరింటి కోడల వమ్మా!

వామాక్షి

(స్వ.) నాయదృష్ట మిట్లున్నది. ఈ బాలుని దృష్టిలోఁ బడితిని; నా యీసాహస మీతఁడు జగద్విఖ్యాతము గావించును.

కృష్ణుఁడు

ఊరకుంటి వేల? బుగ్గమీఁద చేయి పెట్టుకొని మాటిమాటికి నీటివైపుఁ జూచుచుంటి వేటికి?

వామాక్షి

ఎట్టి యాశ్చర్య మిది?

కృష్ణుఁడు

ఏది?

వామాక్షి

మ రేమియును లేదు, నాయనా; చిన్నవాఁడవు నీ కీగొడవ యేల?

కృష్ణుఁడు

చెప్పవమ్మా, నిన్నుఁ జూచిన మాయమ్మ జ్ఞాపకము వచ్చుచున్నది.

వామాక్షి

చావ నెంచినవానికి సముద్రము మోఁకాలు బంటి యని పెద్దలు పల్కుదురు. ఆమాటయే భావించుచుంటిని.

కృష్ణుఁడు

తల్లీ, ఇం దాశ్చర్య మే మున్నది? నిర్భా గ్యుల సంస్పర్శనమున మహాసముద్రములు కూడ నెండిపోవును.

వామాక్షి

(స్వ.) ఈబాలకుని విన్నాణము హృదయాహ్లా దకరముగా నున్నది. వీని యమృతస్వరము నాదుఃఖమును హరింపఁజేయుచున్నది. వీని మధుమయరూపముఁ జూచినకొలఁది నా నేత్ర ముల నమృతాంజనముఁ బెట్టినటు లున్నది. (ప్రకాశముగా) నాయనా! నీకోమలభుజమున నింతబరు వెట్లు మోయుచుంటివి?

కృష్ణుఁడు

అమ్మా, న న్నేమి చేయుమందువు? ఇదియే నాయుద్యోగము. బరువులు మోసి మోసి బ్రతుకుచున్నాను.

వామాక్షి

ఆమాట మెవరిది? ఏమారి కరుగుచున్నావు?

కృష్ణుఁడు

ఈమూట యొక బ్రాహ్మణునిది అదిగో, చూపు మేరలో నున్న యానగరమే నాగమ్యస్థానము.

వామాక్షి

ఆబ్రాహ్మణుని పే రేమి?

కృష్ణుఁడు

కుచేలుఁడు.—అమ్మా, ఆతని యి ల్లేవీథిలో నున్నదో నీ వెఱుంగుదువా?

వామాక్షి

ఏ మంటివి, ఏ మంటివి! నిన్నుఁ బంపిన వా రెవరు ?

కృష్ణుఁడు

కుచేలుఁడు. ఏ మట్లు భయపడియెదవు? అమ్మా, నీ కాతఁడు దగ్గరచుట్టమా?

వామాక్షి

ఆమహాత్ముఁ డిందు వచ్చునా? ఇం కెంత దూరమున నున్నవాఁడు? ఆతని కెట్టియాపదయును గలుగలేదు కదా? ద్వారకనుండియే వచ్చుచుంటిరా? ఇం కెంత సేపటి కరుదెంచును? మార్గము నిష్కంటకమే కద? మృగపన్నగబాధలు కలుగవు కదా? నాయనా, నవ్వుచుంటి వేమి? నాప్రాణేశ్వరుఁడు సురక్షితముగా నింతలో నిలు సేరునా ?

కృష్ణుఁడు

ఇన్ని ప్రశ్నలకు నే నెట్లు సదుత్తర మొసంగఁగలను ? అబ్బా! కావడి యెంత బరువుగా నున్నది!

వామాక్షి

అయ్యో! పథశ్రమమున నీవు చాల వాడిపోయితివి. బాలకా, చెఱియొకమూట తల నిడుకొని త్రోవ నడచిపోదము.

కృష్ణుఁడు

ఊరిముందర పరుగులా? బరువులు మోసి మోసి నామూఁపు కాయలు కాసినది. రెండడుగు లెట్లో వేసెదను. ఇల్లు చేరుకొనఁగలము.

వామాక్షి

అట్లయిన నాయనా, నడువుము.

(స్వ.) ఆహా! శుష్కీభూతమైన పుష్కరిణి నిష్కళంక జలప్రపూర్ణమై నయనానందకరముగా నున్నది. ఎంతలో నెంతటిమార్పు! హా! కృష్ణా! నీలీలానాటకరహస్యము నెవ్వరు పోల్చుకొనఁగలరు! దయామయా! హతభాగ్యను, నే స్పర్శించినమాత్రమున జలాశయమున నీరంతయు నింకిపోయెను. నాకన్నీ రేల యింకిపోదు!

కృష్ణుఁడు

అమ్మా, నడువుమని చెప్పి నిలిచిపోయితి వేమి ? ఇంటికి వచ్చుట కిష్టము లేదా? ఈ మూటలో లేనిపదార్థములు లేవు.

వామాక్షి

ఏ మంటివి ? లేనిపదార్థము లె ట్లుండును!

కృష్ణుఁడు

గ్రామ్యబాలుఁడను. మాటలపొందిక నాకుఁ

దెలియదు. ఈమాటలో బ్రహ్మాండ మంతయు నున్నది.

వామాక్షి

(స్వ.) బాలుఁడు వెఱ్ఱివాఁడా? లేక నాతో హాస్యమాడుచున్న వాఁడా?

(ప్రకాశముగా) నాయనా, పదపద.

(స్వ.) ఆమెను నట్టింట నొంటిగా విడిచి వచ్చితిని. నా యీ యలౌకికవ్యాపారమున కామె యెంతగా నొచ్చుకొనుచుండునో! (నీళ్లు ముంచుకొని)

(ప్రకాశముగా) బాలకా, నడువ్రుము. ఆజొన్న చేలకావల త్రోవయున్నది. ఈ వెన్నెలవెలుఁగులో మనము అనాయాసముగా నిల్లు చేరుకొనఁగలము.

[నిష్క్రమింతురు.]

---

పంచమాంకము

దృశ్యము. ౧

కుచేలుని యావాసభూమి

[ప్రవేశము-కుచేలుఁడు]

కుచేలుఁడు

ఓహో! ఇదేటి వింత! నాపర్ణకుటీర మిందుఁ గానఁబడ దేమి? కడు ముద్దరాలు వామాక్షి యే మయ్యెను? ఈ సింహద్వార మెవ్వరిది? ఈప్రాంతమున మున్నెన్నఁడు నిట్టి యద్భుత నిర్మాణమును నేఁ జూచియుండలేదు. నే నిప్పుడు మాయాజాలమున బంధితుఁడనై యున్నవాఁడనా? నాచూపులో మార్పు కలిగెనా? నామస్తిష్కము చెదరిపోయెనా? నాకన్నులను నేను నమ్మఁజాలకున్నాను. అదిగో, నేను చేతులార పెంచిన మందారవల్లి! నా భక్త్యానందములతోఁ బెరిఁగిన మల్లియలివిగో, నాశాంతినికేతనము, నాపర్ణాలయ మెందు లోపించె? కృష్ణా, నన్ను వంచించితివి. బాగు బాగు! నిన్నాశ్రయించి నేను నిరాశ్రయుఁడ నైతిని! అదిగో, ఆవచ్చున దెవరు? సాలంకృతయై స్వర్గీయసౌందర్యప్రభవలెఁ గనులు మిఱుమిట్లు గొలుపుచు నిం దరుదెంచు నీమె యెవరు? అప్సరోభామినియా?

[వామాక్షి ప్రవేశించును]

కుచేలుఁడు

అబలా, నీ వెవరు?

వామాక్షి

మహారాణిని.

కుచేలుఁడు

ఇది యెవ్వరిసౌధము?

వామాక్షి

మహారాజుగారిది.

కుచేలుఁడు

ఆతఁ డెవఁడు?

(దాసి నీళ్లు తెచ్చును. వామాక్షి భర్తకాళ్లు కడిగి నీళ్లు తలపైఁ జల్లుకొనును, పైఁటతో గాళ్లు తుడుచును.)

వామాక్షి

లోనికి రండు.

కుచేలుఁడు

ఎట్టివిపరీత మిది! అబలా, నన్నంటకుము. నే నొకదరిద్రబ్రాహ్మణుఁడను; నీ వన్ననో మహారాణివి.

వామాక్షి

మహాత్మా, మీపాదదాసి నగుటచేతనే నేను మహారాణి నైతిని. నన్నింకను బోల్చుకొనలేదా? అవును, ద్వారకానగరమున నెచ్చెలి కాని చూపులోఁ జూపు లీన మైపోయిన తరువాత నన్నానవాలు పట్టఁగలరా?

కుచేలుఁడు

(స్వ.) వామాక్షిస్వరమువలె నున్నది. (పరికించి చూచి) ఈ యలంకారముల మఱుఁగున నీనిసర్గలావణ్యము గోచరింపదయ్యె. వామా, ఈ మార్పెట్లు గలిగె నీకు?

వామాక్షి

ఈపరివర్తన కారణము మీచెలికాని కనికరమే.

కుచేలుఁడు

అది యెట్లు?

వామాక్షి

నాథా, మీరు ద్వారకానగరమునుండి చాల దినములవఱకు రాకపోవుటచే నాహృదయము నిలుకడ లేని దయ్యె; నానాఁటికి దైన్యము హెచ్చె. నిన్న రాతిరి సన్న్యాసిని యొకతె మనకుటీరమున కరుదెంచి తల దాఁచుకొనఁ జోటడిగెను. పదపడి పిడికెఁటడుకులు గోరెను. ఇంటఁ బట్టెఁ డన్నము లేదు; పిడికెఁడు గింజలు లేవు. ఆమెను నిరాకరింపలేక, నీళ్లకుఁబోవు నెపమునఁ జెఱువుగట్టుఁ జేరితిని. నీటిలోఁబడి ప్రాణత్యాగము సేయ సంకల్పించితిని. అంతలోఁ జెఱు వెండిపోయెను. ఆ యద్భుతమును దిలకించుచు, నా కపాలమును నిందించుకొనుచు, నే నచ్చటనే నిలిచియుంటిని. వెన్నెల వెలుఁగు లోకమును ముంచివేసెను. అత్తఱి నొక బాలుఁడు, నీలనీరదగాత్రుఁడు, కావడి బుజమునఁ గీలించి నా యెట్టయెదుట సాక్షాత్కరించెను. మీపంపున వచ్చితిననియు, నింటికి దారి చూపుమనియు నన్నుఁ గోరెను. వానితోఁ గుటీరమార్గమున నడచితిని. వచ్చి చూచునరికి కుటీరము లేదు. ఈ రాజసౌధము దృగ్గోచరమయ్యెను. నాథా, ఏమని చెప్పుదును! ఆబాలుఁడే శ్రీకృష్ణుఁడు; ఆసన్న్యాసినియే రుక్మిణీదేవి!

కుచేలుఁడు

ఏ మనుచుంటివి, వామా? ఇది నిజమా, స్వప్నమా? వామా, నీవు సామాన్యురాలవు గావు. నీప్రజ్ఞ యసామాన్యము! నీభక్తివిశ్వాసములవలన నీ దీనకుటీరము ధన్యకైలాస మైనది! నిజముగా నీవంటిధన్యురాలు ముల్లోకముల వెదకినను గానరాదు. ఏ శ్రీకృష్ణుని దర్శనార్థము దుర్గమారణ్యపథములు, గడచి, పలుకష్టముల కోర్చి, ద్వారకానగరమున కరిగితినో, యాశ్రీకృష్ణుని నీవు నీప్రేమపాశమున, నీ భక్తిసూత్రమున బంధించి నీ సమక్షమునకు నాకర్షించితివి! నీజన్మము ధన్యంబయ్యె; నిన్నుఁ గన్న తల్లిదండ్రులు ధన్యులైరి; నీచేయి పట్టి నేఁగూడ ధన్యుండ నైతిని.

వామాక్షి

నాథా, లోనికి రండు. మీభక్తివలన నేను జరితార్థురాల నైతిని.

కుచేలుఁడు

వామా, ఈరాజభోగవిలాసము నీకొఱకు నిర్దేశింపఁబడినది. నే నాగర్భదరిద్రుఁడను. అక్షయ భిక్షాపాత్రధారణమే నాజీవనసర్వస్వము. ఈ రాజసౌధప్రవేశమున నా కేమిప్రయోజన మున్నది. నీవు దేని కాసించితి వాయఖండశ్రీ వడసితివి. నీహృదయపూర్వకముగా ననుభవింపుము. నేను గహనభూముల కరిగి నాచింతామణిని స్మరించుకొనుచుఁ గాలయాపన మొనరించెదను.

వామాక్షి

నేను మీసహధర్మచారిణిని గానా ? మీరు లేకున్న నీరాజసౌధము నాకు గహనభూమి వలె స్ఫురింపదా ?

కుచేలుఁడు

కృష్ణా, ఆత్మీయసఖుఁడవని త్రికరణశుద్ధిగా నమ్మినందుకా నన్ను మోసగించితివి?

వామాక్షి

ఏ మాయెను ? నిందాతీతుఁడగు వానిని నిందింతు రేల ?

కుచేలుఁడు

వామా, నేను సిరిసంపదలతో జన్మింపలేదు. ఈ చంచలసంపదలో శాంతిసుఖము లేదు; దయాధర్మము లేదు. నాభిక్షాపాత్ర యక్షయ సుఖప్రసాదిని; అనంతశాంతిసంపాదిని. ఈక్షణభంగురసంపద నే నెన్నఁడును శ్రీకృష్ణు నర్థింప లేదు.

వామాక్షి

నిజము, మీ రర్థింపలేదు; నేను మనసార నర్థించితిని. పిల్లలగోడు చూడలేక, మీ దైన్యవ్రతమును దిలకింపలేక, వికలమతి నై నేనే సంపద లర్థించితిని.

కుచేలుఁడు

వామా, ఆచతురుఁ డెం దున్నవాఁడు? ఆతని సమక్షమునకు దారి చూపుము.

వామాక్షి

ఆ యాదిదంపతులు శుద్ధాంతమున నున్నవారలు; రండు, లోనికిఁ బోవుదము

[నిష్క్రమింతురు.]

దృశ్యము ౨

కుచేలుని సౌధశుద్ధాంతము

[ప్రవేశము - శ్రీకృష్ణుఁడు, రుక్మిణి, నారదుఁడు]

కృష్ణుఁడు

నారదా, చూచితివా! సంసారి యయ్యు నీ బ్రాహ్మణోత్తముఁడు భక్తిమార్గమున నన్నెట్లు వశీభూతు నొనరించెనో ?

నారదుఁడు

ప్రభూ, కన్నులారఁ జూచితిని; మనసార గ్రహించితిని. నా నేత్రములు, నాహృదయము పరమపవిత్రము లయ్యె.

కృష్ణుఁడు

నారదా, భక్తుఁడే నాదైవము. నా లీలానాటకమున నుపయుక్తపాత్రలు వామాక్షి కుచేలురు; వీ రిరువురే జగంబున నాదర్శభక్తులు!

[వామాక్షీ కుచేలురు ప్రవేశింతురు]

కుచేలుఁడు

కృష్ణా, దయామయా! ఈ నిష్ఠురభావము నీకుఁ దగునా? నిన్ను నమ్మినందుకా నన్ను వంచించితివి?

కృష్ణుఁడు

సఖా, ఏ మయ్యెను?

కుచేలుఁడు

నామనసులో మాట నీకుఁ దెలియదా? ఈ నాగపాశమున నన్నేల బంధించితివి? నే నెన్నఁడును నర్థింపని యీవిభవము నా కేల ప్రసాదించితివి? నీ సాంగత్యమే నాస్వర్గీయ సంపద; నీస్మరణానందమే నాము_క్తిమార్గము; నీ సాక్షాత్కారమే నా జన్మసాఫల్యము. తుచ్ఛభోగము లొసంగి నన్ననంతానంద పదవినుండి తొలఁగింప నెంచితివా?

కృష్ణుఁడు

నే నట్టి యాశయముతో నీ కీవిభవము లొసంగలేదు.

కుచేలుఁడు

నాజీవనమార్గమునఁ గంటక సదృశంబైన యీ సంపద నాకు బాధాజనకము. కృష్ణా, నిన్ను వేఁడుకొందును; నామార్గమును నిష్కంటక మొనరింపుము.

రుక్మిణి

బ్రాహ్మణోత్తమా, భ_క్తవరిష్ఠుండ వై వైకుంఠమున కధికారి వైతివి. ఈ నిస్సారసంపదలు నిన్నేమి చేయఁ గలవు?—పతివ్రతాతిలకమా, అభిమానమున మఱల జలాశయమున మునుఁగ నెంచెదవా?

వామాక్షి

లోకమాతా, మునుఁగ వాంఛింతును; గాని జలాశయమునఁ గాదు, నీ ప్రేమసాగరమున.

కృష్ణుఁడు

కుచేలా, నీవు దుఃఖింపకుము. నీ దుఃఖవిమోచన మొనరింప నెంచి నీ కీయతుల సంపద లొసంగితిని. సంపద సత్పాత్రల వశంబున నున్నచో నశాంతి దాయకము గానేరదు. ఈ ధనయోగమున నీవు జగత్కల్యాణ సాధన మొనరింపఁగలవు.

కుచేలుఁడు

కృష్ణా, నీవు దరిద్రకుచేలుని సఖుడవు. వామా, నీవు చెప్పుము; ఈప్రభు వెవ్వని సఖుఁడు? పేదవాని నెచ్చెలికాఁడా? లేక ధనవంతుని సంగఁడీఁడా? పేదవాని మర్యాదకు మేర లేదు. పేదవార మగుటచేత నే కదా యీ జగత్పిత, యీ లోకమాత మనయింటి కరుదెంచిరి! దీనుల మగుటం జేసి కదా దీన బాంధవులు, రుక్మిణీ శ్రీకృష్ణులు, మన కన్నీరు దుడువ మనయింటికి వచ్చిరి! తెలిసినదా, వామా, మనసంపద యేదియో తెలిసినదా? ఈ తల్లి, యీ తండ్రి వీరే మన త్రిభువనాధిపత్యము! వీరికంటె మన కొండుధనము లేదు.

వామాక్షి

(రుక్మిణీ కృష్ణుని పాదములపైఁబడి) అజ్ఞానాంధ

కారమున నేను నిజానిజంబు లెఱుంగనైతిని. లోకపితా, లోకమాతా, నన్ను మన్నింపుఁడు.

రుక్మిణి

అమ్మా, నీవు దుఃఖింపకుము. (లేవ నెత్తి) ఈసంపదలు మిమ్ము వంచింపఁజాలవు. (సింహాసనమునఁ గూర్చుండఁబెట్టును.)

కృష్ణుఁడు

(కుచేలుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి) కుచేలా, ఈధనమున నీవు పేదవారలకు సహాయ మొనరింపఁగలవు. శతశతదరిద్రకుటుంబములు నీయాశ్రయమున సుఖింపఁగలవు.

కుచేలుఁడు

సరియె, ప్రభూ, నీవు ప్రసాదించిన యీ యక్షయసంపదలు నిరాశ్రయులకు, నిత్యదరిద్రులకు, వికలాంగులకుఁ బ్రదానముఁ గావించితిని. తొల్లిటివలె నేను నీనామామృతపానమున స్వస్థచిత్తుండ నయ్యెదను.

కృష్ణుఁడు

నీయౌదార్య మసామాన్యము! కుచేలా, త్రిభువనముల నీకు నీవేసాటి! నేటినుండి యీ యవంతీనగరము పుణ్యతీర్థ మగునుగాక!

నారదుఁడు

ధన్యుఁడవు, మాన్యుఁడవు. కుచేలా, ధన్యము నీ శ్రీకృష్ణభక్తి!

నందసునందాదివందితచరణారవింద మహోన్నత గోపాల,
బాధితరిపుబృంద బోధగసానంద సాధితజగదండ గోపాల,
గోపీమన్మథ గోపరిపాలక గోవర్ధనోద్ధర గోపాల,
రాసమండలనట దాసజనావన వాసవాదినుత గోపాల!

(తెరపడును)

సంపూర్ణము

---

# సవరణ

కడచిన సంచికయందు ప్రకటించిన 'రామాయణము' అను వ్యాసమునకు మూలము ౧౯౨౩ సం. డిసంబరున రచింపబడినది కాదు. ౧౯౦౩ సం. డిసంబరులో రచింపబడినది.

—బె. గో.

# ఆత్మార్పణము

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

భారతికిం గవిజనర - క్షారతికిం గేలుమోడ్చి కబ్బ మొకండేఁ
గూరుతు "నాత్మార్పణ" మన - సారమతిం దీని నరసి చదువుఁడు మిత్రుల్.

అక్కటికంబులేని కలుషాత్ముఁ డొకానొక బోయవాఁడు పెం
పెక్కిన కాననంబులకు నేగి ఖగంబుల కుచ్చులొడ్డి చేఁ
జిక్కినవానిఁ గొన్నిటి భుజించుచుఁ గొన్నిటి విక్రయించుచున్
బెక్కుదినంబు లిట్లు గడపెన్ దనజీవిత మొక్కపల్లియన్.

ఆతఁ డొకవేకువం గృ - ష్ణాతట కాంతారములకుఁ జనియెన్ మృగయా
కౌతూహల మలర ధను - శ్శాతాశుగ వాగురాది సాధనుఁ డగుచున్.

ఇట్లతండు వేఁటకుం జని యయ్యరణ్య మధ్యంబున.

బిగువు టుండలగుండె లగలించి జిగిమించు కొక్కెర లొక్కన్నింటి నుక్కడంచె
మొఱకుఁ గోలలు గాత్రముల నుచ్చి పోనేసి కొన్ని సాళ్వంబులఁ గూలఁద్రోసె
చెట్లఁబుట్టల రావి జిగురుగండెలఁ బన్ని కొన్ని గోర్వంకల మన్నిగొనియె
కడఁగి యందందు నూకలఁజల్లి వలలొడ్డి పావురాల్ గొన్నింటిఁ బట్టికొనియె
జంగుపిల్లులఁ గుందేళ్ల ముంగిసలఁ గు-ళింగములఁ బట్టెఁ గొన్నింటిఁ జెంగలించి
వేఱ వర్ణింపనేల యవ్వేళఁ బ్రళయ-కాల సంప్రాప్తియయ్యె నగ్గహనమునకు.

అయ్యవసరంబున.

ఈ పరమ కలుషహింసా-వ్యాపారం బంతకంత కగ్గలమగుడున్
గోపించె నన నహస్కరుఁ-డేపున నడిమింట మండుటెండలఁ గాసెన్.

అఖిల సత్త్వశరణ్యా మా నయ్యరణ్య - మట్టుడికి నట్టులుడికెఁ జండాతపాగ్నిఁ
గడచె నొక రెండుగడియలకాల మిట్లు - పీచు పీచు మబ్బులు మింట లేచువఱకు.

తగవరి సిరికైవడి న - మ్మొగుళు లొగిం బెరిగి గగనమున నెల్లెడలన్
నెగడుడుఁ జల్లనితెమ్మెర - నిగిడె నడఁగె నుమ్మదంబు నిముసములోనన్.

అంత సముద్ధాంతమగుభంగిఁ గల్పాంతతీవ్ర వాయువనంగ దిక్కదంబ
మల్లాడ గిరులు కంపిల్లఁ బెల్లుగ రేఁగి పెనుగాలి సాగెఁ దద్భీకరార్భ
టికి నయ్యడవినున్న సకలమృగంబులు ఖగములు నెంతయుం గలఁగి చెదరె
ఘళఘళధ్వనుల మ్రాఁకులుగూలె ఝాంపముల్ గూలఁబారె రోదసీకుహరమెల్ల
ధూళితోనిండె నిటుసముద్ధూతవివిధ- జంతుసంతానమును భయాశ్రయమనఁగుచుఁ
గొంతకాలంబు విసరివిశ్రాంతిసెందెఁ- జండవాతంబు భూతముల్ సన్నుతింప.

గాలియడంగ మేఘము లఖండగతిం జెలరేఁగి గర్జితా
భీలములై తటిల్లత లభిన్నములై తులకింపఁ బిడ్గుల్గ్రా
రాలుచునుండ దిగ్గజకరంబు లనందగు వారిధారలు
ద్వేలములై యెసంగ నటవిం గురిసెన్ జడివాన జోరునన్.

అదిపల్ల మిదిమిట్ట యను విభేదము లేక యడవివెల్లువనీట నడఁగిపోయె
తొలుతఁగూలినవృక్షములు నీడ్చికొనుచుఁ బర్వెత్తె వాఁగులు గట్లనొత్తికొనుచు
చటులధారాపాత సంపీడితాంగంబు లగుట గొన్ని పులుంగు లంతరించె
చిలువమన్నీలు కోమలవీడి గుమిగూడి వేడుకమై జలక్రీడ లాడె
కొండకోనలలోఁ దరుకోటరముల- నురునికుంజంబుల మృగంబు లొదిఁగియుండె
గడగడవడంకఁ జలిగాలి కసరివిసరె- నబ్జబాంధవుఁ డింతలో నస్తమించె.

దుర్గమారణ్య, మదిగాక దుర్దినంబు- వెండియుఁ జడివాన, పైపెచ్చు మాస
నల్లవో! యేమనందు నానాఁటి రేయి- కాటఁగ్రమ్మిన చిమ్మచీఁకటుల పేర్మి

అత్తఱి నక్కఱకు బెదురు దొర వెఱపుఁ గొలుపునక్కాననం గాంచి యుల్లంబు తల్ల
డిల్ల వదనంబు పల్లటిల్ల నెద్దియుం దోఁపక రాపడి నిలుచుండి;

అక్కట యేమిసేయుదు? మహాగహనం బిది కాఱుఁ జీఁకటుల్
నెక్కొనె, శీతవాతములు నిండె, శరీరము గొంకుపోయె, నీ
దిక్కెదియుం జెఱుంగఁ గలతెన్ను గనం బడదయ్యె; వర్షముల్
నిక్కచునుండె, వెల్లువలు నెట్టుకొనెం మది కెద్దిమూడునో.

నేఁడు వఱువాత నెవ్వని- పాడుమొగము నాదు కంటఁ- బడెనో; యిట్టు ల
ల్లాడుగతి- పట్టె నసువుల- తోఁడ నాపీడ లెల్లఁ- దొలఁగునె తలఁపన్?



3. సామర్లకోటకు వచ్చుచున్న సామానుబండి పట్టాలనుండి తొలగగా
నీటిలో రెండుపెట్టెలు బోరగిలిపడినవి



౪. అనకాపల్లి చేరువను వరదలవలన ...

ఇదియ జగమందు నాకుం-దుదినిముసమ్మనుచు మదికిఁ దోఁచెడిఁ గాదే
నెదిరించునె యింతటియా-పదలు ననుం జుట్టుముట్టి బంధురభంగిన్ ?

ఇచ్చవచ్చినపుల్గు వ్రచ్చివెచ్చనిపచ్చి పొలసుమెక్కెడుగీత తొలఁగునొక్కొ
జిడ్డుఁదేనెలనూరు జీడిమామిడిపప్పు నారగించు నదృష్ట మాఱునొక్కొ
చవులూరఁ జేయు కల్సారాలఁ దెగఁద్రావి మత్తిల్లు భోగంబు మడఁగునొక్కొ
నెక్కొన్నకూర్మి నానిసువుపజ్జకుఁ జేరి ముద్దాడు భాగ్యంబు ముగియునొక్కొ
బంగరుంబొమ్మఁ బోని నాసింగి బిగువు-కౌఁగిటంజిక్కు సుగములకడలిఁదోఁగు
పండువెన్నెలఁ రే లింక నుండవొక్కొ-నేఁటితో నాకు నూఱేండ్లు నిండునొక్కొ!

బోయం డార్తుఁడు రక్షణీయుఁడని సంపూర్ణానురాగంబుమై
నాయీయాపదఁ బాపు పుణ్యుఁ డెవఁ డున్నాఁ? డిప్డు డిచ్చోట నేఁ
జేయంగల్గిన కార్య మెయ్యది? యిఁకన్ జీవించు టేలాగు? నా
యాయుర్దాయము నాహరించుటకు నీవాసించితే దుర్విధీ!

నాకనుదోయిముందు మరణంబును గాంచిరి పెక్కు-రే నసం
ఖ్యాకవిహంగ రాజములఁ గాఱియ వెట్టితిఁ జేతులార నే
శోకము నప్డులే, దిపుడు చొప్పడు నాదగు చావటన్న ని
య్యాకులపా టదేటి; కదిరా బ్రదుకెంతయుఁ దియ్యమౌఁగదా.

వనికేఁగితినుటకై వలయు నంజుళ్ల నింతకుమున్నపోలె మధ్యాహ్నమునక
తెచ్చెద నేనంచు నచ్చి నాదగురాక కెదురుసూచుచు నాకుటింటిముందు
నిలచి యెంతకు రామి నిస్పృహఁజెంది నన్నేపాము కఱచెనో, యేమెకంబు
విఱచెనో యంచు భావించి నేఁ డెన్నిభంగుల నేడ్చుచున్నదో కోమలాంగి
పేర్మినల్లారుముద్దుగాఁ బెంచుచున్న-పిల్ల లిపు డెంతగా దురపిల్లుచుండ్రొ?
ఎవరిగతి వారిదే యఁటం చెఱుఁగగల్గు-పెద్దలాడెడిపల్కు నిబద్ధియయ్యె.

కట్టదయనేది యీపాడుపొట్టకొఱకు-నింతవఱ కెన్నిపుల్గుల నేసిచంపి
జంట లెన్నింటి నేడ్పించి యుంటినొక్కొ-కట్టికుడువంగవల దె తత్కలుషఫలము!

అని పెక్కులగు తెఱంగుల-వనరుచుఁ దానుండఁ గొంతనడి కజ్జడి మె
ల్లనఁ దగ్గఱ జలదంబుల-పెనుపత్తె, గాఢాంధకారభీకర మహఁగ్రేఁ.

అంత నజ్జడిపోకకుం గిరాతుం డొకింత సంతసించియు వ్రేకనయగు నీఁదురుత్సాకునకు లొంగి యంగంబు లెల్ల వడంక నింక నేమిసేయుదునని పనవి నలుదెసలకుం జూడ్కు లు నిగిడించి చేరువమిట్టనేల నింగిముట్టి దట్టంపుగుబురులం గ్రిక్కిఱిసి పక్షి మొత్తం బులకెల్ల నిక్కమై యలరు నొక్క మఱ్ఱిమ్రాఁకుంగని దానిచాటునం గొఱకేయి గడప నెంచి తాఁబట్టిన పిట్టల నట్టాడువలం దులకించు గనయంబుం బిల్లగుబ్బలియన నుబ్బి యబ్బురంబుఁగొల్పు దాపటి మూఁపునం గీలించి మెల్ల మెల్లన వెల్లువఁ గడవ నడచియత్త రువుందరిసి తన్మూలంబునంగల కటికిఱా బండపైఁ దనమేనువైచి యేచిన భయంబున.

దిక్కుమాలినబోయ దీనతం బాపరే వనదేవతాచక్రవర్తులార,
నిండారుకూర్మి మన్నించి రక్షింపరే చటులకాంతార వృక్షంబులార,
పగవాఁడనని తలంపక కూర్మిఁ జూపరే సాధువిహంగరాజంబులార,
ఆపన్నుఁడను గాన లోపముల్ మఱవరే భల్లాదిమృగకదంబంబు లార
నీతు విదలించుచుండె హెచ్చెను బుభుక్ష-యసువులేనింట మూఁడునాళ్లగిగెఁ దొలఁగి
దుర్భరపుమృత్యు ముఖమున దూరియుంటి-నెట్లురక్షింతురో మీర లిపుడు నన్ను.

అని పులుంగుదిండి యెలుంగురాల్పడ వేఁడివేఁడి కన్నీరు మున్నీరుగాఁ గాఱ వగల సెగలం బొగులుచుఁ బరుషపాషాణ పర్యంకంబున నొత్తగిల్లి యుండె నత్తఱిఁ దడవులం బట్టి యమ్మఱ్ఱితొఱ్ఱఁ గాలంబు పుచ్చుపావురంబొండు వఱువాత నెరకొఱ కరిగిన తనపరు వంపుటిల్లా లెంతకుం గూడు సేరమి నరసి వెఱతఱచునఁ బరిపరి విధంబులఁ బొరింబొరి దురపిల్లుచుఁ బల్లంబులకు డిగువెల్లువ నీటిజాళుల నుప్పతిల్లు "జలజల" మను చప్పుళ్లతో మేళగించి మ్రోళులు చిగుర్ప దుర్భరవియోగగీతంబులం బాడుచు నిట్లు విలపించె.

వేకువ లేచి నా కెఱఁగి వేడుకమై హృదయేశ, యిష్ట నా
యాఁకటి చిచ్చువార్పుకొన నయ్యయి తావులకుం గమించి నీ
శ్రీకర పాదపంకరుహ సేవకు వత్తునటంచు నేఁగి నీ
వేకడ నుంటివో తరుణి, యింతకుఁ గన్పడవైతి వక్కటా!

అర్ధాంగి, నాహృదయం బెఱుంగఁ దలంచి సురిఁగి యుంటివె వనాంతరమునందు?
వనిత, ని న్నెడసి యుండిననిమేషంబు నా కొక్కయుగంబుగఁ దోఁచుచుండుఁ గాదె?
కలికి, నిన్నీ రేయి గాటంపుటడవి నే పొదరింటఁ గలవంచు వెదక నేర్తు?
తరుణి, నాయీయవస్థ నొకింత గన్న నీహృదయంబు చిదురలై చెదరకున్నె?

గరిత, రాచిల్క లేని పంజరముకరణి-నుండె మనగూడు నీవు లేకున్కి నిపుడు
తెలివ, నీతోడులేని నాదేహయాత్ర-జగతి నొక్కనిమేషంబు సాగఁగలదె?

కడ లేని సీతు వెంతయు-వడఁకింపఁ దొడంగె వేగ వచ్చి నను న్నీ
పొడవారు గఱులఁ గప్పుము-పడఁతీ, నాచింత లెల్లఁ బాయును దానన్.

కలదే ప్రాణము నీశరీరమున నోకాంతాలలామంబ, యే
వలలోనం బడి యుంటివో? క్రొదమసాళ్వం బెద్యుటం జిక్కితో?
చెలి, ఝుంఝూహతికిన్ గఱుల్ విఱుగుటన్ జీవంబులం బాసితో?
ప్రళయాభీలవిశాలమేఘ కరకాపాతంబులం గూలితో?

ఉవిదరో, నీవు జీవించి యుంటివేని-యేల రాకుందు వింటికి నింతదాఁక
లేవు గాఁబోలు జగతిలో నీవు బ్రతికి-రావు గాఁబోలు నింకఁ గోటరంపుదెసకు.

ఆలుమగలఁ జేర్చి యాడించి వెండియుఁ-జీలఁ దీయుచుండెఁ గాలపురుషుఁ
డబల, దీనిడెంద మది యేగతి న్నిల్పెఁ-గనికరంబుపొంతఁ గఱకుఁదనము.

సకలదుఃఖరోగ సంపీడితున కింతి-యౌషధం బటన్న నబ్బురంబె?
ఉవిద, నిన్నుఁ గూడి యున్నంతవఱకు నే-యాపదల నెఱుంగఁ డయ్యె నితఁడు.

శబ్దార్థములభంగిఁ జంద్రికాచంద్రుల ట్లన్యోన్యమైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబుఁ గన్గొన మాలవిధి కెంత కన్ను గుట్టెనో జగత్కంటకునకు?
అడవిమేఁతల మేసి పడియనీళులఁ ద్రావి పరులసొమ్ముల కాసపడక యొగుల
కొకకీడుఁ జేఁతయు నొనరింపక మెలంగు మనజీవితము దైవమున కదెంత
భార మయ్యెనో? పాపంబు పండె నిట్లు-విధివిధానంబు నెదిరించువిధము గలదె?
కటకటా, నేఁటి కెట్టిసంకటము వచ్చె-నెట్లు దీని భరింతు; దిక్కెవ్వ రబల?

అరలేని కూర్మి పేర్మిం-బారపొచ్చెము లేనిడెందముం జూపి ననుం
గరము నలరించితిఁగదా-గరితా, ని న్నెట్లు మఱవఁ గలవాఁడ నింకన్.

నీమందస్మిత సుందరాస్యకలమున్ నీ నిగ్గులన్ జగ్గులన్
నీ మైమవ్వము నీకనుంగవపసన్ నీ నెన్నడల్ సొంపులన్

నీ మర్యాదల నీ మృదూక్తులను నీ నెయ్యంబు నీ తియ్యముల్
భామా, నే నెటు విస్మరింతుఁ జెపుమా ప్రాణంబుతో నుండఁగన్.

సకియా, మాపటివేళ ని న్గలసి కృష్ణావీచికాశీకర
ప్రకరప్లావిత నవ్యదివ్యసికతాభాగంబులం జేరి వా
తకుమారంబులు గంధబంధురము లాత్మప్రీతిఁ గావింప వే
డుకమై గొండిలి సల్పునే సయిచు లెట్టూ? నీవియోగవ్యథన్.

క్రొవ్విన గండుఁదుమ్మెదలకూటువ రాయిడి కోడి రాలు న
మ్మవ్వపు లేఁజిగుళ్లఁ గుసుమంబు లమర్పని సెజ్జ లై తమి
న్నివ్వటిలంగఁ జేయుతటి ని న్గవగూడి నికుంజసీమలన్
జవ్వని, కాలముం గడపు సౌఖ్యము నా కిఁక దుర్లభం బొకో!

అతివ, నీ విచ్చుమేతల నారగించి-నీమృదులపాణిపల్లవానీతపూత
సలిలముం గ్రోలి సంతోషజలధిఁ దేలు-భాగ్య మున్నదె యీమందభాగ్యున కిఁక?

కలిమిలేములలోన భాగంబుఁ గొనుచు-మంచిచెడ్డలలోనఁ బా ల్పంచుకొనుచు
మెలఁగునర్ధాంగి దూరమై తొలఁగెనేని-మగని కాధార మెవ్వరోమగువ, చెపుమ.

ఓవనిత, సకలసౌఖ్య-శ్రీవిరహిత మైనతుచ్ఛజీవిత మిఁక నే
లా? వెల్లువలోఁ బడి నా-జీవంబుల విడుతు నెల్లచింతలఁ గడతున్.

ఇట్లు బిట్టు వగచు మగపావురంబు విలాపంబు లబ్బోయవలం జిక్కి- కుములు చున్నక పోతి విని:

ధన్య నైతిని జగన్మాన్య నైతిని మహాపుణ్యా నైతిని సతీగణ్యా నైతి
నాథుఁ డస్మద్వర్తనంబు నెంతయు మెచ్చి ప్రకటించె నిర్మలప్రణయరసము
నాయీమెడాటంబునకుఁ బొరింబొరిఁ గుంది జోరున వేఁడికన్నీరు రాల్చె
మగనినెమ్మదికి నిమ్మాడ్కి- నెక్కుటయ కా కులకాంత సతతంబుఁ గోరుచుండు
నింక వలసిన దేమి? నా కీభవంబు-సార్థకతఁ జెందె దుర్గతి ప్రాప్తిదప్పె
బాపము లడంగె నోములపంట పండె-ననుచు మదిఁ బొంగి మగని కిట్లనఁ దొడంగె.

ఏల దురంతచింత నిటు లేడ్చెద వో హృదయేశ? నేఁడు దు
ష్కాలము దాపరింపఁ దొలికర్మము న న్నొకబోయవాగురన్
గూలఁ బడంగ నేయ నిటఁ గుందుచు నుంటి భవత్పదాబ్జముల్
వాలినభక్తిఁ గొల్చు విభవం బఖిలంబును గోలుపోయితిన్.

ఒచ్చెంబు నెఱుంగక మన-మిచ్చో దంపతుల మై సుఖించితి మిన్నా
ళ్లచ్చెరు వగుసంస్కృతిఁ గన-విచ్చుచు నున్నార మిప్డు విధియోగమునన్.

తాగుండెదానఁ గానన్-వాగురలోఁ జిక్కి గాలివాన కలసి నీ
యోగంబు నెడసియు నసు-త్యాగం బొనరింపనైతి ననురాగనిధీ!
ఉసురులు దొలంగ సిద్ధ మై యున్న వేళఁ-దలవనితలంపుగా భవద్దర్శనంబు
నాకుఁ గల్గించినట్టి ప్రేమైకమూర్తి-కార్తజనబాంధవునకు జోహా రొనర్తు.

ఎడ తెగక మనదాంపత్య మింతవఱకు-నెన్ని పుట్టువులం దరియించెనొక్కొ-
జీవితేశ్వర, యిది యవిచ్ఛిన్నమగుచు-నెల్లకాలంబు నిట్ల భాసిల్లుఁ గాత.

నీకొఱకు నిరీక్షించుచు-నాకమునం దేను నిరశనవ్యాపృతి నె
ట్లో కాలము గడపెద నిట-నాకొఱ కోనాథ, మనమునం గుందకుమా.

నీకనులుగార్చు వెచ్చని నీటిధార-కాల్చుచున్నది నామనఃకందరంబు
నేమి నేయుదు శోకంబు నెడసి మధుర-వాగమృతవృష్టి ననుఁ దన్పవా మనోజ్ఞ!

ఆడుంబులుఁగి ట్లను నెడఁ-గూడు న్విడనాడి వెఱఁగుఁ గొందలము నెదన్
జో డైక లంపఁ దలిరుం-బోఁడికడకుఁ బోతుపిట్ట బుఱ్ఱున వచ్చెన్.

అరుదెంచి యురులందవిలియున్న యన్నువంజూచి.

హా రమణీ, పారావత-హారమణీ, నన్ను విడచి యమరీప్రియమం
దారోద్యానవనీ సం-చారంబును గోరి వెడలఁ జను నే నీకున్?

కటకటా! నేఁటి కెట్టి దుర్ఘటనవొడమె-వనిత, యీకాలపాశంబువలన నిపుడు
నిన్ను విడపించు వెరవుగన్పింపదయ్యె-నేటితోఁదీఱునె ఋణంబు నీకు నాకు?

వీసంబును లాఁతులమెడ-దోసంబుఁ దలంపనట్టితొయ్యలి వకటా!
నీసాధుచరిత కిదిఫల-మా? సుదతీ, దైవ మెంతకైనం దగదే?

ఒకపరి నిన్నునర్థి మృగయుం డొడ్డినవాగురలోనం గూలంద్రో
యక నిను నొంటిగా వలకు నప్పన సేసి దయావిహీనతన్
బకపకనవ్వుచున్ మనవిపత్తులం గాంచుచు గేలిసేయు న
ట్టికలుషదైవ మెంత వికటీకృత దక్షు మహో! తలంపంగన్.

వలలన్న జిగురులన్నన్, దెలివిమెయిం దిరుగుచుందు తెలివా, యిపుడెం
దులకేగె నీవివేకము, కలయ న్నీకనులమబ్బు గ్రమ్మెనె చెపుమా?

గాటపుంగానం బయనించు బాటసారి-యాతపార్తిందరుచ్ఛాయ, నాశ్రయించె
వానసాగుడు నొకలోయలోనదూరెం-దుదకు నిర్ఘాతమ యడంచె బ్రదుకుటెట్లు?

ఈమహాజలరాశిలో మునింగినవేళం దెప్పవై హర్షాబ్ధిం దేల్చితిగద,
ఈగాఢతిమిరంబు మూంగిముట్టినవేళ దీపంబవై తెన్ను సూపితిగద,
ఈదారికర్దమం బెనసియుండినవేళ గోలవై నడిపింపం జాలితిగద,
ఈమహోన్నతశైల మెదురువచ్చినవేళ గగనయానంబవై కాచితిగద,
నీసహాయంబులేక నాచేసినట్టి-గట్టికర్జం బొకండేనిం గానంబడునె?
అఖిలమునకు నాధారంబవైతివీవు-వెలందీ, ని న్బాసిమెట్లు జీవింపనేర్తు.

అని చింతించు మగనింగని కపోతి వెండియు నిట్లనియె.

హృదయేశ, నిఖిలార్థవిదులువాం దగుమీర లీరీతి వగంగొన్న నేమిఫలము?
దైవనియోగంబుం దలంగ బ్రహ్మేంద్రాందులగు వేల్పుగమికైన నయితియగునె
కరకరి దైవంబు తెఱచినదుఃఖంపు వాంకిలిధైర్యకవాటమునన
మూయవలయుంగదా! బుధులుశోకహతంబు లోకంబటంచుం బల్కుదురువినవె?
ఇలమెలంగుశరీర ధారులకునెల్ల-జననమరణంబులెన్నినైసర్గికముల
కసిమసంగిన మిత్తి గండై సంగ నడంచి-యెల్లకాలంబు నొకమేన నెవ్వరుంద్రు?

జీవులను సృష్టిగావించు శిల్పిమెవండో-ప్రాణులను గూర్మిం గాపాడుభర్త యెవండో,
వాడ వెండియుం గూల్చు విశ్వంబునెల్ల-నతని కిది నిత్యలీలావిహారసరణి.

ఈలతయు నీకుజంబును-మేలుగం నొన్నాళ్లు కలసి మెలసి మరలం బె
న్గాలికి విడివడుచుండుంగదా! లోకంబెల్ల నివ్విధంబ తలంపన్.

ఆపదలుగల్గువేళఁ గట్టా! యటంచ్రు-సుఖము లొనగూడువేళ మెచ్చుకొనుచుంద్రు
కాని, యెవరేనిఁ గష్టసుఖములపట్లఁ-గడఁగి స్వాతంత్ర్యముంజూపఁ గలరె చెపుమ?

కావుననీవు నాకొఱ కిఁక న్విలపించుట నిష్ఫలంబ నా
జీవములం దపేక్ష విడి చిత్తమునం దగుశాంతిఁబూని నీ
జీవితశేషముల్ విబుధశేఖరు లెంతయుమెచ్చ ధర్మసం
సేవనబుద్ధిమైఁ గడవఁ జేయుము కోయుము మోహబంధముల్.

ఆసనడంపు మోర్మిఁగొను మార్యపథంబును ద్రొక్కు నిక్కపుం
బాసలువల్కు శాత్రవులపై నయినం బెరిమంబ నిల్పు సం
త్రాసముఁగొన్న దీనుల సదా కరుణింపు మనంబుఁ బెంపు మే
దోసము నాచరింపక బుధుల్(?) నుతిగాంచుము జీవితేశ్వరా!

శరణమఁటన్నవాఁడు నిజశాత్రవుఁడైనను వాని నెంతయుం
గరుణ దలిర్పఁ బ్రోచుటయ కర్జము నుత్తమధర్మమంచు స
త్పురుషులు వల్కుచుందు రిది బుద్ధిఁదలంచియు నిక్కరాతు నా
దరమునఁ జూడవయ్య, చలితాఁకున కెంతయుఁ దల్లడిల్లెడిన్.

మనయండఁ జేరిన విప న్ననకుం దోడ్పడెడినోము నోఁచనికతనన్
దన కిట్టులయ్యె నీవైన నీతనికి సాయపడు మ నాథుం డగుటన్.

మగఁడు నేఁడురాక మనలె నదేమొకో-దైవమా, యటంచుఁ దల్లడిల్లి
యెఱుకునింతియింట నెల్లెడ్చుచున్నదో జాలిఁగొల్పు వీనిచరిత మకట!

విను మిల్లుత్రొక్కుకొని వచ్చినయతిథికి శక్తికొలఁదిఁ జేయందగుమే
లనఘా, నిరాశతోడం-జనుటొప్పదతండు ధర్మసారం బిదిగా.

అతిథుల నభ్యాగతులన్-గుతుకంబునఁ బూజసేయు గుణ మీకర్మ
క్షితిఁ బుట్టినట్టివారికి-మతినూహింప గనవీనమా హృదయేశా!

ఆపత్సాగరవీచికాహతులచే నల్లాడి యల్లాడి ప్రా
ణాపాయంబుననున్ దలంకి శరణంబం చేడ్చెడిన్ వీఁడమో
లోపంబుల్ గణియింప కీతనిఁ గృపాలోకంబులం జూచి నీ
వాపద్బాంధవుఁడన్న కీర్తిఁ గొనవయ్యా, ఖేచరగ్రామణీ!

భేదబుద్ధివిడచి విశ్వమీశ్వరకళా-దర్పణం బఁటంచుఁ దలచి భగవ
దర్పణంబుగాఁగ నఖిలధర్మంబుల-నలుపకున్న ముక్తి కలదె చెపుమ?

దీనుల మొరలాలింపని వానిబలంబును ధనంబు వంశంబును వి
జ్ఞానంబు జీవితంబు ద-యానిధి, వ్యర్థంబులగుఁగదా పరికింపన్.

తనమానముఁ దనప్రాణముఁ-దనవిత్తముఁ దనబలంబుఁ దనసర్వస్వం
బును విశ్వశ్రేయస-మున కప్పన సేయువాఁడ ముక్తుఁడు సుమతీ!

లోకంబ నేను నేనే-లోకంబ నఁటంచు నాత్మలో నెంచిన సు
శ్లోకునకు నిందు నందున్-జేకూరు నఖండ హర్ష చిరసౌఖ్యంబుల్.

సమదృష్టిలేమి సంకుచి-తములగు భావంబులకు నిదానంబుగదా?
సుమహిత చరిత్ర, వినుసం-ఘమునకధఃపతనసిద్ధి కల్గును దానన్.

పరమేశ్వరగురు తేజః-పరిపూరితమై వెలుంగు ప్రకృతిని వికృతిం
బొరయనిచిత్తంబుననీ-శ్వరతుల్యమఁటంచుఁ గొల్వవలయు మహాత్మా!

ఇట్లిల్లాలు ధర్మోపన్యాసంబు నొసంగిన;

వినిమగపుల్గు విశ్రుతవివేకముఁగాంచి కపోతి మెచ్చి నె
మ్మనమున ధర్మతత్త్వసువిమర్శనముం బొనరించి కాఁచినీ
జనధనపుత్ర బంధుభటసౌఖ్యము లెంతయుఁ జంచలంబు లం
చునెఱిఁగి సంసృతిం దెగడి శోక భయంబులఁబాసి వెండియున్.

జీవుఁ డొడలిం దొలంగెడి-చో వెంటం దోడువచ్చు చుట్టంబు మఱిన్
భావింప ధర్మువ కదా?-నీవాఁడ నఁటం చెవండు నెయ్యము సూపున్.

అని విచారించి సంచలించు నంగంబులం గుంచు కిరాతుదెసఁ బ్రసాదభాసురంబగున
పాంగావలోకనంబుం బఱపి మృదుమధుర కంఠస్వరంబున మానుషభాషణంబు
లొలయ వాని కిట్లనియె.

(సశేషము)

# నిరుటి దీపావళి*

మ. డుంబ నరసింహాచార్యులుగారు

## ౧

ఆనాడు నరక చతుర్దశి. సెలవుదినము. ఖులాసాగా మాట్లాడుకొందామని అలవాటుచొప్పున రామారావు వెంకటశాస్త్రి యింటికి మధ్యాహ్నము రెండుగంటలకే బయలుదేరి వెళ్లినాడు.

రామారావు పేలాపురి ఉన్నతపాఠశాలలో స్కూలుఫైనలు పూర్తి చేసినాడు. వెంకటశాస్త్రి ఏలూరి జాతీయమహావిద్యాలయములో ఉన్నతతరగతియందు విద్య నేర్చుచున్నాడు. ఒక్కబడి కాకపోయినను సమవయస్కులగు ఆయుభయులకు చాల స్నేహము. ఇరువురు పరిహాసభాషణప్రియులే. ఇద్దఱును ఖద్దరు వస్త్రధారులే. దేశాభిమానములోను ఒకరికొకరు తీసిపోరు.

తన చదువులగదిలో రాట్నముదగ్గఱ కూర్చుండి నూలు వడకుచున్న వెంకటశాస్త్రికి రామారావును చూడగానే ప్రాణములు లేచివచ్చినవి. మొగము వికసించినది. నూలు వడకుచున్నవాడు అది మాని చటుక్కున లేచి, "రామారావ్! రా! రా! నీకోసమే చూస్తున్నాను. కూర్చో" అని చెప్పుచు, మీది బల్లపైనున్న రెండు తలగడాలు అందుకొని ఎదురుగా గోడ ప్రక్కను పఱచియున్న తివాచీమీదకు వాటముగా విసరివైచినాడు.

"ఏం డెందుకు తలగడాలు? రాట్నం పని మాని నీవుకూడా తివాచీమీద చేరుదామనా?— నిర్జీవమైన రాట్నానికి విశ్రాంతి అవసరము లేకపోయినా, నీవంటి జీవుడికి కొంత విశ్రాంతి యుండవల్సిందే—సరే. నీవీపాటికి లేచిరా, నేను రాట్నం పని పట్టిస్తా—కదు రాడుచుంటే నేకాని కాటకం పోదన్నారు పెద్దలు" అన్నాడు రామారావు.

"కదు రొక్కటే కాదు—కదురూ కవ్వముకూడ—ఆడితేగాని క్షామకం పోదు." అని నవ్వుకొనుచు లేచివచ్చి వెంకటశాస్త్రి తివాచీమీద కూర్చున్నాడు.

"అయితే నీవు రాట్నాని కెదురుగుండా ఒక రాట పాతి చల్లకుండ పెట్టి కవ్వము త్రిప్పడముకూడా ప్రారంభించు. ఇద్దరం పోటీలమీద కదురు, కవ్వము ఆడించి కాటకాన్ని పారదోలుచున్నామంటే పట్లున్న వాళ్లంతా పకాల్న నవ్వుతారు" అని చప్పట్లు చరచి బొబ్బనవ్వు నవ్వుచు రామారావు రాట్నమువద్ద చేరి నూలువడుకుట ప్రారంభించినాడు.

వెంకటశాస్త్రి ఒక తలగడ వీపువెనుక, ఒకటి మోచేతిక్రింద పెట్టుకొని, మోకాళ్లు ముందుకు ఎత్తియుంచి, ఒయ్యారముగా గోడను ఆనుకొని, తివాచీమీద బాలచంద్రాకృతిగా పండుకొనియున్నాడు.



* ఈ కథకు చిత్రములు కథకుని రెండవకుమారుడును, ఏలూరునందలి శ్రీ గాంధి జాతీయమహావిద్యాలయమున ౧౧ వ తరగతిలో చదువుచు కవిత్వమును, చిత్రలేఖనమును అభిమానవిద్యలుగ నభ్యసించుచున్న విద్యార్థియునగు "ము. నరసింహాచార్య" యను విద్యార్థి పెన్సిలుతో చిత్రించినవి. —భారతి.

రామా: నీ వాలాగు దర్జాగా పనీ యుండడానికి కాదు_నిన్ను కాళీగా యుంచింది_

వెంక: ఏమి చేయమన్నావు_నన్ను?

రామా: కథో, కారుణ్యమో_ ఒకటి_ప్రారంభించు, మఱి_

వెంక: (నవ్వుచు) చీమతలకాయ కథ చెప్పనా?

రామా: నిన్న మీవిద్యాలయంలో మీటింగైందిట! విశేషా లేమీ లేవూ?

వెంక: మీటిం గేమిటి? ఊరికే విద్యార్థు లందరిని సమావేశపర్చి దీపావళికథ చెప్పినారు_అంతే.

రామా: ఆకథాసారాంశం టూకీగా నాలుగువాక్యాలలో చెప్పగల విప్పుడు?

వెంక: కావలెనంటే ఒక్క వాక్యంలోనే తేల్చేస్తా.

రామా: ఏదీ_మఱికానీ. నీశక్తి చూద్దాము.

వెంక: నీవుమాత్రం శ్రద్ధగా వినవలె_టపా_కాయలు_కాల్చ_కూడదు.

రామా_కథేదీ?

వెంక: కథెందుకు? కథాసారాంశమేగా నీ వడిగింది?

"సారాంశ మంటే కథాసంగ్రహమని నాఉద్దేశ్యము" అని రామారావు ప్రసన్నముఖుడై రాట్నపుపనిని ఏదేకదృష్టితో సాగించుచుండెను.

౨

వెంకటశాస్త్రి కథ ప్రారంభించినాడు. "నీవు విన్న కథేనోయ్_ద్వాపరయుగాన, నరకమహారాజు పరిపాలనలో అధికార నిరంకుశ మెక్కువై పోయింది. శ్రీకృష్ణమూర్తి ప్రబోధముచేత ప్రజలు నరకమహారాజుతో సహాయనిరాకరణ మవలంబించినారు. రాజు వారిని నానాబాధలు పెట్టించినాడు. జైళ్లలో ఉంచినాడు. తిండికి, బట్టకు, దీపానికికూడ కఱవు వచ్చేలాగు చేసినాడు. ఏమి చేసినను ప్రజలు వాళ్ల ధర్మదీక్ష విడువలేదు. చివరకు శ్రీకృష్ణుని దయచేత నరకపాలన మంతరించినది. మఱునాడు నరకుని కొడుకు భగదత్తుడు రాచబొక్కసములో నున్న ధనరత్నరాసు లన్నియు దెప్పించి ప్రజలకు బంచిపెట్టించినాడు. ప్రజలు తమ తమ సొమ్ములు లెక్క_పెట్టుకొని సంతోషించినారు. ఆసంగతి జ్ఞాపకముంచుకొనుటకే కొన్ని ప్రాంతాలవారీపండుగను ధనలక్ష్మీపూజ చేయుచున్నారు. ఆనాడు ప్రజ లానందమున దీపారాధనలు చేసికొన్నారు. ఆదీపారాధనలకు ప్రతిగానే మనవారీపండుగకు దీపావళులతో గృహాలను అలంకరించుచున్నారు. ఆరోజున విజయసూచకముగా ఫిరంగులు మ్రోయించినారు. ఆ జ్ఞాపకార్థము ఇప్పుడు బాణసంచులు కాల్చుచున్నారు."

రామా: (నవ్వుచు) సరే. బాగుంది కాని_నే నింకోకథ చెపుతాను. నీకు కోపము రాదుకదా?

వెంక: మధ్య_నా కెందుకు_కోపము?

రామా: నీకు కొంచెము వ్యతిరేకముగా మాట్లాడవలసి వస్తూంది_అందుకు చెపుతున్నాను.

వెంక: నీవు నాకు వ్యతిరేకంగా మాట్లాడని దెప్పుడు? కానియ్యి_ఎంతవిమర్శనకైనా నేను తయారుగానే యున్నాను.

రామా: అసలు పూర్వము నరకాసురు డనే ఒక రాజున్నా డన్నమాట సర్వాబద్ధం.

వెంక: (ముక్కు_మీద వ్రేలు వైచికొని) ఎంతమాట మఱి నరకచతుర్దశి ఎందుకు పుట్టిం దంటావు?

రామా: ఈ విషయాన్నిగురించి వేదాన్ని తలతన్నేటంత ప్రామాణ్యమైన యొక కథను ఈ మధ్య నా కొకానొకరు చెప్పినారు. ప్రత్యక్షప్రమాణంగా కనబడే ఆకథాంశాలను నాస్తికుడైనా కాదనలేడు.

వెంక: నాస్తికులకథ చెప్పకుము_ప్రాయశ్చిత్తం చేసికోవలసి వస్తుంది.

రామా: (నవ్వుచు) అబ్బే_ప్రత్యక్షంగా జరుగుచూన్న సంగతేనోయ్, నే జెప్పేది_సత్యభామా సమేతుడైన శ్రీకృష్ణుడు నరకరాజును చంపినట్లుగదా

భాగవతములో వ్రాసినారు! ఆకథలోనివారంతరు వట్టి కల్పిత వ్యక్తులే.

వెంక: (చెవులు మూసికొని) "పెళ్లికొచ్చినవాళ్లంతా నాపెళ్లాలే" అన్నట్టుంది నీమాట—చాలు చాలు. ఊరుకో.

రామా: చెవులు మూసికొంటా వెందుకు? "వినదగు నెవ్వరు చెప్పిన" అనేపద్యము అర్థముతో వల్లించి కూడ—నీ వింత పామరత్వంలో పడిపోతావని నే నెప్పుడూ అనుకోలేదు.

"సరి. కానియ్యి—ఈవేళ, నీకూ నాకూ కూడా ప్రాయశ్చిత్తం, ఏలాగూ తప్పదు" అని తల పంకించుచు బాసినపట్టు వేసికొని కూర్చుండి వెంకటశాస్త్రి చిరునవ్వుతో కథాశ్రవణమునకు సంసిద్ధు డైనాడు.

## 3

పరిహాసభాషణప్రియుఁ డగు రామారావు వడివడిగా రాట్నము త్రిప్పి నూలు వడుకుచునే తనవింతకథ మొదలుపెట్టినాడు:

"భాగవతకారుడు నరకాసురవధ శ్లేషార్థంగా చెప్పినాడు. ఏలాగంటే, ప్రజాకంటకుడైన నరకుడే దేశారిష్టదాయకములైన ఱెక్కలపురుగులు—పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడే వెలుగుచున్న దీపపువత్తి—రణప్రోత్సాహకారిణియైన సత్యభామే దీపమును ప్రజ్వరిల్ల చేసే చమురు—రణక్షేత్రమే ప్రమిద—ఫలిత మేమనగా; దీపపువెలుగుచే ఱెక్కలపురుగు లాకర్షింపబడి, నూనెలో పడుటచేత ఎగురజాలనివై దీపపువేడిమికి మాడి, ఱెక్కలూడగా ప్రమిదయందు పడి చనిపోవుటకే నరకాసురవధయని అర్థము—కాదు, కాదు—ఇది దండాన్వయం: మఱి తాత్పర్య మేమిటంటే—పూర్వ మొకప్పుడు ఱెక్కలపురుగులు చెలరేగి నిరవకాశంగా ప్రపంచమంతయు ఆక్రమించి మనుష్యులు నిల్వడానికి ఆధారము లేకుండా చేయగా, నూనెదీపములచే వాటిని సంహరించడమనే సులభోపాయమును ప్రజలు కనిపెట్టి, ఆవేడుకను ప్రతి సంవత్సరము ఆచరించుచున్నా రనేదే—ఆయన చెప్పిన ఈసమాచారమంతా తమాషాగానూ, నమ్మదగిందిగానూ కనబడుచున్నది—ఏమంటావు?"

వెంక: పుణ్యకథలందు నమ్మకములేని పాషండుల మాటలు తమాషాగానే ఉంటవి. బహు నమ్మకముగా కూడా కనబడుతవి. అందుచేతనే అటువంటివాళ్లతో మాట్లాడినవాళ్లకు కలిగేపాపము అనేకజన్మా లెత్తినా పోదన్నారు—పెద్దలు. తుంటి కొట్టితే మూతిపళ్లు రాలిన వన్నట్లు అమావాస్యనాడు దీపాలు పెట్టితే చతుర్దశినాడే పురుగు లెట్లు నశించుతవి?

రామా: ఒక్కరోజెక్కువ తక్కువ కేమిలే—అసలు చతుర్దశినాడే దీపాలు పెట్టి పురుగులను చంపవలసినది. అమావాస్యనాడేమో—బాణసంచులు కాల్చి గాలిని శుభ్రపర్చవలసినది.

వెంక: (ఎగతాళిగా)అయితే చతుర్దశినాడే దీపావళి అనక, అమావాస్యనా డన్నా రెందుకోయ్?

రామా: (పరధ్యానముగా) ఏమో! ప్రజలనోళ్లలో పడి బహుశా చతుర్దశి అమావాస్యలు తలక్రిందులై పోయి యుంటవి.

వెంక: బలే—బాగుంది, నీమాట. ఇంత సృష్టిచేసిన భగవంతునికి ఱెక్కల పురుగులను చంపడమును, గాలిని శుభ్రము చేయడమును చేతకాక, మన భారతదేశములోని పారతంత్ర్యపు ప్రజలను శరణు చొచ్చినాడు కాబోలు, తనకు సహాయము చేయుడని. జీవహింస చేయుట, ధనము దుర్వ్యయము చేయుట అనునవి వేదకలుగా మనపూర్వు లెప్పుడును ఉద్దేశించలేదు. ప్రజలలో భక్తిజ్ఞానము లభివృద్ధిపఱచి, దేశమునకు అభ్యుదయము కలిగించుటకోసమే, మనపెద్దలు ఈపండుగలన్నియు ఏర్పాటుచేసినారు. నేటికాలానికి నీబోంట్లు బయలుదేరి పాషండవాదాలు చేసి పండుగలకు పెడఅర్థాలు తీస్తున్నారు.

"నీ స్వంత ఉపన్యాసం ప్రారంభించినా వేమి కర్మమోయ్—మీ ఉపాధ్యాయులు చెప్పిన క్రొత్తసంగతు లేమైనా మొదలుపెట్టమంటేను—"అని చెప్పుచు రామారావు నూలుతో నిండిన కదురు తీసివైచి

ప్రక్కనున్న ఉత్తకదు రోకటి అందిపుచ్చుకొని రాట్న మునకు పెట్టి వేగముగా నూలువడుకు పనిని సాగించు చుండెను.

## ౪

"అయితే మా ఉపాధ్యాయులు చెప్పిన ఒక విచిత్రకథ ఇక్కడ చిత్రిస్తాను—కాచుకో" అని వెంకటశాస్త్రి హుషారుగా క్రొత్తకథ ప్రారంభించినాడు—"పూర్వ మొక గ్రామములో సంపన్నగృహస్థుడగు ఒక బ్రాహ్మణుని యింట్లో పాడిపంటలు సమృద్ధిగా ఉండేవి. అందుచేత వారియింట్లో ఏడు గండు పిల్లులు సింహాలులాగు తిరుగుచు అన్ని పదార్థాలలోను మూతులు పెట్టి తిన్నంత తినేవి. అవి తినగా మిగిలినవే ఇంటివారికి ప్రాప్త మౌచుండేవి—అయితే వాళ్ల యింట్లో తద్దినం వచ్చినప్పుడుమాత్రం—తప్పకుండా ఈయేడు పిల్లులను తీసికొనిపోయి దొడ్లో ఉన్న పెద్ద చింతచెట్టుకు కట్టివేసేవారు. ఆబ్రాహ్మణుని యింట్లో ఉన్న పిన్న పెద్దలగు పిల్లవాండ్రంతా దొడ్లో కట్టివేసిన పిల్లులను చూడగానే "ఈవేళ మాయింట్గో తద్దినమోయ్—అప్పచ్చులు—చేస్తారు" అని ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు—చేతులు ఊపుకొని షికార్లు చేయుచు—ఎగిరి గెంతులు వేయుచు—సంతోషముగా ఉండేవారు.

చూస్తున్నావా వాళ్ల కులాసా. ఈలాగు కొంత కాలము వెళ్లిపోయింది. తర్వాత ఆకుటుంబములో పాడిపంటలు తగ్గిపోయి, మార్జాలాలసంఖ్యకూడా క్షీణించి నాలుగు కాడికి వచ్చింది. మనపెద్దలు తద్దినానికి ఏడుపిల్లులను తప్పకుండా, దొడ్లో చింతచెట్టుకు కట్టేవారు—మనయింట్లో నాలుగుపిల్లులే ఉన్నవి. కనుక మిగిలిన మూడింటిని ఎక్కడో సంపాదించి దొడ్లోకట్టకపోతే, తద్దినము పడిపోతుందనియెంచి, రెండుమూడు రోజులు నానాతంటాలు పడి, ప్రయత్నించి, యేలాగో రోదనసంఖ్యగల పిల్లులను పూర్తిచేసి, దొడ్లో చింతచెట్టుకుకట్టి అప్పటివారు కృతార్థులనుచువచ్చేవారు.

ఆలాగు ఉండగా తరాలు వెళ్లిపోయినవి. పాశ్చాత్యనాగరికత బాగా దేశములో అలుముకొన్నది. వాళ్ల యింట్లో పాడిపంటలు పూర్తిగా నిండుకొన్నవి—ఒక్క పిల్లియైనా వాళ్లింటికి రావడము లేదు. పిల్లులు లేకపోతే తద్దినము పడిపోతుంది—ఏలాగురా—అని ఆలోచించి, చివర కానాటి బుద్ధిమంతులు 7 మట్టిపిల్లులను చేసి, చింతచెట్టుకు కట్టివేయడము మొదలు పెట్టినారు. పితృదేవతలు—పిండము—మంత్రాలు — భోక్తలు— మొదలైన వన్నీ, వాళ్లు పూర్తిగా మరిచిపోయినారు. ఇంత రాగిడిమట్టి తెప్పించిఏడుమాయపిల్లుల్ని చేయడం-వాటిని దొడ్లోచింతచెట్టుచుట్టూ కట్టడం—ఇంట్లో పిండివంటలు చేసికొని మ్రింగడం — క్రిందు దిగించి—తద్దినం.



రామా: (నవ్వుచు) అయితే తరాలు గడచిపోయినా ఆచింతచెట్టు ఆలాగే ఉండిటోయ్—పడిపోకుండా—?

వెంక: అబ్బో! చింతచెట్టుని పోనివ్వడమే? అదిపోతే కొంప మునిగిపోదూ? పాతతులసిమొక్కలు పోగా క్రొత్తతులసిమొక్కలును, పెద్ద మారేడు వృక్షము పోగా చిన్నమారేడుచెట్టును హరిహరుల దేవాలయాలలో ఎంతశ్రద్ధగానాటుతారో అంతకన్న డబ్బైరెట్లు ఎక్కువశ్రద్ధాభక్తులతో. వాళ్లు చింతమొక్కలు జాగ్రత్తచేసి నాటుచుండేవారు.

రామా: (చిరునవ్వుతో) సరే—లే—అయినా మట్టిపిల్లుల్ని కట్టడానికి బలమైన చింతచెట్టెందుకు? లేత మొక్కైనా చాలు—లేకుంటే మట్టితో చేసిన మాయ చింత మొక్కైనా చాలు.

వెంక: పైకథవిను మరి. వీరింటికి ఒకనాడు వైదికజ్ఞానసంపన్నుడైన ఒక బ్రాహ్మణుడు వచ్చినాడు. ఆరోజునే వీరింట్లో తద్దినం కూడా—వచ్చింది. ఆయన వాళ్ల తెలివితక్కువ చేష్టలన్నీచూచి తెల్లబోయి ఇంటియజమానికి తద్దినమంటే యేమిటో బోధించినాడు. మరిన్నీ—మంత్రాలు చదివి, పితృదేవతల నాహ్వానించి భోక్తలద్వారా వాళ్ల ఆకలిదప్పులు అణచడానికి మారుగా—దిక్కుమాలిన పిల్లులు—చింతమొక్క—నీవు—తయారయినావుటయ్యా? అని మొగము వాచేలాగు అతనిని నానాచీవాట్లుపెట్టి ఆపామండుని యింట్లో దిగినందుకు పశ్చాత్తాపపడి, ప్రాయశ్చిత్తంచేసికొని చక్కాపోయినాడు.

౫

కథాశ్రవణానంతరము రామారావు కొంచెమాలోచించి "ఈ పీడుపిల్లులు—పితృశ్రాద్ధముకథ ఆర్యకథానిధి 8 వ భాగములో—వెనుక మన మొకమారు చదివినాము. నీకు జ్ఞాపకము లేదూ?" అని అడిగెను.

వెంక: లేకేమి? ఆకథనే ఇంకా వివరంగాను వినోదంగాను ఉండేలాగు మామాస్టరుగారు చెప్పినారు. నేన దిప్పుడు టూకీగా తేల్చివైచినాను.

"పాడిపంటలుండి ఇంట్లో పిల్లులున్న పూర్వీకుడొకడు కర్మం జాలక వాటినిదొడ్లో కట్టివేసినాడంటే అదే తద్దినానికి ముఖ్యమనుకొని పిల్లులులేనిదే పిచ్చిచేష్టలు చేసిన బీదబ్రాహ్మణు డెంత బుద్ధిమంతుడో, రాజ్యంపోయి, వృత్తులునశించి, భోగభాగ్యాలుపోయి దేశము దరిద్రావస్థలో నుండగా అప్పోసప్పోచేసి నాలుగురూపాయలు సంపాదించి, బాణాసంచాకొని తేసులబెట్టి, దీపావళి వెళ్లించినామని సంతోషించేవాళ్లూ అంత బుద్ధిమంతులే" అని మామాస్టరుగారు చెప్పినారు.

రామా: ఒక్క దీపావళి అన్నమాటేమిటి? అన్ని పండుగలు—ఆలాగే అయినవి—ప్రజాభిప్రాయం ఈలాగు మారిపోయినప్పుడు నీవూ నేనూ తంటాలు పడి ఏటికి ఎదురీత లీదితే ఏమిప్రయోజనము?

వెంక: నీవు. నేను ఉపన్యాసా లిచ్చి లోకాన్ని బాగుపర్చ నక్కరలేదు. ప్రజలు, కనుక ధర్మదీక్షలో ఉండి కష్టసహిష్ణుతకు తయారైతే ఎట్టి నిరంకుశప్రభువులైనా లొంగిపోక తప్పదనే వాస్తవమును ప్రజలకు జ్ఞాపకము చేయుట కేర్పడిన ఈపండుగనుగురించి సరిగా అవగాహనచేసికొన్న మనబోటివాళ్లయినా బాణసంచుల వెట్టిలో పడడం మానవలె. దేశసౌభాగ్యాన్ని వృద్ధిచేసి ప్రజలయందు ధర్మదీక్షవృద్ధిచేసే నిర్మాణకార్యక్రమానికి పూనవలె. అదే మనధర్మం. అంతవరకే మనకు హక్కున్నది. నాలుగురోజులనుండి మాజాతీయ విద్యాలయానికి మేము దీపావళి భిక్ష వసూలుచేస్తున్నాము. దీపావళి ప్రభావమును సూచించే కరపత్రాలు పంచిపెట్టి జనులకు కర్తవ్యమును నచ్చచెప్పుచున్నాము. నూలువడికే ఉత్సాహముగలవారికి రాట్నాలు, కదుళ్లు, ఏకులు మొదలైనవి ఖరీదు పుచ్చుకొని సప్లయిచేస్తున్నాము. కొంతమందిమి ఖద్దరుప్రచారముకూడా చేస్తున్నాము.

రామా: ఈ పండుగరోజులలో ఈ పనులన్నింటికీ నేనుకూడా నాశక్తికొలది సహాయము చేయడానికి ఏమీ అభ్యంతరంలేదు. కాని నాకొక చిన్నసందేహమున్నది. అడుగమన్నావా?

వెంక: (నవ్వుచు) ఒకటికాదు—పది సందేహాలుండినా ఇప్పుడే తీర్చుకో—శంకానివృత్తిచేసికోకపోతే చాలా చిక్కులున్నవి.

రామా: లోకమంతా టపాకాయలు—సీమటపాసులు—జింకాలు—తారాజువ్వలు—మతాబులు—థాప్, థూప్, తస్, తుస్, జుయ్, జూయ్—అని ఊరికే జాజ్వల్యమానంగా వెలిగించివేసి ఆనంద మనుభవించుచుంటే, తగుదుమమ్మా అని చందాలూ, భిక్షలూ వసూలుచేయుచూ — ఖద్దరుమూటలు బుజానవేసికొని

తిరుగవలెనంటే ఈ కలికాలంలో ఎవరు మనమాటలు వింటారు చెప్పుమా.

వెంక: బుగ్గల్ని తమలపాకుల కిళ్లీలూ, నోట్లో సిగరెట్లూ పెట్టుకొని వంకపాపిళ్లు దిద్దుకుంటూ, రోజు రోజూ సినీమాలకూ, నాటకాలకూ బయలుదేరే, షోకేళీపురుషులతోపాటు నీవూ, నేనూ, ఆనంద మనుభ విస్తున్నామా? పోనీ కోడిపందేలలోను, జూదాలకొంప లలోను, వేశ్యాగృహాలలోను — లక్షలకు లక్షలు పందేలు పెట్టి, గెల్చుచూ, ఓడుచూ, ఒకనిమిషానికి లక్షాధి కారులు — మఱొక నిమిషానికి భిక్షాధములు — అగుచు ఆనందసముద్రములో ఓలలాడే వారిని మనము అనుకరిం చడం లేదేమి? ఆపనులు చేస్తేనే కాని మనకు సంతో షంరాదా? నిజంగా — నీవుచెప్పు! ఒకమతాబా కాల్చ డం, ఎక్కువ ఆనందమా; ఒక ఏడుపడికి దారం తీయడం ఎక్కువానందమా?

౬

వెంకటశాస్త్రి ప్రశ్నకు రామారావు వెంటనే జవాబు చెప్పలేదు. ఏదో ఆలోచించుకొనుచు, కొం చెము పరధ్యానముగా నుండుటచే గాబోలు అతనిచేతి లోని దారము తెగిపోయినది. కొసలు నలిపి దారము అతికించుకొని మరల రామారావు సంభాషణ మారం భించినాడు.

రామ: నామట్టుకు నాకు సరాలువడకడమే సరదా — కాని అందరికి ఆలాగుంటుందా? ముఖ్యముగా — చిన్నపిల్లలమాట ఆలోచించు!

వెంక: తప్పని చెప్పిన తర్వాత చిన్నపిల్లలకు మాత్రం దానిలో ఆనంద మెందుకుంటుంది? జూద మాడడం — తప్పనికదా నీవు ఆడకుండా ఊరుకొ న్నావు. దాని ఆనందం ఒక్కసారి చవిచూస్తే — మళ్లీ నీవదిమానగలవు?

రామా: టపాకాయలకూ జూదానికీ సాపత్యమే మిటోయ్? పోనీ — నాదగ్గర ఒకరూపాయ ఉన్నద నుకో — అందులో అర్ధరూపాయ ఏదీపావళి భిక్షుకో ఖర్చుపెట్టి, మిగిలిన అర్ధరూపాయతో నేను ఎందుకు బాణసంచా కొనుక్కొని కాల్చకూడదు?

వెంక: బాణసంచా కాల్చడంవల్ల దీపావళి సార్థక మౌతుందని నీకేమైనా నమ్మకముందా? పూర్వులు తమ కుసల్పరిపాలన లభించినప్పుడు విజయసూచకంగా శిరం గులు పేల్చుకొన్నారని, ఎన్నాళ్లకూ — పారతంత్ర్యము లోంచి బయట పడలేక — అసహాయులమై పడియున్న మనమిప్పుడు తగుదునమ్మామని టపాసులు కాల్చి వెట్టి సంతోషం వెల్లడించవలెనంటావా? — తద్దినానికి, భోక్తలకు మంత్రయుక్తంగా భోజనమూ పెట్టుతాను — దొడ్లోపిల్లులనూ కట్టించుతానంటే విన్నవాళ్లు అపహాస్యం గా నవ్వరూ?

రామా: ఎందుకు నవ్వుతారులే — ఇప్పుడుకూడా ఒకళ్లింట్లో పదిపన్నెండు పిల్లులుంటవనుకో, వాళ్ల దొడ్లో ఏదో చెట్టుంటుందనుకో — తద్దినమంతా శాస్త్ర యుక్తంగా మంత్రాలతో జరుగనిచ్చి ఆపిల్లులను దొడ్లో చెట్టుకు కట్టివేస్తే తప్పేముంది?

వెంక: తప్పా మరీతప్పా? ఆపిల్లులన్నిటినీ కట్టకూ డదు. అందులో ఏడుపిల్లులను మాత్రమే కట్టవలె. దొడ్లో ఏదో చెట్టుకుకట్టితే ఏలాగు? చింతచెట్టుకే కట్టవలె.

రామా: దానికేమిగాని — విదేశపుబాణ సంచులు మాని స్వదేశంవి కావలసినన్ని కొనుక్కొని కాల్చుకో మన్నారొక గొప్పజాతీయవాది — ఈ విషయమై నీ ఉద్దేశ్యమేమిటి?

వెంక: నిజమైన పిల్లులకోసం, ఇల్లిల్లూ తిరిగి ఒళ్లం తా బరుకులమయం చేసికోకుండా, మట్టిపిల్లులను నీచిత్తం వచ్చినన్ని చేసి, చెట్టుకుకట్టి, తద్దినంపూర్తిచేసికొమ్మన్న హితోక్తితో దాన్ని పోల్చవచ్చును.

రామా: (తలఊపుచు) అయితే — మట్టుకీ — స్వదేశపు బాణసంచావల్ల ఏమినష్టములే ని నిన్న ఒప్పించినానన్నమాటే —

వెంక: ఆలాగైతే తద్దినానికి దొడ్లో మట్టిపిల్లుల్ని కట్టితే పిచ్చితనమనుకొంటారని నీకభయంలేదన్నమాట!

రామా: అవునుగాని—ఊళ్లో అందరు మతాబులు, తారాజువ్వలు వగైరా అన్నీ పంచుకొని ఉబలాటపడుచూడుంటే—మనమిక్కడకూర్చుండి ఏకులూ, కదుళ్లూపంచుకొని, యిద్దరము చెరియొకరాట్నము ఎదురెదురుగా వేసికొని త్రిప్పుచు దారాన్ని సృష్టిచేసి అపర బ్రహ్మానంద మనుభవించుచు దామంటావా?

వెంక: వాళ్లు అరవీసెడు మతాబాలూ కాల్చివేస్తే, చివరకు బూడిదయైనా మిగులకుండా అన్నీ అయిపోతవి—మనము అరవీసెడు ఏకులు వడికి దారము తీసినామంటే ఆనూలు చూచుకొన్నప్పుడెల్లా మనకు ఒళ్లు పరవశమయ్యేటంత ఆనందం కలుగుచూడుంటుంది.

అని వెంకటశాస్త్రి ముందునకువంగి తానింతకు ముందువడికిన దారము చుట్టబడియున్న పంటికర్రను కుడిచేతితో అందుకొని మెల్లగా బొంగరమువలె త్రిప్పుచు తననూలు నాణెమును చూచుకొనుచుండెను.



## ౭

వెంకటశాస్త్రి పలికినమాటలు వినగానే రామారావునకు పట్టరాని సంతోషముకలిగినది. ఇకతన వితండవాదమునకు స్వస్తిచెప్పి హృదయమిచ్చి మాట్లాడనారంభించినాడు.

రామా: నిజమేసుమా—నాకు ఈసంగతి నీకన్న ముందే తెలుసును. నీతో తమాషాకు ఈవాగ్వాదమంతా చేసినానుగాని నిన్ననే, నేను సవ్వాసేరుఏకులు కొని తెచ్చినాను. ఇప్పుడు చెప్పడ మెందుకు? రేపు రాత్రి మాయింటివద్ద ఎంతతమాషా చేస్తామో ఒకసారి అటువైపువచ్చి చూచితే నీకే తెలుస్తుంది—అవునుకాని ఈవృథాకాలహరణమెందుకు; దీపావళి చందాలకు బయలుదేరక?

వెంక: వేళైంది. నీవు నూలువడుకుతున్నావు గదా ఆటంకమెందుకని ఊరుకొన్నాను. ఇంకెన్ని ఉన్నవి ఏకులు—?

రామా: ఇంకేమిఉన్నవి? దీనితో అన్నీ అయిపోయినవి (అని చేతులు దులుపుకొని లేచుచున్నాడు.)

వెంక: ఏమిటే! 20 ఏకులలో నేను నాలుగు మాత్రమే వడికినాను. మిగిలిన 16 ను నీవు అప్పుడేవడికివైచినావా? ఆహా! మనమింతసేపూ కులాసాగా మాటలూ ఆడుకొన్నాము—బోలెడు దారము తయారుచేసాము.

రామా: అందుకే రాట్నాన్ని సుదర్శనచక్రమన్నారు. మన దౌర్భాగ్యానికి హేతువైన సోమరితనపుపిశాచము ఈరాట్నచక్రము తిరిగే యింటిచాయలకైనా రాలేదు

వెంక—నేనువృథాగా కూర్చున్నానుకాని, ఇంకోరాట్నముండి వడికితే, వట్లో ఇంత దారము తయారైపోయి యుండును—సరే: మనము ప్రచారానికి బయలుదేరదామా మరి—

ఇట్లు మాట్లాడుచు ముందు వెంకటశాస్త్రియు, వెనుక రామారావును గదివెలుపలికి వచ్చినారు. వెంకటశాస్త్రి గదితలుపు గొళ్లెము పెట్టి తాళము నొక్కివేసినాడు. ఇరువురు కలిసి జాతీయమహావిద్యాలయమున కేగినారు. అచ్చట తమ నిర్ణయకార్యము లొనర్ప సంసిద్ధులైయున్న మిత్రబృందముతో కలిసికొని వారందరు ప్రచారము చేయబూనినారు.

బాణసంచులు కొనుక్కొనుటకు తమ తండ్రుల వెంటబోవుచు కొందరు బాలురు వారికి మార్గములో కనబడినారు. ఆపిల్లలు చేయబోవుపనికిని తానుచేయదల

దలచిన పనికిని గలుసఫలితముల తారతమ్యముల గురించియు, ఆనందముల తేడాలను గురించియు వితర్కించుకొనుచు, సహజముగ తనకు దేశసేవానురక్తిని గల్గించినందుకు, భగవంతునకు లోలోన ధన్యవాదము లర్పించుచు రామారావు ప్రఫుల్లహృదయముతో వారివెంటబోయి ప్రచార మొనర్చి, సఫలీకృతమనోరథుడై, రాత్రికి స్వగృహము చేరుకొన్నాడు.

౨

రామారావుతండ్రి లక్ష్మణరావుగారు జమీందారీయిలాకాను నెలకు 80 రూపాయలు జీతముగల ఉద్యోగములో నున్నారు. ఆయన భార్య సీతామహలక్ష్మమ్మ సదాచార సంపన్నయు, దేశాభిమానయునై సాధ్వీమణి యని పేరుగాంచినది. ఆమెకు మగపిల్లలు అయిదుగురు, ఆడుపిల్లలు ముగ్గురు, మొత్తము ఎనమండుగురు సంతానము కలిగి అందరు బాగున్నారు పెద్దకుమారుని పేరే రామారావు. అతని వయస్సిప్పుడు రమారమి ఇరువది సంవత్సరములు. ఆడుపిల్లలలో కడసారపు బాలికయు సీతామహలక్ష్మమ్మగారి యావద సంతానమును నగు రాజ్యం చాలా తెలివిగలది; చురుకైనది. ఆమెకు కడచిన దసరాకు ఎనిమిదేళ్లు దాటి తొమ్మిదవయేడు వచ్చినది. ఆమెవెనుక గల్గిన మగబిడ్డలిద్దరు చాల చిన్న పిల్లలు.

ఆయింట్లో లక్ష్మణరావుగారును, చిన్నమగ శిశువు లిద్దరును తప్ప మిగిలినవారందరు రాట్నముమీద బహు సున్నితముగను, త్వరితముగను నూలు తీయగలిగినవారే. వారందరును నప్పుడప్పుడు పందెములు వైచికొని నూలు తీయుచుండుట కలదు. అవి వారికొక వినోదప్రాయముగా నుండునేకాని పనిగా కాన్పించదు. ఆపందెములందు నాణెమైన నూలుతీసినవారిలో రాజ్యమే తరుచు ప్రథమస్థాన మాక్రమించుచుండును. ఆముద్దుబాలికను చూచి మెచ్చుకొనని వారొక్కరును లేరు.

లక్ష్మణరావుగారింట్లో దీపావళికి ప్రత్యేకము బాణసంచులకొరకు 8 రూపాయలు వ్యయపరుపబడుట వాడుక. ఈసంవత్సరము దీపావళిపండుగ వారమురోజులున్నదనగానే పండుగుల ప్రయోజనముగూర్చియు, దీపావళిని సార్థక మొనర్చవలసిన పద్ధతినిగూర్చియు రామారావు తన తల్లికిని సోదరీసోదరులకును బాగుగ నచ్చునట్లుగున బోధించియుండెను. అందుచే సీతామహలక్ష్మమ్మ తనభర్తగారితో చాలసేపు వాదప్రతివాదములు చేసి ఏలాగైననేమి మొత్తముమీద ఆసంవత్సరము దీపావళికి ఎనిమిది రూపాయలును రామారావు ఇష్టప్రకారము ఖర్చుపెట్టనిచ్చుటకు అనుమతి పొందెను. అయినను బొత్తిగా టపాసులు కొననియెడల తనభర్తగారికి కోపమువచ్చునేమో అని, సగము దేశోపకారకృత్యములకును సగము బాణసంచులకును ఖర్చుపెట్టిన బాగుండునేమో అని సీతామహలక్ష్మమ్మ రామారావునకు హితవు కరపెను.

పండుగ మూడురోజులున్నదనగానే రామారావు దీపావళీ కార్యక్రమమును తనహృదయఫలకముపై ఇట్లు లిఖించుకొనియున్నాడు.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| స్థానిక జాతీయవిద్యాలయమునకు దీపావళిభిక్ష | 1 | 0 | 0 |
| సోదరీసోదరుల నూలు పోటీ పరీక్షకు వీకులు సవానేరు | 0 | 8 | 0 |
| కృతార్థులకు ప్రథమబహుమతి | 1 | 4 | 0 |
| ,, 2 వ బహుమతి | 0 | 12 | 0 |
| ,, 3 వ బహుమతి | 0 | 8 | 0 |
| స్వదేశపు బాణసంచులు | 4 | 0 | 0 |

వెంకటశాస్త్రితో సంభాషణము చేసి వచ్చిన వెనుక రామారావునకు పూర్తిగ హృదయపరివర్తనము కలిగినది. నాటిరాత్రి పండుకొన్నప్పుడు అతడు తన కార్యక్రమ పట్టికయందుగల చివరవిషయమును మార్చక తప్పదను నిశ్చయమునకు వచ్చెను.

తెల్లవారినది; దీపావళిపండుగ వచ్చినది. ఆనాడువయమున వెంకటశాస్త్రియును, రామారావును నిర్లయస్థలములలో జాతీయమహావిద్యాలయమునకు దీపావళి భిక్ష వనూలుచేయుచు ఖద్దరుప్రచారము చేసినారు. మధ్యాహ్నము 12 గంటలకు తిరిగి వచ్చునప్పుడు రామారావు 5½ గజముల ఖద్దరు పరికిణీగుడ్డకొని తెచ్చినాడు.

మధ్యాహ్నము భోజనములు చేసిన పిమ్మట రామారావు మెల్లగా తనతల్లిని పిల్చి "అమ్మా, నీవు నామీద కోపపడకు. 4 రూపాయలు అనవసరముగా బాణసంచులుకొని కాల్చి పారవేయుటవలన ఏమియులా భము లేదుకదా! పైగా దీపావళి నేర్పాటుచేసిన మన పెద్దల యుద్దేశ్యమును వృథాచేసి వారిపట్ల ద్రోహముచే సినట్లగును. ఆవిషయమై నాకు పూర్ణమైన నమ్మకము న్నది. అందుచేత ఆనాల్గురూపాయలలోను రు 3-7-0 పెట్టి ముద్దులుమూట గట్టుచున్న ఒకపువ్వుల ఖద్దరు పరి కిణీగుడ్డకొని తెచ్చినాను. తక్కిన తొమ్మిది అణాలు పెట్టి అది ఒక పటకాపరికిణీయు, జాకెట్టును కుట్టించి, నాణెమైన నూలుతీసిన ఆడుపిల్లకు అది ప్రత్యేకపుబహు మతిగ నీయవలెనని నాయుద్దేశ్యము. టపాకాయలు కొన నందుకు నాన్నగారు కోపపడకుండ చేయుమని నిన్ను బ్రతిమాలుచున్నాను. తమ్ములను, చెల్లెళ్లను ఒప్పించ డము బాధ్యత నాది" అని చెప్పెను. తనముద్దు చెల్లె లగు రాజ్యానికి దుస్తులను దీపావళి కానుకగా నీయనెం చిన రామారావు పవిత్రహృదయమును తల్లి చాలమెచ్చు కొనెను. "బాణసంచులు లేకుండుటచే మీలో నెవ్వరి కిని సంతోషభంగము కాకపోయేటట్టయితే మధ్యల్లో నాన్నగారు రెందుకు కలుగజేసికొందురులే! నీవు చేసిన పని బాగానే ఉన్నది." అని ఆమె అతనికి అభయహ స్తమిచ్చినది. నాటిమధ్యాహ్నము 4 గంటలకే క్రొత్త దుస్తులు తయారై వచ్చినవి.

౬

సీతామహాలక్ష్మమ్మ, ఎత్తయి విశాలమైయున్న తమ గచ్చు అరుగులు కడిగి శుభ్రపరిపించెను. రాట్న ములకు పసుపు రాసి కుంకుమబొట్లు పెట్టి అలంకారము చేయించెను. అరుగు ఒక్కంటికి మూడేసి రాట్నముల చొప్పున వేయించి ప్రతిరాట్నమువద్దను తగిన యెత్తుపీ టలు పెట్టించెను. ఆయరుగులపై నడుమగా నొక్కొ క్క విద్యుద్దీపము వ్రేలాడగట్టించెను. ఆప్రదేశమంతయు నత్యంత కాంతిమంతమై పట్టపగటిని మరపించుచుండెను. ఇంతకుముందే వారివీథిఅరుగులకు ఎదురుగా కట్టులతో మెట్లవలె కట్టించి, సీతామహాలక్ష్మమ్మ నాలుగేసి వరు సలను ప్రమిదెదీపములు పెట్టించెను. విద్యుద్దీపద్యుతుల ముందు కొంచెము వెలవెల బోవుచున్నట్లగపడుచున్నను ఆదీపావళి తత్ప్రదేశమున కొకవింత యందమును గల్పిం చుచునే యుండెను.

ఆరోజున ఆరుగంటలకే బాలికాబాలకులందరును భోజనములు ముగించిరి. పిండివంట లారగించుట, తాం బూలములు వేసికొనుట, ప్రమిదదీపములు సర్దుట మొద లగు పనులక్రింద రమారమి ఒక అరగంటయయ్యెను. రామా రావు కోరిక ననుసరించి సీతామహాలక్ష్మమ్మ రాట్నపు పరీక్షాధికారిణిగ నుండ నంగీకరించెను. సవానేరు(=ఏబు లము) ఏకులను ఆమె ఆరు సమానములుగ కట్టలుగ కట్టిం చెను. రమారమి నలుబదియైదేసి ఏకులుగల యాకట్ట యొక్కొక్కటియు, నాలుగేసి కదుళ్లును, ఆమె ప్రతి రాట్నమువద్దను పెట్టించి యుంచెను.

సరిగా 6½ గంటలకు సీతామహాలక్ష్మమ్మ తన చేతిలోని స్ప్రింగుగంట నొక్కెను. గంటమ్రోగుచుండ గానే వస్త్రధారులై కలకలలాడు. నామములతో ముగ్గురు బాలికలును, ఒక అరుగు మీదకును, ముగ్గురు బాలురును మఱియొక అరుగుమీదకును చేరి వరుసగా తమతమ రాట్నములవద్ద ఎత్తుపీటలపై కూర్చుండిరి. అప్పుడే మఱల రెండవగంట మ్రోగినది. ప్రతియొక్క రును చేతితో నొక్కొక్క ఏకుతీసికొని కదురునకున్న దారపు కొనలతో తమ ఏకు చివరలను అతికించిరి. సీతామహాలక్ష్మమ్మ మూడవసారి గంట మ్రోయించెను. వారారుగురు నొక్కసారిగా రాట్నములు త్రిప్పుట ప్రారంభించిరి. ఆదృశ్యము చూచుటకు కన్నుల పండు వుగ నుండెను.

ఊరిలో అందరును బాణసంచులుకొని ఉత్సాహ ముతో కాల్చుకొనుచుండగా తమబాలికాబాలకులు-ధన హీనులవలె గృహమున కూర్చుండియుండి, బయటకు వచ్చుటకే సిగ్గుపడుచు దీనులవలెగాన్పింతురేమో అని లక్ష్మణరావుగారు మొదట అనుకొనిరి. కాని ఊరిలో నందరికంటెను నత్యధికోత్సాహవంతులై తేజస్సంపన్న

ములగు మోములతో పచ్చనిరాట్నముల యెదుట దేవతలవలె కూర్చుండి పంతములమీద నూలువడుకుచున్న యాసుకుమార మూర్తులను చూడగానే ఆయనకు సంతోషముచే ఒడలు పరవశమయ్యెను. లక్ష్మణరావుగారు వీథివాకిట్లో నిలువబడి అదృశ్యమును తదేకదృష్టితో చూడసాగిరి.



సీతామహాలక్ష్మమ్మ చంటిపిల్ల వానిని చంకనెత్తుకొని రాజ్యము రాట్నమువద్ద నిలువబడి "నీవుఎక్కువ దారము తీయుటకు ప్రయత్నించవు. నాణెమైన దారమతీసినందుకు ప్రత్యేక బహుమతిగలదు. నీదారమే చాలసన్న నాణెముగ ఉన్నది. ఆబహుమతి తప్పక నీకేవచ్చును. ఆలాగే తీయుము. తొందరపడిలావుతీయవద్దు" అని ప్రోత్సాహవాక్యములు పలుకుచుండెను. వారి చిన్నపిల్లవాడు మూడేండ్లప్రాయముగల ఆనందరావు లాగును,చొక్కాయును తొడిగికొని, తలపై తెల్లని ఖద్దరుటోపీతో రాజ్యము రాట్నము దగ్గర మఠమువైచికొని కూర్చుండియుండి "రాజ్జెమక్క—బాగా నూలు తీత్తే— నేనే బగుమానం, ఇత్తాను—అమ్మా— నువ్వియ్యొద్దు. ఏమే! బుల్లెక్కా! నేనే ఇత్తానుకాదూ" అని తల్లితోను, అక్కతోను పుంఖాను పుంఖముగవచ్చియు రాని ముద్దుమాటలు గుప్పించుచుండెను.

లక్ష్మణరావుగారు సీతామహాలక్ష్మమ్మను సంబోధించుచు "నీ ఏర్పాటు చాల సంతోషదాయకముగానే యున్నదిసుమా! ఈదీపావళి ఖర్చు నిజముగా సద్వినియోగమైనది" అనెను. ఇంతలో అచ్చటకు వెంకటశాస్త్రివచ్చి ఆదృశ్యమును, లక్ష్మణరావుగారి ప్రశంసావాక్యములను, గమనించి రామారావు విచిత్రపు ఏర్పాటునకు మిక్కిలి ఆశ్చర్యపడి యాతని నెంతయు మెచ్చుకొనెను.

అప్పుడు లక్ష్మణరావుగారును, వెంకటశాస్త్రియు దేశపరిస్థితులను గూర్చియు, శ్రీ గాంధిమహాత్ముని దయచేత ముఖ్యముగా యువకులయందు గల్గుచున్న హృదయపరివర్తనము గూర్చియు చాలసేపు మాట్లాడుకొనిరి. అప్పటికి గం. 10–20 నిమిషములయ్యెను. "ఇక 10 నిమిషములు మాత్రమే వ్యవధియున్నది. తరువాత నెవ్వరును రాట్నమును తాకుటకు వీలులేదు జాగ్రత్త" అని సీతామహాలక్ష్మమ్మ బాలికా బాలకులను హెచ్చరించెను. మగపిల్లలలో రామారావును, ఆడుపిల్లలలో రెండవయామెయగు రత్నావతియు తమ పాలియేకులన్నియు పూర్తిగ వడికివైచితిమని ఒక్కసారిగా లేచిరి.

సీతామహాలక్ష్మమ్మ సరిగా గం. 10–30 ని॥ లకు తనస్ప్రింగుగంటను నొక్కి మ్రోయించెను. పెద్దకుమార్తెయగు రంగనాయకమ్మ "నానూలు కూడ పూర్తియైనదమ్మా—" అని చేతులు దులుపుకొనుచు లేచెను. మిగిలినవారికి రెండేసియో, మూడేసియో మాత్రము ఏకులు మిగిలెను. ఒక పావుగంటలోనే బహుమతుల నిర్ణయమొనర్చి సీతామహాలక్ష్మమ్మగారు ఈ క్రింది ఫలితములు చదివెను.

| | | | |
|---|---|---|---|
| అందరిలో మిక్కిలి నాణెమైన నూలువడికి నందుకు రాజ్యమునకు ప్రత్యేకబహుమతి | 4 రు. వెలగల పరికిణీయు జాకెట్టును. | | |
| రత్నావతికి ప్రథమ బహుమానము | రు 1 | 4 | 0 |
| రామారావునకు ద్వితీయబహుమానము | 0 | 12 | 0 |
| రంగనాయకమ్మకు తృతీయబహుమానము | 0 | 8 | 0 |

"తక్కిన మగపిల్ల లిద్దఱు తీసిన నూలుకూడ చాల బాగుగానే యున్నది. వాండ్రుకూడ బహుమతి కర్హులే కాని 4 బహుమతులే యేర్పాటు చేయబడుటచే వాండ్రకు ప్రస్తుతము బహుమతులొసగ జాలనైతి" నని సీతామహాలక్ష్మమ్మగారు చెప్పిరి. రామారావు రెండవ బహుమతిని తాను తీసికొనక తనతమ్ము లిద్దరికిని చెరి యొక పావలాయును బుల్లితమ్ముడగు ఆనందరావునకు మిగిలిన పావలాయును నిప్పించెను. మొత్తముమీద వారందరును పరమానందభరితులై దీపావళిని సార్థక పఱిచిరి.

వెంకటశాస్త్రి స్వగృహమున కేగి తనమిత్రుడు రామరావు జరిపిన దీపావళిపండుగను గూర్చి తన తలిదండ్రుల తోను, తమ్ములతోను వినోదకథవలె వన్నెలు, చిన్నెలు చేసి చెప్పి వారిని సంతోషసాగరమున నోలలాడించెను.

---

## ఉమారమణా!

క్రొత్తపల్లి సూర్యారావు గారు

విను నస్పృశ్యము నంటు, దబ్ధిఁ గొని పేర్మి నీఁవునం దాల్తు, వ
గ్నిని గ౯ మెప్పను మాటు, దానవుని న్నిశ్వాసమాత్రంబుగాఁ
గొను, దుర్వి న్మృదుపీఠముం బలెనె కైకోఁ జాలు, దే మంచు ని
న్వినుతింతు౯ ఘను నోయుమారమణ, వాఙ్నిర్మాణవైచిత్రితో౯.

గాలికి రూప మిచ్చెదవు కన్నులకుం గనరావు; డెందమం
దోలిన చూడఁగాఁ బడుదు వో ప్రభు, చూచెడి దెద్ది యందుఁ బ్రా
జ్ఞాలికి; నీదుచిత్రమును జ్ఞానులును౯ లిఖియింపలేరు నే
నా లఘుబుద్ధి నెంతుఁ దగుదంచు నుమారమణా, భవద్గతి౯.

గగనము కౌను, మేఘములు కైశ్యము, పృథ్వి నితంబ, మగ్ని ఫా
లగతిలకంబు, సూర్యుఁడు గళాపతి కన్నులు, శేషుఁ డారు, వా
యుగతి వచోవిలాసము, పయోధులు రాగరసంబు, దిక్కులే
జిగిగల పుట్టముల్ ప్రకృతిశీల, కుమారమణా, త్వదార్యకు౯.

నీయం దుద్భవ మయ్యె భూతములు లేనే లేవు నీకంటె ము
న్నామైదు న్నినుఁ బట్టి యున్న కతన౯ వ్యామోహాతం జెట్లొ వి
త్తో యే దా మొదలం చెఱుంగక భవద్రూపంబుగా నెంచుఁ బై
పై యాకారముచే నుమారమణ, విద్వద్బృంద మట్లేకదా!

---

# పెంపుడు చిలుక

వేలూరి శివరామశాస్త్రిగారు

౧

రామనాథబాబు హావేలీ జమీందారు. అతనికి ప్రాయము దాటినపిమ్మట వెంకయ్యామ్మారావు అను కూతురు. రామనాథబాబునకు వ్యపదేశివద్భావముచే కూతురైనను కొడుకైనను వెంకయ్యామ్మారావుగారే.

ఆమె చిన్నారిపొన్నారి చిఱుతవయసున ముద్దులకూచి; అందచందాల యౌవనమున గయాళిగంప; ఆమె పవలంతయు లాగులలోను, రాత్రులంతయు లంగాలలోను. జమీందారీ వ్యవహారపు అడుసున నడుమనడుమ ఆమె చేతిగీతలుకూడ అంటుచుండెను.

వయసు ముదిరినను కూతుపెండ్లిని రామనాథబాబు లోగడ తలపెట్టలేదు కాని,ఇపుడు తనశరీరమున నంజు అంటుతొక్కగా ఆప్రయత్నముమీదనే ఉండెను. ముందు స్వయంవరగృహమొకటి కట్టించెను. దాన బస చేసిన వరుడు మూడవ అంతస్థులో నున్న రాజపుత్రికి స్పష్టముగా కనబడును.

ఈ స్వయంవర మంటపమునకు రాజకుమారులందఱు ఒక్కసారిగా రారు. ఒకరితరువాత నింకొకరు. సరస్వతి చేటియంబు వచ్చి, ఇతడు చోళాధీశుడు; ఇతడు నేపాళాధీశుడు; ఇతడు నీయెదకు కస్తూరి తెచ్చునని గాని, ఇతడు నీమొగమునకు వేసలీను పూయునని గాని వర్ణింపదు. మరి నవుకరులు వచ్చి కంచెడుకూడు తిను ననియు, కాళ్లు తానే కడుకుకొనుననియు, వెలకిలబరుండుననియు వర్ణింతురు. రాజకుమారి గంభీరముగా చూచి ఊరకుండదు. వీడు వృషభము, వీడుభషకము, వీడు మహిషము అని వెంటనే పేరులు పెట్టి వెడల నడిపించును. ఇటులు జంతువుల నామములు, జడముల నామములు ఇంచుమించుగా వ్యయమాయెను.

రామనాథబా బెంతతొందరపడుచుండెనో అంత యాలస్య మగుచుండెను. తుదకు ఆర్కాటినుండి జనార్దనరావుగారు స్వయంవర మంటపము ప్రవేశించిరి. లోగడ వచ్చినవారిలో చాలమందితో వచ్చిన కూలినవుకరులవలె ఆయనతో ఒకడును రాలేదు; కాని బి. యే. డిగ్రీమాత్రము వచ్చెను.

ఈమాట వినిన వెంటనే రాజకుమారి మేడపైనుండి చూచెను. చూచునది చూచుచునే నిలువబడిపోయెను. 'టెలెస్కోపు తెచ్చియీయనా?' అని దాసి యనెను.

వెంకయ్యామ్మారావుగారు దానిమ్మపండ్లు, సపోటాలు, నారింజలు, బత్తాయిలు, చక్రకేళీలు, ద్రాక్షలు తీసికొనిపోయి యిచ్చి తమ్మని ధీరముగా పలికెను.

రామనాథబాబు అనుజ్ఞచే మంత్రి స్వయముగా జనార్దనరావుగారికి స్వాగతమిచ్చెను. ఒకటి రెండు సారులు రాజకుమారి మేడక్రింద నుండి ఏదోమిష పెట్టి జనార్దన రావుగారిని అటూ ఇటూ నడిపించెను. స్వయంవర మంటపమున కుర్చీలో ఒకానొక అంగభంగిగా కూర్చుండబెట్టెను; నిలువబెట్టెను; పండఁబెట్టెను. ఏమి చేసినను నాటెము ఇంచుకయు ఓటిది కాదు.

రాజకుమారి అంతయు జూచెను; నవుకర్లచే అంతయు వినెను. తుదకు అతనికి 'పెంపుడుచిలుక' యని పేరుపెట్టెను.

ఆపేరుపెట్టుట కొక సంబంధ మున్నది. తనగది ముంజూరునందు వ్రేలాడదీసిన బంగారుపంజరమున రెండు చిలుకలు ఉన్నవి.

తుదకు వ్యవహార మిటులు ఫైసలాయెను; ప్రథమపురుష సంతానము జమీదీ; రాజకుమారి పుట్టినింటనే యుండును; ఇష్టము కలుగుచో అత్తిల్లు మెట్టును; పురుష సంతానము కలుగువఱకు అల్లుఁడుమాత్ర మత్తింటనే యుండి తీఱవలయును. జమీకి అతఁడు నిత్యమును అతిథియు, అక్రీతదాసుఁడును.

కాకితములు పుట్టి రిజిస్టరు అగుటతో పాటు అతివైభవముగా వివాహము జరిగెను.

పెంపుడుచిలుకను ఒక బంగారు పంజరమున బంధించిరి. అవసరములయందు పండ్లు పెట్టిరి. 'రామన్నా, తోఁటకూర' అని నేర్పఁగా ఆచిలుక మరల 'రామన్నా; తోఁటకూర' అని అనుట అతికష్టముగా నేర్చుకొనుచుండెను.

పెండ్లివైభవము చేతులార చేసికొని, కనులార చూచుకొని, రామనాథబాబు రంగస్థలమునుండి నిష్క్రమించెను. ఆపాత్రయొక్క అభినయ మంతయు ఇపుడు వెంకయ్యమ్మారావుగారే చేయ దొరఁకొనెను.

౨

పండ్లు దొరకని చిలుకకు పండ్లు దొరకుచో పంజరబంధముకూడ కొన్నాళ్లు పండువే. పండ్లు నోరార దొరకినను నిత్యము పంజరబంధమగుచో, ఆ పంజరమును— సువర్ణమయమే యగుఁగాక—గర్భనరకము. ఆచిలుక చూపెపుడును అనంత-ఆకాశముమీఁదనే. పక్షియయినను దానికి పక్షములు లేవు. అది చేతనయయినను జడము. దానితో కొంతసేపు కొందఱు క్రీడింతురు గాని ఆలావణ్యము సహజసిద్ధమగుటయే స్వయంకృతాపరాధము. కాకిని పంజరమున ఎవఁడు ఇడుకొనును?

వెంకయ్యమ్మారావుగారికి కుమారుఁడు కలిగెను. జమీ యంతటను నిత్యకల్యాణము పచ్చతోరణము. మహేంద్రవైభవముతో బారసాల. శిశువుపేరు రామనాథబాబు. పెంపుడు చిలుకకు పంజరకవాటము కొంచెము సడలెను. ఒక రెక్క స్వాధీనమాయెను.

జనార్దనరావుగారికి అనుకొనినపు డల్లా కుమారుని చూచుకొనుటకు వీలు లేదు. భార్య

మాట వేఱుగా చెప్పనక్కఱలేదు. తన పుత్త్రుని నోరార పిలుచుకొన వీలు లేదు. రామనాథబాబుగారూ అని అన్నియక్షరములును పట్టి పట్టి అనవలయును. ఏల? ఆయనయే జమీందారు; ఆయన వెంకయ్యమ్మారావు గారి కుమారుఁడు.

జనార్దన రావునకు భార్యాపుత్త్రులబదులు దాపున పుస్తకము. అతనికి మన స్తత్త్వశాస్త్రమునందు (Psychology) అభిరుచి. అతఁడు ఆపరిజ్ఞానము చేతనే ఇన్నాళ్లు పంజరమునఁ గడఁపఁగలిగితి ననుకొనెను. విచారించుచో తనకును తెలియకుండ అనురాగబంధముచేతనే పంజరబంధము సైరించెనేమో!

అతఁ డిపుడు స్త్రీపురుషులకు సంబంధించిన మన స్తత్త్వమును రచించుచుండెను. అనుభూతమైన ప్రతివిషయమును ఉదాహరణముగాఁ గొనుచుండెను. తనకడకు వచ్చిన సేవకుని, వాఁడు తెచ్చిన ఆహారమునుగూడ తెలియని ఏకాగ్రతతో దానిని వ్రాయుచుండెను. ఒకానొకపుడు ఎవరుపిలిచినను అతఁడు చెవిటి.

వెంకయ్యమ్మారావు గారికి ఈవైనము తెలిసెను. ఒకనాఁడు ఆమె చక్కఁగా అలంకరించుకొని భర్త అంతఃపురములోనికి ఎవరికిని తెలియకుండ వెళ్లెను. అటులు వెళ్లుట కదే మొదలు.

అతఁడు వ్రాఁతలో మునిఁగి తేలుచుండెను. భార్యను చూచినంతనే కాకితములావల త్రోసి, చూచినవాఁడు చూచినటులే యుండెను. అనుకొనని గౌరవము!

ఉభయతటములు నిండిన ప్రవాహమువలె, పూలతో పండ్లతో నిండిన తీవవలె, మనుష్యదేవతవలె ఆమె నిలువఁబడెను. అతఁడు



భార్య కేసి రెండుచేతులూ చాఁపెను.

వెంకయ్యమ్మారావు ఒకనవ్వు నవ్వెను. తృణీకృతబ్రహ్మపురందర మా నవ్వు; మర్మావిధ మా నవ్వు; హృదయభేది ఆనవ్వు.

ఏదీ చూతము, పాఠకుఁడా, నీవు నవ్వుమా నవ్వు! పోనీ, అర్థము చేసికొన్నఁ జాలును! కావలసిన దంతయే.

ఇటులు నవ్వి వెంకయ్యమ్మారావు— 'నన్ను పెంపుడులేడి యనుకొంటివా, చేతులతో దువ్వుటకు, ముద్దిడుటకు' అనెను. జనార్దనరావున కిట్టి ప్రసంగములు క్రొత్తలు కావు.

ఆమె సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరువలె ఆగది లోని పుస్తకములన్నియు చూచెను. వ్రాయుచున్న కాకితములు విప్పి నడుమనడుమ పరిశీలించుచుండెను.

దాసి యొకతె వడిగా వచ్చి, 'చిన్నమ్మారావుగారికొఱకు వరుఁడిపుడే స్వయంవర మంటపమున విడిసెనని చెప్పెను. మఱొకదాసి వచ్చి, 'వ్యవహార పర్యాలోచనమునకు దివాను బహద్దరు తెరచాటున కాచికొని యుండె'నని మనవిచేసెను. విని వెంకయ్యమ్మారావుగారు 'సరి' యని పిమ్మట "ఓసీ, నీ వీ కాకితములకట్టనాగదిలోపెట్టు"మనెను. దాసి తీసికొని వెళ్లెను.

వెంకయ్యమ్మారావు భర్తను చూచి— "తాము నేఁటిరాత్రి యేడుగంటలకు నాగదిలోనికి దయచేసి నన్ననుగ్రహింపవలెను" అనెను. జనార్దనరావుగారికి ఇది యొక క్రొత్తగౌరవము.

"మాటాడ రేమి?"

"దాసిని బంపుచో వత్తును."

జనార్దనరావిటు లనుటకు ఇదియే మొదలు. వెంకయ్యమ్మారావు పనులమీఁద వెళ్లిపోయెను.

ఏడుగంట లాయెను; దాసి రాలేదు. ఎనిమిది యాయెను; రాలేదు. తొమ్మిది; పది; పదునొకండు; పండ్రెండు. దాసి రాదు.

జనార్దనరావు దాదికిఁ బదిరూకలిచ్చి కుమారుని తొట్టికడ కేఁగెను. రెప్పవాల్పక చూచెను.

"కోయిల తనగ్రుడ్డును తాను పొదిగికొనలేదు. నాయనా, పెద్దవాఁడ వైన పిదప మీయమ్మవలె నన్ను మఱవకు."

అతఁడు బాలు నొకసారి యెత్తుకొనెను.



నేను నీవాఁడ నన్నటులు బాలుఁ డూరకుండఁగా, తండ్రి ముద్దుగొని మరల తొట్టియ నుంచెను.

"నీవు నీతల్లిపోలిక; తల్లిచాల మంచిది. వెళ్లునపుడు నిన్నువలె నీతల్లినిగూడ చూడఁదలఁపు గాని అందులకు నాకు భాగ్యము లేదు. బాలుఁడా, నన్ను మఱవకు. దాదీ, నాపలుకును పెద్ద అయినపిదప ఇతనికి చెప్పుదువా?" అని దానికి మరికొన్ని రూకలిచ్చి తొట్టెచూ

చుచు కనుల నీరు గ్రమ్మఁగా వెనుదిరిగి పోయెను.

జనార్దనరావుగారు వెళ్లిపోయిరని ప్రొద్దు నే సేవకుఁడు వెంకయ్యామ్మా రావుగారికి విన్నవించెను. "ఓరీ, నల్లమందు వేళకు ఉడుత తానే వచ్చును" అనెను వెంకయ్యామ్మారావు గారు.

## 3

చిన్నమ్మారావు తనకు మేనత్తకూఁతురు. ఆమె పోషణమంతయు తనమీఁదనే యుండెను. చిన్నమ్మారావుకూడ తన అదుపు ఆజ్ఞలలో ఉండెను. ఆమె కిపుడు పెండ్లి; ఇల్లటమునకు వరుఁడు వచ్చెను. నియమము లన్నిటికి అతఁడు తల నూఁపెను.

వెంకయ్యామ్మారావు చిన్నమ్మారావును దాపునకు బిలిచి, 'ఈ గంగిరెద్దు నీకు బాగుండెనా?' అని అడిగెను.

దాసీలు కొందఱు ఈ నామకరణమునకు సంతసించిరి. కొంద ఱింకను రాణి మోమును జూచుచుండిరి. ఇంకను మంచిపేరు కావలయుఁగాఁబోలు! కొందఱు పకపక నవ్విరి.

చిన్నమ్మారావు చీరముడుతలు సవరించుకొనుచు మోము వంచి తన నెవరో వెనుక పిలిచినటులు లోనికి వెళ్లిపోయెను.

వెంకయ్యామ్మారావు వరుఁడు వెంకటరాయణిం గారికి పదివేలరూపాయలు, వెండి బిందెలు, బంగారు హారములు, వజ్రము మలఁచిన ఉంగరము, రాతికట్టడపు అంటుజోడు, గుఱ్ఱమును కట్నమిచ్చెను. ముప్పదినేలు రాఁబడిగల గ్రామము కొని చిన్నమ్మారావునకు ఫెళ్లుమని పెండ్లి చేసెను. తా నొక్కతియే పెండ్లికూఁతును ధారపోసెను.

గ్రామపాలనమును గుఱించిన వ్యవహారమంతయు భర్తతో సంబంధము లేకుండ నిర్వర్తించుకొను ప్రక్రియను వెంకయ్యామ్మారావు చిన్నమ్మారావునకు నేర్పెను. ప్రథమసంవత్సరము చిన్నమ్మారావు తనవ్యవహార మంతయు తానే చేసికొనెను. రెండవసంవత్సరమునుండియు కొంతకొంత తగ్గించుకొని క్రమక్రమముగా అంతయు భర్తపరము చేసెను.

చిన్నమ్మారావుకు చిన్నతనమునుండియు ముందటేటివఱకు వెంకయ్యామ్మారావు గారికడనే కాలక్షేపము. వెంకయ్యామ్మారావు గారును అన్నము తినునపుడు, నీరు త్రావునపుడు, షికారు వెళ్లునపుడు, నిద్రించునపుడు, ఆటలాడుకొనునపుడు, పాటలు పాడుకొనునపుడు, కూర్చుండునపుడు, వ్యవహరించునపుడు చిన్నమ్మారావును ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె ఎడఁబాయకుండెడిది. అట్టి చిన్నమ్మారావు ఇపుడిపుడు తాను పిలిచినను కొన్నివేళల దర్శనమునకు రాఁదొడఁగుట లేదు. కారణ మడుగుచో ఎపుడు ప్రత్యుత్తరించినను తన భర్తకు సంబంధించిన విషయమే చెప్పుచుండెడిది. వెంకయ్యామ్మారావుగారు—'గంగిరెద్దు ఆయనకాదు; నీవు' అనుచుండెడిది.




కీ. శే. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

౧౯౨౫-వ సం. సెప్టెంబరుమాసమున చూచి వ్రాసిన రూపచిత్రము.

చిత్రకారుడు: శ్రీ కాతా రామమోహనశాస్త్రిగారు.

పటేలుగారి కుటుంబము

ఐదుగురు అన్నదమ్ములు; తల్లి.

ఎడమకడను శ్రీ విఠలభాయి పటేలుగారు.   కుడికడను శ్రీ వల్లభభాయి పటేలుగారు.



కీర్తిశేషులు యస్. ఆర్. దాసుగారు

ఒకనాటి రేయి ఆమె చిన్నమ్మారావును పిలిచికొని రమ్మని దాసిమీఁద దాసిని బంపెను. దాసిక లందఱు తిరిగివచ్చి—'తలుపు వేసికొని పలుకనైన పలుకలేదు' అని మనవిచేసిరి.

ఆమె దాసీల సందఱ నక్కడనే ఉండ నియమించి తాను వెళ్లెను. గవాక్షమునుండి



తొంగిచూచెను. ఒడలు జల్లుమనెను. 'నా కీ యదృష్టమేదీ?' అనుకొనెను. తిరిగివచ్చి ఆలోచించుచు కూరుచుండెను.

దాసీ లందఱు ముక్కుమీఁద వేళ్లువేసికొని నిలువఁబడియుండిరి. సమయము కనిపట్టి ఒకదాసి 'అమ్మా, ఆమెకు మగఁడు మందు పెట్టెను' అనెను. మఱొకతెఁ 'ఏమందోపెట్టనిచో సతనిత్యము మగనిముం దెటులుండును?' అనెను. 'అదేమో కాని ఏ మున్నదమ్మా అప్పనము మగనికడఁ బడియుండుటకు?' అని యింకొకతె యనెను.

వెంకయ్యమ్మారావు దాసికలఁజూచి 'అటువంటి మందు ఉండునా?' అని యడిగెను. 'ఉన్నవి ఉన్న'వని ప్రతివైపునుండియు ఉదాహరణపూర్వకముగా సమాధానములు తామరతంపరగా బయలుదేరెను. వెంకయ్యమ్మారావు ఆశ్చర్యముతో వినుచుండెను.

కొంతవడి ఎవరును మాటలాడక తాము చెప్పిన అపూర్వవిషయముయొక్క సత్యము గ్రహింప రాణి కవకాశమిచ్చిరి. ఆమె ఒకతూరి ప్రబలముగా నిట్టూర్చెను.

కీరవాణి యను దాసి—అమ్మా, మందు లకేమిగాని, ఆమెకు మగడే మందు' అనెను. ఇంకొకతె 'నీకో' అనెను. దానినిగూర్చి మరియొకతె 'నీకో' అనెను. ఇటులు 'నీకో'లు వేనవేలు.

వృద్ధదాసి—'ఎందుల కీవాదము? మగఁడే మందుకాని ఆఁడుది కలదా?' అనెను. ఒకరి మొగము లొకరు చూచుకొనిరి. అందఱు తలాయొక పనిమీఁద వెళ్లిపోయిరి.

వెంకయ్యమ్మారావు గారు ఆకాశము చూచుచు పండుకొనిరి. ఏమియు తోఁచక ఒకొక్క నక్షత్రమునే లెక్కపెట్టుచుండఁగా ప్రభాతమాయెను.

౪

ఇపుడు వెంకయ్యమ్మారావు పను లన్నియు దివానుపరము చేసెను. చేయి కడుగుకొని కూర్చుండెను. ఇపుడు తనకు పనిలేమియు లేవుకాని మనస్సులో ఒకపని ఉండెను. అది వేయిపనులపెట్టు.

ఆమె ఒకనాడు ముంజూరున వేలాడు పంజరమున మగచిలుకను స్వయముగా తీసి మరియొక పంజరమునఁ బెట్టి దూరముగా కట్టెను. రణగుణధ్వని: పండ్లు తినవు; నీరు త్రావవు. ఎగిరి బయటికి రాఁజూచును; ముక్కుతో కడ్డీలను పొడుచును; రివ్వున నెగిరికూలును.

వెంకయ్యమ్మా రావుగా రెంతో సేపు వాని వియోగమును సహింపలేక పోయెను. మరల రెంటిని ఏకపంజరమం దుంచెను. మరల మామూలు.

కొంత సేపటికి కీరవాణిని రావించెను. దానికి మంచిచీరయు, రైకయు ఇచ్చెను. కీరవాణి వానినితాల్చి అన్వర్థనామము కలదయి రాణికి నమస్కరించి సెలవు తీసికొనెను.

ప్రొద్దుపోయిన పిదప చిన్నమ్మారావు పడకటింటి ప్రక్కగా స్నానగృహమున కేఁగుచు వెంకయ్యమ్మారావు దంపతుల సరసాలాపముల వినెను. పులకలచే ఆమెకు స్నానమక్కఱ లేకపోయెను. ఆమె తనకు మరి రెండు చెవులు లేనందులకు కినిసెను. ఇఁక స్నానము లేదు; భోజనములేదు. శయన గృహమునకు వెనుదిరిగి పోయెను. పోయెనన్న మాటయే కాని నిదిరింపలేదు.

ఇంటిలో జనార్దన రావుగారి పటములేదు; ఆయనవస్త్ర మేనియు లేదు.

ఆమె ఆలోచించి ఆలోచించి కొంతవడికి కొడుకు మంచముకడకు వెళ్లెను. అతనిని ఆచియాచి చూచెను. చూచిచూచి "నీవు నా చాఱ; నీవుకూడ నావలె కాఁగలవు; కాఁగలవేమిటి? ఐతివి. లేనిచో 'మాతండ్రి యేడి? అని అడుగవా?' అనెను.

చూడఁగాచూడఁగా వానిలో కొంత భర్త కవళిక కానవచ్చెను. నోరార ముద్దిడెను;



ముద్దిడి ముద్దిడి సిగ్గిలెను.

తెలవాఱకముందే జమానులను బిలిపించి జనార్దనరావుగారివిషయము కనుఁగొని రమ్మని పంపెను. వారు ఆర్వీటికి వెళ్లిరి.

వెనుక వెంకయ్యమ్మారావుగారు భ ర్త రచించుచున్న గ్రంథమును అతనిని బిలిచి అతని యెట్టెదుటనే తగులఁబెట్టఁ దలఁచెను. కాని అపు డతఁడు దాసిని బంపుమనఁగా అభిమానించి పెట్టెలోఁ బాఱవైచెను. దానిని నేఁడు పైకి దీసెను; చదివెను. తనపతి యిపుడు గోచరించెను. దానికి తా నొక పీఠిక వ్రాసెను.

భ ర్తయొక్క ఆంతరస్వరూపదర్శనమాత్రము తనకు తృప్తిజనకము కాకుండు టటుండ స్వస్వరూపదర్శనమునకు ఆమెను తొందర పెట్టెను. ఆమె ఆతొందరచే ఉడ్డుగుడిచినటు లుండెను.

ఆర్వేటినుండి జమానులు వచ్చి దేవరవారు వారికుటీరమున సుఖముగా నున్నారని మనవి చేసిరి.

"మరల పెండ్లాడియా?"

"అమ్మా, అదేమి? ప్రయత్నము చేసినను ఆయనకు మరి పెండ్లి యగునా?"

"ఏమీ కాదేమి? మీకు తెలిసెఁ గాఁబోలు, చేదుమాట లొకప్పుడు తియ్యమాటలు,తియ్యమాట లొకప్పుడు చేదుమాటలు."

జమానులు వెళ్లిపోయిరి. వరాండాలో కుమారుఁడు దాదిపై కినియు మాటలు కొన్ని స్పష్టముగను, కొన్ని అస్పష్టముగను వినవచ్చుచుండెను. దాది బతిమాలుకొనుచుండెను. బాలుఁడు దాదిని లాఁగికొనివచ్చుచు "ఆఁగు! మాయమ్మతో చెప్పి నీపెండ్లి చేయించెదను" అనఁగా "బాబుగారు, బాబుగారు! చెప్పకుఁడు, చెప్పకుఁడు! రేపంతయు మిమ్ము బుజముల మీఁద మోసి తిప్పెదను" అని దాది బతిమాలెను. బాలుఁడు "అమ్మా" యని కేక పెట్టెను. దాది వెలవెలపోవుచుండెను. తల్లి కుమారు నెదురుకొని "ఏమి నాయనా!" అని అడిగెను.

"చూడు, ఇది—నీకు నాయన ఏఁడీ?



అనుచున్నది. మానాయన ఏఁడీ? చూపు! ఆపైని దీనిపెండ్లి!"

"నాయనా! నీకును దానికిని చూపుదును; నేనును చూతును. లెండు;పోదము"అని అపుడే పయనించెను. బాలుని ఆనందమునకు మేర

లేదు. దాది సంతోషమును లోలోపల అణఁచుకొనెను. బాలుఁడు—"చూడు నీ పెండ్లి! మానాన్నవద్ద!" అని దాదిని బెదరించుచుండెను.

ఆమఱునాఁడే వారార్వీడు చేరిరి. గ్రంథపర్యాలోచనము చేయుచున్న జనార్దనరావు రాణివాసము విడిచి నడిచి వచ్చుచున్న



తనభార్యను, దాదిచేతులనుండి కిందికి దుముకుచున్న కుమారుని జూచి తనకనులను తానే నమ్మఁజాలకపోయెను.

వెంకయ్యామ్మారావు సాష్టాంగపడి పుస్తకహస్తుఁడైన కుమారుని భర్త కందించెను. అతఁడు కుమారుని మూర్కొని పుస్తకమెత్తి పీఠికనుజూచి పరవశుఁడాయెను.

రామనాథబాబు లోలోపల 'నేనిదివఱకు మానాయనను చూడలేదే' అనుకొని దాదికడకు వచ్చి తండ్రిని జూపి చఱచెను. దాదికి ఆచఱపే సమ్మోద మాయెను.

"తుదకు పెంపుడు చిలుకకడకే వచ్చితివా?"

"క్షమింపుఁడు, క్షమింపుఁడు! నేనే యిపుడు పెంపుడుచిలుకనై వచ్చితిని."

---

# చిన్ననాఁటి చేష్టలు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

(వెనుకటి సంచిక తరవాయి)

ఊళ్లనుండి వచ్చి యుండిన బందుగుల్
వారివారి యూళ్లదారిఁ బట్టి
రందు దూరదేశమందుండి వచ్చిన
బంధు వొకఁడు నాఁడు పయనమయ్యె.

పిండి జల్లెడ తాఁచిప్ప పేఁడబొమ్మ
కొండచీపురు ఖర్జూరపండు లక్క-
చేట గలమూట ముసలమ్మ చేతఁ గొనియె
నెక్కి నుండిరి వారు రెండెడ్ల బండి.

నన్ను నాలుగైదు నాళులనుండియు
ప్రేముడించు చున్న పెద్ద యతఁడు
దాపురించి చేత రూపాయి నిడి ముడ్చి
పోయి వత్తు ననియె ముద్దు గొనియె.

తెలివ నాచేయి రూపాయఁ దెల్లవాఱె
తేటదనమున నామోము తెల్లవాఱె
నెల్లరాత్రియు నంతలోఁ దెల్లవాఱెఁ
దెల్లవాఱె నా కోర్కులు క్రేళ్లువాఱె.

నాకంటెఁ గొంటె యొక్కఁడు
చేకుఱెఁ జెలికాఁడు మాఱిచితి మాహూప్యం
బేకీభవించి మే మట
చేకొనఁ దలఁచినవి చెప్పఁ జెల్ల వవెల్లన్.

లాటరీ వేసి డబ్బెంతో లాగి యవల
వలయువస్తువుల్ కొనుకొనఁ దలఁచుకొంటి
మెనిమి దెనిమిది కానులు నిర్వ్యారమును
బూని లాటరీచోటికిఁ బోయినాము.

తిండి లేదు తిప్పలు లేదు త్రిప్పి త్రిప్పి
వేయుచుంటిమి ; మావలె వేయుచుండు
వారిఁ జూచుచు నుంటిమి ; వ్యర్థ మయ్యె-
నాకుఁ బదునాఱుకానులు నష్ట మయ్యె.

బిక్క మొగముతో నిలుదారి త్రొక్కినాఁడ ;
అమ్మ నాయన నిన్నటి యమ్మలికమె
అనుకొనిరి బుజ్జగించిరి యంతొ యంతొ
తింటినో లేదొ మఱి బజార్వెంటఁ బడితి.

కొంత కేవేవొ వెదకుచు నుంటి నేను
దంటచెలికాఁడు నంతతో వెంటఁ బడియె
ముందుగ మిఠాయి సరకును గొంద మనియెఁ
దింద మామీఁద నివి చూచుకొంద మనియె.

చెప్ప సిగ్గు గదురు నిప్పుడు మెత్తఁబ
కోడులుం జిలేబి జీడిపప్పు
పాఁగు బూంది లడ్డు నూఁగుండలును గొను
కొంటి మంతఁ బంచుకొంటి మంత.

వీలుచాలు వేళపాళ దలంపని
తిరుగులాట, పాడుతిండి, యదియు
కాస్తకూస్త కాదు, కడుపున కిందునో,
జీర్ణ మానో యెవరు చెప్పువారు ?

తీయవస్తువులను దినఁదిన దాహంబు
తీవ్రమయ్యె నెండఁ దిరుగు టయ్యె
చెఱువులోని కలఁకముఱికినీ రొక్క రార
నాఁగకుండ మేము త్రాగినాము.

మిగిలె నొక్కయణా మాత్రమే మిఠాయి
వెక్కసంబుగాఁ దింటిమి యెక్కువయ్యె
దాన నావంతులోఁ గొంత దాఁచినాను
చిన్నపొట్టము చొక్కాయి జేబులోను.

ఇంక మిగిలినయాయణా యెంతొ చింత
కొల్పుచుండెను చలికాఁడు తెల్పె నిట్లు :—
రార పోదము అంకుల రాటమునకు
నిద్దఱకుఁ జెల్లిపోవు రెండద్దణాలు.

పరుగువాఱి మే మచ్చోటి కరిగినాము
ఒక్కణా నిచ్చినా మందు నెక్కినాము
తీవ్రవేగమై రాటంబు తిరుగఁ జొచ్చె
జలదరించెను నా మేను చలి జనించె.

గిరు గిరు గిరుమని రాటము
తిరిగె నొకటొ రెండొ సార్లు తెలియదు దీనిన్
దిరిగెఁ దల దిరిగెఁ గన్నులు
తిరిగె నొడలు నేల మీఁద దిమ్మని పడితిన్.

* * * *

చెవులన్ అంకులరాటపు
రివురివ్వులు మ్రోఁగుచుండె రి మ్మడఁగెను నే
నవనిఁ బడియుంటి నను స్మృతి
దవిలె నెఱింగితిని జీవితమ్మున నునికిన్.

కన్నుల నీరు నించుచు వి
కారముఖంబున నమ్మనాయనల్
నన్నును గాంచుచుండిరి క
నం గలనైతిని వారి నేను నే
మన్న, యెటున్న దంచు నను
నద్దిరి వా ర్నను నిల్లు సేర్చఁ డీ
చెన్నఁటి చెట్టచెద్దమును
జేసితి నంచును వేఁడి యేడ్చితిన్.

జ్వరపు వేఁడిమి నొడలెల్ల మఱుఁగుచుండె
నుల్లిపాయపకోడీల క్రుళ్లుకంపు
సోఁకుచుం గడ్పు చుమ్మలుచుట్టుచుండె
నోఁకరలు రెండు వ్రేళ్ల చీకాకు లుండె.

ఇటునటుం జూతుఁ గద యది యింటిపట్టు
మాదియే, నేను మంచము మీఁద నుంటి,
ఎపుడు తెచ్చితి రింటికి? నెవరు సెప్పి
రెంత సే పయ్యె? నని యెంతొ వింతపడితి!

కన్నుల నీరు నించుకొనెఁ
గౌఁగిటఁ జేర్చుకొనెన్ వచించె మా
నాన్న ! యెఱింగితే యొకలు
నాయన! నిల్పితె మాదు ప్రాణముల్
నిన్నటిసంజఁ గూలితివి
నేఁ డిదె ప్రొద్దుట జ్ఞప్తి గల్గె; మ
మ్మెన్ని యవస్థలం బఱపి
తే మన నేర్తుము నిన్నుఁ బుత్రకా!

అయిన దయినది నీయొడల్ నయమయినను
నందఱము నింక జాగ్రత్త నుంద మనుచు
వాంతుల విరేచనమ్ముల వంతె నున్న
నన్ను నోదార్చి తేర్చె మానాన్న యపుడు.

చెంత వసించుచుం గథలు
సెప్పుచు బాధ నెఱుంగనీక ధ
న్వంతరిఁ బోలునట్టి ఘన
వైద్యుఁడు మజ్జనకుండు వేకియల్
వాంతు లవెల్ల మాన్చె నను
పానములం దియమందు లిచ్చి యం
తంతకుఁ దేరుకొంటి హిత
మయ్యెఁ గ్రమంబుగఁ బథ్య పానముల్;

చిలుకకుఁ జెప్పినట్లు చెప్పినను
జెప్పితిఁ జెప్పితి నెంత సెప్పినన్
గలుగక పోయె లాభ మధి
కంబగు కష్టముఁ దెచ్చుకొంటి ; నీ
యలఁతను మాకుఁ బ్రాణములు
నట్టిటు లైనవి; యిట్టి దుష్ట చ
ర్యల నిఁక నైన వీడి తన
యా వినయాఢ్యుఁడ వై మెలంగుమా.

ఎక్కడుండి వచ్చెఁ జొక్కాయిలోన మి
ఠాయి నీకు? నుల్లిపాయకంపు
ప్రబలమయ్యె; అంకురాటంబుపయి నెక్క
నెట్లు సాహసించి? లేది డబ్బు?

ఎచట సొమ్ము గొంటి? వేమేమి గొంటి? వే
మేమి తింటి? వింక నేమియేమి
కొంటెపనులు చేసి తంటాలు తెచ్చితి?
వెవరు తోడు నీకు? నెఱుఁగఁ జెపుమ.

అలవు లేనికూర్మి దొలకాడుమానాన్న
హృదయ మపుడు నాకు నెఱుకపడియె
చెప్పికొంటి నాఁటి చెడుచేష్ట లెల్లను
దప్పిదము లటంచు నొప్పికొంటి.

ఎవ్వ రే నెయ్యదియేని యిచ్చినను మా
యిష్టంబు లేకుండ నీ
వవునంచుం గ్రహియించఁగాఁ దగదు మా
కద్దాని దెల్పన్ వలెన్
దవునంచున్ వచియింతుమేని పిదపన్
దానిన్ గ్రహింపన్ వలెన్
నవుఁబా ల్గొఁగద యిల్లె నీనడత యు
న్నన్ మీఁదటన్ బాలకా!

వారు వీరు మంచి వస్తువు లెవియేని
చెంత నుంచుకొన్నఁ జేరఁ బోయి
చూచుచుంట మొగము వాచినవానిఁ
బోసఁగినను గ్రహించు టసదుసుమ్ము.

కొంటివి రూప్యముం జెలుచు
కొంటివి దేహము దాని నాఁడు నీ
వంటకయున్న నెంత మరి
యాదగ నుండెడి దాతఁ డప్పు డీ
కుంటయొ లేక మాయెఱుక
కొప్పుగఁ జెప్పియొసంగుటో యగున్
రెంటనుగూడఁ గీ డపస
రిల్లెడిదేకద నీకు బాలకా!

చెడ్డచెల్మి, ధనము చే నుంచుకొను, టిచ్చ
వచ్చినట్లు దాని వెచ్చపెట్టు,
టెంతనర్థమో గ్రహించితె మేలును
గీడు నెఱుఁగనట్టి యీడునందు.

* * * *

నాఁటిచెట్టచేష్ట నాపడ్డపాటును
నాన్న మెఱుకపఱిచినట్టిహితము
నాఁడె కాదు నాకు నేఁడును నేనాఁడు
నెమ్మనమ్మునందు నిల్చి యుండు.

# లింగం వీరభద్రయ్యచౌదరి గారి

# గృహలక్ష్మి

ప్రాణ మలసట జెందినది. ఉదయమున నేగి సాయంతనమున కింటికి జేరుకొనినాడు. ఎడతెగని పని, సేవకుల యుద్దంకులు, ప్రాంక్షేయుల ప్రార్థనలు, సహోద్యోగుల ప్రశ్నలు, ప్రాణము విసిగించి వేసినవి. పైగా, పైయధికారుల తర్జన భర్జనలు. ఈజీవిత మెంత దుర్భరము!—ఎండలు సాగినవి. దిక్కుమాలిన యాపీసులో, ఎలెక్ట్రిక్ ఫ్యాన్సు లేవు సరేగదా ఉన్నపంకాలైన సగము చిరిగిపోయినది. పంకాలాగువా డెంత సోమరిపోతు! ఈరోజులలో సేవకులకు బూర్వ మున్న భయభక్తులు లేనేలేవు. సమయము చిక్కినప్పు డెల్ల బని నెగగొట్టవలె నని చూచుచుందురు. వాండ్ర కింకను దమపనిని దాము నిర్వర్తించవలె నను జ్ఞానము కలుగలేదు. బీగము ఇచ్చిన గడియారము చేతుల వలె పంకావాని రెండుచేతు లెడతెగ కెప్పుడు పనిచేయుచున్నను గాలి యీపాదుమూల నున్న కుర్చీ టేబుల్లకు చేరదు. చేరినకొంచెము, శరీరమును చల్ల జేయుటకు మారుగా శాగ లెగయ జేయుచున్నది. అబ్బా! ఏమి నిస్సారము! దహించుకొనిపోవుచున్న ఆకలిమంటను మాన్పట కింత మజ్జిగనీరైన లేకపోయినదిగదా! ఇక, కడుపుదీరు ఫలహారము, కంచుచెంబులో దెచ్చిన ఇగమువంటి మంచినీళ్ళసంగతి చెప్పవలయునా? ఆఫీసు బానలోని నీళ్లంత శుభ్రముగా లేవు. వాళ్లు మంచి నీళ్లమంచి, పైగా నీహారుగాలి, దుమ్ము అన్నియు నలకలే. నౌకరిచేత దెప్పించుకొనిన సోడానీళ్లమాత్రమే గతి. పాడుముండాకొడుకులు, శుచియా, శుభ్రమా—అసలు సోడాయే బాగుగ నుండలేదు. అప్పటికప్పుడు మరలోనుంచి ఫోర్సుగా బట్టించిన కొంత బాగుగనుండు నేమో?—ఎట్లో కాలము గడిచినది. సాయంత్రము కావచ్చినది. బ్రతుకుజీవుడా పని పూర్తియైపోయినది. ఒక్క పెద్దనిట్టూర్పు విడిచినాడు. ఇక నింటి కేగవచ్చును. తలపువచ్చినది; హృదయ మాహ్లాదపూరితమైనది; ముఖము వికసించినది. సౌందర్యరాశి, దరహాసవదన, తన యర్థాంగి; కలకలలాడు బిడ్డలు. గృహ మెంత యానందదాయకము! తత్‌క్షణమే యింటికి బైలుదేరినాడు. త్వరితముగా నడచి యింటికి జేరుకొనినాడు. చిరునగవుతో దనభార్య యెదురువచ్చినది. 'నాన్నా, నాన్నా' యని కేరింతలు గొట్టుచు పిల్లలు వచ్చి కాళ్ల కడ్డముపడినారు. దేహము పులకాంకితమైనది; జీవితము ధన్యమైనది.

ఆమె యుదయమున జీక టుండగనే లేచినది. వందిమాగధులు గాని, నిద్ర పట్టక జాగరణము చేయు ముసలివాండ్రు గాని, "కోమ టెంకమ పేడ కొచ్చెను... మేలుకో" అని యెలుగెత్తి పాడు కొం టెపడుచువాండ్ర పాటలు కాని యామెకు సాయము జేయలేదు. పక్షుల కిలాకిలారావములు మేల్కొలిపిన వని చెప్పిన నిజముండదు. ప్రభాతమందమారుతములు మెల్లగా, చల్లగా, హాయిగా వీచి ఆమెను నెమ్మదిగా లేపిన వని కవిత్వించలేను. నిజమున కామె పక్షులకు ముందుగనే లేచి యుం

డినది. వీచుచుండినది మందమలయానిలము గాక జిల్లు పెట్టి శరీరమును కట్టెజేయు కటికిశీతవాయువులు. అర నిముసముక్రింపవరకు కౌగిలించుకొనియున్న ప్రియుని శరీరమువేడిమి, హృదయమువ నిశ్చలముగ వెలుంగుచున్న ప్రేమజ్యోతి వేడిమి ఆమెచలిబాధ కుపశమనములు. స్వాభావికముగ జన్మించు 'ఉహుహూలు' పెదవులు దాటి బైటికి రాకముందే మనమున నావరించియున్న సంతోషానందముల మిశ్రమమున జిరునగవులై మొగమునం తటిని గప్పివేసినవి. స్నానము జేసినది; తల ముడుచుకొనినది; శుభ్రవస్త్రము ధరించినది. సంతోషము, తృప్తి ప్రేమ యామెముఖమున తాండవించుచున్నవి. ఇంటి పనుల జక్క పెట్టుట కారంభించినది. బిడ్డలు లేచినారు. వాండ్రు సరిగా నున్నప్పుడు ముద్దులుగాని లేనప్పుడు మొద్దులు. పిల్లలపోరు తల్లికే యెఱుక. ఎంత మంచి బిడ్డ యైనను లేచుటతోడనే వ్యథ కలుగజేయకమానదు. ఉషఃకాలము శిశువులకు, చంద్రునకు రాహుకాల మెట్టిదో, యట్టిదేమో యనుకొందును. పిల్లల కెట్లున్నను, తల్లుల కది నిజముగ గ్రహణకాలమే. గల్లున గగ్గోలుపెట్టుదురు. గగ్గోలుపెట్టుదశ దాటినను, ఏడ్పు మొగములతో వచ్చి కాళ్ల కడ్డముపడుదురు. చిరునగవుతో సౌజన్యముగ కావలసిన దడిగి తల్లిచేత చెప్పించుకొనుట గాని, చేయించుకొనుట గాని చేయుపిల్ల లరుదు. పాప మామెకు నిజముగా చిరాకే కలిగింతురు. ఆమె పనుల కడ్డమువత్తురు. కాని గట్టిగా కసరుకొనదు. "ఎక్కడిపిల్లలురా, మీకడుపు కాల" యని ప్రాతఃకాలపుదీవెన లీయదు. ఎప్పుడును పిల్లలు పిల్లలే. ముండ్లున్న గులాబిపువ్వులు. కష్టసుఖముల కావడికుండలు. వాండ్రను లాలించినది. ముఖమార్జనము మొదలైనవి చేయించినది. నాయనతోపాటు మొగము కడుగుకొనిన మఱింత సంతోషము. ఒకరిద్దఱకు జల్దియన్నము దినునభ్యాసమున్నది. వారికద్దాని బెట్టినది. బట్టలు విడిపించి, తలలు దువ్వి, బొట్టు పెట్టి ముస్తాబు చేసి వాండ్రను బడికి బంపించినది. భర్తకు గాఫీ తీసికొనుటభ్యాసము. అతనికి గాఫీ యుపమాల జేసి యిచ్చినది. భర్తకు గాఫీ యిచ్చుటయామెకు సంతోషము. పూర్వాచారపరురాలైన పూర్వసువాసిని దేవునకు నైవేద్యము బెట్టునట్లామె భర్తముం దుపమా పెట్టినది. గంగాభవానీ సమానురాలు కొబ్బరికాయ గొట్టి లొటలొటమని నీరు వంచునట్లు అతనికప్పులో గాఫీ పోసినది. భగవంతునే మానసికముగ భర్తను జేసికొనియున్న విధవ భక్తికిని, భర్తను దేవునిగా జూచుకొనుచున్న మన పుణ్యస్త్రీ భక్తికిని భేదము రవంతైన లేదు. భక్తి ప్రధానము కాబట్టి, ఆచరణయందు భేద మున్నను, మోక్షమున కిరువురు సమముగనే పోవుదురు.

ఇక వంట జేయుట కారంభించినది. ఏమిసంసారము! ఏదో సంసారపక్షము; ఒక టుండిన నొక టుండదు; దానికి దీనికి జతపర్చవలెను, ముడివేయవలెను. ఒక్కొకప్పుడు గరికతో బచ్చడి చేసి 'రాజును' మెప్పించవలెను; పాకముల నున్నది గాని పదార్థముల కేమి? పప్పులు, ఊరగాయ లిచ్చిన నెంత తృప్తిగానైన భోజనము చేయించవచ్చును. పప్పుపులుసు స్వర్గము జూపించును. అందులో నిమ్మకాయ పిండిన నెంతరుచి? ఇక ములక్కాయసంగతి చెప్పనేయక్కరలేదు. వీనికన్నిటి కేమిగాని నాలుగు పెద్దయుల్లిపాయలు పడినవా రంభతో నృత్యము జేసినట్లే యుండును. భర్తకు గాకరకాయల యంటుపులుసు మిక్కిలి యిష్టము. వానిదుంపదెగ వారము రోజులనుండి ప్రయత్నించుచున్నను ఎక్కడను దొరకుటలేదు. నిన్నసాయంత్రము వెంకటసామి 'రామయ్యగారి దొడ్డిలో నున్నవి. నాలుగు పిందె లడిగి తెచ్చిపెట్టెద' ననినాడు. ఇంకను రాలేదు; ప్రొద్దెక్కుచున్నది. వారికి ఆఫీసువేళ కావచ్చుచున్నది. రెండవ అబ్బాయికి కందిపచ్చడనిన నిష్టము. దానిని త్వరగా జేయవలెను. బుడ్డది రాత్రి సరిగా నన్నము తినలేదు. కొంచెము జ్వరము తగిలినట్లున్నది. సాలె నరసింహమును బిలిపించెద నన్న నా కేమి వద్దులే యంధని బడిలోనికి బోయినది. పొట్లకాయ జ్వరమునకు మంచిది. కొంచెము పెసరబద్దలు వేసి తిరుగబోత వేసిన

బాగుగ నుండును. చిన్నపిందె ఒకటి దొడ్డిలో నుండవలెను. పిల్లలు బడినుండివచ్చువేళ యైనది. వచ్చినప్పటి నుండి 'అన్నమన్న'మని మీద బడుదురు. ఆయనగారేమో వ్రాసికొనుచున్నట్లున్నది. పాపము కాస్తంతసేపు హాయిమని కాలుమీద కాలువేసికొని యింటియొద్ద కూర్చుండుటకు వీలుండదు. ప్రొద్దస్తమాన మొకచేపని వారట్లు కష్టపడి సంపాదించకపోయిన మాపనియేమి కావలెను?—వంట పూర్తియైనది. స్నానము సిద్ధపరచినది. అంగవస్త్రము, తుండుగుడ్డ, కట్టుపంచె తెచ్చి స్నానమునకు లెండని చెప్పినది. భర్తస్నానము జేసినాడు. ఇంతలో బిల్లలు వచ్చినారు. కీచురు, కాచురు. వారికి, భర్తకు భోజనము పెట్టినది. చేతిమీద వేయించుకొనుట పెద్దబ్బాయికి గిట్టదు; నేతిగిన్నె ముందర బెట్టవలెను. అట్లు పెట్టిన నితరపిల్ల లూరుకొనరు. వాడు లాగి, వీడులాగి వాడెక్కువ వేసికొనినాడని, వీడెక్కువ వేసికొనినాడని. పాపము కమలముమాత్రమే పోరులేక తనకు బెట్టిన దేదియో తినును. పెనిమిటికి ములక్కాయ ముక్కలనిన నిష్టము. పప్పుపులుసులో నుండి దేవి నాలుగు ముక్కలు వడ్డించినది. 'నాన్నకువేసినావు. నాకేవి' యని పిల్ల లెగబడినారు. 'లెక్కకు రెండు కాయలే దొరికినవిర్రా, మీనాన్న కవియన్న నిష్ట' మని యెంత చెప్పినను పిల్ల లూరకొనలేదు. తలకొక ముక్క బెట్టినది. రెండవవాడెప్పుడు గడుసే. 'నాకు లేకుండ నన్నియు, నీవే తినుచున్నావే' యని నాన్నను గద్దించినాడు. 'నీమొఖం; గల్లంతు చేయకుండా నీకు పెట్టిన దేదో తిను' అని తండ్రి సమాధానమిచ్చినాడు. ఈరోజున మజ్జిగ గెందుచేతనో మిక్కిలి పల్చగనున్నది. ఫస్ట్ క్లాస్ బత్తాయుండి, దివ్యమైన గడ్డవంటి పెరుగు వేసికొనిన స్వర్గమునకు బెత్తెడెడముగ నుండును. గాని పాడుముండలు, ఈగొల్లవాండ్రు దెచ్చి యమ్మె కటిక నీళ్లు రుచియా, పచియా? నిమ్మకాయచెక్క వేయించుకొని రసముపిండుకొని యింతయుప్పు కలిపినాడు. ఎట్లయిన నిమ్మకాయకు సరిపోయినవస్తు వేదియు లేదు. మామిడియూరగాయ, నిమ్మకాయపచ్చడి, దబ్బకాయ పచ్చడి యందురు గాని మజ్జిగ పల్చనైనప్పుడు వానిపస యేమియు బనికి రాదు. అప్పుడు నిమ్మకాయరసము ఉప్పే కావలసి యుండును. కలిగినదానిని దృప్తిగ భోజనము చేసినాడు. తా నెంత యదృష్టవంతుడు! అందనందములకు దోడు తనభార్య మంచివంటకత్తె. ఆమెపాకము లెంతరుచిగానుండును! సగమన్నము కాకరగాయ అంటుపులుసుతోనే తినివేసినాడు. వేళ కావచ్చినది. బట్టలు త్వరగావేసికొని యాఫీసునకు బైలుదేరినాడు. పెందలకడనే రండని యథాప్రకారము భార్య యనినది. సరేయని చిరునగవుతో దల యెగరవేసినాడు.

తనభోజనము మొదలువెట్టినది మజ్జిగే పల్చనైనది గాని భర్త తృప్తిగానే భోజనము చేసినాడు. పిల్లలకును గాకరకాయకూర యిష్టమే. ఏమియు మిగిలినట్లు లేదు. అబ్బా, ఏమిదుండగీడుపిల్లలమ్మా! ఎగబడి మటి ములగముక్కలు, ఉల్లిపాయలు పూర్తిచేసినాడు. కందిపచ్చడి రుచిగానే యున్నది. కృష్ణుడు మటికాస్త పెట్టవే అమ్మాయని పెట్టించుకొని తిన్నాడు. కమలం తిండి రాత్రికంటె మెఱుగే. ఆసన్యాసికి జ్వరము లోపల నింక నున్నట్లున్నది. నామనస్సులో నట్లుండును గాని, పిల్లలైనతర్వాత జ్వరములు రాక యుండునా? అదే పోవును. భోజనము పూర్తిచేసినది. చావడిలోను, వీథియరుగులమీదను పిల్ల లేదో ఆడుకొనుచున్నారు.

చీకటినుండియు నొకటే పని కొంచెమాయాసముగ నున్నది. పదినిమిషములు విశ్రమించెద ననుకొన్నది. చావడిలో జిరుచాప వేసికొని అట్టె తలవాల్చినది. ఎన్నియో నిమిషములు కాలేదు. గంపెడంతపని యుండగా సోమరిపోతువలె నిద్రించుటేమి! చప్పున లేచినది. కందిపప్పు పూర్తిగావచ్చినది. క్రిందటి యాదివార మొక యిరసకందులు బజారునుండి పట్టించుకొని వచ్చినారు. ప్రక్కయింటి సుబ్బమ్మ కాస్తంతసేపు వచ్చి ఆలాగే వేయించిపెడతాలే యని చెప్పినది. ఆమెకిప్పుడు తీరికగానే యుండవచ్చును. ప్రొద్దు తిరుగకపూర్వమే ఆపని చూడనియెడల మరల నిబ్బందిపడవలసివచ్చును. మినపపప్పు కొంచె మున్నట్లున్నది. వెంకమ్మతీసికొని వెళ్లిన బదులిచ్చిన నిప్పటిలో నంతయి

బ్బంది యుండదు. అనుటయే కాని యీ లేమిడిసంసా
రములో దినినన్ని గారెలకు నోచుకొనినాము! ఎప్పు
డైన ఫలహారము చేయవలెనన్న సెనగపిండియో ఇం
టిలోనుండకపోదు. ప్రక్కయింటి సుబ్బమ్మను పిలిచి
నది. ఆపూర్వసువాసిని రెండుమూడు పిల్పులైనతర్వాత
పలికి, 'ఏమిటొండలమ్మ, దీనిదుంపదెగ ఒకచేదాహము.
ఇప్పుడే రవంత నేపు వోరగిలినాను. నీకేకలు విని యులి
కిపడి లేచి వచ్చుచున్నా'ననుచు లోపలికి వచ్చినది.కంది
పప్పు చేయు టారంభించినారు. పిల్లలు బడికి వెళ్లువేళ
యయినది. వాండ్రను బిలిచి తలాకాస్త అన్నము పెట్టి
నది. బట్టలను సర్ది మొగములు తుడిచి బడికిపంపినది.
సుబ్బమ్మ చలవవలన పప్పు విసరు టారంభించినది. అప్పుడే
మూడుగంటలు కావచ్చినది. వారెప్పుడూ ప్రొద్దున పది
గంటలకు భోజనము చేసి వెళ్లినారు. పాప మాకలి
వేయుచుండ వచ్చును. పనిలో బని చేరెడంత సెనగ
పిండి కలిపి నాలుగు మెత్తనిపకోడీలు చేసిన, వారు
వచ్చుటతోడనే ఫలహారము చేయుదురు. చేతినిండ
డబ్బుండి, నౌక రుండిన నెంతబాగుగ నుండును! మధ్యా
హ్నము రవంత చిరుదిండి చేసి ఆఫీసునకు బంపిన బాగుగ
నుండును గదా— కందిపప్పెట్లో తయారైనది. ఇక
వెళ్లెద నమ్మా యని దోసెడుపప్పు చీరచెరగున గట్టుకొని
సుబ్బమ్మ తనయింటికి వెళ్లి పోయినది. బడి విడిచిపెట్టు
వేళ యైనది. ఒకయరగంటలో బిల్ల లింటి కెగబడు
దురు. త్వరగా పకోడీలు చేయవలెను. వాండ్రు వచ్చిన
పని సాగనీయరు. తొందరగా బిండి కలిపి నేతిలోనొక
సవానేరునకు సుమారు పకోడీలు చేసినది. ఇదిగో పిల్లలు
వచ్చుచున్నారు. "ఏమిటే అమ్మా! ఏదో కమ్మనివాసన
వచ్చుచున్నది. ఏమివండినా వేమిటి? గారెలా, పకో
డీలా, నేతిలో వేయించిన మసాళా సెనగపప్పా? ఏదో
మాకు పెట్టకుండా దాచుకొన్నావు? మాకుకూడ పెట్టవే.
నాన్న యొక్కడే తినవలెనా?" అని పిల్లలు గల్లంతుచేసి
నారు. "మీకు పెట్టకుండా నాన్న కెట్లా పెడతానురా?
లెక్కకు నాలుగు మెత్తని పకోడీలు చేసినాను.
మీనాన్న కవి యన్న నిష్టము ఇవిగో" అని చెరి
కొంచెము చేత బెట్టినది. 'నాన్న కిష్టము గాని
దేమిటి! పకోడీలు ఇష్టమే, గారెలు ఇష్టమే, చక్క
డాలు ఇష్టమే, నేతిలో వేయించిన కారపుసెనగపప్పు
ఇష్టమే. మాకుమాత్ర మవి యిష్టము గావా' యని
దుండగీడు కృష్ణుడు తర్కించినాడు. 'నాన్న సంపా
దించుకొని రాకపోతే నీవెట్లా తింటా వేమిటి పకోడీ'
లని పెద్దబ్బాయి రాముడు తమ్మునకు సమాధానము
చెప్పినాడు. తనకు బెట్టిన పకోడీలు కొంచెము కొంచెము
కొఱికి తినుచు కమలము తృప్తిజెందినది. సరే యిక
లెండి నాన్న వచ్చువేళ యైన దని వాండ్రకు తలలు
దువ్వి స్నానము చేయించినది. శుభ్రమైన బట్టలు తొడిగి
చాదుబొట్టు పెట్టినది. తానుగూడ తల దువ్వుకొని తిల
కము దిద్దుకొనినది. అబ్బా ఏమికంపరమమ్మా చాకలి
అంజిగాడు ఇస్త్రీబట్టలు తీసికొని రానేలేదు. ఇదిగో
నదిగో నని రెండువారములనుండి గడుపుచున్నాడు.
ఆయనగారి కీ నిమ్మపండుచాయ చీర యన్న మిక్కిలి
యిష్టము. ఆచీర గట్టుకొన్నది. ఈసంవత్సర మెందు
లకోగాని మల్లియంటు సరిగా పూయలేదు. పందిరి
బొత్తిగా పడిపోయినది. దానిని కొంచెము బాగుచే
యింపుడని యెంత చెప్పినను భర్త చెవి కెక్కలేదు.
ఏవియో మూడునాలుగు మొగ్గ లున్నట్లున్నవి. వానిని
కోసి కమలము జడలో నిన్ని పెట్టి, తానిన్ని తన జారు
ముడిలో సవరించుకొన్నది. ఐదుగంట లైనట్లున్నది.
భర్త యాఫీసునుండి బైలుదేరి వచ్చుచుండును. పాప
మెంత యలసియుండినారో! వెధవ ఆఫీసు దాదాపర
మైలు నడువవలెను. ఇదిగో వచ్చుచున్నట్లున్నారు.
కాదు, ఎవరో దారిని బోవువారు. ఆ కాలిచప్పుడు
వినవచ్చుచున్నది. చప్పున గుమ్మము దగ్గరకు వచ్చినది.
అబ్బే ఆయనగారు కాదు. కుమ్మరి నాగన్న 'అయ్యగా
రితో కొంచెము పని యున్నదండీ, ఇంకను రాలేదా'
అని యడిగినాడు. వచ్చుచుండవచ్చును. కొంచెముసే
పాగుమన్నది. 'లేదండీ వెళ్లవలెను, తొందరపనియ
న్నది. రేపుదయము వచ్చి దర్శనము జేసికొందు' నని
చెప్పి వెళ్లిపోయినాడు. అట్లే గుమ్మముదగ్గిర నిలబడి
యెదురు చూచుచుండినది.. పదిబారల దూరములో
మలుపు తిరిగి ఆయనగారు కన్పడినారు. హృదయమా

హ్లాదమయమైనది. ముఖము వికసించినది. చిరునగవుపెదవులపై దాండవింప మొదలు పెట్టినది. చప్పున లోనికేగి మందువాడ్గర సిద్ధముగా నుంచియుండిన జలపాత్రను దెచ్చి యెదురుగా వచ్చినది. చేతిగొడు గందుకొని, చెంబు చేతి కందించినది. ఇంతలో నాన్న వచ్చినాడని పిల్లలు కేరింతలు గొట్టినారు. కమలము అంగవస్త్రము దెచ్చి తుడుచుకొనుట కిచ్చినది. లోపలినుండి యొక పింగాణపళ్లెములో మెత్తని పకోడీలు, కాశిచెంబుతో చల్లనిమంచినీళ్లు తీసికొనివచ్చి, చావడిలోని బెంచీబల్లపై జదికిలబడి, ఉస్సురుస్సురనుచు గాళ్లుచేతులు దుడుచుకొనుచున్న భర్తముందర బెట్టినది. వహవ్వా, ఏమి రోఖ్ఖం యీవేళ! మెత్తనిపకోడీలు!— మొత్తముమీద ఊరకుండడు. సంతోషపూర్వకమైన నవ్వు నవ్వినాడు. 'ఏమిరా కృష్ణా, నీపం తైనదా' అనినాడు. 'అయింది గాని నాన్నో...మఱి...' అని కృష్ణుడు నెమరువేసినాడు. 'ఏమిటక్కరిబిరా' యని నవ్వి, ఇవిగో యీరెండు తీసికో' అని పిల్చినారు. కృష్ణుడు బెట్టు చేసినాడు. 'వాడిదివరకే తినినాడు. ఇక వాడిని మారాము పెట్టకండి' అని చేరువ నున్న కుర్చీపీటమీద గూర్చుండియున్న భార్య యాతురతతో ననినది. రాముడు నాన్న ఎంతు నాన్నకే యనుస్వభావము గలవాడు. కమల యెట్లును ఆడపిల్ల. 'నాన్న ప్రొద్దునమొదలుకొని సాయంత్రము వరకు పని చేసినారు. ఎంతో ఆకలి వేసి యుండును' అని జాలితో గూడిన ప్రేమతో ననుకొనినది. ఎంతతృప్తితో భర్త ఫలహారము చేయుచున్నాడు! ఇంక నాలుగు చేయనైతి ననుకొన్నది. 'కుమ్మరినాగన్న వచ్చి వెళ్లినాడు, మరల రేపుదయము వచ్చెద నన్నాడు. మీతో నేదో పని యున్నదట' అని చెప్పినది. 'వాడి మొఖం భడాయికోరు వెధవ. ఏదో పని యున్నట్లు ఆర్భాటాలు చేస్తాడు. చివర కేమియు నుండ' దని కోపగించుకొనినారు. పొరుగింటిసుబ్బమ్మ వచ్చి కందులు పప్పు చేయుటలో దనకు దోడ్పడిన దనియు, ఎందుకు చేతనో గాని, చూపులకు బాగుగ నున్నను, పప్పు ఆటే రాలేదనియు జెప్పినది. మొత్తముమీద సుబ్బమ్మ మంచిమనిషి. ఒకవిషయముగా విధవలు సంఘమునకు లాభమే.

కాని వారికి కోర్కెలు, ఆశలు, తృష్ణలు ఎందులకుండవలెను? భగవంతుడు పరిపూర్ణు డందురు గాని, ఈవిషయములో దెలివితక్కువపనియే చేసినాడు... కాని, తానే ఆడుజన్మమెత్తి పదునాలువత్సరములు దాటకమునుపే విధవయైన నెట్లు భరించెడువాడో?— ఏదో, ఎవరికర్మము వారిది. ఈచల్లని సాయంతన మప్పుడీపాడు తలంపు లెందులకు? భార్యవంక నిండుదృష్టితో జూచినాడు. ఎంత కలకల లాడుచున్నది. ఎంతశృంగారముగా, కన్నులపండువుగా నున్నది! ఆనిమ్మపండు చాయచీరె యామె సువర్ణదేహమున కెంతయింపు నిచ్చుచున్నది. ఆమె కది, దానికామె అతికినట్లు సరిపోయినారు. సుబ్బమ్మ జ్ఞాపకము వచ్చినది. గుండెగుభేలుమన్నది. ఈశృంగారవతి, యీపూచిన తంగేడుచెట్టు కర్మము చాలక విధవ యైన నెంతఘోరము! తా నప్పుడామెను జూచి సహించగలడా? కన్నుల పండువ జేయుచున్న ఈపుణ్యస్త్రీని ఈ అర్ధాంగిని, ఈగృహలక్ష్మిని ప్రచండ ఝంఝామారుత క్రూరహస్తముల బూవుల, నాకుల, లేగొమ్మల గోలుపోయి మోండి యయి మొరటుగ నున్న తంగేడుచెట్టువలె నుండు విధవనుగా జూచుటకు మన సెట్లొప్పును?— చటుక్కున జ్ఞాపకము వచ్చినది. తనలో దాను నవ్వుకొనినాడు. తాను నిండు జీవముతో మిటకరించి చూచుచుండగా తనభార్య విధవ యెట్లగును! భర్తముఖమువంక తదేకధ్యానమున జూచుచున్న భార్య ఏమిటా రహస్య మని సగ ముత్సాహముతోను, సగమువింతతోను అడిగినది. 'ఏమిలేదు. నీ వెంతయు... నీకాచీర ఎంత అందముగా నున్న'దని చిరునగవుతో ననెను. విషయముల నర్థముచేసికొనుట కారంభించిన కమలము కొంచెము సిగ్గుపడినది. తల్లి ముఖమున నన్నియు గులాబిమొగ్గలే. తాను ప్రేమించు భర్త మెప్పెంత సంతోషకర మైనది.

ఫలహారము పూర్తియైనది. 'ఇక బైలు దేరుదమా? ప్రొద్దు గ్రుంకవచ్చుచున్నది. జయలక్ష్మి పెందలకడనే రండి, ఒకఘడియ సేపు గూర్చుండి వెళ్లవచ్చు నన్నది.' అని యామె యనినది. 'ఇదిగో నేను సిద్ధముగనే

యున్నాను. నా నేలంఅంచు కండువా తెచ్చిపెట్టు' అని అనినాడు. భార్యాభర్తలు, పిల్లలు బైలుదేరినారు. వెంకటకృష్ణయ్యగారియిల్లు అదృష్టవశమున నూరికి బైటగా నటుప్రక్కన నున్నది. జనమధ్యముననుండి పోవనక్కరలేదు. ఆమలుపు దిరిగి నాలుగుబారలు పోయిన పంటకాలువ కన్పడును. దాని ననుసరించి రెండుఫర్లాంగులు నడచిన వారున్న వీథిని చేరుకొందుము. ఆవీథిలో గుడిప్రక్క పదియిండ్ల తర్వాత నున్న డాబాయే వెంకటకృష్ణయ్య జయలక్ష్మిగార్ల గృహము. ఎంత చల్లనిహాయిగొలుపు గాలి వీచుచున్నది? ఈసాయంతన సమయమెంతరమణీయము! అదిగో, సూర్యుడు మొగ మెంత ఎఱ్ఱజేసికొనినాడో చూడుడు. కటా, కాలమాహాత్మ్యము! ఈ యుదయముననే యతండు లేత గులాబిరంగుల నీనువదనముతో, ప్రకాశవంతములైన చిరునగవులు నగుచు, స్నేహయుతిముగ దనలేజేతుల జాచి, యందఱి నాలింగనము జేసికొనినాడు. ఈమధ్యాహ్నమున నతడెంత దుర్నిరీక్ష్యుడు! వయోగర్వము. మిత్రులనక, బంధువులనక, ఆశ్రితులనక, సహవాసులనక, యందఱి నెట్లు నిరాకరించినాడో! తనకూ క్ష్ణేక్షణముల నిప్పులు గురియుచు నందఱి నొకమూల నొదిగి యుండునట్లు చేసినాడు—ఆకాలము చెల్లినది. సాయంత్రమైనది, ఇప్పుడో, ముదుసలియై, ఎఱ్ఱగ బండి, ఇప్పటి తన యసహాయత్వమును, కొలదిగంటల క్రిందటనే తాను చూపించిన యౌద్ధత్యమును, తలచుకొని సిగ్గుచే మొగమెఱ్ఱబారినవాడై, ఎట్లు ప్రక్కప్రక్కకు నొదుగుచున్నాడో, దూర దూరముగ బోవుచున్నాడో! చూడుడు. ఈయుదయమున జూపిన మైత్రి, మధ్యాహ్నగర్వమున మాడియుండనియెడల తనయవసానకాలమున నెందఱు తనను గౌరవించెడివారో! తనయెడల నభిమానము చూపెడివారో!! దానికి మారుగ ప్రజాకంటకుడైన నిరంకుశప్రభువుపాలన మంతమొందినప్పుడు జను లెట్లుసంతోషింతురో యట్లె యిప్పు డతనియవసానకాలమున లోకము చల్లబడి సంతోషించుచున్నది. ఈయవమానమును తా నింక భరింపలేడు. సమీపమున నున్న పశ్చిమసముద్రమున ప్రాణముల బాపుకొనుటుత్తమము. అదిగో ఎట్లు సాహసించి చటుక్కున దుమికినాడో!—కటకటా ఎట్టివారికి మృత్యువు తప్పదుగదా—సూర్యభగవానుని చైదములు మనకు క్రొత్తలుకావు. అతనిది దినదిన మరణము, దినదిన జననము. నిత్యము చచ్చి, పుట్టుచుండువారి విషయమున విచార మెందులకు? ఇంతహృదయాహ్లాదకరముగ మలయమారుతము వీచుచు, ఇంత ప్రశాంతముగ భూమ్యాకాశము లుండి, ఇంత కన్నుల పండువుగ వరిచేలు పండి, ఇంతరామణీయకముగ నిరుప్రక్కల జెట్టులుండిన ఒక్కసూర్యునేకాదు లక్షసూర్యులనైనను నిత్యము జంపుటకు వెలుపవలసిన పని లేదు. నాన్నతో ముందు నడచుచుండిన కృష్ణను కబుర్లు కొట్టిపోయుచున్నాడు. వాని స్నేహితుడు సత్యమునకు జిన్నబైసికిలున్నది. నాన్న తన కొకటి కొనిపెట్టడా!—వాండ్ర తెలుగుపంతులు రామమూర్తిశాస్త్రులుగారు బడిలోనికి రాగానే 'నాన్నా, ఏమి జరిగిం దనుకున్నావు, యివ్వాళ? చలమయ్యగారి రామారావున్నాడే వాడు గాంధిమహాత్మునకు జై ఖద్దరుబట్టలకు జై యని కేకలు వేశాడు. క్లాసంతయు గొల్లున గగ్గోలు పెట్టింది. శాస్త్రుల్లగారికి గాంధిమహాత్ముడంటే యెంతో భక్తి. ఖద్దరుబట్ట లన్నా మిక్కిలి యిష్టమే. కాని క్లాసంతా కేరింతలు కొట్టి గల్లంతు చేయటంతోనే శివమెత్తి 'పుండాకోర్ గల్లంతు చేస్తానా' అని రామారావుమీదికి దుమికాడు. రామారావు యీబల్లపైనుండి ఆబల్లపైకి, ఆబల్లపైనుండి యీబల్లపైకి, కోతిగంతులు వేశాడు. దానితో పిల్లలు మఱింత రెచ్చిపోయారు. శాస్త్రుల్లగారు కోపాన్ని పట్టలేక చిందులు ద్రొక్కుతూ, కొండకేకలు వేస్తూ, హెడ్మాస్టరును దీసుకొనివచ్చి మీదుంప దెబ్బుతాను చూడం డని ఒక్కలగువున మా పెద్దపంతులుగారిగది కేగాడు' అని చెప్పసాగినాడు. నాన్నకు తన బాల్యానుభవములు జ్ఞప్తికి వచ్చినవి. నవ్వుకొనినాడు. పిల్ల లెప్పుడును గొంటెవాండ్రే తనబాల్యమున నున్న పిల్లలకును, ఇప్పటిపిల్లలకును ఈవిషయమున భేదమిసుమంతయు లేదు. ఈరోజున చలమయ్యగారి రామారావు గల్లంతుచేయుటలో నాశ్చర్య మేమున్నది? తాను కూడ నట్లు చేసినవాడే. నిజమున కింతికంటె ఘోరములే

చేసియుండినాడు. తనమోకాళ్ల దండెములు, గోడకు
ర్చీలు,కోదండములు జ్ఞాపకము వచ్చినవి. అబ్బా, వేనినైన
భరించవచ్చును గాని, గోడకుర్చీలు భరించుట కష్టము.
రాక్షసులపద్ధతులు గాని యార్యులపద్ధతులుగావు. ఈ
రోజులలోనటువంటి మోటుదండనలు తగ్గిపోవుచున్నవి.
తగ్గిపోయినవనియే చెప్పవచ్చును. ఎట్లయినను గొన్నివిష
యములలో గడచినదినములకంటె ప్రస్తుతమే యుత్తమ
ముగ గన్పట్టుచున్నది. తల్లి కృష్ణుని మందలించినది. 'గురు
వుగారి నట్లు హేళన చేయవచ్చునటరా; భక్తి లేనిది
చదు వెట్లు వచ్చును? పాపము శాస్త్రిలుగార్లు ఈకాల
ముపంతుళ్లలో మిక్కిలి మెత్తనివారు. నిజమున కమా
యకులు. అట్టివారిని గల్లంతుచేయుట మిక్కిలిచెడ్డపని.
నీవుమాత్రము అల్లరిపిల్లలతో జేరవద్దని యామె బోధించి
నది. రామమూర్తి శాస్త్రిలుగారి అమ్మాయి సీత తనసహా
ధ్యాయిని యనియు, మిక్కిలి నెమ్మదియైన పిల్లయ
నియు, వారియింటికి తా నప్పుడప్పుడు వెళ్లుచుండు
ననియు, శాస్త్రిలుగారు మిక్కిలి మంచివారనియు, తన
నెప్పుడాదరముతో బలుకరించుచుందు రనియు; కమ
లము చెప్పినది. అందఱికంటె వెనుక నడచుచున్నరా
ముడు 'శాస్త్రుర్లుగారు మంచివారే కాని, మా హెడ్‌మాస్ట
రుగారు మాత్రం తలతిక్కమనిషి' అనినాడు—ఆ, ఇం
టిని సమీపించినారు. డాబాయరుగులమీద నింటిపిల్ల
లాడుకొనుచున్నారు. వెంకటకృష్ణయ్యగారు డాబాలో
నేదియో చూచుకొనుచున్నట్లున్నది. వీరు సమీపించుట
తోడనే పిల్లలు, తల్లికి జెప్పుటకు చప్పున నింటిలోనికి
బరుగెత్తినారు. ఇంటి యజమానుడు మనవారు వచ్చి
నారని భార్యను కేక వేసినాడు. జయలక్ష్మి లోపలి
నుండి వచ్చినది. 'ఎట్లా, ఐతే వచ్చారమ్మా,లోపలికిరం'
డని తల్లిని బిడ్డలను లోనికి దీసికొనిపోయినది. తండ్రి
వెంకటకృష్ణయ్యగారి యాహ్వానమున డాబాలోనికుర్చీ
మీద కూర్చుండినాడు. తనచేత నున్న కాగితము లటు
వైచి యింటియజమానుడు తన స్నేహితుని కుశల మడిగి
నాడు. 'ఏమిటో చూచుకొనుచున్నా'రని స్నేహితుడని
నాడు. 'ఏమున్నదండీ, ఎప్పుడూ ఉన్నరాద్ధాంతమే
గదా; ఈమధ్యజరిగిన దెబ్బలాటలకోసని యజమానుడు
జవాబిచ్చినాడు. ఔను నిజమే, మొన్న నేగదా ఆయూ
రువాండ్రుకొట్టుకొనినది? ఇరువదియవ శతాబ్దములో మన
మందఱము నాగరికులమైతి మని సంతోషించుచుండగ,
కాట్లకుక్కలవలె నీపోట్లాట లేల? కడుపునకుదిన్నట్లా,
కటికిగట్టుకొన్నట్లా? తెలివితక్కువ ప్రసంగములు,మూర్ఖ
ప్రసక్తులు, వ్యర్థవివాదములు, దురహంకారపునడవడులు,
పశుకృత్యములు. వీడు బజారువెంట వెళ్లుచుండగ వాడు
లేవలేదు. వాడు చెప్పినమాట వీడు వినలేదు. వీడు
తనవోటును వానితరపు మనుష్యున కీయ
లేదు. ఇవి తగాదాకారణములు. మనలో క్షాత్రము
లే దందు రేమి? మనపూర్వులు దండయాత్రలు చేయ
లేదా, దిగంతములు జయించలేదా? ఆక్షాత్ర మెట్లు
చచ్చును? మన కోడిపందెములు, మన పొట్టేళ్లపోరాట
ములు దానిని నిల్పియే యున్నవి. అట్టిచో చచ్చు దద్ద
మ్మలవలె నూరక యుండెదమా? బుజ్జ లెగరవలెను గాని
తప్పో, యొప్పో, నాలుగుదెబ్బలు కొట్టి, నాలుగుదె
బ్బలు పడినదే పౌరుషము. వెంకటకృష్ణయ్య స్నేహి
తుడు ఆకబుర్లు, ఈకబుర్లు చెప్పుకొనినారు—మధ్యాహ్న
ములో జిరుచాపమీద గూర్చున్న యాడంగు లూరక
యుండిరా? 'మీకమల మెంతనెమ్మదియైన పిల్లమ్మా;
ఎంత వయస్సు? పెండ్లి యీడు వచ్చిందికాదా? ఈగాజు
లెక్కడ చేయించారు? బాగానే ఉన్నవి కాని మావారు
మొన్న మా పెదతల్లి కూతురుబిడ్డ పెండ్లికి బెజవాడలో,
శ్రీలక్ష్మిజ్యూయలరీ కంపెనీవారివద్ద తెచ్చినగాజు లంత
సొగసుగా లే వనుకొంటాను. మీరు కట్టుకొన్నచీరె
మిక్కిలి బాగావున్నది. ఎక్కడ కొన్నారు? మొన్నీ
మధ్య చెన్నపట్టణము మాబావకొడుకు వెళ్లుచుంటే, రెం
డుచీరెలు తెమ్మని డబ్బిచ్చాను. అత డింకా వచ్చినట్టు
లేదు.' జయలక్ష్మిమాటలు సాగిపోవుచుండెను. కాని
కృష్ణు డూరకుండెనా? యేదియైన గిల్లి కజ్జము దెచ్చి
పెట్టక మానడు. వారిరంగడు, కృష్ణు డెందులకో కీచు
లాడుకొనినారు; రంగ డేడ్వ మొదలుపెట్టినాడు. తల్లి
కృష్ణుని చీవాట్లు పెట్టి, రంగని బుజ్జగించ మొదలుపెట్టి
నది. జయలక్ష్మి సరసురాలు. రంగనిదే తప్పై యుండు
నని సమాధానపరచ జూచినది. రాముడు కృష్ణునిదో

షము బైట బెట్టినాడు. సరే, ఇక వెళ్లుటకు వేళయైనది. ఈపిల్ల లొకచోట కొంచెమునేపు నెమ్మదిగ కూర్చుండ నిచ్చెదరా? వారును సిద్ధమై యిక బైలుదేరుదమా యని నారు. సెలవుతీసికొని బయలుదేరినారు వెళ్లినమార్గము ననే తిరిగి యింటికి జేరుకొనినారు.

వెంకి పాచి సరిగ నూడ్చి, వంటసామానులు శుభ్రముగా దోమినదో లేదో? చీకటి పడవచ్చుచు న్నది. బుడ్లలోను, లాంతరులలోను చమురు పోయు మని చెప్పుటకు మఱచిపోయినాను. ఆమొద్దు కామా త్రము జ్ఞాన ముండిన నింక గానలసిన దేమి? వంట యారంభించినది. కమలము తల్లికి దోడుపడినది. ఆకలి వేస్తున్న దే అమ్మా' యని కృష్ణుడు కేకలు మొదలుపె ట్టినాడు. ఇదిగో పూర్తికావచ్చుచున్న దని తల్లి సమా ధానము చెప్పినది. ఈపూట యెట్లును ఆలస్యమైనది. స్నేహితు లన్నప్పుడు రాకుండను, పోకుండనా? జయ లక్ష్మి మంచియిల్లాలు. వారి సంసారము మాసంసారము కంటె చాల మెరుగు. ఆయమ్మ యదృష్టము భర్తబా గుగా సంపాదించుచున్నప్పుడు, డాబాలు రాకయుం డునా, వంటకత్తెలు తక్కువ యౌదురా!– ఏమో ఎవరి యదృష్టము వారిది. వంట పూర్తియైనది. భోజనములై నవి. పిల్లలు కొంచెమునేవు చదివి పరుండినారు. స్నాన ముజేసి తాను కూడ భుజించినది. భర్త యేదో పడక గదిలో జదువుకొనుచున్న ట్లున్నాడు. ఇన్ని యాకులు వక్కలు చేత దీసికొని కంచుచెంబుతో నీరు పట్టుకొని గదిలోని కేగినది. ప్రక్కకుర్చీపై నాసీనయైనది. భర్త యామె రాక గ్రహించి యామెవంకకు దిరిగి చిరునవ్వు నవ్వినాడు. తాను నిజముగా నదృష్టవంతురాలు ఏమో! లక్షాధికారులు కాకపోయి నను తాను తనభర్త సుఖముగ గాలక్షేపము జేయుచు న్నారు. తనవివాహమై ఎన్నిసంవత్సరము లైనది? అప్పుడే పెద్దబిడ్డ కమలమునకు పండ్రెండు వత్సరములు దాటినవి. ప్రస్తుత లోకాచారముప్రకారము బిడ్డకు పెండ్లియీడు వచ్చినది. కాని ఆయనగారు పసిపిల్లలకు పెండ్లిం డ్లేమిటి? దేశములో నున్న బాలవిధవలు చాల కాయని కసరుకొందురు. ఏమో ఆయనగారి యిష్టము. 'కమలం సాగింది చూశారా?' అన్నది. అప్పుడే తాను చదువుచున్న దవతలికి బాఱవేసి భార్యవంక ప్రసన్న వదనముతో జూచుచున్న భర్త 'కమలం' దృఢ మైన పిల్ల. ఏపుగా పెరుగగలదు. పెండ్లి, కార్య మని రభసలు పెట్టకపోయిన, చక్కగా బెరిగి యారో గ్యవతి యగు' ననెను. జయలక్ష్మిగారి యింటియొద్ద కృష్ణుడు చేసిన చిలిపితనము జెప్పినది. 'వాడు శ్రుతిమించి పోవుచున్నాడు. జాగ్రత్తపడకపోయిన చేయి మించి పోవచ్చును. చదువులో, సన్యాసి, కరుకే. గుబులు కుదిరి చదివిన వృద్ధిలోనికి రావచ్చును. వానిని బి. ఏ. వరకు చదివించిన బాగుగ నుండును. కాని డబ్బెక్కడనుండి వచ్చును? మీ జీత మెప్పుడు పెరుగు' నని భర్తను ప్రశ్నిం చినది. 'భగవంతుని కెఱుక. నే నెట్లు చెప్పగలను? నాపైయుద్యోగి నాయందు ప్రసన్నుడుగనే యున్నా డు. మాడిపార్టుమెంటులో నున్న చావే యిది. మావంటి చిన్నయుద్యోగుల లావాదేవులు, మాపైయధికారుల ఆ గ్రహానుగ్రహములపై నాధారపడి యుండును!' అని నాడు. భార్య నిట్టూర్పు విడిచినది. ప్రపంచము మిక్కిలి యన్యాయమైనది. పాపము, రాత్రింబవళ్లు వారు కష్టిం చినను, తుదకు బిడ్డలకు సరిగా జదువు జెప్పించుయోగ్యతే యైన నుండదు కాబోలును! 'రాముని స్కూల్ ఫైనల్ తో మాన్పించవలసియుండును. ట్రైనింగునకు పంపించి టీచరును జేయుటయా లేక యేతాలూకాకచ్చేరిలోనో చేర్పించుటయా? ఒకవేళ క్లీడరుగుమాస్తా బాగుగ నుం డునేమో–వానియదృష్టము బాగుగ నున్న ఎంతయైన సంపాదించుకొనవచ్చును. వెంకటకృష్ణయ్యగారి గుమా స్తాను చూడుడు. ఆయనగా రేమి చదువుకొనినారు? ఏఫస్టుఫారమో చదివినా డందురు. మనిషి చూడబోయిన మఱంత తెలివిగలవాడుగా గన్పించడు. మాటలలో గాని, చేతలలో గాని సున్నితము లేదు. నిజమున కొబ్బెరకము మనిషి. అట్టివాడుగూడ సలక్షణముగ సంపాదించు కొనుట లేదా? ఈమధ్యనే దివ్యమైన డాబా కట్టినాడు. వెంకటకృష్ణయ్యగారి డాబా కేమాత్రము తీసిపోదు. ఈయనగారుమాత్రమే యను కొందమన్న, ఆవీధిలోని

రామసుబ్బయ్యగారి గుమాస్తా పనికూడ నాడుజోరుగా నున్నదట. అతడు మూడవక్లాసువరకైనను జదువుకొన లేదట. మొద్దా, దున్నపోతా, ఎందులోనైన పడి చావ రాదటరా' యని తండ్రి మొదలైనవారు శాపనార్థములు పెట్టుచుండెడివారట. వారిపోరు పడలేక యింటిలోనుండి పారిపోయి, అక్కడక్కడ గొన్నినాళ్లు తిరిగి చివరకు రామసుబ్బయ్యగారియొద్ద ప్రవేశించినాడట. ఇప్పుడత డొక పెద్దవ్యవహర్త. ప్లీడరుగారికి మాడ యయిన తనకు వరహాక్లయంటులను పిశాచము వలె పీడించుకొని తినునని చెప్పుకొందురు. ఎట్లేడ్చిననేమి? అప్పుడే యిరువదియెకరముల బంగారమువంటి మాగాణి సంపాదించినాడు. భర్త యుద్దేశ్యము టీచరును జేయవలెనని కాబోలు 'ఇప్పు డేమితొందర వచ్చినది? ఇంకను గొన్నివత్సరములు గడువవలయునుగదా. అప్పటిసంగతి యప్పుడు చూచుకొనవచ్చు' ననినాడు. చటుక్కున మంచమునుండి దిగి భార్యను సమీపించి, 'కొంచెము మంచినీళ్లీయు'మని యడిగినాడు; మంచినీరు త్రాగి రెండవకుర్చీని లాగి దగ్గరగా వేసికొని తానుకూడ తాంబూలచర్వణ మారంభించినాడు. కిటికీ పూర్తిగ దెఱచి యున్నది. ఎంతహాయిగా మలయమారుతము వీచుచున్నది. పూర్ణిమ యెన్నిరోజులలోనో లేదు. శైట పిండియారబోసినట్లు వెన్నెల కాయుచున్నది. ప్రియురాలి యాలింగనమున కెంత యింపైన రాత్రి! మీద జేయి వేసి దగ్గరకు దీసికొనినాడు. దేహముప్పొంగ నిండుగ గౌగిలించుకొని, హృదయమున నత్తుకొనినాడు. ప్రేయసి అర్ధనిమీలతలోచన యైనది. ఆమె మృణాళబాహువు లతనికంఠమును జెనవైచినవి.— హృదయములు కలిసిన దంపతులప్రేమ యెంత గాఢమైనది! ఎంతనిర్మలమైనది! ఎంతనిశ్చలమైనది! దాంపత్యసౌఖ్యము మానవజీవితమును ధన్యము చేయును.

స్త్రీ గృహలక్ష్మి. ఆమె తనయిల్లు పాడుపడిన దేవాలయము పుష్పించిన మల్లెపందిరివలె, పొన్నచెట్టువలె, నామె గృహమును శోభాయమానము జేయును. ఆమెయునికివలన గృహము కలకలలాడుచు, నిరంతరము నవ్వుచుండును. ఆమె భర్తకు జేయూత! అతని కామముల దీర్చునప్సరస; అతని సంసారసాగరమును ధరింపజేయునౌక; అతనిజన్మకు సార్థకము; అతనికి ముక్తి నిచ్చుపరదేవత. ఆమె లేనియెడల నతనిజీవిత మంతయు నంధకారమయము; వ్యర్థము.

---

పెనుమర్తి వెంకటరత్నము గారు

# శకుంతల

౧

తాను మహామునీంద్రుఁడు గదా! సుఖదుఃఖము లాఁగి నిశ్చల
ధ్యానసమాధిలో యుగశతంబులు దివ్యతపస్సుఁ జేసి తా
త్రానధిగమ్య పూర్వవిదితం బగు బ్రహ్మశరీర మందె! నా
నా నిఖిలాండభాండములయందు వెలింగెను సత్తసత్తి యై.

అట్టి మహానుభావుఁ డగునా! మరి యన్యసమాధిభీరువై
కట్టిడి చేఁతలందు నెఱకాఁ డగు నింద్రుని యప్సరోంగనన్
బట్టి గమించి పాశవిక పాశములం బడెఁ గాని లోనఁ జూ
పట్టెడు తేజు మబ్బువడి భావివిధానమునే నెఱుంగఁడే!

సద్యోగర్భజ మైన యానిసుఁగుఁ విశ్వద్వార దుఃఖాగ్రభా
వద్యోతం బగు నేప్పును న్వాని శిలావల్లకీ తాత్మ్యంపు వై
శద్యం బై కనుపట్టు స్వీయపతనజ్ఞానంబుచే దైవమో
పిద్యోగంబున నుండి ముక్తుఁ డయి వచ్చెన్ స్వీయవన్యోర్వికిన్.

౨

క్షాత్రమున నుండి బ్రహ్మవర్చస్సు గొనిన - యాకఠోరతపస్వి, దయావిహీనుఁ
డట్లు తను వీడి పోయెడు నట్టివేళ - నిసువుఁ జూచి మేనక కంటినీరు విడిచె.

పొరలి పొంగెడు వాత్సల్యభరముచేత - విడిచిపెట్టదు! కన్నీరు విడుచుఁ గాని
సృష్టి దేవాళి కపుడె విచ్చేసియున్న - ఆచిఱుతపాప వెన్నెలల్ పూచి నవ్వె!

మానవజీవితమ్ము రసమాధురి కర్థ మెఱుంగరాని లో
కాన జనించి యాదివిజకాంత, యెదో వచియింపలేని-జ
న్మానుగ సౌహృదమ్ము వలనన్ విడిపోవనులేద! యచ్చటే
తానును నాఁగిపోవద! సుధాంధసులన్ విడియుండ లేదునన్.

౩

మానవుఁడె యయ్యు పాషాణుఁడైన గాధి-సూతి, బంధమ్ము లట్లు త్రెంచుకొని
మానవీభిన్నమైన యామేనక కిఁక-భూతలస్నేహసార మేరీతి నుడు? [పోయె!

శ్రావణాకాశ నీలాంబుదావతార - మోహినీమణి, చంచలామూర్తివోలె
భూపథ మతిక్రమించి, తారాపథంపు-టెల్లలం దాటి యెచటికో యెగిరిపోయె!

అటు విడిపోవుచున్న తనయంబ కనుంగొని వెక్కి వెక్కి యే
డ్చుట యొకటే యెఱుంగు! చిఱుసోనల నశ్రుకణంబు లొక్కటొ
క్కటిగ స్రవించి యాతలిరుకందు, దివంబున వంకఁ జూచు త
త్తటగత నీలమేఘ సముదాయములో తనతల్లి కోసమై.

మేనక జాతిగుండెతనమే తన కూఁతగ దివ్యవీథిపై
పైన నతిక్రమించు చనపాగత మైన హృదంతసౌహృద
జ్ఞానముచే నధఃస్థితవిశాల జగత్తును జూచిచూచి యే
దో నిశితంపుటార్తిఁ గనుదోయిఁ దొరంగు కదుష్ణబాష్పముల్.

౪

'దివిజకాంత నిర్ఘృణ యయి తిగిచిపోయె-మనుజుఁ డట్టుల తనదు సమాధి కేఁగె
సృష్టి కాధిపత్యంబు వాంఛింపఁబోవు-నీమహాత్ముల కుండదో యేమొ కరుణ?'

'ప్రేమమయమైన జీవనగ్రామమందు-హింస వెట్టుకిరాతకుం డీనరుండు! [ణాళి.'
జడిమఁ బూని యింద్రియసుఖశయ్యలందుఁ-దదితర మెఱుంగఁబోవ రైంద్రప

'ఓశకుంతములార, మీ రూరకొనక-స్నేహరస మెండిపోయిన జీవకోటి
దప్పికలు తీర ప్రేమదుగ్ధములు పోసి-రండు! రక్షించి పొండు దుర్గతులనుండి!'

అనుచు విహంగరాజులు విహాయసకేళి చరింపఁబోయి యుం
డినపులుఁగుం గుటుంబముల నెల్లను గూడుక సప్తపర్ణవే
దిని కెవుకెవ్వుమంచు నలుదిక్కుల కేడ్చెడు పూపపాప క
ల్లన నిజపక్షచామరములన్ దగ వీచుచుఁ జేరియుండిరన్.

మానవకృతఘ్నతాఫల మైన చిన్ని-పాపఁగని పుల్గుఁ జేల్లు సంతాపపడుచు
ఎఱుకలం గప్పి భానూష్మ చొరనియట్లు-కంటి కొకతెప్పవలె తమకమునఁ బెంచు!

౫

కలికికోయిల జోలపాటలను బాడు-వనమయూరి నృత్యప్రౌఢిమను వచించు
పూలతోఁటల వాహ్యాళిఁ బూవుఁ దేనె-మొగ్గలం దెచ్చి భ్రమరిక లుగ్గుపోయు!

అలససమీరచాలనగతాగతశీతలితోర్మిడోలిలో
మలయదరీకుమార పవమానుఁడు తానములాడి యాశకుం
తలయలకల్ కదల్చు, నలఁతన్ బడ నీక శరన్నిశాకరుం
డలమును గంధముల్ కపుర మద్దినతావి జవాదిచిక్కన్.

మాశకుంతల పెద్ద దై మనసు తెలిసి-అత్తవారింటి కేఁగెడునట్టివేళ
గర్భమంథర యగు లేడిఁగని, విషాద-బాష్పముల జార్చి సంతాపపడెను సృష్టి!

సృష్టిలోఁ గల చేతనాచేతనముల-వలపు గొనియున్న మాశకుంతలను జూచి
ఏరసాలాగ్రమున దాఁగెనేమొ కాని-కాళిదాస పికమ్ము రాగములు మునరె!

---

# గురుశిష్యసంవాదము

కూచి నరసింహము గారు

దసరాపండుగులకు సెలవు లిచ్చినారు కొంత విశ్రాంతి కలిగినది. శిరోభ్రమణ రోగికిఁ జిత్తవిశ్రాంతి సుఖము "కొంత" గాఁ పూర్తిగా నెట్లు లభింపఁగలదు?

నవమినాఁడు నావంటి రుగ్ణున కుదాత్తమనియే చెప్పఁదగిన భోజనము చేసి, పుస్తకాలబల్లప్రక్కనున్న పడుకకురిచీపైఁ గాళ్లు చాఁచుకొని పరుండియుండఁగా నాకుఁ గునికిపాట్లు వచ్చినవి. కన్నులు మూఁతపడినందున జాగ్రదవస్థ యనలేను; చుట్టుపట్లనుండి వచ్చు చప్పుడు చాయగా వినఁబడుచున్నందున స్వప్నావస్థ యనలేను; అదొక చిత్రమైన చిత్తస్థితి! మంపులో మెలఁకువ, మెలఁకువలో మఱపు! మనసు ద్రొక్కిన పటిగడలుమాత్రము మహాశ్చర్యకరములు. పాఠశాలలో మరల పాఠములు చెప్పితిని. పదముల కర్థనిర్ణయము చేయుటలో నిఘంటుకార్యాలయమునఁ బడుచు పండితులతో సకర్మకాకర్మకాది విషయములఁ గూర్చి వివాదములు పెట్టుకొంటిని. లోడితేఁడు తలఁలోని కవియన్నియు నెట్లువచ్చినవో, అంత స్వల్పకాలములో నన్నిపను లెట్లు చేసితినో, తెలియఁజాలను. మనఃపిశాచ మంత పర్యటనము చేసి మరల స్వస్థానమున నెట్లు ప్రవేశింపఁ గలిగినదో, యంతకంటెఁ దెలియదు. అనుభవైకవేద్యమైనయట్టి యనిర్వచనీయస్థితిలో నుండఁగా, "అయ్యా! నమస్కారము" అను మాటలు వచ్చి చెవిని బడినవి. ఉలికిపడి లేచి చూచితిని. చిత్తకల్పితచిత్రసికతాసౌధమంతయు నిట్టెహాలి మాయమైనది కళవళముతోఁ గనులు విప్పి యర్థవ్యక్తము లైన మాటలతో "అయ్యా! దయచేయుఁడు" అని కుర్చీనుండి కొంచెము లేచి, యెదుటనున్న మఱియొక కుర్చీవైపునకు చేయిచాఁపి చూపితిని. "తమ రట్లు మన్నించి దయచేయుమనుట ధర్మము గాదు; నేను మీపూర్వశిష్యులలో నొకఁడను." అని గదిలోనికి వచ్చిన పాతిక ముప్పదియేండ్ల పడుచువాఁడు పలికినాఁడు. మనసు కుదురుపఱుచుకొని తేఱిచూచి "నీవయ్యా, రా, కూరుచుండుము" అని యంటిని. మా యిరువుర కంతట నీక్రింది సంభాషణము జరిగినది.

అతఁడు—నేఁడు సుదినము, ఇన్నాళ్లకు నాకు మీ దర్శనలాభము కలిగినది.

నేను—నాయనా! ప్రాఁత శిష్యులతోఁ బ్రసంగించుట నాకును బరమ సంతోషకరము. నాకు మీరు పోషణశ్రమ మిసుమంతయేనియు నీయకుండఁ బూర్ణప్రేమచూపు ముద్దుబిడ్డలు.

అ—స్వపోషణసామర్థ్యము మాకు మీవలననే కాదా కలిగినది. ఆభారము మాత్రము మేము మీకిచ్చుటమాన లేదు. మిక్కిలి చిక్కినట్లున్నారు.

నే—ఔను నాయనా! ఆరోగ్యము సరిగాలేదు.

అ—అదిగో బల్లమీఁద ఆశ్వయుజమాస భారతీపత్రికయున్నదే అది చక్కని సచిత్రమాసపత్రిక సుమండీ! వివిధవిషయములఁ గూర్చి విఖ్యాతపురుషులు పద్యగద్యాత్మకములగు వ్యాసములు వ్రాసి యందుఁ బ్రకటించుచున్నారు. మీరేమియు వ్రాయుటలే దెందుచేత?

నే—ఓపిక లేదు, తీఱిక లేదు, వ్యాధిగ్రస్తుఁడనై యున్నాను. ఏమైన వ్రాసి పంపుమని మూడునెలల నుండి పత్రికాధిపతు లుచితముగా వారియమూల్యమైన భారతి నాకంపుచున్నారు. నేనపరిగ్రహవ్రతముఁ బూనినవాఁడనుగానుగాని, యూరక పుచ్చుకొని చదువుచునించుకైనను భారతీసేవ చేయఁజాలమి కెంతయుఁ జింతిల్లుచున్నాను.

అ:—వయోధికు లగు డెబ్బదినాలు గేండ్ల వృద్ధాదిసుబ్బారాయకవీంద్రులే యింకను భారతి కేదో వ్రాసి పంపుచున్నా రఁటకాదా?

నే:—ఔను, వారు నాకుగురుతుల్యులు, వయో వృద్ధులేకాక జ్ఞానవృద్ధులు. ఆంధ్రలోకమునకెల్ల వంద నీయులు. ఈ భారతి సంచికలో "విమానము"నుగూర్చి వారు వ్రాసిన సరసపద్యములు చదివి యానందించినాను. వయసుచే వారి కవితాపటిమ సడలినట్లు నాకగపడలేదు. వారిస్థితి వేఱు; అఱువది రెండేండ్లవాఁడనైనను నాస్థితి వేఱు.

అ:—తలచుగాఁ గాకపోయినను, అప్పుడప్పుడైన నేదోయొక గద్యమో పద్యమో వ్రాసి మీరును పంపు చుండరాదా? భారతీపత్రికలలో నావంటి మీశిష్యు లనేకులున్నారు. మీవ్రాఁతలు వారు చదివిచూచి మిమ్మఁ జూచినట్లే సంతోషించుచుందురు.

నే:—బాబూ! నాకును అట్టి సంకల్పముగలదు, కాని సంకల్పసిద్ధికిఁ జాలిన సామర్థ్యమునూత్రము అగ పడుటలేదు.

అ:— ముందు మాట చూచుకొందముగాని, యిప్పుడు నే వేయు ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లిచ్చి, ప్రస్తుత మవి ప్రకటనార్థము భారతీపత్రికకంపి మీచింత కొంత వాపుకొనుఁడు. ఎంతప్రాఁతదైనను, ఇనుప తునుక తోఁ గొట్టినప్పుడు చెకుముకిఱాతినుండి స్ఫులింగములు రాకమానవు.

నే:—చెకుముకి ఱాయియో! చివుకుతాటాకు పాయయో! సాదృశ్యసమంజసత్వమునకేమిగాని, నీవడు గదలఁచుకొన్న ప్రశ్నలడుగుము. శక్యమైన, జవాబు లిచ్చెదను.

అ:—ప్రస్తుత విద్యాపద్ధతి బాగుగా నున్నదా? సంస్కరణము నపేక్షించుచున్నదా?

నే:—నే నధ్యాపకవృత్తి వదలిపెట్టి అప్పుడే రమారమి పది సంవత్సరములైనది. ఇప్పటి విద్యావిధాన మెట్లున్నదో నేనెఱుఁగను.

అ:—కాల మహాప్రవాహములోఁ బదియేండ్లనఁగా నెంత? భేదమున్నను అది యంత గణనీయముగాదు. అప్పటిస్థితిగతులను బట్టియే మీ యభిప్రాయ మీయ వచ్చును.

నే:—అట్లైన, నాకుఁదోఁచిన మాటలు చెప్పుచు న్నాను విను. అవి యందఱకును నచ్చునో నచ్చవో మాత్ర ము నేఁ జెప్పఁజాలను. విద్యావిధానము కేవల విదేశీయ ముగానున్నది. అది మన దేశాభ్యుదయమున కననుకూల మేకాక, యవరోధకము, అతివ్యయాత్మకము, అనర్థ కరము. చదువుకై సర్వస్వమును బోఁగొట్టుకొని వీదికిలఁ బడిన సంసారము లనేకము లిప్పుడగపడుచున్నవి.

అ:— అయ్యయ్యో! అట్లనుచున్నారేమి? ఆంగ్ల విద్యాధికులెంత మంది యెన్ని యున్నతోద్యోగములలోఁ బ్రవేశించినారు! వందలకొలఁది జీతములు పుచ్చుకొను చున్నవారు వేలకొలఁదిగా నున్నారే! గోఁచిపాఁతరాయ లు కుబేరులైనారే! లక్షాధికారులైన లాయర్లతోను, ఎంజినీయర్లతోను, డాక్టర్లతోను, ఇంక ననేకేతరపరి పాలనాశాఖలలోఁ బనిచేసి యుత్తరవయస్సు హాయిగాఁ గడపుకొనువారితోను, దేశము కలకలలాడుచుండఁగా, నిట్టి విపరీతనైరాశ్యపు దీనాలాపములు మీ నోటినుండి వచ్చుట యత్యాశ్చర్యకరముగానున్నది! అందఱ మాట యేల? మీ సుఖజీవన హేతు వాంగ్ల విద్యయా, అన్యమే మైననున్నదా?

నే:—నిజమే, ఆంగ్ల విద్యయే నా మనుగడ సుఖ ముగా సాగించినది! కాని ప్రజాసమష్టిదృష్టివలనఁగాని, యేకైకనిదర్శనములతోఁ జూచు వ్యష్టిదృష్టివలన, దేశము యొక్క వాస్తవికస్థితి గోచరింపఁజాలదు. నీవు బి. యల్ చదివి చరితార్థుఁడవైతివి గదా! నాబిరుదముకంటె నీబిరు దములో రెండక్షరము లెక్కువగా నున్నవిగదా! ఎంత డబ్బు వ్యయముచేసి యా బిరుదము సంపాదించినావు? దానికి బ్రతిఫలముగ న్యాయవాదవృత్తివలన నీవు డెంత గడించుచున్నావు. నిజముదాఁపక చెప్పుము.

అ:—చిక్కు ప్రశ్నయే వేసినారు. మా వృత్తిలో సత్యగోపన మంతదోషముగాదు కాని, గురువుగారియెదుట నబద్ధమాడ బుద్ధిపుట్టుటలేదు. నాచదువుకై చేసిన ఋణము లో సగమైనను ఇంకను నా రాబడివలన నేఁ గూడఁదీసి కొనలేకున్నాను. అది నా లోపముగాదు. ఏకఫలాపేక్ష

లైన నావంటి చతురతరబిరుదాంచితు లనేకులున్నారు. సరకక్కువగానున్న వెల తక్కువ యగునుగాదా!

నే:—కావుననే, నీవంటివారును, నీకంటెను దరిద్రతరదశలో నున్నవారును, దేశములో నెందఱున్నారో యితఃపూర్వము నీవు పేర్కొనిన వారివంటి విత్తాధిపు లెందఱుమంది యున్నారో, కొంచెము నిదానించి చూచుకొందము. మనము చూచుకొన నక్కఱయేలేదు. ప్రభుత్వమువారును, ప్రజానాయకులును బ్రకటించుచుండు లెక్కలే సత్యమునుజాటుచున్నవి. హైందవుని సగటూదాయమును ఆంగ్లదేశస్థుని సగటాదాయమును తావేలు వేసి చూచుకొనుము. కట్టబట్టలేక, తినఁ దిండిలేక మలమల మాడుచున్న క్షామరోగపీడిత జీవచ్ఛవములను జూడుము. బిచ్చకాండ్ర యమితసంఖ్య చూడుము. దేశదుర్దారిద్ర్యమున కింతకంటెఁ బ్రత్యక్షప్రమాణ మేమి కావలయును?

అ—సరియేకాని, దేశదరిద్రతకును, విద్యావిధానమునకును ఏమి సంబంధమున్నది?

నే—ఉన్న సంబంధము నీకుమాత్రము తెలియదా? అది నాచే జెప్పించి పత్రికకంపఁజూచుచున్నావు. అట్లే కానిమ్ము—

చదువునుబట్టి సంపాదనశక్తి యుండును; సంపాదనసామర్థ్యమునుబట్టి దేశభాగ్యముండును. కనుక దేశదారిద్ర్యమునకును దేశవిద్యాపద్ధతులకును సంబంధ మున్నదని చెప్పక తప్పదు. ఏమనెదవు?

అ—వ్యాస మతి దీర్ఘము కాఁగూడదు. మీధోరణికి నేనడ్డురాను; ముందటికి సాగిపొండు.

నే—బ్రహ్మాండమంత భారతభూమిని పాశ్చాత్యులగు నాంగ్లేయులు జయించి దానికిఁ బ్రభువులైనారు. పరిపాలనకృత్యములందు, వారిభాషావ్యవహార సంప్రదాయము లెఱిఁగిన హైందవులు వారికి సహాయముగావలసి వచ్చినారు. కనుక మెకాలేదొరగారు తమవిద్యావిధానమును మనదేశములో నెలకొల్పి కృతకృత్యులైనారు. గొప్ప యుద్యోగములు దొరకుచున్నవని చంకలు గొట్టుకొని మనవారు స్వధర్మ స్వవృత్తులను మానుకొని ఆంగ్ల పాఠశాలలోఁ బ్రవేశింప మొదలుపెట్టినారు. క్రమక్రమముగా బడి జీతములు పెరిఁగినవి. విద్యాభవన నిర్మాణాదులకై వేలును, లక్షలును దేశధనమునుండి వెచ్చింపఁబడినవి. ఇసుళ్ల తెరలవలె, ఏఁటేఁటను బి. ఏ. లును, బి. యలు లును, యమ్. ఏ. లును బయలుదేఱుచుండిరి. ఉద్యోగస్థానములు తక్కువయైనవి; ఉద్యోగార్థు లెక్కువయైనారు. పూర్వవృత్తులు పొలిసిపోయినవి. పదార్థనిర్మాతలు తగ్గినారు. పండినపంట నమలివేయు నోళ్లు బహుసంఖ్యాకములయినవి. విదేశీయభోగపదార్థములు తరంగములవలె వచ్చి దేశముపైఁబడి దేశధన మన్యదేశములకుఁ గొట్టివేయుచున్నవి. అగ్గిపెట్టెలు, గుండుసూదులు, పాళీలు, గాజుసరకులు గడియారములు—ఇట్టి లెన్నియో యన్నోదకములవలె మన కత్యావశ్యకములైనవి. నిత్యోపయుక్తములగుచున్న యట్టివస్తువులు చేసికొనుటయెట్లో దేశీయులకుఁ దెలియదు. అవి మానుకొని వారు తమ పూర్వపుఁ గష్టజీవనము చేయఁజాలరు. వేలకొలఁది యంత్రములు వాడుకలోనికి వచ్చినవి. అవి లేకుండనుండలేము; వానినిచ్చటఁ జేసికొనలేము. అన్నియుఁ బరదేశములనుండి రావలెను. వర్షవర్షమునకుఁ బరాపేక్ష ప్రబలి స్వతంత్రతను జంపివేయుచున్నది. వివిధయంత్రనిర్మాణవిషయకములైన శాస్త్రీయాంశములఁగూర్చి చక్కని విపులవ్యాసము లాంగ్ల విద్యాపారంగతులైన మనవారు వ్రాసి ప్రకటింపఁగలరు; ప్రయోగభాగముమాత్రము పరమరహస్యమైన మంత్రమువలె నింకను బరదేశీయులలోనే యున్నది. డబ్బులేదు; యంత్రనిర్మాణనైపుణి లేదు; బ్రహ్మరాక్షసులవలె నిరువదినాలుగుగంటలును పనిచేయుచుండు యంత్రములతోఁ గతుఁగట్టి యుత్తచేతులు తమ పంతమెట్లు నెగ్గించుకొనఁగలవు? నాయనా, మన దేశస్థితియు క్షయరోగి దేహస్థితియు నొక్కతీరుగా నున్నవి.

అ—నివారణసాధనము లెఱిఁగింపని రోగనిదానము నిష్ప్రయోజనము.

నే— మునిసిపాలిటీలును, లోకలుబోర్డులును భారము వహించి పిల్లలకు, ఆచండాలము ఉచితముగా

నిర్బంధముగాఁ బ్రాథమిక పాఠశాలలలో విద్య నేర్పింపవలెను. చేతిపనులు మున్నగు వృత్తివిద్యలు మామూలు చదువుతోపాటు కలుపవలెను. ప్రైమరీవిద్యతోఁ జదువు చాలించుకొను బాలుఁడు సైతము జీవికకనువైన చిన్న వృత్తివిద్య యేదో యొకటి నేర్చియుండవలెను.

మాధ్యమిక పాఠశాలలు స్థాపించి కొలఁదిజీతములు పనూలు చేసి స్కూలు ఫైనలువఱకు పిల్లలకుఁ బై చదువు చెప్పింపవలెను. బసులుపెట్టు ఇండ్లారోగ్యభంగకరములు గాకున్నఁ జాలును. పిల్లలకును భవనాదులకును అతివ్యయము చేయనక్కఱలేదు. విద్యాశాఖాధికారులు ప్రస్తుత నియమ కాఠిన్యమును తగ్గించి యట్టిబసులు పెట్టుట కనుజ్ఞ యీయవలెను. ప్రాథమిక పాఠశాలలో కంటె నిం దెక్కువగా వృత్తివిద్యలు నేర్ప ఏర్పాటులు గావింపవలెను. మాధ్యమిక పాఠశాలతోఁ జదువు ముగించుకొను బాలుఁడు సుఖజీవనము చేయుటకుఁ జాలిన యొకటి రెండు వృత్తివిద్యలు నేర్చుకొని యుండవలెను. ప్రస్తుతదేశస్థితిలో విత్తకరి గానివిద్య నిష్ప్రయోజనమైన విద్య. తర్క-వ్యాకరణాది విద్యలు నేర్చుకొనియున్న సంస్కృతపండితుల కావిద్య లెట్లుపకరించుచున్నవో, కేవలాంగ్ల భాషావేత్తలకు వారి విద్యలును నుందట్లే యుపకరించును.

ఉన్నత విద్యాబోధకములగు కళాశాలలకు ధనవత్కుటుంబముల బాలురే పోవలెను. సామాన్యసంసారస్థితిలోనున్నవారు తమ తాహతునకు మించిన పరుగులెత్తి పడిపోఁగూడదు. అసాధారణమేధాసంపన్నులగు పేదపిల్లలు, దేశాభిమానులగు వదాన్యుల తోడ్పాటు పడయఁగలిగినచోఁ బైచదువు చదువవచ్చును.

అ:—ఇది చేయవలెను, ఇది చేయఁ గూడదు. అని యేమేమో విధినిషేధవాక్యములు సెలవిచ్చుచున్నారుగాని సాధ్యతాసాధ్యత లాలోచించి చెప్పుచున్నట్లగపడదు. వృత్తివిద్యలు, వృత్తివిద్యలు అందురుగదా; ఆ విద్యలేవి? వర్ణధర్మములు పాటింపరా? బోధ్యవిషయము లేవో, పఠనీయగ్రంథము లేవో, విద్యాపరిసమాప్తికిఁ బట్టు కాలమెంతో, సవిస్తరముగాఁ జెప్పిన బాగుగానుండును.

నే:—నాయభిప్రాయము లిట స్థూలముగామాత్రమే యీయఁగలను. తప్సీళ్లలోనికి దిగిన యెడలఁ బెద్ద గ్రంథమగును

తాటాకులు, వెదురుబద్దలు, పేము – మున్నగువానితోఁ జేయు అల్లికపనులు, నారతోను, పీఁచుతోను నులక, పురిత్రాళ్లు మొదలగునవి పేనుట, వ్యవసాయము, వడ్రంగిపని, కమ్మరపని, చెంబులచేత, పోఁత, నూలు వడుకుట, బట్టలనేత, రంగులపని, దర్జీపని, అచ్చుకూర్పు పుస్తకములు కుట్టి యట్టలు గట్టుట – ఇట్టి వెన్నియో యున్నవి. స్థలమునుబట్టి, ద్రవిణబలమునుబట్టి, యితరపరిస్థితులఁబట్టి, యట్టివెన్నుకొని నేర్పవలెను. చేసినసరకుల వలన వచ్చుసొమ్ములోఁ గొంతభాగము అవిచేసిన పిల్లలకు బహుమతిగా నిచ్చుచుండు నెడల, నది మఱియుఁ బ్రోత్సాహకముగా నుండును.

నాయనా, వర్ణధర్మములు పాటించుకాలము పోయినది. ఏ యెండ కాగొడుగు పట్టవలెను. ఇప్పుడు వర్ణములఁబట్టి వృత్తులు లేవు. ఇప్పుడనే నేల? చిరకాలము నుండి లేవు! వీరివృత్తులు వారును, వారి వృత్తులు వీరును జేయుచున్నారు. వ్యాపారములలో న్యూనాధిక భేదములు చూడఁగూడదు. సరిగా న్యాయ్యముగాఁ జేయునెడలఁ బ్రతివృత్తియును బ్రశస్తమైనదే; తెలివితేటలును, యోగ్యతయునే గౌరవార్హములైన ప్రధాన లక్షణములు.

అ:—మీయాశయమునుబట్టి మాధ్యమిక విద్యయగువఱకు నెన్నియేండ్లుపట్టును?

నే:—ప్రాథమికవిద్యకు మూడేండ్లును, మాధ్యమికవిద్య కాఱేండ్లును–వెరసి తొమ్మిదేండ్లుచాలునని తోఁచుచున్నది.

అ:—వృత్తివిద్యలు చేర్చియును మీరు 11 సంవత్సరముల చదువును తొమ్మిదేండ్లకు దిగలాగినారే!

నే:—ఔను, అనావశ్యకములైన వేడబములు విసర్జించిన యెడల, నించు మించుగాఁ దొమ్మిదేండ్లు చాలుననుకొనియెదను.

నేనుద్యోగము చాలించుకొనిన పిదప, రోజున కొక యఱగంటచొప్పునఁ, దత్పూర్వ మింగ్లీషేమియు నెఱుఁగని స్వకీయుఁడగు నొకబాలున కింగ్లీషుచెప్పి, రెండేండ్లలో నతఁ డాంగ్ల భాషయందు నాల్గవఫారమున కర్హుఁడగుట కనుఁగొనినాను.

ప్రైమరీ తరగతులలో స్వభాష వ్రాయుట, చదువుట, సామాన్యపు లెక్కలుచేయుట-యివి నేర్పినఁ జాలును. ఇంగ్లీషు అక్కఱలేదు. ఉపవాచకపుస్తక ములంతకంటె నక్కఱలేదు. నీతి, ఆరోగ్యము, సత్పురుషుల చారిత్రములు, నిత్యానుభూతములగు వ్యవహార విషయములు, సుగ్రహములగు ప్రకృతిశాస్త్ర విషయములు-వీనిఁగూర్చి చక్కఁగా వ్రాసిన పుస్తకము సంవత్సరమున కొక్కటి చాలును.

ఆంగ్ల భాష మాధ్యమిక పాఠశాలలలోఁ బ్రారంభింపవచ్చును. వ్యవహారమునకుఁ గావలయు నాంగ్ల భాషా జ్ఞానము సంపాదించుకొనుట కా మేండ్లు చాలును. మాధ్యమిక విద్యఁగఱపుబడులందు స్వభాష, రాజభాష, స్వదేశచరిత్ర, భూగోళశాస్త్రము, ప్రధాన ప్రకృతి శాస్త్రములందలి మూలవిషయములు, గణితశాస్త్రము-ఇవి నేర్పవచ్చును. లెక్కలలో క్షేత్రబీజగణితము లంతర్భూతములై యుండవచ్చును.

అవశ్యపఠనీయములు, ఐచ్ఛికములు-అను విభాగము వృత్తి విద్యలలోఁ దక్క ఇతరత్రయుండఁగూడదు. సవిమర్శపఠనీయ భాషాగ్రంథములు, సామాన్యపఠనీయ భాషాగ్రంథములు-అను ప్రస్తుత విభాగ మనావశ్యకము. మంచి గద్యగ్రంథ మొకటియుఁ జక్కని పద్యగ్రంథ మొకటియు-సంవత్సరమునకు భాషలో రెండు సవిమర్శ పాఠ్యగ్రంథములున్నఁజాలును.

వృత్తివిద్యలందును భాషాదీతరవిషయములందును మూడేసి తరగతుల కొక ముఖ్యపరీక్షచేసి, యందు విజయ మొందినబాలురకు అర్హతాపత్రము లీయవచ్చును.

అః-పై కళాశాలలఁగూర్చి మీ రేమైనఁ జెప్పెదరా?

నే:-వాని యనుభవము నా కంతగా లేదు. క్రిందిమెట్ల కనుగుణముగాఁ బై మెట్లు విశ్వవిద్యాలయాధికారులు ఆలోచించి యేర్పాటుచేయవలెను.

అ-తప్పీళ్ళలో కొన్ని తంటాలు రాకమానవు, వానికేమిపోనిండు; మీరుచెప్పినట్లు చేసిన, దేశారిష్టము లన్నియుఁబోవునా?

నే-కొన్ని పోవుననియే నా నమ్మిక. తల తిరుగుచున్నది. సంభాషణమింకఁ బెరుఁగనీయకుము. ఉపసంహారవాక్యములు కొన్ని చెప్పి నాయుపన్యాసము కట్టిపెట్టెదను.

పరిపాలకులకు నిజదేశాభిమానముకంటెఁ బ్రజానురాగ ప్రజాశ్రేయోభిలాష లెక్కువగా నుండవలెను. వారు తమవారికిఁ గల యంత్ర నిర్మాణ పాటవమును, శిల్పనైపుణ్యమును పాలితప్రజావర్గమునకు నిష్కపటముగాఁ గఱపవలెను. దేశమునుండివచ్చు ఆదాయము దేశాభివృద్ధికే వినియోగపఱుపవలెనుగాని దానిని దేశము దాఁటి వృథాగాఁ బైకిఁ బోనీయఁగూడదు. పరిపాలనా తంత్రములో జ్ఞానవంతులగు ప్రజల నంతకంతకెక్కువగాఁ బాల్గొనఁజేయవలెను. యుక్తవయస్సు వచ్చిన బిడ్డను పేక్షించి, యధికారలుబ్ధుఁడై వృద్ధపిత, గృహభారమంతయుఁ దనమీఁదనే యుంచుకొనునట్లు వ్యవహరింపఁ జనదు.

"నా దేశీయులు చేయఁగల పదార్థములు దక్కఁ దక్కిన భోగపదార్థములు సాధ్యమైనంతవఱకుఁ ద్యజించెదను". అని ప్రజలు గట్టిప్రతిజ్ఞ పట్టి యట్లు జరపుకొనవలెను. "పైతృకమగు ఆస్తి కేదో కొంత యధనముగాఁ జేర్చిపోవనివాఁ డప్రయోజకుఁ"డని ప్రతివాఁడును అనుకొని యుచితమైన మితవ్యయముతో నట్లు తాజీవయాత్ర చేసికొనవలెను. సత్త్వవేష ధారియై మనల నిపుడు మోసపుచ్చుచున్న తమోగుణమును దటిమివేసి రజోగుణద్వారమున యథార్థమైన సత్త్వగుణమును సమార్జించుకొనవలెను. పుట్టుకకంటె బుద్ధియు, శౌశీల్యమును, బూజ్యతరములని యెంచుకొనవలెను. అనేక కారణములచేనంతరించిపోయిన ప్రాచీన దయాధర్మసత్య శౌచశౌర్యములు మరల సంపా

దించుకొనవలెను. అన్యోన్యకలహము లణఁచుకొని పరస్పరమైత్రిపరోపకారచింత లలవడఁజేసికొనవలెను. ఉచితవృత్తులగపఱిచి దృఢగాత్రులగు బీదలకు జీవికాసాహాయ్యము చేయుటనిజమైన లోకోపకారకృత్యముగాని, యపాత్రదానములుచేసి సోమరితన మభివృద్ధిచేయుట కేవల దేశాపకారము అని వివేచించి తెలిసికొనవలెను. స్వహితపరాఙ్ముఖత్వ పరహితపరాయణత్వములు సర్వమత సమ్మతములయిన యుత్తమ ధర్మములని యోజించుకొనవలెను.

ఇట్లు మనము నడచుకొనినచో, పోయినకీర్తిసంపదలు మన దేశమునకు మరల వచ్చునని నేనాశాపూర్ణుఁడనై యున్నాను.

అ—చాలశ్రమ యిచ్చితిని. క్షమింపవలెను. నమస్కారము. (అని లేచెను.)

నే—(అర్ధానుస్వారమువలెఁ సురిచిలోనుండిముందటికి సగమువంగి) శుభమస్తు! శ్రీరామచంద్రప్రసాదసిద్ధిరస్తు! లోకాస్సమస్తా స్సుఖినోభవంతు! (అని యాశీర్వదించి మరల వెనుక కొఱగితిని.)



కామమ్మ, యం. ఏ., యం. యల్.　　సుబ్బయ్యా, బి. ఏ., బి. యల్.

# నా నెల్లూరుమండలయాత్ర

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

౨

కందుకూరు చాలాపురాతన గ్రామం. ప్రాచీన పల్లవరాజుల శాసనాలలో కూడా ఈవూరి పేరు వస్తుంది. ఆంధ్రవంశము వారైన సాతవాహనుల తరువాత ఈప్రాంతమును పరిపాలించిన వారు పల్లవరాజులే. ఈ పల్లవరాజుల మొదటిశాసనాలు ప్రాకృతభాషలో ఉన్నవనీ, తరువాతి శాసనాలు సంస్కృతభాషలో ఉన్నవనీ చరిత్రపాఠకులకు తెలిసిన విషయమే. ప్రాకృతమును వదలి సంస్కృతభాషతో శాసనాలు వ్రాయించుట కారంభించిన మొదటి పల్లవరాజుల శాసనములు అన్నీ నెల్లూరి కుత్తరంగా ఉన్న యీప్రాంతాల దొరకినవే. వీరి శాసనాలలో కందుకూరి పేరు కనబడుతూ ఉండడంవల్ల ఇది చాలాపురాతనస్థలం అని చెప్పడానికి సందేహంలేదు.

పల్లవరాజుల రాజ్యం పోయిన తరువాత ఈ దేశం చాళుక్యవంశపు రాజులకు స్వాధీనం అయినది. ఇక్కడ చాళుక్యులనాటి తెలుగులిపిలోని శిలాశాసనం ఒకటి ఉన్నది. అదులో 'గొణకేనల్లాత'ని పేరూ, 'పాండరంగ'ని పేరూకూడా వస్తుంది. ఈ'గొణకేనల్లాత'డు వేంగీచాళుక్యులలోని 'గుణక్కెనల్లాత'డే. ఇతనికి (మూడవ) విజయాదిత్యుడని మరొక పేరు ఉన్నది. ఇతడు కలి విష్ణువర్ధనుని కొడుకు; వేంగీదేశములో క్రీ. శ. ౮౪౮ వ మొదలు ౮౯౨ వరకు రాజ్యంచేశాడు. పాండరంగడు ఇతనిమంత్రే. ప్రతిబింబముతో సహా ఈశాసనాన్ని బట్టరువర్తి, వేణుగోపాలశెట్టిగార్లు తమ నెల్లూరుమండల శాసనసంపుటాలలో ప్రకటించారు. దీనిలో సీసపద్యం ఉన్నదని కనిపెట్టి కీ. శే. కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు ఆంధ్రపరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసంలో ఈశాసనపాఠాన్ని మళ్లీ యిచ్చారు. కందుకూరులో ఈశాసనశిల యిప్పుడు కనబడడం లేదు. కాలం గడచినకొద్దీ వాటిని జాగ్రత పరిస్తేనే తప్ప విడిగా పడిఉన్న శాసనశిలలుకూడా ప్రయాణాలు చేస్తూఉంటవి; అంతర్ధానమూ అవుతూ ఉంటవి.

బట్టరువర్తి వేణుగోపాలశెట్టిగార్ల నాటికి కందుకూరు 'పీర్లభావి' మెట్లలో అడగి మడగి ఉన్న ప్రతాపరుద్రశాసనశిల దొర్లి దొర్లి యిప్పటికి కందుకూరుతాలూకా ఆఫీసు ఆవరణలోకి వచ్చిఉన్నది. దొర్లి వచ్చేటప్పటికి ఆ శిల ముక్కలై రెండుచెక్కలుగా పడిఉన్నది.

'గొణకే నల్లాత'ని శాసనశిల కనబడుతుందేమో అని ఆవూళ్లో దానికోసం చాలా వెదకినాను. కనబడలేదు. దాన్ని ఎవరు పుణ్యంకట్టుకొన్నారో ఏం తెలుసు? ఈ శాసన ప్రతిబింబమును బట్టి చూస్తే దానిలోని అక్షరాలు చాలా చెడిపోయినవని చెప్పవలెను. అయినా ఆప్రతిబింబమునుబట్టి ఆశాసనపాఠం నేనిట్లా చదివినాను.

## చాళుక్యశాసనం: మొదటిపక్క

౧. శ్రీనిరవద్యుణ్డు
౨. సిత్త...సముణ్డు శివ
౩. పదవర . సేవితుణ్డ
౪. ఖిలుణ్డ్రనతరిపుబ
౫. లుణ్డాహవ రాధరణ్డ
౬. యొగ్యసిఘుసనుణ్డ
౭. గణితద (? దా) నా(?)సనణ్డు గ [? జ]
౮. .........

## రెండవపక్క

౯. . లయుణ్డు...హసణ్డ (?)
౧౦. నపణ్డరంగువి .. ణియు గాన్సి

౧౧. కొలదిలేని కో[ట్ట]ంబు ల్వొది (?డి)[చి]

౧౨. గొణకనలాత పక్షపాతి

౧౩. సలలిత... [? ద]. గఁ

౧౪. ...............

మూడవపక్క

౧౫. తారొణ వివ(?డ)వ గొంవ్ల వ్ర (?)

ఇదివరకున్న పాఠాలకంటె పైని నేనిచ్చిన ఈ పాఠం ఎక్కువప్రయోజనకారి అనికాని,చాలాబాగున్నద నికాని నేననను. అయినా శాసనం కందుకూరిది గనుకనూ, నేనక్కడికి వెళ్లడం సంభవించినది గనుకనూ, ఆవూళ్లో ఉన్న శాసనాలను గురించి కొంత ప్రసక్తి వచ్చినది గనుకనూ ఆశాసన పాఠం ఇస్తే ఇందులోకూడా పడి ఉంటుందనిమాత్రమే ఇచ్చాను. ఈ పై పాఠాన్నిబట్టి చూస్తే శాసనంలో తప్పులు ఉన్నవేమో అనిపిస్తున్నది. కాని అక్షరాలు చాలాచెడిపోయి సరియైన పాఠానికి అక్షరమూ అన్వయమూ కలవడం లేదు గనుక ఈశాసన విషయం ఇంతటితో కట్టిపెట్టుతాను.

చాళుక్యులకాలంలో ఈవూరు మంచిదశ అనుభవించిం దనడానికి పాండరంగని అద్దంకి శాసనమే తార్కాణము. బోయరాజులవల్ల ఏ వుపద్రవమూ కలుగకుండా చాళుక్యరాజ్యమును, దక్షిణదిశను కాపాడడానికి ఇది ఆనాడు ప్రధానస్థలంగా ఉండేదని ఆ శాసనమునుబట్టి ఊహింపవచ్చును.

పల్లవ చాళుక్యరాజుల ఏలుబడి అయినమీదట కందుకూరి దశకూడా కొంతకాలంవరకు తగ్గిపోయినట్టు తోస్తుంది. రెడ్లఏలుబడిలో ఊరికి మళ్లీ వైభవంపట్టింది. చాళుక్యశాసనాల తరువాత ఇక్కడ కనబడేవి రెడ్ల శాసనాలే.

పూర్వం ఇక్కడ రెడ్లు కోట కట్టించి అందుండి ఈప్రాంతదేశమును ఏలుతుండేవారని ప్రతీతి. ఇప్పటికీ కోటసంబంధమైనపనిచెప్పి ఈవూరికి ఉత్తరాన్ని కోట గోడలు, దర్వాజా మొదలైన శిథిలావశేషాలు కొన్ని చూపిస్తూ ఉంటారు. కందుకూరికి అనతిదూరంలోనే ఉన్నచుండిలోకూడా రెడ్డిరాజులకోట ఉండేదట. పాతచుండివద్ద ఈకోటకు సంబంధించిన శిథిలావశేషాలు ఇప్పటికీ కొన్ని చూడవచ్చునంటారు అక్కడివారు. చుండిలోకూడా రెడ్లశాసనాలు ఉన్నవి.

కందుకూరు, చుండినగరాలు రాజధానులుగా చేసుకొని పరిపాలించిన రెడ్డిరాజులు కొండవీటి రెడ్లకు బంధువులే. శ్రీశైలంలో పాతాళగంగకు సోపానాలు నిర్మించి కొండవీటిరెడ్డిరాజ్యం స్థాపించిన వేమారెడ్డింగారి సోదరుడు మల్లారెడ్డింగారే ఈ కోవ వారికి మూలపురుషుడు. ఈయన వేమారెడ్డింగారి సేనాధిపతులలో ఒకడు; చాలా పరాక్రమవంతుడు; తురకలను జయించి వారు తీసుకొన్న బ్రాహ్మణాగ్రహారాలు తిరిగి బ్రాహ్మణుల కిప్పించినవాడు. కందుకూరు చుండి ప్రాంతాల గనబడే శాసనాలను బట్టి ఈకోవ వారి వంశావతారక్రమం ఇది.

వీరిలో చాలామంది గుళ్లూ గోపురాలూ కట్టించి ప్రజోపయోగం నిమిత్తం అనేక తటాకాలు నిర్మించారు. శాసనాలలో ఈరెడ్డిరాజులు కవీంద్రప్రకరసురతరువులనిన్నీ, సంగీత సాహిత్య గుణజ్ఞులనిన్నీ, అనేక దేవాలయ తటాకప్రతిష్ఠాతలనిన్నీ పొగడ్తలు పొందినారు. కందుకూరిలో వేమారెడ్డిగారి సైన్యాధిపతి అయిన మల్లారెడ్డింగారి శాసనమున్నూ, ఆయనమనుమడు రాచవేమారెడ్డింగారి శాసనమున్నూ ఉన్నవి. ఈశాసనాలు కోటలోని మసీదు స్తంభాలమీద ఉన్నవి. స్కన్దపురి జనార్దనస్వామివారికి చేసిన దానధర్మాల శాసనాలక్కడ ఉండడంవల్ల ఈమసీదు పూర్వం జనార్దన స్వామి ఆలయంగా ఉండేదనిన్నీ, ఈ స్తంభాలు ఆగుడి మండపస్తంభాలనిన్నీ ఊహించవచ్చును. తురకల 'తళ్లి'లో ఈ ఆలయాని కీగతి ప్రాప్తించి ఉండవచ్చును. ఆలయానికి సంబంధించిన శిల్పపురాళ్లు ఈవూళ్లో భావులవద్దను ఇతరచోట్లను ఇప్పటికీ కనబడుతవి.

రెడ్డిరాజుల ప్రభుత్వంతో ఈవూరిదశ మళ్లీ మళ్లిపోయింది. వారి తరువాత ఈప్రాంతమును ఏలినవారి

శాసనాలేవీ ఇక్కడ కనబడకపోవడాన్నిబట్టి రెడ్డి రాజుల రాజరికం పోయినతరువాత ఈవూరి ప్రాముఖ్యం కొంత తగ్గివుంటుందని తోస్తుంది.

కందుకూరునుంచి పెట్లూరికి బైలుదేరినాను. నాతో మన్మిత్రులు ఆవంట లక్ష్మీనరసింహముగారు* వస్తానన్నారు.




* వీరు ఆవంట సత్యనారాయణగారి సోదరులు. బి. యే. పరీక్షప్యాసయి వైద్యపరీక్ష యమ్. బి. కి చదువుతూ సహాయనిరాకరణోద్యమంరాగానే దేశాభిమానపూరితులై సత్యనారాయణగారు చదువుమానివేసి ఉద్యమంలో ప్రవేశించి కొంతకాలం ప్రచారంచేసి రాజకీయగ్రంథాలూ, స్వరాజ్యగీతాలూ మొదలైనవి ప్రకటించి, చివరకు ఖద్దరులో దిగినారు. కనిగిరి, కందుకూరుతాలూకా గ్రామాలలో గాంధిమహాత్ముని ఖద్దరుఉద్యమం రాకపూర్వమునుంచీ కూడా రాట్నములు తిరుగుతూ ఉండడంచేతనూ, 'మాలనూలు' వాడుకలో ఉండడంచేతనూ, ఆప్రాంతాలు ప్రత్తిపండేస్థలాలు గనుక ముడిప్రత్తి విశేషంగా దొరకడానికి అవకాశంఉండడంచేతనూ సత్యనారాయణగారు కుటుంబసహితంగా కందుకూరులోనే స్థిరపడి ఈపరిశ్రమప్రారంభించి వ్యాపారంసాగించి తమ సర్వస్వాన్నే కాకుండా నిరాడంబరమైన ఆదేశసేవలో చివరకుతమప్రాణాన్నికూడా ఆహుతియిచ్చారు. ఆయనసోదరులైన ఈ నరసింహముగారు ఇప్పటికీ ఎన్నెన్ని విఘాతాలు వస్తున్నా అన్నగారు చూపినమార్గాన్నే పోతూ శక్తికితగినట్లు ఆ పరిశ్రమనేసాగిస్తున్నారు.

1 Kr 43. N. 1. vol II, 568.
2. Kr 35. N. 1. vol II, 549.
3. Kr I8. N. 1. vol II, 503.
„ Kr 19. N. 1. vol II, 505.
„ Kr 21, N. 1. vol II, 515.
4. N. 1. Cd vol. I, 5.
5. Kr 16. N. 1. P 195.
6. అనుబంధము చూడుడు.

వారూ నేనూ ఉదయాన్నే బైలుదేరి పొన్న లూరి మీదుగా వెళ్లినాము. పొన్నలూరు చెరువు చాలా పెద్దది. దీనికింద వరిపంట విస్తారము. పొన్నలూరి మీదుగా పచ్చవ చేరుకొనేటప్పటికి మధ్యాహ్నం పదకొండో, పదకొండున్నరో అయింది. ఆవూళ్లో నడివీథిలో శాసన శిల ఉన్నదికాని తీరా పోయి చూచేసరి కది శీతలయంత్ర మైనది. పచ్చవ పాలేటిఒడ్డున ఉన్నది. ఇక్కడ రమారమి మూడువందలవరకు ఉంటవన్నారు రాట్నాలు. మేము వెళ్లినది పత్తిపట్టేగోజు లవడంచేత పత్తిరాట్నముల చప్పుడు కిఱ్ఱూ కఱ్ఱూ మంటూ వినబడుతూ ఉండేది.

పచ్చవలో భోజనంచేసి మధ్యాహ్నం రెండున్నర గంటలకు మళ్లీ ప్రయాణం సాగించాము. అక్కడక్కడ పత్తిచేలూ, పత్తివిడిచేవాళ్లూ తక్క మాకింక ఏమీ కనబడలేదు. పేరాపురం, జాళ్లపాలెముల మీదుగా సాయంత్రానికి పెట్లూరు చేరుకొన్నాము.

ఇదంతా రేగుకంపరాజ్యం. మోకాలియెత్తున పెరిగే రేగుడొంకలుతప్ప చెట్లూ చేమలూ ఏమీ కనబడవిచ్చట. అంతా రాతిభూమి. మంచిఎండలో వెడితే తలదాచుకోడానికి దారిలో ఎక్కడా నీడ దొరకదు. చెట్టన్నది ఉంటేగా. చెట్లు కనబడుతున్నవంటే అక్కడ గ్రామం ఉన్నదన్నమాటే. ప్రతీగ్రామానికీ ఈప్రాంతాల చుట్టూ చింతతోపులో మామిడితోపులో ఉంటవి. గ్రామందాటితే మళ్లీగ్రామానికి వెళ్లేవరకూ దారిలో చెట్లే కామకదా తుదకు పురుగుకూడా కనబడదు. అంతా ఎడారిలాగుంటుంది. కాకి సంచారం కూడా చూడం. సరిఅయిన బాటలే లేవు. బండి తోవ లున్నది ఏకొద్ది ఊళ్లకోమాత్రమే. ఊరికీ ఊరికీ మధ్య చీలితోవలు హెచ్చు. ఏతోవనుపోతే ఎక్కడికి పోతుందో—వాగుకే పోతుందో వంకకే పోతుందో, కొండకే పోతుందో, వూరికే పోతుందో—దారిలో చెప్పేవా రెవ్వరూ కనబడరు. వర్షాకాలం పైరూపంటారోజులు. కనబడితే అంగణ్ణొకరు ఆమణ్ణొకరు అప్పుడే కనిపించాలి: అంతే. ఏవూళ్లోనూ బ్రాంచిపోస్టాఫీసుకూడా లేదు. కందుకూరితాలూకా పెట్లూరికి అక్కడికి ఎనిమిదో పదోమైళ్ల దూరంలో ఉన్నమద్దులూరినుంచి వస్తాడట ఉత్తరాలుతెచ్చే ఆతను. (ఆమద్దులూరు గ్రామం గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాలోది). ఇతని'బీటు'లో రమారమి ఇరవై రెండు గ్రామాలదాకా ఉన్నవన్నారు నిజమో అబద్ధమో! ఈప్రాంతాల కొన్నికొన్ని ఊళ్లలో బ్రాహ్మణులే లేరు. ఆవున్నబ్రాహ్మణులకుకూడా వరి అన్నం కరవే. శ్రీనాథుడు పల్నాటిని గురించి వ్రాసినట్లు ఇక్కడ

చిన్నచిన్న రాళ్లు – చిల్లర దేవళ్లు
సజ్జజొన్నకూళ్లు-సర్పంబులును దేళ్లు

విశేషం.

జొన్నకలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ

అన్నట్లు రాగిసంకటి, కొఱ్ఱసంకటి, సజ్జసంకటి, ఆరికెలు, వరిగెలు తప్ప ఇంకేమీ లేవు. ఉద్యోగస్థులకోసం కొందఱు కొందఱు కొంచెంగా బియ్యం నిలవచేసుకొని ఉంచుకొంటారు. కొనవలెనంటే ఊళ్లో మళిగ (కోమటి దుకాణం)లో మాత్రం ఏయెఱ్ఱబియ్యమో దొరుకుతవి.

దేశంచాలా దరిద్రదేశం. అంతావర్షాధారం. వర్షములు కురిస్తే పంటా, కురవకపోతే మంటాను. ఇటువంటిస్థితిలో ఈవూళ్లు ఇట్లావున్నవంటే ఆశ్చర్యం ఏమిటి! ఈదేశస్వభావాన్నీ, స్థితినీబట్టి అక్కడివాళ్లు 'ఇదంతా రావణాసురుడు చుప్పనాతికి అరణ మిచ్చిన రాజ్యం' అంటారు నవ్వుతూను.

ఆరాత్రీ ఆమరునాడు ఉదయమూ అక్కడ ఉండి అక్కడిశాసనాలకు ప్రతిబింబాలు తీసుకొని తరువాత సన్నమూరికి బైలుదేరినాము. సన్నమూరికి పొదిలె కొండలు దగ్గరగా కనబడుతూ ఉంటవి. సాయంత్రం ఆవూళ్లోశాసనం ఒకటి ఉండగా దానికి ప్రతిబింబం తీసుకొన్నాం.

తీసిచూస్తే అది పదవశతాబ్దికి పూర్వపుదిగా కనబడలేదు. దానిలో ఉన్న సంవత్సరం తొమ్మిది వందల నలభై పైచిల్లర. చిట్టచివర అంకె తిన్నగా కనబడడంలేదు. ఆసంవత్సరం శకవర్షమో యేమో తెలియదు. వ్రాతలిపినిబట్టిచూస్తే అది శకవర్షమే అవుతుందనితోచింది. ఇట్లా ఆయితే ఈశాసనం నన్నయభట్టారకునికి సమకాలంనాటిది అవుతుంది. ఇది బాణరాజుల శాసనం. ఇందులోని సంవత్సరం నెల్లూరు మండలశాసన సంపుటాలలో ౯౪౦ అని యివ్వడంమూలాన్ని దానికోసం అక్కడికి వెళ్లినాను. కాని ఆశాభంగం కలిగింది ఆ సంవత్సరం చూడగానే. బట్టరువర్తు వేణుగోపాలశెట్టిగార్ల నాటికంటె రాయి చాలా పాడయినది. అందులో దిగువ కొంత మేర ఇటీవల పేడు లేచిపోయింది. నెల్లూరు శాసనసంపుటాలలో ఇచ్చిన పాఠంకంటె మంచిపాఠం ఇవ్వలేకపోయినా వెళ్లి ఆశాసనప్రతిబింబం తీసుకువచ్చాను గనుక దానినిబట్టి నేను చదివిన పాఠం ఈక్రింద ఇస్తున్నాను. ఇందులో కొన్ని అక్షరాలు నాకింకా సందేహంగానే ఉన్నవి. ఇదే సునిశ్చిత మైనపాఠం అని ఖండితంగా చెప్పలేను కాని చాలావరకు దానిని జాగ్రతగా చదివినానని మాత్రం చెప్పగలను.

## బాణ శాసనం: మూలము

వృషభము    లింగము    మూలము

౧. స్వస్తి సకళజగత్త్రయా
౨. భివర్ధిత సురాసురాధీశ ప
౩. రమేశ్వర ప్రతిహారీకృత మ
౪. హాబలికులోద్భవ కృష్ణధ్వజ
౫. విరాజితపైశాచికపటహ[ఘో ?]
౬. [వృ*]ణ వృషభలాఞ్ఛన నన్ద
౭. గిరినాథ పటీగిపురపర మే
౮. [శ్వ]ర బాణవోడ్డణ బలికు
౯. లార్జున గటు(ఘు)సణ్డియణుచ
౧౦. . దిన. చి(?) శ్రీమత్ (?)
౧౧. అగ్గపరాజు సంవ్సర ౯౪[౫?]
౧౨. యగు నేణ్టి వైశాఖపుణ్ణమ కు
౧౩. క్రవారంబునాణ్డు ప్రసన్నగూరి అగ
౧౪. స్తీశ్వరభటారనికి పెద్దరాజ్య
౧౫. నయు(?) కొణ్డు(?)క రాజ్యనచేతం గొని ఇ
౧౬. చ్చినభూమి ఇరువొదినాలుగు మ
౧౭. [ఱు]తుర్ల నేల పెద్దరాజ్యనయు కొ(?) ణ్డు(?)
౧౮. [క] రాజ్య...నతిభోగము (?) న .
౧౯. పన....[సా*]క్షి జేసరట్టశి
౨౦ ..... ...రివాగ..
౨౧. ............నయుచి..
౨౨. .........సన్మంధంబు
౨౩. .........మయ్యి [స్వ*]దత్తం
౨౪. వాపరదత్త[ంవా యో*] హరేతు వసుం
౨౫. ధరాం షష్టిం వర్షసహస్రాణి వి
౨౬. ష్టాయాం జాయతే కృమి

ఈబాణరాజుపేరు అగ్గపరాజని ఉన్నది. ఇంకా ఈదేశాన్ని క్రీస్తుశకం పదివందల ప్రాంతమున కొందరు బాణరాజులు పాలిస్తూ వున్నట్టు ఈశాసనంవల్ల స్పష్టమవుతున్నది. శాసనంలో ప్రసన్నగూరిపేరు వచ్చినది. ప్రసన్నగూరే ఇటీవల సన్నమూరు అయినదనుకొని ఈవిషయమై ఆవూరికరణంగారిని కూడా అడిగినాను. ఐందసంవత్సరములకు పూర్వంవరకూ 'గ్రామలెఖ్ఖ'లలో ఈవూరిని ప్రసన్నగూరనే వాడేవారని చెప్పినారు.

ఆమరునాడు ఉదయం సంగమేశ్వరానికి బైలుదేరినాము. మేము జువ్విగుంట, అయ్యవారిపాలెం, బోసంవారి పాలెములు గడచి జగ్గరాజుపాలెం వచ్చేటప్పటికి దాదాపు తొమ్మిదిగంట లవుతుంది. పక్కవూళ్లలో ఎక్కడో కలరా ఉన్నదట. మేము ఆవూళ్లనుంచి వచ్చినామనుకొని జగ్గరాజుపాలెం సంసారులు మేము ఆవూళ్లోకి వెళ్లగానే మాదగ్గరకు గుంపులుగా వచ్చి 'అయ్యా! బిడ్డా పాపా ఉన్నవాళ్లం. వూళ్లోకి రాకండి; వూరవతలనుంచి తోవవుంది. ఆతోవమీదుగా పొండి' అని వేడుకోవడం మొదలుపెట్టినారు మమ్మల్ని. మాకు మొదట కొంతవరకిది అర్థంకాలేదు. ఈప్రాం

తాల ఏవూళ్లోనైనా కలరా వస్తే రెండోవూరివాళ్లు ఆవూరివాళ్లను తమగ్రామంగుండా పోనివ్వరు. అట్లాపో నిస్తే కలరాతగిలిన గ్రామాలనుంచి వచ్చేవాళ్లు కలరా దేవతను వెంటతీసుకొనివచ్చి తమ గ్రామంలో దిగబెట్టి వెళ్లిపోతారని భయమట. ఎవరోఒకరు వెనుక కొంతకా లంక్రిందట కలరాతగిలినవూరినుంచి వస్తూ దానిని వాళ్ల వూళ్లో దిగబెట్టిపోయినారట. అప్పుడు వూరంతా చేట లతో చెరిగిందట అమ్మవారు. అందువల్ల వారి కంతభయం. మేము కలరా ఊళ్ల లోనుంచి గావడంలేదని వారికి నమ్మ కం పుట్టించేటప్పటికి మాకు తలప్రాణం తోకకు వచ్చింది.

జగ్గరాజుపాలెం కొంచెం గడచి ముందుకు వెళ్లేటప్పటికి సంగమేశ్వరం దేవాలయాలు కనబడుతూ ఉంటవి. మేము దే వా ల యా ల ద గ్గ ర కు వెళ్లేట ప్ప టి కి ప ది న్న రో, ప ద కొం డో అవుతుంది. సంగమేశ్వరాలు నెల్లూరులోనూ దత్తమండలాలలోనూ కూడా చాలా ఉన్నవి. ఎక్కడ రెండేరులు కలిస్తే అక్కడల్లా సంగమేశ్వరుడు వెలుస్తాడు; ఆస్థలం గొప్ప పుణ్యతీర్థ మవుతుంది. ఈసంగమేశ్వరం మాకేరు పాలే రుల సంగమస్థలంలో ఉన్నది. ఇక్కడ ఊరేమీ లేదు. శివరాత్రికి ఇక్కడ గొప్ప తిరునాళ్లు సాగుతుంటట. యాత్రికుల సౌకర్యార్థం సత్రం ఉన్నది. ఈసంగమేశ్వ రునికి అర్చనాదికములు చేసేఅర్చకులు అక్కడికి సమీ పంలోనే ఉన్న చెన్నుపాటినుంచి వస్తారట., చెనుం పాటినుంచి యేళ్లగుండా రావాలి వారు. వర్షాకాలాన యేళ్లు పొంగినప్పుడు సంగమేశ్వరానికి రావడం కష్టం. అందువల్ల చెన్నుపాటిలో కూడా సంగమేశ్వరస్వామి ఉన్నాడట. ఆరోజులలో అక్కడనే నైవేద్యాదికములు జరుపుతూ ఉంటారట. మే మక్కడ శాసనాలకోసం వెదకినాము. ఆగుడిఆవరణలో రెండుశాసనశిలలు పాతి ఉన్నవి. అవి నెల్లూరుమండల శాసనసంపుటాలలోనికి రాలేదు. అందువల్ల అవి పదవశతాబ్దికి పూర్వపు శాస నాలు కాకపోయినా వాటికికూడా ప్రతిబింబాలు తీసు కొన్నాం. వాటిపాఠము ఇక్కడ ఇస్తున్నాను. అం దులో ఒకటి పల్లవరాజశాసనం. దీనిని ఒకప్రక్క కిందినుంచి పైకివ్రాశారు. అందువల్ల శాసనప్రారంభం కింద ఉన్నది.

పల్లవశాసనం: మొదటిపక్క

౧. స్వస్తి అనేకమహీమం[డ్డ]
౨. లంజధిరాజరజప
౩. రమేశ్వర పరమవంశోద్భ
౪. వపల్లవ కులతిల [క]
౫. భారద్వాజగోత్ర లలితార్ధచ
౬. ంద్రధర ఖట్వాంగధ్వజ కడు
౭. వాయుపఱిషణోవణ వృమభ
౮. లాంఛన వెంగ్గళనాథకాంచ్చీ
౯. పురవరధీశ్వర కామకోట్యం
౧౦. బికలబ్ధ వరప్రసాద నొడువ
౧౧. డిసహోసార్జున నిజసేవకాభర
౧౨. ణా బంధుజనాశ్రయప్రసన్నప్ర
౧౩. చండ్డజలదంక్కౖరన భు
౧౪. [వన *]నారాయణ కుమారకందర్ప స్వ
౧౫. ......సురమఖు(కు)టఘటితచరణా
౧౬. [రవింద *][భూ]లోకచతుర్వర్ణాన్నాశ్ర
౧౭. [మధర్మరక్షణ *] దిగ్విజయార్చితగం
౧౮. ......[శ్రీపర్వతపూర్వదిగ్భాగస్స *] [ప్ర]స
త్రగహార [ప్ర]
౧౯. [తిష్ఠిత శ్రీమన్మ *] [క్క]ంటికడువె[ట్టి*]
౨౧. [వంశావతారులైన శ్రీమను*]మహామం
౨౧. [డలేశ్వర...........*]

రెండవపక్క

౨౨. ......కూడలిసంగ[మేశ్వర*]
౨౩. [శ్రీ] మహాదేవని [అమృ]
౨౪. తపడ్మకున్న అంగరంగ[వై]
౨౫. భవభోగరాగషోడచో(శో)ప
౨౬. చారాలకున్న..ంగ...
౨౭. చన్నునిపాడుగ్రామద్వయ[ం]
౨౮. ఆచంద్రార్కస్థాయిగాను తీ.
౨౯. [ర*]నదిమాకేటిపాడలి

౩౦. పుణ్యసంగ్గమంలోను
౩౧. దారాదత్తంసేశి సపుపిఃతా
౩౨. ంస్తిమి అష్టలోకధర్మ
౩౩. పాలకులుసాక్షిగాను ఇస్తి
౩౪. మియాధర్మము ఎరింగి
౩౫. న్నితిరస్కరించక పాలిం
౩౬. చ్చినపుణ్యుల పాదపద్మ
౩౭. ములు తమశిరసున నుం
౩౮. తును॥స్వదత్తా ద్విగుణ
౩౯. ం పుణ్యం।పరదత్తాను
౪౦. పాలనం।పరదత్తాపహారే
౪౧. ణ। స్వదత్తం నిష్ఫలం భ
౪౨. వేత్॥ మంగళమహా
౪౩. శ్రీశ్రీంజేయును॥

శాసనంలో రాజు బిరుదులూ, దానంచేసిన గ్రామమూ మొదలైనవి వర్ణితమైన భాగం బాగానే వుందికాని అసలురాజుపేరుగలభాగంమాత్రం పోయింది. అందువల్ల శాసనం ఉండీలేనట్టే. ప్రయోజన విరహితం.

నెల్లూరుమండలంలో పరిపాలన సాగించిన పల్లవ రాజులు కొందరు కనబడుతున్నారు. వీరి శాసనాలు దర్శి (౪౩, ౬౯ నెంబర్లుగల శాసనాలు), కందుకూరు (౬౧, ౬౨, ౬౩ నెంబర్లుగల శాసనాలు), కనిగిరి(౨౪ వ నెంబరు శాసనం), ఉదయగిరి (౬ వ నెంబరుశాసనం) తాలూకా గ్రామాలలో ఉన్నవి. ఈశాసనాలువ్రాయించిన పల్లవరాజులందరూ ముక్కంటికాడువెట్టివంశావతారులమని చెప్పుకొన్నవారే. వీరందరు ఒకరిద్దరు తక్క క్రీస్తుశకం పదుమూడవ శతాబ్దిలోవారే. కనిగిరి, ఉదయగిరి శాసనాలలోని పల్లవరాజ బిరుదులే దీనిలో కూడా ఉండడంచేత సంగమేశ్వరంలో శాసనం వేయించిన పల్లవరాజుకూడా కనిగిరి, ఉదయగిరి పల్లవరాజ వంశములలోనివాడై ఉండవచ్చును.

ఇక సంగమేశ్వరంలోని రెండవశాసనం చాలా ఇటీవలిదని తోచింది. అయినా దాని పాఠంకూడా ఇక్కడ ఇస్తున్నాను. ఖిలపడివున్న శివాలయమును ఉద్ధారం చేసినప్పుడు వేసిన శాసన మిది. దీనిలో రాజు పేరులేదు. శాసనంకూడా అసంపూర్తే. శకవర్ష సంఖ్య ౧౩౦౭ అని ఒకవిధంగా చెల్పవచ్చును కాని దానిని మాటలతో తెలిపేవిధంకూడా మరచిపోయిన ఇటీవలి కాలంలోనే ఈశాసనమును వ్రాశారేమోఅని నాతలంపు.

శాసనపాఠము

నంది చంద్రుడు సూర్యుడు

౧. శ్రీ శకవర్షాశేశిరామాగగనక్షి
౨. సంఖ్యప్రభవాద్బ।(బ్ద) ఆశ్వయుజ శు
౩. క్లపక్షధర్మ (ప్రథమ?) తిథి శివాలయం
౪. కుర్యాత్ శ్రీశైలశిఖర ఆ[గ్నే]
౫. యభాగే పంచాధశయో
౬. జనవిస్తార ఆయామభూ
౭. తు సమూర్ణ క్షీరవాహినీ
౮. మాంకేటిసంగముపుణ్యతీ[ర్థ]
౯. సంగమేశ్వర థేవఖిలమంధిరం
౧౦. శిఖరపర్యంత కుర్యాత్ థేవం
౧౧. ధ్రుండ మొథలైన దిక్పతు
౧౨. లున్ను ఆదిత్యాథి నవగ్ర
౧౩. హాలున్ను పృతివ్యప్సుతే
౧౪. జోవాయురాకాశములు
౧౫. న్ను అహోరాత్రములును
౧౬. సంవత్సరమాసరుతు
౧౭. వులున్ను దశదిక్కులు
౧౮. [న్ను] ... ... ..

రెండవపక్క

౧౯. అష్టదిగ్గజాలు [సు*]
౨౦. కృతదుష్కృతంబులుం [న్ను*]
౨౧. స్థావరజంగమంబులున్ను
౨౨. యధిం ... ... ...

# ఆకస్మిక ఛాయాచిత్రములు

## (Snap Shots)



౧. కష్టజీవులు



౨. వెన్నయందు ఈదులాట



౩. భాగస్వాములు



౪. గమసుదనము



౫. పినాకినిమీాది ఆనకట్ట-రైలు వంతెన

ఛాయాచిత్రకారులు: శ్రీ డాక్టరు కె. యస్. ప్రసాదరావుగారు, పొదలకూరు, నెల్లూరుజిల్లా.

శాసన ప్రతిబింబాలు తీసుకొని వేసవి ఎండ చాలా తీక్ష్ణంగా ఉంటే అక్కడ దేవాలయమంటపం లో కొంతసేపు విశ్రమించాము. అక్కడికి కొందరు గొల్లలువస్తే వాళ్లతో కాటమరాజుకథనుసరించి ప్రసంగిస్తూ కూర్చున్నాము.

ఈప్రాంతమంతా కాటమరాజుఏలినదే. సిద్ధిరాజుకున్నూ, కాటంరాజుకున్నూ యుద్ధంజరిగినది ఈసమీపాన్నే. కందుకూరినుంచి కనిగిరివెళ్లేతోవలోనే అలవలపాడూ పంచలింగాలకొండా ఉన్నవి. కాటమరాజు తండ్రి పెద్దిరాజు అలవలపాటి కధిపతి. పంచలింగాల కొండ పరిసరప్రాంతము ఖడ్గతిక్కన సమరక్రీడసలిపిన మహాక్షేత్రము.

అలవలపాటి సమీపాన్ని నేరేళ్ల వాగు ఒడ్డున ఉన్న పంచలింగాలకొండదగ్గర ప్రతీయేటా వైశాఖ పౌర్ణమికి గంగతిరునాళ్లు సాగుతుందట. ఆరోజున కందుకూరు, కనిగిరిసీమలనుంచి 'ఎక్కడెక్కడివాళ్లూ' రెండెడ్ల బళ్లుకట్టుకొని, రంగురంగుల చీరలూ మొదలైనవి గూళ్లుగాకప్పి, ఎడ్లకు వింతవింత అలంకారాలు చేసి ముస్తాబై వస్తారట. కోటప్పకొండ (గుంటూరు), జగ్గన్నతోట (తూర్పుగోదావరి)లలో ప్రభలతీర్థంసాగినట్లు ఇక్కడ బండితీర్థం సాగుతుందట. వచ్చినయాత్రికులంతా ఆవాగుఒడ్డున గంగమ్మకూ కాటమరాజువారికీ పశుక్షేమంకోరి పొంగళ్లు పొంగిస్తారట. నేరేళ్ల వాగు దగ్గర కొండమీద పంచలింగాలున్న ఆలయం ఉన్నది. కొండకింద సమీపాన్ని రావిచెట్టున్నస్థలం దగ్గర యాదవ వీరులు యుద్ధానంతరం ఏట్లోకడిగిన కత్తులు పాతినారని చెప్పుతారు. వాగుకవతలి ఒడ్డున సమీపాన్నే గంగ దేవళం ఉన్నది.

పశువులనిమిత్తమై వచ్చిన యుద్ధంలో యాదవులైన కాటమరాజువారే గెలిచారుకనుక ఇప్పటికీ ఆప్రాంతపు పశుపాలకులకు వారిమీద ఉండేభక్తి అట్టిది. ఇప్పటికీ ఆ ప్రాంతాలవారికీర్తి మాసిపోలేదు. మన్యాలకూ, కొండలకూ మేతకోసం పశువులను తోలుకుపోయేటప్పుడల్లా పశుధనంకలవారందరూ అవి తిరిగి సురక్షితంగా ఇల్లు చేరుకొన్నట్టయితే పొంగళ్లు పొంగిస్తామని కాటమరాజువారికి మ్రొక్కుకొంటారట. ఎప్పటి యుద్ధం! ఎప్పటి కాటమరాజు! ఇప్పటికీ పోలేదు విజయుడైన ఆరాజు పలుకుబడి! ఆప్రాంతాల కాటమరాజువారికి గుళ్లుకూడా లేచినవి! మారెళ్ల సీమలో ఇప్పటికీ కాటమరాజు శిలావిగ్రహాలను చూడవచ్చును. మారెళ్లగ్రామం కనిగిరి తాలూకాలోనిది. ఈమారెళ్ల ప్రాంతమే మారెళ్లసీమ

గంగగుడి ఉన్నచోట్ల సాధారణంగా కాటమరాజువిగ్రహం కనబడుతూనే ఉంటుంది. గంగ కాటమరాజువారికి కులదేవతట. పశువులకు సంబంధించిన వివాదంలో విజయముపొంది ఆప్రాంతాలపశుధనంకలవారి పాలిటి పరమదైవమైనాడు కాటమరాజు.

కాటంరాజు కథకు ప్రచారం విశేషం అక్కడ. అలవలపాటి గంగతిరునాళ్లలో రాత్రులకు రాత్రులు భట్టురాయబారము, యఱ్ఱగుడిపాటి పోట్లాట, కాటంరాజుకథ- ఈమొదలైన పాటలలోనే గడచిపోతవట.

కాటంరాజువారు అసలు తమకథ ప్రచారంచేయడానికి అధికారంఇచ్చినది కొమ్మువాళ్లకట. వీళ్లది మాదిగలలో ఒకకులం. కాటంరాజువారి కథలు మాసిపోకుండా కాపాడినది వీరేనట. ఇందుమూలాన్ని యాదవులైనగొల్లలు వాళ్లను ఎక్కువగా గౌరవిస్తారట. ఎప్పుడైనా కొమ్మువాడు యాదవుల(గొల్లల) ఇంటికి వస్తే వానికి ముందు భోజనంపెట్టకుండా గొల్లలు భోజనం చేయరాదట. ఇప్పటికీ ఈఆచారం సాగుతున్నదట. తమ పూర్వచరిత్రను కాపాడిన ఆజాతికి గొల్లలు ఇంతవరకు చూపించిన, ఇప్పటికీ చూపిస్తున్న అఖండగౌరవం ఇది.

ఈకథలు పాడేవాళ్లు గొల్లలలో కూడా ఉన్నారట. వారికి పికిలివాళ్లని పేరు. వీరు ముఖ్యంగా కందుకూరుతాలూకా ముప్పాళ్లలో ఉన్నారు. వారికి వంశపరంపరగా వస్తూఉన్నవృత్తే ఇది. కందుకూరు తాలూకాగ్రామాలలో ఎక్కడెక్కడ అమ్మవారి జాతరలైనా ఈపాటలు పాడేనిమిత్తం వీళ్లు వస్తుంటారట. ఇందుకు

వీళ్లకు (వృత్తిమాముళ్లు)నివర్తనలు ఉన్నవట. పంచ లింగాలకొండగంగతిరునాళ్లలో కొమ్మువాళ్లే కాక పికిలివాళ్లు కూడా ఈపదాలు పాడుతారట. కాని అక్కడ ఆచారం ఏమిటంటే ప్రాచీనసంప్రదాయ గౌరవాన్ని బట్టి కొమ్మువాళ్లు ముందుగా గుడా రెత్తితేనే కాని పికిలివా ళ్లెత్తకూడదట. ఇవి కాటమరాజు కథకుసంబంధించిన ప్రాచీన సంప్రదాయాలు ఆప్రాంతాల వాడుకలలో ఉన్నవి.

కొంచెం ఎండ చల్ల బడినపిదప పాలేరుదాటి మంగినపాటిమీదుగా కందుకూరు కనిగిరిరోడ్డుమీద ఉన్న వెంకుపాలెం చేరుకొన్నాం సాయంత్రానికి. అక్కడికి రాగానే మాకు మళ్లీ స్వదేశంలోనికి వచ్చినట్లయింది. అక్కడినుంచి 'బస్సు' మీదుగా కందుకూరు వెళ్ళినాము.

అంతవరకు నాతోపాటు కష్టాలకోర్చుకొని నాకు సహాయభూతులైన లక్ష్మీనరసింహంగారిని అక్కడ దిగబెట్టి వారికి వందనాలు సమర్పించి సెలవుపుచ్చుకొని ఆమరునాటి ఉదయం 'బస్సు' మీద కనిగిరికి వెళ్ళినాను.

కనిగిరిలో రెండురోజు లాగి అక్కడినుంచి పామూరుమీదుగా నలజనంపాడు వెళ్లినాను. పామూరులో గొప్ప చెరువున్నది. పాతకోట ఒకటున్నది. అదిగొప్ప వర్తకస్థలము. నలజనంపాడు వెలిగొండల కీవలితట్టు ఉన్నది. అవతలిపక్క మూడుపరుగుల దూరంలో భైరవునికోన మొదలైనవి ఉన్నవి. ఈగ్రామం ప్రస్తుతం వెంకటగిరిరాజావారి జమీలోనిది. ఇక్కడ ఉన్నవారంతా వెలమలు. బ్రాహ్మణు లెవ్వరూ లేరు. అక్కడ ఎలిమెంటరీబోర్డుస్కూలు అయ్యవారొక్కరే బ్రాహ్మణులు. అయ్యవారింట్లో ఆమధ్యాహ్నం భోజనంచేసి శాసనంకోసం బైలుదేరినాను. "ఈశాసనం ఏంచేస్తారు? మీరు జమీందారుగారి తరఫున వచ్చారా? గౌవర్నమెంటుతరఫున వచ్చారా? ఒక్కశాసనంకోసం చెన్నపట్టణం నుంచి రావలసిన అవసర మేమున్నది? ఈశాసనశిల క్రింద లంకెబిందె లున్నవి. వాటిని తీసుకు పోవడానికి కాదా మీరు వచ్చింది? ఎక్కడెక్కడ లంకెబిందె లున్నవో అవైనంకూడా ఆశిలమీద వ్రాసి ఉన్నదటకాదా? ఈ వైనం మాకు కొంతకాలంక్రిందట ఇక్కడికి వచ్చిన యోగిగారొకరు చెప్పినారు. ఇటువంటి సందర్భాలలో మిమ్మల్ని ఆశాసనం తీసుకోనిస్తామా?" ఇట్లా ఆవూరివారు ఒక్కపెట్టున ప్రశ్నలవర్షం కురిపించారు. చిట్టచివరకు వారి ప్రశ్నల కనుగుణ్యంగా జవాబిచ్చి నా సదుద్దేశమును గురించి వారికి నమ్మకం కలుగజేసేటప్పటికి కృత్యాద్యవస్థ అయింది. పిదప వారుకూడా నాపనికి తోడ్పడి నాకు చాలాసాయం చేశారు. అయ్యవారి సాయంవల్లా వారి సాయంవల్లా త్వరితంగానే నాపని ముగించుకొన్నాను. అక్కడ ఉన్నదల్లా ఒక్కశాసనమే. అది పదివందలకు పూర్వపుది. పాతతెలుగుశాసనం. బట్టరువర్తు వేణుగోపాలశెట్టిగార్ల నాటి కంటె చాలాచెకిపోయినది. అది జైనశాసనం. శాసనారంభంలో జినదేవసంకీర్తనము కలదు. ఇక విశేష మేమిటంటే శాసనం జైనశాసనమయినప్పటికీ శాసనం తలభాగాన్ని నందీ లింగమూ మొదలైనవి చెక్కి ఉన్నవి. అది జైనశాసన శిల అవడమూ వాటిమీద నందీ మొదలైనవి కనబడడమూ వింత. ఇది ఆలోచింపదగిన విషయమనుకొన్నాను ఇది ఎట్లా సంభవించినదా అని. నలజేనంపాడను గ్రామనామాన్ని బట్టే అది ఒకప్పుడు జైనుల నివాసస్థలముగా ఉండవలెననుకొన్నాను. అందువల్లనే దానికి జైనులపాడని పేరుకలిగి ఉంటుంది! కాకతి ప్రతాపరుద్రుని కొలువులో వచ్చిన బ్రాహ్మణ జైన మతవివాదంలో విప్రవినోదుల సహాయం మూలంగా బ్రాహ్మణులే గెలిచారట. ఓడిపోయిన జైనులను హతంచేశాడట రాజు. హతశేషులు పారిపోగా వారిని ఊరి (పాడు) పాళ్లలో నివసింపవలసినదే కాని ఊళ్లలో నివసింపరాదని బ్రాహ్మణులు శపించారట. ఇట్లా ఒకకథ చెప్పుతారు. కథ ఇట్టిది ఒకటుండడమూ, ఇక్కడ జైనశాసనం ఒకటి కనబడడమూ చూస్తే ఇది పూర్వం జైనుల నివాసస్థలమనీ, అందువల్లనే దీనికి జైనులపాడనే పేరు కలిగి ఉంటుందనీ, ఆ జైనులపాడే కాలక్రమాన్ని మనుష్యులనోళ్లలోబడి జేనంపాడుగా

మారి ఉంటుందనీ ఆలోచనకలిగింది. కడపమండలంలో పూర్వం చాలా జైనబస్తీలు ఉండేవని కొన్నికొన్ని ఆధారాలవల్ల తెలుస్తున్నది. నెల్లూరుమండలానికి ఈప్రాంతాన్ని కడపజిల్లాయే సరిహద్దు. ఇదిన్నీ కాకుండా నెల్లూరులోకూడా పెద్ద జైన విగ్రహాలు ఉన్నవి. ఇవన్నీ ఒకప్పుడు జైనులు ఈప్రాంతాల ఉండేవారని విశ్వసించడానికి గట్టి ఆధారాలుగా కనబడుతున్నవి. నల జైనుల పాడులోని నల అనునది విశేషణ పదమవుతుందేమో అనుకొన్నాను. మంచి అనో యేమో దాని అర్థం. ఇంకా విచారించాలి.

ఈప్రయాణంలోనే చుండి, మాలెకొండ మొదలైనవి చూచాను. మోపూరు ప్రాజెక్టు చెరువు కూడా చూడడం తటస్థించినది. ఈచెరువువల్ల వేలకొలది ఎకరాలు వరిపంట పండుతున్నది. ఆప్రాంతమంతా పంటకాలువలతోను పిల్లకాలువలతోను, డెల్టాభూమి వలె ఉన్నది. ఇవేకాకుండా నెల్లూరుజిల్లాలోని పెదారికట్ల, చినారికట్ల, పొదిలి, కురిచేడు, కలుజువ్వలపాడు, గొట్లకట్టు, బుడమకాయలపాడు, దర్శి ఈ మొదలైన ఊళ్లుకూడా చూడడం కలిగింది.

బుడమకాయలపాటిలోను కలుజువ్వలపాటిలోను పాతతెలుగు శాసనాలు ఉన్నవి. బుడమకాయలపాడు ఇప్పుడించుమించుగా బేచిరాకు గ్రామమనే చెప్పవచ్చు. ఇది ఒంగోలు కంభంరోడ్డుమీద ఉన్న గొట్లకట్టుకు శివారుగ్రామం. ఈరెండుగ్రామాలూకూడా వెలిగొండచాలుకి అయిదారుమైళ్ల దూరంలోఉన్నవి. ఈప్రాంతమున కనుమలు దాటితే వెలిగొండలలోని కర్నూలు జిల్లాలోనికి పోతాము. నెల్లూరుజిల్లా పడమటి సరిహద్దుగా ఉన్న వెలిగొండల నంటుకొని అవతల కడప, కర్నూలు, గుంటూరుజిల్లాలున్నవి. బుడమకాయలపాటిలో ఊరికి మైలు మైలున్నర దూరాన్ని ఒకవేపచెట్టుకింద గంగమ్మదేవళం ఉంది. అక్కడ పాతతెలుగు శాసనాలు రెండు మూడున్నవి. అందులో రెండుమాత్రం నెల్లూరు మండల శాసనసంపుటాలలోనికి వచ్చినవి. ఒకటి రాలేదు. అక్కడ శిలాస్తంభం ఒకటున్నది. దానికి నాలుగువైపులా శాసనం ఉన్నది. అది ఆరేడుమూళ్ల పొడవుంటుంది. అది అంతా పూర్తిగా ఇసుకలో పూడిపోయింది. ఇది అంతా తువ్వనేల అవడం మూలాన్ని గాలిదుమారాలు లేచినప్పుడల్లా ఇసుకపొరలు మబ్బుతెరలలాగు లేస్తుంటవి. ఇట్లా లేచిన ఈయిసుకపొరలవల్ల ఆ స్తంభం పూర్తిగా కప్పడిపోయింది. ఎగువ తలభాగం మాత్రం కొంచెం కనిపిస్తున్నది. ఈశిలాస్తంభంమీది శాసనం నెల్లూరుమండలశాసన సంపుటాలలో వచ్చినప్పటికీ వాటిలో ఇచ్చిన పాఠంలో కొన్ని పొరపాటులున్నవని తోచడంచేత ఎట్లయినా దానికి ప్రతిబింబాలు ఎత్తవలెనని బుద్ధిపుట్టింది. మరొకశాసనశిల నేలమీదపడిఉండడంచేత సులభంగా దానికి ప్రతిబింబం తీశాను. ఈరెండూ కాక మూడవ శాసనశిల మరొకటున్నది. దానిని గంగమ్మ దేవళానికి ప్రాకారపు రాయిగా పాతినారు. దేవళమంటే పెద్దదేవళంకాదు. పెద్దతులసికోటంతఎత్తు ఉంటుంది. చుట్టూ రాళ్లు పాతిఉంటవి ప్రాకారానికివలె. ఈప్రాకారపునిలువురాళ్లకుపైన కప్పుమాదిరి ఏర్పడేటట్టు వాటిమీద బల్లపరుపుగా రాళ్లు పరిచి ఉంటవి. లోపల గంగవిగ్రహం ఉంటుంది. దీనినే గంగదేవళం అంటారు; కాని అలవలపాటిదగ్గరి గంగదేవళం మాత్రం అమ్మవారి గుడివలెనేఉంది. ఈప్రాకారపు రాయిగా ఏర్పడిఉన్నదానిమీదనే శాసనంఉంది. సగంభాగం శాసనం భూమిలోనికి పూడిపోయిఉంది. అంతేకాకుండా ఆరాతిని ఎడాపెడా అక్కడి వేపచెట్టువేరు పామువలె మెలికలుతీర్చి చుట్టివేసుకొన్నది. ఆవేరును తెగనరికించి ఆరాతిని పైకి తీయింతామన్నా అది వట్టివేపచెట్టుకాదు: అమ్మవారి వేపచెట్టు. అటువంటి వేపచెట్లంటే ప్రజల కెట్టి నమ్మకాలుంటవో అందరికీ తెలిసినవిషయమే. అక్కడ ఈరాయిఒకటీ, ఆ స్తంభమొకటీ- ఈరెండూ రెండు వ్యాసఘట్టాలలాగు ఏర్పడ్డవి.

నేను గొట్లకట్టులో వేమూరి సీతారామయ్యగారి యింట్లో బసచేశాను. సీతారామయ్యగారు చాలా మంచివారు. ఆవూళ్లో ఉన్న బోర్డుస్కూలుకు హెడ్డుమాస్టరు. వారికాప్రాంతాల మంచి పలుకుబడిఉన్నది. ఆయన

ఆవూళ్లో అయ్యవారే కాకుండా వైద్యులు కూడాను. పంచాంగంచూచి నక్షత్ర తిథివారాలూ, వర్జ్యాలూ పరిశీలించి ఊళ్లోవాళ్లకు మంచిచెడ్డలు చెప్పగలవారు. ఆలోచనకు, పాలోచనకు ఎన్నికైనచెయ్యి. ఈకారణాలవల్ల ఆవూళ్లో ఆయనఅంటే అందరికీ విశేష గౌరవం. ఆయన నాకు చేసిన ఉపకారం చెప్పవలెనంటే ఆయనే గనుక నాకుతోడ్పడి ఉండకపోయినట్టయితే నేనాశాసనాలకు ప్రతిబింబాలు ఎత్తగలిగిఉండేవాణ్ణే కానని చెప్పితే చాలు. ఆయన నాకంతటి మహోపకారి అయినాడు. మొత్తంమీద శాసనాలకు ప్రతిబింబాలు తీశాను.

బుడమకాయలపాటికే బుడమనరాయల పాడని కూడా పేరు. ఇప్పుడది చేచిరాకు గ్రామంగా ఉన్నా పూర్వం అది గొప్ప ఊరుగా వుండివుండాలి అనడానికి ఆధారాలు లేకపోలేదు. అక్కడ భూమి చాలా సారవంతమైనది. ఈగంగమ్మ దేవాలయానికి సమీపాన్ని పూర్వం పెద్దచెరువు ఉండేది. ఇప్పటికీ దీని ఆనవాళ్లు చూడవచ్చు. ఇప్పుడది అంతా తుప్పలతోను, డొంకలతోను అడవి మొలచి పోయింది. ఈ చెరువు నైశాల్యము 400 ల ఎకరాలుండవచ్చు. ఈ చెరువునీటికి ఆధారభూతములైనవి మూడువాగులున్నవి. ఈవాగులలోని నీరు ఈచెరువులోకి వస్తుంది. ఇప్పుడీవనరులు చెడిపోయినవి. ఈ చెరువువల్ల నాగంపల్లి, వెలిగొండరాయునుపల్లి, పేరారెడ్డిపల్లి, వెంగళపల్లి, బుడమకాయలపాడు, గర్నిపెంట, గొట్లకట్టు—ఇన్నివూళ్లకు లాభం ఉంటుంది. చెరువులో పుష్కలంగా నీరుంటే వెయ్యిఎకరాలకు పైగా సాగవుతుంది. ఇక్కడ పూర్వం ఒక దేవాలయంకూడా ఉండేదని తెలుస్తుంది. గౌనర్మెంటువారు కాని, జమీందారుగారుకాని ఖిలపడి పోయి ఉన్న ఆచెరువును ఉద్ధరించ చేయించేటట్టయితే పైని చెప్పిన గ్రామాల ప్రజలకు చాలా ఉపకారమవుతుంది. ఆగ్రామం వెంకటగిరి జమీలోనిది. జమీందారులుకూడా ఇందువిషయమై శ్రద్ధ వహించడంలేదు. ఇటువంటివి ఖిలపడి ఉన్న చెరువులింకా చాలా ఉన్నవి. ప్రజలకు అనేక మహోపకారాలుజరిగినట్లు చెప్పబడే బ్రిటీషుప్రభుత్వంలోకంటె కూడా పూర్వపుప్రభుత్వాలలోనే ఈప్రాంతాలు పాడీపంటా సమృద్ధిగా గలిగి ప్రజలు సుఖపడేవారని చెప్పడానికి లెక్కకుమించిన ఈచెరువులేసాక్షి. ఆటువంటి రాతిభూములలో ఏవిధానో గొప్పగొప్ప చెరువులు నిర్మించి నిర్జలమైన ఎడారికాని ఎడారిభూములనూ, గొడ్డువారిన అడవినేలలనూ సస్యశ్యామలములైన సుక్షేత్రములుగా మార్చి ప్రజాక్షేమానికీ, జాతీయసంపదకూ తోడ్పడ్డ పూర్వపు ప్రభుత్వాలకూ ఇప్పటి ప్రభుత్వానికీ ఉండే వ్యత్యాసం దేశం చూస్తేనేకాని బోధపడదు.

వెలిగొండరాయడి దేవళం అక్కడికి సమీపమున వెలిగొండలలోనే ఉన్నది. అది ముచికుందులవారి ప్రతిష్ఠ అని చెప్తుతారు. ఆదేవళం సమీపముననే మూసి (ముచికుంద)నది పుట్టుతున్నది. ఆదేవళాన్ని చూడడం పడింది కాదు. వెంకటగిరినుంచి వచ్చే వెలిగొండలచాలు గర్నిపెంట, తువ్వపాళ్లసమీపాన్నే ఆఖరవుతుంది. కలుజువ్వలపాడు ఈవెలిగొండ కవతల ఉన్నది.

బుడమకాయలపాటి పని పూర్తిచేసుకొని కొంచెం చుట్టుతోవను నాగంపల్లి, గర్నిపెంట, తువ్వపాడు, నాగిరెడ్డిపల్లి, గార్లదిన్నెలమీదుగా కలుజువ్వలపాడు వెళ్లినాను. ఈప్రాంతాల కొన్నిఊళ్లలో విశ్వబ్రాహ్మణులే కరణాలు. కలుజువ్వలపాటిలో రాట్నములు చాలా ఉన్నవి. అవి ప్రత్తిపట్టేరోజులు గనుక చిల్లరవర్తకులు ప్రత్తి పండించినవాళ్లదగ్గరకు విడివిడిగావచ్చి ప్రత్తికొనుక్కొనిపోయి మొత్తంచేసి పెద్దవర్తకుల కమ్ముతారు. సంసారులు బీదవాళ్లవడం మూలాన్ని దినవెచ్చమునకు డబ్బుకోసం అల్లాడుతూఉంటే ఈ చిల్లరవర్తకులువచ్చి ముందు చౌకధరకు పంటను గుత్తకుతీసుకొని అడ్వాన్సుగా సొమ్మిస్తారు. అందువల్ల పంట ఎంతపండినా పండించినవారికి నిత్యదరిద్రమున్నూ దళారులకు నిత్యపంటగానుఉంటున్నదట. ఈకారణాలచేత పల్లెటూరిరైతులు చాలా పరకు వర్తకులకు లోబడి ఎదుగూ బొదుగూ లేకుండా ఉంటున్నారు. ఈప్రాంతాల చాలామంది రైతులు భూములన్నీ వర్తకుల 'అడమానా'(తాకట్టు)లలోనే శాశ్వతంగా ఉండిపోతున్నవి. పంటకు వర్షాలమీద ఆధారపడవలసింది దేశం. భుక్తికి వర్తకులమీద ఆధారపడ

పలసినవారు రైతులు. మిగులూ తగులూ ప్రభుత్వానిది. దేశస్థితి ఇట్టిది.

కలుజువ్వలపాటిలో కైలాసనాథస్వామి ఆలయంలో పాత తెలుగుశాసనం ఉంటే దానికి ప్రతిబింబం తీసుకొన్నాను. అక్కడినుంచి మార్కాపురం రోడ్డు రైలుస్టేషనునుంచి పొదిలికి కొత్తగాపోస్తున్నరోడ్డు మీదుగా వెళ్లదామనుకొన్నాను కాని రోడ్డు పూర్తికాలేదు. తోవకూడా మంచిది కాదని కరణంగారు చెప్పితే తిన్నగా మార్కాపురం రోడ్డు రైలుస్టేషనుకు వెళ్లినాను. అక్కడికి శ్రీశైలం నల్లమలకొండలచాలు సంజమబ్బుల లాగ కనిపిస్తూ ఉంటవి. అక్కడ రైలెక్కి గజ్జలకొండ, దొనకొండలమీదుగాకుచేసువచ్చి పిదప నర్సారావుపేట, గుంటూరులమీదుగా బెజవాడ వచ్చి అక్కడినుంచి తిరిగి పట్నానికి వచ్చాను. ఈరీతిగా ముగిసింది నెల్లూరుమండల యాత్ర.

వెలిగొండల ప్రాంతాన్ని ఊళ్లలో పైరు పంటలకూ త్రాగుటకూ పశువులకూ కూడా దిగుడుబావులలోని ఉదకమే. నీరు చాలాచోట్ల చాలాబావులలో కళ్మలంగా ఉంటుంది. విధిలేక తాగవలసిందే ఆనీరు దాహానికి. దిగుడుబావు లున్నచోటల్లా నారికురుపులు జాస్తీ. అవి లేనిఊళ్లూ దిగుడుబావులులేని ఊళ్లూ లేవు. ఆరోగ్యం చాలా తక్కువ. వైద్యసహాయం గ్రామాలకు అసలే లేదు. మంచి రస్తాలులేవు గ్రామాలకూ గ్రామ్యాలకూను. విద్యావిషయంలో ఊళ్లన్నీ చాలా వెనకబడిఉన్నవి. నాజూకు నాగరికతలు అంతగాలేవు. ఏఉద్యమానికీ కూడా ప్రచారం అటు చాలా తక్కువే. కాని దేశం ఇట్టి స్థితిలో ఉన్నప్పటికీ గాంధిమహాత్ముని పేరు తెలియని ఊరులేదు. ఆ మహాత్ముని పేరు మూలమూలలకు ప్రాకింది; భక్తిగౌరవాలు కలిగించుకొన్నది. కాని ఆయన కలిగించిన రాజకీయప్రబోధము ఆవైపుల అంతగా ఉన్నట్టు పొడకట్టదు.

ప్రజలు చాలామంచివాళ్లు. దేహపటిమా బుద్ధిబలమూ ఉన్నవాళ్లే. కాని అటు అవసరమైనది ఒక్కజాతీయప్రబోధమే. దేశదారిద్ర్యమూ, తరచు సంభవించే అనావృష్టిదోషమూ వారిని క్రుంగదీస్తున్నవి. పూర్వపు దేశీయప్రభువులు పరిపాలన చేసే కాలంలో ఇట్టిప్రాంతాలే శత్రుజనదుస్సాధ్యములై పౌరుషపరాక్రమాలతోనున్నూ, పాడిపంటలతోనున్నూ వియ్యమంది మిలమిల మెరుస్తూ ఉండేవి. ఆరోజు లారోజులే, ఈరోజు లీరోజులే.

## అనుబంధము

హరదత్తాచార్యులవారు రచించిన చతుర్వేదతాత్పర్యసంగ్రహమనే నామాంతరముగల గిరీశస్తుతిసూక్తిమాల అన్ని వేదాంతగ్రంథానికి ప్రోలయ వేమారెడ్డిగారి తమ్ముడును, ఆయన సర్వసైన్యాధిపతీ అయిన మల్లాయ రెడ్డింగారి మనిమనుమడగు కోమటిరెడ్డింగారి కొడుకు(సోమేశభూపతి సోదరుడు) శివలింగభూపతి వ్యాఖ్య వ్రాశాడు. ఆవ్యాఖ్యాగ్రంథంలోని ప్రారంభశ్లోకాలు కృతికర్తృవంశావతారక్రమం వర్ణించేవి ఈక్రిందఇస్తున్నాను. ఈవ్యాఖ్యానం ప్రతి తంజావూరుజిల్లా తిరువిడైమరుదూరు దేవాలయగ్రంథాగారంలో ఉండగా ౧౮౯౪లో మొట్టమొదట చూచి శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారును, టి. వి. కృష్ణస్వామిశాస్త్రిగారును పరిశోధించారు. ఈపైని చెప్పిన ఇరువురి సహాయంతో వెనుక దక్షిణహిందూదేశంలోని సంస్కృతతాళపత్రగ్రంథాన్వేషణ మనకు పూనుకొన్న హుల్షుదొరగారు ఈవిషయమును గురించి తమ నివేదికలో వ్రాశారు. వారి నివేదికలో నుంచే పాఠకుల ఉపయోగార్థము ఈశ్లోకాలు ఎత్తి వ్రాయబడ్డవి.

జాతి స్వసత్త్వా కమలాభిరామా
బుధప్రియా సత్కవిసంఘసేవ్యా।
గంగా ద్వితీయేవ సశైల లక్ష్మ్యాః
పాదాంబుజా దీశితు రుద్బభూవ॥

తత్రోదభూత్కోమటిప్రోలభూపః
స్వకాన్వవాయైక మణిప్రదీపః।
లోకత్రయ వ్యాప్తయశః ప్రతాపః
కృతారిభూపాల మనోనుతాపః॥

# చైతుసింగు[1]

మొసలికంటి సంజీవరావు గారు

మహత్తరగుణదోష సంకలితము, ఆకర్షణీయము, పఠనార్హము నై యొప్పు హేస్టింగ్సు పరిపాలనచారిత్ర మెంతయు విచార్యము. తత్సంబంధ కాశీరాజోపాఖ్యాన మిం దరయుదము.

గభీరపారావారముం బోలు హైందవచారిత్రమున సల్పజలచరప్రాయుఁడగు కాశీరాజు హేస్టింగ్సు కారణమునఁ గొంతప్రాముఖ్యము గాంచెను.

ఈతని పేరు చైతుసింగు. కాశీరాజ్యము, అయోధ్యాదేశాంతర్భాగము. తద్రాజ్యాధిపతి వజీరును[2] ధిక్కరించియు, ధిక్కరింపఁ జాలని స్వాతంత్ర్య మనుభవింపుచుండెను. ఆవిషయ మటుండ, కాశీదేశము క్షామ మెఱుంగక, సస్యశ్యామలశోభితమై ధనధాన్యసమృద్ధమై, లక్ష్మీనిలయమై, దర్శనీయమై, వర్ణనీయమై యుండెను.

ప్రసిద్ధమగు బక్సారు యుద్ధావసరమున (౧౭౬౪) చైతుసింగుజనకుఁడగు బలవంతసింగు కాశీరాజ్యము పాలించుచుండెను. తనపై నధికారము వహించి శాసింపఁజూచు నయోధ్యాధీశుని పీడనము సైఁపఁజాలక, హైందవచారిత్రనిర్మాణసమర్థమగు నమ్మహాసమయమున, నాంగ్లేయులకుఁ దోడ్పడి, బలవంతుఁడు వారి కృతజ్ఞతాభిమానములకుఁ బాత్రుఁడాయెను. ఇంగ్లాండునందలి కంపెనీ డైరక్టర్లు గూడ నాతని నెంతయు నభినందించిరి.[3] సమయము మిక్కిలి అనుకూలముగ నున్నను, తాను సర్వస్వతంత్రుఁడై యుండ నాసింపక, ఆంగ్లేయాధికారమునకు, లోఁబడి యుండు స్వాతంత్ర్యమే ఆతఁ డపేక్షించెను. కాని బక్సారు యుద్ధానంతరమైనసంధి ననుసరించి కాశీరాజు మగుడ నయోధ్యాధిపతిసామంతుఁ డాయెను. ఆసంధి ననుసరించియే, తన సామంతుని స్వాతంత్ర్యమునకు భంగము కలిగింప రాదని ఆంగ్లేయులు శాసించుటచే, వజీరు పరిభవానలతప్తుఁ డయ్యు, సహించి యూరకుండెను.

బలవంతసింగు ౧౭౭౧ లో మరణించినంతనే, అయోధ్యవజీరు దురాశాపరుఁడై, కాశీరాజ్యమును కబళింపఁగోరెను. కాని, ఆంగ్లేయులు సమ్మతింపమి, వజీరు భగ్నమనోరథుఁ డాయెను. బలవంతునికుమారుఁడగు చైతుసింగు యథాప్రకారము రాజాయెను. 1773 లో వజీరు మగుడఁ దన కాశీరాజ్యగ్రహణేచ్ఛ వెలిపుచ్చెను. అట్లు కాదేని, తద్రాజ్యస్థ ప్రసిద్ధదుర్గములు రెండును, ౧౦,౦౧,౦౦౦ రూ. (పదిలక్షలు) అదనముగా నైనను లాగవలయునని ఆతఁడు ప్రయత్నించెను. హేస్టింగ్సు నిరాకరించెను.

ఆంగ్లపరిపాలకుఁడు చెప్పుకారణములు గమనింపఁదగి యున్నవి.

౧. కంపెనీ రక్షించుచున్న గాని చైతుసింగు యొక్క రాజ్యప్రాణములకు క్షేమము లేదు;

౨. చైతుసింగును కంపెనీ రక్షించుట ధర్మము;

3. కేవలము ధర్మమగుటయే కాక అట్టి యాచరణము రాజనీతి విహితముగూడ నై యున్నది. మన దేశమున కంటియున్న కాశీదేశము మనకు ధనవ్యయ మేమియు లేక అమరియున్న రక్షయై యున్నది. తన

---

1. ఇయ్యది రెండవచారిత్రకవ్యాసము. మొదటిది—నందకుమారవధ—జనవరి భారతియందుఁ జూడనగును.

2. అయోధ్యాదేశాధిపతులను వజీరులని యందురు.

3 R......and so highly important was the service which he rendered to the Company, that the Directors expressed their sense of it in the strongest terms"—

Mill and Wilson—p. 363, IV.

సాహాయ్యము మన కవసర మగునపుడు తద్దేశాధిపతి తప్పక ఒనరించునని మనము విశ్వసింపవచ్చును.......

.................................................................

బక్సారుయుద్ధమునందు తమకుఁ దోడ్పడిన కాశీరాజు నెడ నాంగ్లేయులు కృతజ్ఞులై యుండుటయే కాక తద్రాజ్యాధిపతి ఎప్పటియట్టులు స్వతంత్రుఁడై యుండుటయే వారలకు క్షేమకరముగ వాంఛనీయముగ నుండెను. కావుననే, హేస్టింగ్సు అయోధ్యాధీశుని దుష్ట సంకల్పమునకు దోహద మొనరింపక ఆసమయమున చైతుసింగున కమితోపకార మొనరించినవాఁడాయెను.

అంతనయోధ్యాధిపతి మరణించెను. (౧౭౭౫) ఆతని పుత్త్రుఁడగు ఆసఫుద్దౌలా రాజాయెను. ఆసమయమున నాంగ్లకంపెనీ సేనకులు హేయముగఁ బ్రవర్తించిరి. ఆసందర్భముననే అయోధ్యకు లోఁబడియుండిన కాశీరాజు ఆంగ్లేయులకు సామంతుఁ డాయెను. చైతుసింగు స్వాతంత్ర్యమునకు భంగము వొరయకుండ జూడవలయునని హేస్టింగ్సుకడు నుదారముగ సంకల్పించెను. ఆనృపాలుఁ డేఁటేఁట ౨౨,౧౦,౦౦౦ రూ. కప్పము చెల్లింపవలసియుండెను. సదరు కప్పము సరిగఁ జెల్లునంత కాలము తా మాతనిస్వాతంత్ర్య మరికట్టమనియు, అన్యులరికట్టకుండ తాము రక్షింతుమనియు, కరరూపమునఁగాని, మఱి యేరూపమునఁగాని ఎక్కుడు ధనము తామెన్నఁడుఁగోరమనియు కంపెనీవారు అభయమొసంగిరి. కప్పము వసూలుచేయు నధికారము రెసిడెంటున కొసంగినచో రాజుయొక్క గౌరవ స్వాతంత్ర్యములు కొఱఁతె పడునని ఎంచి, * కాశీరాజు స్వయముగనే ఆమొత్తము కలకత్తానగరమునకుఁ బంపునేర్పాటు హేస్టింగ్సు చేయించెను. మఱియు, నాణ్యముద్రణాధికారముగూడ నాతనియధీన మాయెను. ఈవిధమున నిర్ణీతశుల్క సమర్పణము తప్ప రాజశబ్దము సార్థకమగునట్లు కాశీరాజు సర్వస్వతంత్రాధికార సమన్వితుఁడై విలసిల్లెను.

ఈసందర్భమున హేస్టింగ్సు వ్యక్తపఱచిన ఔదార్యము, అభిమానము, ఋజుప్రవర్తనము ప్రశంసనీయములు, నాదర్శప్రాయములుగదా! కాని, చల్లని వర్షము లీను కాఱుమేఘమున భయదములగు పిడుగులుకూడ నడఁగియుండునని ఎఱుంగని కాశీరాజు అట్టులే తలంచి, యుప్పొంగి, ఆంగ్లపాలకుఁడు దైవసమానుఁడని విశ్వసించి, విచారము మఱచి నిజప్రజాసేవాపరాయణుఁడై హాయిగ నుండెను.

చైతుసింగు రెండుమూడు సంవత్సరములు ఆంగ్లేయుల ఆగ్రహమునకు గుఱికాకుండ, కప్పము సకాలమున సముచితముగ సమర్పించెను. అంత ఫ్రెంచివారితో యుద్ధము సంభవమాయెనను కారణమున ౫౦౦,౦౦౦ రూపాయిలు అదనము చెల్లింపవలయునని (౧౭౭౮) హేస్టింగ్సు ఆకస్మికముగాఁ గోరెను. రాజు సహజముగ భయాక్రాంతుఁడై చేయునదిలేక ఆభారము కొంతయైనను తగ్గింపవలయునని అర్థించి, తుద కాధనము చెల్లించుట కొడఁబడి, ఇఁక నెన్నఁ డట్లు విధింపరాదని సవినయముగాఁ గోరెను. అది యొక అపరాధముగ గణించి వాయిదాలపై జెల్లింపవలసిన ఆపైక మంతయు నొక్కసారియే చెల్లింపవలయు ననియు అనంతరము ఐదాఱు దినములలోఁ జెల్లింపవలయు ననియు నాంగ్లపాలకుఁడు కఠినముగ విధించెను. రాజు శిరసావహించెను.*

మఱుసటిసంవత్సరము మఱి ౫ లక్షల రూపాయిలు హేస్టింగ్సు కోరెను. అంత, తా మొనరించుకొనిన యొడంబడిక స్మరణకుఁ దెచ్చి, అట్లు విధించుట

---

* *Vide p. 366, IV—Mill and Wilson.*

* "The Raja asked that the exaction should be limited to a single year, and was punished for his 'contumacy by being ordered to pay the whole forthwith instead of by instalments. Chait Singh then asked for six or seven months' indulgence, whereupon payment was demanded within five days, and was told that if he failed to comply he would be treated as though he had refused absolutely."—A Historical Geography of the British Dominions, Vol. VII,—India Part I,—p. 201;—Mr. P. E. Roberts.

తగదని రాజు సవినయముగా నివేదించెను. కాని, ఆంగ్ల పరిపాలకుఁ డామాట పాటింపక న్యాయాన్యాయములు విచారింపక, క్రుద్ధుఁడై సిద్ధముగ నుండిన బ్రటిషు సైన్య మాతనిపైఁ బంపెను. చైతుసింగు ఆ వైకము త్రోడనే చెల్లించెను. అదిగాక, సుమరు ౨౫,౧౦౦ రూ. సైన్య వ్యయముక్రింద నాహతభాగ్యుఁడు సమర్పింప వలసిన వాఁ డాయెను.

పెనుభూతమువలె దాపురించిన ఆపద యంతనైనను తొలంగదాయెను. ఆసంవత్సరముగూడ గిఱ్ఱునఁ దిరిగెను. ఆంగ్ల పాలకుఁడు మగుడ (౧౭౮౦)నైదులక్షలు కోరెను. రా జేమి చేయవలయును? సామమునం గాని కార్యము దానమునఁ జక్కఁబడునని ఎంచి ఆ ఱేఁడు వెంగలి యై ౨,౦౦,౦౦౦ రూపాయిలు హేస్టింగ్సునకు రహస్యముగ నంపెను. ఆధన మందుకొనియు, నాంగ్ల పాలకుఁడు తనయాజ్ఞ మరలింపఁడాయెను. దురదృష్టవంతుఁడగు సింగు ౫,౧౯,౦౦౦ రూ. యథాప్రకారము జోహారు సల్పి చెల్లింప వలసినవాఁడాయెను. ఒకలక్ష రూపాయిలు పరిహారముగూడ నాతఁ డర్పించెను.

దుర్భరాంగ్ల దౌర్జన్యమునకును, చైతుసింగు దురవస్థకును అంతము లేకుండెను. హేస్టింగ్సు ౨,౧౦౦ అశ్వికదళము నాయత్తపఱుప వలయునని నిర్దయుఁడై ఆజ్ఞాపించి, అనంతరము కరుణించి ౧,౦౦౦ దళము నాయత్తము చేయవలయునని కఠినముగ విధించెను. మందభాగ్యుఁడగు నారాజు తనయసమర్థత వెలిపుచ్చి ఆంగ్ల పరిపాలకుఁ డేమి చేయునో యని వెఱచి ఎట్టకేలకు ౫౦౦ అశ్వికులను, ౫౦౦ప దాతులను జతపెట్టెను. క్రూరకుటిలాచార్యుఁడగు హేస్టింగ్సునకు ఆలస్యము దుస్సహమాయెను. కాశీరాజు యుక్తాయుక్తము లరయక ప్రచండాంగ్లాధికారము ధిక్కరింప సాహసించెనని నేరము వైచి, ౫౧,౦౦,౦౦౦ రూ. (ఏఁబదిలక్షలు), అపరాధము విధించి, తద్విపరీతపరిహార మర్పింపఁడేని క్షుద్రక్రిమికీటకమువలె నలిపివేయ వలయునని ఆంగ్లప్రభువు దారుణముగ సంకల్పించి, * అల్పసైన్యపరిరక్షితుఁడై దురంత క్రోధఘూర్ణమానమానసుఁడై బయల్వెడలెను.

ఆవార్త తెలిసినంతనే కాశీరాజు భయావేశమునఁ దనరాజధాని వీడి, ఏదురేఁగి, దవ్వుననున్న, 'బక్సారు' గ్రామముచెంత హేస్టింగ్సును సందర్శించి, నిజాధికారలాంఛనమై మాననీయమై ప్రాణప్రదమై తనరు తనకిరీటము నాయాంగ్ల వీరుని,యూరుతలంబున నిడి '20,00,000 రూపాయలు పరిగ్రహించి నేరము సైరింపవలయు'నని భయవినయవిహ్వలస్వరంబునఁ బ్రార్థించెను. కాని, ఆమహనీయుని వెన్ను విఱిచి, దావానలసన్నిభముగ తన దారిద్ర్యము తీఱఁగల అనంతధనరాశి గడింప నాసించిన ఆంగ్లప్రభువు ప్రసన్నుఁడుగాక,నోరార మాటాడక దురాలోచనాపరుఁడై తటాలునఁ గాశీనగరమునకుఁ బ్రయాణమాయెను.

కాశీనగరము చేరినంతనే, హేస్టింగ్సు దురాగ్రహము పూర్తిగ బహిర్గత మాయెను. తాగోరిన సాహాయ్యము తాఁగోరినంతనే కాశీరాజు చేయలేదఁట:— అదియొక మహానేర మాయెను! చైతుసింగు, భయభ్రాంతుఁడై, తగు సమాధాన మొసంగెను. కడు సమంజసముగనున్న యాసమాధానము హేస్టింగ్సునకు మాత్రము దుస్సహమాయెను. అన్యథా ఎటులుండును?

ఆంగ్ల పాలకుఁ డాజ్ఞాపించినంతనే 'రెసిడెంటు' నాబడు నాంగ్లస్థానికుఁడు రయమ్మునఁ బోయి కాశీరాజును ఆతని రాజధానియందే బంధింపఁ గడంగెను. హేస్టింగ్సు యుక్తాయుక్తము లెఱుంగని మందుఁడు గాకున్నను ఈసమయమున మాత్రము మందుని చందముననే మెలంగెను. ఉత్తరదేశస్థులు బంగాళీలవలె పందలుగాక అఖర్వబలగర్వసమన్వితు లని యెఱుంగక రెండు పటాలములతో నాకార్యము చక్కనగునని ఆతఁడు భ్రమించెను. గుణవంతుఁడగు రాజు ప్రజాభిమానపాత్రుఁడై, తంత్రిడియై, దైవమై ప్రవర్ధిల్లుచుండిన కారణమున నాంగ్ల

"I was resolved," says the Governor-General, "to draw from his guilt the means of relief to the company's distresses" Mill

పాలకుని దుష్టసంకల్పము వెల్లడియైనంతనే ప్రజాళి దండధరులై ఆయుధపాణులై దుర్దాంతక్రోధఘూర్ణిత మనస్కులై ఆంగ్ల సైనికులను జుట్టిరి. ఆంగ్లోద్యోగులు వీరపురుషోచితముగఁ బోరాడి మరణించిరి. సిపాయిలను దెగ నఱికి దేశీయులు కృతకృత్యులైరి. బంధితుఁడగు చైతుసింగు సమయముఁ జూచి దీర్ఘరజ్జువుగ నేర్పడిన తన యనుచరుల పాగాల సాహాయ్యమున గంగాతీరమున డిగ్గి నౌకారూఢుఁడై రెండవతీరమునందలి రామనగరము జేరెను.

కాశీరాజు తప్పించుకొనెను. ఆంగ్ల సైనికులు తెగటారిరి. హేస్టింగ్సుఅవస్థ తార్తారునిఁ బట్టుటఆయెను—రాజును బంధింపఁబోయి తానే బంధితుఁడాయెను. ఏఁబదిమంది సైనికులుమాత్ర మాతని యండనుండిరి. ఝంఝామారుతాహత గభీర పారావారావృత క్షుద్ర నౌకవలె నాతని మందిరము సంక్షుభితజనసందోహములచేఁ జుట్టబడెను. ఆంగ్ల పాలకుఁ డేమికావలయు ? స్వయంకృత ధూర్తప్రవర్తన ప్రతిఫలముగ నాఁడాసమయమున మరణించెనేని* ఆంగ్ల విజృంభణ మేమాయెడిదో ఆంగ్ల హైందవసామ్రాజ్యనిర్మాణ మేమాయెడిదో, హైందవచారిత్ర మెటులు పరిణమించెడిదో ఎఱుంగ రాదు.

అంతటి అపాయమునం దగుల్కొనినను ఆంగ్లపాలకుఁ డహంకార మడఁగదాయెను. విడివడిన కాశీరాజు అల్పసైన్యరక్షితుఁడగు హేస్టింగ్సుపై తత్క్షణము పడుటకు మాఱుగ సవినయముగఁ గబురంపి నెయ్యము నెఱపఁ బ్రయత్నించెను. కాని గర్విష్ఠతదుర్గర్వమున నాదౌత్యము నిరసించి సమర్థులగు గూఢచారుల కర్ణరంధ్రములందు చీటులు పెట్టి అందందుఁగల ఆంగ్ల సేనానులకుఁ దన దురవస్థ హేస్టింగ్సు తెలియఁబఱచెను.

రంగమునకు దగ్గర నుండిన ఆంగ్ల సేనాని యొకఁడు తనయంతర మెఱుంగక తీవ్రపడుటచే దేశీయులు సన్నివేశములందే ఆసైనికులను దాఁకి చెక్కాడిరి. దాన, కాశీరాజ్యమునఁ బొడనూపిన విప్లవము రాజ్యమందంతటను వ్యాపించెను. * కాశీరాజ్యమే కాదు—దుష్పరిపాలనా పీడితులగు అయోధ్యాదేశస్థులు గూడ నాయధికారము ధిక్కరించి, పన్ను లెగవైచి, శుల్కగ్రహణాధికారులను బాఱఁద్రోలిరి. బీహారుదేశముగూడ నట్టులే సంచలింప నుండెను. మఱియు, పాఱిన చైతుసింగు సాహాయ్యమునకు సైన్యము లాయత్తమాయెనని తెలియవచ్చెను. అట్టిసమయమున నెంతయు నవసరమగు ధనము హేస్టింగ్సువద్ద నేమియు లేకపోయెను. నాలుగైదుమాసములనుండి జీతములు లేక సైనికులు సంకటపడుచుండిరి. అట్టి నికృష్టసమయమున కాశీరాజు కేయియందు నరుదెంచి పైఁబడునని తెలియవచ్చినంతనే ఆంగ్లపాలకుఁడు భయభ్రాంతుఁడై తన సైనికోద్యోగులతో సంప్రతించి, ఇంకను అందుఁ దడయుట అపాయకరమని ఎఱింగి, క్షతగాత్రులగు తన సైనికులనందే వీడి, చీఁకటి యైనంతనే బలిష్ఠుఁడగు 'చూనారు'దుర్గమునకు రహస్యముగఁ బలాయన మొనరించెను.

చైతుసింగు తనరాజధాని వీడినయనంతరముగూడ నాంగ్ల పాలకునిఁ బ్రసన్ను నొనరించుకొన వలయుననియే ప్రయత్నించెను. తనవలన నావంతయు నేరము లేదని విన్నవించి, ఎట్టి షరతులకైనను లోఁబడి, సఖ్యముగ మనవలయునని ఆతఁడు కడుంగడుఁ బ్రయత్నించెను. * క్షమతియగు నాంగ్లపాలకుఁడు సమ్మతింపమి, సహనశీలుఁడగు కాశీరాజు చేయునదిలేక, సముచిత సమర ప్రయత్నము లొనరింపఁ గడంగెను. ఐనను, జయసంపాదన సమర్థులగు నాంగ్లేయుల కోహటించి, చైతుసింగు,

p. 393,—Mill

* "The contagion of revolt and hostility flew with unusual rapidity and strength," Mill.

"The Raja had endeavoured to make his peace from the moment of his escape ......and professed his readiness to submit with implicit obedience to whatever conditions the Governor-General might think fit to impose."—Mill.

'లతీఫు'పురమునుండి, 'బిజిగరు'దుర్గమునకును, అటనుండి బుందేలు దేశమునకును, ఛాటి తుదకు, గ్వాలియరు నగరమున నడంగెను.

మన వ్యాసమునకు విశేషసంబంధము లేకున్నను, మఱియొక విషయము నీసందర్భమున గమనింపఁదగును. బిజగరుదుర్గమునుండి చైతుసింగు పాఱినయవసరమున నాతనిభార్యయు, నాతని జననియుఁ దమధనకనకాదులతో నందు విడిసియుండిరి. ఆదుర్గము రాజమాతకుఁ జెంది యుండెను. తనకుఁగల ధనమంతయుఁ దరలించుకొని తన పుత్రుఁడు వెడలెననియు, మిగిలినసొత్తు తనదేయనియు, ఆకారణమునఁదన్నుఁ దన ధనముతో సపరివారముగాఁబో నిచ్చి మఱికొన్ని సదుపాయము లొనరింప నంగీకరించిన చోనాదుర్గమాంగ్లేయుల యధీన మొనరింతుననియు రాజమాత వర్తమాన మంపెను. ఆంగ్ల సేనాని హృదయమైన మెత్తఁబడెనుఁగాని దవ్వుననున్న హేస్టింగ్సు మాత్రము కఠినహృదయుఁడై సంచరించెను. ఇతర సదుపాయముల మాటయటుండ, అనాథరాజ్ఞి యొక్క ధనకనకాదుల నామెకు విడుచుటకు సమ్మతింపకుండుటయేకాక, ఆమెను బరీక్షింపకుండ వెడలనిచ్చినచో, విజయులగు సైనికులకు రావలసిన దోపిడి మాయమగునని ఆంగ్లపరిపాలకుఁడు దారుణముగఁ దనసేనానికి వ్రాసెను.*

ఉదారమనస్కుఁడగుసేనాని లెస్సగ మెలఁగవలయునని ప్రయత్నించినను, హేస్టింగ్సుయొక్క యభిమతము మెల్లగఁ బ్రాకి వెల్లడియగుటచే, ధనాశాపరులగు తనసైనికులను వారించుట అసాధ్యమాయెను. ఆకారణమునఁ బ్రసిద్ధకాశీరాజ్య భారధురంధరుల రాణివాసము చోరులవంటి, కంటకులవంటి, హంతకులవంటి అన్యజనుల, కఠిన పరీక్షకుఁ బాల్పడి తమదుర్గమునుండి ఎటకేని పోయెను. *

లతీఫుపురము స్వాధీనమైనంతనే హేస్టింగ్సు ఐశి వడిగ కాశీనగరమునకుఁ బోయెను. చైతుసింగును, ఆతని సోదరునిం దప్ప నితరజనానీకము నెల్ల మన్నింతునని యాతఁడు ప్రకటించెను. రాజనీతిజ్ఞుఁడగు నాంగ్లపాలకుఁడు రాజ్యము నాముహూర్తముననే కబళింప నొల్లక, పందొమ్మిది సంవత్సరముల ప్రాయముగల చైతుసింగు మేనల్లుని సింహాసనమునఁ బ్రతిష్ఠించి, ఆతఁడు బాలుఁడని, ఆతనిజనకుని 'నాయిబు'గా నియోగించి, తొంటి ౨౨ లక్షల కప్పమును, నలుబదిలక్షలు చేసి, రాజ్యమునందలి 'క్రిమినలు' అధికారమును,' రాజధానియందలి 'సివిలు' అధికారమును గూడఁ దనకు బాధ్యుఁడై యుండు నొకయధికారియధీన మొనరించెను. రాజచిహ్నమగు నాణ్యముద్రణాధికార మసలే పోయెను. కాశీరాజు నిక్కముగ నొక పోతఁరాజాయెను.

---

"I apprehend that she the Ranee—will contrive to defraud the captors of a considerable part of the booty, by being suffered to retire *without examination.*"—Hasting—Quoted by Mill.

"And when the Princesses, with their relatives and attendants, to the number of three-hundred women, besides children, withdrew from the castle, the capitulation was shamefully violated; they were plundered of their effects; and their persons otherwise rudely and disgracefully treated by the licentious people and followers of the camp."—Mill:—"That they or rather their attendants were subjected to personal search, is possible,—the searchers were females."—Wilson—p. 404.

## సిగ్గంతా చివరకు చీవాట్లకిందికి దిగింది





బ. రామారావు

# కృష్ణరాజసాగరము

బీ. సుబ్రహ్మణ్యం గారు

(మైసూరునందలి యొక చక్కని సరస్సు)

౧

ప్రకృతపు మైసూరుమహారాజుగారి పేర వెలయు కృష్ణరాజసాగర మను సరస్సు మైసూరు రాజ్యమునందలి సుందరప్రదేశములలో నొకటి. మైసూరునకు పదిమైళ్లదూరమున నది జీవనదియగు కావేరినంటి శైలున కందుబాటున నున్నది. మానవప్రతిభావినిర్మితమైన యీసరోవరము తిండికిలేని బీదలతండముల కూటను, శ్రీమంతులకు భోగసౌఖ్యమును ఒక్కట గూర్చు చుండును. విద్యుచ్ఛక్తి యుత్పత్తికిని, వ్యవసాయమునకు నొకేపరి నుపకరించు నద్భుత వ్యవస్థగల యీసరోవరమువంటివి ప్రపంచమున నెన్నియో లేవు.

ఇంచుమించు ౫౦ చదరపుమైళ్ల వైశాల్యముగల యీసరస్సు కావేరీ మహానదిపై పెద్ద ఆనకట్ట కట్టుటచే నేర్పడినది. మైసూరు ప్రభుత్వమువా రీ ఆనకట్ట కట్టుటకు రెండుకోట్లరూపాయలు వెచ్చించిరి. ఆనకట్టపొడవు ౭,౬౦౦ అ. ఎత్తు ౧౩౦ అ. అందు ౧౨౪ అ. ఎత్తువఱకు నీరు నిలువచేయదగును. అందు ఇంచుమించు ౪౭,౨౦౦ మిలియనుల (మి. ౧౦,౦౦,౦౦౦) ఘనపదముల నీరు పట్టును. ఏటిమట్టునుండి ౬౦ అ. ఎత్తున కట్టియున్న నీటిపాఱుదల తూముల అడుగు చాప రాయి మొదలు ౪౫,౪౭౪ మిలియనుల ఘనపదముల నీరు నిరంతరోపయోగమున నుండును. భారతదేశమం దిప్పటికి నిర్మించిన కృతక సరస్సులలోని కెల్ల కృష్ణరాజసాగరమే పెద్ద దనుకొనవచ్చును; ప్రపంచములోని కెల్ల, ఈజిప్టునందలి ఆస్సువ్యఅనుడాము మొదటిది కాగా, నిది రెండవది కావచ్చును. ఈజలకోశ మపారమగు విద్యుచ్ఛక్తిని జనింపజేసి, పరిశ్రమలకును, వ్యవసాయమునకును, ఇంటిపనులకు నెంతయో చాకగ నందజేయుచున్నది. ఈ ఆనకట్ట కట్టక పూర్వము వేసవియందు నదీప్రవాహము మిక్కిలి తక్కువగా నుండుటచేసి, శివసముద్రజల పాతముకడ ౧౧,౦౦౦ అశ్వశక్తి(H. P.) గల విద్యుచ్ఛక్తిమాత్రమే యుద్భవించుచుండెడిది. ఇప్పుడు నిశ్చితముగ ౯౦౦ క్యూసెక్కుల* నదీ జలము నిరంతరము పాతము నొందుచుండుటచే ౪౬,౧౦౦ అ. శ. గల విద్యుచ్ఛక్తి జనించు నేర్పాటయినది. ఇందు నిమిత్తము దాదాపు ౬౧౧ కోట్ల ఘనపదముల నీరు సరస్సునుండి వ్యయమయిపోవును. మిగిలినది వ్యవసాయమున కుపయోగపడును.

ఆనకట్టనుండి నది కిరుప్రక్కల ప్రవహించు దిగు మట్టపుకాలువలు రెండును ఇంచుమించు ౧౧,౦౦౦ ఎకరముల నేల సాగుచేయును. ఈభూమిలో చాలనఱకు సరస్సులోపడిన భూముల ఖామందులకు రైతులకు ముదరాయిచ్చినదే. సాగుబడినీటిలో ఎక్కువభాగము సరస్సునుండి ఉత్తరపు గట్టుననున్న 'ఇర్విన్ కెనాల్' అను ఎగుమట్టపుకాలువగుండ పోవును. అది ౨౫ మైళ్లు పోయి, అటనుండి 'కరిఘట్ట'మను పర్వతపఙ్క్తికడ ౯,౧౩౦ అ. సురంగముద్వారా పాటినపిమ్మట కావేరీ. శింశానదుల నడుమ భూముల సాగుబడికి వినియోగపడును. మాండ్యా, మలవల్లి, నరసిపూరు తాలూకాల కాకరమైన యీభూభాగము సరస్సునకు ౪ మైళ్ల దూరమున నతివిశాలమై యొప్పుచున్నది. ఇచట దాదాపు ౧,౭౫,౧౦౦ ఎకరముల పల్లపునేల సాగుబడికి తగియున్నది. ౧,౨౫,౦౦౧ ఎకరముల కీక్రొత్తకాలువ నుండి పిల్ల కాలువలను, బోదెలను కలుపుటకు ప్రభుత్వమువారు సంకల్పించుచున్నారు.

హిందూదేశమందలి ఇతరభాగములందు మిక్కిలి జయావహముగా కొనసాగిన 'బ్లాక్ సిస్టము'నే ఇచ్చటను

* క్యూసెక్ అనగా ఒక సెకనుకాలమున ప్రవహించు నీటియొక్క ఒక ఘనపదము.

వ్యవసాయవిధానముగా నవలంబింప నెంచినారు. ఈవిధా నము ననుసరించి, గ్రామముయొక్క ఆరోగ్యమునకును, పెరుగుదలకును వలయు నవకాశము లుంచి, సాగుచేయ దగిన నేల మొత్తములో మూడవవంతు బీడునకు వదలి; మిగత రెండువంతుల భూమిని మూడు ఖండములుగా విభజించి, అందు నేమిక్రమమున వరి, చెఱకు, మెట్ట పైర్లు పండింపబడును. ఈవిధమైన వ్యవసాయము గ్రామముయొక్క యారోగ్యమునకే కాక, నీటిఖర్చు మితము గా నుండుటకును నిశ్చయముగ తోడ్పడునని వాడుక.

ఈఇర్విను కాల్వపని పూర్తిఅగుటకుగాను ౨౨౨ లక్షల రూపాయలు వ్యయమగునని అంచనవేయబడెను. ఆమొత్తము అనుమతింపబడెను. పని చురుకుగా సాగు చున్నది. ౧౯౩౧ సం. జూలై నాటికి ఈచెరువులో నుండి మొదట ౩౦,౦౦౦ ఎకరములనేల సాగుబడిచేయు టకు సరిపోవు నీరును అందజేయగలరని దాని అధికారు లాశించుచున్నారు.

౨

ఈ ప్రాచీనదేశమందలి పుణ్యనదులలో నొకటగు కావేరీనది పడుమటి కనుమలలోని కొడగునందుగల తల కావేరియను ప్రదేశమున పుట్టుచున్నది. ఈనది మైసూ రురాజ్యమునందు ౧౪౧ మైళ్లును, పిదప మద్రాసురాజ ధానియందు ౩౮౧ మైళ్లును ప్రవహించి, బంగాళా ఖాతమున బడుచున్నది. నదిపొడుగునను జలము మానవో పయోగ్యమగు రీతిని శతాబ్దులనుండి సజ్జితముగ నున్నది. మద్రాసురాజధానియందు నది దిగువభాగమున గల పల్ల పుడెల్టాభూములవలెగాక, మైసూరురాజ్యమున నది ప్రవ హించు ప్రదేశమంతయు మిట్టపల్లములుగా నున్నందున, మద్రాసురాజధానిలో నెక్కువభూమిని సాగుచేయు టకు సౌలభ్యముండ, మైసురురాజ్యమున నది కిరుప్ర క్కల నంటియుండి, దానిలోని కేటవాలుదిగు ఏకొన్ని చీరికలో సాగగుచున్నవి. మైసూరు నదిలో దాదాపు సగ మునీరు తాను పెంపుచేసినదే యైనను, ఇంచుమించు ౧౮౦ చదరపుమైళ్లు మాత్రమే సాగుచేయ గలుగుచు న్నది. మదరాసురాష్ట్రమున నన్ననో, కావేరీనదివలని సాగుబడి ౧,౮౦౧ చదరపుమైళ్లకుపైగా విస్తరించు చున్నది. ఇంత సాగుబడికిని కావలసినది నదీజలమున నొకస్వల్పభాగముమాత్రమే; మిగిలినదంతయు వ్యర్థముగ బంగాళాఖాతముననే కలియుచున్నది.

మైసూరు రాజ్యమున నింకను జలము నెక్కువ యుపయోగపఱుచు విషయమున, ఎంతలేదన్నను, సుమారొకటిన్నరశతాబ్దమునుండి మైసూరుప్రభుత్వము వారాలోచన సల్పుచునేయున్నట్లు ఇప్పటికున్న ప్రమా ణములు చెప్పుచున్నవి. టిప్పుసుల్తాను రాజ్యకాలము నను, మైసూరు కమిషను రోజులలోను, తిరిగి మైసూరు రాజవంశమువారురాజ్యముపడసినతరువాతనుగూడ ఒక్క బ్రహ్మాండమైనజలకోశమునుగట్టించి, వృథాగా సముద్రము పాలగుచున్న నది వరదనీటిలో కొంతభాగము దాన నిలువ చేసి, ఆనీటితో భూమిని సాగుచేయుటకై అనేకప్రయ త్నములు జరిగియుండెను. కాని ఏదో ఒకఅడ్డంకివలన వారి ప్రయత్నము లన్నియు విరమించుకొనుచునే వచ్చిరి. మైసూరుప్రభుత్వమువారు ౧౯౦౨ సం. శివసముద్రజల పాతమువలన విద్యుచ్ఛక్తి నుద్భవింపజేయ మొదలిడిన వెనుక ఈసమస్య వేరొకమార్గము పట్టినది.

ఎండకాలము నది పొడుదల చాల తక్కువగా నుండుటవలన సంవత్సరము పొడుగునను తగినంత విద్యు చ్ఛక్తి నుద్భవింపజేయ జాలకుండెడివారు. ఈ విద్యుచ్ఛ క్తిని తొలుదొల్త వాడినవారు కోలారు బంగారుగనుల కంపెనీలవారు. నిరంతరము విద్యుచ్ఛక్తిని సప్లయిచేయ గలందులకు మైసూరు ప్రభుత్వము సరియైన పూచీకత్తు నిచ్చినయెడల, ఇంకను ఎక్కువ విద్యుచ్ఛక్తి నుపయో గించుకొనుట కీకంపెనీలవారు సిద్ధముగా నుండిరి. ఇదియుగాక, విద్యుచ్ఛక్తి చౌకయైనచో, పరిశ్రమాభి వృద్ధి యినుమడించును. హైడ్రోఎలెక్ట్రిక్ విధానమువలన చాలలాభము కలుగుచుండెను. ఈఆలోచనలును, చాలగ త్రొత్తభూమిని సాగులోనికి దింపు నుద్దేశ్యములును చేరి, వ్యవసాయమునకును, విద్యుచ్ఛక్తికిని కూడ పనికివచ్చునట్లు ఒకపెద్ద జలాశయమును నిర్మింప వలెనను వెనుకటి సంకల్పమును త్రుప్పుదులుపుటకు ప్రభుత్వమువారిని ప్రేరేచెను.

ఇట్లు ౧౯౦౫ సం.న ముఖ్య ఇంజనీరుగానున్న మెక్ హచినుగారు ప్రథమ పరిశోధనలు మొదలు పెట్టిరి. ౧౯౦౭ సం.న ఆయన జలాశయనిర్మాణమున కొక విధానమును సిద్ధముచేసి ప్రభుత్వమువారియెదుట బెట్టెను. పిదప ౧౯౦౯ వ సం.న క్రొత్తగా ముఖ్యఇంజనీరుగా నియమితులైన సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య



సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు
కృష్ణరాజసాగర నిర్మాణ ప్రారంభకులు

గారు ఈపనికి పూనుకొని, విధానమునంతను కొలదిగ సవరించి, ౧౯౧౧ నందు కన్నంబాడివద్ద కృష్ణరాజసాగరపు ఆనకట్ట కట్టుటకు ప్రారంభించిరి. ఈపనిముగియుటకు ౧౦ వత్సరములు పట్టునని అంచన వేసిరికాని అనేకకారణములవలన నింతవఱకది పూర్తికాలేదు. అట్లు కాకుండుటకు మైసూరుప్రభుత్వమును, మద్రాసుప్రభుత్వమును నదీజలమును సమముగా పంచుకొను విషయమయిన 'మైసూరుమద్రాసు'పరిష్కారము ముఖ్యకారణములలో నొకటి.

ఇన్ని ఇబ్బందులున్నప్పటికి సర్ విశ్వేశ్వరయ్యగారు దివానుగానున్న కాలమున (౧౯౧౨-౧౯౧౮) ఆనకట్ట పని చాలచురుకుగ జగిగినట్లు కన్పడును. తరువాత పని కొంత మందగించినను అన్ని విధములైన అభివృద్ధి శాఖలందును, ముఖ్యముగ వ్యవసాయపు యేర్పాటులందు, మిగుల నాసక్తియు, బుద్ధికుశలతయు గల ప్రస్తుతపు దివాను అమీన్ ఉల్ ముల్క్ మీర్జా యం. ఇస్మైల్ గారి ప్రత్యేకప్రేరణమువలన పని మరల కడు చురుకుగా సాగుచున్నది.

ఈ ఆనకట్ట పునాదికై నేలను త్రవ్వుచుండగా బయలుపడిన ఒక శిలాశాసనమువలన, టిప్పుసుల్తాను ఆనకట్ట కట్టుటకు నిశ్చయించినదియు సరిగ నీప్రదేశముననే యని విశదమయినది. ఇది యొకచక్కని చరిత్రాంశము.

3

కావేరీనది జూలై నెలయందు నీరు హెచ్చుట మొదలిడి, ఆగస్టుమాస మధ్యమునకు పూర్తిగ వరదలతో నిండిపోవును.

ప్రకృతిదేవత యీసుందరసరోవరము నమర్చిన మోహనసన్నివేశమున ముగ్ధుడై, మౌనరాగము లాలపించుకొనుచు శ్రావణసాయంసమయమున నాకృష్ణరాజ సాగరము చుట్టుగోడకడ నిలిచియుండు ప్రేక్షకుని వివిధభావ వికారములకు ఆయుబుకు నీళ్లు సరియగు ప్రతిబింబముల నీనుచుండును. పల్లపడి దిగ్రేఖకడ మెఱపునీటిని ముద్దిడికొన వంగుచుండు సాయంసూర్యుడును, చిఱుకెరటములలో చిత్రపురంగులు కలచుచుండునతని యెఱ్ఱనికిరణములును, తమ దూరపుగూండ్లకు సరసిమీదుగ నెగిరిపోవు పిట్టలును, దక్షిణమున తెల్లని స్టీములాంచితోడి వంకనీరును, ఉత్తరదిశను దూరమున త్రొక్కిసలాడు పచ్చని చెట్టుచేమలును, చివర మసకగా ఊరు జాడయు, కొంచెము తిరుగగా వెనుకదెస చిఱునవ్వువారిచేలును, దవ్వుదవ్వుల నున్న మగనికై చేతులు చాచికొ

మైసూరు కృష్ణరాజ సాగర చిత్రములు



౧. కృష్ణరాజసాగరము-లోవైపు



౩. కృష్ణరాజసాగరము ఆనకట్టకునడుమ తాత్కాలికముగా కట్టిన అడ్డుకట్టమీదపారుచున్న ౧౯౨౪ వ సంవత్సరపు విపరీతపువరదలు



౪. కృష్ణరాజసాగరము ఆనకట్టకు దక్షిణమున తాత్కాలికముగా కట్టబడిన తూములగుండ నీరు వడిగా ప్రవహించుట



౫. కృష్ణరాజసాగరము ఆనకట్టనడుమ తాత్కాలికముగ కట్టిన అడ్డుకట్ట ఉండిన గండిపట్టు



౬. శ్రీ కె. ఆర్. శేషాచార్యులుగారు
కృష్ణరాజసాగరనిర్మాణ ప్రధాన యంత్రశాస్త్రజ్ఞుడు

౭. మైసూరు మహారాజావారి ఊరేగింపు-దసరా చివరరోజు



నుచు తహతహతో తన మలకదారుల తొరపడు నదీ తన్వియు, ముంగట చిన్న డాబాతోపులును, వీథులతోను ద్వారములతోను నందగించు నెత్తునేలయు, వీనికితోడు సరసినుండి తేలివచ్చి, సేదదేర్చుచు, క్రొత్తజీవనమిడు చల్లగాలులును, సరసినుండి బయలువడు. ఏటినిండు హోరును — ఇన్నియు నద్భుతముగ మేళవించిన నిత్యపరివర్తన శీలమగు పరితోదృశ్య సౌందర్యమున ప్రేక్షకు డానంద పరవశుడై పోవును. ప్రకృతిదేవి కాటపట్టయిన యీ తావు నెడతెగనిసొంపు నెంత్రతావిన నంతవిముగ్ధుడై పోవును; తన్నుదానే మఱచిపోవును; కాలమువూటయే తోచదు. ఇక జాలిగొన్న దా యన్నట్లు ప్రకృతి యాదృశ్యమునంతను రాత్రియను చీకటితొడుగున తొడిగివైచును. వెంటనే స్థితియంతయు మాఱిపోవును. నది కిరు ప్రక్కల చెదరినదీపములు మెఱయుచు గానవచ్చును. చుట్టుప్రక్కల నిశ్శబ్దతతోపాటు నదీనిస్స్వనము హెచ్చుచుండును. అప్పటికే, పెరుగుచున్న చలి యిక నతని నింటికి తోలును. మానవప్రయత్నము లెంతటి వనిపించు ప్రకృతి జాణతనపు పొంకములు ఇంతతడవును ఆతని మానసమున తిరుగుచునే యుండును.

---

# తిరుచినాపల్లి రాతికోటలోని దేవాలయ చిత్రములు



మధురనాయకరాజు దేవాలయమున నల్లరాతితో చెక్కిన విగ్రహమును చూచి వ్రాసినది



దేవాలయమునందలి గంగాధరవిగ్రహము

తిరుచినాపల్లి రాతికోటయందు ఒకరాతిలో మలచిన దేవాలయముయొక్క ప్లాను. ఈ దేవాలయము క్రీ.శ.౬౧౦-౬౩౯ సం. ఉండిన పల్లవరాజు మహేంద్రవర్మనాటిది నిడివి అ. ౩౨; వెడలుపు అ.౧౯






పై దేవాలయముయొక్క ఎత్తును తెలుపు ప్లాను.



గంగాధరు డపస్మారు నణగ్రద్రొక్కుట. సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు గంగాధరుని స్తోత్రము చేయుచున్నారు. రాతికోటలో దేవాలయమునందలి చెక్కడపు బొమ్మను చూచి వ్రాసినది








# సంచార చిత్ర ప్రదర్శనము

మొగలాయీల రాజ్యము విచ్ఛిన్నమగు నప్పుడును, ఆంగ్లేయులు దేశము నాక్రమించునప్పుడును సంభవించిన సంక్షోభమునందు అచ్చటచ్చట పోషణను బడయుచుండిన మొగలు, రాజపుత్ర చిత్రకారులను జూచువారు లేకుండిరి. వీ రాశ్రయించియుండిన రాజులపాలనమే యస్థిరమైయుండ వీరిని జూచువా రెవరు? దేశమున శాంతియేర్పడిన పిమ్మట తమవృత్తిని సాగించుటకును అవకాశము లేకపోయెను. జాతీయ కళయెడల సానుభూతిలేని సైనికోద్యోగులును, సైనికులును జయించిన రాజ్యముల నాక్రమించుటయందు నిమగ్నులై చిత్తరువులను సరకుచేయకపోవుటవలన వానియందు పెక్కులు నశించినవి. మిగిలినవాటియం దధిక భాగము పరదేశములను జేరినవి. అటుపిమ్మట పాశ్చాత్యనాగరికత పాదుకొనుచువచ్చినకొలది వీటినిజూచువారు లేక పోవుటవలన కొంతకాలమునకు మనజాతీయకళయొక్క యాధిక్యమునే మనము మరవవలసివచ్చినది.

హేవెలు, ఆనందకుమార స్వామి వంటి పండితుల పొగడ్తలవలనను, అవనీంద్రనాథఠాకురుగారి చిత్రరచనవలనను మనజాతీయ చిత్రరచన మరల ప్రజల నాకర్షింపజాలెను. ఠాకురుగారి శిష్యులగు నందలాలుబోసు, అసితకుమార హల్దారు మొదలైనవారు నూతనమార్గములను ద్రొక్కి యీచిత్రరచనకు నూతనమైన సొగసును చేకూర్చుచున్నారు. కాని పాశ్చాత్యనాగరిక తావ్యామోహితులైన దేశీయులు అంగసౌష్ఠవముకల సౌందర్యమును, స్నాయుపుష్టికల పశుబలమును చిత్తరువులందు చూచి యానందించుట కలవాటుపడి యుండుటచే యీ చిత్తరువుల నామోదించుటలేదు. కలకత్తా, చెన్నపట్టణము, బొంబాయి మొదలగు మహాపట్టణములందు నివసించువారికి దప్ప తక్కిన వారి కీచిత్తరువుల మాతృకలనుజూచు భాగ్యముకూడ లేకున్నది. అచ్చునందు దోషములుండుట వలనను, సుప్రసిద్ధములైన చిత్తరువులందధికములు పత్రికాధిపతులకు లభింపకపోవుటవలనను, లభించినను కొన్నిచోట్ల పత్రికాధిపతులు కళావిమర్శకులు కాకపోవుటచే మంచి బొమ్మలను ప్రకటింప నిరాకరించుటవలనను పత్రికలయందు ప్రచురింపబడుచున్న చిత్తరువులు ప్రజలకు నూతనచిత్రరచనయొక్క గొప్పతనమును తెలియజెప్పజాలుటకు చాలవు. ఇట్టి పరిస్థితులందు ఈసంచారచిత్ర ప్రదర్శనము నేర్పరచి, వ్యయప్రయాసములకోర్చి దేశమునం దంతటను సంచారము చేయుచు, చిత్రసంచయమును ప్రదర్శించుచున్నందులకు వి. ఆర్. చిత్ర, పి. హరిహరన్ గార్లు అభినంద నార్హులు. ఆంధ్రదేశమునం దిప్పుడు వ్యాపించుచున్న జాతీయచిత్రకళయొక్క యామోదమును వీరు బలపరచిరి.

ఆంధ్రదేశమున రామారావుగారు బొంబాయి, కలకత్తా చిత్రరచనావిధానముల లోపములను దీర్చు నుద్దేశమున తమ నూతనశైలిని ప్రచారము కావించిరి. వీరు మరికొన్ని సంవత్సరములు బ్రతికియుండిన యెడల నీ విధానము పాదుకొనుట కవకాశము కలిగియుండును.

ఆంధ్రులనాగరికత, ఆంధ్రులసాంఘికరీతులు, వారిచిత్తవృత్తి తెలియజేయుటకు ప్రత్యేకరచనావిధాన మవసరమని యనేక పర్యాయములు వ్రాసియుంటిని. రామారావుగారు జీవించియుండిన నీలోపములు తీర్చియుండెడివారేమో. వీరిశైలిననుసరించి వ్రాయు ఆంధ్రులందెన్నదగినవారు లేకున్నారు. వ్రాయుచున్న వారిచిత్తరువులందు భావ మల్పముగనున్నది. పరిస్థితులిట్లుండ బందరుజాతీయ కళాశాలయందు ఉపాధ్యాయులుగ నుండినప్రమోదకుమారచటోపాధ్యాయులువంగవిధానములను తమ శిష్యులకు నూరిపోసిరి. పాశ్చాత్యవిధానములను విడనాడినవారు వంగవిధానములకు దాసులై ఆంధ్రవ్యక్తిత్వమున కెట్టిలాభమును చేకూర్పదలచిరో తెలియకున్నది. రామారావుగారి చిత్రరచనావిధానమే యాంధ్రదేశపు కళ నుద్ధరింపగలదని నాయుద్దేశము కాదు. తమకుగల రచనాకౌశలము నుపయోగపరచి యాంధ్రవ్యక్తిత్వము నేల బూజింపరాదు? అని అందును. ఆంధ్రచిత్రరచన యిటులుండ నీసంచారచిత్రప్రదర్శనము వంగవిధానమును మరింత బలపరచునేమోయను అనుమానము కలదు. ఏవో కొన్నితప్ప తక్కినచిత్తరువులన్నియు వంగచిత్రకారులచే రచియింపబడినవి. ప్రదర్శకులు శాంతినికేతనమునందు వంగీయులగు నందలాలుబోసుగారివద్ద చిత్రరచనను నేర్చుకొనినవారు. ఈప్రదర్శనమునందలి చిత్తరువులను జూచిన యాంధ్రు లీవిషయములను మరువకుందురుగాక.

అవనీంద్రనాధఠాకురుగారు విశాలహృదయులు. నూతనముగ జాతీయకళ నుద్ధరించి, శిష్యులకు చిత్రరచనను నేర్పియు వారి స్వేచ్ఛకుమాత్ర మెట్టి యాటంకమును కలుగజేయక పోవుటవలన వారు తమతమ బుద్ధిని వినియోగించి యనేకములగు నూతనమార్గములను ద్రొక్కుచున్నారు. అప్పుడప్పుడు కలిగి మారుచున్న చిత్తవృత్తినిబట్టి యొకేచిత్రకారు డనేకవిధానములజిత్రించుటయు గలదు. పాశ్చాత్యదేశములందైనను, భారతదేశమునందైనను, ఆంధ్రదేశమునందైనను సాహిత్యము వ్యక్తిత్వమును గోరుచున్నది. సజీవులైయున్న యాంధ్రకవులం దొక్కొక్కరి దొక్కొక్క మార్గమైనను అందరు వ్రాసినవి మనోహరముగ నుండగలవు. వంగచిత్రరచనయందుకూడ యిట్టివ్యక్తిత్వమే కానవచ్చుచున్నది. ఈవిషయము చిత్రప్రదర్శనమునందు బాగుగకనబడుచున్నది.

అన్ని విషయములందును ప్రాక్పశ్చిమములను భేదము దినదినమును ప్రబలుచున్న యీకాలమున పశ్చిమదేశమునెడల విముఖతకలిగినకొలది ప్రాగ్దేశములయెడల ప్రేమ హెచ్చుట సహజము. కాని యీప్రేమకు మితి యుండవలెను. హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చిన పిమ్మట జపాను దేశీయులు మనదేశమును పాలించుట కిష్టపడము. అటులే పాశ్చాత్యవిధానమును చిత్రరచనయందు విడనాడ జూచుచున్న చిత్రకారులు జపానుదేశపుశైలినేల యనుసరింపవలెనో తెలియకున్నది. ప్రదర్శనమునందలి కొన్ని చిత్తరువులందు జపానువిధానము స్పష్టముగ కానవచ్చుచున్నది. చిత్రకారుని పేరును వ్రాసుకొనుటయందును వీరు జపానును దృక్పథమున నుంచుకొనుచున్నారు. ఈప్రమాదమును త్వరలో గ్రహింపకపోయినయెడల వీరాశించుచున్న విజయమునందు పరాభవమే ప్రాముఖ్యము వహించగలదు.

ఈచిత్తరువులను జూచిన నీనూతనచిత్రవిధానము వ్యక్తుల సమూహమును ప్రదర్శించుటకు సరిపడదాయను అనుమానము కలుగును. సాధారణముగ వ్యక్తుల కూడికను ప్రదర్శించు పాశ్చాత్యచిత్రముల ననుసరింపక చిత్రింపనుత్సాహపడుచున్నవారు ఒకటి రెండు వ్యక్తులనుమాత్రమే చిత్తరువులందు జూపుట సహజము. కాని యీయుత్సాహము జాతీయచిత్రరచనయొక్క ప్రయోజనమును సంకుచితము చేయరాదు. బాఘ్, అజంతవిహారములందు వ్యక్తుల సమూహము లత్యద్భుతముగ ప్రదర్శింపబడినవి. చిన్నవిగనున్న రాజపుత్రచిత్తరువులందును వేట ఉత్సవము మొదలగునవి అత్యంతానందదాయకముగ నున్నవి. ప్రదర్శనచిత్రములం దిట్టి చిత్తరువులు లేకుండుట యొక లోపము. ఇట్టి చిత్తరువులు వీరికి లభింపరేదని తోచుచున్నది.

కాగితముపైనే కాక పట్టుపైని, బట్టపైని చిత్రింపబడిన బొమ్మలను, బట్టపై అద్దకములను, చక్కనిపా

త్రములను, సుప్రసిద్ధములగు చిత్తరువుల చక్కని అచ్చు ప్రతులను వీరు ప్రదర్శించుటవలన ప్రదర్శనమున కొక విధమగు సంపూర్ణత కలదు.

సాధ్యమైనంతవరకు ప్రసిద్ధి జెందిన వంగచిత్రకారులందరిచే చిత్రింపబడిన చిత్తరువులను వీరు సేకరించిరి. అవనీంద్రనాథఠాకురు, నందలాలుబోసువంటివారి చిత్తరువులు కలవు. ప్రదర్శకులచే వ్రాయబడిన చిత్తరువులు కూడగలవు. ఆంధ్రదేశమున వ్రాయబడినవియు కొన్ని కలవు. వీటిసంఖ్య అధికముగ నుండిన బాగుగనుండియుండెడిది.

మంచి చిత్తరువులతోపాటు కొన్ని భావశూన్యములైన చిత్తరువులును కలవు. ఇట్టివాటియందు వర్ణలేపన కౌశలము సైతము కాన్పింపకున్నది.

ఇది వంగచిత్రకారుల చిత్తరువుల ప్రదర్శనము. ప్రదర్శకులు వంగదేశమున తమ చిత్ర రచనను నేర్చుకొనినను, ఆంధ్రదేశమునం దంతటను చిత్రములను ప్రదర్శించి ఆంధ్రులలో ననేకులు సుప్రసిద్ధవంగచిత్రకారుల చిత్తరువులను చూడలేదన్నలోపమును దీర్చినందులకు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులు కాదగుదురు. ఆంధ్రచిత్రరచనయెడల నభిమానము కల ఆంధ్రులు ఆంధ్రులచే వ్రాయబడిన చిత్తరువులను ఇట్లు దేశమంతటనుదిప్పి జాతీయచిత్ర రచనాప్రచారమునకు దోడ్పడెదరుగాక!

[తలిశెట్టి రామారావు.]

సంచారచిత్రప్రదర్శన మొక క్రొత్త పద్ధతి. ఇట్టి ప్రదర్శనములవలన భారతీయచిత్రకళ బహుముఖముల నభివృద్ధి గాంచగలదు. ఈ ప్రదర్శనమున నించుమించుగ నన్నియు వంగీయచిత్రకారుల చిత్రములే. ప్రదర్శనము జరిగినది ఆంధ్రదేశముననే. ఆంధ్రదేశమునను చిత్రకారు లున్నారు. వారి చిత్రము లిందు విరివిగ కాన్పింపకపోవుట విచారమును గొలుపుచున్నది. ఇట్టి ప్రదర్శనములకు చిత్రకారుల నైకమత్యమును, బరమావశ్యకము.

చిత్రరచనావిధానము కాలదేశముల ననుసరించి మారుచుండుటను చిత్రకళాచరిత్రము చాటుచున్నది. సౌందర్య మన్నివిధానముల చిత్రములందును నేదో యొకతీరున నుండి తీరును. సౌందర్యపిపాసువులగు కళావేత్తలు దానిని గుర్తింపగలరు. ఈవిషయము నింత శ్రీయుతులు తలిసెట్టి రామారావుగారు పైన విమర్శించియున్నారు.

వంగదేశమునందలి శాంతినికేతన కళాభవనమున చిత్రకళ నభ్యసించిన శ్రీయుతులు



వి. ఆర్. చిత్రగారు



పి. హరిహరనుగారు

ఇట్లు క్రొత్తతీరు చిత్రసంచయమును ప్రదర్శించి తమ వంగీయగురువులకు గురుదక్షిణ నర్పించికొని కృతార్థు లయినారు. ముమ్ముందు వీరును, ఆంధ్ర దేశ చిత్ర కారులును కలిసి విరివిగ చిత్రములను సేకరించి యిట్లు సంచార ప్రదర్శనముల ప్రదర్శించుచు జాతీయ చిత్రకళను పెంపొందించుచుండ దగుదురు.

—భారతి

## శ్రీయుత నందలాలుబోసుగారు

శాంతినికేతనమునందలి విశ్వభారతి కళాశాఖయగు కళాభవనముయొక్క ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత నందలాలు బోసుగారి చిత్తరువులందు భావగభీరత, భావప్రదర్శనమునందు స్పష్టత, హైందవవాతావరణము చూడగలము. ఇప్పుడు ప్రాముఖ్యము వహించుచున్న చిత్రకారులలో ననేకులు వీరి శిష్యులు. తమ గురువువలె బోసుగారును ఇతరుల ననుకరించుటను సహింపక తమతమ చిత్తవృత్తిని, వ్యక్తిత్వమును గ్రహించి చిత్రించుటకు తమశిష్యులను ప్రోత్సాహపరచుచున్నారు.

స్థిరమైనవయ్యు చలనభానమును జూపురేఖలు, అణగియున్న భావావేగమును తెలియజేయు మిగుల గాఢమగు వర్ణలేపనము, అన్నివివరములను జూపు అలంకారమును మించినభావప్రదర్శనమును వీరి చిత్రరచనయొక్క గుణములు. గురువగు డాక్టరు అవనీంద్రనాథునిగూడ మీరి, వీరు చిత్రరచనయందు వన్నెకెక్కిరి. ఈయిరువురు మహాచిత్రకారుల చిత్రములకుగల పోలిక చాల తక్కువ. శిష్యుని రచనయందు గురువుయొక్క చిత్రరచనాచిహ్నముల జూడజాలము. సాధారణముగ వీరు పౌరాణిక కథలను చిత్రించుచున్నను, ప్రాపంచిక విషయములను బొత్తిగా విడిచిపెట్టుట లేదు. సర్వసాధారణముగ వీరు చిత్తరువుల నన్నిటిని నీటిరంగులతో చిత్రింతురు.

"ఉమాపరితాపము" అను చిత్తరువంటివి కొన్ని తప్ప తక్కిన వీరి చిత్తరువులన్నియు చిన్నవి. సర్వేశ్వరుడగు మహాదేవు డీతని హృదయము నాకర్షించెను. కాన నీతడు మహాదేవుని వివిధచిత్తవృత్తులను కాగితముపై కాకర్షించుచుండును. క్రొత్తచిత్రరచనా విధానములను వీరత్యంత నిపుణతతో ననుకరింతురు. ఇతర ప్రాగ్దేశపు విధానములను వీరు గ్రహించి అనుభవమునకు దెచ్చుకొని "జపానునృత్యము" అను చిత్తరువునందువలె తమవ్యక్తిత్వము, తెలివి తేటలు కనుపడునటులు హైందవరీతిని ప్రదర్శింపగలరు.

వేయేల, ఈతని రచన ఆవేశపూరితముగను, ఆవేశజనకముగను, భావజనకముగను ఉండును.

[వి. ఆర్. చిత్ర.]

## డాక్టరు అవనీంద్రనాథ ఠాకురు గారు డి. లిట్.

భారతీయ చిత్రరచనయొక్క పునరుజ్జీవన మెవరైన నొకరివలన గలిగెనన్న, వారు డాక్టరు అవనీంద్రనాథ ఠాకురుగారని చెప్పవచ్చును: వంగదేశమునందు కాదు, భారతదేశము నందంతటను. లలిత కళావాతావరణమును సంపూర్ణముగ మార్చివేయజాలిన ఖ్యాతిగాంచిన ఠాకురు వంశము వీరిది. జాతీయమును, దేశీయమును అగు వాతావరణమున బుట్టి, పెరిగి, చిత్రరచనయెడల స్వభావజనితమైన అభిరుచియు, నూతన విధానమును సృజింప నుత్సాహమును కలిగిన డాక్టరు అవనీంద్రనాథుగారు త్వరలో భారత దేశపు మహామిత్రులును, భారతదేశమును సాదరభావముతో గౌరవించువారు నగు ఇ. బి. హేవెల్ గారివలన నాకర్షింపబడిరి. సనాతన భారతీయకళను, నాగరికతను చవిజూచిన పిమ్మట యిట్టి మహాసంప్రదాయమును పునరుజ్జీవితము జేయుటకు వీరికి హృదయావేగము కలిగెను. హైందవ చిత్రరచనను మరల నూతన హైందవమార్గములందు ప్రవహింపజేయుటకు సనాతన బౌద్ధసన్యాస చిత్రకారులతో పోల్పదగిన యుత్సాహముతో ప్రయత్నింప మొదలిడిరి. అప్పటికి వర్ణ లేపనము పాశ్చాత్య చిత్రరచనావిధానముల నవలంబించుటయందును, ముఖ్యముగ నూనె రంగులందు ప్రకృతి చిత్రములను వ్రాయుటయందును సన్నగిల్లుచుండెను. వీరు చాలపాటుపడి, దేశీయుల దృక్పథమును

మార్చి, చిత్రకారుల దృష్టిని ఆవేశముకొరకు తమ యందే వెదకుకొనునటులు చేయ ప్రారంభించిరి. మన యదృష్టమువలన వారికి తగిన మంచిశిష్యులు లభించిరి. తక్కిన గురువులవలె గాక, వారు గ్రుడ్డివారివలె తమ రచన ననుకరించుటకు వీ రియ్యకొనలేదు. వారివారి తెలివితేటలను, వ్యక్తిత్వమును గ్రహించునటులు వీరు బోధించుటచేతనే హైందవ చిత్రరచనయం దిప్పు డిట్టి వైశాల్యము కలుగుట సంభవించెను.

వర్ణలేపనమునందేకాక కళకు సంబంధించిన అన్ని పనులయందును వీరుచాల పనిచేసిరి; వంగభావయందు మంచి రచయితలు. నూనెరంగులయందును, నీటిరంగుల యందును వీరికి చక్కనిప్రవేశమున్నను సాధారణముగ నీటిరంగులనే యుపయోగపరచెదరు. ఇతర ప్రాగ్దేశము లందలి రచనావిధానములను, పనితనమును వీరు వినియోగించిరి. జపానును, చైనాయు వీరి నాకర్షించినవి. వీరి రచన ముఖ్యముగ సనాతనహైందవ వర్ణలేపనము పుట్టించిన యుత్సాహముయొక్క ఫలము. కాని వీరిచిత్రరువు లందు వ్యక్తిత్వమును, ఇంపును ఉండుటచే సజీవములైనటు లుండును. జపానుప్రోద్బలము వీరిరచనకు చాల వరకు మేలొనగూర్చెనని కూడ చెప్పవచ్చును. కాని వీరిరచన సంపూర్ణముగ హైందవమనుట నిశ్చయము. వర్ణలేపనమునందు సూక్ష్మత, భావముయొక్క సూచన, యీతని సౌందర్యమైన చిత్రరచనయం దాకర్షణీయాంశములు. రంగులతో దైవికమగు హృదయావేగము, గభీరములగు భావములు ప్రదర్శించువాడు చిత్రకారుడు, రంగీతనిభావ. డాక్టరు అవనీంద్రనాథు తమవర్ణలేపనమువలన హృదయావేగమును, భావములను కలుగజేయు అతిలోకమాధుర్యము బుట్టింపగలరు. వేయేల? గొప్ప రమణీయతయు, మిన్నందు లాలిత్యమును పదనువెట్టిన సమ్మోహనములగు చిత్రితస్వప్నములు వారిరచనలు.

[వి. ఆర్. చిత్ర.]

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ చందాదారుసంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది.

చందాదారులకు భారతి 10.వ తేదిలోపల అందకపోయినయెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపఁగోరెదము.

—భారతి.



## నవ్వు నాణెము

సుఖమునకు నవ్వు కారణమా? నవ్వునకు సుఖము కారణమా? రెండును. లోపల తరలిన నవ్వు వెంటనే వెలుపలికి వచ్చును. వెలుపలనుండియు లోనికి నట్లే పోవును. ఈతీరున జాన్ హార్వే కెల్లాగుగారు 'హెల్తు' పత్రికలో వ్రాసిరి. ఎట్లు పుట్టిననేమి; నవ్వు శరీరమును' మనస్సును ఉత్సాహంగించును. ఆత్మద్వారములను దెఱచి లోనికి ప్రకాశమును వ్యాపింపజేసి భయము, విచారము నక్కడ ప్రోదిచేసియుంచిన చీకటిని, నీడను చెదరగొట్టును. భయము, కోపము, విచారము జీవనవాహిని నింకించును. నోట ఉమ్మి ఊరదు. నాలుక మండుచు అంగిట నంటుకొనును. కారిజము, జీర్ణకోశము-ప్రతి ముఖ్యావయవమును మందగించిపోవును; లేదా, పూర్తిగ నాగిపోవును. అయిన నవ్వు అన్నిచక్రములను ఝుంకారముతో నడవజేయును. మఱియు నెత్తురు రక్తనాళములయందు క్రొత్తవేగముతో పరువిడజేయును.

హాహాహా అను గళధ్వని క్లోమము (రొమ్ములోపలి కోశములకును, ఉదరమందలి కోశములకును నడుమ నడ్డముగ నుండు పొర) పిత్తజీర్ణకోశముల క్రిందికి మీదికి నెగరజేసి, ఆరొడలినమ్మిన బంట్లకు మనఃపూర్వకమగు హెచ్చరిక నిచ్చును; అది జీర్ణశక్తికి తోడ్పడును; పిత్తాశయమునుండివచ్చు పిత్తరసమును పరిశుద్ధమొనర్చును; ఆహారవాహిక యంతటను తిరుగుడు తరంగములను పుట్టించును.

నవ్వు ఉత్తేజకద్రవ్యము; బలము నిచ్చుమందు; గొప్ప జీవామృతము.

హృదయపూర్వకమగు నవ్వుతో ప్రతిదినము నునయింపజేయుము.

నలుపు లున్నచో నవ్వి మఱచిపొమ్ము.
ఉత్సాహమున కోటీశ్వరుడవు కమ్ము.

ఈసందర్భమున మన ఆంధ్రరత్నము గోపాలకృష్ణయ్యగారు చెప్పిన వాక్యములు స్మరింపదగును: 'Laughter lubricates the soul'—నవ్వు ఆత్మను స్నిగ్ధమొనర్చును.

---

## కీ. శే. శ్రీమతి పార్వతిఅమ్మాళు

'త్రివేణి' జూలయి సెప్టంబరు మాసముల సంచికలో ప్రకటింపబడిన వ్యాసము నుండి.

శ్రీపార్వతిఅమ్మాళు ౧౮౬౫ సం. ఏప్రిల్ మాసమున జననమందినది. సుబ్బస్వామయ్యారుగారి చిన్నపెండ్లమున కీమె కడగొట్టుబిడ్డ. ఈఅయ్యారుగారు తిరుచినాపల్లి మండలమున మనక్కాల్ గ్రామమున నొక సంపన్నుడగు మిరాశిదారుడు. పార్వతిఅమ్మాళున కైదవయేట నాతడు మృతిచెందెను. ఆతనిపత్ని దొరఅమ్మాళు శిష్టాచారపరాయణ; సుగుణవతి. ఈమె తనసవతిపిల్లల పోరువలన చాలసిలుగులకు లోనయినది. పార్వతిఅమ్మాళును కొచ్చిను సంస్థానపు దివానుపేష్కారుగ నుండిన కీ. శే. ఏ. శంకరయ్యరుగారి రెండవకుమారుడు

శ్రీచంద్ర శేఖరయ్యరు పెండ్లాడెను. పెండ్లి నాటికి పార్వతిఅమ్మాళునకు వయసు తొమ్మిదేండ్లు. తరువాత నొక యేడాది కామెతల్లియు పరమపదించెను. ఆమెకు చిన్ననాడు కలిగినచిక్కులు—అందును తల్లిదండ్రులమరణము, యౌవనదశయందు తనపై తా నాధారపడియుండుట, తనబాధ్యతను గుర్తించుట, పరులయెడ నాదరభావము కలిగియుండుట మొదలయిన యుత్తమగుణములు పెంపొందుట కుపకరించినవి.



కీ. శే. శ్రీమతి పార్వతిఅమ్మాళు

మగడు చెన్నపురియందు న్యాయశాస్త్రకళాశాలయందు చదువుచుండ పార్వతిఅమ్మాళు కాపురమునకు బోయెను. ఆమె గృహకార్యనిర్వహణసామర్థ్యమునకు, వివేకమునకు, నత్తవారింట నందఱు నామెయెడ గౌరవమును, ప్రేమయు గలిగి మెలగుచుండువారు. ఆమె కుటుంబకార్యములను నియమముతో, జాగరూకతతో, నేర్పుతో నెరవేర్చుచుండెడిది. అతిథిసత్కారమునెడ నామెకు ప్రీతి మెండు. ఆమె యింట బట్టలు, పాత్రలు, ఆహారపదార్థములు అన్నియు పరిశుభ్రముగ నుండ జూచుకొనుచుండును. ఆమె యెన్నడును సొమ్మును వ్యర్థముగ వ్యయపెట్టెడిది కాదు. ఆమెకు లేనిపోని ఆడంబరము గిట్టదు.

భర్త బి. యల్. పరీక్షనిచ్చి న్యాయవాది కావలచియుండ పార్వతిఅమ్మా ళాతనిని మైసూరు సివిల్ సర్వీస్ మొదటిపోటిపరీక్షకు పోవ ప్రోత్సహించినది. అత డట్లె పోయి యాపరీక్షయందు ప్రథమునుగ కృతార్థుడయ్యెను. మైసూరు ప్రభుత్వ మా రాయనకు తొలుదొలుత అసిస్టాంటు కమిషనరు ఉద్యోగము నొసిగెను. క్రమముగా నాయన పెక్కు ఉన్నతోద్యోగములను బడసి తుదకు మైసూరు ప్రధానన్యాయస్థానమున ప్రధానన్యాయమూర్తియై ౧౯౨౪ వ సం. ఆగస్టుమాసమున విశ్రాంతి గైకొనెను. భార్యయగు పార్వతిఅమ్మాళు సత్ప్రవర్తనము, వివేకము, కార్యకౌశల్యము, అనుకూల్యము, ప్రోత్సాహము నాతనిజీవితమునకు మెఱుగు పెట్టినవనుట అతిశయోక్తి కాజాలదు.

ఆమెకు సంతానము జీవింపలేదు. ఆమె కాకొఱంతయే లేదు. ఒరులసంతానమే యామెసంతానము. ఆమె విశాలహృదయము ప్రేమపూరితము. వారినే తన పిల్లలుగ తలచి మిక్కుటముగ ప్రేమించునది. ఆమెకు మఱియు దీనులయెడ నిండుదయ. వారిదైన్యమును తొలగింప నిరంతరము పాటుపడుచుండెడిది.

ఆమె శిష్టాచారసంపన్నయైనను మతాంతరముల యందు పార్వతిఅమ్మాళునకు విశ్వాసము గలదు. వాని యందలి ప్రధానతత్వము లామెకు నచ్చినవి. ఇదియే యామెజీవితమునకు మెఱుగుదెచ్చినది. ఆమె కొన్నాళ్లకు దివ్యజ్ఞానసమాజమున సభ్యురాలయ్యెను. మహర్షులయెడను, పూర్వాచార్యులయెడను, జాతీయవీరులయెడను ఆమెకు భక్తిగౌరవములు మిక్కుటము. నిరంతర గ్రంథపఠనమే యిందులకు గారణము.

హైందవుల సాంఘికపరిస్థితులు ముఖ్యముగా వివాహవిధానము, స్త్రీలస్థితి, వితంతువులదుర్దశ, పంచములహీనస్థితి—పార్వతిఅమ్మాళు మనస్సున గట్టిగా

నాటుకొని కలత పెట్టినవి. ఆమె వీనిని చక్క-బరచి సంఘమును అభివృద్ధికి దెచ్చుటకయి వీరకంకణము దొడిగినది.

ఆమెకు అఱినము బాగుగవచ్చును. చక్క-గా ఉపన్యసించగలదు.కన్నడమునను, మళయాళమునను ఉపన్యాసముల నొసగగలిగియుండెడిది. తరువాత వయసువచ్చిన పిదప ఇంగ్లీషునను వ్యవహారమునకు జాలినంత పాండిత్యమునుగడించినది. మహాత్ముడు మున్నగువారి యుపన్యాసములను సరిగా నర్థముచేసికొనుటకును, ఆవశ్యకమైనచో తోడివారికి సందర్భానుసారముగ వివరించి చెప్పుటకును జాలినజ్ఞానము గలదు.

పార్వతి అమ్మాళు ఉపన్యాసములు విషయపూరితములు, సయు_క్తికములు, అర్థవంతములునయి శ్రోతల హృదయములయందు లెస్స నాటుకొనునవి; విసుగు కలిగించు వ్యర్థప్రసంగములతో నిండియుండవు.అప్పుడప్పుడు ఆమె చమత్కారపుమాటలను మీగడ తఱకలవలె చేర్చుచుండును. తాను జెప్పబోవు విషయమునుగూర్చి చక్క-గా నాలోచించి నిశ్చయమునుగుదుర్చుకొని పదపడి శ్రోతలకు నచ్చ జెప్పుచుండును. సభలయందు మాట్లాడుట ఈమెకు జంకుకొంకులు లేవు.ఆమె ఉపన్యాసములను చిత్తు వ్రాసికొని వేదికనెక్క-దు. సూచనలచిత్తుకూడ నామెకక్క-రలేదు. ఆమె యెప్పుడును స్వానుభవములోని విషయములనే మాటలాడును.భాష సుబోధముగనుండును. భావములుస్వతంత్రములు,స్పష్టములునయిప్రబోధకములుగనుండును. మంచి దృష్టాంతముల నామె యె_త్తిచెప్పుచుండును. విరోధుల ప్రతివిమర్శనముల కింతయేని చలింపక శ్రోతలముఖభావ వైఖరులను గు_ర్తించి తన యుపన్యాసములను సాగించుచుండును.నియమితకాలమును, విషయమును ఇంతయైన మించక, పెంచక, తనసిద్ధాంతములను గ్రుద్దినట్లు చెప్పితీరును. ఇట్లంతయు నగుటచేతనే శ్రోతలీమెయుపన్యాసముల నొకయతురమునైన త్రోసిపుచ్చక శ్రద్ధతో వినుచుందురు. ఈమె యుపన్యాసధోరణిని పెక్కు-రు దేశీయులు, విదేశీయులు చాల మెచ్చుకొనియున్నారు. స్త్రీలసౌకర్యములకయిన పెక్కు-విషయములనుగూర్చి యీమెచేసిన యుపన్యాసములు లెక్క-కు మిక్కి-లిగ గలవు. ౧౯౨౪ వ సంవత్సరమున మైసూరు విశ్వవిద్యాలయమువారి ప్రార్థనము నంగీకరించి 'స్త్రీల అభివృద్ధి-ప్రకృతావశ్యకములు' అను విషయమునుగూర్చి కన్నడమున నీమె చక్క-గా నుపన్యసించినది.

పార్వతిఅమ్మాళు ఉపన్యాస ప్రారంభమున తాను విద్యావతి కాదనియు, పాఠశాలయందు విద్య నభ్యసించి పరీక్షలనిచ్చియుండలేదనియు,జీవితపాఠశాలయందే విద్య నభ్యసించెననియు, తన ఏబదిఏండ్ల జీవితమున తనకు ఘటిల్లిన వివిధవిధజీవితానుభవములే తాను నేర్చిన పాఠములనియు చెప్పెడిది. ఇది సత్యము. పాఠశాలలయందామె విద్య నభ్యసింపకున్నను సుప్రసిద్ధద్రావిడ సాహిత్య గ్రంథములను, పురాణములను సవిమర్శముగా పఠించి విస్తారము జ్ఞానమును సంపాదించుకొనినది. దీనికి తోడు ఆధునికప్రపంచస్థితులను, దేశాభివృద్ధి కావశ్యకములగు విషయములను స్వీయవ్యాసంగముచేతను, భ_ర్త సహాయముచేతను చక్క-గా బోధపరుచుకొనుచుండెడిది.

పార్వతి అమ్మాళు బుద్ధిని, ద్రవ్యమును వినియోగించి సంఘాభివృద్ధికొఱకు కావించిన ఘనకార్యములు పెక్కి-టిలో స్త్రీవిద్యాభివృద్ధికొఱకయిన బెంగుళూరునందలి 'మహిళాసేవాసమాజము' ముఖ్యమైనది. స్త్రీలయెడ సానుభూతిగల కొందఱు మిత్రుల సహాయప్రోత్సాహములతో నీయమ యీసమాజమును ౧౯౧౩ వ సంవత్సరమున నెలకొల్పినది.ఆనాటి చిన్న సమాజమే యీనాడు బహువిధముల స్త్రీలయభ్యుదయమునకు పాటుపడుచున్నగొప్ప సంస్థయయి పార్వతిఅమ్మాళు యొక్క-స్వార్థరహితమైన సంఘసేవను, తెలివితేటలను చాటుచున్నది. ఆసమాజము పక్షమున స్త్రీలకొఱకొక ట్రెయినింగు పాఠశాల యున్నది. అందు స్త్రీలను కుటుంబసేవకు, ప్రపంచసేవకు ఉపయోగించునట్లు తయారు చేయుటయే పార్వతి అమ్మాళు ఉద్దేశ్యము కావున నామె కొన్ని తరగతుల బాలికలకు గృహకృత్యనిర్వహణవిధానమును, మతమును, నీతిని స్వయము బోధించెడిది. ఆపాఠశాలను నడుపుపద్ధతులు, జాతీయవిధానముల ననుసరించి విద్యగరపుట, ఆరోగ్యమును పెంపొందించు వ్యాయామశిక్షు మొదలయినవి పాఠశాలను పరీక్షింప నేతెంచిన స్వదేశీయవిదేశీయాధికారులు చాలగా మెచ్చుకొనిరి. అన్నిటిని

మించి ఉల్లాసముతో కలకలలాడుచున్న బాలికల ముఖములు చూడ సొంపుగ నుండెడివి. ఆపాఠశాలను సందర్శించినపుడు రాజప్రతినిధి గారిసతి యెంతయు సంతసమును వెలిపుచ్చినది. పాఠశాలయందలి బాలికలపై నాసాధ్వికి మాతృప్రేమ కలదు. వారిని ఎల్లవేళల కంటికి రెప్పవలె గాచుచుండును. మఱియు నామె సమాజము సొమ్మునుండియు,సొంతసొమ్మునుండియు విద్యార్థివేతనములనొసగి వయసువచ్చిన స్త్రీలకు పెక్కురకు వృత్తివిద్యలు – ఉపాధ్యాయనూతికాధాత్రీ వృత్తులు—మొదలైన వానిని అభ్యసింప జేయుచుండెడిది. శిశు–ఆరోగ్యప్రసవాలయమునకు తొలుత నొకసభ్యురాలుగ నుండి తరువాత నధ్యక్షురాలయి తత్సంబంధములగు కార్యములను కడుమెలకువతో నీమె నెరవేర్చుచుండెను. ఇంతేకాక, తఱచుగ నామె వైద్యాలయములకు బోయి రోగులనందఱిని జూచి వారికి సొమ్మును, వలసినవస్తువులను ఇచ్చి ఆదరించుచుండెడిది. వేయేల! మైసూరునందు స్త్రీలయభ్యుదయము నుద్దేశించి ప్రతిష్ఠింపబడిన సంస్థలలో నీయమబుద్ధి శరీర ధనసహాయము ను బడయని సంస్థ యొక్కటి యైన గానరా దనవచ్చును.

మొన్నటి ఐరోపా మహాసంగ్రామమునందు రణరంగమున పోరాడుచున్న సైనికుల సహాయమునకై కొందఱు స్నేహితుల ప్రోత్సాహముపై రెండు మూడు సంస్థలను స్థాపించి తన్మూలమున నీమె వారి కమూల్యమైన సేవను గావించెను. ఇండియా ప్రభుత్వమువారును, ప్రధాన సేనాపతి సర్ సి. మన్రో గారును ఈసేవను చాల కొనియాడిరి. పార్వతి అమ్మాళుగారి సంఘసేవను మెచ్చి ౧౯౧౭ వ సంవత్సరమున మైసూరు మహారాజావారు ఖిల్లతులను, ౧౯౩౭ వ సంవత్సరమున బ్రిటిషుసార్వభౌముడు కేసరిహింద్ పతకమును బహూకరించిరి.

౧౯౩౭ వ సంవత్సరము ఫిబ్రవరినెలలో పార్వతి అమ్మాళు బెంగుళూరు జిల్లాబోర్డుసభకు సభ్యురాలుగా నియమింపబడినది. ఆమె యీసభకు కేవల మలంకారమాత్రమే కాక ప్రతిసమావేశమునను స్త్రీలు పౌరసత్వమును బడసి ప్రజాహితకార్యముల నాచరింపజాలుదురు గాన వారి కట్టికార్యములను గావింప నవకాశముల నొసంగవలెనని వాదించుచుండెడిది.

ఈయమ ఇన్నిపనులను పెక్కేండ్లనుండి ఎడతెగని యనారోగ్యముచే క్రుంగుచుండియే కావించినది. సేవాపరాయణత, స్వార్థత్యాగము, దేశాభ్యుదయవాంఛ యీమె యారోగ్యమును, తుదకు జీవితమును జయింపజాలినవి.

మొన్న ఫిబ్రవరిలో ఢిల్లీనగరమున జరిగిన అఖిలభారత మహిళా మహాసభ కీమె ప్రతినిధిగ నెన్నుకొబడినది. స్త్రీలకు వివాహోచితవయస్సును పొడిగించువిషయమున రాజప్రతినిధిగారికి రాయబారము జరుపవచ్చునని యీమె యీప్రాతినిధ్యమున కంగీకరించినది. భర్తతో ప్రయాణమై ఫిబ్రవరి ౨౫ వ తేదినాడు ఢిల్లీ చేరినది. మఱునాడుదయమున నభ్యంగముచేయుచు మూర్ఛిల్లి వేడినీళ్లపొయ్యిపై పడినది. ముంజేయియు, మోకాలును తీవ్రముగ గాలినవి. వెంటనే గట్టిగా వైద్యముచేయింప మొదలు పెట్టిరి. ఆకారణమున ఆమె సభకు పోజాలకపోయినను సభవారు ఏనాటి కానాడు సభాకార్యక్రమమంతయు నామెకు టెలిఫోనుద్వారా తెలుపుచుండిరి. ఆమెయు వారికి తగినంత ప్రోత్సాహమును చూపుచుండెను.

ఆమెకు క్రమముగా గాయములబాధ ముదిరి అపాయకరమైనది. చివర కామె ౧౯౩౮ ఫిబ్రవరి ౧౯ వ తేది ఆదివారము శివరాత్రినాడు పగలు రెండుఘంటలకు ఈ కర్మభూమిని వదలి కైలాసధామము నలంకరించినది. ఆ పరోపకారపరాయణురాలు, పరమసాధ్వి, ౫౩ ఏండ్లయిన నిండకముందే పరమపదించుట దేశదౌర్భాగ్యము కాక మఱేమగును? పెక్కురు ప్రముఖులు తమయనుతాపమును ఉత్తరములు, వ్యాసములు, ఉపన్యాసములు, ఉపపాదనములు మొదలయినవానిమూలమున వెల్లడించిరి.

డాక్టరు ఆనిబిసెంటుగా రీమెనుగూర్చి వ్రాసినది యిట్లు కలదు:

"నేను చిరకాలమునుండియు పార్వతి అమ్మాళుగారి పరిచయభాగ్యమును బడసియున్నాను.

ఆమె దివ్యజ్ఞానసమాజసభ్యురాలు. నేను బెంగుళూరునకు పోయినపుడెల్ల వారియింటనే విడియుచుందును. బెంగుళూరునందలి ఎల్లమహిళోద్యమములకును ఆమె హృదయము. అచటి మహిళాసేవాసమాజమును స్థాపించి తానే నాయకత్వమును వహించినది. అరవమునను, కన్నడమునను ఇంపుగా నుపన్యసింప గలదు. ఇంగ్లీషునను మంచిజ్ఞానమును సంపాదించినది. భారతదేశమునందలి సమర్థులగు నాయకురాండ్రలో నొక్కతె. ఆమె గృహమునకు దేవి; దివ్యజ్యోతి; శాసకురాలు. పరస్పర సాహాయ్యముతోడను, సంపూర్ణైకమత్యముతోడను వారివారి త్రోవలను వారు వారు కార్యములను నడుపుకొనుచు భార్యాభర్తలు సుఖమయముగ గడపిన నలువదియేండ్ల దాంపత్యజీవితమునకు తరువాత హృదయవిదారకమయిన యొక దైవికసమాఘాత మామెను కాలదన్నుకొని పోయినది. ఆమె జ్యోతిర్మయియై నిర్వృతిస్థానమున నెలకొని యున్నది."

ఈసాధ్వీమణిజీవితము ఆదర్శకమయినది. ఈమెకన్న సంపన్నులు, సాగుదలకలవారు నగు స్త్రీలు ఆంధ్రదేశమునను లేరనజాలము. కాని విశాలహృదయముతో తమ సోదరీమణులయభ్యుదయము కొఱకు నడుము కట్టిన వారిని మాత్రము చిటికినవ్రేలికొన కెక్కింపజాలము. మంచి అవకాశములు సామాన్యసంపన్నస్త్రీలకన్న సంస్థానములవారికి కలవు. వారే యిట్టి ఘనకార్యమునకు బూనుకొని ఇతర సోదరసోదరీమణులను ప్రోత్సహించి వారితోడ్పాటును బడయవలెను. తాము నవకాశములను విరివిగ గల్పించుకొని పాటుపడవలెను.

దేశము నాలుగుమూలలనుండి స్త్రీలయభ్యున్నతికొఱకయిన ప్రయత్నము లెడతెగక పెద్దమొత్తున కొనసాగి ఫలోన్ముఖములయిననేతప్ప భారతీయమహిళామండలి కభ్యుదయప్రాప్తి యనుమానింపవలసినదే యగును. కేవలము స్త్రీలేకాక పురుషులును ఈవిషయమున శ్రద్ధవహించ దగుదురు.

---

## కీ. శే. శ్రీమతి వంగల వనలతాదేవిగారు

**(22-4-1905—28-9-1928)**



ఈమె కృష్ణాపత్రిక సంపాదకులగు శ్రీ ముట్నూరు కృష్ణారావుగారి పెద్ద కుమార్తె. మచిలీపట్టణమున సంస్కృతము, తెలుగు సంగీతము, వీనియందు తన విద్య ముగిసినపిదప నీమెకు 16 వ యేట కలకత్తా విశ్వవిద్యాలయపు ప్రొఫెసరుగ నుండిన డా. వంగల శివరామ్‌గారితో 18-5-1921 తేదీని వివాహమయ్యెను. శిష్టాచార సంప్ర

దాయముగల ఆంధ్రబ్రాహ్మణ కుటుంబమున హిందూ పద్ధతిని జరిగిన కొలది సంస్కారవివాహములలో నిది యొకటి

1921-22 సం.నందు వారి కలకత్తా కాపురము సమయమున నామె యా పట్టణముననుండు దక్షిణ ఇండియా యువతీసమాజము మొదలగు వాని యందు సభ్యురాలయియుండి, కళాశాలకు పోవుచుండెడిది.

28-12-1922 న నీమె కొకయాడశిశువు కలిగెను. పిదప కొలది దినములలోనే జబ్బుపడి సంవత్సరము పైబడిన కాలము బాధపడి నయమొంది, క్రొత్త లక్నో విశ్వవిద్యాలయమున రాజనీతిశాస్త్రశాఖకు ప్రధానోద్యోగిగా తన భర్త నియమింపబడుటచే వారితో నచటికేగెను.

ఈమె హిందీ భాషను బాగుగా నభ్యసించినది. లక్నోలోని ముఖ్య స్త్రీసంఘముల కార్యశాఖలయందుండి చురుకుగా పని చేసినది. దక్షిణయిండియా స్త్రీల సంఘమున కుపాధ్యక్షురాలుగా నుండినది. స్త్రీ విద్యాభ్యున్నతి, ఖద్దరుప్రచారము, సంఘసేవ, హిందీరాష్ట్రభాషా-యీవిషయములయం దీమె చాల పనిచేసినది. హిందీ బాగుగ వచ్చియుండిన దగుటవలన తమ ప్రాంతమునందు వలెనే ఉత్తరదేశమున హిందీ, బంగాళీ స్త్రీలతో కలసి మెలసి పలుకుబడి కలిగి యుండినది.

ఈమె దక్షిణ దేశమునను, ఉత్తరదేశ మంతటను కూడ భర్తగారితో ప్రయాణము చేసియుండెను. గానమునందును, చిత్రకళయందు నీమె కెక్కుడు పరిచయము, నభిమానము నుండెడివి. హిందూస్థాని సంగీతమును నేర్చుకొనినది. ఆంధ్ర చిత్రకారులచే రచియింపబడిన భారతీయచిత్రము లనేకము లీమెవద్ద నుండెను. ఈమె యారోగ్యమునకై భర్తగారితో కలసి త్వరలోనే స్విట్జరులాండు వెళ్లవలసియుండెను. ఇంతలోనే క్రూరమరణము నిర్దాక్షిణ్యముగ వచ్చిపడెను. కుమార్తెగను, భార్యగను, మాతగను ఈమె యనేక విధముల నాదర్శభారతీయ మహిళగ నుండెను. 23 ఏండ్ల చిన్ని జీవితకాలముననే యీమె స్త్రీలకు, భారతదేశమునకు తగు సేవ చేసి 'కొండంత యాస'ను కలుగజేసి తన తలిదండ్రులను, సోదరిని, సోదరుని, చిన్ని బిడ్డను, నిర్భాగ్యుడగు భర్తను శోకమున ముంచి వెడలిపోయినది. తన యల్పజీవితప్రయోజనమును కలకత్తా, లక్నో, ఉత్తరహిందూస్థానములయందలి తన స్నేహితురాండ్రకు నచ్చజేసిన యీమె నిష్క్రమణము వలన సంఘసంస్కరణ స్త్రీ విద్యోద్యమములకు కొంత నష్టము కలిగినదనియే చెప్పవలెను.

— —

## పౌరజీవనాదర్శము

కవయిత్రి సరోజినిదేవి సింగపూరు భారతసంఘమువారి 'ఇండియన్' పత్రికకు పంపిన ఆవేశపూరితమగు నొకచిన్న సందేశమునందు సత్యసౌందర్యముల వెలయు పలుకుల నిట్లు నుడివినది :

మనము ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనవలసిన విషయ మేమనగా, నవీననాగరికత యభివృద్ధియగుచున్న కొలదిని, విజ్ఞానము నిచ్చి పుచ్చుకొనుటయందు ప్రపంచమంతంతకు అంతర్జాతీయ భావము గలది యగుచున్న కొలదిని, మన మితర దేశములకొసంగుచు నితర దేశములనుండి మనమును గ్రహించుకొనుచున్నాము. అట్టిభావములతో విశాలదృక్పథము, శాస్త్రీయవిచారణ గల యనుభవముతో గూడిన జ్ఞానధనముతోపాటు తాను స్వయముగ ప్రపంచమున చేయవలసిన సేవాభారము హెచ్చును; జీవితము మరింత క్లిష్టమగును. ఈ యుద్యమమునకై మీరు మీ జీవితము నర్పింపవలయుననియు, భక్తిజ్వాల కడ వెలిగించుకొనుటకు మీ దీపములను సిద్ధపరచుకొనుడనియు మీ దేశమునకు యోగ్యమగు సేవచేయుడనియు నేను కోరుచున్నాను. ఏదో యొకవిధమున మీ రుపాధ్యాయులై బోధనచేయుడని కాని, రాజకీయవేత్తలు కండని కాని నేను మీకు చెప్పుటలేదు. జీవితమున మీరంగ మేదియైనను, మీ రెంతయల్పులైనను, దేశము నొకజాతిగా నొనర్చు నా మహాసాంఘిక వ్యూహమును పూర్తిచేయుటయందు మీరు ఒక యగత్యమగు అంశము. ఒక దేశము

యొక్క మహత్వము ఆదేశపు గొప్పవారియందు గాక యక్కడి సరాసరి మంచివారియం దిమిడి యుండునని మీరెల్లరును జ్ఞప్తియం దుంచుకొన గోరెదను.

మతభేద వర్ణభేదములు పాటింపక, యెల్లమాన వులకును సమానావకాశము లొసంగుచు, అభివృద్ధి కవరోధము గూర్చు విఘ్నముల జయించుటయందు ధీరతయు, సత్యశౌచములను నిత్యజీవితమున నలవరుచుకొనుటయు, పరిపూర్ణావకాశములతో విశాలజీవనము గడుపుకొనుటకు ఈశ్వరదత్తమును,అనుల్లంఘ్యమును హక్కునుండి యే స్త్రీని గాని, పురుషునిగాని వంచింపకుండుటయు నట్టి మంచి వారికి లక్షణములు.

---

## భారతీయవిద్య

ఆగస్టుమాసపు 'ఇండియన్ ఎడ్యుకేటర్' పత్రికయందు కె. యస్. రామస్వామి శాస్త్రి గారు భారతదేశపు కులజీవనము యొక్కయు, వృత్పన్నజీవనము యొక్కయు సజీవత్వము బహిరంతరములనుండియు తర్జనల నొందు చున్నదని యనుమానించుచు భారతీయ సంస్కారమునకు భారతీయవిద్యయే జయప్రద మగు సంరక్షణకర్త కావలెనని యిట్లుండవలె నని భావించుచున్నారు—

మన విద్యాలయములు, కళాశాలలు, విశ్వకళా పరిషత్తులును గ్రామపరిసరములలో నుండవలెను. అప్పుడే భావనోత్కర్షయు,నిరాడంబరజీవనమును,పవిత్రమైన, న్యాయమైన యేకీభావమును మరల నుత్పన్నమగును.గృహ పరిశ్రమలచే సేవితమగుచు కళలచేతను, చేతిపనులచేతను నలంకృత మగుచు, భారతదేశము చాలవఱకు వ్యవసాయ జాతిగానే యుండవలెను. ఇట్టి యున్నత సంస్కారము బ్రహ్మచర్యము నాధారము చేసికొని యుండవల యును. మన దేశభాషల మూలమున ఆ సంస్కారము గరపవలయును. అంతేకాక యది ఆధునికముగను, జాతీయముగను కూడ నుండవలెను. మనమాతృదేశ మెట్లు కర్మభూమియు,భోగభూమియు,పుణ్యభూమియు నగునో గుర్తించుట కది మనకు తోడ్పడవలయును. మన బాల బాలికలు తమ భారతీయత గోల్పోవకుండ నాధునికులగు నట్లును, ధన శక్తి ప్రాభవములకు నేటి పందెమున వెనుక బడక తమ భారతీయతయందె కీర్తిని నిలుపుకొనునట్లును శిక్షితులై ప్రబుద్ధులు కావలెను.

---

## కెల్లాగు సంధిపత్రము

### నిబంధన 1

ఒడంబడిన యున్నతపక్షములన్నియు, అంతర్జాతీయ కలహములు లేకుండుటకై, యుద్ధమొనర్చుట నిషేధమని ఆయాజాతులపక్షమున దృఢపరచుచు, పరస్పర సంబంధములలో జాతీయరాజ్యనీతి కది యొకయుపకరణ మని దానిని (యుద్ధమును) పరిత్యజించుకొనుచున్నారు.

### నిబంధన 2

ఒడంబడిన యున్నతపక్షములన్నియు నైజము లగు, లేక తమలో తమకు గల, కొన్ని కారణములనుబట్టి కలిగియుండు జగడములు లేక తగవులు విడదీయుటకు శాంతియుతమగు మార్గములనే తప్ప యుద్ధము నెన్నడును తలపకూడదని కరారు చేసికొనుచున్నారు.

### నిబంధన 3

(నిశ్చితమగు పద్ధతుల విధించుచున్నది.)

సంతకములు చేసిన జాతులు

జర్మనీ, అమెరికా యునైటెడ్ స్టేట్సు, బెల్జియము, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను, కనడా, అస్ట్రేలియా, న్యూజీలండు, దక్షిణాఫ్రికాయూనియన్, ఐరిషుఫ్రీస్టేటు ఇండియా, ఇటలీ, జపాన్, పోలండు, జెకోస్లావాకియా.



కెల్లాగు సంధిపత్రమున కెల్లాగు సంతకముచేయుచున్నాడు

ఈసంధిలో చేరుటకు పిలువబడిన జాతులు

| | | |
|---|---|---|
| ఆల్బేనియా | ఎతియాపియా | పెర్షియా |
| ఆఫ్ఘనిస్తాన్ | ఫైన్‌లండు | పోర్చుగల్ |
| అర్జెంటినా | గ్రీసు | రొమేనియా |
| ఆస్ట్రియా | గ్వాటిమలా | *రష్యా |
| బొలివియా | హెయిటీ | సాల్వడర్ |
| బ్రెజిలు | హొండురాస్ | సెర్బులు, క్రోట్లు |
| బల్గేరియా | హంగేరి | స్లావినులయొక్క |
| చైల్ | ఐస్‌లండు | రాజ్యము |
| చైనా | లట్వియా | సయామ్ |

| | | |
|---|---|---|
| కొలంబియా | లిబేరియా | స్పెయిన్ |
| కోస్టారికా | లిథూనియా | స్వీడన్ |
| క్యూబా | లక్సెంబర్గు | స్విట్జర్లాండు |
| డెన్‌మార్కు | మెక్సికో | టర్కీ |
| డొమినిక౯ (రిపబ్లికు) | నెదర్‌లాండ్సు | అరుగ్వాయి |
| ఎక్వాడర్ | నికరగ్వా | వెనిజోలియా |
| ఈజిప్టు | నార్వే | |
| ఎస్తోనియా | పరగ్వాలు | పనమా |

దుర్గమహంతి ఆదినారాయణ.

---

* రష్యాకు ఫ్రాన్సువారి ఆహ్వానము.

## ప్రపంచయువజన శాంతిమహాసభ

### ఆమెన్ (హాలెండ్)

ప్రపంచయువజనోద్యమ సంస్థాపకుడును, డచ్చి యువజనసంఘకార్యదర్శియునగు హాయిమ్‌టింక్ (హాలెండు)గారి యధ్యక్షతక్రింద ౧౯౨౮ ఆగస్టు౧౭ మొదలు ౨౬ వఱకు సమావేశమైనది.

బెజవాడ ఆంధ్రయువజన సంఘకార్యదర్శియగు శ్రీయుత బాసు త్రివిక్రమరావు, ఎల్. ఎల్. బి., బార్. ఎట్. లాగారు ఒక్కరే తిన్నగా భారతదేశము నుండి వచ్చిన ప్రతినిధి; వీరు ఆంధ్రరాష్ట్రము తరఫున అధికారప్రతినిధియు.

రమారమి రెండువందుసురు భారతీయులు మహాసభకు ప్రతినిధులుగా విచ్చేసిరి.—

శ్రీ. డి. టి. రావుగారు, తిన్నగా భారతదేశమునుండి.

,, సింహాగారు, (అవధానుల నరసింహంగారు, మదరాసు) మ్యూనిచ్, జర్మనీనుండి.

,, సింసుకన్య, జర్మనీనుండి భారతీయస్త్రీ ప్రతినిధి.

,, సాన్యాలుగారు, ,, గుహాగారు, ,, సేనుగుప్తగారు — లండనునుండి భారతీయ ప్రతినిధులు — గ్రేటుబ్రిటనునుండి.

,, రాయిగారు, గ్లాస్గోనుండి భారతీయప్రతినిధి.

అన్నిజాతులనుండియు తగురీతి ప్రతినిధులు వచ్చి మహాసభ నలంకరించిరి.

మహాసభయందు ఆఱు విభాగము లేర్పడినవి:—

౧. రాజకీయము
౨. విద్యావిషయికము
౩. ఆర్థికము
౪. పండెములు
౫. అల్పసంఖ్యాకసంఘములు
౬. ధార్మిక నైతికములు

శ్రీ త్రివిక్రమరావుగారు ఆఱునవిభాగమునకు ఉపాధ్యక్షులుగా వర్తించిరి.

మహాసభ యీక్రింది ఆదర్శములను తీవ్రముగ చర్చించినమీదట తీర్మానములుగ నవలంబించినది:—

౧. శాంతియే ప్రపంచమునకు ప్రధానాశయము.

౨. శాంతిసూత్రములు యువకుల మదులకు బాగుగ పట్టునట్లు చరిత్రపాఠ పుస్తకము లన్నింటను చారిత్రక తాత్పర్యమును మార్చుట.

౩. పరాధీనజాతుల కన్నిటికిని స్వాతంత్ర్యము.

౪. స్వయం నిర్ణయాదర్శమును గుర్తించుట.

౫. పెద్దజాతుల పోషణమునుండి చిన్నజాతులకు విముక్తి.

౬. ఆర్థికమగు సామ్రాజ్యవాదమును (Imperialism), ఖడ్గవాదమును (Militarism) తుడిచిపెట్టుట.

౭. మతపరివర్తనముల ప్రచారకోద్యమమును తగ్గింపజూచుట.

భారతీయ ప్రతినిధులును, జర్మను ప్రతినిధులును పరస్పరము కడుంగడు మైత్రితో మెలగిరి. జర్మను ప్రతినిధులు భారతీయ ప్రతినిధులకు తమ దేశపు నృత్తగానాదుల ప్రదర్శనము లిప్పించి, భారతీయయువకుల కీసందేశము నొసగిరి:—

“జర్మనుయువజన సంఘము మేము మీ ఆదర్శములయెడ సంపూర్ణమగుసానుభూతి వహించియున్నాము; స్వాతంత్ర్య సంపాదనయత్నమున మేము భారతీయులను సంపూర్ణముగ ప్రోత్సహించుచు వారికి స్థిరముగ బాసటలమై నిలిచియున్నాము.”

శ్రీ త్రివిక్రమరావుగారు జర్మనీ అమెరికాలసంయుక్తప్రాతినిధ్యముల యాహ్వానము నంగీకరించి, “హిందూమతము, దార్శనికాధారమును” గుఱించి యొకయుపన్యాసము నొసగి, వారి అధికాదరణమునకు పాత్రులైరి.

డచ్చియువజన సంఘమువారు ప్రపంచ యువజన శాంతి మహాసభ గాంచిన యద్భుత జయమునకుగాను

ప్రతినిధుల నభినందింప 'హేగు' నందు ఏర్పఱిం చిన సభ కాహూతులై శ్రీరావుగారు "అంతర్జా తీయశాంతిని" గూర్చి చక్కఁగ నుపన్యసించిరి. పిదప శ్రీరావుగారు గ్రేటుబ్రిటనునకు పోయి, ఎడింబరోయం దలి భారతీయ విద్యార్థులను గలిసికొని, "ఎడింబరో భారతీయసంఘము" పక్షమున "ప్రపంచయుజన శాంతి మహాసభ" యాదర్శములను గూర్చి సెప్టెంబరు ౮ వ తేదీని ఉపదేశదాయకమగు నుపన్యాస మొసంగిరి. అందు శ్రీరావుగారు కీ. శే. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని గూర్చి మాటాడిరి. భారతదేశమున ఆంధ్రరత్నముగను, ఎడింబరోయందు ౧౯౧౩-౧౯౧౪ సం. భారతీయసంఘమునకు ఉపాధ్యక్షుడుగను, ౧౯౧౪-౧౯౧౫ సం. దానికే కార్యదర్శిగను శ్రీగోపాలకృష్ణయ్యగారు కావించిన యద్భుతకార్య విధానమునుగూర్చి ముచ్చటించి, వారు స్వదేశమునను, పరదేశములనుగల భారతీయులకు గావించిన యపారసేవలకు జ్ఞాపకచిహ్నముగ వారి ఛాయాపటము నొకదానిని తమపుస్తక భాండాగార మందిరమున నెలకొల్పునదిగ భారతీయ సంఘమువారిని వేడి, శ్రీగోపాలకృష్ణయ్యగారి ఆత్మశాంతికై భారతీయులెల్లరు నేకమై ప్రార్థనలు సలుపునట్లు ప్రార్థించిరి.

వారిక బ్రిస్టలు నగరము పోయి 'సోషలిస్ట్ డిమాక్రాటిక్ పార్టీ' వారి యాహ్వానము ననుసరించి యచట "భారతదేశపు ప్రస్తుత రాజకీయపరిస్థితిని" గూర్చి యుపన్యసించి, అచటనుండి బెర్లిను, వియెన్నా, జినీవా నగరములందలి యువసమాజముల యాహ్వానము ననుసరించి ఆనగరముల కేగిరి. ఈపర్యటనమునుండి వారు ఈనడుమ భారతదేశమును జేరినారు.

---

## దాసు త్రివిక్రమరావు గారు
## ఎల్. ఎల్. బి., బార్-ఎట్-లా

శ్రీరావుగారు బెజవాడ వాణీముద్రాక్షరశాలాధిపతులగు, మ. రా. రా. శ్రీ దాసు కేశవరావుగారి కుమారులు. వీరు ౧౮౯౪ సం. న జన్మించిరి. ఏలూరు బెజవాడ హైస్కూళ్లలో చదువుకొనిరి. ౧౯౧౦ సం. న అలహాబాదునందు మెట్రిక్యులేషను పరీక్షనిచ్చిరి. ౧౯౧౧, ౧౯౧౨ సం. ల వీరు అలహాబాదులో ఇంట



దాసు త్రివిక్రమరావుగారు, బ్యారిస్టరు

ర్మీడియటు చదువుచుండగా జబ్బుచేయుటచే ౧౯౧౩ వఱకు చదువు నిలిపివేయవలసివచ్చెను. మరల స్వాస్థ్యము కుదిరిన వెనుక వారు ౧౯౧౩ సం. న బారిస్టరు పరీక్షకు చదువుటకు గ్రేటుబ్రిటనునకు వెడలిరి. ౧౯౧౪ సం. న యుద్ధమువలన వీరు భారతదేశమునకు తిరిగి వచ్చివేసిరి.

ఇంటియొద్ద నూరక కూరుచుండనొల్లక ౧౯౧౫ సం. న వారు కొలంబో కేగి, అచ్చట ఎల్. ఎల్. బి. పూర్తిచేసిరి. పిదప కొంతకాలము 'సిలోనీస్' పత్రికకు సహాయసంపాదకుడుగా నుండి, యుద్ధము ముగియగా, ౧౯౧౯ సం. న లండను నగరమున కేగి, న్యాయవిద్యాభ్యాసనము పూర్తిచేసికొని, ౧౯౨౧ సం. ప్రారంభమున న్యాయవాదివృత్తికి నమోదై, ఆ వేసవియందే భారతదేశమునకు తిరిగి వచ్చిరి.

అప్పటి కిచట అసహాయోద్యమ మల్లూతలూగు చుండెను. దేశమాత యాహ్వానము ననుసరించి వారు

న్యాయవాది వృత్తియందు ప్రవేశించుట మానుకొని, బెజవాడయందు ముద్రాలయకార్య నిర్వహణమున దీక్ష వహించిరి.

ఇన్ని యేండ్లనుండియు వారు స్థానికవిషయములందు శ్రద్ధతో పనిచేయుచునే యుండి, ఆంధ్ర యువ సమితికి కార్యదర్శిగా నెన్నుకొనబడినారు. ఆమెన్ (హాలెండు) నందు జరిగిన ప్రపంచ యువజన శాంతి మహాసభకు ఆ సమితిపక్షమున ప్రతినిధిగా పోవ ప్రార్థితులై, అచటికి ౧౯–౨౭ జూలయినెలయందు వారు భారతదేశమునుండి బయలు వెడలిరి. హాలెండు మహాసభయందనేకోపన్యాసముల నొసగినవెనుక, వారు ఎడింబరోయందు శాంత్యుద్యమమునుగూర్చి యొక యుపన్యాస మిచ్చిరి. పిమ్మట "భారతదేశపు ప్రస్తుత రాజకీయ పరిస్థితి"ని గూర్చి బ్రిస్టలు నగరమునను "భారతదేశము"ను గూర్చి జెర్లిను, వియెన్నా, జినీవాల యందు యువసమితుల యెదుటను ఉపన్యాసముల గావింప వారి కాహ్వానములు వచ్చెను.

* * *

వారు ఇపుడు భారతదేశము తిరిగివచ్చిరి. వారిచ్చటి శాంత్యుద్యమమున కెంతయు చేయూతనొసగి, ముఖ్యముగ భారతస్వాతంత్ర్యయుద్ధమున పాల్గొని సాఫల్యమునకై యుపకరింతురుగాక!



## ఇంగ్లండునందలి భారతీయులు

## రాయపురం నల్లవీరన్ సోదరులు

మద్రాసు మంత్రిగానుండిన ఆర్. యన్. ఆరోగ్యస్వామి మొదలియారుగారి రెండవ, మూడవ కుమారులు ఆర్. యన్. వీరన్., ఆర్. యన్. థామస్ గార్లిద్దరును గ్లాస్గోయందు వ్యవసాయము, పాడిపంట విషయమైన విద్యలను బడసిరి.

వీరన్ గారు చెన్నపురిలో 21-9-1899 తేదీని జన్మించి నెల్లూరు వెంకటగిరి హైస్కూలులోను, చెన్నపురి ముత్యాలపేట హైస్కూలులోను చదివి చెన్నపురి క్రిస్టియన్ కాలేజి హైస్కూలునందు 1919లో స్కూలు ఫైనలు పూర్తిచేసిరి. 8-8-1922 తేదీని వీరిద్దరు సోదరులు నింగ్లాండుకు ప్రయాణమైరి.

పగటివేసములు



పాల్ గారు(బాలికవేసమున); సేన్ గారు(జోగివేసమున); ఆర్. యన్. వీరన్ గారు (రెడ్ ఇండియన్ వేసమున) చందానిధివసూళ్ల డబ్బీలు పట్టుకొనియున్నారు.



ఆర్. యన్. థామస్ గారు (హాస్యగానివేసమున)

ఈ 6 సంవత్సరములలోను గ్లాస్గోలో వీరన్‌గారు వ్యవసాయమున సి. డి. ఏ. పట్టమునకై విద్య పూర్తిచేసి అప్రెంటిసుగ పనిచేసి 1926–27 సం.లో కిల్‌మార్నాక్‌లో పశుసంరక్షణ, పాలు పెరుగుల యభివృద్ధిమార్గముల నేర్చుకొనిరి. వీరి విద్య పూర్తియైనది. త్వరలో భారతదేశమునకు తిరిగివత్తురు.

కృషీవలులతోసహా వేల్సునం దొక గోధుమపంట గడ్డిమోపులను చేర్చుచున్న ఆర్. యన్. వీరన్‌గారు

థామస్‌గారు గ్లాస్గోలో 1 సం. చదివిరి. 1923-24 లో వేల్సునందు గుత్తశాలమునందు అప్రెంటిసుగ పనిచేసిరి. ఈ ఛాయాపటమునం దితడు ఆలుదుంపలను కుప్పగా ప్రోగుచేయుచున్నాడు. 1925 లో వ్యవసాయపువిద్య పూర్తి చేసి యతడు సి. డి. ఏ. పట్టము వడసెను. 1926–27 సం. నందు సంవత్సరము పొడుగునను చదివి పరీక్షకు వెళ్ళనక్కరలేని వినాయింపు పొంది వ్యవసాయమునందు గ్లాస్గో బి. యస్‌సి. పట్టము పొందుటకై తయారయ్యెను. కాని యిట్టి చదువు నివృత్తియో

వేల్సునం దొక బంగాళీదుంపల పెరటియందు ఆర్. యన్. థామస్‌గారు

ఆర్. యన్. థామస్‌గారు– తమ బసయందు నెగడివద్ద

ఆర్. యన్. వీరన్‌గారు–తమ చదువుకొను గదియందు

జనమని గ్రహించి ఆప్రయత్నము మానుకొని 1928 లో ఇకోలజీ (ఏయేమొక్కలు, చెట్లు ఎట్టి ఎట్టి స్థలములలో బాగుగా పెరుగును? మొదలగు విషయముల) యందు పరిశోధనచేయుటకై గ్లాస్గోవారి నుండి విద్యార్థి వేతనమును పొందెను. పేపరు మిల్లులలోని పనికిరాని సున్నపుమట్టి నుపయోగమునకు తెచ్చుట, దానితో పాత్రలు మొదలగు సామానులు చేయుట, దాని నెరువుగా నుపయోగించుట మొదలగు వానియం దితడు ప్రత్యేకశిక్షణము బడయుచున్నాడు. అది ముగిసినవెనుక నీ వర్షాంతమున నితడు మనదేశమునకు మరలివచ్చును.

వీరిరువురు సోదరులును గ్లాస్గో ఇండియన్ యూనియన్ కార్యములందు పాల్గొనుచున్నారు. బ్రిటిషు ఆసుపత్రుల సహాయార్థమై చందాలను, విరాళములను వసూలుచేయుటకు Ragday Celebration (పగటివేషముల పండుగవంటిది) యందు హాస్యపు దుస్తుల ధరించి యూపటమునం దున్నారు.

---

## బిజేటి వెంకటనారాయణస్వామి
### యమ్. ఏ., బి. కామ్. (ఎడింబరో)

చెన్నపురి బిన్నీకంపెనీలో పూర్వము దుబాషిగానుండిన కీ. శే. బిజేటి దేవరాజనాయడుగారి పుత్రుడితడు. చెన్నపురిలో 1902 సం. జన్మించిరి. పచ్చయప్పస్కూలులో స్కూలుఫైనలు ముగించుకొని జి. డి. ఏ. చదువుకొఱకు గవర్నమెంట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కామర్సునందు చేరిరి. బ్యాంకింగ్‌నం దొకపట్టము పొందిరి గాని జి. డి. యే. పూర్తిచేయకయే వ్యాపారసంబంధవిద్యకొఱకు 1923 లో ఇంగ్లాండు ప్రయాణమైరి.

ఎడింబరో విద్యాలయమున 1925 లో బి. కామ్. డిగ్రీ పొంది 1927 లో అర్థశాస్త్రమున యమ్. ఏ. పట్టము బడసిరి. తత్త్వశాస్త్రమున పిహెచ్.డి.ని పొందుటకును, న్యాయశాస్త్రమున బారిష్టరు అగుటకును ప్రయత్నించుచున్నారు. అన్నిట జయము చేకుఱచో 1929 సం. మొదటిమాసములందు మరలివత్తురు.

ఇండియన్ అసోసియేషన్‌లో నెక్కువగా పాల్గొనుచుండి భారతదేశ సంబంధవిషయమునం దెక్కుడాసక్తి చూపుచుండిరి. మొదటి సంవత్సరములలో నాసంఘమున నుపాధ్యక్షులుగను, పిదప అధ్యక్షులుగను ఉన్నారు. 'ఎడింబరో ఇండియన్' అను త్రైమాసిక పత్రిక కుపసంపాదకులుగ కూడ నున్నారు.



బిజేటి వెంకటనారాయణస్వామిగారు, యమ్. ఏ., బి. కామ్. (ఎడింబరో)

భారతీయులు స్వరాజ్యమున కర్హులనియు, నిర్బంధముగ భారతీయు లందఱకు విద్య యవసరమనియు వీరి యభిప్రాయము లుపన్యాసములలో వెలిబుచ్చుచుందురు. సైమనుకమిషను వ్యవహారము హాస్యనాటకమనియు, వారిని భారతీయు లెవ్వరును నమ్మరనియు, ఆంగ్ల పరిపాలన న్యాయ్యమైనది కాదనియుకూడ వీరు వెల్లడించిరి.

---

## కొల్లూరు వెంకట్రాయడు చౌదరిగారు

వీరు గుంటూరుజిల్లా మూల్పూరుగ్రామపు రామస్వామిచౌదరీగారి కుమారులు. తెనాలి స్కూలునందు స్కూలుఫైనలు పూర్తిచేసి, గుంటూరు మిషనుపాఠశాలయందు యింటర్మీడియేటును చదువుచు, పాశ్చాత్యసై

ద్యవిద్య పూర్తిగ నభ్యసించుటకు 1920 సం. సెప్టెంబరులో ఇంగ్లాండుకు ప్రయాణమయిరి. 1921 వ సం. లో ప్రవేశపరీక్షను పూర్తిచేసి, ఎడింబరో వైద్యకళాశాలయందు ఎం. బి. సి. ఎచ్. బి. తరగతియందు చేరి 1927 సం. లో బిరుదును గౌరవములతో సంపాదించిరి.



కొల్లూరు వెంకటరాయడు చౌదరిగారు, యమ్. బి. సి. ఎచ్. బి. (ఎడింబరో), డి. టి. యమ్., డి. పి ఎచ్. (లివర్ పూల్), యల్. యమ్. (డబ్లిన్)

ఇంతటితో తృప్తినొందక ట్రాపికలువైద్యమందు ప్రఖ్యాతిబడసిన డి. టి. ఎం., డి. పి ఎచ్. బిరుదులకై లివర్ పూలునందు చదివి, వాటిని ౧౯౨౮ సం. లో సంపాదించిరి. ఆసంవత్సరమందే మిడ్ వైఫరి పరీక్షయందు పేరుపొందిన డబ్లిను విశ్వవిద్యాలయమందు ఎల్. ఎం. బిరుదునుకూడ సంపాదించగలిగిరి.

ఈమధ్యకాలములో ట్రాపికలు వైద్యసంఘమునందును, బ్రిటీషువైద్య సంఘమునందును సభ్యత్వమును సంపాదించిరి. 'Doctor of Public Health' బిరుదునకును, 'Doctor of Medicine' బిరుదునకును చదివి, వీటినికూడ సంపాదించి యింకొకవత్సరములో స్వదేశము రాదలచియున్నారు.

ఎడింబరో హిందూసంఘములో సభ్యులుగానుండి "ఇండియను బజారు"ను యేర్పాటుచేయుటలో చాల శ్రమపడినారు. ఈ బజారును యేర్పాటు చేయుటకు యెన్నియో వేల రూపాయలు ఖర్చుయినప్పటికి, వీరి చేయూతవలన సుమారు నాలుగువేల రూపాయలు యీ హిందూసంఘమునకు ఆదాయము సేకరింపబడెను.

---

జనమంచి వేంకటరామయ్య గారు

# బండిచక్రము

(జనపదగీతము)

౧

రావె యప్పరో! రావెచెల్లెల! రావె కోడలిపిల్లరో!
త్రావి వేగమె చల్దిగంజిని రాక యూడుపు లూడ్వఁగా!
ఆకసంబునఁ బ్రొద్దుపైకెగఁబ్రాఁకుచున్నది చూడరే,
ఆకవెట్టెడి తాళ్లముసుఁగున కడ్డరానివెలుంగులో!

వానదేవునిరాకచే నెవలోనివేడి యడంగ నెం
తేని పంటపొలంతి తెప్పిటి నించుఁ గమ్మని యూర్పులన్
పూనఁగా వలదే యిఁకం దనమేనఁ బులకల పోలికన్
జానలార! ముదంబుతో మననాటఁబోయెడి మొలకలన్?
మెత్తనౌ చిత్తమున నీరికలెత్తు విత్తినకోరికల్
రిత్తయైచనుఁ దగులమెల్లను బొత్తుచేసుకొనుండినన్.

మైలదాఁకక యుండఁ గుచ్చెలు మలచి వెనక్కుఁ గట్టరే
ప్రాలుమాలిక లేక నడుములు వంచి మూనలు వెట్టరే.

౨

అన్నవస్త్రము లిచ్చి ప్రోచెడి యమ్మకును భూదేవికిన్
మున్ను గల్లుమనంగ గాజులు మ్రుట్టి చేతుల మ్రొక్కరే!

తల్లికోడిని బిల్లలట్టులు తగిలి కాళ్లను వ్రేళ్లనుం
దల్లిఁ గొల్చిన నోటికిం జెడుఁ బిల్లలార! యెదేనియున్.

చోడిగింజయొ జొన్నగింజయొ చొప్పడున్ వరిగింజయో
క్రాఁడిమేఁడియుఁ గట్టుదొరలకు గాదెలేయిఁక నిండెడున్.

తాలుఅప్పలు గుట్టలై పడఁ ద్రవ్వి రతనపురాసులన్
గోలకొండనవాబు బంగరు గోడలందును వాపెడున్.

విత్తుచుందుము కోయుచుందుము క్రొత్తయేమియు లేదిగన్
క్రొత్త బ్రదుకును బ్రదుకనలెనను కోర్కె యొక్కటి దక్కఁగన్

మాసిపోయిన రంగుచీరను మార్చి క్రొత్తది తాల్చి యా
వేసమట్టులెయైన వేఱొక వేసమున్ సవరించుచుం

క్రొత్తనవ్వులు క్రొత్తపువ్వులు క్రొత్తయాటలు పాటలుం
క్రొత్తయందము చందముం గని క్రొత్తవేడుక గూర్చెడున్.

భూమిదేవికి తల్లి వినం చిచి యా మె బిడ్డల మనుటచే
నామె త్రోవ వెడపోవుచుమునునమరి సివమో వలెచరయకో.

ఎండ గాసిన వాన గురిసిన నేళ్లు కోళ్లను నేకమై
నిండిపొంగిన నూళ్లు మున్గిన బండి చక్రమువోలెనే

తిరుగుచుండును వెలుఁగుచీఁకటి సరిగఁగను చను భూమియుం
దిరుగుచుండును దానిలో విధి త్రిప్పలం బడి మనమునున్.




ఎంతపాటున కంతియే ఫల మెంతయాఁకటి కంతె కూ
డెంతకల్మియు లేమియేయగుఁ జింతలం బెనువంతలన్.

కడుపునిండినఁ జాలదే యిఁక గాదె నిండకపోయినన్
బడుగుపాటకపుం గొలానికిఁ బానకంబగు గంజియే.

3

పెట్టినారము మొన్న నే కొడవండ్లు పంటలు కోయఁగా
మట్టినారము విత్తుఁగట్టల ముందుపంటకు నేఁ డిదే.

౪

మాటయుం బలుకాడుకొంచును పాటపద్దెముఁ బాడుచున్
నాటినారము పాటువడి యొక పూఁట గంజికి సరిపడన్.

నూటిగా నడునెత్తిమీఁదను చుఱ్ఱుమని యెడుఁ బ్రొద్దికం
గూటిముంతలు వ్రేలు మామిడికొమ్మనీడను నిల్వరే.

కడుపుచిచ్చును నెండయుడుకు రవంత చల్లపడంగ నొ[న్.
క్కఁడుగు నిల్చుట యెప్పుడున్ రెండడుగులిడుటకె ముందుకు

## శ్రీ ద్వారం వెంకటస్వామినాయడుగారు,



గాంధర్వ విద్యాభూషణ

శ్రీవెంకటస్వామినాయడుగారు విశాఖపట్టణము వారు. అన్నగారి వద్దనే గానకళను, ఫిడేలువాద్యమును అభ్యసించి మంచి పాండిత్యమును గడించినారు. పది ఏండ్లనుండి శ్రీవిజయనగర మహారాజావారి గాన కళాశాలలో ఫిడేలు ఉపాధ్యాయులుగా నున్నారు. ఆంధ్ర మండలమున ఫిడేలు పాండిత్యమున వీరికి సమానులనదగిన వారు ఎందరో లేరనవచ్చును. ఇటీవల రెండుమూడేండ్లనుండి దక్షిణదేశమున గానసభలకు బోయి తమ పాండిత్యమును ప్రదర్శించి మెప్పువడసియున్నారు. విజయనగర మహారాజావారు వీరికి 'గాంధర్వ విద్యాభూషణ' బిరుదము నొసగినారు. జయపురము, వద్వాను మొదలగు సంస్థానముల ప్రభువులును, కొందఱు గానసభలవారును వీరికి స్వర్ణపదకములు మొదలయినవాని నొసగి బహూకరించిరి. వీరికిపుడు వయసు ముప్పదియైదు సంవత్సరములు. వీరివలన ఆంధ్రదేశము గానకళయందు ముందుకు సాగుచుండుటను గాంచవగును.

---

## శ్రీ నందికోళ్ల గోపాలరావుగారు*



తూర్పుగోదావరి మండలమున ఇంజరము అను గ్రామము శ్రీ గోపాలరావుగారి నివాసస్థానము. వీరా గ్రామమునకు గ్రామాధికారి (Village Munsiff). వీరు తెలగా తెగలోని సంపన్నమగు నుత్తమ కుటుంబమునకు జెందినవారు. స్వయం కృషిచేత చిత్రకళనభ్యసించి, వీరు వర్ణచిత్రముల చిత్రించుకౌశల్యము నలవరుచుకొన్నారు. వీరి తైలవర్ణచిత్రము 'వేణుగోపాలుడు' భారతి ఐదవ సంపుటము, ఆఱవ సంచికయందు ప్రకటితమైయుండుట భారతీ పాఠకలోకమునకు విదితమే. ఇట్టిదియే ఇంచుకించుక భేదములు గల చిత్రమొకటి వీరిది జర్మనీలో ముద్రితమై యిపుడు ప్రచారమున నున్నది.

---

*శ్రీయుతులు గుండిమెడ వేంకటసుబ్బారావు, మార్ళ్లపూడి పుత్రసత్యంశర్మగారులు శ్రీగోపాలరావుగారి చిత్రములపై ప్రశంసలను వ్రాసి పంపినారు. వారు వ్రాసిన విషయము లిట నుపకరించినవి. —భారతి.

ఇందున్న 'శ్రీమన్నారాయణ' చిత్రము వీరి త్రివర్ణ చిత్రమునకు ప్రతిబింబము. ఈ చిత్రము, ఉలూచి-అర్జున, శ్రీకృష్ణుడు-రాధ, మొదలయిన చిత్రములను కొన్నిటిని రావుగారు జర్మనీకి ముద్రింపబంపియున్నారట. మఱియు వీరి వర్ణ చిత్రములు తెలుగునాడున గల రాజాస్థానములయం దున్నవట.

మునకు దెప్పింపబూనినారు. చిత్రకళ నానాముఖముల కొనలుసాగుచున్న యీకాలమున వర్ణ చిత్రములను చక్కగ ముద్రింపనుపకరించు యంత్రసామగ్రి మనదేశమున లేకపోవుట యొక పెద్దలోటు. ఆలోటును తీర్పగలవారు కళాకుశలురు, కళాభిమానులునగు శ్రీమంతులు. శ్రీ గోపాలరావుగారీలోటును తీర్ప ప్రయత్నించుచున్నారట. ఈ మేలివార్త సత్యమే అయి వారి ప్రయత్నము



శ్రీమన్నారాయణ

చిత్రకళయం దాసక్తి మిక్కిలియగుటచేతను, సఫలమగునేని, ఆంధ్రదేశసౌభాగ్యదేవత నాగరికతా
ధన సంపన్నులగుటచేతను వీరు చిత్రములను చిత్రిం సౌధమునకింకొక మెట్టు పైకెక్కినదన్నమాట. వీరి చిత్ర
చియుంచుకొనుటతో తనివిచెందక [illegible] కళాశాలలయందు ఇంకను పెంపొంది తెలుగునాటికి వాసి
మునకూర్చి వానిని విదేశములకంపి ముద్రింపించి ప్రచారము గూర్ప పరమేశ్వరు డనుగ్రహించుగాక!

# భారతీయ మహిళామండలి

## సి. యన్. నల్లముత్తు అమ్మాళ్ కన్యగారు



ఈమె శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి అమ్మాళ్ గారి చెల్లెలు. మదరాసువిల్లింగ్‌డన్‌ప్రభ్వి కళాశాలయందుపాధ్యాయగా నుండెను. ఇంగ్లాండులో నాలుగేండ్లు ఉన్నతవిద్యల బడసివచ్చెను. ఇపుడీమె రాజమహేంద్రి స్త్రీల బోధనాభ్యసన కళాశాల సూపరింటెండెంటుగ నియమింపబడెను.

## శ్రీమతి కన్యా లీలామణినాయడుగారు



(శ్రీమతి సరోజినిదేవినాయడుగారికుమార్తె)

ఈమె ఆక్స్‌ఫర్డునందు బి. యే. ఆనర్సుపట్టము నొంది యీమధ్య యాంగ్లదేశమునుండి స్వదేశమునకు మరలివచ్చి లాహూరునందలి ప్రభుత్వమహిళాకళాశాలయందు తత్త్వశాస్త్రోపాధ్యాయోద్యోగమును స్వీకరించెను. మొదట లండన్ సెంట్‌పాల్స బాలికా పాఠశాలయందు చదివి, పిదప ఆక్స్‌ఫర్డునందు తత్త్వశాస్త్ర అర్థశాస్త్ర రాజనీతిశాస్త్రములందు బి. ఏ. ఆనర్సుపట్టమును బడసెను. ప్రస్తుతము అమెరికాఖండమునందు భారతదేశస్థితినిగూర్చి ప్రచారము సల్పుచున్న సుప్రసిద్ధకవయిత్రి, రాజకీయవేత్త్రియగు శ్రీమతి సరోజినిదేవి కుమార్తె యీమె.

## శ్రీమతి అన్నా ఈఫెను



ఈమె బెజవాడ పురపాలక సంఘమునందు సభ్యురాలుగ నియమింపబడిన ప్రథమనారీమణి; సంఘసేవాభిలాషిణి. బెజవాడయందు బాలికాభటోద్యమమును స్థాపించెను. ఈమె రైల్వే వైద్యశాఖోద్యోగియగు డా॥ యస్. జె. ఈఫెను, యం. బి. గారి సతీమణి.

# జగన్నాథ నిందాస్తుతి

శ్రీ విక్రమదేవవర్మ గారు

గీతితతి

ఓ జగన్నాథుఁడా! నిన్ను నోకృపాస-ముద్ర! యనుచును బిలుతురు భూరిభీతి
నంతెకాక నీ కాపేరు సుంత యేని-చనునె? నీహృదిఁ గరుణా రసమ్ము గలదె?

పాలొసంగెడుభామిని ప్రాణములను-గొనెడు నిసు వెందుఁ గలదె పూతనను బూర్వ
మేమి చేసితివో స్మరియించు కొనుము-మఱచినను మాత రేణుక మ్మనసునుండి.

జనుల ప్రాణము ల్దినుకాలసర్ప మవుగ-యరయ నీకుఁ బామునకు సామ్యంబు గలదు
చక్రచిహ్న ముండుట దానిఁ జక్రియంద్రు-చక్రహస్తుండవగు నీవు చక్రివి గద!

భోగ మని పడగకు నంద్రు పొంది దాని-నద్ది భోగినామంబుతో నమరు చుండు
భోగము లనేకములు గల్గు పురుషవరుఁడ!-యెట్లు భోగివి గావొ నీ వెంచఁగలవె?

అన్నిచోట్లఁ జరింపకే యహి యనియెడు-సర్ప మనెడు నాఖ్యల నద్ది చాటఁబడెడు
నన్ని నెలవులఁ జరియించు నచ్యుతుఁడవు-చెల్లవే నీకు నారెండు పేళ్లుఁ దలఁప?

కుండలమువోలె నది చుట్టుకొనుట జనులు-దానిఁ గుండలి యందురు గాని దివ్య
కుండలంబులు గల నీకె కుండలియను-నామ మెంతయు నొప్పు నెన్నంగ మదిని.

నడుచుటం బాదములు [illegible] నాగపన్న-గాఖ్యలను బొందె నద్ది; నిరంఘ్రివగుచు
ఋషుల మానసంబులఁ జరియించు నీకు-నొప్పుచుండెడు నానామయుగ్మ మభవ.

అడుగు లిలఁ గానరామి గూఢాంఘ్రి యనుచు-బలుకఁబడునద్ది; నీ పాదములు విరించి
కైనఁ గానంగఁ దరమౌనె? కాన నీదు-పట్ల నా నామధేయ మ స్వార్థ మగును.

అద్ది చక్షుశ్శ్రవో నామ మందుఁ దనదు-కనులతోడనే వినుచుంట కతనఁ, జెవులు
లేక వినువాఁడ వగు నీకు నోకజాక్ష!-చెల్లదే తదాఖ్య నిడంగఁ? జెప్పు మీవ.

కుటిలగతి భుజగాఖ్యను గొనియె నద్ది-నీవు భుజగుఁడ వల గొల్ల నెలతఁలకును
అద్ది మంత్రవశ్యంబు; నీ వరయ నామ-మంత్రవశ్యుండ వగుదు రమాకళత్ర!

ఇంత చాలదే? నీ గుట్టు నింక బైటఁ-బెట్టి నంతన నగుదురు పెఱలు విన్న
నీకు దాసుండఁ గావున న్నే నెఱుంగఁ-గొదవ గలుగదు; చెడదు నీ గొప్పతనము.

ఇంతయే నాకుఁ జాలు నా యంతమందుఁ-జెలిమి నీపేరు స్మరియింపఁ జేసి పిదప
నీకు నిచ్చకు వచ్చెడు నెలవు నిమ్ము-వామదేవ పూజిత దేవ! వాసుదేవ!

---

# ఆంధ్ర నాటకరంగము

[మొన్న మూడవతేది నాడు చెన్నపురి దక్షిణ భారత వాణిజ్యసంఘము (నాటకశాఖ)వారు హరిశ్చంద్ర నాటకమును ప్రదర్శించినారు. ఇందు ప్రధానపాత్రధారులు ఆంధ్రనాటక రంగమున పేరుగన్నవారు. హరిశ్చంద్రుడు: శ్రీ. బ్రహ్మజోస్యుల వెంకటసుబ్బారావు గారు; చంద్రమతి: ఆంధ్రనాటకకళాపూర్ణ శ్రీ ముప్పిడి జగ్గరాజుగారు; నక్షత్రకుడు: శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు. లోహితాస్యబాలుడు: చి॥ రామచంద్రపురపు సత్యనారాయణ. ఈ బాలునియందు త్తమనటలక్షణములు మొలకలెత్తియున్నవి. సుశిక్షితుడగునేని మున్ముందు ఆంధ్రనాటక రంగమునకు వన్నె తేగలడు. ఈనలువురు తమ పాత్రములను సామర్థ్యముతో నిర్వహించగలుగుట చేతనే ప్రదర్శన మాపాతిరమణీయమైనది.

హరిశ్చంద్రుడు సత్యసంధుడని పేరుగాంచుటకు మూలకారణమయిన విశ్వామిత్రుడు ఆశాభంగమును గలిగించినాడు. సత్యకీర్తి మంత్రి, కాలకౌశికదంపతులు, మాతంగకన్యలు చాలినవారుకారు. పాత్రధారు లందఱు నాటకప్రదర్శనమున తమతమపాత్రములను చక్కగా పోషింపజాలకున్నచో ప్రదర్శనము ప్రశంసాపాత్రము కాజాలదు.

ఈహరిశ్చంద్రనాటకమును శ్రీయుతులు బలిజేపల్లి లక్ష్మీకాంతముగారు రచియించినారు. రచనము పద్యభూయిష్ఠము. పద్యములు రసవంతములయి రచనమున కుత్తమకావ్యత్వసిద్ధి నాపాదించుచున్నవి. కాని, ప్రదర్శనమునమాత్రము విసుగునుపుట్టించి, రసభంగమున కుపకరించుచున్నవేమో యను సంశయము గలదు:]

## శ్రీయుతులు బ్రహ్మజోస్యుల వెంకట సుబ్బారావుగారు

ఉత్తమ పురుషలక్షణ సంపన్నమయినది సుబ్బారావుగారి గంభీరాకృతి. ఆహార్య మాయనయందు హరిశ్చంద్ర సార్వభౌముని దిద్ది తీర్చినది. ఇపుడు ఎల్లవిధముల రావుగారు హరిశ్చంద్ర సార్వభౌముడు, ధైర్యవినయము లాయనసొమ్ము. సార్వభౌముడు—శోకము పెల్లున కన్నులనీరు గార్చును; వెఱ్ఱివానివలె విలపించి విలపింపజేయును. సుబ్బారావుగారి హరిశ్చంద్రునకు ఆంధ్రనాటక రంగమునందు సుప్రతిష్ఠితులయిన హరిశ్చంద్రులలో నొకస్థానము గలదు.

సుబ్బారావుగారి ఉదాత్త మధుర కంఠస్వరము వాచికమునకు వన్నెదెచ్చినది. వారికి చక్కనిసంగీతజ్ఞానము కలదు. వారి శ్రావ్యగానము శ్రోతలహృదయముల నాకర్షించును. కాని నాటకమున గానమున కెక్కువ తావు లేదు.

సుబ్బారావుగారి ఆంగిక సాత్వికాభినయములం దక్కడక్కడ ఝుడితిభావస్ఫూర్తి అనుపుపడకుండును. ఇందుకు వారి ప్రకృతియే కారణమా, అభినేయగ్రంథము పద్యభూయిష్ఠమగుటయా! దీనిని సవరించుకొనగలరు సుబ్బారావుగారు.

* * * *

## శ్రీయుతులు ఆంధ్రనాటక కళాపూర్ణ ముప్పిడి జగ్గరాజుగారు

మహాసాధ్వి చంద్రమతిపాత్రధారణమున జగ్గరాజుగారు పేరున కెక్కిన వారని వినుకలి.

వీరిచంద్రమతిని మొదటిమారు చూడ వినుకలి సత్యమని తేలినది. ఉత్తమసాధ్వీలక్షణములు రాజుగారిచంద్రమతియందు దొప్పియున్నవి. రాజుగారియందు చంద్రమతి అద్వైత భావమును జెందినది. ఈచంద్రమతి సిగ్గుతో నమ్రవదనయై అనురాగమును లలితలలితముగ వెలిపుచ్చుట ముచ్చటగొలుపును. ఈమె వియోగ దుఃఖము అనుభవైకవేద్యము. పుత్రశోకముతో, మూర్తీభవించిన కరుణరసమోయన నీ చంద్రమతి పొక్కి-పొగిలి, ప్రేక్షకులను పొగుల జేసినది. ఆంధ్రనాటకరంగమున జగ్గరాజుగారి చంద్రమతియే చంద్రమతి.

ఆంగిక వాచిక సాత్వికాభినయములు, గానము రసానుగుణముగ నీచంద్రమతియందు గుదిరినవి. కంఠస్వరము సౌశీల్యమును పెంపొందజేసినది. ఆహార్యము పాతివ్రత్యమునకు పట్టుగొమ్మ.

జగ్గరాజుగారి చంద్రమతిని తలచుచూడ గుతూహలము గలదు.

* * * *

శ్రీయుతులు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి గారు

వీరు సద్గ్రంథరచయితలని ఆంధ్రలోకమున పేరుగన్నవారు. మంచినటకులనియు ప్రతీతి. మొన్న వీరినక్షత్రకపాత్రదర్శనము లభించినది. కవిగారు సృష్టించిన నక్షత్రకుడే యీపాత్రము. ఆత్మీయులు సర్వథా విధేయులగుదురు. కవిగారినక్షత్రకుడు రంగమున గురువును మించిన శిష్యుడు. గురువునెడ శిష్యులు చూపవలసిన భక్తివినయముల కీనక్షత్రకుడు గురువు. ఈతని కపటనాటకమున ప్రేక్షకులు హరిశ్చంద్రులు.

వాచికమున కవి నక్షత్రకుల కద్వైతభావము. ఈతనిగానము రసములలో లీనమయినది; పశ్చాత్తాపము ప్రేక్షకుల హృదయముల గరగించినది.

* * * *

వీరును, ఇంకను ఇట్టి ఉత్తమనటకులును ఆంధ్రనాటకరంగమును 'నాటకరంగ' మనిపించవలసినవారు.

—భారతి




# గ్రంథములు

## * మహాభారత చరిత్ర

గ్రంథకర్త:— పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, పిఠాపురము.

వెల:— రూ. 1-0-0. డెమ్మీసైజు 237 పేజీలు.

ఈగ్రంథమును వందనములతో నందికొనినాము. గ్రంథకర్త యొనర్చిన పరిశ్రమాతిరేకమును ఎచ్చటపట్టిన నచ్చట చదివిచూచి మిక్కిలి యానందించితిమి.

అధునాతనులగు నాంధ్రులలో, తత్రాపి ప్రాచీన పరిపాటి ననుసరించిన వాఙ్మయ విమర్శకులలో, కూలంకష మగు ధిషణాపాటవమును వినియోగించి, సంస్కృతాంధ్ర భాషాసాహిత్యమును, సామరస్యము నలవరిచికొని ఈతీరుగా ఆర్యాంధ్రవిజ్ఞానముల కాకరమగు భారతరత్నాకరమును మథించి సారమును తేల్చిన పండితులు ఇప్పుడు చాల నరుదుగా నున్నారు.

శ్రీశాస్త్రిలుగారు ఈకాలపు విమర్శకులధోరణి ననుసరించి_అనగా కథ కాలము, కవికాలము, తద్విశేషములు మున్నగువానిని విమర్శించెడిరీతితో బహిరంగ పరీక్షతో ప్రకృతము ఈ భారతచరిత్రను వ్రాసియున్నారు. (ఇది వారు తెలిపినమాటయే.) కనుక వారు భారతయుద్ధకాలము, రచనావిధానము, గాథా విశేషములు, పాండవపక్షపాతులు, భారతకాలపు రాజ్యములు, భారతపు ముఖ్యవీరులు—అను ప్రధానశీర్షికలతో పాశ్చాత్యవిమర్శకపద్ధతితో గ్రంథరచనను సాగించినారు. ఇందు యుద్ధకాలమును నిర్ణయించునప్పుడు ఉపనిషత్తులు, జ్యోతిశ్శాస్త్రసంప్రదాయములు, భారతవ్యాఖ్యానాంశములు, తక్కిన పురాణాంశములు మున్నగువానిని గైకొని పెక్కుయుక్తిప్రత్యుక్తులతో భారతయుద్ధము 15-16 శతాబ్దులమధ్యను జరిగినదని నిరూపించినారు.

ఇక రచనావిధానమునందు—చాలవఱకు పాశ్చాత్యపండితులమార్గము ననుసరించి భారత భేదములను, నానికి ఆధారములగు నంశములను చక్కగా వెల్లడించిరి. ఈరీతిగానే గాథావిశేషములను వెల్లడించుటలో చాల ప్రయాసమునకు పాలై, ఆర్యానార్య మిశ్రజాతినిర్ణయములు, భారతమున దేవతలుగా మహామహిమతో వర్ణింపబడిన శ్రీకృష్ణ పూతనా నాగులను కూర్చిన చరిత్రాంశములను సాధారణముగా నిరూపించుటయేకాక గతానుగతికముగా విశ్వసింపబడుచున్న ద్రౌపదీవస్త్రాపహరణాదికథలు అసత్యములని చెప్పకయే చెప్పుచున్నారు.

* భారతీపత్రికకు అభిప్రాయార్థము వచ్చిన గ్రంథమును నాకిచ్చి తదధిపతులు కొన్నిమాటల వ్రాయుడని కోరిరి. కనుక నాకు తోచిన విషయములనే కొన్నిటిని ఇచ్చట వ్రాసియున్నాను. ఈచరిత్రకర్తల యభిప్రాయమును నే నెంతవఱకు అంగీకరించెద నన్నవిషయమును ముమ్ముందు నా వ్రాయదలచిన వ్యాసములను బట్టి చదువరులు నిర్ణయించుకొనవలెను. పం; ఆ. శా.

పాండవపక్షపాతులను గూర్చి చర్చించినప్పుడు భీష్మ ద్రోణకృప విదుర వ్యాసాదుల తత్త్వములు,వారొనర్చిన యసందర్భాంశములు నిరూపించినారు. ఈ ఘట్టమునం దింకను శ్రీకృష్ణజరాసంధాదిశిష్టి కల గల యంశములు చాల వింత గొల్పుచున్నవి. ఇటులనే మహాభారతకాలపు రాజ్యములను గుఱించి చర్చించుటలో గూడ మనస్మృతులు, పురాణములు మున్నగువానిని మాత్రమే కాక స్వదేశీయులు, విదేశీయులు వ్రాసిన చరిత్రాంశములను కూడ జతచేసి చర్చించి సిద్ధాంతము లొనర్చిరి. ఆకాల పుదేశముల పటము కూడ నచ్చట ప్రదర్శింపబడినది. పిమ్మట ముఖ్య వీరులపట్టిక ఈయబడినది. ఇవి ఇందుగల ముఖ్యవిషయములు.

మొత్తముమీద శ్రీసుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు అత్యధిక మగు నోపికతోను, పట్టుదలతోను సంస్కృతాంధ్ర మహాభారతములను తఱచి తను యోచించినవానిలో అనేకములగు అద్భుతాంశములను వెలువరించిరి. సత్యనిర్ధారణమునకును, విషయవివేచనమునకును అలవాటుపడియున్న సహృదయుల కిట్టి విమర్శనము చాల సంతోషమును కల్గించి ఈవిషయమునం దితోధికమగు విమర్శనము చేయుటకు పురికొల్పుట కలుగ గలదు; కాని ప్రస్తుతాంధ్రదేశములో—అందువను ఎదుటివారివాద మేదియో వినుటకైనను ఓపికపట్టక అపూర్వాభిమానములతో వీరావేశమును దాల్చి అర్భాటముచేయుట కలవాటుపడినట్టి యాంధ్రదేశములో—ఇట్టిగ్రంథములును, గ్రంథకర్తలును చాల నిందాస్పదు లగుట తప్పనిసరి యని మా యభిప్రాయము; అయినను శాంతిని వీడక కేవలసత్యదృష్టితో ఇంకను అనేకగ్రంథముల నిట్టులె వెలువరించుట గల్గినచో, కాలాంతరమున నాగ్రంథములును, గ్రంథకర్తలును ఆంధ్రజాతికి, భావష ఉజ్జీవనము గల్గించునట్లు అగును. ఏమనగా, "కాలోహ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ"—అని కదా అందురు. అయినను, విశిష్టమగు దేవాంశ కలవారని మనవారు నమ్ముచున్న కృష్ణుడు, పాండవులు, వ్యాసాదులు మున్నగువారి విషయముల గుఱించి ఈగ్రంథమునందు చిత్రములు, ఆశ్చర్యజనకము లగు సిద్ధాంతములు వ్రాయబడినవి. ఇంతయేల? "దుర్యోధనునిదే న్యాయము. పాండవులదియే అన్యాయము. పాండవులు కృత్రిమజన్మ కలవారు. ద్రౌపదీ వస్త్రాపహరణము అసలు జరుగలేదు. పాండవులు భారతీయులే కారు. కౌరవులే రాజ్యార్హులు. దుర్యోధనాదులు ఉత్తమకౌరవులు; రాజనీతి విశారదులు. వ్యాసుడు వర్ణసంకరసంతానమునకు పునాది. పాండవులు వ్యసనాసక్తులు"అని ఇట్టివి మన ప్రాచీనాచారపరాయణులమహాత్ముగా విన్నంతనే గుండె బ్రద్దలు చేయునట్టివే కదా? కనుక ఈరీతిగా ప్రవాహమునకు ఎదురీత గల గ్రంథములు మనవారిచే ఆదరింపబడునను నమ్మకము మాకు గల్గలేదు. కాని లోకమునకు విరుద్ధములుగా నున్నను పట్టుదలతో వీటిని బయటపెట్టి శాస్త్రిలుగారు తమకు గల సత్యప్రియతను వెల్లడించినారు. ఇందులకై వీరి నభినందించెదము.

ఏది యెట్లున్నను అనుకూలబుద్ధితోనో, లేక ప్రతికూలబుద్ధితోనో, వీరి విమర్శనలలో సార మెంతకలదన్న యూహతోనైనను, బూజుపట్టిన భారతపు ప్రతులను మనవారు కొందరైనను మఱల విప్పి చదివెదరనుట సత్యము. ఈమూలకముగానైనను నిర్జీవముగానున్న సారస్వతపారిశ్రామికుల జీవితములో కొంత సంచలనము గల్గించుటయైనను ఉత్తమ మగు కార్యమే కాగలదు. తక్కిన వెట్లున్నను ప్రకృతము శ్రీశాస్త్రిలు వారికి ఈపాటిదైయైనను శ్రేయస్సు తప్పదు గదా? కనుక వారు ధన్యులనియే తలంచుచున్నాము.

శ్రీశాస్త్రిలుగారి గ్రంథములో చర్చింపబడిన విషయములు ఆంధ్రదేశపు విమర్శకులలో పేరెన్నిక గన్న బ్రహ్మయ్యశాస్త్రిలు, చెళ్లపిళ్ల శతావధానులు మున్నగువారిచే ఆకర్ణితములై యొప్పుదల గన్నట్లు పీఠికలో గ్రంథకర్తలు సూచించినారు. ఇది ఆనందింపదగిన విషయము. అయినను స్వయముగా పరీక్షించి ఈ విషయమున మఱికొన్ని ప్రత్యేకవ్యాసములను వ్రాయదలచిన మేము ప్రస్తుతము గ్రంథపరిచయముగ నింతకంటెను విశేషించి వ్రాయజాలక యున్నాము.

పం. అ. శా.

## కలికాలపు కథలు (మొదటిభాగం)

గ్రంథకర్త: కలగ సత్యనారాయణగారు. క్రౌను 152 పుటలు. వెల 0 12-0.

ఈభాగమున నెనిమిది కథ లున్నవి. ఇందలి కథ లన్నియు వాడుకభాషలో వ్రాయబడినవి. 'సంఘ సంస్కరణాభిలాషి'యగు గ్రంథకర్తగారు సంస్కరణవిధము లేవియు సూచించకపోవుటచే వారి గ్రంథరచనోద్దేశము నిష్ఫలమైన దనవలసి వచ్చినది. పల్లెటూళ్లను,పట్టణములను గూడ గర్హించిన గ్రంథకర్తగారు వనవాసమును మెచ్చుదురుకాబోలు! పల్లెటూరి పడుచులు పశుప్రాయ లనియు, మన దేశపు ఆడువాండ్రు అప్రయోజక లనియు సూచించుట శోచనీయము. విద్యోపార్జనల కాధారభూతు లగు ప్రాథమిక పాఠశాలలోపాధ్యాయుల చులకనగ జూచుట గ్రంథకర్తల కయుక్తమని నాయాశయము. ఇందు 'వదనమోము'వంటి ప్రయోగములుగూడ నున్నవి. వీరు ప్రచురింపనున్న రెండవభాగమునం దైనను నెక్కుడుశ్రద్ధ వహించినగాని వీరి రచన మాదరపాత్రము కాజాలదేమో ?

కో. నా.

## మిస్ మేయో గ్రంథఖండనము

ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండుకో., తపాలుపెట్టె నెం. 110, మద్రాసు. క్రౌను 183 పుటలు. వెల 1-0-0.

భారతజాతి కప్రతిష్ఠ వాటించుచు వ్రాసిన మేయొకన్య గ్రంథముయొక్క సారమును, ఆగ్రంథమునకు సమాధానముగ రంగయ్యరుగారు వ్రాసిన 'ఫాదర్ ఇండియా' యను గ్రంథములోనుండి కొన్ని భాగములను, ఆంధ్రమాసుదొరగారు 'యంగుఇండియా'లో ప్రకటించిన ఖండనలేఖలును నాంధ్రీకరించి చేర్పబడినవి. గ్రంథమంతయు సరళశైలిని గద్యాత్మకముగ వ్రాయబడియుండుటచే స్త్రీ పురుషు లందరకును పఠనీయముగ నున్నది. ఈ గ్రంథము ప్రతి యాంధ్రుడును పఠింప దగినది.

కో. నా.

## సిల్హౌటీస్

గ్రంథకర్త: వి.ఎస్. భూషణ్. ఇది యొక చిన్ని ఆంగ్లగ్రంథము. తమకు తోచినప్పుడెల్ల వ్రాసిన పద్యముల సమూహ మిందు కలదు. భావ మింకను పరిపక్వము కాకపోయినను చదువుట కీగ్రంథము మనోహరముగ నున్నది. వీరు సరోజినీదేవిగారి మార్గము ననుసరింప యత్నించినటులు గానవచ్చును. ఆంగ్లమునందే యీ పద్యము లున్నయెడల గ్రంథకర్త భావగీతములను వ్రాయుచున్న కవి కుమారుల తరగతికి జేరినవా రగుదురు. రవీంద్రనాథ ఠాకురుగారు ఉపయోగించిన ఆంగ్లశైలిని వీరు దృక్పథమున నుంచుకొనిరి.

శైలియందును, పద్యముల కట్టుబాటునందునే కాక, భావములందును వీరు వంగదేశీయులనే యనుసరించిరి. వ్రాయుట కుత్సాహము కలవారిలో పలువురు దేశభావములందు వ్రాసి స్వభావముల నలంకరింపకుండుట చోద్యము.

అచ్చు బాగుగ నున్నది. శీర్షికకు తగినటుల చక్కని చిత్తరు వీగ్రంథమున కలదు. త. శా.

## శ్రీయుత కూచి నరసింహము పంతులుగారి జీవిత చరిత్రము

కర్త: జనమంచి సీతారామస్వామిగారు.

ప్రకాశకులు: ముద్దా సోమప్పశాస్త్రి అండ్ సన్సు, మేలుపాక, విశాఖపట్నంజిల్లా. వెల అ. 0-3-0. భారతీపాఠకులకు ౨ అ. చీటికి గ్రంథము ప్రతి పంపుదురు.

ఇది శ్రీనరసింహము పంతులుగారి యమూల్య జీవితమునకు సంగ్రహావర్ణనము. శ్రీపంతులుగారి ఆబాల్య భక్తి ప్రౌఢన్యాయములు, ఉపాధ్యాయత్వమందలి అనల్ప సామర్థ్యము, అతి మృదులమగు కవితాధోరణి, హృదయమందలి అతికోమలత మొదలగు నుత్కృష్ట లక్షణములందు చక్కగ వర్ణించుచు, చదువరుల మానసములకు వారి జీవిత ప్రాశస్త్యము నెక్కించుచున్న దీచిన్నవ్యా

సము. వ్యాసము సంక్షిప్తమైర క్తి గూర్చుచున్నది. శ్రీ పంతులుగారి అనుభవ సూచకము లగునట్టియు వారిజీవిత విశేషముల గొన్నిటి వెలిబుచ్చునట్టియు, వారిమానసిక విన్యాసముల గొంత యెఱిగించునట్టియు వారి చక్కని పద్యము లిందు ఉద్ధృతము లైనవి.

## సతీతార

డిమ్మీసైజున ౫౦ పుటలుగల అయిదంకముల చిన్న నాటకము. దీని వెల ఒక్కరూపాయట-అబ్బో!

గ్రంథకర్త: అనుముల వేంకటశేష కవిగారు, కావ్యవిశారద వగైరా బిరుదాంకితులు, తెలుగు పండితుడు, మునిసిపిల్ హైస్కూలు, హూసపేట.

'చెత్తనాటకాలు వద్దో' అని అంటూండే కొద్దీ లెక్క లేకుండా పుట్టుకొస్తున్నాయి. వీటి మూలాన తెలుగు వాఙ్మయానికి తెగులు తగులుకొంటూంది. 'నాటకాంతం కవిత్వం' అని వెనుకటి వారంటే 'నాటకంతోనే మొదలుపెట్టాలనోయి కవిత్వం' అంటారు ఇప్పటివారు. నాటకాలు వ్రాసేవారికి పాండిత్యంకంటే లోకానుభవం ఎక్కువ కావాలి.

ఈనాటకం కథ అందరికీ తెలిసిందే. కాని బృహస్పతి నే చంద్రుడివేమంతో తారను తార్చాడు గ్రంథకర్త. తార 'చంద్రుడే' అను భావంతో తంతు నడిచింది. ఇక తారను సతీత్వ మెక్కడ! భావ వ్యభిచారం కాదా!

## ఝాన్సీ లక్ష్మీబాయి

(ఏకాంక నాటకము)

'సిపాయిల తిరుగుబాటు'ని పేరుగన్న భారత స్వాతంత్ర్య సమరమునాడు ఆంగ్ల సేనాపతుల గుండె గుల్లమయి పరాక్రమించి మించిన వీరవనితామణి యగు 'ఝాన్సీరాణీ' లక్ష్మీబాయి ఆంగ్లేయ సైన్యములు ముట్టడించియున్న ఝాన్సీకోటనుండి తప్పించుకొని వచ్చు పట్టును 'చిత్రగుప్తుడు' ఇట్లు గ్రంథరూపమునకు తెచ్చినాడు. డిమ్మీసైజున ౪౮ పుటల పరిమితిగల యీ పుస్తకమునకు వెల, దొరకుచోటు తెలుపలేదు.

## కృష్ణుని దేశసేవ

గ్రంథకర్త: చాట్రాతి లక్ష్మీనరసాంబగారు. ముద్రాపకులు: కర్లపాలెం కోదండ రామయ్యగారు, శ్రీ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్), బెజవాడ. డెమ్మీసైజు ౯౫ పుటలు. వెల ౧-౮-౦.

చక్కని ధారాళమైన శైలితో నొప్పారు గద్య పద్య ధోరణిని శ్రీకృష్ణచరిత్రము దేశసేవాపరముగ నిరూపించుచు రచించిన యీగ్రంథము ప్రశంసాపాత్రము. ఇది బాలబాలికలు చదువదగినది.

## అరేబియన్ నైట్సు: ప్రథమ భాగము

గ్రంథకర్త: జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు. ప్రకాశకులు: కత్తా అచ్చయ్య అండ్ సన్సు, రాజమండ్రి. క్రౌనుసైజు, ౨౫౫ పుటలు. వెల రు. 1-8-0.

'అరేబియన్ నైట్స్' అను ఆంగ్ల గ్రంథమునకిది ప్రతిపదాంధ్రీకరణము గాక, ప్రథమమున కథ చదివి, తత్సారమును పెంచుచు వ్రాసినది. శైలి యింకను సవరించుకొని సాపు చేసికొన్న బాగుండెడిది.

## శివలీల-నాటకము

కర్త: ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారు, జగ్గయ్యపేట. పేజీలు 86. వెల రు. 1-0-0.

## గయోపాఖ్యానము (ప్రబంధము)

శ్రీ వెంకటేశ్వర గ్రంథమండలి యంపలి ఐదవ కుసుమము. కర్త: వెల్లింటి సుబ్బయార్యగారు. పేజీలు 154. వెల రు 1-4-0. చందాదారులకు రు 1-0-0.

## సారూప్యౌషధశాస్త్రము

కర్త: డాక్టరు లంక రామారావుగారు, హెచ్. ఎం. బి., కాకినాడ. 587 పేజీలు. వెల రు. 3-0-0.

## తంజావూరి మహారాష్ట్రరాజుల చరిత్రము

కర్త: కె. ఆర్. సుబ్రమణియన్‌గారు, యం.ఏ., మైలాపూరు, మద్రాసు. పేజీలు 107. వెల రు. 1-0-0.

కోటంరాజు నాగేశ్వరదాసు

కర్త: పంగులూరివీరరాఘవుడుగారు, అప్పికట్ల.
పేజీలు 22.

బ్రహ్మగుండేశ్వర మాహాత్మ్యము
వెల. అ. 0-2-0.

శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యము
వెల అ. 0-2-0.

శ్రీద్వారకా మాహాత్మ్యము
వెల అ. 0-2-0.

ఈపైమూడు మాహాత్మ్యములకు కర్త పుల్లాపంతుల రామచంద్రయ్యగారు, కర్నూలు.

దీపావళీపండుగ రహస్యము

కర్త: దువ్వూరి బాపన్నగారు, అంద్రంగి.
పేజీలు 64. వెల రు. 2-0-0.

## పత్రికలు

### 'రైతాంగము'

ఇది యొక నూతన మాసపత్రిక. మదరాసు, తిరువళిక్కేణి నుండి శ్రీ బి. టి. నరసింహాచార్యులుగారి సంపాదకత్వమున మొదటి సంచిక అక్టోబరు మాసాంతమున వెలువడినది. సం॥ చందా రూ 2-4-0. క్రౌను సైజున 22 పుటలు. 'రైతులకు సంబంధించిన ఆర్థిక, వ్యావసాయిక, సాంఘికసమస్యలను ప్రజల దృష్టిలోనికి దెచ్చి వానిని గురించి ఆలోచించునట్లు చేయుటయే ప్రధానాదర్శముగా గల పత్రిక యిదివరకాంధ్రదేశమున లేనిలోటును తీర్చుట కేర్పడిన దీపత్రిక. రైతుల యభ్యున్నతికి సాధనములగు ఆర్థిక, వ్యావసాయిక, ఆరోగ్య, సాంఘిక సమస్యలన్నియు నిందు చర్చింపబడు'నని సంపాదకీయమందు వ్రాయబడినది.

వేమవరపు రామదాసుపంతులుగారిచే వ్రాయబడిన 'వ్యవసాయపు రాయితీలు కమిషను' అను వ్యాసము కమిషనువారి రిపోర్టుయొక్క నిష్ఫలతను, నిరర్థకతను సూచించుచు, దానినుండి రైతులు గ్రహింపవలసిన విషయముల చర్చను ప్రారంభించినది. ప్రతిమాసము నొక్కొక వ్యాసమును వ్రాతుమని పంతులుగారిందు తెలిపిరి. ఇది సంచిక యందలి ప్రథమవ్యాసము.

గోగినేని రంగనాయకులుగారి 'రైతులు-ఆర్థికస్థితి' యను వ్యాసము రెండవది. క్రమక్రమముగ రైతులకు హెచ్చుగుచున్న వ్యయమును, తగ్గుచున్న ఆదాయమును, సిస్తుల బాధను గూర్చి ప్రతిగ్రామస్థుడును, రైతును శ్రద్ధతో చదువుకొనవలసిన యీవ్యాసము సరళశైలి నున్నది.

పశువ్యాధులలో కఠినమైన మలబద్ధము, కడుపుఉబ్బరము యొక్క కారణములను, లక్షణములను, చికిత్సను గూర్చిన వ్యాసము మూడవది.

సమకాలికాభిప్రాయములలో 'గాత్తము ఎరువు', 'మిడుతల దండు నివారణము', 'పొగాకు పైరు', 'పైరుల మార్చుటవలని ప్రయోజనము', 'పరిచేలలో పాకుడు', 'విద్యుచ్ఛక్తి-భూసారము', 'పశువులకు రేచీకటి' యను విషయము లున్నవి.

రైతులయెడల శాసనసభలయందు ప్రభుత్వమువారి వైఖరిని గూర్చి సంపాదకీయములలో చర్చింపబడినది.

వ్యవసాయమును, గ్రామజీవనమును సూచించు ముఖశీర్ష చిత్రముతో, మొదటినుండి తుదివరకు రైతున కుపయుక్తమగు విశేషములతో నిండి, సార్థకనామయగు టకు ప్రయత్నించు సూచనలతో నున్న యీపత్రిక చిరజీవినియై వృద్ధిచెందును గాక! జ్వ. బ్ర.



కుఱ్ఱవాళ్లని కూర్చోబెట్టి బొమ్మ గీద్దామంటే సరయిన వైఖరి దొరకడమే బ్రహ్మాండం

# సాభిప్రాయవిశేషములు

ప్రపంచమునందు సత్యాశ్రయము లేని సకల ప్రయత్నములును నిరర్థకము లగుట సహజధర్మము. మానవు లీపరమార్థమును మఱచి పరమానర్థములకు పాలగుచున్న విధమును ప్రపంచేతిహాసము లనంతముఖములను బోధించుచున్నవి. కన్నులు గలవా రీపరమ రహస్యమును చూడగలరు. చెవులు గలవా రీరహస్యమును వినగలరు. బుద్ధి గలవా రీపరమార్థమును గ్రహించి సుఖపడగలరు. కన్నులు, చెవులు, బుద్ధియు కలిగియుండియు వానిని సహజరీతి నుపయోగించనివారు దుఃఖముల పాలగుచున్నారు. ప్రపంచచరిత్ర మంతయును స్వార్థమునకును, పరార్థమునకును గల సంరంభమై యున్నది. బుద్ధిహీనులు స్వార్థమునే పరమార్థముగ ప్రదర్శించుటకు కపటనాటకములను గల్పించుచుందురు. స్వార్థపరులు చెప్పెడి సిద్ధాంతములకును, చేసెడి పనులకును సంబంధము దుర్గ్రాహ్యముగ నున్నది. అధర్మపరాయణులు తాత్కాలికముగ లోకమును వంచించినను కాలాంతరమున సత్యము వ్యక్తము కాగలదు. వర్తమానయుగమునందు వ్యక్తుల కపటనాటకములకన్నను మహాజాతుల కపటనాటకములు మహాసంక్షోభమును గలుగజేయుచున్న విధమును అయిరోపా మహాసంగ్రామము సువ్యక్తము చేసినది. దేశములు పాడుపడినవి. ప్రజలు నశించిరి. సంపదలు క్షీణించినవి. ప్రజ లన్నాతురులై పరితపించుచున్నారు. ప్రపంచశాంతికై నానాజాతిసమితి స్థాపించబడినది. కాని ప్రపంచమునకు మాత్రము జ్ఞానోదయము గలుగలేదు. పాశ్చాత్య రాజ్యములందు వ్యక్తిస్వాతంత్ర్యము వికసించుచున్న విధముననే పరపీడనదాస్యములును వికసించుచున్నవి. ప్రపంచశాంతికి మూలాధారమైన యుద్ధసన్నాహ నియమములకు బ్రిటీషు, ఫ్రెంచి, ఇటలీ రాజ్యములు విముఖత్వమును చూపినవి. ఈరాజ్యము లెప్పటివలెనే యుద్ధసన్నాహమునకు విశేషమైన ద్రవ్యమును వ్యయముచేయుచున్నవి. ప్రజలన్నాతురులై పరితపించుచున్నారు. ఈరాజ్యములు పరదేశదాస్యమునకై చూపుచున్న శక్తిసామర్థ్యములు స్వదేశమోక్షమునకై చూపుట లేదు. ఈ రాజ్యములందు పరదేశాక్రమణాభిలాష పెరుగుచున్నది గాని తరుగుట లేదు. అయిరోపా మహాసంగ్రామానుభవము శ్మశానవైరాగ్యముగ పరిణమించినది. ఆయుధధారణమునందు గల భక్తిశ్రద్ధలు ధర్మధారణమునందు గలుగకున్నవి. ధర్మధారణము లేని సంపదలు, సామ్రాజ్యములు తాత్కాలికముగ సుఖదాయకములుగ గనుపడినను కాలక్రమమున దుఃఖదాయకములగుట తథ్యము.

మహాభారతయుద్ధము ధర్మాధర్మముల సంరంభములందు ధర్మమునకు గలిగెడి విజయమును, అధర్మమునకు గలిగెడి పరాజయమును పరిస్ఫుటము చేయుచున్నది. దుర్యోధనుడు విజయాశీర్వాదము కోరినపుడు గాంధారి 'ధర్మము గలచోట విజయము గలుగును' అని దీవించినది. ధర్మరాజును ధర్మము రక్షించిన విధమున దుర్యోధనుని వాని యక్షౌహిణులు రక్షించలేదు. పరపీడన మధర్మపరాయణమై మూలచ్ఛేదమును జేయగలవిధమును భారతయుద్ధ మత్యద్భుతముగ బోధించుచున్నది. ఓడిపోయిన కౌరవులు సంపూర్ణముగ నశించిరి. గెలిచిన పాండవులును మహాదుఃఖము ననుభవించిరి. యుద్ధానంతరము ధర్మరాజు విజయమును బొందియును అనుభవించిన సంతాపము లోకమునకు జ్ఞానోపదేశమును జేయుచున్నది. ఆంగ్లేయులు విజయమును బొందినను సంగ్రామానంతర మనుభవించుచున్న దుఃఖవేదన జ్ఞానోపదేశమును జేయజాలకున్నది. బ్రిటీషుప్రజలకు జీవనాధారములైన స్వదేశ పరిశ్రమలును, విదేశవ్యాపారమును క్షీణించుచు ప్రజలకు మామూలు జీవయాత్ర దుర్లభమైనది. క్షీణించుచున్న పరిశ్రమలను, వ్యాపారమును, రాజ్యాధికారమును రక్షించుటకు స్వార్థత్యాగము సాధనముగాని పరపీడనము, స్వార్థపరత్వము సాధనములు గావు. బ్రిటీషు సామ్రాజ్యసంరక్షణమునకై ఫ్రాన్సుతో జేసిన సంధినియమములు ప్రయోజనకరములుగ నిపుడు గనుపించినను విషమస్థితియం దవి నిరర్థకములు గాగలవు. బ్రిటీషుసామ్రాజ్యమును రక్షించుటకు సామ్రాజ్యాంతర్భాగములందలి భక్తిశ్రద్ధలు యథార్థమైన సాధనములైనటులు పరరాజ్యముల సహాయము సాధనము గాదు. ఐరోపా మహాసంగ్రామమునందు సామ్రాజ్యాంతర్భాగములను రక్షించుటకు భారతబలముల సహాయము సాధనమైనటులు పరరాజ్యముల సహాయము సాధనము గాలేదు. ఫ్రాన్సు, బెల్జియము, తుర్కి మొదలగు రణరంగములందు భరతవర్షము చేసిన సహాయమును బ్రిటీషురాజనీతిజ్ఞులు వెంటనే విస్మరించుట సంతాపకరము. భరతవర్షమును శాశ్వతముగ బ్రిటీషురాజ్యపాశబద్ధము చేయుటకు బ్రిటీషురాజ్యతంత్రజ్ఞు లవలంబించుచున్న మాయోపాయములు భారతీయులను గాని, లోకమును గాని మోసగింపజాలవు. రాజ్యాంగ సంస్కరణముల వ్యాజమునను బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు ప్రదర్శించుచున్న కపటనాటకము నందలి గూఢార్థము లోకమున కంతకును తేటతెల్లముగ నున్నది.

* * *

సైమను సప్తకము

సైమనుకమిషను రెండవసారి భరతవర్షమునందు సంచారము చేయుచున్నది. సైమను కమిషనుకు భారతప్రభుత్వము త్రిశంకుకమిషనును జతచేసినది. గత సంచారమునందు సైమనుకమిషను విన్నపములతోను, స్వాగతములతోను సంతృప్తినిబొందినది. ఆసంచారము కేవలము ప్రచారము. ఆవిచారణయందలి సారాం

శరహస్యములకిపుడు బహిరంగముగ విచారణ జరుగుచున్నది. రహస్యవిచారణయందు భారతీయులపొత్తులేకపోయినను బహిరంగవిచారణ యందు భారతీయుల పొత్తు గల్పింపబడినది. ఇంగ్లాండునందుగలిగిన విశ్రాంతిసమయము నందు కమిషను సుకరమైనకార్యవిధానమును నిర్ణయించినది. ఆనిర్ణయముల కనురూపముగ భిన్నరాష్ట్రములందు భిన్నసమస్యలను విచారించుట కుపక్రమించినది.

బొంబయి మద్రాసు రాష్ట్రములందు నిమ్నజాతుల సమస్యను, కలకత్తాయందు యూరపియను సంఘసమస్యను, బెంగాలు పంజాబులందు హిందూమహమ్మదీయ సమస్యను విచారించుట కుపక్రమించినది. వంగరాష్ట్రమునందు ఆంగ్లోఇండియను ప్రాతినిధ్యసమస్యను, మద్రాసునందు బ్రాహ్మణ బ్రాహ్మణేతర ప్రాతినిధ్య సమస్యను విచారించుట కేర్పాటు చేయబడినది. ఈవిచారణయందు భారతీయకమిషనులు పాల్గొనుట కేర్పాటులున్నను నిర్ణయాధికారము సైమనుకమిషనుకు మాత్రమే కలదు. రాయలుకమిషను, భారతసామ్రాజ్య కమిషను, రాష్ట్రీయకమిషను చేరి విచారణ చేయుచున్నవి. ఈ విచారణయందు రాష్ట్రీయపరిస్థితులను, స్థానిక పరిస్థితులను, సాంఘిక పరిస్థితులనుబట్టి పరస్పరవిరుద్ధములైన భావములు వెలువడుట సహజము. ఈ యేర్పాటులును పరస్పరవిరుద్ధ భావములను వ్యక్తము చేయుటకే చేయబడినటులు కనుపడుచున్నవి. బొంబయి ప్రభుత్వము సమర్పించిన రిపోర్టును గోప్యముగ నుంచవలసిన యవసరము గనుపడదు. రహస్యపరిశోధనమునందే మహోపద్రవము గలదు గాని బహిరంగపరిశోధనమునందు లేదు.

బొంబయి ప్రభుత్వపక్షమున టర్నరుగారు చెప్పినసాక్ష్యము సంస్కరణముల విషయమై వ్యాపించిన వదంతిని బలపరచుచున్నది. రాష్ట్రీయస్వపరిపాలనమును బొంబయి ప్రభుత్వ మామోదించుచున్నది; లాను, ఆర్డరును కేంద్రాధికారవశము చేయుటకుగోరుచున్నది; రెండవ శాసనసభనుగాని, కార్యనిర్వాహకసభనుగాని నిర్ణయించుచున్నది. పంజాబునందును కేంద్రాధికారమునకు లాను, ఆర్డరును మార్చవలయునని పంజాబు ప్రభుత్వము విశదముచేయుచున్నది. నామరూపములు లేని రాష్ట్రీయస్వాతంత్ర్యము నొసంగుట కన్ని రాష్ట్రప్రభుత్వములును నేకగ్రీవముగ నంగీకరించునని జోస్యము చెప్పవచ్చును. అధికారములేని సంస్కరణములను పరికల్పించుటయందాంగ్ల రాజ్యతంత్రజ్ఞులు పరమప్రవీణులు. బాధ్యతాయుత పరిపాలనమున కాధారభూతములుగ స్థాపితములైన మోంటుఫర్డు సంస్కరణములు గలుగజేసిన బీభత్సము బ్రిటీషురాజ్య తంత్రజ్ఞుల ప్రజ్ఞను విశదముచేయుచున్నది. కుడిచేతితో నిచ్చినదానిని ఎడమచేతితో లాగుకొనుట బ్రిటీషు రాజ్యతంత్రజ్ఞుల రాజ్యనీతి యని సర్వత్ర చిరకాలానుభవము వలన తెలిసిన విషయము. రాజ్యాంగసంస్కరణవిధానమును రెండేండ్లకుపూర్వమే బ్రిటీషురాజ్యతంత్రజ్ఞు

లు నిర్ణయించియుందురు. ఆ నిర్ణయములనే ధూపదీప నైవేద్య హారతులతో సం. ౧౯౩౦ యందు ప్రకాశము చేయుట రాజ్యతంత్ర ప్రయోజనమై యుండును. ఈ కపటనాటక ప్రదర్శనము కాలహరణమునకు గారణంబగు చున్నటులు భారతీయప్రయోజనములను సమకూర్పజాలదు. నిర్ణయించిన విధానమున కీ కపటనాటకప్రదర్శన మేల కావలయునో దురూహముగ నున్నది. సర్ జాన్ సైమను సానుభూతిని, సుదాశయములను తెలిపినను కార్యవిధానము మాత్రము మారునని నమ్ముట కవకాశములు లేవు. ఇంగ్లాండును సందర్శించిన భారతీయులును నీ యభిప్రాయమునే విశదము చేయుచున్నారు.

ఇంగ్లాండునుండి వచ్చిన శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు, చిమ్మనులాలుగారు మొదలగువా రందరును బ్రిటీషుప్రజలకు భారతీయుల పట్లనుగల నిరాదరణనిరసనభావములను విశదముచేయుచున్నారు. బ్రిటీషువారు లే పక్షమువారైనను భారతీయుల స్వరాజ్యాశయములకు ప్రతిఘటనమును బూనుచున్న విధమును పత్రికాభిప్రాయములు, ప్రజాభిప్రాయములు విశదముచేయుచున్నవి. ఆ యభిప్రాయములనే సమర్థించుటకు సైమనుకమిషనువిచారణ జరుగుచున్నది. తెల్లకమిషనువిచారణయును, తెల్లపత్రికల ప్రచారమును సమానఫలమునుగలుగ జేయ సమకట్టినవి. వీరి సంకల్పము బ్రిటీషు రాజ్యాధిపత్యమును సమర్థించుటయును, స్థిరతరము చేయుటయును గాని, భారతీయ స్వాతంత్ర్యమునకు గాని, బాధ్యతాయుత పరిపాలనమునకు గాని సోపానమును నిర్మించుట గాదని నిత్యానుభవము విశదము చేయుచున్నది. బొంబాయియందును, పునహా యందును, లాహోరునందును భారతీయు లవలంబించిన బహిష్కరణవిధానము భారతీయాత్మగౌరవమున కనురూపముగ నున్నది. లాహోరునందు రాజభటులు లాలా లాజపతి రాయిగారికిని, నితరనాయకులకును జూపిన దౌర్జన్యము బ్రిటీషుప్రభుత్వలక్షణమును విశదముచేయుచున్నది. ఇట్టి దురంతకార్యములన్నియును గాంధిమహాత్ముడు చెప్పినటులు బ్రిటిషుసామ్రాజ్యవిలయమునకు సాధనంబులగుచున్నవి. లాలా లాజపతిరాయిగారును, వారి సహచరులును చూపిన నిగ్రహము వారి త్యాగమున కనురూపముగ నున్నది. ఇట్టి నిగ్రహత్యాగములే స్వరాజ్యమునకు సత్యమైన మార్గములు.

బ్రిటీషు ప్రజాభిప్రాయ మంతయును నొకమార్గముననే నడుచుచు సహజమైన భారతీయాశయములను ప్రతిఘటించుచున్నపుడు భారతీయులు భిన్నమార్గములను నడుచుచు స్వీయస్వత్వములను గోల్పోవుట దేశావృతమైన దురదృష్టముగ నున్నది. భారతీయుల స్వరాజ్యాకాంక్ష పరమావసరమైనను దానికి తెన్ను లేకున్నది. "ఎవరికి వారే యమునా తీర" యనుసటు లున్నది. నాయకులు

స్వీయప్రాజాపత్యమును గోరుచున్నారు. సంఘములు ప్రత్యేకలాభములను గోరుచున్నవి. నిమ్నజాతులు, మహమ్మదీయులు, హిందువులు, యూరపియనులు, ఆంగ్లోఇండియనులు ప్రత్యేక సాంఘికలాభములను గోరునటులు దేశక్షేమమును గోరుటలేదు. షాఫిగారివంటి విద్యావంతులు ప్రత్యేకప్రాతినిధ్యమును,నియోజకవర్గమును సమర్థించునపుడు దేశము నావరించిన దౌర్భాగ్యమును వర్ణింపవలసిన యవసరము గనుపడదు. నానకచందుగారు సాంఘిక నియోజకవర్గము బొత్తుగా పనికిరాదనియును సాంఘికనియోజకవర్గ మవసరమైనపుడు సంస్కరణములు పనికిరావనియును నొక్కిచెప్పిరి. రాజాగారును నిమ్నజాతులపట్లను జూపెడిశ్రద్ధను దేశముపట్లను జూపుటలేదు. దేశము బాగున్న వ్యక్తులు, సంఘములు బాగుపడుట కవకాశములు గలుగగలవు. దేశచైతన్యము క్షీణించుచున్నపుడు వ్యక్తివికాసము, సంఘవికాసము దుర్లభము.

సాంఘికప్రాతినిధ్యము గలుగజేయుచున్న యనర్థపరంపరలను బాంబయి ప్రభుత్వము వ్యక్తముచేసినది. సామాన్యముగను ప్రజాభిప్రాయమును, దేశాభిప్రాయమును దీని కనుగుణముగనె యున్నవి. సామాన్య నియోజకవర్గమును, సామాన్యమైన నియోజకాధికారమును తాత్కాలికముగను ప్రత్యేక సంఘలాభములకు నష్టదాయకముగను గనుపడినను, సకలదేశప్రయోజనములను సమకూర్చుటకు దోడ్పడగలవు. ప్రజాస్వామ్యమున కవసరమైన నియోజకవర్గము, ప్రాతినిధ్యము సామాన్యనియోజకవర్గము వలననే ఏర్పడగలవు. ఈ సందర్భములందు మౌలానా షౌకతాలిగారు ప్రయోగించుచున్న జయభేరి పరమవిషాదమును గలిగించుచున్నది. మతావేశము ప్రపంచమునకు గలుగజేసిన దుఃఖము వర్ణనాతీతము. మతమునకును, రాజ్యాంగములకును ముడిపెట్టుట యసంగతము. ఈ రెంటి సంబంధమును విడిపోవుట శ్రేయస్కరము. సంగ్రామమో, సంధియో కావలయునని షౌకతాలిగారు ప్రగల్భములు గొట్టిరి. మహమ్మదీయ పరాక్రమము విషయమై వారు నొక్కిచెప్ప నవసరము లేదు. ప్రపంచపరిస్థితులే విశదము చేయుచున్నవి. బానిసలైన హిందువుల మూలముననే ప్రపంచశాంతి గలుగవలసియున్నదని షౌకతాలిగారును, వారి యనుచరులును గ్రహించుట విశేషము. సాంఘిక విభేదములవలెను నాయకుల విభేదములును పరమాసహ్యముగ నున్నవి. ఈ విభేదములు భారతీయుల దౌర్బల్యమును, ప్రతిపక్షుల బలమును విశదము చేయుచున్నవి.

* * *

### అఖిలభారత కాంగ్రెసుసంఘము

సకలపక్షసమావేశమునందువలెను అఖిలభారత కాంగ్రెసుసంఘమునందును నెహ్రూ నివేదిక ఏకగ్రీవముగ నంగీకరింపబడుట శుభచిహ్నము. కాని సకలపక్షసమావేశలక్ష్యము డొమినియను ప్రభుత్వముమీదను, కాంగ్రెసు సంఘలక్ష్యము సంపూర్ణ స్వాతంత్ర్యము మీా

దను లగ్నమైనవిధమును వ్యవహారవిధానము విశదము చేయుచున్నది. సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమున కభ్యంతరములను గల్పించెడివా రుండజాలరు. ఆదర్శమున కభ్యంతరములు లేకపోయినను కార్యవిధానమునందు భేదాభిప్రాయములు గలుగుచున్నవి. సంస్థానాధీశులు, జమీందారులు, మహమ్మదీయులు, మితవాదులు, హోమురూలరులు, బ్రాహ్మణేతర పక్షమువారు దీని కభ్యంతరములను గల్పించుట సహజము. అఖిలపక్షసమావేశము చేసిన తీర్మానమునకు కాంగ్రెసుసంఘము చేసిన తీర్మానము ప్రతికూలము గాకపోయినను వివిధపక్షములవారును గలిసి పనిచేయుట కభ్యంతరము లేర్పడుచున్నవి. కాంగ్రెసు ప్రచారము కేవలము సభలకు మాత్రమె సంబంధించియున్నది. గ్రామసీమలందును, పట్టణములందును కాంగ్రెసుసంఘములు పేరునకైనను గనుపడవు. పేరునకైనను నిలిచియున్నచోట్లను తగవులాటలు మాత్రము గనుపడుచున్నవి. ఇట్టి సందర్భములలో దేశమంతయును కార్యరూపమున కాకపోయినను భావరూపముననైనను రాజ్యాంగముల విషయమై ఏకాభిప్రాయమును వ్యక్తముచేయుట ప్రయోజనకరమై యుండును. భేదాభిప్రాయములు కార్యానుకూల్యమునకు ప్రతికూలములు. కాంగ్రెసునందు స్వాతంత్ర్యపక్షము రాయలుకమిషను రాజ్యాంగసంస్కరణముల తరువాతను సహజముగ నేర్పడగలదు. ఈలోపుగను దేశమంతయును నేకమార్గమున నడుచుటవలనను లోకమున కసందిగ్ధముగను భారతప్రజాభిప్రాయము వ్యక్తమైయుండును. రాయలుకమిషను నాటక మింకను నైదుమాసములు ప్రదర్శింపబడనున్నది. ఈకాలము వ్యర్థమైన వాదప్రతివాదములతోను కాలహరణము చేయుటవలనను బ్రిటీషురాజ్యతంత్రజ్ఞుల సంకల్పము సఫలమగుట నిశ్చయము. ప్రజానాయకులు కార్యపరతంత్రులై భారతీయ సంకల్పమును సఫలము చేయుటకు దీక్షను బూనవలసియుందురు. కార్యదీక్ష లేని సంకల్పము పెద్దదైనను, చిన్నదైనను, సఫలము గాజాలదు.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.

# విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—'నలరాజు'; గోడీరాగిణి.

సాధారణ చిత్రములు:— క్షత్రపరాజులు ౩; దివాన్-ఇ-ఖాస్; పల్లవశాసనము-నంగిమేశ్వరము ౨; 'బాణశాసనము-నన్నమూరు; విషూచిదేవతకొలువు; గోవర్ధనప్రభువు, సి. వి. రామనుగారు, తాడిపత్రి రాఘవాచార్యులుగారు; డి. బలరామకృష్ణయ్యచౌదరిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు; మహానంది క్షేత్ర చిత్రములు ౪; కీ. శే. లాలా లజపతిరాయిగారు; ఆంధ్రమహాసభల నాయకులు ౫; ఇతర చిత్రములును.





'నటరాజు'

చిత్రకారిణి : శ్రీ. పుష్ప. రాంబ. శారదానికేతనము, గుంటూరు




చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౨౮

సంపుటము ౫ విభవ సంవత్సరము మార్గశీర్షమాసము సంఖ్య ౧౨

## బాలచంద్రుఁడు

కె. అన్నమరాజశర్మ గారు

అమ్మ! శౌర్యాంకురముల రణాంగణమున- స్వీయశోణిత పూరంబుఁ జిలుకరించి
నాఁటు వోయంగ వీరులు, బీర ముడిగి- నిలువఁజాలను నే నిందు నిలువఁజాల.

బాలుఁడు సంగరస్థలిని బాల్గొన రాదని పల్క నేల ? యు
ద్వేల చమూసమూహములఁ బీనుఁగు పెంటలుఁ చేయువాఁడ త
ల్లీ! లవమేనిఁ జింతిలకు లీలమెయిన్ నలగాము శీర్షముం
గూలిచి వేగఁ దెచ్చెద నకుంఠితదర్పము తీవరించెడిన్.

దాయలు వహ్వారే! యనఁ బ్రతాపము రూపముఁ దాల్చునోజ శా
తాయుధముం ధరించి సమరాపని నిల్వఁగ నాగమాంబ నే
సీ! యవమాన రోషము సహింతునొకో; మగపుట్టు వేల, వీ
ర్యాయత హేతులం బర జనాటవి నుగ్గతఁ గాల్పకుండినన్.

కారెమపూఁడి చండగతిఁ గత్తులు కత్తులు దాఁకులాడఁగాఁ
పౌరుషముం ద్యజించి యిట పందవలెఁ వసియింపఁ బాడియే ?
నారణకౌశలంపుఁ దరుణం బిది కావున వీరమాత నాఁ
బేరు వహింపు మమ్మ పృథివిం బలనాటియశంబు నిండఁగన్.

అనికిం బోవక తప్ప దో జనని! శౌర్యాలంబు లౌ నాయనల్
కన విక్రాంతిని వైరిరక్తమునఁ బ్రక్షాళింతు మత్ఖడ్గముఁ ;
ఘనసైన్యంబుల సింహనాదము మనః కర్ణంబుఁ బూరించు రీ
తిని మార్మ్రోఁగెడు పోవ నిమ్ము కరుణార్ద్రీభూతచిత్తంబునన్.

కనులఁ బ్రణయాంకితాశ్రులు గడలుకొనఁగ-మమతఁ జూపంగ మాత! సమయము గాదు;
బవరమున భద్ర మొదవ దీవన లొసంగి-పంపు మభిమన్యుని సుభద్ర పంపినటుల.

వృత్రాసురుని సంహరింప విజృంభించి వజ్రి నిల్చిననాఁటి భయదరేఖ
కార్తవీర్యార్జును కరపంక్తి జమదగ్ని పట్టి చెండిననాఁటి భవ్యశక్తి
కౌసలేయుఁడు దశకంఠమస్తకపరంపరఁ గూల్చిననాఁటి పౌరుషంబు
క్షాత్రతేజోభూతి సైంధవు గాండీవి చంపిననాఁటి ప్రచండదీక్ష
ఆవహించును గాత నేఁ డస్మదీయ-వితతశౌర్యాగ్ని తప్తహృద్వీథియందు
వేఁడినెత్తుఱుకరడులు నాడులందు-రేఁగె నావేశమున జయశ్రీ వరింప.

పరవిక్రాంత నిషూదనక్రియను శర్వాణీకుమారుండు ని
ర్భరరౌద్రాకృతిఁ దాల్చి తారకుని గర్వంబుఁ విదారించిన
ట్లరరే! యంచు జగంబు లెల్ల శుభగీతాళుల్ పఠింపఁ దివిష
చ్ఛిరముల్ దున్మి సుమంబులట్లుగ యశఃశ్రీకన్య కర్పించెదన్.

ఆంధ్రశౌర్యేందిరాదేవి యాటలాడ-నాట్యశాలగ మాఱె పల్నాటిసీమ
శాత్రవానీకహననయజ్ఞంబునందు-పాలుఁ గొన కున్న జీవచ్ఛవంబ నగుదు.

మరణం బన్న భయంబు లేదు కదనక్ష్మాసంహృతిఁ వీరశే
ఖరు లీకాశ్యపి గర్భమందున యశః కాయంబులఁ నేఁటి కెం

దలు జీవింపరు! శత్రు మూనుటయె కర్తవ్యంబు తర్కింప న
శ్వరమగా భౌతికలోకనాటకము స్వప్నంబట్ల చూపట్టెడిన్.

కాయము బుద్బుదంబు, రిపుఖండనమే హృదయంపులక్ష్య మ
మ్మా! యిక పోయి వచ్చెద, నమస్కృతులం గయికొమ్మ; ద్వేషణా
జేయపరాక్రమస్ఫురిత జీవితకావ్యమునందు నూతనా
ధ్యాయము వ్రాసెదన్ రుధిరధార నిశాతకృపాణలేఖినిన్.

జన్మభూరక్షణార్థంబు జన్యకేళి-సహజశూరతఁ బ్రకటించి సమయువాని
దేవదూతలు ప్రీతి నాతిథ్య మిచ్చి-గౌరవింతురు సమ్మదాక్రాంతు లగుచు.

---

## ఏ మనుభవింతువు?

శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

అమృతమెల్ల హరించి యా సోమనాథుండు వట్టిభాండమె దిగఁబెట్టినాఁడు,
వలపులెల్ల హరించి వాయుగంధర్వుండు వట్టివృంతమె దిగఁబెట్టినాఁడు,
మహిమయెల్ల హరించి మదనాగ్నిరూపుండు వట్టికోనయె దిగఁబెట్టినాఁడు,
కళలనెల్ల హరించి కాలభైరవమూర్తి వట్టిగూటినె దిగఁబెట్టినాఁడు,
భావభవుఁ డెందొ తన పంచబాణములను-కట్టగాఁ గట్టుకొని పాతిపెట్టినాఁడు,
హాలికా! హాలికా! వట్టియాన గాక-ఏ మనుభవింతు వీ రుద్రభూమిలోన?—

---

# మహాభారతమందలి విరటుని బృహన్నలాపరీక్షణము

కోరాడ రామకృష్ణయ్య గారు, ఎం. ఏ.

సంస్కృత మూలమునకు తిక్కన తెలుగు రచన కొంచెము భేదించిన సందర్భములలో నిది యొకటిగా గ్రహింపదగినది. మూల మెట్లున్నను మొత్తముమీద తిక్కన యీ సందర్భమున నతినైపుణ్యమును జూపి మూలమునకు మెఱుగు వెట్టినాడనుటకు సందేహము లేదు. అయితే మూలపాఠము లనేకరీతుల నుండుటచే తిక్కన దేని ననుసరించియుండు ననునదే పెద్ద సమస్యగా నున్నది. భండార్కర్ ఇన్‌స్టిట్యూటువా రనేకములగు దక్షిణోత్తర దేశముల వ్రాతప్రతులను సరిచూచి, యతి ప్రాచీన మూలపాఠమిదియని నిర్ణయముచేసి ప్రకటించిన పాఠ మొకటి కలదు. దీనికి కొంచెము భిన్నములగు దక్షిణదేశపు ప్రతులలోని పాఠములు, ఉత్తరదేశపు ప్రతులలోనిపాఠములు మఱికొన్ని గలవు. అతిప్రాచీన పాఠ మైయుండునని భండార్కర్ ఇన్‌స్టిట్యూటువారిచ్చిన పాఠములో నీసందర్భమున విరటుడు స్త్రీలచేగాని, పురుషులచేగాని, పరీక్ష చేయించి తెలుసుకొన్నట్లుగా లేదు. తిక్కనలో వలెనే చక్కగా దాటివేయబడి యున్నది—

"బృహన్నలాం తా మభివీక్ష్య మత్స్యరాట్
కలాసు నృత్యేనచ గీతవాదనే,
అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరం
తతఃకుమారీపుర ముత్ససర్జ తం।
స శిక్షయామాస చ గీతవాదనం..."

ఉత్తరదేశపు నాగరీప్రతులలో రెండింటిలో మాత్రమే పైశ్లోకమున రెండవ పాదము తరువాత

"సంమంత్ర్య రాజా వివిధైః స్వ మంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై"

అను రెండుపాదము లున్నట్లు తెలుపఁబడినది.

కాని దక్షిణదేశపు ప్రతులు పెక్కింటిలో పైశ్లోకమంతయు గనబడనే కనబడదు. విరటుఁడు

"దదామి తే హన్త వరం బృహన్నలే
సుతాంచ మే నర్తయయాశ్చ తాదృశీః,
ఇదంతు తే కర్మ సమం న మే మతం
సముద్రనేమిం పృథివీం త్వ మర్హసి."

అని చెప్పిన తరువాత నిట్టి యాకృతిగల యీతని వృత్తము మాటలనుండి భేదింపదని తలంచినట్లుగా గనబడుచున్నది గాని పరీక్షకు గడంగినట్లు లేదు.

"తతో విరాటః స్వయ మాహ్వాయ త్సుతాం
నరాధిప స్తాంచ సుమధ్యసున్దరీం,
ఉవాచ చైనాం ముదితేన చేతసా
బృహన్నలానామ సఖీ భవ త్వియం.
సుగాత్రి సంప్రీతి సుబద్ధ సౌహృదా
తవాంగనే ప్రాణసమాచ నిత్యదా,
ప్రకామ భక్ష్యాభరణావరా శుభా
చర త్వియం సర్వజనే ష్వవారితా.

న దుష్కులానా మియ మాకృతి ర్భవేత్
న వృత్త భేదీ భవ తీదృశో జనః,
తథా సమాదిశ్య సుతాం నరాధిపః
ప్రవేశ్యతాం సాధుగృహం తథైవచ.
స శిక్షయామాస చ గీతవాదనం..."

చెన్నపట్టణము ప్రాచ్య లిఖిత పుస్తకాలయమందలి బ్రౌన్ దొరగారిచే సంపాదింపబడిన తెలుగుప్రతియందుకూడ నిట్లే యున్నది. కాని దక్షిణ దేశపుప్రతులలో త్రివేంద్రం నుండి సంపాదింపబడిన తిరువాన్కూరు రాజావారి లైబ్రరీలోని మళయాళపు టక్షరముల వ్రాతప్రతిలో మాత్రము, పైశ్లోకములలో చివర మూడుపాదములకు బదులుగా నిట్లున్నది :

"ఇ తీద ముక్త్వా పురుషై ర్యథాశ్రమం
పరీక్ష్య రాజ న్నపుమదాభి రాగతం,
సుతాంచ తాం నర్తయితుం శశాస నై
బృహన్నలాం క్లీబ మవేత్య వేశ్మని."

ఇట్లిన్నిప్రతులలోను నిన్నివిధములుగా గనబడుటను బట్టి తిక్కన యే పాఠమునుబట్టి రచించెనో చెప్పుట దుర్ఘట మగుచున్నది. ఏపాఠము ననుసరించినను తిక్కన తన యసాధారణ నైపుణ్యంబును జూపి. యౌచిత్యమును బాటించినా డనుటలో. సందేహము లేదు.

మఱియొక విషయము మాత్ర మిచ్చట గమనింప దగి యున్నది. పురుషుల మూలముగనో, స్త్రీల మూలముగనో, పరీక్షచేసి యాతని యపుంస్త్వమును స్థిరమైనదిగా దెలిసికొన్నాడని చెప్పు నీ పరీక్షావిషయము నుత్తరదేశములందలి రెండు ప్రతులలో మాత్రమే కానవచ్చుచున్నది. దక్షిణ దేశపు ప్రతులు పెక్కింటిలో నీ పరీక్షా విషయమే కనబడుట లేదు. కాని దీనికి బదులుగా—

"న దుష్కులీనాం త్వియ మాకృతి ర్భవేత్
న వృత్తభేదీ భవ తీదృశో జనః"

అని యుండుటచే నాతనియాకార విశేషమును బట్టియే "యత్రాకృతి స్తత్రగుణాః" అని విరటు డాతని నపుంసకత్వమును నిశ్చయించినట్లు సూచిత మగుచున్నది. దీనికే తిక్కన రచించిన"నైపుణ్యంబున నుచితంబుమైనరసి పాఁప్పము లేమిఁ దదీయ సేవ గైకొనుటకు నిశ్చయించి" యనువాక్యము వ్యాఖ్యాన మందమా? విరటుని నైపుణ్యంబును, నుచితజ్ఞతయు బృహన్నల యాకారమునుబట్టియె "పాఁప్పము లేకుండుట"ను నిశ్చయించుటలో నున్నదని గ్రహింపవలసియున్నది. తక్కిన పాండవులయొక్కయు నాకార విశేషములనే యీతడు విశేషముగా బ్రశంసించుచు దనరాజ్యమునే గ్రహింపవలసీనదని పలుమారు వేడుచుండుటవలన వేఱుగా పరీక్ష లేకయే యాతనియాకారమునుబట్టి, మాటలను నమ్మి, నపుంసకునిగా నిశ్చయించి యుండుననుటయు పొసగును. దీనికి దగినట్లుగా నీ దక్షిణదేశప్రతులలో మాత్రమే విరటుడు తనకుమార్తెను సభలోనికి బిలిపించి బృహన్నల కొప్పచెప్పిన ట్లున్నది. ఉత్తరదేశ ప్రతులలో నీ ప్రశంసయే లేదు. తిక్కన తెలుగు రచనలో కేవలము కూతును రప్పించుటయేగాక దక్షిణ ప్రతులలో కూడ లేని యామె రాకను గూర్చిన

విశేషవర్ణనను జేర్చి, "కర్పూర సహితంబగు తాంబూలంబు వెట్టుట, చిత్రంబులగు చీనాంబరంబులు, మణిమయంబులగు నాభరణంబులు నిచ్చుట", ఆచార్యునకును గూతునకును దగు మాట"లుచితంబుగా బలికి యంగన హస్తము బట్టి తత్కారంబున గదియించుట" ఈ మొదలగు స్వదేశీయాచారములను సందర్భానుకూలముగా పెంచి వర్ణించినాడన్నను, మొత్తముమీద నాతడు దక్షిణదేశ ప్రతులనే యనుసరించినాడని చెప్పవలసివచ్చుచున్నది. కాని కొన్ని యల్పసంఖ్యాకములగు దక్షిణదేశప్రతులలోగూడ "పరీత్య చైనం ప్రమదాభి రాగతం" అనుపాద మొకటి రెం డుత్తరదేశప్రతులలో వలెనే కనబడుచుండుటచే నొకవేళ తిక్కన యీమూలమునే చూచి యిందలియశ్లీలమును వారింపనెంచియే గడుసుదనముతో దాని నిటు దాటివేసియుండునా యను సందేహమును గలుగకమానదు. అట్లేమైనచో తిక్కనకాలమున నాతనికి దొరకిన సంస్కృత మూలగ్రంథములో నీ పరీక్షను గూర్చిన పద్యపాదము లుండియే యున్నవనియు, వానిని జూచియే తిక్కన యుచితజ్ఞత నిట్లుచూపెననియు, నింతేగాక యా సందర్భమునకు దగినట్లుగా తన సహజ ధోరణిని స్వీయదేశీయాచారములను గొంత వర్ణించియుండె ననియు—ఈ విరాటపర్వమున ననేక ప్రదేశముల నిట్టి వర్ణనల నీతడు చేసియే యున్నాడు—ఇందలి యౌచిత్యమును గ్రహించిన పండితవరులు కొందరు తిక్కన తరువాత కొంతకాలమున కీదక్షిణదేశపు మూలగ్రంథ ప్రతులలో నీ పరీక్షావిషయకమగు పద్యపాదములను దీసివేసి తిక్కనరచన ననుసరించిన క్రొత్తశ్లోకములను రచించి చేర్చియుందురేమో యని సందేహించుట కవకాశము కూడ కనబడుచున్నది. కావుననే "తతో విరాటః స్వయ మాహ్వాయ తుస్సతాం" అని విరటుడు కూతును బిలిపించి యొప్పగించె ననువిషయము కూడ ఉత్తరదేశపు ప్రతులలో లేనిది దక్షిణదేశపు ప్రతులలోను, అందు ముఖ్యముగా తెలుగు ప్రతులలోను నుండుట తటస్థించియుండును. ఉత్తరదేశ ప్రతులలోకంటె నీ దక్షిణదేశమందలి వానిలో నిట్టి ప్రక్షిప్త భాగములు విశేషముగా జేరియుండుట భండార్కర్ పరిశోధనాలయమందు జరుగుచున్న పరిశోధనలనుబట్టి స్పష్టమగుచునే యున్నది. దక్షిణదేశప్రతులలో జేరిన ప్రక్షిప్తభాగములలో గొన్నిటికైనను కావ్యకళాదృష్టితో జేయబడిన తిక్కనార్యుని తెలుగురచన మూలమై యుండునా యను విషయ మింకను పరిశీల నార్హంబై యున్నది.

# విభవాబ్ద వృష్టి

వడ్డాది సుబ్బారాయఁడు గారు

విభవను మృగశిరబిందువు-లభవు జటాజూట బిందులట్టివి యయ్యెన్
నభము పెనుఁజిల్లి వడిన-ట్లిభతుండనిభోరుధార వృష్టి ఘటిల్లెన్.

అధికశ్రావణ శుద్ధషష్ఠి విభవాఖ్యాబ్దంబునన్ రేవగల్
విధువారంబున సూర్యుఁ జంద్రు భములన్ వీక్షింప రాకుండఁగా
నిధినిక్షేపము లాదిగా బయలుగా నిశ్శబ్దనీలాభ్రముల్
బుధులట్టుల్ దనివాఱ దాన మొసఁగెన్ భూచాతకాచాంతికిన్.

శ్రావణము జ్యేష్ఠ మయ్యెఁ గ-దా విభవను; జదలనుండి ధారాసంపా
తావిర్భూతికి మాఱుగ-రేవగలుం జెమ్మటలు గురిసెఁ గడు నొడలన్.

మూల దప్పించి పండువుమూఁడునాళ్లు-పుష్పవంతులు మఱువడ భూరిధార.
షష్టిగడియలు విభవను వృష్టి యడరె-నేళ్లు గోళ్లును మిన్నుమన్నేకముగను.

పెనిమిటులు గానరామిని-దినలక్ష్మి విభావరీసతియు రోదనముం
బూనరిం త్రనఁదగె బోరను-ధ్వని విభవను మూలపూజపండుగ వానల్.

న్యగ్రోధమై సర్వదిగ్రోధకం బయ్యె నధికధారావరోహముల మొగులు
హరుఫాలనేత్రంబ యిరులు మాపుట కయ్యెఁ గడమకన్నులు రెండు గప్పవడుట
జలజలఁ బ్రవహించుసెలలకుఁ దల్లులై శ్రవణముల్ జల్లులు చెవుడుపఱిచె
దుర్గాహతాస్రపస్తోమాసృగాపగాస్మారకం బయ్యె వాఃపూర మవని
విజయదశమిముందు విభవహాయనమందు-నెసరుమూఁడునాళ్ల ముసురువల్ల
వఱదఁ గలసె రైళ్లు; వంతెన లడుగంటెఁ;-దూర్పుదేశమునకుఁ దొడరె నెడరు.

ప్రభవం గార్తికమందు సింహపురిఁ దత్ప్రాంతంబులన్ ఝంఝచేఁ
బ్రభవించెం బ్రజ కాపదల్ గృహధనప్రాణ్యాదినాశంబునన్

౨౬3

విభవాబ్దాశ్వయుజాద్యపక్షమున నుద్వేలాతివృష్టిఁ దుని
ప్రభృతిగ్రామములఁ జలప్రళయ మాపాదిల్లె నీప్రాగ్దిశన్.

బాటలు తెగియెఁ జామల-కోట మొదల్ తూరుపూళ్ళకుం బోవను చే
రాటంకము పొగబండ్లకుఁ-బాటిలె నాశ్వయుజమున విభవ నతివృష్టిన్.

సాగఁ రైలులు బాటఁ జూడఁ జనఁ దచ్ఛాఖాధికారుల్ దొరల్
మూగుర్ వంతెన గూలి యిర్వు రసువుల్ గోల్పోయి రం దొక్క-చో
వేగం బాతెడువాఁగునఁ మునిఁగి; యీవిడ్డూరపుంజల్లులఁ
బ్రాగాశఁ విభవఁ ఘటిల్లె లయ మాప త్తూళ్ళకుం బ్రోళ్ళకున్.

వ్యోమాపగ దిగినట్టులు-గా మృగశిర విభవఁ గురిసె; గాని దది; సుధీ
గ్రామణు "లల్పారంభః-క్షేమకర" యటంట లాఁతి సెర గనుటు గదా?

దాదియె పెంచి బిడ్డలకుఁ ద్రావ విషం బిడినట్టు లయ్యెనే,
మేదినిఁ బండుపైరులకు మెట్టల నీవిభవాతివృష్టి; యి
ట్లేదియొ యేఁటనేఁటఁ గఱ వెచ్చుట, కాఁకలిచిచ్చువేదనన్
బేదలు బాధ నొందుటకు, విడ్వర ముద్భవ మయ్యెడుం గటా!

దరికొని యెండకారునను దగ్ధము లయ్యెను వహ్ని గ్రామముల్;
ముణిగెఁ బొలంబు, లిండ్లు పడిపోయె, జలప్లుతి వానకారునన్;
నరు లీఁక సీతుకారునఁ గనం గలభాగ్యము లెట్టు లుండునో?
వరదుఁ డజుండు, శేషవిభవన్ శుభదాయిగఁ జేయుఁ గావుతన్,

---

# శబ్దశక్తివివరణము

కేతవరపు వేంకటశాస్త్రి గారు

నాయీక్రింది వ్యాసము శబ్దశక్తివివరణము. శబ్దములందుండు శక్తులను విశదీకరించుట యని దాని యర్థము. శబ్దములును దదర్థములును గావ్యలక్ష్మికి శరీరమని చెప్పఁబడినది.

క. తనువగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనర గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్.

—అని నరసభూపాలీయము.

అనఁగా గావ్యలక్ష్మికి శరీరము శబ్దార్థములు. ధ్వని జీవము. ఉపమానాద్యలంకారములే యలంకారములు. ప్రసాదమాధుర్యాదిగుణములే గుణములు. కైశికి మొదలగు వృత్తులే యామె ప్రవర్తనములని పైపద్యమునకర్థము. కావ్యశ్రీకి శరీరభూతమగు శబ్దస్వరూపమునందుండు శక్తులను వివరించెదను.

శబ్దమే బ్రహ్మమని వైయాకరణసిద్ధాంతము. పరబ్రహ్మమునం దనేకశక్తులు గలవు. అతనియందున్న శక్తులవలననే చరాచరప్రపంచ మేర్పడుచున్నది. అట్లే శబ్దమునందుఁగూడ ననేకశక్తులు గలవు. ఆశక్తులవలననే భాషాప్రపంచమందు నానావిధవ్యవహారములు కలుగుచున్నవి. బ్రహ్మమునందుండు శక్తులు సర్వజ్ఞత్వము, సర్వనియామకత్వము మొదలగునవి. శబ్దమునందుండు శక్తులు అభిధ లక్షణ మొదలగునవి. అవిద్యాసంబంధముచే బ్రహ్మము సత్వరజస్తమోగుణప్రధానులగు త్రిమూర్తు లేర్పడినటు లీశబ్దస్వరూపముగూడ నభిధాది సంబంధముచే వాచకములనియు లక్షకములనియు వ్యంజకములనియు ముత్తెఱంగు లగుచున్నది. ఈమూఁడు విధములగు శబ్దములందును మూఁడుశక్తులు గలవు. అవి యభిధయనియు లక్షణయనియు వ్యంజనయనియుఁ జెప్పబడును.

"వాచ్యోఽర్థోఽభిధయా బోధ్యో లక్ష్యో
లక్షణయా యుతః
వ్యంగ్యో వ్యంజనయా తాస్స్యు స్తిస్ర
శ్శబ్దస్య శక్తయః

—సాహిత్యదర్పణము.

అం దభిధాశక్తి వాచ్యార్థమును బోధించును. లక్షణాశక్తి లక్ష్యార్థమును బోధించును. వ్యంజనాశక్తి వ్యంగ్యార్థమును బోధించును.

అభిధయనఁగా

"తత్ర సంకేతితార్థస్యబోధనా దగ్రిమాభిధా"

అనగా నీశ్వరసంకేతమగు శబ్ద ముచ్చరింపఁబడఁగా ముందుగా నీశ్వరసంకేతితార్థమును జెప్పునది యభిధయని దాని యర్థము. ఉదా: రామ" యనుశబ్ద మొకవ్యక్తికి సంజ్ఞ. ఆ రామపద ముచ్చరితము కాఁగానే నిస్సందేహముగా దాని యర్థమును గ్రహింపఁగలుగుదుము. అట్లు గ్రహింపఁజేయునది వాచ్యవాచకతాసంబంధము. అందు శబ్ద మావ్యక్తిని జెప్పుచున్నది. ఆవ్యక్తి యాశబ్దముచేఁ జెప్పఁదగియున్నది. కావున శబ్దమునందు వాచకత్వమును వ్యక్తియందు వాచ్యత్వమును గలవు. ఈరెండునుగలిసియే వాచ్యవాచకతాసంబంధమైనది. ఇందలి వాచకతాసంబంధమే యభిధ యనఁబడుచున్నది.

"సంకేతో గృహ్యతే జాతౌ గుణద్రవ్యక్రియాసుచ"

అనుటచే నీశ్వరసంకేతము జాతిగుణద్రవ్యక్రియలనుబట్టి నాల్గువిధము లగుచున్నది. సంకేతమనఁగా సంజ్ఞ. అది చిరంతనమనియు నాధునికమనియు రెండువిధము లగుచున్నది. హరిహరాదిసంజ్ఞలు చిరంతనములు. దేవదత్తడిత్థాదు లాధునికసంజ్ఞలు. ఇందువలన జాతివాచకములగు గవాదిశబ్దములును, గుణవాచకములగు శుక్లనీలాదిశబ్దములును, ద్రవ్యవాచకములగు హరిహరాదిశబ్దములును

క్రియావాచకములగు పాచకపాఠకాదిశబ్దములును సంజ్ఞావాచకములని తెలియవచ్చుచున్నది. ఇట్లు సంజ్ఞావాచకములందుండు నభిధాశక్తి మరల యౌగికమనియు, రూఢమనియు, యోగరూఢమనియు మూఁడువిధములగుచున్నది. ప్రకృతి ప్రత్యయసముదాయమందుండు శక్తి యౌగికి యనఁబడుచున్నది. ఇందుల కుదాహరణము పాచకపాఠకాది శబ్దములు. ఇట "పాచక" అను శబ్దము పచ్ ధాతువునకు ణ్వులన్తరూపము. "పచ్ + అక" అని యుండఁగాఁ బూర్వమునకు వృద్ధి వచ్చి పాచకశబ్ద మేర్పడినది. "పాచక" అనఁగాఁ బచించువాఁడు (వండువాఁడు) అని యర్థము. ఇట నభిధ కేవల మవయవములగు ప్రకృతి ప్రత్యయములందుండి యౌగిక మనబడుచున్నది. రూఢములకుఁ గేవలము సముదాయమునందుమాత్రమే శక్తియుండును. ఇందుల కుదాహరణము దేవదత్తాదులు. ఇట దేవ + దత్త=అనఁగా దేవతలచే నియ్యబడినవాఁడను నవయవార్థము లేదు. కేవలము సముదాయమే యొకవ్యక్తిని బోధించుచున్నది. కావున నందున్న యభిధ రూఢ మనఁబడుచున్నది. యోగరూఢములకు నవయవములందును, సముదాయమునందునుగూడ శక్తి గలదు. ఉదాహరణము పంకజాదిశబ్దములు. ఇటఁ బంకజశబ్దము "పంకేజాయత ఇతి" పంకజమ్మని యవయవార్థముగలదయి యౌగికమగుచున్నది. మఱియు నది బురదయందుఁబుట్టిన వానినెల్లను జెప్పక సముదాయమునందుమాత్రమే శక్తి గలదై యొక్క పద్మార్థమునుమాత్రమే బోధించుచుండుటచే రూఢమనికూడఁ జెప్పఁబడుచున్నది. అందుచేతనే యివి యోగరూఢము లనఁబడుచున్నవి. ఇందువలన వాచకశబ్దము లభిధాశక్తిచే నాయా యర్థములను బోధించుచు జాతిగుణద్రవ్యక్రియా భేదములచే నాల్గు విధములయి, మరల యౌగికరూఢ యోగరూఢమను భేదములచేఁ బలురకము లగుచున్నవి.

అభిధాశక్తిచే బోధ్యములుగాని పదములు లక్షకము లనఁబడును. అనఁగా లక్షణాశక్తిచే నర్థమును బోధించుశబ్దములని యర్థము.

లక్షణయనఁగా

"ముఖ్యార్థబాధే తద్యుక్తో యయాన్యోర్థః ప్రతీయతే,
రూఢేః ప్రయోజనాద్వాసౌ లక్షణాశక్తిరర్పితా"

అభిధాశక్తిచే బోధ్యమగు ముఖ్యార్థమున కన్వయానుపపత్తి గల్గినపుడా ముఖ్యార్థమును సంబంధించిన వేఱొక యర్థమును దెలుపుటకే లక్షణ యనిపేరు. ఆలక్షణ రూఢిని (ప్రసిద్ధిని) బట్టి చేయఁబడిన రూఢిహేతుక లక్షణ యనియు, ఫలమునపేక్షించి చేయఁబడినచోఁ బ్రయోజన హేతుకలక్షణయనియు జెప్పఁబడును.

ఉ: కళింగః సాహసికః=అనఁగాఁ గళింగదేశము సాహసము గలదియని యర్థము. కళింగపదమభిధాశక్తిచే దేశమును జెప్పుచున్నది. సాహసము చేతనమందుండు ధర్మము. అది యచేతనమగు దేశమునం దుండదు. అందుచే నిట ముఖ్యార్థమగు దేశపదార్థమున కన్వయము కుదుర లేదు. కావున ముఖ్యార్థమును విడిచిపెట్టకుండ గళింగ పదమునకుఁ గళింగదేశస్థుఁడని లక్షణార్థమును జెప్పినచోఁ గళింగదేశస్థుఁడు సాహసికుఁ డను నర్థము పైవాక్యమున సరిపడుచున్నది. రూఢియనఁగాఁ బ్రసిద్ధి. ఇటఁ గళింగపదము దేశార్థమునఁ బ్రసిద్ధమైనది. ఆప్రసిద్ధి ననుసరించి చేసిన లక్షణకాన రూఢిహేతుకలక్షణ యనఁబడుచున్నది.

ప్రయోజన హేతుకలక్షణ కుదాహరణము "గంగాయాం ఘోషః" అనఁగా గంగయందు గొల్లపల్లె యను నర్థ మభిధాశక్తిచే బోధిత మగుచున్నది. ఇట గంగా శబ్దమునకు జలప్రవాహమని యర్థము. "అందు" అను సప్తమీవిభక్తి కాధారమని యర్థము. ఘోషమన గొల్లపల్లె. ముఖ్యార్థమగు గంగా జలప్రవాహమునందు గొల్ల పల్లెయుండుట యసంభవము. అందుచే ముఖ్యార్థమున కన్వయము సరిపడ లేదు. ఆకారణమున "గంగయందు" అనుపదమున కా గంగాపదమును సంబంధించిన తటము నందని లక్షణార్థమును స్వీకరింప వలయును. ఇట్లు చెప్పుటచే "గంగయందు గొల్లపల్లె" యనువాక్యమునకు "గంగాతటమునందు గొల్లపల్లె" యని యర్థము లభించినది.

చల్లదనము, పవిత్రత మొదలగు ఫలముల నపేక్షించి లక్షణార్థము స్వీకరింపఁబడుటచే నిది ప్రయోజన హేతుక లక్షణ యనఁబడుచున్నది.

స్వార్థమును విడువకుండ లక్షణార్థము స్వీకరించినచో నాలక్షణ యుపాదానలక్షణ యనఁబడును. దీనికే యజహత్స్వార్థలక్షణ యని నామాంతరము. రూఢి ప్రయోజన శబ్దములతో దీనిని జేర్చినచో రూఢిహేతుకోపాదానలక్షణ యనియు, ప్రయోజన హేతుకోపాదానలక్షణ యనియు రెండువిధము లగుచున్నది. వీని కుదాహరణము—

"శ్వేతో ధావతి"—"తెలుపు పరుగెత్తుచున్న" దని దానియర్థము. ఇట,"తెలుపు"అచేతనము. అది పరువెత్తుట యెప్పటికిని సంభవింపదు. ముఖ్యార్థమున కన్వయము సరిపడమిచే లక్షణ చెప్పుకొనవలయు. అందుచే దెలుపనుపదమునకుఁ దెలుపుగల యశ్వాదు లనునర్థము లక్షణచే వచ్చుచున్నది. అట్లు లభ్యమైన లక్షణార్థమగు నశ్వాదులందుఁ దెలుపు పదముయొక్క స్వార్థము విడువఁబడమిచే నిది యుపాదాన లక్షణ యైనది. తెలుపు మొదలగు గుణములు ధర్మియం దుండుట ప్రసిద్ధము. కావున రూఢిహేతుకోపాదాన లక్షణ యని పేరు కలిగెను.

ఇకఁ బ్రయోజనహేతుకోపాదాన లక్షణ కుదాహరణము: "కుంతాః ప్రవిశంతి" అనఁగాఁ ఈఁటెలు ప్రవేశించుచున్నవని యర్థము. ఈఁటె లచేతనములు. వానికిఁ బ్రవేశనరూపక్రియ సంభవింపదు. ముఖ్యార్థమున కన్వయానుపపత్తి వచ్చినది. అందుచే "ఈఁటెలు" అనుపదమునకు ఈఁటెలుధరించిన పురుషులని యర్థముచెప్పవలెను. అట్టి లక్షణార్థమందు "ఈఁటెలు" అనుపదము స్వార్థమును విడువ లేదు. మఱియు నీఁటెలని చెప్పుటచే పరులకందు దుష్ప్రవేశత్వరూపమగు ప్రయోజన ముండుటచే ప్రయోజనహేతుకోపాదానలక్షణ యను నర్థము సరిపడినది.

ఇట్లే లక్షణాశక్తివలన లభ్యమగు నర్థమునందు పరపదముల యన్వయసిద్ధికై స్వార్థమును విడిచినచో నది లక్షణలక్షణ. యనఁబడుచున్నది. దీనికే జహత్స్వార్థలక్షణయని నామాంతరము. ఈలక్షణలక్షణ రూఢిప్రయోజన భేదముల రెండువిధములయినది. అనఁగా రూఢిహేతుకలక్షణలక్షణ యనియు, ప్రయోజనహేతుక లక్షణలక్షణ యనియు సిద్ధించినది. వీనికిఁ గ్రమముగా వెనుక నుదాహరించిన "కళింగము సాహసికము", "గంగయందు గొల్లపల్లె" యనునవియే యుదాహరణములు. అట లక్షణచే లభ్యమయిన పురుషతటపదముల యన్వయమునందుఁ గళింగ గంగాశబ్దముల యర్థము లన్వయింపమిచే నవి స్వార్థమును విడిచిపెట్టినవి. ఈ రెండును వెనుకటివానితోఁ గలిసి నాల్గయినవి.

పైనుదాహరించిన నాల్గులక్షణములును సారోపా సాధ్యవసాన భేదములచే నెనిమిది విధము లయినవి.

సారోప యనఁగా వాక్యమునందుఁ బ్రయోగింపఁబడిన విశేషణ విశేష్యార్థముల కభేదాన్వయమును సమకూర్చునది. ఈసారోపపదము రూఢిహేతుక లక్షణలతోఁ జేర్చినచో రూఢిహేతుకసారోపోపాదాన లక్షణ యనియు, రూ. హే. సారోపలక్షణలక్షణ యనియును, ప్రయోజనహేతుకలక్షణతోఁ జేర్చినపుడు ప్రయోజనహేతుక సారోపోపాదానలక్షణ యనియు, ప్ర. హే. సారోపోపాదానలక్షణలక్షణ యనియును నాల్గువిధము లయినది.

(1) రూ. హే. సా. ఉపాదానలక్షణ కుదాహరణము: "అశ్వః శ్వేతో ధావతి" అనునది. ఇట గుణపరమయిన శ్వేతశబ్దమునకు గుణియందు లక్షణ. అనఁగా శ్వేతగుణ విశిష్టమగు గుఱ్ఱమని యర్థము. ఈవాక్యమునఁ బ్రయోగింపఁబడిన విశేషణ విశేష్యములగు శ్వేతాశ్వ శబ్దములకు శ్వేతగుణ విశిష్టమగు గుఱ్ఱమని యభేదాన్వయము కల్పించుటచే నిది సారోప యగుచున్నది. ఇటఁ దెలుపుగుణము ద్రవ్యమం దుండుట ప్రసిద్ధమగుటచే రూఢిహేతుక మయినది. శ్వేతపదము శ్వేతగుణ విశిష్టమునందు స్వార్థము విడువక యన్వయించుటచే నుపాదానమయినది. వాక్యమునఁ బ్రయోగింపఁబడిన విశేషణ విశేష్యార్థముల కభేదాన్వయము సమకూడుటచే సారోప యయినది.

(2) ప్ర. హే. సా. ఉపా. లక్షణ—"ఏతే కుంతాః ప్రవిశంతి"—"ఈఈఁటెలు ప్రవేశించుచున్నవి" అని యర్థము. ఇట "ఈఁటెలు" అనుపదము లక్షణచే దానిని ధరించువా రనునర్థము చెప్పుచున్నది. ఈవాక్యమున సర్వనామమునకును, కుంతవిశిష్ట పురుషులను పదమునకును విశేష్య విశేషణభావము గల్గి యభేదాన్వయము సంభవించుచున్నది.

(3) రూ. హే. సా. ల. లక్షణ—"కళింగః పురుషో యుధ్యతే." ఇటఁ గళింగపదమునకుఁ దద్దేశస్థుఁడని యర్థము. అందుచేఁ గళింగపురుషశబ్దార్థముల కభేదప్రతీతి యుండుటచే సారోప యగుచున్నది. ఇటఁ గళింగపదము స్వార్థమును విడుచుటచే లక్షణలక్షణ యగుచున్నది.

(4) ప్ర. హే. సా. ల. లక్షణ—ఉ. "ఆయుర్ఘృతం"—నెయ్యి యాయుర్దాయమే యని దానియర్థము. ఇచ్చట ఆయుశ్శబ్దము లక్షణచే నాయుష్కారణమని యర్థము చెప్పుచున్నది. ఆయుర్ఘృతములకుఁగల కార్యకారణసంబంధముచే నారెండింటికి నభేదాన్వయము సమకూడినది. ఆయుష్కరత్వరూపమగు ప్రయోజన మిందుఁ గలదు: అందుచేఁ బ్రయోజనహేతుక మయినది.

ఇట్లే సాధ్యవసానికలక్షణ నాల్గువిధము లయినది. సాధ్యవసానమనఁగా వాక్యమునఁ బ్రయోగింపఁబడని విశేష్యార్థమునకును, విశేషణార్థమునకును దాదాత్మ్యము గల్గించుట. సాధ్యవసానపదము రూఢి ప్రయోజనములతోఁ జేరి నాల్గువిధము లయినది. రూఢిహేతుకసాధ్యవసానోపాదానలక్షణయనియు, ప్ర. హే. సా. ఉపా. లక్షణయనియు, రూ. హే. సా. ల. లక్షణయనియు, ప్ర. హే. సా. ల. లక్షణయనియు నాల్గువిధములు: ఎట్లన.

రూ. హే. సాధ్య. ఉపా. ల.—ఉదాహరణము: రాజపురుషుఁడు వెళ్లుచుండఁగా "రాజా గచ్ఛతి"—ఈ రాజు వెళ్లుచున్నాఁ డన్న వాక్యమునందు, వాక్యమునందు లేని పురుషపదముయొక్క యర్థము, స్వస్వామిసంబంధముచే రాజపదముతోఁ దాదాత్మ్యభావము నందినది. రాజపదము లక్షణచే రాజపురుషుని చెప్పుచున్నది. స్వస్వామిసంబంధము ప్రసిద్ధమగుటచే రూఢిహేతుకమయినది. రాజశబ్దము స్వార్థమును విడువమిచే నుపాదానపదము లభించినది. ఇట్లే తక్కినమూఁడును నూహింపవలయును.

ఇట్లెనిమిది విధములయిన లక్షణలు సాదృశ్యసంబంధహేతుకములయి గౌణము లనిపించుకొనుచున్నవి. సాదృశ్యసంబంధము గాక యితరసంబంధములుగలవి యెనిమిదివిధము లగుచున్నవి. ఇట్లు పదాఱువిధము లయినది. గ్రంథబాహుళ్యముచే నొకటి రెండింటికి మాత్రమే యుదాహరణము లిచ్చెదను.

రూఢిహేతుక సారూప్యోపాదనగౌణీలక్షణకు—"ఏతాని తైలాని హేమంతే సుఖాని" అనఁగా హేమంతకాలమున నీతైలములు సుఖకరములని యర్థము. తైలమనఁగా తిలలనుండి కలిగినవని యర్థము. తైలశబ్దము సాదృశ్యసంబంధముచే సర్షపాది స్నేహములను జెప్పుచున్నది. తైలశబ్దము స్వార్థమును విడువకపోవుటచే నుపాదానయుత మగుచున్నది. "ఏతాని తైలాని" అని సర్వనామమునకును, తైలశబ్దమునకును దాదాత్మ్యప్రతీతిని గల్గించుటచే సారోప యగుచున్నది. తైలమునకును, సర్షపాదిరసములకును సాదృశ్య ముండుటచే గౌణి యగుచున్నది. తైలములు హేమంతమున సుఖకరములగుట ప్రసిద్ధియగుటచే రూఢిహేతుకమగుచున్నది. ఇట్లె తక్కినవి గ్రహింపఁదగును.

ఇట్లు పదాఱువిధములగు లక్షణలలోఁ బ్రయోజనహేతుకలక్షణ లెనిమిదియును బ్రయోజనరూపమగు వ్యంగ్యము గూఢమనియు, స్పష్టమనియు రెండువిధములగుటచే పదాఱురీతులఁ దనరుచున్నవి. మఱియు ఫలము ధర్మగతమనియు, ధర్మిగతమనియు నీపదాఱును రెండు తెఱంగులై ముప్పది రెం డగుచున్నవి. ఈసంఖ్యతో రూఢిహేతుక లెనిమిదియును గలిసి నలువది యయ్యెను. ఆనలువదియుఁ బదగతములనియు, వాక్యగతములనియు రెండురీతులయి మొత్త మెనుబది యయినవి. ఇఁక గూఢవ్యంగ్యమునకును, అగూఢవ్యంగ్యమునకును లక్ష్యములను జూపి యీలక్షణావృత్తిని జాలించెదను.

వాక్యార్థముల భావనచేఁ బరిపక్వమగు సూక్ష్మ బుద్ధికి గోచరమగు వ్యంగ్యము గూఢ మనఁబడుచున్నది.

"ఉపకృతం బహు తత్ర కిముచ్యతే
సుజనతా ప్రథితా భవతాపరం,
విదధ దీదృశ మేవ సదా సఖే
సుఖితమాస్స్వ తతః శరదాంశతం."

అనఁగా నొకఁ డపకారియగు నొకనితో నిట్లనుచున్నాఁడు: "ఓ స్నేహితుఁడా! మిక్కిలి యుపకారము చేసితివి. ఆవిషయమై యేమిచెప్పవలయును? నీసౌజన్యము మిగులఁ బ్రసిద్ధిగాంచినది. ఎల్లప్పుడు నిట్లాచరించుచున్న నీవు సుఖముగా నూఱేండ్లు బ్రదుకుము" అని యర్థము. ఇట ఉపకృత సుజనతాశబ్దముల ముఖ్యార్థమునకు బాధగలుగుటవలన విపరీతలక్షణచే నపకార దౌర్జన్యములని యర్థము చెప్పుటచే నపకారాతిశయరూపమగుఫలము సంభూతమయినది. మఱియు నిట నుపకృత సుజనతా శబ్దములు తమయర్థము వీడుటచే నీలక్షణ జహత్స్వార్థ మనఁబడుచున్నది. ఈలక్షణ కపకారాతిశయము ఫలమగుటచేఁ బ్రయోజనలక్షణ యైనది. ప్రయోజనరూప వ్యంగ్యము కేవలము సూక్ష్మబుద్ధులకుమాత్రమే గోచరమగుటచే గూఢమగుచున్నది.

చదివినంత మాత్రముననే వ్యంగ్యము స్పష్టమయినచో నగూఢమని చెప్పఁబడుచున్నది.

"శ్రీపరిచయా జ్జడా అపి
భవం త్యభిజ్ఞావిదగ్ధచరితానాం,
ఉపదిశతి కామినీనాం
యౌవనమద ఏవ లలితాని."

ఇం దుత్తరార్థమునఁ గామినీజనులకు యౌవన మదమే లీలాహేలాదులగు శృంగారచేష్టల నుపదేశించుచున్నదని యర్థము. ఇట "ఉపదిశతి" యని యుపదేశరూపమగు ధర్మముచేత ననిష్టముగాని యచేతననిష్ఠముగాదు. అచేతనమగు యౌవనమదమున కట్టి ధర్మ మున్నదని చెప్పుటచే ముఖ్యార్థమున కనుపపత్తిగల్గినది. కావున లక్షణచే నుపదేశ శబ్దమున కావిష్కరణమని యర్థము చెప్పవలయును. ఇట లక్షణాబోధ్యమగు నావిష్కరణరూపమగు వ్యంగ్యము సర్వజనవేద్యమగుటచే నిది యగూఢ వ్యంగ్యమున కుదాహరణ మగుచున్నది.

ఇఁక మూఁడవతరగతి శబ్దములు వ్యంజకములు. అనఁగా వ్యంజనాశక్తితోఁగూడిన శబ్దములు. వ్యంజనాశక్తి యెట్టిదియో యిందు నిర్వచింపఁబడినది:

"విరతాస్వభిధాద్యాసు యయార్థోబోధ్యతేపరః,
సావృత్తి ర్వ్యంజనానామ శబ్ద స్యార్థాదికస్యచ."
సా. ద.

అనఁగా నభిధాలక్షణలు తమతమ యర్థములు చెప్పి విరమింపఁగా నింకను శబ్దార్థములవలన నన్యార్థమును సూచించుశక్తికే వ్యంజన యని పేరు

ఉ. "గంగాయాం ఘోషః" యనునపుడు అభిధార్థము బాధ్యమగుటచే లక్షణావృత్తి గంగాతటమని యర్థముచెప్పి విరమించినది. ఇట్లభిధాలక్షణలు విరమింపఁగా నింకను దెలియవచ్చు నన్యార్థమే వ్యంజనాబోధ్యమగు వ్యంగ్య మగుచున్నది. ఎట్లన లక్షణచే గంగాతటముననున్న గొల్లపల్లెయని యర్థము. నిర్ణీతముగాఁగా గంగాతటమును సంబంధించిన శీతత్వపావనత్వాదులు గమ్యమానము లగుచున్నవి. అట్టియన్యార్థమును బోధించునదియే వ్యంజనావృత్తి. తాదృశవ్యంజనచే బోధ్యములగు శీతత్వపావనత్వాదులే వ్యంగ్యము లగుచున్నవి. ఈవ్యంజనయభిధామూలకమనియు, లక్షణామూలకమనియు రెండువిధములు. అభిధామూలకవ్యంజన యనఁగా నభిధాశక్తిచే గమ్యమానమగు వ్యంగ్యార్థము గలది యని యర్థము.

"దుర్గాలంఘిత విగ్రహో మనసిజం
సమ్మీలయం స్తేజసా
ప్రోద్యద్రాజకలో గృహీతగరిమా
విష్వగ్వృతో భోగిభిః,
నక్షత్రేశకృతేక్షణో గిరిసరో
గాఢాం రుచిం ధారయన్
గా మాక్రమ్య విభూతిభూషిత తనూ
రాజ త్యుమావల్లభః."

ఇది యుమావల్లభుఁ డను రాజు వర్ణనము. పరిఖ మొదలగు దుర్గములచేఁ బ్రతిరోధింపఁబడని యుద్ధము గలవాఁ

డును, కాంతిచే మన్మథుని పరిభవించువాఁడును, అధికాభ్యుదయముగలరాజులను లొంగఁదీసికొనువాఁడును, గొప్ప గౌరవము గలవాఁడును, భోగవంతులగు పురుషులచేఁ బరివేష్టింపఁబడువాఁడును, క్షత్రియ శ్రేష్ఠులనుగూడ నిర్లక్ష్యముగాఁ జూచువాఁడును, గంభీరవాక్యములందు మిక్కిలి యభిరుచి గలవాఁడును, భూమి నాక్రమించుకొన్నవాఁడును, ధనసంపదచే నలంకృతమగు దేహము గలవాఁడును నగు సుమావల్లభుఁ డనురాజు ప్రకాశించుచున్నాఁడు. పై శ్లోకమున కిది యభిధాశక్తిచే గమ్యమానమగు నర్థము. ఈ యభిధాశక్తి బోధ్యమగు నర్థమందు గౌరీవల్లభరూపమగు నర్థము వ్యంజనావృత్తిచే లభ్యమగుచున్నది. దీనికే యభిధాశక్తి మూలవ్యంజన యని పేరు. లక్షణామూలవ్యంజన గంగాయాం ఘోషః అనుచో నిరూపింపఁబడినది. అం దభిధామూలకవ్యంజన శబ్దశక్తి మూలమనియు, నర్థశక్తిమూలమనియు రెండువిధము లయినది.

## శబ్దశక్తిమూలవ్యంజన

క. "ఘనత నృసింహుని కరమునఁ
దనరెడు నసి నిజ సమగ్రధారాగ్ర నిమ
జ్జన తత్పరులగు నరులకు
ననిమిషభావం బొనర్చు ననవరతంబున్."

ఇందు నరసింహునిచేతి కరవాలముచే శత్రువులు రణమునఁ గూలి దేవత్వ మందుచున్నారని భావము. ఈ పద్యమున నున్న ధారామజ్జనశబ్దముల శక్తివలన నదీప్రవాహమునందుఁ దానమాడిన నరులు దేవత్వమును బొందుచున్నారను వ్యంగ్యముగూడ గమ్యమాన మగుచున్నది. ఇట వ్యంజన ధారామజ్జన శబ్దముల శక్తినిబట్టి కల్గుటచే శబ్దమూలక మగుచున్నది.

## అర్థశక్తిమూలవ్యంజన

చ. "అలఘుపరాక్రమక్రమ స
మగ్రభుజాగ్ర నృసింహభూప నీ
విలసదనూనదానగుణ
విభ్రమ మెంతయు నాలకించి తా
వెలవెలఁబాఱె మేఘ మర
విందవిరోధియుఁ గందువాఱె నా
కులపడెఁ గల్పశాఖి తృణ
కోటి గ్రసించె నమర్త్యధేనువున్."

ఇందు నరసింహరాజు దానగుణము విని ఘనచంద్రకల్పవృక్షకామధేనువులు క్రమముగా వెలవెలఁబాటును, మాలిన్యమును, నాకులపాటును, తృణగ్రసనమును బొందెననెడి యర్థశక్తిచే మేఘాదులు దానగుణమున నరసింహునిఁ బోలలే వనెడివ్యంగ్యమును లభింపఁజేయు వేఱొకశక్తి గూడ నిందు ద్యోత్యమాన మగుచున్నది. ఆశక్తియే వ్యంజన. దాని కర్థశక్తి హేతు వగుటచే నది యర్థశక్తిమూల వ్యంజన యనఁబడుచున్నది. శబ్దార్థముల రెండింటివల నను గల్గిన వ్యంజన యుభయశక్తిమూలక మనఁబడు చున్నది.

క. "అరివరకరుఁడై సుమనో
నరచరణధురీణుఁడై యవారితలక్ష్మీ
స్థిరవాస భాసురుండై
నరసింహుఁడు పొల్చుఁ ద్రిభువనస్తుతమహిమన్."

ఈపద్యమున నరసింహరాజును, నరసింహమూర్తిని గూడ వర్ణించెను. శత్రువులకు భయమును గలిగించువాఁడై, పండితశ్రేష్ఠులను బోషించువాఁడై, సంపదచే స్థిరముగా నుండుటచేఁ బ్రకాశించువాఁడై, నరసింహభూపతి ముల్లోకములచేతను బొగడఁబడుచున్నాఁ డని యర్థము. ఇది యిట్లుండఁగా, శంఖచక్రములు చేతఁ గలవాఁడై, దేవతాశ్రేష్ఠులను బోషించువాఁడై, లక్ష్మీదేవి స్థిరముగా నివసించుటచేఁ బ్రకాశించువాఁడై, ముజ్జగములచే నుతింపఁబడు నరసింహమూర్తి యనిగూడ నర్థము కలదు. ఇందున్న "అరివర, సుమనోవర, లక్ష్మీ" శబ్దములు శ్లిష్టములై, రెండర్థములను బోధించుచున్నవి. రెండవ యర్థము శబ్దశక్తివలనఁ గల్గినది. ఈ నరసింహరాజు నరసింహముతో సమానుఁ డనునది యర్థశక్తి వలనఁగలిగినది. ఇట్లు నరసింహ, నరసింహమూర్తుల కుపమానోపమేయ ధర్మము కలిగించుటచే నరసింహమూర్తియందున్న యుత్కృష్టగుణములు నరసింహరాజునందుఁగూడ నున్న వనునర్థము వ్యం

జనచేఁ గల్గినది. కావుననే యిది యుభయశక్తివ్యంజన యైనది. ఇట్లభిధాలక్షణా వ్యంజనాశక్తులచేఁ గల్గు వాచ్యార్థ లక్ష్యార్థ వ్యంగ్యార్థములను బట్టియే కావ్యాదుల యుత్తమత్వాదులు తెలియవచ్చుచున్నవి.

"కావ్యం ధ్వని ర్గుణీభూతవ్యంగ్యం చేతి ద్విధామతం,
వాచ్యాతిశాయిని వ్యంగ్యే ధ్వని స్తత్కావ్య ముత్త[మం."

ధ్వనినిబట్టియు, గుణీభూత వ్యంగ్యమునుబట్టియుఁ గావ్యము రెండువిధము లగుచున్నది. అందులో వ్యంగ్యార్థము వాచ్యార్థమును మించుచున్నచో ధ్వని యుత్తమ కావ్య మనఁబడుచున్నది. ధ్వనిశబ్దార్థమును గుఱించి యనేకు లనేకవిధములుగా నిర్ణయించిరి. ఘంటానాదమునందు స్ఫుటధ్వని క్రమముగాఁ దగ్గి, యవ్యక్తరూపమగు ననురణనరూపమగు ధ్వనిగా మాఱి యానందము గొల్పువిధమున నభిధాలక్షణాదులచేఁ గల్గు బాహ్యార్థములుఁ క్రమముగా విరమించి, వ్యంజనాబోధ్యమగు వ్యంగ్యార్థము మధురమై రసాదులను గల్గించును. ఆ వ్యంగ్యమే ధ్వనియని కొందఱ మతము. "ధ్వనతి వ్యంజనయా రసాదీన్ ప్రత్యాయయతీతి ధ్వని" యను వ్యుత్పత్తిచే వ్యంజనచే బోధ్యమగు శబ్దార్థసముదాయమే ధ్వనియని యర్థము. "ధ్వన్యతే అసా వితి వ్యుత్పత్త్యా రసాదిరపి" యనుటచే రసాదులు ధ్వనియని కొంద ఱనుచున్నారు. "ఏవంచ ధ్వన్యతే అన యేతి వ్యుత్పత్త్యా వ్యంజనాపి ధ్వని రిత్యవధేయం" అనుటచే దీనివలన ధ్వనింపఁజేయఁ బడుచున్న దనువ్యుత్పత్తిచే వ్యంజనయు ధ్వనియే యని తెలియఁదగినది. మఱి కొందఱు ధ్వనిగూడ నభిధాదులవలెనే శబ్దమునం దుండు శక్తి యనుచున్నారు. ఈ పక్షము ననుసరించి యభిధాదిశక్తులవలెనే యిదియు వివరింపవలసి యున్నది. అయిన నిఁక నా విషయము విడిచి ధ్వనియన నెట్టిదియో దిఙ్మాత్రము నిరూపించి విరమించెదను.

సీ. "తల యెత్తుకొనఁగల్గెఁ గులమువారలలోనఁ
బదునాలుశిరముల పాఁపతేని
కనుపమచ్ఛాయా విహార మందఁగఁగల్గెఁ
జిమ్మచీఁకటి మ్రింగు నెమ్మెకాని
కమృతాబ్ధిలో నిద్ర యవధరింపఁగఁగల్గె
వెలిదమ్మి పాక్కిటి వేల్పుసామి
కలమహానట జటావలభి నుండఁగఁ గల్గె
నెలకొన్న చల్లని వెలుఁగువాని
కవుర భువనాతి శాయి వైభవవిభూతిఁ
బూని జగదేక జేగీయమానుఁ డైన
యోజ భూపాలు నరసింహుఁ డుర్వియందు
నవతరించి శుభస్ఫూర్తి నతిశయిల్ల."

నరసింహరా జుర్వి నవతరించుటచే నదివఱకు భూమి మోయుచున్న శేషునకు విశ్రాంతి గల్గెనని చెప్పుట వలన నరసింహుఁడు భూభరము వహించెనని తోఁచుచున్నది. అట్లే సూర్యాదులు విశ్రమించుచున్నారని చెప్పుటచే నతనిప్రతాపాదులు వెలయుచున్న వనుధ్వని వ్యక్తమగుచున్నది. ఇట్లు ధ్వని ప్రధానమగు కావ్యమే యుత్తమ మనఁబడు చున్నది.

"న్యక్కారో హ్యయ మేవ మే యదరయ
స్తత్రా ప్యసౌ తాపసః
సో ప్యత్రైవ నిహంతి రాక్షసకులం
జీవ త్యహో రావణః,
ధిక్ ధిక్ ఛక్రజితం ప్రబోధితవతా
కిం కుంభకర్ణేన వా
స్వర్గగ్రామటికా విలుంఠనవృథో
చ్ఛూనైః కి మేభి ర్భుజైః."

శ్రీరాముఁడు లంకలో రాక్షసులను జంపుచున్నపుడు రావణుఁడు పొందు నిర్వేద మిందుఁ బొందుపఱుపఁబడినది. నాకు శత్రువు లున్నారనుటయే తిరస్కారము. అందు మునివృత్తి నవలంబించినవానితో విరోధము సంభవించుట మఱియుఁ దిరస్కారము. వాఁ డిక్కడనే రాక్షసులను జంపుటయు, రావణుఁడు బ్రతికియుండుటయు మఱింత పరాభవము. ఛీ, ఛీ, ఇఁక నింద్రజి త్తేల? నిద్రనుండి మేల్కొలుపఁబడినను గుంభకర్ణుఁ డేల? స్వర్గపట్టణ మనెడి చిన్న కుగ్రామమును ధ్వంసముచేసి వృథా గర్వము పొందుచున్న యీ నాభుజము లేల?—అని భావము. ఇందు ఈర్ష్యవలనఁ గల్గిన తనయవమానరూప

నిర్వేదభావము ధ్వనించుటచే విధేయావిమర్శ దోషముచే దుష్టమయినను, న_త్తమకావ్యత్వము గల్గుచున్నది. ఇందు వలన ధ్వనియే యు_త్తమకావ్య మనఁబడుచున్నది. మన పూర్వగ్రంథములం దు_త్తమకావ్యత్వ హేతుకమగు ధ్వని యంతటను గలదు. అట్లే మనము రచించు కావ్యములను ధ్వనిమయములుగా నొనరించునట్టి శ_క్తి మనకుఁ బ్రసాదించి కావ్యయువతికి జీవితము పోసి వృద్ధిపొందించుఁగాక యని పరమేశ్వరునిఁ బ్రార్థించెదను.

---

## పద్మనాభము

పురిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి)

తెనుఁగు వీరుల విమల కీ_ర్తి ప్రభావ
మతుల విజయ ప్రతాప శౌర్య ప్రశ_స్తి
పోయె నకట! నిర్మూల మై పోయె నిచట
లంచగొండుల కుటిల కల్పనమువలన
మాతృదేశ విద్రోహుల మాయవలన.

నిర్నిరీక్ష్యప్రతాప సందీ_ప్తిశాలి
పూసపాటి విజయరామ భూపమౌళి
తొలఁగి చనె నిట సూర్యమండలము దాఁటి
విపుల సామంతగణ పరివేష్టితుఁ డయి.

పటిదలై భూతముల మెడబంటి గాఁగ
శూరజనకంఠనిర్గత శోణితమ్ము
పాఱె నీపూతధాత్రి నిబ్బరము తొలఁగి
స్వర్గవాసులు ఝెప్ప వాల్పకయె కాంచ.

అవ్వి భారతస్వాతంత్ర్య హారణయోగ
వాసరము లొట నాంధ్ర సర్వస్వతంత్ర
రాజ్యలక్ష్మి పాశ్చాత్యుల ప్రాపు చేరె
నిచట; దైవయోగమునకు నెదురు కలదె!

ఆనితాంతకఠోర దృశ్యావలోక
నమున సహార్ద్రిమృదుల మానసము చెదర
కంట నీ ర్వెట్టి నిలువక కరఁగి పాఱు
నేఁటికిని సైత మీ గో_స్తనీ స్రవంతి.

భయద దాస్య విశృంఖలా బంధితుఁడవు
ఓయి! జీవచ్ఛవాంధ్రుఁడా! ఒక్కమారు
ఒలుకని మ్మిట నింత కవోష్ణబాష్ప.
మలినధార స్వాతంత్ర్య సంప్రా_ప్తికొఱకు.

---

# తిక్కన విరాటపర్వము

గుఱ్ఱం వెంకటసుబ్బరామయ్య గారు

## వర్ణనవిశేషము

(వెనుకటిసంచిక తరువాయి)

రసము చిప్పిలు ప్రౌఢవర్ణనలకుఁ దిక్కన కవిత పుట్టినిల్లు. కథయం దవకాశ మొదవినపుడెల్ల నిజప్రతిభాస్ఫోరకములగు వర్ణనల నెలకొల్పుటయందుఁ దిక్కన యితరకవుల సరణినే పాటించినాఁడు. కాని యనన్యసాధ్యములగు విశేషము లిక్కవివర్ణనలందుఁ గానిపించును. వానింగొన్నింటి నిచ్చోఁ దడవుట యుక్తముగఁ దోఁచును.

i. భావనాశక్తి (Imagination కి రెండవది వర్ణనిరూపణశక్తి (Colour Sense).

ఇయ్యది నయనైక సాధ్య మగుటచే "సర్వేంద్రియాణాం నయనం ప్రధాన"మను నాభాణమక ముప్పతిలి యుండనోపును. కావుననే వర్ణాత్మికమగు చిత్రలేఖనమునకుఁ గొందఱి మతమున లలితకళలయం దగ్రస్థానము లభించినది. వస్తుస్వరూపముకన్న వస్తుప్రకాశమును వర్ణించుట కెక్కుడు సామర్థ్యము వలయునను విషయ మనుభవవేద్యము. ఈ వర్ణనలయందుఁ దిక్కన యసమానుఁడు. వర్ణ్యగుణములలో "నునుఁగాంతితీపి" తిక్కన హృదయమును మిగుల నాకర్షించినది. శృంగార వర్ణనలలో నంగసౌష్ఠవాదులకన్న మైనిగ్గుల నుగ్గడించుట యిక్కవికిఁ గడుంబ్రియము. ఇందులకు లక్ష్యములు:—

౧. మత్స్యరాజ సౌధముం బ్రవేశించు సైరంధ్రి వర్ణనము:

సీ. "పదతలంబుల కెంపు పగఁగిన తలము కుంకుమ లిప్తమైన చందము వహింప,
అంగంబు నునుఁగాంతి యడరిన గోడలు వేదులు మణిమయ విధము నొందఁ,
గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱఁ బుష్పవహారంబు పోలుపు దాల్ప,
వేనలి కప్పు పర్వీన మీఁదు నీలదుకూలంపు మేల్కట్టు కొమరు వడయఁ,
దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ బాండురాజ తనూభవ పత్ని యరిగె."

పై "క్రొత్తయొ" ప్పంతయు ద్రౌపది మేనిపలువన్నెలు పన్నిన యింద్రజాలమే కదా!

౨. కీచకుఁడు సైరంధ్రిని దొలుసారి గాంచుట:

చం. "పొలఁతుక కాంతి యింత పొలివోవఁగ నీ కెనలారు తొరని
శ్చలతఁ గడంగి క్రోలి కొనఁ జాలుటఁ గీచకముఖ్య లోచనం
బులు 'నయన ప్రధాన' మను పూర్వ వచస్థితి దప్పకుండఁగా
నెలమి వహించెఁ దక్కఁగల యింద్రియ వర్గము ధిక్కరించుచున్."

ఇందు వర్ణ్యకాంతి 'యింత పొలిపోవఁగ నీక' గ్రోలికొనుటకుఁ దిక్కనయు నెంత తమక పడెనో సువ్యక్త మగుచున్నది.

3. కీచకుఁడు మోహ పరవశుఁ డగుట:

సీ. "తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు
నునుఁగాంతి వెల్లువ మునుఁగఁ బాఱఁ,
గిసలయ హస్త కెంగేల నేపారు క్రొ
మ్మించు నను లేయెండ మిగులఁ బర్వఁ,
గమలాస్య ముద్దుమొగంబు లేమెఱుఁగుల
ముత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ,
ధవళాక్షి తొంగలితఱచు ఱెప్పల చెన్ను
కప్పను చీఁకటి కవియ దేర........"

ఇట నిజధాటికి సింహబలుని గ్రుక్కిఁ-ంచి లోఁ గొనినవి యా చెలువ యంగకములం దుఱం గలించు పలుతెఱంగు మెఱుంగుల కావె?

ii. చిత్రలేఖనమునకును, గవిత్వమునకును ఒక గొప్పభేదము కలదు. చిత్రలేఖకుఁడు లేఖ్య వస్తువునఁ దన మదిం జూఱగొన్న యొక నిముసంపు టచంచలస్థితి (static pose)నె చిత్రింపఁగలఁడు. కవియొ పైయచంచలస్థితినె గాక యనుక్షణ చాంచల్యమానమగు దశావిపర్యయమును (dynamic movement)గూడ నిజకవనమునఁ జిత్రింప నేర్చును. ఇదియె చిత్రలేఖనముపైఁ గవిత్వమునకుఁగల యాధిక్యము. ఇట్టి వర్ణనలఁ దిక్కన కడు నేర్పరి. తార్కాణములు-

౧. కీచకుఁడు సైరంధ్రిం బలుకరించుట:

సీ. "తెలి కన్నుఁగవ కాంతి పొలుపార నించుక
గను విచ్చి చూచినఁ గాదె యబల,
చెలువంపు నెమ్మోము నెలమి సొం పినుమడి
గా నల్ల నవ్వినఁ గాదె యింతి,
దంతపఙ్క్తికరుచి దలకొన మఱుమాట
పలికినఁ గాదె యుత్పలదళాక్షి,
యుల్లంబుసరసత దెల్లంబుగా లీలఁ
గైకొన్నఁ గాదె పంకరుహవదన..."

ఇందు "ఇంచుక గనువిచ్చిచూచుట", "అల్లనవ్వుట", "మఱుమాట వలుకుట","లీలఁ గైకొనుట"—ఇయ్యవి ద్రౌపది సహజ సౌందర్యమునకుఁ బోషకములుగ వర్ణింపఁబడినవి.

౨. విరాట సుశర్మ సైన్యముల సంకుల సమరము:

సీ. "నొగ నొగతోఁ దాఁకి పగులంగ నరదంబుః
బఱపి యొండేరిపై కుఱుకువారు
రథ్యముల్ వడ్డ విరథు లయ్యు నసిముద్గ
రాదుల నడరి పోరాడువారు
సారథి నొచ్చినఁ దేరును గడపుచు
నేయుచుఁ గయ్యంబు నేయువారు
నగనంబుపై వ్రాలి యాలోనఁ దెలిసి
త స్నేసినాతనిఁ బడ నేయువారు
నగుచు రథికనికాయంబు లడర..."

దీనిని ఫలకముపైఁ జిత్రింపఁ బూనుదుమేని అందలి యసాధ్యత గోచరమగును. దీనిని జిత్రించుటకు మనఃఫలకముదక్క నొండు వలనుపడదు.

iii. కవులు నిజవ్యాపారము సాగించుటకుఁ గొనుసర కనఁదగు కవిసమయపరికర మెల్లరకు సామాన్యమె. కాని యుత్తమకవులు నిజకల్పనమహిమచే వానినే నూతనములం బోలెఁ దోఁపించి పఠితల మెప్పు వడయుదురు.

# క్షత్రపరాజులు

నాణెములపై నున్న ప్రతిబింబమును చూచి శ్రీ కే. నరసింహాచారిగారు చిత్రించినవి



౧. మహాక్షత్రప నహపానుడు

ఘూర్జర దేశమునందు క్రీ. శ. ౧౧౯-౧౨౪ ల యందు క్షత్రపరాజ్యమును స్థాపించి పాలించిన రాజు. క్షత్రప రాజవంశ కర్త. ఇతని యల్లుడు ఉషవదాతు డనువాడు రాజప్రతినిధిగా నుండి నాసికయందలి కొన్ని సుప్రసిద్ధ గుహాలయములను గట్టించెను. నహపానునికూతురు దక్షమిత్రయు ననేకదానముల జేసి గణ్యత గాంచినది.



౨. మహాక్షత్రప విజయసేనుడు
క్రీ. శ. ౨౮౫. క్షత్రపవంశమున నొక సుప్రసిద్ధరాజు

ఇందుఁ దిక్కనకు లోకోత్తర ప్రతిభ కలదు. నిదర్శనములు-కీచకుఁడు ద్రౌపది సౌందర్యమును వర్ణించుట:

సీ. "నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁ దెచ్చి
యచ్చునఁ బెట్టిన ట్లుంద మొంది
చక్రవాకంబుల చందంబు గొని వచ్చి
కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
చందురు నునుఁగాంతికిం దేర్చి కూర్చి భా
సునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబులకప్పు గలయంతయును బుచ్చి
నారు వోసినభంగి నవక మెక్కి
యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును ని ట్లున్న రుచిరమూర్తి..."

స. "గండుమీలకుఁ బుట్టి కాము బాణములతోఁ
గలసి యాడెడు నట్టి కన్నుఁగవయు
బిసకాండముల శిక్షఁ బెరిగి లేఁదీఁగల
మెచ్చక యున్నట్టి మృదుకరములు
చిగురులతోసంధి నేసి యంబుజముల
పైనెత్తి చనునట్టి పదతలములు
కలకంఠముల చేతఁ గఱచినవిద్య వీ
ణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు..."

ఇం దుపమానికాయము "బాణోచ్ఛిష్ట" మయ్యు, వర్ణన మద్భుత మపూర్వ మనిపించునది యిక్కవీశ్వరుని కూర్పునేర్పె కదా!

iv. కావ్యములకును శాస్త్రగ్రంథములకును గొప్పభేద మేమన, శాస్త్రములందు వస్తుస్వరూప మున్నది యున్నట్లు నిరూపింపఁబడును. కావ్యములం దన్ననో, అతిఘోరములు, జుగుప్సావహములునగు వస్తువులుసైతము కవిభావనామహిమచే భావన నొందుటచేతంబలె నొక విలక్షణశోభం దాల్పవలయును. అదియే రసస్ఫూర్తి కాలవాలము. అందుచేతనే Romeo and Juliet అను నాటకము ఘోరాంతమయ్యుఁ, దత్కవి పఠితృదిదృక్షుహృదయంబుల శృంగార రసమే నెలకొల్పఁ గలిగినాఁడు. ఇట్లు వర్ణ్యమందలి కటుతను మాటి, రోఁతకు మూఁతవైచి, మనోహరత్వముం బ్రకటించుటయందుఁ దిక్కన కపార ప్రతిభ కలదు. దృష్టాంతములు:

౧. కీచకునిచేఁ దన్నువడిన ద్రౌపది వర్ణనము:

సీ. "ఎలదీఁగఁ గప్పిన లలిత పరాగంబు
క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవ సౌరభం బెసఁగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళములఁ దుది మంచుదొరఁగెడు
గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల
నిందు బింబము మీఁది కందు నందంబునఁ
గురులు నెమ్మొగమున నెరసి యుండ..."

౨. భీముఁడు కీచకునిఁ జంపుట:

ఆ. "పల్లవప్రసూన ఫలభరితం బగు
మ్రాను గూలఁ ద్రోచు మత్తగజము
పోల్కి వివిధరత్న భూషణ భూషితుం
డైన సూతుఁ గూల్చె ననిలసుతుఁడు."

3. విరాట సుశర్మ యుద్ధానంతరము పొలికలను వర్ణనము:

"......గుత్తులకొలందికిఁ గృత్తంబులై పడియున్న పాదంబులవలనం గెందలిరుల సెజ్జల చందంబులగు చోట్లును, దునిసి దిక్కువడి

యున్న యూరుకాండంబులవలన మదగజంబులు సొచ్చిన కదలీవనంబులం బోనియెడలును, బ్రోవులుగొనియున్న బ్రేవులవలన లావుగల యంచపిండు వేరాఁకలి నఱిముఱిఁ బెఱికిన గుఱుకులు గట్టిన మృణాళనాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ బ్రేణిసేయు ప్రదేశంబులును, నంగుళీయకరుచు లడర నెఱిం జాఁగి పడియున్న బాహుదండంబులవలన నురగనివాసంబుల ననుకరించు తలంబులును, గీలాలజలంబులపయిం దేలుచు నవ్వినట్లున్న శిరంబులవలన వికచారవింద దీర్ఘికల విడంబించు తావులును..."

సహజముగ ఘోరభీకరములు, జుగుప్సావహములునగు పైమూఁడువర్ణ్యములును మనోహరోపమానములఁ గవి సృజించిన సౌందర్యవాతావరణము (atmosphere of beauty) నంజేసి యెట్లు హృదయంగమములుగ మాఱెనో యరసిన నిక్కవీంద్రుని యుదాత్త ప్రతిభ యెఱుకపడును.

శైలీపరిపక్వత

తిక్కనార్యుని భావనవలెనె శైలియు బాల్యతారుణ్యాద్యవస్థలం దాఁటి, సంపూర్ణపరిణతి గాంచినది. ఎయ్యెడ నాత్మస్తుతి పొంతఁబోవని యిక్కవియె తా "నుభయకవిమిత్రుఁడ" నని తెలిపికొనుటచే, నీతిని యుభయభాషావైదుష్యము తెల్లమగుచున్నది. కుమ్మరగురునాథుఁడు వ్రాయసకాఁడగుట మున్నగు పుక్కిటి పురాణములేగాక, యిక్కవీంద్రుని యనర్గళధారయు, రసావేశమును ఇతని కవన మాశువేయని నమ్మించును. ప్రయత్నపూర్వకముగ నిజమహిమం బ్రకటించి పాఠకపరితోషమును సాధింపవలయునను తలం పిక్కవికిం గలనేని పొడమినట్లు తోఁపదు. ఎవరోకొంద ఱాంధ్రవిద్వాంసులు తన్ను మెచ్చుకొనుటగాక, "భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావలి మోదముం బొరయు"ట యిక్కవికి ముఖ్యోద్దేశ్యమగుటచే నీతని కవనమునఁ బాండిత్యప్రకటనముకన్నఁ బాండిత్యనియమనమే యెక్కుడుగఁ దోఁచును. అర్జున కిరీట దీధితులం బలెనె సవ్యాపసవ్య వాక్ప్రయోగ ధురీణుండగు నిక్కవి సార్వభౌముని శైలిమెఱుఁగులును ప్రయత్న సాధితములగు నెరవుసొమ్ములుగాక, "పెట్టక కట్టక స్వయముగఁ బుట్టినెలుంగొందు" నట్లున్నవి. కావుననే తిక్కనకవనమును 'పండిన పెరటి కల్పక' మనఁదగును.

ఇఁక: దిక్కన కవితాపరిపక్వత కుపలక్షణము లనఁదగు శైలివిశేషములఁ గొన్నింటినిట దిక్ప్రదర్శనమాత్ర ముదాహరించుచుఁ బేర్కొని, యీ వ్యాస ముపసంహరించెదను.

౧. ఉభయభాషామనీషాధ్యసంపద చేతంగాబోలు, వాగర్థసంబంధ పరిజ్ఞానమును, 'భావమున కెలుఁగిచ్చు భాష'ను రచించు నేర్పునందును దిక్కన యసమానుఁడు. రసోచితశైలి యిక్కవి యొక్కనిసొమ్మె యని నుడువవచ్చును. ఇందుల కుదాహరణములు:

శృంగారమునకు (కీచకునకు సుదేష్ణ యుద్బోధము)—

సీ. "లలితంబు లగు మట్టియల చప్పు డింపార
నంచకై వడి నడ నల్ల వచ్చి
యెడ మేనిసెత్తావి సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై మగుడఁ దిగిచి
సోలెడునలదీఁగ లీలఁ గ్రాలుచు వింత
చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలి గన్నుఁగవను నెచ్చెలి యైన లేఁత న
వ్వోలయంగ సరసంపుఁ బలుకు వలికి
మెఱయుచెయ్యుల రాగంబు మెయికొనంగ
నెడఁప సొగయించు మాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నేలఁతలుండ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె?"

(ఇప్పద్యమున మోహనతరము ధ్వని పుష్టియా, తెనుఁగు నుడికారమున నెల కొన్న పదలాలిత్యమా చదువరులు నిశ్చయింతురు గాక.)

వీరమునకు (కీచకుఁడు సైరంధ్రిని బరిభ వింపఁగాఁ జూచిన వలలుని వర్ణనము)—

చ. "కనుఁగొని కోపవేగమునఁ
గన్నుల నిప్పులు రాల నంగముల్
గనఁగ సాంద్ర ఘర్మ సలి
లంబులు గ్రమ్మ నితాంతదంత పీ
డనరటదాస్యరంగ వికట
భ్రుకుటీ చటుల ప్రవృత్తి న
ర్తన ఘటనా ప్రకార భయ
దస్ఫురణాపరిణద్ధ మూర్తి యై."

(ఇందు వర్ణితుఁడు భీముఁడా, వీరరసాధి దేవతయా!)

కరుణకు (కుంతి సహదేవుని ద్రౌపది కిల్లడ వెట్టుట)—

చ. "కడుఁ బసిబిడ్డ వీఁ డొకటి
గాదవు నా నెఱుఁగండు ముంద రె
య్యెడ నొకపాటెఱుంగఁ డెవ
యెంతయుఁ గోమల మెప్పుడైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁ గాని తన
కుం గల యాఁకటి ప్రొద్దెఱుంగఁ డీ
కొడుకిటు వోకకుణ్ మనము
గుంచెడు నిణ్ గని యాఱుసెల్లెదుణ్."

(దీనిని జదువునప్పు డాతల్లిహృదయము చదువరి యాత్మలోఁ బ్రవేశింప కుఁడునా?)

౨. "కవి ఋషియే" అనియు, "వాక్కు వెంబడి నర్థంబు పఱచి వచ్చు నార్యు లయినట్టి పరమ మహర్షులకును" అనియుఁ బరఁగు నార్యోక్తులు తిక్కనపట్ల నెంతెయుఁ జెల్లును. ఆశుకవనము సెప్పుచున్నను, దిక్కన ప్రయోగించు పదజాల మేర్చి కూర్చి నదియుంబోలెఁ బ్రౌయికముగ సాభిప్రాయమై యుండును. నిదర్శనములు:

సీ. "ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుఁడు పార్వ
తీశు నైనను దక్క నేల కున్నె!
యిన్నాతిచెలువంబు గన్న శచీప్రియుం
డైనను గను గల్గి నవయ కున్నె!
యిత్తన్వి కనలేమి కదిరి పన్నిదము భా
షావిభుతో నైనఁ జఱవ రాదె!
యిత్తలోదరి జీవితేసన కిందిరా
పతి నైనఁ మెచ్చక పలుకఁ జనదె!..."

సీ. "తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు
నునుఁ గాంతివెల్లువ మునుఁగఁబాఱఁ,
గిసలయహస్త కెంగేల నేపారు క్రొ
మ్మెంచను లేయెండ మిగులఁ బర్వఁ.

గమలాస్య ముద్దుమొగంబులే మెఱుఁగుల
మొత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ,
ధవళాక్షి తొంగలి తలచు ఱెప్పల చెన్ను
కప్పను చీఁకటి గవిసికొనఁదేర........"

పైపద్దెములఁ "పార్వతీశు","శచీప్రియు", "భాషావిభు", "ఇందిరాపతి", "తన్వంగి", "కిసలయహస్త", "కమలాస్య", "ధవళాక్షి" యిప్పదములు సాకూతములు.

తే. "సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోఁడి
పజ్జఁ గడుపడి దగిలి కోపంబు నిదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొస రించుకయు లేక కూలఁ ద్రోచె."

ఇట "సింహబలుఁడు" "చిగురుఁబోఁడి" పదప్రయోగౌచిత్యంపు సొంపుఁ దిలకింపుఁడు.

"..........................తి
స్ఫురిత మహాయుధోగ్ర రుచి
పుంజ విజృంభణ ఘోరమయ్యె నం
తరము సహస్రనేత్ర ముఖ
దైవత మండల దుర్నిరీక్ష్య మై."

"సహస్రనేత్ర"-ఆయుద్ధమును వీక్షించుటకు వేయికన్నులును గావలయును!

"శరజాలములు పటుజ్వాల లై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల-"

"అర్కతనూభవోగ్రాగ్ని"-అర్కతనూభవుఁడు గావుననే అర్కస్వభావమగు నుగ్ర తేజము వచ్చినది.

"శిఖిఁ బోలెడి కనకలిప్త ఘనబాణంబు
వనచర కేతువుం ద్రాకించి-"

ఇట "వనచర" పదము సాభిప్రాయము.

"శిఖి" "వనచర" పదములు రావణానుచరులు హనుమంతుని తోఁకకు నిప్పంటించిన కథను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి.

3. తిక్కనంగూర్చి "యే ముఖంబునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందు" నను నెఱ్ఱనవాక్య మెంతయుఁ దగియున్నది. షేక్సుపియరు వాక్కులు హూణులనోట నాని వారి కింటివాడుకబాస యైనట్లే తిక్కన యమృతవాణియుఁ దెనుఁగువారికి నుగ్గుఁ బాలతోఁగూడ నలవడుచున్నది. జాతీయోక్తిరత్నములకుఁ దిక్కన కవనము మహోనధి యనఁదగును. తలఁపె జున్నుంబోలు తెనుఁగు నానుడుల తీపి నియ్యాంధ్రకవి వాక్కునఁ జవిఁజూడనగును: లక్ష్యములు:

"ఎనుఁ జన దని చూడక యం
దని ద్రాక్షల పండ్లు గోయఁ దలఁచుట హితమే!"

"విరటుఁడు చూచుచుండ నిను
వేవురు ముందట నట్లు ద్రోవ నొ
క్కరుఁడును గాదు గూడ దనఁ గల్గెనె!"

"గంధదంతావళ కర్ణమారుతిహతిఁ
గాంతారములు చాపకట్టుపడఁగ-"

"కయ్యమునకు యెపుడుఁ గాలు ద్రవ్వుదు కార్య
గతికిఁ జొరవు......"

ఇత్యాదు లసంఖ్యాకములు కలవు.

ర. పద్యము లల్లుటయందుఁ దిక్కనకుఁ గల కౌశల మనిర్వచనీయము. రెండు మూఁడు స్తోదాహరణములు:

సీ. "కాంతి దళ్కొత్తు నీ కడకంటి చూడ్కితోఁ
బొందఁ గానని మేను పొగులుటయును,
దీపారు నీ పల్కు చల్లంబుగా వినఁ
గానని వీనులు గందుటయును,
నింపగు నీ చెయ్వు లెలమిమైఁ గొనియాడఁ
గానని కోర్కులు గనలుటయును,
సొగయించు నీకేళిఁ దగిలి యానందంబుఁ
జెందఁ గానని మది కుందుటయును,
బాయ, నాదగు జన్మంబు ఫలము నొంద,
భావజన్మని పూనికి పార మెద్దు,
నన్ను బంటుగా నేలుము నళినవదన,
యింక నీ సిగ్గు దెర లేవేల నీకు?"

సీ. "తనికెడు నారటంబున నంత కంతకు
వెమ్మచు నునికికి వికు వఱయును,
గోలు మసంగెడు కోర్కుల వెనువెంటఁ
బాఱుచు నునికికి నూఱటయును,
వావిరిఁ బొదివెడువగల సందడిఁ బడి
యురియుచు నునికికి నుడుకువయును,
నంకంద కవిరెడు కొందలపాటుచేఁ
గలఁచుచు నునికికి నిలుకడయును,
లేమిఁ, దాల్మి కొనఁగ లేక యలంచురి
తనువు నింద్రియములు మనము ధృతియుఁ
దన వశంబు గాక తల్లడపడి, సింహ
బలుఁడు విషమ బాణు బారిఁ బాఱె."

పై పద్దెముల నాలుగు పెద్దగీట్లును నాల్గు సమస్యలవలె నున్నవి. వానిని జదువునప్పుడు భావసమన్వయముం గూర్చి సందేహవిస్మయములు పొడమును. వరుసగ గీతాదినుండు "పాయ", "లేమి" యను సూక్ష్మపదములు సమస్యాపూరణములుగను, పద్యభావపేటికను దెఱచు బీగపుఁ జెవులుగను ఉన్నవి. ఇమ్మహాకవిని గూర్చి యెంత నుడివినను తీఱదు. కాని గ్రంథవిస్తర భీతిచే నింతటితో విరమించెదను.

ముగింపునకు ము న్నొకవిన్నపము. నేను ద్రొల్త నుడివినట్లు, నా యల్పజ్ఞత నెఱింగియు, నిక్కవి కమలాసనకీర్తిమూర్తి కొక యాడిగముగను, నా యిష్టదేవతయగు సరస్వతీదేవి కొక యారాధన విశేషముగను భావించి ఈ విమర్శనమును వ్రాసినాఁడను. ఇఁక మును ముందు నా కన్న నన్నివిధముల మిన్నలగు పెద్దలు దీనిచేఁ బ్రోత్సహితులై, తిక్కనాద్యాంధ్ర మహాకవి సందర్భములం దఱచి యందలి 'నిధుల్ నెఱచూఱలిచ్చు' విమర్శన రాజముల, షేక్సుపియరు మున్నగు పురాణమహాకవులగుఱించిన ప్రౌఢవిమర్శనలం బోనివానిని, రచింపఁ దలంతురేని, యీ నా సేవ సఫలమయ్యె నని యెంచువాఁడను.

---

# హృదయావేదనము

జనమంచి సీతారామస్వామిగారు

(౫-వ సంపుటము, ౮-వ సంచిక తరువాయి)

లోకంబందున నెందఱెందఱో గుణాఢ్యుల్ భక్తి సంపన్నులున్
నాకంటెం గడుఁ గష్ట మొందఁ గనుచున్నాఁడం గదా నిచ్చలున్;
నీకారుణ్యము గాంచ నాఘనులకంటె న్నేను బాత్రుండనే
నాకే సిగ్గగు నిన్ను వేఁడునపుడైనన్ మానలే నీశ్వరా.

ఎన్ని ప్రశస్తపుస్తకములేని పఠింపఁగవచ్చుఁ బూర్తిగా;
ఎన్ని సునీతివాక్యములనేని వచింపఁగవచ్చుఁ జక్కఁగా;
ఎన్నివిధాల యత్న మొనరించిన, స్వార్థపరత్వమున్ నరుం
డెన్నఁడుఁ బాయఁ జాలఁ డని యెంచెద, నిక్కము గాదె యీశ్వరా.

కొందఱు బుద్ధిమంతులును కొందఱు మూఢులు కొంద ఱుత్తముల్
కొందఱు నీచవర్తనులు కొందఱు భాగ్యము గల్గువారలున్
కొందఱు పేదలున్ మనుజకోటిని గల్గుట చూడ వింత యౌ!
అందఱు నీదుబిడ్డలెగదా మఱి భేదము గూర్ప నేటికో!

గానముచేత నిన్ దనుపఁగల్గుట కే నల నారదుండనే?
దానముచేత నీకుఁ బ్రమదంబును గూర్ప బలిప్రభుండనే?
మానముచేత నీదు బహుమానము గాంచుట కర్జునుండనే?
ఏ నొక నిష్ప్రయోజకుఁడ, నెట్టులు నిన్నలరింతు రక్షకా?

ఏదో కారణ ముండితీరవలె నే నిట్లాపదల్ పొంద, స్వా
మీ, దానిన్ గ్రహియింపఁజాల; నయినన్ మేలే తుదిం గల్గు నం
చేదైనన్ భరియింపఁబూనెదను తండ్రీ! ఔషధం బెంతయో
చేఁదైనన్ హిత మంచు నమ్మవలెఁగా చిత్తంబులో రక్షకా!

సారవిహీన సంసరణసాగర మీఁదఁగఁ జాల నంచు నే
భీరుఁడనై యహర్నిశము వేగుచు నిన్నును వేచుచుంటి; నా
నేరములన్ క్షమించి కరుణించుట నీవిధి గాదె తండ్రి? నన్
ధీరునిఁ జేయనందుల కిదే ఫల మంచు గ్రహింపు మీశ్వరా!

---

# అప్పకవి సాహసము

జాస్తి శ్రీరాములుచౌదరిగారు

ఆంధ్రవాఙ్మయోద్ధరణమునకై భూమియందవతరించిన ప్రాబంధికకవి యగు శ్రీనాథుఁ డెట్టి నిరంకుశుఁడో, యెంతసాహసుఁడో, యాంధ్రలాక్షణిక గ్రంథములలో నెల్ల మిన్న యనందగు నప్పకవీయమును వ్రాసి ప్రఖ్యాతపురుషుండయిన కాకునూరి అప్పకవియు నట్టి నిరంకుశుఁడు, నంత సాహసుఁడు నని నిశ్చయముగ స్రుద్ధి చెప్పవచ్చును. ఈ యప్పకవి తనకాలమునఁ బాండిత్యమందుఁగాని, కవిత్వము చెప్పుటయందుఁగాని, యెవ్వరును దన కెనగా రనునంత మనోనిశ్చయమునఁ బ్రవర్తించె ననుట నిస్సందేహము. అట్లే తా రచించినట్టి యప్పకవీయమున నందం దాతనిసాహసములు పెక్కులు మనకుఁ గానవచ్చును. అప్పకవీయమునందు నాకుఁ దోఁచిన యప్పకవి సాహసకృత్యముల నిందుదాహరింపఁదలఁచియ నే నీవ్యాసము వ్రాయఁబడంగితి నని మున్ముందుగ విన్నవించుకొనుచున్నాఁడను.

(1) అప్పకవి నన్నయభట్టారకునిచే రచియింపఁబడిన యాంధ్రశబ్ద చింతామణిని దెనిఁగింపుచు నందు లేని యంశములను బెక్కింటిని జేర్చి యాంధ్రభాషకు లక్షణము మిక్కిలిగాఁ బెంచి వ్రాసిన కవి. చింతామణిలోని ప్రప్రథమపుదియైన "విశ్వశ్రేయః కావ్యమ్" అను సూత్రమును నప్పకవి విపులముగఁ జర్చించుచు,

గీ. ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న
నంఛ్రిభవునికావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసంబైన సంస్కారపక్వమైన
కాకజుష్టంబు హవ్యంబు గానియట్లు.

అని సెలవిచ్చియున్నాఁడు. కావ్యము ధర్మాద్యఖిల పురుషార్థప్రదంబయి విశ్వమునకు శ్రేయోదాయకమై యుండవలయునని భట్టారకుని యభిప్రాయమే కాని యప్పకవి చెప్పినవిధమునఁ గావ్య మెంత బాగుగా వ్రాయఁబడినను నంఛ్రిభవుని. దైనట్లయినఁ గాకి యెంగిలి చేసిన హవ్యము వలె గ్రాహ్యము కాదని కాదుగదా! ఒక నన్నయభట్టారకుఁడే కాదు, అప్పకవికిఁ బూర్వమున నున్న లాక్షణిక కవు లెవ్వరును "శూద్రుఃచే వ్రాయఁబడిన కావ్య మొప్పియున్నను గ్రాహ్యముకా"దని చెప్పియుండినట్లు చూడఁజాలము. "చెప్పునది యొకటి, చేయునది యొకటి" యను నట్లు లాక్షణికగ్రంథమును వ్రాయఁ దలఁచిన యప్పకవికి "బ్రాహ్మణులు చెప్పినదియే కావ్యము; ఇతరము కాదు" అని వర్ణనిర్ణయము చేయుట యేల సంభవించెనో తెలియరాదు. ఆ కాలము మాహాత్మ్యమే యప్పకవి నిట్లు సాహసంపడఁ జేసినదని తలంపవచ్చు.

(2) మఱియొకచో సత్కవిలక్షణమును జెప్పుచు,

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
సుశ్భక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగదక్షుఁడు
గరుణామతి యెవ్వఁ డతఁడు కవి యనఁ బరఁగున్.

మొదట నప్పకవి కావ్యలక్షణమును జెప్పుచు, నొప్పియున్నను గావ్య మంఛ్రిభవునిచే వ్రాయఁబడినట్లయినఁ బరిగ్రహింపరాదనియు,నద్దానఁబాప మొడిగట్టుకొనెదమనియుఁ జెప్పి, మఱచియో, మఱి యేకారణముననో, క్షత్రియవైశ్యులను విడిచెను. కాని కవుల లక్షణమును జెప్పునపుడుమాత్రము క్షత్రియ వైశ్యులను విడువక వారిగుట్టును బట్టబయలు చేసెను.

కవి బ్రాహ్మణుఁ డయియే యుండవలయునఁట. క్షత్రియులు, వైశ్యులు మొదలగు నితరజాతులవారు కవిత్వము చెప్పియున్నను గవులు కాఁగూడదఁట. కవుల లక్షణములలో నిది యొండు. కవి యైనవాఁడు తప్పక బ్రాహ్మణుఁడయియే యుండవలయునను నప్పకవి వ్రాఁత తనకుఁ బూర్వమున నుండుకవు లందఱు బ్రాహ్మణజాతిలోనే యుండిరని తెలియఁజే తన్వానోక రాయుచీనులగు

కవులందఱు బ్రాహ్మణజాతులవారే కావలయునని నియమించునో బోనపడదు. అప్పకవి మతి ననుసరించిన వో, సంస్కృతమునఁ జంపూ రామాయణమును వ్రాసిన భోజుఁడు మొదలగు క్షత్రియకవీశులను బ్రాహ్మణులుగనైనఁ జేయవలె, లేకున్న నట్టి మహాకవులను సయితము కవులు గారనియైన భావింపవలె. అంతదూరము పోనేల? ఈ యప్పకవికి నేబది యఱువది సంవత్సరములకు మాత్రమే పూర్వమున నుండు కృష్ణరాయకవిని, రామరాజభూషణకవిని నేమి చేయుదము? మొదటినుండియు నిట్టి జాతివైషమ్యము గలవాఁడగుటచేతనే కావలయు, నప్పకవి ఆముక్తమాల్యద కృష్ణరాయ రచితము కాదనియుఁ, బెద్దనకవిప్రణీతమనియుఁ జెప్పుట. భావమం దైన నేమి, శైలియం దైన నేమి, భావయం దైన నేమి, మనుచరిత్రము రచియించిన పెద్దన కవిత్వమునకును, నాముక్తమాల్యద రచియించిన కృష్ణరాయల కవిత్వమునకు నెట్టి సామ్యమును గన్పడదు. ఈ విషయమై పరమార్థుని కులలో విమర్శకులు పెక్కండ్రతివిపులముగను, సవిమర్శకముగను విమర్శించియుండిరి. తుదకు నాముక్తమాల్యద కృష్ణరాయ రచితమనియ నిగ్గుఁ దేల్చిరి.

అప్పకవి దూర మాలోచింపక బ్రాహ్మణేతరుల యందుఁ దనకుగల నిరసనభావముచే రాయల యాముక్తమాల్యదను బెద్దన దనుట కడుంగడు సాహసమనుట యసంగతము కాదు.

(3) కృష్ణరాయలట్ల బ్రాహ్మణేతరుఁడయి, మహాకవియయి, యందజేలోనఁ జేర్వడ్డ రామరాజ భూషణునియందును నప్పకవికి ద్వేషము లేకపోలేదు. అట్లు ద్వేషము లేనియెడల నప్పకవి తనగ్రంథమం దించుమించుగాఁ బ్రబంధాంక మూర్తి కవితో సమకాలీన కవులగు పెద్దన, సూరన మొదలగు కవీశులచే వ్రాయఁబడిన మనుచరిత్రము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, రాఘవ పాండవీయము, పారిజాతాపహరణము, పాండురంగమహాత్మ్యము మొదలగు ప్రబంధములనుండి పద్యముల నెన్నింటినో తీసికొని లక్ష్యములనుగా నుదాహరించి, వసుచరిత్రమంత పెద్దప్రబంధములోని యొకపద్యమైనను దన గ్రంథమం దుదాహరింపకుండుటకుఁ గారణమేమి? అప్పకవి యుదాహరించిన ప్రబంధములకంటె వసుచరిత్ర మెందును దీసిపోదని చదువరులకుఁ దెలియకపోదు. ఒకచోమాత్ర మప్పకవి యగ్రాహ్యవర్ణయతులు చెప్పుసందర్భమున వసుచరిత్రములోని

శా. ఓ లంబాలక యోలయోలయన నో
లోలంచు మేలంబునకా
లోలంబాలక యోర్తు గ్రుంకి బిసవ
ల్లుల్లున్మి తూఁగాడి క్రాం
గేలం బూని తటాలున న్నెగసె న
త్రీశాంబు నాథాంబుజా
త్రీలోకంబు జయించి వారల యశ
శ్శ్రీఁ దెచ్చుచందంబునన్.

అనుపద్యము నుదాహరించి—"ఈ పద్యము రెండవ చరణము మొదలను లోలంబాలక యోర్తు గ్రుంకి యని కవి హృదయము. ఇది గానక కొందఱు 'ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభరోఽపిచ' అని నిఘంటున ఉన్నదని రోలంబాలకయని చదువుదురు. ఇట్లని రామరాజభూషణు తలంపు కాదు." అని తెలివిడి వ్రాసియున్నాఁడు. అప్పకవికిఁ బ్రాచీనుఁడగు నెవ్వఁడో యొక యనామధేయుఁ డీపద్యమునను "రోలంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లుల్లున్మి" అను పాఠాంతర మొప్పిరి, ప్రాస మంగీకరించియుండ, నీ యప్పకవి కది సమ్మతము కానందున, భూషణము తలంపు లోలంబాలక యనియే కాని రోలంబాలకయని కాదని చెప్పి యన్యమతమును ఖండింపవలసి వచ్చినందునఁ దనపబ్బముఁ గడపుకొనుటకయి వసుచరిత్రములోని యీ యొకపద్యమును మాత్ర ముదాహరించియున్నాఁడు. దీనిచే బ్రాహ్మణేతరుఁ డైనందున భట్టుమూర్తియందు నప్పకవికి ద్వేష మున్నట్లు సూచితమగుచున్నది. ఇవ్విధమున నప్పకవి తెగించి బ్రాహ్మణేతరకవులు కవులు గారనియు, వారి కావ్యములు కావ్యములు గావనియుఁ జెప్పుటకు నాకాలమున నుండు బ్రాహ్మణప్రభావము, బ్రాహ్మణేతర తూష్ణీంభావమును గారణము లై యుండవచ్చునని యూహింపవచ్చును.

(4) తే. చెల్లు నని ముందు భీమన చెప్పె ననుచుఁ
గలుపుదురు రేఫములను అకారములను
దుష్టకవు లవి యొక్కటైనఁ దొంటి పెద్ద
లందఱును నేల విభజింతు రని తెలియరు.

భీమన రేఫ అకారముల మైత్రిని జెప్పెనని తలంచి కొందఱు దుష్టకవులు రేఫఱకారములను యతిప్రాసము లందుసమానములుగఁ జూతురే కాని శిష్టకవులుమాత్రము రేఫఱకారముల మైత్రిచేయరని యప్పకవి చెప్పియున్నాఁడు. రేఫఱకారములకు మైత్రిని గల్పించి యప్పకవిచే దుష్టకవి యని పేర్కొనఁబడిన కవి యెవరు? భక్తాగ్రేసరుఁడు, కవిపుంగవుఁడు సను బమ్మెర పోతనామాత్యుఁడు. భాగవతమం దీదోషము లేదట. కాని రేఫద్వయమైత్రి చేసినంతమాత్రమున నందలి పద్యములలో నేనిని గూడ లాక్షణికు లుదాహరింపరైరట. చెఱువుమీఁద నలుకఁ జూపిన నష్ట మెవరికి?లాక్షణికు లుదాహరింపకపోయినంతమాత్రమున భాగవతము ప్రఖ్యాతికి వచ్చియుండలేదా? లేచినదిమొద లాబాలగోపాలమునకుఁ బారాయణ గ్రంథమై యుండుటలేదా? వేయేల? భక్తిరసపూరితము, శబ్దాలంకారశోభితము, నిరర్గళ ధారావాహియునగు కవిత్వముతో నిండియున్న భాగవతమువంటి సద్గ్రంథమును మన యాంధ్రవాఙ్మయమున నిప్పటికి నెవరైనఁ జేయఁ గల్గిరా? వినఁగల్గితిమా?

అప్పకవి భాగవతమును గుఱించి వ్రాసినపద్యము:

ఉ. బమ్మెర పోతరాజకృత
భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొఱుప
యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి
ప్రాసము లైన కతంబునంగదా
యిమ్ముల నాదిలాక్షణికు
లెల్లను మాని రుదాహరింపఁగన్.

ఇట్లు రేఫద్వయమైత్రి చేసిన పోతరాజు లక్షణ కవి గాఁడని చెప్పిన యప్పకవిని విమర్శించి,బమ్మెరపోతనార్యుని విమర్శించి, కూచిమంచి నరసింహకవి తన సర్వలక్షణ సారసంగ్రహమున వానిని ప్రమాణీకరించెను. ఈరేఫద్వయమైత్రి · యాముక్తమాల్య యం దనేకస్థలములఁ జేయఁబడియున్నది. అయినను నప్పకవి యందలి పద్యముల నెన్నింటి నుదాహరించి యుండలేదు? ఇంకను ననేకగ్రంథములం దీమైత్రి చేయఁబడియున్నను నొక భాగవతమునే యప్పకవి నిరసించుటచూడ నీతని కుండు మెండిపట్టుదలయుఁ, గొందఱు మహాకవులయెడఁ గల్గు చూపోపమియుఁ దెల్లములు కాఁగలవు.

(౫) ఇఁకను బండితులు ప్రతిజ్ఞఁ బట్టి కట్టించిన కంచుఢక్కలను బగులఁగొట్టించి, రాజులచేఁ గనకాభిషేకములనొంది, యెదుట నిలిచితన్నాఁగువారెవరును లేరని యనిపించుకొనిన శ్రీనాథమహాకవి నప్పకవి యేపాటి వానిఁగాఁ జూచెనో చూడుఁడు. శ్రీనాథుఁడు ధూర్త కవియఁట; క్రిందుమీఁదులు గానక ప్రయోగములను బ్రయోగించునఁట. అప్రశస్తప్రాసములను జెప్పుచుఁ గవి

గీ. అప్రశస్తము లనుప్రాసజాలము లలం
కారవిస్మితములు కావు గానఁ
దివిరి ధూర్తులైనకవులు కల్పనఁ జేసి
యొప్పిదంబు లనుచుఁ జెప్పరాదు.

అని వ్రాసి, దీనికి లక్షణము వీథినాటకమునందలి దని యీ క్రిందిపద్యమును వ్రాసియున్నాఁడు:

ఉ. కందుకకేళి సల్పెడు ప్ర
కారమునం బురుషాయితక్రియా
తాండవకేళి సల్పెడు వి
ధంబునఁ బాపరభామ లేఁత నీ
రెండఁ బ్రభాతవేళ రచి
యించెను గుబ్బలమీఁది హారముల్
కుండలముల్ కురుల్ గడల
గోమయపిండము లింటిముందటన్.

ఇందు ద, డ, ప్రాసము చేయఁబడినది. దీనినొప్పుకొనుట కప్పకవి యిష్టపడనందున ధూర్తకవులు చెప్పిన యప్రశస్తములగు ప్రాసములు సరియని యంగీకరింపరాదని చెప్పెను. వీథినాటకము శ్రీనాథరచితమే

కదా ? అప్పకవి పేరుకొనిన ధూర్తకవి శ్రీనాథుఁడే కదా? శ్రీనాథుఁడు ధూర్తుఁడయినట్లయిన నట్టిధూర్తుని చే రచింపఁబడిన కాశీఖండము, నైషధము మొదలగు ప్రబంధములలోని పద్యముల నేల యప్పకవి లక్ష్యములుగ నుదాహరించెను? ఒకవేళ వీథినాటకము శ్రీనాథరచితము కాదని యప్పకవి యభిప్రాయ మందు మేని, మఱొకచో నిత్యసమాసవిశ్రాంతులను జెప్పునప్పు డప్పకవి కర్ణాటశబ్దమున కుదాహరణ మిచ్చుచు శ్రీనాథుని వీథి నాటకములోనిదని యీదిగువ పద్యము నుదాహరించి యున్నాఁడు:

మ. కుసుమం బద్దిన చీరకొంగుపొలయం
గ్రొవ్వారు పాలిండ్లపైఁ
బ్రిసరంబుల్ పొలుపార వేణి యవటూ
దేశంబునన్ రాయఁగాఁ
బస నెవ్వాఁడో యొకండు రాత్రి గతులం
బల్గాసి కావించినన్
వసివాళ్వాడుచు వచ్చుచున్న యది క
ర్ణాటాంగనం గంటిరే.

కనుక నప్పకవికి వీథినాటకము శ్రీనాథునిదని తెలియదని చెప్పుటకు వలనుపడదు. అయినను ఇంటిలోఁ దూటి యింటివాసములను లెక్కించిన విధమునఁ దనకుఁ గావలసిన చోటులనెల్ల శ్రీనాథుని పద్యముల నెన్నింటినో లక్ష్యములనుగాఁ దీసికొని, యొక ద, డ, ప్రాసమంగీకరింపవలెనని వచ్చినందునమాత్రము శ్రీనాథునివంటి మహాకవినిసయితము జంకక "ధూర్తకవి" యనిన నప్పకవిని మనము సాహసుఁ డనుట సాహసమా ?___

(6) శ్రీనాథుఁడు ధూర్తుఁ డగుటయ కాక, ప్రయోగములను గానక ప్రయోగించునఁట. భూతార్థక్రియా సంధిని జెప్పు సందర్భమున నప్పకవి

గీ. వసుధ మత్తమపురుషైకవచనమునను
దక్క భూతక్రియాపదాంతములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు దైత్యదమన.

అని వ్రాసి యుత్తమ పురుషైకవచనమునందు నికారమునకుఁ దప్ప మిగిలిన భూతార్థక్రియాపదాంతములఁ గల్గు నికారమునకు నిత్యముగ సంధివచ్చునని "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అనియున్న నన్నయభట్టీయ సూత్రమునకు సరిగాఁ బరివర్తించియున్నాఁడు. కాని శ్రీనాథుఁ డీనియమమును బాటింపక పరపురుషక్రియా ఇకారమునకు సంధిచేయుట మానెను. దానినే యప్పకవి

క. నిగదించెను శ్రీనాథుఁడు
ధరఁజేని శృంగారనైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరునని పర
పురుషక్రియలఁ బ్రకృతి భావము గలదే___

అని యుదాహరించి శ్రీనాథుఁడేమియు నెఱుఁగనివాఁడగుటచేఁ బరపురుషక్రియల యికారమునకు సంధిచేయుటమానెనని తన యభిప్రాయమును వెలిబుచ్చెను. ఈసంధిని చేయుట యొక శ్రీనాథుఁడే కాక తక్కుంగల కవులెల్లరును మానిరి. కనుకనే యిటీవలి చిన్నయసూరి తన బాలవ్యాకరణమున "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అనియున్న భట్టారకుని సూత్రమును మార్పుచేసి క్రియాపదాంశంబులం దిత్తునకు సంధివైకల్పికముగ నగు; మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధియగును- అని రెండు సూత్రములుగా సూత్రించియున్నాఁడు. ఇట్లె యప్పకవికిఁ బ్రాచీనుఁడగు నథర్వణుఁడును

శ్లో. ప్రథమే చోత్తమేచైవ క్రియేతో వా భవేచ్చ్యుతిః,
నిత్యమన్యస్యవికృతౌ క్త్వార్థే నభవేత్సదా.

అని వ్రాసియున్నాఁడు.

వికృతే= తెనుఁగునందు, ప్రథమేచ=ప్రథమపురుషమందుండునట్టియు, ఉత్తమేచ=ఉత్తమపురుషమందుండునట్టియు, క్రియేతః=క్రియల యికారమునకు, వా=వికల్పముగ, చ్యుతిః=జారుట (సంధియగుట), భవేత్ =అగును; అన్యస్య=ప్రథమోత్తమపురుషముల కితరమైన మధ్యమపురుషేకారమునకు, నిత్యం=సంధినిత్యము; క్త్వార్థేతః=క్త్వార్థక ఇకారమునకు, సదా=ఎప్పుడును, నభవేత్ =సంధి

యుండదు, ఇట్లు స్పష్టముగఁ దనకంటెఁ బూర్వులగు నథర్వణాదులు వ్రాసిన వ్రాఁతలనైనఁ గానక యప్పకవి "కానకపర పురుష క్రియల యికారమునకు సంధిచే యుట మానెనని" శ్రీనాథునిమీఁదికి దాడివెడలుట మంచిపనికాదు.

పైవిషయముల నన్నింటిని నిష్పక్షపాతమున విమర్శించినవా రప్పకవిని సాహసుఁడు నిరంకుశుఁడు నని యనకమానరని తలఁచెదను. ఇంకను నప్పకవీయ మున నందందు బాలకడలియందు నత్తగుల్లలవలెఁ గొన్ని యైన దోషములు లేకపోలేదు. వానినన్నింటిని యప్పకవీయ విమర్శనమున రావుసాహేబు గిడుగు. వేంకట రామమూర్తి పంతులుగారిచేఁ దెలియ వ్రాయఁబడినవి. జిజ్ఞాసువు లప్పకవీయమునందు వారు వ్రాసిన పీఠికను జూచునది.

---

# అంధకారము

శ్రీ. శ్రీ. (కవితాసమితి)

సాయంసంధ్య

దివసమ్మునకు వయోధికత ప్రాప్తించినది
తీక్ష్ణదీప్తులడంగి దినరాజు కృశియించె
వృద్ధాహ్ణమిడిన దీవెనచేత జనియించి
ఔద్ధత్యమునచే అహర్పతిన్ మ్రింగితిని
ఈ నా భవమ్ము లోకానంద మొసగునా
ఏనెప్పటికి కూడ ఇటు వికాసింతునా
నాకెన్నటికినైన లేకుండునా మృతి
ఈకాంతి నశియించి చీకటులు క్రమ్మవా!

*    *    *    *

అంధకారము

ఈ దివారోచిస్సుధాధామముం గూల్చి
ప్రాదుర్భవించి నీ బయలుదేరినయంత
జగతి యేమోకాని
                    నగవే మరచిపోయి
వగపుచే నిట్టూర్చి
                    వనటచే చలియించు
నా మేలిముసుగులో నలుపులూరెడునంట
నా మీద జగతి కింతయు ప్రేమలేదంట!

*    *    *    *

నక్షత్రము

ఈ గభీర నిశీథినీ గర్భకుహరాన
నెలుగెత్తి ఏడ్తువెందుల కంధకారమా
వాగులై నా ప్రేమ వరియించునే నిన్ను
స్వాగతమ్మొసగు నాశాగంధవాయువుల్
నిలువలేనే నీవు
                    నిలిచియుండనివేళ
వెలుగలేనే నీవు
                    విస్తరించనివేళ
నీ కాటుకలచేత నా కనుల్వికసించు
నీకు నేనే, నాకు నీవె యాలోకాన!

---




పాంచాలదేశమందలి కొండ ప్రదేశములలో
నొక సుందరమైన వనము కలదు. అది వసంతర్తు వగు
టచే చెట్లన్నియు పచ్చనియాకులతో నిండియుండెను.
పుష్పజాతులు వనమునందంతటను మనోజ్ఞ సుగంధమును
వెదజల్లుచుండెను. కోయిలలు మధురగానము లొనర్చు
చుండెను. ఆ వన మధ్యమున నొకకోన గలదు. ఆ సామీ
ప్యముననే ఒక పటకుటీరము నేత్రానందకరముగ నుం
డెను. ఒకనాటి ఉదయకాలమున రసపుత్రయోధు
డొకడు సాయుధుడై, అశ్వముపై స్వారిచేయుచు
వచ్చి, ఆ కుటీరము ప్రక్కనే గుఱ్ఱముదిగి, ఒకచెట్టు
నకు దానిని కట్టివేసి, కుటీరద్వారముకడ కేగి, తన కర
వాలముతో ముమ్మారు తలుపుపై గొట్టెను. వెంటనే
కవాటము తెరువబడెను. యౌవనవతియగు నొక రమణీ
మణి చిరునగవుతో నాతని సమీపించి, అర్ఘ్యపాద్యాదు
లొసంగి, సుఖాసీనుం జేసి; ఆతని ప్రక్కనే మనుసిగ్గు
తో నిల్చియుండెను.

"సుందరీ! నీలో నే డేమియో నూత్న సౌందర్య
ము పొడసూపుచున్నదే. అదేమో కాని, యిచ్చటకు
వచ్చి నిన్ను గాంచని దినమున మన మెంతయు కలకబార,
పిచ్చివానివలె తిరుగుచు, నా విధ్యుక్తధర్మమునే మరచు
చుందును."

"విజయా! అది ప్రణయ లక్షణమేగదా! ప్రే
మాస్పదులగు యువతీ యువకులు ఒండొరులను బాసి
సహింపగలరా?"

"నీ పనినమాట నిక్కువము. నీదర్శనభాగ్య మబ్బిన
దినమున యుద్ధములో సంపూర్ణజయ మొందుచుంటిని.
లేనినాడు, అది యేలొకోకాని, శాత్రవులు నా సేనపై
కురికి, నా వారిని తమ వాడి కరవాలముల కెరగా చేయు
చుందురు."

"ఇంకను యుద్ధ మెన్నినాళ్లు సలుపవలెను?"

"అది యేమి చెప్పగలను? శత్రుసంహారము పూర్తి
యగువరకు యుద్ధభూమి వీడుటకు వీలు లేదు."

"అట్లగుచో నిచ్చోట నున్నంతకాలము తమ
దర్శనభాగ్యము కల్గునని యాశించుచుంటిని."

"సుశీలా! నిన్ను బాసి నే నుండగలనా? వీలగునపు
డెల్ల వచ్చుచునే యుండగలను. చాల ప్రొద్దుపోయినది.
సైన్యాధ్యక్షుడు నాకై ప్రతీక్షించుచుండును. నీ తండ్రి
గృహమునకు వచ్చు వేళగూడ సమీపించుచున్నది. పోయి
వచ్చెద"నని, ఆమె నాలింగనమొనర్చి, అధరసుధారస
ముం గ్రోలి, తిరిగి అశ్వారూఢుడై అతడు చిటికలో
మాయమయ్యెను. ఆ కుసుమకోమలియు విజయుని గుఱ్ఱపు
డెక్కల ధ్వని వినవచ్చునంతవరకు నచ్చోటనే యుండి,
ఆపిదప తన పెంపుడు లేడి పిల్లను ముద్దుగొని లోని
కేగెను.

౨

సుశీల నందవంశీయుడగు మాధవుని యేక పుత్రిక.
నవయౌవనవతి. సుకుమారశరీర. అపూర్వ సౌందర్యవతి.

పాపము, చిన్నతనముననే తల్లి స్వర్గస్థురాలయ్యెను. నాటి నుండియు సర్వము దానయై, మాధవుఁ డామె నతిగారాబముతో పెంచుచుండెను. మాధవుడు మహాపద్మనందుని కొలువున నున్నతోద్యోగమునం దుండెను. కాని కాల మహిమ కొనియాడ నేరితరము! నందుని కుమారులు చాణక్యుని నిండు సభలో నవమానపరచుటచే నాతఁడు వారిని రాజ్యభ్రష్టులుగ చేయ శపథ మూని, పద్మనందుని యాగ్రహమునకు గురియైన చంద్రగుప్తుని జేరి, సైన్యములు చేకూర్చి వారిపై కత్తికట్టెను. ఆనాటినుండియు దేశములో రెండుపక్షము లేర్పడెను. రాజభక్తులెల్లరు నందుని పక్షము. దేశభక్తులెల్లరు చాణక్యునిపక్షము. నానాటికి చంద్రగుప్తుడు పరదేశీయులగు యవనులను జయించి, రాజ్యము నాక్రమించుకొనుచుండెను. మాధవుడు నందపక్షపాతి. ఆతఁడు చంద్రగుప్తుని దినదినాభివృద్ధి గాంచి, రాజకొలువు చాలించుకొని, రహస్యముగా వనవాసము చేయుచుండెను. తాను నందపక్షపాతి యని పరు లెవ్వరికి తెలియకుండ కాలక్షేపము చేయుచుండెను. ఇట్లుండ నొకనాడు మాధవుడు తన యేకపుత్రికయగు సుశీలను వీడి మారదేశము కార్యార్థియై పోయెను. అట్టి సమయమున యోధుడొకడు కొలదిమంది సైనికులతో త్రోవతప్పి, సాయంతన మగుటచే ప్రయాణము సాగించుటకు వీలు లేక, ఆ పటకుటీర ప్రాంతమున విడిసెను. కుటీరమునం దెవ్వరో యుండిరని గ్రహించి, యందే సుడించి సుశీలం గాంచెను. ఆమెయు నాతని కర్ఘ్యపాద్యాదు లొసంగి, యేవియో కొన్ని రసఫలములను, క్షీరములను ఒసంగి, అతిథిపూజ యొనర్చెను. ఆయువతీయువకులు ప్రథమావలోకనము వలననే పరస్పరానురాగు లైరి. ఆనాటినుండియు విజయుడు నిత్యము సుశీలాదర్శనాపేక్షితుడై వచ్చుచు పోవుచుండెను. సుశీలతండ్రి నందపక్షపాతియని గ్రహించినపుడు విజయుడు చాల కటకటంబడెను. ఈతడు చంద్రగుప్తుని పక్షమూనెనేమో? తండ్రి లేనిసమయముననే వచ్చి,కొంతకాల మామెతో గడపుచుండెడివాడు. వారి ప్రణయము నానాటికి అధికము కాజొచ్చెను. శకుంతలాదుష్యంతులకుబోలె, వీరిద్వరకు గాంధర్వవిధిని వివాహమయ్యెను. ఈ విషయము తండ్రికిమాత్రము తెలియదయ్యె. ఈవిజయుఁడే పైని వర్ణింపబడిన యోధు డని చదువరు లీవరకే గ్రహించియుందురు.

## 3

మాధవుడు మారప్రయాణమొనర్చి అప్పుడే వచ్చియుండెను. అతడు చాల డస్సియుండుటయేకాక, మిగుల చింతాక్రాంతుడై యుండెను. సుశీలయు తండ్రిని చూచి మిగుల దిగులొందుచుండెను.

"అమ్మా! చాణక్య చంద్రగుప్తుల విజయధ్వని దిగంతముల ప్రాకుచున్నది. మనకు సామీప్యముననే శత్రుసేనలు విడిసియున్నవి. మన మిచ్చోట నుంటి మని వారికి తెలిసెనా, మన ప్రాణములు మనకు దక్కవు. కనుక రేపు ప్రాతఃకాలముననే యిచ్చోటు బాసిపోవ వలెను." అని యతడు చెప్పెను. సుశీల మనస్సు చివుక్కుమనెను. ప్రాణరక్షణార్థమై అచ్చోటు బాసి పోవుట న్యాయమే. కాని తన ప్రాణప్రియుడు తిరిగి తన కెట్లు కాన్పించును? వీ రెచ్చటికి పోయినది ఆతని కెట్లు తెలియును? పోనీ, ఆతనికి వర్తమానమంపుదుమన్న, తన రహ



స్యము వెల్లడియవునుగదా! కష్మ వ్రాయుదుమన్న, తన ప్రియుడెవ్వరో, ఆతని వాసస్థల మెద్దియో ఆమెయెన్నడు కనుగొనియుండలేదు. తనపేరు "విజయు"డని మాత్రము ఆతడు నుడివియుండెను. ఇపుడు కర్తవ్యమేమి? తామీ స్థలము విడిచిపోవుచున్న ట్లాతనికి తెలియు టెట్లు? ఆమె దీర్ఘాలోచనచేసి తుదకిట్లు తెంపుజేసెను: "విజయుడు సైన్యమునందే యుండును. సైన్యము సమీపమునందే విడిసియుండెనని తండ్రి చెప్పెనుగదా! రాత్రిసమయమున నేనొక్కతనే పోయి, ఆతని నచ్చోట కలిసికొని, యీ విషయ మాతని కెరుకపరచెదను".

## ౪

రాత్రి గాఢాంధకారముగ నుండెను. పదిగంటలు దాటిపోయెను. యుద్ధక్షేత్రమందలి డేరాలలో సైనికనికాయమంతయు విడిసియుండెను. చాలమంది భోజనానికృత్యములను గావించి శయ్యలపై జేరిరి. అంతయు నిశ్శబ్దముగ నుండెను. అట్టి సమయమున నంగనామణియొర్తు శరీరమునిండ బట్టకప్పుకొని మేలిముసుంగు సైచికొని, ఆ డేరాలమధ్యమంకి యెదియో వెదకుచున్న దానివలె బోవుచుండెను. ఆమె రెండు మూడు డేరాలను ఈక్షించి, తనకు వలసిన వస్తువు లభింపమి, నిస్పృహ చెందుచు, తిరిగి మరియొక డేరాలోనికిబోవ సమకట్టుచుండెను. ఇంతలో "సుశీలా" యని యెవ్వరో సంబోధించినట్లాయెను. వెనుదిరిగి చూచునప్పటికి విజయుడు సాక్షాత్కరించెను. ఆమె యాతని వక్షమునజేరి దుఃఖాశ్రువులు రాల్పసాగెను.

"సుశీలా! ఇంత రాత్రివేళ నొంటరిగా ఏల వచ్చితివి? కంట నీరిడుచుంటివేమి?"

సుశీల చాలవర కేమియు పలుకలేదు. రెప్పవాల్పక యాతని ముఖమునంక చూడ దొడంగెను. శరీరమంతయు కంపమొందుచుండెను.

"ఏమి, పలుకకుంటివి?"

"విజయా! నీకొరకే వచ్చితిని. మన మొకరినొకరు వీడిపోవలసిన దురదృష్టము సంభవించినది. శత్రువులు తన్ను కనుగొందురను భీతిచే మా జనకు డీవనమును బాసిపోవ నుద్యమించెను."

"ఎప్పుడు?"

"రేపుదయమున నే పోవలయునట. ఈ సంగతి నీకు దెలిసియుండిన ఆశాభంగము కలుగకుండునని తోచి యిటు వచ్చితిని."

"ఇకముం దెచ్చట నివసింప దలంచెను?"

"ఆ సంగతి నాకేమియు చెప్పలేదు. నాకేమియు తోచకున్నది. మనము తిరిగి కలిసికొనుట యెన్నడో?"

"ప్రేయసీ! భీతిల్లకుము. నీవెచ్చట నున్నను నీప్రియుడు వెక్కలు కట్టుకొని వ్రాలునని నమ్ముము."

"మనోహరా! మన మీ కష్టముల పాల్పడకుండ నుండుటకు వీలులేదా? వెంటనే నన్ను నీయండ చేర్చుకొనరాదా?"

"అది నా కంగీకారమే! కాని ప్రస్తుత మీయుద్ధభూమియందు జీవనము గడపుచు, నిన్ను చేకొని యెచ్చట నుంచుదును? అదియుంగాక, సైనికులు స్త్రీలోలురై యుండకూడదను శాసనమున్నది యెఱుగవా?"

"అట్లయిన, నే నీవిధముగ నెంతకాల ముండవలయును?"

"యుద్ధము ముగిసినవెంటనే నిన్ను తప్పక గొనిపోయి నా గృహము చేర్చెదను. అందాక—"

"అది యెన్నడో? ఈలోన మీకు బిడ్డకలిగిన—"

"భయపడకుము. ఈలోననే వచ్చి కొనిపోయెదను. చాలరాత్రి గడచినది. నాఅశ్వశకటము నెక్కిపొమ్ము. అది నిన్ను మీగృహసమీపమున విడిచివచ్చును."

"వద్దు- వద్దు- నేను కాలిబాటనే పోయెదను. విజయా! నన్ను మరువవు గదా?"

విజయుడు ఆమెను తన బాహువులలో చేర్చికొని విశాలఫాలభాగమును తనహస్తముతో రాయుచు, ముద్దుగొని వీడ్కొల్పెను. ఆమెయు మెలమెల్లగ నేగుచుండెను. ఇంతలో విజయుడు తిరిగివచ్చి, ఆమె నాలిం

గనమొనర్చి, తన అశ్వముపై నిడికొని ఆమె గృహసమీపమున డింపెను.

"విజయా! ప్రతి నిమిషము నీకై యెదురుచూచుచుండెదను. నా ప్రాణములు నీ చేత నున్నవి. జ్ఞాపకముందునా?" అని చెప్పుచు, ఆ గాఢాంధకారములో నదృశ్యమాయెను.

౫

నెలలు గడచిపోయెను. సుశీలకు ఆరవమాసము కూడ వెళ్లిపోయెను. ఆమె తండ్రి కీసంగతి యేమియు తెలియకుండెను. ప్రియుడింకను తన్ను చేరకపోవుటవలన సుశీల చాల కటకటం బడుచుండెను. ఈలోన దేశములో చాలమార్పులు కలిగినవి. చంద్రగుప్తుడు యవనులను పాంచాలమునుండి పారద్రోలి చాణక్యసహాయమున ఉత్తర హిందూస్థానమంతయు జయించి నందవంశీయుల నంహరినాశ మొందించి, మగధరాజ్యమునకు పట్టభద్రుడాయెను. ఆకారణమున సుశీలామాధవులు తమ ప్రాణములర చేతులందుంచుకొని యేనిముషమునకేమి వాటిల్లునోయని మిక్కిలి భయపడుచుండిరి. తన ప్రియుడుత్తరమైన వ్రాయడయ్యెనని సుశీల చాల దుఃఖించుచుండెను. ఆ సమయముననే సైనికుడొకడు లేఖ నొకదానిం గొనితెచ్చి సుశీల కొసంగెను. ఆమె యాతురతతో దానిని విప్పి యాక్రిందివిధముగ జదివికొనెను—

"సుశీలా,

నిన్ను సందర్శింపవలెనని చాల యత్నించితి. మీరున్న ప్రదేశముకూడ నాచారులవలన గ్రహించితి. కాని దేశములో కలిగిన మార్పులవలన నాకార్యభారమధికమాయెను. ఇకముందు నిన్ను చూడగల్గుదునన్న యాశలేదు. మనకు కలుగబోవు బిడ్డనుగూర్చి నాకు వీలగునంతవరకు శ్రద్ధతీసికొందును.

—విజయుడు"

ఈ ఉత్తరము చూచుటతోడనే, సుశీల మొదలు నరకిన కదళీవృక్షమువోలె నేలగూలెను. "బిడ్డనుగూర్చి వ్రాసెను. కాని తల్లిగతి యేమికావలయును?" కొంతవరకామె స్పృహతప్పి పడియుండెను. ఉత్తరము మాడనామె ప్రక్కనే గాలి కెగురుచుండెను. ఇంతలో ఆమె




తండ్రి అచటి కరుదెంచి నేలపై పడియున్న తనూజను, ఆమె ప్రక్కనేయున్న ఉత్తరమును కనుగొనెను. తోడనే ఆలేఖందీసి ఆమూలాగ్రముగ జదివికొని నివ్వెరజెందెను. సుశీల కన్నుల విప్పెను. ఎదుటనున్న తండ్రిని కనుగొని లజ్జాభయములు తన్నావహింప, తల వంచుకొనియెను.

"సుశీలా! ఈ లేఖమూలమున నీవు చెప్పకుండగనే సర్వము విదితమయ్యెను. నీవొనర్చిన కార్యము మన క్షత్రియ కులధర్మమునకు దగియే యున్నది. కాని యీ విజయుడెవ్వరు?"

"తండ్రీ! క్షమింపుము. ఆతని విజయుడనుట తప్ప ఆతడెవ్వరో నాకు తెలియదు. ఆతనికి నా యాత్మను ప్రేమపూర్వకముగ సమర్పించియుంటిని"—

"ఎంతవెఱ్ఱిదానవు! ఆతని వంశనామము లెవ్వియో తెలియకుండ ఏల చేపట్టితివి?—దీనివలన నీకను నష్టమేమియో గ్రహించితివా? నీ బిడ్డ అనామకుడై తండ్రికి దూరస్థుడై యుండవలసివచ్చును—"

సుశీల యేమియు మాఱు పలుకలేదు. కాలము గడచిపోవుచుండెను. ఆమెకు పదిమాసములు నిండెను. ఒకశుభముహూర్తమున ఆమె కొక తేజోవంతు డగు పుత్త్రు డుదయించెను. ఆతని కేమియు పేరిడలేదు.

దేశములో కల్గిన మార్పులవలన నందవంశీయుఁడగు మాధవునకు కష్టదినములు సంప్రాప్తమాయెను. శత్రువు లాతని వెదకి పట్టుకొనిరి. ఆతనిపై నభియోగము దెచ్చి న్యాయస్థానమున విచారణ జరుప నెంచిరి. సుశీల చాల దుఃఖితయై యుండెను. నేడో రేపో విచారణ ప్రారంభ మగునని తలచుచుండిరి. ఇంతలో నెవరో యొక సేవకుడు ఒక లేఖం గొనివచ్చి మాధవున కొసంగెను అం దిట్లుండెను—

"దీనియందు అనుమతిపత్రము కలదు. దీనివలన మీరు వెంటనే ఈదేశము వీడి పోవచ్చును మిమ్ముల నెవ్వరు నిరోధింపరు. విజయుని కోర్కెవలన నిది మీకొసంగబడెను. చంద్రగుప్త."

దానింజూచి, సుశీలామాధవులు చాల సంతసించి, కరుణార్ద్రహృదయుఁడగు చంద్రగుప్తుని కొనియాడుచు, నాఁడే దేశము వీడి, దక్షిణదేశమునకు బోయిరి.

౬

రెండేండ్లు గడచెను. సుశీల కుమారుఁడు శుక్లపక్షచంద్రునిరీతి దినదిన ప్రవర్ధమానుఁ డగుచుండెను. తల్లికిని, తాతకును తన బాల్యచేష్టలచే చాల నానందము చేకూర్చుచుండెను. కాని సుశీలమాత్రము భర్తృవియోగముచే చాలకృశించి, ఖిన్నురాలై యుండెను. ఎట్లయినను తన బాలుని తండ్రిని కనుగొను ఉద్దేశముతో తిరిగి ఉత్తరదేశమునకు పోవుదమని సుశీల ప్రోత్సహించుటచే మాధవుఁ డంగీకరించెను. తిరిగి పది దినములలో పాంచాలదేశము చేరిరి. కాని వెంటనే యీతడు నందవంశీయుఁ డని గ్రహించి పాంచాల దేశాధికారి, మాధవునకు ఉరిశిక్ష విధించి, చక్రవర్తి యాజ్ఞకై నిరీక్షించుచుండెను. కాని నియమితకాలము గడచిపోయినను చక్రవర్తి యొద్దనుండి యేమియు నాజ్ఞ రాదయ్యెను. అందుచే నొక యుదయమున మాధవుని ఉరిస్తంభ మెక్కించిరి. సుశీలయు, ఆమె చిన్నికుమారుఁడును ప్రక్కనే నిల్చి కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండిరి. ప్రజలెల్లరు గుమిగూడి చాల విచారించుచుండిరి. ఇంకొక నిమిషములో మాధవుని తల తెగిపడుటకు సిద్ధముగనుండెను. ఇంతలో దూరమున గుఱ్ఱపుడెక్కల ధ్వని వినవచ్చెను. శరవేగమున అశ్వారూఢుఁ డొకఁడు చనుదెంచి, "ఆగుఁడాగుఁడు—



చక్రవర్తి యాజ్ఞ" అనుచు, అశ్వమువరోధించి, యొక యాజ్ఞాపత్ర మధికారిచేత నుంచెను. అది యాతఁడు పరిశీలించి, మాధవుని ఉరిస్తంభమునుండి క్రిందకు దింపి, యాతనిచేతికి చక్రవర్తియాజ్ఞాపత్ర మందించెను. దానిని చూచుటతోడనే మాధవుఁడు మందహాస మొనర్చసాగెను. చంద్రగుప్త చక్రవర్తి యాతని క్షమించి, తనవిశాల రాజ్యములో నితరులవలెనే నిరాక్షేపణగ నివసింపవచ్చునని యనుమతించియుండెను. ఈ క్షమాపణకు కూడ విజయుఁడే కారణమని ఉత్తరము వెనుక భాగముపై వ్రాయబడియుండెను.

క్షత్రపరాజులు



౩. మహాక్షత్రప యశోదాముడు

క్రీ. శ. ౨౩౮. క్షత్రపవంశమున నొక ప్రసిద్ధపాలకుడు



'దివాన్-ఇ-ఖాస్'

ఆగ్రాకోటలో నున్నది. ఇచ్చట మొగలుచక్రవర్తులు రహస్యమంత్రాంగసభలు చేయుచుండిరి. ఇది చలువరాతి కట్టడము. ౬౮ అ. పొడవు, ౩౮ అ. వెడలుపు, ౨౨ అ. ఎత్తుగల రెండంతర్భాగములు గలవు. ఇది ౧౬౩౭-వ సంవత్సరమున నిర్మింపబడినది. భారతదేశమునందలి సుప్రసిద్ధ సుందరభవనములలో నిది యొకటి.

నేడు చంద్రగుప్తుని పట్టాభిషేకదినము. తత్కారణమున నాతని సైన్యమంతయు బారులుదీరి, రాజగృహమునకుబోయి, చక్రవర్తింగూడి, యూరేగ సంకల్పింపబడెను. దీనివలన సుశీల మనస్సులో క్రొత్త యాశలు మొలకలెత్తెను. ఈ అనంత సేనాసమూహములో తన విజయుని సు త్రింపవచ్చునను నాశ కల్గెను. ఈ సంగతి తండ్రితో మనవిజేసెను. ఒక యెత్తైన రమ్యహర్మ్యమున తండ్రియు, బిడ్డయు నాసీనులై యుండిరి. సేనావాహిని మెల్ల మెల్లగా కదలివచ్చుచుండెను. మొదట కాల్బలము నడుచుచుండెను. తన మనోనాథుడు అశ్వారూఢుడగు నని నమ్మియుండుటచే సుశీల కాల్బలమునంత శ్రద్ధగా చూచియుండలేదు. తదుపరి అశ్వికులు చనుదెంచిరి. సుశీల తదేకదీక్షతో పరిశీలించుచుండెను. కాని విజయుడందును లేడయ్యెను. అటుపైని రథములు కదలిపోయెను. అందును విజయుడు లేడయ్యెను. చివరకు చక్రవర్తి యధిష్ఠించియుండిన మత్తగజ మొక్కటియే వెనుకబడియుండెను. సుశీల విజయుని గాంచక పోవుటచే చాల దుఃఖించుచుండెను. ఇంతలో మత్తగజముపై నమర్పబడిన అంబారీయందు చంద్రగుప్తచక్రవర్తి పరివార సమేతుడై యరుదెంచెను. సుశీల యేలాకో అతని గాంచినంతనే కంపితగాత్రయై, తన స్థానమునుండి లేవబోడంగెను. తండ్రియు నామె ననుకరించుచుండెను. ఆమె నిదానించి, చూచిచూచి, కెవ్వున నొక కేకవైచి నేల గూలెను. మాధవు డామెనుపట్టుకొని "ఏమమ్మా! అట్లంటివి?" అనెను.



"అతడే విజయుడు—నా బాలుని తండ్రి—చక్రవర్తి—తండ్రీ! క్షమింపుము" అని సుశీల ప్రాణములను విడిచెను.

---

## లోకవృత్తము

పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

ధర బెండువాతెఁ బాతాళలోకముఁ జేరె సత్యమ్ము ధర్మమా సన్న్యసించె
తపము మున్నైన యుత్తమకృతుల్ వనిఁ జొచ్చెఁ దొలుజాతి వక్త్రిచాపలము హెచ్చె
తండ్రితోఁ గొమరుండు తగవాడఁగాఁ బాతెఁ బ్రభువులందు దురాశ ప్రబల మయ్యె
జఘనచాపలము స్త్రీజాతి కెచ్చుగఁ జేరెఁ బురుషుండు స్త్రీలకింకరతఁ గోరె
కష్టములు చుట్టుకొనుచుండె శిష్టులకును - దుష్టులకుఁ బ్రాభవమ్ము సందృష్ట మయ్యెఁ
గలికిఁ బదునాల్గునెలలైనఁ గాకమునుపె - యిట్టు లగుచుండ నింకముం దెట్టు లగునో?

---

# యుగధర్మము

ప్రియసోదరి రాజ్యలక్ష్మికి—

ఆశీర్వచనములు.

మీరు ఇంగ్లండునుండి తిరిగివచ్చి రెండువత్సరములైనది. అచ్చట మీరు మూడువత్సరములు నివసించితిరి. నీవు నా కీయైదు వత్సరములనుండి క్రమముదప్పక నెలకొక యుత్తరము వ్రాయుచున్నావు. అందలి విషయముల గాంచి మేమందరము సంతసించుచున్నాము. నీయుత్తరము వచ్చుట యొకదిన మాలస్యమైనయెడల నాకు పిచ్చియెక్కినటులుండెను. పిల్లలు 'ఉత్తరము రాలేదేమి' అని పలుమారులు నన్నడుగుచుండిరి. కాని ప్రత్యుత్తరము వ్రాయనైతిని. కారణ మేమన ఏమి వ్రాయుదును. నీకుత్తరము వ్రాసినను నిన్ను చూచుటకు వచ్చినను మాకు వెలితప్పదు. ఏమిచేయుదును. మీరింగ్లండు బయలుదేరినప్పటినుండియు మీ బావగారి మౌనము దినదినప్రవర్ధమానమగుచుండెను. కాని నీయుత్తరము లాయన తప్పక చదువుచుండెను. నీభర్త వ్రాయు వివిధవిషయములుగల పెద్దయుత్తరములను చదివి చేతిపెట్టెయందు దాచుకొనుచుండిరి. ఆయన మీకు ప్రత్యుత్తరములు వ్రాయుచుండెనని నేనింతవరకు దలంచుచుంటిని. కాని నీచివరయుత్తరమువలన ఆయనగూడ మీకు ప్రత్యుత్తరములు వ్రాయుట లేదనువిషయము స్పష్టమైనది. అయినదేమో యైనది. గతించినదానినిగూర్చి విచారించుట నిష్ప్రయోజనముగదా? ఏమైనగాని నామనోవ్యాకులత్వము మొన్నటితోడ నంతరించినది. భగవదనుగ్రహమువలన కొలదిదినములలో మేమందరము మీయింటికి రాగలమనుకొనుచున్నాము. ఆప్రయత్నమందే యున్నాము. రెండుమూడు నెలలయిన నీతో గలసి మెలసి యుండినగాని నాకు తృప్తియుండదు. వచ్చిరాని మాటలతోడ గందరగోళము చేయుచుండు చి॥ కృష్ణునిచూచుటకిప్పటి కవకాశము చిక్కినది. పిల్లలిద్దరు పిన్నీ పిన్నీ యని కలవరించుచున్నారు. నెల దినములలో తప్పక బయలు దేరి రాగలము.

అయిదారు మాసములుగ మాయిల్లు సంతబజారయి పోయినది. ఎప్పుడును గందరగోళమే. చి॥ వేంకటలక్ష్మికి వచ్చే విదియతోడ పండ్రెండువత్సరములు నిండును. మాఘమాసమునమాత్రము రెండుమూడు పెండ్లి లగ్నములున్నవి. అటుపిమ్మట మూఢమి. పిమ్మట నొకటి రెండునెలలవరకును మంచిలగ్నములు లేవు. మనయింటికానువాయి పండ్రెండేండ్లకేగదా రజస్వలయగుట. ఎన్నో సంబంధములు వచ్చినవి. అందు నాల్గుసంబంధములు సర్వోత్తమమైనవి. చింతాకువారి పిల్లవాడు. ఇరువది వత్సరములకులోపు వయసు. బి. ఏ. చదువుచున్నాడు. ఏబదివేల రూప్యముల యాస్తియున్నది. ఒక్కడే పుత్రుడు. తల్లి లేదు. తండ్రి ముసలివాడు. ఇది సర్వవిధముల నుత్తమమగు సంబంధము: పోట్లాటలు, కొట్లాటలు, కోడరికము మొదలగునవి యుండవని మీ బావగారికెన్ని విధములనో నచ్చచెప్పితిని. వారు మూడువేల రూప్యముల నగలు పెట్టెదుమనిరి. వేయిన్ని నూటపదునార్లు కట్నమును కోరిరి. ఇంతకంటె మంచిసంబంధ మెక్కడనుండి వచ్చును? కట్నమీయగల శక్తి మీ బావగారికి లేదా. మేము చేయబోవునది యిద్దరు పిల్లలకు పెండ్లి చేసి యత్తవారిండ్లకు బంపుటయేగదా. అంతకంటెను మాకు వ్యయ మేమున్నది? భగవంతుడు రక్షించిన నాలుగేండ్లకూన రామచంద్రుడు. వాని పెండ్లి పదిపండ్రెండువత్సరముల తర్వాతమాటగదా. కాని యేమి లోటు. సంవత్సరమునుండి నెత్తిన నోరుకొట్టుకొని మీ బావగారికి పెద్దపిల్ల పెండ్లివిషయమును చెప్పుచుంటిని. అది యేమి కర్మమోగాని 'ఆ' అనరు 'ఉ' అనరు. చింతాకువారు రెండు నెల లాగి చివరకు వెల్లంకిలో సంబంధము కుదుర్చుకున్నారు. మీ బావగారికి నే నేమి చెప్పుదును. ఆయనకు తెలియని దేమున్నది. కాని నాకర్మ మిట్లున్నది. గుమ్మములోనికి వచ్చి తలయెత్తుటకే నాకు వీలు లేకుండెను. గ్రామములోని వారందరు నన్ను వ్రేలు పెట్టిచూపి హేళన చేయుచుండిరి. సూటిపోటిమాటల

వెక్కిరింపుచుండిరి. "అక్కా! ఇది బ్రహ్మసమాజమమ్మా ఇదేం పాపకర్మమమ్మా? పండువంటి బ్రాహ్మడికి పాడు బుద్ధులు పుట్టినవి. కిరస్తానులలో కలుస్తారా యేమిటే? వాడున్నాడు గావటే, పెద్దయుద్యోగం కలెక్టరు, ఇంగ్లండు పోయి మాలమాదిగలతోడ మాంసము తిన్నాడు, వెలివేశారు. వాడియూలాన యీ బ్రాహ్మడికొంప మునిగిందే." అని యనేకవిధముల మిమ్ము మమ్ము తిట్టి దుమ్మెత్తిపోయని యాడుదిగాని మొగవాడుగాని మావూళ్లో లేరనుట వింతగాదు. అందువలన మాయింటికివచ్చు నరపురుగు కానరాదు. పిల్లలుగూడ ఆడుకొనుటకు రామానిరి. అందువలన పిల్లలిద్దరు సిగ్గుపడి వీధిగడప దాటకుండిరి. నేను చీకటిపడిన తర్వాత మంచినీళ్లు తెచ్చుకొనుచుంటిని. ఉన్న బ్రాహ్మణ కొంపలు పది. అహోరాత్రము లిదే గొడవ. తిట్లు, శాపనార్థములు, వెక్కిరింపులు, ఏళనలు- ఏమిచేయుదును.

మీ బావగారికి బుద్ధి చెప్పవలయునని చుట్టుప్రక్కల గ్రామములనుండి ముసలి ముతక వచ్చుచుండిరి. కాని యాయన చెంపగూర్చుండి యేమియు మాట్లాడజాలక కొంతవడి మౌనముగనుండి చివర కాయన గాంభీర్యమునకు జోబడి వచ్చినదారిని బట్టుచుండిరి. మీ బావగారు మాత్రము వినుచున్నను విననివారివలెను, చూచుచున్నను చూడనివారివలెను నటించుచుండిరి. నాకాయన పద్ధతి యణుమాత్రమైనను అర్థముగాకుండెను. దుఃఖతరంగము లుప్పొంగుచుండెను. జగత్తంతయు సానందోపాఖ్యానమందలి నరకలోకమును బోలి భయంకరముగ గన్పడసాగెను. అందువలన నా కారుమాసములుగ నిద్రాహారములు లేవనుట యతిశయోక్తి కాదు: దోవ తెన్ను తెలియకుంటిని. పిల్లలు బిక్కమొగము పెట్టుకొని యిల్లు దాటకుండిరి. ఏమిచేయుదును, ఎవరిమారుగుదును. ఈదుఃఖసాగరమునుండి యేదేవుడు ఒడ్డున పడవేయును. శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించుట దప్ప గత్యంతర మేమి?

క్రమక్రమముగ గ్రమ్ముకొనుచుండిన కారు మేఘములు మొన్నటితోడ విడివడినవి. ఘోరాంధకారమం తరించినది. ఉషఃకాలమందలి సుమధుర గీతానినాదము వీనుల విందు గొల్పినది. జగత్తంతయు ఫలపుష్పభరితమై నయనానందకరముగ గన్పట్టినది. శ్రీమన్నారాయణుడు వివిధరూపరేఖావిలాసముల భావవీధియందు గోచరించెను. జయము శ్రీజగన్నాధా జయము. ఆర్తజనరక్షకా జయము.

వారము దినములక్రిందట అమ్మ నాయనలు వచ్చి పదిహేను దినములుండి తిరిగి యింటికి వెళ్లిరి. ఆపదిహేనుదినములయందు అమ్మ పట్టెడన్న మొక్కపూటయైనను తిన్నగ తినలేదు. అరగడియయైన నిద్దుర బోలేదు. నన్ను పిల్లల కౌగిలించుకొని యావురుమని యేడ్చుట తప్ప మరియొకపని యామెకు లేకుండెను. అందువలన మాయిల్లంతయు దుఃఖసాగరమున మునింగెననుట యందతిశయోక్తి గాన్పింపదు. రాజ్యలక్ష్మీ! అప్పటి నాస్థితిని చూడవలయునేగాని వర్ణించి చెప్పుటకు వీలు లేదు. ఇంతకును పూర్వజన్మసుకృత దుష్కృతము లనుభవింపక తీరుదుగదా!

అమ్మ నాయనలు వచ్చినప్పటినుండియు మీ బావగారితోడ నిట్లు చెప్పుచుండిరి: "పెద్దవాండ్లము; వృద్ధులము; మామాటలు వినుము. పిల్లలుగలవాడవు. వేదాధ్యయన నిరతుడవు. శాస్త్రముల చదివితివి. శిష్టాచారపరుడవు. ఇంగ్లీషు చదువుకొనినవాండ్ర గొడవ నీకేందుకు. స్వరాజ్యమా, మాలమాదిగలలో బ్రాహ్మణులు గలియుటయేనా? స్వరాజ్యము కావలయునని యరచుచుండు వాండ్రవరి చేరకుము. వాండ్రు కులభ్రష్టులు; వర్ణభ్రష్టులు. ఇంతకు ఎవరికని యేమిలాభము? రాజ్యలక్ష్మి కర్మ మట్లు పట్టినది.

"ఫలానాశాస్త్రుల్లుగారి కుమార్తె దొరసానులవలె బూట్సులు దొడుగుకొని సభలయందు పన్యసించుచున్న దనుమాటలు నా చెవులకు ములుకులగుచున్నవి. హృదయము బ్రద్దలగుచున్నది కాని యెవరినందును? ఏదైవమును మారుదును, స్వయంకృతాపరాధమునకు శిక్ష యేమి? పుళ్లి పుళ్లి చచ్చుటే శిక్ష. వేదశాస్త్రాధ్యయన మొనర్చిన వరునికొరకు బ్రయత్నింపక పాముమెట్లు పరీక్ష

నిచ్చినాడని 1116 కట్నమిచ్చి కన్యాదాన మొనర్చుట యెవరితప్పు. ఇది నాబుద్ధితక్కువగాదా ? దానిఫలమును నేడనుభవింపుచున్నాను. పండుగయని పర్వమని రాజ్యలక్ష్మిని బిలుచుకొనివచ్చుటకు మాకర్మము గాలినది. నాయనా! చిన్నప్పటినుండియు నాకడ చదువుకొంటివి. షట్ఛాస్త్రములయం దద్వితీయుడవని పేరు గాంచితివి. భగవదనుగ్రహమువలన నీకు సంతానము గలిగినది. సంసారపోషణకు తగిన వసతి యున్నది. అపకీర్తిపాలుగాకుము. నీకడ చదువుకొనుచుండిన పదిమందిశిష్యులు పారిపోవుటకు కారణ మేమి ? నాకర్మమును గాంచుచునేయున్నావుగదా? కొంతమంది శిష్టాచారపరుల మనుకొనువారు నన్ను పంక్తికి రానిచ్చుటలేదు. మాయింటికెవ్వరును భోజనమునకు రారు. పైకి చెప్పరుగాని దాదాపుగ నాకు వెలిబెట్టినారు. కాని యీ కలికాలమున అల్లుడింగ్లండుకుబోయిన మామగారిని శిక్షించుట న్యాయమా యని యడుగువా డెవ్వడు? అడుగువాడున్నను వినువా డెవ్వడు ? ఎవరికివారే యమునాతీరే అనునటులున్నది మనసంఘస్థితి. ఇంతకు నాకు దెలియనివిషయమున ప్రవేశించితిని. తగిన ఫల మనుభవింపుచున్నాను. అల్లునకు నెలకు రు 800-0-0 ల జీతము నిజమే; సంతసమే. కాని నాపాపఫలమును నే ననుభవింపక తప్పదుగదా? బాబూ, మామాట వినుము. మూడునాలుగేండ్లయిన బ్రతుకుదుమోలేదో, ఇద్దరాడు పిల్లలకు మాయెదుట వివాహము చేయుము. సంతసింపుచు ప్రాణముల విడిచెదము. ఇంగ్లీషు చదువుకున్న వాండ్రమాటలు నమ్మకుము. వాండ్రేవేషము వేసినను దొరలపద్ధతి యని మరువక నే ననుభవపూర్వకముగ జెప్పుచున్నాను. వివాహములు చేయవా, మే మిర్వుర మిచ్చటనే మరణింతుము. తప్పదు" అని యనేకవిధముల బోధించిరి. భయపెట్టిరి. కష్టసుఖముల విప్పిచెప్పిరి. పాపపుణ్యముల వివరించిరి. వర్ణించిరి. ఫల మేమి? వారెన్నివిధముల బోధించినను, విలపించినను మీబావగారు మౌనముగ నుండిరేగాని పల్లెత్తి పలుకలేదు. శ్రద్ధగ వినుచుండిరి. కాని ప్రత్యుత్తరము లేదు. అమ్మ నాయనల యుపన్యాసములతోడ ఎప్పుడు ప్రొద్దుగ్రుంకెనో, ఎప్పుడు తెల్లవారెనో తెలియకుండెను. గ్రామములోని పెద్దలుగూడవచ్చి గూర్చుండి తలయూపుచుండిరి. చేతనైనంతవర కుపదేశము లొనర్చుచుండిరి. కాని మీబావగారిచేత 'అవును కాదు' అని యనిపించగలిగినవాడుమాత్రము కానరాకుండెను.

ఇట్లు పదమూడు దినములు గడచెను. పదునాల్గవదినమున తెల్లవారుజాముననే నాన్నగారు లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించుకొని అమ్మను వెంటనిడుకొని పడమటింటియందు దేవతార్చన చేయుచున్న మీబావగారి కెదురుగ బోయి గూర్చుండిరి. చుట్టుప్రక్కలనున్న అమ్మలక్కలు పిన్నపెద్దలుగూడ వచ్చిరి. అప్పు డది యొక చిన్ని సదస్యమువలె నుండెను. రెండు మూడు గడియలు గడచినపిమ్మట మీబావగారు పరమశివునిబోలి నిమీలిత నేత్రములు దెరచి లేచి నిలిచి నడుమునకు కొల్లాయిగుడ్డను బిగించుకొని యెదుట వీరాసనాసీనులై గూర్చుండిన అమ్మ నాయనల పదములకు సాష్టాంగపడి "జ్ఞానదానం బొసంగిన గురుదంపతులకు నమస్కరింపుచున్నాను. ఆశీర్వదింపుడు." అని లేచి చేతులు జోడించుకొని సమ్ముఖమందు గూర్చుండిరి.

అప్పుడు నాయనగారి మోమును గలకింపవలయును. నేత్రద్వయమునుండి యగ్నిస్ఫులింగములు బహిర్గతమగుచుండెను. అచ్చట నున్నవార లాయన మోము దిలకింపజాలకుండిరి. దూర్వాసమహర్షిని మరపించుచూపుల నొకింతకాలము మేనల్లునిమీద బ్రసరింపజేసిరి. కాని మీబావగారుమాత్రము స్థిరగంభీర శాంతచిత్తమున మూర్తీభవించిన ధర్మమూ యనునటుల గురుదంపతుల పాదములమీద దృష్టి నిల్పి చూచుచుండిరి. ఆదృక్కులనుండి యమృతస్రవంతి బయల్వెడల నచ్చటనున్నవారి హృదయసీమల బ్రవహించినకొలదిని కామక్రోధ లోభ మద మాత్సర్యముల ప్రకోపము సన్నగిలుచుండెను. కుతర్కేచ్ఛ కట్టునడెను. అనిర్వచనీయశాంతియం దెల్లరు మునింగియుండ ఆకోపము, ఆతాపము, ఆపట్టుదల, ఆసంక్షుభము మొదలగునవన్నియు నొక్కత్రుటిలోన నాయన గారినుండి పలాయనంబైనంతనే శరీరమున చెమట పట్టెను. పిల్లలిద్దరు విసనకర్రలతోడ విస

రుచుండ నాయనగారు సుశాంతస్వరమున "వత్సా! దీర్ఘాయుష్మాన్భవ" అని దీవింప అచ్చట నున్న వారెల్లరు స్మితవదనారవిందులైరి. మీబావగారు చేతులు జోడించుకొని యాయాశీర్వాదమును శిరమున ధరించిరి అటుపిమ్మట నాయనగా రిట్లు నుడివిరి:—

"వత్సా! పండ్రెండు వత్సరములు నాకు సేవ జేసితివి. వేదశాస్త్రముల నభ్యసించితివి. నీవినయవిధేయతలు, సత్యనిరతి, కార్యనిపుణతకు మెచ్చి కాళ్లు గడిగి కన్యక నిచ్చి వివాహ మొనర్చితిని. ధన్యుడనని తలంచితిని. కాని గురుదక్షిణ నప్పుడు కోరలేదు. నీ వీయలేదు. ఇప్పుడు కోరుచున్నాను. గురుదక్షిణ నిమ్ము."

అన నటనున్నవా రెల్లరును నొక్క మారుగ మీబావగారికేసి నిశ్శబ్దముగ దిలకింపుచుండ ఆయన లేచి ముమ్మారు గురుదంపతులచుట్టు దిరిగి సాష్టాంగపడి "నా ప్రాణమును మీకర్పించుచున్నాను గైకొనుడు" అన అమ్మ లేచి యల్లుని లేవదీసి గూర్చుండబెట్టెను. అప్పుడు నాయనగా రిట్లనిరి: "వత్సా! నాకు గావలసినది నీయైశ్వర్యముకాదు, నీవుకాదు; నీపుత్రికల నాకొసంగుము. అదియే గురుదక్షిణ. గురువును సంతృప్తిపరచవా, రౌరవాది నరకముల బడుదువు. జాగ్రత్త. నీబిడ్డల నిర్ద్వర మాకొసంగనంత వరకు మేము భుజింపము. ఈవీరాసనమున మరణించుట తప్ప గత్యంతరము లేదు."

అనుచుండ నటనుండువా రెల్లరు నిస్తబ్ధులైరి. మామయల్లుండ్రిర్వురు సమానపండితులు. తపోనిరతులు. అందువలన ముందేమి జరుగునో యని నిశ్శబ్దముగ రెప్పవాల్పక చూచుచు గూర్చుండియుండిరి. పెదవి పెదవి కదపకుండిరి. చంటిపిల్లలుగూడ కొయ్యబొమ్మలబోలి యాదృశ్యమును దిలకింపజొచ్చిరి.

అప్పుడు మీబావగారు లేచి నిలిచి యటనున్న వారికెల్లరకు నమస్కరించి వేదగాన మొనర్చుచు అమ్మ నాయనల చుట్టు ముమ్మారుదిరిగి సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి సమ్ముఖమందు గూర్చుండి మూర్తీభవించిన వినయవిధేయతలా యని చూపరులు తలంపుచుండ ఇట్లు నుడువం దొడంగిరి:—

"గురువతంసమా, పూర్వజన్మ సుకృతమువలననే మీకు నేను సేవజేయు భాగ్యమబ్బినది. ధన్యుడను. మీకు గురుదక్షిణ నిచ్చుటకంటెను నేనొనర్పదగిన సత్కర్మమేమున్నది. అన్నిటికంటెను ప్రియమైన పదార్థమును గదా గురుదక్షిణ యొసంగవలయును. నా ప్రాణముల గైకొనుడు. సంతసముగ నొసంగుదును. పరమసంతోషమున నిత్తును. కాని నన్ను సంకల్పవిచ్యుతునిగ జేయదలంపకుడు. సంకల్పచ్యుతుడగు వానికంటెను దరిద్రుడు మతియొక డుండబోడు; నీచుడు గానరాడు. శిష్యుడొనర్చు పుణ్యపాపములు గురువర్యునకుగూడ జెందును. సంకల్పమేగదా సర్వధర్మములకు మూలము. కావున శిష్యుని సంకల్పము నెరవేరుగాక యని యాశీర్వదింపుడు. మీరు నాకు పార్వతీపరమేశ్వర తుల్యులు. అందువలన ననుక్షణము మీచరణధ్యాన మొనర్చుచుందును. మిమ్మారాధింపుచుందును.

"పండితాగ్రణీ, మీహృదయవేదనను నే నెరుంగుదును. గురువర్యుని కలవరపఱచుచున్నానని నిరంతరము విలపించుచుందును. కాని చేయునది యేమి? అయిదారుమాసముల నుండి నాహృదయమున మహత్తరసంగ్రామము జరుగుచున్నది. అది రామరావణయుద్ధమును మించినదనుట యతిశయోక్తి కాదు. విచారించితిని. వివేకమునకు బట్టముగట్టితిని. కాని నాసంకల్పముమాత్రము చెడలేదు. దృఢమగుచున్నది. ఇప్పటికొక వత్సరముగ నాకు నిద్దురలేదు. నిరంతరము నన్ను కలవరపరచుచున్నది. 'నాధర్మమేమి? నాధర్మమేమి?' అను ప్రశ్నయే. ఆడుపిల్లలవిషయము మనమునకు వచ్చినప్పుడెల్ల వేనవేలు శంకలు గలుగుచున్నవి. వాని సంఘట్టనమున వివశుడ నగుచుంటిని. కాని సమస్తమును భగవానున కర్పించుటతోడ శాంతి చేకూరుచుండెను. ఇంతకును భగవత్సంకల్పమున నాసంకల్పము విలీనమగునప్పుడేగదా యది యదార్థమగును. లేనిచో నది భ్రమ కావచ్చును? కాకపోవచ్చును. కాని యిదమిత్థమని నిర్ణయించు టెట్లు? భావరాగతాళముల సమ్మేళనమేగదా సంగీతము. పిల్లవివాహవిషయము మనమునకు వచ్చినంతనే సంతసము గలుగుటలేదు. దుఃఖము వచ్చుచున్నది. పలు

శంకలు పుట్టుచున్నవి. బాల్యవివాహము లీకాలమునకు పనికిరావని నాయంతరాత్మ బోధింపుచున్నది.

"ఇది గణతంత్రయుగము. కావున సమస్తమును గణతంత్రానుసారముగ జరుగవలదా. అందువలన యుక్త వయసురాని బాలికను నే నెట్లు వివాహమొనర్తును? తగినంత లోకజ్ఞానము;యుక్తాయుక్త విచక్షణతనుగలిగించి వివాహము చేసికొనదలచినప్పుడు తగినసహాయ మొనర్చుటయే నాధర్మము. కాని పణ్యద్రవ్యములబోలియొకవ్యక్తిని యింకొకని హస్తమునం దిడుటకు నా కెట్టి హక్కును లేదు. ఉన్న దనుకొనుట భ్రమ. గతించినకాలమం దట్టి హక్కు పురుషున కుండిన నుండవచ్చును, లేకపోవచ్చును. కాని ఈయుగమున మాత్రము అట్టిహక్కు లేదు.

"గణతంత్రమునకు వ్యక్తిస్వాతంత్ర్యము పునాది. పునాది సుస్థిరముగ నేర్పడినగాని గణతంత్రసౌధ మేర్పడదు. అప్పుడుగాని వ్యక్తి, సంఘము, జాతి, దేశములు సంపూర్ణస్వాతంత్ర్యమున నోలలాడజాలవు. కావున నీయుగధర్మమునకు భిన్నముగ నెట్లు ప్రవర్తింతును. సజీవముగ మెలంగవలయునన్న యుగధర్మమున భాసిల్లవలయును. అందువలననే నా కర్తవ్య మేమి అను ప్రశ్న తనంతట తానుగ నుద్భూత మగుచున్నది. సంఘనాశన కారణములలో ముఖ్యమైనది బాల్యవివాహమని నాయంతరాత్మ బోధింపుచున్నది.

"పండితాగ్రగణ్యా! ఇట్లనుటవలన బాల్యవివాహములు తప్పనుచున్నానని తలంపజనదు. ఒప్పనుచున్నానని యెంచరాదు. ఈయుగమునకు బాల్యవివాహములు పనికిరావని నానమ్మకము; విశ్వాసము; శాస్త్రచర్చాఫలితము; వివేకమువలన గలిగిన యుపలబ్ధి. అందువలననే నాసంకల్పము భగవత్సంకల్పమున విలీన మైనదని విన్నవించుకొనుచున్నాను. బ్రహ్మవాదిని యటులనే చాటుచున్నది. విశ్వకవి యటుల గాన మొనర్చుచున్నాడు. మహాత్ముడటుల నుడువుచున్నాడు- అంతేకాదు, ఆజ్ఞాపింపుచున్నాడు. మానవకోటిని పట్టి పీల్చి పిప్పిచేయుచున్న సమస్తసమస్యలకు సమన్వయము మహాత్మునినోట నేగదా వెల్వడి విశ్వశ్రుతియందు విలీనమై సజీవమానవ హృదయఫలకములయం దంకిత మగుచున్నది. కావున మహాత్ముడు యుగావతారము. నాకున్న స్వల్పశాస్త్ర జ్ఞానము, విచారణశక్తితోడ యోచించితిని. వివేకము నుపయోగించితిని. పరిశీలించితిని. కాని యుగధర్మము నాశ్రయింపక తప్పదు. ఇట్లనుటవలన శాస్త్రములను దూషింపుచున్నాననిగాని, శాస్త్రకారుల దూలనాడుచున్నాననిగాని తలంపరాదు. త్రికాలజ్ఞులగు మహాఋషులు శాస్త్రకారులు. వారెప్పుడును వర్తమానమును మరువలేదు. ధిక్కరింపలేదు. అందువలననే యాయా యుగములకు సంబంధించిన యాచరణను ఆయామహాఋషులు నిర్ణయించిరి. కాదన నెట్లు? పలు ధర్మశాస్త్రము లుండుటకు కారణ మేమి; ఇదివర కధికారభేదము ననుసరించి ధర్మశాస్త్రములు రచింపబడినవి. ఇపుడు వ్యక్తిస్వాతంత్ర్యమును బునాదిగ గైకొని ధర్మశాస్త్రములు రచింపబడవలయును. యుగప్రభావమునకు లోబడి మానవులు నడచుచుందురు. మానవమండలి గమనమునకు తీవ్రతనుగలిగించుటకు ధర్మశాస్త్రము లేర్పడుచుండును.

"పండితోత్తమా! తమకు దెలియని దేమున్నది? తమకంటెను అనుభవజ్ఞు లెవ్వరున్నారు? కాలమా యత్యంత వేగమున పరువిడుచు మార్పు జెందుచున్నది. నటరాజు తాండవ మాడుచున్నాడు. శ్రీ మహావిష్ణువు నేత్రముల దెరచుచున్నాడు. ఇక్కాలమున మన కర్తవ్య మేమి? సర్వజ్ఞులగు తామే నిర్ణయింపుడు. జయ జగన్నాథా యని జయజయనినాదము లొనర్చుచు జగన్నాథుని రథము నీడ్చుటయా, లేక యెదురేగి రథచక్రముక్రింద బడి నశించుటయా? కర్తవ్య మేమి?

"పరమానందముగ నేను వర్తమానకాల ప్రవాహమునబడి మునిం గెదను. మంచి చెడుగుల విచారణతోడ బనిలేదు. నిందాస్తోత్రముల చెవి దూరనీయను. పలుగోత్రముల చర్చకు గడంగను. అమృతమైనను విషమైనను భగవత్ప్రసాదముగ స్వీకరింతును; శంకింపక మ్రింగెదను. కర్తవ్యకార్యము నొనర్చితినని సంతసింతును. పరమానందముగ ఫలితము ననుభవింతును.

"గురువర్యా! తాము పెద్దలు. సమస్తశాస్త్రపారంగతులు. తపోధనులు. మీతోడనా వాగ్వాదము! శాస్త్రవాదమా! వాదిదౌర్బల్యముగాని వాదదౌర్బల్య మెందయిన గలదా? తమరొనర్చు శాస్త్రవ్యాఖ్యానమును ప్రతిమొక్కను సంపూర్ణముగ విశ్వసింతును. ఋషుల లోకకల్యాణవాంఛను గాంచి మైమరచుచుందును. కాని యాధర్మగ్రంథము లీయుగమునకు సంబంధించినవికావు. మానవకళ్యాణమును గోరి యీయుగమునకు తిరిగి ధర్మశాస్త్రముల రచించుకొనవలయును. యుగానరణ ప్రారంభమైనది. ఇది తీవ్రమైనకాలదని పురాతన మంతరించును. ధర్మశాస్త్రరచన ప్రారంభమగును. కాని ముందు శాస్త్రములు పుట్టునా?

"మానవకోటి యుగసంధి నతిక్రమింపబోవుచున్నది. ఆయుషఃకాంతులవలన జగత్తు స్వర్ణకాంతుల నీనుచున్నది. పక్షులు మృదుమధుర గీతానినాదము లొనర్చుచున్నవి. పల్లెపడుచులు చెంగు చెంగున దుముకుచు పరువిడుచు సంగీతమందు విలాసమునుబోలి కనురెప్ప పాటు నిలిచి నలుదెస్కుల బరికింపుచు నేత్రపర్వం బొనర్చుచున్నవి. విశ్వశ్రుతియందు గలిపి బాలబాలికలు పాడుచున్నారు. ఆడుచున్నారు

"మానవుడేకార్య మొనర్చినను వర్తమానమున శ్రుతి గలియవలదా? వర్తమానమున జీవితమా? భూతకాలమును గూర్చి యోచనయా? గతించినది గతమే కాని భూతకాలము వర్తమానకాలము కాదు. కాజాలదు. అయినను భూతమును గమనింపుచు స్థిరచిత్తమున వర్తమానకాల ప్రవాహమందు నిలిచి భవిష్యత్తును తిలకించుటకు తీవ్రతపమున మునుంగవలయును. ఇదియే మానవ ధర్మము.

"కావున నేనీయుగధర్మము నాశ్రయించెదను. అందువలన గలుగు సమస్తకష్టములను పరమానందముగ భరించెదను. సంఘము–దేశము–మానవకోటి–వీనియున్నతికి కష్టపరంపర లేగదా సాధనములు; దివ్యబృందావనమును జేరుటకు సోపానములు.. కావున మీమనోవ్యాకులతను వీడుడు. నన్ను వశపరచుకొనుటకు ప్రయత్నింపకుడు. సంకల్పచ్యుతునిగ జేయదలచిన దీక్షనువీడి నన్నాశీర్వదింపుడు.

"నేనీయుగధర్మము నాశ్రయించెదను అందు విలీనమై పోదును. దీనిని పచ్చికలి యనుడు, లేక స్వర్ణయుగమనుడు–నాకు రెండును సమానములే. సమానాదరణీయములే. ఈరెండు నొక్క మూర్తియొక్క ముఖములుగావా? భూతకాలమునిమాత్రమే దృష్టినిల్పి వర్తమానకాలమున జరుగు తీవ్రమగుమార్పులకు జంకుచు, భయపడుచు, భవిష్యత్కాల సందర్శనమున కాతురతలేనివారి కిది కలియుగము; ఘోరకలియుగము. వివేకవిచారము లెరుంగక సామాన్యమున తర్కము నాశ్రయించి యాందోళనకు గడంగువారికి భారతవర్షము నరకకూపము. విదేశములు స్వర్గతుల్యములు. శిశిరఋతువునందు వసంతమునుగాంచి యానందించు కవిసార్వభౌముని బోలి వర్తమానమున భవిష్యత్తును సందర్శింపుచుండువారి కిది స్వర్ణయుగము.

"కాని ప్రతియొక్కసిద్ధాంతమందునను సత్యమున్నది కాని యది పూర్ణసత్యముగాదు. భూతభవిష్యద్వర్తమానముల సంతతధారగ ప్రకాశించునదే దివ్యసత్యము; పూర్ణసత్యము. అందు శ్రుతిగలుపగలిగినవాడు మాత్రమే భవిష్యత్తును సందర్శింపగలడు. వానికి విశ్వరూప సందర్శనమగును. ఆ మహాదృశ్యమున అధోగతినొందుచుండు అనంతజీవరాసుల దిలకించును. ఊర్ధ్వగతిని పరువిడుచు పకపకనవ్వుచుండు జీవకోటినిజూచి చరితార్థుడగును. అప్పుడు సమస్త సంశయములు తీరును. ఇక శంకలకు తావెచ్చట?

"గురువర్యా! భారతవర్షమే నాకు స్వర్గము–మోక్షము–భారతవర్షమంతయు నాకాదరణీయము. భారతవర్ష దాస్యవిముక్తికి నేనేకార్యమునైన నొనర్తును. నా సర్వస్వ మర్పించితిని. ఈ ప్రాచ్యపాశ్చాత్య నాగరికతా యుద్ధమున ఉడుతసేవమాత్ర ముపచరింపగలిగిన నేను ధన్యుడను. నాగృహము–వంశము–సంఘము ధన్యము. కల్పిత నాగరికతాశిఖరముల పటాపంచలుగ నొనర్చు వజ్రాయుధమును ధిక్కరించు రాటమును చేబూనితిని. ఇదియే నాకును నా దేశమునకును మోక్షమునిచ్చును. స్వాతంత్ర్యమొసంగును. పండితోత్తమా! మీరు కన్నుదెరచిన నే నెంతటివాడను. మీరు నాకు మేనమామలు. తలిదండ్రులు

గతించిన నన్ను దగ్గర దీసి పెంచి పెద్దవానినిగ జేసి విద్యాబుద్ధులు చెప్పితిరి. సమార్తి నిచ్చి వివాహ మొనర్చితిరి. అట్టి మీయాజ్ఞలను శిరసావహించుట నాకును పరమ ధర్మము, న్యాయము. కాని యేమిచేయుదును; తాము వెలిగించిన స్వల్పజ్ఞానముతోడ యోచించితిని. పరిశీలించితిని. ప్రతివిషయమును శ్రద్ధగ గమనించి మనఃమొనర్చితిని. భారతవర్షమందలి సమస్తతీర్థములకేగి పెద్దల సందర్శించి కొలదికాలమువారితోడ సాంగత్యమొనర్చితిని. ప్రాచ్యపాశ్చాత్యసాంఘిక, ఆర్థిక, నైతిక, మానసికవిషయములగూర్చి యుపన్యసించు పండితులలో ముఖ్యులకడ కొన్నిదినము లుండి వారి సిద్ధాంతములను సమన్వయసూత్రములను గమనించితిని; గ్రహించితిని. వారి మనోవేదనను హృదయంగమ మొనర్చుకొంటిని. నాకు వీలయినంతవరకు చిన్నపెద్దయను భేదములేక గ్రంథముల నన్నిటిని చదివితిని. ఫలిత మేమి? పర్యవసాన మేమి? కాలమునకు లోబడి కాలాతీతులముగా ప్రయత్నింపకుండుట మహాత్తరదోషముగ దోచినది. అనేక జాతులు, సంఘములు రోదనముచేయుచు మృత్యుగహ్వరమున పడుట నుపలబ్ధినొందితిని. కర్తవ్యమేమి? నాదేశము, నామాతృదేశము, నాపుణ్యదేశము శ్మశానతుల్యమైనది. ఈమహాశ్మశానమునుండియేగదా శక్తినిబుట్టింపవలయును. అందువలననే భారతజాతీయ మోక్షమునకు తపమాచరింపుచున్నాను. సత్యాగ్నిని ప్రజ్వలింపజేయుచున్నాను".

అని నుడువుచు కన్నీరు కాల్వలై పారుచుండ "జయము. భారతవర్షమునకు జయము". అని నుడువుచు నాయనగారి పాదములమీద బడిరి. ఈ దృశ్యమును చూచుచున్న యా బాలవృద్ధవనితలు రోదనము చేయ జొచ్చిరి.

"పండితాగ్రగణ్యా! క్షమించుడు. క్షమించుడు. ఈదాసుని తప్పులను మన్నించువారెవ్వరు? సంకల్పవిచ్యుతునిగ జేయకుడు. స్వయముగ వెలిగించిన జ్ఞానదీపమును స్వహస్తముల నార్పుటకు ప్రయత్నింపకుడు. నాప్రాణముల గైకొనుడు. అవలీలగనిత్తును. చరితార్థుడ నగుదును. కాని బాల్యవివాహములు చేయుమని యడుగకుడు. నిర్బంధింపకుడు. శిష్యునిరక్షింపుడు. ఆశీర్వదింపుడు."

ఆదృశ్యమును మాచితీరవలయునేగాని వర్ణింప నలవిగాదు. అప్పు డమ్మనాయనలులేచి మాబావగారిని లేవదీసి కూర్చుండబెట్టిరి. అమ్మ యల్లుని కన్నీరు తుడిచెను. నాయన "వత్సా, భగవదాజ్ఞానుసారము సత్యము దప్పక ప్రవర్తింపుము" అని యాశీర్వదించెను. నలువైపుల నుండి హర్షధ్వనులు మిన్నుముట్టెను. ఎల్లరిముఖమండలములు చిరునవ్వుతోగూడిన గాంభీర్యమున నలరారజొచ్చెను. అప్పుడు మాబావగారు చివ్వున లేచి కంఠమున నున్న సువర్ణ రుద్రాక్షమాలను నాయనగారి మెడయందు వైచి "నాలుగుపాడిపశువులను నర్పించితిని. గురుదక్షిణగ గైకొనుడు" అన నాయనగారు హర్షాశ్రువుల వీడుచు "గురుదక్షిణను గైకొంటిని. సంతృప్తచిత్తుడనైతిని. చిరంజీవివై వర్ధిల్లుము." అని యాశీర్వదించి నా కేసి చూచి నంతప్రయత్నములు చేయుమనిరి. అప్పటికి పగలు పండ్రెండుగంటలాయెను. సగముమంది గృహముల కేగిరి. మిగిలినవారచ్చటనే యుండి భగవద్విలాసమును దలపోయుచుండిరి.

అప్పుడు దివ్యతేజోమయమూర్తియై వెలుగుచున్న మాబావగారు పెద్దలగాంచుచు నిట్లు నుడువ దొడంగిరి: "పెద్దల సంతృప్తిపరచవలెనని నాజన్మ వ్యర్థము. కాని యేమిచేయుదును? రెండువత్సరములుగ గమనించుచున్నాను. పిల్లవివాహము తలంపునకు వచ్చినంతనే ప్రకృతి నన్నడ్డగింపుచున్నది. కలవరపరచుచున్నది. భగవత్సంకల్పమున నాప్రయత్నము విలీనముగాకుండుటవలన నిర్జీవనినాదము నాహృదయమును బీభత్సమొనర్చుచున్నది. గత్యంతర మేమి? ప్రకృతి నిరంతరము మారుచున్నది. అటులనే మానవుడు నిరంతరము మారుచున్నాడు; అభివృద్ధి గాంచుచున్నాడు. అది నేటితోడ నాగుననికాని, యాగినదనికాని, తలంపజనునా?

"మానవుడు మహాజలధియందు దాడి యాడి, మహాదరణ్యములయందు దిరిగి తిరిగి, దుర్గమకందరములయందు విశ్రమించి ఆకాశమునం దానందముగ సంచరించి, తద

నంతరము వృక్షాగ్రముల కెగఁబ్రాకి, యొకదానిమీద నుండి మరియొకదానిమీది కెగసి యెగసి, వానిమీదనే విశ్రమించి శయనించి కిలకిల నవ్వుచు, ఆకాశమున విహరించి పర్వతాగ్రముల జేరి తప మొనర్చి క్రమముగ వన్యమృగములనుండి వేఱుపడి, గుంపులు గుంపులుగ జేరి స్వీయరక్షణకు పరికరముల సేకరించుకొని మృగముల స్వభావాదుల గుర్తించి అందు సాధుమృగముల నాశ్రయించి వానివలన పలుప్రయోజనము లొందుచు దుష్టమృగ సంహారమునకు గడంగి గుహలు మొదలగు వానిని వీడి పర్ణశాలనిర్మించుకొని యందు నివసించుచు సాధు మృగముల పక్షుల సహవాసమున సంతోషానందమును బొందుచు సల్లుగోపురములు నిర్మించుకొని క్రమముగ నభివృద్ధినొంది పంచభూతముల గ్రహించి వానిశక్తుల గని పెట్టి, వానికన్నిటి కాధారభూతమై యున్న మహత్తర సత్తా నుపలబ్ధినొంది గృహము, వంశము, కులము, సంఘము మొదలగువాని నేర్పరచుకొని వ్యక్తి-సంఘము-జాతిసంఘ సంబంధముల సంరక్షించుకొనుచు, స్వీయాభివృద్ధికై ప్రకృతి నుపయోగపరచుకొనుచు పంచభూతముల ద్వారమున భగవానుని దర్శించువాడు, నేడు పంచభూతముల నశపరచుకొని యున్నాడు. వానిచేత తనకు గావలసిన సమస్తకార్యములను జేయించుకొనుచున్నాడు. అరణ్యములు-నదులు-కొండలు-సముద్రముల త్రుటిలోన నతిక్రమించి మానవకోటి నొక్కచోనుండి ఒక్కటే క్షణమున నిరీక్షించుచు మానవమండలియందు జరుగు అత్యద్భుత పరివర్తనమున శ్రుతిగల్పి గాన మొనర్చుచున్నాడు.

"ఇప్పటికి మానవునకు సగముకాలము చెల్లినది. మానవకోటిని విడివడ జేయుచున్న హద్దులు-ఆటంకములు-పటాపంచలైనవి. అందువలన మానవుడు భౌతిక నేత్రములతోడ హృదయము పులకరింప బృహత్తర మానవ కోటియై వెలుంగు శ్రీమన్నారాయణుని సందర్శింప పరువిడుచున్నాడు. ఇదివర కభివృద్ధికొరకు రక్షణకొరకవలంబించిన మార్గములను పరికరములను పద్ధతులను బరిత్యజించి పంజరమునుండి విడివడినపక్షివోలె యత్యానందమున విహరించుచున్నాడు. ఇక జాతులు-సంఘములు-శాఖలు-రంగుల భేద మెచ్చట? మానవత్వము-సంపూర్ణమానవత్వము-నూతన భావమున దివ్యతేజమున వికసింప బోవుచున్నది. ఈ శుభముహూర్తమున-ఈస్వర్ణయుగమున జయజగన్నాథాయని జయజయనినాదము లొనర్చుట ధర్మముగాదా? ఆనందముగాదా?

"మానవకోటి నావరించియుండిన యనంతభేదములు దొలంగినను స్త్రీపురుష భేదమమాత్రము నశింపదు. లక్ష్మీనారాయణుల - పార్వతీ పరమేశ్వరుల - సీతారాముల యాదర్శమున మానవుడు పరువిడి నేడు రాధాకృష్ణుల పదకమలములకు నమస్కరింప నేగుచున్నాడు. కాని యావేగమునకు హద్దులేదు. అంతులేదు.

"మానవజీవితమునందలి నాల్గుపాదములలో రెండు పాదములు పూర్తియైనవి. ఇప్పుడు మూడవపాదమున ప్రవేశింపబోవుచున్నాము. ప్రథమపాదమున స్త్రీయే మానవమండలికి నాయకురాలు, సర్వాధికారిణి, సర్వశక్తి సంపన్న, సర్వకార్య నిర్వహణయై యలరారుచుండెను. స్థూలదేహము సన్నగిలి సూక్ష్మదేహ మభివృద్ధి నొందిన కాలందిని కారణదేహవిషయకచర్చ ప్రారంభమాయెను. వివాహము, గృహస్థాశ్రమము, సంఘము మొదలగునవి యేర్పడి పరస్పరసంబంధములు నిర్ణయమైన కాలదిని స్త్రీపురుషులు సమానస్థితికి వచ్చిరి. అప్పుడు స్త్రీ పురుషున కర్ధాంగిగ మారిపోయెను. సమస్తవిషయములయం దిర్వురు సమాన భాగస్వాములై యుండిరి. వినయవిధేయతలు, కరుణాప్రేమలు, త్యాగ సత్కారములు, బాధ్యత మొదలగు గుణములు స్వభావసిద్ధముగ నుండిన నారీమణి గృహిణియై, గృహలక్ష్మియై, గృహసంబంధమగు సమస్తకార్యములకు రాణియై సంఘము దేశసంబంధమగు సమస్త కార్యములయందును, యుద్ధములయందును, పురుషునితో గలసి పనిచేయుచుండెను. నియతి నియమములు శరుగబొచ్చెను. శిల్పసాహిత్యము లభివృద్ధికి రాసాగెను. నియతి నియమములు స్వాతంత్ర్యమందిరమును జేరుటకు సోపానములని గ్రహించిన కాలందిని సంఘము వికసింప జొచ్చెను. సంతానపాలనము, పశురక్షణము, అతిథిఅభ్యాగతులసేవ మొదలగు కార్యములతోడ స్త్రీకి కాలము గడవజొచ్చెను. స్త్రీ గృహకార్యముల

యందు మునింగెన కాలదని పురుషుడు స్వేచ్ఛాచారియై రక్షణయను నెపమున తనంతట తానుగ స్త్రీరక్షకుడై యుద్ధములు మొదలగు వానియందు ధనకనకవస్తువాహనములతోడ స్త్రీలనుగూడ దొంగిలించు రాక్షసప్రవృత్తికి దిగినకాలందని స్త్రీలు దాసురాండ్రైరి.

"రెండవపాదమున స్త్రీ పురుషునిచేతి కీలుబొమ్మయై, బొంగరమై, పణ్యద్రవ్యమై సంపూర్ణముగ స్వశక్తిని గోల్పోయెను. పురుషునిదౌర్జన్యము మిన్నుముట్టెను. పురుషుడు కర్త, భర్త, హర్తయై ప్రవర్తింపసాగెననుటకు రామాయణ భారతాది గ్రంథములే ప్రబల నిదర్శనములు.

"ఇప్పుడు మానవుడు తృతీయపాద ప్రవేశమందున్నాడు. ఇక నిమ్నోన్నతముల కవకాశములేదు. ధనికుడు, నిర్ధనుడు, కూలి, యజమాని, ఉత్తమకులము, నీచకులము, అస్పృశ్యత, దృష్టిదోషము, తెలుపునలుపు రంగులు ఇక మానవసంఘమును విడదీయ జాలవు. ఒకదాని నొకటి యణగద్రొక్క లేదు. స్త్రీని అబలయని, మూర్ఖురాలని, స్వాతంత్ర్యము లేనిదని నుడివి పంజరమందుంచు కాలము దాటిపోయినది. స్త్రీ స్వాతంత్ర్యమును హరించుటవలన గలిగిన నష్టమును పురుషు డిప్పుడిప్పుడు గ్రహింపుచున్నాడు. ముఖ్యముగ మనదేశమందు స్త్రీని వదలి పురుషుడే సమస్తకార్యముల నొంటరిగ జేయగడంగుటవలన ఆయాకార్యముల నిర్వహింపజాలక మానవకోటి దృష్టికి నధముడాయెను. అందువలన గలిగిన నష్టము నిప్పుడు పురుషుడు గ్రహింపుచున్నాడు. స్త్రీ బాణము సంధింపుచుండినగాని వింటబాణమును సంధించి గురితప్పక కొట్టుటకు వీలులేదని పురుషుని యనుభవమునకు వచ్చెను. మానవకోటి వికాసమునకు స్త్రీ పురుషులిద్దరు సమాన బాధ్యులని గ్రహించిన కాలందని స్త్రీల బంధనములు పటాపంచ లగుచున్నవి. నారీమణి తలయెత్తి యనంతాకాశమందలి గ్రహనక్షత్రముల దిలకించినకాలందని హృదయ ముప్పొంగ దివ్యగీతముల బాడుచు మాతృపూజకు పుష్పచయన మొనర్చుచున్నది. కావున నిక బంధింపబడి యుండదు, ఉండరాదు, ఉంచలేదు.

గార్గి, మైత్రేయి, సత్యభామ, సావిత్రి, మీరాబాయి, కుమ్మర మొల్ల మొదలగు మహానారీమణులు తిరిగి భూమండలము దవతరించి విశ్వవేదనను హృదయంగమ మొనర్చుకొని బృహత్తర మానవరూపము నుపలబ్ధినొంది మృదుమధుర గీతానినాదము లొనర్చుచున్నారు. ఆ గీతానినాదము మానవలోకమును బట్టి పీల్చి పిప్పిచేయుచున్న దుర్ఘటసమస్యలకు స్వస్తి చెప్పుట కాదా? స్త్రీలు స్వశక్తిమీదనే యాధారపడుదురు. స్వీయాభివృద్ధి కాటంకముల గలిగించు వాటినన్నిటిని స్వశక్తితోడనే యెదుర్కొందురు. బాహుబల జ్ఞానబలముల నద్వితీయలై ప్రకాశించెదరు. ఆసూచనలే మానవమండలియం దెన్నటచూచినను గాన్పింపుచున్నవి.

"ఇక నాకర్తవ్యమేమి? నా ధర్మమెట్టిది? మహాకాల గర్భమునందు బడిపోవుచుండు కామధేనువునైనను రక్షించుటకు బ్రయత్నింపను; విచారింపను; చింతింపను. భగవద్విధానము నడ్డగించువాడెవ్వడు? కాలమే మృత్యువు; కాలమే జీవితము; కాలమే స్వర్గము; కాలమే యనంతపథమున పరువిడుటకు రాజమార్గము. పలురంగులు పలుపేర్లుగల చీట్లముక్కలను గలుపువాని యుద్దేశ్యమేమి? తిరిగి ప్రస్తరించుటకే గదా? జగజ్జనని మానవులనందర గలుపుచున్నది. ఎందుకు? తిరిగి ప్రస్తరించుటకే గదా? ఆవికసనము పూర్తియగుటతోడ మానవత్వము పరిపూర్ణమగును. సార్థకత జెందును. తదనంతరము — .

"పండితాగ్రగణ్యా! బొమ్మల పెండ్లిండ్లు చేయమందురా? లేక ఈ మహాప్రళయమునుండి తీవ్రవేగమున భవిష్యత్తు నాకర్షించుటకు స్వేచ్ఛగా విహరింప నీయమందురా? తమ యాశీర్వాదమువలన హిందూసంఘ రక్షణకు, భారతవర్ష స్వరాజ్యప్రాప్తికి నా సర్వస్వ ముత్సర్గ మొనర్చితిని. అందు నాసంతానము గూడ ఇమిడియున్నదని వేరుగ నుడువుట యనావశ్యకము. నాపుత్రికల కిర్వుర కిరువది వత్సరములు వచ్చువరకు తగిన నడవడికను, కష్టపడి పనిచేయుటయును, స్వశక్తిమీద నాధారపడి లోకకల్యాణముకొఱకు నిరంతరము కృషిసలుపువారినిగ జేయుట నాకర్తవ్యము., నావిధి.

"ఇంతవరకు మనము ఖండసత్యమును దిలకించితిమి. ఇక పూర్ణసత్యమును దిలకింప వలయును. ఇందు "నేతి" యను పదమునకు తావు లేదు. ఒకసంఘమును వీడి మరియొకసంఘము, ఒకజాతిని వీడి వేఱొకజాతి పూర్ణ సత్యమును గ్రహింప జాలదు. అట్లు గ్రహించితిమనుట మనః కల్పన; భ్రమ.

"గురువర్యా! పరితపించుచున్న శిష్యున కిదమిత్థమని చెప్పి కర్తవ్యమును జూపుట ధర్మముగాదా? నా పుత్రికలకు నేను వివాహము చేయను. వివాహమొనర్చుకొనవలచిన వలదనను. సాంఘిక రాజకీయ ఆర్థిక నైతిక విషయజ్ఞానమును గఱపించుటకు బ్రయత్నింతును. జాతీయ వ్యక్తిత్వమును యోచనపద్ధతియు నలవడునటులచూతును. నారీలోకోద్ధరణకు నాపుత్రికాద్వయము నర్పింపుచున్నాను. అందుకు తగినటుల వర్తింపగలవారినిగ జేయుట కహోరాత్రములు పాటుబడుదును. 'జయ జగన్నాథా' మానవకోటి పాపభారమును నాశిరమున మోపుము. ఆభారమువలన క్రుంగి కృశింపుచు సంతసింతును. పలుబాధలకులోనై పరితపింపబడు మానవులకు శాంతి గలుగును" అని తిరిగి గురుసంపతుల పదకమలములమీద బడిరి. నాయనగారల్లుని ఆనందబాష్పముల నభిషేకమొనర్చుచు "తథాస్తు" అని ముమ్మారనిరి. సదస్యులు హర్షాశ్రువులు నించిరి. అప్రయత్నముగ జయజయని నాదము లొనర్చిరి.

మా బావగారు కర్పూరమును పళ్లెమున వెలిగించి శ్రీరామచంద్రమూర్తి సమ్ముఖమున నిలుచుండ ఆయన కిరువైపుల నిర్వురుపిల్లలు నిలిచి మంగళహారతి బాడజొచ్చిరి. అప్పుడు అమ్మ నన్నుపిలిచి యల్లుని కుడిప్రక్కను నిలుచుండబెట్టెను. నావెనుక నామె నిలుచుండెను. నాయనగారల్లునివెనుక నిలిచిరి. అప్రయత్నముగ నేను "జయతి జగన్మంగళం హరేర్నామం" అను మహాగానమును బాడజొచ్చితిని. ఎల్లరును లేచి నిలిచి చప్పట్లు చరుచుచు మైమరచి హరినామస్మరణ జేయజొచ్చిరి. టెంకాయలు గొట్టిరి. పరస్పరము కౌగిలించుకొనిరి. హృదయముల విప్పి మాట్లాడుకొనిరి. ఒకరి నొకరు దోష విరహిత దృక్కుల దిలకింపజొచ్చిరి. అప్పటికి సాయంతనము మూడుగంటలాయెను. మాగృహమున శాంతి తరంగములు మిన్నుముట్టజొచ్చెను. మృత్యువును తృణప్రాయముగ చూడగలిగినవాడే గదా మృత్యుంజయుడగును. గరళమును చవిచూడగలిగినవాడే గదా యమృతమును చవిచూడగలుగును!

రాజ్యలక్ష్మీ! ఏమిచెప్పుదును; వ్రాయుటెట్లు? అప్పటి యానందము, ఆసంతసము- అనిర్వచనీయము! సాక్షాత్ అన్నపూర్ణనుబోలి యమ్మగారు బోసినోట నవ్వుచు వంటయింట ప్రవేశించిరి. ఏడుగంటలకు వంట సిద్ధమాయెను. స్త్రీపురుషులు ముప్పదిమందివరకు భోజనమునకు కూర్చుండిరి. పిల్లలిద్దరు స్నానమొనర్చి వ్రేలుముడులు వీపుమీద తాండవమాడుచుండ మోమునందలి చంద్రరేఖకు కాటుక కన్నులకమనీయకాంతి వన్నెదెచ్చుచుండ ప్రతియొక్కని సమ్ముఖమునకు పిండితోడ అష్టదళపద్మములను, షోడశదళపద్మములను రచించిరి. శిల్పనైపుణ్యముతోగూడిన హస్తకౌశలమువలన పదినిమిషములలో పద్మములువేసిరి. వానిమీద విస్తళ్లు పరచితిని. ఇంతలో దేవతార్చనలు జపములు పూర్తియాయెను. వేదగానము జరిగెను. పిమ్మట మాబావగారు రామచంద్రమూర్తికి మహానైవేద్యమును బెట్టిరి. మంగళహారతులిచ్చిరి. భోజనమునకు గడంగిరి. వంతులువేసికొని కృష్ణకర్ణామృతము, రామకర్ణామృతము, గీతగోవిందము, శ్రీకృష్ణలీలాతరంగిణియందలి శ్లోకముల చదువుచుండిరి. ఇద్దరు పిల్లలును, మాబావగారును విసనకఱ్ఱలతోడ విసరుచు కావలసినపదార్థముల నడుగుచు, సరస సల్లాపములు చలోక్తులు మొదలగువాని ద్వారమున భగవానుని లీలావిలాసముల వర్ణింపుచుండిరి. భగవన్నామ స్మరణవలన గృహమంతయు ప్రతిధ్వనింపుచుండెను. ఎల్లరును లేచి చేతులు కడుగుకొనివచ్చి పంచయరుగులమీద కూర్చుండిరి. దక్షిణ, తాంబూలముల నిచ్చినపిమ్మట మాబావగారును, పిల్లలును, మేమును భుజించితిమి.

అప్పటికి రాత్రి పదిగంటలు దాటెను. చంద్రోదయమాయెను. తమ మంతర్హితమగుచుండెను. పనివాండ్రకు భోజనము పెట్టితిని. జోడుకోడెల సవారిబండి సిద్ధ

ముగ నుండెను. లేగలతోడ నాలుగు పాడియావులను దోలుకొని యిర్వురు పాలేళ్లు బయలుదేరిరి. అప్పుడు నాయన మెడయందలి స్ఫటికహారమును సువర్ణరుద్రాక్షమాలను అల్లుని మెడయందు వైచిరి. చేతిసింహతలాటపు మురుగులు రెండుచేతులకు దగిలించిరి. చెరువుక్రింది పదునారు ఎకరములభూమిని ఇద్దరు పిల్లలకు నిచ్చితి మని చెప్పి నాలుగు పాడియావులు నా వని చెప్పిరి. రామచంద్రునకు వ్రేలికొక యుంగరమును బెట్టిరి. మే మిచ్చిన నూతనఖాదీవస్త్రముల ధరించి బండి యెక్కబోవుచు పిల్లలముఫ్వుర నెత్తుకొని ముద్దాడి యానందబాష్పములు గురియుచుండ రామస్మరణచేయుచు బండిమీదగూర్చుండిరి. చూచుచుండగనే యాబండి పండువెన్నెలలయం దదృశ్యమాయెను.

రాజ్యలక్ష్మీ! భగవల్లీల లచింత్యములుగదా! ఆదినమునుండియు నామనోవ్యాధి యంతరించినది. మీ బావగారు మౌనమును వీడి యాయనకడజేరువారల కనేకవిషయములు చెప్పుచున్నారు. నేను నిశ్చింతగ కాలముగడుపుచున్నాను. పిల్లలానందముగ ఆడుకొనుచున్నారు. చదువుకొనుచున్నారు పిల్లలవివాహవిషయము నాహృదయమునుండి తొలగిపోయినది. సమస్తమునుభగవానునకర్పించినాను. బాలకృష్ణుని గాంచుట కాతురతనొందుచున్నాను. కొలదిదినములలో భగవదనుగ్రహమునవలన బయలుదేరగల ననుకొనుచున్నాను.

"జయతి జగన్మంగళం హరేర్నామం".

ఇట్లు ఆశీర్వదించు

పెద్దక్క రామలక్ష్మి,

[సి. పద్మావతీదేవి.]

---

## దురదృష్టము

మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి గారు

జననియంకాన నేనున్న సమయమందె
కాంచి కామించి పొంచి వరించి మించి
యుగ్ర దురదృష్టదేవత యోర్వలేక
ప్రేయసీ! వేరుజేసె నీరీతి మనల.

కనులకుం గానరాకయే నను కరాళ
పీనలోహార్గళోపమాభీల నైజ
కరసహస్రమ్మునం బిగ్గ గౌగిలించి
విడువకున్నది సర్వదా వెంటనంటి.

దేవి! యీ దృశముగ నాదు జీవితంబు
తావక మనోజ్ఞ బాహు బంధమున గాక
దుష్ట దురదృష్ట దేవతా దోస్సహస్ర
గాఢతర పీడనంబున గడుపనాయె.

బాల్య యౌవన లహరీ ప్రపాత పూత
మైన యిరువదినాలుగు హాయనముల
ప్రాయమును దాని కర్కశ బాహుబంధ
మున నె గతియించె నెన్నొ బాములను బడుచు.

తత్కర విముక్తి గాంచు విధాన మేమొ?
లేమ! తెలియంగరాదు నా ప్రేమహృదికి
తావకీన దృఢాశ్లేష తన్మయత్వ
గరిమ సుఖయించు భాగ్యంబు గలుగకుంట.

(ప్రేమగానము నుండి)

---

# నిక్షేపము

రాయసం వెంకటశివుడు గారు

## ౧

మాది పండితవంశము. మా ముత్తాత ముత్తాత రాజునొద్ద ఆస్థానపండితుఁడై, అపారధనము నార్జించి, వంశీయులవశముచేసి మఱి దివికేగెను. ఆయన కుమారుఁడు జనకునికిఁ దీసిపోని ప్రతిభావంతుఁడైనను, వేదాంతాధ్యయనమునందే మనసు లగ్నముచేసి, దాన ధర్మములకే తన సర్వస్వమును ధారవోసి, చరితార్థుఁడయ్యెను. వీరి తరువాతివారు అట్టి విద్యానిధులను నోఁచుకొనకున్నను, అంతటి ప్రజ్ఞావంతుల వంశమువార మనుగర్వమును మాత్రము విడనాడలేకుండిరి. కస్తూరి కట్టిన పుట్టమువలె, మా వంశము నిరతము సుగుణసౌజన్యముల కాకరమై, ప్రజల మన్ననల నందుచుండెను.

మా పై వంశకర్తలలో రెండవవారు సమర్థులు, జ్ఞానసంపన్నులును. తమ వంశీకు లెన్నఁడును జన్మస్థానము విడిచిపోవలదని వారు శాసించిరఁట! వారిమాట జవదాఁటకయె సామాన్యముగ మా కూటములోనివారు మెలంగుచు వచ్చిరి. కుటుంబములు పెరిఁగి, మడిమాన్యములు సన్నగిల్లిన కొలఁదిని, ఈ గ్రామనివాస మతిదుర్భరమగుచు వచ్చినను, మా వంశీకులు 'అవశ్యం పితురాచారం' అను నార్యోక్తి ననుసరించి యీపాటికే యంటిపట్టుకొని, యెటులో జీవితయాత్ర నడుపుకొనుచున్నారు.

మా యీ పూర్వికుఁడు తనకు మిగిలిన ధనరాశి నెచటనో నిక్షేపించి, అది తన వంశము వారికే లభింపఁజేయుట కుద్దేశించి, వారి హృదయాంతరాల నేకీభావమునఁ గట్టు గాఢప్రేమ సూత్రముగ నుండుటకే పై నియమమేర్పఱిచెననియు, కావున మా వంశమువా రెవుకును ఇంటిపట్టుననే యుండినచో, కర్మపరిపాకమైన తరుణమున మాపూర్వికులధనము మరల మాకు చేఁజిక్కఁగలదనియు, మావంశమున గాఢవిశ్వాసము కలదు. కాని యెంత పరిశోధించినను, మాగృహములందు నిధినిక్షేపముల జాడలేమియుఁ గానరావయ్యెను!

## ౨

ఒకనాఁడు నే నధిక మనస్తాపమున కగ్గమైతిని. నా వంతుకు వచ్చిన చిట్టెడు నేలయు ముగ్గురు కూఁతుల పెండ్లికొఱకు కుదువపెట్టితిని. ఇరువురుపుత్రులును చదువు సంధ్యలు లేక, వీథులందల్లాడుచుండిరి. పట్టణమేఁగి యే వీథి బడిగో పెట్టుకొందునని యొకఁడును, పొరుగూరి నందలి యే కాఫీశాలలోనో చేరి పొట్టపోసికొందునని యొకఁడును జెప్పి, కుమాళ్లు నా యనుమతికై వేధింపఁ జొచ్చిరి. ఇంటికిఁ గావలసిన వస్తువులపట్టి,—ఉత్తరాపథమువలె ననంతమనునది యొకటి;—గృహిణి నా ముందుఁ బఱచెను! క్రొత్తపరికిణీలు గట్టింపుమని గారాబు కూఁతురును, వెచ్చముల సొమ్మియ్యుఁడని వెంకయ్యసెట్టియును దీర్ఘోపన్యాసములు గావించి యపుడె నిష్క్రమించిరి.

ఈ కష్టములనుండి విముక్తి యెటులా యని విసిగికొని, ఏమియుఁ దోఁపక, ద్వారబంధపు కమ్మెమీఁద చేయి వైచి, అందుండు నొక తాళపత్ర గ్రంథమును దీసి చదువఁజొచ్చితిని. చక్షువులు అక్షరములమీఁద నున్నను, మనస్సుమాత్రము విభీత హరిణమువలె దిగ్భ్రమణము చేయసాగెను. చదివెడి పద్యముల యర్థము నాకు నచ్చకున్నను, మనోవేగము నరికట్టుటకును, నన్నావరించిన కష్టములు మనస్సునకుఁ దోఁపకుండుటకును, పుస్తక కాలక్షేపము నా కుపకరించెను. అంత నాకన్నులకు వింతదృశ్యమొకటి గానవచ్చెను. ఒకానొకపుట చివరను పద్యసంబంధము లేని విడి యక్కర మొకటి యుండెను. ఆ యక్షరమునకును, ముందువెనుకటి పత్రములలోని సంగతులకును, బొత్తిగ పొత్తు కలియకుండుట కాశ్చర్యపడితిని. కథాసంవిధానమున నా మనస్సు లగ్నమై యుండెనచో, ఆ విడియక్షరమును నా కన్నులు పరిశోధింప కుండెడివియె. కాని, వేరు పని లేకుండిన హేతువున ఈ స్వల్పవిషయమే నామనస్సును పట్టుకొని ప్రాఁకులాడుచుం

డెను. నవీనముద్రణ పుస్తకములవలె నీ ప్రాచీన తాళపత్ర గ్రంథములు లేఖక ప్రమాదముల కంతగఁ జోటీయవు. కావున నా యాశ్చర్యము ద్విగుణమై నే నంత పత్రములు తిరుగవేసి, యిట్టి యసందర్భాక్షరము లింకెచటనైనఁ గలవాయని శోధింపఁజొచ్చితిని. అంత నా యాశ్చర్య మేమని చెప్పను? కొన్ని పుటలు దాఁటినవెనుక నింకొక విడి యక్కర మిట్టిదియె కాననయ్యెను. అంతట వెనుకకు పుటలు త్రిప్పి చూడఁగా నిట్టి యక్షరములె ప్రత్యక్షమయ్యెను. వీనియన్నిటి నొక పత్రమున వరుసగాఁ గూర్చి వ్రాసితిని. కాని యా యక్షర సముదాయము అర్థరహితముగ నుండెను. ఈ సంజ్ఞాక్షరముల యర్థపరిశోధనమున నే నే నాదినము గడిపినను, నాకు లాభ మేమియుఁ గలుగలేదు. తమ కార్యార్థము నాయొద్దకు పలుమారు వచ్చి నాకు చిరాకు గల్పించెడి నా కుమారుల నంత నే జూచి, "మీ రీయక్షర సమామ్నాయమునకు సమన్వయముచేసి యర్థము తేల్చితిరా, ఎట్లో మీ యభీష్టము నెరవేర్చెద!" నంటిని. అంత కొన్ని దినములవఱకును తండ్రియు, తనయులును ఈ క్రొత్త వ్యాపృత్తిని మునిఁగి యుండిరి. ఈ లోపుగ మా యింటఁ గల తాటియాకుల పుస్తకములన్నియు నేను తిరుగవేసితిని. ఎందును నిట్టి వ్యర్థాక్షర ప్రయోగము గానరాకుండెను. అంత నొకనాడు నా చిన్న కుమారుఁడు ఈ యక్షరముల చిక్కు విడఁదీయు నుపాయము మాకు చెప్పెను. మొదటియక్షరము పిమ్మట నొక యక్షరము, రెండవ దానివెనుక రెండక్షరములు, మూఁడవసారి మూఁడక్షరములు, ఇవ్విధమున వరుసగా విడిచివైచినయెడల, మిగిలిన యక్షరములు అర్థవంతమయ్యెను! అవి వరుసగా కూర్పఁగా నిటు లయ్యెను: "నిక్షేపము పెరటిగుడిముందు పెద్దచింతక్రిం——!"

గ్రంథపారాయణమున కథామధ్యమున నెవ్వరుగాని నిలువరు. ఆ మఱునాఁటినుండియు నా కుమాళ్లు ఈ నిక్షేపాన్వేషణ కార్యము సర్వవిధముల సాధింపఁ బూనిరి. నాయొద్దనున్న తాటియాకుల పుస్తకము అసమగ్రముగ నుండెను. దాని రెండవభాగము మా బంధువులలో నొకరి వంతునకు వచ్చియుండుటచేత, మా చిన్నవాఁడు దాని నొకపరి చదువుటకుఁ బుచ్చుకొని, దానిలోఁగల యధికాక్షరముల నీచొప్పుననే కూర్చి, మొత్తముమీఁద తేలిన అక్షరసమామ్నాయము నిట్లు చదివెను:

"నిక్షేపము: పెరటిగుడిముందు పెద్దచింతక్రింద, తూర్పుదిక్కున తొమ్మిదిమూరలనవ్వున!"

## 3

అప్పటినుండియు మా యింట నెన్నఁడును లేని యైకమత్యము సమకూరెను. రేయుంబవళ్లు మా హృదయములు ఈ నిక్షేపాన్వేషణమునందె లగ్నమై యుండెను. మాకందఱికిని కొన్ని దినములవఱకును కనులముందును, కలలందును ప్రాఁతగుళ్లు, బంగరు పెరళ్లును నాట్యము సలుపసాగెను!

"పెరటిగుడి" అను పదసమష్టి దుర్గ్రాహ్యముగనుండెను. గుళ్లుగోపురములును పెరళ్లలో నుండునా? మా వంశపు వారలకు విశాలమగు పెరళ్లు గ్రామమునఁ గలవు. ఐన నందు దేవాలయములు లేవు. ఊరఁ గొన్ని గుళ్లు గలవు కాని యవి యిండ్లకు దూరమున వీథులలోనుండునట్టివియె. కావున మా కృషియంతయు వ్యర్థమై, యీ నిక్షేపమునుగుఱించి నబీజాక్షరము లెపుడును బీజాక్షరములుగనే యుండవలసివచ్చునట్లు తోఁచెను! అంత గ్రామమునఁ వృద్ధులను విచారింపఁగా, పూర్వమొకప్పుడు ఈ గ్రామము వేఱుప్రదేశమున నుండుచు వచ్చినట్లును, అనటనేదోయొక విప్లవము సంభవింపఁగా, జను లందుఁడి లేచివచ్చి, యిక్కడ నూతనగ్రామ మేర్పఱుచుకొనిరనియును, చాలకాలము క్రితము వఱకును గ్రామప్రదేశము "పాటిపెర" డని వ్యవహరింపఁబడుచుండెననియును తెలిసినది. కాని, యక్కడ గుళ్లేవియు లేవే! నే నొకనాఁ డాప్రదేశమునకేగి, నలుదెసలఁ బరికించి చూచితిని. ఎచటను పాడుగుడి జాడలు గానరాకుండెను. అంతట నొక చెట్టుక్రిందఁ గూర్చుండి, యాలోచనలలో మునిఁగియుంటిని. చేరువనుండి మేకలను మేపుచు ముసలిగొల్లవాఁడొకఁడు పోవుచుండఁగా, వానితో ముచ్చటింపఁదొడంగితిని. పాడు

గుడినిగుఱించి వానిని ప్రశ్నించితిని. శిథిలమైన గుడియొకటి చిరకాలముక్రిందట నిచట నుండెడిదని వాఁడు నాకొక



ప్రదేశము చూపించెను. అందిపుడు గుడి లేకున్నను, గుడి యానవాళ్లు లేకపోలేదు. పైరాళ్లన్నియు చెదరిపోయి అందిపుడు అడవిచెట్లలముకొనియున్నను, కఱ్ఱతో గొట్టినను, కత్తితోఁ బొడిచినను, నేల 'కంగు'మని మ్రోఁగసాగెను. అంత నేను చింతను గుఱించి ప్రశ్నించితిని. తా నాచెట్టు చూడలేదుకాని, పెద్ద చింతయొకటి యచట పూర్వ ముండుచు వచ్చెనని చిన్నప్పుడు పెద్దలవలన వినుచుంటిననని యతఁడుచెప్పి నా కొకప్రదేశము చూపించెను.

ఎన్నఁడు నేను, నాపుత్రులు నింత జాగరూకతతోఁ బనులు సలుపుచుండువారము కాము. "దరిద్రునికి మనోరథము లధికము." మనోరథసాఫల్యమె మా దారిద్ర్యవిచ్ఛేదమునకు ముఖ్యసాధనమని నమ్మి, మే మమితోత్సాహముతో ఈనిక్షేపాన్వేషణకార్యము సాధింపఁ బూనితిమి.

౪

మా బూరుగపాడున కీప్రాఁత పాటిపెరడు సుమారొకక్రోసుదూరమున నున్నది. పాటిపెరడు, దానిచుట్టు నుండు ప్రదేశమును నేఁటివఱకును మా వంశపువారి భుక్తములో నుండినను, పగటిపూఁట బహిరంగముగ మే మచట త్రవ్వ వలను పడదుగదా. జ్ఞాతులు, లోకులును మాపని కడ్డంకులు వేయక పోయినను, దాని కనుసరముగు ప్రకటన గావింతురనుట స్పష్టము. అందువలన మా యుద్దేశమునకు విఘాతము సంభవింపఁగలదు. కావున రాత్రులె మే మీకార్యమును సాధింపఁ దలంచుకొంటిమి. మా కీవిషయమున నెంతో శ్రమగలిగెను. త్రవ్వుపని యొకపూఁటలో తెమలునది కాదు. రాత్రిపూఁట పాటిపెరడు అరణ్యసదృశముగ కనఁబడినను; పగలు సేద్యగాండ్రు, పసులకాఁపరులును అచట సంచరించుచునే యుందురు. వీరందఱును అసంపూర్ణమగు మా పని కనిపెట్టరేని, తమ త్రవ్వే ళ్లందుఁ జొప్పింపక పోయినను, ప్రజలకది ప్రకటింతురనుట స్పష్టము. పగటివలెనే వెన్నెలరాత్రులును మా పనికి విఘ్నకరమె. చీఁకటిరాత్రులందును మాకు చిక్కులు లేకపోలేదు—దీపము లేనిచో మొదట కనులే కనఁబడవుకదా. పురుగు పుట్రలతో నిండియుండు నిర్జన ప్రదేశమున వెలుతురు లేక పని యెట్లు సాగును! ఇఁక దీప ముండినచో దూరమున నుండువారు సయితము మాజాడలు గనిపెట్టరా? ఐనను ఎట్టి విషమసమస్యా పరిష్కారమున కైనను సాహసకార్యమె ప్రబలసాధనమని నేను కార్యనిర్వహణమునకుఁ గడంగితిని.

అమావాస్యనాఁడు రాత్రి రెండుజాములపుడు నా కుమాళ్లతో గ్రామమునుండి బయలు దేఱితిని. కాళ్ల కు మెత్తని చెప్పులు తొడుగుకొని, చేతులందు త్రవ్వు పనిముట్లు, కిరసనాయిలుబుడ్డి, అగ్గిపెట్టెలు నుంచుకొంటిమి. మేము ప్రాఁతగుడిప్రదేశముఁ జేరి మ మ్మెవరైనఁ గనిపెట్టుచుండిరేమో యని యిటునటు పరికించితిమి. కాని చుట్టు ప్రక్కలంతటను నిశ్శబ్దముగ నుండెను. మేము దీపము వెలిఁగించి చూచితిమి. జిల్లేడు, కసింద, నేపాళము మొదలగు మొలకల యెండుటాకులు గలగల మనెను. నిద్దుర కలఁతపడిన తొండలు, ఉడుతలు మొదలగు

కీటకము లిటునటు పారిపోయెను. ఎడారి ప్రదేశము నఁగ్రొత్తలగు దీపపుకాంతులచే నాకర్షింపఁబడి దోమలు, నుసుమలును దీపపు బుడ్డిచుట్టునుమూఁగి, అత్యాశాపీడితుఁడగు మనుజుని హృదయమువలెనే తోఁత్తోఁడనె దగ్ధమయ్యెను. త్రవ్వుఁగోలతో నేల నచ్చటచ్చటఁగొట్టి, విన వచ్చెడి మ్రోఁతనుబట్టి ప్రాచీన దేవాలయ స్థల నిర్ణయము చేసికొంటిమి. చెట్టుజాడలు గుర్తుఁగుటకై గొల్లవాఁడు చూపిన ప్రదేశమున మేము త్రవ్విచూచితిమి ఎచటను వేళ్ల యానవాళ్లు గానఁబడలేదు. చిరకాలముగ పడిపోవుటచేత వేళ్లు మట్టిగ మాఱిపోయి యుండవచ్చునని యును, లేనిచో నవి మొదలంట త్రవ్వివేయఁబడి యుండవచ్చుననియును మేము నిర్ధారణ చేసికొంటిమి. ఆప్రదేశమున కుత్తర దక్షిణములందును త్రవ్విచూచితిమి. ఐన నెచ్చటను మా కేమియుఁ గానఁబడలేదు. అప్పటికి తూర్పు తెల్లవారుసమయము కావచ్చినందున, నాఁటికి పని నిలిపివైచి పగటిపూఁట జనులకంటికి మాపని కానిపింపకుండునట్లు, త్రవ్విన మట్టి వెనుకటి తావుననే చేర్చి, గోయి పూఁడ్చివైచి, బయలుదేఱి యిలు సేరితిమి.

మఱునాఁటి రాత్రియు నదేసమయమున మేము ముగ్వురమును ఇలువెడలితిమి. కాని, యీనాఁడు మా పిల్లవాఁడు చమురుబుడ్డివిడిచి విద్యుద్దీపపు గొట్టము సంపాదించి, తనతోఁ గొనివచ్చెను. దానిసాహాయ్యమున మేము సుకరముగఁ బనులు చేయఁగలిగితిమి. వలసినపుడు వెలుతురు, లేనపుడు చీఁకటి,—ఇవియె కదా మా పనికిపుడు కావలసిన పరిస్థితులు!

"నిజముగ నిక్షేపమె యిచట నుండినయెడల నేఁడది మన కనులఁ బడవలసినదే!" యని పిల్లవారిరువురును రాక్షసులవలె నాఱేయి పనులు సాగించిరి. త్రవ్వి త్రవ్వి, "ఇఁక లాభము లేదు. తెల్లవారుచున్నది ఇంటికేఁ బోవుదము!" అని మే మనుకొనుచుండునపుడు చిన్నవాని గునపపుదెబ్బకు 'కంగు' మను నొక శబ్దము నేలలో నుండి వినవచ్చెను. అది విని యాశ్చర్యానందములు ముప్పిరిగొన మేము గోతిలోని కట్టె తొంగిచూచితిమి.

ఇంతలో మా కార్యమున కొకవిఘాత మాపాదిల్లెను. కొంతసేపటినుండి మా జాడలు తీయువాఁడెవఁడో దూరమున పొంచుని చూచుచున్నట్లు మా పెద్దవాఁ డనుమాన పడుచుండెను. అది వట్టిభ్రమయని మే మెంత చెప్పినను వాఁడు వినక, ఆమనుష్యునిచెవులు కనఁబడినవని యొకమాఱును, తల పొడగట్టెనని యొకమాఱును, పలవించెను! ఈ కంగుమను చప్పుడు వినఁబడిన యొక నిమిషమునకు మా పెద్దవాఁడు అనుమాన పడుచుండిన దిక్కునుండి మా కొక కేక వినవచ్చి, గుండెలు జల్లుమనెను—"వేగముగ గోయిపూఁడ్చు"డని యొకరమును, "మనుష్యుని తరుముఁ"డని మఱి యొకరమును కేకలిడితిమి. అంత మా ప్రయత్నముల ను పరిహసించుటకా యనునట్లు, పదియఱువు లొకసారిగ వినవచ్చెను! ఊరివారందఱును మా మీఁదికెత్తివచ్చినట్టుగఁ దోఁచి, భయభ్రాంతులమై నిశ్చేష్టులమై పోతిమి. కాని, యొకింత ధైర్యము తెచ్చుకొని పరికింపఁగా ఈ యఱచినవి నక్కలని తేలినది. మే మంత వీరావేశమున రాళ్లు రువ్వి, వానిని దరిమివైచితిమి. ఈ క్షుద్రజంబుకములా పురుషసింహులమగు మా పరాక్రమమును పారద్రోలఁ గలుగునవి!

ఇ

దీనికేమి గాని, గునపపుదెబ్బకు మ్రోఁగిన వస్తువేమిటి? పదిమంది మనుష్యులైనను మోయలేని బంగారు గాబు దొరకునని మే మిన్నాళ్లు నువ్విళులూరుచుంటిమి. మూఁడు పదునైదులు ముగిసిన ముడుతలమోము ముదుసలి ముత్తైదువైనను, దొరకు ధనములోఁ దాను మోయఁగల బంగారు ముందుగ తన నగలకై వినియోగింతునని యింటియాపెయును, తమ వృత్తివ్యాపారములకు వలసినంతసొమ్ము వెచ్చింతుమని తనయులును ఇన్నిదినములును ఇంట పాటలు పాడుచుండిరి! ఇఁక విరక్తిమార్గముఁ బట్టియున్న నా మనస్సు ఇట్టి హేయ విషయముల మీఁదికిఁ బోవునా? ఐనను ఏకోశము నుండియో ఆశాపిశాచము నా మీఁదఁ గూడ నుఱుక సాగెను. కూఁతుల పెండ్లి యప్పులు తీఱిపోవుటయు, చిరకాలమునుండి చేయుదమను క్రతువు సక్రమముగ సాగుటయు, కర్ణము



పల్లవశాసనము-సంగమేశ్వరము- రెండవ ప్రక్క
(చూడు, విభవ సం॥ కార్తికమాసపు భారతి, పుటలు ౪౯౪-౪౯౭)



౫. విషూచిదేవత కొలుపు-నంద్యాల

లకు కాంచన కుండలములు చేకూరుటయు — ఇవియె నాకుఁగల కోరికలు!

పండ నడవి మొలకల యూఁకులు, కొమ్మలు నందుపైనఁ బఱచి, రాగిగొట్టము చేతఁ బుచ్చుకొనిరి. ఇపుడె దిశల



ఈ కోరికల కన్నిటికిని కల్పతరువగు మహావస్తు విపుడు మాకనులఁ బడనున్నది. ఆపదార్థమెంత విస్తీర్ణ మగనుండునో యని నివ్వెఱపడుచు, నలుదిక్కులను త్రవ్వి, దాని నెట్టకేలకు పెల్లగించితిమి. కాని, అది మా పిల్లవాని పిడికిలిలో నిమిడిపోయిన చిన్న రాగిగొట్టమె! ఈ యాశాభంగమునకుఁ గుప్పగూలినట్టు క్రుంగిపోతిమి. నే నంత ధైర్యమవలంబించి, "నాయనలారా! ఇఁక చుట్టును మఱి యొకమాఱు త్రవ్వి చూడండి. ఇంకే పెద్దవస్తువుగాని కానఁబడనియెడల, ఈ రాగిగొట్టమును యథాస్థానము నందు పూడ్చివేయుఁడు. దీనివలన మనకుఁ గాకపోయిన ముందువారికైనను మనస్సంతృప్తి గలుగవచ్చును!" అని నేను పిల్లలను హెచ్చరించితిని. నా మాటలు మాత్రము వారలకు నచ్చలేదు. వారు చుట్టును త్రవ్వి, మఱి యే వస్తువుగాని యచట లేదని నిశ్చయించుకొని, త్రవ్వినమట్టి వెనుకటి ప్రదేశమునఁ జేర్చి, ఇతరు లానవాలు పట్ట

కేఁగుచుండెడి చీఁకటి గములవలెనే మేమును చిన్నవోయిన మొగములతో నింటిమొగము పెట్టితిమి.

౬

ఇంకఁ జెప్పవలసినదేమున్నది? సొమ్మంతయు చోరులు కొల్లగొని నప్పటివలె, ఆ దినమున మా యింట నందఱును విషణ్ణవదనులై యుండిరి. నేను మాత్రము పూజ్యులగు మా పూర్వికు లొసఁగిన యీ రాగిగొట్టమున కభిషేకము చేసి విధ్యుక్తముగ దానికిఁ బూజా పురస్కారము లొనరించి, పిమ్మట దానిచీల లూడఁదీసి చూచితిని. చిన్న రాగితీఁగచేఁ గూర్పఁబడిన రెండు రాగిరేకు లందుఁ గానవచ్చెను. ఆ రెండింటి మీఁదను ఈశ్లోకపాదములు చిత్రింపఁబడియుండెను:—

"ఆశాశా పరం దుఃఖం"

"నిరాశా పరమం సుఖం"





5 12.



మడిలోనున్న నా చేతినుండి చివాలున ఆ రాగి రేకులజత నూడఁబెఱికి, నా చిన్నకూఁతురు "ఈతీఁగ వెండి దైనను, తమ్మంట్లు చేయించుకొందును స్వామీ!" యని దైన్యమున విలపించెను. ఎవరేమనుకొన్నను, నేను మాత్రము దిగులుపడక, మహైశ్వర్య సంపన్నుఁడైన మా పూర్వికుఁడు సాహసమున తన ధనరాసులు దానధర్మములకు వినియోగించి, తన యమూల్యానుభవమును మాత్రము వంశమువారికి శాశ్వత కట్నముగ నొసఁగె నంచు కొంతయు కృతజ్ఞుఁడనై, ఈ కార్యసాఫల్య విషయమై నా ధర్మము నేఁ జేసి ధన్యుఁడ నైతినని యుప్పొంగితిని. నేఁటికిని దేవతార్చనా సమయమున నే నాపవిత్రపేటికను భక్తిశ్రద్ధలతో పూజించుచున్నాఁడను. మనపూర్వు లొసఁగు కాంచనాదులు క్షణభంగురములు; వారు చేసెడి ధర్మోపదేశము మాత్రము శాశ్వతజీవము గలిగి తదనుసారులగు వారలను తప్పక తరింపఁజేయును.

---

## దశకంఠరావణతత్త్వము

శ్రీ విక్రమదేవవర్మ గారు

పదుగురి గొంతులపగిది ధ్వనించుటన్ దశకంఠరావణ నామ మబ్బె
నగము పేరునుగూడ జగమున వాడుటన్ దశకంఠ యని రావణా యనుచును
బిలువంబడుచు నుండ నల కంఠపర్యాయము లగు గ్రీవాకంధరలును జేరెఁ
దరువాతఁ బదితల లిరువదిచేతులు కల్పించినాఁ డాదికవివరుండు
గానిచోఁ బాదయుగ మంత కాయభరము- మోయఁగల్గెనె? యటువంటిబూఁచిఁ గనిన
జనని మని మఱి పిల్లలం గనెనె జగతి? - నట్టేఁడు జనించిన నపుడ గిట్టకున్నె?

---

# విమానం

భమిడిపాటి కామేశ్వరరావు గారు

కొంతకాలం కిందట ఓ విమానం రాజమండ్రీ వచ్చి గోదావరిలో దిగింది. ఇటీవల ఓ జోడా విమానాలువచ్చి గోదావరి తిప్పమీద వంతెనకి ఉత్తరంగా దయచేశాయి. వెనకటిది జలంమీంచి ఎగిరేదికాని, ఈ రెండూ భూమిమీంచి రాంబందుల్లాగ ఎగిరే రకం. అసలు విమానంలో దేవతలు బైటాయించవలసిందిగాని, తీరా చూస్తే దొర్లే ఉన్నారు. వర్ణసామ్యంబట్టి దొర్లు దేవతలే గా మరీ! ఆమాటకొస్తే విమానం ఎవరెక్కిన వారు నెత్తిమీది వారే అవుతారు. ఆ వచ్చినవారు వ్యాపారంమీద వచ్చినవారవడంచేత, ముందు రాజమండ్రీలో దిగుదామా, బెజవాడలో దిగుదామా, విశాఖపట్నములో దిగుదామా, అనంతపురములో దిగుదామా, ఖాళీవానంలో దిగుదామా అని గుణకారాలు ప్రారంభించుకోలేదుట. వేర్వేరు గుణకారాలకి ఏకఫలితం ఉండడం చాలా అరుదు అనో, దీర్ఘాలో చనమీదట విమానంకంటె ముందు వ్యాపారమే ఎగిరిపోతుందనో గావును- ఏదో ఏర్పాటుమీద వీలు చూసుగుని వారు రాజమండ్రిలో దిగేశారు. విమానం ఆకాశంలో వెళుతూన్నప్పుడు జనం చూస్తోచ్చినందుకు మాత్రం వీరు టిక్కట్టు పెట్టలేదు. అది నేలమీద వాలి ఉన్నప్పుడు దాని దగ్గిరికివెళ్లి దాన్ని పరకాయించడానికి ఓ పావలా టిక్కట్టు నిర్ణయించారు సర్కస్ జంతువుల్ని చూడడానికి వీలునుబట్టి ఓ అణా పెట్టినట్టు. ఇది గాక, చిన్న ఎగురుకి పదిరూపాయలూ, పెద్ద ఎగురుకి పాతికరూపాయలూ, ఇంకాకావలిస్తే దామాషాయీని మైలుకి రెండున్నర రూపాయలూ-రేట్లతో వీరు చాలా . ందిని ఎగరేసి, తిప్పితిప్పి నేలమీద దిగవిడిచారు. చిన్న ఎగురు అయిదారు నిమిషాలు; పెద్దది పది పది హేను — టిక్కట్టురూపాయలు లెక్కచూసుకున్నంత నేపు లేదు. దిగింది లంకమీద గనక పడవలకీ స్టీమరుకీ కొంత తడి తగిలింది. జనం తీర్థానికి ఇంత రద్దీగా వెళ్లరు. వెనక ఓలంకమీదికి దిగంబర స్వాములవారు వేంచేసినప్పుడు స్త్రీపురుషులు ఇంతకంటె భక్తితో వెళ్లినా, ఇంత తప్పనిసరిగా ముడుపు చెల్లించలేదు.

కొత్త పరిస్థితుల్లో, ధనంకంటే సాహసమే ముందుకొచ్చి పడుతుంది. అందుకని చాలాడబ్బున్నవాళ్లు, పొడుగుపాటి బేరాలుచేస్తూ ఆగిపోగా, సాహసులు- (వీరిలో కొందరు అణాకూళ్ల మాత్రులు) మొదట్లోనే ఎక్కి షికారు తిరుగుతొచ్చారు. స్త్రీలు కొద్దిమంది మాత్రమే ఎక్కవచ్చారట. ఒక ముసలమ్మ తనప్రాణానికి తెగించి కర్రతోసహా ఎక్కిందట. ఆ "ట్రిప్పు" లోనే ప్రమాదాలువచ్చి ముసలమ్మలు పోరు గదా అనే ధైర్యం కొద్దీ, ఇద్దరు ధీరులు డెబ్బలాడి యెక్కారట. లంకమీదికి వెళ్లలేనివాళ్లు, విమానం ఊరుమీద తిరిగేటప్పుడు బయలుదేరే హోరుకి ఇవతలకి వచ్చి పైకిచూసి సంతోషించేవారు. అనగా, విమానం పూరేగ వచ్చేసరికి జనానికి ఊర్ధ్వదృష్టీ, ఊర్ధ్వశ్వాసా బయలుదేరాయి. ఇది ఎన్నిసార్లుచూస్తే అంతఘనత అనుకుంటారని గావును, "అబ్బో! నేనప్పుడే పదోమాటు ఇదిచూడడం!" అని కొందరు బడాయి కొడుతూండేవారు. పాలకొల్లుకేసి ఇది సబురు తిరిగేటప్పుడు ఇది ఒకగ్రామం మీంచి పోతూంటే, అక్కడ తద్దినం జరుగుతోందిట; భోక్తలు భక్ష్యాలు విరుస్తున్నారట, కర్త పారణ కలుపుతున్నాడట, ఈవిమానపు హోరికి యజమాని వీధులోకి ఎగడి పక్షివతుగా ఎగిరిపోతూన్న విమానాన్ని చూసి, పితృదేవస్థానంలో కూర్చున్న గోపాలాన్ని రెక్కలంకించుకుని మొర్రో మొర్రో అంటూండగా చేతిలో గారెపళ్ళంగా ఆయన్ని నడివీధిలోకి ఈడుస్తూ, "ఇంకాచూస్తావేమిటి గోపాలం, ఎగిరిరాకా! తద్దినం మళ్లీవచ్చేదే" అని కసురుకున్నాడట. ఇది అశాస్త్రీయం అంటే ఏంప్రమాదమో అని మంత్రం చెప్పేఆయన, "ఇక్కడికి మీనాన్నగారి ఆత్మకి విమానదర్శనం చేయించారు, ఏమి పితృభక్తి" అని మెచ్చుకున్నాడట. అల్లాగ్గా, అంవరూకూడా ముందు దీన్నిచూసి, తరువాత మరోపని చేసుకునేవారు. ఇది ఒక అమ్మవారై పోయింది. దాని ధ్వనిలాంటిధ్వని ఏది వినబడ్డాసరే, జనం ఇవతలికివచ్చి చూడడం పరిపాటై

పోయింది—రాజు రాజవీధిని ఏగుదెంచుతూంటే పుర స్త్రీలు ఏపనిలో ఉన్నవాళ్లు ఆమట్టుగానే వచ్చి అతణ్ణి తొంగి చూశారని ప్రబంధకవులు దొర్లించినట్లు ఇంట్లోంచి విమానధ్వని విని కొందరు కొందరు తెమిలి వీధిలోకి వచ్చేటప్పటికి అప్పుడే అది తోకముడిచేది. ఇతర ఊళ్ల నించి కేవలం ఈపనిమీదే ఇక్కడకివచ్చి "వేరేప నుండి వచ్చాం లెండి" అని డబాయిస్తూండడం కొంతనుంది. రెండు మూడురోజులయేసరికి ఊళ్లో విమాన విశేషాలు విజృంభించాయి. "మనుష్యుల్ని అందులోకి ఎక్కించి గానుగెద్దుకి కట్టినట్లు కళ్లకి గంతలు కడతారట్ట, ఏమీ కనిపించదుట, అల్లాంటప్పుడు ఇహ ఈ రకంవారీగాళ్లు ఎక్కి ఏం లాభమో!" అని ఒకరు. "మనిషిని తోలు పటగాలెట్టి బిగదీసి రెక్కలు విరిచి విమానపు రెక్కలకి కట్టేస్తారట" అని ఒకరు. "పైకి వెళ్లడం అంటే పైకి వెళ్లడమే. ఎక్కడిమాట! ఈ ఎక్కేపీనుగులు విల్లురాసేసి మరీ ఎక్కడం మంచిది" అని కొందరు జాగ్రత పరులు. "ధనిష్ఠాపంచకాల చిక్కు లేకుండా కాస్త ఏకాదశి లాంటిది చూసుగుని ఎక్కడం వల్ల మోక్షంకూడాను" అని కొందరు భక్తిపరులు. "ఇది ఇందాకా మాయింటి మీంచే వెడతా—దానికిందచెక్కినఅక్షరాలు కూడా చదవడానికి వీలైంది. నేను ఇహ ఎక్క దల్చుకోలేదు" అని ఒక దర్జాపురుషుడు. "రేట్లు మరీ చురుకుగా ఉన్నాయి, నేను సగంరేట్లు అయింతరవాతగాని ఎక్కను" అని ఒక బేరగాడు. "ఇది దిగిన లంకమీద ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజెంట్లు మకాంచేశారట, వీళ్ల సందర్భాలు ఇదైపోనూ, ఓఘూయిత్యంకుడాను! నా ఎడంకన్ను అదురుతోంది నేను రాను బాబూ!" అని ఒక శకునప్రధాని. "మొన్న ఓకోమట్లబ్బాయి విమానం ఎక్కి అది కదలబోయేవేళకి భళ్లునడోక్కున్నాట్ట, మృత్యువంత పనిజరిగిందిట, ఎందుకొచ్చింది!" అని ఒక ధైర్యశాలి. "డోక్కోడంతో తెమల్లేదుట" అనిఒక వెకిలిఅబ్బన్న. "అంచేతే ఆ అబ్బాయి దగ్గిర మరి పది రూపాయలు వసూలు చేశారట" అని ఒక ప్రత్యక్షవాది. "తుదనెగ్గి నేలమీద కాలెట్టిందాకా నమ్మకంలేదుట. ముందేడబ్బివ్వడం దండగేమో!" అని ఒక గడసరి తనస్నేహితుడికి సలహా ఇవ్వగా, ఆస్నేహితుడు, "అల్లాగనక జరిగితే తరవాతే ఇస్తానంటాను ఎంజేస్తారేమిటి?" అన్నాడట. రాజవీధినిపోతూన్న విమానాన్ని మెడనెప్పెట్టే దాకా చూసి, ఒక బాటసారి తనపక్కనున్న పెద్దమనిషితో, "ఏమండీ అయ్యా! పైకి వెళ్లేసరికి గాలి మారడంవల్ల ఎవడికో మూగాడికిమాటలు వచ్చాయంటున్నారు. ఏమిటి మీ ఊహ?" అన్నాడు. అంటే ఆపెద్దమనిషి, "ఏం? మీయింట్లో ఎవరికేనా మూగా?" అన్నాడు. అందుకు బాటసారి, "మరేనండి, మా యింట్లో దానికే" అని జబాబు ఇచ్చాడు. ఆపైని, పెద్దమనిషి, "అదృష్టవంతులే. ఇహను ఆదుర్దా ఎందుకూ?" అన్నాడు. బాటసారి, "నయం అవుతుందంటారా?" అని అడిగాడు. పెద్దమనిషి, "ఏమోగాని, క్షణికసౌఖ్యానికి పాతికగేసి వదలడంవల్ల దిగిన తక్షణం మీకుకూడా మాటపోతుంది." అన్నాడు. ఈలాగ్గా చిత్తానుసారం వృత్తాంతాలు చెలరేగి పాకడం ప్రారంభించాయి.

తరుణం వచ్చినప్పుడు ఉపన్యాసకుడు అమాంతంగా మొలుస్తాడు. ఎల్లానో సందుచేసుగుని ఒక సందర్భములో వెనకయ్య అనే ఒకాయన విమానాన్ని గురించి లెక్చరు పేల్చాడు! "ఇప్పుడంటే ఎవరో ఆవేళపు ఘటాలు 'ఈరిపేన్', 'ఈరిపేన్' అంటూ ఎగబడుతున్నారు గాని, మనస్వంతానివి లేవుటండీబోలెడు విమానాలూ? పురాణంలో లక్ష ఉన్నాయి. ఆదిని, విశ్వకర్మకి చాలాతీరుబడిగా ఉన్నప్పుడు అతడిచేత కర్తిలేని ఒక విమానరాజం బ్రహ్మచేయించాడు. ఆసంగతి కుబేరుడి చెవిని పడేసరికి అతడు బ్రహ్మగారింటికి వెళ్లి అభోజనం పడుకుని అతని దగ్గిర్నించి అది కాస్తా బెల్లించుకు చక్కాపోయాడట. ఈమాట రావణాబ్రహ్మ విని కుబేరుణ్ణి పక్కలు విరగతన్ని అది తనింటికి పట్టుకుపోయాడట. లంకలో ఆంజనీలవారు, చూసింది అదేట. ఆరావణాసురుడి తలకాయ లాంగక చివరకి వాడి హృదయం చీల్చిన తరువాత రాములువారు సీతామ్మవారితో కలిసి దానిమీదే అయోధ్య వెళ్లారట. 'మళ్లీకావలిస్తే కార్డు వ్రాస్తాం పో' అని రాముడు అన్నమీదట చోదకుడు లేకుండానే అది అలకాపురం నిర్క్రమించిందట.

అదీగాక, సకలలోకాలలోనూ ఉంటూండే జట్టీలు తెలుసుసుకోవడానికి నారదులవారికి బ్రహ్మగారు ఓ విమానపు లైసెన్సు మొపణ్ణించీ పారేశారట—(కొడుకు గనుక మామూలు లంచం లాగకుండానే ఇచ్చారట ఆ లైసెన్సు మాత్రం). ఇంద్రజిత్తులవారు మాయ చేశారంటారుగాని విమానంమీంచేట యుద్ధం గావించింది. పూర్వం ఒక హిందూరాజుతో ఒకయవనుడు పేచీపడి, తరవాత మెత్తనిమాటలుచెప్పి ఆరాజుని విమానపుషికారు చేయిస్తానని పైకి కొట్టుగెళ్ళి, విమానం మంచి వేగంలో ఉన్నప్పుడు రాజునిబెడ్డముక్క గిరవాటేసినట్టు కిందికి గిరవాటేశాడట. వెనక మరోకరాజు పెళ్ళానికి పురుడురోజులట, ఆవిడ అక్కడికి చాలాదూరాన్ని ఉన్న ఒకచోటికి వెడితేగాని నీళ్ళాడనని కూచుందిట, అమట్టున అతి వేగంగావెళ్ళే వాయువిమానం కట్టి ఆవిణ్ణిఆప్రకారం చిటికెలో తీసుగువెళ్ళవలసిందిగా ఆరాజు తన ఆస్థానశిల్పుల్ని ఆజ్ఞాపించాడట: భోజుడు వర్ణించినదాల్లోకూడా ఏజంతువు ఆకారంలోనైనా సరే విమానం నిర్మించవచ్చునిన్నీ, ఇనుపసులికలో పాదరసం ఎక్కించి దాన్ని వేడిచేస్తే యంత్రం పైకివెళ్ళి, వేడితగ్గిస్తే కిందికి చేరుతుందనిన్నీ ఉంది. వెనకట్లో మనవాళ్లు! సామాన్యం అని చూస్తున్నారావేమిటి? హేం."

ఇల్లా, చాలామంది వెనకచూపుచూసి హిందువుల పూర్వప్రతిష్ఠ చెబుతూండగా, కొన్నికొన్ని చోట్ల, విమానం ఎక్కివచ్చినవాళ్లకీ ఎక్కని వాళ్లకీ సంభాషణలు జరుగుతోచ్చాయి. విమానం ఎక్కినవాళ్లల్లో ఎవడైనా ఇతరగ్రామం పనుండి వెళ్ళినప్పుడు అతగానిని ఓ పెద్దకథానాయకుడుగా కట్టి జనం విరగబడి చూడరావడం జరుగుతోచ్చింది—అతను అదెక్కినతరవాత అతని ముఖంలో ఏమన్నా మార్పు ఉందేమో అన్నట్టు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కణ్ణిఇల్లాచూస్తూంటారులెండి. ఇదివరదాకా మోటారుడ్రైవర్ని చక్రధరుణ్ణి చూసినట్టు చూడలేదూ? ఇప్పుడంటే ఇల్లా అయిపోయిందిగాని, ఇదివరదాకా బి. యే. లని సరస్వతీవిగ్రహాలని పొగడలేదూ? అల్లానే ఇదీగావును. విమానం ఎక్కినవాడు కొండయ్యఅయిపోతే, ఎక్కనివాడు నేలయ్యగానే ఉంటాడు. అల్లాంటివారికి ఈదిగువ ప్రసంగంలాంటివి నిసంశయంగా జరుగుతోచ్చాయి:—

నేలయ్య—తమరు మహా ఎగురుతున్నారుట మన ఊరుమీద, నిజమేనా?

కొండయ్య—ఎవడా అన్నది?

నే—అదిగాదయ్యా, విమానంలో కొండెక్కారటగా! విశేషాలు!

కొం—మీకూ తెలిసిందీ, అప్పుడేను?

నే—తెలియకేంజేస్తుంది! ఆకాశసంభవాలు రహస్యంగా జరగవ్.

కొం—అల్లాగేమరీ! నేనూ విమానంకి ఎక్కి దర్శించాను, పదిరాళ్లు! అక్కడితోగాని తీరలేదు బులబాటం.

నే—ఎల్లాఉంది?

కొం—బాగానే ఉంది!

నే—అంటే?

కొం—ఏం జెప్పనూ? ఆకాశంలో వెడుతూన్నట్టుంది!

నే—ఏడిసినట్టేఉంది. అదికాదు, నీకు భయం వెయ్యలేదూ?

కొం—దానికేమిటి? అది, మనిషిని బట్టి ఉంటుంది.

నే—అగమం, కళ్లేనా తిరగలేదూ!

కొం—అదీ అంతే, కొందరికి అదుగెక్కి కిందికి చూస్తే నేకళ్లు పచ్చులుగమ్మి చెవులు గడియలడతాయట. ఎక్కడికి?

నే—పడవపు ఏమాత్రం ఉంది?

కొం—పడవకి మోటారుబస్సు ఫస్టు. విమానానికి ఆమాత్రం ఎక్కడేడిసింది? విమానప్రయాణం పడవప్రయాణముకంటె మెత్తన.

నే—అయితే, ఇది నేల ఏరీతిగా వదుల్తుంది?

కొం—మోటారులాగే నేలమీద ఓ అర మైలు పాకి ఆవేగంలో నేల వదిలి పైకెగసి లేచిపోతుంది.

పోయింది—రాజు రాజవీధిని వీసదెంచుతూంటే పుర స్త్రీలు ఏపనిలోఉన్నవాళ్లు ఆపట్టుగానే వచ్చి అతణ్ణి తొంగి చూశారని ప్రబంధకవులు దొర్లించినట్లు ఇం ట్లోంచి విమానధ్వని విని కొందరు కొందరు తెమిలి వీధి లోకి వచ్చేటప్పటికి అప్పిడే అది తోకమడిచేది. ఇతర ఊళ్ల నించి కేవలం ఈపనిమీదే ఇక్కడకివచ్చి "వేరేప నుండి వచ్చాంలెండి"అని డబాయిస్తూండడంకొంతనుంది. రెండు మూడురోజు లయేసరికి ఊళ్లో విమాన విశేషాలు విజృంభించాయి. "మనుష్యుల్ని అందులోకి ఎక్కించి గాను గెద్దుకి కట్టినట్టు కళ్లకి గంతలు కడతార్ట, ఏమీ కనిపించదుట, అల్లాంటప్పుడు ఇహ ఈ రకంవారీగాల్లు ఎక్కి ఏం లాభమో!" అని ఒకరు. "మనిషిని తోలు పటగాలెట్టి బిగదీసి రెక్కలు విరిచి విమానపు రెక్కలకి కట్టేస్తారట" అని ఒకరు. "పైకి వెళ్లడం అంటే పైకి వెళ్లడమే. ఎక్కడిమాట! ఈ ఎక్కేపీనుగులు విల్లు రానేసి మరీ ఎక్కడం మంచిది" అని కొందరు జాగ్రత పరులు. "ధనిష్ఠాపంచకాల చిక్కులేకుండా కాస్త ఏకాదశి లాంటిది చూసుగుని ఎక్కడం వల్ల మోక్షంకూ డాను" అని కొందరు భక్తిపరులు. "ఇది ఇందాకా మాయింటి మీంచే వెడతా—దానికిందచెక్కినఅక్షరాలు కూడా చదవడానికి వీలైంది. నేను ఇహ ఎక్క దల్చు కోలేదు" అని ఒక దర్జాపురుషుడు. "రేట్లు మరీ చురు కుగా ఉన్నాయి, నేను సగంరేట్లు అయింతరవాతగాని ఎక్కను" అని ఒక బేరగాడు. "ఇది దిగిన లంకమీద ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజెంట్లు మకాంచేశారట, వీళ్ల సందర్భాలు ఇదైపోను, ఓఘాయిత్యంపడాను! నా ఎడంకన్ను అదురుతోంది నేను రాను బాబూ!" అని ఒక శకునప్రధాని. "మొన్న ఓకోమట్లబ్బాయి విమానం ఎక్కి అది కదలబోయేవేళకి భళ్లునడోక్కున్నాట్ట,మృత్యు వంత పనిజరిగిందిట.ఎందుకొచ్చింది!" అని ఒక ధైర్యశాలి. "డోక్కోడంతో తెమల్లేదుట" అనిఒక వెకిలిఅబ్బన్న. "అంచేతే ఆ అబ్బాయి దగ్గిర మరి పది రూపాయలు వసూలుచేశారట" అని ఒక ప్రత్యక్షవాది. "తుదనెగ్గి నేలమీద కాలెట్టేందాకా నమ్మకంలేదుట. ముందేడబ్బి వ్వడం దండగేమో!" అని ఒక గడసరి తనస్నేహితుడికి సలహా ఇవ్వగా, ఆస్నేహితుడు, "అల్లాగనక జరిగితే తరవాతే ఇస్తానంటాను ఎంజేస్తారేమిటి?" అన్నాడు. రాజవీధినిపోతూన్న విమానాన్ని మెడనెప్పెట్టే దాకా చూసి, ఒక బాటసారి తనపక్కనున్న పెద్దమనిషితో, "ఏమండీ అయ్యా! పైకి వెళ్లేసరికి గాలి మారడంవల్ల ఎవడికో మూగాడికిమాటలు వచ్చాయంటున్నారు.ఏమిటి మీ ఊహ?" అన్నాడు. అంటే ఆపెద్దమనిషి, "ఏం? మీయింటో ఎవరికేనా మూగా?" అన్నాడు. అందుకు బాటసారి, "మరేనండి, మా యింట్లోదానికే" అని జవాబు ఇచ్చాడు. ఆపైని, పెద్దమనిషి, "అదృష్టవం తులే. ఇహను ఆదుర్దా ఎందుకూ?" అన్నాడు. బాట సారి, "నయం అవుతుందంటారా?" అని అడిగాడు. పెద్దమనిషి, "ఏమోగాని, క్షణికసౌఖ్యానికి పాతిగేసి వదలడంవల్లదిగిన తక్షణం మీకుకూడా మాటపోతుంది." అన్నాడు. ఈలాగ్గా చిత్తానుసారం వృత్తాంతాలు చెల రేగి పాకడం ప్రారంభించాయి.

తరుణం వచ్చినప్పుడు ఉపన్యాసకుడు అమాంతం గా మెలుస్తాడు. ఎల్లానో సందుచేసుగుని ఒక సం దర్భములో వెనకయ్య అనే ఒకాయన విమానాన్ని గురించి లెక్చరు పేల్చాడు! "ఇప్పుడంటే ఎవరో ఆవేళపు ఘటాలు 'ఈరిపేన్', 'ఈరిపేన్'అంటూ ఎగ బడుతున్నారు గాని, మనస్వంతానివి లేవుటండీబోలెడు విమానాలూ? పురాణంలో లక్ష ఉన్నాయి. ఆదిని, విశ్వకర్మకి చాలాతీరుబడిగా ఉన్నప్పుడు అతడిచేత కత్తిలేని ఒక విమానరాజం బ్రహ్మచేయించాడు. ఆసంగతి కుబేరుడి చెవిని పడేసరికి అతడు బ్రహ్మగారింటికి వెళ్లీ అభోజనం పడుకుని అతని దగ్గిర్నించి అది కాస్తా బెల్లిం చుకు చక్కాపోయాడట. ఈమాట రావణాబ్రహ్మ విని కుబేరుణ్ణి పక్కలు విరగతన్ని అది తనింటికి పట్టుకు పోయాడట. లంకలో ఆంజనీలవారు చూసింది అదేట. ఆరావణాసురుడి తలకాయ లొంగక చివరకి వాడి హృద యం చీల్చిన తరువాత రాములువారు సీతామ్మవారితో కలిసి దానిమీదే అయోధ్య వెళ్లారట. 'మళ్లీకావలిస్తే కార్డు వ్రాస్తాం పో' అని రాముడు అన్నమీదట చోద కుడు లేకుండానే అది అలకాపురం నిష్క్రమించిందట.

అదీగాక, సకలలోకాలలోనూ ఉంటూండే జట్టీలు తెలుసుకురావడానికి నారదులవారికి బ్రహ్మగారు ఓ విమానపు లైసెన్సు మొదణ్ణించీ పారేశారట—(కొడుకు గనుక మామూలు లంచం లాగకుండానే ఇచ్చారట ఆ లైసెన్సు మాత్రం). ఇంద్రజిత్తులవారు మాయ చేశారం టారుగాని విమానంమీంచేట యుద్ధం గావించింది. పూర్వం ఒక హింమారాజుతో ఒకయవనుడు పేచీపడి, తరవాత మెత్తనిమాటలుచెప్పి ఆరాజుని విమానపుషికారు చేయిస్తానని పైకి కొట్టుగెళ్లి, విమానం మంచి వేగంలో ఉన్నప్పుడు రాజుని బెడ్డముక్క గిరవటేసినట్టు కిందికి గిరవటేశాడట. వెనక మరొకరాజు పెళ్లానికి పురుడురోజులట, ఆవిడ అక్కడికి చాలాదూరాన్ని ఉన్న ఒకచోటికి వెడితేగాని నీళ్లాడనని కూచుందిట, ఆమట్టున అతి వేగంగావెళ్లే వాయువిమానం కట్టి ఆవిణ్ణిఆప్రకారం చిటికెలో తీసుకువెళ్లవలసిందిగా ఆరాజు తన ఆస్థానశిల్పుల్ని ఆజ్ఞాపించాడట: భోజుడు వర్ణించినదాల్లోకూడా ఏజంతువు ఆకారంలోనైనా సరే విమానం నిర్మించవచ్చునిన్నీ, ఇనుపగులికలో పాదరసం ఎక్కించి దాన్ని వేడిచేస్తే యంత్రం పైకివెళ్లి, వేడితగ్గిస్తే కిందికి చేరుతుందనిన్నీ ఉంది. వెనకట్లో మనవాళ్లు! సామాన్యం అని చూస్తున్నారాఏమిటి? హేం."

ఇల్లా, చాలామంది వెనకచూపుచూసి హిందువుల పూర్వప్రతిష్ఠ చెబుతూండగా, కొన్నికొన్ని చోట్ల, విమానం ఎక్కివచ్చినవాళ్లకీ ఎక్కని వాళ్లకీ సంభాషణలు జరుగుతోచ్చాయి. విమానం ఎక్కినవాళ్లల్లో ఎవడైనా ఇతరగ్రామం పనుండి వెళ్లినప్పుడు ఆతగాని ఓ పెద్దకథానాయకుడుగా కట్టి జనం విరగబడి చూడరావడం జరుగుతోచ్చింది—అతను అదెక్కినతరవాత అతని ముఖంలో ఏమన్నా మార్పు ఉందేమో అన్నట్టు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కణ్ణిఇల్లాచూస్తూంటారు లెండి. ఇదివరదాకా మోటారుడ్రైవర్ని చక్రధరుణ్ణి చూసినట్టు చూడలేదూ? ఇప్పుడంటే ఇల్లా అయిపోయిందిగాని, ఇదివరదాకా బి. యే. లని సరస్వతీవిగ్రహాలని పొగడలేదూ? అల్లానే ఇదీగావును. విమానం ఎక్కినవాడు కొండయ్యాతయిపోతే, ఎక్కనివాడు నేలయ్యాగానే ఉంటాడు. అల్లాంటివారికి ఈదిగువ ప్రసంగంలాంటివి నిరంతరంగా జరుగుతోచ్చాయి:—

నేలయ్య—తమరు పూహా ఎగురుతున్నారట మన ఊరుమీద, నిజమేనా?

కొండయ్య—ఎవడా అన్నది?

నే—అదిగాదయ్యా, విమానంలో కొండెక్కారటగా! విశేషాలు!

కొం—మీకూ తెలిసిందీ, అప్పుడేను?

నే—తెలియకేంజేస్తుంది! ఆకాశసంభవాలు రహస్యంగా జరగవ్.

కొం—అల్లాగేమరీ! నేనూ విమానంకి ఎక్కదర్శించాము, పదిరాళ్లు! అక్కడితోగాని తీరలేదు బులబాటం.

నే—ఎల్లాఉంది?

కొం—బాగానే ఉంది!

నే—అంటే?

కొం—ఏం జెప్పనూ? ఆకాశంలో వెడుతూన్నట్టుంది!

నే—ఏడిసినట్టేఉంది. అదికాదు, నీకు భయం వెయ్యలేదూ?

కొం—దానికేమిటి? అది, మనిషిని బట్టి ఉంటుంది.

నే—అధమం, కళ్లేనా తిరగలేదూ!

కొం—అదీ అంతే, కొందరికి అరుగెక్కి కిందికి చూస్తేనే కళ్లు పచ్చలుగమ్మి చెవులు గడియలడతాయట. ఎక్కడికి?

నే—కుదుపు ఏమాత్రం ఉంది?

కొం—కుదుపుకి మోటారుబస్సు ఫస్టు. విమానానికి ఆమాత్రం ఎక్కడేడిసింది? విమానప్రయాణం పడవప్రయాణముకంటె మెత్తన.

నే—అయితే, ఇది నేల ఏరీతిగా వదుల్తుంది?

కొం—మోటారులాగే నేలమీద ఓ అరమైలు పాకి ఆవేగంలో నేల వదిలి పైకెగిసి లేచిపోతుంది.

నే—అంతేగాని గాలిలోకి అట్ట గమ్మ మని నిటాగ్గా ఉన్నచోట్నించి ఎగరలేదూ? ఇంతాచేసీ వాట్టిదే?

కొం—నీదయవల్ల విమానకర్తలు ఇంకా అంత మట్టుకి రాలేదు.

నే—సరేగాని, పైనించి పెడుతూంటే నేను కన బడ్డానూ?

కొం—ఆ. సరీగ్గా నువ్వులానే కనపడ్డావు. అంతాకుడా అల్లాగేఉన్నారు. జంతువులు నువ్వులానే ఉన్నాయి. ఇదివరకు నేను ఎరుగున్న బ్రాహ్మలూ అబ్రాహ్మలూ, హిందువులూ మహమ్మదీయులూ, పునిస్త్రీలూ వెధవముండలూ—వీళ్ల వయినం తేలకుండా కనిపించింది. పైకివెళ్లి కిందికి చూసేటప్పటికి భూమిమీద మానవులు పెట్టుగునే తేడాలు నాచర్మ చక్షువులకే అంతరించాయి. విమానంకేసి చూస్తూన్నప్పుడు మానవుడి అఖండత్వం, కిందికి చూస్తూన్నప్పుడు మానవుడి అల్పత్వం కనిపించాయి. నేను చేతిరుమాలు ఊగించాను నువ్వు చూశావూ?

నే—లేదుగాని, లోపల గాలి ఉంటుందా?

కొం—చెమటగా ఉంటుంది కాని, పక్కల్నీ ఉండే అద్దాలు ఒత్తిగించి వేలుబయటికి పెడితే గాలియొక్క జోరుకి వేలు తెగిపోతుందా అనిపిస్తుంది.

నే—సరేకాని, విమానం ఎక్కడేనా మళుపు తిరిగేటప్పుడు రామస్మరణ మంచిదంటారు, నిజమే?

కొం— కొంచెం ఒరుగుతుందికాదూమరీ, అందు చేత అల్లాఅంటారు. కాని, ప్రతీయంత్రంకూడా మళుపులో అంతే. ఈయంత్రం గురించి జనంయొక్క ప్రత్యేకభయం ఏమిటంటే, ప్రమాదానంతరం శరీరమే కనపడదేమో ఆసుపత్రికి ఈడవడం దేన్నీ అని.

నే—పోనీ మనవూళ్లో పెద్దభవనం ఎల్లా ఉంది?

కొం—లక్కపిడతలా ఉంది.

నే—పెద్దబరి ఏరీతిగా ఉండుకుంది?

కొం—పొయ్యిలాగ ఉంది.

నే—గోదావరి వంతెన?

కొం—భీముడిచేతులో ఉండే ధప్పళపు గంటి కాడలా ఊరుకుంది.

నే—లోపల జనం మాట్టాడుకో వచ్చా?

కొం—ఆ, చెవులో. ఊళ్లోవాళ్లకే అంతధ్వని వినిపిస్తే అందులోవాళ్లకి నిశ్శబ్దంగా ఉంటుందా? అందుకనే, దమయంతీ స్వయంవరానికి ఇంద్రాదులు బంగారు విమానాలమీద భూమికి వాలేటప్పుడు మేఘరంజనిలాంటి ధ్వని అయిందిట.

నే—అల్లాయితే, విమానంలోపోతూన్న రంభానలకూబరులమాటలు కిందున్నకలభాషిణికి వినిపించాయి అని సూరన్న రాశాడే? కోశాడన్నమాట!

కొం—పూర్తిగా కొయ్యలేదు. అందుకు సరు కారణం ఒకటి చేర్పుగా తగిలించి సర్దుకున్నాడు. సూరన్న మీదికి ఆట్టేవెళ్లకు. అతడు, ఊహించో, గంథ్రాల్లో చూసో, పెద్దలవల్లవినో రాసిన దూరదృష్టి దూరశ్రవణాలు సిద్ధించలేదూ నేడు? భోజుడుచెప్పిన విమానాల మాట అతగానికి మనస్సులో ఉండి అల్లారాశాడేమో? వాటికి సాక్షి ఉలేదేమో!

నే—సరే, వీటికేంగాని, నువ్వు ఎక్కిచూసొచ్చావుగదా, భూమిసంద్రంగా ఉండడంగురించి నువ్వు ఏమి "సెటల్" పరుచుకున్నావు?

కొం—ఏమో! ఈమాటు పూర్ణంగా చూడాలి.

నే—పోనీ, సూర్యుడు ఏసైజులో కనిపించాడు.

కొం—నాకుహూడా పనిలేదనుకున్నావా ఏమిటి?

నే—(వాడు వెళ్లిపోతూండగా)ఒరే! ఎల్లాగైతేం;మహా! ఇదంతానాకూ తెలుసు. "ఘనశైలంబులు బొమ్మ..."

ఈలాంటిప్రశ్నోత్తరాలకి అంతులేదు.కిల్లీదాసుగారైన మాస్నేహితుడొకడు తను విమానంలో తిరుగుతూన్న సమయంలో కృష్ణుడువచ్చే నాటకం ఏదీకుడా కింద జరుగుతూ ఉండదని తనకి తెలిసి ఉండడంవల్ల లాభంలేదని ఊరుకున్నాడటగాని, లేకపోతే గయుడుతో చెప్పేసి ఓ నిష్ఠీవనం వేసేసి ఉండేవాడట. "ఇక కొన్ని ఏళ్లల్లో జనం యావన్మందీకూడా ఎగిరిపోడం రూఢీ. ఈరోజున నే అన్నాను చూడండి!" అని ఒక జోతి

ష్కుడు సిద్ధాంతం చేశాడు. "విమానం వచ్చిం తరవాత ఇక మోటారుకారుకుక్క ముట్టుకు పోయింకన్న మాటే!" అని ఒక కారు ప్రియుడు దుఃఖించాడు. "ఈవిమానం తాలూకుకుడా కొన్ని అంగ్ల పదాలు తెలుగులో జొర పడి తెలుగు ఇంకాపాడవుతుందిగదా!" అని భాషా శ్రోత్రియుడు ఒకాయన ఆచమనం చేశాడు. "సృష్టిం చిన ప్రామిసరీ నోటు కేసుల్లో ప్లీడరు సాక్షిని, 'ఆవేళ నువ్వు మీ ఊళ్లో ఉన్నానంటున్నావుగడా, ఆవేళే అంత దూరాన్ని ఉన్న ఊళ్లో సంతకం ఎల్లా చేశావు?' అని అడగలేడు ఇకమీదట" అన్నాడు ఒక కోర్టు గబ్బిలం.

చలనం జీవసూచకం. గమనం ఇంకా ఎక్కువ జీవానికి తార్కాణ. గమనవేగం మరీ ఎక్కువ జీవానికి లక్షణం. గమనవేగాంతరం అతీతమైన శక్తికి చిహ్నం. జంతువులలో వేగం లేడిది, పక్షులలో మహావేగం వాన కోయిలది. అది గంటకి 200 మైళ్లు. మోటారుకారు యొక్క మహత్తమ వేగం, ఇంతవరకు, గంటకి 207 మైళ్లు. వాయువేగం గంటకి 250 మైళ్లు (సుమారు). విమానం యొక్క మహత్తమ వేగం గంటకి 318 మైళ్లు. కాలం యొక్క ప్రాధాన్యమును గణించడం నాగరికతకు తెలుసును కాబట్టి అది ఎప్పుడూ వేగమే కోరుతుంది. బలం దేశాన్ని జయించగలదే కాని, వేగం దేశకాలాల్ని జయిస్తుంది. వేగసిద్ధికి యంత్రమే దిక్కు. వెనకటి మాటలటుంచి, ఇప్పుడు యంత్రం హైందవేతరుల సొమ్ము. అందువల్ల, ఇతరులు గమనవేగంకోసం నిరంతర యత్నం చేసి, విశేషధనం వెచ్చించి, నూతన యంత్రాలు నిర్మించి, తంటాలు పడుతూన్న మాట నిజం. ఆయంత్రాలలో ఈ విమానం ఒకటి. ఇప్పుడు ఇతర దేశాల్లో విమానాల మీద పడకలు, భోజనాలు, అల్పాహార విందులు, పురుళ్లు, టెన్నిసు ఆటలు, యుద్ధాలు, జననష్టం కూడా అవుతూన్న విలాసయుద్ధాలు — ఇల్లాగ్గా సమస్తమూ జరిగిపోతున్నాయి. ప్రస్తుతకాల హైందవులు మాటలు చెప్పు కుని గాలి మేడలు కడుతూంటే, నేటి ఇతర దేశీయులు గాలి ఓడలు కట్టుగుని మూడేసి వందలమంది ఒకే సారిగా ప్రయాణాలు చేడుతున్నారు. కాని, మనం ఇల్లా అనుకోవచ్చులెండి, "వాళ్ల దేశం ఇరుకు గనక వాళ్లు దేవుడా అని పైకి లేచిపోతున్నారు. మన దేశం విశాలం గనక — (కొందరు అను కుంటున్నారు) మనం కాళ్లు పారజాచుకుని కూర్చోవచ్చు!" అని. ఏమైతేం, ఇంకా ఎక్కువ వేగం సంపాదించాలని ఇతరులు శ్రమ పడుతున్నారు. గంటకి వెయ్యిమైళ్ల పైచిలుకు వేగం సిద్ధించితే భూప్రదక్షిణం ఒక్కరోజులో చెయ్యడం వీలుపడునుగదా అని కొందరు చూస్తున్నారు. ఇందులో ఖర్చు పడేటటువంటి "పెట్రోలు" విసర్జించి ప్రమాదాలు కూడా లేకుండా అయస్కాంతంతో పని జరిగేటట్టు కల్పనలు కొందరు చేస్తున్నారు. రాత్రికాలంలో విమాన ప్రయాణం వీలుగా ఉండేటందుకు కొన్ని మైళ్ల కాంతి స్తంభాన్ని నిటారుగా ప్రసరింపచేసేటట్టి వాయువుని ఒకాయన కనిపెట్టాడు. కొందరు ఉత్తర దక్షిణధ్రువాలదగ్గిరికి విమానాలమీద వెళ్లాలని చూస్తున్నారు. "అక్కడేముందీ, బావుకోడానికి! వీళ్ల మొహం! ఇంటో కూచోకూడదూ, ఏదో ఇంతతిని!" అని ఒక ముసలాయన కొట్టొచ్చాడు ఈసంగతి ఆయనతో చెప్పేసరికి. చాలమంది ఎవరెస్టు శిఖరం లాంటివి ఎక్కాలని చూస్తున్నారు. "వీళ్లు తీరాచచ్చి చెడి ఎక్కేసరికి, అక్కడ ఏ అయ్యర్ కాఫీ హోటలో ఉంటుంది. ఎందుకు వీళ్లకీ శ్రమ!" అని కొందరు చప్పరించేశారు. మరి కొందరు భూమి వదిలి పైకి ఎంతదాకా వెళ్లగలమా అని చూస్తున్నారు. ఒకాయన నాలుగుమైళ్ల ఎత్తుకి వెళ్లే సరికి, అక్కడగాలి పీల్చుకునేటందుకు చాలక, ఆయనకి ఉక్కిరి బిక్కిరి అయిందిటగాని విమానం మాత్రం ఇంకా ఎగబాకుతూనే ఉందిట. ప్రాణ వాయువు సప్లైచేసే యంత్రం చేత్తో పట్టుకుని మళ్లీ ఎక్కక మానను గా అనుకుని ఆయన దిగి పోయాడట. వాయువులేని చోటకుడా విమానం వెళ్లగలిగినా, లేక గాలిలేనిచోట వెళ్లగల యంత్రం మరోటి ఏదేనా బయలుదేరినా, ఎప్పుడో ఒకప్పుడు మానవుడు ఇతర గ్రహాల్ని ఓ దెబ్బతీస్తాడు, అది ఆక్రమించుగోడానికి యిరోపియులంతా కాట్లాడుకుంటారు. ఆదెబ్బతోటి, నరుడికి గ్రహచారం వదలిపోయి, గ్రహాలకి నరచారం

పట్టుగుంటుంది. విమానోపయంతోటి మానవులకి కొండకీ భూమికీ తాళం అన్నంత ఆ స్తికలిసి నట్టుంది.

ఇవి చుట్టు పక్కల సంగతులు. మనదేశంలో విమానపు లైసెన్సులు ఇంకా ఇస్తారో ఇవ్వరోట. హిందువులు ఇంకా కొంతకాలం గోకలిబండల్లాగ నేల బారుగానే బతకవలసిన వాళ్లైతే వీళ్లకి విమానపు లైసెన్సులు ఇప్పట్లో దొరకవు అందుకని, టికట్టు కొనుక్కుని దొర్లతెచ్చిన అద్దె విమానం ఎక్కడమో, లేక, విమానం ఎగురుతూన్నప్పుడల్లా తెల్లపోయి చూస్తూ, మాటలలోమాత్రం, "మాహూ ఉండేదిట. మా పవోవర్గ ముత్తాతకి ఇంపక్కని విమానం ఉండేదిట. అందులో ఆయన షికారు వెళ్లేవాట్ట. నేను మా విమానాలు ఎరక్కేం? బోలెడు చూశాను మాపుస్తకాల్లో" అని చెప్పుకుంటూ మురియడమో. వీరికి పట్టిన అదృష్టంలా కనిపిస్తోంది, ఇన్నాళ్లకి. (15-9-28)

---

## చెఱకు

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మగారు

నల్కకంగా నగుఁ దుండెతుండెములుగా నజైస్వరూపం బలన్
గలకుం గానుగ వైవఁగావలయు నిష్కారుణ్యాత్మం గానిచో
చెఱకా! బెల్లము పెట్టు మంచు సరుఁడుం జేసాఁపఁగాఁ బెట్టుదే?
వెలుపుం గొల్పినఁ గాక సామమున నుర్విం గార్యముల్ సాగునే?

ఒకులకుఁ గాఁగ బాధపడుచుండి వికారశరీర మైన నె
వ్వారికిని వాంఛనీయ వయి భంగములందునుగూడ మాధురీ
స్ఫురణము పూని పొల్చెదవు పో! చెఱకా! మరుభూమి వృద్ధినిం
దొరయవ టన్న నెవ్వరిది దోస? మహాత్రపు నేల దయ్యెడిన్.

భళిరే! ఇక్షువ! స్వస్వరూపమున సర్వప్రాణులం బ్రోతువన్
పలు కట్లుంచు, కఠోరచిత్తులు నినున్ బాధించుచున్నన్ రసో
జ్జ్వల రూపంబును, ఫాణితాకృతి గుడాంచచ్ఛర్కరాకారముల్
వెలయం దాలిచి మేలు నేసెడి భవద్వృత్తిం బ్రశంసించెదన్.

ఓరీ శూన్యహృదయ! త్వక్సారా! నేఁగూడఁ దుంగకాయుఁడ నని భీ
నీరంధ్ర మ్మగునంత - స్సారము గల చెఱకుతోడ జగడంబటరా!

కట్టెఁడి నల్లచెయ్యిలకుఁ గారణముల్ గనుపట్టకుండఁగా
అట్టి రసార్ద్రచిత్తునకు, నట్టి మహోన్నతభావశీలికిన్
బుట్టుకఁదొట్టి మానవసమూహసపర్యలఁ జేయునట్టి నీ
కొట్టిడినట్టు లో చెఱక! యొక్కఫలంబును నీయఁడామెగా!

పాప మిరుగుపొరుగువారలం జూచి యక్లైన ఫలము గల్గునన్న యాస
చే "రసాల" మన్న పేరుఁదాల్చితి వట్టులైనఁగూడ ఫలము నందవైతి.

(అడవిపూలు)

# తానేసేను

కొంపెల్ల జనార్దనరావు గారు

౧

అక్బరు పాదుషా ఉద్యానవనము

[అక్బరుసమక్షమున గాయనీగాయకులు పాడుచుందురు. తానేసేను ప్రవేశించును.

దాపున రసాలముపై కోకిల కూయును.]

అక్బరు

ఓయువకుఁడా! ఎవరవు నీవు?

తానేసేను

రసికవతంసులు పాదుషావారిని దర్శింప వచ్చిన యొక గానకళార్చకుఁడను.

అక్బరు

నీపేరేమి?

తానేసేను

నన్ను 'తానేసేను' అందురు.

అక్బరు

ఓహో! నీవేనా! —ఏదీ, నీనైపుణ్య మింత చవిచూపుము.

[కోకిల కూయును.]

[తానేసేను పాడును. సభయంతయు పారవశ్యమున మున్గును.]

'ఏ యమృతపుఁ బోఁత బెరిఁగె నీ యుపవనముల్
ఈయెడ నెలకలుము లొలుక నెలయు కవనముల్
కనుమూఁతలుపడియుపడవు నునువాత్రము లొడలనడర
తనివోయిన మనసు తడియు తడవ తడవకుర్
అందమ్ములు తావిగములు నక్కజపుంగులుకుఁదములు
విందు లొలయ వినుతించెడి విభువరు నొకనిన్.'

[నిశ్శబ్దత]

అక్బరు

(గద్దె దిగి, తానేసేనుచేతులు పట్టుకొని)

గాయకాగ్రణివై నాయాస్థాని నలంకరింపుము తానేసేన్!

[కోకిల కూయును.]

[తానేసేను స్వీకారము చూపును. కోకిల ఎగిరిపోవును.]

అక్బరు

ఓ ధన్యుఁడా! నీగురు వెవ్వారు? నీగానమే యింతమధురము: నీగురుని గాన మెంతలలిత మోహనమో కదా! నీగురు వెవ్వరు?

తానేసేను

హరిదాసస్వామి మా గురువు. వారు బృందావన ప్రాంతమున వసింతురు. వారి కీలోక మలఁతి. వారి గానము స్వర్గతుల్యము.

అక్బరు

నా కానందము గూర్ప నొల్లరా వారు?

తానేసేను

దేవా, యెట్లు?

అక్బరు

ఇట నేతెంచి.

తానేసేను

దేవా, అది వీలుపడదు. ఒకరాజు నానతి కడఁకువ దాల్పని యమేయ ప్రాభవము నా గురునిది.

అక్బరు

నేనే వచ్చిన?

తాన్సేను

అట్లయినను సందియమే ప్రభూ! రాజ దర్శన మాత్రపోదర్పమును రెచ్చఁగొట్టఁగలదు.

అక్బరు

మాఱువేసమున నీ బానిసగా వచ్చిన ?

తాన్సేను

చక్రవర్తీ!—ఉపాయాంతర మగపడదు!

2

బృందావనప్రాంతము

పసరుచెట్లు, పూఁదీవలు నలంకరించిన యమునాతట వనప్రదేశము

[తాన్సేను, సేవకునివలె గుఱ్ఱమును నడపించుచు అక్బరును వత్తురు. ప్రశాంత నిశ్చలదృష్టితో శూన్యముఁ జూచుచు నిలిచియున్న హరిదాసస్వామి పాదముల కిరు వురు సాఁగిలుదురు. ఆతఁడు వారిని దీవించును.]

తాన్సేను

(అంజలిబద్ధుఁడై, తల వంచి) సృష్టికంత కును దీవనమైన తమజీవనామృత పూరమున నాకొక మునుక లభించినది: ధన్యుఁడను. పాట తీపుల కలరి ప్రకృతి సాఁగిలి మ్రొక్కు మృదుల పదపల్లవము లంటుభాగ్యము గలిగె, మరల నెన్నాళ్లకో!

[పాదము లంటును]

నాద నిధానము, రసపరిప్లుతము, ఈశ్వ రుని వాత్సల్య ప్రవాహ మన వెలయు మధుర గానము మరల వినవలచి వచ్చిన యీ యంతే వాసి నను్రగహింపుఁడు.

హరిదాసస్వామి

(అక్బరుదెసఁ జూచుచు) అక్బరు వేఱొక వేషమున వచ్చిన నాయాత్మ ప్రసన్నము గాకుండెడిది. ఆతని వినయము నచ్చినది. వచ్చినకోర్కి నెఱవేఱఁగలదు.

[నిండైన నిశ్శబ్దత ప్రబలును. కొంతవడికి ఝుమ్మను తుమ్మెదరొదవలె నొక యుచ్చైశ్స్వానము వెలువడును. స్వామి కంఠము 'మాల్కోసు' రాగ మాలపింపఁ దొడఁగును.

యమునాతరంగిణి ఆఁగిపోవును. ఆకసము నిర్మల మగును. పెనుగాలి సన్నగిలిపోవును. పిట్టల పాటలు సద్దణఁగిపోవును. అడవిజంతువులు స్తబ్ధములై పోవును. అక్బరు తాన్సేనులు మైమఱచిపోవుదురు. హరిదాసస్వామి తేలి తేలి తేలి, అదృశ్యుఁడై పోవును.]

* * * *

అక్బరు

ప్రకృతిని శాసించినారు - యథార్థమగు చక్రవర్తి వీరు!

[తాన్సేను గుఱ్ఱమును నడపును; ఇరువురును వెడలి పోవుదురు.]

3

అక్బరు జనానా

[నాట్యము]

'నీ దరహాసితము నిలుపు పొలుపుగన
మనమున మొనకొను రావలపుల్
జిలిబిలి పలుకుల జిలుఁగు సెలవులో
జలజలజల నెడ మలఁగి చనున్
(ఘుణ ఘుణ ఘుణ ఘుణ ఘుణం) ప్రియా త్వ
ద్గుణగణగణనము సంబర మా
ఫణి ఫణా రుచిర మణిగణచ్ఛవులె
అణఁగి మణఁగె జోహారు లిడున్
(తకతై తకతై) లీలా లలితా!
మధుర విలసన మదాకలితా!—నీ
లాలన పాలన ఖేలనములు హృదిఁ
గలయఁగఁ బులకలు చిలుకుఁ బ్రియా!

చిలు వెలుంగుగమి తరఁగలు గట్టెడు
చిఱు చిలు వెలుతురు లురులు విరులవలె
నీ యపాంగముల నిరతము నరవర
ప్రణయపు టేటులు పాఱునుగా!
ఇలఁ గల మృదు కోమలతలు సకలము
జీవకలితములు నీలోనన్
కరఁగి కరఁగి యొడ లెఱుఁగక యాడెను
చిఱుతకన్నియలు జే జే జే'

[తాన్సేను గాయకబృందముతో ప్రవేశించును.]

అక్బరు

తాన్సేన్ ! మీ గురునివలె నొక్కటి పాడుము.

[తాన్సేన్ 'మాల్కోసు' పాడును.
అక్బరు తక్క నందఱును పరవశు లగుదురు.]

[నిశ్శబ్దత]

అక్బరు

మీ గురుని వలె నంతటి యానంద మేల కూర్పవు?

తాన్సేను

హుజూర్! నేను మీ కొఱకై పాడుదును. నా గురువు పరమేశ్వరుని కొఱకై పాడును.

అక్బరు

తాన్సేన్! 'దీపక' రాగము పాడుము.

తాన్సేను

దేవా! అది అగ్నిమయము, క్షమింపుఁడు.

అక్బరు

ఆ చిత్రము చూతము, ఏదీ!

తాన్సేను

ప్రభూ! అది విక్షోభావహము!

అక్బరు

వినను వినవలతును.

[తాన్సేను గురునిఁ దలఁచుకొని 'దీపక' రాగము పాడ మొదలిడును. పైని వ్రేలాడుచున్న గులేబులలోని వత్తులన్నియు వెలిఁగి, కాంతులు వేశ్యల కపోలముల ప్రతిబింబించును. క్రమముగా తాన్సేనుహృదయమున నగ్ని రగిలి యొడల మంటలు వెలువడును.]

తాన్సేను

ఓహో! ఇది సౌందర్య దేవతయా, ప్రళయ దేవతయా!

(వెడలిపోవును.)

౪

నదియొడ్డున నించుకదూరముగ నొకబావి

[తాన్సేను మంటలతో వచ్చును. నగరస్త్రీలు బిందెలతో నదికి వచ్చుచు పోవుచుందురు. కన్య మీరా తన చెలికత్తెతో తొలుత నదియందు స్నానమాడి పిదప బావికడకు వచ్చును. చెలికత్తె మీరా బిందె నీళ్లతో నింపును. తాన్సేను నూతికడకు వచ్చి నీరిడుమని వేఁడుకొనును. మీరా జాలిగొని యాతని చాఁచిన దోసిట నీరు పోయును. మంటలకు జడిసి చెలికత్తె మీరా నీవలకు లాగఁబోవును. తాన్సేను మీరా సౌందర్యము నచ్చెరువుతోఁ గాంచుచుండును. మీరా చల్లనిచూడ్కులతో ప్రత్యుత్తర మిడుచుండును.]

చెలికత్తె

(తత్తఱతో) మీరా! ఇక్కడ జాగు చేసెద వేల? ఈతఁ డిట్లు మండుచున్నాఁ డెందుచేత?

మీరా

(జాలితో) 'దీపక' రాగాగ్నిచే మండుచున్నట్టున్నాఁడు, పాపము.

చెలికత్తె

ఐన నీవు 'మలహారి' పాడి శమింపఁజేయ రాదా?

మీరా

సూర్యునివలె ప్రకాశించుచున్నాఁడి తఁడు: చిన్నదానను, నేనేమి చేయఁగలను?

చెలికత్తె

భయములేదు మీరా! ఈతఁడు సూర్యునివలె ప్రకాశించుచో నీవు చందమామ వలె వెలుఁగుచున్నావు.

[తుద కామె పాడ నంగీకరించి నూతి మెట్లపైఁ గూరుచుండి, చెలికత్తె మెడకు చేతులు చుట్టి, 'మలహరి' ఆలపించును. తాన్సేను తన్మయుఁడై వినుచుండును. మేఘములు గడలుకొనును. ఉఱుము లుఱుమును. మెఱపులు మెఱయును. వాన కురియును. మంట లంతకంతకు చల్లారిపోవును.]

తాన్సేను

(మీరా యొద్దకు వచ్చి) తరుణీ! నీ ఋణము తీర్చుకొన నాకడ నేమియు లేదు. నా యీ ఆర్ద్రహృదయము మాత్ర మింక నీయదియే.

[మీరా సిగ్గుతో మెత్తపడి కండ్లు వాల్చును.]

చెలికత్తె

అట్లు పలుకు నేమి యతఁడు?

[తాన్సే నింకను దగ్గఱి మీరా చిన్నిపాద మంటఁ బోవును. మీరా వినయమున వారించును. అతఁ డామె చేయి ముద్దుగొని తనయురమున నద్దుకొనును. మీరా సిగ్గుబరువున మొగ మావలికిఁ ద్రిప్పుకొనును. చెలికత్తె కంగారు పడి యఱచును. పౌరులు వచ్చి చూతురు.]

పౌరులు

ఋషికన్యవలె నుండు మీరాయే యిది!

మీరా బంధువులు

ఎంతపని!

[మీరా ఒకచేతితో మొగము గప్పుకొనును. చెలికత్తె ఒకచేత నామెను బట్టుకొని, రెండవచేత కోపముతో తాన్సేనును జూపును. పౌరు లాతని చుట్టుముట్టుదురు. తాన్సేను వారి నాఁపును. ఇంతలో మఱికొందఱు వత్తురు. వా రెల్లరు తాన్సేనును బాధింప సమకట్టుదురు. మీరా చెలికత్తెచేతులందు మూర్ఛిల్లును. ఇంతలో అక్బరు తాన్సేనును వెదకఁ బంపిన సేవకు లు చేరుకొని పౌరులఁ బోఁద్రోలి, తాన్సేనును గొనిపోవుదురు.

[తేజీనవెనుక మీరాను చెలికత్తె తీసికొనిపోవును.]

౩

ద్వారక: కృష్ణాలయము

[సన్న్యాసిని మీరా ప్రార్థన సలుపుచుండును!

'నీ కంటికొనల నే నేరిన జా
లులె నా యెడఁద వెలుంగులు దేవా!
నీ యూర్పు కొస మునింగిన నా గా
నము తీపులు కానుకఁగొనుము దేవా!
నీ తాఁకిన మధు నిభృత మధురభా
వసుమము లివి యప్పనములు దేవా!
ఈ మలీమసపు టెడఁద యద్దమున
నీ యందము గమనింపుము దేవా!'

[తాన్సేను వచ్చును.]

'ఎటఁ జూచిన నీ యిద్ధ తేజమే
దోఁబూచుల కాంతు లోలుకు దేవా!
కడు భూతకోటి గందురోదల నీ
నగు మంతనము వినంబడు దేవా!
నీదు రూపులేని మహత్ప్రీతికి ను
పాధి వెదకు వెడభావము దేవా!
లోన నెలకొను వెలుంగుల చాయలు
వెలిఁ గని మది పలవించును దేవా!'

తాన్సేను

(మెల్లగ) ఓ సన్న్యాసినీ!

మీరా

'సంద్రముల పలుపు సామీ, నీ కృప!
దినమణుల దొంతి దేవా, నీ రుచి!
వెన్నెలలగుట్ట విభూ, నీ చలువ!
నీ సేవను మది నిలుచుటె నా సిరి!...'

తాన్సేను

ఓ సన్న్యాసినీ!- మీరా నా కెక్కడ లభించునో దివ్యదృష్టిని జూచి యెఱింగించి పుణ్యము గట్టుకొమ్ము!

మీరా

(తాన్సేనును గుర్తించి, ఒక క్షణకాలము కండ్లు మూసికొని, నెమ్మదిగ) మీరా చనిపోయినది.

తాన్సేను

(చకితుఁడై, నిట్టూర్పు పుచ్చి) హా!-మీరా లేని యీ బ్రదుకు వ్యర్థము.- నేనుకూడ మీరా కడకే పోయెదను.

మీరా

ఎట్లు పోఁగలవు?

తాన్సేను

మృత్యుద్వారమున.

మీరా

అటు నీకు మీరా చేరుబడు.

తాన్సేను

మఱెట్లు చేరుదును? మరణించిన మీరాను బ్రదికి యెట్లు పడయఁగలను? నన్ను మరణము తానే పొందునట్లున్నది.

మీరా

ఊరక మరణము నేల యుపాసించెదవు?

తాన్సేను

మీరా కొఱకు.

మీరా

దాన మీరా మఱింత దూరమగును. నీ జీవితమును వెచ్చించి, కొనఁ దగినది మీరాసాన్నిధ్యము గాదు.

తాన్సేను

మఱేమి? ఇఁక నేను బ్రదికి చేయఁదగిన దేమి?

మీరా

నీవు మీరా నెఱుఁగకపూర్వము మీరా కొఱకే జీవితము నర్పింప నెంచితివా?

తాన్సేను

జ్ఞప్తిలేదు. మీరాను నే నెఱుఁగని దెప్పుడో జ్ఞప్తిలేదు. మీరా నా కెట్లు లభించును? మీరా లేక నా బ్రదు కెందులకు?

మీరా

విశ్వవిభుని సేవకై నీ జీవితము నర్పింపుము తాన్సేన్!

తాన్సేను

(మీరా మాట లించుక మననము చేసి కొని) ఓ యోగినీ! నీ ఆశయ మేమి?

మీరా

తాన్సేన్! ఈ జీవితము నీది కాదు. నీవు నీవాఁడవని చెప్పుకొనుటకు నీ కేమధికార మున్నది? పుట్టకపూర్వము నీవు నీ వాఁడవా? చచ్చిన వెనుక నీవాఁడ వగుదువా?

తాన్సేను

నే నెవ్వరివాఁడను? ఏల జన్మించితిని?

మీరా

నీ ప్రభువు విశ్వమంతకును ప్రభువైన వాఁడు. ఆతని యిచ్ఛాపూర్తికై నీవు జన్మించితివి.

తాన్సేను

నాయిచ్ఛాపూర్తికై జన్మింపలేదా నేను?

మీరా

నీ యిచ్ఛాపూర్తికై నీవు జన్మించితివేని నీకు మీరా దక్కియేయుండును.—నీ యిచ్ఛ ఆతని యిచ్ఛపరుగందుకొనఁ జాలదు.

తాన్సేను

(హృదయము కరఁగి) ఓ దేవీ! ఆ పరమేశ్వరుని యిచ్ఛ పవిత్రముగ నెఱవేర్చుటకే నాకు దారిఁ జూపుము! ఇటుపై స్వార్థమునకై జీవింపను.

మీరా

(కాషాయ వస్త్రము నిచ్చుచు) ఈ వినయవేషము దాల్పుము. ధనికులు నీ దారిద్ర్యమునకే మచ్చరింతురు గాక! దర్పవిలాసములు నీ సారళ్యపదముల ముద్దిడుకొనుఁ గాక! బ్రదుకుము పరమేశునకై!

[తాన్సేను తల వాంచును. మీరా కాషాయ వస్త్రమును, రుద్రాక్షమాలికను అతనిపై నుంచి దీవనగా నతని భుజముపై చేయిడును.]

ఇఁక నిన్ను మిథ్యాజీవనము తాఁకదు. శాశ్వత సత్యజీవనము నీకు చేకూరినది!—మీరా నీకు దవ్వున లేదు; నీ వామెను విడిచి లేవు: కన్నెత్తి చూడుము — ఇదిగో మీరా!—నీవు భౌతిక జీవనమునకు చచ్చినవాఁడవు కానియెడల చచ్చి బ్రదికెడు దాసి నెఱుఁగఁజాలియుండవు.

[సన్న్యాసులవలె వారొండొరుల గారవించుకొందురు. ఇంతలో అక్బరు వచ్చును.]

అక్బరు

ఓ హో!—తాన్సేన్!—గాన తపోనిధి, ఇంకొక హరిదాసస్వామి!

(నమస్కరించును.)

[మీరా సన్న్యాసమునాట విని యామె బంధువులామెను జూడవత్తురు. పూజచేసి మీరా పాడును. నిశ్చలుఁడగు తాన్సేను హృదయమున మీరా పాట ప్రతిధ్వనించును.]

'పితా! దేవ దేవా!

నీ రూపంబు అపారము భాసిజ
గం బకురగతిఁ గనియె నిరూపణ
నీ రూపుఁడవు అపారుఁడ వను ని
న్నీ రూపంబున నిటు సేవింతుగా!—
నా వాణీస్ఫురి పోవఁజాల దిఁక
నీ వేణుపదము నేములు దాటఁగ
నా యెద భావ విహాయస పరిని
స్థిత భవనంఘ్రి స్పృశించియు ఆఁగుగ!—
పారవశ్యముల భూరిపయోధుల
నీ మహామయత నీడలు గ్రక్కఁగ
ఆద మఱచి నా పేదఁయాత్మ నీ
రుచులఁ గరఁగి నిర్ముక్తత వెలుఁగుగ!'—

తాన్సేను

'భావాతీతా! పావనమహిమా!
ప్రేమనిధీ! భవ విదళననేతా!
విశ్వత్రాతా! శాశ్వత సర్వా
తీత నిరవధిక దివ్యప్రతిభా!'—

[ఎల్లరును మైమఱతురు.]

[దూరమున కోకిల గొంతెత్తి పాడును.]

# ఆత్మార్పణము

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

(వెనుకటిసంచిక తరువాయి)

అయ్యా! తొల్లిటిపున్నెపుం బలిమి నీ కాతిథ్యమ్ముఁ సల్పి నా
నెయ్యంబుఁ బ్రకటించు భాగ్య మొదవెన్ నేఁడీగతి న్నీవిఁకన్
డయ్యంగాఁ బనిలేదు నీదగునభీష్టం బెద్దియో చెప్పితే
నియ్యల్పుం డనువైన సాయమును దా నింపారఁ గావించెడిన్.

మానవునకుఁ బులుఁ గేచం - దానన్ దోడ్పడు నటంచుఁ దర్కింపకుమీ
మానవ మృగ ఖగ నగ మయ - మైన జగం బెల్ల నీశ్వరాంశంబ కదా.

ఈశ్వరునిశక్తి నాయందు నింతోయంతో - కలదుసు మ్మట్లగుట నిట్లు వలుకు టొదవె
వెండియున్ భారతోర్విలో నెలయుశిలయు - నతిథిపూజాపరాయణం బగుట వినవె.

జాతి మత కుల గుణాదుల - నీతఱి నరయం బనేమి యెవ్వనికైనన్
జేతనగు మేలు సల్పుట - పాతకహరణంబు చువ్వె పరికింపంగన్.

నావుడు నక్కిరాతుఁడు మనంబున నెంతయు సంతసించి యో
హో వెఱఁ గయ్యెడిన్ ఖగకులోత్తమ, నీ చరితంబు! పాపవుం
ద్రోవలఁ ద్రొక్కి మిమ్మెపుడుఁ ద్రుంచు దురాత్ముని నన్ను నిట్లు సం
భావనఁ జేసి మంతె! తగుభంగి నినుం గొనియాడ నేర్తునే.

జడివానం దడిసితిఁ జలి - గడగడ వడఁకించుచుండెఁ గాయ మ్మకటా!
ముడుచుకొనిపోయె నియ్యది - విడివడున ట్లాచరింపవే! వెర వున్నన్.

నీ వీసాయ మొనర్చిన - జీవించెద నిప్పు; డట్లు సిద్ధింపనిచోఁ
బావనగుణాఢ్య, నాకుం - జావది తప్పక ఘటిల్లు క్షణకాలములోన్.

అని ప్రార్థించుటయు నక్కపోతరాజంబు వానికిం దగు ధైర్యంబు చెప్పి "యిదె వ
చ్చెద నుండు మన్నా" యని.

చట్టుప లట్టె విప్పి రభసంబు భృశం బొనరించి చెట్టులన్
గుట్టల దాఁటి తుట్టతుదకు న్నది కవ్వలిచక్కి నున్న పెన్
పట్టణ మొండు సేరి వెలిపట్టున గిట్టినచెట్టు మింటికిం
దొట్టి వెలుంగుచుండఁ గని తోడన వాలెఁ దదంతికంబునన్.

వాలినవేడుక నచటన్ - వ్రాలి తుదిన్మండు నింధనంబును నానన్
గీలించి యార్తరక్షా - లాలస కేతెంచి తన కులాయమ్మునకున్.

ఎండుంజిదుగుల నీటన్ - నిండినవనసీమఁ బడయనేరక వెర వో
క్కొండును దోఁపమి భగవం - తుండా! యిపు డేమి సేయుదు నటంచు మదిన్.

కొంతతడవు వితర్కించి తుట్టతుద "కో హో! పొరపడితి నెట్టయెదుట నున్న గూటి న్మఱచి యెండుఁబుల్లలకు నల్లాడు నా వెఱ్ఱి నేమనవచ్చు? నార్తరక్షణం బునకంటె నిక్కలాయంబు నా కెక్కుడే? పలయునే నిట్టి గూళులం బెక్కింటి నొక్కదినంబున నిర్మింపనేర్తునని తలంచి, నీడంబున్ దొఱ్ఱనుంగి క్రిందికిఁ బడ నెట్టి, యందు మెత్తగా నమర్చియున్న చెత్తం దాఁ దెచ్చిన కొఱవి నిడి యూఁది మం టఁ జేసి, దానిం గులాయేంధనములఁ గడుంగడు నడరించి కిరాతుం గాంచి.

అన్నా! దురంత శీతా - పన్నుఁడ వై నీవు వగనఁ బని లే దిదె మం
ట న్నిగిడించితి లె మ్మిఁకఁ - గ్రన్ననఁజలిఁ బాపుకొమ్ము గడగడలుడుఁగన్.

అనిన విని పుల్గుపల్కులు - తనడెందంబునకు నవసుధాధారాపా
తనిభంబు లగుడు బోయం - డనూన హర్షమున మున్గి యల్లన లేచెన్.

ఇట్లు లేచి మెల్లమెల్లన మంటం దఱిసి.

"అహాహా"రవంబు "ఓిహీహీ" - "యుహుహూ" నాదములు సెలఁగనోడ లున్నతినం
ద, హుతాశనకీలలఁ బా - దహస్తములఁ గాఁచికొనె నతండు కడంకన్.

వెచ్చపడె నొడలు, సీతువు - విచ్చె, సమస్తాంగకములు విడివడె మోదం
బెచ్చెఁ గిరాతున కత్తఱి; - నచ్చపుడెందమునఁ బుల్గు నాతఁడు మెచ్చెన్.

పావుర మపు డిట్లనె న - య్యా! వొగడం దగినవాఁడనా నే? నస్మత్
ప్రావీణ్య మొందు సెపుమా - నా విధి నేఁ జేయకున్న నవ్వారె లోకుల్?



గోషను ప్రభువు

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ద్వితీయ స్నాతకసభయందు
‘డాక్టరు ఆఫ్ లెటర్సు’ గౌరవబిరుదము నొందిరి.



సి. వి. రామనుగారు

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
ద్వితీయ స్నాతకసభోపన్యాస మొసంగిరి.



తాడిపత్రి రాఘవాచార్యులుగారు

నంద్యాల ఆంధ్రమహాసభయందు
‘నాట్యకళాప్రపూర్ణ’ బిరుదము బడసిరి.



చిలుకూరి వీరభద్రరావుగారు

నంద్యాల ఆంధ్రమహాసభయందు 'ఆంధ్రచరిత్ర చతురానన' బిరుదము బడసిరి.



డి. బలరామకృష్ణయ్య చౌదరిగారు
నంద్యాల ఆంధ్రమహాసభయందు
'బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ' బిరుదమును బడసిరి.

ఓయన్న! చలి యడంగెనె? - నీ యంగము స్వాస్థ్యముం గనియెనే? హర్ష
శ్రీయుతుఁడ వైతె? నా కిఁక - నేయానతి నిత్తు, వేగ నెఱిఁగింపఁగదే?

అనుటయుం గిరాతుండు వినయావనత మస్తకుం డై.

ఏ గతి నీ ఋణభారం - బీఁగెదనో సదుపకార మిట్లు సలిపి నా
యీ గండముఁ దప్పించితి - నీ గొప్పఁదనంబు నెన్న నేరఁ బతత్రీ.

ఈ చిదుగు లెట్లు వడసితి? - వీచి చ్చట లభ్యమయ్యె? నిందులకై నీ
వేచిక్కులఁ జిక్కితివో! - నీచాత్మకు నివ్విధిఁ గరుణింతువె నన్నున్?

జ్ఞానము నుపకారేచ్ఛయు - మానవగణమందె కాదు మఱియున్ ఖగసం
తానమునందుం గలవని - నే నెఱిఁగితి నేఁడు నీపునీతచరిత్రన్.

కొంగరవోయిన నాస - ర్వాంగంబులుఁ దిన్ననయ్యె నలజడి యడఁగెన్
భంగంబు నందె నీతు విఁ - కం గోరికి నాకొకండు గలదు ఖగంబా.

నీకొలఁది యే నెఱింగియు - నా కక్కఱిశిం దలంచి నయభూషణ! ని
న్నీ కోర్కి కోరఁ దొడఁగితి - నేకరణిన్ దీనిఁ దీర్చి కృపఁ జూపెదవో.

అనిన నక్కపోత మబ్బోయ కిట్లనె - నేల సంశయింప, నెఱుకుమిన్న!
ఎద్ది నీయభీష్ట మెఱిఁగింపు మద్దానిఁ - దీర్తు నిపుడ పోసఁగు తెరువ యున్న.

అనుటయు నతండు పారావతంబునకు.

వందన మాచరించి శ్రితవత్సల! యేమని విన్నవింతు మత్
తుందమునం దమందగతితోఁ జెలరేఁగె క్షుధానలంబు దీ
నిం దగురీతి నార్పి కరుణింపుము పెంపుము నీయశంబు నే
మందును మేర కన్పడద, యానకు నెన్ని విధాలఁ జూచినన్.

రవి నభోమధ్యసీమఁ జేరకయమున్న - వేఁట నుడిగి తొల్లిటియట్ల వెడలఁ దలఁచి
కుడువకయ వచ్చితిం జల్దికూటినైనఁ - దుదకు నాకోర్కితీవ లిట్లు దెగిపోయె.

"తా నొకరీతిం దలఁచిన - మానక - దైవంబు వేఱు మార్గముద్రొక్కున్;
దీని నెఱుంగుఁ" డటంచు సు - ధీనిధు లను పల్కు గుణనిధీ! వృథయగునే?

౯౨3

ఆదరమేదురబుద్ధిన్ - నా దీపము వెలుఁగఁ జేసినాఁడ విపుడు నీ
వో దీనబంధు! దీనిం - బ్రోది యొనర్పఁగదె యాఱిపోవక యుండన్!

అనవుడు నద్దీనుని మొఱ - విని గుండె "గుభాలు" మనఁగ విహగము ధైర్యం
బును గోల్పడి గద్గదికా - స్వనమున నీరీతిఁ బల్కె శబరునితోడన్.

మా కూడును మాగుడ్డయు - మా కలిమియు మా కొలంబు మరియాద లవో
నీ కెఱుక లేక యున్నవె? - యీ కోరికి నెట్లు తీర్తు నిత్తఱి నతిథీ!

ఏయెడఁ జిక్కినమేఁతల - నాయెడఁ గబళించి యచట నచ్చట మనుగుం
దోయఃములఁ ద్రావి గూటికి - హాయిగ నేతెంచుఁగద విహంగము లెపుడున్.

ఏపూఁటకూటి విషయం - బాపూఁటన తలఁచుఁ గాని "యవ్వలిపూఁటన్
లోపంబు లేక గడపుట - యే పగిది" నటంచుఁ బుల్గు లెంచునె? చెపుమా.

ఏవేళ యెట్టిదో యని - భావంబున నెంచి గూటఁ బట్టెడెరన్ జే
కావలి యుంతుమె? మే మ - ప్పా వినవో, కనవొ, మాదు బండారంబున్?

తాఁ దిన "దేహి"యటం చను - పేదకు వడ్డింప నతిథిబృందమునం ద
త్యాదరము సూప నెల్లర - కాదరువై వెలయ నితఁడు హాలికుఁ డొక్కో.

ఎండకు వానకు జంకక - పండించిన ధాన్యమెల్లఁ బాఁతఱలందున్
నిండించి తినుచుఁ బెట్టుచు - నుండెడి కర్షకుఁడ ధన్యుఁ డూహింపంగన్.

అయ్యాయి ప్రాఁకులకుం జని - తియ్యని పండులను ద్రుంచి తెచ్చుట కకటా,
యియ్యది జడికారుకదా - యెయ్యది కర్తవ్య మిప్పు డెఱిగిం పవనా.

ఏదారిఁ ద్రొక్కియైనన్ - నీదు బుభుక్షానివృత్తి నెఱపనిచో నన్
గా దంచు నిందసేయరొ - కో ధర్మాధర్మవిదు లకుంఠితరీతిన్.

కలరవరాజ మిట్టులు మొగంబున దైన్యము దోఁప నాఁకటన్
"మలమల"మాఁడుచున్న కసుమాలపు బోయకు విన్నవించి తాఁ
దలఁపున నివ్విధిం దలఁచె "దైవమ! యేపగ నీ విపన్ను నాఁ
కలి దొలఁగింపనేర్తుఁ? దగు - కర్జ మిఁకెయ్యది పూని సేయఁగన్.

ఇట్టలంబగు నాఁకంట నట్టుమెట్టు - నతిథికిం దగు నన్నపానాదు లొసఁగి
లేశమేనియు మే ల్సేయలేని యనద - బ్రదిమి యేటికిఁ బుడమికి బరువుచేటు.

అతిథుల నాదరించి శరణార్థుల భీతిఁ దొలంచి దీనసం
తతిఁ గరుణించి బాంధవజనంబులఁ బెంచి రక్షించువాని వా
బ్రతుకు భవంబు వంశమును భాగ్యము భోగము యోగముల్ జగత్
త్రితయము మెచ్చు వానిన వరించెడు ముక్తివధూవతంసముల్.

గూట నెర లేదు; వేఱొక చోటికిఁ - జని దానిఁ దేరఁ జొప్పడ దంచుల్
గూటి కిటు దేవురించు వ - నాటు హతాశునిఁ బొనర్ప ననుచితము గదా.

కావునఁ దప్పక వీనికి, నీ వలె - నాహార మిప్ప డిందులకై యొ
క్కావంతయుఁ జింతింప క - నావిలభావంబుతో మదంగము నిత్తున్.

ఉర్విని బెక్కునాళు లిటు లున్నను గల్గుఫలం బదేమి? సీ,
చర్విత చర్వణంబ కద, సంసృతి; మిత్తియు వెంట నంటి తా
గర్వము మీఱ మ్రింగుటకుఁ గాచియ యున్నది భీకరాస్యముల్
సర్వము విప్పి; రేపయినఁ జావున కొల్లక డాఁగవచ్చునే.

మలభూయిష్ఠం బతిచం - చలమగుమేనన్ బవిత్ర శాశ్వతతమ కీ
ర్తి లభించు నింతకంటెన్ - గలదే లాభంబు, చక్కఁగాఁ దలపోయన్.

పరహితమున కెవ్వఁడు దన - శరీర మర్పించు నతఁడె శాశ్వతలోక
స్థిరవాసి యంచు ధార్మిక - శిరోమణులు సెప్ప రే? విశిష్టచరిత్రుల్.

ఇట్లు నిశ్చయించి తన ప్రాణప్రయాణసన్నాహంబు నర్ధాంగికిం దెలుప నెంచి వాఁగురా
బద్ధ మై తన మొగమ్మునంద చూడ్కి నిలిపియున్న యిల్లాలిం జూచి.

ప్రేయసి! బోయవాంఛితము వింటివె? నీతు వడంపఁ గూటికిం
దోయిలి సాఁచె వీఁ డితని దుర్భరపుం గొదఁ దీర్ప గూటియం
దేయశనంబు లేదుగద! యింటికి వచ్చిన విందు నిస్పృహన్
బోయిన సర్వపుణ్యములుఁ బోవక నిల్చునొకో తలంపఁగన్!

అట్లగుట నిక్కి-రాతు నాహారమునకు-నప్పన మొనర్తు నాదు హేయంపుఁదనువు
వగవకుము నా వియోగంబు వగచి వగచి-పరమధర్మజ్ఞ! నీకుఁ జెప్పం బనేమి?

ఓ వనిత! బోయచే నీ-వేవిధమున నేని సమసె దిపుడో రేపో
కావున నా వెనువెంటన-నీవును రాఁగలవు నీకు నెగులిం కేలా?

అన్న దక్షిద్వయీగళితాశ్రుకణము-లబల! నీ కెఱిఁగించు నా యరుగుసరణి
లలితలావణ్యముక్తాఫలంబులట్లు-చెలువు గుల్కుచు లేతపచ్చికబయళ్ల.

అనిన నప్పెంటిగువ్వ దుస్సహ దురంత దుర్దాంత భర్తృమరణ వృత్తాంతంబు నాలించి
వెనువెంటన.

అతిదుఃఖప్రభవంబును - బ్రతిబద్ధేంద్రియము నగుచు భాసిలు మూర్ఛన్
బతిమరణంబుం జూడక-స్మృతి చెడి పడియె గృతోపకృతిచందమునన్.

అంత నమ్మగపావురం బిదియ యదనని తలంచి యతిథిం బొడఁగాంచి వానికి ట్లనియె.

అన్నా! తోఁచె నుపాయ మొందు భవదీయ క్షుద్వ్యథన్ దీర్ప; నిం
క నీ వించుకయుం దలంకకుము నాకాయంబు నర్పించి యా
పన్నున్ నిన్నలరింప నెంచితిఁ గృపాభావంబునన్ దీనిఁ గో
మ్మెన్నం డే నిటువంటి వంటకము నీ కే రే సమర్పించి రే.

అని పల్కి.

తడయక మండునగ్గికిఁ బ్రదక్షిణపూర్వకమైన వందనం
బిడి భవబంధము ల్దెగ నొకించుక జంకును గొంకు లేక న
గ్గడలను దేఱి చూచి విహగంబు "శుభాలు"న మాటలోపలం
బడె, వనవృక్షకోటి హిమబాష్పకణంబుల విజ్జ రాల్పఁగన్.

సర్వవలయాబ్జభవ కం-దర్పగురుప్రముఖ దేవతాగణ మబ్రం
బేర్పడ మెచ్చ ఖగం బా-త్మార్పణ మొనరించె నిట్టు లతిథికి నదిరా!

(సశేషము)

# చీనా జాతీయ ప్రభుత్వ విజయము

జయంతి వెంకట కిరీటిరావుగారు

ఇరువదేండ్లు తదేకదృష్టితో కృషిసల్పి, అంతఃకలహముల దిగవిడిచి, హోరాహోరిని పోరాడిన పిమ్మట చీనాయందలి జాతీయపక్షము ఉత్తర భాగమును గూడ జయించి, పికింగు నగరము నాక్రమించి జాతీయప్రభుత్వమును స్థాపింపగల్గెను. ఇంతవరకు అంతఃకలములకు ప్రోత్సాహ మొసంగుచు, సొంతవ్యాపారముల సంరక్షణపేరిట సైన్యములను సిద్ధపరచి ఆర్భాటముచేయుచుండిన విదేశ ప్రభుత్వములు ఇప్పుడీచీనా ప్రభుత్వమును గుర్తించి తామిదివరకు అనుసరించుచున్న సంధిషరతులను మార్చుకొని, ప్రత్యేక సౌకర్యములను విడునవలసిన అగత్యము కల్గెను.

## ఉత్తరదేశ దండయాత్ర

పికింగునందు 'మంచు 'వంశపు రాజ్యపరిపాలన అంతరింపజేసి ప్రజాపరిపాలన స్థాపించిన డా॥ సనుయటుసేనుగారి జాతీయపక్షము దక్షిణమున కాంటను నగరము కేంద్రస్థానముగ జేసికొని, సామాన్య ప్రజలయందు జాతీయ ప్రబోధము కల్గించి, కార్మిక కృషీవలుల సహాయము పొంది, యావద్దేశైక్యమునకును, ఏక ప్రభుత్వ సంస్థాపనకును ప్రతిబంధకముగనున్న ఉత్తరదేశ సేనానుల నోడించి, ఎన్నటికైన చీనాయంతటిని వశపరచుకొని జాతీయప్రభుత్వ సంస్థాపన మొనర్చి, విదేశీయ ప్రభుత్వముల నిరంకుశ చర్యలకు స్వస్తిజెప్పి, చీనా భాగ్యాభివృద్ధికి తోడ్పడవలెనను పవిత్రోద్దేశముతో కృషిసల్పుచుండెను. ఈ కృషి యంతయు నిదివర కీపత్రికలో మున్నొకసారి వివరించుట యైనది.*

కాంటను జాతీయ ప్రభుత్వముక్రింద మొదట దక్షిణ భాగమునందలి మూడు రాష్ట్రములే యుండెను. ఈ ప్రభుత్వ సేనానియగు చియాంగు కాయిషేకుగారు కడు నిపుణులు. వీరు ఉత్తరదిక్కునకు దండెత్తిపోయి క్రమేణ ముఖ్యనగరములన్నింటిని ఆక్రమించుకొనిరి. గత వత్సరమున వీరు అత్యద్భుత విజయమును బడసిరి. నిరుడు జనవరి మాసమున బ్రిటిషువారి స్వాధీనమునందుండిన హాంకోనగరము వీరి వశమయ్యెను. అచ్చటనున్న బ్రిటిషు అధికారులు పురమును పూర్తిగ ఒప్పగించి పోయిరి. బ్రిటిషు ప్రతినిధియగు ఒమల్లేగారు కాంటను ప్రధానియగు యుజనుచెనుగారు మార్చిలో నొక ఒడంబడిక గావించుకొనిరి. పిదప జాతీయ ప్రభుత్వ సేనలు నాంకింగు నగరము నాక్రమించినవి. నాంకింగు నాక్రమించినపుడు అచ్చటనున్న బ్రిటిషు ప్రతినిధికార్యాలయమును జాతీయ పక్షసేనలు ముట్టడిజేయుటలో బ్రిటీషువారికి చాలనష్టము కలిగెను. కొందరు బ్రిటిషువారు గూడ చంపబడిరి. నాంకింగు దుర్ణయములవలన కలిగిన నష్టపరిహార విషయమున బ్రిటిషువారికిని, నాంకింగు ప్రభుత్వమువారికిని సంధిసన్నాహములు ఒక సంవత్సరమువరకు జరుగుచునే యుండెను. చియాంగుకాయిషేకుగారు నాంకింగునందు జాతీయప్రభుత్వమును స్థాపించి, యిక ఉత్తరదేశ పభుత్వసంహారమునకు యత్నించుచుండిరి. హాంకోయందున్న అధికారవర్గమువారు జాతీయపక్షమునకు చెందినవారే అయ్యును, రషియా కనుకూలమగు అతివాదుల తెగవారగుటచే హాంకో నాంకింగు ప్రభుత్వముల మధ్య చీలిజగడము బయలుదేరినది. ఇది యదనుగ గొని విదేశీయులు రెంటికిని వైరము పెంపొందింపజూచిరి. కాని అధిక సైన్యాధికారము గల చియాంగుకాయిషేకుగారి మాటయే నెగ్గెను.

నాంకింగునందు స్థావర మేర్పరచుకొనిన పిదప నింకను అధికబలము చేకూర్చుకొని వీరు ఉత్తరదేశముపై దండెత్తుటకు ఈవత్సరము ఏప్రిలుమాసమున ప్రారంభించిరి. షాన్సిరాష్ట్ర నాయకుడగు యనుషియానుగారును, హోనాను నాయకుడగు ఫెంగుయు

---

* 1927 మార్చి, జూనుమాసముల "భారతి" సంచికలు.

సియాంగుగారును చియాంగుకాయిషేకుగారికి తోడ్పడిరి. ఉత్తర భాగమున పికింగు నగరాధికారమునందున్న మంచూరియా నాయకుడగు చాంగ్ ట్సొలిను సేనాని వీరి ముఖ్యశత్రువు. ఇతనికి జాపాను ప్రభుత్వ సహాయము గలదు. చియాంగుకాయిషేకుగారి పోకడల కనిపెట్టి, జాపాను ప్రభుత్వము స్వదేశీయుల సంరక్షణార్థము తగు సిబ్బందిని షాంటంగు నగరమున కంపెను. ట్సినానుఫూ నగరమునందు జాతీయపక్ష సేనలకును, జాపాను సేనలకును గొప్పయుద్ధము జరిగెను. చివరకు ఫెంగుయుసియాంగు గారు ఆనగరమును వశపరచుకొనగల్గిరి. జాపానువారు ఇంకను అధికముగ సేనలను చీనాకు పంపుచుండిరి. జాపాను చీనావిషయములందు తటస్థముగ నుండునట్లు ప్రకటించెను. అట్టియెడ మితిమీరిన సేనలను పంపుట చైనీయులకు భీతిగల్గించెను. జాపాను సేనల దుర్ణయములు నాంకింగు ప్రభుత్వమువారికేకాక, పికింగు ప్రభుత్వమువారికిగూడ రోత కల్గించుటచే, ఉభయ ప్రభుత్వములు గలసి నిరసనపత్రిక నంపి, జాతిసమితి వారికి విన్నవించుకొనిరి. చాంగ్ట్సొలినుగారుగూడ అవసరమగుచో తాము అంతః కలహములు మానెదమనియు ట్సినాన్ఫూ నగరమునందలి జాపానీయుల దారుణకృత్యముల గూర్చి యేదోవిధముగ తెగదెంపులు జేయవలెననియు ప్రకటించిరి. అంతట జాపాను వెనుకకు తగ్గి, షాంటంగునందలి సైన్యమును ఉపసంహరించుకొనెను.

## పికింగునగరము వశమగుట

జపాను అంతటితో నూరకుండక, జాతీయపక్ష విజయము నరికట్టుటకై మరల చాంగ్ ట్సొలినుగారిని రహస్యముగ బుజ్జగింపసాగెను. అయినను నాంకింగు ప్రభుత్వసేనల దాడికి అడ్డు లేకుండెను. వారి విజయపరంపరకు వెరచి ఉత్తరభాగపు సేనలు తీవ్రసంఘట్టనమునకు గడంగకయే తావిచ్చుచుండెను. ట్సినాన్ఫూ వశమైన పిదప, టీంట్సిను నగరము జాతీయసేనల వశమాయెను. అచ్చట నున్న చాంగ్ట్సొలినుగారిమిత్రుడగు సనుచంగుఫాంగు సేనాని తన అధికారపదవికి రాజీనామా నిచ్చి వెడలి పోయెను. అంతట పికింగునగరము ముట్టడి అతిసులభమాయెను. జూలై మాసమున జాతీయసేన లొకవైపునుండి పికింగునగరమున ప్రవేశించుచుండ, తత్ప్రభువగు చాంగ్ట్సొలినుగారు వేరొకమార్గమునుండి సైన్యపరివారసమేతముగ అధికార పరిత్యాగమొనర్చి మంచూరియా యందున్న ముక్డైను నగరమునకు వెడలిపోవుచుండెను: ఆ సమయమున వారిరైలుపై నెవరో బాంబు విసరిరి. వారు గాయపడి పిమ్మట కొన్నాళ్లకు మరణించిరి. చాంగ్ట్సొలినుగారు అంతరించుటతో చీనాయందు సేనాధిపతుల అధికారమంతరించినదని చెప్పవచ్చును. చియాంగుకాయిషేకుగారు పికింగు నగరమున జాతీయప్రభుత్వ సంస్థాపనమొనర్చి, నూతన రాజ్యాంగ విధాన మేర్పాటుజేసిరి. షాంషియందు యనుషియానుగారు, హోనానునందు ఫెంగుయుసియాంగుగారు వీరికి సామంత ప్రభువులుగ నుండిరి. దక్షిణభాగ మదివరకే వీరిదయ్యెను. ఎట్టకేలకు చీనాయం దేకప్రభుత్వము స్థాపింపబడెను. పదునెనిమిది రాష్ట్రములందు జాతీయపతాక మెగురుచున్నది. అనతికాలములో తక్కిన మూడు రాష్ట్రములు, జాపానీయుల ప్రాబల్య మధికముగనున్న మంచూరియాతో సహా, ప్రభుత్వముక్రింద చేరగలవు.

## నూతన రాజ్యాంగ నిర్మాణము

అక్టోబరు మాసమున స్థాపింపబడిన యీ నూతన ప్రజాప్రభుత్వముయొక్క అధ్యక్షుడు చియాంగుకాయిషేకుగారు. వీరే సేనానాయకులుగూడను. కార్యనిర్వాహక, శాసననిర్మాణ, న్యాయ, పరీక్షా, అధికారశాఖలు "యువాను"లను పేర ఐదుండును. పంద్రెండు లేక పదునైదుమంది స్టేటుకౌన్సిలరు లనబడు సభ్యులుందురు. వారిలోనుండి యీ ఐదుశాఖలకు అధ్యక్షులు, ఉపాధ్యక్షులు ఎన్నుకొనబడుదురు. కార్యనిర్వాహకశాఖ తక్కినవానికన్న ముఖ్యమైనది. ఇదియే మంత్రివర్గముల నేర్పరచును. శాసన నిర్మాణశాఖయిందు ఆర్థికవిషయములు, యుద్ధము సంధివిషయములు మున్నగునవి నిర్ణయింపబడును. న్యాయశాఖవారు న్యాయపరిపాలన జూతురు. పరీక్షాశాఖ ప్రభుత్వోద్యోగమునకు తగినవారిని పరీక్షజేసి యెంచును. అధికార నిర్వాహకశాఖ

వారు ఆడిటు, శిక్షల నమలు జరుపుట మున్నగు పనుల నిర్వర్తింతురు. సలహాసభ్యులుగ నియమింపబడిన పదునైదుగురిలో చాంగ్ట్సొలినుగారి కుమారుడగు చాంగుషులియాంగుగారినిగూడ ఒక సభ్యునిగా చియాంకాయిషేకుగారు నియమించిరి.

## విదేశప్రభుత్వముల సంపర్కము

చీనాయందలి ప్రతి అంతరంగిక పరివర్తనకును అంతర్జాతీయ ప్రాముఖ్యముగలదు. పెకింగునగరము ముట్టడి చీనాతో సంబంధముగల జాపాను, ఇంగ్లాండు, అమెరికాలను కలవరపెట్టెను. ముఖ్యముగ జాపాను సన్నిహితరాజ్యమగుటచే యెక్కువ జోక్యము కలిగించుకొనెను. దాక్షిణాత్యులు వచ్చుచున్నారని విన్నతోడనే వారి దండయాత్ర నరికట్టుటకై షాంటంగునకు సేనల నంపియు, చాంగ్ట్సొలినుగారిని ప్రోత్సహించియు, నిరంకుశదారుణచర్యలకు గడంగి చివర కెటుల విఫలమై యెల్లరిచే నిరసింపబడినదియు పైని జూచియున్నాము. కాని జాపాను దేశస్థితినిబట్టి చూచిన వేరొకరీతిని జేయుటకు వీలు లేదని తోపకమానదు. జాపాను బాగుగ నభివృద్ధిచెందిన యెక్కువ జనసంఖ్యగల చిన్నరాజ్యము. అందుచేతనే కొరియా నాక్రమించుకొనెను. ఆదినుండియు మంచూరియాయందు కొంతభాగము సంపాదించి, కొంత జనసంఖ్య నక్కడ కెగుమతిజేయుటకు జూచెను. కాని జాపానీయుల కచ్చటి దేశపరిస్థితులు సరిపడక ప్రభుత్వమువారి యత్నములకు తగుచేయూత నొసంగకుండిరి. కావున అధికముగనున్న జనమునకు తగు జీవితాధారము కల్పించుటకై వర్తకవాణిజ్యము లభివృద్ధి జేసికొనవలసియున్నది. అందుకొరకు మంచూరియాను, చీనాలో వీలగునన్ని నగరములను తమవశమునం దుంచుకొని ప్రత్యేకసౌకర్యము లనుభవించుచున్నారు. మంచూరియాయందు సొంతముగ నొక రైలుమార్గమునుగూడ నిర్మించుకొనిరి. చీనాయందు జాతీయ ప్రభుత్వము స్థాపింపబడినచో, తమ ప్రత్యేకసౌకర్యములకు భంగము వాటిల్లకుండుటకై జాతీయపక్ష విజయమునకు జాపాను ప్రతిబంధకము లేర్పరచుచుండెను. చాంగ్ట్సొలినుగారు చనిపోయిన పిమ్మటగూడ, వారి కుమారుడగు చాంగుషులియాంగుగారిని సేనానిగ జేసి జాతీయప్రభుత్వముతో చేరకుండుటకు ప్రోత్సహించెను. కాని ఆతడు వారి మాయలకు లోనుగాలేదు. తనతండ్రికి పరమశత్రువగు చియాంగుగారి ప్రభుత్వమునందే ఒకసభ్యుడుగ నెన్నుకొనబడెను.



చాంగుషులియాంగుగారు

ఇకమీదటగూడ జాపాను చైనీయుల ఆగ్రహమునకు గురియగుట భావ్యముగాదని యెంచి గౌరవహానిలేని సంధిషరతుల కంగీకరించి, తన స్వాధీనమునందున్న మూడు రాష్ట్రముల ఫలమునైన ననుభవించుటకు సుముఖిరాలై యున్నట్లు తెలియుచున్నది.

భారతదేశమునకు ఈస్టిండియా కంపెనీవారు వచ్చిన పిదప దేశీయసంస్థానములతో బ్రిటిషువారు చేసికొనిన సంధినియమములవలె, చీనా చారిత్రయందుగూడ అచ్చట వర్తకమునకై పోయి స్థావరమేర్పరచుకొనిన అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాంసు, రషియా మున్నగు పాశ్చాత్యదేశములు గూడ కొన్ని సంధి నియమము లేర్పరచుకొనెను. పిదప యుద్ధానంతరము వాషింగుటను సంధి సంప్రతింపు

లలోగూడ చీనా విషయమే ప్రాముఖ్యము వహించెను. ఆవరతు లిప్పటిపరిస్థితుల కనుగుణ్యమైనవి కావు. నాటికి నేటికి చీనాయందె చాలమార్పులు జరిగెను. జాతీయ పక్షప్రబోధమువలన ప్రజలందరు మేల్కాంచిరి. ప్రజాశక్తి 'ధనరు' విదేశ వ్యాపారసామ్రాజ్యధికారులను గూడ తగిలెను. అందుచే సంధిషరతులు మార్పవలెనని విదేశ ప్రభుత్వములు గూడ నంగీకరించినవి. పాశ్చాత్యదేశములలోకెల్ల రషియా ఆదికిముందు తన ప్రత్యేక హక్కులను విడనాడి ప్రజాపక్షము వహించి, యితర సామ్రాజ్యాధికారముల పడగొట్టుటకు విశేషకృషి సలిపెను. ఏకప్రభుత్వము లేనందున షరతులు మార్చుటనుగూర్చి యెవరితో సంప్రతించుటయు తెలియదను మిషచే ఆలస్యముజేయుచు, లోలోన అంతఃకలహముల పెంపొందించుచు, ఇంగ్లాండు కాలము గడుపుచుండెను. ఇప్పుడు చియాంగుగారి ప్రభుత్వస్థాపన జరిగిన పిదప జూలయి 15 తేదీని పరరాజ్యములకు సంధిషరతుల మార్పవలసినదనియు, నికముందు తమ్ము సరిసమానులుగ జూచుకొనవలెననియు గోరుచు జాతీయప్రభుత్వమువారు ఇతర ప్రభుత్వములకు, తాకీదు నంపిరి.

పరరాజ్యములకు గల ప్రత్యేక హక్కులలోకెల్ల ఆర్థికసౌకర్యములు ప్రాముఖ్యమయినవి. చీనా యిపుడు పునరుద్ధరణకు గడంగినందున ఆర్థికసమర్థత లేకున్న పనిగాదు. అందుచే టారిఫ్ (స్వదేశపరిశ్రమాభివృద్ధికయి వేయబడు పన్ను) విధించు హక్కు విదేశీయులనుండి జాతీయప్రభుత్వమునకు మారవలసియున్నది. దీనితోపాటు దిగుమతిపన్ను, సుంకములు విధించు అధికారము గూడను. ఈ రెండు చేజిక్కిన ఆర్థిక సంస్కారమునకు గడంగి తగు విధానమేర్పరచుటకు ఆర్థికమంత్రి టి. వి. సూంగ్సుగారు సిద్ధముగ నున్నారు. ఈవిషయమునజాతీయ ప్రభుత్వము చాల యుక్తిజూపెను. అమెరికాప్రభుత్వము టీంట్సేనునం దుంచిన తనసేనలో 15,000 మందిని తగ్గించి, సంధిషరతుల మార్చుటకు సిద్ధముగనున్నామని తెలియజేసెను. జూలయి 25 తేదీని పికింగులో సంధిసంతకములైనవి. అమెరికా చీనాకు సంపూర్ణముగ టారిఫ్ స్వాతంత్ర్యము (1929 జనవరి నుండి) ఒసంగుచు, జాతీయ ప్రభుత్వమును స్థిరప్రభుత్వముగ గుర్తించెను. ముందుగ ధర్మపథమననుసరించెనను గౌరవము అమెరికాకుచెందెను. అంతవరకు ఆలోచించుచు నేయుండి, 1927 మార్చిలో నాంకింగు దుర్ణయముల ప్రతిహారము గూర్చియే సాధించుచుండిన ఇంగ్లాండు, అమెరికా యిట్టిసంధి గావింపగనే, ఆగస్టు మాసమున తాను గూడ చీనాప్రభుత్వముతో రెండు ఒడంబడికలు గావించుకొనెను. మొదటిది నాంకింగు వ్యవహారముగూర్చినది; రెండవది ప్రాతసంధిషరతుల మార్చుటకు ఒప్పన్నము.

దేశపరిపాలన పునరుద్ధరణయందు జాతీయప్రభుత్వము అధికారము చేజిక్కినదాది అభిలాషజూపుచునే యుండెను. ఆర్థికసభయొకటి నాంకింగులో జరిపి అనవసర సేనల తగ్గించుట, సెంట్రలు బ్యాంకు స్థాపించుట, నాణెముల విధానము లికనున్న తీసివేయుట మున్నగు విషయము లాలోచించెను. రైళ్లు, రోడ్లు నీటిసరఫరాలు, విమానసౌకర్యములు, ఇరిగేషను మున్నగు విషయములన్నింటినిగూర్చి తగు నేర్పాటులు జరుగుచున్నవి.

## భావి సూచనలు

ఈ ప్రభుత్వ స్థిరతనుగూర్చి పలుతావులందు సందేహము కలుగుచున్నది. "కుమింగుటాంగు" అను పేర ఈ జాతీయపక్షము ఆదిని డా॥ సనుయటుసేనుగారిచే నేర్పాటు చేయబడినది. డా॥ సనుగారు నిర్ణయించిన ముఖ్యాదర్శములు మూడు: (1) జాత్యైక్యము, (2, అధికార నిర్వహణము, (3) సుఖజీవనము. ఈ ఆదర్శముల బడయుటకు వారు సూచించిన పద్ధతులు మూడు గలవు: (1) సోవియటు రషియాతో సహకారము, (2) చీనా కమ్యూనిస్టులతో (సాంఘికసమానత్వముగోరువారు) సహకారము, (3) కార్మిక కృషీవలుల ఉద్యమముల బలపరచుట. ఈ పక్షముయొక్క జీవితము, మార్పులు ప్రస్తుత స్థితి జెప్పవలెనన్న వేరొకవ్యాసమగును. కావున ఇప్పటి కవసరమగునంత క్లుప్తముగ వివరింతును.

కుమింగుటాంగుపక్షమధికారమునందున్న కాంటనుప్రభుత్వమునం దివన్నియు అనుసరింపబడుచుండెను. సనుయటుసేనుగారి సతీ పుత్రులు, ప్రధాని యుజను

చెనుగారు మున్నగువారు ఈ ఆదర్శములను, పద్ధతులను తూ చా విడువకుండ అనుసరింపకోరువారు. కాని అట్లను సరించుటవలన సోవియటురషియా ప్రాబల్య మధిక మయ్యెను. చైనీయుల స్వతశ్శక్తి అంతరించునను భయము కలిగెను. దౌర్జన్య మధికమయ్యెను. రషియా యితర దేశములన్నింటిచే నిరసింపబడుచున్నందున, నితర దేశములతో నెక్కువ సంపర్కముగల చీనాగూడ, కేవలము రషియాపై నాధారపడి అన్ని దేశముల నెదుర్కొనవలసివచ్చినచో, తమ కార్యము నెరవేరదని చైనీయులలో నెక్కువమందికి అభిప్రాయము గలిగెను. చియాంగుకాయిషేకు సేనాని గూడ ఈ తెగలోని వాడే. వీరిట్లునూరుటకు ఆంగ్లేయుల ప్రోద్బలము గూడ కొంతవరకు కారణమందురు. ఎట్లయినను సరే, మంచికో చెడ్డకో—మంచికేయని చెప్పవచ్చును—చియాంగుగారు మితవాదులైరి. వీరు సైన్యాధిపత్యమునందుండుటచే అల్పసంఖ్యాకులగు అతివాదు లెదుర్కొనలేకపోయిరి. సనుయటు సేనుగారి భార్యయు, యుజనుచెనుగారును గూడ రషియాకు వెడలిపోయిరి. నిజము గుర్తించి, యావ ద్దేశైక్యమే ముఖ్యముగ నెంచి, కాలానుగుణ్యముగ ప్రవర్తింపనెంచిన చియాంగుగారు కీ॥ శే॥ డా॥ సనుగారి ఆదర్శపద్ధతులలో ఆదర్శములకే యెక్కువ ప్రాముఖ్యము నొసంగి, వారిపద్ధతులను మార్చి ప్రవర్తింప సాగిరి. నాంకింగు ప్రభుత్వము స్థాపించినప్పటి నుండియు వీరు రషియా కమ్యూనిష్టు పద్ధతుల తీవ్రముగ నెదుర్కొనుచు, అతివాదవర్గముల ఆందోళన అణచివైచి, ముఖ్యముగ తన సైన్యబలముచేతనే విజయము గాంచగల్గిరి. కుమింగుటాంగుపక్షమునందున్న యువజనులు కార్యాచరణకన్న ఆలోచనా సామర్థ్య మెక్కువ గలవారగుటచేతను ఉన్న తాదర్శములు గల్గియు, అనుభవము తక్కువగుటచే అనుకూలపద్ధతుల నెరుంగకయు, దూరపుకొండలు నునుపన్నట్లు అవ్యక్తమగు సోవియటు రష్యావిధాన వ్యామోహితులై చియాంగుగారి పద్ధతులతో సంతృప్తిచెందకున్నారు. అధికారము సేనానాయకుని చేజిక్కినందున నితడు గూడ వేరొక నిరంకుశప్రభు వగునను భయము కొందరికి గలదు. కాని ఆతడు కేవలము సైనికుడేయని యెంచుటకు వీలులేదు. వారి యితర సమర్థతలను జాతీయ ప్రభుత్వనిర్వహణమే మున్ముందు రుజువుజేయ గలదు.



చియాంగు కాయిషేకుగారు - నూతన ప్రభుత్వాధ్యక్షులు

విదేశీయులు స్వార్థపరతతో లోపములను గోరంతలు కొండంతలుచేసి పత్రికలద్వారా ప్రతికూల ప్రచారము జేసి నిరుత్సాహమును పెంపొందించుచున్నారు. కాని, అధికారము చేజిక్కిన పిదప పీఠాధిపత్యము వహించువ్యక్తి యుక్తిపరుడును, సమర్థుడును, శక్తివంతుడు నగుటచే నిట్టివి సరకుచేయక తనయధికారమునకు స్థిరత చేకూర్చుకొని, ఐకమత్యము పెంపొందించి దేశాభివృద్ధికి తోడ్పడుననియే యెంచవచ్చును.

# నాఁటికి నేఁడు

పింగళి లక్ష్మీకాంతం గారు
కాటూరి వేంకటేశ్వరరావు గారు

ఎన్నఁడు పాడుకొంటిమొ గదే! ప్రమదావన దర్శనంబునన్
స్విన్నము లై, కరంగి, వికసించు నెడందలు కౌఁగిలింతలన్
గన్నులు మోడ్చి సొక్కుఁ దొలుకారున, నీ పువుఁ జప్పరమ్మునన్
గిన్నెర మీటి నీవు చిలికింపఁగఁ బెంజడి పూవుఁదేనియల్.

నవనవలాడుచున్ వికసనం బొకయింతయుఁ గోలుపోక, పా
పవికల మై తపింపక, కృపాపరిపూర్ణము లౌచుఁ, జింతలన్
జివుకక, రెక్క లున్న మనచిత్తము లబ్బులు సోఁప మింటికిన్
దివుటలు పెంచుకొన్న యల దివ్యముహూర్తము లెందుఁ బోయెనో?

చింతలపెల్లునన్ జివికి చేడ్పడి యున్న మనంబునందు, వా
సంతిక పెండ్లిముచ్చటలు, జక్కవ తొయ్యలి యూఱడింపు, సం
క్రాంతివినోదముల్ తలఁపురా, గుఱుతించియుఁ బోల్చలేక, జ
న్మాంతర వృత్తసంస్మరణ.లా! యని నివ్వెఱపాటు తోఁచెడిన్.

దుమదుమ చిన్కుఁ దుంపురులతోఁ దొలుకా రెపు డేఁగె, శారదా
గమములు నెన్ని వోయె, సుమకాలము లెన్ని గతించె, వెండి, వ
ర్షమొ, మఱి మేఘగర్జనమొ, చంద్రికయో, చివురించుటో, కటా!
సమసెను సర్వమున్; మదికిఁ జక్కిలిగింతయె రా దొకప్పుడున్.

సోలినమోముతో, నిదురచొక్కులు వ్రేలెడి కన్నుదోయితో
రేలుఁబవల్ వృథా పలవరించుచు నుంటిని, నింకనైన, ను
న్మీలనసుందరమ్మయిన నీముఖమండల చంద్రికాప్రభా
జాలము నింపి, యంధతమసచ్ఛటలన్ విరియింపఁ జెల్లదే?

ఏల విలంబనమ్ము, హరియించెడి ప్రాయపుఁదీపు, లెన్నఁడో
కాలమునాఁడు మూల నిడి, గాసెన గప్పిన యా విపంచికన్
ధూళి విదల్చి కైకొనుము; తొల్లిటి సుస్వరమేళనక్రియా
పాలనఁ జాలియున్నదొ, యపశ్రుతు లీనునొ, చూడఁగావలెన్.

---

# రషియా కార్మికస్మృతి

జనుగుమిల్లి సాంబశివరావు గారు, బి. ఏ.

రషియా పరిస్థితులను గూర్చి చాలవరకు ప్రతికూలముగనే వినుచున్నారము. ఏ జవహరులాలు నెహురూగారో, పండిత మోతీలాలు నెహురూగారో, శ్రీనివాసయ్యంగారో ప్రత్యక్షముగ జూచివచ్చినవారు నిజపరిస్థితులను దెలిపినను, వారు పాక్షికబుద్ధితో దెలుపుచున్నారని ఇంపీరియలిస్టుల వాదము. రష్యా అంత భూలోకస్వర్గము గాకున్నను, అచ్చటివారుసర్వసాధారణముగ దుర్యోధనసంపదతో తులదూగుచున్నారని చెప్పుటకు ఆధారములు లేకపోలేదు. దీనిని నిరూపించుటకు నాకున్న ఆధారప్రమాణములు డబ్ల్యూ. జే. బ్రవునుగారి వ్రాతలే. నేటివరకు ఇంపీరియలిస్టు ప్రభుత్వము వారు ఎవరును వాటిని అబద్ధమని ఆక్షేపింపలేదు. ఆవ్రాతలను బహిష్కరింపలేదు. కాన విశ్వసింపరాదని ప్రకటింపబడువరకు వాటిని మనము విశ్వసింపవచ్చును.

### వేతనములు

కార్మికసమస్య లన్నిటికిని వేతనములే ప్రధానబీజమని వేరుగ జెప్పనక్కరలేదు. ఆ వేతనములు న్యాయముగ లేకపోవుటచేత నే గదా, ప్రపంచములో ఏ మూలజూచినను సమ్మెలను, లాకవుటులను కని వినుచున్నారము. లాకవుటులనగా, యజమానులు పనివాండ్ర కోర్కెల నంగీకరింపనపుడు వారిని పనిలోనికి రానీయకుండ కర్మాగారములను మూసివేయుట. పనివాండ్రు లోబడువరకు అటులనే యుంచెదరు. ఒక్క ఇటలీలో మాత్రము నీనీరు ముసోలినీగారి ధర్మమాయని సమ్మెలు, లాకవుటులు అక్రమములని నిర్వచింపబడి శిక్షార్హముగ శాసింపబడినవి.

### రషియాలో వేతనములు

ప్రభుత్వమువారే కనీసపు వేతనములను నిశ్చయించెదరు. అంతకు తక్కువగా ఎవరును వేతనము లీయరాదు. మామూలుకంటె ఎక్కువ గంటలు పనిచేయువారికి మామూలుగ పనిచేయునపుడు ఇచ్చు వేతనముకంటె మొదటి రెండుగంటల అదనపుపనికి $1\frac{1}{2}$ రెట్లు వేతనముల నిచ్చెదరు. ఆ తరువాతగూడ పనిచేయుచో ఎంత కాలమైననునరే రెండు రెట్లు ఇచ్చెదరు. సెలవురోజులలో పనిచేసిననునరే, ఇదేప్రకారము ఇచ్చెదరు. ప్రతి సంవత్సరము పనివాండ్రకు సెలవుల నిచ్చుటకు ముందుగనే వేతనము లొసంగబడును. చిల్లరగా పనిచేయువారికి (చిన్నపనులకు) మామూలుగా పనిచేయునపుడు ఇచ్చు వేతనముల చొప్పుననే ఇచ్చెదరు. అంతకు ఎక్కువయున్న ఉండవచ్చును గాని తక్కువగామాత్రము ఇవ్వరాదు.

పనివాండ్రను బదలాయించుట

పనివాండ్రను ఒకయూరినుండి ఇంకొక గ్రామమునకుగాని, స్థలమునకుగాని బదలాయించినపుడు ఆ ప్రదేశమునకు బోవుటకగు ఖర్చులను యజమానులే భరింపవలెను.

క్రొత్తప్రదేశములందు బట్టలు, పాదరక్షలు త్వరగా చినిగిపోవుట, అరిగిపోవుట తటస్థించుచో యజమానులే వారికి వస్త్రములను పాదరక్షలను సప్లయిచేయుచుండవలెను. లేదా వాటిని కొనుక్కొనుటకు వాటికగు డబ్బైనను వారికీయవలెను. ఏ కర్మాగారమువారైనను పనిని కట్టిపెట్టుచో కట్టిపెట్టినపిదప మామూలు వేతనములను పనివాండ్రకు ఒకనెలవరకు ఇచ్చుచునేయుందురు.

శక్తి ఉడిగినవారు

పనివాండ్రకు పనిజేయుశక్తి ఉడిగినపుడు, రెండునెలలవరకు వారికి వేతనముల నీయవలసినదే. ఆ పిదప వారిని ప్రభుత్వమువారే పోషింతురు.

గర్భిణీస్త్రీలు—పురిటాండ్రు

గర్భిణీస్త్రీలకును ప్రసవించిన స్త్రీలకును నాలుగు నెలలు జీతముమీద సెలవునీయవలెను. కచ్చేరిలో పనిచేయువారికి మూడునెలలు సెలవు నిచ్చెదరు. ఇట్టిఏర్పాటు లుండుటచేతనే గదా రషియాలో, పనిలేనివాండ్ర సమస్యనే మనము ఎన్నడును వినుటలేదు. శక్తి ఉడిగిన పనివాండ్రను ప్రభుత్వమువారే పోషించు ఏర్పాటు ఉండుట ఎంత క్షేమకరమో వేరుగ జెప్పవలెనా ?

పనిలేనపుడు వేతనములు

పనిలేనపుడు కార్మికులకు సాధారణముగ 6 నెలలు వేతనము నిచ్చెదరు. అవసరమైన 9 నెలలవరకు గాని అంత కెక్కువకాలముకూడ గాని ఇచ్చుటయు కలదు.

వ్యాధిగ్రస్తులైనట్టిగాని, కుంటివారైనట్టిగాని, వృద్ధాప్యము నచ్చినట్టిగాని పనివాండ్రకు సాంఘికపు భీమాసొమ్ము నిచ్చెదరు. దీనినే "సోషలు ఇన్షూరెన్సు" అందురు. స్త్రీ గర్భవతియగుచో తొమ్మిదినెలలు నిండి పురుడు పోసికొని మరల బయటకువచ్చువరకు మూడు నెలలు నిండుజీతముతో సెలవు నిచ్చెదరు.

ఇంగ్లండులో స్త్రీలు వివాహితలైనవెంటనే సివిలుసర్వీసు విడిచిపెట్టవలెను. పనిలో ఉండరాదట. ఆమె ప్రేమించిన మనిషితో కాపురము జేయుచున్నచో పనిలోనుండి తీసివేసెదరట. రషియాలో స్త్రీపురుషులనుభేదమును పాటింపక అన్నివిధముల పనులందు సమానముగ పనిచేయనిచ్చెదరట. స్త్రీపురుషులు సమానులు వీరి ఎక్కువ వారి తక్కువ యనునది లేదు. స్త్రీపురుషుల సంబంధము స్వేచ్ఛతోను సహజమగు ఇష్టముతోను గూడుకొన్నది.

స్త్రీలయందు ఎక్కువ వినమ్రత కలదు.

స్త్రీపురుషుల ప్రవర్తనము చాల కట్టుదిట్టములతో నిబంధనలతో గూడుకొన్నది. వారు

విచ్చలవిడిగా తిరుగరు. ముద్దుబెట్టుకొనుట సినీమాలలోగాని నాటకరంగమునగాని కన్పిం చదట. కౌగిలింతలుగూడ కానరావట.

వివాహము

ఇందు ప్రభుత్వమువా రెట్టి సంబంధమును జెట్టుకొనరు. వివాహితుల పిల్లలవిషయమున మాత్రము ప్రభుత్వమువారు జోక్యమును గలుగజేసికొనెదరు. ఇష్టమున్నచో దేవళమున (చర్చిలో) పరిణయమాడవచ్చును. లేదా రిజిస్ట్రరుకార్యాలయమున అనగా పెండ్లిండ్లకొఱకేర్పడిన కార్యాలయమునకు బోయి పెండ్లియాడవచ్చును. స్త్రీ పెండ్లిజేసికొన్నను చిన్ననాటి తనపేరు త్యజింపదు. తనపేరు నట్లే ఉంచుకొని భర్తపేరును గూడ దానికి జేర్చుకొనును.

ఎంతకాలము భార్యభర్తలుగ నుండవలెనని గోరెదరో అంతవరకు ఆ ప్రకారమే ప్రవర్తింపవచ్చును. ఆ పిదప వివాహమును వదలుకొనవచ్చును.

"మన వివాహమును రద్దుజేసుకొనెదమ" ను చిన్న ప్రకటనమును గావించి వారు విడిపోయెదరు. అమెరికా ఇంగ్లండు మున్నగు దేశములందువలె రచ్చకెక్క నక్కరలేదు. పత్రికలలో వివాహవిచ్ఛేదమునకు సంబంధించిన అభియోగపు విచారణలు కన్పింపవు. వివాహబంధమును తెంపుకొనినట్లు పత్రికలలో ప్రకటనము పడిన చాలును. అట్టి విచ్ఛేదన ప్రకటనమునకు ఒక రౌబులు (నాణెము) నీయవలెను. వారిలో పెండ్లి ఒక ఆచారము గాదు. పెండ్లి ఆయినతరువాతగూడ భార్యాభర్తలు వారి పూర్వవ్యాపారములు చేసికొనుచునే యుండవచ్చును. పిల్లలు పుట్టిన మాత్రమున స్త్రీలు అదివరకు చేయుచున్న పనులు మానుకొన నక్కరలేదు.

వివాహమును వదులుకొన్నపిదప భర్త భార్యా పుత్రాదులకు జీవనభృతిని ఆతని ఆదాయములో 1/3 వంతు ఇవ్వవలెను. వివాహవిచ్ఛేదము బహుళకృతు.

రషియాలో వ్యభిచారము లేదు. మనోదార్బల్యముచే చిత్తచాపల్యముచే స్త్రీపురుషులు ఒండొరులు కలిసిరేని వారిని భార్యాభర్తలుగనే ప్రభుత్వమువారు భావించెదరు.

పరస్త్రీగమనముపర పురుషగమనము సాధారణముగ కన్పించవు. చాలతక్కువ.

ఫ్యాక్టరీలో పిల్లలను సంరక్షించుబాధ్యత ప్రభుత్వమువారిదే. ఇతరత్ర యజమానుల కొలువులో ఉన్నపనివాండ్ర పిల్లల క్షేమమును ఆరయు బాధ్యత యజమానులదే.

---

కదసకంఠీరవ కాంతార మన నొప్పు మహారాష్ట్రమెవ్వాని మాతృభూమి
నీతఁ బోలిన వీరమాత జిజాబాయి కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
స్వామికార్యహితైక చరితుఁడైన శహాజిజనపాలుఁ డెవ్వాని యనుఁగుఁదండ్రి
భీమక్రియారంగవిభ్రాజి సంభాజి భూపాలుఁ డెవ్వాని పూర్వజుండు
సాధు దాదోజి యెవ్వాని సద్గురుండు-అట్టి మహారాష్ట్రరాజ్య విఖ్యాతవిభుఁడు
విజయలక్ష్మీ ప్రసన్న గంభీరభుజుఁడు-శ్రీ శివాజీమహారాజ శేఖరుండు!

పసితనంబునఁ దల్లిపాలతోఁ బోసిన వీరరసాయనసారమహిమ
శైశవంబునగురుసాన్నిధ్యమునఁ గన్న వైరివిచ్ఛేదన పాటవంబు
భక్తవత్సల దుర్గ వరముచేఁ బడసిన విజయసంధాన వివేకగరిమ
అవతరింపక మున్నె యంకురార్పణమైన యవనసంహార సంసవనదీక్ష
దినదినాభ్యుదయంబునఁ దేజరిల్ల - భారత స్వరాజ్యరమణీ పాదపీఠి
జీవ మర్పించియును జిరంజీవి యయ్యె - శ్రీశివాజీమహారాజ శేఖరుండు.

పరదార పరధనాపహరణ దురితంబు లనఁ ద్రికరణశుద్ధి యగువిరక్తి
దుర్జయ దుర్ధర్ష దుర్గమ దుర్గముల్ దుర్జ్ఞేయముగ గెల్చు దుర్గభక్తి
దుర్వార దుస్తంత్ర ధూర్త తురుష్కులఁ ద్రుటిలోనఁ దూలింపఁ దోఁచుయుక్తి
అరివీరభటకోటి నల్పసైన్యంబుతో మోహరింపఁగఁ జాలు బాహుశక్తి
తనర, మాతృదేశ దాస్యబంధ విముక్తి - చేయ దీక్షఁ బూని యాయువంత
ధారవోసినట్టి ధన్యమానవమూర్తి - ఛత్రపతి! శివాజిచక్రవర్తి!

సతతంబు పాదుషా సహకారు లగుచున్న సామంతరాజుల నసి యడంచి,
ద్రోహబుద్ధి గలిగి స్నేహంబుఁ జేసిన ఖానుసేనానినిఁ గాటి కంపి,
మొగలాయిపాదుషా పగవాఁడ నని నిల్చి పక్కలో బల్లెంబుపగిది మసలి,
దుష్టతురుష్కుల దుండగంబుల మాన్పి హైందవయువతుల యార్తిఁ బాపి,
శిష్టరక్షణంబును దుష్టశిక్షణంబుఁ - జేయ శివనేరి వెలసిన శివుఁ డనంగఁ
బరఁగె నమ్మహారాష్ట్ర భూపాలకుండు - శ్రీశివాజీ మహారాష్ట్ర శేఖరుండు!

తోరణదుర్గంబుఁ దోడ్తోడ గెల్చి, స్వారాజ్యరథమునఁ దోరణముఁ గట్టి,
రామదాసస్వామి ప్రేమోపదేశముల్ దద్దయు భక్తి నౌదల ధరించి,
నెఱజాణ తనముతోఁ జెఱ వీడి శత్రుల నుగ్రశౌర్యాగ్ని కాహుతి యొనర్చి,
మొగలాయిసామ్రాజ్య మూలంబు ఛేదించి కూఁకటివ్రేళ్లతోఁ ద్రుంగఁ జేసి,
అభినవాభిమన్యుఁ డనఁగ నవని మించి - కీర్తికాంతాపరిష్వంగ ఖేలనమున
జన్మసాఫల్యమును గన్న చక్రవర్తి - శ్రీశివాజీమహారాజ శేఖరుండు!

# ధాన్యకటకము-కొప్పెరుజింగడు

డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు,
ఎమ్.ఏ., పి. హెచ్.డి.

## ౧

గుంటూరుజిల్లాయందలి అమరావతి యనుగ్రామమునుండి తేబడిన శాసనమొకటి చెన్నపురి వస్తుప్రదర్శనశాలయందున్నది. ఇది పల్లవంశీకుడైన సింహవర్మ యను రాజుచే వేయింపఁబడినది. అందు తన పూర్వికులను సింహవర్మ యిట్లు వర్ణించుకొని యున్నాడు:

మహేన్ద్రవర్మేతి తతః క్షితీశః
శూర స్తతో జాయతి సింహవర్మా
తతోర్కవర్మా తదనుగ్రవర్మా
శ్రీసింహవిష్ణురథ నందివర్మా.

అనేక రాజన్య శిరోమణిప్రభా
విభాతకల్పాయిత శార్వరాస్థితిః
ససింహవర్మా సమభూద్యఉచ్యతే
హయద్విపాష్టా దశలక్షకోజనైః.

తరువాత మహేన్ద్రవర్మ రాజాయెను. అతనికి శూరుఁడగు సింహవర్మ పుట్టెను. పిమ్మట అర్కవర్మయు, ఉగ్రవర్మయు, శ్రీ సింహవిష్ణునకు (పుత్రుడైన) నన్దివర్మయు (రాజులైరి). అనేకరాజుల కిరీటములలోని మణులయొక్క కాంతులచే వెడలగొట్టబడిన చీకట్లుగల సభాస్థానము గలవాడును, పదునెనిమిది లక్షుల గజతురగపదాతులకు నాథుడని ప్రజలచే బిల్వబడువాడును అగు సింహవర్మ పుట్టెను.1

పై వంశవృక్షములోని రాజులకున్న సంబంధము సంపూర్ణముగ వర్ణింపఁబడి యుండలేదు. మహేన్ద్రవర్మ పుత్రుఁడు సింహవర్మ, సింహవిష్ణుని పుత్రుడు నందివర్మయని మాత్రము తెలియుచున్నది. తక్కిన రాజులకును వీరికిని, వారిలో నొండొరులకును గలిగిన సంబంధమెట్టిదో తెలియరాదు. ఈపల్లవంశమెప్పటిది?

మహేన్ద్రవర్మ
|
సింహవర్మ
:
అర్కవర్మ
:
ఉగ్రవర్మ
:
సింహవిష్ణువు
|
నందివర్మ
:
సింహవర్మ

ఈ రాజులు ఎచ్చట ప్రభుత్వము చేసిరి? అను నీప్రశ్నలకు దృప్తికరమైన సమాధానము జెప్పుటకు సాధ్యము కాదు. తగినంత సామగ్రిలేదు. అట్టిసామగ్రి పరిశోధనవల్ల బయల్పడునందాక నిశ్చయ మిదియని ఖండితముగ జెప్పుటకు వీలు లేదు. అయినను వీరి పూర్వోత్తర మిట్టిదని మనకు లభించియుండు శాసనసామగ్రి నాధారపరచుకొని యూహించుటకు అవకాశము గలదు.

ఇతర శాసనములయందు వర్ణింపబడిన పల్లవవంశములకును దీనికి నేలాటిసంబంధమును గన్పించదు. ఇందలి పేర్లు పల్లవుల సంస్కృత శాసనములలోని పేర్లను బోలియున్నవి. ఈ శాసనము వేయించిన సింహవర్మ అతని ప్రభుత్వస్థాన మేదో, కాలమెప్పుడో చెప్పుట కష్టసాధ్యమైనపని. అందువల్లనే పరిశోధక పండితశ్రేష్ఠులగు హూల్ట్షుగారు "చరిత్రనిర్మాణమున ఇది మిక్కిలి జాగరూకతతో నుపయోగింప దగిన"దని2 నుడివియున్నారు. ఈవాక్యము ననుసంధించుకొని పరిశోధకులు దీనివిషయమై మౌనమును వహించియున్నారు. ఈ శాస

1 S. I. I. vol. I.

2 S. I. I. vol. I.

నపుదాతయగు సింహవర్మ్మ చరిత్రమును సాధ్యమైనంత వఱకు దెలిసికొనుట యావశ్యకము.

లిపిస్వభావమును బట్టి, ఈ శాసనకాలము క్రీ. శ. ౧౧౦౦ గ నుండునని హుల్ ట్షుగారు నుడివియున్నారు. ఇంక నూటయేబది యేండ్లకు దరువాతిదని మా యభిప్రాయము. కాకతి గణపతిశాసనముల లిపియు దీని లిపియు, ఇంచుమించుగ నొక్క తెఱగున నుంటచే, ఇవి రెండును నేకకాలపువై యుండవలయునని తలఁచుచున్నాము. కావున సింహవర్మ్మయు క్రీ. శ. ౧౨౫౦ వ సంవత్సర ప్రాంతపు వాడేనని యూహ.

శాసనమున అతడు తన్ను గురించి యిట్లు చెప్పుకొని యున్నాడు. ఒకానొకప్పుడు సకలమాణ్డలికులును, సామంతులును, యుద్ధవీరులును, ముందటను, పిరుందను, ఇరు పార్శ్వములను గొలిచిరాగ, దిగ్విజయార్జితమగు స్వకీర్తిని సుమేరుపర్వత శిఖరమున స్థాపించుటకై యచ్చోటికి జనియెను. మరలివచ్చునప్పుడు భాగీరథీగౌతమీకృష్ణలనుదాటి ధాన్యఘటమను నగరమున వీతరాగభట్టారకుని బొడగాంచెను. చూచి, కుతూహలముతో క్షేత్రరక్షనియుక్తాధిదేవతలను సవినయుడై సమీపించి నమస్కరించి ధర్మోపన్యాసమును వినెను.[1]

ఇందువల్ల సింహవర్మ్మను గురించి మనకు ఈ క్రింది విషయములు దెలియుచున్నవి:—

౧. అతడు అనేకులగు సామన్తుల చేతను, మాణ్డలికులచేతను ఊడిగముసేయించుకొను స్థితియందున్నవాడు.

౨. దిగ్విజేత; పరాక్రమశాలి; స్వకీర్తిని మేరుశిఖరమున నెలకొల్పుటకై దక్షిణమునుండి యుత్తరదేశమునకు బోయినవాడు.

౩. ఆంధ్రుడు గాడు. ఆంధ్రుడైన ధాన్యఘట నగరమున వీతరాగ భట్టారకు డుండుట అప్పటివఱకును దెలియకుండుట సంభవింపదు.

౪. ఇంతియగాక, అతడు ద్రవిడదేశస్థుడని సూచనలు శాసనమునం దున్నవి. ధాన్యకటమును ధాన్యఘటమనియు; ధాన్యకటకమును ధాన్యఘటకమనియు వ్రాసియుండుట సింహవర్మ్మయొక్క ద్రావిడత్వమును సూచించుచున్నది. హుల్ ట్షుగారన్నట్లు "'క'కుబదులు "ఘ"ను వ్రాసినందుకు రెండచ్చులమధ్య వచ్చు పరుషములను సరళములుగ నుచ్చరించు ద్రావిడాచారమే కారణముగ నుండవలయును".[2] పై చర్చవల్ల తేలిన విషయము: సింహవర్మ్మ ద్రవిడదేశస్థుడగు పల్లవరాజు, అనేక సామన్తులును, మాణ్డలికులును అతని సేవించుచుండిరి. గొప్పసైన్యముతో నానాదేశములను జయించి స్వకీర్తిని మేరువుపై స్థాపించుటకై యుత్తరదేశమునకు పోయెను. మరలివచ్చునప్పుడు కృష్ణనుదాటి ధాన్యఘటమున వీతరాగ భట్టారకునికడ ధర్మోపదేశమును బొంది ప్రస్తుత శాసనమును శిలాస్తంభముపై జెక్కించి నిలిపెను. ఇతడు క్రీ. శ. ౧౩ వ శతాబ్దమునం దున్నవాడు.

ఇఁక ద్రావిడదేశమును క్రీ. శ. ౧౩ వ శతాబ్దమున బాలించిన పల్లవరాజు లెవ్వరో, వారియందు సింహవర్మ్మ యనువాడు కలడేమో విచారించవలసి యున్నది. ఆ కాలపు శాసనములను బరిశోధించి చూడగా నప్పుడు ద్రవిడదేశమున కావేరికి ఉత్తరభాగమున తిరుకోవలూరు ప్రాంతములయందు పల్లవరాజులు రాజ్యము సేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈ దేశమునకు అప్పుడు చేదిదేశమని పేరు. దీనిపై కాడవులనబడు పల్లవరాజుల ప్రభుత్వము సాగుచుండెను. వీరియందు ముఖ్యులు ఇద్దరు. వీరిద్దఱును కొప్పెరుఞ్జింగ నామధారులు. ఈ మాటకు అర్థము ఏమన: కొ=రాజు; పెరుఞ్=పెద్ద సింగ=సింహ. కావున, కొప్పెరుంజింగడన్న మాటకు రాజు పెద్ద సింగడని కాని, పెద్దరాజు సింగడనికాని యర్థము చెప్పుకొనవచ్చును. మహారాజసింహయను దీని సంస్కృతరూపము శాసనములయందు గాన్పించుచున్నది. ఇది అరవమాటకు సరియైన తర్జుమా కాదు. మహాసింహరాజయనిగాని, రాజమహాసింహ యనిగాని యుండవలయును. 'సింహ' యనునదియే పేరనుటకు శాసనములలోని 'పృథుసింహస్య శాసనం' అనువాక్యమే నిదర్శ

1 S. I. I. vol. I.

2 S. I. I. Vol. I.

నము. అమరావతిలోని శిలా స్తంభ శాసనకర్తయగు సింహావర్మన్ ఈ కొప్పెరుఞ్జింగలలో నొక్కడని మా యభిప్రాయము. కావున వీరి పుట్టు పూర్వోత్తరముల నించుక యారయవలసి యున్నది.

## ౨

క్రీ.శ. ౧౩ వ శతాబ్దమున దక్షిణదేశముపై నిరంకుశప్రభుత్వము సేయుచున్న చోళచక్రవర్తుల పరాక్రమము సన్నగిలుటచేత వారి సామ్రాజ్యము క్షీణింప దొడగెను. సామంతరాజులును, మాండలికులును స్వతంత్రులగుటకు ప్రయత్నములు సేయదొడగిరి. క్రీ. శ. 1177 మొదలు క్రీ. శ. 1215 పర్యంతము రాజ్యముచేసిన ముమ్మడి కులోత్తుంగుని కాలముననే ఈ క్షీణదశ యారంభమయ్యెను. తదనంతరము చోళసింహాసనము నధిష్ఠించిన మూడవ రాజరాజు (క్రీ. శ. ౧౨౧౬-౧౨౪౨) కాలమున మండలాధిపులు చక్రవర్తి కెదురుతిరిగి కయ్యము సేయదొడగిరి. వారిలో ముఖ్యులు (౧) పాండ్యరాజులు: మారవర్మన్ సుందరపాండ్యుడు, జటావర్మన్ సుందరపాండ్యుడు. (౨) చేది (ఇప్పటి ఉత్తర ఆర్కాడు) దేశముపై ప్రభుత్వము సేయుచుండిన కాడవ వంశజులగు పల్లవరాజులు: అటగియశీయ-కొప్పెరుంజింగడు, మహారాజసింహ=కొప్పెరుంజింగడు. (౩) కార్వేటి నగరసమీపభూముల నేలుచుండిన పల్లవ వంశజులగు సాంబువరాయలు. (౪) నెల్లూరు కడపమండలములపై, విక్రమసింహపురమును రాజధానిగ జేసుకొని, రాజ్యము సేయుచుండిన ఆంధ్రచోడరాజులు: మొదటితిక్కరాజు, రెండవమనుమసిద్ధి. వీరందరును స్వాతంత్ర్య స్థాపనమునకును, సామ్రాజ్యపదమును బొందుటకును చోళరాజుతో నిరంతరము యుద్ధము సేయుచుండిరి. ఇట్లు పోరు సామంతరాజులు తమయందు తమకు ఐకమత్యము లేక యొండొరులతో పోరజొచ్చిరి. తత్కారణమున కొందఱు చోళుని ధిక్కరించి చివ్వకు బిల్వ తక్కినవా రాతనికి బాసటగ నిల్చి పోరుచు, చోళస్థాపనాచార్యయను బిరుదును ధరింప మొదలిడిరి.

ఇంతియకాక నెల్లూరు చోడరాజ్యమునకు ఉత్తరమున కాకతీయరాజ్యము ప్రబలమగుచుండెను. మహాపరాక్రమశాలియైన గణపతి దక్షిణ దిశయందు తనరాజ్యమును విస్తరింపజేయుటకు దగిన ప్రయత్నములు సేయుచుండెను. చోళసామ్రాజ్యమునకు బశ్చిమమున కర్ణాటదేశమున హొయసళరాజ్యము ఉన్నతస్థితియందుండెను. ఈ కర్ణాట రాజులకు చోళచక్రవర్తులతో బంధుత్వమేర్పడెను. రెండవ నరసింహుని పుత్రికను మూడవరాజరాజు వివాహమాడెను. కావున దుర్బలుడైన తన యల్లుని రక్షించుటకై కర్ణాటభూపాలుడు చోళరాజ్యాంతరంగిక విషయములయందు జోక్యము గలిగించుకొనవలసివచ్చెను. కాలక్రమమున చోళరాజ్యమునందు కొన్ని మండలముల నాక్రమించుకొని, కర్ణాట రాజులు చోళదేశముననే నూతనరాజధానిని నిర్మించుకొని రాజ్యము సేయదొడగిరి.

చోళరాజ కుటుంబమున అంతఃకలహము లతిశయింప, సింహాసనమునకై చోళరాజపుత్రు లొండొరులతో బోరాడనారంభించిరి. ఈ పోరాటము మొదటి కులోత్తుంగుని నాడె యంకురించెను. మూడవ కులోత్తుంగుని సింహాసనారోహణము దాయాదులను జయించిన పిమ్మటనే జరిగినట్లు తోచుచున్నది. మూడవ రాజరాజును సింహాసనమునుండి దిగువకు లాగి మూడవరాజేంద్ర చోళుడు సింహాసనమును స్వయ మధిష్ఠించెను.

ఇది క్రీ. శ. 13 వ శతాబ్దమునందలి చోళరాజ్య పరిస్థితి. ఈ రాజకీయ వాతావరణమున రేగి చోళరాజ్య మహీరుహమును ఉజ్జట్లూపి సమూలముగ పెకలింప నుద్యమించిన ప్రభంజనుడు కొప్పెరుంజింగదేవుడు.

## ౩

క్రీ. శ ౧౩ వ శతాబ్దమందు ద్రావిడదేశమున "కొప్పెరుంజింగ" నామధారులగు రాజు లిరువురు గలరని యింతకు పూర్వము వచించియున్నాము. వీరు పితాపుత్రులు. తండ్రియొక్క సంపూర్ణ నామము అటగియశీయన్ అవనియాళప్పిరందాన్ కొప్పెరుంజింగదేవుడు.

5　12-　11　౯-3౯-

ఇతనినే కొన్ని శాసనములు "జీయమహీపతి" యని పేర్కొనుచున్నవి. ఇతని ధర్మపత్ని పేరు శీలవతి.1

ఈ రాజు నామము ప్రప్రథమమున మూడవ కులోత్తుంగుని శాసనములయందు గాన్పించుచున్నది. ఇతడు చోళసామంతులలో నొకడు. మూడవ కులోత్తుంగుని కాలముననే చోళరాజ్యముయొక్క యంత్యావస్థ యారంభమాయెనని పైన వ్రాసియున్నాము. క్రీ.శ. ౧౨౧౬వ సంవత్సరమున సత్వహీనుడగు మూడవ రాజరాజు చోళరాజ్యమునకంతటికిని పట్టాభిషిక్తుడాయెను. అది మొదలు అటగియశీయ-పెరుంజింగడు స్వతంత్రుడగుటకు దగిన ప్రయత్నములు సేయఁ దొడఁగెను. ఇతడు తనశాసనములయందు చోళ, పాండ్య, కర్ణాట రాజులను జయించితినని చెప్పుకొని యున్నాడు 2. కాలక్రమమున నితని బల మతిశయించెను. క్రీ.శ. ౧౨౨౨ లో దన ప్రభువగు మూడవ రాజరాజుపై తిరుగబడి తెళ్ళారు అనుచోట అతనిని యుద్ధమునం దోడించి, బందినిచేసి3 కొల్లడమును దాటి తంజావూరు మండలములోని . అనేకముఖ్యస్థలములను స్వాధీనము చేసుకొని యచ్చటచ్చట కోటలనుగట్టి తాను నూతనముగ నాక్రమించుకొన్న దేశమును బలపరచెను.4 ఇట్లు చోళరాజు బంధీకృతుడగుటను అతని మామయగు హొయసళరాజు రెండవనరసింహుడు డెటిగి అల్లునిచెరనుండి విముక్తుని జేయుటకై గొప్పసైన్యముతో బయలువెడలి శ్రీరంగపట్టణముపై నడిచి, దానిని స్వాధీనపరచుకొనెను 5. అటుపిమ్మట కొప్పెరుంజింగనితో నాతనికి గయ్యము సంప్రాప్తమాయెను. ఈయుద్ధమున కొప్పెరుంజింగడు పరాజితుడు కాగా, చోళరాజు చెరనుండి విడువబడి, రాజ్యమును మునుపటియట్లేల దొడగెను. పరాజితుడైన కాడవరాజు మరల చోళసామంతుడై యాతని గొలువవలసినవాడాయెను. ఇట్లెంతోకాలము గడవలేదు. క్రీ.శ. ౧౨౩౦ వ సంవత్సరమున ఇతడు చోళరాజుపై మరల తిరుగుబాటు చేసెను. సెండమంగళ6 మనుచోట జరిగినయుద్ధములో చోళరాజు మరల పరాజితుడుకాగా, కొప్పెరుంజింగడు ఆతని మంత్రులతో గూడ బంధించి రాజచిహ్నములనన్నిటిని ఒకుచుకొనెను7. కర్ణాటక నరసింహుడు ఆతని చెరనుండి విడిపించి చోళరాజ్యమున సంస్థాపనసేయ మరల దండెత్తఁలసివచ్చెను. పల్లవరాజీపరాజయముగూడ పరాజయము నందెను.8 తరువాత చిరకాలమునకే హొయసళ వీరనరసింహుడు మృతినందెను. అతనికుమారుడు "కర్ణాటసోమేశుడు" కర్ణాటరాజ్యమునకు ప్రభువాయెను.

అటగసీయునికి నెల్లూరు చోడరాజగు తిక్కరాజుతో క్రీ.శ. ౧౨౩౮ వ సంవత్సర ప్రాంతమున యుద్ధము పొసగెను. తిక్కరాజు మూడవరాజరాజునకు సాయముచేయుటకు ద్రావిడదేశమునకు బోయినట్లున్నది.

"శంభురాజాది ప్రశస్తారిమండలకము జెర్చి యేలకే కంచిపురము"9

అను నిర్వచనోత్తరరామాయణ పద్యపాద మీసందర్భమున సంస్మరణీయము. ఇందు "అరిమండలకము" అను మాటచే అనేకశత్రువులు ఏకీభవించిరని తెలియుచున్నది. ఈ "యరిమండలకము" 'ప్రశస్తము.' అందు ముఖ్యుడు సాంబువరాయడు. ఇతరశత్రువు లెవ్వరైయుందురు? కాడవపతి యొకడు, కర్ణాటసోమేశుడు మఱియొకడు, పాండ్యరాజు మూడవవాడు. తిక్కరాజునకు నీ "ప్రశస్తారి మండలకము"తో యుద్ధముపొసగుటకు గారణమును విచారించవలసి యున్నది. ఈవివయమున తిక్కనగారేమేని చెప్పుదురో చూతము:

1 Epi. Rep. of 1906, p. 64.
2 Epi. Rep. of 1923, p. 96.
3 Ibid.
4 Epi. Rep. of 1919, p. 105.
5 Epi. Rep. of 1923, p. 96.
6 Ibid.
7 Ibid.
8 Ibid.
9 Nirv. U. R.

"కమలాప్తప్రతిమాన మూర్తి యగు నా
కర్ణాట సోమేశుడు
ర్దమదోర్గర్వము రూపుమాపి నిజద
ర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళుని భూమిపై నిలిపి చో
ళస్థాపనాచార్య నా
మము దక్కంగొని తిక్కభూవిభుడు సా
మర్థ్యంబు చెల్లింపడే"[1]

మఱియు, "ద్రవిడమండలికు లందఱ దక్కగెల్చి చోడని నిజరాజ్య పీఠమున నిలిపె"[2] నని కేతన పలుకుచున్నాడు.

'కర్ణాట సోమేశు' ని 'ద్రవిడమండలికులందఱి' తో 'గెల్చు'ట 'చోడని నిజరాజ్య పీఠమున నిల్పు'టకే. తత్ఫలము 'చోళస్థాపనాచార్య' నామము దక్కకొనుటయే.

ఇందువల్ల మన మనుమానింప దగ్గది యేదనగా,—

కర్ణాట నరసింహుని మరణానంతరము, మూడవ రాజరాజరాజుపై కొప్పెరుంజింగడు, సాంబువరాయడు మొదలగు ద్రవిడమండలిక సామంతులందఱు తిరుగుబాటు చేసిరి. వీరికి నాయకుడు సాంబువరాయడు. కర్ణాట సోమేశుడు వీరిని గూడెను. తిక్కరాజు వీరినందఱిని చంపాపురముకడ జరిగిన యుద్ధమందు పరాజితులజేసి, మూడవరాజరాజును 'నిజరాజ్యమున నిలిపి' చోడస్థాపనాచార్యుడను నామమును ధరించెను. ఇంతియకాక చోళుని కొల్లప్పనను సమీపమున సంగరక్షకునివలె గాచియుండుటకేమొ కంచి నాక్రమించుకొనెను. "పాండ్యునిచేత గప్పంబు గొనియె."[3] "చేదిమండల మనుగాసిగజేసి" స్వాతంత్ర్యస్థాపనయందు నిరంతర దీక్షగొని పాటుపడుచున్న "కాడవపతిని" 'పలచమునకు' 'ఇయ్యకొలిపెను.'[4]

పలుమారు పరాజితుడగుచు వచ్చినను అటగియ సీయ-కొప్పెరుంజింగడు స్వాతంత్ర్యేచ్ఛను త్యజించలేదు. తిక్కరాజు కుమారుడగు మనుమసిద్ధితో నాతడు పోరినట్లు తోచుచున్నది. నిర్వచనోత్తరరామాయణములోని యీక్రింది పద్య మీవిషయమును సూచించుచున్నది:—

"ద్రవిడోర్వీపతిగర్వముం దునిమి శౌ
ర్యంబొప్ప గర్ణాటద
ర్పవిఘాతంబు నొనర్చి వైరి మనుజేం
ద్రశ్రేణికిం గొంగ నా
నవనిం బేర్కొనియున్న యట్టి విజయ
క్ష్మాధీశ్వరుం గాసిగా
నెవిచెం జోళనమన్మసిద్ధి యని ప్రా
యేటం బ్రగాఢోద్ధతిన్".[5]

'అటగియసీయ' లోని 'సీయ' శాసనములలో "జీయ"[6] గా పరిణామము నంది, యీపైపద్యమునందు "విజయ" శబ్దముగ మారినది. 'పటయారు' అను ఏఱొకటి కుంభకోణమునకు సమీపమున ప్రవహించుచున్నది. కొప్పెరుంజింగని రాజ్య మంతవఱకు వ్యాపించెననుట కాధారము లున్నవి[6]. మనుమసిద్ధి విజయక్ష్మానాథుని ఓడించిన 'ప్రాయేరు' అనునది యీపటయారుగ నుండునేమో!

క్రీ. శ. ౧౨౪౦ వ సంవత్సరము ప్రాంతమున చోళరాజ్యమున నంతఃకలహములు పొడసూపెను. చోళరాజకుటుంబమునకు సంబంధించిన రాజేంద్రచోళుడనువాడు మూడవరాజరాజుపై దిరుగబడి యుద్ధము సేయ దొడగెను. ఈ యుద్ధమున కర్ణాటసోమేశుడు మొదట రాజరాజుపక్షము నవలంబించి యుద్ధము జేసెను. పిమ్మట రాజేంద్రచోళుని కనుకూలుడై యాతని సింహాసనము నధిష్ఠింపజేసెను.[7] ఈసంగ్రామమున కొప్పెరుంజింగ డేపక్షమున నున్నదియు తెలియదు. ఇతడు

1 Nirv. U. R.
2 Dasakumaracharitra.
3 Ibid
4 N. U. R.
5 Ibid
6 Epi. Rep. 1906, p. 64.
7 Ibid.

క్రీ.శ. ౧౨౪౩కు పూర్వమెప్పుడో మృతినందినట్లుతోచు చున్నది. ఏలన, అతని కుమారుడు మహారాజసింహ-కొప్పెరుంజింగదేవుడు క్రీ.శ. ౧౨౪౩ లో సకలభువన చక్రవర్తి యను బిరుదును ధరించి స్వతంత్రుడగుటను జూడ చోళరాజ్యమున బొడసూపిన యంతఃకలహములు ఇతని స్వాతంత్ర్యస్థాపనకు మిక్కిలియు ననుకూలములైనట్లు తోచుచున్నది.

## రెండవకొప్పెరుంజింగరు

ఇతని సంపూర్ణనామము అవనియాళప్పిరంద-కొప్పెరుంజింగదేవుడు: దీనికి అర్థము అవని నేల బుట్టిన రాజు పెదసింగదేవుడుఅని. సంస్కృతపు శాసనములలోని "అవన్యవనోద్భవ-మహారాజసింహ"[2] యనునది దీని సాంస్కృతీకరణము. స్వాతంత్ర్యసూచకమగు-సకలభువనచక్రవర్తి యను బిరుదు ఈతని పేరునకుముందన్ని శాసనముల యందును గాన్పించుచున్నది. ఇదిగాక, క్షీరాపగా దక్షిణనాయక, పెన్నానదీనాథ, కావేరీకాముక: యను బిరుదులు ఇతనిరాజ్యముయొక్క వైశాల్యమును దెల్పుచున్నవి. కనకసభాపతి సర్వకార్య సర్వకాలనిర్వాహక, యనునది చిదంబరేశ్వరునియం దీతనికిగల భక్తిని; 'ఖడ్గమల్ల, నిశ్శంకమల్ల, వాల్ బలప్పెరుమాళ్' అనునవి యాతని పరాక్రమమును; 'భరతమల్ల' 'సాహిత్యరత్నాకర' అనునవి ఇతని పాండిత్యమును దెలుపుచున్నవి[3].

స్వతంత్రుడై క్రీ.శ. ౧౨౪౩లో రాజ్యాభిషేకము జేసికొన్నను మహారాజ సింహుడు, చిరకాలము స్వాతంత్ర్యము ననుభవింపలేదు. అచిరకాలముననే కాకతీయ ప్రతాపవాహిని కంచిపట్టణమున బ్రవహించి, చోళసామ్రాజ్యమునుండి వేర్పడి స్వతంత్రములైన రాష్ట్రములను ముంచివేసినది. అంతఃకలహములవల్ల నెల్లూరు చోడరాజులపటిమ తగ్గెను. మనుమసిద్ధి దాయాదులచే స్వరాష్ట్రమునుండి వెడలగొట్టబడెను. తిక్కన సోమయాజి ఓరుగంటి కేగి గణపతిదేవు నాశ్రయించి, ఆతనిసహాయమును బడసి, తన ప్రభువుయొక్క శత్రువులను పారదోలి, యాతని మరల సింహాసనాసీనుని జేసెనని తెల్పు గాథ యొకటికలదు. దీని నాశ్రయించుకొని పరిశోధకపండితులు మనుమసిద్ధికి సాయమునేయ దక్షిణమునకు నడచిన కాకతీయ సైన్యమల్లే కంచికి బోయి దాని నాక్రమించుకొనెనని దలచుచున్నారు. ఇది విచారణీయము.

క్రీ. శ ౧౨౫౭లోనో తత్పూర్వమో గణపతి కంచిని స్వాధీనపరచుకొన్నది నిజము 4. అప్పటికి అది నెల్లూరు చోడరాజుల స్వాధీనమున నుండియుండవలయును. మనుమసిద్ధికొరకు నెల్లూరును జయించి యాతని కిచ్చి, కంచికి బోయెననుట వాస్తవముగాదు. ఏలన, క్రీ. శ. ౧౨౫౦లో నందలూరు నందు వేయించిన శాసనములో, మనుమసిద్ధితాను "గణపతితోడి మైత్రి నార్జింప నిశ్చయించుచున్నాడ"నని చెప్పుకొనియున్నాడు. ఇంతియ కాక, తాను మూడవరాజేంద్రచోళుని సామంతుడననియు దెల్పుకొనియున్నాడు.5 క్రీ. శ ౧౨౫౦లో మనుమసిద్ధికి గణపతితో మైత్రి కుదురకున్న దత్పూర్వము క్రీ.శ.౧౨౫౭లో మైత్రి కుదిరియుంట యసంభవముగదా! కాబట్టి గణపతిదేవుని దక్షిణదండయాత్రకును మనుమసిద్ధికిని నేలాటి సంబంధమున్నట్లగపడదు. క్రీ. శ. ౧౨౫౭ ముందే మనుమసిద్ధి దాయాదనృపతులచే నెల్లూరు నుండి దరుమబడి యుండవలయును. వీరికిని, ఆమలూరు కడ తిక్కరాజు చే నిర్జింపబడిన దాయాదనృపతులకును నేదో సంబంధమున్నట్లు దోచుచున్నది. గణపతిదన శాసనములయం దాంధ్రచోడరాజులను జయించినట్లు చెప్పుకొనియున్నాడు. వీరు కందుకూరు రాజధానిగ పాకనాటినేలిన చోళరాజులుగ నుండవలయును. వీరే మనుమసిద్ధియొక్క దాయాదులుగ నుండినను నుండవచ్చును. గణపతితో మనుమసిద్ధికి మైత్రి క్రీ. శ. ౧౨౫౦ పిమ్మటనే కుదిరియుండవలయును.

ఇక కాకతీయుల దక్షిణదేశపు దండయాత్రమను గాడవరాజనుమహారాజసింహ-కొప్పెరుంజింగనికిని నేదేని

1 Epi. Rep. of 1922, p. 107.
2 Epi. Rep. of 1906, p. 64.
3 Ibid.
4 K. V. S. Iyer, Anc. Deccan, p. 285.
5 Epi. Rep. of 1908.
6 Dasakumaracharitra.

సంబంధము గలదేమో విచారింతము. ఈతడు గణపతిసైన్యములచే నిర్జితుడాయెను గణపతికి సామంతుడై కప్పముగట్టెను. ఈవాక్యము లొకవేళ విరుద్ధములుగ గాన్పించినను గాన్పించవచ్చును. అయినను, అవి వాస్తవార్థమును సూచించు చున్నవి. మహారాజసింహ కొప్పెరుంజింగడు తన శాసనములలో పాండ్యచోళ కర్ణాటాంధ్ర రాజులను జయించితినని చెప్పుకొనుటచేతను,1 ఇతనిపేరును "ఉత్తరముననే నశించునట్లు తెలుంగవారిని ఉత్తరమునకు వెడలగొట్టితినని"2 ప్రగల్భములు పల్కుటచేతను భ్రమపడి పరిశోధకులు దాక్షారామము లోని యీతనిశాసనములను ఆంధ్రరాజును ఈతడోడించినందుకు నిదర్శనములుగ గొనుచున్నారు. ఇది పొరపాటు. మహారాజసింహుడాంధ్రరాజు నోడించియుండవచ్చును. దాక్షారామశాసనములు మాత్ర మట్టివిజయమునకు సాక్షులుగావు. వీనిని బరిశీలించిన మహారాజసింహుడు గణపతి నాశ్రయించియుండిన సామంతుడనుట తెల్లమగును.

"కక్కతి...దారవిన్ద మధుకరాయమానమాననేన"3 అని మహారాజసింహుడీశాసనములలో తన్ను గూర్చి చెప్పుకొనియున్నాడు. ఈవాక్యములలోని శిథిలమైన భాగ మిట్లుండిన నుండవచ్చును: "కక్కతి [గణపతి పా] దారవిన్ద మధుకరాయమానమాననేన" అని, మఱియు శాసనాంతమున "గణపతి మహారాజస్యాజ్ఞాం ప్రవర్తయతావరాంసు చరితని"4 అని యున్నది. ఇందువల్ల మహారాజసింహుడు గణపతిదేవుని నాశ్రయించియుండిన సామంతుడనుట స్పష్టము. కాకతీయ గణపతిదేవుడు క్రీ. శ. ౧౨౬౨ లో మృతినందెను. రుద్రమదేవి ఓరుగంటి సింహాసనమున నాసంవత్సరముననే యధిష్ఠించెను. శ. ౧౧౮౫ అనగా క్రీ. శ. ౧౨౬౩ వ సంవత్సరమున మహారాజసింహుడు దాక్షారామభీమేశ్వరునికి బంగారుప్రభనిచ్చి శాసనమును5 వేయించియున్నాడు. అందుగూడ "ప్రాదాత్కాకతిభూపతేన్స..." అనియుండుటచేత రుద్రదేవి రాజ్యాభిషేకమైనపిమ్మట రెండుసంవత్సరముల పర్యంతము మహారాజసింహ కొప్పెరుంజింగడు కాకతీయులకు లొంగిన సామంతుడుగ నుండెనని యూహించుట కవకాశముకలదు.

గణపతిదేవుని మరణమునకు పూర్వమే ద్రవిడదేశమునందు కాకతీయుల ప్రభుత్వమునకు భంగము కలిగెను. మధురరాజగు మొదటిజటావర్మ సుందరపాండ్యుడు ఉద్దండుడై చోళ ద్రవిడ దేశములపై దండువెడలి యాయాదేశముల రాజులను మర్దింపజొచ్చెను ఇతడు "కంచిప్రభువగు గణపతియను మృగశాబకమునకు సింహమువంటి వాడనని"6 చెప్పికొనియున్నాడు; అనగా గణపతిని కంచినుంచి వెడలనడచి తత్పురమును స్వాధీనపరచుకొనెను. ఇట్లు కాకతీయప్రతాపమునకు భంగము కలుగగా, మహారాజసింహుడు స్వతంత్రుడుగాక కాకతీయులకు క్రీ.శ. ౧౨౬౩ వఱకు నేల సామంతుడుగా నుండెను? అను ప్రశ్నయొకటి రావచ్చును. దాని కీసమాధానమును చెప్పుచున్నాము.

జటాపాండ్యుడు యుద్ధముజేసి పరాజితులంజేసిన రాజులలో మహారాజసింహుడొక్కడు. "కాతకనృపుడను గజమునకు జ్వరము"7 వంటివాడననియు, "పల్లవరాజు భయకంపితుడగునట్లు యుద్ధము సల్పి, పుష్కలముగ ధాన్యము పండు దేశమును హేమరాసులను అనేక మత్తగజములను హయములను గొని మరల (నాతనికె) యిచ్చితి"8 ననియు ఆతడుచెప్పుకొనియున్నాడు. కావున పల్లవరాజు మహారాజసింహుడు జటాపాండ్యునికి మొదట శత్రువు, పిమ్మటమిత్రుడు. తాను గెల్చిన భూమిని, ధనమును, గజహయములను పాండ్యుడేల పల్లవరాజున కిచ్చెను? అతనితోడ మైత్రి నేలకోరెను? ఇచ్చట నేదియో రహస్య మున్నది. కాకతీయులను కంచినుండి వెడలగొట్టినదానితో దృప్తినందక పాండ్యరాజు ఆంధ్రదేశ

1 Epi. Rep of 1906, p. 60.
2 Ibid.
3 S. I. I. IV No. 1342, P.
4 Ibid.
5 S. I. I. IV No. 1341.
6 Ancient Deccan - K. V. S. Iyer, p. 165.
7 Ibid.
8 Ibid.

ముపై దండయాత్ర నేయగోరియుండును. మహాపరాక్రమశాలియు, బలసంపన్నుడును నైన కాడవరాజును దనపేరుంద విడచి యుత్తరదేశముపై దాడి వెడలుట శ్రేయస్కరముగాదని యెఱింగి యాతనిమైత్రిని గోరి యుండును. అట్టిమైత్రి గుదురునంతవఱకును కాడవనరపతి కాకతీయులకు సామంతుడుగ నటించుచు, తదనంతరము పాండ్యుని గలిసి యాంధ్రరాజ్యముపై దండు వెడలి యుండవలయును. పైజెప్పిన విషయములు నిజములగు పక్షమున జటాపాండ్యుని యాంధ్రదేశ దండయాత్ర క్రీ. శ. ౧౨౬౨ నకు పిమ్మట సాగియుండవలయును.

ఈదండయాత్రయందు దాక్షిణాత్యులకే జయము కలుగుచువచ్చెను. జటాపాండ్యుడు నెల్లూర వీరాభిషేకమును జేసుకొనెను. కాడవ పాండ్యరాజులు కృష్ణానది పర్యంతముగల భూమిని జయించినట్లు తోచుచున్నది. ఈయుద్ధసందర్భములలో నెప్పుడో పల్లవరాజు అమరావతియందలి శిలాస్తంభశాసనమును వేయించియుండునని మాయూహ. రుద్రమదేవి రాజ్యకాలమున కాడవరాజొకడు కాకతీయులకు ప్రబలశత్రుడుండెను. అతడు మనుమగండ గోపాలుని నెల్లూరునుండి వెడల నడచి అతనిరాజ్యము నాక్రమించుకొనినట్లున్నది. ఈకాడవరాయని నిర్జించి మనుమగండ గోపాలునికి విక్రమసింహపుర రాజ్యము నిచ్చితినని రుద్రమదేవి సేనానాయకులలో నొకడగు అంబదేవుడు జెప్పుకొని యున్నాడు.1 మహారాజసింహుడు కాకతీయులను గికురించెనని ఇందువల్ల స్పష్టమగుచున్నది.

తరువాత మహారాజసింహుడు స్వతంత్రముగ కొంతకాలము పర్యంతము రాజ్యముజేసి మృతినందెను.

౪

అమరావతి శిలాస్తంభశాసనమున వర్ణింపబడిన సింహవర్మవలె మహారాజసింహ=కొప్పెరుంజింగడు పల్లవ వంశజుడు. మహాసైన్యముతో నాంధ్రదేశమెల్ల సంచరించినవాడు. అనేకరాజులను జయించితిననియు వారు తనకు పాదాక్రాంతులై కొల్చిరనియు జెప్పుకొనియున్నాడు. సామంతులను, మండలికులను, గొలువ పదునెనిమిది లక్షల సైన్యముతో ఉత్తరదేశమున సంచారము నేయ బయలువెడలిన సింహవర్మయొక్క లక్షణములు మహారాజసింహునియందు గాన్పించుచున్నవి. ఇద్దరి పేర్లకును భేదము విశేషములేదు. ఒకనిపేరు సింహవర్మ; మఱియొకని పేరు పృథుసింహుడు. మహారాజసింహునిశాసనములు అమరావతికి సమీపముననుండు దాక్షారామములో గాన్పించుట; క్రీ. శ. ౧౧౧౦లో ద్రవిడాంధ్రదేశములయం దెచ్చటను బలవంతుడగు పల్లవరాజు లేకపోవుట; అమరావతి శాసనపులిపి కాకతి గణపతి శాసనముల లిపిని బోలియుంట—వీనినన్నిటిని తర్కించిచూడ అమరావతి శాసన కర్తయగు సింహవర్మయు, మహారాజసింహ-కొప్పెరుంజింగడును నొక్కపురుషుడను బుద్ధి కలుగుచున్నది.

అయినను దీనిని ఖండితముగ జెప్పుటకు వీలులేదు: ఈపై సమన్వయమునకు బలమైన యాక్షేపము లున్నవి. (౧) మహారాజసింహుడు పల్లవుడైనను తనశాసనములయం దెచ్చటను పల్లవుడనని చెప్పుకొనలేదు. అరవశాసనములలో దనది 'కాడవ' వంశమనియు, సంస్కృత శాసనములయందు 'కాకక'వంశమనియు చెప్పుకొనియున్నాడు. మహారాజసింహుడే అమరావతి శాసనకర్తయైన ఇందు మాత్రము తనది పల్లవవంశమనియు, పేరు సింహవర్మయనియు చెప్పుకొనుటకు గారణమేమి? (౨) అమరావతి శాసనపు సింహవర్మ పూర్వీకుల నామములకును, మహారాజసింహుని పూర్వీకుల నామములకును సంబంధమున్నట్లగపడదు. సింహవర్మ మహారాజసింహ యనునవి ఒక్కపురుషుని నామములైన, ఈ భేదముగలుగుటకు గతమెయ్యది? ఈయాక్షేపములకు తృప్తికరమగు సమాధానముల నీయకపోయిన నీపై సమన్వయమునకు బలము తగ్గును. ఈవ్యాసమును వ్రాయుటయందు మాయుద్దేశమేమన పరిశోధకుల దృక్పథమునకు దీనిని దెచ్చుటయే. పరిశోధకులు తమదృష్టిని ఈయమరావతి శాసనముపై సారించి, దానికిని ఇతరపల్లవ శాసనములకును గల సంబంధమును వెల్లడిపరతురని కోరుచున్నాము.

1 Anc. Deccan - K. V. S. Iyer, p. 293.

# పిలుపు

ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

అంతమే లేనట్టి రాతిరి
నంతరించిన యంధుమది వె
న్నెలల వెదజల్లెఁ; గగనము
నెలవు దప్పి చనెఁ.

పటునిదాఘచ్ఛటా భగభగ
ఘటితధారల గలిసి యమృతపు
మధురిమలు గురిసెఁ; భువనము
మాయ మైపోయెఁ.

తల్లిముద్దులచలువతరగల
వెల్లువల మరియొక్కపరి నా
మనసు మునిగిచనెఁ; వెలుగుల
గనులు మూతవడెఁ.

నీరసపుటెడదను దహించెడి
నీరవత తన నిర్మలతలో
కరగిపో నురిమెఁ పిలుపది;
కరుణ వరదలిడెఁ.

భార మెరుగని తరుమహోన్నతి
దూర మెరుగని గగననీలిమ
బిలుపు నే వింటిఁ; పిలిచిన
విశ్వమయు గంటిఁ.

---

# కాళాపహాడ్, లేక "సంఘబలి"

జయంతి వెంకటకృష్ణరావు గారు

౧

వేఁగలుల దాడి దౌర్జన్యముల నలిగి నామమాత్రావశిష్టమైయున్న పఠాను సామ్రాజ్యమున స్వతంత్రత గన్న సీమలలో వంగదేశమే మొదటిది. పృథ్వీరాజును గెలిచి మహమ్మదుఘోరీ యేనాడు ఢిల్లీలో మహమ్మదీయపాలనకుబునాదివైచెనో, ఆనాడే భక్తియారుఖిల్జీయను ఘోరీబానిస యొకడు బంగాళము నాక్రమించి దానిని కూడ తురకల యేలుబడికి దెచ్చెను. కాని, యానాటి నుండి పఠాన్‌సామ్రాజ్య మంతమగునాటివరకు నీవంగ భూమి పేరునకుమాత్రమె సామంతసీమగ నుండి, సర్వ స్వతంత్రమై విరాజిల్లుచుండెడిదని చెప్పవచ్చును. పఠాను పాదుషాల ఏలుబడి సీమలో నొక మారుమూల నుండి వారి దాసులకెల్ల వేళల నరియగుచు, నీపుడమియేలికలు నిజ స్వాతంత్ర్యేచ్ఛను అంతఃకలహముల పెంపొందజేయదను మతద్వేషాది అసహనచర్యలకు నెట్టుకొనక, పాలితప్రజల సమదృష్టి నాదరించుచు మన్నించుచుండిరి. ఈ తురక ప్రభువుల కొలువున పరమఛాందసులగు హైందవులు కూడ నున్నతోద్యోగముల జేయుచు ఖ్యాతిగడించుచుండిరి. అట్టి మహోత్కృష్టపదవులలో నొక్కటగు సర్వసేనాధిపత్యమునసె మన కథానాయకుని తండ్రి నయనచంద్రరాయలు తన జీవితమును గడపెను.

నేటి రాజసాహి జిల్లాలోని బిరాజయా యను గ్రామమున నయనచంద్రుడు జగదానందరాయుడను శివభక్తుని కడుపునబుట్టి, భక్తిశ్రద్ధల బెరిగి పేర్వడసి లక్నావతి లేక గౌరునాబరగు నాటి రాజధాని పాలకుడను సులైమానుని కొల్వున ప్రవేశించెను. అతడు తన బుద్ధిచాతుర్యములచే నాప్రభువు ననుగ్రహమునకు బాత్రుడై, సర్వసేనాధిపతియై, యకాలమృత్యువాత బడినంతనె యెల్లర మనంబులకు వెలితి గలిగించినవాడయ్యె. అతని నిర్యాణకాలమునకు కాలచంద్రుడు బాలుడై యుండెను. "రాజు" అను ముద్దుపేర తలిదండ్రుల లాలనకు పాత్రుడైన యీచిన్నికందు కాలచంద్రుడే తలిదండ్రుల యేక సంతానము. అన్నెము పున్నె మెరుంగక, తనకు గలిగిన మహాపదనైన గ్రహింపదగు జ్ఞానములేకయున్న యాబాలునితల్లితోగూడ మాతామహుడు తన యింటికి గొంపోయెను.

నానాటికి పెరిగి పెద్దయగుచు గాలచంద్రుడు తాతగారింటనె విద్యలనెల్ల నేర్చి సరివారల మెప్పు వడయుచుండెను. పరమవైష్ణవుడును, భక్తుడునగు తాత క్రమశిక్షను "రాజు" దైవారాధన విధుల నేర్చి సంస్కృత మెరుగకుండినను, పూజార్హశ్లోకమంత్రోచ్చారణ లలవరచుకొనియెను. మాతృభాషయగు బంగాళీయును, రాజభాషయగు పెర్షియనును చదువను, వ్రాయను నేర్చుకొనెను. అట్టితండ్రికొడుకు సాము గరిడీల నారితేరి మెప్పొందెనని వేరే వ్రాయనేల? పల్లెటూరి పంతులయొద్దిని పాఠములనేర్చిన నేర్పరి, పంచాంగము జూచి గ్రహతారల గమనికలు గుణించి తత్ఫలము జెప్పగలిగెనని యెరుకపరచ వలయునా? స్ఫురద్రూపియు, సుశిక్షితుడును, ధీశాలియు, ఆజానుబాహుండును, ఔదార్యశీలుడునగు కాలచంద్రుడు సహపాఠులలోన జుక్కల మధ్య చంద్రునట్లే చూపట్టెనట. అట్టి దిన దిన ప్రవర్ధమానుని అల్లునిగ జేసుకొనుటే మహాభాగ్యమని తలచి రాధామోహనుడను ఆపురమందలి సంపన్నగృహస్థు డొకడు తన కుమార్తెల నిర్వుర నిచ్చి కాలచంద్రునకు వివాహము జేసెను. "రాజు" మరిరెండేండ్లు తాతగారింటనే భార్యలతోగూడ నుండి, తదుపరి ఒక్కరిపై నింక నాధారపడియుంట భావ్యము కాదని తలచి తల్లితోగూడ లక్నావతియందలి నిజగృహమున కేగెను. సుల్తాన్ సులైమాన్ కాలచంద్రు నుచితరీతి మన్నించి, తనకొలువున జేర్చుకొనెను. "పాప మీనాటికి రాయలింట దీపముబెట్టు గౌరవము నిలబెట్ట దగువాడు కలిగె" నని నల్వురనుకొన మరల వీలయ్యెను.

నిర్భాగ్యుడగు కాలచంద్రుని చెట్టివ్రాతయో కాని, యామాత్రపుసిరియు, శాంతియుగూడ నాపాపపువిధికి

కనుపట్టినట్టయ్యె. నిత్యకర్మనిరతుడగు నా యువకుడు కొల్వుకూటమును వీడి యేనాడును ద్విజార్హ కర్మల జేయ మఱువకుండెను. అతడు కాల్యకృత్యముల దీర్చుకొని గంగాస్నాన మొనరించుకొని, శుచియై, రాజప్రాసాదపరిసరమార్గమున వచ్చుచుండ నొకనాడు రాజకుమారియగు "దలాల్ బీబి" కంటబడెను. అవివాహితయు, నవయౌవనవిలాసవతియునగు నా రాకొమరిత యతనిగాంచి మోహపరవశయై, తనదాసీజనములనుండి యతని వృత్తాంతమెరిగి, నిజేచ్ఛను తలిదండ్రులు గ్రహించునట్లు చేసెను. సులయిమానదివిని కాలచంద్రుని పిలిపించి తనకల్లుని గమ్మని చెప్పెను కాని పరమనైష్ఠికుడగు "రాజు"న కిట్టి సంబంధము నచ్చుటెట్లు? నయమునను, భయమునను గూడ నాద్విజుని మొగ్గింప వీలు గానక సులైమా నలిగి తనయాజ్ఞ నిట్లు ధిక్కరించు కాలచంద్రుని కొరతవేయ నాజ్ఞాపించెను. ఆ బాల్యపరిచితాచార విరుద్ధమగు కార్యమున కొడంబడుటకన్న ప్రాణము లర్పించుట యెక్కువ కాదని తలంచి నిశ్చింతగ రాజాజ్ఞ శిరసావహించి కాలచంద్రు డారాత్రి చెర కేగి మరునా డుసురు లుడుగ నుండెను. దలాల్ దావలచిన వా డింతటిధీరు డని విని, యట్టి మహామహునితో నాకొరతనె తానుగూడ చనుసిన ధన్య నగుదునని భావించి మరునా డుదయముననె వధ్యభూమికి దానును బోయి తన నిశ్చయమును దలారులకు దెలిపెను. రాజకుమారి యద్వితీయలావణ్యము, ననివార్యప్రేమమును, త్యాగశీల్యమును గాంచి కాలచంద్రుని మనసు కరగి, యామెను పరిణయమాడ నొప్పుకొనెను. సుల్తాను ఆనందమునకు మేర లేకుండెను. తాను మహమ్మదీయ మతమును స్వీకరింపకయే కాలచంద్రుడు దలాల్ కుమారి పాణిని గ్రహించెను. కాని తురకబిడ్డను బెండ్లాడిన యాయువకు నెవ్వరును దరిజేర నీయకుండిరి. రాజాగ్రహమునకు బాత్రుడై వధ్యసీమకేగునాడు రహస్యముననైన కంట తడిపెట్టిన వ్యక్తులే నేడాతని ననరాని మాటలాడి, పడరాని పాట్ల బెట్ట మొదలిడిరి. సంఘదూరుడై వెలిబెట్టబడిన కాలచంద్రునికి రాజానుగ్రహ ముండియు జీవయాత్ర గడపుట దుర్భరమయ్యెను. "ఓశమ్మ, ఓశక్క" యను అమ్మలక్కల గుసగుసలకు, కుమిలి కుళ్లెడు తల్లి కన్నీటి కాల్వలకు తాళలేక, కాలచంద్రుడు నియమితప్రాయశ్చిత్తములకు లొంగియు, వలయు నన్నివిధులకు తలయొగ్గియు, సంఘాదరణపాత్రుడు కాలేకపోయెను. ఏరీతినిసంఘము తన్ననుగ్రహించుమార్గము గానక దీనబంధుడగు జగన్నాధుడే శరణ్యమని యెంచి అతడు పూరీక్షేత్రమున కేగి, యట నాదేవు నారాధింప దలంచెను. అచటి పూజారులు పులకళంకితుడని యాతని నటనుండి వెడలదరిమి, నాడు ప్రఖ్యాత హిందూ సార్వభౌముడని వన్నెకెక్కిన ముకుందదేవ గజపతి పండితసభామధ్యమున నీకు దగురీతి సహాయము దొరకునని తెల్పిరి.

ఆద్విజుడు కటకపురిని సార్వభౌమదర్శనభాగ్యమబ్బని కారణమున హతాశుడై, వానికై హుగ్లీతీరమున కేగి, యచ్చటను తిరస్కృతుడయ్యెను. భగ్నమనోరథుడగు కాలచంద్రున కింకేదియు దోపక పట్టరానంత కోపమువచ్చి, తన్నింతగా వేధించుసంఘమును, దాని పూజలందుకొనువేల్పులను రూపుమాపి కసిదీర్చుకొన వలయు ననెడికోర్కె పుట్టె అతడు అందులకు తగు యత్నము సేయుసమకట్టెను. నందులు పరిభవింప కసిదీర్చుకొన నాడు చాణక్యుడు ప్రతినపట్టినయట్లు నేడు కాలచంద్రుడును హైందవసంఘ విధ్వంసమునకు దృఢసంకల్పు డయ్యెను.

## 3

బలాధికార సమన్వితుండును, కోరి కూతు నిచ్చి యుచితరీతి గారవించినవాడును, తనకేలికయు నగు సుల్తాను సులయిమాను ఇప్పట్ల నీక్రోధమయహృదయునకు ఏకమాత్రశరణ్యముగ గన్పట్టెను. అంతేకాదు. కసిదీర్చుకొని తన పరితప్త హృదయానలమును జల్లార్చుకొనుటకు స్వమతమారుడగు సుల్తాన్ ఎల్లవిధముల దగినవాడని యతనికి తోచెను. ద్వేషపూరితమానసమున కాయేలికమత మెంతయు రుచించెను. రాజ్యమేలు రాకొమరిత కేమత మంతగా ప్రేమాంజలిగ త్యాగబుద్ధి బుట్టించెనో, యేమతమర్యాదను సామంతులును, సామాన్యులునుగూడ నంతగా కలసిమెలసి యుండుటకు వీలయ్యెనో, ఏమతావలంబులలో నొకని యాధిక్యము నిం

కొకని యుదాసీనతయు తన కేమాత్రము గానరాకుం డెనో అట్టి ముసల్మానుమతమే కాలచంద్రున కప్పట్టున పరమావలంబనీయముగ దోచె.

అప్పటి స్థితిని సంశయించుటకును, వేరొండురీతి వర్తించుటకును కాలచంద్రునికి సమయమా ? లక్నావతికి చేరినంతనె యాదృఢసంకల్పుడు రాచనగరు కేగి తన నిశ్చితాభిప్రాయమును సుల్తానున కెరింగించెను. సులయిమాన్ అల్లునిలోనిమార్పు గని పరమానందభరితు డయ్యెను. స్వమతమున నుచితరీతిని జేరిన జామాతకు అతడు వలయు సైన్యసహాయము నిచ్చి, విజయుడై రా నాశీర్వదించి, అతనిని ఉత్కళాక్రమణమున కంపెను. అల్లునికోర్కె జెల్లించుటయు, ప్రఖ్యాతశత్రుదేశము నాక్రమించుటయు దలవనితలంపుగ లభింప నెవ్వడు మురియకుండును!

౪

గంగాతీరమున స్వీయనామాంకిత ఘట్టనిర్మాణ నియుక్తుడై యుత్కళసామ్రాజ్య నేత శ్రీముకుంద దేవ గజపతి ప్రమత్తుడుగ నుండెను. గంగాగోదావరీ మధ్యస్థమగు తనరాజ్యమును నిజపరాక్రమమున నెంతయు విస్తరింపజేసి శత్రుభీకరు డనుఖ్యాతిగడించిన యాహిందూప్రభువు, మొగలు తైమూరుదాడిని నలిగియున్న యుత్తర సీమలనుండి యి ట్లురుములేని పిడుగు అనతికాలముననె తనపై బడునని యెట్లు దలంచియుండును ! పటిమ చెడి పఠానుసామ్రాజ్యము భగ్నమగుటచే.సామంతసీమలు నిజ స్వతంత్రతాస్థాపనకు గృషిసలుపుచు నొండొంటితో గలహించుచుండ,నవి తన్ను బోలిన బలవంతునితో గయ్యమునకు కాలుదువ్వునని యాతడు కలనైన నూహింపలేదు. కాని తన రాజ్యసీమనె సంఘనిరాదరణ మనువేడిమిని నావిర్భవించిన యొకద్విజవిద్వేష మేఘము, హుగ్లీ నదీ తటమునందలి తన విడిదిలోని పండితమాన్యుల తిరస్కారణమున చెదరిపోయియు 'గౌడ' రాజాదరణను బలయుతమై యొక్కుమ్మడి తిరిగి క్రిందికి దిగి తనను, దనరాజ్యమునుకూడ ముంచియెత్తి తుడుచుకొని పోవునని అతడు కల గను టెట్లు !

రాజు లేనికటకపురిరాణిచే నెన్నియోదినములు కాపాడబడియు, తుదకు కాలచంద్రునికి కరగతమయ్యెను. కసి తప్ప అన్య మెరుంగని యాకరకుమానిసి విధి విరామము లేక గజపతుల రాచనగరును పీనుగులపెంటగ జేసి విడిచెను. అనాయాసముగ నింతటి జయము గలిగిననెమ్మ సంతసమున నాతురక సైనికు లుత్సాహపూరితులై రాజ్యమెల్ల కొల్లగొట్టుచు విజృంభించిరి. తా బడిన చిత్తసంక్షోభమున మొరడువారిన కాలచంద్రుని హృదయమున దయాదాక్షిణ్యముల కిచ్చోటను దావు లేకుండెను. వయోలింగభేదముల బాటింపకయె చేజిక్కిన యాహిందూసామ్రాజ్య ప్రజనెల్ల నాసేనాధిపుడును, సైనికులును కత్తుల కెరజేసినైచిరి. పంటభూముల పెంటకుప్పలుగ జేసినైచిరి. కలకలలాడు జనపదముల మలమలమాడు మంటల బెట్టినైచిరి. వేయేల ? తైమూరుదోపిడివెనుక పాంచాలమైన కొంత విశ్రాంతి నొందగానికాలచంద్రుని దాడి తరువాత నుత్కళము మరి యూపిరుకొనలే దందురు. ఆతనిచర్యల జూచినవా రెవ్వరును కాలచంద్రుని "కాళాపహాడ్" అని తప్ప వేరొండుపేర బిలిచి యెరుంగరట! సాధారణముగ ఘోరకృత్యములకు వెనుదీయని ఆతని సైనికులే యొక్కొక్కతరి ఆతని సంహారకార్యమును జూచి నిశ్చేష్టులై యిట్టిఘోరములకు వెనుదీయని యీతడును మానవుడేనా ? యని సంశయించుచుండిరి.

కటకపురితోడ శ్రీ జగన్నాథుని యాలయమును, కోణార్కమును, భువనేశ్వరుని కోవెలయు మొదలుగాగల ఎన్నియో దివ్యక్షేత్రములు కాళాపహాడుకసి కాహుతి యయ్యెను. మహాక్షేత్రముల యర్చకులే యాతని కోపానలమున కింధనము లైరి. క్షేత్రనేతల యాలయములే యాతని ద్వేషాగ్నిని వధ్యమందిరములుగ మారె!అనేకపురుషాంతరములనుండి పూజలందెడి మహాసాలగ్రామములె యాతని మూత్రవిసర్జన పాత్రను మురుగవలసివచ్చె.ఏమని వ్రాయను ! . చాలింతయావు కడుపు కోసి యాచర్మముతో మూయబడిన యాతని రణభేరి మ్రోత విని, భయమున శ్రీజగన్నాథుడే పర్వులిడి వచ్చి యాతగడ జమీందారిలో ఉన్న మధురాగ్రామములో దలదాచుకొనెనని చెప్పుదురు. నేటికిని ఈమధురలో

నున్న దేవళమున మూడుశూన్యాసనములపై శ్రీజగన్నాథమునందుబోలె భోగరాగాములు జరుపుదురు. కాళాపహాడ్ పోయినదాక అట విడిసియుండి పిమ్మట నామూర్తులు పూరీ వేంచేసినవని చెప్పుదురు.

ఆనాటి తల్లులు తమపిల్లలను కాళాపహాడ్ కిచ్చెద మని చెప్పి నిద్రపుచ్చెడివారట! ఎంతటి ధీరులును ఆపేరు వినినంతనె గడగడ వణకుచు తలదాచుకొనన నేయడవుల కైన పరువెత్తిపోయెడివారట! ఆపేరుపెట్టుకొని ఎంత యోకాలము దుర్మార్గులు తమదౌర్జన్యములనెల్ల నిర్భీతిని అడ్డులేక జరిపిరట.

ఇట్లు వీరవిహార మొనరించుచు దనసీమ నెల్ల ధ్వంస మొనరించుచున్న కాళాపహాడు నెదుర్కొని ముకుంద దేవుడును రణనిహతుడయ్యె. ఇప్పటి కాదేశాక్రమణము పూర్తియయ్యెనని తలచి 'గౌడ' సేనాని గృహోన్ముఖు డయ్యెను. త్రోవపొడుగునను నీహిందూమత ధూమకేతువున కేదియు బచ్చగనుంట నచ్చినది కాదు. కాని, చిన్నతనమున దన్నుదెచ్చి మాతామహుడు పెంచి పెద్దచేసిన యాపల్లెలోమాత్ర మాతని సంహార కార్యమునకు ఒక యాటంకము వచ్చెను. తానన్యమతావలంబు డైపోయిననా డతని తల్లిని, భార్యలను మొదటి మామగారగు రాధామోహనుడు గొనివచ్చి తనయింట బెంచుచుండెను.

నే డాతని విధ్వంసవాంఛ కాగ్రామమున నంత రాయము గలిగించిన దతనిమాతృమూర్తియే. కొమరుని రుద్రమూర్తిని గని శోకావిలమానసయై కన్నీరు మున్నీరుగా నేడ్చుచు, నెదురుపడు తల్లిని గనినంతనె కాళాపహాడు స్తంభించిపోయెను. చేవ్ర లుడిగిన యాతనిరాతి గుండె నింక నెట్టి సరళత్వ ముండెనోకాని, వేడినిట్టూర్పు విడిచి, 'రాజు' అపల్లెపై నేరను చేయిజేసికొనవద్దని కఠినముగా జెప్పి తిన్నగా లక్నావతికి మరలెను.

యుద్ధపుబడిలిక వదలినపిదప మాట్లాడవచ్చునని సులైమాన్ అల్లుని విశ్రాంతికి భంగము గావింపలేదు. కాళాపహాడు విశ్రాంతి యెట్టిదోకాని, ఆహర్నిశము లాహారనిద్రలసైన తిన్నగ గానక, అనతికాలముననె యాతడు తూర్పుననున్న హిందూరాజ్యములగు అస్సాము (కామరూపము) మొదలగు వాటిపై 'దాడి'వెడల సుల్తాను ననుజ్ఞ వేడెను. ఎంత బ్రతిమాలినను వినబోల్లని కాళాపహాడునకు కాదననేరక, సుల్తాను తన సమ్మతి నిచ్చెను.

❧

నాడు సైమూరుచే విధ్వంస మొనరింపబడగా మిగిలియున్న పఠానుసామ్రాజ్యమును బలాలు లోడీ యను నాత డేలుచు నెట్లైన మరల గోల్పోయిన ప్రతిష్ఠ నార్జింపభగీరథయత్నములజేయుచుండెను. మాళవ, ఘూర్జరములతోపాటు జానుపుర, బంగాళములుకూడ స్వతంత్రసీమలై యుండుటంజేసియు, దనకు రావలసినకప్పములు రాకుండుటంజేసియు, బాదుషా సమీపమున నున్న జానుపురపాలకుని లొంగదీయ యత్నించు చుండెను. జానుపుర పాలకుడగు బరబక్షా డిల్లీదాడుల నెదిరించుచు గాచుకొనుచుండెను. కాశీ, ప్రయాగ, అయోధ్య మొదలగు ప్రఖ్యాత హిందూక్షేత్రము లెన్నియో గల జానుపుర రాజ్య మెప్పటికైన హిందూమత విద్వేషియు, అప్రతిహత శౌర్యరాశియు నగు కాళాపహాడుని కంట బడక తప్పదని బరబక్షా గ్రహించెను. ఆవల డిల్లీకి తోడుగ నీవల లక్నావతియు దనపై గత్తికట్టిన మనుట కష్టమని యాతడు తలచెను. కాన నతను యుక్తియుక్తముగ కాళాపహాడునకు డిల్లీ సార్వభౌముడు తన చేతగానితన మున ముసల్మాన్ద్వేషులగు హిందువులకు నెంతయు ననుకూలుడుగ నుండెనినయు, నట్టివాని దండించి యర్హుడగు వాని డిల్లీ సామ్రాజ్యసింహాపీఠినభిషేకించుటధర్మమనియు, ముసల్మానుల గౌరవప్రతిష్ఠల గాపాడుట తన యట్టి ధీరునకు దగినపనియనియు కబురంపెను! బరబక్షాయాహ్వానము నాలకించి కాళాపహాడు జాన్పురమునకు బయనమయ్యెను.

ఈసమాచార మెరిగి బలాల్ లోడీ, కాళాపహాడును జాన్పుర మేగి బరబక్షాను ఎట్లయిన కలియకుండ జేసి, త్రోవ గాచి వానిని డిల్లీకి దొడ్కొనిరా నిపుణుడగు తన మంత్రి సయ్యదనువానికి వేయిసైనికుల నిచ్చి

పంపెను. చతురమతియగు సయ్యదు నదీతీరమున కాళాపహాడు రాకకై వేచి, యాతడు వచ్చు పడవలు జాన్పుర ప్రాంతము చేరకుండగనె సమీపించి తానె బరబక్షు పంపిన దూతనని తెలిపి, కాళాపహాడునకు రహస్యముగ "ఢిల్లీ సేన లసంఖ్యాకములుగ వచ్చి త్రోవగాచి యున్న వనియెరిగి, బరబక్ మిమ్ము పదిమంది సైనికులతోడ నాపడవల విడిచి నాటుబాట పల్లకిలో రమ్మనుమని వేడ బంపె".నని చెప్పెను. కాళాపహాడున కింతటి వెరపొందవలసిన యవసర మంతగ గానరాకున్నను, బరబక్షుకోర్కె నేల తీర్పరాదని అతనికి తోచెను. కాని యాడుదానివలె నతడు పల్లకినెక్కి పోవుటకు సమ్మతింపక నమ్మినబంట్లు పదిమందితోడ నశ్వారూఢుడై సయ్యదు ననుసరించెను. ఆతనికిగాని, యాతని 'గౌడ'యోధులకు గాని యామంత్రి గొంపోయెడి త్రోవయే తెలియదయ్యెను. మైత్రి వాంఛించు బహలాలులోడీ చేయు సన్మానములవలనను, అతనిమంత్రి సంభావణముల వలనను ఈవంగసేనానికి పఠానుల ద్రోహము గ్రహింప నిసుమంతయు వీలు కలుగదయ్యె. సయ్యదు చేయు సపర్యల సంతృప్తుడైన కాళాపహాడు ఢిల్లీ జేరి నిజ మెరిగినపిమ్మట బాదుషా చేసిన ద్రోహమున కతని నిందింప సాహసింపకుండెను. సామ్రాజ్యనేతయగు లోడీయు కాళాపహాడునకు నిందింప నవకాశ మీయక, ప్రఖ్యాతయశస్కుడగు నాతనిం దనకొమరిత వలచియున్న కారణమున నిట్లు మోసగించితిననియు, క్షమించి మన్నించ వలయుననియు జెప్ప నాతడు మారు మాటాడలేకుండెను.

పెండ్లికుమారుడై సమ్రాట్టునన్నల నందుచు మనుసుడుపు లారగించుచు గూర్చుండుటకు కాళాపహాడునకు మనము నిలుచు టెట్లు? తన్నంతగ పరాభవించిన హిందూసంఘ మింక నంతగ మిగిలి ప్రబలుచుండ నా క్రోధమూర్తి మానసమునకు శాంతి చేకూరు టెట్లు?

కాళాపహాడునకు విశ్రాంతిగొన వాంఛ గలిగినను, జాన్పుర విధ్వంసవాంఛను తన కొమార్తె నాతనికిచ్చి పెండ్లి చేసిన బహ్లోల్లోడీ మిన్నకుండు టెట్లు? జాన్పురపాలకాదరణమున హాయిగనున్న హిందూమహాక్షేత్రములపై కాళాపహాడుని దృష్టి మరల్చుటకు ఢిల్లీ రాజ్యాంగవేత్తలకంత కష్ట మనిపింపలేదు. సామ్రాజ్య సేనావాహినికధినేతయై సార్వభౌముని జామాత మరల దనమారణక్రియలపు మొదలిడెను. ఉత్కళ సంహారమూర్తి కామరూపాదిసీమల వైభవము మట్టిలో కలిపిన పదాఘాతమున నార్యావర్తమున గల హిందూజాతి కొల్ల నంత్యకాల మాసన్నమైనటుల తోచెను. తానొకటి దలప దైవ మొకటి చేసెనే యని విలపించుచు బరబక్షు యుద్ధభూమిని ప్రాణము లర్పించెను. గయ, ప్రయాగ, అయోధ్య మొదలగు గాగల ప్రఖ్యాతపావనభూముల దగులబెట్టి కాళాపహాడు కాశీ కేగెను. అట నాతని సైనికులు విచ్చలవిడి చెలరేగి ఆబాలగోపాల మెల్లర మానప్రాణముల గొనజొచ్చిరి. కాళాపహాడు అటగల దివ్యాలయము లనేకముల జొచ్చి, లోని విగ్రహములనెల్ల ధ్వంసమొనరించి, తుట్టతుదకు విశ్వేశ్వరు నాలయమున జొర నుంకించెను. కాని యాయాలయద్వారము చెంగటి కేగుసరికి నొకస్త్రీవ్యక్తి "ఆకులకళంకు డేడీ? ఆకులపాంసను డేడీ?" యని గద్దించుచు,నండతాడితభుజంగంబువోలె రోజుచు రివ్వున వచ్చి యాతని వామహస్తముబట్టి నిలువబెట్టి, వలయునంతగ దిట్టి, "నన్ను గుర్తించితివే? నీనాడు నాయన్న కడుపు చెరప బుట్టితివో యానాడే యింతటి చండాలుడ వౌదువని యెరింగిన, అల్లారుముద్దుగ బెంచి లాలించిన నా యీచేతులనె నీ యసువుల గొనియుందును. హీన గండైనది. కులప్రదీపకుడవని యెంచి పెంచిననీవు కులకళంకుడవైతి వేమిరా? నీతండ్రితో బుట్టి హతభాగినినై శ్రీవిశ్వేశ్వరు సేవించుచు నీరీతి గాలము గడపనెంచిన నన్నీదివ్యక్షేత్రమునగూడ పడియుండనీక, నీరాకాసిమూకలు పరిభవింప గంగగర్భము జొచ్చి యాత్మహత్య జేసుకొన జూడవచ్చిన ప్రతాపవంతుడవు: ఇకనైన సంతసించు! హూతుల నిచ్చి నీచే నిచ్చ వచ్చిన దాస్యము జేయించుకొని యింట గూర్చుండి గనియు మామలపు ఇకబోయి నీప్రతాపవిశేషములు నచ్చ జెప్పు. తురకబూబుల సాంగత్యమునకై మాతాపితరుల మతమర్యాదలను మంటబెట్టిన మానహీనుని మహమ్మదీయస్వర్గమైన నెట్లు చేరరానిచ్చు ననుకొనుచుంటివి? పొమ్ము! పాపీ! పొమ్ము!!" అనుచు, నిశ్చేష్టుడై స్తంభించి యట్టె

చూచుచున్న కాళాపహాడును వదలి వడివడిబోయి గంగా నదీగర్భమున జొచ్చెను. అప్పటికి నా సేనాధిపుడు తేరుకొనలేదు. ఆ విశ్వేశ్వరాలయద్వారసన్నిధిని కొయ్యబొమ్మవలె నిలిచి నిలిచి, తన్నట్లు మందలించి పోయిన రోషాయతనేత్రజాడనే చూచిచూచి, ధైరును వెరచి తన్ను చేరరాని కారణమున గొంతవడికి దనకు దానె తెప్పిరిల్లి, కాళాపహాడు మారుమాటాడకుండ దన విడిదిగుడారమున కేగి తెర వైచుకొనెను.

## ౬

మరునా డుదయమున సేవకు డెట్టకేలకు సాహసించి గుడారములోని కేగ, కాళాపహాడు మరిగాన రాడయ్యె; ఏమయ్యెనో ఆకాలమూర్తికే యెరుక! లోడీరాకుమారి గర్భమున గలిగిన ఫాతిమా తప్ప వేరెట్టి సంతానమును బడయకయె కాళాపహాడు అంతర్ధాన మయ్యెను. సమ్రాట్టుని రాజనీతియొ, కాశీదేవాలయార్చకుల నైపుణ్యమో, లేక మేనత్తమందలింపువేడిమియొ, యాతని కథావశేషుని జేసెను.

---

# పా రి జా త ము

చిర్రావూరు కామేశ్వరరావు గారు

తరుణశాఖాగ్రమునఁ జక్కఁదనము లొలుకు
 పరమసుకుమార నాట్యసుందరివి నీవు
పారిజాతమా! సౌందర్యభాగ్య మెల్లఁ
జూఱఁగొంటివి, నినువంటి చోద్య మేది?

వలపు ప్రసరించి వెన్నెలతళుకునందుఁ
గలికితన మొల్కు నీ సోయగము నుతింపఁ
బలుకునేరుపు నా కలవడఁగ లేదు:—
భరతశాస్త్రము నీ కేరు గఱపినారు?

పరమనిశ్శబ్దసంగీత వరము నీ కె
వఁడు ప్రసాదించె?—ఎంతటి భాగ్యవతివి!

మలయమారుత వీచిక లొలయునపుడు
తెల్లనవ్వులమో మటు ద్రిప్పి, చంద్ర
కాంతిలో డాఁగి యిసుమంత గానఁబడవు!
నీవు తెచ్చిన దివ్యసందేశ మేమి?
అవధి లేదె, మనోహరమైన నీవి
లాస విన్యాస యుత మృదుహాసమునకు?—

బేల! ఈ పరమానందలీల లెల్ల
అంతరించిపోవు నని నీయాత్మ కెఱుక
లేదె?—తెల్లవాఱినయంత లెక్క లేని
చక్కఁదనములు ధూళిధూసరితము లగు!

---

# ఇంద్రవర్మ తామ్రశాసనమా?

రాళ్లబండి సుబ్బారావుగారు, యం. ఏ., యల్. టి.

కడచిన అపాఢమాసపు భారతిలో "అనంతవర్మ కుమారుడు ఇంద్రవర్మయొక్క తామ్రశాసనము" అనుపేరట వ్యాసమొకటి ప్రకటింపబడినది. ఈశాసనపు ప్రతిబింబములను గడచిన సం. డిశంబరునెలలో టెక్కలిజమీందారుగారగు శ్రీ యల్. యన్. దేవుగారు నాకు పంపి దాని పాఠములను వారికి పంపగోరిరి. అట్లే చేసితిని. తర్వాత పర్లాకిమిడి నివాసులగు సత్యనారాయణరాజ గురువుగారు "నందవర్మ సాంతో బొంవాలి తామ్రశాసనము" అనుపేరిట ఇదే శాసనపు ప్రతిబింబములను, పాఠములను వ్రాసి పంపి, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలివారి ఆంగ్లత్రైమాసికపత్రికయందు ప్రకటింప కోరిరి. అట్లే అవి ప్రకటింపబడినవి. * ఆపాఢ మాసపు భారతియందు నాపాఠములను తెలుగున ప్రకటింప యత్నించితిని. కాని వీలు లేకపోయెను. అయినను శ్రీరాజావారే ఆ శాసనమును ప్రకటింపగా జదివితిని. అనేక విషయములందు మాకు అభిప్రాయభేదము లుండుటచేతను, శాసనపు ప్రతిబింబములందలి విషయములును, ప్రకటింపబడిన పాఠములును అనేకచోట్ల సరిగాకపోవుటచేతను తిరిగి నా వ్యాసములోని కొంతభాగమును ప్రకటించి నా పాఠములను, నాకును, శ్రీ రాజావారికిని గల అభిప్రాయభేదములను ఈక్రింద పొందుపరచుచున్నాడను. ఈ శాసనముయొక్క ఆకారాదివిషయములు, లిపి, భాష మొదలగువానిని గురించి తిరిగి వ్రాయ నక్కరలేదు. కాని శాసనమునందలి భాషనుగురించి కొన్నివిషయములు మాత్రము వ్రాసెదను.

చిట్టచివరనున్న రెండువ్యాసగీతములు తప్ప, మిగిలిన శాసనమంతయు గద్యరూపమున నున్నది. 'ల' కారమునకున్ను, 'ళ' కారమునకున్ను తేడా లేదు. ప్రస్తుతము మనము అనుస్వార ముపయోగించు నెడల శాసనమునందు అనునాసిక మే లిఖింపబడినది. ఇందులకు ఉదాహరణములు:—కళిఙ్గ, మహేన్ద్రి, శశాఙ్క, కలఙ్కో, తరఙ్గ, మఞ్జరీ, పుఞ్జ, రఞ్జిత, శ్రీమానన్దవర్మ.— మరియు "సంవత్సర" అని వ్రాయుటకు బదులుగా శాసనమునందు "సంవచ్ఛర" అని ప్రాకృతపదము వాడబడినది. "వ" "బ" లకు భేదము లేకుండుటయు, ఉండవలసినచోట్ల అనుస్వారముగాని, విసర్గగాని, సంధిగాని యుండకపోవుటయు ఈశాసనపుభాషయం దితర విశేషములు.

## శాసనవృత్తాంతము

ఈశాసనము పూర్వగాంగవంశజుడును, శ్రీ అనంతవర్మసూనుడును అగు శ్రీమానన్దవర్మ మహారాజుదై యున్నది. పూర్వగాంగవంశపు రాజుల బిరుదములన్నియు ఇందునూ గలవు. ఈరాజు తన పరిపాలనమునందున్న "చిఖల్లిక" గ్రామనివాసులగు భోగిక (ఆదాయపుపన్ను వసూలు చేసేవారు) వాఇకి (నీటితీరువా వసూలుచేసేవారు) ప్రముఖులనందరిని సమకూర్చి కుటుంబినులను (వ్యవసాయదారులను) ఆజ్ఞాపించుట ఏమనగా:—"మీకు తెలియబడుగాక! శ్రీమానన్దవర్మనైన మేము ఈ(చిఖల్లిక) గ్రామమునందు సూర్యగ్రహణకాలమందు (మా) పుణ్యాభివృద్ధికొరకు రాజపుత్రుడైన 'ఖాలి' అను పేరుగలవాని (సమక్షమున) 'భూపత్తకః' నివేశనసహితముగను, కౌండిన్యస గోత్రులున్ను, బ్రాహ్మణులున్ను అగు ఆదిత్యశర్మ, మాతృశర్మ, దుర్గశర్మలకు సర్వవిధములైన పన్నులు, ఇతర ఆటంకములు తప్పించి ఆచంద్రార్క స్థాయిగా ఇవ్వబడినది."

* ఆం. ఇ. ప. మం. వారి త్రైమాసికపత్రిక రెండవసంపుటము, 3, 4, సంచికలు, 185-188 పుటలు చూడుడు.

దానమిచ్చిన భూమియొక్క పరిహద్దులు ఈక్రింది విధముగా చెప్పబడినవి:—తూర్పు, దోల్లంగి యను పేరుగల సరిహద్దు. ఉత్తరం, దక్షిణముగా పారుచున్న (కాలువ) దక్షిణపుసరిహద్దు. పశ్చిమదక్షిణమూల పాషాణము. పశ్చిమం దిగుడుబావి. ఉత్తర పశ్చిమమూల పాషాణము. ఉత్తరమున కాలువ తూర్పుగా పారుచున్నది.

రాజులకు ఆజ్ఞాపించుట ఏమనగా:—

"ఓ రాజులారా! ఇతరులు (దానము) ఇచ్చినారని, ఫలంలేనని సందేహించవద్దు. ఇతరులు దానంచేసిన దానిని రక్షించుట స్వదానఫలంకన్న హెచ్చు. సగరాది చక్రవర్తులు అనేకమంది భూమిని దానంచేసినారు. ఎప్పుడు ఎవరికి భూమి దానంచేస్తే, అప్పుడు వారికి అంతఫలం."

## దానముచేసిన గ్రామము

దానముచేసిన "చిఖల్లిక" యను గ్రామమిప్పుడు "చిక్కాలవలస" యను గ్రామమై యుండును. ఇది గంజాం జిల్లాలోని ఉర్లాంగ్రామమునకు సమీపమునన్నది.

## శాసనకాలనిర్ణయము

శాసనకాలము "ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరశతే, 221" అని నిర్ణయింపబడినది. ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలివారి త్రైమాసికపత్రిక, రెండవసంపుటము, రెండవభాగమున, 153 పుటలో ఈశాసన కాలము "ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరశతే" అనియు, అనగా, గాంగేయశకము 100 సంవత్సరము లని, వ్రాసియుంటిని. అప్పుడు శాసనకాలమును దెలుపు గుర్తును శాసనాంతపు చిహ్నముగా భావించియుంటిని. కాని దానినిసరించి సందేహము తీరక, పెక్కలిజమీందారుగారికి వ్రాయగా, వారు అది 321 అని వ్రాసి పంపిరి. శ్రీ సత్యనారాయణరాజు గురువుగారును వారి వ్యాసమున అట్లే వ్రాసిపంపిరి. కనుక ఇదివరలో నేను సూచించిన యభిప్రాయమును మార్చుకొని ఈశాసనము యొక్క కాలము గాంగేయశకము 221 గా భావించెదను.

## ఈశాసనకర్త ఎవరు?

183, 195 గాంగేయశక సంవత్సరములలో గుణార్ణవుని కొడుకు దేవేంద్రవర్మ రెండుదానశాసనముల నిచ్చెను. అతనికి జయవర్మ, అనంతవర్మయని ఇరువురు కొమాళ్లు. అందు అనంతవర్మ 204 గాంగేయశక సంవత్సరములో అతనిసోదరుడైన జయవర్మసలహాపైని వివాహసమయము నందు క్రోష్టుకవర్తనియందలి తాళత్తేరియను గ్రామమును కామరూపవిషయ నివాసియగు విష్ణుసోమాచార్యునకు దానముచేసెను. ఈతని కొమారుడొకడు దేవేంద్రవర్మ యనునతడు 251, 254 గాంగేయశకసంవత్సరములలో దానములుచేసెను. ప్రస్తుతపు శాసనకర్తయగు మహారాజ శ్రీ మానన్దవర్మ 221 సంవత్సరములో దానము చేయుటవలన 204 గాం. శ. సం. న దానముచేసిన అనంతవర్మయొక్క జ్యేష్ఠకుమారుడున్ను, 251,254 గాం. శ. సం. లలో దానములుచేసిన శ్రీదేవేంద్రవర్మకు జ్యేష్ఠసోదరుడును కావలెను. శ్రీమానన్దవర్మయు, శ్రీదేవేంద్రవర్మయు శ్రీఅనంతవర్మ మహారాజుయొక్క కొడుకులే. ఈశాసనమునందు రెండుచోట్ల రాజుయొక్క పేరు "శ్రీమానన్దవర్మ" యనియే యున్నది. అయినను శ్రీసత్యనారాయణ రాజగురువుగారు "శ్రీమాన్ నన్దవర్మ" యని యుండవలెననియు, శ్రీమాన్ అనుచోట నకారపు పొల్లు లేఖకుని పొరపాటువల్ల లోపించినదనియు అభిప్రాయపడిరి.* శ్రీ పెక్కలి జమీందారుగారు నేను పైని చదివిన పాఠము తప్పనియు, "శ్రీమానింద్రవర్మ" యని యుండవలెననియు, సంధి విడదీయునప్పుడు శ్రీమాన్ + ఇంద్రవర్మ యగుననియు తెలిపియున్నారు.† కాని, పై యభిప్రాయములు సరియైనవి కావనియు, లేఖక ప్రమాదములు రెండుచోట్ల దాతయగు రాజు పేరు వ్రాయునప్పుడు జరుగ నేరవనియు, శాసనాధార

* ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలి త్రైమాసిక పత్రిక రెండవసంపుటము, మూడు నాల్గు సంచికలు, 186–188 పుటలు.

† భారతి విభవ సం. ఆషాఢమాసము, 111–116 పుటలు.

మునుపట్టి "శ్రీమానన్దవర్మ" యనియే చదువవలసియుం డుననియు నా అభిప్రాయము. మరియు ఇదివరకు నేను చదివిన పూర్వగాంగరాజుల శాసనములలో "శ్రీమాన్" అను బిరుదము కనబడలేదు. "శ్రీ" అని మాత్రము వ్రాయుట కలదు. "శ్రీమానన్దవర్మ" యనియే శాసనమునందు రెండుచోట్ల స్పష్టముగా ఉన్నను, శ్రీ యల్. యన్. హరిచందన జగద్దేవు రాజాబహద్దూర్ వారు శ్రీమాన్ + ఇంద్రవర్మ యని చదువుటకు గల కారణమేమో? చదువరుల యుపయోగార్థమై నేను చదువగల్గిన రీతిని మూలమును తిరిగి వ్రాసినాను. ఇదివరలో శ్రీరాజావారు ఆషాఢ భారతియందు ఇచ్చిన శాసనపు మూలమునకును, దీనికిని చాలా తేడాలు గలవు. పై భారతియం దివ్వబడిన శాసనపు ప్రతిబింబములను చూడనగును.

## మూ ల ము *

### మొదటిరేకు : రెండవప్రక్క

౧. ఓం[1]స్వస్త్యమరపురానుకారిణ[2]సర్వర్తుసుఖరమణీయా
౨. ద్విజయవత శ్రీకలిఙ్గనగరావాసకా[3]మహేన్ద్రాచలా
3. మలశిఖరప్రతిష్ఠతస్య[4] చరాచరగురోసకల[5]
౪. భువననిర్మాణైకసూత్రధారస్యశశాఙ్కచూడా[6]
౫. మణిర్భగవతోగోకర్ణస్వామినశ్చరణకమ
౬. లయుగలప్రణామాదపాస్తసకలకలికలఙ్కో
౭. గంగామలకులోద్భవనిజనిస్త్రిశో[7]ధారోపార్జితసక
౮. లకలిఙ్గాధిరాజ్యప్రవితతచతురుదధితరఙ్గమేఖ

### రెండవరేకు : మొదటిప్రక్క

౯. లావనితలామలయశాఅనేకా[8]సంఖ్యోభజని
౧౦. తజయశబ్దః ప్రతాపావనత్సమస్తసామన్తచక్ర
౧౧. చూడామణి ప్రభామఞ్జరీపుఞ్జరఞ్జితచరణపర
౧౨. మమహేశ్వరోమాతాపితృపాదానుధ్యాతోనయవి
౧3. నయదయదాక్షిణ్యశౌర్యౌదార్య సత్యత్యాగా
౧౪. దిగుణసంపదామాధార శ్రీఅనన్తవర్మసూనుమహారా

---

* నావద్ద నున్న శాసనపు ప్రతిబింబములనుంచి వ్రాయబడినది. 1. శంఖమువంటి గుర్తు చే చూపబడినది. 2. కారిణః అని చదువవలెను. 3. వాసకాత్ అని. 4. ప్రతిష్ఠితస్య అని. 5. గురోస్సకల అని. 6. చూడా అని. 7. నిస్త్రింశ అని. 8. యశానేక అని.



౮. కోనేరులోని మంటపము

౧౫. జశ్రీమానన్దవర్మ్మా ఫరేయభుక్తిః పాతిచిఖల్లికాగ్రా

౧౬. మసినో[9]భోగికవారికప్రముఖసర్వసమవేతాం

రెండవరేకు : రెండవప్రక్క

౧౭. కుమ్బిన[10]సమాజ్ఞాపయతి విదితమస్తువోయథాస్మిన్గ్రా

౧౮. మే[11]స్మాభిశ్రీమానన్దవర్మ్మా సూర్యోపరాగే పుణ్యాభివృ

౧౯. ద్ధయే రాజపుత్రఖాలినామాభూపటకః నివేశ

౨౦. నసహితా కపిలమన్డపయమలేపోల్లవిత

౨౧. కౌనన్డిల్య[12]సగోత్రాయ బ్రాహ్మణాదిత్యశర్మణే మాత్రు

౨౨. శర్మణే దుగ్గశర్మణేచ సర్వకరభరైః పరిహృత్యా

౨౩. చన్ద్రార్క ప్రతిష్ఠప్రతిపాదిత ఇతి పూర్వేణ దోల్లంగినామ

మూడవరేకు : మొదటిప్రక్క

౨౪. గర్తా సీమాసీతు దక్షిణేనప్రవహాతి దక్షిణేనసీమా

౨౫. సేతుపశ్చిమదక్షిణకోణే పాషాణ పశ్చిమేణవాపీ

౨౬. ఉత్తరపశ్చిమకోణే పాషాణఉత్తరేణకాణగర్తాపు

౨౭. ర్వేణ ప్రవహాతిరాజ్ఞః ప్రజ్ఞాపయతి మాభూద

౨౮. ఫలశఙ్కావః పరదత్తేతిపార్థివాస్వదానాఫల[13]

౨౯. మానన్త్య[14] పరదానానుపాలనం బహుభిర్వసుధాదత్తారాజా

౩౦. భి[15] సగరాదిభి[16] యస్యయస్యయదాభూమితస్యతస్య

౩౧. తదాఫలమితి ప్రవర్ధమానవిజయరాజ్యసంవచ్ఛర[17] శతే ౨౨౧

౩౨. ఆషాఢదినపఞ్చామి ఉత్కీర్ణ[18]శాసన[19]

---

9. గ్రామవాసినో అని. 10. కుటుంబినః అని. 11. యథాస్మి న్గ్రామే అని. 12. కౌన్డిన్య అని. 13. స్వదానాత్ ఫల అని. 14. మానన్త్యం అని. 15. రాజాభిః 16 సగరాదిభిః. 17. సంవత్సర అని. 18. ఉత్కీర్ణం అని. 19. శాసనం అని.

# చ్యుతి

విశ్వనాథ సత్యనారాయణ గారు

ఇది పరానురక్త మగుచు నాయెద జనించి
    తావకాలయ ఘంటికాధ్వానపథము
లందుఁ బడి యభ్రవీథుల యంచు లెఱుఁగు
తలఁపు—వేగింపఁబడెద నిత్యంబు నాథ!

నీగుడి ప్రమాణమును చేరనీక తరిమి
నారు భస్మధారు లగు పూజారివారు
నా వదనసీమ బత్తి యన్నది కనంబ
డదఁట! నావంటివారు కూడరఁట యచట!

నీదుగుడి వెన్కతట్టున నేల కొరిగి
పోవుచున్న ప్రాకారపు బొరియ దాఁగి
యాలయపురఃప్రలంబి ఘంటారవములు
వినుటపై మానసము నిల్పి వేచి యుంటి.

ఆనినాదంబు లేగగనానిలములు
మోచుకొనిపోయెనో! కాక నా చెవులకు
చెప్పరాని విన్కరాని చేటు కలిగె
నో! ప్రతీక్ష ప్రతీక్షగా నుండిపోతి.

ఆనినాదాల కంకితమైన నాదు
పేదగుండె ఆమ్రోఁతలు వినుట యనుచు
కలదొ! ఏనాఁటికైన ఈ గండశిలల
యందు నేఁగూడ నొకశిల యగుదుఁగా! కాక.

---

# ప్రాచీన జ్యోతిష గ్రంథములు*

నిడుమోలు కనకసుందరరంగారు, బి.ఏ. (ఆనర్సు)

## నక్షత్రములు

సూర్యుడు సంచారమొనర్చెడి క్రాంతివృత్తము (Ecliptic) ఇరువదియేడు లేక యిరువదియెనిమిది భాగములుగ విభజింపబడి యందొక్కొక్క భాగమునకొక్కొక నక్షత్రముయొక్క పేరు పెట్టబడెనని ప్రాచీన గ్రంథములందు కానవచ్చు చున్నది. నక్షత్రములు చంద్రుని రాసులని కొన్నిచోట్ల నుదాహరింపబడి యున్నది. అవి సోముని—అనగా, చంద్రుని—భార్యలని మహాభారతము [IX-35 (45)] ను, తైత్తిరీయసంహిత [ii-3 (5)] యును చెప్పుచున్నవి. ఋగ్వేదమునందు తిష్య (సూర్యుడు ?), అఘాస్ (మఘ), అర్జుని (ఫల్గుని) నక్షత్రములు తప్ప నింకేమియు నగుపడుటలేదని యింతకు బూర్వమే వివరించి యున్నాము. 1 వ అధ్యాయము 162 (18) ఋక్కునందు 27 నక్షత్రములకు సూచన యున్నదని కొందరు వ్యాఖ్యాతలు తలచుచున్నారు. అథర్వవేదము [XIX-7], తైత్తిరీయసంహిత [IV-4-10], కథాసంహిత [XXXIX-13], మైత్రాయణీ సంహిత [ii-13 (20)], శతపథబ్రాహ్మణము [X, 5-4, 5 (5)] మొదలగు గ్రంథములును నక్షత్రనామములను వివరించి యున్నవి. ఈపేర్లలో వ్యత్యాసములు అరుదుగా నున్నవి. కాని నక్షత్రసంఖ్య మాత్రము కొన్నిటియందు 27 గను, మరి కొన్నిటియందు 28 గను నున్నది. అథర్వవేదమును, మైత్రాయణీసంహిత యును 28 నక్షత్రములను పేర్కొనుచున్నవి. తైత్తిరీయ సంహిత, శతపథబ్రాహ్మణము మొదలగునవి 27 నక్షత్రములను మాత్రమే పేర్కొని యున్నవి. వేదకాలానంతర గ్రంథములుకూడ నక్షత్రములు 27 అని కొన్నియు, 28 అని మరికొన్నియు తెలుపు చున్నవి. జ్యోతిష వేదాంగము, సూర్యసిద్ధాంతము [ii-64]లందు 27 మాత్రమే కలవు. సూర్యప్రజ్ఞప్తి, బ్రహ్మస్ఫుటసిద్ధాంతము, సూర్యసిద్ధాంతము [VIII-I-f] లందు 28 యున్నవి. కావున ఆదిని 27 ఉండెనో, 28 ఉండెనో, యిదమిత్థమని చెప్పజాలము. ఈ యిరువది యెనిమిదవ నక్షత్రము అభిజిత్తు అయి యుండవలెనని జ్యోతిష్కులు అభిప్రాయ పడుచున్నారు. అభిజిన్నక్షత్రము తారావర్గములోనుండి తొలగిపోయెనని మహాభారతము [III-230-11] న విచిత్రమగు నొక గాథ కలదు. కాని ఇది నక్షత్రవర్గములో వచ్చిచేరిన నూతననక్షత్రమని తైత్తిరీయ బ్రాహ్మణము [i-5-2 (3)] తెలుపుచున్నది. కావున ఆదిని నక్షత్రములు 27 గా నుండి తైత్తిరీయబ్రాహ్మణమునందు వివరింపబడిన రీతిని అభిజిన్నక్షత్రముయొక్క ఆగమనమువలన 28 అయ్యెనో, లేక ఆదినే 28 గా నుండి మహాభారతము నందున్నటుల అభిజిత్తు జారిపోవుటచే 27 అయ్యెనో నిర్ణయింపజాలము. అరేబియాదేశీయుల మనాజీల్ నందును, చైనాదేశీయుల సియూ (Sieou) నందును, బాబిలోనియనుల గణితమునందును 28 నక్షత్రరాసులే కనబడుచున్నవి. వానికిని హైందవ జ్యోతిశ్శాస్త్రము నందలి నక్షత్రరాసులకును గల సంబంధమును గూర్చి అనేక వివాదములు ప్రబలియున్నవి.

నక్షత్రములసంఖ్య యిట్లు భేదించుటకు గల కారణమును ఎవరును ఇంతవరకు నిర్ణయించి యుండలేదు. పూర్వకాలమున అభిజిత్తును విడిచి, 27 నక్షత్రములనే వాడుకొనుచుండిరని పెక్కుమంది శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు. 3 సంఖ్యను 3 సార్లు పెంచిన 27 వచ్చుచున్నది. కావున నీసంఖ్యయందు కొంతగూఢార్థముం

---

* ఈవ్యాసముయొక్క ప్రథమభాగము ఆషాఢమాస సంచికయందున్నది.

యుండవచ్చును. పూజాపీఠమును 756 ఇటుకలతో కట్టవలెనని శతపథ బ్రాహ్మణము [X-5-4 (5)] విధించు చున్నది. ఈ సంఖ్య 27 ను 28 చే గుణింపగా వచ్చున దగుటచే నిందును ఏదో విశేష ముండెనేమో యను అపోహము కలుగుచున్నది. నక్షత్ర నామములలో నింకొక విశేషమును మనము గమనింపవలసి యున్నది. 27 లేక 28 నక్షత్రములలోను పూర్వోత్తర ఫల్గుణి, పూర్వోత్తరాషాఢ, పూర్వోత్తరాభాద్ర పదములను కూడదీసిన యెడల 24 లేక 25 ప్రత్యేక నామములు మాత్రమే కనబడుచున్నవి. హిందువులు మొట్టమొదట క్రాంతి వృత్తమును 6 భాగములుగా విభజించి యుండిరేమోయని ఆల్బిరూని అనుమానపడి యున్నాడు. [ఇండియా, i-358 పేజీ చూ.] ఈ 6 భాగములును తదుపరి 12 రాసులుగా మారినట్లే, ఈ 12 రాసులును 24 అర్ధరాసులు (హోరలు) గా మారి ప్రత్యేక నక్షత్ర నామములను గ్రహించి యుండవచ్చుననియెడి వేరొక అపోహమునకు కూడ తావు కలదు. అదియేగాక, పూర్ణిమయందు సుమారుగా చంద్రు డేనక్షత్రమునం దుండునో ఆనక్షత్ర నామమునుండియే మాసనామము సంక్రమించి యుండి నందువలన నీయపోహమునకు కొంత ఆధారము ఏర్పడుచున్నది. నక్షత్రనామములకును, మాసనామములకును గల సన్నిహిత సంబంధము ప్రత్యక్షముగ నగుపించుచునే యున్నది. చైత్రము—చిత్ర; వైశాఖము—విశాఖ; జ్యేష్ఠము—జ్యేష్ఠ; ఆషాఢము—ఆషాఢ; శ్రావణము—శ్రవణము; భాద్రపదము—భాద్ర; ఆశ్వయుజము—అశ్విని కార్తికము—కృత్తిక; మార్గశిరము—మృగశిర; పుష్యము—పుష్యమి; మాఘము—మఘ; ఫాల్గునము—ఫల్గుని.

నక్షత్రములు ఆకాశమున నుండు స్థానములను పూర్వగ్రంథము లెవ్వియు సూచించి యుండలేదు. వరాహమిహిరుని కాలమునాటి కైనను (క్రీ. శ. 6 వ శతాబ్దము) ఈ విషయమున నుపయోగ కరములగు నూతనాంశము లెవ్వియు లభింపలేదు. పంచసిద్ధాంతికము నందు ఏడునక్షత్రములకు మాత్రము యోగతారలు సూచింపబడి యున్నవి. కాని యివియైనను నిర్దుష్టముగ నున్నవని చెప్పుటకు వీలు లేదు. ఈ నక్షత్రముల స్థానములను స్పష్టముగా నిర్ణయించుటకు మనపూర్వికులు పూనుకొని యుండిన ట్లగపడుట లేదు. ఆల్బిరూని [ఇండియా, II, 88] యిటుల వ్రాసియుండెను: "స్థిరనక్షత్రములను గూర్చి హిందువులకు బొత్తిగా తెలియదు. చంద్రస్థానములైన యోగతారలను గుర్తించి, వ్రేలితో నాకు చూపగలిగినవా రెవరును నాకు తటస్థముకాలేదు." సూర్యచంద్రుల సంచారమార్గము నాధారము చేసికొని ప్రాచీనగ్రంథములు నక్షత్ర స్థానములను నిర్ణయించు చున్నవి. ప్రతినక్షత్రమునందును యోగతారలస్థానము నిర్ణయింప వలసియుండెను. పంచసిద్ధాంతికమున చెప్పబడిన యేడునక్షత్రముల స్థానములు నిట్లు వర్ణింపబడి యున్నవి: "కృత్తికయొక్క యోగతార ఆరవఅంశకు చివరను, క్రాంతివృత్తమున కుత్తరమున మూడున్నర 'హస్తముల' దూరమున నున్నది. రోహిణియొక్క యోగతార యెనిమిదవ అంశతుదిని, క్రాంతివృత్తమునకు దక్షిణమున ఐదున్నర హస్తముల దూరమున నున్నది." [XIV, 34]. "పునర్వసులోని నక్షత్రద్వయము అష్టమాంశాంతమున క్రాంతివృత్తమున కిరుపార్శ్వముల (అనగా నుత్తరదక్షిణముల) నొండొంటికి నెనిమిదిహస్తముల దూరములో నున్నవి. పుష్యమి చతుర్థాంశయందు, మూడున్నర హస్తములు ఉత్తరమునకు నున్నది. ఆశ్లేషలో దక్షిణ నక్షత్రము ప్రథమాంశ యందొకహస్తము దక్షిణమున నున్నది. అటులే మఘలోని ఉత్తర నక్షత్రముకూడ, క్రాంతివృత్తముపైని షష్ఠాంశమున నున్నది. చిత్ర యేడున్నర యంశలలో మూడుహస్తములు దక్షిణమున నున్నది."—ఇందు 360 అంశలు 27 నక్షత్రములకు పంచగా నొక్కొక్క నక్షత్రమునకు $13\frac{1}{3}$ అంశలు లభించును. హస్తమనగా నెంతయో స్పష్టముగా నిర్ణయించుటకు వీలు లేకున్నది. హస్తమునకు 24 అంగుళము లుండుటచేతను, 32 మినిట్లు వ్యాసరేఖ (Diameter) గల చంద్రమండలము 15 అంగుళములు వ్యాసరేఖ గలదిగా నెంచబడుటచేతను, 1 అంగుళమునకు 2 మినిట్లు 8 సెకండ్లు, అనగా, 1 హస్తమునకు 51 మినిట్లు 12 సెకండ్లు వచ్చుచున్నవి. 60 మినిట్లు అయినచో 1 అంశ (డిగ్రీ) యగును. ఇరువది యెనిమిది నక్షత్ర

రాసులయొక్క యోగతారల స్థానములను, ఇంకను ఏడు స్థిరనక్షత్రములయొక్క స్థానములను సూర్యసిద్ధాంతము సూచించు చున్నది. ఏది యెటులైనను, ఆధునిక కాలమున నక్షత్రగోళముల కీయబడిన నామములు ప్రాచీనములు కావనిమాత్రము విశదమగుచునే యున్నది. క్రీ. శ. 1000 వ సంవత్సర ప్రాంతముల క్రాంతివృత్తము రేవతి రాశియందలి ముఖ్యనక్షత్రముతో నారంభించినటుల హైందవజ్యోతిష్కు లెంచుచుండిరని నిదర్శనములు గలవు.

నియమిత సమయములయందు సూర్యచంద్రు లేనక్షత్రరాశియందుండిరో తెలియజేయు ప్రసంగములు ప్రాచీన గ్రంథములందు లేకపోలేదు. "చంద్రుడు ఫల్గునియందుండెను." మొదలగువాక్యములు అట్టి గ్రంథములయందు తరచుగ నగపడుచునే యున్నవి. కాని "జ్యోతిష వేదాంగము"నకు బూర్వము నక్షత్రమానము నిర్ణయింపబడినటు లెచ్చటను కనబడుటలేదు. ఆగ్రంథము క్రాంతి వృత్తము 27 సమభాగములుగా విభజింపబడినట్లును, ధనిష్ఠ నక్షత్రము మకరరాశియందు మొట్టమొదట నున్నటులును తెలుపుచున్నది. ఈ విషయమై మున్ముందు విపులముగ చర్చింతము. "సూర్యప్రజ్ఞప్తి" యందు క్రాంతివృత్తము 27 21/67(?)భాగములు చేయబడియున్నది. ఇందు నక్షత్రమున కొక్కొక్కటికి అర్ధభాగముచొప్పున 6 నక్షత్రములకును, ఒకసంపూర్ణ భాగము చొప్పున 15 టికిని, ఒకటిన్నర భాగము చొప్పున 6 టికిని, మిగిలిన 21/67 భాగము అభిజిత్తునకును చెందుచున్నవి. సూర్యుడు అభిజిత్తునందున్నపుడే మకరసంక్రమణము కలుగుచుండినటులు కూడ తెలియుచున్నది. మాసములకును, నక్షత్రములకును నొకవిధమగు పరస్పరసంబంధ మేదో యొకకాలమున నుండినటులును విదితమగుచునే యున్నది.

కాని, నక్షత్రములు క్రాంతివృత్తము యొక్క భాగములు మాత్రమే అయియుండి, ఆకాశమున ప్రత్యక్షముగ నగుపించు జ్యోతిర్గోళముల గురుతించుట కేర్పడిన పేర్లుగా ఆదిని ఉద్దేశింప బడియుండక పోవచ్చునను కొనుటకు వీలు కలదు. ఈవిషయమున విశేషమగు పరిశోధనము జరుగలేదు. కాని నూతనాంశము లనేకము లట్టి పరిశోధనము వలన మనకు లభింపవచ్చును. గ్రీకుల జ్యోతిషశాస్త్రమున వాడబడిన రాసుల నామములు క్రాంతివృత్తమునందలి ప్రత్యేక నక్షత్రగోళముల కీయబడినపేరులై యుండెను. కాని యీపేరులు కొలది కాల మైనపిదప, గ్రీష్మవిషువత్తు మొదలుకొని క్రాంతివృత్తమును పండ్రెండు పాళ్లుగా విభజింపగా వచ్చిన భాగములకే వాడబడుచు వచ్చినవి. విషువత్తులయొక్క తిరోభిగమనము (Precession of the Equinoxes) వలన క్రాంతివృత్తముయొక్క భాగముల పేరులకు, నక్షత్రరాసుల పేరులకు నుండిన సంబంధము తొలగిపోయినది. గ్రీష్మ విషువద్బిందువు మొదలుకొని 30 డిగ్రీలు తూర్పునకు మేషమును, అటుపిమ్మట 30 డిగ్రీలు వృషభమును— ఈరీతిగా పండ్రెండు రాసులును 360 డిగ్రీలలో నిమిడియున్నవి.

ప్రాచీన గ్రంథములయందలి నక్షత్రనామములు కృత్తికతో నారంభించుచున్నవి. ఈనక్షత్రము నేడు మనము గుఱ్ఱకొయ్యలు, లేక పిల్లలకోడి అని పిలుచు (Pleiades) రాశియేయని యెంచినచో, నేటికి సుమారు 3,200 సంవత్సరముల క్రిందట గ్రీష్మ విషువద్బిందు వీ నక్షత్రమున నుండియుండవచ్చును. నక్షత్రముల నామములు జ్యోతిష వేదాంగమున ధనిష్ఠతోను, మహాభారతమున శ్రవణముతోను, సూర్యసిద్ధాంతమున అశ్వినితోను, సూర్యప్రజ్ఞప్తియందు అభిజిత్తుతోను ఆరంభించు చున్నవి. విషువత్తులయొక్క వక్రగమనమువలన నీనక్షత్రముల యొక్క ప్రథమస్థానము కృత్తిక కడనుండి అశ్వినివద్దకు మార్పవలసి వచ్చెనని చూచినతోడనే మన మెంచుదుము. కాని యీ యూహకు చాల ప్రతిబంధకములు కలవని తిలక్, థీబొ మున్నగువారు సూచించి యుండిరి. కృత్తికతో నారంభించుటకు దైవత పూజావిషయిక మైనట్టి కాని, లేక జ్యోతిష ఫల విషయిక మైనట్టి కాని వేరొక యంతరార్థముండెనేమోయని వారు అభిప్రాయపడియుండిరి. పూజావిధులకు కృత్తిక మొదలనియు, కాలమానమునకు ధనిష్ఠ మొదలనియు గర్గుడు శాసించెనని తిలకు

సూచించియుండెను. నక్షత్రములు కృత్తికతో నారంభించుటకు కారణము హిందువుల పూజా విధానములే కాని, సూర్యుడు గ్రీష్మ విషువత్తునందు దారాశియందుంట కాదని డాక్టరు ఫ్లీటు నిరూపింప నెంచియుండెను.

### బ్రాహ్మణములు

బ్రాహ్మణములయందు జ్యోతిషవిషయములు చాల తరుచుగ నగపడుచున్నవి. ముప్పదియైదు, లేక, ముప్పది యారుదినములు గల పదుమూడవమాసము సంవత్సరమున వచ్చుచున్నటు లందు సూచనలు గలవు. కృత్తికలు తూర్పుదిశను, సప్తర్షులు ఉత్తరమునను ఉదయించుచున్నటు లది యుదాహరించుచున్నది. కృత్తికలు (గుత్తికోయ్యలు అని మనము పిలుచు నక్షత్రములు) తూర్పున నుదయించునెడల విషువద్బిందు వనటనే యుండి యుండవలెనని యెంచినచో, విషువద్బిందువు అశ్విని రాశిని చేరుట కగుకాలమును గుణించి, బ్రాహ్మణములు క్రీ. పూ. 3000 సంవత్సరముల క్రిందట (అనగా నేటికి సుమారు 5,000 సం.ల క్రింద) వ్రాయబడినవని నిర్ధారణ చేయబడెను. ఐతరేయ బ్రాహ్మణమున రోహిణీతారను గూర్చిన యొక విచిత్రమగు కథయు కలదు. [III-33-5 చూ.]

### ఉపనిషత్తులు

మైత్రాయన బ్రాహ్మణోపనిషత్తునందు [I-4] ధ్రువనక్షత్రమును గూర్చిన ప్రస్తావనతప్ప జ్యోతిషవిషయము లికెచ్చట నగపడవు. 360 డిగ్రీల పరిమాణముగల క్రాంతి వృత్తమును (Ecliptic) 27 సమభాగములుగా నొనర్చి, 13⅓ డిగ్రీలు పరిమాణముగల యొక్కొక్క భాగమునందొక్కొక్క నక్షత్ర మున్నటు లుపనిషత్తులు చూపుచున్నవి. కేతు, గ్రహముల పేరుల నవి యుదాహరించుచున్నవి. కాని, జ్యోతిషపరమగు నర్థ మేమియు నాపదములయందిమిడి యున్నట్లగపడుటలేదు.

### జాతకములు

భావి ఫలములను, గ్రహణ సమయములను నిర్ణయించు జ్యోతిష్కులను బౌద్ధమతగ్రంథములు తీవ్రముగ నిరసించియున్నవని ప్రథమమున వివరించియుంటిని. కాని జాతకములయందుమాత్రము జ్యోతిషవిషయములు తరచుగ నున్నవి. కల్పము, లేక, యుగమునందు నాల్గువిచిత్రములు కలుగుననియు, నందు మొదటిది చంద్రబింబమున చెవులపిల్లి యుండుట యనియు, నది కల్పాంతమువరకు నుండుననియు నిరుపదియవ జాతకమునందున్నది. 513వ జాతకమునందీవిషయమున నీరీతి నున్నది:

> పేదబాపని రీతి నొప్పిన శచీంద్రు
> గాంచి కుందే లొకండు "నా కాయ మిదుగో:
> ఆరగించి క్షుధాగ్ని చల్లార్చుకొనుము"—
> అనుచు వేడగ సురపతి యలరి దాని
> యాకృతి సుధాంశు మండలంబందు నునిచె.

48వ జాతకమునందొకమంత్ర మొకగ్రహకూటమి యందు పఠింపవలసి యుండినటులును, ఆగ్రహకూటమి తిరిగి యొక సంవత్సరమునకుగాని సంభవింపదని మంత్రవేత్త యనినటులును వ్రాయబడియున్నది. 474 జాతకమునందిటు లున్నది:

> "కాల మియ్యది మంచిది కాదు. కాన
> నాగుమీ కూడు దనుక గ్రహంబులు రివి."

481, 522 జాతకములయందుకూడ గ్రహకూటమినిగూర్చిన ప్రస్తావనలు కలవు. 481 యందు రాక్షసి యొకటి రాజపుత్త్రిని వదలివేయుచు "రాహువుయొక్క కోరలనుండి తప్పించుకొనిపోయెడి చంద్రునివలెనే, నీవును నాచేతులలోనుండి పారిపొమ్ము" అని చెప్పినటుల నున్నది. ఈగ్రహణ రాక్షసులను 25, 490, 537 జాతకములుకూడ సూచింపుచున్నవి.

### మహాభారతము

సంస్కృతభారతము క్రీస్తునకు ముందు వెనుకల 400 సంవత్సరముల నడుమ రచింపబడి యుండవలెనని నిర్ణయింపబడియున్నది. పంచవర్ష చక్రమునందు అయిదు సంవత్సరములలో రెండు మాసములును, 18 సంవత్సరములలో 5 మాసముల 6 దినములును పెచ్చువచ్చుచుండు

నట. సూర్యచంద్రులును, బృహస్పతియు పుష్యమీ నక్షత్రమునందు కలిసికొనునపుడు కృతయుగము ప్రారంభమగునని తృతీయపర్వము (190-90) నందున్నది. పుష్యమీనక్షత్రము కర్కటకరాశియం దున్నది. గ్రహములు కర్కటకరాశియందు కలిసికొన్నపుడు జగములు భగ్నములగునని బెరోసస్ (Broses) అను సనాతన పాశ్చాత్యశాస్త్రజ్ఞుడుకూడ సూచించి యుండెను.

ఈగ్రంథమున గొన్ని సందర్భములలో 28 నక్షత్రములున్నటుల వ్రాయబడినను, సాధారణముగానవి 27అని యే వాడబడియున్నవి. అభిజిన్నక్షత్రము అదృశ్యమైనటుల నొక గాథ కలదు. "రోహిణియొక్క అనుంగు చెల్లెలయిన అభిజిత్తు రోషావేశపూరితయై కానలకేగి నిష్ఠాగరిష్ఠురాలై యున్నది. పతితమయిన యానక్షత్రముయొక్క స్థానమున నింకొకదానిని నిర్మించుటకు నాకు దుస్సాధ్యముగ నున్నది." (iii-230, 2 చూ.) ధనిష్టతో కాలమానము నారంభింపవలెనని బ్రహ్మదేవుడు శాసించెను. (iii,230-10). కాని "విశ్వామిత్రుడు కోపాతిరేకమున, రెండవలోకమును, శ్రావణతో నారంభించెడి యసంఖ్యాకములగు నక్షత్రములను సృజించుట వలన," శ్రావణతో మొదలుపెట్టవలసివచ్చెనని(xi,44-2) చెప్పబడియున్నది. చాంద్రమాసము శుక్లపక్షముతో నారంభించుచున్నది. పక్షమునకు 14,15 లేక 16 దినములుకూడ నుండవచ్చును. త్రయోదశినాడు గ్రహణము కలిగినటుల నొకచోట సూచన కలదు. (vi,3-32.) గ్రహములు వరుసగ నీక్రమమున పేర్కొనబడియున్నవి:"(1) శుక్రుడు (2) బృహస్పతి (3) బుధుడు (4) అంగారకుడు (5) శని (6)రాహువు (7) ఇతరగ్రహములు" (ii,11-37) నక్షత్రములు దూరస్థములగుటచే చిన్నవిగా నగపడినను, చాల పెద్దవియైయున్నవని తృతీయపర్వమునం (42-24) దున్నది. ఈగ్రంథములలో నెల్ల నీవిషయమే కడు నత్యద్భుతమగు జ్యోతిషరహస్యమని పాశ్చాత్యశాస్త్రజ్ఞులెంచుచున్నారు. సనాతన యవన (గ్రీకు) గురువగు హెరాక్లిడీసు క్రీ. పూ. 350 సంవత్సర ప్రాంతములందే 'ప్రతినక్షత్రము నాకాశమునందు వ్రేలాడెడి గోళమనియు, నందు ప్రతిదానియందును భూమి, వాయువు, ఆకాశము కూడియుండుననియు', శిష్యులకు బోధించియుండెను.

## రామాయణము

వాల్మీకి మహర్షి ప్రోక్తమగు రామాయణము క్రీ. పూ. 3, 4 శతాబ్దములందు రచింపబడి యుండవచ్చును. కాని మనకు నేడు లభించెడి గ్రంథమున నాధునికకాలమున వ్రాయబడి యందు జేర్పబడిన భాగములు కొన్ని లేకపోలేదు. జ్యోతిషసాంప్రదాయములు గల గాథలనేకము లందు కలవు. రోహిణీచంద్రులకథ తరచుగ నం దగపడుచున్నది.చంద్రునియొక్క స్థానమును దెలిపెడి నక్షత్రనామములు పెక్కులందు పేర్కొనబడియున్నవి. పుష్యమీనక్షత్రము మీనరాశియందున్నదని యొకశ్లోకము (i కాం. 19 శ్లో.) స్ఫురింపజేయుచున్నది. సప్తర్షిమండలమును గూర్చియు, త్రిశంకు స్వర్గమును గూర్చియు ప్రస్తావన లిందు కలవు. అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు అను గ్రహముల పేర్లును కలవు. అగస్త్యుడు శ్రీరామునకు సూర్యప్రభావమును వర్ణించుటయు, ఆదిత్యహృదయమను మహామంత్రము నుపదేశించుటయు యుద్ధకాండమున నొకయాశ్వాసమున వర్ణింపబడియున్నది. (గోపీనాథరామాయణము 2వ సంపుటమున 781 పుట కూడ చూడుడు.) చంద్రుడు రాహుగ్రస్తుడగుటలుకూడ నున్నది కాని కేతుగ్రహ మిం దుదాహరింపబడినట్లగపడదు.వింధ్య, హిమవన్నగములకంటె మేరు వత్యుత్తమమైనదనియు నందు గలదు.

## విష్ణు పురాణము

ఈ గ్రంథమునం దొక భాగమును సంక్షిప్తముగ నిట వ్రాయుచున్నాను: "సప్తద్వీపములును సప్తసముద్రముల చే పరివృతములైయున్నవి. వీనిలో జంబూద్వీపము కేంద్రమున నున్నది. ఈద్వీపము నడుమను స్వర్ణమయమగు మేరుపర్వతమున్నది. ఆమేరు పర్వతము భూమిపై 84,000యోజనములయెత్తునకును,భూగర్భములో 16,000 యోజనముల లోతునకును విస్తరించియున్నది. శృంగమున వ్యాసము (Diameter) 32,000 యోజనములును, భూసమప్రదేశమున 16,000 యోజనములు నుండుటవలన

నాపర్వతము పద్మగర్భమందలి దిమ్మయొక్క ఆకారము గలిగియున్నది. సూర్యుడు సంచరించెడి కక్ష్య భూమికి 1,00,000 యోజనముల దూరమున నున్నది. సూర్యునకు పైన నంతయేదూరమున చంద్రమండల మున్నది. చంద్రునకు పైన నంతేదూరమున నక్షత్రమండలము లున్నవి. ఆ పైన 2,00,000 యోజనములలో బుధుడును, అటు పిమ్మట 2,00,000 యోజనములకు శుక్రుడును, 2,00,000 యోజనములకు అంగారకుడును, 2,00,000 యోజనములకు బృహస్పతియు, నాగోళమును గడచిన పిదప 2,50,000 యోజనములకు శనిగోళము నున్నవి. అంతకు పైన 1,00,000 యోజనములలో సప్తర్షులు సంచరించెడి ఖగోళ మున్నది. ఇంకనుపైన నంతియేదూరములో గ్రహచక్రమునకు కేంద్రస్థానమున ధ్రువతార యున్నది. ధ్రువునకుపైన నాల్గుస్వర్గలోకము లున్నవి. ......... సప్తగ్రహములును, మేఘములును ధ్రువతారపై నాధారపడియున్నవి. ధ్రువతార తిరుగుచుండుటవలన చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములునుకూడ తిరుగునటుల దోచుచున్నవి. వలయాకారమున నున్నదాని (ధ్రువతారయొక్క)మార్గమును నక్షత్రములు అనుగమించును. ఏలయన జ్యోతిర్గోళము లన్నియు ధ్రువ నక్షత్రమునకు వాయు సంబంధములచే కట్టబడియున్నవి." ఈలెక్క ప్రకారము ఈగోళములు భూమి కెంతెంత దూరములోనున్నవియు నీక్రింది పథకమువలన తెలియనగును.—

| | | |
|---|---|---|
| సూర్యుడు | 1,00,000 | యోజనములు |
| చంద్రుడు | 2,00,000 | ,, |
| నక్షత్రములు | 3,00,000 | ,, |
| బుధుడు | 5,00,000 | ,, |
| శుక్రుడు | 7,00,000 | ,, |
| అంగారకుడు | 9,00,000 | ,, |
| బృహస్పతి | 11,00,000 | ,, |
| శని | 13,50,000 | ,, |
| సప్తర్షులు | 14,50,000 | ,, |
| ధ్రువతార | 15,50,000 | ,, |

తరువాత గ్రంథములలో నీవరుసక్రమము కొంతవరకు మార్పుచేయబడినది. సూర్యునకును గ్రహములకును గల పరస్పర సంబంధమును సూచింపుచు దూరస్థమగు గ్రహముకంటెను నక్షత్రములు దూరముగ నున్నటులు కొన్ని గ్రంథములు తెలుపుచున్నవి. బుధుడు, శుక్రుడు, అంగారకుడు బృహస్పతి, శని, రాహువు, కేతువు అను సప్తగ్రహములును అష్టాశ్వములచే నీడ్వబడెడు రథములపై సంచారము చేయుచుండునని విష్ణుపురాణమున కలదు. (ii—12చూ.)

ఉత్తరాయణము మాఘమాసారంభమునందును, విషువత్తు కృత్తికయందునో విశాఖయందునో సంభవించుననియు నాగ్రంథమునం దొకభాగము (ii–8) స్ఫురింపజేయుచున్నది. మహాభారతమునందు వ్రాయబడిన రీతినే కృతయుగారంభ మగుననియు నొకచో దెలుపబడిన్నది.

సప్తర్షులు:—సప్తర్షి మండలమును గూర్చిన ప్రస్తావనలు హైందవజ్యోతిష వాఙ్మయమునందు విరివిగ నగపడుచున్నవి. ఒకపురాణమున నిటు లున్నది: "ప్రదీపుడు రాజైయున్న కాలములో పుష్యమీతారకు సమదూరమున సప్తర్షి మండల ముండెను. తదనంతరము ఇరువదియేడవ శతాబ్దాంతమం దుండు ఆంధ్రాంతమునందు తిరిగియు నీచక్రము ప్రారంభమగును. సప్తర్షులును నక్షత్రచక్రమున తిరుగుచుందురు.ఆచక్రముయొక్క పరిధియందు 27నక్షత్రము లున్నవి. సప్తర్షులు ఒక్కొక్క నక్షత్రమునందు నూరేసి సంవత్సరములచొప్పున నుందురు. ఇదియే సప్తర్షి చక్రము. దీనిపరిమాణము 7 దేవతా సంవత్సరములు 6 దేవతా మాసములు. (ఒకదేవతా సంవత్సర మనగా 360 కలిసంవత్సరములు.)" అనగా 2,700 సంవత్సరములు.

ఈసూత్రమునకు సంతృప్తికరమగు సమన్వయార్థము నేటివరకును మనకు లభింపలేదు. పాశ్చాత్యులరాశిచక్రము (Zodiac) వలెనే నక్షత్రమానముకూడ విషువద్బిందువులతోపాటు కదలుచుండునని యెంచి,సప్తర్షి మండలముయొక్క సంచలనమునకు గారణము విషువద్బిందువుల వక్రగమనమని (Precession of Equinoxes) సమాధానము చెప్పవచ్చును, కాని 2,700 సంవత్సరములు పరిమాణముగల కాలచక్రమున కట్టిసంబంధ మున్నది

యో తెలియుటలేదు. విషువద్బిందువు క్రాంతివలయమును చుట్టి వచ్చుటకు 25,696 సంవత్సరములు పట్టును. మన జ్యోతిషగ్రంథము లీకాలమును 24,000 సంవత్సరములుగ నుదాహరింపుచున్నవి. సప్తర్షి మండలము ప్రతి నక్షత్రరాశియందును 600 సంవత్సరములవఱకు నుండునని వరాహమిహిరుడు వ్రాసినటుల ఆల్బిరూని చెప్పుచున్నాడు. అటులయినచో 27 నక్షత్రరాశులను చుట్టి వచ్చుటకు 27 × 600=16,200 సంవత్సరములు చాలు. కాఈసమాధానమువలననయినను ప్రయోజన మగపడుట లేదు. కాని 27ను 900చే గుణింపగా 24,300 వచ్చుచున్నది. పైన వివరింపబడిన పురాణసూత్రముయొక్క నిజమగు నర్థమేదియో శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేయవలసియున్నది.



## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ చందాదారుసంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది.

చందాదారులకు భారతి ౧౦వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మాకార్యాలయమునకును తెలుప గోరెదము. —భారతి





## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజుకాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండా, తిన్నగా వ్రాసి పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.



# క్రాంతిపాత

కోటికెలపూడి యజ్ఞేశగారి నరసింహశర్మ గారు

క్రాంతిపాత (Equinoclial point) పరిడోలనము (Pendulum) గా దిరుగుచున్నదా? లేక పశ్చాద్గతిని బోవుచున్నదా? సదా మారుటకు గారణమేమి? అను నంశములు విచారణీయములై యున్నవి.

క్రాంతిపాత యనగా విషువత్క్రాంతివృత్తద్వయసంపాతము (Equinoclial point).

ఇందునుగురించి మకరసంక్రాంతి తేదీవిషయమైనాచే వ్రాయబడిన వ్యాసములో క్రాంతిపాతగతి అవసరమైనందున కొంతవరకు పరిశీలించితిని గాని యది గొప్పయంశమగుటనుబట్టి విద్వాంసులపైని విడిచిపెట్ట వలసివచ్చినది.

ఏల యనః— సౌరసిద్ధాంతమున క్రాంతిపాతను గూర్చి.

"శ్లో. త్రింశత్కృత్యోయుగేభానాం
చక్రం ప్రాక్పరిలంబతే,
తద్గుణాభూదినైర్భక్తా
ద్యుగణాద్యదవాప్యతే.
తద్దోస్త్రిఘ్నాదశాప్తాంశా
విజ్ఞేయా అయనాభిధాః.

భానాం చక్రం, రాశీనాం వృత్తం, క్రాంతివృత్తం. స్వస్వవిక్షేపమితశలాకాగ్రప్రోత నక్షత్రగణై ర్యుక్త మిత్యర్థః; యుగే, మహాయుగే, ప్రాక్, పూర్వస్యాం భాగే, త్రింశత్కృత్యః త్రింశత్సంఖ్యాకాకృతి ర్వింశతిః, షట్ఛత మిత్యర్థః; పరిలంబతే, ధ్రువాధారభగోళస్థానా త్తద్ద్వార మవలంబతే, అత్ర పరిలంబత ఇత్యనేన భచక్రపర్ణభ్రమణాభావ ఉక్తోఽన్యథాగ్రహ భగణప్రసంగేన మధ్యాధికార ఏవ తదుక్తం స్యాత్, తథాచ, తద్ద్వార మవలంబనోక్త్యా పరావర్త్య యథాస్థితం భవతీత్యాగతం, తత్రాపి స్వస్థానా త్తథైవ పశ్చిమతోఽప్యవలంబత ఇతి సూచితం; ఏవం చ భచక్రం పశ్చిమత ఈశ్వరేచ్ఛయా ప్రథమతః కతిచిద్భాగై శ్చలతి, తతః పరావృత్త్యా యథా స్థితం భవతి తతోఽపి తద్భాగైః క్రమేణ పూర్వత శ్చలతి. తతోఽపి పరావృత్త్యా యథా స్థిత మిత్యేకో విలక్షణో భగణః, తేన ప్రా గిత్యుపలక్షణం. పశ్చిమావలంబనా నుక్తిస్తు సంపాదకాలే త దభావాత్. అత్ర త్రింశత్కృత్వేతి పాఠః ప్రామాదికః.

శ్లో. యుగే షట్ఛతకృత్వో హి
భచక్రం ప్రాగ్విలంబతే.

ఇతి సోమసిద్ధాంతవిరోధాత్. తత్పశ్చాచ్చలితం చక్ర మితి బ్రహ్మసిద్ధాంతోక్తేశ్చ."

ఇటుల చెప్పుటవలన క్రాంతిపాత సృష్ట్యాదిని మేషాదిబిందువులో నుండి సంవత్సరమునకు ఏబదినాల్గు గువికలలు గతి గలిగి ప్రాగ్గతితో పదునెనిమిదివందల సంవత్సరములకు సదరు మేషాదిబిందువునకు ఇరువదేడు భాగలదూరమున సంపాతము నొంది, పిమ్మట పశ్చిమగతితో పదునెనిమిదివందల సంవత్సరములకు మేషాదిబిందువును కలిసి, మరి పదునెనిమిదివందల సంవత్సరములకు సదరు బిందువునకు పడమరవైపు ఇరువదేడుభాగల దూరమున సంపాతము నొంది, తిరిగి ప్రాగ్గతితో మేషాదిబిందువుతో సంపాతము నొందును. ఈప్రకారము 3,600 (ముప్పదియారువందల) సంవత్సరములు ప్రాగ్గతితోను, తిరిగి 3600 ల సంవత్సరములు పశ్చాద్గతితోను మహాయుగమునకు (600) ఆరువందల పర్యాయములు చలించుచుండునవియు కనబడుచున్నది.

బ్రహ్మసిద్ధాంతమునందలి—

"శ్లో. ప్రత్యక్చలస్య మేషాదౌ
తులాదౌ ప్రాక్చలో భవేత్,
కర్కాద్యదిస్థా మృగాదిస్థా
సృష్టే రుదగహాజ్ముఖమ్.

ప్రత్యబ్దం యాంతి యామ్యోద
　　గ్గమనే విహితాపి యత్,
తత్పశ్చాచ్చలితం చక్రం
　　ఉపచారోఽయ మిత్యపి.

తతః పశ్చాల్లగ్నక్రాంతి
　　ప్రసంగాచ్ఛద్రిదృగ్లవాత్,
తతోఽన్యథాథ ప్రత్యబ్దం
　　కించిత్కించి ద్వ్రజంత్యపి.
పశ్చిమాంశే క్రమప్రాప్తి
　　ప్రాక్చక్రం చలితం హి న,
యావత్సప్తాది నిర్దిష్ట
　　స్థానం తావద్వ్రజంతి తే."

అనువచనములు సౌరసిద్ధాంతమును బలపర్చుచున్నవి.

ఇదిగాక సోమసిద్ధాంతము మొదలగు దైవార్ష సిద్ధాంతములు సౌరమతమును స్థిరపర్చుచున్నటుల గను పడును.

ఈయంశములనుబట్టి క్రాంతిపాత పరిడోలనముగ జరుగుచున్నటుల వ్యక్తమగుచున్నది. మనయార్యులలో ముంజాలాదులు క్రాంతిపాత ఇతరగ్రహపాతలవలె వక్రముగనే భగణపూర్తి జేయుచున్న దనిరి.

భాస్కరులవారు—

"శ్లో. అయనచలనం యదుక్తం
　　ముంజాలాద్యైస్స ఏవాయం,
తత్పక్షే తద్భగణాః
　　కల్పే గోంగర్తునందగోచంద్రాః.

వ్యా. యే, అయనచలనభాగాః ప్రసిద్ధాః త ఏవ విలోమగస్య క్రాంతిపాతస్య భాగాః, మేషాదేః పృష్ఠతః తావ ద్భాగాంతరే క్రాంతివృత్తే విషువద్వృత్తం లగ్న మిత్యర్థః. తం విలోమగం క్రాంతిపాతం—"

అని సిద్ధాంతశిరోమణియందు వ్రాసినందున, క్రాంతిపాత సదా పశ్చిమగతితో జరుగుచున్నటుల ముంజాలాదులు భగణకథనపూర్వకముగ దెల్పిరి.

ఇంతియకాక వీరు—

"శ్లో. విషువత్క్రాంతివలయో
　　స్సంపాతః క్రాంతిపాత స్స్యాత్
తద్భగణా స్సౌరోక్తాః
　　వ్యస్తా అయుతత్రయం కల్పే."

అని చెప్పుటవలన వీరికాలమున సౌరమునందు క్రాంతిపాతకు సదా వక్రగతి కలదనెడు పాఠ మున్నటులును, అందు తద్భగణములు మహాయుగమునకు ముప్పదిగ జెప్పబడియున్నటులును వ్యక్తమగుచున్నది. అందు వక్ర భ్రమణ మనునది సరియైనదనియు, ముప్పదిభగణము లనునది సరియైనది కాదనియు వీరి యభిప్రాయమైనటుల వ్యక్త మగుచున్నది.

గూఢార్థప్రకాశకారుల కాలమునకు—

"శ్లో. త్రింశత్కృత్వో యుగే భానాం."

అను పాఠ మున్నటు లగపడుచున్నది గాని వక్రగతిని దెలియజేయు పాఠ మున్నటు లగపడదు.

పాశ్చాత్యజ్యోతిస్సిద్ధాంతులు సంపాతము పైని వ్రాసినరీతిని పెండ్యులమువలె జరుగక సదా ప్రత్యగ్గతితో దీర్ఘవృత్తమునందు 25,800 ల సంవత్సరములకు ఒకమారు భగణపూర్తి జేయుచున్నదని చెప్పెదరు. ఇందునుబట్టి దీనిగతి సంవత్సరమునకు ౫౧ $\frac{౭౭}{౨౫౮}$ వికలలు గలదైయున్నది. దీనిగతి సంవత్సరమునకు 52 వికలలనియు, ప్రకృతము 50 వికలలకు పైబడియున్నదనియు జెప్పెదరు. బ్రహ్మసిద్ధాంతము మొదలగునవి సౌరమతమును బలపర్చుచున్నవి.

భాస్కర, ముంజాలాదులు పాశ్చాత్యమతమునే యవలంబించిరో, పాశ్చాత్య సిద్ధాంతులు ముంజాలాది మతమునే తీసికొనిరో తెలియదు, గాని యందు దొరికిమ తము రెండవవారి మతమున కుపష్టంభకముగ నున్నది.

సాయనులవారు గవామయనములు మొదలగు సత్రములను జేయుకాలమును నిర్ణయించుచు, వానిలో వచ్చెడి ఏకాష్టదినము విషయమై తాండ్యబ్రాహ్మణము లోని (౫-౯) శ్రుతి "చైత్రపూర్ణిమాసే దీక్షేరన్. చక్షుర్వా ఏత త్సంవత్సరస్య య చ్చైత్రపూర్ణిమాసో ముఖ

తో వై చక్షుః ముఖత ఏవ తత స్సంవత్సర మారభ్య దీక్షంతే తస్య న నిర్యాంతి." అను శ్రుతికి చైత్రపూర్ణిమ నాటి రాత్రి సంవత్సరారంభ మనగా ఉత్తరాయణ మారంభమైనదని వ్రాసిరి. ఇందునుబట్టి క్రాంతిపాత పునర్వసులో నున్నటుల గాన్పించుచున్నది.

శతపథబ్రాహ్మణములో (౯-౨-౨-౧౮) శ్రుతి: "ఏషా వై సంవత్సరస్య ప్రథమా రాత్రిః. యత్ ఫల్గునీ పౌర్ణమాసీ." తైత్తిరీయ బ్రాహ్మణం. (౧-౧-౨-౮)- "ఏషావై ప్రథమారాత్రిః-సంవత్సరస్యయదు త్తరేఫల్గుణీ." సాంఖ్యాయన బ్రాహ్మణం (౪-౪)-"ముఖంవా ఏత త్సంవత్సరస్య యత్ఫల్గుణీమాసి" అను శ్రుతికి సాయనుల వారు శ్రు. ఉత్తరయో రాదధీత= ఏషావై ప్రథమా రాత్రిః, సంవత్సరస్య యదుత్తరే ఫల్గుణీ- అను ఆధాన బ్రాహ్మణములోని శ్రుతిని వ్రాయుచు ఫాల్గుణపూర్ణిమ నాటి రాత్రి ఉత్తరాయణప్రారంభమని వ్రాసిరి. ఇందునుబట్టి మరియొకకాలమునకు క్రాంతిపాత మృగశీర్షానక్షత్రములో నున్నటుల వ్యక్తమగుచున్నది.

గోపథబ్రాహ్మణం (౧-౧౯) శ్రు. "ముఖముత్తరే ఫల్గుణ్యౌ పుచ్ఛం పూర్వే 'త ద్యథా ప్రవృత్తస్యాంతే' సమేతౌస్యాతాం. ఏవ మేత త్సంవత్సరస్యాంతౌ సమేతౌ భవతః". ఈశ్రుతుల ప్రకారము ఉత్తర పూర్వఫల్గుణీనక్షత్రములు సంవత్సరముయొక్క ఆద్యంతములనియు, ఫాల్గుణపౌర్ణమినాటిరాత్రి ఉత్తరాయణారంభమనియు వ్రాయుచు, గణితరీతిని ఉత్తరాయణప్రవేశము ఉత్తరాభాద్ర ప్రథమచరణాంతం, మేషాయనం ఆర్ద్రాదిపాదారంభమగు మృగశీర్షాంతం, దక్షిణాయనం ఉత్తరఫల్గుణీ పదియవభాగము, తులాయనం మూలా ద్వితీయచరణాంతం, అగును గాన అశ్వినీప్రథమకళారంభమునకు ౬౩ (అరువదిమూడు) భాగలదూరముగల మృగశీర్షానక్షత్రములో పాత యున్నటుల వ్యక్తపరచిరి. భారతయుద్ధకాలమును నిమర్శించునపుడు, ఆ యుద్ధకాలమునకు క్రాంతిపాత కృత్తికాచతుర్థపాదములో నున్నటు లగపడెను. వీనిని బట్టి సౌరాది సిద్ధాంతములయందు జెప్పబడిన ప్రకారము క్రాంతి పరిడోలనగమన మనుటకు అవకాశమియ్యదు.

సౌరాదులందు క్రాంతిపాత సమగతితో పరిడోలనముగా దిరుగుచున్నటుల వ్యక్తమగుచున్నది. సమగతితో బోవునపుడు పరావృత్తి యనుపపన్నము. ప్రతిఘాత ముండునపుడు పరావృత్తియుండును గాని ద్వితీయాది పరివర్తనలయందు సమగతి విరుద్ధము—ప్రతిఘాతము మర్నిరూప్యము. ఇదిగాక ఇతరగ్రహపాతలకు పశ్చిమగతి జెప్పుచు సంపాతమునకు మాత్రము పరిడోలనము చెప్పుటకు కారణ మగపడదు.

క్రాంతిపాత వక్రముగనే భచక్రభ్రమణము జేయు నెడల కాలక్రమమున మకరసంక్రమణము, పుష్యమాసము సూర్యుడుత్తరమునుండి దక్షిణమునకు మరలునపుడు కావలసివచ్చును. అటులయినచో, "మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ" ఈ మొదలగు శ్రుతివాక్యములకు విరుద్ధములుగ ఋతువులు మారవలసివచ్చును.

ఈపై నుదాహరించిన యంశములనుబట్టి ద్వివిధగతులలో నేది నిర్ణయించుటకు అవకాశ మియ్యలేదు.

సంపాత గమనమునకు గూఢార్థప్రకాశికయందు ఈశ్వరేచ్ఛయే కారణమని వ్రాసిరి. ఇందువిషయమై యోచించ నవసరము లేదు. ధ్రువకదంబముల పరస్పర మత్స్యాకార భ్రమణమువలన పరిడోలనగతి గలిగినదని కొంద రనిరి.

ధ్రువమునకు చలన మెటులసంభవించునో, మత్స్యాకారము పరిడోలన మెట్లగునో యోచింపవలసియున్నది.

భ్రమించుచున్న పృథ్విపై సూర్యాకర్షణ పడుటనుబట్టి యాభూభ్రమణమునకు వంపుగలుగుటవలన సదా పశ్చిమగతి గలిగినదని పాశ్చాత్యజ్యోతిస్సిద్ధాంతజ్ఞు లనిరి. భ్రమించుచున్న భూమిపై బడు సూర్యాకర్షణవలన గలుగునంపు క్రాంతికక్షయొక్క వంపు అయియుండవచ్చును గాని సంపాతగమనకారణ మెట్లగునో తెలియదు.

ఈయంశములనుబట్టి సంపాతగమనకారణాదుల యథాస్థితి సంపూర్ణముగ దెలియనందున స్థిరపర్చుటకు వీలు లేకపోయినది. కాన నిందువిషయమై విద్వాంసులు పరిశీలించి యథార్థమును సయుక్తికప్రమాణముగ దెలియజేయ వేడుచున్నాడను.

---



సర్ కె. వి. రెడ్డినాయడుగారు

దక్షిణాఫ్రికాయందు ఇండియాప్రభుత్వపు ఏజంటుగ నున్న రైటు హానరబులు శ్రీనివాసశాస్త్రి గారు 1929 సంవత్సరము ప్రారంభమున ఉద్యోగము వదలనుద్దేశము తెలిపిరి. ఈ ఉద్యోగమును అనధికారునకే ఇవ్వవలయునని ఇండియా ప్రభుత్వమువారు తీర్మానించుకొని సర్ కె. వి. రెడ్డినాయుడుగారిని ఇండియాప్రభుత్వపు ఏజంటుగ ప్రభుత్వమువారు నియమించిరి. ఈసంవత్సరము (1928) ముగియగనే రెడ్డినాయుడు దక్షిణాఫ్రికాకు ప్రయాణమై వెళ్లెదరు.



ఏచూరి నరసింహాము పంతులుగారు

విజయనగర సంస్థానమున మరల దివానుగా నియమితులైరి.

# ఏచూరి నరసింహము పంతులుగారు, య. ఎ.

(విజయనగర సంస్థాన మంత్రిశేఖరులు).

భోగరాజు నారాయణమూర్తి గారు

(పంచరత్నములు)

శ్రీయున్ భూమియు నంక భాగముల భాసిల్లన్ శ్రితశ్రేణికిన్
శ్రేయోదాయకుఁడై జగత్త్రితయమున్ క్షేమించు దైవంబు తా
నాయుర్వృద్ధి యశస్సమృద్ధియును నిత్యంబుం బ్రసాదించుతన్
మా యేచూరి నృసింహ సూరినుత సన్మార్గైక సంచారికిన్.

క్రమ మేపార సమస్తకార్యములు చక్కం గూర్చి పట్టాభిషే
కము గావించితి వీవ రాజునకుఁ బ్రక్కన్; మంత్రి వై తీవ; మేల్
సమయంబుం గనిపెట్టి యింకఁ గవితాసామ్రాజ్య పట్టాభిషే
కము నైతెమ్ము స్వయమ్ముగా నృపునకుం గావింపు మంత్రీశ్వరా!

రాజుల్ మంత్రులె పూర్వ మాంధ్రకవితా రాజ్యంబుఁ గాపాడి రా
రోజుల్ పోయెఁ గవిత్వతత్త్వకలనా రూఢున్ నినుం బూపవా
గ్రాజామాత్యునిఁగాఁగ వాణిపతితోడం జెప్పి చేయించె మీ
రాజామాత్యు లదే సుమీ కవితభారం బింక మంత్రీశ్వరా!

యతులుం బ్రాసలు హాజరుల్ మనవిసేయన్ సర్వశాస్త్రార్థసం
గతులున్ మేల్పరివార మై కొలువ, శృంగారాది నానారస
ప్రతతుల్ కార్య భరంబు దీర్పఁ, గవితారాజ్యంబు పాలించు ధీ
యుతులన్ సత్కవిరాజులన్ మఱవ వీ వోహో, యమాత్యాగ్రణీ!

స్తోత్రపాత్రం బైన పత్రికన్ గాలేజి యశము భాసిలఁ జేసినట్టికలము
ఆంగలోపాధ్యాయు లలర వేతనముల నధికంబు గావించినట్టికలము
నవ్యకావ్యధురీణు నను మహారాజున కాస్థానకవిఁ జేసినట్టికలము
బహుకుటుంబంబుల కహరహంబును జీవనాధారములఁ గూర్చునట్టికలము
ధరణిఁ గలకాలమును నిట్లు తావకీన-కరమునం గాలుచుండెడుఁ గాక యనుచుఁ
బ్రజలు వాంఛింత్రు సజ్జనప్రతతివినుత-మహితగుణధుర్య, నరసింహమంత్రివర్య!

---






బట్టలు ఎప్పుడు తెస్తావ్?


బట్టలు తెస్తావా? లేదా?


నా యనా! బట్టలు తే వూ?
తెస్తానెళ్ళవయ్యా


మూడు బట్టలు కనబడ లేదండి






© తలిశెట్టి రామారావు.

# కీ. శే. లాలా లజపతిరాయి

## బాల్యదశ, విద్యాభ్యాసము

పాంచాల రాష్ట్రమున లూడియానా మండలమున జగ్రాను అను పట్టణమందు ౧౮౬౫ సం. లాలాజి జననమొందెను. ఈతడు అగర్వాలాజాతి వైశ్యుడు. ఈతని కుటుంబికులు ధనికులు కాకపోయినను చాల గౌరవముగ నుండిరి. లాలాజి తండ్రియగు లాలా రాధాకృష్ణగారు మొదట ప్రభుత్వ పాఠశాలలో ఉరుదు పండితుడుగ నుండిరి. ౧౮౮౮ లో స్వామిదయానంద సరస్వతిపట్ల రాధాకృష్ణగారి కత్యధికమగు భక్తి కుదిరెను. లాలాజితల్లి గూడ గొప్పశీలవతి. ఆడంబరరాహిత్యము, మితవ్యయము మున్నగునవి ఆమెవలననే లాలాజి నేర్చుకొనెను. రాధాకృష్ణగారు ఉపాధ్యాయు డగుటచేతను, విద్యాభిమానియగుటచేతను లాలాజికి ఉత్తమ విద్యను చాల శ్రద్ధతో నేర్పించిరి. లాహోరులోని ప్రభుత్వకళాశాలయందు లాలాజి రెండేండ్లు విశ్వవిద్యాలయ విద్యార్థివేతనమును బడసి విద్య నభ్యసించెను. ౧౮౮౫ లో న్యాయశాస్త్ర ఉన్నతపరీక్షయందు లాలాజి కృతార్థుడయి, హిస్సారు అను పురమున న్యాయవాద వృత్తి ప్రారంభించెను.

## ఆంగ్ల వేదకళాశాల

దయానంద ఉద్యమమునుగూర్చి గట్టిపట్టుదలతో పనిచేసిన యువకులు ముగ్గురు: లాలా లజపతిరాయి, పండిత హన్సరాజు, పండిత గురుదత్త విద్యార్థిగార్లు.

౧-౬-౧౮౮౬ తేదీని వీరు ముువ్వురును లాహోరు నగరమున దయానంద ఆంగ్ల వేదకళాశాలను స్థాపించిరి. అందిపుడు ఎం. ఏ. డిగ్రీవరకును విద్య నేర్పబడుచున్నది. ప్రారంభకాలమున ఆ కళాశాలలో జాతీయ విద్యను నేర్పవలెనని వీరు సంకల్పించిరి. హిందీ, సంస్కృతము, ఆంగ్లము అను నీ మూడు భాషలను, సాంకేతిక విద్యలను నేర్పుటకు అపు డాకళాశాల యేర్పరుపబడినది. అప్పటి కింకను లాలాజి హిస్సారులోనే యుండెను. సమర్థుడగుటచే న్యాయవాదిగ అతడు చాలధనము నార్జించుచుండెను. అచట మూడేండ్లు మునిసిపలు సంఘమునకు కార్యదర్శిగ నుండి చాల మేలుచేసెను. ౧౮౯౨లో తన నివాసమును లాహోరునకు మార్చుకొని అచట న్యాయవాదిగ పనిచేయ నారంభించెను.

## మాతృదేశాభిమానము, రాజకీయము

అప్పటినుండి లాలాజి రాజకీయములందును, సంఘసేవయందును మిక్కిలి పాల్గొన నారంభించెను. సర్ సయ్యద్ అహమ్మదుగారు రాజకీయములందు తరువాతి దినములలో చూపిన భావపరివర్తనమును విమర్శించుచు లాలాజీ పెక్కు బహిరంగ లేఖలను వ్రాసెను. ఆసంవత్సరముననే అలహాబాదులో జరిగిన కాంగ్రెసు సభకు లాలాజి వెళ్లెను.

## అనాధ సేవ

౧౮౯౮ లో కఱవు పుట్టినపుడు లాలాజి లాహోరులో అనాధరక్షణోద్యమము ప్రారంభించెను. ౧౮౯౯-౧౯౦౦లో గూడ మరల అట్టి ఉద్యమమునే సాగించెను. మధ్యరాష్ట్రమునను, రాజపుత్రస్థానమునను, తూర్పువంగమునను ౨,౦౦౦ అనాధజనులను ఈతడు పోషింపగల్గెను. ఫిరోజపూరులో నొక గొప్ప హిందూ అనాధశరణాలయమును, మీరటులో నొక వైశ్య అనాధ శరణాలయమును స్థాపించి తానే కార్యదర్శిగ నుండి కొనసాగించెను.

## ఆంగ్లదేశ యాత్ర

౧౯౦౫ సం. అంతమున లాలాజిఆరోగ్యము చాల చెడిపోయెను. అపుడు ఆంగ్లదేశమున కేగి భారతదేశ స్థితిని దెలుపుటకు లాలాజియు, గోఖలేగారును ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి. అపుడే లాలాజి ఆంగ్లదేశమున కేగెను. అందువలన ఆరోగ్యమును కుదిరెను. ఆంగ్లదేశమున పెక్కుతావుల గొప్పగొప్ప సభలయందు లాలాజి గంభీరోపన్యాసముల నొసంగెను. పిమ్మట అమెరికా దేశమున కేగి అచట విద్యాసంస్థలను పరిశీలించెను.



కీ. శే. లాలా లజపతిరాయిగారు

అమెరికా నుండి మరల ఆంగ్లదేశమునకేగి గోఖలేగారితో గలసి అచటను భారతదేశముగూర్చి చాల ప్రచారము గావించెను. పెక్కుసార్లు విద్యార్థులకు చరిత్రనుగూర్చి ఉపన్యాసముల నొసంగెను.

విద్యావిషయమున లాలాజి చాల సేవచేసెను. దయానందకళాశాలకు ఉపాధ్యక్షుడుగ నుండుటయే కాక పదేండ్లపాటు గౌరవ కార్యదర్శిగకూడ నుండెను. ఆకళాశాలకు చాల ధనముగూడ నొసంగెను. జలంధరు ఆంగ్ల సంస్కృత కళాశాలకుగూడ లాలాజి కార్యదర్శిగ నుండెను.

## ప్రవాసము

లాలాజికి స్వదేశోద్యమమునందు అత్యధికమగు అభిమానము. ఈఉద్యమమునం దభిమానము గలిగియుండుటయే దేశభక్తికి ముఖ్యలక్షణమని లాలాజి నుడువు చుండెను. ౧౯౦౫ సం. కాశీలో కాంగ్రెసు జరిగినపుడు వంగరాష్ట్రమునందలి కఠినశాసనముల గూర్చి లాలాజి తీవ్రముగు ఉపన్యాస మొసంగెను అప్పు డతడు ప్రభుత్వమును ఎట్టిభయము లేక విమర్శించెను కాని అత డెన్నడును చట్టమునకు విరుద్ధముగ నేపనిని జేసియుండ లేదు. ఆంగ్లోఇండియను పత్రికలు నిరంతరమును దొరతనమును ప్రోత్సాహపరచుచుండుటచే ౧౯౦౭ లో సర్ డి. ఇబ్బట్సనుగారి అధికారముక్రింద పంజాబుదొరతనమువారు లాలాజీని అతిరహస్యముగను, అత్యాకస్మికముగను విదేశములకు గొంపోయిరి.

## రాజనీతిజ్ఞత

రాజకీయములందు లాలాజికి అకుభిశంక యెన్నడును లేదు. అతడు కార్యశూరుడుగాని వాక్శూరుడు గాడు. అతని రాజకీయములు నిర్మాణకములు గాని నిర్మూలకములు గావు. కార్యదీక్షలేని వాచాలత నతడు నిరసించును. ౧౯౦౬ సం. కలకత్తాలో కాంగ్రెసు జరిగినపుడు పరమపూజ్యుడగు నౌరోజీ నిరూపించిన స్వరాజ్యాదర్శమే అతని లక్ష్యము.

## సంఘసంస్కరణము

రాజకీయములందు మాత్రమే కాక సాంఘికములందుగూడ లాలాజి అధికముగ పనిచేసెను. సంస్కరణమును ప్రోత్సాహపరచున ట్లుపన్యసించు సమయముల నిరసింపదగిన కపటవర్తనములను లాలాజి తీవ్రముగ విమర్శించుచుండెను.

## వాగ్ధాటి-గ్రంథరచన

నిండు సభలలో నుపన్యసించుటయందు సమర్థులగువారిలో నొకడుగ లాలాజి భావింపబడు చుండెను. పాంచాలమున ఉర్దుభాషలో నుపన్యసింపగలవారలలో లాలాజి ఒకడు. గ్రంథములలో వీరిశైలి కడుసులభముగను, పటిష్ఠముగ నుండును. వాదములందు ప్రతిపక్షుల లోపములను గుర్తించి ఖండించుటలో వీరు కడు నిపుణులు. లాలాజి ఉర్దూభాషలో చాలమంది జీవితచరిత్రలను వ్రాసెను. ఇటలీ భారతదేశములందలి దేశాభిమానుల చరిత్రలను దేశభాషలలో వ్రాసెను. తరుచుగ మాసపత్రికలలో ఆంగ్లభాషయందు వ్యాసములు వ్రాయుచుండెను. బ్రిటిషు, అమెరికా దేశములపత్రికలకుగూడ తరుచు వ్రాయుచుండెను. ఆర్యసమాజమునుగూర్చి గొప్పగ్రంథమును వ్రాసెను. చిరకాలమునుండి ఆర్యసమాజమున కతడు చాల సేవచేయుచుండెను. అమెరికా దేశపు అనుభవములనుగూర్చి "అమెరికా" యనుగ్రంథము నతడు వ్రాసెను. యుద్ధమునకుపూర్వము రెండవసారి అమెరికాకు పోయినపుడు అచట విపులముగ నతడు ప్రచారము జేసెను. 'మిస్ మేయో'కు జబాబుగ నతడు వ్రాసిన "అన్‌హాపీ ఇండియా" అనుగ్రంథ మాతని విమర్శన సమర్థతను వెల్లడిచేయుచున్నది.

## అమెరికాయందు

యుద్ధసమయమున లాలాజి భారతదేశమున లేడు కాని భారతసేనను రణరంగమునకు బంపుటకు పోర్డించి ప్రభువు నిశ్చయించెనని వినుటవలన అధికోత్సాహము కలిగి, వైసురాయి చర్యను ప్రశంసించుచు వెస్టుమినిస్టరు గజెటుకు వ్రాసెను. లాలాజిరాజభక్తి యిటులు వెల్ల

డింపబడినను, యుద్ధము ముగియుపరకు అతడు భారత దేశమునకు వచ్చుటకు దొరతనమువా రంగీకరింప లేదు. కావున అచ్చట పెక్కు-సంవత్సరము లుండవలసివచ్చెను. అచ్చట నున్నపుడు భారతదేశముగూర్చి పదిలక్షుల లేఖ లసు లాలాజి ప్రకటించెనని తెలియుచున్నది. 'అచ్చట ఇండియను బీరో' యను సంఘము నేర్పరచి, 'యంగు ఇండియా' అను పత్రికను ప్రకటించుచుండెను. దాని నమెరికావారు శ్రద్ధగ చదువుచుండిరి.

### ఇండియాకు వచ్చుట-కాంగ్రెసు అధ్యక్షత

౨౦-౧౧-౧౯౧౯ లో న్యూయార్కు-నందు లాలాజి వీడ్కోలు సందర్భమున గొప్పసభ జరిగెను. అమెరికా వారు పలువురు ప్రశంసించుచు నుపన్యసించిరి. సార్వభౌముని ప్రకటనవలన లాలాజి తిరిగివచ్చుట కభ్యంతరము తొలగిపోయెను. ౨౦-౨-౧౯౨౦ తే. లాలాజి అమెరికా నుండి బొంబాయి వచ్చినపుడు ఆ శేషప్రజలు లాలాజికి నిరుపమానమగు స్వాగతమును చెప్పిరి. ౧౯౨౧ సం. కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసుసభకు లాలాజి అధ్యక్షత వహించెను. ఆసభలోనే గాంధిమహాత్ముని అస హాయోద్యమ తీర్మానము అమోదించబడెను. అటు పిమ్మట పాంచాల సింహముయొక్క- గంభీరగర్జనలు, వ్రాతలు, భారతదేశ సంచారములు, హిందూసభాసంస్థాపనలు మున్నగు కార్యములు సువిదితములు. మొన్న మొన్న లాహోరులో సైమనుసంఘ బహిష్కారము నుద్దేశించి లాలాజి మున్నగు ప్రముఖుల నాయకత్వమున జరిగిన మహోత్సవమున పోలీసుల లాఠీదెబ్బలు తగిలిన నాడు మొదలుకొని క్రమముగ ఆరోగ్యము నశించి, చివరకు ౧౭-౧౧-౧౯౨౮ నాడు లాలాజి పరమపదించెను. ఈదేశ సేవాధురంధరుని హఠాన్మరణము భారతదేశమును దుఃఖసముద్రమున ముంచివైచినది.

యస్. శ్రీనివాస అయ్యంగారు, సర్. సి. పి. రామస్వామి అయ్యరు, డాక్టరు పట్టాభిసీతారామయ్య, సామి వేంకటాచలచెట్టి, అబ్దుల్ హమీద్ ఖాన్, జోష్ యా సి. వెడ్జివుడ్, జమల్ మహమద్ సాహెబు, దివాన్ బహదూర్ టి. రంగాచారియర్, డాక్టరు వరదరాజులు, ఏ. రామస్వామి మొదలియారు, మహాత్మాగాంధి, పండిత మోతీలాల్ నెహ్రూ, డా. బిసెంటు, పండిత మదనమోహనమాళవీయ, యమ్. ఏ. జిన్నా, జే. యన్. బసు, మౌలానా షౌకత్ ఆలీ, మహమ్మద్ యాకుబ్, దివాన్ చమన్‌లాల్, మిసెస్ సి. ఆర్. దాస్, డా. మహమ్మద్ ఇక్బాల్, సర్ పి. ఠాకూర్ దాస్, సర్ పి. సెథ్నా, హజరత్ మోహాని, సర్ యమ్. షాఫీ, కే. సంతానం, సర్. ఏ. కాదర్, కలనల్ క్రాఫర్డు, సర్ ఏ. రహీమ్, ఏ. ఆర్. అయ్యంగారు, సత్యమూర్తి, వి. వి. జోగయ్య, సర్ టి. బి. సప్రు, సి. వై. చింతామణి, రామస్వామినాయుడు, సేన్‌గుప్త, సుభాష్‌చంద్రబోస్, ఆనరబిల్. వి. రామదాసు, ఏ రంగనాథమొదలియారు, జమ్నా దాస్ మెహతా, జయకర్, జి. డి. బిర్లా, డి. పి. ఖైతర్, ఆర్. ఛటర్జీ, గిర్ధరిలాల్, డా. జి. నరంగ్, డా. యమ్. అలమ్, ఏ. హెచ్ ఘుజ్నవీ, కే. యస్. రామ్, బి. యల్. రల్లియరామ్, యస్. సింహ, మనోహరలాల్, ఎమ్. కే. ఆచార్య, బి. ఏ. సయ్యాన్, బి. శివరావు, మౌలానా అబుల్ కలామ్ అజాద్, బిపిన్ బాబు, పోలక్, పెథిక్ లారెన్సు, ఫెన్నర్ బ్రాక్ వే, భార్గవ్—ఈ మొదలైన వారు శ్రీ లాలా లజపతిరాయిగారి నిర్యాణమునకు సంతాపము దెలిపిరి.

## లజపతిస్మృతి

చల్లా పిచ్చయ్యశాస్త్రి గారు

భరతమాతృకమెదం బరఁగు నాయకరత్నలలితహారములోని కొలికిపూస
దేశసాఖ్యోద్యాన ధీపుష్పవికసన మహితకళాచంద్ర మండలంబు
శమవజ్రకవచంబు నవదరించి సతంబు సకలదిశల్ కొన్న శౌర్యశాలి
బాల్య మాదిగ నేఁటివఱకును హైందవ ప్రథితిలోఁ జనిన పురాణమూర్తి
ప్రణుతిపుష్పంబులను దన పైనఁ జల్లు-భారతీయుల హృదయప్రపంచమందు
నదిగొ! పాంచాలలోక పంచాననంబు-తాను పోలేదు "లజపతి" ధరణి నిండె.

---

# భారతీయ మహిళామండలి



### శ్రీమతి చెరియన్ జాకోబ్ సతి

కోయంబత్తూరు మునిసిపాలిటీ క్రొత్త సభ్యురాలు.

### శ్రీమతి డి. శ్రీవాస్తవసతి గారు

జబ్బల్పూరు మునిసిపాలిటీ క్రొత్తసభ్యురాలు.

### శ్రీమతి మాయాదేవి గారు

కలకత్తా వాస్తవ్యురాలు. భారతీయస్త్రీలపక్షమున సైమనుసంఘమునకు నివేదిక పంపినది.

### శ్రీమతి జార్జి డి' సిల్వాసతి గారు

సింహళమున స్త్రీలకు గూడ వోటింగు అధికారము కావలెనని పాటుపడుచున్నది.



### శ్రీమతి శారదా గౌరీమేహతా గారు

బరోడా సంస్థాన ప్రాచ్యమహాసభ స్వాగతకారిణీసమితి కధ్యక్షురాలు.

### శ్రీమతి నయనాదేవి గారు

బీహారీస్త్రీ. సంస్థానవేతనము పొందినది: జినీవా యందు జరుగు అంతర్జాతీయ మహిళామహాసభకు హాజరు కానున్నది.

### శ్రీమతి గంగూబాయి పట్వర్ధన్నుగారు

పూనా వాస్తవ్య. ఇంగ్లండునందు 'కిండరుగార్టెను' విషయమున ప్రత్యేకాధ్యయనము కావించి ఈనడుమనే తిరిగి వచ్చినది.

### శ్రీమతి ఎమ్. కేట్కారుకన్య

పూనా వాస్తవ్య. ఉత్తమవిద్యాభ్యాసనమునకై యిరోపా వెళ్లినది.



ఆంధ్రవిశ్వకళాపరిషత్తు (ద్వితీయ స్నాతకసభయందు) బి.ఎ. పట్టముల బడసిన ప్రథమ స్త్రీలు:

శ్రీమతులు కాకర్ల రుక్మిణమ్మగారు; దేవళ పార్వతీబాయిగారు; నాన్సీ శిఖామణిగారు; జి. దేవానంనంగారు; రా. వెం. సుబ్బమ్మగారు.



శ్రీమతి రాపూరి వెంకటసుబ్బమ్మగారు

ఈనడుమ జరిగిన ఆంధ్రవిశ్వకళాపరిషత్సభయందు 'ఉభయభాషాప్రవీణ' యనుపట్టమును బొందెను. ఈ పరిషత్తునందు ప్రాచ్యపట్టభద్రబిరుదము ప్రథమమునబొందినఆంధ్రవనిత యీమెయే. ఈమె యిపుడు విశాఖపట్నము మేరీహైస్కూలునందు ప్రధానాంధ్రోపాధ్యాయగనున్నది. ఈమె సుప్రసిద్ధ వాఙ్మయనిష్ణాతులగు శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహముగారి మేనగోడలు. ఈమెభర్తగారు బెజవాడలో డాక్టరుగ నుండెడివారు; కీర్తిశేషులైరి.



శ్రీమతి రామునిగారు

బళ్ళారి పురపాలక సంఘసభ్యురాలుగ నియమింపబడిన ప్రథమస్త్రీ.



శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మగారు

విశాఖపట్నము జిల్లా విద్యాసంఘసభ్యురాలు. విశాఖపట్నము పిచ్చిఆసుపత్రి, ఘోషాఆసుపత్రుల పరిశీలనసంఘమున సభ్యురాలు. ఆ జిల్లాయందు సంఘసంస్కారమున పాల్గొనుచున్న విదుషీమణి.

# కలువకన్నె

పువ్వాడ శేషగిరిరావుగారు, చోడవరపు జానకిరామయ్య గారు

నీకన్నుంగవసొంపు నీలములు కానీ; పేర్మి త్రేకత్తి నీ
త్రేకుల్ తీయని తేనియల్ కురియనీ; బృందావనమ్మంతయున్
వాఁకల్ కట్టి భవత్కృపారసము పైపైఁ బాఱనీ; యెన్నఁడో
నీకై చేసిన నాతపమ్ము ఫలియించెన్ నేఁడు నీలాలకా.

నెలబాలుండు భవన్మతంబు మఱలించెన్ గాక మున్నెన్నఁడేన్
గలదే యిట్టి తెఱంగు!-మోము ముడువంగా నేల?-నీకోసమై
తొలికారై సొబగీను జవ్వనముకై తోతెంచితిన్ నీప్రభా
మలవీచీ నికురుంబమందు వెలయింపన్ నీకళానందముల్.

నీకై దివ్యపథానురక్తి వరియించెన్ నన్ను-నీకోసమై
నా కీసన్న్యసన ప్రసక్తియును- ఉన్మాదంబు నీకోసమే;
నా కీజన్నియ వట్టి యుండుటయు చానా, నీకుఁగా వచ్చె-నీ
కై కౌతూహలవృత్తి యేటి కుదయంబయ్యెన్ సరఃకన్యకా!

సారెకుసారెకున్ బరవసమ్మున నీతొలిజవ్వనంబుకై
కోరి భవన్మనోజ్ఞరుచి కోరకమైన దినమ్ము లాదిగా
నారసి యేఁగుచుంటి వగపై పగలంతయు పోవుచున్నఁ గా
సారము నీమొగమ్ము చిఱు సొరులు చిమ్మ దదేమి చిత్రమో!

(?) ఆనీలంపున్ జెలిమబ్బువెన్క సగమై యందందు తారాడువాఁ
డా నీమోహపువన్నెకాఁడు?- గురుభార్యాసంగ మాపేక్షచే
మేనన్ వస్త్రములేక మింటఁబడి 'పేర్మిన్ నూలుపోఁ గిచ్చువాఁ
డైనన్ గానఁ బడం' డటన్న వగ నింతైనాఁడుసూ! కోమలీ!

అది యుదయావసాన సమయమ్మున వాయువు తెచ్చి యిడ్డసూ
డిద, కొస తేల సాఁగిన మిళింద కుమారిక సన్నగొంతుతో
పదనయి కమ్మనై చెవికి పండువు చేసెడి గాలిపాటలో
వదనములాని చొక్కి రసవంతముగా సుఖియింతు మో సఖీ!

---

# ఆంధ్రసభలు-నంద్యాల-౧౯౩౭ : తీర్మానములు

## ఆంధ్రమహాసభ

౧

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి అకాలమరణమునకు ఈ సభవారు చింతించుచు వారి యాత్మకు శాంతినొసంగ నీశ్వరుని ప్రార్థించుచు, వారారంభించిన రామదండు ఉద్యమమును నెలకొల్ప వలెననియు వారు దలపెట్టియుండిన, రామాలయ నిర్మాణమును నెరవేర్పవలెననియు నీసభవా రాంధ్రదేశసోదరులను హెచ్చరించుచున్నారు.

౨

దత్తమండల వాస్తవ్యులై యుండి యాటు పిమ్మట కృష్ణామండల మండలి తునికేగి యసహాయోద్యమమున కృషిచేసి కారాగార ప్రాప్తినంది పలు ఇడుములబడి యిటీవల నసువులగోల్పోయిన రాళ్లపల్లి కాశన్నగారి మరణమునకై చింతించుచు, వారి యాత్మకు శాంతి నొసంగ నీశ్వరుని ప్రార్థించుచు దమ యనుతాపము నీసభవారు కీర్తిశేషుల కుటుంబమునకు దెలుపుచున్నారు.

౩

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించి మద్రాసు శాసన సభవారు తీర్మానముచేసియు కూడ నది ఫలోన్ముఖము కాలేదు. కనుక ఇండియా శాసనసభలోని ప్రతినిధులు వెంటనే చర్య పుచ్చుకొనవలసినదని ఈసభవారు కోరుచున్నారు.

౪

బొంబాయి తదితరములైన రాష్ట్రములలో నాంధ్రులసంఖ్య హెచ్చుగనుండియు వారికి పాఠశాలలలోను, కళాశాలలలోను వారి మాతృభాషను నేర్పుటకు దగిన యవకాశముల నింకను గల్పింపనందుకు చింతించుచు, అట్టి ప్రయత్నము లిక నైన సత్వరముగ గావింపబడునని యీ సభవారు విశ్వసించుచున్నారు.

౫

ఆంధ్ర సెనేటువారును, శాసనసభ సెలెక్టుకమిటీ వారును తీర్మానించిన ప్రకారము ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రస్థానము అనంతపురముగా నంగీకృతము కావలయునని నిర్ణయించుచు నీ సభవారీవిషయమును శాసనసభా సభ్యులకు నిర్వర్తనీయముగ నిరూపించుచున్నారు.

౬

ఖరగపూర్ మున్నగు ప్రాంతములలోని యాంధ్ర కార్మికు లనుభవించుచుండు కష్టములకు నీ సభవారు హృదయ పరితాపము గనుపఱచుచు, వారి స్వాతంత్ర్య సంరక్షణకుగా సర్వవిధముల నాంధ్రులెల్లరు దోడ్పడవలెనని కోరుచున్నారు. నాయకత్వము వహించి వారిపరముగా పాటుబడుచుండు శ్రీయుతులు వి. వి. గిరిగారిని, వున్నవ రామలింగం గారిని ఈ సభవా రభినందించుచున్నారు.

౭

ఆంధ్రుల చరిత్రను ఉపక్రమించి వ్రాసి కీర్తి గడించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారికి 'ఆంధ్రచరిత్ర చతురానన' బిరుదమును; ప్రపంచములోని నాటకరంగములందంతట నవలీలగ పేరుపొందిన తాడిపత్రి రాఘవాచార్యులవారికి 'నాట్యకళాప్రపూర్ణ' బిరుదమును; బౌద్ధ చరిత్ర నిర్మాణ విఖ్యాతి వహించిన దుగ్గిరాల బలరామకృష్ణయ్య చౌదరిగారికి 'ఆంధ్రబౌద్ధవాఙ్మయ బ్రహ్మ' బిరుదము నొసంగి వారి నీసభవారు సన్మానించుచున్నారు.

## ౮

గతసంవత్సర మాంధ్ర స్థాయి సంఘమువారు ధన లోపముచే తాము నిర్ణయించుకొనియుండిన ప్రణాళిక యందలి యంశములలో నొక్కదానినైన నెరవేర్పలేక పోయిరి. ఈ సంవత్సరమయినను నాంధ్రమహాజనులు తను రీతిని ద్రవ్యసహాయముచేసి స్థాయిసంఘముచే సేవ సేయించుకొనగలరని యీ సంఘమువారు విశ్వసించు చున్నారు.

## ౯

రాజకీయేతర సభలకు, హైకోర్టువారి తీర్పును పాటింపక, నైజాం ప్రభుత్వమువారు ఏటేట బేబకీ హుకుమత్తు కావలెననుట, హుకుమత్ కోరబడినపుడు సరియైన సమయమునకు దాని నందజేయక పోవుట, నైజాంరాష్ట్రమందలి యాంధ్రోద్యమవ్యాప్తి నరికట్టు చున్నవని యీ సభవారు అభిప్రాయపడుచు, నికనైన అట్టి సభలను గావించుటకు బేబకీ హుకుమత్తును పొం దవలసిన యవసరము లేనట్లు ఉత్తరువు చేయవలయునని యీ సభవారు ఘనతవహించిన నైజాం ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

## ౧౦

తమలో పరస్పరసౌహార్దము నెలకొల్పుటకును, లోక కళ్యాణమునకు సహాయపడుటకును, పరస్పర సమావేశ సంభాషణము లవసరములగుటచే రాష్ట్రేతరాంధ్రులెల్లరు నేటేట నొకచో రాష్ట్రేతరాంధ్ర మహా సభ యను పేర నొక్క సభను సమావేశపరచుచు, నైక కంఠ్యములగు తీర్మానముల మూలమున జనసామాన్యమున కాంధ్రతోద్బోధన మొనరింపవలయునని యీ మహా సభవారు రాష్ట్రేతరాంధ్రులను హెచ్చరించుచున్నారు.

## ౧౧

ఈ క్రింద పేర్కొనబడిన వారీ మహాసభచే నాంధ్ర స్థాయిసంఘ సభ్యులుగ నెన్నుకొనబడిరి.

1 ఓ. లక్ష్మణస్వామిరావుగారు
2 కే. నాగేశ్వరరావుగారు
3 మద్దూరి అన్నపూర్ణయ్యగారు
4 గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
5 వి. యల్. శాస్త్రిగారు
6 కలచవీడు వెంకటరమణాచార్యులుగారు
7 క. కోటిరెడ్డిగారు
8 బులుసు సాంబమూర్తిగారు
9 ఎరి లక్కరాజు నాయుడుగారు, ఖుర్దపురం
10 కొండా వెంకటప్పయ్య పంతులుగారు

# ఆంధ్రరాష్ట్రీయమహాసభ

## ౧

కీర్తిశేషులగు మగన్‌లాలు గాంధి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, హకీం అజమలుఖాన్, గోపబంధు దాసుగార్లు పరమపదప్రాప్తి నందుటచే దేశమునకు గలిగిన లోటున కీసభవారెంతయు విచారమును దెలుపు చున్నారు.

## ౨

నెహ్రూకమిటీ నివేదికపై ఢిల్లీయందు సమావేశమైన అఖిలభారత జాతీయోప సంఘమువారు కావించిన తీర్మానము నీ సభవారామోదించుచున్నారు.

## ౩

లోగడ బెజవాడలో ఏర్పడిన సైమన్‌కమీషన్ బహిష్కార ఉపసంఘమువారు వెంటనే సమావేశమై కార్యక్రమమును నిర్ధారణచేసి తీవ్రమైన బహిష్కార ప్రచారమును జరుపవలెనని కోరడమైనది.

## ౪

తూర్పు గోదావరి, విశాఖపట్టణం జిల్లాలలో గొప్పవర్షములవలనను, గొప్పవరదలవలనను కలిగిన తీరని

నష్టములకు ఈ మహాసభవారు ఆప్రజలయందలి సంపూర్ణసానుభూతిని దెలియబరుచు చున్నారు. ఇండ్లు వాకిళ్లు పోయినబీదలకు తగుసహాయము వెంటనే చేయవలసియున్నందునను, పంటలు నష్టమైపోయినందున విత్తనములువగైరా రైతులకు సర్ఫరా చేయవలసియున్నందునను, ఇంకను యితరవిధములను తోడ్పడవలసియున్నందునను యీకార్యసానుకూల్యమునకై ఆంధ్రమహాజను లెల్లరును, ఆంధ్రసంస్థలన్నియును ధనసహాయము విరివిగా చేయవలెనని, వరదలవల్ల నష్టపడినవారికి పన్నులను మినహాయింపుచేయవలయునని ప్రభుత్వమువారిని, జమీందారులను ఈ సభవారు కోరుచున్నారు.

౫

ఇదివరకే ఎక్కువ పన్నులభారముచేతను, ఋణబాధలచేతను క్రుంగుచున్న కృష్ణా, గోదావరిజిల్లాల రయితులమీద రీసెటిల్మెంటు అనుపేర ఎక్కువపన్నులు వేయుటకు గవర్నమెంటువారు ప్రయత్నించుట అక్రమమనియు, అన్యాయమనియు ఈసభవారు ఖండించుచున్నారు.

౬

నాభా మహారాజైన శ్రీ రిపుదమన సింగుగారిని ప్రభుత్వమువారు నిష్కారణముగా రాజ్యభ్రష్టుని జేసియు నింకను తనివితీరక కొడైకెనాలునందు ప్రవాసితునిగా నొనర్చి రాజ్యము తీసికొని తనభార్యాపిల్లలనైన తనతోనుంచుకొనుటకు అనుజ్ఞ నిమ్మని కోరిన కోరికను గవర్నమెంటువారు నిరాకరించుటను ఈమహా సభవారు తీవ్రముగా గర్హించుచున్నారు.

౭

హిందూస్థానీ సేవాదళమున సభ్యులుగా జేరియు అట్లు చేరుటకు అవకాశములేనివారు విరివిగా విరాళముల నొసగియు ప్రోత్సాహము నొసగవలయునని ఆంధ్రదేశీయు లందరిని ఈసభవారు కోరుచున్నారు.

౮

రాబోవు సమావేశములు విజయవాడయందు జరుగునట్లు ఈసభవారు తీర్మానించుచున్నారు.

నంద్యాలాంధ్రసభ జరుగుటకు ముందుగా లజపతిరాయిగారి మరణవార్త తెలిసినతోడనే అవసరసభ యొకటి జరుపబడి యీ క్రింది తీర్మానము కావింపబడెను:

ఆజన్మాంతము మాతృదేశ స్వాతంత్ర్యమునకై తన సర్వస్వము నర్పించి సేవయొనర్చిన త్యాగమూర్తియగు లాలాలజపతిరాయిగారు హృద్రోగముచే నాకస్మికమరణముపాలగుటయు, సైమనుకమిషనుబహిష్కారార్థమై జరిగిన యూరేగింపును నడిపించుచుండగా పోలీసు అధికారి క్రూరుడై అమానుషమగు కుత్సితబుద్ధితో ఆయన వక్షోభాగమున కర్రతో మోదియుండిన యనతికాలములోనే యీమరణము సంభవించుటయును ఈ ఆంధ్రసభవారికి సంతాపమును గలుగజేయుచున్నదనియు, లాలాజీగారి కుటుంబమునకు సభవారు తమ సానుభూతిని తెలియజేయుచు వారి మరణమువలన కలిగిన తీరని కొరంత వారి కుటుంబమునకేకాక దేశమంతకును కలిగినదనియు, నిట్టి మహనీయుల ఆత్మత్యాగమువల్లనే ఆయా దేశ స్వరాజ్యసౌధము నిర్మాణము చేయబడుననియు తెలియజేయుచున్నారు.



సి. దొరస్వామి అయ్యంగారు
ఆంధ్రరాష్ట్రీయమహాసభాధ్యక్షులు - నంద్యాల



కె. కోటిరెడ్డిగారు
దత్తమండలముల మహాసభ కధ్యక్షులు - నంద్యాల



ప్రొఫెసరు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు
ఆంధ్రమహాసభాధ్యక్షులు - నంద్యాల
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ద్వితీయస్నాతకసభయందు
వీరు 'డాక్టరు ఆఫ్ లెటర్సు' గౌరవబిరుదము నొందిరి.



డాక్టరు ఆని బిసెంటుగారు
ఆంధ్రరాష్ట్ర సర్వపక్షమహాసభాధ్యక్షురాలు-నంద్యాల.



గా॥ వేమవరపు రామదాసుపంతులుగారు
బొంబాయిరాష్ట్ర
ప్రథమాంధ్ర సాంఘికమహాసభాధ్యక్షులు



## ఎల్లరికంటె బలసినస్త్రీ—పొట్టిమనుష్యుడు

కడచిన సెప్టెంబరు మాసమున ఇంగ్లండునందు జరిగిన 'బార్నెట్' తీర్థమున నిరువురు వింతమనుష్యులుండిరి.



ప్రపంచమున నెల్ల మిక్కిలి బలసిన 'టిటానియా' యనునామె ౧౭ వత్సరముల ప్రాయముగలిగి ౨౮ స్టోనులు (౩౯౨ పౌనులు) తూగినది.

'కేరో' అను ఒక 'ఎస్కిమో' పురుషుడు ౩౮ వత్సరముల ప్రాయముగలిగి ౨౯ అంగుళముల యెత్తు మాత్రమే యుండెను.

---

## పోషకుడు

'నాష్స్ మేగజీను' అక్టోబరు (౧౯౨౮) సంచికయందు 'బారీ పెయిన్' గారు వ్రాసిన "ది పాట్రనైజర్" అనువ్యాసమునుండి-

పాఠశాలలు, గ్రంథమాలలు, ప్రదర్శనములు అప్పుడప్పుడు తమపోషకుల జాబితాలు అచ్చువేయ నుత్సుకపడుచుండును. చక్కగ నడచుచున్న యొకసంస్థకు పోషకు డైనవాడు తనప్రఖ్యాతికి మురియుచుండును. కాని, పోషకుడు నిజముగ పోషణగావించువాడు కాకున్నాడు.

నిజముగ నొకదాని పోషణగావించు పోషకుడు భూమిపయినెల్ల మిక్కిలి గర్హితుడు. అతడు బ్రతికినన్నాళులు ఏవకును, తిరస్కృతికిని గురియగుచుండును. వినను అతడాసంగతి యెన్నడు నెరుగకుండనే మరణించుటవాడుక. ఎల్లప్పుడు నాతడు తనకు లేని గరిష్ఠత నాపాదించుకొన గోరుచుండుటయే కాక,వాస్తవముగ తనకుగల పెద్దటికమును పదేపదే బిగ్గఱగ ప్రదర్శించుకొను చుండును. అంగైన యాలోచనకును, వినయముగల మనుజులకును ఇది చీదర పుట్టించును.

ఆ పోషకు డెన్నడు నుదారుడు కాడు. తాను నెత్తిపై దేవత కాఱ్ఱుచువాని కౌదార్య మెట్లువచ్చును? వ్యాపార డబ్బుండి—సాధారణముగా నతడు నడమంత్రపు

సిరివాడయి యుండును—ఏదేని స్వలాభమున కుపయోగించు నవకాశము కన్పడెనా, కావలసినంత చందా నిచ్చును.

అతనికి హృదయమున దాక్షిణ్య ముండదు. కాని దాక్షిణ్యాన్వితములని పేరుపడు కార్యములు మాత్రము తఱుచుగ నతడు చేయుచుండును. ఏలయన, కృతజ్ఞత యనునది తనకంటె తక్కువతనము నొప్పుకొనుటగా నతడు పరిగణించును. ఒక పేద మిత్రున కాతడు డబ్బు బదులీయనచ్చును; తరువాత మాత్ర మత డావిషయము విచ్చలవిడిగ చెప్పకమానడు. తనకు లేని సుగుణసంపదకై ఆత్మశ్లాఘ కావించుకొనుట కొకయవకాశము మాత్రమే దాక్షిణ్య మాతనికి.

అతడు తన 'కారు' నొక పల్లెలోనికి నడిపి యట నిలిపి, చెంతనున్న గ్రామీణు నొకని 'ఏయ్' అని రావ శీవిని బిలిచి, 'ఇదిగో మాడు' అని సంబోధించి, దారి చూప నడుగును. ఆ గ్రామీణుడు తానెఱుగనని చెప్పి పోవును. అచ్చటి గ్రామ్యులు పట్టి తెలివితక్కువ పెటుకు తలకాయ సరుకని 'పోషకుడు' విసుగుకొని పోవును.

ఔనుగాని, ఆ పోషకున కెన్నడు తెలియని 'నిజ స్థితు' లేవి? ఎవరినుండి తా నొకయుపకారము కోరుచున్నాడో, ఆతనితో పలుకునపుడే యత డక్రమమగు నధికారము నవలంబించుకొన్నాడు. 'ఇదిగో చూడు' అనును ఇట్టిది వెక్కిరించిన ట్టుండును. గ్రామీణుడు తన యభిమానము విడిచి దానిపై వ్యాఖ్యానము నేయుచు నూరు చుండ నొల్లక, తా నాదారి ముప్పదేండ్లుగా నెఱిగియున్నదైనను సరే, తెలియదు పొమ్మని శాస్తిచేయును.

'పోషకు' నెవ్వరును గౌరవింపరు; ఏలయన, గౌరవము పాత్రతనుబట్టి వచ్చునే కాని కొనుకొందమన్న రాదు గదా? కాని యతడు గౌరవవేషముల వేయ గలడు. అవి యతనికి గౌరవమువలెనే యుపయోగ పడును. తన సేవకు డెంతయో మంచినడవడి గలవాడని యతడు చెప్పును. ఆ సేవకుడు చాటున తన్ను తిట్టిపోయు తిట్టిపోతలు, పాప మాతని కేమియు తెలియవుగదా! ఇది చాల విచారకరము.

కావున— శోచనీయమగు విషయమే యైనను— పోషకుడు తన కపటవేషము లన్నియు నెడలక గట్టిముగ గ్రమ్మియుండగనే మరణించును. అంతకంటె నెంతయో మిన్నలగువారు దిగంబరులై, చలికి, నెండవానలకు నగ్గమై తిరుగుచునే యుండవలెను.

---

## జగదీశ చంద్రుని వాక్యములు

నవంబరునెల 17వ తేదీ నాడు అలహాబాదు విశ్వవిద్యాలయపు పట్ట ప్రదాన సభలో నుపన్యసించుచు, ఉన్నత శాస్త్రవిద్యకై భారతీయ విద్యార్థులను విదేశములకు బంపుటనుగూర్చి జగదీశ చంద్రబోసుగా రిట్లు నుడివిరి:—

భారతదేశమున ఉన్నత పరిశోధనమును నిర్వహించుటకు తగు నవకాశము లేకుండుటచే భారతీయ విద్యార్థులు ఐరోపా, అమెరికా, జపాను మున్నగు విదేశములకు బోవుట తప్పనిసరి యగుచున్నదని వైసు ఛాన్సెలరుగారు చెప్పచున్నారు. ఈ యూహ కేవలము నిరాధారము. మా వైజ్ఞానికశాఖలో (Department of Science) తమ ప్రావీణ్యముచే నే విద్యాపరివృత్తునకైన ప్రతిష్ఠ సంపాదింపగల సమర్థులున్నారని నేను చెప్పగలను అందులకు వారికి గావలసినది హృదయపూర్వకమగు మీసాయమే. నేడు యూరపు దేశమున వేలకొలది భారతీయ విద్యార్థులు కలరు. ఈ రూపమున (యూరపులోని యా భారతీయ విద్యార్థులకై) భారతదేశము ఏటేట కోటి రూపాయలకన్న నెక్కువగ వ్యయపరచుచున్నదని లెక్కవేయబడినది. ఇంతయైనను ఈ మహా ప్రవాహమును గూర్చి యెవ్వరును నోరెత్తుటయేలేదు. దీనిని సాధ్యమైనంతవరకు భారతదేశముననే వినియోగ పరచుట వాంఛనీయముకాదా? ఇంగ్లండులోని విశ్వ విద్యాలయములు ఎంతమంది వచ్చిన నంతమంది భారతీయవిద్యార్థులను జేర్చుకొనగల స్థితిలో లేవు. నిజమైన ఈ సంగతి చాల దురభిప్రాయములకు గూడ నవకాశ మిచ్చినది. ఇంతేకాక, పరిశ్రమలలో ప్రత్యక్ష శిక్షణము

బొందుట, సామంత దేశముల విద్యార్థులకై యేర్పాటు చేయబడిన విద్యార్థి వేతనములను సంపాదించుట మున్నగు సందర్భములలో దగు ప్రవేశము దొరకక భారతీయ విద్యార్థు లనుభవింపవలసిన కష్టము లెన్నియో యున్నవి. ఈ కష్టము లూహా ప్రపంచములోనివి కావు. కొంతవరకు వాస్తవమైనవే. అవమానకరమగు నీ దుస్థితినుండి బయల్పడవలయునన్న, మనవిద్యకై, మన పరిశ్రమలకై పరదేశములసాయముపై మన మాధారపడకుండ స్వతంత్రులమై యుండుటకు దగు సాధనముల నారయుట యొక్కటియే మార్గము. [ప్ర. రం.]

---




## పేకాట

గిరీశం: పేకాట చాలా చెడ్డదండి. నాభార్య ఎంత చెప్పినా వినక, యింటికైనా వెళ్లక, రాత్రీ పగళ్లూ అదేధ్యాన్నంతో ఆడుతూ ఉండేవాణ్ని. విసుగెత్తో, లేక సంసారసుఖం లేకో, అది కన్నవారింటికి పోయి రానంటూ ఉంది.

పార్వతీశం: ఆలాగునండీ! నే నిప్పుడే పోయి ఒక పేక దస్తా కొంటాను.



## శ్రీ రమణ మహర్షి

ఈ మహాత్ములు బాల్యముననే తల్లిదండ్రులను, సోదరులను వర్జించి, జగత్పితయగు అరుణాచలేశ్వరుని దర్శింప నిశ్చయించి, "తండ్రిని జూడనేగెదను. అది మేలునకే యగును" అని యుత్తరము వ్రాసియుంచి, అరుణాచలేశ్వరుని సాన్నిధ్యమును బడసి, అరుణాచలమున రమారమి ముప్పదియేండ్ల కాలముగా ఘోరతపం బాచరించి, దర్శించిన మాత్రాన సమస్తదురితంబుల బోనడచు సామర్థ్యంబు గలిగి, బ్రహ్మసాక్షాత్కారము జెంది, అజ్ఞుల అజ్ఞానాంధకారమును తొలగించుటకై జ్ఞాన భాస్కరులై ప్రకాశింపుచు రూపబ్రహ్మమై యొప్పుచుండెడివారు.

---

## ౧౮౫౭ సం. పు విప్లవమందలి ఒకవిశేషము

### పంజాబు బ్లాక్ హోలు - అజనాలానుయ్యి

శ్రీయుత సుందరలాలు గారు రచించిన 'భారత దేశమున ఆంగ్ల పరిపాలనము' అను గ్రంథమునుండి 'విశాలభారత' (హిందీ) పత్రిక యీవిశేషమును గూర్చిన వర్ణన ముద్ధరించుకొనెను. ఇందలిబొమ్మలుకూడ ఆగ్రంథము నుండియే కైకొనఁ ప్రచురించినది. అందలి ప్రధానవర్ణనము ఆచిత్రములతోసహా యిట ప్రకటితము.

౧౮౫౭ మే నెలయందు లాహోరులో నాలుగు దేశీయపు పటాలములు కేవలము ప్రభుత్వము వారి యనుమానమునకు పాత్రములై ఆయుధములు విడువవలసి వచ్చెను. సిక్కులును, తెల్లవారును వారికి కాపలా. శిబిరము వెలుపడుటకు వారి కనుమతి లేదు. బయట ఫిరంగులు పెట్టియున్నవి. జూలై ౩౧ తేదీ రాత్రి ఇందు నెం ౨౬ రు పటాలములోని చాలమంది సిపాయీలు శిబిరమునుండి పారిపోయిరి. వీరికడ నాయుధములును లేవు; వారు ఎన్నటను ఏవిద్రోహమునను పాల్గొనను లేరు. మర్నాడు వారు రావీనది దాటి పోవ నెంచిరి. అడ్డంకి వచ్చినది. రావీనది గట్టుగట్టున నే వారు అమృతసరమువైపు సాగిరి. వారిని నెంబడింమనదిగ జుడీషల్ కమిషనరు సర్ రాబర్ట్ మాంట్ గుమరీ ఆనతిచ్చెను. అమృతసరము డిప్టీ కమిషనరు ఫ్రెడరిక్ కూపరు మాంట్ గుమరీకి సొంతమనిషి. నెం ౨౬ రు పటాలపు ఈ హిందూస్థానీ సిపాయీలు అలసిపోయి, ఆకలితో, నిరాయుధులై, అమృతసరములో నొక తహసీలయిన అజనాలాకు ఆరుమైళ్ల దూరమున రావీతీరమున పడియుండిరి. అజనాలా అమృతసరమునకు ౧౬ మైళ్లు. అటు తరువాతి కథనుగూర్చి ఫ్రెడరిక్ కూపరు 'దిక్రైసిస్ ఇన్ది పంజాబ్' (The Crisis in the Punjab) అను తనగ్రంథమున మిక్కిలి యభిమానముతో మెచ్చటించెను. కూపరుగారి వర్ణన ననుసరించియే సంక్షిప్తముగా ఆకథ నిట వర్ణింతము.

ఆ సిపాయీలు రావీనదిఒడ్డున సాగుచున్న సంగతి జూలై ౩౧ రెండుజాములకు కూపరుగారికి తెలిసెను. అజనాలా తహసీల్దారును కొంతమంది సాయుధులైన సిక్కుసిపాయీలతో సహా అక్కడకు పంపిరి. సాయంకాలము దాదాపు నాలుగుగంటలకు కూపరుగారు స్వయముగా ౮౦, ౯౦ మంది రౌతులతో అదనునకు చేరుకొనిరి. అలసిపోయి ఆకలితో మాడుచున్న ఆమనుష్యులపైని తుపాకులు ప్రేల్చిరి. ఆసిపాయీల సంఖ్య ఇంచుమించు ఐదువందలు. ఇందు దాదాపు నూటయేబదిమంది గుండ్లదెబ్బలకు గాయములు తిని వెనుకకు తిరిగి రావీనదియందు దుమికి మునిగిపోయిరి. ఆకలివలనను, అలసటవలనను బలహీనులై వారు ప్రవాహమున నిలువజాలక పోయిరని కూపరు వ్రాయుచున్నాడు. రావీనదిజలము వారి రక్తముతో నెఱ్ఱనయ్యెను. మిగిలిన వారు కొందఱు నీటినుండి బయలుపడి పారిపోయిరి, కొందఱు ఈతగొట్టియు ఎగువ నొకమైలు దూరమున నొకలంక నాశ్రయించిరి. తరుణమునకు రెండు పడవలు సిద్ధమైనవి. ఇంచు మించు ముప్పదిమంది శస్త్రసైనికుల నాపడవ లెక్కించి వారిని పట్టుకొనుటకు పంపిరి. సైనికు లఱువదితుపాకులవఱకు వారి పై బారు పెట్టిరి. దూరమునుండి తుపాకులు చూచి ఆ ఆపన్నులు చేతులు జోడించి తమ నిర్దోషిత ప్రకటించి ప్రాణదానము వేడిరి. ఈసమయమున నే ౨౦ మంది వఱకు నిరాశులై నీటిలో మునిగి మరి కనబడలేదు. మిగతవారిని పట్టుకొని కొలఁది కొలఁది మందిని పడవలపై గట్టుచేర్చిరి. అచట వారి కంఠమాలలు మున్నగునవి తెంపి పారవేసిరి. వారిని వేరువేరు గుంపులుగా నేర్పఱచి కట్టి హోరున వాన కురియుచుండ సిక్కురౌతుల కాపుదలతో మెల్ల మెల్లగా అజనాలా చేర్చిరి.

అర్ధరాత్రమున మొత్తము ౨౮౨ రు సిపాయీలును అజనాలాఠాణా చేరుకొనిరి. అందు కొందఱు ఆ ఫీ స ర్లు మ న దే శ ము వా రు గూ డ గ ల రు. అజనాలా ఠాణాయందు వీరందరిని ఉరితీయుటకు త్రాళ్లును, కాల్చి చంపుటకు ఏబది మంది సశస్త్రులైన

సిక్కు సైనికులను కూపరు తొలినుండి సిద్ధపఱచియుంచెను. కాని వర్షమువలన ఈపని ప్రొద్దుటికని నిలుపుచేసిరి. అందఱును తాణాయింట పట్టరైరి. దగ్గఱనే తహసీలు తాలూకు క్రొత్తకట్టడము పూర్తియై సిద్ధముగ నుండెను. చాల మందిని ఉదయమువఱకు పోలీసు తాణాయందు బంధించిరి. ౬౬ గురిని మాత్రము తహసీలు కట్టడములో ఒక చిన్న గుమ్మటపు గదిలో కుక్కిరి.



తహసీలు కట్టడమునందలి గుమ్మటపుగది

గుమ్మటపు గది చాల ఇరుకైనది. నాలుగు వైపుల తలుపులు మూసివేసిరి.

మర్నాడు ఒకటవ ఆగస్టు బకరీదు. ప్రొద్దుట ఆనిర్భాగ్యుల నందఱిని పదిపది మందిగా బయటికి తెచ్చిరి. కూపరు తాణాయెదుట కూర్చుండియుండెను. పదిమంది సిక్కు సిపాయీలు ఒకప్రక్క తుపాకులతో నిలిచియుండిరి. తక్కిన నలుబది మంది వారి సమీపమున తోడుగ నిల్చిరి. ఎదుట వచ్చుటతోడనే ఈ కైదీలను ప్రేల్చివేయుచుండెడివారు. వీరిలో చాల మంది హిందువులు. అందు కొందఱు చనిపోవు సమయమున సిక్కులకు గంగాదేవిపై నొట్టుపెట్టి తిట్టుచుండెడివారని వ్రాసియున్నది. తాణాలోని కైదీలు పూర్తికాగా గుమ్మటపు గదిలోని కైదీలను బయటికి తెచ్చిరి. ౨౩౭ గురు సిపాయీలు గుండు దెబ్బల మరణించిరి; గుమ్మటపు గదినుండి ౨౧ మంది మాత్రమే వెలుపటికి వచ్చిరి. ఇంతలో మిగిలిన ఖైదీలు రామనుచున్నారని కూపరునకు వార్త వచ్చెను.

మొదట వారిని సంబాళించు నేర్పాటుచేసి లోనికి పోయి చూడగా తక్కిన ౪౫ గురు సిపాయీల శవములు నచ్చట దొరకినవని కూపరు వ్రాయుచున్నాడు. అందు కొంత టెంకను వెక్కివెక్కి యేడ్చుచుండిరేమో కూడను. "తెలియకుండగనే హోల్వెల్ బ్లాక్ హోలుహత్యాకాండ పునః ప్రదర్శితమయ్యెను"* అని కూపరుపలుకులు.

హోల్వెలుబ్లాక్ హోలుకథ అసత్యము కాని కూపరుగారి అజనాలాబ్లాక్ హోలు సత్యమైన సంఘటనమని వేరుగ చెప్పనక్కరలేదు.

రాత్రి వారు నీరనియు, గాలియనియు నరచిరి కాని పైగోడవలో నది పారావాంఛ్రకు వినబడలేదని కూపరు వ్రాయుచున్నాడు. అలసటవల్లను, ఉక్కవల్లను, గాలి లేమివల్లను లోన నూపిరి యాడక చచ్చిన ౪౫ గురి శవములను పై కీడ్చుకొనివచ్చి పడవేసిరి.

ఒక్కచిక్కు తరువాయి: ఈ ౨౮౨ శవములను పూడ్పవలెను. ఆజనాలాతాణాకు ఇంచుమించు నూరుగజముల దూరమున నొక ప్రాత నుయ్యియుండెను. పాకీవాం



అజనాలానూయి—దిబ్బపట్టున నున్నది.

డ్రచేత ఆశవము లన్నింటి నీడిపించి యీడిపించి ఆనూతిలో వేయించిరి. తక్కిన నూతిని మట్టితో కప్పెట్టించి పైనొక గుట్ట యగువఱకు మట్టి పోయించిరి. ఈనూ

*Uuconsciously, the tragedy of Holwell's Black Hole had been re-enacted"—'The Crisis of the Punjab', by Frederic Cooper.

తివిషయమున ఫ్రెడరిక్ కూపరు పెద్దయభిమానముతో నిట్లు వ్రాయుచున్నాడు:—

"కాన్పూరునం దొక నూయి యున్నది. కాని అజనాలాయందును నొకటి కలదు." *

ఈవిధముగా సం ౧౮౫౭ రు పటాలమునకు చెందిన యిదుసందలు దాదాపు మనుష్యులను ౨౪ గంటలలోపల పరలోకగతుల గావించిరి. లాహోరునుండియో రావీ తీరమునుండియో యిటునటు పారివచ్చిన ఆపటాలపు తక్కిన కొలదిమంది సైనికులును నాలుగుమూడు నాళ్లలో పట్టుపడిరి. కొందఱు లాహోరునందును, మఱికొందఱు అమృతసరమునను ఫిరంగులవాత బడిరి.

మరునాడు చీఫ్ కమిషనరు సర్ జాన్ లారెన్సును, జుడీషల్ కమిషనరు సర్ రాబర్ట్ మాంట్‌గుమరీయు వృత్తాంతమంతయు తెలిసి కూపరుగారికి బ్రహ్మాండమైన ప్రశంసలతో జాబులు వ్రాసిరి. ఈజాబులు కూపరుగారి గ్రంథమున ముద్రితములైనవి. హిందూ తహసీల్దారునకును, సిక్కుఘాతుకులకును పెద్ద మొత్తములు బహుమతి యీయబడెను.

అజనాలా భీకరసంఘటనము ఫ్రెడరిక్ కూపరు స్వయముగ తనగ్రంథమున వర్ణింపకున్న మనకు దాని యందు నమ్మిక కలుగుట చాలకష్టము. పైవర్ణనమంతయు కూపరుచేసినదే.

ఇంకను దీనిగూర్చి ప్రామాణ్యము సేకరించుటకై నేను 'ఫుల్వారీ' పత్రికాసంపాదకులును ప్రజ్ఞానిధులు నగు శ్రీ హీరాసింహజీకి శ్రమయిచ్చితిని. వారు అమృతసరము నుండి అజనాలా కేగి యీవిషయమై పరిశీలన సల్పిరి.

విప్లవసమయమునకు దాదాపు ముప్పదియేండ్ల వయసువాడైన బాబాజగత్సింహ అను అజనాలావృద్ధుడొకడు ఇప్పటికిని (ఫిబ్రవరి ౧౯౧౯) జీవితుడై, మతిమంతుడై యున్నాడు. బాబా జగత్సింహుడు ఈసంఘటనమంతయు కన్నులార చూచెను. బాబా జగత్సింహుని స్వలిఖితవర్ణనము నాకడ నున్నది. వారివర్ణనమునకును, కూపరువర్ణనమునకును ముఖ్యవిషయములందు భేదమేమియు లేదు. ఆ శవములు పూడ్చిన నూయియు



బాబాజగత్సింహుడు.

నిప్పు డున్నది. దానిపై నొక పెద్ద మట్టిదిబ్బ యున్నది. సిపాయిక్కైదీలను చంపిన పోలీసుఠాణాయు, ౪౫గురు సిపాయీలూపిరిసలుపక చచ్చిన గుమ్మటపు గదియు నిప్పటికిని గలవు. అప్పటి అజనాలా తహసీల్దారుపేరు ప్రాణనాథుడని బాబాజగత్సింగు చెప్పుచున్నాడు. ప్రాణనాథుడాలంకలోని సిపాయీలను మోసగించి, అనగా మీప్రాణములకు భయము లేదని వారికి మాటయిచ్చి, పట్టుకొనెనట. నూతిలో నొకరిమీద నొకరుగా పడవేసిన వారిలో కొందఱింకను జీవించియుండిరనియు, అరచుచుండిరనియు బాబాజగత్సింగు నుడువుచున్నాడు.

* * * *

వీరిలో నెవ్వరును విద్రోహమునగాని, విప్లవమునగాని యేవిధమునను పాల్గొనలేదనునది మరవరాదు.

* * * *

— —

* "There is a well at Cawnpore, but there is also one at Ajnala"—*Ibid.*



శ్రీ శారదానికేతనము – గుంటూరు, సంగీతపు తరగతులు



ఆకస్మికచ్ఛాయా చిత్రము

దసరాగిలకలు

ఛాయాచిత్రము తీసినవారు:

చక్రవర్తుల వెంకటరావుగారు, దంగేరు, ద్రాక్షారామ, తూర్పుగోదావరిజిల్లాపోస్టు.

## మల్లారురాగిణి

'భారతవర్ష' అను ఒక వంగమాసిక పత్రికలో శ్రీమతి వాణీదేవిగారు ఇటులు వ్రాయుచున్నారు:—

ఒకతూరి మే మాషాఢమాసమున పూరిలో నుంటిమి. అపు డచట వానలు లేవు; మిగుల ఉక్కపోయు చుండెను. మేము 'మల్లారు' పాడి వాన కురిపింప నిశ్చయించితిమి. నే నందఱము భక్తితో గూడ మల్లారు పాడి భగవత్సన్నిధానమున నీటికై ప్రార్థింపఁ దొడఁగితిమి. ఆశ్చర్యము! చూచుచు చూచుచుండఁగా ఆకాశమున నల్ల మబ్బులు నిండిపోయెను. ముసలధారలతో వాన పడెను.

ఒకసారి మేము వైశాఖమాసమున కటకములో నుంటిమి. గాలి పేరుతో అగ్ని జ్వాల వీచుచుండెను. ప్రాణములు తుకతుకలాడుచుండఁగా హృదయమును భేదించుకొని మల్లారురాగిణి ఆవిర్భవించెను. అందఱు ఆశ్చర్యపడి చూచుచుండఁగా ఎక్కడనుండియో మేఘములు వచ్చి వృష్టిదానము చేసి ఆ అగ్ని జ్వాలను ఆర్పివైచెను. కటకమునందు మఱియొకమాఱు మల్లారు పాడి మేము మిక్కిలి అసంభవమగు అవస్థయందును పెద్ద పెద్ద వాన బొట్లను కురిపించితిమి.

ఒకతూరి కటకప్రాంతములలో అనావృష్టి కలిగెను. దానికి ఫలముగా క్షామము చూపడెను. మా తండ్రిగారు అప్పుడు వారి జమీదారీలో భూములు చూచుకొనుచుండిరి. గ్రీష్మతాపముచే ధాన్యము మలమల వేగిపోవుట ఆయనకు కానిపించెను. వారు కడు వగచిరి. వారు భగవత్సన్నిధానమున జలముకొఱకు ఒకకీర్తనను మల్లారురాగిణిలో రచించి పాడఁదొడఁగిరి. సంగీత మహిమ ఆశ్చర్యము—ఒకగంట వెనుక అచట మబ్బనునది మందుకయిన లేదు. ఒక గంటలో అచట ఘోరముగా నల్లనల్ల మబ్బులుపట్టి కురిసి దేశమును ముంచివేసెను. దుర్భిక్షభయము తగ్గిపోయెను.

మల్లారురాగిణి పాడి వాన కురిపించుటకు ప్రమాణము చూపినట్లే సారంగరాగము పాడి వాన ఆఁపుటకును మేము దృష్టాంతమును కనులారఁ గాంచితిమి. దీపకరాగము పాడుటలో అనిష్ట మేదో యొకటి ఘటించును. ఈ అనుమానముతో దీపకరాగము పాడి పరీక్ష చేసి చూడలేదు.

దీనిపై 'శనివారేర్ చిఠి' అను మాసపత్రిక వక్రింది రీతిగా వ్యాఖ్యానము చేయుచున్నది: 'ఇది సర్కారు వారు చదివియే కాఁబోలు, ఇరిగేషన్ డిపార్టుమెంటు బందుచేసి మల్లారు డిపార్టుమెంటు క్రొత్తగా పెట్టుటకు సంకల్పించిరని విని ఆనందించితిమి. శ్రీ దిలీపకుమార రాయ మహాశయులు ఈడిపార్టుమెంటునకు చీఫ్ ఇంజనీయరులు కాఁగలరు. ఈమె దీపకరాగము పాడి పరీక్ష చేయలేదనెను. మంచిపనియే చేసెను. పరీక్ష చేయుచో మనము ఇపుడు ఈ అమూల్యప్రబంధమును చదువుసౌభాగ్యలాభమును పొందువారమై యుండము.'



గృహపరిశ్రమ

చిత్రకారుడు: శ్రీ యస్. యస్. మూర్తిగారు, చెన్నపురి.




## సారూప్యౌషధశాస్త్రము

గ్రంథకర్త: డా. లంక రామారావుగారు, హెచ్. యం. బి., కాకినాడ. పేజీలు ౩౮౭. వెల రు ౩-0-0.

ఇది 'హోమోపతీ' వైద్యవిధానమును దెలుపు తెలుగు వైద్యగ్రంథము. దీనికి పొన్నాడ వెంకట్రావుగారు ఏతద్వైద్యసిద్ధాంతముల దెలుపుచు పీఠికను వ్రాసియున్నారు. 'హోమోపతి' వైద్యము వ్యాప్తి నొందుచున్నయీదినములలో, తెలుగుభాషయందు ఆ వైద్యవిధానమును దెలుపు గ్రంథము లేదన్న కొరతను దీర్చి, గ్రంథమును ప్రకటించిన డా. రామారావుగారు అభినందనీయులు. ఈ గ్రంథము వస్తుగుణదీపిక, చికిత్సావిధానము, సముదాయ చికిత్సలు అను మూడు ప్రకరణములుగా విభజింపబడి, అందు హోమోపతీ ఔషధములయొక్క గుణవిశేషములు, ఏవ్యాధియందు నేయౌషధము ఉపయోగింపవలయునో, అవయవభేదముచే నేవ్యాధియందు ఏ ఔషధమును ప్రయోగింపవలయునో ఈ మొదలగు విషయములు చర్చింపబడియున్నవి.

'హోమోపతి' యనగా రోగియందు కనపడుచున్న గుణములనే కలిగించెడు మందులను మిక్కిలిసూక్ష్మరూపముగా ప్రయోగించు ఒకవిధానము. దీనికే గ్రంథకర్తగారు 'సారూప్యౌషధశాస్త్రము' అని పేరిడినారు. ఈవైద్యవిధానమును మొట్టమొదట జర్మనీదేశస్థుడగు డా. హనిమన్‌గారు కనిపెట్టి ప్రచారమునకు దెచ్చినట్లును, అప్పటినుండియు విశేషవ్యాప్తినొంది, అన్యదేశములందుగూడ ఆదరణమును పొందుచున్నట్లును వీరు వ్రాయుచున్నారు. భరతవర్షమునకీవైద్యవిధానము క్రొత్తది గాదని నా యభిప్రాయము. మన పూర్వాచార్యులగు ఆయుర్వేదగ్రంథకర్తలు ఇట్టివిధానమును పేర్కొనియే యున్నారు. ఇప్పుడు దినదినాభివృద్ధి నొందుచున్నవని చెప్పబడుచున్న అలోపతి, హోమోపతి, ఆస్టియోపతి, కూనీక్యూరు, వాక్సిన్ తెరపీ, సైకోతెరపీ మొదలుగాగల వైద్య పద్ధతులయొక్క సిద్ధాంతములు సవిమర్శముగ విచారించి చూచినయెడల, అభివృద్ధిలేక జీర్ణించిపోయి పునరుద్ధరణము నపేక్షించుచున్న దనబడు ఆయుర్వేద శాస్త్రమునకు సమన్వయమగుచుండు నన్నవిషయము తెలిసికొనవలసివచ్చుచున్నది.

"ఆ వైద్యశాస్త్రమంతయు మిక్కిలి అశ్రద్ధచేయబడిన సంస్కృతభాషలో వ్రాయబడియుండుటవలన, పండితుల సహాయమున ఇంకను చాల పరిశోధనలు సలిపి, తిరిగి పునరుద్ధరింప జేసినగాని అందలివిశేషములు బయల్పడవు" అని పీఠికాకారులు వ్రాయుచున్నారు. నిజమే! శ్రద్ధతో పరిశీలించినయెడల డా. హనిమన్‌గారి పుట్టుకకు పూర్వమే అట్టిసిద్ధాంతము ఆయుర్వేదమున నిరూపింపబడియున్నదని తెలిసికొని మనము ఆశ్చర్యము నొందవలసి వచ్చుచున్నది. ఆయుర్వేద గ్రంథములందు చికిత్సాక్రమము నిరూపించుచు ఆరువిధములగు నౌషధోపయోగపద్ధతులు వివరించినారు: 1. హేతువిపరీతము, 2. వ్యాధివిపరీతము, 3. హేతువ్యాధివిపరీతము, 4. హేతుతదర్థకారి, 5. వ్యాధితదర్థకారి, 6. హేతువ్యాధితదర్థకారి. ఇందు ప్రసక్తించినంతవరకు వివరణము:-

(4) హేతుతదర్థకారి:—వ్యాధి హేతువునకు సారూప్యమగు చికిత్స. అనగా పిత్తప్రధానమైన వ్యాధికి ఉష్ణవీర్య చికిత్సలు.

(5) వ్యాధితదర్థకారి:—వ్యాధిగుణములకు సారూప్యములగు గుణములను గల్గించు నౌషధములచే చికిత్స. అనగా వాంతు లగునపుడు ఇంకను వాంతులను గలిగించు నౌషధములయొక్క ప్రయోగము.

(6) హేతువ్యాధితదర్థకారి:— వ్యాధి హేతువునకు, వ్యాధికినిగూడ, సారూప్యములగు గుణముల గల్గించునౌషధములచే చికిత్స. అనగా విషమునకు విషప్రయోగము

ఈపై విధమునసే, ఆహారమును, విహారమును, దేశకాలాదులనుగూడ సారూప్య, వైరూప్యములచే నెరుంగవలయును.

ఈ పై ఆయుర్వేద సిద్ధాంతములు 'హోమోపతీ' సిద్ధాంతమునకు అవిరోధములయి, సరిపోల్ప దగియున్నవని చదువరులు సులభముగా గ్రహింపగలరు. ఇక నీ సిద్ధాంతమును కనిపెట్టిన గౌరవము హానిమన్ గారికా! చరకాచార్యునికా! చరకాచార్యులు ఆరు పద్ధతులలో ఇదియొక పద్ధతిగా నిరూపించెను. హానిమన్ గారు ఇది ఒక్కటే పద్ధతిని నిరూపించి ప్రచారమునకు దెచ్చెను—ఇది భేదము—

పీఠికాకారులు "ఆయుర్వేద వైద్యము చాల గొప్పదైనను" అని మొదలిడి, "పునరుద్ధరింపవలెను;" "అశ్రద్ధ చేయబడిన సంస్కృతభాషయందు వ్రాయబడియున్నది;" "సులభగ్రాహ్యములు గావు;" "ఇంకను పరిశోధనలు సల్పవలయును" అను వాక్యములతో దాని గొప్పతనమును చాటినారు. విమర్శబుద్ధితో పరిశీలించునట్టి ఓపిక, "అశ్రద్ధచేయబడిన సంస్కృతభాష" యందు అభిమానము, ప్రమాణబుద్ధి ఉండినగాని మన ప్రాచీన శాస్త్రముల యందలి విశేషములు మనము తెలిసికొనజాలము.

పీఠికలో "రోగమనునది శరీరమునగల అంతర్నిర్మాణముతోను, చైతన్యశక్తితోను సంబంధము లేకుండ బాహ్యప్రపంచమున గల కారణములవల్ల కలుగుచున్నదను నభిప్రాయము పరిహసించతగినదై యున్నది" అని వ్రాసినారు. శరీరమునందలి నిర్మాణముతో సంబంధము లేకుండ, కేవలబాహ్యకారణములవల్లనే వ్యాధి కలుగుచున్నదని ఏ వైద్యశాస్త్రసిద్ధాంతమున గలదో తెలుపకయే వీరు అపహసించుచున్నారు. అట్టిసిద్ధాంతము నేవైద్యశాస్త్రమును అంగీకరించుటలేదు.మిథ్యాహారవిహారాదులు రోగకారణములు. అట్టిరోగకారణములు బాహ్యాభ్యంతర భేదములచే రెండువిధములు. వీటివల్లనే హానిమన్ గారి చైతన్యశక్తిగాని,చరకాచార్యునిత్రిదోషములుగాని,అల్లోపతీవైద్యుని శరీరావయవ పద్ధతి (System) గాని వ్యత్యస్తత నొంది కొన్నిలక్షణములతోగూడిన వ్యాధిగా మనకు గోచరమగుచున్నది. జన్మాంతర సంబంధమగు కారణములుగూడ రోగకారణములని ఆయుర్వేదమున కర్మవిపాకమును జెప్పుచు, దానికిని దోషముల సంబంధమే చెప్పినారు—ఇట్టి కారణముల జెప్పు శాస్త్రము నపహసించుట సాహసము!

'సారూప్యౌషధశాస్త్రము' సులభముగా గ్రహింపతగ్గది. ఔషధములు అనపాయముగా నుపయోగింపతగ్గవి. పసిపిల్లలకుకూడ నెట్టికష్టమును లేకుండ ప్రయోగింపవచ్చును.—చాలవరకు రుచికరమైనవి. ఇట్టి శాస్త్రమును దెలుపు గ్రంథమును తెలుగున ననువదించిన గ్రంథకర్త శ్రీరామారావుగారు ఈ వైద్యవ్యాప్తికయి ఒక కళాశాలనుగూడ కాకినాడలో నెలకొల్పి, విశేషవ్యయ ప్రయాసములతో నాకార్యములనెల్ల నిర్వహించుచు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. ఈ శాస్త్రమును ఎవరు కనిపెట్టినను, ఏదేశమునైనను, మానినది మందు అన్నట్టు ఉపయోగపడినంతవరకు సర్వవిధముల ఆదరింపతగినదై యున్నది. మంచి యెచ్చట నున్నను గ్రహింపతగినదే.

గ్రంథకర్తగారికి ఒక ప్రార్థన.— ఈ వైద్యము నాచరించువారలు 'హోమోపతీ' యౌషధములకు జర్మనీకో, అమెరికాకో వ్రాసి తెప్పించుకొనకుండ ఆంధ్రదేశముననే లభించునట్లు తమ కళాశాలయందు అట్టి పరిశ్రమకూడ నెలకొల్పి స్వయముగా తయారు

చేయించినచో శ్రీ రామారావుగారి కృషి మరింతవన్నె కెక్కి, వారు ఆర్థికముగాగూడ ఆంధ్రదేశమునకు లాభము చేకూర్చిన వారయ్యెదరు. వారి కలాశాలకును అట్టి పద్ధతి పోషకముగా నుండును. ఈ వ్యాపార రహస్యముగూడ వారి ఆలోచనమునకు నచ్చుగాక! ఆంధ్రులెల్లరును 'సాముద్రికశాస్త్రము' నాదరించి గ్రంథకర్తకు తగుప్రోత్సాహ మొసంగెదరుగాక!

—వే. శంకరశాస్త్రి.

## కల్యాణరాధామాధవము

గ్రంథకర్త: చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు, లక్ష్మీపురము, వెంట్రప్రగడపోస్టు, కృష్ణాజిల్లా. డెమ్మీ సైజు ౭౨ పుటలు. వెల ౮౨ అణాలు.

ఇది అయిదంకముల నాటకము. రాధామాధవుల ప్రేమగాథ ఇందు వర్ణింపబడినది. బ్రహ్మదేవుడు వీరికి వివాహము చేయుటతో నాటకము సమాప్తమగును.

ఈనాటకమున పాత్రలసంఖ్య తక్కువ. కాని వీరి సంభాషణలతో నాటకము ఎక్కువ పొడిగింపబడినది. అందరిలోనను ముఖ్యులు రాధాకృష్ణులు మాత్రమే. మిగిలిన వారిలో నందుడొకడు కేవల మనవసరము. అట్టిదే వ్రజసుందరియు. నాటకపు తుది యంకమున క్రొత్తగా ఈమెను ప్రవేశపెట్టవగినంత బలవత్తరకారణ మగపడదు. ఈమె లేకున్నను కథ ఆగిపోవదు.

రాధయందు కృష్ణునియెడ భక్తితోకూడిన ప్రేమము చిత్రింపబడినది. అంతకంటె ఈమెనుగూర్చి అధికమేమియు తెలిసికొను అవకాశము లేదు. సత్యభామగుణములలో అసూయమాత్రము వ్రేలెత్తి చూపబడినది.

ఈనాటకమున చేర్పబడి పండితాభిప్రాయములు, జనమంచి శేషాద్రిశర్మగారి ఉపోద్ఘాతముగలవు. శ్రీ.శ్రీ.

## విజయప్రతిజ్ఞ

గ్రంథకర్త: తంగిరాల జగన్నాథశాస్త్రిగారు–కాత్యాయనీ గ్రంథమాల, తణుకు. క్రౌనుసైజు ౧౦౫ పుటలు. వెల ౧౨ అణాలు.

మహాభారతమున ద్రోణపర్వమునుండి సంగ్రహింపబడిన కథాసందర్భముతో అయిదంకములలో వ్రాయబడిన నాటక మిది.

నాటకమున పాత్రములు పోతపోసిన ట్లొకే విధముగ ఉండక పరస్పర భిన్నప్రకృతులతో వ్యక్తిత్వము ప్రదర్శింపవలెను. వారి పరస్పరశీలములను చిత్రించుట నాటకమునకు కావలసిన అనేకవిషయములలో ఒకటి. ఈనాటకమందు వివిధపాత్రలముఖమున చాలవరకు ద్రోణపర్వకథ చెప్పించు తొందరలో ఈ ముఖ్యవిషయము మూలపడినది.

ఈనాటకమును ప్రదర్శించునప్పుడు తొలినుండి తుదివరకు ఒక్కేయుద్ధఘోషతో రంగస్థలము గింగురు మనుచుండుట ప్రేక్షకులకు విసువు కలిగింపకపోదు. కాని కథాసందర్భము మంచిశైలిలో తెలియబరుపబడుటచే పఠనమున కిది అనుకూలము. శ్రీ. శ్రీ.

## చిలుకూరి వీరభద్రరావుగారి దుండగము

రచయిత: రుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు, పశ్చిమ గోదావరిజిల్లా. ఇది క్రౌనుసయిజు ౫౮ పుటలు గలది. వెల తెలియదు. వీరభద్రరావుగారి చారిత్ర విషయకరచనలలోని కొన్ని నిర్ణయములను వీరు ఖండింపుచున్నారు.

## శ్రీస్వామి దయానందసరస్వతి జీవితము

కర్త: లక్కోజు వీరభద్రరావుగారు. డెమ్మీ ౧౬ చిన్నసైజు ౫౯ పుటలు. వెల ౧-౪-౦. మంగిపూడి పురుషోత్తమ శర్మగారు వ్రాసిన గ్రంథమును కొలదిమార్పులతో క్లుప్తీకరించి వ్రాయబడినది.

దొరకుచోటు: ఎ. సూర్యనారాయణ బ్రదర్సు, పెనుమంచిలి, ఆచంటపోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా.

## శ్రీ అడ్డాడ హరిహరస్తుతి

గొ. కృష్ణమాచార్య విరచితము. ౮ పుటలు. పద్యములు.

## శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము

గ్రంథకర్త: కొట్రావులపల్లి సూర్యనారాయణ యోగిని. రాయలుసైజు ౫౦ పుటలు. చక్కనిబైండు.

వెల ౫-౮-౦. కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ యందు దొరకును.

### ధర్మసంగ్రహమునందు అంత్యేష్టి కాండము, ఆశౌచకాండమును

గ్రంథకర్త: బ్ర. శ్రీ ముదిగొండ నాగలింగాచార్యులు. డెమ్మిసైజు ౨౧౬ పుటలు. వెల ౨-౦-౧. గ్రంథకర్తపేర రామలింగేశ్వర పేట, తెనాలికి వ్రాసిన బడయగలరు.

### ప్రతాప కోటయ్యశాస్త్రి

గ్రంథకర్త: చంద్రమౌళి చిదంబర రావుగారు. డెమ్మి ౧౯ పుటలు. వెల తెలియదు. భక్తిలతా గ్రంథమాల, అప్పికట్ల, బాపట్ల తాలూకా (గుంటూరుజిల్లా)కు వ్రాయవలెను.

### ఆదిశైవ ప్రకాశిక

శ్రీనర రామమూర్తిగారు రచించినది. డెమ్మి ౨౬ పుటలు. వెల ౦-౭-౦. గురుకులాశ్రమము, చిలుమూరు, అనంతవరంపోస్టు, గుంటూరుజిల్లా.

### ఆయుర్వేదాంగశారీరశాస్త్రసంగ్రహము

ప్రథమఖండము. కర్త: శ్రీమాన్ ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులుగారు. ప్రకాశకులు: ఆంధ్రవైద్య గ్రంథమాల, విజయరాయి, ఏలూరు. డెమ్మీసైజు ౩౬౭ పుటలు. వెల చందాదారులకు రు ౩-౮-౦. ఇతరులకు రు ౪-౦-౦.

శరీరవిచయము, త్వగ్వివరణము, కలావివరణము, ఆశయవివరణము అను ముఖ్య శీర్షికలక్రింద ప్రధాన విషయవిభాగము ఏర్పరుపబడి ఆంగ్ల ఫిజియాలజీపద్ధతిని చక్కగా వ్రాయబడినది. చిత్రపటములుకూడ చేర్పబడినవి.

### సౌప్తికప్రళయము

కర్త: శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ప్రకాశకులు: శ్రీ మామునూరు నాగభూషణరావుగారు. సారస్వత చంద్రికా కార్యాలయము, ఆర్లపాడున లభింపగలదు. డెమ్మి సైజు ౩౭ పుటలు. వెల తెలియదు. ఒక మిత్రుని యింట నాశువుగా చెప్పబడిన యేబదిపద్యముల 'వేణీభంగము'అను కావ్యము ముందు చేర్పబడినది. సౌప్తికప్రళయము మూడంకముల నాటకము.

### కొండవీటి దండయాత్ర

చరిత్రాత్మకమగు నాటకము. కర్తలు: బాలకవులు వాడ్రేవు చలపతి సుబ్బరాయలు, మాచవరం, రామచంద్రపురం తాలూకా. డెమ్మిసైజు ౯౪ పుటలు. వెల రు. ౧.

### మానపరిభాష

ఇది ప్రతివాది భయంకరం కృష్ణమాచార్యులుగారు రచించినది. ఇందు ఆయుర్వేదవైద్యగ్రంథములందలి మానములు, భేదములు, వానికి సరియగు నేటి దేశీయ, వైదేశిక మానములు వివరింపబడినవి. డెమ్మీసైజు ౬౩ పుటలు. వెల ౦-౭-౧. ఆంధ్రవైద్యగ్రంథమాల, విజయరాయి, ఏలూరు, ప. గోదావరిజిల్లా.

### ఓషధీగుణపంచభాషి

గ్రంథకర్త: డా. కొత్తపల్లి బుచ్చయ్యశర్మగారు, పాలమూరు, అత్తిలిపోస్టు (పశ్చిమగోదావరిజిల్లా). సైజు డెమ్మి; ౧౦౭ పుటలు. వెల రు ౧-౦-౦.

ఇందు తెలుగు, సంస్కృతము, హిందీ లేక యూనానివైద్య సం. అరవము, ఇంగ్లీషు లేక లాటిన్-వీనియందు ఓషధీవస్తువుల నామములు వివరింపబడియున్నవి. రోగవివరముకూడ వివిధభాషలలో నీయబడియున్నది. తెలుగు పేరులులేని హిందూస్తాని మూలికల నామములు నీయబడినవి.

### ఆంగ్లేయవైద్యరహస్యము

పైగ్రంథకర్తగారే దీనినికూడ రచించిరి. క్రౌను ౧౬ సైజున ౪౩ పుటలు. వెల ౦-౭-౦.

ఆంగ్లౌషధములు, వానిగుణములు, వైద్యశాస్త్ర సంబంధ సామాన్యవిషయములు, నీరోగమున క్షేమం దెంతమోతాదు అను విషయములగూర్చి యిందు కలదు. అకారాది విషయసూచికయు గలదు.

### కుటుంబచికిత్సాదర్పణం

ఇదియును పైవారు రచించినదియే. క్రౌను ౧౬ సైజున ౨౭ పుటలు. వెల ౦-౪-౦.

ఇందు సులభచికిత్సలు, వ్యాధినివారణోపాయములు సులభశైలిని వ్రాయబడినవి. సామాన్య ఆకస్మిక వ్యాధుల కు మందులు చెప్పబడినవి. కొన్ని వ్యాధులకు తగిన ఔషధముల పట్టీ తుదిని చేర్పబడినది.

### తెలుగు మెడికల్ హాండ్ బుక్కు

ఈ చిన్నిగ్రంథమునుకూడ పైవారే రచించిరి. క్రౌను ౧౬ సైజున ౩౬ పుటలు. వెల ౦-౮-౦.

ఆయుర్వేదౌషధములు చేయువిధము, వానిపాళ్లు నిందు తెలుపబడినవి. కొన్ని ముఖ్యసూచన లీయబడినవి. అనుపానములు, పథ్యములు తెలుపబడినవి. సాంకేతిక నామముల వివరణము చేర్పబడినది. పుటములగూర్చి తెలుపబడినది. శుద్ధులను, భస్మములనుగూర్చినవిషయములునుగలవు.

### భావమురళి

'కొండకోలకు వికసితోత్పలశ్రీక'-౩౮ పుటలు.

జనపదములు ౩౮ పుటలు.

కుమారకంఠము ౨౭ పుటలు.

మాతృదేశ సంకీర్తనము ౩౨ పుటలు.

కలరుతము ౨౨ పుటలు.

ఈపైవి కవికొండల వేంకటరావు, బి.ఎ., బి.యల్. కవిగారిచే రచియింపబడిన మొదటి సంపుటములోని ఐదు షాత్తములు. 'అభినవాంధ్రకార్యస్థాన సుప్రకాశితము.' ఆల్బర్ట్ ప్రెస్, సూర్యారావుపేట, కాకినాడయందు ముద్రితము. క్రౌను ౧౬ సైజు. వెల యొక్కొకటికి ౮ అణాలు. ఒకొక్కదానియందును ౨౧ గీతికలు గలవు. ప్రతిపుస్తకము ఆదిమశ్రుతి, ఆహ్వానము, శుభ వాక్యములతో నారంభమై, సమాప్తిశ్రుతితో ముగియుచున్నది. ప్రతిపుస్తకము చివరను చరణ సూచిక యివ్వబడియున్నది.

### కాలక్షేపం

మొదటిభాగం. కర్త: భమిడిపాటి కామేశ్వరరావుగారు, రాజమండ్రి. వెల ౧-౭-౦. ఫూల్ స్కేపు సైజు ౧౮౮ పుటలు. గ్రంథనామము సూచించునట్లు ఇది కాలక్షేపమునకై చదువుకొనుట కింపుగానుండు హాస్యములయొక్కయు, తమాషాలయొక్కయు చక్కని సంపుటీకరణము.

### పుష్పాంజలి

మొదటి భాగము. కర్త: వెలగపూడి దానయ్య చౌదరి గారు. క్రౌను ౧౬ సైజు. ౬౭ పుటలు. ౩౨ కావ్యములు. వెల ౧-౧౧-౯. ఇదివరకు 'భారతి', 'సమదర్శిని' మున్నగు పత్రికలయందు ప్రకటింపబడిన పద్యముల సంపుటీకరణమే యిది. వలయువారు గ్రంథకర్తగారికి (ఎనమలకుదురు, బెజవాడపోస్టు, కృష్ణాజిల్లా)కు వ్రాసి బడయగలరు

### శరభరాజీయము

గ్రంథకర్త: తుమ్మూరి శరభరాజుగారు. ప్రకాశకులు: ఆర్ష రసాయనశాల, ముక్త్యాల (కృష్ణాజిల్లా.) డెమ్మిసైజు ౩౮౮ పుటలు. వెల ౧-౯-౦. ఇది పద్యరూపముననున్న వైద్యగ్రంథము.

### శ్రీ భక్తామృతము

అలగరశెట్టి కేశవనారాయణ విరచితము. క్రౌను ౧౬ సైజు ౫౩ పుటలు. వెల ౧-౭-౯ మెయిన్ రోడ్, ఛత్రపురము (గంజాంజిల్లా)- గ్రంథకర్తకు వ్రాసి పడయవచ్చును. ఇందు శ్రీరామ స్తవము, జీవబ్రహ్మైక్య రహస్యము, శ్రీ భగవద్విజ్ఞాపన మొదలగు భక్తివిషయముల గూర్చిన పద్యములు కలవు.

### తెనుగు అభ్యాసబోధిని

౧వ భాగము. సంపాదకులు: రా. వెంకట సుబ్బయ్యగారు. క్రౌను ౧౬ సైజు ౨౧ పుటలు. వెల ౦-౧-౬. దొరకుచోటు: నెం. ౩౭, పూనమల్లిరోడ్డు, కీల్ పాక్ పోస్టు, మదరాసు.

### భట్టరాజపుత్రసూర్యోదయము

జినపనేని సూర్యనారాయణరాజుగారిచే రచియింపబడినది. డెమ్మిసైజు ౨౧౧ పుటలు. వెల ౧-౧-౦. ఇది చిరంజీవి కామరాజుగారికి (భట్టుమగుటూరు, పెనుమంట్రపోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా)కు వ్రాసి పడయవచ్చును.

### మారుతీ శతకము

గ్రంథకర్త: మారేమండ హనుమంతరాయ కవి. ప్రకాశకులు: లక్ష్మీ పబ్లిషింగుహౌసు, ౮, వల్లభ అగ్రహారము, ట్రిప్లికేన్, మదరాసు. క్రౌను ౨౨ పుటలు. వెల ౦-౪-౦.

### జ్ఞానప్రదీపిక అను మలయాల ప్రశ్నలు

తెలుగు తాత్పర్యసహితము. కర్త: సముద్రాల వేంకటరాఘవాచార్యులుగారు. ప్రకాశకులు: ఉప్పల వీరన్నశ్రేష్ఠిగారు, చాకలపేట, మదరాసు. క్రౌను ౧౬ సైజు ౨౯౩ పుటలు. వెల ౧-౭-౦.

# సాభిప్రాయ విశేషములు

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధో ఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప!

అమృతత్వమునకు త్యాగమే పరమసాధనముగ నున్నది. సంకల్పసిద్ధికై సర్వమును సమర్పించిన మహానుభావులు త్యాగమూర్తులు. మహానుభావులు ధనమును, మానమును, సుఖమును, ప్రాణమును సమర్పణముచేసి పరమార్థమును బడయుదురు. సంకల్పసిద్ధికై ఆత్మార్పణముచేసిన మహానుభావులు శాశ్వతకీర్తిని బడసి లోకారాధ్యు లగుచున్నారు. ఆత్మార్పణమును జేసిన మహానుభావులు స్థూలదేహమును విడిచినను యశఃకాయులై శాశ్వతముగ జీవించుచున్నారు. ప్రపంచేతిహాసములందు త్యాగమూర్తులకుగల ప్రతిష్ఠయే త్యాగప్రభావమును విశదము చేయుచున్నది. త్యాగప్రభావము దైవభక్తులందును, దేశభక్తులందును ప్రచండాకారమును దాల్చుచు మానవోద్ధరణమునకు సాధనంబగుచున్నది. బుద్ధుడు, క్రీస్తు చేసిన మహాత్యాగము వారికి దేవత్వమును కల్పించినది. జోన్ ఆఫ్ ఆర్కు, వాషింగ్టను, లింకను మొదలగు దేశభక్తులు చేసిన మహాత్యాగము అమరత్వమును గల్పించినది. త్యాగమునకు లక్ష్యము ఆత్మార్పణముగాని స్వప్రయోజనము గాదు. భారతీయేతిహాసపురాణములందు త్యాగప్రభావము హృద్యముగ వివరింపబడినది. దధీచి, శిబి, బలి మొదలగువారిత్యాగము సుప్రసిద్ధము. చిరకాలగతమైన త్యాగశీలము భారత సంతానములందు వర్తమాన కాలమునందును ప్రత్యక్షమగుచున్నది. దేశ స్వాతంత్ర్యమునకును, మానవకల్యాణమునకును భారతసంతానము చూపుచున్న మహాత్యాగము విదేశీయులకు దుర్గ్రహమైనను భారతీయులకు సుగ్రహముగ నున్నది. స్వదేశ స్వధర్మారాధనమునకై ఆత్మార్పణమును జేసిన బాలగంగాధర తిలకు మహారాజపదవిని, లోకమాన్యప్రతిష్ఠను బడసి భారత హృదయపీఠమునందు స్థిరవాసమును గైకొనిరి. స్వరాజ్యసంకల్పసిద్ధికై సర్వమును సమర్పించిన చిత్తరంజనదాసుగారు దేశబాంధవత్వమును, లోకప్రియత్వమును బడసి భారతీయులకు స్వరాజ్యసంపాదనమునకు మార్గదర్శకులైరి. భారతజాతీయస్వాతంత్ర్యమునకై ప్రాణమానధనములను సమర్పించిన "లాలా లజపతిరాయిగారు" స్వాతంత్ర్యసిద్ధికిని, ఆత్మోపలబ్ధికిని మహాయోగమార్గమును సువ్యక్తము చేసిరి.

లాలా లజపతిరాయిగారి ఆకస్మికమరణము భారతహృదయమునందు మహాదుఃఖవేదనమును గలుగజేసినది. తన జీవితమునంతయును మానవకల్యాణమునకై ధారవోసిన

మహాయోధుడు లాలా లజపతిరాయి. నలువ దేండ్లుగను తదేకనిష్ఠతో సరస్వతీసేవను, దేశసేవను, పరమేశ్వరసేవను జేసిన లజపతి రాయి గారు దేహమును విడిచినను సజీవులై యున్నారు. పరమార్థమునకై వా రనుభవించిన కష్టపరంపరలు లజపతిరాయిగారి దృఢ సంకల్పమును విశదముచేయుచున్నవి. కారాగృహవాసమును, నిర్బంధ దేశప్రవాసమును, మరణమునునిర్లక్ష్యముచేసిన లజపతిరాయిగారి పవిత్రజీవితము భారతీయుల కాదర్శ ప్రాయముగ నున్నది. దేశారాధనము కేవలము మాటలతోగాక చేతలతో జేయగలవిధమును లజపతిరాయిగారి జీవితము విశదము చేయుచున్నది. లజపతిరాయిగారికి గల విద్యాభిమానము, దేశాభిమానము, హిందూ సంఘాభిమానము, మతాభిమానము వారి విశాలమైన మానవలక్ష్యమునకు నిదర్శనములుగ నున్నవి. లజపతిరాయి గారు విద్యాభివృద్ధికై కళాశాలను స్థాపించిరి. భారతీయ సంస్కారోద్ధరణమునకై ఆర్యసమాజమును పోషించిరి. స్వాతంత్ర్య ప్రాప్తికై సకలనిర్బంధముల ననుభవించిరి. లజపతిరాయియోధుడు సైమను సంఘబహిష్కరణమునకై లాహోరునందు నాయకత్వమును వహించి బాధలకు పాత్రులై, భారతస్వరాజ్య నిర్మాణమున కాత్మార్పణము ను జేసి, దేశారాధనమును జేయవలసిన విధానమును విశదముచేసెను. లజపతిరాయి గారి మరణము గలుగజేసిన సంతాపము ప్రజలకు వారిపట్ల గల భక్తిని అసంతముఖము లను విశదము చేసినది. ఆసేతు హిమాచలము గల భరతవర్షమునందు దుఃఖ తరంగములు పొంగి పొరలినవిధమును గతించిన మూడు వారముల యుదంతము విశదము చేయుచున్నది. కాంగ్రెసునాయకుల ఆ దేశానుసారము నవంబరు ౨౯ వ తేదీని దేశమునందంతటను జరుపబడినమహాసభలు ప్రజలకు లాలాలజపతిరాయి గారి మీద గల భక్తిని విశదము చేయుచున్నవి. ప్రజలు వారిభక్తి భావమును సార్థకము చేయుటకై అన్సారి, మాలవ్యా, బిర్లా, గాంధిగార్లు నిర్ణయించిన మార్గము నవలంబించుట పవిత్రధర్మమై యున్నది. నాయకులు నిర్ణయించిన ౫ లక్షల నిధిని వెంటనే సమకూర్చుటకు ప్రజలందరును పాటుపడుట లజపతిరాయిగారి పట్ల గల భక్తిని జూపుటకు సాధనముగ నుండగలదు. లాలాజీకి స్మరణమందిరములు భారతీయుల హృదయమందిరములు. లాలాజీ తన భౌతిక దేహమును చాలించినను వారి యాత్మ సర్వత్ర ప్రత్యక్షమగుచు భారతీయులకు స్వధర్మనిర్వహణమార్గమును బోధించుచున్నది. దేశారాధన జీవనమునకుగల ప్రతిబంధకములను, పరమార్థమును లాలాజీజీవిత ముపదేశించుచున్నది. అనన్యమైన భక్తియే సకలయోగములకును పరమసాధనమని శ్రీకృష్ణభగవానుడు పార్థునకుజేసిన మహోపదేశమును లాలాలజపతి రాయి వారి జీవితమునందు సార్థకముచేసిన విధమును వారి పవిత్రజీవితము విశదము చేయుచున్నది. దూషణభూషణ తిరస్కా-

రములు దేశభక్తిపరాయణుండైన లజపతిరాయిగారి దేశభక్తికి ప్రతిబంధకములు గాక సాధనములైనవి. సైమనుకమిషనును బహిష్కరించుటయందు జూపిన యుత్సాహమును, కార్యపరత్వమును, త్యాగమును భారతస్వాతంత్ర్యప్రియులకు మార్గదర్శకమై యుండుగాత! కర్మయోగపరాయణుండైన లాలాజీ జీవితాదర్శము భారతీయులను కర్మయోగులను జేయుటకు వినియోగపడుటకు భగవంతు డనుగ్రహించుగాత!

* * *

## సైమనుకమిషను

సైమనుకమిషను వ్యవహారములు పరిహాసపాత్రము లగుచున్నవి. వారి నాటక ప్రదర్శనము మహాప్రహసనముగ నున్నది. అన్ని రంగములును హాస్యబీభత్స రసమయములై యథార్థమైన ప్రయోజనము నంతర్ధానము చేయుచున్నవి. వివిధసంఘములు స్వసంఘ ప్రయోజనములను సమర్థించుచున్నవి. మహమ్మదీయులు, యూరపియనులు ప్రత్యేక ప్రాతినిధ్యమును గోరుచున్నారు. హిందువులు, క్రైస్తవులు ప్రత్యేకసాంఘికప్రాతినిధ్యమును నిరసించుచున్నారు. నిరంకుశాధికార వర్గము సంస్కరణములను ప్రతిషేధించుచున్నది. భారతీయనాయకులు స్వరాజ్యమును గోరుచున్నారు. స్వరాజ్య మధినివేశరాజ్యవిధానమైనను, స్వతంత్రరాజ్యవిధానమైనను, భారతీయ నాయకులకును, ప్రజలకును బ్రిటీషురాజ్యాధికారులమీద. సంపూర్ణమైన అవిశ్వాస మదయించిన విధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. సైమనుకమిషను సమక్షమున తయారుచేయబడుచున్న సాక్ష్యమంతయును స్వలాభార్థమై కల్పితమైనసాక్ష్యముగనున్నది. సహాప్రయోజనార్థమై వెలసిన సంఘములు స్వప్రయోజనానుకూలమైన సాక్ష్యమును సృష్టించుచున్నవి. రాష్ట్రీయప్రభుత్వములు గుప్తసాక్ష్యమును సమకూర్చుచున్నవి. మొదటి దానివలె రెండవదియును దేశప్రయోజనములకు నిరర్థకము. బహిరంగసాక్ష్యమునందు సారము లేదు; రహస్యసాక్ష్యమునం దర్థములేదు. అయినను సైమనుకమిషను నాటకము యథావిధిగ సాగుచున్నది. ఆనాటకమువలన దేశమునకు ప్రయోజనము లేకపోయినను, అశక్తిదౌర్జన్య ప్రభావము దేశమునకు విశదమగుచున్నది. సైమను కమిషను వ్యాజమున నిరంకుశ ప్రభుత్వాధికారులు చూపుచున్న దౌర్జన్యము ప్రభుత్వమునకు సహజమైన దౌర్జన్యహృదయమును విశదము చేయుచున్నది.

* * *

## నిరంకుశవిధానము-బహిష్కరణము

బ్రిటిషు ప్రభుత్వమున కాధారమైన పశుబలప్రభావమును సైమను బహిష్కరణ వ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. సైమనుకమిషను బొంబయియందు కాలుపెట్టినది. మొదలు లోకమునందంతటను ప్రతిధ్వనించు

చున్న, సైమనుబహిష్కరణ ఘోషయును, ప్రత్యక్షమగుచున్న నల్ల జెండాలును ప్రజాహృదయము నావరించిన స్వాతంత్ర్యాభిలాషను విశదముచేయుచున్నవి. బొంబయి, పునహా, లాహోరు, కరాచి, డిల్లి, లక్నో నగరములందు ప్రజానాయకులు వ్యక్తముచేసిన బహిష్కరణోత్సాహము ప్రజాశక్తిని, ప్రభుత్వదౌర్జన్యమును విశదముచేసినది. ప్రజాహృదయమునందుగల భావముల నరికట్టుటవలన ప్రభుత్వమునకు దౌర్బల్యము సిద్ధించునుగాని బలము సిద్ధించదు. ప్రజలకు భావప్రకటనమునందుదల సామాన్యపుహక్కును ప్రభుత్వము నిరోధించుట దౌర్జన్యమార్గమునకు సాధనంబుగనున్నది. లాహోరునందు లాలాజి మొదలగు నాయకులను లాటి దెబ్బలు కొట్టుటయును, లక్నోయందు పండితజవహరిలాలుగారు మొదలగు నాయకులను లాటిదెబ్బలుకొట్టుటయును సైమనుకమిషనుకు లాటిదెబ్బల కమిషను నామమును సమకూర్చినది. సైమనుకమిషను పట్ల భారతీయులకు గలయసహ్యమును నిరంకుశాధికారచర్యలు స్థిరతరముచేయుచున్నవి. లాలాజిమరణము బహిష్కరణోద్యమమునకును, స్వరాజ్యమునకును నుత్తేజమును గలుగజేసిన విధమును దేశావృతమైన గాఢానుతాపము విశదముచేయుచున్నది. నెహ్రూకుమారునకు సంప్రాప్తమైన దెబ్బలు నిరంకుశ దౌర్జన్యస్వభావమును విశదముచేయుచున్నవి. క్రియలేని ప్రారంభముల కాడంబర మధికమనుసామెతను సైమనుసప్తకము విశదముచేయుచున్నది. వేడుకలందును, విందులందును గల యుత్సాహము వ్యవహారములందు లేదని సైమనుకమిషనువ్యవహారములు విశదముచేయుచున్నవి. నిర్ణయమైన విషయముల కీకపటనాటక ప్రదర్శన మేల కావలయునో తెలియకున్నది. సామ్రాజ్యాభిమానమునకిది సహజలక్షణమై యుండును. బాల్ఫరుప్రభువు సర్ జాన్ సైమనువిషయమై సామాన్యవిషయములందు ఘనుడనియును, మహత్కార్యములందు సామాన్యుడనియును చెప్పిన యభిప్రాయమును వారివ్యవహారక్రమము పరిస్ఫుటము చేయుచున్నది. సైమనుగారిలక్ష్యము స్వరాజ్యవిధానమును విడిచి సాంఘీకప్రాతినిధ్యమును, ఆంగ్లోద్యోగములను, బ్రిటిషు ప్రయోజనములను నాశించుచున్నది. సైమనుగారిలక్ష్యము బ్రిటీషురాజ్యాధికార సంరక్షణమునందు లగ్నమైన విధమున స్వరాజ్య నిర్మాణ విధానమునందు లగ్నము గాకుండుటవలన, కమిషనువలనను నేవిధమైన ప్రయోజనమును గలుగదని పయోనీయరు పత్రికయే తెలుపుచున్నపుడు భారతీయులు భేదాభిప్రాయమును గలిగియుండుట నిరర్థకము. సైమనుకమిషను బహిష్కరణమునందు జూపినశక్తిని నెహ్రూనివేదికపట్లను సైతము చూపుట స్వరాజ్యసాధనిర్మాణమునకు సాధనముగ నుండగలదు.

* * *

నెహ్రూనివేదిక

లక్నోయందు సకలపక్ష సమావేశము నిర్ణయించిన స్వ రా జ్య సం ధా న ము ను

డిల్లీయందు గూడిన అఖిలభారత కాంగ్రెసు కమిటియును నామోదించుట శుభసూచకముగ నున్నది. శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారికిని, నెహ్రూగారికిని కుదిరిన సమాధానము వాగ్వివాదముల కంతమును గలుగజేసినది. సంపూర్ణ స్వాతంత్ర్యప్రియులును, అధినివేశ రాజ్యవిధానప్రియులును నన్యోన్య సంఘర్షణము లేక స్వరాజ్య విధానములను ప్రచారము చేయుట కవకాశము లేర్పడినవి. ఒకవైపున సంపూర్ణస్వాతంత్ర్య సమితులును, ఒకవైపున సకలపక్షసమావేశములును స్వరాజ్యప్రచారమును జేయుచు స్వరాజ్యావసరమును, స్వరాజ్య కాంక్షను ప్రత్యక్షము చేయుచున్నవి. సకల పక్షముల వారిని నెహ్రూనివేదిక ఏకవేదికయందు సమావేశము చేయగల విధమును గతమాసమునందు సమావేశములైన సకల పక్షసమావేశములు విశదము చేయుచున్నవి. మండలసభలు, రాష్ట్రీయసభలు నెహ్రూనివేదికను సమర్థించుచు స్వరాజ్యాందోళనమునకు బలపోషణములను గలుగజేయు చున్నవి. దేశమునందంతటను మహాసభలు చేయుచున్న తీర్మానములు సైమనుకమిటీకి వినబడుచున్నను కమిటి లక్ష్యము నాకర్షింపజాలకున్నవి. తెలిసియును తెలియనటులు నటించెడివారలకు దెలుపుట బ్రహ్మకైనను సాధ్యము గాని విషయముగదా! సైమనుకమిషను నాటకప్రదర్శనము మూడుమాసములతో నంతము నొందగలదు. సకలపక్షసమావేశము నిర్ణయించెడి రాజ్యాంగవిధానము స్వరాజ్యనిర్మాణమునకు సాధనభూతము కాగలదు సంపూర్ణస్వాతంత్ర్యమైనను, అధినివేశరాజ్యవిధానమైనను భారతీయులశక్తిమీద నాధారపడియున్నది గాని బ్రిటీషుప్రభుత్వపు దాక్షిణ్యముమీద నాధారపడి యుండలేదు. ముప్పదిమూడుకోట్ల భారతీయుల దృఢసంకల్పము స్వరాజ్యమును సంపాదించగల విధమును సహాయ నిరాకరణోద్యమసందర్భమునను, సైమను బహిష్కరణోద్యమ సందర్భమునను ప్రజలు చూపుచున్న నిగ్రహము సువ్యక్తము చేయుచున్నది. నిరంకుశాధికారవర్గ మవలంబించుచున్న దౌర్జన్యవిధానము భారతీయుల నిగ్రహసామర్థ్యమును విశదము చేయుచున్నది. లాహోరు లక్నో పురము లందువలెనే యితర పురములందును సైమను బహిష్కరణోద్యమమునందు ప్రజానాయకులు నిగ్రహ పరాయణులై మెలంగుటకు భారతమాత యనుగ్రహించు గాత!

* * *

**నంద్యాలసభలు**

గతమాసమునందు నంద్యాల పురమునందుగూడిన యాంధ్రమహాసభలును, కల్యాణ్ నందు గూడిన యాంధ్రసాంఘిక సభయును, నితరసభలును ఆంధ్రహృదయమునందు గలిగిన ప్రబోధమును సువ్యక్తముచేయుచున్నవి. నంద్యాలయందు గూడిన ఆంధ్రమహాసభ, సంగీతమహాసభ, జాతీయధ్వజారోహణము, ఖద్దరు ప్రదర్శనము, గోరక్షణసభ, రాష్ట్రీయసభ, సకలపక్షసమావేశము, పశ్చిమాంధ్రమండల్ల

మహాసభ ప్రజాహృదయమునందు ప్రవర్ధమానంబగుచున్న ప్రబోధమునకు నిదర్శనములుగ నున్నవి. ఈసభల కాధ్వర్యమును వహించిన హరిసర్వోత్తమరావుగా రాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులు. రాధాకృష్ణయ్యగారు, దొరసామయ్యంగారు, శ్రీనివాసయ్యంగారు, ప్రకాశముగారు, బెజంటమ్మగారు, చతుర్భుజదాసుగారు, కోటిరెడ్డిగారు వారియుపదేశములం దాంధ్రాభ్యుదయ సాధనములను, స్వరాజ్యసంపాదన సాధనములను విశదముచేసిరి. రెండుదినములం దిన్నిసభలను నిర్వహించుటయందుగల సాధక బాధకములు సభానిర్వాహకులకును, ప్రతినిధులకును, ప్రేక్షకులకును విశదమైనది. కాల మధ్యక్షోపన్యాసములలోను, ప్రసంగములతోను గడచినది. ఆంధ్రాభ్యుదయమునకు సాధనభూతములైన వివిధరంగములందును కార్యవిధానమును నిర్ణయించుట కవకాశము లేకపోయినది. అనేక సభ లేకకాలమునం దొక చోటను సమావేశమగుటయందే ఈదోషము ప్రత్యక్షముగ నున్నది. కాల మతిస్వల్పమైనపుడీదోషము ద్విగుణీకృతమగుచున్నది. ఉపన్యాసములు, సిద్ధాంతములు, ప్రయోజనమును సమకూర్పవలసిన యవసరము పోయి కార్యవిధానము ప్రయోజనమును సమకూర్చవలసిన యుగ మేర్పడినది. ప్రత్యేక విషయములకు ప్రత్యేకసభలను కార్యదక్షు లేర్పాటు చేయవలసినయవసరము వర్తమాన కాలమునందు గలిగినది. సంగీత సాహిత్యములు, లలితకళలు, సాంఘికవ్యవస్థలు రాజ్యాంగములు, పరిశ్రమలు వ్యవహారదక్షుల నిర్వహణమునం దభివృద్ధిని జెందవలసిన యవసరము సర్వత్ర గోచరంబగుచున్నది. భావికాలమునందైనను ప్రజానాయకులు ప్రత్యేకవిషయములకు ప్రత్యేక సభల నేర్పాటుచేసి దేశసౌభాగ్యమునకును, ప్రజాక్షేమమునకును మూలబీజమైన కార్యవిధానమును నిర్ణయించుదురు గాత! ఆంధ్ర సభలను బెజవాడ కాహ్వానము చేసిన కాళేశ్వరరావు గారును, వారి మిత్రులును నా మార్గము నవలంబించుట కాంధ్రదేశము ప్రోత్సహించుగాత! పరోక్షము గనున్న ఆంధ్రత్వమును అపరోక్షము చేయుట కాంధ్రులు కృతనిశ్చయులై కామితార్థములను బడయుదురుగాత!



Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7,Thambu Chetty St., Madras

# అమృతాంజనం డిపోవారి సుప్రసిద్ధౌషధములు

## దంతచూర్ణము

డబ్బీ 1కి వెల రు. 0 2 0; 12కి రు. 1 4 0

ఈ దంతచూర్ణముతో పండ్లు తోముట వలన చిగుళ్లు గట్టిపడును. చిగుళ్లనుండి రక్తము కారకుండును. నోట దుర్గంధము లేక యుండును. పండ్లు ముత్యములవలె తెల్లగా నుండును. సర్వసామాన్యముగ వాడుటకు దగియున్నది.

## తామర తైలము

డబ్బీ 1కి 0 6 0. 12కి 3 8 0.

తమర ఒకవిధమైన పురుగులవలన చర్మము మీదగాని, వెండ్రుకలలోగాని, లోచర్మములోగాని, గోళ్లలోగాని పుట్టవచ్చును. పురుగులలోని భేదములబట్టి తామరలోను రెండు మూడు భేదములు గలవు.

గుర్తులు:—దురద, ఉంగరముల వంటి చుట్లు, పొక్కులు, రసి కారుట, వెండ్రుకలు ఊడిపోవుట మొదలగునవి కొంచెముగా లేచి శరీరమందంతట వ్యాపించి నిద్రపట్టని జిల యేర్పడును.

## మోహినీ తైలము

5 తు॥ నూనెగల సీసా 1కి రూ. 0 12 0

స్త్రీపురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడుకు చలువజేయును, కండ్లకు చలువజేయును, వెండ్రుకలు పెరుగును, వెండ్రుకలు రాలకుండును, వెండ్రుకలు నునుపుదేరును. మనోహరముగా నుండును, సువాసన గల్గి యుండును, తలయందు చుండును పోగొట్టును, వాసన రమ్యముగా నుండును. ముఖమునకు తేజస్సు నిచ్చును, వెండ్రుకలను చిట్లనియ్యదు. అనేక సీసాలు విక్రయము.

## గజ్జికి తైలము

డబ్బీ 1-కి వెల రు. 0 4 0. వి. పి. 0 9 0

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేషబాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిజేయును.

## తేలుమందు

సీసా 1కి వెల రూ. 0 8 0 వి. పి. 0 13 0

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకు పుణ్యము గట్టుకొనవచ్చును. ప్రతియింట నుండదగినది.

## రోమహారి

డబ్బీ 1కి రు. 0 8 0 వి. పి. తో 0 13 0

ఈ భస్మమును నీటితో కలిపి పట్టించిన రోమములు రెండునిమిషములలో మొదలంట రాలిపోవును. దీనివలన చర్మము నలుపెక్కదు, మంట యుండదు. రోమములు రాలిపోవును.

## పగుళ్లకు తైలము

డబ్బీ 1-కి వెల రు. 0 6 0. వి. పి. 0 11 0

అరికాళ్లు, అఱచేతులు, చర్మము కారకమువలన శీతగాలివలన పగిలి నీరుకారుటయు, జిలపుట్టుటయు సంభవించును. ఈ తైలమును రాచిన, పగుళ్లుమాని జిల పోయిమంచి చర్మము రాగలదు. పగుళ్లనొప్పియు నయమగును స్వల్ప క్రయము.

అమృతాంజనం డిపో, నెం.7, తంబుశెట్టి వీధి, మద్రాసు.

# AMRUTANJAN

## BEST INDIAN PAIN BALM

அமிர்தாஞ்சனம்



अमृतांजन



అమృతాంజనము



امرتانجن

**BEWARE OF IMITATIONS!!!**

**AMRUTANJAN DEPOT**

**BOMBAY & MADRAS.**



ANDHRA PATRIKA PRESS, MADRAS.

